70వ నామము 'ప్రజాపతి'ని పరిశీలించినపుడు 'ప్రజ' అనే పదాన్ని రెండువిధాలుగా అర్థం చేసుకోవచ్చునని చెప్పడమైనది. (1) **ప్రకర్షేణ జాయంతే –** ప్రత్యేకమైన, దివ్యమైన జన్మ కలిగినవారు. కర్మబద్ధులు కానివారు. నిత్యసూరులు. (2) సమస్త ప్రజానీకము. ఈ రెండు అర్థములలోను 'ప్రజాభవ' నామమును స్తుతింపవచ్చును. సమస్త జీవులను సృష్టించినవాడు సర్వేశ్వరుడని చెప్పవచ్చును. మరొక విధముగా తక్కిన దేవతలను, ముక్తులను కూడ సృష్టించిన దేవదేవుడు అని చెప్పవచ్చును.

ఈ రెండు అర్థములను సమన్వయపరుస్తూ శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు చెప్పన భావం ఆసక్తికరంగా ఉంది – భగవంతుడు ముందుగా బ్రహ్మాది దేవతలను సృష్టించెను. తరువాత ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని సకల మానవ జంతుజాలమును సృష్టించెను. (ముందుగా సూక్ష్మ, స్వల్ప చైతన్యముతో కనుపించే జంతువులు ఉద్భవించాయనీ, వానినుండి క్లిష్టమైన ఉన్నత స్థాయి జీవజాలం పరిణమించిందనీ మనం చదువుకొంటాము. ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారి భావం విరుద్ధంగా కనిపిస్తుంది.)

## 91. అహః

- ఎవరినీ, ఎన్నడూ వీడనివాడు.
- పగటివలె ప్రకాశస్వరూపుడై అజ్ఞానమును తొలగించి, మనలను జ్ఞానోన్ముఖులను చేయువాడు.
- తన భక్తులను నాశనము కాకుండ కాపాడువాడు.

### ఓం అహ్నే నమః

**న సన్తి హీనా యస్యేతి అహః స పరికీర్తితః అనాద్య విద్యా విద్రాయాం స్వధీ హేతుతయా హి అహః -** తన భక్తులలో ఒక్కడు కూడా హీనుడు లేనివాడు. (ఆయన భక్తులందరూ ఉత్తములు). అజ్ఞానాంధకారము నుండి బయటపడినవారికి స్వరూపజ్ఞానాన్ని ఇచ్చేవాడు.

**న హీనః అస్య అస్తి ఇతి అహః –** ఆయన ఎవ్వరినీ ఎన్నడూ వదలిపెట్టడు. చెలుడై, చుట్టమై, తల్లియై, తండ్రియై, గురువై, ప్రియుడై, బిడ్డయై, ఆపదమ్రొక్కులవాడై మనలను వెన్నంటి ఉంటాడు.

'అహ' అనగా పగలు. నారాయణుడే మనలను అసత్యమునుండి సత్యమువైపు, చీకటినుండి వెలుగువైపు, మృత్యువునుండి అమృతత్వమువైపు నడిపించువాడు.

'హ' అనే ధాతువుకు 'నాశనము' అనే అర్థం ఉంది. 'అ-హ' అనగా నాశనము కానీయనివాడు. ఆయనను నమ్మినవారికెన్నడును కీడులేదు. **న మే భక్తః ప్రణశ్యతి –** అని పార్థసారధియైన గీతాచార్యుడు బోధించెను.

## 92. సంవత్సరః

- భక్తులనుద్ధరించుటకై (వెలసి)యున్నవాడు.
- కాలస్వరూపుడు.

### ఓం సంవత్సరాయ నమః

ఇదే నామము మరల 423వ నామముగా వచ్చును.

10వ శ్లోకము. 92వ నామము. సంవత్సరః – **అహః సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః**

45వ శ్లోకము. 423వ నామము. సంవత్సరః – **ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః**

'వస్' అనగా నివసించుట, జీవించుట అనే భావంనుండి మొదటి అర్థం వస్తుంది. **సముద్ధారణాయ సంవసతి ఇతి సంవత్సరః** – అనగా భక్తులను ఉద్ధరించుటకే, వారి ఆపదలు బాపుటకే, వారికి ముక్తి ప్రసాదించుటకే ఆయన ఆపదమ్రొక్కులవాడై వెలసియున్నాడు.

**ఇత్థం తేషు ప్రబుద్ధేషు వసత్యుద్ధరణాయ యః సంవత్సరః** – తన భక్తులైనవారికి అజ్ఞానపు చీకట్లు తొలగిపోగానే వారికి జ్ఞానజ్యోతిని ప్రసాదించడానికి సర్వకాలములందు ఎదురుచూస్తుంటాడు.

'సంవత్సరము' అనగా ఒక ఏడాది కాలప్రమాణము అని సామాన్యార్థము. భగవానుడు కాలస్వరూపుడు అని భావము.
గీత 10.30 – **కాలః కలయతామహమ్** – గణన చేయువానిలో నేను కాలమును.
గీత 10.33 – **అహమేవాక్షయః కాలః** – నేను నాశనము లేని కాలస్వరూపుడను.

## 93. వ్యాళః

- భక్తుల శరణాగతిని స్వీకరించి అనుగ్రహించువాడు. తన భక్తులకు అభయమిచ్చి వారిని తన అధీనంలో ఉంచుకొనేవాడు.
- (సర్పము, ఏనుగు, పులి వంటివానివలె) పట్టుకొనజాలనివాడు. చిక్కనివాడు.

### ఓం వ్యాళాయ నమః

'ళా' – అనగా స్వీకరించుట – మూలమునుండి మొదటి భావమును శ్రీ భట్టులు చెప్పారు. విభీషణునివంటి భక్తులు శరణనగానే ఆయన వారిని స్వీకరించును. మనము ఆపదలో గాని, సంతోషంలోగాని, కామితార్థులమైగాని, జ్ఞానముకొఱకు గాని, మోక్షము కొఱకు గాని, ఎప్పుడైనా, ఎక్కడైనా ఆ సర్వేశ్వరుని శరణు కోరవచ్చును.

**వ్యాళవత్ భుజంగవత్ గజవత్ గ్రహీతుమ్ అశక్యాత్ వ్యాళః** - వ్యాళమనగా సర్పము, మదించిన ఏనుగు, భీకరమైన పులి అని చెప్పవచ్చును. వీనివలెనే భగవంతుడు మన చేతికి చిక్కడు. ఊహకు దొరకడు. అదుచేయనగడు.

## 94. ప్రత్యయః

- ఆధారపడ దగినవాడు. విశ్వసింప దగినవాడు.

### ఓం ప్రత్యయాయ నమః

**ప్రతీయతే అస్మిన్ ఇతి ప్రత్యయః** –నమ్ముకొని కొలువదగినవాడు ఆ కొండలలోని కోనేటిరాయడు. ఆయనను నమ్మినవారికి లోటులేదు.
మహాభారతము – సభాపర్వము 20.7. **యది తే హృదయమ్ వేత్తి యది తే ప్రత్యయో మయి భీమసేనార్జునౌ శీఘ్రమ్ న్యాసభూతౌ ప్రయచ్ఛ మే** - నీ హృదయమున నన్నెరిగిన యెడల, నాపై నమ్మికయున్న యెడల, భీమసేనుని, అర్జునుని తక్షణమే నా సమక్షమున నుంచుము.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – జ్ఞాన స్వరూపుడని ఈ శబ్దముయొక్క భావము. **ప్రజ్ఞానమ్ బ్రహ్మ** – అని శృతివాక్యము స్మరణీయము. **జ్ఞానాదేతు కైవల్యమ్** –జ్ఞానమువలననే మోక్షము కలుగును.

## 95. సర్వదర్శనః

- తన కటాక్ష పరిపూర్ణ వైభవమును భక్తులకు చూపువాడు.
- సమస్తమును చూచుచుండువాడు.

### ఓం సర్వదర్శనాయ నమః

**మహిమానం సర్వసహం తేషాం దర్శయతీతి సః సర్వదర్శన అఖ్యాతో నవార్ణో లోచనప్రదః -** సర్వాన్నిసహించేటటువంటి తనమహిమను వారికి చూపేవాడు సర్వదర్శనుడు. ఈ నామము నవాక్షరీమంత్రము. దీన్ని జపిస్తే దృష్టి దోషాలు పోతాయి. కళ్ళు లేని వారికి కళ్ళు వస్తాయి. ఓం సర్వదర్శనాయ నమః.

'సర్వదర్శన' నామము వివరణలో మనం గ్రహింపవలసినదేమంటే, మహాత్ములు పరి పరి విధాలుగా భగవంతుని అనంతగుణానుభవాలను దర్శిస్తారు. అనుభవిస్తారు.

శ్రీ శంకరులు – అంతటినీ చూపువాడు సర్వదర్శనుడు.

శ్రీ భట్టులు – అంతటినీ చూచువాడు సర్వదర్శనుడు.

శ్రీ శంకరులు చెప్పిన శృతి ప్రమాణము – తైత్తరీయారణ్యకము 10.1, 11. **విశ్వతశ్చక్షుర్ విశ్వాక్షమ్** – విశ్వమందంతటను కన్నులుగలవాడు, విశ్వమే కన్నుగా గలవాడు.

శ్రీ చిన్మయానందగారు గీత(13.13) నుండి ఉదాహరించారు.

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోऽక్షి శిరోముఖమ్**
**సర్వతః శృతి ముల్లోకే సర్వమావృత్య తిష్ఠతి.**

ఆ పరమాత్ముని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములైయున్నవి. అతడు సర్వమును ఆవరించియున్నాడు.

ఈ గీతాశ్లోకాన్ని శ్రీ జయదయాల్ గోయందకాగారు గీతా తత్వ వివేచనీవ్యాఖ్యలో ఇలా వ్యాఖ్యానించారు – ఆ జ్ఞేయ తత్వమైన పరమాత్ముని సర్వవ్యాపకత్వము ఈ శ్లోకముద్వారా తెలియుచున్నది. ఆయన కన్నులు (చూపులు) సర్వత్ర వ్యాపించియున్నవి. అతడు చూడని స్థలమే ఉండదు. ఆయనకడ ఏమియును దాచుటకు వీలు లేదు. అతని శిరస్సులు సర్వత్ర వ్యాపించియున్నవి. భక్తులు తమ తమ భగవదర్చనలో భాగముగ ఎచ్చటినుండి పుష్పాదులు సమర్పించినను అవి ఆయన శిరస్సునే అలంకరించును. ఆయన శిరస్సు లేని స్థానమే లేదు. ఆయన ముఖములు సర్వత్ర వ్యాపించియుండును. భక్తులు ఆయనకు ఏ పదార్థమును ఇచ్చినను, ఎచ్చటినుండి నివేదన చేసినను అచటినుండియే అతడా వస్తువును ఆరగించును. .. ... పరమాత్మ అన్ని స్థలములనుండియు వినగలడు. ఎచటనుండియైనను భక్తులు చేయు స్తుతులను, ప్రార్థనలను, అభ్యర్థనలను అతడు చక్కగా ఆలకింపగలడు.

శ్రీ పెమ్మరాజు రాజారావుగారి రచననుండి – హిందూవేదాంత సాహిత్యమున భగవత్ప్రాప్తికి ఆరు ప్రధాన సూత్ర విజ్ఞానములను మహర్షులు వివరించిరి. వీనినే 'షడ్దర్శనములు' అందురు. అవి 1. న్యాయ దర్శనము 2. వైశేషిక దర్శనము 3. సాంఖ్య దర్శనము 4. యోగ దర్శనము 5. పూర్వమీమాంసా దర్శనము 6. ఉత్తరమీమాంసా దర్శనము. ఈ షడ్దర్శనములద్వారా దర్శింపదగినవాడు పరమాత్మయే గనుక 'సర్వదర్శనః' అనబడెను.



## అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః |
## వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః || (11)

### 96. అజః

- జన్మము లేనివాడు.
- అన్ని అడ్డంకులను తొలగించువాడు.
- భక్తుల హృదయములందు చరించుచుండువాడు.
- అన్ని శబ్దములకు మూలమైనవాడు ('అ' – అక్షరము).

ఓం అజాయ నమః

ఈ నామము మరల 206వ నామముగాను, 524వ నామముగాను వచ్చును.

11వ శ్లోకము. 96వ నామము. అజః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః**

22వ శ్లోకము. 206 వ నామము. అజః – **ఆజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా**

11వ శ్లోకము. 524వ నామము. అజః – **అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః**

పుట్టుక లేనివాడు. **న జాయతే ఇతి అజః** – ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన శృతి ప్రమాణము - ఋగ్వేదము 1.81.5. **న జాతో న జనిష్యతే.** ఆయన ఇంతకుముందు జన్మింపలేదు. ఇకముందు జన్మింపబోడు.

**న హి జాతో న జాయేఽయం న జనిష్యతే కదాచన క్షేత్రజ్ఞః సర్వభూతానాం తస్మాదహం అజస్మృతః** – మహాభారతము శాంతిపర్వము 330.9. నేను పూర్వము జన్మించియుండలేదు. ఇప్పుడు జన్మించినవాడను కాను. భవిష్యత్తులో జన్మించను. నేను సర్వభూతములందును క్షేత్రజ్ఞుడను. కనుక నన్ను 'అజుడు' అని యందురు.

'అజ' నామమునకు మరికొన్ని ప్రమాణములు –

కఠోపనిషత్తు 1.2.18 – **అజో నిత్యః శాశ్వతోఽయమ్ పురాణః**

బృహదారణ్యకోపనిషత్తు 4.4.22 – **స వా ఏష మహాన్ అజ ఆత్మా**

శ్రీ భట్టుల వివరణ – భగవంతుడు శ్రీనారసింహమూర్తియై స్తంభమునుండి ఆవిర్భవించెను. తక్కిన జీవజాలమువలె ఆయన జన్మింపడు. (3వ నామము 'స్వయంభూః' వివరణను గమనింపదగును.)

'అజ్' అనే ధాతువునకు 'చలనము','తొలగించుట' అనే అర్థాలు కూడా ఉన్నాయి **(అజౌ గత క్షేపణయోః)** ఈ భావములో మరికొన్ని వ్యాఖ్యానాలు మనకు లభించాయి. శ్రీ భట్టులు – పరమపద ప్రాప్తికై తపించు ముముక్షువుల మార్గమునుండి అన్ని విఘ్నములను తొలగించి అనుగ్రహించువాడు భగవంతుడు. అజుడు.

శ్రీ శంకరులు – **అజతి గచ్ఛతి క్షిపతి ఇతి వా అజః** – భక్తుల హృదయమున ప్రవేశించి చరించువాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – మన అజ్ఞానమును తొలగించువాడు. తన భక్తుల చెంతకు చేరి, వారిని తన పరంధామమువైపు నడిపించువాడు.

ఇంకా – **అకార వాచ్యతయా జాతః అజః** – 'అ'కార వాచకముచే తెలుపబడినవాడు అజుడు. అన్న భావములో కూడ ఈ నామమునకు వ్యాఖ్యానాలు ఉన్నాయి. గీత 10.33 - **అక్షరాణామ్ అకారోఽస్మి.** అక్షరములలో నేను అకారమును – అని శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చెను. దీనినే శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు ఇలా వివరించారు - ప్రళయకాలమున పంచభూతములును ఏకమగును (**ఆకాశాత్ వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ** .. .. అనే క్రమానికి తిరుగు క్రమంలోనన్న మాట). అలా జరిగినపుడు చివరకు శబ్ద తన్మాత్ర మాత్రమే మిగులును. అది 'అ'కార శబ్దములో లీనమగును. ప్రళయాంతమున ఆ 'అ'కార శబ్దరూపమే భగవంతుని రూపము. **అకారో వై సర్వావాక్** – అని శృతిలో ఉన్నది. అలాగే తిరుక్కురళ్ లో – **అకార ముదలాయ ఎడుత్తెల్లామ్ ఆది భగవాన్ ముదత్రే ఉళగు** – అని చెప్పారు.

## 97. సర్వేశ్వరః

- ఎవరు తనను కోరుకొందురో వారి చెంతకు తానై వచ్చి అనుగ్రహించువాడు.
- ఈశ్వరులకు ఈశ్వరుడు. ప్రభువులకు ప్రభువు.

### ఓం సర్వేశ్వరాయ నమః

**అశక్తానాం చ శక్తానాం వైరూప్యం శరణైషితామ్ అశ్నుతే పరిహర్తుం యః సర్వేశ్వర ఈరితః** - సమర్థులైనా గాని, అసమర్థులైనా గాని తనను శరణుజొచ్చినవారి అనిష్టములను పోగొట్టేవాడు ఈశ్వరుడు.

'అశ్' అనగా 'వ్యాపించుట' అనే మూలం శ్రీభట్టుల వ్యాఖ్యకు ఆధారం. ఉనాది సూత్రము 738 ప్రకారం – **అశ్నోతే రాశు కర్మణి వరత్ చ** – అనగా అశ్+వరత్=ఈశ్వరః. దీని అర్థము 'అనతికాలంలో విజయమును ప్రసాదింపగలవాడు'. అనగా, తనను శరణుజొచ్చినవారిని అనుగ్రహించి, వేగిరమే వారి కడగండ్లను కడతేర్చి, ముక్తిని ప్రసాదించేవాడు ఈశ్వరుడు. ఇందుకు వారి శక్తి, అర్హతలు ముఖ్యము కాదు. ఆ శరణాగతవత్సలుని శరణుజొచ్చుటే చాలును. **త్వమేవ శరణం మమ, అన్యథా శరణం నాస్తి – వినా వేంకటేశం న నాథో న నాథః – రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోఽస్మ్యహమ్.**

**సర్వేషామ్ ఈశ్వరాణామ్ ఈశ్వరః సర్వేశ్వరః** – ఆయన ఈశ్వరులకు ఈశ్వరుడు. దేవదేవుడు. భక్తవరదుడు.
బృహదారణ్యకోపనిషత్తు 4.4.22 - ఏష సర్వేశ్వరః
**ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోంతర్యామ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్య యౌ హి భూతానమ్ –** మాండుక్యోపనిషత్తు. ఇతడే అన్నింటికిని ప్రభువు. అంతర్యామి, నియామకుడు, కారణము, ఉత్పత్తి, వినాశము అన్నీ ఇతడే. అదే ఆత్మ. అదే పరమేశ్వరుడు.

## 98. సిద్ధః

- తన భక్తులకు అందుబాటులో నుండెడివాడు.

### ఓం సిద్ధాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
11వ శ్లోకము. 98వ నామము. సిద్ధః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిః అచ్యుతః**

88వ శ్లోకము. 825వ నామము. సిద్ధః – **సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః**

శ్రీ భట్టుల వ్యాఖ్యానమును నిరుక్తములో ఇలా పొందుపరచారు – **స్వరూపేణైవ భక్తానామ్ సిద్ధత్వాత్ సిద్ధః ఉచ్యతే** – తన నిజరూపములో భక్తులకు సిద్ధించేవాడు (చేతికందువాడు). శ్రీమన్నారాయణుడు భక్తుల పాలిట కొంగు బంగారము**. ముంగిటనల్లదివో మూలనున్న ధనము.** పిలిచిన పలుకును. తలచినంతనే కరుణించును. పూజలు చేకొనును. కీర్తనలు విని యానందించును. మోక్షమును ప్రసాదించును.

'సిద్ధః' అనగా మరొక అర్థము 'సాధింపదగినదానిని అంతటిని సాధించినవాడు'. ఇక ఆయన పొందదగిన సిద్ధులేవియును లేవు. **నానవాప్తమవాప్తవ్యమ్** – అని గీతావాణి.

శ్రీ శంకరుల భాష్యము – **నిత్య నిష్పన్న రూపత్వాత్ సిద్ధః** – ఏవిధమైన లోపములు లేని, సకల పరిపూర్ణమైన రూపముగలవాడు.

అమరకోశము – **సిద్ధయతి ఇతి సిద్ధః**

## 99. సిద్ధిః

- సాధనా ఫలము. పరమ లక్ష్యము. సాధింపదగినవాడు.

### ఓం సిద్ధయే నమః

**అయమేవ హ్యుపాయైశ్చ సిద్ధిస్స్యా త్సాధ్యతే యతః** – వేరు వేరు ఉపాయాలతో కూడా సాధింపబడువాడు.

'సిద్ధి' అనగా సాధించిన విజయము, ఫలితము. సకల సాధనలకు పరమార్థము భగవంతుడే గనుక ఆయనే సిద్ధి. అన్ని కర్మ, జప, తపములకు పరమ గమ్యము మోక్షము. ఆ మోక్షమును ప్రసాదించువాడు ఆ పరంధాముడే. తక్కిన స్వర్గాది ఫలములు శాశ్వతములు కావు. మోక్షమునకు సరి తూగవు. కనుక భగవంతుని చేరుటయే పరమార్థము. ఆందువలన ఆయనే ముముక్షువులకు సిద్ధి.

**పోతన భాగవతము – గజేంద్రమోక్షము**

ముక్తసంగులైన మునులు - దిద్రుక్షులు సర్వ భూత హితులు
సాధుచిత్తులు అసదృశవ్రతాఢ్యులు - గొల్తురెవని దివ్యపదము.

## 100. సర్వాదిః

- సర్వమునకును మూలకారణము, ప్రప్రథమము.

### ఓం సర్వాదయే నమః

**సర్వేషామ్ పురుషార్థానామ్ ఆదిః సర్వాదిః** – తన భక్తులకు సకలపురుషార్థాలు సిద్ధించడానికి మూలమైనవాడు సర్వాది. **సర్వాన్ కామాన్ ప్రాప్నువంతే విశాలాన్ త్రైలోక్యేస్మిన్ కృష్ణ నామాభి ధానాత్** – శ్రీకృష్ణపరమాత్ముని స్మరించడంవలన అన్ని విధాలైన కోరికలు తీరుతాయి.

**సర్వభూతానామ్ ఆది కారణత్వాత్ సర్వాదిః** – అన్ని భూతాలకు ఆదికారణమైనవాడు సర్వాది. అన్నింటికిని ఆరంభము ఆ పరమాత్ముడే. అన్నింటికంటె ముందుగా ఉన్నవాడు, వేరేదీ లేనప్పుడు తానైయున్నవాడు ఆ నారాయణుడే. కార్యమునకు ముందు

కారణమువలె, సృష్టికి ముందుగా సంకల్పమై, సర్వమునకును ఆదియైనవాడు శ్రీమహావిష్ణువు. ఆయన సంకల్పమాత్రమున సకల సృష్టి సంభవించినది.

## 101. అచ్యుతః

- తన దివ్య తేజోవిభూతి శక్తి సంపన్నత్వమునుండి ఎన్నడు జారనివాడు (పతనము చెందనివాడు.)
- తన భక్తులెన్నడును పతనము కాకుండ కాపాడువాడు.
- జన్మ, పరిణామము, వార్ధక్యము వంటి దశలకు అతీతమైనవాడు.

### ఓం అచ్యుతాయ నమః

ఈ నామము 101, 320, 557వ నామములుగా మూడుమార్లు వచ్చును.

11వ శ్లోకము. 101వ నామము. అచ్యుతః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః**

35వ శ్లోకము. 320వ నామము. అచ్యుతః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**

59వ శ్లోకము. 557వ నామము. అచ్యుతః – **వేధాః**

**స్వాంగోऽజితః కృష్ణో దృఢః సంకర్షణోऽచ్యుతః**




నవంబరు 2014.

మస్కట్ ఆలయంలో శ్రీవేంకటేశ్వర కళ్యాణము.

**భక్తేభ్యోऽచ్యుత పూర్వత్వాత్ అచ్యుతః పరికీర్తితః ఆశ్రితానాం చ్యుతిర్యస్యా న్నాప్తి సోऽచ్యుత ఈరితః** - తన భక్తుల కొరకు మరుగు పడనటువంటివాడు. తనను శరణన్నవారిని ఎప్పుడూ వదలిపెట్టనివాడు అచ్యుతుడు. 'చ్యుతి' అనగా పతనము. అచ్యుతుడు అనగా పతనము కాని(లేని)వాడు. లేదా పతనము కానీయనివాడు.

పతనము లేనివాడు – బ్రహ్మ, ఇంద్రుడు తదితర దేవతలు తమ స్థానములను కొంతకాలము తరువాత (కల్పాంతమున) కోల్పోవవచ్చును. అంతేగాక వారివారి కర్మఫలములచే వారి వైభవము ప్రభావితమగును. కాని శ్రీమన్నారాయణుని పదమునకు ఆదియు, అంత్యము లేదు. ఆయనకు జన్మ కర్మాది బంధములు వర్తించవు. ఆయన అజుడు. అప్రమేయుడు. అచ్యుతుడు.

మహాభారతము. శాంతి పర్వము . 12.330.16 - **యస్మాత్ న చ్యుత పూర్వోऽహమ్ అచ్యుతస్తేన కర్మణా.** ఈ శృతివాక్యమును వివరించడంలో శ్రీశంకరులు, శ్రీభట్టులు కొంత వైవిధ్యాన్ని చూపారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్వరూప సామర్థ్యాత్ న చ్యుతో న చ్యవతే** – ఆయన స్వరూప సామర్థ్యములలో ఎన్నడును కొరవడలేదు (పతనము కాలేదు). ఇప్పుడు కొరత లేదు. ఇంకముదెన్నడును కొరత రాజాలదు. ఆయన వైభవము, శక్తి, సౌందర్యములు అపూర్వములు, అనంతములు, అవిచ్ఛిన్నములు. కనుక ఆయన అచ్యుతుడు.

పతనము కానీయనివాడు – ఇంక పైన చెప్పిన (**యస్మాత్ న చ్యుత పూర్వోऽహమ్ అచ్యుతస్తేన కర్మణా**) శృతివాక్యమునకే శ్రీ భట్టుల వివరణ ద్వారా రెండవ అర్థాన్ని గ్రహింపవచ్చును – నేను (నా భక్తులను) ఎన్నడును విడనాడను. అందువలన నన్ను అచ్యుతుడని

అందురు. **తేభ్యః ప్రపన్నేభ్యః న అపగతః అచ్యుతః** – తనను శరణు జొచ్చినవారినుండి ఎన్నడును దూరము కానివాడు అచ్యుతుడు.

శ్రీ తిరుక్కుళ్ళమ్ నృసింహరాఘవాచారిగారు తమ భగవద్గీతాభాష్యములో చెప్పిన భావము – **న చ్యవయతి ఇతి అచ్యుతః** – అనగా తన భక్తులను పతనము కానీయనివాడు అచ్యుతుడు. తనను నమ్ముకొనినవానిని విజయుని చేయుటకై ఆయన పార్థసారధియై పగ్గములు చేపట్టిన ఆప్తబంధువు గనుక ఆయనను అర్జునుడు 'అచ్యుత' అని సంబోధించాడు. గీత 9.31 – **కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి** – కౌంతేయా! నా భక్తుడెన్నడును నష్టమునకు గురికాడు అను విషయమును నిశ్చయముగా ఎఱుంగుము.

మార్పు లేనివాడు – 'చ్యుతమ్' అనగా మార్పు. సమస్త జీవులును పరిణామ స్వభావము కలిగియున్నవి. జననము, జీవనము, రూపములో మార్పిడి, పెరుగుట, కృశించుట, తుదకు శరీరమునుండి నిష్క్రమించుట – ఇట్టి మార్పులు జీవులకు సహజము. కాని భగవానుడు – **శాశ్వతమ్ శివమ్ అచ్యుతమ్** – అనగా శాశ్వతమైనవాడు, మంగళకరమైనవాడు, మార్పులేనివాడు అని తైత్తరీయారణ్యక ఉపనిషత్తు (10.11)లో ఉన్నది. పరిణామశీలకము కానివాడు గనుక ఆ వేంకటరమణుని అచ్యుతుడని శరణుజొచ్చెదను.

**పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్ నారాయణం మాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం** - విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగ అయినవాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధారమైనవాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు, మంగళకరుడు, నాశనరహితుడు, తెలుసుకోదగిన పరమాత్ముడు, విశ్వపరాయణుడు అయిన నారాయణునకు నమస్కారము.

## 102. వృషాకపిః

- శ్రీవరాహమూర్తిని స్తుతించు పుణ్యనామము.
- జలములలో (అధర్మములో) మునిగిపోవు భూమిని ఉద్ధరించినవాడు. ధర్మపరిరక్షకుడు. వరాహస్వరూపి.

### ఓం వృషాకపయే నమః

**కపిర్వరాహశ్శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే తస్మాద్వృషాకపిః ప్రోక్తో వస్వర్ణోऽభీష్టదో మనుః** - వృష అంటే ధర్మము. కపి అంటే వరాహము. వృషాకపి అంటే ధర్మస్వరూపమైన శ్రేష్ఠమైన వరాహము. ఈ నామాన్ని **'ఓం వృషాకపయే నమః'** అనే అష్టాక్షరీ మంత్రంగా జపిస్తే సర్వాభీష్టాలు నెరవేరుతాయి.

ధర్మమును రక్షించు శ్రీవరాహమూర్తి. **కపిర్వరాహః శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే తస్మాద్ వృషాకపిమ్ ప్రాహ కాశ్యపో మామ్ ప్రజాపతిః** - మహాభారతము.శాంతిపర్వము.330.24. వరాహశ్రేష్ఠమును 'కపి' యందురు. ధర్మమును 'వృష' అనియందురు. (కోరికలు వర్షించునది గనుక ధర్మము వృష యగును.) కనుక ప్రజాపతి కశ్యపుడు నన్ను 'వృషాకపి'యని పిలిచెను.

జలములలో మునిగిపోవు భూమిని ఉద్ధరించినవాడు. కాత్ – అపాత్ - ఉదకములనుండి (భూమిని) ఉద్ధరించినవాడు.

ఈ రెండు అర్థములను అనుసంధానిస్తూ శ్రీ చిన్మయానంద ఇలా వివరించారు – వరాహస్వరూపమును ధరించి, అధర్మసాగరమున మునిగిపోవు భూమిని ఉద్ధరించినందున ఆయన 'వృషాకపి'యగును. (ఈ నామముపై వేర్వేరు వ్యాఖ్యానకర్తల భాష్యములలో భేదాలు స్పష్టంగా కనుపిస్తున్నాయని శ్రీ చిన్మయానంద అభిప్రాయము.)

**శ్రీ భండారు పర్వతరావు రచన – 'ఓం నమో నారసింహాయ' నుండి.**

ప్రళయకాలంలో సృష్టి అంతా జలమయం కాగా భూమి పాతాళానికి దిగిపోయింది. ప్రళయానంతరం పునఃసృష్టికై స్వాయంభువ మనువు నియమించబడ్డాడు. ఆయన తనకూ, తన సంతతికీ ఉండేందుకు స్థలం ఏదని బ్రహ్మను అడిగాడు. బ్రహ్మ 'విష్ణువును ప్రార్థించుము' అన్నాడు. మనువు ప్రార్థన నాలకించి, విష్ణువు బ్రహ్మనాసికారంధ్రం నుండి అంగుళమంత వరాహంగా బయటకు వచ్చాడు. అంతా చూస్తుండగానే ఆ వరాహం క్షణాలపై చకచకా పెరిగి ఆకాశమంత అయింది. సముద్రంలో మునిగి భూమిని తన కొమ్ము కొసన ధరించి పైకి వస్తుండగా హిరణ్యాక్షుడు తారసిల్లాడు. వరాహమూర్తికీ, హిరణ్యాక్షునికీ ఘోరయుద్ధం జరిగింది.

బ్రహ్మ వచ్చి, విష్ణువుతో 'ఇలా ఉపేక్ష చేయకుము. అభిజిన్ముహూర్తం వచ్చింది. వెంటనే రాక్షసుని సంహరించు' అన్నాడు. శ్రీవరాహమూర్తి చేతులలో రాక్షసుడు మరణించగానే దేవతలంతా జయజయ ధ్వానాలు చేసి విష్ణువును స్తుతించారు. దేవతల స్తోత్రాలను స్వీకరించి విష్ణువు (స్వస్వరూపంలో) వైకుంఠానికి వెళ్ళాడు.

ఈ కథను విన్నా, చదివినా గొప్ప కీర్తి, నారాయణ పదభక్తీ, ఇహపర సౌఖ్యాలూ కలుగుతాయి.

**శ్రీవిష్ణుమహాపురాణమునుండి (భక్తి నివేదన - మే 2002) -** (శ్రీవిష్ణుమహాపురాణాన్ని పరాశరమహర్షి రచించాడు. ఈ తెలుగు సేత శ్రీ ఉభయ వేదాంత శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారిది.)

స్వామి వరాహరూపాన్ని ధరించి భూసముద్ధరణకై సముద్యమించాడు. స్వామి ఘుర్ఘుర ధ్వని చేస్తూ ఉంటే సామవేద కమనీయస్వరం వినిపిస్తున్నది.

తతః సముత్క్షిప్య ధరాః స్వదంష్ట్రయా - మహావరాహః స్ఫుట పద్మలోచనః
రసాతా దుత్పల పత్ర సన్నిభః - సముత్థితో నీల ఇవాచలో మహాన్

స్వామి తన కోరలతో పాతాళాంతర్గత అయిన భూమిని పైకి సముద్ధరించాడట. విశాలంగా వికసించిన పద్మాల్లా ఉన్న నేత్రాలతో మహావరాహరూపి అయిన స్వామి, భూమిని పైకెత్తుతూ నల్లని కలువ వంటి దేహచ్ఛాయ కలిగి ఒక మహానీలగిరిలా పైకి లేచినాడట. పైకి లేస్తూ తన ముఖంనుండి ఆవిర్భవించిన వాయువులతో జలాలను పైకి చిమ్ముతూ ఉంటే, ముఖవాయు సముత్థితమైన జలం పైనున్న జనలోకవాసులపై పడిందట. పైలోకాలలో ఈ సన్నివేశాన్ని సానందంగా దర్శిస్తున్న సనక సనందనాది మహర్షుల స్వాభావిక పరిపూతులైనవారిని పరమపావనులుగా చేసిందట ఆ జలం.

## 103. అమేయాత్మా

ఆ పరమాత్ముని తత్త్వ స్వరూపములను తెలిసికొన సాధ్యము కాదు.

### ఓం అమేయాత్మనే నమః

11వ శ్లోకము. 103వ నామము. అమేయాత్మా – **వృషాకపిః అమేయాత్మా సర్వయోగవినిస్సృతః**
19వ శ్లోకము. 181వ నామము. అమేయాత్మా – **అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్**

**ఇయా నిత్యపరిచేద్య స్వభావాత్సర్వతోఽధికః అమేయాత్మా సమద్దిష్టో హ్యౌన్నత్య ఫలదో మనుః -** పరమేశ్వరుడు సర్వాధికుడు కాబట్టి ఇంతటివాడు అని చెప్పటానికి వీలు లేదు. ఈ నామ స్మరణ ఉన్నతమైన ఫలితాన్నిస్తుంది.

'అమేయ' అనగా తెలియరానిది, కొలువరానిది, ఊహకందనిది. ఆ విరాట్ పురుషుని అనంత విభూతి లీలాగుణ సామర్థ్యములు ఈ నామములో కీర్తింపబడుచున్నవి (శ్రీ చిన్మయానంద). ఆయన తత్వము ఎరుగ తరము కాదు. ఆయన స్వరూప స్వభావములు ఊహింప వశము కావు.

## 104 సర్వయోగ వినిస్సృతః

- అన్ని సంగమములకు, బంధములకు, విషయవాసనలకు అతీతుడు.
- ఎన్నో విధములైన (జ్ఞాన, కర్మ, భక్తి వంటి) యోగముల ద్వారా సులభముగా పొందనగువాడు.

### ఓం సర్వయోగ వినిస్సృతాయ నమః

'యోగ' అనగా 'కలయిక', 'ఉపాయము' అని రెండు అర్థాలున్నాయి. ఆలాగే ఈ నామమును రెండు విధాలుగా వ్యాఖ్యానించారు.

వినిస్సృతః – ముందుకు వచ్చుట, తప్పించుకొనుట (సర్ విలియమ్ మోనియర్ గారి సంస్కృత నిఘంటువు.

యోగ – కలయిక, వినిస్సృత – తప్పించుకొనుట

**సర్వేభ్యో యోగేభ్యః వినిసృతః** –ఆ దేవదేవుడు ఏ విధమైన సంబంధ బాంధవ్యములకు, విషయ సంగమములకు బద్ధుడు కానివాడు. కనుక సర్వయోగ వినిసృతుడు.

**పోతన భాగవతము – తానెవరినో వామనుడు బలికి ఇలా చెప్పాడు.**

ఎవ్వరి వాడనంచు ఏమని పల్కుదు నా అంతవాడనై నడువనేర్తు
ఇది నా నడవడియని ఎట్లు వక్కాణింతు పూని ముప్పోకలు పోవనేర్తు
అది నేర్తు నిది నేర్తునని ఏల చెప్పంగ నేరుపులన్నియు నేనె నేర్తు
ఒరులు గారు నాకు ఒరులకు నేనౌదు ఒంటివాడను చుట్టమొకడు లేడు.

యోగ – ఉపాయము, వినిసృత – కదలివచ్చి అందువాడు.

**సర్వైరుపాయైః ప్రాప్యశ్చ సర్వయోగవినిసృతః** – భక్తులు ఎన్నో విధాలుగా ఆ జగన్నాథుని పొందగలరు.

శ్రీ భట్టుల వివరణ – యోగైః-ఉపాయైః, వి-విశేషేణ, నిసృతః-ప్రాప్తుమ్ యోగ్యః, సుగ్రహ ఇతి వా

**పోతన భాగవతము – శ్రీహరి కరుణ పొందుటకు నారదుని ఉపదేశము**

కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటిమెట్లైన ను
ధ్దామ ధ్యాన గరిష్ఠుడైన హరిం జెందవచ్చు ధాత్రీశ్వరా



ద్వారకా తిరుమలలో
ద్వారక మహర్షి, శ్రీ వేంకటేశ్వర స్వామి మూర్తులు



## వసుర్వసుమనాః సత్యః సమాత్మా సంమితః సమః |
## అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః || (12)

### 105. వసుః

- తన భక్తుల హృదయములందు వసించువాడు. (వసించుట = నివసించుట)
- క్షీరసాగరమున వసించువాడు
- భక్తులు కోరుకొను పరమార్థము (అత్యుత్తమమైన సంపద.)
- అష్ట వసువులలో శ్రేష్ఠుడైన పావకుడు.
- అంతరిక్షమున వసించువాడు.

**ఓం వసవే నమః**

ఈ నామము మరల 271వ నామముగాను, 701వ నామముగాను వచ్చును.

12వ శ్లోకము. 105వ నామము – వసుః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**

29వ శ్లోకము. 271వ నామము – వసుః – **సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః**

74వ శ్లోకము. 701వ నామము – వసుః – **వసుప్రదో వాసుదేవో వసుః వసుమనా హవిః**

**వసతీతి వసుస్తేషు ప్రీత్యా పరమయా స్వయమ్ –** తనభక్తుల యందు అపారమగు ప్రీతితో వారియందు వసించువాడు వసువు.

**వసతీతి వసుః –** నివాసముండువాడు 'వసుః' అనే ఆధారంగా మొదటి రెండు అర్థాలు వస్తాయి. కొద్దిపాటిగా నైనను భక్తి భావము కలిగినవారి హృదయాలలో శ్రీహరి స్థితుడైయుండును. మరియు ఆ శ్రీమన్నారాయణుడు శేషశయనుడై క్షీరసాగరమున వెలుగొందుచుండును. ఒక ఉపన్యాసములో శ్రీకృష్ణప్రేమిగారు ఇలా చెప్పారు. – భక్తులు ఎంతో దీక్ష, సాధన తరువాత గాని వైకుంఠప్రాప్తిని పొందలేరు. అట్టివారికి అందుబాటులో ఉండడం కోసం శ్రీమన్నారాయణుడు శ్రీలక్ష్మీసమేతుడై పాలసంద్రమున పవళించియుండును. సామాన్య భక్తుల చెంతకు వచ్చి చేయూతనిచ్చు కరుణామయుడే ఆ అచ్యుతుడు. తానై శబరి చెంతకు చేరి నైవేద్యమును స్వీకరించిన జానకీరాముడు. అజ్ఞానమువల్లనైనను పూజావిధులను నిర్వర్తించిన గుణనిధిని అనుగ్రహించిన గౌరీవల్లభుడు. ఎన్నోతప్పులు చేసినవారి ముడుపులు కూడ స్వీకరించి, వారి ఆపదలను తొలగించు అలమేలు మంగాపతి శ్రీవేంకటరమణుడు.

అనంతశయనుని క్షీరసాగర నివాసమునుగూర్చి శ్రుతులలో ఇలా ఉన్నది. స **లోకానామ్ హితార్థాయ క్షీరోదధే వసతి ప్రభుః –** ఆ ప్రభువు సకల లోకములకు మేలు చేయుటకై పాలసంద్రమున వసించియుండును.

**ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః** (హరివంశము 113.62) – ఈ నారాయణుడు లక్ష్మీ సమేతుడై పాలకడలియందు నివాసముండును.

'వసు' అనగా ఐశ్వర్యము అని కూడ అర్థము. **– వసతి నీతిమతామ్ గృహ ఇతి వసుః –** అత్యుత్తమమగు ఐశ్వర్యము, మోక్షగాముల పరమార్థము ఆ శ్రీనివాసుడే. సకల సంపదల రూపము, సకల తపముల సిద్ధి, సకల జ్ఞానముల గమ్యము ఆ శ్రీహరియే. **వాసుదేవః సర్వమ్** - అని గీత (7.19)లో చెప్పబడినది. జ్ఞానులు అన్వేషించు పరమార్థమే శ్రీకృష్ణ పరమాత్మ.

అష్టవసువులలో శ్రేష్ఠుడైన పావకుడు (అగ్ని) గనుక ఆయనను 'వసుః' నామమున కీర్తింతురు. **వసూనామ్ పావకశ్చాస్మి** – అని శ్రీ శంకరులు గీత (10.23)నుండి ఆధారము చూపారు.

**ధరో ధ్రువశ్చ సోమశ్చ, అహశ్చైవానిలోఽనలః**
**ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ, వసవోఽష్టౌ ప్రకీర్తితాః** (మహాభారతము. ఆదిపర్వము. 6.18)
ధరుడు, ధ్రువుడు, సోముడు, అహస్సు, అనిలుడు, అనలుడు (అగ్ని, పావకుడు), ప్రత్యూషుడు, ప్రభాసుడు అనువారు వసువులు. వీరిలో అనలుడు (అగ్ని) వసువులకు రాజు. దేవతలకు హవిస్సును అందించువాడు. మరియు ఇతడు భగవానుని ముఖముగా భావింపబడువాడు. కనుక భగవానుడు అగ్ని(పావకు)ని తన స్వరూపముగా తెల్పెను. (గీతా తత్త్వ వివేచనీవ్యాఖ్యనుండి)

కఠోపనిషత్తు (2.5.2)లో - **వసురంతరిక్షాత్** – అని చెప్పబడినది. అనగా ఆ పరంధాముడు వాయువువలె సంచరించుచు అంతరిక్షమున (ఆకాశమున) వసించును.

## 106 వసుమనాః

- శ్రేష్ఠమయిన, సకలైశ్వర్యవంతమైన మనసు గలవాడు.
- తన భక్తులను గొప్ప నిధులుగా భావించువాడు.

### ఓం వసుమనసే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది. 12వ శ్లోకంలోను, 74వ శ్లోకంలోనూ కూడా **వసుః, వసుమనాః** అనే నామములు ఒకదాని తరువాత మరొకటి వచ్చాయి.

12వ శ్లోకము. 106వ నామము. వసుమనాః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**
74వ శ్లోకము. 702వ నామము. వసుమనాః – **వసుప్రదో వాసుదేవో వసుః వసుమనా హవిః**

**వసునీవ నిధౌ తేషు మనో యస్యాస్తి సర్వదా సర్వైర్వసుమనాః ప్రోక్తో మాతృవత్ పోషకో మనుః -** మానవులకు తమయొక్క ధనం మీద, భాగ్యము మీద, సంపదమీద మనసు ఏ విధంగా లగ్నమై ఉంటుందో, అదేవిధంగా తనభక్తులయందు మనసు లగ్నమై ఉండువాడు. ఈ నామ మంత్రము తల్లివలె పోషించును. ఓం వసుమనసే నమః.

రాగద్వేష రహితము, మదమాత్సర్య రహితము, మాలిన్యము లేనిదినగు మనస్సు శ్రేష్ఠమయిన మనసు. అట్టి బంగారు మనస్సుగలవాడు వసుమనస్కుడు. ఆయనకు కామక్రోధములు అంటవు. విషయవాసనలు పట్టవు. దోషములు దరిచేరవు.

శ్రీహరి తన భక్తుల పాలిటి కల్పవృక్షము. శ్రీహరికి తనభక్తులు పెన్నిధివంటివారు.

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే**

**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః** – గీత 7.19

అనేక జన్మల పిదప జ్ఞానియైనవాడు (భగవత్తత్త్వమును ఎఱిగినవాడు) సర్వమూ వాసుదేవమయమే అని భావించి నన్ను శరణు పొందును. అట్టి మహాత్ముడు లభించుట అరుదు. కనుకనే శ్రీమన్నారాయణుడు తన భక్తులను ఇష్టనిధులుగా భావించి ప్రేమతో వారి యోగక్షేమములను వహించును.

## 107. సత్యః

- నిజము.
- ప్రాణము, పదార్థము (అన్నము), సూర్యుడు – ఈ మూడింటిచే కూడిన రూపము గలవాడు.
- సత్ప్రవర్తనయందు ప్రీతిగలవాడు.

### ఓం సత్యాయ నమః

ఈ నామము మరి రెండుమార్లు (218, 873 నామములుగా) వస్తుంది.

12వ శ్లోకము. 107వ నామము. సత్యః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**

23వ శ్లోకము. 218వ నామము. సత్యః – **గురుర్గురుతరో ధామః సత్యః సత్యపరాక్రమః**

93వ శ్లోకము. 873వ నామము. సత్యః – **సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాక్రమః**

'సత్యము' అనగా 'నిజము' అనేది అందరికీ తెలిసిన అర్థము. ఇది సామాన్యమైన వాడుక పదము. 'సత్యః' అనే నామంతో శ్రీకృష్ణభగవానుని సంబోధించే ప్రామాణికం మహభారతం ఉద్యోగపర్వము (69.12.13)లో ఉన్నది.

**సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమస్మిన్ ప్రతిష్ఠితమ్ సత్తా సత్తే చ గోవిందః తస్మాత్ సత్యః సతామ్ మతః -** శ్రీకృష్ణునిలో సత్యమున్నది. సత్యములో శ్రీకృష్ణుడున్నాడు. సత్తు, అసత్తు (ఉనికి, మాయ) రెండును గోవిందునిలో స్థితములైయున్నవి. కనుక జ్ఞానులైన మహానుభావులు శ్రీకృష్ణుడే సత్యమని తెలిపినారు.

శ్రీ శంకరులు ఐతరేయారణ్యకమునుండి మరొక ఆధారమును ఉదాహరించారు. **సదితి ప్రాణాస్తీత్యన్నమ్ యమిత్య సావాదిత్యః –** సత్ అనగా ప్రాణము, తి అనగా అన్నము, యమ్ అనగా సూర్యుడు. ప్రాణము, అన్నము, సూర్యుడు అనే రూపములలోనుండువాడు గనక శ్రీమన్నారాయణుని 'సత్యః' అని సేవింపనగును. మనలోని ప్రాణములు భగవంతుని రూపము. ఆ ప్రాణములు నిలుపు అన్నము పరబ్రహ్మస్వరూపము. ఆ అన్నము నొసగు సూర్యుడు ప్రత్యక్షనారాయణుడు.

**సత్సు సాధుత్వాత్ సత్యః** – సచ్ఛీలురైనవారి పట్ల భగవంతుడు ప్రీతి కలిగియుండున. వారికి పరమాత్ముడే ఆత్మబంధువు.

**తత్ర సాధుః** – అనే పాణిని సూత్రము (4.4.98)ననుసరించి – **తత్రేతి సప్తమీశమర్థాత్ సాధురిత్యే తస్మిన్నర్థే యత్ ప్రత్యయో భవతి** – 'యత్' ప్రత్యయము చేర్చుటవలన 'ఉత్తమమైన, సజ్జనులైనవారి విషయమునందు' అనే అర్థం వస్తుంది. సత్-యత్ = సజ్జనులయందు నిజమైనవాడు. సాధుసజ్జనుల యందుండు సత్ప్రవర్తనమే సత్యము. నిత్యము, భగవద్రూపము.

శ్రీ చిన్మయానంద – వేదాంతపరముగా భూత, వర్తమాన, భవిష్యత్ కాలములలో మారకుండ నిలిచియుండునదే సత్యము. అటువంటి గుణము కలిగినాడు సర్వేశ్వరుడు మాత్రమే. మాయామేయ జగంబును దాటి, కాలమునధిగమించిన పిదప ఏకాకృతితో వెలుగువాడు ఆ ఆత్మభవుడు. భూతభవ్యభవత్ప్రభువు. అవ్యయుడు. అక్షరుడు. శ్రీ వాసుదేవుడు.

## 108. సమాత్మా

- సమమైన, భేదభావములు లేని, రాగద్వేష రహితమగు ఆత్మ.

### ఓం సమాత్మనే నమః

సమస్త భూతములందు ఆత్మయై వసించు భూతాత్మునకు రాగద్వేషములు, తర తమ భావములు, స్వ పర భేదములు లేవు.

**సమోఽహమ్ సర్వ భూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్** – గీత 9.29

నేను సకల భూతముల (ప్రాణుల)యందును సమ భావముతో వ్యాపించియుందును. నాకు అప్రియుడు గాని, ప్రియుడు గాని ఎవ్వడును లేడు. కాని నన్ను భక్తితో భజించువారు నాయందే ఉందురు. నేను వారియందు ప్రత్యక్షముగా ఉందును.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్**
**వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి** – గీత 13.27

నశ్వరములైన చరాచర భూతముల (ప్రాణుల)యందు సమముగా స్థితుడైయున్న పరమేశ్వరుడు నాశరహితుడు. అట్టి పరమేశ్వరుని చూచువాడే నిజమైన ద్రష్ట.

## 109. సమ్మితః

## 109. అసమ్మితః

- తన భక్తులచే ఇచ్ఛానుసారముగా నియంత్రింపబడువాడు (వారి అనుభవములకు గోచరించువాడు).
- ఋషులచే అంగీకరింపబడి, ఉపనిషత్తులద్వారా తెలుపబడినవాడు.
- పరిచ్ఛేదింప జాలనివాడు. అంత్యము, హద్దు లేనివాడు (ఆసమ్మితః)

### ఓం సమ్మితాయ నమః

### ఓం అసమ్మితాయ నమః

'సమ్మిత' అనగా 'ఒప్పుకొనబడినది' అనే పదంనుండి మొదటి రెండు అర్థములను గ్రహించవచ్చును.

మొదటి అర్థము, శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము – లోకాధినాధుడు, బ్రహ్మను కన్న తండ్రి, దేవదేవుడు తానే బిడ్డయై దేవకీవసుదేవుల జన్మను ధన్యమొనర్చెను. నందనందనుడై, యశోదాదేవి ముంగిట ముత్యమై మన్ను తినెను. కౌసల్యా దశరథుల చెంత రామచంద్రుడై రఘువంశ కులదీపకుడయ్యెను. తన భక్తుల పట్ల ప్రేమతో వారికి బిడ్డయై, చెలుడై, చుట్టమై వారి జీవితమున పాత్రధారియగుటకు సమ్మతించెను. కనుక ఆ జగన్నాటక సూత్రధారిని 'సమ్మితః' అని కీర్తించిరి.

శ్రీ చిన్మయానంద – ఆయనే సత్యము, నిత్యము అనిఋషులు సమ్మతించినారు. ఉపనిషత్తులు తెలిపిన సత్యము ఆయనే.

(అద్వైతపాఠము ననుసరించి) శ్రీ శంకరులు ఈ నామమును 'అసమ్మితః' అని పరిగణించారు. అసమ్మితము అనగా మితము లేనిది. ఊహించ జాలనిది. పరిచ్ఛేదము కానిది. పరబ్రహ్మము. కనుక ఆయన అసమ్మితుడు.

## 110. సమః

- అన్నింటియందు సమభావము కలిగినవాడు.
- మార్పు లేక ఎల్లప్పుడు సమముగా (ఒకే తీరున) ఉండువాడు.
- శ్రీలక్ష్మీ సమేతుడు.

### ఓం సమాయ నమః

వికార రహితుడై, ద్వంద్వములకు అతీతుడైనవాడు, అందరిపట్ల సమ భావము కలిగినవాడు గనుక వాసుదేవుడు సముడగును. 'సమ' అనే అర్థాన్నే 'మార్పు లేక సమముగా ఉండువాడు' అని శ్రీ శంకరులు అన్వయించారు.

శ్రీ శంకరుల మరొక వివరణ – మా యా- లక్ష్మితో ఎల్లప్పుడూ, స-సహవర్తత్ - కూడియుండువాడు. కనుక ఆయన సదా లక్ష్మీవల్లభుడు. శ్రీధరుడు. శ్రీనివాసుడు. సముడు.

## 111. అమోఘః

- తనను పూజించువారికి నిశ్చయముగా సత్ఫలములను ప్రసాదించువాడు.

### ఓం అమోఘాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

12వ శ్లోకము. 111వ నామము. అమోఘః - **అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః**

17వ శ్లోకము. 156వ నామము. అమోఘః – **ఉపేంద్రో వామనః ప్రాంశుః అమోఘః శుచిరూర్జితః**

మోఘము అనగా వ్యర్థము. (మోఘమ్ నిరర్థకమ్ – అమరకోశము). అమోఘము అనగా వ్యర్థము కానిది. అర్థవంతమైనది. విశేషించి ఫలించునది.

**అమోఘమ్ దర్శనమ్ రామ న చ మోఘః తవ స్తవః**
**అమోఘాస్తే భవిష్యన్తి భక్తిమంతశ్చ యే నరాః** – రామాయణము. యుద్ధకాండము 120.31
రామా! నీ దర్శనము ఎల్లప్పుడూ అమోఘము. శ్రీరామ స్తుతి ఎన్నడూ వ్యర్థము కాజాలదు. నీ పట్ల భక్తులైన నరులు సదా విజయము పొందుదురు.

**శ్రీరామరక్షాస్తోత్రమునుండి (గీత ప్రెస్ వారి ప్రచురణలోని అనువాదం)**

ఏతాం రామబలోపేతాం రక్షాం యః సుకృతీ పఠేత్ - స చిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్.

పాతాళ భూతల వ్యోమ చారిణశ్చద్మ చారిణః - న ద్రష్టు మపి శక్తాస్తే రక్షితమ్ రామనామభిః

రామేతి రామభద్రేతి రామ చంద్రేతి వా స్మరన్ - నరో నలిప్యతే పాపైర్భుక్తిం ముక్తిం చ విందతి.

జగజ్జైత్రైక మంత్రేణ రామనామ్నాభి రక్షితమ్ - యఃకంఠే ధారయేత్తస్య కరస్థాః సర్వ సిద్ధయః

వజ్రపంజర నామేదం యో రామకవచం స్మరేత్ - అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయమంగళం.

శ్రీరాముని దివ్యబలయుతమైన ఈ రామరక్షాస్తోత్రమును పఠించెడి ధన్యుడు దీర్ఘాయువును, సుఖమును, పుత్రసంతానమును, విజయమును, వినయసంపదను పొందగలడు. పాతాళ, భూతల, ఆకాశ చరములు గాని, అదృశ్యరూపమున విహరించెడి శక్తులు

గాని రామనామముచే రక్షింపబడునట్టివానిని కన్నెత్తి అయినను చూడజాలవు. 'రామ'యని, 'రామభద్ర'యని. 'రామచంద్ర'యని స్మరించెడి నరునకు ఎట్టి పాపమును అంటదు. అతడు భుక్తిని, ముక్తిని పొందగలడు. జగత్తును జయించగలిగిన ఏకైక మంత్రమగు రామనామముచే సురక్షితమైన (రక్షా)స్తోత్రమును కంఠస్థము చేసినవానికి సర్వసిద్ధులును కరస్థములగును. వాని ఆజ్ఞలకు ఎదురుండదు. సర్వకాల సర్వావస్థలయందును అతనికి జయము, శుభము కలుగును.

## 112. పుండరీకాక్షః

- తామరపూవువంటి కన్నులు గలవాడు.
- అందరి హృదయ కమలమున వసించి సమస్తమును చూచువాడు.
- వైకుంఠవాసులకు కనుచూపు వంటివాడు.

### ఓం పుండరీకాక్షాయ నమః

పుండరీకము అనగా తామరపూవు. **పుండరీకే ఇవ అక్షిణీ యస్య సః పుండరీకాక్షః** – పద్మములవంటి సుందరమగు నేత్రములు కలవాడు పుండరీకాక్షుడు.

శ్రీ లింగాయత సూరిగారు తమ అమరకోశవ్యాఖ్యానములో ఇంకొక అర్థం కూడా చెప్పారు. **పుండరీకమ్ హృత్కమలమ్ అక్షతీతి వా** – హృదయ కమలమున వ్యాపించినవాడు పుండరీకాక్షుడు. (అక్షతి-వ్యాపించును)

శ్రీ భట్టులు 'పుండరీక' అనే పదానికి 'వైకుంఠము' అనే అర్థం గ్రహించారు. శ్రీవైకుంఠవాసులకు ఆయనే కన్నులవంటివాడు గనుక పుండరీకాక్షుడు. ఇందుకు మహాభారతము ఉద్యోగ పర్వము (69.6)లో ఆధారం ఉన్నది.

**పుండరీకమ్ పరమ్ ధామ నిత్యమ్ అక్షరమ్ అవ్యయమ్**

**తద్భావాత్ పుండరీకాక్షో దస్యుత్రాసో జనార్దనః**

నిత్యము, అవ్యయమునైన పరంధామమే పుండరీకము. ఆ దివ్యలోకవాసులకు చూపువైనందున (కంటికి రెప్పలాగా కాపాడువాడు గనుక) ఆయనను పుండరీకాక్షుడని కీర్తింతురు.

**పృథివీ కృత శ్రీవరాహస్తుతి.**

నమస్తే పుండరీకాక్ష! శంఖ చక్ర గదాధర!

మాముద్ధరాస్మాదద్యత్వం త్వత్తోఽహం పూర్వముత్థితా!

## 113. వృషకర్మా

- ధర్మమే తన నిజకర్మగా కలిగినవాడు.

### ఓం వృషకర్మణే నమః

**శ్రేయస్కరం ధర్మరూపం కర్మయస్య ప్రచక్షతే వృషకర్మేతి విఖ్యాతః శుభకర్మప్రదో మనుః** - భక్తులకు శ్రేయోదాయకమైన ధర్మము అనబడే కర్మగలవాడు. ఈ నామాన్ని మంత్రంగా జపిస్తే శుభకర్మలు జరుగుతాయి. 'వృష' అనగా ధర్మము. కోరినవానిని వర్షించునది. **అభిలాషితమ్ వర్షతీతి వృషః** – శ్రీహరి కర్మములే ధర్మములు. ధర్మసంస్థాపనమే ఆయన కార్యము. కర్మబంధములు లేకున్నను, సాధింపదగినది (అవసరము) ఏమీ లేకున్నను, ఆయన ధర్మపరిరక్షణకై, లోకహితమునకై కర్మలు ఆచరించును.

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి** – గీత 3.22

ఓ అర్జున! ఈ ముల్లోకములందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో నేను పొందనిదియును లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను.

**యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్** – గీత 4.7
**పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే** – గీత 4.8

ఓ భారత! ధర్మమునకు హాని కలిగినప్పుడును, అధర్మము పెచ్చుపెరిగిపోవుచున్నప్పుడును నన్ను నేను సృజించుకొందును. సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపు మాపుటకును, ధర్మమును సుస్థిరమొనర్చుటకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

## 114. వృషాకృతిః

- మూర్తీభవించిన ధర్మస్వరూపుడు.

### ఓం వృషాకృతయే నమః

వృష-ధర్మము, ఆకృతి-ఆకారము. ధర్మమే ఆకారముగా కలవాడు వృషాకృతి.

**తాపత్రయాగ్ని దగ్ధానాం సుధేవాత్యన్త శీతలమ్ రూపం కర్మ చయస్యాప్తి వృషకర్మా వృషాకృతిః** - తాపత్రయాలతో తపిస్తున్నటువంటి తన భక్తులకు అమృతమువలె చల్లనైన రూపము, సుఖము ఇచ్చేటటువంటి ధర్మకర్మములు కలవాడు వృషకర్మ, వృషాకృతి.

**రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః రాజా సర్వలోకస్య దేవానామివ మానవః** - శ్రీరాముడు ధర్మమే మూర్తీభవించిన స్వరూపుడు. కనుక ధర్మము నాచరించువాడును, ధర్మమును పూజించువాడును వేరుకాదు. ధర్మ సంస్థాపనకై ఆకృతి నొందినవాడు – అని కూడ అన్వయించుకొనవచ్చును.



హిరణ్యాక్షునితో యుద్ధం చేస్తున్న శ్రీ వరాహమూర్తి – 1740 కాలపు చిత్రం. చిత్రకారుడు హిమాచల్ ప్రదేశ్‌కు చెందిన మనాకు. వికీపీడియానుండి. https://commons.wikimedia.org/wiki/File:Varaha_and_Hiranyaksha.jpg



## రుద్రో బహుశిరా బభ్రుర్విశ్వయోనిః శుచిశ్రవాః |
## అమృతః శాశ్వతః స్థాణుర్వరారోహో మహాతపాః || (13)

### 115. రుద్రః

- కన్నులలో నీరు తెప్పించువాడు.
- భక్తులకు శుభము కలిగించువాడు.
- దుఃఖమును, దారిద్ర్యమును నాశనము చేయువాడు.

ఓం రుద్రాయ నమః

**ఈదృగ్రూపై శ్చేష్టితైశ్చ భక్తానానంద బాష్పయన్ రోదయన్ రుద్ర ఉద్దిష్టః సర్వ సంతోషదో మనుః -** పై నామాలలో చెప్పిన రూపము, చేష్టలతో తన భక్తులను ఆనంద పరవశులను గావించి, వారి కన్నులనుండి ఆనందబాష్పములు రప్పించువాడు. ఈ నామాన్ని మంత్రముగా జపించినట్లయితే సకల సంతోషాలు సమకూరతాయి. ఓం రుద్రాయ నమః. **రోదయతీతి రుద్రః** – నుండి మొదటి అర్థము వస్తుంది. ఈ అర్థమునే వ్యాఖ్యాతలు రెండు విధాలుగా అన్వయించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఆ భక్తవరదుడు తన ఆశ్రితుల కన్నులలో ఆనందబాష్పములు స్రవింపజేయును గనుక రుద్రుడు. ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు శ్రీమద్భాగవతములోని ఒక శ్లోకాన్ని ఉదాహరించారు. దాని సారాంశము – భగవంతుని లీలాగుణ శ్రవణము వల్లను, ఆయన పుణ్యనామకీర్తన వల్లను ఆనందబాష్పములు రానివారిది రాతిగుండె కావలెను.

మరొక వ్యాఖ్య – ప్రళయ కాళమున సకల ప్రాణులను లయము కావించుచు వారికి దుఃఖమును కలిగించువాడు రుద్రుడు

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – రుద్-శుభములను, ర-కలిగించువాడు. మంగళప్రదుడు. శ్రీకరుడు. శుభకరుడు.

మరొక వ్యాఖ్య – **రుమ్ ద్రావయతి ఇతి రుద్రః** – దుఃఖములను హరించువాడు రుద్రుడు.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి :

**రుద్ర ఇత్యుచ్యతే తస్మాచ్ఛివః పరమ కారణమ్** – అని శివపురాణమునందు చెప్పబడియుండుట చేత, తన్నాశ్రయించిన భక్తుల సమస్త దుఃఖములను, దుఃఖ హేతువులను కూడ పోగొట్టి సుఖములను వర్షింపజేయువాడగుట చే 'రుద్రః' అని భగవానుడు పిలువబడుచున్నాడు. ఆయన భక్తులకు మంగళకరుడు. దుర్మార్గులకు భయకరుడు.

**రుద్రాణామ్ శంకరశ్చాస్మి** (గీత 10.23) – ఏకాదశరుద్రులలో శుభప్రదాతయగు శంకరుడను నేనని గీతాచార్యుడు తెలిపియున్నాడు. **'శం' కరోతి ఇతి శంకరః** – శుభములను కలుగజేయు వాడగుటచేత శంకరుడు అనబడుచున్నాడు. శ్రీ మహావిష్ణువే 'రుద్ర' నామముతో ఇచట స్తవము చేయబడుచున్నాడు.

**శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః.** అను పవిత్ర శాస్త్రవాక్యము స్మరణీయము. శివకేశవులకు భేదమెంతమాత్రమును లేదు. ఆయన (కాశీ) విశ్వనాథుడు. ఈయన (పూరీ) జగన్నాథుడు. ఆయన

సర్పహారములు గలవాడు. ఈయన సర్పశయ్య గలవాడు. కావున శివకేశవులకు భేదము లేదు. (శ్రీ పెమ్మరాజు రాజారావు గారి వ్యాఖ్య)

### 116. బహుశిరాః

- అనేక శిరస్సులు కలవాడు. అనంతుడు.

**ఓం బహుశిరసే నమః**

ఋగ్వేదము, పురుష సూక్తములో – **సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్** – వేయి శిరసులు, వేయి కన్నులు, వేయి పాదములు – అని భగవానుని విరాడ్రూపమును వర్ణించారు. ఇదే విధమైన వర్ణన గీతలో విశ్వరూపదర్శనములోను, పరబ్రహ్మ తత్త్వవివరణలోను ఉన్నాయి. ఆయన అనంత ముఖములు అన్నియెడల విస్తరించియుండును. ఇది భాషకు, ఊహకు అందని విరాట్ పురుషుని గూర్చిన వర్ణన

**అనేక వక్త్ర నయనమ్ అనేకాద్భుత దర్శనమ్ అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్** – గీత 11.10
**దివ్య మాల్యాంబరధరం దివ్య గంధానులేపనమ్ సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖమ్** – గీత 11.11
అర్జునుడు చూచిన ఆ పరమేశ్వరుని విరాట్ (విశ్వ) రూపమునందలి ముఖములు అనంతములు. నేత్రములు అసంఖ్యాకములు. అందలి దృశ్యములు అద్భుతములైనవి. ఆ రూపము అనేక దివ్యాభరణ శోభితము. ఆ పరమేశ్వరుడు పెక్కు దివ్యాస్త్రములను చేపట్టి యుండెను. దివ్యములగు మాలలను, వస్త్రములను ధరించెను. ఆ దివ్య శరీరమునుండి దివ్య చందన పరిమళములు దశదిశల గుబాళించు చుండెను. ఆ రూపము సర్వాశ్చర్యకము. అనంతము. సర్వతోముఖము.

**సర్వతః పాణి పాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్ సర్వతః శృతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి** – గీత 13.13
ఆ పరమాత్ముని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై యున్నవి. అతడు సర్వమును ఆవరించియున్నాడు. ఈ నామము సహస్రాధిక ఫణ సంపన్నుడైన అనంతుని రూపమున విలసిల్లు శ్రీమహావిష్ణువును స్తుతించునని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

### 117. బభ్రుః

- ఆధారమైనవాడు. భరించువాడు.

**ఓం బభ్రవే నమః**

**బిభ్రతి లోకాన్ ఇతి బభ్రుః** – లోకములన్నింటిని భరించి, రక్షించువాడు. సమస్తమునకును ఆధారము. ఆయన ఆదిశేషుడై పృథ్విని భరించును. ఆదివరాహమూర్తియై భూదేవిని ఉద్ధరించి, రక్షించెను.

**యస్య సా సకలా పృథ్వీ ఫణామణి శిరారుణా బిభర్తి మాలాం లోకానామ్** – ఈ భూమండలమంతా ఎవని పడగలలో నుండు మాణిక్యములయొక్క కాంతిచే ఎర్రగా ప్రకాశిస్తున్నదో, అతడే ఈ లోకాన్ని భరిస్తున్నాడు.

### 118. విశ్వయోనిః

- విశ్వమునకు కారణమైనవాడు.

- తన భక్తులను తనయందు విలీనము చేసికొనువాడు.

### ఓం విశ్వయోనయే నమః

మరల 16వ శ్లోకములో 151వ నామము విశ్వయోనిః – **అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః**

'యోని' అనగా మూలకారణము. విశ్వమంతటికి మూలకారణము గనుక శ్రీమహావిష్ణువును 'విశ్వయోని' అని స్తుతింపనగును.

89వ నామము 'విశ్వరేతా' అనగా విశ్వమునకు మూలబీజము. 118వ నామము 'విశ్వయోని' అనగా ఆ బీజమును రక్షించి, జన్మనిచ్చి పోషించు గర్భస్థానము అని చెప్పవచ్చును. 9వ నామము 'భూత భావనః' అనగా సకల జీవకోటులను పోషించువాడు. 15వ నామము 'సాక్షీ' అనగా అంతటిని చూచువాడు. కనుక **'వాసుదేవః సర్వమ్'** అని తెలిసికొన్నవాడే జ్ఞాని (గీత). శ్రీ వాసుదేవుడే తల్లి, తండ్రి, ఆధారము, సాక్షి, పరమపదము. ఆయనే సర్వము, సర్వేశుడు. భగవద్గీత 14వ అధ్యాయములోని 3,4 శ్లోకములలో కూడ ఈ నామముల సమన్వయమును గ్రహింపవచ్చును.

**మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్** – గీత 14.3
**అహం బీజప్రదః పితాః** – గీత 14.1

**విశ్వేషాం భేజూషాం న్వేన విశ్వయోనిస్తు మిశ్రనోత్** – తనను ఆశ్రయించినవారందరినీ తనతో సమానమైన రూపమిచ్చి తనతో చేర్చుకొనువాడు. 'యు' అనగా 'విలీనము' **(యు-మిశ్రణే)** అనే మూలంనుండి కూడ 'యోని' పదమును అన్వయింప వచ్చును. కనుక ఆయన తన భక్తులను కూడ తనలో విలీనము చేసికొనుటచే 'యోని' యగును. ఇది ఆయనకు భక్తులపట్ల గల అవ్యాజప్రేమ వలన జరుగును. కనుక ఆ గోపీజన ప్రియుని 'విశ్వయోని'యని కీర్తించిరి.

## 119. శుచిశ్రవాః

- ధర్మపూరితములు, సత్యములునగు వాక్కులను విని ఆనందించువాడు.
- మంగళకరములై, వినసొంపైన నామములు గలవాడు.
- దివ్యసుందరమగు చెవులు కలవాడు.

### ఓం శుచిశ్రవసే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శుచీని శ్రావణ్యాని శృణోతి ఇతి శుచిశ్రవాః** – స్వచ్ఛమును, ధర్మయుతమునైన మాటలు ఆ భక్తవరదునకు బహుప్రీతికరములు.
విదురుని పలుకులు, అన్నమయ్య కీర్తనలు, త్యాగయ్య గానము, రామదాసు స్తుతి, సూరదాసు కథలు, పోతన పద్యములు పట్ల ఆయనకు ఎంతో మక్కువ. తులసీదాసు, మీరాబాయి ఆయనను కీర్తించి తరించారు. గోదాదేవి తిరుప్పావైను ఆకర్ణించి కావేటి రంగడు పరవశించాడు.

ఈ అర్థానికి ఆధారంగా శ్రీ భట్టులు మహాభారతము శాంతిపర్వములోని శ్లోకము(344.61)ను ఉదాహరించారు.
**శుచీని శ్రవణీయాని శృణోమి ఇహ ధనంజయ న చ పాపాని గృహ్ణామి తతోఽహమ్ వై శుచిశ్రవాః**
ధనంజయా! నేను స్వచ్ఛము, సొంపు అయిన విషయములను విందును. పాపవచనములను ఇచ్చగించను. కనుక నన్ను శుచిశ్రవుడు అనియందురు. ఇదే వివరణలో శ్రీ భట్టులు మహాభారతము ఉద్యోగపర్వము (93.2)నుండి విదురుని సుభాషితమును కూడా ఉదాహరించారు.

**ధర్మ్యా, రమ్యాశ్చ అర్థవతీః విచిత్రార్థ పదాక్షరాః**
**శృణ్వంతో వివిధా వాచః విదురస్య మహాత్మనః**
**అకామస్యైవ కృష్ణస్య సా వ్యతీయాయ శర్వరీ**
మహాత్ముడగు విదురుని ధర్మ, రమ్య, అర్థవంతములైన విచిత్ర బహువిధ భాషణములను వినుచున్న శ్రీకృష్ణునికి గమనించకుండానే రాత్రి గడచిపోయినది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శుచీని శ్రవంసి నామాని శ్రవణీయాన్యస్యేతి శుచిశ్రవాః** – ఆయన నామములు వినుటకు ఇంపుగను, సొంపుగను ఉండును గనుక ఆయన శుచిశ్రవమూర్తి. శ్రీరామ, రామచంద్ర, రామభద్ర, గోవింద, గోపాల, వెంకరమణ, గురువాయూరప్ప, లక్ష్మీనరసింహ, సత్యనారాయణ, అప్పన్న, ఏడుకొండలవాడు, ఆపద మ్రొక్కులవాడు, బాలాజీ, కన్నయ్య, జగన్నాధ – ఇలా వేనవేలుగా భక్తులు ఆ శ్రీహరి నామములను స్మరించి, కష్టములు గడచి, తరించుచున్నారు. కనుక మనము కూడా గోవిందుని భజించి తరింతుము.

'శ్రవస్' అనగా 'చెవి' అనే అర్థంలో శ్రీ చిన్మయానంద వివరణ – ఆయన చెవులు దివ్యములు. భక్తుల మొరలు విని తరలి వచ్చెడు పరమాత్మ ఆయన. కరిరాజవరదుడు. అంతే గాక అందరిలోని వినికిడి శక్తి ఆ శుచిశ్రవ స్వామియే.

## 120. అమృతః

- భక్తులకు తనివి తీరని అమృతమూర్తి
- అజరుడు, అమరుడు.

### ఓం అమృతాయ నమః

**జరామృత్యోర్వారణేన హ్యతృప్తేర్వాపి సేవనాత్ అమృతస్స్యాన్నిరతిశయ మాధుర్యేతి చ సర్వదా** - ఆశ్రితులకు మధురముగానుండి, జరామరణములు లేకుండా నివారించువాడు. ఎంత అనుభవించినప్పటికీ తృప్తి కలగకపోవటం చేత అమృతమువలె ఉండేవాడు. **శ్రీరామ నీ నామమెంతో మధురం** – భగవంతుని స్మరణ, జప, పూజాది సేవలొనర్చు భక్తులకు ఆ కొండలరాయుడు అమృతమూర్తి. భగవత్సేవా కార్యము ఎంత చేసినా భక్తులకు తనివి తీరదు. ఆయన భక్తుల హృదయములను శాంతింపజేయు అమృతమయుడు.

**న విద్యతే మృతమ్ మరణమ్ అస్య ఇతి అమృతః** – ఆయన షడ్వికార శూన్యుడు. జరామరణాది జీవ పరిణామములు ఆయనకు వర్తించవు. ఆయన నిత్య యవ్వనుడు. సచ్చిదానందుడు. **అజరః అమరః** – అని బృహదారణ్యకోపనిషత్తు (4.4.25)లో ఉన్నది.

భక్తుల అజ్ఞానమనే వ్యాధిని నివారించువాడగుటచే ఆయన 'అమృతః' అని శ్రీ చిన్మయానంద వ్యాఖ్యానించారు.

## 121. శాశ్వత స్థాణుః

- కాలముతో నిమిత్తము లేకుండ, నిశ్చలముగా, నిత్యమై, సత్యమై, నిరంతరమైనవాడు. ఆదిమధ్యాంత రహిత పరబ్రహ్మము.

### ఓం శాశ్వతస్థాణవే నమః

### ఓం శాశ్వతాయ స్థాణవే నమః

ఈ నామములోని రెండు పదములు రెండు నామములుగా ఇంతకుముందు స్తుతించడమైనది.

57వ నామము. శాశ్వతః – నిరంతరముగా సృష్టి, స్థితి, లయ కార్యములొనర్చు శాశ్వతమూర్తి.
28వ నామము. స్థాణుః – భక్తులకు నిశ్చయముగా కామితార్థములను, పరమార్థమును ప్రసాధించువాడు. కాలమువలన మార్పు చెందనివాడు.

మరల 'స్థావర స్థాణుః' అనే 427వ నామములో భాగంగా 'స్థాణు' అనే పదము వస్తుంది. ప్రస్తుత 121వ నామము 'శాశ్వతస్థాణుః' ఒకే నామముగా దాదాపు అన్నివ్యాఖ్యానాలలోను ఉన్నది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఆయన ఉనికి, స్వభావము, స్వరూపములు కాలముతో మారవు. స్థలము వల్లను మారవు. పాలసముద్రమును చిలుకుటవలన సాధించిన అమృతమును వేరెవరో తన్నుకొని పోవచ్చును. కాని శ్రీహరి ధ్యానమగ్నులైన భక్తులనుండి ఆయనను విడదీయుట సాధ్యము కాదు. కనుకనే ఆ నారాయణుడు శాశ్వతస్థాణువు (Eternal and Steady).

**భోగ్యో హ్యపునరావృత్త్యా భోక్తృభ్యో రోచతే యతః స్వయం నిత్యస్సదాయోఽసౌ శాశ్వతస్థాణురుచ్యతే** - తానెప్పుడు నిత్యముగా ఉంటాడు కాబట్టి తన భక్తులైన నిత్యముక్తులకు పునర్జన్మ లేనటువంటి భోగ్యవస్తువైనాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – కాలముతో నిమిత్తము లేకుండా దృఢముగా, స్థిరముగా నిలిచియుండువాడు (Eternally firm).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – తుది, మొదలు లేనివాడు గనుక 'శాశ్వత', వయస్సు, క్షీణత లేనివాడు గనుక 'స్థాణు'. వెరసి ఆ పరమాత్ముడు శాశ్వతస్థాణువు.

## 122. వరారోహః

- అన్నింటికంటె శ్రేష్ఠమగు ఊర్ధ్వగతి. పొందదగిన అత్యున్నత పదము.
- అత్యున్నతమగు వృద్ధి కలిగినవాడు.
- ఆదిశేషునిపై పవళించువాడు.

### ఓం వరారోహాయ నమః

**పరమోత్కృష్ట మారోహం యస్య స్వప్రాప్తి లక్షణమ్ వర్తతే స వరారోహః ప్రకృష్టః స్థానదో మనుః** - అన్నింటికీ మిన్నయయిన తనను పొందడం అనే పరమోన్నతమైన లక్షణము కలవాడు. ఈ నామము ఉన్నతమైన స్థానాన్ని ప్రసాదిస్తుంది. 'వరమ్' అనగా శ్రేష్ఠమైనది. 'ఆరోహమ్' అనగా పైకి ఎక్కుట. ఈ నామమును శ్రీ భట్టులు 'అత్యున్నతి గతి' అనీ, శ్రీ శంకరులు 'అత్యున్నత ఊర్ధ్వమార్గము' అనీ వ్యాఖ్యానించారు. శ్రీ వైకుంఠమే ముముక్షువుల పరమపదము. పరంధామము. శ్రీమన్నారాయణుడే పరమగతి. **స న పునరావర్తతే** – అట్టివానికి పునరావృతి లేదు (అతడు తిరిగిరాడు) అని ఛాందోగ్యోపనిషత్తులో ఉన్నది.

ఆదిశేషునిపై శయనించినవాడు, ఉన్నతమైన పర్యంకము కలవాడు గనుక వరారోహుడు అని శ్రీరాధాకృష్ణశాస్త్రిగారు వివరించారు.

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః** – గీత 8.15
**ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే** – గీత 8.16

పరమ సిద్ధిని పొందిన మహాత్ములు నన్ను చేరిన పిదప, దుఃఖములకు నిలయమైన, క్షణభంగురమైన పునర్జన్మను పొందరు. అర్జున! బ్రహ్మలోకము పర్యంతము ఉన్న సమస్త లోకములును పునరావృతములు. కౌంతేయ! (ఈ లోకములన్నియును కాలమునకు పరిమితములైనవి. నేను కాలాతీతుడను). కనుక నన్ను చేరినవానికి పునర్జన్మయుండదు.

శ్రీ లక్ష్మీనారాయణులు. శ్రీ కాకుళం నారాయణతిరుమల ఆలయంలో శిల్పం.

https://commons.wikimedia.org/wiki/File:NarayanaTirumala36.JPG



**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ** – గీత 15.6
స్వయంప్రకాశ స్వరూపమైన నా పరంధామమును సూర్యుడు గాని, చంద్రుడు గాని, అగ్ని గాని ప్రకాశింపజేయ జాలరు. అట్టి పరంధామమును చేరిన పుణ్యాత్ములు మరల ఈ జగత్తున ప్రవేశింపరు. అనగా జన్మింపరు.

**శ్రీ భట్టుల నామవిభాగ ప్రకారము ఈ పుణ్యస్తోత్రములోని (1) 'విశ్వమ్' నుండి (122) 'వరారోహః' వరకు చెప్పబడిన మొదటి 122 పవిత్ర, మంగళ నామములు శ్రీమహావిష్ణువుయొక్క పరవాసుదేవ స్వరూపమును కీర్తించునవి. పరవాసుదేవ స్వరూపము షడ్గుణైశ్వర్య సంపన్నము. జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజో గుణములచే పరిపూర్ణమైనది. ఎల్లలు లేనిది. ఆధారము అవుసరము లేనిది. ముముక్షువుల పరమావధి. భగవంతుని దివ్య పరతత్వమును కీర్తించుచున్నవీ నామములు.**

ఇంతేగాక, యుధిష్ఠిరుని ఆరు ప్రశ్నలలో మొదటి రెండు ప్రశ్నలకును సమాధానము ఈ 122 దివ్య నామములలో పొందుపరచియున్నదని శ్రీభట్టుల వివరణ. ఆ రెండు ప్రశ్నలు

(1) **కిమేకమ్ దైవతమ్ లోకే** – లోకమున ఒక్కడేయైన దేవుడెవ్వరు?

(2) **కిమ్ వాపి ఏకమ్ పరాయణమ్** – మానవులు పొందదగిన ఏకైక మహోన్నత స్థానమేది?

ఇక యుధిష్ఠిరుని 3వ ప్రశ్న

(3) **స్తువంతః కిమ్** – ఎవనిని స్తుతింపవలెను?

ఈ ప్రశ్నకు సమాధానముగా 'వ్యూహ స్వరూపములు' అని చెప్పబడినది అని శ్రీభట్టులు వ్యాఖ్యానించారు. భగవంతుని వ్యూహములు నాలుగు. అవి.

1. వాసుదేవుడు
2. సంకర్షణుడు
3. ప్రద్యుమ్నుడు
4. అనిరుద్ధుడు.

**వీనిలో వాసుదేవమూర్తియే పరవాసుదేవ స్వరూపముగా భావింపవచ్చును. కనుక ఈ వ్యూహము 1 నుండి 122 వరకు నామములలో కీర్తింపబడినది.**

భగవంతుని వ్యూహావతారములు సృష్టి, స్థితి, లయ కార్యములకు ఆధారములుగా గ్రహించాలి. ఒక్కొక్క వ్యూహమునకున ఒక్కో ప్రధాన కార్యమును ఆపాదించారు. ఆ కార్యమునకు అనుగుణముగా ప్రతి వ్యూహమునకు కొన్ని గుణములు, రూపములు వర్తించును. ఈ వ్యూహములలో భగవంతుడు సృష్టి, స్థితి, లయలను నిర్వహించును. శాస్త్రములను ప్రతిపాదించును. వాని ప్రాముఖ్యతను తెలియబరచును. శాస్త్రానుగుణముగా ఫలములను ప్రతిపాదించును.

**సంకర్షణమూర్తి జ్ఞాన, బల సంపన్నుడు. ఇక్కడి నుండి – అనగా 'మహాతపః' నామమునుండి – సంకర్షణుని స్తుతించే నామములు చెప్పబడినవి.**

## 123. మహాతపః

- మహత్తరమైన జ్ఞానము కలిగినవాడు.

ఓం మహాతపాయ నమః

**మహత్ పూజ్యం తపో జ్ఞానం యస్యేతి స మహాతపాః** – పూజనీయమైన జ్ఞానము కలవాడు.

ముండకోపనిషత్తులో - **యస్య జ్ఞానమయం తపః** - అని చెప్పబడినది. పరమాత్మయొక్క తపస్సు జ్ఞానస్వరూపము. 'మహత్' అనగా పూజింప దగినది. సంచిత, ఆగామి, ప్రారబ్ధ కర్మ బంధములను అధిగమించి, భవసాగరమును తరించు జ్ఞానము ఆయననుండియే లభించును.



(చిత్రం. శ్రీలంక నువారా ఇలియా అశోకవాటిక మందిరంలో అర్చామూర్తులు)

### శ్రీ సీతారామచంద్రాభ్యాం నమః

శ్రీ మద్వాల్మీకి రామాయణాంతర్గత **'సుందర కాండము'** నందు హనుమంతుని జయఘోష - శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి శ్రీ మదాంధ్రవాల్మీకి రామాయణము (మందరము)నందు తెలుగు అనువాదము.

**నమోస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకాత్మజాయై**
**నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః**

మ్రొక్కెద రామచంద్రునకు మోడ్చెదఁ గేలు సుమిత్ర పట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహప తనూజకు శ్రీరఘురాము దేవికిన్
మ్రొక్కెద ధర్మ వాసవ మరుద్గణ మారుత రుద్రపాళికిన్
మ్రొక్కెద సూర్య చంద్రులకు మ్రొక్కెదఁ దామరసాప్త సూతికిన్

**జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః**
**రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః**

జయము జయంబు రామునకు సారపరాక్రమ ధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషదసహ్య తరస్వి సుమిత్ర పట్టికిన్
జయము జయంబు దాశరథి సంపరిపాలితుఁడౌ వలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు సాహస విక్రమ కీర్తిశాలికిన్



శ్రీలంక నువారా ఇలియా (అశోకవనం) వద్ద
శ్రీ హనుమంతుని మందిరం.

**దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః**
**హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః**
**న రావణ సహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్**
**శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః**

దాసుఁడ సర్వ సద్గుణ వితాన మనోహర రామమూర్తికిన్
గోసల దేశ వల్లభుకున్ హత శత్రుఁడ వాయుపుత్రుఁడన్
నా సరిగారు సంగరమునన్ దశకంఠులు వేవురేనియున్
వాసి యడంతు ఊాల ద్రుమపాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్

**అర్దయిత్వా పురీం లంకాం అభివాద్య చ మైథిలీమ్**
**సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్**

ధ్వంసంబుఁ జేసి లంకను
హింసించి సమస్త రాక్షసేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్ర
శంసిత గతిం జనెద మిడుక సకల సురారుల్.

మహాబల సంపన్నుడైన శ్రీరామునకు జయము. మిక్కిలి పరాక్రమశాలియైన లక్ష్మణస్వామికి జయము. శ్రీరామునకు విధేయుడు, కిష్కింధకు ప్రభువు అయిన సుగ్రీవునకు జయము. అసహాయ శూరుడు, కోసల దేశపు ప్రభువు అయిన శ్రీరామునకు నేను దాసుడను. వాయుపుత్రుడను. నా పేరు హనుమంతుడు. శత్రుసైన్యములను రూపుమాపువాడను. వేయి మంది రావణులైనా గాని యుద్ధ రంగమున నన్నెదిరించి నిలువలేరు. వేలకొలది శిలలతోడను, వృక్షములతోడను సకల రాక్షసులను, లంకాపురిని నాశనం చేస్తాను. రాక్షసులందరూ ఏమీ చేయలేక చూస్తూ ఉండెదరు గాక. నేను వచ్చిన పనిని ముగించుకొని, సీతాదేవికి నమస్కరించి వెళతాను.



భోపాల్ ఆలయంలో శ్రీ సీతారామ లక్ష్మణ హనుమంతుల మూర్తులు. Photo by Suyash Dwivedi
https://commons.wikimedia.org/wiki/File:RamDarbar_1100qtrs_temple_Bhopal.jpg



## సర్వగః సర్వవిద్భానుర్విష్వక్సేనో జనార్దనః |
## వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః || (14)

### 124. సర్వగః

- అంతటను గమనము కలవాడు. ఎక్కడైనా చేయూతనిచ్చువాడు.

ఓం సర్వగాయ నమః

**ధారయన్ సంహృతాద్యో వై గచ్ఛతీతి సర్వగః –** అన్నింటిని తన శక్తితో ధరించి, సంహరించి, మళ్ళీ సృష్టించి, వాటియందు ప్రవేశించువాడు.

**సర్వత్ర గచ్ఛతి ఇతి సర్వగః –** అన్నిచోట్లకు వెళ్ళువాడు. అందరికీ, అన్నింటికీ ఆధారముగానుండు శక్తిసంపన్నుడు. ప్రళయకాలమున అంతనూ తనలో ఇముడ్చుకొన్నవాడు.

**సర్వగః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శృతి ముల్లోకే సర్వమావృత్య తిష్ఠతి –** గీత 13.13
ఆ పరమాత్ముని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై యున్నవి. అతడు సర్వమును ఆవరించి యున్నాడు.

కొండలలో నెలకొన్న కోనేటిరాయని తిరుమలలో పూజించవచ్చును. ద్వారకాతిరుమలలో సేవింపవచ్చును. చిలుకూరులో ప్రదక్షిణము చేయవచ్చును. మస్కట్ లో ధ్యానించవచ్చును. భారతదేశంలో గాని, అమెరికాలో గాని, అంతరిక్షమున గాని, ఇంటిలో గాని, గుండెలలో గాని నివసించి, మ్రొక్కినవారికి పెక్కు శుభములు కలిగించు సంకర్షణునికి నమస్కారములు.

### 125. సర్వవిత్ / సర్వవిద్భానుః

- సమస్తమును తెలిసినవాడు.
- సమస్తమునకు పునరుజ్జీవనము ప్రసాదించువాడు.

ఓం సర్వవిదే నమః

**సర్వ వేత్తి విందతి ఇతి వా సర్వవిత్ –** దీనికి రెండు అర్థాలు చెప్పారు.

* సమస్తమును ఎరిగినవాడు. శ్రీహరి విశ్వాంతరాత్ముడై, సాక్షియై, అనంతుడై, ఆదిమధ్యాంతరహితుడై సర్వమును తెలిసికొనును. విష్ణువునకు తెలియని జ్ఞానము లేదు. ఆయనెరుగని కార్యము లేదు.

* సమస్తమును వెలికి తీయువాడు. ఇది ప్రద్యుమ్న వ్యూహమును సూచించు కార్యము. ఆయన సంకర్షణుడై సకల జీవములను తనలో లీనమొనర్చుకొనగా, ప్రద్యుమ్నుడై సకల జీవములను తిరిగి వెలికి తీయును. (పునర్జీవితులను చేయును.) – **ప్రద్యుమ్నత్వేతు కార్యాణి లభతే యః స సర్వవిత్.** ప్రద్యుమ్న మూర్తియై తనతో సృష్టింపబడిన సమస్త కార్యములను లభింపజేయువాడు సర్వవిత్.

శ్రీ శంకరుల భాష్యము ప్రకారము, 'సర్వవిత్' మరియు తరవాతి నామము 'భానుః' కలిపి ఒకే నామముగా 'సర్వవిద్భానుః'అని చెప్పబడినది.

## ఓం సర్వవిద్భానవే నమః

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – సర్వవిత్ + భానుః = 'సర్వవిద్భానుః' అననది ఏకనామము. 'సర్వవిత్' అనగా సర్వమును ఎరింగినవాడనియు, 'భానుః' అనగా కాంతి స్వరూపుడనియు భావము. **జ్యోతిషామపి తజ్జ్యోతి** (గీత 13.13) – సూర్య చంద్రాది జ్యోతులకంటెను దివ్యప్రకాశ సంపన్నుడు. సూర్య చంద్రాగ్నులయందు గల తేజస్సంతయు నాదే - అని భగవద్వాక్యము (గీత-15.2). 'జ్ఞానమయ దివ్య జ్యోతి' యగుట చేత భగవానుడు 'సర్వవిద్భానుః' అని కీర్తింపబడును.

## 126. భానుః

- ప్రకాశించువాడు.

## ఓం భానవే నమః

**భాతి ఇతి భానుః** – నిశ్చలముగా ప్రకాశించువాడు. ఆయన సృష్టి, పాలన కార్యము వలన విశ్వములో పరిణామము సహజము. కాని ఆయన మాత్రము మార్పు లేక, నిరవధికముగా, నిశ్చలముగా ప్రకాశించుచునే యుండును. **భాను సర్వస్య భాతీతి నిర్మాణేస్యవికారతః** – అన్ని పదార్థాలను నిర్మించి, తాను కొంచెము కూడా వికారము చెందకుండా ప్రకాశించువాడు.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చన్ద్రమపి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్** – గీత 15.12
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సు, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సేయని ఎరుంగుము.

## 127. విష్వక్సేనః

- లోకరక్షణార్థము అన్ని దిక్కులయందు సైన్యము కలిగినవాడు. తన తలంపు మాత్రమున సర్వ దానవ సైన్యమును నాశనము చేయువాడు.

## ఓం విష్వక్సేనాయ నమః

**ఇనేన స్వామినా సాకం వర్తతే సేన ఇత్యతః విష్వగ్రక్ష్యో జనో యస్య విష్వక్సేన ఇతీరితః** - 'ఇన' అంటే ప్రభువు. అతడితో ఉన్నది సేన. అదే ఇక్కడ పరమాత్మ అంతర్యామిగా ఉండి రక్షించే సంసారము.

**ఇనేన స్వామినా ఈశ్వరేణ సహవర్తతే ఇతి సేనా విషూచీ సేనా యస్య సః విష్వక్సేనః -** 'ఇనుడు' అంటే స్వామి. ఆ స్వామితో కూడి ఉన్నది సేన, అనగా రక్షక వర్గము. అటువంటి రక్షక వర్గాన్ని నాలుగు దిక్కులయందు కలవాడు కాబట్టి 'విష్వక్సేనుడు' అనబడుతున్నాడు.

*(సంస్కృత వ్యుత్పత్తిని తెలిపే కొన్ని కొన్ని శ్లోకాలను, వాని తాత్పర్యాలను డా. క్రోవి పార్థసారధి గారు రచించిన 'శ్రీకైవల్య సారథి' అనేపుస్తకం నుండి తీసికొంటున్నాను. – కా. సు. బాబు)*

శ్రీ భట్టుల వివరణ ప్రకారము ఈ నామము అనిరుద్ధ మూర్తిని కీర్తించును. అనిరుద్ధుడు మనందరకును రక్షకుడు. **ఇనేన వర్తతే ఇతి సేన –** ఇక్కడ 'ఇనేన' అనగా 'స్వామికి తోడుగా' (స్వామిన్ సహ) అని అర్థము. కనుక ఎల్లప్పుడూ స్వామి వెంటనే ఉండునది సేన (సేశ్వరః). ఈ నామము ఆయన శక్తిని సూచించును. 'అ-నిరుద్ధ' అనగా నిరోధింపజాలని వాడు. ఎవ్వరి నియంత్రణలోను ఉండనివాడు. శక్తిమంతుడు. స్వతంత్రుడు. ఆ శక్తి ఆ శ్రీమన్నారాయణునిదే. ఆయనే విష్వక్సేనుడై భక్తులను కాపాడుచుండును.

తన తలంపు మాత్రమున సర్వ దానవ సైన్యమును నాశనము చేయువాడు. విష్వక్సేనుడు

విష్ణుమూర్తికి సేనాపతి విష్వక్సేనుడు. యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరఃశతమ్ విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం తమాశ్రయే

## 128. జనార్దనః

- దుష్టులను శిక్షించువాడు.
- దుష్టుల బారినుండి సజ్జనులను రక్షించువాడు.
- కామితార్థములకై భక్తులు ఎవరిని ఆశ్రయింతురో ఆ దేవుడు.

### ఓం జనార్దనాయ నమః

**భక్త విద్వేషిణాం తూర్ణం మర్దనాద్ది జనార్దనః –** తనయొక్క భక్తులను ద్వేషించేవారిని శిక్షించువాడు జనార్దనుడు. శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణము

**దస్యు త్రాణాత్ జనార్దనః** (మహాభారతము. ఉద్యోగ పర్వము. 71.6) – దస్యులను (రాక్షసులను) శిక్షించి ప్రజలను రక్షించువాడు గనుక శ్రీకృష్ణుడు జనార్దనుడగును.

శ్రీ శంకరులు రెండు అర్థాలను చెప్పారు.

**జనాన్-దుర్జనాన్, అర్థయతి-హినస్తి –** అనగా దుర్జనులను శిక్షించువాడు జనార్దనుడు.

**జనైః అర్థయతే –** జనులచే యాచింపబడువాడు జనార్దనుడు. ముడుపులు కట్టి, మ్రొక్కులు మ్రొక్కి, దీక్షలు పూని, వ్రతములు ఆచరించి, పూజలు చేసి, కీర్తనలు ఆలాపించి భక్తులు తమ కోరికలను శ్రీవేంకటరమణునికి విన్నవించుకొంటారు. ఆ జనార్దనుడు భక్తవరదుడై వారికి కామితార్థములను ప్రసాదిస్తాడు.

**పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే –** గీత 4.8
సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపుమాపుటకును, ధర్మమును సుస్థిర మొనర్చుటకును నేను ప్రతి యుగమునందును అవతరించుచుందును.

<u>ద్రౌపది ప్రార్థన.</u> తనను వేరెవరు రక్షింపజాలరని తెలిసికొని కురుసభలో ద్రౌపది ఆర్తయై మానసంరక్షణ కొఱకు గోపీజన వల్లభుని ప్రార్థించిన విధము. మహాభారతము. సభాపర్వము.67

గోవింద! ద్వారకా వాసిన్! కృష్ణ! గోపీజన ప్రియ!
కౌరవైః పరిభూతానాం మాం, కిం న జానాసి కేశవ?
హే నాథ! హే రమానాథ! వ్రజనాథార్తినాశన!
కౌరవార్ణవ మగ్నాం మాముద్ధరస్వ జనార్దన!
కృష్ణ! కృష్ణ! మహాయోగిన్! విశ్వాత్మన్! విశ్వభావన!
ప్రపన్నాం పాహి గోవింద! కురుమధ్యేऽవసీదతీమ్.

ఓ గోవింద! ద్వారకావాస! ఓ కృష్ణ! గోపీజనప్రియ! కేశవ! కౌరవులు నన్ను అవమానించుచున్న విషయమును నీవెరుగవా? ఓ జగన్నాథ! లక్ష్మీనాథా! వ్రజనాథా! దుఃఖ నాశన! జనార్దన! కౌరవ సముద్రమునందు మునుగుచున్న నన్ను రక్షించుము. హేకృష్ణ! కృష్ణ మహాయోగీశ్వర! విశ్వాత్మా! విశ్వభావనా! గోవిందా! దుఃఖితురాలనై నిన్ను శరణు జొచ్చిన నన్ను కౌరవుల బారినుండి రక్షింపుము. (గీతా ప్రెస్ ప్రచురణ నుండి)




ద్వారకా తిరుమల – దీపారాధనా స్థలంవద్ద శ్రీ స్వామివారి ద్విమూర్తులు

## 129. వేదః

- సమస్త జ్ఞానము మూర్తీభవించిన స్వరూపుడు. వేదమూర్తి.

### ఓం వేదాయ నమః

'విద్' అనగా 'తెలిసికొనుట'. ఈ ధాతువునుండే 'వేద' శబ్దము వస్తుంది. **వేదయతీతి వేదః** – అంతటిని తెలియపరచు పరమ సత్యమే వేదము. జనార్దనుని ఊపిరినుండి వేదములు ఉద్భవించాయి. వేదములకు, వేదవేద్యునకు భేదం లేదు.

**సర్వే వేదాః సర్వ విద్యాః సశాస్త్రాః సర్వే యజ్ఞాః సర్వ ఇజ్యాశ్చ కృష్ణః** (మహాభారతము) – అన్ని వేదములు, అన్ని విద్యలు, అన్ని శాస్త్రములు, అన్ని యజ్ఞములు, అన్ని నివేదనలు శ్రీకృష్ణుడే.

**యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మ చ వేదాశ్శాస్త్రాణి విజ్ఞానమేత త్సర్వం జనార్దనాత్** - శ్రీ విష్ణు సహస్రనామము ఉత్తర పీఠిక - యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్య, సర్వశాస్త్రములు జనార్దనుని నుండియే కలిగినవి.

శ్రీ భట్టుల వ్యాఖ్యానంలో ఈ శుభనామము జ్ఞానగుణ సంపన్నుడైన సంకర్షణ వ్యూహ స్వరూపమును సూచించును.

## 130. వేదవిత్

- వేదములను, వాని సారమును (అర్థమును) సంపూర్ణముగా నెరిగినవాడు.

- వేద జ్ఞానమును బోధించువాడు.

## ఓం వేదవిదే నమః

ఈ నామము ఇదే శ్లోకములో 130, 133వ నామములుగా రెండుమార్లు వస్తుంది -
**వేదో వేదవిత్ అవ్యంగో వేదాంగో వేదవిత్ కవిః**

**వేదమ్, వేదార్థమ్ వేత్తి ఇతి వేదవిత్** – వేదములను, ఆ వేదముల అర్థమును తెలిసినవాడు వేదవిత్.

**వేదాన్ విన్తే-విచారయతి ఇతి వేదవిత్** – వేదములనెరిగి, వానిని చక్కగా విచారించువాడు, అనుష్ఠించువాడు, బోధించువాడు (ప్రద్యుమ్న, వ్యాసాది రూపములలో)

ఏ విధమైన సంశయములు లేకుండ సంపూర్ణముగా వేదములనెఱిగిన జ్ఞానానందమయుడు ఆయన మాత్రమే. వేదముల సారమైన ధర్మమును సంపూర్ణముగా నెఱిగిన ధర్మమూర్తియును ఆయనే.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్** – గీత 15.15
సమస్త ప్రాణులలో హృదయములలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నా నుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహమును తొలగించుట) కలుగుచున్నవి. వేదముల ద్వారా తెలిసికొనదగిన వాడను నేనే. వేదాంత కర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

## 131. అవ్యంగః

- ఏ విధమైన లోపములు లేనివాడు.

## ఓం అవ్యంగాయ నమః

'వ్యంగము' అనగా లోపము. 'అవ్యంగము' అనగా లోపము లేకుండుట. 'వేదః', 'వేదవిత్' నామములు ఇప్పుడే చెప్పిన సందర్భములో ఈ 'అవ్యంగః' నామమునకు చెప్పిన అర్థము – ఆయన వేదమూర్తి. వేదవిదుడు. వేదవేద్యుడు. కనుక వేదములకు సంబంధించిన ఎలాంటి విషయంలోనైనా (ఛందస్సు, కల్పము వంటివి) ఆయన జ్ఞానమునకు ఎలాంటి కొదువ ఉండదు. **శిక్షా వ్యాకరణాద్యజైః న హీనోऽవ్యంగ ఉచ్యతే** – శిక్షా వ్యాకరణము మొదలైన వేదాంగములలో ఏ విధమైన హీనత లేనివాడు. (తక్కువ కానివాడు.). కనుక ఆయన అవ్యంగుడు.

మరో విధంగా – ఆయన షడ్గుణైశ్వర్య పరిపూర్ణుడు. జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజో సంపన్నుడు. కనుక శ్రీమహావిష్ణువునందు ఎలాంటి లోపములూ ఉండవు.

శ్రీ పెమ్మరాజు రాజారావు గారి రచన నుండి – జ్ఞానము చేత పరిపూర్ణుడైనాడు. 'వ్యంగ' అనగా ఆకారము. 'అవ్యంగుడు' అనగా ఆకారరహితుడు. 'అవ్యక్తోయం' అని గీతావాక్యము (2.25). ఇంద్రియముల చేత గాని, మనస్సు చేత గాని తెలియబడనివాడగుట చేత 'అవ్యంగః' అనబడును.

## 132. వేదాంగః

- వేదములే శరీరముగా కలిగినవాడు.
- శృతులు, స్మృతులు శరీరముగా కలిగినవాడు.

### ఓం వేదాంగాయ నమః

పరబ్రహ్మమే వేదపురుషుడు. సకల జ్ఞానము ఆయన అవయవములు. **వేదాః అంగభూతాః యస్య స వేదాంగః** – ఎవరికైతే వేదములు శరీరమగునో ఆయనే వేదాంగుడు. **వేదాః సర్వాంగాణి** - వేదములన్నియు ఆయన అవయవములు అని కేనోపనిషత్తులో ఉన్నది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు మహాభాగవతంనుండి రెండు ఆధారాలు చెప్పారు.

భాగవతము 3.13.34 – **త్రయీమ్ తనుమ్ స్వామ్ పరిధున్వతే నమః** – వేదములే శరీరముగా కలిగినవానికి నమస్కరించుచున్నాను.

భాగవతము 3.13.41 – **త్రయీమయమ్ రూపమిదం చ సౌకరమ్** – వేదస్వరూపుడైన శ్రీవరాహమూర్తి.

## 133. వేదవిత్

- వేదముల నెఱుగుటయే గాక, వేదసారమైన ధర్మము నెఱిగినవాడు. వేదములను చక్కగా అనుష్ఠానము చేయువాడు.

### ఓం వేదవిదే నమః

ఈ నామము ఇదే శ్లోకములో 130, 133వ నామములుగా రెండుమార్లు వస్తుంది -

**వేదో <u>వేదవిత్</u> అవ్యంగో వేదాంగో <u>వేదవిత్</u> కవిః**

**వేదైర్వేద్యతయా వేదః తదర్థా ధర్మ ఉచ్యతే తదనుష్ఠాపనాన్నిత్యం ప్రద్యుమ్నో వేదవిత్ స్మృతః -** వేదములను తెలియుటయే గాక, వాని సారమైన ధర్మమును చక్కగా తెలిసికొని, ప్రద్యుమ్నమూర్తియై వైదిక ధర్మాన్ని తన శాసనములచేత, అనుష్ఠానము చేత నిత్యము విచారణ చేయువాడు.

## 134. కవిః

- సామాన్య దృష్టి నధిగమించి, సునిశిత దర్శనము (సూక్ష్మదృష్టి) కలవాడు.

### ఓం కవయే నమః

**క్రాంత దర్శిత్వాత్ కవిః** – కంటికి కనిపించని దానిని కూడ దర్శించువాడు కవి. సర్వజ్ఞమూర్తి. అట్టివారిలో ఉత్తముడు గనుక భగవానుడు 'కవి'యని స్తవనీయుడు.

**స ఏవ కాన దర్శిత్వాత్ కవిరిత్యుచ్యతే బుధైః** – భక్తులకు మధురముగా కనిపించువాడు కవి.

గీత 8.9 – **కవిం పురాణమనుశాసితారమ్** – ఇక్కడ సచ్చిదానంద పరబ్రహ్మము 'కవి'యని చెప్పబడెను.

గీత 10.37 – **కవీనా ముశనా కవిః –** సూక్ష్మబుద్ధి కలవారిలో నేను శుక్రాచార్యుడను.



## లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృత: |
## చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్దంష్ట్రశ్చతుర్భుజః || (15)

**135. లోకాధ్యక్షః**

**136. సురాధ్యక్షః**

**137. ధర్మాధ్యక్షః**

- లోకములకును, దేవతలకును, ధర్మమునకును ప్రభువు.
- జగన్నాధుడు, దేవదేవుడు, ధర్మాధిపుడు.

**ఓం లోకాధ్యక్షాయ నమ;**

**ఓం సురాధ్యక్షాయ నమః**

**ఓం ధర్మాధ్యక్షాయ నమః**


చిన్న శేషవాహనంపై శ్రీ మలయప్ప స్వామి.
https://commons.wikimedia.org/wiki/File:Chinnasesha_vahanam.jpg

అధ్యక్షుడనగా ప్రభువు, అధిపతి.
లోకములు – ధర్మమునాచరించవలసిన ప్రజలు.
సురులు – ధర్మమార్గమున ఆరాధింపబడు దేవతలు.
ధర్మము – పూజాది కార్యక్రమములకు సాధనము.

**లోకానాం అధ్యక్షః లోకాధ్యక్షః**
**సురానాం అధ్యక్షః సురాధ్యక్షః**
**ధర్మస్య త్సాధనం తేషా మధ్యక్ష స్సత్రినామవాన్**
**లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్ష ఇతి క్రమాత్**
**అనిరుద్ధ స్స విజ్ఞేయో లోకాధ్యక్షాది నామవాన్**

భగవంతుడు అనిరుద్ధ స్వరూపమున ఈ మూడింటికిని అధిపతియై ధర్మాచరణమునకు అనుగుణముగా ఫలములను ప్రసాదించును. ధర్మము నాచరించు వారికి సత్ఫలితములు కలుగక మానవు. అధర్మపరులకు సత్ఫలితములు కలుగనేరవు. తనను ఆశ్రయించినవారికి ఉపాయము, ధర్మము, అన్నింటికీ పరమాత్మయే ప్రభువు.

ఈ మూడు పవిత్ర నామములను మరొక విధముగా కూడా వివరించారు.

లోకములు – ప్రజలు.

సురులు – ప్రజలను రక్షించు దేవతలు.

ధర్మము – రక్షణ కలుగజేయు సాధనము.

ఆ శ్రీహరియే ఈ మూడింటికిని అధినాథుడు. ఆయన ఆజ్ఞానువర్తులై సర్వమును ప్రవర్తించును. అట్లు కానియెడల వానిని నియంత్రించునది ఆ శ్రీమన్నారాయణుడే. సూర్యచంద్రుల గమనము, వర్షాది కాలభ్రమణము జీవుల ప్రయోజనము కొఱకు జరుగుచున్నవి. కాని గోకులవాసులపై కోపగించి వారిని బాధించుటకై ఇంద్రాది దేవతలు రాళ్ళ వర్షము కురిపించినపుడు ఆ చిన్ని కృష్ణుడు చిటికెన వ్రేలితో గోవర్ధన గిరినెత్తి దేవేంద్రునికి గర్వభంగము కావించాడు.

## 138. కృతాకృతః

- ఇహ, పరములు రెండింటను ఫలములు ప్రసాదించువాడు.
- సమస్తమునకు కార్యము, కారణము కూడనగువాడు.
- వ్యక్తావ్యక్త స్వరూపుడు.

### ఓం కృతాకృతాయ నమః

ఇహలోకమున మనము కోరుకొను ధర్మార్థాది కామములు, ఆయురారోగ్య ఐశ్వర్య సంతానములు, పూజా దానాది పుణ్య కార్యములు – వీటన్నింటిని (కృతములను) ప్రసాదించువాడు శ్రీమన్నారాయణుడు. తరగని సంపదలను (మోక్షములను) కూడ (అకృతములను) ప్రసాదించువాడును శ్రీమన్నారాయణుడే. కనుక ఆయన కృతాకృతుడు.

**అనిత్య నిత్య ఫలదౌ ప్రవర్తక నివర్తకౌ దదౌ యస్య స్వరూపం సః కృతాకృత ఇతీరితః -** అనిత్యము (ఐహిక ఫలాన్ని ఇచ్చే ప్రవృత్తి ధర్మము - కృతము), నిత్యము (శాశ్వతమైన మోక్షఫలాన్నిచ్చే నివృత్తి ధర్మము - అకృతము) – ఈ రెండింటినీ తన స్వరూపంగా కలవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'కృతము' అనగా కార్యరూపము, కనుపించునది, చేయబడునది. 'అకృతము' అనగా కారణరూపము, కార్యమునకు మూలము. కృతాకృతములకు – అనగా కార్య కారణములకు ఆధారము గనుక శ్రీమహావిష్ణువు కృతాకృతుడు.

'కృతము' అనగా వ్యక్తము, సృష్టింపబడినది, తెలియజేయబడినది. 'అకృతము' అనగా అవ్యక్తము, సృష్టింపబడనిది, తెలియరానిది. భగవానుడు కృత రూపమున, అనగా నిర్దిష్ట కార్య కాలమున, అవతరించి గోచరించును. ఆయనే అకృత రూపమున అవ్యక్తుడై, నిత్యుడై, అవాఙ్మానస గోచరుడై విలసిల్లును. కనుక శ్రీహరి కృతాకృతుడు.

## 139. చతురాత్మా

- సృష్టి, స్థితి, లయ కార్యములందు నాలుగేసి విభూతులతో నొప్పువాడు.
- నాలుగు విధములగు సాధనావస్థలకు ప్రభువు.

### ఓం చతురాత్మనే నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.

15వ శ్లోకము. 139వ నాము. చతురాత్మా – **చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః**

82వ శ్లోకము. 775వ నామము. చతురాత్మా – **చతురాత్మా చతుర్భావః చతుర్వేదవిదేకపాత్**

సాధన, ధ్యానాది కార్యములలో ఆత్మకు నాలుగు విధములైన అవస్థలు చెప్పబడినవి.

1. జాగ్రత్ అవస్థ – మెలకువగానుండుట – బాహ్యేంద్రియములు మాత్రము పనిచేయును.
2. స్వప్న అవస్థ – కలత నిదుర – మనసు పని చేయుచుండును.
3. సుషుప్తి అవస్థ – గాఢ నిద్ర – శ్వాస మాత్రము పనిచేయును.
4. తురీయ అవస్థ – శ్వాస కూడ నియంత్రించబడును.

ఈ నాలుగు పరిస్థితులలోను పరమాత్ముడే ఆత్మకు ప్రభువు గనుక ఆయన చతురాత్ముడు.

శ్రీ శంకరుల భాష్యము – ఒక్కొక్క కార్యమునందు భగవానుని గుణవైభవము నాలుగేసి విభూతుల రూపమున మూర్తీభవించును. అందుకు ఈ విష్ణుపురాణములోని శ్లోకము ప్రమాణము.

**బ్రహ్మ దక్షాదయః కాలస్తథైవాఽఖిల జన్తవః**
**విభూతయో హరేరేతా జగతః సృష్టిహేతవః**
**విష్ణుర్మన్వాదయః కాలః సర్వభూతాని చ ద్విజ**
**స్థితేర్నిమిత్త భూతస్య విష్ణోరేతా విభూతయః**
**రుద్రః కాలోంతకాద్యాశ్చ సమస్తాశ్చైవ జన్తవః**
**చతుర్ధా ప్రళయాయైతా జనార్దన విభూతయః**
**జగదాదౌ తథా మధ్యే సృష్టిరా ప్రళయాద్ద్విజ**
**ధాత్రా మరీచి మిశ్రైశ్చ క్రియతే జంతుభిస్తథా**

| హరి<br>సృష్టి విభూతులు | విష్ణువు<br>స్థితి విభూతులు | జనార్దనుడు<br>లయ విభూతులు |
|---|---|---|
| బ్రహ్మ | విష్ణువు | రుద్రుడు |
| దక్షుడు మొదలగు ప్రజాతులు | మనువు మొదలైనవారు | కాలము |
| కాలము | కాలము | యముడు |
| సమస్త జంతువులు<br>(సర్వ భూతములు) | సర్వ భూతములు<br>(సర్వ భూతములు) | సమస్త జంతువులు<br>(సర్వ భూతములు) |

## 140. చతుర్వ్యూహః

- నాలుగు వ్యూహమూర్తులుగా – వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపాలలో – విలసిల్లువాడు.

### ఓం చతుర్వ్యూహాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

15వ శ్లోకము. 140వ నామము. చతుర్వ్యూహః - **చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః**

82వ శ్లోకము. 773వ నామము. చతుర్వ్యూహః – **చతుర్మూర్తిః చతుర్బాహుః చతుర్వ్యూహః చతుర్గతిః**

వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు – అనే నాలుగు వ్యూహ స్వరూపములు కలిగినవాడు. ఇందుకు ప్రమాణముగా శ్రీ శంకరులు చెప్పిన వ్యాసుని శ్లోకము.

**వ్యూహాత్మానమ్ చతుర్థావై వాసుదేవాది మూర్తిభిః**
**సృష్ట్యాదీన్ ప్రకారోత్యేష విశృతాత్మా జనార్దన**

విశృతాత్ముడైన జనార్దనుడు వాసుదేవుడు మొదలుగాగల నాలుగు మూర్తులు కలిగి సృష్టివంటి కార్యములు నిర్వర్తించును. వ్యూహము అనగా ఒక ప్రయోజనము కొఱకు ఏర్పడిన ఆకారము. ఈ నాలుగు వ్యూహములు భగవంతుని వేర్వేరు కార్యములు ఆధారముగా విలసిల్లు స్వరూపములు.

1. **ప్రద్యుమ్నుడు:** సృష్టి కార్యమును నిర్వర్తించును. ఈ రూపము ఐశ్వర్య, వీర్య సంపన్నము. 'ప్ర-ద్యుమ్న' అనగా అమితముగా వీర్యము కలవాడని అర్థము. మనస్సునకు ప్రతీక.

2. **అనిరుద్ధుడు**: స్థితి కార్యమును నెరపు సంరక్షకుడు. ఈయన శక్తి, తేజస్సు గుణములు ప్రధానముగా కలవాడు. 'అ-నిరుద్ధ' అనగా ఆపజాలనివాడు. కనుక ఆయన రక్షణలోనున్నవారికి ఇంక భయము వలదు. అహంకారమునకు ప్రతీక.

3. **సంకర్షణుడు**: లయకార్యమును జరిపించువాడు. సమస్తమును ఆకర్షించి తనయందు లీనమొనర్చుకొనును. జ్ఞాన, బల గుణములు ప్రధాన లక్షణములు. జీవునకు ప్రతీక.

4. **వాసుదేవుడు**: పరమాత్ముడు. షడ్గుణ పరిపూర్ణుడు. అనగా జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు అను ఆరు గుణములు అవధులు లేకుండ కలిగినవాడు. సమస్తమునకును ఆధారము. సర్వత్ర వ్యాపించినవాడు. అనంత కాంతిమయుడు.

నమస్తే వాసుదేవాయ నమః సంకర్షణాయచ
ప్రద్యుమ్నాయ అనిరుద్ధాయ చ సాత్వతాం పతయే నమః

## 141. చతుర్దంష్ట్రః

- నాలుగు కోరలు (పన్నులు) కలిగినవాడు. శ్రీ నృసింహమూర్తి.

### ఓం చతుర్దంష్ట్రాయ నమః

దంష్ట్రములు అనగా దృఢమైన కోరలు. భక్తులకు అభయము నొసగి, కోర్కెలు దీర్చు శ్రీ లక్ష్మీనృసింహమూర్తిని కీర్తించు దివ్యనామమిది.

చతుర్దంష్ట్రత్వము మహాపురుష లక్షణము అని చెబుతూ శ్రీ భట్టులు వాల్మీకి రామాయణం సుందరకాండ నుండి ఉదాహరించారు. హనుమంతుడు సీతమ్మ వారికి శ్రీరామచంద్రుని రూపమును వర్ణిస్తూ – **చతుర్దశ సమద్వంద్వః చతుర్దంష్ట్రః చతుర్గతిః** – అని చెప్పాడు. అనగా ఆ సుందరాంగుడు (శ్రీరాముడు) పదునాల్గు జతల అవయవములు (కనుబొమలు, నాసికాపుటములు, నేత్రములు, చెవులు, స్తనాగ్రములు, మోచేతులు, మణికట్టులు, మోకాళ్ళు, ముష్కములు, పిఱుదులు, చేతులు, పాదములు, పిఱుదులపై ఎత్తైన కండరములు) సమప్రమాణములో కలవాడు (ఇవి రాజ లక్షణములు). నాలుగు చక్కనైన దంష్ట్రలు(సూదివలె మొనదేలిన దంతములు - రెండు పలు వరుసలలో మధ్యగల నాలుగు దంతములకు ప్రక్కన ఉన్న నాలుగు పన్నులకు 'దంష్ట్రలు' అనే పేరు ప్రసిద్ధము.) కలవాడు. (ఏనుగు, పులి, సింహము, ఎద్దు అనే) నాలుగు జంతువుల నడకలోని అందమును పుణికిపుచ్చుకొన్నవాడు.

## 142. చతుర్భుజః

- నాలుగు బాహువులతోనొప్పువాడు. శంఖ చక్ర గదా పద్మ ధారి.

### ఓం చతుర్భుజాయ నమః

శ్రీ మహావిష్ణువు శంఖము, చక్రము, గద, పద్మములతో విలసిల్లు సుందర చిత్రము భక్తులకు సుపరిచితము. ధర్మ రక్షణార్థమై ఈ నాలుగు సాధనములను ఉపయోగించు విధమును శ్రీ చిన్మయానంద చక్కగా వర్ణించారు – దుష్కార్యములు వదలి, సచ్చిదానంద పరబ్రహ్మమగు విష్ణుపద మార్గమున పయనించమని ప్రణవ నాద భరితమైన శంఖము మనలను ఉద్బోధించును. అలా చేయనివారిని దుష్టశిక్షణాయత్తమగు గద దండించును. జీవితమున తారసపడు దుఃఖములే ఈ శిక్షణా సాధనములు. అయినను సన్మార్గమునకు మరలని వారిని కాలరూపియగు చక్రము పరిసమాప్తమొందించును. ఈ విధమైన పిలుపు, శిక్ష, అంతము ఎందుకు? పరమ పదమునకు చేర్చుటకే. ఆ పరమపదమునకు సంకేతము పద్మము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – శ్రీమన్నారాయణుని నాలుగు భుజములును ధర్మార్థకామమోక్షములను నాలుగు పురుషార్థములను సూచించును. అన్నింటికిని నెలవు కొండలలో కొలువైన దేవదేవుడే.

గోపాలోత్తర తామిని.55 – **సత్వ రజస్తమ ఇతి అహంకారశ్చతుర్భుజః** – సత్వము, రజస్సు, తమస్సు, అహంకారము అనే నాలుగు గుణములును నాలుగు భుజములు.

మరొక వివరణ – పద్మము చిత్తమును, శంఖము మనస్సును, గద అహంకారమును, చక్రము బుద్ధిని సూచించును.

సశంఖ చక్రమ్ సకిరీట కుండలమ్
సపీత వస్త్రమ్ సరసీరుహేక్షణమ్
సహార వక్షస్స్థల శోభి కౌస్తుభమ్
నమామి విష్ణుమ్ శిరసా చతుర్భుజమ్



చతుర్భుజుడైన విష్ణువు. 10-11 శతాబ్దపు కాలంనాటి శిల్పం. మధుర మ్యూజియంలో ఉన్నది.

**వికీపీడియా చిత్రం.** Photo by Biswarup Ganguly

https://commons.wikimedia.org/wiki/File:Four-armed_Vishnu_-_Circa_10-11th_Century_CE_-_Rataul_-_ACCN_88-10_-_Government_Museum_-_Mathura_2013-02-23_5170.JPG



## భ్రాజిష్ణుర్భోజనం భోక్తా సహిష్ణుర్జగదాదిజః |
## అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః || (16)

### 143. భ్రాజిష్ణుః

- స్వయంప్రకాశ స్వరూపుడు. తేజోమయుడు. భక్తులకు కనుపించువాడు.

ఓం భ్రాజిష్ణవే నమః

**భ్రాజత ఇతి తచ్ఛీలో భ్రాజిష్ణుః** – ప్రకాశించుట అను గుణము కలవాడు 'భ్రాజిష్ణుః'. 'భ్రాజృ' అనే ధాతువునుండి, పాణిని సూత్రము 3.2.138 ప్రకారము, అనగా 'ఇష్ణుచ్' ప్రత్యయము చేర్చినపుడు 'ఆ విధమైన గుణాదికము కలిగియుండుట' అనే అర్థం వస్తుంది. కనుక భ్రాజృ + ఇష్ణు = భ్రాజిష్ణు అవుతుంది. తేజేమయుడైన శ్రీమన్నారాయణుడు తన భక్తులకు దర్శనము ఇచ్చువాడని శ్రీ భట్టులు వివరించారు.

**ఉపాసితృభ్యో భ్రాజిష్ణుః స్వప్రకాశన శీలతః** – తనను ఉపాసన చేసే భక్తులు జ్ఞానదీపికలతో ప్రకాశించాలనే కోరికతో తాను ప్రకాశించువాడు.

శ్రీ విష్ణు సహస్ర నామమునకు సంస్కృతములో విపులమైన వ్యాఖ్యానము వ్రాసిన శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారి సూచన – సూర్య చంద్రాదులలోని తేజస్సు వారి స్వంతం కాదు. శ్రీమహావిష్ణువు యొక్క ప్రకాశము వల్లనే వారు వెలుగు వెదజల్ల గలుగుచున్నారు.

గీత 13.17 – **జ్యోతిషామపి తజ్జ్యోతిః** – ఆ పరబ్రహ్మము అన్ని జ్యోతులకును జ్యోతి. పరంజ్యోతి.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్** - గీత 15.12
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సు, అటులనే చంద్రుని తేజస్సు, అగ్ని తేజస్సును నా తేజస్సేయని ఎఱుంగుము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – బయటినుండి వచ్చిన కాంతి వస్తువులపై పడుటవలన మనకు వస్తువులు కనిపించును. వస్తువులనుండి పరావర్తనము చెందినందువలన మనకు కాంతి కనిపించిన అనుభూతి కలుగును. కాని భగవానుడు స్వయంప్రకాశమానుడు. అయనకు వేరు వస్తుసముదాయముతో పని లేదు. అందువలన భక్తులు కానివారు ఆయనను కనుగొనలేరు. భక్తులకు మాత్రము ఆయన స్వయముగా దర్శనమిచ్చును.

ఈ నామమునకు ప్రమాణములైన యజుర్వేద వాక్కులు. **బ్రహ్మ సూర్య సమం జ్యోతిః – సూర్యో జ్యోతిః – జ్యోతిః సూర్యః**

### 144. భోజనమ్

- భక్తులకు ఆనందానుభూతిని ఒసగువాడు. సచ్చిదానంద స్వరూపుడు.

## ఓం భోజనాయ నమః

**తం భుజ్యతే, సుఖేన అనుభూయతే ఇతి భోజనమ్** – శ్రీహరిని పూజించుట, సేవించుట, కీర్తించుట, స్మరించుట మొదలగు కార్యములు భక్తులకు పరమానందమును కలుగజేయును. ఇలా భగవంతుడే భక్తులకు ఆనంద కారణము, సాధనము అగును.

భోజనము అనగా తినే ఆహార పదార్థము అని అందరికీ తెలిసిన అర్థము. వేదాంత పరముగా అన్ని ఇంద్రియముల ద్వారాను గ్రహించి, అనుభవించు వస్తువులను అన్నింటిని 'భోజనము' అని చెబుతారు. ఆహారము వలెనే ఇవన్నీ జీవనమునకు ఆధారము. వాటిని అనుభవించుటలో ఆనందము లభిస్తుంది. (ఆకొన్న కూడె అమృతము.)

ఈ విధముగా అయన మన నిత్యావసర పదార్థములను అనుభవించుటలో ఆనందమును లభింపజేయును. అంతే గాక, ఐహిక వాంఛలను త్యజించి, ముక్తి మార్గమున సాధన చేయు భక్తులకు స్వయముగా శ్రీలక్ష్మీనారాయణుడే ఆనందము. పరమానందము. (ఆనందో బ్రహ్మ).

## 145. భోక్తా

- భుజించువాడు.
- ఆనందించువాడు. భక్తితో ఒసగిన కానుకలు స్వీకరించి సంతుష్ఠుడగును. యజ్ఞములో అర్పించిన దానిని గ్రహించువాడు.

## ఓం భోక్త్రే నమః

ఈ నామము మూడుమార్లు వచ్చును.

16వ శ్లోకము. 145వ నామము. భోక్తా – **భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః**

53వ శ్లోకము. 502వ నామము. భోక్తా – **శరీరభూతభృత్ భోక్తా కపీంద్రో భూరిదక్షిణః**

95వ శ్లోకము. 888వ నామము. భోక్తా – **అనన్తో హుతభుక్ భోక్తా సుఖదః నైకదోగ్రజః**

భక్తులకు ఆనందము కలుగజేయుటయే కాదు. భక్తులొసగినవానిని అమృతమువలె స్వీకరించి ఆ పరమాత్ముడు సంతోషించును.

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యుపహృతశ్నామి ప్రయతాత్మనః** – గీత 9.16
నిర్మల బుద్ధితో, నిష్కామ భావముతో పరమభక్తునిచే సమర్పింపబడిన పత్రమును గాని, ఫలమును గాని, జలమును గాని నేను ప్రత్యక్షముగా (స్వయముగా) ప్రీతితో ఆరగింతును.

ఏ యజ్ఞము చేసినా, ఏ దేవునికి నివేదన చేసినా, అన్ని అర్పణములు శ్రీ వేంకటరమణునే చేరును. హరి యవతారములే అన్ని దేవతలు. హరి నామములే అన్ని మంత్రములు. కనుక ఆయన భోక్తయగును.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా ప్రభురేవ చ** - గీత 9.24 – సకల యజ్ఞములకును భోక్తను, స్వామిని కూడ నేనే.
మనకు ఆనందము కలుగజేయువాడు ఆయనే. మనము నివేదించిన దానిని స్వీకరించి ఆనందించువాడు ఆయనే. అంతా కృష్ణార్పణము.

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్** – గీత 9.27
ఓ కౌంతేయ! నీవు ఆచరించు కర్మలను, భుజించెడి ఆహారమును, హోమము చేయు హవ్యమును, అర్పించు దానమును, ఆచరించు తపస్సును నాకే సమర్పించుము.

## 146. సహిష్ణుః

- క్షమించి, అనుగ్రహించు కరుణామయుడు.
- ఓర్పు కలిగి, భరించు సర్వసాక్షి, సహనమూర్తి.
- దుష్టులను సంహరించు వాడు.

### ఓం సహిష్ణవే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

16వ శ్లోకము. 146వ నామము. సహిష్ణుః – **భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః**

60వ శ్లోకము. 570వ నామము. సహిష్ణుః – **ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుః గతిసత్తమః**

'సహ్' అనే ధాతువునకు మన్నించుట, క్షమించుట అని అర్థము. 'భ్రాజిష్ణు' నామ వివరణలో చెప్పినట్లుగానే, 'ఇష్ణుచ్' ప్రత్యయము చేర్చినపుడు 'గుణము కలిగి యుండుట' అనే భావం వస్తుంది. 'సహిష్ణు' అనగా క్షమాగుణమూర్తి. మన మొనర్చే లెక్కకు మిక్కిలి తప్పిదములను క్షమించి, నామస్మరణ పూజాది తరణోపాయములను ప్రసాదించి, ఇహపర భాగ్యములను కలుగజేయు పరమాప్తుడే ఆ పురుషోత్తముడు.

'సహ్' అనగా 'ఓర్పుతో సహించుట' అని కూడా అర్థము. శ్రీహరి విశ్వాత్మకుడై, అంతరాత్మయై, అందరికిని సాక్షియైనవాడు. లోక భారమును వహించువాడు. ఎన్ని అపరాధములు జరిగినా జగన్నాధుడు సహించుచూ, సకల భువనములను భరించుచుండును. **నా క్షతవ్యతే భూరిభారః** – అని ఋగ్వేద మంత్రము. ఈ కొండయే కాదు. బ్రహ్మాండములు పైబడ్డను నా వ్రేలు చలించదు అని బాలగోపాలుడు గోవర్ధన గిరిధారియై అభయమిచ్చెను.

'సహతే' అనగా 'జయించుట' అనే అర్థంలో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. హిరణ్యాక్షాది దుష్ట రాక్షసులను సంహరించినందున శ్రీ వరాహమూర్తిని సహిష్ణు అని కీర్తించనగును.

శ్రీ భట్టుల వ్యాఖ్యానము ప్రకారము, 1వ నామము 'విశ్వమ్' నుండి, 146వ నామము 'సహిష్ణుః' వరకు భగవంతుని వ్యూహస్వరూపములను కీర్తించును.

1-122 నామములు: పరవాసుదేవమూర్తి స్వరూపమునకు చెందినవి.

123-124 నామములు: సంకర్షణమూర్తి స్వరూపమునకు చెందినవి.

125 - ? నామములు: ప్రద్యుమ్నమూర్తి స్వరూపమునకు చెందినవి.

? – 146 నామములు: అనిరుద్ధమూర్తి స్వరూపమునకు చెందినవి.

**ఇంక భగవంతుని 'విభవ' స్వరూపముల గుణకీర్తనము ఆరంభమవుతున్నది. వీనిలో ముందుగా 'విష్ణు' విభవ స్వరూపమును సూచించు పుణ్యనామములు 147వ నామముతో ఆరంభమగును.**

## 147. జగదాదిజః

- జగములన్నింటికంటెను ముందున్నవాడు. **జగత్-ఆది-జాతః**

### ఓం జగదాదిజాయ నమః

జగత్సృష్టికి పూర్వము ఆ సృష్టి చేయగలిగినవాడు ఉండవలయును. అట్టి సృష్టికర్త శ్రీమహావిష్ణువే. ఆయనే బ్రహ్మను కన్న తండ్రి.

**జగతామాది భూతాసు మూర్తి ష్వన్యత మత్వతః జాతత్వాద్విష్ణు రూపేణ ప్రోచ్యతే జగదాదిజః** - జగత్తులో సర్వభూతములకు ఆదియందు విష్ణుమూర్తిగా అవతరించినవాడు జగదాదిజుడు.

శ్రీ చిన్మయానంద – ప్రళయానంతరము, సృష్టి ఆరంభమునకు పూర్వము హిరణ్యగర్భమూర్తియైన శ్రీమహావిష్ణువు జగదాదిజుడు. ఆయన విరాట్ ఆత్మ స్వరూపము.

దేవతలకు విష్ణువే పూర్వజుడనుటకు ప్రమాణము మహాభారతము ఉద్యోగపర్వము 12.11లో ఉన్నది.
**గతిశ్చ నస్త్వమ్ పూర్వజో జగతః ప్రభుః రక్షార్థమ్ సర్వ భూతానామ్ విష్ణుస్త్వమ్ ఉపజగ్మివాన్** - నీవే మాకు గతి (శరణు). నీవే సకల దేవతలకు ముందుగా నున్నట్టివాడవు. నీవే జగములన్నింటికిని ప్రభువు. సర్వభూతముల రక్షణకై విష్ణురూపమును ధరించినవాడవు.

## 148. అనఘః

- పాప రహితుడు. కల్మషము లేనివాడు. **– పాపమ్ న విద్యతే అస్మిన్ ఇతి అనఘః**

### ఓం అనఘాయ నమః

16వ శ్లోకము. 148వ నామము. అనఘః - **అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః**
89వ శ్లోకము. 835వ నామము. అనఘః – **అమూర్తిః అనఘోऽచింత్యో భయకృత్ భయనాశనః**

విష్ణువు సంసార మధ్యమున అవతరించినా గాని, ఆయనకు పాపములు అంటవు. కర్మలు ఆయనను బంధించవు. ఇందుకు శృతులలో అనేకప్రమాణములు ఉన్నాయి.

**శుద్ధమ్ అపాప విద్ధమ్** – యజుర్వేదము 40.8. **న పుణ్య పాపే మమ** – కైవల్యోపనిషత్తు 22

## 149. విజయః

- జయించుటయే స్వభావముగా గలవాడు.

### ఓం విజయాయ నమః

**వివిధమ్ విశేషేణ వా జయతి ఇతి విజయః** – ఇలా అలా అనీ, ఇక్కడ అక్కడ అనీ, ఇప్పుడూ అప్పుడూ అనీ కాక అన్నింటి (అందరి)పైనా, అన్ని విధములుగానూ, అన్ని చోట్లా శ్రీమహావిష్ణువు విజయము పొందును. ఆయన సత్, చిత్, ఆనంద స్వరూపుడు. ప్రకృతి, జీవులు ఆయనకు అధీనమై యుండును. ఆయన జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాదులు అపరిమితములు, అసమానములు. కనుక జయించుట ఆయనకు స్వభావ సిద్ధము. వేరు విధముగా కానేరదు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – జగత్తులో జరిగేదంతా విష్ణువు అధీనములో ఉంటుంది. బ్రహ్మ చేసే సృష్టి, రుద్రుని లయ కార్యము కూడా ఆయన ఇచ్చానుసారమే జరుగుతాయి. **తదాऽదర్శిత పంథానౌ సృష్టి సంహార కారకౌ** (మహాభారతము. మోక్షపర్వము.169.9). కనుక ఆయన విజయుడు.

డా. క్రోవి పార్థ సారథి రచననుండి – బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన సమస్త దేవతల విజయానికి కారణమైనాడు. దేవతలందరూ తమ తమ పనులందు విజయము సాధించడానికి కారణము గనుక ఆయన విజయుడు.

## 150. జేతా

- జయించువాడు.

### ఓం జేత్రే నమః

**సర్వమ్ జగత్ జయతి ఇతి జేతా –** జయించు స్వభావము కలాడు గనుక ఆయన జేతయే అగును. ఆయన ఇచ్ఛ కానిది ఏదియును జరుగదు. శివుని ఆజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు. ఆయన సత్య సంకల్పుడు, సత్యకామి, సత్య స్వరూపుడు. సత్యమే జయించును గనుక ఆ సచ్చిదానందమూర్తి జేత, విజేత. అన్యదేవతలు అందరు ఆయన ఇచ్ఛానుసారమే వర్తిస్తారు.

డా. క్రోవి పార్థ సారథి రచననుండి – **స్వాభిప్రాయే స్థాపయితా ఔతాస్యాద్విధి శంకరౌ** –బ్రహ్మ, రుద్రుడు, మొదలైన వారిని తన ఇష్టానుసారముగ స్థిరముగ ఉంచువాడు జేత.

## 151. విశ్వయోనిః

- విశ్వమునకు జన్మ స్థానము, కారణము.
- విశ్వమే కారణముగా కలవాడు.

### ఓం విశ్వయోనయే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
13వ శ్లోకములో 118వ నామము. విశ్వయోనిః **– రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోనిః శుచిశ్రవాః**
16వ శ్లోకములో 151వ నామము. విశ్వయోనిః – **అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః**

**విశ్వం తత్కార్య వర్గస్యాత్ యోనిస్తస్య తు కారణమ్ తస్య బ్రహ్మాది ముఖతః విశ్వయోని రితీరితః -** విశ్వము అంటే శ్రీమన్నారాయణుని చేత నిర్మింపబడిన సంసారము. యోని అనగా ఆ సంసారమునకు కారణమైనది. అంటే సకల చరాచర జగత్తునకు కారణభూతమైనవాడు విశ్వయోని.

**విశ్వస్య సకలస్య యోనిః కారణమ్ విశ్వయోనిః –** సకల విశ్వమునకు జన్మ స్థానము, కారణము గనుక ఆయన విశ్వయోని.

మరొక భావము – శ్రీమహావిష్ణువునకు, ఆయన అవతార వైభవమునకు విశ్వము కారణము. లోకములందున్న పరిస్థితుల కారణంగానే ఆయన వివిధ రూపములలో అవతరించుచుండును. ధర్మమును రక్షించును. కనుక ఆయనకు విశ్వము కారణమని చెప్పవచ్చును.

## 152. పునర్వసుః

- తన సృష్టియందు అంతట, సకల దైవములందును అంతరాత్మయ్యై, మరల మరల విలసిల్లువాడు.
- ప్రళయానంతరము మరల సృష్టి కావించువాడు.

### ఓం పునర్వసవే నమః

**బ్రహ్మాదిష్వపి దేవేషు అంతరాత్మతయా చ యః పునర్వసనా న్నిత్యం పునర్వసురుదాహృతః -** బ్రహ్మాది దేవతలను, సకల భూతాలను పుట్టించడమే కాక, వారిలో మళ్ళీ అంతరాత్మగా ఉన్నవాడు శ్రీహరియే గనుక ఆయన 'పునర్వసుః'. హరి నామములే అఖిల మంత్రములు. హరియవతారములే అఖిల దైవములు. హరియే విశ్వాంతరాత్ముడు. అన్ని పూజలు శ్రీహరికే చెందును.

ఇంద్రుడు రుద్రునితో ఇలా అన్నాడు – **తవాంతరాత్మా మమ చ యే చాऽన్యే దేహి సంజ్ఞితః** (మహా భారతము. మోక్షపర్వము. 179.4) – నీకును, నాకును, ముక్తులైనవారందరకును ఆయనే అంతరాత్మ.

మరొక వివరణ – ప్రతి ప్రళయము తరువాతను మరల పూర్వమువలెనే సూర్య చంద్రులను, భూమిని, సకల భూతములను సృష్టించును. కనుక ఆయన పునర్వసువు.

**సూర్య చంద్రాంసౌ ధాతా యథా పూర్వమ్ అకల్పయాత్**
**దివమ్ చ పృథ్వీమ్ చ అంతరిక్షమ్ అథోస్వః** – ఋగ్వేదము. 10.190.3



ద్వారకా తిరుమల ప్రధాన గోపురానికి మెట్ల దారి



ద్వారకా తిరుమల శ్రీ కుంకుళ్ళమ్మ మందిరం.



## ఉపేంద్రో వామనః ప్రాంశురమోఘః శుచిరూర్జితః |
## అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమ: || (17)

### 153. ఉపేంద్రః

- ఇంద్రునికి తమ్ముడై అవతరించినవాడు.
- ఇంద్రునిపైన ఇంద్రుడు (ఇంద్రునకు అధిపతి)

ఓం ఉపేంద్రాయ నమః

**ఉపగతః ఇంద్రమ్ ఉపేంద్రః** – వామనావతారమున శ్రీమహావిష్ణువు అదితి గర్భమున జన్మించెను. ఇంద్రుని తల్లి అదితి గనుక వామనుడు ఇంద్రునకు తమ్ముడగును.

శుక్రాచార్యుల ఆదేశము ప్రకారము ప్రహ్లాదుని మనుమడైన బలి తపోయజ్ఞములను ఆచరించి ఇంద్రుని జయించెను. ఇంద్రుని తల్లి అదితి తన బిడ్డ (ఇంద్రుని) క్షేమం కొరకు భగవంతుని ప్రార్థించినది. యజ్ఞయాగాదుల ద్వారా ప్రాభవమును సాధించిన బలిని ఓడించడం వీలుకాదు. కనుక భగవానుడు అదితి గర్భమున జన్మించి, యాగశాలలో బలిని యాచించి, మూడడుగుల నేల గైకొని, రెండడుగులో బ్రహ్మాండముల నతిక్రమించి, మూడవ అడుగును బలి తలపై మోపి, పాతాళమున బంధించివేసెను.

**జఘన్యజస్సర్వేషాం ఆదిత్యానాం గుణాధికః**
**ద్వాదశేవాదితేః పుత్రాః శక్రముఖ్యాః నరాధిపః**
**తేషామవరజోవిష్ణుః యత్ లోకాః ప్రతిష్ఠితాః**
రాజా! అదితి పుత్రులలో చివరివాడు కాని గుణములలో పెద్దవాడు, సకల లోకపాలకుడు శ్రీమహావిష్ణువేనయ్యా!

**ఇంద్రస్య ఉపరి ఇంద్రః** – ఇంద్రునిపైన ఉన్నవాడు ఉపేంద్రుడు. ఇక్కడ 'ఉప' అనగా 'పైన, అధిక' అనే అర్థాలు వర్తిస్తాయి. ఇంద్రుని కాచే ప్రభువు, ఇంద్రునికి శక్తినొసగే ఈశ్వరుడు శ్రీమహావిష్ణువే. ఇంద్రుడు గోపాలురపై అలిగి వారిని శిక్షించాలని యత్నించగా ఆ శ్రీహరి నందగోపబాలుడై గోవర్ధనగిరినెత్తి, గోపకులమును రక్షించి, ఇంద్రుని గర్వమును అణగించెను.

శ్రీ పెమ్మరాజు రాజారావు గారి రచన నుండి – ఓ కృష్ణా! నీవు గోవులకు ఈశ్వరుండవగుట చేత 'ఇంద్రుడవు'గా విలసిల్లితివి. ఈ కారణము చేత దేవతలు నిన్ను 'ఉపేంద్రః' అని పిలుతురు. – అని హరివంశము (76.47)నందు వర్ణింపబడెను.
**మమోపరి యథేంద్రస్త్వం స్థాపితో గోభిరీశ్వరః**
**ఉపేంద్ర ఇతి కృష్ణ! త్వాం గాస్యంతి భువిదేవతా**

డా. క్రోవి పార్థసారధి గారి రచన నుండి – కృష్ణా! నేను ఏవిధముగా ఇంద్రుడనో, అలాగే నీవు నాకు పైగా, ఇంద్రుడుగా, ఈశ్వరుడుగా, స్వామిగా, గోవులచేత నిలుపబడ్డావు. అందుచేత నిన్ను భూలోకములో మానవులు, స్వర్గములో దేవతలు కూడా 'ఉపేంద్రుడు' అని అంటారు.

## 154. వామనః

- పొట్టివానిగా అవతరించినవాడు.
- చక్కనైన, కనులకింపైన రూపము గలవాడు.

### ఓం వామనాయ నమః

శ్రీమహావిష్ణువు తన ఐదవ అవతారంలో వామనుడై బలిచక్రవర్తిని యాచించి, త్రివిక్రముడై ముల్లోకములను ఆక్రమించెను.

**వామయతి త్యాజయతి మదమ్ బలిమ్** – 'వామ్' అనగా త్యజించుట, వెలిగ్రక్కుట. ఇలా చూచినట్లయితే బలిచక్రవర్తి చేత గర్వమును, వైభవమును, రాజ్యమును బయటకు క్రక్కించినవాడు వామనుడు.

శ్రీ లింగాయత సూరి – **వామో వాల్గుత్వమ్ అస్య అస్తి ఇతి వామనః** – సుందరమైన పొట్టి ఆకారము కలిగినవాడు వామనుడు. మరో విధముగా – **వామో వటుత్వమ్ అస్య అస్తి ఇతి వామనః** – పొట్టియైన వడుగు (గురుకుల విద్యార్థి) స్వరూపమును ధరించినవాడు వామనుడు.

వామనుని రూపసౌందర్యము వర్ణన శ్రీమద్భాగవతము (8.18.26)లో చక్కగా ఉన్నది.

**యజమానః ప్రముదితో దర్శనీయ మనోరమమ్**

**రూపానురూపావయవమ్ తస్మాఽసనమాహరాత్**

మరొక వివరణ – **సర్వాణి వామాని నయతి ఇతి వామనః** – భక్తుల సకల కామితార్థములను ప్రసాదించువాడు వామనుడు. తన స్వయంప్రకాశ దివ్యస్వరూప దర్శనమును అనుగ్రహించి, వారి హృదయములను ఆనందింపజేయువాడు. **ఏషా సర్వే వామనీః ఏష హి సర్వాణి వామాని నయతి** (ఛాందోగ్యోపనిషత్తు 4.25)

**ద్రష్టౄన్ స్వకాన్త్యా వామాని సుఖాని నయతీతి యః స వామనో.** తనను సేవించేవారికి తన దివ్యకాంతులతో సుఖములను ఇచ్చేవాడు వామనుడు.

**మధ్యే వామనమాసీనం విశ్వే దేవా ఉపాసతే** (కఠోపనిషత్తు 3.5). హృదయ కమలము మధ్యభాగమున విలసిల్లుతున్న వామనుని సకల దేవతలును ఉపాసించుచున్నారు.

## 155. ప్రాంశుః

ఎంతో ఎత్తైన, ఉన్నతమైన, విస్తారమైన దేహము గలవాడు.

### ఓం ప్రాంశవే నమః

**ప్రాశ్నుతే ప్రకర్షేణ ఊర్ధ్వమ్ ఇతి ప్రాంశుః** – బలి చక్రవర్తి మూడడుగులు దానమిచ్చుటకై జలమును ధారగా పోయగానే వామనుడు ఇంతింతై, తానింతై, భూనభోంతరాళములను అతిక్రమించుచూ, త్రివిక్రముడై బ్రహ్మాండాంత సంవర్ధియయ్యెను. అప్పుడు ఆయన

శరీరంలో సకలదేవతలు కనిపించారు. భూమియే ఆయన పాదపీఠమయ్యెను. ఆకాశము శిరస్సుగా నయ్యెను. సూర్యచంద్రులు కన్నులాయెను.

**తోయోతుపతితే హస్తే వామనోఽభూదవామనః**
**సర్వదేవమయం రూపం దర్శయామాసవై ప్రభుః**
**భూపాదః ద్యౌః శిరశ్చాస్య చంద్రాదిత్యా చ చక్షుషీ**

వామనుడు త్రివిక్రముడైన సుందర, మంగళ రూపమును హరివంశము (31.89)లో మనోహరముగా వర్ణించినారు. వ్యాఖ్యానకర్తలు ఈ ప్రమాణమును తరచుగా ఉదహరించారు.

**తస్య విక్రమతో భూమిమ్ చంద్రాదిత్యౌ స్థానాంతరే నభః ప్రక్రమాణస్య నాభిదేశే వ్యవస్థితౌ** - సూర్యచంద్రులు ముందు కన్నులగానయ్యెను. తరువాత ఉదర సమము, తరువాత నాభివద్ద, తరువాత మోకాళ్ళవద్ద గోచరించెను.

ఈ విషయంలో పోతన భాగవతంలోని వర్ణన తెలుగువారికి సుపరిచితము.

**ఇంతింతై వటుడింతయై మరియు తానింతై నభో వీధి పై**
**నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశి పై**
**నంతై చంద్రుని కంతయై ధ్రువుని పై నంతై మహర్వాటిపై**
**నంతై సత్య పదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధి యై.**

**రవి బింబంబుపమింప పాత్రమగు ఛత్రంబై శిరో రత్నమై**
**శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచత్ ఘంటయై నూపుర**
**ప్రవరంబై పదపీఠ మై వటుడు తా బ్రహ్మాండమున్ నిండుచోన్.**



నేపాల్ కు చెందిన శ్రీ వామనావతార చిత్రం. 19వ శతాబ్దము కాలం.
వికీపీడియా నుండి. https://commons.wikimedia.org/wiki/File:Vamana1.jpg

## 156. అమోఘః

- ఆయన ప్రతికార్యము విశేషించి కారణయుక్తము. వ్యర్ధము కాదు. పరమార్థము ఉన్నది.

### ఓం అమోఘాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

12వ శ్లోకము. 111వ నామము. అమోఘః – **అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః**
17వ శ్లోకము. 156వ నామము. అమోఘః – **ఉపేంద్రో వామనః ప్రాంశుః అమోఘః శుచిరూర్జితః**

మోఘము అనగా వ్యర్థము. (మోఘమ్ నిరర్ధకమ్ – అమరకోశము). అమోఘము అనగా వ్యర్థము కానిది. అర్థవంతమైనది. విశేషించి ఫలించునది.

111వ నామము. అమోఘః – భక్తులకు నిశ్చయముగా సత్ఫలములు ప్రసాదించువాడు.

156వ నామము. అమోఘః – ఆయన చేసే ప్రతిపనికి ఏదో పరమార్థముండును.

శ్రీ భట్టులు వామనావతారపరంగా తమ వ్యాఖ్యను కొనసాగించారు - **న మోఘమ్ చేష్టితమ్ యస్య సః అమోఘః.** ఆయన కార్యము ఏదీ వ్యర్థము కాదు.

**బలేశ్చ వాసవస్యాపి కృతార్థీ కరణాత్పమమ్ మానాతీత ప్రభావత్వా దమోఘః పరికీర్తితః -** బద్ధ శత్రువులైన బలిచక్రవర్తి, మరియు దేవేంద్రుల కోరికలను ఒకేసారి తీర్చాడు కాబట్టి అమోఘమైన మహిమ కలవాడు అని చెప్పబడుచున్నవాడు. శ్రీమహావిష్ణువు వామనుడై బలిని యాచించి, రెండడుగులతో బ్రహ్మాండమును కొలిచినందున ఇంద్రునకు తిరిగి రాజ్యము లభించెను. మూడవ అడుగు బలి తలపై మోపి, పాతాళమునకు త్రొక్కివేసినందువలన, బలికి మహాభక్తుడనే గౌరవము లభించెను. యజ్ఞములో బలి సమర్పించిన హవిస్సును సకల దేవతలును స్వీకరించిరి. బలికి మనువు పదవి లభించింది. కనుక భగవానుని కార్యములు ఏవీ వ్యర్థము కాలేదు.

## 157. శుచిః

పరమ పావనమూర్తి. ఏ విధమైన దోష మాలిన్యములును అంటనివాడు.

### ఓం శుచయే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

17వ శ్లోకము. 157వ నామము. శుచిః – **ఉపేంద్రో వామనః ప్రాంశురమోఘః శుచిరూర్జితః**

27వ శ్లోకము. 252వ నామము. శుచిః – **అసంఖ్యేయో అప్రమేయాత్మా విశిష్టః శిష్టకృత్ శుచిః**

**శుచయతి ఇతి శుచిః –** శుభ్రపరచువాడు. పరమ పవిత్రుడు. కర్మ ప్రభావములు పరమాత్మకు వర్తించవు.

**స్వయంకృతోప కారేషు యత్కించిత్ప్రత్యుపక్రియామ్ అనపేక్షస్థితో యోऽసౌ శుచిస్స్యాద్ధర్మదోమనుః -** స్వయంగా తాను మానవులకు ఉపకారం చేస్తాడు కాని వారినుంచి ఏ విధమైన ప్రతిఫలాన్నీ ఆశించడు కనుక అయన పవిత్రుడు. మరియు తనను స్మరించేవారిని పవిత్రులుగా చేసేవాడు. ఈ పవిత్ర నామము ధర్మముననుగ్రహించే మంత్రము.

శ్రీమహావిష్ణువు **'పవిత్రాణాం చ పవిత్రమ్'**. అంతే కాదు. ఆయనను ధ్యానించి, పూజించువారి పాపములు పటాపంచలగును. వారును పవిత్రులగుదురు. భగవంతుడు ధర్మ స్వరూపుడైనందున, శుద్ధ సత్వ స్వరూపుడైనందున, భగవంతునికి సంబంధించిన దేదియును అపవిత్రము కాదు. బలిని అణచి, ఇంద్రునికి సహాయపడినందున ఆయన పక్షపాతి అనిపించవచ్చును. కాని బలికి మరింత ప్రయోజనము ఒనగూడెను. శ్రీమన్నారాయణుడే బలికి ద్వారపాలకుడయ్యెను.

**శుద్ధమ్ అపాపవిద్ధమ్ –** ఈశావాశ్యోపనిషత్తు.

**అస్పర్శశ్చ మహాన్ శుచిః**

భగవంతుని పవిత్రతను మరింత విశదీకరిస్తూ శ్రీ సత్యదేవ వాసిష్ఠగారుఇలా చెప్పారు – సృష్టిలోని సౌందర్య మాధుర్యములు భగవంతుని శుచిత్వమును చాటిచెప్పుచున్నవి. పూవులు, తావులు, సెలయేరులు, పిల్లగాలులు భగవంతుని గుణగానము చేయుచు, మనసా వాచా కర్మణా పవిత్రముగా నుండవలెనని బోధించుచున్నవి.

## 158. ఊర్జితః

- అనంత శక్తి సామర్థ్య సంపన్నుడు.

### ఓం ఊర్జితాయ నమః

'ఊర్జా' అనగా బలము. ఇది భగవంతుని షడ్గుణములలో ఒకటి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, లీలామాత్రముగ సకల భువనముల భారమును వహించుట వంటి ఆయన లీలలను స్మరిస్తూ, ఆయన బలమును అర్థం చేసుకోవడానికికి మనం ప్రయత్నించవచ్చును. అయన అనంత బలసంపన్నుడు. అంతే కాదు. సకల భూతములలోని బల వైభవములు కూడ భగవంతునివల్లనే కలుగుచున్నవి.

**యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జితమేవవా**
**తత్తదేవాగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్** – గీత 10.41
విభూతియుక్తమైన, అనగా ఐశ్వర్య యుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువు ఏదైనా నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము.

అందరిలోని బలము భగవంతునివల్లనే కలుగుచున్నది. పెక్కు మంత్రములద్వారా పూర్వీకులు బలాన్ని కోరారు.

**ఊర్జాదేతామ్ అవస్యొజసాం త్వామ్ పిబా సోమమదాయ కమ్ శతక్రతో** – ఋగ్వేదము 8.36.3
**ఊర్జా పిన్వస్వ సమిషోదిదేహిన** – ఋగ్వేదము 3.3.7
**ఊర్గస్యాంగిరస్యూర్ణమ్రదా ఊర్జమ్ మయి దేహి** – యజుర్వేదము 4.15
**బలమసి బలమ్ మయి దేహి** – యజుర్వేదము 19.9
**ఊర్జో బలమ్ స ఓజో మ ఆగన్** – అధర్వణ వేదము 18.4.53
**ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాఽజోసి**

## 159. అతీంద్రః

- ఇంద్రునికంటె అధికుడు

### ఓం అతీంద్రాయ నమః

శ్రీమహావిష్ణువు దేవతలకును, దేవతల పాలకునకును రక్షకుడు. ఆయన కృపవల్లనే ఇంద్రునికి ఆ వైభవము ప్రాప్తించెను.

శ్రీకైవల్య సారధినుండి – ఇంద్రునికి తమ్ముడే అయినప్పటికీ ఐశ్వర్యములో అతనిని మించినవాడు.

శ్రీ చిన్మయానంద – వేదాంతపరముగా ఇంద్రుడు ఇంద్రియములకు. మనసుకు, బుద్ధికి ప్రతీక. మనస్సునకు ఆధారము ఆత్మ. అన్ని ఆత్మలకును ఆధారము పరమాత్ముడు. అతీంద్రియుడు.

## 160. సంగ్రహః

- సులభముగా, కేవలము భక్తివల్లనే, పొందనగువాడు (అందుబాటులో ఉండేవాడు).
- ప్రళయ కాలమున సమస్తమును తనయందు చేర్చుకొనువాడు.
- సమస్తమును కలిపి తన అధీనములో ఉంచుకొన్నవాడు.

ఓం సంగ్రహాయ నమః

'సంగ్రహించుట' అనగా కలిపి పట్టుకొనుట, దగ్గరకు తీసికొనుట, స్వంతము చేసికొనుట అనే అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అథః భక్తైః అయత్నేన సంగ్రహయతి ఇతి సంగ్రహః.** పెద్దగా శ్రమ లేకుండా, అంటే కేవలం భక్తి కలిగియుండడం ద్వారా, భక్తులకు ఆ వైకుంఠవాసుడు అందుబాటులో ఉంటాడు. భక్తి యోగమునకు శ్రమ లేదు. ఖర్చు లేదు. కాని ఆ జగన్నాథుని అందిపుచ్చుకొనవచ్చును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వేషామ్ సంహృతౌ ప్రతి సంహారాత్ సంగ్రహః.** ప్రళయకాలమున సమస్తమును ఆ విశ్వేశ్వరుడు తనయందు విలీనము చేసికొనును (సంగ్రహించును.)

శ్రీ చిన్మయానంద – భగవంతుడు జగత్తునంతటిని కలిపి యుంచును. కనుక ఆయన సంగ్రహుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సమ-గ్రహ-సంగ్రహః – సకల భూతముల అంతస్థితమగు ఆత్మ భగవత్స్వరూపమే. ఆ పరమాత్ముడు అన్నింటి అంతరాత్మయైనందున, అన్నింటిని కలిపి పట్టుకొనేది ఆయనే. (పూలదండలో దారం వలె సకల జీవులందలి ఆత్మ ఒక్కటే). అన్నింటిని కలిపినందున ఆయన సంగ్రహుడు.

## 161. సర్గః

- తనను తానే సృజించుకొని, తననుండి సమస్తమును సృజించినవాడు.

ఓం సర్గాయ నమః

**సృజతి ఇతి సర్గః** – సృష్టించువాడు 'సర్గః'. 'సృజ్' అనే ధాతువునుండి ఈ నామమును వివరించవచ్చును. స్థితి, ప్రళయ కార్యములకు ముందుగా సృష్టి కార్యము జరిగినది. సృష్టియంతయు ఆయన రూపమే.

**బ్రహ్మాదిభ్యః సృజ్యతేయః సర్గః తం పరిచక్షతే** – బ్రహ్మాది దేవతలను ఉద్ధరించడానికి తనకు తానుగా సృజింపబడేవాడు.

గీతా- తత్త్వ వివేచనీ వ్యాఖ్య నుండి (పండిత జయదయాల్ గోయందకా రచన)–
భీష్మ పితామహుడు ఇట్లనెను – వాసుదేవ భగవానుడు దేవదేవుడు. సర్వశ్రేష్ఠుడు. ఆయనయే ధర్మము. ధర్మజ్ఞుడు. వరదుడు. సర్వమనోరథములను ఈడేర్చువాడు. అతడే కర్త, కర్మ, స్వయంప్రభువు. భూత భవిష్యత్ వర్తమానములను, సంధ్యలను, దిశలను, ఆకాశమును, అన్ని నియమములను ఈ జనార్దనుడే సృజించెను. మహాత్ముడును, శాశ్వతుడును ఐన ఈ ప్రభువే ఋషులను, తపస్సులను, జగత్సృష్టిని చేయు ప్రజాపతిని సృష్టించెను. ప్రాణులందరికిని అగ్రజుడైన సంకర్షణుని కూడ ఇతడే సృష్టించెను. లోకములు ఆదిశేషుని 'అనంతుడు' అని పిలుచును. పర్వతములతో సహా పృథ్విని ధరించు ఆదిశేషుడు కూడ ఈయననుండియే ఉత్పన్నుడాయెను. ఈయనయే వారాహ, నృసింహ, వామనాది అవతారములు దాల్చెను. అందరికిని తల్లియు, తండ్రియు ఇతడే. ఈయనకంటె శ్రేష్ఠుడు మరియొకడు లేడు. ఇతడే కేశవుడు. పరమ తేజఃస్వరూపుడు. అందరికిని పితామహుడు. మునులు ఈయనను హృషీకేశుడు అని పిలిచెదరు. ఇతడే ఆచార్యుడు. పితృదేవుడు. గురుడు. ఈ శ్రీకృష్ణుని అనుగ్రహమునకు పాత్రుడైనవానికి అక్షయలోకప్రాప్తి కలుగును. భగవానుడైన ఈ కేశవుని భయగ్రస్తుడు శరణుపొంది, ఈయనను స్తుతించినచో అతడు భయవిముక్తుడై పరమ సుఖమును పొందును. శ్రీకృష్ణ భగవానుని శరణు పొందినవారు మోహపాశములలో చిక్కుకొనరు. మహాభయము (సంకటము)నకు గురియైనవారిని కూడ భగవానుడైన జనార్దనుడు అనుక్షణమూ కాపాడుచుండును.

**యే చ కృష్ణం ప్రపద్యంతే తే న ముహ్యంతి మానవాః**
**భయే మహతి మగ్నాంశ్చ పాతి నిత్యం జనార్దన** – మహాభారతము. భీష్మ పర్వము. 67/24

## 162. ధృతాత్మా

- సకల జీవాత్మలకును ఆధారమైనట్టివాడు (ధరించువాడు).
- షడ్భావ వికారములు లేనివాడు.

### ఓం ధృతాత్మనే నమః

**ధృతః ఆత్మా యేన సః ధృతాత్మా** – అన్ని ఆత్మలను ధరించి (చేపట్టి) యున్నవాడు. జనన, మరణ, కామ, క్రోధాది వికారములకు అతీతముగ వర్తిల్లు సర్వాంతర్యామి.

## 163. నియమః

- శాసన కర్త. నియమములనేర్పరచి, నియంత్రించి, నడపువాడు.

### ఓం నియమాయ నమః

17వ శ్లోకము. 163వ నామము. 'నియమః' – **అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః**
92వ శ్లోకము. 869వ నామము. 'నియమః' లేదా 'అనియమః' – **'అపరాజితః సర్వసహో నియంతా నియమో యమః'** లేదా **'అపరాజితః సర్వసహో నియంతాऽనియమోऽయమః'**

**నియమ్యతే జగద్యేన నియమః స ఉదీరితః** – ఎవనిచేత జగత్తు అంతా నియమింపబడుతుందో ఆయన నియముడు. **నియమతి ఇతి నియమః** – నియమములనగా విధివిధానములు. ఇందుకు ధాతువైన 'యమ్'కు రెండు అర్థాలున్నాయి.

యమ్ – ఉపరమే – పర్యవేక్షించుట, పని చేయించుట.
యమ్ – పరివేషణే – చుట్టుముట్టుట, అధీనములోనుంచుకొనుట.

అన్నింటిని సృష్టించినవాడు భగవానుడు స్వయముగా అన్ని భూతములందును ఆత్మసాక్షియై యున్నాడు. కనుక అందరిని నియంత్రించుట ఆయనకే సాధ్యము. ఆయన శాసనమునకు లోబడియే పంచభూతములు, సూర్యచంద్రాది దేవతలు వర్తించును.

## 164. యమః

- పరిపాలించువాడు. సమస్తమును వశము కావించుకొన్నవాడు.

### ఓం యమాయ నమః

17వ శ్లోకంలోని 163, 164 నామములు. నియమః, యమః – **అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః**
92వ శ్లోకంలోని 869, 870 నామములు. నియమః, యమః లేదా అనియమః, అయమః – **'అపరాజితః సర్వసహో నియంతా నియమో యమః'** లేదా **'అపరాజితః సర్వసహో నియంతాऽనియమోऽయమః'**

**అకంటకం చానుకూలం యచ్ఛతీ త్యఖిలం యమః** – ఈ జగత్తును తన భక్తులకు అనుకూలంగా, అవరోధాలు లేకుండా చేసేవాడు.

**యచ్ఛతి ఇతి యమః** – లేదా – **యమయతి ఇతి యమః** – అంతయును శ్రీహరికి అధీనమై పాలింపబడుచున్నది. ఆయన సకల భూతములందును అంతస్థితుడై వానిని పాలించుచుండును. మరియు సూర్యమండల మధ్యవర్తియై భూమిపైని సకల జీవరాసులను పాలించును. ఇందుకు శృతులనుండి పెక్కు ఆధారాలున్నాయి. బృహదారణ్యకోపనిషత్తు –

3.7.15 – యః సర్వాణి భూతాని అంతరో యమయతి.

? – **యః పృథ్వీమ్ అంతరో యమయతి**

3.7.3 – **యః ఆత్మానమ్ అంతరో యమయతి**

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి –
భక్తి, జ్ఞాన, కర్మ మార్గములలో ఏ మార్గమును సాధించుచున్నను యమ, నియమములు అత్యంత ప్రధానములు.
యమములు అనగా

1. అహింస (ఏ ప్రాణికిని హింస చేయకుండుట)
2. సత్యము (నిజము పలుకుట)
3. అస్తేయము (దొంగతనము చేయకుండుట)
4. బ్రహ్మచర్యము (ఇంద్రియ నిగ్రహము)
5. అసంగ్రహము (ఇతరులనుండి స్వీకరింపకుండుట)

నియమములు అనగా

1. సంతోషము (సుఖ దుఃఖాది ద్వంద్వములయందు సమత్వము)
2. శౌచము (శరీరము, మనస్సుల శుద్ధి)
3. తపస్సు (శారీరిక, వాచిక, మానసిక నియమము)
4. స్వాధ్యాయము (పుణ్యగ్రంథ పఠనము)
5. ఈశ్వర ప్రణిధానము (భగవంతుని శరణాగతి)

ఈ దశవిధ గుణముల అనుష్ఠానము చేత మానవుడు మహాత్ముడగును. కావుననే ఈ స్తవరాజములో వీనికి ఎక్కువ ప్రాధాన్యమీయబడెను.




కెనడాలోని చెప్పుల మ్యూజియంలో
రామాయణానికి చెందిన చిత్రం.
పురాతన హిందూ సమాజంలోని పాదరక్షల
గురించిన వివరణగా ఈ చిత్రాన్ని ప్రదర్శించారు.



## వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః |
## అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః || (18)

### 165. వేద్యః

- తెలిసికొన బడువాడు (**వేదితుమ్ శక్యః వేద్యః**)
- తెలిసికొన దగినవాడు (**వేదనార్హత్వాత్ వేద్యః, వేదితుమ్ యోగ్యః ఇతి వేద్యః**)

**ఓం వేద్యాయ నమః**

ముముక్షువులు, జ్ఞానులు, తాపసులు ఆ పరబ్రహ్మమును తెలిసికొనుటకే సదా ప్రయత్నించుదురు. అన్ని జప, తప, కర్మ, విద్యాదుల ద్వారాను తెలియబడునది ఆ పరబ్రహ్మమే.

కైవల్య 22 – **వేదైరనేకై రహమేవ వేద్యః** – అన్ని వేదములవల్లను తెలిసికొనదగినది నేనే.

శ్రీమహావిష్ణువే పరమసత్యము. ఇది తెలిసికొన్న తరువాత తక్కినవి అన్నియును తెలిసినట్లే. అని శ్రీ చిన్మయానంద వివరించారు.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్** – గీత 13.17
ఆ పరబ్రహ్మ అన్ని జ్యోతులకును జ్యోతి (పరంజ్యోతి). మాయాతీతుడును, జ్ఞాన స్వరూపుడును, తెలిసికొనదగినవాడును, తత్వజ్ఞానముద్వారా ప్రాప్యుడును అతడే. సర్వప్రాణుల హృదయములయందు విశేషముగా ఉండువాడును అతడే.
**సర్వస్యచాహం హృదిసన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్** – గీత 15.15
సమస్త ప్రాణుల హృదయములలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహమును తొలగించుట) కలుగుచున్నవి. వేదములద్వారా తెలిసికొనదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడ నేనే.

### 166. వైద్యః

- విద్యలన్నియును తెలిసినవాడు. సర్వజ్ఞుడు.
- జనన మరణ చక్రమునుండి తన భక్తులను ముక్తులుగా చేయడం తెలిసినవాడు.

**ఓం వైద్యాయ నమః**

'విద్య' నెరిగినవాడు వైద్యుడు. శ్రీమహావిష్ణువే అనాదిగానున్న విద్యలన్నింటిని తెలిసినవాడు. విశ్వమునకు, విశ్వములోని సకల విద్యాజ్ఞానములకు సృష్టికర్త ఆయనే. ఆయన కెఱుక లేని విద్య లేదు. అంతేకాదు. వేరెవ్వరికి అన్ని విద్యలు తెలియవు. అయనొక్కడే సకలసృష్టివిద్య నెరిగిన వైద్యుడు.

**విశ్వాని దేవ వాయునాని విద్వాన్** – యజుర్వేదము 7.43

**ఈశ్వరః సర్వవిద్యానామ్** – తైత్తరీయారణ్యకము 10.21

ఆయన సర్వవిద్య. మహావిద్య. విద్యేశ్వరుడు. వేదవిదుడు. వేదవేద్యుడు. వైద్యుడు. పశుపక్షులలోను, క్రిమికీటకాదులలోను కూడ మనము గమనించే బుద్ధి, జ్ఞానము మనకు సర్వదా భగవంతుని సర్వజ్ఞత్వమును, సర్వాంతర్యామిత్వమును సూచించును. ఆయన పదసేవయే మనకు పరమార్థము.

**వేదిత్రాణాం భవాఖ్యస్య గదన్య వినివర్తినీమ్**
**విద్యామధీతే వేదేతి యో వైద్యః స ముదాహృతః**
తనను ఉపాసించేవారిని భవబంధాలనుండి విముక్తులుగా చేసి, విద్యను (జ్ఞానాన్ని) తెలియజేయువాడు.

శ్రీ భట్టుల ప్రత్యేక సూచన – శ్రీహరియే మన పాపములను హరించి, కర్మబంధములను తొలగించి, జననమరణ చక్రమునుండి ముక్తిని ప్రసాదించు విద్యనెరిగినవాడు. కనుక వైద్యుడు. జగద్గురువు.

వైద్యుడు అనగా 'డాక్టర్' అని సామాన్యార్థము. ఈ అర్థములో కూడ వ్యాఖ్యానకర్తలు పురుషోత్తముని కీర్తించినారు. ('భిషక్' అనే నామము కూడ తరువాత వస్తుంది.)

శ్రీ చిన్మయానంద – అహంకారము, మాయ, అజ్ఞానము అనే వ్యాధులతో బాధపడుతున్న లోకములను బాగుచేయగలిగిన వైద్యుడు ఆయన. ఇదే అర్థములో శ్రీ భట్టులు చూపిన ప్రమాణమునుబట్టి, సకల పాపములను నశింపజేయును గనుక శ్రీహరి వైద్యుడు.

**మేరు మందర మాత్రోఽపి పాపస్య కర్మణః కేశవమ్ వైద్యమ్ అసాధ్య దుర్వ్యాధిరివ నశ్యతి** – విష్ణుధర్మము 69.110. మేరు పర్వతమంతటి పాపములు ప్రోగైనను సరే, కేశవుని అర్చించినట్లయితే ఆ పాపములన్నీ నశించును. వైద్యుని వైద్యమువలన దుర్వ్యాధులు తొలగిపోయినట్లే, కేశవార్చన వలన పాపములు నశించును.

తిరువేంకట రమణుడు కోరి మమ్మేలిన కులదైవము. రోగములన్నింటిని అణగించు దివ్యౌషధము. చెడనీక బ్రతికించే సిద్ధమంత్రము. కోరికలు వర్షించు కాలమేఘము.

## **167.** సదాయోగీ

- భక్తులపట్ల ఎల్లప్పుడు జాగరూకుడై అందుబాటులో ఉండువాడు.
- సర్వ వ్యాపియై విశ్వమును అవిచ్ఛిన్నముగా నిలుపువాడు.
- సదా ధర్మమార్గానువర్తి యైనవాడు.
- యోగచింతనలో నిమగ్నుడైన సచ్చిదానంద స్వరూపుడు.
- ఎల్లప్పుడు సమత్వ భావన కలిగినవాడు.

ఓం సదాయోగినే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవానుడు భక్తులపట్ల సదా జాగృతుడై యుండును. అందరిలోను అంతర్యామియై వెలుగొందుచుండును. కనుక మనమెప్పుడు పూజించినా, శరణు కోరినా, స్మరించినా ఆయన మనకు అందుబాటులోనుండి మనలను బ్రోచును. రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా! అని గజేంద్రుడు శరణు వేడగనే అపన్న ప్రసన్నుండు సంరంభియై

**సిరికిం జెప్పడు, శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపడే**
**పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం**
**తర ధమ్మిల్లము జక్క నొత్తడు వివాద ప్రోత్థిత శ్రీ కుచో**
**పరిచేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మూడు విధాలుగా ఈ నామమును వివరించారు – సతః అయోగీ, సదాయోగీ, సదా అయోగీ

'సతస్' అనగా సమభావము. 'అయుజ్' అనగా కలుపుట, సంధానించుట. ఈ నామమునకు మూలధాతువులు కూడా బహువిధములుగా ఉత్పన్నములు.

యుగి – వర్జనే – వర్జించుట, వదలివేయుట
యుజ్ – సమాధౌ – మనస్సును కేంద్రీకరించుట
యుజ్ – యోగే – కలుపుట, ఐక్యమగుట
యుజ్ – సంయమనే – జత చేయుట

**సతః అయోగీ సదాయోగీ** – భగవంతుడు సర్వవ్యాపియై లోకములను కలిపియుంచును. **సదైవ యోజయతి సంయమయతి విశ్వాన్ లోకాన్ స సదాయోగీ** – భగవంతుడు ఇందు కలడు అందు లేడని సందేహము వలదు. చక్రి సర్వోపగతుడు. ఎందెందు వెదకి చూచిన అందందే కలడు.

సత్యము, ధర్మము కానివానిని అన్నింటిని త్యజించినందున శ్రీహరి 'సదాయోగి' యగును. సత్యపాలనకు, ధర్మ రక్షణకు ఆయన సదా అవతరించి సజ్జనులను కాచుచుండును.

ఎల్లపుడు ఆయన యోగమూర్తియై (సమత్వ భావన కలిగి) ఉన్నందున ఆయన 'సదాయోగి'. సచ్చిదానందపూర్ణ పరబ్రహ్మము. శుద్ధసత్త్వమూర్తి. రాగద్వేషరహితుడు. జ్ఞానానందమయుడు. **సదాయోగః అస్య అస్తి ఇతి తమ్ సదాయోగినమ్, సదా యోగశీలమ్ స్వభావ ధర్మాణమ్ వా.**

ధర్మచక్రము రచయిత (పేరు తెలియదు) వ్యాఖ్యానము ప్రకారము ప్రజలు మూడువిధములైన జీవనము గడుపుచుందురు. రోగి, భోగి, యోగి. వీనిలో ఇంద్రియములను నిగ్రహించి, ఇంద్రియ సౌఖ్యములను పరిత్యజించి, పరమ పురుషుని పరంధామముపై దృష్టి నిలుపు జీవన్మార్గము యోగము. ఈ మార్గంలో ఆరోగ్యము, ఆనందము, మోక్షము లభిస్తాయి. అట్టి మార్గానువర్తులు సదాయోగియైన పరమాత్మునిపైననే మనసు నిలుపుకొందురు.

## 168. వీరహా

- బలవంతులగు దుష్టులను నాశనము చేయువాడు.

### ఓం వీరఘ్నే నమః

ఈ నామము 168, 747, 927వ నామములుగా మూడుమార్లు వస్తుంది.

18వ శ్లోకము. 168వ నామము. వీరహా - **వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః**
79వ శ్లోకము. 747వ నామము. వీరహా - **వీరహా విషమః శూన్యో ఘృతాశీరచలశ్చలః**
99వ శ్లోకము. 927వ నామము. వీరహా - **వీరహా రక్షణః సంతో జీవనః పర్యవస్థితః**

**పరిత్రాణాయ సాధూనామ్, వినాశాయ చ దుష్కృతామ్, ధర్మ సంస్థాపనార్థాయ** – తాను యుగ యుగమున సంభవింతునని శ్రీకృష్ణభగవానుడు గీతోపదేశమున సెలవిచ్చెను. వీరుడైనవాడు తన శక్తిని అధర్మకార్యమునకు వినియోగించిన యెడల భగవంతుడు వానిని అంతమొందించుట తథ్యము. పెక్కు వరములు పొందినను, అసమాన బల పరాక్రమములు కలిగినను వానికి నాశనము తప్పదు. హిరణ్యకశిపుడు, రావణుడు, కంసుడు వీరులైనను వారికి శ్రీహరి చేత మరణము తప్పలేదు.

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము ఇక్కడ 'వీర' అనే పదము 'కుకర్త శూరు'లకు వర్తించును. అట్టి కుకర్త వాదులు భగవంతుడు లేడనియో, తామే దేవుళ్ళమనియో, మరొక విధముగానో వాదించి భక్తులను పెడత్రోవ పట్టింతురు. వారి ప్రవృత్తి గురించి భగవద్గీత 16వ అధ్యాయము (దైవాసుర సంపద్విభాగ యోగము) నందు 8 నుండి 19వ శ్లోకము వరకు చెప్పబడినది – అలాంటి కుకర్తా వాదులు అసుర స్వభావము కలవారు. దంభము, దర్పము, మదముచే మత్తులై, విషయ భోగ పరాయణులై యుందురు. మిథ్యా సిద్ధాంతములను ఆశ్రయించి భ్రష్టాచారులై వర్తించెదరు. వారు ఇతరులను నిదించుచు, తమ శరీరముల యందును, ఇతరుల శరీరములందును అంతర్యామిగా నున్న పురుషోత్తముని ద్వేషించుచుందురు. అట్టి 'వీరు'లను నశింపజేయువాడగుటే శ్రీహరిని వీరఘ్నుడు అని నుతింపనగును.

శ్రీ కైవల్య సారథి నుండి – **స్వ ధ్యాన భంజకాన్ వీరాన్ హన్తి యః సతు వీరహా** – తన ధ్యానాన్ని చెడగొట్టు వీరులను అంతము చేయువాడు 'వీరహా'.

## 169. మాధవః

- బ్రహ్మ విద్యను ప్రసాదించువాడు. సకల విద్యా జ్ఞానములకు ప్రభువు. పరమాత్మను గూర్చిన జ్ఞానమును ప్రసాదించువాడు.
- మా+ధవః – లక్ష్మి (మా)కి భర్తయైనవాడు.
- మధువిద్య ద్వారా తెలియువాడు.
- మౌనము, ధ్యానము, యోగము ద్వారా తెలిసికొనబడువాడు.
- మధువంశము (యాదవ వంశము)నందు జన్మించినవాడు.
- తనకు వేరు ప్రభువు లేనివాడు (అందరకు ఆయనే ప్రభువు)
- మౌనముగానుండి, సాక్షియైనవాడు.

### ఓం మాధవాయ నమః

సర్వ కాలములందు స్మరించి తరించనగు ఈ పుణ్య నామము శ్రీవిష్ణుసహస్రనామములో మూడుమారులు చెప్పబడినది. (73, 169, 741వ నామములు).
8వ శ్లోకము. 73వ నామము. మాధవః – **హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః**
18వ శ్లోకము. 169వ నామము. మాధవః – **వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః**
78వ శ్లోకము. 741వ నామము. మాధవః – **లోకబంధుః లోకనాథో మాధవో భక్తవత్సలః**

ఈ మూడు సందర్భములలోను మూడు విధములుగా విజ్ఞులు భాష్యమును చెప్పారు. వివిధ అర్థములు 73వ నామ వివరణలో చెప్పబడినవి.

**మా విద్యా చ హరేః ప్రోక్తా తస్యాః స్వామీ ధవ స్మృతః తస్మాన్మాధవ నామాऽసౌ బ్రహ్మవిద్యా ప్రదో మనుః -** 'మా' అంటే పరావిద్య. దానికి స్వామి (ధవుడు) గనుక ఆయనను మాధవుడు అన్నారు. ఈ నామము బ్రహ్మవిద్యనొసగే మంత్రము.

**మౌనాత్ ధ్యానాచ్చ యోగాచ్చ మాధవః పరికీర్తితః –** మౌన, ధ్యాన యోగములు కలవాడు మాధవుడు.

## 170. మధుః

- భక్తులకు తేనెవలె, అమృతము వలె, అత్యంత ప్రియమైనవాడు.
- మంగళకరమగు జ్ఞానమయుడు.

### ఓం మధవే నమః

భక్తుల హృదయములందు భగవద్భావన, స్మరణ, కీర్తనలు తేనెవలె, అమృతమువలె ఆనందమును నింపును. **భక్తేభ్యో లబ్ధ విద్యేభ్యో స్వదమానతయా మధుః –** మోక్షసాధన కొరకు పరావిద్యనాశ్రయించిన భక్తులకు మధువువలె తియ్యగా ఉండేవాడు మధువు. శ్రీహరి ధ్యానమే భక్తులకు మందార మకరంద మాధుర్యము. అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పాన విశేష మత్త చిత్తమునకు ఇతర విషయములు సారహీనములు. అందువలననే ఆళ్వారులు, పోతన, అన్నమయ్య, త్యాగయ్య, రామదాసు, మీరాబాయి, తులసీదాసు వంటి భక్తులు హరినామ గానామృతమున పరవశించి తరించారు.

**అయమాత్మా సర్వేషామ్ భూతానామ్ మధు –** బృహదారణ్యకోపనిషత్తు 2.5.14. (నేను అన్ని భూతములందును ఆత్మస్థితుడనై, మధువునై యున్నాను)

పెరియాళ్వారుగారు 'పూచ్చూతల్'లో **– తేనియల్ ఇనియ సిరానె –** అని భగవంతుని ప్రస్తుతించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'మధు' అనగా జ్ఞానము అని కూడ అర్థము. భగవంతుడు సర్వ వ్యాపి, సర్వాంతర్యామి యైనందున సర్వజ్ఞుడు కూడ. **జ్ఞాన ధర్మేణ వ్యాప్నువమ్ సర్వమ్ విశ్వమ్ మన్యతే జానాతి, తస్మాత్ స మధుః.** అలాగే యజుర్వేద మంత్రము – **తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః –** ఆయన అన్నింటి లోపలను, అన్నింటి బయటను ఉండును. కనుక ఆయన జ్ఞానమయుడు. ఆయనకు తెలియనిది లేదు.

ధర్మ చక్ర రచయిత మరిన్ని విశేషాలను పొందుపరచారు – ఆహార పదార్థములలో తేనె విశిష్టమైనది. రుచికరమైనది. అందులో వ్యర్థమయ్యేది ఏమీ లేదు. దానివలన విపరీత లక్షణములు సంభవింపవు. అదేవిధముగా సకల శుభదాయకమగు పరిపూర్ణ జ్ఞానానందమయుడు మధువు. శ్రీమహావిష్ణువు.

---

**శ్రీ తూము నరసింహదాసు కీర్తన**

నోరూరు గదవె శ్రీరాముని దలచిన నోరూరు గదవె
పాలు మీగడ మేలి చక్కెర – చాల మెక్కిన పోలికను ||నోరూరు||
మేరు సమదాధీరు జగదా – ధారు శ్రీ రఘువీరు దలచిన
కూరిమితో నరసింహ దాసుని – జేరు రాముని పేరు దలచిన ||నోరూరు||




**శ్రీ భక్త రామదాసు కీర్తన**

శ్రీరామ నీ నామమేమి రుచిరా - ఓరామ నీ నామ మెంత రుచిరా ||శ్రీరామ||
కరిరాజ ప్రహ్లాద ధరణి విభీషణుల - గాచిన నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||
కదళీ ఖర్జూరాది ఫలములు కధికమౌ - కమ్మన నీనామ మేమిరుచిరా ||శ్రీరామ||
నవరసములకన్న నవనీతము కంటె - నధికమౌ నీ నామ మేమి రుచిరా ||శ్రీరామ||
అంజనాతనయ హృత్కమలంబు నందు - రంజిల్లు నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||
శ్రీ సదా శివుడు తానేవేళ భజియించు - శుభరూప నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||
సారము లేని సంసారము తరణమునకు - తారకము నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||
శరణన్న జనులను సరగున రక్షించు - బిరుదుగల్గు నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||
తుంబురు నారదులు డంబుమీరగ – గానంబు చేసెడి నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||
అరయ భద్రాచల శ్రీరామదాసుని - ఏలిన నీనామ మేమి రుచిరా ||శ్రీరామ||

Picture source: https://commons.wikimedia.org/wiki/File:Sadani_darbar,statue7.JPG by User:Dvellakat

## 171. అతీంద్రియః

- ఇంద్రియములకు అందనివాడు. ఇంద్రియముల ద్వారా తెలిసికొనబడ జాలనివాడు.

### ఓం అతీంద్రియాయ నమః

**జ్ఞానోపకరణవ్రాత మతిక్రాన్తో హ్యతీంద్రియః** – ఇంద్రియాలకు కనిపించనివాడు.
**ఇంద్రియాణి అతిక్రాంతః అతీంద్రియః** – ఇంద్రియాలను అతిక్రమించినవాడు.

మనకు ఏవిషయమునైనా తెలిసికొనడానికి కనులు, ముక్కు, చెవులు, స్పర్శ వంటి ఇంద్రియములే సాధనములు. కాని ఏదయినా ఆకారము, రంగు, వాసన వంటి గుణములు కలిగినవానినే ఇంద్రియముల ద్వారా తెలిసికొనగలము. అలాగే మనసుకు (బుద్ధికి) తెలిసిన ఒక విషయము ద్వారా మరొక విషయమును తెలిసికొనడానికి ప్రయత్నించవచ్చును. కాని పరమాత్ముడు **యతో వాచే నివర్తంతే అప్రాప్య మనసా సహ** – వాక్కు చేత గాని, మనస్సు చేత గాని పట్టరానివాడు పరమేశ్వరుడు. నిరాకార నిర్గుణ పరబ్రహ్మమును ఇంద్రియములద్వారా తెలిసికొన సాధ్యము కాదు. (విశ్వరూప దర్శనమునకు సామాన్యదృష్టి చాలదని అర్జునునివంటి ఆప్తునికి దివ్యదృష్టి నొసగినాడు శ్రీకృష్ణపరమాత్ముడు.)

ఈశావాస్య ఉపనిషత్తులోని రెండు మంత్రములు (**అనేజదేకమ్**.. .. , **తదేజతి తన్నైజతి**… ..) పరబ్రహ్మముయొక్క అతీంద్రియ, అవాఙ్మానస నిర్గుణత్వమును చెబుతున్నాయి.

కఠోపనిషత్తు 1.3.10 – **ఇంద్రియేభ్యః పరహ్యర్థా … … అవ్యక్తాత్ పురుషః పరః అశబ్దమ్, అస్పర్శమ్, అరూపమ్, అవ్యయమ్ తథారసమ్ నిత్యమ్, అగంధవచ్చయత్** అతడు శబ్దము లేనివాడు. స్పృశింప జాలనివాడు. నిరాకారుడు. అవిచ్ఛిన్నుడు. నిత్యమైనాడు. గంధము (వాసన) లేనివాడు.

**తదేజతి తన్నైజతి తద్దూరే తదంతికే**
**తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః**
అతడు నడచును, నడవడు. దూరస్థుడు, సమీపస్థుడును. ఈ సమస్త జగత్తునకు లోపల, బయట ఉండువాడు.

శ్రీ చిన్మయానంద – ఇంద్రియముల ద్వారా భగవంతుని గ్రహింపలేము అనియే గాక, ఇంద్రియములలోని గ్రహణశక్తి, తద్వారా మనకు లభించు జ్ఞానము భగవంతునివల్లనే సాధ్యము. కన్ను తనను తాను చూడలేదు (అద్దములో ప్రతిబింబమును చూచును). అలాగే ఇంద్రియములు భగవంతుని గ్రహింపలేవు. అంతే కాదు. ఇంద్రియములు బయటనున్నవానిని చూడగలవు. కాని సర్వుల హృదయ కుహరములందు అంగుష్ఠమాత్రుడై యున్న సర్వాంతర్యామిని ఇంద్రియముల ద్వారా తెలిసికొనుట సాధ్యము కాదు.

అతీంద్రియు నెఱుంగుటకు భక్తి మాత్రమే ఏకైక మార్గము. ఆయన వేదవేద్యుడు. భక్తులకు అనుభవైకవేద్యుడు.

## 172. మహామాయః

- అధిగమింపజాలని మాయమయుడు.

### ఓం మహామాయాయ నమః

**మాయా యస్యా ప్రపన్నానాం సర్వేషామస్తి మోహినీ మహామాయః స విజ్ఞేయః వస్వర్ణో మనురుజ్వలః -** తనను శరణు పొందనివారిని మాయలో పడవేసేవాడు 'మహామాయః'. ఈ నామము అష్టాక్షరీమంత్రము. ఉజ్వలమైన ఫలితాన్నిస్తుంది. ఓం మహామాయాయ నమః.

**మాయాతీతా యస్య సః మహామాయః** – గొప్పదయిన మాయ కలవాడు.

భక్తితో శరణాగతులై సర్వస్వమును అర్పించినవారు తప్ప మిగిలినవారు ఆ సర్వోపగతుని కనుగొనజాలరు అని శ్రీభట్టులు వివరించారు. ఆ జగన్నాథుడు అతీంద్రియుడు గనుక ఆయనను తెలిసికొనుట ఎవ్వరికిని సాధ్యము కాదు. ఆయన మాయను అధిగమించ ఎవ్వరి తరము కాదు.

ఇక్కడ 'మాయ' అనగా కనికట్టు అనియో, మోసము అనియో, భ్రాంతి అనియో అర్థము తీసికొనకూడదు. భగవంతుని మాయ అసాధారణ, కార్యకారణ రూపమగు అపరాప్రకృతి. అద్భుతమైన తత్వగుణము. అత్యంత విచిత్రము. (**జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా** – ఇక్కడ సీతాదేవి 'దేవమాయ' అని చెప్పబడెను.)

**దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా**
**మామేవ ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే** – గీత 7.14
నా మాయ త్రిగుణాత్మకమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి సంసార సముద్రమునుండి బయటపడగలరు.

శృతులనుండి మరికొన్ని ఆధారములు.

**అతి మోహకారీ మాయా మమ** – శరభ 24.

**విద్యాత్ మాయినమ్ తు మహేశ్వరమ్** – శ్వేతాశ్వర 4.10

తరువాతి నామములు 'మహోత్సాహః' నుండి 'అనిరుద్ధః' వరకూ భగవానుని షాడ్గుణ్య పరిపూర్ణతను కీర్తించేవిగా వివరించారు.

**ఐశ్వర్యస్య చ సర్వస్య వీర్యస్య యశసః శ్రియః జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరితాః** ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనేవి షడ్గుణములు. కొన్ని చోట్ల జ్ఞానము, శక్తి, ధనము, బలము, వీర్యము ఓజస్సు అనేవి షడ్గుణాలుగా చెప్పబడినాయి.

## 173. మహోత్సాహః

- గొప్ప ఉత్సాహముతో కార్యాచరణము కావించువాడు.
- అంతు లేని సహనముతో జగత్తును భరించువాడు.

### ఓం మహోత్సాహాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య - **మహదుత్సహనం యస్య హైశ్వర్యం కర్తృలక్షణమ్ మహోత్సాహః స విజ్ఞేయో మనురైశ్వర్య దాయకః -** సకల జగత్తును సృష్టించడం అనే గొప్పదైన ఐశ్వర్యము కలవాడు. ఈ నామము ఐశ్వర్యమును ప్రసాదించు మంత్రము. ఓం మహోత్సాహాయ నమః. శ్రీమహావిష్ణువు నిరవధికముగా (విసుగు లేకుండ) సృష్టివంటి కార్యములు సాగిస్తూనే ఉంటాడు. ఆయన చేసే సృష్టిలోని వైవిధ్యము అత్యద్భుతము. ఈ సృష్టి పరిమాణము అనూహ్యము. జగత్పాలనము అసమానము. ఇలాంటి కార్యములను నిరంతరముగా, నిరవధికముగా నిర్వహించే భగవానుని ఐశ్వర్యగుణము 'మహోత్సాహము' కాక మరేమగును? అది ఆయనకు బయటినుండి అబ్బిన గుణము కాదు. ఆయనే స్వతహాగా మహోత్సాహుడు. సాంఖ్య తత్వములో చెప్పబడినది ఏమనగా – భగవంతుడు సర్వజ్ఞుడు, నిర్వికారుడు కనుక ఆయన ప్రత్యేకించి ఏ కార్యములూ చేయడు, అని. ఇందుకు భిన్నముగా 'మహోత్సాహః' నామమును బట్టి భగవంతుడు నిష్కర్ముడు కాడని, ఎంతో ఉత్సాహముతో సృష్టి స్థితి లయాది కార్యములను అవిచ్ఛిన్నముగా సాగించుచునే ఉండునని అర్థము చేసికొనవచ్చును.

శ్రీ చిన్మయానంద – భగవంతుని మహాశక్తికి మహోత్సాహము తోడు అగుట వల్లనే జగత్తు నిలిచియున్నది. సముద్రములోని అలలు అలుపు సొలుపు లేకుండా ఎగసి పడుచున్నట్లుగానే, భగవంతుడు విరామము లేని ఉత్సాహముతో లోకములను ఏలుచుండును. దూడ కొఱకు ఆవు పొదుగులో పాలు నింపును. తేటి కొఱకు పూవులకు రంగులద్ది, లోపల మకరందము నింపును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **మహాన్+ఉత్+సాహః, మహాన్తమ్ ఉచ్చైస్తమమ్ సాహః, సహతే సహ్యతి, సహతి వా స మహోత్సాహః –** గొప్పదైన సహనగుణము కలిగినవాడు. ఇక్కడ 'సాహ్' అనే ధాతువును 'సహనము' అనే అర్థంలో అన్వయించుకొనవచ్చును. అందుకు ప్రమాణము ఋగ్వేద మంత్రము (1.164.13) – **నా క్షతప్యతే భూరిభారః** – అలసట లేకుండ ఆయన సూర్యచంద్రాదుల మహాభారమును మోయుచునే యుండును. సృష్టించుట, పోషించుటతో సరిపెట్టుకొనక, తను సృష్టించిన ప్రతి అణువునకు అంతర్యామియై యున్నవానిని 'మహోత్సాహుడు' అనకుండా ఎలా చెల్లుతుంది? ఆయన సహన గుణమును సూచించే మరొక ఋగ్వేద మంత్రము (19.9) – **సహోऽసి సహో మయి దేహి.**

'ఉత్సాహము' అనే సామాన్యార్థమును వివరిస్తూ ధర్మచక్రము రచయిత ఇలా చెప్పారు – సత్వ, రజస్, తమో గుణములలో సాత్విక గుణ ప్రధానమైన పనులు ఉత్సాహ పూరితముగను, లోక కళ్యాణ ప్రదముగను ఉండును. అవి జయప్రదములు. శుభకరములు. మంగళ దాయకములు. కనుక సాత్విక జీవన విధానమును అనుసరించుట కూడ భగవంతుని సేవించుటయే.

## 174. మహాబలః

- ఇతరుల సహాయ సహకారాలు లేకుండానే సృష్టి చేసే బలము కలవాడు.
- అనంతమగు, అద్భుతమగు బలముకలవాడు. బలవంతులకంటె బలవంతుడు. అందరికి (భక్తులకు) వివిధ బలములు ప్రసాదించువాడు. జీవనాధారము.

### ఓం మహాబలాయ నమః

**కర్త్రన్తరానపేక్షో యః సృష్టేః సః స్యాత్ మహాబలః** – ఇతరుల సహాయ సహకారాలు లేకుండానే సృష్టి చేసే బలము కలవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **బలినామపి బలవత్వాత్ మహాబలః** – ఎంతో బలవంతులకంటె ఎక్కువ బలము కలవాడు. గోవర్ధనగిరిని వ్రేలిపై ఎత్తుట ఆయనకు ఆట మాత్రమే. బ్రహ్మాండంబులు పైబడినను తన వ్రేలు బెసకదని గోపాలకులకు అభయమిచ్చినాడు.

భగవంతుని 'మహాబల' గుణమునకు శ్రీరాధాకృష్ణశాస్త్రిగారు పెక్కు ఉదాహరణలు చెప్పారు. – ఒకమారు బలిని సందర్శించడానికి రావణుడు పాతాళానికి వెళ్ళాడు. బలిచక్రవర్తికి ద్వారపాలకుడుగా ఉన్న భగవంతుడు అదృశ్యమవగా రావణుడు ద్వారమునకు అడ్డుగా ఉన్న వస్తువును కదల్చడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఆ వస్తువు హిరణ్యకశిపుని చెవి కుండలము. శ్రీనృసింహమూర్తి చేత చిక్కిన హిరణ్యకశిపుని చెవినుండి జారి పడినది. తన చేయి ప్రోగు క్రింద పడి, రావణుడు విలవిలలాడుతుండగా భగవంతుడు ప్రత్యక్షమై ఒక్క తన్ను తన్నాడు. దానితో రావణుడు ఆమడ దూరంలో పడ్డాడు. అట.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'బల్'-ప్రాణనే, అనగా ఊపిరి పీల్చుట, జీవించుట అనే అర్థంలో – సమస్త లోకమునకు ప్రాణమును, బలమును ప్రసాదించువాడు గనుక శ్రీమహావిష్ణువు మహాబలుడగును. 'బలము' అనగా కండబలము మాత్రమే కాదు. విద్యా బలము, సేవా బలము, ధన బలము, అన్న బలము, జ్ఞాన బలము, ధర్మ బలము – అన్ని బలములకు ఆయనే ఆధారము గనుక ఆయన మహాబలుడు. **బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్** – అని గీత (7.11)లో చెప్పబడినది. ఆయన బలవంతులకంటె బలవంతుడు. బలవంతులలోని బలము. మహాబలుడు.



గుజరాత్ – పటన్ గోడపై ఒక భాగంలో కొన్ని దశావతారాల శిల్పాలు. **వికీపీడియా చిత్రం.** By Anurag choubisa

https://commons.wikimedia.org/wiki/File:A_wall_of_rani_ki_vav_patan.jpg

https://commons.wikimedia.org/wiki/File:Rani_ki_Vav_sculptures_02.jpg



## మహాబుద్ధిర్మహావీర్యో మహాశక్తిర్మహాద్యుతిః |
## అనిర్దేశ్యవపుః శ్రీమానమేయాత్మా మహాద్రిధృక్ || (19)

### 175. మహాబుద్ధిః

- అనంతమగు బుద్ధి (జ్ఞానము, విచక్షణ, గ్రహణము) కలవాడు.
- అన్ని ప్రాణులలోను బుద్ధికి కారణమైనవాడు.

### ఓం మహాబుద్ధయే నమః

శ్రీమహావిష్ణువు సకలాంతర్యామి. సాక్షి. క్షేత్రజ్ఞుడు. అన్నియెడల శిరములు, కన్నులు, చెవులు, నోళ్ళు, చేతులు, పాదములు కలవాడు. మనము సామాన్యముగా అర్థము చేసికొనేలా ఇంద్రియముల ద్వారా పరిమితమైన జ్ఞానము గ్రహించుట, తద్వారా పరిమితమైన బుద్ధిని కలిగియుండుట ఆయనకు వర్తించదు. ఆయన స్వతహా అనంత, సకల జ్ఞాన సంపన్నుడు, మహాబుద్ధి యని శ్రీ భట్టులు వివరించారు. ఇందుకు శ్రుతులనుండి పెక్కు ఆధారములను చూపవచ్చును.

శ్వేతాశ్వరోపనిషత్తు 3.19 – **పశ్యత్యచక్షుః స శృణోతి అకర్ణః** – ఆయన కన్నులు లేకుండానే చూచును. చెవులు లేకుండానే వినును.

తైత్తరీయ నారాయణోపనిషత్తు 1.12 – **విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖమ్** – ఆయన అన్నియెడల కన్నులు, అన్నియెడల ముఖములు కలవాడు.

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోऽక్షిశిరోముఖమ్**
**సర్వతః శృతి ముల్లోకే సర్వమావృత్య తిష్ఠతి** – గీత 13.13
ఆ పరమాత్మని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములైయున్నవి. అతడు సర్వమును ఆవరించియున్నాడు.

ఆచార్య నాతముని మహాత్ములు న్యాయతత్వములో ఇలా చెప్పారు. **యో వేత్తి యుగపత్ సర్వమ్ ప్రత్యక్షేణ సదాస్వతః.** ఆయన ప్రత్యక్షముగా. స్వభావసిద్ధముగా అంతటను ఒకేమారు చూచుచుండును. ఆయనకు తెలియనిది లేదు. ఆయన బుద్ధికి తోచనిది లేదు. కనుక ఆయన మహాబుద్ధి.

ఆయన బుద్ధి అన్నింటికంటె గొప్పది గనుక మహాబుద్ధియని ఇంతవరకు చెప్పబడినది. అంతే కాదు. సకల ప్రాణులలోని బుద్ధి, జ్ఞానము ఆయనే. అందువలననే చరాచరాత్మకమైన సకల విశ్వము నిర్ణీత మార్గములో వర్తించుచున్నది. 'బుధ్' అనే ధాతువును 'తెలిసికొనుట, అర్థము చేసికొనుట' అని భావము.

**బీజం మా సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్**

**బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్** – గీత 7.10

ఓ పార్థ! సమస్త భూతములకును నన్ను సనాతనమైన (శాశ్వతమైన) బీజముగా ఎఱుంగుము. ప్రజ్ఞావంతులలోని ప్రజ్ఞను, తేజోవంతులలోని తేజస్సును నేనే.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరింత వివరించారు – సృష్టియందలి సకల జీవుల స్వభావములు, స్పందనలు, ప్రవర్తనలు వానిలో భగవంతుడు పొందుపరచిన బుద్ధికి అనుగుణముగా జరుగును. చెట్లు శిశిరములో ఆకులు రాల్చును. వసంతములో చిగురించును. తల్లులు బిడ్డలకు పాలుగుడిపి సాకును. 'లజ్జావంతి' మొక్కలు కేవలము ఆడువారు నీరుపోసినపుడే వర్ధిల్లును. మగవారు నీరు పోసిన వాడిపోవును. సకల చరాచరములు భగవంతుడు తమకు ఒసగిన బుద్ధి ప్రకారము వర్తించును. ఇంత వైవిధ్యమున్న సృష్టిని చేయుట, వానిలో బుద్ధిని నింపుట కేవలము మహాబుద్ధిగలవాడు మాత్రమే చేయగలడు. కనుకనే ఆయన మహాజ్ఞాని, మహాబుద్ధి.

శ్రీరామకృష్ణ తపోవనమువారు ప్రచురించిన 'ధర్మచక్రము' అనే పత్రికలో ఒక రచయిత (పేరు తెలియదు) ఇదే విషయం గురించి ఆసక్తికరమైన ఉదాహరణలను ఇచ్చారు. చిన్నపిల్లవాడు అదిలించినపుడు కాకి ఒకసారి రెక్కలు విదిలించి ఊరుకుంటుంది. పెద్ద వ్యక్తి అదిలిస్తే అది కొంచెం దూరం గెంతి ఆగుతుంది. కఱ్ఱతో బెదిరిస్తే కఱ్ఱకందనంత సురక్షితమైన దూరం వెళ్ళి ఆగుతుంది. తుపాకిని పట్టుకున్నవాడిని చూస్తే మాత్రం చుట్టుప్రక్కల కనుపించదు. ఇంత బుద్ధి కాకికి ఎవరిచ్చారు? ఆ బుద్ధి తరతరాలుగా కాకులలో ఎలా సంక్రమిస్తున్నది? ఇందుకు కారణం మహాబుద్ధియైన శ్రీమహావిష్ణువే. పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఆయన బుద్ధియే వారివారి బుద్ధిగా ప్రవర్తిల్లుచున్నది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారి అదనపు వివరణ – బుద్ధి, మనసు, చిత్తము, అహంకారము అనే నాలుగు అంతఃకరణాలలో బుద్ధి అతిముఖ్యమైనది. అనుభవములు, పరిశీలనలు చిత్తము ద్వారా అందుతాయి. ఏమేమి చేయడానికి సాధ్యము అనే మార్గాలను మనసు సూచిస్తుంది. నిర్ణయించిన పనిని అహంకారము ఆచరిస్తుంది. అయితే ఈ నిర్ణయించడమనే కార్యక్రమం మాత్రం బుద్ధివల్ల జరగాలి. అల్పబుద్ధులు అనుచిత నిర్ణయములు చేయవచ్చును. అలా కాకుండా సర్వత్ర సన్మార్గయుతమైన నిర్ణయము చేసేది మహాబుద్ధి.

## 176. మహావీర్యః

- సకల సృజనాత్మక దివ్య శక్తులకు ఆధారము.
- అచంచల మూర్తి.

### ఓం మహావీర్యాయ నమః

**హేతౌ సతి వికారిత్వేత్యవికారిత్వ లక్షణమ్ మహద్వీర్యం యస్యేతి మహావీర్యస్స చ స్మృతః** వికారాలకు కారణమున్నప్పటికీ, వికారము పొందకుండా ఉండడము వీర్యము అబడుతుంది. అటువంటి గొప్ప వీర్యము కలవాడు మహావీర్యుడు.

సృష్టిలో అన్నీ పరిణామము చెందుతాయి. (పాలు పెరుగుగా మారినట్లు). కానీ శ్రీమన్నారాయణుడు ఏకాకృతియై వెలుగుచునే యుండును. కనుక ఆయన మహావీర్యుడు. ఆయన వీర్యశక్తి, ఇంద్రియ నిగ్రహములే మహాయోగులలోని నిర్మల, నిశ్చయ భావములుగా ప్రతిబింబించును. శ్రమ లేకుండానే పూవు తన చుట్టుప్రక్కల అందమును, సుగంధమును వెదజల్లినట్లుగా భగవంతుడు సకల కార్యములను అలవోకగా నిర్వర్తించును గనుక ఆయన మహావీర్యుడు.

శ్రీ చిన్మయానంద – సకల చేతనత్వమునకు, సృష్టికి, సృజనాత్మతకతకును వీర్యమే మూలాధారము. సృష్టిలోని చైతన్యమంతా భగవంతుని అంశయే గనుక భగవంతుడు మహావీర్యుడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – ఎంత అసాధ్యమనిపించినా గాని, ధ్యేయమును సాధించుటయే వీర్య లక్షణము. ప్రకృతినుండి విశ్వసృష్టిని కావించినందున భగవంతుడు మహావీర్యుడు.

ధర్మచక్ర వ్యాఖ్యాన రచయిత – వీర్యసంపన్నుడైనవాడు సంపూర్ణ ఇంద్రియ నిగ్రహమును కలిగి యున్నట్లయితే సర్వశ్రేయోదాయకమైన సృష్టి జరుగును. కనుక భగవంతుడొక్కడే మహావీర్యుడు.

## 177. మహాశక్తిః

- సృష్ట్యాది సకల కార్యములకు కారణమైన శక్తి గలవాడు.
- క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తుల సంగమమైన అనంత శక్తిమయుడు.

### ఓం మహాశక్తయే నమః

భగవంతుడు సకల శక్తులకును ఆధారము. అనంత శక్తిసంపన్నుడు. అందరిలోని శక్తి ఆయన అంశయే. కనుక శ్రీహరి మహాశక్తి.

సృష్టి, స్థితి, లయ వంటి కార్యక్రమములలో సంకల్పము మాత్రము భగవంతునిదని, భౌతికమైన పని చేసేది భగవంతుడు కాడని ఒక తత్వమార్గంలో (పసుపత తత్వము) చెప్పబడినది. ఇందుకు భిన్నంగా, సకల కార్యములలోను భగవంతుని శక్తియే ఆధారమైయున్నదని శ్రీభట్టులు ఈ నామ వ్యాఖ్యానంలో వివరించారు. కనుక సృష్టిలోని సకల కార్యములు, పరిణామములు, సృజనలు భగవంతుని మహాశక్తి కారణముగానే జరుగుచున్నవి.

శక్ – మర్షణే – సాధ్యమగుట, భరించి సాధించి సహించుట.
శక్తౌ – సామర్థ్యము కలిగియుండుట.

'మహాబల;', 'మహోత్సాహః' నామములను వ్యాఖ్యానించినట్లే శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు 'మహాశక్తిః' నామమును కూడా వివరించారు. అన్ని శక్తులకు మూలమైనవాడు భగవంతుడు గనుక ఆయన మహాశక్తి యగును.

శ్రీ శంకరులు కూడ సామర్థ్యము, నేర్పరితనము అనే భావంలో ఈ నామమును వ్యాఖ్యానించారు.

శ్రీ చిన్మయానంద – క్రియాశక్తి (పని చేయు శక్తి), ఇచ్ఛాశక్తి (కామ శక్తి, కోరుకొను శక్తి, సంకల్పించునది), జ్ఞానశక్తి (తెలిసికొను శక్తి) అనే మూడింటి మహాసంగమమే మహాశక్తి. సృష్టికి మూలము, ఆధారము.

మనము పరిశీలించే ప్రతిశక్తి (చీమలోను, సింహంలోను, మనిషిలోను, సముద్రంలోను, భూమిలోను, గాలిలోను.. .. ) భగవంతుని గుర్తు చేయును.

## 178. మహాద్యుతిః

- అసమానమగు దివ్యమైన కాంతితో విరాజిల్లువాడు. తేజోమయుడు.

### ఓం మహాద్యుతయే నమః

'ద్యుతి' అనగా కాంతి. **ద్యుత దీప్తౌ** – ప్రకాశించుట. అనే ధాతువునండి. **ద్యోతయితా వా ద్యుతిః.** ప్రకాశించువాడు, ప్రకాశింపజేయువాడు ద్యుతి. భగవంతుని కాంతి అనంతము. సృష్టిలోని ప్రకాశము అంతా భగవంతుని కాంతిలోని అంశము వల్లనే కలుగుచున్నది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన యజుర్వేద ప్రమాణములు (23-2,4)

**యస్తే దివి సూర్యే మహిమా సంబభూవ**
**తస్మైతే మహిమ్నే ప్రజాపతయే దేవేభ్యః స్వాహా**
**యస్తే నక్షత్రేషు చంద్రమసి మహిమా సంబభూవ**
**తస్మైతే మహిమ్నే ప్రజాపతయే దేవేభ్యః స్వాహా**

శ్రీ భట్టుల వివరణ ప్రకారము భగవంతుని కార్యములకు బయటినుండి సహాయ సాధనములు అవుసరము లేదు. ఆయన శక్తి, తేజస్సు, బుద్ధి, జ్ఞానము, వీర్యము వంటి గుణములన్నియును ఆయనకు స్వాభావికముగా ఉన్న అనంత వైభవైశ్వర్యములు. అలాగే ఆయన ప్రకాశము బయటినుండి వచ్చు కాంతి మూలముగా సంభవింపదు. ఆయన స్వయంప్రకాశమూర్తి. మహాద్యుతి. తేజోమయుడు. సూర్యుని కాంతి, వజ్రము తళుకు, మబ్బులలోని మెరుపు భగవంతుని తేజస్సుయొక్క స్వల్ప అంశమువల్లనే కలుగుచున్నది. ఆయన తేజము మనచుట్టును కప్పిన, మన మనస్సులో గూడుకట్టుకొన్న అంధకారమును, అజ్ఞానమును పారద్రోలును. ఆయన తేజస్సు భక్తులకు నయనానందకరము. శత్రువులకు భీకర దుర్నిరీక్ష్యము.

ఆయన స్వయంప్రకాశమూర్తి యనుటకు శృతులలోని ఆధారములు.

**స్వయం జ్యోతిః** – బృహదారణ్యకోపనిషత్తు 4.3.9
**జ్యోతిషామ్ జ్యోతిః** – ముండకోపనిషత్తు 2.2.9
**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్** – గీత 15.12
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సేయని యెఱుంగుము.

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా**
**యది భాఃసదృశీ సా స్యాత్ భాస్తస్య మహాత్మనః**
ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాంతి పుంజములును ఆ విరాట్ రూప తేజస్సునకు సరికావు.

ధ్మచక్ర రచయిత – ఆ మహాద్యుతిని పూజించువారు భగవంతుడొసగిన కాంతితో, తేజస్సుతో వెలుగుదురు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఈ పుణ్యస్తవములో 'మహా' అనే శబ్దముతో మొదలయ్యే నామములు మొత్తము 43 ఉన్నాయి. అందులో ఆయన షడ్గుణైశ్వర్యములను కీర్తించే ఈ ఆరు నామములు ఆయన లీలా వైభవమును తెలుపును. వీనివల్లనే భగవానుడు 'మహామాయ' అగును.

173. మహోత్సాహః
174. మహాబలః
175. మహాబుద్ధిః
176. మహావీర్యః

177. మహాశక్తిః

178. మహాద్యుతిః

**పరా అస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వభావికీ జ్ఞాన బల క్రియాచ** (శ్వేతాశ్వరోపనిషత్తు 6.8) – జ్ఞానము, బలము, క్రియ వంటి వివిధములైన శక్తులు ఆయనలో స్వాభావికముగా (నేర్చుకొన్నవి కావు) అపరిమితములై యున్నవి.

**జ్ఞాన శక్తి బల ఐశ్వర్య వీర్య తేజాంసి అశేషతః**

**భగవచ్ఛబ్ద వాచ్యాని వినా హేయైః గుణాదిభిః** – విష్ణు పురాణము 65.79

'భగవత్' అను శబ్దము జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజము అను ఉత్తమ గుణములతో అనుసంధానమైనది. హేయమైన గుణములతో 'భగవత్' శబ్దమునకు సంబంధము లేదు.

**తేజో బల ఐశ్వర్య మహా అవబోధ సువీర్య శక్త్యాది గుణైక రాసిః** – విష్ణుపురాణము 6.5.85

భగవంతుడు తేజస్సు, బలము, ఐశ్వర్యము, గొప్ప జ్ఞానము, సమృద్ధిగా వీర్యము, శక్తి వంటి సద్గుణములకు నిలయుడు. తేజోమయుడు.

## 179. అనిర్దేశ్య వపుః

- వర్ణించుటకు వీలు గానట్టి, ఊహింపనలవి కానట్టి ఆకృతి (శరీరము) కలవాడు.

### ఓం అనిర్దేశ్య వపుషే నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.

19వ శ్లోకము. 179వ నామము. అనిర్దేశ్యవపుః – **అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్**

70వ శ్లోకము. 662వ నామము. అనిర్దేశ్యవుః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరోऽనంతో ధనంజయః**

**ఇదమ్ తత్ ఇత్యాది రూపేణ విజ్ఞాపనమ్, జ్ఞాప్యస్య ప్రకాశనమ్ వా నిర్దేశ్యః.** ఇదీ అదీ అని చెప్పగలిగినది, ఇలా అలా అని చూపదగినది 'నిర్దేశ్య' అగును. అలా సాధ్యము కానిది, మాటలకు చాలనిది, ఊహలకు అందనిది అనిర్దేశ్యము. 'వపు' అనే పదానికి 'శరీరము' అనీ, 'విత్తుట, చల్లుట' అనీ అర్థములు చెప్పవచ్చును (**బీజ సంతానే ఛేదనే చ**). 'బాపు, బాప్' అనే హిందీ పదములు 'వపు'నుండి ఉద్భవించి ఉండవచ్చును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు 'అనిర్దేశ్య-వపు' అనే నామమునకు చెప్పిన అర్థము – వర్ణింపరానివాడు, విశ్వమునకు విత్తనము విత్తినవాడు (రెండు అర్థములు జోడింపబడినవి).

కాని విస్తారముగా చెప్పబడిన అర్థము – నిర్దేశింపజాలని శరీరము కలిగినవాడు భగవంతుడు.

**జ్ఞానాది షాడ్గుణ్య మయం ఉపమాన విసర్జితమ్ వపుర్యస్యాతి తేజిష్ఠ అనిర్దేశ్య వపుర్హిస** జ్ఞానము మొదలైన షడ్గుణాల చేత సాటి లేనటువంటి, మిక్కిలి తేజోవంతము, పూర్ణమయము అయిన దివ్యమంగళ విగ్రహము కలవాడు. సకల భూతముల శరీరములు పంచభూతములు, మనస్సు, అహంకారములచే నిర్మితములు. కాని శ్రీమన్నారాయణుని శరీరము పాంచభౌతికము కాదు. ఆయన నిర్గుణ, నిరాకారమూర్తి. శుద్ధ సత్వ స్వరూపి. తేజోమయుడు. జ్ఞానానందమయుడు. సకలైశ్వర్య సంపన్నుడు. సర్వశక్తిమంతుడు. **రూపవర్ణాది నిర్దేశ విశేషణ వర్జితః** (విష్ణు పురాణము 1.2.10) – రూపము, రంగువంటి విశేషణములకు అతీతుడు. ఆయన రూపాది గుణములు వర్ణించ సాధ్యము కాదు. దేనితోను పోల్చుట కుదరదు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు మహాగుణ సంపన్నుడు. కనుక మన సామాన్య జ్ఞానము, పాండిత్యము శ్రీహరిని ఊహింప చాలవు. అంతరాత్మతోను, భక్తితోను భావించి, అనుభవించి, భగవంతుని తెలిసికొనుటకు యత్నింపవచ్చును.

శ్రీ చిన్మయానంద – మనము తక్కినవానివన్నీ చూచుటకు, తెలిసికొనుటకు సాధనమైన జ్ఞానము భగవంతునివలన కలుగుచున్నది. కనుక ఈ జ్ఞానముతో భగవంతుని వర్ణింప సాధ్యము కాదు (కన్ను తనను తాను చూడలేనట్లుగా).

## 180. శ్రీమాన్

- దివ్యాభరణ శోభితుడు.
- సౌందర్యమూర్తి, సుందరాంగుడు.
- సకలైశ్వర్య యుతుడు.

### ఓం శ్రీమతే నమః

'శ్రీమాన్' అనే ఈ శుభమంగళ నామము 22వ, 180వ, 222వ నామములుగా మూడుమార్లు జపింపబడినది.
ఈ మూడు సందర్భములలోను ప్రముఖ వ్యాఖ్యాతల అనుభవం క్రింద సంక్షిప్తంగా చెప్పడమైనది.

3వ శ్లోకము. 22వ నామము. శ్రీమాన్ - **నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః**
శ్రీ భట్టుల వ్యాఖ్య: అతిమనోహర సుందర శ్రీ నారసింహ స్వరూపము
శ్రీ శంకరుల వ్యాఖ్య: వక్షస్థలమున శ్రీలక్ష్మిని ధరించినవాడు.

19వ శ్లోకము. 180వ నామము. శ్రీమాన్ - **అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్**
శ్రీ భట్టుల వ్యాఖ్య: దివ్యాభరణములతో, దివ్య మాల్యాంబరములతో శోభిల్లువాడు.
శ్రీ శంకరుల వ్యాఖ్య: సకలైశ్వర్య సంపన్నుడు

24వ శ్లోకము. 222వ నామము. శ్రీమాన్ - **అగ్రణీః గ్రామణీః శ్రీమాన్ న్యాయోనేతా సమీరణః**
శ్రీ భట్టుల వ్యాఖ్య: శ్రీయుత మత్స్య మూర్తి. అన్ని సంపదలను కలిగినవాడు.
శ్రీ శంకరుల వ్యాఖ్య: అనన్య తేజోమయుడు.

మళ్ళీ 65వశ్లోకంలో **'శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః'** అని వస్తుంది. అప్పుడు శ్రీ శంకరులు **'శ్రీమాన్'** ను ప్రత్యేక నామముగా పరిగణించారు. శ్రీ భట్టులు మాత్రము '**శ్రేయశ్శ్రీమాన్**' ఒకేనామముగా పరిగణించారు.

65వ శ్లోకము – 619వ నామము. శ్రీమాన్ / శ్రేయశ్శ్రీమాన్ – **శ్రీధరః శ్రీకరః శ్రేయఃశ్రీమాన్ లోకత్రయాశ్రయః**

శ్రీ భట్టుల వ్యాఖ్య: **శ్రేయశ్శ్రీమాన్** – సకల సంపదలను ప్రసాదించు లక్ష్మీదేవిని నిత్యము కలిగియున్న శ్రీధరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య: **శ్రీమాన్** – సకల వైభవములు, సమస్త భోగభాగ్యములు, సకల విభూతులు, సకల సద్గుణములు, సర్వశక్తులు, సర్వనిధులు తనయందే కలిగియున్న శ్రీమంతుడు.

21వ నామము 'నారసింహ వపుః'. తరువాత 22వ నామము 'శ్రీమాన్'. అక్కడ శ్రీనారసింహావతారపరంగా 'శ్రీమాన్' నామమును శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. అవధులు లేని సౌందర్యముగల శ్రీనారసింహమూర్తియే శ్రీమాన్.

అలాగే మత్స్యావతారపరంగా వివరింపబడిన నామములలో 222వ నామమైన 'శ్రీమాన్' వచ్చును. అప్పుడు మత్స్యావతార సౌందర్యపరంగా 'శ్రీమాన్' పుణ్య నామమునకు వ్యాఖ్య చెప్పబడింది.

ఇదే విధంగా భగవంతుని శరీర వైశిష్ట్యమును ప్రస్తుతించే 'అనిర్దేశ్యవపుః' నామము ననుసరించి ఈ 180వ నామము 'శ్రీమాన్'వచ్చింది గనుక శ్రీహరి సౌందర్య వర్ణనతో ఈ నామమును వివరించారు.

శ్రీ భట్టులు: భగవంతుడు దివ్యాయుధములతో, దివ్య మాల్యాంబరములతో శోభిల్లువాడు. శిఖిపింఛమౌళి. **అతసీపుష్ప సకాశం హారనూపుర శోభితం రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుం.**

శ్రీ శంకరులు – భగవంతుడు షడ్గుణైశ్వర్య సంపన్నుడు. సకల శుభలక్షణ శోభితుడు. సర్వాంగ సుందరుడు – అని శ్రీ అనంతకృష్ణశాస్త్రిగారు తమ శంకరభాష్యము అనువాదములో చెప్పారు. భగవంతుడు సిరిగలవాడు. సకలైశ్వర్య సంపన్నుడు.

ధర్మ చక్రము రచయిత వివరణ – శ్రియఃపతి, లక్ష్మీవల్లభుడు గనుక వేంకటరమణుడు 'శ్రీమాన్'అని కీర్తింపబడుచున్నాడు. లక్ష్మిని వక్షస్థలమున ధరించినందున (**తద్వక్షస్థల నిత్యవాస రసికామ్ తత్ క్షాంతి సంవర్ధినీమ్**) ఆయన అందము స్వాభావికము. అనంతము. వారిది విడదీయరాని బంధము. అట్లే ప్రకృతి, పురుషులను వేరుచేయ సాధ్యము కాదు. ఇద్దరూ ఒకే పరబ్రహ్మముయొక్క అవినాభావ భావములు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'శ్రీ' అనగా సేవింపదగినది (సేవాయామ్). 'శ్రీ' అనగా శోభ, కాంతి. 'శ్రీ' అనగా సంపద. శ్రీమన్నారాయణుని సేవించుటయే జీవిత పరమార్థము. ప్రకృతిలోని ప్రతి అందము, ప్రతి వెలుగు (చెట్లు, పూలు, పక్షులు, నీళ్ళు, నక్షత్రములు, సూర్యచంద్రులు) అన్నీ భగవంతుని గుర్తు చేయును. భగవంతుని సేవించినవారికి నిత్యము, సత్యము, అనంతమునగు ఆనంద్యైశ్వర్యములు లభించును.

## 282. అమేయాత్మా

- తెలియరాని స్వరూపము గలవాడు. ఊహింపరాని తత్వమూర్తి.

### ఓం అమేయాత్మనే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకు పూర్వము చెప్పబడిన నామములు భగవంతుని విశిష్ఠ బహువిధ గుణములను, శక్తిని కీర్తించుచున్నవి. శ్రీమహావిష్ణువును ఇంద్రియముల ద్వారా తెలిసికొనలేము (అతీంద్రియుడు). ఆయన మాయను అధిగమించజాలము (మహామాయుడు). మహోత్సాహి. మహాబలుడు. మహాబుద్ధి. సకలసృష్టి మూలము (మహావీర్యుడు). మహాశక్తి. అసమాన కాంతిమయుడగు మహాద్యుతి. శ్రీయుతమూర్తి. ఆయన గుణవైభవములకు అంతములేదు. ఆయన స్వరూపమును ఎంచజాలము. కనుక శ్రీవాసుదేవుడు అమేయాత్ముడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'ఆత్మ' యనగా బుద్ధి, తెలిసిన విషయము. మహాబుద్ధియైన శ్రీహరిని తెలిసికొనుట, ఆయన బుద్ధిని అంచనా వేయుట అసాధ్యము. కనుక ఆయన అమేయాత్ముడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు 'మా' అనే ధాతువునుండి ఈ నామమును వివరించారు. మా-మానె-కొలుచుట, పోల్చుట. **మాతుమ్ అర్హః మేయః, న మాతుమ్ అర్హః అమేయః.** కొలుచుటకు అందనిది అమేయయము. 'ఆత్మ' అనగా స్వరూపము. భగవంతుడు అంతటను అంతరాత్మయై యున్నవాడు గనుక బయటినుండి ఆయనను తెలిసికొనుట, కొలుచుట సాధ్యము కాదు.

శ్రీ కృష్ణ తులాభారము వృత్తాంతమును స్మరింపనగును. బ్రహ్మాండములను ఉదరమున భరించిన పరబ్రహ్మమును తులవేయతరమా?.

## 182. మహాద్రిధృత్ / మహాద్రిధృక్

- గొప్పకొండలనెత్తినవాడు. (ధరించినవాడు)

### ఓం మహాద్రిధృతే నమః

శ్రీమహావిష్ణువు కూర్మావతారమున మందర పర్వతమును ధరించెను. నందగోపాలుడై గోవర్ధనగిరిని ధరించెను. దేవదానవులు అమృతమును కోరి వాసుకిని త్రాడుగా జేసి, మందరగిరిని కవ్వముగా వాడి క్షీరసాగరమును మధించు సమయమున ఆ పర్వతము జారిపడిపోవుచుండెను. అప్పుడు భగవంతుడు మహాకూర్మరూపమును ధరించి ఆ పర్వతమును వీపుపై భరించెను. మరల కృష్ణావతారమున ఆయన తనను నమ్ముకొన్న గోకులమును కాచుటకై గోవర్ధనగిరినెత్తి ఇంద్రుని గర్వమునణగించెను. బ్రహ్మాండమును సృజించి భరించు పరబ్రహ్మమునకు, రెండడుగులలో సకల భువనముల నతిక్రమించిన త్రివిక్రమునకు ఒక కొండనెత్తుట ఏపాటి కార్యము?

శ్రీ చిన్మయానంద – సాధకుని భక్తిపూరిత హృదయమే పాలకడలి. మనసు కవ్వము. వివిధములగు భావములే దేవదానవులు. బుద్ధియే వాసుకి. శ్రవణ మననాది సాధనలే చిలుకుట అనే ప్రక్రియ. మోక్షమే అమృతమను ధ్యేయము. ఇట్టి సాధనయందు కర్మ, బంధనములవలన సంసార సాగరమున మునిగిపోకుండ సహకరించువాడు శ్రీమహావిష్ణువు. కూర్మరూపదారి.

సహస్రనామము యొక్క కొన్ని పాఠములలో ఈ నామమే 'మహాద్రిధృక్' అని చెప్పబడినది. ఈ రెండు పాఠాంతరములను శ్రీరాధాకృష్ణశాస్త్రిగారు ఇలా వివరించారు.

**మహాద్రిధృక్ – మహాద్రయే దిధృష్ణోతి** – గొప్ప కొండనెత్తగల అంతటి మొనగాడు.
**మహాద్రిధృత్ – మహాద్రిమ్ ధరతి** – కొండనెత్తినవాడు.



గోవర్ధన గిరినెత్తిన బాల కృష్ణుడు. 1690 కాలపు చిత్రం. చిత్రకారుడు Shaha din.
వికీపీడియా నుండి. https://commons.wikimedia.org/wiki/File:Shahadin_001.jpg



## మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాం గతిః |
## అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాంపతిః || (20)

### 183. మహేష్వాసః

- తిరుగులేని, గొప్ప బాణములు ప్రయోగించువాడు.
- బ్రహ్మాండమైన ధనుస్సును ధరించినవాడు. గొప్ప విలుకాడు.

ఓం మహేష్వాసాయ నమః

**మహాన్-ఈషూణామ్-ఆసః – మహేష్వాసః** – గొప్పవైన బాణములను వేయువాడు.

శ్రీమహావిష్ణువు శార్ఙ్గము అనే మహాధనుస్సును ఆయుధముగా పూనినవాడు. ఆయనే కోదండరాముడై సాగరముపై బాణమును ఎక్కుపెట్టెను. ఆయనే బ్రహ్మాస్త్రమును వేసి రావణుని అంతము చేసెను. (శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణలు).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'ఇషు' అనగా బాణములు. 'ఇష్వాస' అనగా బాణములు వేయు ఆయుధము (ధనుస్సు) అగును. **మహాన్ ఇష్వాసః అస్య ఇతి మహేష్వాసః** – గొప్పదైన ధనుస్సును ధరించినవాడు మహేష్వాసుడు.

ధర్మచక్రము రచయిత – ఆధునిక ఆయుధములలో ఎంత బలమున్నా, ఇంకా యుద్ధ పరిస్థితులు, అన్యాయములు పెచ్చరిల్లుతూనే ఉన్నాయి. అంటే వీనిలోని శక్తికి, ధర్మరక్షణకు సంబంధం లేదు. కాని భగవానుని ఆయుధములు వ్యర్థములు కానేరవు. రామబాణమునకు తిరుగు లేదు. దానివలన అధర్మము నశించుట, ధర్మము వర్ధిల్లుట తథ్యము.

**ఆపదుద్ధారక స్తోత్రమునుండి**

నమః కోదండ హస్తాయ సంధీకృత శరాయచ
దండితాఖిల దైత్యాయ రామాయాపన్నివారణే

### 184. మహీభర్తా

- భూభారము వహించినవాడు. ఆదికూర్మరూపుడు. శ్రీవరాహమూర్తి.

ఓం మహీభర్త్రే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీహరి ఆదికూర్మమై భూమిని సదా భరించియుండును గనుక ఆయన మహీభర్త.

శ్రీ శ్రీనివాస రాఘవాచారిగారు తమ 'నృసింహప్రియ' వ్యాసములో చెప్పిన వివరణ – నిత్య ఆహ్నిక కర్మలోని **'ఓం అఖిల జగదాధారాయ కూర్మరూపిణే నారాయణాయ నమః'** అనే మంత్రములో శ్రీమన్నారాయణుని మహీభర్తగా జపించుచున్నాము.

భర్త అనగా 'మగడు, భరించువాడు' అనే అర్థంలో 'మహీభర్త' అనగా భూదేవికి భర్త. శ్రీమన్నారాయణుడు శ్రీవరాహమూర్తియై ప్రళయానంతరము పాతాళాంతర్గతయైన భూదేవిని ఉద్ధరించినాడు. అట్టి శ్రీభూవరాహస్వామియే మహీభర్త.

ధర్మ చక్రము రచయిత – శాస్త్రానుసారము సకల గ్రహ నక్షత్రాదులను భ్రమింపజేయు గురుత్వాకర్షణ శక్తి కూడా మహీభర్తయొక్క అంశమే.

హళెబీడులోని శ్రీభూవరాహమూర్తి శిల్పం. **వికీపీడియానుండి.**
Photo by Michael Gunther
https://commons.wikimedia.org/wiki/File:Halebid_si0954.jpg

## 185. శ్రీనివాసః

సిరికి నిలయమైనవాడు. లక్ష్మీవల్లభుడు.

**ఓం శ్రీనివాసాయ నమః**

ఈ పుణ్యనామము 185వ నామముగాను, 614వ నామముగాను స్తుతింపబడినది.
20వ శ్లోకము. 185వ నామము. శ్రీనివాసః – **మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాం గతిః**
65వ శ్లోకము. 614వ నామము. శ్రీనివాసః – **శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః**

'శ్రీ' అనగా లక్ష్మీదేవి. క్షీరసాగర మథన సమయమున అవతరించిన లక్ష్మీదేవి నారాయణుని వరించినది. ఆమెను తన వక్షస్థలమున ధరించి ఆయన శ్రీమన్నారాయణుడైనాడు. ఆ అలమేలు మంగమ్మతల్లి నిత్యానపాయినియై, తద్వక్షస్థల నిత్యవాస రసికయై వేంకటరమణుని క్షాంతిసంవర్ధినియై విలసిల్లుచున్నది.

శ్రీ చిన్మయానంద – 'శ్రీ' అనగా సకల శక్తి సంపదలు, కీర్తి, వైభవము, బలము, ధైర్యము, ధర్మము, సృజన, విద్య తదితర గుణసంపద. ఇన్ని సంపదలు ఒకచోట స్థిరముగానుండవు. కనుకనే లక్ష్మీదేవి నితాంత చంచల స్వభావము కలదియని చెప్పుదురు. ఇందుకు అసలు కారణము – అన్నియెడల, అందరియందు దోషములు, తమోగుణము. అజ్ఞానము ఎంతో కొంత ఆవరించి యుండును. కనుక అచట శ్రీదేవి నిలువజాలదు. కాని పురుషోత్తముడు, సచ్చిదానంద స్వరూపుడు, సకల కళ్యాణగుణనిధియైన నారాయణునివద్ద అలాంటి సమస్య లేనందున లక్ష్మీదేవి ఆయన వక్షస్థలమున నిత్యవాసియై యుండును. కనుకనే ఆయన శ్రీనివాసుడు.

పోతన భాగతము – గోపవనితలు శిశువులను చంకలనిడుకొని నందగోపాలునకు ఎదురేగి ఆనంద బాష్పములతో కౌగిలించుకొని స్వాగతించిన విధము.

**సిరి చాంచల్యము తోడి దయ్యుఁ దనకుం జితేశ్వరుండంచు నే**
**పురుషశ్రేష్ఠు వరించె నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులన్**
**గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణ బాష్పంబు లా**
**భరణ శ్రేణులుగాఁ బ్రతిక్షణ నవప్రాప్తాను రాగంబులన్**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'శ్రీ' అనగా శోభ, కీర్తి, ధనము. ఇలాంటి సంపదలు స్వాభావికముగా, అనంతముగా కలిగియున్నందున భగవంతుడు శ్రీనివాసుడగును.

లక్ష్మీనారాయణులు వేరువేరు కాదు. భగవంతుని సకలైశ్వర్య శక్తి శుభ కళ్యాణ లక్షణములే లక్ష్మి. శ్రీదేవియే పరబ్రహ్మమగు నారాయణుడు. వెరసి శ్రీనివాసుడు.

**శ్రీ మేప్పత్తూర్ నారాయణ భట్టాత్రి ప్రణీత శ్రీ మన్నారాయణీయము నుండి (2వ సర్గ) –**

**స్వామి తపస్యానంద వ్యాఖ్యానం. అనుసృజన తాడేపల్లి పతంజలి.**

తత్తాదృజ్ మధురాత్మకం తవ వపుస్సంప్రాప్య సంపన్మయీ
సా దేవీ పరమోత్సుకా చిరతరం నాస్తే స్వభక్తేష్వపి
తే నాస్యా బత కష్ట మచ్యుత విభో త్వద్రూప మానోజ్ఞక
ప్రేమ స్థైర్యమయా దదాచపల బలా చ్చాపల్య వార్తోదభూత్

అటువంటి మధురయుతమైన నీ శరీరమును ఆశ్రయించి సంపన్మయి ఐన లక్ష్మీదేవి పరమమైన ఉత్సాహంతో కూడినదై తన భక్తులయందు ఎక్కువ సేపు నిలబడదు. అయ్యో ప్రభూ! నీ రూప మనోజ్ఞతలయందు ప్రేమబలం ఏర్పడడంచే లక్ష్మికి 'చంచల' అనే అపకీర్తి వచ్చింది.

లక్ష్మీస్తావక రామణీయక హృతేవేయం పరేష్వస్థిరే
త్యస్మిన్న న్యదపి ప్రమాణమధునా వక్ష్యామి లక్ష్మీపతే
యే త్వద్ధ్యాన గుణానుకీర్తన రసాసక్తా హి భక్తా జనా
స్తేష్వేషా వసతి స్థిరైవ దయిత ప్రస్తావ దత్తాదరా

స్వామీ! నీ సుందర రూపానికి ముగ్ధురాలై, పరవశురాలైన లక్ష్మీదేవి – ఏ భక్తులు నీ ధ్యాన గుణ కీర్తన రసమునందు ఆసక్తులై ఉంటారో, ఆ భక్తుల జపతపములందు వినబడు తన భర్త ప్రస్తావనలను విని దయతో ఆ భక్తుల ఇండ్లయందు కూడా వసించుచున్నది. అందువలననే ఆమెకు 'చంచల' అని మాట వచ్చి వుంటుంది.

## 186. సతాంగతిః

- సత్పురుషులకు, ముముక్షువులకు పరమగతియైనవాడు.

### ఓం సతాంగతయే నమః

20వ శ్లోకము. 186వ నామము. సతాంగతిః – **మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాం గతిః**
48వ శ్లోకము. 451వ నామము. సతాంగతిః – **యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాంగతిః**

**ప్రణతానాం ప్రియకరః సతాంగతిః** – శరణాగతులకు ప్రియము చేకూర్చువాడు సతాంగతి.

'సత్' అన్న పదమునకు సన్మార్గమున వర్తించువారని, మోక్షసాధన చేయువారని కూడ అర్థము చెప్పవచ్చును. అట్టివారికి పరమ గమ్యము శ్రీవైకుంఠవాసుడు, పరమాత్ముడు, పురుషోత్తముడు. వారికి గమ్యమే కాదు. దిశ, మార్గము, గమనము కూడ ఆయనే (శ్రీ చిన్మయానంద). శ్రీహరిపట్ల భక్తి కలిగి ఆయనను శరణుజొచ్చినవారికి వేఱు సంపదలు, సాధనములు సమ్మతములు కావు. కనుకనే నరహరిని కీర్తించు నోటితో నరులను శ్లాఘించుటకు అన్నమయ్య నిరాకరించినాడు.

## 187. అనిరుద్ధః

- ఎవరివల్లను, ఎన్నడైనను నిరోధింపబడనివాడు.
- అపరిమిత చేష్టామూర్తి.

### ఓం అనిరుద్ధాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

20వ శ్లోకము. 187వ నామము. అనిరుద్ధః – **అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః**

68వ శ్లోకము. 644వ నామము. అనిరుద్ధః – **అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము

187వనామము – అనిరుద్ధః – నిరోధింపబడనివాడు.

644వనామము – అనిరుద్ధః – వసుభాండము (భూమిపై) జనార్దనునిగా నిత్యము వసించువాడు.

**న నిరుద్ధః అనిరుద్ధః** –నిరోధింపబడజాలనివాడు అనిరుద్ధుడు. భగవంతుని అనిరుద్ధ తత్త్వమును మనము ఎల్లెడల గమనించవచ్చును. సూర్యుడు ఉదయించును, అస్తమించును. అలలు ఎగసి ఎగసి పడును. ప్రకృతి నియమములు జరిగి తీరును. కాలము ఆగదు. అంతా భగవంతుని నియమానుసారము వర్తించి తీరును. ఆయన శాసనము అనివార్యము. ఆయన అనిరుద్ధుడు.

**అనంత చేష్టాయుక్తత్వాత్ అనిరుద్ధ ఉదాహృతః** – ఆయన చేష్టలకు మితి లేదు. భక్తులను రక్షించడానికి అనేకమైన పనులు చేసేవాడు అనిరుద్ధుడు. శ్రీ భట్టులు మూలసంహితమునుండి చెప్పిన ప్రమాణము – **అపరిమిత చేష్టో భగవాన్ అనిరుద్ధః.**

ధర్మ చక్రము రచయిత వివరణ – కృష్ణుని నిరోధించుటకు కంసుడు ఎన్నో యత్నములు చేసెను. కృష్ణుని పుట్టుకకు ముందునుండి మొదలుపెట్టెను. అయినా కృష్ణుని అవతరణము, కంసుని మరణము తప్పలేదు. భగవంతుని భక్తులకు రక్షణ తథ్యము. భగవంతుని శత్రువులను రక్షించగలిగినవారు లేరు.

**188వ నామము నుండి 199వ నామము వరకు - సురానందః, గోవిందః, గోవిదాం పతిః, మరీచిః, దమనః, హంసః, సుపర్ణః, భుజగోత్తమః, హిరణ్యనాభః, సుతపః, పద్మనాభః, ప్రజాపతిః – నామములు భగవానుని హంసావతారమును సూచించునవని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

## 188. సురానందః

- దేవతలకు ఆనందమును ప్రసాదించు దేవదేవుడు.

### ఓం సురానందాయ నమః

**సురాన్ ఆనందయతి ఇతి సురానందః** – దేవతలను ఆనందింపజేయువాడు సురానందుడు.

'సు'-మంచి, 'రా'-ఇచ్చుట. లోకములకు మంచి (క్షేమము) చేయువారు సురులు (దేవతలు). భగవంతుడొసగిన శక్తి సామర్థ్యముల వల్ల, భగవంతునిచే నియమింపబడిన కార్యములు చేయుచు దేవతలు లోకములకు క్షేమము కూర్చుచున్నారు. అలాంటి దేవతలకు

మేలు, రక్షణ, ఆనందము శ్రీహరివల్లనే కలుగును. ఆయన కృపవల్లనే వారు పాలకడలిని చిలికి అమృతమును పొందగలిగారు. వారికి కలిగిన ఇక్కట్లను తొలగించి వారిని కాచు ప్రభువు శ్రీమన్నారాయణుడే. దేవతల శక్తికి ఆధారము, దేవతల ఆనందమునకు ఆలవాలము ఆ ప్రభువే.

దివ్య ప్రబంధములలో తరచుగా కీర్తింపబడిన హంసావతారమును ఈ నామవివరణలో శ్రీ భట్టులు ఉదాహరించారు. అజ్ఞానము వల్ల, మోహమువల్ల లోకములు అంధకారములో మునిగిపోయినపుడు బ్రహ్మ, సనక సనందనాదులు శ్రీమన్నారాయణుని ప్రార్థించారు. ఆయన హంస రూపంలో ప్రత్యక్షమై వారికి సత్యమును ఉపదేశించెను. హంస నీటిని పాలను వేరు చేసే విధంగా భగవంతుడు మంచి చెడుల విచక్షణను దేవతలకు ప్రసాదించాడు. శ్రీమద్భాగవతము 11వ స్కంధము 13వ అధ్యాయము పూర్తిగా హంసావతారమును గూర్చి చెబుతుంది.

**శ్రీ మద్భాగవతము – ఏకాదశ స్కంధము – 13వ అధ్యాయము – హంసావతారము**

http://srimad.org/wp/ నుండి. (శ్రీ మధ్వాచార్యుల 'భాగవత తాత్పర్య నిర్ణయము' ఆధారంగా శ్రీ వసంత మాధవపాయ్ గారు భాగవతము 11వ స్కంధమును ఆంగ్లంలోకి అనువదించారు. ఆ ఆంగ్లపాఠం యొక్క నా తెలుగు అనువాదం ఇక్కడ వ్రాస్తున్నాను – కా.సు. బాబు)

భగవంతుడు దివ్య హంస స్వరూపమున ఏతెంచి, సనక సనందనాదులకు ఒనరించిన ఉపదేశము – ధర్మమార్గమున చరించి రజస్తమోగుణములను అధిగమించు ఉపాయము – మోహమును విడనాడి అజ్ఞానమును పారద్రోలు ఆవశ్యకత --



హంసావతారము . 1720 కాలపు చిత్రం.
చంబ ప్రాంతపు మహేష్ చిత్రించినది కావచ్చును.
వికీపీడియా నుండి.

ముందుగా, సత్వగుణ ప్రధానమగు ధర్మమునాచరించి, క్రమముగా రజోగుణమును, తమోగుణమును జయింపవలెనని భగవంతుడు ఉద్ధవునకు ఉపదేశించెను. ఏదైనా గుణము వృద్ధియగుటకు పది ప్రధాన కారణములున్నవి. అవి – శాస్త్రములు, నీరు, జనులు, స్థలము, కాలము, వృత్తి, జన్మము. మనోవాంఛితము, మంత్రము, యజ్ఞకర్మలు.

తత్వవిదులైనవారు ప్రశంసించునది సాత్వికము. వారిచే నిరసింపబడునది తామసికము. మరియు వారు తటస్థముగానుండు గుణము రాజసము. వెదురు పొదల రాపిడి వల్ల ఉత్పన్నమైన అగ్ని ఆ వెదురు పొదలను దహించిన పిమ్మట అణగారును. అట్లే సత్వగుణాధిక్యము వలన ప్రకాశవంతమైన జ్ఞానము బాహ్యేంద్రియములను (జ్ఞాన సాధనములను) అణచివేసి, పిదప సమత్వ భావనమున విలీనమగును.

ఉద్ధవుడు భగవంతుని ఇట్లు ప్రశ్నించెను – ఇంద్రియ సౌఖ్యములు దుఃఖహేతువులని, ఆపత్తులకు మూలమని తెలిసి కూడ మానవులు అట్టి సుఖములయందు మోహితులై ఏల వర్తించెదరు?

అందులకు భగవంతుని సమాధానము – మాయామోహితమైన జీవుల హృదయములందు వికార పూరితమైన 'అహం'భావము రజోగుణమును పెంపొందించును. ఇది మనస్సునావరించి దుఃఖములకు కారణమగును. రజోగుణము వలన వస్తువుల ననుభవించు భావము కలుగును. అందుండి అనుభవించు మార్గముపై మనస్సు నిమగ్నమగును. తద్వారా నియంత్రింప శక్యము గాని కామము

జనించును. ఇట్లు రజోగుణ ప్రభావితుడై, కామ ప్రేరేపితుడై, ఇంద్రియ నిగ్రహమును కోల్పోయి జీవుడు చేయు కార్యములు దుఃఖమునకు కారణమగును.

విషయ వ్యామోహమును జయించుటకును, ఇంద్రియములను నిగ్రహించుటకును, రజోగుణమును నియంత్రించుటకును ప్రాణాయామాది యోగముల ద్వారా మనమును ప్రశాంతపరచుచు భగవంతునిపై నిలుపనగును. ఇదే విషయమై భగవంతుడు సనక సనందనాదులకు యోగోపదేశము కావించెను.

సనక సనందనాదులు బ్రహ్మను ఇట్లు ప్రశ్నించిరి – మనస్సు, ఇంద్రియములు ఒకదానినొకటి పెనవేసికొని జీవుని మోహములో బంధించుచున్నవి. అట్టి పరిస్థితిలో ఇంద్రియ వ్యామోహమునుండి మనసును విడదీసి, భవ సాగర తరణమునకు సిద్ధము చేయుట ఎట్లు సాధ్యము?

ఇదే ప్రశ్నకు సమాధానము కొఱకు బ్రహ్మ నారాయణుని ప్రార్థించెను. అప్పుడు నారాయణుడిచ్చిన ఉత్తరము – మనస్సు విషయవాసనలందు మగ్నమై ఇంద్రియముల చెప్పుచేతలకు లోబడును. మనస్సునకు, ఇంద్రియములకు కూడ పరమాత్ముడే అధిపతి. కనుక మనస్సును భగవంతునివైపు మరల్చినట్లయితే విషయ వ్యామోహము నశించి ఇంద్రియములు నిగ్రహింపబడును.

జాగ్రదవస్థ (మెళకువ), స్వప్నావస్థ (కలత నిదుర), సుషుప్తి అవస్థ (గాఢనిద్ర) అనునవి ప్రకృతి జనితమగు అవస్థలు. ఇందు సుషుప్తి అనునది తమోగుణ ప్రధానమైనది. స్వప్నావస్థయందు రజోగుణము ముఖ్యము. జాగ్రదవస్థ సత్వగుణ వర్ధకము. ఈ మూడింటికంటే జీవుడు వేరు. ఈ మూడు అవస్థలకు జీవుడు సాక్షియనవచ్చును. ఈ మూడు గుణములు జీవుని సంసారమున బంధించుచున్నవి. కనుక సంసారముయొక్క క్షణిక లక్షణమును గ్రహించి, సకల భయములను పారద్రోలి, జీవుడు నాలుగవదైన తురీయావస్థను (ఆత్మ సమాధి స్థితిని) సాధింపవలెను. ఇందుకై మోహమును విడనాడి, విరుద్ధ భావములను త్యజించి సమత్వ బుద్ధిని సాధింపవలెను.

బ్రహ్మాది దేవతలందరు శ్రీహరియొసగు శక్తిపైననే ఆధారపడి యున్నారు. శ్రీహరి ఒక్కడే దేవదేవుడు, సర్వేశ్వరుడు. ఆ శ్రీహరియే తన విశ్వ, తైజస, ప్రజ్ఞ స్వరూపములలో సకల జీవులకు మూడు అవస్థలలో వేర్వేరు అనుభవములను కలుగజేయుచున్నాడు. ఇది గ్రహించి జీవులు ఇంద్రియములను నిగ్రహించి, కామమును త్యజించి, దుష్కర్మములకు దూరముగానుండవలెను. తద్వారా ప్రశాంతమైన మనమును శ్రీహరి ధ్యానముపై మగ్నము చేయవలెను. ఆ విధముగా జీవుని నిజతత్వము, పరమాత్మతోడి సంబంధము తెలియుటయు, శరీరమే 'నేను' అను అజ్ఞానము నశించుటయు జరుగును. అట్టివారు దేహమును ధరించుట, విసర్జించుట పట్ల మమకారమును త్యజింతురు. ఇదే సాంఖ్యము, యోగముల రహస్యము – అని భగవానుడు సెలవిచ్చెను.

## **189.** గోవిందః

- దేవతలచే ప్రస్తుతింపబడు దేవదేవుడు.
- మహార్ణవమునుండి భూమిని పైకెత్తి కాపాడినవాడు. శ్రీవరాహమూర్తి.
- గోవులను కాచేటి గోపాలుడు.
- వేదముల నొసగిన, వేదముల ద్వారా పొందదగినవాడు. వేదవేద్యుడు.

### ఓం గోవిందాయ నమః

శ్రీసీతారామచంద్రా! గోవిందా! గోపాలా! వేంకటరమణా! గురువాయూరప్పా! శ్రీలక్ష్మీనారసింహస్వామీ! త్రివిక్రమా! జనార్దనా! శరణు శరణు! శ్రీ సత్యనారాయణా! శ్రీదేవీ భూదేవీ సమేత శ్రీవరాహమూర్తీ! శ్రీనివాసా! శ్రీవేంకటేశా! పాహి పాహి!

మరల గోవింద నామము 58వ శ్లోకములో వస్తుంది.

20వ శ్లోకము. 189వ నామము. గోవిందః – **అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః**
58వ శ్లోకము. 543వ నామము. గోవిందః – **మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ**

'గో' శబ్దానికి భూమి, గోవు, వాక్కు, వేదము అని వివిధ అర్థములున్నాయి. ఈ ధాతువునుండి 'గవామ్', 'గామ్' అనేధాతువులు ఉత్పన్నములు. 'విద్' అనగా లభించుట, కనుగొనుట. ఇందునుండి 'వింద' శబ్దము వస్తుంది.

**గవామ్ విందః గోవిందః** – స్తుతి వాక్కులను స్వీకరించువాడు గోవిందుడు. శ్రీహరియే సురానందుడు గనుక దేవతలకు జ్ఞానము నుపదేశించును. వారికి శ్రేయము కూర్చును. వారికి మార్గము చూపును. మరియు బ్రహ్మాది దేవతలొనరించు స్తుతివాక్యములను స్వీకరించి ప్రసన్నుడగును. కనుక ఆ దేవదేవుని, శ్రీవేంకటేశ్వరుని 'గోవిందుడు' అని స్మరించి భక్తులు తరింతురు.

**గామ్ అవిందత్ గోవిందః** – భూమిని మహాసాగరమునుండి ఉద్ధరించినవాడు గోవిందుడు.
**నష్టామ్ వై ధరణీమ్ పూర్వమ్ అవిందమ్ వై గుహాగతమ్**
**గోవింద ఇతి తేనాఽహమ్ దేవైర్వాగ్భిరభిష్టుతః** – మహాభారతము. శాంతిపర్వము. 330.5
సాగరగర్భమున (అసురునిచే) దాచబడిన భూమిని లేవనెత్తినందున దేవతలు, శృతులు నన్ను 'గోవింద'యని స్తుతింతురు.
ఈ భావము యొక్క ప్రాముఖ్యతను ధర్మచక్రము రచయిత వివరముగా తెలిపారు. సమస్త లోకములను, జీవులను సంపూర్ణముగా నెఱిగినవాడు శ్రీనివాసుడే.

**గావో వేద వాణ్యో విందన్తి లభన్తే, యత్ర వా అవిష్ఠన్తే స గోవిందో భగవాన్ విష్ణుః** – వేదపారాయణము వలన లభించువాడు, వేదములకు నిలయమైనవాడునగు విష్ణుభగవానుడే గోవిందుడు.

**గౌరేషా తు యతో వాణీ తామ్ చ విందయతే భగవాన్**
**గోవిందస్తు తతో దేవ! మునిభిః కథ్యతే భగవాన్** – హరివంశము 3.88.50
ఇక్కడ 'గౌ' అనగా వాక్కు, వాణి. అన్ని వాక్కులయందు వ్యాపించి, వానికి శక్తిని ప్రసాదింతువు గనుక మునులు నిన్ను గోవిందుడనియెదరు.

గోవులను కాచు గోపాలుడు గనుక గోవిందుడగును. ఇందుకు కూడ ఆధారము హరివంశమునుండి చెప్పారు.
**అహమ్ కిలేంద్రో దేవానామ్ త్వమ్ గవామ్ ఇంద్రతామ్ గతః**
**గోవింద ఇతి లోకాస్త్వామ్ స్తోష్యన్తి భువి శాశ్వతమ్** – హరివంశము 2.19.45
నేను దేవతలలో ముఖ్యుడనైన ఇంద్రుడను. నీవు గోవులకధిపత్యము వహించితివి. కనుక భువిలో జనులెల్లపుడు నిన్ను 'గోవిందా' యని స్తుతింతురు. – ఆయన గోవుల కాపరి. బృందావన విహారి. గోపీజన మనోహారి. మురళీగానలోలుడు. గోపాలుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – పాలు, పెరుగు, వెన్న, నెయ్యి వంటి పదార్థములు నిత్య జీవితములో ఆహారముగాను, యజ్ఞాదికములందు హవ్యములుగాను ఎంతో ప్రాముఖ్యము గలవని మనము గమనింపనగును. ఆయన గోపాలుడయినందున జీవులకాధారము. యజ్ఞమునకు సాధనము. యజ్ఞమునకు భోక్త.

శ్రీ శంకరుల విష్ణు సహస్ర నామ వ్యాఖ్యానమును అనువదించిన శ్రీ అనంతకృష్ణశాస్త్రిగారు 'గో+విద్' శబ్ద సముదాయమునకు 10 అర్థాలను ఇచ్చారు.

1. గో – స్వర్గము → స్వర్గములను అధిగమించినవాడు.
2. గో – బాణములు → సకల శస్త్రాస్త్ర ప్రవీణుడు.
3. గో – ఆవులు → పశుగణమునకు పాలకుడు.
4. గో – వాక్కు → వేదములద్వారా తెలియబడువాడు.
5. గో – పిడుగు (మెరుపు) → పాదములపై వజ్ర చిహ్నములు గలవాడు.
6. గో – లోకములు → అన్ని లోకములందు విఖ్యాతుడు (పూజింపబడువాడు).
7. గో – కన్నులు → అందరియందు అంతర్యామియైన సాక్షి, దృష్టి.
8. గో – సూర్యుడు → సూర్య మండలాంతర్వర్తి.
9. గో – భూమి → సాగరమునుండి భూమిని ఉద్ధరించినవాడు.
10. గో – నీరు → జలములే నిలయమైనవాడు – నారాయణుడు.

## 190. గోవిదాం పతిః

- వేదార్థముల నెఱిగిన జ్ఞానులకు రక్షకుడు.

### ఓం గోవిదాం పతయే నమః

**గావో వేదగిరః ప్రోక్తాః గోవిందస్తత్సుపాలనాత్ గోవిందా పతిరుద్దిష్టో వేదవిద్వత్తుదో మనుః** - గోవులు అంటే వేదవాక్కులు. వానిని రక్షించువాడు గోవిందుడు. ఈ నామము వేదవిద్వత్తును ప్రసాదించు మహామంత్రము. 'గో-విద్' అనగా 'వేదములు తెలిసినవారు' అని ఇంతకుముందు 'గోవింద' నామవివరణ ప్రకారమగానే గ్రహించవచ్చును. 'పతి' అనగా నాయకుడు, రక్షకుడు అని అర్థములు గలవు. కనుక వేదాధ్యయనము చేయువారికి ఆ వేదవిదుడు, వేదవేద్యుడు నాథుడగును.

ఇక్కడ మనము స్మరించి పరవశింపదగిన విషయము – సమస్త జ్ఞానమునకు గోవిందుడే మూలము. జ్ఞానార్జనకు గోవిందుడే ఆధారము. జ్ఞానమువల్ల మనకు గోవిందుడే అందివచ్చును.

'గో' అనగా వాక్కు, భూమి, గోవులు – ఇలా వివిధ అర్థములు ఉన్నాయని ఇంతకుముందే చెప్పుకొన్నాము. ఈ అర్థముల ఆధారముగా 'గోవిదాంపతి' పుణ్య నామమునకు మరిన్ని మనోహరమైన భావములు స్ఫురిస్తాయి. భగవంతుడు పశుపక్ష్యాది సకల జీవజాలమునకు భాషనొసగినవాడు. విశ్వతత్వము నెఱిగిన మహానుభావులకు ముఖ్యుడు. భూనాథుడు. గోనాథుడు. గోపాలబాలుడు. గోపీజన ప్రియుడు.

(శ్రీ ఎమ్. శ్రీనివాసన్ గారు అందించిన ఆధారములు ఈ వివరణకు ఉపయోగపడినవని శ్రీకృష్ణమాచారిగారు కృతజ్ఞతలు తెలిపారు.)



అట్లాంటాలో శ్రీ వెంకటేశ్వర మందిరం



## మరీచిర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః |
## హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతి: || (21)

### 191. మరీచిః

- కాంతి కిరణము, తేజోమయుడు.

**ఓం మరీచయే నమః**

**అంధేభ్యోఽపి చ జంతుభ్యోః హంసగ్రీవావతారతః ప్రకాశిత స్వరూపత్వాత్ మరీచిరితి కథ్యతే -** గ్రుడ్డివారికి కూడా నిర్మలమైన హంసావతారముతో తన రూపమును ప్రకాశింపజేయువాడు.

'మరీచి' అనగా కిరణము. భగవంతుడు భౌతికమగు కన్నులకు (చర్మచక్షువులకు) కానరాడు. కాని భక్తుల భక్తినేత్రములకు శ్రీమన్నారాయణుడు కిరణమై దర్శనమొసగును అని శ్రీభట్టులు వివరించారు. వ్రతముల వలన, క్రతువుల వలన, శక్తియుక్తులవలన చిక్కనివాడు భక్తికి మాత్రము తనంత తాను పట్టుబడును. భక్తులకు భగవంతుని వెదుకనవసరము లేదు. ఆయనే వారికి దర్శనమిచ్చును.

ధర్మచక్రము రచయిత – భగవంతుని 'మరీచి' గుణము మనకు ధ్యాన మార్గమును ఉపదేశించును. ముందుగా ఇంద్రియములను నియంత్రించి, శారీరక శక్తిని మానసిక శక్తిగా మలచుకొనవలయును. ఆపై మనస్సును నియంత్రించి ఈ శక్తిని వెలుతురుగా చేసికొని, ఆ వెలుతురులో ధ్యానమును సాగించవలెను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఇదే నామమునకు మరొకవిధముగా అర్థము చెప్పారు. 'మృ' – ప్రాణత్యాగే -మరణించుట, నశించుట – అనే మూలమునుండి, 'మరీచి' అనగా 'నాశనము చేయువాడు' అని అర్థము. లయ కారకుడైనందున ఆయన 'మరీచి'యగును. సృష్టి, స్థితి, లయములను మూడును భగవంతుని కార్యములే.

గీత 2.25 – **జాతస్య హి ధ్రువో మృత్యుః, ధ్రువమ్ జన్మ మృతస్య చ** – పుట్టినివానికి మరణము నిశ్చయము. మరణించిన పిదప మరల జన్మయును నిశ్చయమే.
అధర్వ వేదము 5.24.13 – **మృత్యుః ప్రజానామ్ అధిపతిః**

### 192. దమనః

– సంసార భారమును తొలగించి, బంధవిముక్తి నొసగువాడు.
– అధర్మ మార్గమున చరించువారిని దండించి, శిక్షించువాడు.

**ఓం దమనాయ నమః**

**దమయతి ఇతి దమనః** – హరించువాడు దమనుడు.

శ్రీ భట్టులు 'మరీచిః' నామము వివరణను ఇంకొంత ముందుకు నడిపి, 'దమనః' నామమును వివరించారు. శ్రీమన్నారాయణుడు కాంతిమయుడు గనుక అజ్ఞానాంధకారములో, మాయామోహితులై, సంసారబంధమున కొట్టుమిట్టాడు భక్తులకు తరణోపాయమును చూపి వారిని భవపాశములనుండి విముక్తులను చేయును. **భవతాపస్య దమనాత్ కాన్త్యా దమన ఈరితః** – తనయొక్క చల్లని కరుణచేత (కాంతి అనే చల్లని గంగాప్రవాహము చేత) భవతాపమును నాశనము చేయువాడు దమనుడు. తమస్సునకు, అసత్యమునకు, మృత్యువునకు ఆయన దమనుడు. సచ్చిదానందమార్గమును తెలియజేయు మరీచి.

శ్రీ శంకరులు 'దమ్' – ఉపశమే – నెమ్మది పరచుట – అనే భావంలో 'దమనః' అనగా 'అణచివేయువాడు, శిక్షించువాడు' అని వ్యాఖ్యానించారు. **స్వాధికారాత్ ప్రమాద్యతః ప్రజాః వైవస్వాది రూపేణ దమయితు శీలమ్ యస్య స దమనః** – తమయొక్క కర్తవ్యమునుండి విముఖులైన ప్రజలను తాను యముడు మొదలైన రూపములలో శిక్షించే లక్షణము కలవాడు దమనుడు. భగవంతుడు పెక్కు విధములుగా అధర్మపరులను శిక్షించును. రాజుగా నేరస్తులను శిక్షించును. నొప్పి, దుఃఖము, భయము, మరణము – ఇవన్నీ జనులలోని విపరీత వర్తనమును అదుపుచేయు సాధనములు.

ధర్మ చక్రము రచయిత ఇదే భావమును మరొక కోణంలో చెప్పారు. (ఆహార వ్యవహారములలో) సాత్విక మార్గమును వదలినవారికి వ్యాధులు, బాధలు సంభవించును. అలా వ్యక్తులను సన్మార్గమున నడపించు ముండ్లకంచెయే ఈ దమనము.

భగవంతుని అవతారములలో ఆయన దుష్ట శిక్షకుడని విశదముగా తెలియుచున్నది.

## 193. హంసః

– హంసవంటి గుణములు కలవాడు. హంసావతరమును ధరించినవాడు. '**సోऽహమ్**' అని చాటిచెప్పు పరబ్రహ్మము. అన్ని శరీరములందలి అంతర్యామి.

### ఓం హంసాయ నమః

నీటినుండి పాలను వేరు చేసి, పాలను మాత్రమే స్వీకరించుట హంస లక్షణము. ఇంకా స్వచ్ఛత, అందము, అందమైన నడకలకు హంస ప్రసిద్ధము. అదే విధముగా భగవంతుడు కేవలము మంచితనమునకు ఆలవాలము. మంచి కానిది ఆయన దరి చేరదు. భగవంతుని సంకల్పము, వాక్కు, కార్యము సదా సుందరము. శుద్ధము. కనుక 'హంస' నామమున శ్రీహరిని నుతింపనగును.

భగవంతుని హంసావతారము గూర్చి 'సురానందః' నామమున వివరించడమైనది. ఈ 'హంస' నామము కూడ బ్రహ్మాదులకు జ్ఞానమునుపదేశించిన పుణ్యావతారముగా చెప్పవచ్చును.

శ్రీ శంకరుల వ్యాఖ్యను అద్వైతపరముగా అన్వయింపవచ్చును. '**సోऽహమ్**' లేదా '**అహమ్ సః**' అనే సూక్తి అద్వైతవాదమున తరచుగా చెప్పబడినది. నేనే బ్రహ్మమును - **సోऽహమ్** – అని గ్రహించినవానికి సంసార భయమును పోగొట్టువాడు గనుక పరమాత్ముడు హంసయగును. 'హన్-స'. 'హన్'-నాశనము చేయుట 'స'-సంసార బంధన భయములు.

నాలుగు వేదాలలోనూ నాలుగు మహావాక్యాలున్నాయి.

1. **ప్రజ్ఞానం బ్రహ్మ** – ఐతరేయోపనిషత్తు – ఋగ్వేదము.
2. **అహం బ్రహ్మాస్మి** – బృహదారణ్యకోపనిషత్తు – శుక్లయజుర్వేదము

3. **తత్త్వమసి** – ఛాందోగ్యోపనిషత్తు – సామవేదము
4. **అయమాత్మా బ్రహ్మ** – మాండూక్యోపనిషత్తు – అధర్వణ వేదము

ఈ వాక్యాలలో చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమేని, ఆ పరమేశ్వరుడను నేనే (నీయందే ఉన్నాడు) అని చెప్పబడింది. తమ ఉపన్యాసములో శ్రీ కృష్ణప్రేమి ఒక పిట్టకథను చెప్పేవారు. ఒక శిష్యుడు వేదాంతజ్ఞానము కొరకు ఒక అద్వైతాచార్యుని వద్దకు, ఒక విశిష్టాద్వైతాచార్యునివద్దకు మార్చి, మార్చి వెళ్ళినాడట. వారు ఇలా చెప్పారట.

అద్వైత గురువు – **సోऽహమ్** (సః + అహమ్)

విశిష్టాద్వైత గురువు – **దాసోऽహమ్**

అద్వైత గురువు – **సదాసోऽహమ్**

విశిష్టాద్వైత గురువు – **దాసదాసోऽహమ్**

'స', 'ద' అక్షరములు చేర్చి ఇలా తత్త్వమును ఉపదేశించుట విచిత్రము.

'హంస' నామమునకు మరొక వ్యాఖ్య – **హన్తి గచ్ఛతి సర్వ శరీరేషు ఇతి వా హంసః** – సకల శరీరములందు నివసించి చరించువాడు 'హంస'.

## 194. సుపర్ణః

- చక్కనైన రెక్కలుగలవాడు. గరుత్మంతుడు. హంస.
- యోగులు సంసార సాగరమును దాటుటకు సహకరించేవాడు.
- ఏదైనా కదలడానికి శక్తినిచ్చేవాడు.
- వేద స్వరూపుడు (సంసారమనే అశ్వత్థ వృక్షానికి వేదములే ఆకులు – గీత)
- పచ్చని తులసి ఆకులచే అలంకృతుడైనవాడు.
- శ్రీలక్ష్మీదేవి సాన్నిధ్యం కారణంగా పచ్చని రంగు గలవాడు.
- శుద్ధమైన భక్తిచే సంతోషించువాడు.
- పరమానంద నిలయుడు (సు-పర్-ణః)
- ప్రళయకాలంలో చక్కని మఱ్ఱి ఆకుపై శయనించినవాడు.
- విశ్వమంతా పూర్తిగా వ్యాపించియున్నవాడు.
- సుపర్ణుడైన గరుడుని వాహనముగ కలిగినవాడు.



గరుడునిపై అధిరోహించిన విష్ణువు – బ్యాంగ్‌కాక్‌లో విగ్రహము.

**వికీపీడియానుండి.** Photo by Hdamm

https://commons.wikimedia.org/wiki/File:Garudabkkholidayinn0609.jpg

### ఓం సుపర్ణాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

21వ శ్లోకము. 194వ నామము. సుపర్ణః – **మరీచిర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః**

91వ శ్లోకము. 859వ నాము. సుపర్ణః – **ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

పర్ణములనగా పక్షిరెక్కలు. అందమైన, శుభప్రదమైన, దృఢమైన రెక్కలు కలిగిన పక్షిరూపుడని ఈ నామమునకు అర్థము. ఇదే అర్థమును వివిధ భావాలలో అన్వయించారు.

శ్రీమద్భాగవతము (1.16.15)లో భగవంతుడు ఇలా చెప్పాడు – **సిద్ధేశ్వరాణామ్ కపిలః సుపర్ణోఽహమ్ పతత్రిణామ్** – సిద్ధులలో నేను కపిలుడను. పక్షులలో నేను గరుడను. భగవద్గీత (10.29)లోనూ ఇదే విషయం ఉన్నది – **మృగాణామ్ మృగేంద్రోఽహమ్ వైనతేయశ్చ పక్షిణామ్** – మృగములలో నేను సింహమును. పక్షులలో వినతాసుతుడగు గరుత్మంతుని.

కనుక 'సుపర్ణ' అనగా గరుత్మంతుడనీ, అన్నింటిలోకి ఉత్తముడనీ చెప్పవచ్చును. ఇంకా ఇంతకుముందు నామమైన 'హంస' అవతారమునకు కూడ (సుందరమైన రెక్కలుగలవాడు) అన్వయింపవచ్చును.

**శోభన పర్ణత్వాత్ సుపర్ణ ఇతి కథ్యతే సంసారపార నయనాత్ సుపర్ణ ఇతి వా మతః** - సంసారసాగరమును దాటించుటకై చక్కనైన రెక్కలతో వచ్చి భక్తులను ఆ దరికి మోసుకొని పోవును గనుక ఆయన సుపర్ణుడగును.
ముండకోపనిషత్తు (3.1) లో జీవాత్మ, పరమాత్మలను వివరించు వర్ణన సుప్రసిద్ధము.

**ద్వా సుపర్ణా సాయుజా సఖాయా సమానమ్ వృక్షమ్ పరిష్వజతే**
**తయోరన్యః పిప్పలమ్ స్వాదన్తి అనశ్నమ్ అన్యో అభిచాకశీతి**
ఒకే చెట్టుపై రెండు చక్కనైన పక్షులు (సుపర్ణములు) ఉన్నవి. అందు ఒక పక్షి (రావి)పండును భుజించుచున్నది. రెండవ పక్షి కేవలము చూచుచున్నది. రెండు పక్షులు అత్యంత స్నేహము కలిగినవి.

ఇక్కడ శరీరమే వృక్షము. దానిపైన మొదటి పక్షి 'జీవుడు'. రెండవ పక్షి 'ఈశ్వరుడు'. సంసారమునందలి కర్మఫలమే పండు. జీవాత్మ కర్మఫలమునననుభవించును. పరమాత్మ సంగరహితుడు, సాక్షిమాత్రుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి గారు మొదటి పక్షిని మహాభోగి (పేరింబమ్) అనీ, రెండవ పక్షిని మహాజ్ఞాని (పేరఱివు) అనీ చెప్పారు. రెండవ పక్షిని 'సుపర్ణ' నామము ద్వారా గ్రహింపనగును.

(మరింత వివరణ 859వ నామమునకు చెప్పబడినది.)

## 195. భుజగోత్తమః

- ఆదిశేషునకు ప్రభువు.
- సర్పములలో ఉత్తముడు. (అనంతుడు, వాసుకి)
- వ్యాపనము, చలనము కలిగినవానిలో ఉన్నతుడు (సర్వవ్యాపి)

### ఓం భుజగోత్తమాయ నమః

**భుజేన గచ్ఛన్తి ఇతి భుజగాః** – (కాళ్ళతో కాక) భుజములతో కదలునది భుజగము. 'ఉత్తమ' అనగా పైస్థానమున ఉన్నవాడు, ప్రభువు. 'భుజగోత్తమ' అనగా భుజగములలో శ్రేష్ఠుడు.

భగవద్గీతలో '**సర్పాణామస్మి వాసుకిః**' అనియు (10.28), మరియు '**అనంతశ్చాస్మి నాగానాం**' అనియు (10.29) భగవానుడు సెలవిచ్చెను. వాసుకి సర్పములకు రాజు, భగవద్భక్తుడు. కనుక సర్ప శ్రేష్ఠుడు. ఆదిశేషుడు (ఆనంతుడు) నాగజాతికి ప్రభువు. వేయి పడగలవాడు. శ్రీమహావిష్ణువునకు శయ్యగానుండి అనవరతము ఆయనను సేవించును. భగవంతునకు పరమభక్తుడు. పెక్కు పర్యాయములు ఆయనకు తోడుగా అవతారములను దాల్చి భగవల్లీలలయందు పాలు పంచుకొన్నవాడు. ఇతడు భగవానునినుండియే ఉద్భవించెను.

'భుజగోత్తమ' నామమునకు శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు ఇచ్చిన వివరణ మిగిలిన వ్యాఖ్యానాలకంటె కొంత వైవిధ్యము కలిగియున్నది. ఇందుకు వారు వ్యాకరణమునుండి, శ్రుతులనుండి పెక్కు ఆధారములు చూపారు. 'భుజ్' అనే ధాతువునకు వంగుట, మలుపు తిరుగుట (కౌటిల్యే) అనే అర్థములు ఉన్నాయి. వంగునవి, మలుపు తిరిగినవి (అనగా విస్తరించినవి) అయినవానిలో అత్యుత్తముడు గనుక భగవానుడు భుజగోత్తముడు. ఆయన చరించని ప్రదేశము, చొరరాని చోటు లేదు. పక్షులు, గాలి, విమానములు, రాకెట్లు ఏవయినా సరే. వాని చలనశక్తికి ఆధారము భగవంతుడు.

ఆయన ఆదిశేషునకు ప్రభువు. శేషాద్రిపై వెలసిన శ్రీనివాసుడు. శేషశాయియైన శ్రీరంగనాథుడు. శ్రీరామానుజులచేత నుతింపబడిన శ్రీమహావిష్ణువు.

## 196. హిరణ్యనాభః

- బంగారమువంటి, కళ్యాణప్రదము, మనోహరమునగు నాభియందు చతుర్ముఖ బ్రహ్మకు ఆధారమైనవాడు.

### ఓం హిరణ్యనాభాయ నమః

హిరణ్యమనగా బంగారము. శ్రీమహావిష్ణువు బొడ్డు బ్రహ్మకు జన్మ స్థానము. ఆ చతుర్ముఖ బ్రహ్మయే చతుర్వేద జ్ఞాని. సకల జీవరాశులను సృష్టించి, శ్రీమన్నారాయణుని సేవించు భాగ్యము కలిగినట్టి మహానుభావుడు. అట్టి బ్రహ్మకు జన్మస్థానమైన నాభి కలిగినందున విష్ణువే హిరణ్యనాభుడు.

## 197. సుతపాః

- అత్యుత్తమ జ్ఞానమునకు ఆలవాలము.
- మూర్తీభవించిన తపస్సు.
- బదరికాశ్రమమున తపస్సును ఆచరించినవాడు.

### ఓం సుతపసే నమః

'తపస్సు' అనగా 'జ్ఞానము' అనే అర్థంలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. సకల విద్యలు, యోగములు, జ్ఞానము, విజ్ఞానము జనార్దనుని అధీనములోనుండును గనుక ఆయన సుతపస్వి.

శ్రీ శంకరులు మహాభారతము (12.242.4) నుండి ఉదాహరించారు. **మనశ్చేంద్రియాణామ్ చ హ్యైకాగ్ర్యమ్ పరమమ్ తపః** – మనస్సును, ఇంద్రియములను, బుద్ధిని ఏకాగ్రము చేయుటయే తపస్సు. ఇట్టి తపోసాధన భగవంతుని అనుగ్రహమువలన కలుగును. దానివలన బ్రహ్మజ్ఞానము కలుగును.

శ్రీ చిన్మయానంద గారు ఉపనిషత్తులనుండి ఉదాహరించారు. **స తపః తప్త్వా ఇదమేతదసృజత్** – ఆయన తపమాచరించెను (సంకల్పించెను). తపము చేసి ఇదంతా సృజించెను.

అన్ని బలములకంటె తపోబలము అత్యంత శక్తివంతమైనదని వివరిస్తూ ధర్మచక్రము రచయిత పెక్కు ఉదాహరణలు ఇచ్చారు. వశిష్ఠుని తపోబలము ముందు విశ్వామిత్రుని సైన్యము నిర్వీర్యమయ్యెను. పిదప తపమువల్లనే విశ్వామిత్రుడు బ్రహ్మజ్ఞానము పొందగలిగెను. తపస్సు ద్వారానే ధ్రువుడు వాసుదేవుని అనుగ్రహమును, నిశ్చల తారాస్థానమును పొందెను. ఇట్టి తపస్సు భగవానుని స్వరూపము. తపోరూపమున భగవానుడు భక్తులకు కార్యసిద్ధి, సంకల్పసిద్ధి చేకూర్చును. కనుక ఆయన సుతపస్వి.

తాపసులకు దిక్కు. స్వయముగా మహాతపస్వి. బదరికాశ్రమమున నరనారాయణులుగా సుదీర్ఘకాలము భగవానుడు తపమునాచరించెను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు 'తప్' అనగా 'భరించుట' (క్లేశమును సహించుట) అనే అర్థంలో వ్యాఖ్యానించారు. తల్లి నవమాసములు బిడ్డను గర్భమున మోసి, ప్రసవ వేదన సహించి, బిడ్డకు జన్మనిచ్చి పెంచుటయే తపస్సు. సూర్యాదుల వేడిమిని భరించి, మనుష్యులకు తగినంత వేడిమిని మాత్రమే భూమికి అందజేయుట తపస్సు. ఇవన్నీ భగవంతుని మహాతపస్సులు. కనుక ఆయన సుతపస్వి.

## 198. పద్మనాభః

- బొడ్డున (బ్రహ్మకు జన్మస్థానము అయిన, పృథివీ సంబంధమైన) తామరపూవు కలవాడు.
- అందరి హృదయ కమలములందు వసించువాడు.
- జ్ఞానమునకు నిలయము. బహు మనోహరుడు.

### ఓం పద్మనాభాయ నమః

ఈ నామము మూడుమార్లు వస్తుంది.

6వ శ్లోకము. 48వ నామము. పద్మనాభః – **అప్రమేయో హృషీకేశః పద్మనాభః అమరప్రభుః**

21వ శ్లోకము. 198వ నామము. పద్మనాభః – **హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః**

38వ శ్లోకము. 348వ నామము. పద్మనాభః – **పద్మనాభః అరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్**

48వ నామమునకు – నాభియందు పద్మము గలవాడు. ఆ పద్మమునుండి బ్రహ్మ జనించెను. బ్రహ్మవలన సృష్టి కావింపబడెను – అని అర్థము చెప్పబడినది.

**పార్థివం భూరి పద్మస్తు నాభావష్టదళం మహత్ య స్స హేమమయీ దివ్యాకర్ణికా మేరురుచ్యతే యస్య నాభౌ తదుత్పత్తి పద్మనాభ స్స ఉచ్యతే** - బంగారుమయమైన మేరుపర్వతము దుద్దుగా కలిగి, ఎనిమిది దళాలతో అలరారుతున్న పృథివీ సంబంధమైన పద్మమును నాభియందు గలవాడు.

ఈ 198వ నామము 'పద్మనాభః' కు శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు అందరి హృదయ కములమునందు వసించును. నాభి అనగా మధ్యభాగము.

ధర్మచక్రము రచయిత ఇదే నామమునకు రమ్యమైన మరొక అనుభవమును పంచినారు. పద్మము వికసించినపుడు తుమ్మెదలను, తేనెటీగలను ఆకర్షించును. అలాగే పద్మనాభుడు జీవులను తనవైపు ఆకర్షించును. పద్మము అత్యంత సుందరమైన పుష్పము. అలాగే పద్మనాభుడు అందమునకు అందమైనవాడు. శ్రీలక్ష్మీదేవి శుభమంగళయై భృంగాంగనవలె పులకభూషణమైన హరి శరీరమును ఆశ్రయించును. ఆయన సీతాముఖాంభోరుహ చంచరీకుడు. రుక్మిణీవల్లభుడు. గోపీజనప్రియుడు. శ్రీనివాసుడు. శ్రీవరాహమూర్తి. అందమునకు రూపము. శ్రీ కంబ మహాకవి **'తాళ్ కందాట్ తాళె కందాట్'** అని శ్రీరాముని చక్కదనమును వర్ణించెను. అట్టి పద్మనాభుని సౌందర్యము భక్తులను ఆనందాంతరంగులనొనర్చి, సన్మార్గమున నడిపి, ముక్తిని ప్రసాదించును. ఆయన ప్రహ్లాద మానస సరోవరమున వికసించిన శ్రీనారసింహమూర్తి. పద్మనాభుడు. పద్మావతీనాథుడు.

శ్రీ సత్యదేవోవాసిష్ఠగారు ఇదే నామమును మరొక దృక్పథమునుండి వ్యాఖ్యానించారు. 'పద్మము' అనగా 'జ్ఞానము' అని కూడ అర్థము. **పద్యతే జ్ఞాయతే అనేన పద్మమ్ జ్ఞానమ్.** సకల విద్యలకు, సర్వ జ్ఞానమునకు కేంద్రము, నిలయము అయినందున, అఖిల విద్యలు ఆయన అధీనములో నున్నందున ఆయనను పద్మనాభుడు అని నుతింతురు.



కంబోడియాలో శ్రీ అనంతపద్మనాభుని శిల్పము.
Creative Commons photo from Flickr
by Soham Banerjee
https://www.flickr.com/photos/soham_pablo/49418289042/in/dateposted/

## 199. ప్రజాపతిః

- సకల జీవులకును ప్రభువు.

### ఓం ప్రజాపతయే నమః

8వ శ్లోకము. 70వ నామము. ప్రజాపతిః – **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**
21వ శ్లోకము. 199 వ నామము. ప్రజాపతిః – **హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః**

**తద్ పద్మోద్భవ ప్రభృతానామ్ ప్రజానామ్ పతిః** – శ్రీహరియే సకల ప్రజలకును, పద్మ సంభవుడైన బ్రహ్మకును అధిపతి. కాలముతో పునరావృతమగు సృష్టి, లయ కార్యములు పద్మనాభుని అధీనములు. నైమిత్తిక కృషిలో సృష్టింపబడిన పరబ్రహ్మ మొదలైనవారికి రాజైనవాడు ప్రజాపతి.

**నైమిత్తి కేత్రు యే సృష్టాః ప్రజా బ్రహ్మముఖాస్తథా తేషాం చైవ పతిస్స్వామీ ప్రజాపతిరిహోచ్యతే** - 'పతి' అనగా తండ్రి అని కూడ చెప్పవచ్చును. సకల జీవరాశులును ఆయననుండియే, బ్రహ్మద్వారా సృజింపబడినవి గనుక హిరణ్యనాభుడే ప్రజాపతి. ప్రజాపాలనార్థము, ధర్మరక్షణార్థము ఆయన అవతరించును.

గీత 9.17 – **పితామహస్య జగతః**    గీత 11.43 – **పితాసి లోకస్య చరాచరస్య**

### తులసి (వనమాల) ప్రాశస్త్యము

http://www.vedics.net "Ramanuja Darshan" Vol-3 Issue-1 (Jan-Mar 2005)
"రామానుజ దర్శనము"లో శ్రీ జి. శేషాద్రి అయ్యంగార్ రచన నుండి గ్రహించినది.

శ్రీమహావిష్ణువు వనమాలను, పంచాయుధములను ధరించియుండును. తులసిమాల (వనమాల) శ్రీవాసుదేవుని అసాధారణ చిహ్నములలో ఒకటి. శ్రీమన్నారాయణునికి తులసితో గల అనుబంధము ప్రగాఢమైనది. ప్రతి సాలగ్రామ పూజ (విష్ణుపూజ)యందును తులసీదళములు సమర్పింపబడును. తులసి ప్రాశస్త్యమును గూర్చి కొన్ని ఆసక్తికరమైన విషయములు.

- ఇంటిలో తులసిమొక్కను పెంచుటయే శ్రీనివాసుని అర్చించుటకు సమానమగును.
- తులసియున్నచోట విష్ణువు వసించును.

- ఉదయమే తులసిని దర్శించినట్లయితే, అప్పటివరకు చేసిన పాపములు నశించును.
- ఏకాదశి ఉపవాసానంతరము ద్వాదశి పారణ తులసి తీర్థముతో ఆరంభింతురు.
- చాలా గృహములందు తులసిమాతను ప్రత్యక్ష మహాలక్ష్మిగా అర్చింతురు.
- తులసీజలముతో అర్పించిన దానము ఫలవంతమగును.
- శ్రీమద్భాగవతములో తులాభార సందర్భమున సత్యభామాదేవి తన సకలసర్వాభరణములతోను ఆ జగన్నాథుని తూచలేకపోయినది. రుక్మిణీదేవి తులసిదళముతో భగవానుని భారమును సమమొనర్చినది.
- త్రిపద్ రామాయణమున తులసి వైకుంఠమును గురించిన ప్రస్తావన యున్నది.
- శ్రీ నమ్మాళ్వార్ గారు తమ 'తిరువైమొళి'(4.2)లో తులసి మహాత్మ్యమును విపులముగా కీర్తించారు. శ్రీమన్నారాయణుని పాదసన్నిధిలో తులసివలె తరించవలెనని ఆకాంక్షించారు.
- శ్రీ తిరుమంగైయాళ్వారువారు తమ 'సిరియ తిరుమండల్' (58-59)లో ఆ భగవంతుని పదములచెంతనున్న తులసిదళము కొరకు ఆక్రోశించారు.
- శ్రీ అళవందార్ (యమునాచార్యులు)గారు తమ స్తోత్రరత్నమున భగవంతుని '**లసత్తులస్యా వనమాలయోజ్వలమ్**' అని వర్ణించారు. నాలాయిర దివ్య ప్రబంధములో అందరు ఆళ్వారులు తమ పాశురములలో తులసిని అర్చించారు.
- గ్రీకు తత్వవేత్త అయిన అరిస్టాటిల్ మహాశయుడు (క్రీ. పూ. 384-322) తులసిమొక్కకు 'Sanctum Basil' అని నామకరణము చేసెను. ఆయన 'Sanctum' అనగా 'పవిత్ర' అనే పదమును మరే మొక్కకు వాడలేదు. ఆయుర్వేదములో తులసికి ఎంతో ప్రాధాన్యత ఉన్నది.
- శ్రీ త్యాగరాజస్వామివారు తులసితల్లిని ఆరు కీర్తనలలో ఆరాధించారు. తులసిని జగజ్జననియని, సకల తీర్థములకు స్వర్గమని కీర్తించారు. బ్రహ్మాదులు కూడ తులసితో అర్చించి శ్రీమన్నారాయణుని ప్రసన్నము చేసికొనిరి. శ్రీరాముని ఉరమున, కరమున, ముఖమున, శిరమున, భుజమున, నేత్రమున, చరణయుగమున తులసి వెలుగొందుచున్నది. తులసియే భగవంతుని శరీరము. తురీయ బ్రహ్మము. శ్రీహరికి పరమ ప్రియము. ఆండాళ్ తల్లిని శ్రీరంగనాథునితో కలిపిన నేస్తము.
- పద్మపురాణములో ఇలా ఉన్నది – తులసి మొక్కలు ఉన్న ఇంటిలోనికి ప్రవేశించడానికి యముడు సాహసింపడు.



చిత్రం. బెంగాల్ విష్ణుపూర్ రాధామాధవ మందిరంలో తులసి కోట. వికీపీడియా నుండి. By Jonoikobangali

https://commons.wikimedia.org/wiki/File:Tulsi_Mancha_at_Radhamadhab_Temple_Arnab_Dutta_2011.JPG



## అమృత్యుః సర్వదృక్సింహః సంధాతా సంధిమాన్ స్థిరః |
## అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా || (22)

### 200. అమృత్యుః

- మరణము, నాశనము లేనివాడు.

**ఓం అమృత్యవే నమః**

**మృత్యుః యస్య న అస్తి ఇతి అమృత్యుః** – ప్రతి వస్తువునకు జననము (ప్రారంభము), వృద్ధి, క్షీణత, వ్యాధి, మరణము (అంతము) అనే 5 దశలు తప్పవు. పుట్టినదెల్ల గిట్టక మానదు. కాని భగవంతుడు అజుడు (పుట్టుక లేనివాడు), అమరుడు, అమృత్యుడు, షడ్భావ వికార శూన్యుడు.

ధర్మ చక్రము రచయిత వ్యాఖ్య - ఈ నామ స్మరణమునందు మనము ఆత్మ (జీవాత్మ) నాశనము లేనిదని గుర్తించవలయును. కనుక నశ్వరమగు శరీరమునే జీవునిగా తలంపక, పరమాత్మను ధ్యానించి అమృతత్వమును (జనన మరణ చక్రమునుండి ముక్తిని) సాధింపవచ్చును.

### 201. సర్వదృక్

- సమస్తమును చూచుచుండువాడు.

**ఓం సర్వదృశే నమః**

శ్రీ వాసుదేవుడు సర్వాంతర్యామియై సకల భూతములందును, సకల ప్రదేశములందును సమస్తమును సర్వదా చూచుచుండును. ఆయన పట్ల భక్తి కలిగినవారికి, భగవంతుని నిరసించినవారికి, దైవారాధన పట్ల ఆసక్తి లేనివారికి – అందరికీ వారివారి బుద్ధి, కర్మల అనుసారముగా తగు ఫలితములను ప్రసాదించును.

ధర్మచక్రము రచయిత ఒక సర్వ సాధారణమైన, కాని ప్రాముఖ్యత కలిగిన సత్యమును పదే పదే గుర్తుంచుకొనవలెనని నొక్కి వక్కాణించారు. మనము మనస్సులోను, మాటలలోను, చేతలలోను సదాచారమును ఎల్లప్పుడూ పాటించి తీరవలెను. ఎవరూ చూడడములేదని, ఎవరికీ తెలియదనీ, ఏమీ పరవాలేదనీ అనుకోవడం మూర్ఖత్వము. శ్రీమన్నారాయణుడు సర్వస్థితుడు. సర్వాంతర్యామి. సర్వసాక్షి. సర్వదృక్కువు. సర్వేశ్వరుడు.

## 202. సింహః

- సింహము.
- పాపములను నశింపజేయువాడు.

### ఓం సింహాయ నమః

22వ శ్లోకము. 202వ నామము. సింహః – **అమృత్యుః సర్వదృక్ సింహః సంధాతా సంధిమాన్ స్థిరః**
52వ శ్లోకము. 489వ నామము. సింహః – **గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – మనిషి, సింహముల రూపమును ధరించినందున శ్రీహరి 'సింహము' అనే నామముతో స్తవనీయుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **హినస్తి ఇతి సింహః, హినస్తి స్మరణ మాత్రేణ సమస్త పాపాన్ ఇతి సింహః**

స్మరించినందువల్లనే సకల పాపములను నాశనము చేయువాడు 'సింహః'. ఇక్కడ పాణిని వ్యాకరణ సూత్రము (6.3.109) ప్రకారము అక్షరములను తారుమారు చేయుటవలన 'హింస' అను పదము 'సింహ' యగును. (పృషోదరాదీని యతోపదిష్టమ్)

శ్రీ చిన్మయానంద 'సింహము' అనే సామాన్య అర్థములోనే వ్యాఖ్యానించారు. సింహము మృగరాజు. దానిని చూచినంతనే అడవిలోని జంతువులు పలాయనమగును. భగవంతుని నామస్మరణము మాత్రమున బుద్ధి అనే అరణ్యములోని క్రూర, మూర్ఖ, కామములనే దుష్టజంతువులు పారిపోవును.

గీత 10.30 – **మృగాణాంచ మృగేంద్రోకహమ్** – జంతువులలో నేను మృగరాజును (సింహమును).

ధర్మచక్రము రచయిత – ఈ పుణ్యనామ స్మరణము వలన మనకు మనసా, వాచా, కర్మణా మంచిని ఆచరించుటకు, చెడును త్యజించుటకు అవుసరమగు బలము, ధైర్యము లభించును. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను దూరముగా నెట్టివేయుటకు, చెడు ఆలోచనలను అణచివేయుటకు, చెడు మాటలు మానివేయుటకు, చెడు కార్యములు చేయకుండుటకు ఎంతో బలము, ధైర్యము కావలెను. ఇట్టి ధైర్య, స్థైర్యములు నరసింహ రూపుడైన, సింహ నామధేయుడైన నందకిశోరుని అనుగ్రహమున మనకు లభించును.

**శ్రీయుత మూర్తి! పురుష సింహము!** – అని రుక్మిణీదేవి తన రాయబారమున యదునాధుని సంబోధించినది.

## 203. సన్ధాతా

- భక్తులను తనలో కలుపుకొనువాడు.
- జీవులను వాని కర్మఫలములకు ముడివేయువాడు (అనుసంధానించును).

### ఓం సన్ధాత్రే నమః

**సంధత్తా ఇతి సంధాతా** – కలుపువాడు, సమన్వయపరచువాడు.

మొదటి భావము (భక్తులను తనలో కలుపుకొనువాడు సంధాత) శ్రీ భట్టుల వ్యాఖ్యానములో ప్రహ్లాదుని ఉదాహరణగా చెప్పబడినది. ప్రహ్లాదుడు నిరంతర హరిచింతనామృత పాన మత్తుడు. రాగవిద్వేష రహితుడు. మృదు వినయశీలి. అట్టి భక్తునకు ఆపన్నత కలుగకుండ, అతనిమాట పొల్లుపోకుండా కాచుటకై నరహరిగా అవతరించిన శ్రీహరి తన భక్తునకు సాయుజ్యమును ప్రసాదించెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య భగవంతుని కర్మఫల ప్రదాతృత్వమును సూచించును. కర్మఫలములనధిగమించుట సాధ్యము కాదు. కనుక భగవంతుని పరమాత్మగా నెఱిగి, ఆప్తునిగా ఆయనను శరణుజొొచ్చి, దుష్టకర్మలను త్యజింపవలెను.

నిరుక్తిలోని వర్ణన – **ప్రహ్లాదాద్యైః సంధాతా సంశ్లేష కరణాచ్చ సః.**

## 204. సన్ధిమాన్

- భక్తులందు ఐక్యమై యుండువాడు.
- ఫలభోక్తృ స్వరూపమై యున్నవాడు.

### ఓం సన్ధిమతే నమః

'సంధి' అనగా కలయిక. భగవంతుడు భక్తులందు కలిసిపోవును గనుక ఆయన 'సంధిమాన్' అని శ్రీ భట్టుల వివరణ. హరిదాసులను హరిమూర్తులుగా గ్రహింపనగును.

నిరుక్తిలో ఇలా చెప్పారు – **ప్రహ్లాదాద్యైః నిత్య సంధిః యస్య స్యాత్ సంధిమాన్ స్మృతః** – ప్రహ్లాదాదులయందు ఐక్యమైయున్నందున 'సంధిమాన్' అనబడును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఫలభోక్తృ స్వరూపమై యున్నవాడు గనుక 'సన్ధిమాన్' శబ్దము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

## 205. స్థిరః

- భక్తుల పట్ల బాంధవ్యము నిలకడగా కలిగినవాడు.
- నిశ్చలుడు, నిర్వికారుడు, నిత్యుడు.

### ఓం స్థిరాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అపచారేపి అచల్యత్వాత్ సంధానే స్థిర ఉచ్యతే.** భక్తులు అపచారములొనర్చినను, వారిపట్ల కరుణతో మన్నించి, వారియెడల వాత్సల్యానురాగములు ఏమాత్రము చెదరని ప్రజాపతి. ఆ శేషశైల శిఖామణి మన అశేష అజ్ఞాన దోషములను క్షమించి కొండలంత వరములు క్రుమ్మరించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సదైక రూపత్వాత్ స్థిరః.** ఎల్లప్పుడూ ఒకే రూపంతో ఉండేవాడు. ఆయన జన్మ రహితుడు. ఆద్యంత రహితుడు. దేశకాలములతో మార్పుచెందడు. ఆయనే నిత్యము. సత్యము. నిరంతరము. పరమపదము. స్థిరము. తిరువేంకటగిరిపై మోపిన పాదము. పరబ్రహ్మము.

## 206. అజః

- పుట్టుక లేనివాడు (స్తంభమునుండి అవతరించిన శ్రీనృసింహమూర్తి).
- అడ్డంకులను తొలగించువాడు.
- భక్తుల హృదయములందు చరించువాడు.
- భక్తుల మనములందలి అజ్ఞానమును హరించువాడు.
- సకల శబ్దములకు మూలము ('అ'కారము)

### ఓం అజాయ నమః

ఈ పవిత్ర నామము ఈ స్తవరాజములో మూడు పర్యాయములు (96వ, 206వ, 524వ నామములుగా) స్తుతించబడినది.

11వ శ్లోకము. 96వ నామము. అజః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః**

22వ శ్లోకము. 206 వ నామము. అజః – **ఆజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా**

11వ శ్లోకము. 524వ నామము. అజః – **అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః**

పుట్టుక లేనివాడు. **న జాయతే ఇతి అజః** – ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన శృతి ప్రమాణము -
ఋగ్వేదము 1.81.5 – **న జాతో న జనిష్యతే.** ఆయన ఇంతకుముందు జన్మింపలేదు. ఇకముందు జన్మింపబోడు.

**న హి జాతో న జాయేఽయం న జనిష్యతే కదాచన**
**క్షేత్రజ్ఞః సర్వభూతానాం తస్మాదహం అజస్మృతః** - మహాభారతము శాంతిపర్వము 330.9
నేను పూర్వము జన్మించియుండలేదు. ఇప్పుడు జన్మించినవాడను కాను. భవిష్యత్తులో జన్మించను. నేను సర్వభూతములందును క్షేత్రజ్ఞుడను. కనుక నన్ను 'అజుడు' అని యందురు.

శ్రీ భట్టుల వివరణ – భగవంతుడు శ్రీనారసింహమూర్తియై స్తంభమునుండి ఆవిర్భవించెను. తక్కిన జీవజాలమువలె ఆయన జన్మింపడు.

'అజ్' అనే ధాతువునకు 'చలనము','తొలగించుట' అనే అర్థాలు కూడా ఉన్నాయి (**అజౌ గత క్షేపణయోః**) ఈ భావములో మరికొన్ని వ్యాఖ్యానాలు మనకు లభించాయి.

శ్రీ భట్టులు – పరమపద ప్రాప్తికై తపించు ముముక్షువుల మార్గమునుండి అన్ని విఘ్నములను తొలగించి అనుగ్రహించువాడు భగవంతుడు. అజుడు.

శ్రీ శంకరులు – **అజతి గచ్ఛతి క్షిపతి ఇతి వా అజః.** భక్తుల హృదయమున ప్రవేశించి చరించువాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – మన అజ్ఞానమును తొలగించువాడు. తన భక్తుల చెంతకు చేరి, వారిని తన పరంధామమువైపు నడిపించువాడు.

ఇంకా – **అకార వాచ్యతయా జాతః అజః** – 'అ'కార వాచకముచే తెలుపబడినవాడు అజుడు. అన్న భావములో కూడ ఈ నామమునకు వ్యాఖ్యానాలు ఉన్నాయి.

## 207. దుర్మర్షణః

- ఎదురు లేనివాడు. అడ్డు లేనివాడు.

### ఓం దుర్మర్షణాయ నమః

**దుష్కరమ్ మర్షణమ్ అస్య ఇతి దుర్మర్షణః.** ఆయనను ఏ శత్రువులైనా అడ్డుకొనలేరు. ఎంతటివారైనా జయించలేరు. కాలము గాని, ప్రాంతము గాని, బలము కాని – ఏదీ ఆయనను నిలువరించజాలదు. ఆయన శాసనమును అతిక్రమించదగదు. కనుకనే ఆయన దుర్మర్షణుడు. దుష్ట శిక్షకుడు. దురితాపహారి.

శ్రీ చిన్మయానందగారు ఇదే అర్థమును మరొక చక్కని దృక్పథములో వ్యక్తీకరించారు – మనము ఇంద్రియ వాంఛలకు దాసులమై సన్మార్గమును తప్పవచ్చును. సంసార చక్రమున మత్తులమై చరింపవచ్చును. కాని జన్మలనెత్తి, ఎత్తి, తుదకు విష్ణుపద

పథగాములుగా కాక తప్పదు. క్రిమికీటకాది జన్మలలో ఆధ్యాత్మిక సాధనలకు అవకాశము లేకపోవచ్చును. కాని అనేక జన్మల అనంతరము బుద్ధి కలిగి, సద్గురు కృప లభించి, సాధననవలంబించి, శ్రీహరికి శరణాగతులమై సచ్చిదానంద పరబ్రహ్మమునకై తపించెదము. వేరు దారి లేదు. వేరు నాథుడు లేడు.

ఈ నామమునకు మూల ధాతువు 'మృష్' - సహనే - సహించుట. 'దుర్మర్షణుడు' అనగా (శత్రువులకు) దుస్సహమైనవాడు. శ్రీమన్నారాయణుడు శతకోటి సూర్యాధిక తేజోమూర్తి. అనంత బల సంపన్నుడు. అప్రమేయుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారి వివరణ – ప్రకృతిలోని ప్రతిశక్తికిని మరొక శక్తి భగవానుని అనంత శక్తిని గుర్తు చేయుచునే యుండును. సూర్యకాంతి ముందు చంద్రుని వెన్నెల వెలవెల బోవును. చంద్రునికాంతియందు తారల మెరుపులు క్షీణించును. నిప్పును నీరు ఆర్పివేయును. నీటిని అగ్ని ఆవిరి చేయును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారి మరొక వివరణ – 'మర్షితుమ్' అనగా 'జ్ఞాతుమ్' - తెలిసికొనుట - అని అర్థము గలదు. ఆయనను తెలిసికొనుట సులభము కాదు. సాధన, దీక్ష, భక్తి, గురుకృప, భగవదనుగ్రహము కావలెను. **దుఃఖేన మర్షితుమ్ శక్యః దుర్మర్షణః.** శ్రమతో మాత్రము తెలియబడువాడు దుర్మర్షణుడు.

ధర్మ చక్రము రచయిత వ్యాఖ్య – దుష్టులైన అసురులను వినాశనమొనర్చువాడు (మృ - మృత్యు - చంపుట) గనుక శ్రీహరి దుర్మర్షణుడు. ఈ భావమును మనసులోనుంచుకొని ఈ నామమును స్మరించినట్లయితే భక్తుల మనసునుండి దురాలోచనలు దూరమై, మనసు నిర్మలమై, భక్తి నిశ్చలమై, దీక్ష సత్ఫలితములనిచ్చును. కిరాతుడైన వాల్మీకి రామనామ స్మరణము వలన ఋషియై ఆదికావ్యస్రష్టయై మోక్షమార్గ దర్శకుడయ్యెను.

## 208. శాస్తా

- బోధించువాడు. జగద్గురువు.
- శాసించువాడు. భక్తులమార్గమును అవరోధించువారిని శిక్షించువాడు.

### ఓం శాస్త్రే నమః

ఈ నామమునకు మూల ధాతువు 'శాసు' - అనుశిష్టౌ - బోధించుట, ఉపదేశించుట, పాలించుట, సరిచేయుట. 'శాస్త్రము', 'శిక్ష' అను పదములు ఇదే ధాతువునుండి వ్యుత్పన్నములు.

శ్రీకృష్ణభగవానుడు గురువులకు గురువు. సమస్త జ్ఞానమునకు మూలము. వేదవిదుడు. వేదవేద్యుడు. తల్లిదండ్రుల రూపమున, గురువుల రూపమున, శృతుల రూపమున, స్మృతుల రూపమున విద్యలన్నింటిని బోధించును. అంతర్యామియై విద్యలను బుద్ధిలో నిలుపును. భక్తుల మార్గమునకు అడ్డుపడువారికి తగు గుణపాఠము చెప్పును.

## 209. విశ్రుతాత్మా

- జగమంతయు విస్మయముతో ఎవరి అద్భుత లీలా మహాత్మ్యములను గానము చేయునో ఆ దేవదేవుడు. సుప్రసిద్ధమైన చరితము గలవాడు.
- సత్యము, జ్ఞానము, పరబ్రహ్మము – ఇత్యాది విశిష్టమగు నామములచే స్తుతింపబడు అనంతగుణ సంపన్నుడు.
- వివిధ స్వరూపములుగా కీర్తింపబడు ప్రజాపతి.

- విశేష, షడ్గుణ్య పరిపూర్ణ, పరమాత్మ.

**ఓం విశ్రుతాత్మనే నమః**

**విస్మయేన స్తుతం దేవైః సైంహం యస్యాపదానకమ్ శీలం తైర్విశ్రుతాత్మనః మహత్కీర్తి ప్రదో మనుః -** దేవతలందరూ ఆశ్చర్యముగా చెప్పుకుంటున్నటువంటి శ్రీనృసింహావతారములో అద్భుత వ్యాపారములు చేసినవాడు. ఈ నామస్మరణము మహత్కీర్తిని ప్రసాదిస్తుంది. ఓం విశ్రుతాత్మనే నమః.

ఈ నామమునందు 'వి', 'శ్రుత', 'ఆత్మ' అనే మూడు ధాతువులున్నాయి. 'వి' ధాతువునకు వ్యాఖ్యాతలు చెప్పిన అర్థాలనుబట్టి మొదటి మూడు భావములను వివరింపవచ్చును.

శ్రీ భట్టులు – 'వి' – విస్మయేన – అబ్బురముగా.

శ్రీ శంకరులు – 'వి' – విశేషేణ – ప్రత్యేకమైన.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'వి' – వివిధైః – పెక్కు రూపములతో.

రెండవ ధాతువు – 'శ్రు' – శ్రవణే – వినిపించుట, స్తుతించుట, కీర్తించుట, పేరు కలిగియుండుట.

మూడవ ధాతువు – 'ఆత్మ' – గుణము, స్వరూపము, నామము, సర్వాంతర్యామియైన పరమాత్మ.

విశ్రుతాత్మ – అందరు విస్మయముతో అద్భుతమంది కీర్తించు లీలావినోది. సుప్రసిద్ధమైన శ్రీనృసింహమూర్తిగా ఆయనను దేవతలు స్తుతిస్తారు. ఆయన గోవర్ధనగిరినెత్తినవాడు. బ్రహ్మచే గోవులు, గోపాలకులు దాయబడగా తానే వేరుసృష్టి చేసిన నందనందనుడు. కుచేలుని అటుకులతో సంతుష్టుడైనవాడు. రెండడుగులతో బ్రహ్మాండము నతిక్రమించినవాడు. తండ్రిమాటకై వనవాసము చేసినవాడు. ఆపదమ్రొక్కులవాడు.

విశ్రుతాత్మ – విశేష నామములతో శ్రుతులందు స్తుతింపబడినవాడు. ఆయనే జ్ఞానము, జ్ఞేయము, మార్గము, మార్గదర్శి, మార్గవర్తి, గమ్యము. నరుడు. నారాయణుడు. శ్రీధరుడు. శ్రీనివాసుడు. వేదము. వేదవిదుడు. వేదవేద్యుడు. పరమపదము. వాసుదేవుడు. రాముడు. శివుడు. వామనుడు. త్రివిక్రముడు.

విశ్రుతాత్మ – వివిధ స్వరూపములుగా, సూర్యునిగా, చంద్రునిగా, తల్లిగా, తండ్రిగా, గురువుగా, అర్చామూర్తిగా, అంతర్యామిగా, ధర్మముగా, జ్ఞానముగా, తపముగా, ప్రభువుగా, సర్వముగా, సర్వేశ్వరునిగా వ్యక్తమగువాడు.

**తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదుచంద్రమాః**

**తదేవ శుక్రమ్ తద్ బ్రహ్మ తాఽఽపః స ప్రజాపతిః** – యజుర్వేదము 32.1

ఇంకా అయనను గానము, అర్చనము, వేదపఠనము వంటి బహుసాధనములద్వారా నుతింపవచ్చును గనుక ఆయన విశ్రుతాత్మ.

విశ్రుతాత్మ – **విశేషేణ శ్రుతః (జ్ఞాతః) ఆత్మా యేన స విశ్రుతాత్మా** – జీవాత్మకంటె భిన్నమై, సర్వజ్ఞుడై, సర్వశక్తుడై, షడ్గుణ్యపరిపూర్ణుడై, కర్మాదిసంగరహితుడైన పరమాత్ముడు. పురుషోత్తముడు.

**210.** సురారిహా

- దేవతల శత్రువులను సంహరించువాడు.

**ఓం సురారిఘ్నే నమః**

సుర-అరి-హా – దేవతల శత్రువులను అంతముచేయువాడు 'సురారిహా'. హిరణ్యకశిపుని సంహరించిన శ్రీనృసింహావతారమును ఈ నామవివరణలో శ్రీ భట్టులు ప్రస్తావించారు. ఎన్ని వరములు ప్రోగుచేసుకొన్నా గాని, ఎంత బలము కూర్చుకొన్నాగాని ఆ సురారికి శ్రీనరహరి చేత మరణము తప్పలేదు.

శ్రీ చిన్మయానంద – ఈ నామ స్మరణ ధ్యానములవలన మన దీక్షకు అడ్డుపడు అంతశ్శత్రువులు నశించును. శారీరిక రాక్షస వాంఛలు, అహంకార భూతములు, కామక్రోధాది పిశాచములు దూరముగా పారిపోవును. ముముక్షువుల పురోగతికి శత్రువులైన అరిషడ్వర్గములను, అహంకారమును హరించును గనుక ఆయన సురారిఘ్నుడు. పాపములను, తాపములను నాశనము చేయు శ్రీనారసింహుడు.


చిన్న తిరుపతిలోని శ్రీనృసింహస్వామి శిల్పం.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు – **పాహి నో అగ్నే రాక్షసః .... .......** అని మొదలయ్యే ఋగ్వేద మంత్రము (1.36.15)ను ప్రస్తావిస్తూ, ఈ మంత్ర జపము వలన సకల దుష్టశక్తులు తొలగిపోవుట తమ స్వానుభవంలో జరిగిందని తెలియజేశారు.

ఈ శ్లోకములోని అన్ని నామములను – **అమృత్యుః, సర్వదృక్, సింహ, సంధాతా, సంధిమాన్, స్థిరః, అజః, దుర్మర్షణః, శాస్తా, విశ్రుతాత్మా, సురారిహా** – నామములను శ్రీనృసింహావతార గుణ వైభవ పరముగా శ్రీ భట్టులు వ్యాఖ్యనించారు.

## శ్రీ వేదాంత దేశికుల కామాశికాష్టకము

RAMANUJA DARSHANAM. A VEDICS JOURNAL. *Volume 3 Issue 2: June – Aug 2005*
***Vedics Foundation*** *http://www.vedics.org. (old web site: http://www.vedics.net not working now).*
**శ్రీ కళియర్ నారాయణన్ గారి వ్యాసమునకు అనువాదము.**

కాంచీపురములో వేళుక్కాయి దివ్యదేశములో చక్కని శ్రీనృసింహమందిరము ఉంది. 'వేళుక్కాయి' అనగా ఎంచుకొన్న నివాసస్థలము. ఈ నృసింహ స్వామిని స్తుతిస్తూ స్వామి వేదాంత దేశికులవారు 'కామాశికాష్టకము'ను రచించారు (కామ – కోరుకొన్న, ఆశిక – నివాసము). ఈ నృసింహమూర్తి వేదవేదాంత వందితుడు. త్రినేత్రుడు. భక్త రక్షకుడు. దుష్ట శిక్షకుడు. వరదుడు. (మందిరం చిత్రం. వికీపిడియా నుండి. By S Sriram mt)



శ్రుతీనాముత్తరమ్ భాగమ్ వేగవత్యాశ్చ దక్షిణమ్
కామాద్ అధివసన్ జీయాత్ కశ్చిదద్భుత కేసరి
వేదముల ఉత్తర భాగమున (ఉపనిషత్తులలో) కీర్తింపబడిన దేవదేవుడు అద్భుత కేసరి రూపమును దాల్చి వేగవతి (నది) దక్షిణ భాగమున ఉండుటకు ఇచ్ఛగించినాడు.

తపనేంద్వాగ్ని నయనః తాపానపచినోతు నః
తాపనీయ రహస్యానామ్ సారః కామాసికా హరిః
కామాసికా హరి 'నృసింహ తాపనీయ ఉపనిషత్తు'లో చెప్పబడిన విధమున సూర్య, చంద్ర, అగ్ని నయనములు గలవాడు (త్రినేత్రుడు). తాపత్రయములను హరించువాడు. (ఆధ్యాత్మిక తాపము, అధిభౌతిక తాపము, అధిదైవిక తాపము – వీనిని తాపత్రయములు అందురు).

ఆకాంతమ్ ఆది పురుషమ్ కంఠీరవమ్ ఉపరికుంఠితారాతిమ్
వేగోప కంఠ సంగాత్ విముక్త వైకుంఠ బహుమతిమ్ ఉపాసే
వైకుంఠమును వదలివచ్చి వేళుక్కాయిలో వెలసిన ఆదిపురుషునకు, నరహరి మూర్తికి, దేవదేవునకు పెక్కు వందనములు.

బంధుమ్ అఖిలస్యజంతోః బంధుర పర్యంక బంధ రమణీయమ్
విషమ విలోచనమీడే వేగవతీ పులిన కేళి నృసింహమ్
నృసింహదేవుడే సకల జీవులకును నిజమైన బంధువు. ఆయన పర్యంక బంధము (ఒక యోగముద్ర) యందు ఆసీనుడై యున్నాడు. భక్తుల యోగక్షేమ రక్షణయందు నిమగ్నుడై యున్నాడు.

స్వస్థానేషు మరుద్గణాన్ నియమయన్ స్వాధీన సర్వేంద్రియః
పరయంక స్థిర ధారణా ప్రకటిత ప్రత్యన్ ముఖావ స్థితిః
ప్రాయేణ ప్రణిపేదుషామ్ ప్రభురసౌ యోగమ్ నిజమ్ శిక్షయన్
కామానాప్నుదాత్ అశేష జగతామ్ కామాసికా కేసరి
వేళుక్కాయి నరకేసరి పశ్చిమ ముఖుడై పర్యంక స్థిరముద్రలో యోగమగ్నుడైనాడు. ఆయన సర్వేంద్రియములను నిగ్రహించిన హృషీకేశుడై, ముముక్షువులందరికిని శ్రీమన్నారాయణ ప్రాప్తి కలిగించు యోగసాధనమును వ్యక్తపరచుచున్నాడు.

వికస్వర నఖ స్వరుక్షత హిరణ్య వక్షఃస్థలే నిరర్గళ వినిర్గళద్రుధిర సింధు సంధ్యాయితాః
అవంతు మదనాశికా మనుజ పంచ వక్త్రస్య మామ్ అహమ్ ప్రథమికామితః ప్రకటితాహవా భావః
హిరణ్యకశిపుని వక్షస్థలమును చీల్చుటవలన రక్తము ధారలుగా కారినందున ఎఱ్ఱబడిన వజ్రనఖములతో శోభించు వరదాభయప్రదమగు హస్తము మన సకల భయములను నశింపజేయును.

సటాపటల భీషణే శరభసాట్టహాసోద్భటే
స్ఫురత్క్రుధిప్రిస్ఫుటాద్ భృకుటికేపి వక్త్రేకృతే
కృపాకపట కేసరిన్ దనుజ డింభ దత్తస్తనా
సరోజ సదృశా ధృశా వ్యతిబిషజ్య తేవ్యాజ్యతే
హిరణ్యకశిపుని యపచారములవలన కోపించిన స్వామి ముఖమున భృకుటి ముడివడి, భీకరగర్జనలతో, జూలు సడలించుచు, శత్రువులకు దుర్నిరీక్షమై భయానకమై యున్నది. అదే స్వామి ముఖము బాలుడైన ప్రహ్లాదుని పట్ల మాతృప్రేమాభరితమై కృపామృతమును జల్లుచున్నది. అట్టి కృపాకపటకేసరికి నమస్కృతులు.

త్వయి రక్షతి రక్షకైః కిమన్యైః త్వయిచాऽరక్షతి రక్షకైః కిమన్యైః
ఇతి నిశ్చిత ధీః శ్రయామి నిత్యమ్ నృహరే వేగవతీ తటాశ్రయమ్ త్వామ్
వేగవతీ తటమున వేంచేసిన శ్రీనరహరీ! వేళుక్కాయి స్వామీ! నీ రక్షణ యున్నవారికి వేరు రక్షకుల అవుసరము లేదు. నీవు రక్షింపనియెడల వేరు రక్షకులవలన ప్రయోజనము లేదు. ఈ విషయము ఖచ్చితముగా తెలిసికొని నిన్నే శరణు వేడుచున్నాను. శ్రీ నరకేసరి స్వామీ! శరణు! శరణు!.

ఇత్థమ్ స్తుతః సకృదిహాష్టభిరేష పద్యైః శ్రీ వేంకటేశ రచితైః త్రిదశేంద్ర వంద్యః
దుర్దాంత ఘోర దురిత ద్విరదేంద్ర భేదీ కామాశికా నరహరి ర్వితనోతు కామాన్.
(ఫలశ్రుతి) శ్రీ వేంకటేశునిచే (వేదాంత దేశికులచే) రచితమగు ఈ స్తోత్రముతో భగవంతుని ఒక్కమారు స్తుతించినంతనే కామాశికా నృసింహుడు సమస్త ఘోర పాపములను నాశనమొనర్చి సకల కామితార్థములను ప్రసాదించును.



## గురుర్గురుతమో ధామః సత్యః సత్యపరాక్రమః |
## నిమిషోऽనిమిషః స్రగ్వీ వాచస్పతిరుదారధీః || (23)

**211. గురుర్గురుతమః**

గురుః

గురుతమః

- గురువులకు గురువు. గురువులందు సర్వశ్రేష్ఠుడు.

ఓం గురుతమాయ గురవే నమః

ఓం గురవే నమః

ఓం గురుతమాయ నమః

'గురువు' అనగా తన్నాశ్రయించిన శిష్యులకు వేదములను, జ్ఞానమును, ధర్మమును, మోక్షమార్గమును ఉపదేశించు ప్రత్యక్ష దైవము. 'గురుతముడు' అనగా గురువులలో అత్యుత్తముడు. శ్రీ శంకరుల వ్యాఖ్యానుసారము '**గురుః**', '**గురుతమః**' అనేవి రెండు నామములు. శ్రీ భట్టులు మాత్రము 'గురుతమ' శబ్దమును విశేషణముగా స్వీకరించి, '**గురుతమ గురువు**' అనే ఒకే నామముగా వ్యాఖ్యానించారు.

లోకములకు వేదములొసగిన దేవుడు బ్రహ్మ. ఆ బ్రహ్మకు జన్మనిచ్చి, వేదములను ప్రసాదించిన శ్రీమన్నారాయణుడు గురువులకును, బ్రహ్మకును ఆదిగురువు. **యో బ్రహ్మాణామ్ విదధతి పూర్వమ్ యోవై వేదాన్ శ్చ ప్రహిణోతి తస్మై** – అని శ్వేతాశ్వరోపనిషత్తు (6.18) నందు గానము చేయబడెను.

త్రిపద్ విభూతి మహానారాయణోపనిషత్తు 8.15 – **గురుః క ఇతి గురుః సాక్షాత్ ఆదినారాయణః**

శ్రీ శంకరాచార్యుల (అద్వైత) గురుపరంపరయందు ప్రథమ గురువు నారాయణుడు. **నారాయణమ్ పద్మభువమ్ వశిష్ఠమ్ శక్తిమ్ చ తత్పుత్ర పరాశరమ్ చ వ్యాసమ్ శుకమ్ .... ..... శ్రీ శంకరాచార్యమ్.**

శ్రీ వైష్ణవ గురుపరంపరయందును ప్రప్రథమాచార్యుడు శ్రీమన్నారాయణుడే. నరనారాయణావతారమున శ్రీమన్నారాయణుడు సద్గురువై నరునకు 'మూలమంత్రము'నుపదేశించెను. ఆ జగన్నాథుడే శ్రీ దేవికి 'ద్వయమంత్రము'ను ఉపదేశించెను. ఆ పద్మనాభుడే శ్రీకృష్ణునిగా గీతాచార్యుడై అర్జునునకు 'చరమశ్లోకము'ను ఉపదేశించెను. **కృష్ణం వందే జగద్గురుమ్.**

**శ్రీ వైష్ణవ గురుపరంపర –**

శ్రీధరుడు (శ్రీమన్నారాయణుడు)

శ్రీ (మహాలక్ష్మి, జగన్మాత)

శ్రీ విష్వక్సేనులు

శ్రీ శఠగోపముని (నమ్మాళ్వారు)

శ్రీ నాతముని

శ్రీ పుండరీకాక్షులు

శ్రీ రామమిశ్రులు.

శ్రీ యమునాచార్యులు (అళవందార్)

శ్రీ పరాంకుశ స్వామి

శ్రీ రామానుజాచార్యులు (విశిష్టాద్వైత సిద్ధాంతకర్త)

శ్రీ ఎంబార్

శ్రీ పరాశర భట్టు

శ్రీ నన్ జీయర్ స్వామి

శ్రీ నమ్ పిళ్ళై

శ్రీ వడక్కు తిరువీధి ఫిళ్ళై

శ్రీ పిళ్ళై లోకాచార్యులు

శ్రీ తిరువైమోళి పిళ్ళై

శ్రీ మనవాళ మహాముని (వరవరముని)



శ్రీ రామానుజాచార్యులు.
వికీపీడియా చిత్రం.

ధర్మచక్రము రచయిత మరింత ఆసక్తికరమైన వ్యాఖ్యనిచ్చారు – శ్రీహరి లేనిచోటు లేదు. ఆయన విశ్వవ్యాపి. విశ్వము. విష్ణువు. విశ్వాంతరాత్ముడు. కనుక జ్ఞానమునుపదేశించమని కోరుటకు ఆయనను వెదుకనవుసరము లేదు. భక్తి కలిగి, వినయ విధేయతలు కలిగి, అహంకారమును విడచినవారు జ్ఞానము కొఱకు తపించినయెడల ఆ వాసుదేవుడు తానై వచ్చి గురువై కరుణించును. కనుకనే ఆయన గురుతముడు.

శ్రీ సద్గురువులకు నమస్కారము.

**ఈ శ్రీవిష్ణుసహస్రనామ వివరణ అనువాద కార్యమును నేను ఫిబ్రవరి 2005లో ప్రారంభించి సెప్టెంబరు 2011లో పూర్తి చేశాను. అక్టోబరు 2011న కంప్యూటర్...లో టైపు చేయడం మొదలుపెట్టాను. ఈ నాటి తేదీ 11 ఏప్రిల్ 2012.**

మొదట్లో చెప్పినట్లుగా ఈ వివరణా సంకలనం ప్రధానంగా శ్రీ నరసింహన్ కృష్ణమాచారిగారి ఆంగ్లరచనకు అనువాదం. శ్రీ కృష్ణమాచారి గారితో నాకు అసలు పరిచయం లేదు. యదాలాపంగా అంతర్జాలంలో వెదుకుతూ వారి రచనను చూసి, **(బహుశా 2004లో) ప్రింట్ చేసుకొన్నాను. 2005లో ఈ మెయిల్ ద్వారా వారి అనుమతిని, ఆశీస్సులను తీసికొని ఈ అనువాద కార్యక్రమాన్ని ఆరంభించాను. మధ్యలో ఇంకొక్కమారు మాత్రం నా ప్రగతిని గురించి వారికి వ్రాశాను. తరువాత వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. అసలు ఆయన ఎక్కడుంటారో నాకు తెలిదు.**

**2010లో 800** నామములు అనువాదం పూర్తి చేసిన తరువాత నా రచనను స్కాన్ చేశాను. ఆ పిడిఎఫ్ ఫైళ్ళ సి.డి.ని వారికి పంపాలనుకొని వారి అడ్రసు కావాలని మెయిల్ రాశాను. కాని జవాబు రాలేదు. తరువాత మళ్ళీ **2012**లో మెయిల్ వ్రాశాను. జవాబు రాలేదు. ఈ రోజు **(11** ఏప్రిల్ **2012**న**)** ఇంటర్నెట్ లో వెదుకుంటే తెలిసిన విషయం. శ్రీ నరసింహన్ కృష్ణమాచారిగారు డిసెంబర్ **2008**లో భగవత్సాన్నిధ్యాన్ని పొందారు. ఈ రచనకు సంబంధించినంతవరకు వారే నాకు సద్గురువులు. వారికి నమస్సులు. **–**

సుధాకర బాబు

From: malolan_net [mailto:malolan_net ] On Behalf Of Dr.V.Sadagopan
Sent: 19 à®Ÿà®¿à®šà®®à¯ à®ªà®°à¯ 2008 01:51
To: Ponnappan; Sgt; SG; Rajeev@...; Swami; IRS; DS; RamanujaandDesika ; Kalyani Krishnamachari
Cc: Robert Evans
Subject: Fw: Sri Narasimhan Krishnamachari

Dear Aathma Bhandhus :
It is with great sadness that I learnt from friends at Chicago that SrimAn NarasimhanKrishnamachari attained his AchAryan Thiruvadi this Morning after a short illness. He has blessed us with the fruits of his deepresearch on Sri VishNu Sahasra Naamams, PaancharAtra Aagamam, Taatparya RatnaavaLiand number of other SrI Sooktis. He dedicated himself to the many Kaimkaryams at the Aurora Temple for many years. His was a model life as a SrI VaishNavan and endeared himself to many, many SrivaishNava Families. On this sad occasion, adiyEn extends to his dear wife and family all of our sincere condolences. A tall tree has fallen in the forest of Sri VaishNavas. Our prayers are with the family for bearing this unbearable personal loss with the anugrahams of Srimath Srirangam Andavan and Sri BhUmi Devi SamEta Sri Oppiliappan.
adiyEn , V.Sadagopan

----- Original Message -----
From: "Robert Evans" evans.robert.d@...
To: "Dr. Sadagopan" <yennappan (AT) computer (DOT) net>
Sent: Thursday, December 18, 2008 10:07 AM
Subject: Sri Narasimhan Krishnamachari

Dear Dr. Sadagopan,
Below is the note I received from the Sri Venkateswara Swami Temple (Aurora) religious committee chair person about Sri Narasimhan Krishnamachari's attainment of the Lord's lotus feet. He will be missed by everyone here in the Chicago area and by devotees all over the world who benefited from his scholarship.
With Sadness,
Bob Evans

Dear Friends:
I just learnt that Sri Krishnamachari, a very long term committed and dedicated devotee of our temple reached the lotus feet of Sriman Narayana early this morning. As a "Prapanna" ( a Pious and beloved devotee of Bhagavan), his "JIvatman" is now united with "Paramatman". His soul has attained "Moksha", ( liberation) and is rejoicing the bliss of "Vaikuntha", the abode of Sriman Narayana Let us offer our prayers to Sri Balaji for his soul to rest in peace. Let us all join as the "Balaji Family" and extend our deepest sympathies to Sri Krishnamachari's family, and provide our solidarity of support. At times like this, the family needs our support. After I have further details, I will pass them along.
Regards,
Ranganathan Hemmige

## 212. ధామః

- పరమపదము. అత్యుత్తమ నివాస స్థానము. మార్గదర్శి.
- పరంజ్యోతి. దివ్య ప్రకాశము.
- సకల కామితార్థములకును నిలయము.

### ఓం ధామ్నేనమః

62వ నామమైన 'త్రిక-కుద్-ధామ' నామ వివరణలో 'ధామ' శబ్దముయొక్క భావము కొంతవరకు చెప్పబడినది. శ్రీ భట్టుల వ్యాఖ్యననుసరించి 211వ నామమైన 'గురుర్గుతమః' నుండి భగవంతుని శ్రీమత్స్యావతార వైభవ వర్ణనా నామములు ప్రారంభమగుచున్నవి.

ప్రళయ కాలమున సకల చరాచర జీవములను మోయు నావను తన శృంగమునకు కట్టుకొని మహోదధిని దాటించినవాడు 'ధామః'. నడిసంద్రమున చిక్కుకొని కొట్టుమిట్టాడు సంసార నావను నవజీవన మార్గమున నడిపించు ప్రభువు.



చిన్న తిరుపతిలో శ్రీమత్స్యావతార శిల్పము

శ్రీ శంకరులు 'ధామ' అనగా 'ప్రకాశము' అనే అర్థమును గైకొని భగవానుడు దివ్య కాంతి స్వరూపుడు, మార్గమును చూపువాడు అని వ్యాఖ్యానించారు. భగవద్గీతలోని విభూతియోగములోని శ్లోకము (10.12)

**పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్**
**పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్**

ఇక్కడ 'పరంధామ' నామమునకు దివ్యమైన, అనన్యమైన, పరమ ప్రకాశము, తక్కిన అన్ని వెలుగులకు మూలము అని శ్రీ రామానుజులు తమ గీతాభాష్యమున అర్థము తీసుకొన్నారు. **ధామశబ్దో జ్యోతిర్వచనః పరంజ్యోతిః**

**నారాయణ పరోజ్యోతిః** – నారాయణోపనిషత్తు.

**పరంబ్రహ్మ పరంధామ** – బృహదారణ్యకము.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః** – భగవద్గీత (13.18)

'పరమజ్యోతి' అనే భావమును ధర్మచక్రము రచయిత మరింత విపులీకరించారు. సూర్యుని కాంతివలన మనము కంటితో చూడగలము. కాని పరమ సత్యమును, పరమాత్ముని చూచుటకు కన్నులు, సూర్యకాంతి చాలవు. అందుకు కావలసినది భగవంతుని కృప, అంతశ్చక్షువులు, జ్ఞాననేత్రము. ఇదే శ్రీమహావిష్ణువు. ఆయనను తెలిసికొనుటకు ఆయనే సాధనము. ఆయనను దర్శించుటకు ఆయనే కన్నులు. ఆయనను చేరుకొనుటకు ఆయనే మార్గము.

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే** – గీత 18.65

ఓ అర్జున! నీవు నాయందే మనస్సును నిలుపుము. నా భక్తుడవు కమ్ము. నన్నే సేవింపుము. నాకు ప్రణమిల్లుము. ఇట్లు చేయుట వలన నన్నే పొందగలవు. ఇది ప్రతిజ్ఞాపూర్వకముగా నేను చెప్పుచున్న మాట. ఏలనన నీవు నాకత్యంత ప్రియుడవు.

ఇంకా కొన్ని భావములు చెప్పబడినవి.

కోరుకున్నంటివాని కన్నింటికి నిలయము ధామము. అన్ని కర్మములకు ఆధారము. వరముల పెన్నిధి.

'ధామ' అనగా అత్యున్నత స్థానము (కొండ కొమ్ము) అనే భావములో శ్రీ చిన్మయానందగారు చెప్పిన అర్థము – అందరూ చివరకు చేరదగిన అత్యున్నత స్థలము. పరమ పదము. కోనేటిరాయని కోవెల. శ్రీనివాసుని సన్నిధి.

## 213. సత్యః

- మంచియైనది. మేలు చేయువాడు.

### ఓం సత్యాయ నమః

ఈ పవిత్ర నామము ఈ స్తవరాజములో మూడు మారులు – 107, 213, 873వ నామములుగా గానము చేయడమైనది.

12వ శ్లోకము. 107వ నామము. సత్యః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**

23వ శ్లోకము. 218వ నామము. సత్యః – **గురుర్గురుతరో ధామః సత్యః సత్యపరాక్రమః**

93వ శ్లోకము. 873వ నామము. సత్యః – **సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాక్రమః**

107వ నామ వివరణలో చెప్పుకొన్న అర్థములు (1) నిజము (2) ప్రాణము, అన్నము, సూర్యుడు రూపములలో నుండువాడు. (3) సత్ప్రవర్తనయందు ప్రీతి గలవాడు.

మత్స్యావతార గుణగాన సందర్భముగా ఈ 213వ నామమునకు శ్రీ భట్టులు చెప్పిన భావము – మనువు వంటి సత్పురుషుల ప్రార్థనలను మన్నించి, వారిపట్ల సాధు భావముతో సంచరించి, వారికి హిత మొనర్చినవాడు – **మన్వాదిష్వసి సాధుత్వాత్ సత్య ఇత్యభిధీయతే.**

107వ నామమునకు శ్రీ సత్యదేవో వాసిష్ఠగారి వ్యాఖ్యానము ఆధారముగా – 'సత్య' అనగా 'సత్' అనబడు అన్నింటిలోను అత్యుత్తమము (పాణిని సూత్రము 4.4.98). వేనిని 'సత్' అనవచ్చునో భగవద్గీతలో శ్రీకృష్ణుడే సెలవిచ్చినాడు. (17.26,27)

**సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుచ్యతే**
**యజ్ఞే తపసి జ్ఞానే చ స్థితిః సదితి చోచ్యతే**
**కర్మచైవ తదర్థీయమ్ సదిత్యే వాభిధీయతే**

ఓ పార్థ! 'సత్' అను పరమాత్మ నామము సత్య భావమునందును, శ్రేష్ఠ భావమునందును, అనగా పరమాత్ముడు నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావమనందును ప్రయోగింప బడుచుండును. ఉత్తమ కర్మాచరణము నందున 'సత్' అను శబ్దము ప్రయుక్తమగుచుండును. యజ్ఞ దాన తపః క్రియల యందలి నిష్ఠ, ఆస్తిక భావమును 'సత్' అనియందురు. పరమాత్మను ఉద్దేశించి చేయబడు నిశ్చయాత్మక కర్మలను గూడ 'సత్' అనియందురు.

ఇట్టి 'సత్' అని సంభావింపదగిన అన్నింటిలోను అత్యుత్తముడు గనుక శ్రీమహావిష్ణువు సత్య నామధేయుడు.

## 214. సత్య పరాక్రమః

- నిజమైన, అనన్యమైన, తరుగులేని పరాక్రమము కలవాడు.
- సత్ప్రవర్తనకు అండగా నిలుచు పరాక్రమము కలవాడు.

### ఓం సత్యపరాక్రమాయ నమః

మత్స్యావతార భజనను కొనసాగిస్తూ శ్రీ భట్టులు భగవంతుడు మన్వాదుల కొఱకు నిర్వహించిన సత్య, శౌర్య కార్యములను ప్రస్తావించారు.

ధర్మ చక్రము రచయిత రెండు విధముల పరాక్రమములను ఉదాహరించారు – సజ్జన రక్షణార్థము, సత్కార్య నిర్వహణకై, ధర్మబద్ధమైనది సత్యపరాక్రమము. శ్రీరాముని రూపములో మూర్తీభవించిన భగవద్గుణము. అట్లు కాక దంభము, దర్పము, పరపీడనము, స్వార్థములతో కూడిన పరాక్రమము రావణుని లక్షణము.

శ్రీమహావిష్ణువు ధ్యానము వలన సత్యపరాక్రమము వర్ధిల్లును.

## 215. నిమిషః

కనులు మూసుకొని ఉన్నవాడు. అనగా –

- యోగనిద్రలోనున్నవాడు.
- తన భక్తుల శత్రువులపై తనయొక్క కటాక్ష వీక్షణమలను పడనీయనివాడు.

### ఓం నిమిషాయ నమః

**న ఈక్షతే ఇతి నిమిషః** – ఆ భక్తవరదుని చూపు సకల కళ్యాణప్రదము. అన్ని భయములను తొలగించును. కామతార్థమలను వర్షించును. మోక్షమునకు దారి చూపించును. కాని ఆ చల్లని చూపు అయన భక్తులకు కీడు కలిగించు దుష్కృతులపై పడదు. అట్టి దుర్జనులకు భగవంతుని రక్షణాభాగ్యము లభించదు. **యోఽసౌ సతాం నేక్షతే హి నిమిషస్స విరోధినం**

శ్రీ శంకరులు చెప్పిన అర్థము – యోగనిద్రలోనున్న ఆయన కన్నులు సదా నిమీలితములైయుండును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతునకు చూచుటకు (భౌతికమైన) కన్నులు అవుసరము లేదు. వినుటకు చెవులు అవుసరము లేదు.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు విశ్వము. విశ్వవ్యాప్తుడు. సర్వాంతర్యామి. సర్వసాక్షి. కనుక నిద్రలోనున్నను అంతటిని ఎల్లపుడు చూచుచునేయుండును. శ్రీమహాష్ణువుయొక్క యోగనిద్రను స్మరించి. కనులు మూసికొని ధ్యానము చేయువారి మనస్సు క్రమముగా అంతర్ముఖమై, ఆత్మదర్శనమొంది, పరమాత్మునివైపు మరలును.

## 216. అనిమిషః

- ఎల్లప్పుడు కనులు తెరచియుండువాడు.

### ఓం అనిమిషాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – చేపల కనులకు రెప్పలుండవు. మత్స్యావతారమూర్తియై ఎన్నడును కనులు మూయనివాడగుటచేత అనిమిషుడనబడును. అయన సదా భక్తుల యోగక్షేమములను కనిపెట్టుకొనియుండును. **సద్రక్షణే జాగరూకః స్మృతోఽహ్యానిమిషశ్చ శః**

శ్రీ శంకరుల వ్యాఖ్య – (1) భగవానుడు నిత్యజాగరూకుడు. జ్ఞానమూర్తి. ఏమరుపాటు లేనివాడు. (2) భగవానుడు ఆత్మస్వరూపుడు. ఆత్మకు నిద్రాది అవస్థలు వర్తించవు. కనుక భగవానుడు అనిమిషుడు.

ధర్మచక్రము రచయిత – ఈ పుణ్యనామమును ధ్యానించినవారి ఆధ్యాత్మిక సాధనము బలహీనపడదు. దురాలోచనలు వారిని చెరపజాలవు. వారు జాగరూకులై సత్కర్మలను సాధింతురు.

శ్రీ తిరుప్పాణాళ్వారు వారి చివరి పాశురము (అమలనాధిపిరన్ లోనిది) ఇక్కడ స్మరింపదగినది. గుడిలో భగవంతుని సౌందర్యమును చూచుచు ఆయన పరవశించిపాడినపాట అంతర్నేత్రమునకు కూడ వర్తించును.

**శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర నుండి.**

**శ్రీ సాయి సచ్చరిత్రము – రచన: శ్రీ హేమాండ్ పంత్ – తెలుగు సేత: శ్రీ ప్రత్తి నారాయణరావు.**

బాబా షిరిడీకి చేరిన కొద్ది కాలమునకే 4 మూరల పొడవు, ఒక జానెడు వెడల్పుగల కర్రబల్లమీద నాలుగు చివరలకు నాలుగు దీపపు ప్రమిదలు పెట్టి దానిపై పండుకొనువారు. కొన్నాళ్ళు గడచిన పిదప బాబా దానిని విరిచి ముక్కలు చేసి పారవేసెను. ఒకనాడు బాబా దాని మహిమను కాకాసాహెబుకు వర్ణించి చెప్పుచుండెను. ఇది విని యతడు బాబాకిట్లనియె – "మీకింకను కర్రబల్లయందు మక్కువయున్నచో నింకొక బల్ల మీకొరకు మసీదులో వ్రేలాడ వేసెదను. దానిపై మీరు సుఖముగా నిద్రింపవచ్చును".

అందుకు బాబా ఇట్లనెను "మహాల్సాపతిని దిగువ విడిచి నేనొక్కడనే పైన పండుకొనుటకిష్టము లేదు." కాకా సాహెబు ఇట్లనెను "మహాల్సాపతి కొరకు ఇంకొక బల్లను తయారు చేయించెదను". బాబా "అతడెట్లు బల్లపై పరుండగలడు? బల్లమీద అంత ఎత్తున పండుకొనుట సులభమయిన పని కాదు. ఎవరు మిక్కిలి పుణ్యవంతులో వారే పండుకొనగలరు. ఎవరయితే కండ్లు తెరచి నిద్రించగలరో వారికే యది వీలగును. నేను నిద్ర పోవునపుడు, మహాళ్సాపతిని నా ప్రక్కన కూర్చుండి తన చేయి నా హృదయముపై నుంచు మనెదను. అచ్చటినుంచి వచ్చు భగవన్నామ స్మరణమును వినుమనెదను. నేను పండుకొనినచో నన్ను లేవగొట్టుమనెదను. దీనినే యతడు నెరవేర్చలేకున్నాడు. నిద్రతో కునుకుపాట్లు పడుచుండును. నా హృదయముపై వాని చేతి బరువును గమనించి, ఓ భక్తా! అని పిలిచెదను. వెంటనే కండ్లు తెరచి కదలును. ఎవడయితే నేలపై చక్కగా నిద్రించలేడో, ఎవడు కదలకుండ యుండలేడో, ఎవడు నిద్రకు సేవకుడో, వాడు ఎత్తైన బల్లమీద నెట్లు పండుకొనగలడు?" అనెను.

అనేక పర్యాయములు బాబా తన భక్తులయందు ప్రేమచే నిట్లనెను – "మంచి గాని, చెడుగాని, ఏది మనదో యది మనదగ్గరనున్నది. ఏది ఇతరులదో, యది యితరులవద్దనున్నది"

## 217. స్రగ్వీ

- వైజయంతీ మాలను ధరించినవాడు.
- సూర్య చంద్రాది సమస్త లోకములను మాలగా ధరించినవాడు.

### ఓం స్రగ్విణే నమః

'స్రక్' అనగా పూలమాల. పాణిని సూత్రము (అష్టాధ్యాయి 5.2.121) ప్రకారము – **మాయా మేధా స్రజో వినిః** – 'స్రజ్' తరువాత 'విన్' ప్రత్యయము వచ్చినందువలన 'స్రగ్వీ' అనగా 'మాలతో సంబంధము కలిగినవాడు' అని అర్థము. శ్రీమహావిష్ణువు సదా దివ్యపరిమళ భరితమగు వైజయంతీమాలను ధరించినందున 'స్రగ్వి' యనబడును.

**పరత్వ సూచనీయా చ వైజయన్తీతి కీర్తితా తయా స్రజా నిత్యయోగాత్ స్రగ్వీతి పరికీర్త్యతే** - మత్స్యావతార మూర్తి అయినప్పటికీ పరతత్వాన్ని సూచించడానికి వైజయంతిమాలను (వనమాలను) నిత్యము ధరించువాడు స్రగ్వి.

ఆచార్య శ్రీనివాస రాఘవన్ గారి వివరణ ప్రకారము వైజయంతీమాల ఐదు రత్నములచే కూర్చబడి యుండును – ముత్యము, కెంపు, పచ్చ, పుష్యరాగము, వజ్రము (Pearl, Ruby, Emerald, Sapphire and Diamond)

శ్రీ శంకరుల వ్యాఖ్యానుసారము వైజయంతీమాల పంచతన్మాత్ర స్వరూపము. పంచభూతముల మూలగుణములైన రుచి, ఆకారము, శబ్దము, వాసన, స్పర్శ అనునవే ఈ పంచతన్మాత్రలు. ఇందుకు శ్రీరాధాకృష్ణశాస్త్రిగారు విష్ణుపురాణము (1.2.72) నుండి ప్రమాణమును ఉదాహరించారు.

**పంచ స్వరూప యా మాలా వైజయంతీ గదా భృతః**
**సా భూత హేతు సంగాతా భూతమాలా చ వై ద్విజః**

మనము పంచతన్మాత్రలను, అనగా సర్వేంద్రియ జ్ఞాన విషయములను భగవంతునికి అలంకారములుగా అర్పించవలయునని ధర్మచక్రము రచయిత సూచించారు. విష్ణురూపమే కన్నులకు పండుగ. నారాయణ భజనమే వీనులకు విందు. దేవునికర్పించు ధూపదీపములే సుగంధభోగములు. శ్రీహరికి నివేదించిన ప్రసాదమే మృష్టాన్నము. తులసి తీర్థమే మహాభాగ్యము. శ్రీనివాసుని అర్చించుటయే రాజభోగము. అలమేలు మంగను పూజించుటయే అష్టైశ్వర్యములను అనుభవించుట. శ్రీరంగనాథునకు సమర్పింపనున్న పూలమాలను ముందుగా తాను ధరించి అండాళ్ తల్లి ఆ దేవునికి అలంకారము సరిగానుండునో లేదో ముందుగా నిర్ధారించుకొనెడిది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు మరొక విశిష్ఠమైన అర్థమును చెప్పి 'స్రగ్వీ' నామధారియే విశ్వధరుడని వివరించారు. సకల నక్షత్రములు, గ్రహములు, సూర్యచంద్రులు, నక్షత్ర మండలములు, చతుర్దశ భువనములు అన్నియు ఆయనచే సృజింపబడి నిలిచియున్నవి గనుక ఆయన స్రగ్వీ. దండనుండి విడివడిన పూవు నిలువజాలదు. అలాగే సకల లోకములు కలిసి స్రగ్వీ యగును. ఆ స్రగ్వియే శ్రీమహావిష్ణువు. ప్రముఖులకు పూలమాలలు వేసి సన్మానించుట ఆచారము. విశ్వరూపునకు చతుర్దశ భువనములే తగిన మాల.

## 218. వాచస్పతి

- వాక్కునకు ప్రభువు.

### ఓం వాచస్పతయే నమః

ఈ నామము మరల 579వ నామముగా కీర్తింపబడినది.

23వ శ్లోకము. 218వ నామము – వాచస్పతిః – **నిమిషోఽనిమిషః స్రగ్వీవాచస్పతిరుదారధీః**

61వ శ్లోకము. 579వ నామము – వాచస్పతిః – **దివస్పృక్ సర్వదృగ్ వ్యాసో వాచస్పతిరయోనిజః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీమన్నారాయణుడు మత్స్యపురాణమున వేదములనుపదేశించెను. ఆయన గురువులకు గురువు. విద్యలకు విద్య. వేదములకు మూలము. కనుక వాచస్పతి. **వేదోప బృహణత్వాద్ధి వాచస్పతిరితి శ్రుతః** – వేదములకు ఉపబృహణములైన ధర్మశాస్త్రములను, పురాణములను, ఇతిహాసములను ప్రవర్తింపజేసినవాడు వాచస్పతి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'వాచస్పతి', మరియు తరువాత వచ్చే 'ఉదారధీ' అనే నామములను కలిపి 'వాచస్పతిరుదారధీ' అనే ఒకే నామముగా పరిగణించారు. 'ధీ' అనగా జ్ఞానము. 'ఉదారధీ' అనగా పరమశ్రేష్ఠమగు దివ్యజ్ఞానము. 'వాచస్పతి' అనగా విద్యాధిపతి. 'వాచస్పతిరుదారధీ' అనగా పరమోత్తమ జ్ఞానస్వరూపుడైన విద్యాధినాథుడు.

పెక్కు వ్యాఖ్యానకర్తలు 'వాచస్పతి + ఉదారధీ'ని ఏకనామముగానే పరిగణించారు. శ్రీ సత్యదేవో వాశిష్ఠగారు విడివిడి నామములుగా వ్యాఖ్యానము చెప్పి, లెక్కకు మాత్రము ఒకే నామముగా పరిగణిస్తూ, సరిగా వేయి నామములు లెక్క సరిపోవడానికి ఈ పద్ధతిని అనుసరించినట్లు వివరించారు. అయితే శ్రీ భట్టులు 'గురుర్గురుతమ' వంటి మరికొన్ని నామములను ఏకనామములుగా పరిగణించినందువలన వారి లెక్క వేయికి సరిపోతుంది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారి సత్యభాష్యము ప్రకారము – 'వాచస్పతి' అనగా వేదములను, విద్యలను కాపాడువాడు. వానికి ప్రభువు, గతి, పతి.

## 219. ఉదారధీః

- ఉదారమగు (కరుణాపూరితమగు) బుద్ధి (గుణము) కలిగినవాడు.

**ఓం ఉదారధయే నమః**

ధీ – బుద్ధి, జ్ఞానము, స్వభావము.

ఉదార – దయ కలిగిన, మితిలేని, దాతృత్వము

భగవంతుడు భక్తులపట్ల దయగల దాత. భక్తుల తప్పులను మన్నించి, ఒక్క దండముతోను, ఒక్క పూవుతోను సంతృప్తుడై వారి పాపములను హరించి, అభయమునిచ్చి, వరములు క్రుమ్మరించును. అనంత గుణవైభవమూర్తిని ఒక్క నామముతో స్మరించిన చాలును. గంగానదికి జన్మనిచ్చిన వానికి గిన్నెడు తీర్థము నైవేద్యము చాలును. మాయామోహితులైన జనుల బలహీనతలను గుర్తెరిగిన ఆయన వారి తప్పులను మన్నించుచునే యుండును. విద్యాది సంపదలు ప్రసాదించుచునే యుండును. అజ్ఞాన మోహితుడైన అర్జునునిపై కరుణించి, ఉదారధియే గీతోపదేశమును కావించెను.

**సర్వోపజీవ్య సార్వజ్ఞ్యా దుచ్యతే స ఉదారధీ** – లోకంలో అందరూ జీవించాలనే సంకల్పము కలవాడు. కర్మక్షయం కానివారందరికీ కర్మక్షయం చేసి మోక్షమును ప్రసాదించాలనే కోరికతో సృష్టి చేసినవాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు 'ఉదారధి' అనబడుచున్నాడు.



ద్వారకా తిరుమల తూర్పు ప్రవేశ ద్వారము



## అగ్రణీర్గ్రామణీః శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః |
## సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్ || (24)

### 220. అగ్రణీః

- ముందుండి గమ్యస్థానమునకు దారి చూపువాడు (మార్గదర్శి)

**ఓం అగ్రణ్యే నమః**

**అగ్రే నయతి ఇతి అగ్రణీః** – ఆధ్యాత్మిక సాధకులకు తాను ముందుగా నడచుచు గమ్యస్థానము చేర్చువాడు అగ్రణి. అనగా ముముక్షువులకు మార్గదర్శి – అని శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడ వ్యాఖ్యానించారు.

**మహోదారతయా భక్తాన్ అగ్రిమం పశ్చిమం (పరమం?) పదమ్ నయతీత్యగ్రణీః ప్రోక్తో మోక్షప్రదోమనుః -** పరమేశ్వరుడు కడు ఉదార స్వభావుడు కాబట్టి తన భక్తులకు పరమోత్కృష్టమైన పరమపదమును ఇస్తాడు. ఈ నామ స్మరణము మోక్షమును ప్రసాదిస్తుంది. ఓం అగ్రణ్యే నమః.

మోక్షసాధన పరముగా జీవులను నాలుగు విధములుగా విభజింపవచ్చునని 'ధర్మచక్రము' రచయిత వివరించారు. ఈ సందర్భముగా బెస్తవాని వలకు తగులుకునే చేపలను ఉదాహరణగా చెప్పారు.

1. నిత్యసూరులు – అసలు సంసారబంధములో తగులుకొననివారు. వేటగాని ఎరకు ఆశపడక ఎల్లప్పుడూ వలకు దూరముగా ఉండే చేపలవంటి జీవులు.
2. ముక్త జీవులు – సాధనయందు సఫలురై, సంసార బంధమునుండి బయటపడి మోక్షమునందుకొన్నవారు. వలలో పడికూడ, ప్రయత్నించి బయటపడ్డ చేపలవంటి జీవులు.
3. ముముక్షువులు – మోక్షముకొరకు సాధన చేయుచున్నవారు. బంధములనుండి బయటపడుటకు విలవిలలాడుచున్న చేపలవంటి జీవులు.
4. బద్ధజీవులు – సంసార బంధమున తగులుకొని, మాయామోహితులై, అందే సుఖమును వెతుకుకొనువారు. వేటగాని ఎరనే రుచికరముగా భావించి, చివరకు వేటగానికి ఆహారమగు చేపలవంటి జీవులు.

ఇందు ముముక్షువులు సంసార బంధముల ప్రాబల్యమును గ్రహించి, భగవంతునకు, గురువులకు శరణాగతులై, అహంకార మమకారములను త్యజింపనెంచి, శ్రీమన్నారాయణుని ధ్యానించు సాధకులు. వారికి భగవంతుడందించు చేయూతయే ఇక్కడ 'అగ్రణీః' నామమున స్తుతింపబడినది. నీట మునిగినవాడు ఊపిరికై ఎంత తపించునో అంతగా ముముక్షువు భగవత్ప్రాప్తికై సాధన చేయవలయును. అప్పుడే అగ్రణి దయ లభించును. శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు ఇక్కడ శ్రీమహావిష్ణువుయొక్క 'ముందుకు

నడిపించు గుణము'ను మరింతగా ప్రస్తావించారు. ఇది జీవితములో పలు సందర్భములందు ప్రస్ఫుటముగా కనిపిస్తుంది. కాలము ముందుకే నడుస్తుంది. గడచిన సమయము తిరిగిరాదు. సూర్యచంద్రాదులు భగవంతుని అభీష్టానుసారమే వర్తించుచున్నవి.

## 221. గ్రామణీః

- సకల సముదాయములకు (జీవులకు, దేవతలకు, ముముక్షువులకు) నాయకుడు. అందరికీ మోక్షమును చూపు పెద్దదిక్కు.

### ఓం గ్రామణ్యే నమః

**గ్రామమ్ సమాజమ్ నయతి ఇతి గ్రామణీః** – (భక్త) సమాజమును, సమూహమును నాయకత్వము వహించి ముందుకు నడుపువాడు గ్రామణి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు 'గ్రామ' పదమును మరింత వివరించారు. 'గ్రామ' అనగా ఏదైనా సముదాయము, గుంపు అని చెప్పవచ్చును. ఇండ్ల సముదాయము (ఊరు), ఇంద్రియ సముదాయము (దేహము), సంగీత సాధనముల సముదాయము (**సప్తస్వరాస్త్రయో గ్రామా** – నారదీయ శిక్ష). ఇలాగే సృష్టింపబడిన సకల భూత సముదాయము గ్రామము. సకల గ్రామములకు శరణ్యైనవాడు, భూతభావనుడు, భూతేశుడు, దేవదేవుడు, జగత్పతి గనుక భగవానుడు 'గ్రామణి'యగును.

ధర్మచక్రము రచయిత చక్కని ఉదాహరణ చెప్పినారు – ఒక అడవిలో తప్పిపోయి తిరుగాడుచున్నవాడు అదే విధముగా తడుముకొనే మరొకరిని ఆశ్రయించినందువలన ప్రయోజనము లేదు. అలాగునే సంసార ఘోరాటవిలో పడి కొట్టుకొనువారు ఇతర బద్ధ జీవులను ఆశ్రయించి లాభము లేదు. వారు కేవలము శ్రీమహావిష్ణువునకు శరణాగతులైన యెడల వారిని ఆయన మోక్షమార్గమున నడిపించును.

## 222. శ్రీమాన్

'శ్రీ' అనగా కాంతి, తేజస్సు, వైభవము, సంపద.

- సకల సంపదలు మూర్తీభవించిన మూర్తి. సిరిగలవాడు.
- సమస్త వైభవము గలవాడు. శ్రీ, ధృతి, స్మృతి, కీర్తి గలవాడు.
- ప్రకాశించువాడు. తేజోమూర్తి.
- శ్రీమహాలక్ష్మీపతి. వక్షస్థలమున శ్రీమహాలక్ష్మిని నిలుపుకొన్నవాడు.
- సకల శక్తిమంతుడు.

### ఓం శ్రీమతే నమః

ఈ మంగళకర నామము 22వ నామముగాను, 180వ నామముగాను, మరల ఈ 222వ నామముగాను కీర్తింపబడినది. ఈ మూడు సందర్భములలోను ప్రముఖ వ్యాఖ్యాతల అనుభవం ఆసక్తికరంగా వ్యక్తమైనది.

శ్రీ శంకరుల వ్యాఖ్యప్రకారము 'శ్రీమాన్' నామము నాలుగుమార్లు (3వ, 19వ, 24వ, 65వ శ్లోకములలో) వస్తుంది. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము ఈ నామము 3 మార్లు (3వ, 19వ, 24వ శ్లోకములలో) వస్తుంది. 65వ శ్లోకములో శ్రీభట్టులు 'శ్రేయశ్శ్రీమాన్' అనే ఒకే నామముగా పరిగణించారు.

3వ శ్లోకము. 22వ నామము – శ్రీమాన్ – **నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య: అతిమనోహర సుందర శ్రీ నారసింహ స్వరూపము

శ్రీ శంకరుల వ్యాఖ్య: వక్షస్థలమున శ్రీలక్ష్మిని ధరించినవాడు.

19వ శ్లోకము. 180వ నామము – శ్రీమాన్ – **అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్**

శ్రీ భట్టుల వ్యాఖ్య: దివ్యాభరణములతో, దివ్య మాల్యాంబరములతో శోభిల్లువాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య: సకలైశ్వర్య సంపన్నుడు

24వ శ్లోకము. 222వ నామము – శ్రీమాన్ – **అగ్రణీః గ్రామణీః శ్రీమాన్ న్యాయోనేతా సమీరణః**

శ్రీ భట్టుల వ్యాఖ్య: శ్రీయుత మత్స్య మూర్తి. అన్ని సంపదలను కలిగినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య: అనన్య తేజోమయుడు.

65వ శ్లోకము – 619వ నామము. శ్రీమాన్ / శ్రేయశ్శ్రీమాన్ – **శ్రీధరః శ్రీకరః శ్రేయఃశ్రీమాన్ లోకత్రయాశ్రయః**

శ్రీ భట్టుల వ్యాఖ్య: **శ్రేయశ్శ్రీమాన్** – సకల సంపదలను ప్రసాదించు లక్ష్మీదేవిని నిత్యము కలిగియున్న శ్రీధరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య: **శ్రీమాన్** – సకల వైభవములు, సమస్త భోగభాగ్యములు, సకల విభూతులు, సకల సద్గుణములు, సర్వశక్తులు, సర్వనిధులు తనయందే కలిగియున్న శ్రీమంతుడు.

'శ్రీ' అనగా సంపద అన్న అర్థములో శ్రీభట్టులు వ్యాఖ్యానము చెప్పారు. **మత్స్యః కమల లోచనః** – పద్మాక్షుడైన మత్స్యావతారమూర్తి శ్రీమంతుడు. పరమాత్ముడు. విపత్తులను తొలగించి సంపదలు వర్షించు కరుణామయుడు.

'శ్రీ' అనగా కాంతి అనే అర్థంలో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. భగవంతుని ప్రకాశము అనితరము. ఆయన వెలుగులకు వెలుగు. చదువులకు మూలము. **సర్వాతిశయాని శ్రీః కాంతి అస్యః**

శ్రీ చిన్మయానంద – 'శ్రీ' అనగా జగన్మాతయగు లక్ష్మీదేవి. అన్నిశక్తులకు, సంపదలకు, వైభవములకు ఆలవాలము. అట్టి సకల శక్తి సంపదలు శ్రీమహావిష్ణువునందు గలవు గనుక ఆయన 'శ్రీమాన్'.

'శ్రీమాన్' అనగా శ్రియఃపతి. మహాలక్ష్మీవల్లభుడు. ఆయన వక్షస్థలమున 'శ్రీ' వసించును గనుక అందమంతా ఆయనయందే పొందగును.

ధర్మచక్రము రచయిత – ప్రకృతి, పురుషులను విడదీయ సాధ్యము కాదు. అట్లే లక్ష్మీనారాయణులు సదా ఏకమైయుందురు. వారొకే పరబ్రహ్మము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'శ్రీ' అనగా సేవింపదగినది. 'శ్రీ' అనగా శోభ. 'శ్రీ' అనగా కాంతి. 'శ్రీ' అనగా సంపద. శ్రీనివాసుడే అందరిచేత సేవింపబడువాడు. ప్రకృతియందు కానవచ్చు సౌందర్యమంతా ఆయనను స్మరింపుమని చెప్పు గురుతులే. ఆయన ప్రకాశము సూర్యచంద్రాగ్నులకు వెలుగునిచ్చును. ఆయనే తరుగులేని సంపద.

## 223. న్యాయః

- భక్తులకు తగురీతిలో (మోక్ష) ఫలము నొసగువాడు.
- పరబ్రహ్మ జ్ఞానమునకు దారిచూపు తర్కము, యుక్తి.
- విశ్వమందు అంతటిని సక్రమముగా నియమముగా నడుపు శక్తి.

## ఓం న్యాయాయ నమః

'న్యాయము' అనగా ధర్మము ననుసరించి ఇచ్చు ఫలము (Justice). న్యాయము అనగా తర్కశాస్త్రములో ప్రమాణము (Logical Rule).

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు భక్తులకు సదా న్యాయము చేయును. వారికి తగిన ఫలములను ప్రసాదించును. వారికి కీడు రాకుండ కాచును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ప్రమాణానుగ్రాహకములందు తర్కమును, యుక్తియును ఆయనే. 'ప్రమాణానుగ్రాహకములు' అనగా విజ్ఞానమునకు మౌలిక సూత్రములు. 'తర్కము' అనగా శాస్త్రానుసారముగ మంచి చెడులను వేరు చేయుట. 'యుక్తి' అనగా తత్త్వ విచార మార్గము, సాధనము. కనుక జ్ఞానసాధనకు మార్గము ఆయనే. గమ్యము ఆయనే. తిరుగు లేని వాదన ద్వారా (వేదప్రమాణము ద్వారా?) మార్గనిర్దేశనము చేయును గనుక భగవానుడు 'న్యాయము' అని శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు వివరించారు.

ఈ భావాన్ని ధర్మచక్రము రచయిత మరింత విపులీకరించారు – తర్కములో వాదము, వితండము, జల్పము అనే మూడు విధాలున్నాయి. వాదము - సత్యశోధనకై శ్రద్ధతో, వినయముతో సాగించు సాధన; వితండము - ప్రతివాదిని కంగారుపెట్టి, అహంకారముతో జరుపు విధము; జల్పము - అధికార మదముతో ప్రతివాదిని భయపెట్టు పద్ధతి. ఇందు 'వాదము' అనునది శాస్త్రానుగుణముగా, ఉచితముగా సాగించు జ్ఞానసముపార్జనా విధానము. మహావిష్ణువును అర్చించువారు శ్రద్ధ, వినయములు కలిగి సముచితముగా తర్కమును సాగించి జ్ఞానమును పొందుట తథ్యము. మాయా మోహములనుండి వారు విముక్తు లగుదురు. గీతోపదేశమును విన్న అర్జునుడు ఈ విధముగాపలికెను (గీత 18.73)

**నష్టో మోహః స్మృతిర్లబ్ధాత్వత్ప్రసాదాన్మయాచ్యుత స్థితోऽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ -** ఓ అచ్యుత! నీ కృపచే, నా మోహము పూర్తిగా తొలగినది. స్మృతిని పొందితిని. ఇప్పుడు సంశయ రహితుడనైతిని. కనుక నీ ఆజ్ఞను తల దాల్చెదను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'న్యాయము' అనగా 'నియమము ప్రకారము నడచు విధము' అనే భావములో కూడ వివరించారు. 'నియతి' అనగా శాసించుట, అధికారము నెరపుట. **నీయతే ప్రాప్యతే ఇతి న్యాయః.** విశ్వములో అంతయును నియమానుసారముగ వర్తించుటకు కారణము గనుక శ్రీమన్నారాయణుడే న్యాయము. సూర్య చంద్రాదుల గతులకు, ఇంద్రియముల ప్రవర్తనకు, సకల జీవుల స్వభావములకు నియంతయైనందున భగవంతుడే న్యాయము.

## 224. నేతా

- భక్తుల కోరికలు తీర్చువాడు.
- విశ్వమునందన్ని వ్యవహారములను నిర్వహించు అధికారి.

## ఓం నేత్రే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **నియుక్తమ్ కరోతి ఇతి నేతా**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **జగద్-యంత్ర నిర్వాహకః నేతా**

ధర్మచక్రము రచయిత వివరణ – ఒక చక్రము తిరుగునపుడు దానికి అతికించిన వస్తువులు కూడ తిరుగుచుండును. అలాగే భగవత్సంకల్పమున కనుగుణముగా సకలము వర్తించుచుండును, అందరము ప్రవర్తించుచుందుము. కాని మన శక్తి సామర్థ్యముల

వలన, ఇష్టానుసారము మనమిలా చేయుచున్నామని ప్రజలు భ్రమింతురు. ఈ నామస్మరణము ద్వారా ఈ మోహమును, భ్రాంతిని విడిచి, సర్వము తానెయ్యైన పరమేశ్వరునకు శరణాగతులు కావచ్చును.

శ్రీకృష్ణభగవానుడు రథమును, రథములోని అర్జునుని నడపుచుండెను. రథమునకు తానే చలనశక్తియను భ్రాంతి లేదు. కాని జీవాత్మయగు అర్జునునకు మాత్రము తానే యుద్ధముచేయు శక్తియను మోహము క్రమ్మివేసెను. అప్పుడు భగవంతుడు 'నన్నే నమ్ముకొనుము. నాకే నమస్కరించుము. నిన్ను కాపాడెదను' అని యుపదేశించెను.

శ్రీకృష్ణపరమాత్ముడు ఆయుధమును ధరింపలేదు. యుద్ధము చేయలేదు. ఊరకే చూచుచున్నట్లుండెను. ఆయన సర్వసాక్షి. విశ్వాత్మకుడు. అంతర్యామి. అంతటిని గమనించుచుండును. అన్నింటిని నిర్వహించుచుండును. అంతా ఆయన సంకల్పానుసారమే సంభవించును. అందరికిని నేత ఆయనే.

## 225. సమీరణః

- అద్భుతమైన, మనోహరమైన కార్యములను నిర్వహించువాడు.
- సకల జీవుల శ్వాసను, తదితర చైతన్యమును నడపువాడు.

### ఓం సమీరణాయ నమః

'ఈర్' అనే ధాతువునుండి 'ఈరణ' అనగా 'చలింపజేయుట' అనే అర్థము వచ్చును.

వైవస్వత మన్వంతర ప్రారంభ కాలమున వేదములను దొంగిలించిన హయగ్రీవుడను దైత్యుడు ప్రళయాంభోనిధిలోనికి ఉరికినాడు. శ్రీమహావిష్ణువు మహామత్స్యాకృతుడై ఆ రాక్షసుని వెదకి చంపి శృతులను బ్రహ్మకొసగిన మహాద్భుత కార్యమును ఈ నామ వివరణయందు శ్రీ భట్టులు ప్రస్తావించినారు.

ఈ మత్స్యావతారమునందే మాధవుడు సత్యవ్రతుని, ముని బృందమును, ఓషధులను, సృష్టిబీజములను కలిగిన నావను తన కొమ్ముతో ప్రళయమహాసాగరమును దాటించిన వైనము 'సమీరణ' నామ గుణగానమని శ్రీరాధాకృష్ణశాస్త్రి వ్యాఖ్యానించారు.

శ్రీమద్భాగవతము 8వ స్కంధము 24వ అధ్యాయములోని 33వ శ్లోకము

**త్రైలోక్యమ్ లీయమానామ్ సంవర్తాంభసి వై తదా**
**అప్స్యాస్యతి నౌః కాచిత్ విశాలా త్వామ్ మయా ఈరితా**

ముల్లోకములు సాగరగర్భమున అదృశ్యమగునపుడు ఒక పెద్ద నావ నాచే నీవైపుకు లాగబడును. ఇక్కడ 'ఈరితా' అన్న పదమును గమనించదగును.

'సమీరణ' నామమునందలి చలనమును సకల ప్రాణులయందలి శ్వాసగా శ్రీ శంకరులు అన్వయించారు. ఊపిరి సాధనముగా సమస్త జీవుల కర్మములను అధీనమందుంచుకొనువాడు గనుక శ్రీమన్నారాయణుడే సమీరణుడు.

ఈ అర్థమును శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు మరి కొంచెము ముందుకు లాగారు. సృష్ట్యాదినుండి కల్పాంతము వరకు మనిషికి 32 పండ్లు ఉండును. సూర్యచంద్రాదులు తమతమ గతులయందు వర్తించును. ఇదంతా భగవంతునికి చైతన్యముపై గల నియంత్రణకు సంకేతము.

**పోతన భాగవతమునందు శ్రీమత్స్యావతార వర్ణనము.** (శ్రీ మాడుగుల నాగఫణిశర్మ 'పోతన భాగవత కవితాసుధ' ఆడియో క్యాసెట్టు నుండి విని వ్రాసినది.)

ఒకనాటి కల్పాంత సమయమున మహాయుగసంధిలో (చాక్షుస మన్వంతరము ముగిసి, వైవస్వత మన్వంతరము ఆరంభమగుటకు ముందు) జరిగిన కథ ఇది. వివస్వతుడు అనే సూర్యుని పుత్రుడు సత్యవ్రతుడు. అతనికి శ్రాద్ధదేవుడు అనే పేరు కూడ గలదు. ఆ సత్యవ్రతుడు కృతమాలిక అనే నదిలో అర్ఘ్యం ఇస్తున్నాడు. అప్పుడు అతని చేతిలోనికి ఒక చేపపిల్ల వచ్చింది. దానిని తిరిగి వదలి పెట్టబోగా అది తనను కాపాడమని కోరింది. సరే అని ఇంటికి తీసికొని వెళ్ళగా అది ఒక్క ఘడియలో చెంబుకంటె పెద్దదయ్యింది. ఇంకా పెద్ద పాత్రలో వేస్తే ఆ పాత్ర కూడా పట్టకుండా పెరిగింది. చెరువులో వేస్తే చెరువు చాలనంత పెరిగింది. నదిలో వేస్తె ఇంకా పెద్దయ్యింది. అప్పుడు రాజు "నీవెవరవు?" అని ఆ చేపను ప్రార్థించగా ఆ చేప తాను మత్స్యాకృతి దాల్చిన విష్ణువునని చెప్పింది. "శ్రీ లలనా కుచవీధీకేళీ పరతంత్రబుద్ధిన్ క్రీడించు శ్రీహరీ! తామసాకృతిన్ ఏలా మత్స్యంబవైతివి?" అని రాజు ప్రశ్నించాడు. అప్పుడా మత్స్యం ఇలా జవాబిచ్చింది. "రాజా! నేటికి 7వ దినమునకు బ్రహ్మదేవునకు ఒక పగలు పూర్తియై రాత్రి కావస్తున్నది. అప్పుడు సకల ప్రపంచమూ జలమయమౌతుంది. నా మహిమ వల్ల ఆ ప్రళయసాగరంలో ఒక నావ వస్తుంది. ఆ నావలో నిన్నూ, తపోమూర్తులైన సప్తర్షులనూ, ఓషధులను, తిరిగి సృష్టికోసం అవుసరమైన మూలబీజాలనూ పదిలం చేసి, నా శృంగము (ఒంటి కొమ్ము) తో ఆ నావను లాగి ప్రళయాంబోధిని దాటింతును" అని చెప్పెను. ఎడతెరిపిలేని సృష్టి కార్యంలో అలసిన బ్రహ్మ ఆ కల్పాంత సాయంసంధ్యలో రవ్వంత కునుకు తీసెను. ఇదే అదనుగా చూసుకొని హయగ్రీవుడనే రాక్షసుడు బ్రహ్మ దగ్గరనుండి చతుర్వేదాలను చేజిక్కించుకొని మహాజలరాశి గర్భంలోనికి ఉరుకెత్తాడు. మీనాకృతియైన శ్రీమహావిష్ణువు వేదచౌర్యమొనర్చిన రాక్షసుని వెంటాడిన విధము

ఒకమాటు జలజంతు యూథంబుతో గూడు - ఒకమాటు దరులకుం బుదికివచ్చు
ఒకమాటు మింటికి ఉరగి ఉల్లంఘించు - ఒకమాటు లోపల నొదిగి యుండు
ఒకమాటు వారాసి నొడలు ముంపమి నూపు - ఒకమాటు బ్రహ్మాండ మొరయ దలచు
ఒకమాటు ఝుషకోటి నొడిసి యాహారించు - ఒకమాటు జలముల నుమిసివైచు
కనులు సారించు మీసలు గడలు గొలుపు
ఒడలు మెరిపించు కన్నుల పలపమార్చు
ఒడలు ఝుళిపించు తళతళ లొలయ
మీనవేషి పెన్నీటి నిగమ గవేషి యగుచు

ఉరకంభోనిధిలోని వేదముల కుయున్ దైత్యున్ జూచి పే
గరులాడించి ముఖంబు సాచి పలువీతన్ తోక సారించి మేన్
మెరయన్ దౌడలు గీరి మీసలడరన్ మీనాకృతిన్ విష్ణుడ
క్కరటిన్ దాకి వధించె ముష్టి దళిత గ్రావున్ హయగ్రీవున్



శ్రీ మత్స్యావతార మూర్తి – 1760 కాలపు చిత్రం. వికీపీడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:Vishnu_matsya.jpg

అలా శ్రీమన్నారాయణుడు మత్స్యరూపంలో ఆ రాక్షసుని వెదకి, చంపి, వేదములను తిరిగితెచ్చి బ్రహ్మకిచ్చాడు.

ఆ యాదినారాయణుని సత్యవ్రత రాజేంద్రుడు ఇలా ప్రస్తుతించాడు.

చెలివై చుట్టమవై మనస్థితుడవై చిన్మూర్తివై ఆత్మవై
వలనై కోర్కెల పంటవై విభుడవై వర్తిల్లు నిన్నొల్లకే

పలువెంటన్ బడి లోకమక్కటా వృధా బద్ధాశమై పోయెడున్
నిలువన్నేర్చునె హేమరాశి గనియున్ నిర్భాగ్యుడంభశ్శయ్యాపహా!

ఆలింపుము విన్నపమిదె
వేలుపు గమి రేయి నిన్ను వేడికొనియెదన్
నాలోన్ చిక్కు మానిచి
నీలోనికి గొంచుపొమ్ము నిఖిలాధీశా!

సత్య వ్రతుని సంస్తుతులకు సంతసించి పురాణపురుషుడైన మాధవుడు అతనికి సాంఖ్యయోగ క్రియను, పురాణ సంహితను ఉపదేశించెను. కృపానిధియై మహామత్స్యశరీరుడు సత్యవ్రతుని, మునిబృందమును, ఓషధులను, మూలబీజములను కల్గిన నావను ప్రళయాంభోనిధిని దాటించెను. వివస్వతుని పుత్రుడైన సత్యవ్రతుడు శ్రీహరి అనుగ్రహమువలన ప్రస్తుతం నడుస్తున్న "వైవస్వత మన్వంతరానికి" అధిపతి అయ్యాడు.

ప్రళయాంభోనిధిలోన మేన్ మరచి నిద్రంజెందు వాణీశు
మోల వేదంబులు గొన్న దైత్యున్ మృతిన్ బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మమ మాటలన్ దెలిపి సర్వాధారుడై మీనమై
జలధిం గ్రుంకుచు తేలుచున్ మెలగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్

ఈ చరిత్ర విన్నచో కలుగు ఫలశ్రుతి

జనవిభుండు తపసి సత్యవ్రతుండును మత్స్యరూపియైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు వినినవాడు బంధవిరహితుండు.

**మన్వంతరము (శ్రీ జయదయాల్ గోయందకా గారి గీతా తత్త్వవివేచనీవ్యాఖ్య నుండి)**

దేవతల కాల ప్రమాణము మన(మానవ) కాలప్రమాణమునకు 360 రెట్లు అధికము. అనగా మన ఒక సంవత్సరకాలము దేవతలకు ఒక దివారాత్రము (పగలు + రాత్రి). మన 30 సంవత్సరములు దేవతలకు ఒక నెల. మన 360 సంవత్సరములు వారికి ఒక (దివ్య) సంవత్సరము. ఇట్టి 12,000 దివ్య సంవత్సరములు వారికి ఒక దివ్య యుగము (మహాయుగము). ఇది మనకు ఒక చతుర్యుగకాల సమానము. ఈ విధముగా లెక్క పెడితే మన 43,20,000 సంవత్సరములు ఒక మహాయుగము అగును.

| యుగము | దివ్య సంవత్సరములు | మానవ సంవత్సరములు |
|---|---|---|
| కృత యుగము | 4,800 | 17,28,000 |
| త్రేతా యుగము | 3,600 | 12,96,000 |
| ద్వాపర యుగము | 2,400 | 12,96,000 |
| కలియుగము | 1,200 | 4,32,000 |

మొత్తము 12,000 దివ్య సంవత్సరములు = 43,20,000 మానవ సంవత్సరములు = ఒక దివ్య యుగము (చతుర్యుగము, మహాయుగము). ఇలాంటి వేయి దివ్య యుగములు బ్రహ్మదేవునకు ఒక పగలు. బ్రహ్మ పగలును కల్పము (సర్గము) అంటారు. మరొక వేయి దివ్య యుగములు బ్రహ్మదేవునకు ఒక రాత్రి. ఈ రాత్రిని ప్రళయము అంటారు. అటువంటి 360 దివారాత్రములు బ్రహ్మకు ఒక సంవత్సరము. అటువంటి 100 సంవత్సరములు బ్రహ్మ ఆయుఃకాలము.

| కాలమానము | సౌర (మానవ) సంవత్సరాలు | దివ్య సంవత్సరాలు |
|---|---|---|
| ఒక చతుర్యుగము | 43,20,000 | 12,000 |

| | | |
|---|---|---|
| 71 చతుర్యుగములు | 30,67,20,000 | 8,52,000 |
| ప్రతి కల్పాదియందు వచ్చు సంధ్య | 17,28,000 | 4,800 |
| 14 సంధ్యా కాలములు | 2,41,92,000 | 67,200 |
| ఒక సంధ్యాకాలముతో పాటు ఒక మన్వంతరము | 30,84,48,000 | 8,56,800 |
| 14 సంధ్యలతో పాటు కలిపిన 14 మన్వంతరములు | 4,31,82,72,000 | 1,19,95,200 |
| 14 మన్వంతరములు + కల్పాది సంధ్య = ఒక కల్పము = బ్రహ్మకు ఒక పగలు | 4,32,00,00,000 | 1,20,00,000 |
| బ్రహ్మకు ఒక రాత్రి | 4,32,00,00,000 | 1,20,00,000 |
| బ్రహ్మకు ఒక దివారాత్రము (ఒక రోజు) | 8,64,00,00,000 | 2,40,00,000 |
| బ్రహ్మకు ఒక సంవత్సరము | 311040,00,00,000 | 864,00,00,000 |

**మన్వంతరముల పేర్లు**

1. స్వాయంభువ మన్వంతరము
2. స్వారోచిష మన్వంతరము
3. ఉత్తమ మన్వంతరము
4. తామస మన్వంతరము
5. రైవత మన్వంతరము
6. చాక్షుష మన్వంతరము
7. **వైవస్వత మన్వంతరము (ప్రస్తుతము జరుగుచున్నది)**
8. సూర్యసావర్ణి మన్వంతరము
9. దక్షసావర్ణి మన్వంతరము
10. బ్రహ్మసావర్ణి మన్వంతరము
11. ధర్మసావర్ణి మన్వంతరము
12. భద్రసావర్ణి మన్వంతరము
13. దేవసావర్ణి మన్వంతరము
14. ఇంద్రసావర్ణి మన్వంతరము



వైవస్వత మనువును ప్రళయాంబోధి దాటిస్తున్న శ్రీ మత్స్యావతార మూర్తి.

వికీపీడియా చిత్రం. గీతా ప్రెస్ ప్రచురణ నుండి.

By Ramanarayanadatta Shastri

---

## 226. సహస్రమూర్ధా

- వేయి శిరసులు గలవాడు

**ఓం సహస్రమూర్ధ్నే నమః**

## 228. సహస్రాక్షః

- వేయి కన్నులు గలవాడు

**ఓం సహస్రాక్షాయ నమః**

## 229. సహస్రపాత్

- వేయి పాదములు గలవాడు

### ఓం సహస్రపదే నమః

శ్రీ భట్టులు ఈ మూడు నామములకు కలిపి వ్యాఖ్యానము చెప్పారు. ఇక్కడ శిరసులు, కన్నులు, పాదముల ప్రస్తావన అనగా సకలములైన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములను గూర్చి చెప్పినట్లు భావింపవలెను. ఇంకా 'వేయి' అనగా 'లెక్కపెట్టలేనన్ని, అంతులేని' అని అర్థము చెప్పుకొనవలెను. తద్వారా భగవంతుని విశ్వవ్యాప్తిత్వము ప్రస్తుతింపబడుచున్నది. అనంత జ్ఞానేంద్రియ యుతుడైనందున శ్రీహరికి తెలియని విషయముండదు. అనంత కర్మేంద్రియములు కలిగినందున ఆయనకు సాధ్యముకాని పని లేదు. ఎక్కడైనను, ఎప్పుడైనను మన మొనరించు పూజా నమస్కార నామస్మరణములను ఆయన అంగీకరించును. మనమర్పించు నైవేద్యమును స్వీకరించును. భక్తులకు వరములు ప్రసాదించును. అభయము నొసగును.

ఈ మూడు నామములకు శ్రుతులనుండి పెక్కు ఆధారములు గలవు.

**సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్** – పురుష సూక్తము.
**సర్వతః పాణిపాదమ్ తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్** – గీత 13.13
**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్** – తైత్తరీయారణ్యకము 10.1
**అనేక వక్త్ర నయనమ్ అనేకాద్భుత దర్శనమ్** – గీత 11.10
**రూపమ్ మహత్ తే బహువక్త్రనేత్రమ్ .. .. ... బహు బాహూరుపాదమ్** – గీత 11.23

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – తల్లి గర్భములో ముందుగా తల రూపుదిద్దుకొనును. జన్మ సమయమున ముందుగా తల బయటకు వచ్చును. కనుక ముందుగా 'సహస్రమూర్ధా' అను నామము చెప్పడమైనది. ఇంకా జ్ఞాన, కర్మేంద్రియములలో జ్ఞానశక్తి, క్రియాశక్తి నుపయోగించుటలో వానికున్న ప్రాముఖ్యతవలన శిరస్సు, నేత్రములు, పాదములు ఇచ్చట స్తుతింపబడినవి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఈ మూడు మహానామములు భగవంతుని సర్వవ్యాప్తిత్వమును, సర్వాంతర్యామిత్వమును, సర్వశక్తిత్వమును కీర్తించుచున్నవి. ఆయన లేని చోటు లేదు. ఆయనే సర్వసాక్షి. మరియు అనంతమైన శిరస్సులు అనంతమైన బుద్ధికి కూడ సంకేతము. మనమందరము శ్రీమన్నారాయణుని శరీరమునందు భాగములు (అవయవములు) గనుక అందరి తలలు ఆయన తలలే. ఇందువలన కూడ భగవంతుడు సహస్రమూర్ధ్నుడు. సర్వాంతర్యామి, సర్వసాక్షి గనుక శ్రీహరి సహస్రాక్షుడు. ఆయన సృష్టియందు జీవులు బహువిధములుగా సంచరించును. రెండుకాళ్ళు, నాల్గుకాళ్ళు, నూరుకాళ్ళు, అసలు కాళ్ళు లేకుండుట, రెక్కలుండుట, ఈదగలుగుట – అంటే ఆయన అనంత జ్ఞానసంపన్నుడై సృష్టివైవిధ్యమునకు కారకుడైనందున సహస్రపాదుడు.

వేదమునందు '**సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**' అని చెప్పబడెను. శ్రీ విష్ణుసహస్రనామములో కూడా ఇదే క్రమములో ఈ మూడు నామములు చెప్పబడుట గమనార్హము.

శ్రీ చిన్మయానంద – పెక్కు తలలు, పెక్కు కన్నులు, పెక్కు పాదములు – అన్నీ కలిపి ఒకే అనంత చైతన్యమును సూచించును. ఈ సచ్చిదానంద పరబ్రహ్మమే ఆలోచించుట (తల ద్వారా), చూచుట (కన్నుల వలన), నడచుట (కాళ్ళతో) వంటి జీవగుణములను వ్యక్తమొనర్చును.

## 227. విశ్వాత్మా

- విశ్వమునకే ఆత్మ. సకల భూతములకు అంతఃస్థితుడైన ఆద్యుడు.

**ఓం విశ్వాత్మనే నమః**

**విశ్వస్య ఆత్మా విశ్వాత్మా** – శ్రీనివాసుడు తన జ్ఞానమువల్లను, శక్తివల్లను విశ్వమంతయును వ్యాపించియున్నందున విశ్వాత్మకుడగును.

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానాం అంత ఏవ చ** – గీత 10.20
ఓ అర్జున! సమస్త ప్రాణులయందున్న ఆత్మను నేనే. సకల భూతముల (ప్రాణుల) ఆదియును, మధ్యస్థితియును, అంతము నేనే (ప్రాణులయొక్క సృష్టి, స్థితి, లయములకు కారణము నేనే)

ధర్మచక్రము రచయిత - సకల చరాచర జీవములు పరమాత్ముని స్వరూపములేయని, ఆకార వ్యవహారాది విభేదములు పై పై ఆచ్ఛాదనలేయని గ్రహించుట ఈ నామస్మరణయొక్క ప్రధాన ధ్యేయము. బయటకు కనిపించు విభేదములను పట్టించుకొనుటవల్ల కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యములు వృద్ధిపొందును. కాని సకల జీవజాలమునందు భగవంతుని దర్శించువారికి ఆయన కటాక్షము సిద్ధించును.

యాజ్ఞవల్క్య మునీంద్రుడు మైత్రేయికి చేసిన ఉపదేశము – **నవాऽరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి ఆత్మనస్తు కామాన జాయా ప్రియా భవతి** ... ... – ఎవరైనను తన భార్యను ఆకారమునుబట్టి గాక ఆత్మనుబట్టి ప్రేమింపవలయును. ఇదే నిజమైన ప్రేమ.



అనంతపురం శ్రీ కృష్ణచైతన్య సంఘం మందిరంలో మూర్తులు. **వికీపీడియా చిత్రం.** by Geetha geeths!!

https://commons.wikimedia.org/wiki/File:Iskcon_temple_30.jpg



## ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః |
## అహఃసంవర్తకో వహ్నిరనిలో ధరణీధరః || (25)

### 230. ఆవర్తనః

- సంసారచక్రమును పరిభ్రమింపజేయువాడు.

**ఓం ఆవర్తనాయ నమః**

**సంసార చక్రమ్ ఆవర్తయితు శీలమ్ అస్య ఇతి ఆవర్తనః –** 'ఆవర్తనము' అనగా మరల మరల జరుగుట. సంసారము అనగా దివారాత్రములు, జననమరణములు, సుఖదుఃఖములు, సృష్టి నాశనములు – ఇలా పునరావృతమగు కాలచక్రము. ఇట్టికాలచక్రము అనంతుని మాయవలననే అవిరామముగా తిరుగుచున్నది. దానిని త్రిప్పువాడు ఆవర్తనుడు. ఆయనను శరణుజొచ్చినవారే ఆ మాయను దాటగలరు.

**సంసారాఖ్య ఘటీ యన్త్రే పరివర్తన శీలతః చక్రవచ్చ విశేషణ హ్యావర్తన ఇతీరితః -** జీవులను సంసారము అనే రంగులరాట్నమునందు ప్రవేశపెట్టి వారి కర్మానుసారము త్రిప్పుతూ ఉండేవాడు ఆవర్తనుడు.

**దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే** – గీత 7.14
నా మాయ త్రిగుణాత్మకమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి, సంసార సముద్రమునుండి బయట పడగలరు.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**
**భ్రామయన్ సర్వ భూతాని యంత్రారూఢాని మాయయా** – గీత 18.61
అర్జున! శరీర రూప యంత్రములను అధిరోహించిన సర్వప్రాణుల హృదయములయందు అంతర్యామిగానున్న పరమేశ్వరుడు తన మాయ చేత వారివారి కర్మలను అనుసరించి వారిని భ్రమింప జేయుచున్నాడు.

**కాలచక్రం జగచ్చక్రం యుగచక్రం చ కేశవః**
**ఆత్మయోగేన భగవాన్ పరివర్తతేఽనిశమ్** – మహాభారతము. ఉద్యోగపర్వము.
కాలచక్రము, జగచ్చక్రము, యుగచక్రము – వీటన్నింటినీ భగవానుడైన కేశవుడు తన సంకల్పముతో ఎల్లప్పుడూ త్రిప్పుతూనే ఉన్నాడు.

## 231. నివృత్తాత్మా

- అన్నింటికంటె మహోన్నతమగు పరమపద తత్వమూర్తి.
- సంసార చక్రమును త్రిప్పువాడైనను, కోర్కెలకు అతీతుడైనవాడు. మాయాతీతుడు.
- నివృత్తి ధర్మమును పాటించువారికి ఆత్మస్వరూపుడు.
- సంసార బంధములకు అతీతుడు.

### ఓం నివృత్తాత్మనే నమః

'నివృత్తాత్మ' నామము 231, 453, 604, 780వ నామములుగా – అనగా నాలుగుమారులు కీర్తింపబడిన మోక్షప్రదమగు నామము. ఈ నామమునకు వ్యాఖ్యానకర్తలు నాలుగు వేర్వేరు వివరణలు ఇచ్చి పునరుక్తి లేదని నిరూపించినారు.

25వ శ్లోకము. 231వ నామము. **నివృత్తాత్మా** – ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః
48వ శ్లోకము.453వ నామము.
శ్రీ భట్టుల పాఠము ప్రకారము: **నివృత్తాత్మా** – సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్
శ్రీ శంకరుల పాఠము ప్రకారము: **విముక్తాత్మా** – సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్
64వ శ్లోకము. 604వ నామము. **నివృత్తాత్మా** – అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః
83వ శ్లోకము. 780వ నామము.
శ్రీ భట్టుల పాఠము ప్రకారము: **నివృత్తాత్మా** – సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః
శ్రీ శంకరుల పాఠము ప్రకారము: **అనివృత్తాత్మా** – సమావర్తోऽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః

అన్నింటికంటె మహోన్నతమగు పరమపద తత్వమూర్తి. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణములు –
**త్రిపాదూర్ధ్వ ఉదయిత్ పురుషః** – భౌతిక లోకమునకు మూడురెట్లు ప్రశంసనీయమైన పరమపదమున ప్రకాశించు పురుషుడు (పురుషసూక్తము 4).
**పరాత్ పరమ్ యన్ మహతో మహాన్తమ్** – అధికమైనవానికన్నింటికిని అత్యధికుడు, మహత్తరమైన అన్నింటికంటె మహాత్ముడు (తైత్తరీయ నారాయణోపనిషత్తు 1.5)

**త్రిపాద్విభూతికత్వేన భవపాద విభూతితః ఉద్గతాక్మ స్వరూపాత్వాత్ నివత్తాత్మేతి కథ్యతే** - నిత్యవిభూతిని స్వస్థానముగా గలవాడు కాబట్టి, సంసారమనే లీలా విభూతి స్వభావాలు ఏవీ తనకు అంటకుండా నిర్వహిస్తుంటాడు. (శ్రీ కైవల్యసారధి)

సంసార చక్రమును త్రిప్పువాడైనను, కోర్కెలకు అతీతుడైనవాడు. మాయాతీతుడు.

**పరమవైరాగ్య ఖ్యాపనాయ విషయేభ్యః ప్రత్యాహృత మనాః నివృత్తాత్మా** – భగవానుని మనసు దేనిని ఆశ్రయించదు. విషయ వ్యామోహములందు చిక్కుకొనదు. మాయచే ప్రభావితము కాదు. ఆయన ధ్యానమునకు గల లక్షణములు –
**అంతర్నివిష్ఠ భావమ్ చ** – అంతర్ముఖములైన భావములు.
**ఆత్మ ధ్యాన పరాయణాయ** – తనపైననే నిమగ్నమైన ఆలోచనలు.
**హృద్ పద్మార్పిత మానసమ్** – హృదయ కమలమును ఆశ్రయించిన మనస్సు.

నివృత్తి ధర్మమును పాటించువారికి ఆత్మస్వరూపుడు.

ధర్మములు రెండు విధములు. పితృమార్గము ననుసరించి, కర్మఫలముల ననుభవింపజేయునది ప్రవృత్తి ధర్మము. దీనివలన కర్మశేషమును అనుభవించుటకు పునర్జన్మము ప్రాప్తించును. రెండవదైన నివృత్తి ధర్మము కర్మబంధములనుండి విముక్తిని ప్రసాదించును. అట్టి నివృత్తి ధర్మము నవలంబించువారి యాత్మయే పరమాత్ముడగు నివృత్తాత్మ.

సంసార బంధములకు అతీతుడు.

**సంసార బంధాన్ నివృత్త ఆత్మా స్వరూపమ్ అస్య ఇతి నివృత్తాత్మా** – సంసార బంధములనుండి సంపూర్ణముగా తొలగిన ఆత్మ గనుక నివృత్తాత్మ. ముండకోపనిషత్తునందు ఒకేచెట్టుపైని రెండు పక్షుల గురించి చెప్పబడినది. వానిలో ఫలములను తినకుండ ఊరకే చూచుచున్న పక్షియే నివృత్తాత్మ – అని శ్రీ చిన్మయానంద వ్యాఖ్యానించారు.

ధర్మ చక్రము రచయిత చెప్పిన సాధనా ఫలము – సత్యాన్వేషణకై మనము ప్రయత్నింపవలెనంటే కామాది బంధములను అధిగమించాలి. ఈ పుణ్యనామమును స్మరించుటవలన శ్రీమహావిష్ణువు మనకు అటువంటి జీవన విధానమును ప్రసాదించును. బంధములనుండి విముక్తి కలిగించును. శ్రీరాముని జీవనశైలియే 'నివృత్తాత్మ'కు చక్కని దృష్టాంతము. ఆయనకు వస్తువ్యామోహము ఎన్నడును కలుగలేదు.

ఈ నామము మరల చెప్పబడిన సందర్భములలో (456, 604, 780) కొందరు వ్యాఖ్యానకర్తలు 'విముక్తాత్మా' అనిగాని, 'అనివృత్తాత్మా' అనిగాని పాఠాంతరములను స్వీకరించి వ్యాఖ్యానించారు.

## 232. సంవృతః

- కప్పబడియుండువాడు (తెలియ జాలని వాడు)

### ఓం సంవృతాయ నమః

'వృంఞ్' – కప్పుట – అనే ధాతువునుండి వచ్చు అర్థము – **సంవృత్వాత్ సంవృతః** – భగవానుని కనుగొనుట సులభము కాదు. తమోగుణ మోహితులైన అజ్ఞానులకు (**తమసః పరస్తాత్**) వాసుదేవుడు కానరాడు. భక్తితో శరణాగతి జొచ్చినవారికి మాత్రము ఆయన బహు సులభుడు. తానై వారికి అందివచ్చును. సఖుడై పాచిక లాడును. సారథియై ముందుకు నడిపించును.

ఈ నామ వివరణ యందు ధర్మచక్రము రచయిత శ్రీ నమ్మాళ్వారుల పాశురమును ఉదాహరించారు (మయర్వఱ మది నిలమ్ అరుళినన్ ఎవనవన్) అజ్ఞానమును, సంశయమును, విపరీత జ్ఞానమును తొలగించి, జ్ఞానమును, భక్తిని ప్రసాదించువానిని పూజింపదగును. సూర్యుని కారణమున ఉద్భవించిన మేఘమే మనకు సూర్యుడు కనుపించకుండ అడ్డుపడును. అదే విధముగా అజ్ఞానము, మోహము మనకు, భగవంతునికి అడ్డుగా నిలుచును. భక్తితో వీనిని ఛేదించి పురుషోత్తముని కనుగొన సాధ్యమగును.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్** – గీత 7.25

నా యోగమాయ యందు దాగియున్న నేను అందరికిని గోచరింపను. కనుక అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలిసికొనలేరు.

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప** – గీత 11.54

కాని ఓ పరంతప! అర్జున! ఇట్టి నా (చతుర్భుజ) రూపమును ప్రత్యక్షముగా చూచుటకును, తత్వజ్ఞానమును పొందుటకును, అందు ఏకీభావ స్థితి నందుటకును, కేవలము అనన్య భక్తి ద్వారానే సాధ్యమగును (నీవు చూచిన నా చతుర్భుజ రూప దర్శన భాగ్యము అత్యంత దుర్లభము. వేద పఠనములచే గాని, తపశ్చర్యలచే గాని, దానములచే గాని, యజ్ఞకర్మలచే గాని శక్యము కాదు.)

## 233. సంప్రమర్దనః

- చీకటిని, అజ్ఞానమును, మాయను పారద్రోలువాడు.
- (రుద్రుడు, యముడు వంటి రూపములలో) నాశనము చేయువాడు.
- దుష్టులను హింసించువాడు.

### ఓం సంప్రమర్దనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్యానాన్ని నిరుక్తి రచయిత క్లుప్తముగా ఇలా చెప్పారు – **తమసో విద్యయా సమ్యక్ మర్దనాత్ సంప్రమర్దనః** – చుట్టూరా ఆవరించి ఉన్న గాఢాంధకారమును విద్యతో తగురీతి నాశనము చేయువాడు గనుక సంప్రమర్దనుడగును. చీకటి అనగా భక్తులను క్రమ్మివేసిన మాయ అనీ, భగవంతుడు సంప్రమర్దనుడై మాయను తొలగించుననీ శ్రీ అణ్ణాంగారాచార్య స్వామి వివరణ.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'మర్దనము' అనగా నాశనము చేయుట. **సమ్యక్ ప్రమర్దయతి రుద్ర కాలాద్యాభిః విభూతిః ఇతి సంప్రమర్దనః** – శ్రీమహావిష్ణువు రుద్రుడై లయకార్యమొనర్చును. పుట్టిన ప్రతిజీవియును గిట్టునట్లు చేయు యముడు కూడ ఆయన విభూతియే. కనుక ఆయన సంప్రమర్దనుడు.

శ్రీ చిన్మయానంద – దుష్టులను, కాముకులను, పాపులను (రాక్షసులను) పలువిధములుగా పరిమార్చు దేవుడు సంప్రమర్దనుడు.

ధర్మచక్రము రచయిత ప్రబోధము – దుష్ట కర్మములను త్యజించి, సత్కర్మముల నాచరించుట జీవితములో అత్యావశ్యకము. 'సంప్రమర్దన' నామ స్మరణము వలన అహంకారము, కామము నశించును. భగవానుని చేరు మార్గము సుగమమగును. శ్రీరాముడు దుష్టశిక్షకుడు గనుకనే ఋషులను కాచుటకై కోదండధారిగా అడవికి పోయెను. అట్టి రామనామ జపము బోయవాడగు వాల్మీకిని ఋషిగా, ఆదికవిగా మలిచెను.

## 234. అహఃసంవర్తకః

- సూర్యుని రూపమున ఉండి దినములను చక్కగా ప్రవర్తింపజేయువాడు.

### ఓం అహస్సంవర్తకాయ నమః

**సంయక్ అహ్నీమ్ ప్రవర్తనాత్ అహఃసంవర్తకః** – శ్రీమన్నారాయణుడే శ్రీసూర్యనారాయణుడై దివారాత్రముల క్రమమునకు, భూత భవిష్యద్ వర్తమాన కాలవిభజనకు కారకుడగుచున్నాడు. ఇందువల్ల జీవుల పరిణామ క్రమము (పుట్టుక, పెరుగుట, మార్పు, ఉనికి, క్షీణించుట, మరణించుట) సంభవించుచున్నవి. భగవంతుడే సూర్యునిగా జీవితమునకు వెలుగును, శక్తిని ప్రసాదించుచున్నాడు.

శ్రీ చిన్మయానందగారు గీత (!5.12)నుండి ఉదాహరించారు.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**

సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సేయని యెఱుంగుము.

ధర్మచక్రము రచయిత వ్యాఖ్య – శ్రీమహావిష్ణువు బాహ్య ప్రపంచమునకు, అంతరాత్మకు కూడ వెలుగునిచ్చు సూర్యుడు. అహస్సంవర్తకుడు. సూర్యుని వెలుతురులో వస్తువులు కనిపించును. అంతర్యామి అనుగ్రహమువలన ఆత్మజ్ఞానము సాధించు మార్గము కనిపించును. సూర్యోదయము వలన సకల జీవులు నిద్ర లేచును. శ్రీహరిపై భక్తి కలిగినంతనే ఆత్మజ్ఞానముపట్ల శ్రద్ధ దృఢమగును. సూర్యకిరణములు జీవులలో ఉత్సాహమును పెంచును. విష్ణుచింతన జీవాత్మను ప్రకాశవంతము చేయును. సూర్యకాంతి రోగములను హరించి శక్తిసామర్ధ్యములను పెంపొందించును. అహస్సంవర్తకుని ధ్యానించినట్లయిన దురాలోచనలు నశించి, మనసు పరిశుభ్రమగును. ఆయనే మనకంటి వెలుగు. జ్ఞాననేత్రమునకు కనువిప్పు ఆయనే.

## 235. వహ్నిః

- సమస్తమును వహించువాడు (భరించువాడు)
- దేవతలకు హవిస్సును అందించు అగ్నిహోత్రుడు.

### ఓం వహ్నయే నమః

'వహ్' – అనగా (భారము) వహించుట – అను ధాతువునుండి ఈ నామమును వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టులు – సకల భువనములు రోదసి (Space)లో వ్యాపించి యున్నవి. స్థలము లేని యెడల పదార్థము లేదు. శక్తి లేదు. ఈ స్థలము (Space) అనంత ఖగోళ మండలమును భరించుచున్నది. అలా సర్వత్ర వ్యాపించిన అంశము (Dimension, Space) భగవానుడే. కనుక ఆయన వహ్ని యగును.

**విశ్వస్య దేశరూపేణ వహనా ద్వహ్ని రుచ్యతే** – పరమాకాశము, గగనాది సమస్త దేశములు, బద్ధ, ముక్త్యాది రూపమైన సమస్త ప్రపంచాన్ని వహించేవాడు.

శ్రీ అణ్ణంగారాచార్య – అందరిని భరించువాడు భగవానుడు.

శ్రీ శంకరులు – 'వహ్ని' అనగా అగ్ని. **దేవేభ్యో హవ్యమ్ వహ నః ప్రజానన్ – హవిర్వహనాత్ వహ్నిః** – అగ్నియై, యజ్ఞయాగాదులయందు హోమము చేయబడిన హవిస్సును దేవతలకందించువాడు వహ్ని.

## 236. అనిలః

రెండు మాత్రలతోకూడిన ఈ నామమునకు విజ్ఞులు 11 విధములైన అర్థములను వ్యాఖ్యానించి అనంతగుణ సంపన్నుని అర్చించినారు. శ్రీహరి తన భక్తులకు పలురీతులుగా అవగతమగును. అన్ని యెడల వారి కందుబాటులో నుండును. కొండలలో నెలకొన్న కోనేటిరాయడు కొలిచినవారికి కొంగు బంగారము. మ్రొక్కినవారికి వరముల పెన్నిధి.

(1) వాయువు. ప్రాణమునకు ఆధారమైన ఊపిరి.

(2) ప్రేరణ లేకుండగనే (వేరెవరు చెప్పకుండానే) భక్తుల కోర్కెలు తీర్చువాడు.

(3) ఆది లేనివాడు.

(4) సంగమము (బంధము) లేనివాడు. మంచి, చెడులకు అతీతుడు.



(5) కరిగిపోనివాడు.

(6) సర్వజ్ఞుడు.

(7) భక్తులకు సులభముగా అందువాడు.

(8) స్థిరమైన నివాసము (నిలయము) లేనివాడు.

(9) ఇల (భూమి) ఆధారము అవుసరము లేనివాడు.

(10) అన్నిచోట్ల ఉండువాడు (ఎక్కడో దాగనివాడు)

(11) సదా జాగరూకుడగువాడు.

హళెబీడులో శ్రీ త్రివిక్రమమూర్తి.

Photo by solarisgirl
https://commons.wikimedia.org/wiki/File:Trivikrama_Vamana_Mahabali_legend,_Hoysaleshwara_Hindu_temple,_Halebidu_Karnataka.jpg

## ఓం అనిలాయ నమః

ఈ నామము మరల 818వ నామముగా చెప్పబడినది.

25వ శ్లోకము. 236వ నామము. అనిలః – **అహః సంవర్తకో వహ్నిరనిలో ధరణీధరః**

87వ శ్లోకము. 818 నామము. అనిలః – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోऽనిలః**

(1) వాయువు. ప్రాణమునకు ఆధారమైన ఊపిరి.

**తదేవాగ్నిః తద్వాయుః** – అని తైత్తరీయారణ్యకము(10)లో చెప్పబడినది. 235వ నామము 'వహ్నిః' అనగా అగ్ని. 236వ నమము 'అనిలః' అనగా వాయువు. ఆ పరబ్రహ్మమే అగ్ని. ఆ పరబ్రహ్మమే వాయువు.

**అననాత్ ఉజ్జీవనాత్ అనిలః** – అందరికి జీవనాధారమగు శ్వాసను ప్రసాదించువాడు గనుక ఆయన అనిలుడు.

**కోహేవాన్యాత్ కః ప్రాణ్యాత్** – తైత్తరీయ నారాయణము (7). ఆకాశము (పరమాత్మ) లేనిదే ఎవరు ఊపిరి తీసికొనగలరు? ఎవరు జీవించగలరు?

**ప్రాణాత్ వాయురాజాయత** – ఆయన శ్వాసనుండి వాయువు ఉద్భవించినది. (పురుష సూక్తము. 14)

(2) ప్రేరణ లేకుండగనే (వేరెవరు చెప్పకుండానే) భక్తుల కోర్కెలు తీర్చువాడు.

మరల ఈ నామము 818వ నామముగా వచ్చినపుడు శ్రీభట్టులు ఈ అర్థంలో వ్యాఖ్యానించారు. **ఇలతి ప్రేరణమ్ కరోతి ఇతి ఇలః తద్రహితత్వాత్ అనిలః** – ప్రేరణము అవుసరమైనవాడు 'ఇలః'.అలాంటి అవుసరము లేనివాడు గనుక 'అనిలః'. ఏ విధమైన ప్రోత్సాహము లేకుండా (తనంత తానే) భక్తుల అవుసరములను తీర్చువాడు అనిలుడు.

విష్ణుధర్మము 74.42 – **తదప్య ప్రార్థితమ్ ధ్యాతో దదతి మధుసూదనః** – ప్రార్థన చేసినంతనే, మరేవిధమై ప్రేరణ లేకుండ, భక్తులకు వరములు ప్రసాదంచువాడు మధుసూదనుడు.

శ్రీ శంకరులు పై రెండు అర్థములను చెప్పి, ఇంకా మరికొన్ని అర్థములను కూడా చెప్పారు.

(3) ఆది లేనివాడు.

**అనాదిత్వాత్ అనితి యోऽసు అనిలః** – ఆది లేనందున ఆయన అనిలుడనబడును.

(4) నిస్సంగుడు. సంగమము (బంధము) లేనివాడు. మంచి, చెడులకు అతీతుడు.

**అనాదానాత్ అనిలః** – భగవంతునకు ఏ విధమైన బంధములు, విషయ వాసనలు వర్తించవు.

(5) కరిగిపోనివాడు.

తరగనివాడు. నిత్యమై నిఖిలమై నిలిచియుండును.

(6) సర్వజ్ఞుడు.

ఇల అనగా నిద్ర, అజ్ఞానము. అనిలుడు అనగా సర్వజ్ఞుడు.

(7) భక్తులకు సులభముగా అందువాడు.

**నిలతేర్ గహనార్థాత్ క-ప్రత్యయాంతాత్ అగహనః అనిలః** – భక్తులకు అందుబాటులో ఉండువాడు. పిలిచిన పలికెడు దేవుడు. కొలిచిన కరుణించు విభుడు. వేడుకున్న కాచెడు రాముడు.

(8) స్థిరమైన నివాసము (నిలయము) లేనివాడు.

**అనిలాయ అనిలః న విద్యతే నిలయమ్ స్థానమ్ యస్య** – ఆయనకొక్కచోట నిలయము అనిచెప్పరాదు. ఆయన సర్వోపగతుడు. ప్రహ్లాదుని రక్షింప స్తంభమునుండి వెడలిన దేవుడు. ఏడు కొండలపైని వేంచేసినాడు. ఇంటింటను అర్చామూర్తియై పూజలందుకొనుచున్నాడు. ప్రతిజీవుని యందును అంతర్యామియై జీవనాధారమైనవాడు. ఆయన లేని చోటు లేదు. ఆయన కాని వస్తువు లేదు.

(9) ఇల (భూమి) ఆధారము అవుసరము లేనివాడు.

'ఇల' అనగా భూమి. ఈ లోకమున అన్ని జీవులకును ఆధారము భూమి. భగవంతుడు భూమికంటే ముందేయుండెను. ఆయనకు వేరు ఆధారము ఉండజాలదు. కనుక ఆయన అనిలుడు (శ్రీ రాధాకృష్ణశాస్త్రి)

(10) అన్నిచోట్ల ఉండువాడు (ఎక్కడో దాగనివాడు)

**న నిలీయతే ఇతి అనిలః** – భగవంతుడు ఎక్కడో దాగియుండునను భావము కలదు. కాని ఆయన సర్వస్థితుడు. అవిచ్ఛిన్నుడు. ఇవన్నీ వాయువునకు గల లక్షణములు. అందువలన భగవంతుని కూడ అనిలుడని కీర్తింపనగును.

(11) సదా జాగరూకుడగువాడు.

**ఇలతి స్వపితి ఇతి ఇలః, తద్ విపరీతః అనిలః** – 'ఇల' అనగా నిద్రించుట. నిదురించనివాడు అనిలుడు. జాగృతుడు. **జాగృవిమ్ విభుమ్** – అని ఋగ్వేదములో ఉన్నది. నిద్ర అజ్ఞానమునకు చిహ్నము. జ్ఞానస్వరూపుడైనందున దేవుడు అనిలుడు.

శ్రీనివాసుని 'అనిల' గుణధ్యానమును యొక్క విశిష్టతను ధర్మచక్రము రచయిత ఇలా వివరించారు. ఊపిరి లేకుండ జీవనము క్షణములోనే సమసిపోవును. అలానే విష్ణు ధ్యానము చేయని ఆధ్యాత్మికత నిలువజాలదు. తాను భోజనము లేకుండ ఎన్నో రోజులు ఉండగలనని, కాని ప్రార్థన చేయకుండ ఒక్కరోజు కూడ బ్రతుకలేనని మహాత్మాగాంధీగారు చెప్పారు. ఇంకా, మనస్సు వాయువువలె నియంత్రించుటకు దుష్కరమని అర్జునుడు చెప్పాడు. భగవానుడు కూడా వాయువులాగా అన్నిచోట్లను వ్యాపించియుండును. కాని విష్ణుధ్యానముతో కేంద్రీకృతమైన మనసే దేవుని దర్శించగలదు.

## 237. ధరణీధరః

- భూమిని ధరించువాడు, పోషించువాడు.

## ఓం ధరణీధరాయ నమః

శ్రీమన్నారాయణుడే ఆదిశేషుని రూపమున, అష్టదిగ్గజముల రూపమున, ఆదివరాహమూర్తి రూపమున భూమిని ధరించియుండువాడు.

**ధరణీమ్ ధరతి ఇతి ధరణీధరః** – ధరణి యనగా భూమి. భూమిని ధరించినవాడు ధరణీధరుడు. ఈ అర్థమును శ్రీ భట్టులు ఇంకొంచెం ముందుకు తీసికొని వెళ్ళి, 'ఇతరులను ధరించేవారిని ధరించేవాడు' అని విశేషంగా వ్యాఖ్యానించారు. సమస్త ప్రాణికోటులను భూమి ధరించును. భూమిని ఆదిశేషుడు ధరించును. ఆదిశేషుని అనంతపద్మనాభుడు ధరించును.

**సదాధార పృథ్వీమ్ ద్యామ్ ఉతేమామ్** – ఆయన భూమిని, స్వర్గమును భరించును (యజుర్వేదము 13.4)

**ఉధృతాऽసి వరాహేణ** – శ్రీవరాహమూర్తి నిన్ను (భూమాతను) ఉద్ధరించెను (తైత్తరీయారణ్యము 10.8)

**పృథ్వీమ్ చ అంతరిక్షమ్ చ ద్యామ్ చైవ పురుషోత్తమః**
**మానసైవ విసృష్టాత్మా నయతి ఆత్మవశమ్ వశీ**

భూమిని, అంతరిక్షమును, ఊర్ధ్వలోకములను పురుషోత్తముడు తన సంకల్పమాత్రముననే సృజించెను. విశ్వాధిపుడైన ఆయన వానినన్నింటిని తన నియంత్రణలో ఉంచుకొనును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు ఇదే అర్థము వచ్చే మరికొన్ని నామములను ప్రస్తావించారు – మహీభర్తా (184), మహీధరః (319. 371), త్రిలోకధృత్ (757), ధరాధరః (762). ఇంకా 240వ నామము 'విశ్వధృక్'ను ఇదే అర్థములో కొందరు వ్యాఖ్యాతలు వివరించారు.

ధర్మచక్రము రచయిత ఈ 'ధరణీధరః' నామము ప్రాముఖ్యతను చక్కగా వివరించారు – భగవంతుడు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను కూడ భూమిని, జీవులను పోషించును. సకల జీవరాశులు భూమిపైని లభించు ధాన్యాది ఆహారములను గాని, ఆ యాహారమును తినే వేరు జంతువులను గాని తిని బ్రతుకును. అందుకు కావలసిన శక్తిని, అవకాశమును, బుద్ధిని భగవంతుడే ప్రసాదించుచున్నాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – తల్లి బిడ్డలను కాపాడును. భర్త భార్యను కాపాడును. అందరిని భగవానుడు కాపాడును. కనుక భగవానుని ధరణీధరత్వమును ఎల్లెడల మనము దర్శింపవచ్చును. ధరణీధరుడే బిడ్డల కొరకు తల్లుల చన్నులలో పాలు నింపును. పూలకు రంగులద్దును. మేఘములలో నీరు నింపును. జీవితముపైని తీపిని పెంచును.

**ఓం నమో శ్రీనారసింహాయ**

(శ్రీ భండారు పర్వతరావు రచన "**ఓం నమో శ్రీనారసింహాయ**" నుండి, మరియు పోతన భాగవతమునుండి సంగ్రహించినది.)

**శ్రీనారసింహుడు హిరణ్యకశిపుని సంహరించిన విధము.**

విహగేంద్రుండహి వ్రచ్చు కైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుడై యూరువులందు చేర్చి నఖ సంఘాతంబులన్ వ్రచ్చె దు
స్సహ దంభోళి కఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్ర హుతాశాంతక భీకరున్ ఘనకరున్ దైత్యాన్వయ శ్రీకరున్

హిరణ్యకశిపుని తన తొడలపై వేసికొనినాడు హరి. హిరణ్యకశిపుని గుండె నరహరి చీలుస్తాడు. నేలనిండా నెత్తురు చల్లుతాడు. కఠినములైన నరాలను తెంపుతాడు. రొమ్మును పగులగొడతాడు. మాంసాన్ని ముక్కలుగా చేస్తాడు. పేగులు హారాలుగా మెడలో వేసుకొంటాడు.



చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిన్
ద్రెంచున్ గర్కశ నాడికావళులు భేదించున్ మహావక్షముం
ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురున్ ప్రచ్ఛిద
ర్పించున్ బ్రేవులు కంఠమాలికలుగ గల్పించున్ నఖోద్భాసియై

పుదుచ్చేరి శ్రీ వరదరాజపెరుమాల్ ఆలయ శిల్పం.

Photo by Muthukumaran pk
https://commons.wikimedia.org/wiki/
File:Varadarajaperumal_temple,_
Thirubuvanai,_Puducherry,_India_(8).JPG

రాక్షసుని చీలుస్తుంటే, నరహరి గోళ్ళు గొడ్డళ్ళవలె ఉన్నాయి. లోతైన గుండెను బ్రద్దలు కొట్టేటపుడు గుద్దళ్ళవలె నున్నాయి. నరాలను త్రెంచేటపుడు గట్టి కొడవళ్ళవలె నున్నాయి. కడుపులోని పేగులను తెంచేటపుడు రంపాలలా ఉన్నాయి. నరసింహుని గోళ్ళను చూసి దేవతా ముఖాలు వికసిస్తున్నాయి. రాక్షసరాజు శరీరాన్ని చీలుస్తున్నాయవి. అగ్ని జ్వాలలకన్న ప్రకాశమానంగా ఉండి నరహరికి మ్రొక్కేవారలకు అభయదానం చేస్తున్నాయి.

ఇట్లు కేవల పురుష రూపంబును, మృగరూపంబునుం గాని నరసింహ రూపంబున, రేయునుం బగలునుం గాని సంధ్యా సమయమున, నంతరంగంబును బహిరంగంబును గాని సభాద్వారంబున, గగనంబును భూమియుం గాని యూరు మధ్యంబున, బ్రాణ సహితంబులును బ్రాణరహితంబులును గాని నఖంబులన్ త్రైలోక్య జన హృదయ భల్లుండైన దైత్యమల్లుని వధియించి, మహాదహన కీలాభీల దుర్లసుండును, కరాళ వదనుండును, లేలిహాన భీషణ జిహ్వుండును, శోణిత పంకాంకిత కేసరుండునై ప్రేవులు కంఠమాలికలుగ ధరించి, కుంభి కుంభ విదనంబుం జేసి, తదీయ రక్తసిక్తంబులైన నఖంబులు సంధ్యారాగ చంద్రరేఖ చెలువు వహింప, సహింపలేహక లేచి, తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని, తత్తఱంబున రణంబునకు నురవణించు రక్కసులం బెక్కు సహస్రంబులం జక్రాది నిర్వక్ర సాధనంబుల నొక్కనిం జిక్కకుండం జక్కడిచె.

హిరణ్యకశిపుని వధానంతరం రాక్షస సేనను చంపిన నరసింహుని భూతసింహుడు అంటారు (లక్ష్మీపురం నృసింహగిరిపై వెలసిన నరసింహుడు భూతసింహుడు). ప్రాచీన నరసింహాలయాలలో నివురుగప్పిన నిప్పులా వుండిపోయిన గుడి ఒకటి పశ్చిమగోదావరి జిల్లా లక్ష్మీపురం దగ్గర గల ఐ.ఎస్.జగన్నాధపురం (కామవరపుకోట సమీపంలో ఐ.ఎస్. రాఘవాపురం, ఐ.ఎస్. జగన్నాధపురం ల మధ్య) వద్దనున్న నృసింహగిరిపైన ఉంది. ఈ ఆలయంలో ఉన్నది భూతసింహుడని శ్రీ వి.వి. శ్రీధర్ గురూజీ చెప్పారు. స్థానికుల సాయంతో, ముఖ్యంగా ఓరియెంటల్ ఇన్సూరెన్సు డెవలప్‌మెంట్ ఆఫీసర్ శ్రీ కె.స్.వి. నరసింహంగారి పూనికవల్ల ఈ ఆలయాన్ని గురూజీ పునరుద్ధరించారు.



లక్ష్మీపురంలోని శ్రీ భూత నరసింహుని మందిరం

నరసింహుని సరసన, కనకవల్లి (మహాలక్ష్మి)ని, ఎదురుగా పంచముఖ ఆంజనేయుడిని, ప్రక్కన ఏకాక్షర గణపతిని, వెనుక సర్పశ్రీనివాసుడినీ ప్రతిష్ఠించారు. ఈ ఆలయంలో స్వామి ఎంతో శక్తివంతమైనవాడనీ, రోగులకు స్వస్థత చేకూర్చడంలోనూ, కోరిన కోర్కెలను తీర్చడంలోనూ భక్తసులభుడని గురూజీ (శ్రీ మహాసుదర్శన జ్వాలానృసింహ పీఠాధిపతులు, సికిందరాబాద్) అంటారు.

**ఓం నమో శ్రీనారసింహాయ.**

రక్షోవీరుల నెల్ల ద్రుంచి రణ సంరంభము చాలించి దృ
ష్టి క్షేపంబు భయంకరంబుగ సభా సింహాసనారూఢుడై
యక్షీణా గ్రహుడై నృసింహుడు కరాళాస్యంబుతో నొప్పి దన్
వీక్షింపం బరికింపనోడి యమరుల్ విభ్రాంతులై డాగగన్

స్వామి చూపులు భయంకరమైన మంటలవలెనున్నాయి. జూలు నిండా నెత్తురు, ఉరద అంటుకొన్నాయి. ప్రేవులను కంఠమాలికలుగా వేసుకొన్నాడు. రాక్షసుని రక్తం అంటి గోళ్ళు సంధ్యాకాలంనాటి ఎర్రదనాన్ని సంతరించుకున్నాయి. స్వామి జూలు విదిలిస్తే మేఘాలు చెదిరాయి. ఆయన చూపులకే గ్రహాలు గతులు తప్పాయి. ఆయన నిట్టూర్పులకు సముద్రాలు అల్లకల్లోలమయ్యాయి. ఆయన గర్జనలకు దిగ్గజాలు ఉలికిపడ్డాయి. ఆకాశమంతా ఆయన జూలు తాకిడికి దూరంగా చెదిరిపోయిన దేవతా విమానాలతో నిండింది. ఆయన పాదాలు నేలపై మోపినపుడు భూమి అదిరింది. ఆయన కాంతిముందు దిక్కులన్నీ వెలవెలపోయాయి.

**ఓం నృసింహాయ విద్మహే వజ్రనఖాయ దీమహి తన్నృసింహః ప్రచోదయాత్**

సునందుడు, కుముదుడు మొదలైన శ్రీమహావిష్ణువు పార్శ్వచరులు విచ్చేశారు. శివుడు, బ్రహ్మ మొదలగు దేవతలంతా బయలుదేరి అక్కడకు చేరుకున్నారు. దేవతలు, అశ్వముఖులు, అశ్వదేహులు, నాగులు, సిద్ధులు, సాధ్యులు, గరుడులు, గంధర్వులు, విద్యాధరులు, ప్రజాపతులు మొదలైనవారంతా నరసింహుని దర్శనానికై వచ్చారు. వచ్చి చేతులు జోడించి నుదుట చేర్చి నమస్కరించారు. దగ్గరకు వెళ్ళే సాహసం లేక దూరంనుంచే ప్రణతులర్పించారు. ఒక్కొక్కరు ఒక్కొక్కతీరున ఆయనను స్తుతించారు.

బ్రహ్మ స్తుతి

ఘన లీలా గుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే
దనముం జేయు దురంత శక్తికి ననంత జ్యోతికిన్ జిత్ర వీ
ర్యునికి న్నిత్య పవిత్ర కర్మునికి నేనుత్కంఠతో నవ్యయాత్మునికిన్
వందన మాచరించెద గృపాముఖ్య ప్రసాదార్థినై

రుద్రుడిట్లనియె

అమర వరేణ్య! మీదట సహస్ర యుగాంతము నాడు గాని కో
పమునకు వేళ గాదు సురబాధకుడైన తమస్వినీ చరున్
సమరమునన్ వధించితివి చాలు దదాత్మజుడైన వీడు స
ద్విమలుడు నీకు భక్తుడు పవిత్రుడు గావుము భక్తవత్సలా

బ్రహ్మాదులంతా ప్రహ్లాదుని దగ్గరకు తీసికొన్నారు – నాయనా! నీ తండ్రి నిమిత్తం కోపాన్ని పూనాడు స్వామి. ఆయనను శాంతింపజేయి – అన్నారు. ప్రహ్లాదుడు మెలమెల్లగా స్వామి దగ్గరకు పోయి, అంజలి ఘటించి, నమస్కరించాడు. తరువాత అన్ని అవయవాలు భూమిని సోకేలా సాష్టాంగ దండప్రమాణం చేశాడు.

స్వామి కరుణ యుప్పొంగగా బాలుని దగ్గఱగా తీసికొనినాడు. ఇంపుగా వెలిగే చూపులతో ప్రసన్నంగా చూశాడు. లోకాలన్నింటి నుతులు స్వీకరించే శ్రీహరి, దానవాంతకుడైన నరహరి, బాలుని తలపై తన చేయినుంచాడు. కాలసర్పం భయంనుండి కూడా కాపాడి అభయదానం చేసే ప్రశస్తి గల హస్తమది. అడ్డు లేకుండా అన్ని విధాలా శుభాలను కురిపించే చేయి అది.



సింహాచలం మందిరం

ప్రాభవమొప్ప నుత్కట కృపామతియై కదియంగ జీరి సం
శోభిత దృష్టి సంఘముల జూచుచు బాలుని మౌళియందు లో
కాభినుతుండు పెట్టె నసురాంతకు డుద్భట కాలసర్ప భీ
తాభయ దాన శస్తము ననర్గళ మంగళ హేతుహస్తమున్

వినయ వివేక భూషణుడైన ప్రహ్లాదుడు ఆ మంగళ హేతుహస్తము స్పర్శతో పులకాంకితుడై, భక్తితో పరవశించి, చేతులు జోడించి దేవదేవుని ప్రస్తుతించాడు.

తపమున్ వంశము తేజమున్ శ్రుతము సౌందర్యంబు ను
ద్యోగమున్ నిపుణత్వంబు ప్రతాప పౌరుషములున్ నిష్ఠా బల ప్రజ్ఞలున్
జప హోమంబులు జాలవీశ్వర! భవత్సంతుష్టికిన్ దంతి యూ
థపు చందంబున భక్తి సేయవలయున్ దాత్పర్య సంయుక్తుడై.

కావున నల్పుడ సంస్తుతి
గావించెద వెఱపు లేక కల నేరుపునన్
నీ వర్ణనమున ముక్తికి
బోవు నవిద్యను జయించి పురుషు డనంతా!

మహాత్మా! దుష్టజన సంహారంబును, శిష్ఠ భృత్య మునిజన రక్షాప్రకారంబును నీకు నైజ గుణంబులు. విశ్వంబు నీవ. గుణాత్మకమైన విశ్వంబు సృజియించి, యందు ప్రవేశించి, హేతు భూత గుణ యుక్తుండవై, రక్షక సంహారకాది నానారూపంబుల నుండుదువు. సదసత్కారణ కార్యాత్మకంబైన విశ్వంబునకుం బరమ కారణంబు నీవ. నీ మాయచేత వీడు దా నని యెడు బుద్ధి వికల్పంబు దోచు గాని, నీకంటె నొండెద్దియు లేదు. బీజంబునందు వస్తుమాత్ర భూత సౌక్ష్మ్యంబును, వృక్షంబునందు నీలత్వాది వర్ణంబును గలుగు తెఱంగున, విశ్వంబునకు నీయంద జన్మస్థితి ప్రకాశ నాశనంబులు గలుగు ...... కృత త్రేతా ద్వాపర యుగంబులందును, తిర్యఙ్మానవ ముని జలచరా కారంబుల నవతరించి, లోకంబుల నుద్ధరింపుచు, ధరియించుచు, హరియింపుచు, యుగానుకూల ధర్మంబులం బ్రతిష్ఠించుచుందువు. దేవా! అవధరింపుము ... ... భవదీయ దాస్య యోగంబు కృప సేయుము.

ప్రసన్నుడైన స్వామీ – ఓ ప్రహ్లాదా! నీకు భద్రమగుగాక. నేను ప్రీతి చెందాను. నీయంతర్వాంఛిత లాభమెల్ల కరుణాయుత్తుండనై యిచ్చెదను. నేను అన్ని రకాల భద్రములకు నాధుడను. జంతుశ్రేణికి నన్ను జూచిన పునర్జన్మంబు లేదు – అని యానతిచ్చెను.

ప్రహ్లాదుడు – స్వామీ! నా తండ్రి యొనర్చిన భాగవతాపచార పాపమునుండి విముక్తుడు కావలె – అని కోరుకొన్నాడు.

భగవంతుడు – ఓ పాపరహితా! నిన్ను కుమారునిగా పొందినపుడే నీ తండ్రి త్రిసప్త పూర్వజులతో సహా పావనుడైనాడు. నాయనా! నా స్పర్శకు నోచుకొని పవిత్రుడైన నీతండ్రికి ప్రేతకార్యం చేయి. మంచి కొడుకులను కన్నవారు ఉత్తమ లోకాలకు వెళతారు. నీవు నీతండ్రి సింహాసనాన్ని అధిష్టించు. విజ్ఞుల ఉపదేశాన్ని పొందుతూ ఉండు. నాయందే మనసు నిలుపు – అని ఆనతిచ్చాడు

బ్రహ్మ ఇలా అన్నాడు.

పరమ గృప సేసితివి మేలు వారిజాక్ష
నీ నృసింహావతారంబు నిష్ఠతోడ
దగిలి చింతించువారలు దండధరుని
బాధనొందరు మృత్యువు బారిపడరు.

**ఓం నమో శ్రీ నారసింహాయ**



## సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వధృగ్విశ్వభుగ్విభుః (విశ్వసృడ్విశ్వభుగ్విభుః) | సత్కర్తా సత్కృతః సాధుర్జహ్నుర్నారాయణో నరః || (26)

### 238. సుప్రసాదః

- అనుగ్రహ స్వరూపుడు. శుభకరమగు ఫలములు ప్రసాదించువాడు.

ఓం సుప్రసాదాయ నమః

**శోభనః ప్రసాద దాతృత్వాత్ సుప్రసాదః** – కరుణామృత మూర్తియైన శ్రీహరి తనకు శరణాగతులైనవారికి మంచి ప్రసాదము లొసగును. కనుక శ్రీహరియే సుప్రసాదుడు.

శరణాగతులకు శుభములనిచ్చుటతో పరిమితము గాకుండ, భగవంతుని సుప్రసాదత్వము ఆయన శత్రువులకు కూడ శుభములు కూర్చును. రావణుడు, శిశుపాలుడు, దుర్యోధనుడు వంటి భగవద్విరోధులు కూడ భగవంతుని యనుగ్రహము వలన మోక్షమును పొందిరి. అంటే ఆయన ప్రసాదించేదంతా శుభకరమే. ఈ సుప్రసాద గుణము స్వామిదేశికుల దయాశతకమునందు పదే పదే ప్రస్తావింపబడినది. పరశురామునిచేత మరణించిన క్షత్రియులు తమ పాపకర్మములనుండి విముక్తులై మోక్షమును పొందిరి. అదే విధముగా కలియుగాంతమున శ్రీమహావిష్ణువే కల్కియై పాపులను పరిమార్చి, ఇంక పాపములు చేయు అవకాశము లేకుండ చేసి, ధర్మయుతమైన కృతయుగమునందు సకల జీవులు వృద్ధిపొందు స్థితిని కలుగజేయును.

ధర్మచక్రము రచయిత వ్యాఖ్య – కొందరు ఉపకారులకు ఉపకారము చేస్తారు. అపకారులకు అపకారము చేస్తారు. కొద్దిమంది ఉపకారులకు కూడ అపకారము చేస్తారు. ఇంకొద్దిమంది అపకారులకు కూడ ఉపకారము చేస్తారు. కాని అవతలివారి కార్యములతో నిమిత్తము లేకుండ భగవంతుని చేష్టలు మాత్రము సర్వదా సర్వులకు శుభకరములే. శ్రీమహావిష్ణువుయొక్క 'సుప్రసాదః' నామమును ధ్యానించువారికి సాత్త్విక మార్గమున పయనించు భాగ్యము లభించును.

**అన్నమయ్య కీర్తన**

పలువిచారములేల పరమాత్మనీవు నాకు - కలవు కలవు ఉన్న కడమలేమిటికి

నీపాదముల చెంత నిబిడమైతే చాలు - యేపాతకములైన ఏమిసేసును
యేపార నీభక్తి ఇంత గలిగిన చాలు - పై పై సిరులచ్చుట పాదుకొని నిలుచు
సారిదినీ శరణము జొచ్చితినంటే చాలు - కరుణించి యప్పుడట్టే కాతువు నీవు
సరుస నీముద్రలు భుజములనుంటే చాలు - అరుదుగా చేతనుండు అఖిలలోకములు
నేరక వేసిన చాలు నీమీద ఒక పువ్వు - కోరిన కోరికలెల్ల కొనసాగును
మేరతో శ్రీవేంకటేశ నిన్నుగొలిచితి నేను – యే రీతి నుండిన గాని యిన్నిటా ఘనుడను

## 239. ప్రసన్నాత్మా

- ప్రసన్నమైన, ప్రశాంతమైన మనస్సు గలవాడు.

### ఓం ప్రసన్నాత్మనే నమః

భగవంతుని మనస్సు సర్వదా ప్రశాంతముగ నుండును. ఆయన రాగ ద్వేష రహితుడు. త్రిగుణాతీతుడు. కరుణామూర్తి. మానవులు ప్రకృతి జన్యములగు మూడు గుణముల చేత బద్ధులు గనుక దుఃఖితులు. భగవానుడు త్రిగుణాతీతుడు గనుక ప్రసన్నాత్ముడు.

**అవాప్త సర్వ కామత్వాత్ రాగాది రహితం మనః యస్యాస్తి స ప్రసన్నాత్మా చిత్తతుష్టిప్రదోమనుః** - సర్వ కామ రాగములకు అతీతుడు గనుక ప్రసన్నాత్ముడు. ఈ నామధ్యానము చిత్తశాంతినిచ్చును. ఓం ప్రసన్నాత్మనే నమః.

**అవాప్త సర్వ కర్మత్వాత్ (కామత్వాత్?)** –దేవదేవునకు ఏ విధమైన కోర్కెలు, కామములు వర్తించవు. ఆయనకు సమస్తమును సిద్ధించినవి. కనుక ఆయన ప్రసన్నాత్ముడు.

**కరుణార్ద్ర స్వభావాత్** – శ్రీహరి కరుణామూర్తి. భక్తుల పాలిటి కామధేనువు. కనుక ఆయన ప్రసన్నాత్ముడు.

శ్రీ పి.బి.అణ్ణంగారాచార్య స్వామి – ఆయన రాగద్వేష రహితుడు. ఇష్టానిష్టములు ఆయనను ప్రభావితము చేయవు.

శ్రీ చిన్మయానంద – వస్తువులు, వాని గుణములు, వానిపై మోహము దుఃఖములకు కారణములు. రజోగుణము, తమోగుణములు అట్టి వాంఛలను, దుఃఖ కారణమగు కర్మలను ప్రేరేపించును.

ధర్మచక్రము రచయిత ఈ సందర్భమున రావణ, కుంభకర్ణ, విభీషణుల ఉదాహరణ చెప్పారు. రజోగుణము అధికముగానున్న రావణుడు కామమోహితుడై, అధర్మ కార్యముల నాచరించి నాశనము కొనితెచ్చుకొనెను. కుంభకర్ణుడు తమోగుణ ప్రభావమున నిద్రాహారములకు దాసుడయ్యెను. సత్వగుణ సంపన్నుడైన విభీషణుడు భగవంతుని శరణుజొచ్చి, ఆయన అనుగ్రహము పొంది, లంక సర్వనాశనము కాకుండ కాపాడెను. భగవంతుని 'ప్రసన్నాత్మ' నామమును ధ్యానించుట వలన అట్టి సత్వగుణము వృద్ధిచెంది, మనస్సు నిర్మలమగును. ఆ విధమైన తత్వము కలిగి యున్నందునే భీష్ముడు ధర్మవిజయము తథ్యమని, కృష్ణుడున్నచోటనే ధర్మముండునని గ్రహించెను.



విష్ణువు. 11వ శతాబ్దానికి చెందిన శిల్పం. న్యూయార్క్ మ్యూజియంలోనిది.

Creative commons from Flickr. By Wally Gobetz.

https://www.flickr.com/photos/wallyg/1658013702/in/photostream/

**పద్మపురాణము – క్షేత్రకాండము – 33వ అధ్యాయము**

జితంతే పుణ్డరీకాక్ష! నమస్తే విశ్వభావన!
నమస్తేఽస్తు హృషీకేశ! మహాపురుష పూర్వజ!
నమః శ్రీధామ నిలయ! నమః శ్రీవత్స లక్షణ
నమస్త్రిధాత్మనే తుభ్యం నమః శ్రీధనమోహన!
నాకౌకః ప్రత్యనీకారే! నారాయణ! నమోస్తుతే!
నాగపర్యఙ్క శయనా నాథనాథ! నమోనమః
విశ్వ స్రష్టే విశ్వభర్త్రే విశ్వ త్రాత్రే విచక్షణ!
విశ్వాన్తర్యామినే తుభ్యం విశ్వోత్తీర్ణ! విభో నమః .

---

## 240. విశ్వస్పృట్ / విశ్వధృగ్ / విశ్వస్పృష్ట్ / విశ్వస్పృగ్

- విశ్వమును సృజించినవాడు.
- విశ్వమును ధరించువాడు.

**ఓం విశ్వస్పృజే నమః**

**ఓం విశ్వదృశే నమః**

శ్రీ భట్టులు 'విశ్వస్పృట్' అనే పాఠమును స్వీకరించి, **విశ్వమ్ సృజతి యో స విశ్వస్పృట్** – అని వ్యాఖ్యానించారు. భగవంతుడు కరుణామయుడై, విశ్వమును సృష్టించినాడు.

శ్రీ శంకరులు 'విశ్వధృగ్' అనగా, విశ్వమును తన అధీనములో ధరించి, బాగోగులు గమనించువాడు – అని వ్యాఖ్యానించినారు.

ఇంకా శ్రీ శ్రీనివాస రాఘవన్ గారు తమ 'నృసింహప్రియ'లో 'విశ్వస్పృష్ట్', 'విశ్వస్పృగ్' అను మరి రెండు పాఠాంతరములను ప్రస్తావించారు.

'విశ్వధృగ్' నామము అర్థమును వివరిస్తూ, ధర్మచక్రము రచయిత ఇలా తర్కించారు – మనసు మన అధీనములో ఉండునా? మనము మనసు అధీనములో ఉందుమా? మనస్సుపై ఆధిపత్యము సంపాదించినవారికి వారి కుటుంబము, వారి దేశము చెప్పుచేతలలోనికి వచ్చును. వారికే ఈ సమస్త భువనములకు అధిపతి ఎవరో తెలియవచ్చును. 'విశ్వధృగ్' నామగుణ ధ్యాన మొనరించినవారికి అది సాధ్యమగును. భగవంతుడు అంతటినీ అజమాయిషీ చేయుచుండునని తెలిసికొన్నవాడు అధర్మకార్యము లాచరింపజాలడు.

## 241. విశ్వ భుగ్ విభుః ( విశ్వభుగ్విభుః / విశ్వభుగ్ / విభుః)

- అతటను వ్యాపించి అన్నింటిని రక్షించువాడు.

**ఓం విశ్వభుగ్విభవే నమః**

**ఓం విశ్వభుజే నమః**

**ఓం విభవే నమః**

శ్రీ భట్టులు 'విశ్వభుగ్విభుః' ఏక నామముగా పరిగణించారు. – **తత్సృష్టం వ్యాప్యవై భుఙ్జన్ పాలయన్ విశ్వభుగ్విభుః** – తనచేతనే సృష్టింపబడిన ఈ జగత్తు అంతటా వ్యాపించి, దానిని అనుభవిస్తూ పాలించేవాడు విశ్వభుగ్విభుడు. అన్ని అనుభవములు ఆయనకే చెందును. అన్నింటి రక్షణకు ఆయనే బాధ్యుడు. సృష్ట్యాదియందు ప్రజాపతియై, సృష్టిస్థితియందు విష్ణువై, ప్రళయకాలమున రుద్రుడై ఆయన అంతటిని కాపాడును. భగవానుడు సర్వవ్యాపియై, సర్వాధారుడై సర్వమును రక్షించును

శ్రీ శంకరులు 'విశ్వభుగ్', 'విభుః' అనే రెండు నామములుగా వ్యాఖ్యానించారు.

విశ్వభుగ్ – **విశ్వమ్ భున్క్తే, విశ్వమ్ భునక్తి** – విశ్వమును అనుభవించువాడు, భక్షించువాడు. పరమాత్మయే జీవరూపమున శరీరమునందుండి ఇంద్రియముల ద్వారా సుఖదుఃఖములను అనుభవించువాడు. ప్రళయకాలమున సర్వజీవులను తనయందే నింపుకొనువాడు.

శ్రీ చిన్మయానంద – భగవంతుడే సర్వానుభూతులను (విశ్వ) తనయందు లీనము చేసికొనును. ఆయన అంతర్యామియైనందున అన్ని అనుభవములు ఆయనకే చెందును. ప్రళయకాలమున అంతయును ఆయనయందే లయమగును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **ప్రభుః సృణానామ్ విశ్వభుక్** – అని తైత్తరీయారణ్యకము (10.91) నందు ఉన్నది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'భుజ్' అనగా వంగుట (కొటిల్యే), విస్తరించుట. అన్ని దిశలందును విస్తరించిన శ్రీమహావిష్ణువే విశ్వము నేర్పరచినాడు.

'విభుః' నామమునకు శ్రీ శంకరుల భాష్యము – **వివిధమ్ భవతి ఇతి విభుః** – హిరణ్యగర్భుడై, మరియు అనేక స్వరూపములు ధరించి, విశ్వమంతయును నిండి వెలుగు పరమేశ్వరుడే విభుడు. సర్వమూ తానెయైనవాడు. అనంతుడు. **వివిధమ్ భావయతి.**

ధర్మచక్రము రచయిత శ్రీ మద్భగవద్గీతలోని విభూతి యోగము నందలి 21 నుండి 38వ శ్లోకము వరకు శ్రీకృష్ణపరమాత్ముడు తన అనంత ఐశ్వర్య విభూతులను తెలిపిన విషయమును విపులీకరించారు –

శ్రీ భగవానుడే సకల ప్రాణులకును ఆత్మ. ఆది, మధ్యము, అంతము. ఆదిత్యులలో విష్ణువు. జ్యోతులలో సూర్యుడు. మరుత్తులలో తేజము. వేదములలో సామవేదము. దేవతలలో ఇంద్రుడు. ఇంద్రియములలో మనస్సు. ప్రాణులలో చైతన్యము.

ఆ పురుషోత్తముడే రుద్రులందు శంకరుడు. యక్షులందు కుబేరుడు. వసువులలో అగ్ని. పర్వతములందు సుమేరువు. పురోహితులందు బృహస్పతి. సేనాపతులందు కుమారస్వామి. సరస్సులలో సముద్రుడు. మహర్షులందు భృగువు. శబ్దములందు ఓంకారము. యజ్ఞములందు జపయజ్ఞము. స్థావరములందు హిమాలయము.

ఆ పరమేశ్వరుడే చెట్లలో రావిచెట్టు (అశ్వత్థ వృక్షము). దేవర్షులలో నారదుడు. గంధర్వులలో చిత్రరథుడు. సిద్ధులలో కపిల ముని. గుఱ్ఱములలో ఉచ్చైశ్రవము. ఏనుగులలో ఐరావతము. నరులలో నరేంద్రుడు. ఆయుధములలో వజ్రము. ఆవులలో కామధేనువు. సంతానోత్పత్తికి కారణమగు మన్మథుడు. సర్పములలో వాసుకి. నాగులలో అనంతుడు. జలచరాధిపతియగు వరుణుడు. పితృదేవతలలో ఆర్యముడు. శాసకులలో యముడు.

ఆ గోవిందుడే దైత్యులలో ప్రహ్లాదుడు. లెక్కవేయువారిలో కాలము. మృగములలో సింహము. పక్షులలో గరుత్మంతుడు. పవిత్రము చేయువానిలో వాయువు. శస్త్రధారులలో శ్రీరామచంద్రుడు. మత్స్యములలో మొసలి. నదులలో గంగ. సృష్టికి ఆది, మధ్యము, అంత్యము. విద్యలకు ఆధ్యాత్మము (బ్రహ్మవిద్య). తత్వనిర్ణయమునకు వాదము.

ఆ కేశవుడే అక్షరములయందు 'అ'కారము. సమాసములందు ద్వంద్వము. అక్షయమగు కాలము. విశ్వతోముఖుడగు విరాట్ పురుషుడు. అందరిని పోషించువాడు. హరించు మృత్యువు. భవిష్యత్తునకు ఉత్పత్తి హేతువు. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమ. శ్రుతులందు బృహత్సామము. ఛందస్సులందు గాయిత్రి. మాసములందు మార్గశీర్షము. ఋతువులందు వసంతము. వంచకులలో జూదము. ప్రభావశాలురలోని తేజము. విజేతలలోని విజయము. కష్టించువారిలో నిశ్చయము. సత్పురుషులలోని సాత్విక భావము. ఆ శ్రీవేంకటరమణుడే వృష్ణివంశజులలో వాసుదేవుడు. పాండవులలో ధనంజయుడు. మునులలో వేదవ్యాసుడు. కవులలో (సూక్ష్మబుద్ధి కలిగిన వారిలో) శుక్రాచార్యుడు. శిక్షించువారిలో దమనశక్తి. జయము కోరువారిలో నీతి. రహస్యములలో మౌనము. జ్ఞానులయొక్క తత్వజ్ఞానము. సర్వప్రాణుల ఉత్పత్తికి కారణమైన బీజము. ఆయన లేని చరాచర ప్రాణి ఏదియును లేదు. ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువు ఏదైనను శ్రీకృష్ణుని తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినది. ఈ సంపూర్ణ జగత్తు శ్రీమన్నారాయణుని యోగశక్తియొక్క ఒక అంశతోడనే ధరింపబడి యున్నది. ఆయన విభూతులకు అంతము లేదు. ఆయనే విభుడు.

## 242. సత్కర్తా

- సజ్జనులను, పుణ్యవర్తనులను, ధర్మాత్ములను ఆదరించువాడు, గౌరవించువాడు – **సత్ కరోతి పూజయతి ఇతి సత్కర్తా.**

### ఓం సత్కర్త్రే నమః

'సత్కారము' అనగా పూజ. శ్రీరాముడు, **సజ్జన ప్రతి పూజకః** అని ప్రసిద్ధుడు. **బహుశ్రుతానామ్ వృద్ధానామ్ బ్రాహ్మణానామ్ ఉపాసితా** (రామాయణము 2.2.33)

ధర్మచక్రము రచయిత హనుమంతుని చూచింతనే శ్రీరాముడు ప్రశంసించిన విధమును ఉదాహరించారు. ఈ నామస్మరణము వల్ల మనము సద్వర్తన నలవరచుకొనవలయును. ఇందువలన మనకు మనశ్శాంతి లభించును. అహంకారము నశించును. భగవంతుని ఆదరము, అనుగ్రహము కలుగును. పరులకు సంతోషము కలుగును.

సీతాదేవి కుశలవార్తలను తెలిపిన హనుమంతునితో శ్రీరాముడు ఇట్లు పలికెను – హనుమా! వినుము. దేవతలలో గాని, మునీశ్వరులలో గాని, మానవులలో గాని నాకు నీవంటి ఉపకారి లేనేలేడు. నేను నీకేమి ప్రత్యుపకారము చేయగలను? నా మనస్సు కూడ నీ ముందుకు వచ్చుటకు జంకుచున్నది. ఆలోచింపగా నీ ఋణమునుండి విముక్తుడను కాలేనని తోచుచున్నది (శ్రీ రామచరిత మానసము 3.4)

## 243. సత్కృతః

- పూజనీయులచేత (సాధువుల చేత) కూడ పూజింపబడువాడు.

### ఓం సత్కృతాయ నమః

శ్రీభట్టుల వ్యాఖ్యను నిరుక్తిలో ఇలా చెప్పారు – **అర్చాదిభిః సజ్జనైః యః పూజితః సత్కృతః స్మృతః** – శ్రీహరియే సాధుసజ్జనులచేత పూజలందుకొనువాడు గనుక సత్కృతుడు.

నృసింహప్రియ వ్యాఖ్యలో ఆచార్య శ్రీనివాస రాఘవాచారి ఇలా వివరించారు – శ్రీమహావిష్ణుభక్తి తత్పరులైనవారు నివేదించినదేమైనా, ఎంత చిన్నదైనా గాని, దానిని భగవంతుడు మహానైవేద్యముగా భావించి స్వయముగా స్వీకరించును. అంతేకాదు. అందుకు ప్రతిగా తానందించు ఫలము అల్పమని ఆయన భావించును (ద్రౌపది ఆక్రందన తన హృదయముపై వీడని భారముగా నున్నదని శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను.)

వేదములలో చెప్పినట్లుగా తల్లిని, తండ్రిని, గురువును పూజించుట ద్వారా పరమాత్మునిపై భక్తిని పెంపొందించుకొనవచ్చునని ధర్మచక్రము రచయిత వ్యాఖ్యానించారు.

## 244. సాధుః

- (భక్తుల క్షేమమునకు అవుసరమైన పనిని) సాధించువాడు.
- సాధువర్తనుడు. సదాచార సంపన్నుడు.

### ఓం సాధవే నమః

**సాధయతి ఇతి సాధుః –** (కార్యమును) నిర్వర్తించువాడు.

**సాధ్నోతి ఇతి సాధుః –** (లోకరక్షణార్థమై) సాధ్యము కావించువాడు.

**సేవాం సారథ్య దూత్యాద్యాం సాధు సాధయతీతి సః –** తన భక్తులకు రథము తోలుట, దూతకృత్యములు వంటి పనులను నెరవేర్చినవాడు.

భక్తుల కొఱకు భగవంతుడు పడిన పాట్లు ఇన్ని అన్ని కావు. ఆయన పాండవుల కొఱకు రాయబారము తీసికొని పోయెను. శిశుపాల దుర్యోధునాదుల నిందలను సహించెను. కూర్మావతారుడై కొండనెత్తెను. మత్స్యావతారుడై పడవను లాగెను. శ్రీవరాహమూర్తియై ధరణిని ధరించెను. శ్రీరాముడై వనవాసమును అనుభవించెను. శ్రీవరదరాజ స్వామిగా కంచిలో తిరుక్కచ్చి నంబికి గొడుగు పట్టెను. శ్రీనివాసుడై అనంతాళువారికి మట్టి మోసెను. కనుకనే ఆయన సాధువు. భక్తులకు సఖుడు. వారి పనులు చేయుట ఆయనకు ప్రీతికరము.

'సాధుః' అనగా వేదయుక్తమగు సత్ప్రవర్తన కలిగినవాడు అని కూడ అర్థమును చెప్పారు. సన్మార్గమున వర్తించువానికి లక్ష్యసాధనము, విజయము తథ్యము. భగవంతుడు సదా విజయుడు. సాధువు.

సాధుస్వరూపుడగు భగవానుని పొందుటకు సాధువర్తనము అత్యంతావశ్యకము. శీలసంపద లేనివానికి మోక్షము లేదు.

## 245. జహ్నుః

- గుహ్యమైనవాడు. (మూఢులను విడనాడువాడు). కానరానివాడు.
- ప్రళయకాలమున సమస్తమును లయము చేయువాడు.
- దోషములకు దూరముగానుండువాడు.

### ఓం జహ్నవే నమః

'హ' అనే ధాతువునకు త్యాగము చేయుట, విడనాడుట అనే అర్థములున్నాయి.

**అభక్తేషు ఆత్మ మాహాత్మ్యమ్ అపహ్నుతే ఇతి జహ్నుః – జహాతి అవిదుషు జహ్నుః –** భక్తి, విశ్వాసము లేనివారిని మోక్షమార్గమునకు పెడగానుంచువాడు. మూఢులకు కానరానివాడు.

మహాభారతము ఉద్యోగపర్వము (6.7.2) నుండి శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణము.

**చక్రమ్ తద్-వాసుదేవస్య మాయయా వర్తతే విభోః**
**సాఽపహ్నవమ్ పాణ్డవేషు చేష్టతే రాహసత్తమః**

మహారాజా! వాసుదేవుని చక్రము (ఇతరులకు కనిపించకుండా) మాయగా పాండవులను ఎల్లెడల రక్షించుచుండును.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– జనాన్ సంహార సమయే అపహ్నుతే అపనయతి ఇతి జహ్నుః –** ప్రళయ సమయమున సకల ప్రాణులను తనయందు ఇమిడ్చుకొనువాడు (దాచియుంచువాడు) గనుక ఆయన జహ్నువు. ఇదే విధముగా జహ్ను మహర్షి గంగానదిని తనయందు దాచుకొన్నందున గంగకు జాహ్నవి యను పేరు గలదు. (గంగావతరణ గాథ శ్రీరాధాకృష్ణశాస్త్రిచే ఉదాహరింపబడినది)

ఇలా 'గుహ్యముగా నుంచుట' అనే విషయమున జీవనంలో సర్వసాధారణమనీ, ప్రయోజనకరమనీ చెబుతూ ధర్మచక్రములో పెక్కు దృష్టాంతములను చెప్పారు. ఇలానే మనము గడచిన చెడు విషయములను మరచిపోగలము. ముందుకాలములోని విపత్తులు

సంభవించువరకు మనకు తెలియవు. తల్లి గర్భములో బిడ్డ దాగియుండును. విత్తనములో వృక్షము దాగియుండును. మరణకాలము ముందుగా తెలియదు. గెలుపెవరిదో ప్రత్యర్థులకు ముందుగా తెలియదు. పునఃసృష్టికి ముందు జీవులన్నియు దేవునిలో దాగియుండును.

ఈ నామస్మరణ ద్వారా మనము ఇతరుల లోపములను, చెడును విస్మరించి, వారి ఉపకారములను మాత్రము గుర్తుంచుకొనవలెను. ఈ విధముగా సాధన చేయుటవలన భగవంతుడు మనకు తెలియవచ్చును (గుహ్యము కాడు).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు 'హ' అనగా 'త్యాగే' ధాతువునుండే మరొక వివరణ ఇచ్చారు. భగవంతుడు శుద్ధ సత్వ స్వరూపుడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు ఆయనకు దూరముగానుండును. అన్ని క్లేశములను, పాశములను ఆయన త్యజించినవాడు. **పవిత్రాణాం చ పవిత్రమ్.**

## 246. నారాయణః

- సకలాత్మలకు ఆధారమైనవాడు, జీవ సముదాయములకు ఆశ్రయము.
- జగత్తంతయును (లోపల, వెలుపల) వ్యాపించియున్నవాడు.
- జలములకు ఆధారము, జలములే నివాసము అయినవాడు.
- ప్రళయ కాలమున జీవులకు నిలయమగువాడు.

### ఓం నారాయణాయ నమః

భక్తులకు అత్యంత ప్రియమగు ఈ పుణ్యనామము అష్టాక్షరీ మహామంత్రముగా లోక ప్రసిద్ధము. గాయత్రీమంత్ర దేవత. ఈ నామమునకు అనేక పుణ్య భావములు, విశేషార్థములును, సాంకేతికార్థములును కలవని శాస్త్రములును, భక్తులును చెప్పుచున్నారు.

ఇంతకు ముందు ప్రస్తుతింపబడిన దివ్యనామములు బహువిధములైన గుణస్వరూప కీర్తనముద్వారా నారాయణుని స్తుతించునవి. శ్రీవిష్ణుసహస్రనామము నందలి శివ, రుద్ర, పరమాత్మ, మహాశక్తి, గురు, సాధు వంటి నామములు శ్రీమహావిష్ణువు నుద్దేశించినవైనను పెక్కు దేవతాస్తోత్రములందు కూడ వాడబడును. ఇప్పుడు శ్రీ వ్యాసభగవానులు చెప్పిన 'నారాయణ' నామము శ్రీమహావిష్ణువునే కీర్తించు దివ్య నామము, స్తుతించు మహామంత్రము. 'నారాయణ' నామప్రాశస్త్యమును గూర్చి శ్రీ భట్టులు విపులముగా చర్చించారు. అన్ని ఉపనిషత్తులలోను నారాయణ నామము స్తుతింపబడినది. వేదములలో 'నారాయణ' నామమునకు అర్థము ఇలా చెప్పబడినది.

**యచ్చ కించిత్ జగత్ సర్వమ్ దృశ్యతే శ్రూయతేऽపివా**
**అంతర్ బహిశ్చ తత్ సర్వమ్ నారాయణః స్థితః**
సర్వ జగత్తునందును కనుపించునది గాని, వినుపించునది గాని, ప్రతి వస్తువు నందును లోపల, బయట వ్యాపించి నారాయణుడు స్థితుడై యున్నాడు.

**నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్** – తైత్తిరీయారణ్యకము 6.1.28
**నారాయణ పరమ్ బ్రహ్మ తత్వమ్ నారాయణః పరః**
**నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః** – తైత్తిరీయారణ్యకము 6.11

**ఏకో హవై నారాయణాऽసీత్**

**న బ్రహ్మ న ఈశానః న ఆపః న అగ్నిషోమి యౌ**

**న ఏమే ద్యావా పృథ్వీ న నక్షత్రాణి న సూర్యః న చంద్రమః** – మహోపనిషత్తు

ఈ నామ వ్యాఖ్యానము చివరలో శ్రీ భట్టులు చెప్పిన విషయం ఇక్కడ ముందుగా గమనించవలసిన అవుసరం ఉంది – అక్కడా ఇక్కడా చదివీ, వినీ ఈ మహానామమంత్రమునకు అర్థమూ, రహస్యమూ తెలిసికొన సాధ్యము కాదు. తగిన గురువును ఆశ్రయించి, సేవించి, వారి అనుగ్రహము ద్వారా మాత్రమే ఈ పవిత్ర నామ మంత్ర రహస్యమును గ్రహింపనగును. ఈ పవిత్ర నామ మహాత్త్మ్యము నాలుగు కన్నులకు మాత్రమే గోచమగును, కాని ఆరు కన్నులకు కాదు – అని శ్రీ భట్టులు తమ వ్యాఖ్యను ముగించారు. (అనగా గురువుగారి రెండు కన్నులు, శిష్యుని రెండు కన్నులు – నాలుగు కన్నులు మాత్రమే ఈ నామవైభవమును దర్శింపగలవు. వ్యాఖ్యానకర్తయొక్క మరి రెండు కన్నులు అక్కడ చేరరాదు.)

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'నర' శబ్దము ఆత్మను సూచించును. 'నార' అనగా ఆకాశము, మరియు ఆకాశమునుండి ఉద్భవించినవి. వీటన్నింటికి కారణము, అన్నింటా వ్యాపించినవాడు అయిన భగవంతునకు సర్వము 'అయనము' (అనగా నివాసము). కనుక ఆయన 'నారాయణుడు'. మహాభారతమునందు ఈ ప్రమాణము ఉన్నది.

**నరాజ్జాతాని తత్వాని నారాణీతి తతో విధుః**

**తాన్యేవ చాయనమ్ తస్య తేన నారాయణఃస్మృతః** – అనుశాసనిక పర్వము 13.1.2

నరులనుండి (ఆత్మలనుండి) ఉద్భవించినందున తత్వములు 'నారములు' అని పిలువబడెను. ఆ నారములే నిలయముగా కలిగినందున భగవంతుని 'నారాయణుడు' అని చెప్పిరి.

శ్రీ శంకరులు చెప్పిన మరొక భావము – **నరాణామ్ జీవానామ్ అయనత్వాత్ ప్రళయ ఇతి వా** – ప్రళయ కాలమున జీవులు ఆయనయందు ప్రవేశించి నివసించును. అనగా ప్రళయ కాలమున జీవులకు నారాయణుడే నివాస స్థలము. తైత్తరీయోపనిషత్తు (3.1)లో **'యత్ప్రయన్త్యభిసంవిశన్తి'** అను విశేషణము చెప్పబడెను. దీనికి 'సమీపించి, ప్రవేశించును' అని అర్థము. కనుక ఆయన నరులకు, తత్వములకు నిలయమై నారాయణుడని చెప్పబడెను. **నరాణామ్ అయనమ్ యస్మాత్ తస్మాన్ నారాయణః స్మృతః** (బ్రహ్మ వైవర్త పురాణము).

పై చెప్పిన విధములలో 'నారములే ఆయనకు నిలయము' అని ఒక అర్థము కాగా, 'నారములకు ఆయన నిలయము' అని రెండవ అర్థము. మనుస్మృతి (1.10)లోని నిర్వచనము.

**ఆపో నారాః ఇతి ప్రోక్తాః ఆపో వై నరసూనవః**

**తా యదస్యాయనమ్ పూర్వమ్ తస్మాన్ నారాయణః స్మృతః** – మనుస్మృతి (1.10)

'నారములు' అనగా జలములు (పంభూతములు వేరువేరుగా కనిపించక ముందున్న స్వరూపము). అట్టి నారములను సృజించి, వానియందే (ప్రళయకాలమున) నివాసమేర్పరచుకొన్నందున భగవంతుని నారాయణుడని అందురు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారి ఉపమానము – తల్లి గర్భములో శిశివు నీటిలో తేలుచూ ఉండును. అందుండి శిశువు జన్మించి లోకములో ఆవిర్భవించును. అదే విధముగా నారములనుండి బ్రహ్మాండము ఉద్భవించెను. ఆ నారములను సృజించినది (మాతృమూర్తి) నారాయణుడే. ఆయన కూడ నారములను తన నివాసముగా చేసికొనెను.

నరసింహ పురాణములో చెప్పిన నారాయణ నామ మహాత్త్మ్యము (18.31) –

**నారాయణాయ నమ ఇత్యయమేవ సత్యః**

**సంసార ఘోర విష సంహరణాయ మంత్రః**
**శృణ్వన్తు భవ్యమతయో యతయోऽస్తరాగా**
**ఉచ్చైస్తరా ముపదిశామ్యహమ్ ఊర్ధ్వబాహుః**

'నారాయణాయ నమః' అను ఈ మంత్రమే సంసార ఘోర విషమును హరించు మహామంత్రము. ఈ విషయమును నేను చేతులెత్తి బిగ్గరగా చెప్పుచున్నాను. ఇంద్రియములను జయించి, సద్బుద్ధిని సాధించిన సాధువులందరూ ఈ మాట వినండి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – గాయత్రీ మంత్రము ద్వారా పూజింపబడు మంత్రదేవత శ్రీమన్నారాయణుడే – **ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణః**

ఈ నామ జప మహాత్మ్యమును వివరిస్తూ ధర్మచక్రము రచయిత దివ్యప్రబంధములను ఉదాహరించారు – **నలమ్ తరుమ్ సొల్లై నాన్ కణ్డు కొండేన్ నారాయణా ఎన్నున్ నామమ్.**

నారాయణ శబ్ద సంకీర్తనా మహాత్మ్యము ఈ శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర మహామంత్రము ఉత్తరపీఠిక (ఫలశృతి) యందే స్పష్టముగా చెప్పబడినది.

**ఆర్తా విషణ్ణాః శిధిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః**
**సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం విముక్త దుఃఖాః సుఖినో భవంతి.**

నారాయణ శబ్దోచ్చారణ మాత్రము చేతనే ఆర్తులు, విషణ్ణులు, దుఃఖితులు, భయంకర రోగపీడితులు, భయగ్రస్తులును విముక్తులై సుఖశాంతులు పొందుదురు.

(ఈ క్రింది భాగం శ్రీ కృష్ణమాచారి రచనలోనిది కాదు) https://sites.google.com/site/harshalarajesh/Home లో 'నారాయణ' నామమునకు శ్రీ మాధ్వ సంప్రదాయానుసారం 72 అర్థాలను ఇచ్చారు. ఇవి శ్రీ బిదరహళ్ళి శ్రీనివాసాచార్య తమ 'నారాయణ శబ్దార్థ'లో వ్రాశారని చెప్పారు. అవి

1. సకల కళ్యాణగుణ నిలయుడు.
2. ఏ విధమైన లోపములు లేనివాడు.
3. జ్ఞానమునకు గమ్యమైనవాడు.
4. సకల ఆత్మలకును విశ్రాంతిస్థానము.
5. సకల జనులకును పాలన, లయము, వ్యవస్థ, విద్య, అవిద్య, బంధనము మరియు మోక్షము కలుగజేయువాడు.
6. సమస్త మానవులచే నమస్కరింపబడువాడు.
7. అత్యంత ప్రియమైన ముఖ్యప్రాణదేవుడు.
8. సమస్త వేదములు ఆయననే కీర్తించుచున్నవి.
9. ముఖ్య వాయుదేవుని జ్ఞానమునకు సాధనము.
10. సకల దేవతల నామములు ఆయననే తెలియజేయుచున్నవి.
11. ముఖ్యాత్మ ఉన్నంతవరకే మానవశరీరములో ఉండేవాడు.
12. బ్రహ్మదేవుని శరీరమైన బ్రహ్మాండములో ఉండేవాడు.




ఉడిపి శ్రీకృష్ణ మందిరం గోపురము.

Creative Commons photo from Flickr by Vinay Bhavdekar https://www.flickr.com/photos/vabavdekar/4232457647/in/photostream/

13. బ్రహ్మదేవుడు సృజించిన ప్రపంచములో నివసించేవాడు.
14. శ్వేతదీపము, అనంతాసనము, వైకుంఠము అనే మూడు ఆవాసములు కలిగినవాడు.
15. తానే సృజించిన జలములు తనకు ఆవాసముగానున్నవాడు.
16. సూర్యమండలము అంతర్వర్తియైనవాడు.
17. తన భక్తుల హృదయపద్మములలో విలసిల్లువాడు.
18. గరుత్మంతుని తన వాహనముగా కలిగినవాడు.
19. శేషపాన్పుపై పవళించువాడు.
20. పరిశుద్ధులు కానివారికి తెలియరానివాడు.
21. ముఖ్యప్రాణమాతయైన శ్రీ మహాలక్ష్మిచే సేవింపబడువాడు.
22. భూదేవికి ఆధారమైనవాడు.
23. ముక్తులకు ఆనందమును ప్రసాదించువాడు.
24. సకల జ్ఞానులకు మరియు ముఖ్యవాయుదేవునకు పితృ, భ్రాతృ, సఖ సంబంధము కలిగినవాడు.
25. నరుల విన్నపాలను అనుగ్రహించువాడు.
26. వటపత్రముపై శయనించినవాడు. శ్రీదేవీ సమేతుడు.
27. కూర్మరూపధారియై బ్రహ్మాండమునకు ఆధారమైనవాడు.
28. ఆదిశేషునికి ఆధారముగా కూర్మమైన ముఖ్యప్రాణదేవునికి ఆధారమైన మహాకూర్మము.
29. అన్ని జీవులకంటె, ప్రకృతికంటె భిన్నమైనవాడు, ఎట్టి లోపములు లేనివాడు, సకల ముక్తాత్ములకంటె ఉన్నతమైనవాడు, తన భక్తుల దోషములను నశింపజేయువాడు, మరియు సకల కళ్యాణగుణములకు నిలయుడు.
30. శాశ్వతమైన, అవ్యయమైన, స్వతంత్రమైన జ్ఞానమునకు నిలయము.
31. విరజానదిలో జ్ఞానుల లింగశరీరమును అంతముచేయువాడు.
32. జ్ఞానుల మనములకు గమ్యము.
33. జ్ఞానుల ననుసరించువాడు.
34. బ్రహ్మదేవుని శరీరములో ప్రవేశించువాడు.
35. దుష్టుల మనసులకు అందరానివాడు.
36. పాపులకు ప్రేరకముగా నరకములోనున్నవాడు.
37. సత్పురుషులకు ప్రేరకముగా స్వర్గములోనున్నవాడు.
38. ప్రలయ కాలమును వరుణుడు, చంద్రుడు అనిరుద్ధునిలో ప్రవేశించుటకును, అనిరుద్ధుడు మన్మథునిలో ప్రవేశించుటకును, మన్మథుడు వరుణిలో ప్రవేశించుటకును, వరుణి శేషునిలో ప్రవేశించుటకును, అగ్ని

సూర్యులు బృహస్పతిలో ప్రవేశించుటకును, బృహస్పతి ఇంద్రునిలో ప్రవేశించుటకును, ఇంద్రుడు సౌపర్ణిలో ప్రవేశించుటకును, సౌపర్ణి గరుడునిలో ప్రవేశించుటకును కారణమైనవాడు.

39. తన చక్రాది ఆయుధములతో తన శత్రువులను నాశనము చేయువాడు.
40. బ్రహ్మాండమునకు ఆవలనున్న జలములను బ్రహ్మాండములో ప్రవేశింపజేయువాడు.
41. తననుండి ఉద్భవించిన పద్మమునకాధారమైనవాడు.
42. పదునాల్గు భువనములకు ఆధారమైనవాడు.
43. జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలకు మూలకారణమైనవాడు.
44. విశ్వ, తైజస, ప్రజ్ఞ రూపములలో కన్నులు, మనసు, హృదయములలో వసించువాడు.
45. అవతారానంతరము తన శ్రీ రామాది అవతారరూపములను తన మూలరూపములో విలీనము జరుపువాడు.
46. శ్రీనృసింహావతారమున ప్రహ్లాదుని సంరక్షించినవాడు.
47. శ్రీ రామావతారమున హనుమంతునకు ఆధారమైనవాడు.
48. శ్రీ కృష్ణావతారమున భీమసేనునకు ఆధారమైనవాడు.
49. శ్రీ వేదవ్యాసావతారమున శ్రీమదానంద తీర్థులకు ఆధారమైనవాడు.
50. ఎనిమిది వ్యాసమూర్తులలో నివసించువాడు.
51. శ్రీ ప్రద్యుమ్న, సంకర్షణ రూపములలో భుజియించువారిలో వసించువాడు.
52. శ్రీ అనిరుద్ధ, నారాయణ రూపములలో ఆహారమునందు వసియించువాడు.
53. జీవులు భుజించిన ఆహారమును జీర్ణము కావించి క్రొత్త స్థలమును కలిగించువాడు.
54. శ్రీ సాలిగ్రామ రూపములలో సదా కొలువైయుండువాడు.
55. శ్రీ రంగనాథాది అర్చారూపములలో కొలువైయుండువాడు.
56. శ్రీ కృష్ణావతారములో అర్జునునకాధారమైనవాడు.
57. అర్జునునకు సఖుడై భూమికి ఆధారమైనవాడు.
58. అపరోక్ష జ్ఞానమునకు లక్ష్యమై, ప్రారబ్ధ, అనిష్ట పుణ్య, పాప కర్మలను నాశనము చేయువాడు.
59. అత్యంత శక్తిమంతులైన సత్పురుషులలోని దోషములను నశింపజేయువాడు.
60. తాను ఆనందస్వరూపమై, దుష్టులకు దోషములు కలిగించువాడు.
61. ముక్తిరూపంలో శిష్టులకు పరమానందమును అనుగ్రహించువాడు.
62. యజ్ఞాది కర్మలను చేయువారికి వారి కర్మానుసారము స్వర్గములో ఆనందమును ప్రసాదించువాడు.
63. కలికి శాశ్వతనరకమునిచ్చువాడు.
64. దైత్యుల ఆనందమునకు అవరోధము కలిగించువాడు, ప్రళయమునకు కారణము, మరియు బ్రహ్మాది దేవతలకు తెలియవచ్చువాడు.
65. ఎట్టి దోషములును లేకుండ, అందరికంటెను ఉత్తముడై, ముక్తులకు లభించువాడు.
66. ఎట్టి దోషములు లేనివాడు, శిష్టులకు ఆనందమును ప్రసాదించి తనను చేరుకొనేలా అనుగ్రహించేవాడు.
67. ఆనందఘనుడై, దుష్టులకు అందరానివాడు

68. ప్రళయకర్త, దైత్యులకు ఆనందమునందనీయనివాడు, సచ్చిదానంద స్వరూపుడు, మరియు సరైన జ్ఞానము కలిగినవాడు.
69. శ్రీ సద్గురు స్వరూపములో ముక్తిని అనుగ్రహించేవాడు.
70. జీవులకు వారివారి కర్మానుసారము ఫలములను అనుగ్రహించేవాడు.
71. నరుల సత్కార్యముల ఫలములను ఆరగించువాడు.
72. ముక్తుడైన బ్రహ్మదేవుని స్త్రీ రూపమునకు ఆనందము కలిగించువాడు.

(English translation of the 72 meanings by Shri.K. Narasimhan, Tirunelveli, in his article Narayana Sabdartha; Vol-6, No.10, Dharmaprakash, June 1977)

**247.** నరః

- నాశనము (తుది) లేనివాడు.
- నడిపించువాడు. నాయకుడు.

ఓం నరాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – శాశ్వతమైన సంపత్తు గలవాడు. ఆయన చెంత చేరిన చేతనాచేతనములకు నాశనము లేదు.

శ్రీ శంకరులు – **నయతితి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః** – అను వేదవ్యాస వాక్యానుసారముగా, భక్తులను పరమ పదమునకు నడిపించు నాయకుడైనందున పరమాత్ముడు నరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'నృ' అను ధాతువునుండి – 'నయె' అనగా నడుపుట. – 'నయతి' అనగా నడిపించువాడు – 'నృణతి' అనగా తీసికొని వెళ్ళువాడు. ఈ విశాలజగత్తును ఒక కల్పమునుండి మరొక కల్పమునకు చేర్చును గనుక ఆయన నరుడు. 'నర' శబ్దమునకు 'జలము' అనే అర్థము కూడ ఉన్నది. నీటికి ప్రవహించే లక్షణము ఉన్నందున, ప్రవాహముతోపాటు వస్తువులను తీసికినివెళ్ళు గుణము కూడ ఉన్నది. సృష్టికి ముందు సర్వమూ జలమయమని ఋగ్వేదము (10.129.3)నందు చెప్పబడినది. **తమాఽసీత్ తమసా గూఢమగ్రేఽప్రకృతమ్ సలిలమ్ సర్వమిదమ్.**

ధర్మచక్రము రచయిత – పిల్లవాని చేయిపట్టి దారిచూపు తల్లి అవుసరమైతే పిల్లవాని మేలుకోసం శిక్షిస్తుంది కూడాను. అలాగే జ్ఞానార్థియైన శిష్యుని అప్పుడప్పుడూ గురువు దండించ వచ్చును. ఇదేవిధంగా శ్రీమహావిష్ణువు నరుడై, నాయకుడై నడిసంద్రమున నావను నడిపించు దేవుడు. ఆ లోకనాథుడు అప్పుడప్పుడూ శిక్షింపవచ్చును. కాని ఎల్లప్పుడూ రక్షించుచునేయుండును.

**రామానుజ దర్శనము (Vol.3 – Issue.2 – June-August 2005).** శ్రీ వి.వి. రామానుజమ్ గారి 'Vaishnavism in Vedic Period' నుండి సంగ్రహించినది.

గీతోపదేశమున భగవానుడు **'వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః'** – అని తెలిపెను. అనగా అన్ని వేదముల ద్వారా తెలిసికొనదగినవాడు, వేదవేద్యుడు ఆయనే. వేదాంత భాషణములందు పరతత్వమనీ, బ్రహ్మమనీ, పరబ్రహ్మమనీ ఆయననే సూచించడం జరిగింది. సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ – స భూమిమ్ విశ్వథోవృత్వా – అథ తిష్ఠమ్ దశాంగుళమ్ – అనే పురుష సూక్తము అన్ని వేదములందూ చెప్పబడినది. ఇందుబట్టి ఇది చాలా ముఖ్యమైన ప్రమాణము అని గ్రహింపవచ్చును. ఇక్కడ 'సహస్ర' అనగా వేయి కాదు. వేలాది, అసంఖ్యాకము, అనంతము అని గ్రహించుట కష్టము కాదు (వేయి తలలుంటే రెండువేల కళ్ళు ఉండాలి కదా!). అంటే ఆ 'పురుషునకు'

జ్ఞానము, శక్తీ, ఐశ్వర్యమూ అనంతమై ఉండవలెను. ఇంకా ఇలా చెప్పబడినది – ఆ పురుషునకు మృత్యువు లేదు. ఆయన ఇతరులకు అమృతత్వము ప్రసాదించగలడు. ఆయన సకల జగత్తునకు కారణము. ప్రభువు.

ఇంకా – వేదాऽహమ్ ఏథమ్ పురుషమ్ మహాన్తమ్ – ఆదిత్యవర్ణమ్ తమసాస్తుపరే – ఆ పురుషుడు తమస్సునకు అతీతముగా ఆదిత్యవరణముతో ప్రకాశించునని నేను ధ్యానిస్తున్నాను (తెలిసికొంటున్నాను). ఆ పరమపురుషుడు జగత్తును సృష్టించి, అందు స్థితుడైయున్నాడు. అన్ని జీవులయందు ఆత్మలో స్థితుడైయున్నాడు. అంతటా వ్యాపించి, అన్నింటినీ భరిస్తున్నాడు. లోనా, బయటా ఆవరించి యున్నాడు. ఆది, మధ్యము, అంతము లేని కాలాతీతుడు. సంకల్పమాత్రమున సమస్త స్వరూపములందు అవతరించు జన్మరహితుడు.

జగత్తు అంతా ఆ పరమపురుషుని స్వరూపమే అయినా, ఆయన భక్తులకు అనన్య కాంతిమయ సుందరుడై దర్శనమొసగును. ఆయన జ్ఞాన, బల, వీర్య, తేజో సంపన్నుడై, సమస్త మంగళ స్వరూపుడై, భగవంతునిగా గుర్తింపబడును. దోషరహితుడు. శ్రీదేవీ భూదేవీ సమేతుడు. లోకకళ్యాణార్ధము వివిధ రూపములలో అవతరించువాడు. కేవలము జ్ఞాన, భక్తి సంపన్నులైన మహాభాగులే ఆయనను అవతారమూర్తిగా నెరుగుదురు. భూమి మొదలు పరమపదము వరకు సకల భువనములును ఆయనకు అధీనమైన విభూతులు. ఆయన జగన్నాధుడు. దేవదేవుడు. భక్తిపూరితమైన పూజాది ఉపచారములను స్వీకరించి పరమపదమును ప్రసాదించు కరుణామూర్తి. శ్రీమహాలక్ష్మీదేవితో సదా కూడియుండువాడు. శ్రీలక్ష్మీనారాయణుని సేవించుటకంటె మహద్భాగ్యము వేరొకటి లేదు.

**యజుర్వేదము – నారాయణ సూక్తము**

సహస్రశీర్షమ్ దేవమ్ విశ్వాక్షమ్ విశ్వసంభవమ్
విశ్వమ్ నారాయణమ్ దేవమ్ అక్షరమ్ పరమమ్ బ్రహ్మమ్
ఆ సహస్రశీర్ష పురుషుడే విశ్వపురుషుడు, విశ్వరూపుడు, దేవుడు, అక్షరుడు, పరబ్రహ్మమునైన నారాయణుడు.

విశ్వతః పరమామ్ నిత్యమ్ విశ్వమ్ నారాయణమ్ హరిమ్
విశ్వ మే వేద్యమ్ పురుషః తద్విశ్వమ్ ఉపజీవతి
పతిమ్ విశ్వస్యాత్మేశ్వరమ్ శాశ్వతమ్ శివమ్ అచ్యుతమ్
నారాయణమ్ మహాజ్ఞేయమ్ విశ్వాత్మానమ్ పరాయణమ్

నారాయణ పరంబ్రహ్మ తత్వమ్ నారాయణ పరః
నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణ పరః
యచ్చకించిత్ జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేऽపివా
అంతర్ బహిశ్చ తత్ సర్వమ్ వ్యాప్య నారాయణ స్థితః

రామానుజ దర్శనము (Vol.1 – Issue.1 – Jan-Mar 2003) నుండి సంగ్రహించినది. Picture also from same source

**Who is Ramanuja? –by Sri Mohan Sagar**

శ్రీవైష్ణవ గురుపరంపర చక్కని మణిహారముతో పోల్చబడినది. ఈ గురుమణిహారము రహస్య త్రయమును అలంకరించుచున్నది. శ్రీ నారాయణుడే ఈ హారమునకు మొదలు, చివర కూడాను. **రహస్యత్రయములో** మూడు మంత్రములున్నవి.

1) శ్రీమన్నారాయణుడే స్వయముగా నరనారాయణావతారమున నరునకుపదేశించినది – మూల మంత్రము.
2) శ్రీధరుడే జగన్మాతయగు శ్రీమహాలక్ష్మికి ఉపదేశించిన మంత్రము – ద్వయమంత్రము

3) శ్రీకృష్ణభగవానుడు కురుక్షేత్రమున అర్జునునకుపదేశించిన మంత్రము – చరమ శ్లోకము.

**గురు పరంపర**

1) శ్రీధరుడు (శ్రీమన్నారాయణుడు)
2) శ్రీ (జగన్మాత మహాలక్ష్మి)
3) శ్రీ విష్వక్సేనుడు
4) శ్రీ శఠగోపముని (నమ్మాళ్వారు)
5) శ్రీ నాథముని
6) శ్రీ పుండరీకాక్షుడు
7) శ్రీ రామమిశ్రుడు
8) శ్రీ యమునాచార్యులు (అళవందార్)
9) శ్రీ పరాంకుశుడు
10) శ్రీ రామానుజుడు
11) శ్రీ ఎంబార్
12) శ్రీ పరాశర భట్టు
13) శ్రీ నన్ జీయర్
14) శ్రీ నన్ పిళ్ళై
15) శ్రీ వడక్కు తిరువీధి పిళ్ళై
16) శ్రీ పిళ్ళై లోకాచార్యుడు
17) శ్రీ తిరువైమొళి పిళ్ళై
18) శ్రీ మనవాళ మహాముని



www.srivaishnavam.com **Sri Vaishnavam – A Concise Study – Part V నుండి**

**మూల మంత్రము (అష్టాక్షరి, తిరుమంత్రము, మంత్రరాజము)**

బదరికాశ్రమమున నారాయణుడు నరున కుపదేశించినది. ఈ మంత్రములో మూడు పదములు (భాగములు) ఉన్నవి **(1) ప్రణవ శబ్దము (2) నమః (3) నారాయణాయ.**

చేతనులు నారాయణుని శరణుజొచ్చినందున లభించు సచ్చిదానంద భాగ్యము ఈ మంత్రమున పొందు పరచబడియున్నది. ప్రణవ శబ్దము కలిగినందున ఈ మంత్రము వైదికము. కనుక బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య పురుషులు మాత్రమే ఈ మంత్రసాధన చేయుటకు అర్హులు. ప్రణవ శబ్దమునకు బదులుగా 'ఆమ్' అని ఉచ్చరించినయెడల ఇది తాంత్రిక మంత్రమగును. అందువలన ఆ మంత్రముయొక్క ప్రభావమునందు, ఫలితమునందు ఏ విధమైన మార్పు ఉండదు. కాని అప్పుడు అన్ని వర్ణముల స్త్రీ పురుషులు (జాతి, లింగ నియమములు లేకుండ) ఈ మంత్రమును ఉచ్చరింపవచ్చును.

ప్రణవమునందు మూడు శబ్దములు – అ, ఉ, మా – మిళితములు. "అ" విష్ణువును సూచించును. "ఉ" లక్ష్మీదేవిని సూచించును. "మా" జీవాత్మకు సంకేతము. కనుక ఈ మంత్రము ద్వారా జీవాత్మ లక్ష్మీనారాయణులకు శేషము (శరణాగతము) కావలెనని చెప్పడమైనది. లక్ష్మీనారాయణులు ఒక్కటే గనుక ప్రణవమునకు బదులుగా "ఆమ్" అని వాడినా గాని అర్థము మారదు. "నమః" అనగా "నాది కాదు" అని అర్థము.

ఈ మంత్రమునకు పెక్కు రహస్య విశేష అర్థములున్నందున ఇది అత్యంత ముఖ్యమైనది. ఈ మంత్ర సాధన అన్ని వేదములను పఠించిన దానికి సమము. భక్తి విశ్వాసములతో స్మరించినయెడ ఈ మంత్రము సకల శుభసంపదలను, మోక్షమును ప్రసాదించును. శ్రీమన్నారాయణుడే ఈ మంత్రాధిష్టాన దేవత.

ఈ మంత్రమును 1 లేదా 2 లేదా 3 భాగములుగా ఉచ్చరింపవచ్చును. ఒకే భాగముగా జపించినయెడల ఈ మంత్రము సాధనామార్గమును, దాసత్వమును ప్రసాదించును. రెండు భాగములుగా జపించినట్లయితే ఈ మంత్రము ఆత్మజ్ఞానమును, శరణాగతిని, మోక్షమును ప్రసాదించును. మూడు భాగములుగా జపించినచో ఈ మంత్రము ఆత్మజ్ఞానమును, మోక్షమును, కామితార్థములను ప్రసాదించును. కష్టములను తొలగించును.

**మంత్ర రత్నము (ద్వయ మంత్రము)**

వైకుంఠములో శ్రీమహాలక్ష్మికి శ్రీమన్నారాయణుడు ఉపదేశించిన మంత్రము

శ్రీమన్నారాయణ చరణౌ శరణమ్ ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః
రెండు వాక్యములున్నందున ఇది ద్వయము. ఏ విధమైన నిబంధనలు లేకుండ అందరును జపించదగిన తాత్విక మంత్రము. లక్ష్మీనారాయణులకు శరణాగతి చేయు సాధనము. ఈ మంత్ర వ్యాఖ్యానము శ్రీరామానుజుల శరణాగతి గద్యమునందు చెప్పబడినది. ఇందులో ఎనిమిది పదములు ఉన్నాగాని, ఉచ్చరించేటపుడు ఆరు పదములుగానే అనిపిస్తుంది.

నిగూఢమైన భావములున్నందున, జాతి మత లింగ సమయ విచక్షతలు లేకుండా జపింపదగినందున ఇది మంత్రరత్నము.

**చరమ శ్లోకము**

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకమ్ శరణమ్ వ్రజ
అహమ్ త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః
అని గీతోపదేశమున శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునునకు బోధించినదే చరమశ్లోకము. మోక్షమునకు శరణాగతియే సులభము, ఉత్తమము అయిన మార్గము. అనగా ఇక్కడ వర్ణాశ్రమ ధర్మములను వదలిపేయమని కాదు. కామములను యోగములను త్యజింపమని అర్థము.



ద్వారకా తిరుమల శ్రీ సంతాన వేణుగోపాలస్వామి జగన్నాధాలయం గోపురం



## అసంఖ్యేయోऽప్రమేయాత్మా విశిష్టః శిష్టకృచ్ఛుచిః |
## సిద్ధార్థః సిద్ధసంకల్పః సిద్ధిదః సిద్ధిసాధనః || (27)

### 248. అసంఖ్యేయః

- అసంఖ్యాకములైన గుణ, స్వరూప, నామములు గలవాడు..

**ఓం అసంఖ్యేయాయ నమః**

**అగణ్యా నర సంఖ్యేయః సోऽసంఖ్యేయః పరికీర్తితః –** భగవంతుని గుణములు అనంతములు. రూపములకు లెక్క లేదు. ఆయన ఏ పేరుతో పిలిచినా పలుకును. కనుక ఆయన అసంఖ్యేయుడు.

**అనేక బాహూదర వక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోऽనంత రూపమ్**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప** – గీత 11.16
ఓ విశ్వేశ్వర! విశ్వరూప! నీ బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు అసంఖ్యాకములు. నీ అనంత రూపము సర్వతోముఖముగ విలసిల్లుచున్నది. నీవు ఆది మధ్యాంత రహితుడవు. మహత్వపూర్ణమైన నీ విశ్వరూపమునకు ఆది మధ్యాంతములను తెలిసికొనలేకున్నాను.

### 249. అప్రమేయాత్మా

- ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని తెలిసికొన శక్యము కాని, ఎట్టి ప్రమాణముల చేతను నిర్వచించుటకు వీలు గాని దివ్యాత్మస్వరూపుడు.

**ఓం అప్రమేయాత్మనే నమః**

మనస్సు చేత గాని, ఇంద్రియముల చేత గాని, ఆత్మ స్వరూపము బోధపడదు. ప్రమాణైః ప్రమాతుమ్ అశక్యః అప్రమేయః – అని శ్రీ సత్యదేవో వాసిష్ఠగారి వివరణ. ఇంక పరమాత్ముని తెలిసికొన నెవరి తరము?

**న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహత్ య సః** – యజుర్వేదము 31.3
46వ నామము – అప్రమేయః
249వ నామము – అప్రమేయాత్మా
103, 181 నామములు – అమేయాత్మా
ఈ మూడు దివ్య నామములందలి పోలిక గమనింపదగినది.

**శ్రీ పుష్పదంతాచార్య కృతమైన శ్రీ శివ మహిమ్న స్తోత్రము నుండి**

మహిమ్నః పారం తే పరమ విదుషో యద్య సదృశీ
స్తుతిర్బ్రహ్మాదీనామపి తదవసన్నాస్త్వయి గిరః
అథా వాచ్యస్సర్వస్స్వమతి పరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే హర! నిరపవాదః పరికరః
ఓ ఈశ్వరా! నీ మహిమ యింతటిదని తెలియనివాడు నిన్నుగూర్చి చేసిన స్తోత్రము అయోగ్యమయినచో, సర్వజ్ఞులగు బ్రహ్మాదులును నీ మహిమను సమగ్రముగా నెరుగనివారు గాన, వారు చేయు స్తుతికూడ అయోగ్యమే కావలసివచ్చును. అట్లు గాక, తన బుద్ధికి గోచరమైనంత గ్రహించి చేసిన స్తోత్రమంతయు యోగ్యమయినదే యగునేని, నేను చేయు స్తుతి కూడ అనింద్యమే యగును.

అతీతః పన్థానం తవ చ మహిమా వాఙ్మనసయోః
అతద్వ్యా వృత్త్యా యం చకిత మభిదత్తే శ్రుతిరపి
స కస్య స్తోతవ్యః కతి విధ గుణః? కస్య విషయః?
పదేత్వర్వాచీనే పతతి నయనః కస్య న వచః?
ఓ ఈశ్వరా? నీ మహిమ వాక్కు చేతను, మనస్సు చేతను తెలిసికొనుట అశక్యమయినది. వేదము కూడ 'అది కాదు, అది కాదు' అని నిశ్చయ జ్ఞానము లేక భయముతో కూడుకొని యున్నట్లు పలుకుచున్నది. అట్టి నీ మహిమలు నుతించుటకు ఎవ్వడు శక్తుడగును? అది యిన్ని గుణములు గలదియని వర్ణించుటకును గోచరము కాదు. (అయితే) భక్తానుగ్రహార్థము గ్రహింపబడిన వృషభ వాహనాదులు గల నీ నవీన స్వరూపమునందు ఎవని మనస్సు ప్రవేశింపదు? ఎవని వాక్కు ప్రవేశింపదు? (నీ నూతన స్వరూపమును అందఱును చూడగలరనియు, అందఱును స్తోత్రము చేయగలరనియు భావము)

## 250. విశిష్టః

- అన్నింటినీ మించువాడు. అందరికంటే అధికుడు. ఎవరిపైనా ఆధారపడనివాడు.
- అంతటా వ్యాపించినవాడు.

### ఓం విశిష్టాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతునకు వేరే విధమైన తోడు, ఆధారము అవుసరం లేదు. అన్నింటిలోను ఆయనకు ఆయనే సాటి. కనుక ఆయన విశిష్టమైనవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అంతటా వ్యాపించిన సర్వాంతర్యామి.

ధర్మచక్రము రచయిత – జీవితములో ధనము, బలము, కీర్తి వల్ల ఆధిక్యత లభించదు. దేవునిపై భక్తి యుండవలెను. అలా కానియెడల మిగిలిన సంపదలన్నీ వ్యర్థము.

డా. క్రోవి పార్థసారథి రచన 'శ్రీకైవల్యసారథి' నుండి – అథర్వ శిరోపనిషత్తులో దేవతలంతా 'దేవా! నీవెవరవు?' అని మహారుద్రుని ప్రశ్నించారు. రుద్రుని ఉత్తరము – నేను ఒక్కడనే మొదట ఉన్నాను. ఇప్పుడున్నాను. ముందు కూడా ఉంటాను. నాకన్న వేరైనవాడు లేడు. నేను త్రికాలాతీతుడను. నిత్యుడను. బ్రహ్మము నేను. చక్షురింద్రియములు నేనే. వాగింద్రియము నేనే. శ్రోత్రేంద్రియము నేనే. మనస్సు నేనే. దశదిక్కులు నేనే. స్త్రీ, పురుష, నపుంసకులు నేనే. గాయత్రిని నేనే. ఛందస్సులు నేనే. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని కూడా నేనే. సత్యస్వరూపము నేనే. గోవు నేనే. గౌరీదేవి నేనే. జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను నేనే. అందరికన్న అధికుడను

నేనే. అగ్ని నేనే. జలము నేనే. చతుర్వేదాలు నేనే. ఓంకారము నేనే. ఈ రకంగా జగత్తు అంతా నేనే. జగత్తులో అన్నింటికన్నా అధికుడను నేనే.

## 251. శిష్టకృత్

- తన భక్తులను సదాచారవంతులుగాను, ఉన్నతులుగాను చేయును.
- శాసనము చేయువాడు.

### ఓం శిష్టకృతే నమః

'శిష్ట' అనగా సత్ప్రవర్తనము, క్రమశిక్షణ, ఔన్నత్యము. భగవద్భక్తి పరాయణులైన వారికి ఈ సుగుణములు, తద్వారా ఉన్నత స్థానము సహజముగానే లభించును. భక్తులు దుష్కర్మలు చేయజాలరు. లోకాధినాధుని నుతించు భక్తులకు సామాన్యాధికారులవద్ద తలవంచ నవుసరము రాదు.

భగవంతుడు వేదముల రూపమున, జ్ఞానము రూపమున ఎలా నడచుకొనవలయునో ఆజ్ఞాపించును గనుక ఆయన శిష్టకృత్. (శిష్ట = శాసనము).

(ఈ నామముల వ్యాఖ్యనుబట్టి చూచినయెడల 250వ నామము 'విశిష్టః' అనగా అనన్యమైన సత్ప్రవర్తన, క్రమశిక్షణ కలిగినవాడు అనీ, అందువలన అందరినీ శాసించు జగన్నాధుడనీ అర్థము చెప్పుకొనవచ్చును).

## 252. శుచిః

- పవిత్రమైనవాడు. పవిత్రము చేయును.

### ఓం శుచయే నమః

ఈ నామము 157వ నామముగాను, 252వ నామముగాను వచ్చినది.

17వ శ్లోకము. 157వ నామము. శుచిః – **ఉపేంద్రో వామనః ప్రాంశురమోఘః శుచిరూర్జితః**

27వ శ్లోకము. 252వ నామము. శుచిః – **అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టః శిష్టకృత్ శుచిః**

157వ నామము. శుచిః – పావనమైనవాడు.

252వ నామము. శుచిః – పావనము చేయువాడు.

భగవంతుడెంత పవిత్రమైనవాడు అంటే ఆయనపట్ల భక్తి కలిగినవారు మనసా, వాచా, కర్మణా పావనులగుదురు.

ధర్మచక్రములోని వ్యాఖ్య – భక్తివలన శుభ్రత, తేజస్సు లభించును. స్నానాదికములవలన శరీరము శుభ్రమై, వ్యాధులు నివారణమగునట్లు భగవన్నామస్మరణ వలన మన ఆలోచనలు నిర్మలములగును. ఇంద్రియములు నిగ్రహింపబడును. ఇహపర వ్యవహారములందు మన మనుసరించు మార్గము ధర్మయుతమగును.

ఆలయములో భగవంతుని పూజించుట, కర్పూరహారతిని తిలకించుట, నామసంకీర్తనమును ఆలకించుట, భజనలందు పాల్గొనుట, సుగంధ పుష్ప ధూపాదులను అర్పించుట, దేవుని దివ్యమంగళ స్వరూపమును చూచి, అలంకరించి, పులకించుట, ఆయన అనంత విశిష్ట శక్తిని, భక్తసౌలభ్యమును, ఆయన అపార కారుణ్యమును తలచి పరవశించుట – ఇవన్నీ మన

సర్వేంద్రియములను అనుచిత మార్గము నుండి మరల్చి, పవిత్ర ధర్మాచరణమునందు నిమగ్నము చేయును. ధ్యానాది సాధనలవలన శ్రీమన్నారాయణుని పట్ల భక్తి, ఆయన కటాక్షము, రక్షణ లభించును.

## 253. సిద్ధార్థః

- సకలార్థములు సిద్ధించినవాడు. సంపూర్ణుడు. నిత్యపూర్ణుడు.

### ఓం సిద్ధార్థాయ నమః

అన్ని సంపదలు ఆయనకు ముందే లభించినవి. ఇంక కావలసినది వేరేమీ లేదు. **సిద్ధః అర్థః యస్య స సిద్ధార్థః.**
ఛాందోగ్యోపనిషత్తులోని **'సత్య కామః సత్య సంకల్పః'** (8.1) అనే వర్ణనను ఈ నామమునకు, తరువాతి నామమునకు ప్రమాణముగా శ్రీ శంకరులు ఉదాహరించారు.

## 254. సిద్ధ సంకల్పః

- సిద్ధించిన సంకల్పము గలవాడు. అన్ని కోరికలు నెరవేరువాడు.

### ఓం సిద్ధ సంకల్పాయ నమః

సంకల్పము అనగా కోరిక. భగవానుడు తలచినంతనే అన్ని కోరికలు నెరవేరును. భగవంతుని శరణు జొచ్చిన వారి కోరికలు కూడ సిద్ధించును.

శ్రీవేంకటరమణుని అన్నమయ్య కీర్తించిన విధము – కోరికలన్నింటిని తీర్చు కల్పవృక్షము, దప్పికతీర్చు కాలమేఘము, రోగములను అణగించు దివ్యౌషధము, చెడనీక బ్రతికించు సిద్ధమంత్రము – కనుక దేవునకు శరణాగతులైనవారికి భయము లేదు. లోటు లేదు. కోరికలు మిగలవు. ధర్మవిరుద్ధము కాని కామమును భగవంతుడు అనుగ్రహించును.

ధర్మచక్రములోని ఉదాహరణలు – భగవంతుని అండ ఉన్నందువలననే సుగ్రీవునకు, విభీషణునికి రాజ్యములు లభించెను. దశరథుని మాట నిలబడెను. హనుమంతునికి సీతమ్మతల్లి దర్శన భాగ్యము లభించెను. ఆఖరుకు భీష్ముని ప్రతిజ్ఞ నిలుపుటకై శ్రీకృష్ణ పరమాత్ముడు తన మాటను తప్పి కురుక్షేత్రమున ఆయుధమును ధరించెను.

## 255. సిద్ధిదః

- భక్తులకు సిద్ధులను ప్రసాదించువాడు.

### ఓం సిద్ధిదాయ నమః

యోగులకు ధ్యానము, తపస్సు, సాధన వంటి ప్రయత్నముల వలన ఎనిమిది విధములైన సిద్ధులు లభించును. వానిని అష్టసిద్ధులు అంటారు.

1. అణిమ – శరీరమును అతి చిన్నదిగా చేయుట.
2. మహిమ – శరీరమును అతిపెద్దగా చేయుట.
3. గరిమ – శరీరము బరువును విపరీతముగా పెంచుట.

4. లఘిమ – శరీరమును అతి తేలికగా చేయుట.
5. ప్రాప్తి – కావలసిన వస్తువును పొందుట.
6. ప్రాకామ్య – కావలసిన భోగమును అనుభవించుట.
7. ఈశిత్వము – ఎవరిపైనైనా, దేనిపైనైనా అధికారము పొందుట.
8. వశీత్వము – అన్ని భూతములను లోబరచుకొనుట.

ఈ సిద్ధులు భగవంతుని కృపవలననే సాధకునకు లభించును గనుక శ్రీనివాసుడే సిద్ధిదాత.



మస్కట్ లో 2018లో జరిగిన శ్రీ సీతారామ కళ్యాణము

శ్రీ శంకరుల వ్యాఖ్య – కర్మ ఫలితమును, యోగ్యతను బట్టి జీవులకు సిద్ధులను ప్రసాదించువాడు గనుక భగవానుని 'సిద్ధిదః' అని కీర్తింతురు.

(90వశ్లోకము లోని – **అణుర్బృహత్కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్** – అనే నామములను ఈ సిద్ధుల పరంగా వ్యాఖ్యానించారని గమనింపదగును.)

**శ్రీ హనుమాన్ చాలీసా నుండి.**

అష్టసిద్ధి నౌ నిధికే దాతా – అస బర దీన్హ జానకీ మాతా
రామ రసాయన తుమ్హరే పాసా – సదా రహో రఘుపతి కే దాసా
తుమ్హరే భజన రామకో పావై – జనమ జనమ కే దుఖ బిసరావై

అణిమాది అష్ట సిద్ధులను అనుగ్రహించు వాడవు. ధనధాన్యాది నవనిధులను ఇచ్చువాడవు. శ్రీరామపత్ని జానకీమాత నీకీ వరమిచ్చినది కదా! నీవు శ్రీరామభక్తి రసాయనము గలవాడవు. సదా శ్రీరఘుపతి పాదసేవా దురంధరుడవు. నీ నామస్మరణ గావించు వారలు శ్రీరామునికి చేరువ అగుదురు. జన్మ జన్మాంతరముల దుఃఖము బాసి సుఖులయ్యెదరు.

## 256. సిద్ధిసాధనః

- సిద్ధిని పొందుటకు సాధనమైనవాడు.

### ఓం సిద్ధిసాధనాయ నమః

**సిద్ధేః సాధకత్వాత్ సిద్ధిసాధనః** – సాధన చేయువారిలోని సంకల్పము, శక్తి, నిశ్చయము,దీక్ష అన్నియును భగవంతుడే. కనుక సాధకులకు ఫలితము మాత్రమే ముఖ్యము కాదు. సాధన అను ప్రక్రియ కూడ భగవత్స్వరూపము, ప్రియాతి ప్రియము. శ్రీమన్నారాయణుడే ముముక్షువులకు మోక్షసాధనము, మోక్షమార్గము, మోక్షదాత, మోక్షము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **"సిద్ధార్థః సిద్ధసంకల్పః సిద్ధిదః సిద్ధిసాధనః"** అను ఈ నాలుగు దివ్యనామములు కలిపి ఒక మహామంత్రము. సకల యత్నములకు, ఆశయములకు, యోగములకు మహాఫలవంతము. ఈ మంత్రమును జపించినవారు భగవంతుని నాలుగు దివ్యకుసుమములతో అర్చించినట్లుగా చతుర్విధ పురుషార్థములను సన్మార్గవర్తులై సాధింపగలరు.

ధర్మచక్రము రచయిత – ఈ మంత్రమును జపించినవారి మనసునుండి ఇహలోక వాంఛలు. కామ క్రోధ లోభ మద మాత్సర్యములు తొలగిపోవును. వారి మనస్సు శ్రీమహావిష్ణువు పైననే లగ్నమగును. వారికి ముక్తిమార్గము సుగమమగును.



ద్వారకా తిరుమల తూర్పు గోపురం. ఇది షుమారు 2010 నాటి చిత్రం. ప్రస్తుతం ఈ ప్రదేశంలో చక్కని ప్రవేశ మార్గాన్ని, పందిళ్ళను నిర్మించారు



ద్వారకా తిరుమలలో శ్రీ గరుత్మంతుని విగ్రహం



శ్రీ మత్స్యావతారం. 1725-50 కాలపు చిత్రం. చంబ ప్రాంతపు మహేష్ చిత్రించినది కావచ్చును.
https://commons.wikimedia.org/wiki/File:Matsya,_the_Fish-Incarnation_of_Vishnu.jpg



## వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వా వృషోదరః |
## వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః || (28)

### 257. వృషాహీ

- ధర్మస్వరూపుడై ప్రకాశించువాడు.
- తన భక్తులను ధర్మపరాయణులుగా చేసి పగటివలె వెలిగించువాడు.
- వృషాహ యజ్ఞమునకు దేవత.
- అగ్నివలె తేజోమయుడు. అన్ని తేజములకు ఆధారమైనవాడు.

**ఓం వృషాహిణే నమః**

వ్యాఖ్యానకర్తలు ఈ నామమును బహువిధములుగా వివరించారు. దీనిలో రెండు పదములు ఇమిడియున్నవి. 'వృష' అనగా ధర్మము. 'అహ' అనగా పగలు, వెలుగు.

**వృషోహి ధర్మ స్తద్రూప మహర్యస్య దినం స్మృతమ్ ప్రథమాభి గమనాఖ్యం వృషాహీ స ప్రకీర్తితః -** వృష అంటే ధర్మము. అటువంటి ధర్మస్వరూపమైన దినము కలవాడు. అంటే ఆ పరమేశ్వరుని దర్శించే (పొందే) మొదటిరోజు సమస్త శుభములకు తొలిరోజుగా ధర్మస్వరూపమై ఉంటుంది. అందుచేత పరమేశ్వరుడు ధర్మరూపమగు దినము కలవాడని చెప్పబడినది.

**వృషం చ తత్ అహశ్చ వృషాహః - వృషాహః అస్యాస్తీతి వృషాహీ -** ఇతనిని పొందే మొదటిరోజు సకల శ్రేయస్సులకు ప్రారంభ దినములాగా ధర్మరూపముగా నుండును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – (1) భగవంతుడు ధర్మస్వరూపుడు గనుక పగటివలె ప్రకాశించును (2) దేవుని నమ్ముకున్నవారు ధర్మమునాచరింతురు. వారు ప్రకాశించుచుందురు.

శ్రీ భట్టులు – భక్తుడు భగవంతుని చేరిన దినమే ఆ భక్తులకు సకల శుభదాయకమగునట్లు చేయువాడు వృషాహి. శ్రీహరిని స్మరించిన దినమే పావనము, మంగళప్రదము, కళ్యాణకారకము.

శ్రీ శంకరులు – (1) **వృషః ధర్మః తదేవ ఆహః** – ధర్మమును ఉపదేశించువాడు, ప్రసాదించువాడు వృషాహి. (2) 'వృషాహ' అనునది 10, 12 దినములు ఆచరించు ఒక యజ్ఞము. ఆ యజ్ఞమునకు కర్త, భోక్త అయిన దేవుడు గనుక భగవంతుడు వృషాహి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **వృషో అగ్నిః సమిధ్యతే** – అను ఋగ్వేద మంత్రము (3.27.14) ననుసరించి 'వృష' అనగా అగ్ని. 'అహః' అనగా వెలుగు. భగవంతుడు అగ్నివలె తేజోమయుడు. ఇంకా అగ్ని, సూర్యుడు, చంద్రుడు, జ్ఞానము, ఆత్మతత్త్వము – అన్నింటిలోని ప్రకాశము భగవంతునివల్లనే కలుగుచున్నది. శ్రీమన్నారాయణుడు ఒక్కడే స్వయంప్రకాశమూర్తి. వెలుగులకు వెలుగు.

డా. క్రోవి పార్థసారథి రచన 'శ్రీకైవల్యసారథి'లో ఉదాహరించిన విషయము –

మధురానగరమునకు ప్రయాణించు అక్రూరుడు ఇలా అనుకొంటున్నాడు (విష్ణుపురాణము నుండి)

**అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా**

**యదున్నిద్రాబ్జపత్రాక్షం విష్ణోర్ద్రంక్షామ్యహం ముఖమ్ ....**

**పాపం హరతి యత్పుంసాం స్మృతం సంకల్పనా మయమ్**

**తత్పుండరీక నయనమ్ విష్ణోర్ద్రంక్షామ్యహం ముఖమ్ ......**

ఇప్పుడు నాజన్మ సఫలమయింది. తెల్లవారుతున్నది. అప్పుడే వికసించిన తామర రేకులవంటి కనులుగల ఆ గోవిందుని దర్శించబోతున్నాను. సంకల్పనాత్మకమైన పాపాన్ని హరించేవాడు, పద్మములవంటి కనులు గలవాడు అయిన విష్ణువును చూడబోతున్నాను. యజ్ఞాలలో యజ్ఞపురుషుడు, పురుషులలో పురుషోత్తముడు, సర్వాధారుడు అయిన ఆ జగదీశ్వరుని దర్శించబోతున్నాను.

ఇంద్రుడు నూరు యజ్ఞాలు చేసి ఎవరిని అర్చించి ఆ పదవి చేపట్టాడో, ఆ స్వామిని నేను దర్శించ బోతున్నాను. బ్రహ్మ, రుద్రుడు, వసువులు, మరుద్గణాలు ఎవరి రూపాన్ని దర్శించాలని అనుకొంటారో, ఆ మహాపురుషుని నేను దర్శించబోతున్నాను.

సర్వాత్మకుడు, సర్వభూతాంతఃస్థుడు, అచింత్యుడు, అవ్యయుడు, సర్వవ్యాపి అయిన శ్రీమహావిష్ణువు నాతో మాటాడబోతున్నాడు. మత్స్య కూర్మాది రూపములతో జగత్తును రక్షించిన ప్రభువు నాతో మాట్లాడబోతున్నాడు. ఇప్పుడు ఆ పరమేశ్వరుడు మనుష్యాకారుడై యున్నాడు. ఆదిశేషుడై భూమిని మోసే ఆ భగవానుడు నన్ను 'అక్రూరా' అని పిలుస్తున్నాడు. పుత్ర, మిత్ర, కళత్రము అనే మాయను మనం జయించలేము. ఆ మాయకు అధిపతి ఆ పరమేశ్వరుడే. అటువంటి మాధవుడికి నమస్కారము.

**భద్రాచల రామదాసు కీర్తన**

దినమే సుదినము సీతారామ స్మరణే పావనము || దినమే ||
ప్రీతిసైనా ప్రాణభీతిసైనా కలిమి – చేతసైనా మిమ్మే తీరుగ తలచిన ఆ || దినమే ||
అర్థాపేక్షను దినము వ్యర్థముగాకుండ – సార్థకముగా మిమ్ము ప్రార్థన చేసిన ఆ || దినమే ||
నిరతము మెరుగు బంగారు పుష్పముల రఘు – వరుని పదముల నమర పూజించిన ఆ || దినమే ||
మృదంగ తాళము తంబురశృతి గూర్చి – మృదు రాగము కీర్తన పాడినను విన్న ఆ || దినమే ||
ఘనమైన భక్తిచే పెనగొని యే వేళ – మనమున శ్రీరాముని చింతించిన ఆ || దినమే ||
భక్తులతో ననురక్తిని గూడక – భక్తి మీరగను భక్తవత్సలు పొగడగా || దినమే ||
దీనశరణ్య మహానుభావ యో గానలోల – నను కరుణింపుమని కొలుచు ఆ || దినమే ||
వాసిగ శ్రీహరిదాసుల గూడుకొని – వాసుదేవు వాంఛతోను పాడెడి ఆ || దినమే ||
అక్కరతోడ భద్రాచలముననును – చక్కని సీతారాములను చూచిన ఆ || దినమే ||

## 258. వృషభః

- **వర్షతీతి వృషభః.** భక్తులపై కామితార్థములను వర్షించు కరుణామూర్తి.
- అమృతమును వర్షించి సంసార తాపమును ఉపశమింప జేయువాడు.
- ధర్మమూర్తియై వెలుగొందువాడు.

ఓం వృషభాయ నమః

**వర్షతి ఏష భక్తేభ్యః కామాన్ ఇతి వృషభః. అభిగచ్ఛద్భక్త జనాన్ సుధావర్ణతోऽస్వహమ్ వృషభశ్చ సమాఖ్యాతః సిఞ్చన్ భయహరో మనుః -** తనకు అభిముఖులైన భక్తులకు సంసారతాపము ఉపశమించేటట్లుగా ప్రతిదినము అమృతమును వర్షించి తడుపుతూ ఉండేవాడు. ఈ నామధ్యానము భయహరము. ఓం వృషభాయ నమః. భక్తులకు ధర్మము, అర్థము, కామము ప్రసాదించి, సంసార తాపములను హరించి, మాయను దాటించి, మోక్షమును ఇచ్చు అమృతమయుడు. గరుడవాహనుడు. మోహినీ రూపుడు. కోనేటిరాయుడు. శ్రీధరుడు. శ్రీనివాసుడు. వేంకటరమణుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ధర్మస్వరూపుడై ప్రకాశించువాడు వృషభుడు.

ధర్మచక్రమునుండి – భక్తుల కర్మానుగుణముగ, ప్రయత్నమును బట్టి, భగవంతుడు భక్తుల కోర్కెలను తీర్చును. కాని ఇహలోక సంపదల వలన లభించు ఆనందము అశాశ్వతము. అచ్యుతుని తెలియు సాధన మాత్రమే నిత్యము. సత్యము. సకల మంగళప్రదము. కనుక **'అచ్యుతా! అమరఱ్ ఏఱె! అయర్ తమ్ కోళుందే! ఎన్నుమ్ ఇచ్చువై తవిరయాన్ పోయ్ ఇందిర లోకమ్ ఆళుమ్ అచ్చువై పెరినుమ్ ఎండేన్!"** అని కోరదగును.

## 259. విష్ణుః

- అంతటను వ్యాప్తినొంది, భక్తులను ఎల్లెడల బ్రోచువాడు.

### ఓం విష్ణవే నమః

ఈ పుణ్యనామము ఈ మహాస్తోత్రములో మూడుమార్లు వచ్చును.
1వ శ్లోకము. 2వ నామము. విష్ణుః – **విశ్వమ్ విష్ణుః వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః**
28వ శ్లోకము. 259వ నామము. విష్ణుః – **వృషాహీ వృషభో విష్ణుః వృషపర్వా వృషోదరః**
70వ శ్లోకము. 663వ నామము. విష్ణుః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరోऽనంతో ధనంజయః**

'విష్' అనగా వ్యాపించుట – అన్న ధాతువునుండి 'విష్ణు' నామము వ్యాఖ్యానింపబడినది. **వేవేష్టీతి విష్ణుః –** వ్యాపించువాడు విష్ణువు. భగవంతుడు భక్తుల కోర్కెలను తీర్చు కల్పవృక్షము అని ప్రస్తుతించు సందర్భములో ఈ నామము చెప్పబడినందువలన ఇక్కడ శ్రీభట్టులు చెప్పిన వివరణ కూడా అందుకు అనుగుణంగా ఉన్నది.

**సిద్ధార్థః, సిద్ధ సంకల్పః, సిద్ధిదః, సిద్ధిసాధనః, వృషాహీ, వృషభః, విష్ణుః, వృషపర్వః –** ఇవన్నీ కొండలంత వరములిచ్చు కోనేటిరాయని అర్చించు కుసుమములు. ఆయన లేనిచోటు లేదు. విష్ణుభక్తులకు తోడు లేదను భావముతో పని లేదు. భయమన్నది అసలే లేదు. శ్రీహరి అండనుండగా ఇంక కొదువ ఏమున్నది?

**విష్ణుస్స్యాదవినా భావాత్ వ్యాప్య వ్యాపక భావతః –** జగత్తులో ఉండే పదార్థములన్నింటియందు వ్యాపించి ఉండేవాడు.

## 260. వృషపర్వా

- తనను చేరుకొనుటకై ధర్మము అను మెట్లదారిని ప్రసాదించినవాడు.

### ఓం వృషపర్వణే నమః

'వృష' అనగా ధర్మము. 'పర్వ' అనగా సోపానము (మెట్లు). భగవంతుడు వర్ణాశ్రమ ధర్మములను సోపానమును ప్రసాదించి, భక్తులకు ముక్తిమార్గమును సుగమము చేసెను (శ్రీ భట్టుల వ్యాఖ్య).

**వృషా వర్ణాశ్రమా ధర్మా పర్వాణ్యారోహణే తు తే యస్య సన్తి సదా సోऽయం వృషపర్వా ప్రకీర్తితః** బ్రహ్మచర్యమున జ్ఞానార్జన, గృహస్థుగా యజ్ఞయాగాది కర్మలు, వానప్రస్థమున ధర్మచింతన, సన్యాసిగా కర్మత్యాగము, ఆత్మశోధన సాగించుచు అందరును ఈశ్వరార్చన చేయవచ్చును.

కొందరు వ్యాఖ్యానకర్తలు జ్ఞానము, భక్తి వంటి సాధనలను, శ్రవణ మనన, కీర్తనలవంటి సేవలను ఈ ధర్మమార్గములోని మెట్లుగా అభివర్ణించారు.

---

Ramanuja Darshanam Vol-2 Issue-1 (Jan-Mar 2004) (http://www.vedics.org)

**పెరుమాళ్ తిరుమొళి –** శ్రీ పి.బి. రాజహంసమ్ స్వామిగారి వ్యాసమునుండి సంగ్రహించినది. (ఆంగ్ల వ్యాసము ఆధారముగా, తెలుగులో వ్రాయుచున్నాను. మూలమునుండి భిన్నముగానున్నచో క్షంతవ్యుడను – కా.సు.బాబు)

శ్రీమహావిష్ణువు వక్షస్థలము నలంకరించిన కౌస్తుభమణియే కులశేఖరాళ్వారుగా అవతరించెనని చెప్పుదురు. రాజవంశమున జన్మించిన ఈ మహాత్ముడు ధర్మయుతముగా రాజ్యమునేలి, శ్రీమన్నారాయణుడే పరమాత్ముడని గురువుల ద్వారా తెలిసికొని, విష్ణుగాథలు వినుటలోను, విష్ణువును కీర్తించుటలోను, హరిదాసులను సేవించుటలోను జన్మ ధన్యమొనర్చుకొనెను. ఈ శ్రీవైష్ణవమూర్తి రాజ్యమును త్యజించి, దివ్యదేశములను దర్శించి, శ్రీరంగనాధుని సేవలో తరించెను. ప్రత్యేకించి విభవావతారములందు ఆయనకు ఎంతో మక్కువ. ఆయన కీర్తించిన పుణ్యగానమే "**పెరుమాళ్ తిరుమొళి**". ఇందులో 10 దశకములు (10 x 10 స్తోత్రములు) ఉన్నవి.

**మొదటి దశకము** – శ్రీరంగమున శ్రీమహాలక్ష్మిని, శ్రీరంగనాధుని సేవించుచున్న కావేరీనది వర్ణన. భక్తులయెడ లక్ష్మీనారాయణుల కటాక్షమును స్తుతించుట.

**రెండవ దశకము** – శ్రీరంగనాధుని సేవకులైన భాగవతుల పట్ల భక్తి, దాసత్వము.

**మూడవ దశకము** – శ్రీరంగనాధుని యెడల భక్తిభావము లేని వారికి దూరముగానుండవలెనను కోరిక.

**నాలుగవ దశకము** – తిరుమలలో వెలసిన శ్రీవేంకటేశ్వరుని స్తుతించు మధురస్తోత్రము. ఏదోవిధముగా ఆ వృషపర్వుని సేవింపవలెనని శ్రీకులశేఖరాళ్వారు తపన. అందు కొరకు ఆ కొండపై నివసింపవలెనని, అందు కనుగుణముగా ఏదో రూపమును ధరింపవలెనని ఆ శ్రీవైష్ణవుని కోరిక.

ముందుగా, 'కురుకై' పక్షిగా పుట్టి కొండపై నుండవచ్చునని శ్రీ కులశేఖరాళ్వారు కోరుకున్నారు. కాని రెక్కలున్నందున ఆ పక్షి దూరంగా ఎగిరిపోయే అవకాశం ఉన్నందున ఆ కోరికను విరమించుకొన్నారు. పోనీ కొండపై సెలయేరులో చేప అయితే, సెలయేరు ఎండినపుడు చేప మరణించవచ్చును. కోనేటిరాయని సేవ అంతటితో ముగింపవలసి వస్తుంది. అలా కాకుండా, సేవాసమయమున శ్రీవారు పుక్కిళించు బంగారుపాత్రను పట్టుకొనే సేవకుడయ్యే భాగ్యము లభిస్తే బాగుండును. కాని ఉద్యోగధర్మములో ఏదైనా పొరపాటు జరిగితే పై అధికారులు ఆ బాధ్యతనుండి తప్పించవచ్చును. కొండపైనుండి దూరంగా పంపివేయవచ్చును.

ఇంతకంటే ఏదైనా చలనము లేని వస్తువుగా ఉంటే మేలు. 'షెన్బగ' (చంపక?) వృక్షమై శ్రీనివాసుని పూజించు పూలు సమర్పించుకొనవచ్చునేమో! కాని స్వర్గములోని పారిజాత వృక్షమునే పెకలించి ప్రియురాలిని సంతోషపెట్టాలని శ్రీకృష్ణుడు ప్రయత్నించగా, ఇంక మామూలు చెట్టునెవరో తొలగించరని నమ్మకమేమిటి? కొండపైన ఎవరూ పట్టించుకోని పొద అయితేనో? దారి సరి చేయువారెవరైనా ఆ పొదను తీసివేయుదురేమో. కొండమీద బండరాయి అయితే దానిని విగ్రహముగా మలచడానికి (బౌద్ధ)

శిల్పులు తీసికొని పోవచ్చును. సెలయేరుగా ఉంటే వేసవికాలములో ఎండిపోవచ్చును. గుడికి పోవు దారిగా మారి హరిదాసులను సేవించుకుందామంటే వారు వేరేదారి చూచుకొనవచ్చునేమో.

ఇలా కాదు. గర్భగుడి ద్వారమువద్ద మెట్టుగా అయితే – అంతకంటే భాగ్యమేమున్నది? నిరంతరము శ్రీనివాసుని దర్శించుకొని తరించు అవకాశము కలుగును. కాకపోతే ఆలయ పాలకులు ఆ మెట్టుకు బంగారు రేకు తొడిగిస్తే ఆపై తిరుమలేశుని దర్శనం కుదరదు. ఏమీ పాలుపోవడంలేదు. **ఎమ్ పెరుమాన్ పొన్నుమలై మేల్ ఎత్తనుమ్ అవనే ....** .. సర్వేశ్వరా! శ్రీ వేంకటేశ్వరా! నీ కొండపై ఏదో ఒకటిగా జన్మించేలా అనుగ్రహించు! (తిరుమల తిరుపతి గర్భగుడి ద్వారము వద్ద నున్న మెట్టును 'కులశేఖరపడి' అని అంటారు. పడి=మెట్టు).

**5వ దశకము** – జీవునకు, పరమాత్మకు మధ్య నుండు నవవిధ బాంధవ్యమును వర్ణించారు. (కేరళలోని) తిరువిత్తువక్కోడు ఆలయమునందు వెలసిన శ్రీమన్నారాయణుడే పరమాత్ముడు. ఆయన శ్రీచరణ ధ్యానమే మోక్షమార్గము అని శ్రీ కులశేఖరాళ్వారులు కీర్తించారు.

**6వ దశకము** – శ్రీ కులశేఖరాళ్వరులు బృందావనమున గోపికయై గోపాలబాలుని కానక విరహమున తపించుచున్నట్లుగా సాగిన కవిత.

**7వ దశకము** – శ్రీ కులశేఖరాళ్వారులు తనను తాను దేవకీదేవిగా తలచుకొన్నారు. కన్నబిడ్డకు దూరమై ఆ తల్లి చెరసాలలో అనుభవించు వేదనను కవి స్వయముగా అనుభవించి విలపించారు. బాలకృష్ణుని ఆటలకు, మాటలకు, లీలలకు నోచుకొనలేకపోతినే అని ఆక్రోశించారు.

**8వ దశకము** – శ్రీరామచంద్రుని నిదుర బుచ్చుటకు తల్లి కౌసల్య పాడిన జోల.

**9వ దశకము** – తండ్రి మాట నిలుపుటకై వనవాసమునకు పోయిన శ్రీరాముని తలచుకొని దశరథుడు విలపించిన దృశ్యము. రామావతార కాలమున జన్మించలేకపోతినే అని శ్రీ కులశేఖరాళ్వారు బాధ పడినారు.

**10వ దశకము** – సంగ్రహ రామాయణము. నీలమేఘ శ్యాముని వర్ణన. రామాయణ మహాత్మ్యమును తెలిసికొని సులభముగా మోక్షమును సాధింపవచ్చునని శ్రీవైష్ణవులకు బోధన.



శ్రీ కులశేఖరాళ్వారు.
వికీపీడియా నుండి.
పి. ఎస్. మీనన్ చిత్రం.

## 261. వృషోదరః

- ధర్మమును ఉదరమున ధరించినవాడు.
- అగ్నిని ఉదరమున ధరించినవాడు.
- ప్రళయ (వర్ష) కాలమున సమస్తమును ఉదరమున భద్రపరచువాడు.
- భక్తులను కడుపులో పెట్టుకొని కాపాడువాడు.

### ఓం వృషోదరాయ నమః

ఈ నామమునకు వివిధములైన వివరణలను చెప్పారు. యజ్ఞయాగాది ధర్మకార్యములందు అర్పించిన పూజోపచారములను గ్రహించు ఉదరము కలిగినవాడు వృషోదరుడు.

**భక్తైరుపాహృతామ్ పూజాం ఉపహారాంశ్చ ధర్మతః కృత్వాదరే యోజయతి స వృషోదర ఉచ్యతే.** ధర్మనిర్వర్తకులైన బ్రహ్మాదులు ఆయన (ఉదరము)నుండి జన్మించిరి గనుక ఆయన వృషోదరుడు. పరబ్రహ్మము.

వృష = వర్షించుట – కల్పాంత మహాప్రళయ కాలమున సమస్తమును తన (ఉదరము)లో భద్రపరచి, అనంతరము మరల సృష్టి చేయు వటపత్రశాయియే వృషోదరుడు.

వృష = అగ్ని – ఉదరమున అగ్నిని ధరించినవాడు. (ఈ నామమును, దీని ముందు నామములను 'అగ్ని' అనే అర్థములో శ్రీ వాసిష్ఠగారు వివరించారు. సూర్యునియందును, భూమియందును, సాగరమందును,మానవుల జఠరమునందును – అణువణువున అగ్ని దాగియున్నది. (Atomic energy, Digestive juices, volcanoes, thermo nuclear energy etc.,) అనే విషయమును గ్రహించినయెడల 'వృషోదర' నామమును అగ్ని పరమగా అర్థము చేసుకొనవచ్చును.

భక్తులను కడుపులో పెట్టుకొని కాపాడువాడు వృషోదరుడు.

## 262. వర్ధనః

- వర్ధిల్లజేయువాడు. వృద్ధి పరంపరలు కలిగించువాడు.

### ఓం వర్ధనాయ నమః

**వర్ధయతీతి వర్ధనః** – పెంచి పోషించువాడు వర్ధనుడు.

**మాతృవజ్జఠరే కృత్వా భక్తాన్వర్ధయతి స్వయం వర్ధనః ప్రోచ్యతే నిత్యం సప్తార్ణో వృద్ధిదో మనుః -** తల్లివలె భక్తులను తన కడుపులో పెట్టుకొని వర్ధిల్లజేసేవాడు గనుక వర్ధనుడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. దీనిని స్మరిస్తే వృద్ధి కలుగుతుంది. ఓం వర్ధనాయ నమః.

ఇంతటి ముందు నామము 'వృషోదరః' అనగా ప్రళయ వర్షమున సమస్తమును ఉదరమున భద్రపరచువాడు – అన్న భావమునే కొనసాగిస్తూ శ్రీ భట్టులు 'వర్ధనః' నామమును వ్యాఖ్యానించారు. భక్తులను, సమస్తమును తన గర్భమున ఉంచుకొని వర్ధిల్లజేయువాడు గనుక ఆయన వర్ధనుడగును.

శ్రీ పి.బి. అణ్ణాంగారాచార్య స్వామి – భగవంతుని శరణుజొచ్చినవారిని వృద్ధి చేయును గనుక వర్ధనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పిడికెడు అటుకులు గ్రహించి భగవంతుడు కుచేలుని కుబేరునికంటె సంపన్నునిగా అనుగ్రహించాడు. అల్పమైన మ్రొక్కుబడులు స్వీకరించి కొండలంత వరములు క్రుమ్మరించును. పత్ర పుష్ప ఫల జలాదులతో ప్రసన్నుడై భక్తుల యోగక్షేమములను వహించువాడు. వర్ధనుడు.

ధర్మచక్రము రచయిత – వళ్ళు పెంచడము ముఖ్యము కాదు. జ్ఞానమును, భక్తిని పెంపొందించుకొనుట ప్రధాన ధర్మము. అందుకు చేయూతనిచ్చు భక్తజన వత్సలుడైనందున శ్రీమహావిష్ణువు వర్ధనుడు.

## 263. వర్ధమానః

- వర్ధిల్లజేయువాడు. తానును వృద్ధినొందువాడు.

### ఓం వర్ధమానాయ నమః

**వర్ధయస్తాన్ స్వయమపి వర్ధమానః – వర్ధతే ఇతి వర్ధమానః.** స్వయముగా వర్ధిల్లువాడు మరియు వర్ధిల్లజేయువాడు వర్ధమానుడు.

శ్రీ భట్టులు – తన భక్తుల వృద్ధిని చూచి సంతోషముతో పొంగిపోవు ఆత్మబంధువు, వర్ధమానుడు.

శ్రీ చిన్మయానంద – ఇంతింతై, అంతంతై, ప్రభారాశిని మించి, బ్రహ్మాండాంత సంవర్ధియైన త్రివిక్రముడు.

శ్రీ శంకరులు – **ప్రపంచ రూపేణ వర్ధతే ఇతి వర్ధమానః.** ఆయన విశ్వాత్మకుడు. విశ్వరూపుడు. విశ్వేశ్వరుడు. విశ్వము వర్ధిల్లుట యనగా ఆయన వర్ధిల్లుటయే.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః** .. .... ... – 'వర్ధమానః' నామము ప్రక్కన 'చ' అను శబ్దము గమనింపదగినది. విశ్వమెలా వర్ధిల్లుచుండునో అదే విధముగా శ్రీహరియు వృద్ధి చెందును.

**దసరా పద్యము**

ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండమాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరసన్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా

## 264. వివిక్తః

- విలక్షణమైనవాడు.
- ప్రత్యేకమైనవాడు. వేరెవరితోను, వేనితోను పోలిక గాని, బంధము గాని లేని నిర్లిప్తుడు.

ఓం వివిక్తాయ నమః

**లోకోత్తరాది వృత్తాన్తాత్ స్వైః కాన్తాగణ బృంహితాత్ వివిక్త ఇతి విఖ్యాతః పావనత్వప్రదోమనుః** - లోక విలక్షణమైన వృత్తాంతము గలవాడు అవటంవలన, అసాధారణమైన కళ్యాణగుణ సమూహము కలవాడు గనుక లోకాతీతుడై వివిక్తుడగచున్నాడు. **వివిచ్యతే ఇతి వివిక్తః.** ఈ నామము పవిత్రతను ప్రసాదించే మంత్రము. ఓం వివిక్తాయ నమః.

భగవంతుడు సర్వాంతఃస్థితుడు. వర్ధనుడు. వర్ధమానుడు. కాని ఆయనకు వేనితోను సంబంధము లేదు. ఆయన అన్నింటికీ అతీతుడు. అసమానుడు. అప్రమేయుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు 'విజ్' అనగా 'పృథక్ భావే' – వేరుగా ఉండుట – అనే మూలము ఆధారముగా ఈ నామమును వ్యాఖ్యానించారు. కుండలు చేయు కుమ్మరికి ఆ కుండల లక్షణములతో సంబంధము లేదు. అతడు వేరు. కుండలువేరు. అలాగే సృష్టికర్త, సృష్టి పాలకుడు, లయకారకుడు నైన మహాదేవుడు సృష్టికంటె విలక్షణమైనవాడు. శ్రీ వాసిష్ఠగారు ఋగ్వేదములోని – **ద్వా సుపర్ణాః సాయుజా సఖాయాః .. ..** – అనే శ్లోకము (1.164.20)ను ఉదాహరించారు. సాక్షియైన పక్షికి కర్మఫలములతో సంబంధము లేదు.

శ్రీ వాసిష్ఠ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రములోని వేయి నామముల అర్థములను వివరిస్తూ వేయి శ్లోకాలను రచించారు. వానిలో మచ్చునకొకటి.

**శృత్వా జగత్ సర్వవిధమ్ విధాతాస్స్వయమ్ వివిక్తో హ్యజరోऽమరః సః**
**సహస్ర శీర్షా స సహస్ర దృష్టిః స సర్వబంధుః పృథక్ చ దృశ్యాత్**

భగవంతుడు బహువిధములుగా విలక్షణుడు. అనన్యుడు. కర్మఫలములకు సంబంధము లేనివాడు. ఆయన గుణములు, లీలలు, కార్యములు అసాధారణములు. అనన్యసాధ్యములు అని శ్రీ భట్టుల వ్యాఖ్య.

విశ్వమంతా వ్యాపించియున్నా, వానికంటె వేరైనవాడు అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – బుద్ధికి, తర్కమునకు అందనివాడు గనుక ఆయన 'వివిక్తః'

ధర్మచక్రము రచయిత – అన్ని కర్మములను మోహరహితముగా, నిర్లిప్తతతో ఆచరించుట వలన పరమాత్మను గూర్చిన జ్ఞానము సాధించు మార్గము సుగమమగును. పంచేంద్రియములను కట్టడి చేసినపుడే శ్రీమహావిష్ణువుపై బుద్ధి తగులుకొనును.

## 265. శ్రుతిసాగరః

- అన్ని శ్రుతులకు సముద్రమువంటివాడు. వేదములకు మూలము, వేదజ్ఞానమునకు పరమార్థము ఆయనే. **శ్రుత్యాః సాగర ఇవ అత్ర నిధీయతే ఇతి శ్రుతిసాగరః**

ఓం శ్రుతిసాగరాయ నమః

**నదీనాం సాగర ఇవ స్వగుణోక్తి విధాజుషామ్ శ్రుతీనామవసానత్వాత్ కథ్యతే శ్రుతి సాగరః -** నదులన్నింటికీ సాగరమే సంగమ స్థానము. అదే విధముగా వేదమున్నీ పరమాత్మునివైపు మనలను తీసికొనిపోవును. కనుకనే ఆయన వేదవేద్యుడు. శ్రుతిసాగరుడు.

ఈ నామ వివరణలో శ్రీ భట్టులు శ్రీమద్భాగవతము నుండి – **నారాయణ పరా వేదాః ....** – అనే శ్లోకము (2.5.15)ను, మరియు శ్రీ మద్భగవద్గీత నుండి – **వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః** – అనే శ్లోకము (!5.15)ను ఉదాహరించారు.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్త స్స్మృతిః జ్ఞాన మపోహనంచ**

**వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్**

అర్జునా! సమస్త ప్రాణుల హృదయముల యందు అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహములు తొలగుట) కలుగుచున్నవి. వేదముల ద్వారా తెలుసుకో దగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను నేనే.

డా. క్రోవి పార్థసారథి 'శ్రీకైవల్యసారథి'నుండి – వేదాంతము అంటే వేదములయొక్క చివరి భాగము. వేదములు నాలుగు భాగములు (1) సంహితలు (2) బ్రాహ్మణములు (3) అరణ్యకములు (4) ఉపనిషత్తులు.
వేదములయొక్క సారమును వివరించే ఉపనిషత్తులే వేదాంతము. ఇది జ్ఞానకాండ. దీనివలన తెలిసికొనేది ఆ పరమేశ్వర స్వరూపాన్నే. ఈ ఉపనిషత్తుల సారాన్ని మహావాక్యాలలో చెప్పారు. ప్రతి వేదంలోనూ ఒక మహావాక్యం ఉన్నది.

| వేదము | ఉపనిషత్తు | మహావాక్యము |
|---|---|---|
| ఋగ్వేదము | ఐతరేయోపనిషత్తు | ప్రజ్ఞానం బ్రహ్మ |
| శుక్ల యజుర్వేదము | బృహదారణ్యకోపనిషత్తు | అహం బ్రహ్మాస్మి |
| సామవేదము | ఛాందోగ్యోపనిషత్తు | త త్వమసి |
| అథర్వణ వేదము | మాండూక్యోపనిషత్తు | అయమాత్మా బ్రహ్మ |



## సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః |
## నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః || (29)

### 266. సుభుజః

- అందమైన భుజములు గలవాడు – **శోభనా భుజాః అస్య ఇతి.**
- జగద్రక్షకుడు. భక్త వరదుడు.

ఓం సుభుజాయ నమః

తనను శరణుజొచ్చిన భక్తుల యోగక్షేమములను, భారమును వహించు మహోన్నత భుజములను శ్రీభట్టులు ఈ నామరూపమున కీర్తించారు. అంతటితో ఆగక, సకల భువనములను రక్షించు భుజములు కలిగినవాడు సుభుజుడు అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. రక్షించి, కామితార్థములను ప్రసాదించు అభయ వరద హస్తుడైనందున శ్రీనివాసుడు సుభుజుడని శ్రీ చిన్మయానంద స్తుతించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **పాతు ప్రణత రక్షాయామ్ విలంబమ్ అహసన్నివ, సదా పంచాయుధీమ్ బిభ్రత్ సనః శ్రీరంగనాయకః.** భక్తుల రక్షణార్థము ఏమాత్రము జాప్యము జరుగకుండ నుండుటకై సదా పంచాయుధములను ధరించి సిద్ధముగానుండు శ్రీరంగనాథుడు.

గజరాజు రక్షణకై చక్రమును ప్రయోగించినవాడు. గోకులమును కాచుటకై గోవర్ధనగిరి నెత్తినవాడు. విభీషణునకు శరణమిచ్చినవాడు. కటి వరద హస్తములతో, శంఖ చక్రములతో తిరువేంకటగిరిపై వెలసినవాడు. శ్రీవేంకటరమణుడు. అర్జునునికొరకు రథము తోలినవాడు. ద్రౌపదికి చీరలిచ్చినవాడు.

ధర్మచక్రము రచయిత – 'సుభుజ' అన్న నామము శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించిన శ్రీమహావిష్ణువు కరములను స్మరించును. శంఖము ప్రణవనాద భరితము. చక్రము ధర్మపరులను రక్షించి, అధర్మవర్తులను శిక్షించును. గద దుర్మార్గులను అణచివేయును. పద్మము భగవంతునకు భక్తులపైనున్న అనురాగమును సూచించును.

**అన్నమయ్య కీర్తన**

ఇందరికి న భయంబులిచ్చు చేయి – కందువగు మంచి బంగారు చేయి ॥
వెలలేని వేదములు వెదకి తెచ్చినచేయి – చిలుకు గుబ్బలి కింద చేర్చు చేయి
కలికి యగు భూకాంత కౌగిలించిన చేయి – వలనైన కొనగోళ్ళ వాడి చేయి
తనివోక బలిచేత దానమడిగిన చేయి – ఒనరంగ భూదాన మొసగు చేయి
మొనసి జలనిధి యమ్ముమొనకు దెచ్చిన చేయి – ఎనయ నాగేలు ధరియించు చేయి

పురసతుల మానములు వొల్లసేసిన చేయి – తురగంబు బరపెడి దొడ్డచేయి
తిరువేంకటాచలాధీశుడై మోక్షంబు – తెరువు ప్రాణుల కెల్ల తెలిపెడి చేయి॥

## 267. దుర్ధరః

- ఇతరులచేత ఆపబడజాలని బలము కలవాడు (ఎదురు లేనివాడు).
- తెలిసికొనుటకు అందనివాడు (తెలియరానివాడు).
- మనస్సులో నిలుపుకొనుటకు కష్టమైనవాడు (నిలువరానివాడు).
- మరి దేనిచేతను ధరింప (భరింప) జాలనివాడు.

### ఓం దుర్ధరాయ నమః

ఈ నామము 267వ మరియు 720వ నామములుగా చెప్పబడినది.

29వ శ్లోకము. 267వ నామము – దుర్ధరః – **సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః**

76వ శ్లోకము. 720వ నామము – దుర్ధరః – **దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథా పరాజితః**

**పరైర్దుర్వార వేగో యః దుర్ధరః స చ కథ్యతే** – ఇతరులచేత ఆపబడని వేగము కలవాడు.

'సుభుజః' అనగా శరణాగతులను కాపాడు అనంత శక్తియుతములైన భుజములు కలవాడు – అన్న భావమునే 'దుర్ధరః' నామ వివరణయందు శ్రీ భట్టులు కొనసాగించారు. పొంగివచ్చే సముద్ర ప్రచండమును ఇసుకతిన్నెలు ఆపలేనట్లే శ్రీమహావిష్ణువు భుజబలము యెదుట మరేమియును నిలువజాలవు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – (1) ధ్యాన సమయమున శ్రీమన్నారాయణుని మనసులో నిలుపుకొనుట యోగులకు చాల కష్టము (2) సమస్తమును ఆయనే భరించును. ఆయనను భరించువారెవ్వరును లేరు.

శ్రీ చిన్మయానంద – మహాయోగులకు కూడ ఆయనను తెలిసికొనుట సాధ్యము కాదు.

ధర్మ చక్రము రచయిత వ్యాఖ్య – భగవంతుని మనస్సులో నిలుపుకొనవలెనన్నచో ముందుగా ప్రాణాయామాది సాధనముల ద్వారా మనస్సును నిర్మలమొనర్చుకొనవలెను. పిదప శ్రీనివాసునిపై ధ్యానము సాగించవలెను.

## 268. వాగ్మీ

- మధురమైన, ప్రియమైన, స్తుతింప దగిన వాక్కు కలవాడు.
- శక్తిపూరితమైన వాక్కు కలవాడు.
- వేదములు ఆయన వాక్కునుండి ఉద్భవించెను.

### ఓం వాగ్మినే నమః

యుద్ధభూమియందు దిక్కుతోచక కర్తవ్య విమూఢుడైన అర్జుననకు గీతోపదేశ మొనరించిన శ్రీకృష్ణపరమాత్ముడు సకల పుణ్యవాఙ్మయ స్వరూపుడు. శ్రీరాముడు మృదుభాషి. ప్రియభాషి. అందరిని స్వయముగా పలకరించి యోగక్షేమములు తెలిసికొనెడివాడు. విద్యానిధి. **బుద్ధిమాన్ మధురభాషీ పూర్వభాషీ ప్రియంవదః** – అని అయోధ్యకాండము (1.13)లో చెప్పారు.

**వాగ్వివృత్తాశ్చ వేదాః** – ఆయన వాక్కునుండి వచ్చినవన్నీ వేదములే.

భగవానుని వాక్ప్రభావమును వివరిస్తూ ధర్మచక్రము రచయిత గీత (18.73)నుండి ఉదాహరించారు.

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత**
**స్థితో஽స్మి గతసందేహః కరిష్యే వచనం తవ**
అర్జునుడు పలికెను – ఓ అచ్యుత! నీ కృపచే నా మోహము పూర్తిగా తొలగినది. స్మృతిని పొందితిని. ఇప్పుడు సంశయ రహితుడనైతిని. కనుక నీ ఆజ్ఞను తలదాల్చెదను.

## 269. మహేంద్రః

- మహత్తరమగు, అనన్యమగు ఐశ్వర్యము కలవాడు. సిరిగలవాడు.
- ఇంద్రునకును, దేవతలకును దేవుడు.
- అన్ని వెలుగులకు మూలము.

### ఓం మహేంద్రాయ నమః

'ఇది' అన్న మూలమునకు పరమైశ్వర్యము అనే అర్థమున్నది. **పరమైశ్వర్యవత్త్వేన మహేన్ద్ర ఇతి శబ్ద్యతే.** ఆయన సకలైశ్వర్య సంపన్నుడు. అన్నింటికిని అధిపతి. ప్రభువు.

ఇంద్రునకు ప్రభువైనందున శ్రీమన్నారాయణుడు మహేంద్రుడు.

'ఇన్ధీ' అనగా ప్రకాశించుట (దీప్తౌ) అనే ధాతువునుండి శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు మరొక అర్థాన్ని చెప్పారు. అన్నింటా ఆయనే వెలుగు. అన్ని వెలుగులు ఆయన నుండియే సంభవించును. కనుక ఆయన మహేంద్రుడు.

## 270. వసుదః

- సంపదలను ప్రసాదించువాడు

### ఓం వసుదాయ నమః

**వసు (=ధనము) దదాతి ఇతి వసుదః** – ధనమునిచ్చువాడు 'వసుదః'.
**వసుదో ధనదావాచ్చ ధనాయద్భ్యో విశేషతః** –ఇంద్రుడు, కుబేరుడు వంటివారికి దనమునిచ్చువాడు.

సామాన్యమయిన ధనము కాని, త్రైలోక్యాధిపత్యము కాని, ఏదయినా శ్రీనివాసుని కటాక్షము వల్లనే లభించును. ధర్మము, అర్థము, కామము, మోక్షము – అన్నియును భక్తులపట్ల దయతో ఆ శ్రీధరుడు ప్రసాదించినవే.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఎవరైనా ఏమయినా ఎవరికైనా ఇచ్చినప్పుడు భగవంతుని దాతృత్వము ఆ కార్యములో ప్రకాశించును. అన్నదానము, వస్త్రదానము, జ్ఞానదానము వంటి పుణ్యకార్యములను చేయువారు శ్రీమహావిష్ణువును పూజించినవారే యగుదురు.

## 271. వసుః

- జ్ఞానులైనవారు కాంక్షించు సంపద వాసుదేవుడే.

## ఓం వసవే నమః

ఈ నామము మూడుమారులు – 105, 271, 701వ నామములుగా చెప్పబడినది.

12వ శ్లోకము. 105వ నామము – వసుః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**

29వ శ్లోకము. 271వ నామము – వసుః – **సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః**

74వ శ్లోకము. 701వ నామము – వసుః – **వసుప్రదో వాసుదేవో వసుః వసుమనా హవిః**

మహేంద్ర, వసుద, వసు – ఈ నామములు ఐశ్వర్యమును స్తుతించు సందర్భములో చెప్పబడినవి. అన్నింటికంటె ఉత్తమమైన సంపద వైకుంఠప్రాప్తి, శ్రీవిష్ణుసేవా భాగ్యము. భక్తులకు ఆయనే కొంగుబంగారము.

**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః** – సర్వమును వాసుదేవుడే అని తెలియు మహాత్ములు అరుదు. వాసుదేవుడే పరమైశ్వర్యము. అది సాధించు మార్గమును వాసుదేవుడే.

'వసు' నామమునకు చెప్పబడిన ఇతర భావములు.

- భక్తుల హృదయమున వసించువాడు.
- క్షీరసాగర నివాసి.
- వసువులందు పావకుడు.
- అంతరిక్షమున వసించువాడు.
- అత్యుత్తమమగు ధనము.
- మాయతో అంతను కప్పివేసినవాడు.

**'నైకరూపః'తో ప్రారంభమయ్యే తరువాతి నామములు కొన్నింటిని శ్రీవాసుదేవుని విశ్వరూప స్తుతిగా శ్రీభట్టులు వర్గీకరించారు.**

వివిధ పురాణములలో విశ్వరూప వర్ణన ఉన్నది. వాటిని డా. క్రోవి పార్థ సారథిగారు తమ 'శ్రీ కైవల్య సారథి'లో ఉదాహరించారు.

1) దేవీ భాగవతము – సప్తమ స్కంధము – దేవతలు దర్శించిన శ్రీ పరమేశ్వరి విరాడ్రూపము.
2) శ్రీమద్భాగవతము – బ్రహ్మదేవుడు నారదునికి చెప్పిన శ్రీమహావిష్ణురూపము.
3) విష్ణుధర్మోత్తర పురాణము – మార్కండేయుడు వర్ణించినది. నారదుడు దర్శించిన విశ్వరూపము.
4) భగవద్గీత – 11వ అధ్యాయము – అర్జునుడు దర్శించిన శ్రీకృష్ణ రూపము.
5) వేదములలోని పురుష సూక్తము.

---

## దేవీ భాగవతము – సప్తమ స్కంధము – 31వ అధ్యాయము

తారకాసురుని బాధలనుండి తమను కాపాడమని ప్రార్థించిన దేవతలకు శ్రీదేవి సాక్షాత్కరించినది. హిమవంతుడు "తల్లీ! నీ విశ్వరూపమును చూడవలెనని మాకు కోరికగా నున్నది" అని ప్రార్థింపగా శ్రీపరమేశ్వరి వారికి తన విరాడ్రూపం చూపింది.

ఆ పరదేవతకు సత్యలోకమే శిరస్సు. సూర్యచంద్రులు కనులు. దిక్కులు చెవులు. వేదములు వాక్కు. వాయువు ప్రాణము. ప్రపంచము హృదయము. భూమి కటి. ఆకాశము నాభి. నక్షత్రగణము రొమ్ము. మహర్లోకము కంఠము. జనలోకము ముఖము.

తపోలోకము నుదురు ... .... ..... ఆమె కడగంటి చూపే సమస్త సృష్టి. రాత్రింబవళ్ళు కనురెప్పలు. ఆమె నవ్వే మాయ. రుద్రుడు ఆమె యంతఃకరణము. ఆమెకు విష్ణువు విజ్ఞానశక్తి.... ....

**శ్రీమద్భాగవతము – నారదునకు బ్రహ్మదేవుడు శ్రీమహావిష్ణువుయొక్క విశ్వరూపమును వర్ణించిన విధము.**

ఆ విశ్వరూపునకు భూలోకము కటిప్రదేశము. ఊర్ధ్వలోకములు శరీరము పైభాగము. అధోలోకములు క్రిందిభాగములు. అగ్నియే ముఖము. (వాక్కు ముఖము). వాయువు శ్వాస. రాత్రింబవళ్ళు కనురెప్పలు. చిరునవ్వు మహామాయ. కాలము ఆయన గమనము. హృదయము అవ్యక్తము. రుద్రుడు అహంకారము. మనుష్యులు ఆ విరాట్ స్వరూపుని నివాసము. .... ....

అంతే కాదు నారదా!

**నీలకంధరునకు, నీకు నాకు సనత్కు**
**మార ముఖ్య సుత సమాజమునకు**
**ధర్మ సత్వబుద్ధి తత్త్వములకు నీశ్వ**
**రాత్మ వినుము పరమమైన నెలవు.**

**నర సురాసుర పితృ నాగ కుంజర మృగ, గంధర్వ యక్ష రాక్షస మహీజ**
**సిద్ధ విద్యాధర జీమూత చారణ గ్రహ తారకాప్సరో గణ విహంగ**
**భూత తటిద్వసు పుంజంబులును, నీవు ముక్కంటియును, మహామునులు, నేను**
**సలిల నభస్థల చరములు మొదలైన వివిధ జీవులతోడి విశ్వమెల్ల**
**విష్ణుమూర్తి మయము పుత్ర! వేయేల బ్రహ్మండ**
**మతని జేనలోన నడగియుండు**
**బుద్ధి నెరుగరాదు; భూతభవద్భవ్య**
**లోకమెల్ల విష్ణులోన యుండు.**

**విష్ణుధర్మోత్తర పురాణము – నారదుడు చూసిన విశ్వరూపము. మార్కండేయుడు వజ్రునకు వర్ణించినది.**

ఆ నారదుడు అపుడంతట విశ్వరూప ధరుడును, విష్ణువును అగు శ్రీహరిని దర్శించెను. అతడు ఒక్కొక్కచోట ఇవి ఇట్టివి అని నిర్దేశించ నలవిగాని బహువర్ణములు ధరించియుండెను. బహువిధములుగా ప్రకాశించుచుండెను. నానావిధ ప్రాణుల బహుముఖములను, బ్రహ్మ శంకర రుద్ర యమ వరుణ కుబేరాగ్ని వాయు నిరృత గ్రహ నక్షత్ర వసు రుద్రాదిత్య మరుద్ భృగ్వంగిరః సాధ్యాఽశ్వి దైత్య నాగ గంధర్వ సర్వ రక్షః పితృ పన్నగ యక్ష పిశాచ మనుష్య హయ నాగ గజాశ్వ మృగ పక్షి ఖడ్గమృగ వ్యాఘ్ర సింహాది ప్రాణి విశేషముల ముఖములను దాల్చియుండెను. అతని ముఖములు వందలు వేలుగా కనబడుచుండెను. రౌద్రరూపుడగు అతని రౌద్ర ముఖములందు అతనిచే మ్రింగబడుచున్న అనేక ప్రాణి సంఘములను, అగ్నులను కూడ నారదుడు చూచెను. అతని సౌమ్య ముఖములనుండి వెలికి వచ్చుచున్న అనేక ప్రజలును, వివిధ వాహనములును ఆ నారదునకు కనబడెను. నానా ముద్రా సమన్వితములును, నానా భాండము (వస్తువు)లతో నానాయుధములతో కూడిన హస్తములును వేలకొలదిగా అతనికి కనబడెను. ఆ ముని సయక్ష నాగ రక్షోగణములతోను, ద్వీప సముద్రాదులతోను, పాతాళాది లోకములతోను కూడినదయి సమగ్రమయిన దానిని ఆ భగవానుని దేహమునందు – దేహముగానే యున్నదానిని – చూచెను.



కనులకు, మాటలకు, మనసుకు అందని విరాడ్రూపాన్ని అనేక కళాకారులు మన కనులముందు ఉంచడానికి చేసిన ప్రయత్నం. అనేక చిత్రాల సంకలనం.

**శ్రీమద్భగవద్గీత – 11వ అధ్యాయము – విశ్వరూప సందర్శన యోగము.**

**9 నుండి 25వ శ్లోకము వరకు అర్జునుడు దర్శించిన శ్రీకృష్ణుని విశ్వరూప వర్ణనము.**

సంజయుడు పలికెను – ఓ రాజా! మహాయోగేశ్వరుడును, పాపములను హరించువాడును ఐన భగవానుడు ఈ విధముగా పలికి, అనంతరము షడ్గుణైశ్వర్య సంపన్నమైన తన పరమ దివ్యస్వరూపమును అర్జునునకు చూపెను. అర్జునుడు చూచిన ఆ పరమేశ్వరుని విరాట్ (విశ్వ) రూపమునందలి ముఖములు అనంతములు – నేత్రములు అసంఖ్యాకములు. అందలి దృశ్యములు అద్భుతములైనవి. ఆ రూపము అనేక దివ్యాభరణ శోభితము. ఆ పరమేశ్వరుడు పెక్కు దివ్యాస్త్రములను చేపట్టియుండెను. దివ్యములగు మాలలను, వస్త్రములను ధరించియుండెను. ఆ దివ్యశరీరమునుండి దివ్యచందన పరిమళములు దశదిశల గుబాళించుచుండెను. ఆ రూపము సర్వాశ్చర్యకరము, అనంతము, సర్వతోముఖము, ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాంతి పుంజములును ఆ విరాట్-రూప తేజస్సునకు సాటి రావు.

ఆ సమయమున అర్జునుడు ఆ దేవాది దేవుని శరీరమనందు అసంఖ్యాకములైన వివిధ బ్రహ్మాండములను వేర్వేరుగా ఒకేచోట కేంద్రీకృతమై యున్నట్లు చూచెను. అద్భుతమైన ఆ పరమాత్ముని విశ్వరూపమును చూచి అర్జునుడు ఆశ్చర్య చకితుడై పులకిత గాత్రుడయ్యెను. తేజోమయమైన ఆ విశ్వ (విరాట్) రూపమునకు భక్తి శ్రద్ధలతో సాష్టాంగ ప్రణామము లాచరించెను. తదనంతరము చేతులు జోడించి యిట్లు పలికెను.

అర్జునుడు పలికెను – ఓ దేవాది దేవా! నీ విరాట్-రూపమునందు సకల దేవతలను, నానావిధ ప్రాణికోటిని, కమలాసనుడైన బ్రహ్మను, మహాదేవుడైన శంకరుని, సమస్త ఋషులను, దివ్యసర్పములను చూచుచున్నాను. ఓ విశ్వేశ్వర! విశ్వరూప! నీ బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు అసంఖ్యాకములు. నీ అనంత రూపము సర్వతోముఖముగ విలసిల్లుచున్నది. నీవు ఆదిమధ్యాంత రహితుడవు. మహత్వపూర్ణమైన నీ దివ్యరూపమునకు ఆదిమధ్యాంతములను తెలిసికొనలేకున్నాను. హే విష్ణో! కిరీటమును, గదను, చక్రమును ధరించి, అంతటను తేజఃపుంజములను విరజిమ్ముచున్న నిన్ను దర్శించుచున్నాను. ప్రజ్వలితాగ్ని వలెను, జ్యోతిర్మయుడైన సూర్యునివలెను వెలుగొందుచున్న నీ అప్రమేయ రూపము దుర్నిరీక్ష్యమైయున్నది.

పరమ అక్షర స్వరూపుడవైన పరబ్రహ్మపరమాత్మవు నీవే; కనుక అందరికిని తెలిసికొనదగిన వాడవు. ఈ జగత్తునకు నీవే పరమాశ్రయుడవు. సనాతన ధర్మ రక్షకుడవు. నీవు అవ్యయుడవు, సనాతన పురుషుడవు అని నా విశ్వాసము. ఆదిమధ్యాంతరహితుడవు, అపరిమిత శక్తిశాలివి, అసంఖ్యాకములైన భుజములు కలవాడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు. అగ్నివలె నీ ముఖము ప్రజ్వరిల్లుచున్నది. నీ తేజస్సుతో ఈ జగత్తును సంతప్తమొనర్చుచున్నావు. అట్టి నిన్ను నేను చూచుచున్నాను. ఓ మహాత్మా! దివినుండి భువి వరకు గల అంతరిక్షము నందంతటను అన్ని దిశలను నీవే పరిపూర్ణుడవై యున్నావు. అద్భుతమైన నీ భయంకర రూపమును చూచి ముల్లోకములును గడగడలాడుచున్నవి.

ఇదిగో! ఆ దేవతలెల్లరును నీలో ప్రవేశించుచున్నారు. కొందరు భయపడినవారై అంజలి ఘటించి, నీ నామగుణములను కీర్తించుచున్నారు. మహర్షులును, సిద్ధులును స్వస్తి వచనములతోడను, ఉత్తమోత్తమ స్తోత్రములతోడను నిన్ను ప్రస్తుతించుచున్నారు. ఏకాదశ రుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినీకుమారులును, మరుద్గణములును, పితరులును, అట్లే గంధర్వయక్షాసురసిద్ధ సముదాయములును సంభ్రమాశ్చర్యములతో నిన్నే దర్శించుచున్నారు. హె మహాబాహో! అసంఖ్యాకములైన వక్త్రములను, నేత్రములను, చేతులను, ఊరువు (తొడ)లను, పాదములను, ఉదరములను, కోరలను కలిగిన మిక్కిలి భయంకరమైన నీ రూపమును చూచి అందరును భయకంపితులగుచున్నారు. నేను కూడ భయముతో వణికిపోవుచున్నాను.

ఏలనన ఓ విష్ణో! నీ రూపము అంతరిక్షమును తాకుచున్నది. అది అనేక వర్ణములతో దేదీప్యమానమై వెలుగుచున్నది. కాంతులను విరజిమ్ము విశాల నేత్రములతో, విస్తరించిన ముఖములతో అద్భుతముగా ఒప్పుచున్నది. అట్టి నీ రూపమును చూచిన నా మనస్సు తత్తరపడుచున్నది. అందువలన నా ధైర్యము సడలినది. శాంతి దూరమైనది. ఓ జగన్నివాసా! కరాళ దంష్ట్రలతో (భయంకరమైన కోరలతో) ఒప్పుచున్న నీ ముఖములు ప్రళయాగ్ని జ్వాలలవలె భీతిగొల్పుచున్నవి. వాటిని చూచిన నాకు దిక్కు తోచకున్నది. నెమ్మది (శాంతి) శూన్యమైనది. ఓ దేవేశ! ప్రసన్నుడవు కమ్ము.



https://commons.wikimedia.org/wiki/File:Arjun-er_Biswarup_Darshon.jpg photo by বাক্যবাগীশ

శ్రీ మద్భగవద్గీతలోని చివరి మూడు శ్లోకములు (18-76, 77, 78)

రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమమద్భుతమ్|
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః|| 18-76 ||

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః|
విస్మయో మే మహాన్ రాజన్హృష్యామి చ పునః పునః|| 18-77 ||

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః|
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ|| 18-78 ||

ఓ రాజా! (ధృతరాష్ట్రా!) శ్రీకృష్ణ భగవానునకు, అర్జునునకు మధ్య జరిగిన గొప్పమైన ఈ సంవాదము పుణ్యప్రదమైనది. అత్యద్భుతమైన ఈ సంవాదమును అనుక్షణము పదే పదే స్మరించుచు నేను నిరంతరము ఆనందమున ఓలలాడుచున్నాను. ఓ రాజా! అత్యంత విలక్షణము, పరమాద్భుతము, అపూర్వము ఐన ఆ శ్రీహరి రూపమును పదే పదే స్మరించుచు, నేను పొందుచున్న సంభ్రమాశ్చర్యములకు అవధియే లేదు. తత్ప్రభావమున మరల మరల హర్షోల్లాసముతో పులకిత గాత్రుడ నగుచున్నాను. ఓ రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడును, గాండీవ ధనుర్ధారియైన అర్జునుడును ఉండుచోట సంపదలును, సర్వ విజయములును, సకలైశ్వర్యములును, సుస్థిరమైన నీతియును ఉండును – అని నా నిశ్చితాభిప్రాయము

(భగవద్గీత శ్లోకముల తెలుగు తాత్పర్యములు శ్రీ జయదయాల్ గోయందకా గారి "శ్రీ మద్భగవద్గీత – తత్త్వ వివేచనీ వ్యాఖ్య" నుండి తీసుకొనబడినవి. ఆంధ్రానువాదము డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య)

## 272. నైకరూపః

- అనేక రూపములలో వెలయు విశ్వరూపుడు.

ఓం నైకరూపాయ నమః

**న ఏకాని రూపాణి యస్య సః నైకరూపః** – అనేక రూపములు ధరించేవాడు నైకరూపుడు.

**యస్సదా బహురూపశ్చ నైకరూప స్సకీర్తితః తత్తజ్జన జ్ఞానయోగ్యం రూపం యస్య విశేషతః నైకరూప స్సముద్దిష్టః సర్వ ప్రత్యయ గోచరః** - భక్తులు ఏ విధంగా చూడాలనుకుంటే వారికి ఆ విధంగా పరమేశ్వరుడు దర్శనమిస్తాడు. అంటే తాను ఒకేరూపంలో ఉండకుండా భక్తుల ఇష్టానుసారము రూపమును ధరిస్తూ ఉంటాడు.

**అన్నిరూపులు నీ రూపమైనవాడు ఆదిమధ్యాంతములు లేక అలరువాడు** – భాగవతము. గజేంద్రమోక్షము

**అనేకవక్త్రనయనమ్ అనేకాద్భుతదర్శనమ్ –** గీత 11.10

**సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్ –** గీత 11.11

**అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోऽనన్తరూపమ్ –** గీత 11.16

శ్రీ చిన్మయానంద చెప్పిన ప్రమాణము –

**జలమ్ విష్ణుః స్థలమ్ విష్ణుః విష్ణురాకాశమ్ ఉచ్యతే**

**స్థావరమ్ జంగమమ్ విష్ణుః సర్వమ్ విష్ణుమయమ్ జగత్**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు అభయవరదాత. అందరికీ అభయములిచ్చే చేయి ఆయనది. కొండలంత వరములు క్రుమ్మరించువాడు కోనేటిరాయుడు. మరి అందరికీ అందుబాటులో ఉండేవాడు ఉండేవాడు అన్నిచోట్లా, అన్ని రూపాలలో వెలసి ఉండడం సహజమే గదా!

విశ్వమందలి సమస్త రూపములలో ఆయన దివ్యమంగళ స్వరూపమును దర్శించువాడే జ్ఞానియును, యోగియును అగును.

## 273. బృహద్రూపః

- మహాద్భుతమైన పెద్దరూపము గలవాడు.

### ఓం బృహద్రూపాయ నమః

భగవానుడు శ్రీవరాహమూర్తియై పాతాళాంతర్గతయైన భూమిని సముద్ధరించినాడు. శ్రీనారసింహుడై హిరణ్యకశిపుని చీల్చి చెండాడెను. శ్రీత్రివిక్రముడై బ్రహ్మాండాంత సంవర్ధియైనాడు. అన్నింటా ఆయన రూపము మహాద్భుతము. అప్రమేయము.

పురుష సూక్తములో – **అత్య తిష్ఠత్ దశాంగులమ్** – జగత్తుకంటె పదింతలు పెద్దదైనవాడు – అని చెప్పబడినది.

**అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోऽనన్తరూపమ్**

**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప** – గీత 11.16

ఓ విశ్వేశ్వర! విశ్వరూప! నీ బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు అసంఖ్యాకములు. నీ అనంత రూపము సర్వతోముఖముగ విలసిల్లుచున్నది. నీవు ఆదిమధ్యాంత రహితుడవు. మహత్వపూర్ణమైన నీ దివ్యరూపమునకు ఆదిమధ్యాంతములను తెలిసికొనలేకున్నాను.

**ద్యావా పృథివ్యో రిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః**

**దృష్ట్వాద్భుతమ్ రూపముగ్రమ్ తవేదం లోకత్రయమ్ ప్రవ్యథితమ్ మహాత్మన్ –** గీత 11.20

ఓ మహాత్మా! భూమ్యాకాశాలు అంతా నీవే పరిపూర్ణుడవై ఉన్నావు. అద్భుతమైన నీ భయంకర రూపాన్ని చూచి ముల్లోకాలు గడగడలాడుచున్నాయి.

సామాన్యమైన చక్షురింద్రియములతో భగవంతుని బృహద్రూపమును చూచుట, ఊహించుట అసాధ్యము. కాని ఆ బృహద్రూపుని అనంతైశ్వర్య శక్తి సామర్థ్యములను, ఆయన సర్వవ్యాపిత్వమును మనము ధ్యానించిన యెడల ఇంద్రియ గోచరమగు ప్రపంచముయొక్క అల్పత్వము అవగాహనయగును. ఈ స్వల్ప బంధములను అధిగమించ సాధ్యమగును.

**భక్తి నివేదన – మే 2002 – శ్రీ ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామి రచన "శ్రీ విష్ణుపురాణము" నుండి.**

స్వామి వరాహరూపాన్ని ధరించి భూసముద్ధరణానికై సముద్యమించాడు. స్వామి ఘుర్ఘుర ధ్వని చేస్తుంటే సామవేద కమనీయ స్వరం వినిపిస్తున్నది.

**తతః సముక్షిప్య ధరాః స్వదంష్ట్రయా మహావరాహః స్ఫుట పద్మలోచనః**
**రసాతలా దుత్పల పత్ర సన్నిభః సముత్థితో నీల ఇవాచల మహాన్**

స్వామి తన కోరలతో పాతాళాంతర్గత అయిన భూమిని పైకి సముద్ధరించాడట. విశాలంగా వికసించిన పద్మాల్లా ఉన్న నేత్రాలతో మహావరాహరూపి అయిన స్వామి, భూమిని పైకెత్తుతూ నల్లని కలువవంటి దేహచ్ఛాయ కలిగి ఒక మహా వినీలగిరిలా పైకి లేచినాడట.

పైకి లేస్తూ తన ముఖంనుండి ఆవిర్భవించిన వాయువులతో జలాలను పైకి చిమ్ముతూ ఉంటే, ముఖ వాయు సముత్థితమైన జలం పైనున్న జనలోక వాసులపై పడిందట. పై లోకాలలో ఈ సన్నివేశాన్ని సానందంగా దర్శిస్తున్న సనక సనందనాది మహర్షుల స్వాభావిక పరిపూరితులైన వారిని పరమ పావనులుగా చేసిందట ఆ జలం. స్వామియొక్క కాలిగిట్టల తాకిడికి లోతైన రంధ్రాలు భూమి పైభాగం నండి రసాతలం వరకూ ఏర్పడగా, ఆ రంధ్రాలలోనికి జలం ధ్వని చేస్తూ వేగంగా ప్రవేశించసాగిందట. ఇక స్వామియొక్క నిఃశ్వాస వాయువులు సిద్ధజనులున్న దిక్కులవైపున నలువైపులా ప్రసరించసాగాయి. ఇలా పైకి లేస్తూ, ఒక్కసారి తన జలార్ద్రమైన శరీరాన్ని ఇటూ అటూ వేగంగా విదిలించగా, గుహకూపాలలో నెలవులు ఏర్పరచుకొన్న మహర్షులు స్తుతించసాగారట. జనాది లోకాల్లో ఉన్న సనందనాది మహర్షులు శ్రీభూవరాహస్వామిని ఇలా స్తుతించారు.

**జయేశ్వరాణాం పరమేశ! కేశవ!**
**ప్రభో! గదా శంఖ ధరాసి చక్రధృక్!**
**ప్రసూతి నాశ స్థితి హేతురీశ్వరః**
**త్వమేవ నాన్యత్ పరమం యత్పదమ్**
**పాదేషు వేదాస్తవ యూప దంష్ట్రా**
**దన్తేషు యజ్ఞాః చితయశ్చ వక్త్రే!**
**హుతాశ జిహ్వోసి తనూరుహాణి**
**దర్భాః ప్రభో యజ్ఞపుమాంస్త్వమేవ**



1740 కాలపు చిత్రం.
శ్రీవరాహమూర్తి. వికీపిడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:Varaha_avtar,_killing_a_demon_to_protect_Bhu,_c1740.jpg

ఈశ్వరులకు పరమేశ్వరుడైన కేశవా!
ప్రభూ! గదా-శంఖ ధారీ! ఖడ్గ చక్రాలను ధరించినవాడా! సమస్త జగత్తుయొక్క పుట్టుక, ఉనికి, నాశనాలకు కారణమైన నీవే పరమ ప్రాప్యమైన 'పరమపద' స్థానానివి. నీ పాదాల్లో వేదాలున్నాయి. నీ కోరలే యూపస్తంభాలు. నీ దంతాలలో యజ్ఞాలున్నాయి. నీ ముఖమే హవిర్ద్రవ్యాలనుంచే యజ్ఞస్థలము. హుతాశనుడు (అగ్ని) నీ నాలుక. నీ రోమాలు దర్భలు. కనుక నీవు ఇలా యజ్ఞపురుషుడవే.

రాత్రింబవళ్ళు నీకన్నులు. ఓ మహాత్మా! నీ శిరస్సు సమస్తానికీ ఆశ్రయమైన ప్రణవము. సమస్త వైదిక సూక్తాలు నీ శిరస్సు పైనున్న జడలు. నీ ముక్కు సమస్త హవిర్ద్రవ్యాలు. నీ తుండము 'స్రుక్' అనే హవిఃప్రక్షేపణ సాధనం. నీ నాదము నాదస్వరము. నీ శరీరము ప్రాగ్వంశము. నీ సంధులు సమస్త యాగములు. ధర్మకార్యములు నీ శ్రవణేంద్రియములు. ఓ సనాతన స్వరూపుడా! ప్రసన్నుడవు కమ్ము!

**పదమాక్రాన్త భువమ్ భవన్తమ్ ఆదిస్థితం చాక్షర విశ్వమూర్తే !**
**విశ్వస్య విద్మః పరమేశ్వరోసి ప్రసీద నాథోऽసి పరావరస్య!**

## 274. శిపివిష్టః

- కిరణముల స్వరూపమున వ్యాపించియున్నవాడు.
- యజ్ఞపశువునందు ఆవహించియున్నవాడు.

### ఓం శిపివిష్టాయ నమః

'శిపి' అను పదమునకు రెండు అర్థములున్నవి – కిరణములు, జంతువులు.

సూర్యుడు, చంద్రుడు, అగ్ని వంటివాని కిరణముల రూపములలో అంతట వ్యాపించినవాడు. ఆయనే వెలుగు, జ్ఞానము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శిపయః - రశ్మయః, తాన్ సంప్రవిష్టః, వ్యాప్తవాన్ ఇతి శిపివిష్టః** – కిరణములయందు వ్యాపించియున్నవాడు శిపివిష్టుడు. ఇందుకు ప్రమాణముగా యాస్క ముని నిరుక్తమున చెప్పినది – **శిపయో రశ్మయః ఉచ్యంతే, తై ఆవిష్టః**

శీ భట్టుల వ్యాఖ్యానమును సంగ్రహముగా ఒక రచయిత (పేరు తెలియదు) 'నిరుక్తి' అను గ్రంథములో పొందుపరచినారు. అందులో చెప్పబడిన అర్థము – **శిపయో రశ్మయః ప్రోక్తా వ్యాప్త తేష్వపి వర్తనాత్ శిపివిష్ట స్సమాఖ్యాతః సూర్యేన్ద్వగ్న్యాది రూపవత్**

**శిపివిష్టేతి యచ్చాస్య పీతం రోమ చ యద్భవేత్**
**తేనాపి విష్టం యత్కించిత్ శిపివిష్టం హి తత్స్మృతమ్** - మహాభారతము – శాంతిపర్వము 343.41
(పచ్చ) బంగారు వర్ణములో ఉండే ఇతని రోమములకు శిపివిష్టములని పేరు. అట్టి శరీరముతో సమస్తమును వ్యాపించియున్నందున ఇతనిని 'శిపివిష్టుడు' అందురు.

ఉద్యోగ పర్వములో ఇలా చెప్పబడినది – **రోమ కూపేషు చ తథా సూర్యస్యేవ మరీచయః** – సూర్యకిరణముల వలె శరీరమున ప్రతి రోమ రంధ్రమున ప్రవేశించువాడు శిపివిష్టుడు.

శ్రీ లింగాయత సూరి తమ అమరకోశ వ్యాఖ్యానములో ఇలా చెప్పారు – **శిపిషు పశుషు జనేషు విష్టో వ్యాప్త ఇతి శిపివిష్టః** – అన్ని జంతువులు, మనుష్యులందు వ్యాపించినవాడు శిపివిష్టుడు.

శ్రీ కైవల్యసారధి నుండి - **యజ్ఞో వై విష్ణుః** పశవః శిపి ర్యజ్ఞ ఏవ పశషు **ప్రతితిష్ఠతి** – యజ్ఞమే విష్ణువు. పశువులు 'శిపి' అనబడును. అంటే పశువులయందు యజ్ఞము అనే రూపముతో నారాయణుడు ప్రవేశించియుంటాడు. శ్రీమహావిష్ణువు తానే యజ్ఞరూపమున పశువులయందు ప్రవేశించి, యజ్ఞములకు సమగ్రత కలిగించి, వాటిని ఫలవంతము చేస్తూ వాటి యజమానులకు ఫలదానము చేస్తున్నాడు.

## 275. ప్రకాశనః

- తన (విశ్వ) రూపమును దర్శించు భాగ్యమును తన భక్తులకు ప్రసాదించువాడు. (శ్రీ భట్టుల వ్యాఖ్య).
- సమస్తమును ప్రకాశింపజేయువాడు (శ్రీ శంకరుల వ్యాఖ్య)

### ఓం ప్రకాశనాయ నమః

**దివ్యరూపం దిదృక్షుభ్యః పార్థాదిభ్యో విశేషతః రూపం ప్రకాశయతి యః స ప్రకాశన ఈరితః -** తన దివ్యరూపాన్ని చూడగోరే అర్జునుడు మొదలైనవారికి తన దివ్య (విశ్వ) రూపమును ప్రకాశింప జేసినవాడు (చూపినవాడు) కనుక 'ప్రకాశనః'

**న తు మాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా**

**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్** – గీత

అర్జునా! చర్మచక్షువులతో నా ఈ రూపమును నీవు చూడజాలవు. కనుక నీకు దివ్యదృష్టిని ప్రసాదించుచున్నాను. ఆ దివ్యదృష్టితో నా ఈశ్వరీయ దివ్య యోగశక్తిని (స్వరూమును) చూడుము.

**ప్రకాశయతీతి ప్రకాశనః – సర్వేషాం ప్రకాశన శీలం అస్య –** భగవంతుడు సమస్తమును ప్రకాశింపజేయును.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే**

**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్** – గీత 13.17

ఆ పరబ్రహ్మ అన్ని జ్యోతులకును జ్యోతి (పరం జ్యోతి). మాయాతీతుడును, జ్ఞాన స్వరూపుడును, తెలిసికొనదగినవాడును, తత్వ జ్ఞానము ద్వారా ప్రాప్యుడును అతడే. సర్వ ప్రాణుల హృదయముల యందు విశేషముగా ఉండువాడును అతడే.

**యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః**

**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత**

అర్జునా! ఒక్క సూర్యుడే ఈ సమస్త జగత్తును ప్రకాశితము ఒనర్చుచున్నట్లు, ఒకే ఆత్మ సర్వ ప్రాణులయందును స్థితమై వానినన్నింటిని ప్రకాశింజేయుచున్నది (చైతన్యవంతులుగా చేయుచున్నది).

ధర్మచక్రము రచయిత – భగవంతుడు ప్రసాదించు వెలుగే ఆయనను తెలిసికొనుటకు ఉపయోగపడు మార్గము.



చికాగో శ్రీ వేంకటేశ్వర మందిరం



## ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః |
## ఋద్ధః స్పష్టాక్షరో మంత్రశ్చంద్రాంశుర్భాస్కరద్యుతిః || (30)

### 276. ఓజస్తేజోద్యుతిధరః

- పరిపూర్ణమగు ఓజస్సు (బలము), తేజస్సు (శత్రువులను ఓడించు శక్తి), ద్యుతి (కీర్తి, కాంతి) కలిగినవాడు.

**ఓం ఓజస్తేజోద్యుతిధరాయ నమః**

**అసాధారణ సామర్థ్యం బల యోజః ప్రచక్షతే పరాభి భవ సామర్థ్యం తేజశ్చ పరిపఠ్యతే**
**కీర్తిర్వా ద్యుతి రౌజ్వల్యం తాని దత్తే యస్సదా ఓజస్తేజోద్యుతిధరోహ్యేక నామ ప్రకీర్తితః**
ఓజస్సు అనగా అసాధారణమైన బలము. తేజస్సు అనగా శత్రువులను ఓడించు శక్తి. ద్యుతి అనగా ఉజ్వలమగు కీర్తి. ఈ మూడు గుణములను విశేషముగా (అనంతముగా) కలిగియున్నందన శ్రీనివాసుడు ఓజస్తేజోద్యుతిధరుడు.

**స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ**
**రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః** – భగవద్గీత 11.36
ఓ అంతర్యామి! కేశవా! నీ నామ గుణ ప్రభావములను కీర్తించుచు జగత్తు హర్షాతిరేకముతో, అనురాగముతో ఉప్పొంగి పోవుచున్నది. ఇది సముచితము. భయగ్రస్తులైన రాక్షసులు నలుదిక్కులకు పారిపోవుచున్నారు. సిద్ధగణముల వారెల్లరును ప్రణమిల్లుచున్నారు.

ఇక్కడ భగవంతుని ఓజస్సు, తేజస్సు, ద్యుతి వర్ణితములు. అట్లే విశ్వరూపతేజస్సు వేలకొలది సూర్యుల తేజస్సుకంటె అధికము – అని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపినాడు. ఈ మూడు గుణములు వేరువేరుగా కూడ గీతలో ప్రస్తావింపబడినవి.

**బలం బలవతా చాహం కామరాగ వివర్జితమ్ – బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్**

**యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జితమేవ వా**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజో అంశ సంభవమ్**
విభూతి యుక్తమైన, అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువేదైనను నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము.

**విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్** – ఈ సంపూర్ణ జగత్తును నా యోగశక్తియొక్క ఒక్క అంశతోడనే ధరించుచున్నాను.

### 277. ప్రకాశాత్మా

- ప్రకాశవంతమగు స్వరూపము గలవాడు. (మూర్ఖులు కూడా అంగీకరించేట్లుగా) గొప్పగా ప్రకాశించేవాడు.

**ఓం ప్రకాశాత్మనే నమః**

అంధుడు అయిన ధృతరాష్ట్రుడు (చూపు లేనివాడు, వివేకము లేనివాడు) కూడా శ్రీకృష్ణుడు పరమాత్ముడని గుర్తించి ప్రార్థించెను.
**త్వమేవ పుండరీకాక్ష సర్వస్య జగతః ప్రభుః తస్మాన్మే యాదవశ్రేష్ఠ ప్రసాదం కర్తుమర్హసి** – మహాభారతము. ఉద్యోగపర్వము.
పుండరీకాక్షా! సకల జగములకును నీవే ప్రభువువు. రక్షకుడవు. యాదవశ్రేష్ఠా! కనుక నీవు నాపై కరుణ చూపవలెను.

**ప్రకాశ స్వరూప ఆత్మా యస్య సః** – ప్రకాశవంతమగు ఆత్మ కలిగినవాడు. గీతయందు భగవంతుని ఉజ్వల స్వరూపము ఎన్నోచోట్ల కీర్తింపబడినది.

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా** (గీత 11.2) – **తేజస్తేజస్వినామహమ్** (గీత 10.36)

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్** – గీత 15.12
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నాతేజస్సేయని యెఱుంగుము.

**అనాదిమధ్యాన్త మనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్**
**పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్** – గీత 11.19
ఆదిమధ్యాంతరహితుడవు, అపరిమిత శక్తిశాలివి, అసంఖ్యాకములైన భుజములు కలవాడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు. అగ్నివలె నీ ముఖము ప్రజ్వరిల్లుచున్నది. నీ తేజస్సుతో ఈ జగత్తును సంతప్తమొనర్చుచున్నావు. అట్టి నిన్ను నేను చూచుచున్నాను.

**నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో** – గీత 11.24
ఓ విష్ణో! నీ రూపము అంతరిక్షమును తాకుచున్నది. అది అనేక వర్ణములతో దేదీప్యమానమై వెలుగుచున్నది. కాంతులను విరజిమ్ము విశాల నేత్రములతో, విస్తరించిన ముఖములతో అద్భుతముగా ఒప్పుచున్నది. అట్టి నీ రూపమును చూచిన నా మనస్సు తత్తరపడుచున్నది. అందువలన నా ధైర్యము సడలినది. శాంతి దూరమైనది.

## **278.** ప్రతాపనః

- (శ్రీ శంకరులు) సూర్యునివంటి రూపములతో జగత్తును తపింప (వేడి) చేయువాడు.
- (శ్రీ భట్టులు) తన ఉగ్ర రూపమున జగత్తును తపింపజేయు కాలస్వరూపుడు.
- (శ్రీ రాధాకృష్ణ శాస్త్రి) ప్రళయాగ్నియై జగత్తును లయమొనర్చువాడు.

### ఓం ప్రతాపనాయ నమః

ప్రళయాగ్ని జ్వాలలవలె ప్రజ్వలించు ముఖముతో, కరాళ దంష్ట్రలతో, లోకములను కబళించుటకు విజృంభించిన కాలస్వరూపుని ప్రతాపనుడని శ్రీ భట్టులు కీర్తించారు.

**దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని**
**దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస** – గీత 11.25
ఓ జగన్నివాసా! కరాళ దంష్ట్రలతో (భయంకరమైన కోరలతో) ఒప్పుచున్న నీ ముఖములు ప్రళయాగ్ని జ్వాలలవలె భీతిగొల్పుచున్నవి. వాటిని చూచిన నాకు దిక్కు తోచకున్నది. నెమ్మది (శాంతి) శూన్యమైనది. ఓ దేవేశ! ప్రసన్నుడవు కమ్ము.



**అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసఙ్ఘైః**
**భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః** – గీత 11.26
**వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాలాని భయానకాని**
**కేచిద్విలగ్నా దశనాన్తరేషు సన్దృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః** – గీత 11.27
**యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా ద్రవన్తి**
**తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి** – గీత 11.28
**యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః**
**తథైవ నాశాయ విశన్తి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః** – గీత 11.29

నేపాల్ చాంగునారాయణ మందిరంలో విశ్వరూప శిల్పం. వికీపీడియానుండి
Photo by: Gerd Eichmann
https://commons.wikimedia.org/wiki/File:Changu_Narayan-Skulptur-12-Vishnu_Vishvarupa-2013-gje.jpg

ఈ ధృతరాష్ట్రపుత్రులు ఇతర రాజన్యులతోసహా నీలో ప్రవేశించుచున్నారు. భీష్మపితామహుడు, ద్రోణుడు, కర్ణుడు, అట్లే మన పక్షమందలి ప్రధాన యోధులును అందఱును భయంకరములైన కోరలతో గూడిన నీ ముఖములయందు అతివేగముగా పరుగులు తీయుచు కనిపించుచున్నారు. కొందరి తలలు నీ కోరలమధ్య పడి నుగ్గునుగ్గై పోవుచుండగా వారు దంతములలో చిక్కుకొని వ్రేలాడుచున్నారు. నదీనదములు సముద్రమున కభిముఖముగా ప్రవహించి అందు ప్రవేశంచుచున్నట్లు, ఈ శ్రేష్ఠులైన సమర యోధులు కూడ జ్వలించుచున్న నీ ముఖములయందు ప్రవేశించుచున్నారు. మిడతలు మోహవశమున తమ నాశనము కొరకు అగ్నిలో ప్రవేశించుచున్నట్లుగా ఈ వీరులందరును తమ నాశనముకై అతి వేగముగా పరుగెత్తి నీ వక్త్రములందు ప్రవేశించుచున్నారు.

**లేలిహ్యసే గ్రసమానః సమన్తాల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః**
**తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో** – గీత 11.30
**ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద**
**విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్** – గీత 11.31

హే విష్ణో! ప్రజ్వలించుచున్న నీ ముఖములతో సమస్త లోకములను కబళించుచు అన్నివైపులనుండి మాటిమాటికిని ఆస్వాదించుచున్నావు. నీ ఉగ్రతేజస్సులు అంతటను నిండి జగత్తును తపింప జేయుచున్నవి. ఓ పరమాత్మా! నీకు నా నమస్కారములు. ప్రసన్నుడవు కమ్ము. ఉగ్రరూపుడవైన నీవు ఎవరో దయతో నాకు తెలుపుము. ఆదిపురుషుడవైన నిన్ను విశదముగా తెలిసికొనగోరుచున్నాను. ఏలనన నీ ప్రవృత్తిని ఎఱుంగలేకున్నాను.

అర్జునుని కోరిక మేరకు భగవానుడు తన ఉగ్ర (విశ్వ) రూప ధారణకు గల కారణమును తెలిపెను.

**కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః**
**ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః** – గీత 11.32

నేను లోకములన్నింటిని తుదముట్టించుటకు విజృంభించిన మహాకాలుడను. ఇప్పుడు ఈ లోకములను రూపుమాపుటకై పూనుకొనియున్నాను. కనుక నీవు యుద్ధము చేయకున్ననూ ప్రతిపక్షమున ఉన్న ఈ వీరులెవ్వరును మిగలరు.

ఆ విశ్వరూపుని అర్జునుడు ఇలా ప్రస్తుతించాడు.

**త్వమాదిదేవః పురుషః పురాణస్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్**

**వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనన్తరూప** – గీత 11.38

**వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాఙ్కః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ**

**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే** – గీత 11.39

**నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ**

**అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః** – గీత 11.40

ఓ అనంత రూప! నీవు ఆదిదేవుడవు. సనాతన పురుషుడవు. ఈ జగత్తునకు పరమాశ్రయుడవు. సర్వజ్ఞుడవు. సర్వవేద్యుడవు. పరంధాముడవు. ఈ జగత్తు అంతయును నీచే పరిపూర్ణమైయున్నది. నీవే వాయుదేవుడవు. యముడవు. అగ్నివి. వరుణుడవు. చంద్రుడవు. ప్రజాపతియైన బ్రహ్మవు. బ్రహ్మకును జనకుడవు. నీకు వేలకొలది నమస్కారములు. మఱల మఱల నమస్కారములు. అనంత సామర్థ్యము కలవాడా! నీకు ఎదురుగా ఉండియు, వెనుకనుండియును నమస్కరించుచున్నాను. ఓ సర్వాత్మా! నీకు అన్నివైపుల నుండియు నమస్కారములు. ఏలనన అనంత పరాక్రమశాలివై నీవు జగత్తంతటను వ్యాపించియున్నవాడవు. అన్ని రూపములు నీవియే.

## 279. బుద్ధః

- అన్ని ఉత్తమ గుణములు సమృద్ధిగా కలిగిన పరిపూర్ణుడు.

### ఓం బుద్ధాయ నమః

30వ శ్లోకము. 279వ నామము. బుద్ధః – **బుద్ధః స్పష్టాక్షరో మంత్రః చంద్రాంశుః భాస్కరద్యుతిః**

38వ శ్లోకము. 353వ నామము. బుద్ధః – **మహర్ధిః బుద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః**

బుధ్ – వృద్ధౌ – పొంగుట, సంపన్నమగుట, వృద్ధియగుట.

**పార్వణో జలధిర్యద్వత్ వృద్ధిమాన్ బుద్ధ ఉచ్యతే** – అన్నికాలములందు పొంగుతూ ఉండే సముద్రములాగా ఎప్పుడూ సమృద్ధిగా ఉండేవాడు. ధర్మము, జ్ఞానము, వైరాగ్యము మొదలైన ఉత్తమ గుణములు సమృద్ధిగా కలిగినవాడు.

**సుందరకాండము (34-28, 29, 30) – హనుమంతుడు సీతాదేవితో శ్రీరాముని ఇలా వర్ణించాడు.** శ్రీరామచంద్రుడు తేజస్సునందు సూర్యుడు. సకల లోకాధిపత్యమున కుబేరుడు. పరాక్రమ వైభవమున అతడు సర్వలోక విఖ్యాతుడైన శ్రీమహావిష్ణువు. సత్యముగా మధురముగా మాట్లాడుటలో సాక్షాత్తు బృహస్పతియే. అతడు రమణీయ రూప సౌభాగ్యములు గలవాడు. మహాతేజశ్శాలి. మధురాకృతిలో మన్మథుడు. దండింపదగిన వారియెడ అనువైన సమయమున కోపము చూపువాడు. దండించువాడు. సర్వలోక శ్రేష్ఠుడు. మహారథుడు. మహాత్ముడైన శ్రీరాముని బాహుచ్ఛాయను ఆశ్రయించి లోకము మనుగడను సాగించును.

**సుందరకాండము (37-14, 15, 16, 17, 18) – సీతాదేవి వచనములు.** ఓ కపీశ్వరా! నా స్వామి నన్ను త్వరలోనే చేరగలడు. ఇది నా పరమ విశ్వాసము. నా అంతరాత్మ పవిత్రమైనది. శ్రీరామునిలో ఉత్సాహము, పౌరుషము, బలము, కరుణ, కృతజ్ఞత, పరాక్రమము, శక్తి మొదలగు సకల సద్గుణములు కలవు. శ్రీరాముడు తానొక్కడే పదునాలుగు వేలమంది రాక్షసులను హతమార్చెను. అట్టి మహావీరునకు ఏ శత్రువు భయపడడు? ఎట్టి క్లిష్ట పరిస్థితులును ఆ మహాపురుషుని చలింపజేయజాలవు.

దేవేంద్రుని శక్తి శచీదేవికి తెలిసినట్లు ఆయన ప్రభావము నాకు తెలియును. సూర్యుడు తన తీవ్ర కిరణములతో నీటిని పూర్తిగా ఇంకింపజేసినట్లు, శూరుడైన శ్రీరాముడు తన బాణపరంపరలచే శత్రురాక్షస సమూహములను నుగ్గునుగ్గు గావింపగలడు.

**సుందరకాండము (37-6,67) – సీతాదేవి వచనములు.** శ్రీరాముడు అద్భుతమైన ధనుస్సు గలవాడు. మహాబలశాలి. పరాక్రమమున దేవేంద్రుని మించినవాడు. వాయువు తోడై మహాజ్వాలలతో మీదికెగియు అగ్నివలె, లక్ష్మణుడు తోడై తేజరిల్లుచుండెడి ఆ మహావీరుని జూచి సంగ్రామమున ఎదురుగా నిలబడగలవాడెవ్వడు? ఓ వానరోత్తమా! యుద్ధమున శత్రువులను మర్దించు శ్రీరాముడు లక్ష్మణ సహితుడై, బాణములనెడి కిరణములను విరజిమ్ముచు ప్రళయకాల సూర్యునివలె తేజరిల్లుచు, కదన రంగమున మదించిన దిగ్గజమువలె నిలిచియున్నపుడు ఆ వీరుని ఎదుర్కొనగల యోధుడెవ్వడు?

**శ్రీ తులసీదాస కృత శ్రీరామచంద్ర స్తుతి**

శ్రీరామచంద్ర కృపాళు భజ మన హరణ భవభయ దారుణం
నవకంజలోచన, కంజముఖ, కరకంజ, పదకంజారుణం --1--
కందర్ప అగణిత అమిత ఛబి నవ నీల నీరద సుందరం
పట పీత మానహు తడిత రుచి శుచి నౌమి జనకసుతావరం --2--
భజ దీన బంధు దినేశ దానవ దైత్యవంశ నికందనం
రఘునంద ఆనందకంద కోసల చంద దశరథ నందనం --3--
సిరముకుట కుండల తిలక చారు ఉదారు అంగ విభూషణం
ఆజానుభుజ శర-చాప-ధర సంగ్రామ జిత ఖర-దూషణం --4--
ఇతి వదతి తులసీదాస శంకర శేష-ముని-మనరంజనం
మమ హృదయకంజ నివాస కురు, కామాదిఖల-దల గంజనం --5--



గోస్వామి తులసీదాసు – 1940 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Tulsidas_composing_his_famous_Avadhi_Ramcharitmanas.jpg

**తాత్పర్యము:**

ఓ మనసా! వికసించిన కమలముల వంటి కన్నులు, ముఖము, చేతులు, పాదములు కల, అమితమైన కృప కలిగిన, ఈ జీవనములోని భయాలను పారద్రోలే శ్రీ రామచంద్రుని భజించుము.

కోటి మన్మథుల కన్నా అందమైన వాడు, క్రొత్తగా ఏర్పడిన నీలి మేఘమువలె సుందరుడు, ఎల్లప్పుడూ శుచియైన పీతాంబరములు (పచ్చని పట్టు వస్త్రములు) ధరించి అందముగా ఉండేవాడు, సీతాదేవి వరుడు అయిన రామునికి నమస్కారములు.

దీన బంధువు, సూర్యవంశమున జన్మించిన వాడు, రాక్షస వంశములను నిర్మూలనము చేసిన వాడు, రఘు కులమునకు ఆనందకారుడు, కోసల రాజ్యానికి చంద్రుని వంటి వాడు, దశరథుని పుత్రుడు అయిన శ్రీ రాముని భజించుము.

ఆ శ్రీరాముడు శిరసుపై కిరీటమును ధరించిన వాడు, కుండలములు ధరించిన వాడు, ఎన్నో ఆభరణాలతో శోభిల్లే శరీరము కలవాడు, మోకాళ్ళ వరకు ఉన్న చేతులకు ధనుస్సు, శరములు కలిగిన వాడు, యుద్ధములో ఖర దూషణ రాక్షసులను సంహరించిన వాడు.

"నా హృదయ కమలములో నివసించే ఓ రామచంద్రా! నాలోని కామాది దుష్ట గుణముల సమూహమును నాశనము చేసే ప్రభూ! " - అని శంకరుడు, ఆది శేషుడు, ఇతర మునుల మనసు రంజిల్ల చేసే తులసీ దాసు ఈ విధంగా నుతిస్తున్నాడు.

(http://prasad-akkiraju.blogspot.com శ్రీఅక్కిరాజు ప్రసాదు బ్లాగునుండి)

## 280. స్పష్టాక్షరః

- స్పష్టమైన వేదాక్షరములు కలవాడు. అనగా వేదమునందలి అక్షరముల ద్వారా స్పష్టమైనవాడు (శ్రీ భట్టులు)
- దివ్యమగు ప్రణవ శబ్దము ద్వారా తెలియవచ్చువాడు (శ్రీ శంకరులు).
- విశ్వమును కలిపి పట్టియుంచువాడు (శ్రీ సత్యదేవో వాసిష్ఠ)

### ఓం స్పష్టాక్షరాయ నమః

**స్పష్టీకృతాశ్చ వేదార్ణాః యస్మాత్ స్పష్టాక్షరో మతః.** వేదముల (అక్షరముల) ద్వారా తెలియవచ్చువాడు. కనుక స్పష్టాక్షరుడు.

ప్రణవము (ఓం) అను అక్షరము ద్వారా ప్రస్ఫుటమైనవాడు – ఈ వివరణలో శ్రీ చిన్మయానందగారు గీత (8-12,13)నుండి ఉదాహరించారు.

**సర్వ ద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ**
**మూర్ధ్న్యాధ్యాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణమ్**
**ఓమిత్యేకాక్షరమ్ బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిమ్**

సర్వేంద్రియములను నిగ్రహించి, మనస్సును హృదయమునందే స్థిరముగా నిలిపి, అట్లు వశమైన మనస్సు ద్వారా ప్రాణములను మూర్ధస్థానము (సహస్రారము)నందు స్థిరమొనర్చి, పరమాత్మ ధ్యానమునందే నిమగ్నుడై, అక్షర బ్రహ్మ స్వరూపమైన ఓంకారమును ఉచ్చరించుచు, ఆ ఓంకారమునకు అర్థస్వరూపుడును, నిర్గుణ బ్రహ్మను ఐన నన్ను చింతించుచు దేహత్యాగమొనర్చువాడు పరమగతిని (మోక్షమును) పొందును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు వైవిధ్యమైన వివరణ చెప్పారు –
స్పష్ – బంధనే – కలుపుట, కట్టియుంచుట.
అక్షర – నాశనము లేనివి, మరల మరల ఉద్భవించునవి.
నక్షత్రాది సమస్త మండలములను ప్రళయకాలము వరకు కలిపియుంచెడువాడు గనుక శ్రీమహావిష్ణువు స్పష్టాక్షరుడు.

## 281. మంత్రః (మన్త్రః)

- తన నామమును మననము చేయువారిని రక్షించువాడు.
- వేద స్వరూపుడు. మంత్రమూర్తి.

### ఓం మన్త్రాయ నమః

**తన్మన్త్రం త్రాయతే ఇతి మన్త్రః** – తనను స్మరించేవారిని రక్షించును గనుక మంత్రము.
**మననాత్ త్రాయతే ఇతి మన్త్రః** – మననము చేసినందువలన రక్షించును గనుక మంత్రము.

**దైవాధీనమ్ జగత్ సర్వమ్ మన్త్రాధీనమ్ తు దైవతమ్** – జగత్తంతా దైవమునకు అధీనమై యుండును. ఆ దైవము మంత్రమువలన ప్రసన్నమగును.

బ్రహ్మపురాణమునందు భగవానుడు ఇలా చెప్పెను –

**తృష్ణాతోయ సమాకీర్ణాత్ ఘోరాత్ సంసార సాగరాత్**
**అపారాత్ పారమాప్నోతి యో మామ్ స్మరతి నిత్య సః**
నిత్యమును నన్ను స్మరించువాడు కామ, మోహ భరితమైన ఘోర సంసారమును దాటుట తథ్యము.

శ్రీభట్టులు వరాహపురాణమునందలి వరాహ చరమశ్లోకమును ఉదాహరించారు –

**స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః ధాతు సామ్యే స్థితే స్మర్తా విశ్వరూపమ్ చ మమాऽజమ్**
**తతస్తమ్ మ్రియమాణమ్ తు కాష్ఠః పాషాణ సన్నిభమ్ అహమ్ స్మరామి మద్భక్తమ్ నయామి పరమాంగతిమ్**
మనస్సు సుస్థితముగాను, శరీరము దృఢముగాను, దేహధాతువులు సమముగాను ఉన్న సమయమున ఎవరైతే భక్తులు విశ్వరూపుడను, జన్మరహితుడను అయిన నన్ను స్మరింతురో అట్టివారి అంత్యకాలమున, వారి దేహము మొద్దువలె పడియున్నపుడు, వారిని నేను గుర్తుంచుకొని, అట్టి భక్తులను పరమపద మార్గమున నడిపింతును.

మూడు వేదములు మూర్తీభవించినస్వరూపము కలిగినందున పరమాత్ముడు 'మన్త్రము' అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు.

ధర్మచక్రము రచయిత – స్నానాదికముల వలన శరీరము పరిశుభ్రము అగునట్లే మంత్రములు మనస్సును పరిశుద్ధము చేయును. మంత్ర జపము, భగవద్ధ్యానము, శ్రీహరి కీర్తనము, శ్రీనివాసుని భజనము ఇందుకు మార్గములు.

శ్రీ తిరుమంగై ఆళ్వార్ – పెరియ తిరువైమొళి 1.1.9 – **నలమ్ తరుమ్ సొల్లై నాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్.**

డా. క్రోవి పార్థసారధి గారి 'శ్రీకైవల్య సారధి' నుండి – ఓంకారము ఉన్నవి వైదిక మంత్రములు. ఓంకారము లేనివి తాంత్రిక మంత్రాలు. 'స్వాహా' అనే పదము చివర కలిగినవి స్త్రీ మంత్రాలు. 'హుం ఫట్' అనే పదము చివర గలవి పురుష మంత్రాలు. 'నమః' అనే పదము చివర కలిగినవి (పురుష? / నపుంసక?) మంత్రాలు. పురుష దేవతలను ఉపాసించే వాటిని మంత్రాలని, స్త్రీ దేవతలను ఉపాసించే వాటిని 'విద్య' అనీ అంటారు.

నారాయణోపనిషత్తులోనుండి – **ఓమిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణాయే త్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి, ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం పదమ్, యోహ వై నారాయణస్యాష్టాక్షరమ్ పద మధ్యేతి, అనపబ్రువస్సర్వ మాయురేతి, విందతే ప్రాజాపత్యమ్, రాయస్పోషం గౌపత్యమ్, తతో – మృతత్వ మశ్నుతే తతోऽమృతత్వ మశ్నుత ఇతి, ఏతత్సామ వేద శిరో – ధీతే.**

ముందుగా 'ఓం' అని అనాలి. తరువాత 'నమో' అనాలి. ఆ తరువాత 'నారాయణాయ' అనాలి. ఇది అష్టాక్షరీ మహామంత్రము. ఈ మంత్రాన్ని శ్రద్ధాసక్తులతో, విశ్వాసముతో, ప్రీతితో జపం చేసేవాడు పూర్ణాయువు అవుతాడు. అతడు స్వర్గాధిపత్యము పొందుతాడు. ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు – అన్నీ పొందుతాడు. చివరకు అమృతత్వాన్ని పొందుతాడు. మృత్యుంజయుడౌతాడు.

తారసారోపనిషత్తు: **ఓం** – ఆత్మ స్వరూపము. **నమః** – ప్రకృతి స్వరూపము. **నారాయణాయ** – పరబ్రహ్మ స్వరూపము.

నృసింహ తాపిని ఉపనిషత్తులో నృసింహ మంత్రము, రామరహస్యోపనిషత్తులో రామమంత్రము, గోపాల తాపిని ఉపనిషత్తులో గోపాల మంత్రము చెప్పబడ్డాయి. అవన్నీ పరమేశ్వరుని ప్రతిరూపాలే. అందుచేతనే శ్రీమన్నారాయణుడు 'మన్త్రః' అనబడుచున్నాడు.

## **282.** చంద్రాంశుః

- చంద్రుని కిరణములవలె (వెన్నెలవలె) చల్లగానుండి, ఆహ్లాదము కలిగించి, సంసార తాపమును శమింపజేయువాడు.

ఓం చంద్రాంశవే నమః

**క్షమహారి మహాహ్లాద తేజస్కరత యాపి చ మంత్రాణామేవ చంద్రాంశు ఆహ్లాద ఫలదో మనుః -** భగవంతుడు వెన్నెలవలె చల్లనైనవాడు. తనను స్మరించు భక్తులకు ఆహ్లాదము కలిగించును. తాపమును శమింపజేయును. ఈ నామమును మహామంత్రముగా జపిస్తే వారికి మహదానందము కలుగుతుంది. ఓం చంద్రాంశవే నమః.

**యదాదిత్య గతం తేజో జగద్భాసయతేஉఖిలమ్**
**యచ్చన్ద్రమపి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్** – గీత 15.12
**గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః** – గీత 15.13
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సేయని ఎఱుంగుము. పృథ్వియందు ప్రవేశించి, నేను నా శక్తి ద్వారా సకల భూతములను ధరించి, పోషించుచున్నాను. రస స్వరూపుడనై – అనగా అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు, అనగా వనస్పతులన్నింటికి పుష్టిని చేకూర్చుచున్నాను.

## 283. భాస్కరద్యుతిః

- సూర్యునివంటి తేజస్సు గలవాడు. శత్రుదుర్నిరీక్ష్య పరాక్రముడు. సూర్యునికి కాంతిని ప్రసాదించువాడు.

ఓం భాస్కరద్యుతయే నమః

**పరప్రభావాభి భవ లక్షణ ద్యుతి మాంశ్చయః స భాస్కరద్యుతిః ప్రోక్తో నేత్ర వైమల్యదో మనుః -** శత్రువుల ప్రభావాన్ని అరికట్టే సూర్యునికాంతి వంటి కాంతి గలవాడు. ఈ నామమును మంత్రముగా జపిస్తే కన్నులకున్న రోగాలు తగ్గిపోతాయి. ఓం భాస్కరద్యుతయే నమః.

భగవంతుని చంద్రునివలె, సూర్యునివలె ప్రస్తావించిన సందర్భములు అనేకములు. ఆయన వెన్నెలవలె తాపమును హరించును. ఎండవలె శత్రువులను సంహరించును.

సుందరకాండము 35.8,9 – **రామః కమలపత్రాక్షః సర్వసత్త్వ మనోహరః** – ఓ జానకీ! శ్రీరాముడు కమల పత్రములవంటి కన్నులు గలవాడు. తన నిరుపమాన కాంతిచే సమస్త ప్రాణులకును ఆనందమును కూర్చువాడు. **తేజసాஉஉదిత్య సంకాశః** – అతడు తేజస్సున సూర్యునివంటివాడు.

సుందరకాండము 34.28 – **ఆదిత్య ఇవ తేజస్వీ లోకకాంత శ్శశీ యథా** – శ్రీరామచంద్రుడు తేజస్సునందు సూర్యుడు. లోకమునకు ఆహ్లాదము కూర్చుటలో చంద్రుడు.

సుందరకాండము 37.18 – **శర జాలాంశుమాన్ శూరః కపే రామ దివాకరః శత్రు రక్షోమయం తోయమ్ ఉపశోషం నయిష్యతి** – ఓ కపీశ్వరా! సూర్యుడు తన తీవ్రకిరణములచే నీటిని పూర్తిగా ఇంకింపజేసినట్లుగా, శూరుడైన శ్రీరాముడు తన బాణపరంపరలచే శత్రురాక్షస సమూహములను నుగ్గునుగ్గు గావింపగలడు.

గీత 15.12 – **యదాదిత్య గతం తేజో ..... యచ్చన్ద్రమపి....**

తిరుప్పావై మొదటి పాశురము (మార్గత్తింగళ్.....) – మార్గశిరమాస వ్రతమును ఆచరించుటకు గోదామాత (ఆండాళ్ళు తల్లి) గోపకాంతలను పిలిచిన విధము – ఇది మార్గశిర మాసము. వెన్నెల నిండిన దివ్యమైన రోజు. ఐశ్వర్యము, ఆరోగ్యము కలిగి, అందమైన ఆభరణములుగల ఓ చెలులారా! ఈ స్నాన వ్రతమును ఆచరించదలిస్తే రండి. యశోదయొక్క కిశోరసింహం మనందరికీ ఏ ఆపదా రాకుండా రక్షిస్తుంది. గోపకుమారుడు, అందమైన కనుదోయివాడు, నీలమేఘ శరీరుడు, సూర్యునివలె వెలుగు – చంద్రునివలె చల్లదనము ఏకకాలంలో ఈయగల తేజోవంతమైన ముఖమండలము గలవాడు – శ్రీమన్నారాయణుని అవతారమైనవాడు ఆ యశోదైయిళగం. అతడిని పొందగోరువారు ఈ వ్రతము చేయ రారండి (శ్రీ భమిడిపాటి రాధాకృష్ణమూర్తి 'తిరుప్పావై – తెలుగు వ్యాఖ్యానము' నుండి.)

ఇలా 'చంద్రాంశుః', 'భాస్కరద్యుతిః' అనే నామములు ప్రక్కప్రక్కనే చెప్పబడడాన్ని గురించి డా. వి.వి.రామానుజన్ గారు తమ సహస్రనామభాష్యంలో ఇలా చెప్పారు – చంద్రునివలె ఆహ్లాదము కలుగజేయుట, సూర్యునివలె మాడ్చివేయుట – రెండును భగవానుని విశిష్ట లక్షణములు. ఆయన భక్తులకు అమృతమూర్తి. దుష్టులకు ప్రచండభాను తీక్షణుడు. శ్రీనృసింహమూర్తి ప్రహ్లాద మానస రంజనుడు. హిరణ్యకశిపు భంజనుడు. అర్జునుడు దర్శించిన విశ్వరూపములో కేశవుని నామగుణ ప్రభావములను కీర్తిస్తూ జగత్తు హర్షాతిరేకముతో, అనురాగముతో పులకించుచున్నది. భయగ్రస్తులైన రాక్షసులు నలుదిక్కులకు పారిపోవుచుండిరి. సిద్ధగణములు ప్రణామములు చేయుచున్నవి.

ఇంకా – భగవంతుడు సూర్యుని తేజస్సునకు, అన్ని తేజస్సులకు ఆది కారణము. సూర్యుని తేజమును మనము తెలిసికొనవచ్చును. శ్రీమన్నారాయణుని తేజము ఊహింపరానిది.

**దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా**
**యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః** – గీత 11.12
ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాంతి పుంజములును ఆ విరాట్-రూప తేజస్సునకు సాటి రావు.

**కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్ దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్** – గీత 11.17
హే విష్ణో! కిరీటమును, గదను, చక్రమును ధరించి, అంతటను తేజఃపుంజములను విరజిమ్ముచున్న నిన్ను దర్శించుచున్నాను. ప్రజ్వలితాగ్నివలెను, జ్యోతిర్మయుడైన సూర్యునివలెను వెలుగొందుచున్న నీ అప్రమేయ రూపము దుర్నిరీక్ష్యమైయున్నది.

దేవీభాగతము – సప్తమ స్కంధము – పరమేశ్వరి వర్ణన –

**చతుర్దిక్షు చతుర్వేదమూర్తి మద్భిరభిష్టుతమ్**
**కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్**
**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః**
**నైవచోర్ధ్వం నతిర్యక్చ న మధ్యే పరిజగ్రభత్**
ఆ పరమేశ్వరి తేజము రూపుదాల్చిన నాలుగు వేదములచేత స్తుతింపబడుచున్నది. కోట్లకొలది సూర్యకాంతులతో వెలుగుచున్నది. కోట్ల చంద్రులవలె చల్లనైనది. ఆ రూపము కోట్ల మెరుపుతీగెలు ఒక్కసారిగా తళుక్కున మెరిసినట్లున్నది. ఆ రూపమునకు పైన, క్రింద, మధ్య, అడ్డము అనే తేడాలు లేవు. ఆద్యంతములు లేవు.



గరుడారూఢుడైన శ్రీ మహావిష్ణువు. అనేక చిత్రాలు, శిల్పాల సంకలనం.



## అమృతాంశూద్భవో భానుః శశబిందుః సురేశ్వరః |
## ఔషధం జగతః సేతుః సత్యధర్మపరాక్రమః || (31)

### 284. అమృతాంశూద్భవః

- అమృత కిరణ్మయుడగు చంద్రుని జననమునకు కారణము.
- జలములను వ్యాపింపజేసి జీవులను సృష్టించువాడు.

**ఓం అమృతాంశూద్భవాయ నమః**

**సర్వతాప హరస్యైవ మృత సంజీవనస్య చ అమృతాంశో హి తజ్జత్వా దమృతాంశూద్భవ స్మృతః**

అమృత – తాపహరములు, మృత్యునివారణములు, జీవదాయకములు.

అంశుః – కిరణములు (కలిగిన చంద్రుని)

ఉద్భవః – జన్మకు కారణము (సృష్టించినవాడు).

**అమృతాంశుః ఉద్భవతి అస్మాదితి అమృతాంశూద్భవః.** అమృతాంశుడనగా చంద్రుడు. క్షీరసాగర మథన సమయమున చంద్రుని ఉద్భవమునకు మూల కారణమైన శ్రీకూర్మమూర్తియే అమృతాంశూద్భవుడు. సంసార సాగరమునుండి, కర్మ భారముల నుండి, మాయామోహముల బంధమునుండి అందరను ఉద్ధరించువాడు. ఇందుకు శ్రీ చిన్మయగారు గీత 15.13 నుండి చెప్పిన ప్రమాణము – **పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః** – అమృతమయుడనైన చంద్రుడనై వనస్పతులను పోషించుచున్నాను.

**చంద్రమానునసోజాతః** – ఆ విరాట్పురుషుని మనస్సునుండి చంద్రుడు జన్మించెను (పురుషసూక్తము).
**నక్షత్రాణామహం శశీ** – నక్షత్రములలో చంద్రుడను (గీత).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు తక్కిన భాష్యకారులకంటె స్వతంత్రమైన భావమును వివరించారు. 'అమృత' అనగా పానీయము, జలము. 'అంశు' అనగా పంచుట, విభజించుట. ప్రాణాధారమైన జలములను అన్నియెడల పంచి ప్రాణుల మనుగడకు ఆధారమైనాడు గనుక భగవానుడు అమృతాంశూద్భవుడు. తల్లి గర్భమున శిశువు నీటిలో తేలుచుండును. నీరు లభించినపుడే విత్తనములనుండి మొలకలు బయటపడును. వృక్షములు పెరుగును. సస్యములు ఫలించును. వానిని ఆహారముగా స్వీకరించి అన్ని జీవులును ప్రాణములను నిలుపుకొనును. నీరే అమృతము. శ్రీమన్నారాయణుని ప్రసాదము.

### 285. భానుః

- ప్రకాశించువాడు. కిరణ్మయుడు. సూర్యుడు.

- సూర్యునకు కూడ వెలుగు ప్రసాదించువాడు.

### ఓం భానవే నమః

**భాతి ఇతి భానుః** – ప్రకాశించువాడు భానుడు.
**రవేస్తేజస్వర త్వాచ్చ భానురిత్యభిధీయతే** – తేజస్సు కలిగినందున సూర్యుని భానుడు అందురు.
**యస్యాదిత్యో భా ముపయుజ్య భాతి** – ఎవనివలన సూర్యుడు ప్రకాశించుచున్నాడో అతడు.

ముండకోపనిషత్తు 2.2.10 – **తమేవ భాంతమ్ అనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదమ్ విభాతి** – ఆయన స్వయముగా ప్రకాశించును. అంతటిని ప్రకాశింపజేయును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అన్ని శరీరములందు చైతన్యము, అగ్ని భగవంతుని ప్రసాదము. వానివల్లనే ప్రాణము నిలబడును.

ధర్మచక్రము రచయిత – సూర్యుని కాంతివలన బయటి వస్తువులు మాత్రమే కనిపించును. ఆ పరమేశ్వరుని కాంతివలన ఆత్మజ్ఞానము కలుగును.

## 286. శశబిన్దుః / శశవిన్దుః

- దుర్మార్గులను విడనాడువాడు, దుర్మార్గులను శిక్షించువాడు.
- చంద్రుడు (కుందేలువంటి మచ్చ గలవాడు).
- నక్షత్రముల, గ్రహముల గతులను నియంత్రించువాడు.

### ఓం శశబిన్దవే నమః

### ఓం శశవిన్దవే నమః

**శశప్లుత గతిః ప్రోక్తో బిన్దుస్తస్య నివర్తకః కౌటిల్య గతి విధ్వంసీ శశబిన్దు రుదాహృతః.** శ్రీ భట్టుల వ్యాఖ్యానము ప్రకారము – శశ – ప్లుతగతౌ – వక్రమార్గమున నడచువారు. బిన్దు – బిది – దూరముగానుండుట. **శశానాం కుటిల గతీనాం బిందుః అపలపితా ఇతి శశబిందుః** – వక్రమార్గమున సంచరించు దుష్టులను, అన్యాయవర్తనులను నశింపజేయువాడు శశబిన్దువు. కంసుని పాలిటి వజ్రము. నరకుని పాలిటి యముడు. హిరణ్యకశిపుని చీల్చిన వజ్రనఖుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'శశ' అనగా కుందేలు. 'బిందు' అనగా మచ్చ. చంద్రునిపైని మచ్చ కుందేలువలె నుండును. శశబిందువు అనగా చంద్రుడు. భగవంతుని చంద్రునిగా పెక్కు సందర్భములలో చెప్పడమైనది. **'చంద్రాంశుః', 'అమృతాంశూద్భవో భానుః', 'నక్షత్రాణామహం శశీ', 'సోమో భూత్వా రసాత్మకః'**.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు ఈ నామమును **'శశవిన్దుః'** అని గ్రహించారు. శశ – ప్లుతగతౌ – అటూ ఇటూ తిరిగేవి (గ్రహములు). విందః – వేదనాశీలః – తెలిసినవాడు, అదుపు చేయువాడు. సకల గ్రహ నక్షత్రముల గతులను అదుపు చేయువాడు గనుక శ్రీమహావిష్ణువు శశవిందువు.

## 287. సురేశ్వరః

- దేవతలకు ప్రభువు. సన్మార్గమున నడచువారికి అండ.

### ఓం సురేశ్వరాయ నమః

**సురాణాం ఋజుగతీనాం దేవానాం ఈశ్వరః నిర్వాకః సురేశ్వరః. ధర్తా ఋజుగతీనాం యః సః సురేశ్వర ఈరితః -** సు (శోభన) – రా (దానః) – మంచి పనులు చేయువారు, సన్మార్గమున నడచువారు సురులు. వారికి ప్రభువు సురేశ్వరుడు. దుష్టులను శిక్షించి, శిష్టులను బ్రోచువాడు. కూర్మావతారుడై మందర పర్వతమును నిలిపినవాడు. మోహినియై అమృతమును పంచి, దేవతలను కాచిన ప్రభువు. శ్రీకృష్ణుడై గోవర్ధన గిరినెత్తి దేవతల గర్వమడచినవాడు.

సురేశ్వరుడైన శ్రీమహావిష్ణువును ధ్యానించి, భక్తులు దైవత్వమును సాధింపనగును. (ధర్మచక్రము రచయిత).

## 288. ఔషధమ్

- **రోగార్తో ముచ్యతే రోగాత్ –** భవరోగమును నయము చేయు దివ్యమగు మందు.

### ఓం ఔషధాయ నమః

**భవ తీవ్ర విషం హర్తా ఔషధం యః స ఉచ్యతే –** జనన మరణ చక్రబంధమున పడి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులచే పీడింపబడు సంసార వ్యాధిగ్రస్తులకు ఆ దుఃఖమునుండి విముక్తిని ప్రసాదించు దివ్యౌషధము ఆ దేవదేవుడే. **దేవా దేవర్షయశ్చైవ యమ్ విదుః దుఃఖ భేషజమ్ –** అనగా, దేవతలకును, దేవర్షులకును దుఃఖమునుండి విముక్తిని కలిగించు దివ్యౌషధము శ్రీమన్నారాయణుడే (మహాభారతము. శాంతి పర్వము 79.22)

శ్రీ భట్టులు చెప్పిన మరొక ప్రమాణము – **ఏకాగ్రతా మూల్య బలేన లభ్యమ్ భవౌషధమ్ త్వమ్ భగవాన్ కిలైకః –** భగవంతుడా! ఏకాగ్రత అనే ఖర్చు ద్వారా లభించు దివ్యౌషధమవు. సంసార వ్యాధికి విరుగుడు నీవే.

శ్రీ వి.వి. రామానుజన్ గారు 3వ తిరువంతాది (3) దివ్య ప్రబంధమునుండి ఉదాహరించారు – **తేన్ గోదవణ్ణన్ వరు నరగమ్ తిరుక్కు మరున్దు.**

ధర్మచక్రము రచయిత – ప్రకృతి భగవంతుని అంశయే. మనకు సకలములైన ఆహారములు, ఔషధములు, జీవనాధారములు ప్రకృతినుండియే లభించును. పరిశుభ్రమైన గాలి, నీరు, భోజనము స్వీకరించిన వారికి ఆరోగ్యము చక్కగా నుండును.

## 289. జగతః సేతుః

- మంచి, చెడుల మధ్య అడ్డుగా నిలుచువాడు.
- సంసార సాగరమును దాటుటకు ఉపయోగపడు వంతెన.
- చలించువానినన్నిటిని అదుపులోనుంచువాడు.

### ఓం జగతః సేతవే నమః

**నిరోధా జ్జగతస్సేతుః సదసద్వర సఙ్గతే –** మంచి చెడుల మధ్య సేతువుగా నిలిచి భగవంతుడు ధర్మక్రమమును పరిరక్షించును. చేసిన కర్మకు తగిన ఫలము లభించును. చేయని దానికి ఏమియును చిక్కదు. మంచి పనులకు మంచి, చెడు పనులకు చెడు ఫలితములు లభించి తీరును. జన్మలు గడచినా కర్మబంధములు జీవుని వెంటాడుతూనే ఉండును. ఇలా పుణ్య పాపములు, న్యాయాన్యాయములు కలిసిపోకుండా నిరోధించేందుకు ఒక సేతువులా ఉండి దేని ఫలితాన్ని దానికి ఇచ్చేవాడు జగతస్సేతువు.

బృహదారణ్యకము 6.4.22 – **ఏషః సేతుః విధరణ ఏషామ్ లోకానామ్ అసంభేదాయ** – కలగాపులగం కాకుండా నిలుపు సేతువు (అడ్డుకట్ట).

శ్రీ శంకరులు మరొక వ్యాఖ్య కూడా చెప్పారు – సంసార సాగరమును దాటుటకు ఉపయోగపడు వారధి.

తెలుగు సినిమా పాట – **రామయ తండ్రీ! ఓ రామయ తండ్రీ! అందరినీ దరిజేర్చు మారాజువే! అద్దరినీ చేర్చమనీ అడుగుతుండావే!.** క్రైస్తవ భక్తి గీతము – **నడిపించు నా నావా! నడి సంద్రమున దేవా!**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారి వ్యాఖ్య – జగత్ – ('గతి' నుండి) – చలించునది, భ్రమించునది. సేతు – కలిపి యుంచునది. ప్రపంచములో అన్నింటినీ క్రమముగా పట్టియుంచువాడు శ్రీహరి. సూర్య చంద్రులు, నక్షత్రములు, గ్రహములు, తారామండలములు, నదీనదములు, తరంగములు, శరీరములోని భాగములు, పశుపక్ష్యాదులు – సమస్తమును చలన శీలములైనను, ఒక క్రమములో చలించును. ఇలా అన్నింటిని జాగ్రత్తగా కలిపియుంచువాడు జగత్సేతువు.

ధర్మచక్రము రచయిత – నదులు గట్లలో ఒదిగియుండును. సముద్రము చెలియలికట్టను దాటిరాదు. అలాగే జీవాత్మలు ఇంద్రియ సుఖములకు, విషయ వాంఛలకు లొంగి శరీరమున బందీలై యుండును. ఈ బంధములను తెంచుకున్నవారే సంసార సాగరమును తరింపగలరు. శ్రీమహావిష్ణు ధ్యానమే అందుకు మార్గము.

## 290. సత్యధర్మ పరాక్రమః

- సదా నిజమైన ధర్మగుణము, పరాక్రమము కలిగినవాడు.

### ఓం సత్యధర్మ పరాక్రమాయ నమః

ఇక్కడ 'ధర్మము' అనగా భగవంతుని సకల కళ్యాణ గుణ వైభవములు. పరాక్రమము అనగా శక్తి సామర్థ్యములు, కార్య సాధక లక్షణములు. ఇట్టి లక్షణములు ఎన్నడూ కొరవడనివాడు గనుక శ్రీనివాసుడు సత్యధర్మపరాక్రముడు. వాల్మీకి రామాయణమున శ్రీరాముని సత్యధర్మపరాక్రమునిగా వర్ణించెను. ఆయన పరాక్రమము ఎన్నడూ వన్నె తరుగదు. అన్ని వేళలా లోక కళ్యాణమునకు వినియోగము.

ధర్మచక్రము రచయిత – సత్యము, ధర్మము, ధైర్యము, కార్యదీక్ష, లోకహితములతో కూడిన జీవనము సాగింపవలెనని ఈ నామము బోధించును. హనుమంతునివలె, భీష్మునివలె, దృఢ, ధర్మ మార్గము ననుసరించువారు భగవంతుని కటాక్షమును పొందుట తథ్యము.

మొల్ల రామాయణము నుండి (http://musicandmantra.blogspot.com శ్రీ సాకేత్ రామ్ కూర్పు నుండి కాపీ చేయడమైనది)




**అవతారిక**

సల్లలిత ప్రతాప గుణ సాగరుఁడై విలసిల్లి, ధాత్రిపై
బల్లిదుఁడైన రామ నరపాలకునిన్ స్తుతి సేయు జిహ్వకున్
జిల్లర రాజలోకము జేకొని మెచ్చఁగ నిచ్చు పుట్టునే?
యల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాస సేయునే ?

**గుహుని ప్రపత్తి**

సుడిగొని రాము పాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంత యయ్యె నఁట, పన్నుగ నీతని పాద రేణువి
య్యెడ వడి నోడసోఁక నిది యేమగునో" యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రామపద కంజ యుగమ్ము భయమ్ము పెంపునన్.

**హనుమంతుని సాగర లంఘనము**

మొగము బిగించి, పాదములు మొత్తముగా వదినూఁది త్రొక్కి, నీ
తుగ మొగ మెత్తి, భీకర కఠోర రవంబున నార్చి, బాహు ల
త్యగణిత లీల నూఁచి, వలయంబుగ వాలముఁద్రిప్పి, ప్రేఁగునన్
నగము సగమ్ము గ్రుంగఁ, గపి నాథుఁడు నింగికి దాఁటె జివ్వునన్.

**హనుమంతుడు శ్రీరాముని శోభన గుణములను వర్ణించుట**

నీల మేఘు చ్ఛాయ బోలు దేహమువాఁడు - ధవ ళాబ్జ పత్ర నేత్రములవాఁడు
కంబు సన్నిభ మైన కంఠంబు గలఁవాఁడు - చక్కని పీన వక్షంబువాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహులవాఁడు - ఘనమైన దుందుభి స్వనమువాఁడు
పద్మ రేఖలు గల్గు పద యుగంబులవాఁడు - బాగైన యట్టి గుల్ఫములవాఁడు
కపట మెఱుఁగని సత్య వాక్యములవాఁడు
రమణి! రాముండు శుభ లక్షణములవాఁడు
ఇన్ని గుణముల రూపింప నెసఁగువాఁడు
వరుస సౌమిత్రి బంగారు వన్నె వాఁడు



వనవాస సమయంలో శ్రీ సీతా రామ లక్ష్మణులు. 1820 కాలపు చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Unknown_Indian_-_Rama,_Lakshmana,_and_Sita_Cooking_and_Eating_in_the_Wilderness_-_Google_Art_Project.jpg

## తిరుప్పావై – 22వ పాశురము

ఈ విశాల భూమండలమును పాలించే రాజులందరూ భయంతో నీముందు గుంపులు గుంపులుగా శరణాగతులైనట్లే మేముకూడా అహంకారమును వీడి నీ వాకిట చేరియున్నాము. చిరుగంటలా, అరవిరిసిన తామరపూవులాగా ఉన్న నీ కంటిచూపును మాపై కటాక్షించు స్వామీ!

సూర్యచంద్రులిరువురూ ఒకేసారి ఆకాశంలో ఉదయించినటులుగా నుండే నీ దివ్యనేత్రాలతో మావైపు అనుగ్రహంతో చూడు. ప్రారబ్దకర్మ కూడ భస్మమై మేము అనుభవింపవలసిన శాపంవంటి కర్మలు దానితో పటాపంచలైపోతాయి.

శ్రీమహావిష్ణువునకు సూర్యచంద్రులు ఇద్దరూ రెండు నేత్రములు. మహావిష్ణువు విశ్వరూపమును దర్శించుటకు ముందుగా అహంకారమును వీడవలయును. ఆపైననే ఆత్మనివేదనము సాధ్యమగును. ఈ స్థితినుండి దాస్యభావము దశకు చేరిన జీవునికి ఆ విశ్వరూపము దర్శించు మార్గము సుగమమగును. 'నీవే తప్ప నితఃపరంబెరుగ' అన్న ఉన్నతదిశ భగవద్దర్శనమునకు అనువగు మార్గము. (డా. వేదవ్యాస వ్యాఖ్యనుండి)



## భూతభవ్యభవన్నాథః పవనః పావనోऽనలః |
## కామహా కామకృత్ కాంతః కామః కామప్రదః ప్రభుః || (32)

### 291. భూతభవ్యభవన్నాథః

- (గడచినది. జరుగుచున్నది, రాబోవునది అను) మూడు కాలములకు అధిపతి.
- మూడు కాలములందు అధిపతి.

ఓం భూతభవ్యభవన్నాథాయ నమః

మొదటి శ్లోకములో నాలుగవ నామము 'భూత భవ్య భవత్ ప్రభుః' కూడా ఇంచుమించు ఇదే అర్థమును సూచించును. కాని ఈ రెండు నామముల వ్యాఖ్యలో శ్రీ శంకరులు చూపిన వైవిధ్యము ఇలా ఉన్నది –

**భూతభవ్యభవత్ప్రభుః** – త్రికాలములకు అధిపతి. కాలాతీతుడు.
**భూతభవ్యభవన్నాథః** – త్రికాలములందు సకల చరాచరములకు, జీవులకు అధిపతి. కాలముతో నిమిత్తము లేని అధికారి.

**ఐశ్వర్యం వాథస్వామ్యం వా త్రికాలేష్వపి యస్య సః భూతభవ్యభవన్నాథః ఇత్యుక్త స్సద్భిరాదరాత్.** త్రికాలములయందు కూడా సకలము నియమించే సామర్థ్యము కలవాడు. అన్నింటికీ స్వామి.

**భూతానాం భవ్యానాం భవతానాం చ ప్రాణినాం నాథః** – భూతభవిష్యద్వర్తమాన కాలములన్నింటిలోనూ జీవులకు ప్రభువు. త్రికాలములందు ప్రాణులచే యాచింపబడువాడు. ఆ ప్రాణులను శాసించువాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **భూతభవ్యభవతాం నాథః భూతభవ్యభవన్నాథః** – ఇట్టి యైశ్వర్యమును త్రికాలంబునను కలిగియుండువాడు.
**భూత భవ్యభవన్నాథః కేశవః కేశి సూదనః** – భారతము సభా పర్వము 38-23. కేశిని నిరసించిన కేశవుండు భూత భవిష్యద్వర్తమాన కాలంబులందు గల వస్తువులకు స్వామి.

### 292. పవనః

- వాయువు, ప్రాణము.
- పవతః ఇతి పవనః – సంచరించువాడు. సర్వదా వ్యాపించినవాడు.

ఓం పవనాయ నమః

32వ శ్లోకము – **భూతభవ్య భవన్నాథః పవనః పావనోऽనలః**
87వ శ్లోకము – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోऽనిలః**

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము 32వ శ్లోకంలోని 292వ నామము '**పవనః**' మరియు 293వ నామము '**పావనః**'. ఇక 87వ శ్లోకములోని 817వ నామమును '**పవనః**'గాను, '**పావనః**' గాను కూడా పరిగణించినట్లు కనిపిస్తున్నది.

**సదా స్వయం తు సర్వత్ర ప్రవాహ ఇవ నిత్యశః పవనః ప్రవహతి యః కథ్యతే వేగదోమనుః -** పవి – అనగా సంచరించుట అనే ధాతువు ఆధారంగా శ్రీ భట్టుల వ్యాఖ్యను వివరింపవచ్చును. భగవంతునకు ఎక్కడా, ఎప్పుడూ అడ్డు లేదు. కనుక ఆయన పవనుడు. ఈ నామము వేగమునిచ్చును. ఓం పవనాయ నమః.

**పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్**
**ఝుషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ** – గీత 10.31
సంచరించువాటిలో (పవిత్రము చేయువానిలో) వాయుదేవుడను నేను. శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను. జలచరములలో మొసలిని. నదులలో గంగానదిని నేను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు ఈ ('**పవనః**') నామమునకు 'పవిత్రమైనవాడు' అనీ, తరువాతి ('**పావనః**') నామమునకు 'పవిత్రము చేయువాడు' అనీ అర్థము చెప్పారు.

## 293. పావనః

- **పావయతీతి పావనః** – అంతటినీ పవిత్రము చేయువాడు.

### ఓం పావనాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

32వశ్లోకము – **భూతభవ్య భవన్నాథః పవనః పావనోఽనలః**

87వ శ్లోకము – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః**

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము 32వ శ్లోకంలోని 292వ నామము '**పవనః**' మరియు 293వ నామము '**పావనః**'. ఇక 87వ శ్లోకములోని 817వ నామమును '**పవనః**'గాను, '**పావనః**' గాను కూడా పరిగణించినట్లు కనిపిస్తున్నది.



అహల్యా శాప విమోచనము. రాజా రవివర్మ చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Rama_releasing_Ahalya_from_curse.jpg

**యస్స్వ సంబన్ధి గంగాదీన్ పావయన్ లోకపావనాన్ స పావన ఇతి ఖ్యాతః పావనత్వప్రదో మనుః -** తనయొక్క సంబంధము చేతనే గంగ మొదలైన నదులను పవిత్రం చేస్తున్నాడు గనుక పావనుడు. ఈ నామము పవిత్రతనిచ్చును. ఓం పావనాయ నమః.

**పావనః సర్వ లోకానామ్ త్వమేవ రఘునందన** – రఘునందనా! సర్వ లోకములను పావనము చేయువాడవు నీవే (రామాయణము. ఉత్తర కాండము. 32.9) అని అగస్త్యమహర్షి అన్నాడు. శ్రీరాముని చరణములు సోకినంతనే అహల్యకు శాపవిమోచనము అయినది. రామనామ సంకీర్తనము పాపహరము. మోక్షప్రదము.

శ్రీ విష్ణు సహస్ర నామములో **'పవిత్రాణామ్ పవిత్రమ్ మంగళానామ్ చ మంగళమ్'** అని చెప్పబడినది.

శ్రీ వి.వి. రామానుజన్ గారు తిరువైమోళి (2.8.5) నుండి చెప్పిన ఉదాహరణ – **దేవాది దేవ పెరుమాన్ ఎన్ తీర్థనే.** ఇక్కడ 'తీర్థన్' అనగా 'పవిత్రము' అని అర్థము. ఇంకా ఇరణ్డామ్ తిరువందాడి (14)లో- **కరమ్ నాన్గుదైయాన్ పేరోడి తీర్థకరార్ ఆమిన్.** ఆ చతుర్భుజుని నామము స్మరించి మనము పావనమగుదుము – అని చెప్పబడినది.

శ్రీ మహావిష్ణువు శక్తివల్లనే అనేక విషయములు, పాపములు తొలగును. ఎండ్రకాయలు కుట్టుట వలన బాధపడేవాని చెవిలో ఎర్ర మిరపకాయల రసం వేసినట్లయితే విషం తగ్గుతుంది. ఇటువంటి ఎన్నో ఉదాహరణలను శ్రీసత్యదేవో వాసిష్ఠ పేర్కొన్నారు.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – మనసునకును, సకల ప్రాణికోటులకును చైతన్యమునొసంగువాడు. వాయువును ప్రవర్తింపజేయువాడు. పావనుడు.

## 294. అనలః

- తృప్తిలేని (అనంతమైన దయ గలిగిన) వాడు. తన భక్తులకు తాను చేసినదానితో తృప్తి చెందనివాడు.
- తన భక్తుల పట్ల జరిగిన దుష్కార్యమును సహింపజాలనివాడు.
- ప్రాణశక్తిని తనదానిగా స్వీకరించి జీవాత్మగా వ్యవహరించువాడు.
- వాసనవంటి గుణములకు అతీతుడు.
- అంతు లేని యశో వైభవ విభూతులు గలవాడు. (అలమ్ – పర్యాప్తి – చివర)
- అగ్నిస్వరూపుడు. పాపవినాశకుడు.
- అంతము లేనివాడు. (అలమ్ – పర్యాప్తి – చివర)
- ఎదురు లేనివాడు (అలమ్ – నిరోధము)
- భగవంతుని కొరకు తపించే భక్తులను పునరుజ్జీవింప జేయువాడు. (అన్- ప్రాణనే).

### ఓం అనలాయ నమః

ఈ నామము రెండుమార్లు వచ్చుచున్నది.

32వ శ్లోకము. 294వ నామము. అనలః – **భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః**

76వ శ్లోకము. 716వ నామము. అనలః – **భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః**

ఈ నామమునకు శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్య (అన్-అలః)– **అపర్యాప్తో హి భక్తేభ్యోఽప్యుపకృత్యపునః పునః అనుగ్రహం యః కరోతి సోఽనలః పరికీర్తితః -** భక్తులకు మరల మరల ఎన్నో విధములుగా ఉపకరించి కూడ సంతుష్టుడు కానివాడు. అపరిమిత కరుణాంతరంగుడు. భక్తవరదుడు. 'అలమ్' అనగా సంతుష్టి చెందుట. 'అనలము' అనగా తృప్తి లేకుండుట. **న అలః అనలః.**

శ్రీ వి.వి. రామానుజన్ గారు చెప్పిన వివరణ – పెరియ తిరువంతాడి (53). **ఉన్ అడియార్ క్కు ఎన్ సేయవాన్ ఎన్ టే ఇరుత్తినీ –** నీ భక్తుల కోసం ఇంకా ఏమేమి చేస్తావో అనే ఆలోచిస్తూ ఉంటాను. ద్రౌపదీ మానసంరక్షణ చేసిన శ్రీకృష్ణ పరమాత్మునికి ఆమె ఆక్రందన మరచిపోవుట సాధ్యము కాలేదు. ఇంకా ఆమెకు ఋణపడి యున్నట్లుగానే ఆయన భావించెను. **ఋణమ్ ప్రవృత్తమ్ ఇదమ్ మే హృద్యాత్ నాపసర్పతి.** భక్తుల కొరకు ఆయన చేసే పనులకు అంతులేదు. కంచిలో తిరుక్కచ్చినంబికి వర్షములో గొడుగు పట్టినాడు. అనంతాళువారికి మట్టి మోసినాడు. మనము ఎన్ని అపరాధములు చేసినను మన్నించు, కొండలంత వరములు కూపెడు కోనేటిరాయడు ఆయన.

'అనలము' అనగా అగ్ని. అగ్నికి దాహము చల్లారదు. ఆహుతి చేసిన కొలది ప్రజ్వలించి మరింతగా కాల్చివేయును. అదే విధముగా భగవంతుడు శరణాగతులైనవారి పాపములను భస్మీపటలము చేయును. మనము ఎన్ని పాపములు చేసినా గాని ఆయన పాపనాశనత్వము శమించదు (వేదాంత దేశికుల దయాశతకము – 29)

ఈ నామమునకు శ్రీ శంకరులు చెప్పిన వ్యాఖ్య (అన-లః) – **అన** – ప్రాణము, **లా** – ఆదానే దానేచ – స్వీకరించుట. **అనాన్ ప్రాణాన్ ఆత్మత్వేన లాతి ఇతి అనలః** – ప్రాణశక్తిని తనదానిగా స్వీకరించి జీవాత్మ స్వరూపునిగా వ్యవహరించువాడు అనలుడు (ఒక భావము)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు ఇదే (ప్రాణములను స్వీకరించుట అనే) అర్థాన్ని కొంత భిన్నంగా వివరించారు – **అనాన్** – ప్రాణులను, **లః** – గ్రహించువాడు.చివరకు భగవంతుడు అందరి ప్రాణాలనూ తనలో విలీనం చేసుకొంటాడు గనుక ఈశ్వరుడు అనలుడు.

శరీరములో జఠరాగ్ని ఆహారమును అరిగింపజేసి, శక్తినొసగి, ప్రాణములు నిలబెట్టుచున్నది. అదియును భగవత్స్వరూపమే.

మరిన్ని భావములు 716వ నామము వివరణలో చెప్పబడినవి.

## 295. కామహా

- కోరికలను నాశనము చేయువాడు.

### ఓం కామఘ్నే నమః

తన భక్తుల మనసులలోని విషయ వాంఛలను, ఐహిక కామములను నశింపజేయువాడు గనుక శ్రీనివాసుడు కామఘ్నుడు.

కోరికలను ఎందుకు నాశనము చేయాలి? కోరిక ఉన్నపుడు రెండు పరిణామములు సాధ్యము – కోరిక తీరినట్లయితే ఇంకా కావాలనిపిస్తుంది. కోరిక తీరనట్లయితే కోపము అధికమవుతుంది (శ్రీ చిన్మయానంద). అందుకే కోరికలున్నచోట శాంతము ఉండదు. శాంతము లేకున్న సౌఖ్యము లేదు (శ్రీ త్యాగరాజ స్వామి). హరి పాదాంబుజ ధ్యానమే సకల సౌఖ్యములకు మార్గము. మహా భాగ్యవంతునకు చిల్లర సొమ్ముపై మనసు లేనట్లుగా, మహాపర్వతమునెక్కిన వానికి చిన్ని గుట్టలనెక్కుటకు ఆసక్తి లేనట్లుగా - **అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పాన విశేషమత్త చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు?** – అని ప్రహ్లాదుడు అన్నాడు (పోతన భాగవతము). అందుకే ఆ దేవదేవుడు కామఘ్నుడు. **ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్** – అని సెలవిచ్చెను (గీత 2.55)

**పుంసాం స్వదర్శినాం యోऽసౌ స్పృహాంచ విషయాన్తరే హతవాన్ కామహా ప్రోక్తః సర్వాశాపూరకో మనుః -** తనను దర్శించినవారికి సాంసారిక భోగమును మాన్పించేవాడు కామఘ్నుడు. ఈ నామము సకలములైన కోరికలను నెరవేర్చును. ఓం కామఘ్నాయ నమః.

## 296. కామకృత్

- కోరదగినవానిని సృష్టించువాడు. కోరికలను తీర్చువాడు

### ఓం కామకృతే నమః

భోగములు గాని, మోక్షము కాని – అన్ని కోర్కెలను తీర్చువాడే 'కామకృత్'. అన్ని కామితార్థములను ప్రసాదించువాడు శ్రీ వేంకటేశుడు.

(తిరుమల తిరుపతిలో స్వయంభువైన ప్రధాన మూర్తిని 'ధృవబేరం' అంటారు. ధృవబేరానికి ప్రక్కన చిన్న భోగవేంకటేశ్వరుని ప్రతిమ ఉన్నది. స్వయంభువైన శ్రీనివాసుని ఐహిక కామములు కలవారు కొలువరాదని నమ్మకము. కనుక తిరుపతిలో అర్చనాది సర్వ పూజలు శ్రీ భోగవేంకటేశ్వరునికే చేయబడుతాయి.)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **కామాన్ కరోతి పూరయతి ఇతి కామకృత్** – కోరిన వరములిచ్చే దేవుడు. ఎవరైనా ధనము అవుసరమైనపుడు తనకంటే ధనికుని అర్థిస్తారు. అందరి కోరికలను తీర్చగలవాడు సర్వైశ్వర్య సకల గుణ సంపన్నుడైన శ్రీలక్ష్మీనారాయణుడే.

కామకృత్ – అనగా కోరికలు కలిగించువాడు – అని కూడ అర్థము. ధర్మయుతమైన, శాశ్వతానందప్రదమైన, సకల శుభకరమగు కోరికలు శ్రీధరుని పదసేవకులకే కలుగును.

**కామహా** – మోక్షమునకు ఆటంకములగు కోరికలను నాశనము చేయువాడు.

**కామకృత్** – ధర్మబద్ధమగు కోరికలను కలుగజేయువాడు.

ఈ నామ వివరణ సందర్భములో ధర్మచక్రము రచయిత వివరించిన దివ్య సాహితీ రత్నములు –

**వేణ్డత్తక్కదు అఱివోయ్ నీ, వేణ్డ ముళుదుమ్ తరువోయ్ నీ**

**వేణ్డుమ్ పరిశు ఒన్ఱు ఉండు ఎనిల్ అదువుమ్ ఉందన్ విఱుప్పన్రే** – మాణిక్యవాచకార్.

**కులమ్ తరుమ్ సెల్వమ్ తందిడుమ్, అడియార్ పద్దుమ్ తూయర్ ఆయిన**

**ఎల్లామ్ నిలమ్ తరమ్ శెయ్యుమ్ నీల్ విశుంబుమ్ అరుళుమ్**

**అరుళోడు పెరునిలమ్ అళిక్కుమ్, నలమ్ తరుమ్ సొల్లై**

**నాన్ కణ్డుమ్ కొండేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్** – తిరుమంగైయాళ్వార్

కోరుకొన్నవారికి కోరినంత ప్రసాదించే కొండలరాయుడు. నామమును స్మరించినంతనే మోక్షమును ప్రసాదించు సీతారాముడు. కామకృత్.

## 297. కాంతః (కాన్తః)

- మనోహరుడు. సమ్మోహనరూపుడు. ఆత్మబంధుడు.
- పరార్థమున (మహా ప్రళయమున) సృష్టికర్తయైన బ్రహ్మ కూడ అంతమగునట్లు చేయువాడు.
- అన్నియెడలా ఉండి ప్రకాశించువాడు.

### ఓం కాన్తాయ నమః

ఈ నామము మరల 660వ నామముగా స్తుతింపబడును.

32వ శ్లోకము. 297వ శ్లోకము. కాన్తః – **కామహా కామకృత్ కాంతః కామః కామప్రదః ప్రభుః**

70వ శ్లోకము. 660వ నామము. కాన్తః **– కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః**

'కాన్త' అనగా ఆకర్షణ. 'అయస్కాంతము' అనే పదము ఇందునుండే వచ్చినది. శ్రీదేవుడు సౌందర్యాది గుణములతోను, శీలము, ఔదార్యముతోను అందరిని ఆకర్షించును. ఆయన నీలమేఘశ్యాముడు. సుగుణాభిరాముడు. పుంసాం మోహనరూపుడు. ఆర్తత్రాణ పరాయణుడు. అహల్య పాలి కామధేనువు. సీతాదేవి పాలి చింతామణి. దాసుల పాలి ఇహపరదైవము. సుగ్రీవునకు పరమ బంధువు. ఆయనే కౌశికుని పాలిటి కల్పవృక్షము. కామిత ఫలములిచ్చు రఘువీరుడు. సరి హనుమంతు పాలి సామ్రాజ్యము.

విభీషణునకు నిధానము. జనకుని పాలి ఘనపారిజాతము. శబరికి తత్వపు రహస్యము. అలరి గుహుని పాలి ఆదిమూలము. కలడన్నవారిపాలి కన్నులెదుటి మూర్తి. శ్రీ వేంకటాద్రి విభుడు. అని అన్నమయ్య కీర్తించెను.

మరి కొన్ని భావములు 660వ నామ వివరణలో చెప్పబడినవి.

## 298. కామః

- ప్రేమ స్వరూపుడు. కోరుకొనదగినవాడు. మన్మధుడు.
- ధర్మార్థకామమోక్షములను అభిలషించువారిచే కోరబడువాడు.

### ఓం కామాయ నమః

అన్ని పురుషార్థములకును పురుషోత్తముడే మార్గము.

**సౌన్దర్యాది గుణైః కాన్తః మనోహరతయా భృశమ్**
**వికామ కమనీయత్వాత్ శీలౌదార్య దయాదిభిః**
**కామ ఇత్యుచ్యతే నిత్యం షడర్ణో కామ్య రూపదః**

అని నిరుక్తిలో '**కాన్తః**' మరియు '**కామః**' అనే రెండు నామములకు అర్థము చెప్పబడినది. ఆయన సీతామనోహరుడు. గోపకాంతుడు. గోపాలబాలుడు. మునిజన మానస విహారి. ఆర్తిహారి. ఈ నామము షడక్షరీ మంత్రము. కామ్యరూపమును ప్రసాదించునది. ఓం కామాయ నమః.

కామ దేవుడనగా మన్మధుడు అని కూడా అర్థము.

## 299. కామప్రదః

- కోరినవి ఇచ్చేవాడు.

### ఓం కామప్రదాయ నమః

ఎంతలు కోరినవారికి అంతలిచ్చే కామధేనువు.

**స్వకామ్య క్షుద్రకామ్యేభ్యో యథార్హం కామ్య దానతః కామప్రద స్సమాఖ్యాతో హ్యష్టార్ణో మనురుత్తమః** - తనను కోరువారికి తనను, పురుషార్థములను కోరువారికి వాటిని, వారి యోగ్యతను బట్టి ఇచ్చేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఉత్తమమైనది. ఓం కామప్రదాయ నమః.

**యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్**
**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః** – గీత 4.11

పార్థా! భక్తులు నన్ను సేవించిన రీతికి అనుగుణముగ నేను వారిని అనుగ్రహింతును. మనుష్యులందరు వివిధ రీతులలో నా మార్గమునే అనుసరింతురు.

**ఏకో బహూనామ్ యో విదధాతి కామాన్** – అందరి కోర్కెలను తీర్చే ఒకే ఒక్కడు (కఠోపనిషత్తు 2.5)

## 300. ప్రభుః

- అందరికంటె అధికుడు. అందరి మనస్సులను తనవైపు లాగుకొను అధిష్ఠాత. ఘటనాఘటన సమర్థుడు. దేవాధిదేవుడు.

### ఓం ప్రభవే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

4వ శ్లోకము. 35వ నామము. ప్రభుః – **సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభుః ఈశ్వరః**

32వ శ్లోకము. 300వ నామము. ప్రభుః – **కామహా కామకృత్ కాంతః కామః కామప్రదః ప్రభుః**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

35వ నామము. ప్రభుః – సర్వాధిపతి. బ్రహ్మాది దేవతలకు కూడ సకల భోగమోక్షములను, ఫలములను ప్రసాదించువాడు ప్రభువు.

300వ నామము. ప్రభుః – అందరిని చిత్తములను ఆకర్షించు సుందరుడు, నేర్పరి. శక్తిమంతుడు. అన్నింటిని లోబరచుకొనువాడు. **సర్వేషాం చిత్తహరణే ప్రభుః ప్రభవతీతి యః**

శ్రీ శంకరుల వ్యాఖ్య –

35వ నామము. ప్రభుః – సకల కార్యములందును అతిశయించిన సామర్థ్యము కలవాడు.

300వ నామము. ప్రభుః **– ప్రకర్షేణ భవనాత్ ప్రభుః** – అందరిని అధిగమించువాడు ప్రభువు.

శ్రీహరియే ప్రభువని చెబుతూ ధర్మచక్రము రచయిత పెక్కు ఉదాహరణలు చెప్పారు – శ్రీమన్నారాయణుడు భక్తుల చేయి వీడని, సన్మార్గమునుండి చలించని అచ్యుతుడు. ఇంద్రియములను నియంత్రించు హృషీకేశుడు. సాధువులను పరిత్రాణము చేసి దుష్టులను వినాశనము చేయు అవతారమూర్తి. మధుసూదనుడు. కంసచాణూరమర్దనుడు. దేవదేవుడు. ప్రభువు.

మస్కట్ శివాలయం





## యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః |
## అదృశ్యోऽవ్యక్తరూపశ్చ సహస్రజిదనంతజిత్ || (33)

### 301. యుగాదికృత్

- యుగమును ఆరంభించువాడు. యుగములను సృష్టించి, యుగము ప్రారంభములో సృష్టికార్యము చేయువాడు. వటపత్రశాయి.
- యుగములు, కల్పములు – ఇటువంటి కాలప్రమాణములను సృష్టించినవాడు. కాలచక్రమును కల్పించినవాడు. సూర్యుని సృష్టించి, కాలభ్రమణమునేర్పరచినవాడు.

ఓం యుగాదికృతే నమః

**301 నుండి 314** వరకు నామములు వటపత్రశాయిని స్మరించు **నామములు.**

కరారవిందేన పదారవిందమ్ ముఖారవిందే వినివేశయంతమ్
వటస్య పత్రస్య పుటేశయానమ్ బాలమ్ ముకుందమ్ మనసా స్మరామి


తూర్పు యడవల్లి ఆలయం కప్పులో శ్రీ వటపత్రశాయి ఆకృతి.

**న్యగ్రోధశాయీ భగవాన్ పురుషోత్తమః కరోత్యాది యుగాస్యాన్తే యుగాదికృదురీరితః** - పురాణపురుషుడైన ఆ పరమేశ్వరుడు ప్రళయకాలంలో వటపత్రశాయియై, ఈ జగత్తు నీటిలో మునిగిపోకుండా కాపాడి తరువాతి కాలంలో యుగాలను ఆరంభిస్తున్నాడు.

**యుగాదిం కాలవిశేషం కరోతి** – యుగాది అనే కాలవిశేషాన్ని ఏర్పరచేవాడు.

**అహవేవాऽక్షయ కాలః** – నేను అక్షయమగు కాల స్వరూపమును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యుగస్య అంతేऽపి ఆదిమ్ కరోతి** – యుగాంతమున కూడ యుగమును ప్రారంభించువాడు. ప్రళయ కాలమున సకల భువనములను తనయందు భద్రపరచి, ప్రళయానంతరము సృష్టిని పునఃప్రారంభించును గనుక ఆ వటపత్రశాయియే యుగాదికృత్తు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యుగాదేః కాలభేదస్య కర్తృత్వాత్ యుగాదికృత్** – యుగారంభమున దినములు, సంవత్సరములు, యుగములు, మన్వంతరములు – ఇటువంటి కాలభేదములను సృష్టించినవాడు గనుక భగవంతుడు యుగాదికృత్.

శ్రీ చిన్మయానంద – 'ఆది' అనగా దినములు, నెలలు, సంవత్సరములు వంటి కాలప్రమాణములు. ఇటువంటి కాలభేదములను కల్పించి, కాలమునకు గమనము, భ్రమణము కలుగజేసినవాడు. అలా కాకున్నయెడల కాలమునకు మొదలు, తుది, మార్పు అనేవి తెలియవు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు కాలవిశేషములు సృష్టించినందున యుగాంతము, యుగారంభమువంటి కాలచిహ్నములను ఏర్పరచినాడు. ఒక యుగమునకు, మరొక యుగమునకు సంధానకర్త పరమేశ్వరుడు మాత్రమే.

**యుగానాం ఆదిమ్ ఆరంభమ్ కరోతి ఇతి యుగాదికృత్** – అని కూడ శ్రీ శంకరులు చెప్పారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'యుగము' అనగా కాలచక్రము. 'ఆది' అనగా మొదలు. దివారాత్రములకు మూలమైన సూర్యుడే 'యుగాది'. సూర్యుని సృష్టించినవాడు 'యుగాదికృత్'.

ధర్మచక్రము రచయిత – అనంత కాలగమనమును అర్థము చేసికొన్నవారు క్షణికమైన ఐహిక బంధనములలో చిక్కుకొనరు. గడచిపోయినదానికి ఇంక చేసేది లేదు. రానున్నది మన అధీనములో నుండదు. మనకందుబాటులోనున్న వర్తమానమును భగవధ్యానమునకు వినియోగించవలయును.

**భగవద్గీత – అక్షర పరబ్రహ్మ యోగము.**

అర్జునా! బ్రహ్మలోకము పర్యంతము ఉన్న సమస్త లోకములును పునరావృతములు. కౌంతేయ! (ఈ లోకములన్నియును కాలమునకు పరిమితములైనవి. కాని నేను కాలాతీతుడను.) కనుక నన్ను చేరినవానికి పునర్జన్మయుండదు. వేయి చతుర్యుగముల కాలము బ్రహ్మకు ఒక 'పగలు' అనియు, అంతే కాలము ఆ బ్రహ్మకు ఒక 'రాత్రి' యనియు తెలిసిన యోగులు కాలతత్త్వమును నిజముగా ఎఱిగినవారు. చరాచర ప్రాణులన్నియును బ్రహ్మయొక్క పగటి కాలము ప్రారంభము కాగానే అవ్యక్తమునుండి, అనగా బ్రహ్మయొక్క సూక్ష్మశరీరమునుండి ఉత్పన్నమగును (ప్రకటితములగును). మరల బ్రహ్మయొక్క రాత్రి కాలము ప్రారంభ సమయమున అవి అదే అవ్యక్తమునందు లీనమగును.

పార్థా! ఈ భూత (ప్రాణి) సముదాయమే ప్రకృతి వశమున మాటిమాటికిని ఉత్పన్నమగుచుండును. రాత్రి ప్రారంభకాలమున లీనమగుచుండును. పగటి ప్రారంభ కాలమున ఉత్పన్నమగుచుండును. ఆ అవ్యక్తము కంటెను పరమైన విలక్షణమైన సనాతన(శాశ్వత)మైన అవ్యక్త భావమే ఆ పరమపదము. ప్రాణులన్నియును నశించినను ఆ పరమపురుషుడు నశింపడు (నిత్యుడే). ఈ అవ్యక్తమునే 'అక్షరము' అనియు అందురు. ఇదియే పరమగతి. మరియు నా పరమధామము. ఈ సనాతన అవ్యక్తమును, అనగా నా పరంధామమును, చేరినవారు మఱల తిరిగి రారు.

**భగవద్గీత – విభూతి యోగము**

**మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః (10-6)**

సప్తమహర్షులును, వారికంటె పూర్వులైన సనకాది మహామునులు నలుగురును, స్వాయంభువాది చతుర్దశ మనువులును మొదలగు వీరందరును నా భక్తులే. అందరూ నాయెడ సద్భావము గలవారే. ఈ జగత్తు నందలి సమస్త ప్రాణులును వారి ప్రజలే.

## 302. యుగావర్తః

- యుగములను ప్రవర్తింపజేయువాడు. కాలచక్రమును త్రిప్పువాడు. కాలస్వరూపుడు.

### ఓం యుగావర్తాయ నమః

**ధర్మ వ్యవస్థయా స్వస్య యుగాద్యావర్తనాన్ముహుః యుగావర్త స్సమాఖ్యాతః కాలరూపధరో హరిః** - ఆవర్తనము అనగా తిరుగుట. పునరావృతమగుట. కృతయుగము (సత్యయుగము), తరువాత త్రేతాయుగము, ఆపై ద్వాపరయుగము, పిదప కలియుగము అయిన అనంతరము మరల కృతయుగము సంభవించును. ధర్మము తిరిగి సంపూర్ణముగా ప్రవర్తిల్లును. దివారాత్రములు, ఋతువులు వలెనే యుగములు మరల మరల వర్తించుటకు కారణము కాలస్వరూపుడు, యుగాదికృత్తు, యుగావర్తుడు అయిన శ్రీహరియే. కాలమును సృష్టించినవాడే కాలమును నడిపించుచున్నాడు.

## 303. నైకమాయః

- అనేకములైన అద్భుతములకు ఆలవాలమైనవాడు.
- ఎన్నోవిధములైన మాయాస్వరూపములు ధరించువాడు.

### ఓం నైకమాయాయ నమః

శ్రీ భట్టులు (విశిష్టాద్వైతము), శ్రీ శంకరులు (అద్వైతము) తమ తమ వేదాంతమార్గములకు అనుగుణముగా వివరించడాన్ని ఈ నామము వ్యాఖ్యానములో మనం స్పష్టంగా గమనించవచ్చును.

శ్రీ భట్టులు – 'మాయ' అనగా ఇక్కడ అద్భుతములైన సత్యములు, కార్యములు అని అర్థము. 'మాయ' అనగా 'భ్రమ' అని అర్థము చెప్పరాదు. భగవంతుని అనంతాద్భుత లీలలు ఆయన మాయ. **నైకా మాయా యస్య సః నైకమాయః** – అనేకములైన ఆశ్చర్యములు చేయువాడు నైకమాయ. **ముగ్ధార్భకత్వ రూపేణ జగన్నిర్భరణాదపి వటైక పత్ర శయనాత్ నిరాలమ్బజలే ముహుః అనంతాశ్చర్య సంయుక్తో నైకమాయస్తు స స్మృతః** - ఏమీ ఎరుగని పసిపిల్లవాడిలా ఉండి కూడా, లోకాలన్నింటిని తన ఉదరమున ధరించుట, మహాప్రళయం జరిగినప్పుడు లేత మర్రి ఆకుపై సముద్రపు నీటిలో పండుకొనుట వంటి ఆశ్చర్యకరమైన పనులు చేయువాడు. నైకమాయుడు. మన్ను తిన్నవాడు. గోవర్ధనగిరిని ఎత్తినవాడు. బ్రహ్మాండమును తన ఉదరమున దాచుకొని తాను తన భక్తుల హృదయమున స్థితుడైనవాడు.

'మాయ' అనగా 'తెలియరానిది' అనే భావముకంటే 'అద్భుత సత్యము' అనే భావమే సమంజసముగా ఉన్నదని శ్రీ భట్టులు ఎన్నో ఉదాహరణలు చెప్పారు. **మాయామ్ తు ప్రకృతిమ్ విద్యాత్** – మాయ అనగా ప్రకృతి. **మాయావయునమ్ జ్ఞానమ్** – మాయ అనగా జ్ఞానము. అని నిరుక్తిలో ఉన్నది. విష్ణుపురాణములో శంబరాసురుని వేలాది మాయలను తన చక్రముతో నాశనమొనర్చిన విషయము వర్ణింపబడినది. భ్రమను నాశనము చేయుటకు చక్రమునెందుకు వాడవలెను? కనుక 'మాయ' అనగా నిజమైన వస్తువే యనుట సరియగును.

శ్రీ శంకరులు – భగవంతుని మాయలకు అంతు లేదు. ఆయన ఎన్నో మాయా స్వరూపములు ధరించును. **న ఏకా మాయా విద్యతే అస్య** – ఇతడికి ఒకే మాయ లేదు. అనేక విధములైన మాయలను ధరించియున్నాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'మా' అనే ధాతువునుండి 'మానె' అనగా 'కొలుచుట'. కొలవజాలని మాయాధరుడు 'నైకమాయః'. ఊహకు, జ్ఞానమునకు అందనివాడు.

## 304. మహాశనః

- విపరీతమైన ఆకలి గలవాడు. సమస్తమును భక్షించువాడు. ప్రళయకాలమున అంతటిని తనయందు లయమొనర్చుకొనువాడు.
- గొప్పగా వ్యాపించినవాడు.

### ఓం మహాశనాయ నమః

**మహత్ అశనమ్ యస్య సః మహాశనః – భువనానామ్ నిగరణాత్ మహాశన ఇతీరితః.** అశ్ – భోజనే – తినుట – అనే ధాతువునుండి ఈ నామమును వివరింపవచ్చును. ఏడేడు లోకములను మ్రింగినవాడు గనుక ఆయన మహాశనుడు.

మన్ను తిన్నవాడు. హన్నా అని చెవి నులిపి యశోద, ఏదన్నా నీ నోరు చూపుమనగా, చూపితివట నీ నోటన్ బాపురే పదునాల్గు **భువన భాండమ్ములను, ఆ రూపము గని యశోద తాపము నశియించెనట, జయ కృష్ణా! ముకుందా! మురారీ! జయ గోవింద బృందా విహారీ!.**

**ఉలగమ్ ఉణ్ణ పెరువాయా**
**కారేళ్ కడలేళ్ మలైఏళ్ ఉండుమ్ ఆరా వాయిఱ్ఱానై అడంగప్ పిడిత్తేనే** – తిరువైమొళి 108.2

ప్రళయ కాలమున అంతటిని దహించివేయువాడు గనుక ఆయన మహాశనుడు అని శ్రీ శంకరుల భాష్యము. **కల్పాంతౌ సర్వ గ్రసనాత్.**

**ఒకపరి జగముల వెలినిడి**
**యొకపరి లోపలికి గొనుచు నుభయము గనుచున్**
**సకలార్థ సాక్షియగు న**
**య్యకలంకుని నాత్మమయుని నర్థింతు మదిన్** – పోతన భాగవతము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'అశ్' – వ్యాప్తౌ సంఘటే చ – వ్యాపించుట, పేరుకొనుట. భగవంతుడు గొప్పగా, పెద్దయెత్తున అంతటా వ్యాపించెను గనుక మహాశనుడు.

## 305. అదృశ్యః

- కానరానివాడు.

### ఓం అదృశ్యాయ నమః

భగవంతుని కంటితో చూడలేము. ఇంద్రియములతో తెలిసికొనలేము. ఆ వటపత్రశాయి కృపవల్ల మాత్రమే ఆయనను గురించి తెలిసికొననగును.

**కథమ్ నోऽయమ్ శిశుః శేతే లోకే నాశమ్ ఉపగతే**
**తపసా చింతయాన్ శ్చాపి తమ్ శిశుమ్ నోపలక్షయే** – మహాభరతము. వానప్రస్థ పర్వము. 191.94
లోకములన్నీ ప్రళయమున నశించినాగాని ఈ శిశువు మఱ్ఱియాకుపై పవళించి విరాజిల్లుచున్నాడని నా తపస్సువలన తెలిసికొనియుంటిని. కాని ఈ బాలుని తత్త్వము తెలిసికొనుట మాత్రము సాధ్యము కాదు.

**అతర్క్య వృత్తాన్తతయా జగతః ప్రలయేऽపి యః న లబ్ధశ్చిన్త్యమానోऽపి సోऽదృశ్య ఇతికథ్యతే** - జగత్తులన్నీ లయమైపోయిన ప్రళయకాలమున కూడ ఊహకు గాని, ధ్యానమునకు గాని అందనివాడు.

శ్రీ వి.వి. రామానుజన్ గారు శ్రీ నమ్మాళ్వార్ తిరువైమొళి (7.2.3)నుండి ఉదాహరించారు – **కట్కిల్ ఉన్నైక్ కాణుమాఱు అరుళై** – ఇక్కడ 'కట్కిల్' అనగా భౌతిక నేత్రములకు కనుపించనివాడు.

**అదృశ్యమ్ అవ్యవహార్యమ్ అగ్రాహ్యమ్ అలక్షణమ్ ... శాంతమ్ శివమ్ అద్వైతమ్** (మాండూక్యోపనిషత్తు 1.1.6)

## 306. వ్యక్తరూపః

స్పష్టమైన రూపము కలిగినవాడు. భక్తులకు దర్శనమొసగువాడు. స్వయంప్రకాశమూర్తి. అవతారమూర్తి. ప్రత్యక్షదైవము.

## ఓం వ్యక్తరూపాయ నమః

శ్రీ మహావిష్ణువును పూజిస్తున్న శ్రీ మార్కండేయ మహర్షి.
18వ శతాబ్దపు చిత్రం. వికీపీడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:Shesh_shaiya_Vishnu.jpg



మార్కండేయాది ఋషులకు స్పష్టముగా కనుపించువాడు.

**మహాజలే సఞ్చరతో మార్కణ్డేయస్య ధీమతః దృశ్యో యో వ్యక్తరూపస్స్యాత్ దివ్య విగ్రహ ధారణాత్ -** మహా సముద్రంలో మునుగుతూ తేలుతూ ఉన్న మార్కండేయుడికి దివ్యమంగళ విగ్రహముతో దర్శనమిచ్చినవాడు.

(డా. క్రోవి పార్థసారథి రచన 'శ్రీ కైవల్య సారథి' నుండి) భృగుమహర్షి కుమారుడు విధాత. విధాత కుమారుడు మృకుండ మహర్షి. ఆయన కుమారుడు మార్కండేయుడు. ఇతడిది అల్పాయుష్షు. కనుక తీవ్రమైన తపస్సు చేయగా శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకొమ్మన్నాడట. దానికి మార్కండేయుడు ఈ శరీరతోనే అనేక యుగాలు జీవించి ఉండేటట్లుగా వరమడిగాడు. తథాస్తు అన్నాడు శ్రీహరి. ఆ రకంగా మార్కండేయుడు చిరంజీవి అయినాడు. ప్రళయము సంభవించి లోకాలన్నీ జలమయమైపోయినప్పుడు మార్కండేయుడు ఒక్కడే జీవించి ఉంటాడు. వటపత్రశాయి అయిన హరికి నమస్కరించి, ఆయన శరీరంలో ప్రవేశించి అనేక సంవత్సరాలు ఆ శరీరం లోపలే తిరిగిన మహానుభావుడు. (మార్కండేయుడు సప్తర్షుల దీవెన వలన, బ్రహ్మ దీవెన వలనా మరియు శివారాధన వలన చిరంజీవి అయ్యాడనే కథకూడా లోక విదితము)

**అతసీపుష్ప సంకాశః శ్రీవత్సకృత లక్షణః సాక్షాత్ లక్ష్మ్యా ఇవ సదా ప్రతిభాతిమే -** శ్రీవత్స వక్షచిహ్నము కలిగిన ఆ నీలికలువ రంగు దివ్యమూర్తి నాకెప్పుడూ లక్ష్మీనిలయునిగా ప్రకాశించుచుండును.

**తస్య తామ్ర తలౌ తాత! చరణౌ సుప్రతిష్ఠితౌ**
**సుజాత మృదు రక్తాభిః అంగుళీభిః అలంకృతౌ**
**ప్రణతేన మయా మూర్ధ్నా గృహీత్వాహ్యభివందితౌ** – మహాభారతము. వానప్రస్థ పర్వము.188.13

తాతా! ఆయన పాదములు మృదువుగా, ఎఱ్ఱని అంచులతో, అలంకరింపబడిన వ్రేళ్ళతో శోభించుచుండెను. నేను ఆయనకు ప్రణమిల్లి పూజించునపుడు ఆ దివ్యమంగళ చరణారవిందములు నా శిరస్సుపై నుంచబడినవి.

క్రితము నామము 'అదృశ్యుడు' అనగా చక్షురింద్రియములకు గోచరము కానివాడు. ఈ నామము 'వ్యక్తరూపుడు' అనగా ఇంద్రియ బంధములను అధిగమించిన భక్తులకు స్పష్టముగా కనుపించువాడు. అవతారమూర్తియై, అర్చామూర్తియై, స్వయంభువై, సాలగ్రామరూపుడై, గురువై, ఆత్మబంధుడై ఆదుకొను సర్వాంతర్యామి. 'అదృశ్యోవ్యక్తరూపశ్చ' లోని 'చ' ప్రత్యయము ఈ రెండు నామములందలి విభిన్నత్వమును అనుసంధానము చేయుచున్నదని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు.

ఊహకందని గుణరూప సంపన్నుడు గనుక అదృశ్యుడు. అంతర్యామియై అన్నింటియందు స్థితుడైనందున వ్యక్తరూపుడు – అని ధర్మచక్రము రచయిత వివరించారు.

**శ్రీ పోతన భాగవతము. మార్కండేయోపాఖ్యానమునుండి.** (telugubhagavatam.org)

నిలిచిన శంకరుం గనియు, నిత్యసుఖంబుల నిచ్చు గౌరి యు
మ్మల "హర! భూతిభూషణసముజ్జ్వలగాత్రునిఁ గంటె, యెంతయున్

వలనుగ వానితోడ నొక వాటపుమాటను బల్కఁగాఁ దగున్
సలలితమైన యీ తపసి జాడ వినంగడు వేడ్క యయ్యెడిన్."

అనిన శంకరుండును శాంకరీసమేతుం డయి నభంబుననుండి ధరణీ తలంబునకు నేతెంచి యితరంబు గానక యేకాగ్రచిత్తుండగు నమ్మునిం గని తన దివ్యయోగమాయా ప్రభావంబుచేత నతని హృదయంబునం బ్రవేశించి చతుర్బాహుండును, విభూతి రుద్రాక్షమాలికాధరుండును, త్రిశూల డమరుకాది దివ్యసాధన సమేతుండును, వృషభవాహ నారూఢుండును, నుమాసమేతుండునై తన స్వరూపంబు గనంబఱచిన విస్మయంబునొంది యమ్ముని యా పరమేశ్వరుని ననేక ప్రకారంబుల స్తుతియించిన, నప్పు డమ్ముని తపఃప్రభావంబునకు మెచ్చి "మహాత్మా! పరమశైవుండ" వని పరమేశ్వరుం డానతిచ్చిన మార్కండేయుండును శంకరు నిరీక్షించి, "దేవా! హరిమాయాప్రభావంబు దుర్లభం; బయ్యది భవత్సందర్శనంబునం గంటి; నింతియచాలు; నైన నొక్కవరంబు గోరెద; నారాయణచరణాంబుజ ధ్యానంబును, మృత్యుంజయంబునుం గలుగు నట్లు గాఁగృప సేయవే" యని ప్రార్థించినఁ గృపాసముద్రుండై "యట్లగాక" యని "జరారోగవికృతులు లేక కల్పకోటి పర్యంతంబు నాయువుం, బురుషోత్తముని యనుగ్రహంబుఁ గలుగు" నని యానతిచ్చి యమ్మహాదేవుం డతర్థానంబు నొందె" నని చెప్పి యీ మార్కండేయోపాఖ్యానంబు వ్రాసిన వినినం జదివినను మృత్యువు దొలంగు నని మఱియు నిట్లనియె; హరి పరాయణుం డగు భాగవతుండు దేవతాంతర మంత్రాంతర సాధనాంతరంబులు వర్జించి, దుర్జనులం గూడక నిరంతరంబు నారాయణ గోవిందాది నామస్మరణంబు సేయుచునుండె నేని నట్టి పుణ్యపురుషుండు వైకుంఠంబున వసియించు; మఱియు హరి విశ్వరూపంబును జతుర్విధ వ్యూహభేదంబును, జతుర్మూర్తులును, లీలావతారంబులును జెప్ప నగోచరంబు" లనిన శౌనకుం డిట్లనియె.

హరికథలు, హరిచరిత్రము,
హరిలీలావర్తనములు నంచిత రీతిం
బరువడి నెఱిఁగితి మంతయుఁ
సురనుత! యనుమాన మొకటి నొప్పడెడి మదిన్.



క్షీరసాగరంలో శ్రీ మార్కండేయ మహర్షి ఆశ్రమం.
1790 కాలపు చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:8_Sage_Markandeya%27s_Ashram_and_the_Milky_Ocean,_Watercolour_on_gold_paper,_ca._1780-90_Mehrangarh_Museum_Trust.jpg

## 307. సహస్రజిత్

- వేలాది యుగములను జయించువాడు (శ్రీ భట్టుల వ్యాఖ్య).
- వేలాది రాక్షసులను జయించువాడు (శ్రీ శంకరుల వ్యాఖ్య).

### ఓం సహస్రజితే నమః

**సహస్ర యుగ సంఖ్యాకం సర్వ కల్పాన్తమేవ హి శయాన ఏవ జయతి సహస్రజిదితి స్మృతః -** ప్రళయమున జగములన్నీ నశించినా భగవంతుడు యోగనిద్రలోనుండును. కాలము అన్నింటినీ అధిగమించును. అన్నింటినీ జయించును. యుగాంతమున సమస్తము లయమగును. కాని యుగాదికర్తయైన ఆ కాలస్వరూపుడు మాత్రము కాలమునకు అందరానివాడు. యుగములతో నిమిత్తము లేనివాడు. కల్పములు గడచినను వటపత్రశాయియై వెలుగొందువాడు.

వేలసంఖ్యలో రాక్షస గణములను సంహరించినవాడు. శ్రీరాముడు తానొక్కడై పదునాలుగువేల రాక్షసులను సంహరించిన విధము రామాయణమున వివరింపబడియున్నది. అంతే కాదు. హరినామ స్మరణ కీర్తనలు సకల దుష్టచింతనలను, పాపములను నశింపజేయును.

## 308. అనంతజిత్

- అంతులేని విజయములు గలవాడు.
- అవధులు లేకుండా ప్రకాశించేవాడు.

### ఓం అనంతజితే నమః

అంతా శ్రీమన్నారాయణుని అధీనములోనుండును. అన్ని ప్రాణులు, అన్ని యుగములు, అన్ని కాలములు ఆయన ఆజ్ఞానుసారము వర్తించును. అన్ని అవతారములందును ఆయనే జయించును.

(డా. క్రోవి పార్థసారధి రచన 'శ్రీకైవల్యసారధి'నుండి) **మతస్య శిశురూపస్య కదా చిత్కశ్చిదేవ హి కథంచిత్ అవధిర్నాస్తి మహిమ్నః పరమాత్మనః తస్మాదీ ననన్తజిదితి వస్వర్ణో జయదోమనుః -** శిశురూపము గాని, మరేదైనా రూపము గాని తన యిష్టానుసారము ధరించి అవధులు లేకుండా ప్రకాశించు పరమాత్ముడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. జయమును కలుగజేయును.

**అనంతం పరిమిత శిశురూపస్య మహిమావధిం జయతి అభిభవతీతి అంతజిత్ న అంతజిత్ అనంతజిత్**

అతడు చిన్నవాడైనప్పటికీ తన మహిమ ఏమిటో ఎవరికీ తెలియకుండా ప్రకాశించేవాడు. ఊహించనలవికాని శక్తిమంతుడు కాబట్టి యుద్ధక్రీడలయందు అనంతభూతములను జయిస్తాడు.

అనూహ్యమైన శక్తిసామర్థ్యములు కలిగి రణరంగములో అందరినీ జయించే శక్తిసామర్థ్యాలు గలవాడు. పరమేశ్వరుడు. సత్యస్వరూపుడు. కాబట్టి విజయం అతనిదే. జీవులయొక్క పాపములను ప్రక్షాళన చేసి, వారందరికీ కైవల్యము ప్రసాదించేవాడు. కాబట్టి 'అనంతజిత్' అనబడుచున్నాడు. అసంఖ్యాకమైన భక్తుల హృదయాలలో రమించువాడై వారిని తనవైపు మరలించుకొను శక్తి కలవాడు కాబట్టి 'అనంతజిత్' అనబడుతున్నాడు.



తిరుమలలోని శిల్పాలు
Photo by Klsateeshvarma.

https://commons.wikimedia.org/wiki/File:Tirupati_sriram.jpg



## ఇష్టోऽవిశిష్టః శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః |
## క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః || (34)

### 309. ఇష్టః

- అందరకును ప్రియమ్మైనవాడు. జగదానంద కారకుడు.
- ఇష్టి (యజ్ఞము)నందు అర్చింపబడువాడు.

**ఓం ఇష్టాయ నమః**

శ్రీహరియేసచ్చిదానంద స్వరూపుడు. సర్వప్రియుడు. చెలుడై, చుట్టమ్మై, ఆర్తత్రాణ పరాయణుడై, కోరికలీడేర్చువాడై, అందమునకందమ్మై, అందరికిని ప్రియమ్మైనవాడు. శాశ్వతానందమూర్తియైన శ్రీదేవుని ధ్యానించినవారికి మరేమియును ఇష్టము కాదు. అని ధర్మచక్రము రచయిత వ్యాఖ్యానించారు. **అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృత పాన విశేష మత్త చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు?**

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – 'ఇష్టః' అను శబ్దమునకు యజ్ఞము అనియును అర్థమే. యజ్ఞము విశ్వకళ్యాణార్థము, ఈశ్వర ప్రీతికొరకు, పరోపకారార్థమ్మై, నిష్కామముగా చేయబడు సాత్వికపుణ్యకర్మ. ఇట్టి పుణ్యవ్రతారాధనా కర్మలచేత ఆరాధింపబడేవాడు గనుక 'ఇష్టః' అనబడును. నిష్కామకర్మానుష్టానము ఈశ్వరప్రాప్తికి సాధనము.

### 310. అవిశిష్టః / విశిష్టః

- అందరినీ సమముగా కాపాడువాడు.
- అన్నింటియందు స్థితుడై, వేరుగా తెలియజాలని, అంతర్యామి.
- అసమానుడు.

**ఓం అవిశిష్టాయ నమః**

**ఓం విశిష్టాయ నమః**

తల్లివలె, భేదభావము లేకుండ, అందరినీ సమానముగా రక్షించువాడు గనుక భగవానుడు అవిశిష్టుడు. భగవానుడు సర్వాంతర్యామి. సకల ప్రాణులయందు, భూమియందు, అగ్నియందు, వాయువునందు, ద్యులోకమున, ఆదిత్యలోకమున, చంద్రునియందు, దిగంతరాళమున, అంధకారమున, తేజస్సునందు ఉండి వానిని నియంత్రించును. కాని వాటికి ఆయన తెలియదు. వాటికి, ఆయనకు భేదము మనకు తెలియదు.

శ్రీ భట్టులు 309, 310 నామములను కలిపి '**అవిశిష్టఃఇష్టః**' అనే ఒకే నామముగా పరిగణించినట్లు కొన్ని వివరణా గ్రంథములలో ఉన్నది – సకల జీవులందు భేదభావము చూపక, తల్లివలె అందరిని రక్షించువాడు – అని ఈ ఏకనామమునకు అర్థము.

రెండూ వేరువేరు నాములుగా పరిగణించినవారిలో కూడ కొందరు 310వ నామమును '**అవిశిష్టః**' అని కాక '**విశిష్టః**' అని స్వీకరించారు (శ్రీ చిన్మయానంద). 'విశిష్టః' అనగా ప్రత్యేకమైనవాడు, సాటిలేనివాడు, మహానుభావుడు, పరమ పవిత్రుడు.

**311. శిష్టేష్టః**

- శిష్టులకు (సాధుసజ్జనులకు) ఇష్టమైనవాడు.
- శిష్టులపట్ల మిక్కిలి ప్రేమ గలవాడు.

**ఓం శిష్టేష్టాయ నమః**

**మార్కండేయ ద్విజాదీనాం పండితేష్వగ్రయాయనాం ఉత్కృష్ట పురుషార్థత్వే నేష్ట శిష్టేష్ట ఉచ్యతే** - శిష్టాచార సంపన్నులైన మార్కండేయాది మహర్షులచే ఉత్కృష్టమైన పురుషార్థముగ ప్రార్థింపదగినవాడు. **శిష్టానామ్ ఇష్టః శిష్టేష్టః** – శిష్టులనగా సదాచార సంపన్నులు, సత్ప్రవర్తనులు, శీలసంపన్నులు, సాధుసజ్జనులు, పుణ్యాత్ములు. వారికి భగవంతునికంటె ప్రియమైనది లేదు. హరికథాచింతనమే వారికి జపము, తపము, మోక్షమార్గము, పరమార్థము.

భగవంతునకు కూడ శిష్టులపట్ల ప్రేమ అపారము. అందువల్లనే ఆయన తిరుక్కచ్చినంబికి గొడుగుపట్టెను. అనంతాళువారికి మట్టి మోసెను.

శ్రీ శంకరులు గీతనుండి ప్రమాణము చెప్పారు.

**చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోऽర్జున**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ** – గీత 7.16
ఓ భరత శ్రేష్ఠ! అర్జున! శుభకర్మలను ఆచరించుచు సుఖసంపదలను కోరుకొనువారు (అర్థార్థులు), శారీరిక మానసిక సంతాపములకు గురియైన ఆర్తులు, ఐహిక విషయములపై ఆసక్తిని వీడి పరమాత్మ తత్వజ్ఞానమును పొందుటకు ఇచ్ఛగలవారు (జిజ్ఞాసువులు), పరమాత్మ ప్రాప్తినందిన జ్ఞానులు అను చతుర్విధ భక్తులు నన్ను భజింతురు.

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే**
**ప్రియో హి జ్ఞానినోऽత్యర్థమహం స చ మమ ప్రియః** – గీత 7.17
ఈ చతుర్విధ భక్తులలో నిరంతరము నాయందే ఏకీభావ స్థితుడై, అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. ఏలనన, వాస్తవముగ నన్ను (నా తత్వమును) తెలిసికొనిన జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడును నాకు మిక్కిలి ఇష్టుడు.

**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్** – గీత 7.18
ఈ చతుర్విధ భక్తులును ఉదారులే (అనగా భగవంతునియందు విశ్వాసమునుంచి, ఎల్లప్పుడు అతనినే సేవించుచు ఉండువారు). కాని జ్ఞానియైనాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగా ఉంచి, నన్నే పరమప్రాప్యునిగా భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థితుడు.

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే**
**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః** – గీత 7.19
అనేక జన్మల పిదప జ్ఞానియైనవాడు (భగవత్తత్త్వమును ఎఱిగినవాడు) సర్వమూ వాసుదేవమయమేయని భావించి నన్ను శరణు పొందును. అట్టి మహాత్ముడు లభించుట అరుదు.

శ్రీ వి.వి. రామానుజన్ గారు తిరుప్పావై (6)నుండి ఉదాహరించారు.

**వెళ్ళత్తరవిల్ తుయి లమర్ న్ద విత్తినై**
**ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్ గళుమ్ యోగిగళుమ్**
**మెళ్ళ వెళున్దు అరియెన్ఱ పేరరవమ్**
**ఉళ్ళమ్ పుగున్దు కుళిర్ న్దేలో రెమ్బావాయ్**
ఓ దయామయా! పాలమున్నీటిలో, మీగడ పొత్తిళ్ళలో హాయిగా బజ్జున్న ఓ బుజ్జి నారాయణా! యోగులు కూడా తమ గుండెల్లో దాచుకుని చూచుకొనే ఓ ప్రాణదీపమా! చెవులారా నీ నామమే విందు చేస్తున్నదయ్యా ఓ నల్లనయ్యా! నా కన్నయ్యా! ఎంత హాయిరా! నన్ను గన్న తండ్రీ! స్వామీ! నీకు నిత్యశుభమంగళ మగుగాక! అంటున్నదీ ఆరవ పాశురంలో గోదాకన్య. ( డా. వేదవ్యాస గారి 'తిరుప్పావై - ధనుర్మాస పారాయణ గ్రంథం' నుండి గ్రహించిన తెలుగు అనువాదము. వేద విశ్వవిద్యాలయం వారి ప్రచురణ.)

## 312. శిఖండీ

- దివ్యతేజోమయుడు. వెల్లి విరిసిన తేజముగల ప్రభువు.
- నెమలి పింఛమును ధరించినవాడు.

### ఓం శిఖండినేనమః

'శిఖండము' అనగా జుట్టు ముడియని, నెమలి పింఛమని అర్థములు. మెదటి అర్థమును శిఖాగ్రస్థానము అని కూడ అన్వయింపనగును. శ్రీ భట్టులు ఈ భావములో వ్యాఖ్యానించారు. శ్రీహరియే దేవదేవుడు. తేజములకు తేజము. అన్ని ఐశ్వర్యములకు అగ్రస్థానము. దివ్యతేజమే ఆయన ఆభరణము.

**అత్య ప్రధృష్య మైశ్వర్యం పరం యత్తేజ అస్థితమ్ తచ్ఛఖణ్ణస్తు యస్యాప్తి తచ్ఛిఖణ్ణీతి చక్ష్యతే -** అపరిమితమైన. ఎవరికీ ఎదిరించడానికి వీలుకాని ఐశ్వర్యము గలవాడు శిఖండి.

**శిఖండః అస్యాస్తీతి శిఖండీ –** తిరస్కరింపజాలని ఐశ్వర్యము, తేజము కలవాడు శిఖండి. **ఆసీనమ్ తం నరవ్యాఘ్రం పశ్యామ్యమిత తేజసమ్ –** అమితమైన తేజస్సు ఆభరణంగా ధరించి ఆ పరమేశ్వరుడు ప్రకాశిస్తున్నాడు.

నల్లనయ్య శిఖిపింఛమౌళి గనుక శిఖండియని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. **గోపవేష ధరస్య శిఖండః అలంకారః అస్య –** గోపవేష ధరుడగు ఇతనికి నెమలి పింఛము (శిఖండము) అలంకారముగానున్నది. గోపాలబాలుడు మౌళిపరిసర్పిత పింఛమువాడు. సుధారసమ్ము పై జల్లువాడు. పద్మనయనమ్ముల వాడు. నల్లనివాడు. నవ్వు రాజిల్లెడు మోమువాడు. దివ్యమంగళ స్వరూపుడు. కటి వరద హస్తములతో ఏడుకొండలపై వెలసిన కోనేటిరాయుడు. భద్రాద్రి రాముడు. శ్రీనారసింహుడు. వటపత్రశాయి.

## 313. నహుషః

- తన మాయచే జీవులను బంధించువాడు.

### ఓం నహుషాయ నమః

'నహుషము' అనగా బంధనము. **జీవాన్ స్వమాయయా నిత్యం నహుషో నహ్యతీతియః – నహ్యతి బధ్నాతీతి నహుషః –** మాయామేయ జగంబున సర్వము భగవంతుని ఇచ్ఛానుసారమే వర్తించును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు తన సౌందర్యముతోను, సౌలభ్యముతోను సమస్తమును బంధించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అంతయును ఆయనకు లోబడియుండును. కనుక ఆయన నహుషుడు. ఆ బంధమే గ్రహగతులను నిర్దేశించును. నక్షత్రమండలమును నిలువరించును. తల్లికి బిడ్డపై ప్రేమను కలుగజేయును. సాగర కెరటములను తీరమువద్ద ఆపివేయును. దేహములోని భాగములన్నింటి చేతను ఒక రీతిగా పని చేయించును. జ్ఞానము, సౌఖ్యము, మోహములతో ఆత్మను శరీరమున బంధించును.

**త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్** – గీత 7.13
**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా**
**మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే** – గీత 7.14
ఈ జగత్తు, అనగా ప్రాణి సముదాయము అంతయును గుణములయొక్క కార్యరూపములైన సాత్త్విక, రాజస, తామస అను త్రివిధ భావములచే మోహితమగుచున్నవి. కనుక త్రిగుణములకు అతీతుడను, శాశ్వతుడను అయిన నన్ను ఆ ప్రాణులు తెలిసికొలేకున్నవి. నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి, సంసార సముద్రమునుండి బయటపడగలరు.

## 314. వృషః

- సంసార తాపమున బాధితులైనవారిపై ఉపశమనమును వర్షించు అమృతమయుడు (వృష్ – వర్షించుట).
- భక్తులకు కామితార్థములను వర్షించువాడు.
- ధర్మస్వరూపుడు (వృష – ధర్మము).

### ఓం వృషాయ నమః

'వృష' శబ్దమునకున్న వేర్వేరు అర్థముల కారణంగా ఈ నామమునకు వివిధ వ్యాఖ్యలు లభించాయి.

**సాగరస్యోదరే నిత్యం వసన్నమృత రూపయా స్వదేహ కాన్త్యా వా చాపి సమ్యగాశ్వాస యన్ముహుః బహుశప్పించయతి యః వృషస్స పరిపఠ్యతే -** నిత్యము సముద్రగర్భంలో నివసించువాడై, అమృతాన్ని పోలిన దేహకాంతులతోను, మధురమైన మాటలతోను మార్కండేయాది మహర్షులను ఊరడిల్లజేయువాడైన వటపత్రశాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కామాన్ వర్షణాత్ వృషః** – కోరుకున్నవారికి కోరినంత ప్రసాదించువాడు. కొండలంత వరములు గుపెడువాడు. మమ్మేలిన కులదైవము. ఆపదమ్రొక్కులవాడు.

శ్రీ శంకరులు మహాభారతము (శాంతిపర్వము 330.23) ప్రమాణముగా 'వృషః' అనగా 'ధర్మస్వరూపుడు' అనే అర్థాన్ని కూడా చెప్పారు.

**వృషోహి భగవాన్ ధర్మః స్మృతో లోకేషు భారత నైఘంటుక పదాఖ్యానైర్విద్ధి మాం వృష యిత్యుత** - అర్జునా! నిఘంటుకారులు చెప్పిన ప్రకారము 'వృష' అనగా 'ధర్మము'. భగవంతుడు ధర్మస్వరూపుడు. కనుక నేనే 'వృషః'

**తరువాతి 8 నామములను శ్రీపరశురామావతారమును స్మరించు నామములుగా శ్రీ భట్టులు వివరించారు.**

## 315. క్రోధహా

- క్రోధమును పరిత్యజించినవాడు (శ్రీ భట్టుల వ్యాఖ్య).
- సాధువులందు క్రోధమును నశింపజేయువాడు (శ్రీ శంకరుల వ్యాఖ్య).

### ఓం క్రోధఘ్నే నమః

**క్రోధమ్ హన్తీతి క్రోధహా**

**కాశ్యపస్య ప్రార్థనయా యః క్రోధం క్షత్రహానిదం హతవాన్ క్రోధహా ప్రోక్తః షడర్ణో క్రోధనాశకః** - ఆయన ధరించిన క్రోధమువలన 21మార్లు దండయాత్ర జరిపి క్షత్రియులను నాశనము చేసెను. అట్టి క్రోధమును, కాశ్యపమహర్షి ప్రార్థనతో ఉపశమింపజేసుకొనిన వాడైన పరశురాముడు 'క్రోధహా'. ఈ నామము క్రోధమును నశింపజేయు షడక్షరీమంత్రము. ఓం క్రోధఘ్నే నమః.



చిన్న తిరుపతిలోని శ్రీ పరశురామ శిల్పం

ఇదే వ్యాఖ్యను శ్రీ వి.వి. రామానుజన్ గారు దివ్యప్రబంధమునందలి ఉదాహరణలతో వివరించారు. పెరియ తిరువైమొళి 8.1.6 – **మళువినాల్ అవని అరశై మూవెడుకాల్ మణిముడి పొడి పడుత్తు యుదిరిక్ – కుళువార్ పునలిల్ కుళిత్తు వెన్ కోపమ్ తవిర్ న్దవాన్.**

శ్రీరాధాకృష్ణశాస్త్రి వివరణ – భగవానుడు శుద్ధసత్త్వస్వరూపుడైనను సంకల్పమాత్రముననే కోపమును ధరించును, నియంత్రించును, త్యజించును. శ్రీరామావతారమున ఆయన కోపమును పూనిన పెక్కు సందర్భములు వర్ణింపబడినవి. **రోషమ్ ఆహారయత్ తీవ్రమ్** (3.30.19) – **క్రోధస్య వశమేయివాన్** (6.59.136).

శ్రీ శంకరుల వ్యాఖ్య – సాధుసజ్జనులకు కోపము భయంకరమైన శత్రువు. తీరని కోరికలే అందుకు కారణము. కోరికలను జయించినవారికి క్రోధము దూరమగును. ఆ విధముగా వారి కోపమును నాశనము చేయువాడు గనుక శ్రీహరి 'క్రోధహా'.

శ్రీ పరమహంస ప్రవచనములను ఉదాహరిస్తూ ధర్మచక్రము రచయిత కోపమును జయించుటకు చెప్పిన ఉపాయము – బుసకొట్టు, కాని కరవవద్దు – అనగా క్రోధము వలన ఎవరికీ హాని జరుగకుండా జాగ్రత్త పడవలెను.

## 316. క్రోధకృత్

- కోపమును వహించినవాడు.
- కోపమును కలుగజేయువాడు.

## ఓం క్రోధకృతే నమః

పరశురామావతారమున కార్తవీర్యునిపై కోపించి, క్షత్రియులను దునిమినవాడు (పిదప కోపమును పరిత్యజించినవాడు).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అసాధుషు క్రోధమ్ కరోతి ఇతి క్రోధకృత్** – దుర్జనులయందు క్రోధము ప్రజ్వరిల్లుటకు కారణము భగవానుడే. అలా కోపము కారణంగా ఆ దుర్జనులు తమను తాము నాశనము చేసుకొందురు.

## 317. కర్తా

- (కార్తవీర్యుని) తెగనరికినవాడు (శ్రీ భట్టులవ్యాఖ్య).
- జగత్తునకు కర్త (శ్రీ శంకరుల వ్యాఖ్య)

## ఓం కర్త్రే నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.

34వ శ్లోకము. 31వ నామము. కర్తా – **క్రోధహా క్రోధకృత్ కర్తా విశ్వబాహుః మహీధరః**

41వ శ్లోకము. 382వ నామము. కర్తా – **కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః**

**కృద్ధేతో కార్తవీర్యస్య ఛేత్తా కర్తేతి శబ్ద్యతే** – తన కోపమునకు కారణమైన కార్తవీర్యునికి కోపము తెప్పించి, అతనితో యుద్ధము చేసి, అతని చేతులను తెగనరికినవాడు కర్త.

**క్రియతి ఇతి కర్మ జగత్ తస్య కర్తా** – జగత్తును తయారు చేసినవాడు కర్త.

316, 317 నామములకు వేరువేరుగా అర్థములు చెప్పిన పిదప శ్రీ శంకరులు ఈ రెండింటిని ఒకే నామముగా **'క్రోధకృత్కర్తా'** అనికూడ పరిగణింపవచ్చునని వ్యాఖ్యానించారు. వేయి నామములు సంఖ్య సరిగా వచ్చుటకు కావచ్చును – శ్రీ శంకరుల భాష్యమునందు 'క్రోధకృత్కర్తా' అని, శ్రీ భట్టుల భాష్యమునందు 'క్రోధకృత్', 'కర్తా' అని లెక్కింపబడినవి.

## క్రోధకృత్కర్తా

- సజ్జనులకు అపకారము చేయు దుష్టులపట్ల కోపము వహించువాడు.

## ఓం క్రోధకృత్కర్త్రే నమః

**క్రోధ కృతమ్ దైత్యాదీనామ్ కర్తా ఛేదక ఇతి ఏకనామః.**

శ్రీ సత్యదేవోవాసిష్ఠ గారి వ్యాఖ్య – **క్రోధమ్ కరోతి ఇతి క్రోధకృత్. క్రోధకృతమ్ కృన్తతి చిన్తతి హన్తి వా క్రోధకృత్కర్తా.**

## 318. విశ్వబాహుః

- దుష్టులను శిక్షించుటకై వ్యాపించిన బాహువులు గలవాడు.
- అనంత బాహువులు కలిగి, సమస్తమును సంరక్షించువాడు.

## ఓం విశ్వబాహవే నమః

లోక కంటకులను తొలగించుటకు విస్తరించిన చేతులు కలిగినవాడు గనుక భగవానుడు విశ్వబాహువు. అధికార మదాంధులైన 21 తరముల క్షత్రియులను నిర్జించిన భార్గవరాముడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు అనంతబాహుడైన విరాట్పురుషుడు. అంతటా వ్యాపించిన ఆయన బాహువులు సమస్త కార్యములను నిర్వహించును. సజ్జనులను రక్షించును.

**విశ్వతో బాహుః** (శ్వేతాశ్వరోపనిషత్తు 3.3). అంతా ఆయనపైననే ఆధారపడియున్నది.



(శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము) దుష్టులను శిక్షించుటకును, (శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము) సజ్జనులను రక్షించుటకును సర్వత్ర విస్తరించిన అనంతమైన బాహువులు కలిగినందున భగవానుడు విశ్వబాహువు.

ధర్మచక్రము రచయిత – మనము మన చేతులతో కర్మలు నిర్వహించుదుము. సృష్టి, స్థితి, లయాది సకల కార్యములు నిర్వహించువాడు భగవంతుడు గనుక విశ్వబాహువు. పరోపకారార్థమై మనము మన చేతులను ఉపయోగింపవలెనని ధర్మచక్రము రచయిత సందేశము.

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహురుత విశ్వతస్పాత్**
**సంబాహుభ్యాం ధమతి సంపత త్రైర్ ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః**

https://commons.wikimedia.org/wiki/
File:Utsava_murthy_antique_statue_from_kanakapura_area.jpg

## 319. మహీధరః

- భూ భారమును తగ్గించి, భూమిని ధారణ చేయువాడు.
- సకల పూజలను స్వీకరించువాడు.

### ఓం మహీధరాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
34వ శ్లోకము. 319వ నామము. మహీధరః – **క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుః మహీధరః**
40వ శ్లోకము. 371వ నామము. మహీధరః – **మహీధరో మహాభాగో వేగవానమితాశనః**

**భారావతరణం కృత్వా గాం ధత్తే స మహీధరః - మహీం ధరతి ఇతి మహీధరః -** భూమిపై దుష్టులను నాశనము చేసి, భూమి భారమును తగ్గించి, ధరించువాడు మహీధరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'మహీ' అనగా 'భూమి' మరియు 'పూజ' అనే రెండు అర్థాలున్నాయి. కనుక రెండు భావములు – భూమిని (ఆదిశేషుడై, శ్రీవరాహమూర్తియై) ధరించువాడు. భక్తుల పూజలన్నింటిని స్వీకరించువాడు. మహీధరుడు.

'ధారణ చేయుట' అనే విషయాన్ని శ్రీ చిన్మయానంద ఇలా వివరించారు – వస్త్రమునకు ప్రత్తి, ఆభరణమునకు స్వర్ణము, కుండకు మట్టి ఆధారమనవచ్చును. మరొక విధముగా వీనికి భేదము లేదనవచ్చును. అదే విధముగా భగవంతునకు, లోకమునకు భేదము లేదు. సర్వలోకములు జగదాధారుని విభూతులే.



## అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః |
## అపాం నిధిరధిష్ఠానమప్రమత్తః ప్రతిష్ఠితః || (35)

### 320. అచ్యుతః

- తన మహామహిమ నుండి ఎన్నడును చ్యుతి (పతనము) లేనివాడు.
- తన భక్తులను వీడనివాడు.
- షడ్వికార రహితుడు, శాశ్వతుడు, పరిణామమునకు అతీతుడు

**ఓం అచ్యుతాయ నమః**

ఇదే నామము ఇంతకుముందు 101వ నామముగా వచ్చెను. మరల 557వ నామముగా చెప్పబడును.

11వ శ్లోకము. 101వ నామము. అచ్యుతః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిః అచ్యుతః**

35వ శ్లోకము. 320వ నామము. అచ్యుతః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**

59వ శ్లోకము. 557వ నామము. అచ్యుతః – **వేధాః స్వాంగోऽజితః కృష్ణో దృఢః సంకర్షణోऽచ్యుతః**

101వ నామము వివరణలో పొందుపరపని మరికొన్ని ఉదాహరణలు ఇక్కడ చెప్పబడుచున్నవి (శ్రీ కృష్ణమాచారిగారి సంకలనమునుండి మరియు శ్రీకైవల్యసారథినుండియు కూడ). **చ్యవనోత్పత్తి యుక్తేషు బ్రహ్మేంద్ర వరుణాదిషు యస్మాన్నచ్యవతే స్థానాత్ తస్మాత్సంకీర్త్యతేऽచ్యుతః.**

**సా ధర్మేణావతారేऽపి బ్రహ్మేంద్ర వరుణాదిభిః నస్వైశ్వర్యాత్ప్రచ్యుతో యః అచ్యుతః పరికీర్తతః.** బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు మొదలైన దేవతలతో సమానంగా అవతరించినప్పటికీ, వారికిలాగా తరగని చెదరని పదవి, ఐశ్వర్యము గలవాడు అచ్యుతుడు.

శ్రీ వి.వి. రామానుజన్ గారు రామాయణమునుండి ఉదాహరించారు – **మిత్రభావేన సంప్రాప్తమ్ కదాచన దోషో యద్యపి తస్యస్యాత్** – నా స్నేహము కోరి దరిచేరినవానిలో ఏ విధమైన దోషములున్నను అతనిని ఎట్టి పరిస్థితులలోను విడనాడను. దివ్యప్రబంధమునుండి చెప్పిన ఉదాహరణ – **కార్తిగైయానుమ్ కరిముగత్తానుమ్ కనలుమ్ ముక్కణ్ మూర్తియుమ్ మోడియుమ్ వెప్పుమ్ ముదుగిట్టు** – బాణాసురుని కథలో అతడు రక్షణకై ఆశ్రయించినపుడు ఇతర దేవతలు దూరమైనారు. కాని శ్రీకృష్ణభాగవతులు ఎన్నడును తమ తోడును కోల్పోరు. **న మే భక్తః ప్రణశ్యతి** (గీత).

**విశ్వతః పరమాన్నిత్యమ్ విశ్వం నారాయణగ్ం హరిమ్**
**విశ్వమే వేదమ్ పురుష స్తద్విశ్వముపజీవతి**
**పతిం విశ్వస్యాత్మే శ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్**
**నారాయణమ్ మహాజ్ఞేయమ్ విశ్వాత్మానమ్ పరాయణమ్** – తైత్తరీయారణ్యకోపనిషత్తు.

విశ్వానికి అతీతుడు, విశ్వమే తానుగా అయినవాడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు, విశ్వానికి జీవనాధార మైనవాడు, విశ్వపతి, విశ్వానికి ఈశ్వరుడు, శాశ్వతుడు, మంగళకరుడు, నాశనము లేనివాడు, తెలిసికొన దగిన పరమాత్ముడు, విశ్వాత్ముడు, విశ్వపరాయణుడు అయిన నారాయణునకు నమస్కారము.

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి తస్యాహం న ప్రణశ్యామి స చ యే న ప్రణశ్యతి** – గీత 6.30
సకల ప్రాణులయందు ఆత్మరూపంలో ఉన్న నన్ను చూడగలిగిన వాడికి, ప్రాణులన్నింటిని నాయందు అంతర్గతంగా ఉన్నట్లు చూసేవాడికి నేను లేకుండా పోను. నాకు అతడు లేకుండా పోడు.

ధర్మచక్రము రచయిత – ముండకోపనిషత్తులోని రెండు పక్షులలో కర్మఫలము ననుభవించునది జీవాత్మ. ఊరకే చూచుచున్న పక్షి సాక్షి, పరమాత్మ. జీవాత్మవలె నాశనము చెందనిది.

అచ్యుతుని శరణుజొచ్చినవానికి భయము లేదు. శ్రీహరి తన భక్తులకు సదా చేయూత నిచ్చుచుండును. ఒక వ్యక్తి సముద్రతీరమున నడుచుచుండేవాడు. ఇసుకలో తన పాదముల గుర్తులకు ప్రక్కనే మరొకరి పాదచిహ్నములను అతడు గుర్తించెను. అవి భగవంతుని అడుగుజాడలని అతడు గ్రహించెను. కొంత కాలమునకు ఆవ్యక్తి దుర్భరమైన కష్టముల ననుభవించెను. ఆ సమయంలో అతనికి ప్రక్కన వేరే అడుగుజాడలు కనిపించలేదు. భగవంతుడా! నాకష్టకాలంలో నాకు తోడు లేకుండా వెళ్ళిపోయావా? – అని అతడు ఆక్రోశించాడు. అప్పుడు భగవంతుడు చెప్పిన జవాబు – ఇప్పుడు నీకు కనిపించే అడుగుజాడలు నీవి కావు. నావి. నా భక్తులకు కష్టములు దాపురించినపుడు నేను వారి ప్రక్కన నడవను. వారి నా భుజములపై మోసెదను. (http://srivaishnavan.com/)

**అచ్యుతుడితడే ఆదియు నంత్యము – అచ్యుతుడే యసురాంతకుడు**
**అచ్యుతుడు శ్రీవేంకటాద్రిని దానిదే – అచ్యుత అచ్యుత శరణనవో మనసా** – అన్నమయ్య కీర్తన

శ్రీమాన్ రొంపిచర్ల శ్రీనివాసాచార్యులు గారి 'దేవీ భాగవతము' సప్తమ స్కంధమునుండి – మహర్షులు చేసిన దేవీస్తుతి
**నమస్తే విశ్వరూపాయై వైశ్వానర సమూర్తయే**
**నమస్తే జలరూపాయై సూత్రాత్మవపుషే నమః**
**యస్మిన్ సర్వే లింగదేహా ఓతప్రోతా వ్యవస్థితాః**
**నమః ప్రాజ్ఞ స్వరూపాయై నమో వ్యాకృతమూర్తయే**
**నమః ప్రత్యక్స్వరూపాయై నమస్తే బ్రహ్మమూర్తయే**
**నమస్తే సర్వరూపాయై సర్వలక్ష్యాత్మమూర్తయే**

ఓ వైశ్వానరరూపిణీ! ఓ విశ్వరూపిణీ! నీకు మా ప్రణామములు. ఏ చిద్రూపిణియందు లింగదేహములన్నియు నిండియున్నవో ఆ సూత్రాత్మ స్వరూపిణికి మా నమస్కారములు. సమస్త శరీరములందు అవ్యాకృత రూపిణి, ప్రాజ్ఞ స్వరూపిణి, ప్రత్యక్స్వరూపిణియునగు బ్రహ్మమూర్తికి మా ప్రణామములు. ఆ తల్లిని యెల్లపుడు స్తుతింతుము.

**శ్రీదేవీ సిద్ధపీఠములు**

జనమేజయుడు – సిద్ధపీఠములననేవి? అవియెన్ని? వాటి పేర్లేవి? అచటి దేవతల పేర్లను గూడ వినగోరుచున్నాను – అనియడుగగా వ్యాసుడిట్లు చెప్పెను – ఓ రాజా! దేవీ పీఠములను గూర్చి వినినచో మానవుడు పాపము తొలగినవాడగును. పరమసిద్ధిని, విభూతిని కోరువారు యేయే పీఠమందు యేయే నామములతో దేవిని ఉపాసించి ధ్యానింపవలయునో చెప్పెదను వినుము.

కాశీపీఠములో '**విశాలాక్షి**'యను పేరుతో దేవి పూజింపబడును. నైమిశారణ్యమునందలి దేవి '**లింగధారిణి**'. ప్రయాగలో దేవి '**లలిత**'. గంధమాదన పర్వతమునందలి దేవి '**కాముకి**'. దక్షిణ మానసమున '**కుముద**'. ఉత్తర మానసమున అన్ని కోరికలను దీర్చు '**విశ్వకామ**'. గోమంతమందు '**గోమతి**'. మందరపర్వతముపై '**కామచారిణి**'. చైత్రరథమున '**మదోత్కట**'. హస్తినాపురమున '**జయంతి**'. కన్యాకుబ్జమందు '**గౌరి**'. మలయ పర్వతముపై '**రంభ**'. ఏకామ్ర పీఠమున '**కీర్తిమతి**'. విశ్వమందు '**విశ్వేశ్వరి**'. పుష్కరమున '**పురుహూతి**'. కేదారమందు '**సన్మార్గదాయిని**'. హిమాలయము వెనుక '**మంద**'. గోకర్ణమున '**భద్రకర్ణిక**'. స్థానేశ్వరమున '**భవాని**'. బిల్వకమున '**బిల్వపత్రిక**'. శ్రీశైలమున '**మాధవి**'. భద్రేశ్వరమున '**భద్ర**'. వరాహ పర్వతమున '**జయ**'. కమలాలయమున '**కమల**'. రుద్రకోటియందు '**రుద్రాణి**'. కాలంజరమున '**కాళి**'. శాలగ్రామమున '**మహాదేవి**'. శివలింగమున '**జలప్రియ**'. మహాలింగమున '**కపిల**'. మాకోటమున '**ముకుటేశ్వరి**'. మాయపురియందు '**కుమారి**'. సంతానమందు '**లలితాంబిక**'. గయలో '**మంగళ**'. పురుషోత్తమమున '**విమల**'. సహస్రాక్షమున '**ఉత్పలాక్షి**'. హిరణ్యాక్షమున '**మహోత్పల**'. విపాశలో '**అమోఘాక్షి**', పుండ్రవరమున '**పాటల**' అనియు దేవిని పిలుచుచుందురు.



ముండూరు ఆలయంలో శ్రీ అమ్మవారు

మరియు సుపార్శ్వమునందు '**నారాయణి**', త్రికూటమున '**రుద్రసుందరి**', విపులమున '**విపుల**', మలయాచలమున '**కళ్యాణి**', సహ్యపర్వతముపై '**ఏకవీర**', హరిశ్చంద్రమున '**చంద్రిక**', రామతీర్థమున '**రమణ**', యమునయందు '**మృగావతి**', కోటతీర్థమున '**కోటవి**', మాధవీవనమున '**సుగంధ**', గోదావరియందు '**త్రిసంధ్య**', గంగాతీరమున '**రతిప్రియ**', శివకుండమున '**శుభానంద**', దేవికాతటమందు '**నందిని**', ద్వారకయందు '**రుక్మిణి**', బృందావనమున '**రాధా**', మధురలో '**దేవకి**', పాతాళమున '**పరమేశ్వరి**', చిత్రకూటమున '**సీత**', వింధ్యపర్వతముపై '**వింధ్యవాసిని**', కరవీరమున '**మహాలక్ష్మి**', వినాయకమున '**ఉమాదేవి**', వైద్యనాథమున '**ఆరోగ్య**', మహాకాళమున '**మహేశ్వరి**', ఉష్ణతీర్థమున '**అభయ**', వింధ్యగిరిపై '**నితంబ**', మాండవ్యమున '**మాండవి**', మహేశ్వరీపురమున '**స్వాహా**', ఛగండమున '**ప్రచండ**', అమరకంటకమున '**చండిక**', సోమేశ్వరమున '**వరారోహ**', ప్రభాసమున '**పుష్కరావతి**', సరస్వతిలో '**దేవమాత**', సాగరతటమున '**పారావార**', మహాలయమున '**మహాభాగ**', పయోష్ణిలో '**పింగలేశ్వరి**', కృతశౌచమున '**సింహిక**', కార్తికమున '**అతిశాంకరి**', ఉత్పలావర్తమున '**లోల**', శోణసంగమమున '**సుభద్ర**', సిద్ధవనమందు '**లక్ష్మీమాత**', భరతాశ్రయమున '**అనంగ**', జాలంధరమున '**విశ్వముఖి**', కిష్కింధ పర్వతమున '**తార**', దేవదారు వనమున '**పుష్టి**', కాశ్మీరమున '**మేధ**', హిమాద్రిపై '**భీమాదేవి**', విశ్వేశ్వరీక్షేత్రమున '**తుష్టి**', కపాలమోచనమున '**శుద్ధి**', కాయావరోహణమున '**శ్రీమాత**', శంభోద్ధారమున '**ధర**', పిండారకమున '**ధృతి**' యనియు శ్రీదేవికి నామములు.

శ్రీదేవి నామములు నూటయెనిమిది. అట్లే శ్రీదేవి పీఠములు కూడ నూటయెనిమిదిగ ప్రసిద్ధి చెందినవి. ఈ భూమండలమందింకను ముఖ్యములైన దేవీనిలయము లున్నవి. ఎవడీ నూటయెనిమిది దేవీపీఠ నామములు వినునో, చదువునో వాడు సమస్త పాపములనుండి విముక్తుడై దేవీ సాలోక్యమును పొందగలడు. .... .... దేవియొక్క ఈ నూటయెనిమిది నామములను జపించి చాలమంది సిద్ధిని పొందిరి. ఈ నూటయెనిమిది నామములను పుస్తకములో వ్రాయించినచో గ్రహబాధలు తొలగును. అతని సౌభాగ్యము వృద్ధి చెందును. అతనికి పొందరానిది యుండదు.

## 321. ప్రథితః

- ప్రసిద్ధి చెందినవాడు. ప్రతిష్ఠగలవాడు.

### ఓం ప్రథితాయ నమః

ప్రథ్ – ప్రఖ్యాన్ – ప్రసిద్ధి – అనే మూలమునుండి ఈ నామముయొక్క భావమును గ్రహింపనగును. ఇంతకుముందలి నామము 'అచ్యుతః' అనగా పతనము లేనివాడు, తోడు వీడనివాడు, తరుగు లేని దేవదేవుడు. అలా అచ్యుతునిగా ప్రసిద్ధి చెందినందున శ్రీదేవుని 'ప్రథితుడు' అని నుతింతురు. ఇందుకు పెక్కు ప్రమాణములను చెప్పవచ్చును.

**తస్యనామ మహాద్ యశః** – తైత్తరీయ నారాయణ 1.9
**యశసశ్చ ఏక భాజనమ్** – రామాయణము. కిష్కింధకాండ 15.9
**పెరుమై ఉడియా పిరానార్** – తిరువైమోళి 1.6.9
**నగర్ ఈల్ పుగళై** – తిరువైమోళి 6.10.10

ధర్మచక్రము రచయిత వ్యాఖ్య – ధనము, పదవి వంటి వానివల్ల లభించు ప్రతిష్ఠ తాత్కాలికము. కాని సత్యధర్మవ్రతముల వలన వచ్చు పేరు శాశ్వతము. హరిశ్చంద్రుడు, పాండవులు, ప్రహ్లాదుడు, హనుమంతుడు వంటివారు ఈ విధముగా లోకపూజ్యులైరి. ఇక భగవానుడు సత్యపరాక్రముడు, సత్యము, సత్యకాముడు, సత్యసంకల్పముగలవాడు, సత్యవ్రతుడు. కనుక ఆయన ప్రఖ్యాతి అనితరము, అనంతము, శాశ్వతము. ఆయన ప్రథితుడు. అచ్యుతుడు. భార్గవరాముడు.

**అన్నమయ్య కీర్తననుండి –**
పాత్రదానోత్సవ ప్రథిత వేంకటరాయ - ధాత్రీశ కామితార్థ ప్రదాయ
గోత్ర విన్మణి రుచిర గాత్రాయ రవిచంద్ర - నేత్రాయ శేషాద్రి నిలయాయతే నమో
నారాయణాయ సగుణబ్రహ్మణే సర్వ - పారాయణాయ శోభనమూర్తయే నమో

## 322. ప్రాణః

- తన భక్తులకు ప్రాణమైనవాడు (శ్రీ భట్టుల వ్యాఖ్య).
- సకల భూతముల చైతన్యకారకమగు ప్రాణశక్తి (శ్రీ శంకరుల వ్యాఖ్య).

### ఓం ప్రాణాయ నమః

67వ, 422వ నామములు కూడా 'ప్రాణః'.
8వ శ్లోకము – 67వ నామము – ప్రాణః - **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**
35వ శ్లోకము – 322వ నామము – ప్రాణః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**
44వ శ్లోకము – 408వ నామము – ప్రాణః **– వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**

నారాయణుని శరణుజొచ్చిన భక్తులకు ఆయనే ప్రాణము. గోవింద నామ స్మరణయే చేతనత్వము. హరి సేవయే అమృత పానము. అన్ని ప్రాణులయందు స్థితమైన మూలప్రాణము నారాయణుడే.

**ప్రాణోవా అహమస్మి** – నేను ప్రాణమైయున్నాను – ఐతరేయారణ్యక 2.2.3.

**ఉలగుక్కే ఓర్ ఉయిరు మానాయ్** – తిరువైమొళి 6.9.7.

**ప్రాణోऽస్మి ప్రజ్ఞాత్మా తన్మాయు రమృత మిత్యుపాస్వ** – జ్ఞానమయుడనైన నేను ప్రాణముగా ఉందును. అటువంటి నన్ను ఆయుష్షు అనీ, అమృతమనీ అంటారు. **పుంసామ్ జీవిత రూపత్వాత్ ప్రాణ ఇత్యభిధీయతే**

**తరువాతి 11 నామములను శ్రీకూర్మావతార పరంగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

**జయదేవుని దశావతార స్తుతి నుండి.**

క్షితిరతి విపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణిధర కిణ చక్ర గరిష్ఠే
కేశవ! ధృత కచ్ఛప రూప! జయ జగదీశ హరే!

**పోతన భాగవతమునుండి**

సవరనై లక్ష యోజనముల వెడలుపై కడు గఠోరంబైన కర్పరమున
నదనైన బ్రహ్మాండమైన నాహరించు ఘనతరంబగు ముఖ గహ్వరంబు
సకల చరాచర జంతురాసులనెల్ల మ్రింగి లోగొనునట్టి మేటి కడుపు
విశ్వంబు పై వేఱు విశ్వంబు పైబడ్డ నాగిన గదలనియట్టి కాళ్లు

వెలిగి లోనికి జనుదెంచు విపుల తుండ
మంబుజంబుల బోలెడి యక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి చెలువొంద నొక మహాకూర్మమయ్యె

కమఠంబై జలరాశిన్ జొచ్చి లఘుముక్తాశుక్తి చందంబునన్
నమ దద్రీంద్రమునెత్తె వాసుకిమహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళి కంపములతో నౌ నౌ గదే బాపురే
కమలాక్షా! శరణంచు భూ దిశలు నాకాశంబునున్ మ్రోయగాన్



కూర్మావతారం. 1850 కాలపు చిత్రం.
వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Kurma_deva.jpg

## 323. ప్రాణదః

- ప్రాణములను, బలమును ప్రసాదించువాడు (సురాసురులకు).
- ప్రాణములను హరించువాడు (అసురులకు).

### ఓం ప్రాణదాయ నమః

66, 323, 409, 956వ నామములు 'ప్రాణదః'
8వ శ్లోకము - 66వ నామము - ప్రాణదః – **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**
35వ శ్లోకము – 323వ నామము – ప్రాణదః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**
44వ శ్లోకము – 409వ నామము – ప్రాణదః – **వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**
102వ శ్లోకము – 956వ నామము – ప్రాణదః – **ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – క్షీరసాగర మథన సమయమున దేవతలకు తగు బలమునొసగినవాడు. శ్రీకూర్మరూపధారి. **మరుతాం బలదానాద్ధి సముద్ర మథనే భృశమ్ ప్రాణదశ్చ సముద్దిష్ట కూర్మరూపతయా హి సః**

శ్రీ శంకరులు రెండు అర్థములు చెప్పారు.

ద – ఇచ్చుట – దేవతలకు, దానవులకు కూడ ప్రాణములు ప్రసాదించువాడు ప్రాణదుడు.

ద్యాతి – తగ్గించుట – దానవుల బలమును నాశనము చేయువాడు గనుక ప్రాణదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ గారు ఈ రెండు భావములను మిళితము చేసి ఇలా చెప్పారు – **ప్రాణాన్ దదాతి ద్యాతి ఖండయతి వ స ప్రాణదః** – భగవంతుడు అందరికి ప్రాణమలు ప్రసాదించును. సమయము ఆసన్నమైనపుడు ప్రాణములను హరించును.

ధర్మచక్రము రచయిత – మన శరీరములోని అవయవములు, ఇంద్రియములు, మనస్సు – అన్నీ మనలోని ప్రాణశక్తియొక్క చైతన్యమును ప్రతిబింబించు భాగములు. ప్రాణము లేనియెడల ఇవి పని చేయవు. భగవంతుడొసగిన ప్రాణమే అన్ని భావములకు, అన్ని అనుభవములకు, అన్ని కార్యములకు ఆధారము. ఇవన్నీ భగవదారాధనగా భావించి సద్వినియోగపరచుకొనవలయును.

## 324. వాసవానుజః

- ఇంద్రుని సోదరుడు.
- సర్వాంతర్యామి.

### ఓం వాసవానుజాయ నమః

వాసవుడనగా ఇంద్రుడు. ఇంద్రుని తమ్మునిగా అవతరించి, క్షీరసాగర మథనము ద్వారా అమృతమును సాధించుటకు సహాయపడినవాడు గనుక భగవానుడు వాసవానుజుడు. ఈ నామము 153వ నామమైన 'ఉపేంద్రః', అనగా వామనావతార నామము కంటె భిన్నమైనదని శ్రీ వి.వి. రామానుజన్ గారు సూచించారు.

ఇంద్రునితో సంబంధము లేకుండా వేరు వివరణను శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు చెప్పారు.

**వసతి సర్వత్ర వస్తే సర్వమ్ ఇతి వా వాసుః ఈశ్వరః వాసోః ఇదమ్ వాసవమ్ సర్వమ్ జగత్**

**వాసవమ్ జగత్ అనిజాతో (అనుప్రవిష్టో) వాసవానుజః**

అనుజాత – అప్రవిష్ట – ప్రవేశించియుండువాడు – సర్వత్ర, అన్ని వస్తువులందు వసించు ఈశ్వరుడు వాసవానుజుడు.

## 325. అపాంనిధిః

- జలములను ధరించినవాడు / భరించినవాడు.
- సాగర స్వరూపుడు.

### ఓం అపాంనిధయే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్యానమునందు శ్రీమహాకూర్మావతార వర్ణన కొనసాగినది. **అపాన్నిధిర్మథ్యమాన మహార్ణవ విధారణాత్** – మహార్ణవము మథనము జరుగుచున్నపుడు శ్రీకూర్మరూపియై మందరగిరినెత్తిన శ్రీహరి జలములను నిలబెట్టినాడు (ధరించినాడు) గనుక ఆయన అపాంనిధి. శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (4.75)నుండి ఉదాహరించారు – **అప్పనే! అళ్ కడలైక్ కడైంద తుప్పనే!**

భగవద్గీత (10.24)లో **– సరసామస్మి సాగరః** – జలాశయములందు నేను సముద్రుడను – అని భగవానుడు చెప్పిన విషయము ఆధారముగా శ్రీ శంకరులు 'అపాంనిధి' అనగా 'సముద్రము' అని వ్యాఖ్యానించారు.

**అపో యత్ర నిధయన్తే సః అపాంనిధిః –** జలములు ఎక్కడ సమృద్ధిగా నుండునో అది అపాంనిధి. సముద్రముయొక్క గాంభీర్యము, అసమాన శక్తి ఇవన్నియును భగవంతుని దివ్యైశ్వర్య బల సంపన్నతకు సంకేతములని శ్రీ చిన్మయానంద సూచించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి, ధర్మచక్రము రచయిత ఈ నామానుభవమును మరింత విస్తారంగా వివరించారు – నదులన్నీ సముద్రమున విలీనమైనట్లే భక్తులు భగవంతుని చేరుకొంటారు. సముద్రమునుండి ఆవిరైన నీరు మేఘములై, వర్షమై, నదులై మరల సముద్రమును చేరినట్లుగా సకల జీవములకు మూలము, అంతము పరమాత్ముడే. సముద్రము చేరిన పిదప అనేకవిధములైన జలములు భేదము లేకుండా కలిసినట్లుగా జీవాత్మలలో తుదకు భేదము సమసిపోవును. బయట ఏరులకు చెరువులకు హద్దులు (గట్లు) ఉండును కాని సముద్రమును విభజింప సాధ్యము కాదు. పైన కల్లోలితముగా కనిపించే సాగరము లోపల ప్రశాంత గంభీరము. ఇవన్నీ అపాంనిధి లక్షణాలు.

## 326. అధిష్ఠానమ్

- ఆధారమైనవాడు. నిలబెట్టువాడు.

### ఓం అధిష్ఠానాయ నమః

మందరగిరిని కవ్వముగా చేసి, వాసుకిని త్రాడుగా చుట్టి, దేవదానవులు అమృతము కొరకు సాగరమును మథించునపుడు పర్వతము మునిగిపోకుండా కూర్మరూపియై నిలిపినవాడు గనుక భగవంతుడు 'అధిష్ఠానము' – **భ్రమమాణమ్ మందరాద్రిం ధృతవాన్ యో మహాబలే అధిష్ఠానమ్ తమేవాహుః అధిష్ఠాన్ ప్రదో మనుః** - అని వివరిస్తూ శ్రీభట్టులు విష్ణుపురాణము (1.9.88)నుండి ఉదాహరించారు. ఈ దివ్యనామము చేయూతనిచ్చును.

**క్షీరోదమధ్యే భగవాన్ కూర్మరూపీ స్వయమ్ హరిః**

**మందరాద్రే అధిష్ఠానమ్ భ్రమతోఽభూత్ మహామునే**



ఏలూరు శనివారపు పేట గోపురంపై సాగర మంథనం శిల్పాలు

శ్రీ శంకరులు మరింత విస్తారమైన అర్థము వ్యాఖ్యానించారు. సమస్త ప్రపంచమునకు ఆధారమైనవాడు, ఉపాదానమైనవాడు అధిష్ఠానము. అన్నింటికీ నెలవు ఆయనే. అంతటినీ నిలుపువాడు ఆయనే. అధిష్ఠానమైనవాడు **– అధిష్ఠన్తి భూతాని.**

**మత్ స్థాని సర్వభూతాని** – గీత 9.4 – సకలభూతములు నాయందే గలవు.

ఈశావాస్యోపనిషత్తు – **ఈశావాస్యమిదమ్ సర్వమ్ యత్కించ జగత్యాం జగత్** – ఈ జగత్తులో జడము, చైతన్యము రెండు పదార్థాలు కూడా ఆ పరమేశ్వరుని చేతనే ఆవరింపబడియున్నాయి.

**అధితిష్ఠతి అస్మిన్నితి అధిష్ఠానమ్** – ఆధారమైనవాడు అధిష్ఠానము.

## 327. అప్రమత్తః

- జాగ్రత్త కలవాడు (ఏమరుపాటు లేనివాడు).

### ఓం అప్రమత్తాయ నమః

శ్రీ భట్టుల వివరణ – ఆర్తులైనవారిని కాపాడుటకు సదా అప్రమత్తుడైయుండువాడు. 'ప్రమత్తత' అనగా నిర్లక్ష్యము, సోమరితనము, మాంద్యము. అప్రమత్తుడనగా శరణాగతులను కాచుటకు ఎల్లప్పుడు జాగ్రత్తగా నుండువాడు. **అత్యన్తావహితస్త్రాణే హి అప్రమత్తః ప్రకీర్తితః.**

శ్రీ శంకరుల వివరణ – ప్రమత్తుడు కార్యనిర్ణయములందు పొరపాటు చేయవచ్చును. అప్రమత్తుడు సర్వత్రా, సదా తగు కార్యమును నిర్వహించును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పాలకడలిని చిలికిన పిమ్మట లభించిన అమృతమును పంచిపెట్టుటలో జాగ్రత్త చూపినందున కూడ భగవంతుని అప్రమత్తుడని సేవింపవచ్చును.

ధర్మచక్రము రచయిత – మనుష్యులు మెలకువగానున్న ఇంటిలో దొంగ దూరడు. అలాగే భగవన్నామ స్మరణయందున్న మనస్సులో చెడు ఆలోచనలు ప్రవేశించవు. అప్పుడు ఇంద్రియ ప్రలోభమునకు అవకాశముండదు. హరినామ సంకీర్తనమే మనకు అన్ని విధములుగా రక్షయని ఈ నామ జపమువలన గ్రహింపనగును.

## 328. ప్రతిష్ఠితః

- తనకు తానే ఆధారమైనవాడు. అన్నింటికిని భగవంతుడే ఆధారము.

### ఓం ప్రతిష్ఠితాయ నమః

మందరగిరినెత్తినవానికి వేరు వస్తువు ఆధారము కానేరదు. శక్తి, బలము, మహిమ – అన్నింటిలోను శ్రీమన్నారాయణునకు ఆయనే మూలము, కారణము, ఆధారము. – **సా భగవః క్వ ప్రతిష్ఠిత ఇతి** – ఛాందోగ్యోపనిషత్తు (7.24.1) – భగవంతునకాధారమైనది ఏది? ఆయన స్వీయ మహిమయే.

శ్రీ చిన్మయానంద – విశ్వములో ప్రతిదానికి ఒక కారణముండును. కాని ఆదిమూలమైనవానికి వేరు కారణము లేదు. ఆయన స్వయంభువు. స్వయంప్రకాశకుడు. అజుడు. ప్రతిష్ఠితుడు.

జనులందరి గొప్పతనము వారికున్న బలము, ధనము, వంశము – ఇలా ఏదో ఒకదానిపై ఆధారపడియుండును. కాని ఈ కారణములే అశాశ్వతములు. కనుకనే ధనము, వయసు, బలము, బంధుమిత్రగణము వంటివన్నీ తరిగిపోవుచుండును. కాని శాశ్వతుడైన శ్రీకూర్మావతార స్వరూపుని నమ్ముకున్నవారికి కొదువ లేదు. తరుగు రాదు. శ్రీకృష్ణుని నమ్ముకున్నపుడే పాండవులకు విజయము తథ్యము అయినది.




సాగర మంథనం – 19వ శతాబ్దపు రవివర్మ ప్రెస్ చిత్రం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File:Sagar_Manthan.jpg



## స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయువాహనః |
## వాసుదేవో బృహద్భానురాదిదేవః పురందరః || (36)

### 329. స్కందః

- శోషింపజేయువాడు (ఆసురులను).
- అమృతమువలె ప్రహించువాడు (భక్తులకు).
- సుబ్రహ్మణ్యస్వామి. దేవతల సేనానాయకుడు.

ఓం స్కందాయ నమః

**స్కందయతి శోషయతి ఇతి స్కందః** – అసురులను, దుష్టులను శోషింపజేయువాడు (ఎండించువాడు, క్షీణింపజేయువాడు) – అని శ్రీ భట్టులు వివరించారు.

స్కందతి – గచ్ఛతి, ప్రసరతి – వెన్నవలె కరుగువాడు. భక్తులపట్ల అమృతమువలె ప్రసరించువాడు – శ్రీ శంకరులు చెప్పిన వ్యాఖ్యలలో ఇది ఒకటి.



శ్రీ వల్లీ దేవసేనా సమేతులైన శ్రీ సుబ్రహ్మణ్య స్వామి.

https://commons.wikimedia.org/wiki/File:Pachaimalai_Kalyana_Subramanyar_pic1.jpg

గీత 10.24 – **సేనానీనామ్ అహమ్ స్కందః** – సేనాపతులలో నేను స్కందుడను. స్కందుడు అనగా సుబ్రహ్మణ్యస్వామి, కుమారస్వామి, కార్తికేయుడు – శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు ఈ అర్థమును చెప్పారు.

### **330.** స్కందధరః

- దేవతల సేనాపతియగు స్కందుని (కుమారస్వామిని) తన విభూతిగా ధరించినవాడు – శ్రీ భట్టుల వ్యాఖ్య.
- ధర్మపథమును నిలబెట్టువాడు (కాపాడువాడు) – శ్రీ శంకరుల వ్యాఖ్య.

### ఓం స్కందధరాయ నమః

గీత (10.24)నందలి – **సేనానీమహమ్ స్కందః** – అనే శ్లోకభాగం ఆధారంగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. స్కందునకు మరొక నామము కార్తికేయుడు. ఇతడు పార్వతీ పరమేశ్వరుల కుమారుడు. షణ్ముఖుడు. 12 చేతులు గలవాడు. దేవతల సేనానాయకుడు. జగత్తులోని సేనాపతులందరిలోను ప్రసిద్ధుడు.

'స్కందః' అనగా మార్గము, ధర్మపథము అనే అర్థంలో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. ధర్మమును పరిరక్షించెడువాడు, ధర్మమును అనుసరించేవారిని కాపాడువాడు స్కందధరుడు. శ్రీనివాసుడు.

### **331.** ధుర్యః

- ధరించువాడు. భారమును వహించువాడు. భరించువాడు. దారి చూపువాడు.

### ఓం ధుర్యాయ నమః

'ధుర్' అనగా భారము. బరువును మోయును గనుక ఆయన ధుర్యుడు. శ్రీ కూర్మావతారుడై మందరపర్వతమును మోసిన నగరాజధరుడు. సమస్త విశ్వమును ధరించి, భరించు 'భువనభృత్'. సృష్టి స్థితి లయాది కార్యములను నిర్వహించువాడు. ఆదిశేషుడై భూమిని మోయువాడు. శ్రీవరాహమూర్తియై ధరనుద్ధరించినవాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – 'ధుర్' అనగా ముందుభాఘము. అందరకును ముందుండి దారిచూపు మార్గదర్శియైనందున భగవానుడు ధుర్యుడు.

### **33.** వరదః

- కొండలంత వరములు గూపెడు కోనేటిరాయడు. అత్యుత్తమమగు ఫలములు ప్రసాదించు భక్తవరదుడు.

### ఓం వరదాయ నమః

**వరః అభీప్సితః అర్థః, తమ్ దదాతి ఇతి వరదః** – వరములనగా కోరుకున్న కోరికలు. వరమనగా శ్రేష్ఠమైనది అని కూడ అర్థము. భక్తులకు కావలసిన ధర్మార్థకామమోక్షములను ప్రసాదించువాడు శ్రీమన్నారాయణుడే. మరియు వారికి అత్యుత్తములగు ఫలములు ప్రసాదించునది కూడ భగవంతుడే. ధర్మచక్రము రచయిత శ్రీ తిరుమంగైయాళ్వారువారి పాశురములను ఉదాహరించారు. **నలమ్ తరుమ్ సొల్లై నాన్ కణ్డు కొండేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్** – నారాయణుని నామస్మరణమున పొందరానిది ఏమీ లేదు.

**కులమ్ తరుమ్ సెల్వమ్ తందిడుమ్ ఎడియార్ పడుతుయార్ ఆయిన ఎల్లామ్ నిలమ్ తరమ్ సెయ్యుమ్ ... ... పెఱ్ఱ తాయినుమ్ ఆయిన సెయ్యుమ్.**

## 333. వాయువాహనః

- ప్రాణ స్వరూపమగు వాయువుపై సంచరించువాడు. ఆ విధముగా ప్రాణములు నిలుపువాడు.
- సప్త మారుతములను (ఏడు వాయువులను) అన్ని మండలాంతరములందును చలింపజేయువాడు.

### ఓం వాయువాహనాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

36వ శ్లోకము. 333వ నామము. వాయువాహనః – **స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయువాహనః**

91వ శ్లోకము. 860వ నామము. వాయువాహనః – **ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

సమస్త ప్రాణములకు ఆధారమగునది వాయువు. ఆ వాయువును నడిపించు సారథియైనందున శ్రీమహావిష్ణువే వాయువాహనుడు. **మేడగుమ్ అయింపెరుమ్ భూతముమ్ నీయే** (తిరువెళుక్కుఱ్ఱిక్కై ) – పంచ భూతములను అదుపులోనుంచువాడవు నీవే.

ధర్మచక్రము రచయిత – ప్రాణములను నిలుపు వాయువు మనకు ఎంత అవసరమో తెలిసికొని, ఆ వాయువును అందజేయు వాయువాహనుని ధ్యానించవలయును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – సప్త మండలాంతరములందు చలించు ఏడు విధములైన వాయువులను యథాక్రమముగా సంచరింపజేయువాడు గనుక శ్రీమహావిష్ణువే వాయువాహనుడు. **వాయుమ్ వాహయతీతి వాయువాహనః.**

కశ్యప, దితిల సంతానమైన సప్తమరుత్తులను వివిధ మండలములందు వ్యాపించిన వాయువులకు అధిపతిగా భగవంతుడు నియమించెను. ఈ వాయువుల ప్రభావము (ఒత్తిడి) వలన గ్రహ నక్షత్రాదులు తమ నిర్ణీత మార్గములందు సంచరించును.

ఏడు విధములైన వాయువులు

(1) ఆవహ వయువు – మేఘమండలమునకు, భూమండలమునకు మధ్య ప్రసరించునది.
(2) ప్రవహ వాయువు – సూర్యమండలమునకు, మేఘమండలమునకు మధ్య ప్రసరించునది.
(3) అనువహ వాయువు – చంద్రమండలమునకు, సూర్యమండలమునకు మధ్య ప్రసరించునది.
(4) సంవహ వాయువు – నక్షత్ర మండలమునకు, చంద్రమండలమునకు మధ్య ప్రసరించునది.
(5) వివహ వాయువు – గ్రహమండలమునకు, నక్షత్రమండలమునకు మధ్య ప్రసరించునది.
(6) పరావహ వాయువు –సప్తర్షి మండలమునకు, గ్రహమండలమునకు మధ్య ప్రసరించునది.
(7) పరివహ వాయువు – ధ్రువ మండలమునకు, సప్తర్షి మండలమునకు మధ్య ప్రసరించునది.

**తరువాతి 12 నామములు ఆధ్యాత్మ వాసుదేవుని, అనగా పరవాసుదేవుని స్తుతించు నామములుగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.** ఆసక్తికరమైన విషయము ఏమంటే వాసుదేవ మంత్రములో కూడ 12 అక్షరములు ఉన్నాయని ప్రొఫెసర్ ఎ. శ్రీనివాస రాఘవన్ సూచించారు.

## 334. వాసుదేవః

- సర్వత్ర వ్యాపించి, క్రీడించువాడు. అన్నింటియందు ఉండువాడు.
- అన్నింటినీ తన యందుంచుకొని కాపాడువాడు.
- వసుదేవుని కుమారుడు.

**ఓం వాసుదేవాయ నమః**

ఈ పరమ పవిత్ర నామము మూడుమార్లు ఈ మహాస్తోత్రమున స్తుతింపబడినది.

36వ శ్లోకము. 334వ నామము. వాసుదేవః – **వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః**

74వ శ్లోకము. 701వ నామము. వాసుదేవః – **వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః**

76వ శ్లోకము. 714వ నామము. వాసుదేవః – **భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోనలః**

ముందుగా శ్రీభట్టుల ప్రత్యేకవ్యాఖ్యను గమనించనగును – **'నారాయణ' నామము వలెనే 'వాసుదేవ' నామము మహామంత్రము. ఆచార్య ముఖతః తెలిసికొనదగినది.** ఇందువలన శ్రీభట్టులు ఈ నామార్థమును కేవలము క్లుప్తముగా చెప్పి ముగించారు. ఈ నామములో 'వాసు', 'దేవుడు' అనే రెండు ముఖ్యమైన భగవద్విభూతులు చెప్పబడినవి.

వస్ – నివసించుట, కప్పియుంచుట – అనే ధాతువునుండి గ్రహింపదగిన అర్థములు.

వాసు – సర్వమ్ వసతి – అంతా ఆయనలో వసించును.

వాసు – సర్వత్ర వసతి – ఆయన అన్నిచోట్ల వసించును.

దివ్ – క్రీడాయామ్ – ఆడుట – అనే ధాతువునుండి

దేవ – వినోదించువాడు. లీలాసూత్రధారి. ఆడువాడు. జయింపగోరువాడు. ప్రకాశించువాడు.

ఈ రెండు పదములు (వాసు, దేవ) కలిపి 'వాసుదేవ' నామము వ్యాఖ్యానింపబడినది. భగవంతుడు తల్లివలె సమస్త జగత్తును తనయందు పెట్టుకొని కాపాడును. పక్షివలె రెక్కలలోదాచి పిల్లలను రక్షించును. ఇదియంతయును ఆయన లీల (క్రీడ). అందువలన ఆయన శ్రీవాసుదేవుడు.

**సర్వభూతాన్ వాసయతి వాసుస్స పరికీర్తితః దివ్ ధాతోరపి క్రీడా ద్యర్థకత్వాద్విశేషతః**
**వాసుశ్చ సా దేవశ్చేతి వాసుదేవః ప్రకీర్తితః**
**సర్వభూతేష్వపి వసన్ స్వస్మిన్ భూతాని వాసయన్ యః క్రీడతి ముదా యద్వా వాసుదేవస్స ఉచ్యతే**
**సర్వత్రా సా సమస్తం చ వసత్యత్రేతి వైయతః తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరికీర్తితః**

ఈ అర్థమునకు ప్రమాణముగా శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడ ఇచ్చిన ఉదాహరణలు –

**ఛాదయామి జగద్విశ్వమ్ భూత్వా సూర్య ఇవాంశుభిః**
**సర్వభూతాది వాసశ్చ వాసుదేవః తతః స్మృతః** – మహాభారతము. శాంతిపర్వము. మోక్షధర్మము 12.328.36
నేను సూర్యుడనై కిరణములతో ఈ జగత్తును కప్పివేస్తున్నాను. మరియు సర్వభూతములయందు అంతర్యామియై వసించియున్నాను. కనుక నన్ను వాసుదేవుడనియందురు.

**వసనాత్ సర్వభూతానామ్ వసుత్వాత్ దేవయోనితః**
**వాసుదేవస్తతో జ్ఞేయః యోగిభిస్తత్వదర్శిభిః** – మహాభారతము. ఉద్యోగపర్వము 69.3

నేను అన్ని భూతములకు నివాస (ఆశ్రయ) స్థానమును. మరియు అన్ని భూతములందు దివ్యశరీరముతో వసింతును. కనుక జ్ఞానమునెరిగిన యోగులు నన్ను వాసుదేవునిగా తెలిసికొందురు.

**సర్వత్రాऽసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః**

**తతః స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే** – విష్ణుపురాణము 1.2.12. అన్నింటియందు ఆయన వసించును. అన్నియును ఆయనయందు వసించును. కనుక ఆయన వాసుదేవుడని విద్వజ్ఞులు చెప్పుదురు.

**సర్వాణి తత్ర భూతాని వసంతి పరమాత్మని భూతేషు చ స సర్వాత్మా వాసుదేవస్తతః స్మృతః** – విష్ణుపురాణము 6.5.80

ఆ పరమాత్మునియందు సర్వభూతములు వసించును. మరియు సర్వభూతములయందు ఆ సర్వాత్ముడు వసించును. కనుక ఆయన వాసుదేవుడు.

ద్వాపరయుగమున వసుదేవుని సుతునిగా అవతరించినందున కూడ శ్రీకృష్ణ భగవానుడు వాసుదేవుడని పిలువబడెనని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు సర్వాంతర్యామియైనను కేవలము తన భక్తులకే గోచరించును. అన్నియెడల చలనము, చైతన్యము, ప్రకాశము, జ్ఞానము ఆయన వలననే సంభవించును. కాని ఆత్మజ్ఞానము నెరిగిన వారికే ఆయన తెలియును.

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః.** గీత - జ్ఞానవిజ్ఞానయోగము 7.19

అనేక జన్మల పిదప జ్ఞానియైనవాడు (భగవత్తత్వమును ఎఱిగినవాడు) సర్వమూ వాసుదేవ మయమే యని భావించి నన్ను శరణు పొందును. అట్టి మహాత్ముడు లభించుట అరుదు.



https://commons.wikimedia.org/wiki/File:GitaUpadeshTirumala.jpg Photo by w:User:Raji.srinivas

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము 108వ శ్లోకము

**వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నందకీ**

**శ్రీమాన్నారాయణో విష్ణుః వాసుదేవోऽభిరక్షతు.**

**శ్రీ వాసుదేవోऽభిరక్షతు ఓం నమ ఇతి**

శ్రీ విష్ణు సహస్ర నామము ఉత్తర పీఠికనందు వాసుదేవ నామము అనేకమార్లు ప్రస్తావింపబడినది.

**భక్తిమాన్ యః సదోత్థాయ శుచిస్తద్గతమానసః**

**సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ ప్రకీర్తయేత్** (5)

**వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః**

**సర్వపాప విశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనం** (10)

**న వాసుదేవ భక్తానా మశుభం విద్యతే క్వచిత్**
**జన్మ మృత్యు జరా వ్యాధి భయం నైవోపజాయతే** (11)

**ద్యౌ స్సచంద్రార్కనక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః** (14)

**ఇంద్రియాణి మనో బుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ** (16)
వ్యాస ఉవాచ:
**వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ సర్వభూత నివాసోऽసి వాసుదేవ నమోऽస్తుతే**
**శ్రీ వాసుదేవ నమోऽస్తుత ఓం నమ ఇతి.**

## 335. బృహద్భానుః

- గొప్ప కిరణములు గలవాడు. అమిత ప్రకాశము గలవాడు.

### ఓం బృహద్భానవే నమః

'బృహత్' అనగా పెద్ద, గొప్ప. 'భాను' అనగా కిరణములు. విశ్వమునకు, సూర్యచంద్రాగ్నులకు ప్రకాశము నొసగువాడు గనుక వాసుదేవుడే బృహద్భానుడు. ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన ప్రమాణము –

**బృహంతో భానవో యస్య చంద్ర సూర్యాదిగామినః**
**తైర్విశ్వమ్ భాసయతి యః స బృహద్భానురుచ్యతే** – ఉద్యోగపర్వము 70.4
చంద్ర సూర్యులను అధిగమించు గొప్ప కిరణములు కలిగి, వానిద్వారా విశ్వమును వెలిగించువానిని బృహద్భానువందురు.

ముండకోపనిషత్తు (2.2.10)నుండి శ్రీ రాధాకృష్ణ శాస్త్రి ఇచ్చిన ఉదాహరణ –
**న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకమ్ నేమా విద్యుతో భాన్తి కుతో యమాగ్నిః**
**తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదమ్ విభాతి**
అక్కడ సూర్య చంద్రాగ్నులు ప్రకాశించరు. ఆయనయే అన్నింటికి వెలుగు.

ధర్మ చక్రము రచయిత – సూర్యుడు బహిర్లోకమునకు వెలుగు ప్రసాదించును. భగవంతుడు ఆత్మ జ్ఞానముకు కావలసిన వెలుగును ప్రసాదించును.

డా. క్రోవి పార్థసారధి 'శ్రీకైవల్య సారధి' నుండి – ఆ పరమేశ్వరుడు ఒక పెద్ద జ్ఞానజ్యోతి. అతని శరీరమునుండి వందలు, వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్ల కొలది కిరణములు ప్రకాశిస్తున్నాయి. అందులో అగ్ని 108, సూర్యుడు 176, చంద్రుడు 136 కిరణములను మాత్రమే తీసికొన గలిగారు. ఈ కిరణముల చేతనే అంటే పగటి పూట సూర్యుని వెలుగులతో, రాత్రిపూట చంద్రుని కాంతులతో, సంధ్య వేళలయందు అగ్ని కాంతులతో ఈ జగత్తు ప్రకాశిస్తున్నది. అని 'భైరవ యామళము'లో చెప్పబడినది.

## 336. ఆదిదేవః

- మొట్టమొదటి దేవుడు. సంపూర్ణ లీలా నాటక వినోది.
- అన్నింటికి ప్రథమ కారణము.
- ఇచ్చువాడు. వెలుగువాడు. వెలిగించువాడు. విశ్వాత్మకుడు.

## ఓం ఆదిదేవాయ నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.

36వ శ్లోకము. 336వ నామము. ఆదిదేవః – **వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః**

52వ శ్లోకము. 491వ నామము. ఆదిదేవః – **ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః**

'వాసుదేవ' నామములో 'దేవ' అనే పదమునకు 'క్రీడించువాడు' అని అర్థము వివరించడమైనది. అదే ఆధారముగా 'ఆదిదేవుడు' అనగా సమస్త సృష్టి లయాది కార్యములు ఆయన లీలయే యని గ్రహింపవలెను – **యః క్రీడతీత్యాది దేవః పాదాత్మకః విభూతిభిః.** చిన్నపిల్లవాడు తన ఇష్టానుసారము ఇసుకలో ఇండ్లు కట్టి మరల చెల్లాచెదరు చేసినట్లే ఆదిదేవుడు సృష్టిస్థితిలయాది కార్యములందు ఆడుకొనును. అని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు. **అఖిల భువన జన్మస్థేమ భంగాది లీలే** – అంతా ఆయన లీల మాత్రమే. **ఆదిశ్చాసౌ దేవశ్చ ఆదిదేవః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి నిరుక్తము (7.25)నుండి ఉదాహరించారు. **దేవో దానాద్వా దీపనాద్వా ద్యుస్థానో భవతి** – దేవుడనగా పుష్కలముగా ప్రసాదించువాడు (వరమిచ్చువాడు), తానై వెలుగువాడు, ఇతరులను వెలిగించువాడు, ద్యులోకమున (అంతరిక్షమున) నుండువాడు. అట్టి దేవుళ్ళలో మొదటివాడు గనుక భగవానుడు ఆదిదేవుడు.

*(ఈ నామమునకూ , ఇంకా శ్రీ విష్ణుసహస్ర నామ స్తోత్రములోని మరి కొన్ని నామములకూ చక్కని అర్థము పోతనగారి గజేంద్రమోక్షములోని పద్యాలలో ఉన్నదని నాకనిపిస్తుంది – కా.సు. బాబు)*

**ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై;**
**ఎవ్వనియందు డిందు, పరమేశ్వరు డెవ్వడు; మూల కారణం**
**బెవ్వ; డనాదిమధ్యలయు డెవ్వడు; సర్వముదాన యైన వా**
**డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.**

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం**
**డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్**

**విశ్వకరుని విశ్వదూరుని**
**విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వునవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు**
**నీశ్వరునిం బరమ పురుషు నే భజియింతున్.**



శ్రీ గజేంద్ర పరిరక్షణ – 18వ శతాబ్దపు చిత్రం. వికీపీడియానుండి
https://commons.wikimedia.org/wiki/File:Brooklyn_Museum_-_Vishnu_Saving_the_Elephant_(Gajendra_Moksha).jpg

## 337. పురందరః

- పురములను నాశనము చేసినవాడు (త్రిపురాంతకుడు, ఇంద్రుడు).
- అధిదైవికములగు కష్టములనుండి కడతేర్చువాడు.
- స్థూల, సూక్ష్మ, కారణ శరీరములనుండి విముక్తిని పొందుటకు భక్తులకు సాయము చేయువాడు.
- అన్ని జీవుల శరీరములను తుదకు నాశనము చేయువాడు.

## ఓం పురందరాయ నమః

'పురములు' అనగా నగరములు. 'దర' అనగా ధ్వంసము చేయుట. **పురమ్ దారయతి ఇతి పురందరః.** త్రిపురాసుర సంహారమును సాగించిన రుద్రునకు అంతర్యామి అయినందున భగవానుడు పురందరుడు. శ్రీ వి.వి. రామానుజన్ గారు ఈ వివరణకు సమర్ధనగా శ్రీ నమ్మాళ్వార్ తిరువైమోళినుండి ఈ పాశురము (1.1.8)ను ఉదాహరించారు.

**పురమ్ ఒరు మూన్ఱు ఎఱిత్తు అమరుక్కుమ్ అఱివు ఇయన్దు**
**అరన్ అయన్ ఏన ఉలగు అళిత్తు అమైత్తు ఉళనే**
ఎంపెరుమాన్ వారే రుద్రుడై మూడు పురములను నశింపజేసెను. బ్రహ్మయై దేవతలకు వేదజ్ఞానము నందించెను. ఆయనే సకల సృష్టి స్థితి లయ కార్యములు సాగించును.



త్రిపురాసుర సంహారానికి వెడలిన శ్రీ రుద్రుడు. చెన్నై గోపురం శిల్పం.

Photo by Bernard Gagnon. https://commons.wikimedia.org/wiki/File:Gopuram_Madras.jpg

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **పురాణి శంబరాదినామ్ అసురాణామ్ నగరాణి దృణతి ఇతి పురందరః** – శంబరునివంటి అసురుల నగరములను నాశనము చేసినవాడు పురందరుడు. ఇందుకు ప్రమాణముగా ఋగ్వేద మంత్రము (7.99.5) – **ఇంద్రా విష్ణు దృగమ్ హిత శంబరస్య నవపురో నవతిమ్ చ శ్నతిష్టమ్.** నీవే ఇంద్రుడవు. నీవే విష్ణువు. నీవే శంబరుని తొమ్మిది దుర్గమ నగరములను నాశనము చేసినవాడవు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సుర శత్రూణామ్ పుర దారణాత్ పురందరః** – దేవతల శత్రువుల పురములను నాశనము కావించువాడు పురందరుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అసుర పురాణి దారయతి ఇతి పురందరః** – అనగా రాక్షసులు, పిశాచములు, పిడుగు, గ్రహబాధలు వంటి అధిదైవిక పీడలను నాశనము చేయువాడు పురందరుడు. ఇక్కడ 'పురము' అనగా రాక్షసులకు నిలయమైనది. అట్టి అసుర స్థావరములను ధ్వంసము చేయును గనుక ఆయన పురందరుడు.

శ్రీ చిన్మయానంద – జాగ్రత్, స్వప్న, సుషుప్తి యను మూడు అవస్థలు మూడు పురములు. స్థూల, సూక్ష్మ, కారణ రూపములగు మూడు శరీరములతోనున్న బంధము విడనంతవరకు ఈ అవస్థలు (పురములు) జీవుని చుట్టుముట్టియే యుండును. శరీరమునుండి విడివడి, ఆ యవస్థాపురములను ఛేదించిన గాని ఆత్మజ్ఞానము సిద్ధింపదు. ఈ ప్రక్రియ శ్రీహరి యనుగ్రహము వల్లనే సాధ్యము గనుక ఆయన పురందరుడు.

ఈ విషయమును ధర్మచక్రము రచయిత చక్కగా వివరించారు – ఈ స్థూల శరీరము భగవంతునిదేనని భావించి, భగవత్సేవకే తనువును అంకితము చేసినపుడు, భగవదనుగ్రహము వలన స్థూల శరీరమునుండి విముక్తి లభించును. ఈ మనస్సును భగవంతుని ధ్యాన స్మరణాది భావములందు లయమొనర్చినపుడు భగవంతుడు మన మనస్సుల ప్రేరణవలన జరుగు కర్మల ప్రభావమునుండి విముక్తిని ప్రసాదించును. ఆయనయందు మహావిశ్వాసము కలిగి సంపూర్ణ శరణాగతులైనవారికి కారణ శరీరమునుండి కూడ విముక్తి లభించును. అప్పుడే ఆత్మజ్ఞానము సాధించుటకు మార్గము సుగమమగును. ఆ మార్గమునకు ద్వారము తెరచు భగవంతుడే పురందరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **పురమ్ దారయతి ఇతి పురందరః** – పురములను నాశనము చేయువాడు పురందరుడు. పురము అనగా శరీరము. ఈ పురమునందే జీవుడు వసించును. కాలము చెల్లిన పిదప అందరినీ కడతేర్చువాడు, అందరినీ దరిచేర్చువాడు పురందరుడు.



కేరళ పీచి ఆనకట్ట వద్ద
శ్రీ పరశురాముని విగ్రహం

Photo by Ranjithsiji
https://commons.wikimedia.org/wiki/File:Peechi_Dam_Garden_Statue_of_Parasurama.JPG



## అశోకస్తారణస్తారః శూరః శౌరిర్జనేశ్వరః |
## అనుకూలః శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః || (37)

**పురందరః అశోకః తారణః తారః**

ఇంతకు ముందు నామమైన **'పురందరః'** మరియు ఇప్పటి మూడు వరుస నామములు **'అశోకః', 'తారణః', 'తారః'** – ఈ నాలుగు నామములు మన భయములను తొలగించే భగవంతుని దయాగుణ గానమయ పుణ్యకీర్తనలు అని చెప్పబడెను. ఏ నామస్మరణము ఏ విధమైన భయహారకము? అనే విషయంలో వేరువేరు వ్యాఖ్యానకర్తల అభిప్రాయాలలో స్వల్పవైవిధ్యము కనిపిస్తుంది. మొత్తానికి భగవానుని నామస్మరణము సకల భయాపహము అని మనము గ్రహింపవలసి ఉన్నది.

శ్రీ రాధకృష్ణశాస్త్రిగారు చక్కని తరణోపాయమును సెలవిచ్చారు. ఏ విధమైన భయములు గాని, కష్టములు గాని చుట్టుముట్టిన యెడల **'అశోకస్తారణస్తారః'** అని స్మరించినట్లయితే కష్టములనుండి బయటపడు మార్గము లభించి తీరును. ఈ భయములు ఆధ్యాత్మికము, అధిభౌతికము, అధిదైవికము అని మూడు విధములుగా శ్రీ భట్టులు వివరించారు. పిశాచములవల్ల, రాక్షసులవల్ల కలుగు భయము అధిదైవికము. శతృవుల వలన, పాములు, పులులు వంటి జంతువులవలన సంభవించునది అధిభౌతికము. మాయ, ఆకలి, శోకము వంటివానివలన ఆధ్యాత్మిక భయము కలుగును.

ఇక వీటన్నింటిని మించినది జనన మరణ చక్ర బంధితమైన సంసార భయము. ఈ భయముల గురించి అందరికీ తెలుసు. కాని వానిని భగవంతుడెలా తొలగించును? అందుకు ధర్మచక్రము రచయిత చక్కని వివరణ చెప్పారు – మనము శరీరమునే జీవము అని భ్రమించుటవలన భయము కలుగును. ఆత్మజ్ఞానము కలిగినవానికి ఆత్మ నశింపదని, దానిని అగ్ని దహింపలేదని తెలియును. వానికి భయముండదు. శ్రీమహావిష్ణు ధ్యానమే అట్టి జ్ఞానమునకు మార్గము.

శ్రీనివాసుని ఆర్తత్రాణ పరాయణత్వమును పెక్కురు భక్తులు పలువిధముల కీర్తించిరి. దేవతలకైనా, సామాన్య మానవులకైనా ఇడుములను హరించునది హరినామ స్మరణయే.

**అన్నమయ్య కీర్తన**

నీయంతటివారెవ్వరు నీకు నెదురేది యెందు - చాయల నీ సుద్ది విని శరణంటి నేను
కావలెనంటే దొల్లి కంభము చించుకవెళ్ళి - కైవశమై ప్రహ్లాదు గావవా నీవు

తేవలనంటే బ్రహ్మ దేవునికి వేదములు - సోవల సముద్రమయిన చొచ్చి తేవా నీవు
పట్టియెత్తవలెనంటే బాతాళాన బడ్డకొండ - తట్టియెత్తి పాలవెల్లి దచ్చవా నీవు

మట్టుపెట్టవలె నంటే మరి భూమి చాపగాగ - చుట్టుకపోతే దెచ్చి సొంపుగ నిలుపవా
పక్షపాతమయ్యేనంటే బాండవుల గెలుపించి - యీా క్షితి నేలించి చనవియ్యవా నీవు

రక్షించేనంటే గాచరావ శ్రీవేంకటాద్రి బ్ర - త్యక్షమై మావంటివారి దగ గరుణించవా

ఈ విధముగా బ్రహ్మాది మహాత్ములకు సంభవించిన విపత్తులను పరిహరించి బ్రోచువాడు అయిన శ్రీనివాసుడు శ్రీవేంకటాద్రిపై వెలసియున్నాడు. బ్రహ్మాదులకే కాదు. సామాన్యులు సదా చింతించు కష్టములను పరిమార్చు సాధనము శ్రీవేంకటేశుని పుణ్యనామమేయని అన్నమయ్య మరొకమారు కీర్తించారు.

ఆకటి వేళల అలపైన వేళలను - తేకువ హరినామమే దిక్కు మరి లేదు

కొఱమారియున్న వేళ కులము చెడిన వేళ - చెఱవడి వొరుల చేజిక్కినవేళల
వొఱపైన హరినామమొక్కటే గతి గాక - మఱచి తప్పిననైన మఱి లేదు తెరగు

ఆపద వచ్చిన వేళ ఆరడి బడిన వేళ - పాపపు వేళల భయపడిన వేళ
వోపినంత హరినామ మొక్కటే గతి గాక - మాపు దాకా పొరలిన మరిలేదు తెరగు

సంకెల బెట్టిన వేళ చంప బిలిచిన వేళ - అంకిలిగా నప్పుల వారాగిన వేళ
వేంకటేశు నామమే విడిపించ గతిగాక - మంకు బుద్ధి పొరలిన మరిలేదు తెరగు

ఇవన్నీ సామాన్యుని దిక్కు తోచని చీకటిలో క్రుంగదీయు కష్టములు. పడ్డవానికే తెలియవచ్చు ఇక్కట్లు. ఆకలి బాధ, అలసిపోయిన పరిస్థితి, పాపములో చిక్కుకొనుట, ఇక్కట్ల పాలగుట, చెరసాల పాలగుట, అప్పులవారు ఎదురైన దీనస్థితి – ఇట్టి ఇడుములు చుట్టుముట్టినపుడు హరినామస్మరణమే కాపాడు గతి. వేరెవ్వరును రక్షింపజాలరు. కనుకనే మన పట్ల దయతో ఏడుకొండలవాడు ఆపదమ్రొక్కులవాడై వెలసియున్నాడు.

ఇంక ఆపన్న ప్రసన్నుడు గజేంద్రుని రక్షించిన విధము పోతనగారి దయవలన తెలుగునాట సుప్రసిద్ధమైనది. గజేంద్రమోక్షములోని పద్యములు మేలిముత్యములు. భక్తిరసామృత పాత్రములు. నిత్యస్మరణ చేయదగిన వేదసారములు శ్రీవిష్ణుసహస్రనామ భావ భరితములు.

## 338. అశోకః

- శోకములను నాశనము చేయువాడు (శ్రీ భట్టుల వ్యాఖ్య)
- శోకము లేని మూర్తి (శ్రీ శంకరుల వ్యాఖ్య).

### ఓం అశోకాయ నమః

శ్రీ శంకరుల వ్యాఖ్య, శ్రీ భట్టుల వ్యాఖ్యలందున్న స్వల్ప భేదము భగవానుని సచ్చిదానంద స్వభావమును రెండు కోణములనుండి ప్రకాశింపజేయుచున్నవి.

**అశోకః శోకమోహాది నాశకః పరికీర్తితః** – దుఃఖము, మోహము, భయము, ఆకలి వంటి బాధలను నాశనము చేయువాడు గాన భగవంతుడు అశోకుడు.

**శోకాది షడూర్మి రహితః అశోకః** – శోకము, మోహము, ఆకలి, దప్పిక, జర, మరణము అనే ఆరింటినీ 'షడూర్ములు' అంటారు. ఇట్టివి లేనివాడు గనుక ఈశ్వరుడు అశోకుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్యననుసరించి ఈ నామముల ప్రభావము ఇలా ఉన్నది.
(337) **పురందరః** – అధిదైవిక భయములను హరించు పుణ్యనామము.

(338) **అశోకః** – ఆధ్యాత్మిక భయములను హరించు దివ్యనామము.

(339) **తారణః** – అధిభౌతిక భయములను హరించు శుభ నామము.

(340) **తారః** – సంసార సాగరమును దాటించు మంగళనామము.

**పురందరః అశోకః తారణః తారః** – అనే నామములు కలిపి సకల భయములను పరిహరించి శుభములు చేకూర్చు అభయ మంత్రము.

## 339. తారణః

- దరి చేర్చువాడు. ఆపదలను హరించువాడు.

**ఓం తారణాయ నమః**

**తారయతి ఇతి తారణః** – భయములనుండి రక్షించువాడు తారణుడు. సంసార సాగరమును దాటించువాడు. కష్టములనుండి కడతేర్చు కొండలరాయని కరుణాస్వభావ కీర్తనను కొనసాగిస్తూ శ్రీ భట్టులు ఈ 'తారణః' అను నామము అధిభౌతిక దుఃఖములను పరిమార్చునని వ్యాఖ్యానించారు.

సంసార సాగరమును దాటించు గుణమును ఈ 'తారణః' నామము చాటుచున్నదని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. అయితే అదే గుణమును శ్రీ భట్టులు తరువాతి నామమైన 'తారః'కు అన్వయించారు.

శ్రీ చిన్మయానంద ఈ 'తారణః', 'తారః' నామములలోని సూక్ష్మ భేదమును ఇలా వివరించారు – సంసార సాగరమును దాటుటకు సాయము చేయువాడు అని ఒక నామము, స్వయముగా దాటించువాడు అని మరొక నామము తెలుపును. కొన్ని సందర్భములలో భక్తి మార్గము అనుసరించినవానికి, అచ్యుతునకు శరణాగతుడైనవానికి లభించే చేయూతలలోని భేదమును ఈ నామముల అన్వయములో గ్రహింపవచ్చును.

## 340. తారః

- రక్షించువాడు. భయంకరమగు గర్భనరకమునుండి జీవులను కాపాడువాడు.

**ఓం తారాయ నమః**

ఈ నామము రెండుమార్లు వచ్చినది.

37వ శ్లోకము. 340వ నామము. తారః – **అశోకః తారణః తారః శూరః శౌరిర్జనేశ్వరః**

404వ శ్లోకము. 968వ నామము. తారః – **భూర్భువస్స్వస్తరుస్తరుః తారః సవితా ప్రపితామహః**

**తార స్సంసార భయతో నిత్యం తారయతీతి సః – గర్భ జన్మ జరా మరణ సంసార సాగర మహాభయాత్ తారయతి తస్మాత్ ఉచ్యతే తారః** – గర్భావాసము, జన్మము, ముసలితనము, మరణము ఇవి మరల మరల సంభవించు క్లేశములు. అట్టి క్లేశములతో కూడిన సంసార సాగరములో చిక్కుకొని పోవు భయమునుండి రక్షించువాడు తారుడు.

**జన్మ దుఃఖం జరాదుఃఖం జాయా దుఃఖం పునఃపునః**
**సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత**
**పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్**

**ఇహ సంసారే బహుదుస్తారే కృపయా పారే పాహి మురారే**
**భజ గోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే.**

## 341. శూరః

- పరాక్రమశీలి. విజయ స్వరూపుడు.

### ఓం శూరాయ నమః

శ్రీ శంకరుల పాఠం ప్రకారం 'శూరః' అనే నామం ఒక్కమారు వస్తుంది. అది ఈ 37వ శ్లోకంలోని 341వ నామము – **అశోకః తారణః తారః శూరః శౌరిః జనేశ్వరః.**

69వ శ్లోకం మొదటిపాదం శ్రీ శంకరుల పాఠంలో **'కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః'** అని ఉండగా, శ్రీ భట్టుల పాఠంలో **'కాలనేమినిహా శౌరిః శూరః శూరజనేశ్వరః'** అని ఉంది. కనుక శ్రీ భట్టుల పాఠం ప్రకారం 'శూరః' నామము రెండుమార్లు వస్తుంది.

37వ శ్లోకం. 341వ నామము. శూరః – **అశోకః తారణః తారః శూరః శౌరిః జనేశ్వరః**
69వ శ్లోకము. 650వ నామము. శూరః – **కాలనేమినిహా శౌరిః శూరః శూరజనేశ్వరః**
341వ నామమును భగవంతుని శౌర్యగుణం పరంగాను, 650వ నామమును రామావతారపరంగాను శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

'శు' అనే ధాతువునకు 'ముందుకు పోవుట' అనే అర్థమున్నది. దీనినుండి విజయేచ్ఛను గ్రహింపవచ్చును. విక్రమము విజయమునకు సాధనము. **విజిగీషు తయా జైత్య సమర్థ శ్శూర ఉచ్యతే** – జయించు కోరిక గలవాడు శూరుడు. శత్రువులను నిర్జించువాడు. నమ్మినవారిని కాచువాడు. అపజయ మెరుగనివాడు.

'శు' – ముందుకు పోవుట – అనే లక్షణమును వక్కాణిస్తూ శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధములనుండి ఉదాహరణలు చెప్పారు.

తిరుప్పావై 24 – **శెన్ఱంగు తెన్నిలంగై శెత్తామ్ తిఱళ్ పోత్తి** – మిక్కిలి సంపదతో గర్వించియున్న లంకాపురిని ధ్వంసము చేసిన మీ మహాబలమునకు మంగళము.

పెరియాళ్వార్ తిరుమొళి 5.3.4 – **శెన్ఱంగు వాణనై ఆయిరమ్ తోళిమ్ తెఱ్ఱిత్తిసై తిసై వీడచెత్తై**

రెండుచోట్లా 'శేన్ఱు' అన్న పదమును గమనించదగును.

దైనందిన జీవనములో ఈ నామస్మరణ ప్రాశస్త్యమును ధర్మచక్రము రచయిత వివరించారు. దేవదానవ పోరాటములలో ముందుగా దానవులు గెలిచినట్లనిపించినప్పటికీ, దేవతలు శ్రీమహావిష్ణువును శరణుజొచ్చి, ఆయన కృపతో అంతిమ విజయమును పొందుతారు. ఇదే విధముగా మన జీవితములో దుర్గుణములు చాలా బలవత్తరముగా మనిషిని లొంగదీసికొనుచుండును. అప్పుడు శూరుడైన నారాయణుని శరణువేడి మనిషి సద్గుణ సంపన్నుడు కావచ్చును.

**ఖరకర వంశజా విను మఖండిత భూత పిశాచ ఢాకినీ**
**జ్వర పరితాపము సర్వభయ వారకమైన భవత్పదాబ్జ వి**
**స్ఫుర వజ్ర పంజరము జొచ్చితి నీయెడ దీన మానవో**
**ద్ధర బిరుదాంక యేమఱకు దాశరథీ కరుణా పయోనిధీ.**

సూర్యవంశజా! రామా! శ్రీరామా! సీతారామా! భయంకరమగు భూత ప్రేత పిశాచ వ్యాధి సర్ప భయములను తొలగించు నీ పాదముల శరణు జొచ్చితిని. కరుణాపయోనిధీ! కాపాడు.

## 342. శౌరిః

- వసుదేవుడు, దశరధుడు వంటి శూరులకు పుత్రునిగా జన్మించినవాడు (శ్రీ భట్టుల వ్యాఖ్య).
- శూరుని వంశములో జన్మించినవాడు. శూరసేనుని పుత్రుడు వసుదేవుడు. వసుదేవుని పుత్రుడు శ్రీకృష్ణుడు. (శ్రీ శంకరుల వ్యాఖ్య).
- యాదవులందు 'శూర' సంతతికి చెందినవాడు (శ్రీ రాధాకృష్ణ శాస్త్రి వ్యాఖ్య).

### ఓం శౌరయే నమః

ఈ నామము రెండుమార్లు వచ్చును.

37వ శ్లోకము. 342వ నామము. శౌరిః – **అశోకస్తారణస్తారః శూరః శౌరిః జనేశ్వరః**

67వశ్లోకములో 'శౌరిః' నామము వచ్చే క్రమం శ్రీ భట్టుల పాఠములోను, శ్రీ శంకరుల పాఠములోను కొంత భేదం కనిపిస్తుంది.

**కాలనేమినిహా శౌరిః శూరః శూరజనేశ్వరః** (శ్రీ భట్టుల పాఠము ప్రకారము)

**కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః** (శ్రీ శంకరుల పాఠము ప్రకారము)

కనుక ఎలా చూసినా 'శౌరిః' నామము రెండుమార్లు వస్తుంది.

మొదటి అర్థము (శూరుల పుత్రుడు)ను వివరిస్తూ శ్రీ వి.వి. రామానుజన్ చెప్పిన ఉదాహరణ –

**ఒడతతోల్ వలియన్ నందగోపకుమరన్**
**దయరఅక్కు మగనాయిత్ తోన్ఱి**

శ్రీ శంకరుల వ్యాఖ్య (శూర వంశము) – **శూరస్య గోత్రాపత్యం పుమాన్ శౌరిః – శూర కులోద్భవాత్ శౌరిః**

యాదవులలో ఒక వర్గమును 'శూరులు' అనేవారు. వసుదేవుడు ఆ వర్గము(గోత్రము)నకు చెందినవాడు. కనుక వసుదేవుని పుత్రుడు 'శౌరి' అని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు.

**కృష్ణోపనిషత్తు (అధర్వణ వేదాంతర్గతము)నందు చెప్పబడినట్టి శ్రీకృష్ణావతార కారణము (డా. క్రోవి పార్థసారధి విష్ణు సహస్ర నామ భాష్యము 'శ్రీకైవల్య సారధి' నుండి).**

రామావతారములో సర్వాంగసుందరుడైన రామచంద్రుని చూచి మునీశ్వరులంతా – శ్రీరామచంద్రా! నిన్ను ఆలింగనము చేసుకొనే భాగ్యము మాకు ప్రసాదించ వలసినది – అని వేడుకున్నారు. ఆ మాటలు విన్న శ్రీరామచంద్రుడు – కృష్ణావతార సమయమున మీరు గోపికలుగా జన్మించండి. మీ కోరిక తప్పక నెరవేరుతుంది – అన్నాడు. దానికి వారంతా గోపికలు, గోపాలురుగా జన్మించడానికి సంతోషముగా ఒప్పుకొన్నారు.

నందుడు – పరమానందము; యశోద – ముక్తి కాంత; దేవకి – వేదములచే చెప్పబడిన బ్రహ్మపుత్రిక;
వేదము – వసుదేవుడు; వేదార్థము – కృష్ణుడు; ఋక్కులు – గోపికలు, గోవులు;
బ్రహ్మ – గోవులను కట్టివేసే కర్ర; రుద్రుడు – వెదురుకర్ర; ఇంద్రుడు – శిరస్సు;
దేవతలు – స్నేహితులు; వైకుంఠము – గోపకులము; మహర్షులు – అక్కడి చెట్లు;

రాక్షసులు – క్రోధము, లోభము; తిరస్కరింపబడువాడు – కవి;

శ్రీకృష్ణుడు – సాక్షాత్తు మహావిష్ణువు;

ఋక్కులు, ఉపనిషత్తులు – స్త్రీలు; ద్వేషము – చాణూర మల్లుడు; మత్సరము – ముష్టికుడు;

దర్పము – కువలయాపీడనము (ఏనుగు); గర్వము – బకాసురుడు;

దయ – రోహిణీమాత; భూదేవి – సత్యభామ;

మహావ్యాధి – అఘాసురుడు; కలిపురుషుడు – కంసుడు;

శమము – సుదాముడు; సత్యము – అక్రూరుడు; దమము – ఉద్ధవుడు

ఆదిశేషుడే బలరాముడు. సత్యము, నిత్యము అయిన పరబ్రహ్మమే శ్రీకృష్ణుడు. పాలసముద్రములో పుట్టిన మేఘధ్వని కల శంఖము లక్ష్మీరూపమైన విష్ణువు.

పాలసముద్రము – పాలకుండలు; చక్రము – బ్రహ్మ; చామరము – అక్కడి వాయువు; ఖడ్గము – మహేశ్వరుడు; కశ్యపుడు – రోలు; అదితి – త్రాడు; కాళిక – గద; విష్ణుమాయ – శార్ఙ్గవమనే ధనుస్సు; శరత్కాలము – భోజనము; జగద్బీజము – తామరకాడ; గరుడుడు – వటవృక్షము; బృందాదేవి – భక్తి

శ్రీమహావిష్ణువు బాలుడై పాలకుండలతో క్రీడించాడు. శత్రువులను సంహరించడానికి, మిత్రులను రక్షించడానికి, అన్ని జీవులయందు దయ చూపడానికి కృష్ణుడైనాడు. సాక్షాత్తు వైకుంఠమే భూమికి దిగివచ్చింది. ఈ విధంగా దేవకీ వసుదేవులకు పుత్రుడై అవతరించిన శ్రీమన్నారాయణుడు పుట్టీపుట్టగానే తన మహిమలు చూపించిన శౌరి. హరేకృష్ణ.

## 343. జనేశ్వరః

- జనులకు, సకలప్రాణులకు ప్రభువు.
- జనులకు ఐశ్వర్యమును ప్రసాదించువాడు.

### ఓం జనేశ్వరాయ నమః

**జనానాం జంతూనాం ఈశ్వరః** – జన్మించిన, సృష్టింపబడిన సకల ప్రాణులకు శ్రీమన్నారాయణుడే ప్రభువు. **వినా వేంకటేశం న నాథో న నాథః** – అందరికీ దారి చూపువాడు భగవానుడే. కష్టాలలో ఉన్నవారు కూడ భగవంతునికి మ్రొక్కి పునీతులగుదురు.

రెండవ అర్థము – జనులకు ఐశ్వర్యమును ప్రసాదించువాడు జనేశ్వరుడు – శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ అర్థాన్ని చెప్పారు.

## 344. అనుకూలః

- హద్దులలో, అందుబాటులో ఉండువాడు. భక్తసులభుడు.

### ఓం అనుకూలాయ నమః

'కూలము' అనగా ఒడ్డు, దరి. **కూలమ్ వర్తతే ఇతి అనుకూలః** – హద్దులలో ఉండువాడు అనుకూలుడు. భక్తికి చిక్కువాడు. ఇది ఆయన అనుకూల్య స్వభావము. భగవానుడు సర్వేశ్వరుడు,అనంతుడు, అమితవిక్రముడు, జనేశ్వరుడు అయినాగాని అందరికీ అందెడివాడు కూడాను (శ్రీ అణ్ణాంగారాచార్య స్వామి వివరణ).

శ్రీ వి.వి. రామానుజన్ – **యది శక్నోషి గచ్ఛత్వమ్ అతి చంచల చేష్టితః** – నీకు చేతనైతే విడిపించుకోరా అల్లరి కన్నా! అని యశోద బాలగోపాలుని రోట బంధించెను.

**స్వభావతో మహత్వేఽపి మద విస్మయ వర్జనాత్ భక్తైక ప్రవణో నిత్యం అనుకూల ఇతి స్మృతః** - సహజమైన మహత్వము కలిగియుండికూడా ఆ పరమేశ్వరుడు గర్వము లేనివాడు, మరియు భక్తులకు అందియుండేవాడు కనుక అనుకూలుడు.

శ్రీరాముడు **'వీర్యవాన్ న చ వీర్యేణ మహతాస్వేన విస్మితః'** మహావీరుడైనా గాని తన వీరత్వము గురించి స్మృతి లేనివాడు (పట్టించుకొననివాడు).

శ్రీ చిన్మయానంద – సర్వసాక్షియైన భగవానుడు అంతటినీ చూచుచున్నాగానీ, మౌనముగానుండును (అడ్డము రాడు). అలా ఆయన హద్దులలోనుండు అనుకూలుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – 'అనుకూలము' అనగా దరికి పోవునది. సంసార సాగరమును దాటుటకు సాయము చేయువాడు అనుకూలుడు.

ధర్మచక్రము రచయిత – భగవానుడు అంతర్యామి. మనోసాక్షి. కనుక అందరికీ అందుబాటులోనుండును. మనము చేయు పనిలోని తప్పును మనస్సాక్షి హెచ్చరిస్తూనే ఉంటుంది. ఇలా మనకు తప్పొప్పులు తెలియజేయు దగ్గరి గురువు గనుక భగవంతుడు అనుకూలుడు.

## 345. శతావర్తః

నూరు ఆవర్తనములు (సుడులు) గలవాడు, అనగా

- ధర్మ సంస్థాపనార్థము అనేక అవతారములు ధరించినవాడు.
- శరీరములోనున్న శతాధిక నాడులయందు ప్రాణరూపమున సంచరించువాడు.
- విజృంభించి, సుడులు తిరుగుచున్న అనేక ఐశ్వర్యములు గలవాడు.
- సంసార చక్రము, గ్రహచక్రము, నక్షత్రచక్రము, యుగచక్రము వంటి ఎన్నో చక్రములను సంచరింపజేయువాడు.

### ఓం శతావర్తాయ నమః

శత – నూరు – అన్న పదమునకు 'లెక్క లేనన్ని' అనే అర్థాన్ని గ్రహించాలి. 'ఆవర్తనము' అనగా భ్రమణము, చక్రము, సంచలనము, పునరావృతము. **ధర్మ సంస్థాపనార్థాయ యుగే యుగే** – అన్న గీతావాక్యానుసారము భగవానుడు ధర్మసంస్థాపనము కొరకు, దుష్టశిక్షణ కొరకు, శిష్ట రక్షణ కొరకు మరల మరల అవతరించును. ఆయన అవతారములకు, విభూతులకు లెక్క లేదు.

**నాడీ శతే ప్రాణరూపేన వర్తతా ఇతి వా** – శరీరములో వందలాది నాడులలో ప్రాణరూపమున సంచరించును గనుక శతావర్తుడు. పై రెండు అర్థములును శ్రీ శంకరుల వ్యాఖ్యానుసారమున్నవి. వీనిని (శతావర్త లక్షణమును) వివరిస్తూ పెక్కు రచనలున్నవి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరియు ధర్మ చక్రము రచయిత – భగవానుని శతావర్త గుణ సంపదను ఎల్లెడలా మనము అనుభవింపవచ్చును. ఆయన సూర్యభగవానుడై ప్రతిదినము దర్శనమిచ్చి ప్రాణులను పోషించును. **సర్వస్య ఆవృతమ్ అనావర్తే** (అథర్వణ వేదము 10.5.37). భగవానుడు పాండవులను ఎన్నో ఆపదలనుండి మరల మరల కాపాడిన ఆత్మబంధువు. ద్రౌపదిని కురుసభలో మానభంగము కాకుండా, అరణ్యవాసములో అతిథిగా వచ్చిన దూర్వాసుని శాపమునకు గురి కాకుండా

సంరక్షించినవాడు. హరి సర్వోపగతుడన్న ప్రహ్లాదుని మాట పొల్లుపోకుండా స్తంభమునుండి శ్రీనారసింహమూర్తియై అవతరించి తన భక్తుని కాచినాడు. కృష్ణుడై గోవులను, గోపాలురను, యాదవులను కాచెను.

**ఐశ్వర్య జృంభితాభిఖ్యాః ఆవర్తా నిత్యశః శతం సంతి శతావర్తః వస్వర్ణో భక్తిముక్తిదః -** 'ఆవర్త' అనగా సుడిగుండము. అనంతములైన ఆయన ఐశ్వర్యములు సుడులు తిరుగుచున్నవి. కనుక ఆయన శతావర్తుడు. ఈ అష్టాక్షరీ పుణ్యనామ మంత్రమును జపించినయెడల భుక్తి, ముక్తి లభించునని శ్రీ భట్టుల వ్యాఖ్య. అనంతైశ్వర్యసంపన్నుడైనా ఆయన ఎంతో ప్రేమతో భక్తులకు అందుబాటులో నుండును. ఓం శతావర్తాయ నమః.

**శాంతోదిత విజ్ఞాన ప్రాణాయ** – ప్రశాంతమైన మరియు వృద్ధి చెందుతున్న జ్ఞానము, ప్రాణము అయినవానికి – అని పరవాసుదేవుని స్మరించు మంత్రము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'ఆవర్త' అనగా చక్రము అనే అర్థములో ఇలా వ్యాఖ్యానించారు. సంసార చక్రమున జన్మలను పరిభ్రమింపజేయువాడు, కాలచక్రమును త్రిప్పువాడు, నక్షత్రగ్రహ మండలములను పరిభ్రమింప జేయువాడు భగవానుడు శతావర్తుడు.



ద్వారకా తిరుమల ప్రవేశద్వారం వద్ద శిల్పాలు. శ్రీ దేవీ భూదేవీ సమేతులైన శ్రీ వేంకటేశ్వరస్వామి.

**334 నుండి 345వరకు – 'వాసుదేవ' నుండి 'శతావర్త' వరకు – నామములు భగవంతుని పరవాసుదేవ తత్త్వమును తెలియజేయును. 346వ నామము 'పద్మీ' నుండి – భగవంతుని పరవాసుదేవ స్వరూపమును వర్ణించు నామములు ప్రారంభమగునని శ్రీభట్టుల విశ్లేషణ.**

## 346. పద్మీ

- పద్మమును చేత ధరించినవాడు.

### ఓం పద్మినే నమః

భగవంతుడు శంఖ చక్ర గదా పద్మ ధారి. ఆయన ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్య గుణములలోని సాత్త్వికత్వమునకు ఈ పద్మము చిహ్నము.

శ్రీ చిన్మయానంద – పద్మము జ్ఞానమునకు సంకేతము. అది అందుకొనమని శంఖనాదముతో మనకు తెలియజెప్పును. పెడదారి బట్టినవారిని చక్రముతోను, గదతోను ఖండించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – నిజమైన జ్ఞానమునకు నిలయము గనుక భగవానుడు పద్మి. (ఇక్కడ 'పద్మము' అనగా జ్ఞానము అని అర్థము. సంకేతము కాదు.)

## 347. పద్మనిభేక్షణః

- పద్మమువంటి కన్నులు గలవాడు. చల్లని చూపులు గల స్వామి.

## ఓం పద్మనిభేక్షణాయ నమః

భగవంతుని చూపు చల్లనిది. తాపములను హరించునది. జ్ఞానము నొసగునది. మోక్షమును ప్రసాదించునది.

శ్రీ వి.వి. రామానుజన్ ప్రబంధములనుండి ఉదాహరించారు.

నాచియార్ తిరుమొళి (2.4) **– ఉన్ ముగమ్ మైయాల్ ఎత్తై మయక్కుమ్ మాయ మందిరమ్ తాన్ కోలో? చెయ్య తామరాయిక్ కణ్ణినాయ్.**

తిరువైమోళి (6.2.7) – **ఉవగైయాల్ నేస్టమ్ ఉళ్ళురుగి ఉనతామరాయి క్కణ్ విడిగళిన్ అగవలైప్పడుప్పన్.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **అనుకూలః శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః** – అనే నామములు వరుసలో వచ్చుటవల్ల భగవానుని ఆపన్నశరణాగత రక్షణా గుణమును తెలియజెప్పడమైనది.



గోవర్ధనోద్ధరణ – బృందావనం ప్రేమమందిరంలో నమూనా. వికీపీడియా చిత్రం by Saisumanth532

https://commons.wikimedia.org/wiki/File:Prema_Mandir_2.jpg

కెనడాలో మందిరం.





## పద్మనాభోఽరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్ |
## మహర్ద్ధిర్ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః || (38)

### 348. పద్మనాభః

- పద్మమువంటి నాభి (బొడ్డు) కలవాడు.
- హృదయపద్మము నడుమనుండువాడు.
- జ్ఞానులకు వికసించిన జ్ఞానము. అజ్ఞానులకు కానరానివాడు.

**ఓం పద్మనాభాయ నమః**

ఈ నామము మూడుమార్లు వస్తుంది.

6వ శ్లోకము -48వ నామము -పద్మనాభః – **అప్రమేయో హృషీకేశః పద్మనాభః అమరప్రభుః**

21వ శ్లోకము - 198వ నామము -పద్మనాభః – **హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః**

38వ శ్లోకము -348వ నామము - పద్మనాభః – **పద్మనాభః అరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్**

ప్రస్తుత (348వ) నామము పరవాసుదేవుని దివ్య సౌందర్యమును వివరించు సందర్భమున చెప్పబడినది. 'పద్మనాభః' అనగా బొడ్డున తామరపూవు గలవాడు. మరొక వివరణ – అందరి హృదయపద్మమునకు మధ్యనుండువాడు. ఇంకొక వివరణ – శ్రీవాసుదేవుని నాభినుండి సకల విశ్వము అష్టదళ పద్మమువలె ఉద్భవించినది. అందు మధ్యమున మేరుపర్వతమున్నది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్యానము మరల విలక్షణముగా నున్నది – 'పూవు' (పద్మ) అనగా వికసించి, రంగులతో రాజిల్లి, అందరకూ కనుపించి, కనువిందు చేయునది. 'నాభ్' అనగా అంతగా కనుపించనిది. మరుగైనది. కనుక 'పద్మనాభుడు' అనగా విరుద్ధములనిపించే రెండు భిన్నగుణములను ఒకేమారు ప్రదర్శించువాడు. ఘటనాఘటనశీలి. జ్ఞానులలో విద్య, అజ్ఞానులకు మోహము. భక్తులకు దర్శనమిచ్చే భక్తసులభుడు, ఇతరులకు తెలియరానివాడు. పగలు వికసించి, రాత్రి ముకుళించు పద్మము వంటివాడు. పద్మనాభుడు.

### 349. అరవిందాక్షః

- అరవిందము (తామరపూవు) వంటి కన్నులు గలవాడు.
- సూర్యచంద్రులు తన కన్నులైనవాడు.

**ఓం అరవిందాక్షాయ నమః**

**అరవింద సదృశే అక్షిణి అస్య ఇతి అరవిందాక్షః** – తామరపూవువంటి కన్నులు గలవాడు అరవిందాక్షుడు. **రామః కమలపత్రాక్షః** (సుందరకాండము). ఇంకా శ్రీ వి.వి. రామానుజన్ దివ్య ప్రబంధములనుండి చాలా ఉదాహరణలిచ్చారు. 40వ నామము **'పుండరీకాక్షః'** భావము కూడ ఇలాంటిదే.

శ్రీ చిన్మయానంద – సూర్యోదయమున వికసించి, రాత్రి ముకుళించు అరవిందము వలెనే భగవంతుడు భక్తులపట్ల చల్లని చూపును ప్రసాదించును. భక్తులు కానివారికి పెడమొగమగును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'అర్' అనగా గతి, చలనము, భ్రమణము. 'విందతి' అనగా 'ప్రాప్నోతి' అనగా కలిగియున్నవాడు. పరిభ్రమించు సూర్యచంద్రులే తన కన్నులుగా కలవాడు గనుక శ్రీవాసుదేవుడు అరవిందాక్షుడు.

**అనాది మధ్యాంతమనంత వీర్యమ్ అనంత బాహుమ్ శశిసూర్యనేత్రమ్**
**పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపంతమ్** – గీత 11.19
ఆదిమధ్యాంత రహితుడవు. అపరిమితశక్తిశాలివి. అసంఖ్యాకములైన భుజములు గలవాడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు. అగ్నివలె నీ ముఖము ప్రజ్వరిల్లుచున్నది. నీ తేజస్సుతో ఈ జగమును సంతప్తమొనర్చుచున్నావు. అట్టి నిన్ను నేను చూచుచున్నాను.

## **350.** పద్మగర్భః

- పద్మమునందు వసించియున్నవాడు.
- హృదయపద్మము మధ్యభాగమున విరాజిల్లువాడు.

### ఓం పద్మగర్భాయ నమః

మృదువైన, సుగంధభరితమైన, సుందరమైన పద్మమునందు ఉన్నట్లుగా శ్రీపద్మావతీవల్లభుని ఆరాధింతురు. నారాయణుడు **'సరసిజాసన సన్నివిష్టః'** అని నిత్యస్తోత్రములందు చెప్పబడినది. **పద్మేన గౌర్యతే స్వాంతః అవస్థాప్యతే ఇతి పద్మగర్భః.**

తనను ధ్యానించు యోగుల హృదయకమలమున నుండువాడు. **దహరమ్ విపాప్మమ్ పరవేశ్మ భూతమ్ యత్ పుండరీకమ్.**

**తణ్ణామరై సుమక్కుమ్ పాద ప్పెరుమాన్** – తిరువైమొళి 4.5.8

శ్రీ శంకరుల వ్యాఖ్యానానుసారము – హృదయపద్మమున నిలుపుకొని ధ్యానింపదగినవాడు – **పద్మస్య మధ్యే ఉపాస్యత్వాత్ పద్మగర్భః.**

## **351.** శరీరభృత్

- యోగుల శరీరముల తానై కాపాడువాడు (పోషించువాడు).
- అన్నమువంటి ప్రాణరూపములతో శరీరముల పోషించువాడు.
- ధర్మరక్షణార్థమై వివిధ శరీరములను ధరించువాడు.

### ఓం శరీరభృతే నమః

**యోగి హృన్మధ్య కంజస్థ స్వదేహం తంబి భర్తియః శరీర భృత్వ కథితః వస్వర్ణో భుక్తి ముక్తిదః** – యోగీశ్వరుల హృదయమునందు తన శరీరమునుంచి (తానై వసించి), వారికి భుక్తిని, ముక్తిని ప్రసాదించువాడు శరీరభృత్.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శరీరం, స్వశరీరం భూతం ఉపాసకం బిభక్తి పుష్ణాతీతి శరీరభృత్** – యోగులు భగవంతుని గుణములను ధ్యానింతురు. ఆ గుణములే వారిని పోషించును. అనగా భగవంతుడు యోగులనే తన శరీరములుగా భావించి, వారి హృదయ కమలమున వెలసి, వారిని రక్షించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పోషయన్ అన్నరూపేణ ప్రాణరూపేణ వా శరీరిణామ్ ధారయతి ఇతి శరీరభృత్** – పరమేశ్వరుడు అన్నము రూపముననను, ప్రాణము రూమునను జీవుల శరీరములను ధరించును (నిలుపును) కనుక ఆయన శరీరభృత్.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – ధర్మ రక్షణకు, దష్కృతులను నాశనము చేయుటకు వివిధ రూపములలో అవతరించును గనుక ఆయన శరీరభృత్.

**తరువాతి కొన్ని నామములు భగవంతుని మహోన్నతత్వమును కీర్తించుచున్నవి.**

## 352. మహర్ధిః

- అపారమైన బుద్ధి, ఐశ్వర్యము, విభూతులు గలవాడు. తరగని సంపద కలవాడు.

### ఓం మహర్ధయే నమః

**మహతీ బుద్ధిః విభూతిః అస్య ఇతి మహర్ధిః** – అని శ్రీ శంకరుల వ్యాఖ్య. ఇక్కడ 'బుద్ధి' అనగా ఐశ్వర్యము, శక్తి, వైభవము కలిసిన విభూతి. అనంత శ్రీయుతుడు, అపారమైన శక్తిమంతుడు, లక్ష్మీనాధుడు, భక్తుల పాలిట కల్పవృక్షము, మహదైశ్వర్య సంపన్నుడు మహర్ధి.

భక్తుల యోగక్షేమములను వహించడానికై తరగని విభూతి కలవాడు మహర్ధి. **తద్యోగక్షేమ వహనే నిస్సీమ విభూతిః మహర్ధిః** – అని శ్రీ భట్టుల వ్యాఖ్య. తిరువైమొళి(4.5.1)నుండి శ్రీ వి.వి. రామానుజన్ చెప్పిన ఉదాహరణ – **విట్రీరిందు ఎళ్ ఉలగమ్ తనిక్కోల్ శెల్ల ఆళుమ్ అమ్మాన్.**

ధర్మచక్రము రచయిత రెండు విధాలైన ఐశ్వర్యాలను ప్రస్తావించారు. ఐహికమైన ధన కనక వస్తు వాహనాది సంపద (పోరుళ్ సెల్వమ్), సుగుణ కరుణాపూరితమైన సంపద (అరుళ్ సెల్వమ్). మొదటి విధమైన గుణసంపద ఎవరివద్దనైనా (మంచివారు గాని, చెడువారుగాని) ఉండవచ్చును. రెండవ విధమైన సంపద సత్పురుషులకు మాత్రమే స్వంతము.

రెండు విధాలైన ఐశ్వర్యాలు అనంతముగా కలిగినవాడు శ్రీమహావిష్ణువు. ఆయనను 'మహర్ధిః' అని ధ్యానించినవారికి ఉభయ విధైశ్వర్యములను ఆయన పుష్కలముగా ప్రసాదించును.

**గజరాజ వరదుడిచ్చును**
**గజ తురగ స్యందనములు గైవల్యంబున్.**

## 353. బుద్ధః

- భక్తులయొక్క సమృద్ధిచేత తానుకూడ సమృద్ధుడగువాడు.
- విశ్వరూపుడై వర్ధిల్లుచుండువాడు.

### ఓం బుద్ధాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

30వ శ్లోకము. 279వ నామము. ఋద్ధః – **ఋద్ధః స్పష్టాక్షరో మంత్రః చంద్రాంశుః భాస్కరద్యుతిః**

38వ శ్లోకము. 353వ నామము. ఋద్ధః – **మహర్ధిః ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః**

ఇంతకుముందు 279వ నామముగా 'ఋద్ధః' నామమునకు చెప్పిన భావము – అన్ని ఉత్తమ గుణములు సమృద్ధిగా కలిగిన పరిపూర్ణుడు. 'సమృద్ధి' అనే లక్షణము ఆధారముగానే 352వ నామము 'ఋద్ధః'కు కూడా భాష్యకర్తలు అర్థము చెప్పారు. **తత్సమృద్ధ్యాయః సమృద్ధస్త్వృద్ధ ఉచ్యతే** – భక్తుల బాగోగులే భగవంతునికి నైవేద్యములు. భక్తులు వృద్ధినొందినపుడు భగవానుడు సంతసించి తృప్తుడై భాసిల్లును.

**అభిషిచ్యచ లంకాయాం రాక్షసేంద్రం విభీషణం కృతకృత్యః తదారామః విజ్వరః ప్రమోదహ** - లంకకు రాక్షసరాజుగా విభీషణునికి పట్టాభిషేకం జరిపి, శ్రీ రామచంద్రుడు చింతలన్నీ తీరిపోయినాయని సంతసించాడు.

**ప్రపంచ రూపేణ వర్ధమానత్వాత్ ఋద్ధః** – విశ్వరూపమున విస్తరించుచుండును గనుక విశ్వేశ్వరుడు ఋద్ధుడు – అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు.

ధర్మచక్రము రచయిత – ఎవరికీ ఊహకందనంతగా దేవదేవుడు వర్ధిల్లును. ఈ సమృద్ధ గుణమును ధ్యానించినవారికే భగవానుడు అందివచ్చును.

## **354.** వృద్ధాత్మా

- మిక్కిలి పురాతనమైనవాడు. సంపూర్ణముగా వృద్ధిచెందినవాడు.

### ఓం వృద్ధాత్మనే నమః

అత్యంత పురాతనమైన (వృద్ధమైన) ఆత్మ కలిగినందున (ఐనందున) భగవానుడు వృద్ధాత్ముడు. సృష్టికంటె ముందుగానున్నవాడు.

**మహిమానాం చుళకయన్ సమృద్ధస్సర్వతోఽధికమ్ ఆత్మా స్వరూపమ్ యస్యేతి స వృద్ధాత్మేతి కథ్యతే** - ఈ మహిమ అంతా ఒక మూల ఉండేటట్లుగా సర్వాధికముగా పెరిగిన దివ్యమైన ఆత్మస్వరూపము గలవాడు.

ధర్మచక్రము రచయిత వివరణ – గర్భావాసము, జననము, బాల్యము, యౌవనము, వృద్ధాప్యము, మరణము – ఇవి సాధారణ సంసార చక్క్రమము. కాని శ్రీమహావిష్ణువును స్మరించి, మోక్షమార్గము నవలంబించి, వైకుంఠమును చేరినవారికి మరల జన్మము లేదు. అనగా వారు పరమపదమును చేరుకున్నారన్నమాట. అట్టివారే సంసారమునుండి సంపూర్ణమైన వృద్ధిని సాధించినవారగుదురు. కాని భగవంతుడు సృష్టికంటె ముందున్నవాడు. సంసారచక్రమున కతీతుడు గనుక వృద్ధాత్ముడు.

## **355.** మహాక్షః

- గొప్ప (ఇరుసున్న) రథము గలవాడు. గరుడ వాహనుడు.
- గొప్పకన్నులు గలవాడు. అనంత నయనుడు.
- అందరికిని దారి చూపువాడు.

### ఓం మహాక్షాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య అలంకారపరంగా సాగింది. **అక్ష స్తుతార్యోవహనాత్ రథాయవ సామ్యతః మహాపూజ్యస్య యస్యాస్తి స మహాక్ష ఇతి స్మృతః** - 'అక్షము' అనగా ఇరుసు. ఒక వస్తువులోని భాగమును ఆ పూర్తివస్తువును సూచించే దానిగా చెప్పే అలంకారమును (పప్పన్నం ఎప్పుడు పెడతావు? ఎర్ర జెండా వచ్చింది. లాగా) అనుసరించి ఇరుసును 'రథము'ను సూచించేదానిగా వాడవచ్చును. మళ్ళీ 'రథము' అంటే 'వాహనము' అని గమనించాలి. కనుక బ్రహ్మాండమైన, పూజింపదగిన వాహనము గలవాడు. గరుడునిపై ఊరేగువాడు. మహాక్షుడు.



గరుడారూఢుడైన విష్ణువు. తూర్పు చాళుక్యులనాటి మకరతోరణ శిల్పం. పెదవేగి గ్రామంలోనిది.

గరుత్మంతుడు మహావీరుడు. శ్రీమహావిష్ణువును సేవించే భాగ్యమును పొందినవాడు. అధర్వణ వేదములోని 'గరుడోపనిషత్తు'లో వైనతేయుడు విషాపహారి అని చెప్పబడినది. గరుత్మంతుడు వేదస్వరూపుడు – **దక్షిణ పాదము స్వస్తికము, ఎడమ పాదము కుంచితముగా ఉండి నమస్కరిస్తున్న గరుడుని నే ధ్యానింతును. హరికి ఇష్టుడైన గరుడుని ధ్యానింతును. నాగులచే సేవింపబడుతున్న కపిలాక్షుడు, బంగారు కాంతి గలవాడు, పొడవైన బాహువులు, పెద్ద మూపు గలిగి, నాగాభరణ భూషితుడై, మోకాళ్ళనుండి బంగారు రంగు గలవాడు, మొలపైన తెలుపు రంగు, కంఠమువరకు ఎరుపు రంగు, వంద చంద్రుల కాంతి గల ముక్కు, కిరీటముగల, విష్ణువునకు వాహనమైన గరుడునికి నమస్కారము.**

'అక్షి' అనగా కన్ను. ఈ అర్థములో శ్రీ శంకరులు – **మహతీ అక్షిణీ అస్య ఇతి మహాక్షః** – అని వ్యాఖ్యానించారు. భగవానుని అనంత నయనములు సకలమును బయట, లోపల కూడ చూచుచునే యుండును. **మహాన్తి అక్షిణి అస్య ఇతి మహాక్షః** – అని మరొక వ్యాఖ్యను కూడ శ్రీ శంకరులు చెప్పారు. దీని అర్థము – దివ్యమైన, శరీరముతో పనిలేని, అనంత ఇంద్రియములు గలవాడు. అంతటా కన్నులున్నవాడు.

ధర్మచక్రము రచయిత వివరణ – శ్రీమన్నారాయణుని చూపు పడినంతనే అజ్ఞాన మోహాంధకారములు పటాపంచలై జ్ఞానము విరాజిల్లును. మహాక్షుని ధ్యానించినవారికి ఆశామోహములు నశించి, జ్ఞానము లభించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'అక్ష' – ఇరుసు – రథము – నడిపించువాడు. అందరికి తీరు, దారి, తోడు, బలము అయినవాడు మహాక్షుడు.

## 356. గరుడధ్వజః

- గరుత్మంతుడు ధ్వజము(పతాకము)గా గలవాడు.

### ఓం గరుడధ్వజాయ నమః

గరుత్మంతుడు శ్రీమహావిష్ణువునకు వాహనమేగాక పతాకచిహ్నము కూడ. వినీలాకాశమున ఎగిరే గ్రద్ద భూమిమీది చిన్న వస్తువును కూడ చూడగలదు. అదే విధముగా భగవంతుని చూపు భక్తుని హృదయములో దురాలోచనలు ప్రవేశింపకుండ రక్షించును. మహాభారతగాథ ప్రకారము గరుత్మంతుడు తన తల్లి వినత దాస్యమును అంతము చేయుటకొఱకు దేవతలతో పోరాడి అమృతమును తేవలసివచ్చినది. అప్పుడు గరుత్మంతుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించెను. నారాయణునికంటె ఎత్తున ఉండుట కొఱకు. ఆ విధముగా గరుడుడు శ్రీనివాసుని ధ్వజచిహ్నము, వాహనముకూడ అయ్యెను.

ధర్మచక్రము రచయిత – పరమాత్ముని సేవించుటయే జీవాత్మ లక్ష్యము కావలెను. గరుత్మంతుడు శ్రీహరికి వాహనమగుట ఇందుకొఱకే. ఆ సేవయందే తరించినవారు పరమాత్మను చేరుదురని జటాయువు కథ తెలుపుచున్నది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఆకాశమున గ్రద్ద ఎగురుచున్నపుడు దానిదృష్టికే భయపడి విషసర్పములు పారిపోవును. అదే విధముగా భగవంతుని చూపు భక్తుల పాపములను హరించును.

**ఆదికవి శ్రీ నన్నయ – ఆంధ్రమహాభారతము. ఆదిపర్వము. గరుడోపాఖ్యానము నుండి.**

అమృతము సాధించుట కొఱకు స్వర్గలోకముపై దండెత్తిన శ్రీ గరుత్మంతుడు శ్రీ మహావిష్ణువుకు మ్రొక్కి ఇలా అన్నాడు.

'అమృతాశనంబు చేయకను దేవ! నా – కజరామరత్వంబు నందుటయును
అఖిల లోకంబుల కగ్రణివైన నీ – యగ్రంబునందు నిన్నధిక భక్తిఁ
గొలుచుచు నునికియుఁ గోరితిఁ, గరుణతో – దయసేయు ముద్ధత దైత్యభేది!'
యనవుడు వానికి నభిమతంబులు ప్రీతుఁ – డై యిచ్చి హరి యిట్టులనియె; 'నాకు
ననఘ! వాహనంబవై మహాధ్వజమవై
యుండు' మనినఁ బక్షియును ప్రసాద
మనుచు మ్రొక్కి పఱచె; నంత ....
.........
..........
ఈ సౌపర్ణాఖ్యానము
భాసురముగ వినిన పుణ్యపరులకు నధిక
శ్రీ సంపదలగు; దురిత ని
రాసంబగుఁ; బాయు నురగ రక్షో భయముల్.



బేలూరు చెన్నకేశవాలయంలో స్వామివారికి అభిముఖంగా శ్రీ గరుత్మంతుడు.

Photo by: Ananth H V

https://commons.wikimedia.org/wiki/File:Garuda_image_facing_Chennakeshava_temple_at_Belur_with_gopura_(entrance_tower)_in_the_background.jpg

శ్రీరామ జయరామ జయజయరామ శ్రీమద్రామాయణము – యుద్ధకాండము – నాగపాశవిమోచన ఘట్టము

(ఈ రచనలనుండి గ్రహించినది.

**1.** సుందర కాండము. పారాయణ గ్రంథము – శ్రీమాన్ ఎస్.టి.పి.వి. కోనప్పాచార్యులు

**2.** వాల్మీకి రామాయణము. సరళ సుందర వచనము – బ్రహ్మశ్రీ కొంపెల్ల వేంకట రామశాస్త్రి)

భీకరమైన యుద్ధంలో అంగదునివల్ల పరాభవం పొందిన ఇంద్రజిత్తు మాయమైనాడు. రామునిమీదా, లక్ష్మణునిమీదా ఇంద్రజిత్తు ఘోరమైన నాగాస్త్రాన్ని ప్రయోగించి వారిని బంధించివేయగలిగాడు. అదృశ్యరూపంలో ఇంద్రజిత్తు వేసే శరపరంపరకు రామలక్ష్మణుల శరీరాలు బాణాలతో నిండిపోయాయి. వారిదేహంనుండి రక్తం పర్వతం మీదినుండి సెలయేళ్ళు ప్రవహించినట్లు ప్రవహించింది. మూర్ఛిల్లిన సోదరులను చూచి వానరులంతా విచారంలో మునిగిపోయారు. ధర్మాత్ముడైన విభీషణుడు బాణములచేత అంతటా గ్రుచ్చబడిన రామలక్ష్మణుల శరీరములు చూచి అప్పుడు చాల వ్యధ చెందెను. అతడు నీళ్ళతో తడిసిన తన చేతితో వారి కన్నులు తడిచి, విలపించెను. ఏ రామలక్ష్మణుల పరాక్రమమును ఆశ్రయించి నేను రాజ్యమును పొందవలెనని కోరుకుంటినో అట్టి ఈ మానవశ్రేష్ఠులు ప్రాణములను విడచుటకై పడియున్నారని శోకించెను.



యుద్ధంలో నాగపాశబద్ధులైన శ్రీ రామ లక్ష్మణులు. కుడివైపు ఇంద్రజిత్తు రావణుని దర్శించుట.
1652 కాలానికి చెందిన ఉదయపూర్ ప్రాంతపు చిత్రం.

వికీపీడియా నుండి. Creator:Sahib_Din https://commons.wikimedia.org/wiki/
File:Rama_and_Lakshmana_bound_-_Ramayana,_Yuddha_Kanda_(1652),_f.34_-_BL_Add_MS_15297.jpg

సుగ్రీవుడు విభీషణుని కౌగిలించుకొని – ధర్మజ్ఞా, విభీషణా! నీవు లంకారాజ్యమును పొందగలవు. సందేహము లేదు. ఈ రామలక్ష్మణులు కేవలము మోహము చెందియున్నారు. వీరు పాశవిముక్తులై యుద్ధములో రావణుని చంపగలరు – అన్నాడు. తరువాత సుగ్రీవుడు తన మామయైన సుషేణునితో – నీవు ఈ రామలక్ష్మణులను తీసికొని పరివారంతో కిష్కింధకు వెళ్ళిపో. నేను రావణుని, అతని పుత్రులను, బంధువులను సంహరించి సీతమ్మను తీసికొని వచ్చెదను – అని చెప్పెను. సుషేణుడు తాను చూచిన దేవాసుర యుద్ధంలో దేవతలపై బృహస్పతి వాడిన ఔషధాలు తేవడానికి హనుమంతుడిని పంపమని సుగ్రీవునకు చెప్పాడు.

**ఇంతలో మేఘాలనూ, సముద్రాలనూ కల్లోలం చేసే తీవ్రమైన వాయువు వీచింది. భూమి కంపించింది. పెద్దపెద్ద చెట్లన్నీ ఆ గాలి వేగానికి పెళ్ళగిల్లి సముద్రంలో పడ్డాయి. సముద్రంలోనున్న సర్పములన్నీ భయపడినాయి. జలజీవాలన్నీ సముద్రం అడుగుకు**

**వెళ్ళిపోయాయి. మరుక్షణం మండే అగ్నివలెనున్న, మహాబలిశాలియైన వినతాకుమారుడు గరుత్మంతుడు వానరులకు కనబడెను. బాణముల రూపమున రామలక్ష్మణులను బంధించియున్న మహానాగములన్నియు గరుత్మంతుని రాకతో పారిపోయెను. నేలమీద వాలిన గరుత్మంతుడు తన రెండు చేతులతో రామలక్ష్మణుల సర్వావయవాలను నిమిరాడు. మరుక్షణంలో వారి గాయాలన్నీ మానిపోయినాయి. వారి దేహాలకు తొల్లిటి వర్చస్సు వచ్చింది. మీదుమిక్కిలి వారి తేజమూ, బల వీర్య పరాక్రమాలూ, ఓజస్సూ, ఉత్సాహమూ, బుద్ధీ, స్మృతీ పూర్వంకంటె ద్విగుణీకృతమయ్యాయి.**

పక్షీంద్రుడు వారిని ఆప్యాయంగా కౌగిలించుకొన్నాడు. అతనితో రాముడు – నీ అనుగ్రహంవల్ల మేము ఆపదనుండి విముక్తులమై, పూర్వపు బలము పొందాము. నిన్ను చూడగా మా తండ్రి దశరధ మహారాజునూ, మా తాత అజమహారాజునూ చూచినట్లు మా హృదయం ప్రసన్నమగుచున్నది. నీవు రూపసంపన్నుడవు. దివ్యవస్త్రాభరణ సుగంధములను ధరించిన నీవెవ్వరవు మహాపురుషా! – అని అడిగెను. అప్పుడా వైనతేయుడు ఇట్లనెను.

**అహం సఖా తే కాకుత్స్థ ప్రియః ప్రాణో బహిశ్చరః**
**గరుత్మానిహ సంప్రాప్తో యువయోః సాహ్యకారణాత్**

రామా! నేను నీ ప్రియమిత్రుడను. బయట సంచరించు ప్రాణమువంటివాడను. నా పేరు గరుత్మంతుడు. మీకు సాయపడడానికి వచ్చాను. ఇంద్రజిత్తు మాయవల్ల బాణాలై మిమ్ములను బంధించిన ఈ నాగులనుండి దేవేంద్రాదులు కూడా విడిపించలేరు. నువ్వు ధర్మజ్ఞుడవూ, సత్యపరాక్రముడవూ గనుక నాగబంధమునుండి మీరు విముక్తులైనారు. కపట స్వభావులైన రాక్షసులపట్ల ఎన్నడును మీరు ఏమరుపాటుగా నుండరాదు.

గరుత్మంతుడు స్నేహముతో రాముని కౌగిలించుకొని – మిత్రుడా! నేను వెళ్ళుట కనుజ్ఞనిమ్ము. మన యిద్దరి స్నేహము ఎలా ఏర్పడినది అని తెలిసికొనుటకు నీవిపుడు అభిలాష చూపవద్దు. యుద్ధమునందు శత్రుసంహారము పూర్తిచేసిన పిదప నీకు తెలియగలదు. బాలురనూ, స్త్రీలనూ, వృద్ధులనూ మాత్రమే మిగిల్చి నీ బాణాలతో లంకను నాశనం చేసి, రావణుణ్ణి సంహరించి నువ్వు సీతను పొందడం తథ్యం – అనిచెప్పి, రామలక్ష్మణులకు ప్రదక్షిణ చేసి, కౌగిలించుకొని, వాయువువలె ఆకాశమున ప్రవేశించెను.

ఇలాగ పునరారోగ్యవంతులైన రామలక్ష్మణులను చూచి వానరులు ఆనందముతో గెంతి, సింహనాదాలు చేశారు. తోకలెగరేశారు. భేరీలు, శంఖాలు పూరించారు. భుజాలు చరచారు. వేలాది వృక్షాలను పెరికి యుద్ధానికై లంకాద్వారాలమీదికి దూకారు. వారి సింహనాదాలు ఆ నిశిరాత్రి సమయంలో ప్రళయకాలంనాటి ఉరుముల్లాగా రాక్షసులను భయకంపితులుగా చేశాయి.



శ్రీ రామ లక్ష్మణులను ఆలింగనం చేసుకొంటున్న శ్రీ గరుత్మంతుడు.
గీతాప్రెస్ వారి ప్రచురణలోని చిత్రం. వికీపీడియానుండి.
https://commons.wikimedia.org/wiki/File:Garuda_meets_Rama_Laxman.jpg



## అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః |
## సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః || (39)

### 357. అతులః

- సాటిలేనివాడు. పోల్చరానివాడు.

**ఓం అతులాయ నమః**

**గరుడధ్వజ సత్వాద్ధి అతులోऽనుపమ స్మృతః** – గరుడధ్వజము కలవాడు కాబట్టి లోకమునందు సాటిలేని మేటి అవుతున్నాడు.

తులనము అనగా (తక్కెడలో తూచినట్లుగా) మరొకదానితో పోల్చుట. భగవంతుడొక్కడే. ఆయనవంటి మరేమియును లేదు. ఆయనను వేరొకరితో పోల్చుట సాధ్యము కాదు. కనుక ఆయన అతులుడు. **తులోపమానం అస్య న విద్యత ఇతి అతులః** – అని వ్యాఖ్యానించి, శ్రీ శంకరులు శ్వేతాశ్వరోపనిషత్తు (4.19) నుండి ప్రమాణము చెప్పారు.

**నైన మూర్ధ్వం నతిర్యంచం న మధ్యే పరిజగ్రభతు న తస్య ప్రతిమాస్తి యస్య నామ మహద్యశః** ఈ పరమాత్మను ఊర్ధ్వ దిక్కులయందుగాని, అధోదిక్కులయందుగాని గ్రహించడానికి వీలులేదు. అనంతకీర్తితో వెలుగొందుచున్న ఆ పరమాత్మతో పోల్చడానికి మరెవరూ లేరు. ఈ నామము గొప్ప యశమును కూర్చుతుంది. **ఓం అతులాయ నమః.**

గీత 1.43 – **న త్వత్సమోऽస్త్యభ్యధికః కుతోऽన్యో లోకత్రయేऽప్య ప్రతిమ ప్రభావః** – నీవు గురువువు. సర్వశ్రేష్ఠుడవు. ముల్లోకాలలోనూ నీతో సమానులెవరూ లేరు. ఇంక నీకన్న అధికులెలా ఉంటారు? సర్వేశ్వరా! నీవు గురువులకు గురువువు. బ్రహ్మకు జనకుడవు. పూజ్యులైనవారికి పూజ్యుడవు. మహాగుణములు, ఐశ్వర్యము, మహిమలు గల నీతో సరితూగగలవాడు ఈ లోకంలో ఎవరూ లేరు. నీకు నీవే సాటి.

తిరువైమొళి (6.3.9)నుండి శ్రీ వి.వి.రామానుజన్ ఉదహరించినది – **తాన్ ఒప్పారిల్ అప్పన్.**

ధర్మచక్రము రచయిత – కనుక మనము సాయము కోరి ఎవరో సామాన్యుని కీర్తింప తగదు. సర్వేశ్వరుడైన శ్రీమహావిష్ణువునే స్మరింపనగును. ఆయనను స్మరించినవారు ప్రవర్ధమానులు అగుదురు. అట్లు కానివారు దిగజారుదురు.

### 358. శరభః

- ధర్మము హద్దునతిక్రమించినవారిని శిక్షించువాడు.
- అంతరాత్మయై వెలుగువాడు.
- శరభావతారమునెత్తిన పరమేశ్వరుడు.

## ఓం శరభాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శృణాతీతి శరభః** – 'శృ' అనే ధాతువునకు గాయపరచుట, ఖండించుట అన్న అర్థముల నుండి – తన ఆజ్ఞను మీరినవారిని ఆయన శిక్షించును. ఆయన ఆజ్ఞ ప్రకారమే సకల భూతములు తమతమ విధులను నిర్వహించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శీర్ణమగునది, అనగా నశించునది, శిథిలమగునది శరము. **శీర్యమానాత్ శరః** – శరీరము అశాశ్వతము గనుక శరము. 'భ' ధాతువునుండి 'ప్రకాశమానము' (భాతి) అనే భావమును గ్రహింపనగును. శరీరములో జ్యోతియై వెలుగువాడు శరభుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి శరభోపనిషత్తునుండి చెప్పిన ప్రమాణము – **శర జీవస్తదంగేషు భాతి నిత్యమ్ హరిః స్వయమ్ బ్రహ్మైవ శరభ సాక్షాత్.** శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరొక అర్థము కూడా చెప్పారు. శరము అనగా బాణము. శరీరమును బాణముగా చేసికొని పరమాత్మునివైపు గురిచూచినయెడల అశాశ్వతమైన దేహము కూడ భగవంతుని ప్రభావమువలన మరల ప్రకాశించును.

శ్రీ పెమ్మరాజు రాజారావు, డా. క్రోవి పార్థసారథిల రచనలలో ఇచ్చిన మరొక అర్థము – పరమేశ్వరుడు ఒకప్పుడు ఎనిమిది కాళ్ళుగల మహామృగముగా అవతరించెను. కనుక భగవానుడు శరభుడయ్యెను. (ఆ మహామృగము పేరు 'శరభము'.)

## 359. భీమః

- భయంకరుడు. భయమును కలిగించువాడు.

## ఓం భీమాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
39వ శ్లోకము. 359వ నామము. భీమః – **అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః**
101వ శ్లోకము. 948వ నామము. భీమః – **జననో జనజన్మాదిః భీమో భీమపరాక్రమః**

**బిభ్యతి ఇతి భీమః** – 'భీ' అనగా 'భయము' అనే ధాతువునుండి – భీముడు అనగా భయము కలుగజేయువాడు. భగవంతుని ఆజ్ఞను అతిక్రమించడానికి అందరూ భయము చెందెదరు. తైత్తరీయారణ్యకము (8) – **భీషాస్మాత్ వాతః పవతే** – ఆయనకు భయపడి గాలి వీచును.

**భయాదేవ అగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః**
**భయాత్ ఇంద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః** – కఠోపనిషత్తు (2.6.3)
అయన శిక్షించుననే భయముతోనే అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, వాయువు, మృత్యువు తమ తమ విధులను నిర్వర్తించును.
బ్రహ్మసూత్రము (1.3.40)లోని 'కంపనాత్' అనే పదము ఈ భావములోనే వాడబడింది.

శ్రీ వి.వి.రామానుజన్ దివ్యప్రబంధములనుండి మరికొన్ని ఉదాహరణలు చెప్పారు. శ్రీనారసింహుని ఆవిర్భావమున హిరణ్యకశిపుడు భయముతో కంపించిపోయెను. లంకలో యుద్ధము జరిగినపుడు శ్రీరాముని శరధాటికి రాక్షసులు సింహమును చూచిన తోడేళ్ళవలె పరుగులు తీసిరి. (తిరువైమొళి 7.6.8).

ధర్మచక్రము రచయిత – భగవంతుని తత్వము తెలియనివారిని, భగవంతుని నమ్మనివారిని కట్టడి చేసేది భయమే. భగవంతునిపై మనస్సు నిలిపినవారికి భయముండదు.

'అభీమ' అనే పాఠాంతరమును కూడ శ్రీ శంకరులు పేర్కొన్నారు. సన్మార్గములో చరించువారికి భయము లేకుండ చేయువాడు అభీముడు.

## 360. సమయజ్ఞః

- నియమము, కాలము, వ్రతము తెలిసినవాడు
- సమభావము కలిగినవాడు.

### ఓం సమయజ్ఞాయ నమః

ఈ నామమును భాష్యకారులు రెండు విధాలుగా వ్యాఖ్యానించారు.
సమయ-జ్ఞ – సమయము తెలిసినవాడు. ఇక్కడ సమయము అనగా కాలము అని, నియమము అని కూడ అర్థములు చెప్పబడినవి.
సమ-యజ్ఞః – సమమైన వ్రతము కలవాడు.

**సూర్య చంద్ర సమో ధాతా యథా పూర్వకమ్ అకల్పయత్.**

**అగ్న్యాదీనాం చ సమయః ఊర్ధ్వాగ్ర జ్వలనాధికమ్ యో జానాత్యధికారం చ సమయజ్ఞ స్స కీర్తితః -** అగ్ని ఎప్పుడు మండాలి? మంట పైకి ఎలా వెళ్ళాలి? ప్రళయానంతరం సృష్టి ఎలా జరగాలి? సూర్యచంద్రుల గతులెలా ఉండాలి? ఈ నియమాలను, సమయాలను విధించినవాడు, తెలిసినవాడు, పాలించువాడు సమయజ్ఞుడు.

శ్రీ భట్టులు మరొకవిధంగా కూడా వ్యాఖ్యానించారు. ఎప్పుడు తన భక్తుల కోర్కెలను కరుణించాలో, ఎప్పుడు తాను వారికి అందిరావాలో తెలిసినవాడు సమయజ్ఞుడు.

శ్రీ శంకరులు కూడా రెండువిధాల వ్యాఖ్యలను ప్రసాదించారు. సృష్టి, స్థితి, లయముల సమయము నెఱింగినవాడు గనుక భగవానుడు సమయజ్ఞుడు. అందరినీ సమముగా చూచు వ్రతము గలవాడు గనుక సమయజ్ఞుడు.

శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (2.8.9)నుండి చెప్పిన ఉదాహరణ. శ్రీనృసింహావతారమున స్తంభమునుండి బయల్పడవలసిన సమయము తెలిసినవాడు గనుక అచ్యుతుడు సమయజ్ఞుడు – **ఇరణియాన్ తూణ్ పుడై ప్పాంగు అప్పొడుదే అవన్ వీయత్ తోన్టియ ఎన్ సింగప్పిరాన్.**

శ్రీ పోతన భాగవతంలో ఈ ఘట్టానికి సంబంధించిన పద్యం
**హరి సర్వాకృతులన్ గలండనుచు ప్రహ్లాదుండు భాషింప స**
**త్వరుడై ఎందును లేడు, లేడని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ**
**నరసింహాకృతినుండె నచ్యుతుడు నానా జంగమ స్థావరో**
**త్కర గర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబుతోన్.**



శ్రీనృసింహావతారం. 18వ శతాబ్దపు చిత్రం. వికీపీడియా నుండి .
https://commons.wikimedia.org/wiki/File:Narasimha_oil_colour.jpg

యుద్ధకాలమున ఒక రాజు అవలంబింపవలసిన ఆరు విధములైన వ్యూహములను శ్రీ రాధాకృష్ణశాస్త్రి ప్రస్తావించారు – యుద్ధము, సంధి, ఇతరుల సహకారము, ఇద్దరు శత్రువుల మధ్య పోరు, దండయాత్ర, వేచియుండుట – ఇవన్నీ పాండవుల విజసారధియై శ్రీకృష్ణభగవానుడు నిరూపించెను గనుక ఆయన సమయజ్ఞుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడే భూత భవిష్యద్ వర్తమానములు తెలిసినవాడు. షడృతువులను ప్రవర్తిల్లజేయును. గ్రహముల గతులెరిగినవాడు. జనన మరణ సమయము తెలిసినవాడు. కనుక సమయజ్ఞుడు.

## 361. హవిర్హరిః

- యజ్ఞములందు అర్పించిన హవిస్సులను స్వీకరించు హరి.

### ఓం హవిర్హరయే నమః

ఈ నామమును 'హవిర్హరిః' అనే ఒకే నామముగానూ, 'హవిః', 'హరిః' అనే రెండు నామములుగానూ కూడా వ్యాఖ్యానకర్తలు పరిగణించారు.

### హవిర్హరిః

'యజ్ఞేషు హవిర్భాగం హరతి ఇతి హవిర్హరిః' – యజ్ఞములందు అర్పించిన హవిస్సులను హరించువాడు హవిర్హరి – ఇందుకు ప్రమాణంగా గీత (9.2.4)నుండి – **అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ** – అని శ్రీ శంకరులు ఉదాహరించారు. సకలయజ్ఞములకును భోక్తను, స్వామిని కూడా తానేనని శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చెను. సకలదేవతలు హరియవతారములు. యజ్ఞయాగాదులలో అర్పించు హవిస్సులను ఆయా దేవతల రూపమున శ్రీహరియే గ్రహించును. హవిర్భాగమును తీసుకొనే దేవతల సంఖ్య 33 అని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడింది.

| | | |
|---|---|---|
| ఏకాదశ రుద్రులు | - | 11 |
| ద్వాదశాదిత్యులు | - | 12 |
| అష్టవసువులు | - | 8 |
| ఇంద్రుడు, ప్రజాపతి | - | 2 |
| **మొత్తము** | **-** | **33** |

'హు' అనే ధాతువునుండి 'హవిస్' అనే పదము వస్తుంది. దీనికి 'ఇచ్చుట' అనీ, 'తీసికొనుట' అనీ రెండర్థములు చెప్పవచ్చును. భగవంతుని సేవించి భక్తులు సంతసింతురు. భక్తులను అనుగ్రహించి భగవంతుడు సంతసించును. ఈ విధంగా కూడా ఆయన హవిర్హరి.

**సమయం శృతిసిద్ధం యో జ్ఞాత్వా తేభ్య శ్రియం ముదా దత్తే హుతం హవిస్తైశ్చ దీయతే స హవి స్మృతః**
**హరతీతి హరిర్విఘ్నాన్ అన్నదానేషు నిత్యశః హవిర్హరిరితి ప్రోక్తః హ్యష్టార్ణశ్చైక నామతః**

(ఇక్కడ 'సమయజ్ఞ' నామముతో సంబంధము కలుపబడినది!) వేదోక్తమయిన సమయము తెలిసి, తన భక్తులకు సంపదలు ఇచ్చి ఆనందించువాడు. ఆ భక్తులు అగ్నియందు అర్పించు హవిస్సును తీసికొనువాడు. భక్తులొనరించు అన్నదానమువంటి పుణ్యకార్యములకు కలిగే విఘ్నాలను పోగొట్టువాడు గనుక 'హవిర్హరి'యని ఒకే నామమున చెప్పబడును.

హవిః

(శ్రీకైవల్య సారధి నుండి) పురుషసూక్తంలో - **అబధ్నన్ పురుషం పశుం** – అని చెప్పబడినది. దేవతలు తాము చేసే యజ్ఞానికి విరాట్పురుషునే పశువుగా బంధించారట. ఈ విధముగా భగవంతుడే హవి.

హరిః

పాపములను హరించువాడు శ్రీమన్నారాయణుడు.

**హరియను రెండక్షరములు**
**హరియించును పాతకముల నంబుజనాభా**
**హరి నీ నామమహిమము**
**హరి హరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా**

**ప్రోమ్యఘమ్ చ స్మర్తృణామ్ హవిర్భాఘమ్ క్రతుష్వహమ్**
**వర్ణశ్చ మే హరిద్వేతి తస్మాద్ హరిరహమ్ స్మృతః** – మహాభారతము. శాంతిపర్వము. 330.3

నన్ను స్మరించినవారి పాపములను హరింతును. ఇంకా యజ్ఞములలో హవిర్భాగమును స్వీకరింతును. నావర్ణము కూడ నీలము (హరివర్ణము). కనుక నన్ను 'హరి'యందురు.



నారాయణ తిరుమల ఆలయంలో శ్రీ ఆదిలక్ష్మి శిల్పం. వికీపీడియా చిత్రం. రాజశేఖర్ సౌజన్యంతో.

**362**నుండి **379**వరకు నామములు పరవాసుదేవుని లక్ష్మీపతిత్వమును స్తుతించు నామములుగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

**శ్రీసూక్తము (ఋగ్వేదము. సౌభాగ్యలక్ష్మీ ఉపనిషత్తు)**

తమకు సౌభాగ్యలక్ష్మీవిద్యను ఉపదేశించమని కోరిన దేవతలకు శ్రీమహావిష్ణువు ఇలా చెప్పాడు – దేవతలారా! తురీయ, తురీయాతీత, సర్వోత్కట, సర్వమంత్రాసనగత, పీఠ, ఉపపీఠ, దేవతాపరివృత, చతుర్భుజ అయిన లక్ష్మి (శ్రీ)ని హిరణ్మయము చేసి 15 ఋక్కులలో ధ్యానము చేయండి.

శ్రీ గణేశాయ నమః
అథ శ్రీమహాలక్ష్మ్యై నమః

హిరణ్యవర్ణామితి పంచదశర్చస్య సూక్తస్య ఆనంద కర్దమ చిక్లీతేన్దిరాసుతా ఋషయః శ్రీరగ్నిశ్చేతుభ్యే దేవతే
ఆద్యాస్తిస్రోऽనుష్టుభః చతుర్థీ బృహతీ పంచమీ షష్ఠ్యౌ త్రిష్టుభౌ తతోऽష్టా వనుష్టుభః అన్త్యా ప్రస్తార పంక్తిః జపే వినియోగః
(ఈ శ్రీసూక్తానికి ఆనంద, కర్దమ, చిక్లీత, ఇందిరాసుతులు ఋషులు. శ్రీరిత్యాదులు ఋక్కులు. 14 ఋక్కులకు ఆనందాదులు ఋషులు. 'హిరణ్యవర్ణాం'తో మొదలగు మూడు ఋక్కులకు ఛందస్సు 'అనుష్టుప్'. 'కాంసోస్మిత' ఋక్కునకు ఛందస్సు 'బృహతీ'.

తరువాతి రెండింటికి ఛందస్సు 'త్రిష్టుప్'. తరువాతి ఎనిమిదింటికి ఛందస్సు 'అనుష్టుప్'. చివరి ప్రసార పంక్తికి దేవత అగ్ని. బీజము 'హిరణ్యవర్ణాం' అనునది. కాంసోస్మితి ఇతి శక్తిః.)

హరిః ఓం

హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం

చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ

అగ్నిదేవా! సువర్ణకాంతివంటి ఛాయగలదీ, పాపాలను హరించివేసేదీ, బంగారు వెండి హారాలను అలంకరించుకొన్నదీ, చంద్రునివంటి ఆహ్లాదం కలదీ, సువర్ణమయమైనదీ అయిన మహాలక్ష్మిని నా కొరకు ఆవాహన చెయ్యి!

తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్

యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్

ఓ అగ్నిదేవా! ఎవరి కృపాకటాక్షంతో నాకు బంగారం, గోవులు, గుర్రాలు, బంధువులు సంప్రాప్తమైనవో ఆ మహాలక్ష్మిని నాకడకు ఆవాహన చెయ్యి. ఆమె నావద్దనుండి వీడిపోనట్లు చూడు.

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్

శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీర్జుషతామ్

గుర్రాలు పూన్చిన రథం మధ్యన ఆసీనురాలైనదీ, తన రాకను ఏనుగు ఘీంకారంతో సూచిస్తూ వున్నదీ అయిన శ్రీదేవిని ఆహ్వానిస్తున్నాను. శ్రీదేవీ! నీవు నావద్ద సంతోషంగా నెలకొనియుందువుగాక!

కాం సోస్మితాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్

పద్మే స్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్

చిరుదరహాసంతో కూడినదీ, బంగారుకోటలో వసించునదీ, కరుణాస్వరూపిణీ, తేజస్స్వరూపిణీ, ఆనందస్వరూపిణీ, ఆనందం ప్రసాదించునదీ, పద్మంలోఆసీనురాలయినదీ, పద్మంవంటి ఛాయగలదీ అయిన ఆ శ్రీదేవిని ఇక్కడ సాక్షాత్కరింపమని ప్రార్థిస్తున్నాను.

చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టాముదారామ్

తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేऽలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే

చంద్రునితో పోలినదీ, తేజోవంతమైనదీ, తన కీర్తిచంద్రికలవలన దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నదీ, దేవతలచే పూజలు అందుకొనునదీ, కరుణాస్వరూపిణీ, పద్మాన్ని ధరించినదీ, 'ఈం' అనే బీజమంత్రానికి భావంగా విరాజిల్లుతూన్నదీ అయిన మహాలక్ష్మిని నేను శరణుజొచ్చుతాను. ఓ దేవీ! నిన్ను ప్రార్థిస్తున్నాను. నా దారిద్ర్యం తీరిపోయేలా కరుణించు.

ఆదిత్యవర్ణే తపసోऽధిజాతో వనస్పతిస్తవ వృక్షోऽథ బిల్వః

తస్య ఫలాని తపసానుదన్తు మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః

సూర్యుని వన్నె కలదానా! వనానికి అధిపతియైన బిల్వవృక్షం నీ తపోమహిమచే ఉద్భవించింది. నీ తపస్సంభూతాలైన దాని ఫలాలు అజ్ఞానమైనలోపలి ఆటంకాన్నీ అమంగళకరమైన బాహ్య ఆటంకాన్నీ తొలగిస్తాయి గాక!

ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ

ప్రాదుర్భూతోऽస్మి రాష్ట్రేऽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే

కుబేరుడూ, కీర్తిదేవుడూ ఐశ్వర్యాలతో నన్ను వెన్నంటి రావాలి. నీ అనుగ్రహం పూర్తిగా సంతరించుకొన్న ఈ దేశంలో నేను జన్మించాను. కీర్తిని, ఐశ్వర్యాన్ని నాకు ప్రసాదించు.

క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్షీం నాశయామ్యహమ్
అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్
ఆకలి దప్పులతో కృశించినదీ, శ్రీదేవికంటే ముందుగా జన్మించినదీ అయిన జ్యేష్ఠాదేవిని (అలక్ష్మిని) నేను నాశనం చేస్తాను. నా గృహంనుండి అభాగ్య, అసమృద్ధులను పూర్తిగా నిర్మూలించి అనుగ్రహించు.



శ్రీ లక్ష్మీ నారాయణులు. ఖజురాహో శిల్పం. వికీపీడియానుండి.

Photo by: Jean-Pierre Dalbéra from Paris, France
https://commons.wikimedia.org/wiki/File:Le Temple Devi Jagdambi (Khajurâho) (8504113364).jpg

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్
సుగంధానికి ఆలవాలమైనదీ, జయింపనలవి కానిదీ, సతతం పౌష్టికతనిచ్చునదీ, సకల సంపన్నురాలూ, సమస్త జీవులకు నాయకురాలైనదీ అయిన మహాలక్ష్మిని ఇక్కడ ఆవాహన చేస్తున్నాను.

మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి
పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః
శ్రీదేవీ! మనస్సులో జనించే ఉదాత్త ఆకాంక్షలను, సంతోషాన్ని, వాక్కులో సత్యాన్ని, గోసమృద్ధిచేత, ఆహార సమృద్ధిచేత కలిగే ఆనందాన్ని నేను చవి చూడాలి. నాకు కీర్తి కలుగుగాక!

కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్
కర్దమ మహర్షీ! నీకు పుత్రికగా జన్మించిన మహాలక్ష్మి నాకు సాక్షాత్కరించాలి. తామరపువ్వుల మాల దాల్చినదీ, సిరిసంపదలకు అధిదేవతా, తల్లీ అయిన ఆమెను నా కులంలో సతతం వసింపచేయాలి.

ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే
ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే
శ్రీదేవి పుత్రుడవైన ఓ చిక్లీతా! నీరు చక్కని ఆహారపదార్థాలను ఉత్పాదన చేయనీ. నా యింట నువ్వు వసించాలి. దేవీ, నీ మాతా అయిన శ్రీదేవి నా కులంలో నిరంతరం వసింప అనుగ్రహించు!

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలాం పద్మమాలినీమ్
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ
అగ్నిదేవా! కరుణాపూరిత మనస్సు గలదీ, పద్మవాసినీ, ఆహారం ఒసగి లోకాన్ని పోషించేదీ, కుంకుమవన్నె గలదీ, తామరపువ్వుల మాలాధారిణీ, చంద్రునిలా ఆహ్లాదకారిణీ, బంగారుమయమైనదీ అయిన మహాలక్ష్మిని నా నిమిత్తం ఆవాహన చేయి.

ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ
అగ్నిదేవా! దయార్ద్రహృదయురాలూ, గంభీరమూర్తీ, దండం చేబట్టినదీ, అందమైన మేనిచ్ఛాయగలదీ, సూర్యునిలా ప్రకాశమాన అయినదీ, బంగారుమయమైనదీ అయిన మహాలక్ష్మిని నాకోసం ఆవాహన గావించు.

తాం మ ఆవహ జాతవేదో లక్షీమనపగామినీమ్
యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽశ్వాన్ విందేయం పురుషానహమ్

అగ్నిదేవా! ఎవరివలన నేను అపరిమిత బంగారం, గోవులు, సేవకురాండ్రు, గుర్రాలు, సేవకులను ప్రాప్తించుకొంటానో అట్టి మహాలక్ష్మి నన్ను వదలివెళ్ళిపోకుండా కృపచూపు.

యః శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్యమన్వహమ్

సూక్తం పంచదశర్చం చ శ్రీ కామః సతతం జపేత్

ఎవరు లక్ష్మీదేవి కృపాకటాక్షార్థం ప్రార్థిస్తున్నారో వారు శుచిగా, ఇంద్రియాలు నిగ్రహించినవారిగా ఉంటూ ప్రతిరోజు నేతితో హోమం చేయాలి. పైన తెలిపిన లక్ష్మీదేవియొక్క పదిహేను మంత్రాలను సదా జపిస్తూ ఉండాలి.

ఆనన్దః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః

ఋషయస్తే త్రయః ప్రోక్తా స్వయాం శ్రీరేవ దేవతా

సుప్రసిద్ధులూ, ఋషులూ అయిన అనందుడు, కర్దముడు, చిక్లీతుడు ముగ్గురూ ఈ సూక్తంలోని ఋషులు. మహాలక్ష్మియే దేవత.

పద్మాననే పద్మఊరూ పద్మాక్షీ పద్మసంభవే

త్వం మాం భజస్వ పద్మాక్షీ యేన సౌఖ్యం లభామ్యహమ్

పద్మంవంటి ముఖమూ, పద్మంవంటి ఊరువులూ, పద్మంవంటి కన్నులూ గలదానా, పద్మంనుండి ఉద్భవించినదానా, నేను దేనివలన సుఖిస్తానో దాన్ని నువ్వు నాకు అనుగ్రహించు.

అశ్వదాయీ గోదాయీ ధనదాయీ మహాధనే

ధనం మే జుషతాం దేవి సర్వకామాంశ్చ దేహి మే

గుర్రాలను సమర్పించేదీ, గోవులను సమర్పించేదీ, సంపదలను సమర్పించేదీ, ధనానికి అధిదేవతాయైన మహాలక్ష్మీ! అభీష్టాలన్నీ నెరవేరేటప్పుడు కలిగే సుఖాన్ని ఇచ్చే సంపదను నాకు ప్రసాదించు.

పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాదిగవే రథమ్

ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతు మామ్

పుత్రులు, పౌత్రులు, ధనధాన్యాలు, ఏనుగులు గుర్రాలు ఇత్యాదులు, గోవులు, రథాలు సకలం ప్రసాదించు. జనులకు నువ్వు తల్లిగా భాసిస్తున్నావు. నన్ను ఆయుష్మంతునిగా ఒనరించాలి.

ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః

ధనమింద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే

అగ్నిదేవుడూ, వాయుదేవుడూ, సూర్యభగవానుడూ, అష్టవసువులూ, దేవేంద్రుడూ, దేవగురుపైన బృహస్పతీ, వరుణదేవుడూ తమ తమ సంపదలను నీ కృపతో అనుభవిస్తున్నారు.

చంద్రాభాం లక్ష్మీమీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్

చంద్రసూర్యాగ్ని వర్ణాభాం శ్రీ మహాలక్ష్మీముపాస్మహే

చంద్రునిలా ఆహ్లాదంగా ప్రకాశిస్తున్నదీ, దేవతల శక్తిగా విరాజిల్లుతూన్నదీ, సూర్యునిలా తేజస్సుతో ప్రకాశిస్తూన్నదీ, శ్రీదేవీ, ఈశ్వరీ, చంద్ర సూర్య అగ్నుల ముువ్వురినీ తన మహత్తుగా కలదీయైన శ్రీమహాలక్ష్మిని ఆరాధిస్తాం.

వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా

సోమం ధనస్య సోమినో మహ్యం దదాతు సోమినః

ఓ గరుత్మంతుడా! సోమరసం గ్రోలు. వృత్రాసురుని సంహరించిన ఇంద్రుడు సోమరసం గ్రోలనీ. సోమయాగం నిర్వర్తింప ఆశిస్తూన్న నాకు పుష్కలంగా ధనాన్ని ప్రసాదించనీ.

న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభామతిః
భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా
పుణ్యం చేసిన భక్తులకు కోపం రాదు, మాత్సర్యం ఉండదు, లోభం నశిస్తుంది, దుర్బుద్ధి పుట్టదు. వారికి అశుభం కలుగదు. భక్తిని పొంది వారు శ్రీసూక్తాన్ని సదా జపం చేయాలి.

వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః
రోహంతు సర్వబీజాన్యవ బ్రహ్మ ద్విషో జహి
నీ కృపతో విద్యుల్లతాయుక్తాలైన మేఘాలు రేయింబవళ్ళు వర్షించనీ! విత్తనాలు యావత్తు చక్కగా మొలకెత్తి ఏపుగా పెరుగనీ! భగవంతుని నిందించేవారు నిష్క్రమించనీ!

పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మ దళాయతాక్షి
విశ్వప్రియే విష్ణుమనోఽనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ
పద్మమంటే ఇష్టపడేదానా, పద్మకుమారీ, పద్మాన్ని చేత ధరించినదానా, పద్మనివాసినీ, తామర రేకులవంటి విశాలమైన కన్నులు గలదానా, లోకానికి ప్రియమైనదానా, విష్ణువు మనస్సుకు అనుకూలురాలైనదానా, నీ పాదపద్మాలను నాపై మోపి నన్ను అనుగ్రహించు.

యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ
గంభీరావర్తనాభిః స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రై మణిగణఖచితై స్స్నాపితా హేమకుంభైః
నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగల్యయుక్తాః
పద్మంమీద ఆసీనురాలై ఉన్నదెవరో, విస్తారమైన పిరుదులుగలవారెవరో, తామరరేకులవంటి నేత్రాలు గలవారెవరో, లోతైన నాభి గలవారెవరో, స్తనాలభారంతో వంగివున్నవారెవరో, స్వచ్ఛమైన వలువలు ఉత్తరీయం ధరించినవారెవరో, రత్నాలు పొదిగిన బంగారు కలశాల జలంతో దేవలోకంలోని శ్రేష్టతమ గజరాజులచే అభిషేకింపబడుచున్నదెవరో, పద్మాన్ని చేత ధరించినవారెవరో, సర్వమంగళ స్వరూపిణియైనదెవరో, అట్టి మహలక్ష్మి నా గృహంలో సదా సర్వవేళలా నివసించనీ!

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీమ్
దాసీభూత సమస్తదేవవనితాం లోకైకదీపాంకురామ్
శ్రీమన్మందకటాక్షలబ్ద విభవద్బ్రహ్మేంద్రగంగాధరామ్
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్
భాగ్యానికి ఆలవాలమైనది, క్షీరసముద్రరాజ తనయా, శ్రీరంగంలో వెలసిన దేవీ, దేవలోక స్త్రీలందరినీ దాసీజనంగా చేసుకొన్నదీ, లోకానికి ఏకైక దీపంగా భాసిస్తున్నదీ, ఎవరి మృదుల కటాక్షంతో బ్రహ్మ ఇంద్రుడు గంగాధరుడు వైభవం సంతరించుకొన్నారో ఆమే, మూడులోకాలను తన కుటుంబంగా చేసుకొన్నదీ, తామర కొలనులో ఉద్భవించినదీ, మహావిష్ణువుకు ప్రియాతిప్రియమైనదీ అయిన నీకు నమస్కరిస్తున్నాను.

సిద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీస్సరస్వతీ
శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా

తలచిన మాత్రాన కోరికలను నెరవేర్చే సిద్ధలక్ష్మిగాను, ముక్తిని అనుగ్రహింపగల మోక్షలక్ష్మిగాను, విజయాన్ని సిద్ధింపజేసే జయలక్ష్మిగాను, పద్మకాసారంలో ఉద్భవించినదీ, సంపదలిచ్చే శ్రీదేవిగాను, వరాలు ప్రసాదింపగల వరలక్ష్మిగాను విరాజిల్లుతూన్న నువ్వు సదా సర్వవేళలా నాకు ప్రసన్నురాలవుగా ఉండుగాక!

పరాంకుశౌ పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థామ్
బాలార్క కోటి ప్రతిభాం త్రిణేత్రాం భజేహమాద్యాం జగదీశ్వరీం త్వామ్
వర, అభయ ముద్రలు చేత దాల్చినదీ, పాశ అంకుశాలను చేత ధరించినదీ, పద్మనివాసినీ, కోటి బాలసూర్యుల ప్రకాశం కలదీ, మూడు కన్నులు కలదీ, ఆదిశక్తీ, జగదీశ్వరీ అయిన ఆమెను నేను స్తుతిస్తాను.

సర్వమంగల మాంగల్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తు తే నారాయణి నమోఽస్తు తే నారాయణి నమోఽస్తు తే
మంగళాలకల్లా మంగళకరమైనదానవు, మంగళం ప్రసాదించేదానవు, సకల శుభాలను సాధించి ఇచ్చేదానవు, శరణు పొందడానికి యుక్తమైనదానవు, మూడు కన్నులున్నదానవు అయిన దేవీ! నారాయణీ! నీకు నా నమస్కారము. నారాయణీ! నీకు నా నమస్కారము. నారాయణీ! నీకు నా నమస్కారము.



థాయిలాండ్ చియాంగ్ మాయ్ మ్యూజియంలో శ్రీ లక్ష్మీదేవి విగ్రహం.

సరసిజ నిలయే సరోజహస్తే ధవలతరాంశుక గంధమాల్యశోభే
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీదమహ్యమ్
పద్మవాసినీ, చేత పద్మాన్ని పవిత్రమైన తెల్లని వస్త్రాలను సుగంధపూరిత మాలను ధరించి శోభించేదానా, భగవతీ, హరి అర్ధాంగీ, కోరికలనెరిగి యీడేర్చుదానా, ముల్లోకాలను పోషించి కాపాడేదానవైన నువ్వు నన్ను అనుగ్రహించు.

విష్ణుపత్నీం క్షమాం దేవీం మాధవీం మాధవప్రియామ్
విష్ణోః ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్
విష్ణుపత్నీ, భూదేవీ, తులసిమొక్కగా అలరారుతున్నదీ, మాధవుని ప్రియురాలూ, విష్ణువు ప్రియసఖీ, విష్ణువుతో కూడిన దేవీ, నేను నమస్కరిస్తున్నాను.

ఓం మహాలక్ష్మీ చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్
మహాలక్ష్మిని తెలుసుకొందాం. విష్ణుపత్నియైన ఆమెను అందుకై ధ్యానిద్దాం. ఆ లక్ష్మీదేవి మనలకు ప్రేరణనిచ్చుగాక.

శ్రీవర్చస్యమాయుష్యమారోగ్యమావిధాత్ పవమానం మహీయతే
ధనం ధాన్యం పశుం బహుపుత్రలాభం శత సంవత్సరం దీర్ఘమాయుః
ఋణరోగాదిదారిద్ర్యపాపక్షుదపమృత్యవః
భయశోకమనస్తాపా నశ్యంతు మమ సర్వదా

మహాలక్ష్మీ! వర్చస్సు, లోటులేని జీవితం, మంచి ఆరోగ్యం నాకు ప్రసాదించే పవనాలు సదా సర్వవేళలా వీచనీ. ధనధాన్యాలు, పశుసంపద, పుత్రులు, నూరేళ్ళ దీర్ఘాయుస్సు నాకు చేకూరనీ. అప్పు, రోగం, దారిద్ర్యం, ఆకలి, అకాలమరణం, భయశోకాలు, మానసిక వ్యధలు ఇత్యాదులు నశించనీ.

శ్రియే జాత శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జరితృభ్యో దధాతు
శ్రియం వసానా అమృతత్వమాయన్ భజన్తి సద్యః సవితా విదధ్యూన్
శ్రీదేవి చేరేవారిని ఐశ్వర్యం వరిస్తుంది. సంపద, దీర్ఘాయువు చేకూరుతుంది. వారు ఐశ్వర్యంలో తులతూగుతూ మరణంలేని స్థితికి చేరుకొంటారు. సత్వరమే వారు కీర్తిని, విజయాన్ని పొందుతారు.

శ్రియ ఏవైనం తచ్ఛ్రియామాదధాతి
సంతతమృచా వషట్ కృత్యం సంధత్తం సంధీయతే ప్రజయా పశుభి:
య ఏవం వేద
మంచివి అన్నీ లక్ష్మీ దేవియే – ఇలా తెలుసుకొన్నవాడు లక్ష్మీదేవిని చేరుకొంటాడు. మంత్రయుక్తంగా ఎల్లప్పుడూ యాగం చేయాలి. అలాచేసేవాడికి పుత్రసంపద, పశుసంపద లభిస్తుందని గ్రహించాలి.

ఓం మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్
~ ఓం శాంతిః శాంతిః శాంతిః ~
మహాదేవియైన లక్ష్మీదేవిని తెలుసుకొందాము. విష్ణుపత్నియైన ఆమెను అందునిమిత్తం ధ్యానిద్దాం. ఆ లక్ష్మీదేవి మనలకు ప్రేరణనిచ్చుగాక!

*సూక్తము http://kadambakusumam.blogspot.com నుండి కాపీ చేసినది. తెలుగు అనువాదము స్వామి జ్ఞానానంద రచన (శ్రీరామకృష్ణ మఠం ప్రచురణ) నుండి*

## 362. సర్వలక్షణ లక్షణ్యః

- సకల శుభలక్షణములకును నిలయమైనవాడు.
- అన్ని సద్గుణములకును ప్రమాణము.
- అన్ని విశ్లేషణల వల్లనూ పరమ సత్యమని చెప్పబడువాడు.
- సకల వస్తురూపమున దర్శించుకొనదగినవాడు.

### ఓం సర్వలక్షణ లక్షణ్యాయ నమః

భగవంతుని సకల శుభలక్షణములను తెలుపుతూ శ్రీభట్టులు ఉదాహరించిన ధ్యానశ్లోకము –

**ధ్యాయేత్ కమల గర్భాభమ్ దేవమ్ లక్ష్మీపతిస్తతః**

**కమలాలయ హితీశ విభూషిత కరద్వయమ్**

కమలమునకు అంతర్భాగమువలె ఉన్నవాడు, ఒక చేత శ్రీలక్ష్మీనిలయమగు పద్మమును, మరొకచేత ఆయుధముల రాజయిన చక్రమును ధరించినవాడును అయిన లక్ష్మీపతిని ధ్యానింతును.

శ్రీ భట్టులు ప్రస్తావించిన మంత్రము – **పుండరీకాక్ష! సకల సుఖ సౌభాగ్య వారిధే!**

శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమోళి (1.9.1)నుండి ఉదాహరించారు. ఇంకా విష్ణుపురాణములో చెప్పినది – **పశ్యతామ్ సర్వదేవానామ్ యయౌ వక్షస్థలమ్ హరేః** – పాలకడలినుండి వెలువడిన లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు వక్షస్థలము నలరించినది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అన్ని విధములైన లక్షణములు (ప్రమాణములు) ద్వారా స్పష్టముగా తెలియబడువాడు. అనగా జ్ఞానమువల్ల, భక్తివల్ల, యోగమువల్ల, తర్కమువల్ల – అన్ని శోధనలవల్లను ఆ పరమాత్ముడే సత్యముగా అవగతమగును.

ధర్మచక్రము రచయిత వివరణ. ఏమైనా విషయము తెలిసికొనడానికి 4 మార్గములున్నవి.

ప్రత్యక్ష ప్రమాణము – స్వయముగా ఇంద్రియ జ్ఞానముతో తెలియుట.
యుక్తి ప్రమాణము – పరోక్షముగా తెలియుట (పొగవల్ల నిప్పు).
శాస్త్ర ప్రమాణము – వేదములవంటి శాస్త్రములు చెప్పినది.
అనుభవ ప్రమాణము – అనుభవమువల్ల తెలియునది (తలనొప్పి వంటి విషయాలు)

ఈ అన్ని ప్రమాణములద్వారాను భగవంతుని తెలిసికొనిన మహానుభావుడు శ్రీరామకృష్ణపరమహంస. ఆయన భగవంతుని చూడగలిగిరి. భగవంతుని ఎడబాటు భరింపలేకుండిరి (గాలి లేకపోతే మనము భరింపలేనట్లు). శాస్త్రములవల్లను, గురువులవల్లను భగవంతుని తెలిసికొనిరి. సమాధిస్థితిలో భగవంతుని ఐక్యమయ్యిరి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – లోకములో అన్ని వస్తువులు, కార్యములు భగవంతుని సూచించును. అన్నింటికిని ఆయనే కారణము. అన్నింటా దేవుడున్నాడు.

## 363. లక్ష్మీవాన్

- సదా శ్రీలక్ష్మీదేవితో కూడియుండువాడు. సిరిగలవాడు. శ్రీనాథుడు. శ్రీనివాసుడు.

### ఓం లక్ష్మీవతే నమః

ముందుమాట – శ్రీ భట్టుల వ్యాఖ్యను ఆచార్య శ్రీనివాస రాఘవన్ అనువదించారు. ఆ సమయంలో ఆయన చెప్పిన విషయము – భగవంతునకు, లక్ష్మీదేవికి గల అనుబంధపు తత్త్వమును గురువు కృపవలన తెలిసికొనవలసినది.

**లక్ష్మ్యా చ నిత్య యుక్తత్వాత్ లక్ష్మీవానితి కథ్యతే** – శ్రీదేవితో నిత్యము కూడియుండువాడు లక్ష్మీవాన్. ఆ తల్లి జగన్మాత. శ్రీరంగనాథునికి నిత్యానపాయిని. వేంకటరమణుని పట్టపురాణి. జనని, జానకి, జగమేలు తల్లి.

నిత్యము, సత్యము అయినవి, ఆద్యంతములు లేనివి రెండు – భగవంతుడు, ప్రకృతి. ఈ ప్రకృతియే జగన్మాతృక, శ్రీలక్ష్మి. పురుషుడే నారాయణుడు. ప్రకృతి, పురుషుల వలన సకల నామరూపాత్మకమగు విశ్వము ఉద్భవించి, ప్రవర్తిల్లుచున్నది. సత్వరజస్తమో గుణములవల్ల ప్రకృతి పరిణామము చెందుచున్నట్లు అనిపించును. మూలప్రకృతియే మహాలక్ష్మి.

శ్రీ భట్టులు ఉదాహరించిన ప్రమాణము –
**ద్వయమ్ దేవీ పరిణయే లీలాయైవ సమర్పయన్**
**ప్రకాశయన్ అనాదిత్వమ్ ఆత్మనా ప్రకృతే సహ**
**మత్కరైః అనువిద్ధేయమ్ ప్రకృతిః ప్రకృతైరహమ్**
**యతోఽహమ్ ఆశ్రితశ్చ అస్య మూర్తిః మయి ఏతదాత్మికా**

శ్రీదేవితో నా పరిణయము జరిగిన సమయమున నేను సంతసించి లీలాస్వరూపమును అందరికిని చెప్పితిని. ఈ పరమ సత్యము లక్ష్మీనారాయణుల జంటయేగాని వేరువేరుగా కాదు. నావలెనే లక్ష్మి కూడ అనాది తత్త్వము. అంత్యరహితము. నేను, ఈ ప్రకృతి రెండు చేతుల ఆలింగనము చేసికొంటిమి. మేమిరువురము అప్పటినుండి ఒకటే.

శ్రీ చిన్మయానంద కూడ ఇదే భావమును వివరించారు. లక్ష్మి ప్రకృతి స్వరూపము. విష్ణువు పురుష స్వరూపము. ప్రకృతియొక్క శక్తి పురుషుని దీప్తిచే చైతన్యవంతమై మనకు కనుపించే నామరూపాత్మక విశ్వమై శోభిల్లుచున్నది. కనుక భగవానుడు 'లక్ష్మీవాన్' అనబడును.

### 364. సమితింజయః

- అసంఖ్యాక సైన్య సమూహమును జయించినవాడు.
- భగవంతుని ఎడబాటుచే బాధపడు భక్తుల హృదయములను జయించి, వారిని తనకడకు తీసికొనువాడు.

**ఓం సమితింజయాయ నమః**

**సమితిం యుద్ధం జయతి ఇతి సమితింజయః** – ఇక్కడ 'సమితి' అనగా 'యుద్ధము' అనే అర్థములో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. శత్రుసమూహములను జయించువాడు గనుక సమితింజయుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భక్తుల కష్టములను నాశనము చేయువాడు. భక్తుల మనసులను జయించి, పరమాత్మునినుండి దూరమైన జీవాత్మలకు ఆనందము కూర్చువాడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – 'సమితి' అనగా 'సమూహము'. ఎందరు శత్రువులు దండెత్తినాగాని వారిని జయించువాడు సమితింజయుడు.

**శ్రీ మద్రామాయణము – అరణ్యకాండము నుండి. బ్రహ్మశ్రీ కొంపెల్ల వెంకటరామశాస్త్రిగారి సరళ సుందర వచన గ్రంథమునుండి సంక్షిప్త పరచినది. శ్రీరామునిచేత పధ్నాలుగు వేలమంది రాక్షసులు నశించుట.**

రామలక్ష్మణులచేత భంగపడిన శూర్పణఖ తన సోదరుడైన ఖరునితో మొరపెట్టుకొన్నది. వెంటనే ఖరుడు యముళ్ళలాంటి పధ్నాల్గురు రాక్షసులను పిలిచి రామలక్ష్మణులను చంపిరమ్మని ఆజ్ఞాపించాడు. వాళ్ళు శూర్పణఖతోడుగా వెళ్ళి, సీతతోనూ, లక్ష్మణునితోనూ పర్ణశాలలో కూచుని ఉండిన రాముడిని చూశారు. రాముడు వాళ్ళను చూసి, సంగతి అంతా గ్రహించి, "తమ్ముడూ! నీవు సీత దగ్గర ఉండు. శూర్పణఖ మాటమీద వచ్చిన వీళ్ళను నేనిప్పుడే సంహరించి వస్తాను" అని చెప్పాడు. లక్ష్మణుడు సరేనన్నాడు.

పదునాల్గురు రాక్షసులు రాముణ్ణి చూసి, శూలాలు విసిరారు. పదునాల్గు బాణాలతో రాముడు ఆ పదునాల్గు శూలాలనూ ముక్కలు చేసేశాడు. ఇంకా క్రుద్ధుడై ఎండదేవుడిలా మండిపడిపోతూ పదునాలుగు బాణాలు తొడిగి, కొండమీద వజ్రాయుధం వేసినట్లు వాళ్ళమీద విడిచిపెట్టాడు. వెంటనే వాళ్ళు నేలకూలారు. వాళ్ళ రక్తంతో నేల అంతా తడిసిపోయింది. అంతా చూసి శూర్పణఖ బావురుమంటూ మళ్ళీ పరుగెత్తిపోయి ఖరునిముందు కూలబడింది. ఖరుడిని ఎత్తిపొడిచి మాట్లాడింది.

రోషంతో మండిపడి ఖరుడు దూషణుడనే సేనాధిపతిని చూచి "మన పధ్నాలుగువేల సైన్యమునూ సిద్ధం చెయ్యి. నేనే ముందుగా దుర్వినీతుడైన రాముణ్ణి సంహరించడానికి వెడతాను. నా రథం సిద్ధం చెయ్యి" అని చెప్పాడు. భీమవిక్రములైన రాక్షసులు ఖరుణ్ణీ, దూషణుణ్ణీ పరివేష్ఠించి నిలిచారు. వాళ్ళంతా ఆ మహారణ్యం అంతా దద్దరిల్లిపోయేటట్టు బొబ్బలు పెడుతూ బయలుదేరారు. రథనేమి ధ్వనితో ఆకాశం బద్దలయిపోయింది. అప్పుడు రాక్షసులకు అమంగళకరంగా, భయోత్పాతంగా దుర్నిమిత్తాలు కానవచ్చాయి. మృత్యుముఖంలో ఉన్న రాక్షససేనను చూచి మహర్షులూ, దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, చారణులూ ఆకాశాన ఉండి "గోవులకూ, బ్రాహ్మణులకూ, లోకకళ్యాణం కోరేవారందరికిన్నీ మంగళం అగుగాక. సుదర్శన చక్రధారి అయిన శ్రీమహావిష్ణువు

అసురులను సంహరించేటట్టు శ్రీరామచంద్రుడు ఈ రాక్షసులనందరినీ సంహరించి విజయం పొందాలి" అన్నారు. గ్రహాలన్నీ రవిచంద్రులను చేరినట్టు ఆ రాక్షసులందరూ రామలక్ష్మణులను సమీపించారు.

ఆకాశంలో పుట్టిన ఉత్పాతాల్ని లక్ష్మణునకు చూపుతూ రాముడు "తమ్ముడూ! ఈ మహోత్పాతాలు చూశావా! ఇవి రాక్షస వినాశానికి వచ్చాయి. మనకు జయమూ, శత్రువునకు పరాజయమూ కూడా తప్పదని అనిపిస్తోంది" అని, చెట్ల ఋరుగులో దుర్గంలా ఉన్న పర్వతగుహను చూపి "నీవు ధనుష్పాణివై సీతను అక్కడికి తీసుకువెళ్ళి జాగ్రత్తగా చూస్తూ ఉండు" అని చెప్పాడు. వెంటనే లక్ష్మణుడు మారు చెప్పకుండా, ధనుర్బాణాలు పుచ్చుకొని, సీతను వెంటబెట్టుకొని గుహలోకి వెళ్ళిపోయాడు.

అగ్నిలాగ వెలిగిపోతున్న రాముడు కవచం తొడుక్కొని, ధనుస్సు చేతబుచ్చుకొని, దిక్కులు పిక్కటిల్లేట్లు నారి మ్రోగిస్తూ ఇవతలికి వచ్చాడు. అప్పుడు క్రోధావేశంతో యుద్ధానికి సిద్ధంగానున్న రాముణ్ణి చూసి సమస్తభూతాలూ గడగడలాడిపోయాయి. పరవళ్ళు తొక్కుతూ సాగరంలా పొంగివస్తున్న ఖరునిసైన్యం రాముణ్ణి సమీపించింది. కౌశికుని శిష్యుడు, రణపండితుడు అయిన రాముడు ఒక్కసారి ఖరసైన్యాన్ని కలయచూశాడు. దుర్నిరీక్ష్యుడైన రాముణ్నిచూసి రాక్షసులుకూడా వణికిపోయారు. అప్పుడు రాముని రూపం దక్షుని యజ్ఞం నాశనం చెయ్యబూనిన పినాకపాణి రౌద్రరూపంలా ఉంది.



రాక్షసులను సంహరిస్తున్న శ్రీరాముడు. 1700 కాలపు ఆజ్మీర్ ప్రాంత చిత్రం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File:Rama_Battling_The_Titans,_Folio_from_a_Ramayana_(Adventures_of_Rama)_LACMA_M.73.34_(6_of_6).jpg

ఖరుడూ, పన్నెండుమంది రాక్షసులూ తీక్షణమైన ఆయుధాలతో రాముణ్ణి ముట్టడించారు. గాయపడిన రాముడు మిక్కిలి క్రోధం తెచ్చుకొని రాక్షసులమీద వేలాది బాణాలు విడిచాడు. అవి యమపాశాల్లాగా రాక్షసుల ప్రాణాలు తీశాయి. రాక్షససైన్యం ఎండిపోయిన అరణ్యంలా అయిపోయింది. అనేకులు చావగా మిగిలినవారు ఖరుని శరణుజొచ్చారు. దూషణుడు క్రోధోద్రిక్తుడై రాముని మీదికివచ్చి కవ్వించాడు. కోపించిన రాముడు బాణాలతో దూషణుని ధనుస్సునూ, గుర్రాలనూ, సారధినీ, ఆపై దూషణుని గుండెలనూ, చేతులనూ చీల్చేశాడు.

క్రుద్ధుడైన ఖరుడూ, వాని పన్నెండుగురు సేనాధిపతులు – శ్యేనగ్రామీ, పృథుగ్రీవుడూ, యజ్ఞశత్రువూ, వింగముడూ, దుర్జయుడూ, కరవీరాక్షుడూ, పరుషుడూ, ఆలకర్ముకుడూ, మేఘమాలీ, మహామాలీ, సర్పముఖుడూ, రుధిరాశనుడూ – రాముని మీదికురికారు. వజ్రసమానమైన రాముని బాణాలకు ఆ రాక్షసులందరూ కవచాలు బ్రద్దలయిపోయి, ధనుస్సులూ, బాణాలూ ముక్కలయి, రక్తం వోడ్చుకుంటూ భూమిమీద పడిపోయారు. ఆ వనం అంతా రాక్షసుల రక్తమాంసాలతో నిండిపోయింది.

రాముని చేతిలో ఇలాగ పధ్నాలుగువేలమంది రాక్షసులు కూలిపోగా ఖరుడు, త్రిశిరుడు మాత్రమే యుద్ధభూమిలో మిగిలియున్నారు. రామునిమీదికి బయలుదేరిన ఖరుని ఆపి త్రిశిరుడు యుద్ధానికి వచ్చాడు. అలా వచ్చిన త్రిశిరునిపై వాడిబాణాలు వేసి వానిని యమునికి అతిథిగా పంపించాడు రాముడు. అది చూసి ఖరుడు నిజంగా భయపడ్డాడు. కాని అంతలో రోషం తెచ్చుకొని

రామునిమీదికి వురికాడు. వారిద్దరి బాణాలతోను ఆకాశం నిండిపోయి దిగ్భేదం తెలియకుండా అయిపోయింది. ఆ శరజాలంతో సూర్యబింబం కూడా కప్పబడిపోయింది. ఒక మద్దిచెట్టును పెరికి ఖరుడు రామునిమీదికి విసిరేశాడు. ఆ చెట్టును తునకలు చేసి, రాముడు బాణాలతో ఖరుని శరీరం అంతా తూట్లుతూట్లుగా కొట్టాడు. రాముని బాణాల దెబ్బకు ఖరుని శరీరాన రక్తం కాల్వలు కట్టింది. వాడి మనస్సు చలించింది. తన నెత్తురు వాసనకే మత్తుకలిగి వాడి తల తిరిగిపోయింది. వెంటనే ఏమి చేస్తున్నదీ తెలియక రామునిమీదికురికాడు. రక్తం వోడ్చుకుంటూ ఖరుడు మీదికి వచ్చేటప్పటికి వెంటనే దాశరథి అగ్నిలా మెరుస్తున్న బాణం తొడిగి విడిచాడు. మరుక్షణంలో ఖరుడు నేలమీద పడిపోయాడు.

ఆకాశంలో దేవదుందుభులు మ్రోగిస్తూ దేవతలు పూలవాన కురిపించారు. "ఓహో! రాముడొక్కడే క్షణంలో పధ్నాలుగువేలమంది రాక్షసులను సంహరించాడు. ఆహా! శ్రీమహావిష్ణువు శక్తిసామర్థ్యాలు శ్రీరామునిలో కనబడుతున్నాయి" అని దేవతలు ప్రశంస చేస్తూ యథేచ్ఛగా వెళ్ళిపోయారు. విజయఘోష విని లక్ష్మణుడు సీతను వెంటబెట్టుకొని గుహలోనుండి ఆశ్రమానికి వచ్చాడు. ఎందరో మునులు వెంటరాగా రాముడూ ఆశ్రమంలో ప్రవేశించాడు. వెంటనే లక్ష్మణుడతన్ని పూజించాడు. రాముడు రాక్షసులనందరినీ సంహరించడమూ, అపాయమేమీ లేకుండా క్షేమంగా వుండడమూ చూసి సీత చాలా సంతోషించి అతన్ని మిక్కిలి ప్రస్తుతించింది.

**శ్రీరామ! రామ! రఘునందన! రామ! రామ!**
**శ్రీరామ! రామ! భరతాగ్రజ! రామ! రామ!**
**శ్రీరామ! రామ! రణకర్కశ! రామ! రామ!**
**శ్రీరామ! రామ! శరణం భవ! రామ! రామ!**

**శ్రీ సీతారాములకు నమస్కారములు. శ్రీలక్ష్మణస్వామికి నమస్కారములు. శ్రీ భరత శత్రుఘ్నులకు నమస్కారము.**
**జై వీరాంజనేయ.**



శ్రీలంక నువారా ఇలియా అశోకవాటిక మందిరం ద్వారంపై శిల్పాలు



## విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరస్సహః |
## మహీధరో మహాభాగో వేగవానమితాశనః || (40)

### 365. విక్షరః

- క్షీణత లేనివాడు.
- భక్తులయెడ తరగని ప్రేమ గలవాడు.

**ఓం విక్షరాయ నమః**

**విగతః క్షరః యస్య స విక్షరః –** అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. 'క్షరము' అనగా తరిగిపోవుట. క్షరము లేనివాడు విక్షరుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఉక్త స్నేహస్యాక్షరణాత్ విక్షరః పరికీర్తితః –** భగవంతునకు భక్తులపైనున్న ప్రేమ అపారము. వారు చేయు తప్పులను క్షమించి, వారిపై కరుణను వర్షించు అమృతమయుడు విక్షరుడు.

### 366. రోహితః

- పద్మము లోపలివలె ఎర్రని వర్ణము గలవాడు.
- శ్రీ మత్స్యావతార మూర్తి.
- ప్రావిర్భవించువాడు.

**ఓం రోహితాయ నమః**

**కమల గర్భత్వాత్ రోహితః –** కమలము లోపలివలె ఎర్రనివాడు. శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (8.4.7) నుండి ఉదాహరించారు **– తిరుచ్చెయ్య కమలక్కణ్ణుమ్ సెవ్వాయుమ్ సెవ్వాడియుమ్ సెయ్యకైయుమ్ తిరుచ్చెయ్య కమల ఉందియుమ్ సెయ్య కమల మార్బుమ్.**

'రోహిత' అనేది ఒక జాతి చేప. ఈ అర్థాన్ని పురస్కరించి శ్రీ శంకరులు చెప్పిన వ్యాఖ్య – ఎర్రని చేపగా అవతరించినవాడు గనుక రోహితుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'రుః' అనే ధాతువునకు **'ప్రాదుర్భావే చ' –** పెరుగుట, విస్తరించుట, అందుకొనుట అనే భావమున్నది. **ప్రాదుర్భవతి ఇతి రోహితః –** ప్రాదుర్భవించువాడు రోహితుడు. విశదపరచువాడు. తెలియజెప్పువాడు.

## 367. మార్గః

- వెదకబడువాడు. అనుసరింపబడువాడు.
- మోక్షమునకు దారి చూపువాడు.
- ప్రళయానంతరము పునఃసృష్టికి మార్గమైనవాడు.

### ఓం మార్గాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

40వ శ్లోకము. 367వ నామము. మార్గః – **విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరస్సహః**

43వ శ్లోకము. 399వ నామము. మార్గః – **రామో విరామో విరతో (విరజో) మార్గో నేయో నయోనయః**

తిరువైమొళి నూఱ్ఱాందాడి (91) నుండి శ్రీ వి.వి. రామానుజన్ చెప్పిన ఉదాహరణ – **తాళ్ అడైందార్ తంగట్కు తానే వడిత్తుణైయామ్ కాళమేగత్తై** – తనకు శరణాగతులైనవారికి తాను తోడుగానుండి దారి చూపును.

శ్రీ శంకరులు మరొక అర్థము కూడా చెప్పారు – మోక్షమునకు దారి చూపువాడు గనుక మార్గము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పిన మరొక భావము – ప్రళయకాలానంతరము జగత్తు అంతరించినపుడు (ఆయనలో లీనమ్మైనపుడు) పునఃసృష్టికి ఆయనే మార్గము.

గజేంద్రుని ప్రార్థన –

**ముక్త సంగులైన మునులు దిద్రుక్షులు**
**సర్వ భూత హితులు సాధుచిత్తులు**
**అసదృశ వ్రతాఢ్యులై కొల్తురెవ్వని**
**దివ్యపదము వాడు దిక్కు నాకు.**

సంసార బంధనాలు విడిచి, బ్రహ్మసాక్షాత్కారము కోసము శరీరాన్ని నియమనిష్టలతో శుష్కింపజేసి, వ్రతాలు, దీక్షలు ఆచరిస్తూ ఉండే మహర్షులు ఎవని దివ్య పాదారవిందములను పూజిస్తారో అతడిని నేను శరణు వేడుచున్నాను.

## 368. హేతుః

- కారణము.

### ఓం హేతవే నమః

- 'కారణము' అనే అర్థమును రెండు విధాలుగా వ్యాఖ్యానించారు.
- శ్రీ భట్టుల వ్యాఖ్య – వాంఛితార్థముల సిద్ధికి కారణమ్మైనవాడు. కొండలంత వరములు గుప్పెడువాడు. ఇహపరముల నొసగువాడు. కామితార్థ ప్రదాయకుడు.
- శ్రీ శంకరుల వ్యాఖ్య – సకలమునకు ఉపాదాన కారణము, నిమిత్త కారణము అయినవాడు. సృష్టించువాడును, సృష్టియును శ్రీమన్నారాయణుడే. కారణము, కార్యమును ఆయనే.

| కార్యము | ఉపాదాన కారణము | నిమిత్త కారణము |
|---|---|---|
| ఏదైనా పని | ముడి పదార్థము | పని చేయువాడు |
| కుండ | మట్టి | కుమ్మరి |
| సకల సృష్టి | శ్రీనివాసుడు | శ్రీనివాసుడు |

ధర్మ చక్రము రచయిత వివరణ – సామాన్యముగా మనకు ప్రభావములు తెలియవచ్చును గాని కారణములు కనిపించవు. విశ్వములో మనము నివశించుదుము, పంచ భూతములను వినియోగించుదుము. కాని కారణము మనకు తెలియరాదు. శరీరము కనిపించును గాని దానికి మూలమైన పంచభూతములను తెలిసికొనము. యోగులు, జ్ఞానులే హేతువు నెఱుగుదురు.

## 369. దామోదరః



- సకల భువనములు (దామములు) తన యుదరమునందు కలిగివాడు.
- యశోదచేత దామము (త్రాడు)చే కట్టివేయబడినవాడు.
- భక్తుల కొరకు ఆనందమును కలిగినవాడు.
- 'దమము' వంటి సాధనములచేత పొందబడువాడు.

ఓం దామోదరాయ నమః

'దామము' అన్న పదమునకు త్రాడు, లోకము, ఆనందము అనే వేర్వేరు అర్థములున్నవి. 'ఉదరము' అనగా పొట్ట.

**దామాని లోకనామాని హ్యుదరే యస్య సంతినః దామోదర ఇతి ఖ్యాతో యశోదా ధదామ బంధనాత్**

యశోదా కృష్ణులు. 1914 నాటి చిత్రం. వికీపీడియా నుండి.

Artist - Bhabani Chandra Law (original Bengali surname is Laha)

https://commons.wikimedia.org/wiki/File:Yashoda_with_Krishna.jpg

**దేవానాం సుఖ శంసిత్వాత్ దామోదరోऽపివా ఉదరే దామాని అస్య ఇతి దామోదరః** . లోకములన్నింటిని తన బొజ్జయందు నిలుపుకొన్నవాడు దామోదరుడు. తన నోట యశోదాదేవికి సకల భువనములను చూపినవాడు. ఇందుకు వ్యాసుడు చెప్పినట్లుగా ఉదాహరించిన ప్రమాణము –

**దామాని లోకనామాని తాని యస్య ఉదరాంతరే**
**తేన దామోదరో దేవః శ్రీధరః శ్రీసమాశ్రితః**

త్రాడుచే నడుమునకు కట్టబడినవాడు దామోదరుడు. వ్రతములకు, తపములకు చిక్కని పరమాత్ముడు యశోదాదేవి చేత చిక్కగా ఆమె అతనిని రోట బంధించినది.

**దదర్శ చాల్ప దంతాస్యం స్మితహాసంచ బాలకమ్**
**తయోర్మధ్యగతం బద్ధం దామ్నా గాఢం తదోదరే**
**తతశ్చ దామోదరతాం సయమో దామబంధనాత్** – బ్రహ్మపురాణము 76.14

చిన్న దంతములు కలిగి, చిరునవ్వు నవ్వుతూ, యశోదాదేవిచే కట్టబడినవాడై, నలకూబరుడు మరియు మణిగ్రీవుడు అనే మద్దిచెట్ల మధ్యనుంచి పోయిన బాలుని గోపబాలురు చూశారు. అప్పటినిండే అతడు దామోదరుడని పిలువబడ్డాడు. శ్రీ శ్రీనివాస

రాఘవాచార్యస్వామిగారు 'శ్రీ నృసింహప్రియ' పత్రిక (తమిళ వ్యాఖ్యానం)లో చెప్పిన విషయం – పరమాత్ముడు గోపబాలుడై యశోదచేత ముద్దలు తిని, ఆమెచే కట్టుబడినాడు. పరమాత్ముడు భక్తపరతంత్రుడని ఈ ఘటనవలన తెలియుచున్నది.
శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – **దమాది సాధనేన ఉదర (ఉత్కృష్ట) మతిః (యా తయా గమయత) ఇతి దామోదరః** – దమము (నిగ్రహము) వంటి సాధనములవలన మనసును స్వచ్ఛము (ఉదరము, ఉత్కృష్టము) చేసికొనినయెడల తెలియవచ్చువాడు. మహాభారతము ఉద్యోగపర్వము(5.69.8)లో **'దామాత్ దామోదరో విదుః'** అని చెప్పబడినది.
ఈ నామ వివరణలో ధర్మచక్రము రచయిత చక్కని వ్యాఖ్య చెప్పారు – త్రాటిచే రోట కట్టబడినవానిని తెలిసికొనుటకు ఒకే మార్గమున్నది. పంచేంద్రియములను అటునిటు తిరుగకుండ నిర్బంధించి భాగవతసేవయను ఒకేమార్గమున నడిపించుట.
శ్రీ రాధాకృష్ణమూర్తి – అఖిలాండ బ్రహ్మాండ నాయకుడు గోపాలకుడై భక్తులకు కొంగుబంగారమై అందినాడు. భగవంతుడు భక్త సులభుడు.

## 370. సహః

- సహించువాడు. ఓర్పుగలవాడు. యశోదమ్మ తనను రోట బంధించినపుడు సహించినవాడు.

### ఓం సహాయ నమః

**సహతే ఇతి సహః** – సహించువాడు సహుడు.

**యశోదాకృత బంధాది సహనాత్ సహ ఈరితః** – యశోదమ్మ రోట బంధించినపుడు సహించినవాడు. యశోదాకృష్ణుడు. అని శ్రీ భట్టులు ఈ నామమును ఇంతకుముందరి నామము 'దామోదరుడు'తో అనుసంధించారు.

**సహతే సర్వాన్ అభిభవతి ఇతి సహః** –భక్తుల తప్పిదములను సహించువాడు – అని శ్రీ శంకరుల వ్యాఖ్య.

**అజ్ఞానినా మయా దోషాన్ అశేషాన్ విహితాన్ హరే క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైల శిఖామణే**
భక్తలకు కనువిప్పు కలుగువరకు వారి అపరాధములను సహించువాడు. జన హితమునకై భూభారము వహించువాడు. జగములను భరించువాడు. శిశుపాలుని నూరు తప్పులను కాచినవాడు.

## 371. మహీధరః

- భూమిని ధరించినవాడు.

### ఓం మహీధరాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
34వ శ్లోకము. 319వ నామము. మహీధరః – **క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుః మహీధరః**
40వ శ్లోకము. 371వ నాము. మహీధరః – **మహీధరో మహాభాగో వేగవానమితాశనః**

ఇంతకుముందు 319వ నామము 'మహీధరుడు' అనగా – భూమిపై దుర్జనులను శిక్షించి, సజ్జనులను పరిరక్షించి, భక్తుల పూజాదికములను పరిగ్రహించువాడు – అని చెప్పడమైనది. ఇప్పుడు 'మహీధరుడు' అనగా – కులపర్వతముల రూపమున భూమిని నిలుపువాడు – అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. విష్ణుపురాణము(2.12.37)లో **'వనాని విష్ణుర్గిరాదియో దిశశ్చ'** అందుకు ప్రమాణము. విష్ణువే అడవులు, పర్వతాలు, దిశలు, అన్ని లోకములకు ఉపాదాన కారణము.

శ్రీ వరాహమూర్తియై భూమిని తన కోరలమధ్య నిలిపినవాడు మహీధరుడు అని శ్రీ వి.వి. రామానుజన్ వ్యాఖ్యానించారు.

శ్రీ కైవల్యసారధినుండి –

**శింశుమారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వతస్థితాన్ దధ్రే శేష తయా లోకాన్ సప్తలోకాన్ అథస్థితాన్**
శ్రీ మహావిష్ణువు మొసలి రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను ధరిస్తున్నాడు.

**అస్మిన్ మహతి బ్రహ్మాండ ఖండయోః మధ్యే ... ..... ..... ఆధారశక్తి, శ్రీకూర్మ, వరాహ, వైష్ణ, అనంత, నాగ, శేష, తక్షక అష్టదిగ్గజో పరివేష్టితే** ....... – పెద్ద బ్రహ్మాండపు తునక నడుమ 1. ఆధారశక్తి 2. శ్రీకూర్మము 3. వరాహము 4. వైష్ణవము 5. అనంతము 6. నాగ 7. శేష 8. తక్షక – అనే అష్టదిగ్గజాలు ఎనిమిది దిక్కులందు నిలువగా ఊర్ధ్వలోకాలకు క్రిందభాగాన, అధోలోకాలకు పైభాగాన

**చక్రవాళ శైల మధ్యగత మహాసుమేరోః సహస్ర శిఖరానువర్తిని మహానాయమాన ఫణిరాజ రాజస్య శేషస్య సహస్ర ఘణామణిమండం మండితే** – చక్రవాళము మొదలైన పర్వతములను కులపర్వతములంటారు. ఈ కులపర్వతాల రూపంలో పరమేశ్వరుడు ఈ భూమిని మోస్తున్నాడు. అందుచేతనే ఆయన మహీధరుడు.

## 372. మహాభాగః

- మహాసౌభాగ్యమును పొందువాడు.
- ప్రతి అవతారమునందు ఉత్తమమైనదానిని పొందువాడు.
- నైవేద్యములో, యజ్ఞములో హవిర్భాగమును స్వీకరించువాడు.

### ఓం మహాభాగాయ నమః

- శ్రీ భట్టుల వ్యాఖ్య – **రుక్మిణ్యాది బహుస్త్రీభిః మహాభాగ స్స్వయంవృతః** – నీలాదేవి, వేలాది ఉత్తమ గోపకాంతలు, రుక్మిణి, సత్యభామ, జాంబవతి వంటి ఉత్తమ స్త్రీలచే వరింపబడినవాడు.
- శ్రీ శంకరుల వ్యాఖ్య – తన ఇష్టానుసారము ఉత్తమ రూపములు దాల్చి అవతరించువాడు.
- శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతునకు నివేదించినదానిలో ప్రధానభాగమును స్వీకరించువాడు మహాభాగుడు. గోపాలురు గోవర్ధనగిరిని పూజించి, నైవేద్యములు అర్పింపగా శ్రీకృష్ణభగవానుడు గిరిశిఖరమున దర్శనమిచ్చి నైవేద్యముల నారగించెను.

**తిరుప్పావై 19వ పాశురము – గోదాదేవి బృందము నీలాదేవిని నిదుర లేపుట.**

1. శ్రీ భమిడిపాటి రాధాకృష్ణమూర్తి వ్యాఖ్య 2. డా. వేదవ్యాస వ్యాఖ్య – ఈ రెండింటినుండి సంగ్రహించినది.

భగవంతునకు భక్తుని పొందు పరవశం కలుగజేస్తుంది. **నీలాతుంగస్తన గిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం** – అని శ్రీ పరాశరభట్టు వర్ణించారు. గుత్తుల దీపారాధన జ్యోతులు వేయిచుట్లు వెలుగుతూవుండగా అందమైన ఏనుగు దంతపు కోళ్ళమంచంపై చల్లగా పాలనురుగువలె, తెల్లగా మెత్తగా హంసతూలికా తల్పంపై పడుకొని ఘుమ్మని పరిమళించే పూలగుత్తు సిగముడిలో ధరించుకొని, బంగారు కలశమువంటి స్తనములపై హాయిగా పవళించిన మెత్తని వక్షస్థలం కలవాడా! పలుకే బంగారమయిందా? నోరు తెరచి పలుకవయా!

ఓ విశాలమైన కాటుక కన్నులుగల సొగసుగత్తె! నీ ప్రియుడు ఎక్కడకు పోతాడో అని క్షణమైనా వదలలేకుండా కౌగిలించుకొని లేవనీయవా ఏమి? కాస్తయినా ఆయనను నీవు విడిచిపెడితేగదా మాకు శ్రీవారు దర్శనమిచ్చేది? ఇంత స్వార్థము నీకు తగదమ్మా! – అని ఈ పాశురములో నీళాదేవి కౌగిటిలో మైమఱచి నిదురించిన కృష్ణయ్యను కాస్త విడిచిపెట్టమని మేలుకొలుపుతో ప్రార్థిస్తున్నది గోదామాత!

**ఆడుచు పాడుచు నందొక చేడియ మంజీర మంజు శింజిత మమరం గూడి హరికరము సనుగవపై డాయవిడిచె జఘన భారాలసయై** (పోతన భాగవతము. దశమస్కంధము).

నీలాదేవి రతిశ్రమతనూవివశయై నిదురించుచున్నది. ఆమెను మేల్కొలుపుటకు '**పన్దార్ విరలి**' (బంతితో నిండిన చేతులు-వ్రేళ్ళు కలదానా!) అని పిలిచింది గోదాబృందం. నీలాదేవి తన లాలసకు తాను కొంచెం సిగ్గిలినప్పటికీ, లేచి తలుపు తీయవలెననుకొన్నది. కాని, ఆమె శయ్యపైనుండి లేవలేకపోయినది. కారణము బైటనున్నవారు తేలికగా ఊహించగలుగుచున్నారు. ఆమె 'కన్దమ్ కమళమ్ కుళలీ' – సుగంధమును వెదజల్లుచున్న కేశపాశములు కలిగియుండుట ఒక కారణము. నీలాదేవి తాను వచ్చి తలుపు తెరవవలెననుకొన్నది. ఒక్క ఉదుటను లేవనుంకించినది. కాని ఆమెపైని కృష్ణుని చేయి అదిమియున్నది. లేవనుంకించిన ఆమె తిరిగి వివశయైనది.



శ్రీకాకుళం నారాయణ తిరుమల ఆలయంలో శ్రీ ఆండాళ్ తల్లి విగ్రహం. వికీపీడియా చిత్రం. రాజశేఖర్ తీసినది.

లేవబోయిన నీలాదేవిని తిరిగి శయ్యపై పరుండజేసి తత్సుఖాపాదితమైన తన్మయతతో తిరిగి నిద్రాలాలసుడయ్యెను. బైట గోపికల పిలుపు విని శ్రీకృష్ణుడు లేవబోయిన ఆమె లేవనీయలేదు. ఇప్పుడు ఇద్దరినీ మేల్కొలపవలసివచ్చింది. అన్యోన్యాలింగన సౌఖ్యమునందు మునిగితేలుతున్న నీలాదేవిని 'ఇది నీకు తగునా' అని నిలదీయుచున్నారు గోపకాంతలు – కాటుక కన్నులదానా! నాధుని లేవదీయవా ఏమి? ఈ ఓర్వలేనితనము నీ స్వభావము కాదుగదా!

## 373. వేగవాన్

- మిక్కిలి వేగము గలవాడు.

### ఓం వేగవతే నమః

**దుర్వార పరమైశ్వర్య ప్రసరత్వాద్విశేషతః మనుష్యధర్మే బాల్యేఽపి వేగానితి (వేగవానితి?) శబ్ద్యతే**

శ్రీ భట్టులవ్యాఖ్య – బాలునిగానున్నపుడే దుర్వారమగు పరమైశ్వర్యశక్తిని ప్రదర్శించినవాడు. పూతన ప్రాణమును హరించిన నందనందనుడు. శకటాసురుని మట్టుబెట్టిన యశోదానంద వర్ధకుడు. గోవర్ధనగిరినెత్తిన గోపబాలుడు.

శ్రీ చిన్మయానంద వ్యాఖ్య – తలచినంతనే అందివచ్చు భక్తసులభుడు. ద్రౌపది ఆక్రందన విన్నంతనే వచ్చి ఆమెను రక్షించినవాడు. మొరలిడిన కరిరాజును గాచుటకై సంరంభమున వెడలిన వైకుంఠవాసుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య ఈశావాస్యోపనిషత్తు ఆధారముగా సాగినది. **అనేజదేకం మనసో జనీయోనైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షతు తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠ త్తస్మిన్నపోమాతరిశ్వా దధాతి.** ఆత్మ చలనరహితమైనది. అయినప్పటికీ అది మనసుకంటె వేగంగా పోతుంది. ఇంద్రియాలకు అందదు. స్థిరమైనది అయినాగానీ పరుగుతీసేవానికన్నా ముందుకు పోతుంది. ఆత్మ తన సన్నిధిమాత్రం చేత ప్రాణికోటుల కార్యకలాపాలను భరించడానికి ప్రాణశక్తిని సమర్థం చేస్తున్నది.

ఆత్మస్వరూపుడైన పరమాత్ముడు వేగవతి. మనసునకు అందజాలనివాడు.

## 374. అమితాశనః

- అమితముగా భుజించినవాడు.

- ప్రళయకాలమున సమస్తమును కబళించువాడు.
- సృష్టిలో సకల జీవులకు ఆహారము ప్రసాదించువాడు.

### ఓం అమితాశనాయ నమః

**అమితం అన్నం అశ్నతి ఇతి అమితాశనః** – అమితముగా అన్నమును భుజించినవాడు అమితాశనుడు. 304వ నామము 'మహాశనః'కు కూడా ఇదే విధంగా అర్థము చెప్పబడినది.

**ఇంద్రాయ కల్పితం గోపైః అమితం చాశనం స్వయమ్ భుక్తవాన్ యశ్చ నిశ్శేషం ప్రోచ్యతే సోऽమితాశనః** – గోపజనులు గోవర్ధనగిరికి అర్పించిన మహాప్రసాదమును అంతటిని ఆరగించిన గోపీజనప్రియుడు. అదిచూచి గోపాలురు **'దేవో దానవో వా త్వమ్'** (విష్ణుపురాణము 5.13.121) అని అబ్బురపడిరి. ఇది శ్రీ భట్టుల వ్యాఖ్య.

శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధములనుండి ఉదాహరించారు – పెరియాళ్వార్ తిరుమొళి 3.5.1 – కొండవలెనున్న అన్నపురాశి, ఏరువలెనున్న పెరుగు, చెరువువలెనున్న నెయ్యి – అన్నింటినీ క్షణమాత్రమున ఆరగించిన వెన్నదొంగయే అమితాశనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యానుసారము ప్రళయకాలమున అంతటినీ ఆరగించువాడు అమితాశనుడు. ఆయనకు అరగనిది లేదు. ఆయనే జఠరాగ్ని. **అహం వైశ్వానరో భూత్వా ... .... పచామ్యన్నమ్ చతుర్విధమ్** (గీత 15.14).

ధర్మచక్రము రచయిత – భోజనము ఎంత అవుసరమో అరుగుదల అంతే అవుసరము. అరుగుటకు జఠరాగ్ని కారణము. ఆ అగ్నిస్వరూపుడే అమితాశనుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు పై భావములతోపాటు మరొక అదనపు అర్థమును చెప్పారు – **అమితాన్ ప్రాణినః ఆశ్యతి = భోజయతి ఇతి అమితాశనః** – అంతులేని ప్రాణులన్నింటికిని భోజనము ప్రసాదించువాడు అమితాశనుడు.



చికాగో శ్రీ స్వామినారాయణ మందిరం.









శ్రీమహావిష్ణువు అవతారాలకార్యాలకు సంబంధించిన కొన్ని పురాతన చిత్రాల సంకలనం. వికీపీడియానుండి సేకరించినవి.



## ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః |
## కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః || (41)

### 375. ఉద్భవః

- భవబంధములను తొలగించువాడు.
- సంసార బంధములకు అతీతుడు.
- సకల సృష్టికి మూలము

**ఓం ఉద్భవాయ నమః**

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

41వ శ్లోకము. 375వ నామము. ఉద్భవః – **ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః**

85వ శ్లోకము. 796వ నామము. ఉద్భవః – **ఉద్భవః సుందరః సుందో రత్ననాభః సులోచనః**

**ఉదతః భవః యస్మాత్ సః ఉద్భవః** – శ్రీమన్నారాయణుని ధ్యానించువారికి ఆయన సంసారబంధములనుండి ముక్తిని ప్రసాదించును. యశోదమ్మచే రోట కట్టబడిన కన్నయ్యను స్మరించినయెడల సంసార బంధములు పటాపంచలగునని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. (**కణ్ణినుణ్ సిరుత్తాంబినాయ్ కట్టుణ్ణప్ పణ్ణియ పెరుమాయన్**)

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఉద్గతో భవాత్ సంసారాత్ ఇతి ఉద్భవః** –ప్రాపంచిక బంధములకు అందనివాడు గనుక ఉద్భవుడు. శ్రీ శంకరులు మరొక అర్థమును కూడ చెప్పారు – **ప్రపంచ ఉత్పత్తి ఉపాదాన కారణత్వాత్ ఉద్భవః** – సమస్త లోకము ఉత్పత్తికి కారణమైనందున ఉద్భవుడు.

### 376. క్షోభణః

- క్షోభింపజేయువాడు. చలనము, చైతన్యము కలిగించువాడు.

**ఓం క్షోభణాయ నమః**

క్షుభ్ – సంచలనే – అనే ధాతువునుండి ఈ నామమును వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ప్రకృతేర్బంధనార్హాణాం క్షోభయతి ఇతి క్షోభణః** – సంసారమున బంధింపదగినవారిని క్షోభింపజేయువాడు క్షోభణుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – సృష్టి సమయమున ప్రకృతి, పురుషులయందు ప్రవేశించి వారిని క్షోభింపజేయువాడు. ఉత్తేజపరచువాడు. అందుకు శ్రీ శంకరులు విష్ణు పురాణము (1.2.29)నుండి ఉదాహరించారు.

**ప్రకృతిం పురుషంచైవ ప్రవిశ్య ఆత్మేచ్ఛయా హరిః క్షోభయామాస భగవాన్ సర్గకాలే వ్యయావ్యయీ**
శ్రీహరి తన యిష్టానుసారము సృష్టికాలమందు ప్రకృతి పురుషులయందు ప్రవేశించి క్షోభింపజేశాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ, శ్రీ చిన్మయానంద వంటివారు సమర్ధించిన మరొక వివరణ – సమస్త భూతములయందును అంతర్యామియై చేతనత్వమును కలగజేయువాడు గనుక క్షోభణుడు.

## 377. దేవః

- ప్రకృతి, మాయ, జీవులతో సృష్టికార్యమున క్రీడించువాడు.
- సర్వభూతములందు దైవస్వరూపుడై ప్రకాశించువాడు.

### ఓం దేవాయ నమః

**దీవ్యతి, క్రీడతి ఇతి దేవః** – జీవులను మాయలో బంధించి క్రీడించువాడు దేవుడు.
**వ్యాఘ్రాదివ జీవతతే మాయాపాశేన బంధనమ్ కృత్వా నిత్యం క్రీడయతి యః స దేవః పరికీర్తితః** - జీవులను మాయ అనే పాశముచేత బంధించి, వ్యాఘ్రమువంటి ఆకారములనిచ్చి ఆడుకొనేవాడు. ఇదే భావము (312వ) 'నహుషః', (335వ) 'ఆదిదేవః' నామములందు సూచింపబడినది.
ఈ అర్థంలో చాలా తెలుగు సినిమాపాటలున్నాయి.
తోలుబొమ్మలాటలోన నీకెవరు సాటి రారంట (మంజునాధ)
బొమ్మను చేసి, ప్రాణము పోసి ఆడేవు నీకిది వేడుకా (దేవత)

ఇక్కడ 'దీవ్యతి' అనగా ప్రకాశించువాడు, జయించువాడు, కీర్తింపబడువాడు అని శ్రీ చిన్మయానంద వివరణ.

శ్రీ శంకరులు శ్వేతాశ్వరోపనిషత్తు (6.11)లో చెప్పిన – **ఏకో దేవః సర్వభూతేషు గూఢః** – అన్ని భూతములందు అంతర్గతంగా (దాగి)యున్న దేవుడొక్కడే – అనే భావం ఆధారంగా వ్యాఖ్యానించారు. భగవానుడు దివ్యప్రకాశ స్వరూపుడు. సకల రాక్షస సంహారకర్త. తన భక్తులలోని అసురలక్షణములను పోగొట్టువాడు. సృష్టి, స్థితి, లయములను నాటకమునందు చక్కగా క్రీడించువాడు. భక్తులచేత సదా స్తవము చేయబడువాడు. కనుక 'దేవః' అను దివ్యనామమున స్తుతింపబడుచున్నాడు.

## 378. శ్రీగర్భః

- దేవుడై క్రీడించునపుడు సదా లక్ష్మీదేవి తోడుగలవాడు.
- విశ్వరూపమున లక్ష్మిని తనయందుంచుకొన్నవాడు.
- సకల శుభగుణములకు ('శ్రీ'లకు) నిలయమైనవాడు.

### ఓం శ్రీగర్భాయ నమః

శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి వేరువేరు కారు. దేవుడై క్రీడించు దేవదేవునకు దేవేరియై శ్రీదేవి అన్నివేళల తోడైనది. **విష్ణోరేషా అనపాయినీ** (విష్ణుపురాణము 1.9.144)

శ్రీ భట్టుల వ్యాఖ్య – **భోగక్రీడా సహాయత్వేన వర్ధనీయ అస్య శ్రీః ఇతి శ్రీగర్భః** – భోగక్రీడలయందు 'శ్రీ' తోడుగా కలవాడు శ్రీగర్భుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – తన ఉదరము (గర్భము)నందు విశ్వమునుంచుకొన్నవాడు శ్రీగర్భుడు. విశ్వము సకలైశ్వర్య సంపన్నము. కనుక 'శ్రీ'లన్నియు ఆయన గర్భమునందున్నవి.

ధర్మచక్రము రచయిత వివరణ – గర్భమునందలి బిడ్డయే తల్లికి సకలైశ్వర్యము. తల్లి బిడ్డను సంరక్షించుకొన్నట్లు, లోభి తన ధనమును దాచుకొన్నట్లు, జ్ఞాని తన విద్యను జాగ్రత్త చేసికొన్నట్లు శ్రీమహావిష్ణువు సకల విశ్వమును పరిరక్షించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – విశ్వమునందు ('శ్రీ'యందు) అందరిలో అంతర్యామియై యున్నందున భగవానుడు శ్రీగర్భుడు.

## 379. పరమేశ్వరః

- అందరికిని ఈశ్వరుడు, ప్రభువు, శక్తి, శోభ.

### ఓం పరమేశ్వరాయ నమః

ఐశ్వర్యము, ఈశ్వరత్వము అనేవి ప్రభువు లక్షణములు. భగవానుడు అందరికిని, మహాలక్ష్మికి కూడ ప్రభువు. **తిరువుక్కుమ్ తిరువాగియ సెల్వా** (తిరుమొళి 7.7.1).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – పరా-మా – పరమా – మహాలక్ష్మి. అన్నిశక్తులకును ఆదిలక్ష్మి. మహామాయ. మహేశ్వరి. పరబ్రహ్మస్వరూపిణి. పరమేశి. జగన్మాత. అట్టి శ్రీదేవి ఎవని వక్షఃస్థలమును ఆశ్రయించియున్నదో ఆ జగదీశ్వరుడు – **పరమాయాః ఈశ్వరః** – పరమేశ్వరుడు.

ధర్మచక్రము రచయిత – ఇంద్రియములను నిగ్రహించుకొన్న వ్యక్తికి తనపై అధికారము సిద్ధించును. విశ్వముపై అధికారము కలిగియున్న భగవానుడు పరమేశ్వరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – 'మా' అనగా శోభ. అన్నింటికంటె శోభను కలిగినవాడు, అందరికిని ప్రభువు, సర్వమును ఆకర్షించువాడు – **పరా మా యస్య స పరమేశ్వరః స చ అసౌ ఈశ్వరః పరమేశ్వరః.**

## 380. కరణమ్

- సాధనము. **క్రియతే అనేన ఇతి కరణమ్.**
- భగవంతుని పొందుటకు భగవంతుడే సాధనము.

### ఓం కరణాయ నమః

## 381. కారణమ్

- హేతువు. **కారయతీతి కారణమ్**
- సాధించువాడు.

### ఓం కారణాయ నమః

ఈ రెండు నామముల భావసాన్నిహిత్యమువలన రెండింటిని ఉమ్మడిగా పరిశీలించవచ్చును. ఏ పనికైనా రెండు విషయములు అవుసరము. (1) కరణము – అనగా పనిచేయు సాధనము. ఒక కుండ తయారు చేయడానికి మట్టి, పనిముట్లు కరణములు.

కాని ఇవి మాత్రమే ఉంటే కుండ తయారవదు. (2) కారణము – ఇవే కాకుండా ఇతర హేతువులు. ఉదాహరణకు కుమ్మరి యొక్క పని, సంకల్పము, నైపుణ్యత, వాతావరణము వంటివి. ఈ కరణ కారణములు రెండును భగవంతుడే అని వ్యాఖ్యానకర్తలు వేరువేరు పనుల విషయములో వివరించారు.

**భగవత్ప్రాప్తి (మోక్షము) గురించి** – భగవంతుని పొందుటకు సాధించు యత్నములో జ్ఞానేంద్రియములు (కన్నులు, చెవులు, నోరు వంటివి), కర్మేంద్రియములు (కాళ్ళు, చేతులు వంటివి), అంతఃకరణములు (చిత్తము, మనసు, బుద్ధి, అహంకారము) పాల్గొంటాయి. అభ్యాస వైరాగ్యముల చేత నిగ్రహము సాధ్యమని గీతలో చెప్పబడినది. కన్నులకు చూపును, చెవులకు వినికిడిని, కాలికి నడకను, బుద్ధికి ఆలోచనను, మనసునకు విచక్షణను, అహంకారమునకు గమ్యమును, చిత్తమునకు దీక్షను ప్రసాదించు భగవానుడు కరణము. అదేవిధముగా భగవత్ప్రాప్తికి సాధించు దీక్ష, అభ్యాసము కూడ భగవత్స్వరూపములే. కనుక భగవంతుడే కారణము.

**విశ్వసృష్టి గురించి** – జగత్తును సృష్టించినవాడు గనుక ఆయన కారణము. సృష్టికి ఆయనకు వేరే పనిముట్లు, సహాయము లేవు. తననుండే జగత్తును సృష్టించెను. కనుక ఆయన కరణము. జగదుత్పత్తికి సాధనము, ఉపాదాన కారణము, నిమిత్త కారణము కూడ శ్రీనివాసుడే.

## 382. కర్తా

- చేయువాడు (పరమ స్వతంత్రుడు).

### ఓం కర్త్రే నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.

34వ శ్లోకము. 31వ నామము. కర్తా – **క్రోధహా క్రోధకృత్ కర్తా విశ్వబాహుః మహీధరః**

41వ శ్లోకము. 382వ నామము. కర్తా – **కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః**

317వ నామము వివరణ సందర్భమున శ్రీ భట్టులు పరశురామావతార పరముగా చెబుతూ, కార్తవీర్యుని దండించినవాడు గనుక 'కర్తా'యని వివరించారు. ఇంక ఇప్పుడు 'కర్తా' అనగా అన్నికార్యములకు ప్రధానకర్త – తాను చేయువాడు లేదా ఇతరులచే చేయించువాడు – అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

పాణిని సూత్రము – **స్వతంత్రః కర్తా** – ఆధారముగా ఈ నామమును శ్రీ చిన్మయానంద వివరించారు. సృష్టి స్థితి లయాది సకల కార్యములను సంపూర్ణ స్వాతంత్ర్యముతో నిర్వహించును గనుక భవానుడు కర్త. కేవలము పంచభూతముల ఉనికివలన సృష్టి జరుగదు. కర్త వలననే సమస్తము జరుగును. మట్టియున్నంతవలన కుండ తయారుకాదు. కుమ్మరివాని పని కావలెను.

జీవాత్మలు తామే ఏదో చేయుచున్నామని భ్రమింతురు. కాని పరమేశ్వరుడే సకల కార్యములకు కరణము, కారణము, కర్త. ప్రతి పనికిని, సృష్టికిని, అంతటికిని సరుకులు, పనిముట్లు, పనితనము, పనివాడు కూడ పరమేశ్వరుడే. కేవలము పని చేయించుట, పని చేయుటతో భగవంతుని పాత్ర పరిమితము కాదు. తత్ఫలితములు ఆయన అనుభవము చెందును. జీవాత్మలతో కూడి స్పందించును. **వ్యసనేషు మనుష్యాణాం భృశమ్ భవతి దుఃఖితః ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి** – జనులు బాధపడినపుడు రాముడు దుఃఖించెను. జనులు ఆనందించినపుడు తండ్రివలె సంతసించెను. అలాగే విభీషణుని పట్టాభిషిక్తుని చేసి - **కృతకృత్య ప్రముమోదః** – తృప్తితో మోదమునొందెను.

**383.** వికర్తా

- మార్పు చెందువాడు.
- బహువిధములైన జగములను సృష్టించినవాడు.

ఓం వికర్త్రే నమః

**వి కుర్వాణః వికర్తా** – అవికారుడైన భగవంతుడు స్థిరుడు. నిజానికి ఆయనలో మార్పు ఉండదు. కాని ఆయన సృష్టించిన ప్రపంచము మారుతూ ఉన్నందున ఆ విశ్వరూపుడు కూడ వికర్తయే. ఆయన రాగద్వేష రహితుడైనప్పటికిని జీవుల సుఖదుఃఖములందు, వికారములందు భావములను తనవిగా పాలు పంచుకొనును గనుక ఆయన వికర్త. శ్రీరాముడు రాజ్యము పోగొట్టుకున్నందుకు బాధపడలేదు. పట్టాభిషిక్తుడైనపుడు పొంగిపోలేదు. కాని విభీషణునకు రాజ్యమిచ్చి సంతసించెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **విచిత్రమ్ భువనమ్ కృతవాన్ ఇతి వికర్తా** – చిత్రవిచిత్రములైన భువనములకు కర్తయైనందున ఆయన వికర్త. ఆయన లీలలు అనంతములు. సృష్టియందు ఒకదానికొకటికి పోలిక లేదు. ప్రతి మనసు వేరు. మనుషులు వేరు. జన్మలు వేరు. ప్రతిక్షణము మరొక క్షణమునకు సంబంధము లేనిది. ఇదంతా ఆయన సృష్టిలోని వైచిత్ర్యము.

**384.** గహనః

- తెలియరానివాడు. గ్రహింపజాలనివాడు.

ఓం గహనాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
41వ శ్లోకము. 384వ నామము. గహనః – **కరణమ్ కారణమ్ కర్తా వికర్తా గహనో గుహః**
58వ శ్లోకము. 548వ నామము. గహనః – **గుహ్యో గభీరో గహనో గుప్తః చక్రగదాధరః**

భగవంతుడు మన బుద్ధికి, తర్కమునకు, ఇంద్రియములకు తెలియరాడు. మనలోనున్నను ఆయనను మనమెరుగలేము. **యః పృథివ్యాస్తిష్ఠాన్ యమ్ పృథ్వీ న వేద** – ఆయన భూమిలోనుండినా గాని భూమి ఆయననెరుగదు (బృహదారణ్యకోపనిషత్తు 5.7.3). ఆయన దేవతలందు ఉండునుగాని దేవతలు కూడా ఆయననెరుగరు. **విణ్ణవరక్కు ఎణ్ణె అరియాన్** (తిరువైమొళి 1.9.2). **చక్షుశ్చ ద్రష్టవ్యమ్ చ నారాయణః** – చూచే కన్నులు, చూడబడే వస్తువులు నారాయణుడే. శ్రీ రాధాకృష్ణశాస్త్రి కఠోపనిషత్తు (1.21)నుండి చెప్పిన ప్రమాణము – **తమ్ దుదర్శమ్ గూఢమ్ గుహాహితమ్ గహ్వరేష్ఠమ్ పురాణమ్.**

శ్రీ శంకరాచార్యులు భగవానుని తత్త్వము, శక్తి, చర్యలు – అన్నీ మనకు అర్థము కావని వివరించారు. ధర్మచక్రము రచయిత బాలకృష్ణుని లీలలను విపులముగా ఉదాహరించారు. పూతన మరణము, గోవర్ధనగిరి ధారణము, గోపికా వస్త్రాపహరణము, యశోదమ్మచేత బంధనము – ఇవన్నీ మనము తెలిసికొనలేని లీలలు. భక్తిమాత్రముచేతనే అనుభవింపదగినవి.

**385.** గుహః

- లోకములను రక్షించువాడు.
- అజ్ఞానులకు (భక్తులు కానివారికి) కనిపించనివాడు.

- హృదయ గుహయందు వసించువాడు.

## ఓం గుహాయ నమః

**గుహతి రక్షతి ఇతి గుహః** – లోకములను రక్షించేటివాడు గుహుడు అని శ్రీ భట్టుల వ్యాఖ్య. తన గర్భమున బిడ్డను తల్లి కాపాడునట్లుగా లోకములను భగవానుడు కాపాడునని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు.

**గుహతే సంవృణోతి** – తన తత్వమును దాచియుంచువాడు. అని వ్యాఖ్యానిస్తూ శ్రీ శంకరులు భగవద్గీత (7.25) నుండి ఉదాహరించారు.

**నాహం ప్రకాశ సర్వస్య యోగమాయా సమావృతః మూఢోऽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్**
నా యోగమాయయందు దాగియున్న నేను అందరికీ గోచరించను. కాబట్టి అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా తెలియజాలరు.

శ్రీ చిన్మయానంద విష్ణుభాగవతము(10.37.11)నుండి ఉదాహరించినది – **గూఢో గుహాశయః సాక్షీ మహాపురుష ఈశ్వరః** – మహాపురుషుడైన ఈశ్వరుడు సాక్షిగా గూఢముగా గుహాశయుడై యున్నాడు. **'నిహితమ్ గుహాయామ్'** అని ముండకోపనిషత్తులో ఉన్నది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి చూపిన రెండు ప్రమాణములు –
**ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా (న?) ప్రకాశతే** – కఠోపనిషత్తు (3.12)
**అవజానంతి మామ్ మూఢా మానుషీమ్ తనువాశ్రితమ్**
**పరంభావమజానంతో మమ భూత మహేశ్వరమ్** (గీత 9.1)

శ్రీ ఆర్. అనంతకృష్ణశాస్త్రి మరొక అర్థం చెప్పారు – అందరి హృదయము అనే గుహలో పవళించియున్నవాడు గుహుడు.

### శ్రీ ధన్వంతరి స్తుతి.

అచ్యుతానంత గోవింద విష్ణో నారాయణామృత
రోగాన్మే నాశయాశేషాన్ ఆశు ధన్వంతరే హరే
ఆరోగ్యం దీర్ఘమాయుష్యం బలం తేజో ధియం శ్రియమ్
స్వభక్తేభ్యః అనుగృహ్ణన్తం వందే ధన్వంతరిమ్ హరిమ్
ఓం నమో భగవతే వాసుదేవాయ ధన్వంతరయే
అమృత కలశ హస్తాయ వజ్రజలౌక హస్తాయ
సర్వామయ వినాశనాయ త్రైలోక్యనాథాయ మహావిష్ణవే స్వాహా
ఓం వాసుదేవాయ విద్మహే సుధాహస్తాయ ధీమహి
తన్నో ధన్వతరిః ప్రచోదయాత్



ఆయుర్వేద ప్రదర్శనలో శ్రీ ధన్వంతరి మూర్తి.
Photo by: HPNadig
https://commons.wikimedia.org/wiki/File:Dhanvantari-at-Ayurveda-expo.jpg



తిరుపతి శ్రీ గరుత్మంతుని విగ్రహం

Creative Commons Photo from Flickr – by Amarnath

తిరుమల ఆలయం విహంగ వీక్షణ చిత్రం

Creative Commons Photo from Flickr – by Pranav Yaddanapudi
https://www.flickr.com/photos/neychurluvr/5838483868/in/photolist-9TVKQY



## వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః |
## పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టః శుభేక్షణః || (42)

### 386. వ్యవసాయః

- (గ్రహనక్షత్రాదులకు) ఆధారము (ఇరుసు) అయినవాడు.
- నిశ్చలమైన, దృఢమైన బుద్ధిగలవాడు. స్పష్టమైన జ్ఞానము కలవాడు.

ఓం వ్యవసాయాయ నమః

**386 నుండి 390వరకు నామములు భగవంతుని అవతారమైన ధ్రువుని కీర్తించేవిగా శ్రీభట్టులు అభివర్ణించారు.**

**జ్యోతిశ్చక్రమ్ ధృవేన్నిత్యం సీయతే బధ్యతే యతః వ్యవసాయస్తతో జ్ఞేయో భగణాధార మూర్తిమాన్**

గ్రహనక్షత్ర మండలములను దృఢముగా పట్టియుంచువాడు. నక్షత్రాలకు ఆధారమైన ఆకాశమే శరీరముగా గలవాడు. కనుక 'వ్యవసాయః' అబడెను. తేజశ్చక్రాన్ని తనయందు బంధించుకొన్నవాడు. **విశేషేణ అవసీయతే బధ్యతే జ్యోతిశ్చక్రమితి వ్యవసాయః.**

'వ్యవసాయము' అంటే దృఢమైన దీక్ష. చెదరని యోగము. ఏకాగ్రమైన చిత్తము. గీత 2వ అధ్యాయములో 41, 42, 43, 44 శ్లోకములు ఈ అర్థమును సమర్థిస్తున్నాయి.

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోऽవ్యవసాయినామ్**

ఓ అర్జున! ఈ (నిష్కామ) కర్మయోగమునందు నిశ్చయాత్మక బుద్ధి ఒకటియే యుండును. కాని భోగాసక్తులైన వివేకహీనుల బుద్ధులు చంచలములై (అవ్యవసాయములై) ఒక దారీ తెన్ను లేక కోరికలవెంట నలువైపులా పరుగులు తీయుచూ అనంతములుగా నుండును.

### 387. వ్యవస్థానః

- ప్రారంభించు స్థానము.
- (వ్యవస్థను, ఆధారమును, కాలమును) ఏర్పరచువాడు.
- సృష్టిలో జీవులు, రక్షకులు, జీవనమార్గము – ఇలా సమస్తమును ఏర్పాటు చేయువాడు.

ఓం వ్యవస్థానాయ నమః

'స్థ' అనే ధాతువునుండి స్థితి, వ్యవస్థ, స్థానము వంటి పదములు వ్యుత్పన్నమయాయి. వ్యవస్థను, అనగా సవ్యమైన పద్ధతిని స్థాపించువాడు వ్యవస్థాపకుడు.

**కలా ముహూర్తాది మయః ధ్రువే కాలోఽపతిష్ఠతే యస్మాత్తస్మా ద్వ్యవస్థానో హ్యష్టార్ణ స్థానదో మనుః – ఈ అష్టాక్షరీ పుణ్య నామ మంత్రము మంచి స్థానాన్ని ఇస్తుంది.**

'వ్యవస్థను ఏర్పరచుట' అనే భావములోనే భాష్యకారులు చెప్పిన వివరణలు –

శ్రీ భట్టులు – అన్నింటికి ఆధారమైన కాలమును ఏర్పరచినవాడు. ఇందుకు నక్షత్ర గ్రహగతులు మూలము. వానికి ధ్రువనక్షత్రము కేంద్రము.

శ్రీ శంకరులు – సృష్టిలో ధర్మము, జీవ వైవిధ్యము, పరిణామక్రమము, ప్రాణ సంరక్షణామార్గములు, ఆహారాది సౌకర్యములు ఇవన్నీ ఏర్పరచిన దేవుడు 'వ్యవస్థానః'.

## 388. సంస్థానః

- పరిసమాప్తియగు స్థానము. నిలకడగానుండు స్థానము.
- ఉత్తమమైన స్థానము.

### ఓం సంస్థానాయ నమః

**సర్వమ్ ఏతస్మిన్ సంతిష్ఠతే సమాప్యతే ఇతి సంస్థానః** – అన్నింటికీ సరైన ముగింపు ఉండే స్థానము సంస్థానము. సమస్తమును ఆయనయందు నిలకడగా ముగియును (ప్రళయకాలమున?).

శ్రీ వి.వి.రామానుజన్ చెప్పిన అర్థము – అన్నింటిని ఎప్పుడో ఒకప్పుడు ముగించేవాడు.

శ్రీ శంకరులు మరొక అర్థమును కూడ చెప్పారు – **సమీచీనమ్ స్థానమ్ అస్య ఇతి సంస్థానః** – అన్నింటికిని ఉత్తమమైన స్థానము సంస్థానము. దీనిని వివరిస్తూ శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇలా చెప్పారు. పాలపుంత, సూర్యమండలము, యోగి హృదయము, ధ్రువమండలము – వీటన్నింటికీ ఉత్తమమైన ధ్రువనక్షత్రమే సంస్థానము.

## 389. స్థానదః

- పరమపదమును ప్రసాదించువాడు.
- తగిన ఫలము, స్థానము ప్రసాదించువాడు.

### ఓం స్థానదాయ నమః

**స్థానమ్ దదాతి ఇతి స్థానః** – 'ద' అనగా 'ఇచ్చుట' అనే అర్థములో పెక్కునామములు ఈ పుణ్యస్తవములో కీర్తింపబడినవి – ప్రాణదః, మానదః, శాంతిదః, శ్రీదః, దర్పదః, సర్వకామదః, స్వస్తిదః వంటివి. అన్నింటికంటె ఉత్తమమైన స్థానమునిచ్చువాడు స్థానదుడు.

**స ఏవ పరమాకాశ ప్రాప్తౌ హేతుత్వతః సదా ప్రోచ్యతే స్థానద ఇతి సప్తార్ణో మనునాయకః** - ఎల్లవేళలందు కూడా పరమపదము ఇవ్వడానికి కారణమైనవాడు. **'ఓం స్థానదాయ నమః'** అనేదానిని సప్తాక్షరీమంత్రము లేదా మంత్రరాజము అని అంటారు.

శ్రీ శంకరులవ్యాఖ్య మరింత విస్తారమైన అర్థములోనున్నది. జీవులకు వారికి తగిన స్థానమునిచ్చువాడు స్థానదుడు. **ధ్రువాదీనామ్ కర్మానురూపమ్ స్థానమ్ దదాతి ఇతి స్థానదః** – అందరకూ తగిన స్థానము నిచ్చువాడు. ధ్రువునకు ప్రత్యేకమైన (స్థిరమైన) స్థానమునిచ్చినవాడు స్థానదుడు.

శ్రీ చిన్మయానంద కఠోపనిషత్తులోనుండి ఉదాహరించిన సూత్రము – **యథా కర్మమ్ యథాశృతమ్ – కర్మఫలదాతా నారాయణః.**

డా. క్రోవి పార్థసారథి రచన 'శ్రీ కైవల్యసారథి'నుండి – **బ్రహ్మపురాణంలో వైకుంఠము వర్ణన** – విష్ణులోకము సంసార నాశకము. సర్వాశ్చర్య స్థానము. కల్పవృక్ష స్థానము. సర్వవృక్షములు, పూలు, పళ్ళు, అనేక రకాల పద్మములు, కలువలు, దిగుడుబావులు, సరస్సులు ఉంటాయి. దేవతలు బంగారు విమానాలమీద విహరిస్తూ ఉంటారు. విష్ణులోకం మధ్యలో మేలిమి బంగారు రంగులో నవరత్నములు పొదగబడిన బంగారు ప్రాకారాలతో యోజన విస్తారంతో శ్రీమహావిష్ణువు మందిరం ఉంటుంది. అది చుక్కలలో చంద్రునిలాగా ప్రకాశిస్తుంటుంది. ఆయుధధారులైన ద్వారపాలకులు దాని నాలుగు ద్వారాలకు కాపలా కాస్తుంటారు. ఆ వైకుంఠమునందు ఇంద్రనీలము, మహానీలము, పద్మరాగమణిమయము, వజ్రమయము, వైఢూర్యమయము అయిన ఏడు పట్టణాలుంటాయి.

అక్కడ సిద్ధులయొక్క తేజస్సుతో దశదిశలు ప్రకాశిస్తుంటాయి. వారినడుమ మేఘశ్యాముడు, పీతాంబరధారి, శ్రీవత్సాంకితుడు అయిన శ్రీహరి శ్రీదేవితో ఉంటాడు. ఆయనచేత సుదర్శనమను చక్రము, పాంచజన్యమను శంఖము, కౌమోదకి అను గద, శార్ఙ్గము అను ధనుస్సు ఉంటాయి. దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, గరుడ, నాగ గణాలు, సప్తర్షులు, మహామునులు అతన్ని పరిపరివిధాల కీర్తిస్తుంటారు. కీర్తి మొదలు మాయవరకు అనేక శక్తులు అక్కడ ఉంటాయి. విష్ణుభవనము పరమానంద మయము, సర్వాభీష్టప్రదము.

## 390. ధ్రువః

- నిశ్చలమైనవాడు. ఉన్నత స్థానము నిచ్చినవాడు.

### ఓం ధ్రువాయ నమః

'ధ్రు' ధాతువునకు 'నిశ్చలము' అని అర్థము. ధ్రువునకు భగవంతుడు నిశ్చలమైన స్థానమును ప్రసాదించెను. వైకుంఠము శాశ్వత స్థానము. వైకుంఠమువలెనే ఏ స్థానమునైనా స్థిరమైన, నిత్యమైన, శాశ్వతమైనదిగా చేయగలడుగాన పరమాత్ముడు ధ్రువుడు. **ఆర్వాచీనం ధ్రువమసి తుంగస్థాన ప్రదానతః ధ్రువీ చకార యస్మాద్ధి ధ్రువసస్తస్మా త్సుకీర్తితః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుని (తత్వము) లక్షణము నిత్యము, శాశ్వతము, అచంచలము, స్థిరము, సత్యము. ఈ లక్షణమునే ఆయన ధ్రువునకు ప్రసాదించెను. కనుక భగవానుడు ధ్రువుడు.

ధర్మచక్రము రచయిత – సృష్టి లయ చక్రములో సర్వము అంతమగును. కాని భగవంతుడు శాశ్వతుడు, స్థిరుడు గనుక ఆయన ధ్రువుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'ధ్రువ' శబ్దమునకు 'నిశ్చయము' అని అర్థము. ప్రపంచములో అంతా 'అధ్రువము' అయినా గాని భగవంతుడు తన లక్షణమువల్ల వానికి నిశ్చయత్వ గుణమును ఆపాదించును. సూర్యోదయాస్తమయములు, జనన మరణములు – ఇవన్నీ నిశ్చయమైన ఘటనలు.

**తరువాతి 16 నామములను శ్రీరామావతార పరముగా శ్రీభట్టులు వర్ణించారు. "మృతులైనవారిని కూడా పునరుజ్జీవింపజేయు గాథ" అని ఈ అధ్యాయమునకు శ్రీ భట్టులు నామకరణము చేశారు. రామావతారముపై శ్రీ భట్టులకు ప్రత్యేకమైన మక్కువ అని శ్రీ వి.వి. రామానుజన్ వ్యాఖ్యానించారు.**

## 391. పరర్ధిః

- సకల శుభ, ఉత్తమ కళ్యాణ లక్షణములు గలవాడు.
- దివ్యమైన విభూతి, ఐశ్వర్యము గలవాడు.

### ఓం పరర్ధయే నమః



'(ఋ)రిద్ధి' అనగా విభూతి (స్వరూపము**). పరా ఋద్ధిః యస్య స పరర్ధిః –** ఉత్కృష్టమైన కళ్యాణగుణ సంపన్నుడు పరర్ధి. నారదుడు వాల్మీకి మహర్షికి చెప్పిన శ్రీరామవర్ణనలో రెండు శ్లోకములు –

**సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ**
**విష్ణునా సదృశో వీర్యే సోమవత్ ప్రియదర్శనః**
**కాలాగ్ని సదృశః క్రోధే క్షమయా పృథ్వీసమః**
**ధనదేన సంస్త్యాగే సత్యే ధర్మ ఇవా పరః**

చిన్న తిరుపతిలోని శ్రీరాముని శిల్పం.

శ్రీరాముని గాంభీర్యము సాగరమువంటిది. ఆయన ధైర్యము హిమాలయ సదృశము. విష్ణుసమాన వీరుడు. చంద్రునివంటి రూపముగలవాడు. ఆయన క్రోధము ప్రళయాగ్ని సమము. భూమాతతో సమమైన ఓర్పు, కుబేరునివంటి త్యాగము, ధర్మదేవతవంటి సత్యము శ్రీరాముని లక్షణములు.

శ్రీ రామానుజన్ ఇచ్చిన మరొక వివరణ – **పరేశామ్ ఋద్ధిరేవ ఋద్ధిః యస్య** – పరుల సమృద్ధినే తన ఋద్ధిగా భావించువాడు పరర్ధి. శ్రీరాముడు విభీషణునకు పట్టముగట్టి, **కృతకృత్యః తదా రామః** – సంతోషించెను. **ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి** – ప్రజలు సంబరములు చేసుకొన్నపుడు శ్రీరాముడు వారి తండ్రివలె సంతోషించుచుండెను.

'ఋద్ధి' అనగా విభూతి. పరమైన (అనంతమైన, ఉత్కృష్టమైన) విభూతులు గలవాడు పరర్ధి.

**దివ్యానాత్మ విభూతయః** (గీత 10.16) – నా విభూతులు దివ్యములు.

**నాంతోऽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప** (గీత 10.40) – నా దివ్య విభూతులకు అంతము లేదు.

ఇలా అంతు తెలియని విభూతులు కలిగినవాడు పరర్ధి.

## 392. పరమస్పష్టః

- స్పష్టమైన పరతత్వము గలవాడు. తన పరతత్వాన్ని స్పష్టముగా గోచరింపజేసేవాడు.

### ఓం పరమస్పష్టాయ నమః

**స్పష్ట (ప్రత్యక్ష, దృష్టా) పారమ్యః పరమస్పష్టః** – ఆయన ఔన్నత్యము, పరతత్వము స్పష్టమైనవి. ఈ వివరణలో శ్రీ భట్టులు రామాయణము (యుద్ధకాండము 114.4)లో రావణ వధానంతరము మండోదరి శ్రీరామునిగూర్చి చెప్పిన మాటలను ఉదాహరించారు – **వ్యక్తమేషాం మహాయోగీ పరమాత్మా సనాతనః** – శ్రీరాముడు మహాయోగి, పరమాత్ముడు, సనాతనుడు అని వ్యక్తమగుచున్నది.

అలాగే శ్రీరాముని చూచి తార అన్న మాటలు (4.24.31, 32) – **త్వమ్ అప్రమేయశ్చ దురాసదశ్చ ... ... మనుష్య దేహాభ్యుదమ్ విహాయ దివ్యేన దేహాభ్యుదయేన యుక్తః.**

శ్రీరాముని చూడగానే ఆయన పరతత్వము తెలియవచ్చును. సుమిత్ర మాటలు – **సూర్యస్యాపి భవేత్ సూర్యః** – సూర్యునికంటె ఎక్కువ ప్రకాశము గలవాడు. సూర్యునికి కాంతినిచ్చువాడు.

ఇంకా శ్రీరాముని పరమస్పష్టతను గూర్చి ప్రస్తావనలు –

**పుంసామ్ దృష్టి చిత్తాపహారిణమ్ – రూప సంహననమ్ లక్ష్మీమ్ తదృశుర్విస్మితాకారాః**

ధర్మచక్రము రచయిత వివరణ – శ్రీ రఘునందనుని ఈ స్పష్ట పరతత్వమువల్లనే భరతుడు రాజ్యాధికారమును తృణీకరించి శ్రీరాముని పాదుకలకు శరణాగతుడయ్యెను. లక్ష్మణుడు నిద్రాహారములు పరిత్యజించి అన్నా వదినలకు వనవాససేవాదీక్ష నాచరించెను. ఒక్కమారు శ్రీరాముని దర్శించగానే హనుమంతుడు శాశ్వతముగా రామదాసత్వమును చేకొనెను.

శ్రీ సత్యదేవోవాసిష్ఠ మరొక స్వతంత్రవ్యాఖ్యనిచ్చారు. 'స్పష్' అనగా బంధించుట (స్పశతి – బధ్నాతి). అన్నింటినీ అద్భుతముగా అల్లువాడు పరమస్పష్టుడు. అందువలననే రక్తమాంస శల్య నాడీ సంయుక్తమైన శరీరము ఒక సుందర రూములో వ్యక్తమగుచున్నది. ఈ భావమునకు ఆయన చెప్పిన ఉదాహరణలు –

**అస్య స్పశో న నిమిషన్తి** (ఋగ్వేదము 9.73.4)
**దివః స్పశః ప్రచరన్తి** (అధర్వ వేదము 4.16.4)

## 393. తుష్టః

- ఆనందముతో నిండియున్నవాడు. పూర్ణ సంతుష్టుడు.
- సచ్చిదానందమర్తి. తృప్తినొందువాడు.

### ఓం తుష్టాయ నమః

వైకుంఠములో నిత్యసూరుల మధ్యనుండక మానవమాత్రుడైన దశరధునకు కొడుకై, నరునిగా సామాన్యులకు అందివచ్చిన భగవానుడు తుష్టుడు. **లాభాద్దాశరధి త్వస్య జగతః పాలనస్య చ మనుష్యత్వేపి యః ప్రీతః సంతుష్ట ఇత కథ్యతే** - భగవంతుడు తన భక్తులకు, దాసులకు ప్రియము కలిగినపుడు సంపూర్ణముగా సంతుష్టుడగును.

'తుష్టః' అనగా పరమానంద స్వరూపి అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. పత్రముగాని, పుష్పము గాని, ఫలముగాని, జలముగాని భక్తితో నివేదించినది గ్రహించి సంతుష్టుడగు సర్వేశ్వరుడు తుష్టుడు.

ఏ విధమైన తాపములు, కామములు భగవానుని దరిచేరవు. శ్రీరాముడు పట్టాభిషేకమునకు పొంగిపోలేదు. వనవాస యోగమునకు కుంగిపోలేదు. గాంధారీమాత యాదవ కులమును శపించినపుడు శ్రీకృష్ణుడు చిరునవ్వుతో అనుగ్రహించెను.

**సంతుష్టః సతతం యోగీ** – ఘటనలకు, కర్మ ఫలములకు అంతఃకరణమును దూరముగానుంచి, సంతుష్టుడై యుండుట భగంతుని గురించిన జ్ఞానమునకు మార్గము.

## 394. పుష్టః

- పరిపూర్ణుడు. ఉన్నత గుణ సంపన్నుడు.

### ఓం పుష్టాయ నమః

**పూర్ణత్వాత్ పుష్టః** – అన్ని విధముల పరిపూర్ణుడు గనుక ఆయన పుష్టుడు. ఆయనలో ఇష్టానిష్టములకు, కామమోహములకు తావు లేదు. ఈ నామ వివరణలో ధర్మచక్రము రచయిత వళ్ళువార్ రచనను ఉట్టంకించారు. **వెండుదల్ వెండమాయి ఇలాన్** – ఆయనలో కొరత అనేది ఉండదు. ఈ నామస్మరణవలన ఇష్టానిష్టములను జయింపవచ్చును.

శ్రీ సత్యదేవోవాసిష్ఠ ఈ నామముయొక్క పరిధిని ఇంకా పెంచారు. **పుష్ణాతి ఇతి పుష్టః** – పోషించువాడు పుష్టుడు. తన సృష్టిలో అన్నింటికి సంతృప్తినిచెందు విధమును ప్రసాదించువాడు.

## 395. శుభేక్షణః

- మంగళకరమైన చూపు గలవాడు.
- చూపుతోనే సకల శుభములను ప్రసాదించువాడు.
- భగవంతుని చూసినవారికి, భగవంతునిచే చూడబడినవారికి సకల తాపత్రయములు నశించును. వారి పాపములు శమించును. కోరికలీడేరును.

### ఓం శుభేక్షణాయ నమః

ఇంతకుముందు 346వ నామము 'పద్మనిభేక్షణః', 348వ నామము 'అరవిందాక్షః' కూడ భగవంతుని చల్లని చూపును ప్రస్తుతించినవి. శ్రీ భట్టులు ఉదాహరించిన అయోధ్యకాండము శ్లోకము (17.14) –

**యశ్చ రామమ్ న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి నిందితః స వసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే** - రాముని చూడనివాడు గాని, రామునిచే చూడబడనివాడు గాని లోకంలో అందరిచే నిందితుడై జీవిస్తాడు. చివరకు అతని ఆత్మ కూడ అతనిని నిందిస్తుంది.

**సుభ్రూరాయత తామ్రాక్షః సాక్షాద్విష్ణురివ స్వయం** – చక్కని కనుబొమలు, విశాలమైన ఎర్రని కనులతో రాముడు సాక్షాత్తు విష్ణువువలె ప్రకాశిస్తున్నాడని అయోధ్యాపురవాసులు కొనియాడిరి. **రామః కమలపత్రాక్షః సర్వసత్వ మనోరథః** – అని హనుమంతుడు వర్ణించెను. **తమ్ పద్మదళ పత్రాక్షమ్ ... ... ధన్యాః పశ్యన్తి మే నాథమ్** – అని సీతమ్మతల్లి ప్రస్తావించెను.

**సౌశీల్యైశ్వర్య పిశునం శీతలం దీర్ఘమాయితమ్ తామ్రం చ లోచనం యస్య స శుభేక్షణ ఈరితః స్వకర్మ కర్తృకం చైవ శుభ యస్యేతి దర్శనమ్ శుభేక్షణస్యాత్ ... ...** – సౌశీల్యము, ఐశ్వర్యమును సూచించునట్టి నల్లని పొడవైన, విశాలమైన ఎర్రని నేత్రములు గలవాడు. తాను చూడడం గాని, తనను చూడడం గాని శుభకరము చేయువాడు. అని శ్రీ భట్టులు ఈ నామమును వివరించారు.

**శ్రీ సీతారాములకు నమస్కారము. శ్రీ లక్ష్మణస్వామికి నమస్కారము. శ్రీ భరత శత్రుఘ్నులకు నమస్కారము. జై వీరాంజనేయ.**

శ్రీ శంకరులు ఇదే శుభనామా ... యస్య శుభమ్, శుభకరమ్ నరాణామ్, ముముక్షూణామ్ మోక్షదమ్, ... , సర్వ సందేహ విచ్ఛేదకారణమ్, హృదయగ్రంథేర్విచ్ఛేదకరమ్, స ... **శుభేక్షణః.** భగవానుని చూపు, దర్శనము సకల శుభకరము. సర్వ మంగళప్రదము. భోగములను కురిపించును. పాపములను నశింపజేయును. సకల సందేహములను నివారించును. హృదయగ్రంథిని ఛేదించును. కర్మలనుండి విముక్తి కలిగించును. అవిద్యను పటాపంచలు చేయును. కనుకనే ఆయన శుభేక్షణుడు. ఇందుకు శ్రీ శంకరులు ముండకోపనిషత్తు(2.2.8)నుండి చెప్పిన ప్రమాణము – **భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యతే సర్వసంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి కూడ శ్రుతులనుండి పలు ఉదాహరణలు చెప్పారు – 'ఈక్షణము' అంటే 'దృష్టి' మాత్రమే కాక భగవంతుని సంకల్పమును కూడ సూచించును. తాను ఏకమాత్రుడైనను పలువురిగా కావలెనను ఆయన సంకల్పమే సృష్టికారణమైనది. అలా శుభమును సంకల్పించినవాడు (ఈక్షించినవాడు) గనుక భగవానుడు శుభేక్షణుడు. ఈ విషయమై శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పిన సూక్తులు –

**తదైక్షత బహుస్యామ్ ప్రజాయెయేతి** (ఛాందోగ్యోపనిషత్తు 6.2)
**స ఈక్షత లోకాన్ సృజ ఇతి** (ఐతరేయ 1.1.1)    **స ఈక్షామ్ చక్రే** (ప్రశ్నోపనిషత్తు 6.3)
**సేయమ్ దేవతైక్షత హంతాహ్మిమాః తిస్రో దేవతా అనేన జీవేన ఆత్మానను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి** (ఛాందోగ్యోపనిషత్తు 6.3)

భగవంతుని చల్లనిచూపువలన ధన్యులైన పెక్కురు పుణ్యాత్ములనుగురించి ధర్మచక్రము రచయిత ప్రస్తావించారు. శ్రీకృష్ణుని దర్శనమువలన అర్జునుని అజ్ఞానము పటాపంచలయ్యెను. గుహుడు, హనుమంతుడు, పరశురాముడు, శబరి వంటివారు ఎందరో శ్రీరాముని దర్శనమువలన ప్రయోజనము పొందినారు.

సీతమ్మ వద్ద చూడామణిని తీసుకొంటున్న హనుమంతుడు. హంపీలోని శిల్పం. వికీపీడియా చిత్రం.
Photo by: Soham Banerjee https://commons.wikimedia.org/wiki/File:Hanuman_taking_Sita%27s_ring.jpg

**శ్రీ వాల్మీకి రామాయణము.**
సుందరకాండము. 17వ సర్గ. 30, 31, 32

**తాం క్షమాం సువిభక్తాంగీం వినాభరణ శోభినీమ్**
**ప్రహర్షమతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్**
**హర్షజాని సోఽశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్**
**ముమోచ హనుమాం స్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్**
**నమస్కృత్వా చ రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్**
**సీతా దర్శన సంహృష్టో హనుమాన్ సంవృతోఽభవేత్**

ఆభరణములు లేకున్నను చక్కని అవయవ సౌష్టవముతో శోభిల్లుచున్న క్షమామూర్తియైన ఆ సీతామాతను చూచి మారుతి మిక్కిలి సంతసించెను. అందమైన కన్నులుగల ఆ సీతాదేవిని చూచుటతోడనే హనుమంతుని నేత్రములనుండి ఆనందాశ్రువులు స్రవించెను. పిమ్మట ఆంజనేయుడు రాముని స్మరించి, ఆయనకు అంజలి ఘటించెను. సీతాదర్శనముతో ఆనందభరితుడై రామలక్ష్మణులకు నమస్కరించి, ఆ మహావీరుడు ఆకులమాటున దాగికొనియుండెను. (గీతా ప్రెస్ ప్రచురణలోని తాత్పర్యము)

## రామో విరామో విరతో (విరజో) మార్గో నేయో నయోऽనయః |
## వీరః శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః || (43)



శ్రీ సీతా రామ లక్ష్మణ హనుమంతులు – శివరామపురం

Creative Commons photo from flickr – by Sowrirajan S
https://www.flickr.com/photos/sowri/6897793394/in/dateposted/

### 396. రామః

- రమింపజేయువాడు. నిత్యానంద స్వరూపుడు. అందరి ఆనందమునకు కారకుడు.

ఓం రామాయ నమః

**రమంతే యోగినః అస్మిన్ ఇతి రామః** – యోగులందరు ఆయనయందు రమించెదరు గనుక ఆయన రాముడు. ఈ విషయమై శ్రీ శంకరులు పద్మపురాణమునుండి ఉదాహరించారు.

**రమంతే యోగినో యస్మిన్ నిత్యానందే చిదాత్మనిఇతి రామ పదే నైతత్ పరం బ్రహ్మోऽభిధీయతే** - నిత్యానందస్వరూపుడగు దేనియందు యోగులు నిరంతరము రమించుచుందురో అట్టి పరబ్రహ్మము 'రామ' శబ్దముతో కీర్తింపబడుచున్నది.

రెండవ అర్థము – శ్రీరాముని శుభగుణములవలన అందరికీ ఆనందము కలుగును. కనుక ఆయన రాముడు. జగదానందకారకుడు. ఇందుకు శ్రీభట్టులు పలు ఉదాహరణలు చెప్పారు –

**రామో రమయతాం శ్రేష్ఠః** (రామాయణము. అయోధ్యాకాండము. 53.1)

**గుణాభిరామం రామంచ** (మహాభారతము. సభాపర్వము. 58.42)

**తథా సర్వప్రజాకాంతైః ప్రీతి సంజననైః పితుః**

**గుణైః విరురుచే రామః దీప్తః సూర్య ఇవాంశుభిః** (రామాయణము. అయోధ్యాకాండము. 1.33)

రాముడు సకల జనులకు ప్రీతిపాత్రుడు. తండ్రికి ఆనందకారకుడు. సకల కళ్యాణగుణ సంపన్నుడు. సూర్యునివలె ప్రకాశించువాడు.

తిరుప్పావైలో అండాళ్ తల్లి **'మనతుక్కు ఇనియన్'** అని దేవదేవుని సంబోధించినది. రాముని రూపము శత్రువులనుకూడ ఆకర్షించునట్టిది. వాలి మరణ సమయమున తార, రావణుని మరణ సమయమున మండోదరి శ్రీరాముని దివ్యత్వమును గ్రహించారు.

శూర్పణఖ రామలక్ష్మణులను వర్ణించిన విధమును శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించారు –

**తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ పుండరీక విశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ, శ్రీ వి.వి. రామానుజన్ **'క్రీడాయాం'** అనే మూలము ఆధారముగా వివరణ ఇచ్చారు. భగవంతుడు తన క్రీడ (లీల)వలన సంతోషించువాడు, సంతోషపరచువాడు గనుక రాముడు.

ధర్మచక్రము రచయిత ఇంకా ఇలా వివరించారు – క్షణికమైన ఆనందమునిచ్చి, దుఃఖకారణమైనవి ఒక విధమైన సుఖములు. శాశ్వతమైన ఆనందమునిచ్చు పరబ్రహ్మానుభవము మరొకటి. అట్టి సచ్చిదానంద శాశ్వత సుఖకారకుడైన పరబ్రహ్మమే రాముడు. కనుకనే రాముని దర్శనముకొరకు శబరి ప్రాణములను నిలుపుకొన్నది. రాముని దర్శించి ఋషులు పరవశించారు. కృష్ణునితో క్రీడించి గోపీజనులు ధన్యులయ్యారు.

**రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరంతపః రామ ఏవ పరం తత్వం శ్రీరామో బ్రహ్మతారకమ్**

**"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షరీమంత్రములోని బీజమైన **'రా'** అక్షరమును, **"నమః శివాయ"** అనే పంచాక్షరీమంత్రములోని బీజాక్షరమైన **'మ'** అక్షరమును కలుపగా వచ్చిన దివ్యమంత్రము పరమాత్మ నామమైనది. ఇది వారి కులగురువు వశిష్ఠమహర్షియొనర్చిన నామకరణము.

## 397. విరామః

- ఆయనవద్దకొచ్చేసరికి అందరూ శక్తిహీనులవుతారు (వారి వారి శక్తులు విరమణ చేయబడుతాయి).
- అందరికి అంతిమ విశ్రాంతి స్థానము.

### ఓం విరామాయ నమః

బ్రహ్మాది దేవతల శక్తులకు, వారిచే వరములు పొందినవారి శక్తులకు శ్రీమహావిష్ణువు విరామస్థానము. అనగా వారిశక్తులు ఆయనవద్ద విరమించును. **విరమ్యతే అస్మిన్ వరప్రదై బ్రహ్మాదిభిః వరైశ్చ అవధ్యాదిభిః లబ్ధ వరైశ్చ రావణాదిభిః ఇతి విరామః**

**వరప్రదైః బ్రహ్మముఖ్యైః అవధ్యత్వాదిభిర్వరైః యస్మిన్విరమ్యత ఇతి స విరామ ప్రకీర్తితః** - రావణుడు, హిరణ్యకశిపుడు వంటివారు బ్రహ్మాది దేవతలనుండి ఎన్ని వరములు పొందినా అవి శ్రీనివాసునిముందు నిర్వీర్యమయ్యెను. ఎందుకంటే ఆయన అప్రమేయుడు. అమోఘుడు. విరాముడు. ఈ వివరణతో శ్రీ భట్టులు రామాయణము సుందరకాండమునుండి హనుమంతుని భాషణముల నుదాహరించారు.

**దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేంద్ర గంధర్వ విద్యాధర నాగయక్షాః**
**రామస్య లోకత్రయ నాయకస్య స్థాతుం న శక్తా స్సమరేషు సర్వే** (సుందరకాండము 51.44)
దేవతలు, దైత్యులు, గంధర్వులు, విద్యాధరులు, నాగ, యక్షులు మొదలైనవారు విడివిడిగా గాని, కలిసిగాని ముల్లోకాధిపతియైన శ్రీరామునకు ఎదురుగా యుద్ధమందు నిలువజాలరు.

**బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా రుద్రస్త్రినేత్ర స్త్రిపురాంతకో వా**
**ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్**
సమరమున శ్రీరాముని చేతిలో చావు మూడినవానిని స్వయంభువు, చతుర్ముఖుడు ఐన బ్రహ్మగాని, త్రినేత్రుడు, త్రిపురాంతకుడు అయిన రుద్రుడుగాని, మహైశ్వర్య సంపన్నుడు, సురపతియు ఐన దేవేంద్రుడుగాని రక్షింపజాలరు.

**దాశరథి శతకము – భద్రాచల రామదాసు కంచర్ల గోపన్న రచన**

శ్రీ రఘురామ, చారు తులసీదళదామ, శమ క్షమాది శృం
గార గుణాభిరామ, త్రిజగన్నుత శౌర్య, రమాలలామ, దు
ర్వార కబంధ రాక్షస విరామ, జగజ్జన కల్మషార్ణవో
త్తారక నామ, భద్రగిరి దాశరధీ! కరుణాపయోనిధీ!

రామ విశాల విక్రమ పరాజిత భార్గవరామ, సద్గుణ
స్తోమ పరాంగనా విముఖ సువ్రతకామ, వినీల నీరద
శ్యామ, కకుత్స్థ వంశ కలశాంబుధి సోమ, సురారి దోర్బలో
ద్దామ విరామ, భద్రగిరి దాశరధీ! కరుణాపయోనిధీ!

అన్నింటికి, అందరికి అంతిమ విరామ స్థానము గనుక భగవంతుడు 'విరాముడు' అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. **విరామః అవసానమ్ ప్రాణినామ్ అస్మిన్ ఇతి విరామః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి రామాయణము (2.8.13)నుండి చెప్పిన ఉదాహరణ –
**న హి తస్మాత్ మనః కశ్చిత్ చక్షుషీవా నరోత్తమాన్**
**నరః శక్నోత్యపాక్రష్టుమ్ అతిక్రాంతే అభిరాఘవే**
శ్రీరాముని దర్శించినవారు, ఆయనపై మనసు నిలిపినవారు ఇంక తమ మనసును మరలించడానికి యత్నించరు.



శ్రీరామునికి శరణాగతుడైన హనుమంతుడు. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Hanuman_kneeling_before_Rama._Gouache_drawing._Wellcome_V0044943.jpg

శ్రీ చిన్మయానంద – భగవంతుని చేరినవారికి మరల పునర్జన్మయుండదు గనుక రాముడే విరాముడు. ఇదే నామమునకు కొందరు వ్యాఖ్యానకర్తలు 'ప్రళయకాళమున భిన్నత్వము ఏకత్వములో విలీనమగును' అని అర్థము చెప్పారు. **యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ** – అని భగవద్గీతలో భగవానుడు ప్రవచించెను. ఇది గ్రహించి విరాముని ధ్యానించవలెను.

'రామ'. 'విరామ' నామముల భావములను అనుసంధిస్తూ శ్రీ సత్యదేవోవాసిష్ఠ ఇలా చెప్పారు –

**రమంతే అస్మిన్ రామః, విరమంతి అస్మిన్ ఇతి విరామః** – ఎవనియందు జనులు ఆనందింతురో ఆయన రాముడు. ఎవనియందు జనులు విశ్రమింతురో ఆయన విరాముడు. **యత్ర రమణమ్ తత్ర రమణ అవసానమ్** – ఆనంద స్థానమే విశ్రాంతిస్థానము. సృష్టికారకుడు, లయకారకుడు కూడ ఆయనే. పంచభూతములనుండి జనించినది పంచభూతములయందే కలిసిపోయినట్లు, ఉదయించిన సూర్యుడు అస్తమించినట్లుగాని, ఆ పరమేశ్వరుని చేతనే జగములు జనించును. ఆయనలోపలనుండును. ఆయనయందు డిందును. ఇందుకు శ్రీ సత్యదేవోవాసిష్ఠ శృతులనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు

**తస్మిన్ ఇదమ్ సమ్ చ విచయితి సర్వమ్ స ఓత ప్రోతశ్చ విభుః ప్రజాసు** – యజార్వేదము 32.8

**యో మారయతి ప్రాణయతి యస్మాత్ ప్రాణంతి భువనాని విశ్వా** – అధర్వణవేదము 13.3.3.

**కాలేనోదతి సూర్యః కాలేనివిశతే పునః** – అధర్వణ వేదము 19.54.1

**యత్రామృతమ్ చ మృత్యుశ్చ పురుషేఽధి సమాహితే** – అధర్వణ వేదము 10.5..17

## 398. విరజో-మార్గః, విరతోమార్గః

| | | |
|---|---|---|
| విరజః | - | రజోగుణము లేనివాడు (పూర్ణ సత్వస్వరూపుడు). |
| విరతః | - | విషయచింతన (ఆసక్తి) లేనివాడు. |
| మార్గః | - | ఆయనను పొందుటకు ఆయనే దారి. |
| విరజోమార్గః | - | దోషరహితమైన మార్గము చూపువాడు. |
| విరతో మార్గః | - | ఆయన విషయచింతన లేనివాడైనను అందరూ ఆశించువాడు. |

ఈ నామపాఠముగురించి వేరువేరు అభిప్రాయములున్నవి. ఒకే నామముగా భావించినవారు 'విరజోమార్గః' అనీ, రెండు నామములుగా భావించినవారు 'విరతః', 'మార్గః' అనీ అధికంగా చెబుతున్నారు. కొంతమంది ఒకే నామముగా లెక్కవేసి, అర్థము మాత్రము రెండు నామములుగా చెబుతున్నారు.

34వ శ్లోకములో ('ఇష్టోఽవిశిష్టః' లేదా 'ఇష్టః' మరియు 'విశిష్టః' నామములుగా) ప్రారంభమైన సంఖ్యాభేదము ఈ 43వ శ్లోకముతో మరల కలిసిపోవుచున్నది (వ్యాఖ్యలనుబట్టి). మొత్తానికి వివిధ భాష్యకారులు బహువిధములైన భగవద్గుణానుభవములను ఈ నామవ్యాఖ్యద్వారా మనకు ప్రసాదించారు.

### ఓం విరతాయ నమః

**విగతమ్ రతమ్ అస్య విషయ సేవాయామ్ ఇతి విరతః** – విషయములందు రతము (అనురక్తి, చింతన, కోరిక) లేనివాడు గనుక భగవానుడు విరతుడు. అయోధ్యాపురమున పట్టాభిషేకము చేజారినపుడు శ్రీరాముడు చింతితుడు కాలేదు. రాత్రిసమయములో చంద్రుని చల్లదనము, సౌందర్యము విడచిపోవు. అదేవిధముగా రాజ్యము దూరమైనను రామచంద్రుడు చిదానంద స్వరూపుడే.

**న చాస్య మహతీమ్ లక్ష్మీమ్ రాజ్యనాశోఽపకర్షతి**
**లోక కాంతస్య కాంతత్వమ్ శీతరశ్మేరివ క్షపా** – అయోధ్యాకాండము 19.32

సుందరకాండము (36.29)లో సీతమ్మతల్లి హనుమంతునితో నిట్లన్నది – **ధర్మాపదేశాత్ త్యజతశ్చ రాజ్యమ్ మామ్ చాప్యరణ్యమ్ నయతః పదాతిమ్** - ధర్మము కొరకు రాజ్యమును త్యజించి కాలినడకన మాతో అడవులకు వెడలినపుడు ఆయన ముఖమున బాధగాని, నిరుత్సాహముగాని, భయముగాని లేవు.

శ్రీ వి.వి. రామానుజన్ – భీకరయుద్ధంలో రావణుని కూల్చినాగాని లంకారాజ్యముపై రాముని కిసుమంతయినా ఆసక్తి లేదు. ఆయన నగరంలోనికి అడుగుపెట్టనే లేదు. విభీషణునికి పట్టముగట్టి ఆయన ఆనందభరితుడయ్యెను. శ్రీరాముని విరత గుణమునకు ఇది మరొక తార్కాణము.

## ఓం విరజాయ నమః

శ్రీ చిన్మయానంద – రజోగుణము, మనోవికారములు లేనివాడు. సంపూర్ణశుద్ధ సత్వ స్వరూపుడు గనుక విరజుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఒక్కో నామము అర్థమును వివరిస్తూ ఒక్కో శ్లోకమును రచించారు. 'విరజః' నామార్థములో ఆయన చెప్పిన శ్లోకము –

**రజో న తస్మిన్ న తమశ్చ తస్మిన్ సత్వ స్వభావో హి స విష్ణురుక్తః**
**సోऽస్తి స్వభావాత్ అమితో ప్రకాశో దేవేऽస్తి గీతః తమసః పరస్తాత్**

## ఓం మార్గాయ నమః

ఇంతకుముందు **"విక్షరో రోహితో మార్గో హేతుః ... ....."** అనే 40వ శ్లోకములో ఈ నామము 367వ నామముగా స్తుతింపబడినది.

**మార్గయతే ఇతి మార్గః** – శాస్త్రానుబద్ధమైన జీవనము సాగించువారలకు జ్ఞానస్వరూపుడైన భగవంతుడే మార్గము. (మృజా – శుద్ధౌ – అనే ధాతువునకు 'శుద్ధి చేయుట' అని అర్థము.) భరద్వాజునివంటి మునివర్యులుకూడ శ్రీరాముని అనుసరించారు. (జ్ఞానసముపాసనామార్గము శ్రీమన్నారాయణుని స్వరూపమే) అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. భగవత్ప్రాప్తి గమ్యము. అందుకు భగవంతుడే మార్గము.

శ్రీ శంకరులు తైత్తరీయోపనిషత్తు (3.13)నుండి చెప్పిన ప్రమాణము –**నాన్యః పంథా విద్యతేऽయనాయ** – వేరు మార్గము లేదు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి బృహదారణ్యకోపనిషత్తు (4.49) నుండి చెప్పిన ప్రమాణము – **ఏషా పంథా బ్రహ్మణా హానువిత్తః**

పరశురాముడు, వాలి, రావణుడు తదితరులు శ్రీరాముని దర్శనమువలననే భగవత్తత్వము తెలిసికొన్నారని ధర్మచక్రము రచయిత వివరించారు.

## ఓం విరజోమార్గాయ నమః

శ్రీ భట్టులు 'మార్గః' అనే నామంగానూ, 'విరజోమార్గః' అనే నామంగానూ కూడా పరిగణించారు. 'విరజోమార్గః' అనగా దోషరహితమైన మార్గము (కలవాడు). **పారస్తు విరజోమార్గ ఇతి నిర్దోష దర్శితః సంధాస్యాద్యేన విరజోమార్గ స్సన్మార్గ దర్శనాత్.** పరమపదాన్ని చేర్చే అర్చిరాదిమార్గమును తన భక్తులకు చూపినవాడు.

## ఓం విరతోమార్గాయ నమః

శ్రీ శ్రీనివాసరాఘవన్ 'విరతోమార్గః' అనే ఏకనామమును పరిగణించారు. భగవంతుడు నిరాసక్తుడు అయినప్పటికీ అందరూకోరే (దివ్యపదము) దివ్యమార్గము భగవంతుడే.

శ్రీ భట్టులు 'మార్గః', 'విరజోమార్గః' అనే రెండు విధాల నామములనూ పరిగణించారు.

శ్రీ శంకరులు 'విరతః', 'మార్గః' అనే రెండు వేరువేరు నామములుగా పరిగణించారు.

## 399. నేయః

- (భక్తుల మాటలకు) విధేయుడై యుండువాడు.
- అన్ని విధములుగాను ప్రాప్తిని కోరుటకు అర్హుడు (గమ్యముగా కోరదగినవాడు).
- మార్గమును చూపించువాడు.

### ఓం నేయాయ నమః

'నేత' అనగా నడిపించువాడు. 'నేయ' అనగా నేతను అనుసరించువాడు. 'నియోగము' అనగా ఆదేశము. **నియోగ అర్హత్వాత్ నేయః** – అని శ్రీ భట్టులు వివరించారు. ఆదేశములకు అనుగుణముగా వర్తించుటకు (భక్తులు) ఎవరిని నమ్ముకొనవచ్చునో ఆయనే నేయుడు. భక్తజనాదేశ విధేయుడు. భక్తులు చెప్పినట్లుగా నడచుకొనువాడు. ఇందుకు శ్రీ భట్టులు పెక్కు ప్రమాణములు చెప్పారు.

**ఆజ్ఞాప్యోऽహమ్ తపస్వినామ్** (రామాయణము. అరణ్యపర్వము. 6.22) – తాపసుల ఆజ్ఞలను నేను అనుసరింతును. (అని రాముడు పలికెను)

**నియుంక్ష్వ చాऽపి మామ్ కృత్యే సర్వం కర్మాస్మి తే వచః** (మహాభారతము. అనుశాసన పర్వము. 33.25) – నీవు చెప్పినదేదైనా నేను నెరవేర్చెదను (అని కృష్ణుడు యుధిష్ఠిరునితో అనెను).

**అయమస్మి మహాబాహో బ్రూహియత్తే వివక్షితమ్**
**కరిష్యామీహ తత్సర్వమ్ యత్త్వమ్ వక్ష్యసి భారత** (మహాభారతము. అరణ్యపర్వము. 71.5)
భరతవీరా! నీవు చెప్పినది చేయడానికే నేనిక్కడున్నాను. నీవు చెప్పినట్లే అంతా చేస్తాను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – **ప్రాప్యః ప్రాప్తుమ్ యోగ్యః** – (భక్తులకు) ప్రాప్తి కొరకు ప్రయత్నించడానికి యోగ్యమైనవాడు. ధ్యాన, స్మరణ, భక్తి మార్గముల ద్వారా ఏ దేవదేవుని ప్రాప్తి కొరకు సాధన చేయదగునో అట్టి దేవదేవుడు. **సర్వ ప్రమాణ అవిషయత్వాత్ స మనసా నేతుమ్ అర్హః.**

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – 'నేయః' అనగా మార్గదర్శి. భక్తులకు భగవంతుడు మార్గము మాత్రమే కాక ఆ మార్గమున మార్గదర్శియును ఆ కరుణామయుడే గదా కనుక 'నేయః' అని ప్రసిద్ధుడయ్యెను.

## 400. నయః

- అందరిని తనవైపు లాగుకొనేవాడు (నడిపించువాడు, ఆకర్షించుకొనేవాడు).

### ఓం నయాయ నమః

**నయతి ఇతి నయః** – అందరిని తనవైపు లాగుకొనేవాడు. **నీయంతే అస్మిన్నితి నయః** – మహానుభావులు కూడా తన మాటలను ఆచరించునట్లుగా చేయువాడు. **యస్మిన్ తపోధనా నిత్యం నీయంత ఇతి వై నయః** – తపోధనులైన మహర్షిపుంగవులు కూడా తన ఆజ్ఞను ఉల్లంఘించలేనట్లుగా ఆకర్షించేవాడు.

తపోధనసంపన్నులైన మహర్షులుకూడ తమ రక్షణాభారమును శ్రీరామచంద్రునికి అప్పగించిరి. శ్రీ శ్రీవరాహావతారమున భగవంతుని పలుకులను శ్రీ వి.వి.రామానుజన్ ఉదాహరించారు – **నయామి పరమామ్ గతిమ్** – అందరిని పరమపదమునకు నడిపించెదను. గీతోపదేశముద్వారా భగవంతుడు అర్జునుని కర్తవ్యమార్గమున నడిపించిన విధమును ధర్మచక్రము రచయిత ఉదాహరించారు. ఈ

పుణ్యనామము ద్వారా తెలియవచ్చేదేమంటే భగవంతునిపై దృష్టి సారించి, ఆయన ననుసరించుటయే మోక్షమార్గము. ఆయనే మోక్షము.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – పైమూడు నామములను పరిశీలించినయెడల

**మార్గః** - భగవంతుడే మార్గము.

**నేయః** - భగవంతుడే దారి చూపువాడు.

**నయః** - భగవంతుడే నడిపించువాడు.

భక్తులు పూర్ణమగు శ్రద్ధతో భగవానుని ఆశ్రయించినచో ఆయనయే మార్గమై - మార్గదర్శియై - నాయకుడై - సారథియై - సచివుడై - నెయ్యమై - అండయై - దండయై - జంటయై - వెంటనంటి చరించుచు గమ్యమునకు తీసికొనిపోవును.

## 401. అనయః

- తేలిక కానివాడు (ఆయనను తొలగించుట, తృణీకరించుట అసాధ్యము).
- ఆయన లేకున్న భాగ్యములు లేవు.
- అందరినీ నడుపువాడు. ఆయనను నడిపేవారు లేరు.

### ఓం అనయాయ నమః

ఆయనను కదిలించుట అసాధ్యము. ఆయన దృఢుడు. నిశ్చలుడు. ఈ భావమును వివరించుచు శ్రీ భట్టులు రామాయణమునుండి ఉదాహరించారు. రావణుడు బ్రహ్మదత్తమైన శక్తిని సౌమిత్రిమీద ప్రయోగించాడు. లక్ష్మణుడు దాన్ని నిరోధించాలని బాణాలతో కొట్టాడు. కాని అది అతని వక్షస్థలంమీద నాటుకుంది. దాని ప్రభావానికి లక్ష్మణుడు తెలివితప్పాడు. వెంటనేవచ్చి రావణుడు లక్ష్మణుని పట్టుకొనిపోబోయాడు కాని ఎత్తలేకపోయాడు. కైలాసం ఎత్తవచ్చు. మందర పర్వతం ఎత్తవచ్చు. త్రిలోకాల్నీ పైకెత్తి పట్టుకోవచ్చు. కాని యుద్ధరంగంలో ఉన్నంతసేపూ శతృవు ఎంతటివాడయినా లక్ష్మణుడిని ఎత్తలేడు. లక్ష్మణుడు బ్రహ్మదేవుని శక్తి తన వక్షస్థలంమీద నాటగానే తాను విష్ణుభాగం అయిఉండడం తలుచుకొన్నాడు. అంచేతనే రావణుడు సౌమిత్రిని ఎత్తలేకపోయాడు. ... ... తరువాత తేజఃశాలియైన హనుమంతుడు లక్ష్మణుని తన భుజాలతో ఎత్తి రామునివద్ద పడుకోబెట్టాడు. హనుమంతుడు హితుడూ, పరమభక్తుడూ గనుక లక్ష్మణుడు అతని చేతిలో చాలా తేలిక అయినాడు ... (బ్రహ్మశ్రీ కొంపెల్ల వెంకటరామశాస్త్రి రచన – వాల్మీకి రామాయణం. సరళ సుందర వచనము – నుండి)

శ్రీ భట్టులే మరొక భావమును కూడ చెప్పారు – 'అయః' అనగా భాగ్యమును కలుగజేయు సాధనములు, మార్గములు. 'అనయః' అనగా ఆయన లేనియెడల భాగ్యము ఉండజాలదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అందరికి దారి చూపేది, దారిలో నడిపించేది, దారి కూడ శ్రీహరియే. కనుక ఆయనకు మార్గదర్శి వేరొకరుండజాలరు. అందువల్ల ఆయన అనయుడు.

భగవానుడు పరస్పర విరుద్ధములైనట్లుగా కనిపించే తత్వాన్ని శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరించారు.

**నయః** - నడచువాడు, నడిపించువాడు.

**అనయః** - కదలనివాడు.

ఇలా ఉండుట భగవత్తత్వము. ఇందుకు శాస్త్రములలో పెక్కు ఉదాహరణలున్నవి.

**తదేజతి, తన్నైజతి – అనేజాదేకమ్ మనసో జవీయో** – ఈశావాస్యోపనిషత్తు.
**అరమ్ కామాయ హరయో వధన్విరే స్థిరాయ హిన్వాన్ హరయో హరీతురా** – ఋగ్వేదము 10.96

## 402. వీరః

- వీరుడు. శత్రుభయంకరుడు. బలపరాక్రమ తేజః సంపన్నుడు.

### ఓం వీరాయ నమః

'వీరః' అనే నామము రెండు లేదా మూడు మార్లు వస్తుంది.
43వ శ్లోకము. 402వ నామము. వీరః – **వీరః శక్తిమతాంశ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః**
67వ శ్లోకము. 649వ నామము. వీరః **– కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః**
(శ్రీ శంకరుల పాఠము ప్రకారము)
70వ శ్లోకము. 64వ నామము. వీరః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరః అనంతో ధనంజయః**

సజ్జనులను బాధించు దుష్టులను తన తిరుగులేని బాణములద్వారా నాశనము చేయువాడు వీరుడు. **విక్రమశాలిత్వాత్ వీరః** – అని శ్రీ శంకరుల భాష్యము.



హనుమంతుని భుజాలపై అధిరోహించి యుద్ధం చేస్తున్న శ్రీరాముడు. కంబోడియా అంగ్కార్ వాట్ కుడ్యశిల్పం. గ్విమెట్ మ్యూజియంలోనిది. వికీపీడియా చిత్రం. Photo by: Jean-Pierre Dalbéra
https://commons.wikimedia.org/wiki/File:L'exposition "Angkor - la naissance d'un mythe" (musée Guimet) (11804234493).jpg

శ్రీ వి.వి. రామానుజన్ వివరణ – వీరత్వము, శౌర్యము, పరాక్రమము అనేవి భగవానుని మహాగుణములు. ఈ మూడు గుణములను భీష్మపితామహుడు 'వీరః' అని స్తుతించెను. వీరత్వము శత్రవుల గుండెలలో కంపనము సృష్టించును. శూరుడు (శౌర్యము గలవాడు) ఏకాకిగానైనను శత్రు సమూహములో చొరబడి వారిని ఛిన్నాభిన్నము చేయును. పరాక్రమశాలి తాను ఇసుమంతయినా గాయపడకుండానే శత్రుసైన్యమును నిర్మీలించును. 'రఘువీర గద్యము' ప్రారంభవచనమే **"జయ జయ మహావీర!"**

భగవంతుని వీరత్వమును ప్రస్తావించే పెక్కు ఉదాహరణలను శ్రీ భట్టులు చెప్పారు.

**వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్**
**గృహీత ధనుషామ్ రామమ్ పాశహస్తమివాంతకమ్** – రామాయణము. అరణ్యాకాండము. 39.14
ప్రతి చెట్టులోనూ నాకు కృష్ణాజినధారియైనవాడు, ధనుస్సును ఎక్కుపెట్టినవాడును, యమపాశములవంటి బాణములను సంధించినవాడును అయిన రాముడే కనిపిస్తున్నాడు. అని మారీచుడన్నాడు.

రాముడి పేరు వినేటప్పటికి మారీచుని ఒడలు నీరుకారి వాడిమొగంలో ప్రేతకళ వచ్చేసింది. పెదవులెండిపోయాయి. నిలువుగ్రుడ్లు పడిపోయాయి. భయంతో కొయ్యబారిపోయాడు. (బ్రహ్మశ్రీ కొంపెల్ల వెంకటరామశాస్త్రి రచన – వాల్మీకి రామాయణం. సరళసుందర వచనము – నుండి)

**రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ**

**రత్నాని చ రథాశ్చైవ విత్రాసం జనయంతి మే**

రత్నాలు, రథము – ఇలా 'ర'తో మొదలయ్యే ఏ పదం విన్నా నాకు రాముడే గుర్తువచ్చి కంపనం కలుగుచున్నది.

**మాతంగ ఇవ సింహేన గరుడేనేవ పన్నగః**

**అధిభూతోऽభవ భవద్రాజా రాఘవేణ మహాత్మనా** – యుద్ధకాండము. 60.2

**బ్రహ్మదండ ప్రకాశానామ్ విద్యుత్ సదృశ వర్చసామ్**

**స్మరన్ రాఘవ బాణానామ్ వివ్యతే రాక్షసేశ్వర** – యుద్ధకాండము. 60.3

కోదండపాణి ప్రకాశహీనుడైన లంకేశ్వరునితో – రావణా! నువ్వు మహాభయంకరమైన యుద్ధం చేశావు. ప్రస్తుతం నువ్వు బాగా అలసియున్నావు కనుక, నిన్నిప్పుడు వధించక విడిచిపెడుతున్నాను. నేను అనుమతిస్తున్నాను. లంకలోకి వెళ్ళి అలసట తీర్చుకో. అప్పుడు నా బలం ఏపాటిదో చూడగలవు – అని హెచ్చరించి పంపేశాడు. రావణుడు అంతఃపురంలో ప్రవేశించి చాలాసేపు దుఃఖించాడు. సింహాన్ని చూసిన ఏనుగులాగా, గరుత్మంతుని చూచిన నాగుపాములాగా, అయోధ్యరాముణ్ణి తలచి రావణుడు వ్యాకులచిత్తుడైపోయాడు. బ్రహ్మాస్త్రాలవంటీ, మెరుపుతీగలవంటీ రామబాణాలు గుర్తుకొస్తే చాలు అతను గడగడలాడిపోయాడు. (బ్రహ్మశ్రీ కొంపెల్ల వెంకటరామశాస్త్రి రచన – వాల్మీకి రామాయణం. సరళసుందర వచనము – నుండి)

ఇంకా శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధాలనుండి చాలా ఉదాహరణలు చెప్పారు – పెరుమాళ్ తిరుమొళి 10.1, 10.3, సిరియ తిరుమడాల్, తిరుప్పావై మొదలగునవి. తిరుప్పావై 13వ పాశురములో గోదామాత 'రావణుని పది తలలను గిల్లివేసినవాడు' అని శ్రీరాముని వర్ణించినది. 'యుద్ధసమయములో ఖరదూషణులకు నరకము చూపినాడు' అని తిరుమంగై సిరియతిరుమడల్ లో రాముని స్తుతించిరి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ శ్రుతులనుండి చెప్పిన ప్రమాణములు –

**శృణ్వే వీరో విందమానో వసూని మహద్దేవానామ్ అసురత్వమేకమ్** – ఋగ్వేదము 3.55.10

**స ఘా వీరో న రిష్యతే యమింద్రో బ్రహ్మణస్పతిః సోమో హినోతి మర్త్యమ్** – ఋగ్వేదము 2.28.4

శ్రీ రాధాకృష్ణశాస్త్రి 'వీర' శబ్దమును చక్కని పదములలో వర్ణించారు (మూలమును చెప్పలేదు) –

**యస్మాత్ స్వమహిమ్నా సర్వాన్ లోకాన్ సర్వాన్ దేవాన్ సర్వానాత్మనః సర్వాణి భూతాని విరమతి విరామయతి, అజస్రమ్ సృజతి విసృజతి వాసయతి, యతో వీరః కర్మణ్యః సుదృక్షో యుక్తగ్రావ జాయతే దేవకామః తస్మాత్ ఉచ్యతే వీరమ్ ఇతి** – ఆయనను ఎదిరించ శక్యము కాదు. జయించ సాధ్యము కాదు. ఆయన బలపరాక్రమములు స్వయంప్రకాశమానములు. శత్రునాశకములు. కనుక ఆయన వీరుడు.

## **403.** శక్తిమతాం శ్రేష్ఠః

- శక్తిమంతులైనవారిలోకెల్ల శక్తిగలవాడు.
- శక్తిమంతులైన దేవతలచే కొనియాబడువాడు.

### ఓం శక్తిమతాం శ్రేష్ఠాయ నమః

**శక్తిమతామపి శక్తిమతత్వాత్ శక్తిమతాం శ్రేష్ఠః** – శక్తిమంతులైనవారికంటె శక్తిమంతుడు, ఉత్తముడు, ప్రథముడు.

**సురాదీనాం శక్తిమతాం యః ప్రశస్యత మస్స్మృతః తస్మాచ్ఛక్తిమతాం శ్రేష్ఠః దశార్ణ శ్రేష్ఠదోమనుః -** శక్తిమంతులైన వారిచేత, దేవతలచేత కొనియాడబడువాడు. బ్రహ్మాదులకు కూడ శక్తిని ప్రసాదించువాడు. ఇంద్రాది దేవతలు రక్షణకొరకు ఆయనను శరణుజొచ్చెదరు. ఈ నామము దశాక్షరీమంత్రము. శ్రేష్ఠమైనవానినిచ్చును. ఓం శక్తిమతాంశ్రేష్ఠాయ నమః.

పరశురాముడు శ్రీరామునితో ఇట్లనెను – **అక్షయం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్** (రామాయణము. బాలకాండము. 76.17) – రామా! నీవు అక్షయుడవు. మధుసూదనుడవు అని తెలిసికొనుచున్నాను. సురేశ్వరుడవు నీవే.

శ్రీభట్టులు హనుమంతుడు రావణునితో చెప్పిన పలుకుల నుదాహరించారు (సుందరకాండము 51-40, 41, 42, 43, 44, 45. గీతాప్రెస్ వారి ప్రచురణ – అనువాదం. డా. యం. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకట్రామయ్య) –

మహాయశస్వియైన శ్రీరామచంద్రుడు రుద్రునివలె సమస్తలోకములను సంహరింపగలడు. పంచభూతాత్మకములైన చరాచరములతో నిండినవాటినన్నింటిని మఱల అదేవిధముగా క్షణకాలములో సృష్టింపగలడు. దేవతలలో, అమరులలో, నరేంద్రులలో, యక్షులలో, రాక్షసులలో, విద్యాధరులలో, సమస్త గంధర్వులలో, నాగులలో, సిద్ధులలో, కిన్నరులలో, పక్షులలో, సకల ప్రాణులలో ఎవ్వరును విష్ణుతుల్య పరాక్రముడైన శ్రీరాముని ఎదిరించి, యుద్ధము చేయుటకు ఏ విధముగనైనను, ఎచ్చటనైనను, ఏ కాలమునందైనను సమర్థులు గారు. సకల లోకములకు ప్రభువు, రాజశ్రేష్ఠుడు ఐన శ్రీరామునియెడ ఈ విధముగా ఘోరమైన అపరాధము గావించి, ఇక నీవు జీవించియుండుట అసాధ్యము.

**దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేంద్ర - గంధర్వ విద్యాధర నాగయక్షాః**
**రామస్య లోకత్రయ నాయకస్య -స్థాతుం న శక్తా స్సమరేషు సర్వే**
ఓ రాక్షసరాజా! దేవతలు, దైత్యులు, గంధర్వులు, విద్యాధర, నాగ, యక్షులు మొదలైనవారు విడివిడిగా గాని, కలిసి గాని ముల్లోకాధిపతియైన శ్రీరామునకు ఎదురుగా యుద్ధములయందు నిలువజాలరు. సమరమున శ్రీరామునిచేతిలో చావుమూడినవానిని స్వయంభువు, చతుర్ముఖుడు ఐన బ్రహ్మగాని, త్రినేత్రుడు, త్రిపురాంతకుడు ఐన రుద్రుడుగాని, మహైశ్వర్య సంపన్నుడు, సురపతియు ఐన దేవేంద్రుడు గాని రక్షింపజాలరు.

## 404. ధర్మః

- మూర్తీభవించిన ధర్మస్వరూపుడు.
- సర్వమును ధరించువాడు.

### ఓం ధర్మాయ నమః

ధృజ్ – ధారణే – **ధారయతి ఇతి ధర్మః** – ధరించునది ధర్మము. **ధార్యతే వా యేన జగత్ ఇతి ధర్మః** – ఎవరిచే జగత్తు ధరించబడినదో (నిలుపబడినదో) అతడే ధర్మము. అని శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామము అర్థమును వివరించారు.

శ్రీ భట్టుల వివరణ – అందరికీ ఐశ్వర్యమును, మోక్షమును ప్రసాదించి వారిని ధరించువాడు గనుక భగవానుడు ధర్మము. యుద్ధకాండములో బ్రహ్మదేవుడు శ్రీరామునిగూర్చి ఇలా చెప్పాడు – **లోకానామ్ త్వమ్ పరమో ధర్మః** – సమస్త లోకములకును నీవు పరమధర్మమువు. మహాభారతములో – **సాక్షాత్ దేవః పురాణోఽసౌ సహి ధర్మః సనాతనః** – ఆయనే పురాణ దేవుడు. సనాతన ధర్మము.

**యే చ వేదవిదో విప్రాః యే చ అధ్యాత్మవిదో జనాః**

**తే వదన్తి మహాత్మానమ్ కృష్ణమ్ ధర్మమ్ సనాతనమ్**

వేదవిదులైన బ్రాహ్మణులు, బ్రహ్మజ్ఞానము తెలిసినవారు మహాత్ముడైన కృష్ణుడే సనాతనుడు, ధర్మము అని చెప్పుదురు.

శ్రీ వి.వి. రామానుజన్ వివరణ – అరణ్యకాండములో మారీచుడు రాముని గురించి ఇలా చెప్పాడు. రాముడు మూర్తీభవించిన ధర్మము. **రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః రాజా సర్వస్య లోకస్య దేవానామివ మానవః**

అండాళ్ తల్లి నాచియార్ తిరుమోళిలో భగవంతునిపై తనకున్న చనువు కారణంగా ఆయనను **'ధరుమామ్ అఱియాక్ కురుంబన్'** అని సంబోధించినది.

'ధర్మము' అనే పదము భావమును శ్రీ చిన్మయానంద మరింత విస్తారంగా చర్చించారు. దేని కారణముచేత ఒక పదార్థము నిలిచియుండునో (ఉనికి కలిగియుండునో) అది ఆ పదార్థ ధర్మము. ఉదాహరణకు తీయగా నుండుట పంచదార ధర్మము. వేడిగానుండుట నిప్పు ధర్మము. ఆయా ధర్మములు లేనియెడల ఆయా పదార్థములకు ఉనికియుండదు. అలాగే సకల జీవులకు ధర్మము ఆత్మ (ఆత్మ లేనిచో జీవుడు ఉండుట అసంభవము). అటువంటి ఆత్మలన్నీ పరమాత్ముని వలననే ఉనికి కలిగియుండును. కనుక భగవంతుడు పరమధర్మము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **ధర్మో రక్షతి రక్షితః, ధర్మయేవ హతోహన్తి.** ధర్మము మార్గమునకు ఇరువైపులా ఉండే హద్దువంటిది. హద్దులలోపల మార్గాన్ని అనుసరించేవారు గమ్యాన్ని చేరుతారు. హద్దుమీరినవారు ప్రమాదాల పాలౌతారు. అలాగే భగవంతుడు ధర్మబద్ధులను కాపాడుతాడు. ధర్మసంస్థాపనకై యుగయుగమున అవతరిస్తాడు. ధర్మచక్రము రచయిత ఈ విషయముపై పెక్కు ఉదాహరణలిచ్చారు. ధర్మమును నమ్ముకొన్న హరిశ్చంద్రునకు, పాండవులకు భగవంతుడు అండ. ధర్మమును అతిక్రమించిన రావణునకు, దుర్యోధనునకు నాశనము తప్పలేదు. ధర్మము తెలిసినవాడైన భీష్ముడు దుర్యోధనుని పక్షాన ఉన్నాగాని ధర్మరాజుదే అంతిమవిజయం. విభీషణుని ధర్మబోధను తిరస్కరించిన రావణుడు తన అధర్మకార్యాలకు బలికాక తప్పలేదు. ఈ పుణ్యధర్మనామస్మరణ చేయువారికి భగవంతుని రక్షణ తప్పక లభిస్తుంది.

## 405. ధర్మవిదుత్తమః

- ధర్మము తెలిసినవారిలో శ్రేష్ఠుడు.
- ధర్మశాస్త్రములను ప్రసాదించినవాడు.

### ఓం ధర్మవిదుత్తమాయ నమః

ధర్మ-విత్-ఉత్తమః – ధర్మము తెలిసినవారిలో ఉత్తముడు.

శ్రీ భట్టుల వివరణ – వశిష్ఠుడు, వామదేవుడు, మార్కండేయుడు వంటి గురూత్తములు కూడ ధర్మసందేహ నివృత్తి కోసం శ్రీరామునిపై ఆధారపడిరి. ధర్మవిదులలో ఉత్తముడనుటకు ఇంతకంటె వివరణ అవుసరం లేదు.

శ్రీ శంకరుల వివరణ – స్మృతులవంటి ధర్మశాస్త్రములు భగవంతుని ప్రసాదములు. కనుక ఆయనకంటె బాగా ధర్మము తెలిసినవారు లేరు. **శృతి స్మృతి మమైవాఽజ్ఞే** (విష్ణుధర్మోత్తరము 76.31).

ధర్మచక్రము రచయిత – ధర్మమేదో, ధర్మము కానిదేదో తెలిసికొనుట సులభము కాదు. శ్రీమహావిష్ణువును ధ్యానించుటవలన ధర్మాధర్మ విచక్షణ లభించును. అందుకు నిర్మలమైన మనస్సు అత్యవసరము. ఇదే సంగతి తిరుక్కురల్ లో చెప్పబడినది – **మనత్తుక్ క్కాణ్ మాశిలన్ ఆదల్ అనైత్తు అఱన్.**

## శ్రీసుందరకాండము సంక్షిప్త కథ.

కిష్కింధ కాండ చివరిలో సీతాన్వేషణానికై దక్షిణదిశకు బయలుదేరిన బృందం ఎలాగో సాగర తీరానికి చేరుకొన్నారు. నూరు యోజనాల అవతల రావణుని నగరం లంకలో సీత ఉండవచ్చునని సంపాతి ద్వారా తెలుసుకొన్నారు. కాని సాగర తరణం సాధ్యమయ్యేది ఎలాగని హతాశులయ్యారు. జాంబవంతుని ప్రేరణతో సాగరాన్ని తాను గోష్పాదం లాగా లంఘించగలనని హనుమంతుడు సన్నద్ధుడయ్యాడు. అక్కడినుండి సుందరకాండ కథ మొదలౌతుంది.

### శ్రీ హనుమంతుని సాగర తరణం

హనుమంతుడు పర్వత సమానంగా దేహాన్ని పెంచి, సాగరాన్ని దాటడానికి సన్నద్ధుడై మహేంద్రగిరిపైకి ఎక్కాడు. సూర్యునికి, ఇంద్రునికి, బ్రహ్మకు, భూతకోటికి నమస్కరించాడు. పిక్కలు బిగబట్టి, చేతులు అదిమి, ఒక్కుదుటున లంఘించాడు. ఆ అదురుకు పర్వతం బీటలు వారింది. ఆకాశంలో మేఘంలా, విడచిన రామబాణంలా, హనుమంతుడు వేగంగా లంకవైపుకు వెళ్ళసాగాడు.

రామ కార్యానికి సహాయపడదలచి, దారిలో మైనాకుడనే పర్వతం తనపై విశ్రాంతి తీసికోమని కోరాడు. ఆ ఆతిథ్యాన్ని వినయంతో తిరస్కరించి హనుమంతుడు ముందుకు సాగాడు. సురస అనే నాగమాత హనుమను పరీక్షింపదలచి, మృత్యుగహ్వరంలాంటి తన నోరు తెరచి అతని దారికి అడ్డు నిలచింది. యుక్తిగా ఆమె నోట ప్రవేశించి, మళ్ళీ బయటకు వచ్చి, ఆమె ఆశీర్వచనం పొంది హనుమంతుడు ముందుకు సాగాడు. సింహిక అనే ఛాయాగ్రాహక రాక్షసి హనుమంతుని నీడను పట్టి లాగసాగింది. హనుమంతుడు శరవేగంతో దాని కడుపులో దూరి, కడుపును చీల్చి వేసి, అప్రతిహతంమైన రామబాణంలా లంకలోని త్రికూటగిరి శిఖరంపై వాలాడు.

### లంకా నగర ప్రవేశం

దూరంనుండి లంకానగరం శోభను, సౌందర్యాన్ని, సురక్షిత వ్యవస్థను చూసి హనుమంతుడు ఆశ్చర్యపోయాడు. చీకటి పడిన తరువాత చిన్నపాటి దేహం దాల్చి నగరంలో ప్రవేశించబోయాడు. ద్వారం వద్ద లంకా నగరాధిదేవత లంకిణి అతనిని అడ్డగించిండి. హనుమంతుడు ఆమెను దండించాడు. అతడు కారణజన్ముడనీ, బ్రహ్మ చెప్పిన విధంగా లంకకు కీడు వాటిల్లనుందనీ లంకిణి గ్రహించింది. ద్వారం గుండా కాకుండా ప్రాకారాన్ని లంఘించి, ఎడమ కాలు ముందుంచి, హనుమంతుడు మయుని అపూర్వ సృష్టియైన లంకలో ప్రవేశించి, సీతను వెదుకసాగాడు. ఆ సమయంలో చంద్రోదయం జరిగి, లంకానగరం మరింత శోభాయమానం అయింది.



సుందరకాండ కథలో కొన్ని చిత్రాలు. హనుమంతుని సాగర లంఘునం, సీతా దర్శనం, లంకా దహనం

1800 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File:Hanuman_Visits_Sita_in_Lanka,_Folio_from_a_Ramayana_(Adventures_of_Rama)_LACMA_M.72.11.jpg

**అంతఃపురంలో సీతాన్వేషణ**

చిన్న శరీరము ధరించి, హనుమంతుడు రావణుని మందిరములోనూ, పానశాలలోనూ, పుష్పక విమానములోనూ .. అన్నిచోట్లా సీతను వెదకాడు. రాత్రి వేళ రావణుని మందిరంలో కాంతలు భోగ లాలసులై, చిత్ర విచిత్ర రీతులలో నిద్రిస్తూ ఉన్నారు. ఆ దృశ్యాలను చూచి కలవరపడిన హనుమంతుడు, తాను రామ కార్యాచరణ నిమిత్తం ఏ విధమైన వికారాలకూ లోను గాకుండా సీతాన్వేషణ చేస్తున్నందున తనకు దోషం అంటదని, తన బ్రహ్మచర్య దీక్షకు భంగం వాటిల్లదని సమాధానపడ్డాడు. పుష్పక నిమానం అందాన్ని, రావణుని ఐశ్వర్యాన్ని చూసి అబ్బురపడ్డాడు. నిద్రించుచున్న స్త్రీలలో మండోదరిని చూచి సీత అని భ్రమించాడు. మరల తప్పు తెలుసుకొని అన్వేషణ కొనసాగించాడు. సీతమ్మ జాడ కానక చింతించాడు. ఏమిచేయాలో తోచలేదు. ఊరకే వెనుకకు మరలి అందరినీ నిరాశపరచడానికి ఇష్టం లేదు. తన కార్యం విఫలమైతే సుగ్రీవుడు, రామ లక్ష్మణులు, మరెందరో హతాశులౌతారని వగచాడు. ఆత్మహత్య గురించి కూడా ఆలోచించాడు. సీత కనుపించకుండా తాను వెనుకకు వెళ్ళేది లేదని నిశ్చయంచుకొన్నాడు. ఆ సమయంలో అశోక వనం కనిపించింది.

**"నమోస్తు రామాయ సలక్ష్మణాయ, దేవ్యైచ తస్యై జనకాత్మజాయై, నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో, నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః"** అని ప్రార్థించాడు. దేవతలు, మహర్షులు తనకు కార్య సాఫల్యత కూర్చవలెనని కోరాడు. బ్రహ్మ, అగ్ని, వాయుదేవుడు, ఇంద్రుడు, వరుణుడు, సూర్య చంద్రులు, అశ్వినీ దేవతలు, మరుత్తులు, శివుడు, సకల భూతములు, శ్రీమహావిష్ణువు తనకు కార్యసిద్ధి కలిగించవలెనని ప్రార్థించి సీతాన్వేషణకై అశోకవనంలో అడుగుపెట్టాడు.

**అశోకవనంలో సీతమ్మ దర్శనం**

అశోకవనం అనన్య సుందరమైనది. అందులో చక్కని వృక్షాలు, పూలు, చిత్ర విచిత్రములైన కృతక పర్వతాలు, జలధారలు ఉన్నాయి. మణిమయాలైన సరస్సులున్నాయి. అద్భుతమైన చైత్య ప్రాసాదములున్నాయి. వాటిలో అతి మనోహరమైన ఒక శింశుపా వృక్షాన్ని ఎక్కి హనుమంతుడు చుట్టుప్రక్కల పరిశీలింపసాగాడు.

అక్కడ శింశుపా వృక్షము క్రింద, రాక్షసకాంతలచే పీడింపబడుతూ, సింహముల మధ్యనున్న లేడివలే భీతయై కృశించిన ఒక స్త్రీని చూచాడు. ఆమె ఏకవస్త్రయై, ధూమావృతమైన అగ్ని శిఖవలె, మిధ్యాపవాదువలన భంగపడిన కీర్తివలె, మేఘాచ్ఛాదితమైన చంద్రబింబంవలె ఉంది. ఆమె ధరించిన ఆభరణాలు, ఆమె తీరు, ఉన్న స్థితిని బట్టి హనుమంతుడు '''ఈమె సీతయే''' అని నిర్ధారించుకొన్నాడు. ఆమె దీనావస్థను, రామలక్ష్మణాదుల దుఃఖమును తలచుకొని, కాలం ఎంతటివారికైనా అతిక్రమింపరాని బలీయమైనది అనుకొని, హనుమంతుడు దుఃఖించాడు.

**త్రిజటాస్వప్నం**

అక్కడికి కామాతురుడైన రావణుడు వచ్చి సీతను బెదరించి, తనకు వశముకావలెనని ఆదేశించాడు. సీత ఒక గడ్డిపరకను అడ్డముగా పెట్టుకొని, రావణుని ధర్మహీనతను, భీరత్వాన్ని నిందించింది. పోగాలము దాపురించినందువల్లనే ఈ నీచ సంకల్పము అతనికి కలిగిందని హెచ్చరించింది. శ్రీరాముని బాణాగ్నితో లంక భస్మమగుట తథ్యమని రావణునకు గట్టిగా చెప్పినది. ఒక నెల మాత్రము గడువు పెట్టి రావణుడు వెళ్ళిపోయాడు. రాక్షసకాంతలు సీతను నయానా, భయానా అంగీకరింపచేయాలి అని ప్రయత్నించ సాగారు. రావణునికి వశం కాకపోతే ఆమెను తినేస్తామని బెదరించారు. భయ విహ్వలయై, ఆశను కోల్పోయిన సీత ప్రాణత్యాగం చేయాలని నిశ్చయించుకొన్నది.

వారిలో సహృదయయైన త్రిజట అనే రాక్షసకాంత మిగిలిన రాక్షస స్త్రీలను గద్దించి, సీతవంటి పుణ్యస్త్రీకి హాని చేయడం రాక్షస జాతికి వినాశకరమని హెచ్చరించింది. తనకు వచ్చిన కలలో ఇలా జరిగిందని చెప్పింది - "వేయి హంసలు పూన్చిన తెల్లని ఏనుగుదంతపు పల్లకీలో రామలక్ష్మణులు లంకకు వచ్చారు. తెల్లని పర్వతాగ్రంపై సీత ఆసీనయై ఉంది. ఆమె సూర్య చంద్రులను స్పృశించింది. నాలుగు దంతాలు కలిగిన తెల్లని ఏనుగు నెక్కి, రాముని ఒడిలో సీత కూర్చుని ఉంది. సీతారామలక్ష్మణులు అధివసించిన భద్రగజం ఆకాశంలో లంకపైభాగాన నిలిచింది. ఎనిమిది వృషభములు పూన్చిన రథంపై రాముడు తెల్లని వస్త్రాలతో, సీతా లక్ష్మణులతో లంకలో కనిపించాడు. తరువాత, వారంతా పుష్పకం ఎక్కి ఉత్తర దిశగా వెళ్ళారు.

"ఎర్రని వస్త్రములు ధరించి, తైలము పూసుకొని రావణుడు మత్తిల్లి, పుష్పకంనుండి క్రింద పడ్డాడు. గాడిదలు పూన్చిన రథంలో ఉన్నాడు. అతని మెడలో త్రాడు కట్టి, నల్లని వస్త్రములు ధరించిన ఒక స్త్రీ దక్షిణానికి లాగుచున్నది. అతడు దుర్గంధ నరక కూపంలో పడిపోయాడు. రావణుడు పందినెక్కి, కుంభకర్ణుడు పెద్ద ఒంటెనెక్కి, ఇంద్రజిత్తు మొసలినెక్కి దక్షిణ దిశగా పోయారు. విభీషణుడు మాత్రం తెల్లని గొడుగుతో, దివ్యాభరణాలతో, తెల్లని గజం అధిరోహించి, మంత్రులతో కూడి ఆకాశంలో ఉన్నాడు. లంకా నగరం ధ్వంసమై సముద్రంలో కూలింది. రాక్షస స్త్రీలంతా తైలము త్రాగుచు, పిచ్చివారివలె లంకలో గంతులు వేయుచున్నారు."

ఇలా చెప్పి త్రిజట తమను ఆపదనుండి కాపాడమని సీతాదేవిని వేడుకొనమని తక్కిన రాక్షస కాంతలకు హితవు పలికింది. భయంకరమైన ఆ కల విని రాక్షసకాంతలు భీతిల్లారు. ఆత్మహత్యకు సిద్ధపడిన సీతకు శుభ శకునములు కనిపించసాగాయి..

## శ్రీరామ వర్ణన

చెట్టుపైనుండి ఇదంతా గమనించిన హనుమంతుడు ఇంక ఆలస్యము చేసినచో సీత ప్రాణత్యాగము చేయగలదని ఊహించాడు. కాని ఒక్కమారుగా ఆమెకు కనిపించినట్లయితే ఆమె ఖంగారుపడి కేకలు వేయవచ్చనీ, అలాగయితే అసలు పని చెడుతుందని భావించాడు. చెట్టుపైనుండి మెల్లగా దశరథ కుమారుడైన రాముని కథ చెప్పనారంభించాడు. ఆ రాముడు సీతను వెదకడానికి పంపిన దూతలలో ఒకడైన తాను ప్రస్తుతం లంకను చేరి, చెట్టుపైనుండి, సీతను చూచానని ఆ కథాక్రమంలో తెలియజేశాడు. ఆ రామకథా శ్రవణంతో సీత కొంత ఆనందించింది. కానీ తాను కలగంటున్నానేమోనని భ్రమ పడింది. తల పైకెత్తి, మెరుపు తీగవలె, అశోక పుష్పము వలె ప్రకాశిస్తున్న వానరుని చూచి కలవరపడింది. తాను విన్న విషయాలు సత్యాలు కావాలని బ్రహ్మకు, మహేంద్రునికి, బృహస్పతికి, అగ్నికి నమస్కరించింది. హనుమంతుడు మెల్లగా చెట్టు దిగివచ్చి ఆమెకు శుభం పలికాడు. సీతకు తన వృత్తాంతమునూ, రాముని దుఃఖమునూ వివరించాడు. శ్రీరాముని పరాక్రమాన్నీ, గుణగణాలనూ ప్రశంసించి ఆమెకు త్వరలో విముక్తి కలుగుతుందని అనునయ వచనాలు పలికాడు. సీత దుఃఖించి, అందరి క్షేమసమాచారములు అడిగి, ఆపై రాముని వర్ణించమని కోరింది.




1940 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.

By MV Sharma
printed by Anant Shivaji Desai
https://commons.wikimedia.org/wiki/File:Hanuman_finds_Sita_in_the_ashoka_grove,_and_shows_her_Rama%27s_ring.jpg

హనుమంతుడు భక్తితో అనన్య సుందరుడు అయిన రాముని, అతని సోదరుడైన లక్ష్మణుని వర్ణించాడు. "రాముడు ఆజానుబాహుడు. కమల పత్రాక్షుడు. రూప దాక్షిణ్య సంపన్నుడు. శుభలక్షణములు గలవాడు, తేజోమూర్తి, ధర్మ రక్షకుడు, సర్వ విద్యాపారంగతుడు, లోకమర్యాదలను పాటించువాడు. సమ విభక్తములైన శరీరాంగములు కలవాడు. దీర్ఘములైన బాహువులు, శంఖమువంటి కంఠము, కండరములతో మూసుకొనిపోయిన సంధి యెముకలు కలవాడు. మూడు దృఢమైన స్థానములు, మూడు దైర్ఘ్యముగల అవయవములు, మూడు సమ అవయవములు, మూడు ఎత్తైన అవయవములు కలవాడు. పదునాలుగు సమమైన అవయవములు కలవాడు. నాలుగు విధములైన నడక గలవాడు. ఉత్తముడు, వీరుడు. నల్లనివాడు. అతని తమ్ముడు లక్ష్మణుడు అట్టి శుభలక్షణములే కలిగి, ఎర్రని మేని ఛాయ గలవాడు - అట్టి రామలక్ష్మణులు నీకై పరితపించుచున్నారు. సుగ్రీవునితో చెలిమి జేసి, నిన్ను వెదకుటకై నలుతెరగుల వానరులను పంపియున్నారు. ఓ సీతా దేవీ! త్వరలోనే శ్రీరాముడు నిన్ను ఇచటనుండి తీసికొని పోనున్నాడు" - అని హనుమంతుడు చెప్పాడు.

శ్రీరాముని గురించి విని, సీత ఊరడిల్లింది. తరువాత హనుమంతుడు ఆమెకు శ్రీరాముని ఆనవాలైన అంగుళీయకమును ఇచ్చాడు. రాముడు చెప్పిన మాటలు తెలియజేశాడు. ఆమెకు శుభం పలికాడు. తనతో వస్తే ఆమెను తీసికొని వెళ్ళగలనని కోరాడు. సీత హనుమంతుని పలుకులకు సంతోషించి అతని పరాక్రమాన్ని ప్రశంసించింది. కాని స్వయంగా శ్రీరాముడే వచ్చి, రావణుని పరిమార్చి, తనను తీసికొని వెళ్ళాలని చెప్పింది. రాముని పరాక్రమానికి ముల్లోకాలలోను ఎదురు లేదని తెలిపింది. రామలక్ష్మణులకు,

సుగ్రీవునకు, భల్లూక వానరులకు ధర్మక్రమ మనుసరించి కుశలం అడిగినట్లు తెలుపమని పలికింది. హనుమంతుని ఆశీర్వదించి, తన చూడామణిని ఆనవాలుగా ఇచ్చినది. ఒక్క నెలలో రాముడు తనను కాపాడకున్న తాను బ్రతుకనని చెప్పినది. ఆ మహాంబుధిని దాటడం (హనుమంతుడు, వాయుదేవుడు, గరుత్మంతుడు తప్ప) ఇతరులకు ఎలా శక్యమని సంశయించింది.

అందుకు హనుమంతుడు తనకంటే గొప్పవారైన మహావీరులు వానరులలో ఎందరో ఉన్నారని, తాను సామాన్యుడను గనుకనే ముందుగా తనను దూత కార్యానికి (యుద్ధానికి కాదు) పంపారని ఆమెకు నచ్చచెప్పాడు. మహావీరులైన రామలక్ష్మణులు కపి భల్లూక సేనా సమేతంగా, త్వరలో లంకకు వచ్చి సూర్య చంద్రుల వలె, అగ్ని వాయువులవలె లంకను వాశనం చేసి రావణ సంహారం సాగించడం తథ్యమని ఆమెను అనునయించాడు.  హనుమంతుని సీతమ్మ ఆశీర్వదించింది.



ఆంగుళి ప్రదానము. 1801-5 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Sita_accepting_a_jewel_from_Hanumana_sent_by_Rama,_1800s.jpg

### రాక్షసులను దండించడం

సీతా దర్శనంతో సంతుష్టుడైన హనుమంతుడు ఇక పనిలో పనిగా రావణునితో భాషింపవలెననీ, లంకను పరిశీలింపవలెననీ నిశ్చయించుకొన్నాడు. అలా చేయడం వల్ల రావణుని హెచ్చరించడానికీ, లంక రక్షణా వ్యవస్థను తెలుసుకోవడానికీ వీలవుతుంది. అంతే గాకుండా ఆ ప్రయత్నంలో లంకకు వీలయినంత నష్టం కలిగించవచ్చును. ఇలా సంకల్పించిన హనుమంతుడు వెంటనే ఉగ్రాకారుడై వనమునూ, అడ్డు వచ్చిన వేలాది రాక్షసులనూ ధ్వంసం చేసి మకరతోరణాన్ని అధిష్ఠించి కూర్చున్నాడు.

ఆ కపిని బంధించమని రావణుడు ఎనుబదివేల మంది సైన్యాన్ని పంపాడు. హనుమంతుడు - **"జయత్యతిబలో రామో, లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవో, రాఘవేణాభిపాలితః, దాసోహం కోసలేంద్రస్య, రామస్యా క్లిష్ట కర్మణః, హనుమాన్ శత్రు సైన్యానాం నిహన్తా మారుతాత్మజః"** అని జయఘోష చేశాడు - "మహా బలవంతుడైన శ్రీరామునకు జయము.  మిక్కిలి పరాక్రమశాలియైన లక్ష్మణునకు జయము. రాఘవుల విధేయుడైన కిష్కింధ ప్రభువు సుగ్రీవునకు జయము. నేను శ్రీరామ దాసుడను, వాయుపుత్రుడను, హనుమంతుడను. శత్రు సైన్యాన్ని నాశనం చేస్తాను. వేయి మంది రావణులైనా యుద్ధంలో నన్నెదిరించలేరు. వేల కొలది శిలలతోను, వృక్షాలతోను సకల రాక్షసులను, లంకాపురిని  నాశనం చేస్తాను. నా పని ముగించుకొని, సీతమ్మకు నమస్కరించి వెళతాను. రాక్షసులు ఏమీ చేయలేక చూచుచుందురు గాక" - ఇలా గర్జిస్తూ హనుమంతుడు ముఖద్వారానికి బిగించిన ఇనుప గడియతో రాక్షసులనందరినీ చావగొట్టాడు. పర్వతాకారంలో దేహాన్ని పెంచి,  చైత్య ప్రాసాదాన్ని కూలగొట్టి,  ఆ ప్రాసాదము యొక్క ఒక పెద్ద స్తంభాన్ని పరిఘలా త్రిప్పుతూ అందరినీ చావగొట్టాడు.

అప్పుడు రావణుడు, ప్రహస్తుని కుమారుడు మహా బలశాలీ అయిన జంబుమాలిని పంపాడు. హనుమంతుని చేతి పరిఘతో జంబుమాలి శరీరం చూర్ణమయ్యింది. ఆపై అగ్నివలె తేజరిల్లే యుద్ధవిద్యా నిపుణులైన ఏడుగురు మంత్రి పుత్రులు పెద్ద సేనతో కలిసి హనుమంతునిపై దండెత్తారు. హనుమంతుడు భయంకరంగా గర్జించి కొందరిని అఱచేతితోను, కొందరిని ముష్టిఘాతాలతోను, కొందరిని తన వాడిగోళ్ళతోనూ చంపగా యుద్ధ భూమి అంతా శత్రువుల రక్త మాంసాలు చెల్లాచెదరయ్యాయి. పిమ్మట విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అనే గొప్ప సేనా నాయకులు తమ సేనలతో వచ్చి వన ముఖ ద్వారంపై కూర్చున్న హనుమంతునిపై విజృంభించారు. వారంతా కూడా హనుమ చేత నిహతులైపోయారు. రణ భూమి అంతా రాక్షస, వాహన కళేబరాలతోను, ఆయుధ, రథ శకలాలతోను నిండిపోయింది.

ఇక దుర్ధరమైన ప్రతాపశాలి, వర సంపన్నుడు, గొప్ప రథము కలవాడును అయిన అక్షకుమారుడు సకలబలములతో హనుమంతుని సమీపించాడు. వారి మధ్య జరిగిన యుద్ధం సురాసురులను సంభ్రమపరచింది. వర్షంలాంటి అక్షకుమారుని బాణాలు హనుమంతుని చాలా నొప్పించాయి. అతని పరాక్రమానికి హనుమంతుడు ముచ్చటపడ్డాడు. అంతటి పరాక్రమశాలిని, తేజోమయుని చంపడానికి తటపటాయించాడు. కాని అతనిని ఉపేక్షిస్తే తనకు పరాభవం తప్పదని తెలిసికొని హనుమంతుడు విజృంభించాడు. ఆకాశానికెగిరి వాయువేగంతో సంచరిస్తూ అరచేతితో అక్షకుమారుని గుర్రాలను చరచి చంపేశాడు. తరువాత, గరుత్మంతుడు మహా సర్పాన్ని పట్టుకొన్నట్లుగా అక్షకుమారుని కాళ్ళను గట్టిగా చేజిక్కించుకొని, గిరగిర త్రిప్పి నేలకు విసరికొట్టాడు. అక్షకుమారుని శరీరం నుగ్గునుగ్గయ్యింది.

ఈ సంగతి తెలిసిన రావణుడు కలవరపడి, పెక్కు జాగ్రత్తలు చెప్పి, ఇంద్రజిత్తును యుద్ధానికి పంపాడు. ఇంద్రజిత్తు బ్రహ్మవర సంపన్నుడు, ఇంద్రాదులకు కూడా నిలువరింప శక్యంగాని పరాక్రమశాలి, మంత్ర తంత్ర యుద్ధవిద్యానిపుణుడూను. అతడు తండ్రికి నమస్కరించి, రణోత్సాహంతో పొంగిపోతూ, సేనలు లేకుండా ఒకడే దివ్యరథాన్ని అధిరోహించి హనుమంతునిపైకి వెళ్ళాడు. వారిద్దరి మధ్య యుద్ధం చిత్ర విచిత్ర రీతులలో సకల గణాలకు సంభ్రమం కలిగించింది. ఒకరిని ఒకరు జయించడం అశక్యమని ఇద్దరికీ తెలిసిపోయింది. ఇక లాభం లేదు, కనీసం ఆ వానరుని బంధించాలని సంకల్పించి ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అది హనుమంతుని బంధించింది. బ్రహ్మ హనుమంతునకిచ్చిన వరం ప్రకారం ఆ అస్త్రం అతనిని బాధించకుండా మరుక్షణమే తొలగిపోయింది. అయినా బ్రహ్మదేవునిపట్ల గౌరవసూచకంగా ఆ అస్త్రానికి కట్టుబడిపోయినట్లుగా నటించాడు. ఆ విధంగా రావణునితో సంభాషించ దలచాడు. రాక్షస సేనలు హనుమంతుని బంధించి, బాధిస్తూ రావణుని సభా ప్రాంగణానికి తీసుకుపోయారు.

### రావణునితో సంవాదం

బ్రహ్మాస్త్రానికి వశుడైనట్లు నటించి, హనుమంతుడు రావణుని సభాభవనంలో ప్రవేశించి రావణుని చూశాడు. రావణాసురుని సభాప్రాంగణం మణిమయమై శోభిల్లుతున్నది. రావణుని కిరీటం, ఆభరణాలు, వస్త్రాలు, అనులేపనాదులు అత్యద్భుతంగా ఉన్నాయి. మహా తేజశ్శాలియు, వీరుడును ఐన రావణుడు పది శిరస్సులతో ఒప్పుచు, అనేక క్రూర మృగములతో నిండిన శిఖరములు గల మందరగిరి వలె ప్రకాశిస్తున్నాడు. మణిమయాలంకృతమైన ఉన్నతాసనంపై కూర్చొని ఉన్నాడు. మంత్రాంగ నిపుణులైన నలుగురు మంత్రులచే పరివేష్టితుడై కాటుక కొండవలె ఉన్నాడు. అప్పుడు హనుమంతుడు ఇలా అనుకొన్నాడు. - 'ఆహా! ఈ రావణుని రూపం అత్యద్భుతం. ధైర్యం నిరుపమానం. సత్వం ప్రశంసార్హం. తేజస్సు అసదృశం. నిజముగా ఈ రాక్షస రాజు సర్వ లక్షణ శోభితుడు. ఈ అధర్మానికి ఒడి గట్టకపోతే సురలోకానికి సైతం ప్రభువయ్యేవాడు. లోకాలన్నీ ఇతనికి భయపడుతున్నాయి. ఇతడు కృద్ధుడైనచో సమస్త జగత్తునూ సముద్రమున ముంచి ప్రళయం సృష్టించగల సమర్థుడు గదా!'

హనుమంతుడు ఎవరు? ఎందుకు వచ్చాడు? ఎవరు పంపారు? - తెలిసికోమని రావణుడు మంత్రులకు ఆదేశించాడు. హనుమంతుడు రావణునకు ఇలా చెప్పాడు - రాజా! నేను సుగ్రీవుని మంత్రిని. రాముని దూతను. హనుమంతుడనే వానరుడను. నీ కుశలము తెలిసికొమ్మని సుగ్రీవుడు స్నేహ భావంతో చెప్పాడు. రాముని పత్ని సీతను తెచ్చి నువ్వు పెద్ద తప్పిదం చేశావు. దీని వలన నీవు చేసుకొన్న పుణ్యమంతా నిష్ఫలమై పోతుంది. వాలిని రాముడే సంహరించాడు. రాముని బాణాల ధాటికి నీవు గాని, మరెవరు గాని నిలువజాలరు. ఈ అకృత్యం వలన నీకు, లంకకూ చేటు దాపురించింది. రాముడు మానవుడు. నీవు రాక్షసుడవు.

నేను వానరుడను, నాకు పక్షపాతం లేదు. కనుక నా మాట విని సీతను అప్పగించి రాముని శరణు వేడుకో. రాముని క్రోధానికి గురియైనవానిని ముల్లోకాలలో ఎవరూ రక్షింపజాలరు. - అని హితవు చెప్పాడు.

రావణుడు కోపించి ఆ వానరుని చంపమని ఆదేశించాడు. అంతలో విభీషణుడు అడ్డుపడి - దూతను చంపడం రాజ ధర్మం కాదు. అంతే కాకుండా ఇతను తిరిగి వెళ్ళకపోతే నీను శతృవులతో యుద్ధం చేసి వారిని నిర్జించే అవకాశం కోల్పోతావు. కనుక, దండించి వదలమని సూచించాడు. ఆ మాటలకు కాస్త నెమ్మదించిన రావణుడు ఆ వానరుని తోకకు నిప్పంటించి వూరంతా త్రిప్పమని ఆనతిచ్చాడు.

**లంకా దహనం**

రావణుడు ఉగ్రుడై హనుమంతుని తోకకు నిప్పు పెట్టమని ఆదేశించాడు. రాక్షస కింకరులు హనుమంతుని తోకకు పాత గుడ్డలు చుట్టి నిప్పు పెట్టారు. ఊరంతా త్రిప్పసాగారు. ఈ అవకాశం చూసుకొని హనుమంతుడు లంకా నగరాన్ని నిశితంగా పరిశీలించాడు. జరిగిన సంగతి విన్న సీతాదేవి హనుమంతుని చల్లగా చూడమని అగ్నిదేవుని ప్రార్ధించింది. తన తోక కాలుతున్నా గాని ఏ మాత్రం బాధ లేకపోవడం సీతమ్మ మహిమ వలన అని, తన తండ్రి వాయుదేవుని మిత్రుడైన అగ్ని కరుణ వలన అని గ్రహించిన హనుమంతుడు ఆ అగ్నికి లంకను ఆహుతినీయ సంకల్పించాడు. తన బంధాలను త్రెంచుకొని, ఒక పరిఘతో రాక్షస మూకను చావబాదాడు. పైకెగిరి, మండుతున్న సూర్యునిలా విజృంభించాడు. ప్రహస్తుని ఇంటితో మొదలుపెట్టి లంకలోని అద్భుతభవనాలకు నిప్పంటించాడు. ఒక్క విభీషణుని ఇల్లు తప్ప లంకలో భవనాలను బుగ్గి చేశాడు.

అప్పుడు ఒక్కమారుగా సీత సంగతి గుర్తు వచ్చి హనుమంతుడు హతాశుడయ్యాడు. తన తొందరపాటువలన లంకతో పాటు సీతమ్మ కూడా అగ్నికి ఆహుతయ్యిందేమో అన్న ఊహతో విలవిలలాడిపోయాడు. తన చాంచల్యం వలన తన జాతికి, పనికి కీడు తెచ్చినందుకు రోదించి ప్రాణత్యాగానికి సిద్ధమయ్యాడు. కాని సీత క్షేమంగా ఉన్నదని తెలిసి, ఊరట చెందాడు. మరొక్కమారు సీతను దర్శించి, ఆమెకు సాంత్వన వచనాలు పలికి, రాముడు సకల వానరసేనతో త్వరలో రాగలడని అభయం పలికాడు. ఆమెకు ప్రణమిల్లి, తిరిగి ఉత్తరదిశకు బయలుదేరాడు.

ఇలా హనుమంతుడు రాముని దూతగా సాగరాన్ని లంఘించి, సీతను కనుగొని, రాక్షసులను సంహరించి, లంకను భయభ్రాంతమొనర్చి, రావణుని మదమణచి, సీతకు సాంత్వన కూర్చి, తిరుగు ప్రయాణానికి అరిష్టము అనే పర్వతాన్ని అధిరోహించాడు.

**తిరుగు లంఘనం**

హనుమంతుడి పద ఘట్టనంతో అరిష్ట పర్వతం నేలలో క్రుంగిపోయింది. ఒక మహానౌక సముద్రాన్ని దాటినట్లుగా హనుమంతుడు సునాయాసంగా ఆకాశాన్ని దాటాడు. దారిలో మైనాక పర్వతాన్ని గౌరవంగా స్పృశించి, ఉత్తర సాగర తీరం సమీపించగానే పెద్దయెత్తున గర్జించాడు. ఆ కేక విని జాంబవంతాదులు ఇది హనుమంతుని విజయసూచక ధ్వానమని గ్రహించి హర్షంతో గంతులు వేయసాగారు. మేఘంలాగా హనుమంతుడు మహేంద్రగిరిపై దిగి గురువులకు, జాంబవంతాది వృద్ధులకు, యువరాజు అంగదునకు ప్రణామం చేశాడు. - **"కనుగొంటిని సీతమ్మను."** ఆమె రాక్షసుల బందీయై, రాముని కొరకు ఎదురు చూచుచు కృశించియున్నది. " అని హనుమంతుడు చెప్పాడు. "కనుగొంటిని" అన్న మాటలతో "వానరు లందరూ పరమానందము పొందారు." అతనిని కౌగలించుకొని సంతోషంతో చిందులు వేశారు. తరువాత తన లంకా నగర సందర్శనా విశేషాలను అన్నింటినీ తన బృందంలోనివారికి వివరంగా చెప్పాడు హనుమంతుడు.

ఇంక అంతా కలసి వెళ్ళి లంకను నాశనం చేసి, రావణుని ఓడించి, సీతను తెచ్చి రామునకు అప్పగించాలని అంగదుడు అభిప్రాయపడ్డాడు. కాని జాంబవంతుడు అందుకు వారించి, ముందుగా జరిగిన సంగతిని రామునకు, సుగ్రీవునకు నివేదించుట సరైనపని అని చెప్పాడు. అందరూ సంరంభంగా కిష్కింధకు బయలుదేరారు.

**మధువనం**

సీత జాడ తెలియడం వలన అంగదాది వానరులంతా ఉత్సాహంగా హనుమంతుని పరివేష్టించి కిష్కింధకు బయలుదేరారు. దారిలో మధువనమనే మనోహరమైన వనాన్ని చేరుకొన్నారు. అది సుగ్రీవునిది. దధిముఖుడనే వృద్ధ వానర వీరుని పరిరక్షణలో ఉంది. అంగదుని అనుమతితో వానరులంతా ఆ వనంలో ఫలాలను కోసుకొని తింటూ, మధువులను గ్రోలుతూ, చిందులు వేస్తూ, మత్తెక్కి పిచ్చిగా ఆడుతూ వనాన్ని ధ్వంసం చేయసాగారు. అడ్డు వచ్చిన దధిముఖుని తీవ్రంగా దండించారు. దిక్కు తోచని దధిముఖుడు తన తోటి వన రక్షకులతో కలిసి వేగంగా సుగ్రీవుని వద్దకు ఎగిరిపోయి జరిగిన అకృత్యం గురించి మొరపెట్టుకొన్నాడు.

సీతాన్వేషణా కార్యం సఫలమయి ఉండకపోతే తన భృత్యులైన వానరులు అంతటి సాహసం చేయజాలరని సుగ్రీవుడు ఊహించాడు. వనభంగం అనే నెపంతో దధిముఖుడు సీతాన్వేషణా సాఫల్య సమాచారాన్ని ముందుగా సూచిస్తున్నాడని, శుభవార్త వినే అవకాశం ఉన్నదని రామలక్ష్మణులకు సుగ్రీవుడు చెప్పాడు. శుభవార్త తెలిపినందుకు దధిముఖుని అభినందించాడు. దధిముఖుడు మధువనానికి తిరిగి వెళ్ళి అంగదాదులతో సాదరంగా మాట్లాడి త్వరగా సుగ్రీవుని వద్దకు వెళ్ళమన్నాడు. అంగదుడు, హనుమంతుడు, తక్కిన బృందం రివ్వున ఆకాశానికెగిరి ఝంఝూమారుతంలాగా సుగ్రీవుని వద్దకు బయలుదేరారు.

**రామునకు సీత జాడ తెలుపుట**

అంగదాది ప్రముఖులు, హనుమంతుడు మహోత్సాహంతో సుగ్రీవుడు, రామలక్ష్మణులు మొదలైనవారున్న ప్రస్రవణగిరిపై దిగారు. **"దృష్టా దేవీ (చూచాను సీతను)"** అని హనుమంతుడు చెప్పగానే రామలక్ష్మణులు మహదానంద భరితులయ్యారు. హనుమంతుని కార్య సాధనపై విశ్వాసము గల లక్ష్మణుడు సుగ్రీవునివంక ఆదరంగా చూశాడు. తక్కిన వానరుల ప్రోద్బలంతో హనుమంతుడు దక్షిణ దిక్కుకు తిరిగి సీతమ్మకు ప్రణమిల్లి, ఆమె ఇచ్చిన చూడామణిని రామునికి సమర్పించి, తన సాగర లంఘనా వృత్తాంతమును రామలక్ష్మణసుగ్రీవులకు వివరించాడు.

ఓ రామా! సీతామాత ఏకవేణియై, రాక్షస స్త్రీల నిర్బంధములో దీనురాలై నిరంతరము నిన్నే స్మరించుచున్నది. అందరిని కుశలమడిగినది. నీవు అనతి కాలములోనే వచ్చి ఆమెను విముక్తురాలను చేసి స్వీకరింతువనే ఆశ మాత్రముననే జీవించియున్నది. ఒక మాసము లోపల అట్లు కాకున్నచో తాను ప్రాణములతో ఉండజాలనన్నది. రామా! సింహ పరాక్రముడైన రాముని, ధనుష్పాణియైన లక్ష్మణుని త్వరలో లంకా ద్వారమున చూడగలవని చెప్పి ఆమెను అనునయించితిని. శుభకరమైన వచనములతో ఆమెను ఓదార్చి ఇటు వచ్చితిని. - అని హనుమంతుడు శ్రీరామునకు విన్నవించాడు.

(యుద్ధకాండము - మొదటి సర్గము నుండి) - హనుమంతుని మాటలు విని శ్రీరాముడు ప్రసన్నుడై ఇట్లు పలికెను. "హనుమంతుడొనర్చిన ఘన కార్యములు లోకములోనే అత్యద్భుతములైనవి. ఊహకు అందనివి. అనితర సాధ్యములు. హనుమంతునితో సమానుడైన తేజోబల సంపన్నుడు ఎవ్వడును లేడు. దుష్కరమైన ప్రభుకార్యములను సాధించుటయే గాక, దానికి భంగము కలుగకుండ, తదనురూపములైన ఇతర కార్యములను కూడ సాధించు సేవకుడు అత్యుత్తముడు. ఈ కార్య సాధన ద్వారా హనుమంతుడు మాయందరి ప్రాణములను కాపాడినాడు. నాకిట్టి మహోపకారమొనర్చిన హనుమంతునకు తగిన ప్రత్యుపకారము చేయలేని దీనుడనై యున్నాను. గాఢాలింగన సౌఖ్యమును మాత్రమే ఈయగలను. ప్రస్తుతము నేనీయగలిగిన నా సర్వస్వమిదియే", అని శ్రీరాముడు పులకిత గాత్రుడై తాను అప్పగించిన కార్యమును సాఫల్యమొనర్చి, పవిత్రాత్ముడై వచ్చిన హనుమంతుని తన హృదయమునకు హత్తుకొనెను.

ఆధ్యాత్మ రామాయణము: **శ్రీరాముని పాదపద్మములను తులసీ దళాదులతో పూజించినవారు సాటిలేని పరమపదమును పొందెదరు. అట్టి శ్రీరామ చంద్రుడే పుణ్యముల రాశియైన హనుమంతుని అనుగ్రహించి, స్వయముగా ఆయనకు తన ఆలింగన సౌఖ్యమును ప్రసాదించెను. ఆ మారుతి భాగ్యమును ఎంతని కొనియాడగలము** ("గీతా ప్రెస్, గోరఖ్‌పూర్ ప్రచురణలోని అనువాదము")



శ్రీలంక సీతా ఇలియాలో అశోక వాటిక సీతమ్మ మందిరం. Creative commons from Flickr. Photo by Buddhika Mawella



Photo by Michael Gunther
https://commons.wikimedia.org/wiki/File:Sita_Amman_Temple_0634.jpg



## వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః |
## హిరణ్యగర్భః శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః || (44)

### 406. వైకుంఠః

- ఐక్యమునకు ప్రతిబంధకములైనవాటిని (మోక్షమునకు అడ్డంకులను) తొలగించువాడు.
- పంచభూతములను అదుపులో నుంచినవాడు.

ఓం వైకుంఠాయ నమః

కుఠీ – గతి ప్రతిఘాతే – దారికి అడ్డముగానున్నది – అన్న ధాతువునుండి శ్రీ భట్టులు 'వైకుంఠ' నామము అర్థమును వివరించారు.

**సంశ్లేష ప్రతిఘాతశ్చ కుంఠి ధాత్వర్థ ఉచ్యతే విగతస్స యేషా తే వికుంఠా స్స్యురుదీరితాః తేషామేవైష ఇతి హి వైకుంఠ పరికీర్తితః –** 'కుంఠా' అనగా ఐక్యమునకు అడ్డముగానున్నది. 'వైకుంఠ' అనగా అటువంటి అడ్డము లేనిది. భగవంతుని చేరుటకు పాపములు అడ్డంకులు. అట్టి పాపములను తొలగించువాడు భగవంతుడు గనుక ఆయనే వైకుంఠుడు.

(శ్రీ శంకరుల భాష్యముననుసరించి) శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – **విగతా కుంఠా తస్యాః కర్తా** – నియంత్రణ లేనియెడల ఏవైతే అదుపులేక చెలరేగునో అట్టివాటిని నిరోధము (ప్రతిఘాతము) చేయువాడు వైకుంఠుడు. సృష్టి మొదలున పంచభూతములు ఒకదానితోనొకటి సంబంధము లేకుండా, అదుపు లేకుండా, చెలరేగే పరిస్థితిలో, వాటిని అదుపు చేసి, వానిమధ్య సంబంధము (ఐక్యము) కలుగజేసెను గనుక భగవానుడు వైకుంఠుడు.

భిన్నమైనవాటి మధ్య సంబంధము కలుగజేయువాడు భగవంతుడు – అనే వివరణకు శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడ మహాభారతము శాంతిపర్వములోని శ్లోకము (343.50)ను ఉదాహరించారు.

**మయా సంశ్లేషితా భూమిః అద్భిర్వ్యోమ చ వాయునా**
**వాయుశ్చ తేజసా సార్థః వైకుంఠత్వమ్ తతో మమ**

భూమికి జలముతో, ఆకాశానికి వాయువుతో, వాయువుకు తేజస్సుతో – ఈ విధంగా సంబంధము (సమ్మేళనము) కలుపబడినది. అందువల నేను వైకుంఠుడను.

శ్రీ పి.బి. అణ్ణంగారాచార్య – భగవంతుని పొందుటకు భక్తునికి గల అడ్డంకులను తొలగించి, తనలో భక్తుని కలుపుకొనువాడు గనుక ఆయన వైకుంఠుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఎవనికైతే ఏ విధమైన అడ్డంకులు లేవో, ఎవరైతే అన్ని అడ్డంకులను తొలగించునో ఆయనే వైకుంఠుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరొక వివరణ – ఐదవ మన్వంతరమున భగవంతుడు శుభ్ర, వైకుంఠులకు బిడ్డగా జన్మించెను. ఆయన రమను పరిణయమాడి, ఆమె ఆనందము కొరకు వైకుంఠమును సృష్టించెను. ఆ వైకుంఠము భగవంతుని స్వరూపము, నివాసము కూడ. (విష్ణుపురాణము 3.2.41, భాగవతము 8.5.4-5)

ధర్మచక్రము రచయిత – ఎందరో వ్యక్తుల జ్ఞానమునకు, మోక్షమునకు అడ్డముగానున్నవానిని తొలగించి, వారిని తనలో ఐక్యము చేసికొన్నవాడు వైకుంఠుడు అని వివరిస్తూ ధర్మచక్రము రచయిత ప్రహ్లాదుడు, పరశురాముడు, కర్ణుడు, హరిశ్చంద్రుడు, వాలి వంటివారి కథలను ఉదాహరించారు.

## 407. పురుషః

- పావనము చేయువాడు.

ఓం పురుషాయ నమః

2వ శ్లోకము. 14వ నామము. పురుషః – **అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ**
44వ శ్లోకము. 407వ నామము. పురుషః – **వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**

ఇంతకుముందు 'పురుషః' నామము 14వ నామముగా స్తుతించబడినది. అప్పుడు ఈ నామమునకు ఇచ్చిన అర్థములు –

(1) **పురు సనోతి ఇతి పురుషః** – పుష్కలముగా ప్రసాదించువాడు పురుషుడు.

(2) **పురా ఆసీత్ ఇతి పురుషః** – అన్నింటికంటె పూర్వమే ఉండినవాడు పురుషుడు.

(3) **పూరయతి ఇతి పురుషః** – అంతటికిని పరిపూర్ణత నొసగువాడు పురుషుడు.

(4) **పురి సేతే ఇతి పురుషః** – శరీరమను పురమున వసించినవాడు పురుషుడు.

4వ భావమునకు ఇంతకుముందు శ్రీ శంకరులు చెప్పన ప్రమాణోదాహరణ –

**నవద్వారమ్ పుణ్యమ్ ఏతైర్భావైః సమన్వితమ్**
**వ్యాప్య సేతే మహాత్మా యస్తస్మాత్ పురుష ఉచ్యతే** (మహాభారతము 12.203.35)
నవద్వారములు కలిగిన శరీరమున వ్యాపించిన మహాత్ముడు పురషుడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక ప్రమాణము –

**స వా అయమ్ పురుషః సర్వాసు పూర్షు పురి శయః** (బృహదారణ్యకోపనిషత్తు 2.5.18) – అన్ని శరీరములందు వసించువాడు పురుషుడు. ఇదే భావమునకు శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధములనుండి ఉదాహరించారు (తిరువైమొళి 3.9.5, 2.7.11) పైన చెప్పిన 4 అర్థమలు కాకుండా మరికొన్ని అర్థములు ఇక్కడ చెబుతున్నాము –

(5) **ఉష దాహే పురూః సర్వాన్ ఓషతి దహతి ఇతి వా పురుషః** – అన్నింటికంటె అధికముగా ప్రకాశించువాడు పురుషుడు.

(6) **పాప్మణా ఓషః తస్మాత్ పురుషః** – అన్ని పాపములను దహించివేయువాడు పురుషుడు.

(7) **పిపర్తి పృణతి పాలయతి పూరయతి ఇతి వా పురుషః** – అన్నింటిని పరిపాలించువాడు పురుషుడు (పృ – పాలన – పూరణయోః)

(8) పురా – కుషన్ – పురుషః (పురా – అగ్ర గమనే) – **పురా అగ్రగామీ భవతి ఇతి వా పురుషః** – ముందుగానుండి నడిపించువాడు పురుషుడు.

**(9) పూర్వః అస్మాత్ విశ్వాత్ తత్ ఆదికారణత్వాత్ ఇతి పురుషః** – విశ్వమునకు ఆదికారణమైనవాడు పురుషుడు.

**(10) పురాణి భువనాని సంహార సమయే స్యతి అంతమ్ నయతీతి పురుషః** – సంహార (ప్రళయ) కాలమున భువనములను తుదివరకు తీసికొనిపోవువాడు పురుషుడు.

వీటిలో 6, 7 అర్థములను శ్రీ భట్టులు ప్రస్తుత (407వ) నామ వివరణ సందర్భముగా చెప్పారు.

**స యత్పూర్వ ఇతి శృత్యా పురుషః పావనత్వతః**
**ప్రూ ధాతోః పాలనార్థార్ధి అర్ష ప్రత్యయ యోగతః**
**సర్వ పాలకతా లబ్ధ్వా పురుషః ప్రోచ్యతే బుధైః**
'స యత్పూర్వో' అనే శ్రుతిననుసరించి, పరమపావనుడగుటవల్ల పురుషుడగుచున్నాడు. లేక 'ప్రూ' అనే ధాతువునకు 'పాలన' అని అర్థము. కాబట్టి పాలించువాడు, పరమపావనుడు పురుషుడు. (శ్రీకైవల్యసారథినుండి)

**స యత్పూర్వః అస్మాత్ సర్వస్మాత్ పాప్మనా ఓషః తస్మాత్ పురుషః** – పాపములను దహించు గుణము కలవాడు పురుషుడు అని శ్రీ భట్టులు చెప్పిన అర్థము శ్రీ శంకరులు చెప్పిన ప్రమాణమునకు (బృహదారణ్యక 1.4.1) దగ్గరగా ఉన్నది – **స యత్పూర్వోఽస్మాత్ సర్వస్మాత్ పాప్మనా ఔషత తస్మాత్ పురుషః.**

(7)వ భావము 'ప్రూ' అనే ధాతువు ఆధారముగా చెప్పబడినది. ప్రూ – రక్షించుట, పోషించుట. ఉణాది సూత్రము – **పురః కుషాన్;** పాణిని సూత్రము – **పుర అగ్రగమనే.** అగ్రగామియై ఉండువాడు పురుషుడు అనే భావమును శ్రీ పి.బి.అణ్ణాంగారాచార్య తమ సంక్షిప్తవ్యాఖ్యలో తీసికొన్నారు. శ్రీ వి.వి. రామానుజన్ ఈ నామమునకు క్లుప్తంగా 'రక్షకుడు, పోషకుడు' అని అర్థం చెప్పారు.

**తవాఽహం చక్షుసా సౌమ్యపూతా సౌమ్యేవ మానద** – రామా! నీ చల్లని చూపుతో నేను పరిశుద్ధనైనాను – అని శబరి రామునితో అన్నది. **పావనః సర్వలోకానాం త్వమేవ రఘునందన.**

శ్రీమన్నారాయణుడు పావనుడు. పాపహారి. ఫలప్రదాత. రక్షకుడు. పోషకుడు. సర్వాత్మకుడు. సనాతనుడు. పాలకుడు. పురుషుడు. శ్రీమన్నారాయణుడు. శ్రీరాముడు. సీతారాముడు. లక్ష్మణ సమేతుడు. హనుమత్సేవితుడు.

డా. క్రోవి పార్థసారథి రచన శ్రీ కైవల్యసారథి నుండి – విష్ణుధర్మోత్తరపురాణంలో పురుష స్వరూప వర్ణన. మార్కండేయునిచే వజ్రానకు చెప్పబడినది.

**అజేయం వైష్ణవం తేజస్తశ్చ నిత్యం చ జంతుషు**
**నాశమాయాన్తి తే సర్వేహీనా వైష్ణవ తేజసా**
**అవినాశి జగత్యస్మిన్ న కించిదథ విద్యతే**
**ఋతేతు మహత్ తస్మాత్తేజసో నృప! వైష్ణవాత్**
**...........సర్వతః పాణి పాదాంతం సర్వతోఽక్షి శిరోముఖమ్ .......**
**అవినాశి తదేవైకం యస్యోదర గతం జగత్**
**సదాశివేతి తం కేచిదాహుర్దేవం జగత్పతిమ్**
**వాసుదేవేతి చాప్యన్యే కాలమిత్యేవ చా పరే**

**కర్మేతి చాపరే ప్రాహుః పురుషేతి తథాపరే**

**ప్రణవాఖ్యం తథా తం చ విదుర్వేదవిదో జనాః**

విష్ణుతేజస్సు అజేయమైనది. శాశ్వతమైనది. అది లేనివారు నశిస్తారు. జగత్తంతా నిండిఉన్నది, నాశనము లేనిది ఒక్కటే. దానికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఉండవు. అది సర్వేశ్వర మయము. నిర్గుణము. గుణాతీతము. అన్ని ఇంద్రియాలను, గుణాలను ప్రకాశింపజేసేది. దానికి మాత్రము ఇంద్రియాలు లేవు. దానికి అన్నివైపులకు కళ్ళు, ముక్కు, చెవులు, నోరు ఉంటాయి. అదే ప్రకాశరూపము. కేవలము జ్ఞానము. సర్వవ్యాపకము. పరమేశ్వరము. నాశన రహితము. దాని ఉదరమందే జగత్తంతా ఉన్నది. అటువంటి దానిని కొందరు సదాశివుడు అంటారు. కొందరు జగదీశ్వరుడు అంటారు. కొందరు వాసుదేవుడు అంటారు. కొందరు కాలము అంటారు. కొందరు దైవము అంటారు. కొందరు స్వభావము అని, కొందరు కర్మ అని అంటారు. వేదవేత్తలు దానిని ప్రణవము అంటారు. అది అజము-పుట్టనిది, అవ్యక్తము-కనిపించనిది, నాశనము లేనిది, అదే పురుష స్వరూపము.

## 408. ప్రాణః

- జీవమును నిలుపు వాయువు.

### ఓం ప్రాణాయ నమః

ఇదే నామము 67వ, 322వ నామములుగా కూడ స్తుతించబడినది.

8వ శ్లోకము. 67వ నామము – ప్రాణః – **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**

35వ శ్లోకము. 322వ నామము – ప్రాణః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**

44వ శ్లోకము. 408వ నామము – ప్రాణః – **వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**

67వ నామమునకు చెప్పిన భావము – **ప్రాణితి ఇతి ప్రాణః** – అన్ని జీవులకు మూలచేతనత్వమై, అంతర్యామియై, భరించి పోషించువాడు.

322వ నామమునకు – నారాయణుని శరణుజొచ్చిన భక్తులకు ఆయనే ప్రాణము – అని శ్రీ భట్టులు చెప్పారు. అన్ని ప్రాణములందు స్థితుడైన మూలప్రాణము – అని శ్రీ శంకరులు చెప్పారు.

408వ నామమునకు – అందరు భక్తులకు, దేవతలకు కూడ ప్రాణరూపమున శరీరమందుండి చేష్టలు కలిగించువాడు.

## 409. ప్రాణదః

- ప్రాణములనిచ్చువాడు.

### ఓం ప్రాణదాయ నమః

ఈ శుభనామము 66వ, 323వ, 409వ, 956వ నామములుగా – అనగా నాలుగుమార్లు స్తుతించబడినది.

8వ శ్లోకము. 66వ నామము - ప్రాణదః – **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**

35వ శ్లోకము. 323వ నామము – ప్రాణదః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**

44వ శ్లోకము. 409వ నామము – ప్రాణదః – **వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**

102వ శ్లోకము. 956వ నామము – ప్రాణదః – **ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః**

ఈ నామమునకు భాష్యకారులు వివిధములుగా అర్థములు చెప్పారు.

(1) శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా చెప్పినది – **ప్రాణాన్ దదాతి ఇతి ప్రాణః** – ప్రాణములను ఇచ్చువాడు.

(2) శ్రీ శంకరులు – **ప్రాణన్ ద్యాతి ఇతి ప్రాణః** – ఆయువు తీరిన పిదప ప్రాణములను హరించువాడు.

(3) శ్రీ శంకరులు – **ప్రాణాన్ దీపయతి** – ప్రాణములను ప్రకాశింపజేయువాడు.

భగవంతుని ప్రాణప్రసాద గుణమును మరొక విధముగా కూడ వివరించారు. నిత్యసూరులైనవారు శ్రీమన్నారాయణానుభవమును నిర్విరామముగా ఆనందించి తమ ప్రాణములను నిలుపుకొందురు. ఇది భగవానుని ప్రసాదమే.

ధర్మచక్రము రచయిత వివరణ – సూర్యకాంతి రూపములో భగవానుడొసగు ప్రాణము జీవులను చైతన్యవంతులుగా చేయును. తాము భగవంతునికి చెందినవారమని తలచినవారు ప్రకాశమానులగుదురు. మంత్రస్వరూపుడై భగవంతుడు గాయత్రీ జపమును చేయువారిని ఉద్దీపించి జ్ఞానోన్ముఖులను చేయును. ఇలా భగవంతుడు అనేకానేక విధములుగా ప్రాణదుడు. ప్రాణములిచ్చు ప్రభువు.

## 410. ప్రణమః / ప్రణవః

- అందరిచే ప్రణామములందుకొనువాడు.
- వేదములందు ప్రణామములు గ్రహించువాడు.
- అన్ని విధముల పూజ్యుడు. ఆయనకు దాస్యము చేయుట ఉత్తమ ధర్మము.

ఓం ప్రణమాయ నమః

ఓం ప్రణవాయ నమః

44వ శ్లోకము. 410వ నామము. ప్రణవః / ప్రణమః – **వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**
102వ శ్లోకము. 957వ నామము. ప్రణవః – **ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః**

**ప్రణామయతి ఇతి ప్రణమః** – భగవంతుని పరమేశ్వరత్వము కారణముగా అందరును ఆయనకు దండము పెట్టవలసినదే. శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధము (నాన్ముగన్ తిరువంతాది. 8) నుండి ఉదాహరించారు. రాముడొక్కడే పూజ్యుడు..వేరెవ్వరును కాదు.

'ప్రణవ' నామమును కూడ కొందరు గ్రహించారు. అపరిమితముగా కీర్తింపబడువాడు – అనే అర్థమునకు శ్రీ శంకరులు సనత్కుమారుని మాటలను ఉదాహరించారు. **ప్రణమతీహ వై వేదా స్తస్మాత్ ప్రణవ ఉచ్యతే** – వేదములలో ఈయనకు ప్రణామములు చెప్పబడునవి. కనుక 'ప్రణవః'.

'ప్రణవ మంత్రము' అన్న భావములో మంత్రస్వరూపుడైన భగవానుడు ప్రణవము.

శ్రీ కైవల్యసారథిలో ఇచ్చిన మరికొన్ని ఉదాహరణలు.
**గణైశ్చరాచరం నిత్యం నామనాత్ప్రణమ స్మృతః** – తన కళ్యాణగుణములచేత జగత్తులోని జీవులన్నింటిని సర్వదా తనకు అణగి ఉండేటట్లు చేయువాడు. ప్రణమః.
**ప్రణమంతాహ వై వేదాస్తస్మాత్ప్రణవ ఉచ్యతే** – తన గుణములచే చరాచర జగత్తును తనకు లొంగజేసుకొన్నవాడు. దేవతలచేత కూడ ఆరాధింపబడువాడు. ప్రణవః.

**ప్రణమయతీతి ప్రణమః** – అతనికి వేదములుకూడ ప్రణమిల్లుతాయి. ప్రణమః

**గుణైర్దాస్య ముపాగతః** – ఆయన కళ్యాణగుణములకు ప్రపంచమంతా దాసోహము అంటున్నది. అని రామాయణములో చెప్పడినది.

## 411. పృథుః

- వ్యాపించిన కీర్తిగలవాడు.
- విశ్వమంతట విస్తరించినవాడు.
- పృథుమహారాజుగా అవతరించినవాడు.

### ఓం పృథవే నమః

ప్రథ – ప్రఖ్యానే – ఖ్యాతి పొందుట – అన్న ధాతువునుండి ఈ నామమును వివరిస్తూ శ్రీ భట్టులు రామాయణము బాలకాండము (1.8)నుండి ఉదాహరించారు**. పృథుశ్రీః పార్థివాత్మజః** – దశరధుని కుమారుడు లోకమంతట కీర్తినొందినవాడు.

బాలకాండము 77.28 **– తేషామ్ అతియశో లోకో రామః** – వారిలో రాముడు అందరికంటె యశము నొందినవాడు.
తిరువైమొళి 6.10.10 – **నిగర్ ఇల్ పుగళాయ్**
**యశో విశాలవత్వాచ్చ పృథురిత్యుచ్యతే బుధైః**

శ్రీ శంకరులు చెప్పిన అర్థము – తానే స్వయముగా విశ్వమై విస్తరిల్లినవాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ప్రథ్ - విస్తారే - వ్యాపించుట – శ్రీ మహావిష్ణువు విశ్వరూపము ఈ రెండు అర్థములను చక్కగా సమన్వయపరచుచున్నది. ఆయన విరాట్ స్వరూపము అందరిచే కీర్తింపబడుచు యశోవిరాజితమై యున్నది. ఆయన విరాట్ స్వరూపములో విశ్వమంతా వ్యాపించియున్నది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పృథుమహారాజు విష్ణుమూర్తి అవతారమని భాగవతము (1.3.4)లో చెప్పబడినది. **ఋషిభిర్యాచితో భేజే నవమం పార్థివం వపుః** – ఋషుల ప్రార్థనలు మన్నించి ఆయన పృథువు రూపములో వచ్చెను. ఆ సమయంలో కరువు నెలకొన్నది. అప్పుడు భూదేవి గోమాతగా ప్రత్యక్షమైనది. స్వాయంభువ మనువు దూడగా, పృథుమహారాజు తన అరచేతిని పాత్రగా చేసి, ఆవు రూపంలోనున్న భూదేవి పాలు పితికాడు. దేశం సస్యశ్యామలమయ్యింది.

## 412. హిరణ్యగర్భః

- అందరికిని సంతుష్టిని, ఆనందమును కలిగించేవాడు.
- తనను ధ్యానించే భక్తుల హృదయములందు బంగారు నిధి.
- బ్రహ్మకు జన్మనిచ్చిన హిరణ్మయాండమును గర్భమున కలిగినవాడు.
- అతి రమణీయమగు పరమపదమున (వైకుంఠమున) నివసించువాడు.

### ఓం హిరణ్యగర్భాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
8వ శ్లోకము. 71వనామము – హిరణ్యగర్భః - **హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః**

44వ శ్లోకము. 412వనామ – హిరణ్యగర్భః – **హిరణ్యగర్భః శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః**

ఇంతకుముందు ఈ నామము 71వ నామముగా చెప్పబడినది. అప్పుడు శ్రీవైకుంఠమున నుండువాడు గనుక హిరణ్యగర్భుడు అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. "హిరణ్యము' అనగా బంగారము. పరిశుద్ధము, ఆకర్షణీయము, అందరు కోరుకొనేది. అలాగే పరమపదము కూడా శుద్ధసత్వమయము. ముముక్షువుల గమ్యము. కనుక హిరణ్యముతో పోల్చారు. అన్నివిధాల మంచిదానిని ప్రసాదించువాడు హిరణ్యగర్భుడు. '**నిరతిశయ తేజోరూపమాన పరమపదము**'న నుండువాడు హిరణ్యగర్భుడు.

**హితస్య రమణీయస్య ధ్యాతౄణాం హృదయస్య హి హిరణ్యగర్భస్తత్రస్థః స శుభాశ్రయణ స్మృతః యద్వా హిరణ్యగర్భోऽసౌ హిరణ్యనిధి సామ్యతః -** తనను ధ్యానించే భక్తుల హృదయములందు ఉండేవాడు. బంగారునిధి వంటివాడు. వారికి శుభములు కూర్చువాడు. **ధ్యేయః స ఏవ విశ్వాత్మా** – విశ్వరూపుడు, విశ్వాత్ముడు అయిన పరమేశ్వరుని హృదయమునందు ధ్యానించాలి.

నారాయణుడు మొదట జలమును సృష్టించెను. ఆ జలమునందు తన వీర్యమును వదిలాడు. అది బంగారు గ్రుడ్డయి నీటియందు తేలింది. ఆ అండమునుండి బ్రహ్మ జనించాడు. ఈ రకంగా హిరణ్యమును గర్భమునందు గలవాడు గనుక నారాయణుడు హిరణ్యగర్భుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి 'వైకుంఠః' నామమునుండి ఈ 'హిరణ్యగర్భః' నామమువరకు అన్ని నామములను సృష్టికార్యపరంగా సమన్వయపరుస్తూ చక్కగా వ్యాఖ్యానించారు.

**వైకుంఠః** – భగవంతుడు వైకుంఠములోనుండే పరమపురుషుడు. అపరిమిత శక్తి సంపన్నుడు.

**పురుషః** – ఆ పరమపురుషుడు దిగివచ్చి, జీవుల శరీరములలో పురుషునివలె నివశించుచున్నాడు. హృదయస్థానమే ఆయనకు వైకుంఠమయ్యెను. ఈ ఆకాశమునకంటె ముందుగా ప్రణవనాదముండెను.

**ప్రాణః, ప్రాణదః** – ఆపై భగవంతుడు ప్రకృతిని నిలిపే ప్రాణశక్తిని జీవులను చైతన్యవంతులుగా చేసేలా మార్చాడు. అలా ఆయన ప్రాణదుడయ్యెను.

**ప్రణవః** – ఇలా సృష్టి ఆరంభము కాగా, పంచభూతములలో మొదటిగా ఆకాశము ఉద్భవించెను **(తస్మాద్ వా ఏతస్మాదాత్మనా ఆకాశ సంభూతః).**

పృథుః – **ఆకాశాత్ వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథ్వీ**. అలా పంచభూతముల క్రమములో పృథ్వి జనించెను. ఇలా భగవంతుడు పృథువై విశ్వమును విస్తరింపజేసెను.

**హిరణ్యగర్భః** – స్థూలరూపమునుండి సూక్ష్మరూపుడై విస్తరించుచు దేవదేవుడు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు తన సృష్టికొసగి హిరణ్యగర్భుడయ్యెను.

## 413. శత్రుఘ్నః

- శత్రువులను నాశనము చేయువాడు.

### ఓం శత్రుఘ్నాయ నమః

**శత్రుమ్ హన్తి ఇతి శత్రుఘ్నః** –తన భక్తుల శత్రువులను నాశనము చేయువాడు శత్రుఘ్నుడు.

**శత్రూనింద్రియ వర్గాన్యో హంరితి శత్రుఘ్న ఉచ్యతే** – తన భక్తుల ఇంద్రియములు అటునిటు పోకుండా అణచి ఉంచేవాడు శత్రుఘ్నుడు.

భగవంతుని ధ్యానించిన యెడల అట్టి భక్తుల బాహ్య శత్రువులను, అంతఃశత్రువులను కూడ భగవంతుడు నాశనము చేయును.

## 414. వ్యాప్తః

- అందరిపట్ల ప్రీతి, వాత్సల్యము, కరుణ పొంగియున్నవాడు.
- అంతటను వ్యాపించినవాడు.

### ఓం వ్యాప్తాయ నమః

నిరుక్తిలో ఇలా చెప్పారు – **నీచపూజ్యోऽవిశేషణ వ్యాపనాద్వ్యాప్త ఉచ్యతే** – గొప్ప, సామాన్య, తక్కువ భేదములు లేకుండా తనను కొలుచువారందరిపట్ల వాత్సల్యము వర్షించువాడు. శ్రీభట్టులు రామాయణము అరణ్యకాండము (2.37.38)నుండి చెప్పిన ఉదాహరణ –

**పౌరాన్ స్వజనవత్ నిత్యమ్ కుశలమ్ పరిపృచ్ఛతి**
**పూతేష్వంగిషు దారేషు ప్రేష్య శిష్యగణేషు చ**
**నిఖిలేన అనుపూర్వ్యాచ్చ పితా పుత్రానివ ఔరసాన్**

ఇంకా శ్రీరాముడు - **రిపుణామపి వత్సలః** – శత్రువులపట్ల కూడ వత్సలుడు (యుద్ధకాండము 50.56)

శ్రీ శంకరులు, శ్రీ చిన్మయానంద, శ్రీరాధాకృష్ణశాస్త్రి – అంతటను వ్యాపించియున్నందున శ్రీనివాసుడు వ్యాప్తుడు.

## 415. వాయుః

- చలించువాడు. భక్తుల కడకు తానై పోవువాడు.
- అంతటను వ్యాపించుయున్నవాడు.
- పుణ్యగంధమూర్తి. ప్రాణము నిలుపువాడు.

### ఓం వాయవే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తత్ర తత్ర స్థితాన్ సర్వాన్ భరద్వాజ గుహాదికాన్ గచ్ఛతి స్వయమేవైతాన్ స వాయురితి శబ్ద్యతే** - భగవానుడు తానై భక్తుల కడకు పోయి వారిని అనుగ్రహించును. అలా రాముడు గుహుని వద్దకు, భరద్వాజుని వద్దకు, శబరివద్దకు వెళ్ళి వారిని ధన్యులను చేసెను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **వాతి సర్వత్ర గతో భవతి ఇతి వాయుః** – ఆయన లేని స్థలము లేదు. చొరరాని చోటు లేదు. సర్వవ్యాపకత భగవంతుని లక్షణము. కనుక ఆయన వాయువు.

ధర్మచక్రము రచయిత – ఈ నామము భగవంతుని సర్వవ్యాప్తి గుణమును స్తుతించును. మిగిలినవి ఎన్ని యున్నను వాయువు లేక జీవించుట అసాధ్యము. అలాగే భగవంతుడు ప్రాణప్రదాత. ఆయన కృప యున్నంతవరకే ప్రాణము నిలిచియుండును. ఇంకా వాయువు తనంతట తానే జీవులకడకు వచ్చి వారి జీవమును నిలుపును. అలాగే భగవంతుడు స్వయముగా తానేతెంచి భక్తులను

బ్రోచును. వాయువు తరతమ భేదములు లేకుండ అందరి ప్రాణములను పోషించును. అదేవిధముగా భగవంతుడు అందరికిని సమముగా ప్రాణము ప్రసాదించును. భగవంతుని 'వాయువు' అని స్తుతించునపుడు ఇన్ని వాత్సల్యగుణములను స్మరింపనగును.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు వాయువు మాత్రమే కాదు. వాయువుకున్న ప్రాణప్రదానశక్తి భగవంతుడే.

**పుణ్యోగంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ**
**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు** – గీత 7.9
పృథివియందున్న గంధాన్ని, అగ్నిలోని తేజస్సును, సమస్త ప్రాణులయందు చైతన్యాన్ని, తాపసులలోని తపస్సును నేనే.
శ్రీ శంకరులు – గంధము కలిగించునది వాయువు – అనే భావములో వ్యాఖ్యానించారు. **వాతి గంధం కరోతి ఇతి వాయుః.**

పుణ్యగంధము కలిగించునది వాయువు అనుటకు శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉపనిషత్తులనుండి ఉదాహరించారు –

**వాయురస్మై పుణ్యం గంధం ఆవహతి** – ఐతరేయ 1.7.
**యో వాయౌ తిష్ఠాన్ వాయోరంతరో**
**యమ్ వాయుర్నవేద యస్య వాయుః శరీరమ్**
**యో వాయుమంతరో యమయతి**
**ఏష తే ఆత్మాంతర్యామ్యమృతః** – బృహదారణ్యకము 3.7.7

భగవానుడు వాయువునకు అంతర్యామియై వాయవు తన ధర్మములను (కార్యములను) నిర్వర్తించునట్లు చేయును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి పెక్కు ఉదాహరణలద్వారా దేవతలలో వాయువునకున్న ప్రాముఖ్యతను వివరించారు –

**వాయుర్వావ సంవర్గో యదా వా అగ్నిరుద్వాయతి, వాయుమేవాప్యేతి, యదా సూర్యో஽స్తమేతి వాయుమేవాప్యేతి, యదా చంద్రో஽స్తమేతి వాయుమేవాప్యేతి, యదాపయుచ్ఛుష్యంతి వాయుమేవాపియంతి వాయుహ్యేవైతాన్, సర్వాన్ సంవృక్తే** – ఛాందోగ్యోపనిషత్తు 4.3. సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నీరు – అన్నీ తుదకు వాయువునందు ఐక్యమగును.

**మ్లోచ్చంతి హ్యన్య దేవతాః, న వాయుః శేషా஽నస్తమితా దేవతా వాయుః** – బృహదారణ్యకోపనిషత్తు 1.5.22 - సూర్యుడు, చంద్రుడు వంటి తక్కిన ఇంద్రియ దేవతలు సుషుప్తి స్థితిలోనున్నపుడు వాయువు మాత్రము ప్రాణమై చైతన్యముతోనుండును.
**కిం తద్విష్ణోః బలమాహుః వాతాద్విష్ణోః బలమాహుః** – తైత్తరీయ 1.8.3 - భగవంతుడైన విష్ణువు తన వాయువిభూతి ద్వారా భూమిని ధరించును (భరించును).
**వాయుర్వై గౌతమ్ తత్ సూత్రమ్ వాయునావై గౌతమ్ సూత్రేణాయమ్ చ**
**లోకః పరశ్చలోకః సర్వాణి చ భూతాని సంధృబ్ధాని భవన్తి** – బృహదారణ్యక 3.5.2
మణులలో దారమువలె ప్రపంచములనన్నింటినీ కలిపియుంచేది వాయువు. అది లేకుంటే లోకములు చెల్లాచెదురైపోవును. అలా కలిపి ఉంచే శక్తి భగవంతుడే.

విశ్వము ఉనికికి ఇంత ముఖ్యమైనందున భగవంతుడే వాయువు.

## 416. అధోక్షజః

- తరగనివాడు.
- భూమ్యాకాశముల మధ్య విస్తరించిన విరాట్ స్వరూపుడు.

- ఇంద్రియములచే తెలియరానివాడు.

## ఓం అధోక్షజాయ నమః

**సదోపభుజ్యమానోऽపి సర్వై రమృత సింధువత్ అధో న క్షీయతే జాతు యస్మాత్తస్మా దధోక్షజః -** అందరిచేత అన్ని వేళలయందు అనుభవింపబడువాడైనప్పటికీ, సముద్రమువలె ఉన్నతుడు. కొంచెము కూడా తరగనివాడు. అమృతమువంటివాడు. ఈ నామవివరణకు చక్కగా సరిపోయేపాశురాన్ని శ్రీ నమ్మాళ్వార్ తిరువైమొళి (4.3.10)నుండి శ్రీ వి.వి.రామానుజన్ ఉదాహరించారు.

**అధో న క్షీయతే జాతు యస్మాత్తస్మాదధోక్షజః** – మహాభారతము ఉద్యోగపర్వము 4.69.10 – ఎన్నడును తన దివ్యత్వమునుండి జారినవాడు కాడు గనుక అధోక్షజుడు (అధః-క్రిందికి, క్షీయతే-క్షీణించువాడు, న-కాదు)

శ్రీ శంకరులు రెండు విధములుగా వ్యాఖ్యానము చెప్పారు –

అక్షగణములు (ఇంద్రియములు) అధోముఖములు (అంతర్ముఖములు) అయినపుడు తెలియవచ్చువాడు. అనగా నిగ్రహముతో అంతఃదృష్టి గలవారికి మాత్రమే అవగతమగువాడు.

**అధోభూతేహ్యక్షగణే ప్రత్యగ్రూప ప్రవాహితే జాయతే తస్య వై జ్ఞానమ్ తేన అధోక్షజ ఉచ్యతే.** అన్ని చోట్లా ఉన్నాగాని చక్షురాది ఇంద్రియములకు కానరానివాడు అని శ్రీరాధాకృష్ణశాస్త్రి వివరించారు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – **అక్షమ్ అధః తయోర్మధ్యే వైరాజ రూపేణ అజాయత ఇతి అధోక్షజః** – అక్షభాగము (ఆకాశము)నకు, అధోభాగము (భూమి)కి మధ్య విరాట్ స్వరూపుడై విలసిల్లినవాడు అధోక్షజుడు.

**అక్షయం మధుహంతారమ్ జానామిత్యాం సురోత్తమమ్** – పరమేశ్వరుడు మధుసూదనుడని, అక్షయుడని, సురోత్తముడని చెప్పబడుచున్నాడు.



కులగురువు శ్రీ వశిష్ఠులు మరియు శ్రీ సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమంతులు.
సింగపూర్ శ్రీ కృష్ణన్ మందిరంలో శిల్పాలు.
వికీపీడియా చిత్రం.
By Marcin Konsek

https://commons.wikimedia.org/wiki/ File:2016 Singapur, Rochor, Świątynia Sri Krishnan (21).jpg.jpg



## ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః |
## ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః || (45)

### 417. ఋతుః

- కాలములో చక్రరూపమున సంభవించే ఋతువుల స్వరూపుడు.
- అందరికీ ఆనందాన్నిచ్చే కళ్యాణగుణసంపన్నుడు.

ఓం ఋతవే నమః

**ఋచ్ఛతి ఇతి ఋతుః ప్రోక్తః సర్వోల్లాసకరైర్గుణైః** – ప్రతి సంవత్సరము ఆరు ఋతువులు ఒకదాని వెనుక ఒకటి సంభవించును. ఒక్కొక్క ఋతువు సమయానికి తోసుకొనివచ్చి తనతో వాతావరణములో మార్పులను, వివిధ పుష్పఫలసంపదను తీసికొనివచ్చి సకలభూతములకు సుఖశాంతులు కలిగించును. ఇలా కాలస్వరూపుడైన శ్రీనివాసుడు ఋతువు.

ఇంకా భక్తుల గుండెలలో మరల మరల ఆనందమును అలలు అలలుగా ప్రసాదించి కరుణించును గనుక శ్రీనివాసుడే ఋతువు. భగవంతుడు ఋతురూపమున సర్వత్ర ఉన్నాడు గనుక ఋతువు.

### 418. సుదర్శనః

- కనులకింపైన, రమణీయమైన, శుభప్రదమగు దర్శనమిచ్చువాడు.
- ఆయన దర్శనము మోక్షప్రదము.
- పద్మపత్రములవంటి కన్నులు గలవాడు.
- తన భక్తులకు సులభముగా దర్శనమిచ్చువాడు.

ఓం సుదర్శనాయ నమః

**శుభం చ దర్శనం యస్య మందానాం స సుదర్శనః – శోభనం దర్శనం యస్య స సుదర్శనః** – ఆయన దర్శనము సు-దర్శనము. రాముని చూచిన దినమే సుదినము. సురరక్షకుని చూచు చూడ్కులు చూడ్కులు. శ్రీ వేంకటరమణుని దర్శనము సకల పాపహరము. శుభకరము. మోక్షప్రదము. శ్రీ సీతారాముల కళ్యాణము చూచినవారికి కన్నుల పండుగ. భగవంతుని దర్శనము అందరికిని, ఆయన గుణ వైభవ హాత్మ్యములు తెలియని మందులకు కూడా, మహదానందకరము. సకలశుభప్రదము. సమస్త సన్మంగళ ప్రసాదము. అని శ్రీ భట్టులు వివరించారు. శ్రీ వి.వి. రామానుజన్ **'దృష్టి చిత్తాపహారి'** అని భగవద్గుణములను స్తుతించారు.

శ్రీ శంకరులు మూడు విధాలైన అర్థాలను చెప్పారు.

**సు-దర్శనమ్ అస్య ఇతి సుదర్శనః** – ఇక్కడ సు-శోభనమ్, నిర్వాణ ఫలమ్, దర్శనమ్-జ్ఞానమ్ – అనగా మోక్షప్రదమైన జ్ఞానస్వరూపుడు గనుక జగన్నాథుడు సుదర్శనుడు.

**శుభే దర్శనే-ఈక్షణే పద్మపత్రాయతే అస్య ఇతి సుదర్శనః** – తామరపూవు రేకులవంటి కన్నులు గలవాడు సుదర్శనుడు.

**రామః కమలపత్రాక్షః సర్వసత్త్వ మనోహరః రూప దాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాత్మజే** – సుందరకాండము 35.8

**సుఖేన దృశ్యతే భక్తైః ఇతి సుదర్శనః** – తన భక్తులకు సులభముగా దర్శనమిచ్చువాడు సుదర్శనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఈ 'సుదర్శనః' నామమును ఇందకు ముందు నామమైన 'ఋతుః'తో అనుసంధిస్తూ –సుదర్శన చక్రమునకు దేవత సుదర్శనుడు. ఆరు ఋతువులతో కాలము నిరంతరము తిరుగుచున్నట్లే ఆరు మొనలుగల సుదర్శనచక్రము మహాశక్తియుతమై పరిభ్రమించుచున్నది – అని వివరిస్తూ నృసింహపూర్వ (7.2) నుండి చెప్పిన ఆధారము –

**షడారమ్ వా ఏతత్ సుదర్శనమ్ మహాచక్రమ్ తస్మాత్ షడారమ్ భవతి**
**షడ్పత్రమ్ చక్రమ్ భవతి**
**షడ్వా ఋతవః ఋతుభిః సమ్మితమ్ భవతి మధ్యేనావిర్భవతి........**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతునకు సూర్యుడే నేత్రము. ఇంకా ఆయన అన్నింటా అంతర్యామి. కనుక విశ్వమలో అంతటినీ స్పష్టముగా చూడగల (దర్శించగల) భగవంతుని గుణవైభవము సుదర్శన నామమున తెలియవచ్చుచున్నది.

## 419. కాలః

- అందరిని తనవైపుకు లాగుకొనేవాడు.
- ప్రతిదానిని గణించి, హద్దులేర్పరచువాడు.
- తన శత్రువులకు మృత్యురూపుడు.
- అందరి కర్మలను లెక్కించి తదనుగుణముగ ఫలములిచ్చువాడు.

### ఓం కాలాయ నమః

కలనము చేయుట, అనగా లెక్కబెట్టుట – అనే అర్థములో ఈ నామమునకు వ్యాఖ్యానము చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **చరాచర సంకలనాత్ కాలః** – చలించువానిని, నిశ్చలమైనవానిని కూడ సంకలనము చేయువాడు, అనగా ప్రోగుచేయువాడు. అన్నింటిని తనయందు నిలుపుకొను ఆనందమయుడు.

శ్రీ శంకరుల భాష్యము – **కలయతి సర్వమ్ ఇతి కాలః** – అన్నింటిని లెక్కించువాడు. పరిమితులు విధించువాడు. అని శ్రీ శంకరులు గీత (10.30)నుండి ఉదాహరించారు – **కాలః కలయతామహమ్** – గణకులలో నేను కాలమును.

గీతలో ఈ భాగమునకు శ్రీ రామానుజుల భాష్యము – **అనర్థ ప్రేప్సుతయా గణయతామ్ మధ్యే కాలః మృత్యుః అహమ్** – అనర్థములు ప్రేరేపించువారికి నేను మృత్యువును. ఈ విషయానికి తిరుక్కళ్ళమ్ శ్రీ నృసింహ రాఘవాచార్యస్వామి 'అందరి కాలమును, అంతమును లెక్కించువాడు' అని వివరించారు. అనగా 'శత్రువులకు మృత్యువు' అని శ్రీ చిన్మయానంద వివరణ. శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా 'కాల స్వరూపుడు, కర్మఫలప్రదాత' అనే వివరించారు. **సర్వేశ్వరో విష్ణురేవ కాలో, యతో హి స కలయతి గణయతి, సమస్త ప్రాణి కర్మాణి, తదనుకూల ఫల ప్రదాయ.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – లెక్కించే వానిలో కాలము అన్నింటికంటె నిర్దిష్టమైనది. వ్యత్యాసమునకు ఆస్కారము లేనిది. అన్నింటిని వాని అంతమునకు కొనిపోవును. ఇది భగవత్స్వరూపము.

**కాలో హి నామ భగవాన్ స్వయంభూ అనాది మధ్య నిధనః స సూక్ష్మామపి కలామ్ న లీయతే ఇతి కాలః సంకలయతి కాలయతి వా భూతాని ఇతి కాలః** – శుశ్రుత సూత్ర 6.3.

## **420.** పరమేష్ఠీ

- పరమపదమునందు, అనగా వైకుంఠమునందు, ఉండువాడు.
- హృదయము అను గుహయందు ప్రకాశించువాడు.

### ఓం పరమేష్ఠినే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **పరమే స్థానే తిష్ఠతి ఇతి పరమేష్ఠీ** – శ్రీదేవుడు పరమపదమైన వైకుంఠమునందు వసించును. రాక్షస సంహారము అను లీల అనంతరము భగవంతుడు మరల పరమపదమును చేరును. శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (6.4.10)నుండి ఉదాహరించారు.

శంకరభాష్యము ననుసరిస్తూ శ్రీ చిన్మయానంద వ్రాసినద – హృదయమనే అద్భుతమైన, శ్రేష్ఠమైన గుహను కల్పించి, అందుండి ప్రకాశించువాడు. భక్తుల అనుభవమునకు ఆ విధముగా అందెడువాడు పరమేష్ఠి. ఇందుకు ప్రమాణముగా ఉదాహరించిన ఉపనిషద్వాక్యము – **పరమే వ్యోమ్ని ప్రతిష్ఠితః** (కఠోపనిషత్తు).

## **421.** పరిగ్రహః

- అంతటినీ తనతో తీసికొని వెళ్ళువాడు.
- శరణాగతులు భగవంతుని అన్నియెడలా పట్టుకొనియుందురు.
- భక్తితో అర్పించినది ఏదయినా గ్రహించువాడు.
- విశ్వములో అంతటిని తన అదుపులో నుంచినవాడు.

### ఓం పరిగ్రహాయ నమః

శ్రీ భట్టుల భాష్యము – **అత్ర తత్ర చ పరితో గ్రహః అస్య ఇతి పరిగ్రహః** – ఇక్కడా, అక్కడా, అన్నిచోట్లా అన్నింటినీ అంగీకరించువాడు. గుహుని ఆతిథ్యము, శబరి ఆతిథ్యము స్వీరించినవాడు. శ్రీరామావతారము పరముగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించిన నామములలో 'పరిగ్రహః'చివరిది. అవతార సమాప్తి కాలమున శ్రీరాముడు వైకుంఠమునకు పోవునపుడు సకల అయోధ్యావాసులను వృక్షములతో సహా తనతో తీసికొనివెళ్ళెను. శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి(7.5.1)లో ఈ విషయమును చక్కగా వర్ణించారు.

శ్రీరామావతారానుభవ విశేష వర్ణనలను ముగిస్తూ శ్రీ భట్టులు చెప్పిన విషయము – శ్రీరామావతారమున స్పష్టముగా కానవచ్చు భగవంతుని గుణము సౌశీల్యము. సామాన్యమానవునివలె దేవదేవుడు భూమిపై జన్మించి, వినయముతో విద్యనభ్యసించి, సీతామహాలక్ష్మిని చేబట్టి, వనవాస దీక్షను పూని, పత్నీ వియోగమున పరితపించి, హనుమంతుని సేవలను, వానరసైన్యము సహాయమును పరిగ్రహించి, రాక్షస సేనలతో యుద్ధము చేసి, రావణుని సంహరించి, లోకాపవాదమునకు వెరచి, సీతమ్మకు అగ్ని పరీక్ష పెట్టి, పిదప వైభవముగా పట్టాభిషిక్తుడై జనరంజకముగా పాలించినవాడు. అందరితోను వారిలోనొకడై కలిసిపోయినవాడు.

శ్రీ శంకరులు చెప్పిన వివిధ అర్థములు –

**పరితో గృహ్యతే** – శరణు కోరినవారిచే అన్నిప్రక్కల పట్టుకొనబడినవాడు (చుట్టుముట్టబడినవాడు).

**పరి గృహ్ణాతి ఇతి పరిగ్రహః** – పత్రము, పుష్పము, ఫలము, జలము వంటి స్వల్ప నివేదనలను భక్తులనుండి ప్రేమగా గ్రహించువాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **పరితః సర్వతః గ్రహణమ్** – తన శక్తితో జగత్తునంతటిని అదుపులోనుంచినవాడు.



శబరి ఆతిథ్యం స్వీకరిస్తున్న శ్రీ రామలక్ష్మణులు – తూర్పు యడవల్లి ఆలయంలో శిల్పం




శ్రీరాముని వైకుంఠ గమనం. 1650 కాలపు ఉదయపూర్ కు చెందిన చిత్రం. వికీపీడియా నుండి. By Sahib Din
https://commons.wikimedia.org/wiki/File:End_of_Rama.jpg

**412 నుండి 451 వరకు నామములు కల్క్యవతారము పరముగా వ్యాఖ్యానింపబడినవి.**

## 422. ఉగ్రః

- ఉగ్రుడు. భయముగొలుపువాడు. దుష్టులకు భయంకరుడు.

### ఓం ఉగ్రాయ నమః

ఇక్కడినుండి కొన్ని నామములు శ్రీభట్టుల వ్యాఖ్యలో కల్క్యవతార వర్ణనాపరముగా సాగును.
ఉచ్ – సమవాయే – ప్రోగుచేయుట. **ఉచ్యతీతి ఉగ్రః**

**నష్టే ధర్మే కల్కిరూపోహ్యవతార్య మహీభృతః మ్లేచ్ఛాదీన్హ తవాన్యోసౌ ఉగ్ర ఇత్యుచ్యతే బుధైః -** కలియుగాంతమున ధర్మము నశించి, పాపము విజృంభించినపుడు కల్కిరూపములో అవతరించి మ్లేచ్ఛులవంటి వారినందరినీ సంహరించే ఉగ్రమూర్తి. ఓం ఉగ్రాయ నమః.

**కల్కేన విష్ణుర్భగవాన్ నష్టధర్మాऽవతారకృత్**
**ఉర్వ్యాం మ్లేచ్ఛగణం హత్వాऽవస్థితోయః కలౌయుగే**

భగవానునిపట్ల భయమువలనే సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, ఇంద్రవరుణాదులు – అందరును తమతమ కర్తవ్యములను శ్రద్ధగా, సక్రమముగా, నిరంతరాయముగా నిర్వహిస్తున్నారు. అని కఠోపనిషత్తులో (తైత్తరీయోపనిషత్తు?) చెప్పబడినది.

## 423. సంవత్సరః

- పాతాళమున అనంతపద్మనాభుడై శయనించియున్నవాడు.
- సకల భూతములకు నెలవు.
- కాలస్వరూపుడు.

### ఓం సంవత్సరాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
10వ శ్లోకము. 92వ నామము. సంవత్సరః – **అహః సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః**
45వ శ్లోకము. 423వ నామము. సంవత్సరః – **ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – 'సం-వసతి' అనే మూలములనుండి శ్రీ భట్టులు ఈ నామమును వివరించారు.

**సంహారస్యోపకరణైః సాకం కాలం ప్రతీక్షయన్ సంవత్సర స్యాత్పాతాళే హ్యన్యంతే వసతీతియః -** కలియుగాంతమున సంహారకార్యమునకు కావలసిన పరికరాలతో, తగుసమయంకోసం ఎదురుచూస్తూ పాతాళమున అనంతునిపై శయనించినమూర్తి. సమయము వచ్చినపుడు కల్కిగా అవతరించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సంవసతి భూతాని అస్మిన్ ఇతి సంవత్సరః –** సకలభూతములు భగవానునియందు చక్కగా వసించును.

శ్రీ చిన్మయానంద – 'సంవత్సరము' అనగా (35 రోజుల) కాలప్రమాణము. భగవంతుడు కాలస్వరూపుడు. సకల అనుభవములు, అనుభూతులు జీవులకు కాలపరిధియందే సంభవించును.

92వ నామముగా చెప్పినపుడు వ్రాసిన వివరణ – భక్తులనుద్ధరించుటకై వెలసియున్నవాడు. కాలస్వరూపుడు.

## 424. దక్షః

- శీఘ్రముగా, వేగముగా ఉండేవాడు.
- ప్రవృద్ధి, శక్తి, శీఘ్రకారి – అనే మూడు గుణములు గలవాడు.
- సమర్థుడు.

### ఓం దక్షాయ నమః

45వ శ్లోకము. 424వ నామము. దక్షః – **ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః**
98వ శ్లోకము. 917వ నామము. దక్షః – **అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః**

'దక్ష' అనగా త్వరగా పెరుగుట – అనే ధాతువునుండి ఈ నామమును వివరించారు. ('దక్షిణ' అనే పదము కూడా ఇదే ధాతువునుండి వచ్చినది. యజమాని క్షేమమును పెంపొందించునది దక్షిణ.) దస్యులను, అనగా దుష్టును, కనురెప్పపాటులో సంహరించు కల్కిభగవానుడు దక్షుడు. **శీఘ్రార్థత్వాత్ దక్షధాతోః నిమేషాద్దస్యవో హతాః యేనసస్యాచ్ఛీఘ్రకారీ దక్ష ఇత్యుచ్యతే బుధైః**

శ్రీ వి.వి.రామానుజన్ నమ్మాళ్వార్ రచన(4.8.1)ను ఉదాహరించారు.

ఇదే నామము మరల 917వ నామముగా – **అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః** – అని స్తుతింపబడినది. అప్పుడు ఈ నామమును శ్రీ భట్టులు గజేంద్రమోక్షము పరముగా వ్యాఖ్యానించారు. గజేంద్రుని బ్రోచుటకై సిరికింజెప్పక, శంఖచక్రయుగముం జేదోయి సంధింపక, ఏ పరివారంబును జీరక, అభ్రకబతిం బన్నింపక, ఆకర్ణికాంత ధమ్మిల్లముం జక్కనొత్తక, వివాదప్రోత్థిత శ్రీకుచోపరి చేలాంచలమైన వీడక, గజప్రాణావనోత్సాహియై రొయ్యన వెడలిన గజరాజవరదుడే దక్షుడు.

శ్రీ చిన్మయానంద – దక్షత, సామర్థ్యము, ప్రజ్ఞ, ప్రతిభ, ప్రాభవములతో సృష్టి స్థితి లయాది సకల కార్యములను నిర్వహించువాడు దక్షుడు.

శ్రీ శంకరులు – 'దక్షః శబ్దము ద్వారా భగవంతుని మూడు గుణములు కొనియాడబడినవి – **ప్రవృద్ధః శక్తః శీఘ్రకారీ చ దక్షః** – చక్కని వృద్ధి కలిగినవాడు, శక్తి కలిగినవాడు, వేగము కలిగిన వాడు. పరమాత్మునకు ఇవి సహజలక్షణములు. ఆయన దక్షుడు.

## 425. విశ్రామః

- అందరికిని విశ్రమించే స్థానము.
- అందరికిని విశ్రాంతి ఇచ్చేవాడు.

### ఓం విశ్రామాయ నమః

శ్రమ అనంతరము లభించే శాంతియే విశ్రామము. **విశ్రామ్యతి యస్మిన్ సర్వమ్ ఇతి విశ్రామః** – సకల జీవులకును అంతమున (జీవితానంతరము, లేదా ప్రళయకాలమున) విశ్రాంతిస్థానము. షడూర్ములతోను (అనగా ఆకలిదప్పులు, శోకమోహములు,

జననమరణములతో), తాపత్రయములతోను, అరిషడ్వర్గములతోను బాధలు పొందువారికి శరణాగతియైన భగవంతుడే విశ్రాంతిస్థానము.

**విశ్రామయతి సర్వమ్ ఇతి విశ్రామః** – అందరికిని విశ్రాంతి కలుగజేయువాడు. పగలు అలసినవారికి రాత్రి, కర్మపీడితులైనవారికి మరణము, ఎండలో మాడువారికి నీడ – ఇలా అన్ని శ్రమలకు విశ్రామమార్గములు కల్పించిన భగవంతుడు విశ్రామః.

భగవంతుని తలచినంతనే కష్టములనుండి తరణోపాయము, దుఃఖమునుండి ఊరట, అలసటనుండి ఆరామము లభించును.

## 426. విశ్వదక్షిణః

- అందరిపట్ల సమముగా కరుణగలవాడు.
- అశ్వమేధయాగమున విశ్వమును దక్షిణగానొసగువాడు.
- అన్ని విషయములందు నేర్పరి.
- అందరికంటె నేర్పరి.

**ఓం విశ్వదక్షిణాయ నమః**

పై వివరణలలో మొదటి రెండు అర్థములను శ్రీ భట్టులు, తరువాతి రెండు అర్థములను శ్రీ శంకరులు చెప్పారు.



గుజరాత్ పటాన్ మ్యూజియంలో శ్రీ కల్కి శిల్పం. Photo by: Anurag choubisa
https://commons.wikimedia.org/wiki/File:Kalki_avatar_idol_in_rani_ki_vav_patan.jpg

**విశ్వస్మిన్ ఇష్ట అనిష్ట కారిణియా విశేషేన దక్షతే ఇతి విశ్వదక్షిణః** – అందరిపట్ల సమముగా దయజూపువాడు. త్రివిక్రముడై తన పాదముతో బలిని మాత్రమే కాక అందరిని పావనము చేసెను. (దాక్షిణ్యము అనగా క్షమాగుణము). **విశ్వమ్ దక్షిణా అస్య ఇతి విశ్వదక్షిణః.**

**యదాశ్వమేధే పృథివీం దక్షిణాత్వేన దత్తవాన్ మహాసురేభ్యః కృత్స్నాం యః స స్మృతో విశ్వదక్షిణః** - అశ్వమేధయాగము చేసి సమస్తమును బ్రాహ్మణులకు దక్షిణగానొసగినవాడు.

**తతశ్చోరక్షయ కృత్వా ద్విజేభ్యః పృథ్వీమిమాం**
**వాజిమేధ మహాయజ్ఞే విధివత్ కల్పయిష్యతి** – మహాభారతము. వనపర్వము. 191.1

**విశ్వేషు కర్మసు దాక్షిణ్యాత్ విశ్వదక్షిణః** – అన్నిపనులందు దక్షిణ (నైపుణ్యము) కలవాడు. సర్వసమర్థుడు. సర్వశక్తి భాండాగారము.

**విశ్వస్మాత్ దక్షిణః శక్తః** – అందరికంటె ఎక్కువ దక్షిణ (శక్తి, సామర్థ్యములు) గలవాడు. విశ్వములోని సమస్త జీవుల శక్తి, సామర్థ్యము, నైపుణ్యము, జ్ఞానము – అన్నియును భగవంతుని దక్షిణకు ప్రతిబింబములే. ఎందుకంటే అన్నివిధములైన శక్తిసామర్థ్యములు భగవంతునినుండియే కలుగుచున్నవి. కనుక భగవానుడు విశ్వదక్షిణుడు అని శ్రీ చిన్మయానంద వివరించారు.



## విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయం |
## అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః || (46)

### 427. విస్తారః

- (వేదములను) విస్తరింపజేయువాడు.
- అన్నింటియందు విస్తరించియున్నవాడు.
- అన్నింటిని తనయందు ఉంచుకొనుటకు (ప్రళయకాలమున) విస్తరించువాడు.

ఓం విస్తారాయ నమః

**ప్రబలం యః కలి హత్వా ప్రవర్త్య చ కృతం యుగం విస్తార్య వేద మర్యాదాం స్థితో విస్తార ఉచ్యతే -** కలిపురుషుని హతముచేసి, మరల కృతయుగమును ప్రర్తింపజేసి, వేదసమ్మతమగు మర్యాదలను అన్నింటినీ విస్తరింపజేయు కల్కిభగవానుడు విస్తారుడు – అని ఈ నామమును వ్యాఖ్యానిస్తూ శ్రీభట్టులు చెప్పిన ప్రమాణము.

**తతోఽధర్మ వినాశోవై ధర్మవృద్ధిశ్చ భారత**
**భవిష్యతి కృతే ప్రాప్తే క్రియావాంశ్చ జానస్తథా** – మహాభారతము. వనపర్వము 191.7

కృతయుగము రాగానే అధర్మము పూర్తిగా నాశనమై ధర్మము అభివృద్ధి జరుగుతుంది. మానవులు సత్కార్యములాచరించెదరు.

శ్రీ వి.వి. రామానుజన్ నమ్మాళ్వారు రచన (తిరువైమోళి 5.2.1.2)నుండి ఉదాహరించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు నానావిధ జీవవస్తురూపమున విశ్వమంతటా వ్యాపించియున్నాడు. ప్రళయకాలమున ఆయన విస్తరించి అన్నింటినీ తనలో లయము చేసుకొనును. కనుక 'విస్తారః' నామము రెండు విధములుగా వర్తించును (1) అన్నింటిలోపల వ్యాపించియున్నవాడు (2) అన్నింటిని తనలో ఇముడ్చుకొనుటకు వ్యాపించినవాడు. ఒక విత్తనములో చెట్టు ఇమిడియుండును. చెట్టులో విత్తనముండును.

యజుర్వేదములో ఈ భావము ఇలా రెండుచోట్ల చెప్పబడినది. (1) **తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః** (2) **ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యామ్ జగత్.**

ధర్మచక్రము రచయిత – శ్రీకృష్ణుడు అర్జునునకు అనుగ్రహించిన విశ్వరూపము 'విస్తారః'. అది ఆదిమధ్యాంత రహితము. అనంత నేత్ర ముఖ బాహు సంయుతము. శశిసూర్య నయన ప్రకాశవంతము. విస్తరించుటయే జీవితము అని స్వామి వివేకానంద అన్నారు. మనము భగవంతునిపై భక్తిని, ప్రేమను పెంచుకొన్నయెడల ఆయనకు దగ్గర కాగలము.

## 428. స్థావరస్థాణుః

- కృతయుగ ధర్మమును పునఃస్థాపించి, విశ్రమించువాడు.
- స్థావరములైన (చలనము లేని) భూమివంటివి ఆయనయందు ఉండును.
- చలనము లేనివాడు. ఆయనయందు భూమివంటివి ఉండును.

### ఓం స్థావరస్థాణవే నమః

ఇంతకుముందు చెప్పిన కొన్ని నామముల అర్థములను గుర్తు చేసుకొందాము.

28వ నామము. **స్థాణుః** – (4వ శ్లోకము) **సర్వః శర్వః శివః స్థాణుః భూతాదిః నిధిరవ్యయః** – స్థిరమైనవాడు. నిశ్చయముగ ఇష్టకామ్యములను సిద్ధింపజేయువాడు. వృద్ధి, క్షయ గుణములకు లోబడనివాడు.

121వ నామము. **శాశ్వతస్థాణుః** – (13వ శ్లోకము) **అమృతః శాశ్వతస్థాణుః వరారోహో మహాతపాః** – కాలముతో నిమిత్తము లేకుండ, నిశ్చలముగా, నిత్యమై, సత్యమై, నిరంతరమైనవాడు. ఆదిమధ్యాంత రహిత పరబ్రహ్మము.

ఇప్పటి 428వ నామము. **స్థావరస్థాణుః** – (46వ శ్లోకము) **విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్**

శ్రీ భట్టుల వ్యాఖ్య – కలియుగాంతమున దుష్టులను నాశనము చేసి, కృతయుగ ధర్మమును పునరుద్ధరించి, ఆపై శమించి, కదలకుండా ఉండువాడు స్థావరస్థాణువు. **స్థావరీకృత్య ధర్మాన్యః శమే స్థాస్యతి నిత్యశః యేనకేనాప్యచాల్యస్థః స్థావరస్థాణురుచ్యతే**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్థితి శీలః స్థావరః, స్థితిశీలాని పృథివ్యాదీని తిష్ఠంతి అస్మిన్ ఇతి స్థాణుః, స్థావరశ్చ అసౌ స్థాణుశ్చ స్థావరస్థాణుః** – కదలకుండే ఉండే లక్షణమున్నది స్థావరము. అటువంటివి ఎవరియందు ఉండునో ఆయన స్థాణువు. స్థావరము కూడాను, స్థాణువుకూడాను అయినందున స్థావరస్థాణువు. శ్రీ శంకరులు చెప్పిన ఈ వ్యాఖ్యకు రెండు విధాలైన వివరణలు లభిస్తున్నాయి (1) కదలిక లేని భూమివంటివి భగవంతుని యందు స్థిరముగా ఉన్నాయి (2) కదలిక లేనట్లు అనిపించే భూమివంటివి భగవంతునియందు ఉన్నాయి. కదలిక లేనివాడు, మిగిలినవానికి ఆధారమైనవాడు కూడా ఆయనే.

శ్రీ చిన్మయానంద వివరణ – భగవంతుడు స్థిరమైనవాడు (స్థావరః). భగవంతుడు నిశ్చలుడు (స్థావరః) అంతటా ఉన్నవాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ప్రళయకాలమువరకు ఉండే పంచభూతములు స్థావరములు. తన స్థితియందు మార్పు లేనిది స్థాణువు. మారని స్థితి గలవాడు, స్థావరములైన పంచభూతములకు నిలయమైనవాడు స్థావరస్థాణువు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ప్రజలు మార్గములో నడచి గమ్యము చేరుకొందురు. కాని మార్గము మాత్రము స్థిరముగానుండును. గర్భిణీ స్త్రీ నడచినపుడు గర్భములోని బిడ్డ నడవడంలేదు. భగవంతుడు అంతటినీ సృష్టించాడు గాని ఆయనమాత్రము స్థావరుడు.

## 429. ప్రమాణమ్

- సకల ధర్మమునకు, జ్ఞానమునకు, శాస్త్రమునకు మౌలికమైన ఋజువు.

### ఓం ప్రమాణాయ నమః

ఈ నామము మరల 959వ నామముగా వచ్చును.

46వ శ్లోకము. 429వ నామము. ప్రమాణమ్ – **విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయం**

103వ శ్లోకము. 959వ నామము. ప్రమాణమ్ – **ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః**

'మానము' అనగా కొలుచునది. ప్రమాణము అనగా అన్ని లెక్కలకు మూలము. అన్ని విషయములకు మౌలికాధారము. అధికారిక జ్ఞానము. ఎందువలనంటే సకల ధర్మములకు, శాస్త్రములకు, జ్ఞాన విజ్ఞానములకు నారాయణుడే సృష్టికర్త, ప్రమాణము.

**యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మ చ**
**వేదాః శాస్త్రాణి విజ్ఞానమేతత్ సర్వమ్ జనార్ధనాత్** – అని ఈ స్తోత్రము ఉత్తర పీఠికలో చెప్పబడినది.

**హితాహిత స్థాపకత్వాత్ ప్రమాణమ్ స్యాత్కృతాదిషు** – కృతయుగంలో ఉన్న జీవులకు మంచిచెడులు తెలియజేసి స్థిరమైన ఏర్పాట్లు చేసినవాడు. స్థిరమైన ప్రమాణాలు ఏర్పరచినవాడు.

**ప్రమీయతే అనేనేతి ప్రమాణమ్** – హితము చెప్పి ప్రమాణమునేర్పరచువాడు.

**తచ్ఛీల మనువర్తంతే మనుష్యాః లోకవాసినః** – లోకంలో నివసించేవారంతా ఆ పరమేశ్వరుని శీలాన్నే ఉత్తమమైనదిగా అనుసరిస్తారు.

## 430. బీజమవ్యయమ్

- నశించని బీజము.
- తాను మారకుండానే అన్నింటికి జన్మనిచ్చువాడు.
- మరల మరల (యుగాంతములందు) ధర్మస్థాపన చేయువాడు.

### ఓం అవ్యయాయ బీజాయ నమః

### ఓం బీజాయ అవ్యయాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – ప్రతి యుగాంతమున ధర్మము మరల మరల ప్రవర్ధిల్లుటకు కారణమైనవాడు గనుక ఆయన అవ్యయ బీజము.
**యో వై కలియుగస్యాంతే ముహుర్ధర్మ ప్రరోహణమ్ కరోతి భక్త రక్షార్థాం సోచ్యతే బీజమవ్యయమ్**

శ్రీ శంకరుల వ్యాఖ్య – తాను మారకుండానే అన్నింటికీ కారణమైనవాడు. అనగా ఒక చెట్టు మొలకెత్తినపుడు ఆ బీజము అంతటితో వ్యయమగును (ఖర్చై పోవును). కాని పరమాత్ముడు తాను అవ్యయుడై మరల మరల సృష్టి కావించును. **అన్యథా భావవ్యతిః ఏకేన కారణమ్**

ధర్మచక్రము రచయిత ఇదే వ్యాఖ్యను కొంచెం వైవిధ్యంగా వివరించారు. కొన్ని బీజాలు అసలు మొలకెత్తకుండా బీజాలుగానే ఉండి నశించిపోతాయి. కాని భగవంతుడు అలా వ్యయముకాని బీజము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి గీత (9.18)నుండి ఉదాహరించారు –
**గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాస శరణం సుహృత్**
**ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్**
పరమగతియైన పరంధామమును, జగత్తును భరించి పోషించువాడను నేనే. అందరికిని స్వామిని, అందరి శుభాశుభములను చూచువాడను నేనే. అందరికిని నివాస స్థానమును, శరణు పొందదగినవాడను నేనే. ప్రత్యుపకారమును ఆశింపక హితమొనర్చువాడను, అందరి ఉత్పత్తి, ప్రళయములకు హేతువును, వారి స్థితికి ఆధారమును, నిధానమును, శాశ్వత కారణమును నేనే.

ఈ గీతా శ్లోకమునకు భగవద్రామానుజుల భాష్యము – **తత్ర తత్ర వ్యయరహితమ్ యత్కారణమ్ తదహమ్ ఏవ** – నేను మాత్రమే అంతటా శాశ్వత మూలకారణములకు తరుగులేని బీజమును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **అజాయమానో బహుదా విజాయతే** – అనే వేదోక్తి ఇదే భావమును తెలుపుచున్నది. ఇంకా వ్యాకరణసూక్తి 'అవ్యయ' పదమునకు ఇలా చెప్పుచున్నది – **సదృశమ్ త్రిషు లింగేషు సర్వాసు చ విభక్తిషు వచనేషు చ సర్వేషు యన్నవ్యేతి తద్ అవ్యయమ్.** అనగా, మూడు లింగపదాలలోను, ఏక బహు వచన పదాలలోనూ, విభక్తి రూపాలలోనూ కూడా సమానమైన భావము, రూపము కలిగినది. వేరుగా చూడలేనిది. అది అవ్యయము.

## 431. అర్థః

- కోరబడువానిలో ఉత్తమమైనవాడు (అర్థింపబడువాడు).
- సచ్చిదానంద స్వరూపుడైనందున అందరు ఆయనను కోరుకొందురు.

### ఓం అర్థాయ నమః

అర్థమనగా అర్థింపబడునది. **పరమై కాంతిభిర్నిత్యం ఈషణత్రయ వర్జితైః స్వయం ప్రయోజనతయా యాద్యమానోऽర్థ ఉచ్యతే.** ఈషణత్రయమును (ధనేషణ, దారేషణ, పుత్రేషణ) వదలి, తననే ఆరాధించు భక్తులచే, తానే పురుషార్థముగా భావించబడువాడు. శ్రీ భట్టులు భగవద్గీత (7.19)నుండి ఉదాహరించారు.

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః**

అనేక జన్మల తరువాత జ్ఞానియైనవాడు సర్వము పరమేశ్వరమయము అని భావించి నన్ను శరణు పొందుతాడు.

శ్రీ శంకరుల భాష్యము – **సుఖరూపత్వాత్ సర్వైః అర్థ్యత ఇతి అర్థః** – భగవంతుడు ఆనందమూర్తి. కనుక అందరు ఆయనను కోరుకొంటారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ప్రపంచములో ప్రజలు కోరుకొనే ఎన్నో విషయములు తుదకు దుఃఖమును కలిగించును. కాని భగవంతుడే పరిపూర్ణ ఆనందస్వరూపుడనీ, ఆయననే కోరుకొనదగుననీ జ్ఞానులెరుగుదురు.

## 432. అనర్థః

- అల్పభాగ్యులు (శాశ్వతమైన ఆనందము కోరనివారు) ఎవరిని అర్థించరో అతడు.
- అన్ని కోరికలు నెరవేరినవాడు. పొందవలసిన కోరికలు లేనివాడు. పూర్ణుడు, పూర్ణకాముడు, పరిపూర్ణుడు.

### ఓం అనర్థాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – తగినంత వివేకము లేనివారు అశాశ్వతమైన అర్థకామములవెంట వెంపర్లాడుతారు. కనుక వారు పరంధాముని (సరిగా) అర్థించరు. భోగకాములకు భగవంతుడు అనర్థుడు. **అర్థార్థినాऽల్పభాగ్యేన నిర్వ్యాజం నార్థ్యతేయతః తస్మాదనర్థనా మాసౌ వేదవిద్భిః ప్రకీర్తితః**

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవానుడు పొందవలసినవేవీ లేవు. ఆయన పూర్ణకాముడు. ఆయనే అందరికి కొండలంత వరములు గూపెడు కోనేటిరాయడు. సిరిగలవాడు. అనర్థుడు.

ధర్మచక్రము రచయిత వివరణ – సదుపాయములు పెరిగినకొలదీ ఆధునికుల జీవితములు సంక్లిష్టములై దుఃఖములకు దారి తీయుచున్నవి. జనుల కోరికలునానాటికి అధికములై శాంతి దూరమగుచున్నది. కోరికలను అదుపులో పెట్టుకొని సాగించే జీవనవిధానమే శ్రీదేవుని ధ్యానించు అకాశమును కలిగించి శాశ్వతమైన సౌఖ్యమునకు సోపానమగును.

**శ్రీ దుర్గా ఆపదుద్ధారక స్తోత్రము**

నమస్తే శరణ్యే శివే సానుకంపే నమస్తే జగద్వ్యాపికే విశ్వరూపే
నమస్తే జగద్వంద్య పాదారవిందే నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

నమస్తే జగచ్చింత్యమాన స్వరూపే నమస్తే మహాయోగిని జ్ఞానరూపే
నమస్తే నమస్తే సదానంద రూపే నమస్తే జగత్తారిణి త్రాహి దుర్గే

అనాధస్య దీనస్య తృష్ణాతురస్య భయార్తస్య భీతస్య బద్ధస్య జంతో
త్వమేకా గతిర్దేవి నిస్తార కర్త్రీ నమస్తే జగత్తారిణి త్రాహిదుర్గే

అరణ్యే రణే దారుణే శత్రుమధ్యే నలే సాగరే ప్రాంతరే రాజగేహే
త్వమేకా గతిర్దేవి నిస్తారనౌకా నమస్తే జగత్తారిణి త్రాహిదుర్గే



చిత్రం – మస్కట్ శ్రీ అమ్మవారి గుడిలోని చిత్రపటం. చిత్రకారుడు – శ్రీ ముసలయ్య, మార్టేరు. ప.గో. జిల్లా, ఆంధ్రప్రదేశ్

## 433. మహాకోశః

- గొప్ప నిధి (ధనాగారము) కలవాడు. ఎన్నటికీ తరగని శంఖపద్మ నిధులు గలవాడు.
- గొప్ప నిధి. తరగని పెన్నిధి.
- ఐదు కోశములు ఆవరణములుగా గలవాడు.

### ఓం మహాకోశాయ నమః

**మహాంత కోశా యస్య సః మహాకోశః.** కోశము అనగా నిధి. మహాకోశము అనగా తరుగులేని పెద్ద నిధి. ఎవరికెంత భాగ్యమునిచ్చినా ఆయన సంపద తరగదు. చిత్ర విచిత్రములైన గ్రహనక్షత్ర జీవ చరాచర జాలమును, బ్రహ్మాండములను సృష్టించినా ఆయన తరిగిపోడు. కనుక ఆయన మహాకోశము. **శంఖపద్మాది నిధయః మహాంతో రోహణో గిరిః కోశభాండ గృహా యస్య మహాకోశస్స ఉచ్యతే**

శ్రీ శంకరులు కోశము అనగా 'ఆవరణ' (చుట్టూ ఉండే వలయము, లేదా కవచము) అనే అర్థంలో వ్యాఖ్యానించారు. శరీరంలో ఉండే కోశములు ఐదు.

(1) అన్నమయ కోశము – ఇంద్రియములను నియంత్రించి యోగులు దీనిని దాటవచ్చును.

(2) ప్రాణమయ కోశము – శ్వాసను నియంత్రించి దీనిని దాటవచ్చును.

(3) మనోమయ కోశము – మనస్సును నియంత్రించి దీనిని దాటవచ్చును.

(4) విజ్ఞానమయ కోశము – జ్ఞానమును నియంత్రించి దీనిని దాటవచ్చును.

(5) ఆనందమయ కోశము – ఆత్మను నియంత్రించి దీనిని దాటవచ్చును.

ఇలా సాధన ద్వారా యోగులు వివిధ కోశములను అధిగమించవచ్చును. ఈ పంచకోశములు ఆవరణగా ఉన్నవాడు నారాయణుడు.

పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. అన్నాన్ని ఎన్నడూ నిందించరాదు. ప్రాణము, మనస్సు అన్నీ అన్నంపైనే ఆధారపడి ఉన్నాయి. అన్నాన్ని నిర్లక్ష్యం చేయకుండా, జీవించడానికి సరిపడా నియమం ప్రకారం తినాలి. అన్నాన్ని పూజిస్తే తరువాతివన్నీ లభిస్తాయి. అందుకని ఆహారాన్ని వదలకుండా, ప్రాణాన్ని నిలుపుకుంటూ, మనస్సును వికసింపజేసుకొని, విజ్ఞానానుభవంనుండి బ్రహ్మానందం పొందాలి. (తైత్తరీయోపనిషత్తులో వరుణమహర్షి తన కుమారుడు భృగుమహర్షికి ఉపదేశించాడు.)

## **434.** మహాభోగః

- సుఖమునొసగు మహాభోగములు గలవాడు.
- తన్నాశ్రయించిన భక్తులందరికిని సుఖ భోగ ఆనంద శాంతులను సమకూర్చువాడు.

### ఓం మహాభోగాయ నమః

**మహాన్ భోగః యస్మాత్ స మహాభోగః** – ధనముతో సాధింపదగిన మహత్తరమైన కామభోగములు ఆ శ్రీనివాసునివల్లనే లభించును గనుక ఆయన మహాభోగుడు అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **అర్థసాధ్యః కామభోగో యస్మాదేషాం మహానిత్తి మహాభోగ స్స విజ్ఞేయా హ్యస్మార్ణః చింతితార్థదః -** ధనముతో సాధింపదగిన మహత్తరమైన కామభోగాలు తనవల్లనే లభిస్తున్నట్లుగా ఉండేవాడు. ఈ నామాన్ని 'ఓం మహాభోగాయ నమః' అనే అష్టాక్షరీ మంత్రంగా జపం చేస్తే కోరిన ధనం లభిస్తుంది.

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమోహతే**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హితాన్** – గీత 7.22

అటువంటి కోరికలుగల భక్తుడు భక్తిశ్రద్ధలతో ఆ దేవతనే ఆరాధిస్తాడు. తత్ఫలితముగా నా అనుగ్రహము వల్లనే ఆ దేవత ద్వారా తాను కోరిన భోగములు పొందుతాడు.

**మహాన్ భోగాన్ నందరూపః అస్య ఇతి** – ఆనందరూపమయిన గొప్ప భోగము ఇతడికి ఉన్నది. సచ్చిదానంద స్వరూపుడు గనుక పరమేశ్వరుడు 'మహాభోగః' అనబడుచున్నాడు. తనను ఆశ్రయించినవారికి అన్నిరకాల భోగాలను ఇచ్చేవాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు మహాభోగి.

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వార్ రచన (310.3)నుండి ప్రస్తావించారు. భగవంతుడు అంతు, హద్దు లేని భోగములు కలిగియున్నాడు (**ముత్తు ఇల్ పాల్ భోగత్తొరు తనినాయకన్**).

ధర్మచక్రము రచయిత – కొన్ని ఆనందములు కోరుకొనదగిన ఫలితములనిచ్చును. కొన్ని దుఃఖహేతువులగును. ఆకలి తీర్చుకొనునంత తిన్నవానికి అనారోగ్యములేదు. రుచికొరకు తినేవాడికి ఇబ్బందులు కలుగును. జూదము, మద్యపానము,

ధనాపహరణ వంటివి దుఃఖములకు దారితీయును. భగవంతుడు ఆత్మజ్ఞానమునకు, శాశ్వత సచ్చిదానందమునకు, అత్యుత్తమములైన సౌఖ్యములకు ఆలవాలము. కనుక ఆయన మహాభోగి.

## 435. మహాధనః

- అపారమగు సిరిగలవాడు. తన భక్తులకు ధన కనక వస్తు వాహన విశేషములన్నియును వర్షింపజేయును.

### ఓం మహాధనాయ నమః

**అనిరూప్యేతి కృపణ ప్రదేయం ధనమక్షయం యస్యైవాస్తీతి సతతం స మహాధన ఈరితః -** అమితమైన ధనముగలవాడు మహాధనుడు. **మహత్ ధనం యస్య సః మహాధనః** – అతి పిసినారికి గాని, పరమ దరిద్రునకు గాని ఎంత ఇచ్చినా తరగని ధనముగలవాడు మహాధనుడు. శ్రీ భట్టులు తమ వ్యాఖ్యలో విష్ణుపురాణము (1.8.23) నుండి ప్రమాణము చెప్పారు –

**మరీచి మిశ్రైః దక్షేణ తథైవ అన్యాయైః అనంతతః**
**ధర్మః ప్రాప్తః తథాచ అన్యైః అర్థ కామ తథా పరైః**
మరీచి, దక్షుడు వంటివారు ఆ పరమేశ్వరునినుండి ధర్మము అమితంగా పొందారు. అలాగే కొందరు సంపదలను, కొందరు కామములను పొందారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు 'మహాధనము' కలిగియున్నాడు (435వ నామము). అది 'మహాకోశము'లో నున్నది (433వ నామము). అది 'మహాభోగము'ను ప్రసాదించును (434వ నామము).

ధర్మచక్రము రచయిత – ప్రాపంచిక ధనము, జ్ఞానము, భక్తి అనేవి మూడు ధనములు. వీటిలో ధనము, జ్ఞానము లభించినవారు జనులనుండి ప్రశంసలు పొంది, తద్వారా గర్వాంధులవుతారు. కాని భక్తి అనే సంపద కలిగినవానికి భగవంతుని ప్రశంస మాత్రము లభిస్తుంది. ఆసంపదవల్ల కలిగే సచ్చిదానంద శాశ్వత వైభోగము భగవంతుడే.

పట్టాభిషేక సమయమున శ్రీరాముడు అందరికిని విలువైన కానుకలిచ్చెను. కాని హనుమంతునకు ఏమీ ఇచ్చినట్లు కనిపించలేదు. సీతమ్మ తల్లి అందుకు కారణమడుగగా శ్రీరాముడు తాను హనుమంతునకిచ్చినది వేరెవరికిని తెలియదని, హనుమంతునే అడిగి తెలుసుకొనమని చెప్పెను. సీతమ్మతల్లి ఆ విషయం అడుగగా అంజనీసుతుడు తన హృదయంలో నెలకొనియున్న సీతారాములను చూపెను. ఇదే మహాధనము. తనను నమ్ముకొన్నవారికి శ్రీ మహావిష్ణువు స్వయముగా తననే ప్రసాదించును. కనుక ఆయనే మహాధనము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అందరూ కోరుకొనే తరగని, నశించని, కొలువరాని పరమానందమనే మహాధనము గనుక ఆయన మహాధనుడు.

(శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి) **అర్థార్థీ చార్థమాప్నుయాత్ కామానవాప్నుయాత్ కామీ** – ధనము కోరువారికి ధనమును, కోరికలు గలవానికి కోరినవియును వర్షించునని ఈ స్తవరాజము ఉత్తరపీఠికలో తెలుపబడియున్నది. అర్థః, అనర్థః, మహాకోశః, మహాభోగః, మహాధనః అను నామములు భగవానుని ధనసమృద్ధిని సూచించుచున్నవి. కనుక భక్తులు చాలమంది ఈ నామములను జపించుచు సకల దారిద్ర్యములనుండియు విముక్తిని పొందుచున్నారు.



## అనిర్విణ్ణః స్థవిష్ఠోభూర్ధర్మయూపో మహామఖః |
## నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః || (47)

### 436. అనిర్విణ్ణః

- విరామము, నిరాశ, నిర్వేదము లేకుండా సృష్టికార్యము సాధించువాడు.
- కోరికలు లేనివాడు, పరిపూర్ణుడు కనుక నిరాశ చెందనివాడు.

**ఓం అనిర్విణ్ణాయ నమః**

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

47వ శ్లోకము. 436వ నామము. అనిర్విణ్ణః – **అనిర్విణ్ణః స్థవిష్ఠోభూర్ధర్మయూపో మహామఖః**

95వ శ్లోకము. 893వ నామము. అనిర్విణ్ణః – **అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – జనులు సంసారబద్ధులై, లౌకికవాంఛాప్రీతిపరులై, పరమేశ్వరుని అలక్ష్యం చేసినాగాని విసుగు చెందక మరల మరల సృష్టికార్యం కొనసాగించువాడు అనిర్విణ్ణుడు. **అనిర్విణ్ణో జాగరూకో జగద్వ్యాపార సంతతౌ.**

శ్రీ వి.వి.రామానుజన్ నమ్మాళ్వారు పెరియతిరువంతాది (18)నుండి ఉదాహరించారు. **సోంబాదు ఇప్పల్లురువాయ్ ఎల్లామ్ పడర్ విత్తవిత్తా.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు పరిపూర్ణుడు. పూర్ణకాముడు. ఆయనకు కావలసినదేదీ లేదు. కనుక ఆయన నిర్విణ్ణ భావము చెందనివాడు.

ధర్మచక్రము రచయిత వివరణ – సత్వభావముతో కర్మలు చేసేవారికి నిరాశ, నిస్పృహ భావములు కలుగవు. రజస్తమోభావములతో ఆచరించే కర్మలు నిరాశకు, నిస్పృహకు దారి తీస్తాయి.

### 437. స్థవిష్ఠః

- విరాట్ రూపముతో సర్వమయుడై యున్నవాడు. బ్రహ్మాండమును తనలో ఇముడ్చుకొన్న బృహద్రూపి.
- నక్షత్రమండలమున శింశుమార రూపియై ప్రకాశించువాడు.

**ఓం స్థవిష్ఠాయ నమః**

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

6వ శ్లోకము. 53వ నామము. స్థవిష్ఠః – **విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః**

47వ శ్లోకము. 437వ నామము.స్థవిష్ఠః – **అనిర్విణ్ణః స్థవిష్ఠో భూర్ధర్మయూపో మహామఖః**

'స్థూల' అనగా పెద్ద – అనే పదము ఆధారంగా 'స్థవిష్ఠః' నామమును వివరించారు. **స్థౌల్యాత్ స్థవిష్ఠః**. విష్ణుపురాణము (2.9.1)లోని శింశుమార చక్రము వర్ణన ఆధారంగా శ్రీ భట్టులు ఈ నామమును వివరించారు.

**శింశుమారాకృతితయా తారారూపేణ సర్వదా స్థౌల్యాత్ స్థవిష్ఠ సంప్రోక్తః సప్తార్ణః పాపనాశనః** - నక్షత్రమండలమునందు శింశుమార చక్రము రూపముననున్నవాడు. స్థూలమైనందున స్థవిష్ఠుడనబడును. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సర్వపాపహరము. ఓం స్థవిష్ఠాయ నమః. (శ్రీకైవల్య సారధి).

శ్రీ శంకరాచార్యులు ముండకోపనిషత్తు (2.1.4)నుండి ప్రమాణము చెప్పారు. **అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ** – ఈ పరబ్రహ్మకు అగ్ని శిరస్సు. సూర్యచంద్రులు నేత్రాలు. దిక్కులే చెవులు. వేదాలు వాక్కు. వాయువు ప్రాణం. జగత్తే అతని హృదయం. అతని పాదాలనుండి భూమి పుట్టింది. అతడే సమస్త భూతాలలోను ఉండే అంతరాత్మ.

**అతిశయేన స్థూలః** – మిక్కిలి లావైనవాడు. విరాడ్రూపంతో స్థూలప్రపంచాభిమానిగా (వైశ్వానరుడై) ఉన్నాడు.

**అనేకబాహూదర వక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప** – భగవద్గీత 11.16

ఓ విశ్వేశ్వరా! విశ్వరూపా! నీ బాహువులు, ఉదరములు, నేత్రములు అసంఖ్యాకములు. అనంతమైన నీ రూపము సర్వతోముఖముగా వర్ధిల్లుతున్నది. నీవు ఆద్యంతరహితుడవు. నీ దివ్యరూపానికి ఆది, మధ్య, అంతము లేదు.

శ్రీ మద్భాగవతంలో 2.1.24 నుండి 2.1.38 శ్లోకములలో భగవంతుని విరాడ్రూపము వర్ణన ఉన్నది. తైత్తరీయారణ్యకము (2.19)లో భగవంతుని శింశుమార స్వరూపమును వర్ణించారు.

**తస్మై సమస్తచ్ఛిరో ధర్మో మూర్ధానమ్ బ్రహ్మోత్తరా విష్ణు హృదయమ్ .....**
**స వా ఏష దివ్యః సాక్వరః శింశుమారః**

<u>విష్ణుపురాణంలో శింశుమారరూప వర్ణన –</u>

**తారామయం భగవతశ్శింశుమారకృతి ప్రభో**
**దివిరూపం హరేర్యత్తు తస్య పుచ్ఛేస్థితో ధ్రువః**
**సైషభ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యాదికాన్ గ్రహాన్**
**భ్రమన్తమతు తం యాన్తి నక్షత్రాణి చ చక్రవత్**
**సూర్యచంద్రమసౌ తారా నక్షత్రాణి గ్రహైస్సహ**
**వాతానీకమయై బంధైర్ధ్రున్ వే బద్ధాని తానివె**
**శింశుమారాకృతి ప్రోక్తం యద్రూపం జ్యోతిషాన్దివి**
**నారాయణోఽయనం ధామ్నాం తస్యాధార స్వయం హృది ......**
**తదాధారం జగచ్ఛేదం స దేవాసుర మానుషమ్ ........**
**ఆకాశ గంగా సలిలం తథాऽऽదాయ గభస్తిమాన్**
**అన భ్ర గతమే వోర్వ్యాం సద్యః క్షిపతి రశ్మిభిః ......**
**ఉభయం పుణ్యమత్పృథనం నృణాం పాపహరం ద్విజ**
**ఆకాశగంగా సలిలం దివ్యం స్నానం మహామునే .......**



ధ్రువునకు వరమిస్తున్న శ్రీ మహావిష్ణువు.
1940 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:1940s_Indian_Vintage_Print_Vishnu_With_Bhakta_Dhurva.jpg

**ఆధారభూత స్సవితు ర్ధ్రువ వో మునివరోత్తమ**
**ధ్రువస్య శింశుమారోసౌ సోపి నారాయణాశ్రయః**
**హృది నారాయణస్తస్య శింశుమారస్య సంస్థితః**
**తద్భుతాన్ సవన్ భూతానామాది భూతస్సనాతనః**

భగవానుడైన విష్ణువు నక్షత్రమయమై 'శింశుమార' స్వరూపమున వెలుగుచున్నాడు. దాని తోకయందు ధ్రువుడున్నాడు. ఆ శింశుమారాకృతియే చంద్రసూర్యాది గ్రహములను గిఱ్ఱున త్రిప్పుచున్నది. అట్లు తిరుగుచున్న దానివెంట నక్షత్రములు చక్రములవలె తిరుగుచున్నవి. సూర్యచంద్రులు, తారా నక్షత్రములు, గ్రహములతో కూడ వాయుమయమైన గట్టిత్రాళ్ళతో (సప్తవాయువులచే) ధ్రువునియందు కట్టబడియున్నది.

జ్యోతిస్వరూపమైన యీ శింశుమారాకారముయొక్క హృదయమునందు తారాస్వరూపమున నారాయణుడే స్వయముగా దానికాధారమైయున్నాడు. తారామయమైన శింశుమారముయొక్క తోకయందు, జగత్పతియైన ఆ నారాయణు నారాధించుచు ఉత్థానపాదుని కుమారుడగు ధ్రువుడున్నాడు.

సర్వాధ్యక్షుడైన జనార్దనుడు శింశుమారమునకు, శింశుమారము ధ్రువునకు, ధ్రువుడు సూర్యునకు ఆధారముగానున్నారు. ఆ సూర్యుడు దేవాసుర మనుష్యులతోకూడి ఈ జగత్తునకాధారముగా నున్నాడు.

ఆకాశగంగయందలి నీటిని సూర్యుడు గ్రహించి, దానిని తన కిరణములచేతనే భూమిపై వర్షించుచున్నాడు. దాని స్పర్శచే మానవుడు పాపముల బాసి పుణ్యలోకములకు పోవును. దానికే దివ్యస్నానమని పేరు. సూర్యుడు కనపడుచుండగనే మేఘముల మూలమున కాక సూర్యుని కిరణముల చేత  ఆకాశగంగాజలము కృత్తికానక్షత్రము మొదలుకొనియున్నవానిలో బేసి నక్షత్రములయందు ఆకాశమునుండి వర్షింపబడు ఆ జలము దిగ్గజములచే వర్షింపబడు గంగోదకమని పేరు గాంచినది. సరి నక్షత్రములయందు, అనగా రోహిణి, ఆర్ద్ర మొదలగు వానియందున్న సూర్యుని కిరణములచే ఆకర్షింపబడి వర్షింపబడు ఆకాశగంగాజలము కూడ చాలా పుణ్యమైనది. పాపహరము. పుణ్యస్నానమను వాడుక దీనికే. మేఘములచే వర్షింపబడు నీరు ఓషధులను పెంచును. అది జీవనాధారముగను అమృతమని పేరొందినది.

యజ్ఞములు, వేదములు, వర్ణములు, సర్వదేవతలు, పశువులు, భూతములు మొదలగునవియెల్ల వర్షముచే నిలుచుచున్నవి. అన్నము వృష్టి (వర్షము)చే నేర్పడుచున్నవి. ఆ వృష్టికాధారము సూర్యుడు సూర్యుడు. అతనికాధారము ధ్రువుడు. ధ్రువునికాధారము నారాయణుడు. దానిహృదయమందే ఆ నారాయణమూర్తి యున్నాడు. సర్వభూతములకు అతడే మొదలయి, సనాతనుడయి ఉన్నాడు. ఈ విధముగా నక్షత్రమండలంలో ప్రకాశిస్తున్న శ్రీమన్నారాయణుడు 'స్థవిష్ఠః' అనబడుతున్నాడు.

*(ఈ నామ వివరణలో అధికభాగం డా. క్రోవి పార్థసారధి రచన 'శ్రీకైవల్యసారధి'నుండి తీసుకొన్నాను)*

## 438. భూః

### అభూః

- మరే ఆధారము లేకుండా ఉండేవాడు గనుక నిజమైన ఉనికిగలవాడు భగవంతుడు మాత్రమే.
- శింశుమార చక్రమునకు ఆధారమైన ధ్రువుడు.
- జన్మము లేనివాడు.

### ఓం భువే నమః

### ఓం అభువే నమః

ఈ నామమును శ్రీ భట్టులు 'భూః' అని చెప్పారు. శ్రీ శంకరులు 'అభూః' అని పరిగణించారుగాని, 'భూః' అనే నామాంతరాన్నికూడా పేర్కొన్నారు.

భూః – 'భావ్'నుండి – ఉనికి కలిగియుండుట. మిగిలినవన్నీ మరొక ఆధారముపై నియమితకాలంలో ఉంటాయి. కాని శ్రీనాథుడు వేరే ఆధారములేని నిజమైన ఉనికిగలవాడు.

శింశుమార చక్రమునకు తోక స్థానములో ధ్రువుడు ఆధారము. శ్రీవాసుదేవ సేవాపరాయణుడైన ధ్రువుడు భగవంతుని అంశయే. అలా భగవంతుడు శింశుమార చక్రమునకు ఆధారము – అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **ఔత్తానపాది సంబంధాత్ సర్వాధారతయా తథా భవతీతి చ భూః ప్రోక్తః భక్తానాం భూతిదో మనుః** - ఈ నామజపము భక్తులకు ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. ఓం భువే నమః. (శ్రీకైవల్య సారథి).

శ్రీ రామానుజన్ తిరువైమొళి (5.6.5), తిరుచ్చందారువిత్తమ్ (6)నుండి ఉదాహరిస్తూ, భూమిని భరించే ఆదిశేషునికి ఆధారమైనవాడు 'భూః' అని వివరించారు.

నమ్మాళ్వార్ – **తిఱంబామల్ మణ్ కాక్కిన్ఱేన్ యానే** ....

తిరుమళిసాయి ఆళ్వార్ – **నాగమేందు మణ్ణినాయ్ ... ... కాత్తు** (తిరుచ్చందారువిత్తం).

శ్రీ శంకరులు **'అభూః'** అనగా జన్మించనివాడు – అని చెప్పారు. **న భవతి న జాయతే.**

**'భూః'** అనే నామాన్ని కూడా శ్రీ శంకరులు గుర్తించారు.

## 439. ధర్మయూపః

- ధర్మమునకు ఆధారము, నిలయము అయినవాడు.
- ధర్మమే శిరస్సుగాగల ధర్మస్వరూపుడు.
- ప్రాణములను నిలుపు పంచభూతములను కలిపియుంచువాడు.

### ఓం ధర్మయూపాయ నమః

యజ్ఞములందు యజ్ఞపశువును బంధించు స్తంభమునకు 'యూపము' అని పేరు. విష్ణువురూపంలో అన్ని ధర్మాలు కట్టివేయబడి ఉంటాయి. ఆత్మసాక్షాత్కారానికి సాధనాలయిన ధర్మాలన్నీ అతనియందే బంధింపబడియుంటాయి. శ్రీ భట్టుల వ్యాఖ్యానం – **ధర్మతత్వం శిరః అవయవతాయ యౌతి ఇతి ధర్మయూపః.**

**తస్మై నమస్ తచ్ఛిరో ధర్మః** – తైత్తరీయారణ్యకము.

**ఉత్తమాంగతయా ధర్మతత్వం యౌతీతి సర్వదా ధర్మయూప స్సమాఖ్యాతో హ్యష్టార్ణోధర్మదాయకః** - సర్వదా ధర్మమే శిరస్సుగాగలవాడు ధర్మయూపుడు. ఈ నామము అష్టాక్షరి. ధర్మదాయకము. ఓం ధర్మయూపాయ నమః. (శ్రీకైవల్య సారథి).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమునకు మరొక అనుభవం మనకు ప్రసాదించారు. **ధారయతి ఇతి ధర్మః** – ధరించునది ధర్మము. యూపమనగా బంధించు గుంజ. ఈ జగత్తులో జీవులను బంధించునవి (నిలబెట్టునవి) పంచభూతములు. అలా ధరించే పంచభూతాలను కలిపికట్టివేసేవాడు గనుక భగవానుడు 'ధర్మయూపః'

ధర్మచక్రము రచయిత – ధర్మము, భగవానుడు వేరువేరు కాదు. ధర్మమార్గమున వర్తించువారికి భగవంతుని కావలి తథ్యము. అదేమాట భీష్ముడు దుర్యోధనునికి చెప్పాడు.

## 440. మహామఖః

- గొప్ప యజ్ఞము. యజ్ఞస్వరూపుడు. పూజ్యమైన యజ్ఞము అవయవముగా గలవాడు.
- ఆయనకు అర్పింపబడు యజ్ఞాలు మోక్షఫలాన్నిస్తాయి.

**ఓం మహామఖాయ నమః.**

'మఖము' అనగా యజ్ఞము. సక్రమముగా యజ్ఞమును చేసినవారికి కోరుకున్న ఫలము సిద్ధిస్తుంది. భక్తుల కోరికలన్నీ నెరవేర్చేవాడు గనుక శ్రీదేవుడు మహామఖుడు.

**ధర్మదేహతయా పూజ్యో యజ్ఞోऽస్యావయవో యతః అతో మహామఖః ప్రోక్తో హ్యష్టార్ణః కర్మకారకః** - పరమేశ్వరుడు ధర్మమే శరీరముగా గలవాడు. అందుచేత పూజ్యమైన యజ్ఞము అవయవముగా గలవాడై, 'మహామఖః' అనబడును. ఈ నామము అష్టాక్షరీమంత్రము. పుణ్యకర్మలను చేయిస్తుంది. ఓం మహామఖాయ నమః. (శ్రీకైవల్య సారధి).

**మహాన్తః భవంతి మఖాః యజ్ఞాః నిర్వాణ లక్షణం**
**ఫలం ప్రయచ్ఛంతః సంతః యస్మిన్ సమర్పితా**
ఎవనియందు సమర్పింపబడే యజ్ఞాలు గొప్పవిగా అయి మోక్షఫలాన్ని ఇస్తున్నాయో, అట్టి మహానుభావుడు – అని శ్రీ శంకరుల భాష్యము. శ్రీనివాసునకు సమర్పింపబడే సత్కర్మలన్నీ జన్మరాహిత్యాన్ని ప్రసాదిస్తాయి.

## 441. నక్షత్రనేమిః

- నక్షత్రములను నడుపువాడు.
- శింశుమార చక్రమునకు ఇరుసువలె హృదయస్థానమున నున్నవాడు.

**ఓం నక్షత్రనేమయే నమః**

నక్షత్రములు – **న క్షరతి క్షీయతే వా** – క్షీణించనివి; నేమి – **నయతి ఇతి** – నడిపించువాడు.

**యన్నక్షత్రాత్మకం చక్రం జ్యోతిరూపమనామయం యస్తన్నిత్యం భ్రామయతి భ్రమంత మనుయాతి చ నక్షత్రనేమిర్విజ్ఞేయో నవార్ణో భ్రమనాశకః** - తేజోరూపకమైనది, ఆరోగ్యప్రదమైనది అయిన నక్షత్రరూప చక్రాన్ని నిరంతరము ప్రవర్తింపజేస్తూ, దానిని అనుసరించి చరించేవాడు. ఈ నవార్ణమంత్రము భ్రమనాశకము. ఓం నక్షత్రనేమయే నమః.

**జ్యోతిశ్చక్రమ్ నయతి ఇతి నక్షత్రనేమిః** – అని శ్రీ భట్టులు తమ వ్యాఖ్యకు విష్ణుపురాణమునుండి ఉదహరించారు.

ఏష భ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యకాన్ గ్రహాన్

**భ్రమంతమను తం యాంతి నక్షత్రాణి చ చక్రవత్** – విష్ణుపురాణము 2.92

(ధ్రువుడు) అలా తాను తిరుగుతూ సూర్యచంద్రులను, గ్రహాలను త్రిప్పుచున్నాడు. నక్షత్రాలు తనతో చక్రము వలె భ్రమించును.

**శింశుమారాకృతి ప్రోక్తమ్ యద్రూపం జ్యోతిషామ్ దివి**
**నారాయణః పరంధామ్నా తస్యాధారః స్వయం హృదిః** – విష్ణుపురాణము 2.94

శింశుమారాకృతి (నీటిలో తిరిగే మొసలి) రూపంలో ఉండే ఈ జ్యోతిశ్చక్రము హృదయస్థానమున ఆధారమై నారాయణుడున్నాడు.

తైత్తరీయ శాఖలోని స్వాధ్యాయ బ్రాహ్మణములో కూడ శింశుమారచక్రము హృదయస్థానమున నారాయణుడున్నట్లు ప్రస్తావింపబడినది. ఈ ఆధారముగ శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. శింశుమార చక్రమునకు ఇరుసువలె మధ్యనున్నవాడు గనుక నారాయణుడు నక్షత్రనేమి.

ధర్మచక్రము రచయిత – బ్రహ్మాండములో ఒక నక్షత్రము గతి తప్పినా అది ఉత్పాతమే. అన్ని దశలలోను క్రమము అత్యవసరమని, స్వార్థమును విడచి క్రమమార్గమున లోకాభ్యుదయము కొరకు కృషించవలెనని ఈ నామము బోధించుచున్నది.

## 442. నక్షత్రీ

- నక్షత్రములను (నిలుపువాడు) కలిగినవాడు.
- చుక్కలలో చంద్రుడు. తారలకు రాజు.

### ఓం నక్షత్రిణే నమః

**శింశుమారాకృతిః ప్రోక్తం యద్రూపం జ్యోతిషాం దివి తద్వ్యాప్తి స నక్షత్రీ సప్తార్ణో లోకపావనః** - మొసలి ఆకారము కలిగిన ఆకాశమునందు వెలుగొందుచున్న నక్షత్రపుంజమును కలిగిన (ధరించియున్న) వాడు. ఈ సప్తాక్షరీమంత్రము లోకపావనము. ఓం నక్షత్రిణే నమః.

**నక్షత్రం అస్మిన్నస్తీతి నక్షత్రీ** – శింశుమార రూపమయిన నక్షత్రరూపమును ధరించినవాడు – అని శ్రీ భట్టుల వ్యాఖ్య.

శ్రీ సత్యదేవో వాసిష్ట – క్షేత్రము గలవాడు క్షేత్రి. శరీరము గలవాడు శరీరి. నక్షత్రము గలవాడు 'నక్షత్రీ'.

శ్రీ శంకరులు గీతాశ్లోకము (10.21) ఆధారముగా 'నక్షత్రీ' అనగా 'చంద్రుడు' అని వివరించారు.

**ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్**
**మరీచిర్మరుతామస్మి నక్షాత్రాణా మహం శశీ** – గీత 10.21
ద్వాదశాదిత్యులలో నేను విష్ణువును. జ్యోతిర్మయ స్వరూపులలో కిరణ్మయుడైన సూర్యుడను. మరుత్తులలో తేజమును. నక్షత్రములలో చంద్రుడను.

## 443. క్షమః

- సమర్థతతో, శక్తితో భువనభారమును వహించేవాడు.
- అన్ని కార్యములందు సమర్థుడు.
- భూమివలె క్షమాగుణము కలవాడు.

## ఓం క్షమాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అనాయాసేన అఖిల భువన భారమ్ క్షమతే -వహతి ఇతి క్షమః** – అవలీలగా అఖిల భువనములను భరించువాడు 'క్షమః'. **అనాయాసేన నిఖిలభారం చ భువనస్య యః సహతే సః క్షమః ప్రోక్తః షడర్ణః క్షాంతిదాయకః -** అనాయాసముగా అఖిల భువనభారమును సహించువాడు. ఈ షడర్ణమంత్రము క్షాంతి దాయకము. ఓం క్షమాయ నమః.

**శింశుమారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వతస్థితాన్**
**దధ్రే శేష తయాన్ లోకాన్ సప్తలోకాన్ అథస్థితాన్**
శ్రీమహావిష్ణువు శింశుమార రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను మోస్తున్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వకార్యేషు సమర్థః క్షమః** – అన్ని పనులలో సమర్థుడు క్షమ.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – సహనము, ఓర్పు కలవాడు. **క్షమయా పృథ్వీ సమః** (బాలకాండము 1.18) భూమికి సమానమైన క్షమాగుణము కలవాడు శ్రీరాముడు.

ఈ అర్థాలను ధర్మచక్రము రచయిత చక్కగా సమన్వయ పరచారు. సమర్థవంతముగా సత్ఫలితాలను సాధించాలంటే ఓర్పుతో కృషి చేయాలి. ఇలా ఓర్పుతో శ్రమించి ఫలితాలు సాధించేవారు భగవంతుని కృపాగుణమును తెలిసికొని పరవశిస్తారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – జీవులు వైదికమార్గమును విడచి చరించినాగాని భగవంతుడు సహనము కోల్పోడు. అందరికీ తగిన ఫలములు ప్రసాదించును. వారికి మార్గము మార్చుకొను అవకాశమును కలిగించును. సృష్టిలో అంతటా భగవానుని క్షమాగుణము ప్రతిబింబించుచున్నది. శరీరములో ఆత్మ క్షమకలిగి బంధింపబడి యుండును. అన్ని జీవులు వివిధ క్షోభలను భరించుచుండును.

## 444. క్షామః

- అవాంతర ప్రళయకాలమున క్షీణించినట్లు కనిపించేవాడు.
- ప్రళయకాలమున అన్నీ లయముకాగా తాను మాత్రము నిలిచియుండేవాడు.
- అన్నింటా దాగియున్నవాడు.

## ఓం క్షామాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
47వ శ్లోకము. 444వ నామము. క్షామః – **నక్షత్రనేమిః నక్షత్రీ క్షమః క్షామః సమీహనః**
91వ శ్లోకము. 858వ నామము. క్షామః – **ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

క్షయమునొందుట – అనే అర్థములో ఈ నామమునకు వ్యాఖ్యానములు చెప్పారు.

**అవాంతర లయే కైశ్చిత్ క్షీణ స్తారాగణైః స్మృతః క్షామో ధ్రువ సమీపస్థః చతుర్నక్షత్ర సంయుతః -** అవాంతర ప్రళయంలో శింశుమార చక్రమునకు సంబంధించిన నాలుగు నక్షత్రములు మాత్రమే మిగిలియుండును. మిగిలిన నక్షత్రములన్నీ కొరవడగా ఆ నాలుగు నక్షత్రములతో కలిసి ధ్రువమండలమునకు సమీపంలో ఉంటాడు కనుక భగవంతుడు 'క్షామః' – ఇది శ్రీ భట్టుల వ్యాఖ్యానుసారము.

**యావన్మాత్రే ప్రదేశే తు మైత్రేయావస్థితో ధ్రువః**
**క్షయమాయాతి తావత్ తు భూమేరాభూత సంప్లవే** – విష్ణుపురాణము 2.8.92

శ్రీ శంకరుల వ్యాఖ్య – ప్రళయకాలమున అన్నీ నశించినపుడు తానుమాత్రమే ఉండేవాడు 'క్షామః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – విశ్వములో అన్నింటిలోను దాగియున్నవాడు గనుక భగవంతుడు 'క్షామః'.

## 445. సమీహనః

- సృష్ట్యాదియందు ఇంద్రాదులను తగిన పదవులందు నియమించువాడు.
- తన సృష్టియొక్క క్షేమము కొరకు కాంక్షించువాడు.

ఓం సమీహనాయ నమః

'ఈహ' అనగా కోరుట, ప్రయత్నించుట – ఇది రెండు విధములుగా జరుగవచ్చును. (1) స్వయముగా ప్రయత్నించుట (2) ఆ కార్యముకొరకు తగిన వారిన నియమించుట. ఈ రెండు భావములందును వ్యాఖ్యానకర్తలు వివరించిరి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ప్రళయానంతరము సృష్టి సమయమున సకల దేవతలను నియమించును గనుక సమీహనుడు. **సమీహయతి ఇతి సమీహనః.**

**స్వస్వాధికారే సర్వాన్ హి య స్సమీహతి సృష్టిషు సమీహన స్స విజ్ఞేయ స్త్వష్టార్ణః కార్యదాయకః -** సృష్టిలో అందరినీ తగిన పదములందు నియమించువాడు. **'ఓం సమీహనాయ నమః'** అనే ఈ అష్టాక్షరిని జపం చేస్తే సకలకార్యసిద్ధి జరుగుతుంది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శృత్యాది అర్థమ్ సమ్యగ్ ఈహత ఇతి సమీహనః** – తన సృష్టికి మంచిని ఇచ్చేవాడు సమీహనుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఋగ్వేదం (10.190.3)నుండి చెప్పిన ఆధారము –

**సూర్యా చంద్రమసౌ ధాతా యథా పూర్వ అకల్పయత్ దివం చ పృథ్వీం చ అంతరిక్షం అథో స్వః**



శ్రీ రుక్మిణీ కృష్ణుల మూర్తులు. లాస్ ఏంజిలెస్ హరేకృష్ణ మందిరం.

New Dwarka Hare Krishna temple, Los Angeles. Creative Commons Photo from Flickr By Sureshnarasimhan
https://www.flickr.com/photos/nsu/15705873614/



## యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాంగతిః |
## సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞోజ్ఞానముత్తమమ్ || (48)

### 446. యజ్ఞః

- యజ్ఞస్వరూపుడు.

**ఓం యజ్ఞాయ నమః**

'యజ్ఞః' నామము మరల 971వ నామముగా స్తుతింపబడినది.

48వ శ్లోకము. 446వ నామము. **యజ్ఞః** – యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాం గతిః

104వ శ్లోకము. 971వ నామము. **యజ్ఞః** – యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః

**యజ్ఞో వై విష్ణుః** – అని తైత్తరీయసంహితములో చెప్పారు. యజ్ఞములన్నింటిచేత ఆరాధింపబడేవాడు, యజ్ఞము, యజ్ఞసాధనము కూడ శ్రీమహావిష్ణువే.

యజ్ఞముగురించి ధర్మచక్రము రచయిత చక్కగా వివరించారు – కర్మలు వాని ఫలములతో మనను బంధించును. యజ్ఞము కర్మబంధములనుండి విముక్తులను చేయును. స్వార్థము లేకుండా, అహంకారమును విడచి, లోకహితార్థము సాగించు సత్కార్యములు, త్యాగశీల యత్నములు, భగవదారాధనా విధానములు యజ్ఞములే. ద్రవ్యయజ్ఞములో తాను సంపాదించిన ధనమును లోకకళ్యాణార్థము వెచ్చించుదురు. తపోయజ్ఞములో ధ్యానమును భవగవంతునివైపు లగ్నము చేయుదురు. యోగయజ్ఞములో నియమములు పాటించి ఇంద్రియములను నియంత్రించుదురు. తనను, తనవానిని, తన పనులను, తన ఆలోచనలను సంపూర్ణముగా మాధవసేవకై అర్పించుట అన్నింటికంటె గొప్ప యజ్ఞము.

భగవంతుని సకల కార్యములు, లీలలు లోకమునుద్ధరించుటకే గాని ఆయన అవుసరకోసం కాదు. కనుక గోవిందుడే యజ్ఞస్వరూపుడు.

ఈ నామవివరణను శ్రీశంకరులు మరింత విస్తరించారు. **సర్వేషామ్ దేవానామ్ తుష్టి కారకో యజ్ఞ ఆకారేణ ప్రవర్తత ఇతి** – యజ్ఞస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు హవిర్భాగములను అందజేసి సకల దేవతలను సంతుష్ఠులుగా చేయుచున్నాడు.

పద్మపురాణంలో యజ్ఞరూపియైన ఈశ్వరుని ఇలా వర్ణించారు –

**వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః**
**అగ్ని జిహ్వో ధర్మరోమాః బ్రహ్మశీర్షో మహాతపాః**
**...........**
**నానాచ్ఛందో గతిపథో గుహ్యోపనిషదాసనః**

**ఛాయాపత్నీ సహాయోవై మేరుశృంగ ఇవోచ్ఛ్రితః**

ఆ యజ్ఞపురుషునకు వేదాలు - పాదాలు; యూపస్తంభాలు - కోరలు; క్రతువులు - హస్తాలు; యాగమునకు వాడు చితి - ముఖము; అగ్ని - నాలుక; ధర్మములు - రోమాలు; తపోనిష్ఠులగు బ్రాహ్మణులు - తల; అహోరాత్రాలు - చూపులు; వేదాంత శృతులు - చెవికమ్మలు; ప్రవము - తుండము; ఆజ్యము - ముక్కు; సామఘోష - గొప్ప ధ్వని; సత్క్రియలు - క్రమ విక్రమములు; ప్రాయశ్చిత్తములు - నఖములు; పశువు - జానువు; ఔద్గాత్రము - ఆంత్రము (ప్రేగు); హోమము - లింగము; ఫలములు - అవయవాలు; వాయువు - అంతరాత్మ; మంత్రాలు - పెదవులు; సోమరసము - రక్తము; వేదాలు - భుజాలు; వేది - స్కందము; హవిస్సు - గంధము; హవ్యకవ్యములు - వేదాలు; ప్రాగ్వంశికలు - దేహము; దానము - హృదయము; ఉపకర్మలు - పెదవులు, గడ్డము; ప్రవర్గ్యలు - భూషణములు; నానా ఛందస్సులు - మార్గాలు; గుహ్యోపనిషత్తు - ఆసనము; ఛాయ అతని పత్ని. అతడు ధర్మ సత్యమయుడు. నానాదీక్షలచే అర్చింపబడినవాడు. పర్వతమువలె ఉన్నతుడు.

మానవుడు నిత్యమును పంచమహాయజ్ఞములను – దేవయజ్ఞము, ఋషియజ్ఞము, పితృయజ్ఞము, అతిథి యజ్ఞము, భూతయజ్ఞములను – ఆచరింపవలయును.

## 447. ఇజ్యః

- సకల పూజలను అందుకొనే (ఒకేఒక) దేవుడు.

### ఓం ఇజ్యాయ నమః

**ఇజ్యమ్ అర్హతి ఇతి ఇజ్యః** – పూజింపదగినవాడు. అన్ని మంత్రములు హరి నామములు. అఖిల దేవతలు హరి యవతారములు. అన్ని పూజలును అచ్యుతునకే చెందును.

**యేఽప్యన్య దేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః**
**తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్** – గీత 9.23
ఓ అర్జునా! శ్రద్ధాన్వితులైన భక్తులు ఇతర దేవతలను పూజించినప్పటికిని వారు నన్ను పూజించినట్లే! కాని వారి పూజలు అవిధిపూర్వకమైనవి (అనగా అజ్ఞానముతో కూడినవి). (9.24) ఏలనన సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడ నేనే.

శ్రీ భట్టులు మహా భారతము శాంతిపర్వము (355.24)నుండి ఉదాహరించారు – **యే యజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్ సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే.** పితృదేవతలను, దేవతలను, బ్రాహ్మణులను, అగ్నిని అర్చించేవారు సర్వభూతములకు అంతరాత్మయైన శ్రీమహావిష్ణువునే ఆరాధిస్తున్నారు.

శ్రీ శంకరులు హరివంశము (3.40.27) నుండి చెప్పిన ఉదాహరణ –
**యే యజంతి మఖైః పుణ్యైర్దేవతాదీన్ పితౄణపి**
**ఆత్మానమాత్మనా నిత్యం విష్ణుమేవ యజంతి తే**
ఎవరైతే నిత్యము పుణ్యయజ్ఞములచే దేవతలను, పితరులను అర్చిస్తారో వారు పరమాత్ముడైన విష్ణువునే అర్చిస్తున్నారు.

## 448. మహేజ్యః

- పూజింపదగినవారిలో ఉత్తముడు.

## ఓం మహేజ్యాయ నమః

శ్రీ మహావిష్ణువు మాత్రమే సంసార చక్రమునుండి శాశ్వతముగా విముక్తిని కలుగజేయు మోక్షమును ప్రసాదింపగలడు. ఇతర దేవతలను పూజించుటవలన సామాన్యమగు ఫలములు మాత్రము లభించును. కనుక శ్రీమహావిష్ణువు మహేజ్యుడు. ఆయనను పూజించుట సర్వోత్తమము. **సర్వాసు దేవతాసు మోక్షఫల దాతృత్వాత్ ఇతి మహేజ్యః** – అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు.

ఈ నామమును మరింత వివరిస్తూ శ్రీ వి.వి. రామానుజన్ – శ్రీమహావిష్ణువు పరమపురుషుడు. అందరు దేవుళ్ళకు ఆయనే ఆంతర్యామి. కనుక నేరుగా మహేజ్యుని పూజించుట ఉత్తమము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **అగ్ని రవమో దేవతానాం విష్ణుః పరమః** – అని తైత్తరీయ సంహితము (5.5.1)లో చెప్పారు. అందరు దేవతలలో మనకు దగ్గరగానున్న దేవుడు అగ్ని. పరమము (దూరముగానున్నవాడు) విష్ణువు.

## 449. క్రతుః

- క్రతువులు (పశువును బంధించు స్తంభముగల యజ్ఞములు) ద్వారా ఆరాధింపబడువాడు.
- అందరి క్రియలకు (పనులకు) మూలమైన శక్తి – లేదా – అన్ని పనులు చేసేవాడు.

## ఓం క్రతవే నమః

సకల శక్తి సంపదలు వినియోగించి, నిర్దిష్టమైన ఫలితమునాశించి, నియమిత కాలపరిమితిలో సాగించు యజ్ఞము క్రతువు. దృఢమైన సంకల్పము, దీక్షాబద్ధమైన ప్రయత్నము, అచంచలమైన విశ్వాసము క్రతువునకు ఆవశ్యకములు. వీటన్నింటిద్వారా అర్చింపబడే దేవుడు గనుక వాసుదేవుడే క్రతువు.

**అగ్నిష్టోమాదయాస్సప్త సంస్థాః క్రతవ ఈరితః ఆరాధ్యః క్రియతే తైస్తైః ఇతి క్రతురీరితః** - అగ్నిష్టోమాది ఏడు యాగములు క్రతువులు. వానిద్వారా ఆరాధింపబడువాడు గనుక దేవుడు క్రతువు. 446వ నామము **'యజ్ఞః'**. 449వ నామము **'క్రతుః'**. గీతలోని 9.16 శ్లోకము ద్వారా ఇవి వేరువేరని గ్రహింపనగును.

**అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్**
**మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్**
నేనే క్రతువును. నేనే యజ్ఞమును. స్వధయును నేనే. ఓషధులు నేనే. నేనే మంత్రమును. నేనే ఘృతమును. నేనే అగ్నిని. హోమరూప క్రియను నేనే.

యజ్ఞము – దీక్షతో ఆచరించు ధర్మకార్యములు – ఇవి 3 విధాలు.

**పాక యజ్ఞాలు** మరల 7 విధములు – (1) ఔపాసన (2) స్థాలీపాకము (3) వైశ్వదేవము (4) అష్టక్రము (5) మాసశ్రాద్ధము (6) సర్పబలి (7) ఈశాన బలి.

**హవిర్యాగాలు** మరల 7 విధములు – (1) అగ్నిహోత్రాలు (2) దర్శపూర్ణిమాసలు (3) అగ్రయణం (4) చాతుర్మాస్యాలు (5) పిండపితృయజ్ఞాలు (6) నిరూఢ పశుబంధము (7) సౌత్రామణి.

**సోమ సంస్థలు** లేదా **క్రతువులు** అనగా జ్యోతిష్టోమాది యాగములు. వీటిలో యూపస్తంభము ఉండును. ఇవి మరల 7 విధములు – (1) అగ్నిష్టోమము (2) అత్యగ్నిష్టోమము (3) ఉక్థము (4) అతిరాత్రము (5) ఆప్తోర్యామము (6) వాజపేయము (7) పౌండరీకము.

పంచ మహాయజ్ఞాలు

(1) బ్రహ్మ యజ్ఞము – వేదముల పారాయణ, బోధన

(2) పితృయజ్ఞము – పితృదేవతలకు తర్పణమొసగుట

(3) దేవయజ్ఞము – అగ్నిద్వారా దేవతలకు హవిస్సు సమర్పించుట

(4) భూత యజ్ఞము – సకల ప్రాణులకు నిత్యాన్నములో భాగము అర్పించుట

(5) మనుష్య యజ్ఞము – అతిథులను, సకల జనులను ఆదరించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము – 446వ నామము. **యజ్ఞః –** పంచ మహాయజ్ఞములు, ఏడు పాకయజ్ఞములు కూడ శ్రీమహావిష్ణువు స్వరూపములే. 449వ నామము. **క్రతుః** – 7 సోమసంస్థలు శ్రీమహావిష్ణుస్వరూపములే.

'క్రతుః' నామమును శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'క్రియ' అనే అర్థములో వివరించారు**. క్రియత ఇతి క్రతుః** – అన్నింటిని చేసేవాడు గోవిందుడే.

## 450. సత్రమ్

- సత్రయాగము ద్వారా ఆరాధింపబడువాడు.
- సత్పురుషులను కాచువాడు.
- అంతటిని నడుపువాడు.

### ఓం సత్రాయ నమః

**బహుకాలానేక యజమానకే విధిచోదితే సత్రే సదారాధ్య యా సత్రం స్వాత్సీదతీతి చ -** శాస్త్రంలో చెప్పబడి, అనేకమంది చేత అనేకసార్లు చేయబడే సత్రయాగముచే ఆరాధించబడువాడు. సత్రయాగము అంటే 18 మొదలు 100 రోజులవరకు చేసే ఒక యజ్ఞము. లోకకళ్యాణము కొరకు పెక్కుమంది చేసేది. శ్రీ భట్టులు తమ వ్యాఖ్యలో – **దీర్ఘకాల బహుయజమానక మాస చోదనా లక్షణమ్ సత్రమ్** – అని వివరించారు. (పెక్కుమందికి ఆహార విరామాది సదుపాయాలు కలిగించే గృహాలను 'సత్రములు' అంటారు). అన్ని విధాల యాగాలు విష్ణురూపాలు గనుక భగవంతుని నామము 'సత్రము'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సతః త్రాణయతి ఇతి సత్రమ్** – సజ్జనులను కాపాడువాడు గనుక సత్రము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **సీదతి గచ్ఛతి సర్వత్ర** – సద్ - సీదతి - కదులునది, కదిలించునది. అన్ని చోట్లకు వెళ్ళేవాడు 'సత్రమ్'. మరొక వివరణ – ప్రపంచమును కదిలించువాడు – **సత్రయతే విస్తారయతి విశ్వమ్ ఇతి సత్రమ్** – భగవంతుని సృష్టి యందంతట ఈ భగవద్గుణము కానవచ్చును. గుండెకాయ కదులుతుంది గాని ఒకేచోట ఉంటుంది.

## 451. సతాంగతిః

- సత్పురుషులకు గమ్యము.

### ఓం సతాంగతయే నమః

ఇదే నామము 20వ శ్లోకములో 186వ నామముగా వచ్చినది.

20వ శ్లోకము. 186వ నామము. సతాంగతిః – **మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాంగతిః**

48వ శ్లోకము. 451వ నామము. సతాంగతిః – **యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాంగతిః**

శ్రీ శంకరుల భాష్యము – **సతామ్ - ముముక్షూణామ్ న అన్య గతిః ఇతి సతాంగతిః** – మోక్షము కోరువారికి వేరొక గతి యొల్లదు. అంబుజోదర దివ్య పాదారవిందములందే వారి మనసు లగ్నమై యుండును. **వినా వేంకటేశం న నాథో న నాథః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామమునందు 'ప్రవృత్తి ధర్మము' (ఐహిక భోగభాగ్యములు కోరుట) ననుసరించువారి లక్ష్యము భగవానుడు అని చెప్పడమైనది. ఈ నామమునందు 'నివృత్తి ధర్మము' (ఐహిక భోగభాగ్యములనుండి విరక్తి) కోరువారికి కూడ భగవానుడే పరమగమ్యమమని ఈ నామమునందు తెలియవచ్చుచున్నది. **ప్రవృత్తి ధర్మనిష్ఠానాం గతిర్యస్య సతాంగతిః నివృత్తి ధర్మ నిష్ఠానాం గతిర్యస్య సతాంగతిః**

ఇందుకు విష్ణుపురాణము (2.8.94)నుండి శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణము – **నిర్ధూత దోష పంకానాం యతీనాం సంయుతాత్మనాం స్థానం తత్పరమం విప్ర పుణ్యపాప పరిక్షయే.** ఓ బ్రాహ్మణోత్తమా! దోషములనే బురదను కడిగివేసుకొన్నవారు, పుణ్యాపాపముల ప్రభావము నశింపజేసుకొన్నవారు, సంయుతాత్ములు అయిన యతులకు ఇది పరమపదము.

శ్రీ చిన్మయానంద – 'గతి' అనగా మార్గము, గమ్యము అని రెండర్థములున్నాయి. సాధువులకు శ్రీమన్నారాయణుడే మార్గము, గమ్యము, సతాంగతి.

**చెలివై చుట్టమవై మనస్థితుడవై చిన్మూర్తివై ఆత్మవై వలనై కోర్కెల పంటవై విభుడవై వర్తిల్లు నిన్నొల్లకే పలువెంటన్ బడి లోక మక్కటా వృథాబద్ధాశయమ్మై పోయెడున్....**

## 452. సర్వదర్శీ

- అంతటిని చూస్తుండేవాడు.

ఓం సర్వదర్శినే నమః

**ధర్మాధర్మాచ తౌ సర్వౌ అధ్యక్షయితుమాదరాత్ సర్వదా శీలమస్యేతి సర్వదర్శీ తతస్స్మృతః -** భగవానుడు అందరికిని అంతర్యామి గనుక అందరి కార్యములను, మంచివి గాని చెడువి గాని – చూచుచునే యుండును. సూర్యుడు లోకమునకు చక్షువని, అంతటికీ వెలుగని అన్నారు. చేయవలసిన పనులు చేసినా, చేయకూడనివి చేసినా, చేయవలసినవి చేయకున్నా – అన్నింటికీ శ్రీమన్నారాయణుడే సాక్షి. అందరికీ అంతర్యామి. కనుక భగవంతునికి ప్రీతి కలిగించే పనులు మాత్రమే చేయాలి. (**అనుకూల్య సంకల్పమ్, ప్రతికూల్య వర్జనమ్**) అని ధర్మచక్రము రచయిత వివరించారు.

**జ్ఞాన చక్షుర్భగవాన్ విష్ణుః** – అని ఈ నామమును వివరిస్తూ శ్రీ సత్యదేవో వాసిష్ఠ ప్రసిద్ధ శృతినుండి ఉదాహరించారు –

**సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ విశ్వతశ్చక్షురుతః విశ్వతోముఖో విశ్వతో బాహురుత విశ్వతస్పాత్**
**హిరణ్యయేన సవితా రథేన దేవో యాతి భువనాని పశ్యన్**

ఇదే భావము గీత (13.13) శ్లోకములోకూడ ఉన్నది –

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శృతిమాన్ లోకే సర్వమావృత్య తిష్ఠతి.**

10వ శ్లోకములోని **'సర్వదర్శనః'**, 22వ శ్లోకములోని **'సర్వదృక్'** నామములు ఈ నామమునకు దగ్గర భావములు కలిగియున్నవి.

## 453. విముక్తాత్మా

### నివృత్తాత్మా

ఈ శ్లోకములో నామము శ్రీ శంకరుల పాఠము ప్రకారము **'విముక్తాత్మా'**. మరియు శ్రీ భట్టుల పాఠము ప్రకారము **'నివృత్తాత్మా'**.

**నివృత్తాత్మా**

- విషయములనుండి విముఖమైన మనస్సు గలవాడు.
- నివృత్తి ధర్మము పాటించువారికి ఆత్మ (ఆత్మీయుడు).

**విముక్తాత్మా**

- సహజముగా, స్వభావసిద్ధముగా ముక్తుడైన ఆత్మ
- బంధములు లేనివాడు.

**ఓం విముక్తాత్మనే నమః**

**ఓం నివృత్తాత్మనే నమః.**

'నివృత్తాత్మా' నామము నాలుగుమార్లు స్తుతింపబడినది.

25వ శ్లోకము. 231వ నామము. నివృత్తాత్మా – **ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః**

48వ శ్లోకము. 453వ నామము (శ్రీ భట్టుల పాఠము ప్రకారము). నివృత్తాత్మా – **సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్**

64వ శ్లోకము. 604వ నామము. నివృత్తాత్మా – **అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః**

83వ శ్లోకము. 780వ నామము. నివృత్తాత్మా – **సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః**

శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము 48వ శ్లోకములో **'విముక్తాత్మా'** అనియు, 83వ శ్లోకములో **'అనివృత్తాత్మా'** అనియు చెప్పబడెను.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **నివృత్తి ధర్మాచార్యత్వాత్ విషయేభ్యో నివృత్తిమత్ మనో యస్య నివృత్తాత్మా నరనారాయణాత్మకః** - భగవానుడు నరనారాయణులుగా అవతరించి నివృత్తి ధర్మము బోధించెను. నారాయణుడు బోధించిన నివృత్తి ధర్మమును నిర్మమ తపముద్వారా నరుడు పాటించెను. పరమవైరాగ్యము నవలంబించెను. ఏదయినా నారాయణుని కొరకే చేయాలని, అలా చేయించేదికూడా నారాయణుడేనని తెలిపే ఈ పుణ్యనామములో అష్టాక్షరీ మంత్రము, నరనారాయణావతారము సమ్మిళితములైయున్నవి. ఓం నివృత్తాత్మనే నమః.

604వ నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – నివృత్తిధర్మము పాటించువారికి ఆత్మ. అట్టి జ్ఞానులను భగవానుడు తన స్వరూపముగా అనుగ్రహించునని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు.

780వ నామ వివరణలో శ్రీ భట్టులు 'నివృత్తి'కి మరొక భావమును గ్రహించారు. తానే సృష్టి చేసినా భగవంతుడు ఐహిక విషయములకు సంపూర్ణముగా అతీతుడు. **స్వతస్తు తత్ అసమ్మత మనః** – ఆయన కరుణామూర్తియై లోకములను సృజించెనుగాని లోకములో జరిగేవి శ్రీమన్నారాయణుని ప్రభావితము చేయవు.

231వ నామమునకు శ్రీ భట్టుల వివరణ – అన్నింటికంటె మహోన్నతమగు పరమపద తత్త్వమూర్తి. పరమ పురుషుడు. పరమాత్ముడు. పరమాప్తుడు. పరంధాముడు. పరమేశ్వరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – స్వభావసిద్ధంగానే ముక్తిని పొందియున్న ఆత్మ. కర్మబంధములకతీతుడు, లోక కళ్యాణమునకే సర్వకార్యములు చేయువాడు గనుక శ్రీమహావిష్ణువు **'విముక్తాత్మా'**.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – జగత్తులో అన్నింటికి, అందరికిని వాసుదేవుడే అంతర్యామియైనాగాని ఆ పరమాత్ముడు దేనియందును బంధింపబడలేదు గనుక శ్రీహరియే విముక్తాత్ముడు, నివృత్తాత్ముడు.

## 454. సర్వజ్ఞః

- సకల జీవులకును తానే అంతర్యామియని స్వయముగా తనను తానెరిగినవాడు. కనుక సర్వమును తెలసినవాడు.
- సర్వము తానెయైనవాడు. సర్వము తెలిసినవాడు.

### ఓం సర్వజ్ఞాయ నమః

ఈ సప్తాక్షరీ మంత్రము జ్ఞానప్రదము. మరల 821వ నామముగా వచ్చును.

48వ శ్లోకము. 454వ నామము. సర్వజ్ఞః – **సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞోజ్ఞానముత్తమమ్**

87వ శ్లోకము. 821వ నామము. సర్వజ్ఞః – **అమృతాశోऽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – జగత్తులోని సమస్తమునకు అంతర్యామియని భగవానుడు తనను తానే తెలిసినవాడు. తానే ఉత్తమధర్మము, తానే ఉత్తమ గమ్యము, తానే ఉత్తమ సాధనము అని యెరిగినవాడు. ఇది జ్ఞానమునొసగే సప్తాక్షరీ మంత్రము. ఓం సర్వజ్ఞాయ నమః. **స్వాత్మనా స్వమాత్మానం యశ్చ జానాతి కేవలమ్ సర్వజ్ఞస్సతు విజ్ఞేయః సప్తార్ణో జ్ఞానదో మనుః.**

పెరియతిరుమొళి 4.9.6 – **ఉళగత్తు ఎల్లామ్ అఱివీర్**

శ్రీ శంకరుల భాష్యము – **సర్వశ్చ అసౌ జ్ఞాశ్చ ఇతి** – అంతయు తానైనవాడు. అంతయు తెలిసినవాడు. ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రి శృతులనుండి పలు ఉదాహరణలనిచ్చారు –

ముండకోపనిషత్తు 1.1.9 – **యః సర్వజ్ఞః సర్వవిత్**

ప్రశ్నోపనిషత్తు 4.10 – **స సర్వజ్ఞః సర్వతో భవతి**

శ్వేతాశ్వరోపనిషత్తు 2.6.2,16 – **స విశ్వకృత్ విశ్వవిద్ ఆత్మయోనిః జ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్యః**

## 455. జ్ఞానముత్తమమ్

- అన్నింటికంటె ఉత్తమమైన శ్రీవైష్ణవ ధర్మమును, పాంచరాత్రాగమమును ప్రసాదించినవాడు.
- అన్నింటికంటె ఉత్తమమైన, నిత్యమైన, సత్యమైన, అనాదియైన, అవిచ్ఛిన్నమైన, అనంతమైన, శాశ్వతమైనవాడు.

### ఓం ఉత్తమాయ జ్ఞానాయ నమః

### ఓం జ్ఞానాయ ఉత్తమాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **పరశ్చ వైష్ణవోధర్మః సర్వోऽస్మిన్ జ్ఞాయతే యతః సర్వేషాం శ్రేయసాం మూలం స జ్ఞేయం జ్ఞానముత్తమమ్.** అన్ని ధర్మములకంటె ఉత్తమమైన శ్రీవైష్ణవధర్మమును తెలియజేసినవాడు. **సర్వః పరో వైష్ణవో ధర్మః జ్ఞాయతే అస్మిన్ ఇతి**

**జ్ఞానముత్తమమ్.** ఇంకా భగవంతుడు పాంచరాత్రమును ఉపదేశించెను. ఇది ఉత్తమ జ్ఞానము. **పఠంతమ్ అనిశమ్ శాస్త్రమ్ పాంచరాత్ర పురస్సరమ్.**

శ్రీ వి.వి. రామానుజన్ నమ్మాళ్వారు రచనను ప్రస్తావించారు. **మిక్క జ్ఞానమూర్తియాగియ వేదవిళక్కు** (తిరువైమోళి 4.7.10).

శ్రీ శంకరుల భాష్యము – **ప్రకృష్టమ్ అజన్యమ్ అనవచ్ఛిన్నమ్ సర్వస్య సాధకమ్ ఇతి జ్ఞానముత్తమమ్.** పరబ్రహ్మము అనంతము. దేశకాలములచే పరిచ్ఛిన్నము కానిది. ఆద్యంత రహితము. సర్వోత్తమము. ఏదయినా సాధించుటకు అత్యున్నత మార్గము. **సత్యమ్ జ్ఞానమ్ అనంతమ్ బ్రహ్మ** (తైత్తరీయోపనిషత్తు). కనుక పరబ్రహ్మమే ఉత్తమజ్ఞానము.

సామాన్యజ్ఞానమునకు, ఉత్తమ జ్ఞానమునకు శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పిన అంతరము – ఒక వ్యక్తి ఏమైనా వస్తువును చూచినపుడు, ఆ జ్ఞానమునకు కొన్ని పరిమితులుండును. చూచేవాని దృష్టి, శక్తి, ఆ వస్తువుపై పడే కాంతి, ఇరువురకు ఉన్న దూరము, ఆ వస్తువు పరిమాణము – ఇవన్నీ పరిమితులు. కాని ఆత్మజ్ఞానమునకు ఇంద్రియాల పరిమితులు వర్తించవు. అది ఉత్తమ జ్ఞానము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఉదాహరించిన శ్రుతివాక్యములు –

**సూత్రమ్ సూత్రస్య యో వేద స వేద బ్రహ్మణమ్ మహత్ -** మహత్ బ్రహ్మమును గురించి తెలిసినవాడు తెలియవలసినవాటిలో ఉత్తమమైనదానిని తెలిసినవాడు.



శ్రీదేవీ భూదేవీ సమేతులైన శ్రీ మహావిష్ణువు.

తమిళనాడు తిరునల్వేలి సమీపంలోని శ్రీ వైకుంఠనాథన్ పెరుమాళ్ దేవాలయం లోని శిల్పం.

Creative Commons Photo from Flickr – by Sowrirajan S
https://www.flickr.com/photos/sowri/1136116431/



## సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్ |
## మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః || (49)

### 456. సువ్రతః

- శరణాగతులకు అభయమును ప్రసాదించుట – అను చక్కని వ్రతము గలవాడు.
- నరనారాయణావతారమున గొప్ప వ్రతము (తపము) ఆచరించినవాడు.
- తాను పరిగ్రహించు నైవేద్యము విషయమై మంచి నియమము గలవాడు (కుచేలునివంటి భక్తులు అర్పించినదానిని స్వీకరించువాడు).
- లోకులకు మార్గదర్శకముగానుండుటకై నిత్యకర్మాది వ్రతములను ఆచరించువాడు.

ఓం సువ్రతాయ నమః

మరల ఈ నామము 88వ శ్లోకములో 824వ నామముగా స్తుతింపబడినది.

49వ శ్లోకము. 456వ నామము. సువ్రతః – **సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్**

88వ శ్లోకము. 824వ నామము. సువ్రతః – **సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః**

శ్రీ భట్టులు 824వ నామమునకు, శ్రీ శంకరులు ఈ 456వ నామమునకు శ్రీరామచంద్రుని శరణాగతత్రాణ పరాయణత పరముగా వివరణ ఇచ్చారు. అందుకు వారు యుద్ధకాండలోని ప్రసిద్ధ శ్లోకము (18.34)ను ఉదహరించారు.

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి యాచతే అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ.** - 'నేను నీవాడను. రక్షింపుము' అని ఒక్కమారైనను నన్ను యాచించినవానికి సర్వభూతములనుండి అభయమును ప్రసాదింతును. ఇది నా వ్రతము.

ఇదే వివరణకు శ్రీ వి.వి. రామానుజన్ నమ్మాళ్వార్ శ్రీసూక్తినుండి ఉదాహరించారు – **శరణమాగుమ్ తనతాళ్ అడైందార్గతకెల్లామ్** (తిరువైమొళి 9.10.5)

88వ శ్లోకములోని 'సువ్రతః' నామమునకు శ్రీ శంకరులు చెప్పిన వివరణ. వ్రతయతి – ఆనందించువాడు; సువ్రతః – కుచేలునివంటి భక్తులు సమర్పించినదానిని గైకొని సంతసించువాడు.

**('గీతాతత్వవివేచనీ వ్యాఖ్య'నుండి ఈ సుదాముని కథ భాగము సంగ్రహించినది)** సుదాముడు (కుచేలుడు) శ్రీకృష్ణునకు బాల్యమిత్రుడు. సహపాఠి. వేదవేత్త. విషయ విరక్తుడు. శాంతచిత్తుడు. తదుపరి కాలమున దుర్భర దారిద్ర్యమునకు లోనయ్యెను. అతని భార్యాబిడ్డలు ఆకలితో అలమటించిరి. భార్య అభ్యర్థన మేరకు సుదాముడు తన బాల్యమిత్రుడైన శ్రీకృష్ణభగవానుని దర్శింపతలచెను. ఎట్లో భార్య యేర్పరచిన నాలుగు పిడికెళ్ళ అటుకులు తన జీర్ణవస్త్రములో మూటగట్టుకొని దేవదేవుని దర్శించుటకు ద్వారకకు చేరెను. సుదాముడు తనకొరకై వేచియున్నాడని ద్వారపాలకునిద్వారా విన్న కృష్ణుడు ఒక్క ఉదుటున లేచి పరుగిడి

సుదాముడు, అతని భార్య. గుజరాత్ పోర్‌బందర్ శిల్పం. Photo by: Pradhyumanvyas
https://commons.wikimedia.org/wiki/File:PORBADAR-SUDAMA_AND_HIS_WIFE.jpg



కరమర్థి నెదురుగా జని
పరిరంభణమాచరించి, బంధుస్నేహ
స్ఫురణన్ దోడ్తెచ్చి, సమా
దరమున గూర్చుండబెట్టె దన తల్పమునన్

సుదాముని దీనదశను జూచి అచ్యుతుని గుండె నీరయ్యెను. చెలికానిని గుండెలకు హత్తుకొని, సాదరముగా అంతఃపురములోనికి గొనిపోయి, తన తల్పముపై కూర్చుండబెట్టెను. పూజాసామగ్రిని స్వయముగా తెచ్చి, తన చేతులతోనే ఆయన పాదములు కడిగి, దేవదేవుడా పాదజలమును తన శిరముపై జల్లుకొనెను. పిదప సుగంధ ద్రవ్యములతో సత్కరించి, భోజనమునిడి, తాంబూలము సమర్పించెను. శ్రీరుక్మిణీదేవి తన చెలులతో సహా వింజామరలు వీచుచుండగా చిన్ననాటి ముచ్చట్లు చెప్పసాగెను. ఆ దృశ్యమును చూచిన అంతఃపురకాంతలు కుచేలుని సౌభాగ్యమును ఇట్లు ప్రశంసించిరి –

ఏమి తపంబు సేసెనొకొ యీ ధరణీదివిజోత్తముండు, తొల్
బాముున యోగివిస్ఫురదుపాస్యకుడై, తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించియున్నవా
డీ మహనీయ మూర్తికెనయే మునిపుంగవులెంతవారలున్?

కొంత తడవునకు శ్రీనివాసుడు తన ప్రియమిత్రునితో – మిత్రమా! నాకేమైన కానుక తెచ్చితివా? భక్తులు ప్రేమతో ఇచ్చిన స్వల్పవస్తువును కూడ నేను గొప్పగా భావింతును. ఏలనన నేను ప్రేమ ఆకలితోనున్నవాడను. భక్తిరహితులు ఎన్నెన్ని కానుకలు సమర్పించినను అవి నాకు సంతృప్తికరములు గావు – అని స్మితముతో పలికెను.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః –
(వ్యాసుని రచన)
దళమైనను బుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్
గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్ –
(పోతన తెలుగు సేత)



సుదాముడు శ్రీకృష్ణుని సందర్శించుట – 17వ శతాబ్దపు చిత్రం. వికీపీడియానుండి
https://commons.wikimedia.org/wiki/File:Krishna_welcomes_Sudama,_Bhagavata_Purana,_17th_century,_India.jpg

తన మిత్రుడు నిష్కామభక్తుడు. పతివ్రతయైన భార్య ప్రార్థనపై బాల్యమిత్రుని కడకు వచ్చెను అని సర్వాంతర్యామి హరి గ్రహించినాడు. దేవతలకును దుర్లభములైన సంపదలను (భోగ మోక్షములను) అతనికి ప్రసాదింప నిశ్చయించినాడు. సంకోచించుచున్న

సుదాముని జీర్ణవస్త్రపు మూటను భగవానుడు చొరవగా లాగుకొనగా ఆ మూట చినిగి అటుకులు చెదురైనవి. అపుడా శ్రీవత్సాంకితుడు ఆ అటుకులను ఏరుకొని తినుచు ఇట్లనెను.

నన్వేత దుపనీతం మే, పరమ ప్రీణనం సఖే!
తర్పయంత్యంగ మాం విశ్వమేతే పృథుక తండులాః

శ్రీకాకుళం నారాయణ తిరుమల ఆలయంలో చిత్రం. రాజశేఖర్ తీసినది.
https://commons.wikimedia.org/wiki/File:NarayanaTirumala32.JPG



మిత్రమా! నీవు తెచ్చిన ఈ అటుకుల కానుకయే నన్ను మిక్కిలి ప్రసన్నునిగా జేసినది. **ఈ అటుకులు నన్ను, నాతోబాటు సమస్త విశ్వమును సంతృప్తి పఱచినవి.** అనుచు ఒక పిడికెడు అటుకులు ఆరగించి శ్రీదేవదేవుడు మరియొక పిడికెడు తీసికొనబోవుచుండగా ఆయనను రుక్మిణీదేవి వారించినది.

మురహరుడు పిడికెడటుకులు
కరమొప్పగ నారగించి, కౌతూహలియై
మఱియును, బిడికెడు గొన ద
త్కర మప్పుడు పట్టి, కమల కరములన్

సొంపారగ నితనికి బహు
సంపదలందింప నివియ చాలును నిక భ
క్షింప వలవదు, త్రిజగ
త్సంపత్కర! దేవదేవ! సర్వాత్మ హరీ!

కొలది దినముల పిదప సుదాముడు తన ఇంటికరిగెను. భగవంతుని అనుగ్రహముతో అతనికి అపార సంపదలు కూడెను. సుదాముడు జీవితమంతయు అనాసక్త భావముతో గడిపెను. ఎల్లవేళల భగవంతుని భజించుచునే యుండెను.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి సూచన – నరనారాయణావతారమున భగవానుడు సకల నియమములతో తపమాచరించెను. వ్రతము అనగా నియమము, నియంత్రణ. కనుక భగవానుడు సువ్రతుడు.

శ్రీ చిన్మయానంద వివరణ – నరనారాయణావతారమున దేవుడు బదరికాశ్రమమున తీవ్రమైన వ్రతము (తపము) ఆచరించెను. కనుక ఆయన సువ్రతుడు.

ఈ 456వ నామమునకు శ్రీ భట్టుల వివరణ – సు-వ్రతుడు అనగా సత్కర్మలను చక్కగా ఆచరించువాడు. భగవంతుడు అన్ని కర్మఫలములకును, కులధర్మములకును అతీతుడైనను, సకల అనుష్ఠానములను అవతార సమయమున శ్రద్ధగా ఆచరించును గనుక ఆయన సువ్రతుడు.

గీత 3.21, 22, 23
**యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే**
**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి**

**యదిహ్యయం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః**
**మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః**

శ్రేష్ఠుడైన పురుషుని ఆచరణమునే ఇతరులు అనుసరింతురు. అతడు నిలిపిన ప్రమాణములను పాటించెదరు. అర్జునా! ముల్లోకములలో నాకు కర్తవ్యముగాని, పొందవలసియున్నదిగాని లేదు. ఐనను నేను కర్మలయందు ప్రవర్తిల్లుచున్నాను. ఏలనన ఎప్పుడైనను నేను కర్మాచరణమునందు వర్తించకున్న ఇతరులు కూడ నా మార్గమును అనుసరించుచు కర్మలను విస్మరింతురు.

భీష్ముని బ్రహ్మచర్యవ్రతము, హరిశ్చంద్రుని సత్యవ్రతము వారిని మహాత్ములను చేసెను. సువ్రతత్వమునకు ఇవి ఉదాహరణలని ధర్మచక్రము రచయిత వివరించారు.

**457నుండి 463వరకు నామములను శ్రీ భట్టులు నరనారాయణావతార పరముగాను, మోహినీ అవతార పరముగాను కూడ వ్యాఖ్యానించారు.**

## 457. సుముఖః

- సుందరమైన ముఖము గలవాడు.
- సుఖదుఃఖములను ద్వంద్వములయందును ప్రసన్నముఖుడై యుండువాడు.
- బ్రహ్మను సృజించి ఆయనకు వేదములు బోధించినవాడు.
- అమృతమును ధరించిన చంద్రునివంటి ముఖముగల మోహిని.

ఓం సుముఖాయ నమః

**ధ్యాతౄణాం విషయే యస్య సుప్రసన్నం మనోహరం ముఖ మస్తీతి సుముఖః –** తనను ధ్యానించేవారు, ఉపాసించేవారు అయిన భక్తుల విషయంలో ప్రసన్నమైన ముఖము గలవాడు సుముఖుడు.

**శోభనం ముఖం యస్య స సుముఖః –** అందమైన ముఖము గలవాడు సుముఖుడు.

**ప్రసన్నవదనం చారుపద్మాయతేక్షణమ్ –** ప్రసన్న వదనుడు, కమలముల రేకులవంటి కనులు గలవాడు.



హళెబీడులో శ్రీ మోహిని శిల్పం. వికీపీడియా చిత్రం

Photo by: : Kumara Sastry. https://commons.wikimedia.org/wiki/File:Mohini_Halebid.jpg

**ఆనందామృత సంపూర్ణ వదనేందు కాంతినా కలాకృతి రూపేణ కరస్థేన విరాజితమ్**

ఆనందామృతము నిండిఉన్న చంద్రునిలాగా ప్రకాశించే వదనంతో అమృతకలశము ధరించినట్లుగా అందమైన ముఖం గలవాడు. ప్రసన్నమైన వదనము గలవాడు. ఇది మోహిని అవతారపరమైన సూచన.

**శోభనమ్ ముఖమ్ అస్య ఇతి సుముఖః –** నరనారాయణావతారమున తపము చేయు సమయమున ధ్యానమగ్నుడైయున్న సుందరవదనుడు.

శ్రీ భట్టులు **'కృష్ణాయ కమలదళామలనేత్రాయ'** అనే కృష్ణమంత్రమును ఉదాహరించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – తీవ్రమైన సాధన సమయంలోనూ, సమస్యలనెదుర్కొన్న సమయంలోనూ ఎవరి ముఖంలోనైనా అలసట, బాధ కనిపించవచ్చును. కాని భగవానుని ముఖం సదా ప్రసన్నంగా ఉంటుంది. అయోధ్యకాండము 19.30-33, కంబరామాయణము – రాజ్యాభిషేకము బదులు వనవాసదీక్ష చేకొనిన రాముని వదనము ప్రశాంతసుందర పద్మమువలెనున్నది.

శ్రీ శంకరులు విష్ణుపురాణమునుండి, మరియు శ్రీమద్రామాయణమునుండి ఉదాహరించారు.

**ప్రసన్న వదనమ్ చారుపద్మ పత్రాయతేక్షణమ్** –విష్ణుపురాణము 6.7.79 – ఆయన ముఖము ప్రసన్నముగానున్నది. ఆయన కనులు చక్కని తామరరేకులవలెనున్నవి.

**ఇమాని తు మహారణ్యే విహృత్య నవపంచ చ**
**వర్షాణి పరమప్రీతః స్థాస్యామి వచనం తవ** – అయోధ్యకాండము 24.17

**న వనం గంతు కామస్య త్యజతశ్చ వసుంధరామ్**
**సర్వలోకాతి గస్యేవ మనో రామస్య వివ్యతే** – అయోధ్యకాండము 19.33

**స పితుర్వచనమ్ శ్రీమానభిషేకాత్పరం ప్రియమ్**
**మనసా పూర్వమాసాద్య వాచా ప్రతిగృహీతవాన్** – సుందరకాండము 33.24
సకల సద్గుణరాశియైన ఆ శ్రీరాముడు తండ్రి ఆజ్ఞను పట్టాభిషేకముకంటెను గొప్పదిగా భావించి, మనస్ఫూర్తిగా సంతోషముతో దానికంగీకరించి, అందులకు తన ఆమోద(వచన)మును తెల్పెను.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – **యో బ్రహ్మాణమ్ విదధాతి పూర్వమ్** – బ్రహ్మకు విజ్ఞానము నుపదేశించి, ప్రసన్నుడైనవాడు.

## 458. సూక్ష్మః

- బుద్ధికి అందనంత సూక్ష్మరూపియై, అంతటా ఉన్నవాడు. అన్నియెడల తన ఉనికికి సంబంధించిన గుణములు ప్రదర్శించువాడు.
- తన ఆలోచనలు అసురులకు తెలియకుండా ఉన్న మోహిని.

### ఓం సూక్ష్మాయ నమః

భగవంతుడు ఇంద్రియములకు కానరాడు. బుద్ధికి అందడు. అయినా అత్యంత ప్రభావశాలియై అన్నియెడల వ్యాపించియుండును. నిశ్చలమైన దీక్ష, నిర్మలమైన భక్తి చేతనే తెలియవచ్చును. **సర్వగతం సూక్ష్మం** (ముండకోపనిషత్తు 1.1.16) – అనే శృతివాక్యమును శ్రీ శంకరులు ఉదాహరించారు. **సూక్ష్మ సూక్ష్మ స్వరూపతః అసురేషు నిగూడాభిప్రాయత్వాత్ సూక్ష్మ ఉచ్యతే** - అన్ని జీవులలోను ప్రవేశించిన సూక్ష్మరూపి. రాక్షసులను శిక్షించే విషయంలో ఎవరికీ కనిపించని భావాలు గలవాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – 'సూచ్' అనగా సూచించుట అన్న ధాతువునుండి – భగవంతుడు నేరుగా కన్పించకపోయినా, ప్రతివస్తువునందు ఆయన ప్రభావము గోచరమగుచుండును. ఆకాశములోని శబ్దము, వాయువునందలి స్పర్శ, అగ్నిలోని వేడి – ఇవన్నీ సూక్ష్మరూపుని సూచికలు.

మోహిని అవతారపరంగా – తన ఆలోచనలు అసురులకు తెలియకుండా ఉన్న మోహిని. కనుక సూక్ష్మ.

## 459. సుఘోషః

- వేదములే తన ధ్వని (ఘోష, నాదము) అయినవాడు.
- వేదములందు, ఉపనిషత్తులందు చక్కని నాదముతో కీర్తింపబడినవాడు.
- మధుర గంభీర స్వరము గలవాడు.
- ప్రకృతిలోని చక్కని శబ్దములద్వారా తెలియజేయబడువాడు.

ఓం సుఘోషాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – వేదముల వాణియైన ఉపనిషత్తులచే ఘోషింపబడిన (తెలియచెప్పబడిన) వాడు. వేదస్వరూపుడు. **స్వాధ్యాయ ఘోషో యస్యాస్తి సుఘోష స్స తు కీర్తితః.** ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ చెప్పిన తిరుసాహిత్య ప్రమాణములు –

తిరువైమొళి 2.7.2 – **నారణాన్, మూడు ఏడులగుక్కుమ్ నాధన్, వేదమయన్.**

పెరియ తిరుమొళి 5.5.9 – **సందోగన్, పౌడియన్, ఐన్ తడల్ ఓంబు తైత్తిరియన్, సామవేదీ** (తిరుమంగైయాళ్వారు).

శ్రీ శంకరుల భాష్యము – **సుశోభనో ఘోషో వేదాత్మకో అస్య ఇతి సుఘోషః** – వేదములే శ్రీమన్నారాయణుని మంగళఘోష.

ఇదే గాక, మేఘ గంభీరమైన, మనోహరమైన కంఠధ్వని గలవాడు – అని మరొక స్పష్టమైన ప్రత్యక్ష అర్థమును కూడ శ్రీ శంకరులు చెప్పారు.

ధర్మచక్రము రచయిత – నియమబద్ధముగా వేదములను ఉచ్చరించిన యెడల మనస్సు పావనమగును. ప్రకృతిలోని మధుర స్వనములు ప్రశాంతత గూర్చును. అవే సంగీతమునకు మూలము. భగవంతుని గూర్చిన గానము, స్మరణము, మంత్రము – అన్నీ సుఘోషణలే.

నీ కథాగానమే నాకు నిరత స్మరణ, మంత్రము, జపము, తపము అని అన్నమయ్య కీర్తించినాడు. హరినామము జపియించెడి నోరు నోరని ప్రహ్లాదుడు నుతించినాడు. ఎంతో రుచిరా, ఓ రామ, నీ నామమెంతో రుచిరా – అని రామదాసు గానము చేసినాడు. అన్నింటికంటె రామునిధ్యానమే ఉత్తమమని త్యాగయ్య పరవశించినాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమును మరొక విధముగా విశ్లేషించిరి – 'ఘుషుర్' - విశబ్దనే – అన్న ధాతువునుండి – 'ఘోషణ' అనగా ప్రకటించుట, చాటిచెప్పుట. 'సు-ఘోష' అనగా మరల మరల ఎలుగెత్తి చాటుట. అలా ఒక్కని గురించే వేదములు వేదములు చెప్పినవి. ఆ పరబ్రహ్మమే 'సుఘోష'. వర్షంలోనూ, జలప్రవాహంలోనూ, ప్రకృతి పలవరింపులోనూ వినవచ్చేది ఆ సుఘోషయే.

సుందరకాండము 35.16 – శ్రీరాముని హనుమంతుడు వర్ణించిన విధము –

**దుందుభి స్వన నిర్ఘోషః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్ సమస్సమ విభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః.** ఓ సీతాదేవీ! శ్రీరాముడు దుందుభివలె గంభీరమైన కంఠస్వరము గలవాడు. నిగనిగలాడు శరీరచ్ఛాయ గలవాడు. ప్రతాపశాలి. ఎక్కువ తక్కువలు లేకుండా పరిపుష్టములైన చక్కని అవయవములు గలవాడు. మేఘశ్యామవర్ణ శోభితుడు.

మోహిని అవతారపరంగా – దేవతలచేత, దానవులచేత కూడ పెద్దగా కొనియాడబడుతూ పాలకడలిని చిలికిన దేవుడు.

## 460 సుఖదః

- సుఖ సంతోషములను, శాశ్వత సుఖమైన మోక్షమును ఇచ్చువాడు.

- దుష్టుల సౌఖ్యమును నాశనము చేయువాడు.
- మోక్షమునకు ప్రతిబంధకములైన భోగములను నివారించువాడు.
- రోగములు లేకుండ జీవించు శరీరమునిచ్చువాడు.

ఓం సుఖదాయ నమః

మరల 890వ నామముగా 'సుఖదః' వచ్చును.

49వ శ్లోకము. 460వ నామము. సుఖదః – **సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్**

95వ శ్లోకము. 890వ నామము. సుఖదః – **అనంతో హుతభుగ్భోక్తా సుఖదో నైకదోఽగ్రజః**

సదాచార సంపన్నులకు, సమాధిసాధకులకు సుఖమునిచ్చును గనుక భగవంతుడు 'సుఖదః' అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

**సదాచార సమాధి అనుష్ఠాపనేన తన్నిష్ఠేభ్యః ఫలమ్ పరమ సుఖమ్ దదాతి ఇతి సుఖదః**

**సమాధ్యనుష్ఠానేన తదనుష్ఠాన శీలినామ్ సుఖం బహు దదాతి ఇతి సుఖదః పరికీర్తితః**

ధ్యాన నిష్ఠను ప్రచారం చేసి, అలా నిష్ఠతో ధ్యానించిన భక్తులకు అపరిమిత సుఖమునొసగువాడు.

భగవంతుడు సదాచార సంపన్నులను అనుగ్రహించుటయే కాదు. తాను స్వయంగా సత్కర్మలను ఆచరించుచు మనకు దారి చూపును. ఆ మార్గమును అనుసరించినవారికి పరమ సౌఖ్యము అందివచ్చును.

'ద' అనగా ఇచ్చుట, నాశనము చేయుట (దదాతి, ద్యాతి) అను రెండర్థములున్నవి. కనుక 'సుఖదః' అనగా దుష్టుల సుఖమును హరించువాడు అన్న అర్థమును కూడ శ్రీ శంకరులు సమర్థించారు. **ఆపద్వృత్తానామ్ సుఖమ్ ద్యాతి ఖండయతి ఇతి సుఖదః.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరొకవిధంగా విశ్లేషించారు – సు-ఖ-దః

సు – మంచి, ఆరోగ్యకరమైన

ఖ – ఖను-అవధారణే – త్రవ్వుట, తరచుట

సుఖ – నవరంధ్రములతో కూడిన శరీరము, మంచి జీవితమునిచ్చును.

సుఖద – ఆరోగ్యకరమైన జీవితమునిచ్చు శరీరమును ప్రసాదించువాడు.

**సుఖమ్ ఖాతమ్ తద్దః సుఖదః విష్ణుః**

మోహిని అవతారపరంగా – అమృతమును పంచి ఆనందమును విరజల్లిన దేవుడు.

## **461.** సుహృత్

- మంచి మనసుగల నిజమైన మిత్రుడు. అపకారికి కూడా ఉపకారము చేయనెంచువాడు. కరుణాసాగరుడు.
- కామక్రోధాది భావములతో కాకుండా, వేదధర్మము కోసమే అసురసంహారాది కార్యములు నిర్వహించువాడు.
- కామక్రోధాది వికారములకు అతీతుడు.
- దేవతలకు అమృతమును పంచియిచ్చిన మిత్రుడు.

ఓం సుహృదే నమః

**కిమస్మిన్ కరవాణీతి హ్యపకారిణి శోభనమ్ యస్యాప్తి హృదయం చాసౌ సుహృత్యభిధీయతే** - అపకారము చేసినవాడికి కూడా, ఇతడికి నేనే విధమైన మేలు చేయగలను అని ఆలోచించే మనసుగలవాడు. **అనుపకారిణి అపి- కిం అస్య భవిష్యతి- కిం కరవాణి-**

**ఇతి శుభాశంసి శోభన హృదయత్వమ్ సుహృత్త్వమ్** – అని శ్రీ భట్టులు వివరించారు. **రిపుణామపి వత్సలః** – అని రామాయణమునుండి శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించారు.

ధర్మచక్రము రచయిత – తనకు కష్టాలు కలిగినపుడు క్రుంగి, కలసివచ్చినపుడు పొంగిపోయే మనసు 'సుహృత్' కాదు. పరులకు దుఃఖము కలిగినపుడు కరిగిపోయేదే 'సుహృత్'. పట్టాభిషేకమునకు సిద్ధమైనపుడూ, వనవాసానికి కదిలినపుడూ కూడా శ్రీరామచంద్రుడు స్థిరచిత్తుడయ్యే ఉన్నాడు. కాని ఇతరుల కష్టాలను తన కష్టాలుగా తలచాడు. ఈ పుణ్యనామమును ధ్యానించినవారికి హృదయము కల్మషరహితమౌతుంది. ఓం సుహృదే నమః.

మోహిని అవతారపరంగా – దేవతలకు అమృతమును పంచి ఇచ్చిన నిజమిత్రుడు సుహృత్.

## 462. మనోహరః

- మనసును హరించువాడు.

### ఓం మనోహరాయ నమః

'సుహృత్' అనగా అందరికీ మేలుచేయనెంచువాడు. అందువలన అందరి మనసులను ఆకట్టుకొనేవాడు మనోహరుడు. నల్లనివాడు. పద్మనయనమ్ములవాడు. నవ్వు రాజిల్లెడు మోమువాడు. సుధారసమ్ము పై జల్లువాడు. గోపీజన మనోహరుడు.

**ఏవం విసర్గ సౌహార్దాత్ తేషాం హృదయ హారకః మనోహర స్సమాఖ్యాతో హ్యష్టార్ణ శ్శాంతిదాయకః -** ఇటువంటి మంచి మనసుతో శత్రువులను కూడా ఆకట్టుకొంటాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. శాంతిదాయకము. ఓం మనోహరాయ నమః.

శ్రీ వి.వి. రామానుజన్ ఇందుకు నమ్మాళ్వార్ తిరువైమొళి (7.2.6)నుండి ఉదాహరించారు – **మెయ్యల్ సెయిదు ఎన్నై మనమ్ కవరందానే.**

శ్రీ చిన్మయానంద – మనసు దోచుకొనేవాడు మనోహరుడు. శ్రీనివాసుని సౌందర్యము సకల కళ్యాణదాయకము. ఐహికదృష్టి నుండి భక్తులను తన దివ్యపదమునకు మళ్ళించును. అంబుజోదర దివ్యపాదారవింద మత్తమైన చిత్తము ఇతరములకేల వెడలును?

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శ్రీదేవుని మనోహరత్వము ఆయన సృష్టిలో మరల మరల ప్రస్ఫుటమగుచున్నది.

ధర్మచక్రము రచయిత – సుఖభోగానురక్తులైనవారి చిత్తమును ఐహికానందమువైపునకు, మోక్షగాముల చిత్తమును పరమపద సోపానమువైపునకు ఆకర్షించు భగవానుడు ఇరువర్గములకు మనోహరుడు.

## 463. జితక్రోధః

- కోపమును జయించినవాడు.

### ఓం జితక్రోధాయ నమః

క్రోధము, తదితర వికార భావములన్నింటిని జయించినవాడు. తన ఇచ్ఛానుసారమే కోపమును ధరించువాడు. శ్రీమద్రామాయణము ఆరంభములో వాల్మీకి 'జితక్రోధుడు' ఎవరు అని అడుగగా నారదుడు –**ఉచ్యమానోऽపి పరుషమ్ న ఉత్తరమ్ ప్రతిపద్యతే** – తనపట్ల పరుషమైన మాటలాడినా, తానుమాత్రము పరులకు పరుషమైన ఉత్తరమీయనివాడు రాముడే జితక్రోధుడు – అని చెప్పెను.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి మూడువిధములైన కోపములను పేర్కొన్నారు (1) మనసులో దాగిఉండి, మాటలు, చేతల రూపంలో బయటకు రానిది మన్యు (2) కండ్లు ఎరుపెక్కి ముఖం కటువుబారితే అది కోపము (3) పరుషములైన మాటలు, చేతలు, కదలికలతో వెళ్ళగక్కునది క్రోధము.

భగవంతుడు క్రోధాన్ని పరిత్యజించలేదు. జయించాడు. అనగా తన ఇచ్ఛానుసారము క్రోధాన్ని ధరిస్తాడు. శ్రీనారసింహుడు ప్రహ్లాదుని కాచుటకై హిరణ్యకశిపునిపై విరుచుకుపడ్డాడు. **క్రోధమ్ ఆహార్యాత్ తీవ్రమ్** – అని వాల్మీకి వ్రాశాడు (3.24.33). యుద్ధకాండము(59.147) – శ్రీరాముడు హనుమ భుజాలపై అధిరోహించి రావణునితో యుద్ధం చేస్తుండగా, రావణుడు తీవ్రమైన బాణాలతో హనుమను నొప్పించాడు. రక్తం వోడుతూ మోదుగచెట్టు పూలతో నిండినట్లున్న ఆంజనేయుని చూచి శ్రీరాముడు 'క్రోధమా, నన్నావహించు' అన్నాడు. అలా ఆయన క్రోధాన్ని జయించిన జితక్రోధుడు.

**రక్షసాం దేవ విషయే యేన క్రోధో వినిర్జితః స జితక్రోధ అఖ్యాతో హ్యష్టార్ణః క్రోధనాశకః -** దేవతల విషయంలో రాక్షసులకుగల క్రోధాన్ని పరిమార్చినవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. క్రోధనాశకము. ఓం జితక్రోధాయ నమః.

అసురలపట్ల క్రోధంతో గాక, వేదధర్మోద్ధరణ కోసమే వారిని సంహరించిన భగవంతుడు జితక్రోధుడు అని శ్రీ శంకరులు వివరించారు.

సంపూర్ణ సమతులనముగల మనసు గలవాడు గనుక భగవానుడు కామక్రోధాది వికారములకు అతీతుడని శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరించారు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ గొప్ప సంస్కృత పండితులు మాత్రమే కాదు. ఆయుర్వేద జ్యోతిశ్శాస్త్రాలలో దిట్ట. ఆయన ఇలా వివరించారు. క్రోధము అనేది శారీరిక గ్రంథులలో ఏర్పడిన ఒక వికారము. ఏవిధములైన వికారములు, వ్యత్యాసములు లేని అచ్యుతుడు సుహృత్, జితక్రోధుడు.

శ్రీ చిన్మయానంద – క్రోధమే కాదు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు లేశమంతయినా లేనివాడు గనుక శ్రీమహావిష్ణువు సుహృత్, జిదక్రోధః.

మోహిని అవతారపరంగా – జగన్మోహినిని చూచిన అసురులు మాయావివశులై, దేవతలపట్ల తమకున్న క్రోధమును విస్మరించిరి.

## 464. వీరబాహుః

- గొప్ప బాహువులు గలవాడు.

### ఓం వీరబాహవే నమః

శ్రీ భట్టులు ఈ నామమును క్షీరసాగరమథనం పరంగా ఇలా వివరించారు – దేవతలు, దానవులు అలసిపోయినపుడు శ్రీమహావిష్ణువే పాలకడలిని చిలకడం కొనసాగించాడు. శ్రీహరి వేల చేతులు మనోహరంగా, మహాద్భుతంగా మందరగిరిని త్రిప్పుతున్నాయి. ఆ చేతులు ప్రకాశమానములైన కంకణాలతో, కడియాలతో, భుజకీర్తులతో, పూలమాలలతో వెలుగుచున్నాయి.

శ్రీ వి.వి. రామానుజన్ పెరియతిరుమొళి (5.7.4)నుండి ఉదాహరించారు.

శ్రీ శంకరుల భాష్యము – శత్రువులను నిర్జించి వేదధర్మమును నిలిపిన భగవానుడు వీరబాహువు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – వెనుకంజ వేయకుండా, విరామం లేకుండా విజృంభించేవాడు వీరుడు. భగవంతుని నాలుగు చేతులు వివిధాయుధాలతో, ఒకేమారు, ప్రతిచేయి స్వతంత్రంగా, తమ కార్యములు సాధించును. కనుక ఆయన ప్రతిబాహువు వీరలక్షణములు కలిగియుండును.

ధర్మచక్రము రచయిత – ధర్మమును కాపాడేవాడు వీరుడు. కనుక ఇరవైచేతులున్నాగాని రావణుడు వీరబాహువు కాదు. ఎందుకంటే అవి కామానికి సహకరించేవి. మనము మన శక్తిని ధర్మకార్యాలకు వినియోగించాలని ఈ నామస్మరణముద్వారా గ్రహించాలి.

## 465. విదారణః

- చీల్చివేయువాడు. (ధర్మము తప్పినవారిని) ఖండించేవాడు. రాహువును, హిరణ్యకశిపుని ఖండించినవాడు.
- భక్తుల పాపములను ఖండించువాడు. భయమును హరించువాడు.
- విభజించువాడు.
- హేతి మొదలైన దివ్యాయుధములచే రాక్షసులను చీల్చువాడు.
- ఆత్మకు, శరీరానికి ఉండే బంధాన్ని త్రెంచేవాడు.



వికీపీడియా చిత్రం. By Nani.2018
https://commons.wikimedia.org/wiki/File:Lakshmi_narasimha_swamy_idol.jpg

### ఓం విదారణాయ నమః

అమృతమును పంచే సమయంలో రాహువును ఖండించినవాడు, దేవతలను కాచినవాడు విదారణుడు.

సమగ్ర ఉగ్ర భయ విదారణాయ – అన్నది భగవంతుని స్మరించే మంత్రము. సకల భీకర భయాలు శ్రీదేవుని స్మరణమువలన పటాపంచలవుతాయి.

**బధ్వా గలే యమభటా బహుతర్జయన్తః కర్షంతి చాత్ర భవపాశ శతైర్యుతం మామ్**
**ఏకాకినం పరవశం చకితం దయాళో! లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్**

ధర్మచక్రము రచయిత వివరణ – భవబంధములను ఖండించేవాడు. ఆత్మకు శరీరబంధమునుండి విముక్తిని కలిగించేవాడు విదారణుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – విభజించేవాడు విదారణుడు. స్త్రీ పురుషులను, రేయింబవళ్ళను, ఉత్తరాయణ దక్షిణాయనాలను, పృథివ్యాకాశములను, అగ్నిస్తోమములను వేరుచేసేవాడు. జన్మ సమయమున తల్లి గర్భమునుండి బిడ్డను వేరుచేసేవాడు.

**శ్రీనారసింహుడు హిరణ్యకశిపుని చీల్చిన విధము** – హిరణ్యకశిపుని గుండెను నరహరి చీలుస్తాడు. నేలనిండా నెత్తురు చల్లుతాడు. కఠినములైన నరాలను తెంపుతాడు. రొమ్మును పగులగొడతాడు. మాంసాన్ని చిన్నచిన్న ముక్కలుగా చేస్తాడు. ప్రేగులు హారాలుగా మెడలో వేసుకొంటాడు. ఒక్క ఆయుధాన్ని కూడా ప్రయోగించకుండా తొడలపై వేసికొని హరి రాక్షసుని చీలుస్తుంటే, నరహరిగోళ్ళు గొడ్డళ్ళవలె ఉన్నాయి. లోతైన గుండెను బద్దలుకొట్టేటపుడు గుద్దళ్ళవలెనున్నాయి. నరాలను త్రెంచేటపుడు గట్టి కొడవళ్ళవలె నున్నాయి. కడుపులోని ప్రేగులను తెంచేటపుడు రంపాలలా ఉన్నాయి. ఇట్లా ఏయే పనులకు తగినట్లు ఆయా విచిత్రములైన ఆయుధాలవలె నొప్పాయి.

**ఓం నమో శ్రీలక్ష్మీనారసింహాయ. ప్రహ్లాద వరదాయ నమః.**

శ్రీనారసింహుని గోళ్ళను చూచి దేవతాముఖాలు వికసిస్తున్నాయి. రాక్షసరాజు శరీరాన్ని చీలుస్తున్నాయవి. అగ్ని జ్వాలలకన్న ప్రకాశమానంగా ఉండి, నరహరికి మ్రొక్కేవారలకు అభయదానం చేస్తున్నాయి.

ఓం నమో భగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే హరయేऽద్భుత సింహాయ బ్రహ్మణే పరమాత్మనే
సర్వవేదాంత వేద్యాయ కారణాయ మహాత్మనే సర్వలోక శరణ్యాయ శ్రీనృసింహాయ మంగళమ్.
(శ్రీ భండారు పర్వతాలరావు రచన “ఓం నమో శ్రీ నారసింహాయ”నుండి)





## స్వాపనస్స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ |
## వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః || (50)

### 466. స్వాపనః

- నిదురింపజేయువాడు. మాయామోహితులను చేయువాడు.

ఓం స్వాపనాయ నమః

**కటాక్ష భ్రూవిలాసాద్యైః నష్ట శిష్టాన్ జనానపి యోऽసౌ సమ్య మోహయతి స్వాపనః పరికీర్తితః** - భగవానుడు విదారణుడై కొందరు దానవులను నాశనం చేశాడు. వారు నశింపగా మిగిలిన రాక్షసులు మోహిని క్రీగంటిచూపుతో సమ్మోహితులై, వివశులై తమకు అమృతం అందడంలేదనే విషయాన్ని విస్మరించారు. ఇది శ్రీ భట్టుల వ్యాఖ్య.

https://commons.wikimedia.org/wiki/File:BelurCTM_25_Bhasma_Mohini_Dance.jpg

**స్వాపయతి నిద్రాపయతి ప్రళయకాలే సర్వమ్ ప్రకృతావితి స్వాపనః** – ప్రళయకాలంలో ప్రకృతినంతటినీ నిద్రబుచ్చువాడు. అని శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరించారు. భగవంతుడు మాత్రము జాగరూకుడై ఉంటాడు. కాని ఆయన నిద్రిస్తాడని ఇతరులు భావిస్తారు. ఎందుకంటే ఆయన పరమేశ్వరత్వము నితరు లెరుగజాలరు. అలా ఆయన తత్వము తెలియనివారు నిద్రిస్తున్నట్లే లెక్క. అని వివరిస్తూ శ్రీ వి.వి. రామానుజన్ గీతనుండి ఉదాహరించారు.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః మూఢోऽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్** – గీత 7.25
నా యోగమాయయందు దాగియున్న నేను అందరికి గోచరింపను. కనుక అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలిసికొనలేరు.

ధర్మచక్రము రచయిత వివరణ – బుద్ధి, విజ్ఞానము వంటి విషయాలలో మనుష్యులు 'మెలకువగా ఉన్నారు' అని, అవి కొరవడిన జంతువులు 'నిద్రపోతున్నాయి' అని చెప్పవచ్చును. అంటే మానవులుండే ఆ ప్రాంగణంలో జంతువులు విహరించలేవని వివరించవచ్చును. అలాగే 'జ్ఞాని'కి సంబంధించిన స్థానంలో సామాన్యమానవులు నిద్రిస్తూ ఉన్నట్లే. "నారాయణ" మంత్రజపం వల్ల మాత్రమే అట్టి మానవులు జాగరూకులు కాగలరు. మోహపాశబద్ధులై, చైతన్యహీనులైనవారిని మేలుకొలిపేది ఈ పుణ్యనామము.

### 467. స్వవశః

- తనకు తానే వశమైనవాడు. వేరెవ్వరికి అధీనములో ఉండడు.
- సర్వస్వతంత్రుడు. అంతా తనకు వశమైనవాడు.

- మరేమీ అవుసరము లేనివాడు.

ఓం స్వవశాయ నమః

**స్వకియైస్సహ సుప్తేషు తేషు స్వైర విహారవాన్ భవతి స్వవశస్సోऽపి నాన్యధీనత్వదో మనుః -** రాక్షసులను మాయామోహితులను చేసి, నిదురబుచ్చి, దేవతలతో యధేచ్ఛగా విహరించెను. ఆయన అన్యులకు అధీనుడు కాడు గనుక స్వవశుడు – అని వివరిస్తూ శ్రీ భట్టులు మోహిని అవతారపరంగా వ్యాఖ్య కొనసాగించారు.

భగవానుడు సృష్టి స్థితి లయాది కార్యములు సంపూర్ణముగా తన ఇచ్ఛానుసారము చేయు సర్వస్వతంత్రుడు గనుక స్వవశుడు అని శ్రీ శంకరుల వ్యాఖ్య.

ఆయనకు కావలసినదేదీ లేదు. అంతా ఆయనలోనే ఉన్నది.

## 468. వ్యాపీ

- క్షీరసాగర మథన సమయంలో అందరిలోనూ వ్యాపించి శక్తిని ఇచ్చినవాడు.
- అంతటా విస్తరించియున్నవాడు. సూక్ష్మమై, అనంతమైనవాడు.

ఓం వ్యాపినే నమః

**దేవ రక్షో మంథరేషు వాసుకి ప్రభృతిష్వపి ఆప్యాయనాయ శక్త్యా చ వ్యాపీ స్సాద్వ్యాసనాదసౌ -** శ్రీ భట్టుల వ్యాఖ్యానం క్షీరసాగరమథనపరంగా కొనసాగింది. క్షీరసాగరమథన సమయంలో దేవతలకు, రాక్షసులకే కాక వాసుకికి కూడా శక్తి సన్నగిల్లుతున్నది. అప్పుడు శ్రీమహావిష్ణువు వారందరియందును వ్యాపించి, మందరపర్వతమునందు కూడా తానే వ్యాపించి, వారికి శక్తినొసగి, సాగరమథనానికి అవుసరమైన శక్తిని ప్రసాదించాడు. శ్రీ వి.వి. రామానుజన్ ఇందుకు నమ్మాళ్వార్ రచన (1.1.10)ను ఉదాహరించారు.

కార్య కారణ రూపమున అంతటను వ్యాపించి, విస్తరించి, విరాజిల్లినవాడగుటచేత పరమాత్ముడు 'వ్యాపీ'యను భవ్యనామమున భజనీయుడు. (శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి శృతినుండి చెప్పిన ఉదాహరణ – **అవ్యక్తాత్ తు పరః పురుషో వ్యాపకః** (ముండకోపనిషత్తు 2.3.8) – వ్యాప్తిత్వము సూక్ష్మత్వమును సూచించుచున్నదని శ్రీ చిన్మయానంద వివరించారు. సర్వవ్యాపియైన భగవానుడు సూక్ష్మమైనవానికంటె సూక్ష్మతముడు. కనుక ఆయన లేని చోటు లేదు.

ధర్మచక్రము రచయిత వివరణ – సర్వవ్యాప్తిత్వము అనంత గుణమును సూచించును. ఏదైనా ఎక్కడైనా ఉన్నట్లైతే దానిలో అక్కడ దేవుడున్నాడు. కనుక ఆయన సర్వవ్యాపి. అంతము, అవధి లేనివాడు. మన బుద్ధి, ఇంద్రియ, జ్ఞానములకున్న పరిధులనుబట్టి అంతవరకే ఆయనను మనము తెలిసికొన ప్రయత్నము సాధ్యము. ఈ నామధ్యానమువలన ఎంపెరుమాన్ అనంతత్వమును అనుభవించే దీక్షానుభవము మనకు సమకూరుతుంది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ శృతులనుండి పలు ఉదాహరణలు చెప్పారు –

యజుర్వేదము – **పరీత్య భూతాని పరీత్యలోకాన్ పరీత్యసర్వాః ప్రదిశో దిశశ్చ**

ఋగ్వేదము **– పృష్టో దివి పృష్టో అగ్నిః పృథివ్యామ్ పృష్టో విశ్వా ఓషధీరావివేశ**

అథర్వణ వేదము – **యో అగ్నౌ రుద్రో యో అప్స్వంతర్య ఓషధీర్వీరుధ ఆవివేశ**

## 469. నైకాత్మా

- అనేక రూపములలో, అనేక ఆత్మలుగా విస్తరించియున్నవాడు.
- విష్ణువు, కూర్మము, మందరము, మోహిని, వాసుకి – ఇలా ఒకేమారు బహురూపములలో నున్నవాడు.

### ఓం నైకాత్మనే నమః

**తదాత్మనై ర్బహ్మ కౌర్మ మోహిన్యాద్యవతారకైః నైకాత్మేతి శ్రుత స్సమ్యక్ మున్యర్ణో బహురూపదః** - బ్రహ్మ కూర్మ మోహిన్యాది అనేక అవతారములతో ఏకరూపముగా ఉన్నవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సౌందర్యప్రాప్తి. ఓం నైకాత్మనే నమః.



క్షీరసాగర మథనం – 1820 కాలపు చిత్రం. వికీపీడియానుండి

https://commons.wikimedia.org/wiki/File:The_Churning_of_the_Milky_Ocean.jpg

క్షీరసాగరమథనపరంగా శ్రీ భట్టుల వ్యాఖ్య – ఒకేమారు శ్రీమహావిష్ణువు క్షీరసాగర మథనానికి వివిధ అవతారాలు ధరించి తోడ్పడినాడు. శ్రీకూర్మస్వామియై మంధరగిరిని నిలిపాడు. మోహినియై అమృతాన్ని పంచాడు.

ఈ నామమునకు, 139వ నామము "చతురాత్మా"కు ఉన్న పోలికలను శ్రీ రాధాకృష్ణశాస్త్రి పేర్కొన్నారు. భగవంతుడు తన సృష్టిలోని వివిధ రూపములద్వారా మనకు స్ఫురిస్తున్నాడు.

ధర్మచక్రము రచయిత వ్యాఖ్య – వివిధ మతస్థులు భగవంతుని వివిధరూపాలను కొలుస్తున్నారు. నైకాత్ముని గుణమెరుగక వీరు తమ తమ దేవుళ్ళు వేరు వేరని తలచి తమలో తాము కలహిస్తున్నారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – "ఆత్మ" అనగా నిలకడగా ఉండేది. తల్లిగా, తండ్రిగా, బిడ్డగా, గురువుగా, శిష్యునిగా, భార్యగా, భర్తగా, మిత్రునిగా పరమాత్ముడు అందరికీ అందుబాటులోనున్నాడు. ఎందుకంటే ఆయన సర్వాంతర్యామి. శృతులలోని పెక్కు వాక్యములు ఇందుకు ఉదాహరించవచ్చును.

**తదేవ అగ్ని స్తదాదిత్య స్తదు వాయు స్తదు చంద్రమాః**
**తదేవ శుక్రమ్ తద్ బ్రహ్మ తా ఆపః స ప్రజాపతిః** – యజుర్వేదము 32.1
**త్వమ్ హి నః పితా వాసో త్వమ్ మాతా శతకృతో బభూవిథ** – ఋగ్వేదము 8.98.1

## 470. నైక కర్మ కృత్

- అనేకములైన కర్మలనొనరించువాడు.

### ఓం నైకకర్మకృతే నమః

శ్రీ భట్టుల వివరణ – క్షీరసాగర మథన సమయంలో మంధరగిరిని నిలుపుట, అమృతమును పంచుట, అందరకును శక్తినొసగుటవంటి అనేక కార్యములు చేసినవాడు.



క్షీరసాగర మథనం. బ్యాంగ్ కాక్ విమానాశ్రయంలో శిల్పం. వికీపీడియా చిత్రం. Photo by Sailko
https://commons.wikimedia.org/wiki/File:Bangkok_Airport_07.JPG

శ్రీ శంకరుల వ్యాఖ్య – సృష్టి స్థితి లయాది సకల కార్యములను తానే చేయువాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సూర్యుడు, చంద్రుడు, అగ్నివంటి వివిధ రూపములలో జీవులకు అవుసరమైన కార్యములను నిర్వర్తించువాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – తల్లి, తండ్రి, గురువు, బిడ్డ, శిష్యుడు వంటి వివిధ రూపములలో ఆయా ధర్మములను నిర్వహించువాడు.

అన్ని విధములైన వ్యాఖ్యలను సమన్వయపరుస్తూ ధర్మచక్రము రచయిత ఇచ్చిన వివరణ – ఎక్కడ ఏ పని జరిగినా అది భగవంతునిద్వారా మాత్రమే జరుగుతున్నదని గ్రహించాలి. ఇందుకు చాలా ఉదాహరణలు చెప్పవచ్చును. దేవుని సృష్టికార్యములో మనము నిమిత్తమాత్రులమేగాని చేసేవారము కాము. కర్త మాత్రము భగవంతుడే. ఒక మామిడి టెంకనుండి మామిడిచెట్టు వస్తుంది కాని వేరొకటి రాదు. కనుక బహువిధములైన సృష్టి, తదితర కార్యములు భగవంతునిద్వారా మాత్రమే జరుగుచున్నవి. ఇవి గ్రహించిన యెడల కర్మఫలములు మనలనంటవు.

## 471. వత్సరః

- సకల భూతములయందు వసించువాడు.
- సకల భూతములు ఆయనయందు వసించును.
- అనంతమైన కాలస్వరూపుడు.

- గోవులకడకు లేగలను తిరిగి చేర్చినవాడు.

### ఓం వత్సరాయ నమః

**పురుషార్థ స్థాపనాయ సర్వాంతర్య సనాచ్చతాః ధర్మాత్మా వత్సరస్సస్స్యాత్ మున్వర్ణోఽభీష్టదో మనుః** - పురుషార్థముల మర్యాదను కాపాడడానికి అందరియందు నివసించే ధర్మాత్ముడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. కోరిన కోరికలు తీరుతాయి. ఓం వత్సరాయ నమః

వస్-అనగా నివసించుట – అనే అర్థమునుండి ఈ నామమును శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ధర్మమును స్థాపించడానికి, మోక్షమార్గమున నడిపించడానికి శ్రీమహావిష్ణువు అంతర్యామియై అందరియందు వసించియున్న వత్సరుడు. ఇందుకు ప్రమాణముగా శ్రీ భట్టులు ఉదాహరించిన మంత్రము – **సర్వాంతశ్చారిణే ధర్మాత్మనే.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వసతి అత్ర అఖిలమ్ ఇతి వత్సరః** – అంతయు ఆయనలో వసించును గనుక శ్రీహరి వత్సరుడు. అన్నింటికిని ఆవాసము.

పైరెండు వ్యాఖ్యలకును వర్తించే పెక్కు శ్రుతిప్రమాణములను శ్రీ సత్యదేవో వాసిష్ఠ పేర్కొన్నారు –
**త్వయి రాత్రి వశాంసి స్వపిష్యామసి జాగృః** – అధర్వణ వేదము 19.47.9
**ఈశావాస్యమిదమ్ సర్వమ్ యత్కించిత్ జగత్యామ్ జగత్** – ఈశావాస్యోపనిషత్తు.
**సంవత్సరోఽసి పరివత్సరోఽసీదా వత్సరోఽసీదా వత్సరోఽసీ** – యజుర్వేదము 27.45

వత్సరము - అనగా ఒక సంవత్సరకాలము. కాలాకాశ స్వరూపుడైన భగవంతునిలో అందరూ ఉన్నారు. ఇది కూడా పై అర్థమునే పరోక్షముగా తెలుపును.

శ్రీ చిన్మయానంద – (శ్రీకృష్ణావతార పరంగా) **వత్సాన్ రాతి ఇతి వత్సరః** – గోపబాలకులనుండి వత్సములు (ఆవుదూడలు) శత్రువులచే తీసికొని పోబడినవి. వాటిని మరల భగవానుడు గోపాలకులకు అప్పగించినాడు. కనుక ఆయన వత్సరుడు.

## 472. వత్సలః

- ప్రేమమూర్తి. వాత్సల్య స్వరూపుడు.

### ఓం వత్సలాయ నమః

'వత్స'అనగా దూడ – ప్రేమను సూచించునది. (**వత్స అంశాభ్యామ్ కామబలే** – పాణిని). శ్రీమన్నారాయణుడు వాత్సల్యభరితుడు.

**సర్వస్యాంతర్నివసనే హేతు స్స్యా ద్వత్సల స్మృతః వత్సేదో నోఽరివ యతో వత్సలశ్శరణాగతే** - అందరియందు గల వాత్సల్యమువల్లనే వారియందుంటాడు. పుట్టిన లేగపై ఆవుకు ఎంత ప్రేమ ఉంటుందో శరణాగతునిపై పరమేశ్వరునికి అంత ప్రేమ ఉంటుంది. వత్సరుడై ఆ భక్తవత్సలుడు వసించుటకు కారణము ఆయనకు భక్తులపట్ల, శరణాగతులపట్ల గల వాత్సల్యమేనని శ్రీ భట్టులు వివరించారు.

**విదిత స్స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః** (సుందరకాండము 21.20) – ఓ రావణా! శ్రీరామచంద్రుడు ధర్మజ్ఞునిగా, శరణాగత వత్సలునిగా మిక్కిలి వాసికెక్కినాడు. నీవు బ్రతికియుండదలచినచో ఆయనతో మైత్రి నెఱపుటయే క్షేమము. శరణుగోరినవారిని అనుగ్రహించునట్టి ఆ స్వామిని నీవు ప్రసన్నుని చేసికొనుము. నీవు జితేంద్రియుడవై, నిర్మల మనస్సుతో నన్ను ఆయనకు అప్పగించుము – అని సీతమ్మతల్లి రావణునకు హితవు చెప్పినది.

ధర్మచక్రము రచయిత – వత్సలుడు గనుకనే శ్రీరాముడు గుహుని మిత్రుడైనాడు. తానే స్వయముగా హనుమంతుని గుండెలో వెలసినాడు. శరణాగతులైన సుగ్రీవుని, విభీషణుని బ్రోచినాడు.

## 473. వత్సీ

- పెక్కు దూడలు కలిగిన గోపాలుడు.
- నిత్యము తనచేత పోషింపబడే ఆత్మవర్గములను దూడలుగా గలవాడు.

### ఓం వత్సినే నమః

**నిత్య పోష్యాత్మ గుణవత్ భూయస్త్వద స్సదా వత్సీ స్యాద్ధి విశేషేణ షడర్ణో గోపదో మనుః -** ఆత్మగుణాలతో అలరారే ఆత్మలను – గోవు తన దూడలను కాపాడునట్లు, గోపాలుడు గోవులను కాచునట్లు – ఎప్పుడూ పోషించేవాడు. అటువంటివారే అధికముగా కలవాడు. ఈ నామము షడక్షరీ మంత్రము. రక్షణనిస్తుంది. ఓం వత్సినే నమః

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవానుని రక్షణాపరత్వము ఎల్లెడల మనకు ప్రస్ఫుటమగుచున్నది. బిడ్డ జన్మింపగనే తల్లి స్తన్యమివ్వగలగడం ఇందుకొక ఉదాహరణ.

## 474. రత్నగర్భః

- విశేషములైన ధనసంపదలు గలవాడు. కోరినంత ధనమును ప్రసాదించువాడు.
- రత్నరాసులు తనయందు కలిగియున్నవాడు. సాగరుడు.
- భక్తులను తన కడుపులో పెట్టుకొని రత్నములనువలె కాపాడుకొనువాడు.

### ఓం రత్నగర్భాయ నమః

**ధనాయద్భ్యో యథారామం ప్రదేయ ధనవత్త్వతః రత్నగర్భ స్సమాఖ్యాతో హ్యష్టార్ణో ధనదో మనుః -** ధనము, ఐశ్వర్యము కోరి తనను సేవించేవారికి  కోరినంత ధనమును ఈయగలవాడు. ఈ నామాన్ని మంత్రంగా జపం చేస్తే అష్టాక్షరి. ధనప్రాప్తి. ఓం రత్నగర్భాయ నమః

శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించినది – **వైత్త మా నిధియామ్ మధుసూదనానై** (నమ్మాళ్వార్ 6.7.11) – భగవానుడు దాచుకొన్న నిధివంటివాడు. అవుసరమునకు ఆదుకొను ఆపద్బాంధవుడు.

గీత(10.24)యందు చెప్పబడిన  - **సరసామస్మి సాగరః** – సరస్సులలో నేను సాగరమును – అన్న వచనము ఆధారముగా శ్రీ శంకరుల వ్యాఖ్యానము సాగినది. సారమును రత్నాకరము, రత్నగర్భ అన్నట్లే భగవంతుడు కూడ రత్నగర్భుడు. సకల నిధులు ఆయనయందే ఉన్నవి. కనుకనే ఆయన కొండలంత వరములు కూపెడు కోనేటిరాయడు. ఆపన్నులకు అభయమయ, అర్థార్థులకు ఐశ్వర్యము, శరణాగతులకు రక్షణ, ప్రపన్నులకు మోక్షము ప్రసాదించు కల్పతరువు కామధేనువు. నిధానము.

ఈ భావమును శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరింత పొడిగించారు. నాగుపాము పడగలోని రత్నము, వెదురుకణుపులో ఏర్పడు రత్నము కూడ భగవంతునిలో సంభవించును. మరొక భావములో, భగవానుడు తన భక్తులను రత్నములవలె కాపాడుచుండును. మోక్షపథమువైపు నడుపుచుండును. రాజస, తామస ప్రలోభములకు లోనుకాకుండ శ్రీమన్నారాయణుని ధ్యానించినయెడల సత్యమార్గమున చరించు భాగ్యము లభించును.

శ్రీ సత్యేవో వాసిష్ఠ – రమ్ - క్రీడాయామ్ - క్రీడించుట – అన్న ధాతువునుండి, రత్నము అనగా ఆనందమునిచ్చేది అంతా రత్నమే. ఆనందము ఏదైనా సచ్చిదానంద పరమాత్ముడైన శ్రీమహావిష్ణువు కటాక్షమువలన కలుగవలసినదే గనుక శ్రీహరియే రత్నగర్భుడు. ఇందుకు శ్రీ వాసిష్ఠ శ్రుతినుండి పెక్కు ఆధారములను ఉదాహరించారు.

**హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేకాసిత్**
**అర్చామి సత్య సవం రత్నధామభి ప్రియమ్ మతిమ్**
**హిరణ్యాక్షః సవితాదేవ ఆగాత్ దధత్ రత్నా దాశుషేవార్యాణి**

## 475. ధనేశ్వరః

- ధనమునకు అధినాధుడు. సకలైశ్వర్యమలకు ప్రభువు. శ్రీలక్ష్మీవల్లభుడు. ధనమును ప్రసాదించువాడు.

### ఓం ధనేశ్వరాయ నమః

ఏకేన చక్రమపరేణ కరేణ శంఖ
మన్యేన సింధుతనయా మవలంబ్య తిష్ఠన్
వామేతరేణ వరదాభయ పద్మచిహ్నమ్
లక్ష్మీనృసింహ! మమదేహి కరావలంబమ్

లక్ష్మీ మహీ తదనురూప నిజానుభావ
నీళాది దివ్య మహిషీకర పల్లవానామ్
ఆరుణ్య సంక్రమణతః కిలసాంద్ర రాగౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే

**ధనానామ్ ఈశ్వరః ధనేశ్వరః** – సకల ధనములకును ప్రభువు ధనేశ్వరుడు – అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. ఇంతకుముందు నామమైన 'రత్నగర్భః' అనగా రత్నములకు నిలయమైన సాగరమని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిన విషయమును గమనించనగును

శ్రీ భట్టులు 'రత్నగర్భః' అనగా సకల నిధులు, సంపదలకు నిలయము – అని మరింత విస్తృతార్థములో వ్యాఖ్యానించారు. కనుక శ్రీ భట్టులు ప్రస్తుత నామము 'ధనేశ్వరః' అనగా – సంపదలు కోరుకొన్న భక్తులకు ధారాళముగా సంపదలొసగువాడు – అని వ్యాఖ్యానించారు. ఇందుకు ఉణాది సూత్రము 738 ఆధారముగా తీసికొనవచ్చును. **అశ్నోత్తర ఆసుకర్మణి వరత్ చ** – త్వరగా సఫలతను ప్రసాదించగలవాడు. ఇక్కడ "త్వరగా" అన్న పదమును నొక్కిచెప్పారు. మ్రొక్కుకున్నంతనే, అభ్యర్థించినంతనే కోరికలు తీర్చువాడు అనే అర్థములో. ఓం ధనేశ్వరాయ నమః.

శ్రీ వి.వి. రామానుజన్ నమ్మాళ్వార్ (3.9.7) రచనను ఉదాహరించారు. **శేరుమ్ కొడై పుగళ్ ఎల్లై ఇలానై.** భగవంతుడు ఒక్కసారిగా సంపదలు ఇచ్చే విషయంగురించి శ్రీ అనంతకృష్ణశాస్త్రి కుచేలుని కథను ఉదాహరించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఈ నామమునకు మరొకవిధంగా అర్థము చెప్పారు. భగవంతుని విభూతులలో కుబేరుడు ఒకరు. **విత్తేశో యక్షరాక్షసామ్** (గీత 10.23). విత్తేశుడనగా కుబేరుడు. కనుక ఆయన ధనేశుడు.

శ్రీ చిన్మయానంద – ఇక్కడ 'సంపదలు' అనగా సంతోషము కూర్చునవన్నియును అని భావించవలెను. శ్రీలక్ష్మీపతియైన శ్రీమహావిష్ణువు సకల ధనములకును నాధుడు. అన్నింటికంటె ఉత్తమ ధనమైన మోక్షమునకు కూడ ఆయనే నాధుడు. ప్రపన్నులకు సత్వరమే ధనమునొసగు శ్రీమన్నారాయణుడే ధనేశ్వరుడు.



## ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదసత్క్షరమక్షరం |
## అవిజ్ఞాతా సహస్రాంశుర్విధాతా కృతలక్షణః || (51)

### 476. ధర్మగుప్

- ధర్మమును రక్షించువాడు

**ఓం ధర్మగుపే నమః**

**ధర్మం గోపయతి రక్షతి ఇతి ధర్మగుప్.** ధర్మమును కాపాడువాడు ధర్మగుప్. ఇందుకు శ్రీ శంకరులు గీత(4.8)నుండి చెప్పిన ఆధారము. **ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.** ధర్మసంస్థాపన కొఱకు నేను యుగయుగమున అవతరింతును – అని శ్రీకృష్ణభగవానుడు బోధించెను.

**కామం దత్వాప్యర్థకామౌ వివర్త్య విషయాంతరాత్ తాభ్యాం హితస్య ధర్మస్య రక్షణాత్ ధర్మగుప్ స్మృతః -** అర్థ కామములను కోరేవారికి వాటిని ఇచ్చి, క్రమంగా వారి బుద్ధిని మరల్చి, వారికి హితమైన ధర్మమునందు ప్రవేశపెట్టి ధర్మాన్ని కాపాడేవాడు. ధర్మమును రక్షించినందున ధర్మగుప్ అని స్మరింపబడును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సృష్టి ఆదినుండి అంతమువరకు ధర్మమార్గమున జీవులను క్రమబద్ధముగా పరిరక్షించువాడు. చెట్టునుండి వచ్చిన విత్తనము మరల చెట్టుకు జన్మనిచ్చును. ఇలా జీవరాశి పరిరక్షించబడుచున్నది. ఇందుకు స్మృతినుండి ఉదాహరణ –

**త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః అతో ధర్మాణి ధారయన్** (యజుర్వేదము 34.43)

ధర్మచక్రము రచయిత – ధర్మముననుసరించువారిని రక్షించి, భగవంతుడు ధర్మమును వీడినవారిని శిక్షించును. లోకములో ధర్మము క్షీణించినపుడు ఉత్పాతములు సంభవించును. ఈ నామస్తోత్రమువలన మనము సకల సంకల్ప వ్యవహారములలో ధర్మమార్గానువర్తనమును అలవాటు చేసుకొనవలయును.

### 477. ధర్మకృత్

- తన భక్తులు ధర్మమును ఆచరించుటకు చేయూతనిచ్చువాడు.
- తానే స్వయముగా ధర్మమును అనుష్ఠించువాడు.

**ఓం ధర్మకృతే నమః**

**సర్వం జనం ధార్మికయన్ లీలానుగ్రహ లక్షణమ్ ధర్మం కరోతి యస్మాద్ధి తస్మాద్ధర్మకృదుచ్యతే -** లోకంలో ప్రజలందరినీ ధార్మికులుగా చెయ్యడానికి ధర్మాన్ని ముందుగా తాను ఆచరిస్తూ, ఇతరులచేత కూడా ఆచరింపజేయువాడు. శ్రీనివాసుని అనుగ్రహమువలననే

ధర్మమార్గానుచరణ సాధ్యమవుతుంది. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన వివరణ – **ధర్మం సామాన్యం అమలమ్ అనాది నిధనమ్ విభుమ్ దుర్లభం యత్ప్రబుద్ధానామ్ తత్ప్రసాదయితా వినా.** గొప్ప జ్ఞానులకు కూడా శ్రీమహావిష్ణువు అనుగ్రహము లేకుండా నిర్మల, అనాదినిధనమైన ధర్మమునాచరించుట సాధ్యము కాదు. ఆ కరుణామయుడు మాత్రమే మనపై దయదలచి, మనను ధర్మమార్గమున నడిపించును.

శ్రీదేవుడు ధర్మాధర్మములకు అతీతుడైనా గాని లోకుల మేలుగోరి తాను స్వయముగా ధర్మమునసుష్ఠించి అందరికిని దారిచూపును. **ధర్మ మర్యాదా స్థాపనార్థమ్ ధర్మమేవ కరోతి ఇతి ధర్మకృత్** – అని శ్రీ శంకరులు చెప్పారు.

శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించిన నమ్మాళ్వార్ రచన (5.6.4) – **సైవార్గళై చ్చైవేనుమ్ యానె.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – జీవితములో ధర్మము ప్రాముఖ్యత గురించి – క్రితం జన్మల కర్మఫలితంగా జీవాత్మ శరీరములో బందీయైనది. ఆత్మవిమోచన కొఱకు దేవుడు ధర్మము అనే సాధనమును ప్రసాదించినాడు.

గీత 3.22,23,24 – ఓ అర్జున! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియును లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను. ఏలనన ఓ పార్థా! ఎప్పుడైనను నేను సావధానుడనై కర్మలయందు ప్రవర్తించకున్నచో లోకమునకు గొప్ప హాని సంభవించును. ఎందుకనగా మనుష్యులందరును అన్నివిధముల నా మార్గమునే అనుసరింతురు. నేను కర్మలను ఆచరించుట మానిననచో ఈ లోకములన్నియును నశించును. అంతేగాదు. లోకములందు అల్లకల్లోలములు (సాంకర్యములు) చెలరేగును. ప్రజానష్టము వాటిల్లును. అందులకు నేనే కారకుడనయ్యేదను.

## 478. ధర్మీ

- ధర్మమే ఉపకరణముగా గలవాడు. ధర్మస్వరూపుడు.

ఓం ధర్మిణే నమః

**ధర్మః అస్య అస్తి ఇతి ధర్మీ** – ధర్మముగలవాడు గనుక ఆయన ధర్మి.

**రామో విగ్రహవాన్ ధర్మః** – శ్రీరాముడు ధర్మము మూర్తీభవించిన స్వరూపము.

భగవంతుడు ధర్మమును రక్షించువాడు. తన భక్తులను రక్షించుటకు ధర్మమే సాధనముగా గలవాడు.

**సాధారణోపకరణం ధర్మో యస్యాస్తి కేవలం స వై ధర్మీతి విజ్ఞేయం షడర్ణో ధర్మదో మనుః** - లోకంలో ప్రసిద్ధమైన ధర్మాన్ని జగద్రక్షణ కోసం సాధనముగా గ్రహించువాడు. ఈ నామము షడక్షరి. ధర్మప్రదము. ఓం ధర్మిణే నమః

ధర్మచక్రము రచయిత – ధర్మము అనంతము. అనాదిగానున్నది. భగవానుడు ఆద్యంత రహితుడు. ధర్మస్వరూపుడు. ధర్మమును అనుసరించువారు శాశ్వత కీర్తిమంతులగుదురు. ధర్మమును త్యజించినవారు నశింతురు. భక్తులకు ధర్మమును నేర్పుటకు, వారిని ధర్మమార్గమున నడిపించుటకు శ్రీహరి సదా అవకాశమును కలుగజేయును. కనుకనే భీష్మపితామహుని అంత్యకాలమున ఆయనవద్ద ధర్మమును గ్రహించమని యుధిష్ఠిరునకాదేశించెను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సూర్యచంద్రాదులు ధర్మము తప్పక తమ గతులననుసరించెదరు. ఇటువంటి విషయములలో మనము గ్రహింపవలసినది – భగవానుడు ధర్మమును సదా అమలు చేయును.

తరువాతి నాలుగు నామములు – **సత్, అసత్, క్షరమ్, అక్షరమ్.** ఈ పుణ్య నామములను శ్రీ శంకరులు, శ్రీభట్టులు వేరు వేరు క్రమములలో వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరులు : **సత్ – అసత్ – క్షరమ్ – అక్షరమ్**

శ్రీ భట్టులు : **సత్ – అక్షరమ్ – అసత్ – క్షరమ్**

ఇద్దరు భాష్యకారులు ఈ నామములను ఒకే విధముగా గ్రహించినప్పటికీ, వారు అవలంబించిన పద్ధతిలో కొంత వ్యత్యాసమున్నది. శ్రీ భట్టులు 'సత్' నామమునకు 'అక్షరమ్' అన్నపదమును విశేషణముగాను, 'అసత్' నామమునకు 'క్షరమ్' అన్నపదమును విశేషణముగాను పరిగణించారు. శ్రీ శంకరులు మాత్రము వీటిని వేరువేరు నామములుగా గ్రహించారు.

| **శ్రీ శంకరుల వ్యాఖ్య** | **శ్రీ భట్టుల వ్యాఖ్య** |
|---|---|
| సత్ | సత్ |
| అసత్ | సత్ అక్షరమ్ |
| క్షరమ్ | అసత్ |
| అక్షరమ్ | అసత్ క్షరమ్ |

'సత్', 'అసత్' అనే నామాలు సామాన్య వ్యవహారంలో పరస్పర వ్యతిరేక అర్థాలుగల ఒక జంటగాను, అలాగే 'క్షరమ్' అక్షరమ్' అనేవి అలాంటి మరొక జంటగానూ చూడవచ్చును.

## 479. సత్

- ప్రశంసింపదగిన, ఉత్తమమైనవాడు.
- శాశ్వతమైనవాడు.
- మంచి, ఉత్తమ కార్యముల రూపము గలవాడు.

### ఓం సతే నమః

**నిరుపాధిక సద్భావాత్ నిత్య సాద్గుణ్య యోగతః సచ్ఛబ్దేనోచ్యతే విష్ణుః వేదవేదాంతపారగైః -** సహజమైన సత్తుగలవాడు, సద్గుణాలను ఆభరణంగా ధరించాడు. అందుచేత శ్రీమన్నారాయణుడు వేదవేదాంతపారంగతులచేత 'సత్' అనిచెప్పబడుతున్నాడు. నిస్సంశయంగా, నిరవధికముగా సకల కళ్యాణ శుభలక్షణ గుణోపేతుడు గనుక శ్రీమన్నారాయణుడు 'సత్'. అంతే గాక ఆయన ఆద్యంతరహితుడైన నిత్యసత్యస్వరూపుడు, శాశ్వతుడు – అని శ్రీభట్టులు వివరించారు.

అద్వైతపరమైన వ్యాఖ్యానములలో **'సత్'** అనగా 'నిజము' అనే అర్థము గైకొనబడినది. రెండు విధములైన సత్యములను శ్రీరాధాకృష్ణశాస్త్రి వివరించారు. పారమార్థిక సత్యము – భూత, భవిష్యత్, వర్తమాన కాలాలలో కూడా మారనిది. శాశ్వతమైనది. వ్యావహారిక సత్యము – భౌతిక ప్రపంచమువంటిది. పారమార్థిక సత్యములోనుండి ఉద్భవించి మరల అందులోనే ప్రళయకాలమున లీనమగునది.

భగవంతుడు నిత్యసత్యము. పారమార్థిక సత్యము. ఓం సతే నమః

భగవద్గీత 17వ అధ్యాయము శ్రద్ధాత్రయవిభాగ యోగము (17 - 23, 24, 25, 26, 27)లో **'ఓం తత్ సత్'** అనే పదాలను శ్రీకృష్ణభగవానుడు వివరించెను.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపః క్రియా
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్

తదిత్య నభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దాన క్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః

సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే



తిరుమల శ్రీవారి పాదములు
Creative Commons Photo from Flickr by Kiran Jagarlapudi

**ఓం, తత్, సత్** – అను మూడు విధములగు పేర్లు సచ్చిదానంద ఘన పరబ్రహ్మకు నిర్దేశించబడినవి. ఆ పరమాత్మనుండియే సృష్ట్యాదియందు బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు ఏర్పడుట జరిగినది. కనుక వేదమంత్రములను పఠించువారు శాస్త్రవిహితములయిన యజ్ఞ, దాన, తపశ్చర్యలను సర్వదా **'ఓమ్'** అను పరమాత్మ నామమున ప్రారంభింతురు. మోక్షకాంక్ష గలవారు స్వలాభాపేక్ష లేశమాత్రమైనను లేకుండ లోకహితార్థమై యజ్ఞ, దాన, తపశ్చర్యలను 'ఇదియంతయు పరమాత్మదే' అను భావముతో **'తత్'** అను నామమును ఉచ్చరించుచు చేయుదురు. ఓ పార్థ! **'సత్'** అను పరమాత్మ నామము సత్యభావమునందును, శ్రేష్ఠ భావమునందును – అనగా పరమాత్ముడు నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావమునందును ప్రయోగించబడుచు నుండును. ఉత్తమ కర్మాచరణమునందును **'సత్'** అను శబ్దము ప్రయుక్తమగుచుండును. యజ్ఞ దాన తపః క్రియలయందలి నిష్ఠ, ఆస్తిక భావమును **'సత్'** అనియందురు. పరమాత్మనుద్దేశించి చేయబడు నిశ్చయాత్మక కర్మలను కూడ **'సత్'** అనియందురు.

## 480. అక్షరమ్

అక్షరమ్ సత్

సత్ అక్షరమ్

- నిశ్చయముగా ఎన్నటికిని తరగని, చెరగని సత్యము.
- మంచివారిని, మంచిని ఎన్నడూ విడనాడనివాడు.

ఓం అక్షరాయ నమః
ఓం అక్షర సతే నమః
ఓం సదక్షరాయ నమః

క్షరము అనగా క్షీణించునది. అక్షరము అనగా ఎన్నడును క్షీణించనిది. **అపక్షయ వినాశాది వర్జితోఽక్షర ఉచ్యతే** – తరుగుట, విరుగుట మొదలైన వికారములు లేనివాడు, నాశన రహితుడు, సత్యము, నిత్యము ఐనవాడు, ఆది, అనాది అయినవాడు, జన్మ మృత్యు

జరాదులు లేనివాడు. సృష్టి జరుగకముందు ఉన్నవాడు, ఇప్పుడు ఉన్నవాడు, ఇకముందుకూడా ఉండేవాడు, సృష్టి స్థితి లయాదులకు కారణభూతుడు. అతడే పరబ్రహ్మ. అక్షరము.

శ్రీ భట్టులు తమ వ్యాఖ్యానములో **'సత్'** అనే (479వ) నామమునకు **'అక్షరమ్'** అనే (480వ) నామమును విశేషణముగా గ్రహించారు. కనుక ఈ ఏకనామము **'సత్ అక్షరమ్'** లేదా **'అక్షరమ్ సత్'** అగును. అనగా అక్షరమైన సత్. ఏ విధమైన క్షీణత లేని సకల కళ్యాణ శాశ్వత సచ్చిదానందమూర్తి. ఆయన స్వరూపము, స్వభావము, కళ్యాణ గుణములు అక్షరములు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణమునుండి, ఛాందోగ్యోపనిత్తునుండి ప్రమాణములను ఉదాహరించారు.

**అపక్షయ వినాశాభ్యామ్ పరిణామర్ధి జన్మభిః**
**వర్జితః శక్యతే వక్తుమ్ సదాస్తీతి కేవలమ్** – విష్ణుపురాణము (1.2.11)
తరుగుట, నశించుట, మార్పు చెందుట, పెరుగుట, జన్మించుట వంటి దశ లక్షణములు ఆయనకు వర్తించవు. 'ఎప్పుడూ ఉండేదే' అనే భావంతోనే పరబ్రహ్మను గురించి ప్రస్తావించడం సాధ్యం.

**సదేవ సోమ్య! ఇదమగ్ర ఆసీత్** – ఛాందోగ్యోపనిషత్తు 6.2.1 – నాయనా! ఈ ఉండడం అనేది మొదట్లోనూ ఉండేది. అన్నింటికంటే అధిక స్థానంలో ఉన్నది **'సత్'** మాత్రమే.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'క్షరమ్' అనగా 'సంచరించుట' అన్న అర్థంలో – నిశ్చలంగా, నిలకడగా ఉండేది అక్షరము. సత్పురుషులకు, సన్మార్గమునకు, సత్కార్యమునకు ఎన్నడూ దూరము కానిది **'సత్-అక్షరమ్'**.

## 481. అసత్

- ఇప్పుడు లేనిది. కాని పూర్వము ఉన్నది. భవిష్యత్తులో ఉండేది.
- పాపకర్ములకు దుఃఖహేతువైన బంధనములు కలుగజేయువాడు.
- ధర్మమును వీడినవారికి లేనివాడు.

### ఓం అసతే నమః

**తపామ్యహమ్ వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ**
**అమృతం చైవ మృత్యుశ్చ సద సచ్చాహ మర్జున** – భగవద్గీత 9.19
సత్ – అసత్ – ఈ రెండూ తానేనని శ్రీకృష్ణుడు తెలియజేసినాడు.

ఈ శ్లోకమునకు శ్రీమద్రామానుజుల వ్యాఖ్య: **సత్ యద్ వర్తతే** – ప్రస్తుతమున్నది సత్యము. **అసత్ యద్ అతీతమ్ చ అనాగతమ్ చ** – గడచిన కాలంలోనూ, రాబోయే కాలంలోనూ ఉన్నది అసత్. అన్ని కాలాలలోనూ ఉన్న భగవానుడు సత్-అసత్.

గీత (17.26)లోనే 'శత్' శబ్దమును 'సాధుభావము'లో వాడుదురని చెప్పడమైనది. కనుక అసాధువులైనవారికి దేవుడు 'అసత్'. అనగా పాపకర్ములను శిక్షించువాడు.

ధర్మము పాటించనివారికి భగవంతుడు తలపురాడు. కానరాడు. కాపాడరాడు. వారికి ఆయన 'అసత్'.

## 482. అసత్ క్షరమ్

### క్షరమ్

- అసత్తునకు క్షరస్వభావము (దూరముగానుండు లక్షణము) కలవాడు.
- పరిణామశీలమ్మైన, తుదకు లయించు భౌతికజగత్తు రూపముకూడ అయినవాడు.

### ఓం అసత్ క్షరాయ నమః

### ఓం క్షరాయ నమః

'క్షరము' అనగా అశాశ్వతమ్మైనది. దూరముగా పోవునది. ('క్షర' ధాతువునకు 'ప్రవహించుట' అన్న భావము కలదు). దుర్మార్గములొనరించువారికి దూరమగువాడు, అందనివాడు గనుక భగవంతుడు క్షరుడు అని ఈ నామ వివరణలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – జగత్తులో భౌతికమ్మైనవి క్షరములు. అంతటా అంతర్యామిగానున్నది అక్షరము. క్షరమ్మైనదాని ఉనికికి, చైతన్యమునకు, చలనమునకు కారణమ్మైనది అక్షరము. భగవానుడు క్షరము, అక్షరము కూడ. మనము నడచేటప్పుడు ఒక్కో అడుగు సమయంలో ఒకో కాలు కదులుతూ ఉంటుంది. మరో కాలు భూమిపై ఆని స్థిరంగా ఉంటుంది. అలాగే జగత్తులో కదిలేవి (చైతన్యము, మార్పు కలిగినవి)గానూ, కదలనివిగానూ ఉంటాయి. అలాంటి చైతన్యమునకు అంతఃకారణముగానూ భగవంతుడు క్షరుడు, అక్షరుడు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఇందుకు శ్రుతులనుండి అనేక సూక్తులను ఉదాహరించారు.

**తదేజతి తన్నైజతి తద్దూరే తదంతికే**
**తదంతరస్య సర్వస్య తదు సర్వస్య బాహ్యతః** – ఈశావాస్యోపనిషత్తు
భగవంతుడు క్షరుడు, అక్షరుడు కూడ అని వివరిస్తూ శ్రీ చిన్మయానంద చెప్పిన చక్కని ఉదాహరణ – సముద్రంలో అలలు ఎగసిపడుతూ, మళ్ళీ వెంటనే నశిస్తాయి. కాని నశించని సముద్రంలో ఆ అలలు కూడా ఒక భాగమే.

## 483. అవిజ్ఞాతా

- తెలియనివాడు.
- తన భక్తుల తప్పుల నెఱుగనివాడు.
- అందరిని కాపాడువాడు.
- కల్పితమ్మైన జ్ఞానము (భ్రమ) లేనివాడు.

### ఓం అవిజ్ఞాత్రే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు తనను శరణుజొచ్చినవారి దోషములను పూర్తిగా విస్మరించును. భక్తుల తప్పులు ఆయనకు తెలియవు. **ప్రపన్న కృత పాపానాం కించదప్యవిచారణాత్ అవిజ్ఞాతేతి కథితః బుధైః సద్గుణసాగరైః -** (ప్రపన్నులు బుద్ధిపూర్వకంగా పాపాలు చేసినప్పటికీ ఏమాత్రమూ పట్టించుకోనివాడు) ఆశ్రితుల అపరాధముల నెఱుగనివాడు.

**ఉచ్యమానోఽపి పరుషమ్ నోత్తరమ్ ప్రతిద్యతే** – అయోధ్యకాండము 1.10 – శ్రీరాముడు తనపట్ల పరుషముగా మాటలాడినవారికి ఏమియును జవాబు ఇచ్చెడివాడు కాదు.

ఇందుకు వివరణగా శ్రీ భట్టులు తమ తండ్రి శ్రీ కూరత్తాళ్వాన్ రచనను ప్రస్తావించారు – **సర్వజ్ఞతామ్ ఏవమ్ ఉపాలభామహే త్వమ్ హి అజ్ఞాన ఏవ ఆశ్రిత దోషజోషణః.** భగవంతుడా! నీవు సర్వజ్ఞుడవందురు. కాని మేము అందుకు అంగీకరించము. నీ భక్తుల దోషములు నీకేమియును తెలియవు.

శ్రీ వి.వి. రామానుజన్ పెరియాళ్వారువారి సన్నుతిని స్మరించారు – **ఎన్నడియార్ అదు శెయ్యార్ సెయిదారేల్ నన్రు సెయిదార్ ఎంబార్** (4.9.2) – నా భక్తుడు ఈ పాపము చేసియుండడు. ఒకపరి అలా చేసియుండినా అది సత్కార్యమే.

**అపిచేత్సు దురాచారో భజతే మామనన్యభాక్**
**సాధురేవ స మంతవ్యః సమ్యగ్ వ్యవసితో హి సః**
మిక్కిలి దురాచారుడైనను అనన్య భక్తితో నన్ను భజించినచో అతనిని సత్పురుషునిగానే భావింపదగును. ఏలనన యదార్థముగా అతడు నిశ్చయబుద్ధి గలవాడు. అనగా పరమాత్మని సేవించుటతో సమానమైనది మరియొకటి ఏదియును లేదని గట్టిగా నిశ్చయించుకొనినవాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమును "అవి-జ్ఞాతా" అని పరిగణించి వ్యాఖ్యాణించారు. 'అవ్' అనే ధాతువునకు 'రక్షించుట' అని భావము. 'అవిజ్ఞాతా' అనగా కాపాడుట తెలిసినవాడు. అందరిని కాపాడువాడు. అందరిలోనూ అంతర్యామియై తనను శరణుజొచ్చినవారిని రక్షించువాడు అవిజ్ఞాత. ఇందుకు ప్రమాణమైన వైదిక మంత్రము. **అవిర్వై నామ దేవతార్తైనాస్తే పరివృతః** – అధర్వణ వేదము 10.8.31.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఆత్మని కర్తృత్వాది కల్పవిజ్ఞానమ్ కల్పితమ్ ఇతి జీవో విజ్ఞాతా. తద్విలక్షణో అవిజ్ఞాతా** – అంతా తానే చేస్తున్నానన్న మిధ్యాభావము కలిగిన జీవుడు విజ్ఞాత. అటువంటి మిధ్యాజ్ఞానము లేనివాడు అవిజ్ఞాత.

## **484.** సహస్రాంశుః

- వేయి కిరణములు గలవాడు (అనంత జ్ఞానమూర్తి).
- అనంత కిరణుడైన సూర్యనారాయణ మూర్తి.
- తన జ్ఞానమును, తేజస్సును ఎల్లెడల వెదజల్లువాడు.

### ఓం సహస్రాంశవే నమః

**అంశవో బుద్ధయః ప్రోక్తా సహస్రం సంతి యస్య తే సహస్రాంశురితి ఖ్యాతో హ్యష్టార్ణో దీపదోమనుః -** అంశ అంటే బుద్ధి. అటువంటి అంశలు ఇతనికి అపారంగా ఉన్నాయి. కనుక ఆయన సహస్రాంశువు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. జ్ఞానప్రదము. ఓం సహస్రాంశవే నమః

సహస్ర-అంశు – అనగా వేయి కిరణములు. శ్రీ భట్టులు 'సహస్ర' అనగా 'అపరిమితములైన' అనియు, 'అంశువు' అనగా 'జ్ఞానము' అనియు భావములను గ్రహించారు. అనంత జ్ఞాన స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు సహస్రాంశువు. **మిక్క జ్ఞాన మూర్తియాయ వేద విళక్కినాయ్** – అని నమ్మాళ్వార్ చెప్పారు (4.7.10). భగవానుడు శుద్ధ సత్వ జ్ఞానముతో ప్రకాశించువాడు. వేదములను ప్రసాదించినవాడు. వేదములద్వారా మనకు తెలియవచ్చువాడు.

అనంత కిరణమూర్తియైనందున శ్రీనివాసుడు సహస్రాంశువని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. **యేన సూర్యస్తపతి తేజసేద్ధః** – అతని తేజస్సువలన సూర్యుడు ప్రకాశించును – అని తైత్తరీయ బ్రాహ్మణము (3.12.9)లో చెప్పబడినది. శ్రీ శంకరులు గీత (15.12)నుండి కూడ ఉదాహరించారు –

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నాతేజస్సేయని యెఱుంగుము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **అంత జ్ఞాన అనంత ప్రభశ్చ విష్ణుః అత సహస్రాంశః** – అనంత జ్ఞానముతో, అనంత తేజముతో ప్రకాశించు శ్రీమహావిష్ణువు సహస్రాంశువు.

## 485. విధాతా

- అన్నింటిని, అందరిని నియంత్రించు అధిపతి. విధించువాడు.
- విశ్వమును ధరించు (భరించు)వాడు.
- బ్రహ్మను కన్న తండ్రి.

### ఓం విధాత్రే నమః

ఈ నామము ఇంతకు ముందు 44వ నామముగా కూడ చెప్పబడినది.
5వ శ్లోకము. 44వ నామము. విధాతా – **అనాది నిధనో ధాతా విధాతా ధాతురుత్తమః**
51వ శ్లోకము. 485వ నామము. విధాతా – **అవిజ్ఞాతా సహస్రాంశుః విధాతా కృతలక్షణః**

44వ నామము. **విధాతా** –
శ్రీ భట్టులు – బ్రహ్మను సృష్టించినవాడు.
శ్రీ శంకరులు – విధి విధానములనేర్పరచి, తగు ఫలముల నొసగువాడు.

485వ నామము. **విధాతా** –
శ్రీ భట్టులు – యముడు మొదలైన దేవతలను కూడా తన అధీనములో కలిగినవాడు. వారికి విధులనేర్పరచువాడు.
శ్రీ శంకరులు – విశ్వభారము వహించు దిగ్గజములకు, ఆదిశేషునకు ఆధారమైనవాడు .

ఇంతకు ముందు నామమైన 'అవిజ్ఞాతా' వ్యాఖ్యాన భావమునుండి 'విధాతా' నామ వ్యాఖ్యను శ్రీ భట్టులు కొనసాగించారు. 'విధా' అనగా భాగము చేయుట, వేరు పరచుట. 'అవిజ్ఞాతా' అనగా భక్తుల దోషములను తెలియని (పట్టించుకొనని)వాడు. అలాగైతే, యమునివంటివారు తమ కర్తవ్యానుసారము విష్ణుభక్తుని అతని పాపముల కారణముగా దండింపవలసివచ్చినచో ఏమగును? భగవానుడు 'విధాత' గనుక, అందరు దేవతలూ శ్రీహరి ఆజ్ఞానువర్తులు గనుక, యముడు గాని, మరొక దేవత గాని విష్ణుభక్తులను శిక్షింపజాలరు. మరియు తమ భటులకు కూడ విష్ణుభక్తులజోలికి పోవలదని చెబుతారు.

తిరుమళిసాయి ఆళ్వార్. తిరువంతాడి(68). యముడు తన బంటులతో రహస్యంగా ఇలా చెప్పాడు – శ్రీమన్నారాయణునే తదేక ధ్యానముతో పూజించే భక్తుల జోలికి పోకుండా మీరు వారిని గౌరవ భక్తులతో ఆదరించండి.

**పరిహర మధుసూదన ప్రపన్నాన్ ప్రభురహం అన్యనృణాం న వైష్ణవానామ్** – శ్రీ విష్ణుపురాణము (3.7.14). వైష్ణవులకు తక్క మిగిలిన నరులకు తాను ప్రభువునని యముడు చెప్పెను.

ఈ విధాతా నామమునే మరొక విధంగా అర్థము చేసికొనవచ్చును.

'ధా' – **ధారయ పోషణాయో ర్దానే చ** – ధరించుట, పోషించుట, ప్రసాదించుట. 'వి' – అనేక విధములుగా. బహు విధములుగా ధరించి, భరించి, పోషించువాడు 'విధాత' అని శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్య. బిడ్డను తల్లి తన గర్భములో పోషించును. తల్లినికూడ కాపాడువాడు జనార్దనుడే. **స న బంధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా** – యజుర్వేదము 32.10

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరొక భావమును కూడా చెప్పారు. **వేదే మనుష్యస్య కృతే కర్తవ్యానామ్ విధాన కర్తృత్వేన విధాతా. విధానస్య కర్తా విధాతా. కర్తవ్య కర్మణామ్ విధాతృత్వేన విస్ ధాతా, వ్యధదాత్ ఇతి** – వేద విధులు నిర్వహించుటకు కర్తవ్యములనేర్పరచినవాడు విధాత.

శ్రీ శంకరుల భాష్యము – ఆదిశేషుడు, దిగ్గజములు, కులసానువులు – ఇవి జగమును ధరించును. వారిని కూడా ధారణ చేయువాడు విధాత.

## 486. కృతలక్షణః

లక్షణములను (గుణములను) ఏర్పరచినవాడు – అన్న సామాన్య భావమునకు భాష్యకారులు తమ రీతులలో వివరణలు ఇచ్చారు.

శ్రీ భట్టులు:

- సాధువులకు, భాగవతులకు ఉండవలసిన లక్షణములను తెలియబరచినవాడు.

శ్రీ శంకరులు:

- విశిష్టమైన శ్రీవత్స చిహ్నము కలవాడు. దివ్యలక్షణమూర్తి.
- వేదములను (లక్షణ గ్రంథములను) ఇచ్చినవాడు.
- వివిధ భేద లక్షణములతో నానా జీవజాలమును సృష్టించినవాడు.

### ఓం కృతలక్షణాయ నమః

'లక్షణము' అనగా గుర్తు, ధర్మము, గుణము. 'కృతలక్షణుడు' అనగా లక్షణములను ఏర్పరచినవాడు. ఈ నామమును వివిధ భాష్యకారులు తమ తమ విశిష్టానుభవములతో స్మరించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అవిజ్ఞాతా సంహస్రాంశుః విధాతా కృతలక్షణః**

అవిజ్ఞాతా – తన భక్తుల తప్పిదముల నెఱుగనివాడు.

సహస్రాంశుః – అపరిమితమైన జ్ఞానము కలవాడు.

విధాతా – అందరు దేవతలకు కూడా శ్రీమహావిష్ణువే ప్రభువైనందున యమాది దేవతలు విష్ణుభక్తులను శిక్షింపజాలరు.

కృతలక్షణః – భగవంతుడు ఎవరి దోషములనెఱుగడు? ఎవరు విష్ణుభక్తులు? అన్న ప్రశ్నలకు – అటువంటి సాధు సజ్జనుల లక్షణములేవో శ్రీహరియే చెప్పినాడు.

**మిత్రభావేన సంప్రాప్తం** (యుద్ధకాండ 18.3) – నావద్దకు మిత్రునిగా వచ్చినవాడు.

**సంయగ్ వ్యవసితో హి సః** (గీత 9.30) – ఎంతటి పాపి అయినప్పటికి ఏకాగ్రచిత్తంతో నన్ను సేవించేవాడిని (**మా మనన్య భాక్**) సాధువుగానే భావించాలి.

**చక్రాంకితః ప్రవేష్టవ్యాః** (హరివంశము 2.24) – తమ శరీరముపై శ్రీచక్రముద్రలు ధరించినవారు.

సౌశీల్యవతి తన మాంగల్య చిహ్నములను కాపాడుకొనునట్లే విష్ణుభక్తుడు ఈ ముద్రలను ధరించవలెను (విష్ణుతత్వము).

శ్రీ భట్టులు చెప్పిన పై లక్షణములకు అదనముగా శ్రీ వి.వి. రామానుజన్ చెప్పిన లక్షణము – **మఱందుమ్ పుఱామ్ తొళామాందర్** (నాన్గామ్ తిరువంతాడి 68) – అన్యదేవతలను అర్చించనివాడు.

ధర్మచక్రము రచయిత గీతలో 12.13 నుండి 12.20 వరకు చెప్పిన భగవంతుని ప్రియమైన భక్తుల లక్షణములను చెప్పారు – **"అద్వేష్టా సర్వభూతానామ్ ....."** నుండి **"...... ....భక్తాస్తేऽతీవ మా ప్రియా"** వరకు.

- సర్వప్రాణులపట్ల ద్వేషము లేనివాడు. స్నేహము, దయ గలవాడు.
- అహంకార మమకారములను విడచినవాడు.
- సుఖ దుఃఖములను సమముగా చూచెడివాడు.
- నిత్య సంతృప్తి, ఆత్మ నిగ్రహము, దృఢనిశ్చయము గల యోగి.
- మనసును, బుద్ధిని భగవంతున కర్పించినవాడు.
- తనవలన లోకము, లోకమువలన తాను భయపడరు.
- కోపం, భయం, ఆవేశాలకు వశం కానివాడు.
- అపేక్షలు లేనివాడు. శుచి, కార్యదక్షుడు.
- పక్షపాతము, వ్యధ లేనివాడు.
- ఆడంబర కర్మలను పరిత్యజించినవాడు.
- సంతోషం, ద్వేషం లేకుండా దుఃఖం, కోరికలు, శుభాశుభాలు పరిత్యాగము చేసినవాడు.
- శత్రువులు, మిత్రుల పట్ల, మానావమానాల పట్ల, దూషణ భూషణల పట్ల సమభావం కలిగినవాడు.
- దేనిమీదా అసక్తి లేనివాడు. కొద్దిపాటి దొరికినా సంతృప్తుడు.
- మౌనంగా ఉండేవాడు. దృఢ నిశ్చయం గలవాడు.
- స్థిరనివాసం లేనివాడు.

శ్రద్ధతో నన్నే పరమగతిగా నమ్మి అమృతంలాంటి ఈ ధర్మాన్ని నేను చెప్పినట్లు పాటించే నా భక్తులు నాకు చాలా యిష్టులు (భక్తియోగము).

**చక్రాది ధారణం పుంసాం పరసంబంధ వేదనం పతివ్రతా నిమిత్తం హి వలయాది విభూషణమ్** – విష్ణుతంత్రము. వలయాదులు సుమంగళీ చిహ్నాలు. అలాగే చక్రాదులు భగవత్సంబంధ సూచకాలు.

**కృతం హి లాంఛనం యేన ఉపాదేయేషు జంతుషు**
**పరమాత్మా హృషీకేశః స తు స్యాత్ కృతలక్షణః**

ఇంద్రియాలకు ప్రేరకుడైన పరమాత్మ తాను సృష్టించిన ప్రాణులకు స్వయంగానే గుర్తులను తెలిపినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'లక్షణములు' అనగా వేదాంతశాస్త్రములని అర్థము గలదు. **వేదాః శాస్త్రాణి విజ్ఞానమేతత్ సర్వం జనార్దనాత్** – సకల వేదశాస్త్రములు జనార్దనునినుండియే కలిగినవి గనుక ఆయన కృతలక్షణుడు.

వక్షస్థలమున శ్రీవత్స చిహ్నము గలవాడు కృతలక్షణుడు. **శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితం శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్**

తాను సృజించిన నానా జీవజాలమునకు వివిధములైన బాహ్య, అంతర లక్షణములనేర్పరచినవాడు కృతలక్షణుడు.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు షడ్గుణైశ్వర్య సంపన్నుడు. ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము సంపూర్ణముగా గలవాడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – సత్-చిత్-ఆనంద స్వరూపుడు. శేషశాయి. గరుడవాహనుడు. మేఘశ్యాముడు. పీతాంబరుడు. శంఖచక్రాద్యాయుధ ధారి. ఇటువంటి విశిష్టమైన లక్షణములు గలవాడు కృతలక్షణుడు.




పెదవేగి – గోపన్న పాలెం మార్గంలో
శ్రీ నాగవీరాంజనేయ మందిరం.
ఇది రావిచెట్టు క్రిందున్న పాత మందిరం



ఇది క్రొత్తగా కట్టిన మందిరం



## గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః |
## ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః || (52)

### 487. గభస్తినేమిః

- దీప్తిమంతమైన చక్రాయుధమును ధరించినవాడు.
- తన కాంతితో అంతటను వెలుగు నింపువాడు.
- కిరణ్మయ చక్ర మధ్యమున భాసిల్లు సూర్యనారాయణ మూర్తి.

ఓం గభస్తినేమయే నమః

**జ్యోతిర్విశిష్ట నేమ్యాయత్ లక్షితమ్ చక్రముత్తమమ్ గభస్తినేమిర్యస్యాస్తి నవార్ణః పాపనాశనః -** మహాప్రకాశవంతమైన అంచులతో కూడిన, ఉత్తమమైన చక్రాయుధమును ధరించినవాడు. ఈ నవార్ణ మంత్రము పాపనాశనము. ఓం గభస్తినేమయే నమః.

శ్రీ భట్టుల వ్యాఖ్య – గభస్తిః **దీప్యతే జ్యోతిర్మయమ్, నేమి లక్షితమ్ చక్రమ్ యస్య ఇతి గభస్తినేమిః** – శ్రీహరి చక్రము భాస్వర సహస్రము. జ్యోతిర్మయము. సుదర్శన చక్ర ముద్రలు ధరించినవారిని యముడు, యమదూతలు బాధింపరు **'విధాతా', 'కృతలక్షణః'** నామములకు శ్రీ భట్టులు చెప్పిన నామ వివరణలను అనుసరించుతూ, '**గభస్తినేమి**'యే తన శరణాగతులను సర్వదా రక్షించును.

ధర్మచక్రము రచయిత – శ్రీమన్నారాయణుని దివ్య చక్రాయుధమే అందరిని ధర్మమార్గమున నడిపించు ధర్మచక్రము. అనంతమైన కాలస్వరూపుని చక్రము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్య – భాసే-దీప్త్యో- ప్రకాశించునది; నీ-ప్రాపణే-దారి చూపునది; నేమి-చక్రము అంచు.

గభస్తి నేమి – తన ప్రకాశముతో అందరికి వెలుగునిచ్చి, దారి చూపువాడు. బృహద్భానువైన శ్రీమన్నారాయణుడే సూర్యునకు కూడా వెలుగునిచ్చువాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **గభస్తి-చక్రస్య మధ్యే సూర్యాత్మనా స్థిత ఇతి గభస్తినేమిః** – గభస్తి చక్రము, అనగా కిరణచక్రము మధ్య విలసిల్లు సూర్యనారాయణమూర్తి. ఇందు శ్రీ రాదాకృష్ణశాస్త్రి చెప్పిన శ్రుతి ప్రమాణము (తైత్తరీయారణ్యకము 10.14)

**ఆదిత్యో వా ఏష ఏతన్మండలమ్ య ఏష ఏతస్మిన్ మండలేర్చి దీప్యతే**
**య ఏష ఏతన్మండలేర్చిషి పురుషః ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణః**

## 488. సత్వస్థః

- భక్తుల హృదయములందు వసించువాడు.
- సత్వగుణమూర్తియై ప్రకాశించువాడు.
- సకల చరాచరములందు స్థితుడైనవాడు.

### ఓం సత్వస్థాయ నమః

'సత్వ' అనగా మనసు (హృదయము), సాత్విక గుణము, వస్తువు (ఉనికి గది) అనే మూడు అర్థాలున్నాయి. ఈ మూడు భావములలో పై మూడు వ్యాఖ్యలను చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీనివాసుడు భక్తుల హృదయములలో వసించును. అట్టి కాంతిమయ శంఖచక్రగదాధారి ఉన్న చోట అజ్ఞానాంధకారములకు తావు లేదు. నారాయణుని పాదపద్మములను మనసున నిలుపుకొనిన వారికి యముని భయము ఉండజాలదు.

**స్ఫటిక మణి శిలామలః క్వ విష్ణుః**
**మనసి నృణాం క్వ మత్సరాది దోషః** – విష్ణుపురాణము 3.7.22
స్ఫటికమణివలె నిర్మలంగా ఉండే విష్ణువు ఉండేచోట మత్సరాది దోషములు ఎలా ఉంటాయి?

**కింకరా దండపాశౌ వా న యమో న చ యాతనః**
**సమర్థః తస్య యస్యాత్మా కేశవాలంబనః సదా** – విష్ణుపురాణము 2.2.28
కేశవుని ఆలంబనముగా చేసికొన్న ఆత్మకు యమదండము, యమకింకరుల యాతన ఉండవు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సత్వమ్ గుణమ్ ప్రకాశకమ్ ప్రాధాన్యేన అధితిష్ఠతి ఇతి** – సత్వగుణప్రధానుడై ప్రకాశించువాడు సత్వస్థుడు.

సత్వగుణ ప్రధానమైన జీవనము – బ్రహ్మముహూర్తములో మేల్కొనుట, జప ధ్యానముల సాధన, సకల జనహితమునకై శ్రమించుట, ఒరులకు హాని చేయకుండుట వంటివి – గడుపవలెనని ఈ నామము మనకు బోధించుచున్నదని ధర్మచక్రము రచయిత వివరించారు.

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – సత్వములందు, అనగా సకల భూతములందు స్థితుడైనందున విశ్వాత్మకుడే సత్వస్థుడు.

## 489. సింహః

- (తన భక్తులను కష్టపెట్టువారిని) శిక్షించువాడు.
- శ్రీనృసింహమూర్తి.
- అనంత శక్తిసంపన్నుడు.

### ఓం సింహాయ నమః

ఇంతకుముందు ఈ నామము 202వ నామముగా స్తుతింపబడెను.
22వ శ్లోకము. 202వ నామము. సింహః – **అమృత్యుః సర్వదృక్ సింహః సంధాతా సంధిమాన్ స్థిరః**
52వ శ్లోకము. 489వ నామము. సింహః – **గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః**

శ్రీ భట్టులు చెప్పిన అర్థములు –

202వ నామము. సింహః – శ్రీనారసింహమూర్తి.

489వ నామము. సింహః – తన భక్తులను పీడించువారిని శిక్షించువాడు.

శ్రీ శంకరులు చెప్పిన అర్థములు –

202వ నామము. సింహః – స్మరణ మాత్రమున పాపములను నాశనము చేయువాడు.

489వ నామము. సింహః – అసమాన శక్తియుతుడు. శ్రీనారసింహమూర్తి.

శ్రీ హరి తన భక్తరక్షణాతత్పరుడనే భావపరంపరను శ్రీ భట్టులు ఈ నామవివరణలో కూడా కొనసాగించారు. **హరిభక్తాయ విజ్ఞాయ దండే ప్రయతమానసాన్ హినస్తి చ యమాదీన్యః స సింహ పరికీర్తితః.** విష్ణుభక్తులు అని తెలియక వారిని దండించే యమాది దేవతలనుకూడా హింసించే (శిక్షించే)వాడు.

**నరకే పచ్యమానస్తు యమేన పరిభాషితః**

**కిం త్వయానార్చితః దేవః కేశవః క్లేశనాశయః** – విష్ణుధర్మము

నరకంలో బాధపడుతున్నవారిని చూచి యమధర్మరాజు – నువ్వు ఇంతకుముందు కేశవుని ఎందుకు పూజించలేదు? – అని అడుగుతాడు.

శ్రీ శంకరులు ఈ నామమునకు – సింహమువలె శక్తిగలవాడు – అని వ్యాఖ్యానము చెప్పిరి. శ్రీ నృసింహమూర్తి నామమునకు సంక్షిప్తరూపముగా 'సింహ' నామమును స్మరించవచ్చునని కూడ శ్రీ శంకరులు అదనపు భావమును తెలియజేశారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – లేళ్ళవలె చిందులువేయు అసురులను, అసుర ప్రభావమును పారద్రోలు శ్రీహరి సింహము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సిచ్-క్షరణే-వెదజల్లుట, అంకురింపజేయుట. అందరికిని కర్మఫలములను పంచువాడు సింహము. సింహ-శక్తివంతమైనది. సమయము వచ్చినపుడు అందరి ప్రాణములను హరించువాడు సింహము. కల్పాంతమున సమస్తమును తనలో లీనము చేసికొనువాడు.

## 490. భూతమహేశ్వరః

- సకల భూతములకును అధిపతి.
- సకల భూతములను శాసించు పాలకులకు అధిపతి.
- నిజమైన మహేశ్వరుడు.

### ఓం భూత మహేశ్వరాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భూతములకు ప్రభువులైన బ్రహ్మ, యమాదులకు కూడా ప్రభువైనందున శ్రీమహావిష్ణువు భూతమహేశ్వరుడు. **భూతేశ్వరాణాం స బ్రహ్మ యమాదీనాం నియన్తృణాత్ కారణం జగతాం యశ్చ పశ్యాద్భూత మహేశ్వరః.**

ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధములనుండి పెక్కు ప్రమాణములను చెప్పారు – తిరువైమొళి 5.2.8, 8.9.8, 8.1.1

శ్రీ శంకరుల వ్యాఖ్య – సకల భూతములకు పరమప్రభువు. 'భూత' అనగా 'నిజమైన'. నిజమైన మహేశ్వరుడు భూతమహేశ్వరుడు.

**అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్**

**పరంభావమజానంతో మమ భూత మహేశ్వరమ్** – గీత 9.11

సమస్తప్రాణికోటికి ప్రభువైన నా పరమాత్మ తత్వము తెలియని మూఢులు మానవరూపంలో ఉన్న నన్ను మామూలు మనిషిగా భావించి అవమానిస్తున్నారు.

'భూతమహేశ్వరః' నామమునకు శ్రీ సత్యదేవో వాసిష్ఠ శృతులనుండి పెక్కు ప్రమాణములు చూపారు –

**భవాసవౌ మృడతమ్ మాభి యాతమ్ భూతపతీ పశుపతీ నమోవామ్** – అధర్వణ వేదము 21.2.1

**య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విదేమ** – యజుర్వేదము 23.3

**యో భూతానామ్ అధిపతిర్యస్మిన్ లోకే అధిసృష్టాః**

**య ఈశే మహతో మహాన్స్ తేన గృహ్ణామి త్వామహమ్** – యజుర్వేదము 20.32

**హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేకాऽసీత్** – ఋగ్వేదము 1.121.1

## 491. ఆదిదేవః

- అందరికిని, దేవతలకు కూడ కారణమైన ప్రకాశమూర్తి.
- సృష్టికి ఆదియైన దేవుడు.
- ప్రళయకాలమున ముల్లోకములను కబళించి, సృష్టి సమయమున వెలికి తీయువాడు.

### ఓం ఆదిదేవాయ నమః

ఇదే మహత్తర నామము ఇంతకుముందు 336వ నామముగా కీర్తింపబడినది.

36వ శ్లోకము. 336వ నామము. ఆదిదేవః – **వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః**

52వ శ్లోకము. 491వ నామము. ఆదిదేవః – **ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః**

శ్రీ శంకరుల వ్యాఖ్య

(336) ఆదిదేవః – అన్నింటికిని మూలకారణమైనవాడు.

(491) ఆదిదేవః – సర్వభూతములకును కారణమైన దేవుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య

(336) ఆదిదేవః – సంపూర్ణ లీలానాటక వినోది.

(491) ఆదిదేవః – అందరు దేవతలకు కారణంగా వెలిగే దేవుడు.

491వ నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆదిః ద్యోతమానశ్చ ఆదిదేవః** – ఆది-కారణము; దేవ-వెలిగేవాడు; శ్రీహరియే సకల దేవతలకు మూలము. శ్రీహరి ప్రకాశమే అందరికీ అందే వెలుగు. ఉదాహరణకు – **భీషాऽస్మాత్ వాతః పవతే** (ఆయన భయమువలన గాలి వీచును) అని తైత్తరీయోపనిషత్తు ఆనందవల్లి 8.1లో చెప్పబడినది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వ భూతాని అధీయన్తే అనేన ఇతి ఆదిః ఆదిశ్చ అసౌ దేవశ్చ ఇతి ఆదిదేవః.** సకల భూతములకును మూలమైనందున ఆది. మరియు దివ్యత్వమున దేవుడు. కనుక ఆదిదేవుడు.

శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడ 'ఆది', 'దేవ' అనే రెండు పదములు శ్రీదేవుని రెండు గుణములను సూచించుచున్నట్లుగా వ్యాఖ్యానించారు. కాని శ్రీ చిన్మయానంద 'దేవ' పదమునకు విశేషణముగా 'ఆది' పదమును పరిగణించారు. ప్రప్రథముడైన దేవుడు గనుక శ్రీమహావిష్ణువు ఆదిదేవుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ –

ఆది – **అదత్తే, గ్రసతి జగత్ ప్రళయకాలే స ఆదిః** – ప్రళయకాలమున జగత్తును కబళించువాడు.
దేవ – **దత్తే, విసృజతి చ బహిః సర్గ కాలే స దేవః** – సృష్టి సమయమున జగత్తును మరల వెలువరచును.
కనుక శ్రీమన్నారాయణుడు ఆదిదేవుడు.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు ప్రకృతి ధర్మములకు లోబడి ప్రవర్తింపనవసరము లేదు. ప్రకృతిలో అంతటికిని మరొక కారణము లేదా మూలము ఉంటుంది. కాని శ్రీమహావిష్ణువునకు వేరు కారణము, మూలము ఉండజాలవు. అలాగే అచ్యుతునకు ఆదిమధ్యాంతములు లేవు. ఆయన తత్వము దేవతలకు కూడా అవగతము కాదు. ఆదిదేవుని ధ్యానించిన కొలది మనము భగవంతునకు దగ్గర కావచ్చును.

## 492. మహాదేవః

- గొప్పగా క్రీడించువాడు.

### ఓం మహాదేవాయ నమః

**బ్రహ్మాదిభిః క్రీడతి యో మహాదేవ స్స ఉచ్యతే** – బ్రహ్మాదులతోకూడ క్రీడించేవాడు మహాదేవుడు. 'దివ్' అనే ధాతువునకు 'క్రీడాయాం' అన్నఅర్థములో వినియోగమున్నది. శ్రీమన్నారాయణునకు బ్రహ్మాది దేవతలు కూడా క్రీడామాత్రులే అని 'మహాదేవః' నామమును శ్రీ భట్టులు వివరించారు.

శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించిన నమ్మాళ్వార్ రచన. తిరువైమొళి 3.10.7 – **ఇంబుఱుమ్ ఇవ్విళై యాట్టుడైయాన్.** ఈ పాశురమునకు శ్రీ వేదాంత దేశికుల వ్యాఖ్య – ఇక్కడ 'ఇంబుమ్' లేదా 'లీల' ఏమనగా భగవంతుడు తనను చేరుకొనుటకు ఆలంబనగా మనకు అనేక సదుపాయ మార్గోపకరణములను ప్రసాదించును. మనకు అందుబాటులోనుండే అర్చారూపములు, యుక్తాయుక్తములను గ్రహించగల విచక్షణ, నిత్య కర్మ ధ్యాన యోగములను నిర్వర్తించగల శక్తి చైతన్యములు – ఇవన్నీ శ్రీమహాదేవుడు మనకు ప్రసాదించిన దివ్యానుగ్రహములు. అయినా వీటన్నింటినీ ఉపేక్షించి జనులు పెడదారిబట్టుట ఆ దేవునకు వినోదకారకము. ఇక్కడ కూడ శ్రీమహాదేవుని లీల, క్రీడ గోచరమగుచున్నవి. అంతేగాక తాను సృజించిన బ్రహ్మాదులతో సృష్ట్యాది కార్యక్రమములను క్రీడామాత్రముగ నిర్వహింపజేయు లీలానాటకసూత్రధారి గనుకనే శ్రీహరి మహాదేవుడు. ఆదిదేవుడు. దేవేశుడు (శ్రీ పి. బి. అణ్ణాంగార్ రచననుండి).

శ్రీ చిన్మయానంద వివరణ – తక్కిన సకలదేవతలును శ్రీమహావిష్ణువునుండి ఉద్భవించిరి కనుక శ్రీహరియే మహాదేవుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'మహ్' అన్న పదమును పూజార్హత విషయములో భావింపదగును. అన్ని ఇంద్రియములకంటెను ఆత్మ ప్రధానము. సూర్యుడు ఉదయించినపుడు తక్కిన చుక్కలు వెలవెలపోవును. అలాగే అన్యదేవతల ఆరాధనను మాని శ్రీమహాదేవుని పూజింపనగును.

## 493. దేవేశః

- దేవతలకు కూడ పాలకుడు.

### ఓం దేవేశాయ నమః

**దేవానం ఈశః దేవేశః. బ్రహ్మాదీనాంచ దేవేశో యథార్థ వినియోజకః**

శ్రీ చిన్మయానంద వివరణ – తక్కిన దేవతలందరికిని శ్రీమన్నారాయణుడే పరమాత్ముడు. అంతరాత్ముడు.

శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించిన నమ్మాళ్వార్ తిరువైమొళి 1.5.4 – **వానోర్ పెరుమాన్ మామాయన్ వైకుంఠన్ ఎంపెరుమాన్.**

శ్రీ పి.బి. అణ్ణంగారాచార్య స్వామి వివరణ – బ్రహ్మాదులకు వారి వారి విధులను అనుగ్రహించును గనుక శ్రీమన్నారాయణుడు దేవేశుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఉదాహరించిన శ్రుతి వాక్యములు –
**యో దేవేషు అధిదేవ ఏకాసీత్ కస్మై దేవాయ హవిషా విధేమ** – ఋగ్వేదము 10.121.8
**యో జాత ఏవ ప్రథమో మనస్వాన్ దేవో దేవాన్ ఋతునా పర్యభూషాత్** – అథర్వణ వేదము 20.34.1
**స దేవానాం అధిపతిర్బభూవ సో అస్మాసు ద్రవిణా మాదధాతు** – అథర్వణ వేదము 7.5.2
**తమ్ ఈశానామ్ జగత్ స్తస్థుషస్పతిమ్ ధీయమ్ జిన్వమశే హూమహే వయమ్** – యజుర్వేదము 25.8

## 494.దేవభృత్

- దేవతలను భరించువాడు (పోషించువాడు).

### ఓం దేవభృతే నమః

## దేవభృత్-గురుః - దేవభృద్గురుః

- దేవతలకు అధిపతియైన ఇంద్రునకు గురువు.
- దేవతలకు ఆధారమైనవాడు, విజ్ఞానమునకు మూలమైనవాడు.

### ఓం దేవభృద్గురవే నమః

శ్రీ భట్టులు '**దేవభృత్**', '**గురుః**' అను రెండు నామములుగా పరిగణించి వ్యాఖ్యానించారు. **దేవభృత్** – ఆదిదేవుడు, మహాదేవుడు అయిన శ్రీమన్నారాయణుడు దేవతలకు వారి వారి విధులనేర్పరచి పాలించుటయేగాక వారి రక్షణభారమును కూడ తానే వహించును. శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించిన నమ్మాళ్వార్ స్తుతి 8.1.5 – **మనిశరక్కు దేవర్ పోల దేవరక్కుమ్ దేవన్.**

శ్రీ శంకరులు, ఆయనను అనుసరించిన ఇతర వ్యాఖ్యాతలు '**దేవభృద్గురుః**' అనే ఒకే నామమును పరిగణించారు.

**దేవభృద్గురుః** – దేవతలకు అధిపతియైన ఇంద్రుడు దేవభృత్. ఇంద్రునకు జ్ఞానమును (వేదోపదేశమును) ఇచ్చిన గురువు దేవభృద్గురువు.

వారిదే మరొకవిధమైన వ్యాఖ్యలో 'దేవభృత్', 'గురుః' అనే రెండు నామముల దివ్యలక్షణములను అనుసంధించి 'దేవభృద్గురుః' నామమును వివరించారు. దేవతలకు పోషకుడు, గురువు దేవభృద్గురువు.

## 495. గురుః

- గురువు. వేదముల రూపమున జ్ఞానమంతటికిని మూలము.

### ఓం గురవే నమః

దేవతలకు వేదములిచ్చిన గురువు అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

**హరి గురు వశాగోऽస్మి.** నేను నా గురువైన హరికి విధేయుడను – అని విష్ణుపురాణము (3.7.15)లో బ్రహ్మ చెప్పెను. శ్రీవైష్ణవ పరంపరలో ప్రధమాచార్యుడు శ్రీనాధుడేనని ఈ సందర్భములో శ్రీరామానుజన్ గుర్తు చేశారు.



బలభద్రుడు, సుభద్ర, జగన్నాధుడు. వికీపీడియా చిత్రం. Photo by http://patferro.zenfolio.com/



కాళీయ మర్దనం. బృందావనం ప్రేమమందిరంలో శిల్పాకృతులు. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Prema_Mandir_7.jpg Photo by User:Sumanth699



## ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః |
## శరీరభూతభృద్భోక్తా కపీంద్రో భూరిదక్షిణః || (53)

### 496. ఉత్తరః

- రక్షకుడు. బ్రహ్మాదులను అసురులనుండి రక్షించువాడు.
- రక్షకుడు. సంసార సాగరమును తరింపజేయువాడు.
- జన్మ పునర్జన్మ అవధులకు అతీతుడు.

ఓం ఉత్తరాయ నమః

**ఉత్తరాత్ ఉత్తరః** – తరింపజేయువాడు, కాపాడువాడు ఉత్తరుడు – అన్న అర్థంలోనే ఇరువురు వ్యాఖ్యానకర్తలు ఈ పుణ్య నామమును వివరించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆపదుత్తారణాద్యోऽసౌ బ్రహ్మాదే రుత్తర స్మృతః** – బ్రహ్మాదులను ఆపదలనుండి రక్షించువాడు ఉత్తరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **జన్మ సంసార బంధనాత్ ఉత్తరతి ఇతి ఉత్తరః** – జన్మ సంసార బంధమునుండి తరింపజేయువాడు (కాపాడువాడు) ఉత్తరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఆప్-నీటిని, తర-దాటుట; మరొక విధముగా ఉత్-ఉత్కర్షోతిశయః-అసాధారణమైన, అద్భుతమైన, తర-దాటుట. ఉత్తరుడు – సంసార సాగరమును తరించుటకు ఉత్తమ (ఏకైక) మార్గము.

ధర్మచక్రము రచయిత వివరణ – సంసార సాగరమును తరించుటకు బుద్ధియనునది ఒక నౌక. అహంకార మమకారాది భావములు ఈ బుద్ధికి తూట్లు పొడిచి సంసారసాగరమున మునుగుటకు కారణమగును. అలా నావ (బుద్ధి) ఛిన్నాభిన్నము కాకుండా భవ తరణ కార్యము సాగాలంటే ఉత్తరుని ధ్యానమే శరణ్యము.

### 497. గోపతిః

- అన్ని పదములకు (వాక్కులకు, వేదములకు) అధిపతి.
- తన వాక్కునకు తానే రక్షకుడు.
- తన భక్తుల పలుకును రక్షించువాడు.
- గోవులను కాచిన గోపాలకృష్ణుడు.
- కదులుచున్న సమస్తమును (ఇంద్రియములను) కాపాడువాడు.

- భూపతి, ధరణీధరుడు.
- (పుణ్య) లోకముల కధినాధుడు.

### ఓం గోపతయే నమః

ఇదే నామము మరల 63వ శ్లోకములో వచ్చును. రెండు శ్లోకములలోను 'గోపతి', 'గోప్త' నామములు క్రమములో వచ్చుట గమనింపదగును.

53వ శ్లోకము. 497వ నామము. గోపతిః – **ఉత్తరో గోపతిః గోప్తా జ్ఞానగమ్యః పురాతనః**

63వ శ్లోకము. 599వ నామము. గోపతిః – **గోహితో గోపతిః గోప్తా వృషభాక్షో వృషప్రియః**

'గో' శబ్దమునకు ఆవులు, వాక్కులు, వేదములు, భూమి వంటి పెక్కు అర్థములున్నవి. అలాగే ఈ పుణ్యనామమునకు పలు వివరణలు ఉన్నవి. వివిధ భావములను శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఇలా సంక్షిప్తంగా, చక్కగా చెప్పారు.

**గావో వాచో, గావః పశవో, గౌర్ భూమిశ్చ విశ్వ నిర్మాణే కారణమ్ ఇతి భావార్థః**
**ఏవాన్చ గోపతి చతుష్పదామ్ గవామ్ వాచామ్ భూమేశ్చ రక్షక ఇత్యర్థః**

సకల వాక్కులకు గోవిందుడే అధిపతియన్న అర్థమును శ్రీ భట్టులు ఇలా వివరించారు – వేదములను, సకల భాషలను ప్రసాదించినవాడు గోపతి.

ధర్మచక్రము రచయిత వివరణ – భక్తులను కాచువాడు భగవంతుడు. శరణాగతులకు సకల విధములగు రక్షణనొసగుట భగవానుని గుణము. దేవదేవుని మాట వ్యర్థమగుట అసాధ్యము. పుండరీకాక్షుని మాట అమోఘము. అలాగే ఆయన భక్తుల మాట కూడ పొల్లుపోదు. వాసుదేవునితో ఆయుధము పట్టింతునని ప్రతిజ్ఞ చేసిన భీష్ముని మాట నిలుపుటకై 'ఆయుధము ధరింపను' అని అంతకుముందు చెప్పిన పార్థసారథి అర్జునుడు వేడుకొంటున్నా వినకుండా కురుక్షేత్రమున చక్రము ధరించి భీష్మునిపై లంఘించెను. చక్రి సర్వోపగతుడని ప్రహ్లాదుడు పలికిన పలుకులకు ఆపన్నత రాకుండుటకై శ్రీహరి శ్రీనారసింహమూర్తియై స్తంభమునుండి వెలువడెను.



గీతోపదేశం. 1830 కాలానిది. వికీపీడియా చిత్రం. https://commons.wikimedia.org/wiki/File:Krishna_Arjuna_Gita.jpg

'గమ్' అన్న ధాతువునకు 'గతౌ' అనగా 'చలించుచున్నది'. 'పా'- రక్షణే- కాపాడునది. ఇవే ధాతువుల ప్రకారము 'గో' అనగా ఇంద్రియములని కూడా చెప్పవచ్చును. ఎందుకంటే ఇంద్రియములు నిలకడ లేకుండా విషయానురక్తులై చలించుచుండును. 'గో' అనగా 'ఆత్మ' కావచ్చును. ఎందుకంటే ఆత్మ ఒక శరీరమునుండి మరొక శరీరమును ధరించుచునేయుండును. 'గో' అనగా శరీరము కావచ్చును. ఒక చోటనుండి మరొక చోటకు కదులుతూ ఉండేది. ఈ అన్నింటికీ అధిపతి గోపతి.

వినిపించేవి వేదములు. కనిపించేది భౌతిక ప్రపంచము. ఈ రెండింటికినీ గోపతియే నాధుడు.

## 498. గోప్తా

- సంరక్షకుడు. సకల విద్యలకును.

- సంరక్షకుడు. సకల భూతములకును, అఖిల లోకములకును.
- కర్మచక్రమును కాపాడి నడుపువాడు.
- భక్తులు కానివారికి తెలియరానివాడు.

## ఓం గోప్త్రే నమః

ఈ పావన నామము ఇప్పుడు 'గోపతిః' తరువాత వచ్చినది. మరల 63వశ్లోకములో ఇదే క్రమములో స్తుతింపబడును.

53వ శ్లోకము. 498వ నామము. గోప్తా – **ఉత్తరో గోపతిః గోప్తా జ్ఞానగమ్యః పురాతనః**

63వ శ్లోకము. 600వ నామము. గోప్తా – **గోహితో గోపతిః గోప్తా వృషభాక్షో వృషప్రియః**

'గుప్' అనే ధాతువును రక్షణ, దాచుట అనే రెండు అర్థములలోను వాడుతారు. వ్యాఖ్యలు కూడ ఆ విధముగానే చెప్పబడినవి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – గోపతి సకల వేదములకు అధిపతి. వేదములకు, సకల విద్యలకును రక్షకుడు గోప్త (498వ నామము). భగవంతుడు కర్మచక్రమును సంరక్షించును. జీవుల కర్మానుసారము వారికి తగిన ఫలములను, జనన మరణ కార్యములను నిర్దేశించును. ఇలా భగవంతుని రక్షణ గుణము ఎల్లెడల విస్తరించినది గనుక ఆయన గోప్త (600వ నామము).

శ్రీ శంకరుల వ్యాఖ్య – సకల జీవులకును, లోకములకును సంరక్షకుడు గనుక, వారిని కాపాడి, రక్షించి, పోషించువాడు గనుక గోప్త (498వ నామము). తన మాయ కారణముగా భక్తులు కానివారికి గుప్తముగానుండువాడు గోప్త (600వ నామము).

**పాలనాత్ సర్వవిద్యానాం గోప్తేతి పరికీర్తితః** – సకల విద్యలను పాలించువాడు గోప్త.
**గోపయతీతి గోప్తా** – సకల విద్యలకును రక్షకుడు. గుప్తముగానుండువాడు గోప్త.
**రక్షతి సమస్త భూతానాం** – సమస్త భూతములను రక్షించువాడు.
**సంస్పృజ్య విశ్వ భువనాని గోప్తా** (అధర్వ శీర్షము 5) – శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉదాహరించినది.
**త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపాదాభ్యః** (యజుర్వేదము 34.43) – శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఉదాహరించినది. భగవంతుని రక్షణాగుణము ఎల్లెడల విస్తరించినది.

దాచుట, రక్షించుట అనే రెండు భావములను అనుసంధించుచు శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇలా వివరించారు – భగవంతుడు తన భక్తులను వారి శత్రువులనుండి భద్రముగా దాచి సంరక్షించును, సకల విపత్తులనుండి భక్తులను దూరముగానుంచును. కనుక శ్రీమన్నారాయణుడు గోప్త.

ధర్మచక్రము రచయిత – అందరినీ కాపాడువాడు ఆ దేవుడే. ఇది తెలియక ప్రజలు తామెవరినో కాపాడుచున్నామని, లేదా తమనెవరో కాపాడుచున్నారని భ్రమిస్తారు.

## 499. జ్ఞానగమ్యః

- జ్ఞానమువలన తెలియవచ్చువాడు.

## ఓం జ్ఞానగమ్యాయ నమః

**పరయా విద్యయా వేద్యో జ్ఞానగమ్య ఇతి స్మృతః** – పరావిద్యచేత మాత్రమే తెలియవచ్చువాడు 'జ్ఞానగమ్యః'. ఇక్కడ పరావిద్య అనగా పరమాత్ముని గురించిన విద్య. సమాధినిష్ఠ వలనే సాధ్యము.

ముండకోపనిషత్తులో చెప్పిన వివరణ – రెండు విధాల విద్యలున్నాయి (1) పరావిద్య (2) అపరావిద్య.

పరావిద్య – పరమేశ్వరునికి సంబంధించినది. జ్ఞానేంద్రియములకు లొంగనిది, కర్మేంద్రియాల విషయం కానిది, నిత్యమై అన్నింటియందు ఉన్నది, సూక్ష్మాతిసూక్ష్మమైనది, అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది అగు పరబ్రహ్మతత్వమును జ్ఞానియైనవాడు సర్వత్ర చూడగలడు. కనుక పరమేశ్వరుడు జ్ఞానగమ్యుడు.

అపరావిద్య – ధర్మములు, కర్మలు, వాటి సాధన మొదలైన విషయాలకు సంబంధించినది. నామములు, ఇంద్రియములు వంటివానికి గోచరమయ్యే విషయాలకు సంబంధించినది.

ధర్మచక్రము రచయిత వివరణ – పరావిద్యకు జ్ఞానము, భక్తి, కర్మ, యోగములు సాధనములు. హరినామ సంకీర్తనము, పుణ్యకథాశ్రవణము, అచ్యుతునకు నిత్య కైంకర్యము వంటి సత్కృత సాధనలు భక్తుని భక్తిని పెంపొందించును. కష్ట సుఖములపట్ల సమభావవర్తనము, సర్వము వాసుదేవార్పణా తత్పరత్వము జీవాత్ముని పరమాత్మ సాన్నిధ్యమునకు కొనిపోవును. జ్ఞానమును అంకురింపజేయును. అదియును జ్ఞానగమ్యుని కరుణాప్రసాదమే.

## 500. పురాతనః

- కాలాతీతుడు. పూర్వమునుండే ఉన్నవాడు.
- ప్రతి కల్పమునందును విద్యను ప్రకాశింపజేయువాడు.

### ఓం పురాతనాయ నమః

**విద్యా ప్రద్యోతనాద్యోఽసౌ ప్రతికల్పం పురాతనః** – ప్రతికల్పమునందును విద్యను ప్రకాశింపజేయువాడు. శ్రీ భట్టులు ఇంతకుముందు నామములో చెప్పబడిన 'జ్ఞాన' స్వరూపమునే ఈ నామవివరణలో కూడ తీసికొన్నారు. ప్రతికల్పమునందును జ్ఞానమును రక్షించి జనులకు ప్రసాదించు దేవుడు జ్ఞానగమ్యుడు, పురాతనుడు.

శ్రీ శంకరుల భాష్యము – సృష్టిలో వేరేమియును లేనప్పుడుకూడ ఉండియుండినవాడు. అనాదియైనవాడు. అజుడు. 'కాలము' అనునది లేనప్పుడు కూడ ఉండియున్న విరాట్ పురుషుడు. కనుక కాలముచే కొలువబడ జాలనివాడు. పురాతనుడు.

## 501. శరీరభూతభృత్

- శరీరమునేర్పరచు తత్వాలకు ఆధారమైనవాడు.
- తన శరీరములోని భాగములైన సకల భూతములకు ఆధారము.
- శరీరములోని వివిధ భాగములకు, ఇంద్రియములకు అధిపతులైన దేవతలను కాపాడువాడు.

### ఓం శరీరభూతభృతే నమః

భృత్ – భరించువాడు, పోషించువాడు.

భూత – పదమునకు మూడు విధాలైన అర్థములను చెప్పవచ్చును (1) పంచభూతములు (2) 24 తత్వములు (25, 36, 51 గా కూడా లెక్కిస్తారు). (3) విశ్వములో ఉండేవన్నీ. ఈ అర్థాలనుబట్టి ఈ నామమునకు మూడు విధాలైన అర్థాలను చెప్పారు.

**దేహ భూతం జగత్తత్వం ప్రకృత్యాది ధరాన్తకమ్ శరీరభూతభృత్ ప్రోక్తో బిభర్తీతి తతోఽక్షరః** - శ్రీ భట్టులు చెప్పిన భావము – 24 తత్వములు సృష్టికి మూలములు. వానిని తన శరీరములో భాగములుగా కలిగి సృష్టికి ఆధారమైనవాడు గనుక గోవిందుడే శరీరభూతభృత్. ఆ 24 తత్వములు – ప్రకృతి(1), మహత్ (1), అహంకారము(1), జ్ఞానేంద్రియాలు (5), కర్మేంద్రియాలు (5), పంచభూతాలు (5), పంచ తన్మాత్రలు (5), మనసు. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణము. **తస్య మూర్ధా సమభావాత్ ద్యౌష నక్షత్ర దేవతా** – నక్షత్రములు, దేవతలు కూడా ఆయన శిరస్సులోని భాగమైన ఆకాశములో భాగములు.

మరింత విస్తారమైన భావములో 'భూతములు' అనగా సృష్టిలోని సమస్తములు. భూ - సత్యాయామ్ - నిజమైనది, ఉండినది. విశ్వరూపుడైన శ్రీదేవుని శరీరములో సకల భూతములు భాగములే. అన్నింటిని భరించు శ్రీమహావిష్ణువే శరీరభూతభృత్.

శ్రీ శంకరుల వ్యాఖ్య – మన శరీరములోని అంతఃప్రాణము ఆ నారాయణుడే. శరీరమునకు మూలమైన భూతములను పోషించువాడు శరీరభూతభృత్.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన మరొక వ్యాఖ్య – కంటికి అధిదేవత సూర్యుడు. మనసుకు చంద్రుడు. చర్మమునకు వాయువు. ఇలా సకలేంద్రియముల అధిదేవతలను కాపాడేవాడు శరరభూతభృత్.

## 502. భోక్తా

- అనుభవించువాడు. భుజించువాడు. స్వీకరించువాడు.

### ఓం భోక్త్రే నమః

ఈ దివ్యనామము 145వ, 502వ, 888వ నామములుగా మూడుమార్లు స్తుతించబడినది.

16వ శ్లోకము. 145వ నామము. భోక్తా – **భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః**

53వ శ్లోకము. 502వ నామము. భోక్తా – **శరీరభూతభృత్ భోక్తా కపీంద్రో భూరిదక్షిణః**

95వ శ్లోకము. 888వ నామము. భోక్తా – **అనన్తో హుతభుక్ భోక్తా సుఖదః నైకదోగ్రజః**

ఇంతకుముందు (145వ) నామ వివరణ ప్రకారము 'భోక్తా' అనగా (1) పత్రపుష్పఫలాది సమర్పణలను పరిగ్రహించి ఆనందించువాడు (2) సకల దేవతలకు సమర్పించినవన్నియును వాసుదేవునకే చేరును – కనుక ఆయనను భోక్త అని కీర్తిస్తారు. (గీత 9.26, గీత 5.29 ఆధారముగా).

ఈ (502వ) నామ వివరణలో శ్రీ భట్టులు చెప్పినది – హవ్యములను, కవ్యములను కూడ భుజించువాడు భోక్త. 'హవ్యము' అనగా దేవతలకు సమర్పించునది. 'కవ్యము' అనగా పితృదేవతలకు సమర్పించునది. **హవ్యకవ్య భుజో విష్ణో హుదక్ పూర్వే మహోదధౌ** (మహాభారతము. శాంతిపర్వము. 348.3) – విష్ణువు ఈశాన్యమున మహాసాగరమునందుండి భక్తితో సమర్పించిన హవ్య కవ్యములను భుజించుచున్నాడు.

**అహమన్నమ్ అహమన్నమ్ అహమన్నమ్**
**అహమన్నాదో అహమన్నాదో అహమన్నాదో** – తైత్తరీయోపనిషత్తు
నా భక్తులు ఆనందించే భోజనము (విషయము) నేను. వారు అర్పించేవానిని ఆస్వాదించునది నేను.

ఇంకా దివ్యప్రబంధములనుండి పెక్కు వచనములను శ్రీ వి.వి. రామానుజన్ వంటివారు ఉదాహరించారు. (తిరువైమొళి 5.6.4, తిరువైమొళి 9.6.10, తిరువైమొళి 10.10.11). ప్రసాదించువాడు, ఆస్వాదించువాడు కూడ పరమాత్ముడే. భక్తుని సాంగత్యమును

భగవంతుడు, భగవంతుని సాంగత్యమును భక్తుడు పోటీపడి అనుభవిస్తున్నారు. ఆ విషయంలో చివరకు దేవుడే నెగ్గాడు. ఆ భక్తసులభుడు తన భక్తుల సాన్నిహిత్యమును తనివితీరా అనుభవించి ఆనందిస్తున్నాడు. గోపీజనవల్లభుడు భోక్త గనుకనే కుచేలుడు తెచ్చిన పిడికెడు అటుకులను భుజించి సంతృప్తుడయ్యాడు. దుర్యోధనుని రాజమర్యాదలను వలదని విదురుని యింట విందారగించాడు.

'భోక్తా' అన్న పదమునకు శ్రీ చిన్మయానంద రెండు అర్థాలను చెప్పారు (1) **భునక్తి ఇతి భోక్తా** – రక్షించేవాడు భోక్త (2) **భుంక్తే ఇతి భోక్తా** – ఆస్వాదించేవాడు భోక్త.

**రక్షకో భక్షణశ్చ** – పుట్టించేవాడు, కాచేవాడు, తుదకు కబళించేవాడు కూడా విశ్వేశ్వరుడే – అని శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరించారు.

ధర్మచక్రము రచయిత వివరణ – అందరియందును అంతర్యామిగా స్థితుడైన పరమాత్ముడు సాక్షి, మార్గదర్శి, భోక్త కూడాను.

**ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః** – గీత 13.22
ఈ శరీరంలో అంటీ అంటనట్లు ఉండే పరమపురుషుణ్ణి సాక్షి, అనుమతించేవాడు, భరించేవాడు, అనుభవించేవాడు, మహేశ్వరుడు, పరమాత్మ అని చెబుతారు.

ఇంద్రియలోలురై చలించేవారిలో దేవుడు సాక్షి మాత్రమే. ధర్మమార్గం అనుసరించేవారికి జగత్పతియే భర్త (పాండవులకు వలె). శరణాగతులై సర్వము శ్రీహరికి అర్పించువారికి ఆయన భోక్త. వారి నివేదనము స్వీకరించి తన యనుభవమును భక్తులకు పంచును. కనుక అహంకార మమకారములను త్యజించి సర్వమును శ్రీకృష్ణార్పణమొనరించి దివ్యానందము ననుభవింపవచ్చును.

**ఇంతకుముందు 390 నుండి 421 వరకు నామములను శ్రీ రామావతారపరముగా శ్రీభట్టులు వ్యాఖ్యానించారు. మరల 503 (కపీంద్ర) నుండి శ్రీ భట్టులు శ్రీరామగుణగానము చేయు నామములుగా వ్యాఖ్యానించారు.**

## 503. కపీంద్రః

- కపిసేనకు ప్రభువైన రాముడు. వానరరూపంలో ఉన్న దేవతలకు రాజు.
- ఆదివరాహమూర్తి.
- అన్నింట, అంతట చలనమునకు అధిపతి.

### ఓం కపీంద్రాయ నమః

'కపి' అనే పదమునకు వానరము, వరాహము, చలనము కలిగినది అనే అర్థాలున్నాయి.

**కపిరూపం ప్రపన్నానాం దేవానామీశ్వరతత్వతః కపీంద్ర ఇతి విఖ్యాతః సప్తార్ణో మనునాయకః** - శ్రీ భట్టుల వ్యాఖ్య – తానే హయగ్రీవుడై ప్రసాదించిన వేదములను సంరక్షించుటకు శ్రీహరి స్వయముగా నరుడై యవతరించెను. అదే కార్యమును సాధించుటకు దేవతలు వానరులుగా జనించిరి. అట్టి కపులకు ప్రభువైనందున ఆపన్నివారణుడైన శ్రీరామచంద్రుడు కపీంద్రుడు. ఇది ఉత్తమమైన సప్తాక్షరీ మంత్రము. ఓం కపీంద్రాయ నమః.

**సర్వలోకేశ్వర స్సాక్షాత్ లోకానాం హితకామ్యయా**

**సర్వేః పరివృతో దేవ్యైః వానరత్వముపాగతైః** – రామాయణము. యుద్ధకాండము 114.16. లోకేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు లోకహితమును కోరి వానరరూపమెత్తిన సకల దేవతలతోను పరివేష్టితుడైయున్నాడు. ఇక్కడ లోకములనగా ప్రపంచము, అందలి జనులు మరియు వేదములు కూడ. వీనినన్నింటిని కాపాడుటకు దేవదేవుడు కపీంద్రుడై యవతరించినాడు.



వానరవీరులతో శ్రీ రామ లక్ష్మణులు. 19వ శతాబ్దం ఆరంభకాలపు చిత్రం. వికీపీడియా నుండి.
చిత్రంలో ఎడమనుండి కుడిపైపునకు – నలుడు, వానరుడు (?), రంభుడు, దుర్వీందుడు, సుగ్రీవుడు, శ్రీరాముడు, హనుమంతుడు, లక్ష్మణుడు, జాంబవంతుడు, అరుణుడు, అంగదుడు, నీలుడు, సంరంభుడు
https://commons.wikimedia.org/wiki/File:Rama_and_monkey_chiefs.jpg

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – కోట్లకొలది కోతులను క్రమశిక్షణలో నడిపినవానికి ఇంద్రియములను నియంత్రించుట చాలా తేలిక పని.

ధర్మచక్రము రచయిత – కోతిలా గెంతే మనసు భగవధ్యానమువలన అదుపులోనికి వచ్చును. అలా చేయడం వల్లనే అజ్ఞానము (రావణుడు) నశించును. బందీయైయున్న జ్ఞానము (సీతమ్మ తల్లి) స్వతంత్రమగును. అందుకు కపీంద్రుని ధ్యానమే ఉత్తమము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'కపి' అనగా వరాహము. కనుక ఆదివరాహమూర్తియే కపీంద్రుడు. 102వ నామమైన **'వృషాకపి'** కూడ ఇదే అర్థములో వ్యాఖ్యానించబడినది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కపి - సంచలనే - చలించే గుణము కలది. సూర్యచంద్రాదులు, గ్రహములు, జీవజాలములు, పంచభూతములు, శరీరములో హృదయము, ప్రవహించే రక్తము, దేహమునుండి దేహమునకు మారు ఆత్మలు – అన్నీ చలనము కలిగినవే. అన్నింటికీ అధినాధుడు కపీంద్రుడు.

## 504. భూరి దక్షిణః

- పుష్కలముగా దక్షిణలొసగువాడు.
- శీఘ్రగతిని అన్నింటిని పెంపొందించువాడు. చలింపజేయువాడు.
- గొప్ప నైపుణ్యము గలవాడు.

## ఓం భూరి దక్షిణాయ నమః

'భూరి' అనగా ఎక్కువ, అత్యధికము, పుష్కలము. 'దక్షిణ' అనగా దానము, గౌరవ పురస్కారము.

**హయమేధాదిభిర్యజ్ఞైః జగదాచార్యకాయవై యజమానస్స విజ్ఞేయ సర్వదా భూరిదక్షిణః** - లోకంలోని ప్రజలతో కర్మలు చేయించదలచినవాడై, తానే స్వయంగా అశ్వమేధాది యజ్ఞాలు అనేకం చేసి బ్రాహ్మణులకు అధికమైన దక్షిణలిచ్చినవాడు భూరిదక్షిణుడు.

**అశ్వమేధ శతైరిష్ట్వా తథా బహు సువర్ణకైః**
**గవాం కోట్యాయుతం దత్వా బ్రహ్మలోకం గమిష్యతి**
శ్రీరామచంద్రుడు వంద అశ్వమేధయాగాలు చేసి, కోట్ల కొలది ఆవులను, బంగారాన్ని దానంగా ఇచ్చి పరమపదం చేరాడు.

బలరామ శ్రీకృష్ణులు తమ గురువైన సాందీపని పుత్రుని పాతాళ లోకమునుండి పిలిచి ఇచ్చి, అపూర్వమైన, అసాధ్యమైన గురుదక్షిణనొసగిరి. అందరకు అభయమ్మునిచ్చు కందువగు బంగారుచేయి, కొండలంత వరములు కూపెడు చేయి తిరువేంకటేశ్వరుని మంగళహస్తము.



భాగవతంలోని గురుదక్షిణ వృత్తాంతము. శ్రీకృష్ణుడు, ఉద్ధవుడు పంచజనుడనే రాక్షసుని ఓడించుట, పాతాళలోకమునుండి గురుపుత్రుని తీసికొని వచ్చుట, సాందీపని గురువుగారివద్దనుండి ఉపవీతమును స్వీకరించుట వంటి దృశ్యాలు. 1640 కాలానికి చెందిన మధ్యప్రదేశ్, మాల్వా ప్రాంతం చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Receives_the_Sacred_Thread_and_Returns_his_Preceptor_Sandipani%27s_Son,_Folio_from_a_Bhagavata_Purana_(Ancient_Stories_of_the_Lord)_LACMA_AC1995.220.2.jpg

**యజతో ధర్మమర్యాదాదర్శనాయాఽపి భూరయః బహ్వ్యోఽస్య దక్షిణా యజ్ఞ ఇతీశో భూరిదక్షిణః**
ధర్మ మర్యాదను లోకమునకు చూపుటకై యజ్ఞమును ఆచరించు యజమానిగా ఉన్న ఈ భగవానునకు ఆ యజ్ఞమున తాను ఇచ్చు భూరిదక్షిణలు కలవు. అట్టి యజ్ఞమును ఆచరించుచుండు యజమానుడూ విష్ణుపరమాత్ముని విభూతియే! అనగా -

యజ్ఞమును చేయించిన ఋత్విజులకు యజమాని సమర్పించుకొను భూరిదక్షిణలూ విష్ణువే. కావున ఆ విష్ణుదేవుడు భూరిదక్షిణః. (దివ్య నామములు బ్లాగు).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – దక్ష్ - వృద్ధౌ - శీఘ్రగతే - వేగముగా వృద్ధి చెందుట, త్వరగా చలించుట – అనే అర్థములో – జీవజాలములు జన్మించినవెంటనే కదులుట, ఆహారము గ్రహించుట, ప్రవర్ధమానమగుట వంటి లక్షణములు కనబరచును. ఇది భగవానుని అనుగ్రహము. కనుక ఆయన భూరిదక్షిణుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరొక అర్థమును కూడ సూచించారు – పాణిని సూత్రము 1.1.34 ప్రకారము 'దక్షిణ' అనగా నైపుణ్యము అనే అర్థమున్నది. కనుక అసమాన దక్షిణాదక్షుడు భూరిదక్షిణుడు.

**ముగ్గురు ఆళ్వారుల దివ్యానుభవము.** ఈ క్రింది రచన వీనినుండి సంగ్రహించబడినది –

1) ఆళ్వారాచార్య సంగ్రహ చరిత్రలు – శ్రీమాన్ పాలవంచ తిరుమల గుదిమెళ్ళ వేంకటలక్ష్మీ నరసింహాచార్యులు

2) ద్వాదశ సూరి చరిత్ర – శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు

ఆళ్వారులు శ్రీవైష్ణవ సంప్రదాయంలోనూ, తమిళ సాహిత్యంలోనూ విశిష్టమైన స్థానం కలిగిన విష్ణు భక్తులు. తమ పాశురాలతో విష్ణువును కీర్తించి దక్షిణాదిన భక్తి సంప్రదాయాన్ని పరిమళింపజేశారు. వీరు పాడిన (రచించిన) పాశురాలు అన్నీ (నాలుగు వేలు) కలిపి 'దివ్య ప్రబంధం' లేదా 'నాలాయిరం' లేదా 'ద్రవిడ వేదం' అనబడుతాయి. భక్తి, పారవశ్యము, శరణాగతి - ఇవి ఈ ఆళువారుల జీవితంలోనూ, రచనలలోనూ, వారిని గురించిన గాథలలోనూ ప్రముఖంగా కానవచ్చే అంశాలు. మొత్తం పన్నెండుమంది ఆళ్వారులలో **పొయ్‌గయాళ్వార్** (సరోయోగి), **పూదత్తాళ్వార్** (భూతయోగి) మరియు **పేయాళ్వార్** (మహాయోగి) - ఈముగ్గురూ ప్రథములు. కనుక వారిని ముదలాళ్వారులు అంటారు. ఆళ్వారుల జీవిత కాలాల గురించి స్పష్టమైన చారిత్రక ఆధారాలు అందడంలేదు. ముదళాల్వారులు ద్వాపర యుగాంతంలో ఉద్భవించారని సంప్రదాయ గాథలు. కాని శాస్త్రీయ పరిశోధకులు వీరి కాలం క్రీ.శ. 7వ శతాబ్దం - 9వ శతాబ్దం మధ్యకాలమని అభిప్రాయపడుతున్నారు. ఆళ్వారుల జీవిత విశేషాలగురించి కూడా అనేక గాథలు ప్రచారంలో ఉన్నాయి. ఈ ముగ్గురు ముదలాళ్వారుల సమావేశం గురించీ, ద్రవిడ వేదం ఆవిర్భవించడం గురించీ ఒక గాథ ప్రచారంలో ఉంది. ఇది తిరుక్కోవలూర్‌లో జరిగింది అని చెబుతారు.

వర్షం కురుస్తున్న ఒక చీకటిరాత్రి పోయ్‌గై ఆళ్వారు ఒక ఇంటి యజమాని అనుమతి తీసికొని ఆ యింటి చిన్న అరుగుపైన పడుకొని భగవధ్యానము చేసికొంటున్నాడు. కొంత సేపటికి పూదత్తాళ్వారు అక్కడికి వచ్చి తాను కూడా తలదాచుకొనవచ్చునా అని అడిగాడు. అప్పుడు పోయ్‌గయాళ్వారు - 'ఈ అరుగు మీద ఒకరే పండుకొనవచ్చును కాని ఇద్దరు కూర్చుండవచ్చును' అని పూదత్త ఆళ్వారును ఆహ్వానించాడు. మరి కొంత సేపటికి పేయాళ్వాఋ వచ్చి తనకు కూడా చోటు దొరకునా అని అర్థించాడు. కూర్చొని ఉన్న ఇద్దరు ఆళ్వారులు - 'ఈ అరుగు మీద ఇద్దరే కూర్చోగలరు. కాని ముగ్గురు నిలుచుండవచ్చును' అని మూడవ భగవద్దాసుని ఆహ్వానించారు.

ఆ రాత్రిపూట, కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కటిక చీకటిలో, ఈ ముగ్గురూ భగవద్గుణానుభవామృత పానమత్తచిత్తులై మైమరచి యున్నారు. వారి భక్తి ప్రకర్షకు పరవశించి తిరుక్కోవలూర్ ఆలయంలోని నాయనార్ (సర్వేశ్వరుడు) శ్రీ హరి ఉన్నట్లుండి అదృశ్యరూపంలో వచ్చి వారి నడుమ నిలిచాడు. మాధవుని కళ్యాణగుణ వైభవమును వారు ముప్పురు గానము చేయుచుండగా అచ్యుతుడు ఆనందముతో చిందులు వేయసాగాడు. నాల్గవ వ్యక్తి తమ మధ్య ఉన్నారని. ఆయనే సర్వేశ్వరుడని, ఆళ్వారులు గ్రహించారు.

అపుడు పొయ్‌గయాళ్వారు ఆ మహామూర్తిని గుర్తించటానికి ఒక దివ్యదీపం వెలిగించాడు. భూమిని ప్రమిదగా చేసి, దానిలో సముద్రజలం అనే నెయ్యిపోసి, ఉష్ణకిరణాలతో వెలిగే సూర్యుణ్ణి వత్తిగా వేసిన దీపంతో సుదర్శన చక్రధారియైన స్వామిని అర్చిస్తానన్నాడీ కవి. సుదర్శన హస్తుడగు శ్రీమహావిష్ణువు పాదారవిందములకు నూరుపాశురములు ప్రస్తుతించెను. వాటిని 'ముదల్ తిరువన్దాది' అని దివ్య ప్రబంధములో చెబుతారు.

వైయం తకళియా వార్ కడలే నెయ్యాక వెయ్యకతిరోన్ విళక్కాక - శెయ్య
శుడరాళియా నిడిక్కే శూట్టినేన్ శొన్మాలై ఇడలాళి నీంగుక వే యెంగు

తాళ్ళపాక తిరువేంగళనాధుడు రచించిన 'పరమయోగి విలాసము'లో ఈ పాశురమునకు తెలుగు సేత ఇలా ఉన్నది.

ధరణి పంతియ సముద్రంబులు నేయి యరుణు దీపము జేసి యరుణాంశ తతుల
గారాబు చక్రంబు కైబూన్చినట్టి నీరజాక్షునకిత్తు నీరాజనంబు

ఆహా! ఏమి అద్భుత దృశ్యమిది? దీనిని గాంచినంతనే నా యొడలు గగుర్పొడుచుచున్నదే! సాక్షాత్తు శ్రీమహావిష్ణువే నాకు ప్రత్యక్ష మయినాడు. ఆహా ఏమి నా భాగ్యము. ఎంతో కాలమునుండి యెదురుచూచిన మా స్వామి నాకు ప్రసన్నుడైనాడు గదా! నేటికి నా జన్మ తరించినది. అయిన నీ మహాత్మునికి నేనెట్లొనరింపగలను? సామాన్య ధూప దీపాదులతో ఈ ఘను నర్చించుట నాబోటి యల్పునకీ సమయమున సాధ్యమగునా? కాన భూమిని ప్రమిదగాజేసి, సముద్ర జలమునే నేయిగా అందుంచి, ఉష్ణకిరణుడగు సూర్యునే వత్తిగా వేసిన దీపముతో ఈ స్వామిని అర్చింతును. దుఃఖ సముద్రమునుండి బయటపడగోరి సుదర్శన చక్రహస్తుడగు శ్రీమహావిష్ణువు పాదములయందు ఈ వాఙ్మయమును భక్తితో సమర్పించుట తక్క నేనేమి సేయగలను?

ఆ తరువాత పూదత్తాళ్వారులు తమ హృదయంలోనే ప్రజ్వలిస్తూ ఉన్న జ్ఞానదీపంతో ఆ శ్రీపతి కిట్లా నివాళి పట్టాడు:-

అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక ఇన్బురుకు శిందై ఇడు తిరియా - నన్బురుకి
జ్ఞానచ్చుడర్ విళక్కేత్తినేన్ నారణ్కు జ్ఞానత్తమిళ్ పురిందనాన్.
భక్తిని ప్రమిదగా చేసి, ఆర్తిని నెయ్యిగా దానిలో పోసి, భగవత్సందర్శన జనితానందం అందులో వత్తిగావేసి, అజ్ఞానాంధకారం దూరం అయ్యేటట్లుగా పరభక్తి అనే ఉజ్జ్వల దీపాన్ని నిండుమనస్సుతో అర్పించి ఆ శ్రీ హరిని అర్చిస్తున్నాను అని దీని అర్థం. వీరు పాడిన దివ్య ప్రబంధము నూరుపాశురములను 'ఇరణ్డాన్ తిరువన్దాది' అంటారు.

తాళ్ళపాక తిరువేంగళనాధుడు రచించిన పరమయోగి విలాసములో ఈ విషయాన్ని ఇలా వర్ణించాడు.

.... ... ... ప్రేమ
పంతియ మితి లేని భక్తియే చమురు నానంద భరిత హృదబ్జంబె వత్తి
గానొనరించి వికాసమై యాత్మన్ తిరమొందు జ్ఞానంబు దీపంబు జేసి
పెరియ నారాయణార్పితము గావించె

ఈ ఇద్దరు భక్తులూ వెలిగించిన జ్ఞానదీపద్వయ ప్రకాశంలో మూడవ ఆళ్వారైన పేయాళ్వారులు ఆ భగవానుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యం కన్నుల కరువు తీరా సందర్శించాడు. బ్రహ్మానంద పరవశుడై పరమాత్మ స్వరూపమును నుతించారు. వారి నూరు పాశురములు 'మూన్ఱాన్ తిరువన్దాది'. ఆ శుభక్షణంలో అయత్నంగా వెలువడిన సుమధుర వాణియే ఇది:-

తిరుక్కండెన్ పొన్మేని కండేన్ తికళుమ్ అరుక్కన్ అణినిరమున్ కండెన్ – శెరుక్కి శరుం
పొన్నాళి కండేన్ పురిశంగై కండేన్ ఎన్నాళి వణ్ణన్ పాల్ ఇంగు

ఆహా! ఏమియానందము! శ్రీమహాలక్ష్మి ఈ నా ప్రాకృత నేత్రములకు కనిపించినది. శ్రీహరి సువర్ణ శరీర సౌందర్యము ఈనాడు నేత్రాంజలులతో తనివితీర గ్రోలగలిగినాను. పాపాత్ములను సమూలముగా ఛేదించునట్టి మా స్వామి హస్తము నలంకరించిన సుదర్శనాయుధమును కూడ సందర్శింపగలిగిన నేనెంత భాగ్యశాలినో గదా! ప్రళయకాలాభీలమగు పర్జన్య దేవుని గర్జన ననుకరించే పాంచజన్యమును గాంచి సుకృతిని కాగలిగినాను. నీల ఘనాభుడగు శ్రీవైకుంఠుని దివ్యమంగళ విగ్రహము సందర్శించిన సౌభాగ్యవంతుడనగు నాకింక కోరదగినది ఏముండును?

తాళ్ళపాక తిరువేంగళనాధుడు రచించిన పరమయోగి విలాసములో ఈ విషయాన్ని ఇలా వర్ణించాడు.

సిరి గంటి చెన్ను మించిన మేను గంటి
కరమొప్పు వదన వికాసంబు గంటి
సల్లలితా వనీస్తన కుంభ శుంభ
పల్లవంబుల బోలు పాదముల్గంటి
సరసీజ హల శంఖ చక్రాంకుశాంక
చరణముల్ జగదేక శరణముల్ గంటి
ధరణీ బింబము చాయ దరళించు కనక
సురుచిరాంశుకము నంశుకము గన్గొంటి
శ్రీ మించు కటితట శ్రీ సతీవరణ
దామముల్ మేఖలా దామముల్గంటి
వాత్సల్య జలధి కైవడి నొప్పుచున్న
వత్సంబు గంటి శ్రీవత్సంబు గంటి
చుట్టు కైదువు వలచుట్టు శంఖంబు
పట్టి చూపట్టిన బాహువుల్గంటి
శీతాంశు మండల శతకోటి కోటి
రీతి జూపట్టు కిరీటంబు గంటి
మలగులై తెల్ల దామరల దామరలన్
గలహించు నిడువాలు గన్నుల గంటి
మకర కుండల బాల మార్తాండ రుచుల
వికసించు వదనారవిందంబు గంటి



తిరుక్కోవిలూర్ మందిరం. వికీపీడియా నుండి.

Photo by https://commons.wikimedia.org/wiki/User:Bmohanraj91



అదే మందిరంలో శ్రీ ఉళగలంత పెరుమాళ్ శిల్పం. వికీపీడియా నుండి.

Photo by - https://commons.wikimedia.org/wiki/User:Ssriram_mt

ఇలా ఆ మహనీయుల భగవద్దర్శన కాంక్ష ఒకే కాలమున ఒకేచోట భగవదనుగ్రహము చేతనే నెరవేరెను. అప్రాకృత దివ్యమంగళవిగ్రహుడగు శ్రీహరిని ఈ లోకస్థులలో కాంచు అదృష్టము ఈ ముగ్గురు ఆళ్వారులకే ప్రప్రథమమున కలిగినది. కావుననే వారికి ముదలాళ్వారులు – మొట్టమొదటిగా భగవద్దర్శనానందామృత పాన మత్తచిత్తులు – అను పేరు రూఢి యయినది.

వారికి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైన విధమును "ప్రపన్నా మృతము" అను సంస్కృత కావ్యములో ఇలా వర్ణించారు.

తార్క్ష్యాదిరూఢం తటిదంబుదాభం లక్ష్మీధరం వక్షసి పంకజాక్షమ్
హస్తద్వయే శోభిత శంఖచక్రం విష్ణుం దయాబ్దిం దదృశుస్తమాద్యమ్
ఆజానుబాహుం కమనీయగాత్రం పార్శ్వద్వయే శోభిత భూమినీళమ్
పీతాంబరమ్ భూషణ భూషితాంగం చతుర్భుజమ్ చందన రూక్షితాంగమ్
బింబాధరం కుందసమాన దంతం శరన్నిశానాథ సమాన వక్త్రమ్
నీలాలకం దివ్యకిరీట జుష్టమ్ కర్ణద్వయే శోభిత కుండలాఢ్యమ్
రత్నాంగదం మౌక్తిక దివ్యహారం కటీతటీ లంబిత హేమసూత్రమ్
రత్నాంగులీయం మణి కంకణాఢ్యం మాణిక్య మంజీర సుమృష్ట పాదమ్
మందార మాలాంచిత కేశబంధం శ్రీకౌస్తుభోద్భాసిత కంఠ దేశమ్

శ్రీవత్స చిహ్నమ్ కమనీయ వేషం వేదాంతవేద్యం మనసోऽప్యగమ్యమ్
అప్రాకృతం దివ్యమనంతరూపం సద్యోగి గమ్యం గుణ సంవియోగే
అత్యద్భుతం కోటి రవిప్రకాశ మనుత్తమం యత్నసకాద్య గమ్యమ్

శ్రీమన్నారాయణుడు గరుడవాహనారూఢుడై వారి అనన్య భక్తికి ప్రీతుడై ప్రత్యక్షమయ్యెను. ఉరమున లక్ష్మీదేవిని దాల్చిన ఆయన నేత్రములు పద్మదళములను పోలినవై ఆకర్ణాంత విశాలములై చూపరులకు చూడవలెనను కాంక్ష కల్గించుచుండెను. సుదర్శన పాంచజన్యాదులను హస్తములందు ధరించిన ఆ దేవదేవునకు ఇరుపార్శ్వములందు భూ నీళా దేవులు కొలిచియుండిరి. నీలమేఘశ్యామమగు ఆ రమాకళత్రుని శరీరయష్టికి పట్టుపుట్టము వన్నె పెట్టుచుండెను.




రిచ్ మండ్ ఆలయంలో శ్రీ ఆళ్వారుల సన్నిధి. వికీపీడియా చిత్రం.

శరచ్చంద్ర మండలమును బోలిన స్వామి ముఖమండలమున అధరము బింబఫలమును, దంతములు కుందపుష్పములను అనుకరించి శోభించుచుండెను. నీలాలకాలంకృతమైన శిరమున స్వామి ధరించిన దివ్యమణికిరీట కాంతులు కర్ణద్వయోలంబి కుండలములతో వియ్యమాడుచున్నవా అన్నట్లుండెను. భుజముల రత్నాంగదములు కైసేసి వైజయంతిమాలయను వనమాల గళమున ప్రేలాడగా కటితటమున సువర్ణసూత్రమును కట్టుకొనిన మాధవుడు చేతులకు రత్న వలయములు దాల్చి ప్రేళ్ళకు రత్నాంగుళీయములు పెట్టుకొని పాదములకు మాణిక్యమంజీరములు ధరించి మిగుల తేజరిల్లుచుండెను.

ఆ మేఘవర్ణుని కేశపాశము మందారమాలతో గూడి వింతకాంతులీనుచుండెను. కౌస్తుభరత్నముతోబాటు శ్రీవత్సమను పుట్టుమచ్చకూడ ఆ మహనీయుని ఱొమ్మునకు వింతశోభ గూర్చుచుండెను. అ మహామహుడు మనసునకు కూడ అందనివాడయ్యును వేదాంతవేత్తలకు సులభవేద్యుడు. అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడును, యుగపదుదిత కోటిసూర్య ప్రభాభాసమానుడును, సనక సనందనాది మహామునులకు కూడ అగమ్యుడును అయిన ఆ అనంత కళ్యాణగుణాకరుని కాంచగలిగిన ఈ మహర్షిత్రయము భాగ్యమెట్టిదో గదా!

పరమపదనాధ సందర్శనా జనిత పారవశ్యముచే శరీరములందు పులకలెగియగా కన్నులనుండి ఆనంద బాష్పామృత ధారలు స్రవించుచుండగా వారు భక్తిగీతములు ఆలాపించిరి. ఆ భక్తి రసామృత ప్రవాహములు "ఇయఱ్పా" అను పేరుగల గ్రంధమున మూడువందలుగా నిబంధింపబడినవి. ఒకటవ తిరువందాది, రెండవ తిరువందాది, మూడవ తిరువందాది – ఇవి వీరి ఆత్మానుభవమునకు, హరిభక్తి తత్వమునకు, ఉత్తమ తాత్విక లక్ష్యమునకు ప్రతిబింబములు.

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీ గరుత్మంతుని స్తుతి.**

కుంకుమాంకిత వర్ణాయ కున్దేన్దు ధవళాయచ
విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయ తే నమః



పూరీలో శ్రీ గరుడ విగ్రహం.

Photo by juggadery. https://commons.wikimedia.org/wiki/File:Garuda_statue_(26881868020).jpg



## సోమపోऽమృతపః సోమః పురుజిత్ పురుసత్తమః |
## వినయో జయః సత్యసంధో దాశార్హస్సాత్వతాం పతిః || (54)

### 505. సోమపః

- శ్రీరామావతారములో యజ్ఞములు చేసి, అందు దేవతలకు అర్పించిన పిదప సోమరసమును పానము చేసిన యజమాని.
- యజ్ఞాధిదేవతయై సకల యజ్ఞములందును నివేదింపబడు సోమరసమును పానముచేయు భోక్త.

**ఓం సోమపాయ నమః**

ఒక వృక్షమునుండి సేకరింపబడే సోమరసం యజ్ఞాలలో అర్పింపబడే ముఖ్యమైన నివేదన. యజ్ఞము ఏ దేవతలను ఉద్దేశించి చేశారో ఆ దేవతలకు ముందుగా ఈ రసమును సమర్పిస్తారు. తరువాత యజ్ఞమును ఆచరించిన యజమాని సేవిస్తాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీరాముడు అనేక యజ్ఞములను ఆచరించాడు. అప్పుడు సోమరసం దేవతలకు సమర్పించి, తరువాత తాను త్రాగాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య –అన్ని యజ్ఞములలోను ఉద్దేశించబడిన దేవతలందరూ నారాయణుని రూపములే. కనుక వివిధ దేవతల రూపములలో విష్ణువే అన్ని యజ్ఞములకు భోక్తయై సోమమును స్వీకరించును.

(13/10/2020 ఉదయం – భక్తి టి.వి. లో శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రం పారాయణ వస్తున్నది. ఆ ప్రవచనకర్త ఒక ఆసక్తికరమైన విషయాన్ని చెప్పారు. అనుష్టుప్ ఛందస్సులో ప్రతి పాదానికి 16 అక్షరాలుంటాయి. కాని ఈ శ్లోకంలో రెండవ పాదంలో 17 అక్షరాలున్నాయి. ఒక వేద సూక్తము ప్రకారము ఇది సమంజసమని ఆయన చెప్పారు – వివరాలు నేను సరిగా గ్రహించలేకపోయాను. కొందరు ఈ పాదాన్ని 'వినయోజ్యః సత్యసంధో దాశార్హస్సాత్వతాం పతిః' అని చదువుతారట, అలాగయితే 16 అక్షరాలు సరి పోతాయి.)

### 506. అమృతపః

- అమృతమును సేవించినవాడు.
- అమృతమును కాపాడువాడు.

**ఓం అమృతపాయ నమః**

ఈ నామములో 'ప' ధాతువును గ్రహించే విధం బట్టి శ్రీ భట్టులు రెండు విధములైన అర్థాలను చెప్పారు.

'ప' - పిబతి - త్రాగినవాడు. **యత్కించిద్ధ్యాయతే వహ్నౌ హవిర్మంత్రైర్విధానతః తత్సర్వ మమృతం కృత్వా విష్ణవే సంప్రయచ్ఛతి** - యజ్ఞంలో హోమం చేసిన ద్రవ్యాలను అగ్నిదేవుడు అమృతముగా చేసి విష్ణువునకందజేస్తాడు. కనుక భగవానుడు అమృతమును (యజ్ఞభోక్తయై) ఆస్వాదించువాడు. **అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా ప్రభురేవచ** (గీత).

'ప' - పాతి - రక్షించువాడు. భగవానుడు స్వయముగా అమృతస్వరూపుడు. ధర్మపరులైన తన భక్తుల కొరకు, ముక్తుల కొరకు అమృతమును భగవానుడు కాపాడుచుండును.

**అమృతస్య ఏష సేతుః** (ముండకోపనిషత్తు 2.2.5) – ఆయనే అమృతమునకు సేతువు (అనగా అమృతము లభించు మార్గము).

**యస్య ఛాయా అమృతమ్** (తైత్తరీయ యజుర్వేదము 4.1) – ఆయన నీడ అమృతము. అనగా అమృతము ఆయన రక్షణలో ఉన్నది.

ఈ నామ వివరణలో శ్రీ శంకరులు మోహిని అవతారమును ఉదాహరించారు. శ్రీమన్నారాయణుడు అసురులనుండి అమృతమును కాపాడి, దేవతలకు పంచి, వారితోపాటు ఆయన కూడ పానము చేశాడు. కనుక అమృతమును కాపాడినవాడు, అమృతమును త్రాగినవాడు 'అమృతపః'.

శ్రీ చిన్మయానంద – భగవానుడు పరమసత్యము. సదా అమృతత్వ స్వరూపుడు (నాశనము లేనివాడు). కనుక అమృతపః. స్వాత్మానందము అనే అమృతాన్ని త్రాగేవాడు.

## 507. సోమః

- అమృతమూర్తి
- చంద్రుడు.

ఓం సోమాయ నమః

**సోమ స్సుధాయమానత్వాత్ ముక్తానాం పరికీర్తితః** – ముక్తులైనవారు భగవంతుని అమృతమువలె ఆస్వాదింతురు. ఈ భావమును శ్రీభట్టులు రామాయణంలోని అరణ్యకాండ శ్లోకము ద్వారా ఉదాహరించారు –

**మహతా తపసా రామ మహతా చాపి కర్మణా**

**రాజ్ఞా దశరథే నాసి లబ్ధోऽమృతమివామరైః**

రామా! దశరథుడు గొప్ప తపస్సు చేసి, మహత్వమైన కర్మలు చేసి, దేవతలు అమృతమును పొందినట్లుగా నిన్ను పొందాడు.

ఇంకా శృతినుండి – **శాంతి సమృద్ధమ్ అమృతమ్** (తైత్తరీయ. శిక్షావల్లి. 6) – అని కూడ ఉదాహరించారు.

భగవంతుని తిరుమంత్రము 'ఆరావముదన్' కూడ ఇదే భావమును తెలుపుచున్నది. ఇదే 'తరగని అమృతము' అనే అర్థములో వివిధ దివ్యప్రబంధములలో ఉట్టంకించబడినది.

**మనత్తుక్కినియానై పాడవుం నీవాయ్ తిఱవాయ్** – ఆండాళ్ తిరుప్పావై 12.

ఇందుకు ఆత్రేయ ఆంధ్రీకరణ (తిరుప్పావై పూదండ) –

**మంచు మా తలలపై పడగ నీ వాకిలి పట్టి కోపమున రావణుని కూల్చిన శ్రీరాముని**

**కీర్తింపగ, పెదవి కదపవేమె కలికి! మాయ నిద్రను వీడి మేలుకోవమ్మ!**

**ఎన్నకృట్ తేనే! పాలే! కన్నలే! అముదే!** (నమ్మాళ్వార్. తిరువైమొళి 10.7.2) – ఆయన నా సర్వస్వము- తేనె, పాలు, మిఠాయి, అమృతము.

నమ్మాళ్వార్. తిరువైమొళి 2.5.4 – నీవు నాకు తనివి తీరని అమృతానివి. రోజులు, నెలలు, యేళ్ళు, యుగాలు ఆస్వాదించినా నీ అనుభవము నాకు ఎల్లప్పుడూ క్రొత్త ఆనందమే!

'సోమ' అనగా 'చంద్రుడు' అని కూడ అర్థము. శ్రీ శంకరులు ఈ నామమునకు ఈ అర్థాన్ని కూడా చెప్పారు.

**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః** (గీత 15.13) – నేను రస స్వరూపుడనగు సోముడనై సస్యములను ఫలింపజేయుచున్నాను.

## 508. పురుజిత్

- అందరిని జయించువాడు.

**ఓం పురుజితే నమః**

శ్రీ శంకరుల వ్యాఖ్య –

**పురూన్ బహూన్ జయతి ఇతి పురుజిత్** – ఎల్లరను జయించువాడు పురుజిత్తు.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

**లోకాన్ దీనాన్ గురూన్ శత్రూన్ సత్య దానానువర్తనైః ధనుషా జితవాన్ యశ్చ పురుజిత్ సస్మృతో బుధైః**

లోకములను సత్యముతోను, దీనులను దానముతోను, గురువులను సద్వర్తనతోను, శత్రువులను ధనుస్సుతోను జయించినవాడు గనుక పురుజిత్. ఇందుకు శ్రీ భట్టులు రామాయణమునుండి ఉదాహరించిన శ్లోకము –

**సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః**

**గురూన్ శుశ్రూషయా వీరః ధనుషా యది శాత్రవాన్** – అయోధ్యకాండ 12.29

రాముని అడవులకు పంపమని కైక పట్టుబట్టినపుడు ఆమెను పట్టువీడమని బ్రతిమాలుతూ దశరధుడు రాముని సద్గుణాలను వివరించాడు. తనను రామునినుండి దూరం చేయవద్దని బ్రతిమాలుతూ అన్నాడు. లోకాలను రాఘవుడు సత్యంతోను, దీనులను దానంతోను, గురువులను శుశ్రూషతోను, శత్రువులను ధనుస్సుతోను జయించాడు.

ఇదే జయశీలత్వమును తిరుమంగైయాళ్వారులు తమ పెరియ తిరుమొళిలో వర్ణించారు (1.10.2, 4.3.5)

శ్రీ రామానుజన్ చెప్పిన మరొక విషయం – శ్రీరాముడు ఒకే కుటుంబంలో ముగ్గురిని మూడువిధాలుగా జయించాడు. రావణుని యుద్ధంతోను, విభీషణుని ధర్మంతోను, శూర్పణఖను రూపంతోను జయించాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఇదేభావాన్ని భగవంతుని విశ్వేశ్వర స్వరూప వర్ణనలో చెప్పారు –

**అసంఖ్యాత తారాగ్రహోపగ్రహ సహితం తథా వన ఉపవన సముద్రాది సహితం**

**ఖగోళ భూగోళాత్మకం సర్వం విశ్వం యేన వశీకృతం స పురుజిత్ విష్ణుః**

అంతులేని తారాగ్రహాదులు, వనాలు, సాగరాలు, ఖగోళ భూగోళాదులు కలిగిన సకల విశ్వమును తన అధీనమున ఉంచుకొన్నందున విష్ణువు పురుజిత్.

ధర్మచక్రము రచయిత – శ్రీరాముడు అనుసరించిన ధర్మ, వినయ, సత్య, శౌర్యాది శీలసంపదయే అందరికిని ఆదర్శప్రాయము. ఇట్టి నియమములతో సాగించు జీవనక్రమంలో వచ్చే అవరోధాలు తాత్కాలికమైనవి. వాటిని ఎదుర్కొనడం ద్వారా విశ్వాసాన్ని మరింత పెంపొందించుకోవాలి. హరిశ్చంద్రుడు, పాండవులు అనుభవించిన క్లేశములే ఇందుకు దృష్టాంతములు.

**509. పురుసత్తమః**

- స్వయముగ మహాత్ములయందు సత్యముగ (తోడుగ) ఉండేవాడు.
- విశ్వస్వరూపుడు, సర్వమునకు ఉత్తముడు, అధికుడు.

**ఓం పురుసత్తమాయ నమః**

ఈ నామమునకు భాష్యకారులు వివిధములైన వ్యాఖ్యలు చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **మహత్వ స్థిత మత్వాద్యో హ్యంజనేయాదిషు స్వయమ్ పురుసత్తమ అఖ్యాతో నవార్ణ స్స్వస్తిదో మనుః -** ఆంజనేయాది మహాత్ములపట్ల భగవానుడు స్వయముగ తోడై నిత్యమై యుండును. వారు భగవంతుని అమృతత్వమును సదా ఆస్వాదింప నిచ్చగింతురు. ఈ నామము నవాక్షరీ మంత్రము. స్వస్తికరము. ఓం పురుసత్తమాయ నమః.



1790 కాలపు రామాయణ గ్రంధంలోని ఒక చిత్రం. సుగ్రీవుడు, హనుమ శ్రీ రామలక్ష్మణుల అనుజ్ఞ తీసికొనుట.
కుడివైపు: హనుమ శ్రీ సీతమ్మను దర్శించుట. రాక్షసస్త్రీలు కూడా శ్రీ అమ్మవారికి శరణాగతులైనారు. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Folio_from_a_Ramayana_manuscript,_text_in_Devanagari.jpg

ఇందుకు దృష్టాంతముగా శ్రీభట్టులు రామాయణం ఉత్తరకాండలో హనుమంతుడు చెప్పిన శ్లోకము(40.15)ను ఉదాహరించారు.

**స్నేహో మే పరమో రాజన్! త్వయి నిత్యం ప్రతిష్ఠితః**
**భక్తిశ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి.**

రాజా! నాకు నీ పట్ల స్నేహము నిత్యమై నెలకొన్నది. వీరుడా! నా మనసు నీ యెడల భక్తి తప్ప వేరెక్కడికీ వెళ్ళదు.

శ్రీ వి.వి. రామానుజన్ తిరుమంగైయాళ్వారు రచనలు తిరువైమోళి 4.9.2, 1.8.4లను ఉదాహరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఈ నామమును రెండు భాగాలుగా వ్యాఖ్యానించారు.

**విశ్వరూపత్వాత్ పురుః, ఉత్కృష్టత్వాత్ సత్తమః**

పురు – అనేకాద్భుత దివ్య ముఖ నయన దిశా సమన్వితమైన విశ్వరూపమూర్తి.

సత్తమ – సత్-తమ – సజ్జనులందరికంటె అధికుడు.

విశ్వరూపుడు మరియు సర్వోత్తముడు అయినందున పురుసత్తముడు.

శ్రీ చిన్మయానంద 'పురు' అనగా 'గొప్ప' అనే భావములో 'పురుసత్తమ' అనగా గొప్పవారిలో గొప్పవాడు – అని భగవానుని పరమోత్తమ తత్వమును వివరించారు. అంతే గాకుండా కొన్ని పాఠములలో 'పురుషోత్తమ' అనగా అంతటను ఉన్నవాడు మరియు ఉత్తముడు అని వివరించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్య – పురు-సత్-తమ – పురుసత్తమ – ఇక్కడ 'సత్' అనగా ఉనికి. 'తమ' అనగా ఉత్తమ. భగవంతుడొకడే నిత్యము. తక్కినదెల్లా అనిత్యము. ఈ నామము భగవంతుని అమృతత్వమును సూచించునది.

ధర్మచక్రము రచయిత – అనేక విభూతులతో నొప్పువాడు పురుసత్తముడు. ప్రకాశవంతమైనవానిలోసూర్యుడు, చంద్రుడు. వేదములలో సామవేదము. దేవతలలో ఇంద్రుడు. అన్నింట అత్యధిక ప్రభావము గలవాడు. పురుసత్తముడు.

## 510. వినయః

- దండించి (దుష్టులను) అణచివేయువాడు.
- నయ (ధర్మ) మార్గములో నడిపించువాడు.

### ఓం వినయాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **వినీయంతే దమయంతే ఇతి వినయః** – దండించి అణచువాడు వినయుడు. **కుంభకర్ణ మహాకాయ ఖర మారీచ రావణాః దమ్యంతే విక్రమైర్యేవ వినయ స్స ముదాహృతః** - మహాకాయుడైన కుంభకర్ణుని, ఖర దూషణ మారీచ రావణాదులను తన పరాక్రమముచే అణచివేసినందున శ్రీరాముడు వినయుడు. నయవర్తనము లేనివారిని దండించును.

శ్రీ చిన్మయానంద – 'వినయ గుణము' అనగా అహంకారము లేకుండుట. అధర్మపరుల అహంకారమును అణచివేయును గనుక భగవంతుడు వినయుడు.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు పెద్దలపట్ల, గురువులపట్ల, బ్రాహ్మణులపట్ల ఎంతో వినయవిధేయతలను కలిగియున్నారు. ఇలా భగవంతుడు వినయుడు.

వి-నయః – నయ మార్గమున నడిపించువాడు నేత. సత్య ధర్మ మార్గమున ముముక్షువులను నడిపించును గనుక శ్రీదేవుడు వినయుడు.

## 511. జయః

- ఆశ్రితులచే జయింపబడినవాడు.
- జయించువాడు.

### ఓం జయాయ నమః

శ్రీ శంకరుల భాష్యము – **సమస్త భూతాని జయతి ఇతి జయః** – అన్ని భూతములను జయించువాడు జయుడు.

శ్రీ భట్టుల భాష్యము – **ఆశ్రితైర్జీయతే యస్మాత్ విధేయో క్రియతే జయః** –ఆశ్రితుల ఇచ్ఛ ప్రకారము నడుచుకొనువాడు. వారిచే జయించబడినవాడు. ఇలా భగవంతుని సౌశీల్యమును కీర్తించే ఈ పుణ్యనామము వివరణకు శ్రీ భట్టులు రామాయణమునుండి ఉదాహరించారు –

**ఆజ్ఞాప్యోऽహమ్ తపస్వినామ్** (బాలకాండ 3.37) – నేను తాపసుల ఆజ్ఞను పాటించెదను.
**తతో నారాయణో విష్ణుః నియుక్తః సురసత్తమైః** (బాలకాండ 16.1) – అప్పుడు నారాయణుడు దేవతలచే నియుక్తుడయ్యాడు (వారు చెప్పిన విధంగా చేశాడు).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'జయ' శబ్దమువల్ల భగవానుడు అన్నింటిని తన అధీనములో ఉంచుకొనిననట్లు, అన్నింటిని జయించినట్లు, ఏదియు గాని ఎవరుగాని ఆయనను జయింపజాలనట్లు తెలిసికొనవలెను.

ధర్మచక్రము రచయిత – ఈ నామము ద్వారా మనము తెలిసికొనవలసినది. మనలో రెండు విధములైన గుణములున్నవి (1) భగవంతుని తెలిసికోవడానికి ఉపయోగపడేవి (2) అలా కానివి. సంపదకు లోబడుట, సంపద కొరకు అధర్మ కార్యములాచరించుట, కీర్తి కొరకు ప్రాకులాడుట వంటి దుర్లక్షణములు భగవదారాధనకు అవరోధములు. అలా కాకుండా శ్రీహరి కైంకర్యమునకు జీవితమును అంకితమొనర్చుట ద్వారా నిజమైన జయము లభించును.



**ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్**
**జయోऽస్మి వ్యవసాయోऽస్మి సత్త్వం సత్త్వవతామహమ్.** వంచకులలో జూదమును నేనే. ప్రభావశాలురలోని ప్రభావము నేను. విజేతలలో విజయము నేను. నిశ్చయాత్మకులలో నిశ్చయమును, సాత్త్విక పురుషులలో సాత్త్విక భావమును నేనే.

## 512. సత్యసంధః

- తానిచ్చిన మాటను నిలుపుకొనువాడు.
- దృఢమైన, చెరగని సంకల్పము గలవాడు.

### ఓం సత్యసంధాయ నమః

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'సంధ' అనగా 'ప్రతిజ్ఞ' అన్న అర్థమును వివరించారు. భగవానుని ప్రతిజ్ఞలు ఎల్లపుడు సత్యములగును. ఇందుకు శ్రీ భట్టులు అయోధ్యకాండ (10.9)నుండి చెప్పిన ప్రమాణము. శ్రీరాముడు సీతమ్మతో అన్నది –
**అప్యహం జీవితమ్ జహ్యామ్ త్వాం వా సీతే స లక్ష్మణాం**
**న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః.**
సీతా! నేను నా ప్రాణమును, నిన్ను, లక్ష్మణుని కూడా విడువగలను కాని నా ప్రతిజ్ఞను, విశేషించి బ్రాహ్మణులకు ఇచ్చిన మాటను, విడువజాలను.

శ్రీ వి.వి. రామానుజన్ నమ్మాళ్వార్ రచన తిరువైమొళి నుండి (9.10.6) ఉదాహరించారు. భగవంతుడు సదా తన నిజభక్తులకు సత్యస్వరూపుడు. ఆయన శ్రీనారసింహుడై ప్రహ్లాదుని మాటను, దేవతలకు తానిచ్చిన మాటను సత్యమొనర్చెను. హిరణ్యకశిపునకు కూడా దర్శనమొసగెను. హిరణ్యకశిపుడు తన కొడుకునకు ఆపన్నత కలిగించినపుడు వానిని పట్టి వధియింతునని శ్రీహరి దేవతలకు అభయమిచ్చినాడు. సర్వాత్మకుడైన హరి స్తంభమున తప్పక యుండునన్న ప్రహ్లాదుని మాట తప్పకుండ హరి యుద్దండ

ప్రభావమున శ్రీనారసింహాకృతుడై స్తంభమునుండి అవతరించెను. బ్రహ్మ వరమునకు భంగము కాకుండ రాక్షసుని పట్టి వధియించి జయ విజయుల మనోరథమును నెరవేర్చెను.

శ్రీరామానుజులు శరణాగతి గద్యములో ఉదాహరించిన భగవద్వాక్యములు –

**రామో ద్విర్నాభిభాషతే** – రాముడు రెండువిధములుగా మాటలాడడు.

**అనృతం నోక్త పూర్వమ్ మే న చ వక్ష్యే కదాచన** – నేనెన్నడును అసత్యమును చెప్పినవాడను కాను.

కైకేయికిచ్చిన వరమునకు కట్టుబడ్డ దశరథుడు, ద్యూత నియమమునకై అజ్ఞాతవాసము చేసిన ధర్మపుత్రుడు, ఆడి తప్పని హరిశ్చంద్రుడు – వీరంతా భగవంతునకు ఆప్తులు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సత్యసంధః అస్య ఇతి సత్య సంకల్పః** – ఆ వాసుదేవుని సంకల్పము నిశ్చయముగా సత్యమగును.

శ్రీ ఆర్. అనంతకృష్ణశాస్త్రి, శ్రీ చిన్మయానంద పురాణములనుండి ఉదాహరించినది – మిన్ను విరిగి పడుగాక. హిమాలయములు క్రుంగుగాక. భూమి బ్రద్దలగుగాక. సాగరములింకిపోవు గాక. నా పలుకులెన్నటికిని వ్యర్థములు కావు.

## 513. దాశార్హః

- కానుకలు సమర్పించ తగినవాడు.
- భక్తులకు తానే కానుక యగువాడు.
- 'దశార్హః' – యదువంశమున జన్మించినవాడు.

### ఓం దాశార్హాయ నమః

దాస్ - దానే - ఇచ్చుట; అర్హ - తగిన; అనే రెండు శబ్దములనుండి ఈ పుణ్యనామము మొదటి రెండు అర్థములు తెలుపబడినవి. కానుకలు సమర్పించి హరిని సేవింపదగును. హరియే పరమ భాగ్యమని తలచి ఆరాధింపదగును. శ్రీ శంకరులు 1వ, 3వ అర్థములలో వ్యాఖ్యానించారు. శ్రీ భట్టులు ఈ మూడు అర్థములను వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము భగవంతుడు అన్ని నివేదనలను, యజ్ఞయాగాదుల అర్పణలను స్వీకరించును. **ఆత్మనోవార్పణం భక్తైః తేభ్యోవా స్వాత్మనోఽర్పణం దాశస్తు మర్హతి చ యః దాశార్హ స్స తు కీర్తితః** - దానానికి తగినవాడు. తనను తన భక్తులకు ఇచ్చుకొనేవాడు. భక్తులు స్వయంగా తమను ఆయనకు సమర్పించుకోవడానికి తగినవాడు.

భగవంతుడు కృష్ణుడై దశార్హ (యదు) వంశమున జన్మించెను గనుక దాశార్హుడు.

శ్రీ వి.వి. రామానుజన్ తిరువాయిమొళి (2.34, 3.7.4)నుండి ఉదాహరించారు. భగవంతునకు ఆత్మ సమర్పణము చేసికొనవలెను. భగవంతుడు తానే పాలసముద్రమునుండి అమృతమును చిలికించి, మరల మోహినియై దేవతలకు పంచినాడు. **పెరుమక్కళ్ ఉళ్ళువార్ తమ్ పెరుమాన్** – భగవన్నామ స్మరణ చేయువారి హృదయములలో వసించును. అట్టి ముముక్షువులు కోరుకొను గొప్ప బహుమతి శ్రీనివాసుడే.

ధర్మచక్రము రచయిత – మనము సమర్పించిన అన్నింటిని, పాపములతో సహా, స్వీకరించువాడు భగవానుడే. మన కర్మ ఫలములను గైకొని వాసుదేవుడు సకల పాపకర్మలనుండి మనలను విముక్తులను చేయువాడు.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**

**అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః** – గీత 18.66

సర్వ ధర్మములను, అనగా సమస్త కర్తవ్య కర్మలను నాకు సమర్పించి, సర్వ శక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని గావించెదను. నీవు శోకింపకుము.

## 514. సాత్వతాం పతిః

- సాత్వతులకు ప్రభువు.
- సాత్వత (యదు) వంశమున జన్మించినవాడు.
- సాత్వత తంత్రము (పాంచరాత్రము) అనుసరించువారికి దిక్కు.

### ఓం సాత్వతాంపతయే నమః

**యే సాత్వతా భాగవతాః తేషాం యః పతి రీశ్వరః సాత్వతాం పతిర్యుక్తో నవార్ణ స్సాధు రక్షకః -** సాత్వతులనగా సత్వగుణ సంపన్నులు. సత్యమును తెలిసికొని నిచ్చగించు భాగవతులు. సాత్వికులను అనుసరించువారు. అట్టి సాత్వతులకు పతియైన భగవంతుడు సాత్వతాం పతి. ఇది నవార్ణ మంత్రము. సాధువులకు రక్ష. ఓం సాత్వతాంపతయే నమః.

సాత్వత వంశమనగా యదుకులము. యాదవులకు దిక్కైనందున శ్రీకృష్ణుడు సాత్వతాంపతి.

సాత్వతము – అనగా సత్వగుణ ప్రధానమైన ధర్మతంత్రము. అట్టి తంత్రము ననుసరించి శ్రీమహావిష్ణు ధ్యానమే జీవిత లక్ష్యముగా సాధనచేయువారు సాత్వతులు. పాంచరాత్రము కూడా అట్టి సాత్వతమే.

శ్రీ పి.బి. అణ్ణాంగారాచార్య స్వామి – శ్రీహరియే పాంచరాత్ర విధమును ప్రసాదించెను. దానిని ఆచరించు సాత్వతులకు పతియైన శ్రీదేవుడే సాత్వతాంపతి.



19వ శతాబ్దపు పంజాబీ వ్రాతప్రతిలోని చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Panjabi_Manuscript_255_Wellcome_L0045222_(cropped).jpg



## జీవో వినయితా సాక్షీ ముకుందోఽమితవిక్రమః |
## అంభోనిధి రనంతాత్మా మహోదధిశయోఽ న్తకః || (55)

### 515. జీవః

- జీవనము ప్రసాదించువాడు.
- పరమాత్మ సకల క్షేత్రములందు జీవుడై వెలసియున్నాడు.

**ఓం జీవాయ నమః**

**జీవయతీతి జీవః.** భాగవతులను పాపకర్మలనుండి దూరముగా ఉంచి, భగవత్సేవా భాగ్యమును ప్రసాదించి, వారి జీవితమును సచ్చిదానందమయము చేయువాడు గనుక శ్రీదేవుడు 'జీవః'. ఒక ఉడుత కూడ కైంకర్యమొనర్చి జన్మను సాఫల్యము చేసికొను భాగ్యము ప్రసాదించినవాడు. **తానాత్మనాశాద్వ్యావర్త్య సత్వాన్యశ్చ స్వసేవయా ఉజ్జీవయతి జీవ స్సః భక్త క్లేశా సహో మనుః -** తన భక్తులను ఆత్మ నాశనమునుండి కాపాడి, తనకు సేవలు చేయు భాగ్యమును ప్రసాదించి, ఉజ్జీవింపజేయువాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరింత విస్తృతమైన అర్థంలో వివరించారు. **జీవయతి ప్రాణాన్ ధారయతి ఇతి జీవః.** అన్ని జీవులను, ప్రాణములను నిలుపువాడు జీవుడు.

మరొక విధంగా – పరమాత్మయే అన్ని శరీరములందును జీవుడై వెలయుచున్నాడు. మాయావశుడై, కర్మబద్ధుడై కర్తృత్వ భోక్తృత్వములను అనుభవించుచున్న జీవుడు వాస్తవముగా పరబ్రహ్మమగుటచేత 'జీవ' శబ్ద వాచ్యుడగును. **క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత** (గీత 13.2.). అన్ని క్షేత్రములందును నేను క్షేత్రజ్ఞుడనైయున్నాను. (శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి).

### 516. వినయితా

### 517. సాక్షీ

### 516, 517. వినయితా సాక్షీ

ఈ నామమును శ్రీ శంకరభగవత్పాదులు 'వినయితా సాక్షీ' అని ఒకే నామముగా పరిగణించారు. శ్రీ పరాశరభట్టులు 'వినయితా', 'సాక్షీ' అనే రెండు నామములుగా పరిగణించారు.

**వినయితా**

- రక్షించువాడు.
- అందరికిని మార్గము చూపువాడు.

**ఓం వినయిత్రే నమః**

'నే' అనే ధాతువునకు (గతౌ) 'వెళ్ళుట', (రక్షణేచ) 'కాపాడుట' అనే రెండు అర్థములు ఉన్నవి. కాపాడుట అనే భావములో శ్రీ పరాశరభట్టు ఈ నామమును వ్యాఖ్యానించారు.

**భక్తాన్నిత్యం రాజపుత్ర లాలన న్యాయత్ స్సుఖమ్ రక్షత్యతో వినయితా నయతే రక్షణార్థతః.** భక్తులను రాజకుమారులవలె లాలించి భగవానుడు రక్షించునట. శ్రీ వి.వి. రామానుజన్ యుద్ధకాండమునుండి ఉదాహరించారు. లంకలో సుగ్రీవుడు తొందరపడి రావణునిపై ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు. అప్పుడు రాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు. **త్వయి కించితి సమాపన్నే కిం కార్యమ్ సీతాయా మమ?** మిత్రుడా! నీకు ఆపత్తు కలిగేట్లయితే నాకు సీత ఎందుకు?.

నమ్మాళ్వార్ తిరువైమొళి(6.9.3)లో ఇలా అన్నారు. నీ రక్షణ కోరి నిన్నాశ్రయించేవారి కొరకు నీవు నిలుచున్నట్లు గాను, విశ్రమించినట్లు గాను, కూర్చున్నట్లుగాను దర్శనమిస్తుంటావు మాధవా.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'నే' అనగా 'వెళ్ళుట' అనే భావములో ఈ నామమును వివరించారు. **సర్వస్య జగతో ప్రాయయితా గతేర్దాతా ఇత్యర్థః.** అందరికిని దారి చూపెడువాడు, నడిపించేవాడు వినయుత.

## సాక్షీ

- చూచువాడు.

### ఓం సాక్షిణే నమః

భగవంతుడు అందరిలోను అంతర్యామియై అందరిని పరికించుచుండును. తనను నమ్ముకొన్నవారికి కించిత్తైనా కీడు కలుగకుండా చూస్తూ ఉంటాడని శ్రీ భట్టుల వివరణ. **సాక్షాత్కరోతి యస్సాక్షీ తద్వృత్తం రక్షణాయ సః.** భక్తులను కాపాడడానికి వారు చేసే పనులన్నీ ప్రత్యక్షముగా చూసే శ్రీదేవుడే సాక్షి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **సాక్షాత్ ద్రష్టా సాక్షీ** – అని చెప్పారు. ఇందుకు రెండు విధాల వివరణలు ఇవ్వవచ్చును. (1) మాయకు అతీతుడైన భగవానుడు అన్నింటినీ ఉన్నవి ఉన్నట్లు చూచేవాడు గనుక సాక్షి. (2) భగవంతుడు అందరియందును, లోపల, వెలుపల, అంతటా ఉన్నాడు. అన్నీ ఆ దేవుడే. కనుక అన్నింటికిని ఆ శ్రీనివాసుడే సాక్షి. సర్వము వాసుదేవ మయమే గనుక ఆయన యెరుగనిది లేదు. ఈ నామమును వివరిస్తూ శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన శ్లోకము –

**సాక్షీ స విష్ణుః స హి దర్శనో వా ద్రష్టా స్వయం స హి సూర్యచక్షుః**
**జ్ఞానమ్ హి చక్షుర్తమాత్ర బోధః సోऽంతర్గతః పశ్యతి విశ్వమాత్రమ్.**

## వినయితా సాక్షీ

- తన భక్తులందలి వినయసంపదను చూచి ఆనందించువాడు.

### ఓం వినయిత్రే సాక్షిణే నమః

తన ప్రియ భక్తులలోనున్న దయ, ప్రేమ, కరుణ, శాంతి, అహింస, సత్యము వంటి దివ్యగుణ సంపదలకు, వినయ సంపదకు శ్రీమహావిష్ణువే సాక్షి. మాధవుని సేవించు దివ్యగుణ సంపన్నులకు ఆ పుండరీకాక్షుడే తోడు, నీడ, గురువు, బంధువు, చెలి, మార్గదర్శి, రక్షణ, కైవల్యము.

## 518. ముకుందః

- మోక్షమునిచ్చువాడు ముకుందుడు.

### ఓం ముకుందాయ నమః

శ్రీ శంకరులు, శ్రీ పరాశరభట్టులు కూడా ఈ నామమునకు అర్థమును, వ్యుత్పత్తిని ఒకే విధముగా చెప్పారు. **ముక్తిం దదాతి ఇతి ముకుందః**. ముక్తినిచ్చేవాడు ముకుందుడు. పాణిని సూత్రము 6.3.109 – **పృషోదరాదీని యథోపదిష్టమ్** – ను ఇద్దరు భాష్యకారులూ ఉదాహరించి, ముక్తినిచ్చేవాడు ముకుందుడు అనే వ్యుత్పత్తిని సమర్థించారు. సమస్త కర్మ బంధములనుండి, క్లేశములనుండి భక్తులను విముక్తులను చేసి ముక్తినిచ్చేవాడు ముకుందుడు. ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ దివ్య ప్రబంధములనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః** – గీత 18.66
సర్వ ధర్మములను, అనగా సమస్త కర్తవ్య కర్మలను నాకు సమర్పించి, సర్వ శక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని గావించెదను. నీవు శోకింపకుము.

## 519. అమితవిక్రమః

- హద్దులు లేని బలపరాక్రమములు కలిగినవాడు (ఆధారశక్తి).
- కొలువజాలని పెద్ద అడుగులుగల త్రివిక్రముడు.

### ఓం అమిత విక్రమాయ నమః

ఈ నామము మరల 647వ నామముగా వచ్చును.

55వ శ్లోకము. 519వ నామము. అమితవిక్రమః – **జీవో వినయితా సాక్షీ ముకుందః అమితవిక్రమః**

68వ శ్లోకము. 647వ నామము. అమితవిక్రమః – **అనిరుద్ధః అప్రతిరథః ప్రద్యుమ్నః అమితవిక్రమః**

**తేషాం ధ్యానానుసంధేయ తత్త్వ సందోహ ధారిణీమ్ తాం శక్తి ధృతవాన్యోసౌ స్మృతో హ్యమిత విక్రమః** - భక్తులు పరమేశ్వరుని ధ్యానించేటపుడు వారు అనేకములైన తత్వాలను సంధిస్తుంటారు. వాటన్నింటినీ ఆధారశక్తి అనబడే అపరిమిత బలపరాక్రమాలతో ధరిస్తుంటాడు. భక్తులు తనను ధ్యానించేటపుడు చేసే మంత్ర తంత్ర యోగాలను భరించగల బలవంతుడు అమితవిక్రముడు. (డా. క్రోవి పార్థసారథి రచననుండి).

శ్రీ భట్టుల వ్యాఖ్యప్రకారం శ్రీ భగవానుడు సకల ప్రకృతి తత్వములకు ఆధారశక్తి. **ఆధారశక్తి సంజ్ఞస్య అమృతస్య చ వై విభో** (శ్రీ పౌష్కరము). శ్రీ వి. ఎన్. వేదాంతదేశికుల వివరణ – సకలమును భరించుటకు అపరిమితమైన శక్తి కలిగిన కారణమున భగవానుడు అమితవిక్రముడు.

శ్రీ శంకరులు ఈ నామమునకు రెండు విధములైన వ్యాఖ్యలు చెప్పారు (1) 'విక్రమ' అనగా 'శౌర్యము' అన్న భావంలో (2) 'విక్రమ' అనగా 'పదక్రమము' (నడకలో అడుగు) అన్న భావంలో. **అమితమ్ విక్రమణమ్ శౌర్యమ్ అస్య ఇతి అమిత విక్రమః.**

భగవద్గీత (11.40)లో ఈ నామము కీర్తింపబడినది.

**నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ**

**అనంత వీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వ.**

అనంత సామర్థ్యము గలవాడా! నీకు ఎదురుగా ఉండియు, వెనుకనుండియు నమస్కరించుచున్నాను. ఓ సర్వాత్మా! నీకు అన్నివైపులనుండియు నమస్కారములు. ఏలనన అనంత పరాక్రమశాలివై నీవు జగత్తంతటను వ్యాపించియున్నావు. అన్నిరూపములు నీవియే.

శ్రీ తిరుక్కళ్ళుమ్ శ్రీనృసింహరాఘవాచార్యస్వామి ఈ అమితవిక్రమనామము తులలేని పరాక్రమమును, శౌర్యమును, శక్తిని, బలమును సూచించునని వివరించారు.

శ్రీ శంకరుల రెండవ వివరణ – **అమితా అపరిచ్ఛిన్నా విక్రమాస్త్రయః పాదవిక్షేపా అస్య** – కొలువజాలని మూడడుగులువేసి ముల్లోకములను కొలిచిన శ్రీవామనమూర్తియే అమితవిక్రముడు.

'క్రమ' అనగా 'పదవిక్షేపము' లేదా 'అడుగు' అన్న భావంలోనే శ్రీ సత్యదేవోవాసిష్ఠ కూడా ఈ నామమును వివరించారు. అయితే ఆయన చెప్పిన అర్థం – భగవంతుడు సృష్టి అంతటా తానే వ్యాపించియున్నాడు. భూమ్యాకాశములలోను, సత్త్వరజస్తమో గుణములలోను, త్రిసంధ్యలయందును – ఇలా సర్వత్ర భగవంతుని విస్తారమున్నది గనుక ఆయన అమితవిక్రముడు (పెద్ద పెద్ద అడుగులతో విస్తరించియున్నవాడు.)

## 520. అంభోనిధిః

- జలములే నివాసముగా నున్నవాడు (శ్రీ కూర్మావతారము).
- సాగర స్వరూపుడు (**సరసామస్మి సాగరః**)
- అంభువులకు (దేవతలకు, పితరులకు, మానవులకు, అసురులకు) ఆధారము. అంభువులను తనయందు నిలుపుకొన్నవాడు.
- సకల జీవులలో జలరూపమున నిధానమై యున్నవాడు.

**ఓం అంభోనిధయే నమః**

**శ్రీ పరాశరభట్టు 520 నుండి 528 వరకు నామములను శ్రీ కూర్మావతార పరముగా వివరించారు.**

**ఆధారశక్తి కమఠ స్వరూపేణార్ణవాంభసి నిధీయతే స్వయం యేన స హ్యంభోనిధి రుచ్యతే**

**పాతాళాంభసి అఖిల జగదాధార పీఠ నిధీయతే ఇతి అంభోనిధిః** – పాతాళలోకము తన పీఠముగా కలిగి జలములలోనుండి సకల జగములను భరించేవాడు అంభోనిధి. ఇందుకు ప్రమాణముగా శ్రీ భట్టులు ఉదాహరించిన మంత్రము – **అనంత బలశక్తయే భువనభృతే కచ్ఛపాత్మనే** – కచ్ఛప స్వరూపుడై భువనములను భరించే అనంత బలశక్తిమూర్తికి ప్రణామములు.

'నిధి' అనగా ప్రోగుచేసిన చోటు, ఆవాసస్థానము. శ్రీ శంకరులు ఈ అర్థములో 'అంభోనిధి' నామమును వ్యాఖ్యానించారు. సకల జలములకు స్థానమైనవాడు గనుక భగవానుడు అంభోనిధి. జలాశయములలో నేను సాగరమును – అని గీత (10.24)లో శ్రీకృష్ణభగవానుడు తెలియజెప్పెను.

శ్రీ శంకరులు చెప్పిన రెండవ భాష్యము – దేవతలు, పితృదేవతలు, మనుష్యులు, అసురులు - ఈ నలుగురికి కలిపి 'అంభస్సులు' అని పేరు ఉన్నది. ఇందుకు తైత్తరీయ బ్రాహ్మణములోని శృతివాక్యము (2.3.8) ప్రమాణము – **తాని వా ఏతాని చత్వార్యంభసి దేవా మనుష్యాః పితరోఽసురాః**

ఇట్టి అంభస్సులు తనయందు విహితములై యున్నందున శ్రీహరియే అంభోనిధి. ధర్మచక్రము రచయిత దీనిని మరింత వివరించారు. ఈ నాలుగు అంభస్సులు సకల జీవములను నియంత్రించును. కనుక సర్వము భగవానుని నియంత్రణలో ఉన్నది. ఇంకా ప్రళయకాలములో అంతా జలమయమైనపుడు శ్రీకూర్మమూర్తి జీవులను కాపాడును. అనగా సకల కాలములందును సకల జీవరాశులకును ఆధారము శ్రీహరియే.

శ్రీసత్యదేవోవాసిష్ఠ వివరణ – సకల జీవరాశులకును నీరే ప్రాణాధారము. జీవుల రక్తములోను, వృక్షముల నాళములందు నీరే జీవమునకు ఆధారమైయున్నది. అలా శ్రీనివాసుడు నీటిని నిధానముగా చేసియున్నాడు గనుక ఆయన అంభోనిధి. **అపామ్ రేతాంసి జిన్వతి** – అని అధర్వణ వేదంలో తెలుపబడినది.

## 521. అనంతాత్మా

- అనంతుని ఆత్మ.
- దేశ కాల వస్తు పరిచ్ఛేదములు లేని ఆత్మ. అనంతమైన ఆత్మ.

### ఓం అనంతాత్మనే నమః

శ్రీ పరాశర భట్టుల వివరణ – సమస్త జగత్తునకు ఆధారమైన ఆదికూర్మముపైనుండి, జగదాధార స్తంభమైన అనంతునికి ఆత్మ.

**కమఠేనోపరి జగదాధార స్తంభ భోగినః స్వరూపేణ స్థితో యోఽసౌ అనంతాత్మా ప్రకీర్తితః**

**అనంతస్య ఆత్మా అనంతాత్మా. ఆధారశక్తే రుపరి విమలం దీప్తవిగ్రహమ్ జ్వాలాశ సమాకీర్ణం శంఖ చక్ర గదాధరమ్ అనంతేశమ్ న్యశేత్**
ఆధారశక్తి మీద నిర్మలమై ప్రకాశిస్తున్న దివ్య మంగళ స్వరూపుడు, అనేక జ్వాలలతో కూడినవాడు, శంఖ చక్ర గదాధారి అయి ప్రకాశిస్తున్న అనంతేశుని హృదయస్థానంలో స్థాపించాలి – అని జయ సంహితలో చెప్పబడినది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అనంతమైన, తెలియజాలని ఆత్మ. దేశ కాల వస్తు పరిచ్ఛేదములు లేని స్వరూపము గలవాడు. దీనికి శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – సృష్టిలో సకల వస్తువులకు దేశ కాల పరిమితులుంటాయి. ఒక వస్తువు ఒక చోట ఉన్నట్లయితే అదే సమయంలో అది మరొకచోట ఉండలేదు. కాని శ్రీమన్నారాయణునికి ఈ నియమాలు వర్తించవు. కనుక శ్రీహరియే అనంతాత్ముడు. అన్నింటికీ అంతరాత్ముడు. అంతటికీ పరమాత్ముడు.

## 522. మహోదధిశయః

- మహాసాగరమున శయనించినవాడు.

### ఓం మహోదధిశయాయ నమః

**తస్మిన్ననంత పర్యంకే సముద్రే శయనాచ్చయః మహోదధిశయః ఖ్యాతో దశార్ణో మనురుత్తమః.** మహాసముద్రంలో అనంత శేషపాన్పుపై పవళించినందున శ్రీమన్నారాయణుడు మహోదధిశయనుడు. ఈ నామము దశాక్షరీ మహామంత్రము. ఓం మహోదధిశయాయ నమః.

ఈ భావమును పెరియాళ్వారు తిరుమొళి (5.1.7)నందు, నమ్మాళ్వారు తిరువైమొళి (3.4.9)నందు కీర్తించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము ప్రళయ సమయమున జగం అంతా ఒక సాగరంలో విలీనమౌతుంది. ఆ మహార్ణవంలో శ్రీరంగనాథుడు శయనించాడు.



కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం
వటస్య పత్రస్య పుటేశయానం బాలం ముకుందం మనసా స్మరామి.

శేషశాయి అయిన శ్రీమహావిష్ణువు.
హైదరాబాదు పురావస్తు మ్యూజియంలోని శిల్పం

## 523. అంతకః

- సమస్తమును లయము చేయువాడు.

**ఓం అంతకాయ నమః**

శ్రీ శంకరులు ఈ నామమునకు చెప్పిన వ్యుత్పత్తి – **అంతం కరోతి భూతానామ్ ఇతి అంతకః.**

శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణములు –

**అంతే పృథివ్యాం సలిలే దృశ్యతే త్వం మహోరగః** (రామాయణము. యుద్ధకాండ 120.23)

**కల్పాంతే యస్య వక్త్రేభ్యో విషానల శిఖోజ్వలః సంకర్షణాత్మకో రుద్రో నిష్క్రమ్య అత్తి జగత్రయమ్.** కల్పాంతమున అతని నోటినుండి వెలువడే విషజ్వాలలు లోకములను నాశనం చేస్తాయి. అతడే బలరాముడు, రుద్రుడు (సంక్షణ రూపుడైన రుద్రుడు).

శ్రీ వి.వి. రామానుజన్ నమ్మాళ్వార్ తిరువైమొళి (2.2.6)నుండి ఉదాహరించారు.

శ్రీ చిన్మయానంద – కాలాంత ప్రళయంలో అంతటినీ అంతం చేయడంవల్ల పునఃసృష్టి సాధ్యమవుతుంది. కనుక భగవానుడు అంతకుడు.



తిరుచిరాపల్లి మండపం ద్వారం శిల్పాలు. Photo by: Jean-Pierre Dalbéra from Paris, France
https://commons.wikimedia.org/wiki/File:Amma_Mandapam_Place_(Tiruchirapalli,_Inde)_(14084819064).jpg



## అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః |
## ఆనందో నందనో నందః సత్యధర్మా త్రివిక్రమః || (56)



తిరుమలలో మెట్ల దారి.

Creative commons Photo from Flickr by Shashi Bellamkonda

### 524. అజః

- 'అ'కారము ('అ' అనే అక్షరము) విభూతిధారి.
- జన్మము లేనివాడు.
- భక్తుల చిత్తములందు అంధకారమును పారద్రోలువాడు.
- భక్తుల వెన్నంటి ఉండువాడు.
- హృదయగతికి కారణమైనవాడు.
- కర్మ ఫలములను సదా వర్తింపజేయువాడు.
- సకల వస్తుభూత సముదాయము కలిపిన స్వరూపుడు.
- అంతటా, అన్నింటా ఉండువాడు.
- మన్మధుడు.

**ఓం అజాయ నమః**

ఈ నామము 96వ, 206వ, మరియు ఇప్పుడు 524వ నామములుగా చెప్పబడినది.

11వ శ్లోకము. 96వ నామము. అజః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః**

22వ శ్లోకము. 206 వ నామము. అజః – **అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా**

11వ శ్లోకము. 524వ నామము. అజః – **అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః**

ఈ మూడు సందర్భాలలోను ఈ పుణ్యనామమునకు శ్రీ భాష్యకారులు చెప్పిన అర్థాలు క్లుప్తంగా ఇలా ఉన్నాయి.

శ్రీ భట్టుల వివరణ –

96. అజః – **క్షిపతి ఇతి అజః** – ముముక్షువుల సాధననుండి విఘ్నములను తొలగించువాడు.

206. అజః – **న జాయతే ఇతి అజః** – పుట్టుక లేనివాడు. స్తంభమునుండి వెలువడిన శ్రీనారసింహుడు.

524. అజః – **అకార వాచ్యతయా జాతః** – 'అ' అను అక్షరముగా తెలియువాడు.

శ్రీ శంకరుల వివరణ –

96. అజః – **అజతి గచ్ఛతి క్షిపతి వా అజః** – భక్తుల హృదయమున ప్రవేశించి చరించువాడు.

206. అజః – **న జాయతే ఇతి అజః** – జన్మము లేనివాడు (ఎప్పుడూ ఉన్నవాడు).

524. అజః – విష్ణువునకు జన్మించిన మన్మధుడు *(సరి చూడవలసి ఉన్నది)*

**తత్వావసాన కాలేన ప్రణవ ప్రకృతి తత్వతః స్మర్తవ్యత్వా దజః ప్రోక్తః షడర్ణో హృర్యార్మి నాశకః** - ప్రళయకాలంలో అన్ని తత్వాలు నశించిపోతాయి. అటువంటి సమయంలో 'ఓం'కారానికి ఆదియైన 'అ'కారముచే చెప్పబడువాడు (ప్రణవంలో అకార, ఉకార, మకారాలున్నాయి). ఈ నాము షడక్షరి. తాపనాశకము. ఓం అజాయ నమః.

**అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ**
**అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః** – గీత 10.33
అక్షరములలో 'అ'కారమును నేను. సమాసములలో 'ద్వంద్వ'సమాసమును నేను. అక్షయకాలము అనగా మహాకాలమును నేను. విశ్వతోముఖుడైన విరాట్ పురుషుడను నేను. అందరిని పోషించువాడను నేను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'అ' విష్ణువును, 'జ' ఉత్పత్తిని సూచించును. అంతా విష్ణువునుండే సంభవించినది గనుక 'అజ' అనగా సకల వస్తు భూత సముదాయము.



కొచ్చిన్ శ్రీ వెంకటేశ్వర దేవస్థానంలో శ్రీ స్వామి, అమ్మవార్ల విగ్రహాలు.
Photo by Dspai. https://commons.wikimedia.org/wiki/File:Gosripuresha.jpg

మహాభారతం శాంతిపర్వంలో ఇలా ఉంది (341.74).

**న హి జాతో న జాయేఽహమ్ న జనిష్యే కదాచన**
**క్షేత్రజ్ఞః సర్వ భూతానామ్ తస్మాదహం అజః స్మృతః**
నేను పూర్వము జన్మించియుండలేదు. ఇప్పుడు జన్మించినవాడను కాను. భవిష్యత్తులో జన్మించను. నేను సర్వభూతములందును క్షేత్రజ్ఞుడను. కనుక నన్ను 'అజుడు' అని యందురు.

## 525. మహార్హః

- పూజింపదగినవాడు.

ఓం మహార్హాయ నమః

**స్వరూపాది కృతార్థేన తారేణాత్మ నివేదనమ్ మహం పూజాం అర్హతీతి మహార్హ ఇతి కథ్యతే** - ఆత్మ జ్ఞాన సముపార్జనకు ఉపయోగించే ప్రణవ స్వరూపంగా ఆత్మను అర్చించడమే 'పూజ' అవుతుంది. అటువంటి పూజకు తగినవాడు మహార్హుడు. **మహమ్ - పూజనమ్ - అర్హతీతి మహార్హః** – 'మహమ్' అనగా 'పూజ'. ఇక్కడ పూజ అనగా 'ఆత్మ సమర్పణము' లేదా 'ప్రపత్తి' అని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు.

ఉపనిషత్తులలోనే 'న్యాసము' లేదా 'భార సమర్పణము' విశిష్టత తెలియజేయబడిందని వివరిస్తూ శ్రీ భట్టులు తైత్తరీయారణ్యకము (21) నుండి ఉదాహరించారు. **బ్రహ్మణే త్వా మహసా ఓం ఇతి ఆత్మానమ్ యుంజీత ఏతద్వై మహోపనిషదమ్ దేవానామ్ గుహ్యమ్.** ప్రణవం ద్వారా పరమాత్మునికి జీవమును సమర్పించుకోవాలి. ప్రణవంలో మొదటిదైన'అ'కారము పరమాత్మ స్వరూపము. చివరిదైన 'మ'కారము జీవాత్మ సూచకము. 'ఓం' అనే మంత్రము ద్వారా నేను నన్ను నీకు సమర్పించుకొంటున్నాను పరబ్రహ్మమా – ఇది దేవతలకు మాత్రమే తెలిసిన రహస్యం. దీనిని మహోపనిషత్తులు మనకు అందజేశాయి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – అన్ని సేవలకంటెను అత్యుత్తమమైన ఆత్మనివేదనమే ప్రపత్తి. అట్టి ప్రపత్తి శంఖచక్రగదాధరుడైన శ్రీమన్నారాయణునికి చెందవలెను. ఆయనే మహార్హుడు.

ఆత్మ బోధోపనిషత్తు – ప్రత్యగానంద స్వరూపుడు, ఓంకార రూపుడు అయిన పరమపురుషుడే పరబ్రహ్మ. అకార, ఉకార, మకారముల కలయికే ప్రణవము, ఓంకారము. ఈ ప్రణవాన్ని జపించే బ్రహ్మజ్ఞాని జన్మ సంసార బంధనాలనుండి విముక్తి పొందుతున్నాడు. "ఓం నమో నారాయణాయ శంఖ చక్ర గదా ధరాయ" అనే మంత్రమును జపిస్తున్న ఉపాసకుడు వైకుంఠము పొందుతాడు. పద్మమువంటి బ్రహ్మ పట్టణము తటిల్లతవలె, దీపమువలె ప్రకాశిస్తున్నది. దేవకీపుత్రుడే పరబ్రహ్మ. మధుసూదనుడు. పుండరీకాక్షుడు. విష్ణువు. అచ్యుతుడు. అతడే నారాయణుడు. కారణ పురుషుడు. అతడే "ఓం"కారము. కనుక పరమపదమును పొందగోరేవారు ఓంకారాన్నే అర్చించాలి. అటువంటి అర్చనకు తగినవాడు కాబట్టే శ్రీమన్నారాయణుడు "మహార్హః" అనబడుతున్నాడు. (డా. క్రోవి పార్థసారధి రచన 'శ్రీ కైవల్య సారధి' నుండి).

## 526. స్వాభావ్యః

- తన సొత్తు అయిన జీవులచే సదా ధ్యానింపతగినవాడు.
- స్వభావపరంగా ప్రభువు.
- స్వభావాత్మకంగా అనాది అయినవాడు.
- అన్నింటా, అంతటా, మినహాయింపు లేకుండా ఉండువాడు.

### ఓం స్వాభావ్యాయ నమః

**మంత్రేణానే నాత్మభిస్తు స్వభూతైరాభి ముఖ్యతః అవశ్యం భావనీయత్వాత్ స్వాభావ్యః పరికీర్తితః -** తన సొత్తుగా ఉన్న జీవులు ప్రణవ మంత్రాన్ని జపిస్తూ తనను ధ్యానించడానికి తగినవాడు స్వాభావ్యుడు.

**స్వభూతైః (ఆత్మభిః) భావనీయత్వాత్ స్వాభావ్యః** – అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **స్వభావికత్వేన భావనీయత్వాత్ స్వాభావ్యః** – అని కూడా చెప్పారు. సకల భూతములు శ్రీమహావిష్ణువునకు స్వంతమే. కనుక ఆ జీవులు అన్నీ సహజంగానే ఆయనను ప్రభువుగా ధ్యానించును గనుక భగవంతుడు స్వాభావ్యుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– స్వభావ్యేన అభావ్యః** – భగవంతుడు పరమోన్నతుడు. పురుషోత్తముడు. మనకు ఆయనను గురించి తెలియకపోవడం, ఆయనకు ఆది లేకపోవడం – ఇవి రెండూ భగవంతుని స్వభావములు కనుక ఆయన స్వాభావ్యుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ **"స్వ-భూ-వ్యాత్"** అనే ధాతువులనుండి పాణిని సూత్రాల ద్వారా (భు=భావ్), అంతటా, అన్నింటా తప్పక ఉండేవాడు స్వాభావ్యుడని వివరించారు.

## 527. జితామిత్రః

- అమిత్రులను జయించినవాడు. తన భక్తులు కామ క్రోధ అహంకార మమకారాదులను జయించడానికి తోడ్పడేవాడు.
- కామక్రోధాదులను జయించినవాడు.
- రావణాది శత్రువులను జయించినవాడు.

### ఓం జితామిత్రాయ నమః

**ఏతద్రహస్య విజ్ఞాన నిరోధి మమతాదయః జితాస్తేషా మనేనేత్ జితామిత్రాऽష్ట వర్ణకః** - తన భక్తులు ఈ విధమైన రహస్యార్థాలు తెలుసుకోవడానికి వారి అహంకార మమకారములను పోగొట్టేవాడు జితామిత్రుడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అహంకారాన్ని పోగొడుతుంది. ఓం జితామిత్రాయ నమః.

**అమిత్రా జితాః అనేన ఇతి జితామిత్రః** – జయింపబడిన అమిత్రులు (శత్రువులు) గలవాడు. ఇక్కడ 'అమిత్రులు' అనగా కామము, అహంకారము, మమకారము వంటి వికార భావములు – అని శ్రీ భట్టులు వివరించారు. భగవానుని స్వరూపజ్ఞానం లభించకుండా భక్తులకు ఈ వికారాలే ఆటంకంగా ఉంటాయి. భగవద్గీతలో (3.37 నుండి 3.43 వరకు) ఇట్టి రజోగుణములే శత్రువులని శ్రీకృష్ణుడు ఉపదేశించాడు.

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.** రజోగుణంనుండి జనించే కామక్రోధాలు మహాశనములు. ఎంత అనుభవించినా తృప్తి కల్గించవు. పైగా ఇవి మహాపాప కర్మలకు ప్రేరణలవుతాయి. కనుక ఇవి పరమ శత్రువులని తెలిసికొనుము.

భక్తుల సాధనలో ఆటంకాలైన వికార శత్రువులను భగవంతుడు తొలగిస్తాడని చెప్పడానికి శ్రీ వి.వి. రామానుజన్ దివ్య ప్రబంధములనుండి ఉదాహరించారు (తిరువైమొళి 29.3).

భగవానుని జితామిత్రుడని సంబోధించుటకు శ్రుతులనుండి శ్రీ సత్య దేవో వాసిష్ఠ అనేక ప్రమాణాలు చూపారు.

**ద్యుమాగమ్ అమిత్రా దంభనః** – ఋగ్వేదము 4.15.4
**అమిత్ర సేనామ్ మఘవన్** – అథర్వణ వేదము 3.1.3

అంతే కాకుండా భగవంతుని, ధర్మాన్ని నమ్ముకొన్నవారికి విజయం తథ్యం.

శ్రీ శంకరులు తమ వ్యాఖ్యలో రావణాది శత్రు సంహారం చేయండవలన కూడా భగవానుడు జితామిత్రుడని తెలిపారు. భగవానుడు స్వయంగా కామక్రోధాదులను జయించినందున జితామిత్రుడు – అనే భావం కూడా చెప్పబడింది.

## 528. ప్రమోదనః

- భక్తులకు ముదము (ఆనందము) కలిగించువాడు.
- సదానంద స్వరూపుడు.

### ఓం ప్రమోదనాయ నమః

**ప్రమోదం కరోతి ఇతి ప్రమోదనః** – తనను ధ్యానించేవారి మనస్సులను సంతోషంతో నింపివేసేవాడు ప్రమోదనుడు. 'ముదము' అనగా 'హర్షము' అనే భావంలో ఈ నామమును వ్యాఖ్యానిస్తూ శ్రీ భట్టులు దీని ముందు నామమైన 'జితామిత్రః'తో ఇలా అనుసంధానించారు – తమనుండి కామక్రోధాది తమోగుణములు దూరమైనపుడు భక్తులు ప్రమోదితులు అవుతారు. అలా వారిని ఆనందింపజేయువాడు గనుక భగవంతుడు ప్రమోదనుడు.

శ్రీ శంకరులు చెప్పిన అర్థము – భగవతుడు సచ్చిదానంద స్వరూపుడు గనుక ప్రమోదనుడు.

శ్రీ పి.బి. అణ్ణాంగార్ స్వామి, శ్రీ వి.వి. రామానుజన్ వంటి వ్యాఖ్యాతలు ఈ రెండు భావాలను చక్కగా సమన్వయ పరచారు – అహంకార మమకార కామ క్రోధాది శత్రువులనుండి విముక్తులైన కారణంగా భక్తులు సంతోషిస్తారు. వారి సంతోషం కారణంగా

భగవంతుడు సంతోషిస్తాడు. బిడ్డల ఆనందం తల్లిదండ్రులకు ముదావహం గదా! ఇలా భక్తులకు ముదం కలుగజేసి, ఆయన స్వయంగా ఆనందం అనుభవిస్తాడు గనుక శ్రీనివాసుడు ప్రమోదనుడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – 'మోదము' అనగా ఐహికములైన ఆనందములు. 'ప్రమోదము' అనగా ఆత్మ సాక్షాత్కారము వలన కలిగే ఆనందము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కర్మ బంధాల కారణంగా సంప్రాప్తించిన దేహాన్ని వదలడానికి ఎవరూ ఇష్టపడరు. అనగా భగవానుడు జీవులకు ఎంత సంతోషం కలుగజేస్తున్నాడో ఊహింపవచ్చును.

## 529. ఆనందః

- ఆనంద స్వరూపుడు.

### ఓం ఆనందాయ నమః

**529 నుండి 537 వరకు నామములను భగవానుని కపిలాచార్య అవతారస్తుతి పరముగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

బ్రహ్మ మానస పుత్రుడు కర్దముడు. అతడు విష్ణువును గురించి గొప్ప తపస్సు చేశాడు. శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై కర్దమునికి దేవహూతిని పరిణయమాడమని, ఆ దంపతులకు తాను స్వయముగా కపిలమూర్తిగా జన్మించి సాంఖ్యయోగము తెలియజేస్తానని వరమిచ్చాడు.

స్వాయంభువ మనువు భార్య శతరూప. వారి పుత్రిక పేరు దేవహూతి. స్వాయంభువ మనువు తన భార్య, కుమార్తెలను వెంటబెట్టుకొని కర్దముని దర్శించాడు. తన కుమార్తెను కర్దమునికిచ్చి పెండ్లి చేశాడు. దేవహూతికి కర్దమునివలన తొమ్మిదిమంది కుమార్తెలు, ఒక కుమారుడు కలిగారు. ఆ కుమారుడే కపిలుడు. విష్ణుమూర్తి అంశావతారము. తరువాత కొంత కాలానికి కర్దముడు సన్యాసము స్వీకరించి సాయుజ్యం పొందాడు. కపిలుడు సాంఖ్యదర్శనాన్ని ప్రచారం చేశాడు. ఒకమారు కపిలుడు తన తల్లి దేవహూతికి జ్ఞానోపదేశం చేశాడు. ఆ ఉపదేశానికి 'కపిల దేవహూతి సంవాదము' అని పేరు.

**వాఙ్మనస దుర్గాహ్యో మహానందః అస్య ఇతి ఆనందః.**

**వల్ల్యామానంద సంజ్ఞాయాం అవాఙ్మనస గోచరః ఆనందో యస్సయస్యాస్తీ త్యానందః పరికీర్తితః -** ఆనందవల్లి అనే ఉపనిషత్తునందు చెప్పబడినట్లుగా మనస్సుకు, వాక్కుకు అందని ఆనందమునకు స్వరూపుడు (కలవాడు) కనుక ఆనందుడు.

తైత్తరీయోపనిషత్తులో శిక్షావల్లి, భృగువల్లి, ఆనందవల్లి అనే మూడు భాగాలున్నాయి. విషయవాంఛలవలన కలిగేది క్షణికమైన లౌకికానందము. సత్యము, జ్ఞానము, అనంతము అయిన బ్రహ్మము గురించిన చింతనవలన కలిగేది బ్రహ్మానందము. ఆనంద స్వరూపుడైన బ్రహ్మను మనము పరిమితమైన మాటల చేతను, మనసు చేతను తెలిసికోవడం అసాధ్యం. మనసుకు, మాటలకు అతీతమైన జ్ఞానంతో మాత్రమే పరబ్రహ్మమును గురించిన ఎఱుక సాధ్యము.

కపిల మూర్తిని గూర్చిన స్తుతికి 'ఆనందః' అనే నామమును చెప్పడానికి కారణాన్ని శ్రీ వి.వి. రామానుజన్ ఇలా వివరించారు. కపిలావతారమూర్తి బంధరహితుడు. కామక్రోధాది బంధములకు అతీతుడైనవాడు. **శ్రోత్రియస్య చ అకామహతస్య** – అని శ్రుతి చెబుతున్నది. అట్టి బ్రహ్మానంద స్వరూపుడే కపిలుడు. ఆనందుడు.

శ్రుతులలో భగవానుని ఆనంద స్వరూపమును గురించి పెక్కు ప్రస్తావనలను శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉదాహరించారు –

**ఆనందరూపమ్ అమృతమ్ యద్ విభాతి** – ముండకోపనిషత్తు 2.2.7.

**ఆనంద ఆత్మా** – తైత్తరీయ 2.5

**ఆనందో బ్రహ్మ** – తైత్తరీయ 3.6



నాసిక్‌లో శ్రీ కపిల మహర్షి విగ్రహం. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/User:Pradeep717

## 530. నందనః

- ఆనందము కలిగించువాడు. నందయతి ఇతి నందనః.

**ఓం నందనాయ నమః**

**తమానందం యథోక్తాయాం ముక్తౌ ప్రాప్య య స్సదా ముక్తా నిత్యానందయతే నందన స్స తు కీర్తితః** - అటువంటి (ఇంతకుముందు నామంలో చెప్పబడినట్టి) ఆనందాన్ని (బ్రహ్మానందాన్ని) ముక్తులకు ప్రసాదించి వారికి నిత్యానందాన్ని (క్షణికం కాని ఆనందాన్ని) కలిగించేవాడు. ఇంతకు ముందరి నామం (ఆనందః) ప్రకారం భగవంతుడు ఆనంద స్వరూపుడు. ఈ నామం (నందనః) ప్రకారం ఆయన అట్టి బ్రహ్మానందాన్ని ముక్తులకిచ్చి, వారికి ఆనందం కలుగజేసి, తానుకూడా ఆనందిస్తాడు. భగవంతుని సామీప్యము చాలును ఈ పరస్పరానందాన్ని ప్రభవింపజేయడానికి.

శ్రీ శంకరాచార్యులు భజగోవిందంలో ఇలా చెప్పారు –

**యోగరతో వా భోగరతో వా సంగరతో వా సంగహీనః**

**యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ.**
యోగి అయినా, భోగి అయినా, ఒంటరి అయినా, బంధుమిత్రులతో కలసిఉన్నా గాని పరబ్రహ్మయందు మనసు లగ్నము చేసినవాడు ఆనందిస్తాడు. ఆనందిస్తాడు. ఆనందిస్తాడు. సందేహము లేదు.

## 531. నందః

### ఆనందః

- సమస్త సుఖ సంతోష భోగములతో పరిపూర్ణుడైనవాడు.

**ఓం నందాయ నమః**

**ఓం ఆనందాయ నమః**

**భోగ్యైః భోగోపకరణైః భోగైర్భోకృభిరేవచ తస్మిన్ సమృధ్యతే నిత్యం ఇతి నందః ప్రకీర్తితః** - భోగ్యములు, భోగ వస్తువులు, భోగ సాధనములు, భోగముల సమృద్ధిచేత నిత్య పరిపూర్ణుడైనందున భగవానుడు నందుడు. **నందతి అస్మిన్నితి నందః** – ఆనందంలో ఉన్న అపరిమిత భోక్తలచేత, భోగవస్తువులచేత, భోగోపకరణములచేత సమృద్ధుడు.

శ్రీ వి.వి. రామానుజన్ – భగవానుడు సంగరహితుడు. ఆయనకు కావలసింది లేనిది ఏదియును లేదు. సకల ఆనందములు, ఆనంద ఉపకరణములు, ఆనందించేవారు అంతా ఆయనయందే స్థితులైయున్నారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **నందతి సమర్ధంతే అస్మిన్ విశ్వరూపే పురుష ఇతి నందో విష్ణుః** – శ్రీమహావిష్ణువు పూర్ణ పురుషుడు. సకల జీవములు ఆయనయందే ఆనందములు పొందును. కనుక భగవానుడు నందుడు.

శ్రీ శంకరులు **'ఆనందః'** అనే నామమును కూడా (**'నందః'**కు బదులుగా) గ్రహించారు. ఇక్కడ **'ఆనందః'** అనగా – ఇంద్రియ సంబంధములైన సౌఖ్యములేవీ భగవానునకు సంబంధము కలిగియుండవు – అని.

## 532. సత్యధర్మా

- తన ధర్మమును సత్యముగా (తప్పక) నిర్వర్తించువాడు.
- నిశ్చయంగా శరణాగతులను కాపాడువాడు.
- సకల కళ్యాణగుణములకు నిలయము.
- సత్యము ఆయన ధర్మము. తనను ఆశ్రయించినవారిని సత్యమైన మార్గంలో నడిపించేవాడు.
- జ్ఞాన బల ఐశ్వర్య వీర్య శక్తి తేజములనే షడ్గుణములు పరిపూర్ణముగా గలవాడు.

### ఓం సత్యధర్మణే నమః

**ఆప్తక్రమా ధాన్యప్రాప్తే రార్జవాత్ సత్యవర్తనః యస్యాత్ స సత్యధర్మా చ వస్వర్ణ స్సత్యధర్మదః** - ఆశ్రితులను మొదటినుండి చివరివరకు ఒకేరీతిగా నడిపించువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. సత్యధర్మమును ప్రసాదించును. ఓం సత్యధర్మణే నమః.

శ్రీ భట్టుల వివరణ – భక్తుడు భగవంతుని గురించి సేవా ధ్యానాదులు మొదలుపెట్టినప్పటినుండీ మోక్షము సాధించేవరకు వారిని విడువకుండా, క్రమం తప్పకుండా, నిశ్చయంగా వారికి తోడుండి నడిపించేవాడు. సత్యధర్ముడు. సాధు పరిత్రాణత, శరణాగత పరిత్రాణత – ఇవి రెండూ దేవదేవుని ధర్మాలు. వాటిని ఆయన సత్యంగా, నిస్సందేహంగా, నిశ్చయంగా ఆచరిస్తాడు.

శరణాగతి గద్యంలో భగవంతుడు తన గుణాలను (ధర్మాలను) శ్రీ రామానుజులకు ఇలా తెలియజేశాడు. **అనృతమ్ నోక్త పూర్వమ్ న చ వక్ష్యే కదాచన. రామో ద్విర్నాభి భాషతే.**

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే అభయం సర్వ భూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ** – రామాయణము

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకమ్ శరణం వ్రజ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః** – గీత

శరణాగతులను కాచుట శ్రీరామకృష్ణుని ధర్మము. ఇందులో సందేహం లేదు. తన ధర్మాన్ని ఆయన సత్యముగా నిర్వహించును.

శ్రీ శంకరాచార్యులు ఈ నామమునకు చెప్పిన అర్థము – జ్ఞాన బల ఐశ్వర్య వీర్య శక్తి తేజములనే షడ్గుణములు పరిపూర్ణముగా గలవాడు సత్యధర్ముడు.

శ్రీ చిన్మయానంద – సకల ధర్మములు శ్రీ వాసుదేవునియందు సర్వోత్తమ పరిపూర్ణములై నెలకొనియున్నవి. మరియు ఆత్మ దర్శన యోగమే పరమ ధర్మమని ఉపనిషత్తులలో చెప్పబడినది.

## 533. త్రివిక్రమః

- మూడు వేదాలలోను విస్తరించియున్నవాడు.
- మూడు అడుగులతో ముల్లోకములలోను విస్తరించియున్నవాడు.

- ముల్లోకములలోను అంతటా వ్యాపించినవాడు.
- మూడు అవస్థలు అతిక్రమించి తురీయావస్థ యందున్నవాడు.

## ఓం త్రివిక్రమాయ నమః

శ్రీ భట్టులు హరివంశము (279.50)నుండి చెప్పిన ప్రమాణము –

**త్రిరిత్యేవం త్రయో వేదాః కీర్తితః మునిసత్తమైః క్రమతే తాన్ తథా సర్వాన్ త్రివిక్రమ ఇతిస్మృతః -** త్ర-విక్రమ – ఇక్కడ 'త్రి' అనగామూడు వేదములని అర్థము. ఈ మూడు వేదములందు విస్తరించినందున శ్రీమన్నారాయణుడు త్రివిక్రముడు.

'త్రి' అను పదము మూడు లోకములను సూచించునని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. ముల్లోకములందును విస్తరించినవాడు ( అంతటా ఉన్నవాడు) త్రివిక్రముడు.

శ్రీ శంకరులే ఈ నామమును త్రివిక్రముడైన శ్రీవామనావతార పరముగా కూడా వివరించారు. **త్రయో విక్రమః త్రిషు లోకేషు క్రాంతా యస్య స త్రివిక్రమః.**ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన శ్రుతి ప్రమాణము – **త్రీణి పదా విచక్రమే** (తైత్తరీయ బ్రాహ్మణము 2.4.6).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ముల్లోకములలోను ప్రతి వస్తువునందు వ్యాపించియున్నవాడు త్రివిక్రముడు.

శ్రీ చిన్మయానందగారు పైనున్న హరివంశ శ్లోకమునే మరొక విధంగా వ్యాఖ్యానించారు. 'లోకము' అనగా ఆత్మ అనుభవించే పరిస్థితి (అవస్థ). జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనేవి మూడు అవస్థలు. ఈ మూడింటికి అతీతమైనది తురీయావస్థ. అది పరమాత్మకు సహజస్థితి. త్రివిక్రముడు తెలియవచ్చే లోకము.



శ్రీ త్రివిక్రమ మూర్తి. తమిళనాడు తిరునల్వేలి సమీపంలోని శ్రీ వైకుంఠనాథన్ పెరుమాళ్ దేవాలయం లోని శిల్పం.

Creative Commons Photo from Flickr – by Sowrirajan S



## మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః |
## త్రిపదస్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాంతకృత్ || (57)

### 534. మహర్షిః

మహర్షిః కపిలాచార్యః

- గొప్ప ఋషి, వేదద్రష్ట.
- గొప్ప ఋషియైన కపిల ముని.

ఓం మహర్షయే నమః

ఓం మహర్షయే కపిలాచార్యాయ నమః

శ్రీ పరాశరభట్టు 'మహర్షిః', 'కపిలాచార్యః' అనేవి రెండు నామములుగా పరిగణించారు. రెండు నామాలనూ కపిలావతార పరంగానే వ్యాఖ్యానించారు. శ్రీ శంకరులు కపిలాచార్యునికి 'మహర్షి' అని వర్ణనగా గ్రహించి 'మహర్షిః కపిలచార్యః' అనే ఒకే నామముగా వ్యాఖ్యానించారు.

కపిల మూర్తిగా భగవానుడు వేదములకు ద్రష్ట అయినందున 'మహర్షి' అని శ్రీ భట్టులు వివరించారు. **ఋషిర్దర్శనాత్** (నిరుక్తి 2.11. శ్రీ సత్యదేవో వాసిష్ఠ) మరియు అన్ని వేదములను పొల్లుపోకుండా పఠించినందున కూడా – **శ్రుతీర్గాద్యాః వక్త్రేభ్యః ప్రోద్గిరంతరమ్ అతః స్మరేత్** – మహర్షి. శ్రీ భట్టులు శ్వేతాశ్వరోపనిషత్తు (5.2)నుండి కూడా ప్రమాణం చెప్పారు. **ఋషిమ్ ప్రసూతమ్ కపిలం మహాంతమ్**. కపిలుడు జన్మనుండి మహాముని. **సాంఖ్యస్య వక్తా కపిలః పరమర్షిః స ఉచ్యతే**. సాఖ్య దర్శనము బోధించినందున కపిలుడు మహర్షి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – సమస్త వేదములకు ద్రష్టలైన మునులు మహర్షులు. అట్టి మహర్షులో తాను స్వయముగా కపిలాచార్యుడనని శ్రీకృష్ణ భగవానుడు గీత (10.26)లో చెప్పెను.

**అశ్వత్థః సర్వ వృక్షాణాం దేవర్షీణాం చ నారదః**
**గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః**

అర్జునా! వృక్షములలో అశ్వత్థ వృక్షమును నేను. దేవఋషులలో నారదుడను. గంధర్వులలో చిత్రరథుడను. సిద్ధులలో కపిలుడను.

దర్శనాలు మొత్తం ఆరు. పాణిని - వ్యాకరణము; జైమిని - పూర్వ మీమాంస; వ్యాసుడు - ఉత్తర మీమాంస; కపిలుడు - సాంఖ్యము; కణాదుడు - వైశేషికము; అక్షపాదుడు - తర్కము. **పాణినిర్జైమినిశ్చైవ వ్యాసశ్చ కపిలశ్చచ కణాద్యశ్చాక్షపాదశ్చ దర్శనాని షడైవహి.**

## 535. కపిలాచార్యః

- కపిల వర్ణము కలిగిన ఆచార్యుడు. కపిలశ్చా సౌ ఆచార్యశ్చ కపిలాచార్యః

### ఓం కపిలాచార్యాయ నమః

**కపిలశ్చా సౌ ఆచార్యశ్చఇతి కపిలాచార్యః.** చెట్టుయొక్క లోపలిభాగపు రంగును కపిల వర్ణమంటారు. ఇది పొగలేని జ్వాలయొక్క వర్ణము. కపిలాచార్యుడు ఈ రంగులో ఉండేవాడట. కపిలాచార్యుని స్మరించే మంత్రము – **నిర్ధూమాంగ వర్ణాభమ్ శంఖ పద్మాక్ష సూత్రిణమ్.** పొగ లేకుండా జ్వలించే నిప్పులవంటి వర్ణము కలిగినవాడు, చేతిలో శంఖ, పద్మముల పూసలు ధరించినవాడు. ఈ వర్ణన కపిలుని రంగుకు మాత్రమే కాక ప్రజ్వలించే అతని జ్ఞానమునకు కూడా అన్వయింపవచ్చును. **సంవిత్ ప్రకాశనాయ** – జ్ఞానమును ప్రకాశింపజేసినవాడు కపిలాచార్యుడు.

'ఆచార్య' పదానికి శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన చక్కని నిర్వచనం – **ఆచరతి స్వయం శిష్యేభ్యశ్చ ఆచారం గ్రాహయతి ఇతి ఆచార్యః.** సద్ధర్మమును స్వయముగా ఆచరించేవాడు, తన శిష్యులకు బోధించేవాడు ఆచార్యుడు.

## 536. కృతజ్ఞః

- తనపట్ల ఒనర్చిన సత్కార్యములను మాత్రమే గుర్తుంచుకొనేవాడు.
- సృష్టికర్త మరియు సృష్టి కూడ అయినవాడు.
- తాను సృజించిన అంతటినీ తెలిసినవాడు.

### ఓం కృతజ్ఞాయ నమః

ఈ పుణ్య నామము ఇంతకుముందు 9వ శ్లోకములో 83వ నామముగా కూడ స్మరింపబడినది.

9వ శ్లోకము. 83వ నామము. కృతజ్ఞః – **అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్**

57వ శ్లోకము. 536వ నామము. కృతజ్ఞః – **మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః**

83వ నామము 'కృతజ్ఞః'కు చెప్పిన భావములు –

- నామస్మరణము, శరణాగతి, పూజాది భక్తి కార్యక్రమములచే ప్రసన్నుడై భక్తులను అనుగ్రహించువాడు.
- పత్ర పుష్పాది అల్ప నివేదనలచేతనే సంతుష్టుడై, కామితార్థ మోక్షములను ప్రసాదించువాడు.
- సమస్త ప్రాణుల పుణ్య, అపుణ్య కర్మలనెరిగినవాడు.

ప్రస్తుత 536వ నామము వ్యాఖ్యలో శ్రీ భట్టులు తమ కపిల మహర్షి స్తుతిని కొనసాగించారు. శ్రీ శంకరులు 'కృతమ్-జ్ఞ' అనగా 'చేసినది తెలిసినవాడు' అన్న భావంలో ఈ నామును వివరించారు. **స్వాభి నమ్రత్వ సుకృతం కిమంశుమతాకృతమ్. విదితం యేన కారుణ్యాత్ కృతజ్ఞ సోఽభిధీయతే.** అంశుమంతుడు తనకు చేసిన సుకృతము (ప్రణామము, ప్రార్థన) తెలిసికొని కరుణతో అతని పినతండ్రులు (సగర పుత్రులు) తరించే మార్గమును బోధించి రక్షించినవాడు. భూమిపై గంగావతరణమునకు ఈ ఘట్టము నాందీవాక్యము. ఇక్ష్వాకు వంశ చరిత్రలో జరిగిన ఈ కథ – సగరుని యజ్ఞాశ్వాన్ని దొంగిలించి ఇంద్రుడు పాతాళంలో కపిలుని ఆశ్రమంలో ఉంచాడు. అశ్వాన్ని వెదుకుతూ పాతాళాన్ని చేరిన సగరుని కుమారులు అశ్వాన్ని కపిలుడే అపహరించాడని తలచి కపిలునిపై దూషించి, కొట్టబోయారు. కపిలుడు కనులు తెరువగానే సగర పుత్రులు భస్మమయ్యారు. అనంతరం సగరుని మనుమడు అంశుమంతుడు పాతాళం చేరి అశ్వాన్ని కనుగొని కపిలునికి వినమ్రతతో ప్రణామం చేసి ప్రార్థించాడు. కపిలుడు

ప్రసన్నుడై, అశ్వాన్ని ఇచ్చి సగరుని పుత్రులు (అంశుమంతుని పినతండ్రులు) తరించే మార్గం తెలిపాడు. **సుకృతమేవ జ్ఞాత్వాన్ ఇతి కృతజ్ఞః** – అని శ్రీ భట్టులు వివరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారం 'కృతమ్' అనగా భగవంతుని సృష్టి. 'జ్ఞ' అనగా తెలిసినవాడు లేదా ఆత్మ (సృజింపబడనిది). శ్రీహరియే సృష్టి మరియు స్రష్ట గనుక కృతజ్ఞుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **కృతమ్ జ్ఞానాతి ఇతి కృతజ్ఞః** – తన సృష్టి గురించి సమస్తమూ తెలిసినవాడు కృతజ్ఞుడు.

నామరూపాత్మకమైన విశాల విశ్వమునందలి అణువణువునందును నిమిత్త కారణముగాను, ఉపాదాన కారణముగాను వ్యాపించియున్నవాడు పరమాత్ముడు, కృతజ్ఞుడు (శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి).

## **537.** మేదినీపతిః

- భూమిని భరించేవాడు, రక్షించేవాడు, భర్త.

### ఓం మేదినీపతయే నమః

**కాపిలం రూపమాస్థాయ యో ధారయతి మేదినీమ్ స మేదినీ పతి ఖ్యాతో నవార్ణో భూప్రదో మనుః** - కపిల రూపము ధరించి భూమిని ధరించినవాడు మేదినీపతి. ఈ నామము నవాక్షరీ మంత్రము. భూమిని ప్రసాదించునది. ఓం మేదినీపతయే నమ.

సృష్టి సమయంలో భూమి జలాంతర్గతమై యుంది. అపుడు బ్రహ్మదేవుని ప్రార్థనను మన్నించి వాసుదేవుడు శ్రీ యజ్ఞవరాహమూర్తియై భూమిని ఉద్ధరించాడు. కపిలునిగా పాతాళమున ఉండి తన యోగశక్తితో భూమిని నిలుపుతున్నాడు. శ్రీ మద్రామాయణం బాలకాండ (1.40.2)లో ఇలా ఉంది –

**యస్యేయం వసుదాస్సర్వో వాసుదేవస్య ధీమతః**
**కాపిలం రూపమాస్థాయ ధారయత్యనిశం ధరామ్**
సమస్త భూమి వాసుదేవునిది. కపిలరూపం ధరించి ఆయన భూమిని ధరించుచున్నాడు.

శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (8.1.11)నుండి ఉదాహరించారు. **పెరియ అప్పన్, పిరమన్ అప్పన్, ఉరుత్తిర అప్పన్, మునివరక్కు ఉరియ అప్పన్, అమరార్ అప్పన, ఉలగుక్కోర్ తనియప్పన్....**

## **538.** త్రిపదః

- మూడు తత్వములను దర్శించినవాడు (కపిల ముని).
- మూడు శబ్దముల మిశ్రితమైన ప్రణవ స్వరూపమును దాల్చినవాడు.
- మూడు మూపులతో శోభిల్లిన శ్రీవరాహమూర్తి.
- మూడు అడుగులతో సర్వమును జయించిన శ్రీ త్రివిక్రముడు.
- భూత భవిష్యత్ వర్తమానములకు ప్రభువు.

### ఓం త్రిపదాయ నమః

మూడు తత్వములను దర్శించినవాడు గనుక త్రిపదుడని వివరిస్తూ శ్రీ భట్టులు పేర్కొన్న మూడు తత్వములు – ప్రధాన, పురుష, పరమాత్మ తత్వములు. వీటినే భోక్త, భాగ్యము, నియంత అని కూడా పేర్కొన్నారు.

ఇందుకు విష్ణుధర్మము (63.59)నుండి ఉదాహరించిన శ్లోకము –

**సత్వానాం ఉపకారాయ ప్రధానం పురుషం పరమ్**
**దర్శయిష్యామి లోకేషు కాపిలమ్ రూపమాస్థితః**

లోక కళ్యాణార్ధమై నేను కపిలావతారమును ధరించి, ప్రధాన, పురుష, పరమాత్మ తత్వములను బోధించెదను.

ఈ మూడు తత్వములూ భగవద్విశేష విభూతులే అని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు. ఒక రూపంలో ఈ లోకాన్ని రక్షిస్తాడు. మరొక రూపంలో లోకాన్ని రక్షించే దేవతలను రక్షిస్తాడు. మరొక రూపంలో లోక బంధాలకు అతీతుడైన శ్రీవైకుంఠనాధుడు.

శ్రీ పరాశరభట్టులే ఈ 'త్రిపదః' నామమునకు మరి రెండు భావాలను చెప్పారు –

**ప్రణవే త్రీని వాచ్యాని వాచకాని పదానివాచ** – 'అ', 'ఉ', 'మ' కారములచే ఏర్పడిన ప్రణవరూపములో మూడు పదములు కలవాడు త్రిపదుడు.

శ్రీవరాహమూర్తిగా అవతరించినపుడు మూడు మూపులు ధరించినవాడు త్రిపదుడు. **తవైవాహమ్ త్రిక-కుదో వారాహమ్ రూపమాస్థితః** (మహాభారతము. మోక్షపర్వము. 343.63).

**వారాహ రూపస్యాస్థానే సదాని కకుదానివా**
**యస్య సంతి హ్యసౌ నిత్యం త్రిపదః పరికీర్తితః.**

శ్రీ శంకరులు ఈ నామమును శ్రీవామనావతారపరంగా వ్యాఖ్యానించారు. తైత్తరీయ బ్రాహ్మణము (2.4.6)లో **'త్రీణి పదా విచక్రమే'** ప్రకారం **'త్రీణి పదాని యస్య సః త్రిపదః'** – అనగా మూడు అడుగులలో జగత్తును జయించినవాడు త్రిపదుడు. ఇలా త్రివిక్రముడు మూడడుగులలో ఏమి జయించాడో శ్రీ రాధాకృష్ణశాస్త్రి చక్కగా వివరించారు. మొదటి అడుగుతో శ్రీహరి సకల భువనాలనూ, అనగా మహాబలియొక్క స్థూల సంపదను ఆక్రమించాడు. రెండవ అడుగుతో శ్రీమన్నారాయణుడు మహాబలియొక్క సూక్ష్మ ఐశ్వర్యాలను ఆక్రమించాడు. సూక్ష్మ ఐశ్వర్యాలు అనగా అతడు (మహాబలి) తన సత్కర్మలద్వారా పొందగల స్వర్గాది భాగ్యములను, తరువాత పొందే ఉత్తమ జన్మలను కూడా హరించాడు. మూడవ అడుగుతో శ్రీవాసుదేవుడు మహాబలియొక్క అహంకార మమకారములను భస్మంచేసి పరమపదాన్ని ప్రసాదించాడు.

శ్రీరాధాకృష్ణశాస్త్రి చెప్పిన మరొక భావం – భూతకాలం, వర్తమానం, భవిష్యత్తులలో శ్రీనివాసుని పాదం (అధిపత్యం) ప్రకాశిస్తున్నది గనుక ఆయన త్రిపదుడు.

## 539. త్రిదశాధ్యక్షః

- బ్రహ్మాది దేవతలకు కూడ ఆపదలు సంభవించినపుడు కాపాడువాడు.
- ముప్పైమూడు దేవుళ్ళకు అధిపతి.
- మూడు అవస్థలకు ప్రభువు.
- మూడు గుణములకు ప్రభువు.

**ఓం త్రిదశాధ్యక్షాయ నమః**

**సఖాస్యా త్రిదశాధ్యక్ష బ్రహ్మాదేవ ప్రళయాపది.** ప్రళయంవంటి ఆపదలు సంభవించినపుడు బ్రహ్మాది దేవతలను కాపాడువాడు – అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ఇక్కడ 'త్రి-దశ' అనగా 'ముప్పై' అనే సంఖ్య '33'ను సూచించేదిగా పరిగణించవచ్చునని ప్రొఫెసర్ శ్రీనివాస రాఘవన్ భావించారు. అష్ట వసువులు (8), ఏకాదశ రుద్రులు (11), ద్వాదశాదిత్యులు (12) మరియు అశ్వినీ దేవతలు (2) – మొత్తం 33 దేవతలు. తిరుప్పావై (20)లో ముప్పదిమూడు దేవతల ప్రస్తావన ఉన్నది. **ముప్పత్తి మూవర్ అమరర్కు, మున్ సెన్ఱు కప్పమ్ తవిర్ క్కుమ్ కలి** – లోకములు జలమయమైనపుడు శ్రీమన్నారాయణుడు శ్రీవరాహమూర్తియై భూమిని ఉద్ధరించి బ్రహ్మసృష్టిని సాధ్యం చేశాడు – అని శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించారు.

శ్రీ శంకరాచార్యుల వివరణ – 'త్రి-దశ' – మూడు దశలకు అధిపతి గనుక శ్రీహరి త్రిదశాధ్యక్షుడు. ఇక్కడ మూడు దశలు (1) జాగ్రదవస్థ (2) స్వప్నావస్థ (3) సుషుప్త్యవస్థ.

'త్రి-దశ-అధ్యక్ష' అనే భావాన్ని శ్రీ చిన్మయానంద మరింత విస్తరించి చెప్పారు. మూడు గుణములను, అనగా (1) సత్వగుణము (2) రజోగుణము (3) తమోగుణములను తన అధీనములో ఉంచుకొన్నందున శ్రీమహావిష్ణువే త్రిదశాధ్యక్షుడు.

## 540. మహాశృంగః

- గొప్పకొమ్ము (శృంగము) కలిగిన శ్రీవరాహమూర్తి.
- గొప్ప కొమ్ము కలిగిన శ్రీమత్స్యావతారమూర్తి.

### ఓం మహాశృంగాయ నమః

ఈ పుణ్యనామమును శ్రీ భట్టులు వరాహావతార పరముగాను, శ్రీ శంకరులు మత్స్యావతార పరముగాను వ్యాఖ్యానించారు.

**మహీ యస్య చ శృంగాగ్రే మహాశృంగ స కథ్యతే** – కోర కొనయందు భూమిని ధరించిన శ్రీమన్నారాయణుడు మహాశృంగుడు. శ్రీమద్రామాయణము యుద్ధకాండ (120.14)లో **– ఏకశృంగో వరాహస్త్వం** – ఒక కొమ్ము కలిగిన శ్రీవరాహమూర్తివి నీవే – అని ఉన్నది. ప్రళయజలాంతర్గతయైన భూమిని శ్రీవరాహమూర్తి తన కొమ్ముతో పైకి ఉద్ధరించెను. అపుడు సరస్సులో ప్రవేశించిన గజరాజు దంతములపై మట్టి అంటుకొన్న పద్మము శోభిల్లినట్లుగా శ్రీవరాహమూర్తి కొమ్ముపై భూమి ప్రకాశించెను (విష్ణుపురాణము 1.4.36). మహోన్నతమైన శ్రీవరహాశృంగముపై చిన్న ఆహారపు తునక అంటుకొన్నట్లుగా ఆయన కొమ్ముపై భూమి ఆసీనయైనది (శ్రీమద్భాగవతము).



హైదరాబాదు మ్యూజియంలో శ్రీ లక్ష్మీవరాహస్వామి శిల్పం.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ప్రళయసాగరంలో సప్తర్షులను, సర్వబీజములను కలిగిన నావను తన కొమ్మునకు సంధించుకొని క్రీడించిన శ్రీమత్స్యావతారమూర్తి మహాశృంగుడు.

**శ్రీమన్నారాయణీయములో వరాహావతార స్తుతి –**

అభ్యుద్ధరన్నథ ధరాం దశనాగ్రలగ్న ముస్తాంకురాంకిత ఇవాధిక పీవరాత్మా
ఉద్ధూత ఘోర సలిలాజ్జలధే రుధంచన్ క్రీడా వరాహవపురీశ్వర పాహిరోగాత్

ఓ దేవా! మాయావరాహరూపంతో, కల్లోల సముద్రంనుండి సువిశాలమైన భూమితో నువ్వు బయటకు వచ్చే సమయంలో ఆ భూమి నీ కోర పైభాగాన అంటుకొనిన ఒక గడ్డిపరకలా కనబడింది. ఓ క్రీడావరాహధారీ! మహాశృంగా! గురువాయురప్పా! నా వేదనను తొలగించు. ఓం మహాశృంగాయ నమః.

**శ్రీమన్నారాయణీయములో మత్స్యావతార స్తుతి –**

ఝుషాకృతిం యోజన లక్షదీర్ఘాం దధాన ముచ్చైస్తర తేజసం త్వామ్
నిరీక్ష్య తుష్టా మునయస్త్వదుక్త్యా త్వత్తుంగ శృంగే తరణిం బబన్ధుః

ఆ ఋషులు లక్ష యోజనాల విస్తీర్ణంతో, అద్భుత తేజస్సుతో ఒప్పారుతున్న మత్స్యరూపంలోని నిన్ను దర్శించి మహదానందభరితులైనారు. నీ ఆదేశం మేరకు ఆ నావను నీ కొమ్మునకు గట్టిగా కట్టారు.

ఆకృష్ట నౌకో మునిమండలాయ ప్రదర్శయన విశ్వ జగద్విభాగాన్
సంస్తూయమానో నృవరేణ తేన జ్ఞానం పరం చోపదిశన్నచారీః

ఆ జలరాశిమీదుగా నావను లాగుకొనిపోతూ ఆ ముని బృందానికి లోకంలోని అన్ని ప్రాంతాలనూ చూపించావు. రాజర్షియైన ఆ సత్యవ్రతుడు నిన్ను స్తుతించసాగాడు. ఆ ప్రళయజలాల్లో అలా సంచరిస్తూనే నువ్వు అతడికి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించావు.

కల్పావధౌ సప్తమునీన్ పురోవత్ ప్రస్థాప్య సత్యవ్రత భూమి పం తమ్
వైవస్వతాఖ్యం మనుమా దధానః క్రోధాద్ధయగ్రీవ-మభిద్రుతోఽభూః

ప్రళయం ముగియగానే సప్తర్షులను మళ్ళీ వారి యథాస్థానాలలో నియమించి, సత్యవ్రతుని వైవస్వతుడనే మనువుగా నియుక్తుడిని చేశావు. ఆ తరువాత (అంతకు క్రితం బ్రహ్మ ముఖాలనుండి వేదాలను అపహరించిన) హయగ్రీవుడనే అసురునిపై ఆగ్రహోదగ్రుడవై దండెత్తావు.

స్వతుంగ శృంగ-క్షత వక్షసం తం నిపాత్య దైత్యం నిగమాన్ గృహీత్వా
విరించయే ప్రీత హృదే దదానః ప్రభంజనాగారపతేః ప్రపాయాః

ఆ విధంగా రాక్షసునితో యుద్ధం చేసి అతడి వక్షస్థలాన్ని నీ కొమ్ముతో చీల్చి, వేదాలను గ్రహించి, బ్రహ్మకు తిరిగి ఇచ్చి, ఆయనను ఆనందభరితుడిని చేసిన ఓ గురువాయూరు దేవా! ప్రసన్నుడవై నన్ను రక్షించు. ఓం మహాశృంగాయ నమః

1840 కాలానికి చెందిన శ్రీ మత్స్యావతార చిత్రం. మనువు, సప్తర్షులు నావలో ఉన్నారు. బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువునకు నమస్కరిస్తున్నారు. వికీపీడియా చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Matsya_and_Manu.jpg



## 541. కృతాంతకృత్

- హిరణ్యాక్షుని సంహరించినవాడు.
- మరణమును అంతము చేయువాడు.
- కృతాంతమును (సిద్ధాంతమును) ప్రకటించినవాడు.
- కార్యరూపమైన (వ్యక్తమైన) జగమును ప్రళయమున అంతము చేయువాడు.

### ఓం కృతాంతకృతే నమః



1600 కాలానికి చెందిన శ్రీ భూవరాహమూర్తి శిల్పం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File:Varaha,_the_Boar_Avatar_of_Vishnu_LACMA_M.87.160.2_(1_of_2).jpg

**అంతకాభం హిరణ్యాక్షం కృత్తవాऽన్యః కృతాంతకృత్ స్వ సిద్ధాంత కరత్వాద్వా స్వాఖ్య స్మృతి పురాణయోః కృతాంతకృదితి ఖ్యాతో వస్వర్ణోऽభీష్ట దాయకః -** మహాభయంకరుడైన హిరణ్యాక్షుని సంహరించినవాడు. వరాహస్మృతి, వరాహ పురాణాలతో తన సిద్ధాంతమును ప్రకటించినవాడు కృతాంతకృత్. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. భక్తుల కోరికలను తీరుస్తుంది. ఓం కృతాంతకృతే నమః

ఈ నామమును వివరిస్తూ భాష్యకారులు ఇలా చెప్పారు –

శ్రీ భట్టులు – **కృతాన్తమ్ కృత్వాన్ ఇతి కృతాన్తకృత్**

శ్రీ శంకరులు – **కృతాన్తమ్ మృత్యుమ్ కృన్తతి ఇతి కృతాన్తకృత్**

ఇద్దరూ చెప్పిన వ్యాఖ్యలకు ఒకేవిధమైన అర్థమును తీసికొనవచ్చును. 'కృతాంతుడు' అనగా యముడు. శ్రీ శంకరులు ఈ అర్థాన్ని యథాతథంగా గ్రహించి, మృత్యువును కూడా అంతము చేయువాడు 'కృతాంతకృత్' అని వివరించారు. సమస్తమును లయం చేసేటపుడు మృత్యుదేవత కూడా లయమౌతుందని ఒక భావం. శ్రీవాసుదేవుని శరణాగతులైనవారు జనన మరణ చక్రమును అధిగమించి మృత్యుంజయులౌతారని కూడా చెప్పవచ్చును.

శ్రీ భట్టులు చెప్పిన అర్థం – యమునివలె భీకరుడైన హిరణ్యాక్షుని సంహరించిన శ్రీవరాహమూర్తి కృతాన్తకృత్.

శ్రీ భట్టులు మరొక అర్థం కూడా చెప్పారు. 'కృతాంతము' అనగా సిద్ధాంతము. తనకు శరణాగతులైనవారిని తాను కరుణించి బ్రోచెదనన్న సిద్ధాంతమును ప్రకటించిన శ్రీహరి కృతాంతకృత్. ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ తిరుమంగయాళ్వారు పెరియతిరుమొళి (2.6.3)నుడి ఉదారించారు – శ్రీ వరాహావతారము జ్ఞానస్వరూపము.

శ్రీ శంకరులు కూడా మరొక అర్థాన్ని చెప్పారు **– కృత అంత కృత్ – కృతస్య అంతమ్ సంహారమ్ కరోతి ఇతి కృతాన్తకృత్ –** కృతమైన జగత్తును అంతము చేయువాడు కృతాన్తకృత్.

ధర్మచక్రము రచయిత – రైతు తన పంటను చివరికి నరికివేయడం ద్వారా అందరికీ మంచే చేస్తాడు. అలాగే శ్రీమన్నారాయణుడు తను సృజించిన లోకాలను తానే లయం చేసి జీవులకు మేలు చేస్తాడు.



మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ |
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః || (58)

**542.** మహావరాహః

గొప్ప వరాహ అవతారమును ధరించినవాడు

ఓం మహావరాహయ నమః

**రసాతల గతాముర్వీం యశ్చోద్ధృత్యోత్థితః క్షణాత్ మహావరాహ ఇతినః స్మృతోహ్యుర్వీప్రదో మనుః -** పాతాళానికి క్రుంగిపోయిన భూమిని తన కోరతో ఎత్తి లేపినవాడు మహావరాహమూర్తి. ఈ పుణ్య నామము భూలాభాన్ని అనుగ్రహిస్తుంది. ఓం మహావరాహాయ నమః.

శ్రీ భట్టులు విష్ణుపురాణంనుండి శ్రీ వరాహమూర్తి సౌందర్యాన్ని ఉట్టంకించారు (1.4.26) –

**తతః సముత్క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః స్ఫుటపద్మలోచనః**
**రసాతలాత్ ఉత్పలపత్ర సన్నిభః సముత్థితో నీల ఇవాచలో మహాన్**

పద్మలోచనుడై ప్రకాశించుచున్న శ్రీమహావరాహమూర్తి రసాతలమునుండి తన దంష్ట్రతో తామరాకును ఎత్తినట్లుగా ధరను పైకి లేవనెత్తెను. అలా భూదేవిని సముద్ధరించిన ఆ స్వామి గొప్ప నీలిరంగు కొండవలెనుండెను.

శ్రీ వరాహమూర్తి సౌందర్యము 'తిరుచ్చంద విరుత్తమ్' (45)లో కూడా వర్ణింపబడినది. శ్రీ చిన్మయానంద ఇంకా ఇలా చెప్పారు – ప్రళయకాలంలో అంతా జలమయమైంది. అనంతరం ఆ జలాలు తగ్గినపుడు ఏర్పడిన బురదనుండి భూమిని బయటకు తీయడంకొఱకు శ్రీమన్నారాయణుడు శ్రీవరాహావతారమును ధరించాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన అర్థము. మహా-వర-ఆహ = గొప్ప వరములు ప్రసాదించువాడు.

బ్రహ్మపురాణంలో యజ్ఞవరాహాన్ని గురించి బ్రహ్మ స్తుతి –

**యోऽసౌ చార్ణవ మధ్యస్థో నష్టే స్థావర జంగమే**
**నష్టే దేవాసురనరే ప్రనష్టోరుగ రాక్షసే**
**యోద్ధుకామౌ దురాధర్షౌ తావు భౌ మధుకైటభౌ**
**హతౌ భగవతా తేన తయోర్దత్వాऽమితం వరమ్**
.........
**పురాణం కథ్యతే యత్ర దేవ శ్రుతి సమాహితమ్**

వారాహస్తు శ్రుతిముఖః ప్రాదుర్భావో మహాత్మనః
యత్ర విష్ణుః సురశ్రేష్ఠో వారాహం రూపమాస్థితః
వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్తోఽశ్వినీ ముఖః
అగ్ని జిహ్వో దర్భ రోమా బ్రహ్మ శీర్షో మహాతపాః
..........
నానా ఛందోగతి పథో గుహ్యోపనిషదాసనః
ఛాయా పత్నీ సహాయోఽసౌ మణిశృంగ ఇవోత్థితః
మహీం సాగర పర్యంతా స శైలవనకాననామ్
ఏకార్ణవ జలభ్రష్టా మేకార్ణవ గతః ప్రభుః
దంష్ట్రయా యః సముద్ధృత్య లోకానాం హితకామ్యయా
సహస్ర శీర్షో లోకాదిశ్చకార జగతీం పునః
ఏవం యజ్ఞ వరాహేణ భూత్వా భూతహితార్థినా
ఉధృతా పృథ్వీ దేవీ సాగరాంబుధరాపురా

ఈ రకంగా యజ్ఞవరాహమూర్తి ఏకార్ణవమున మునిగిపోయిన భూమిని తన కోరలతో ఎత్తిపట్టి రక్షించాడు.

ఓం మహావరాహాయ నమః



తూర్పు యడవల్లిలో శ్రీవరాహమూర్తి శిల్పం.

## 543. గోవిందః

1) దేవతలచే ప్రస్తుతింపబడిన దేవదేవుడు.
2) ప్రళయ జలాంతర్గతయైన భూమిని పైకి ఉద్ధరించినవాడు.
3) గోవులను కాచేటి గోపాలుడు.
4) వేదములను ప్రసాదించినవాడు.
5) భూమిని (రాక్షసులనుండి?) రక్షించినవాడు.
6) వేదవాక్కులద్వారా తెలియదగినవాడు.
7) సకల చైతన్యము (చలనము)నకు కారకుడు.

### ఓం గోవిందాయ నమః

ఈ పుణ్యనామము 20వ శ్లోకములోకూడా ప్రస్తుతింపబడినది.

20వ శ్లోకము. 189వ నామము. గోవిందః – **అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః**

58వ శ్లోకము. 543వ నామము. గోవిందః – **మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ**

భక్తులందరూ ఇతనిని అనేకవిధాలుగా స్తుతించి ఆయన అనుగ్రహం సంపాదిస్తారు గనుక శ్రీహరిని 'గోవిందుడు' అంటారు. ప్రస్తుత శ్లోక వివరణ సందర్భములో శ్రీ భట్టులు (5)వ భావమును తెలిపియున్నారు. రాక్షసులనుండి భూమిని కాపాడినవాడు గోవిందుడు. ఇది (1)వ భావమునకు కొంచెం మార్పుగా భావింపవచ్చును. **నష్టాం చ ధరణీం పూర్వం గోవిందో య స్స లబ్ధవాన్.**

శ్రీ శంకరులు ఈ నామవివరణకు (6)వ భావమును చెప్పారు. **గోభిః వాణిభిః విందతే** – వేదవాక్యములద్వారా తెలియవచ్చువాడు గోవిందుడు. ఇందుకు ప్రమాణము విష్ణుతిలకమునుండి చెప్పారు – **గోభిరేవ యతో వేద్యో గోవిందః సముదాహృతః** – శృతివాక్యములద్వారా తెలియనగువాడవు గనుక నీవు గోవిందుడవు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారు (7)వ అర్థమును ఇలా తెలిపారు – **గామ్-గతౌ – గచ్ఛతి ఇతి గతౌ** – కదులునది; **విద్-లాభే** – ప్రాప్తించుట. కనుక **గామ్-విద్ – గోవిందః** – చలించువానికన్నింటికి అధిపత్యము (స్వంతము) కలిగినవాడు. ఇక్కడ చలనము అనగా సమస్త చైతన్యమును సూచించును. అట్టి చేతనత అంతయు గోవిందుడే. ఇదే భావము 'గోవిదాంపతిః' నామమునకు కూడ చెప్పారు.

## 544. సుషేణః

- శుద్ధసత్త్వమయములైన పంచమహాశక్తులు శరీరముగా కలిగినవాడు.
- శోభనములైన సైన్యములు కలిగినవాడు.

ఓం సుషేణాయ నమః

**శ్రీ వి.ఎన్. వేదాంతదేశికులు ఇలా చెప్పారు – ఈ నామము మొదలుకొని గుహ్యములైన, సామాన్య జ్ఞానమునకు అతీతమైన కొన్ని భావములు సూచితములు. వానిని ఆచార్యుల అనుగ్రహము చేతనే తెలిసికొనవలసియున్నదిగాని అవి గ్రంథరూపములుగా లభించవు. కనుక పుస్తక రూపములలో తెలిసే వివరణలు గూఢార్థములతో ఉండియుండును.**

ఇంకా శ్రీ వి.వి. రామానుజన్ ఇలా సెలవిచ్చారు – శ్రీరాముని తనతో అడవులకు యాగరక్షణార్థము పంపమని విశ్వామిత్రుడు దశరథుని సమ్మతింపజేసే ప్రయత్న సందర్భంలో **'అహం వేద్మి'** అన్నాడు. అనగా రాజు అయిన దశరథునికి తెలియని శ్రీరామశక్తి రాజర్షి అయిన తనకు తెలుసునని అన్నమాట. ఈ నామము, తరువాత వచ్చే మరికొన్ని నామములు విశ్వామిత్రుడు **'అహం వేద్మి'** (నాకు తెలియును) అని దేనిని గురించి అన్నాడో ఆ విషయాలకు సంబంధించినవి.

శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాస స్వామి)గారు రచించిన శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము (మందరము)లో ఈ 'అహం వేద్మి' గురించి శ్రీ వాసుదాసస్వామి ఇలా వివరించారు. (రామాయణము. బాలకాండము.)

**చాలం డని కలనిసికిఁ బసి**
**బాలుండని విడువు పుత్రుపై మోహంబున్**
**జాలరు బ్రతుకఁగ నీ సుతు**
**మ్రోల సురాహితులు శపథము న్వచియింతున్**

యుద్ధము చేయ శక్తుడు కాడని, పసి బాలుడని, నీ పుత్రునిపై మోహమును వదలిపెట్టుము. రాక్షసులు నీ కుమారుని యెదుట నిలువజాలరని ప్రమాణము చేసి చెప్పెదను.

**ఏనెఱుంగుదు రాజేంద్ర యీా మహాత్ము**
**రాము సత్యపరాక్రమోద్ధాము మఱి ప్ర**
**సిద్ధ తేజోధికుండు వసిష్ఠమునియు**
**నీ తపస్స్థితులెల్లరు నెఱుఁగువార**

సంసారిగా నుండు నేను నా పుత్రవ్యామోహమునెట్లు వదలుకొందును? నా పుత్రుని బలాబలములు నాకు తెలియకున్న నీకెట్లు తెలియునందువేమో, రాజా! శ్రీ రాముడు పేరుకు నీ కుమారుడే గాని లోకమునకు తండ్రి. లోకమునుద్ధరించుటకై పుట్టినవాడు కాని నీయింట

సుఖించుటకు పుట్టినవాడు కాడు. నీ కొడుకని నీ కీయన యందెంత ప్రీతి యున్నదో జగజ్జనకుడైన యీయనకు లోకముపైనంత ప్రీతి యున్నది. సత్యమెరుగక నీ కుమారుడేయని నీవు తలచెదవు. సత్యమెఱిగిన నాబోటులు భగవంతుడని చూచెదరు. కావున శ్రీరాముడు అందరి సొత్తు గాని, నీయొకని సొత్తు మాత్రమే కాదని విశ్వామిత్రుడు చెబుతున్నాడు.

రాజశ్రేష్ఠుడా! రజోగుణ ప్రధానుడైన నీవు సత్యమునెఱుగవు. సత్వగుణయుక్తుడనైన యోగీంద్రుడనైన నేను పరబ్రహ్మ స్వరూపమును తెలిసికొనదగినవాడను. **'జ్ఞానముం గప్పి యజ్ఞానంబు వెలయు, దానఁగదా జంతుతతులు మోహించు'** అన్నటులజ్ఞానముచే కప్పబడిన పామరుడవై, మోహపడెడి నీవెఱుగజాలవని భావము. **ఏను** = అనేక గురువుల సేవ జేసి జ్ఞానము సంపాదించుకొన్నవాడను. పరాపర తత్త్వయాథ్యాయమును నా యోగబలముచే ప్రత్యక్షముగా చూచువాడను. .... ... ఆయన గర్భమునందుండు వారము మేము. నీవో యీయన నీ గర్భమునందు జనించెనని గర్వించుచున్న వాడవు. యోగక్రమమెరిగినవాడను నేను. భోగక్రమమెరిగినవాడవు నీవు. ... .. నేను శ్రీరామచంద్రమూర్తి యెట్టివాడో యెఱుంగుదునుగాని, నీయింటనున్నంత మాత్రమున నాయన మహిమ నీవెఱుంగజాలవని భావము......

ఈ మహాత్మునెఱుంగుదును, అనగా ఈయనను మహాత్మునిగానే యెఱుంగుదును. **'వేదాహమేతం పురుషమ్మహాంత'**మ్మని శ్రుతి యట్లే యన్నది. ఈ పురుషసూక్త వాక్యమే రామాయణమున **'అహం వేద్మి మహాత్మానం'** అని చెప్పబడినది. కావున రెండు వాక్యములలోను చెప్పబడిన మహాత్ముడొక్కడే యనియు, ఆయన శ్రీ రామచంద్రమూర్తిగా నవతరించిన పురుషసూక్త వాచ్యుడగు భగవంతుడేయనియు యెఱుగనగును. .... 'మహాత్మునెఱుంగుదును' అనక 'ఎఱుంగుదు మహాత్ము' ననుట నిర్వికల్పమైన దృఢజ్ఞానమును ప్రకటించుటకే. మూలమునందు గల 'అహమ్' శబ్దమునకు శబ్దబ్రహ్మమైన విష్ణువుగా కొందరు అర్థమును చెబుతున్నారు. అ ఇ ఉణ్ ఇత్యాది వర్ణ సముదాయములో అకారము మొదటి అక్షరము. హల్ అని హకారము కడపటి అక్షరము. 'ము'ప్రత్యాహారముగా అహమ్మని ద్వితీయయందగు 'విష్ణువు' అని యర్థము.



శాపముక్తయైన అహల్య శ్రీరామునికి నమస్కరిస్తున్నది. 1600 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Ahalya_bows_to_Rama.jpg

శ్రీ భట్టులు 'సుషేణ' నామమును 'సు-సేన' అనగా 'మంచి సైన్యము కలిగినవాడు' అన్న భావములో వివరించారు. భగవానుడు శుద్ధసత్వ శరీర స్వరూపుడు. ఈ శుద్ధ సత్వములే శ్రీనివాసుని శుభకరములైన సైన్యములు. ఆ మంగళ సైన్యమే బద్ధులను, ముక్తులను, నిత్యులను జయించి పరమానందమును విజయముగా పంచియిచ్చును. మానవ శరీరము పంచభూతమయమైనట్లుగానే భగవానుని శరీరమునందలి శుద్ధసత్వములు – పంచహాశక్తులు – **పరమేష్ఠి, ప్రమాన్, విశ్వః, నివృత్తః, సర్వః** అనునవి. ఈ పంచహాశక్తులను ఉపనిషత్తుల ద్వారానే తెలిసికొనడం సాధ్యమవుతుంది. కనుకనే వీనిని పంచోపనిషత్తు మయములు అని కూడా అంటారు. అట్టి పంచమహాశక్తులు లేదా పంచోపనిషన్మయ ద్రవ్యములే శ్రీమహావిష్ణువుయొక్క 'సు-సేన'. కనుక ఆ దేవదేవుడు 'సు-షేణుడు'.

శ్రీ పి.బి. అణ్ణంగారాచార్య స్వామి – భగవంతుడు తన భక్తులను వశపరచుకోవడానికి బహువిధములైన సైన్యములను (ఉపాయములను, ఉపకరణములను) కలిగియున్నాడు గనుక సుషేణుడు.

తిరువైమోళి (3.1.9)లో శ్రీ నమ్మాళ్వారు భగవంతుని గుణములే ఆయన బలములు (సైన్యములు) అని చెప్పినారని శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించారు. భగవానుని దివ్యలీలావిశేషములే ఆయన సేనలు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – మహోజ్వలములైన సైన్యమునకు అధిపతి గనుక శ్రీహరి సుషేణుడు. ఈ సైన్యము గురించి శ్రీ రాధాకృష్ణశాస్త్రి 9 గణములుగా ఇలా చెప్పారు – 12 ఆదిత్యులు, 10 విశ్వేదేవతలు, 8 వసువులు, 26 తుషితులు, 64 అభాస్వరులు, 49 మరుత్తులు, 30 మహారాజికులు, 12 సాధ్యులు, 11 రుద్రులు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమును 'సి-బంధనే-బంధించుట' అన్న ధాతువు ఆధారంగా వివరించారు. అన్నింటినీ చక్కగా బంధించేవాడు (కూర్చేవాడు) సుషేణుడు. శరీరమును, ప్రాణమును, గుణములను భగవంతుడే బంధిస్తున్నాడు. ఇందుకు శృతిప్రమాణములు (యజుర్వేదము) –

**అయముపర్వాగ్ వసుస్తస్య సేన జీచా సుషేణశ్చ** (15.19)
**సత్య జిచ్చ సేన జిచ్చ సుషేణశ్చ** (17.83)

## 545. కనకాంగదీ

- బంగారు భుజకీర్తులు, హస్తాభరణములతో నొప్పువాడు.
- దివ్యమైన కంకణములు, ఆభరణములు ధరించినవాడు.

ఓం కనకాంగదయే నమః

ఓం కనకాంగదినే నమః

**కనకాని అంగదాని అస్య సంతీతి కనకాంగదీ.** బంగారముతో చేసిన ఆభరణములు గలవాడు కనకాంగది. 'కనకము' అనగా బంగారము. కాని ఇక్కడ బంగారము అనగా లోహము అని కాక దివ్యమైన, శుద్ధ సత్వ తేజోమయములైన ఆభరణములు అని గ్రహింపవలెను. 'అంగదములు' అనగా సకల తిరు ఆభరణములు. **అప్రాకృతాని దివ్యాని భూషణాని నిత్యశః రత్నానివంతి యస్యాఽసౌ సోచ్యతే కనకాంగదీ**

'అంతరాదిత్య'లో భగవానుని సువర్ణతేజోమయునిగా వర్ణించారు. **అంతరాదిత్యే హిరణ్మయః పురుషః దృశ్యతే.** శ్రీ నమ్మాళువారు తిరువిరత్తమ్ లో ఇలా వర్ణించారు – **మాణిక్కమే! ఎన్ మరకతమే! మఱ్ఱొప్పారియల్లా ఆనిప్పొన్నే!**

శ్రీ భట్టులు ఇంకా ఇలా చెప్పారు. **నిత్యయోగే ఇనిః.** ఈ నామము చివరిలో ఉన్న 'ఇణీ' ద్వారా భగవానుని 'తిరుమేణి' యొక్క ప్రకాశము సూచితమైనది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కనక-అంగ-ద – కనక-ప్రకాశము; అంగ-చలనము (చైతన్యము); ద-ఇచ్చువాడు. అందరికీ ప్రకాశమానమైన చైతన్యము ప్రసాదించువాడు కనకాంగది.

## 546. గుహ్యః

- తెలియరానివాడు. రహస్యముగానుండు శుద్ధసత్వమూర్తి.
- అతి రహస్యములైన ఉపనిషత్తులద్వారానే తెలియవచ్చువాడు.

- హృదయమనెడు గుహయందు రహస్యముగానున్నవాడు.

### ఓం గుహ్యాయ నమః

శుద్ధసత్వ దివ్య శరీరధారియైనందున శ్రీహరిని ఎవ్వరును కనుగొనలేరు. ఆయనది పాంచభౌతిక దేహము కాదు. దివ్యాత్మ స్వరూపము. కనుక (ఉపనిషత్తుల జ్ఞానము లేనివారికి) అది గుహ్యము. నమ్మాళ్వారు తిరువైమొళి (3.4.9)లో ఇలా అన్నారు – జగములన్నింటినీ మ్రింగివేసి వాటిని మరల సృజించిన ఈ ఎంపెరుమాన్ స్వభావం నాకు తెలియరావడంలేదు.

శ్రీ శంకరులు ఈ నామానికి రెండు భావాలు చెప్పారు –

1. **రహస్య ఉపనిషద్వేద్యతాత్.** ఉపనిషత్తులలోని రహస్యవాక్యములద్వారా తెలియవచ్చువాడు.

2. **గుహాయాం హృదయాకాశే నిహిత ఇతి వా.** హృదయము అనెడి గుహాంతరమున ఉన్నందున.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – పంచేంద్రియముల అనుభూతి ద్వారా శ్రీ వాసుదేవుని తెలిసికొనుట అసాధ్యము. భక్తియుతమైన ధ్యానయోగాదులద్వారా ఆయన కానవచ్చును. అంతే కాకుండా ఒకరు మరొకరికి శ్రీనివాసుని చూపుట జరుగదు. ఎవరికివారే హృదయాంతరాళంలో పరిశోధించి ఆయనను తెలిసికొనే ప్రయత్నం చేయాలి.

**ఇతరులకు నినునెరుగ తరమా ఇందిరా రమణా!** (అన్నమయ్య)

## 547. గభీరః

- తెలియరాని, అందరాని మహాగాంభీర్యము కలవాడు.

### ఓం గభీరాయ నమః

**మహాగాంభీర్య యుక్తత్వాత్ గభీర ఇతి కథ్యతే.** మిక్కిలి లోతైన, స్వచ్ఛమైన నీరు అసలు లోతులేనట్లు కనిపించును. అలాగే భగవానుని శుద్ధషడ్గుణ పరిపూర్ణత్వము కారణముగా – జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజస్సుల సంపూర్ణత వలన – ఆయన ఎంతటివాడో తెలిసికొనుట అసాధ్యం. ఏ విధమైన ఇతర పదార్ధములు లేని స్వచ్ఛమైన ఆకాశం ఎంత దూరం విస్తరించి ఉందో అంచనా వేయడం అసాధ్యం కదా!



శ్రీ లక్ష్మీ దేవి, బ్రహ్మ సేవిస్తూండగా అనంతశాయి అయిన శ్రీమహావిష్ణువు. – హిమాచల్ ప్రదేశ్ కు చెందిన 1690 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.

ఒక్కమారు శ్రీమన్నారాయణుని ధ్యానించినంతనే జన్మ జన్మాంతర పాపములు పటాపంచలవుతాయి. తరింపరానిదని అనిపించే సంసారబంధనం నుండి ముక్తి లభిస్తుంది. చిన్న స్పర్శతో మహాసాగరంలోని నీరంతా ఒక్కమారు స్వచ్ఛమయినట్లయితే అటువంటి స్పర్శనొసగేవాని గాంభీర్యము ఊహించతరమా!

అచ్యుతా, అనంతా, కేశవా, మాధవా, శ్రీధరా, వసుదా, వసుప్రదా, వసుప్రదా, వాసుదేవా, సంకర్షణా, ప్రద్యుమ్నా, అనిరుద్ధా, వంశవర్ధనా, క్షేత్రజ్ఞా, సమీహనా, శ్రీసీతారామచంద్రా, గోవిందా, గోపాలా, వెంకటరమణా, గురువాయురప్పా, లక్ష్మీనారసింహా, శ్రీవరాహమూర్తీ, త్రివిక్రమా, శ్రీనివాసా, శ్రీ వేంకటేశా, గభీరా నమోనమః.

**548.** గహనః

- దురవగాహ్యమైన, దుష్ప్రవేశ్యమైన వాడు. తెలియరానివాడు, చొరరానివాడు, చేరరానివాడు.
- అన్నింటినీ అవలోకించుచున్నవాడు.

ఓం గహనాయ నమః

ఈ నామము 384వ నామముగా 41వ శ్లోకములోకూడ చెప్పబడినది.

41వ శ్లోకము. 384వ నామము. గహనః – **కరణమ్ కారణమ్ కర్తా వికర్తా గహనో గుహః**

58వ శ్లోకము. 548వ నామము. గహనః – **గుహ్యో గభీరో గహనో గుప్తః చక్రగదాధరః**

ఈ రెండు చోట్లా (384వ, 548వ నామములకు) చెప్పిన అర్థాలు ఇంచుమించు ఒకే భావంతో ఉన్నాయి. 'గహనము' అనగా 'అడవి' లేదా 'కోట' వంటిది. వాటిలో ప్రవేశించుట కష్టము. భగవానుని తత్వము కూడా అలాంటిదే. అమరకోశం వ్యాఖ్యంలో శ్రీ అప్పయార్య **'గహనమ్ దుష్ప్రవేశ స్థానమ్'** అని చెప్పారు. ఈ నామాన్ని వివరిస్తూ శ్రీ భట్టులు 'దురవగాహ్యత' అనే పదాన్ని, శ్రీ శంకరులు 'దుష్ప్రవేశత్వము' అనే పదాన్ని వాడారు. రెండూ ఇంచుమించు ఒకే భావాన్ని సూచిస్తున్నాయి.

సముద్రంలో స్వచ్ఛమైన నీరు ఉంటే గనుక, దాని అడుగు స్పష్టంగా కనుపించవచ్చును గాని, అక్కడికి చేరడం సులభం కాదు. భగవంతుడు **'అప్రాప్య మనసా సహ'** అని శ్రుతివాక్యము. ఉపనిషత్తులు ఎంత వివరంగా తెలిపినాగాని శ్రీనివాసుని తత్వము మనకు తెలియరాదు. శ్రీ వేంకటేశ్వరుని దివ్యమంగళవిగ్రహము కనులపండువుగా ఎదుటనున్నాగాని ఆయనపై మనసు నిలువదు. ఉండేది రాముడొకడేయని భక్తులు సెలవిచ్చినాగాని చిత్తము మోక్షకామి గాదు. ఎందుకంటే శ్రీమన్నారాయణుడు గహనుడు.

'గహనః' శబ్దమునకు మరొక అర్థము – 'గాహూ - విలోడనే - లోపలికి మునిగి చేరుట'. అన్న మూలమునుండి చెప్పబడింది. శ్రీవాసుదేవుడు మూడు అవస్థలందును (జాగ్రత్, స్వప్న, సుషుమ్న స్థితులు) మనతోనే ఉండి సకలమును చూచుచుండును (శ్రీ శంకరులు). కాని ఆయనను చేరుకోవడం మనకు సాధ్యం కాదు.

**549.** గుప్తః

- గోప్యముగానున్నవాడు.
- మనసునకు, మాటలకు అగోచరుడు.

ఓం గుప్తాయ నమః

'గుప్-రక్షణే' – అన్న ధాతువునుండి – గోప్యముగానున్నవాడు. అనగా అందుబాటులో లేకుండ కావలివారిచే రక్షింపబడుచున్నవాడు గుప్తుడు. **అన్యైః దురవబోధో యః గుప్త ఇత్యభిధీయతే.** అయనగురించి ఇతరులెరుగరు. ఆయన తత్వమెరిగిన పూజ్యులైన పూర్వాచార్యులు అట్టి జ్ఞానమును గోప్యముగానుంచిరి. భక్తితో, శ్రద్ధతో వారికి ప్రపత్తి చేసి, అట్టి పూర్వాచార్యుల అనుగ్రహముతో శ్రీవాసుదేవుని గురించి తెలిసికొననగును – అని శ్రీ భట్టులు వివరించారు. ఉపనిషత్తులు కూడా ఆయనను పూర్తిగా తెలుపలేవు. **అహం వేద్మి మహాత్మానం** – అన్న విశ్వామిత్రునివంటివారు శ్రీరాముని తత్వమునెఱుగుదురు. **ఇతరులకు నిననెఱుగ తరమా ఇందిరా రమణా!**.

మరొక విధముగా – అనంతుడు, విష్వక్సేనుడు, గరుత్మంతుడు వంటి శ్రీవారి సేవకులు అయనను సదా పరివేష్ఠించియుండగా శ్రీనివాసుని సన్నిధి లభించుట సులభము కాదు. కనుక ఆయన గుప్తముగా నున్నవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అవాఙ్మనస అగోచరత్వాత్ గుప్తః.** అంతా శ్రీమహావిష్ణువే అయినా ఆయన ఉనికి తెలియరాదు. **ఏష సర్వేషు భూతేషు గూఢః ఆత్మాన ప్రకాశతే** – అని కఠోపనిషత్తు (3.12)లో ఉంది. **యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ** – అని తైత్తరీయోపనిషత్తు బ్రహ్మవల్లి (4)లో ఉంది.

**నాహం ప్రకాశ సర్వస్య యోగమాయా సమావృతః**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్** – గీత
నా యోగమాయయందు దాగియున్న నేను అందరికిని గోచరింపను. కనుక అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలిసికొనలేరు.

## **550.** చక్రగదాధరః

- చక్ర గదాది దివ్యాయుధములను ధరించినవాడు.

### ఓం చక్రగదాధరాయ నమః

**యశ్శక్తిమద్భిస్వహేతిః సస్వ్యః చక్రగదాధరః** – సామర్థ్యముగల చక్రము, గద మొదలగు దివ్యాయుధములను ధరించినవాడు చక్రగదాధరుడు. దివ్య భూషణములు ధరించినట్లే, దివ్యాయుధములను ధరించినవాడు శంఖచక్రగదాధరుడు. ఈ నామము యుద్ధకాండము (114)లో చెప్పబడినది. **తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః**

**మనస్తత్వాత్మకం చక్రం బుద్ధి తత్త్వాత్మకం గదాం ధారయన్ లోకరక్షణార్థముక్తశ్చక్రగదాధరః** - మనస్సు తత్వముగల చక్రమును, బుద్ధి తత్వము గల గదను లోకరక్షణ కొఱకు ధరించినవాడు చక్రగదాధరుడు.

ఈ పుణ్యనామమునకు సామాన్యమైన అర్థము – చక్రమును, గదను ధరించినవాడు. అయితే పంచమహాయుధములను మరింత లోతుగా అర్థం చేసుకోవాలని శ్రీ ఎమ్.వి. రామానుజాచార్య వివరించారు. ఇవి సృష్టి, స్థితి, సంహారము, నిగ్రహము, అనుగ్రహము అనే ఐదు మహాశక్తుల మూర్తీభవించిన రూపములు. ఈ పంచాయుధములు పంచమహాకృత్యములను నిర్వహించే ఉపకరణములు. ఇంకా శ్రీ వి.వి. రామానుజన్ ఇల చెప్పారు – ఈ పంచ దివ్యాయుధములు నిత్యసూరులైన సుదర్శనాళ్వారు, పాంచజన్యాళ్వారు ఇత్యాదులే.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి విష్ణుపురాణం (1.22.69-74)నుండి ఉదాహరిస్తూ, పంచాయుధములు ఐదు తత్వములను సూచించునని వివరించారు. భగవంతుడు రాజస అహంకారమును, మానస అహంకారమును పంచభూతాలలోను, పంచేంద్రియ జ్ఞానాలలోను ఇమిడ్చాడు. ఇవి రెండును శంఖము (పాంచజన్యము) మరియు ధనుస్సు (శార్ఙ్గము) ద్వారా సూచితములు. మనసు తత్వమునకు చక్రము (సుదర్శనము) సూచిక. ఎందుకంటే మనసులోని ఆలోచనలు గాలికంటే వేగంగా పయనించే ఆయుధాలు. గద (కౌమోదకి) బుద్ధి తత్వము గలది. ఈ దివ్యనామములో ప్రస్తుతింపబడిన 'చక్రగదాధరుడు' ఒకచేత మనస్సును, మరొకచేత బుద్ధిని ధరించిన శ్రీమహావిష్ణువు. ఆయన ఖడ్గము (నందకము) విద్యాజ్ఞానములకు ప్రతీక.

శ్రీ విష్ణుపురాణములోని శ్లోకాలకు మరింత విశాలమయిన అర్థం చెప్పాలంటే – భగవంతుడు సమస్తమునకు నిలయము. ఆత్మ, ప్రకృతి, బుద్ధి, అహంకారము, భూతములు, ఇంద్రియములు, మనసు, మాయ, జ్ఞానము – అన్నీ ఆ పరమాత్మునియందే నెలకొన్నవి. జ్ఞానము, అజ్ఞానము, ఉన్నది, లేనిది, శాశ్వతము, క్షణికము ఆయనయందే ఆవహించియున్నవి. శ్రీమన్నారాయణుడే కాలము, భూమి, ఆకాశము, స్వర్గము – అంతాను. విష్ణుపురాణంలోని విశ్వరూపవర్ణనలో ఇది మరింత చక్కగా తెలుపబడింది.



## వేధాస్స్వాంగోऽజితః కృష్ణో దృఢస్సంకర్షణోऽచ్యుతః |
## వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః || (59)

### 551. వేధాః

- మహావైభవ కళ్యాణ మంగళములను ప్రసాదించువాడు.
- అమిత వైభవ శుభములను కలుగజేయువాడు.
- సృష్టిని చేయు విధాత.

**ఓం వేధసే నమః**

**మహావిభవ కళ్యాణ సతతం విదధాతి యః భక్తేభ్యః పరమం వేధాః షడర్ణో మంగళప్రదః -** తన భక్తులకు ఎల్లప్పుడూ మహావైభవమైన మంగళములు సమకూర్చువాడు. ఈ నామము షడక్షరి. మంగళప్రదము. ఓం వేధసే నమః

**విదధాతి ఇతి వేధాః.** అనంత వివిధ వైభవములను ప్రసాదించువాడు – అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **విదధాతి కామాన్ స్వజనానామ్ ఇతి వేధాః** – అని వివరిస్తూ, కఠోపనిషత్తు (2.2.13)నుండి ఉదాహరించినది – **ఏకో బహూనామ్ విదధాతి కామాన్.**

శ్రీ పి.బి.అణ్ణంగారాచార్య స్వామి రెండవ భావమును (చేసేవాడు అని) చెప్పారు. వైభవ మంగళములను చేయువాడు 'వేధాః'.

శ్రీ శంకరుల భాష్యము – **విదధాతి సృజతి ఇతి వేధాః** – అని శ్రీ శంకరులు చెప్పారు. **స్రష్టా ప్రజాపతిః వేధా విధాతా విశ్వసృడ్విధిః** (అమరకోశం 1,17). అనగా సృజించేవాడు 'వేధాః'.

### 552. స్వాంగః

- ఛత్ర చామరాది సార్వభౌమ లక్షణములు స్వయంగా (స్వతహాగా) కలిగినవాడు. జగదీశ్వరుడు గనుక.
- సృష్టికి ఉపాదాన కారణము మరియు నిమిత్తకారణము కూడ ఆయనే.
- సుందరములైన అవయవములతో శోభిల్లువాడు.
- తానే విశ్వరూపుడై విశ్వమును స్వయముగా చలింపజేయువాడు.

**ఓం స్వాంగాయ నమః**

**స్వా సాధారణ మంగం హి ఛత్రాది పరిబర్హణమ్ యస్యాస్తి నిత్యం స స్వాంగః షడర్ణః పరివారదః** - ఛత్రచామరాదులు సార్వభౌమత్వానికి చిహ్నములు. శ్రీమహావిష్ణువు సకల జగములకు చక్రవర్తి గనుక అట్టి ఛత్రచామరాదులు ధరించి శోభిల్లుతున్నాడు.

ఈ దివ్యనామము షడక్షరి. పరివారాన్నిస్తుంది. **ఓం స్వాంగాయ నమః**. భగవానుడు ధరించే ఛత్రచామరాదులు దివ్యమైనవి, అనితరములు, స్వసిద్ధములు (మరొకరు ఇచ్చినవి కావు). ఈ భావమును శ్రీకృష్ణదత్త భరద్వాజ ఇలా వివరించారు – **స్వాన్యతే శబ్ద్యంతే సుకృతిభిరితి స్వాని తదృశాని అంగాని యస్య ఇతి స్వాంగః**

శ్రీ శంకరుల భాష్యము – **స్వయమేవ కార్యస్య కరణే అంగం సహ కరోతి ఇతి స్వాంగః.** సృష్టి స్థితి లయాది కార్యములు చేయడానికి శ్రీమన్నారాయణునికి తానే సాధనము. ఏ పనైనా చేయడానికి ఉపాదానము (సాధనం), నిమిత్తం (చేసేవాడు) అనే రెండు కారణాలు ఉంటాయి. కాని శ్రీమన్నారాయణుడే తనంత తానే మరెట్టి ఇతర సాధనములు (అంగములు) అవుసరం లేకుండా సర్వకార్యనిర్వహణము సాగించును.

శ్రీ చిన్మయానంద – చక్కని అంగములతో శోభిల్లువాడు గనుక భగవానుడు 'స్వాంగః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అంగ్-చలించుట (అగి, గత్యర్థక ధాతు)నుండి – సృష్టిలో సకల చైతన్య చలనములు ఇతర శక్తి సహాయములతో జరుగుచున్నవి. కాని శ్రీహరికి ఆయనే సర్వశక్తి.

ధర్మచక్రము రచయిత – తనకు తానే సహాయము చేయువాడు 'స్వాంగః'. ఈ నామమును గుర్తుంచుకొని, ధ్యానము చేయునపుడు మరే సహాయము అవుసరము లేదని గ్రహింపవలెను.

ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పర మామ్నాయములెల్ల వంది గణమై బ్రహ్మాండమాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీ గంగ సత్పుత్రియై
వరుసన్నీ ఘన రాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా

## 553. అజితః

- ఎన్నడును అపజయము పొందనివాడు. జయింపరానివాడు.
- అజిత (వైకుంఠ) పురము గలవాడు.
- ఆరవ మన్వంతరములో 'అజితుడు' అనే అంశావతారము ధరించి క్షీరసాగరమథనంలో సహాయపడెను.
- తనను ఆశ్రయించినవారిని కాపాడుట అనే ధర్మమును నిర్వర్తించుటలో ఎన్నడూ విఫలం కానివాడు.

### ఓం అజితాయ నమః

**ప్రాకృతైర్నజితాయ సా యస్యాస్త్యజితాపురీ అజితస్తేన విజ్ఞేయః సప్తార్ణో ముక్తిదో మనుః** – ప్రాకృత పురుషులకు అజేయమైన 'అజిత' అనే పట్టణము (వైకుంఠము) కలవాడు. ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. మోక్షదాయకము. ఓం అజితాయ నమః. **పురం హిరణ్మయీం బ్రహ్మ వివేశాపరాజితా** – సువర్ణమయమైన అపరాజిత అనే పట్టణంలో పరబ్రహ్మమున్నది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – అజిత, అపరాజిత అనే పేర్లు కూడా వైకుంఠానికున్నాయి. శ్రీవైకుంఠనాధుడైనందున శ్రీనివాసుడు అజితుడనబడుచున్నాడు. భగవానుని స్థానమైన వైకుంఠము మరియు భగవానుడు సంపూర్ణ శుద్ధ సత్వమయములు గనుక జనన, పరిణామ, మరణాది భౌతికధర్మములు అక్కడ చెల్లవు.

శ్రీ వి.వి. రామానుజన్ రామాయణము యుద్ధకాండము (120.16) నుండి ఉదాహరించారు – **అజితః ఖడ్గధృగ్ విష్ణుః కృష్ణశ్చైవ బృహద్బలః.** ఇక్కడ, శరణాగత త్రాణ ధర్మ నిర్వహణమయందు శ్రీరాముడు ఎన్నడును జయింపబడడు – అని శ్రీ పి.ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ వివరణ.

శ్రీ శంకరుల వ్యాఖ్య - **న జితః ఇతి అజితః** – ఎన్నడును, ఇంతకు ముందు మరియు ఇంకముందు కూడ, జయింపబడనివాడు గనుక అజితుడు. **న జితః కేనాపి త్రిభువనే ఇతి అజితః** – అని శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరించారు.

ధర్మచక్రము రచయిత – శ్రీమన్నారాయణుడు సత్యస్వరూపుడు, ధర్మస్వరూపుడు. సత్య ధర్మములకు ఎన్నడును పరాజయము లేదు. అలాగే శ్రీమన్నారాయణుడు అజితుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భాగవతంలో క్షీరసాగర మథన కథా సందర్భంలో శ్రీకూర్మావతారము గురించి చెప్పబడింది. అప్పుడు శ్రీమహావిష్ణువే అజితునిగా వచ్చి దేవదానవులకు సహకరించాడు (8.5.9). **తత్రాపి దేవః సంభూత్యామ్ వైరాజస్య అభవత్ సుతః అజితో నామ భగవానంశేన జగతః పతిః.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సమానుల మధ్యనే గెలవడం, ఓడడం అనే విషయాలుంటాయి. శ్రీమహావిష్ణువునకు పోలికైనవారు సకల జగత్తులోను లేరు. శ్రీమహావిష్ణువును జయించడం అనే ప్రశ్నే లేదు. అందువలన శ్రీమహావిష్ణువు అజితుడు.

## 554. కృష్ణః

- సచ్చిదానంద క్రీడామూర్తి.
- నల్లని వర్ణము గలవాడు.
- తన అనంత కళ్యాణ గుణములతో భక్తులను ఆకర్షించువాడు.
- నాగలిగా భూమిని దున్ని జీవసమృద్ధి కలిగించువాడు.
- కృష్ణద్వైపాయనుడైన వేదవ్యాసుడు.
- వ్యాసుడై వేదములను విభజించి భక్తుల మనోవ్యవసాయము సాగించి జ్ఞానోత్పత్తిని కలిగించినవాడు.
- కానరాని, తెలియరాని, తెలియజాలని, అందరానివాడు. సంపూర్ణ భక్తికి మాత్రమే లభ్యమైనవాడు.



వికీపీడియా చిత్రం. బిల్వమంగళుని బాలగోపాలస్తుతి గ్రంథంలో ఒక పుట. (కాలం: 1226?)
https://commons.wikimedia.org/wiki/File:Bilvamangala%27s_Balagopalastuti;_detail_of_folio_2_verso_Wellcome_L0031371.jpg

### ఓం కృష్ణాయ నమః

ఈ నామము 7వ, 59వ శ్లోకములలో స్తుతింపబడినది.

7వ శ్లోకము. 58వ నామము. కృష్ణః – **అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః**

59వ శ్లోకము. 554వ నామము. కృష్ణః – **వేధాః స్వాంగోఽజితః కృష్ణో దృఢః సంకర్షణోఽచ్యుతః**

ఈ రెండు సందర్భాలలోను ప్రధాన భాష్యకారుల వివరణ ఇలా ఉంది.

**58వ నామము. కృష్ణః**

శ్రీ శంకరులు – నిరతిశయమైన ఆనందము, అప్రమేయమైన అస్తిత్వము – ఈ రెండింటి సమ్మేళనము కృష్ణుడు.

శ్రీ భట్టులు – శాశ్వతము, అవిచ్ఛిన్నము అయిన క్రీడావినోదముచే సదా ఆనందమునకు నెలవైనవాడు కృష్ణుడు.

**554వ నామము. కృష్ణః**

శ్రీ శంకరులు – కృష్ణద్వైపాయనుడైన వేదవ్యాసుడు కృష్ణుడు.

శ్రీ భట్టులు – నల్లని వర్ణము కలిగినవాడు కృష్ణుడు.

నల్లనివాడు కృష్ణుడు – అన్న శ్రీ భట్టుల వ్యాఖ్య గురించి – భగవంతుడు శుద్ధ సత్వ స్వరూపుడు (పాంచభౌతిక దేహి కాడు.). కనుక ఆయన రంగు నలుపుగా లేక నీలమేఘఛాయలో ప్రకాశించు అద్భుత వర్ణము. ఉనాది వ్యాకరణము సూత్రము (3.4) ప్రకారము 'కృష్' (దున్నుట) అనే ధాతువుకు 'నక్' అనే ధాతువును జోడించినపుడు అది, 'కృషర్ వర్ణే', రంగును సూచించును. కనుకనే ద్రాక్షకు, ఇనుముకు 'కృష్ణ' అనే నామాంతరాలున్నాయి. ఈ 'నల్లని రంగు' ఆధారంగా మహాభారతం శాంతిపర్వం (143.49)లోని ఈ శ్లోకంలో 'కృష్ణ' నామానికి అర్థం చెప్పబడింది.

**కృషామి మేదినీం పార్థ భూత్వా కృష్ణాయ సో మహాన్**

**కృష్ణో వర్ణశ్చ మే యస్మాత్ తేన కృష్ణో஽హమర్జున**

అర్జునా! నేను నల్లని కొయ్యగొడ్డలినై భూమిని చీల్చడం చేతను, నల్లని రంగు గలవాడనగుట చేతను నన్ను కృష్ణుడు అంటారు. (ఇంతకుముందు 58వ నామం వివరణలో ఉదాహరించిన ఇదే శ్లోకానికి, ఇప్పుడు ఉదాహరించిన శ్లోకానికి స్వల్పంగా పాఠ్యభేదం ఉంది. ఇది పాఠ్యాంతరం కావచ్చును).

'నల్లనివాడు' అన్న సందర్భంలో శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధములనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు –

**కణ్ణన్ ఏనుమ్ కరుమ్ దైవమ్** – నాచ్చియర్ తిరుమొళి

**కరియాన్ ఒరు కాళై** – తిరుమొళి 3.7

శ్రీ కృష్ణదత్త భరద్వాజ వ్యాఖ్య – **కర్షతి భగవాన్ ఆత్మానం ప్రతి వయో వర్ణ రూప లావణ్య మధురీ రసోత్కర్షణేన ఇతి కృష్ణః.**

**కృషతే ఆత్మానమ్ ప్రతి భక్తాన్ స సౌందర్యేణ ఇతి కృష్ణః** – తన ప్రతి భక్తుని ఆత్మను తన సౌందర్యముచే ఆకర్షించువాడు కృష్ణుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య– వేదవ్యాసుడు భగవానుని అవతారము. ఆయనే కృష్ణుడు లేదా కృష్ణద్వైపాయనుడు.

**కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణమ్ ప్రభుమ్**

**కో஽హ్యన్యః పుండరీకాక్షాన్మహాభారత కృద్భవేత్** – విష్ణుపురాణము 3.4.5

ధర్మచక్రము రచయిత 'నాగలి', 'వ్యాసుడు' అన్న భావాలను సమ్వయపరుస్తూ ఇలా చెప్పారు – వేదములను అమర్చివిభజించి వేదవ్యాసుడు భక్తుల చిత్తములందు వ్యవసాయము చేయుటకు క్షేత్రమును దున్ని సిద్ధం చేశాడు. కనుక నారాయణుని స్వరూపుడైన వేదవ్యాసుడు కృష్ణద్వైపాయనుడు.

శ్రీ చిన్మయానంద 'నల్లని' అన్న స్వరూపాన్ని మరొక అద్భుతంగా వివరించారు. ఇక్కడ నలుపు రంగు మన బుద్ధికి, శక్తికి, ఇంద్రియాలకు తెలియని విషయాన్ని సూచిస్తుంది. ఆకాశాంతరాళం నల్లగా కనుపించినట్లు. భక్తి అనే దివ్వెతో మాత్రమే ఆయన గురించి తెలిసికోవడం జరుగవచ్చును.

## 555. దృఢః

- భక్త సంరక్షణ కొఱకు, బలమైన, శక్తివంతమైన వ్యూహ రూపములు దాల్చువాడు.
- తన సంకల్పము, మాట, చేతలలో చంచలత లేనివాడు.
- పరమాత్ముడు అన్న ఋజువునుండి ఎలాంటి వాదాలద్వారా అయినా తప్పింపబడజాలనివాడు. నిస్సంశయముగా దేవదేవుడే.
- మహోన్నతమైన, మహాద్భుతమైన మహాశక్తిమంతుడు.

### ఓం దృఢాయ నమః

'దృఢ' అంటే బలమైన, నిశ్చలమైన, పెద్ద, స్థిరమైన అనే అర్థాలను చెప్పవచ్చును.

శ్రీ వి.ఎన్. వేదాంత దేశికుల వివరణ – పరవాసుదేవుని వ్యూహములు ఏమాత్రమూ ఊహాజనితములు కావు. ఏమాత్రమూ అస్పష్టములు కావు. అవి దృఢమైనవి. శక్తిని, బలమును స్పష్టముగా తెలియజేయునవి. ఆ రూపములను స్మరించి, ధ్యానించుట భక్తులకు కష్టము కాదు. శ్రీ నృసింహమూర్తి శక్తి, ప్రభావమును ఆరాధించుటవలన భక్తులకు ఆ దృఢత్వము సుస్థిరమైన భక్తినొసగును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు ప్రేమ, కరుణ, వాత్సల్యము వంటి దివ్యగుణములనుండి ఎన్నడును చలించడు. దృఢుడు.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు ధర్మసంస్థాపనయందు, పాపశిక్షణయందు దృఢుడు కాని శరణాగతులైన పాపులపట్ల మెత్తనివాడు.

శ్రీ పి.బి. అణ్ణాంగారాచార్య స్వామి – వేద ప్రమాణములు శ్రీమన్నారాయణుడే దేవదేవుడని నిస్సంశయముగా తెలుపుచున్నవి. బాహ్య కుదృష్టులు ఎందరైనా, ఎన్ని కువాదాలు చేసినా గాని ఈ సత్యము నిశ్చయమైనది. కనుక భగవానుడు దృఢుడు.

**స్థూలత్వాత్ బలవత్వాచ్చ దృఢ ఇత్యభిధీయతే – దృఢో స్థూలో బలవాన్ వా** – దృఢత్వము అనగా చాలా పెద్ద, చాలా బలమైన, చాలా శక్తివంతమైన గుణము. తన శత్రువులను రూపుమాపడానికి భగవానుడు దృఢమైన రూపములు ధరించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సముద్ర జలములను చెలియలికట్ట నిలిపివేయును. శరీరమును అస్థిపంజరము జీవితాంతము నిలిపియుంచును. భూమిపై గిరితరులు స్థిరముగానుండును. ఇవన్నీ సృష్టిలో భగవానుడు పొందుపరచిన దృఢత్వ లక్షణములు.

## 556. సంకర్షణః

## 557. అచ్యుతః

## 556,557. సంకర్షణోఽచ్యుతః

**సంకర్షణః**

- సంసారంలో చేతనాచేతనములైన ఆత్మలన్నింటిని తనవైపు లాగుకొనేవాడు. (ఆకర్షించేవాడు).

**సంకర్షణోఽచ్యుతః**

- ప్రళయకాలమున అన్నింటినీ తనవైపు ఆకర్షించి లీనం చేసుకొంటూ, తన దివ్యస్వరూపంనుండి ఎన్నడును చ్యుతిని (భ్రంశమును) పొందనివాడు.

**అచ్యుతః**

- తన పరబ్రహ్మ స్థానమునుండి ఎన్నడూ చలించనివాడు.
- తన భక్తులను ఎన్నడూ పతనము కానీయనివాడు.
- జననము, వయోవృద్ధివంటి పరిణామములకు లోనుగానివాడు.

**ఓం సంకర్షణాయ అచ్యుతాయ నమః**

**ఓం సంకర్షణాయ నమః**

**ఓం అచ్యుతాయ నమః**

శ్రీ శంరులు 'సంకర్షణోऽచ్యుతః' అని విశేషణముతో కూడిన ఒకే నామంగా పరిగణించారు. శ్రీ పరాశరభట్టులు 'సంకర్షణః', 'అచ్యుతః' అనే రెండు నామములుగా పరిగణించారు.

**ఓం సంకర్షణాయ అచ్యుతాయ నమః**

శ్రీ శంకరులు – **'సంకర్షణోऽచ్యుతః'** నామమునకు –

ప్రళయకాలమున సర్వజీవులను ఆకర్షించి, తనలో లయం చేసుకొనే భగవానుడు తానుమాత్రం చలించడు (చ్యుతిని పొందడు, పతనం కాడు). ఆకర్షించేవాడు సంకర్షణుడు. చ్యుతిని పొందనివాడు అచ్యుతుడు. వెరసి 'సంకర్షణోऽచ్యుతుడు'.

**ఓం సంకర్షణాయ నమః**

శ్రీ భట్టులు – **'సంకర్షణః'** నామమునకు –

**సంసారే చిత్ అచితోః ఆత్మాని సమం కర్షణాత్ సమం కర్షమ్ నయతి** – చిత్, అచిత్ లను సమంగా అన్నింటినీ తనవైపు ఆకర్షించేవాడు, వానిని ఏకం చేసేవాడు సంకర్షణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సమ్యక్ కర్షతి ఇతి సంకర్షణః. శ్రీ భగవాన్ స్వజనాన్ ఆత్మానమ్ ప్రతి స్వకీయైః వాత్సల్య మాధుర్యాది గుణైః కర్షతి** – చక్కగా ఆకర్షించేవాడు సంకర్షణుడు. భగవానుడు తన దివ్య వాత్సల్య రూప గుణాదులచే తన భక్తులను తనవైపు ఆకర్షించును.

ఇక్కడ మూడు నామములు వరుసలో వచ్చినవి – **దృఢః, సంకర్షణః, అచ్యుతః** – వీటి క్రమం గురించి శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇలా చక్కగా వివరించారు.

దృఢః – బలము, స్థిరత్వము, స్థూలత్వము అనే లక్షణములున్నవాడు.
సంకర్షణః – సంసారంలో చిక్కుకున్నవారిని విముక్తులను చేయడానికై తనవైపు లాగేవాడు.
అచ్యుతః – అన్నింటినీ తనవైపు లాగుతున్నాగాని తాను మాత్రం చలించనివాడు.

ఇదే **దృఢః, సంకర్షణః, అచ్యుతః** క్రమాన్ని ధర్మచక్రము రచయిత ఇలా వివరించారు – నీటిలో కొట్టుకుపోతున్నవానిని రక్షించాలంటే ముందు లాగేవాడు బలంగా ఉండాలి (దృఢః). తనవైపుకు లాగాలి (సంకర్షణః). మునిగిపోయేవాడిని రక్షించే సంకల్పం స్థిరంగా ఉండాలి గాని తాను మాత్రం చలించరాదు (అచ్యుతః).

**ఓం అచ్యుతాయ నమః**

'అచ్యుతః' నామము మూడుమార్లు స్తుతింపబడినది.

11వ శ్లోకము. 101వ నామము. అచ్యుతః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః**

35వ శ్లోకము. 320వ నామము. అచ్యుతః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**

59వ శ్లోకము. 557వ నామము. అచ్యుతః – **వేధాః స్వాంగోऽజితః కృష్ణో దృఢః సంకర్షణోऽచ్యుతః**

'చ్యుతి' అనగా పడిపోవుట, విడనాడుట, జారిపోవుట, పతనమగుట. ఎన్నడును చ్యుతిని పొందనివాడు అచ్యుతుడు.

ఈ నామమునకు శ్రీ భట్టుల వివరణ – బ్రహ్మేంద్రాది దేవతలు కూడా కాలక్రమమున తమ తమ స్థానములను కోల్పోవుదురుగాని శ్రీమన్నారాయణుడు సదా శ్రీమన్నారాయణుడే గనుక అచ్యుతుడు. ఇందుకు శ్రీ భట్టులు ఉదాహరించిన శ్లోకము –

**చ్యవనోత్పత్తి యుక్తేషు బ్రహ్మేంద్ర వరుణాదిషు**
**యస్మాన్ న చ్యవసే స్థానాత్ తస్మాత్ సంకీర్త్యసే అచ్యుతః**

బ్రహ్మ, ఇంద్ర, వరుణాదులు కూడ జన్మము, అంతము, పదవీభ్రంశము వంటివి కలిగియున్నారు. కాని నీవు వానికతీతుడవు గనుక అచ్యుతుడవు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – కామాది గుణములకు అతీతుడైనందున శ్రీహరి అచ్యుతుడు.

**యస్మాత్ న చ్యుత పూర్వోऽహమ్ అచ్యుతస్తే న కర్మణా** (మహాభారతము. శాంతిపర్వము 12.330.16). దీనిని శంకరులు – **స్వరూప సామర్థ్యాత్ న చ్యుతో న చ్యవతే న చ్యవిష్యతి ఇతి అచ్యుతః** – అని వివరించారు. ఆయన స్వరూప సామర్థ్యములలో ఎన్నడును కొరవడలేదు (పతనము కాలేదు). ఇప్పుడు కొరత లేదు. ఇంకముదెన్నడును కొరత రాజాలదు. ఆయన వైభవము, శక్తి, సౌందర్యములు అపూర్వములు, అనంతములు, అవిచ్ఛిన్నములు. కనుక ఆయన అచ్యుతుడు.



మస్కట్ లో శ్రీ లక్ష్మీనరసింహస్వామి కళ్యాణము. ఏప్రిల్ 2019.

జీవాత్మ కర్మఫలములను అనుభవించుచుండును. పరమాత్ముడు కేవలం సాక్షి. కర్మలకు అంటనివాడు. కనుక అచ్యుతుడు – అని ధర్మచక్రము రచయిత వివరించారు.

శ్రీ భట్టులు ఇచ్చిన మరొక వ్యాఖ్య – తన భక్తులను ఎన్నడూ విడనాడనివాడు అచ్యుతుడు. **తేభ్యః ప్రపన్నేభ్యః న అపగతః అచ్యుతః.** భగవానుని శరణుజొచ్చినవారికి ఆయన ఎన్నడూ దూరం కాడు. కనుకనే పార్థసారథియై అర్జునుని రథాన్ని నడిపాడు.

శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించినది – **మిత్రభావేన సంప్రాప్తమ్ న త్యజేయమ్ కదాచన దోషో యద్యాపి తస్య స్యాత్.** ఎటువంటి దోషములున్నవాడైనా మిత్రభావంతో నా దగ్గరకు వస్తే వానిని ఏ పరిస్థితులలోనూ త్యజించను – అని రామాయణంలో రాముడన్నాడు.

**న మే భక్తాః ప్రణశ్యతి.** నా భక్తుడెన్నడూ నశింపడు (గీత).

'చ్యుతము' అనగా మార్పు కూడాను. తైత్తరీయారణ్యము (10.11)లో భగవంతుడు – **శాశ్వతమ్ శివమ్ అచ్యుతమ్** – అని చెప్పారు. భగవానుడు మార్పులకు అతీతుడు గనుక అచ్యుతుడు.

## 558. వరుణః

- ఆవరించువాడు.
- సాయంకాల సూర్యుడు.

### ఓం వరుణాయ నమః

వృణ్-వరణే – అనగా 'కప్పివేయుట' – అనే దాతువునుండి ఈ నామమును వివరించారు. (ఆవరణము, ఆవృతము వంటి పదాలను గమనించనగును.) **యు స్థిర సర్వమావృత్య వరుణస్సతు కథ్యతే** – సమస్తాన్ని ఆవరించి ఉండేవాడు వరుణుడు. **వ్రియతే సర్వమనేనేతి వరుణః** – సకలమును ఆవరించియున్నవాడు వరుణుడు.

ఈ నామమును వివరిస్తూ శ్రీ భట్టులు తైత్తరీయోపనిత్తు (1.1) నుండి ఉదాహరించారు. **యేన ఆవృతం ఖం చ దివమ్ మహీం చ.** ఆకాశంతరాళము, స్వర్గము, భూమి కూడ అతనిచే ఆవరింపబడియున్నవి.

'వరుణ' అన్న పదమునకు 'సాయంకాల సూర్యుడు' అని కూడ అర్థమున్నది. సాయంకాలంలో సూర్యుడు తన కిరణాలను ఉపసంహరించుకొని తననే కప్పివేసుకొంటాడు. అలాగే పరమేశ్వరుడు తననుండి ఉద్భవించిన ద్వంద్వ ప్రవృత్తి కలిగిన జగమును తనయందే లీనము చేసుకొంటాడు. అక్షరమైన చిత్ స్వరూప సత్యము సూర్యునినుండి శక్తి మరియు కాంతి రూపంలో వ్యక్తమగుచున్నది. ఇదియే 'హిరణ్మయము' అని ఉపనిషత్తులు కీర్తించినవి. కనుక నారాయణుని వరుణుడని, సూర్యనారాయణుడని స్తుతించుట సముచితమని శ్రీ చిన్మయానంద అన్నారు.

ఈ మంత్రమునకు ధర్మచక్రము రచయిత చెప్పిన కొన్ని ఆసక్తికరమైన అనుభవములు – వరుణుడు జలములకు ప్రభువు. వరుణుడు సాయంకాలపు సూర్యుడు. వరుణుడు పశ్చిమ దిక్కునకు అధిపతి. సూర్యుడు అస్తమించినపుడు చీకటులు ఆవరించినట్లుగానే దైవచింతన లేనివాడు అంధకారములో చిక్కుకొనిపోవును. భగవంతుని తలచినవానికి జ్ఞానదీపము మార్గదర్శియగును.

## 559. వారుణః

- తనను ఆశ్రయించినవారి పట్ల ఆదరము గలవాడు.
- వరుణుని పుత్రులు – వసిష్ఠుడు, అగస్త్యుడు.
- తన భక్తుల కష్టములను తొలగించేవాడు.

### ఓం వారుణాయ నమః

ఈ నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **తం స్వామిత్వేన వృణుతే ఇతి వరుణః తత్ర భావో వారుణః.** భగవంతుని ప్రభువుగా నమ్ముకొన్నవాడు వరుణుడు. అట్టివారితో సదా తోడుండెడివాడు వారుణుడు, భగవానుడు. శ్రీ భట్టుల వ్యాఖ్యానానికి నిరుక్తము రచయిత వివరణ – **స్వామిత్వేన వృణనేషు స్థితో వారుణ ఈరితః.** శ్రీ వి.వి. రామానుజన్ తిరుమొళి (1.10.9)నుండియు, పెరియాళ్వార్ తిరుమొళి (5.4.5)నుండియు ఉదాహరించారు.

శ్రీ శంకరుల భాష్యము – **వరుణస్య ఆపత్యమ్ వసిష్ఠః అగస్త్యో వా వారుణః.** వరుణుని పుత్రులనబడు వసిష్ఠుడు, అగస్త్యుడు వారుణులు. వీరిరువురును భగవంతుని అంశావతారములే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరణ – **వారణయతి నివారయతి విపదమ్ స్వజనానామ్ ఇతి వారుణః.** స్వజనుల విపత్తులను నివారించువాడు వారుణుడు.

## 560. వృక్షః

- సత్పురుషులకు ఆశ్రయమునిచ్చువాడు (చెట్టునీడవలె).
- వృక్షమువలె స్థిరమైనవాడు.

### ఓం వృక్షాయ నమః

వృజ్ - వరణే -ఆశ్రయించుట – అన్న ధాతువునుండి శ్రీ భట్టులు ఈ నామమును వివరించారు. నీడనిచ్చే చెట్టులాగా భగవంతుడు భక్తుల సేద దీర్చి వారికి సౌలభ్యము కలిగించడానికి సదా సిద్ధంగా ఉంటాడు. భక్తుడు తనవద్దకు రావాలని వేచియుంటాడు (శ్రీ పి.బి. అణ్ణాంగారాచార్యస్వామి వివరణ).

**సాధూనామాశ్రయత్వాచ్చ సర్వేనస్సహనాదపి సర్వసత్వాప జీవ్యత్వాత్ వృక్ష ఇత్యభిధీయతే -** సత్పురుషులకు ఆధారమైనవాడు, తన భక్తుల సమస్త పాపములను సహించేవాడు, సమస్త ప్రాణులకు బ్రతుకు తెరువైనవాడు, అందరికీ ఆధారమైనవాడు కనుక శ్రీమన్నారాయణుడు 'వృక్షము' అని స్తుతింపబడుచున్నాడు.

శ్రీ భట్టులు చెప్పిన కొన్ని మూలములు –

**నివాస వృక్షః సాధూనామ్ ఆపన్నానామ్ పరాగతిః** – రామాయణము. కిష్కింధకాండ 151.9.

**వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠతేభ్యః** – నిశ్చలమైన వృక్షమువలె ఆకాశమునందు నిలిచియున్నది – మహానారాయణోపనిషత్తు 10.4

శ్వేతాశ్వరోపనిషత్తులో – ఏ బ్రహ్మముకన్న శ్రేష్ఠమైనదిగాని, వేరైనదిగాని, పెద్దదిగాని, చిన్నదిగాని ఏదీ లేదో, ఏది వృక్షములాగా ఆకాశమునందు నిలబడియున్నదో, అట్టి బ్రహ్మముచేత సమస్త ప్రపంచము పరిపూర్ణమై, వ్యాప్తమై యున్నది.

శ్రీ శంకరులు కూడా – **వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠతేభ్యః** – అనే వాక్యాన్నే ఉదాహరించారు. కాని అందులో 'దృఢమైన, నిశ్చలమైన, స్థిరమైన' అన్న భావాన్ని గ్రహించారు.

ఈ ప్రపంచమే ఒక మహావృక్షమనే భావాన్ని తీసికొని శ్రీ చిన్మయానంద ఈ నామాన్ని వివరించారు – **ఊర్ధ్వమూల మధశ్శాఖమ్ అశ్వత్థమ్ ప్రాహురవ్యయమ్.** (గీత 15.1). ఈ సంసారము ఊర్ధ్వ (పైకి) మూలములు (వ్రేళ్ళు) కలిగి, క్రిందివైపుకు కొమ్మలు విస్తరించి, అవ్యయమై, వేదములే ఆకులుగా కలిగి త్రిగుణములతో వర్ధిల్లుచు, విషయములే చిగురుటాకులై, మానవలోకమందు కర్మసంబంధములగు వ్రేళ్ళతో గట్టిగా నాటబడియున్నది.

శృతులలో 'వృక్ష' అన్నపదమును వివిధ భావములలో ఉపయోగించారని శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఉదాహరించారు –

'వృక్ష' అనగా 'చెట్టు' అనే భావము –

**ఊర్ధ్వమూల మధశ్శాఖమ్ అశ్వత్థమ్ ప్రాహురవ్యయమ్** – గీత 15.1

**ఊర్ధ్వమూల అవాక్ శాఖ ఏష అశ్వత్థ సనాతనః** – కఠోపనిషత్ 2.6.1

**వృక్షో న పక్వః** – ఋగ్వేదము 4.20.5

'వృక్ష' అనగా 'సూర్యుడు' అనే భావము –

**కః స్విద్ వృక్షో నిష్ఠితో మధ్యే అర్ణసః** – ఋగ్వేదము 1.182.7

'వృక్ష' అనగా 'స్త్రీ' అనే భావము –

**మర్యో న యోషామభి మన్యమానః** – ఋగ్వేదము 4.20.5

'వృక్ష' అనగా 'ప్రకృతి' అనే భావము –

**ద్వా సుపర్ణాః సయుజా సఖాయాః సమానమ్ వృక్షమ్ పరిషస్వజాతే** – ఋగ్వేదము 1.164.20

'వృక్ష' అనగా 'పరమాత్మ' అనే భావము –

**యస్మిన్ వృక్షే మాధ్వదః సుపర్ణాః నివిశంతే స్తువతే చాఽధి విశ్వేః** – ఋగ్వేదము 1.164.22

ఇన్ని స్వరూపములలో వ్యక్తమయ్యే శ్రీనివాసుడు 'వృక్షః'.

ఈ నామమునకు శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరొక అనుభవమును కూడ చెప్పారు –

వ్రాశ్చ్ - ఛేదనే – అన్న ధాతువునుండి 'వృక్షః' పదాన్ని 'చీల్చివేయుట' అనే భావంలో కూడ అన్వయించుకొనవచ్చును. భగవానుడు జీవులను వేరువేరు శరీరములలో బంధిస్తాడు. గ్రహ నక్షత్రాదులను దూరదూరంగా ఉంచుతాడు. సూర్యుడు చీకట్లను చీల్చుతాడు. ఒక చెట్టు తన ఫలాలను వేరువేరుగా అందించి అనేక వృక్షాలు ఉద్భవించడానికి దోహదమవుతుంది. ఇలా భగవానుడు వృక్షరూపుడై అనేక రూపాలలో వెలుగొందుతూ సృష్టిని నానావిధములుగా చేయుచున్నాడు. ఇలాంటి వృక్షతత్వాన్ని గ్రహించినవారు కామాదులను చీల్చి చెండాడి శ్రీహరియనెడి కల్పతరువును చేరగలరు.

ధర్మచక్రము రచయిత – ఈ నామమునుండి గ్రహించవలసినది. చెట్టునుండి చంచలమైన ఛాయనేగాక పుష్కలమైన ఫలాలను ఆశించాలి. కేవలం యాదవసైన్యాన్ని తీసుకొన్న దుర్యోధనుడు నీడతో సరిపెట్టుకొన్నాడు. శ్రీకృష్ణుని సారథ్యాన్ని కోరిన అర్జునుడు శాశ్వత సత్ఫలాలను పొందాడు.

## 561. పుష్కరాక్షః

- పోషించు (పుష్టి కలిగించు) కన్నులు కలవాడు.
- పద్మములవంటి కన్నులు కలవాడు.
- సమస్తాకాశమున వ్యాపించియున్నవాడు.
- సూర్యచంద్రులు కన్నులుగా గలవాడు.
- ధ్యానించినపుడు హృదయపద్మమును ప్రకాశింపజేయువాడు.

### ఓం పుష్కరాక్షాయ నమః

ఈ ప్రియనామము రెండుమార్లు వస్తుంది.

5వ శ్లోకము. 40వ నామము. పుష్కరాక్షః – **స్వయంభూః శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః**

59వ శ్లోకము. 561వ నామము. పుష్కరాక్షః – **వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః**

40వ నామమునకు నిరుక్తి వివరణ – **అక్షిణీ పుండరీకేవ భక్తానుగ్రహ కారిణీ యస్యాసౌ పుండరీకాక్షః స్వేష్టవర్ణస్తు పావకః.** తన భక్తులను అనుగ్రహించడానికి తామరపూవులను బోలిన కన్నులు గలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. పావనకరము. ఓం పుష్కరాక్షాయ నమః.

561వ నామమునకు నిరుక్తి వివరణ – **సతాం ప్రసాద వర్షేణ పోషకే యస్య చాక్షిణీ పుష్కరాక్ష స్స విజ్ఞేయో హ్యష్టార్ణః ప్రీతివర్ధనః.** సత్పురుషులమీద తన అనుగ్రహమును వర్షించి పోషించు నేత్రములు కలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ప్రీతికరము. ఓం పుష్కరాక్షాయ నమః.

శ్రీ భట్టులు 'పుష్ - పుష్టౌ - పుష్టి కలిగించునది' అన్న ధాతువు ఆధారంగా ఈ నామమును వ్యాఖ్యానించారు. శ్రీ స్వామిదేశికన్ తమ 'శ్రీ భగవధ్యాన సోపానము'లో **'స్వాగత ఉదార నేత్రమ్'** అని స్తుతించారు. శ్రీరంగనాధుని కన్నులు సదా భక్తులవైపు చూస్తూ కరుణను వర్షిస్తాయి. శ్రీ దశావతార స్తోత్రము 2వ శ్లోకములో ఇలా వ్రాశారు – **అరవింద గహనాని తన్వాన్ ఇవ దత్త క్షణైర్వీక్షణైః.** ఆ కన్నులు  తామరపూల అడవిలా కరుణను వర్షిస్తాయి.

పుష్కరములు అనగా తామరపూలు. కనుక తామరపూలవంటి కన్నులు కలిగినవాడు పుష్కరాక్షుడు. ఛాందోగ్యోపనిషత్తు (1.6.7)నుండి శ్రీ రామానుజులు ఉదాహరించిన భాగాన్నే శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఉదాహరించారు – **తస్య యథాకప్యాసం పుండరీకమేవ అక్షిణీ.**

పుష్కరమనగా 'విశ్వాంతరాళము' అని కూడ. 'అక్షు' అనగా వ్యాపించుట. కనుక ఆకాశమంతా వ్యాపించినవాడు పుష్కరాక్షుడు – అని శ్రీ శంకరులు చెప్పిన అర్థాన్నే శ్రీ చిన్మయానంద కూడా అనుసరించారు.

పై అర్థాన్నే శ్రీ సత్యదేవో వాసిష్ఠ కొంత మార్చారు. పుష్కర - విశ్వాంతరాళాకాశము. అక్ష - కన్నులు. సూర్యచంద్రులు కన్నులుగానుండి ఆకాశమంతటిని చూచుచున్నవాడు పుష్కరాక్షుడు. **యస్య  సూర్యశ్చక్షు శ్చంద్రమాంశ్చ పునర్ణవః** (అధర్వణ వేదము 10.7.33)

పుష్కరము అనగా హృదయపద్మము అనికూడ చెప్పవచ్చును. ధ్యానము చేసినపుడు హృదయపద్మమును ప్రకాశింపజేయువాడు పుష్కరాక్షుడు అనికూడ శ్రీ శంకరులు చెప్పారు. ధ్యానమును సాధన చేయు ఆరంభదశలో భ్రూమధ్యంకంటె హృదయంపై కేంద్రీకరించడం సులభమని ధర్మచక్రము రచయిత వ్రాశారు.

## **562.** మహామనాః

- ఉదారమైన, విస్తారమైన మనసు కలవాడు.
- అనితర శక్తిమంతమైన మనసు కలవాడు.
- అనంతమైన బుద్ధి, జ్ఞానము కలిగినవాడు.

### ఓం మహామనసే నమః

శ్రీ భట్టులు – భగవానుడు విశాల హృదయుడు. లోతైన, విస్తారమైన మనసు కలవాడు. భక్తులను మన్నించువాడు. శరణాగతులైన పాపులను కాచువాడు. ద్రౌపదికి తగినంత సహాయము చేయలేదని చింతించినవాడు.

శ్రీ శంకరులు – **మనసైవ జగత్ సృష్టిం సంహారం చ కరోతి యః.** అని విష్ణుపురాణము(5.22.15)లో ఉన్నది. ఆయన సంకల్పమాత్రముననే, కర్మేంద్రియములతో పని లేకుండా, సృష్టి స్థితి లయాది కార్యములను నిర్వహించును. కనుక శ్రీహరి మనసు మహాశక్తిమంతమైనది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **యం మేధాం దేవగణాః పితరశ్చ ఉపాసతే, తయా మామ్ అద్య మేధయా అగ్నే మేధావినం కురు.** అని యజుర్వేదము (32.14)లో ఉన్నది. అంతటా అంతర్యామి అయిన ఆయనకు తెలియనిది లేదు. అందరూ జ్ఞానము కొరకు ఆయనను ఆరాధిస్తారు.

ధర్మచక్రము రచయిత – శరీరము, ఇంద్రియములు, మనసు - వీనిలో శరీరము స్థూలమైనది. మనస్సు అన్నింటికంటె సూక్ష్మమైనది. మనసు వలననే ఇంద్రియులు, తద్వారా శరీరము వర్తించును. భగవానుడు అన్నింటికంటె సూక్ష్మతరుడు. అన్ని కార్యములకు మూలము.



1725 కాలపు చిత్రం. చంబా ప్రాంతపు మహేష్ చిత్రించి ఉండవచ్చును. ఈ చిత్రంలో బుద్ధుని విష్ణువు అవతారంగా పూజిస్తున్నారు.

https://commons.wikimedia.org/wiki/File:Buddha,_the_Ninth_Incarnation_of_Vishnu.jpg



శ్రీలంకలో బుద్ధమందిరంలోని విగ్రహాలు.



## భగవాన్ భగహానందీ వనమాలీ హలాయుధః |
## ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః || (60)

### 563. భగవాన్

- పూజనీయుడు. పూజ్యులందరిలోను పూజ్యతముడు.
- సమగ్రమైన షడ్గుణములు సంపూర్ణముగా కలిగినవాడు.
- ఉత్పత్తి ప్రళయములను, గతాగతములను, విద్య అవిద్యలను తెలిసినవాడు.

ఓం భగవతే నమః

**సర్వహేయ ప్రత్యనీక కళ్యాణగుణవత్తయా పూజ్యాత్ పూజ్యతమో యోऽసౌ భగవానితి శబ్ద్యతే.** లోకంలో ఉన్న ప్రతిదుర్గుణానికి అనేకానేక సద్గుణాలు కలవాడు. అందుచేత పూజ్యులందరిలోను పూజ్యుడు భగవానుడు అని పిలువబడుచున్నాడు.

సకల కళ్యాణగుణ పరిపూర్ణుడు, దోషరహితుడు అయినందున శ్రీమన్నారాయణుడు భగవానుడు, పూజ్యనీయుడు అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. 'భగ' అన్న పదానికి షడ్గుణైశ్వర్యములు అని అర్థం ఉంది కాని శ్రీభట్టులు ఈ నామవ్యాఖ్యానానికి ఆ అర్థం తీసుకోలేదు (తరువాతి నామమైన 'భగహా' వ్యాఖ్యానానికి శ్రీభట్టులు ఆ అర్థాన్ని ఉపయోగించారు.) అయితే ఇతర వ్యాఖ్యానకర్తలు 'భగవాన్' నామ వివరణకు ఆ అర్థం తీసుకొన్నారు. పూజింపదగినవాడు గనుక భగవాన్ అని శ్రీ భట్టుల వ్యాఖ్య. అమరకోశ వ్యాఖ్యానంలో **'భజయత ఇతి భగః'** అని ఉంది. అది శ్రీ భట్టుల వివరణకు సరిపోతుంది.

శ్రీ శంకరులు 'భగ' అనగా షడ్గుణైశ్వర్యములు అన్న అర్థంలో 'భగవాన్' నామమును వ్యాఖ్యానించారు. ఇందుకు విష్ణుపురాణము (6.5.74)నుండి ప్రమాణం చెప్పారు.

**ఐశ్వర్యశ్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరిణా**
ఐశ్వర్యము (ప్రభుత), వీర్యము, యశస్సు, సిరి, జ్ఞానము, వైరాగ్యము – అనే ఆరు గుణాలు సంపూర్ణముగా కలిగియున్నవాడు భగవాన్. ఈ శ్లోకానికి పాఠాంతరాలున్నాయి. 'వీర్యస్య' బదులుగా 'ధర్మస్య' అనీ, 'జ్ఞాన వైరాగ్యయోऽశ్చైవ' బదులుగా 'వైరాగ్యస్య అథ మోక్షస్య' అనీ కూడా ఉన్నాయి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరణ – **భగో జ్ఞానాది షట్కమ్ విద్యతే నిరతిశయమ్ యస్మిన్నితి భగవాన్.** నిరతిశయమైన జ్ఞానాది షడ్గుణములు కలిగినవాడు భగవానుడు.

ఈ షడ్గుణముల గురించి శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పిన వివరణ –

(1) ఐశ్వర్యము – అన్నింటిపై ఆధిపత్యము (ఈశ్వరత). భగవంతుడు అన్నింటికి, అన్ని కాలములందును ప్రభువు. ఆయనకు వేరు ప్రభువు లేడు. ఆయన పరమేశ్వరుడు. **న తస్య ఈశే కశ్చన** (తైత్తరీయారణ్య 10.10).

(2) వీర్యము – ఎంతటివాడినైన జయించువాడు. అనంతశక్తిమంతుడు. **ఉగ్రమ్ వీరమ్ మహావిష్ణుమ్.**

(3) యశము – కీర్తి. అందరును ఆయననే స్తుతింతురు. **తస్య నామ మహద్యశః** (తైత్తరీయారణ్యకము 10.1).

(4) శ్రీ – సంపద. శ్రీమహాలక్ష్మిని వక్షస్థలమున దాల్చినవాడు శ్రీనివాసుడు. **శ్రియం లక్ష్మీం ఔపలామ్ అంబికాంగం.** ఆమె భగవంతునికి నితరానపాయిని. క్షాంతిసంవర్ధిని.

(5) జ్ఞానము – భూత భవిష్యద్వర్తమానములన్నీ ఆయనకెరుకయే. ఆయన భూతభవ్యభవత్ప్రభువు. **యః సర్వజ్ఞ సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః** (ముండకోపనిషత్తు 1.1.9).

(6) వైరాగ్యము – భగవంతునికి ఎటువంటి బంధములు, కర్మఫలాదులు, వికారములు వర్తించవు. **స వా అయమాత్మా బ్రహ్మ అకామ మయః** (బృహదారణ్యకము 4.4.5)

శ్రీ శంకరులు మరొక వ్యాఖ్యానము కూడా విష్ణుపురాణములోని శ్లోకము (6.5.78) ఆధారంగా చెప్పారు.

**ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానాం ఆగతిం గతిం**
**వేత్తి విద్యామవిద్యాంచ స వాచ్యో భగవానితి.**

ఉత్పత్తి, ప్రళయము, గతాగతములు (సృష్టి సంహారములు), విద్య, అవిద్య – వీనిని సంపూర్ణముగా నెరిగినవాడే భగవానుడని చెప్పబడును.

## 564. భగహా

- షాడ్గుణ్య పరిపూరితుడు. కళ్యాణగుణములు సంపూర్ణముగానున్నవాడు.
- ప్రళయకాలమున సకల సంపదలను హరించి తనయందే లీనము చేసికొనువాడు.

ఓం భగఘ్నే నమః

**భగైస్తు కళ్యాణగుణైః సర్వం సర్వత్ర గచ్ఛతి యశ్చాసౌ భగహా ప్రోక్తః షడర్ణ సుఖదాయకః -** భగము అంటే ఆరు గుణముల సముదాయము. వీటిని సర్వత్ర ధరించియుంటాడు కనుక ఆయన 'భగహా'. ఈ నామము షడక్షరీమంత్రము. సుఖప్రదము. ఓం భగఘ్నే నమః.

విష్ణుపురాణములోని శ్లోకము (6.5.74) –

**ఐశ్వర్యశ్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః**
**జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం వర్గో భగస్మృతః**

ఈ శ్లోకాన్ని శ్రీ శంకరులు ఇంతకుముందటి నామమైన 'భగవాన్' వ్యాఖ్యానంలో ఉదాహరించగా, శ్రీ భట్టులు అదే విష్ణుపురాణశ్లోకాన్ని ఈ 'భగహా' నామ వ్యాఖ్యానంలో ఉదాహరించారు. శ్రీ భట్టులు చెప్పిన భాష్యము – **భగ శబ్దయాన్ స కళ్యాణ గుణాన్ హన్తి తు గచ్ఛతి.** 'భగ' శబ్దము ద్వారా తెలుపబడిన ఆరు కళ్యాణ గుణములను కలిగియున్నవాడు. (హన్తి - గచ్ఛతి - వెళ్ళువాడు). 'హా' శబ్దమునకు 'నాశనము చేయుట' అనే అర్థమున్నది. ఉదాహరణకు 'వీరహా'. కాని శ్రీ భట్టులు 'హా'ను 'హన్తి' అని అన్వయించారు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదేవిధంగా – **భగం మాహాత్మ్యం జిహీతె గచ్ఛతి ప్రాప్నోతి ఇతి భగహా** – అని వ్రాశారు.

శ్రీ శంకరులు **'హా'** అనగా **'సంహరించుట, హరించుట'** అన్న అర్థంలో ఈ నామమును వ్యాఖ్యానించారు. **ఐశ్వర్యాదికమ్ సంహార సమయే హన్తి ఇతి భగహా.** ప్రళయ సమయమున సకలైశ్వర్యములను రూపుమాపువాడు **'భగహా'**. ఈ అర్థాన్ని శ్రీ సత్యదేవో వాసిష్ఠ

కొంచెం తేడాగా విశదీకరించారు. అంతనూ తనలో లీనం చేసుకోవడమే ఇక్కడ సంహారం. కనుక ఇది నాశనం కాదు, ఉత్పత్తి స్థానానికి చేర్చడం అని శ్రీ చిన్మయానంద వ్యాఖ్యానించారు.

ధనము, కీర్తి వంటివి శాశ్వతం కాదని, వాటిపట్ల మోహము పెంచుకొనవద్దని ఈ నామము మనకు ఉద్బోధించునని ధర్మచక్రము రచయిత వివరించారు.

## 565. నందీ

## ఆనందీ

- నందగోపుని కుమారుడు.
- షడ్గుణైశ్వర్య పరిపూర్ణుడగుటచేత ఆనందమే స్వరూప స్వభావములుగా కలిగినవాడు.
- తన భక్తుల సాంగత్యమువలన సదా సంతోషించువాడు.
- తన భక్తులకు ఆనందము కలిగించువాడు.

### ఓం నందినే నమః

### ఓం ఆనందినే నమః

శ్రీ భట్టులు 'నందీ', 'ఆనందీ' అనే రెండు నామములను చెప్పారు. శ్రీ శంకరులు 'ఆనందీ' అనే నామమునే చెప్పారు. శ్రీ భట్టులు రెండు నామముల వివరణను సంకర్షణవ్యూహమూర్తియైన బలరామావతారము పరముగా అన్వయించారు. శ్రీ శంకరులు శ్రీకృష్ణావతారమును 'ఆనందీ' నామమునకు అన్వయించారు.

నందగోపుని కుమారుడు బలరాముడు. ఈయన సంకర్షణవ్యూహ విభవావతారము. కనుక 'నందీ'. ఇదే నామమునకు శ్రీ చిన్మయానంద – **నందగోప కుమరన్ నారాయణన్** – అని చెప్పారు.

శ్రీ శంకరులు 'ఆనందీ' అనగా సచ్చిదానంద స్వరూపుడని వివరించారు. ఎందుకంటే సకలైశ్వర్యములు భగవానునికి పరిపూర్ణముగా ఉన్నాయి. **సుఖస్వరూపత్వాత్ ఆనందీ – సర్వాభిః సంపద్భిః సమృద్ధత్వాత్ ఆనందీ.**

శ్రీ భట్టులు 'ఆనందీ' అనగా గోపకులంలో సర్వులకూ ఆనందము కలుగజేసిన బలరాముడు అని వ్రాశారు. ధర్మచక్రము రచయిత ఇదే 'ఆనందీ' నామమునకు – గోపకులంలో అందరికీ ఆనందం కలిగించిన శ్రీకృష్ణుడు – అని వ్రాశారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరణ – **నందతి సమృద్ధయతి ఇతి నందీ.** తన భక్తులకు సమృద్ధిని, ఆనందమును కలుగజేయువాడు 'నందీ'. శ్రీ చిన్మయానంద వివరణ – భగవానునికి శరణాగతులైనవారు ఆయన ఆనందమును అందుకొందురు. ఈ రెండు భావములను 'ఆనందీ' నామమునకు కూడ అన్వయింపవచ్చును.

ధర్మచక్రము రచయిత – మన స్వభావము స్వతఃసిద్ధముగా ఆనందమయము. కాని కనులు మూసుకొని చీకటిని అనుభవించినట్లుగా మనము జ్ఞానమును వదులుకొని దుఃఖములను అనుభవిస్తున్నాము. కనుక భగవంతుని, మరియు మన ఆనంద స్వభావమును తెలిసికొని ఈ దుఃఖములనుండి విముక్తులము కావచ్చును. భగవంతుని భక్తితో అర్చించుటయే ఇందుకు సాధనము. భగవంతునిపట్ల ధ్యానముతో సంపూర్ణముగా పరవశులైన కారణంగానే గోపికలు సచ్చిదానందమును అనుభవించారు. **ఓం నందినే నమః. ఓం ఆనందినే నమః.**

## 566. వనమాలీ

- వనమాలను ధరించినవాడు.

### ఓం వనమాలినే నమః

**స్వసృజత్యభూత సూక్ష్మాణాం మాలయా నిత్యయోగతః వనమాలీ సమఖ్యాతో హ్యష్టార్ణో భూషణప్రదః -** తన చేత సృష్టింపబడిన పంచభూతములను, తన్మాత్రలను మాలగా ధరించినవాడు వనమాలి. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఆభరణప్రదము. ఓం వనమాలినే నమః.

సదా వైజయంతీమాలను ధరించువాడు వనమాలి. శబ్ద, స్పర్శ, రస, రూప, గంధములనెడు ఐదు తన్మాత్రలకు అధిష్ఠానదేవత వైజయంతీమాల. ఈ పంచతన్మాత్రలను మనము పంచేంద్రియములద్వారా గ్రహిస్తున్నాము. ఇవి పంచభూతములకు సంబంధితములు.

వనమాల అంటే అడవిపూల మాల. సాధరణంగా ఐదు రంగుల పూలను వనమాలలో కూరుస్తారు. పంచభూతమయమైన సకల జగత్తును తన కంఠమునందు ధరించువాడు వనమాలి అని ఇక్కడ గ్రహింపవలెను.

మన సకలేంద్రియములను భగవానునిపట్ల లీనము చేసి. నిశ్చలమైన భక్తితో భగవానుని అర్చించవలెనని ధర్మచక్రము రచయిత వ్రాశారు.



తన నాగలితో నదిని మళ్ళిస్తున్న బలరాముడు. 1650 కాలపు చిత్రం. వికీపీడియానుండి

https://commons.wikimedia.org/wiki/File:Brooklyn_Museum_-_Balarama_Pulling_Hastinapur_toward_the_Ganages_Page_from_a_Bhagavata_Dasamskanda_series.jpg

## 567. హలాయుధః

- హలము, అనగా నాగలిని, ఆయుధముగా ధరించినవాడు.

### ఓం హలాయుధాయ నమః

**హలం చ సతతం సీరం ధత్తే యోఽసౌ హలాయుధః సీరకార్య సమృద్ధ్యర్థో వస్వర్ణో మంత్రనాయకః. -** ఎల్ల వేళల నాగలిని ధరించి ఉండేవాడు హలాయుధుడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. వ్యవసాయం ఫలిస్తుంది. ఓం హలాయుధాయ నమః.

శ్రీ శంకరుల వివరణ – **హలం ఆయుధం అస్య ఇతి హలాయుధః** – నాగలిని ఆయుధముగా గలవాడు హలాయుధుడు. ఈ నామము శ్రీ బలరామావతారమును స్తుతించునది.

శ్రీ భట్టుల వివరణ – పంచభూతముల సమృద్ధికై శ్రీమన్నారాయణుడు తన చేత నాగలి ధరించి రైతువలె పని చేయును గనుక హలాయుధుడు.

## 568. ఆదిత్యః

- దేవకీ నందనుడు. పూర్వజన్మములో దేవకియే అదితి.
- అదితి, కశ్యపులకు జన్మించిన శ్రీవామనమూర్తి.
- 'ఆ' అను బీజాక్షరముచే ప్రసన్నుడగు సంకర్షణుడు.
- మోక్షమును ప్రసాదించువాడు.



నారాయణ తిరుమల దేవాలయంలో
శ్రీ బలరాముని విగ్రహం - వికీపీడియా చిత్రం – రాజశేఖర్ తీసినది

### ఓం ఆదిత్యాయ నమః

ఈ దివ్య నామము 5వ, 60వ శ్లోకములలో స్తుతింపబడినది.

5వ శ్లోకము. 39వ నామము. ఆదిత్యః – **స్వయంభూః శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః**

60వ శ్లోకము. 568వ నామము. ఆదిత్యః – **ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుః గతిసత్తమః**

39వ నామమునకు వ్రాసిన అర్థములు –

- సూర్యమండల మధ్యవర్తియై బంగారువర్ణముతో ప్రకాశించు పురుషుడు.
- ద్వాదశాదిత్యులలో విష్ణువు.
- సమస్తమును ప్రకాశింపజేసి పోషించువాడు.
- అదితియొక్క కుమారుడైన వామనుడు.

ఇక 568వ నామమునకు తెలుపబడిన అర్థములు –

**అవర్ణాదేవ ప్రాప్యో యః ఆదిత్యః పరికీర్తితః అదితిర్దేవకీ తస్యాః ఆదిత్యోవా హ్యపత్యతః** - తనకు బీజాక్షరమైన 'అ'కారముచే పొందదగినవాడు. గత జన్మలో అదితిగా ఉన్న దేవకి గర్భాన జన్మించినవాడు. ఆదిత్యుడు. శ్రీ భట్టులు 'దేవకీనందనుడు' అనే అర్థాన్ని తెలుపుతూ విష్ణుధర్మము (93.44)నుండి ప్రమాణం చూపారు –

**దాక్షాయణి త్వం అదితిః సంభూతా వసుధాతలే**
**నిత్యైవ త్వం జగద్ధాత్రీ ప్రసాదం తే కరోమ్యహమ్**

దాక్షాయణీ! నీవు భూమిపై జన్మించిన అదితివి. నీవు జగన్మాతవు. నీకు ప్రమాణములు.

శ్రీ శంకరుల వివరణ – **అదిత్యాం కశ్యపాత్ వామన రూపేణ జాత ఆదిత్యః** – కశ్యపునికి అదితియందు వామనరూపమున అవతరించివాడు ఆదిత్యుడు.

శ్రీ కృష్ణదత్తభరద్వాజ చెప్పిన ప్రమాణము –

**భాద్రమాసే సితేపక్షే ద్వాదశ్యాం శుభవాసరే**
**కశ్యపాత్ అదితేర్మాతుః భగవాన్ వామనః అభవాత్**

శ్రీ భట్టులు చెప్పిన మరొక వివరణ – **'ఆ'వర్ణాత్ ఆతః ఇత్యః ప్రాప్యః ఇతి ఆదిత్యః** – సంకర్షణుని బీజమంత్రము 'ఆ'. ఆ బీజమంత్రముచేత ప్రాప్తించువాడు ఆదిత్యుడు.

శ్రీ చిన్మయానంద వివరణ – **ఆత్** - విష్ణువునుండి, **ఇత్య**-లభించునది. **ఆదిత్య**- విష్ణువు ద్వారా ప్రసాదింపబడు మోక్షము. అట్టి మోక్షమును ప్రసాదించువాడు ఆదిత్యుడు.

**తరువాతి నామములను శ్రీ భట్టులు 'నారాయణావతారము' పరముగా వ్యాఖ్యానించారు.** 'నారాయణ' నామము అత్యంత గోప్యము. అయినను 'నారాయణ' నామము నారాయణావతారమునుకూడ తెలుపును అని శ్రీ వి.వి.రామానుజన్ చెప్పారు. శ్రీమహావిష్ణువు బదరికాశ్రమములో నరనారాయణ అవతారములను దాల్చెను.

## 569. జ్యోతిరాదిత్యః

- దివ్యప్రకాశముతో విరాజిల్లుచున్న సూర్యుడు. జ్యోతిష రూపుడైన ఆదిత్యుడు.
- సూర్యమండలాంతర్గతమైన జ్యోతియందున్న పరమాత్మ.
- సూర్యునివలె (కంటె చాల) ప్రకాశించువాడు.

### ఓం జ్యోతిరాదిత్యాయ నమః

**సమస్త తేజోహరణ జ్యోతిషా దీప్యతే చ యః స వై స్యాత్ జ్యోతిరాదిత్యః నవార్ణో జ్ఞానదాయకః** - అన్ని తేజస్సులను తనలో ఏకీభవింపచేసుకొనగల తేజస్సుతో ప్రకాశించేవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము. జ్ఞానదాయకము. ఓం జ్యోతిరాదిత్యాయ నమః.

ఇతని తేజస్సుముందు సూర్యుని తేజస్సు వెలవెలపోతున్నది. శ్రీభట్టులు చెప్పిన వ్యాఖ్యానము – **దివ్యాశ్చర్య జ్యోతిర్మయత్వాత్ అపూర్వః జ్యోతిరాదిత్యః.** ఇందుకు శ్రీ భట్టులు మహాభారతము శాంతిపర్వము (344.90) నుండి ఉదాహరించారు – **నిష్ప్రభాని చ తేజాంసి బ్రహ్మాచైవ ఆసనాత్ చ్యుతః** – నరనారాయణులు భవునితో (రుద్రునితో) యుద్ధము చేసినపుడు సకల తేజస్సులు కాంతిహీనములయ్యెను. బ్రహ్మకూడ తన ఆసనమునుండి చలించెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **జ్యోతిషీ సవితృమండలే స్థితః జ్యోతిరాదిత్యః** – అనగా సూర్యమండల మధ్యమున ఉన్న తేజోమయమూర్తి.

**ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసన సన్నివిష్టః**
**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయ వపుర్ధృతశంఖచక్రః**
పద్మాసనాసీనుడై, కేయూర మకర కుండల కిరీటధారియై, శంఖచక్రములను ధరించి ప్రకాశించుచున్న హిరణ్మయమూర్తియగు శ్రీమహావిష్ణువును ధ్యానించుచున్నాను.

శ్రీకృష్ణదత్తభరద్వాజ వివరణ – **ద్యోతతే దీప్యతి ఇతి జ్యోతిః, జ్యోతిః ఆదిత్య ఇవ ఇతి జ్యోతిరాదిత్యః** – సూర్యునివలె ప్రకాశించువాడు జ్యోతిరాదిత్యుడు. ఇందుకు ఆయన చెప్పిన ప్రమాణములు –

**వేదాహమేతమ్ పురుషమ్ మహాంతమ్ ఆదిత్యవర్ణమ్ తమసా పరస్తాత్** – శ్వేతాశ్వరోపనిషత్తు 3.8
**సర్వస్య ధాతారమ్ అచింత్యరూపమ్ ఆదిత్యవర్ణమ్ తమసా పరస్తాత్** – భగవద్గీత 8.9

ఈశావాస్యోపనిషత్తులోని శ్లోకము (డా. క్రోవి పార్థసారధి ఉదాహరించినది) –
**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం**
**తత్ త్వం పూషన్న పావృణు సత్యధర్మాయ దృష్టయే**

ఓ పరమేశ్వరా! సువర్ణకాంతితో ప్రకాశించే నీ బింబం బ్రహ్మలోకద్వారాన్ని మూతలా కప్పియున్నది. ఓ సూర్యభగవానుడా! వ్రతనిష్ఠుడనైన నేను, సత్యాన్ని దర్శించడానికి వీలుగా బ్రహ్మలోకద్వారానికి మూతలా ఉన్న నీ కాంతిని ఒక్కసారి ఉపసంహరించుకో. అప్పుడు నేను సత్యమార్గాన్ని చూడగలుగుతాను. ఓం జ్యోతిరాదిత్యాయ నమః.

## 570. సహిష్ణుః

- అపారమైన సహనము కలవాడు.
- క్షమించువాడు.
- మనకొరకు అమితమైన కష్టములను భరించువాడు. (తాను కర్మరహితుడై కూడాను).
- శత్రువులను జయించువాడు.
- భక్తులు సమర్పించినవానిని ప్రీతితో గ్రహించువాడు.
- ద్వంద్వములను సహించువాడు.

### ఓం సహిష్ణవే నమః

ఈ పుణ్యనామము 16వ శ్లోకములోను, 60వ శ్లోకములోను కీర్తింపబడినది.

16వ శ్లోకము. 146వ నామము. సహిష్ణుః – **భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః**

60వ శ్లోకము. 570వ నామము. సహిష్ణుః – **ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుః గతిసత్తమః**

(1) అపారమైన సహనము కలవాడు సహిష్ణువు.

అనేక అపరాధములను సహించువాడు **(అపరాధ సహనాత్ సహిష్ణుః)** అని వ్యాఖ్యానిస్తూ శ్రీభట్టులు నారాయణునికి, రుద్రునికి జరిగిన పోరాటాన్ని ప్రస్తావించారు. పరాజితుడైన శివుని అపరాధమును భగవానుడు మన్నించాడట. ఇది బహుశా బాణాసురుని కాపాడడానికి శివుడు విష్ణువుతో చేసిన యుద్ధం గురించి కావచ్చును. శ్రీ వి.వి. రామానుజన్ శిశుపాలుని తప్పిదాలను శ్రీకృష్ణుడు మన్నించిన వైనాన్ని ఉదాహరించారు. శ్రీ రాధాకృష్ణశాస్త్రి రామాయణంనుండి శ్రీరాముని వర్ణన – **క్షమయా పృథ్వీ సమః** – ను ఉదాహరించారు. అంతే కాకుండా భగవానుడు దేవకి, అదితి, కౌసల్య వంటి క్షమామూర్తులకు జన్మించి వారి క్షమాగుణములను పుణికిపుచ్చుకొన్నాడట.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – 'సహనము' అనేది భగవంతుని తత్వముగా అనిపిస్తున్నది. ఆయన స్వభావము, ధర్మము, నడవడిక – అన్నీ 'సహించుట'తో నిండియున్నవి. **సహతే తద్ధర్మః తత్శీలః తత్సాధుః.** సృష్టిలో ఆయన సహనతత్వము అణువణువునా ప్రతిబింబిస్తుంది. ఉదాహరణకు శరీరం బరువును, ధర్మాలను, కార్యాలను నిలిపియుంచే అస్థిపంజరము.

డా. క్రోవి పార్థసారధి శ్రీకైవల్యసారధిలో వ్రాసినది – **బ్రహ్మాదిమంతు సహనాత్ సహిష్ణురితి కథ్యతే.** బ్రహ్మాదుల అపరాధములను సహించువాడు సహిష్ణువు. **సహతే ఇతి సహిష్ణుః.** దేవతలయొక్క అపరాధములను సహించినవాడు సహిష్ణువు.

**ప్రసాదయామాస భవః దేవం నారాయణం ప్రభుం**
**శరణం జగతామాద్యం వరేణ్యం వరదం హరిం**
**తదైవ వరదో దేవః జితక్రోధః జితేంద్రియః**
**ప్రీతిమాన భవత్తత్ర రుద్రేణ సహసంజ్ఞితః**

జగములకు ఆదియైనవాడు, సర్వశ్రేష్ఠుడు, అభీష్టములను ఇచ్చువాడు, సకలపాపరహితుడు, సర్వవ్యాపకుడు అయిన శ్రీమన్నారాయణుని రుద్రుడు ప్రార్థించాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు కోపము పోయి, ప్రీతితో రుద్రునితో కలిసిపోయాడు. ఓం సహిష్ణవే నమః.

(2) క్షమించువాడు సహిష్ణువు.

146వ నామం వ్యాఖ్యానంలో శ్రీభట్టులు భగవంతుని క్షమాగుణాన్ని విస్తారంగా కీర్తించారు. ఆయనకు శరణాగతులైన భక్తుల అపచారములను శ్రీనివాసుడు తప్పక మన్నించును. **ప్రాక్, ఊర్ధ్వంచ, సంచితానామ్, బుధ్యా, అబుధ్యా, సకల కారణైః, సర్వదా, సర్వథా చ, ప్రచీయ మానానామ్, విధి నిషేధ శాసన అతిలంఘనాత్మానామ్, సాధారణానామ్, అతి సాధారణానాం చ, స్వావజ్ఞా నిందానీనామ్, సర్వం సహేన స్వేనాపి దుస్సహానామ్, స్వభక్త విషయాణాంచ, అనవధికానామ్, అపరాధానామ్, సహిష్ణుః.** పూర్వజన్మలో చేసినవి, ఈ జన్మలో చేసినవి, సంచితములు, తెలిసి చేసినవి, తెలియక చేసినవి, అన్ని అంగములతోను, అన్ని ఇంద్రియములతోను అన్ని విధములుగ చేసినవి, శాస్త్రముల విధిని అతిక్రమించి చేసినవి, శాస్త్రములను పాటించకుండ చేసినవి, భగవానుని నిందించి దూషించినవి, భాగవతులను నిందించి దూషించినవి – అన్ని విధములైన పాపములను క్షమించువాడు సహిష్ణువు. ఓం సహిష్ణవే నమః.

శరణాగతి గద్యములో శ్రీభగవద్రామానుజులు మనమొనరించే కొన్ని దారుణాపచారములను చెప్పి మన పక్షాన శ్రీరంగనాధుని క్షమను అర్థించారు – **మనోవాక్కాయైః అనాదికాల ప్రవృత్త అనంత అకృత్య కరణ అకరణ భగవదపచార భాగవతాపచార అసహ్య అపచార రూప నానావిధ అసహ్య అపచారాన్ ఆరబ్ధ కార్యాన్ అనారబ్ధ కార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాన్ శ్చ సర్వాన్ అశేషతః క్షమస్వ.** మనసుచేత గాని మాటలచేతగాని చేతలచేతగాని చేసిన అపచారములను; లెక్కలేనన్ని జన్మలందు చేసిన పాపములను; చేయకూడని పనులు చేయుటవలన గాని, చేయవలసిన పనులు చేయకుండుట వలన గాని ప్రోగుపడిన అనంత పాపములను; భగవంతుని పట్లను, భాగవతుల (భగవద్భక్తుల) పట్లను చేసిన అపచారములను; సహింపరానివి, క్షమింపరానివి అయిన నానావిధ అపచారములను; ఇప్పటికే పండినవి మరియు ఇంకా పండనివి అయిన పాపములను; ఇదివరకు చేసినవి, ఇప్పుడు చేస్తున్నవి, మరియు ఇంకముందు చేయబోవునవి అయిన పాపములను – అంతులేని అన్ని పాపములను మన్నించు ప్రభూ. అన్ని పాపములను భగవంతుడు నిశ్శేషంగా క్షమిస్తాడు. అందుకు ఆయనకు శరణాగతులము కావలెను. ఇదియే ప్రపత్తి.

(3) కర్మరహితుడైకూడా మనకొరకు అమిత కష్టములను సహించువాడు సహిష్ణువు.

గోవర్ధనగిరిని తన వ్రేలిపై ఎత్తినట్లుగా జగన్నాధుడు ఎన్ని అపరాధములు జరిగినాగాని మన్నించి సకల భువనములను భరించియుండును.

(4) శత్రువులను జయించువాడు సహిష్ణువు (సహతే - జయించును).

హిరణ్యాక్షాది దుష్ట రాక్షసులను సంహరించిన శ్రీవరాహమూర్తియే సహిష్ణువు.

(5) భక్తులు సమర్పించినదానిని ప్రీతితో గ్రహించువాడు సహిష్ణువు.

భక్తులు సమర్పించిన పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, తోయము(జలము)గాని ప్రీతితో గ్రహించువాడు, గ్రహించి తృప్తినొందువాడు సహిష్ణువు. ఇది ఆయన గుణము అని శ్రీ కృష్ణదత్తభరద్వాజ ఈ నామమును వ్యాఖ్యానించారు. **సహితుమ్ తృప్తిమ్ అనుభవితుమ్ భక్త ఉపహృతైః ఫలాదిభిః శీలమ్ యస్య ఇతి సహిష్ణుః – సోఢుమ్ తృప్తిమ్ అనుభవితుమ్ స్వజన సేవయా శీలమ్ అస్య ఇతి సహిష్ణుః.**

(6) ద్వంద్వములను సహించువాడు సహిష్ణువు.

ఈ నామమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య – **ద్వంద్వాని శీతోష్ణాదీని సహత ఇతి సహిష్ణుః** – భగవంతుడు శీతోష్ణములు, సుఖ దుఃఖములు వంటి ద్వంద్వములకు అతీతుడు. బదరికాశ్రమములో నరనారాయణులుగా శ్రీదేవుడు చేసిన తపస్సు ఈ విషయమును తెలుపుచున్నదని శ్రీ అనంతకృష్ణశాస్త్రి వ్రాశారు. ఓం సహిష్ణవే నమః.

## 571. గతిసత్తమః

- ధర్మమార్గమును బోధించువారిలో ఉత్తముడు.
- శరణాగతులకు ఉత్తమ గమ్యము.
- పరమోత్కృష్టమైన ఆలంబనము మరియు అందరికంటె గొప్పవాడు.

### ఓం గతిసత్తమాయ నమః

ఈ నామమును **సద్గతిః తమః, గతిః సత్తమశ్చ, సత్ తమః గత్యైః** – ఇలా అనేక విధాలుగా వివరించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స ఏవ పరమ ధర్మాధ్వదేశికత్వేన గతిః సత్తమః - గతౌ ప్రత్యయిత తమః** – భగవానుడు గీత, వేదములవంటి ధర్మశాస్త్రములను ప్రసాదించాడు. ధర్మములనుపదేశించు గురువులలో ఆయన ఉత్తముడు. జగద్గురువు. గతిసత్తముడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఈ నామము భగవానుని 'గతి', 'సత్తమ' అనే రెండు గుణాలను సూచిస్తుంది. **గతిశ్చ అసౌ సత్తమశ్చ ఇతి గతిసత్తమః**. ఆయనే అందరికి గతి (ఆశ్రయము) మరియు అందరికంటెను గొప్పవాడు (సత్-తమః). కనుక గతిసత్తముడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వ్యాఖ్య – కోరవలసినవానిలో సర్వోత్తముడైనందున భగవానుడు గతిసత్తముడు. ఎందుకంటే ఆ శ్రీమన్నారాయణుడు సహనము కలవాడు మరియు క్షమించువాడు (సహిష్ణువు). పాపులను కూడా క్షమించి ఆశ్రయమిస్తాడు కనుక ఆయనను ఆశ్రయించడమే తగిన కర్తవ్యము.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **గంతవ్య స్థానే గతి ప్రయోగః.** వెళ్ళవలసిన చోటును 'గతి' అన్న పదం సూచిస్తుంది. అలా చేరవలసిన సర్వోత్తమస్థానం హరిచరణ సన్నిధియే. **శ్రీమన్నారాయణ చరణ సాన్నిధ్యమేవ సర్వోత్తమమ్ గంతవ్యమ్.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా ఇదే భావాన్ని చెప్పారు – **గతి శబ్దేన ఇహ గతిరాశ్రయః గృహ్యతే తేన గతిరాశ్రితానామ్ శ్రేష్ఠతమో గతిసత్తమః** ఓం గతిసత్తమాయ నమః



శ్రీకాకుళం నారాయణ తిరుమల దేవాలయంలో
శ్రీ దేవీ భూదేవీ సమేతులై ఆదిశేషునిపై పవళించిన శ్రీ మహా విష్ణువు. నాభి కమలంలో బ్రహ్మ.
వికీపీడియా నుండి . రాజశేఖర్ తీసిన చిత్రం https://en.wikipedia.org/wiki/User:Rajasekhar1961



## సుధన్వా ఖండపరశుర్దారుణో ద్రవిణప్రదః |
## దివస్పృక్ సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః || (61)

### 572. సుధన్వా

- సుశోభనమైన ధనుస్సును ధరించినవాడు.

**ఓం సుధన్వనే నమః**

సు - చక్కని, మంగళకరమైన ధనుస్సును ధరించినవాడు అని ఈ నామమునకు అర్థము. ఈ నామ వివరణలో వ్యాఖ్యానకర్తలు వివిధ అనుభవములను ప్రస్తుతించారు.

శ్రీ భట్టులు – క్షీరసాగర మథనానంతరం ఉద్భవించిన అమృతం గురించి దేవదానవుల మధ్య భీకరమైన పోరు జరిగింది. అప్పుడు శ్రీమహావిష్ణువు ధనుస్సును ధరించి అసురసంహారం కావించాడు. **సుశోభనం ధనుః యస్య సః సుధన్వా.**

శ్రీ శంకరులు – **శోభనమ్ ఇంద్రియాదిమయం శార్ఙ్గ ధనుః అస్య అస్తి ఇతి సుధన్వా.** శ్రీమహావిష్ణువు చేతిలోనున్న శార్ఙ్గము అనే ధనుస్సు సకలేంద్రియములపై ఆయనకున్న అధిపత్యమునకు సంకేతము. ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రిగారు విష్ణుపురాణము (1.22.69)నుండి ఉదాహరించారు –

**భూతాదిం ఇంద్రియాదిం చ ద్విధా అహంకారం ఈశ్వరః బిభర్తి శంఖరూపేణ శార్ఙ్గరూపేణ చ స్థితమ్.**
ఈ శ్లోకం చెప్పిన సందర్భం – విశ్వంలో సకలములూ భగవంతుని ఆయుధములు లేదా అంగాలపై ఆధారపడి ఉన్నాయి. సకలేంద్రియములు,అహంకారము భగవానునిచేత శార్ఙ్గము అనే ధనుస్సు రూపంలో అధీనమై ఉన్నాయి.

**శ్రీమద్రామాయణము – యుద్ధకాండము – రావణవధ**

(శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిహొళ్ళ వేంకట కోనప్పాచార్యులు రచించిన "సుందరకాండము"నుండి.)

మాతలి పలుకులచేత స్మరింపజేయబడిన రాముడు బ్రహ్మచేత ఇవ్వబడిన, యుద్ధములో తిరుగులేని గొప్ప బాణమును పూర్వము భగవంతుడైన అగస్త్యుడు తనకిచ్చెనో అట్టి, బుసలు కొట్టుచున్న సర్పమువలె ప్రకాశించుచున్న బాణమును తీసెను. ఆ బాణము రెక్కలందు వాయువు, ములికియందు అగ్ని సూర్యులు, బరువునందు మేరు మందర పర్వతములు అధిష్ఠాన దేవతలుగా ఉందురు. దాని శరీరము బ్రహ్మమయము. అది ధూమముతో కూడిన ప్రళయకాలాగ్నివలె ప్రజ్వలించుచుండెను.

మహాబలశాలియైన రాముడు ఆ బాణమును వేదోక్తప్రకారము అభిమంత్రించి ధనుస్సుపై సంధించెను. అప్పుడు సర్వభూతములు భయపడినవి. భూమి కంపించెను. రాముడు ధనుస్సును బాగుగా లాగి సావధానచిత్తుడై ఆ బాణమును రావణునిపై ప్రయోగించెను. వజ్రాయుధమువలె ఎదిరింప శక్యముగాని ఆ బాణము రావణుని హృదయమును బ్రద్దలుకొట్టెను. రావణుని ప్రాణములను హరించి రక్తముచేత పూయబడినదై భూమిలో ప్రవేశించెను. పిదప చడీచప్పుడు లేకుండా తిరిగి రాముని అమ్ములపొదిలో తిరిగి ప్రవేశించెను. రావణుడు ప్రాణములను విడిచి రథమునుండి నేలపై కూలెను. ... ......

వానరులు రాముని విజయమును, రావణుని వధను గూర్చి చెప్పుకొనుచు గొప్పగా హర్షధ్వానములు చేసిరి. దేవ దుందుభి మధురముగా మ్రోగెను. సుగంధ భరితమైన వాయువు సుఖకరముగా వీచెను. రాముని రథముపై పుష్పవర్షము పడెను. దేవతలు, చారణులు 'బాగు బాగు' అని శ్రేష్ఠవాక్యములు పలికిరి. రాముడు ఇలా సుగ్రీవాంగద విభీషణుల కోరిక తీర్చెను. దేవతలు మనఃశాంతిని పొందిరి. దిక్కులు ప్రసన్నములయ్యెను.



రావణ వధ – 1650 కాలానికి చెందిన ఉదయపూర్ చిత్రం. వికీపీడియా నుండి. చిత్రకారుడు Sahib Din

https://commons.wikimedia.org/wiki/File:Ravana_losing_his_heads.jpg

తతస్తు సుగ్రీవ విభీషణాంగదాః సుహృద్విశేషాః సహ లక్ష్మణాస్తదా

సమేత్య హృష్టా విజయేన రాఘవం రణేఽభిరామం విధినాభ్య పూజయన్

పిమ్మట సుగ్రీవ విభీషణ అంగదులు, లక్ష్మణుడు, ఇతర మిత్రులు యుద్ధములో రాముని విజయముచేత సంతోషించి, అతనిని సమీపించి, మనోహరుడైన ఆ రాముని యథావిధిగా పూజించిరి.

స తు నిహత రిపుః స్థిర ప్రతిజ్ఞః స్వజన బలాభివృతో రణే రరాజ

రఘుకుల నృప నందనో మహౌజా స్త్రిదశగణైరభి సంవృతో యథేన్ద్రః

రఘువంశ రాజులకు ఆనందకరుడైన ఆ రాముడు శత్రువును చంపి, ప్రతిజ్ఞ నిలుపుకొని, యుద్ధరంగములో తన మిత్రాదులతోను, సైన్యముతోను కూడినవాడై, దేవతాగణములతో కూడిన ఇంద్రునివలె ప్రకాశించెను.

## 573. ఖణ్డపరశుః

- ఖండితమైన (ముక్కలైన) పరశువు (గండ్రగొడ్డలి) కలవాడు.

- శత్రువులను ఖండించెడి పరశువు కలవాడు. పరశురాముడు.

### అఖణ్డపరశుః

- ఎదురులేని పరశువును ధరించినవాడు. పరశురాముడు.

### ఓం ఖండపరశవే నమః

### ఓం అఖండపరశవే నమః

**తీవ్ర కోపాత్పరశువా రౌద్ర సర్గానుఖండనాత్ ఇత్యుక్తః ఖండపరశుః నవార్ణశ్లోక వినాశకః -** రుద్రునితో యుద్ధం జరిగినప్పుడు మిక్కిలి కోపంతో అతని గండ్రగొడ్డలిని ఖండించినవాడు. ఈ నామము నవాక్షరీమంత్రము. సకల దుఃఖహారిణి. **ఓం ఖండపరశువే నమః.**

ఖను - భేదన - అవధారణ (ఖది - భేదనే - ముక్కలు చేయుట); **పరమ్ శృణతి ఇతి పరశుః శత్రమ్**

**ఖండపరశుః** - విరిగిన గొడ్డలి కలవాడు (శ్రీ సత్యదేవో వాసిష్ఠ).

మరొక విధంగా (శ్రీ కృష్ణదత్త భరద్వాజ) – **ఖండయతి శత్రూనితి ఖండః, ఖండః పరశుః యస్య ఇతి ఖండపరశుః** – శత్రువులను శిక్షించు గొడ్డలి కలవాడు ఖండపరశువు.

ఈ నామ వివరణలో శ్రీ భట్టులు విష్ణువునకు, రుద్రునకు జరిగిన యుద్ధాన్ని గురించిన శ్లోకాన్ని ప్రస్తావించారు. ఇక్కడ భగవానుని పరశువు ఖండింపబడినది గనుక ఆయన 'ఖండపరశువు' అయినాడు.

**అథ రుద్ర విఘాతార్థం ఇషీకామ్ నర ఉద్ధరన్**
**మంత్రైశ్చ సమ్యుయోజాసు సో భవత్ పరశుర్మహాన్**
**క్షిపతశ్చ సహసా రుద్రే ఖండనమ్ ప్రాపవాన్ స్తథా**
**తతోఽహమ్ ఖండపరశుః తతః పరశుఖండనాత్.**

అపుడు రుద్రుని దండించడానికి నరుడు ఒక గడ్డిపరకను తీసికొని మంత్రించగా అది గొప్ప పరశువు అయ్యింది. ఆ పరశువు రుద్రునివైపు బలంగా వేయబడింది కాని అది విరిగిపోయింది. అలా జరిగినప్పటినుండి నేను 'ఖండపరశువు' అనే నామంతో పిలువబడ్డాను.

శ్రీ శంకరులు ఈ నామమును పరశురామావతారపరముగా వ్యాఖ్యానించారు. జమదగ్ని కుమారుడైన పరశురాముడు గొప్ప పరశువును ధరించి శత్రువులను ఖండించాడు. శ్రీ శంకరులే 'అ-ఖండ-పరశుః' అని కూడా ఈ నామాన్ని చెప్పవచ్చునన్నారు. ఎదురులేని పరశువు కలిగినవాడు అఖండపరశువు.



కేరళలో శ్రీ పరశురాముని విగ్రహం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Parashurama - പരശുരാമൻ.JPG

**574. దారుణః**

- బాహ్య, అంతః శత్రువులను చీల్చివేయువాడు (**దారణాత్ దారుణః**)
- ధర్మవిరుద్ధముగా నడచువారిని కఠినముగా శిక్షించువాడు (**దారుణత్వాత్ దారుణః**)

**ఓం దారుణాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **బాహ్యాభ్యంతరారి దారణాత్ దారుణః**. బాహ్య శత్రువులను, అంతఃశత్రువులను సంపూర్ణముగా నాశనము చేయువాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సన్మార్గ విరోధినామ్ దారుణత్వాత్ దారుణః**. దుష్టమార్గములో నడచువారిని కఠినముగా శిక్షించువాడు. ఇలా శిక్షిచడం కూడా వారిని పాపవిముక్తులను చేసి కాపాడడానికే అని శ్రీ చిన్మయానంద వివరించారు.

**తరువాతి 10 నామములను వ్యాసభగవానుని పరంగా వివరించారు.**

**575. ద్రవిణప్రదః**

- ధనమును ప్రసాదించువాడు.

**ఓం ద్రవిణప్రదాయ నమః**

**శాస్త్రం తదర్థం ద్రవిణం ప్రదదాతి జనాయ యః వ్యాసో భూత్వా హరిస్సాక్షాత్ ద్రవిణప్రద ఉచ్యతే** - సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే వ్యాసునిగా అవతరించి జనులందరికీ శాస్త్రాలు అనే ధనాన్ని ఇచ్చి ద్రవిణప్రదుడు అనబడ్డాడు. శ్రీ భట్టులు తమ వ్యాఖ్యానంలో శాస్త్రధనం గురించి చెప్పారు. వ్యాసుని ధ్యానశ్లోకం –

**వహన్త్యై వామహస్తేన సర్వశాస్త్రార్థ సంచయమ్**
**దక్షిణేన చ శాస్త్రార్థాన్ ఆదిశంశ్చ యథాస్థితాన్**
సకల శాస్త్ర అర్థాలను ఎడమచేతితో ధరించి, కుడిచేతితో వాటి అర్థాలను వ్యాఖ్యానిస్తూ ఉండే వ్యాసమహర్షికి నమస్కారము (కుడిచేత ఉపదేశముద్ర ధరించియున్నవాడు).
**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః.**
వ్యాసుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు స్వరూపము. అలా వ్యాసుని రూపంలో ఉన్న విష్ణువుకు, బ్రహ్మజ్ఞానమునకు నిధియైన వసిష్ఠుని మునిమనుమడైన వ్యాసునకు నమస్కారము.

శ్రీ శంకరుల వ్యాఖ్యానములో 'ద్రవిణము' అనగా 'ధనము, సంపద' అనే సాధారణ అర్థము ఉన్నది. **ద్రవిణం వాంఛితం భక్తేభ్యః ప్రదదాతి.** భక్తులు కోరిన సంపదను ప్రసాదించువాడు ద్రవిణప్రదుడు. 'ద్రవిణము' అన్న పదము 'ద్రవము' అనగా కావలసినపుడు ఉపయోగించదగినది, నిలకడ లేనిది అన్న భావాలను శ్రీ రాధాకృష్ణశాస్త్రి, శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరించారు.

**దధాతి రత్నమ్ ద్రవిణమ్ చ దాశుషే అగ్నే సఖ్యే మాఋుషామ్ వయమ్ తవ** – ఋగ్వేదము 1.94.1.4.
**యత్కామాస్తే జుహుమాస్తన్నో అస్తువయం స్యామ పతయోరయీణామ్** – యజుర్వేదము 40.16.

ధర్మచక్రము రచయిత – ప్రేయోధనము, శ్రేయోధనము అని రెండు విధములు. ప్రేయోధనము సౌఖ్యమును ప్రీతిని కలిగించును కాని కాలక్రమమున కష్టములే కలిగించును (డబ్బు, కుటుంబము, అధికారము వంటివి). శ్రేయోధనము బంధములను తొలగించి మోక్షమునకు మార్గమును సుగమము చేయును. నచికేతుడు ప్రేయోధనము వలదని, యమునినుండి శ్రేయోధనమును గ్రహించెను.

## 576. దివిస్పృక్
## దివస్పృక్

https://commons.wikimedia.org/wiki/File:Crafts_museum_ivory_work.png
Craftsman – Sri C S Viswam
Photo by : Rajendersinghkain




- ఆకాశమును స్పృశించినవాడు.
- పరావిద్యద్వారా సర్వమును స్పృశించువాడు.
- విశ్వము మాత్రమే గాక విశ్వమును అధిగమించిన శరీరము కలవాడు.
- వామనావతారమున అడుగుతో ఆకాశమును స్పృశించినవాడు.
- ఆకాశమునంటే విశ్వరూపమును అర్జునునకు చూపినవాడు.
- సూర్యాది ఖగోళములకు అంతర్యామి.

ఓం దివిస్పృశే నమః
ఓం దివస్పృశే నమః

(1) శ్రీ భట్టుల వివరణ – **పరయా విద్యయా యస్స్వం స్పృశతీతి పరే పదే దివిస్పృక్ సోచ్యతే నిత్యం.** పరవిద్యాజ్ఞానమువలన పరమతత్త్వమును పరమపదమును స్పృశించువాడు.

(2) శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఛాందోగ్యోపనిషత్తు (1.12.6)లో **'త్రిపాదస్యామృతమ్'** అని ఉన్నది. భగవానుని శరీరములో నాలుగవ భాగము విశ్వరూపమైయున్నదనియు, తక్కిన శరీరము విశ్వమునకు వెలుపల విస్తరించియున్నదనియు శృతివాక్యము.

(3) శ్రీ కృష్ణదత్త భరద్వాజ – (దివస్పృక్) వామనావతారమున తన అడుగుతో ఆకాశమును స్పృశించినవాడు.

(4) శ్రీ చిన్మయానంద – ఆకాశమునంటుచున్న విశ్వరూపమును శ్రీకృష్ణుడు అర్జునునకు చూపెను.

(5) శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఋగ్వేదము(10.168.1)లో

**వాతస్యను మహిమాం రథస్యరుజన్నేతి స్తనయన్నస్య ఘోషా**
**దివిస్పృగ్యాంత్యరుణాని కృణ్వన్నుతో ఏతి పృథివ్యారేణుమస్యమ్.**

శృతులలో దివిక్షయమ్, దివిక్షితా, దివిచరాః, దివిజాః, దివియజః, దివియోనిః, దివిశృతః, దివిషదః, దివిసదమ్ వంటి అనేక పదములు సూర్యుని సూచిస్తూ వాడారు. సూర్యునికి, ఇతర గ్రహములకు అంతర్యామియైనందున శ్రీహరి దివిస్పృక్.

**నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాల నేత్రమ్**
**దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో** – గీత 11.24

హే విష్ణో! నీ రూపము అంతరిక్షమును తాకుచున్నది. అది అనేక వర్ణములతో దేదీప్యమానమై వెలుగుచున్నది. కాంతులను విరజిమ్ము విశాల నేత్రములతో, విస్తరించిన మఖములతో అద్భుతముగా ఒప్పుచున్నది. అట్టి నీ రూపమును చూచిన నా మనస్సు తత్తరపడుచున్నది. అందువలన నా ధైర్యము సడలినది. శాంతి దూరమైనది.

## 577. సర్వదృక్

- సమస్తమును దర్శించువాడు.
- సమస్తమును, పరిపూర్ణ పరతత్వమును చూచుచుండువాడు.
- సకలముల జ్ఞానమునకు పరిపూర్ణరూపుడు.
- అనేక విధములుగా చూచే జీవులను సృష్టించినవాడు.

### ఓం సర్వదృశే నమః

**సర్వస్య ద్రష్టా సర్వదృక్**. పరతత్వముయొక్క పరిపూర్ణతను సంపూర్ణముగా తెలిసికొన్నవాడు. **సర్వదర్శనాత్ సర్వదృక్** – అని నిరుక్తి వాక్యము. 'సర్వదృక్' అనగా సకల జ్ఞానము అనికూడ చెప్పవచ్చును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరొక దృక్పథంలో ఈ నామమును వ్యాఖ్యానించారు. గాలిలోను, నీటిలోను, చీకటిలోను, సూక్ష్మపదార్థాలలోను చూడగలిగే అనేక జీవులను భగవంతుడు సృష్టించాడు. ఇవన్నీ చూపుద్వారా మాత్రమే గాక, స్పర్శ, ఘ్రాణాది ఇంద్రియాలద్వారా కూడా చూస్తుంటాయి (తెలిసికొంటుంటాయి). ఇలా సకల జీవులు చూస్తూ ఉండేవన్నీ భగవంతుడు చూస్తున్నట్లే.

శ్రీ శంకరులు ఈ నామమును, తరువాతి నామమును కలిపి **'సర్వదృగ్వ్యాసః'** అని వ్యాఖ్యానించారు. శ్రీ భట్టులు **'సర్వదృగ్'**, **'వ్యాసః'** అనే రెండు నామములుగా పరిగణించారు.

## 578. వ్యాసః

### సర్వదృగ్వ్యాసః

- అమర్చువాడు. విభజించినవాడు.
- వేదములను, పురాణములను విభజించినవాడు.
- కాలమును, సృష్టిని వివిధ భాగములుగా విభజించినవాడు.
- కౌస్తుభము తదితర విశేష ప్రకాశముగల ఆభరణములు ధరించినవాడు.

### ఓం వ్యాసాయ నమః

### ఓం సర్వదృగ్వ్యాసాయ నమః



శ్రీ వేదవ్యాసునికి ఉపదేశం చేస్తున్న శ్రీ నారదుడు. 1915లో ముద్రించిన తమిళ పురాణాల గ్రంధం చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Narada_meetsVyasa.jpg

**విభజనస్తు చతుర్ధావై వేదమేకమ్ త్రికాలవిత్ ఇతి వ్యాసః.** ఒకటిగా ఉన్న వేదమును ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదములుగా విభజించినందున భగవానుడు వ్యాసుడని శ్రీభట్టులు వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరులు వేదవిభజనతోపాటు పురాణాల విభజనను కూడా ప్రస్తావించారు. **అన్యాని చ పురాణాని వ్యస్తాని అనేన ఇతి వ్యాసః.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **వ్యాస్యంతే పృథక్రియంతే అనేన ఇతి వ్యాసః.** జగములను విభజించినవాడు వ్యాసుడు. సృష్టిని, కాలమును రాత్రింబవళ్ళుగాను, ఉత్తరాయణ దక్షిణాయనములుగాను, శుక్ల కృష్ణ పక్షములుగాను, సూర్య చంద్రాదులుగాను విభజించినందున శ్రీనివాసుడు వ్యాసుడనబడును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ చెప్పిన మరొక వివరణ – **యస్య కౌస్తుభాదీని ఆభరణాని విశేషేణ సంతి దీప్యంతి స వ్యాసః.** ఆయన ధరించిన కౌస్తుభాది ఆభరణములు విశేషముగా ప్రకాశించును.

శ్రీ శంకరులు, ఆయన వ్యాఖ్యను అనుసరించినవారు **'సర్వదృగ్వ్యాసః'** అనే నామమును (ఒకటిగా) పరిగణించారు. సర్వదృగ్-వ్యాస – అనగా అంతా తెలిసిన వ్యాసుడు అని అర్థం. ఇందుకు శ్రీ చిన్మయానంద చెప్పిన చక్కని వివరణ – ఎందరో విజ్ఞానవంతులను సృజించువాడు సర్వదృగ్వ్యాసుడు. వారిద్వారా జ్ఞానమును లోకులకు అందించును.

**వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం  పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం**

## 579. వాచస్పతిః

## 580. అయోనిజః

### వాచస్పతిరయోనిజః

శ్రీ భట్టులు ఈ రెండు నామములను వేరువేరుగా చెప్పారు. శ్రీ శంకరులు రెండింటినీ కలిపి ఒకే నామముగా చెప్పారు.

- **వాచస్పతిః** – వాక్కునకు అధిపతి. మహాభారతకర్త అయిన వేదవ్యాసుడు.
- **అయోనిజః** – గర్భమునుండి గాక, భగవంతుని శబ్దమునుండి జన్మించినవాడు అయిన వేదవ్యాసుడు.
- **వాచస్పతిరయోనిజః** – జననియందు జన్మించనివాడును, సకల విద్యలకు నాధుడును అయిన శ్రీహరి.

**ఓం వాచస్పతయే నమః**

**ఓం అయోనిజాయ నమః**

**ఓం వాచస్పతిరయోనిజాయ నమః**

**వాచస్పతిః –** ఈ నామము ఇంతకుముందు 218వ నామముగా వచ్చింది.

23వ శ్లోకము. 218వ నామము. వాచస్పతిః – **నిమిషోऽనిమిషః స్రగ్వీవాచస్పతిరుదారధీః**

61వ శ్లోకము. 579వ నామము. వాచస్పతిః – **దివస్పృక్ సర్వదృగ్ వ్యాసో వాచస్పతిరయోనిజః**

23వ శ్లోకం నామము వివరణలో చెప్పిన అర్థాలు ఇలా ఉన్నాయి.

శ్రీ భట్టులు – మత్స్యపురాణంలో వేదములను ఉపదేశించిన జగద్గురువు. వేదములకు మూలము. వాచస్పతి.

శ్రీ శంకరులు – **'వాచస్పతిరుదారధీః'** (అనే ఒకే నామమును పరిగణించారు) అనగా పరమోత్తమ జ్ఞానస్వరూపుడైన విద్యాధినాధుడు.

61వ శ్లోకంలో ఈ నామమును శ్రీభట్టులు వేదవ్యాసపరంగా వివరించారు. **వాచ పంచమ వేదస్య స్వామీ వాచస్పతి స్మృతః.** పంచమవేదమైన మహాభారతాన్ని వ్రాసినవాడు వాచస్పతి.




నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్

నారాయణునికి, నరులలో ఉత్తముడైన నరునికి, సరస్వతిదేవికి, వ్యాసుడికి నమస్కరించి జయమును చెప్పాలి. ఇక్కడ 'జయము' అనగా మహాభారతము.

ఇది మహాభారతం ప్రథమ శ్లోకము. ప్రతి పురాణం ప్రారంభంలో ఈ శ్లోకం చెప్పటం పరంపర.

గీతా ప్రెస్ వారి ప్రచురణలోని చిత్రం.

By: Ramanarayanadatta Sastri

https://commons.wikimedia.org/wiki/File:Mahabharata01ramauoft_0024_01.jpg

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – వాక్కులకు పతి వాచస్పతి వ్యర్థమైన మాటలు చెప్పడు కనుకనే వేదములు, బ్రహ్మసూత్రములవంటివి అంత సంక్షిప్తంగా ఉంటాయి.

శ్రీ చిన్మయానంద – జీవిత పరమసత్యానికి అధిపతి వాచస్పతి.

కొందరు వ్యాఖ్యాతలు 'వాక్' అనగా సరస్వతి అన్న అర్థాన్ని గ్రహించి, ఈ నామము బ్రహ్మను కీర్తిస్తున్నదని చెప్పారు.

**అయోనిజః –** జనని గర్భమునుండి పుట్టనివాడు.

**సారస్వతావతారేహి భగవన్ముఖ సంభవాత్ స్మృతో హ్యయోనిజ ఇతి వస్వర్ణః కర్మనాశకః -** వ్యాసావతారమెత్తి పరమేశ్వరుని వాక్కునుండి ఉద్భవించినవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. కర్మనాశకము. ఓం వాచస్పతిరయోనిజాయ నమః. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతము శాంతిపర్వము (3.50.37)నుండి ఉదాహరించారు. **అథ భూయో జగత్ సృష్ట్వా 'భో' శబ్దేన అనువాదయన్ సారస్వతీమ్ ఉచ్చార తత్ర సారస్వతో భవాత్**

**వాచస్పతిరయోనిజః – వాచో విద్యాయాః పతిః వాచస్పతిః.** వాక్కులకు, విద్యలకు నాథుడు వాచస్పతి. మరియు తల్లి గర్భమున జన్మింపనివాడు (స్వయంభువు) వాచస్పతిరయోనిజః. మాతృగర్భమునుండి జన్మించని మహావిద్యా కళావిజ్ఞాననిధి. శ్రీహరిని ఆశ్రయించినవారికే సకల కళలును చేకూరును.










(పైన ఎడమవైపు) తెలంగాణ. చిలుకూరు శ్రీ బాలాజీ ఆలయం . Photo by Srilakshmi1991
https://commons.wikimedia.org/wiki/File:Chilukuru_temple.jpg

(పైన కుడివైపు) ఆంధ్ర ప్రదేశ్. ద్వారకా తిరుమల ఆలయం Photo by Ramireddy.y
https://commons.wikimedia.org/wiki/File:Dwaraka_Thirumala_Gopuram.jpg

(క్రింద కుడివైపు) ఆంధ్ర ప్రదేశ్. తిరుమల తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం Photo by Lokeshloki400
https://commons.wikimedia.org/wiki/File:Tirumala_tiupathi.jpg

(క్రింద ఎడమవైపు) కర్ణాటక. చిక్క తిరుపతి ఆలయం Photo by Ssriram mt
https://commons.wikimedia.org/wiki/File:Chikka_Tirupathi2.jpg



## త్రిసామా సామగః సామ నిర్వాణం భేషజం భిషక్ |
## సంన్యాసకృచ్ఛమశ్శాంతో నిష్ఠా శాంతిః పరాయణం || (62)

### 581. త్రిసామా

- మూడు విధములైన సామగానములచే స్తుతింపబడువాడు.

### ఓం త్రిసామ్నే నమః

**ప్రోక్త స్త్రిసామా యశ్చాసౌ బృహదాది త్రిసామకః.** బృహత్తు, రథంతరము, వామదేవ్యము అనే మూడు సామములచేత కీర్తింపబడువాడు. నాలుగు వేదాలలో సామవేదము ఒకటి. సామవేదములో దేవతాస్తుతులు ఉన్నాయి. ఇందులో దేవవ్రతము అనే విభాగంలో బృహత్, రథంతర, వామదేవ్యములు ప్రసిద్ధములు. **త్రీణీ సామాని యస్య సః త్రిసామా – త్రిభిః సామభిః దేవవ్రత సమాఖ్యాతైః సామగ్రైః స్తూయతే.**

**వేదానాం సామవేదోఽహం** – అని శ్రీకృష్ణుడు గీతయందు ఆనతిచ్చెను. కనుక సామవేదము భగవద్విభూతి.

శ్రీ చిన్మయానంద వివరణ కొంత భిన్నంగా ఉన్నది. భగవంతుని కీర్తించేవారిలో దేవతలు, వ్రతులు, సామములు ప్రసిద్ధములు.

### 582. సామగః

- సామమును గానము చేయువాడు.
- సామగానముద్వారా స్తుతింపబడువాడు.

### ఓం సామగాయ నమః

**స్వయం స్వానుభవ ప్రీత్యా గాయతీతి చ సామగః.** భగవంతుడు స్వయముగా సామమును గానము చేయును. ఇది ఆయనకు స్వానుభవము.

పరమపదములో ముక్తులు సామమును గానము చేయుచుందురు. ఇది వారికి భగవదనుభవము. **ఏతత్ సామ గాయన్నాస్తే** (తైత్తరీయ).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – **సామభిః మంత్రైః గీయతే ఇతి సామగః.** సామమునందలి మంత్రములచే కీర్తింపబడువాడు గనుక 'సామగః'.

## 583. సామ

- తనను గానము చేయువారి పాపములను హరించువాడు.
- సామవేద స్వరూపమైనవాడు.
- మృదుమధుర స్వభావము కలవాడు.

### ఓం సామ్నే నమః

శ్రీ భట్టులు ఈ నామమును 'సో' అనగా నాశనము చేయుట – అన్న ధాతువునుండి వివరించారు. **స్వగాయకానాం పాపం స్యతి నాశయతి ఇతి సామః – స్వగాయకానాం కాలుష్యనాశక స్సామ ఈరితః.** తనను స్తుతి చేసేవారి పాపాలను క్షయం చేసేవాడు.

**వేదానాం సామవేదోఽస్మి దేవనామస్మి వాసవః**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా** – భగవద్గీత విభూతి యోగము 10.22
వేదములలో సామవేదమును నేను. దేవతలలో ఇంద్రుడను. ఇంద్రియాలలో మనస్సును. ప్రాణులలోని చైతన్యమును నేను. నాలుగు వేదాలలో సామవేదము మధురమైనది, సంగీతమయము. ఇది పరమేశ్వరుని స్తుతులతో కూడుకొనియున్నది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి 'సామ, దాన, భేద, దండోపాయములు'లోని 'సామ' ధర్మము ఆధారంగా ఈ నామాన్ని వివరించారు. **యత్ ఖలు సాధు తత్ సామేత్యా చక్షతే** (ఛాందోగ్యోపనిషత్తు 2.1.1). దయతో, స్నేహముతో, ప్రేమతో సన్మార్గమును చూపి ఉపదేశించేవాడు 'సామ'.

## 584. నిర్వాణమ్

- భక్తులకు పరమానందమును ప్రసాదించువాడు.
- పరమానంద స్వరూపుడు.

### ఓం నిర్వాణాయ నమః

**నిర్వాణమ్ స్సాత్పరగతేః నిమిత్తమ్ నిర్గతైన సామ్.** పాపములు నశించినవారికి పరమపదమును ప్రసాదించును. 'వాణము' శరీరమునకు సంబంధించినది. ఈ భావములను అధిగమించిన స్థితి నిర్వాణము. అట్టి స్థితిని భగవంతుడు ప్రసాదించును. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము శ్రీమన్నారాయణుడు తన భక్తుల పాపములను హరించును (ఇంతకుముందు నామమైన 'సామ'కు శ్రీ భట్టులు చెప్పిన అర్థము). అలా వారి పాపములను హరించి పరమానందమును ప్రసాదించును. అట్టి స్థితిలో వారికి 'తన' అను భేదముండదు. ఇంద్రియముల అనుభవము నశించును కనుక దుఃఖమునకు తావుండదు. అదియే నిర్వాణము.

ధర్మచక్రము రచయిత – దుఃఖము మూడు కారణములవలన ప్రాప్తించును. శరీర కారణము చేతను, మానసిక కారణము చేతను, అజ్ఞానము చేతను. ఈ మూడు దుఃఖములను అధిగమిస్తేనే నిర్వాణము లభించును. అందుకు శ్రీహరి పాదపద్మముల ధ్యానమే సరయిన సాధనము.

**విద్యాంచాఽవిద్యాంచ యస్తద్వేదో భయగ్ం సహ అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే** – ఈశావాస్యోపనిషత్తు. విద్యనూ, అవిద్యనూ రెండింటినీ తెలుసుకున్నవాడు అవిద్య అంటే కర్మచేత మృత్యువును జయించి విద్యచేత అంటే జ్ఞానంచేత అమరత్వాన్ని పొందుతాడు.

## 585. భేషజమ్

- ఔషధము.

### ఓం భేషజాయ నమః

సంసారమనెడి మొండి రోగానికి దివ్యౌషధమైనవాడు. **అసాధ్య భవరోగస్య భేషజమ్ యస్సదౌషధమ్.** ఈ నామమును వివరిస్తూ శ్రీ భట్టులు మహాభారతంనుండి భీష్మస్తవరాజమును ఉదాహరించారు –

**నారాయణాత్ ఋషిగణాః తథా సిద్ధ మహోరగాః**

**దేవా దేవర్షయశ్చైవ యం విదుః దుఃఖ భేషజమ్**

ఋషులు, సిద్ధులు, నాగులు, దేవతలు, దేవర్షులు ఈ (సంసార) దుఃఖమునుండి విముక్తినొసగు దివ్యౌషధమును నారాయణునినుండి తెలుసుకొనిరి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – నిర్వాణమును అందించు ఔషధము గనుక శ్రీహరిని 'భేషజమ్' అన్నారు.

**చెడనీక బ్రతికించు సిద్ధ మంత్రమూ, రోగాలనడచి రక్షించు దివ్యౌషధమూ** – అన్నమయ్య.

ధర్మచక్రము రచయిత – ఆత్మజ్ఞానమునకు శారీరికమైన మరియు మానసికమైన ఆరోగ్యము కావాలి. ఇందుకు ఇంద్రియములను, మనస్సును అదుపులో ఉంచుకొనే జీవనశైలిని అవలంబించవలెను. శ్రీహరి ధ్యానమే మనస్సును ఆరోగ్యకరముగా ఉంచే దివ్యౌషధము. ఓం భేషజాయ నమః.

## 586. భిషక్

- వైద్యుడు.

### ఓం భిషజే నమః

**భవరోగ విధాన జ్ఞో యోऽసౌ భిషగుదీరితః.** భవబంధనాలకు కారణం తెలుసుకొని చికిత్స చేసేవాడు భిషక్. భక్తుల సంసార బంధనములకు సరియైన చికిత్స చేసేవాడు. గీత, ఉపనిషత్తువంటి పరావిద్యలను ప్రసాదించినవాడు.

**నిర్వాణం భేషజం భిషక్** – అనే మహామంత్రాన్ని జపిస్తే వ్యాధులనుండి విముక్తి లభిస్తుందని శ్రీ రాధాకృష్ణ శాస్త్రి చెప్పారు. తైత్తరీయోపనిషత్తు (4.5.1)లో భగవానుడు ప్రథమ దివ్య వైద్యుడని ఉంది. **ప్రథమో దివ్యో భిషక్.**

శ్రీ చిన్మయానంద – ధన్వంతరిగా భగవంతుని అవతారమును ఈ నామము సూచించుచున్నది.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – వ్యాధులు రెండు రకములు. చర్మగత వ్యాధులకు మందులు పనిచేయును. కర్మగత వ్యాధులకు సామాన్యమైన మందులు, వైద్యము నిరుపయోగము. అట్టి వ్యాధులకు రామనామమే మందు. కృష్ణ నామమే ఇంజక్షన్. శివనామమే ఆపరేషన్. భగవంతునియొక్క శక్తిమంతములగు వేయి నామములతో కూడిన ఈ స్తవరాజమును భక్తిశ్రద్ధలతో పఠించుటచేత తాత్కాలిక చర్మగత వ్యాధులు మాత్రమే గాక భయంకర కర్మగత వ్యాధులు తప్పక నశించునని భక్తులు అనుభవపూర్వకముగా తెలుపుచున్నారు. హరినామకీర్తనము, స్వాధ్యాయ జప తపములు, సత్సంగము గొప్ప ఔషధములు. ఓం భిషజే నమః.

## 587. సన్న్యాసకృత్

- వ్యామోహములను త్యజించిన భక్తులకు కర్మబంధనములను ఛేదించువాడు.
- మోక్షమునకు మార్గమైన సన్న్యాసాశ్రమమును ఏర్పరచినవాడు.
- భక్తులకు శరణాగతి మార్గమును చూపువాడు.

### ఓం సన్న్యాసకృతే నమః

**త్యాగేన సాత్త్వికేనాశు రజస్తమ స యోః పదమ్ యః కృన్తతి స సన్న్యాసకృన్నవార్ణో మనుస్మృతః -** సాత్త్విక త్యాగము అంటే భక్తుడు భగవంతునియందే తన రక్షణ భారము ఉంచుట. ఆ రకంగా సాత్త్వికత్యాగము చేసినవారి రజస్తమోగుణాలు నిర్మూలించేవాడు 'సన్న్యాసకృత్'. ఈ నామము నవాక్షరీమంత్రము.

శ్రీ భట్టులు ఈ నామవివరణను దీనిముందు నామము (భిషక్) అర్థముతో అనుసంధించారు. **సాత్త్వికేన సన్న్యాసేన రజస్తమసా కృన్తతి ఇతి సన్న్యాసకృత్.** కామము లేకుండా తమ విద్యుక్తధర్మములను నిర్వహించేవారియొక్క రజస్తమో బంధనములు ఛేదించేవాడు 'సన్న్యాసకృత్'. గీతలో చెప్పిన నిష్కామకర్మయోగము ఇదే. ఇక్కడ 'సన్-న్యాస' అనగా సమస్తభారమును ప్రభువుపై ఉంచుట. సంసారబంధములనుండి విముక్తికి ఇదే మార్గము. శ్రీ భట్టులు శృతినుండి చెప్పిన ఉదాహరణ –

**వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాస యోగాత్ పరిముచ్యంతి సర్వే**
**తే బ్రహ్మలోకే తు పరాంతకాలే పరామృతాత్ పరిముచ్యంతి సర్వే.**
ఉపనిషత్తుల పఠనముద్వారా తత్త్వ, హిత, పురుషార్థములను తెలిసికొన్నవారు తమ కర్మలకు తాము కర్తలమని భావించరు. మరియు అట్టి కర్మఫలములను ఆశించరు. ఇలా వారి చిత్తములు పరిశుద్ధములు కాగా వారు భక్తియోగమును ఆచరిస్తారు. అంతిమజన్మ అనంతరం సకల కర్మబంధాలనుండి విముక్తులై మోక్షాన్ని పొందుతారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మోక్షార్థమ్ చతుర్థమ్ ఆశ్రమమ్ కృతవాన్ ఇతి సన్న్యాసకృత్.** మోక్షసాధన కొరకు నాలుగవ ఆశ్రమమైన సన్న్యాసాశ్రమమును ఏర్పరచిన శ్రీమన్నారాయణుడు 'సన్న్యాసకృత్'.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి, శ్రీ కృష్ణదత్త భరద్వాజ, శ్రీ చిన్మయానంద –
**సమ్యక్ న్యాసో నిక్షేపః సంన్యాసః షడ్విధ శరణాగతేః**
**ఏకతమమ్ అంగమ్ ఆత్మనిక్షేపణామ్ అధేయమ్**
**తమ్ కరోతి ద్రఢయతి భక్తహృదయే ఇతి సన్న్యాసకృత్**
భక్తునకు మోక్షప్రదమైన సన్న్యాస ఆశ్రమమునకు మార్గము చూపువాడు శ్రీహరియే. శ్రీహరి ఆశీర్వచనమువల్లనే భక్తుడు శరణాగతియొనర్చును.

ధర్మచక్రము రచయిత **–** బిడ్డ తన బొడ్డుద్వారా తల్లి బొడ్డుతోనున్న సంబంధము తెంచుకొంటేనే స్వతంత్రుడు కాగలడు. అలాగే ఇంద్రియాలద్వారా ఏర్పడే బంధాలను ఛేదిస్తేనే జీవుడు సంసారచక్రం నుండి బయటపడతాడు. ఇలా ప్రాకృతికమైన రజస్తమో గుణాలనుండి విడివడడమే **'సం-న్యాసము'**. మోహబంధాలనుండి దూరంగా ఉండి జీవించాలని ఈ నామం తెలుపుచున్నది.

## 588. శమః

- క్రోధాది దుర్గుణములను నియత్రించడం బోధించినవాడు.

- సన్యాసులకు ఇంద్రియ నిగ్రహము ప్రధానధర్మమని బోధించినవాడు.
- సకల జీవులను నియంత్రించువాడు, ప్రళయమునందు కూడ.
- తన మనస్సును పూర్తిగా నిగ్రహించినవాడు. ప్రశాంతమూర్తి.
- భక్తుల మనస్సులలోని అంధకారమును హరించువాడు.

## ఓం శమాయ నమః

ఈ నామమునకు మూలము 'శమూ' అన్న ధాతువు (ఉపశమే). దీని అర్థము - తగ్గించుట, నియంత్రించుట, తొలగించుట, అణచివేయుట. అందునుండి ఉత్పన్నమైన భావములు – భక్తుల హృదయములలో తమోగుణమును హరించువాడు, ప్రళయంలో అన్నింటినీ అంతం చేయువాడు, మనోనిగ్రహాన్ని బోధించేవాడు, అన్నింటినీ అదుపులో ఉంచేవాడు. ఈ నామాన్ని ధ్యానించడంవలన భక్తుల మనస్సులో కల్లోలం నశించి శాంతి లభిస్తుందని శ్రీ సత్యదేవో వాసిష్ఠ అన్నారు.

శ్రీ భట్టులు ఇంతకుముందు నామములైన **'నిర్వాణం, భేషజం, భిషక్, సన్యాసకృత్'** లకు తెలిపిన భావాన్ని కొనసాగించారు. భగవంతుడు తన భక్తుల కామక్రోధ భయాదులను నిగ్రహించుకొనే విధానం తెలియజేస్తాడు గనుక 'శమః' – అని వివరిస్తూ శ్రీ భట్టులు గీత (5.29)నుండి ఉదాహరించారు –

**భోక్తారం యజ్ఞ తపసామ్ సర్వలోక మహేశ్వరమ్**
**సుహృదం సర్వభూతానామ్ జ్ఞాత్వా మామ్ శాంతి మృచ్ఛతి.**

భగవంతుడు యజ్ఞములకు, తపస్సులకును భోక్త. సమస్త లోకములకును, లోకేశ్వరులకును అధిపతి. సమస్త ప్రాణులకును ఆత్మీయుడు, అనగా అవ్యాజ దయాళువు, పరమప్రేమ స్వరూపుడు. ఈ భగవత్తత్వమును ఎరిగిన భక్తునకు శాంతి లభించును.

శ్రీ శంకరులు కూడ ఇంతకు ముందటి నామము 'సన్యాసకృత్'నకు తామిచ్చిన వివరణతో ఈ 'శమః' నామవివరణను అనుసంధానించారు. సన్యాసులకు శమము అతిముఖ్యమైన ధర్మమని చెబుతూ శ్రీ శంకరులు శృతినుండి ఉదాహరించారు –

**యతీనామ్ ప్రశమో ధర్మో నియమో వనవాసినామ్**
**దానమేవ గృహస్థానామ్ శుశ్రూషా బ్రహ్మచారిణామ్.**

యతులకు ప్రశమము (మిక్కిలి శాంతి), వానప్రస్థులకు నియమము, గృహస్థులకు దానము, బ్రహ్మచారులకు శుశ్రూష ప్రధాన ధర్మములు.

శ్రీ శంకరులే మరొక భావముకూడ తెలిపారు. **సర్వభూతానామ్ శమయతైతి శమః.** అన్ని భూతములను శమింపజేయువాడు (నిగ్రహించువాడు, అదుపు చేయువాడు). ఇదే భావాన్ని శ్రీ అనంతకృష్ణశాస్త్రి కొంచెం మార్చి – ప్రళయకాలంలో అన్నింటినీ శమింపజేయువాడు – అని వివరించారు.

శ్రీ చిన్మయానంద – భగవంతుడే ప్రశాంతతకు రూపము. కనుక శమము.

ధర్మచక్రము రచయిత – బ్రహ్మచర్యంలో స్నాన, ధ్యాన, విద్యా, శుశ్రూషాది నియమాలు పాటించాలి. అలాగే వానప్రస్థ సన్యాసాశ్రమాలలో కూడా దృఢమైన నియమాలున్నాయి. ఇలా జీవితంలో ఇంద్రియాలను నిగ్రహించుకొని ఉంటే భగవంతుడు ప్రసన్నుడౌతాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **తమో భవాని కార్యాని శమయతి**. మనలోని తమోగుణములను, మన తామస కర్మలను శమింపజేయువాడు శ్రీహరి.

## 589. శాంతః

- సదా ప్రశాంతమైన మనసు కలవాడు. శాంతగుణమూర్తి.

### ఓం శాంతాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు ఉప్పొంగిన సముద్రంలా మహాశక్తిమంతుడైనప్పటికీ అలలులేని ప్రశాంత మహాసాగరంలా ఉంటాడు. వేదవ్యాసునిగురించి ఒక కవి ఇలా అన్నాడు – ఆయన చూపు సోకినంతనే క్రూరమృగాలు కూడా సాధువులుగా మారేటంతటి ప్రశాంతమూర్తి. మనమొనరించే అనంతమైన అపచారాలను కూడా సహించి శాంతంగా ఉండే మహాత్ముడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు ఇంద్రియ జగత్తుకు బద్ధుడు కాడు గనుక సదా శాంతమూర్తి. **నిష్కలం నిష్క్రియం శాంతం.** పరమేశ్వరుడు అవయవములు లేనివాడు. క్రియారహితుడు. శాంతమూర్తి. అని శ్వేతాశ్వరోపనిషత్తు(6.19)లో ఉన్నది. శ్రీ రాధాకృష్ణశాస్త్రి ప్రశ్నోపనిషత్తు (7.5)నుండి కూడా ఉదాహరించారు. **శాంతమ్ అజరమ్ అమృతమ్.**

ధర్మచక్రము రచయిత – ప్రాపంచిక విషయాలపట్ల అనుబంధం పెరిగినకొద్దీ శాంతి కొరవడుతుంది. అలా కాకుండా అంతర్ముఖులైనవారికి మనశ్శాంతి లభిస్తుంది. భగవంతుని శాంతస్వభావాన్ని సూచించే ఈ నామమును ధ్యానిస్తే శాంతి లభిస్తుంది.

డా. క్రోవి పార్థసారథి శ్రీకైవల్యసారథి నుండి – **నిరంజనం నిరవయవం నిర్గుణం శాంతం బ్రహ్మ.** కళలకు అతీతమైనవాడు, గుణరహితుడు, అవయవములు లేనివాడు, శాంతస్వభావుడు ఆ పరబ్రహ్మ అని చెప్పబడింది. నారాయణోపనిషత్తులో – **నిష్కలంకో, నిరంజనో, నిర్వికల్పో, నిరాఖ్యాతశుద్ధో దేవ ఏకో నారాయణ** – అని ఉంది. నారాయణుడు నిష్కళంకుడు. నిరంజనుడు. నిర్వికల్పుడు. వాక్కులతో నిర్వచించడానికి వీలు లేనివాడు. అందుకే శ్రీమన్నారాయణుని స్తుతించేటప్పుడు **'శాంతాకారం భుజగశయనం'** అని ప్రారంభిస్తారు. అతడు పరమశాంతిమూర్తి. తన భక్తులైనవారు తన నెత్తిమీద కూర్చున్నప్పటికీ ఏమాత్రమూ కోపగించనివాడు. తల్లి తన పసిపాపలను లాలించిట్లుగా భక్తులను లాలించేవాడు.

## 590. నిష్ఠా

- ఏకాగ్ర ధ్యానమునకు స్థిరమైన కేంద్రము, లక్ష్యము.
- ప్రళయకాలంలో సమస్త భూతములకు స్థిరనివాస స్థానము.

### ఓం నిష్ఠాయై నమః

'నిష్ఠ' అనగా ఒక స్థిరమైన ఆధారము. ఈ భావంలో శ్రీ భట్టులు ఇలా వ్యాఖ్యానించారు – **వృత్తిత చిత్తైః శుభాశ్రయ భూతే అస్మిన్ నిష్ఠీయతే ఇతి నిష్ఠా.** ధ్యానమగ్నులైనవారి చిత్తములు శ్రీహరియందే నిలకడగా ఉంటాయి. వారి ధ్యానమునకు శ్రీనివాసుడే ఆశ్రయము, ఆధారము, ఫలము.

ఇదే నామమును శ్రీ కృష్ణదత్త భరద్వాజ ఇలా వ్యాఖ్యానించారు – **నియతమ్ స్థానమ్ నిష్ఠానమ్ స్వజన కామానామ్ ఇతి నిష్ఠా.** భక్తుల చిత్తములందున్న కామ్యార్థములకు స్థిరనివాసమైనవాడు నిష్ఠ.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ప్రళయే నితరామ్ తత్రైవ తిష్ఠంతి భూతాని ఇతి నిష్ఠా.** ప్రళయకాలములో సకల భూతములు పరమాత్మునియందే లయమై వసిస్తాయి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు సృష్టిలో అన్నింటియందూ వ్యాపించియున్నాడు. సకల పరిణామాలకూ, ఉత్పత్తి స్థితి క్షయాలకూ మూలకారణము. కాని పరమాత్ముడు మాత్రం మార్పులేకుండా స్థిరంగా ఉంటాడు.

ధర్మచక్రము రచయిత – భగవంతుని నామధ్యానముపై చిత్తమును నిలుపవలెనని ఈ నామము బోధించుచున్నది. ప్రాపంచిక విషయములలో తగులుకొంటే జన్మకు పరమోత్కృష్ట లక్ష్యమైన మోక్షసాధన మనకు అందకుండా పోతుంది.

## 591. శాంతిః

- సమాధి స్థితిలో సమస్తమును మరపించి పరమానందమొసగువాడు.
- ధ్యానమునకు లక్ష్యము.
- సకలమునకు ఆధారము.

### ఓం శాంతయే నమః

**సర్వాధికారాశ్శామ్యంతి సమాధౌ సరమేయతః అతః శాంతిరితి ప్రోక్తః ఋత్వర్ణో భక్తిదోమనుః -** భక్తులు సమాధిస్థితిలో ఉండి తనను ధ్యానించినపుడు, వారివారి అధికారములను మరపింపజేయువాడు గనుక శాంతి. ఈ నామము షడక్షరీ మంత్రము. భక్తిప్రదము. ఓం శాంతయే నమః.

**శ్శామ్యంతి అస్మిన్నితి శాంతిః.** సమాధిస్థితిలో ఉండి తనను అనుభవించేవారు ఆ సమయంలో తమ స్థితిని మరచిపోయేటట్లు చేసేవాడు. అప్పుడు భక్తులు సమస్తమును మరచి భగవదనుభంలో లీనమౌతారు. ఇదే శాంతి. భగవంతుని ప్రసాదము. ధ్యానమునకు గమ్యము.

శ్రీ వి.వి. రామానుజన్ శ్రుతినుండి ఉదాహరించారు – **యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శృణోతి తద్ భూమా.** ఆ సమయంలో మరేవీ కనిపించవు. వినిపించవు. శ్రీ రాధాకృష్ణశాస్త్రి కఠోపనిషత్ (2.2.13)నుండి చెప్పినది – **తేషాం శాంతిః శాశ్వతీ న ఇతరేషామ్.** అతనియందే శాశ్వతమైన శాంతి పొందదగును. మరెక్కడా కాదు.

శ్రీ శంకరులు చెప్పిన వ్యాఖ్య – భగవానుడు పరిపూర్ణ విజ్ఞాన స్వరూపుడు. భగవంతునియందు 'అవిద్య' అనేది ఉండదు. అవిద్య లేనందున భగవంతుడు పరమశాంతిమూర్తి.

శ్రీ చిన్మయానంద 'అవిద్య' బదులు 'కోరికలు' అని వివరించారు. కోరికలు కల్లోలమునకు కారణములు. భగవంతుడు పరిపూర్ణుడు గనుక కోరికలు లేనివాడు. పరమశాంతిమూర్తి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'శమ'-ఆలోచనే – **భక్తానాం ఆలోచన విషయత్వాత్ శాంతిః.** 'ఆలోచన' అనగా ఒక దిశలో చూచుట, పరికించుట. భక్తుల ఆలోచన(ధ్యానము)కు లక్ష్యమైనవాడు శాంతి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'సమ్'-ఉపశమే-తగ్గుట, ఆగుట, అణిగిపోవుట – అన్న భావంలో శ్రుతివాక్యమును ఉదాహరించారు.
**ద్యౌః శాంతిః అంతరిక్షమ్ శాంతిః**
**పృథ్వీ శాంతిః ఆపః శాంతిః.**
ఇవన్నీ (ఆకాశము, అంతరిక్షము, భూమి, నీరు) ఒకదానికొకటి ఆధారము. అన్నింటికీ ఆధారమైనవాడు శాంతి. శ్రీమన్నారాయణుడు.

## 592. పరాయణమ్

- అత్యుత్తమ విధానము, మార్గము.
- సర్వోత్తమ గమ్యము, ఆశ్రయము, నిలయము, గతి.
- అత్యుత్తమ స్థానమున ఉన్నవాడు.

ఓం పరాయణాయ నమః

**యస్మాత్తు పరమాభక్తిః చరమప్రాప్తి కామతా తస్మాత్ పరాయణమితి స్మృతో హ్యష్టార్ణ ఉత్తమః.** - భక్తులకు మోక్షము ప్రసాదించాలంటే వారికి పరమభక్తి కావాలి. అటువంటి పరమభక్తిని భక్తులకు కలిగించేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఉత్తమము. ఓం పరాయణాయ నమః.

ఈ నామమునకు తెలుపబడిన మొదటి అర్థము భగవంతుడే అత్యుత్తమ ఉపాయమనియు, రెండవ అర్థము భగవంతుడే అత్యుత్తమ ఉపేయమనియు తెలుపుచున్నవి. సాధనామార్గము, సంపూర్ణ ఫలము కూడ శ్రీహరియే.

**పరమమ్ అయనమ్ పరాయణమ్.** అయ్-గతౌ-వెళ్ళుట – అన్న ధాతువునుండి 'అయనము' అనగా 'సాధనావిధానము' అని చెప్పవచ్చును. అత్యుత్తమమైన సాధనావిధానము అనగా పరమభక్తి. శ్రీహరిని పొందుటకు వలసిన భక్తికూడా శ్రీహరి స్వరూపమే. ఇందుకు శ్రీ భట్టులు గీత (18.53-54)నుండి ఉదాహరించారు –



**అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్**
**విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మ భూయాయ కల్పతే**
**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి**
**సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం**

అహంకారమును, బలమును, దర్పమును, కామక్రోధములను వదలిపెట్టి, నిరంతరము ధ్యానయోగపరాయణుడై ఉండువాడు, మమతా రహితుడు, శాంతియుతుడు అయిన పురుషుడు సచ్చిదానంద పరబ్రహ్మమునందు అభిన్నభావముతో స్థితుడగుటకు పాత్రుడగును. సచ్చిదానంద ఘనబ్రహ్మయందు ఏకీభావస్థితుడై ప్రసన్నమనస్కుడైన యోగి దేనికిని శోకింపడు, దేనినీ కాంక్షింపడు. సమస్త ప్రాణులయందును సమభావముగల అట్టి స్థితిని చేరిన యోగి నా పరాభక్తిని పొందును.

గీత 11.54లో ఇలా ఉన్నది –

**భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప**

కాని, ఓ పరంతప! అర్జున! ఇట్టి నా చతుర్భుజ రూపమును ప్రత్యక్షముగా చూచుటకును, తత్వజ్ఞానమును పొందుటకును, అందు ఏకీభావ స్థితినందుటకును కేవలము అనన్య భక్తి ద్వారానే సాధ్యమగును.

**'అయనమ్'** అనగా మార్గము. **అయన్తే అనేన ఇతి అయనమ్ –** అని అమరకోశములో ఉన్నది. శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము శ్రీహరిని పొందినవాడు మరల సంసారచక్రములో తగుల్కొనడు. కనుక ఆ దేవదేవుడు అత్యుత్తమ గమ్యము, పరాయణము.

శ్రీ విష్ణు సహస్ర నామము పూర్వపీఠికలోని '**పరమమ్ యః పరాయణమ్**' అన్న పదాలను శ్రీ రాధాకృష్ణశాస్త్రి ప్రత్యేకంగా ఈ సందర్భంలో సూచించారు. శ్రీ చిన్మయానంద గీత (15.6)నుండి వివరించారు (పరంధామము **–** పరాయణము).

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః**

**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ**

స్వయంప్రకాశరూపమైన నా పరంధామమును సూర్యుడు గాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయజాలరు. అట్టి పరంధామమును చేరిన పుణ్యాత్ములు మరల ఈ జగత్తున ప్రవేశింపరు. అనగా జన్మింపరు.

పూర్వపీఠికలో యుధిష్ఠిరుడు '**కిమేకమ్ దైవతమ్ లోకే కిం వాऽప్యేకమ్ పరాయణమ్**' అని ప్రశ్నించాడు. ఈ భాగాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీ భట్టులు ఇక్కడ ధర్మరాజు 'పరమ ఉపేయము'ను గురించి అడిగినట్లు వివరించారు **పరమమ్ ఉపేయమ్ పృచ్ఛతి కిం వా అపి ఏకమ్ పరాయణమ్ ఇతి**

**అయనమ్-ప్రాప్యమ్ ఏవమ్ ఉపేయమ్ ద్విధా పృష్టమ్.**

శ్రీ పి.బి.అణ్ణంగారాచార్య స్వామి '**పరాయణః**' అనే పాఠాంతరం కూడా ఉన్నదని చెప్పారు.

**పరమమ్ అయనమ్ యస్య సః పరాయణమ్ –** సర్వోత్తమమైన స్థానమును కలిగియున్నవాడు.

**సన్యాసకృత్ శమః శాంతో నిష్ఠాః శాంతిః పరాయణమ్ –** అనే నామాలను భక్తితో జపిస్తే కల్లోలమైన మనస్సుకు శాంతి లభిస్తుందని శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పారు.

ధర్మచక్రము రచయిత వ్యాఖ్య **–** ఇంద్రియములను, మనస్సును నియంత్రించినవానికి పునర్జన్మనుండి విముక్తి లభిస్తుంది. ఇంద్రియాలు, మనస్సుల చెప్పుచేతలలో వర్తించేవారు సంసారబంధంలో చిక్కుకుంటారు. మనం ఏ పని చేసినా గాని దానికి నిజమైన కర్త భగవంతుడేనని, మనం కేవలం సాధనాలమని గుర్తుంచుకోవాలి. ఇది కర్మయోగానికి ప్రథమ సోపానము. ప్రాపంచికమైన విషయాలపైనున్న కాంక్షను భగవంతుని పొందడంపట్ల మళ్ళించగలిగితే భక్తియోగమార్గం తెలిసివస్తుంది. నిజమైన ఆత్మ, శరీరము, మనస్సుల మధ్య భేదాన్ని గుర్తిస్తే జ్ఞానయోగం తలుపు తెరుచుకొంటుంది. ఇలా భగవంతుని పొందడానికి భగవంతుడే మార్గమని గ్రహించవచ్చును.



పశ్చిమ గోదావరి జిల్లా జీలకర్ర గూడెం

శ్రీ రామాలయం



## శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః |
## గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః || (63)

### 593. శుభాంగః

- యోగసాధకులకు అష్టాంగములను ప్రసాదించినవాడు.
- సుందరమైన రూపము కలవాడు.
- ధ్యానించేవారికి సకల సన్మంగళములిచ్చే రూపముకలవాడు.
- తన ఉనికిచే అంతటినీ మంగళకరమొనరించువాడు.

ఓం శుభాంగాయ నమః

ఈ నామానికి వ్యాఖ్యానకర్తలు రెండు విధాలుగా అర్థం చెప్పారు. (1) యోగశాస్త్రానికి చెందిన అష్టాంగములకు సంబంధించి (2) భగవానుని సౌందర్యమును గురించి. 3,4 అర్థాలు 2వ అర్థానికి భావాంతరాలు. మరల ఇదే నామము 788వ నామముగా కీర్తింపబడినది.

63వ శ్లోకము. 593వ నామము. శుభాంగః – **శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః**
84వ శ్లోకము. 788వ నామము. శుభాంగః – **శుభాంగో లోకసారంగః సుతంతుః తంతువర్ధనః**

**స్వశక్త్యుద్భవ కళ్యాణ యమాద్యష్టాంగ సంభవః యస్మాత్ శుభాంగ సంప్రోక్తః సప్తార్ణో ధ్యానదాయకః -** భక్తులు తనను పొందడానికి తగిన ఉపాసన నిమిత్తం యమ నియమాది అష్టాంగములను ఇచ్చినవాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. ధ్యానప్రదము. **ఓం శుభాంగాయ నమః.**

శ్రీ భట్టులు ఈ 593వ నామమును యోగసాధనకు విధానములైన అష్టాంగములపరముగా వివరించారు. ఇవన్నీ శ్రీపతి కరుణవలన, శ్రీపతి పట్ల భక్తివలన సమకూడుతాయి. ఆయనే తన భక్తునికి ధ్యానమార్గమును, ధ్యానఫలమును ప్రసాదించును. ఆ అష్టాంగములు (1) యమము (ఇంద్రియ నిగ్రహము) (2) నియమము (ఏర్పాటు) (3) ఆసనము (4) ప్రాణాయామము (రేచకము, పూరకము, కుంభకము) (5) ప్రత్యాహారము (ఇంద్రియాలనుండి విషయాన్ని మరల్చుట) (6) ధారణ (7) ధ్యానము (8) సమాధి.

ధర్మచక్రము రచయిత వివరణ – యమ, నియమముల వలన మనస్సు అదుపులోకి వస్తుంది. ఆసన, ప్రాణాయామముల వలన శరీరం ధ్యానమునకు సిద్ధమౌతుంది. ప్రత్యాహార, ధారణ, సమాధులు ఒక్కొక్క మెట్టుగా ఆలోచనలను భగవంతునిపట్ల మళ్ళించును. సమాధి స్థితిలో భగవంతుని అనుభవము సిద్ధించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సుందరమ్ తనుమ్ ధారయన్ శుభాంగః.** సుందరమైన తనువును ధరించినవాడు శుభాంగుడు.

ఇదే భావమును శ్రీ భట్టులు 788వ నామవివరణలో ఇచ్చారు. మోహినియై జగములను మోహింపజేసిన శుభాంగుడు. గోపికల మనసులను దోచిన గోపబాలుడు. కమలపత్రాక్షుడైన రాముడు. ఆ రాముని సౌందర్యమును సీతమ్మకు వర్ణించి చెప్పి హనుమంతుడు తరించాడు.

శ్రీ చిన్మయానంద ఉపనిషత్తులలోని **'శాంతమ్ శివమ్ సందరమ్'** అనే వాక్యాన్ని ఉదాహరించారు. ఛాందోగ్యోపనిషత్తు (1.6.7) లో ఇలా ఉన్నది –

**య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో ఉచ్యతే**
**తస్య యథా కప్యాసమ్ పుణ్డరీకేవమక్షిణీ.**

అతడు ఆదిత్యమధ్యముడై బంగారు రంగులో ప్రకాశిస్తూ ఉంటాడు. వికసిస్తున్న పద్మమువలె వెలుగుతుంటాడు.

శ్రీ వి.వి. రామానుజన్ – శ్రీమన్నారాయణుని తిరుమేణియందు 788 సుందర అంగములున్నవి గనుక ఆయన శుభాంగుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుని చరణము, వదనము, నయనములను ధ్యానించేవారికి సకల సన్మంగళములను ప్రసాదించే రూపుగలవాడు శుభాంగుడు. **శుభాని - దర్శకానామ్ మంగళోత్పాదకాని; అంగాని - చరణ వదన నయనాదీని; యస్య ఇతి శుభాంగః.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అంగ్-వెళ్ళుట – అనే ధాతువునుండి, భగవంతుని ప్రతి రూపము, ప్రతి చలనము కూడ సకల సన్మంగళములను ప్రసాదించును.



మణిపురి నృత్యశైలిలో రాసలీల నృత్యం. వికీపీడియానుండి

**భాగవతము – దశమస్కంధము – గోపికల ప్రార్థన.** శ్రీ మద్భాగవతము – రచన: శ్రీ ఏల్చూరి మురళీధరరావు

దేవా! మా ప్రార్థన ఏమిటో విను. సంసృతి భయార్తలమై నీ శరణుజొచ్చాము. మాకు అభయాన్నివ్వు. .. .. ఏ నీ పాణిపద్మం సమస్త వరదాయకమో, ఏ నీ పాణిపద్మాన ఇందిరాదేవిని పరిగ్రహించావో, ఆ నీ పాణిపద్మాన్ని మా శిరసులపై ఉంచు. ... స్మితోల్లసితమైన నీ సుందర ముఖారవిందాన్ని చూపు. స్త్రీలకు అంతకంటె సంతోషకరమైనది వేరొకటుండదు..... ఏ నీ పాదకమలం సిరికి నిలయమై కాళియ ఫణి ఫణార్చితమై గోగణానుగతమై ఒప్పారుచున్నదో ఆ పవిత్ర నీరేజాన్ని మా కుచకుంభాలపై నిలుపు. నీ కోమల పాదపద్మాలు మా కుచ కాఠిన్యానికి నొచ్చుకుంటాయని వెనుకాడబోకు. వాటిని సుతారంగా మా వక్షఃపీఠిపైని ధరిస్తాము. అంతలో మా మదనతాపం చల్లారుతుంది.... తర్వాత మమ్ము గ్రహించి నీ అధరామృతాన్ని ప్రసాదించి మా మోహం తీర్చి మమ్మల్ని ఉజ్జీవింపజేయి.

ప్రభూ! నీ చరిత్రరసం తాపత్రయ తప్తులకు జీవనామృతం. కవిజన వాక్య లతికలకు అవ్యయఫలం. కర్ణములకు పరమ రసాయనం. కీర్తించినవారికి వివిధ దానఫలం. శ్రీమంతమైన నీ కథాశ్రవణ భాగ్యాన్ని మాకు కరుణించు. నీ కథాశ్రవణ మాత్రాననే మాకు నిర్వృతి కలుగుతుండగా నీ దర్శన భాగ్యాన్ని ఎందుకు కోరుతున్నామని అడుగుతావేమో ప్రభూ! నీ లేనగవులు, నీ ప్రేమస్నిగ్ధ వీక్షణాలు, నీ ధ్యానమంగళవిహారం, నీ సంకేత మర్మాలు మా హృదయాలను కలచివేస్తుండడంవలన నీ విలాస క్షుభిత చిత్తలమై శాంతికి దూరమయ్యాము. మా మనఃక్షోభ నీ దర్శన భాగ్యలబ్ధిచే గాక వేరొక మార్గాన తీరేది కాదు.

ఓం శుభాంగాయ నమః



శ్రీకృష్ణునికై వెదకుతున్న గోపికలు. 1780 కాలపు చిత్రం. వికీపీడియానుండి.
https://commons.wikimedia.org/wiki/File:Gopis_searching_for_Krishna,_Bhagavata_Purana,_c1780.jpg

## 594. శాంతిదః

- సాయుజ్యము అనే శాశ్వతమైన శాంతిని ప్రసాదించేవాడు.

### ఓం శాంతిదాయ నమః

శ్రీభట్టుల వ్యాఖ్యానం ఈ నామమునకు ముందునామమైన **'శుభాంగః'** నామమునకు చెప్పిన భావాన్ని కొనసాగిస్తూ యోగాభ్యాసపరంగా ఉంది. యోగాది సాధనలద్వారా భక్తిలో అత్యున్నత స్థితికి చేరినవారికి ఆత్మజ్ఞానం లభిస్తుంది. వారికి మరి జన్మ

ఉండదు. అదే మోక్షము. అటువంటి శాశ్వతమైన శాంతిని ప్రసాదించేవాడు **'శాంతిదః'**. ఇందుకు శ్రీ భట్టులు చూపిన ప్రమాణములు –

**విశ్వస్యైక్యమ్ పరివేష్టితారమ్ జ్ఞాత్వా శివమ్ శాంతిమ్ అత్యంతమ్ ఏతి** – శ్వేతాశ్వరోపనిషత్తు 2.7 – విశ్వమంతా ఒకడే వ్యాపించియున్న భగవంతునిగురించి తెలిసినవానికి అత్యంత మంగళప్రదమైన శాంతి లభిస్తుంది.

**తమీశానామ్ వరదమ్ దేవమీడ్యమ్ నిచయ్య ఆత్మానమ్ శాంతిమ్ అత్యంతమ్ ఏతి** – శ్వేతాశ్వరోపనిషత్తు 3.11 – జగత్ప్రభువు, వరములను ప్రసాదించేవాడు, కీర్తనీయుడు, అంతరాత్మస్థితుడు అయిన ఈశ్వరుని తెలిసికొన్నవానికి పరమశాంతి లభిస్తుంది.

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత**
**తత్ప్రసాదాత్పరం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్** – గీత 18.62
అర్జునా! అన్ని విధములుగా ఆ పరమేశ్వరునే శరణుజొచ్చుము. అతని కృపచేతనే పరమశాంతిని, శాశ్వతమైన పరమపదమును పొందగలవు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఇష్టానిష్టములనే భేదభావములు లేని సంపూర్ణమైన శాంతిని ప్రసాదించువాడు **'శాంతిదః'**. ఇది ఇష్టమైనది, ఇది ఇష్టం లేనిది అనే ద్వంద్వభావం ఉన్నంతవరకు నిజమైన తృప్తి, శాంతి లభించవు.

ధర్మచక్రము రచయిత తిరువళ్ళువార్ రచననుండి ఉదాహరించారు. **వేండుదల్ వేండమై ఇలాదాన్** – కావలసినది, అక్కరలేనిది అనేవి లేనివాడు భగవంతుడు. భగవంతునిపట్ల భక్తితో స్థిరమైన ధ్యానం సాగిస్తే శాశ్వతమైన శాంతి లభిస్తుంది.

## 595. స్రష్టా

- సృష్టించినవాడు.

### ఓం స్రష్ట్రే నమః

ఈ నామము మరల 990వ నామముగా స్తుతింపబడినది.

63వ శ్లోకము. 595వ నామము. స్రష్టా – **శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః**
106వ శ్లోకము. 90వ నామము. స్రష్టా – **దేవకీనందనః స్రష్టా క్షితీశః పాపనాశనః**

'సృష్టించుట' అనే అర్థంలో అందరు వ్యాఖ్యానకర్తలు తమ తమ భగవదనుభవాలను వెల్లడించారు.

శ్రీ భట్టులు – 'సృజ్' అనే ధాతువునుండి - సృష్టించేవాడు 'స్రష్ట'. **కర్మ వైచిత్ర్యత సృష్టీన్ స్రష్టాస్యాత్ సృజ్యతే చ యః.** మోక్షం కోరేవారికి మోక్షం ప్రసాదించినట్లే శ్రీమన్నారాయణుడు భక్తులకు సంసారాన్నికూడా ప్రసాదిస్తాడు. తమ కర్మలద్వారా లౌకిక సుఖాలు కావాలనుకొనేవారికి సంసారం లభిస్తుంది. ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమోళి (5.6.1)నుండి ఉదాహరించారు

**ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా** – గీత 7.6
ఓ అర్జునా! సమస్త ప్రాణులును ఈ రెండు విధములైన ప్రకృతులనుండియే ఉత్పన్నములగుచున్నవి. ఈ జగత్తుయొక్క ప్రభవమూ (పుట్టుక), ప్రలయమూ (లీనమగుట) నావలననే జరుగుచున్నవి. అనగా ఈ సంపూర్ణ జగత్తుకు నేనే మూలకారణము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉపనిషత్తులనుండి ఉదాహరించారు –

**విశ్వస్య స్రష్టారమ్ అనేక రూపమ్** – శ్వేతాశ్వరోపనిషత్తు 4.14
**స ఇమాన్ లోకాన్ సృజతః** – ఐతరేయోపనిషత్తు 1.2

'సృజ్' అంటే విడచుట, బయటకు పంపుట అని కూడా చెప్పవచ్చును (విసర్గే). శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ భావాన్ని గ్రహించారు. భగవంతుడు ప్రళయ సమయంలో జగత్తును అంతటిని తనయందు భద్రపరచి మరల సృష్టి సమయంలో అన్నింటినీ వెలికితీస్తాడు గనుక స్రష్ట.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు జీవునకు శరీరం ప్రసాదించడానికి కారణం ఆయనను కొలిచి, ఆయనను పొందే అవకాశాన్ని మనకు కలిగించడమే.

శ్రీ చిన్మయానంద – విష్ణువు ఒసగిన శక్తివలననే బ్రహ్మదేవుడు సృష్టికార్యం సాగిస్తున్నాడు. అందరు దేవుళ్ళకు అంతర్యామి ఆ దేవదేవుడే.

**శ్రీమద్భాగవతము – మూడవ స్కంధము – బ్రహ్మకృత భగవత్స్తోత్రము.** శ్రీ ఏల్చూరి మురళీధరరావు రచననుండి.

దేవా! బహుకాలం ఉపాసించి తత్ఫలితంగా నిన్ను తెలిసికోగలిగాను. అనవద్యమైన నీ తత్త్వజ్ఞానాన్ని పొందడంకంటె ఉత్తమమైన భాగ్యం దేహధారులకు వేరొకటి ఏముంటుంది? నీవు తప్ప వేరొకటి లేదన్నదే నీ తత్త్వ రహస్యం. నీవు నిర్గుణ పరబ్రహ్మవన్నదే నీ తత్త్వ పరమార్థం. ప్రపంచరూపమై ఈ ప్రతీతి అంతా నీ గుణాత్మకం. నీ సత్యరూపం అనావృత ప్రకాశం, అవికల్పం, ఆనందమాత్రం అయి జ్ఞానులకు మాత్రమే భాసిస్తుంది. ఉపాసకుల అనుగ్రహార్థమై నీవు నీ చిచ్ఛక్తి ప్రభావంతో వివిధావతారాలను ధరిస్తావు.

దేవా! నీ ప్రకృతరూపం సర్వావతారాలకూ మూలబీజమైయున్నది. ఈ నీ రూపం సృష్టికి కారణమైనందున విశ్వానికంటె వేరైనట్టిది. ఇదే భూతేంద్రియాలకు కూడా కారణం. అందువల్ల నీ ఈ రూపం సర్వోపాస్య రూపాలలో ముఖ్యమై ఉన్నది. అట్టి ఉత్తమ రూపాన్ని నేనాశ్రయించాను.

దేవా! ఈ నీ రూపం సోపాధికమని, అర్వాచీనమని భావించేవారు ఇది ముఖ్యమెలా అవుతుందని అడుగుతారు. అవ్యక్తాన్ని ఉపాసించడం సాధ్యం కాదు. ఉపాసకులు నీ వ్యక్త స్వరూపాన్ని ధ్యానిస్తారు. వారి శ్రేయస్సును కోరి ఈ భువనమంగళరూపాన్ని వ్యక్తపరచావు. ఉపాసకులిందుకు నీకు నమస్కరించడంకన్న వేరొకవిధాన తమ కృతజ్ఞతను చూపజాలరు. ఇదే నీకు సాష్టాంగ ప్రణామం .....

ఎవడు వేదాలనే మలయానిలాలు మోసికొని వచ్చిన చల్లని నీ పాదారవిందాల సురభిళ పరిమళాన్ని లవమాత్రమైనా అనుభవించే పుణ్యానికి నోచుకొంటాడో, ఎవడు మహాదరంతో చేరి నీ కథలను వింటాడో, ఆ ధన్యజీవుడు నీ పాదపద్మాలను తప్పక చూరగొంటాడు. నీవతని హృదయాన్ని నిలయంగా చేసుకొని నిరంతరం నివశిస్తావు. అతనిని ఎన్నటికీ ఎడబాయవు.

దేవా! ఈ సంసార పరిభ్రమణం తొలగిపోవడానికి నీ ఆశ్రయం ఒక్కటే పరమసాధనం. నీ ప్రాపు పొందాలంటే నీ పరమ తత్త్వాన్ని గ్రహించి ఆ దారిలోనికి ప్రవేశించి పరిశ్రమించాలి. వేదాంతశ్రవణం కావించి, తత్త్వరహస్యాన్ని గ్రహించి, నిన్ను పొందాలని నిశ్చయించి, భక్తిమార్గాన్ని మెట్టి, చిత్తశుద్ధిని పొందినవారి హృదయమందిరాలలోనికి నీవు పరమానందంతో చేరి ఈప్సితార్థాలను నెరవేరుస్తావు.

ఏ రూపంలో నీ భక్తులు ధ్యానిస్తే ఆ రూపంలో నీవు వారికి సాక్షాత్కరిస్తావు.. .... నిష్కామం, సకామం అని రెండు విధాలుగా ఉన్న భక్తిమార్గాలలో నిష్కామ భక్తికి నీవు పరమసులభుడవు.

దేవా! నీవు భేదరహితుడవు. సమగ్ర బోధాశ్రయుడవు. స్వరూప చైతన్య తేజోమూర్తియై తనరారే పరమాత్ముడవు. సృష్టి స్థితి లయ కారణమైన నీ మాయాశక్తిని క్రీడోపకరణగా చేసికొని ఆత్మానందాన్ని పొందుతావు. నీ అవతార విడంబనలైన దేవకీనందనాది నామాలనుగాని, గుణవిడంబనాలైన సర్వజ్ఞ భక్తవత్సలాది నామాలనుగాని, కర్మవిడంబనాలైన కంసారి ప్రముఖ నామాలనుగాని – చివరికి ప్రాణోత్క్రమణ కాలంలోనైనా ఉచ్చరింపనోచిన జీవులకు బహుజన్మార్జిత పాపసంచయం పటాపంచలై, నిరస్తావరణమైన బ్రహ్మస్వరూపాన్ని సందర్శించే మహాభాగ్యం తప్పక సిద్ధిస్తుంది. అట్టి మహానుభావునకు నీకు పునఃపునః ప్రణామాలు.

ఏ నీ విశ్వాకార వృక్షానికి సృష్టికర్తనైన నేను, స్థితికర్తయైన విష్ణువు, లయకర్తయైన ఈశ్వరుడు గుణత్రయ రూపాంతరాలతో వ్యవహరిస్తూ మూలత్రయమై నెలకొని ఉన్నామో ఆ విశ్వాత్మకునికి నీకు సాష్టాంగాలు.

**భవదుదర ప్రభూతమగు పద్మమునందు వసియించియున్న నే**
**నవిరళ తావకీన కలితాంశమునం దనరారు విశ్వముం**
**దవిలి రచించుచున్ బహువిధంబుల బల్కెడి వేదజాలమున్**
**శివతరమై ఫలింప గృపసేయుము భద్ర ఫలప్రదాయకా!**




తూర్పు చాళుక్యుల కాలపు బ్రహ్మ విగ్రహం. పెదవేగి గ్రామం లోనిది.

## 596. కుముదః

- భూమియందు మోదము పొందువాడు.
- భూమిపైనున్న జీవులకు రూప స్పర్శ శబ్దాది గుణములనిచ్చి వాని అనుభవమువలన సంతోషించువాడు.
- లీలా విభూతితో జీవుల కర్మఫలాన్ని అనుభవింపజేస్తూ ఆనందించును.
- భూమిపై తన భక్తుల సాంగత్యమువలన సంతోషించువాడు.
- భూమిభారమును తొలగించి (దుర్జనులను శిక్షించి) భూమికి ఆనందము కూర్చువాడు. భూమాతను పొంది ఆనందించువాడు.
- భక్తులు తనకోసం చేసే సాధన చూసి, వారి ఆనందాన్ని చూసి సంతోషించువాడు.

### ఓం కుముదాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

63వ శ్లోకము. 596వ నామము. కుముదః – **శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః**

87వ శ్లోకము. 813వ నామము. కుముదః – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః**

**కౌప్రాకృతే మండలేయః స్వభోక్తౄనపి భోజయాన్ మోదతే యస్సదాకాలం కుముద స్సతు గీయతే** - 'కు' అంటే లీలావిభూతి. ఆ లీలావిభూతిలో కర్మఫలము అనుభవించవలసిన జీవులను వాని కర్మానుసారము కర్మఫలము అనుభవింపజేస్తూ ఆనందించేవాడు కుముదుడు. శ్రీ భట్టులు ఈ నామమును 'కు-ముద' అని విశ్లేషించారు. 'కు' అనగా ప్రకృతిమండలము. పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆయన సృజించిన ప్రకృతిమండలమే. వానికి రూప రస శబ్దాది గుణములద్వారా సంతోషమును అనుభవించు

అవకాశము కల్పించిన భగవంతుడు వాని సంతోషమువలన తాను 'మోదము' పొందును గనుక ఆయన 'కుముదుడు'. శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (3.10.7)నుండి ఉదాహరించారు.

ఇదే మూలంతో శ్రీ భట్టులు మరొక అనుభవాన్ని కూడా చెప్పారు. **కౌమోదతే ఇతి కుముదః**. ప్రకృతి మండలంలో తన భక్తుల సాంగత్యంవలన భగవానుడు ముదించును. ఈ భావాన్ని శ్రీ వి.వి. రామానుజన్ ఇంకా వివరంగా చెప్పారు. శ్రీరాముడు అయోధ్యను విడచి అడవులపాలై, సీతను దూరం చేసుకొని, జటాయువును పోగొట్టుకొని దుఃఖించాడు. అయినా ఆయన భరద్వాజ, అత్రి, అగస్త్యాదుల దర్శనంతో సంతోషించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కుమ్-ధరణీమ్ భారావతరణమ్ కుర్వన్ మోదయతి ఇతి కుముదః**. (అవతారములయందు దుష్ట సంహరణమువల్లను, ప్రళయకాలమునందు అంతటిని తనలో లీనము చేసికొనుటవల్లను) భూమియొక్క భారమును తగ్గించి భూమికి సంతోషము కలిగించువాడు కుముదుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భూమాత సాంగత్యమువలన సంతోషించువాడు కుముదుడు. తన అవతారములందు భూమిపై అధర్మమును రూపుమాపి సంతోషించువాడు.



https://te.wikipedia.org/wiki/ దస్త్రం:SrIvaariPaadaalu.jpg photo by: Chavakiran

శ్రీ చిన్మయానంద – నానావిధములైన ద్వంద్వములతో కూడిన సృష్టిని చేసి వినోదముతో ఆనందించువాడు కుముదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కై-శబ్దే – శబ్దమువలన సంతోషము పొందువాడు. తాను సృష్టించిన జీవులకు వాక్కు, వినికిడి వంటి శబ్దసంబంధ గుణములనొసగి వారి అనుభవములను విని ఆనందించువాడు. వేదాధ్యయనము, సామగానము, భగవత్ స్తుతి, కీర్తనము – ఇవన్నియును శ్రీమన్నారాయణునికి మోదము కలిగించును.

ధర్మచక్రము రచయిత వివరణ – ఏ జీవికైనా లభించే ఆనందము ఆ జీవియొక్క ఇంద్రియాల పరిమితులనుబట్టి ఉంటుంది. ఒక చీమకు పెద్ద పర్వతమంత చక్కెర లభించినాగాని అది కొద్ది ఆనందమును మాత్రమే పొందగలదు. కాని ఇంద్రియాల పరిమితులు లేని అతీంద్రియుడైన భగవానుని ఆనందమును మనము అంచనా వేయలేము. ఈ నామమును ధ్యానించి, భగవంతునికి కైంకర్యము చేసి, ఇంద్రియములకు అందని మహానందమును పొందవచ్చును.

## 597. కువలేశయః

- తమ దేహేంద్రియాలకు తామే ప్రభువులమని భ్రమించే జీవులకు నిజమైన ప్రభువు.
- భూమిని చుట్టియున్న జలములలో శయనించువాడు.
- ఆదిశేషునిపై శయనించినవాడు.

### ఓం కువలేశయాయ నమః

ఈ నామమును వ్యాఖ్యానకర్తలు ప్రధానంగా రెండు విధాలుగా వ్యాఖ్యానించారు.

**కు-వల-ఈశయ** – అన్నింటికీ ప్రభువు.

**కవలే-శయ** – కడలిలో శేషునిపై శయనించినవాడు.

శ్రీ భట్టులు ఈ నామమును **'కు-వల-ఈశ-య'** అని విశ్లేషించారు. కు – ప్రపంచము, ప్రకృతి మండలము ('కుముద' నామంలో లాగా); వల-వలన్తి – తిరుగాడువారు; ఈశ – ప్రభువు; య – (యాతి-వెళ్ళువాడు) నియంత్రించువాడు. అనగా జీవులను తన అధీనంలో ఉంచుకొన్న నిజమైన ప్రభువు కువలేశయుడు.

శ్రీకైవల్య సారధి నుండి – **కుత్సితం బలమేషాం తే కువలా జీవ సంగికాః దేహేంద్రియాదేరీశాస్తే కువలేశా ఇతి స్మృతాః యస్మాన్నియచ్ఛ న్యైనీతి కువలేశ ఉచ్యతే** - సంస్కృతంలో 'వ', 'బ'లకు పెద్దగా తేడా లేదు. కాబట్టి 'కువలలు' అంటే విషయానుభవం కలిగిన జీవులు. వారే తమ దేహేంద్రియాలకు ప్రభువులు (అని భావిస్తుంటారు). అందుచేత కువలేశులు అనబడతారు. అటువంటివారిని కర్మానుగుణంగా నియమించేవాడు కువలేశయుడు. (డా. క్రోవి పార్థసారధి రచననుండి).

**కౌ భూమౌ ఆ సంసారం భ్రామ్యంతీతి కువలాః జీవాః కువలాశ్చతే ఈశాశ్చ కువలేశాః కువలేశాన్ యాతీతి కువలేశయః** - ఈ జగత్తు ఉన్నంతవరకు సృష్టి చేస్తూనే ఉంటాడు. 'కువలాః' అంటే జీవులు. 'కువలేశాః' అంటే తమ దేహాలకు తామే ప్రభువులుగా భావించేవారు. దేహమే ఆత్మలని భావించేవారు అజ్ఞానులు. వారిని అలా ఉంచేవాడు కువలేశయుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా **'కు-వల-ఈశ-యః'** అనే విశ్లేషించారు కాని వేరే అర్థం చెప్పారు. 'కై' అన్న ధాతువు శబ్దమును సూచించును. శబ్దము చేసే అన్నింటికి ఈశుడు. 'వల' అనగా కదులుట. కదిలే అన్నింటికి ఈశుడు. అనగా సమస్త జీవులకు అధిదేవుడు, అంతర్యామి కువలేశయుడు.

శ్రీ శంకరులు **'కువలే-శయః'** అని విశ్లేషించారు. కాని 'కువలే' అన్న పదానికి రెండు అర్థాలు చెబుతూ ఈ నామానికి రెండు వ్యాఖ్యలు చెప్పారు.

కోః-క్షితే; వలనాత్-సంసారణాత్, కువలమ్-జలమ్; తస్మిన్ శేత ఇతి కువలేశయః. భూమిని చుట్టియున్నవి జలములు. ఆ జలములందు శయనించినవాడు కువలేశయుడు. వటపత్రశాయి.

మరొక విధంగా, కువల – సర్పముయొక్క ఉదరము (ప్రాకునపుడు భూమిని స్పృశించు భాగము); శయః – శయనించువాడు. ఆదిశేషుని ఉదరమున శయనించియున్న శ్రీమన్నారాయణుడు కువలేశయుడు.

'కువలము' అనగా రేగుపండు. పరీక్షిత్తును కాటువేయడానికి రేగుపండులోపల శయనించిన తక్షకుడు భగవద్విభూతియైన కువలేశయుడు.

ధర్మచక్రము రచయిత – పంచభూతములు ఒకదానినుండి మరొకటి, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అందుండి నీరు, నీటినుండి భూమి ఉద్భవించెను. పంచభూతములన్నీ కువలయేశునినుండే ఉద్భవించినవి. నీట శయనించినవాడు అనగా తాను సృజించిన ప్రకృతిలో తానేయున్నవాడు కువలేశయుడు.

## 598. గోహితః

- ప్రకృతికి వ్యవస్థాపకుడు. జగములకు, భూమికి హితము కూర్చువాడు.
- గోవర్ధనగిరినెత్తి గోవులను రక్షించినవాడు.

**ఓం గోహితాయ నమః**

ఈ నామవివరణలో 'గో' శబ్దమునకు వ్యాఖ్యానకర్తలు రెండు ప్రధానార్థాలు గ్రహించారు (1) గోవులు (2) ప్రకృతి, భూమి, జలములు.

శ్రీ భట్టులు 'గో' అనగా సంసారబీజక్షేత్రమైన 'ప్రకృతి' అని అర్థం తీసుకొన్నారు. **సంసారబీజక్షేత్రస్య ప్రకృతే స్థాపకశ్చ యః స గోహితః.** సంసారమనే విత్తనాలు నాటటానికి తావైన ప్రకృతికి ఆధారమైనవాడు గోహితుడు. **గోః ప్రకృతే హితః గోహితః.** సంసారము అనే విత్తనాలు జల్లే భూమియైన ప్రకృతి మండలానికి అధిష్ఠానదేవత అయి కార్యము చేస్తాడు కాబట్టి ప్రకృతికి వ్యవస్థాపకుడు అవుతున్నాడు. (డా. క్రోవి పార్థసారథి రచననుండి).

శ్రీ శంకరులు 'గో' అనగా 'గోవులు' అనే అర్థంలో వివరించారు. **గవామ్ వృద్ధ్యర్థం గోవర్ధనమ్ ధృతవాన్ ఇతి గోభ్యో హితో గోహితః.** గోవుల హితము కొరకు గోవర్ధనగిరిని ఎత్తినవాడు గోహితుడు.

అన్నమయ్య – **కొండ గొడుగుగా గోవుల గాచిన యదుకుల స్వామికి గొబ్బిళ్ళో.**

శ్రీ శంకరులు 'గో' అనగా 'భూమి' అనే అర్థం కూడా తీసుకొన్నారు. అనేక అవతారములెత్తి భూమిని రక్షిచువాడు గోహితుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – గో-గతౌ-వెళ్ళుట – సృష్టిలో సకల జీవుల చలనమునకు కారణమైనవాడు గోహితుడు.

## 599. గోపతిః

- భోగభూమియైన స్వర్గానికి అధిపతి.
- ఇంద్రియములకు ప్రభువు.

### ఓం గోపతయే నమః

ఈ నామమును 53వ శ్లోకములోను, 63వ శ్లోకములోను స్తుతించారు. రెండు శ్లోకములలోను 'గోపతిః', 'గోప్తా' నామములు క్రమములో వచ్చుట గమనింపదగును.

53వ శ్లోకము. 497వ నామము. గోపతిః – **ఉత్తరో గోపతిః గోప్తా జ్ఞానగమ్యః పురాతనః**
63వ శ్లోకము. 599వ నామము. గోపతిః – **గోహితో గోపతిః గోప్తా వృషభాక్షో వృషప్రియః**

497వ నామవివరణలో అనేక అర్థాలు ప్రస్తావింపబడినవి.

- అన్ని పదములకు (వాక్కులకు, వేదములకు) అధిపతి.
- తన వాక్కునకు తానే రక్షకుడు.
- తన భక్తుల పలుకును రక్షించువాడు.
- గోవులను కాచిన గోపాలకృష్ణుడు.
- కదులుచున్న సమస్తమును, ఇంద్రియములను, కాపాడువాడు.
- భూపతి, ధరణీధరుడు.
- (పుణ్య) లోకముల కధినాధుడు.

599వ నామ వివరణలో శ్రీ భట్టులు 'గో' అనగా భోగభూమి అయిన స్వర్గము అన్న అర్థంలో – స్వర్గంలో ఉండేవారికి అధిపతి – అని చెప్పారు. స్వర్గవాసులైన దేవతలను రక్షించేవాడు అని కూడా అనుకోవచ్చును. **స్వర్గభూమే పతిత్వాత్ గోపతి స్మృతః. గోః భూమే పతిః గోపతి.**

శ్రీ చిన్మయానంద – 'గో' అనగా గోవులు, జనులు, ఇంద్రియాలు వంటి అర్థాలున్నాయి. కనుక అందరికీ, అన్నింటికీ ప్రభువు గోపతి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – గో-గతౌ-చలించుట. అందరినీ రక్షించువాడు. అందరికీ దారి చూపువాడు. సారథియై పగ్గాలు పూని రథమును త్రోలి ముందుకు తీసుకెళ్ళి కాపాడువాడు. గోపతి. పార్థసారథి. గురువాయూరప్ప.

## 600. గోప్తా

- సంరక్షకుడు. సకల విద్యలకును, భూతములకును, లోకములకును, కర్మచక్రమునకును సంరక్షకుడు.
- భక్తులు కానివారికి తెలియరానివాడు.

## ఓం గోప్త్రే నమః.

ఈ నామమును 53వ శ్లోకములోను, 63వ శ్లోకములోను స్తుతించారు. రెండు శ్లోకములలోను 'గోపతిః', 'గోప్తా' నామములు క్రమములో వచ్చుట గమనింపదగును.

53వ శ్లోకము. 498వ నామము. గోప్తా – **ఉత్తరో గోపతిః గోప్తా జ్ఞానగమ్యః పురాతనః**

63వ శ్లోకము. 600వ నామము. గోప్తా – **గోహితో గోపతిః గోప్తా వృషభాక్షో వృషప్రియః**

'గుప్' అనే ధాతువునకు రక్షించుట, దాచుట అనే అర్థాలున్నాయి. ఈ రెడు అర్థాలలోను వ్యాఖ్యానకర్తలు ఈ నామాన్ని వివరించారు.

**498వ నామము. గోప్తా.**

శ్రీ భట్టులు – వేదములకు, సకల విద్యలకు రక్షకుడు.

శ్రీ శంకరులు – జీవులను, లోకములను కాపాడి పోషించువాడు.

**600వ నామము. గోప్తా.**

శ్రీ భట్టులు – కర్మచక్రమును సంరక్షించువాడు.

శ్రీ శంకరులు – తన మాయకారణముగా భక్తులు కానివారికి గుప్తముగానుండువాడు.

**ఓం గోప్త్రే నమః**

(1) వేదములను, విద్యలను, ధర్మచక్రమును, కర్మచక్రమును, జీవులను, లోకములను కాచెడువాడు.

(2) భగవంతునిగూర్చి తెలిసికోవాలనే కోరిక లేనివారికి గోప్యముగా (కానరాకుండా, తెలియరాకుండా) ఉండేవాడు. తన భక్తులనుండి చెడుకార్యములను దాచేవాడు. సాధన చేయనివారికి ఆత్మజ్ఞానము తెలియనీయనివాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ రెండు అర్థాలను అనుసంధానిస్తూ ఇలా వ్యాఖ్యానించారు. **స్వయమాత్మా గుప్తః.** స్వయముగా గుప్తముగానుండువాడు మరియు **గోప్తా స విష్ణుః స హి గోప్తృ ధర్మః.** కాపాడుట తన ధర్మము గనుక అందరిని కాపాడువాడు.

దాగి ఉంటూ రక్షిస్తుంటాడు. **గోపయతి సతతమ్ రక్షతి స్వభక్తాన్ నిత్యదా ఇతి గోప్తా.**

ధర్మచక్రము రచయిత – ఆ శ్రీనివాసుడే అందరిని రక్షింపజాలినవాడు. వేరొకరు కాదు.

ఈ అర్థం శ్రీ స్వామిదేశికన్ వివిధ స్తోత్రాలలో ఉంది –

**భయం కుతః స్యాత్ త్వయి సానుకంపే రక్షః కుతః స్యాత్ త్వయి జాతరోషే**

**తవ ప్రవృత్తే మమ కిం ప్రయాసైః త్వయ్య ప్రవృత్తే మమ కిం ప్రయాసైః** – శ్రీ అష్టభుజాష్టకము. 5,6

**త్వయి చా రక్షతి రక్షకైః కిం అనన్యైః** – శ్రీ కామాసికాష్టకము 8



శ్రీ లక్ష్మీనరసింహస్వామి శిల్పం. రంగారెడ్డి జిల్లా చెర్యాల గ్రామం. వికీపీడియా చిత్రం. by Veera Narayana
https://commons.wikimedia.org/wiki/File:Lakshmi_Narasimha_statue_at_Cheriyal_temple,_December_2018.jpg

**పోతన భాగవతం. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడిచ్చిన ఉత్తరము –**

బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వడు? నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు? ప్రాణులకును
బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్రా

దిక్కులు కాలముతో నే
దిక్కున లేకుండ గలుగు దిక్కులు మొదలై
దిక్కుగల లేనివారికి
దిక్కయ్యెడువాడు నాకు దిక్కు మహాత్మా

## 601. వృషభాక్షః

- ధర్మము రూపములో సంసార చక్రమునకు ఆధారమైనవాడు.
- కామితఫలములను వర్షించు కన్నులు గలవాడు.
- ధర్మమే లక్ష్యముగా గలవాడు.

### ఓం వృషభాక్షాయ నమః

ఈ నామములో 'వృషభ', 'అక్ష' అనే రెండు పదములున్నాయి.

వృషభ – 'వృష'నుండి - (1) వర్షించునది (2) ధర్మము.

అక్ష – (1) ఇరుసు (2) కన్నులు.

ఈ అర్థములను తీసుకునే క్రమాన్నిబట్టి ఈ నామమునకు వివిధ వ్యాఖ్యలు లభిస్తున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – సంసారచక్రమునకు ధర్మము అనే ఇరుసు గనుక భగవానుడు వృషభాక్షుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – (1) **సకలాన్ కామాన్ వర్షుకే అక్షిణీ అస్య ఇతి వృషభాక్షః.** భక్తులు కోరినవానిని వర్షించే కన్నులున్న దేవుడు వృషభాక్షుడు. భగవంతుని చూపే సకల సంపదలను క్రుమ్మరిస్తుంది. (2) **వృషభః ధర్మః స ఏవ వా దృష్టిః అస్య ఇతి వృషభాక్షః.** ధర్మమే దృష్టిగా కలిగినవాడు వృషభాక్షుడు.

ధర్మచక్రము రచయిత – దుర్యోధనుడు, అర్జునుడు - వీరి మధ్య యుద్ధంలో ధర్మము అర్జునుని పక్షాన ఉండడంవలన అర్జునుడు జయించాడు. భగవంతుడు ధర్మం పక్షమున ఉండును గనుక మనం ధర్మమార్గమున చరించాలి.

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీ ర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతిర్మమ** – గీత 18.78
ఓ రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడును, గాండీవ ధనుర్ధారి అయిన అర్జునుడును ఉండుచోట సంపదలును, సర్వ విజయములును, సకలైశ్వర్యములును, సుస్థిరమైన నీతియును ఉండును – అని నా నిశ్చితాభిప్రాయము.

విశ్వామరేంద్ర పదవిభ్రమ దానదక్షమ్
ఆనంద కంద మనిమేష మనంగ తంత్రమ్
ఆకేకరస్థిర కనీనిక పద్మనేత్రమ్
భూత్యై భవేన్మమ భుజంగ శయాంగనాయాః – కనకధారా స్తోత్రము.
తనను భజించువారికి దేవేంద్రపదవిని సైతము ఇవ్వజాలినవి, మానవుడు అనుభవింపకోరిన సకల ఆనందములకును మూలమైనవి, (దేవతయగుటచే) రెప్పపాటు లేనివి, భగవంతుడైన విష్ణుమూర్తికి సైతము మన్మధబాధను కలిగింపగలిగినవియు, అర్ధనిమీలితములుగా చూచునవియు అయిన శ్రీలక్ష్మీమాత యొక్క నేత్రకమలములు నాకు సంపదలను కటాక్షించుగాక.



క్రీస్తుపూర్వంనాటి శ్రీ గజలక్ష్మి శిల్పం

https://commons.wikimedia.org/wiki/File:Gajalakshmi._Bharhut,_c._100_BC._Indian_Museum,_Calcutta_ei05-12.jpg

ప్రాప్తమ్ పదమ్ ప్రధమతః ఖలు యత్ ప్రభావాత్
మాంగల్యభాజి మధుమర్థిని మన్మథేన
మయ్యాపతేత్ తదిహ మంథర మీక్షణార్థమ్
మందాలసం చ మకరాలయ కన్యకాయాః – కనకధారా స్తోత్రము.
దేవి ప్రభావముచేత మన్మధుడు సకల కళ్యాణగుణాభిరాముడైన శ్రీ విష్ణుమూర్తి యొక్క మనసునందు (ఆయనను మదన తాపమునకు గురిచేయుట ద్వారా) మొదటిసారిగా స్థానము సంపాదించుకొన్నాడో, ఆ శ్రీలక్ష్మీదేవియొక్క సెమ్మదైన మరియు ప్రసన్నమైన ఓరచూపు నాపై ప్రసరించుగాక!

## 602. వృషప్రియః

- ధర్మమునందు ప్రీతి కలిగినవాడు.
- ధర్మపరులకు ప్రియమైనవాడు, ఆప్తుడు.

### ఓం వృషప్రియాయ నమః

**ధర్మో ప్రియౌతావస్యేతి ప్రవర్తక నివర్తకౌ వృషప్రియ స్స విజ్ఞేయో హ్యష్టార్ణః ఫలదోమనుః -** ప్రవృత్తి ధర్మము మరియు నివృత్తి ధర్మము – రెండింటియందు ప్రీతి కలిగినవాడు వృషప్రియుడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. ఫలప్రదము. ఓం వృషప్రియాయ నమః.

'వృష' అనగా ధర్మము. ధర్మముపట్ల ప్రేమ కల్గినవాడు గనుక శ్రీహరి వృషప్రియుడు. అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ప్రవృత్తి ధర్మము అనగా ఇహలోకములో అవుసరమైన సిరిసంపదలు, భోగభాగ్యాలు వంటివానిని ధర్మమార్గములో సంపాదించి అనుభవించుట. నివృత్తి ధర్మము అనగా ఐహికసౌఖ్యాల పట్ల వైరాగ్యము కలిగి శాశ్వత సచ్చిదానంద స్వరూపుని చేరుటకై దీక్ష సాగించుట. ఈ రెండు విధములైన ధర్మములుకూడ దేవదేవునికి ప్రీతి కలిగించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ధర్మమార్గమును అనుసరించువారికి భగవానుడు అత్యంత ప్రీతిపాత్రుడు. కనుకనే ఆయన ధర్మసంస్థాపనకై యుగయుగమున సంభవించును.



బృందావనవిహారి శ్రీగోపీకృష్ణుడు. కాంగ్రా శైలి చిత్రం. 1760 కాలానిది.

https://commons.wikimedia.org/wiki/File:Kangra_Painting.jpg



## అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః |
## శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః || (64)

### 603. అనివర్తీ

- పితృయానములో (ప్రవృత్తి మార్గంలో) పయనించేవారిని సంసారమువైపు నివర్తింపజేయువాడు (మోక్షమువైపు పోనీయనివాడు).
- దేవాసుర సంగ్రామంలో ఎన్నడును మరలనివాడు. సదా విజయుడు.
- ధర్మపథమునుండి ఎన్నడును మరలనివాడు.
- వెనుదిరగని, చలించని లక్షణము కలవాడు

ఓం అనివర్తినే నమః

'నివర్తనము' అనగా వెనుకకు తిరుగుట, మరలుట. 'అనివర్తి' అనగా (1) వెనుకకు తిరగనీయనివాడు – అని శ్రీ భట్టులు (2) వెనుకకు తిరగనివాడు – అని శ్రీ శంకరులు తమ వ్యాఖ్యలలో చెప్పారు.

శ్రీ భట్టులు – **న నివర్తయతి ఇతి అనివర్తీ.** ప్రవృత్తి ధర్మమునకు బద్ధులైనవారిని సంసారమునుండి మరలనీయనివాడు (మోక్షమువైపు పోనీయనివాడు) అనివర్తి. **పితృయాణ ప్రవృత్తానాం సంసారాన్న నివర్తనాత్ అనివర్తీ సమాఖ్యాతో హ్యష్టార్ణోఽభయదోమనుః** - పుణ్యకర్మలాచరించినవారిని (ప్రవృత్తిమార్గంలో నడచినవారిని) ధూమ్రమార్గంలో పితృలోకాలలోని ఫలము అనుభవింపజేసి తిరిగి సంసారంలో పడవేసేవాడు అనివర్తి. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అభయప్రదము. ఓం అనివర్తినే నమః.

**ప్రవృత్తిరతాన్ సంసారాత్ న నివర్తయతీతి అనివర్తీ** – ప్రవృత్తిమార్గంలో నడచినవారికి పితృలోకాలలోని సుఖాలందించి, కర్మఫలశేషము అనుభవించడానికి వారికి మళ్ళీ ఉత్తర జన్మలు కలిగించేవాడు అనివర్తి.

శ్రీ శంకరులు రెండు అర్థాలను చెప్పారు –

**దేవాసుర సంగ్రామాత్ న నివర్తత ఇతి అనివర్తీ** – అసురులతో యుద్ధము చేయునపుడు ఎన్నడును మరలనివాడు అనివర్తి. సదా రాక్షస సంహారము కావించి విజయము పొందినవాడు.

**వృషప్రియాత్ ధర్మాత్ న నివర్తత ఇతి అనివర్తీ.** – ధర్మముపట్ల ప్రియము కలిగియున్నందున ధర్మపథమునుండి ఎన్నడును మరలని (వీడని)వాడు అనివర్తి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **న నివర్తితుమ్ శీలమ్ అస్య ఇతి అనివర్తీ.** వెనుదిరిగే లక్షణము లేనివాడు అనివర్తి. ఉదాహరణకు సృష్టి ఆదినుండి ప్రళయమువరకు భగవంతుని సృష్టి తమతమ లక్షణములు కలిగియేయుండును.

## 604. నివృత్తాత్మా

- ఇతరములకంటె ఉన్నతమైన లక్షణము కలవాడు.
- ప్రవృత్తిధర్మము పాటించువారికి ఆత్మమూర్తి.
- సంసారబంధములకు బద్ధముకాని లక్షణము కలవాడు.
- విషయ వ్యామోహములకు విముఖుడు.
- తన కీర్తి, గుణగానములపట్ల ఆసక్తిగాని, స్వకీర్తిపరతగాని లేనివాడు.
- విషయ ఇంద్రియ సంబంధమైనవానిపట్ల విముఖుడు.
- అంతటా ఉండేవాడు గనుక దేనినుండీ మరలనివాడు.

### ఓం నివృత్తాత్మనే నమః

ఈ నామము శ్రీ భట్టుల వ్యాఖ్యానము ప్రకారము నాలుగుమారులు (25వ, 48వ, 64వ, 83వ శ్లోకాలలో) మరియు శ్రీ శంకరుల వ్యాఖ్యానము ప్రకారము రెండుమారులు (25వ, 64వ శ్లోకాలలో) వస్తుంది. శ్రీ శంకరులు 48వ శ్లోకంలో 'విముక్తాత్మా' అనే పాఠాన్ని, 83వ శ్లోకంలో 'అనివృత్తాత్మా' అనే పాఠాన్ని గ్రహించారు.

25వ శ్లోకము. 231వ నామము. **నివృత్తాత్మా** – ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః

48వ శ్లోకము.453వ నామము.

శ్రీ భట్టుల పాఠము ప్రకారము: **నివృత్తాత్మా** – సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్
శ్రీ శంకరుల పాఠము ప్రకారము: **విముక్తాత్మా** – సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్
64వ శ్లోకము. 604వ నామము. **నివృత్తాత్మా** – అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః

83వ శ్లోకము. 780వ నామము.

శ్రీ భట్టుల పాఠము ప్రకారము: **నివృత్తాత్మా** – సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః
శ్రీ శంకరుల పాఠము ప్రకారము: **అనివృత్తాత్మా** – సమావర్తోऽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః

శ్రీ భట్టుల వ్యాఖ్యప్రకారం నాలుగుమార్లు వచ్చే మరొక నామము **'ప్రాణదః'**

'నివృత్తి' అనగా 'వ్యామోహహీనత' (తగులుకొనకుండుట). ఇదే భావాన్ని కొంత పొడిగిస్తే 'నివృత్తి' అనగా 'ఉద్గతము' లేదా 'ఉన్నతము' (అందరానిది) అని కూడా చెప్పవచ్చును. శ్రీ భట్టులు 25వ శ్లోకంలోని నామానికి 'ఉన్నతమైనవాడు' అన్న భావంలో వ్యాఖ్యానించారు. మిగిలిన మూడు శ్లోకాలలోను 'విషయరాహిత్యము' అన్న భావంలో వ్యాఖ్యానం చెప్పారు. నివృత్తిధర్మం గురించి ఈ వ్యాఖ్యానాలలో అనుసంధించారు. నివృత్తిధర్మం పాటించేవారికి ఆత్మస్వరూపుడు నివృత్తాత్మ. **నివృత్తి ధర్మిణో యస్యహ్యాత్మా న స్సంతి సస్మృతః - నివృత్తాత్మేత్యష్టవర్ణో దుష్కృర్మఫలయోదకః -** నివృత్తిధర్మము గల ఆత్మలను తనవారిగా అర్చిరాదిమార్గమున స్వీకరించువాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. పాపములను హరించును. ఓం నివృత్తాత్మనే నమః.

ప్రవృత్తిధర్మముపట్ల ఆసక్తిలేని జీవులు భగవంతునకు కైంకర్యము చేయుటయే లక్ష్యముగా కలిగియుండును. శ్రీహరి వారికి అదే ప్రసాదించును. అనగా వారికి తన లోకము (పరంధామము)ను ప్రసాదించును. అట్టివారికి తిరిగి సంసారమునకు వచ్చే గతి పట్టదు.

భగవంతుడు అందరికీ ఆత్మ అయినట్లే నివృత్తిధర్మమును ఆచరించేవారికి కూడా ఆత్మయే. కాని ఆయన నివృత్తిధర్మపరులను తనకు ఆత్మసములుగా ఆదరించును. కనుక శ్రీదేవుడు నివృత్తాత్మ.

శ్రీ రామానుజన్ – బ్రహ్మాండమును సృష్టించిన భగవంతుడు సకల భువనములకు ప్రభువు. కాని ఆయనకు ఈ సృష్టి తన స్వంతమన్న అహంకారభావముగాని, స్వోత్కర్షగాని యుండవు. ఎందుకంటే విషయగుణములపట్ల ఆయన విముఖుడైయుండును. కనుక ఆయన నివృత్తాత్మ.

ఈ నాలుగు శ్లోకాలలోను శ్రీ శంకరులు చెప్పిన వ్యాఖ్యలు –

25వ శ్లోకము. **నివృత్తాత్మా** – సంసారబంధములకు లోబడనివాడు.

64వ శ్లోకము. **నివృత్తాత్మా** – స్వభావము ప్రకారము ఐహిక విషయములందు విముఖుడైనవాడు.

48వ శ్లోకము. **విముక్తాత్మా** – స్వభావము ప్రకారము సంపూర్ణముగా స్వేచ్ఛయున్నవాడు. కర్మబంధములకు బద్ధుడు కానివాడు.

83వ శ్లోకము. **అనివృత్తాత్మా** – అన్నిచోట్లా ఉండేవాడు గనుక ఎక్కడనుండైనా వెనుదిరగనివాడు.

శ్రీ చిన్మయానంద – భగవంతుని తెలిసికోవాలంటే మనము విషయలోలతనుండి విముఖులము కావాలని ఈ నామము బోధిస్తున్నది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఊబిలో చిక్కుకున్నవాడిని బయటకు లాగేవాడు ఒడ్డున ఉండాలి. అలాగే సంసార వ్యామోహంనుండి మనను కాపాడేవాడు సంసారబద్ధుడై యుండకూడదు. అన్నివిధాలుగా విముక్తుడైన శ్రీమన్నారాయణుడే మనలను ఈ ఘోర సంసార పాపపంకిలంనుండి ఉద్ధరించగలడు. హరేరామ.

## **605.** సంక్షేప్తా

- ప్రవృత్తి ధర్మమును ఆచరించేవారి జ్ఞానమును సంకుచితము చేయువాడు.
- ప్రళయకాలమున సకల జగములను తనయందే సంక్షేపించువాడు.
- తన భక్తుల విపత్తులను తగ్గించువాడు. వారివెంటనుండువాడు.

## ఓం సంక్షేప్త్రే నమః

'సంక్షేపము' అనగా చిన్నది, తగ్గినది, సూక్ష్మమైనది (ఉదా.: సంక్షేప రామాయణము). ఈ అర్థాన్ని వివిధ వ్యాఖ్యానకర్తలు వివిధాలుగా అనుభవించి మనకు తెలిపారు. శ్రీ భట్టులు ప్రవృత్తి, నివృత్తి ధర్మాలపరంగా భాష్యాన్ని కొనసాగించారు. శ్రీ శంకరులు విశ్వసంక్షిప్తతను సూచించారు.

**స్వాభావికా సంకుచితా మేధా యశ్చ ప్రకాశనమ్ నివృత్తి ధర్మాణాం కర్తుం శీలం యస్యాస్తి సర్వదా స సంక్షేప్తేతి కథితః షడర్ణో ధీవికాసదః -** నివృత్తి ధర్మము ననుసరించేవారి జ్ఞానము దినదినాభివృద్ధి చెందుతూ ఉంటుంది. అలా కాకుండా ప్రవృత్తి ధర్మాన్ని ఆచరించేవారి బుద్ధి కుంచించుకొని ఉంటుంది. అలా చేసేవాడు సంక్షేప్త. ఈ నామము షడక్షరి. బుద్ధివికాసాన్ని కలిగిస్తుంది. ఓం సంక్షేప్త్రే నమః. ఇలా ప్రవృత్తిధర్మమును అనుసరించేవారికి కామ్యసిద్ధి పైనే కోరిక ఉంటుంది. వారికి పరిపూర్ణమైన జ్ఞానదృష్టి అబ్బదు. వారు పూర్వకర్మలకు లోబడి వర్తించి, మోక్షగాములు కాకుండా తిరిగి సంసారచక్రంలోనికి వస్తారు. ఇలా వారి జ్ఞానాన్ని సంకోచింపజేసేవాడు 'సంక్షేప్త' అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **విస్తృతమ్ జగత్ సంసార సమయే సూక్ష్మరూపేణ సంక్షిపన్ సంక్షేప్తా.** ప్రళయకాలంలో సకలజగములను, భూతములను సంక్షేపముచేసి తనయందే ఉంచుకొనవాడు గనుక శ్రీహరి సంక్షేప్త.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సంక్షిపయతి న్యూనయతి భక్తానామ్ విపత్తీః ఇతి సంక్షేప్తా.** తన భక్తుల కడగండ్లను కడతేర్చువాడు. ఆపదలు తగ్గించువాడు సంక్షేప్త.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు ఒక మహావృక్షాన్ని ఒక చిన్నవిత్తనంలో పొందుపరుస్తాడు. సృష్టి అంతటా ఈ ధర్మం కనిపిస్తుంది.

శ్రీ చిన్మయానంద, శ్రీ అనంతకృష్ణశాస్త్రి – వీరు 'అసంక్షేప్తా' అనే పాఠాంతరాన్ని గ్రహించారు. భక్తులను ఎన్నడును విడచిపెట్టనివాడు శ్రీహరి. **ఓం అసంక్షేప్త్రే నమః.**

ధర్మచక్రము రచయిత – సంసారవ్యామోహాలలో కూరుకుపోయినకొలదీ మనదృష్టి కుంచించుకుని పోతుంది. భగవంతుని గురించిన జ్ఞానం కనుమరుగవుతుంది. అలా జీవించేవారు విలువైన మానవజన్మను వృథా చేస్తున్నారు.

## 606. క్షేమకృత్

- తన భక్తులకు క్షేమమును కలిగించువాడు.
- తన భక్తులు సంపాదించుకొన్నదానిని పరిరక్షించేవాడు.

### ఓం క్షేమకృతే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – నివృత్తిధర్మమును పాటించేవారి జ్ఞానమునకు అవరోధములను తొలగించి వారికి మంచి చేసేవాడు క్షేమకృత్. **అసంకోచ జ్ఞానరూప క్షేమస్య కరణాత్పతతామ్ క్షేమకృచ్చాపి సర్వేషామ్.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఉపాత్తస్య క్షేమమ్ పరిరక్షణమ్ కరోతి ఇతి క్షేమకృత్.** తనను సేవించువారికి క్షేమము కలిగించి పరిరక్షించువాడు. ఈ వ్యాఖ్యను ఇద్దరు అనువాదకులు కొంత భేదంతో వివరించారు.

శ్రీ టి.ఎస్. కృష్ణమూర్తి – తనను ఆశ్రయించినవారికి రక్షణ, క్షేమము కలిగించువాడు క్షేమకృత్.

శ్రీ ఆర్. అనంతకృష్ణశాస్త్రి – తన భక్తులు సంపాదించుకొన్నదానిని కాపాడేవాడు క్షేమకృత్.

శ్రీ చిన్మయానంద వివరణ – భగవంతుడు తన భక్తులు సంపాదించుకొన్నదానిని కాపాడడమే కాదు. ఇంకా సాధించనిదానిని సాధించేందుకు అనుగ్రహిస్తాడు.

**అనన్యాంశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానామ్ యోగక్షేమం వహామ్యహమ్** – గీత 9.22
పరమేశ్వరుడనైన నన్ను నిరంతరము అనన్యభక్తితో చింతన చేయుచు, నిష్కామభావముతో సేవించువారి యోగక్షేమములను నేనే వహించుదును.

ఇక్కడ యోగమనగా ఇంకా లభించనిది లభించే భాగ్యము. క్షేమమనగా ఇప్పటికే లభించినది భద్రంగా ఉండే ఆనందం. యోగక్షేమాలను ఇద్దరు రచయితలు ఇలా వివరించారు.

తిరుక్కళ్ళమ్ శ్రీ నృసింహ రాఘవాచార్యస్వామి – **అలబ్ధస్య లాభోయోగః, లబ్ధ రక్షణమ్ క్షేమః.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **అప్రాప్తస్య ప్రాపణామ్ యోగః, యోగస్య రక్షణమ్ క్షేమః.** మోక్షార్థులైన భక్తులకు మోక్షాన్ని ప్రసాదిస్తాడు శ్రీహరి. ఇది యోగము. ఆ మోక్షాన్ని వారినుండి దూరం చేయడు. ఇది క్షేమము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కొంత విలక్షణమైన అర్థాన్ని చెప్పారు – 'క్షేమ' అనే పదాన్ని అనేక ధాతువులుగా విపులీకరించవచ్చును.

క్షి – నివాస – నివాసముండుట

క్షి – గతయోః – చలించుట

క్షి – క్షయ – తగ్గుట, సమాప్తమగుట

క్షి – హింసా – బాధకలుగుట

ఇవే కాకుండా 'క్షేమ' అంటే 'మంచి కలిగించుట' అనే సామాన్యమైన అర్థం ఉండనేఉన్నది. వీటన్నింటిని కలిపి ఇలా వివరించవచ్చును.

భగవంతుడు అందరిలోనూ ఉన్నాడు (నివాస). భగవంతుడు అందరికీ చైతన్యం కలిగిస్తాడు (గతి). భగవంతుడు కడకు శరీరంనుండి ఆత్మను వేరుచేస్తాడు (క్షయ). ఇలా సమస్త జీవులకు ఆది, మధ్య, అంతములలో తోడుండి, వారికి క్షేమాన్ని కలుగజేస్తాడుగనుక శ్రీహరి క్షేమకృత్. అన్ని అర్థాలలోనూ ఆయన క్షేమకరుడే.

ధర్మచక్రము రచయిత – తల్లి తన బిడ్డను కడుపులో ఉంచుకొనీ, కనీ, పెంచీ కాపాడేలాగే శ్రీహరి తన భక్తులను కాపాడుతాడు. ఓం క్షేమకృతే నమః.

## 607. శివః

- తన భక్తులకు శుభములను కలుగజేయువాడు. మంగళకరుడు.
- తన నామమును స్మరించినంతనే పవిత్రము చేయువాడు.
- ప్రళయకాలములో జగత్తు ఆయనయందు శయనించును.
- అన్నింటా, అంతటా ఉండేవాడు.

**ఓం శివాయ నమః.**

ఈ మంగళప్రదమగు నామము 27వ నామముగాను, మరల 607వ నామముగాను కూడ చెప్పబడెను.

4వ శ్లోకము. 27వ నామము. శివః – **సర్వః శర్వః శివః స్థాణుః భూతాదిః నిధిరవ్యయః**
64వ శ్లోకము. 607వ నామము. శివః – **అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృత్ శివః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శివమ్ కరత్వాత్ శివః.** అందరికీ మంగళకరుడు శివుడు. సౌఖ్యకాములకూ, మోక్షకాములకూ కూడా, బుభుక్షువులకూ, ముముక్షువులకూ కూడా – వారు కోరినది అనుగ్రహించేవాడు.

శ్రీ మహాభారతము – **శివో శివానామ్ అశివో అశివానామ్.** మంచివారికి మంచిని, చెడువారికి చెడును కల్పించేవాడు.

శ్రీ విష్ణుపురాణము 6.7.62 – **సంసారమోక్ష స్థితి బంధహేతుః.** ప్రాపంచిక బంధాలకు, వానినుండి విముక్తికి కారణమైనవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీహరి నామస్మరణము చేతనే పవిత్రత లభించునుగనుక శ్రీహరియే శివుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ, శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'శీఙ్' అన్న ధాతువునుండి, 'స్వప్నే' అనగా నిదురించుటయందు – **సేతే సర్వమ్ జగత్ ప్రళయవేళాయామ్ యస్మిన్ ఇతి శివః.** ప్రళయకాలమున సకల జగము ఎవనియందు వసించియుండునో ఆయన శివుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారి మరొక వ్యాఖ్య – 'శ్యై' అన్న ధాతువునుండి 'వెళ్ళుట' అనే భావములో – **శ్యాయతే సర్వమ్ ఇతి ప్రాప్నోతి ఇతి అర్థః** – అంతటా ఉండేవాడు, అన్నింటా ఉండేవాడు శివుడు. ఓం శివాయ నమః.

## 608. శ్రీవత్సవక్షాః

- వక్షమున శ్రీవత్సచిహ్నమును కలిగినవాడు.

### ఓం శ్రీవత్సవక్షసే నమః

**ఈ నామమునుండి 619వ నామమువరకు వచ్చు నామములు – శ్రీవత్సవక్షాః, శ్రీవాసః, శ్రీపతిః, శ్రీమతాంవరః, శ్రీదః, శ్రీశః, శ్రీనివాసః, శ్రీనిధిః, శ్రీవిభావనః, శ్రీధరః, శ్రీకరః, శ్రేయః, శ్రీమాన్ – శ్రీహరియొక్క లక్ష్మీపతిత్వమును తెలియజేయునవిగా శ్రీభట్టులు వ్యాఖ్యానించారు.**

608వ నామమునకు నిరుక్తి వివరణ –

**లక్ష్మీవాల్లభ్య సౌభాగ్య చిహ్నమ్ శ్రీవత్సనామకమ్ శ్రీవత్సవక్షా యస్యాస్తి వక్షసీతి సతుస్మృతః** - లక్ష్మీవల్లభత్వమనే సౌభాగ్యచిహ్నమైన శ్రీవత్సము అనే చిహ్నాన్ని వక్షస్థలమున కలవాడు

సర్వభూపాల వాహనంపై ఉభయ దేవేరులతో ఊరేగుతున్న శ్రీ మలయప్ప స్వామి. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Malayappa_in_mutyala_pandiri_vahanam.jpg



శ్రీ రాధాకృష్ణశాస్త్రి విష్ణుపురాణము నుండి ఉదాహరించారు – వ్యాసుడు తనకు తెలిపినట్లుగా పరాశరుడు మైత్రేయికి చెప్పినది – సకల జగములు శ్రీమహావిష్ణువు తత్త్వమందు లీనమైయుండును. వివిధాభరణములు చిహ్నములందు సమస్తము నిక్షిప్తమైయున్నది. **శ్రీవత్స సంస్థానధరమ్ అనంతే చ సమాశ్రితమ్** (1.22.67). నిర్గుణమైన, నిష్కళంకమైన శుద్ధసత్వాత్మమును హరి కౌస్తుభమణిగా ధరించియున్నాడు. అన్నింటికంటె ప్రధానమైనది శ్రీవత్సచిహ్నముగా నున్నది. బుద్ధి మాధవుని గద రూపమున ఉన్నది.......

శ్రీ రాధాకృష్ణశాస్త్రి శ్రీ మద్భాగవతము (12.11.10)నుండి కూడా ఉదాహరించారు. శుద్ధ జీవ చైతన్యమే భగవానుని కౌస్తుభము. దాని ప్రతిబింబమే శ్రీవత్స చిహ్నము.

**కౌస్తుభ వ్యాపదేశేన స్వాత్మజ్యోతిః బిభర్తి అజః తత్ప్రభా వ్యాపినీ సాక్షాత్ శ్రీవత్సమ్ ఉరసా ప్రభుః**
**శ్రీ ఏల్చూరి మురళీధరరావు 'శ్రీమద్భాగవతము'నుండి:**

ఆ (విరాట్) మూర్తియొక్క ఆత్మతేజస్సు కౌస్తుభరూపంలో అతనిని అలంకరిస్తుంది. ఆ కౌస్తుభకాంతి శ్రీవత్సమనే పేరుతో అతని విభూషగా అలరారుతుంది. గుణమయి అయిన అతని శక్తి ఛందోమయ పీతాంబరరూపంలో చూపట్టుతుంది. వర్ణత్రయాత్మకమైన

ఓంకారం అతనికి బ్రహ్మసూత్రంగా అమరింది. సాంఖ్యయోగాలు మకరకుండలాలుగా, బ్రహ్మలోక మౌళిగా కల్పించారు... మునులారా... అతని ఆత్మశక్తి అయిన శ్రీదేవి నిరంతరం అతనిని అర్చిస్తుంటుంది... ఆ మహాపురుషుడు వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నాల్గుమూర్తులతో ఉపాసనాదులకు స్థానమై విలసిల్లుతుంటాడు... మునులారా... భగవానుడు స్వప్రకాశుడు, స్వమహిమాపూర్ణుడు, అనవచ్ఛిన్న జ్ఞానాత్మకుడు ఐనా నిజమాయను అధిష్ఠించి బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపాలలో భిన్నునిగా కనుపట్టుతూ విశ్వ సృష్టి స్థితి లయాలను కావిస్తుంటుంది. ఆ పరమాత్ముని తాదాత్మ్యముచేత తప్ప వేరొక విధాన పొంద శక్యంకాదు. తాదాత్మ్యస్థితి పొందాలంటే తత్పరులు కావాలి. ఎవరు వేకువజామున మేల్కాంచినంతనే

**శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావ నిధ్రుగ్రాజన్య వంశ దహనానపవర్గ వీర్య**
**గోవిన్ద గోపవనితా వ్రజభృత్యగీత తీర్థ శ్రవః శ్రవణ మంగళ పాహి భృత్యాన్**

శ్రీకృష్ణా! అర్జునసఖా! వృష్ణివంశోత్తమా! భూద్రోహిరాజవంశ దహనా! అక్షీణ ప్రభావా! గోవిందా! గోపాంగనా గీత పవిత్ర కీర్తీ! శ్రవణ మంగళా! నీ భృత్యులను మమ్ము కాపాడుము – అని తచ్చిత్తులై ప్రణతిపూర్వకంగా జపిస్తారో వారికి తత్ హృదయవర్తి అయిన భగవానుడు ప్రసన్నుడవుతాడు. తత్ఫలంగా వారికి హృదయాంతర్వర్తియైన భగవంతునితో తాదాత్మ్యం కాలక్రమాన కలుగుతుంది.

శ్రీ చిన్మయానంద వ్యాఖ్యప్రకారం శ్రీవత్సచిహ్నము భగవానుని వక్షస్థలముపై భగవంతుని పాదముద్ర. భక్తులపై తనకు గల ప్రేమకు గుర్తుగా శ్రీదేవుడు ఈ చిహ్నమును ధరించును. ఇందుకు ఆధారముగా శ్రీమద్భాగవతములో ఈ శ్లోకము (10.89.12) చెప్పబడినది.

**అద్యాహమ్ భగవాన్ లక్ష్మ్యాఽసమ్ ఏకాంత భాజనమ్ వత్స్యతి ఉరసి మే భూతిః భవత్పాద హతాంహసః**
భృగుమహర్షి పాదముచే పవిత్రమైన తన వక్షస్థలమునందు ఇకనుండి శ్రీలక్ష్మి నివసించునని శ్రీనివాసుడు తెలిపెను. భగవంతుడు భృగుమహర్షి పాదచిహ్నమునే 'శ్రీ'గా తన వక్షముపై ధరించెనని శ్రీ చిన్మయానంద వివరించారు.

## 609. శ్రీవాసః

శ్రీలక్ష్మీదేవికి నిలయమైనవాడు.

- 'శ్రీ-వాసుడు' అనగా లక్ష్మిని కలిగినవాడు. సదా శ్రీహరి వక్షస్థలమున లక్ష్మీదేవి వసించియున్నది.
- అన్ని విధములైన 'శ్రీ'లను సంపూర్ణముగా కలిగియున్నవాడు.

### ఓం శ్రీవాసాయ నమః

శ్రీ భట్టులు రామాయణము యుద్ధకాండము (114.15)నందు శ్రీరాముడు 'నిత్యశ్రీ' అని వర్ణింపబడినట్లు ఉదాహరించారు. ఆయన కల్పవృక్షవనము. ఆయమ్మ కల్పవల్లి. **శ్రియో విహారస్థానత్వాత్ శ్రీవాస ఇతి చోచ్యతే.** శ్రీమహాలక్ష్మి యథేచ్ఛగా విహరించడానికి స్థానము కలవాడు శ్రీవాసుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అస్య వక్షసి శ్రీః అనపాయినీ వసతి ఇతి శ్రీవాసః.** నిత్యానపాయినియై (ఎన్నడూ విడువనిదై) నారాయణుని వక్షస్థలమున శ్రీ నివశిస్తుంది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – శోభ సౌందర్య సంపన్నుడు శ్రీవాసుడు.

ధర్మచక్రము రచయిత – శ్రీ, కీర్తి, ఐశ్వర్యము, జ్ఞానము, వీర్యము, వైరాగ్యము – అన్ని సంపదలను అనంతముగా కలిగినవాడు శ్రీవాసుడు.




సిరి చాంచల్యము తోడిదయ్యు దనకుం జితేశ్వరుండంచు నే
పురుష శ్రేష్ఠు వరించె నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులన్
గరయుగ్మంబుల గౌగిలించిరి సతుల్ కళ్యాణ బాష్పంబు లా
భరణ శ్రేణులుగా బ్రతిక్షణ నవప్రాప్తానురాగంబులన్. –

పోతన భాగవతము.

## 610. శ్రీపతిః

- శ్రీమహాలక్ష్మికి నాథుడు.
- విశ్వశక్తికి అధిపతి

### ఓం శ్రీపతయే నమః

**స్వయం శ్రియః పతిత్వేన వృత్తత్వాన్ శ్రీపతి స్స్మృతః.** అన్ని అవతారములందును శ్రీమహాలక్ష్మి శ్రీహరిని వరించు నిత్యానపాయిని. శ్రీభట్టులు శ్రీసూక్తమునుండి ఉదాహరించారు – **అస్యేశానా జగతో విష్ణుపత్నీ.** విష్ణుపత్ని అయిన లక్ష్మీదేవి ఈ జగత్తునకు ఈశ్వరి. సుందరకాండ (16.5)నుండి కూడ శ్రీ భట్టులు ఉదాహరించారు – **రాఘవోఽర్హతి వైదేహీం తం చేయమ్ అసితేక్షణా**. రామునకు తగినది సీత. సీతకు రాముడు తగును.

శ్రీ వి.వి. రామానుజన్ దివ్యప్రబంధములనుండి ఉదాహరించారు –
పెరియ తిరుమొళి 7.7.1 – అందరికీ ఐశ్వర్యాలనొసగే దేవదేవుని ఐశ్వర్యము నీవు.
తిరువైమొళి 10.10.7 – నీవు శ్రీమహాలక్ష్మికి ప్రేమమూర్తివి.

శ్రీ శంకరులు క్షీరసాగరమథన సమయంలో లక్ష్మీదేవి అవతరణను పేర్కొన్నారు – **అమృత మథనే సర్వాన్ సురాసురాన్ విహాయ శ్రీః ఏనం వరయామాస ఇతి శ్రీపతిః.** అమృతమథన సమయంలో సురాసురులనందరినీ వదలి లక్ష్మీదేవి ఇతనిని వరించింది గనుక నితడు శ్రీపతి.

శ్రీ శంకరులు మరొక అర్థాన్ని కూడా చెప్పారు – 'శ్రీ' అనగా పరమ విశ్వశక్తి. అట్టి శక్తి ఇతని వశములో నుండును. కనుక నితడు శ్రీపతి.

**శ్రీమద్భాగవతము – అష్టమ స్కంధము నుండి (శ్రీ ఏల్చూరి మురళీధరరావు రచన)** - ఆ విధంగా శ్రీదేవి అందరినీ ఉపేక్షించి ఏకాగ్రమతియై 'ఏ మహనీయుడు గుణాతీతుడైనా నిత్యానపాయి సద్గుణాలన్నింటికీ ఏకాశ్రయుడు కాగలడో ఆ పురుషోత్తముడు నిరపేక్షుడైనా అతననే వరిస్తాను' అని తలపోసి తనచేతి పూమాలికను పద్మనాభుని కంఠదేశాన అలంకరించి లజ్జాలలిత మందహాస చంద్రికలను ప్రసరింపజేస్తూ అతని వక్షోభాగం తనకు నివాసస్థానమని అపాంగవీక్షణాలతో సూచిస్తూ చెంత నిలిచింది. లోకజనకుడు జగజ్జనని మనసు గ్రహించి తన ఉరోభాగాన్ని ఆమెకు నివేశస్థానంగా అనుగ్రహించాడు. ఆ దేవి లోకేశ్వరుని హృదయమందిరమందు వసించి కరుణా కటాక్ష వీక్షణాలను సారించినంతనే ముజ్జగాలలో పెంపుసొంపులు ఇంపుమీరాయి. సురసుందరీమణులు తమ ఆనందాన్ని నృత్య గీత వాద్యాలతో వెల్లడించారు. బ్రహ్మరుద్రాది విశ్వస్రష్టలు వైష్ణవ మంత్రాలతో దంపతులను ప్రస్తుతించి పుష్పవర్షం కురిపించారు. ప్రజాపతులందరూ శ్రీ కటాక్ష భాగ్యపాత్రులై ఆనందపరవశులయ్యారు.

## 611. శ్రీమతాంవరః

- సంపన్నులలో అత్యుత్తముడు.
- వేదవిజ్ఞానము కలిగినవారిలో సర్వశ్రేష్ఠుడు.

### ఓం శ్రీమతాంవరాయ నమః

**దేవానాం శ్రీమతాం శ్రేష్ఠః శ్రీమతాంవర ఉచ్యతే.** లక్ష్మీదేవియొక్క కటాక్షవీక్షణాలతో శ్రేష్ఠులైన దేవతలలో శ్రేష్ఠుడు. శ్రీ భట్టులు క్షీరసాగర మథన సమయంలో లక్ష్మీదేవి ఉద్భవించి శ్రీమన్నారాయణుని వరించిన ఘట్టాన్ని ఈ శ్లోక వ్యాఖ్యానంలో విష్ణుపురాణం (1.9.106-107)నుండి ఉదాహరించారు.



రంగాపురం ఆలయంలో శ్రీ లక్ష్మీహయగ్రీవస్వామి శిల్పం

**శుక్లమాల్యాంబరధరా స్నాతా భూషణ భూషితా**
**పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షస్థలే హరే**
**తయోఽవలోకితాః దేవాః హరి వక్షస్థలస్థయా**

స్నానము చేసి తెల్లని వస్త్రములు మాలలు ధరించినదై, ఆభరణములచే అలంకరింపబడి లక్ష్మీదేవి విష్ణుమూర్తి వక్షస్థలాన కూర్చున్నది. అలా ఆసీనయై ఆ తల్లి దేవతలకు వరాలిస్తున్నది. అలా లక్ష్మీకటాక్షాన్ని అందుకొన్నవారిలో శ్రేష్ఠుడు శ్రీమతాంవరుడు.

శ్రీ వి.వి. రామానుజన్ – కొందరికి, కొన్ని సంపదలు, కొంతకాలం ఉండవచ్చును. కాని సకలైశ్వర్యములు సదా కలిగిన శ్రీహరియే శ్రీమతాంవరుడు. శ్రీ రామానుజన్ నాచియార్ తిరుమొళి (10.10) మరియు తిరువాశిరియాన్ (1) నుండి ఉదాహరించారు.

శ్రీ శంకరులు ఈ నామాన్ని 'శ్రీ' అనగా వేదములు అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. వేదములెరిగినవారిలో సర్వశ్రేష్ఠుడు శ్రీమతాంవరుడు. శ్రీ శంకరులు చెప్పిన ప్రమాణము –

**ఋచః సామాని యజూగ్ంషి, సాహి శ్రీ అమృతా సతామ్** (తైత్తరీయ బ్రాహ్మణము 1.2.1) సజ్జనులకు శాశ్వతమైన సిరి ఋగ్ యజూస్సామ వేదములు.

**ఋగ్యజూస్సామ లక్షణాశ్రీః ఏషామ్ తేషామ్ సర్వేషామ్**
**శ్రీమతామ్ విరించ్యాదీనామ్ వరః ప్రధాన భూతః శ్రీమతాంవరః**

వాటిని తెలిసికొన్న బ్రహ్మాదులు శ్రీమతులు. వారిలో ఉత్తముడు శ్రీమతాంవరుడు.

ఈ అర్థాన్నే కొంచెం మార్చి శ్రీ చిన్మయానంద ఇలా చెప్పారు – 'వర' అనగా దీవెన. వేదములు అధ్యయనం చేసేవారు కోరుకొనే ఉత్తమమైన వరము భగవంతుడు. అనగా వేదాన్ని నేర్చినవారు పూజించే పరమదైవము శ్రీమతాంవరుడు.



## శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః |
## శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః || (65)



తిరుమల మ్యూజియంలో చిత్రం.

### 612. శ్రీదః

'శ్రీ'ను ఇచ్చువాడు.

- లక్ష్మీదేవికి 'శ్రీ'త్వమును ఇచ్చువాడు.
- భక్తులకు సిరులను ప్రసాదించువాడు.

### ఓం శ్రీదాయ నమః

608వ నామమునుండి 619వ నామమువరకు – శ్రీవత్సవక్షాః, శ్రీవాసః, శ్రీపతిః, శ్రీమతాంవరః, శ్రీదః, శ్రీశః, శ్రీనివాసః, శ్రీనిధిః, శ్రీవిభావనః, శ్రీధరః, శ్రీకరః, శ్రేయః, శ్రీమాన్ – ఇవి శ్రీలక్ష్మీనారాయణుల అవినాభావ సంబంధమును, ఏకత్వమును, పరిపూర్ణతను సూచించునవిగా శ్రీభట్టులు వ్యాఖ్యానించారు.

'శ్రీదః' నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **నిత్యనూతన, నిరవ్యాజ ప్రణయరస శ్రియం తస్యై దదాతి ఇతి శ్రీదః.** నిత్యనూతన, నిరంతరాయమైన పరిపూర్ణ ప్రణయాన్ని లక్ష్మీదేవికి ఇచ్చువాడు 'శ్రీదః'. ఇందుకు ప్రమాణములు పెక్కులున్నవి.

విష్ణుపురాణము 1.9.144 – **విష్ణోరేవా అనపాయినీ.** ఆమె విష్ణువునుండి వేరుకాదు.

యుద్ధకాండము 121.19 – **అనన్యా హి మయా సీతా భాస్కరేణా ప్రభా యథా.** సూర్యునినుండి కాంతిని వేరుచేయడం సాధ్యంకాదు. నానుండి సీత వేరుకాదు. అని రాముడు అన్నాడు.

సుందరకాండము 21.15 – **అనన్యా రాఘవేణాహమ్ భాస్కరేణ ప్రభా యథా** – సూర్యునినుండి కాంతిని ఎలా విడదీయలేమో అలాగే రామునినుండి నన్ను వేరు చేయలేరు. అని సీత అనెను.

కాలిఫోర్నియా స్వామినారాయణ్ మందిరంలో శ్రీ లక్ష్మీనారాయణుల ప్రతిమలు. వికీపిడియా చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Downey_Laxminarayan_Dev.jpg Photo by User:AroundTheGlobe



'శ్రీ' అనగా 'సంపదలు' అన్న అర్థం తీసుకొంటే – భక్తులకు ఐశ్వర్యములు ప్రసాదించేవాడు 'శ్రీదః'. శ్రీ శంకరులు ఈ అర్థాన్ని తీసికొని ఈ నామాన్ని వ్యాఖ్యానించారు. **శ్రియమ్ దదాతి భక్తానామ్ ఇతి శ్రీదః.**

ఈ 'శ్రీ'ని ఇవ్వడం అనే భావాన్ని శ్రీ భట్టులు తమ వ్యాఖ్యలో – లక్ష్మీదేవికి 'శ్రీ'త్వమును ఇచ్చేవాడు శ్రీమన్నారాయణుడు. నారాయణునకు పూర్ణత్వము నొసగేది శ్రీమహాలక్ష్మి. అని, వారిద్దరూ వేరు వేరు కారని వివరించారు.

భగవంతుడు ఐశ్వర్యాన్ని ఇచ్చేవాడయితే ఎలాంటి ఐశ్వర్యాన్ని కోరుకోవాలి? 'ప్రేయస్సు' అనగా ఐహికమైన సంపదలు. 'శ్రేయస్సు' అనగా ఆధ్యాత్మిక సంపద. శ్రేయస్సుకొరకు, విష్ణువును అర్చిస్తూ మోక్షాన్ని పొందే భాగ్యం కొరకు విష్ణువును స్తుతించాలి అని ధర్మచక్రము రచయిత వివరించారు.

**శ్రీమతే రామానుజాయ నమః. శ్రీ శరణాగతి గద్యము ఆరంభంలో శ్రీ అమ్మవారికి శరణాగతి.**

భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూప గుణవిభవైశ్వర్యశీలాద్యనవధికాతిశయ అసంఖ్యేయ కళ్యాణగుణగణాం పద్మవనాలయాం భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవ దివ్యమహిషీం అఖిల జగన్మాతరం అస్మన్మాతరం అశరణ్యశరణ్యాం అనన్య శరణశ్శరణమహం ప్రపద్యే.

## 613. శ్రీశః

- -'శ్రీ'కు అనగా లక్ష్మీదేవికి ప్రభువు.
- తనకు ప్రభువు (రాణి)గా లక్ష్మీదేవిని కలిగినవాడు.

### ఓం శ్రీశాయ నమః

**శ్రీశస్స్యాచ్ఛ్రియ ఈశత్వాదీశా శ్రీరస్య నామతః** (శ్రీ ఈశ స్యాత్ శ్రియ ఈశత్వాత్ ఈశా శ్రీః అస్య నామతః). లక్ష్మీదేవికి ప్రభువు. లక్ష్మీదేవిని ప్రభ్వీణిగా కలవాడు. ఈ నామములో మరల శ్రీమహావిష్ణువు మరియు అమ్మవార్ల ఏకత్వము తెలుపబడుచున్నది. శ్రీ భట్టులు లక్ష్మీదేవి వర్ణనను ప్రస్తావించారు.

**ఆదావాత్మ గుణత్వేన భోగ్యరూపేణ విగ్రహే ఆధారక స్వరూపేణ దాసీభావేన వా సదా**

ఆదిలో ఆత్మగుణముగాను, విగ్రహమున భోగ్యరూపముగాను, ఆధారక స్వరూపంగాను, దాసీభావముతోను ఆయనయందు లీనమై అమ్మవారుంటారు.

ఈ భావాన్ని శ్రీ వి.వి. రామానుజన్ ఇంకా వివరించారు. భగవంతుని దివ్యస్వరూపంలో సర్వశుభలక్షణాలుగా శ్రీమహాలక్ష్మి ఏకమై ఉంటుంది. ఆయన దివ్యమంగళ విగ్రహములో సౌందర్యము ఆమెయే. దేవదేవునికి ఆధారము శ్రీదేవియే. జగదీశ్వరునికి దాసి ఆ జగన్మాతయే. శ్రీమహాలక్ష్మి అనుజ్ఞతోనే జగత్ప్రభువు లోకములను ఏలుచున్నాడు (పాంచరాత్ర సంహిత).

శ్రీ భట్టులు శ్రీ సనత్కుమారసంహితను కూడా ప్రస్తావించారు. **పుమ్ ప్రధాన ఈశ్వర ఈశ్వరీ** (113). అన్ని ఆత్మలకు, ప్రకృతికి, వాని ప్రభువునకు కూడ పాలకురాలు ఈశ్వరియే.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శ్రియః ఈశః శ్రీశః.** సంపదలకు ప్రభువు శ్రీశుడు.

వికీపీడియా చిత్రం. గజలక్ష్మి శిల్పం. Photo by Palagiri
https://commons.wikimedia.org/wiki/File:Goddess_Gaja_Lakshmi.jpg



## 614. శ్రీనివాసః

- లక్ష్మీదేవికి నివాసమైనవాడు.
- లక్ష్మీదేవికి ఆధారమైనవాడు (లతకు వృక్షములాగా).
- సజ్జనులు, పుణ్యాత్ముల హృదయములందు వసించువాడు.
- లక్ష్మీదేవి ఉన్నచోట ఉండేవాడు.

### ఓం శ్రీనివాసాయ నమః

ఈ పుణ్యనామము 185వ నామముగాను, 614వ నామముగాను స్తుతింపబడినది.

20వ శ్లోకము. 185వ నామము. శ్రీనివాసః – **మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాం గతిః**

65వ శ్లోకము. 614వ నామము. శ్రీనివాసః – **శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః**

20వ శ్లోకంలోని 'శ్రీనివాసః' నామవివరణను శ్రీ భట్టులు క్షీరసాగరమథన సందర్భంగా శ్రీలక్ష్మీదేవి ఉద్భవించి విష్ణువు వక్షస్థలమున నెలకొనిఉండడం పరంగా చెప్పారు. అమృతవల్లి (లత) కల్పవృక్షాన్ని పెనవేసుకొని ఉన్నట్లుగా అమ్మవారు, శ్రీవారు ఒకటిగా ఉన్నారని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు.

20వ శ్లోకంలోని 'శ్రీనివాసః' నామమునకు శ్రీ శంకరుల భాష్యము – **యస్య వక్షసి అనపాయినీ శ్రీః వసతి సః శ్రీనివాసః.** నిత్యము ఆయన వక్షస్థలమున వీడకుండా శ్రీ వసించును గనుక ఆయన శ్రీనివాసుడు.

ఈశానాం జగతోస్య వేంకటపతేః విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతి సంవర్ధినీం
పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్

శ్రీ చిన్మయానంద వివరణ – 'శ్రీ' అనగా సకల శక్తులు, బలము, కీర్తి, సద్గుణములు మరియు సత్కర్మాచరణము. శ్రీ ఉన్నచోట లోటుండదు, వంక ఉండదు, చెడు ఉండదు. గొప్పగొప్ప మహాత్ములు, సాధుసజ్జనులయందు కూడ ఏవో లోపములుంటాయి. కాని నారాయణునియందు శ్రీ సదా ఉండుటవలన పరిపూర్ణత్వము ఆయనయందే మూర్తీభవించినది. అచట లోపములు ఉండనేరవు. కనుక నారాయణుడు శ్రీనివాసుడు.

ఇక ప్రస్తుత (614వ) నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **దివ్య వల్ల్యా ఇవ కల్పద్రుమః తస్య నిత్య అనుపఘ్నః శ్రీనివాసః.** ఇక్కడ 'నిత్య' పదాన్ని గమనించాలి. దివ్యలతకు కల్పద్రుమమువలె నిత్యము 'శ్రీ'కి ఆలవాలమై యుండువాడు శ్రీనివాసుడు.

ప్రస్తుత నామమునకు శ్రీ శంకరుల భాష్యము – **శ్రీమత్సు నిత్యమ్ వసతి ఇతి శ్రీనివాసః.**

శ్రీమత్ - శ్రీమంతులు - అనగా పుణ్యాత్ములు, సాధువులు, సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, శౌచ, త్యాగ, కారుణ్యాది గుణసంపన్నులు. అట్టి దోషరహితులయందు సదా వసించువాడు శ్రీనివాసుడు.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – లక్ష్మీదేవి ఉండేచోట విష్ణువు ఉంటాడు. వారిద్దరూ వేరు కాదు. కనుక విష్ణువు శ్రీనివాసుడు. **యతో లక్ష్మి స్తతో హరిః.**

శ్రీ చిన్మయానంద – సకల కళ్యాణ గుణములకు నిలయమైనవాడు శ్రీనివాసుడు. ఎందుకంటే ఆయన లక్ష్మీదేవికి శాశ్వత నిత్య నిలయుడు. శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్

## 615. శ్రీనిధిః

- శ్రీమహాలక్ష్మీదేవి తన సంపదగా కలిగినవాడు.
- సకల సంపత్తుకు ఆలవాలమైనవాడు.
- అన్ని శ్రీలకు, సమస్త విభూతులకు మూలము.

### ఓం శ్రీనిధయే నమః

'నిధి' అనగా సంపద, ఐశ్వర్యము, విలువైనది, దాచుకొన్నది. భగవానునికి 'శ్రీ'యే నిధి. **శ్రీరస్మిన్నిహితా నిత్యం శ్రీనిధిః పరికీర్తితః.** లక్ష్మి తనయందు ఎల్లప్పుడు ఉంచబడియుండువాడు. ఈ నామవివరణలో శ్రీ భట్టుల అనుభవము – రత్నాభరణమును భద్రముగా పెట్టెలో దాచుకొన్నట్లుగా నారాయణుడు శ్రీదేవిని తన వక్షస్థలమున దాచి పీతాంబరమును కప్పి ఉంచుకొన్నాడు. ఆమె సకల శక్తి స్వరూపిణి. ఆయన అన్ని శక్తులకు నిలయము.

**అంభోరుహం జన్మగృహం భవత్యా వక్షస్థలం భర్తృగృహం మురారే**
**కారుణ్యతః కల్పయ పద్మవాసే లీలాగృహం మే హృదయారవిందం.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వశక్తిమయే అస్మిన్ అఖిల శ్రియోః నిధీయన్తా ఇతి శ్రీనిధిః.** సకల శక్తులకు, ఐశ్వర్యములకు, విభూతులకు నిధియైనవాడు శ్రీనిధి.

శ్రీ చిన్మయానంద – 'శ్రీ'కి నిధియైనవాడు శ్రీనిధి. సకల సంపూర్ణత్వము, సమస్త వైభవములు, సర్వానందములు శ్రీమన్నారాయణునియందే ఉన్నవి. ఇవన్నీ ఆయననుండియే లభించును. శ్రీదేవి, అనగా లక్ష్మీదేవి కూడ తన శక్తి సంపదలను శ్రీమన్నారాయణునినుండి పొందుచున్నది.

ధర్మచక్రము రచయిత – సాధుపరిరక్షణకొరకు వాసుదేవుడు అవతరించుచుండును. సన్మార్గములో నడిచేవారిని కాపాడుట అనగా 'శ్రీ'ని రక్షించుట. కనుక దుష్టకర్మలను పరిత్యజించి, సత్ప్రవర్తనను అలవరచుకొని శ్రీమహావిష్ణువును శ్రీనిధిగా ధ్యానింపతగును.

## 616. శ్రీవిభావనః

- లక్ష్మీవల్లభుడైనందున ప్రసిద్ధి పొందినవాడు.
- కర్మానుసారము 'శ్రీ'లను (సంపదలను) వితరణము చేయువాడు (పంచువాడు).
- లక్ష్మీదేవి కీర్తిని వ్యాపింపజేయువాడు.

### ఓం శ్రీవిభావనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యస్య ప్రభ్యోపాఖ్య హేతుః శ్రీస్యాత్ స శ్రీవిభావనః.** ఎవని ప్రసిద్ధికి కారణము 'శ్రీ' అయినదో అతడు శ్రీవిభావనుడు. ఇందుకు శ్రీ భట్టులు వాల్మీకి రామాయణము అరణ్యకాండము (37.18)నుండి ఉదాహరించారు – **అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా.** సీతమ్మ తోడుగా కలిగిన అతని (రాముని) తేజస్సు తులలేనిది. అని మారీచుడు రావణునితో అన్నాడు. తనకు దూరమైన సీతను దక్కించుకోవడానికి శ్రీరాముడు పడిన కష్టాలను అండాళ్ తల్లి తన నాచియార్ తిరుమోళి (11.6)లో వర్ణించినది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కర్మానురూపేణ వివిధః శ్రియః సర్వభూతానామ్ విభావయతి ఇతి శ్రీవిభావనః.** కర్మానుసారము సకల భూతములకు సంపదలను ప్రసాదించువాడు శ్రీవిభావనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వ్యాఖ్య – శ్రీ లక్ష్మీదేవిని వక్షస్థలమున ధరించి, దర్శనమిస్తూ, అందరికీ వరములను ప్రసాదించేవాడు శ్రీవిభావనుడు. ఇలా ఆయన శ్రీనిధియై అందరికీ ఐశ్వర్యములిస్తూ ఉండడంవలన లక్ష్మీదేవి లోకములన్నింటా పూజింపబడుచున్నది.

ధర్మచక్రము రచయిత వివరణ – లోభివద్ద ఎంత ధనమున్నా దానిని అనుభవించడు మరియు సద్వినియోగం చేయడు. శ్రీనివాసుడు సకల శ్రీలకు నిలయమై తన భక్తులకు కామితార్థములను ప్రసాదిస్తున్నాడు. అలా ఆయన కారణంగా లక్ష్మీదేవి, లక్ష్మీదేవి కారణంగా విష్ణువు ప్రఖ్యాతులయ్యారు. అలా శ్రీలక్ష్మీనారాయణుల ఏకత్వము ఈ నామములో కూడా తెలుపబడినది.

నమోస్తు దేవ్యై భృగునందనాయై
నమోస్తు విష్ణోరురసిస్థితాయై
నమోస్తు లక్ష్మ్యై కమలాలయాయై
నమోస్తు దామోదర వల్లభాయై




వికీపీడియా చిత్రం. లక్ష్మి పూజ – photo by लक्षी_देवी

https://commons.wikimedia.org/wiki/File: लक्षी देवी.JPG

## 617. శ్రీధరః

- 'శ్రీ'ను ధరించినవాడు.

### ఓం శ్రీధరాయ నమః

.శ్రీ భట్టుల వ్యాఖ్య – **రత్నమివ అర్చిషామ్, పుష్పమివ సురభిమ్, ఇందురివ చంద్రికామ్, అమృతమివ స్వాదుతమ్, ఔత్పత్తికేన సంబంధేన శ్రియమ్ ధరతి ఇతి శ్రీధరః.** రత్నములు కాంతిని, పూవులు సువాసనను, చంద్రుడు వెన్నెలను, అమృతము స్వాదుత్వమును ధరించినట్లుగా భగవంతుడు 'శ్రీ'ని సహజస్వభావముగా ధరించియున్నాడు గనుక శ్రీధరుడు. శ్రీభట్టులు రామాయణమునుండి చెప్పిన ఉదాహరణ – అయోధ్యకాండ 3.29. **న హి హాతుమ్యమ్ శక్యా కీర్తిరాత్మవతో యథా**. సజ్జనునినుండి కీర్తిని వేరుచేయలేనట్లుగా రామునినుండి సీతను వేరుగా తలచ సాధ్యము కాదు. ఒక వస్తువునుండి దాని గుణమును వేరుచేయజారు. నిప్పునుండి వేడిని, పాలనుండి తెలుపును, సూర్యునినుండి కాంతిని వేరుచేయలేరు. అలాగే భగవానునినుండి అమ్మవారు వేరు కాదు.

శ్రీ మరియు నారాయణుల ఏకత్వము ఈ నామములో మరొకమారు సూచింపబడినది. **రుచ్యర్చి కౌముదీ గంధాన్ సుధా రత్నేందు పుష్పవత్ శ్రియం ధరతి నిత్యం యః శ్రీధరః స్స తు కీర్తితః -** అమృతమునకు మాధుర్యము సహజము. రత్నములకు కాంతి, చంద్రునికి వెన్నెల, పూలకు సువాసన సహజము. అలాగే శ్రీమహావిష్ణువు నిత్యము 'శ్రీ'ను ధరించినవాడగుటచే శ్రీధరునిగా కీర్తింపబడుచున్నాడు.

## 618. శ్రీకరః

- లక్ష్మిని తన అవతారములలో తోడుగా అవతరింపజేయువాడు.
- భక్తులకు శ్రీ (ఆధ్యాత్మిక సంపద)ను, నిత్యశ్రీ (మోక్షము)ను ప్రసాధించువాడు.
- తన భక్తులను శ్రీ (కీర్తి)తో ప్రకాశింపజేయువాడు.
- శ్రీమహాలక్ష్మి చేతిని అందిపుచ్చుకొన్నవాడు.

### ఓం శ్రీకరాయ నమః

**పర వ్యూహావతారేషు స్వానురూపాం కరోతి తామ్ శ్రియం యోऽసౌ శ్రీకరస్స్యాత్ మున్యర్ణః శ్రీకరో మనుః -** పర, వ్యూహావతారములలో లక్ష్మిని తనకు తోడుగా చేసికొనెడువాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. లక్ష్మీప్రదము. ఓం శ్రీకరాయ నమః.

శ్రీభట్టుల వ్యాఖ్యానము ప్రకారము శ్రీహరి తన అవతారములకు తగినట్లుగా లక్ష్మీదేవినికూడా తన తోడుగా అవతరింపజేయును. దేవలోకమున దేవతగాను, మానవలోకమున మానవకాంతగాను శ్రీమహాలక్ష్మి ఆయనకు సదా తోడైయుండును.

**దేవత్వే దేవదేహేయమా మనుష్యత్వే చ మానుషీ** – శ్రీ విష్ణుపురాణము 1.9.145

ఈ భావాన్ని శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరింత వివరించారు – రామునివెంట సీతగాను, కృష్ణునివెంట రుక్మిణిగాను శ్రీదేవి అవతరించి తోడైయున్నది. ఇలా శ్రీహరికి తోడుగానుండి ఆమె విష్ణుదాసులకు శ్రీ (ఐశ్వర్యము)ను, నిత్యశ్రీ (మోక్షము)ను ప్రసాదించుచున్నది. ఇలా లక్ష్మీదేవిచేత 'శ్రీ'ను అనుగ్రహింపజేసే భగవానుడు శ్రీకరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యానము – **స్మరతామ్, స్తువతామ్, అర్చయతామ్ చ భక్తానామ్ శ్రియమ్ కరోతి ఇతి శ్రీకరః.** తనను స్మరించేవారికి, స్తుతించేవారికి, పూజించేవారికి ఇలా భక్తులందరికీ 'శ్రీ' (ఐశ్వర్యము, మోక్షము)ను కలుగజేయువాడు శ్రీకరుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శ్రియామ్ స్వజన కీర్తీనామ్ కరః ఇతి శ్రీకరః.** తన భక్తుల కీర్తిని మరింత సంపన్నము చేయువాడు శ్రీకరుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – శ్రీమహాలక్ష్మి కరమును గ్రహించినవాడు (పరిణయమాడినవాడు) శ్రీకరుడు.

## 619. శ్రేయశ్శ్రీమాన్

### శ్రేయః

### శ్రీమాన్

- శ్రేయశ్శ్రీమాన్ – భక్తులు పూజించే లక్ష్మీదేవితో నిత్యము కూడియున్నవాడు.
- శ్రేయశ్శ్రీమాన్ – నూపుర, కేయూర, కటక, కిరీటాది దివ్యసుందరాభరణములు ధరించినవాడు.
- శ్రేయః – శాశ్వతమైన సుఖము, విముక్తి, మోక్షము.
- శ్రీమాన్ – లక్ష్మీదేవిని ధరించినవాడు.
- శ్రీమాన్ – సర్వవిధములైన ఐశ్వర్యములు కలవాడు

**ఓం శ్రేయశ్శ్రీమతే నమః**

**ఓం శ్రేయసే నమః**

**ఓం శ్రీమతే నమః**

### శ్రేయశ్శ్రీమాన్

శ్రీ భట్టులు 'శ్రేయశ్శ్రీమాన్' అనే ఒకే నామముగా పరిగణించారు. **శ్రేయసే శ్రమణీయా శ్రీః శ్రేయశ్శ్రీర్నిత్య యోగినీ శ్రేయశ్శ్రీమానసా వస్వర్థః పురుషార్థదః** - సకల పురుషార్థముల కొరకు ఆశ్రయించబడు లక్ష్మితో ఎల్లప్పుడూ కూడియుండువాడు. ఈ నామము అష్టాక్షరి. సకల పురుషార్థాలనూ ఇస్తుంది. ఓం శ్రేయశ్శ్రీమతే నమః.



పశ్చిమ గోదావరి జిల్లా రంగాపురం గ్రామం ఆలయంలో శిల్పాలు

ఇక్కడ శ్రేయస్సు అనగా ఆధ్యాత్మిక సమృద్ధి. కఠోపనిషత్తునందు శ్రేయస్సు (ఆధ్యాత్మిక సంపద)కు, ప్రేయస్సు (ఐహిక సంపద)కు కల భేదం తెలుపబడింది. శ్రీ భట్టులు 'శ్రేయస్-శ్రీ' అనగా లక్ష్మీదేవి అనియు, అట్టి లక్ష్మీదేవి ఆధ్యాత్మిక సంపదలను ప్రసాదించుననియు, అట్టి లక్ష్మీదేవిని నిత్యము కలిగియున్న శ్రీధరుడు 'శ్రేయస్-శ్రీ-మాన్' అనియు వివరించారు. ఇందుకు సుందరకాండ (58.92)నుండి ఉదాహరించారు.

రాక్షస వనితలతో త్రిజట ఇలా అన్నది – **ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా అలమేషా పరిత్రాతుమ్ రాక్షస్యో మహతో భయాత్.** ఓ రాక్షస వనితలారా! జనకుని కూతురైన ఈ సీత తనను శరణుజొచ్చినవారిని తప్పక కరుణించగలదు. మనలను భయంకరమైన ఆపదనుండి కాపాడుటకు ఈమెయే తగినది.

విష్ణుపురాణము 1.9.125 – **శరీర ఆరోగ్యమ్ ఐశ్వర్యమ్ అరిపక్ష క్షయమ్ సుఖమ్.** ఆమె ఆరోగ్యమును, ఐశ్వర్యమును, శత్రునాశనమును, సుఖమును ప్రసాదించును.

విష్ణుపురాణము 1.9.120 – **విముక్తి ఫలదాయినీ.** ఆమె బంధములనుండి విముక్తిని ప్రసాదించును.

శ్రీ సూక్తము 2 – **యస్యామ్ హిరణ్యమ్ విందేయమ్ గామశ్వమ్ పురుషానహమ్.** ఆమె కరుణవలన బంగారము, పశువులు, గుఱ్ఱములు, పుత్రసంతానము పొందగలను.

శ్రీసూక్తము 5 – **శ్రియమ్ లోకే దేవజుష్టాముదారామ్** – లక్ష్మీదేవిని లోకములో తమ ఇష్టకామ్యసిద్ధి కొఱకు దేవతలు అర్చింతురు. ఆమె నారాయణునకు ప్రియమైనది. ఆమె సకల సంపత్తులను అనుగ్రహించు ఉదార స్వభావము కలది.

శ్రీకృష్ణదత్త భరద్వాజ – **శ్రేయసీ అతిశయ శోభమానా, శ్రీర్-వేష రచనా నూపుర యుగళ కాంచీ కటక కేయూర కుండల కిరీటాదిమతీ, యస్య ఇతి శ్రేయః శ్రీమాన్** – అత్యంత శోభమానములైన నూపురద్వయము, కేయూరము, కుండలములు, కిరీటమువంటి దివ్యాభరణములు కలిగినవాడు 'శ్రేయఃశ్రీమాన్'. ఇందుకు ఆయన అమరకోశము (3.1.58)నుండి చెప్పిన ప్రమాణము – **శ్రేయాన్ శ్రేష్ఠః పుష్కలస్యాత్ సత్తమ్ శృతి శోభనే.**

శ్రీ శంకరులు 'శ్రేయః', 'శ్రీమాన్' అనే రెండు నామములుగా పరిగణించి వ్యాఖ్యానించారు.

## శ్రేయః

శాశ్వతమైన నిత్యానందము శ్రీహరియే. ఎన్నడూ దూరముకాని సుఖము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి కఠోపనిషత్తు (2-1,2)నుండి చెప్పిన వివరణ – **అన్యాత్ శ్రేయః అన్యదుతైవ ప్రేయః, .... తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి శ్రేయోహి ధీరోఽభి ప్రేయో వృణీతే ......** శ్రేయస్సు, ప్రేయస్సు అనేవి రెండు వేరు వేరు మార్గాలు. శ్రేయోమార్గాన చరించేవారికి ఆధ్యాత్మిక జ్ఞానం లభిస్తుంది. ధీరులైనవారు ప్రేయోమార్గము (ఐహికమైన భోగభాగ్యములు)ను వదలి శ్రేయోమార్గాన్ని ఎన్నుకొంటారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ శ్రేయోమార్గమును నివృత్తి ధర్మముగాను, ప్రేయోమార్గమును ప్రవృత్తి ధర్మముగాను వివరించారు. ఇందుకు ఆయన ఋగ్వేదము (10.31.2)నుండి చెప్పిన ప్రమాణము –

**పరిచిన్మర్తో ద్రవిణామ్ మమన్యాదృ తస్యపథా నమసా వివాసేత్**
**ఉతస్వేన క్రతునా సమ్ వదేతా శ్రేయాంసమ్ దక్షమ్ మనసా జాగృభ్యాత్**

## శ్రీమాన్

శ్రీమంతుడు. సకల వైభవములు, సమస్త భోగభాగ్యములు, సకల విభూతులు, సకల సద్గుణములు, సర్వశక్తులు, సర్వనిధులు తనయందే కలిగియున్నవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యప్రకారము 'శ్రీమాన్' నామము నాలుగుమార్లు (3వ, 19వ, 24వ, 65వ శ్లోకములలో) వస్తుంది. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము ఈ నామము 3 మార్లు (3వ, 19వ, 24వ శ్లోకములలో) వస్తుంది. 65వ శ్లోకములో శ్రీభట్టులు 'శ్రేయశ్శ్రీమాన్' అనే ఒకే నామముగా పరిగణించారు.

3వ శ్లోకము – 22వ నామము. శ్రీమాన్ – **నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః**
శ్రీ భట్టుల వ్యాఖ్య: అతిమనోహర సుందర శ్రీ నారసింహ స్వరూపము
శ్రీ శంకరుల వ్యాఖ్య: వక్షస్థలమున శ్రీలక్ష్మిని ధరించినవాడు.

19వ శ్లోకము - 180వ నామము. శ్రీమాన్ – **అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్**
శ్రీ భట్టుల వ్యాఖ్య: దివ్యాభరణములతో, దివ్య మాల్యాంబరములతో శోభిల్లువాడు.
శ్రీ శంకరుల వ్యాఖ్య: సకలైశ్వర్య సంపన్నుడు

24వ శ్లోకము – 222వ నామము. శ్రీమాన్ – **అగ్రణీః గ్రామణీః శ్రీమాన్ న్యాయోనేతా సమీరణః**
శ్రీ భట్టుల వ్యాఖ్య: శ్రీయుత మత్స్య మూర్తి. అన్ని సంపదలను కలిగినవాడు.
శ్రీ శంకరుల వ్యాఖ్య: అనన్య తేజోమయుడు.

65వ శ్లోకము – 619వ నామము. శ్రీమాన్ / శ్రేయశ్శ్రీమాన్ – **శ్రీధరః శ్రీకరః శ్రేయఃశ్రీమాన్ లోకత్రయాశ్రయః**
శ్రీ భట్టుల వ్యాఖ్య: **శ్రేయశ్శ్రీమాన్** – సకల సంపదలను ప్రసాదించు లక్ష్మీదేవిని నిత్యము కలిగియున్న శ్రీధరుడు.
శ్రీ శంకరుల వ్యాఖ్య: **శ్రీమాన్** – సకల వైభవములు, సమస్త భోగభాగ్యములు, సకల విభూతులు, సకల సద్గుణములు, సర్వశక్తులు, సర్వనిధులు తనయందే కలిగియున్న శ్రీమంతుడు.

## 620. లోకత్రయాశ్రయః

- మూడులోకములకు ఆశ్రయము అయినవాడు.
- మూడు (జాగ్రత్, స్వప్న, సుషుప్త) అవస్థలకును అధిపతి.

### ఓం లోకత్రయాశ్రయాయ నమః

**శ్రియా సహ జగన్మాతా పితృవత్సకలాశ్రయః లోకత్రయాశ్రయస్య స్యాత్ దశార్ణో రక్షకత్వదః** - జగన్మాత అయిన లక్ష్మీదేవితో కలిసిఉండి, తండ్రిలాగా ఎల్లప్పుడూ లోకాలకు ఆశ్రయమైనవాడు లోకత్రయాశ్రయడు. ఈ నామము దశాక్షరీమంత్రము. రక్షణ కలుగజేస్తుంది. ఓం లోకత్రయాశ్రయాయ నమః.

ఈ నామవివరణలో శ్రీభట్టులు విష్ణుపురాణము (1.9.126)నుండి ఉదాహరించారు – **త్వమ్ మాతా సర్వలోకానామ్ దేవదేవో హరిః పితా**. ముల్లోకములకును నీవు తల్లివి. దేవదేవుడైన హరి తండ్రి. అని ఇంద్రుడన్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **త్రయాణామ్ లోకానామ్ ఆశ్రయత్వాత్ లోకత్రయాశ్రయః**. మూడు లోకములకును ఆశ్రయమైనవాడు లోకత్రయాశ్రయుడు.

ఈ మూడు లోకాలు ఏవి అనే విషయంలో వ్యాఖ్యాతలు కొంత వైవిధ్యం చూపారు. భూమి, ఆకాశము, స్వర్గము అనేవి మూడు లోకాలని శ్రీ అనంతకృష్ణశాస్త్రి అన్నారు. జాగ్రత్ (మెలకువ), స్వప్న (నిదుర), సుషుప్తి (గాఢ నిద్ర) అనేవి మూడు లోకాలని శ్రీ చిన్మయానంద అన్నారు.



## స్వక్షః స్వంగః శతానందో నందిర్జ్యోతిర్గణేశ్వరః |
## విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్నసంశయః || (66)

### 621. స్వక్షః

- సుందరమైన కన్నులు కలవాడు,

**ఓం స్వక్షాయ నమః**

సు-అక్ష - స్వక్ష – అనగా అందమైన కన్నులున్నవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారం – **శోభనే పుండరీకాభే అక్షిణీ అస్య ఇతి స్వక్షః.** తామరపూవు రేకులవంటి అందమైన కన్నులున్నవాడు.

ఈ అర్థాన్నే శ్రీ భట్టులు శ్రీలక్ష్మీనారాయణుల అన్యోన్యత్వమును తెలిపేలా వ్యాఖ్యానించారు. **శ్రీ సౌందర్య సుధాసింధు రపార కరణోహి యః స్వక్షః.** లక్ష్మీదేవియొక్కసౌందర్యము అనే అమృత సముద్రాన్ని తనివితీరా అనుభవించడానికి మంచినేత్రములు కలవాడు. నారాయణుని కడకన్నులు ఎరుపుగాను, లక్ష్మీదేవి కడకన్నులు నలుపుగాను ఉంటాయట. పరస్పరం ఒకరినొకరు వీక్షిస్తూ ఉండడంవలన, వారివారి శరీరవర్ణాలనుబట్టి ఇలా జరిగిందని భావించవచ్చును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సూర్యమండలంలో రథారూఢుడై శ్రీనారాయణుడు విశ్వాన్ని చూస్తుంటాడు. అన్నింటికీ చూపు ఆ నారాయణుడే. ఓం స్వక్షాయ నమః.

### 622. స్వంగః

- చక్కని అంగములు కలవాడు.

**ఓం స్వంగాయ నమః**

సు-అంగః - స్వంగః – చక్కని శరీర భాగములు కలవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యానము – **సు శోభనాని అంగాని అస్య ఇతి స్వంగః.** ఆయన సమస్తావయవములును సుందరములు, మంగళకరములు, రక్షాప్రదములు, భాగ్యదాయకములు, మోక్షప్రదాయకములు.

**శ్రియ స్పృహణీయ దివ్యాంగ స్వంగ ఉచ్యతే.** లక్ష్మీదేవి కూడా కోరుకొనగల సుందర శరీరము కలవాడు. అనేది శ్రీ భట్టుల వ్యాఖ్య. ఇదే భావాన్ని శ్రీ బలదేవ విద్యాభూషణ ఇలా చెప్పారు – **లక్ష్మీ స్పృహణీయ దివ్య శరీరధారీ.** సుందరకాండములో శ్రీరాముని సౌందర్యమును 16 శ్లోకాలలో (35.7-22) హనుమంతుడు వర్ణించి సీతమ్మకు చెప్పాడు. శ్రీ తిరుప్పాణాళ్వార్ వారి అమలనాదిపిరాన్ లో శ్రీరంగనాధుని సౌందర్యం వర్ణింపబడింది. స్వామిదేశికన్ ధ్యానసోపానములో కూడా రంగనాధుని సౌందర్యవర్ణన ఉంది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అగి-గతౌ – కదలుట అన్న అర్థంలో, చక్కనైన కదలిక లేదా నడక కలిగినవాడు 'స్వంగః'. ఇందుకు ఋగ్వేదము (10.1.1)నుండి ప్రమాణము చెప్పారు. మరొక విధంగా – ఇంత అద్భుతంగా, అందంగా చలించే విశ్వాన్ని సృజించిన భగవంతుడు 'స్వంగః'.

**శ్రీ సుందరకాండము – శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి 'మందరము'- సీతమ్మ కోరికపై హనుమంతుడు శ్రీరాముని వర్ణించుట**

చిత్రం. జిబ్రాల్టర్ ఆలయంలో శ్రీ సీతా రామ లక్ష్మణ హనుమంతుల మూర్తులు. Photo by :Deepaaidasani
https://commons.wikimedia.org/wiki/File:Ram,_Sita,_Lakshman_and_Hanuman.jpg



**హనుమంతుడు సీతాదేవితో ఇలా అన్నాడు.**

రాజులలోని మేటి దిన రాజు ప్రతాపమునందు, యామినీ
రాజు మనోజ్ఞతన్, భువనరాజులరా జలరాజరాజున
ట్లా జగదేకకీర్తి యపరాజిత శౌర్యుఁడు, మూర్తి మద్రతీ
రాజు సురూప సంపద, విరాజిలు సత్య వచోరతుండునున్

గురుఁడు మధురోక్తులను భీ
కరుఁడు విరోధులకు భువనగణ మెవ్వని శ్రీ
కరకరముల ఛాయను సు
స్థిరతన్ జీవించునట్టి దేవుని రామున్

**సీతాదేవి కోరికపై హనుమంతుడు శ్రీముని ఇలా వర్ణించాడు.**

రాముండు కమలపత్ర విశాలలోచనుం, డఖిల సత్త్వ సుమనోహరగుణుండు
రూపదాక్షిణ్య నిరూఢుఁడై జనియించెఁ, దేజంబునందు నాదిత్యుఁబోలు
నోరుపు గుణమున నుర్వికిఁదుల్యుండు, బుద్ధి బృహస్పతి పురుడు చూపు
సద్యశంబున హరి సకలజీవావళీ, రక్షకుఁడాత్మీయ రక్షకుండు
స్వకుల వృత్తి ధర్మసంరక్షకుఁడు నాల్గు
జాతులరయుచుండు రీతి చెడక
మనుజహితములైన మర్యాదలందుండి
పరుల నట్ల చేయుఁబనుచుచుండు

కాంతి రహించుఁ, బూజితుఁడు కంజదళాక్షిరొ! బ్రహ్మచర్య మ
త్యంతముఁబూను, సాధులకుఁ దప్పని ప్రాపు, సమస్త సద్విధుల్
సాంతముగా నెఱుంగు, సముపాసిత విప్రుఁడు, రాజవిద్యలం
దెంతయు మేటి, శీలధనుఁ డెల్లరపట్ల వినీతుఁడంగనా!

వేద వేదాంగముల యజుర్వేదమునను
విల్లువిద్యను నిపుణుండు విపులములగు
నంసములవాఁడు దీర్ఘ బాహావిరాజి
యబ్జకంఠుఁడు ముఖము రాకాబ్జసఖము.

తామ్రలోచనుండు తతగూఢజత్రుండు
దుందుభిస్వనుండు తోయజాక్షి
బల్లిదుండు స్నిగ్ధవర్ణుండు చామన
చాయవాడు సింహ సంహనుఁడు



ఇండొనేషియా నృత్యంలో శ్రీ సీతారాముల పాత్రచిత్రణ.

Photo by: Duduhsadarachmat
https://commons.wikimedia.org/wiki/File:Rama_dan_Sinta.jpg

సమవిభక్తాంగుండు సముఁడు త్రితామ్రుండు, త్రిప్రలంబుండును ద్రిస్థిరుండు
ముచ్చోట్ల నున్నతి ముచ్చోట్ల స్నిగ్ధత, ముచ్చోట్ల గాంభీర్యమును గలండు
త్రివళివంతుండును ద్రిసముండు త్ర్యవనత, త్రిశిరస్కుఁడమ్మ! నీ హృదయవిభుఁడు
నాలుగు వ్యంగ్యముల్ నాలుగు కలలును, నాలుగు రేఖ లందబు మీఱు
జెలి! చతుస్సముండు బలి చతుష్కిష్కుఁడో
యమ్మ మహితనాసి కొష్ఠహనువు
లమరువాఁడు జంటలగు పదునాలుగు
సమముగాఁగలండు జనక తనయ

నాలుగు ప్రక్కదంష్ట్రలును నాల్గిటి యానముఁగల్గు, నాలుగున్
నాలుగు వంశముల్ గలఁడు నాలుగు నొక్కటి స్నిగ్ధ మాఱునున్
నాలుగు పద్మముల్, మఱియు నాలుగు నాఱును గొప్పనొప్పెడున్
నాలుగు రెండు మిట్టలును నాలుగు నైదును సన్నపైతగున్

మూఁట వ్యాప్తుఁడనుష్ఠించు మూఁటి సతము
రెంటఁ దెల్లన సత్యంబు నంటి యుండు
ధర్మనిరతుండు సంగ్రహ దాన విధుల
నెంతయును నిష్ఠులుండు శ్రీమంతుఁడమ్మ!

రాముని ద్వైమాతురుఁడగు
సౌమిత్రి యజయ్యుఁడాజి సద్గుణరూప
ప్రేమముల నట్టివాఁడు
ర్వీ మండలి దేవి! నిన్ను వెదకుచు వారల్




చిత్రం. గుజరాత్ సాలంగాపూర్ శ్రీ కష్టభంజన్ హనుమాన్

Taken from free download wallpaper. Copy right by Shree Kashtbhanjandev Hanumanji Mandir – Salangpur https://www.salangpurhanumanji.com/ .
(As Live Darshan is telecast from this temple, I believe it is fair to use this image in a non-commercial publication)

## 623. శతానందః

- అనంతమైన ఆనందము కలవాడు.

### ఓం శతానందాయ నమః

**అన్యోన్య ప్రణయానంద సింధో సముదితోఽపి యః శతానంద స్స విజ్ఞేయః దాంపత్యానందదో మనుః** - లక్ష్మీనారాయణులు ఒకరిపై ఒకరు అన్యోన్యమైన అనురాగము కలవారు. అలా అనురాగసాగరంలో వారిరువురూ ఓలలాడతారు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. దంపతులకు ఆనందాన్నిస్తుంది. ఓం శతానందాయ నమః.

ఇలా శ్రీ భట్టులు లక్ష్మీనారాయణుల ఏకత్వము వివరణను ఈ నామం వ్యాఖ్యలో కూడా కొనసాగించారు. ఇక్కడ 'శత' అనగా 'వంద' అని మాత్రమే కాక, 'అపరిమితమైన' అని భావించాలి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అనంత ఆనందమూర్తి శతానందుడు. అందుకు శ్రీ శంకరులు బృహదారణ్యకోపనిషత్తు (4.3.32)నుండి ఉదాహరించారు – **ఏతస్యైవ ఆనందస్య అన్యాని భూతాని మాత్రామ్ ఉపజీవన్తి.** ఈ ఆనందముతో పోలిస్తే అన్యజీవుల ఆనందము అత్యల్పభాగము మాత్రమే.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పశువుల ఆనందము, మానవుల ఆనందము, దేవతల ఆనందము, ఋషుల ఆనందము వివిధ స్థాయిలలో ఉండును. అనుభవించేవాని స్థితినిబట్టి ఆ ఆనందము పరిమాణము ఉండును. సంసారబద్ధులైనవారికంటే విముక్తులైన జ్ఞానులు ఆనందమును అధికంగా అనుభవిస్తారు. ఈ అన్ని ఆనందాలూ శతానందుడైన పరబ్రహ్మమునుండే ఉద్భవిస్తాయి. **తే యే శతమ్ మానుషః, దేవానామ్ ఇంద్రస్య, ప్రజాపతేః ఆనందః స ఏకో బ్రహ్మణ ఆనందః స్తోత్రియస్య చా కా మహతస్య.** తైత్తరీయోపనిషత్తు 2.8

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఒక్కొక్కజీవి కొన్ని పరిస్థితులలో ఆనందమును, ఇతర పరిస్థితులలో బాధను పొందును. ఉదాహరణకు చేపలు నీటిలో సంతోషంగాను, నీరు లేనపుడు కష్టంగాను ఉంటాయి. అయితే దేవదేవునికి ఎలాంటి ప్రతిబంధకాలు, విపత్తులు, అసాధ్యాలు ఉండవు. కనుక ఆయన శతానందుడు. అందరి ఆనందాలకు మూలాధారము.

ధర్మచక్రము రచయిత – చెట్లకు స్పర్శద్వారా మాత్రమే ఆనందం లభిస్తుంది. పురుగులకు స్పర్శ, రుచి కూడా ఆనందాన్నిస్తాయి. ఇలా జీవుల స్థాయి పెంచినకొద్దీ ..... మనుషులకు స్పర్శ, రుచి, వాసన, రూపము, శబ్దము మరియు భావము (మనసు) వీటన్నింటిద్వారా ఆనందం లభిస్తుంది. ఇలా లభించే ఆనందంకొరకు ఐహికసుఖాలవెంట పడకుండా శతానందుని ధ్యానించాలి. అలా చేస్తే అనన్యమైన, శాశ్వతమైన ఆత్మానందము లభిస్తుంది.

## 624. నన్దిః

- సదా ఆనందించువాడు. ఆనందనిధి.

### ఓం నన్దయే నమః

**నందతి ఇతి నందిః.** ఆనందించువాడు నంది.

శ్రీ భట్టులు – సదా, సర్వత్రా, సర్వవిధాలా లక్ష్మీదేవి తోడుగా ఉండుటవలన శ్రీహరి సర్వసమృద్ధుడు. లక్ష్మీదేవి తోడుగా ఉండుటయే ఆయన సదా ఆనందించుటకు కారణము. **నంది సర్వత్ర నిత్యం సః శ్రియా ఋధ్యతి సర్వదా.** అంతటా, అన్నివేళలా లక్ష్మిచే సమృద్ధుడుగా ఉండేవాడు. **నందితి సమృధ్యతీతి నందిః.** అన్నివేళలందు, అన్నిచోట్లా లక్ష్మీదేవితో కలిసి సమృద్ధిగా ఉండేవాడు నంది.

శ్రీ శంకరులు – **పరమానంద విగ్రహో నందిః.** పరమానంద స్వరూపమైనవాడు నంది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – దేవతలకు, మనుష్యులకు నిజమైన ఆనందమును ప్రసాదించువాడు శ్రీనివాసుడే.

## 625. జ్యోతిర్గణేశ్వరః

- ప్రకాశించే గణములకు (నిత్యసూరులకు) ప్రభువు.
- ప్రకాశించే గణములకు (సూర్య చంద్రాది జ్యోతులకు) ప్రభువు.

### ఓం జ్యోతిర్గణేశ్వరాయ నమః

జ్యోతి-గణ-ఈశ్వరుడు – అనగా ప్రకాశించే సమూహములకు అధిపతి జ్యోతిర్గణేశ్వరుడు. అయితే ఆ జ్యోతిగణములు ఏవనే విషయంలో వ్యాఖ్యాత దృక్పథాన్నిమనం గమనించవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఆదిశేషుడు, విష్వక్సేనుడు వంటి తేజోవంతులైన నిత్యసూరులు సదా భగవంతుని, అమ్మవారి సేవలో నిమగ్నులై తరిస్తూ ఉంటారు. **నిత్యసూరి గణానాం యః ఈశో జ్యోతిర్గణేశ్వరః.** ఇందుకు శ్రీ భట్టులు పురుషసూక్తములోని శ్లోకాన్ని ఉదాహరించారు. **మరీచీనామ్ పదమిచ్ఛన్తి వేధసః.** జ్ఞానులైనవారు ప్రకాశమానములైన ఆత్మలున్న లోకాన్ని చేరాలని ఆశిస్తారు. భగవానునికి, అమ్మవారికి చేసే సేవలో నిత్యసూరులు ప్రకాశిస్తూ ఉంటారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – జ్యోతిర్గణములనగా సూర్య చంద్ర నక్షత్రాది ప్రకాశమానములైన గ్రహాదులు. ఇందుకు శ్రీ శంకరులు కఠోపనిషత్తు (2.2.14)నుండి చెప్పిన ప్రమాణము. **తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదమ్ విభాతి.** ఆయన ప్రకాశిస్తే అంతా వెలుగుతుంది. ఆయన కాంతియే అంత వెలుగుకూ కారణము. మరియు గీత (15.12)నుండి –

**యదాదిత్య గతమ్ తేజో జగద్భాసయతేऽఖిలమ్ యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**

సమస్త జగత్తును ప్రకాశింపజేసే సూర్యుని తేజస్సు, చంద్రుని తేజస్సు, అగ్ని తేజస్సు కూడా నా తేజస్సే అని తెలిసికోవలెను.

ధర్మచక్రము రచయిత – చూపు లేనివారికి చుట్టూ ఉన్న వెలుగు కానరాదు. అలాగే అజ్ఞానంచే అంధులైనవారికి తమలోనే ప్రకాశించే దేవుడు కానరాడు. జ్ఞానాన్ని సాధించమని ఈ నామం ప్రబోధిస్తున్నది.

**ఇలా శ్రీ భట్టులు 608నుండి 625వరకు నామములలో శ్రీలక్ష్మీనారాయణుల ఐక్యతను వర్ణించారు.**

## 626. విజితాత్మా

- భక్తులచేత జయింపబడిన మనస్సు గలవాడు.
- జయించిన (అనగా వశములోనున్న) మనస్సు గలవాడు.

**ఓం విజితాత్మనే నమః**

**శ్రీ భట్టులు 608నుండి 625వరకు నామములను భగవంతునికి అమ్మవారితో గల విడదీయరాని అనుబంధమును ప్రకటిస్తూ వ్యాఖ్యానించారు. ఈ నామముతో మొదలుకొని కొన్ని నామములు భగవంతుని సౌశీల్యమును వర్ణిస్తూ శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

https://commons.wikimedia.org/wiki/File:Srikrishna_use_weapon_in_Kurukshetra.jpg



**సౌశీల్యస్య గుణస్యాథ పరమావధి వర్ణనమ్ మానసం ప్రణతైర్యస్య విజితాత్మా జితశ్చ సః** - తననాశ్రయించిన భక్తులకు వశమైనవాడు విజితాత్మ. పరమేశ్వరుడు భక్తసులభుడు. తన భక్తుల మాటలను నెరవేరుస్తూ ఉంటాడు. వారి పాపాలను హరిస్తాడు. ఆయుధమును ధరించనని మహాభారత యుద్ధారంభంలో ప్రమాణం చేసినాగాని శ్రీకృష్ణుడు భీష్ముని మాట చెల్లించడం కోసం చక్రం చేత ధరించి ముందుకురికాడు.

పోతన భాగవతంలో భీష్ముడు కృష్ణుని స్తుతించిన పద్యము

**కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి, గగన భాగం బెల్లఁ గప్పికొనఁగ**
**నుఱికిన నోర్వక యుదరంబులో నున్న, జగముల వ్రేఁగున జగతి గదలఁ**
**జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ , బై నున్న పచ్చని పుటము జాఱ**
**నమ్మితి నా లావు నగుబాటు సేయకు, మన్నింపుమని క్రీడి మఱలఁ దిగువఁ**

**గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి**
**నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాఁతు**
**విడువు మర్జున ! యంచు మద్విశిఖ వృష్టిఁ**
**దెరలి చనుదెంచు దేవుండు దిక్కు, నాకు.**

ఇలా భక్తులకోసం తన మాట తప్పడానికి కూడా సిద్ధమయ్యే సౌశీల్యం ఆయనది. శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 1.3.1 ని ప్రస్తావించారు. నమ్మాళ్వారుగారు భగవంతుని పరత్వమును నిలకడైన మనసుతో గానం చేశారు గాని, ఆ దేవదేవుని సౌలభ్య సౌశీల్యాలను కీర్తించేటపుడు విపరీతమైన ఆవేశానికి లోనయ్యారు. యశోదచేత రోట బంధింపబడి, ఆ తల్లి దండనను స్వీకరించిన శ్రీహరి సౌలభ్యాన్ని స్మరిస్తూ పరవశంతో నమ్మాళ్వార్ స్పృహ కోల్పోయారట.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **విజితా ఆత్మా మనో యేన సః విజితాత్మా.** తన మనసును తన వశములో ఉంచుకొన్నవాడు విజితాత్మ. శ్రీ రాధాకృష్ణమూర్తి వివరణ – భగవంతునికి లేనిది లేదు. ఆయనవలన కానిది ఉండదు. చెల్లని కోరిక ఉండనేరదు. ఆయన మనసు పూర్తిగా ఆయన అధీనంలో ఉంటుంది.

ఈ నామస్మరణ ద్వారా మనసును అదుపులో ఉంచుకొనవచ్చునని ధర్మచక్రము రచయిత వివరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్యానానికి, శ్రీ భట్టుల వ్యాఖ్యానానికి ఉన్న భేదం చెప్పడానికి ఈ నామం ఒక ఉదాహరణ. శ్రీ శంకరులు భగవంతుని పరత్వమును, ఐశ్వర్యమును తెలుపుతూ వ్యాఖ్యానించారు. శ్రీ భట్టులు భగవంతుని సౌశీల్యమును, సౌలభ్యమును అధికంగా ప్రస్తావించారు.

## 627. విధేయాత్మా

- తన భక్తులకు విధేయమైన లక్షణము కలవాడు.
- సకల జీవులు ఆయనకు లోబడియుండును.

### అవిధేయాత్మా

- ఎవరివలనను విధింపబడు స్వరూపము కలవాడు కాదు.

### ఓం విధేయాత్మనే నమః

### ఓం అవిధేయాత్మనే నమః

విధేయమగుట అనగా లోబడియుండుట. భగవంతుని భక్తసౌలభ్యమును సూచించేదిగా ఈ నామమును శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

**ఇహా గచ్ఛేహ తిష్ఠేదం భుజ్ క్ష్వేతి ప్రణతైస్సదా యోగ్యం విధాతుం యద్రూపం విధేయాత్మా స కీర్తితః -** ఇలా రా, కూర్చో, భోజనం చేయి – అని తన భక్తులచేత ఆజ్ఞలు జారీ చేయబడకుండా తానే వారికి విధేయుడై ఉండేవాడు విధేయాత్మ. శ్రీ భట్టుల వ్యాఖ్యానం ప్రకారం భగవంతుడు భక్తులకు ఎంత అనుకూలంగా ఉంటాడంటే భక్తులు తమకిష్టమైన పనులు చేయమని భగవంతునికి ఆజ్ఞాపించవచ్చును. పెరియాళ్వారువారు **'పూచ్చూడ వా, నీరాడ వా, అమ్ముమ్ ఉణ్ణాయ్'** అని దేవదేవుని చనువుగా పిలిచిన విషయాన్ని శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించారు. శ్రీ పి.బి. అణ్ణాంగారాచార్య స్వామి 'సొన్నవణ్ణమ్ సేయద పెరుమాళ్'

(యథోక్తకారి) కథను ఉదాహరించారు. తిరుమళశయాళ్వార్ (భక్తిసార యోగి) చెప్పగానే కంచి పెరుమాళ్ (యథోక్తకారి) తన పాము పడకను చుట్టచుట్టుకొని భూనీళాసమేతుడై తిరుమళశయాళ్వార్ వెంట నడచెను. మళ్ళీ ఆళ్వారు మాటవిని కంచికి తిరిగివచ్చెను.

అలాగే అర్జునుడు **'సేనయోరుభయోర్మధ్యే రథమ్ స్థాపయ మే అచ్యుత'** అని చెప్పగానే పార్థసారధి రెండుసేనల మధ్యకు రథాన్ని తీసుకువెళ్ళాడు. శ్రీ వి.వి. రామానుజన్ పెరియతిరుమొళి (11.5.5)నుండి కూడా ఉదాహరించారు – **వణ్ణక్కరుమ్ కుళల్ అయిచ్చియాల్ మొత్తుణ్ణు కణ్ణిక్ కుఱుమ్ కయిఱ్ఱాల్ కట్టుండాన్.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ శ్రుతులనుండి ఉదాహరించారు – **ఉద్బుధ్యస్వ ప్రతిజాగృహి, ఇష్టపూర్తమ్ సంసృజ.**
**ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి తవమ్ ఇష్టాపూర్తే సంసృజే యామయం చా** – యజుర్వేదము 15.54
**దేవ సవితః ప్రసువ, యజ్ఞమ్ ప్రసువ, యజ్ఞపతిమ్ భగాయ** – యజుర్వేదము 32.15

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'విధేయాత్మా'కు చెప్పిన అర్థము – **విధేయః-సేవకా, ఆత్మనో-జీవా, యస్య ఇతి విధేయాత్మా** – ఇక్కడ 'ఆత్మలు' అనగా జీవులు. అన్ని జీవులు భగవంతునికి విధేయులైయున్నవి. కనుక శ్రీహరి విధేయాత్మ.

శ్రీ శంకరులు **'అవిధేయాత్మా'** అనే పాఠాన్ని గ్రహించి వ్యాఖ్యానించారు. 'విధి' అంటే – ఇది ఇలా ఉంది, మీరు ఇలా చేయండి, అని చెప్పడం. అనగా విధానము. పరమేశ్వరుడు ఇలాంటి విధివిధానానికి లోబడి ఉండడు. అందుచేతనే 'అవిధేయాత్మా' అనబడుచున్నాడు. విధేయము కాని ఆత్మ కలవాడు. పరమేశ్వరుని స్వరూపం ఇలాంటిది అని చెప్పడం కష్టం. అతను 'నువ్వు ఇది చెయ్యి, ఇది చేయవద్దు' అనిఎవరిచేతను ఆజ్ఞాపింపబడడు. అందుకే శ్రీమన్నారాయణుడు 'అవిధేయాత్మ' అనబడుచున్నాడు.

**కుంభకోణములోని శార్ఙపాణి అయిన విష్ణువును తిరుమళశయాళ్వారు (భక్తిసారయోగి) స్తుతించిన విధము. తాళ్ళపాక చిన్న రచించిన 'పరమయోగి విలాసము' నందలి తెలుగుసేత. శ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులు తమ 'ద్వాదశ సూరి చరిత్ర'లో ఉదాహరించినది.**

భద్ర నాగేంద్రముపైఁ బవ్వళించి
నిద్రించెదేటికి నిర్నిమిత్తముగ
నీ తఱిం బవళించితేమి కారణము
నా తోడఁ జెప్పవే నను(గన్న తండ్రి!

ఘనతరంబైన చక్రము కేలఁబూని
చెనటి రక్కసులఁ ద్రుంచిన బడలికయొ
క్షీర సింధువు మధించియుఁ గ్రుంకకుండఁ
జేరి మందరము మోచిన బడలికయొ

ముఖదంత కోరకమున జగత్త్రయము
నిఖిల భారంబు నావిన బడలికయొ
పైకొన్న యుక్కు కంబముఁగొనగోళ్ళఁ
జేకొని వ్రక్కలించిన బడలికయొ

జగములీరేడును చక్కని యడుగు
చిగురుటాకునఁ గొలిచిన బడలికయొ
గండ్రగొడ్డట రాజకంఠనాళములు
చెండి చెండాడిపైచిన బడలికయొ



బలరాముడు. పటచిత్రం. వికీపీడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:Balarama_Mural.jpg

దండకావనమున దనుజవర్గంబుఁ
జెండివైచుచుఁ జరించిన బడలికయొ
కౌరవాధిపునితోఁ గనలి తత్పురము
సీరాగ్రమున బెకల్చిన బడలికయొ

యలవి మీరంగ గోపాంగనామణుల
చెలువంపు రతులఁ దేల్చిన బడలికయొ
మేలిమి తురగంపు మీఁదటనెక్కి
లీల నయ్యాళిఁదోలిన బడలికయొ

యీ యెడ నాతోడ నింతయుఁ దెలియ
మాయన్న యెఱిగింపుమా.



చిన్న శేష వాహనంపై ఊరేగుతున్న శ్రీ మలయప్ప స్వామి. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Malayappa_in_Chinnasesha_Vahanam.jpg

## 628. సత్కీర్తిః

- గొప్ప, నిజమైన, శాశ్వతమైన కీర్తిగలవాడు.

### ఓం సత్కీర్తయే నమః

**ఈదృక్సౌశీల్య సత్వాద్ధి సత్కీర్తితి కథ్యతే** – ఈ విధంగా (భక్తులకు వశుడై యుండడం వంటి) మంచి గుణాల కారణంగా కీర్తింపబడుతుండేవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సౌశీల్య సత్వేన అస్యాఽతి మహతీ కీర్తిః ఇతి సత్కీర్తిః.** సౌశీల్యము కారణంగా భగవంతునికి మహత్తరమైన కీర్తి లభించింది. ఆయనను ఎంత పొగడినా తక్కువే. మరియు ఆయన కీర్తి అంతా నిజమైనది. అతిశయోక్తి లేనిది.

**యథా సర్వేశ్వరః కృష్ణః ప్రోచ్యతే సర్వపండితైః**
**తథాపి స్వల్పమేవోక్తం భూతార్థే కతమాస్తుతిః**
శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడని పండితులంటారు. అయినా ఆయన గురించి చెప్పేది చాలా తక్కువ. ఆయన గురించి చెప్పాలంటే అసలు స్తోత్రమెంత? ఆయన కీర్తి ప్రతిష్టలు అనంతములు.

శ్రీ శంకరులు 'సత్' అనే పదం భగవంతుని కీర్తియొక్క నిజమైన తత్వాన్ని తెలుపుతుందని వ్యాఖ్యానించారు. **సతీ అవితథా కీర్తిః అస్య ఇతి సత్కీర్తిః.** దేవదేవుడు శ్రీలక్ష్మీపతి అయినందున ఆయన కీర్తికి ఈ లక్షణము అబ్బింది. అని శ్రీ చిన్మయానంద భావించారు.

ధర్మచక్రము రచయిత – ఐహికమైన భోగభాగ్యాలు, పదవులు వలన వచ్చే కీర్తి తాత్కాలికమైనది. ధర్మమార్గాన్ని ఆచరించడంవలన వచ్చే కీర్తి శాశ్వతమైనది. కనుక అలా ధర్మాన్ని ఆచరిస్తూ శ్రీహరిని సేవించవలెనని ఈ నామములోని మంత్రం తెలియజేస్తున్నది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుని సదా పూజించి కీర్తించడంవల్లనే నిజమైన కీర్తి లభిస్తుంది. మిగిలిన కీర్తులు నిజమైనవి కావు.

శ్రీ సత్యదేవోవాసిష్ఠ ఒక్కో నామానికి సవివరమైన వ్యాఖ్యతోపాటు ఆ నామభావాన్ని తెలిపే శ్లోకాన్నికూడా (ఒక్కొక్క నామమునకు ఒక్కొక్క శ్లోకమును) రచించారు. ఈ 'సత్కీర్తి' నామానికి ఆయన వ్రాసిన శ్లోకము –
**విష్ణుః సదా సర్వగుణాభిరామః సంకీర్త్యతే స్వాత్మతమః ప్రమృష్ట్యై**

**మంత్రైర్వ్రతైః సత్యజపైస్తపోభిర్నాన్యస్తతః కీర్తిముపైతి సత్యామ్**

## 629. ఛిన్న సంశయః

- సందేహాలను పటాపంచలు చేసేవాడు.

### ఓం ఛిన్న సంశయాయ నమః



**సౌశీల్య ప్రథమాచైవం దుష్కరత్వాది సంశయః ఛిన్నో యేన విశేషేణ స ప్రోక్తః ఛిన్నసంశయః** - విధేయత, మంచి కీర్తి (విధేయాత్మా, సత్కీర్తిః) వంటి మంచి లక్షణాలుండడంచేత, ఇతనిని అర్చించినట్లైతే ఇతడు మనకు లభిస్తాడా? లభించడా? వంటి సంశయాలను తొలగించేవాడు.

గరుడ వాహనులైన శ్రీ లక్ష్మి, విష్ణువు. 1720 కాలపు చిత్రం. వికీపీడియా నుండి. https://commons.wikimedia.org/wiki/File:Garuda_Vishnu_Laxmi.jpg

**ఛిన్న సంశయా భక్తానామ్ యేన ఇతి ఛిన్న సంశయః.** ఎవని కారణంగా భక్తుల సంశయాలు ఛిన్నమవుతాయో అతడు ఛిన్న సంశయుడు. అని శ్రీ కృష్ణదత్తభరద్వాజ నిర్వచనం.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీదేవుడు అనంత సౌశీల్య సౌలభ్య గుణములు కలిగియున్నందున ఇతనిని తెలిసికోవడం సాధ్యమవుతుందా? ఇతనిని మెప్పించతరమా? ఇతనిని చేరడం కుదురునా? వంటిసందేహాలు నివృత్తి అవుతాయి.

**ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్య శేషతః**
**త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే** – గీత 6.39
ఓ కృష్ణా! ఈ నా సందేహమును పూర్తిగా నివృత్తి చేయుట నీకే చెల్లును. ఏలనన ఈ సందేహము (యోగభ్రష్టుడు ఇహపరములకు కాకుండా పోవచ్చునన్న భయము) తొలగించుట నీకు తప్ప మరెవ్వరికిని శక్యము కాదు.
**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత**
**స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ** – గీత 18.73
ఓ అచ్యుతా! నీ కృపచే నా మోహము పూర్తిగా తొలగినది. స్మృతిని పొందితిని. ఇప్పుడు సంశయ రహితుడనైతిని. కనుక నీ ఆజ్ఞను తలదాల్చెదను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతునికి అంతా తెలుసు. కనుక ఆయనకు ఎలాంటి సందేహాలు ఉండే అవకాశం లేదు. కనుక ఆయన ఛిన్న సంశయుడు. అంతా అరచేతిలో ఉసిరికాయలా స్పష్టంగా ఆయనకు కనిపిస్తుంది.
**కరతలామలకవత్ సర్వమ్ సాక్షాత్కృతవతః**
**క్వాపి సంశయో నాస్తి నాస్తి ఇతి ఛిన్న సంశయః**

సృష్టినుండి ప్రళయంవరకూ అంతా భగవంతుడు అనుకొన్నట్లే జరుగుతుంది. కనుక ఆయనకు సంశయాలు ఉండే అవకాశం లేదు. అని శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరించారు.



## ఉదీర్ణః సర్వతశ్చక్షురనీశః శాశ్వతస్థిరః |
## భూశయో భూషణో భూతిర్విశోకశ్శోకనాశనః || (67)

### 630. ఉదీర్ణః

- అవతారమూర్తులుగాను, అర్చామూర్తులుగాను అందరికీ కనిపించి ప్రకాశించేవాడు.
- సర్వభూతములకంటె అధికుడు. మహాశక్తి సంపన్నుడు.
- తన భక్తులను తనంత స్థాయికి ఉద్ధరించువాడు.

**ఓం ఉదీర్ణాయ నమః**

**ప్రత్యక్ష విషయత్వేన హ్యుత్పన్నశ్చర్మచక్షుషాం ఉదీర్ణ ఇతి స ప్రోక్తః సప్తార్ణో నయనప్రదః -** ప్రాకృతమైన (సామాన్యమైన) కనులు కలవారికి కూడా ప్రత్యక్షముగా చూసేటట్టుగా అవతరించినవాడు. ఈ మంత్రము సప్తాక్షరి. మంచి దృష్టిని ప్రసాదించును. ఓం ఉదీర్ణాయ నమః.

ఈ నామము, తరువాతి కొన్ని నామములు భగవంతుని అర్చామూర్తిత్వమును సూచించేవిగా శ్రీభట్టులు వ్యాఖ్యానించారు. ఇంద్రియాలకు అతీతమైన, అనంత తేజోమయమైన భగవంతుని చూడడానికి చర్మచక్షువులు చాలవు. కనుక భగవంతుడు రామునిగాను, కృష్ణునిగాను అవతరించి జనాలమధ్య తిరిగాడు. గోవులు కాచి చలిది తిన్నాడు. దేవాలయాలలోను, గృహాలలోను అర్చామూర్తియై నిత్యపూజలు అందుకొంటూ భక్తుల కన్నులకు పండుగచేసి వారిని తరింపజేయుచున్నాడు. శ్రీ భట్టులు 'ఉదీర్ణ' అనగా 'ఉల్లాసిత' అనగా 'ప్రకాశిస్తూ దర్శనము ఇచ్చుట' అనగా అందరికీ కనిపించే తేజోమయమూర్తి – అని వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరులు భగవంతుని ఆధిక్యమును సూచించారు. **సర్వభూతేభ్యః సముద్రిక్తత్వాత్ ఉదీర్ణః.** అన్ని భూతములకంటె పరమాధిక్యము కలవాడు, మహాశక్తిమంతుడు ఉదీర్ణుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'ఉత్' అనే ధాతువునుండి, 'ఋ'-గతౌ – అన్నింటికంటె అధికుడు ఉదీర్ణుడు. మరొక విధంగా అందరిని పైకి లేపేవాడు (ఉద్ధరించేవాడు) అనగా తన భక్తులను ఉన్నతులుగా చేసేవాడు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే భావాన్ని చెప్పారు.

ధర్మచక్రము రచయిత – పరిమాణంలో గాని, శక్తిలో గాని, ప్రేమలో గాని, ఇంద్రియ నిగ్రహంలో గాని, జ్ఞానంలో గాని – ఎలా చూసినా భగవంతునికి మరెవ్వరూ సరి రారని (అందరూ కలిసినా సరి రారని) భగవంతుని లీలాగాధల వలన మనం తెలుసుకోవచ్చును.

### 631. సర్వతశ్చక్షుః

- అందరికి కనుపించువాడు. అందరి కన్నులు తనపైనే కలవాడు.
- అంతటను నేత్రములు కలవాడు. అంతా చూశేవాడు.

### ఓం సర్వతశ్చక్షుషే నమః

**తత్సాక్షాత్కార కర్మాణి సర్వచక్షూంష్యపి స్వతః అతస్యాత్ సర్వతశ్చక్షుః నవార్ణో నేత్రశక్తిదః -** అందరి నేత్రములు తనయందే గలవాడు. కనుక (అందరికీ కనుపించడంవలన) సంశయానికి అవకాశం లేనివాడవుతున్నాడు గనుక సర్వతశ్చక్షువు. ఈ నామము నవాక్షరీ మంత్రము. మంచి దృష్టిని, కంటి శక్తిని ప్రసాదిస్తుంది. ఓం సర్వతశ్చక్షుషే నమః.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు అందరికీ కనిపిస్తాడు. రాముడు, కృష్ణుడు వంటి అవతారములెత్తి భూమిపై అందరికీ కనిపించాడు. నేడు కూడ గృహాలలోను, మందిరాలలోను అర్చామూర్తియైయుండి అందరి కన్నులకు వెలుగునిస్తూ, ఛిన్నసంశయుడై, ఉదీర్ణుడై, భక్తులకు ఆనందం చేకూర్చుచున్న సర్వతశ్చక్షువు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతునికి కనులు ఎల్లెడలా ఉంటాయి. ఆయనకు కనుపించనిది లేదు. **సర్వతః సర్వమ్ స్వచైతన్యేన పశ్యతి ఇతి సర్వతశ్చక్షుః.** ఆయన స్వభావమైన చైతన్యముద్వారా అంతటా అన్నింటినీ చూస్తాడు గనుక సర్వతశ్చక్షువు.

శ్వేతాశ్వరోపనిషత్తు 3.3 – **విశ్వతశ్చక్షురుత విశ్వతస్పాత్.** ఆత్మరూపుడైన పరబ్రహ్మ భూమిని, ఆకాశాన్ని కూడా సృష్టిస్తున్నాడు. అంతటా నేత్రములు, ముఖములు, బాహువులు, పాదములు కలిగియున్నాడు.

**సర్వతః పాణి పాదం తత్ సర్వతోऽక్షి శిరోముఖమ్ సర్వత శ్రుతి ముల్లోకే సర్వమావృత్య తిష్ఠతి** – గీత 13.14
ఆ పరమాత్ముని చేతులు, కాళ్ళు, నేత్రాలు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములైయున్నాయి. అతడు సర్వాన్ని ఆవరించియున్నాడు.

## 632. అనీశః

- పరతంత్రుడు. భక్తుల అధీనంలో ఉండేవాడు.
- సర్వస్వతంత్రుడు. పరమాత్మయే అందరికి ఈశుడు. అనగా ఆయనకు వేరు ప్రభువు ఉండడు.

### ఓం అనీశాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – తన భక్తుల విషయానికి వచ్చేసరికి భగవంతుడు తన విశ్వేశ్వరత్వమును ప్రదర్శించకుండా పూర్తిగా భక్తులకు వశుడై ఉంటాడు. **ప్రోక్తో హ్యనీశో యశ్చాసౌ తదాయత్తాఖిల క్రియః.** తనయొక్క ఉనికి, నడవడి అన్నీకూడా భక్తుల అధీనంలో కలవాడు కాబట్టి ఇతడు పరతంత్రుడు. 627వ నామము 'అవిధేయాత్మా'లో భగవంతుడు భక్తుల చెప్పుచేతలకు లోబడి నడచుకొనే ఉదాహరణలు చెప్పబడినాయి. ఈ భావాన్ని శ్రీ వి.వి. రామానుజన్ మరింత చక్కగా ఇలా చెప్పారు. అర్చామూర్తియైన శ్రీ అనీశుడు స్నానానికి, పానానికి, భోజనానికి, వస్త్రాలకు కూడా భక్తులపైనే ఆధారపడి ఉంటాడు. శ్రీ పెరియాళ్వారువారి తిరువైమోళి (6.2.11)లో ఈ భావనను ఎంతో అందంగా చెప్పారు. ఎవరైనా తనపై యశోదకు చాడీలు చెప్పినపుడు లేదా యశోదమ్మకు తనపై కోపం వస్తుందని అనిపించినపుడు చిన్నికృష్ణుడు భయం నటించేవాడు. ఏడుపుముఖం పెట్టేవాడు. ఆమె దండనను తప్పుకోవడానికి యత్నించేవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఆ దేవదేవునికి మరొక ఈశుడు (ప్రభువు) లేడు. **న విద్యతే అస్య ఈశ ఇతి అనీశః.** ఇందుకు శ్రీ శంకరులు నారాయణోపనిషత్తు (3.2)నుండి ఉదాహరించారు – **న తస్య ఈశే కశ్చన.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి శ్వేతాశ్వరోపనిషత్తు (6.9)నుండి చెప్పిన మరొక ప్రమాణం – **న తస్య కశ్చిత్ పతిరస్తి లోకే న చేశితా.**

ధర్మచక్రము రచయిత – నిజమైన భక్తునికి సాక్షాత్తు భగవంతుడే వశుడైయుండగా ఇంకా భగవద్భక్తునిపై వేరొకరు అధికారం చలాయించే అవకాశం ఏముంది?

## 633. శాశ్వతస్థిరః

- శాశ్వతమైన, మరియు నిలకడైనవాడు (మార్పులేకుండా ఎల్లప్పుడూ ఉండేవాడు).
- మనము తయారుచేసిన మూర్తులందు తానై ప్రవేశించి (అర్చారూపములో) శాశ్వతముగా, స్థిరముగా ఉండువాడు

### ఓం శాశ్వతస్థిరాయ నమః

శ్రీ భట్టులు సాత్వతసంహితనుండి ఉదాహరించారు – **బింబాకృత్య ఆత్మనా బింబే సమాగమ్య అవతిష్ఠతే.** మనము తయారుచేసిన మూర్తులందు తానై ప్రవేశించి (అర్చారూపములో) శాశ్వతముగా, స్థిరముగా ఉండువాడు శాశ్వతస్థిరుడు. సర్వదా సేవించి తరించడానికి వీలుగా అనేక మూర్తులుగా అయి శాశ్వతముగా ఉండేవాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ భక్తులపట్ల భగవంతునికిగల వాత్సల్యాన్ని ప్రస్తావించారు. **శాశ్వత భవ ఇతి శాశ్వతో నిత్యః స చ అసౌ స్థిర ఇతి శాశ్వత స్థిరః నిత్యమ్ స్వాశ్రిత వాత్సల్య ప్రతిష్ఠితః**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శాశ్వత భవన్నపి, న విక్రియామ్ కదాచిత్ ఉపైతి ఇతి శాశ్వత స్థిరః.** ఎల్లప్పుడూ ఉండేవాడై కూడా మార్పులేనివాడు.

ధర్మచక్రము రచయిత – చంచలమైనవాని పట్ల లగ్నమైన మనసుకు నిలకడ ఉండదు. కాని శాశ్వతస్థిరుడైన శ్రీహరిపట్ల లగ్నమైన మనస్సు స్థిరముగానుండి శాశ్వతమైన మోక్షమునిచ్చును.

ఈ భావాన్ని దగ్గరలో ఉండే కొన్ని నామముల పునశ్చరణ –

28వ నామము. **స్థాణుః** – స్థిరమైనవాడు. భక్తులపట్ల అనుగ్రహము కలిగి నిశ్చయముగా ఇష్టకామ్యములు సిద్ధింపజేయువాడు. వృద్ధి క్షయ గుణములకు లోబడనివాడు.
57వ నామము. **శాశ్వతః** – కాలముతో మార్పుచెందక, ఎల్లప్పుడు ఉండేవాడు.
121వ నామము. **శాశ్వతస్థాణుః** – కాలముతో నిమిత్తము లేకుండా, నిశ్చలముగా, నిత్యమై, సత్యమై, నిరంతరమైనవాడు. ఆదిమధ్యాంత రహిత పరబ్రహ్మము.
205వ నామము. **స్థిరః** – భక్తులపట్ల బాంధవ్యము నిలకడగా కలిగినవాడు. నిశ్చలుడు. నిర్వికారుడు. నిత్యుడు.
428వ నామము. **స్థావరస్థాణుః** – కృతయుగ ధర్మమును పునస్థాపించి విశ్రమించువాడు. స్థావరములయన భూమివంటివి ఆయనయందు ఉండును.
633వ నామము. **శాశ్వతస్థిరః** – శాశ్వతమైన, మరియు నిలకడైనవాడు. మనము తయారుచేసిన మూర్తులందు తానై ప్రవేశించి (అర్చారూపములో) శాశ్వతముగా, స్థిరముగా ఉండువాడు.

## 634. భూశయః

- తన భక్తులు తనను ఎక్కడ ప్రతిష్ఠిస్తే అక్కడ అర్చామూర్తియై ఉండి వారి పూజలనందుకొనేవాడు.
- శ్రీలంకకు వెళ్ళేమార్గంలో సాగరతీరాన శయనించినవాడు.

- సకలభూతములందును అంతర్యామిగాఉండేవాడు.
- ప్రళయకాలంలో సకలజగత్తు ఎవనియందు శయనిస్తుందో అతడు.

### ఓం భూశయాయ నమః

శ్రీ భట్టులు భగవంతుని అర్చావతారపరంగా వ్యాఖ్యను ఈ నామంలోకూడా కొనసాగించారు. **స్వయం వ్యక్తాది రూపేణ కౌశేతే భూశయశ్చ సః**. భగవంతుడు భక్తుల ప్రార్థనలను మన్నించి స్వయంవ్యక్తమూర్తిగాను, సిద్ధప్రతిష్ఠితునిగాను, మానుషప్రతిష్ఠితునిగాను భూమిపై అవతరించి అక్కడ ఆయా ప్రదేశాలలో స్థిరంగా ఉండేవాడు గనుక భూశయుడు. భగంతుడు తానై వెలసిన మూర్తులు స్వయంవ్యక్త మూర్తులు. బ్రహ్మాది దేవతలు, సిద్ధులు ప్రతిష్ఠించినవి మరొకవిధమైన అర్చావతారములు. సామాన్య మానవులు ప్రతిష్ఠించినవి మానుష ప్రతిష్ఠిత మూర్తులు. ఈ మూడు అర్చావతారములలోను నెలవై భగవంతుడు భక్తులను బ్రోచుచున్నాడు. శ్రీ పి.బి. అణ్ణంగారాచార్య ఇలా అన్నారు – భక్తులు అడిగిన చోటకు దిగివచ్చి అక్కడే మొండిగా కొలువైయుంటాడు భూశయుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – రావణ సంహారార్థమై లంకకు పోవుచు మహాసాగర తరణోపాయాన్వేషణార్థము ఉపవాసదీక్ష చేకొని భూమిపై శయనించిన శ్రీరామచంద్రుని దివ్యమంగళమూర్తిని సూచించు దివ్యనామమిది.

శ్రీ చిన్మయానంద – **భూః సేతే అస్మిన్ ఇతి భూశయః**. సమస్త భూమండలము ప్రళయకాలమునందు ఆయనయందు శయనించియుండును కనుక ఆయన భూశయుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **భూషు సేతే భూశయః**. సకలభూతములందును అంతర్యామియై యుండును గనుక శ్రీహరి భూశయుడు.

ఒకే నామములోని మాధుర్యమును, మహాత్మ్యమును వివిధ జ్ఞానులు వివిధములుగా అనుభవించుట ఈ నామవ్యాఖ్యలలో మనము చూడవచ్చును.

## 635. భూషణః

అలంకరింపబడినవాడు, లేదా అలంకారమైనవాడు.

- సౌలభ్యము, సౌశీల్యమువంటి ప్రియగుణములనే ఆభరణములుగా ధరించినవాడు.
- శ్రీ శరణాగతి గద్యములో ఎంబెరుమార్ వర్ణించినట్లుగా అనేక దివ్యసుందర ఆభరణములు ధరించినవాడు.
- తన సంకల్పానుసారము అనేక అవతారములు ధరించి, లీలావిశేష విభూతులను ప్రదర్శించి, భూమికి దివ్యాలంకారమై భాసించినవాడు.
- తానే స్వయముగా అంతరాత్మయై జీవులను అలంకరించేవాడు.
- తన చిత్ర విచిత్ర వైవిధ్య సృష్టితో జగత్తును అలంకరించేవాడు.

### ఓం భూషణాయ నమః

'భూషణము' అనగా ఆభరణము. 'భూషణుడు' అనగా ఆభరణమును ధరించినవాడు లేదా తానే ఆభరణమైనవాడు. ఈ ఆభరణము ఏమిటనే విషయంలో వివిధ వ్యాఖ్యానకర్తల భావవైవిధ్యం మనకు అవగతమవుతుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు భక్తునికి అందుబాటులో ఉంటాడు. ఈ సౌలభ్యమే ఆయనకు ప్రధాన ఆభరణము. పరత్వమునుండి దిగివచ్చి భక్తులలో కలిసిపోయే తత్వము ఆయనకు భూషణము. అలానే కుచేలుడు తెచ్చిన అటుకులు ఆరగించాడు. శబరి ఇచ్చిన పండ్లను తిన్నాడు. పిలిస్తే పలుకుతాడు. పాడితే ఆడుతాడు. స్తుతిస్తే సంతోషిస్తాడు.

**ఏవం విశ్వజనీనేన శీలేన చ శ్రియఃపతిః య ఆత్మానం విషయతి భూషణ పరికీర్తితః -** అందరియందు సాధారణమైన స్వభావంతో, అరమరికలు లేకుండా, ఒకే రీతిగా ప్రవర్తించడం అనే అసాధారణమైన భూషణము కలవాడు భూషణుడు.

శ్రీ వి.వి. రామానుజన్ – శ్రీ శరణాగతి గద్యములో భగవద్రామానుజులు స్వామివారు ధరించిన అనేక దివ్యభూషణములను వర్ణించారు – **స్వాచిత వివిధ విచిత్రానంతాశ్చర్య నిత్య నిరవద్య నిరతిశయ సుగంధ నిరతిశయ సుఖస్పర్శ నిరతిశయౌజ్జ్వల్య కిరీట మకుట చూడావతంస మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తా దామోదర బంధన పీతాంబర కాంచీగుణ నూపురాద్యపరిమిత దివ్యభూషణ! స్వానురూపాచింత్యశక్తి శంఖ చక్ర గదాసి శార్ఙ్గాద్యసంఖ్యేయ నిత్య నిరవద్య కళ్యాణ దివ్యాయుధ! స్వాభిమత నిత్య నిరవద్యానురూప స్వరూపరూప గుణవిభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయ కళ్యాణగుణగణ శ్రీవల్లభ! ఏవం భూత భూమి నీళా నాయక!.** ఇలా స్వామివారు చిత్ర విచిత్రములైన, వివిధములైన, శాశ్వతములైన, అద్భుతములైన, సాటిలేని, సుగంధభరితములయన, స్పర్శకు సుఖమునిచ్చే అనేక దివ్యాభరణములు – కిరీటము, శిరస్సు ఆభరణాలు, కుండలాలు, హారాలు, కంఠాభరణాలు, మాలలు, భుజకీర్తులు, హస్తాభరణాలు, శ్రీవత్సకౌస్తుభ చిహ్నాలు, నడుము పట్టీలు, పట్టుబట్టలు, అందియలు – ధరించియున్నారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– స్వ ఇచ్ఛా అవతారైః బహుభిః భూమిమ్ భూషయణ్ భూషణః.** శ్రీహరి ధరించిన అనేక అవతారములే భూమికి భూషణములు. తన అవతారములలో అనేక మధుర గంభీర లీలావిశేష విభూతులను ప్రదర్శించినందున భూమికి దివ్యాలంకారమై భాసించినవాడు భూషణుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఒక శరీరములో ఆత్మ (ప్రాణము)ఉండుటయే ఆ శరీరమునకు అన్నింటికంటెను గొప్ప అలంకారము. ఆత్మ వెడలిన మరుక్షణమే ఆ శరీరము కళావిహీనమగును. సర్వసృష్టికి అంతరాత్మ మరియు జీవనాధారము అయిన భగవానుడు సకల భువనములకును భూషణుడు.

శ్రీ చిన్మయానంద – చిత్ర విచిత్రములైన సుందరములైన సృష్టివైవిధ్యమే శ్రీహరికి భూషణము. జీవులలో భావములు, స్వభావములు ఆయన సృజించిన అలంకారములు.

ధర్మచక్రము రచయిత – మనం ప్రకృతిలో అనుభవించే సౌందర్యాలన్నీ ఆయనలో ఉన్నాయి. బృందావనలీలలోని అందము, వేణువులోని మాధుర్యము, శ్రీరాముని ధర్మవర్తనము మరియు సౌందర్యము, రామనామములోని మహత్తు – ఇవన్నీ శ్రీమన్నారాయణుని భూషణములను తెలియజేయును.

### 636. భూతిః

- భక్తులకు సంపద అయినవాడు.
- మహత్వమునకు, కీర్తికి, ఐశ్వర్యమునకు (విభూతులకు) స్వరూపము.
- తను సృజించినవానిలోని ఐశ్వర్య విభూతులకు కారణము.
- తన సృష్టిలో అన్నింటిలోను ఐశ్వర్య విభూతుల రూపంలో ఉన్నవాడు.

**ఓం భూతయే నమః.**

ఈ నామమునకు మూలధాతువు 'భూ'-సత్తాయామ్ – శక్తి. 'భూతి'కి మరొక పదము 'విభూతి' అనగా ఐశ్వర్యము. **భవతి ఇతి భూతిః – భవతి అనయా శ్రీమాన్ ఇతి భూతిః** – వంటి అమరకోశ నిర్వచనాలున్నాయి. మొత్తానికి 'భూతి' అంటే 'ఐశ్వర్యము' అనే అర్థంలో ఈ నామానికి వ్యాఖ్యలు ఇవ్వబడినాయి.

శ్రీ భట్టులు – **యోऽసౌ సమృద్ధమైశ్వర్యం భక్తానాం భూతిరీరితః.** భక్తులకు తానే సకలైశ్వర్యము అయినవాడు భూతి. శరణాగతులకు సర్వము ఆయనే. తల్లి, తండ్రి, గురువు, దైవము, తోడు, నీడ, గతి, పతి, బిడ్డలు కూడ శ్రీహరియే.

శ్రీ శంకరులు – (1) సకలైశ్వర్య విభూతులకు నిలయమైనవాడు భూతి. (2) అన్ని భూతములకును ఐశ్వర్యము ఆయనే.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – తన సృష్టి రూపంలో అంతటా శ్రీహరి వసించియుంటాడు. ఇందు గల డందు లేడను సందేహము వలదు. చక్రి సర్వోపగతుడు. మరియు తన సృష్టిలో భూతములు కనబరిచే ఐశ్వర్యములన్నియును భగవద్విభూతులే.



కాళీయ మర్దనం. 1640 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

ధర్మచక్రము రచయిత – మహత్వమునకు మూర్తి భగవంతుడు. కనుక చిన్న చితక విషయాలపై మనసు పారవేసికొనరాదు. మనసును, మాటను, చేతను శ్రీమహావిష్ణువుపట్ల అంకితం చేయాలి.

**హంత తే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠః నాస్త్యంతో విస్తరస్య మే** – భగవద్గీత 10.19
ఓ అర్జునా! నా దివ్య విభూతుల విస్తృతి (వ్యాప్తి)కి అంతమే లేదు. వాటిలో ప్రధానమైనవాటిని కొన్నింటిని మాత్రమే నీకు తెలుపుచున్నాను.

## 637. విశోకః

### అశోకః

- దుఃఖము లేనివాడు.

ఓం విశోకాయ నమః
ఓం అశోకాయ నమః

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన నిర్వచనము – **విగతః శోకో యస్య స విశోకః.** శోకము లేనివాడు విశోకుడు –**అవిద్యమానః శోకో యస్య స అశోకః.** శోకమునెఱుగనివాడు అశోకుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **న శోకో యస్య ఇతి అశోకః నిత్యానందమయః.** నిత్యానందమయుడగుటచే శోకము లేనివాడు అశోకుడు.

శ్రీ భట్టులు ఈ నామవివరణలో కూడా ముందటి నామమువలెనే భక్తులపట్ల భగవానుని వాత్సల్యాన్ని ప్రధానంగా చెప్పారు. భగవంతుడు అనాథలనబడేవారి నెవరినీ వదిలిపెట్టడు. వారికి ఆయనే దిక్కు. అందుకని వారి విషయమై ఆయనకు చింత లేదు. కనుక ఆయన అశోకుడు.

శ్రీ శంకరులు భగవంతుని పరత్వమును ప్రస్తావించారు. శ్రీహరి శాశ్వత సచ్చిదానంద స్వరూపుడు గనుక శోకము లేనివాడు.

మరి సీతా వియోగ సమయంలో శ్రీరాముడు చాలా దుఃఖించాడు గదా? ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రి భగవద్గీత (9.10.11)నుండి ఉదాహరిస్తూ ఇలా చెప్పారు. **ప్రియయా వియుక్తః స్త్రీ సంగినామ్ గతిమితి ప్రథయన్ శ్చచార.** ఒక స్త్రీపట్ల అనురాగబద్ధులైన పురుషులు ఎలా ప్రవర్తిస్తారో మాయామానుషుడైన శ్రీరాముడు తెలియజేశాడు.

శ్రీ చిన్మయానంద – శరీరము, బుద్ధి, ఆత్మల మధ్యనుండే సమతుల్యత దెబ్బతినడంవల్ల దుఃఖం కలుగుతుంది. రాగరహితుడు, ఆనందమయుడు, సర్వతృప్తుడు అయిన శ్రీహరికి శోకం కలిగే అవకాశం లేదు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ ఛాందోగ్యోపనిషత్తు (8.7.1)నుండి ప్రమాణం చెప్పారు. ఇందులో 'విశోకః' అనేది భగవంతుని గుణాలలో ఒకటిగా చెప్పబడింది.

## 638. శోకనాశనః

- శోకమును నాశనము చేయువాడు.

### ఓం శోకనాశనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతునినుండి కలిగిన ఎడబాటుకు దుఃఖించే భక్తులకు సంసారసాగరమునుండి తరించేందుకు చేయూతనిచ్చి వారి శోకమును నాశనము చేయువాడు శోకనాశనుడు. **భక్తానాం స్వేన సంబంధ వ్యతిరేక స్వరూపకమ్ యత్తచ్ఛోకం నాశయతి శోకనాశన ఈరితః -** భక్తులకు సేవచేస్తూ వారికి తనవల్ల కలిగే ఎడబాటువలన దుఃఖము లేకుండా చేస్తాడు గనుక శోకనాశనుడు.

ప్రపంచంలో అనేక సంపదలు దుఃఖాన్ని కలుగజేస్తాయి. కాని భగవంతుడు అనే సంపద దుఃఖాన్ని నాశనం చేస్తుందని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు. ఇందుకు తిరుమళిశయాళ్వారు తిరుచ్ఛందవిరుత్తమ్ (115)నుండి ఉదాహరించారు – అతడు భక్తుల సంపూర్ణ సంపద అవుతాడు. వారికి తల్లి, తండ్రి, ప్రభువు కూడా ఆయనే. భక్తుల హృదయాలలో ప్రవేశించి వారిని సంసార సాగరంనుండి బయటకు తెచ్చి వారి శోకాన్ని నశింపజేస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుని స్మరించినంతనే భక్తునికి దుఃఖం నశిస్తుంది కనుక ఆయన శోకనాశనుడు. **స్మృతిమాత్రేణ భక్తానామ్ శోకమ్ నాశయతి ఇతి శోకనాశనః.** ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉదాహరించినది – ఛాందోగ్యోపనిషత్తు (5.1.3) **తరతి శోకమ్ ఆత్మవిత్** – ఈశావాస్యోపనిషత్తు (7) **తత్ర కో మోహః కః శోకః.**

ధర్మచక్రము రచయిత – శోకానికి మోహము కారణము. భగవంతుని ధ్యానించడంవలన మోహము, శోకము నశిస్తాయి. గీతాశ్రవణంవలన అర్జునుడు శోకవిముక్తుడై భగవంతుని బోధప్రకారం కర్తవ్యం నిర్వహించాడు.

**తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్**
**భవామి న చిరాత్ పార్థ మయ్యావేశిత చేతసామ్** – గీత 12.7
ఓ అర్జున! నాయందే లగ్నమనస్కులైన అట్టి పరమభక్తులను నేను శీఘ్రముగనే మృత్యు సంసార సాగరమునుండి ఉద్ధరించెదను.
**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత**
**స్థితోఽస్మి** గతసందేహః కరిష్యే వచనం తవ – గీత 18.73
అర్జునుడు పలికెను – ఓ అచ్యుతా! నీ కృపచే నా మోహము పూర్తిగా తొలగినది. స్మృతిని పొందితిని. ఇప్పుడు సంశయరహితుడనైతిని. కనుక నీ ఆజ్ఞను తలదాల్చెదను.



## అర్చిష్మానర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః |
## అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః || (68)

### 639. అర్చిష్మాన్

- అత్యంత కాంతిప్రదమైనవాడు. తేజోమయుడు.

**ఓం అర్చిష్మతే నమః**

'అర్చస్' అనగా కాంతికిరణము. ఈ నామమునకు వివిధ వ్యాఖ్యలు ఈ అర్థంతో పెనవేసుకొని ఉన్నాయి.

శ్రీ భట్టులు – భగవంతుడు తన అనన్య తేజస్సును భక్తులకు తెలియజేస్తాడు. సామాన్యులు ఆయన తేజమును భరించలేరు. కనుక అర్జునునికి శ్రీవాసుదేవుడు దివ్యచక్షువులను ప్రసాదించాడు. **భక్తాభ్యంతర బాహీక చక్షురున్నయవక్షయమ్ దివ్యం తేజస్సదా యస్య అర్చిష్మానితి కథ్యతే.** భక్తుల చర్మచక్షువులను మనసును కూడా వికసింపజేయగల దివ్యమైన తేజస్సుగలవాడు అర్చిష్మాన్.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – నిజానికి ఆయన దివ్యతేజస్సును భరించడం లేదా ఆయన మహాత్మ్యమును తెలిసికోవడం ఎవరికీ సాధ్యం కాదు. కనుక భక్తుల శక్తి, స్థాయిల ప్రకారం శ్రీమహావిష్ణువు తన తేజస్సు కొంత వారికి తెలిసేలా అనుగ్రహిస్తాడు.

శ్రీ వి.వి. రామానుజన్, శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'అర్చామూర్తి' కాంతిపరంగా ఈ నామాన్ని వ్యాఖ్యానించారు. **అర్చి విగ్రహ కాంతిః తదస్య అస్తి ఇతి అర్చిష్మాన్.** అర్చావిగ్రహం రూపంలో ప్రకాశించేవాడు అర్చిష్మంతుడు.

శ్రీ శంకరులు **– అర్చిష్మంతో తదీయేన అర్చిషా చంద్ర సూర్యాదయః, స ఏవ ముఖ్య అర్చిష్మాన్.** శ్రీమన్నారాయణుడే సకల తేజమునకు మూలము. సూర్య చంద్రాదులు ఆయన కాంతివల్లనే ప్రకాశించుచున్నారు. ఆయనే సూర్యచంద్రాదులకు అంతర్యామి గనుక అర్చిష్మాన్.

శ్రీ చిన్మయానంద గీత (13.17)నుండి – **జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే** – అని ఉదాహరించారు. మరియు ఆయన కఠోపనిషత్తు (2.5.15)నుండి ఇచ్చిన ఉదాహరణ –

**న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకమ్ నేమ విద్యుతో భాన్తి కుతో యమాగ్నిః**

**తమేవ భాన్తుమ్ అనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదమ్ విభాతి.** అక్కడ సూర్యుడు, చంద్రుడు, తారలు, మెరుపు తీగలు ప్రకాశించవు. ఇంక అగ్నివల్ల ఏమవుతుంది? సర్వలోకములను తానే (ఆ పరమాత్మ) ప్రకాశింపజేస్తాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ గౌడీయ సంప్రదాయానుయాయి. ఆయన చెప్పిన మరొక వైవిధ్య వ్యాఖ్య –**కంసాత్ పిత్రోరవజ్ఞయా జాజ్వల్యమానత్వాత్ అర్చిష్మాన్** – కంసుడు తన (కంసుని) తండ్రియైన ఉగ్రసేనుని బంధించిన సంగతి తెలిసి శ్రీకృష్ణుడు కోపంతో ఎర్రబడి ప్రకాశిస్తున్నాడట. అలా ఆయన అర్చిష్మాన్.

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా యది భాః సదృశీ సాస్యాత్, భాసస్తస్య మహాత్మనః** – గీత 11.12

ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాంతి పుంజములును ఆ విరాట్ రూప తేజస్సునకు సాటిరావు.

ఉభయ దేవేరులతో ముత్యాల పందిరి వాహనంపై ఊరేగుతున్న శ్రీ మలయప్ప స్వామి. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Malayappa_in_mutyala_pandiri_vahanam.jpg

## 640. అర్చితః

పూజింపబడువాడు.

- పూజింపబడుటకు తగు అన్నిగుణములు కలవాడు.
- అర్చామూర్తియై పూజలు అందుకొనేవాడు.
- బ్రహ్మాదులచేత కూడ పూజింపబడేవాడు.

### ఓం అర్చితాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు చెప్పిన అన్ని కళ్యాణ గుణములు – **ఉదీర్ణః, సర్వతశ్చక్షుః, అనీశః, శాశ్వతస్థిరః, భూశయః, భూషణః, భూతిః, విశోకః, శోకనాశనః, అర్చిష్మాన్** – వలన తెలియవచ్చేదేమంటే శ్రీహరియే పూజింపదగినవాడు. పూజలందుకొనేవాడు. ఈ నామము ఆయన అర్చావతారమును కూడ సూచించును. **అర్చాహ్యవతారోऽస్య క్షేత్రాయతన సద్మసు స జ్ఞాతేత్యర్చితః ప్రోక్తః సప్తార్ణో వాంఛితప్రదః.** 'అర్చా' అంటే అర్చావతారము. అది సమస్త క్షేత్రాలలోను, గృహములయందు, దేవాలయములందు ప్రత్యక్షముగా సర్వకాల సర్వావస్థలయందు అందరికీ కనులకు కనుపించే భగవద్రూపము. ఈ నామము సప్తాక్షరి. సర్వకామప్రదము. ఓం అర్చితాయ నమః.

మనకు మిగిలిన అవతారాలగురించి తెలుసుకోవడానికి కొన్ని పరిమితులున్నాయి. ఉదాహరణకు రామునిగాను, కృష్ణునిగాను ఆయా యుగాలలోనే భగవంతుడు అవతరించాడు. పరవాసుదేవ రూపములో వైకుంఠములోనే దర్శనమిస్తాడు. ఇలా అందరికీ అన్నివేళలా ఆ దివ్యావతారముల దర్శనం సాధ్యం కాదు. కాని అర్చారూపంలో ఆ దేవదేవుడు అందరికీ దర్శనమిస్తాడు. అర్చామూర్తి గురించి గుహ్యమైన జ్ఞానము భగవత్ శాస్త్రము (పాంచారాత్రాగమము), బోధాయన స్మృతి, వైష్ణవ పురాణము వంటి గ్రంధాలలో లభిస్తున్నది. అర్చామూర్తిని గూర్చి శ్రీ భట్టులు 'వైష్ణవ ధర్మము'లోని ఈ శ్లోకాన్ని ఉదాహరించారు –

**సురూపమ్ ప్రతిమామ్ విష్ణోః ప్రసన్న వదనేక్షణామ్**
**కృత్వాత్మనః ప్రీతికరీమ్ సువర్ణ రజతాదిభిః**
**తామ్ అర్చయేత్ తామ్ ప్రణామేత్ తామ్ యజేత్ తామ్ విచింతయేత్**
**విశత్యపాస్త దోషస్తు తామేవ బ్రహ్మరూపిణీమ్**

బంగారము, వెండి వంటివానితో ప్రసన్న వదనము, నేత్రములు కలిగిన విష్ణువుయొక్క సుందర ప్రతిమను ప్రీతితో చేసి దానిని అర్చించవలెను. ప్రణామము చేయవలెను. సేవింపవలెను. ధ్యానించవలెను. అలా చేస్తే సమస్త దోషములు నశిస్తాయి. సాక్షాత్తు పరమేశ్వరుడే అయిన ఆ రూపంలో లీనం కావచ్చును.

శ్రీ వి.వి. రామానుజన్ ముదల్ తిరువందాడి (44)ను ఉదాహరించారు. మరియు గీత (4.11)ను కూడా ఉదాహరించారు. **యే యథా మామ్ ప్రపద్యంతే తాన్ స్తథైవ భజామ్యహమ్.**

శ్రీ నమ్మాళ్వారు తిరువైమోళి (3.6.9)లో కూడా ఇదే చెప్పారు – వైకుంఠములోని పరరూప దర్శనం లభించలేదని చింతించవద్దు. ఆయనను ధ్యానించే భక్తులు ఏయే రూపంలో ఆయనను స్మరిస్తారో ఆయా రూపంలో వారిని అనుగ్రహిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – బ్రహ్మాదులు కూడా ఆయనను అర్చిస్తారు గనుక శ్రీహరి అర్చితుడు. ఆయనను పూజించడంవల్లనే సూర్యచంద్రాదులకు వారి శక్తులు లభిస్తున్నాయి.

ధర్మచక్రము రచయిత – మన మానసిక స్థాయినిబట్టి ఏదో ఒక రూపంలో ఆయనను అర్చింపవచ్చును.

భగవంతుడు భక్తులకొరకు ఏమయినా చేస్తాడనేది (సౌలభ్యము) శ్రీ భట్టుల వ్యాఖ్యలో ప్రధాన ఇతివృత్తము. భగవంతుని పరత్వము శ్రీ శంకరుల వ్యాఖ్యలో ప్రధానంగా ప్రస్తావింపబడుచున్నది.

## 641. కుంభః

- కోరబడినవాడు. భక్తులు ఆయనను కోరుకుందురు.
- ప్రపంచములో (అర్చామూర్తులవంటి సుందరరూపంలో) ప్రకాశించేవాడు.
- విశ్వమంతా భగవానుని గర్భమనే భాండంలో ఇమిడి ఉంది.
- భూమిని చుట్టుముట్టి ఉండేవాడు.
- తన కీర్తితో భూమిని నింపినవాడు.

### ఓం కుంభాయ నమః

**కామ్యతే య స్సజాతీయైః గుణైః కుంభైః ప్రకీర్తితః భాతీతి కుంభో నిత్యం హి షడర్ణో భయనాశకః -** ప్రతిమలలో తాను సౌందర్యాది గుణాలతో ఉండడంచేత భక్తులచే కోరబడువాడు. తాను ప్రతిష్ఠింపబడినట్టి, లేదా వెలసినట్టి క్షేత్రములతో సంబంధమున్నవారికి యమకింకరులనుండి భయము తొలగజేయువాడు. ఈ నామము షడక్షరీ మంత్రము. అన్ని రకాల భయాలను పోగొట్టును. ఓం కుంభాయ నమః.

ఈ నామానికి శ్రీ భట్టులు రెండు అర్థాలను చెప్పారు (1) **కామ్యతే ఇతి కుంభః.** భక్తులు ఆయనను కోరుకుంటారు. (2) **కౌభాతీతి కుంభః.** ప్రకాశించేవాడు.

'కాము'-కోరుట – అనే ధాతువునుండి ('కుమార' శబ్దం కూడా ఇదే ధాతువునుండి వచ్చింది). **కామ్యత ఇతి కుంభః.** ఆయన పరమ సౌందర్యం కారణంగా భక్తులు ఆయనను కోరుకుంటారు. ఆయనను చేరితే తిరిగి సంసారంలో పడరు. కనుక ఇంక కోరుకోవాల్సింది వేరేమీ ఉండదు. శ్రీ వి.వి. రామానుజన్ తిరుమోళి (9.2.1)నుండి ఉదాహరించారు.

శ్రీ భట్టులు 'భా'-ప్రకాశించుట – మరియు 'కుమ్'-ప్రపంచము – అనే ధాతువుల ఆధారంగా, **కౌ భాతి ఇతి కుంభః** – అనికూడా చెప్పారు. ఈ ప్రకాశానికి కారణం దివ్యదేశాలలోను, ఇతర స్థలాలలోను ఆయన అర్చామూర్తిగా వెలుగొందుతూ అక్కడి భూమిని పరమపవిత్రం చేయడము. ఆ ప్రదేశాలలో జన్మించినవారికి, మరణించినవారికి, ఇతరత్రా సంబంధమున్నవారికి యమభటుల భయం ఉండదు.

**అర్చ్యానిషు సర్వాసు నిత్యం కుర్వతి సన్నిధిమ్ ముక్తయే సర్వభూతానామ్ విశేషేణ తు వై భువిః**
భూలోకంలోని ప్రాణికోటికి ముక్తి కలిగించడానికి అక్కడక్కడ క్షేత్రాలలో ప్రతిమల రూపంలో వెలసి మహిమతో వెలుగొందుతుంటాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **కుః భూమిః ప్రపంచ ప్రతీకః, ఉంభతి పూరయతి ఇతి ఉంభః, కోః ప్రపంచస్య ఉంభః –పూరకః స్వయశసా ఇతి కుంభః.** 'కుః' అనగా భూమి. 'ఉంభ' అనగా నింపునది. తన యశస్సుచే ప్రపంచమును నింపినవాడు 'కుంభః'.

శ్రీ శంకరులు 'కుంభము' అనగా 'కుండ' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. ప్రపంచమంతా భగవానునియందు ఇమిడి యున్నందున శ్రీహరి అలంకారిక భాషలో భావగర్భితముగా 'కుంభః' అను నామముతో గానము చేయబడెను. అలా విశ్వాన్ని తనలో ఉంచుకొని రక్షిస్తాడని వివరిస్తూ శ్రీ రాధాకృష్ణశాస్త్రి శ్రుతులనుండి ఉదాహరించారు.

**ఉభే అస్మిన్ ద్యావా పృథివీ అంతరేవ సమాహితే** – ఛాందోగ్యోపనిషత్తు 8.1.3
**తస్మిన్ సర్వమ్ ప్రతిష్ఠితమ్** – బృహదారణ్యకోపనిషత్తు 1.5.1

ఈ భావాన్ని కొంచెం మార్పుతో శ్రీ చిన్మయానంద ఇలా చెప్పారు – అంతా ఆయనయందే జరుగుతుంది గనుక ఆయన నామము 'కుంభః'

ధర్మచక్రము రచయిత – బంధుమిత్రుల చేయూత తాత్కాలికము. భగవానుని చేయూత శాశ్వతమైనది. కనుక ఆయననే నమ్ముకొని ధ్యానించాలి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'కుభి'-ఆచ్ఛాదనే – అన్న ధాతువునుండి, భగవానుడు భూమిని చుట్టియున్నాడు గనుక 'కుంభః' (సూర్యాదులు భూమికి చుట్టూ ఉన్నాయని).

## 642. విశుద్ధాత్మా

- పరిశుద్ధమైన స్వభావము (గుణము, ఆత్మ) కలవాడు.

### ఓం విశుద్ధాత్మనే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వాశ్రితే స్వశేషేణ సర్వస్య త్యాగత స్సదా విశుద్ధాత్మా.** తననాశ్రయించినవారెవరైనా సరే వారికి తన సర్వస్వాన్ని అనుగ్రహించేవాడు. ఆశ్రితులయందు తారతమ్యము లేనివాడు విశుద్ధాత్మ. ఆళ్వారులు స్తుతించిన అమలన్ ఆదిపిరాన్, విమలన్ నామములు ఈ నామమునకు దగ్గరగా ఉన్నాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – త్రిగుణాతీతము, దోషరహితము, నిస్సంగము అయిన ఆత్మ. ప్రకృతి మాయకు లోబడనిది విశుద్ధాత్మ.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **విశేషేణ శుద్ధ ఆత్మా స్వరూపమ్ యస్య ఇతి విశుద్ధాత్మా.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ శ్రుతులనుండి చెప్పిన ఉదాహరణలు. ఇవి భగవానుని శుద్ధ స్వరూపమును వివరిస్తున్నాయి –

**స పర్యగాత్ శుక్రమ్ అకాయమ్ అవ్రణమ్ అస్నావిరమ్ శుద్ధమ్ అపాపవిద్ధమ్** – ఈశావాస్యోపనిషత్తు 8

**ఎతోన్వింద్రమ్ స్తవాత్మా శుద్ధమ్ శుద్ధేన సామ్నా**
**శుద్ధైరుక్థైర్వా వృధ్వాంసమ్ శుద్ధాశీర్వాన్ మమంతు**
**ఇంద్ర శుద్ధో న అగ్ని శుద్ధః శుద్ధాభిరూతిభిః**
**శుద్ధోరయిమ్ ధారయ శుద్ధో మమద్ధి సోమ్య**
**ఇంద్రశుద్ధో హి నో రయిమ్ శుద్ధో రత్నాని దాశుషే**
**శుద్ధో వృత్రాణి జిఘ్నసే శుద్ధోవాజమ్ సిషాససి** – ఋగ్వేదము 7.95 – 7,8,9

## 643. విశోధనః

- పవిత్రము చేయువాడు.

### ఓం విశోధనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **చ పూర్వోక్త విభవస్త్యాద్విశోధనః.** ఇంతకుముందు చెప్పిన విభవముల కారణముగా విశోధనుడు. **విశోధయతి ఇతి విశోధనః.** పవిత్రము చేయువాడు విశోధనుడు. పుణ్యక్షేత్రములలో మరణించినవారిని వెతికి తన సాన్నిధ్యానికి తెప్పించుకునేవాడు. వారికి మోక్షమునిచ్చేవాడు. **విశేషేణ శోధయతి విమలీ కరోతి సమారాధన నిరతాన్ ఇతి విశోధనః.** అని శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్మృతి మాత్రేణ పాపానామ్ క్షపణాత్ విశోధనః.** స్మరించినంతనే పాపాలను నాశనం చేసేవాడు విశోధనుడు. భగవంతుని స్మరించడంద్వారా సత్వరజస్తమోగుణాలు మన మనసుపై అధిపత్యం కోల్పోతాయి. వ్యాకులత శమిస్తుంది. పాపాలు నశిస్తాయి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు సృష్టిద్వారాను (**నవో నవో భవతి జాయమానః**), ఏ విధమైన అడ్డంకులు లేనందువల్లను (**ఇంద్రస్య భాహోర్ భూయిష్ఠమోజః**), అనంతమైన శక్తివల్లను (సూర్యాదుల తాపం ఒక ఉదాహరణ) జగత్తును ఎప్పటికప్పుడు మార్పునకు గురిచేస్తూ పరిశుద్ధము చేస్తున్నాడు.

**తరువాతి కొన్ని నామములు దివ్యదేశములలో భగవానుని వ్యూహ, విభవ అవతారములను వర్ణించునవిగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.** ఈ నామములు వివిధ క్షేత్రములలో ఆయన పర, వ్యూహ, విభవ రూపములను తెలియజేయుచున్నవని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు. విశాఖయూపవృక్షంలో విభవావతారములకంటె ముందు వ్యూహావతారములు వస్తాయని గమనించాలి. జగత్తులో వివిధజీవుల సృష్టి, పోషణ కార్యానికి భగవంతుడు వ్యూహావతారములను ధరిస్తాడు.

## 644. అనిరుద్ధః

- అనిరుద్ధ స్వరూపుడు (వసుభాండమునందు జనార్దనుడు).
- నిరోధింపబడనివాడు.

### ఓం అనిరుద్ధాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

20వ శ్లోకము. 187వ నామము. అనిరుద్ధః – **అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః**

68వ శ్లోకము. 644వ నామము. అనిరుద్ధః – **అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః**

ఈ నామమునకు మూలధాతువు 'రుధిర్'-ఆవరణే – ఎదిరించుట. నిరుద్ధ – ఎదిరింపబడుట, ఆపబడుట, నిలుపబడుట. అనిరుద్ధః – **న అస్తి నిరోధో యస్య స అనిరుద్ధః** – ఎదురు లేనివాడు అనిరుద్ధుడు.

(డా. క్రోవి పార్థసారథి రచననుండి) సర్వేశ్వరుడు (1) పర (2) వ్యూహ (3) విభవ (4) అంతర్యామి (5) అర్చ అనే అవతారాలుగా ఉంటాడు. 'వ్యూహ' అంటే సృష్టి, స్థితి, లయాలు, శాస్త్రాలు, శాస్త్రార్థాలు, శాస్త్ర ఫలితాలు, ధ్యానము, ఆరాధన, లీల అనే పనులకు తగ్గట్టుగా తన రూపాన్ని, గుణాలను విభజించుకొని లీలావిభూతిని నిర్వహించే రూపము. వ్యూహావతారములు నాలుగు విధములు.

(1) వాసుదేవ వ్యూహావతారము – షడ్గుణ పరిపూర్ణము. పరమపదము.

(2) సంకర్షణుడు – జ్ఞానము, బలము

(3) ప్రద్యుమ్నుడు – ఐశ్వర్యము, వీర్యము

(4) అనిరుద్ధుడు – శక్తి, తేజస్సు.

**వసుభాండాఖ్య భూభాగే నిత్యం సన్నిహిత స్థితః**
**అనిరుద్ధ ఇతి ఖ్యాతో వస్వర్ణో మనురుత్తమః**
వసుభాండము అనే భూభాగంలో జనార్దనుడు అనే అపరనామధేయం గల అనిరుద్ధ స్వరూపుడైన పరమేశ్వరుడున్నాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఉత్తమమైనది. ఓం జనార్దనాయ నమః. ఓం అనిరుద్ధాయ నమః.

**జనార్దనాఖ్యయా దేవస్త్వనిరుద్ధో జగత్ప్రభుః**
**భూభాగే వసుభాండాఖ్యే నిత్య సన్నిహితస్థితః**
అనిరుద్ధుడు జనార్దన రూపంలో ఈ భూమిమీద వేంచేసియున్నాడు.

187వ నామమునకు శ్రీ భట్టులు 'నిరోధింపబడనివాడు' అని వ్యాఖ్యానించారు. భగవంతుని శక్తికి ఎదురు లేదని దుష్టశిక్షణార్థమై ఆయన చేకొన్న అవతారాలలో నిరూపితమయ్యింది. భక్తుల సంరక్షణకై భగవంతుడు అనిరుద్ధుడై భూమిపైకి వస్తాడు.

644వ నామమునకు శ్రీభట్టులు ఇలా వ్యాఖ్యానించారు – వసుభాండము (భూమి)పై భగవానుడు జనార్దనుడై నిత్యము వసించును. కనుక ఆయన అనిరుద్ధుడు.

## 645. అప్రతిరథః

- సాటి లేనివాడు. ఇతనితో పోటీ వేరెవ్వరూ లేరు.

### ఓం అప్రతిరథాయ నమః

**ప్రతిపక్షస్య రాహిత్యాత్ బహ్వనిష్ట జనార్దనః విఖ్యాతోऽప్రతిరథః నవార్ణః శత్రునాశనః -** లోకకంటకులను నశింపజేసే స్వభావం కలవాడు. కాబట్టి విరోధులే లేనివాడు. ఈ నామము నవాక్షరి. శత్రునాశనము చేయును. ఓం అప్రతిరథాయ నమః.

**న ప్రతిరథః సమాన శక్తిమాన్ కోऽపి యస్య ఇతి అప్రతిరథః.** 'ప్రతిరథుడు' అనగా యుద్ధంలో రథానికి ఎదురు నిలిచేవాడు. 'అప్రతిరథుడు' అనగా అలా ఎదురు ఎవ్వరూ లేనివాడు. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం జనార్దనుడిగా (దుష్టశిక్షకునిగా) అవతరించే శ్రీహరికి ఎదురు నిలువగలిగవారు లేరు గనుక ఆయన అప్రతిరథుడు.

శ్రీ శంకరుల భాష్యము – **ప్రతిరథః ప్రతిపక్షః అస్య న విద్యత ఇతి అప్రతిరథః.** ఆయనకు ప్రతిపక్షము (శత్రువులు) ఎవ్వరూ లేరుగనుక ఆయన అప్రతిరథుడు. శ్రీ చిన్మయానంద – భగవానుని కరుణముందు శత్రువుల దౌష్ట్యము నశిస్తుంది. సూర్యుని వేడికి మంచు కరిగినట్లుగా.

**పితాऽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్**
**న త్వత్సమోऽస్త్యభ్యధికః కుతోऽన్యో లోకత్రయేऽప్యప్రతిమప్రభావ!** – గీత 11.43
ఓ అప్రతిమ ప్రభావా! ఈ సమస్త చరాచర జగత్తునకును నీవే తండ్రివి. పూజ్యుడవు. గురుడవు. సర్వశ్రేష్ఠుడవు. ఈ ముల్లోకములందును నీతో సమానుడెవ్వడును లేడు. ఇంక నీకంటె అధికుడెట్లుండును?

## 646. ప్రద్యుమ్నః

- భక్తులయందే ఉండి, వారిని ప్రకాశింపజేయువాడు.
- విశేషమైన ఐశ్వర్యము, సంపద కలిగి భక్తుల ననుగ్రహించువాడు.
- అన్ని కోర్కెలను తీర్చువాడు.
- సాటిలేని బలము కలవాడు.

### ఓం ప్రద్యుమ్నాయ నమః

'ద్యుమ్నము' అనగా సంపద లేదా కాంతి. శ్రీ శంకరులు 'సంపద' అనే అర్థంలో వ్యాఖ్యానించగా, శ్రీ భట్టులు 'కాంతి' అనే అర్థంలో వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆత్మ ప్రద్యోతవాన్ ప్రద్యుమ్నః**. ఆత్మలను ప్రకాశింపజేయువాడు ప్రద్యుమ్నుడు. తిరువళ్ళికేణిలో భగవంతుని ప్రద్యుమ్నుని రూపంలో పూజింపవచ్చునని శ్రీ వి.వి. రామానుజన్ వ్రాశారు. తిరునాఱయూర్ (నాచ్చియార్ కోయిల్) క్షేత్రంలో కూడా భగవంతుని చతుర్వ్యూహ మూర్తులున్నాయి. **ఆత్మ ప్రద్యోతనత్వాచ్చ ప్రద్యుమ్న ఇతి కథ్యతే అధిష్ఠాయ స్థితస్సాక్షాత్ భక్తానాం సుగతిప్రదః -** 'ద్యుమ్నం' అనగా స్వయంగా ప్రకాశించుట. ఇది అపరిమితంగా కలిగినవాడు. ఆత్మలను ప్రకాశింపజేసేవాడు ప్రద్యుమ్నుడు. ఈ నామము భక్తులకు సుగతినిస్తుంది. ఓం ప్రద్యుమ్నాయ నమః.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఒక్కోనామంలోని ధాతువులను పరిశీలించి ఆయా నామములకు వ్యాఖ్యానం వ్రాశారు.ప్ర - ప్రకృష్ట, ఉత్కృష్ట - విశేషమైన, అత్యధిక; ద్యు - కాంతి, ప్రకాశము; మ్న - అభ్యాసే - మరల మరల. శ్రీ వాసిష్ఠ 'మరల మరల' అనే భావానికి ప్రత్యేకమైన స్థానం ఇచ్చారు. భగవంతుడు సూర్యునిగా ప్రతిదినము లోకములను ప్రకాశింపజేస్తాడు. జన్మ జన్మలకు జీవుల ఆత్మలయందుండి ప్రకాశము (చైతన్యము) ప్రసాదిస్తున్నాడు. అనేక అవతారములెత్తి తన వైభవైశ్వర్యములను లోకములందు వ్యాప్తి చేయుచున్నాడు. కనుక ఆయన ప్రద్యుమ్నుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ప్రకృష్టమ్ ద్రవిణమ్ అస్య ఇతి ప్రద్యుమ్నః**. విశేషమైన, అనంతమైన సంపద కలిగినవాడు ప్రద్యుమ్నుడు.

శ్రీ చిన్మయానంద – లక్ష్మీపతియైనందున భగవానుని సంపదలు అనంతములు. ఆయన కొండలంత వరములు కూపెడువాడు. భక్తులకు ఆయురారోగ్యైశ్వర్యములను, సుఖ సంతోషములను, వైభవములను ప్రసాదించు ప్రద్యుమ్నుడు.

ఈ నామము వ్యాఖ్యలలో కూడా శ్రీ శంకరుల మరియు శ్రీ భట్టుల వ్యాఖ్యానములలో దృక్పథ వైవిధ్యాన్ని మనం గమనించవచ్చును. భగవంతుడు తన భక్తులకు ఎలా సహాయపడతాడో శ్రీ భట్టులు వివరించారు. శ్రీ శంకరులు దేవదేవుని పరత్వమును ప్రత్యేకంగా శ్లాఘించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – 'ద్యుమ్నము' అనగా కోరిక అని కూడా అర్థం ఉంది. ప్రద్యుమ్నుడు మనస్సునకు అధిదేవత. ప్రద్యుమ్నరూపంలో భగవంతుడు మన మనస్సులలో కోరికలు కలిగించి సృష్టిపరంపరకు కారణమౌతున్నాడు.

ధర్మచక్రము రచయిత – ఇక్కడ కోరికలు తీర్చడం అనగా భక్తుల మోక్షేచ్ఛ నెరవేరడం. ఆత్మజ్ఞానము, భగవత్సేవ అనేవి అత్యుత్తమమైన కోరికలు. వాటిని తీర్చేవాడు ప్రద్యుమ్నుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'ద్యుమ్నము' అంటే 'బలము' అనే అర్థాన్ని చెప్పారు. **ద్యుమ్నమ్ విత్తమ్ బలేఽపి చ** – అని మేదినీకోశము (1.20.11)లో ఉన్నది. దీని ప్రకారము విశేషమైన, అనంతమైన బలము కలవాడు ప్రద్యుమ్నుడు. **ప్రకృష్టమ్ ద్యుమ్నమ్ బలమ్ యస్య ఇతి ప్రద్యుమ్నః**. శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే భావాన్ని చెప్పారు.

## 647. అమితవిక్రమః

- పెద్ద పెద్ద, కొలువజాలరాని, అడుగులు కలిగినవాడు.
- అమిత బలపరాక్రమములు కలిగినవాడు.

### ఓం అమితవిక్రమాయ నమః

ఈ దివ్యనామము 55వ శ్లోకంలోను, 68వ శ్లోకంలోను కీర్తింపబడినది.

55వ శ్లోకము. 519వ నామము. అమితవిక్రమః – **జీవో వినయితా సాక్షీ ముకుందః అమితవిక్రమః**
68వ శ్లోకము. 647వ నామము. అమితవిక్రమః – **అనిరుద్ధః అప్రతిరథః ప్రద్యుమ్నః అమితవిక్రమః**
'విక్రమ' అన్న పదానికి (1) అడుగు (పదక్రమము) (2) శక్తి లేదా పరాక్రమము అనే రెండు అర్థాలున్నాయి.

519వ నామము 'అమితవిక్రమః' వివరణ –
శ్రీ భట్టులు – 'శక్తి' అర్థములో – భగవంతుడు సకలశక్తిమూర్తి.
శ్రీ శంకరులు – 'శక్తి' మరియు 'అడుగు' అర్థంలో – ఎదురులేని శక్తిగలవాడు మరియు శ్రీవామనమూర్తి.

647వ నామము 'అమితవిక్రమః' వివరణ –
శ్రీ భట్టులు – 'అడుగు' అర్థములో – మూడు లోకాలు ఆయన అడుగులకు చాలవు.
శ్రీ శంకరులు – 'శక్తి' అర్థంలో – సాటిలేని పరాక్రమము కలవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **త్రిలోక్యేऽపి అపర్యవసిత విక్రమత్వాత్ త్రివిక్రమః అమితవిక్రమః**. త్రివిక్రమ (వామన) అవతారంలో మూడులోకాలు ఆయన మూడు అడుగులకు చాలని అమితవిక్రముడు.

శ్రీ వి.వి. రామానుజన్ 'అమిత' అనగా 'అనేక' అనే భావంలో వ్యాఖ్యానించారు. భగవానుడు అనేకమైన పాదములు కలిగియున్నాడు గనుక అమితవిక్రముడు. **సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్** – అని పురుషసూక్తంలో ఉన్నది.

**యామునం జలమాశ్రిత్య దేవదేవః త్రివిక్రమః స్థితః కమలసంభూత నృణాం చ సుగతిప్రదః.** యమునాతీరమున ఉన్నటువంటి త్రివిక్రముడు అమితమైన శక్తిగలాడు. అమితమైన క్రమముగలవాడు. సుగతినిచ్చేవాడు. ఓం అమితవిక్రమాయనమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అమితః అతులితః విక్రమః అస్య ఇతి అమితవిక్రమః. అ-హింసిత విక్రమో వా.** ఆయన బలమునకు ఎదురులేదు. ఎవరూ ఆయనను హింసించలేరు. కనుక ఆయన అమితవిక్రముడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇంతకుముందు నామము 'ప్రద్యుమ్నః'తో ఈ 'అమితవిక్రమః' నామాన్ని అనుసంధించారు. ప్రద్యుమ్నుడు మనసునకు అధిపతి. మనోబలంతో వ్యవహరిస్తాడు. కనుక అమితవిక్రముడు.

శ్రీ చిన్మయానంద – శ్రీమన్నారాయణుడు సర్వశక్తిమంతుడు. కనుక ఆయన విక్రమంతో సాటివచ్చే విక్రమం మరొకటి లేదు.

శ్రీ బలదేవ విద్యాభూషణ బాలకృష్ణుని లీలాపరంగా ఈ నామమును వ్యాఖ్యానించారు. **అతివిక్రమిణామపి చాణూరాదీనామ్ హేలైవ వినాశనాత్ అమితవిక్రమః**. అతిబలవంతులైన చాణూరాదులను కేవలం ఆట లెక్కన నాశనం చేసినవాడు అమితవిక్రముడు.

ఇలా వివిధ వ్యాఖ్యానకర్తల వివిధ భగవదనుభవముల ద్వారా మనకు శ్రీనివాసుని కళ్యాణగుణముల ధ్యానమునందు వైవిధ్యమైన మాధుర్యం లభిస్తున్నది.



## కాలనేమినిహా శౌరిః శూరః శూరజనేశ్వరః |
## త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః || (69)

పాఠాంతరము:

## కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః |
## త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః || (69)

ముందుగా ఈ శ్లోకమునకు వివిధ పాఠములున్నాయని మనం గమనించాలి. మనం ఎంచుకున్న పాఠాన్ని బట్టి 649, 650 నామములు ఇలా వస్తాయి. (1) వీరః, శౌరిః (2) శౌరిః, శూరః (3) శౌరిర్వీరః, వీరఃశౌరి.

### 648. కాలనేమినిహా

- కాలచక్రమునకు అంచు అయిన అవిద్య (అజ్ఞానము)ను విధ్వంసం చేసేవాడు.
- కాలనేమి అనే రాక్షసుని సంహరించినవాడు.
- కాలమునకు అధిపతి అయిన సూర్యునికి మార్గనిర్దేశం చేసేవాడు.
- కాలచక్రమునకు అతీతుడు అయినవాడు.

### ఓం కాలనేమినిఘ్నే నమః

'నేమి' అంటే చక్రమునకు బయటి అంచు (పట్టా). 'నిహనము' అంటే సంహరించుట. కాలచక్రము అవిద్యకు చిహ్నము. అవిద్యను నాశనం చేసే జ్ఞానస్వరూపుడైనందున భగవంతుడు 'కాలనేమినిహా'. ఇందుకు శ్రీ భట్టులు ఉదాహరించిన శ్లోకము –

**అవిద్యాఖ్యా చ యా నేమిః కాలచక్రస్య దుర్ధరా**
**సామయీయం సమాశ్రిత్య విగ్రహమ్ విధునోతి చ**

కాలచక్రమునకు దుర్ధరమైన నేమి (అంచు) అవిద్య. కాని నన్నాశ్రయించినపుడు అది (ఆ చక్రము) తన రూపును కోల్పోవును.

శ్రీ ఎమ్.వి. రామానుజాచార్య –కాలచక్రము అనగా కలిప్రభావమునకు చిహ్నము. భగవంతుడు దివ్యక్షేత్రాలలోను, పుణ్యస్థలాలోను నివాసం ఉండడంద్వారా కలిప్రభావమైన అవిద్యను నాశనం చేస్తాడు. కనుక భగవంతుని నామము 'కాలనేమినిహా'. ఈ నామము గురించి నిరుక్తిలో ఇలా చెప్పారు – **కాలచక్రస్య యా నేమిః అవిద్యాఖ్యా చ దుర్ధరా తాం నాశయతి యశ్చాసౌ కాలనేమినిహాస్మృతః నవాక్షరో మనరయం అవిద్యామూలమోచకః -** కాలము అనే చక్రానికి పట్టా అజ్ఞానము (కలి కల్మషము). అట్టి అజ్ఞానాన్ని విధ్వంసం చేసేవాడు 'కాలనేమినిహా'. ఇది నవాక్షరీ మంత్రము. అవిద్యకు మౌలికమైన కారణాన్ని తొలగిస్తుంది. ఓం కాలనేమిఘ్నే నమః.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – అవిద్య కారణంగా జనన మరణ చక్రంలో పరిభ్రమించడం అంటే కాలచక్రంలో చిక్కుకొనడమే. శ్రీహరిని ఆశ్రయించినట్లయితే ఆయన కర్మబంధాలనుండి విముక్తిని కలిగించి పునర్జన్మ లేకుండా చేస్తాడు. కాలుని (యముని) భయం లేకుండా చేస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కాలనేమిం అసురం నిజఘాన ఇతి కాలనేమినిఘా**. కాలనేమి అనే అసురుని సంహరించినవాడు కాలనేమిఘ్నుడు.

కాలనేమి మారీచుని కుమారుడు. సముద్రుని మిత్రుడు. కాలనేమి కుమార్తె బృంద జలంధరుని వివాహమాడింది. హనుమంతుడు లక్ష్మణ ప్రాణసంరక్షణార్థమై సంజీవనిని తీసుకొనిరావడానికి వెళ్తుండగా అతనికి కాలనేమి ఆటంకం కల్పిస్తాడు. హనుమంతుని చేతిలో కాలనేమి హతుడయ్యాడు. మరల కాలనేమి కంసునిగా జన్మించి కృష్ణునిచేత మరణించాడు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతం (10.51.42 నుండి ఉదాహరించారు – **కాలనేమిః హతః కంసః.** శ్రీ రాధాకృష్ణశాస్త్రి కూడా కంసవధ ఆధారంగా ఈ నామమును వ్యాఖ్యానించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కాల-సమయం, నేమి-చక్రం, హా-వెళ్ళుట. కాలనేమినిహా – కాలచక్రమును నడిపించేవాడు. సూర్యునికి మార్గం చెప్పేవాడు (సూర్యగమనాన్ని నిర్దేశించేవాడు).

శ్రీ చిన్మయానంద – 'సమయం' అనేది మనస్సుకు మాత్రమే అవగతమయ్యే (కల్పించిన) ఒక ప్రమాణం. పరమాత్ముడు దీనికి (మనసుకు, కాలానికి) అతీతుడు గనుక 'కాలనేమిహా'.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు మానవులకిచ్చిన అమూల్యమైన బహుమతి 'సమయం'. ఇది గడిస్తే మళ్ళీ తిరిగిరాదు. కనుక మనకున్న సమయాన్ని భోగలాలసలో వ్యర్థం చేయకుండా, పూర్వకర్మల బంధాలను విముక్తి చేసుకోవడానికి, కొత్త బంధాలు రాకుండా ఉండడానికి వాడుకోవాలి. అలా సమయాన్ని సద్వినియోగం చేసుకొన్నవారు భగవంతుని అనుగ్రహంవలన మోక్షాన్ని పొంది కాలానికే అతీతులౌతారు.

ఉభయదేవేరులతో కూడి పెద్దశేషవాహనంపై ఊరేగుచున్న శ్రీ మలయప్ప స్వామి. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Pedasesha_Vahanam.jpg



## 649. శౌరిః

### వీరః

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం 'శౌరిః' అనే నామం రెండుమార్లు వస్తుంది.

37వ శ్లోకము. 342వ నామము. శౌరిః – **అశోకః తారణః తారః శూరః శౌరిః జనేశ్వరః**

67వశ్లోకములో 'శౌరిః' నామము వచ్చే క్రమం శ్రీ భట్టుల పాఠములోను, శ్రీ శంకరుల పాఠములోను కొంత భేదం కనిపిస్తుంది.

**కాలనేమినిహా <u>శౌరిః</u> శూరః శూరజనేశ్వరః** (శ్రీ భట్టుల పాఠము ప్రకారము)

**కాలనేమినిహా వీరః <u>శౌరిః</u> శూరజనేశ్వరః** (శ్రీ శంకరుల పాఠము ప్రకారము)

కనుక ఎలా చూసినా 'శౌరిః' నామము రెండుమార్లు వస్తుంది. ఇంక 'వీరః' అనే నామము రెండు లేదా మూడుమార్లు వస్తుంది.

43వ శ్లోకము. 402వ నామము. వీరః – **వీరః శక్తిమతాంశ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః**

67వ శ్లోకము. 649వ నామము. వీరః – **కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః** (శ్రీ శంకరుల పాఠము)

70వ శ్లోకము. 64వ నామము. వీరః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరః అనంతో ధనంజయః**

**'శౌరిః' నామమునకు అర్థములు**

- శూరుని పుత్రుడు (వసుదేవుని మరొక పేరు 'శూరుడు')
- శూరుల (యాదవుల) వంశంలో జన్మించినవాడు.
- తిరుక్కణ్ణపురంలోని శౌరిరాజ పెరుమాళ్.

**'వీరః' నామమునకు అర్థములు**

- సదా శౌర్యవంతుడు, విజయము పొందేవాడు.

ఓం శౌరయే నమః

ఓం వీరాయ నమః



తిరుక్కణ్ణపురంలో శ్రీ నీలమేఘ శౌరిరాజ పెరుమాల్ మందిరం. వికీపీడియా చిత్రం. Photo by :Ssriram_mt

**శూరస్య - వసుదేవస్య అపత్యమ్ ఇతి శౌరిః.** వసుదేవునికి శూరుడనే పేరుకూడా ఉంది. ఆ శూరుని సుతుడు శౌరి. **శూరవంశ ప్రాదుర్భావాత్ శౌరిః.** శూరులు (యాదవులలో ఒక శాఖ) వంశమున జన్మించినవాడు శౌరి.

ఉత్పలావర్తక దేశము (తిరుక్కణ్ణపురము)నందు శౌరిరాజ పెరుమాళ్ళుగా వెలసినవాడు శౌరి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **శూరయత ఇతి శౌరిః.** శూరుడైనవాడు శౌరి. లేదా శూరవంశంలో ఘనుడు శౌరి.

శ్రీ శంకరులు 'వీర' అనే నామాన్ని ఇక్కడ గ్రహించారు. తరువాతి నామమును 'శౌరి'గా చెప్పారు. వీరుడు, మహావీర్య సంపన్నుడు 'వీరః'. శూరుని వంశంలో జన్మించినవాడు 'శౌరిః'. వసుదేవుని తండ్రి పేరు శూరుడనికూడా కొన్నిచోట్ల వ్రాశారు.

ధర్మచక్రము రచయిత – మిగిలిన జీవులకు భిన్నంగా మానవులకు రెండురకాల శత్రువులున్నారు. (1) అంతఃశత్రువులు (2) బాహ్య శత్రువులు. వీనిలో అంతఃశత్రువులను జయించడం మరీ కష్టం. కాని వీరుడైనవాడు వెనుదిరగక అంతఃశత్రువులపై పోరాడితే ఆ యుద్ధంలో శ్రీహరి తోడ్పాటు తప్పక లభిస్తుంది.

## 650 శూరః

- శూరుడు.

ఓం శూరాయ నమః

శ్రీ శంకరుల పాఠంలో 69వ శ్లోకం మొదటిపాదం **'కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః'** అని ఉండగా, శ్రీ భట్టుల పాఠంలో **'కాలనేమినిహా శౌరిః శూరః శూరజనేశ్వరః'** అని ఉంది. కనుక శ్రీ శంకరుల పాఠం ప్రకారం 'శూరః' అనే నామం ఒక్కమారు వస్తుంది. అది 37వ శ్లోకంలోనిది (341వ నామము) – **అశోకః తారణః తారః శూరః శౌరిః జనేశ్వరః.** శ్రీ భట్టుల పాఠం ప్రకారం 'శూరః' నామము రెండుమార్లు వస్తుంది.

37వ శ్లోకం. 341వ నామము. శూరః – **అశోకః తారణః తారః శూరః శౌరిః జనేశ్వరః**

69వ శ్లోకము. 650వ నామము. శూరః – **కాలనేమినిహా శౌరిః శూరః శూరజనేశ్వరః**

341వ నామమును భగవంతుని శౌర్యగుణం పరంగాను, 650వ నామమును రామావతారపరంగాను శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ –

341వ నామము. **శూరః** – ఎదురులేని పరాక్రమము కలవాడు.

650వ నామము. **శూరః** – దేశ కాల దిక్ విభాగముల హద్దులు లేనివాడు. భక్తులకు ఎదురులేని వరములిచ్చేవాడు. విశ్వమంతా వ్యాప్తి చెందినవాడు. మిత్రుడు (సూర్యుడు), వరుణుడు, అగ్ని రూపములలో అన్ని సమయములందును తేజరిల్లేవాడు.

## 651. శూరజనేశ్వరః

- శూరులైనవారికి ప్రభువు.

### ఓం శూరజనేశ్వరాయ నమః

**శూర జనానామ్ ఈశ్వరః శూరజనేశ్వరః** – హనుమంతుడు, సుగ్రీవుడు, జాంబవంతుడువంటి మహావీరులకు ప్రభువైన శ్రీరామచంద్రుడు శూరజనేశ్వరుడు.

ఇంద్రాది దేవతలకు ప్రభువైనందున భగవానుడు శూరజనేశ్వరుడని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – చలించేవన్నీ ఆయననుండి ఉద్భవించును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుడు ఇంద్రాది దేవతలకు, అర్జునునివంటి మానవులకు, సుగ్రీవుడు, హనుమంతుడు వంటి వానరులకును ప్రభువు గనుక శూరజనేశ్వరుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – కంసాదులను సంహరించిన శ్రీకృష్ణుడు శూరవంశంలోనివారికి అధిపతి.

## 652. త్రిలోకాత్మా

- భక్తులను అనుగ్రహించడం కోసం మూడు లోకములందు సదా సంచరిస్తూ ఉండేవాడు.
- మూడు లోకములను చలింపజేసేవాడు.
- మూడు లోకములలోను సకలములకును అంతరాత్మ.

### ఓం త్రిలోకాత్మనే నమః

**యస్సాతత్యేన లోకాన్ త్రీన్ భక్తానుగ్రహకామ్యయా గచ్ఛతీతి త్రిలోకాత్మా వస్వర్ణో భూతిదాయకః -** భక్తులను అనుగ్రహించడంకోసం ఎల్లప్పుడు ముల్లోకముందు తిరుగుతుండేవాడు త్రిలోకాత్మ. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఐశ్వర్యప్రదము. ఓం త్రిలోకాత్మనే నమః.

అత – చలించుట (అత సాతత్య గమనే) – అనే ధాతువునుండి 'ఆత్మ' శబ్దం అర్థాన్ని గ్రహించి శ్రీభట్టులు ఈ నామాన్ని వ్యాఖ్యానించారు. **త్రీన్ లోకాన్ అతతి సతతమ్ గచ్ఛతి**. శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (6.9.5)నుండి చక్కని ఉదాహరణ చెప్పారు. అందరికీ అందుబాటులో ఉండడంకోసం శ్రీహరి మూడు లోకాలలోను సదా తిరుగుతూ ఉంటాడట.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ అనుభవాన్ని మరికొంచెం విస్తరించారు. భగవంతుడు త్రిలోకాలలోను తిరగడమే కాదు. మూడు లోకాలలోను ప్రతి చలనానికి చైతన్యానికి కూడా కారణం శ్రీహరియే.

శ్రీ శంకరులు 'ఆత్మ' అనే సామాన్యమైన భావంతో వ్యాఖ్యానించారు. **త్రయాణామ్ లోకానామ్ అంతర్యామితయా ఆత్మా ఇతి త్రిలోకాత్మా.** మూడు లోకములలోను అంతర్యామిగా ఆత్మయైనవాడు త్రిలోకాత్మ. ఇక్కడ ముల్లోకాలంటే భూమి, అధోలోకాలు, ఊర్ధ్వలోకాలు. శ్రీ చిన్మయానంద జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలని చెప్పారు.

**మగధా మండలే విప్రమహామేధ ధరాశ్రితః సంస్థితో లోకనాధాత్మా దేవదేవో జనార్దనః.** మగధ దేశాన ఉన్న త్రిలోకనాధుడు. భక్తులను అనుగ్రహించడానికి ముల్లోకాలకు వెళ్ళేవాడు.

## 653. త్రిలోకేశః

- మూడు లోకములకు ప్రభువు.

### ఓం త్రిలోకేశాయ నమః

**త్రిలోకానామ్ ఈశతయా త్రిలోకేశః.** మూడు లోకములకు ప్రభువైనందున త్రిలోకేశుడు. శ్రీ నమ్మాళ్వారువారి ప్రసిద్ధ పాశురము 'అగల గిల్లేన్' (తిరువైమొళి 6.10.10) ఆయనను మూడులోకములకు అధిపతిగా వర్ణించుచున్నది.

ఈ భావాన్నే శ్రీ శంకరులు మరింత విస్తారంగా తెలిపారు – **త్రయో లోకాః తదాజ్ఞయా స్వేషు స్వేషు కర్మసు వర్తన్త ఇతి త్రిలోకేశః.** మూడు లోకములు ఆయన ఆజ్ఞను అనుసరించి తమ తమ విధులను నిర్వర్తించును. **ఏషా లోకపాల లోకేశః** (కౌషీతకీ 3) – అని శ్రీ రాధాకృష్ణశాస్త్రి శ్రుతులనుండి ఉదాహరించారు.

**శుభమాసాద్య భూభాగం ప్రాగ్జ్యోతిషపురే తథా దేవం విశ్వేశ్వరాఖ్యన్తు స్థితమేత్య స్వగోచరాత్.** ప్రాగ్జ్యోతిషపురాన వేంచేసియున్న విశ్వేశ్వరుడు.

శ్రీ వామన మూర్తి. గుజరాత్ పటాన్ శిల్పాలు. వికీపీడియా నుండి. Photo by Digishagautam
https://commons.wikimedia.org/wiki/File:Sculptures_on_walls_of_rani_ni_vav,_patan.JPG



## 654. కేశవః

- సుందరమైన కేశములు గలవాడు.
- దివ్యసుగంధభరితమైన శిరోజములు గలవాడు.
- బ్రహ్మకును, శివునకును మూలమైనవాడు.
- సూర్యాదుల కిరణములకు కారణమైనవాడు.
- 'కేశి' అనే రాక్షసుని సంహరించినవాడు.
- శత్రువులను పీడించేవాడు.
- సకల జలములపై ఆధిపత్యము కలవాడు.
- (మోక్షముతో సహా) అన్ని సుఖములపై ఆధిపత్యము కలవాడు.

### ఓం కేశవాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

3వ శ్లోకము. 23వ నామము. కేశవః – **నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః**

69వ శ్లోకము. 654వ నామము. కేశవః –**త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః**

'కేశవ' నామమును వివిధ ధాతువులు, శబ్దముల ఆధారంగా వివిధ వ్యాఖ్యాతలు వివరించారు.

కేశ – జుట్టు; కేశ – కిరణము; కమ్ – నీరు; కమ్ – సుఖము; క-అ-ఈశ-వ – త్రిమూర్తులు; క్లిస్ – పీడించుట

**కేశవః క్లేశహా లోకే ద్వైరూప్యేణ క్షితౌ స్థితః మధురాఖ్యే మహాక్షేత్రే వారాణస్యామపి ద్విజ**
క్లేశములను హరించేవాడు కేశవుడు. మధురయందు, వారాణసియందు కలడు.

**శోభనాః కేశా యస్య స కేశవః.** సుందరమైన జుట్టు కలిగినవాడు కేశవుడు. 'కేశములు' అంటే జుట్టు అని సాధారణంగా వాడే పదమే. 'వ' అంటే కేశములను 'సుందరమైనవి'గా ప్రశంసించే ధాతువు **(కేశాద్వోऽన్య తరస్యామ్ ఇతి ప్రశంసాయామ్ వః)** అని శ్రీ భట్టులు వివరించారు. 23వ నామ వివరణలో శ్రీ భట్టులు ఇలా చెప్పారు. సర్వాధిక్యత, దివ్యసౌందర్యము అనేవి భగవంతుని గుణములు. ఆయన **'ప్రశస్త - స్నిగ్ధ - నీల - కుటిల - కుంతలములు'** కలిగియున్నాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఈ అనుభవాన్ని మరికొంత విస్తరించారు. శ్రీ నృసింహమూర్తిగా భగవానుని కేశముల సౌందర్యము ఎనలేనిది. శ్రీరాముని జుట్టు **'శిఖీ కనకమాలయా'** (బంగారపుదండ వంటిది) అని మారీచుడు వర్ణించాడు. బాలకృష్ణుని ముఖము **'కుటిల కుంతలమ్ కోమలాననమ్'** అని గోపికలు వర్ణించారు. శ్రీ శంకరుల భాష్యము ప్రకారము – **అభిరూపాః కేశాః యస్య స కేశవః.** ఆయన దివ్యమంగళ విగ్రహ సౌందర్యము వంటిదే ఆయన కేశ సౌందర్యము.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (7.7.9)లో భగవంతుని కేశ సౌందర్యమును, పరిమళమును వర్ణించారు – ఆయన కేశముల నల్లదనం ప్రళయకాలంనాటి అంధకారంవంటి నల్లదనమని ముందు అనుకొన్నాను. కాని ఆ పోలిక చాలదు. ఆయన కేశ సౌందర్యంతో దేనినైనా పోల్చడం సాధ్యం కాదు. ఆయన జుట్టునుండి వెలువడే తులసి పరిమళం నా ఆత్మను పూర్తిగా వశం చేసుకొన్నది. అది నాకు సంపూర్ణంగా అనుభవైకవేద్యమే.

'వ' అంటే సుగంధము – అనే అర్థంలో కూడా 'కేశవ' నామాన్ని వ్యాఖ్యానించారు. **వాన్తి గంధయన్తి ఇతి వాః కేశః యస్య ఇతి కేశవః.** పరిమళభరితమైన కేశములు కలవాడు కేశవుడు అన్న ఈ వ్యాఖ్య పైన చెప్పిన నమ్మాళ్వారు స్తుతికి సరిపోతుంది.

క-బ్రహ్మ, ఈశ-శివుడు – వీరిద్దరికి మూలమైనవాడు కేశవుడు. ఇందుకు శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడా హరివంశము (3.88.48)నుండి ఉదాహరించారు.

**క ఇతి బ్రహ్మణో నామ ఈశోऽహమ్ సర్వ దేహినామ్ ఆవామ్ తవాంగే సంభూతౌ తస్మాత్ కేశవ నామాన్**
ఈశ్వరుడు ఇలా అన్నాడు – ఓ జనార్దనా! 'క' అంటే బ్రహ్మ. 'ఈశ' అనగా నేను (శివుడను). మేమిద్దరము కూడా నీ శరీరమునుండే ఉద్భవించాము. అందుకే నీవు కేశవుడవనబడుచున్నావు.

నారాయణోపనిషత్తు – సృష్టి ప్రారంభంలో పరమపురుషుడైన నారాయణుడు ప్రాణులను సృష్టించాలని అనుకొన్నాడు. అప్పుడు ముందుగా హిరణ్యగర్భుడు పుట్టాడు. ఆ తరువాత పంచభూతములు నారాయణునినుండే పుట్టాయి. నారాయణునినుండే బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు జన్మించారు. మరీచి, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు జన్మించారు. నారాయణునినుండే అష్ట వసువులు, ఏకాదశ రుద్రులు. ద్వాదశాదిత్యులు, సకల వేదములు ఆవిర్భవించాయి. ఈ రకంగా చరాచర జగత్తంతా నారాయణునినుండే పుట్టింది.

'కేశములు' అంటే 'కిరణములు' అనే అర్థంలో శ్రీ శంకరులు మరొకభావం చెప్పారు. అందుకు మహాభారతం (!2.328.43)నుండి ప్రమాణం చెప్పారు.

**అంశవో యే ప్రకాశంతే మమైతే కేశ సంజ్ఞితాః సర్వజ్ఞాః కేశవం తస్మాత్ మామాహుః ద్విజసత్తమాః**

సూర్యునినుండి వెలువడే కిరణాలు నా అంశలే. కనుక సర్వజ్ఞులైన బ్రాహ్మణులు నన్ను 'కేశవ' అంటారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి విష్ణుపురాణంనుండి మరొక భావం చెప్పారు. అసురుల బాధలనుండి రక్షింపమని బ్రహ్మాది దేవతలు మొరపెట్టుకొన్నపుడు నారాయణుడు తన రెండు కేశములను (ఒకటి తెల్లనిది, మరొకటి నల్లనిది) పెరికిచూపి, ఈ రెండు కేశములు బలరామకృష్ణులుగా సంభవించి భూభారమును తగ్గించునని చెప్పాడు.

**ఏవమ్ సస్తూయమానస్తు భగవాన్ పరమేశ్వరః**
**ఉజ్జహారాత్మనః కేశౌ సిత కృష్ణౌ మహామునే**
**ఉవాచ చ సురానేతౌ మత్కేశా వసుధాతలే**
**అవతీర్య భువోభారక్లేశ హానిమ్ కరిష్యతి** – విష్ణుపురాణము 5.1.59,60

(ఈ శ్లోకానికి అర్థం రెండు కేశములు బలరామ కృష్ణులుగా అవతరించాయని కాదు. అసురులను రూపుమాపడానికి భగవంతుని రెండు కేశములు చాలునని – అని వ్యాఖ్యాత వివరించారు.)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – క్లిస్ - విబాధనే - పీడించుట. **క్లిశ్నాతి, క్లిశ్యతే వా అనేన ఇతి కేశవః.** తన శత్రువులను పీడించేవాడు కేశవుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన మరి రెండు భావములు 'కమ్' అనే ధాతువునకు జలము, సుఖము అనే అర్థాలపై ఆధారపడి ఉన్నాయి. (1) **జలమ్ తమీష్టే ఐశ్వర్య భావాయ ఇతి కేశవః.** జలమునకు అధిపతి కేశవుడు. (2) ఐహిక, ఆముష్మిక సుఖములకు అధిపతి కేశవుడు.

'కేశి' అనే రాక్షసుని చంపినవాడు కేశవుడు. తరువాతి నామము 'కేశిహా' వివరణలో ఈ అర్థము మరింత విపులముగా తెలుపబడింది.

వికీపీడియా చిత్రం. కేశి వధ. 5వ శతాబ్దానికి చెందిన శిల్పం.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Killing_the_Horse_Demon_Keshi.jpg Photo by Claire H.



## 655. కేశిహా

- 'కేశి' అనే రాక్షసుని చంపినవాడు.
- అగ్ని, సూర్య, ఇంద్ర, వాయువు వంటివార్లను వారి కార్యములలో నిర్దేశించువాడు.

### ఓం కేశిఘ్నే నమః

**కేశి నామానామ్ అసురమ్ హతవాన్ ఇతి కేశిహా.** 'కేశి' అనే రాక్షసుని చంపినవాడు 'కేశిహా' (కేశిఘ్నుడు?)

**(శ్రీ ఏల్చూరి మురళీధరరావు భాగవతం రచన నుండి)** బలరామకృష్ణులను వధించడానికి కంసుడు 'కేశి' అనే రాక్షసుని పంపాడు. ఆ కేశి తన రాక్షసమాయతో విపరీతమైన అశ్వరూపం ధరించి అత్యంత భయంకరంగా వ్రేపల్లెలోనికి జొరబడ్డాడు. కృష్ణుడది గ్రహించి సింహనాదం చేస్తూ దానికెదురు నిలిచాడు. ఆ గుఱ్ఱం సకిలిస్తూ కృష్ణునిమీదికి ఉరికింది. నందసూదనుడు గరుత్మంతుడు పామును పట్టుకొన్నట్లుగా దాని వెనుగాళ్ళు రెండూ ఒడిసిపట్టుకొని లాగి

వదలాడు. ఆ వూపుకు మహాహయం అల్లంతదూరాన పడి, మూర్ఛిల్లి, లేచి మళ్ళీ కృష్ణునిపైబడ్డది. యశోదా తనయుడు తన వామభుజాన్ని ఆ తురంగం నోట జొనిపాడు. కొలిమిలో కాలుతున్న ఇనుపకమ్మిని పోలిన ఆ చేయి స్పర్శ తగిలినంతనే ఆ గుఱ్ఱం దంతాలు జలజల రాలాయి. భగవానుని హస్తం క్షణక్షణానికి పెరిగి ఆ గుఱ్ఱపు గొంతు క్రోవిని అడ్డగించింది. ఆ హయం ఊపిరాడక పొట్ట ఉబ్బి బూరటిల్లి చెమరుస్తూ గుడ్లు మిటకరిస్తూ లద్దె విడిచి నేలబడి తన్నుకొని ప్రాణాలు విడిచింది. దాని నోరు దోసపండులా బ్రద్దలయింది. అంత కృష్ణుడు దాని వక్త్రాంతరంనుంచి తన హస్తాన్ని వెలికి తీశాడు. ఆ అద్భుతానికి దివిజులు మహాశ్చర్యమంది ప్రస్తుతిపూర్వకంగా పుష్పవృష్టి కురిపించారు. వ్రేపల్లె మళ్ళీ కళకళలాడింది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వివరణ – హా - వెళ్ళుట; కేశి - కేశములు కలిగినవారు. అగ్ని, సూర్యుడు, వాయువు, ఇంద్రుడు వంటివారు. ఉదాహరణకు అగ్నియొక్క కేశము పొగ. ఇంద్రుని కేశము మెరుపు. యాస్కుని నిరుక్తము (12.24,25)లో వీని వివరణ ఉంది. ఇందుకు ప్రమాణమైన ఋగ్వేదమంత్రము –

**త్రయః కేశినా ఋథా విచక్షతే సంవత్సరే వపత ఏక ఏషామ్**
**విశ్వమేకో అభిచష్టే శచీభిర్ధ్రాజిరేకస్య దదృశే న రూపామ్**
అగ్ని, సూర్య, ఇంద్ర, వాయువులు తమ కర్తవ్యములు నిర్వహించేలా చేసేవాడు గనుక భగవానుడు కేశిహా.

ఇంకా 'కేశి' అనే పదానికి గుఱ్ఱము, హృదయము, ఆత్మ వంటి అనేక అర్థాలున్నాయి. వీని ఆధారంగా శ్రీ సత్యదేవో వాసిష్ఠ పెక్కు వ్యాఖ్యానాలు చెప్పారు.



బృందావనం ఆలయంలో శ్రీ బలరామ కృష్ణుల విగ్రహాలు – వికీపీడియా చిత్రం. By Gaura

## **656.** హరిః

- పచ్చని శరీరచ్ఛాయ కలిగినవాడు.
- తన భక్తుల దుఃఖమును హరించువాడు.
- -సంసారభయమును సమూలముగా నాశనము చేయువాడు.
- ప్రళయకాలమున జగమును హరించువాడు (నాశనము చేయువాడు).

### ఓం హరయే నమః

పచ్చని శరీరఛాయ (హరిత వర్ణము) గలవాడు హరి. భక్తుల దుఃఖములను హరించువాడు హరి. **భక్తానాం దుఃఖహరణాత్ వర్ణశ్చైష్ఠాద్ధరిస్మృతః.** శ్రీ భట్టులు 'పచ్చని వర్ణము' గురించి మహాభారత శ్లోకాన్ని ఉదాహరించారు (శాంతిపర్వము 343.39) – **ఇడోపహూతమ్ ... వర్ణశ్చ మే హరిః శ్రేష్ఠః తస్మాత్ హరిరితి స్మృతః.** నా ఉన్నత వర్ణము హరితము. కనుక నన్ను హరియందురు. తిరుమాలై (2) లోని పాశురము – **పచ్చై మామలై పోల్ మేని.**

శ్రీ అణ్ణాంగారాచార్య చెప్పిన అర్థము – **ఆర్తిగళై హరిప్పవార్.** భక్తుల ఆర్తిని హరించువాడు హరి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – (సంసారమ్) **హరతి ఇతి హరిః** – లేదా – **సహేతుకమ్ సంసారమ్ హరతీతి హరిః.** జననమరణ రూపమైన సంసారాన్ని సమూలంగా నాశనం చేసేవాడు హరి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ప్రళయకాలంలో ప్రపంచాన్ని హరించేవాడు. మనలోని అజ్ఞానాన్ని హరించేవాడు హరి.

**గిరౌ గోవర్ధనాఖ్యేతు దేవః సర్వేశ్వరో హరిః సంస్థితః పూజితః స్థానే.** గోవర్ధన పర్వత స్థానమందు హరియను పేరుతో ఉన్నవాడు. పాపములను హరించువాడు. సంసార సాగరాన్ని దాటించేవాడు. భవబంధాలను త్రెంచువాడు. అవిద్యను హరించేవాడు.

ధర్మచక్రము రచయిత – పచ్చని రంగు మన కంటికి ప్రశాంతత కలిగిస్తుంది. అలాగే హరితచ్ఛాయ కలిగిన దేవుని స్మరణ మన మనసుకు ప్రశాంతత కలిగిస్తుంది. ఏదైనా కార్యానికి ముందుగా హరినామస్మరణం చేస్తే విఘ్నాలు తొలగుతాయి. ఆ కార్యాచరణలో కలిగే పాపాలు నశిస్తాయి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – కలిసంతరణోపనిషత్తు (6.2)లో చెప్పిన ప్రకారం కలికల్మషనాశకమైన దివ్యమంత్రము –

**హరే రామ హరే రామ రామ రామ హరే హరే**

**హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే**





ఎడమ వైపు. తిరుమలలో శ్రీవరాహస్వామి ఆలయం ముందరి చిత్రం.

https://te.wikipedia.org/wiki/ దస్త్రం:Varahaswamy.jpg . Photo by వాడుకరి:S172142230149(బ్లాగేశ్వరుడు)

కుడివైపు. మైసూర్ రాజప్రాసాదం ఆవరణలో శ్రీ శ్వేతవరాహస్వామి ఆలయం.

https://commons.wikimedia.org/wiki/File:Sri_Shveta_Varahaswami_Temple.jpg Photo by User:Pjt56



## కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః |
## అనిర్దేశ్యవపుర్విష్ణుర్వీరోऽనంతో ధనంజయః || (70)

### 657. కామదేవః

- కోరిన కోర్కెలను తీర్చే దేవుడు.
- పురుషార్థముల కొఱకు ఆరాధింపబడువాడు.

**ఓం కామదేవాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **కామాన్ దీవ్యతి ఇతి కామదేవః**. భక్తులు కోరిన కోర్కెలను తీర్చే దేవుడు కామదేవుడు. ఇక్కడ 'దీవ్యతి' అనే పదము దానగుణాన్ని సూచిస్తుంది.ఇందుకు శ్రీ భట్టులు మహాభారతం శాంతిపర్వము (343.39)నుండి తెలిపిన ప్రమాణము – **కామదేవస్తు భగవాన్ సర్వేషామ్ సర్వకామదః.** సర్వ కామితార్థములను ప్రసాదించే భగవానుడు కామదేవుడు.

**శంకరాలయ మాసాద్య సంస్థితోऽప్సరార్చితః.** శంకరాలయము అనే క్షేత్రంలో అందరిచేత (అప్సరసల చేత?) పూజింపబడేవాడు కామదేవుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కామ్యశ్చ ఇతి కామః దేవశ్చ**. కోరబడే దేవుడు. ధర్మార్థకామమోక్షములనే చతుర్విధ పురుషార్థములను కోరేవారు ఈ దేవుడిని కోరుతారు. తన సౌజన్య సుందర రూపము చేతను, సకల విభూతి సంపదలతో నిండియున్నందునను, లోకమునందు అందరిచేతను ప్రేమింపబడువాడు, పూజింపబడువాడు, కీర్తింపబడువాడును శ్రీహరియే అగుటచేత కామదేవుడని ప్రకీర్తింపబడెను. (శ్రీ పెమ్మరాజు రాజారావు రచన నుండి)

ధర్మచక్రము రచయిత – కామములు (కోరికలు) ధర్మబద్ధమైనవి, మరియు ధర్మవిరుద్ధమైనవి అని రెండు విధములు. ధర్మవిరుద్ధముకాని కోరిక తానేనని గీతలో భగవానుడు అన్నాడు. కామదేవుని ధ్యాన పూజాదుల వలన ధర్మబద్ధమైన కోరికలు సాధించుకొంటూ క్రమంగా సంసారబంధాలు అధిగమించవచ్చును.

### 658.కామపాలః

- తానొసగిన కామితార్థములను తానే కాపాడువాడు.
- తనను కోరుకునేవారిని రక్షించేవాడు.

**ఓం కామపాలాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామము 'కామదేవః' అనగా కోరిన కోర్కెలు తీర్చేవాడు. ఇప్పుడు 'కామపాలః' అనగా అలా తాను ఇచ్చినవానిని తానే కాపాడువాడు. **స ఏవ దత్తా** (కామాన్) **అనుపాలనాత్ కామదేవః.**

గౌడీయ సంప్రదాయానువర్తియైన శ్రీమత్ బలదేవ విద్యాభూషణ – **కేశి వధేన తేషా కామమ్ అభిలాషమ్ పాలయతి పూరయతి ఇతి కామపాలః**. కేశి అనే రాక్షసుని సంహరించడంద్వారా వారి (దేవతల) కోరికలు, అభిలాషలను పూరించినవాడు కామపాలుడు.

శ్రీ చిన్మయానంద – 'కామా' అనగా భగవంతుని కోరుకొనేవారు. తనను కోరేవారిని రక్షించేవాడు కామపాలుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య (?) – ధర్మబద్ధములగు కోరికలను తీర్చువాడు కామపాలుడు.

## 659. కామీ

- కావలసినవన్నీ కలిగియున్నవాడు.
- పూర్ణకాముడు. కోరికలు లేనివాడు.

### ఓం కామినే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – కావలసినవన్నీ కలిగియున్నవాడు కామి. పుష్కలముగా అన్నీ కలిగియున్నందున తన భక్తులకు ఏదైనా ఈయగలవాడు అని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పూర్ణకామ స్వభావాత్.** కోరికలన్నీ సిద్ధించినందున ఆయన కామి. **అవాప్త సర్వకామాన్.**

**ప్రదేయాతిశయాత్కామీ** – ఇవ్వదగిన వస్తువులు తనవద్ద ఎక్కువగా కలవాడు కామి.

**కామాః అస్య సంతీతి కామీ** – పురుషార్థములను అధికంగా ఇచ్చేవాడు కామి.

## 660. కాన్తః

- కమనీయ సమ్మోహన స్వరూపుడు.
- పరార్థమున (మహాప్రళయమున) సృష్టికర్తయైన బ్రహ్మ కూడ అంతమగునట్లు చేయువాడు.
- అన్నియెడలా ఉండి ప్రకాశించువాడు.

### ఓం కాన్తాయ నమః.

ఈ నామము ఇంతకుముందు 32వ శ్లోకంలో వచ్చింది.
32వ శ్లోకము. 297వ శ్లోకము. కాన్తః – **కామహా కామకృత్ కాన్తః కామః కామప్రదః ప్రభుః**
70వ శ్లోకము. 660వ నామము. కాన్తః **– కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య **– స ఏవ స్వయమేవ కమనీయః కాన్తః.** తానే స్వయముగా సౌందర్య సౌకుమార్యాది రూపగుణముల కారణంగా కమనీయమ్మైనవాడు కాంతుడు. శ్రీ నమ్మాళ్వార్ తిరువైమోళి (7.17)లో **'పరుగు ఇన్నముదే'** అని సంబోధించారు. దేవతలు అమృతంకోసం క్షీరసాగరాన్ని చిలికారు. కాని శ్రీ నమ్మాళ్వారు నేరుగా భగవంతునే త్రాగివేయకోరాడు. ఎందుకంటే ఆయనే అమృతస్వరూపుడు. శ్రీ కులశేఖరాళ్వారు పెరుమాళ్ తిరుమోళిలో ఇలా అన్నారు – తిరుక్కణ్ణపురంలో ఆయనను దర్శించుకొన్నవారు పరవశులై ఆయన సౌందర్యానికి దాసులవుతారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కస్య బ్రహ్మణః అంతః అస్మాత్ ఇతి కాన్తః.** 'క' అనగా బ్రహ్మ. సృష్టికర్త. అటువంటి బ్రహ్మ ఆయుఃకాలాంతంలో, పరార్థం చివర, 10 లక్షల కోట్ల సంవత్సరాలలో – బ్రహ్మనుకూడ లయము చేయవాడు కాంతుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'కాంతి' అనగా ప్రకాశము (కని – దీప్తి కాంతి గతిషు) అనే అర్థంలో, అన్నిచోట్లా ఉండి అంతటా ప్రకాశించేవాడు కాంతుడు.

## 661. కృతాగమః

- పవిత్ర మంత్రాలను మంత్రద్రష్టలకు తెలిపినవాడు.
- పాంచరాత్రాగమమును ఉపదేశించినవాడు.
- శ్రుతులను, స్మృతులను ప్రసాదించినవాడు.
- ఆయననుండి కృతయుగము ఆవిర్భవించింది.
- కేశిని వధించి, విజయంతో గోపకులంలో ప్రవేశించినవాడు.
- వారు కోరిన రూపాలలో మరల మరల భక్తులకు దర్శనమిచ్చేవాడు.
- బౌద్ధ, జైన ఆగమములను బోధించినవాడు (795వ నామమునకు, బుద్ధావతార పరంగా వ్యాఖ్య)

### ఓం కృతాగమాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

70వ శ్లోకము. 61వ నామము. కృతాగమః – **కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః**

84వ శ్లోకము. 795వ నామము. కృతాగమః – **ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – స్వచ్ఛమైన మనస్సు కలిగినవారికి, అనగా మంత్రద్రష్టలకు, మంత్రములను ప్రకటించినవాడు కృతాగముడు. మంత్రము అనగా భగవంతుని స్వరూపమే.

**మంత్రవిద్యా వ్యంజకత్వాత్ కృతాగమః** – అనేకమైన మంత్రవిద్యలను ప్రకటించినవాడు కృతాగముడు.

**కృతః ఆగమః యేన సః కృతాగమః** – మంత్రవిద్యను ఉపదేశించినవాడు.

**నానామంత్రమయీం దివ్యం వ్యంజయత్వమాత్మానాం** – అనేక విధాలైన మంత్రములను ప్రవచించినవాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **కృతో విరచిత ఉపదిష్టో వా ఆగమః పాంచరాత్ర శాస్త్రమ్ యేన ఇతి కృతాగమః.**పాంచరాత్రాగమమును ఉపదేశించినవాడు కృతాగముడు.

వైష్ణవాగమములు 4 విధములు (1) వైఖానసము (2) పాంచరాత్రము (3) ప్రతిష్ఠాసారము (4) విజ్ఞాన లలితము. మహాభారతము శాంతిపర్వములోని నారదీయాశ్వాసము మనకు పాంచరాత్రం గురించి లభిస్తున్న మొట్టమొదటి ప్రస్తావన. శ్రీమన్నారాయణుని పర, వ్యూహ అవతారముల గురించి పాంచరాత్రాగమంలో ఉన్నది. యజ్ఞాదులకు బదులుగా అర్చామూర్తి అర్చన పాంచరాత్రంలో ప్రధానవిషయం. పాంచరాత్రము ప్రకారము భగవంతుడు ఐదు రూపాలలో ఉంటాడు –

(1) పరరూపము – పరబ్రహ్మము, పురుషోత్తముడు, పరవాసుదేవుడు (వ్యూహవాసుదేవుడు అనగా పరవాసుదేవుని ఒక స్వరూపము). యోగులు ధ్యానంలో దర్శించేది పరరూపము. నిరాకార, ఆదిమధ్యాంత రహిత సచ్చిదానంద పరబ్రహ్మముయొక్క ఒక రూపము పరరూపము.

(2) వ్యూహరూపము లేదా వ్యూహావతారములు – శ్రీలక్ష్మీనారాయణుల గుణగణములు ప్రకటితమైన నాలుగు వ్యూహములు

వాసుదేవుడు – ఆరు గుణముల పరిపూర్ణమూర్తి

సంకర్షణుడు – జ్ఞాన, గుణ బల సంపన్నుడు.

ప్రద్యుమ్నుడు – ఐశ్వర్య, వీర్య గుణసంపన్నుడు.

అనిరుద్ధుడు – శక్తి, తేజో బలసంపన్నుడు.

అంటే సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు కేవలం రెండేసి గుణాలు మాత్రం కలిగి ఉంటాయని కాదు. ప్రతివ్యూహమూ వాసుదేవవ్యూహ సమానమే. కాని, ఆయా వ్యూహాలలో రెండేసి గుణాలు ప్రత్యేకంగా ప్రకటితమౌతాయి.

(3) అవతార రూపములు లేదా విభవమూర్తులు – ఈ అవతారములు అనిరుద్ధ వ్యూహమునుండి, లేదా వాసుదేవ వ్యూహమునుండి లేదా మూడు వ్యూహములనుండి ప్రభవించును.

(4) అంతర్యామి అవతారము – హృదయపద్మములో స్థితుడైయున్న అనిరుద్ధుడు.

(5) అర్చావతారము – పాంచరాత్ర విధానము ప్రకారము ప్రతిష్ఠింపబడిన అర్చామూర్తి సాక్షాత్తు విష్ణువు అవతారమే (కేవలం ప్రతిమ కాదు).

పాంచరాత్రాగమము ప్రకారము భగవంతునికి ఆరువిధములుగా ప్రపత్తి చేయవచ్చును.

(1) ఆత్మ నిక్షేపము (న్యాసము) – భగవంతునకు సంపూర్ణముగా శరణాగతి చేయుట. అంతా భగవంతుని అధీనంలో ఉందని తెలుసుకోవడం.

(2) కార్పణ్యము – తన అజ్ఞానమును, మాలిన్యమును గుర్తెరిగి, విధేయులైన దాసులగుట.

(3) మహావిశ్వాసము – భగవంతునిపట్ల, అతని రక్షణ పట్ల అచంచలమైన విశ్వాసము.

(4) గోప్తృత్వము – కేవలం శ్రీమన్నారాయణుడే సంపూర్ణ రక్షకుడని, ఆయన తప్పక మనలను కాచునని నమ్మకము.

(5) ప్రాతికూల్య వివర్జన – భగవంతునికి, ఆయన సృష్టికి కష్టం కలిగించే పనులను చేయకుండా ఉండడం.

(6) అనుకూల్య నిశ్చయము – సకల జీవులకు హితం చేయాలన్న నిశ్చయము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'ఆగమములు' అనగా శృతులు, స్మృతులు. కృతాగముడు అనగా శృతులకు, స్మృతులకు ఆద్యుడు. **శృతి స్మృతీ మమ్మైవాజ్ఞే** – అని భగవంతుని మాటలనే శ్రీ శంకరులు ఉదాహరించారు. శ్రీ విష్ణు సహస్రనామము ఉత్తరపీఠికలో – **వేదాః శాస్త్రాణి విజ్ఞానమేతత్ సర్వం జనార్దనాత్** – అని ఉంది.

శ్రీ అణ్ణాంగారాచార్య – దివ్యప్రబంధము పెరియతిరుమొళి (2.8.5)లో ఇలా ఉన్నది – ఆయన ఎనలేని దయతో దేవతలకు, మానవులకు వేదాలను, వేదాంత సూత్రాలను, ఇతిహాసాలను, కల్పసూత్రాలను, వ్యాకరణాన్ని, మీమాంసను, ఇత్యాదులను ప్రసాదించాడు.

శ్రీ చిన్మయానంద – కృతయుగమునకు మూలము కృతాగముడు. మహాప్రళయంలో అన్నీ లయమైపోగా మరల కృతయుగంతో సృష్టి ఆరంభమౌతుంది. (ఇంతకు ముందు నామము 'కాంతః' అనగా బ్రహ్మకు కూడా అంతమైనవాడు అన్నఅర్థాన్ని గమనింపనగును).

శ్రీ బలదేవ విద్యాభషణ – కృ-హింసాయాం -చంపుట; గమ్-గతౌ - వెళ్ళుట; కేశి అనే రాక్షసుని సంహరించిన పిదప చిన్నికృష్ణుడు విజయంతో గోకులంలోని బంధుమిత్రుల పరివారంలోనికి ప్రవేశించాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కృ-కరణే - చేయుట; గమ్-గతౌ - వెళ్ళుట; **కృత ఆగమో యేన స కృతాగమః.** తన భక్తులు తనను స్తుతించినపుడు మరల మరల వారు కోరిన రూపాలలో వారికి దర్శనమిచ్చేవాడు. ఇందుకు ఆయన ఉదాహరించిన ఋగ్వేద మంత్రము (8.3.13,14)

**కదు స్తువంతర్తయన్త దేవతాఋషిః కో విప్రా ఊహతే**
**కదా మఘవన్ ఇంద్రసువన్తః కదుస్తువన్తః ఆగమః**
నిన్ను ఎలా స్తుతించాలి? ఎలా స్తుతిస్తే నువ్వలా ప్రత్యక్షమౌతావు.

ధర్మచక్రము రచయిత – ఆగమములు, వేదములు వంటి దర్శనములు భగవంతునిచే స్వయముగా ప్రసాదింపబడినవి. వాటిద్వారా జ్ఞానాన్ని పొంది భగవంతునివైపు ప్రయాణం సాగింపవచ్చును.

బలభద్రుడు, సుభద్ర, జగన్నాధుడు. వికీపీడియా చిత్రం.



## 662. అనిర్దేశ్యవపుః

- నిర్ణయింప జాలని, వర్ణింప వీలుకాని శరీరము కలవాడు.
- యుగములకు తగిన శరీరము ధరించి అవతరించేవాడు.
- సృష్టికి బీజము వేయువాడు.

### ఓం అనిర్దేశ్యవపుషే నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.
19వ శ్లోకము. 179వ నామము. అనిర్దేశ్యవపుః – **అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్**
70వ శ్లోకము. 662వ నామము. అనిర్దేశ్యవుః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరోऽనంతో ధనంజయః**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ నిర్వచనము – **న నిర్దేశితుమ్ శక్యమ్ వపుః యస్య ఇతి అనిర్దేశ్యవపుః.** మనసుకు, మాటలకు అందని శరీరము కలవాడు.

19వ శ్లోకము, 179వ నామము వ్యాఖ్యానములో శ్రీభట్టులు మౌలసంహితనుండి ఉదహరించారు. మన శరీరాలు పంచభూతాలు, మహత్, అహంకారములతో నిర్మిమయ్యాయి. మనకు బుద్ధి, మనసు, శరీరము, అవయవాలు ఉంటాయి. మరి భగవానుని శరీరం దేనితో చేయబడింది? ఇందుకు జవాబు – భగవానుని శరీరం భగవానుని శరీరం చేతనే చేయబడింది. మరేమీ కాదు. కనుక ఆయన శరీరాన్ని వేరే దేనితోనూ వర్ణించలేము. అనగా ఆయన అనిర్దేశ్యవపుషుడు. ఆయన శరీరం జ్ఞానస్వరూపం, ఈశ్వర స్వరూపం, శక్తి స్వరూపం. అన్నిప్రక్కలా ప్రకాశిస్తున్న వస్త్రం లాంటిది. అన్ని విధాలా మధురమైన తేనెలాంటిది. అన్నిదిశలా వెలుగుతున్న బంగారంలాంటిది. లోనా బయటా అన్నివైపులా సుందరమైన సౌధంలాంటిది. భగవానుడు సంపూర్ణ ఈశ్వరస్వరూపుడు. ఆయన ఏది కావాలనుకుంటే అది అవుతాడు. ఇలా ఎన్ని విధాలుగా చెప్పుకుంటూ వెళ్ళినా ఆయనను వర్ణించేందుకు ఉపమానాలు చాలవు. ఎందుకంటే ఆయన అనిర్దేశ్యవపుషుడు.

శ్రీ భట్టులు విష్ణుపురాణము (1.2.10-12)నుండి కూడా ఉదాహరించారు – ఆయన మన ఇంద్రియాల జ్ఞానానికి అతీతుడు. సర్వోత్తముడు. పరమాత్ముడు. స్వయంభువు. రూపవర్ణాది గుణములకు అతీతుడు. జననము, మార్పు, క్షీణత, అంతము వంటివానికి లోబడని కాలాతీతుడు. అంతటా ఉండేవాడు. అన్నీ ఆయనలోనే ఉంటాయి.... **వర్జితః శక్యతే వక్తుమ్ యః సదా అస్తి**

**ఇతి కేవలమ్** – ఆయన ఎల్లప్పుడూ ఉంటాడని మాత్రం చెప్పి, ఆయనను వర్ణించడం మనవల్ల కాదని చెప్పుకొని ఊరుకోవడం తప్పితే మనం చేయగలిగినదేమీ లేదు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **అనిర్దేశ్యమ్ పరమ సుఖమ్** (కఠోపనిషత్తు 2.2.14) – ఆయనను ఎరిగినవారు ఆయనను వర్ణించడానికి మాటలు చాలవని సరిపెట్టుకొంటారు.

శ్రీ వి.వి. రామానుజన్ ఉదారించిన ఆళ్వారుల పాశురాలలో ఇది చక్కగా తెలుస్తుంది. శ్రీ తిరుమంగైయాళ్వార్ – తిరునేడుంటాండకం 3 – తన సృష్టిపట్ల ఆయన కరుణ అపారమైనది. నిండుగా నీటిని మోస్తున్న మేఘాలవలె నల్లని రంగు గలవాడాయన. త్రేతాయుగంలో ఆయనరంగు ఎరుపు. కృతయుగంలో శంఖంలాంటి తెలుపు. ప్రతియుగంలోను భక్తులు ఆయన అవతరించిన రూపంలో ఆయనను అర్చింపవచ్చును. అంతేకాని ఆయన అసలురూపం ఏమిటో తెలియదు. ఈ నీలమేఘశ్యాముని, ఈ అరుణనేత్రుని భక్తులు తమకు ఇచ్చవచ్చినరీతిలో వర్ణిస్తారు. కాని ఆయన నాకు ప్రత్యక్షమైన రూపాన్ని ఎవరూ వర్ణించలేరు.

శ్రీ నమ్మాళ్వార్ – (తిరువైమొళి 8.8.2) ఇదీ ఇదీ అని వర్ణించే గుణం కాదు ఆయనది. (తిరువైమొళి 1.6.3) ఆయనకంటె ఉన్నతమైనది గాని, సమమైనదిగాని ఏదీ లేదు. (పెరియతిరుమొళి 8.1.2) ఆయనకు పోలిక ఏదీ లేదు. (తిరువైమొళి 6.3.9) తిరువిణ్ణాగరంలోని ప్రభువు **'తాన్ ఒప్పార్ ఇల్ అప్పన్'**. తిరువైమొళి 3.8.8లో కూడా ఇదే భావం ఉంది. మహానుభావులైన ఆళ్వారులు తమకు కలిగిన దివ్యమైన అనుభవాలను మాటల్లో చెప్పలేకపోవడం ఇలా అనేక సందర్భాలలో దివ్యప్రబంధాలలో చూడవచ్చును.

తైత్తరీయోపనిషత్తు ఆనందవల్లి 4 – **యచో వాతే నివర్తన్తే అప్రాప్త మనసా సహ** – ఆయనను మాటలతోను, మనసుతోను తెలుసుకొనలేము. అనుభవంద్వారా మాత్రమే తెలిసికొనవచ్చును.

కేనోపనిషత్తు 1.5-9 – బ్రహ్మముద్వారా వాక్కు సాధ్యమగుచున్నది. కాని మాటలద్వారా బ్రహ్మమును వర్ణించడం సాధ్యం కాదు. బ్రహ్మమువలన మనకు చూపు లభిస్తున్నది. కాని బ్రహ్మమును చూడలేము.

ఈశావాస్యోపనిషత్తు 4.5 – ఆత్మ మనసుకంటె వేగమైనది. కనుక మనసుకు అందదు. ఇంద్రియాలద్వారా తెలియరానిది. అది చలిస్తుంది కాని నిశ్చలమైనది. అజ్ఞానులకు దూరంగా ఉంటుంది. జ్ఞానులకు అందుబాటులో ఉంటుంది. అది లోపల, బయట ఉంటుంది.

ప్రస్తుత (662వ)నామం వివరణలో భగవంతుడు యుగానుసారం వివిధరూపాలలో అవతరిస్తాడని వివరించారు. **యుగానుసారి రూపత్వాత్ అనిర్దేశ్యవపుః**. ఆయా యుగములకు తగిన శరీరం ధరించి అవతరించేవాడు. కనుక ఆయన శరీరం ఇది అని చెప్పలేము. సోమకుని సంహరించడానికి చేప అయినాడు. క్షీరసాగరమథన సమయంలో శ్రీకూర్మరూపం ధరించాడు. శ్రీవరాహమూర్తియై భూమిని ఉద్ధరించాడు. శ్రీరాముడై రావణుని అంతమొందించాడు. మరియు సృష్టిలోని అన్ని రూపములు ఆయనవే. అతని రూపం ఇది అని చెప్పజాలము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ రెండు అర్థాలు చెప్పారు – (1) శ్రీహరి విరాట్ స్వరూపుడు. జననము, వృద్ధాప్యము, అంతము లేనివాడు. అంతటా లోపల, బయట వ్యాపించినవాడు. అందరిలోను ఉన్నవాడు. ఇదే ఆయన అనిర్దేశ్య వపుత్వము (2) వప్-బీజ సంతానే ఛేదనే చ – విత్తుట – అనిర్దేశ్యమైన అనగా తెలియరానివాడు మరియు సృష్టికి విత్తనం వేయువాడు. అనిర్దేశ్యవపుషుడు.

## 663. విష్ణుః

- అంతటా వ్యాపించియున్నవాడు.

**ఓం విష్ణవే నమః.**

ఈ పుణ్యదివ్యనామము ఈ స్తోత్రములో మూడుమార్లు చెప్పబడినది.
1వ శ్లోకము. 2వ నామము. విష్ణుః – **విశ్వమ్ విష్ణుః వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః**
28వ శ్లోకము. 259వ నామము. విష్ణుః – **వృషాహీ వృషభో విష్ణుః వృషపర్వా వృషోదరః**
70వ శ్లోకము. 663వ నామము. విష్ణుః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరోఽనంతో ధనంజయః**

**విష్ణు సంపూజనాన్నిత్యం సర్వం పాపం ప్రణశ్యతి** – విష్ణువనగా సర్వాంతర్యామి. సర్వవ్యాపకుడు. విష్ణువును పూజిస్తే సకల పాపములు నశిస్తాయి.

**స్వశక్త్యా జగతో వ్యాప్తే యద్వా విక్రమణాత్స్వతః విష్ణుః స్మృతో విశేషణః** – స్వశక్తి చేతనే ప్రపంచమంతా వ్యాపించియుండువాడు. ముల్లోకములు ఆక్రమించినవాడు.

**వేవేష్టి వ్యాప్నోతి విష్ణుః** – లోకమంతా వ్యాపించినవాడు.

**యస్మాద్విష్టమిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః తస్మాత్ స ప్రోచ్యతే విష్ణుః విశేర్ధాతోః ప్రవేశనాత్ .** ఆ మహనీయుడు తన శక్తిచేతనే ఈ జగత్తంతా వ్యాఫించియున్నాడు. అతడే విష్ణువు (ఆదిత్య పురాణము). 'విశ్' అనే ధాతువునకు 'ప్రవేశము'అనే అర్థమున్నది.

**వ్యాప్య మే రోదసీ పార్థ కాంతిరభ్యధికా స్థితా**
**క్రమణాద్వాప్యహం పార్థ విష్ణురిత్యభి సంజ్ఞితః** – మహాభారతము. శాంతిపర్వము.
అర్జునా! భూమ్యాకాశాలు వ్యాపించినదై, నా వైభవము మిక్కిలి అధికమై ఉన్నది. రెండు అడుగులలో భూమ్యాకాశాలు ఆక్రమించాను. ఈ విధంగా నన్ను విష్ణువంటారు.

(డా. క్రోవి పార్థసారధి రచన 'శ్రీకైవల్య సారధి'నుండి) మహానారాయణోపనిషత్తులో బ్రహ్మ ఇలా శ్రీమహావిష్ణువును స్తుతించాడు – దేవదేవా! పరమతత్వరహస్యాన్ని వివరించేవారు నీకన్న మరొకరు లేరు.

నీవే సర్వజ్ఞుడవు. నీవే సర్వ శక్తివి. నీవే సర్వాధారుడవు. సర్వ స్వరూపుడవు. నీవే సర్వేశ్వరుడవు. నీవే సర్వప్రవర్తకుడవు. నీవే సదసదాత్మకుడవు. నీవే అంతర్ బహిర్ వ్యాపకుడవు. సూక్ష్మాతిసూక్ష్మమైనవాడవు. మహత్తులన్నింటిలోకీ మహత్ అయినవాడవు. నీవే మూలవిద్యవు. నీవే విద్యాధారకుడవు. నీవే విద్యావేద్యుడవు. విద్యాతీతుడవు. సర్వకారణ కారకుడవు నీవే. సర్వకారణ వ్యష్టి సమిష్టికుడవు నీవే. అఖండానందుడవు. పరిపూర్ణుడవు. నిరతిశయానందుడవు. తురీయుడవు. నీవే అఖిలశాస్త్ర విదుడవు. నీవే బ్రహ్మవు. నీవే రుద్రుడవు. సర్వదేవతా స్వరూపము నీవే. సర్వ ఆగమముల సారము నీవే. అమృతమయుడవు. సర్వప్రపంచము నీవే. మోక్షము నీవే. మోక్షసాధనము కూడా నీవే. సర్వప్రాణి స్వరూపడవు. నీవే సర్వవ్యాపివి.

## 664. వీరః

- వీరుడు. శక్తిమంతుడు.
- భక్తుల హృదయాలలోనికి వేగంగా ప్రవేశించేవాడు.

- ఆయన ఎదుట శత్రువులు పారిపోతారు.

ఓం వీరాయ నమః

ఈ స్తోత్రంలో 'వీరః' నామము రెండు లేదా మూడుమార్లు వస్తుంది.

43వ శ్లోకము. 402వ నామము. వీరః – **వీరః శక్తిమతాంశ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః**

67వ శ్లోకము. 649వ నామము. వీరః **– కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః** (శ్రీ శంకరుల పాఠము ప్రకారము)

70వ శ్లోకము. 64వ నామము. వీరః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరః అనంతో ధనంజయః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – 'అజ' అనే ధాతువునకు 'గతి క్షేపణయో' అనగా నడిపించుట, ప్రయోగించుట, చొనుపుట అనే అర్థాలున్నాయి (అష్టాధ్యాయి 2.4.56) ప్రకారం). కొన్నిచోట్ల 'అజ' ధాతువునకు బదులు 'వీ' ధాతువును వాడవచ్చును. తన భక్తుల శత్రువులను నాశనం చేయడానికి భగవంతుడు తన వీరత్వమును ప్రయోగిస్తాడు. **రక్షాం అతిభయ చలన హేతుత్వాత్ వీరః.** అని శ్రీ భట్టులు అన్నారు. అనగా భగవంతుడు తన భక్తులను రక్షించడానికి వారి శత్రువులను భీతావహులను చేస్తాడు. ఇక్కడ కూడా భగవంతుని భక్తవాత్సల్యం చెప్పబడింది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ –**వీరయతే ఇతి వీరః. రిపు దమనాయ విక్రమతే. వీరస్యా సాధు దుఃఖహా.** సజ్జనులను బాధించేవారిని తన చక్రాయుధంతో నశింపజేస్తాడు**. అజతి క్షిపతి హినస్తీతి వీరః.**

**ఆజ్ఞా ప్రతీక్ష కేనైవ** గదా **చక్రద్వయేన తు ప్రేరితేన హినస్త్యాశు సాధు సత్తమ కారిణః**

తన ఆజ్ఞ కోసం ఎదురు చూసే చక్రాది ఆయుధములు ప్రయోగించి సాధువులను హింసించేవారిని సంహరించేవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వీ గత వ్యాప్తి ప్రజన కాంత్యసన ఖాదనేషు.** 'వీ' అనే ధాతువునకు గతి (గమనము), వ్యాపించుట, జననము, కాంతి, పారద్రోలుట, భుజించుట అనే అర్థాలున్నాయి. ఇలాంటి గుణములు ఉన్నందున (గత్యాదిమత్వాత్) ఆయన వీరుడయ్యాడు. ఆయన ఎంతో వేగంగా భక్తుల హృదయాలలో ప్రవేశిస్తాడు. ఎంతో వేగంగా భక్తుల శత్రువులను నాశనం చేస్తాడు. ఈ గుణానుభం శ్రీనరసింహావతారాన్ని స్మరిస్తే అర్థమవుతుంది. అంతే కాకుండా ఆయన అంతటా వ్యాప్తిచెందియున్న తేజోమయుడు. ప్రళయకాలంలో జగత్తునంతటినీ భుజిస్తాడు.

అమరకోశంలో చెప్పబడిన అర్థాలు – **విరుద్ధాన్ రాతి హన్తి ఇతి వీరః.** శత్రువులను నాశనం చేయువాడు వీరుడు. **విద్విష్టాన్ ఈరయతి ఇతి వీరః.** శత్రువులు భీతులై తమ వెన్ను చూపిస్తూ పారిపోయేలా చేసేవాడు వీరుడు.

ధర్మచక్రము రచయిత – బాహ్యశత్రువులకంటె అంతఃశత్రువులను జయించడానికి ఎక్కువ బలం (వీరత్వం) కావాలి. వీరుడైన భగవంతుని ధ్యానించి కామ, క్రోధ, లోభ, మోహ, భయాదులను జయించవచ్చును.

## 665. అనంతః

- అంతము లేనివాడు.
- దేశ కాలాదులచేత, మరి దేనిచేతను పరిచ్ఛిన్నుడు కానివాడు.
- ఎవరికీ అంతు తెలియని గుణసంపన్నుడు.
- పరిశుద్ధమైన మనసు లేనివారికి అందరానివాడు.

ఓం అనంతాయ నమః

70వ శ్లోకము. 665వ నామము. అనంతః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరః అనంతో ధనంజయః**

95వ శ్లోకము. 889వ నామము. అనంతః (శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము) – **అనంతః హుతభుక్ భోక్తా సుఖదో నైకదోఽగ్రజః**

శ్రీ వైష్ణవులు నిరంతరం స్మరించే మూడు నామములలో – **అచ్యుత, అనంత, గోవింద** నామములలో – ఇది ఒకటి.

**ఈ 665వ నామమునుండి 683వ నామమువరకు భగవంతుని అనంత విభూతులను తెలిపే నామములుగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు**. ఆ నామములు –

**అనంతః, ధనంజయః, బ్రహ్మణ్యః, బ్రహ్మకృత్ బ్రహ్మా, బ్రహ్మ, బ్రహ్మవివర్ధనః, బ్రహ్మవిత్, బ్రాహ్మణః, బ్రహ్మీ, బ్రహ్మజ్ఞః, బ్రాహ్మణప్రియః, మహాక్రమః, మహాకర్మా, మహాతేజః, మహోరగః, మహాక్రతుః, మహాయజ్వా, మహాయజ్ఞః, మహాహవిః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **న అస్య దేశ కాల వస్తుతః అవధయః సన్తి ఇతి అనంతః**. దేశము, కాలము, వస్తువు వంటి అవధులు లేనివాడు అనంతుడు. **దేశతః కాలతోవాపి గుణతో వస్తుతోఽపివా అవధిర్యస్య నాస్తీతి సోఽనంతః స్సముదాహృతః**

**హన్త తే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠః నాస్త్యంతో విస్తరస్య మే** – గీత 10.19
ఓ అర్జునా! నా దివ్య విభూతుల విస్తృతికి అంతమే లేదు. వాటిలో ప్రధానమైనవాటిని కొన్నింటిని మాత్రమే నీకు తెలుపుచున్నాను.
శ్రీ భట్టులు శ్రుతులనుండి కూడా ఉదాహరించారు. ఇవన్నీ బ్రహ్మము అనంతమని తెలుపుచున్నవి –
**సత్యమ్ జ్ఞానమ్ అనంతమ్ బ్రహ్మ** – తైత్తరీయ. ఆనంద 1
**అథై తస్యైవ అంతో నాస్తి తత్ బ్రహ్మ** – తైత్తరీయ. యజుర్ 7.3.4

శ్రీ శంకరులు 'అనంత' నామమునకు చెప్పిన మరొక కారణము – **వ్యాప్తిత్వాత్, నిత్యత్వాత్, సర్వాత్మత్వాత్, దేశతః, కాలతః, వస్తుతశ్చ అపరిచ్ఛిన్నః అనంతః.** దేశము చేతను, కాలము చేతను, వస్తువుచేతను, పరిచ్ఛిన్నుడు కానివాడు అనంతుడు. ఇక్కడ ఉన్నంతలో అక్కడ లేడనలేము. ఇప్పుడుంటే అప్పుడు లేడనలేము. ఈ గుణాలున్నాయి గనుక ఆ గుణాలు లేవనలేము. ఇందులో ఉన్నాడు గనుక అందులో లేడనలేము. కనుక భగవానుడు అనంతుడు. శ్రీ శంకరులు విష్ణుపురాణము (2.5.24) నుండి కూడా ఉదాహరించారు – **గంధర్వాప్సరసః సిద్ధాః కిన్నరోరగ చారణాః నాఽన్తమ్ గుణానామ్ గచ్ఛన్తి తేన అనంతః అయం అవ్యయః.** గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, కిన్నరులు, నాగులు, చారణులు ఎవరైనా ఆయన గుణముల అంతమును చూడలేదు. కనుక అవ్యయుడైన భగవంతుడు అనంతుడు.

శ్రీ నమ్మాళ్వార్. తిరువైమొళి 1.3.5 – భగవంతుని కళ్యాణగుణములకు అంతము లేదు. ఆయనే అన్నింటికీ మూలము. ఆయనకు అంతము లేదు. తిరువైమొళి 1.1.4 – మనమంతా ఆయనే. అతడు ఇతడు అని, ఆమె ఈమె అనీ, అది ఇది అనీ మనం వేరువేరుగా తలచేవన్నీ భగవంతుడు, మరియు భగవంతుడు మాత్రమే. మంచి చెడు వస్తువులు, అక్కడి ఇక్కడి వస్తువులు, వచ్చేవి పోయేవి అన్నీ ఆయనే. ఇవన్నీ ఆయన దివ్యవైభవంలో భాగాలే.

మరికొన్ని ఉదాహరణలు – భగవంతుడు భూత భవ్య భవన్నాధుడు. అన్నింటికంటే ఆద్యుడు. ఇప్పుడున్నాడు. ఎప్పటికైనా ఉంటాడు. **నిత్య నిత్యో నిత్యానామ్** – కఠోపనిషత్తు 2.2.13

**ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ చ భగవాన్** – శ్వేతాశ్వరోపనిషత్తు 3.11
**నైవ స్త్రీ న పుమాన్ ఏష** – శ్వేతాశ్వరోపనిషత్తు 5.10

శ్రీ బలదేవ విద్యాభూషణ – **అవిశుద్ధ మనసామ్ అనికటత్వాత్ అనంతః.** శుద్ధమైన మనస్సు లేనివారికి అందనివాడు అనంతుడు.

## 666. ధనంజయః

- అన్ని ధనములకంటె అధికమైన పెన్నిధి.
- దిగ్విజయము కావించి విశేషధనమును అర్జించిన అర్జునుడు.

### ఓం ధనంజయాయ నమః

ఆయనను మించిన ధనము లేదు. భక్తులు మణిమాణిక్యాలను చిన్నచూపు చూసి శ్రీనివాసుని కోరుకుంటారు. శ్రీ భట్టుల వ్యాఖ్యను నిరుక్తిలో ఇలా చెప్పారు – **ప్రేప్సోపార్జన లోభాది యోగ్యత్వాధిక్యతస్తతః మణి మౌక్తిక రత్నాని హేమ రూప్యాదికం ధనమ్**

**యోऽధః కరోతి సతతం ధనంజయ ఇతీరితః** – ధనార్జన, లోభము మానవులకు సహజము. కాని ఆయననుగురించి తెలుసుకొన్నవారు మణిమాణిక్యాలను, రత్నాలను, బంగారాన్ని, ధనాన్ని తక్కువ చేస్తారు. కేవలం భగవంతుని కోరుకుంటారు.

స్వామిదేశికన్ వైరాగ్యపంచకంలో ఇలా ఉంది – **ధనంజయ వివర్ధనమ్ ధనముదూఢ గోవర్ధనమ్ సుసాధనమ్ అబాధనమ్ సుమనసామ్ సమారాధనమ్.** గోవర్ధనగిరిని సునాయాసంగా ఎత్తినది, అర్జునునికి మహత్వము కలిగించినది, ఎన్నటికి తరగనిది, శుద్ధాత్ములకు సదా సంపూర్ణానందాన్ని కలిగించేది, ఇష్టకామ్యాలను అనుగ్రహించేది, అదే నిజమైన ధనము.

శ్రీ నమ్మాళ్వార్. తిరువైమొళి 10.7.2 – ఆయనే నాకు తేనె, పాలు, చక్కెర, అమృతము, అంతాను.

అర్జునుని మరొకపేరు ధనంజయుడు. ధర్మరాజుయొక్క రాజసూయయాగం కొరకు పెక్కు రాజులను జయించి బోలెడు ధనాన్ని తెచ్చినందుకు ఈ పేరువచ్చింది. కనుక భగవానుని అర్జున విభూతి ధనంజయుడని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. **వృష్ణీనాం వాసుదేవోऽస్మి పాండవానాం ధనంజయః మునీనామప్యహం వ్యాసః కవీనాముశనాకవిః** – గీత 10.37. వృష్ణివంశజులలో వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను నేను. అనగా నీవే నేను. మునులలో వేదవ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేను.

భగవంతుని నామములను పెక్కురు భక్తులు, వ్యాఖ్యాతలు తమ తమ దృష్టి ప్రకారము అనుభవించి ఆనందించారు. గౌడీయ వైష్ణవ సంప్రదాయానికి చెందిన శ్రీ బలదేవ విద్యాభూషణ ఈ నామములను అధికంగా శ్రీకృష్ణచరిత్ర ఆధారంగా వ్యాఖ్యానించారు. ఈ 'ధనంజయ' నామమునకు ఆయన చెప్పిన వ్యాఖ్య – **కంస సంపదో ధనాని జయతి, జిత్వా ఉగ్రసేనాయ దదాతి ఇతి ధనంజయః.** కంసుని వధించి, అతని ధనాన్ని జయించి ఉగ్రసేనునికి ఇచ్చినవాడు ధనంజయుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సకల జగత్తు అంతా ఆయనదే. ఆయన అధీనంలోనే ఉన్నది. కనుక సంపద అంతా ఆయనదే. అందువలన శ్రీహరియే ధనంజయుడు.



శివసముద్రం ఆలయంలో శ్రీ రంగనాథస్వామి. వికీపిడియా చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Madyaranga_Ranganatha_temple.JPG



## బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మ బ్రహ్మ బ్రహ్మవివర్ధనః |
## బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః || (71)

**(శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి)** పవిత్రమైన ఈ పుణ్యశ్లోకము దశవిధ బ్రహ్మనామములతో ప్రసిద్ధమగుచున్నది. కొండచరియలనుండి దివ్యనాదములతో జలజల పారు సెలయేటిమ్రోతలవలె మనోజ్ఞములగు శబ్దాలంకార శోభలతో వెలుగందుచున్న దివ్యశ్లోకములలో నిదియొకటి. ఉచ్చారణమాత్రము చేతనే వాక్శుద్ధి కలుగును. తద్వారా చిత్తశుద్ధియును కలుగును.

ఈ శ్లోకంలోని నామముల అర్థాలను తెలుసుకొనేముందుగా 'బ్రహ్మ' అనే పదమును కొంచెం పరిశీలించడం మంచిది. ఈ పదానికి మూలధాతువు 'బ్రహ్' – అనగా చాలా పెద్ద, గొప్ప, శక్తివంతమైన, వృద్ధిగల - వంటి అర్థాలున్నాయి. **తపో వేదశ్చ విప్రశ్చ జ్ఞానమ్ చ బ్రహ్మసంజ్ఞితమ్.** బ్రహ్మ అనగా తపస్సు, వేదములు, పండితులైన బ్రాహ్మణులు, జ్ఞానము వంటి అర్థాలున్నాయి. జగత్ప్రభువు, వేదము, ప్రకృతి, ఆత్మ (జీవుడు) వంటి అర్థాలు కూడా ఉన్నాయి. 'జీవుడు' అనే అర్థాన్ని భగవద్రామానుజుల సంప్రదాయంలో విశేషంగా గ్రహిస్తారు. ఎందుకంటే జీవుడు స్వతస్సిద్ధముగా అనంతశక్తిమంతమైన బ్రహ్మముకంటె వేరుకాదు. జీవుడు శరీరంలో బద్ధుడైయున్నందున తాత్కాలికముగా జీవునికి పరిమితులు ఏర్పడుతాయి. ఆత్మ నిజానికి అనంతవ్యాప్తి (infinite extensiveness) గుణమును కలిగిఉంది కాని శరీరబద్ధమైనందున ఆయా పరిమితులు సంక్రమిస్తాయి.

'బ్రహ్మ' అనే పదాన్ని నామవాచకంగా తీసుకుంటే త్రిమూర్తులలో ఒకరైన 'చతుర్ముఖ బ్రహ్మ'ను సూచిస్తుంది. మరియు చతుర్ముఖబ్రహ్మను సృష్టించే విషయంలో శ్రీమహావిష్ణువును సూచిస్తుంది.

ఈ శ్లోకంలోని వేరువేరు నామముల వ్యాఖ్యలు పైన చెప్పిన వివిధ అర్థాలపై ఆధారితమై ఉన్నాయి. భాష్యకారుల దృక్పథాలనుబట్టి వ్యాఖ్యానాలలో భేదాలను గ్రహింపవచ్చును.

### 667. బ్రహ్మణ్యః

- అచేతన, చేతనములకు, అనగా ప్రకృతి, ఆత్మలకు హితము కూర్చువాడు.
- తపమునకు, వేదములకు, విప్రులకు, జ్ఞానమునకు హితము కూర్చువాడు.

**ఓం బ్రహ్మణ్యాయ నమః**

పాణిని అష్టాధ్యాయి (5-1) సూత్రములు 4 నుండి 7 వరకు – 'యత్' అను ప్రత్యయమువలన 'మంచిచేయుట' అనే అర్థం వస్తుంది. ముఖ్యంగా 5.1.7 సూత్రము – **ఖల యవ మాష తిల వృష బ్రహ్మణః చ (యత్)**. కనుక 'బ్రహ్మణ్య' అనగా 'బ్రహ్మన్'కు మంచి చేయువాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – జీవునకు, ప్రకృతికిని హితము కూర్చువాడు బ్రహ్మణ్యుడు. **జీవాత్మా ప్రకృతిశ్చాపి బ్రహ్మేతి వ్యపదిశ్యతే తాభ్యాం యస్థితి భోగాదే సర్వావస్థాను కారణమ్ బ్రహ్మణ్య స్స చ విజ్ఞేయః సప్తార్ణో భోగదాయకః** - జీవాత్మ, ప్రకృతి రెండూ 'బ్రహ్' అనబడతాయి (చాలా పెద్దవి, విశాలమైనవి, విస్తారమైనవి, శక్తివంతమైనవి). ఆరెండింటియొక్క స్థితికి, భోగానికి కారణమైనవాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. భోగప్రదము. ఓం బ్రహ్మణ్యాయ నమః.

ప్రకృతి, జీవుడు, పరమాత్మ (అన్నీ బ్రహ్మములే) ఎంత బృహత్తరములైనవో శ్రీ నమ్మాళ్వారు చెప్పారు. తిరువైమొళి 10.10.10 – మహత్తు, అహంకారాదులుగా రూపొంది విశ్వమంతా వ్యాపించిన అనంత మూలప్రకృతికి అంతరాత్మయైనవాడా! మూలప్రకృతికంటే విస్తారమైనదానిని అధిగమించి అవతరించిన మరియు జ్ఞానానంద తేజోమయమైన జీవాత్మకు అంతరాత్మయైనవాడా! ఈ రెండింటిని ఆవరించి ప్రకాశించే సచ్చిదానంద సంకల్ప జ్ఞానస్వరూపుడా! నీలో లీనం అవ్వాలనే నా కోరిక నీ సంకల్పజ్ఞానముకంటే బలీయమైనది. కాని ఇప్పుడు నీవు నన్ను నీలో లీనం చేసుకొంటున్నావు. అనంతామృతసాగరంలో నేనొక బిందువును. నా కోరిక నెరవేరింది.

ఈ పాశురంలో మొదటిపంక్తి ప్రకృతియొక్క బృహద్గుణాన్ని సూచిస్తుంది. రెండవపంక్తి ఆత్మజ్ఞానంయొక్క బృహద్గుణాన్ని సూచిస్తుంది. మూడవపంక్తి ఆత్మయొక్క బృహద్గుణాన్ని సూచిస్తుంది. బ్రహ్మమును పరమాత్మునిగా భావిస్తే గనుక తనకు చిత్, అచిత్ అనే భేదాలున్నాయి (చేతన, అచేతన శరీరాలున్నాయి). బ్రహ్మమును ప్రకృతిగా భావిస్తే తనకు అచిత్ (insentiency) అనే గుణం మాత్రమే ఉంది. బ్రహ్మమును ఆత్మ (జీవుని)గా భావిస్తే తనకు చిత్ (consciousness) అనే గుణం మాత్రమే ఉంది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'బ్రహ్మ' అనగా తపము, వేదములు, విప్రులు, జ్ఞానము. **తపో వేదాశ్చ విప్రాశ్చ జ్ఞానంచ బ్రహ్మసంజ్ఞితమ్.** వీటన్నింటికీ మేలు కూర్చువాడు బ్రహ్మణ్యుడు. మత్స్యావతారుడై వేదములను రక్షించినవాడు. నారాయణుడై తపోమార్గమును తెలియజేసినవాడు. అనేక అవతారములెత్తి విప్రులను కాచినవాడు. గీతను బోధించి జ్ఞానమును ప్రసాదించినవాడు. బ్రహ్మణ్యుడు. ఇవి శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇచ్చిన ఉదాహరణలు.

భగవానుని బ్రహ్మణ్యమునకు వివిధ వ్యాఖ్యాతలు మరికొన్ని ఉదాహరణలు ఇచ్చారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – భగవానుడు శ్రీకృష్ణుడై రాజసూయసమయంలో బ్రాహ్మణులకు పాదపూజ చేశాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భగవానుడు శ్రీకృష్ణుడు తన గురువుయొక్క పుత్రుని యమలోకంనుండి తెచ్చియిచ్చాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు పెద్దవాడు (బృహత్). మరియు తన భక్తులను రక్షించి వారికి భోగైశ్వర్యములిచ్చి వారిని గొప్పవారిగా చేస్తాడు. కనుక బ్రహ్మణ్యుడు.

## 668. బ్రహ్మకృత్ బ్రహ్మ

### బ్రహ్మకృత్

### బ్రహ్మ

శ్రీ భట్టులు 'బ్రహ్మకృత్ బ్రహ్మ' ఒకే నామముగా పరిగణించారు. శ్రీ శంకరులు 'బ్రహ్మకృత్', 'బ్రహ్మ' అనే రెండు నామములుగా పరిగణించారు.

## బ్రహ్మకృత్ బ్రహ్మ

- సృష్టికర్తయైన బ్రహ్మను సృష్టించినవాడు.

### ఓం బ్రహ్మకృత్ బ్రహ్మణే నమః

శ్రీ భట్టులు ఈ నామవివరణలో 'బ్రహ్మ' అనగా 'పెద్ద' అనే అర్థాన్ని గ్రహించారు. అఖిల జగాలను (అనగా చాలా పెద్దవాటిని) సృష్టించే చతుర్ముఖబ్రహ్మయే 'బ్రహ్మకృత్'. ఆ (చతుర్ముఖ)బ్రహ్మను సృష్టించే భగవానుడు 'బ్రహ్మకృత్ బ్రహ్మ'.

శ్రీ నమ్మాళ్వార్. తిరువైమొళి 2.2.4 – ఈ దేవదేవుడు చతుర్ముఖబ్రహ్మను సృష్టించాడు. ఆ చతుర్ముఖబ్రహ్మ అన్నింటినీ, దేవతలను, చేతనాచేతనములను సృష్టించాడు.

**మహదాది తమః కార్యం బ్రహ్మేతి అభిధీయతే తస్య కర్తా స్వయం బ్రహ్మ నియామ్యే యస్య సర్వదా సతుస్యాద్బ్రహ్మకృద్బ్రహ్మ నవార్ణః సర్వశక్తిదః.** మహదాది వికారాలకు (చాలా పెద్దవాటికి) 'బ్రహ్' అని పేరు. ఆ వికారాలను పుట్టించేవాడుకూడా బ్రహ్మే. అటువంటి చతుర్ముఖబ్రహ్మ తన అధీనమున గలవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము. సర్వశక్తిప్రదము. (శ్రీకైవల్యసారథి నుండి). ఓం బ్రహ్మకృత్ బ్రహ్మణే నమః.

థాయిలాండ్ బ్యాంగ్‌కాక్ లో శ్రీ బ్రహ్మదేవుని విగ్రహం



## బ్రహ్మకృత్

- బ్రహ్మను (తపో వేదాదులను) కలిగించువాడు.

### ఓం బ్రహ్మకృతే నమః

'బ్రహ్మ' అనగా తపస్సు, వేదములు, విప్రులు, జ్ఞానము. వీనికి కర్త అయినవాడు 'బ్రహ్మకృత్'.

శ్రీ చిన్మయానంద – బ్రహ్మతపమును ఆచరించేవాడు బ్రహ్మకృత్.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **బ్రహ్మ కరోతి బ్రహ్మచర్యలక్షణమ్ తపశ్చరతి ఇతి బ్రహ్మకృత్.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు తన భక్తులను గొప్పవారిగా (పెద్దగా) చేయును కనుక బ్రహ్మకృత్. మరియు ఆయన చతుర్ముఖబ్రహ్మను, వేదములను, బ్రాహ్మణులను, తపస్సును సృష్టించెను.

## బ్రహ్మ

- సృష్టికర్తయైన (చతుర్ముఖ) బ్రహ్మ

### ఓం బ్రహ్మణే నమః

- సృష్టికర్తయైన చతుర్ముఖబ్రహ్మ భగవానుని రూపమే గనుక బ్రహ్మ. బ్రహ్మ రూపమున సర్వమును సృజించువాడు.

## 669. బ్రహ్మ

- పరబ్రహ్మ.
- అపరిమిత కళ్యాణగుణవర్ధనుడు.
- అగోచరమయన జ్ఞానము.

### ఓం బ్రహ్మణే నమః

ఇక్కడ 'బ్రహ్మ' అనగా 'చాలా పెద్ద' అన్న అర్థంలో వ్యాఖ్యాతలు ఈ నామమును వివరించారు. భగవంతుడు చాలా పెద్ద. ఆయన చేసేదంతా చాలా పెద్ద. ఆ పెద్ద ఏమిటి? భగవంతుని 'పరత్వము' బ్రహ్మమని శ్రీ శంకరులు, ఆయన మార్గాన్ని అనుసరించిన వ్యాఖ్యాతలు చెప్పారు. భగవంతుని అపరిమిత కళ్యాణ గుణములకు శ్రీ భట్టులు, మరియు ఆయన దృక్పథాన్ని అనుసరించినవారు ప్రత్యేకంగా అద్దం పట్టారు.

ఈ నామమునకు మూలధాతువు 'బృహ్' అనగా పెరుగుట, వృద్ధిచెందుట. **బృహత్వాత్ బ్రహ్మణత్వాచ్చ బ్రహ్మేతి పరికీర్త్యతే.** ఆయన బృహద్రూపుడు. బృహద్గుణుడు. అన్నీ తానైనవాడు. అంతటా తానుండేవాడు. అంతా పెద్దగా చేసేవాడు. సంకల్పమాత్రాన సకల కార్యాలు చేసేవాడు (మరేవిధమైన తోడు, ఉపకరణం లేకుండా).

**వ్యక్తావ్యక్త సమష్ట్యాది పురుషాంశ్చైవ నిత్యశః**
**గుణైశ్చ కళ్యాణతమైః బ్రహ్మ బ్రహ్మయతీతి చ**
**రూపై స్వరూపేణ గుణైః విభైశ్చ స్వయం ముహుః బ్రహ్మేతి**
**స తు వా బ్రహ్మ షడర్ణో సంతతిప్రదః.**

వ్యష్టిరూపంగాను, సమిష్టిరూపంగాను ఉండే వ్యక్తావ్యక్త స్వరూపులైన చేతనులను తనయొక్క కళ్యాణ గుణముల చేత వృద్ధి పొందించేవాడు. తాను కూడా స్వరూప గుణ విభవాదులచేత మాటిమాటికీ అభివృద్ధి చెందే వేదాంతవేద్యుడు. ఈ నామము షడక్షరి. సంతానకరము (శ్రీకైవల్యసారధి నుండి). ఓం బ్రహ్మణే నమః.

భగవంతుడు బద్ధజీవులైన సంసారులను ఉద్ధరించి నిత్యసూరులుగా చేసే కరుణామయుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **బ్రహ్మయతి ప్రజాః స్వ దయాదృశా ఇతి బ్రహ్మ.** తన కటాక్షముచే భక్తులను ఉద్ధరించేవాడు బ్రహ్మ.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **బృహత్వాత్ బ్రహ్మ.** పెద్దతనము కారణమున బ్రహ్మ. బృహత్వ, బృంహణత్వములను బట్టి (గొప్పదనము, పుష్టి పరచుట) సత్యాది లక్షణమైన పరమాత్మను 'బ్రహ్మ' శబ్దముచే తెలియజేయవచ్చును. విష్ణుపురాణం (6.7.53)లో – **సత్తా మాత్రమ్ అగోచరమ్ వచసామ్, ఆత్మసంవేద్యమ్, తద్ జ్ఞానమ్ బ్రహ్మ.** సంపూర్ణముగా సాత్వికమైనది, మాటలకు అందనిది, అనుభవముద్వారా మాత్రమే తెలుసుకొనదగినది అయిన జ్ఞానమే బ్రహ్మ. సత్యం, జ్ఞానం అనన్తం బ్రహ్మ.

అన్నింటికంటె స్థూలమైనది, అంతటా విస్తరించి వ్యాపించియున్నది, సత్యజ్ఞానాది లక్షణాలతో కూడియున్నది బ్రహ్మ.

ఇంతకుముందు నామము 'బ్రహ్మకృత్ బ్రహ్మ' అని శ్రీ భట్టులు, 'బ్రహ్మ' అని శ్రీ శంకరులు గ్రహించారని గమనించాలి (దీర్ఘం ఉన్నది). ప్రస్తుత నామము 'బ్రహ్మ' (దీర్ఘం లేదు) అని ఇరువురూ పరిగణించారు. ఇక్కడ అసలు నామము 'బ్రహ్' శబ్దానికి 'మనిన్' ప్రత్యయం చేర్చి, అకారం కలిపినందున 'బ్రహ్మ' అయినదని చెప్పారు. సృష్టికర్త 'బ్రహ్మ' మరియు 'జీవులు' కలిపి 'బ్రహ్మ' అని చెప్పారు.

## 670. బ్రహ్మవివర్ధనః

- ధర్మమును (తపస్సువంటి బ్రహ్మమును) వృద్ధిచేయువాడు.
- వస్తువులను గొప్పగా వృద్ధిచేయువాడు.

### ఓం బ్రహ్మవివర్ధనాయ నమః

శ్రీ భట్టులు 'బ్రహ్మము' అనగా 'తపస్సు' అనే అర్థంలో ఈ నామాన్ని వ్యాఖ్యానించారు. తపస్సు అనగా ధర్మముకూడ. 'తపోబ్రహ్మ' అని శృతివాక్యము. **తపోబ్రహ్మ, తమ్ వివర్ధయతి ఇతి బ్రహ్మవివర్ధనః.** తపస్సు అనగా బ్రహ్మము. దానిని వర్ధిల్లజేయువాడు బ్రహ్మవివర్ధనుడు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఐతరేయబ్రాహ్మణము (7.22)నుండి **'బ్రహ్మ వై యజ్ఞః'** అని ఉదాహరించారు.

శ్రీ వి.వి. రామానుజన్ – తపస్సు అనగా ఐహికవ్యామోహమునుండి దూరమగుట. ఈ బంధాలనుండి విడివడినకొలదీ భగవంతుని ఆనంద స్వరూపము అవగతమవుతుంది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – భగవంతుడు భక్తుల హృదయాలలో బ్రహ్మతత్వమును వృద్ధిపరచును గనుక బ్రహ్మవివర్ధనుడు. **బ్రహ్మతత్వమ్, తత్ విశేషేణ వర్ధయతే స్వజన హృదయేషు ఇతి బ్రహ్మవివర్ధనః.**

శ్రీ చిన్మయానంద – వేదము, సత్యము, జ్ఞానము, సత్కర్మలు, ఇవన్నీ బ్రహ్మమే. భక్తులలో వీటిని వృద్ధిచేయువాడు బ్రహ్మవివర్ధనుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – బ్రహ్మము అనగా చాలాపెద్దయైనది (బృహత్), అంతు చిక్కనిది. భవంతుడు వస్తువులను పెద్దగా వృద్ధిచేయువాడు గనుక బ్రహ్మవివర్ధనుడు. ఉదాహరణకు విత్తనమునుండి వృక్షమును, వృక్షమునుండి విత్తనాలను ఇలా అనంతంగా పెంపొందించువాడు భగవంతుడు. బ్రహ్మవివర్ధనుడు.

**వివర్ధనమ్ విశ్వమిదమ్ సమస్తమ్ యతః స్వయమ్ బ్రహ్మవివర్ధనః సః**
**బీజాచ్చ వృక్షమ్ కురుతే వివృద్ధమ్ వృక్షాచ్చ బీజాన్ కురుతే బహూః సః**

ధర్మచక్రము రచయిత వ్యాఖ్య – తపస్సు, దానము, యజ్ఞము కూడ బ్రహ్మస్వరూపములే. తపస్సుద్వారా వ్యక్తి తనను అభివృద్ధి చేసుకొనును. తన సంపదలు సమాజం కొఱకు త్యాగం చేస్తే అది దానము. తాను చేసే కర్మలన్నీ మనోవాక్కాయపూర్వకంగా స్వార్థం లేకుండా భగవంతునికి అర్పించడం యజ్ఞం. అలా చేస్తే భగవంతునిపై ధ్యాస లభిస్తుంది. ఇలా చేసే ప్రతి కర్మ తపస్సు, దానము, యజ్ఞము అవుతాయి. భగవంతుని ధ్యానిస్తే తపస్సు దానము, యజ్ఞము వర్ధిల్లుతాయి. కనుక శ్రీమహావిష్ణువు బ్రహ్మవివర్ధనుడు. భగవద్గీత శ్రద్ధాత్రయయోగములో సాత్విక తపస్సు, సాత్విక దానము, సాత్విక యజ్ఞము వివరించబడ్డాయి.

భగవంతుని శరణాగతి పొందినవారి తపస్సాధన మాత్రమే జయప్రదమగును. వేదవిచారణ సులభమగును. విప్రత్వము సిద్ధించును. ఆత్మజ్ఞానము అలవడును (శ్రీ పెమ్మరాజు రాజారావు).

## 671. బ్రహ్మవిత్

- వేదములను (బ్రహ్మమును) ఎరిగినవాడు.
- మత్స్యావతారమునెత్తి వేదములను కాపాడినవాడు.
- గొప్ప విషయాలను, దృశ్యాదృశ్యమైనవానిని ఎరిగినవాడు.

### ఓం బ్రహ్మవిదే నమః

**బ్రహ్మ వేత్తి ఇతి బ్రహ్మవిత్** – బ్రహ్మమును తెలిసినవాడు బ్రహ్మవిత్.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఈ నామములో 'బ్రహ్మ' అనగా వేదములు అనే అర్థాన్ని గ్రహించారు. **అనంతా వై వేదాః.** వేదములు అనంతములు.

**అనాది నిధనమ్ బ్రహ్మ న దేవా న ఋష్యో విదుః**
**ఏకస్తత్ వేద భగవాన్ ధాతా నారాయణః స్వయమ్** – మహాభారతము. మోక్షపర్వము 380.19
వేదములు ఆది, అంతము లేనివి. దేవతలుగాని, ఋషులుగాని వాటిని పూర్తిగా తెలిసికొనలేరు. సృష్టికర్తయైన భగవన్నారాయణుడు మాత్రమే స్వయముగా వానినెఱిగినవాడు.

వేదములు భగవంతుని తెలియజేయుచున్నవి. కనుక భగవంతుని పూర్తిగా తెలుసుకోవడం ఎలా సాధ్యం కాదో అలాగే వేదాలను పూర్తిగా తెలుసుకోవడం ఇతరులకు సాధ్యం కాదు. భగవంతునికే అది సాధ్యము. కనుక ఆయన వేదవిదుడు.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవవేద్యో వేదాన్తకృత్ వేదవిదేవ చాహమ్** – గీత 15.15
సమస్తప్రాణుల హృదయాలలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహము తొలగించుట) కలుగుచున్నవి. వేదములద్వారా తెలిసికొనదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

ఈ గీతాశ్లోక వ్యాఖ్యానంలో శ్రీభగవద్రామానుజులు ఇలా చెప్పారు – 'వేదములను తెలిసికోవడం' అంటే అగ్ని, వాయువువంటి ఇతరదేవతలు కూడా పూజించేది ఆయననే (**అహమ్ హి సర్వయజ్ఞానామ్ భోక్తా చ ప్రభురేవ చ**) అనియు, అన్ని సమర్పణలకు ఫలితాలనిచ్చేది ఆయనే (**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్**) అనియు, వేదములద్వారా తెలిసికొనవలసినది ఆయననే (**వేదైశ్చ సర్వైః అహమేవ వేద్య**) అనియు తెలిసికోవడం. ఈ విషయాలు గ్రహించకుండా వేదాలను వేరేవిధంగా వివరించడానికి యత్నించేవానికి వేదాలు తెలియవన్నమాట.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'విద్'-లాభే - కనుగొనుట – **విశ్రమితాన్ ఉరుభయే సలిలే ముఖాత్ మే ఆదాయ తత్ర విజహార హ వేదమార్గాన్** (మహాభాగవతం 2.7.12). బ్రహ్మ ఇలా అన్నాడు – మహాప్రళయానంతరం నా చుట్టూ ఉన్న జలరాశినిచూచి నేను భయపడ్డాను. నా ముఖంనుండి వెలువడిన వేదాలను ఆ ప్రభువే కాపాడాడు – శ్రీ మత్స్యావతారుడై వేదములను కాపాడిన దేవుడు వేదవిత్. అనగా బ్రహ్మవిదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'బ్రహ్మ'- చాలా పెద్దది. కనుపించేది లేదా కనుపించనిది. ఇవన్నీ జ్ఞానంద్వారా మాత్రమే తెలియవచ్చును. వాటిని పూర్తిగా తెలిసినవాడు బ్రహ్మవిదుడు. **వివృద్ధమ్ వివర్ధనమ్ వా బ్రహ్మ, దృశ్యమ్ అదృశ్యమ్ జ్ఞానమాత్ర గమ్యమ్ చ యత్, తత్ సర్వమ్ కో వేత్తి ఇతి ప్రశ్నే వక్తుమ్ శక్యతే, స ఏవ సర్వస్య ఆధారో భగవాన్ విష్ణుః వేత్తి ఇతి, తస్మాత్ బ్రహ్మవిత్.**

ధర్మచక్రము రచయిత – ప్రకృతి, జీవుడు, పరమాత్ముడు – వీనిమధ్య భేదములను గురించి తెలుసుకోవడం వేదజ్ఞానానికి అత్యావశ్యకం. ముఖ్యముగా జీవునికి భగవంతునికి తేడా తెలుసుకోవడం. రాముడు, కృష్ణుడు వంటి అవతారపురుషుల జీవితాలను సామాన్యమానవచరిత్రలుగా విశ్లేషించేవారు వేదాలనుగురించి ఏమీ తెలియనివారన్నమాట. ఎందుకంటే వారికి జీవాత్మ, పరమాత్మల మధ్య భేదం తెలియదు. రాముడు, కృష్ణుడు వంటివారు పురుషులు కారు. పురుషోత్తములు. త్రిగుణాతీతులు. వారికి సామాన్యమైన పరిమితులు వర్తించవు. వేదజ్ఞానంలో ఇది తెలిసికొనవలసిన విషయం.

## 672. బ్రాహ్మణః

- వేదములను బోధించువాడు.

### ఓం బ్రాహ్మణాయ నమః



బ్రహ్మ నయతి, అణతి ఇతి బ్రాహ్మణః, వేదములను బోధించువాడు, వల్లించువాడు బ్రాహ్మణుడు – అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **దత్తాత్రేయాది రూపేణ హ్యుదీర్ణో బ్రాహ్మణ స్మృతః పఠనాద్వాథ వేదస్య బ్రాహ్మణః పరికీర్తితః.** - దత్తాత్రేయుడు మొదలైన బ్రాహ్మణుల రూపంలో అవతరించినవాడు. నిత్యము వేదపారాయణ చేయువాడు బ్రాహ్మణుడు.

అమరకోశము వ్యాఖ్యానము ప్రకారము బ్రాహ్మణునకు ఆరు కర్తవ్యాలున్నాయి. యజనము (యజ్ఞము చేయుట), యాజనము (యజ్ఞము చేయుటకు సహకరించుట),అధ్యాపనము (వేదములను పఠించుట), దానము (ఇచ్చుట), ప్రతిగ్రహణము (స్వీకరించుట).

కన్యాకుమారి సమీపంలోని అంజుగ్రామం ఆలయంలో శ్రీ దత్తాత్రేయుని మూర్తి. Photo by Nilrocks.
https://commons.wikimedia.org/wiki/File:Lord_Shri_Datta_Near_Vattakottai_fort,Anjugramam,Kanyakumari.jpg

బ్రాహ్మణుని లక్షణములను ధర్మచక్రము రచయిత ఇలా వివరించారు – బ్రాహ్మణుడు బ్రహ్మతత్త్వమును ఎరిగియుండవలెను. బ్రహ్మమును సేవించుటకు జీవితమును అంకితము చేయవలెను. శరీరము, సంపదలపై వ్యామోహము కలిగియుండరాదు. భగవంతుని కళ్యాణగుణములపై అచంచలవిశ్వాసము కలిగియుండవలెను. మనస్సును, వాక్కును, కర్మను భగవంతునకు అంకితము చేయవలెను. ప్రతిపని భగవంతుని సేవలోను, భగవంతుని భక్తుల సేవలోను ఆచరించవలెను. మనసును, ఇంద్రియములను నిగ్రహించుకొనవలెను. మనోవాక్కాయకర్మలను సాత్వికతతో నింపుకొనవలెను. కష్టములను సహింపవలయును. ఇతరులకు కీడు చేయరాదు. వేదములపట్ల, శాస్త్రములపట్ల, భగవంతునిపట్ల చెదరని విశ్వాసము కలిగియుండవలెను. వేదములను అభ్యసింపవలెను, ఇతరులకు బోధింపవలెను. ఆ కార్యములందు ఆనందము పొందవలెను. నీతి, ప్రేమ అనే గుణములతో సాత్విక జీవనము సాగింపవలెను.

**శమోదమస్తపః శౌచం క్షాంతి రార్జవ మేవచ జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మస్వభావజం** – గీత 18.42
(1) శమము (2) దమము (3) తపస్సు (4) శౌచము (5) ఓర్పు (6) ఋజుప్రవర్తనము (7) శాస్త్రజ్ఞానము (8) అనుష్ఠానవేదాంతము (9) భగవద్విశ్వాసము అను ఈ నవవిధ లక్షణములు కలవాడే బ్రాహ్మణుడు.

## 673. బ్రహ్మీ

- ప్రమాణము, ప్రమేయము అనే సమస్తము తనయందే కలిగియున్నవాడు. ప్రకృతి, పురుష, ఈశ్వర, వేదాది సమన్వితుడు.
- బ్రహ్మముతో కూడినవాడు. వేద తపో జ్ఞాన విప్ర సమన్వితుడు.
- నాభి కమలమున చతుర్ముఖబ్రహ్మను కలిగినవాడు.

### ఓం బ్రహ్మిణే నమః

'బ్రహ్మ' పదమునకు 'ఇని' ధాతువు చేర్చుటవలన 'బ్రహ్మను కలిగియుండుట' అనే అర్థం వస్తుంది. పాణిని సూత్రము 'బ్రీహ్యాదిభ్యశ్చ' (5.2.116) మరియు 'నస్తద్ధితే' (6.4.144).

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము సమస్తమైన ప్రమాణము (అనగా జ్ఞానమునకు సాధనము) మరియు ప్రమేయము (జ్ఞానముయొక్క లక్ష్యము) తనయందే కలిగియున్నవాడు 'బ్రహ్మీ'. వేదములు ప్రమాణములు. ప్రకృతి, పురుషుడు, ఈశ్వరుడు మొదలగునవి ప్రమేయములు.

వేదములు, చతుర్ముఖబ్రహ్మ, బ్రాహ్మణులు (విప్రులు), తపస్సు మొదలగునవి భగవత్తత్త్వమును తెలిసికొను మార్గములు. ఇవన్నీ భగవంతునియందే ఉన్నందున ఆయన బ్రహ్మీ.

**స నాభి కమలే విష్ణోః స్థితో బ్రహ్మా ప్రజాపతిః.** అని మార్కండేయపురాణం (7.8.51)లో ఉంది. నాభి కమలంలో చతుర్ముఖబ్రహ్మను కలిగియునందున విష్ణువు బ్రహ్మీ.

ధర్మచక్రము రచయిత – పాంచభౌతికమైన ఈ దేహం మనుగడకు పంచభూతముల సహాయం అవుసరం. అలాగే మనలోనున్న పరమాత్ముని తెలిసికొనుటకు ఆయన కలిగియున్న వేదములు, విప్రులు, తపస్సు వంటివాని సహాయం కావాలి. వేదాలను పఠిస్తూ బ్రాహ్మణ ధర్మాన్ని అవలంబిస్తూ యోగసాధన చేస్తే భగవంతుని గురించిన జ్ఞానంవైపు పురోగమింపవచ్చును.

## 674. బ్రహ్మజ్ఞః

- వేదముల సారము (అంతరార్థము) పూర్తిగా తెలిసినవాడు.
- బ్రహ్మమునెరిగినవాడు.

### ఓం బ్రహ్మజ్ఞాయ నమః

'బ్రహ్మ' అంటే వేదము. వేదముల అర్థము పూర్తిగా తెలిసినవాడు బ్రహ్మజ్ఞుడు. **యో వేదానర్థతో వేత్తి సోऽపి బ్రహ్మజ్ఞ విశ్రుతః.** 671వ నామము 'బ్రహ్మవిత్' అంటే కూడా బ్రహ్మమును తెలిసినవాడు అని అర్థము. ఈ రెండు నామాలకూ మధ్యనున్న భేదాన్ని వ్యాఖ్యాతలు సూచించినవిధం గమనించదగినది.

శ్రీ భట్టుల వ్యాఖ్యలు – **అనంతా వై వేదః, తాన్ అవధినా వేత్తి ఇతి బ్రహ్మవిత్.** వేదములు అనంతములు. వాటిని సంపూర్ణముగా (అవధులవరకు) ఎరిగినవాడు బ్రహ్మవిత్; **వేదాన్ అర్థపర్యంతమ్ సాక్షాత్కరోతి ఇతి బ్రహ్మజ్ఞః.** వేదములను, వాని అర్థమును, సారమును తెలిసినవాడు బ్రహ్మజ్ఞుడు. ఈ వివరణల ప్రకారం శ్రీ భట్టులు 'బ్రహ్మవిత్' నామవివరణలో వేదజ్ఞాన విస్తారతను, 'బ్రహ్మజ్ఞ' నామ వివరణలో వేదార్థమును మరింతలోతుగా తెలియుటను ప్రత్యేకంగా సూచించారనుకోవచ్చును.

ఈ రెండు నామములకు శ్రీ శంకరులు చెప్పిన వివరణలు – **వేదమ్ వేదార్థమ్ చ యథావత్ వేత్తి ఇతి బ్రహ్మవిత్; బ్రహ్మ వేదాన్ స్వాత్మభూతాన్ జానాతి ఇతి బ్రహ్మజ్ఞః.** వేదములను, వేదముల అర్థములను తెలిసినవాడు బ్రహ్మవిత్. తననుండే సంభవించినట్టి వేదములను సంపూర్ణముగా తెలిసినవాడు బ్రహ్మజ్ఞుడు.

శ్రీ చిన్మయానంద వ్యాఖ్య – వేదములను, వాని భావములను పూర్తిగా ఎరిగినవాడు బ్రహ్మవిత్. భగవంతుడు స్వయముగా పరబ్రహ్మముగనుక, బ్రహ్మముగురించి ఆయనకు తెలిసినట్లుగా వేరెవరికీ తెలియదుగనుక, ఆయన బ్రహ్మజ్ఞుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **బ్రహ్మవేదః, తత్ విందతి మత్స్యావతారే ఇతి బ్రహ్మవిత్**. మత్స్యావతారుడై వేదములను తెచ్చియిచ్చినవాడు బ్రహ్మవిత్. **బ్రహ్మ శ్రీ విష్ణోర్విభూతిః, తద్ స్వవిభూతిరూపమ్ జానాతి ఇతి బ్రహ్మజ్ఞః.** శ్రీమహావిష్ణువుయొక్క విభూతి బ్రహ్మ. అలా తనవిభూతిని పూర్తిగా తెలిసినవాడు బ్రహ్మజ్ఞుడు.

బ్రహ్మవిత్, బ్రహ్మజ్ఞః – అనే ఈ రెండు నామములు పరస్పరము అనుసంధానితములు అని పరిగణింపవచ్చును. వేదముల సంపూర్ణజ్ఞానము ఒక నామమునందు, వేదముల అంతరార్థము మరొక నామమునందు సూచింపబడినవి.

## 675. బ్రాహ్మణప్రియః

- బ్రాహ్మణులయందు ప్రీతి కలవాడు.
- బ్రాహ్మణులకు ఇష్టమైనవాడు.

### ఓం బ్రాహ్మణప్రియాయ నమః

**వేదాధికారిణో విప్రాః ప్రియా యస్యేతి వై సదా బ్రాహ్మణప్రియః ఇత్యుక్తో నవార్ణో ధర్మదో మనుః** వేదాన్ని చదవడానికి అర్హతగలవారు బ్రాహ్మణులు. అట్టి బ్రాహ్మణులయందు ప్రీతిగలవాడువ బ్రాహ్మణప్రియుడు. ఈ నామము నవాక్షరీమంత్రము. ధర్మప్రదము. ఓం బ్రాహ్మణప్రియాయ నమః.

శ్రీ భట్టులు భృగుమహర్షి ఉదంతాన్ని ఉదాహరించారు. భృగువు శ్రీహరి వక్షస్థలంపై తన్నినా గాని భగవంతుడు భృగువును ఆదరించాడు. ఇంకా శ్రీ భట్టులు అనేక ఉదాహరణలిచ్చారు.

**ఘ్నంతం శపంతం పరుషం వదంతం యో బ్రాహ్మణమ్ న ప్రణయేద్యథాऽహమ్** (ఇతిహాస చూడామణి 30.100). ఒక బ్రాహ్మణుడు కొట్టినా, తిట్టినా, శపించినాగాని సహించి అతనిని పూజించాలి. నేను భృగుమహర్షిని అలానే ఆదరించాను. అలా చేయనివాడు బ్రాహ్మణుని కోపాగ్నిలో నశిస్తాడు. అతడు శిక్షార్హుడు. అటువంటివాడు నావాడు కాడు.

ఇలా భగవంతునికి బ్రాహ్మణులపట్ల విపరీతమైన ఆదరణ ఉండడానికి కారణం వారు ధర్మాన్ని ఆచరిస్తూ భగవంతుని నమ్ముకొని ఉండడమే.

**యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేऽతీవ మే ప్రియా** – గీత 12.20
ఉపర్యుక్త ధర్మామృతమును సేవించుచు, నిష్కామ భక్తి శ్రద్ధలతో మత్పరాయణులైన భక్తులు నాకత్యంత ప్రియులు.

**విప్ర ప్రసాదాత్ అసురాన్ జయామి** (విష్ణుధర్మము 52.23) – బ్రాహ్మణుల అనుగ్రహముచేతనే రాక్షసులను జయించుచున్నాను.

ఈ నామ వ్యాఖ్యానంలోనే బ్రాహ్మణులు ఎలా ప్రవర్తించాలో తెలుపబడింది. శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – బ్రాహ్మణులు వేదాధ్యయనము, వేదబోధనము కొఱకు జీవించుచున్నందున భగవానునకు అత్యంత ప్రియులు. వేదములు భగవత్స్వరూపమే గనుక వారు చేయునది భగవత్సేవయే.

**యం దేవం దేవకీదేవి వసుదేవాదజీజనత్ భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్తమగ్నిమివారణి**
బ్రాహ్మణులను రక్షించడం కోసమే దేవకీవసుదేవులకు శ్రీకృష్ణపరమాత్ముడు జన్మించాడు (మహాభారతం).

శ్రీ శంకరులు రెండు అర్థాలనూ చెప్పారు – **బ్రాహ్మణానామ్ ప్రియః బ్రాహ్మణప్రియః, బ్రాహ్మణాః ప్రియా అస్య ఇతి వై**. బ్రాహ్మణులకు ప్రియమైనవాడు, బ్రాహ్మణులపట్ల ప్రీతి కలిగినవాడు బ్రాహ్మణప్రియుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ అన్ని నామాలను శ్రీకృష్ణచరిత్రము ఆధారంగా వ్యాఖ్యానించారు. చనిపోయిన గురుపుత్రుని పునర్జీవితుని చేసి (యమలోకంనుండి తెచ్చి) గురువుగారికి (సాందీపనికి) ఆనందం కలుగజేసినవాడు బ్రాహ్మణప్రియుడు.

శ్రీ చిన్మయానంద – ఇక్కడ 'బ్రాహ్మణులు' అనగా దివ్యమైన భగవదనుభూతిని పొందినవారు. జ్ఞానులు (కులం కాదు).




దశావతారాలను అనేకవిధాలుగా చిత్రీకరించారు. వికీపీడియా చిత్రాల సంకలనం.



## మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః |
## మహాక్రతుర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః || (72)

**(శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి)** ఇంతకుముందు శ్లోకము వలెనే ఈ మహాశ్లోకమును జలజల పారుతున్న మహాజలపాతముయొక్క మహాశబ్దజాలమువలె మహానామాష్టకముతో; మహనీయ - మధుర - మహా శబ్దాలంకారములతో, మహత్వపూర్ణమై, మహేశ్వరమూర్తియొక్క మాహాత్మ్యమును మహాశబ్దములతో స్తవము చేయుచున్నది.

**ఇక్కడినుండి కొన్ని నామములను శ్రీభట్టులు వ్యాఖ్యానించిన భావము – భగవంతునికి భక్తులపట్ల గల అపరిమిత వాత్సల్యము, భగవంతునకు భాగవతులకు గల ప్రగాఢ సంబంధము, తనను ఆరాధించడానికి భక్తులకు భగవానుడు ఎలా మార్గం సుగమం చేస్తాడు మొదలైన వివరాలు.**

### 676. మహాక్రమః

- భక్తుల ఉన్నతి కొఱకు క్రమక్రమమైన అర్హతను ప్రసాదించువాడు.
- మూడు గొప్ప అడుగులుగల శ్రీత్రివిక్రమమూర్తి.
- ఆయన అడుగులు ఎంత గొప్పవంటే, ఎక్కడికైనా గాని అందరికంటె ముందుగా చేరుకొనేవాడు.
- శరణాగతి పొందుటకు తగిన ఉత్తమ పాదములు కలవాడు.

### ఓం మహాక్రమాయ నమః

'క్రమము' అనగా అడుగు (పద విన్యాసము) అనియు, క్రమబద్ధమైన (నిర్ణీతమైన) విధానము అనియు అర్థములు గలవు. శ్రీ శంకరులు మొదటి అర్థాన్ని తీసికొని శ్రీవామనావతారపరంగా వ్యాఖ్యానించారు. శ్రీ భట్టులు రెండవ అర్థాన్ని తీసికొని, భక్తులు ఒక్కొక్క అడుగు వేసుకొంటూ తనను చేరుకొనే అవకాశం ప్రసాదించేవాడు భగవంతుడు అని వ్యాఖ్యానించారు. **పరమోన్నతిమాత్మానం సోనిమ్నాద్భవ పాతకాత్ జీవస్సమారోహయతో జ్ఞానభక్త్యాది రూపిణీ సర్వానుపూర్వీ యస్యాస్తి మహాక్రమ ఇతీరితః -** పరమేశ్వరుడు సర్వోత్కృష్టుడు. జీవులందరూ తనను పొందేందుకు వీలుగా భక్తి, జ్ఞానము, వైరాగ్యము అనే సోపానక్రమమును ప్రసాదించినవాడు మహాక్రముడు.

ఇందుకు శ్రీభట్టులు చక్కని ఉదాహరణ ఇచ్చారు. బిడ్డకు తల్లి ముందుగా చనుబాలు, తరువాత ఆవుపాలు, తరువాత ఘనాహారము ఇచ్చినట్లుగానే భగవంతుడు కూడా క్రమక్రమముగా భక్తులందరికీ భగవదారాధనను సుగమం చేస్తాడు. ముందుగా భగవంతునిపట్ల విముఖత నశించాలి. ఆపై భగవంతునిపట్ల, శృతులపట్ల విశ్వాసం నెలకొనాలి. వాటిపట్ల మక్కువ కలగాలి. ఇలా భక్తి, జ్ఞానముల ద్వారా భగవంతుడు లభిస్తాడు. ఇందుకు అనేక జన్మలు పట్టవచ్చును. లఘు అత్రిస్మృతి నుండి శ్రీ భట్టులు చెప్పిన

ఉదాహరణ – **జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః నరాణామ్ క్షీణపాపానామ్ కృష్ణే భక్తిః ప్రజాయతే.** అనేక జన్మలయందు చేసిన తపస్సు, ధ్యానము, యోగమువలన నరులకు పాపములు క్షీణించి శ్రీకృష్ణునియందు భక్తి ప్రవర్ధిల్లుతుంది.

**బహూనామ్ జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః** – గీత 7.19
అనేక జన్మల తరువాత జ్ఞానియైనవాడు సర్వమూ వాసుదేవమయం అని గ్రహించి నన్ను శరణు పొందుతాడు. అటువంటి మహాత్ములు అరుదుగా ఉంటారు.

**అభ్యాస యోగేన తతో మామ్ ఇచ్ఛాప్తుమ్ ధనంజయః** (గీత 8.8) – నాయందు స్థిరముగా మనసు నిలవనట్లయితే అభ్యాసయోగముద్వారా ప్రయత్నించవలయును.

గీతోపదేశ సమయంలో కూడా భగవానుడు ఒక క్రమంలో అర్జునునికి ఉపదేశం చేశాడు, ఒక్కమారుగా కాదు – అని శ్రీ వి.ఎన్. వేదాంతదేశికన్ తమిళవ్యాఖ్యానంలో వ్రాశారు. ఇలా క్రమమైన అభివృద్ధి కూడా భగవదనుగ్రహంవల్లనే సాధ్యమవుతుంది.

శ్రీ శంకరులు ఈ నామమును త్రివిక్రమపరంగా వ్యాఖ్యానించారు. **మహాన్తః క్రమాః పాదవిక్షేపా అస్య ఇతి మహాక్రమః.** గొప్ప పాదవిక్షేపములు కలవాడు మహాక్రముడు.

**శం నో విష్ణుః ఉరుక్రమః** – తైత్తరీయోపనిషత్తు 1.1 – గొప్ప పాదవిన్యాసముగల విష్ణుదేవుడు మాకు శుభములు కలిగించునుగాక.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఇక్కడ 'మహా' శబ్దము ద్వారా మనము గ్రహించవలసినది ఏమంటే త్రివిక్రముని అడుగులు ఇంతపెద్దవని మనం చెప్పలేము. అవి మన ఊహకందనివి.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు మహాక్రముడు అనగా అందరినీ అన్నింటికంటె ముందు చేరగలడు. అంతటా వ్యాపించినవాడు. 'విష్ణు'నామము కూడ ఇదే అర్థమును సూచించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **న చాస్తి కించిత్ భువి వర్తమానమ్ మహాక్రమో యన్నా వశే కరోతి.** ఈ విశ్వంలో మహాక్రముని వశం కానిదేదీ లేదు.

ధర్మచక్రము రచయిత – ఆయన అడుగులు ఎంతపెద్దవంటే ఆ పాదములను ఆశ్రయించి మనం ఈ దుర్భరమైన దురంతమైన సంసారసాగరమును దాటవచ్చును. శ్రీవారి పాదములను సేవించినయెడల అత్యల్పుడు కూడా మహాత్ముడు కావచ్చును.

## 677. మహాకర్మా

- గొప్ప కార్యములు చేయువాడు.

### ఓం మహాకర్మణే నమః

ఈ నామము రెండుమార్లు వస్తున్నది.
72వ శ్లోకము. 677వ నామము. మహాకర్మా – **మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః**
84వ శ్లోకము. 793వ నామము. మహాకర్మా – **ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః**

**మహాన్తి కర్మాణి యస్య ఇతి మహాకర్మా.** మహాకర్మలు అనగా గొప్ప పనులు. శరణాగతులైన భక్తులను ఉద్ధరించడం మహాకర్మ అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. భగవానుని సృష్టి స్థితి లయాది కార్యాలు మహాకర్మలు అని ఇతర వ్యాఖ్యాతలు చెప్పారు.

క్రిమికీటకాదులను కూడా క్రమక్రమముగా ఉద్ధరించి శ్రీహరి తన సన్నిధానమునకు చేర్చుకొనుట అతివిస్మయనీయము, మహదాశ్చర్యకరము అని శ్రీ భట్టుల వ్యాఖ్య. **అత్యంత హీనవాన్ జంతూంశ్చ యోగ్యాన్ స్వానుభవస్య చ కరోతి మహదాశ్చర్యం కర్మ యస్యాస్తి సర్వదా మహాకర్మా స విజ్ఞేయో హ్యష్టార్ణో మనురుత్తమః** - నీచాతినీచులైనవారిని కూడా తనను పొందడానికి వీలుగా చేయగలవాడు 'మహాకర్మా'. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఉత్తమమైనది. ఓం మహాకర్మణే నమః.



https://commons.wikimedia.org/wiki/ File:God_Statues.jpg Photo by Vinodarch

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వార్ తిరువైమొళి (7.5.1)నుండి ఉదాహరించారు – శ్రీరాముడు తన అవతారానంతరం అయోధ్యను వీడి వైకుంఠమునకు వెళ్ళునపుడు అయోధ్యానగరంలోని సకల జీవరాశులను, గడ్డి పోచలను, చీమలను కూడా, తనతోపాటు తీసికొనివెళ్ళి ఉత్తమగతులు ప్రసాదించాడు.

ఆయన మహాకర్మలు భక్తులకు చేయూతనివ్వడానికే పరిమితం కావు. భక్తుల శత్రువులను శిక్షించడమూ, భక్తుల శత్రువులను పెడమార్గంలో పట్టించే లీలావినోదమూ కూడా ఆయన మహాకర్మలే. 84వ శ్లోకంలోని 'మహాకర్మా' నామమును శ్రీభట్టులు ఈ భావంలో వ్యాఖ్యానించారు. (బుద్ధావతారంలో భగవంతుడు ఉద్దేశ్యపూర్వకంగా నాస్తికులను వేదమార్గంనుండి విముఖులుగా చేశాడు.)

ఈ నామమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య – **మహత్ జగత్ ఉత్పత్త్యాది కర్మా అస్య ఇతి మహాకర్మా.** మహాజగత్తు సృష్టివంటి కార్యక్రమములు చేసేవాడు మహాకర్మ. ప్రళయకాలంలో జగత్తును శ్రీమహావిష్ణువు మ్రింగివేయడాన్ని శ్రీరాధాకృష్ణశాస్త్రి ప్రస్తావించారు. 84వ శ్లోకంలోని 'మహాకర్మా' నామంగురించి వ్యాఖ్యానిస్తూ శ్రీ శంకరులు – పంచభూతములవంటి మహత్తరమైనవానిని సృజించడం మహాకర్మ – అని చెప్పారు. **మహాన్తి వియదాదీని భూతాని కర్మాణి కార్యాణి అస్య ఇతి మహాకర్మా.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ భగవంతుని కార్యములు 'దివ్యములు' గనుక మహాకర్మలని ప్రస్తావించారు. **జన్మ కర్మ చ మే దివ్యమ్** (గీత 4.9).

ధర్మచక్రము రచయిత – జీవుడు కోరినవాటిని ఇవ్వడం భగవంతుని మహాకర్మ. ఐహిక సుఖములకు కావలసిన సాధనాసంపత్తిని, సాధనకు కావలసిన యోగమార్గమును, మోక్షమునకు కావలసిన భక్తి జ్ఞాన వైరాగ్యములను భగవంతుడు ప్రసాదించుచున్నాడు.

శ్రీ చిన్మయానంద – పంచభూతములను, వానినుండి నిర్ణీత విధానములో వర్తించు గ్రహనక్షత్రాదులను సృష్టించుట, వాటిని నిర్దిష్టముగా నడిపించుట, సమయము ఆసన్నమైనపుడు వానిని నాశనము చేయుట – ఇవి మహాకర్మలుగాక మరేమియగును?

## 678. మహాతేజాః

- గొప్పతేజస్సు కలవాడు.
- అజ్ఞానము తొలగించువాడు.

- శక్తివంతమైన, ఎదురులేని లక్షణములు గలవాడు.
- సూర్యచంద్రాదులకు తేజమునిచ్చువాడు.

ఓం మహాతేజసే నమః

**అనాద్యవిద్యాఖ్యతమో హరి తేజో మహద్యతః మహాతేజాహ్యతఃఖ్యాతః తేజదో వసువర్ణకః -** జీవికి అనాదిగా ఉన్న అవిద్యను (అజ్ఞానాంధకారమును) సమూలంగా నాశనం చేయు తేజస్సు గలవాడు 'మహాతేజాః'. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. తేజస్సును ప్రసాదిస్తుంది. ఓం మహాతేజసే నమః.

శ్రీ భట్టుల వ్యాఖ్యకు శ్రీ వి.వి. రామానుజన్ **'నారాయణ పరో జ్యోతిః'** అనే శృతివాక్యమును ఉదాహరించారు. శ్రీ తిరుమంగయాళ్వార్ తిరుచ్ఛందవిరుత్తము (34)లో కూడా 'నీవు తిరుగులేని జ్యోతివి' అన్నారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుని తేజస్సువల్లనే సూర్యుడు ప్రకాశమును పొందుచున్నాడు. ఇందుకు శ్రీ శంకరులు, ఇతర వ్యాఖ్యాతలు చెప్పిన ప్రమాణములు –

**యేన సూర్య స్తపతి తేజసేద్ధః** – తైత్తరీయ బ్రాహ్మణము 3.12.9 – ఆయన కాంతివలన సూర్యుడు ప్రకాశించుచున్నాడు.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేऽఖిలమ్ యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్** – గీత 15.12
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సేయని యెఱుంగుము.

**న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకమ్ నేమా విద్యుతో భాన్తి కుతోऽయమగ్నిః**
**తమేవ భాన్తమనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదమ్ విభాతి** – ముండకోపనిషత్ 2.10 (11.2.10?)
అక్కడ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, అగ్ని (మెరుపు) ప్రకాశింపలేవు. ఆయన కాంతివలననే అవన్నీ ప్రకాశిస్తున్నాయి.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్** – గీత 13.17
ఆ పరబ్రహ్మ అన్ని జ్యోతులకును జ్యోతి (పరంజ్యోతి). మాయాతీతుడును, జ్ఞానస్వరూపుడును, తెలిసికొనదగినవాడును, తత్వజ్ఞానముద్వారా ప్రాప్యుడును అతడే. సర్వప్రాణుల హృదయములందు విశేషముగా ఉండువాడును అతడే.

శ్రీ శంకరులు మరొక అర్థం కూడా చెప్పారు – **క్రౌర్య శౌర్యాదిభిః ధర్మైః మహాద్భిః సమలంకృత ఇతి వా మహాతేజః.** శత్రువులపట్ల శౌర్యము, దుష్టులపట్ల క్రౌర్యమువంటి శక్తివంతమైన, ఎదురులేని లక్షణములు గలవాడు మహాతేజస్వి.

ధర్మచక్రము రచయిత – సూర్యుడు బయటి చీకట్లను పారద్రోలినట్లే భగవంతుడు మనలోని చీకట్లను తొలగించును. ఆయన ప్రసాదించిన కాంతివలన మనము మనలను, దేవుని తెలిసికొనవచ్చును.

## 679. మహోరగః

- గొప్పవాడు మరియు మన హృదయము (ఉరము)నందు ప్రవేశించువాడు.
- గొప్ప హృదయము (ఉరము) కలవాడై మనను దీవించేవాడు.
- అనంతుడు, వాసుకి వంటి గొప్ప ఉరగములు (నాగములు)గా అవతరించినవాడు.
- అనంతుడు అను సర్పముపై శయనించినవాడు.

- గొప్ప ఉరముగల సూర్యునిగా అంతటా పయనించువాడు.

ఓం మహోరగాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **మహా-ఉరః-గః మహోరగః.** ఉరస్సు అనగా మనలోని హృదయము. **ఉరః ప్రదర్శితమ్ హృదయమ్, యద్ ద్వారా తాన్ (అదీయాన్) గచ్ఛతి ఇతి మహోరగః.** భగవంతునితో పోలిస్తే ధూళికంటె అల్పమైన మన హృదయాలలో భగవంతుడు ప్రవేశిస్తాడు గనుక ఆయన 'మహోరగః'. మన హృదయాలలో ఆయన ఎలా ప్రవేశిస్తాడు? ఐహిక సౌఖ్యాలు మనలో ఇంద్రియాలద్వారా ప్రవేశించినట్లే భగవంతుడు కూడా ఇంద్రియాలద్వారా మన హృదయాలలో ప్రవేశిస్తాడు అని శ్రీ భట్టులు చెప్పారు. మన కన్నులతో భగవంతుని దివ్యమంగళ విగ్రహాన్ని చూస్తాము. మన చెవులతో ఆయన మధురస్తోత్రాలను వింటాము. ఇలా క్రమంగా మన హృదయాలలోని భోగలాలసతను వెడలగొట్టి శ్రీహరి ప్రవేశిస్తాడు. ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ దివ్య ప్రబంధాలనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు. తిరుమోళి 1.10.9 (శ్రీ తిరుమంగైయాళ్వార్), తిరువైమోళి 6.10.3, తిరుచ్ఛంద 115, తిరువైమోళి 5.7.7 వంటివి.

ఈ నామములో 'ఉరస్' అంటే మన హృదయం అని పై వ్యాఖ్యలో చెప్పారు. శ్రీ బలదేవ విద్యాభూషణ 'ఉరస్' అనగా భగవంతుని హృదయం అని వ్యాఖ్యానించారు. **మహతా ఉరసా హృదయేన గచ్ఛతి స్వభక్తమ్ ముచుకుందమ్ ఇతి మహోరగః.** అల్పులైన భక్తులపట్ల దయతో వర్తించే హృదయం కలిగినందున భగవంతుడు 'మహోరగః'. కనుకనే ఆయన గుహుని కౌగిలించుకొన్నాడు. జటాయువుకు అంతిమసంస్కారం కావించాడు. శబరి ఇచ్చిన పండ్లను స్వీకరించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఉరసా గచ్ఛతి ఇతి ఉరగః.** రొమ్ముతో కదలునది పాము (ఉరగము). భగవంతుడు తాను సర్పములలో వాసుకిననియు, నాగములలో అనంతుడననియు గీతలో చెప్పియున్నాడు.

**సర్పాణామపి వాసుకిః** – గీత 10.28; **అనంతశ్చాస్మి నాగానామ్** – గీత 10.29

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **మహాన్-మహనీయః, ఉరగః-అనంతః, శయ్యారూపేణ యస్య ఇతి మహోరగః.** గొప్ప ఉరగమైన అనంతుని శయ్యగా కలిగినవాడు మహోరగుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – మహా-ఉరస్-గ, సూర్యదేవుడై గొప్ప వక్షస్థలము కలిగి నిరంతరము ప్రయాణించువాడు మహోరగుడు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ ప్రతి నామమునకు వ్యాకరణ సూత్రాలననుసరించి విశిష్ఠమైన వ్యాఖ్యానం వ్రాశారు. సూర్యుడు, విష్ణువు ఒకరే అన్న భావంలో ఆయన వ్యాఖ్యానించారు.

## **680.** మహాక్రతుః

- గొప్ప యజ్ఞముద్వారా ఆరాధింపబడువాడు.
- సులభముగా పూజింపబడువాడు.
- అనేకవిధములుగా పూజింపబడువాడు.
- ఉత్తమ ఫలములనిచ్చే గొప్ప యజ్ఞము.
- పాంచరాత్ర క్రతువు అనే గొప్ప యజ్ఞము చేసినవాడు.

ఓం మహాక్రతవే నమః

48వ శ్లోకము, 448వ నామముగా 'క్రతుః' అనే నామము వచ్చినది. **యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాంగతిః.** 'క్రతువు' అనగా ఒక విధమైన యాగము. అన్ని యాగములు భగవంతుని ఉద్దేశించి చేసేవే గనుక భగవంతునికి 'క్రతుః' అనే పేరు కూడా వర్తిస్తుంది. శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **కరోతి ఇతి క్రతుః, క్రియతే వా క్రతుః.** చేసేవాడు క్రతువు. చేసేది క్రతువు – అని కూడా నిర్వచించారు. 'మహా' అనే శబ్దానికి గొప్ప, అనేక, సులభమైనందున గొప్ప – వంటి అర్థాలు చెప్పవచ్చును.

శ్రీ అణ్ణాంగారాచార్య స్వామి 'మహా' అంటే 'గొప్ప' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. గొప్ప యజ్ఞములు భగవంతుని ఆరాధిస్తూ చేయబడుతాయి. కనుక ఆయన మహాక్రతువు.

శ్రీ భట్టులు 'మహా' అంటే (1) భక్తులకు సులభమైన, సౌకర్యవంతమైన పూజావిధానము (2) అనేకములైన పూజావిధానములు – అనే అర్థాలలో వ్యాఖ్యానించారనిపిస్తుంది. **మహాత్ సర్వ సుకరమ్ ఆరాధనమ్ అస్య ఇతి మహాక్రతుః.** ఎటువంటివారైనా తేలికగా, అనేక రకాలుగా శ్రీహరిని ఆరాధించవచ్చును. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుధర్మమునుండి, గీతనుండి ఉదాహరించారు.

**యో న విత్తై ర్నవిభవై ర్నవశోభి న్నభూషణైః**
**తోష్యతే హృదయేనైవ కస్తమీశమ్ న తోషయేత్** – విష్ణుధర్మము 90.69
ఈశ్వరుడు ధనము, వైభవము, భూషణములకు వశుడు కాడు. కేవలము ప్రేమించే హృదయానికి వశుడౌతాడు. అలాంటి ఈశ్వరుని సంతోషపెట్టకుండా ఎలా ఉండగలరు?

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్** – గీత 9.27.
ఓ కౌంతేయ! నీవు ఆచరించు కర్మను, భుజించెడి ఆహారమును, హోమము చేయు హవ్యమును, అర్పించు దానమును, ఆచరించు తపస్సును నాకే సమర్పించుము.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భగవంతుని అనేక విధములుగా అర్చింపవచ్చును. తులసి ఆకులు సమర్పించి ఆయన అనుగ్రహమును సాధింపవచ్చును.

శ్రీ భట్టులు ఇచ్చిన అదనపు వివరణ – ఆగమ శాస్త్రములు నిర్దేశించినట్లుగా ఆయనను పెక్కు పనులద్వారా పూజింపవచ్చును. అట్టి పనులు ఆయనకు సమర్పణ చేసినంతనే పవిత్రములగును. **సమర్పణ సంస్కార స్వాదు కృతైః ఆగమశాస్త్రకారిత సర్వవ్యాపారైః ఆరాధ్యత్వాత్.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మహాన్ శ్చ క్రతుశ్చ ఇతి మహాక్రతుః.** భగవంతుడు గొప్ప యజ్ఞము. గీతలో భగవంతుడు తానే క్రతువునని చెప్పియుండెను.

**అహం క్రతు రహం యజ్ఞః స్వధామహమౌషధమ్ మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహం హుతమ్** – గీత 9.16
నేనే క్రతువును. నేనే యజ్ఞమును. స్వధయును నేనే. ఓషధులు నేనే. నేనే మంత్రమును. నేనే ఘృతమును. నేనే అగ్నిని. హోమరూపక్రియయును నేనే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **మహాన్ క్రతుః పాంచరాత్రో యస్య ఇతి మహాక్రతుః.** శతపథబ్రాహ్మణము(13.6.1)లో చెప్పిన ప్రకారం నారాయణుడు పాంచరాత్రక్రతువును ఆచరించి తాను అందరికంటె అధికుడై తానే సర్వము అయ్యాడు

**పురుషోహవై నారాయణో కామ్యత అతితిష్టేయమ్**
**సర్వాణి భూతాని అహమేవ ఇదమ్ సర్వమితి**
**స ఏతమ్ పురుషమేధమ్ పాంచరాత్రమ్ యజ్ఞ**

**క్రతుమపశ్యత్ తమాహరత్ తేన జాయత తేనేష్ట్వమ్**
**అత్యతిష్ఠ త్సర్వాణి భూతానీదమ్ సర్వమ్ భవాత్.**

## 681. మహాయజ్వా

- గొప్ప యజ్ఞములు చేసేవాడు.
- ఉత్తములు, మహాయజ్వలు అయిన భక్తులు తనవారిగా కలిగినవాడు.

### ఓం మహాయజ్వనే నమః

**దేవతాంతర యాజిభ్యః స్వయాజ్యుత్కృష్టకారకః మహాయజ్వా సముద్దిష్టః సత్కర్మఫలదోమనుః -** అన్యదేవతలను ఆరాధించేవారికంటే ఉత్కృష్టులైనవారు, ఉత్తమఫలములు పొందేవారు తన భక్తులుగా కలవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. పుణ్యకర్మప్రదము. ఓం మహాయజ్వనే నమః.

పాణిని సూత్రము (3.2.103 **సు యజోర్ఙ్వానిప్)** ప్రకారము 'యజ్వా' అనే పదమునకు మూలధాతువు 'యజ్'- త్యాగము చేయుట, బలి ఇచ్చుట. 'యజ్వా' అనగా యజ్ఞము చేసినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మహాన్తమ్ యజ్ఞమ్ కృతవాన్ ఇతి మహాయజ్వా.** గొప్ప యజ్ఞములు చేసినవాడు మహాయజ్వ. రామావతారమునందు అశ్వమేధయాగము చేసినవాడు. అంతేగాక తన భక్తులు చేయు యజ్ఞములు చక్కగా పరిసమాప్తమగునట్లు కాపాడు భగవానుడే ఆ యజ్ఞములకు యజమాని అని భావింపవచ్చును. ఆ విధంగా కూడా ఆయన మహాయజ్వ.

శ్రీ భట్టుల వ్యాఖ్య – అన్యదేవతలను తలపక శ్రీమహావిష్ణువునే ఆరాధించు భక్తులు ఉత్కృష్టమైనవారు. అట్టి యజ్ఞకర్తలు మహాయజ్వలు. వారికి నాధుడైన భగవంతుడు మహాయజ్వ. మరోవిధంగా, అలాంటి భక్తులు తన ఆత్మగా కలవాడు మహాయజ్వ. అన్యదేవతలను ఆరాధించేవారికంటే తనను ఆరాధించేవారికి అధికమైన ఫలమును ప్రసాదించేవాడు మహాయజ్వ. **స్వయాజినామ్ అన్య యాజిన్యోపి అత్యుత్కృష్టత్వాత్ మహాయజ్వా.**

ఆయన భక్తులు ఉత్కృష్టులు ఎందుకవుతారంటే వారు ఐహిక ఫలములను త్యజించి మోక్షమును కోరుతారు.

## 682. మహాయజ్ఞః

- పూజింపదగినవారిలో అత్యుత్తముడు.
- యజ్ఞములలో ఉత్తమయజ్ఞస్వరూపము కలవాడు (జపయజ్ఞము).
- జ్ఞానులద్వారా పూజింపబడువాడు. గొప్ప యజ్ఞముద్వారా పూజింపబడువాడు.

### ఓం మహాయజ్ఞాయ నమః

**అన్యేభ్యో దేవ యాగేభ్యః స్వయాగోత్కృష్టకారకః మహాయజ్ఞ స్సమాఖ్యాతో హ్యష్టార్ణో హరియాగదః -** ఇతర దేవతలకన్నా తన యాగము గొప్పదిగా కలవాడు మహాయజ్ఞము. ఈ నామము అష్టాక్షరీమంత్రము. హరిపూజాఫలాన్నిస్తుంది. ఓ మహాయజ్ఞాయ నమః. ఇంతకుముందు నామము 'మహాయజ్వా' వలెనే ఈ నామము 'మహాయజ్ఞః'ను కూడా 'యజ్' అనే ధాతువునుండి వివరింపవచ్చును. **దేవపూజా సంగతి కరణా యజన దానేషు.** త్యాగము చేయుట, పూజించుట, ఇచ్చుట, దానము చేయుట, సంబంధము కలిగియుండుట – వంటి అర్థములలో 'యజ్' ధాతువు వినియుక్తము. **యజనమ్ యజ్ఞః, ఇజ్యతే ఇతి వా యజ్ఞః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – పూజింపదగినవారిలో శ్రేష్ఠుడు 'మహాయజ్ఞః'. యజ్ఞమనగా భగవదారాధనము. యజ్ఞము అనగా మనము ఆరాధించునది (భగవంతుడు). మహాయజ్ఞము అనగా ఆరాధించువానిలో ఉత్తమమైనది, అనగా శ్రీమహావిష్ణువు. ఎంపెరుమాన్ సుప్రభాతమును పఠించుట, భక్తితో మెలగుట, రుచిశుచికరమైన నైవేద్యమును సమర్పించుట, సాష్టాంగప్రమాణము చేయుట – ఇవన్నీ యజ్ఞములే. వీనిని ఇతరదేవతలను గాక శ్రీనివాసుని ఉద్దేశించి యొనర్చుట మహాయజ్ఞమగును. ఎందుకంటే ఆయన తన భక్తులను తన స్వంత శరీరమువలె పరిరక్షించును. **రక్షతే భగవాన్ విష్ణుః భక్తానాత్మశరీరవత్**. మరియు వారు సమర్పించిన దానిని ప్రేమతో స్వీకరించును.

**యాః క్రియాః సంప్రయుక్తాః స్యుః ఏకాంతగత**
**బుద్ధిభిః తాస్సర్వాః శిరసాదేవ ప్రతిగృహ్ణాతివై స్వయమ్** – మహాభారతము.మోక్షపర్వము 17.163.
జ్ఞానులు చేసే పూజాదికములను పరమేశ్వరుడు శిరసుతో (తలవంచి) స్వీకరిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు యజ్ఞములలో శ్రేష్ఠమైన యజ్ఞము. ఇందుకు ప్రమాణము గీత (10.25)లో ఉన్నది. **యజ్ఞానామ్ జపయజ్ఞోస్మి.** యజ్ఞమలలో నేను జపయజ్ఞమును. జపయజ్ఞమునకు దేశకాల బంధనములు లేవు. ఖర్చుతో కూడిన సంభారములు అక్కరలేదు. శ్రమ ఉండదు. హింస ఉండదు. 'క్రతువు'అనగా ఒ ప్రత్యేకమైన ఫలితమును ఆశించి చేయునది. యజ్ఞము అనగ విద్యుక్తధర్మముగా చేయునది. అట్టి యజ్ఞములలో శ్రేష్ఠమైన జపయజ్ఞము భగవత్స్వరూపము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – గొప్ప యజ్ఞములద్వారా పూజింపబడువాడు, గొప్ప జ్ఞానులద్వారా పూజింపబడువాడు 'మహాయజ్ఞః'. **మహత్ యజనమ్ యస్య, మహద్భిః ఇజ్యత ఇతి వా.**

ధర్మచక్రము రచయిత – శాస్త్రముల ప్రకారము మనమందరము ఐదు విధాలైన యజ్ఞాలను ఆచరించాలి.

(1) భూతయజ్ఞము – పశుపక్ష్యాదులకు ఆహారమిచ్చుట, సేవించుట, వానిని కాపాడుట.
(2) పితృయజ్ఞము – పెద్దలను, పితృదేవతలను సేవించుట.
(3) నరయజ్ఞము – సాటి మనుష్యులకు సేవచేయుట, వారికి కష్టము కలిగించకుండ ఉండుట.
(4) ఋషియజ్ఞము – వేద, మంత్ర, విజ్ఞాన పఠనము.
(5) దేవయజ్ఞము – భక్తితో భగవంతుని సేవించుట.

ఈ ఐదు యజ్ఞాలను కూడా మనము శ్రీహరిని ఉద్దేశించి ఆచరింపవలెను. నిజానికి వాటిని ఆచరించేవాడు కూడా శ్రీహరియేనని గ్రహింపవలెను.

## **683.** మహాహవిః

- గొప్ప హోమద్రవ్యములచే పూజింపబడువాడు.
- పరబ్రహ్మస్వరూపమైన హవిస్సు
- ప్రళయకాలమున జగములన్నింటిని హవిస్సు రూపమున స్వీకరించువాడు.

### ఓం మహాహవిసే నమః

అర్పింపబడునది హవిస్సు. అగ్నిహోత్రమునందు హోమము చేయబడు నెయ్యి, తేనె, అన్నము వంటివి హోమద్రవ్యములు. 'మహాహవిః' అనగా గొప్ప హోమద్రవ్యము లేదా ఆ హోమద్రవ్యమును స్వీకరించువాడు లేదా ఆ ద్రవ్యమును అర్పించువాడు లేదా ఆ ద్రవ్యమును సమర్పించు సాధనము – ఇలా వివిధ అర్థములను గ్రహింపవచ్చును.

భగంతుడు మహాహవిస్సు ఎలాగవుతాడంటే

(1) ఆయనకు సమర్పించేవి కూడా ప్రపంచంలో ఉన్నతమైనవి (ఉదాహరణకు – ఆత్మ)

(2) మనం సమర్పించే అత్యల్పమైనవానినికూడా దయతో స్వీకరించే మహోన్నతుడాయన.

(3) ప్రతివస్తువూ ఆయన స్వరూపము లేదా అవతారము లేదా విభూతి. అలాగే గొప్ప గొప్ప యజ్ఞములు కూడా ఆయన స్వరూపములే.

శ్రీ భట్టుల వ్యాఖ్య – గొప్ప హోమద్రవ్యములను స్వీకరించువాడు 'మహాహవిః'. మనసు, బుద్ధి, ఇంద్రియములు, అన్నింటిని మించి ఆత్మసమర్పణము. **అహమేవన్ మామ్ జుహోమి** (తైత్తరీయ నారాయణ 41). ఇవి మహాహవిస్సులు. వానిని అర్పించడానికి భూతహింస చేయనక్కరలేదు. **న తత్ర పశుఘాతోఽభూత్** (మహాభారతము. శాంతిపర్వము 337.9). **ప్రత్యగాత్మా హవిష్ట్వాత్, అహింస్రమ్ ఆత్మాది హవిః యస్య స్యాత్ స మహాహవిః.**

ఆత్మసమర్పణము గురించి ఆళ్వారుల దివ్యప్రబంధాలలో అనేక ప్రస్తావనలున్నవి. నిజానికి ఈ ఆత్మకూడా భగవంతునిదే అయినా మన స్వంతవస్తువేదో దేవునికిచ్చినట్లుగా దీనిని మనం అర్పించవచ్చును. అదేదో గొప్ప నివేదనగా భావించి భగవంతుడు దానిని స్వీకరిస్తాడు. ఆత్మసమర్పణ అనగా అహంకారభావాన్ని భక్తి అనే అగ్నిలో దహింపజేయడం.

శ్రీ బలదేవ విద్యాభూషణ –

**నమస్కార స్వాధ్యాయ ఔషధి రూపత్వేన అతిపవిత్రత్వాత్ అన్య హవిర్భ్యో మహాన్తి హవింషి యస్య స మహాహవిః**

నమస్కారము, వేదపఠనము, ఔషధి (తులసి)వంటి అత్యంత శుద్ధమైన (మలినము లేని) నివేదనలను స్వీకరించేవాడు 'మహాహవిః'.

**తులసీదళ మాత్రేన జలస్య చుళుకేన**
**విక్రీణీ తే స్వమాత్మానమ్ భక్తేభ్యో భక్తవత్సలః** – విష్ణుధర్మము

ఆ భక్తవత్సలుడు తన భక్తులు సమర్పించే తులసీదళాలు, చారెడు నీళ్ళు వంటివానికి బదులుగా భక్తులకు తనను తానే ఇచ్చివేస్తాడు (భక్తులను తనలో చేర్చుకొంటాడు).

**యః క్రియాః సంప్రయుక్తాః స్యుః ఏకాన్తగతబుద్ధిభిః**
**తాః సర్వాః శిరసాదేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్** – మోక్షధర్మము

భక్తులు ఏకాగ్రతతో (అన్యమైన ఆలోచన లేకుండా) తనకు సమర్పించేవాటిని భగవంతుడు శిరసువంచి (వినమ్రతతో) స్వీకరించాడు.

**జప్యేనైవ సంశుద్ధ్యేత్ బ్రాహ్మణో నాఽత్ర సంశయః**
**కుర్యాదన్యన్ న కుర్యాత్ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే** – మోక్షధర్మము

శుద్ధమైన భగవన్నామజపం ద్వారానే బ్రాహ్మణుడు బ్రాహ్మణుడనిపించుకుంటాడు. ఇతరకార్యాలవల్ల కాదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – యజ్ఞములలో సమర్పించు హవిస్సు పరబ్రహ్మస్వరూపమే గనుక భగవానుడు 'మహాహవిః'

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా** – గీత 4.24

యజ్ఞకార్యములందు ఉపయుక్తమగు స్రువాది సాధనములు బ్రహ్మము. హోమము చేయబడు ద్రవ్యము బ్రహ్మము. యజ్ఞమునాచరించు కర్తయు బ్రహ్మము. హవనక్రియయు బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడైయుండు యోగిద్వారా పొందదగిన యజ్ఞఫలముకూడ బ్రహ్మమే.

**అహం క్రతు రహం యజ్ఞః స్వధామహమౌషధమ్ మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహం హుతమ్** – గీత 9.16
నేనే క్రతువును. నేనే యజ్ఞమును. స్వధయును నేనే. ఓషధులు నేనే. నేనే మంత్రమును. నేనే ఘృతమును. నేనే అగ్నిని. హోమరూపక్రియయును నేనే.

**జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్** – గీత 9.15
మరికొందరు జ్ఞానయోగులు నిర్గుణాకారబ్రహ్మనైన నన్ను జ్ఞానయజ్ఞముద్వారా అభేదభావముతో ఉపాసించుచుందురు. మరికొందరు అనంతరూపములతో ఒప్పెడి నా విరాట్ స్వరూపమును పృథక్ భావముతో ఆరాధించుచుందురు.
ఈ శ్లోకమునకు శ్రీ రామానుజులు వ్రాసిన వ్యాఖ్య ఇలా ఉన్నది – **..... వివిధ విభక్త నామ రూప స్థూల చిత్ అఇత్ వస్తు శరీరః స్యామ్ ఇతి సంకల్పః, స ఏకదేవ ఏక తిర్యగ్ మనుష్య స్థావరాఖ్య విచిత్ర జగచ్ఛరీరః అవతిష్ఠతే ఇతి అనుసంధానాశ్చ మామ్ ఉపాసతే.**
భగవంతుని సంకల్పానుసారము ఆయన నామరూపస్థూలమై, సకల వస్తుజీవసముదాయమైన జగత్తే శరీరంగా దాల్చాడు. మహాత్ములు ఆయనను అలా భావించి ధ్యానిస్తారు.

(శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి) ఈ నామవివరణ సందర్భంలో హవిస్సు కూడా భగవంతుడే అని గ్రహించాలి. దీని అర్థం సమస్తం ఆయనలో ఉన్నది. అంతేగాని భగవంతునికి, వానికి తేడాలేదు అనుకోకూడదు. పరబ్రహ్మను అగ్నిలో, పరబ్రహ్మ స్వరూపములేయగు హవిస్సులను, పరబ్రహ్మస్వరూపుడగు యజమాని, పరబ్రహ్మయొక్క ప్రీతి కొరకు, పరబ్రహ్మార్పణ కావించుచున్నాడను దివ్యభావమును సాధకులు సదా భావింపవలయును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ప్రళయకాళమున సకలజగత్తును భగవంతుడు హవిస్సుగా స్వీకరించును. అలా జగత్తు ఆయనలో లీనమగును. అగ్నిలో వ్రేల్చినది కూడా అగ్ని అయినట్లుగా ప్రళయకాలమున ఆయనలో లీనమైన జగత్తు పరబ్రహ్మమే అగును.



యాదగిరిగుట్ట శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి ఆలయం చిత్రాలు.

https://commons.wikimedia.org/wiki/File:Yadagirigutta_temple_main_Gopuram.jpg Photo by N. Aditya Madhav
https://commons.wikimedia.org/wiki/File:YadaGiriGutta_4.JPG Photo by A.RadhaKrishna



**స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిః స్తోతా రణప్రియః |**
**పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిరనామయః || (73)**

లేదా

**స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతః స్తోతా రణప్రియః |**
**పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిరనామయః || (73)**

**684.** స్తవ్యః

- స్తవము చేయదగినవాడు. స్తుతించడానికి యోగ్యుడు.
- అందరూ శ్రీహరిని స్తుతించెదరు. శ్రీహరి ఎవరినీ స్తుతించనవసరం లేదు.

ఓం స్తవ్యాయ నమః

**చేతశ్శరీరయోర్గంతో వ్యాపారారాధ్యతే హరేః ఉక్తం నారాయణస్యాథ నాగారాధ్య త్వముచ్యతే స్మృతస్తుత్యర్హనాత్ స్తవ్యః షడర్ణో బంధమోచకః -** స్తుతించడానికి తగిన యోగ్యత కలవాడు కాబట్టి నారాయణుడు స్తవ్యుడు అనబడుచున్నాడు. ఈ నామము షడక్షరి. సంసారబంధనాన్ని త్రెంచివేస్తుంది. ఓం స్తవ్యాయ నమః.

'స్తు' అనగా 'పొగడుట' అనే ధాతువునుండి ఈ నామమును వ్యాఖ్యానించారు. 'యత్' అనే ప్రత్యయంవల్ల 'పొగడుటకు తగినవాడు' అనే అర్థం వస్తుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్తవమ్ అర్హతి ఇతి స్తవ్యః.** శ్రీమహావిష్ణువు శాశ్వత, అపరిమిత, దోషరహిత, అనంత కళ్యాణ సంపన్నుడు. కనుక స్తవము చేయదగినవాడు. ఆయనను స్తుతిస్తే సంసారబంధంనుండి విముక్తి లభిస్తుంది. ఇందుకు శ్రీ భట్టులు బృహస్పతిసంహితనుండి ఉదాహరించారు.

**ఆదరేణ యథా స్తౌతి ధనవంతం ధనేచ్ఛయా**
**తథా చేద్విశ్వకర్తారం కో న ముచ్యేత్ బంధనాత్** – బృహస్పతిసంహిత

ధనంకోసం ధనవంతుడిని పొగడుతాము. అలాగే విశ్వకర్తయైన శ్రీమహావిష్ణువును స్తుతించి బంధనాలనుండి విముక్తిని పొందవచ్చును.

శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము ఫలశ్రుతిలో భీష్ముడు యుధిష్ఠిరునికి ఇలా చెప్పాడు – **ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః నామ్నాం సహస్రం దివ్యానాం అశేషేణ ప్రకీర్తితమ్**

ఇలా స్తవనీయుడు (కీర్తనీయుడు), మహాత్ముడు అగు భగవంతుడు కేశవుని దివ్యమైన వేయి నామములు సంకీర్తనము చేయబడినవి. ఇక్కడ 'కేశవ'నామ ప్రయోగముద్వారా ఆయనే శివుని, బ్రహ్మను సృజించెనని సూచింపబడినది. మహాత్ముడు అనగా పురుషోత్తముడు. 'దివ్య' పదమువలన ఈ వేయి నామములను భూమిపైనా, పరమపదములోనూ స్తోత్రము చేయవచ్చునని గ్రహించాలి. 'కీర్తనీయుడు' శ్రీమహావిష్ణువే.



మస్కట్‌లో శ్రీనివాస కళ్యాణం. ఏప్రిల్ 2019

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (3.9.1)నుండి ఉదాహరించారు – ఈ సంగతి వినడం మీకు కష్టంగా ఉండవచ్చును. అయినా మీ మేలుకోరి చెబుతున్నాను వినండి. నా మధురమైన స్తుతులన్నీ తిరువేంకటాద్రిపై మత్తగజంవలె వేంచేసియున్న నా ప్రభువుకే. ఇతర దేవతలను స్తుతించి నా స్తుతులను వ్యర్థం చేసుకొనలేను.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **స్తోతుమ్ యోగ్యః సర్వోత్తమత్వాత్ ఇతి స్తవ్యః.** అన్నివిధాలుగా ఆయన సర్వోత్తముడు. కనుక స్తవనీయుడు. స్తవ్యుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుని దివ్యగుణములు అనంతములు. వేలకొలది సంవత్సరములు స్తుతించినాగాని అవి పూర్తికావు.

**తమ్ ఈశానామ్ వరదమ్ దేవమీడ్యం** (శ్వేతాశ్వరోపనిషత్తు 4.11). ఆయన అందరకు దేవదేవుడు. వరదుడు. స్తుతి చేయదగినవాడు.

**తమ్ విశ్వరూపమ్ భవభూతమ్ ఈడ్యం** (శ్వేతాశ్వరోపనిషత్తు 6.4). ఆయన విశ్వరూపుడు. జరిగినదానికి, జరుగుతున్నదానికి కారణము. స్తుతింపదగినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వైః స్తూయతే, న స్తోతా కస్య చిత్ ఇతి స్తవ్యః.** అందరూ ఆయనను స్తుతిస్తారు. ఆయన ఎవరినీ స్తుతింపనక్కరలేదు. కనుక స్తవ్యుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **వాగ్వ్యాపారేణైవ సమారాధ్యత్వాత్ నిత్య కళ్యాణ గుణకతయా స్తోతుమ్ అర్హ స్తవ్యః.** ఆయన అనంత కళ్యాణగుణాలను మాటలద్వారా ఆరాధించడం చాలా సులభం. కనుక ఆయన స్తవ్యుడు.

ధర్మచక్రము రచయిత ఆళ్వారుల స్తుతులనుండి ఉదాహరించారు. ఆయనను స్తుతించుట, వానికి అర్థం తెలిసికొనుట, ధ్యానించుట, గానం చేయుట, జపించుట, అంతా ఆయనకు అర్పించుట, ఇవన్నీ ఆయనను స్తుతించే విధములు.

## 685. స్తవప్రియః

- స్తవము (స్తుతి, స్తోత్రము)వలన ఆనందించువాడు.

### ఓం స్తవప్రియాయ నమః

**యయాకయా చిద్భాషత్యా యేనకేవాపి జంతునా యథాకథం చిత్కృథితో యస్య ప్రియతమస్తవః స్తవప్రియ స్స కథితో వస్వర్ణః ప్రీతివర్ధకః -** పరమేశ్వరుని ఏ భాషలో స్తుతించాలి? అనే అనుమానం అవసరం లేదు. ఎవరు ఏ భాషలో, ఏ విధంగా స్తుతించినా ఆయనకు అర్థం అవుతుంది. ఆయన ఆ స్తోత్రాన్ని స్వీకరిస్తాడు. కనుక ఆయన స్తవప్రియుడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ప్రేమను వృద్ధిపొందిస్తుంది. ఓం స్తవప్రియాయ నమః.

(శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి) **మద్భక్తాః యత్ర గాయన్తి తత్ర తిష్ఠామి నారద.** నా భక్తులు నన్ను ఎచ్చట ప్రేమతో గానము చేయుదురో అచ్చట నేనుందునని శ్రీమహావిష్ణువు నారదునితో అన్నాడు. భక్తితో, ప్రేమతో, శ్రద్ధతో, హృదయపూర్వకముగా స్తవము చేసినచో భగవానుడు అత్యంతమోదము పొంది వారికి కామితార్థములను వర్షింపజేయును.

శ్రీ భట్టుల వ్యాఖ్యానము – **యథాకథంచిత్** – ఏ విధంగానైనా (విమర్శిస్తూ కూడా); **యయా కయాచిత్ భాషయా** – ఎలాంటి భాష ఐనా (తప్పులున్నా కూడా); **యేన కేనపి** – ఎవరైనా, దేవుడిని వ్యతిరేకించేవారైనా; **తేజస్కరః తిరస్కారోపి** – పొగడినా, తెగడినా; **స్తవప్రియతమః అస్య ఇతి స్తవప్రియః** – వాటిని స్తోత్రాలుగా స్వీకరించి సంతోషిస్తాడు గనుక స్తవప్రియుడు. శ్రీ భట్టులు ఘంటాకర్ణుని ఉదంతాన్ని ఉదాహరించారు. ఘంటాకర్ణుడు పిశాచరాజు. విష్ణునామంపట్ల విరక్తుడు. విష్ణునామం వినపడకుండా తన చెవులకు గంటలు కట్టుకొన్నాడు. ఎవరైనా విష్ణునామం ఉచ్ఛరించినపుడు ఆ గంటలు మ్రోగించుకొనేవాడు. అందునిమిత్తం ఎప్పుడూ ఎక్కడ విష్ణునామం వినిపిస్తుందోనని అప్రమత్తంగా గమనిస్తూ ఉండేవాడు. ఈ క్రియను భగవన్నామస్మరణగా పరిగణించి భగవానుడు అతనికి మోక్షాన్ని అనుగ్రహించాడు.

శ్రీ వి.వి. రామానుజన్ శిశుపాలుని ఉదంతాన్ని (వైరభక్తిని) ఉదాహరించారు.

శ్రీ నమ్మాళ్వార్. తిరువైమొళి 7.9.11 – అర్థం తెలిసిగాని, తెలియక గాని, శ్రీహరి నామాన్ని స్మరిస్తే రెండువిధాలుగానూ ఫలితం ఒకటే. సత్ఫలమే; తిరువైమొళి 5.1.1 – భగవంతుని పొగడాలనే లేదు. ఆయనను గురించి ఏదో ఒకటి అంటే దానిని ఆయన స్తవంగా స్వీకరించి మనకు సద్గతిమార్గం చూపుతాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – స్తవప్రియుడంటే దేవుడు పొగడ్తలను ఆశిస్తున్నాడని అర్థం కాదు. జీవుడు తన ఇంద్రియాలను సద్వినియోగపరచుకొంటున్నందుకు సంతోషిస్తాడు. భగవత్ స్తుతివల్ల జీవుడు భగవంతునికి ఇంకా చేరువ అవుతాడు.

ధర్మచక్రము రచయిత – తల్లిదండ్రులు ఇచ్చిన పుస్తకాలను బాగా చదివి పిల్లలు పరీక్షలో ఉత్తీర్ణులయితే తల్లిదండ్రులు ఆనందిస్తారు. అలాగే భగవంతుడిచ్చిన ఇంద్రియాలను విష్ణుస్తవంలో వినియోగిస్తే భగవంతుడు సంతోషిస్తాడు.

## 686. స్తోత్రమ్

- స్తోత్రమునకు మూలము. భక్తులకు జ్ఞానము ప్రసాదించి వారిచే తన స్తోత్రమును చేయించుకొనేవాడు.

- స్తోత్ర స్వరూపుడు.
- వేదములచే స్తుతింపబడువాడు.

## ఓం స్తోత్రాయ నమః

'స్తు' అనే ధాతువునకు 'పొగడుట' అని అర్థము. దీనికి 'ష్ట్రాన్' అనే ప్రత్యయంవల్ల 'ఆధారము, కారణము' అనే భావాలు చేరుతాయి (పాణిని సూత్రము 3.2.182). భగవానుడు స్తోత్రస్వరూపియని ఈ నామమునకు సాధారణ భావము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుని అనుగ్రహంవల్లనే భక్తులు భగవంతుని కీర్తిస్తారు. ఇలా స్తుతికి మూలము, సాధనము కూడా భగవంతుడే. **స్వేనైవ నిష్టాద్యతయా స్వస్తుతే స్తోత్రముచ్యతే**. తనను స్తోత్రం చేసేవారికి జ్ఞానమును ప్రసాదించి తన స్తోత్రము తానే చేయించుకొనేవాడు స్తోత్రము.

శ్రీ భట్టులు ఈ నామవివరణలో ధ్రువుని ఉదంతాన్ని ఉదాహరించారు. భగవద్దర్శనానందాతిశయంతో నోట మాట రాక ధ్రువుడు అప్రతిభుడై నిలబడిపోయాడు. తన భక్తుని కలరపాటును గుర్తించిన భగవానుడు దయగొని నిజహస్తాగ్రమందలి వేదమయశంఖంతో ధ్రువుని కపోతలాన్ని స్పృశించాడు. ఆ స్పర్శ ప్రభావం వలన ధ్రువునికి అద్భుతమైన వాక్చాతుర్యం లభించింది. అతను వాసుదేవుని స్తుతించాడు. (శ్రీ ఏల్చూరి మురళీధరరావు రచనలోని వాక్యాలు).

**యోऽనంతః ప్రవిశ్యమామ్ వాచమిమమ్ ప్రసుప్తామ్**
**సంజీవయత్యఖిల శక్తిధరః స్వధామ్నా**
**అన్యాంశ్చ హస్త చరణ శ్రవణ త్వగాదిన్**
**ప్రాణాన్నమో భగవతే పూరుషాయ తుభ్యమ్**
నాలో ప్రవేశించి, సుప్తమైన నా మాటలకు ప్రాణం పోసి, తన విశిష్టశక్తితో నా కర చరణ చర్మాది ఇంద్రియాలను పునరుజ్జీవితం చేసిన భగవత్ పురుషునకు ప్రణామములు.

తిరువైమొళి 10.7.5 – భగవంతుడు శ్రీనమ్మాళ్వారును సాధనంగా చేసుకొని తన స్తుతులు తానే పాడుకొనెనట.

అన్నమయ్య – **నా నాలుకపై నిలిచి నానా సంకీర్తనలు పూని నాచే నిన్ను పొగడించితివి.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడే స్తోత్రము. భక్తితో శ్రీనివాసుని కళ్యాణగుణములను గానముచేయు వ్యక్తి సచ్చిదానందానుభవము పొందును. అప్పుడు నామము (స్తోత్రము), నామి (భగవంతుడు) ఒకటేయగును. కనుక భగవంతుడే స్తోత్రము. (శ్రీ చిన్మయానంద వివరణ).

శ్రీ రాధకృష్ణశాస్త్రి – భగవంతుని స్తుతించే, కీర్తించే మాటలన్నీ మంచిమాటలే.  కనుక అవి భగవంతుని స్వరూపములే. (లోకంలో ఉత్తమ స్వభావము కలిగినవన్నీ తన విభూతులేనని గీతలో శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చాడు).

**నలమ్ తరుమ్ సొళ్ళై నాన్ కణ్డు కొండేన్ నారాయణా ఎన్నమ్ నామమ్** – అని ఆళ్వారుల వచనము. ద్రౌపది భగవంతుని స్తుతింపగానే ఆమెకు రక్షణ లభించెను (భగవంతుడు అక్కడికి రాకముందే).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **స్తూయతే అనేన ఇతి స్తోత్రమ్ వేదః.** భగవంతుని స్తుతించేవి వేదములు. వేదస్తుతులు ఆయనను ఉద్దేశించినవి గనుక ఆయనే స్తోత్రము. **వేదస్య ప్రధాన విషయత్వా బ్రహ్మాపి స్తోత్రమ్.**

**ధ్రువుడు చేసిన శ్రీహరిస్తోత్రము.** శ్రీ ఏల్చూరి మురళీధరరావు రచన 'శ్రీమద్భాగవతము'నుండి.

ఏ అఖిల శక్తిధరుడు నాలో ప్రవేశించి, సుప్తస్థితిలో ఉన్న నా ప్రాణేంద్రియాలను, వాక్కును సంజీవింపజేశాడో, ఆ పరమపూరుషునికి నమస్కారం! దేవా నిత్యైకరూపా! ఆత్మశక్తి అయిన మాయను అధిష్ఠించి, మహదాదులతో కూడిన విశ్వాన్ని సృజించి, చైతన్యరూపంతో అందులోనికి ప్రవేశించి, బహురూప నామాలతో గోచరించే నీకు భక్తిపూర్వక ప్రణామం! ........ నీవు ప్రసాదించిన జ్ఞాన ప్రభావాన్ని, పూర్వకల్ప ప్రపంచాన్ని మళ్ళీ రచించడమే బ్రహ్మసృష్టి అనబడుతున్నది.



ధ్రువునికి దర్శనమిచ్చిన శ్రీవాసుదేవుడు. గీతా ప్రెస్ ప్రచురణలోని చిత్రం. వికీపీడియానుండి
https://commons.wikimedia.org/wiki/File:Story_of_dhruva.jpg

దేవా! నీ పాదపద్మం భక్తులపాలిటి కల్పవృక్షం. ముముక్షువులకు కూడా అదే శరణ్యం.... లోకేశ్వరా! నీ పాదారవింద పరిచర్యవలన, నీ కళ్యాణకథాసుధారసపానంవలన కలిగే పరమసుఖాన్ని చవిగొన్నవారు మోక్షాన్ని కూడా లెక్కచేయరు. తండ్రీ! నీ భక్తులతోడి నిత్యసంగము భాగ్యాన్ని నాకు ప్రసాదించు.

స్వామీ! కార్యకారణాత్మకమూ, నానారూప ప్రాణివర్గ సంకులమూ అయి కంటికి కానవస్తున్న ఈ ప్రపంచమంతా నీ స్థూలరూపం. ఇది దృశ్యం కనుక, కంటితో చూసి దీని తత్వాన్ని కొంతకు కొంతయినా గ్రహింపగలము. నీ స్వరూపం ఈ దృశ్యప్రపంచానికి పరమైనట్టిది. అది దృశ్యం కాదు గనుక మనోవాక్కులకు అందరానిది. కేవలం బుద్ధిమాత్రగమ్యం.

మహాత్మా! కల్పాంతంలో సర్వ దృశ్యప్రపంచాన్ని నీ కుక్షిలో నిక్షేపించి, ఏకార్ణవ జలమధ్యంలో శేషపర్యంకాన పవ్వళించి, సమయం వచ్చినపుడు నీ నాభినుండి చతురాస్యుని పుట్టించి, పునఃసృష్టిని కావిస్తావు.... నీవు నీ చిచ్ఛక్తివలన సర్వావస్థలకు సాక్షివవుతావు. జీవుడు సర్వావస్థలను తానే అనుభవిస్తున్నట్లు భావిస్తాడు. ...

దేవా! నీవు నిర్వికారుడవైనా లోకస్థితి పరిపాలనార్థం విష్ణురూపాన్ని ధరించావు. అవిద్యాది వివిధశక్తులు విరుద్ధ గతులను కలిగి ఉన్నప్పటికీ కార్యార్థమై అనుపూర్విగా వచ్చి నీయందు చేరుతుంటాయి.

అట్టి బ్రహ్మమునకు, విశ్వకారకునకు, ఏకమూర్తికి, అనంతునకు, ఆద్యునకు, ఆనందమాత్రునకు, అవికారునకు నమస్కరిస్తున్నాను. నీవు పురుషార్థమూర్తివిగనుక నీ పాదపద్మ సేవవలన సర్వార్థాలూ కలుగుతాయి. అందువల్ల సనకాదులు కూడా నిన్ను ఆశ్రయిస్తారు. నిన్ను ఆశ్రయించినవారు దీనులని నీవు ఏనాడూ భావింపవు. అప్పుడే ఈనిన ఆవుదూడను కాపాడినట్లు మమ్మల్ని పరిపాలించు!

**687. స్తుతిః** (శ్రీ శంకరుల పాఠము)

**స్తుతః** (శ్రీ భట్టుల పాఠము)

- స్తోత్రము చేయుట, ప్రార్థించుట కూడా భగవత్స్వరూపములే (స్తుతిః).
- స్తోత్రము చేయబడువాడు (స్తుతః)

**ఓం స్తుతయే నమః**

**ఓం స్తుతాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఈ నామమును **'స్తుతః'** అని చెప్పారు. **సహస్రఫణ త్రయీమయాదిభిః అనంతైః బ్రహ్మాదిభిః అస్మదాదిభిశ్చ తత్తదభిలాషసిద్ధయే స్తుత ఇతి** - నిత్య సూరులైన ఆదిశేషుడు, గరుడుడు (మూడు వేదముల స్వరూపుడు), అనంతుడు, బ్రహ్మ వంటివారిచేతను, మనచేతను కూడా ఈప్సితార్థసిద్ధికొరకు స్తుతింపబడువాడు స్తుతుడు. ఇందుకు శ్రీ భట్టులు శ్రుతినుండి ఉదాహరించారు.

**ధాతా పురస్తాత్ యముదాజహారశక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః** – పురుషసూక్తము

ముందుగా సృష్టికర్తయైన బ్రహ్మ ఆయనను స్తుతించెను. తరువాత విద్వత్తు కలిగిన ఇంద్రుడు, అనంతరము నాలుగు దిక్కులు ఆయనను స్తుతించెను. మనతోసహా అందరూ ఆయననే స్తుతిస్తారని ఇక్కడ నాలుగు దిక్కుల ద్వారా సూచింపబడినది

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఈ నామమును **'స్తుతిః'** అని చెప్పారు. స్తుతి అనగా స్తోత్రము చేయుట, ప్రార్థించుట. ఇదియును భగవత్స్వరూపమే. వేదగానము, గీతాగానము, విష్ణుసహస్రనామ గానము, భగవన్నామ సంకీర్తనము ఇవన్నియును భగవత్స్వరూపములే.

ధర్మచక్రము రచయిత – మన మనస్సు పరిశుద్ధమైయుంటే భగవంతుడు అందులో ప్రవేశిస్తాడు. అప్పుడే సరైన స్తుతి వాక్కు రూపంలో వెలువడుతుంది.

శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము: (686) **స్తోత్రమ్** – కీర్తించే పదాలు; (687) **స్తుతిః** – కీర్తించే పని.

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము: (686) **స్తోత్రమ్** – కీర్తించడానికి సాధనము, పదాలు, కార్యము; (687) **స్తుతః** – ఆ కీర్తనకు లక్ష్యము.

**అన్నమయ్య కీర్తన .** https://commons.wikimedia.org/wiki/File:Annamacharya.jpg Photo by Tallapragada sriram

ద్వారకా తిరుమలలో అన్నమయ్య విగ్రహం. వికీపీడియా నుండి.



దాచుకో నీపాదాలకు దగ నే జేసినపూజ లివి
పూచి నీ కీరీతిరూప పుష్పము లివి యయ్యా

వొక్క సంకీర్తనె చాలు వొద్దికై మమ్ము రక్షించగ
తక్కినవి భాండారాన దాచి వుండనీ
వెక్కసమగు నీ నామము వెల సులభము ఫల మధికము
దిక్కై నన్నేలితి విక నవి తీరని నా ధనమయ్యా

నా నాలికపైనుండి నానాసంకీర్తనలు
పూని నాచే నిన్ను బొగడించితివి
వే నామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నా కీపుణ్యము గట్టితి వింతేయయ్యా

యీమాట గర్వము గాదు నీ మహిమే కొనియాడితిగాని
చేముంచి నా స్వాతంత్ర్యము చెప్పినవాడగాను
నేమాన బాడే వాడను నేరము లెంచకుమీ
శ్రీమాధవా నే నీదాసుడ శ్రీవేంకటేశుడవయ్యా

## 688. స్తోతా

- తనను స్తుతించేవారిని ప్రశంసించేవాడు.
- స్తోత్రము చేయువాడు కూడ భగవత్స్వరూపియే.

### ఓం స్తోత్రే నమః

**స్వ స్తోతారం పరం స్తోతుం శీలం యస్యాస్తి సర్వదా స్తోతా సస్యాత్పంచవర్ణః సర్వస్తోత్రత్వదో మనుః -** తనను స్తుతించేవారిని తానే స్తుతించే (ప్రశంసించే) స్వభావము కలవాడు. ఈ నామము పంచాక్షరి. అందరిచేత స్తుతించబడేట్లు చేస్తుంది. ఓం స్తోత్రే నమః.

శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్య – **స్వ-స్తోతారం స్తోతుం శీలమ్ అస్య ఇతి స్తోత్రా**. తనను స్తుతిచేయువారిని స్తుతించుట ఆయన గుణము. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుధర్మము (75.55)నుండి ఉదాహరించారు. **యం స్తువన్ స్తవ్యతామేతి వందమానశ్చ వంద్యతామ్.** భగవంతుని స్తుతించేవాడు స్వయముగా స్తుతనీయుడు అవుతాడు. భగవంతునికి వందనము చేసేవాడు వందనీయుడు అవుతాడు. శ్రీ భట్టులు శ్రీకృష్ణుని కైలాసయాత్రోదంతాన్ని ఉదాహరించారు. ఆ యాత్రలో శ్రీకృష్ణుడు శంకరుని స్తోత్రం చేశాడు. శంకరుడు సదా తారకమంత్ర ధ్యాననిమగ్నుడై యుండుట వలన కృష్ణుని స్తుతిని పొందినాడు. తనను స్తుతించేవాడు స్తుతనీయుడౌతాడని భగవానుడు చెప్పినట్లు హరివంశములో ఉన్నది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **స్తౌతి స్వజనాన్ ఇతి స్తోతా**. తనవారిని స్తుతించేవాడు స్తోత.

శ్రీ బలదేవ విద్యాభూషణ – తన భక్తుల ఔన్నత్యాన్ని తెలియబరచేవాడు స్తోత. భగవానుడు తన భక్తుల గొప్పతనమును తెలియబరచేందుకే వారిని స్తుతించును అని చెబుతూ గీతనుండి **'జ్ఞానీత్వాత్మైవ మే మతమ్'** అని ఉదాహరించారు.

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే**
**ప్రియోऽహి జ్ఞానినోऽత్యర్థమహం స చ మమప్రియః** – గీత 7.17
**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవా నుత్తమాం గతిమ్** – గీత 7.18

ఈ చతుర్విధ భక్తులలో నిరంతరము నాయందే ఏకీభావస్థితుడై, అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. ఏలనన వాస్తవముగ నన్ను తెలిసికొనిన జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడును నాకు మిక్కిలి ఇష్టుడు. ఈ చతుర్విధ భక్తులందరును ఉదారులే. కాని జ్ఞానియైనవాడు నా స్వరూపమే. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగానుంచి, నన్నే పరమప్రాప్యునిగా భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థితుడు.

శ్రీ చిన్మయానంద గీత (12.14)నుండి ఉదాహరించారు – **మయ్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్తః స మే ప్రియః.**

ధర్మచక్రము రచయిత – గీత 16వ అధ్యాయములో చెప్పినట్లుగా ఇట్టి భక్తులు (భగవంతునిచే ప్రశంసింపబడువారు) అందరిపట్ల దయ కలిగియుందురు. కోపమును త్యజింతురు. సుఖదుఃఖములపట్ల సమభావమును కలిగియుందురు. మనసా వాచా కర్మణా పరిశుద్ధులై, తమ సమస్త కర్మలను భగవానునికి అర్పింతురు. పొగడ్తలకు పొంగరు. నిందలకు క్రుంగరు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్తోతా అపి స ఏవ, సర్వాత్మకత్వాత్.** భగవానుడు సర్వాత్మకుడైనందున, స్తుతి చేయువాడును భగవంతుడే. భక్తితో భగవంతుని కీర్తించేవాడు భగవంతునిలో లీనమగును (శ్రీ చిన్మయానంద వివరణ).

**శ్రీ కృష్ణమాచార్య మహాకవి (13-14వ శతాబ్ది) సింహగిరి వచనములు**

శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు రచించిన 'ద్వాదశసూరి చరిత్ర'లో ఉదాహరించినవి.

దేవా! విష్ణుభక్తి లేని విద్వాంసునికంటె హరికీర్తనము చేయునతడే కులజుండు. శ్వపచుండైననేమి? ఏ వర్ణంబైన నేమి? ద్విజునికంటె నతడె కులజుండు. దృష్టింజూడగా విద్వజ్జన దివ్యభూషణము. సింహగిరి నరహరిని దలంచిన యాతండె కులజుండు. సంధ్యాది నిత్యకర్మానుష్ఠానంబులు దప్పక నడపిననేమి? చతుర్వేద షట్ఛాస్త్రములు సదివిన నేమి? శతక్రతువు లాచరించిన నేమి? మా సింహగిరి నరహరి దాసులకు దాసులైనంగాని లేదు గతి! స్వామీ! సింహగిరి నరహరీ! నమో దయానిధీ!

దేవా! అంకిలియనియెడి తెవులింటింటికి ద్రిప్పు. అసత్యకృతమే ముప్పు. తగవు ధర్మము నడిపినదే యొప్పు. అనాధపతీ, నరహరీ! మిమ్ము దలంపనిదే తప్పు. స్వామీ! సింహగిరి నరహరీ! నమో దయానిధీ!

దేవా! శ్రీమన్నారాయణా! పరబ్రహ్మస్వరూపా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా, వేదవేదాంతవేద్యా! పురాణ పురుషోత్తమా! పురందర వంద్యా, దేవా! కపట నాటక సూత్రధారీ, మాయావినోదా! అగణిత మహిమావతారా! ఆశ్రితజన మందారా! సకల కళ్యాణగుణోన్నతా! సకల జగదంతర్యామీ, శ్రీమదయోధ్యాపురవరాధీశ్వరా! దశరధరాజ నందనా! కౌసల్యాగర్భ శుక్తిముక్తాఫలా! స్వామీ! సింహగిరి నరహరీ! నమో దయానిధీ!

దేవా! ఏడు రామాయణములు, పదునెనిమిది పురాణములు, భగవద్గీతలు, సహస్రనామములు మొదలయినవి చదివిరేమి? వినిరేమి? వ్రాసిరేమి? మీ సంకీర్తనకు వెయ్యవపాలింటికి సరిరావు. కడమ సంకీర్తన లనేకసార్లు విన్నారు. ఇందుకు తప్పదు. మీ శంఖచక్రంబులాన, మీ పాదపద్మంబులాన, నారాయణ నారాయణయని మంత్రంబనిరేమి? దూదికొండలమీద వటబీజమాత్ర మగ్నిహోత్రుడు ప్రవేశించిన దగ్ధంబైపోదా? స్వామీ! సింహగిరి నరహరీ! నమో దయానిధీ!

దేవా! పెద్దతనంబు జేసి మిమ్ము మెప్పించెదనంటినా, జాంబవంతుడు మీ సన్నిధినే యున్నాడే! దేవా! బుద్ధినే మెప్పించెదనంటినా, విభీషణుండు మీ సన్నిధినే యున్నాడే! దేవా! బంటుతనంబు జేసి మిమ్ము మెప్పించెద నంటినా, అంజనీదేవి సుతుడు హనుమంతుడు మీ సన్నిధినే యున్నాడే! దేవా! తీర్థంబులాడి మిమ్ము మెప్పించెదనంటినా, సూర్యచంద్రాదులు మీ సన్నిధినేయున్నారే! దేవా! వేదవేద్యుడనై మిమ్ము మెప్పించెద నంటినా, బ్రహ్మ మీ నాభికమలమందు ఉద్భవించియున్నాడే! స్వామీ! సింహగిరి నరహరీ! నమో దయానిధీ!



సింహాచలం ఆలయం గోడలపై శిల్పాలు. శ్రీ వరాహ స్వామి, శ్రీ నరసింహ స్వామి. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/User:Adityamadhav83

దేవా! ఇంద్రాది దేవతలు నూరును, హిరణ్యగర్భులిన్నూరును, కాశ్మీరగిరులు మున్నూరును, తిలధాంచన గిరులు

నన్నూరును, పతివ్రత లేనూరును, నగ్రహారంబు లారునూరులును, స్త్రీమూర్తు లేడునూరులును, నుభయస్తోమకు లెనిమిది నూర్లును, కపిలధేనువులు వేయిని, కాలచక్రంబులు లక్షయును, తులాపూరుషంబులు కోటియును, కన్యాదానంబులు పదికోట్లును, నివియన్నియు గూడిన మీ దివ్యనామ సంకీర్తన వినినందుకు వేయిలో నొక్కభాగంబును సరిగావు. ఈ సంకీర్తనఫలం బెవరు వ్రాసిరి, యెవరు చదివిరి, యెవరు వినిరి, వారికాయురారోగ్యైశ్వర్యంబులు కృప చేతువు. మా యతిరాజముని వరము. దాతారు. అనాధమతీ, స్వామీ! సింహగిరి నరహరీ! నమో, నమో దయానిధీ!

## 689. రణప్రియః

- యుద్ధమునందు ప్రీతి కలవాడు.
- పూజాస్థానములందలి మంగళధ్వనులకు ఆనందించువాడు.
- సూర్యాదుల రూపములో సంతోషంగా చరించువాడు.

### ఓం రణప్రియాయ నమః

'రణ' శబ్దమునకు రెండు అర్థములున్నవి – చలించుట, శబ్దము (రణ గతౌ, రణ శబ్ద అర్థః). ఈ రెండు అర్థాలు కలిపి 'రణము' అనగా 'యుద్ధము' అనే అర్థం ఉంది. సామాన్యార్థంగా రణప్రియుడు అనగా ధ్వనిప్రదమైన పరిస్థితులలో చలించడానికి ఇష్టపడేవాడు. వీరపురుషుడు యుద్ధంలో విహరించడానికి ఇష్టపడతాడు. శ్రీ శంకరులు, శ్రీ భట్టులు 'రణము' అనగా 'యుద్ధము' అనే అర్థాన్ని గ్రహించారు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'చలనము' అనే అర్థాన్నీ, శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'శబ్దము' అనే అర్థాన్నీ తీసుకొన్నారు.

**సుహృత్ప్రియం యుద్ధకర్మ యస్యాస్తి స రణప్రియః.** తన ఆశ్రితులైన సుహృత్తులను రక్షించడానికి యుద్ధము చేయుటయందు ప్రియము కలవాడు రణప్రియుడు. రామునిగాను, కృష్ణునిగాను భగవానుడు ధర్మసంరక్షణార్థం యుద్ధంలో పాల్గొన్నాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే** – గీత 4.8
సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపుమాపుటకును, ధర్మమును సుస్థిరమొనర్చుటకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

**తతః సకామం సుగ్రీవమంగదంచ మహాబలమ్**
**చకార రాఘవః ప్రీతో హత్వా రావణమాహవే** – రామాయణము. యుద్ధకాండ 11.31
యుద్ధంలో రావణుని హతంచేసి శ్రీరాముడు మహాబలులైన సుగ్రీవ, అంగదులకు ప్రీతి కలిగించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యతః పంచమహాయుధాని ధత్తే సతతమ్ లోకరక్షణార్థమ్ అతో రణప్రియః.** లోకరక్షణ కొఱకు శ్రీమన్నారాయణుడు శంఖము, చక్రము, గద, శార్ఙ్గము (ధనుస్సు), ఖడ్గము ధరించియుంటాడు గనుక రణప్రియుడు.

శ్రీకృష్ణదత్త భరద్వాజ వైవిధ్యమైన అర్థం చెప్పారు – **రణో రవః మందిరేషు మంగళధ్వనిః, స ప్రియో యస్య ఇతి రణప్రియః.** మందిరాలలో వినవచ్చే మంగళప్రదమైన ధ్వనులు రణము లేదా రవము. అవి ఆయనకు ఆనందకరములు గనుక ఆయన రణప్రియుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – (రణము = చలనము) భగవంతుడు అందరి హృదయాలలోనూ సంచరిస్తూ వారిలోని అజ్ఞానాంధకారాన్ని తొలగిస్తాడు. సూర్యునిగా సంచరిస్తూ లోకాలకు కాంతినిస్తాడు.

ధర్మచక్రము రచయిత – జీవితంలో యుద్ధం ఒక భాగం. ఒక జీవి మనుగడ మరొక జీవి మనుగడకు వ్యతిరేకం కావచ్చును. మన జీవితంలో అధర్మాన్ని, దుష్ప్రభావాలను ఎదిరించాలంటే యుద్ధం చేయాలి. భగవానుడు అన్ని లోకాలలో అధర్మాన్ని అరికట్టాలి. అందుకే ఆయన పంచాయుధాలు ధరించాడు. భగవానుని ఈ నామస్మరణద్వారా మనం జీవితం అనే యుద్ధంలో అధర్మాన్ని జయించి ధర్మాన్ని ఆచరింపవచ్చును. ఓం రణప్రియాయ నమః.

## 690. పూర్ణః

సంపూర్ణమైనవాడు.

- అన్ని కోరికలు తీరినవాడు.
- అన్ని కళ్యాణగుణములు నిండియున్నవాడు.
- అన్ని శక్తులు గలవాడు.
- స్వల్పనివేదనలతో సంతోషించువాడు.
- అంతటా అన్నింటా నిండియున్నవాడు.

### ఓం పూర్ణాయ నమః

'పూరీ' – ఆప్యాయనే - నింపుట, సంతోషపెట్టుట – అనే ధాతువునుండి ఈ నామమును వివరింపవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అవాప్త సమస్త కామాన్.** అన్ని కోరికలు తీరినవాడు. ఇంకా ఏమీ అవుసరం లేనివాడు, పూర్ణుడు. అందుకే పెద్దగా శ్రమపడకుండా, ఏమీ ఖర్చుపెట్టకుండా, భారీ సంభారాలు లేకుండా, కేవలం ధ్యాన కీర్తన పూజాదులద్వారా భగవంతుని సంతోషపెట్టవచ్చును.

లక్ష్మీపతియైన భగవంతునికి ఇంకేమి కావాలని శ్రీ చిన్మయానంద వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సకలైః కామైః, సకలాభిః శక్తిభిశ్చ సంపన్న ఇతి పూర్ణః.** భగవంతుడు అన్నికోరికలు తీరినవాడు (పూర్ణకాముడు) మరియు అన్ని శక్తులు కలిగినవాడు (కనుక కోరికలు తీర్చుకొనగల శక్తిమంతుడు) కనుక పూర్ణకాముడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు అంతటా వ్యాపించియున్నవాడు. అన్నింటా నిండియున్నాడు. అన్నీ ఆయనలో ఉన్నవి. కనుక ఇంక ఆయనకు కావలసింది ఏమీలేదు. కనుక ఆయన పూర్ణుడు. ఈశావాస్యోపనిషత్తు (బృహదారణ్యకము 5.1.1) శాంతిమంత్రము ఇలా చెబుతున్నది –

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే**

ఆయన అన్ని విధాలా పరిపూర్ణుడు. ఆయననుండి ఉద్భవించునదికూడా పూర్ణమైనది. అలా ఆయననుండి పూర్ణములైనవి అనేకములు వెలువడినా ఆయనమాత్రం ఎన్నటికీ ఎలాగైనా పరిపూర్ణుడే. ఇతర ఉపనిషద్వాక్యాలు: **పూర్ణమ్ అప్రవర్తి** (బృహదారణ్యక 2.1.5); **తదేతత్ పూర్ణమ్ అప్రవర్తి** (ఛాందోగ్య 3.1.2)

శ్రీ బలదేవ విద్యాభూషణ 'పూర్ణః' అనే ఈ నామము అర్థాన్ని ఇంతకుముందు నామమైన 'రణప్రియః'తో అనుసంధానించారు. తన శత్రువులను సంపూర్ణంగా నాశనం చేసేవాడు పూర్ణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **పూర్యతే ఆప్యాయతే స్మకళ్యాణగుణైః ఇతి పూర్ణః.** అనంత కళ్యాణగుణములు కలవాడు గనుక ఆయన పూర్ణుడు. **భక్తార్పితైః ఫల కుసుమాదిభిః తర్పిత ఇతి పూర్ణః.** భక్తులు అర్పించిన పండ్లు, పూలువంటి సామాన్యమైనవానితో సంపూర్ణుడై సంతృప్తిని పొందువాడు పూర్ణుడు.

ధర్మచక్రము రచయిత – లోకంలో కోరికలు తీరినకొద్దీ ఇంకా కావలసినవి పెరుగుతూ ఉంటాయి. ఇప్పటి చదువులు కూడా వ్యామోహము పెంచేవేకాని భగవంతునిదరికి చేర్చేవి కావు. భగవంతునిపట్ల భక్తి, శ్రద్ధ మాత్రమే ఇందుకు మందులు. మనకు నిజంగా కావలసింది మనలోనే ఉంది అని గ్రహించి ఆత్మజ్ఞానంద్వారా సంతృప్తిని పొందవచ్చునని ఈ నామధ్యానంద్వారా తెలుస్తుంది.

## 691. పూరయితా

- తన భక్తుల కోరికలు పూర్తిచేయు (తీర్చు)వాడు.

### ఓం పూరయిత్రే నమః

భగవంతుడు భక్తుల అర్హతలనుబట్టి వారుకోరేవానిని (ధర్మార్థకామమోక్షములను) ప్రసాదిస్తుంటాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుని స్తుతించాలనే భక్తుల కోర్కెలను తీరుస్తూ, అనగా తాను స్తవప్రియుడు (685వ నామము) అవుతూ, భగవతుడు పూరయిత అవుతున్నాడు. నిజమైన భక్తుని ఒకేఒక్క కోరిక ఏమంటే భగవంతునికి కైంకర్యము చేయాలని. భగవంతుడు తాను పూర్ణుడు (690వ నామము) అయినా కూడా భక్తులకు ఈ అవకాశం ఇస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు స్వయముగా పూర్ణుడు (690వ నామము) మాత్రమే కాకుండా తగు సమయంలో ఇతరులను పూర్ణులుగా చేస్తాడు గనుక పూరయిత.

ధర్మచక్రము రచయిత – భక్తుని కోరిక తీర్చడానికై భగవంతుడు ఎంతపని చేస్తాడు? తాను ఆయుధం పట్టనని యుద్ధానికి ముందు కృష్ణుడన్నాడు. భగవంతునితో ఆయుధం పట్టిస్తానని భీష్ముడు ప్రతిన పూనాడు. భీష్ముని (భక్తుని)మాట నెగ్గించడంకోసం భగవంతుడు ఆయుధం పట్టి తనమాటను తానే అతిక్రమించాడు.

## 692. పుణ్యః

- పవిత్రము చేయువాడు.
- పుణ్యకార్యము ఆచరించుటయందు శ్రేష్ఠుడు.

### ఓం పుణ్యాయ నమః

ఈ పవిత్రనామము రెండుమార్లు వస్తుంది.

73వ శ్లోకము. 692వ నామము. పుణ్యః – **పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిః అనామయః**

99వ శ్లోకము. 925వ నామము. పుణ్యః – **ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః**

ఈ నామమును రెండు ధాతువుల ఆధారంగా వ్యాఖ్యానించారు: పు - పావనే - పవిత్రము చేయుట; పుణ్ - శుభకర్మాణి - మంగళ కార్యములందు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **పుణాతి ఇతి పుణ్యః.** పావనము చేయువాడు పుణ్యుడు. అతినీచులైన పాపులుకూడా భగవన్నామస్మరణం చేసి పవిత్రులయ్యేలా చేసేవాడు గనుక భగవంతుడు పుణ్యుడు. 'పుణ్యన్' అనే పదాన్ని ఆళ్వారులు ఎంతో మక్కువతో అనేక సందర్భాలలో భగవంతుని సంబోధిస్తూ వాడారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్మృతిమాత్రేణ కల్మషాణి క్షపయతి ఇతి పుణ్యః.** భగవంతుని స్మరించినంతనే కల్మషాలు నశించును గనుక భగవంతుడు పుణ్యుడు. ఇంద్రియసుఖాలను గురించిన ఆలోచనలు మనల్ని భగవంతునికి దూరం చేస్తాయి. భగవంతుని గురించిన ఆలోచనలు పవిత్రత కలుగజేసి శ్రీహరికి దగ్గరచేస్తాయి.

925వ నామము 'పుణ్యః'కు శ్రీ భట్టులు చెప్పిన అర్థం శ్రీ శంకరులు ఈ (692వ)నామము 'పుణ్యః'కు చెప్పిన వ్యాఖ్యకు సరిపోతుంది. అదేమంటే భగవంతుడు తన భక్తులను ఉద్ధరించిన ఉదంతాలను మననం చేసికోవడం మాత్రాన మనం పరిశుద్ధులమవుతాము. ఉదాహరణకు గజేంద్రమోక్షము పారాయణం, స్మరణం, ధ్యానంవంటి కార్యములు. శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా 925వ నామాన్ని ఇలానే వ్యాఖ్యానించారు.

925వ నామమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వేషామ్ శ్రుతి స్మృతి లక్షణాయ వాచా పుణ్యమ్ ఆచష్ట ఇతి వా పుణ్యః.** శృతి, స్మృతుల బోధనలద్వారా పుణ్యమార్గములను ఉపదేశించి సాధువులను బ్రోచుచున్నాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ ఈ (692వ) నామమునకు చెప్పిన వ్యాఖ్య – కంసునివంటి దుర్మార్గులను నాశనం చేసినందున భగవంతుడు పుణ్యుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **పూయతే వా అనేన ఇతి పుణ్యః, పవిత్రః పాపానవిద్ధః శుభో వా.** ఏ విధమైన లోపములు, అధర్మములు లేనివాడు మరియు పవిత్రము చేయువాడు పుణ్యుడు. భగవంతుడు సూర్యుని రూపంలో తాను స్వయంగా పవిత్రుడు అగుటయేగాక అన్నింటిని పవిత్రము చేయును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరియు శ్రీ కృష్ణదత్త భరద్వాజ చెప్పిన మరొక అర్థము – **పుణతి శుభకర్మ ఆచరతి ఇతి పుణ్యః.** స్వయముగా శుభకర్మలు ఆచరించేవాడు పుణ్యుడు.

## **693.** పుణ్యకీర్తిః

- ఆయనను కీర్తించడంవలన పవిత్రత లభించును.

### ఓం పుణ్యకీర్తయే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవానుని నామసంకీర్తనమువలన భక్తులు పునీతులవుతారు.

**నామసంకీర్తనమ్ పుంసామ్ విలాయనమ్ అనుత్తమమ్**
**మైత్రేయ! అశేష పాపానామ్ ధాతూనామివ పావకః** – విష్ణుపురాణము 6.8.20
మైత్రేయా! లోహమును అగ్ని పరిశుద్ధము చేసినట్లుగానే విశేషమైన నామసంకీర్తనంవల్ల అశేష పాపములు నశించును.

**అవశేనాఽపి యాన్నామ్ని కీర్తితే సర్వపాతకైః**
**పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రాసైః మృగైరివ** – విష్ణుపురాణము 6.8.19
సింహం వచ్చినపుడు మృగాలు పారిపోయినట్లుగా భగవంతుని కీర్తించినపుడు పాపాలు పటాపంచలవుతాయి.

**ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాన్ ద్వాపరేఽర్చయాన్**
**యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవం** – విష్ణుపురాణము 6.2.17

కృతయుగమునందు ధ్యానము (తపస్సు)వలన, త్రేతాయుగమందు యజ్ఞమువలన, ద్వాపరయుగమందు అర్చనవలన కలిగే ఫలము కలియుగమందు కేశవసంకీర్తనవలన లభించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పుణ్యమ్ ఆవహతి అస్య కీర్తిః నృణామ్ ఇతి పుణ్యకీర్తిః.** భగవంతుని కీర్తి భక్తులకు పుణ్యము (పవిత్రత) కలిగించును.

ఇంతకుముందు నామము 'పుణ్యః' అంటే స్మృతిమాత్రాన పవిత్రత కూర్చువాడు. ఈ నామము 'పుణ్యకీర్తిః' అనగా ఆయన కీర్తి కారణంగా ఆయనను స్మరిస్తాము. కనుక పుణ్యం లభిస్తుంది.

అన్నమయ్య కీర్తన

నీకథామృతము నిరతసేవన నాకు

చేకొనుట సకల సంసేవనంబటుగాన
ఇదియే మంత్రరాజము నాకు నే ప్రొద్దు
ఇదియే వేద సంహిత పాఠము
ఇదియె బహుశాస్త్ర మెల్ల చదువుటనాకు

ఇదియె సంధ్య నాకిదియె జపమటుగాన
ఇదియె బ్రహ్మవిద్యోపదేశము నాకు
ఇదియె దుఃఖవిరహిత మార్గము
ఇదియె భవ రోగరహిత భేషజమునాకు

ఇదియె ఉపనిషద్వాక్య పద్ధతి
ఇదియె దాన ఫలమీ జాలినది నాకు
ఇదియె తలప పరహిత మార్గము
ఇదియె తిరువేంకటేశ నీ సంస్మరణ
మిదియె ఇదియె యిన్నియును నటుగాన



తిరుమల మార్గంలో శ్రీ హనుమంతుని విగ్రహం

## 694. అనామయః

- సంసారమనే వ్యాధిని తొలగించువాడు.
- అన్ని విధములైన దుఃఖములకు, కష్టములకు అతీతుడు.

### ఓం అనామయాయ నమః

ఈ నామమునకు మూలధాతువులు – 'మీ' - హింసాయామ్ – మరణించుట, నశించుట; ఆమయ – వ్యాధి, దుఃఖమునకు సంబంధించినది; అనామయ – రోగరహితము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సంసార మహావ్యాధి విరోధీ.** అన్నింటికంటె పెద్ద వ్యాధి అయిన సంసార బంధమునకు విరోధి. అలా తన భక్తులకు భగవదనుభవాన్ని దగ్గర చేసేవాడు. ఇందుకు శ్రీ భట్టులు ఛాందోగ్యోపనిషత్తు (4.10.3)నుండి ఉదాహరించారు. **వ్యాధిభిః పరిపూర్ణోస్మి** – సంసారము గురించి తెలుసుకొన్నవారు తాము వ్యాధితో నిండియున్నామని చెప్పారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – కర్మవల్ల కలిగే అంతర్, బాహ్య దుఃఖాలన్నింటికీ పూర్తిగా అతీతుడు కనుక భగవంతుడు అనామయుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **న ఆమయో రోగో యస్య ఇతి అనామయః దివ్యమంగళవిగ్రహః.** ఆయన దివ్యమంగళ స్వరూపము ఏ విధమైన వ్యాధికిని అతీతము. ఆయన దివ్యసత్వశుద్ధ స్వరూపుడు. కనుక ఏ విధమైన శారీరిక, మానసిక వ్యాధులును ఆయన దరిచేరవు.

ధర్మచక్రము రచయిత – శరీరము స్థూలము. మనసు సూక్ష్మము. వీనికి కష్టము కలిగించునది వ్యాధి. జీవుడు శరీరము, మనసునకు లోబడియుండుటవలన వానికి శ్రమ, నొప్పి, వ్యాధి కలుగుతాయి. భగవంతునికి ఇవి వర్తింపవు.



తంజావూరు ప్రసాదంలోని శిల్పాలు. Photo by: Thamizhpparithi Maari

https://commons.wikimedia.org/wiki/File:"Amazing detailes on the wall of Tanjavur Palace1".JPG



## మనోజవస్తీర్థకరో వసురేతా వసుప్రదః |
## వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః || (74)

### 695. మనోజవః

- మనస్సువంటి వేగము కలవాడు. తన భక్తులకు అతిశీఘ్రముగా సంపదలనిచ్చేవాడు.

ఓం మనోజవాయ నమః

'జంగ్' - గతౌ -వెళ్ళుట – అనే ధాతువునుండి 'జవము' అనగా వేగము అని అర్థము. **'ఏతాని స వేగ - గతి - నామాని'** అని అమరకోశంలో 'జవ'కు సంబంధించిన అనేకపదాలున్నాయి. **మనసో జవ ఇవ జవో యస్య ఇతి మనోజవః.** మనసువంటి వేగము కలవాడు 'మనోజవః'

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామాలలో చెప్పిన ఫలము - పావనము చేయుట -కు కావలసిన కార్యాలన్నీ మనసుకంటే వేగంగా చేసేవాడు 'మనోజవః'. ఇందుకు శ్రీ భట్టులు గీతనుండి, విష్ణుధర్మమునుండి ఉదాహరించారు.

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి**
**కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి** – గీత 9.31
కౌంతేయా! అతడు (నన్ను అనన్యభక్తితో భజించేవాడు) శీఘ్రముగా ధర్మాత్ముడగును. శాశ్వతమైన పరమశాంతిని పొందును. 'నా భక్తుడెన్నటికిని నష్టపోడు' అని నిశ్చయముగా నెఱుంగుము.
**సప్తజన్మకృతం పాపం స్వల్పం వా యది వా బహు**
**విష్ణోరాలయ విన్యాస ప్రారంభదేవ నశ్యతి** – విష్ణుధర్మము 83.20
ఏడు జన్మల పాపాలు, కొంచెమైనా, ఎక్కువైనా గాని - అవి ఒక్కమారు విష్ణువు ఆలయంలో అడుగుపెట్టగానే నశిస్తాయి.

శ్రీ నమ్మాళ్వార్ తిరువైమొళి 1.6.10లో భగవంతుడు ఎంతవేగంగా భక్తుల పాపాలను హరిస్తాడో చెప్పారు. శ్రీమహాలక్ష్మి ఆయనయందే నిత్యం ఉండుటవలన చిటికెకంటె తక్కువ సమయంలో మనం ఎంతోకాలంగా చేసిన పాపాలను నశింపజేయును. శ్రీ వి.వి. రామానుజన్ గజేంద్రమోక్షమునుండి ఉదాహరించారు. గరుడుని వేగంపై కూడా ఆధారపడకుండా, తన వస్త్రాదులను పట్టించుకోకుండా విష్ణువు తన భక్తుని కాపాడడానికి పరుగెట్టాడు.

**సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపడే**
**పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం**
**తర ధమ్మిల్లము జక్కనొత్తడు వివాదప్రోత్థిత శ్రీ కుచో**
**పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై** – పోతన భాగవతము. గజేంద్రమోక్షము.

శ్రీ అణ్ణంగారాచార్య స్వామి – భగవంతుడు మనోవేగంతో, సంకల్పమాత్రాన భక్తుల కోరికలను తీరుస్తాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – తనకు శరణాగతులైనవారి సంసారబంధాలను మనోవేగంతో తొలగిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మనసో జవః, వేగ ఇవ వేగోఽస్య సర్వగతత్వాత్ ఇతి మనోజవః.** భగవంతుడు మనోవేగం కలవాడు. అన్నిచోట్ల ఒకేమారు ఉండువాడు.

**అనేజదేకమ్ మనసోజవీయో నైనద్దేవాऽऽప్నువాన్ పూర్వమర్షత్**
**తద్ధావతోఽన్యాన్ అత్యేతి తిష్ఠత్తస్మిన్నపోమాతరిశ్వదదాతి** – ఈశావాస్యోపనిషత్తు 4
భగవంతుడు తన పరంధామంలో ఉన్నప్పటికీ మనసుకంటే వేగంగా ఎక్కడైనా ఉండగలడు.....

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – దేశకాలవస్తువులు వేగానికి ప్రతిబంధకాలు. కాని భగవంతునికి ఇవేవీ అడ్డుకావు. ఆయన అన్నిచోట్లా, అన్ని కాలాలలో అన్నింటా ఉంటాడు.

**అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యతి అచక్షుః స శృణోతి అకర్ణః**
**స వేత్తి వేద్యమ్ న చ తస్య అస్తి వేత్తా తమాహుః అగ్ర్యమ్ పురుషమ్ మహాన్తమ్** – శ్వేతాశ్వరోపనిషత్తు 3.19
ఆయన కాళ్ళు, చేతులు వాడకుండా కదులుతాడు, పట్టుకొంటాడు. కనులు లేకుండా చూస్తాడు. చెవులు లేకుండా వింటాడు. ఆయనకు తెలియనిది లేదు. ఆయనను తెలిసినవారు లేరు. ఆయనను ప్రథముడు అనీ, మహా అనీ అంటారు.

ధర్మచక్రము రచయిత – భగవంతుని ధ్యానించిన కొలదీ మనకు దేశ కాల వస్తు అవరోధాలు తగ్గుతాయి. మనం భగవంతునికి దగ్గర అవుతాము.

## 696. తీర్థకరః

- పుణ్యజలములకు మూలమైనవాడు.
- మనలను సంసారసాగరం దాటించేవాడు.
- ఆయన కరస్పర్శ పావనం చేస్తుంది.
- తనను చేరడానికి వివిధ అవతారములు, గురువులు వంటి సోపానములను ఏర్పాటు చేసినవాడు.

### ఓం తీర్థకరాయ నమః

**గంగాదితీర్థ హేతుత్వాత్ శ్రుతిస్మృత్యోః ప్రవర్తనాత్ ఆత్మప్రవేశ సోపాన కృత్వా తీర్థకర స్మృతః** - గంగ మొదలైన పుణ్యతీర్థములకు కారణమైనవాడు. శ్రుతులు, స్మృతులు ప్రవర్తింపజేయువాడు. అనితరసాధ్యమైన ఆత్మప్రవేశం చేయడానికి మార్గం వంటివాడు తీర్థకరుడు.

'తీర్థము' అనే పదము 'తౄర్ - ప్లవన తరణయోః - ఈదుట, దాటుట' అనే ధాతువునుండి వచ్చినది. అందునుండే పవిత్రముచేయు జలాలను కూడా తీర్థము అన్నారు. మరోవిధంగా, **తరత్యనేన పాపమ్ అజ్ఞానమ్ ఇతి తీర్థమ్** – అజ్ఞానమును నశింపజేసి, పాపములనుండి తరింపజేయు వేదాదులు కూడా తీర్థములని చెప్పారు. ఇంకోవిధంగా సంసారాన్ని దాటి భగవంతుని చేరడానికి చేయూతనిచ్చే అవతారమూర్తులు (పర, వ్యూహ, విభవ, అర్చా, అంతర్యామి అవతారాలు) తీర్థములని వ్యాఖ్యాతలన్నారు. శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురము 7.10.1 ప్రకారము మూడు స్థావర తీర్థములున్నాయి (1) పెరుమాళ్ళు (2) పవిత్రమైన ఆళ్వారు పాశురాలు (3) ఆ పాశురాలను గానం చేసే భక్తులు.

'కరః' అనే శబ్దాన్ని వ్యాఖ్యాతలు రెండు విధాలుగా వ్యాఖ్యానించారు.

(1) 'కృ - కరణే' ధాతువునుండి -చేయువారు (2) కరము – చేయి.

పైన చెప్పిన అర్థాల ప్రకారం 'తీర్థకరః' నామాన్ని అనేక విధాలుగా వ్యాఖ్యానించారు.

- తీర్థములను సృష్టించు (తయారుచేయ)వాడు (శ్రీ సత్యదేవో వాసిష్ఠ)
- శాస్త్రములను సృష్టించువాడు.
- పవిత్రమొనరించు చేయి కలవాడు (శ్రీ కృష్ణదత్త భరద్వాజ)

శ్రీ భట్టులు మూడు అర్థాలు చెప్పారు –

(1) భగవంతుడు గంగాది పవిత్ర నదులకు, పవిత్ర పుష్కరిణలకు మూలము కనుక ఆయన తీర్థకరుడు. ఆయా నదులు, సరస్సులు, భగవన్నామము కూడా భక్తులను పావనమొనర్చును.

(2) యోగము, జ్ఞానము, సాంఖ్యము (విజ్ఞానము, కళలు, శాస్త్రములు) ఆయననుండి జనించినవి గనుక ఆయన తీర్థకరుడు.

(3) భగవంతుడు సముద్రమువలెనే అందరానివాడు. కాని తన అవతారములనెడు సోపానములద్వారా భక్తులు ఆయనను చేరే వీలు కల్పించిన తీర్థకరుడు.

స్వామిదేశికన్ దయాశతకంలో రెండవ శ్లోకం (**విగాహే తీర్థ బహుళమ్ శీతలామ్ గురు సంతతిమ్**)లో రచయిత – అగాధమైన భగవంతుని చేరడానికి తీర్థములైన గురుపరంపరకు ప్రణమిల్లారు. ఈవిధంగా గురువును, గురుపరంపరను ప్రసాదించిన కారణంగా కూడా భగవంతుని తీర్థకరుడని అనవచ్చును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'తీర్థము' అనగా 'విద్య' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. **చతుర్దశ విద్యానామ్ బాహ్యవిద్యా సమయానామ్ చ ప్రణేతా ప్రవక్తా చ ఇతి తీర్థకరః.** పదునాలుగు విద్యలను, మరియు సంబంధిత బాహ్యవిద్యలను తెలియబరచినవాడు తీర్థకరుడు. 4 వేదాలు, 6 వేదాంగాలు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము), 2 దర్శనములు (న్యాయ, మీమాంస), ధర్మశాస్త్రములు, పురాణములు – ఇవి 14 విద్యలు. ఇంకా నాలుగు విద్యలు (ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము) ఉన్నాయి. (ఇవి కాక అసుర (నాస్తిక) స్వభావం కలవారిని (బౌద్ధులు, జైనులు....) పెడమార్గం పట్టించే విద్యలగురించి కూడా ప్రస్తావన ఉంది).

విద్యలు (తీర్థములు) బోధించినవారిలో ఆద్యుడు కనుక భగవానుడు తీర్థకరుడని శ్రీ చిన్మయానంద వ్యాఖ్యానించారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **తీర్థః తారకః కరో యస్య ఇతి తీర్థకరః.** ఎవని కరస్పర్శ సకల పాపములను, అజ్ఞానమును నశింపజేసి పావనము చేయునో అతడు తీర్థకరుడు. భగవంతుని స్పర్శమాత్రమున గజేంద్రుడు అజ్ఞానబంధనుండి విముక్తుడై, పీతాంబరధారియై, చతుర్భుజములు కలిగి హరి పార్షదత్వమును పొందాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – తీర్థము అనగా దాటుట. కరము అనగా చేయుట. సూర్యాది గ్రహముల చలనమునకు కారణమైనవాడు తీర్థకరుడు.

## **697.** వసురేతా

- ప్రకాశమునకు జన్మస్థానము.
- విశ్వసృష్టియందు బంగారమువలె ప్రకాశించువాడు.

- విశ్వమునకు మూలమైనవాడు.

## ఓం వసురేతసే నమః

ఈ నామము మొదలుగా, **786**వ నామమువరకు, భగవానుని శ్రీకృష్ణావతారమును సూచించునవిగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **848**వ నామమువరకు భగవానుని 'దుష్టనిగ్రహ శిష్టపరిపాలనము'ను సూచించునవిగా శ్రీ వి.వి. రామానుజన్ వర్గీకరించారు.

**గోపాలతాపిని ఉపనిషత్తునుండి** (డా. క్రోవి పార్థసారథి రచన శ్రీ కైవల్యసారథినుండి)

పూర్వకాలంలో కొందరు మునీశ్వరులు తపోనిష్ఠాగరిష్ఠుడైన ఒక బ్రాహ్మణుని దగ్గరకు పోయి ఇలా అడిగారు – బ్రాహ్మణోత్తమా! గొప్పవాడైన దేవుడెవరు? మృత్యువు ఎవరికి భయపడుతుంది? ఎవరిని తెలుసుకొన్నందువల్ల అన్ని విషయాలు తెలుస్తాయి? ఈ జగత్తు ఎవరివల్ల నడుస్తున్నది? ఈ విషయాలన్నీ దయచేసి మాకు వివరించండి.

దానికి ఆ ద్విజశ్రేష్ఠుడు ఇలా అన్నాడు – తాపసోత్తములారా! శ్రీకృష్ణుడు పరదేవత. అతని పేరు వింటేనే మృత్యువు కూడా భయపడుతుంది. అతన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుంది. అతనివల్లనే ఈ జగత్తు నడుస్తున్నది. అతడే పాపములు పోగొట్టే మహానుభావుడు. వేదవిదుడు. అతడే పరబ్రహ్మ. అతన్ని స్మరించినంతమాత్రం చేతనే మృత్యువు తొలగిపోయి, సాధకుడు మృత్యువు లేనివాడు అవుతాడు.

అతడు హిరణ్మయుడు, గోపవేషుడు, మేఘమువంటివాడు, తామరలవంటి కనులు గలవాడు, మెరుపువంటి వస్త్రము కలవాడు. రెండు భుజములవాడు. జ్ఞానముద్ర కలవాడు. వనమాల ధరించినవాడు. దివ్యాలంకార భూషితుడు. రత్నపద్మమధ్యగతుడు. కాళిందీజలకల్లోలమారుతము సేవించేవాడు. అట్టి శ్రీకృష్ణుని సేవించినవాడు సంసార బంధనాలనుండి విడివడి ముక్తుడవుతాడు. అతన్ని సేవించడానికి ఐదు పదముల మంత్రమున్నది. అందులో

క్లీం కృష్ణాయ – మొదటి పదము

గోవిందాయ – రెండవ పదము

గోపీజన – మూడవ పదము

వల్లభాయ – నాల్గవ పదము

స్వాహా – ఐదవ పదము.

ఈ మంత్రాన్ని ఉపాసన చేసినవాడు బ్రహ్మపదము పొందుతాడు. శ్రీకృష్ణుడు ఒక్కడే అయి ఉండి అనేక రకాలుగా ప్రకాశిస్తున్నాడు. అతనిని సేవించినవారికి శాశ్వత సుఖము కలుగుతుంది. అతడే వాసుదేవుడు. సచ్చిదానందుడు. బృందావనంలో కల్పవృక్షము నీడన విశ్రమించినవాడు. విశ్వరూపుడు. సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. విజ్ఞానరూపి, పరమానందుడు, కమలనేత్రుడు, కమలనాభుడు, కమలాపతి, నెమలి పింఛముతో అలరారేవాడు, కంసుని సంహరించినవాడు, అతడే శ్రీకృష్ణపరమాత్ముడు. దేవాదిదేవుడు, సృష్టి స్థితి లయ కారకుడు, పరబ్రహ్మ.

**దేవభేదేఽనలే రశ్మౌ వసూ రత్నే ధనే వసు**
**విష్ణౌ చ వేధాః స్త్రీత్వాశీర్హితాశంసా హి దంష్ట్రయో** – అమరకోశము (3.4.288)

'వసు' శబ్దమునకు ఒక జాతి దేవతలు (దేవభేదము), అగ్ని, కాంతి, కళ్ళెము, రత్నము, ధనము, విష్ణువు, తెలిసినవారు (వేధా) అనే అర్థాలున్నాయి. 'రేత'కు మూలధాతువు 'రీ' - శ్రవణే - ప్రవహించుట. ఈ పదాన్ని రేతస్సు, విత్తనము, కారణమువంటి అర్థాలలో వాడుతారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'వసు' అనగా 'ప్రకాశము' (**వసు ఇతి జ్యోతి పర్యాదః**), 'రేతస్' అనగా 'మూలము' లేదా 'కారణము' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. దివ్యప్రకాశమునకు మూలమైనవాడు, సూర్యాదులకు కాంతినిచ్చేవాడు 'వసురేత'. శ్రీ భట్టుల వ్యాఖ్యను నిరుక్తిలో ఇలా చెప్పారు – **వసుశబ్దో జ్యోతిరర్థో రేతస్తత్కారణమ్ మతమ్ దివ్యజ్యోతిః కారణత్వాత్ వసురేతా ప్రకీర్తితః.**

శ్రీ అణ్ణాంగారాచార్య స్వామి – తన అవతారములకు తన దివ్యతేజస్సు కారణమైనవాడు వసురేత. ఉదాహరణకు ఆయన దివ్యతేజస్సుగా దేవకి గర్భంలో ప్రవేశించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వసువర్ణమ్ రేతాః అస్య ఇతి వసురేతాః.** బంగారమువంటి వీర్యము కలవాడు వసురేత. ఇందుకు శ్రీ శంకరులు వ్యాసుని రచనను ఉదాహరించారు – **దేవః పూర్వమాపః సృష్ట్వా తాసు వీర్యముపాసృజాత్ తదాండమ్ భవత్ హైమమ్ బ్రహ్మణః కారణమ్ పరమ్.** పరమేశ్వరుడు సృష్టి చేయాలని సంకల్పించి, ముందుగా నీటిని సృష్టించి, అందు తన వీర్యాన్ని ఉంచాడు. అది హిరణ్మయాండము (బంగారు గ్రుడ్డు) అయినది. దానినుండి బ్రహ్మ ఉద్భవించాడు అని పురాణాలలో చెప్పబడింది. కనుక పరమేశ్వరుడు హిరణ్యగర్భుడు. వసురేత.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'వస్' - నివసే - నివాసముండుట; 'రేతస్' - కారణము. ఎవనియందు విశ్వము అంతర్గతమై (నివాసం) ఉంటుందో అతడు వసు. విశ్వంలో అన్నింటికీ కారణమైనవాడు వసురేత.

ధర్మచక్రము రచయిత – బంగారంనుండి ఆభరణాలు తయారైనట్లుగా భగవంతునినుండి సకలజీవులు ఉద్భవిస్తాయి. సృష్టి సమయంలో బంగారంలా ప్రకాశించేవాడు దేవుడు. ఆభరణాల తయారీకి బంగారంలో అన్యలోహాలు కలిపినట్లుగా సృష్టికొరకు ఆయన వీర్యానికి పాంచభౌతికమైన మూలప్రకృతి తోడవుతుంది.

శ్రీ నాథుని చిత్రం. వికీపీడియా నుండి. Art by Damian N. Boodram



కన్నులు గల్గువాడు మఱి కావనివానికి త్రోవజూపగా
జన్న తెఱంగు మూఢునకు సమ్మతి దా గురుడౌట; సూర్యుడే
కన్నులుగాగ భూతముల గాంచుచునుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురువవై సద్గతి జాడ జూపవే.

భాగవతము. అష్టమస్కంధము.

## 698. వసుప్రదః

## 699. వసుప్రదః

- గొప్ప సంపదలను ఇచ్చువాడు.
- తనను తానే మహాధనంగా ప్రసాదించువాడు.
- కుబేరాదులకు కూడా అనంత సంపదల నిచ్చువాడు.
- అత్యుత్తమమైన మోక్షసంపదనిచ్చువాడు.
- సకల జీవులకు నివాసస్థలం కలిగించేవాడు.
- యశస్సును ఇచ్చువాడు.

ఓం వసుప్రదాయ నమః

## ఓం వసుప్రదాయ నమః

29వ శ్లోకంలో 270వ నామము **'వసుదః'** అని గమనించాలి. **సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః.**



ఆ 'వసుదః' నామమునకు వ్యాఖ్యానకర్తలు సాధారణంగా 'సంపదలు ఇచ్చేవాడు' అని అర్థం చెప్పారు. ఇప్పుడు ఈ 74వ శ్లోకంలో 'వసుప్రదః' నామము వెంటవెంటనే రెండు సార్లు వచ్చింది.

**మనోజవస్తీర్థకరో వసురేతా వసుప్రదః**
**వసుప్రదో వాసుదేవో వసుః వసుమనా హవిః**

270వ నామము **'వసుదః'**కు 'ప్ర' అక్షరం అదనంగా చేరిస్తే 698, 699 నామములు **'వసుప్రదః'** వచ్చును. ఈ నామములకు వ్యాఖ్యాతలు చెప్పిన అర్థాలు – కుబేరసమంగా ప్రత్యేకమైన సంపదలు ఇచ్చువాడు, తనను తానే ప్రసాదించువాడు, మోక్షమునిచ్చువాడు, శాశ్వతమైన యశస్సును ఇచ్చువాడు – ఇలా వ్యాఖ్యానకర్తలు పునరుక్తిదోషం లేదని నిరూపించారు. **వసుధమ్ ప్రకర్షేణ దదాతి ఇతి వసుప్రదః** – వసువును, అనగా ధనమును, విశేషముగా ఇచ్చువాడు వసుప్రదుడు.

హళెబీడులో శ్రీలక్ష్మీనారాయణుల శిల్పాలు. వికీపీడియా చిత్రం. Photo by Dineshkannambadi
https://commons.wikimedia.org/wiki/File:Relief_sculpture_of_the_Hindu_god_Narayana_with_his_consort_Lakshmi_(Lakshmi narayana)_in_the_Hoysaleshwara_temple_at_Halebidu.jpg

శ్రీ భట్టుల వ్యాఖ్య –

**698. వసుప్రదః** – పరమనిధియైన తనను తానే ధనముగా భక్తులకు ప్రసాదించేవాడు వసుప్రదుడు.
**దేవకీ వసుదేవాభ్యాం ఆత్మరూపం మహద్ధనం పుత్రత్వేన ప్రకర్షేణ దదాతీతి వసుప్రదః.** దేవకీ వసుదేవులకు తాను అనే మహాధనాన్ని పుత్రరూపంగా ప్రసాదించినవాడు వసుప్రదుడు.

**699. వసుప్రదః** – గొప్ప యశస్సును, కీర్తిని, తేజమును ప్రసాదించువాడు వసుప్రదుడు.
**దేవకీ వసుదేవాభ్యాం స్వపితృత్వం మహద్వసు తేజో యః ప్రదాతీతి వసుప్రద ఇతీరితః.** దేవకీ వసుదేవులకు తన తల్లిదండ్రులుగా ఉండడం అనే గొప్పకీర్తి (వసువు)ను ఇచ్చినవాడు వసుప్రదుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

**698. వసుప్రదః** – కుబేరాదులకు కూడా నిజంగా సంపదను ప్రసాదించువాడు వసుప్రదుడు. కుబేరునకు ధనాధికారి అనే పేరు ఉందిగాని భగవంతుని కటాక్షమువల్లనే అతనికి ధనం, ఆ ధనాన్నిచ్చే పేరు సంభవించాయి.

**699. వసుప్రదః** – అన్నింటికంటె అత్యుత్తమమైన సంపద, అనగా మోక్షమును ప్రసాదించేవాడు వసుప్రదుడు. **వసు - మోక్షాఖ్యం ప్రకృష్టం ఫలం భక్తేభ్యః ప్రదదాతి.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్య –

**698. వసుప్రదః** – 'వసు' అనగా నివాసముండుట (వసించుట). **వసత్యస్మిన్ ఇతి వసుః, వాసన్తమ్ ప్రదదాతి ఇతి వసుప్రదః.** సకల జీవులకు తనయందే నివాసముండునట్లు చేసినవాడు వసుప్రదుడు.

**699. వసుప్రదః** – సంపదలను ఇచ్చువాడు వసుప్రదుడు.

## 700. వాసుదేవః

- వ్యాపించువాడు, క్రీడించువాడు.
- వసుదేవుని సుతుడు.
- ప్రసిద్ధ వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రపు దైవము.
- తన భక్తులచే ఆరాధింపబడే దేవుడు.
- అన్నింటియందు ఉండేవాడు, వానిని చలింపజేయువాడు.

### ఓం వాసుదేవాయ నమః

ఈ పరమ పవిత్ర నామము మూడుమార్లు ఈ మహాస్తోత్రమున స్తుతింపబడినది.

36వ శ్లోకము. 334వ నామము. వాసుదేవః – **వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః**

74వ శ్లోకము. 701వ నామము. వాసుదేవః **– వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః**

76వ శ్లోకము. 714వ నామము. వాసుదేవః – **భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోనలః**

ముందుగా 334వ నామము వ్యాఖ్యలో శ్రీభట్టుల ప్రత్యేకవ్యాఖ్యను గమనించనగును – 'నారాయణ' నామము వలెనే 'వాసుదేవ' నామము గుహ్యమంత్రము. సరియైన గురువువద్దనే ఈ నామమునకు అర్థమును తెలిసికొననగును.

వివిధ వ్యాఖ్యాతలు చెప్పిన విషయాలలోని భావాలు ఇక్కడ ఇవ్వడమైనది.

36వ శ్లోకము. 334వ నామము. **వాసుదేవః** – శ్రీ భట్టుల వ్యాఖ్య – 'వాసు' - తల్లి గర్భములోవలె భగవంతునియందు సమస్తము నివసించును. అంతటినీ ఆయన ఆవరించి పక్షి తన రెక్కలతో కప్పియుంచినట్లు కాపాడుతున్నాడు. 'దేవ'-క్రీడించువాడు. సృష్టి, వ్యాప్తి, రక్షణ, లయము ఇవన్నీ ఆయన లీల. వాసు-దేవ – వాసుదేవ. అంతటినీ తనయందు ఉంచుకొని క్రీడించువాడు వాసుదేవుడు.

36వ శ్లోకము. (334వ నామము). **వాసుదేవః** – శ్రీ శంకరుల వ్యాఖ్య – వసతి - ఆచ్ఛాదయతి - కప్పియుంచును. **వసతి వాసయతి ఆచ్ఛాదయతి వా సర్వమ్ ఇతి వాసుః.** సర్వమును తన మాయతో కప్పియుంచి క్రీడించువాడు వాసుదేవుడు. శ్రీ శంకరులుకూడా 'వాసు', 'దేవ' అనే పదాల ఆధారంగానే ఈ నామాన్ని వ్యాఖ్యానించారని గమనించవచ్చును. కాని ఇందులో ఆయన భగవంతుని 'మాయ'ను ప్రస్తావించారు. **జగత్ ఆచ్ఛాదయి మాయయా ఇతి వాసుః స ఏవ దేవ ఇతి వాసుదేవః.** అద్వైతుల సంప్రదాయం ప్రకారం మాయ అనేది అజ్ఞానస్వరూపం (భ్రాంతి). కాని విశిష్టాద్వైతంలో మాయ అనేది ఈశ్వరుని అద్భుతమైన శక్తి (లీల)లో ఒక భాగం.

ఈ 74వ శ్లోకము. 700వ నామము. **వాసుదేవః** – ఈ సందర్భములో శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడా వసుదేవుని సుతుడు వాసుదేవుడు – అనే అర్థం చెప్పారు. **వసుదేవస్య అపత్యమ్ వాసుదేవః.** శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతంనుండి ఉదాహరించారు.

**అవతీర్ణో యదుకులే గృహానక దుందుభేః**
**వదంతి వాసుదేవేతి వసుదేవ సుతం హి మామ్** – భాగవతము 10.51.41

76వ శ్లోకము. 714వ నామము **వాసుదేవః** – శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీవాసుదేవ ద్వాదశక్షరీ మంత్రమునకు అధిదేవతయైన వాసుదేవుడు. శ్రీవైకుంఠములోని పరవాసుదేవుడే పాలసముద్రంలో వ్యూహవాసుదేవునిగా అవతరించాడు. ఆయనే మధురలో దేవకీ వసుదేవులకు సుతునిగా అవతరించాడు (700వ నామమునకు శ్రీ భట్టుల వివరణ). శ్రీవైకుంఠమునుండి దిగివచ్చిన ఆ వ్యూహవాసుదేవుడే గోపికల హృదయాలను అలరింపజేశాడు. యోగులకు పరతత్త్వము అయ్యాడు. కంసాది దుష్టులకు మృత్యుసమానుడయ్యాడు. (శ్రీ వి.వి. రామానుజ్ వివరణ)



శ్రీకృష్ణావతారం బాల్యంలోని అనేక ఘట్టాలను ఈ అజ్ఞాత చిత్రకారుడు ఒకేచిత్రంలో చూపించాడు.
1800-1850 కాలపు చిత్రం. వికీపీడియా నుండి. https://commons.wikimedia.org/wiki/File:Krishna_saga.jpg

శ్రీ కృష్ణదత్త భరద్వాజ మరొక వైవిధ్యమైన అర్థం చెప్పారు. వాస్ - ఉపసేవాయాం - సుగంధభరితము చేయుట. **వాసయతే సేవయతే భక్తైః ఇతి వాసుః, స చాసౌ ఇతి వాసుదేవః.** భక్తులచే అలంకరింపబడేవాడు వాసుదేవుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **దివ్ - క్రీడా విజిగీష వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు** – ఇందులో 'గతి'- అనగా కదలుట. అన్నింటియందు ఉండేవాడు, వానిలోని చలనమునకు ఆధారమైనవాడు వాసుదేవుడు. **ఈశావాస్యమిదమ్ సర్వమ్ యద్ కించన జగత్యామ్ జగత్** (ఈశావాస్యోపనిషత్తు).

శ్రీ చిన్మయానంద – సకల జీవులలోని అంతర్యామి వాసుదేవుడు. ఇందుకు గీతాశ్లోకం ప్రమాణంగా భావింపవచ్చును.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**

**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా** – గీత 18.6

ఈ శ్లోకానికి వివరణ ఇస్తూ శ్రీ భగవద్రామానుజులు తమ గీతాభాష్యంలో 'వాసుదేవ' అనే పదాన్ని వాడారు గనుక పై అర్థాన్ని ఆయన సమర్ధిస్తున్నట్లు భావింపవచ్చును. **ఈశ్వరః సర్వ నియమన శీలో వాసుదేవః సర్వభూతానామ్ హృద్దేశే సకల ప్రవృత్తి నివృత్తిమూల జ్ఞానోదయే దేశే తిష్ఠతి.**

## **701.** వసుః

- భక్తుల హృదయాలలో నివసించేవాడు.
- కోరదగినవానిలో అత్యుత్తమమైన సంపద.
- పాలకడలియందు శేషశాయియై వసించేవాడు.
- అష్టవసువులలో నొకడు.
- అన్నింటియందు ఉండేవాడు. అన్నీ ఆయనలో ఉండును.
- (భక్తులు కానివారికి) కానరానివాడు.
- అందరికీ కడపటి నివాస స్థానము.

### ఓం వసవే నమః

ఈ నామము మూడుమార్లు చెప్పడమైనది.

12వ శ్లోకము. 105వ నామము. వసుః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**

29వ శ్లోకము. 271వ నామము. వసుః – **సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః**

74వ శ్లోకము. 701వ నామము. వసుః – **వసుప్రదో వాసుదేవో వసుః వసుమనా హవిః**

శ్రీ భట్టుల వ్యాఖ్యలు –

12వ శ్లోకము. **వసుః.** కొద్దిపాటి భక్తికి కూడ భగవంతుడు సంతోషిస్తాడు. భక్తుల హృదయాలలో నివాసముంటాడు. శ్రీ రామానుజన్ శ్రీనమ్మాళ్వారు తిరువైమొళి (8.8.1)నుండి ఉదాహరించారు. ఒక్కడే ఐన పరమాత్ముడు నా ఆత్మలో ఆత్మయై ప్రకాశిస్తున్నాడు. భగవంతునకు జీవులను ఉద్ధరించాలనే కోరిక చాలా బలమైనది. కనుక భక్తికి సంబంధించిన ఏ సంకేతం కనుపించినా భగవంతుడు అక్కడికి పరుగున వస్తాడు. ఎవరైనా యధాలాపంగా అంకెలు లెక్కపెడ్తున్నారనుకోండి. 1 నుండి 24వరకు వారు తత్వాలను, 25వ అంకె ద్వారా ఆత్మను ప్రస్తావిస్తున్నారని భగవంతుడు భావిస్తాడు. 26వ అంకె లెక్కపెట్టగానే తననే తలచుకొంటున్నారని భావించి భగవంతుడు వారిచెంతకు అరుదెంచును. అలాగే ఎవరైనా కొండలపేర్లు వల్లిస్తూ 'తిరుమల' అన్న పేరు పలుకగానే తన ఇంటిని తలుస్తున్నారని భావించి భగవంతుడు వారిప్రక్కకు వేంచేస్తాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ భగవానుడు చెప్పిన ఈ మాటలను ఉదాహరించారు – **మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద.** నా భక్తులు నన్నెక్కడ గానముచేయుదురో అక్కడ నేనుంటాను.

29వ శ్లోకము. **వసుః. వాసుదేవస్సర్వమితి ప్రకారేణ గరీయసామ్ స్వయమేవ ధనమ్ ఇతి వసుః.** మహాత్ములు అన్యధనములను ఆశించక భగవంతునే కాంక్షిస్తారు. ఎందుకంటే సర్వసంపదలకంటె ఉత్తమమైన ధనము దేవుడే.

ధర్మచక్రము రచయిత – ఆటవస్తువుల మోజులో పడి బిడ్డ తల్లిని మరచిపోయినట్లుగా మనము అల్పమైన సాంసారిక మోహములలో పడి భగవంతుని మరచిపోతాము. కాని ఒక్కమారు బిడ్డ ఏడువగానే తల్లి తనబిడ్డను దగ్గరకు తీసికొనును. అలాగే మనము ఒక్కమారు భగవంతుడే అసలైన ధనమని గ్రహించి ఆక్రోశించగానే ఆయన మనను హత్తుకొనును.

74వ శ్లోకము. **వసుః**. ఇక్కడ 'వసుః' నామమును శ్రీ భట్టులు శ్రీ కృష్ణావతారపరంగా వ్యాఖ్యానించారు. లోకాలను కాపాడడానికి పాలసముద్రంనుండి శ్రీకృష్ణునిగా అవతరించినవాడు వసువు. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణలు –

**స లోకానామ్ హితార్థాయ క్షీరోదే వసతి ప్రభుః** – మహాభారతము. శాంతిపర్వము 47.26
**ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః నాగపర్యంకం ఉత్సృజ్యహ్యాగతో మధురాంపురీం** – హరివంశము 113.62. శ్రీలక్ష్మీసమేతుడై పాలకడలిలో శయనించియున్న ఆ నారాయణుడే శేషపాన్పును వదలి మధురానగరానికి వేంచేశాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు –

12వ శ్లోకము. **వసుః**. (1) **వసంతి భూతాని తత్ర తేష్వయమపి వసతీతి వసుః**. అన్ని భూతములు అతనియందే ఉంటాయి. ఆయన అన్నిభూతములయందు ఉండును. (2) అష్టవసువులలో ఒకడు. పావకుడు లేదా అగ్ని. వసూనామ్ పావకశ్చాస్మి – గీత 10.23

29వ శ్లోకము. **వసుః**. ఈ నామమునకు శ్రీ శంకరులు అనేక అర్థాలు చెప్పారు. (1) తనను తానే భక్తులకు ఇచ్చుకొనే పరమధనము. (2) వస్-కప్పుట. తనను తానే మాయచే కప్పియుంచేవాడు (3) అంతరిక్షమందు వాయువుగానున్నవాడు. **వసురంతరిక్షాత్** – కఠోపనిషత్తు 2.2.3

శ్రీ చిన్మయానంద – అందరికీ కడపటి నివాసము వసువు.

## 702. వసుమనాః

- తన భక్తులే తన నిధిగా భావించే మనసు కలవాడు.
- వసుదేవునిపట్ల మనసు లగ్నమైనవాడు.
- ఏ విధైన దోషములేని శుద్ధ సాత్విక మనసు కలవాడు.
- శుద్ధమైన, అన్నింటిపట్ల సమభావమున్న మనసు కలవాడు.
- భక్తులపట్ల వాత్సల్యము నిండిన మనసు కలవాడు.
- తన భక్తుల ఇక్కట్లను తొలగించే తత్వము కలవాడు.
- శరీరము, దాని తత్వము, అవుసరము గురించి పూర్తిగా తెలిసినవాడు.
- అంపశయ్యపై పరుండిన భీష్మునిపట్ల మనసు లగ్నమైనవాడు.

### ఓం వసుమనసే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది. 12వ శ్లోకంలోను, ఈ 74వ శ్లోకంలోనూ కూడా **వసుః**, **వసుమనాః** నామములు ఒకదాని తరువాత మరొకటి వచ్చాయి.
12వ శ్లోకము. 106వ నామము. వసుమనాః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**
74వ శ్లోకము. 702వ నామము. వసుమనాః – **వసుప్రదో వాసుదేవో వసుః వసుమనా హవిః**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

12వ శ్లోకంలో 'వసుః' (105వ) నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – భక్తుల మనసులలో నివశించేవాడు. తరువాతి (106వ) నామమైన 'వసుమనాః'కు శ్రీ భట్టుల వ్యాఖ్య – తన భక్తులే తన పెన్నిధిగా భావించేవాడు (వసు-సంపద, మనాః-మనస్సు). అనగా భగవంతుడు తన మనసులో భక్తులనే పెద్దనిధిగా భావిస్తాడు. **స మహాత్మా సుదుర్లభః** – అని గీత (7.19)లో ఉన్నది. **అకించన భక్త ధనేషు మనో యస్య స వసుమనాః** – అని శ్రీ బలదేవ విద్యాభూషణ వ్యాఖ్యానించారు.

తిరువైమొళి మొదటి పాశురంలో శ్రీ నమ్మాళ్వారు పెరుమాళ్ళు తిరువడిని **'తూయర్ అఱు సూడర్ అడి'** – భక్తుల కష్టాలను తొలగించే తిరువడి – అని వర్ణించారు. అనగా భక్తుల కష్టాలు తొలగితే పెరుమాళ్ తిరువడి మరింతగా ప్రకాశిస్తుంది (భగవంతుడు ఆనందిస్తాడు) అని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు. అయితే శ్రీ భగవద్రామానుజుల వ్యాఖ్యలో కొంత వ్యత్యాసం ఉంది (అని శ్రీ బి.ఆర్. పురుషోత్తమ నాయుడు తమిళ రచన 'ఈడువ్యాఖ్యానం'లో వివరించారు). తన భక్తుల స్పర్శవలన భగవంతునికి తూయర్ (దుఃఖం) తొలగి ఆయన పాదాలు మరింత ప్రకాశమానమయ్యాయట (అనగా భక్తుల సాంగత్యంకోసం భగవంతుడు ఎదురు చూస్తాడు). రామాయణం అయోధ్యకాండ (2.42)లో చెప్పిన విషయం కూడా గమనించాలి –

**వ్యసనేషు మనుష్యాణామ్ భృశమ్ భవతి దుఃఖితః ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి** - జనులు బాధపడితే శ్రీరాముడు దుఃఖితుడయ్యాడు. జనులు ఆనందిస్తే శ్రీరాముడు ఆనందించాడు.

ఇక 74వ శ్లోకంలోని **వసుః, వసుమనాః** నామములకు శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్యలు ఒకదాని కొకటి అనుసంధంగా గమనించవచ్చును.

701. **వసుః**. క్షీరసాగరంలో వసిస్తూ, భక్తజనరక్షణ కొరకు అవతారాలకు సిద్ధంగా ఉన్నవాడు.

702. **వసుమనాః**. తాను క్షీరసాగరంలో ఉన్నాగానీ తన మనసు వసుదేవునియందు (బిడ్డగా జన్మించడానికి) లగ్నమైయున్నవాడు. **వసౌ మనః యస్య సః వసుమనాః**.

**జన్మభూమ్యర్ణవే లక్ష్మ్యాః వసతో యస్య వై మనః అస్తీతి వసుదేహీతి సస్యాద్వసుమనాః పరమ్** - లక్ష్మీదేవికి పుట్టినిల్లయిన పాలసముద్రంమీద పవళించి ఉన్నప్పటికీ వసుదేవునియందే మనసు లగ్నమైనవాడు. ఇక్కడ 'వసు' అనగా వసుదేవుడు (భామ అనగా సత్యభామ, దత్తుడనగా దేవదత్తుడు అన్నట్లుగా) ఎందుకంటే భగవంతుడు వసుదేవునికి కొడుకుగా పుట్టడానికి సంకల్పించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

12వ శ్లోకంలోని 'వసుమనాః' **– రాగద్వేషాదిభిః క్లేశైః మదాదిభిః ఉపక్లేశైశ్చ యతో న కలుషితమ్ చిత్తమ్ తతః తన్ మనాః ప్రశస్తమ్; ప్రశస్తమ్ మనో యస్య సః వసుమనాః**. రాగద్వేషాదులచే కలుషితముకాని మనస్సు కలవాడు.

74వ శ్లోకంలోని '**వసుమనాః**' – అందరిపట్ల సమభావంతో, వ్యత్యాసాలు లేకుండా, అందరియందు వసించే శుద్ధ సాత్విక మనస్సు కలవాడు. **అవిశేషేణ సర్వేషు విషయేషు వసతి ఇతి వసుః, తా దృశమ్ మనః అస్య ఇతి వసుమనాః.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ రెండు అర్థాలు చెప్పారు –

వస్ - స్నేహే – ప్రేమించుట; వస్ - స్నేహ చ్ఛేద అపహరణేషు – ప్రేమించుట, ఖండించుట, అపహరించుట.

**వసు స్నేహః వాత్సల్యమ్ తన్ మనః యస్య ఇతి వసుమనాః** . తన భక్తులపట్ల వాత్సల్యముతో నిండిన మనస్సు కలవాడు.

**వాసయతి అపహరతి విపదః స్వజనానామ్ ఇతి వసుః; తా దృశమ్ మనో యస్య ఇతి వసుమనాః.** తన భక్తుల కష్టాలను అపహరించేవాడు (తొలగించేవాడు).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **యేన ప్రకారేణ నివసితుమ్ అర్హతి, పృథక్ పృథక్ శరీరకృతే కథమ్ విధస్య ఔష్ణస్య, కిం వా శీతస్య, కిం వా జలస్య, కిం వాయోః ఆవశ్యకతా అస్తీతి సర్వమ్ విష్ణుః జానాతి, తస్మాత్ స వసుమనాః ఉక్తో భవతి.** భగవంతుడు సకల జీవుల శరీరాలగురించి, వానికి కావలసిన శీతోష్ణములు, వాయువు, నీరు వంటివాని గురించి పూర్తిగా తెలిసినవాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భీష్ముడు వసువులలో నొకడు. శాపవశాన గంగా శంతనులకు జన్మించాడు. అలాంటి భీష్ముడు అంపశయ్యపై వాలి, పురుషోత్తముడైన వాసుదేవుని ధ్యానించాడు. అలా భగవంతుని మనసులో భీష్ముడున్నాడు గనుక భగవంతుడు 'వసుమనాః'

**శరతల్పోగతో భీష్మః శంయన్నివ హుతాశనః మామ్ ధ్యాయతి పురుషవ్యాఘ్ర తతో మే తద్గతం మన**

ధర్మచక్రము రచయిత – ఎక్కువమంది ఐహిక వాంఛలలోను, స్వలాభాపేక్షలోను చిక్కుకుపోతారు. కాని వేదాంతజ్ఞానులైన కొందరు అంతటా భగవంతుని దర్శిస్తారు. వారికి భగవంతుడు తప్ప అన్యగమ్యం నిస్సారం. వారు అచంచలమైన భక్తితో భగవంతుని ఆరాధిస్తారు. దీనికి ఫలితం అనేక జన్మల అనంతరం వచ్చుగాక. అయినా వారి భక్తి సడలదు. '**వసుమనాః**' నామధ్యానం ద్వారా అలాంటి భక్తికి మనం దగ్గరౌతాము.

---

**శ్రీ జయదయాల్ గోయందకా రచన 'గీతా-తత్వవివేచనీ వ్యాఖ్య'నుండి –**

దేవతలకు, బ్రహ్మకును జరిగిన సంవాదమును గురించి భీష్ముడు దుర్యోధనునకు చెప్పెను. బ్రహ్మ ఇట్లు పలికెను – సకల లోకేశ్వరుడైన వాసుదేవుడు మీకందఱికిని పూజ్యుడు. శంఖ చక్ర గదాధారియును, మహావీరుడును ఐన వాసుదేవుని సామాన్యమానవునిగా భావించి ఎన్నడును ఆయనను చులకనగా చూడరాదు. అతడే అక్షరుడు. అవ్యక్తమైనవాడు. సనాతనుడు. పరమతేజస్సు. పరమ సుఖము. పరమ సత్యము. ఆ హృషీకేశుని మానవునిగా తలంచు మూఢమతులు నరాధములు.... చరాచర ప్రాణికోటికి ఆత్మస్వరూపుడు, శ్రీవత్సలాంఛనుడు, మహాతేజస్వి ఐన పద్మనాభుని యదార్థముగా తెలియనివారు తామస స్వభావులు. కౌస్తుభమును, కిరీటమును ధరించినవాడు, మిత్రులకు అభయప్రదాత ఐన భగవానుని అవజ్ఞ చేయువారు అతిభయంకరములైన నరకయాతనలకు గురియగుదురు. ఓ దేవతాశ్రేష్ఠులారా! ఈ విధముగా అయనయొక్క దివ్యస్వరూప తత్వమును తెలిసికొని, జనులెల్లరు లోకేశ్వరులకు ఈశ్వరుడైన ఆ వాసుదేవ భగవానునకు ప్రణమిల్లవలెను.

అంపశయ్యపై భీష్ముడు. వికీపీడియా చిత్రం. Art by T.Sujatha
https://commons.wikimedia.org/wiki/File:Ampasayyalo_bhishmudu.jpg



తన ప్రాణత్యాగమునకు ముందు భీష్ముడు శ్రీకృష్ణుని ఇలా ప్రార్థించాడు – హే భగవన్! దేవదేవేశ! సురాసుర వందిత! త్రివిక్రమ! శంఖచక్రగదాధారి! నేను నీకు ప్రణమిల్లుతున్నాను. వాసుదేవ! హిరణ్యాత్మ! పరమపురుష! సవిత! విరాట్ పురుష! నీవే సమస్త

జీవరూపుడవు. అణురూప పరమాత్ముడవు. సనాతనుడవు. పుండరీకాక్ష! పురుషోత్తమ! మీరు నన్ను ఉద్ధరింపుడు. ఓ కృష్ణ! వైకుంఠవాస! ఈ తనువును చాలించుటకు నాకు అనుజ్ఞ ఇండు. .... **యతః కృష్ణ స్తతో ధర్మో, యతో ధర్మ స్తతో జయః** – కృష్ణుడున్నచోటనే ధర్మముండును. ధర్మమున్నచోటనే విజయముండును.

నేను నిన్ను ఎఱుగుదును. నీవు పురాణపురుషుడవు. ఈ భూమిపై అవతరించిన ఆదినారాయణుడవు. ఓ కృష్ణ! తనువును త్యజించుటకు నాకు అనుజ్ఞ ఇమ్ము, నీ ఆజ్ఞతో ఈ శరీరమును వీడి, పరమపదము పొందెదను.

## 703. హవిః

- యజ్ఞ యాగాదులందు హోమము చేయు హవిస్సు.
- ఇవ్వబడినవాడు, స్వీకరింపబడినవాడు.
- సంతుష్టి చెందువాడు.

### ఓం హవిషే నమః

హు - దానాదానయోః – అర్పించుట, త్యాగము చేయుట.

72వ శ్లోకంలోని **'మహాహవిః'** నామముకూడా ఇదే ధాతువునుండి వివరింపబడినది. యజ్ఞయాగాదులలో హోమము చేయు పదార్థమును 'హవిస్సు' అంటారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు శ్రీకృష్ణావతారపరంగా వ్యాఖ్యలను కొనసాగించారు. **నందగోప యశోదాభ్యాం కంసోపద్రవ శాంతయే అదీయతే స్వీక్రియతే స హవిః పరికీర్తితః** - కంసునివలన కలిగిన ముప్పు తప్పించడానికి దేవకీవసుదేవులు ఇవ్వగా యశోదానందగోపులచే స్వీకరింపబడ్డవాడు. నిజానికి కృష్ణునికి కంసునివలన ఎలాంటి భయమూ లేకున్నాగాని, దేవకీవసుదేవుల మనశ్శాంతికొరకు ఆయన తనను తాను యశోదానందులకు ఇవ్వనిచ్చాడు.

ధర్మచక్రము రచయిత – దానము లేదా అర్పణమువలన ఇచ్చేవారూ పుచ్చుకునేవారూ కూడా ధన్యులవుతారు. ఐతే ఈ పనిని స్వార్థరహితంగా చేయాలి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **బ్రహ్మ అర్పణమ్ యేన కరణేన బ్రహ్మవిత్ హవిః అగ్నౌ అర్పయతి తత్ బ్రహ్మైవ ఇతి పశ్యతి.** బ్రహ్మను తెలిసినవారికి హవిస్సుకూడా బ్రహ్మమే అని తెలుసు. ఇందుకు ప్రమాణము గీతాశ్లోకము.

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా** – గీత 4.24
యజ్ఞయాగాదులలో ఉపయోగించే స్రుక్ స్రువాదులు బ్రహ్మము. హోమము బ్రహ్మము. హోమద్రవ్యము బ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోమము చేసే కర్మ బ్రహ్మము. హవనక్రియ బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడై ఉండే యోగిద్వారా పొందదగిన యజ్ఞఫలము కూడా బ్రహ్మమే. బ్రహ్మమే హవిస్సు. అది బ్రహ్మకే అర్పణము చేయుబడుచున్నది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ, శ్రీ బలదేవ విద్యాభూషణ – హు (హిన్వ్) - ప్రీణనే – సంతోషపరచుట. **హూయతే ప్రీయతే ఇతి హవిః.** సంతోషితుడైనవాడు 'హవిః'.

భీష్ముని ప్రార్థనకు సంతోషించి అతనికి మోక్షమునిచ్చినవాడు **'హవిః'** అని శ్రీ విద్యాభూషణ వ్యాఖ్య. ఇంతకుముందు నామము **'వసుమనాః'** అనగా భీష్మునిచే ధ్యానింపబడ్డవాడు అని ఆయన వ్యాఖ్యానించారు.



## సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః |
## శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాసః సుయామునః || (75)

### 704. సద్గతిః

- సజ్జనులకు సరైన మార్గము చూపేవాడు.
- సజ్జనులకు సరియగు మార్గము.
- ఉత్కృష్టమైన బుద్ధి కలిగినవాడు.
- సత్కార్యములద్వారా పొందదగినవాడు.

**ఓం సద్గతయే నమః**

'సత్' అనగా మంచిది, మంచివారు. 'గతి' అనగా మార్గము. **సతామ్ సాత్విక - సజ్జనానామ్ గతిః ఇతి సద్గతిః**. 2వ శ్లోకంలోని 12వ నామము **'ముక్తానామ్ పరమాగతిః'**, అనగా ముక్తులైనవారికి పరమగతి, నిధానము, గమ్యము. అలాంటి పరమగతిని అన్వేషించేవారికి మార్గము లేదా మార్గము చూపువాడు భగవంతుడేనని ఈ **'సద్గతిః'** నామము తెలియజేయుచున్నది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – సజ్జనులకు శాశ్వతమైన శాంతి, ఆనందము కలిగించేందుకు కావలసిన మార్గమును చూపేవాడు శ్రీనివాసుడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణంలో శ్రీకృష్ణజన్మమును వర్ణించే శ్లోకాన్ని ఉదాహరించారు.

**సంతః సంతోషమధికమ్ ప్రశమమ్ చండమారుతః**
**ప్రసాదమ్ నిమగ్నయాతా జాయమానే జనార్దనః** – విష్ణుపురాణము 5.3.4
జనార్దనుని జననసమయం ఆసన్నమైనందున సజ్జనుల మనస్సులు సంతోషంతో ప్రశాంతంగా ఉన్నాయి. గాలి మెల్లగా వీస్తుంది. నది మెల్లగా జారుతుంది.

శ్రీ వి.వి. రామానుజన్ ఈ ఘట్టాన్ని మరింత ముందుకు తీసికొని వెళ్ళారు. శ్రీకృష్ణుని జననం వెంటనే వసుదేవుని బంధాలు విడిపోయాయి. బాలునిగా ఉన్నప్పుడే కృష్ణుడు నందగోపుని స్థలంలో పెక్కు రాక్షసులను సంహరించాడు. పూతన, ధేనుకాసురుడు, శకటాసురుడు, ప్రలంబాసురుడు, కేశి, వ్యోమాసురుడు వంటి రాక్షసులు కృష్ణునిచేత హతులయ్యారు. అంతేగాక శిశుపాలాదుల పాపాలను కడతేర్చినందువలన ఆయన **'అసద్గతి'** కూడానని శ్రీ రామానుజన్ వ్యాఖ్యానించారు. శ్రీ నమ్మాళ్వారు తమ తిరువైమొళి (7.2.7)లో– కాకాసురునివంటివారికి కూడా ఆయనే గతి – అని చెప్పారు.

**ఉత్పన్న ఏవ కంసాది కృతి బాధాపనోదనాత్**
**సతాం ప్రాప్యతయా చైవ సద్గతి స్సముదాహృతః**
పుట్టినతోడనే కంసాది రాక్షసులను (వారివలన కలిగిన బాధలను) కడతేర్చినందున సాధుజనులకు గతియైనవాడు సద్గతి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – సజ్జనులకు గమ్యమైనవాడు సద్గతి. **అస్తి బ్రహ్మేతి చేద్ వేద సన్తమేనమ్ తతో విదుః** (తైత్తరీయోపనిషత్తు 2.6). బ్రహ్మము సద్రూపమని యెరిగినవారు సత్పురుషులు. అట్టి సత్పురుషులకు, అనగా బ్రహ్మవిదులకు గతియగువాడు గనుక పరమాత్ముడు 'సద్గతి'.

శ్రీ శంకరులు మరొక అర్థం కూడా చెప్పారు. 'గతి' అనగా బుద్ధి. **సతి గతిః, బుద్ధిః సముత్కృష్ట అస్య ఇతి వా సద్గతిః.** ఉత్కృష్టమైన బుద్ధి కలిగినవాడు సద్గతి.

శ్రీ బలదేవ విద్యాభూషణ – 'గతి' అనగా అందుబాటులో ఉన్నది. **సతామ్ భీష్మాదీనామ్ ప్రాప్యత్వాత్ సద్గతిః.** భీష్మునివంటి సజ్జనులకు అందేవాడు సద్గతి.

## 705. సత్కృతి

- మనోహరములైన, సత్ఫలితాలనిచ్చే, గొప్ప పనులు చేసేవాడు.

### ఓం సత్కృతయే నమః

**సతి సత్యా శోభనాచ కృతి రచనా యస్య ఇతి సత్కృతిః.** అని శ్రీ కృష్ణదత్త భరద్వాజ నిర్వచనము. మంచివైన, ఆనందము కలుగజేయు కార్యములు అనగా సత్కార్యములు గలవాడు సత్కృతి. బాలగోపాలునిగా ఆయన వెన్న దొంగిలించుట, రోటికి బంధింపబడుట వంటి ఉదాహరణలను శ్రీ భట్టులు పేర్కొన్నారు. **జన్మ కర్మ చ మే దివ్యమ్** – అని గీత (4.9)లో భగవానుడు చెప్పియున్నాడు. ఆయన దివ్య కార్యములు బాల్యలీలలకే పరిమితములు కావు. జగత్ సృష్టి, పాలన, లయము కూడా ఆయన దివ్యకార్యములే. మనసులో ఆయన దివ్యకార్యములను స్మరించినంతనే సంసారబంధనాలనుండి విముక్తి లభిస్తుంది.



నారాయణ తిరుమల ఆలయంలో చిత్రం.
వికీపీడియా నుండి. రాజ్ శేఖర్ తీసినది.
By Rajasekhar1961

శ్రీ నమ్మాళ్వారు తమ 6.4.1 నుండి 6.4.11 వరకు పాశురములలో భగవంతుని దివ్యలీలలను చక్కగా వర్ణించారు. ఇక్కడ ఆయన 'మఙ్ఞుమ్ పల' అన్న పదాన్ని పెక్కుమార్లు వాడడంవలన ఇలాంటి అనంతమైన లీలలున్నాయని గ్రహించవచ్చును.

శ్రీ చిన్మయానంద – ఇతరులను శిక్షించినట్లు కనిపించే ఆయన పనులు (కురుక్షేత్ర యుద్ధము, రావణవధ వంటివి) కూడా జగద్రక్షణకు, మరియు వారిని ఉద్ధరించడానికే.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు భగవానుని లోకరక్షణను ప్రత్యేకంగా పేర్కొన్నారు. **సత్ కృతిః జగద్రక్షణాది లక్షణా అస్య యస్మాత్ తేన సత్కృతిః.** జగద్రక్షణ కొరకు చేయు పనులు గలవాడు సత్కృతి.

శ్రీ బలదేవ విద్యాభూషణ –

**యది వాతాది దోషేణ మద్భక్తో మామ్ న చ స్మరేత్**
**అహం స్మరామి మద్భక్తమ్ నయామి పరమాం గతిమ్**

శరీర దౌర్బల్యాది కారణాలవలన అంత్యకాలంలో ఎవరైనా భగవంతుని స్మరింపలేకుంటే కూడా, భగవంతుడు వారిని గుర్తుంచుకొని వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. కనుక ఆయన సత్కృతి.

## 706. సత్తా

- 'సత్' అయినవాడు. 'ఉనికి' అన్న భావానికి మూర్తి.
- తానొక్కడే అయినవాడు.

ఓం సత్తాయై నమః

**సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే** – గీత 17.26
**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే**
**కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే** – గీత 17.27

ఓ పార్థ! 'సత్' అను పరమాత్మ నామము సత్యభావమునందును, శ్రేష్ఠభావమునందును, అనగా పరమాత్ముడు నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావమునందును ప్రయోగింపబడుచుండును. ఉత్తమ కర్మాచరణము నందును 'సత్' అను శబ్దము ప్రయుక్తమగుచుండును. యజ్ఞ దాన తపః క్రియలయందలి నిష్ఠ, ఆస్తిక భావమును 'సత్' అని యందురు. పరమాత్మను ఉద్దేశించి చేయబడు నిశ్చయాత్మక కర్మలను కూడ 'సత్' అని యందురు.

పై భావములనుండి 'సత్' అనగా 'ఉండుట, ఉనికి' అన్న అర్థముపై ఈ నామమును వ్యాఖ్యానించిరి. 'త్వ' లేదా 'తల్' అనే విభక్తులవలన 'గుణము కలిగియుండుట' అనే భావం జత అవుతుంది (పాణిని 5.1.119). కనుక 'సత్తా' అనగా ఉండుట అనే గుణమున్నవాడు, నిత్యుడు, మూర్తీభవించిన తానొక్కడు, సకల ప్రాణుల ఉత్పత్తికి మూలమైనవాడు – వంటి అర్థాలను చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

**సత్తాది సతామ్ స్వయమేవ ఇతి సత్తా నహి తద్ వ్యతిరేకేన కించిత్ స్యాత్.** సత్పురుషులకు తానే 'సత్తు'గా ఉండేవాడు. సత్తులకు సత్తుగా ఉండేవాడు. ఆయన లేనిది ఏదీ లేదు. కనుక 'ఉనికి' అన్న పదానికి అర్థం పరమాత్ముడే. ఇందుకు శ్రీ భట్టులు గీతనుండి ఉదాహరించారు.

**యచ్చాపి సర్వభూతానామ్ బీజం తదహమర్జున**
**న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరమ్** – గీత 10.39

ఓ అర్జున! సర్వ ప్రాణుల ఉత్పత్తికి కారణమైన బీజమును నేనే. ఏలనన నేను లేని చరాచర ప్రాణి ఏదియును లేదు.

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ తిరుమళిశయాళ్వారు తిరువంతాడి (7)నుండి ఉదాహరించారు – నీవు లేకుండా మేము లేము. ఇక నీ సంగతి. నీవు రక్షించేది మమ్మల్ని కాకపోతే నీకు రక్షించడానికి వేరేమీ లేదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'ఉండుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత అనుభూతిః సత్తా**. తన, పర భేదం లేనివాడు. ఇందుకు శ్రీ శంకరులు ఛాందోగ్యోపనిషత్తు (6.2.1) నుండి ఉదాహరించారు. **ఏకమేవాऽద్వితీయం బ్రహ్మ.**

ఉద్దాలక మహర్షి తన కుమారుడైన శ్వేతకేతువునకు ఇలా ఆత్మజ్ఞానం బోధించాడు – సృష్టికి పూర్వం ఈ ప్రపంచం నామరూపాలతో కూడిలేదు. అప్పుడు కేవలం అద్వితీయమైన సత్తు మాత్రమే ఉన్నది. నామము, రూపము, పదార్థము ఏమీ లేదు. 'సత్తు' అంటే

ఉనికి, సత్యం అని అర్థం. అసత్తు అంటే లేనిది, అసత్యం అని అర్థం. అన్నింటికన్నా పూర్వమైనది, రెండు కానిది, మొదటగా ఉన్నది ఏకైక పరబ్రహ్మ.

శ్రీ శంకరుల వ్యాఖ్యపై ధర్మచక్రము రచయిత మరింత వివరణ ఇచ్చారు: సజాతీయ భేదము – ఒకే జాతికి చెందిన రెండు జీవుల మధ్య భేదము. ఉదాహరణకు ఇద్దరు వ్యక్తుల మధ్య భేదము; ఈ భేదము కారణంగానే మనమంతా భగవంతుని శేషులమని, మనందరికీ భగవానుడు అంతర్యామి అనీ గ్రహించలేకపోతున్నాము. విజాతీయ భేదము – ఉదాహరణకు ఒక మనిషికి, జంతువుకు మధ్య భేదము; ఈ కారణం చేతనే కుక్క పిల్లిపై దాడి చేస్తుంది. నిజమైన జ్ఞానులు అన్ని జీవులూ భగవంతుని సృష్టి అని భావించి అన్నింటినీ ఆదరిస్తారు. స్వగత భేదము – ఒకే జీవికి వివిధ అవయవాలు, ఇంద్రియాలు అనే భేదము. ఈ కారణంచేత ఒక అవయవం అందంగా ఉన్నదనీ, మరొకటి లేదనీ భావిస్తాము. ఈ భేదాలు మనకు సత్యసాధనలో అడ్డంకులు. భగవానుడు ఈ అన్ని రకాల భేదాలకూ అతీతుడు. అంతే కాకుండా భగవంతుడు అద్వితీయుడు. ఆయనకు 'మరొకడు' లేడు. ఆయనకు భేదభావము, కాలభేదము లేదు. మార్పు లేదు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **సత్తాహి ఆత్మ ధారణమ్.** భగవానుడు ఒకడే అందరినీ రక్షించేవాడైన 'సత్తా'. మరెవరికీ రక్షించే శక్తిగాని, నిలిపే శక్తి గాని ఉడదు.

## 707. సద్భూతిః

- సజ్జనులకు, సాధువులకు సమస్త బంధువర్గము తానే ఐనవాడు. వారికి సకల ఐశ్వర్యములు ఆయనే.
- గొప్ప యశస్సు, వైభవము కలవాడు.
- సత్యముగా ఉండేవాడొక్కడే.
- అనేక రూపములు (విభూతులు)గా అవతరించువాడు.

### ఓం సద్భూతయే నమః

అమరకోశము ప్రకారము 'భూతి' అనగా సంపద, ఐశ్వర్యము, ఉండుట (భవతి). **భవత్యనయా శ్రీమాన్ ఇతి భూతిః, భవతి ఇతి వా.**

**స తామ్ మహాత్మనా భూతిః సంపత్తిః ఇతి సద్భూతిః.** మహాత్ములకు, సాధువులకు సంపత్తి అగువాడు సద్భూతి. అని శ్రీ కృష్ణదత్త భరద్వాజ నిర్వచనము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – నిజమైన భక్తులకు ఆయన కొడుకు, స్నేహితుడు, దూత, రథసారధి, అన్నీ అవుతాడని శ్రీ భట్టులు వివరించారు. ఆవిధంగా సకలరూపములలోనూ భగవంతుడు తన భక్తులకు సహాయమవుతాడని శ్రీ అణ్ణాంగారాచార్య వివరించారు.

శ్రీ చిన్మయానంద – గొప్ప వైభవము (సంపద, యశస్సు, ఆనందము) కలవాడు సద్భూతి. మరొకవిధంగా, వివిధ అవతారములు దాల్చి పరమాత్ముని వైభవమును ప్రకాశింపజేసినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'భూతి' అనగా భాసమానత్వము (వెలుగుట), 'సత్' అనగా నిజంగా ఉండుట. భగవంతుడొకడే నిజంగా ఉండేవాడు. ఇతర జ్యోతులతో పనిలేకుండా స్వయంగా ప్రకాశించేవాడు. ఆయన లేకుంటే మరేమీ లేదు. ఆయనవల్లనే మిగిలినవన్నీ తెలియవస్తున్నాయి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భూ - సత్తాయామ్, ఉండుట; సతి - శాశ్వతీ; భూతి - భవనమ్, వివిధ భావేన పరిణామః. భగవంతుడొకడే నిత్యము. సత్యము. అనేకరూపములలో (విభూతులలో) ఉండేవాడు. అన్నింటికీ నిమిత్తకారణము, ఉపాదానకారణము భగవంతుడే.

## **708.** సత్పరాయణః
## సత్పరాయణమ్

- సజ్జనులకు అండయైనవాడు.
- సజ్జనులకు, తత్వవిదులకు పరమగతియైనవాడు.
- సజ్జనులే తనకు బలము అయినవాడు.

### ఓం సత్పరాయణాయ నమః

శ్రీ భట్టులు 'సత్పరాయణమ్', 'సత్పరాయణః' అనే రెండు నామాలనూ గ్రహించి వ్యాఖ్యానించారు. శ్రీ శంకరుల వ్యాఖ్యానాన్ని అనుసరించిన కొందరు 'సత్పరాయణః' అనీ, కొందరు 'సత్పరాయణమ్' అనీ వ్రాశారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సతాం స్యాదయనం సనో యస్యోత్తమాయనం స సత్పరాయణం ఖ్యాతో యద్వాస్యాత్సత్పరాయణః -** సత్పురుషులకు తను, తనకు సత్పురుషులు ఆయనము (అండ)గా ఉన్నందున ఆయన సత్పరాయణము లేదా సత్పరాయణుడు.

**సత్పరాయణమ్** – సత్పురుషులకు అండగా ఉండేవాడు. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతము ద్రోణపర్వము (173.24)నుండి చెప్పిన ప్రమాణము – **కృష్ణాశ్రయాః కృష్ణబలాః కృష్ణనాథాశ్చ పాండవాః కృష్ణః పరాయణమ్ తేషామ్ .....** పాండవులకు కృష్ణుడే ఆశ్రయము. కృష్ణుడే బలము. కృష్ణుడే రక్షకుడు. కృష్ణుడే సత్పరాయణము.

**సత్పరాయణః – సంతోః అస్య పరాయణమ్.** ఆయనకు సాధువులు పరాయణము (అండ). ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణలు – **మమ ప్రాణా హి పాండవాః** (మహాభారతము. ఉత్తర. 90.33). పాండవులు నాకు ప్రాణ(స)ములు. **జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్** (గీత 7.8). జ్ఞానులు నాకు ఆత్మ.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సతామ్ తత్వవిదామ్ పరమ్ ప్రకృష్టమ్ అయనమ్ ఇతి సత్పరాయణమ్ (సత్పరాయణః).** 'సత్' అనబడేవారికి, అంటే తత్వజ్ఞానము కలవారికి ఆ పరమేశ్వరుడే పరమపదము, గమ్యము (అయనము). కనుక శ్రీమన్నారాయణుడు సత్పరాయణుడు (సత్పరాయణము).

## **709.** శూరసేనః

- గొప్ప శూరులు తనకు సేనగా కలవాడు.
- కదిలేవాటినన్నింటినీ ఒక క్రమంలో నిలిపి ఉంచేవాడు.

### ఓం శూరసేనాయ నమః

శూర - విక్రాంతౌ - విక్రమము, పరాక్రమము చూపుట; సేన - ఇనేన ప్రభుణా సహవర్తతా ఇతి సేనా - గొప్ప, బలమైన నాయకుడిని కలిగియున్నది. **శూరాః సేనాః యస్య ఇతి శూరసేనాః –** గొప్ప శూరులైన సైన్యమును కలిగియున్నవాడు శూరసేనుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **భూభార హరణార్థాయ యాదవాః పాండవాశ్చయే శూరాస్సహాయా యస్యేతి శూరసేనస్స కథ్యతే** - భూభారమును తగ్గించడానికి శూరులైన యాదవులు, పాండవులను తనకు సేనగా కలవాడు శూరసేనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **హనూమత్ ప్రముఖాః సైనికాః శౌర్యశీలినో యస్యామ్ సేనాయామ్ సా శూరా సేనా యస్య సః శూరసేనః** హనుమంతునివంటి శౌర్యశీలురైన అనేక మహావీరులను తన సైన్యమునందు కలిగియున్నవాడు శూరసేనుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్య – సూ - కదలుట ( సు సి చి మీనామ్ దీర్ఘాశ్చ – 185 ఉనాది); శూర - కదులునది; సి - బంధనే - కట్టియుంచుట; సేనా - కలిపియుంచునది. **ఏవమేవ సకలమ్ చరాచర దృశ్యమ్ అదృశ్యమ్ చ చింతయమ్ అచింతయమ్ చ జగత్ తస్య విష్ణోః శూరసేనత్వ లక్షణమ్ గుణమ్ ప్రకాశయన్ శూరసేన అభిధానమ్ లభతే**. నడచినపుడు, పరుగెత్తినపుడు, నాట్యం చేసేటపుడు ఒక వ్యక్తి అవయవాలు కదలుతున్నాగాని అన్నీ ఒకేశరీరంగా ఉంటాయి (విడిపోవు). అలాగే గ్రహనక్షత్రాదులు, చరాచర జగత్తు, కనుపించేవి, కనుపించనివి అన్నీ వేనికవే వేరువేరుగా కదలినట్లున్నా, అన్నింటినీ క్రమవిధానంలో కలిపి ఉంచేవాడు శూరసేనుడు. జ్ఞానులైనవారు అంతటా భగవంతుని శక్తి ఈ విధంగా విస్తరించియుందని తెలిసికొంటారు. శూరసేనుని స్తుతించి తమ పాపాలను పరిహరింపజేసుకొంటారు.

ధర్మచక్రము రచయిత – మహాభారతయుద్ధంలో కృష్ణుడు తమ పక్షాన ఉండడంవలన పాండవులు విజయులయ్యారు. అసురస్వభావంకల కౌరవులు నశించారు. మనంకూడా మనలోని అసురగుణాలను త్యజించి, భోగలాలసతను విడిచి, భగవంతుని స్తుతించడంద్వారా శూరసేనుడైన భగవంతుని పక్షంలో చేరవచ్చును.



శ్రీబాలకృష్ణునికి స్నానం చేయిస్తున్న యశోదాదులు. 1500 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File: Meister der Bhâgavata-Purâna-Handschrift 001.jpg

## 710. యదుశ్రేష్ఠః

- యాదవులలో శ్రేష్ఠుడు.
- -(జీవుల ముక్తి కొరకు) యత్నించేవారిలో సర్వోత్తముడు.

**ఓం యదుశ్రేష్ఠాయ నమః**

**మగ్నంతు యాదవం వంశం ఉద్ధరిష్యతి యశ్చ సః యదుశ్రేష్ఠః ఇతి ఖ్యాతః వస్వర్ణో వంశవర్ధనః -** క్రుంగిపోయి ఉన్న యదువంశాన్ని ఉద్ధరించినవాడు యదుశ్రేష్ఠుడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. వంశమును వర్ధిల్లజేయునది. ఓం యదుశ్రేష్ఠాయ నమః. శ్రీ భట్టులు విష్ణుపురాణము (15.20.37)నుండి ఉదాహరించారు.

**అయం స కథ్యతే ప్రాజ్ఞైః పురాణార్థావలోకినః**
**గోపాలో యాదవమ్ వంశమ్ మగ్నమ్ అభ్యుద్ధరిష్యతి**
జ్ఞానులైన ఉత్తములు, పురాణములు తెలిసినవారు చెప్పిన విషయమిది – క్షీణిస్తున్న యాదవకులాన్ని ఉద్ధరించే గోపాలుడితడే.

**యదూనామ్ ప్రధానత్వాత్ యదుశ్రేష్ఠః.** యాదవవంశంలో ముఖ్యుడైనందున యదుశ్రేష్ఠుడు అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – యత్ - ప్రయత్నే- యతే యాతుః ప్రయత్నశీలః; శ్రేష్ఠః - ప్రశస్యశ్రః – ప్రశంసింపదగిన వారిలో ఉత్తముడు. ఇష్టాన్ యదుశ్రేష్ఠః. ప్రయత్నము చేయువారిలో అత్యంత స్తుతనీయుడు యదుశ్రేష్ఠుడు. భగవానుడు సూర్యునిగా సకలజీవులను పోషించును. పరమాత్ముడై అందరియందు వసించును. ఆత్మలను ముక్తిమార్గమువైపు నడిపించును. ఇందుకొరకు ఆయన వేదములనిచ్చి జ్ఞానమును ప్రసాదించెను. ఇలా భగవంతుడు అనేక ప్రయత్నములు చేయును గనుక యదుశ్రేష్ఠుడు.

ధర్మచక్రము రచయిత – శ్రీకృష్ణుని కారణంగా యదుకులము, గోకులము కూడా పావనమయ్యెను. మనం యదుశ్రేష్ఠుని స్మరిస్తూ మనవంశం అభ్యున్నతికి తోడ్పడవచ్చును.

## 711. సన్నివాసః

- (సనక సనందనాది) సాధువులకు నివాసము.
- 'సత్'నకు నివాసము. 'సత్'యందు నివసించేవాడు.

### ఓం సన్నివాసాయ నమః

**సనకాది నివాసోహి మానుషత్వేఽపి యస్సదా సన్నివాస స్స విజ్ఞేయ హ్యష్టార్ణః స్థానదాయకః. -** తాను మానవునిగా అవతరించికూడా సనక సనందనాది మహర్షులకు ఎప్పుడూ ఉనికిపట్టు అయి ఉండువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. స్థానదాయకము. ఓం సన్నివాసాయ నమః.

శ్రీ భట్టులు విష్ణుపురాణమునుండి చెప్పిన ప్రమాణము.
**సనందనాద్యైర్మునిభిః సిద్ధయోగైరకల్మషః**
**సంచింత్యమానమ్ తత్రస్థైః నాసాగ్రన్యస్తలోచనైః** – విష్ణుపురాణము 5.18.42
కల్మషరహితులు, యోగసిద్ధులు అయిన సనక సనందనాదులు తమ నాసాగ్రములపై దృష్టినుంచి గోలోకవాసియైన శ్రీకృష్ణుని ధ్యానింతురు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **సత్ - సతామ్, వినాశ రహితామ్ ప్రవాహతో నిత్యానామ్, ఆప్రలయ స్థాయినామ్.** 'సత్' అయినవారు ఆయన యందుండెదరు. 'సత్' అనగా మార్పు, పతనము లేని జీవులు (నిత్యసూరులు). **నిజ సత్తాయామ్ వాసయంతమ్, తేషు వా వసంతమ్ ఇతి భావః.** అనగా 'సత్' ఆయన యందు, ఆయన 'సత్'యందు వసింతురు.

## 712. సుయామునః



నారాయణ తిరుమల ఆలయంలో చిత్రం. వికీపీడియా నుండి. రాజ్ శేఖర్ తీసినది.
https://commons.wikimedia.org/wiki/User:Rajasekhar1961

- యమునానదియందున, తీరమున అనేక మనోహర క్రీడలు సలిపినవాడు.
- సజ్జనులైన యమునాతీరవాసులచే పరివేష్ఠితుడు.
- కనులకు చక్కని అంజనము పెట్టుకొన్నవాడు.
- ప్రళయకాలమున జీవులను ఉద్ధరించువాడు.

### ఓం సుయామునాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శోభనమ్ పావనమ్ మనోహరమ్ యమునా సంబంధి జలక్రీడా పుష్పాచయ రాసక్రీడాది యస్య ఇతి సుయామునః.** యమునానది, తటియందు పావనమైన మనోహరమైన జలక్రీడలు, పుష్పక్రీడలు, రాసక్రీడలు సలిపినవాడు సుయామునుడు. **గోపీభిర్యమునాయాంతు శోభనం పావనం మహత్ జలక్రీడాది యస్మేతి సుయామున ఇతీరితః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'యామునులు' అనగా యమునాతీరమున ఉండేవారు – దేవకి, వసుదేవుడు, నందుడు, యశోద, బలభద్రుడు, సుభద్ర, గోపబాలురు, గోపికలు ఇత్యాదులు. ఉత్తములైన యామునులచే (యమునా సంబంధులచే) పరివేష్ఠితుడై యున్నవాడు సుయామునుడు.

యామునులు కేవలం పశుపాలకులే కాదు. ఉపనిషత్సార పరిరక్షకులు అని చెబుతూ శ్రీ చిన్మయానంద నారాయణీయము (100.1)నుండి ఉదాహరించారు.

**తారుణ్యారమ్యరమ్యమ్ పరమసుఖరసస్వాద రోమాంచితాంగైః**
**అవీతమ్ నారదాద్యైః విలసత్ ఉపనిషత్సుందరీ మండలైశ్చ.**

సుందరుడైన గోపకిశోరబాలుడు నాకు దర్శనమిచ్చాడు. ఆయనను చుట్టుముట్టియున్న నారదాదులు పరమసుఖరసాస్వాదులైనందున రోమాంచితులైయున్నారు. మరియు సుందరులైన ఉపనిషత్కాంతామణులు ఆయనచుట్టూ ప్రకాశిస్తున్నారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సుందరమ్ యామునమ్ నయనాంజనమ్ యస్య ఇతి సు-యామునః.** ఇక్కడ యామునము అనగా కన్నులకు పెట్టుకొనే అంజనము. కనులకు చక్కని అంజనము పెట్టుకొన్నవాడు సుయామునుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – యమ్-ఉపరమే-ఎత్తుట, ఉద్ధరించుట; యామునః-యచ్ఛతి, ఉపరమ్యతి.
**శోభనో యామునః సుయామనో విష్ణుః భగవాన్ విష్ణుః మహాప్రళయే స్వకీయయా వ్యవస్థయా కార్యకారణరూపమ్ రూపమిదమ్ సమస్తమ్ విశ్వమ్ యచ్ఛతి, పరిణతమ్ ఉపరమ్యతి, సమయతి.** మహాప్రళయకాలమున (ఆత్మలను) మంగళకరముగా ఉద్ధరించువాడు సుయామునుడు.



## భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః |
## దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాఽపరాజితః || (76)

### 713. భూతావాసః

- సకలభూతములకు నివాసమైనవాడు.
- తన భక్తుల హృదయములలో నివసించువాడు.
- పంచభూతములకు నిలయమైనవాడు.

**ఓం భూతావాసాయ నమః**

భూ – భవన్ - ఉండుట; భవన్తి ఇతి భూతాని; వస్ - నివాసే - నివసించుట; **సమంతాద్ వసన్తి భూతాని యస్మిన్ సః భూతావాసో విష్ణుః**. ఎవనియందు సమస్తభూతములు నివసించునో అతడు భూతావాసుడు విష్ణువు (శ్రీ సత్యదేవో వాసిష్ఠ నిర్వచనము).

శ్రీ భట్టుల వ్యాఖ్యను నిరుక్తంలో ఇలా చెప్పారు – **యస్మిన్ వసన్తి భూతాని భూతావాస స కథ్యతే**. ఇందుకు శ్రీ వి.వి. రామానుజన్ గీతనుండి, దివ్యప్రబంధములనుండి ఉదాహరించారు.

**పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాంస్తథా భూత విశేష సంఘాన్**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్** – గీత 1.15
అర్జునుడు పలికెను – ఓ దేవాది దేవా! నీ విరాట్ రూపమునందు సకల దేవతలను, నానావిధ భూతములను (ప్రాణికోటిని), బ్రహ్మను, మహాదేవుడైన శంకరుని, సమస్త ఋషులను, దివ్యసర్పములను చూచుచున్నాను.

**మత్త పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ** – గీత 7.7
ఓ ధనంజయ! నాకంటెను పరమకారణమైనది ఏదియును లేదు. ఈ జగత్తునందలి వస్తువులన్నియు సూత్రమున సూత్రమణులవలె నాయందే కూర్పబడియున్నవి.
శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 3.2.11 – ఆయన అన్ని ఆత్మలకు ఆత్మ.
శ్రీ పెరియాళ్వారు తిరు. 1.1.6 – చిన్నికృష్ణుని నోట సమస్త భువనములను యశోద దర్శించెను.

**పోతన భాగవతము – 10.341 నుండి 344**
ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలకాది కరండమైన బ్రహ్మాండంబున్

కనుగొని,

కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్నేరక యున్నదాననొ యశోదాదేవి గానో పర
స్థలమో బాలకుడెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్

బాలమాత్రుడైన బాలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసియుండు?
బాలుభంగి నితడు భాసిల్లుగాని స
ర్వాత్ముడాదివిష్ణుడగుట నిజము.



నారాయణ తిరుమల ఆలయంలో చిత్రం.
వికీపీడియా నుండి. రాజ్ శేఖర్ తీసినది.
https://commons.wikimedia.org/wiki/User:Rajasekhar1961

శ్రీ శంకరుల వ్యాఖ్య – **భూతాని అత్ర అభిముఖ్యేన వసన్తి ఇతి భూతావాసః**. ఎవనియందు ముఖ్యముగా భూతములు వసించునో అతడు భూతావాసుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **భూతేషు భజన పరాయణేషు ప్రాణిషు ఆవాసో యస్య ఇతి భూతావాసః**. తనను సేవించు, భజించు, పూజించు ప్రాణుల (భక్తుల)యందు నివాసముండువాడు భూతావాసుడు.

శ్రీ చిన్మయానంద 'భూతములు' అనగా 'పంచమహాభూతములు' అన్న అర్థం గ్రహించారు. ఈ పంచమహాభూతములకు నివాసస్థలమైనవాడు భూతావాసుడు.

**వసన్తి త్వయీ భూతాని భూతావాసస్తతో భవాన్** (హరివంశము 279.52).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అన్నిజీవులూ పాంచభౌతికములైనాగాని, మనుష్యులది ప్రధానంగా పృథ్వీతత్వము. చేపలది జలతత్వము. పక్షులది వాయుతత్వము. ఇలా భగవంతుని సృష్టి వివిధ పంచమహాభూతాలతో ముడివడి ఉంది. భగవంతుడు భూతావాసుడని చెప్పడానికి ఇది ఒక సూచన. అన్నీ ఆయనయందు, ఆయన అన్నింటియందు ఉండును. **విష్ణోః కర్మాణి పశ్యత** (ఋగ్వేదము 1.22.19). విష్ణువు తన కర్మలు (సృష్టివంటి కార్యక్రమములు) ద్వారా తెలియవచ్చుచున్నాడు.

## 714. వాసుదేవః

- వ్యాపించువాడు, క్రీడించువాడు.
- వసుదేవుని సుతుడు.
- ప్రసిద్ధ వాసుదేవ ద్వాదశాక్షరి మంత్రపు దైవము.
- తన భక్తులచే ఆరాధింపబడే దేవుడు.
- అన్నింటియందు ఉండేవాడు. వానిని చలింపజేయువాడు.

ఓం వాసుదేవాయ నమః

(700వ నామమువద్ద ఇచ్చిన వివరణ ఇక్కడ మరల వ్రాయబడినది.)

ఈ పరమ పవిత్ర నామము మూడుమార్లు ఈ మహాస్తోత్రమున స్తుతింపబడినది.

36వ శ్లోకము. 334వ నామము. వాసుదేవః – **వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః**

74వ శ్లోకము. 701వ నామము. వాసుదేవః **– వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః**

76వ శ్లోకము. 714వ నామము. వాసుదేవః – **భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోనలః**

ముందుగా 334వ నామము వ్యాఖ్యలో శ్రీభట్టుల ప్రత్యేకవ్యాఖ్యను గమనించాలి – 'నారాయణ' నామము వలెనే 'వాసుదేవ' నామము గుహ్యమంత్రము. సరియైన గురువువద్దనే ఈ నామమునకు అర్థమును తెలిసికొననగును.

వివిధ వ్యాఖ్యాతలు చెప్పిన విషయాలలోని భావాలు ఇక్కడ ఇవ్వడమైనది.

36వ శ్లోకము. 334వ నామము. **వాసుదేవః –** శ్రీ భట్టుల వ్యాఖ్య – 'వాసు' - తల్లి గర్భములోవలె భగవంతునియందు సమస్తము నివసించును. అంతటినీ ఆయన ఆవరించి పక్షి తన రెక్కలతో కప్పియుంచినట్లు కాపాడుతున్నాడు. 'దేవ'-క్రీడించువాడు. సృష్టి, వ్యాప్తి, రక్షణ, లయము ఇవన్నీ ఆయన లీల. వాసు-దేవ – వాసుదేవ. అంతటినీ తనయందు ఉంచుకొని క్రీడించువాడు వాసుదేవుడు.

36వ శ్లోకము. (334వ నామము). **వాసుదేవః –** శ్రీ శంకరుల వ్యాఖ్య – వసతి - ఆచ్ఛాదయతి - కప్పియుంచును. **వసతి వాసయతి ఆచ్ఛాదయతి వా సర్వమ్ ఇతి వాసుః.** సర్వమును తన మాయతో కప్పియుంచి క్రీడించువాడు వాసుదేవుడు. శ్రీ శంకరులుకూడా 'వాసు', 'దేవ' అనే పదాల ఆధారంగానే ఈ నామాన్ని వ్యాఖ్యానించారని గమనించవచ్చును. కాని ఇందులో ఆయన భగవంతుని 'మాయ'ను ప్రస్తావించారు. **జగత్ ఆచ్ఛాదయి మాయయా ఇతి వాసుః స ఏవ దేవ ఇతి వాసుదేవః.** అద్వైతుల సంప్రదాయం ప్రకారం మాయ అనేది అజ్ఞానస్వరూపం (భ్రాంతి). కాని విశిష్టాద్వైతంలో మాయ అనేది ఈశ్వరుని అద్భుతమైన శక్తి (లీల)లో ఒక భాగం.

74వ శ్లోకము. 700వ నామము. **వాసుదేవః –** ఈ సందర్భములో శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడా వసుదేవుని సుతుడు వాసుదేవుడు – అనే అర్థం చెప్పారు. **వసుదేవస్య అపత్యమ్ వాసుదేవః.** శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతంనుండి ఉదాహరించారు.

**అవతీర్ణో యదుకులే గృహానక దుందుభేః**
**వదంతి వాసుదేవేతి వసుదేవ సుతం హి మామ్** – భాగవతము 10.51.41

76వ శ్లోకము. 714వ నామము **వాసుదేవః –** శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీవాసుదేవ ద్వాదశక్షరీ మంత్రమునకు అధిదేవతయైన వాసుదేవుడు. శ్రీవైకుంఠములోని పరవాసుదేవుడే పాలసముద్రంలో వ్యూహవాసుదేవునిగా అవతరించాడు. ఆయనే మధురలో దేవకీ వసుదేవులకు సుతునిగా అవతరించాడు (700వ నామమునకు శ్రీ భట్టుల వివరణ). శ్రీవైకుంఠమునుండి దిగివచ్చిన ఆ వ్యూహవాసుదేవుడే గోపికల హృదయాలను అలరింపజేశాడు. యోగులకు పరతత్వము అయ్యాడు. కంసాది దుష్టులకు మృత్యుసమానుడయ్యాడు. (శ్రీ వి.వి. రామానున్ వివరణ)

శ్రీ కృష్ణదత్త భరద్వాజ మరొక వైవిధ్యమైన అర్థం చెప్పారు. వాస్ - ఉపసేవాయాం - సుగంధభరితము చేయుట. **వాసయతే సేవయతే భక్తైః ఇతి వాసుః, స చాసౌ ఇతి వాసుదేవః.** భక్తులచే అలంకరింపబడేవాడు వాసుదేవుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **దివ్ - క్రీడా విజిగీష వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు** – ఇందులో 'గతి'- అనగా కదలుట. అన్నింటియందు ఉండేవాడు, వానిలోని చలనమునకు ఆధారమైనవాడు వాసుదేవుడు. **ఈశావాస్యమిదమ్ సర్వమ్ యద్ కించన జగత్యామ్ జగత్** (ఈశావాస్యోపనిషత్తు).

శ్రీ చిన్మయానంద – సకల జీవులలోని అంతర్యామి వాసుదేవుడు. ఇందుకు గీతాశ్లోకం ప్రమాణంగా భావింపవచ్చును.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా** – గీత 18.6
ఈ శ్లోకానికి వివరణ ఇస్తూ శ్రీ భగవద్రామానుజులు తమ గీతాభాష్యంలో 'వాసుదేవ' అనే పదాన్ని వాడారు గనుక పై అర్థాన్ని ఆయన సమర్థిస్తున్నట్లు భావింపవచ్చును. **ఈశ్వరః సర్వ నియమన శీలో వాసుదేవః సర్వభూతానామ్ హృద్దేశే సకల ప్రవృత్తి నివృత్తిమూల జ్ఞానోదయే దేశే తిష్ఠతి.**

## 715. సర్వాసునిలయః

- సకల ప్రాణులకు ఆధారమైనవాడు.

### ఓం సర్వాసునిలయాయ నమః

సర్వ - అన్నీ, సమస్తము; అసు - జీవించునది, ప్రాణి (అస్తి ఇతి అసుః); నిలయః - నివాసము (లీ - శ్లేషణే - అతుకుకొని యుండుట). సకల ప్రాణులకు ఆధారము సర్వాసునిలయుడు. ఈ భావాన్ని మూడు విధాలుగా వెల్లడించవచ్చును.

(1) నిజమైన భక్తులకు ఆలంబనము భగవంతుడే. భగవంతుని తోడువల్లనే అట్టి భక్తులు జీవించియున్నారు. భగవంతుని ధ్యానము లేని జీవనము వారికి వ్యర్థము.
(2) ప్రాణులకు ప్రాణమునిచ్చేది భగవంతుడే. ఆయన కారణమువల్లనే ప్రాణములు నిలిచియుండును.
(3) ప్రళయకాలంలో సకలప్రాణులు భగవంతునియందు లీనమగును.

ఈ మూడు భావాలను కలిపి 'సర్వాసునిలయః' నామమునకు అర్థము చెప్పవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భక్తుల ప్రాణములకు ఆలంబనము భగవంతుడే. **సర్వప్రాణ ఆలంబనమ్ సర్వాసునిలయః**. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతమునుండి ఉదాహరించారు-

**అసూర్యమివ సూర్యేణ నివాతమివ వాయునా**
**కృష్ణేన సముపేతేన జహృతే భారతమ్ పురమ్** – మహాభారతము (ఉద్యోగ పర్వము?) 28.22
శ్రీకృష్ణుడు హస్తినాపురానికివచ్చాడు. సూర్యుడు కనుపించని రోజులలో సూర్యోదయమైనట్లుగా, గాలిలేనిచోట గాలి వీచినట్లుగా హస్తినాపుర జనులు సంతసించారు.

శ్రీ అణ్ణాంగారాచార్య – భగవంతునిపట్ల జనులు ఎంతగా ఆకర్షితులయ్యారంటే భగవధ్యానం లేకుండా జనుల ప్రాణాలు నిలువవు. అందుకే ఆయన సర్వాసునిలయుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అసు - ప్రాణము - నాశనము లేని జీవశక్తి. సకల జీవ చైతన్యమునకు ఆధారమైనవాడు, మరియు అంతములేని జీవుడు సర్వాసునిలయుడు. **సర్వ ఏవ అసవః ప్రాణా జీవాత్మకే యస్మిన్ అవ్యయే నిలీయంతే స సర్వాసునిలయః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఒకవ్యక్తి మెలకువగా ఉన్నపుడు ఆ వ్యక్తి ఇంద్రియాలు స్వతంత్రంగా పనిచేస్తున్న భావన కలుగుతుంది. అదే వ్యక్తి నిదురించినపుడు సర్వేంద్రియాలూ అతనిలో ఒదిగిపోతాయి. అలాగే ప్రళయకాలంలో సమస్తప్రాణులు భగవానునియందు లీనమౌతాయి.

**అన్నమయ్య కీర్తన**

అందరికాధారమైన ఆది పురుషుడీతడు
విందై మున్నారగించె విదురునికడ నీతుడు

సనకాదులు కొనియాడెడి సర్వాత్మకుడీతడు
వనజ భవాదులకును దైవంబై నతడీతడు
ఇనమండలమున జెలగేటి హితవై భవుడితడు
మునుపుట్టిన దేవతలకు మూలభూతి యీతడు

సిరులొసగి యశోదయింట శిశువైనతడీతడు
ధరనావుల మందలలో తగ జరించె నీతడు
సరసతలను గొల్లెతలకు జనవులొసగె నీతడు
ఆరసి కుచేలుని యడుకులు ఆరగించెనీతడు

పంకజభవునకును బ్రహ్మ పద మొసగెను యీతుడు
సంకీర్తన లాద్యులచే జట్టి గొనియెనీతడు
తెంకిగ నేకాలము పరదేవుడైన యీతడు
వేంకటగిరి మీద ప్రభల వెలసిన ఘనుడీతడు



శ్రీ రుక్మిణీ సత్యభామా సమేతుడైన శ్రీ కృష్ణుడు.
కుడివైపు ఉన్నది గరుత్మంతుడు.
12-13 శతాబ్దం కాలపు శిల్పాలు. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Krishna_Rukmini_Satyabhama_Garuda.jpg

## 716. అనలః

1) తన భక్తులకు తాను చేసినదానితో తృప్తిచెందనివాడు. (అన్-అలః)
2) తన భక్తులపట్ల జరిగిన దుష్కార్యములను సహింపజాలనివాడు.
3) ప్రాణశక్తిని తనదానిగా స్వీకరించి జీవాత్మగా వ్యవహరించువాడు.(అన-లః)
4) వాసనవంటి గుణములకు అతీతుడు. (అ-నలః)
5) అంతులేని యశోవైభవ విభూతులు కలవాడు (అలమ్ - పర్యాప్తి - చివర).
6) అగ్ని స్వరూపుడు. (అనల-అగ్ని)
7) అంతము లేనివాడు (అలమ్ - పర్యాప్తి - చివర).
8) ఎదురు లేనివాడు (అలమ్ - నిరోధము).
9) భగవంతునికొరకు తపించే భక్తులను పునరుజ్జీవింపజేయువాడు (అన్ - ప్రాణనే).

### ఓం అనలాయ నమః

ఈ నామము రెండుమార్లు వచ్చుచున్నది.

32వ శ్లోకము. 294వ నామము. అనలః – **భూతభవ్యభవన్నాథః పవనః పావనోऽనలః**

76వ శ్లోకము. 716వ నామము. అనలః – **భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోऽనలః**

ఈ నామమును 'అన్-అలః', 'అ-నలః', 'అన-లః' ఇలా వివిధా శబ్ధాలుగా చూసి వివిధ భావాలను వ్యాఖ్యాతలు చెప్పారు.

(1) అనలుడు – తన భక్తులకు తాను చేసినదానితో తృప్తిచెందనివాడు.

శ్రీ భట్టులు 32వ శ్లోకంలోని 'అనలః' నామమును ఇలా వివరించారు (అన్-అలః)

**అపర్యాప్తో హి భక్తేభ్యోప్యుపకృత్య పునఃపునః అనుగ్రహం యః కరోతి సోऽనలః పరికీర్తితః -** భక్తులకు ఎన్నో మార్లు అనేక విధాలుగా ఉపకరించికూడా తృప్తిపొందనివాడు. తరగని అనుగ్రహము కలవాడు అనలుడు. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతము (ఉద్యోగపర్వము 28.22)నుండి ఉదాహరించారు – **ఋణమ్ ప్రవృద్ధమివ మే హృదయాత్ నాపసర్పతి**. అప్పుడు ద్రౌపది 'గోవిందా'యని ఆక్రోశించిన కేక నా మనసునుండి చెరిగిపోలేదు. రోజురోజుకూ అప్పువలె పెరుగుతూనే ఉన్నది.

ఇక్కడ శ్రీ భట్టులు 'అల్-పర్యాప్తి-తృప్తి' అనే అర్థంలో 'అనలుడు' అనగా 'తృప్తిలేనివాడు' అని అర్థం చెప్పారు. భక్తులకు తాను ఎంత చేసినాగాని భగవంతుడు – **న కించిత్ కృతమ్ ఏషామ్ మయా ఇవి అవి తృప్తః** – నేను ఏమీ చేయలేకపోయానని భావించి తృప్తిలేకుండా ఉంటాడట. శ్రీకృష్ణుడు ద్రౌపది మానాన్ని సంరక్షించాడు. తన స్వంత ప్రతిజ్ఞను జవదాటి యుద్ధంలో పగటిని రేయిగా చేశాడు. అయినాగాని ఆయనకు తృప్తి లేదు. ద్రౌపదికి తానేమీ చేయలేకపోయానని వగచాడు.

శ్రీ నమ్మాళ్వారు. పెరియ తిరువంతాడి 53 – నీ భక్తులకు ఏమి చేయాలనేదే ఎప్పుడూ నీ ధ్యాస (ఇక్కడ కూడా అగ్నికీ భగవంతునికీ పోలిక ఉన్నది. ఆజ్యం పోసినకొద్దీ అగ్ని ఇంకా విజృంభిస్తుంది).

తృప్తి లేకపోవడానికి శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరొక అర్థం చెప్పారు. పూజలో అనేక సంభారాలు సమర్పించినంతలో దేవుడు తృప్తి పొందడు. భక్తితో ఏదైనా అర్పిస్తేనే తృప్తుడవుతాడు.

(2) అనలుడు – తన భక్తులపట్ల జరిగిన దుష్కార్యములను సహింపజాలనివాడు.

76వ శ్లోకములోని 716వ నామము 'అనలః'కు శ్రీభట్టులు ఈ అర్థం చెప్పారు. తన భక్తులపట్ల జరిగిన అపచారమును ఏమాత్రము సహింపనివాడు అనలుడు. దీనికి కూడా శ్రీ భట్టులు మహాభారతం (సభాపర్వము 68.26)నుండి ఉదాహరించారు.

**ద్వౌతు మే వధకాలేऽస్మిన్ న క్షంతవ్యౌ కథంచ న**

**యజ్ఞం విఘ్నకరం హన్యామ్ పాండవానామ్ చ దుర్హృదమ్**

చంపవలసిన సమయం వచ్చినపుడు ఇద్దరిని ఏమాత్రం వదలను. ఈ యాగాన్ని అడ్డుకొనేవారిని, పాండవులపట్ల శతృత్వం కలిగినవానిని.

పాండవులపట్ల శతృత్వం కలిగియున్నాడన్న కారణంగా దుర్యోధనుని ఆతిథ్యాన్ని శ్రీకృష్ణుడు తిరస్కరించాడు.

(3) అనలుడు – ప్రాణశక్తిని తనదానిగా స్వీకరించి జీవాత్మగా వ్యవహరించువాడు.

32వ శ్లోకంలోని 'అనలః' నామమును శ్రీ శంకరులు 'అన-లః' అని వ్యాఖ్యానించారు. అన - ప్రాణము; లా - ఆదానే దానే చ - స్వీకరించుట; **అనాన్ ప్రాణాన్ ఆత్మత్వేన లాతి ఇతి అనలః**. దీనికి అనువాదం ఇలా చెప్పవచ్చును – ప్రాణశక్తిని తనదానిగా స్వీకరించి జీవాత్మ స్వరూపునిగా వ్యవహరించువాడు అనలుడు. 'ప్రాణాలను స్వీకరించుట' అనే భావాన్ని శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఇలా వివరించారు – చివరకు భగవంతుడు అందరి ప్రాణాలను తనలో విలీనం చేసుకొంటాడు గనుక అనలుడు.

(4) అనలుడు – వాసన వంటి గుణములకు అతీతుడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – 'అ-నలః' నల్ - గంధే బంధనేన చ - వాసన, కట్టి ఉంచుట. **న అలమ్ అస్య స అనలః.** వాసనకు అతీతుడు అనలుడు. ఇందుకు శ్రీ శంకరులు బృహదారణ్యోపనిషత్తు (3.8.8)నుండి ప్రమాణం చెప్పారు – **అ స్థూలమ్ అనణ్వహ్రస్వమ్ అదీర్ఘమ్ అలోహితమ్ అస్నేహమ్ అచ్ఛాయమ్ ... .. అమాత్రమ్ అనంతరమ్ అబాహ్యమ్.....** బ్రహ్మము పెద్దది కాదు, చిన్నది కాదు, పొడవు గాదు, పొట్టి కాదు, రంగు లేదు, తడి చేయబడదు, కొలవజాలరానిది.....

(5) అనలుడు – అంతులేని యశోవైభవ విభూతులు కలవాడు.

76వ శ్లోకం వ్యాఖ్యలో శ్రీ శంకరులు 'అలమ్' అనగా 'హద్దు' అనే అర్థం తీసుకొన్నారు. అలమ్ - పర్యాప్తి - చివర, హద్దు. **అలమ్ పర్యాప్తిః శక్తి సంపదామ్ న అస్య విద్యత ఇతి అనలః.** ఎవని శక్తి సంపదలకు పరిమితులు లేవో అతడు అనలుడు. ఇందుకు శ్రీ చిన్మయానంద గీత (12.5)నుండి ఉదాహరించారు. **న అంతోస్తి మమ దివ్యానామ్ విభూతీనామ్ పరంతప.** ఓ అర్జునా! నా దివ్య విభూతులకు అంతము లేదు.

ఇక్కడ గమనించదగ్గ విషయం – 'అల్ - పర్యాప్తి - అనగా పరిమితి' అనే అర్థాన్నే శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా గ్రహించారు. కాని శ్రీ భట్టుల వ్యాఖ్య – భక్తులకు సహాయపడే భగవానుని సంకల్పానికి పరిమితి లేదు. శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవానుని శక్తిసంపదలకు పరిమితి లేదు. శ్రీ భట్టుల వ్యాఖ్య భగవానుని భక్తవాత్సల్య గుణాన్ని వక్కాణిస్తుంది. శ్రీ శంకరుల వ్యాఖ్య భగవంతుని పరత్వాన్ని తెలియజేస్తుంది.

(6) అనలుడు – అగ్ని స్వరూపుడు.

శ్రీ చిన్మయానంద 'అనలః' అనగా 'అగ్ని' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. భగవంతుడు అగ్నిస్వరూపుడై మన దేహాలలో ఉష్ణతను కాపాడుతూ ప్రాణాలను నిలుపుతున్నాడు.

(7) అనలుడు – అంతము లేనివాడు (అలమ్ - పర్యాప్తి - చివర).

(8) అనలుడు – ఎదురు లేనివాడు (అలమ్ - నిరోధము).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన అర్థాలు:

అలమ్ - పర్యాప్తి - తృప్తి వచన – అంతులేనివాడు అనలుడు.

అలమ్ - వారణా - నిరోధము, ఎదురు – ఆయనను ఎదిరించేవాడు లేడు గనుక ఆయన అనలుడు.

ఇందుకు శృతులనుండి ఉదాహరణలు –

అధర్వ 5.11.4 – **న త్వదన్యః కవితరోన మేధాయా ధీరో వారుణా స్వధావాన్.**

అధర్వ 13.4.16 – **న ద్వితీయో న తృతీయః.**

ఋగ్ 10.48.5 – **అహమ్ ఇంద్రో న పరాజిగ్యే.**

ఋగ్ 8.93.4, అధర్వ 20.11.2.1, యజుర్ 33.35 – **సర్వమ్ తదింద్ర తే వాసే.**

(9) అనలుడు – తన దర్శనం ద్వారా భక్తులను పునరుజ్జీవింపజేయువాడు (అన్ - ప్రాణనే).

శ్రీ కృష్ణదత్త భరద్వాజ పూర్తిగా వేరే అర్థం చెప్పారు. అన్-ప్రాణనే-జీవించుట; ఉనాది సూత్రము (1.106) **'వృషాది భయశ్చిత్'** ప్రకారము – **ఆనయతి సముజ్జీవయతి తపః కృశాన్ స్వజనాన్ స్వదర్శనేన ఇతి అనలః.** తపస్సువలన కృశించిన స్వజనులకు (భక్తులకు) తన దర్శనం ప్రసాదించి తిరిగి వారిని పునరుజ్జీవింపజేసేవాడు అనలుడు.

## 717. దర్పహా

- గర్వమును అణచువాడు.

### ఓం దర్పఘ్నే నమః

దర్ప - దృప్ - హర్ష మోహనయోః - ఆనందించుట, గర్వించుట; హా - హాన్ - చంపుట; గర్వంతో మదించినవారి గర్వాన్ని అణచివేసేవాడు 'దర్పహా'.

శ్రీ భట్టులు ప్రత్యేకంగా, దేవాసుర గర్వాణ్ని అణచివేసేవాడు, అని చెప్పారు. **గోవర్ధనస్యోద్ధరణే పారిజాత పరిగ్రహే బాణ దోర్దండ షండానాం ఖండనాదౌ తదా దేవానాం వై దర్పమాత్రం హతవాన్య స దర్పహా.** గోవర్ధనోద్ధరణమునందు, పారిజాతాపహరణమునందు, బాణాసురుని భుజాలను ఖండించినపుడు – ఇలా దేవేంద్రాదుల గర్వమును అణచినవాడు దర్పఘ్నుడు.



గోవర్ధనోద్ధారణ – 1800 కాలపు చిత్రం. వికీపిడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Lifting_Mount_Govardhan_-_Google_Art_Project.jpg

శ్రీ శంకరుల వ్యాఖ్య – ధర్మమార్గంనుండి వైదొలగేవారి గర్వాన్ని అణచివేసేవాడు దర్పఘ్నుడు. వ్యక్తులు తమ పరిమితులు తెలిసికొనకుండా ప్రవర్తించినపుడు వారిలో గర్వం పెరుగుతుంది. వారికి అడ్డంకులు కలిగించడం ద్వారా భగవంతుడు వారి గర్వాన్ని అణచివేస్తాడు. అలాగే దేహానికీ, ఆత్మకూ భేదం తెలియకుండా ఉంటే గర్వం పెరుగుతుంది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – జీవులు తాము భగవంతునినుండి వేరుగా తలచినపుడు గర్వితులౌతారు. దుఃఖము, కష్టము కలిగినపుడు కొంచెం గర్వం నశిస్తుంది.

## 718. దర్పదః

- (తన భక్తులకు) గర్వమును కలిగించువాడు.
- (యాదవులకు) గర్వమును కలిగించినవాడు.
- అన్నింటిలో అందమును, ఆకర్షణను కలిగించువాడు.
- ధర్మమార్గమున నడచువారికి గౌరవ ప్రతిష్టలు కలిగించువాడు.

### ఓం దర్పదాయ నమః

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **దర్పో హర్షః, తమ్ సాత్వికేభ్యో దదాతి ఆత్మానమ్ ప్రదర్శ్య ఇతి దర్పదః.** దర్పము అనగా సంతోషము. తన దర్శనము ద్వారా నిజమైన భక్తులకు సంతోషము, గర్వము కలుగజేయువాడు దర్పదుడు. భగవదనుభవము భక్తులకు ఎనలేని గర్వమును కలుగజేయును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – (దర్పో గర్వః) భగవంతుడు తన భక్తులకు గర్వము రూపంలో బలాన్ని ప్రసాదిస్తాడు. అలాంటి గర్వబలంవల్లనే హనుమంతుడు సీతమ్మను వెదకడానికి సాగరాన్ని లంఘించాడు. రావణుని యెదుట నిర్భయంగా మాట్లాడాడు.

**మధురాయాం యాదవేభ్యః మధుపానాదినా తతః దర్పం చ దత్తతా న్యోసౌ దర్పదః పరికీర్తితః -** మధురానగరంలో యాదవులు మధుపానం చేసి గర్వించేలా చేసినవాడు గనుక దర్పదుడు. శ్రీకృష్ణుడు మధురానగరాన్ని దుర్భేధ్యంగా రూపొందించాడు గనుక దానికి శత్రుభయం లేదు. ఆ నగరంలో సాక్షాత్తూ పరమేశ్వరుడయిన శ్రీమన్నారాయణుడే వాసుదేవుని రూపంలో ఉన్నాడు. అతనితోపాటు శంఖ పద్మ నిధులున్నాయి. పారిజాతము ఇక్కడే ఉన్నది. ఇన్ని కలిగిన యాదవవీరులు మధుపానం చేసి మత్తెక్కి గర్వించారు (డా. క్రోవి పార్థసారధి).

శ్రీ చిన్మయానంద – భక్తులు గర్వంవలన తమ ధర్మమార్గనుండి ఏమాత్రం బెసకరు. ఇలా గర్వమే వారికి రక్షణ అవుతుంది.

ధర్మచక్రము రచయిత – కత్తివలె గర్వముకూడా రెండువైపుల పదునైనది. తాను విష్ణుభక్తుడైనందుకు గర్వించే భక్తుడు తద్వారా మరింత ఆధ్యాత్మిక ప్రగతి సాధిస్తాడు. ఇక్కడ లభించే గర్వము భగవత్సేవ వలన, నిర్మలమైన మనసు వలన, సత్ఫలితాన్నిచ్చే దీక్ష వలన కలుగుచున్నది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – దృప్ - హర్ష మోహనయోః; దర్పము - ఆకర్షణ, అందము. ప్రతివస్తువులోని అందము, ఆకర్షణ విష్ణువు ప్రసాదించినదే. ఈ ఆకర్షణ అనేది చంద్ర శుక్రుల ద్వారా సంభవిస్తుంది. ఆ చంద్ర శుక్రులు భగవత్స్వరూపాలే.

శ్రీ పెమ్మరాజు రాజారావు – ఇచ్చట 'దర్ప' శబ్దమునకు గౌరవము, ప్రతిష్ఠ అని అర్థము. ధర్మమార్గమున నడచు సజ్జనులకు గౌరవము, సత్కీర్తి, ప్రతిష్ఠను కలిగించువాడు నారాయణుడే యగుట చేత 'దర్పదః' అను నామమున ధ్యాతవ్యుడగును. ఈ నామమునకు మరొక భావముకూడ చెప్పబడును. సంస్కృత భాషలో 'ద' అనగా ఇచ్చుట, నాశనము చేయుట అను రెండర్థాలు ఉన్నాయి. సజ్జనుల మనసులో అప్పుడప్పుడు కానవచ్చుచుండు అహంకారాది దుర్గుణములను హరించువాడు శ్రీహరియేగాన 'దర్ప-దః' అను నామమున ప్రసిద్ధుడగును.

కొన్ని పుస్తకాలలో 'అదర్పదః' అనే పాఠాంతరం కూడ కానవచ్చుచున్నది.

**శ్రీమద్రామాయణము – సుందరకాండము (గీతా ప్రెస్, గోరఖ్ పూర్ వారి ప్రచురణనుండి) (1-39,40,41,42,43)**




వానరాన్ వానరశ్రేష్ఠ ఇదం వచనమబ్రవీత్
యథా రాఘవ నిర్ముక్త శ్శర శ్శ్వసన విక్రమః
గచ్ఛేత్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితమ్
న హి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజామ్
అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్
యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యా మ్యకృతశ్రమః
బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్
సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహ సీతయా
ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణామ్
ఏవముక్త్వా తు హనుమా న్వానరా న్వానరోత్తమః

సాగర లంఘనమునకు ముందు, వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు అంగదాది వానరులతో ఇట్లనెను – వాయువేగమున సాగిపోవు రామబాణమువలె నేను మిక్కిలి వేగముగా రావణునిచే పాలింపబడుచున్న లంకకు వెళ్ళెదను. అచ్చట జానకీమాతను కాంచజాలనిచో అదే వేగమున సురలోకమునకు పోయెదను. ఆ స్వర్గమున కూడ సీతాదేవిని దర్శింపనిచో రాక్షసరాజైన రావణుని అవలీలగా బంధించి, తీసికొని వచ్చెదను. ఏది ఏమైనను కృతకృత్యుడనై సీతతో సహా తిరిగివచ్చెదను. లేనిచో రావణునితో సహా లంకను పెకిలించికొని తీసికొని రాగలను.

**(42-33,34,35,36) మరియు (43-8,9, 10,11) – హనుమంతుని జయఘోష**



జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః
దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః
న రావణ సహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః
అర్దయిత్వా పురీం లంకాం అభివాద్య చ మైథిలీమ్
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్

మహాబల సంపన్నుడైన శ్రీరామునకు జయము. మిక్కిలి పరాక్రమశాలియైన లక్ష్మణస్వామికి జయము. శ్రీరామునకు విధేయుడు, కిష్కింధకు ప్రభువు అయిన సుగ్రీవునకు జయము. అసహాయ శూరుడు, కోసల దేశపు ప్రభువు అయిన శ్రీరామునకు నేను దాసుడను. వాయుపుత్రుడను. నా పేరు హనుమంతుడు. శత్రుసైన్యములను రూపుమాపువాడను. వేయి మంది రావణులైనా గాని యుద్ధ రంగమున నన్నెదిరించి నిలువలేరు. వేలకొలది శిలలతోడను, వృక్షములతోడను సకల రాక్షసులను, లంకాపురిని నాశనం చేస్తాను. రాక్షసులందరూ ఏమీ చేయలేక చూస్తూ ఉండెదరు గాక. నేను వచ్చిన పనిని ముగించుకొని, సీతాదేవికి నమస్కరించి వెళతాను.

చిత్రం. కొరియాలో ఒక గ్రామంలో థాయి ఖోన్ నృత్యం ప్రదర్శన. ఈ చిత్రంలో నృత్యకారుడు శ్రీరామ పాత్రధారి అనిపిస్తున్నది.

https://commons.wikimedia.org/wiki/File:Korea-Andong-Hahoe_Folk_Village-Thai_dancer-01.jpg
Photo by : Robert

## 719. అదృష్టః

### దృష్టః

- ఏమాత్రము గర్వము లేనివాడు.
- యశోదాదేవి లాలనమువలన గర్వించినవాడు.
- సచ్చిదానందమైన తన స్వరూపము అనే అమృతాన్ని పానం చేయుటచే మిక్కిలి ఆనందించినవాడు.
- ధర్మమును రక్షించినందున గర్వించువాడు.

**ఓం అదృష్టాయ నమః**

**ఓం దృష్టాయ నమః**

శ్రీ భట్టులు 'అదృష్టః', 'దృష్టః' అనే రెండు నామములకు వ్యాఖ్యానం చెప్పారు. శ్రీ శంకరులు 'దృష్టః' అనే నామమును మాత్రము గ్రహించి వ్యాఖ్యానించారు.

**అదృష్టః**

**న దృష్టః అదృష్టః**. గర్వము పొందనివాడు అదృష్టుడు. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతంనుండి ఉదాహరించారు. (సభాపర్వము 51.28)

**ఏవం విధాని కర్మాణి కృత్వా గరుడవాహనః**
**న విస్మయం ఉపాగమత్ పారమేష్ఠ్యేన తేజసా**

ఆ గరుడవాహనుడు ఇట్టి పనులు చేసికూడా, తన పరమ తేజస్సు కారణంగా, కొంచెం కూడా గర్వించలేదు.

శ్రీ వాసిష్ఠ – అంతా ఆయన నియంత్రణలో ఉంటుంది. కనుక భగవానుడు ఎప్పుడూ నియమాలను అతిక్రమించని అదృష్టుడు.

**దృష్టః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యశోదా నంద లాలన దృష్టః**. యశోదా నందుల లాలనమువలన సంతోషముతో గర్వించినవాడు దృష్టుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్వాత్మామృత రసాస్వాదనాత్ నిత్య ప్రముదితో దృష్టః**. నిజమైన సచ్చిదానంద స్వరూప రసామృతమును ఆస్వాదించి తన్మయుడైనవాడు దృష్టుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **నిత్యం హర్షమయాత్ దృష్టః. గర్వరహితత్వాత్ దృష్టః**. సదా సంతోషంగా ఉన్నందున దృష్టుడు. గర్వము లేనందున దృష్టుడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – పరమేశ్వరుడు దుష్టజనులను అణచి ధర్మమును రక్షించినందున గర్వించినవాడు గనుక దృష్టుడు అయ్యాడు.

శ్రీ వాసిష్ఠ – దృప్ - హర్ష మోహనయోః. **దృపయతి ఇతి దృష్టః**. జగత్సృష్టి, పరమ సత్యము వంటి అద్భుతమైన విషయాలను గురించి మనలను ఆశ్చర్యపరచి, జ్ఞానోన్ముఖులను చేయువాడు దృష్టుడు. ఆలా జ్ఞానంద్వారా మోహం నశిస్తుంది. 'విశోకః', 'శోకనాశనః' నామములవలెనే 'దృష్టః', 'అదృష్టః' నామములను జంటగా పరిగణించవచ్చును. ఈశావాస్యోపనిషత్తులో **'తదేజతి తన్నైజతి ..........'** వంటి వాక్యాలు కూడా ఇలా వ్యతిరేకమనిపించే భావాలను సంఘటిత పరుస్తాయి

## 720. దుర్ధరః

ధరింపజాలనివాడు, పట్టరానివాడు.

- బాలకృష్ణునివలె పట్టరానివాడు.
- దుర్యోధనాది దుష్టులకు బంధింపజాలనివాడు.
- ధారణ చేయుటకు కష్టమైనవాడు. సుశిక్షితమైన మనసునకు మాత్రమే ధ్యానమున నిలిచియుండువాడు.

### ఓం దుర్ధరాయ నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడును.

29వ శ్లోకము. 267వ నామము . దుర్ధరః – **సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః**

76వ శ్లోకము. 720వ నామము . దుర్ధరః – **దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోऽథా పరాజితః**

29వ శ్లోకంలోని 'దుర్ధరః' నామమునకు చెప్పిన అర్థాలు –

శ్రీ భట్టులు – ఆపబడని బలము కలవాడు (ఎదురు లేనివాడు).

శ్రీ శంకరులు – ధారణకు కష్టమైనవాడు (గొప్ప యోగులకు మాత్రమే ధారణకు అందువాడు). భరింపరానివాడు (ఆంతటినీ ఆయనే భరించును).

ఇక ఈ 76వ శ్లోకంలోని 'దుర్ధరః' నామము వివరణ. దుః - దుఃఖేన - చాలా కష్టంగా; ధృ - ధారణే - ధరించుట, పట్టుకొనుట, నిలబెట్టుట. కనుక 'దుర్ధరః' నామమునకు రెండు ప్రధానార్థాలున్నాయి. (1) చాలా కష్టంమీద మనసులో ధారణ చేయబడువాడు. శ్రీ శంకరులు, ఇతర వ్యాఖ్యాతలు ఈ అర్థాన్ని తీసుకొన్నారు. (2) (శారీరికంగా) పట్టరానివాడు (అయిన చిన్నికృష్ణుడు). శ్రీ భట్టులు ఈ అర్థాన్ని గ్రహించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **బాల లీలాది ప్రసంగేషు మత్త మాతంగత్వాత్ తాభ్యామ్ దుర్ధరః దుర్వార చంచల చేష్టితః.** తన బాల్యలీలాచేష్టల సమయమున, చిన్నికృష్ణుడు మదించిన ఏనుగువలె యశోదానందులకు పట్టరానివాడై, దుర్ధరుడై యున్నాడు.

**బాలలీలా ప్రసంగేషు యశోదా నంద లాలనాత్ దృపో మత్తో భవేత్తాభ్యాం దుర్గ్రహో దుర్ధరోమతః -** చిన్నతంలో ఆటలాడేటప్పుడు శ్రీకృష్ణుడు అల్లరి చేసినా యశోదానందులు అతనిని శిక్షింపలేదు. పైపెచ్చు లాలించారు. అందుచేత గర్వించి, దృప్తుడై, పట్టశక్యముకానివాడై, దుర్ధరుడైయున్నాడు.

శ్రీ భట్టులు విష్ణుపురాణం (5.6.15) నుండి ఉదాహరించారు. యశోద చిన్నికష్ణుని రోటికి కట్టివేసి ఇలా అన్నది – ఓ చిలిపివాడా! ఇప్పుడు పారిపోగలవేమో చూపు.

మరొక విధంగా – దుర్యోధనునివంటి దుష్టులకు ఏవిధంగానూ నిగ్రహింపజాలనివాడు దుర్ధరుడు. ఇందుకు శ్రీభట్టులు మహాభారతంనుండి ఉదాహరించారు

**ఇమం హి పుండరీకాక్షం జిఘృక్షంతి అల్పమేధసః**

**పటేనాగ్ని ప్రజ్వలితం యథాబాలో యథాऽబలాః** – ఉద్యోగపర్వము 129.16

ప్రజ్వలించుచున్న అగ్నిని బాలబాలికలు గుడ్డపేలికలతో పట్టుకోవడం సాధ్యం కాదు. అలాగే ఈ అల్పబుద్ధులు శ్రీకృష్ణుని పట్టుకొనలేరు.

**దుర్గ్రహః పాణినా వాయుః దుస్స్పర్శః పాణినా శశౌ**

**దుర్ధరా పృథ్వీ మూర్ధ్నా దుర్గ్రహః కేశవో బలాత్** – వనపర్వము 309.28

వాయువును చేతులతో బంధింపలేము. చంద్రుని తాకలేము. భూమిని తలపై ధరింపలేము. అలాగే కేశవుని బలంతో పట్టుకొనలేము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు ఎన్నో జన్మల ధ్యానం, సుశిక్షితమైన తపం ద్వారా మాత్రమే మనసులో నిలిచియుంటాడు గనుక దుర్ధరుడు. ఇందుకు గీతనుండి ఉదాహరించారు.

**క్లేశోऽధిక తరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్**

**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే** – గీత 12.5

కాని సచ్చిదానంద ఘన నిరాకార పరబ్రహ్మమునందు ఆసక్తచిత్తులు అయినవారు తత్ప్రాప్తికై చేయు సాధన మిక్కిలి శ్రమతో కూడినది. ఏలనన దేహాభిమానులకు అవ్యక్త పరబ్రహ్మ ప్రాప్తి కష్టమే.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **దుఃఖేన ధర్తుమ్ శక్యో దుర్ధరః.** ఎంతో కష్టంచే ధారణ చేయబడువాడు దుర్ధరుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **దుఃఖేన ఆయాసేన ధ్రియతే అ-సమాహిత-మానసైః ఇతి దుర్ధరః.** ఎంతో నిగ్రహము, ప్రశాంతత, శిక్షణ ఉన్నవారికే అతికష్టంపై ధారణ చేయబడువాడు దుర్ధరుడు.

## అథః

దుర్ధరోऽథాపరాజితః – ఇక్కడ 'దుర్ధరః' నామము తరువాత 'అథ' శబ్దము వచ్చినది. ఇలా వాక్యం మధ్యలో 'అథ' శబ్దం రావడం జరిగితే అది మంగళవాక్యం అవుతుంది. **అథేతి గ్రంథమధ్యే మంగళమ్** – అని శ్రీ బలదేవ విద్యాభూషణ అన్నారు. ఆప్టే సంస్కృత నిఘంటువు ప్రకారము 'అథ', 'ప్రణవము' ఒకేమారు సృష్టి ఆదిలో బ్రహ్మముఖంనుండి వెలువడ్డాయి. కనుక 'అథ'శబ్దము మంగళసూచకము.

**ఓంకారశ్చ అథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా కంఠం భిత్వా వినిర్యాతౌ తేన మంగళికావుభౌ**

## 721. అపరాజితః

- అపజయమెరుగనివాడు. జయింపరానివాడు. పరాజయము రానీయనివాడు.
- దేవుని రక్షణలో ఉన్నవారికి అపజయం లేదు.

**ఓం అపరాజితాయ నమః**

ఈ నామం రెండుమార్లు వస్తుంది.

76వ శ్లోకము. 721వ నామము. అపరాజితః – **దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోऽథాపరాజితః**

92వ శ్లోకము. 866వ నామము. అపరాజితః – **అపరాజితస్సర్వసహో నియన్తాऽనియమోऽయమః**

జీ- జయతే- జయించుట; **న పరాజితః కదాపి కేనాపి ఇతి అపరాజితః.** ఎవరిచేతను, ఎప్పుడూ, ఎలాగూ పరాజితుడు కానివాడు అపరాజితుడు. శ్రీ భట్టులు అనేక ఉదాహరణలు ఇచ్చారు –

**ఏకమ్ హనిష్యసి రిపుమ్ గర్జంతమ్ తం మహామృధే**

**న తు తమ్ ప్రార్థయస్యేకమ్ రక్ష్యతే స మహాత్మనా**

**యమ్ అహుర్వేద విదుషో వారాహమ్ అజితమ్ హరిమ్**
**నారాయణమ్ అచింత్యమ్ చ తేన కృష్ణేన రక్ష్యతే** – మహాభారతము. ఉద్యోగపర్వము 129.40

ఇంద్రుడు కర్ణునితో అన్నాడు – జరుగబోయే మహాయుద్ధంలో గర్జించే ఒక మహావీరుని హతం చేయడానికి కావలసిన శక్తిని ఇస్తున్నాను. కాని ఆ మహావీరుడు అర్జునుడు కాడు. ఎందుకంటే అర్జునుని మహాత్ముడైన శ్రీకృష్ణుడు రక్షిస్తున్నాడు. ఆ కృష్ణుడే శ్రీవరాహావతారం ధరించిన, అజితుడైన, నారాయణుడని విజ్ఞులు చెప్పే శ్రీహరియే.



శ్రీకృష్ణుడు పాండవులకు తన మద్దతును తెలుపుట. 1830 కాలపు అజ్ఞాత చిత్రకారుని చిత్రం.
ధర్మరాజు కృష్ణుని అర్థించుట, తన సోదరులను సంప్రదించుట, సభలో సమావేశమగుట ఈ చిత్రంలో ఉన్నాయి.
https://commons.wikimedia.org/wiki/File:Krishna_Offering_Support_to_the_Pandavas_1.jpg

**అజయ్యాన్ శ్చాపి అవధ్యాన్ శ్చ వారయిష్యసి తాన్ యుధీ**
**ఋతే అర్జునమ్ మహాబాహుమ్ దేవైరపి దురాసదమ్**
**యమ్ ఆహుః అమితమ్ దేవమ్ శంఖ చక్ర గధాధరమ్**

**ప్రధానః సోऽస్త్రవిదుషామ్ తేన కృష్ణేన రక్ష్యతే** – మహాభారతము. వనపర్వము 260.75

రుద్రుడు జయద్రధునితో అన్నాడు – యుద్ధంలో నీవు మహాబాహుడైన అర్జునుని తక్క ఇతర మహావీరులను నిరోధింపగలవు. శంఖ చక్ర గధాధారియైన, తెలియజాలని భగవంతుడైన కృష్ణుడే స్వయంగా అర్జునుని కాపాడుతున్నాడు.

భీష్మద్రోణాదులు కూడా ఇదే విషయాన్ని చెప్పారు. విష్ణువు గనుక పాండవులకు రక్షకునిగా లేకపోతే పాండవులను సులభంగా నిర్జింపవచ్చునట.

**ధ్రువం వై బ్రాహ్మణే సత్యం ధ్రువా సాధు సన్నతిః శ్రీర్-ధ్రువా చాపి దక్షేషు ధ్రువో నారాయణే జయః.** బ్రాహ్మణులచెంత సత్యము, సాధువులచెంత వినయము, దక్షులవద్ద సంపద ఉన్నట్లుగానే తప్పక నారాయణుని చెంత విజయం ఉంటుంది.

**యస్య త్వం పురుషవ్యాఘ్ర ముపజగ్మివాన్ ధ్రువ ఏవ జయస్తస్య న తస్యాస్తి పరాజయః.** అర్జునుడు అన్నాడు – కృష్ణా! నువ్వు ఎవరికి సారధిగా ఉంటావో వారికి విజయము నిశ్చయముగా కలుగుతుంది. పరాజయము కలుగదు.

**శక్తోఽహం ధనుషైకేన నిహంత్రుం సర్వపాండవాన్ యద్వేషాం భవేద్గోప్తా విష్ణుః కారణపూరుషః.** కర్ణుడు అన్నాడు – కారణ పురుషుడైన శ్రీకృష్ణుడు పాండవులకు రక్షణగా ఉన్నాడు. అలా కాకుంటే పాండవులను ఒకేఒక్క బాణంతో చంపుతాను.

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్-విజయో భూతిర్-ధ్రువా నీతి ర్మతిర్మమ** – గీత 18.78 & శ్రీ విష్ణు సహస్రనామము ఉత్తర పీఠిక.
సంజయుడు అన్నాడు – ఓ రాజా! యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు, గాండీవ ధనుర్ధారియైన అర్జునుడును ఉండుచోట సంపదలును, సర్వవిజయములును, సకలైశ్వర్యములును, సుస్థిరమైన నీతియును ఉండును. ఇది నా నిశ్చితమైన అభిప్రాయము.

శ్రీ భట్టులు ఆయుర్వేద చరకసంహితమునుండి కూడా ఉదాహరించారు –
**యథాఽహమ్ నాభిజానామి వాసుదేవే పరాజయమ్**
**మాతుశ్చ పాణిగ్రహణమ్ సముద్రస్య చ శోషణమ్**
**ఏతేన సత్యవాక్యేన సిద్ధ్యతామ్ అగదోహ్యయమ్**
వాసుదేవునకు పరాజయము లేదు. నా తల్లి వివాహము నేను చూడలేదు. సముద్రము ఎండిపోదు – ఈ వాక్యములు ఎంత నిజమో ఈ ఆయుర్వేద శాస్త్రము కూడ అంతే నిజము, సత్ఫలదాయకము అగుగాక.

వైతరణంలో విషహరణమైన మంత్రంలో భాగం – **రత్నాకర ఇవ అక్షోభ్యో హిమవానివ అచలః జాతవేదా ఇవ అధృష్యో నారాయణ ఇవ అజేయః.** సముద్రము క్షోభింపరానిది, హిమవత్పర్వతము నిశ్చలమైనది. అగ్ని సమీపింపరానిది. నారాయణడు అజేయుడు. అయినట్లే ఈ మంత్రము విషమును హరించును గాక.

శ్రీ భట్టులు ఇంకా రామాయణ మహాభారతాలనుండి ఉదాహరించారు –
యుద్ధకాండ 114.15 – **అజయ్యః శాశ్వతో ధ్రువః.**
యుద్ధకాండ 120.14 – **అజితః ఖడ్గధృక్**
భారత. ఉద్యోగ. 6.79 – **యతో కృష్ణ స్తతో జయః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – అంతః శత్రువులైన కామాది అరిషడ్వర్గాలు గాని, బాహ్యశత్రువులైన రాక్షసాదులుగాని భగవంతుని జయింపలేరు. కనుక శ్రీహరి అపరాజితుడు.
శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **పర ఏవ కశ్చిన్నాస్తి - న ద్వితీయో న తృతీయః ఇతి అధర్వ వచనాత్ - తస్మాత్ పరాజిత్వస్య అసంభవాత్ భగవతః అపరాజిత ఇతి నామ్నా సంకీర్తనమ్ ఉపపద్యతే** – భగవంతునికంటె 'పర' లేదు. ఆయనవంటి మరొకరు లేరు. కనుక ఆయనను మరొకరు జయించే ప్రసక్తే లేదు. కనుక ఆయన అపరాజితుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **న పరాజితః కదాపి కేనాపి ఇతి అపరాజితః.**

శ్రీ సత్యసంధతీర్థ యతిరాజ ఈ నామమును 'అ-పరః-అజితః' అని అభివర్ణించారు.
**న విద్యతే పర-ఉత్తమో యస్మాత్ ఇతి అపరః అపరశ్చ అసౌ అజితశ్చ ఇతి అపరాజితః**

ఆయనకంటె గొప్పవాడు లేనందున ఆయన 'అపరః'. మరియు ఆయనను జయించేవాడు లేనందున ఆయన 'అజితః'. ఇలా భగవంతుడు అపరాజితుడు.

శ్రీ చిన్మయానంద – ఈశావాస్యోపనిషత్తు – **నైనద్ దేవా ఆప్నువాన్.** దేవతలు కూడా దానిని అధిగమించలేరు. ఆశా మోహముల బలం దేవతలకు కూడా బలమైనది. కాని నారాయణునికి అలాంటి సమస్యలు లేవు. (దేవతలకు కూడా వశం కాని పనులు ఆయనకు సులభం?).

**866**వ నామము – అపరాజితః – భగవంతుని రక్షణలో ఉన్నవారికి పరాజయం ఉండదు. మహాభారతంలో కౌరవులనెదుర్కొన్న పాండవులు కృష్ణుని రక్షణలో ఉన్నారు. కనుక అంతిమ విజయం వారినే వరించింది. ఈ వివరణకూ శ్రీ భట్టులు మహాభారతంనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు.

**యస్య మంత్రీ చ గోప్తా చ సుహృచ్చైవ జనార్దనః హరిః త్రైలోక్యనాథః సన్ కిమ్ ను తస్య నిర్జితమ్**

ఎవరికైతే భగవానుడైన శ్రీహరి మంత్రిగాను, మిత్రునిగాను, రక్షకునిగాను ఉన్నాడో అలాంటివారు జగత్తులో జయింపలేనిది ఏముంది?



పాండవులకు సదా శ్రీకృష్ణుని రక్షణ – ద్రౌపది మాన సంరక్షణము, యుద్ధం రాత్రులలోగుఱ్ఱాలను శుభ్రము చేయుట, యుద్ధానంతరము అర్జునుని రథం కాలిపోగా అర్జునుని రక్షించుట, నాగాస్త్రమునుండి అర్జునుని కాపాడుట, భీష్మునిపై లంఘించుట, ఉత్తర గర్భమును కాపాడుట. గీతా ప్రెస్ వారి ప్రచురణలలోని చిత్రాలు. వికీపీడియానుండి.



## విశ్వమూర్తిర్మహామూర్తిర్దీప్తమూర్తిరమూర్తిమాన్ |
## అనేకమూర్తిరవ్యక్తః శతమూర్తిః శతాననః || (77)

### 722. విశ్వమూర్తిః

- విశ్వమే తన శరీరంగా కలవాడు.
- భక్తుల మనసులు, కన్నులలో ప్రవేశించే సుందరరూపుడు.
- విశ్వము రూపంలో మాయాశక్తి కలవాడు.
- అంతటా మాయను కలిగించే రూపము కలవాడు.

ఓం విశ్వమూర్తయే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు అన్ని జీవులయందు ఆత్మగానున్నవాడు గనుక విశ్వమూర్తి. **అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః** (గీత 10.19). ఈ కారణం చేతనే పోరాటాలలో బలవంతుడే ఎప్పుడూ గెలవాలని లేదు. ఒకోమారు బలహీనుడు గెలుస్తాడు.

తిరువైమోళి 6.9.7 – నీవే సమస్త కర్మలు. నీవే సమస్త కర్మలను ఆచరించే లోకము. నీవే సకల జీవులకు ఆత్మవు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **విశ్వమ్ మూర్తిః అస్య సర్వాత్మకత్వాత్ ఇతి విశ్వమూర్తిః**. భగవంతునికి విశ్వమే స్వరూపము. ఆయనే అందరికి ఆత్మ. కనుక ఆయన విశ్వమూర్తి.

తైత్తరీయారణ్యకము 10.13 – **విశ్వాత్మానమ్ పరాయణమ్.**

తైత్తరీయారణ్యకము 10.14 – **ఊర్ధ్వరేతమ్ విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః.**

ధర్మచక్రము రచయిత – భగవంతుని విశ్వరూపము గురించి తెలిసికోవడానికి అర్హత, స్థాయి కావాలి. భగవధ్యానంతో దానిని సాధించవచ్చును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'విశ్'-ప్రవేశించుట. **విశతి మనో నయనాని సతామ్ ఇతి విశ్వా, తదృశీ కమనీయ మూర్తిః యస్య ఇతి విశ్వమూర్తిః**. సజ్జనుల మనసునందు, కన్నులయందు ప్రవేశించే (ఆకర్షించే) కమనీయమైన మూర్తి విశ్వమూర్తి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – మూర్ఛా - మోహ సముచ్ఛ్రాయయో - నిలకడ కోల్పోవుట; మూర్తి - మాయారూప విమోహికాశక్తిః - మోహింపజేయు మాయ.

**విశ్వమేవ మూర్తిః ఆకారో యస్య సః విశ్వమూర్తిః.**
**విశ్వమేవ మాయా విమోహికాశక్తి యస్య సః విశ్వమూర్తిః.**

**విశ్వస్య మోహికా శక్తిః యస్య సః విశ్వమూర్తిః**

అనగా – విశ్వమే రూపముగా (ఆకారముగా) కలవాడు విశ్వమూర్తి. విశ్వం రూపంలో ఉన్న మాయాశక్తి కలవాడు విశ్వమూర్తి. తన మాయతో విశ్వాన్ని కట్టి ఉంచేవాడు విశ్వమూర్తి.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భగవంతుడు విశ్వమూర్తియై దేవ గంధర్వ మానవాది సకలజీవులలో ఉంటాడు గనుక అపరాజితుడు. ఇలా శ్రీ విద్యాభూషణ 'అపరాజితః' నామంతో 'విశ్వమూర్తిః' నామాన్ని అనుసంధానించారు.

## 723. మహామూర్తిః

- గొప్పదైన, పెద్దదైన శరీరము కలవాడు.
- గొప్పగా పూజనీయమైన ఆకృతి కలవాడు.

ఓం మహామూర్తయే నమః

**విశ్వైకాశ్రయ మూర్తిత్వాత్ మహామూర్తిరితి స్మృతః.** జగత్తు అంతా ఒకటేయైన తన శరీరముగా కలవాడు మహామూర్తి. శ్రీ భట్టులు భగవద్గీత (11.7) శ్లోకాన్ని ఉదాహరించారు.

**ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య స చరాచరమ్**
**మమదేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి** – గీత 11.7

నా యీ రూపమునందు ఒకేచోట స్థితమైయున్న సమస్త చరాచర జగత్తును చూడుము. ఓ అర్జున! అంతేగాక ఇంకను నీవు చూడదలచుకొనిన వాటినన్నింటనీ చూడుము.

**తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా**
**అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవస్తదా** – గీత 11.3

ఆ సమయమున అర్జునుడు అ దేవదేవుని శరీరమునందు అసంఖ్యాకములైన వివిధ బ్రహ్మాండములును, వేర్వేరుగా ఒకేచోట కేంద్రీకృతములై యున్నట్లు చూచెను.

శ్రీ తిరుమంగైయాళ్వారు. పెరియతిరుమొళి – ఈ విశ్వమంతా భగవంతుని శరీరంలో చిన్నభాగం. ఇంక ఆయన మహామూర్తి గురించి ఊహించుకొనండి.

శ్రీ కష్ణదత్త భరద్వాజ 'మహా' అంటే ('పెద్ద' అని కాకుండా) 'పూజనీయ' అనే అర్థాన్ని వాడారు. **మహతీ పూజనీయ మూర్తిః ఆకృతిః యస్య ఇతిమహామూర్తిః.** గొప్ప పూజనీయమైన ఆకృతి కలవాడు మహామూర్తి.

ధర్మచక్రము రచయిత – (1) జీవులకు వేరువేరు శరీరాలు ఉన్నట్లు అనిపించినాగాని నిజానికి అన్ని ఆత్మలు, అన్ని శరీరాలు మహామూర్తి శరీరంలోని భాగాలే. (2) సృష్టి, స్థితి, సంహారము అనే ప్రక్రియలు కూడా మహామూర్తి శరీరంలో భాగాలే. (3) మనకు సాధన కొరకు ఒక శరీరం అవుసరం గనుక భగవంతుడు శరీరాన్ని ప్రసాదించాడు. అనేక జన్మలలో సాధన ద్వారా మనసును పరిశుద్ధం చేసుకొని మహామూర్తిని దర్శించే అవకాశానికి దగ్గర కావచ్చును.

## 724. దీప్తమూర్తిః

- ప్రకాశవంతమైన స్వరూపము కలవాడు.

ఓం దీప్తమూర్తయే నమః

**దీప్తా అప్రాకృత తేజోమయీ మూర్తిః ఆకారః యస్య ఇతి దీప్తమూర్తిః.** అప్రాకృతమైన (అసాధారణ, అద్భుతమైన) తేజస్సుతో ప్రకాశించే మూర్తి దీప్తమూర్తి.

**యత్కించిత్కేన చిద్దీప్త గుణేనాత్ర విశేషతః యత్సర్వం మూర్తి రస్యేతి దీప్తమూర్తిరసౌ స్మృతః.** ఏయే వస్తువు ఏయే గుణముతో ప్రకాశిస్తున్నదో, ఆ గుణములన్నీ తన రూపమే అయినవాడు దీప్తమూర్తి. సృష్టిలో ప్రకాశించేవన్నీ భగవానునివల్లనే అని చెబుతూ శ్రీ భట్టులు గీత (10.4)నుండి ఉదాహరించారు –

**యద్యద్విభూతిమత్సత్వం శ్రీమదూర్జితమేవ వా**

**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజః అంశ సంభవమ్**

విభూతియుక్తమైన, అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము అయిన వస్తువేదైనను నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము.

కఠోపనిషత్తు 2.2.15 – **తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్.** అది స్వయముగా ప్రకాశించును మరియు అంతటిని ప్రకాశింపజేయును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – (1) **దీప్తా జ్ఞానమయీ మూర్తిః యస్య దీప్తమూర్తిః.** జ్ఞానముతో ప్రకాశించు మూర్తి దీప్తమూర్తి. (2) **స్వేచ్ఛయా గృహీత తేజసీ మూర్తిః అస్య ఇతి వా దీప్తమూర్తిః.** తన సంకల్పము చేతనే తేజోమయ రూపము ధరించినవాడు దీప్తమూర్తి.

శ్రీ చిన్మయానంద గీత (11.12)నుండి ఉదాహరించారు –

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా**

**యది భాః సదృశీ సా స్యాత్, భాసస్తస్య మహాత్మనః**

ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాంతిపుంజములును ఆ విరాట్-రూప తేజస్సునకు సాటి రావు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'దీప్త' పదానికి 'ప్రకాశము' అని మాత్రమే కాక, 'స్పష్టము' (దాయనిది) అన్న అర్థం కూడా తీసుకొన్నారు. భగవంతుడు ఏదీ దాయవలసిన అవుసరం లేదు గనుక దీప్తమూర్తి. ఇందుకు ఆయన చెప్పిన ఉదాహరణ – ఒక స్త్రీ గర్భిణి అయినపుడు ఆ చిహ్నములు స్పష్టముగా కానవచ్చును.

ధర్మచక్రము రచయిత – ప్రకాశములు రెండు విధాలు. (1) బయటి కాంతిద్వారా కలిగే ప్రకాశము (2) జ్ఞానము వలన మనసులో కలిగే ప్రకాశము. ఈ రెండూ భగవంతునివల్లనే కలుగుతాయి. బయటి ప్రకాశం లేనపుడు నేరములు జరిగినట్లే, లోపలి ప్రకాశం లోపించినపుడు మనసు చెడుదారులలో వెళుతుంది. అంతః ప్రకాశం కలిగించడానికి భగవంతుడు ఇచ్చిన సాధనాలలో గాయత్రీ మంత్రము ఒకటి. ఈ 'దీప్తమూర్తి' నామమువలన మనం తెలుసుకొనవలసినది ఏమంటే భగవంతుడు బయటా, లోపలా కూడా అంతటినీ నియంత్రిస్తున్నాడు. మనస్సును సాధన ద్వారా ప్రకాశవంతము చేసి భగవంతునివైపుకు మళ్ళించవచ్చును.

## 725. అమూర్తిమాన్

- ప్రత్యేకమైన ఆకృతి లేనివాటిని (భూమి, గాలి, అగ్ని, ప్రకృతి వంటివి) కూడ తనవిగా కలిగినవాడు.
- భగవంతుని రూపము కర్మవలన సంభవించదు.
- కఠినము కాని, క్రూరము కాని, మృదువైన, స్వభావము కలవాడు.
- వర్ణించరాని, స్థిరము కాని ఆకృతి కలవాడు.

- తన ఇచ్ఛానుసారము రూపు ధరించును గనుక ప్రత్యేకమైన ఆకృతి లేనివాడు.

## ఓం అమూర్తిమతే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – అమూర్తులైనవాటిని, అనగా ప్రత్యేకమైన ఆకృతి లేని గాలి, భూమి, అగ్ని, నీరు వంటివాటిని తనవిగా కలిగినవాడు 'అమూర్తిమాన్'. **అమూర్తి శబ్దేనోచ్యంతే హ్యవ్యక్త పురుషాదయః త ఏవ యస్య స్వమితి స స్మృతస్యాదమూర్తిమాన్** అమూర్తి అంటే శరీరం లేని ప్రకృతి, పురుషాదులు. వీటిని తనవిగా కలవాడు అమూర్తిమంతుడు. ఇందుకు శ్రీ భట్టులు అనేక ప్రమాణాలను ఉదాహరించారు.

**భూమి రాపోనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా** – గీత 7.4
భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని నా ప్రకృతి ఎనిమిది విధములుగా కలదు.
సుబాలోపనిషత్తు 7 – **యస్య అవ్యక్తమ్ శరీరమ్.**
శతపథ బ్రాహ్మణము 14.6.30 – **యస్య ఆత్మా శరీరమ్.**

'అమూర్తిమాన్' అనగా 'రూపము లేనివాడు' అనే అర్థం ముందు స్ఫురిస్తుంది. కాని పాణిని సూత్రము 5.2.94 **తత్ అస్య అస్తి అస్మిన్ ఇతి మాతుప్** – ప్రకారము 'మాతుప్' ప్రత్యయమువలన 'కలిగియున్నది', 'అక్కడ, అందు ఉన్నది' అనే అర్థాలు వస్తాయి. కనుక 'అమూర్తిమాన్' అనగా (1) 'ఆకృతి లేనివాడు' అనేది సరైన అర్థం కాదు. (2) 'అమూర్తులను తనవానిగా కలవాడు' అనేది సరైన అర్థం. అంతే కాకుండా విశ్వమూర్తి, మహామూర్తి, దీప్తమూర్తి, అనేకమూర్తి వంటి అనేక నామములకు 'ఆకృతి లేనివాడు' అనే అర్థానికి పొసగదు.

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళినుండి అనేక ఉదాహరణలు చెప్పారు. వాని భావం భగవంతుని రూపాలు అర్థం కానివని. 6.9.7 – శ్రీవైకుంఠం అంతటా ఉన్న ముక్తజీవుల ఆత్మవు నీవే; 7.8.9 – సుందరమైన, మనోహరమైన రూపము కలవాడవు నీవే, మరియు అందరికిని కానరాని, రూపము లేని ఆత్మవు నీవే; 5.10.6 – నీవు అనంత స్వరూపుడవు. మరియు సర్వులకు (రూపము లేని) ఆత్మవు నీవే. నీ సృష్టిలోని అద్భుతాలకు అంతం లేదు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉపనిషత్తులనుండి ఉదాహరించారు.
ముండకోపనిషత్తు 2.2 – **దివ్యో హ్యమూర్తః.**
బృహదారణ్యకోపనిషత్తు 3.1 – **ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తమ్ చ అమూర్తమ్ చ.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కర్మనిబంధనా మూర్తిః అస్య న విద్యత ఇతి అమూర్తిమాన్.** భగవంతునికి కర్మల కారణంగా మూర్తి (ఆకృతి) సంభవించదు కనుక ఆయన అమూర్తిమతి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'మూర్తి' అనగా ఒక అర్థము 'ఆకృతి'. మరొక అర్థము 'కఠినమైనది' (అమరకోశములో 'మూర్తిః కాఠిన్యమ్' అని ఉన్నది). ఈ ప్రకారంగా చూస్తే – భగవంతునిలో కాఠిన్యత, కఠోరత వంటి గుణాలు లేవు. ఆయన మృదుస్వభావుడు. కనుక 'అమూర్తిమాన్'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతునికి ఒక ప్రత్యేకమైన ఆకృతి లేదు. అనంతమైన, వర్ణనాతీతమైన, స్థిరము కాని ఆకృతులున్నవాడు గనుక 'అమూర్తిమాన్'. శ్రీ చిన్మయానంద వ్యాఖ్య కూడా ఇలాగే ఉంటుంది. పరిమితులున్నదానికే ఆకృతి ఉంటుంది. అపరిమితుడైన భగవంతునికి ఆకృతి ఇది అని చెప్పజాలము.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు సంకల్పానుసారము వివిధ స్వరూపములలో అవతరించును కాని ఆ స్వరూపములు ఆయన పరిమితులు కావు. ధర్మరక్షణార్థము ఆయన ఆయా రూపములను ధరించును.

## 726. అనేకమూర్తిః

- పెక్కు రూపములు కలిగినవాడు.

### ఓం అనేకమూర్తయే నమః

**అనేకా బహవో మూర్తయః ఆకారాః స్వేచ్ఛా పరిగృహీతా యస్య ఇతి అనేకమూర్తిః.** తన ఇచ్ఛానుసారము పెక్కు విధములైన ఆకారములు గైకొనువాడు అనేకమూర్తి. శ్రీ భట్టులు విష్ణుపురాణము (5.31.18)నుండి ఉదాహరించారు.

**షోడశ స్త్రీ సహస్రాణి శతమేకమ్ తతోఽధికమ్**
**తావంతి చక్రే రూపాణి భగవాన్ దేవకీసుతః**
దేవకీసుతుడైన భగవనుడు పదహారువేల ఒక మంది రాణులకు తగినట్లుగా అన్ని రూపములు ధరించినాడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.5.6 – ఆయన అన్నింటిలోను వైవిధ్యము కలవాడు. పేర్లలోగాని, శౌర్యములో గాని, గుణములలోగాని, దివ్యత్వములో గాని, అన్నింటిలోను అనేకమూర్తిమంతుడు.

శ్రీ అన్నమయ్య – **అన్ని మంత్రములు హరినామములు, అన్ని దేవతలు హరియతారములె.**

ఋగ్వేదము 1.664.46 – **ఏకమ్ సద్ విప్రా బహుధా వదంత్యగ్నిమ్ యమమ్ మాతరిశ్వానమ్ అహుః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – ధర్మసంరక్షణార్థము శ్రీహరి అనేక అవతారములు ఎత్తును గనుక అనేకమూర్తి.

## 727. అవ్యక్తః

- వ్యక్తుడు కానివాడు. తెలియరానివాడు. ఇంద్రియములకు గోచరింపనివాడు.

### ఓం అవ్యక్తాయ నమః

'వ్యక్తము' అనగా ఇంద్రియములకు తెలియవచ్చునది. వానికి అతీతమైనవాడు అవ్యక్తుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **మనుష్యత్వేన సర్వత్ర పరభావా ప్రకాశనాత్ బుద్ధై రవ్యక్త ఇతి చ కథిత స్తత్వపారగైః** - మనుష్యునిగా అవతరించినప్పటికీ, తన తత్వాన్ని మరుగుపరచి ప్రవర్తించాడు గనుక తత్వవేత్తలు అతనిని 'అవ్యక్తుడు' అన్నారు. శ్రీ భట్టులు భగవద్గీతనుండి ఉదాహరించారు.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్** – గీత 7.25
నా యోగమాయయందు దాగియున్న నేను అందరికిని గోచరింపను. కనుక అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలిసికొనలేరు (అనగా జనన మరణములకు లోనగువానినిగా తలంతురు.)

**నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా** – గత 11.53

నీవు కాంచిన నా చతుర్భుజ రూపమును దర్శించుటకు వేదపఠనములచే గాని, తపశ్చర్యలచే గాని, దానములచే గాని, యజ్ఞకర్మలచే గాని శక్యము కాదు.

శ్వేతాశ్వరోపనిషత్తు 4.20 – **న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్.** ఆయన స్వరూపము చూపులకు అందనిది. ఆయనను ఎవరూ కంటితో చూడలేదు.

**అంతి సంతి న పశ్యతి అంతి సంతమ్ న జహాతి**
**దేవస్య పశ్య కావ్యం న మమార న జీర్యతి** – అధర్వ వేదము 10.8.32
భగవంతుడు సమీపంలో ఉన్నాడుకాని ఎవరికీ కనుపించడు. ఆయన వయసు పెరగదు, క్షీణించదు. ఇది ఆశ్చర్యము.

శ్వేతాశ్వరోపనిషత్తు 6.11 – **ఏకో దేవః సర్వభూతేషు గూఢాః**

తిరువైమోళి 1.9.6, 1.3.4 – ఆయన తర్కముద్వారా ఎవరికీ తెలియరాడు. భక్తులకు తప్ప మిగిలినవారికి ఆయన స్వరూపము కానరాదు. భక్తులకు కనుపించినా అది వెంటనే మాయమవుతుంది. వెంటనే మళ్ళీ అవ్యక్తుడు అయిపోతాడు. యశోదకు కృష్ణుని విశ్వరూపం కనుపించినాగాని, తరువాత మళ్ళీ ఆమెను మాయ అవరించిందట.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యద్యాపి అనేకమూర్తిత్వం అస్య, తథాపి అయమ్ ఈదృశ ఏవ ఇతి న వ్యజ్యతా ఇతి అవ్యక్తః.** భగవంతుడు (క్రిందటి నామము) అనేకమూర్తి అయినప్పటకీ ఆయనను గురించి 'ఇది, ఇలా, ఈ విధంగా' వంటి మాటలతో చెప్పడం సాధ్యం కాదు. కనుక ఆయన అవ్యక్తుడు.

## 728. శతమూర్తిః

- నూరు (అనేక) రూపములు ధరించినవాడు.

### ఓం శతమూర్తయే నమః

ఇక్కడ 'శత' అనగా 'నూరు' అనిగాక, 'అనేక, అసంఖ్యాక' అన్న అర్థం తీసుకోవడం ఉచితం, అలంకారికంగా చూస్తే 'లెక్క లేనన్ని' అని చెప్పడానికి 'శత, సహస్ర' శబ్దాలను వాడడం జరుగుతుంది. ఆ విధంగా చూస్తే శతమూర్తి, సహస్రమూర్తి, అనేకమూర్తి, బహుమూర్తి – ఈ నామములకు అన్నింటికీ ఒకేభావం వస్తుంది. అయితే పునరుక్తిదోషం లేకుండా వ్యాఖ్యాతలు చెప్పిన అర్థాలు ఆసక్తికరంగా ఉంటాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్యలు –

**అనేకమూర్తి** – వివిధ సమయాలలో భగవంతుడు వివిధ అవతారాలు ధరించాడు.

**శతమూర్తి** – ఒకే సమయంలో భక్తులకు అనేక రూపాలలో దర్శనమిచ్చాడు. **అర్జునాయ వ్యక్తాయా చ విశ్వరూప ప్రదర్శనాత్ శతమూర్తిరితి ఖ్యాతః శతశోऽథ సహస్రశః.** అర్జునునికి తన విశ్వరూపాన్ని చూపుతూ వందలు, వేలు గల తన రూపాన్ని చూపాడు గనుక శతమూర్తి.

**పశ్య మే పార్థ రూపాణి శతశోऽథ సహస్రశః**
**నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ** – గీత 11.4
ఓ అర్జున! అసంఖ్యాకములైన, బహువిధములైన, పెక్కు వర్ణములు, ఆకృతులు గల నా అలౌకిక రూపమును చూడుము.

శ్రీ భట్టుల వ్యాఖ్యప్రకారం అర్జునుడు (ఒకేవ్యక్తి) ఒకేమారు భగవంతుని అనేక రూపములు దర్శించాడు. శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పిన మరొక విలక్షణ అనుభవం – వివిధ వ్యక్తులు, భగవంతుని వివిధ రూపాలలో దర్శించడం భగవంతుని 'శతమూర్తిత్వము'ను తెలియజేయును.

**మల్లానామ్ అశనిః నృణాం నరవరః స్త్రీణామ్ స్మరో మూర్తిమాన్**
**గోపానామ్ స్వజనః అసతామ్ క్షితిభుజామ్ శాస్తా స్వపిత్రో శిశుః**
**మృత్యుః భోహపతేః విరాట్ అవిదుషామ్ తత్వం పరం యోగినామ్**
**వృష్ణీనామ్ పరదేవతా ఇతి విదితః. ...** –భాగవతము 10.43.17

బలరామునితోపాటు వేదికపైకి ప్రవేశించిన కృష్ణుడు మల్లురకు పిడుగువలె కనుపించాడు. పురుషులకు పురుషోత్తమునివలెను, స్త్రీలకు మన్మథునివలెను, గోపకులకు మిత్రునివలెను భాసించాడు. కంసుని మిత్రులకు తమను శిక్షింపవచ్చే శత్రువుగా కానవచ్చాడు. దేవకీవసుదేవులకు తమ బిడ్డవలెను, కంసునికి మృత్యువువలెను, పామరులకు రాజువలెను, యోగులకు పరతత్వమువలెను, యాదవులకు తమ యశస్సు నిలిపే దివ్యమూర్తివలెను ప్రకాశించాడు.



శ్రీ బలరామ కృష్ణుల విగ్రహాలు. వికీపీడియా నుండి. (అర్జెంటీనా మందిరం?) –
Deidades de mármore de Krishna e Balarama instaladas em Vrajabhumi, Teresópolis by Halley Pacheco de Oliveira
https://commons.wikimedia.org/wiki/File:Deidades_Krishna_Balarama.jpg

శ్రీ రాధాకృష్ణశాస్త్రి కల్పవృక్షమును కూడా ఉదాహరించారు. ఎవరు ఏమి కోరితే అది ఇచ్చే కల్పవృక్షంలాగా భగవంతుడు భక్తులు తనను ఎలా ధ్యానిస్తారో అలా దర్శనమిస్తాడు గనుక ఆయన శతమూర్తి.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు –

**అనేకమూర్తి** – ధర్మరక్షణ కొరకు వివిధ అవతారములను ధరించినవాడు.

**శతమూర్తి – నానా వికల్పజా మూర్తయః సంవిద కృతేః సన్తి ఇతి శతమూర్తిః.** శ్రీమహావిష్ణువు శుద్ధసత్వమూర్తి అయికూడా సంకల్పానుసారం వివిధ రూపాలలో వ్యక్తము అవుతాడు గనుక శతమూర్తి.

శ్రీ పెమ్మరాజు రాజారావు – కోటానుకోట్ల రూపములలో గలవాడు పరబ్రహ్మమని ఈ నామముయొక్క భావము. అన్ని రూపములు ఆయన రూపములే. అన్ని నామములు ఆయన నామములే. అయినను ఆయన నామరహితుడు. రూపరహితుడు. హిందూవేదాంత సాహిత్యమునందు గల ఈ అద్భుత సమన్వయము ఈ శ్లోకములోని వివిధ నామములలో వ్యక్తమగుచుండుటను విజ్ఞులు గ్రహింపగలరు.

## 729. శతాననః

- అనేక ముఖములు కలిగినవాడు.
- జీవుల మనుగడ కొరకు అనేక ఉపకరణములు (నోరు, ముక్కు వంటివి) సమకూర్చినవాడు.
- అనేక విధములైన జీవులను సృష్టించి, వాని మనుగడ కొరకు కావలసిన వసతులను ఏర్పరచినవాడు.
- వివిధ మతములలో వివిధములుగా తెలియబడువాడు.

ఓం శతాననాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అనేకానన సంపత్త్యా తానన ఇతీరితః.** అనేక ముఖములు కలిగియున్నందున భగవంతుడు శతాననుడు. ఇక్కడ కూడ 'శత' అనగా 'అసంఖ్యాక' అన్నఅర్థం ఉచితం. శ్రీ భట్టులు గీత (11.10)నుండి ఉదాహరించారు. భగవంతుని విశ్వరూప వర్ణనను సంజయుడు ఇలా ఆరంభించాడు.

**అనేక వక్త్ర నయనమ్ అనేకాద్భుత దర్శనమ్**
**అనేక దివ్యాభరణమ్ దివ్యానేకోద్యతాయుధమ్** – గీత 11.10
అర్జునుడు చూచిన ఆ పరమేశ్వరుని విరాట్ (విశ్వ) రూపమునందలి ముఖములు అనంతములు. నేత్రములు అసంఖ్యాకములు. అందలి దృశ్యములు అద్భుతములైనవి. ఆ రూపము అనేక దివ్యాభరణ శోభితము. ఆ పరమేశ్వరుడు పెక్కు దివ్యాయుధములు చేపట్టియుండెను.

శ్రీ చిన్మయానంద కూడా గీతనుండి ఉదాహరించారు –

**సర్వతః పాణిపాదమ్ తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శ్రుతి మల్లోకే సర్వమావృత్య తిష్ఠతి** – గీత 13.13
ఆ పరమాత్ముని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై యున్నవి. అతడు సర్వమును ఆవరించియున్నాడు.

*(ఈ రచన మొత్తంలో భగవద్గీత శ్లోకాలకు తెలుగు అనువాదం గీతాప్రెస్, గోరఖ్‌పూర్ వారి ప్రచురణ **"శ్రీ మద్భగవద్గీత – తత్వవివేచనీ వ్యాఖ్య"** నుండి ఉన్నదున్నట్లుగా తీసుకొన్నాను. హిందీ రచయిత – **శ్రీ జయదయాల్ గోయందకా** – అనువాదకులు: డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య)*

శ్వేతాశ్వరోపనిషత్తు 3.11 – **సర్వానన శిరోగ్రీవ సర్వభూత గుహాశయః.** బ్రహ్మమునకు అన్ని (అనేక) విధములైన ముఖములు, తలలు, మెడలు ఉన్నాయి. సర్వభూతముల హృదయములందును వసించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'ఆన' - ప్రాణనే - శ్వాసించుట; పాణిని సూత్రము (3.3.117) ప్రకారము 'అన' ప్రత్యయము చేరి నపుడు – **కరణా అధికరణయోశ్చ** – ఆ ప్రత్యయమునకు 'చేయుట, పనిముట్టు, స్థలము' వంటి అర్థములు వచ్చును. 'ఆన, అన, ఆనన' లకు అర్థాలు ఇలా ఉంటాయి.

**ఆన** – ప్రాణము, శ్వాసించుట; **అన** – ఉపకరణము; **ఆనన** – ప్రాణములు నిలుపు విధానము.
**శతానన** – అనేక ప్రాణములు నిలుపుటకు తగు ఉపకరణములను సమకూర్చినవాడు.

**జీవన ఉపాయానామ్ చ బాహువిద్యమ్, తథా చ యద్యద్ జీవనే శిల్ప వైశిష్ట్యమ్ తత్తత్ తస్యైవ భాగవత ఇత్యాఖ్యాతుమ్ శతానన నామా భగవాన్ విష్ణుః స్తూయతే.** జీవుల మనుగడ కొరకు అనేక ఉపకరణములు (నోరు, ముక్కు వంటివి) సమకూర్చినవాడైన విష్ణుభగవానుడు శతాననుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠగారే పాణిని సూత్రము (3.1.26 'హేతుమతి చ') ఆధారంగా మరొక అర్థం చెప్పారు – **ఆనయతి ఇతి ఆననః.** ప్రాణములు మనుటకు కారణమైనది ఆననము అనగా జీవనదాత. అసంఖ్యాకమైన ప్రాణుల మనుగడకు ఆధారమైనవాడు శతాననుడు. **చతుర్విధ సృష్టి ఉద్వహావినః అనంతాన్ జీవాన్ తత్తత్ జీవనైః ఉపకరణైః ఆనయతి ఇతి జీవయతీతి శతాననః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – జైన, బౌద్ధాది మతములకు వివిధ రూపములలో కనుపించేవాడు శతాననుడు. ఇంకా ద్వైతులు, అద్వైతులు ఇలా వేరువారువారిచే వివిధరూపాలలో భావింపబడేవాడు శతాననుడు.

---

**శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు రచించిన శ్రీ వేంకటేశ్వర వచనములనుండి –**

శ్రీ వేంకటగిరిదేవా! నా దేహంబు నీవుండెడి నిత్యనివాసంబు; నా జ్ఞాన విజ్ఞానంబులు నీ యుభయ పార్శ్వంబుల దీపంబులు; నా ముకుఁజెఱముల యూర్పులు నీ యిరుదెసలం బట్టెడి యాలవట్టంబులు; నా మనోరాగంబు నీకుఁ జెంద్రకావి వలువ; నీకు మ్రొక్కనెత్తిన నా చేతులు రెండును మకరతోరణంబులు; నా భక్తియె నీకు సింహాసనంబు; నా మేనం బొడమిన పులకలు నీకు గుదులు గ్రుచ్చి యర్పించిన పూదండలు; నే నిన్ను నుతియించిన నుతులు యక్షరవంబులు నీకు భేరీ భాంకార ఘంటా నినాదంబులు; నా పుణ్య పరిపాకంబులు నీకు నైవేద్య తాంబూలాదులు; మదీయ నిత్యసేవా సమయ నిరీక్షణంబు నీకు సర్వాంగంబుల నలందిన తట్టుపునుంగు; నా సాత్విక గుణంబు నీకు ధూపపరిమళంబు; నీవు దేవుండవు; నేనర్చకుండను. ఈ రీతి నిత్యోత్సవంబు నాయందు నవధరింపవే శ్రీవేంకటేశ్వరా! మఱియును;

నందకాయుధధరా! నీ యూధంబులకు జయజయః నీ వాహనంబులకు శుభమస్తు; నీ పరివారంబులకు క్షేమంబు గోరెద; నీ కళ్యాణ గుణంబులకు నిరంతరాభివృద్ధి యగుగాక! నీ సత్త్వంబులకు శోభన పరంపరావాప్తి యొసగవలయు; నీ దేవులకు మంగళ మహాశ్రీలగు; నీ మహిమకు ననంతవిధార్చనము. నీ భుజాబలమునకు అపరిమిత స్తోత్రము; నీ చక్కదనంబునకు పుష్పాంజలి; నీ యుదారతకు శరణంబు; నీ శ్రీవత్స కౌస్తుభాది చిహ్నంబులకు సంతత ప్రార్థన; నీ పాదంబులకు సాష్టాంగ నమస్కారంబు చేసెద; ఏమి నిమిత్తంబు చేసెదనంటివా? నాలుగు యుగంబుల ధర్మంబులు, సకల జంతువుల పరిణామంబులు, కమలాసనాది దేవతల బ్రదుకులు, నీ మూలంబు గావున నీవు శుభంబున నుండుటే మేలు; శ్రీ వేంకటేశ్వరా!

హయగ్రీవా! కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహా, అచ్యుత, జనార్దన, ఉపేంద్ర, హరి, శ్రీకృష్ణ యనియెడి చతుర్వింశతి నామంబులు పాపహరంబులు; పుణ్యంబుల కునికిపట్లు; నుతించువారికి వచన భూషణములు; కోరినవారికి కొంగుబంగారము! జ్ఞానులకు సిద్ధమంత్రము; ఇహపరంబులకు కామధేను కల్పవృక్ష చింతామణులివి; శ్రీవేంకటేశ్వరా!



## ఏకో నైకః స వః కః కిం యత్తత్పదమనుత్తమం |
## లోకబంధుర్లోకనాథో మాధవో భక్తవత్సలః || (78)

### 730. ఏకః

- అద్వితీయుడు. ఏ విధంగానైనా భగవంతునితో సమమైన మరొకడు (మరొకటి) లేదు.

ఓం ఏకాయ నమః

ఓం ఏకస్మై నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఉక్తే మహిమ్ని సజాతీయ సంఖ్యేయ అసంభవాత్ అద్వైతమ్ గచ్ఛతి ఇతి** ఏకః. ఇలా మహాత్మ్యం విషయంలో ఆయనతో పోల్చదగినది ఉండడం అసంభవం. కనుక ఆయన 'ఏకః'. ఇందుకు ప్రమాణముగా శ్రీ భట్టులు తైత్తరీయ యజుర్వేదము (4.1.8)నుండి ఉదాహరించారు **– ఏక ఇద్ రాజా జగతో బభూవ.** జగత్తునకు ఆయనొక్కడే రాజు.
ఋగ్వేదము 10.81.3 – **ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః.** అంతరిక్షమును, భూమిని సృష్టించిన ఒకే ఒక దేవుడు.
భాగవతము 9.5.11 – **యది నో భగవాన్ ప్రీత ఏకః సర్వగుణాశ్రయః.** అందరికి అంతర్యామి, సకల కళ్యాణ గుణములకు నిలయుడు ఒక్కడే అయిన భగవంతుడు మాయెడల ప్రీతుడైతే ఈ బ్రాహ్మణుడు బాధలనుండి విముక్తుడగుగాక.
శ్రీ నమ్మాళ్వారు భగవంతుని 'ఒరువన్' అని పెక్కుచోట్ల ప్రస్తావించారు. అనగా ఒకే ఒక్కడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పరమార్థతః సజాతీయ విజాతీయ స్వ-గత భేద వినిర్ముక్తత్వాత్ ఏకః.** స్వజాతీయము (తన జాతి), విజాతీయము (పరజాతి), స్వ-గత (తనది, పరాయిది) వంటి భేదములు అసలు లేని ఒకే ఒక్కడు గనుక భగవంతుడు 'ఏకః'. ఇందుకు శ్రీ శంకరులు ఛాందోగ్యోపనిషత్తు (6.2)నుండి ఉదాహరించారు – **ఏకమేవా అద్వితీయం బ్రహ్మః.** పరబ్రహ్మము ఒక్కటే. మరొకటి లేదు.

శ్రీ బలదేవ విద్యాభూషణ ఈ నామమును ఇంతకు ముందు శ్లోకములోని 'శతమూర్తిః', 'శతాననః' నామములతో అనుసంధించారు. భగవంతునికి అనేక రూపములు, అనేక ముఖములు ఉన్నాగాని నిజానికి ఆయనొక్కడే. అందువలన 'ఏకః' అనబడ్డాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **ఏతి - గచ్ఛతి సర్వత్ర ఇతి ఏకః.** అన్నిచోట్ల ఉండేవాడు 'ఏకః'. ఏదైనా జాతికి సంబంధించినవి అనేకం ఉంటే వానికి సంఖ్యలను ఉపయోగిస్తాము. ఉదాహరణకు ఒక వ్యక్తి, ఐదు ఆవులు, పదిమంది విద్యార్థులు – ఇలా. అయితే భగవంతుని విషయంలో ఇందుకు ఆస్కారం లేదు. మరొకరు ఉండడం సాధ్యం కాదు. కనుక ఆయన **'ఏకః'**. మరియు ఎందరో బిడ్డలకు ఒకే తండ్రి ఉన్నట్లే జగజ్జనకుడు ఒకే దేవుడు.

సహస్ర నామావళిలో 'ఏకః' నామమునకు సంబంధించిన మంత్రము –
విశిష్టాద్వైతం, ద్వైతం సంప్రదాయాలలో – **ఓం ఏకాయ నమః.** అద్వైత సంప్రదాయంలో – **ఓం ఏకస్మై నమః.**

ఇలాగే మరికొన్ని మంత్రపాఠాలు. **విశ్వాయ నమః – విశ్వస్మై నమః; నైకాయ నమః – నైకస్మై నమః** ఇలా నామ, మంత్ర పాఠాలలో భేదాలు ఆయా సంప్రదాయ ప్రవక్తలు బోధించిన తత్త్వాలలోని భేదాలను ప్రతిబింబిస్తాయి. విశిష్టాద్వైత సంప్రదాయంలో ఒక్కో నామము భగవంతుని విశిష్టమైన నామవాచకము (Noun)గా భావిస్తారు. అద్వైత సంప్రదాయములో ఒక్కో నామము పరబ్రహ్మయొక్క గుణమును తెలిపే సర్వనామము (Pronoun)గా భావిస్తారు. ఉదాహరణకు 'రాముడు' – విశిష్టాద్వైతం ప్రకారము రామావతారమును తెలుపును. అద్వైతం ప్రకారం పరబ్రహ్మమునకు మరొకపేరు.

## 731. నైకః

- ఒక్కడు కానివాడు. అనేకుడు.

**ఓం నైకాయ నమః**

**ఓం నైకస్మై నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **విభూతితయా విజాతీయేన సర్వేణ ద్వితీయవానేవ ఇతి నైకః.** భగవంతుడు తన స్వరూపమునకు భిన్నముగా అగుపించే అనేక విభూతులు తనవిగా కలిగియున్నాడు గనుక 'నైకః'. జగత్తులో సమస్తము తనవిగా కలిగియున్నందున ఆయన 'ఏకః' (ముందటి నామము), కాని ఇలా ఆయనకంటే భిన్నమనిపించే అనేక విభూతులు కలిగియున్నందున ఆయన 'నైకః'. ఇందుకు శ్రీ భట్టులు గీతనుండి ఉదాహరించారు – **నాంతోఽస్తి మమ దివ్యానామ్ విభూతీనామ్ పరంతప** – గీత 11.40. అర్జునా! నా దివ్య విభూతులకు అంతము లేదు.



భగవానుని విశ్వరూపం. 1740 కాలపు బిలాస్ పూర్ కు చెందిన చిత్రం. వికీపీడియా నుండి

https://commons.wikimedia.org/wiki/File:Vishnuvishvarupa.jpg

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 7.8.1 – నీవే అగ్ని, నీరు, భూమి, ఆకాశము, గాలి. మాకు నీవే తల్లి, తండ్రి, పిల్లలు, బంధువులు. ఇంతే కాదు. సకల జగత్తు నీవే. అయినా నీ సుందరరూపపు తలపు మాధుర్యాన్ని నేను గ్రోలుచున్నాను. (నిన్ను సాకారునిగా ధ్యానిస్తున్నాను). దీనికి కారణమేమిటి? లోతైన తత్త్వజ్ఞానం నాకు అవగతం కాదు.

తిరువైమొళి 6.9.1 – నీవే నీరు, నిప్పు, నేల, గాలి, ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, శివుడు, బ్రహ్మ. నీవే వీటన్నింటికీ అంతర్యామివి. అన్ని రూపాలు ధరించినవాడివి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మాయయా బహురూపత్వాత్ నైకః.** తన మాయద్వారా బహురూపములు కలిగినవాడు 'నైకః'.

శ్రీ చిన్మయానంద – 'ఏకః' నామం జ్ఞానదృష్టితోనూ, 'నైకః' నామం ఉనికి దృష్టితోనూ అర్థం చేసికొనదగును. అన్నింటా భగవంతుడున్నాడు. భగవంతుడు లేనిది లేదు. ఈ విధంగా ఆయన 'నైకః'. ఇలా అన్నింటా, అంతటా ఉండి, అన్నింటినీ నడిపేవాడు ఆయనొక్కడే గనుక ఆయన 'నైకః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **న తస్య ప్రతిమా అస్తి** (యజుర్వేదము 32.3). **న ఏకో యస్మాత్ ఇతి నైకః.** భగవంతుని సృష్టిలో ఉన్న వైవిధ్యం ఆయన నైకత్వాన్ని సూచిస్తుంది.

శ్రీ పెమ్మరాజు రాజారావు – **ఇన్ద్రోమా యాభిః పురురూప ఈయతే** (ఛాందోగ్యోపనిషత్తు). సూర్యుడొక్కడే అయ్యును వివిధ భాండములలో అనేకములుగా గోచరించునట్లు ఏకమును, అద్వితీయమును అగు పరబ్రహ్మము అనేకములుగా గోచరించుచున్నది. కనుక ఆయనను 'నైకః' అని కీర్తించుచున్నాము. సర్వత్ర ఆత్మ దర్శనమునకు ఇది సాధనము.

**732.** సః జ్ఞానమును వ్యాపింపజేయువాడు.

**733.** వః వసించువాడు

సవః సోమయాగం రూపంలో ఉండేవాడు.

శ్రీ భట్టులు 'సః', 'వః' అనే రెండు నామములుగా పరిగణించారు.

శ్రీ శంకరులు 'సవః అనే ఒకే నామముగా పరిగణించారు.

## **732.** సః

- తనను గురించిన జ్ఞానమును అందరికీ తెలియజేయువాడు.
- జ్ఞానమును నిశ్చయింపజేయువాడు. అనగా ఆయన నిర్ణయమే అన్నింటికీ కడపటి నిర్ణయము.
- తన భక్తుల కష్టములను నశింపజేయువాడు.
- భక్త సులభుడు. గోపకులంలో బాలురచేత 'వీడు' అని పిలుచుకునేంత చనువు ఇచ్చినవాడు.



బాల కృష్ణుడు గోపకులతో చల్దులారగించుట. గోవులు, గోపాలురులతో వ్రేపల్లెకు వచ్చుట.

1860 కాలపు చిత్రం. వికీపీడియా నుండి. https://commons.wikimedia.org/wiki/File:Anonymous_-_Krishna_Returns_with_the_Cowherds_to_Braj,_from_a_Bhagavata_Purana_-_1971.301_-_Cleveland_Museum_of_Art.tiff

### ఓం సాయ నమః

'సో' - అంత కర్మాణి – కడతేర్చుట

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వ-విషయ జ్ఞానమ్ స్యాతి ఇతి సః.** తనను గురించిన జ్ఞానమును వ్యాపింపజేయువాడు 'సః'.

**సర్వేషు కృష్ణరూపేషు అకుమార ప్రసిద్ధతః అజ్ఞానం యస్య విషయం స్యత్యసా స ఇతీరితః** కృష్ణుని రూపంలో అనేకవిధాలుగా తన మహాత్మ్యాన్ని తెలియజేసినవాడు 'సః'. కాళీయుని చంపినవాడు. గోవర్ధనగిరి నెత్తినవాడు. కంసుని చంపినవాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఏదైనా జ్ఞానము, తత్వము, పని, ఏ విషయంలో అయినా తుదినిర్ణయం భగవంతునిదే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **స్యాతి వినాశయతి స్వజన విపదా ఇతి సః.** తన భక్తుల విపత్తులను వినాశనం చేసేవాడు గనుక 'సః'.

శ్రీ అణ్ణంగారాచార్య స్వామి – 'సః' అనగా 'వాడు'. అలా అలా అని స్తుతింపదగినవాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – గోపబాలకులు 'వీడు కృష్ణుడు' అని వేలెత్తి చూపేంత చనువు ఇచ్చిన భక్తసులభుడు 'సః'.

### సవః

శ్రీ భట్టులు 'సః', 'వః' అనే రెండు నామాలను చెప్పగా, శ్రీ శంకరులు 'సవః' అనే ఒకే నామముగా చెప్పారు.

- సోమయాగము రూపంలో ఉండేవాడు.
- తనను గురించి భక్తులకు సంపూర్ణ జ్ఞానం ఇచ్చువాడు, మరియు అంతటా వసించువాడు.

### ఓం సవాయ నమః

**సవః - సూయతే అభిషూయతే సోమః అత్ర ఇతి సవః.** సోమరసమును సమర్పించే క్రతువు 'సవః'. సోమయాగము విష్ణురూపమే గనుక విష్ణువు 'సవః' అనబడెనని శ్రీ శంకరుల వ్యాఖ్య. **అహం క్రతురహం యజ్ఞః** (గీత 9.16)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్య – **సవః - యో హి స్యాతి - అంతయతి - నిశ్చయతి - స్వవిషయమ్ జ్ఞానమ్, వసతి చ సర్వత్ర, ఇతి సవః.** తనను గురించిన అంతిమ జ్ఞానమును భక్తులకు ఇచ్చేవాడు మరియు అంతటా ఉండేవాడు 'సవః'.

## 733. వః

- వసించేవాడు. సర్వాంతర్యామి.

### ఓం వాయ నమః

**వస్ - నివాసే - వసతి ఇతి వః.** వసించేవాడు 'వః'. అంతకూ అంతర్యామి.

శ్రీ భట్టులు విష్ణుపురాణము (6.5.76)నుండి ఉదాహరించారు –

**వసంతి తత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని స చ భూతేష్వశేషేషు వకారార్థస్తతో మునే**

సకల భూతములు ఆయనయందుండును. మరియు అన్ని భూతములు ఆయనే. మరియు అన్నింటికి ఆత్మ ఆయనే. ఇంకా ఆయన అన్ని భూతములందు వసించును. కనుక మునులు ఆయనను 'వ'కారముతో స్తుతించారు. (విష్ణుపురాణంలో 'భ-గ-వ' పదంలోని అక్షరాలకు అర్థం చెప్పే సందర్భంలో ఈ స్తోత్రం వస్తుంది.)

తిరువైమొళి 1.1.10 – ఆయన అంతటా వ్యాపించిన నీటిలోని ప్రతి కణంలోనూ ఉన్నాడు. భూమి, ఆకాశం, విశ్వం అంతటా వ్యాపించాడు. సూక్ష్మాతిసూక్ష్మమైన వస్తువులలోనూ ఉన్నాడు. మరియు అన్నింటి ఆత్మ ఆయనే. అంతటినీ మ్రింగి తన కడుపులో ఉంచుకొన్న ఆయన అన్నింటిలోనూ దాగిఉన్నాడు.

కలడంబోధి కలండు గాలి గలడాకాశంబునన్ గుంభినిన్
గలడగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలడోంకారమునం త్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులం దంతటన్
గలడీశుండు గలండు తండ్రి! వెదుకంగా నేల యీ యా యెడన్ – పోతన భాగవతము

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – వాతి - గచ్ఛతి - వెళ్ళువాడు. **వాతి గచ్ఛతి స్వజనాయోజిత భజన భవనం ఇతి వః.** తనను భజించేవారి నివాసమునకు వెళ్ళువాడు 'వః'.

## 734. కః

- ఆనంద స్వరూపుడు.
- ప్రకాశించువాడు.
- భక్తులచే స్మరింపబడువాడు, స్తుతింపబడువాడు.
- మేధస్సుద్వారా ప్రయత్నిస్తే ప్రశ్నార్థకంగా ఉండిపోయేవాడు.

ఓం కాయ నమః

కాన్ - దీప్తి కాంతి గతిషు; కః - కనతి - ప్రకాశించునది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **మలీమశేషు వసన్నపి కనతి ఇతి కః.** భగవంతుడు సర్వాంతర్యామి. అపరిశుద్ధము, పాపమయము అయినవాని ఆత్మలలో కూడా ఉన్నాగాని భగవంతుని ప్రకాశము పరమపవిత్రము.

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుని ప్రకాశము సహజమైనది. వస్త్రాభరణాలతో నిమిత్తం లేనిది.

శ్రీ వాసిష్ఠ – 'కన్' - దీప్తి, కాంతి, గతౌ. భగవంతుడు ప్రతిచోటా ప్రకాశించును (కాంతి). అన్నిచోట్లా ఉండును (గతి). అన్నింటినీ ప్రకాశింపజేయును, అనగా చైతన్యపరచును (దీప్తి). కనుక భగవంతుడు 'కః'. జీవి ఆత్మకు ఆత్మయై దేహంలో దేవుడున్నంతవరకే జీవికి ప్రకాశం ఉంటుంది. ఆత్మ లేకుంటే ప్రకాశం ఉండదు. భగవంతుడు అంతటా, అన్నింటా ఉండి వెలిగిస్తున్నాడు గనుకనే జగత్తు ప్రకాశిస్తున్నది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **కై - శబ్దే, కాయతే శబ్ద్యతే ఆహూయతే భక్తైః ఇతి కః.** భక్తుల శబ్దములు (జపములు, తపములు, కీర్తనలు, మంత్రములు) వలన కీర్తింపబడువాడు, పిలువబడువాడు 'కః'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కమ్ - సుఖేऽపి విజానీయాత్.** భగవంతుడు ఆనందస్వరూపుడు గనుక 'కః'.
ఛాందోగ్యోపనిషత్తు 4.10 – **కమ్ బ్రహ్మ** – ఆనందము బ్రహ్మము.

గీత 9.33 – **అనిత్యమసుఖమ్ లోకం, ఇమం ప్రాప్య భజస్వ మాం.** ఈ లోకము సుఖరహితమైనది. అనిత్యమైనది. కనుక నన్ను భజించి పరమానంద సుఖములను పొందుము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – అహంకార మమకారములను త్యజించుట ఆనందమునకు హద్దు. భగవంతునకు అహంకార మమకారములు లేనందున ఆయన ఆనంద స్వరూపుడు.

ధర్మచక్రము రచయిత – ఎక్కువమంది ఆశించే భౌతిక ఆనందము దుఃఖానికి దారి తీస్తుంది. భౌతిక సుఖాలను త్యజిస్తే ఆత్మానందం లభిస్తుంది. ఈ నామమును ధ్యానించుట ద్వారా ఆత్మానందమును పొందవచ్చును.

శ్రీ చిన్మయానంద – 'కః' అనగా 'ఎవరు?'. భగవంతుడు ఎవరో తెలిసికోవాలని మేధస్సు, తర్కము ద్వారా ప్రయత్నిస్తే మిగిలేది ప్రశ్న మాత్రమే. (భక్తి ద్వారానే భగవంతుని తెలిసికొనవచ్చును.)

## 735. కిమ్

- సత్యాన్వేషకులు ఎవరిని గురించి సకల ప్రశ్నలు వేస్తారో అతను.
- భక్తులు ఎవరిని కీర్తిస్తారో అతను.
- తెలిసికొనబడదగినవాడు, కోరబడదగినవాడు.

**ఓం కిమే నమః**

**ఓం కస్మై నమః** (శ్రీ శంకరుల పాఠము)

'కిం' అనగా 'ఏమిటి?' అన్న ప్రశ్న. ప్రచ్ఛా - జ్ఞీప్సాయామ్ - అడుగుట, తెలిసికొనుట. ఇక్కడ 'కిం' అనే ప్రశ్నవాచక పదము పరమాత్మకు నామవాచకముగా చెప్పబడుట విశేషము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **పృచ్ఛతి ఇతి కిమ్, పృచ్ఛయతా ఇతి కిమ్.** అడిగేవాడు 'కిమ్'. ఎవరిని గురించి అడగడం జరుగుతుందో అతను కూడా 'కిమ్'. పరమాత్మ ఏమిటి? ఎలా ఉంటుంది? ఎక్కడ ఉంటుంది? వంటి అనేక ప్రశ్నలు అన్నీ ఆ దేవుని గురించే. అన్నింటికీ జవాబు ఆ దేవుడే.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తత్ తత్ సర్వేప్సితుః బుభుత్సూనామ్ నిరుపాధిక పృష్టవ్యత్వాత్ కిమ్.** కామరహితులైనవారు తమ పరమార్థము కొరకు ఎవరిని గురించి అన్ని ప్రశ్నలూ అడుగుతారో ఆయనే 'కిం'. ఇందుకు శ్రీభట్టులు ఛాందోగ్యోపనిషత్తు (8.7.1)నుండి ఉదాహరించారు. **స అన్వేష్టవ్యః స విజింజాసితవ్యః.** అతడే వెదుకదగినవాడు, గాఢంగా కోరదగినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వ పురుషార్థ రూపత్వాత్ బ్రహ్మైవ విచార్యమ్ ఇతి బ్రహ్మ కిమ్.** సకల పురుషార్థములకు (జీవిత గమ్యములకు) రూపము బ్రహ్మమే. కనుక బ్రహ్మమును గురించి విచారింపవలసి యున్నది గాన బ్రహ్మము 'కిమ్'. ఇందుకు శ్రీ శంకరులు గీత (8.1)నుండి ఉదాహరించారు.

**కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ**
**అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే**

ఓ పురుషోత్తమా! 'బ్రహ్మ' అనగా ఏమి? (కిం?), అధ్యాత్మము అనగానేమి? కర్మ అనగానేమి? అధిభూతము అని దేనికి పేరు? అధిదైవము అని దేనిని అందురు?

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఋగ్వేదమునుండి కొన్ని ఉదాహరణలు ఇచ్చారు –

10.29.1 – **అంబుః కిం ఆసీత్ గహనమ్ గంభీరమ్.** లోతైన, గంభీరమైన నీరు అక్కడ ఉన్నదా?

1.129.6 – **కుతః ఆజాతా కుత ఇయమ్ విసృష్టిః.** అది ఎప్పుడు జన్మించినది? ఈ సృష్టి ఎప్పుడు ఆరంభమైనది?

10.129.7 – **యోऽస్యాధ్యక్షః పరమే వ్యోమన్.** ఎవరి కనుసన్నలలో ఈ అత్యుత్తమ స్వర్గము మెదులుతుంది? ఇలాంటి ప్రశ్నలన్నింటికీ కడపటి జవాబు గనుక పరమేశ్వరుడు 'కం'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – కూంగ్-శబ్దే-శబ్దము చేయుట. **కూయతే - ఆహూయతే స్వజనైః భజమానైః ఇతి కిం.** భక్తులు ఎవరిని స్తుతిస్తారో ఆయన 'కిం'.

శ్రీ అణ్ణంగారాచార్య స్వామి – ఉపనిషత్తులు ఆయనను 'అన్వేష్టవ్యుడు' అని వర్ణించాయి. ఎవరిని గురించి అన్వేషింపదగునో ఆయన 'కిం'.

ధర్మచక్రము రచయిత – సత్యము నెరుగదలచినవారు భగవంతుని ధ్యానింతురు. కాల, దేశాతీతమ్మైనది, ఎన్నడూ మారనిది, శాశ్వతమ్మైనది, ఇంద్రియాలకు అందనిది, నిజమ్మైన భక్తి మరియు ధ్యానము వల్లనే పొందదగునది, అన్నింటా అంతటా ఉండునది అయినది మాత్రమే అన్ని ప్రశ్నలకు చివరి జవాబు.

## 736. యత్

- (భక్తుల పరిరక్షణకు) అన్ని యత్నములు చేయువాడు.
- అప్పటికే ఉండినది ఏదైతే అది (బ్రహ్మము).
- దేనినుండి సృష్టిలో అంతా ఉద్భవించిందో...

**ఓం యతే నమః**

**ఓం యస్మై నమః** (శంకర పాఠము. ఇక్కడ 'యత్' అను పదము సర్వనామముగా చూడడమ్మైనది)

శ్రీ భట్టుల వ్యాఖ్య – యత్ - ప్రయత్నే- ప్రయత్నించుట, కష్టించుట. **తేషామ్ రక్షాయై యతతే ఇతి యత్. రక్షాయై పుచ్ఛకానామ్ సః యతతే యత్ ఇతి స్మృతః.** తనను వేడుకున్న భక్తుల రక్షణ కొరకు సకల యత్నములు చేసేవాడు 'యత్'.

**కృష్ణ కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః జలం భిత్వా యథా పద్మం నరకాత్ ఉద్ధరామ్యహమ్**
కృష్ణ, కృష్ణ, కృష్ణ అని నన్ను ఎవరైతే స్మరిస్తారో వారిని, నీటినుండి తామరపూవును తీసినట్లుగా, నరకమునుండి ఉద్ధరిస్తాను.

వరాహ చరమశ్లోకము – **అహం స్మరామి మద్భక్తమ్ నయామి పరమామ్ గతిమ్.** నా భక్తుని నేను గుర్తు ఉంచుకొని పరమపదమునకు తీసికొని వెళతాను. (భక్తుడు తన అంతిమ సమయంలో భగవంతుని తలచుకొనలేకపోయినాగాని, భగవానుడు అతనిని గుర్తుంచుకొని తన ధామమునకు తీసికొని వెళతాడు.)

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 5.8.9 – తనలాంటి ఇంద్రియలోలునికి, అల్పునికి, అహంకారికి కూడా భగవంతుడు ఆత్మజ్ఞానము ప్రసాదించాడని శ్రీ నమ్మాళ్వారు స్తుతించారు. (ఇక్కడ శ్రీ నమ్మాళ్వారువారి నైచ్యభావం తెలియవస్తున్నది.)

శ్రీ శంకరుల వ్యాఖ్య – యత్ - ఏదైతే; తనంతట తానుగానే సిద్ధించియున్నది పరబ్రహ్మమగుటచేత 'యత్' (ఏదో) అనే నామముతో ఉపనిషత్తులు ఈశ్వరుని వర్ణించినవి. **యత్ శబ్దేన స్వతః సిద్ధ వస్తు ఉద్దేశ వాచినా బ్రహ్మ నిర్దిశ్యత ఇతి బ్రహ్మయత్.** 'యత్' అను పదము స్వయంసిద్ధమ్మైన వస్తువును ఉద్దేశించినది. కనుక ఇది బ్రహ్మమే అవుతుంది. ఎందుకంటే బ్రహ్మము ఎప్పుడూ ఉంటుంది. ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన ప్రమాణము. తైత్తరీయోపనిషత్తు 3.1 – **యతో వా ఇమాని భూతాని జాయంతే.** దేనినుండి అయితే అన్ని భూతములు ఉద్భవించినవో.....

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పైన చెప్పిన శ్రుతి వాక్యం ఆధారంగానే శ్రీ రాధాకృష్ణశాస్త్రి వేరొక అర్థం చెప్పారు. సృష్టిలో దేనినుండి సకలము ఉద్భవించినదో అది 'యత్'.

శ్రీ చిన్మయానంద ఉదాహరించినది – తైత్తరీయోపనిత్తు 2.9.1 – **యతో వాచే నివర్తంతే అప్రాప్య మనసా సః.** దేనిని గురించి చెప్పడానికి మాటలు, మనసు చాలవో.....

## 737. తత్

- తన భక్తులకు జ్ఞానమును, భక్తిని పెంపొందించువాడు.
- తన భక్తుల కీర్తిని అధికము చేయువాడు.
- జగత్తును సూక్ష్మరూపమునుండి స్థూలరూపమునకు విస్తరింపజేయువాడు.
- ఇంద్రియములకు అందనివాడు.

**ఓం తతే నమః**

**ఓం తస్మై నమః** (శ్రీ శంకరుల పాఠము)

శ్రీ భట్టుల వ్యాఖ్య – తను - విస్తారే - విస్తరించుట (తనోతి - విస్తృణతి). **స్వజ్ఞానం భక్తిం భక్తానామ్ తనోతి ఇతి తత్.** భక్తితో తనను అర్చించేవారికి ఆ భక్తిని పెంపొందింపజేసి, తనను తెలిసికొనే జ్ఞానాన్ని ప్రసాదించేవాడు 'తత్'. శ్రీ భట్టులు తన వ్యాఖ్యకు ప్రమాణముగా చెప్పిన ఉదాహరణ. తైత్తరీయ నారాయణీయము 27 – **తత్ సవితుర్ వరేణియమ్.** ఆ పరమాత్ముని అద్భుత ప్రకాశమే సృష్టికి మూలము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **తనోతి ఇతి తత్.** అది పరబ్రహ్మము.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – 'తత్' అనగా 'అది' అని శబ్దార్థము. తత్ శబ్దవాచ్యుడు పరమాత్మ. 'తత్-త్వం-అసి' – 'తత్వమసి' అను మహావాక్యములో 'తత్' అనగా పరబ్రహ్మము అని అర్థము. శ్రవణ, మనన, చింతనల చేత, పరమార్థసాధకుడు 'తత్' శబ్దవాచ్యుడగు ఆ పరమాత్మనే అనుభవపూర్వకముగా తెలియును.

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా** – గీత 17.23
ఓం, తత్, సత్ – అని ఈ మూడు విధములగు పేర్లు సచ్చిదానంద ఘనపరబ్రహ్మకు నిర్దేశించబడినవి. ఆ పరమాత్మనుండియే సృష్ట్యాదియందు బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు ఏర్పడుట జరిగినది.

**తదిత్యభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియా**
**దాన క్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః** – గీత 17.25
మోక్షకాంక్ష గలవారు స్వలాభాపేక్ష లేశమైనను లేకుండ లోకహితార్థమై యజ్ఞ దాన తపః చర్యలను 'ఇది యంతయు (తత్ - ఇత్ - అభిసంధాయ) పరమాత్మదే' అను భావముతో 'తత్' అను నామమును ఉచ్చరించుచు చేయుదురు.

అనేక పూజాది కార్యక్రమములను 'హరిః ఓమ్ తత్' అనుచు ప్రారంభిస్తారు (సంకల్పము).

గీతాశ్లోకము (17.25)పై శ్రీ భగవద్రామానుజుల వ్యాఖ్యలో 'తత్' అనగా బ్రహ్మము అని చెప్పారు. వేదపఠనము, యజ్ఞములు, దానములు చేసేవారు లౌకిక ఫలములను కోరకుండా మోక్షమును మాత్రమే కోరుతూ ఆ పనులు చేసేట్లయితే వాటిని 'తత్' అనగా

'బ్రహ్మము' అని అనుకోవాలి. ఎందుకంటే అవి బ్రహ్మమును పొందే సాధనాలు కనుక. ఈ సందర్భంలో శ్రీ రామానుజులు విష్ణుసహస్రనామములోని ఈ (78వ) శ్లోకాన్ని ప్రస్తావించి, 'తత్' అనగా 'బ్రహ్మము' అని చెప్పారు. **సః వః కః కిం యత్ తత్ పదమనుత్తమమ్ – ఇతి శబ్దో హి బ్రహ్మవాచీ ప్రసిద్ధః.**

శ్రీ వి.వి. రామానుజన్ ఇంతకుముందటి నామము 'యత్' (యతతే – రక్షించ యత్నించును), ఈ నామము 'తత్' (తనోతి – భక్తిని పెంపొందించును ) కలిపి ఇలా వ్యాఖ్యానించారు – రక్షించడానికి భక్తిని పెంపొందించును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **తనోతి - విస్తారయతి స్వజనానామ్ కీర్తిమ్ ఇతి తత్.** తన భక్తుల కీర్తిని పెంపొందించేవాడు 'తత్'.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుని తత్-గుణము వలన ఆయన అంతటా విస్తరించి ప్రవేశించును. అలా జీవులను చైతన్యపరచి భగవంతుని చేరుకొనే అవకాశము కల్పించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **తనోతి విశ్వమ్ ఇతి తత్.** భగవంతుడు విశ్వమును సూక్ష్మరూపమునుండి స్థూలరూపమునకు (కనుపించే రూపమునకు) విస్తరింపజేయును గనుక 'తత్'. అలాగే భగవంతుడు జ్ఞానమును, భక్తిని విస్తరింపజేయును. అందరిలోనూ అంతర్యామియై వర్తించును.

శ్రీ సత్యసంధ యతిరాజ – ఈయన మాధ్వసంప్రదాయానికి చెందిన ఆచార్యులు. ఏదైతే కంటికి కానరాదో అది 'తత్'. అలాంటిదానిని గురించి పరోక్షశబ్దవాచ్యము ద్వారానే చెబుతాము. ప్రత్యక్షముగా హరిని తెలియజాలము. వేదము ద్వారానే ఆయన తెలియవచ్చును. కనుక ఆయనను 'తత్' తత్వము ద్వారా చెప్పనగును. **పరోక్షమ్ వస్తు తత్ శబ్ద వాచ్యమ్, హరిస్తు ప్రత్యక్షాత్ అవేద్యత్వేన ముఖ్యైతో వేదైక గమ్యత్వాత్ గుణైః తత్తత్వాద్-వా ఇతి ఉచ్యతే.**

## 738. పదమనుత్తమమ్

- అత్యుత్తమమైన గమ్యము. పరమపదము. ప్రపన్నులకు పరమప్రాప్యము.
- భక్తులకు అత్యుత్తమమైన రక్షకుడు.
- అత్యుత్తమమైన మార్గము, గమ్యము, స్థానము.

### ఓం అనుత్తమాయ పదాయ నమః

### ఓం పదాయ అనుత్తమాయ నమః

పద్ - గతౌ - వెళ్ళుట; **పద్యతే - గమ్యతే, జ్ఞాయతే, ప్రాప్యతే, యత్యతే తత్ పదమ్, న ఉత్తమమ్ తస్మాత్ ఇతి అనుత్తమమ్** – వెళ్ళవలసినది, తెలియవలసినది, పొందవలసినది, ప్రయత్నింపవలసినది పదము. దానికంటె ఉత్తమమైనది మరిలేదు గనుక అది అనుత్తమము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషామ్ పరమ ప్రాప్యత్వాత్ పదమ్ అనుత్తమమ్.** ప్రపన్నులైన తన భక్తులకు పొందదగినవానిలో అత్యుత్తముడు. వారికి అంతకంటే కావలసింది మరొకటి లేదు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 5.9.1 – నాకు శ్రీవైకుంఠం కూడా అవుసరం లేదు. కేవలం నీ పాదపద్మాలను నా తలపై ఉంచితే చాలును; తిరువైమొళి 3.7.6 – భగవంతుడు సాటిలేని రక్షకుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – అమరకోశము (3.3.93) ప్రకారము – **పదమ్ వ్యవసితి త్రాణ స్థాన లక్ష్మాంఘ్రి వస్తుః.** ఇక్కడ పదము అనగా 'రక్షణ'. పదమ్ **త్రాణమ్ – అనుత్తమమ్ సర్వోత్తమమ్ – ఇతి** పదమనుత్తమమ్ **అర్థాత్** సర్వోత్తమో రక్షకః **శ్రీ భగవానేవ సర్వోత్తమః త్రాతా స్వజనానామ్.** తన భక్తులకు సర్వోత్తముడైన రక్షకుడు గనుక శ్రీ భగవానుడు 'పదమనుత్తమమ్'.

**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్**

**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్** – గీత 7.18

ఈ చతుర్విధ భక్తులందరును ఉదారులే (అనగా భగవంతునియందు విశ్వాసమునుంచి అతనినే సేవించుచు ఉండువారు). కాని జ్ఞానియైనవాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగానుంచి, నన్నే పరమప్రాప్యునిగా (ఉత్తమాం గతిం) భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థితుడు.

ఈ శ్లోకాన్ని ఉదాహరిస్తూ శ్రీ చిన్మయానంద ఇలా చెప్పారు – శ్రీమహావిష్ణువు మార్గము (పదము), గమ్యము (పదము), స్థానము (పదము) అయినందున ఆయన 'అనుత్తమమ్ పదమ్'.

## 739. లోకబంధుః

- సకల లోకములకును బంధువు.
- అంతటికినీ ఆయన ఆధారము గనుక అంతా ఆయనతో బంధింపబడియున్నది.
- అందరికీ ఆయన నెచ్చెలి, తండ్రి, బంధువు.
- శాస్త్రములద్వారా మంచిచెడులను ఒక బంధువులా తెలియజేప్పేవాడు.
- జీవితంలో అన్నింటికీ పరిమితులు విధించేవాడు.

### ఓం లోకబంధవే నమః

మనకు, భగవంతునికి ఉన్న విడదీయరాని పరస్పర బాంధవ్యము ఈ నామములో తెలుపబడినది.

**నీవే తల్లివి తండ్రివి**

**నీవే నా తోడు నీడ నీవే సఖుడౌ**

**నీవే గురుడవు దైవము**

**నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఏవమ్ అవిశేషేణ అశేష అనుగ్రహే అవర్జనీయమ్ బాంధవమ్ నిబంధనమ్ ఆహ - లోకబంధుః.** ఈ లోకంలో అందరికీ ఆయన బంధువే. భేదం లేకుండా అందరినీ ఆశీర్వదిస్తాడు గనుక ఆయన లోకబంధువు. ఇందుకు శ్రీ భట్టులు సుబాలోపనిషత్తు (6)నుండి ఉదాహరించారు. **మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః.** తల్లి, తండ్రి, సోదరుడు, నివాసము, ఆశ్రయము, మిత్రుడు, గమ్యము అన్నీ నారాయణుడే. ఈ జగత్తులోని ఆదిత్యులు, రుద్రులు, మరుత్తులు, వసువులు, అశ్వినీ దేవతలు, ఋక్కులు, సామములు, అగ్ని, ఆజ్యము – ఒకటేమిటి, అన్నీ నారాయణుడే. అందుకే ఆయన అందరికీ కావలసినవాడు.

**పితామహస్య జగతో మాతా ధాతా పితామహః**

**వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవ చ** – గీత 9.17

ఈ సమస్త జగత్తునకు ధాతను, అనగా ధరించువాడను, అట్లే కర్మఫలము ఇచ్చువాడను నేనే. తల్లియును, తండ్రియును, తాతయును నేనే. తెలిసికొనదగినవాడను కూడా నేనే. పవిత్రుడను, ఓంకారమును నేనే. ఋక్, సామ, యజుర్వేదములును నేనే.

**సమోऽహం సర్వభూతేషు న మేద్వేషోऽసి న ప్రియః**

**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్** – గీత 9.29

నేను సకల భూతముల (ప్రాణుల)యందును సమభావముతో వ్యాపించియుందును. నాకు అప్రియుడు గాని, ప్రియుడుగాని ఎవ్వడును లేడు. కాని నన్ను భక్తితో భజించువారు నాయందే యుందురు. నేనును వారియందు ప్రత్యక్షముగా ఉందును.

శ్రీ ఆండాళ్ తిరుప్పావై 28 – **ఉన్దన్నోడు ఉఱవేల్ నమక్కింగొళిక్కి వొళియాదు.** ఇది వద్దంటే వీడిపోయే బంధంకాదు. ఈ పాశురానికి చిత్రకవి శ్రీ ఆత్రేయ అనువాదము –

**ఆలమందలతోడి అడవులలో పడి తినెడి కుడియడమ తెలియని గోప కులజాలము**

**నీవు తోడ పుట్టిన పుణ్యమే మా పుణ్యము కొరత కొంచెము లేని గోవిందా! నీ తోడి**

**సంబంధము కాదన్న పోవునది కాదురా!**

**లోక మర్యాదల లోతెరుంగని లేమలము చిన్న పేరున నిన్ను ప్రేమతో పిలిచేము**

**కోపగించక స్వామీ! కరుణించి పర నిమ్ము! జగతికే మంగళము కూర్చు మన శ్రీవ్రతము.**

నాన్ముగమ్ తిరు. 7 – నీవు తప్ప నాకు వేరు శరణు లేదు. నీవు కాచవలసిన వారిలో మొదటిస్థానం నాదే.

తిరువైమోళి 7.8.1 – నీవే నా తల్లివి, తండ్రివి, బిడ్డవు, సకల బంధుడవు. అంతకంటే ఎక్కువగా సకల లోకమూ నీవే. ఐనా నీ సుందరమైన రూపంపైనే నాకు మక్కువ ఎక్కువ. ఇందులో అద్భుతం ఏమిటి? నాకు విపరీతమైన తర్కాలు అర్థం కావు గదా!



శ్రీకృష్ణుడు గోపాలకులతో కూడి భుజించుట. 1760 కాలపు బషోలి చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_and_the_Cowherds_on_a_Picnic,_Folio_from_a_Bhagavata_Purana_LACMA_M.2011.156.5.jpg

శ్రీ శంకరులు మూడు విధాలైన అర్థాలు చెప్పారు.

(1) **ఆధారభూతేऽస్మిన్ సకల లోకా బధ్యంతా ఇతి లోకానాం బంధుః లోకబంధుః.** భగవంతుడు సకల లోకాలకు ఆధారము. కనుక అన్ని లోకాలు ఆయనచే బంధింపబడి ఉన్నాయి. అందువలన ఆయన లోకబంధువు.

(2) భగవంతుడు సకల లోకాలను సృష్టించాడు. కనుక ఆయన సకల లోకాలకూ తండ్రి. తండ్రికంటె దగ్గరి బంధువెవరు? అందుచే ఆయన లోకబంధువు. **లోకానామ్ జనకత్వాత్ జనకోపమో బంధుర్నాస్తీతి వా.**

(3) **లోకానామ్ బంధుకృత్యమ్ హితాహితుపదేశమ్ శృతి స్మృతి లక్షణమ్ కృతవాన్ ఇతి వా.** శృతులు, స్మృతుల ద్వారా ఏది మంచో, ఏది చెడో ఒక దగ్గరి బంధువులా భగవంతుడు లోకానికి తెలియజేస్తున్నాడు గనుక ఆయన లోకబంధువు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – బంధ్ - కట్టివేయుట; **బధ్నాతి ప్రేమపాశేన ఇతి బంధుః, లోకానామ్ బంధుః ఇతి లోకబంధుః.** తన ప్రేమతో లోకాలను బంధించి ఉంచేవాడు లోకబంధువు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – లోక్-దర్శనే-చూచుట, తెలిసికొనుట; బంధ్-బంధించుట, ఆకర్షించుట; **బధ్నాతి ఇతి బంధుః.** (1) లోకంలో అన్నింటికీ భగవంతుడు బంధాలను (మితులను) ఏర్పరచాడు. ఉదాహరణకు మనిషి ఆయుర్దాయానికి ఒక పరిమితి ఉంది. ఇలా భగవంతుడు లోకబంధువు. (2) ఏదైనా తాడువంటిది లేకుండానే కర్మతో జీవులన్నింటినీ బంధించినవాడు లోకబంధువు. (3) భగవంతుడు వేదములలోని నియమాలద్వారా మనుష్యుల వ్యవహారాలను బంధించాడు గనుక లోకబంధువు.

ధర్మచక్రము రచయిత – మన కోరికలు రెండు విధాలు (1) ఐహికమైన సౌఖ్యము (ప్రేయస్సు) (2) నిజమైన జ్ఞానము (శ్రేయస్సు). భగవంతుడు తల్లి, తండ్రి, భార్య, బిడ్డలు, సహోదరుల రూపాలలో ప్రేయస్సును సమకూరుస్తాడు. గురువుగా శ్రేయస్సును అనుగ్రహిస్తాడు. రెండు విధాలుగానూ ఆయన లోకబంధువే.

## 740. లోకనాథః

- లోకములను రక్షించేవాడు.
- అనంత ఐశ్వర్యవంతుడు కావడంచేత అందరికీ ఐశ్వర్యం ప్రసాదించేవాడు.
- లోకాలచేత ప్రార్థింపబడేవాడు, కోరబడేవాడు.
- లోకములను ప్రకాశింపజేసేవాడు. శక్తిమంతం చేసేవాడు.
- లోకములను శాంతిపరచి ఆశీర్వదించేవాడు.
- లోకములను శాసించేవాడు.
- ధర్మం తప్పినవారిని కష్టాలపాలు చేసి శిక్షించేవాడు.

### ఓం లోకనాథాయ నమః

లోక్ - దర్శనే - చూచుట, అనుభవించుట;

లోక్ - భాషాయామ్ దీప్తౌ చ - వెలిగించుట, తెలిసికొనుట, కోరుట;

నాథ్ -యాచ్, ఉపతాపైః, ఐశ్వర్యాశీఃషు - అడుగుట, శ్రమపెట్టుట, శాసించుట, పాలించుట

లోకము - చూపులకందేది, జగత్తు

పైని వివిధ భావాలనుబట్టి వివిధ వ్యాఖ్యలు లభిస్తున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తన్మూలమ్ అసాధారణమ్ స్వాభావికమ్ చ సంబంధమ్ ఆహ - లోకనాథః.** భగవంతునికి, సకల జీవులకు అసాధారణమైన, స్వభావసిద్ధమైన సంబంధం ఉన్నది. సకల లోకాలకు భగవంతుడు ప్రభువు, రక్షకుడు ఐనందున లోకనాథుడు. కనుక సహజంగానే భగవంతునికి సకల లోకాలతోనూ విడదీయరాని సంబంధం ఉంది. **లోకబంధుత్వ మూలాద్ధి లోకస్వామిత్వమిత్యతః స్వాభావికాచ్చ సంబంధాత్ లోకనాథ ఇతీరితః.**

శ్రీ వి.వి. రామానుజన్ దివ్య ప్రబంధాలనుండి ఉదాహరించారు –

తిరువైమొళి 7.10.1 – ఈ ఏడు లోకాలూ క్షేమంగా ఉండడం కోసమై భగవంతుడు శ్రీ అమ్మవారితో కూడి దివ్యదేశాలలో ఆసీనుడై యున్నాడు.

తిరువైమొళి 6.9.3 – నీ సృష్టిలోని జీవులను రక్షించడానికే నీవు అనేకమార్లు వివిధ రూపాలలో అవతరించావు.

తిరువైమొళి 6.10.10 – నా స్వామీ! ఈ మూడు లోకాలూ నీవే (మూడు చేతనములు – బద్ధ, నిత్య, ముక్త; మూడు అచేతనములు – కాలము, ప్రకృతి, శుద్ధసత్వము)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **లోకమ్ నాథతి - స్వ ఐశ్వర్య యోగేన ఐశ్వర్యవంతమ్ కరోతి ఇతి లోకనాథః.** ఆయన అనంత ఐశ్వర్య సంపన్నుడు అవడం చేత అందరికీ ఐశ్వర్యమును ప్రసాదించేవాడు. లోకనాథుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు నాలుగు రకాల అర్థాలు చెప్పారు.

(1) **లోకైః నాథ్యతే యాచ్యతే** – కామితార్థముల కొరకు లోకములచే ప్రార్థింపబడువాడు, యాచింపబడువాడు లోకనాథుడు.

(2) **లోకానామ్ ఉపతపతి**. లోకములను ప్రకాశింపజేయువాడు (తపింపజేయువాడు), శక్తినిచ్చువాడు లోకనాథుడు.

(3) **ఆశాస్తే.** లోకములను నెమ్మదింపజేసి (శమింపజేసి) దీవించువాడు లోకనాథుడు.

(4) **లోకానామ్ ఈష్టే.** లోకములను శాసించువాడు, దీవించువాడు లోకనాథుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి 'ఉపతపతి' అన్న పదాన్ని తీసికొని ఇలా వ్యాఖ్యానించారు – అవుసరమైనట్లుగా శిక్షించి లోకాలను అదుపులో ఉంచేవాడు లోకనాథుడు.

ధర్మచక్రము రచయిత పై వ్యాఖ్యలను ఇలా సమన్వయపరచారు – భగవంతుడు లోకములకు ప్రభువు గనుక అందరినీ రక్షించేవాడు, శాసించేవాడు, అవుసరమైనపుడు శిక్షించేవాడు ఆ లోకనాథుడే. ధర్మాన్ని ఆచరించేవారు శాంతిగా జీవిస్తారు. అధర్మాన్ని ఆచరించేవారు అశాంతిలో మగ్గుతారు. లోకనాథుని పాలనలో ఇది సత్యము.

## 741. మాధవః

- 'మా' అనగా శ్రీలక్ష్మీదేవికి పతియైనవాడు.
- తనను గురించిన జ్ఞానమును ప్రసాదించువాడు.
- మధువిద్యద్వారా తెలియవచ్చువాడు.
- మౌనము, ధ్యానము, యోగము ద్వారా తెలియవచ్చువాడు.
- మధు (యాదవ) వంశములో జన్మించినవాడు.
- ఈ నామముద్వారా జగన్మాతాపితరులకు విశ్వముతో ఉన్న సంబంధం సూచింపబడింది.

- ఆయనకంటె పై ప్రభువు లేడు.

## ఓం మాధవాయ నమః

ఈ నామము 73, 169, 741వ నామములుగా మూడుమార్లు స్తుతింపబడినది.

8వ శ్లోకము. 73వ నామము. మాధవః – **హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః**

18వ శ్లోకము. 169వ నామము. మాధవః – **వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః**

78వ శ్లోకము. 741వ నామము. మాధవః – **లోకబంధుః లోకనాథో మాధవో భక్తవత్సలః**

**లోకనాథత్వ సంబంధః శ్రీమతశ్చేతి మాధవః మధోర్వంశోద్భవత్వాచ్చ మాధవః పరికీర్తితః** ఈతడు లక్ష్మీపతి కాబట్టి లోకనాథుడయ్యాడు. మధువంశంలో ఉద్భవించాడు. కనుక మాధవునిగా కీర్తింపబడుచున్నాడు.

**మాయా ధవః మాధవః.** 'మా'కు భర్త మాధవుడు. 'శ్రీ' మరియు 'హరి' సదా కలసి ఉంటారు. ఆయమ్మ నిత్యానపాయిని. ఈ విషయాన్ని నొక్కి వక్కాణించడం కొఱకు శ్రీ భట్టులు ఈ నామవివరణలో భగవంతుని గుణాలను గురించి ఎక్కువగా ప్రస్తావించకుండా శ్రీమహాలక్ష్మి గుణాలను విశేషంగా వర్ణించారు. మరియు వర్ణనను ఇలా ముగించారు – శ్రీమహావిష్ణువు లక్ష్మీవల్లభుడైనందున జగత్ప్రభువయ్యాడు. ఇదే శ్రీమహాలక్ష్మి తత్త్వరహస్యము. ఈ వివరణ అంతా 8వ శ్లోకంలోని 73వ నామము వ్యాఖ్యలో శ్రీ భట్టులు చెప్పారు. శ్రీ భట్టులు తమ వ్యాఖ్య వివరణను ఈ శ్రుతివాక్యాలతో ఆరంభించారు.

**హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ** – పురుష సూక్తము. భూమి మరియు లక్ష్మి నీ పత్నులు.

**అస్యేశానా జగతో విష్ణుపత్నీ** – నీలా సూక్తము. ఈమె (లక్ష్మి) జగత్తునకు అధినేత్రి. విష్ణుపత్ని.

తరువాత శ్రీ భట్టులు లక్ష్మీదేవి గుణగణాలను వర్ణించారు. **అస్యః స్వరూపత్వాత్ నిత్య - నిర్మల - రూపత్వమ్, నిరుపాధిక పరమైశ్వర్యాది జగన్మాతృత్వమ్, ఔత్పత్తికో భగవత్ సంబంధో నిత్య అనపాయశ్చ ఇత్యాది తత్త్వపరేషు శాస్త్రేషు అమర్యాదమ్, వేదేషు తావత్ శ్రీసూక్తమ్, మేధాసూక్తమ్, ఉత్తర నారాయణమ్, కౌషీతకీ బ్రాహ్మణమ్ ఇత్యాదౌ.** శ్రీలక్ష్మీదేవి పరతత్త్వము శాస్త్రాలలో చెప్పబడినది. ఆమె నిత్య నిర్మల స్వరూపిణి. జగములనేలే తల్లి. సాటిలేని జగదధినేత్రి. సదా శ్రీవారితో కూడియుండే నిత్యానపాయిని. ఈ గుణాలు వేదాలలోను, శ్రీసూక్తము, మేధాసూక్తము, ఉత్తర నారాయణము, కౌషీతకీ బ్రాహ్మణము వంటి గ్రంథాలలో చెప్పబడినవి.

తరువాత శ్రీ భట్టులు పురాణాలనుండి ఉదాహరించారు –

విష్ణుపురాణము 1.8.17 – **నిత్యైవ ఏష విష్ణోః శ్రీరనపాయినీ యథా సర్వగతో విష్ణుః తథైవేయమ్ ద్విజోత్తమ.** ఓ బ్రాహ్మణోత్తమా! ఆ లక్ష్మీదేవి నిత్యమైనది (సదా ఉండునది). జగన్మాత. సదా విష్ణువుతో కూడియుండును. విష్ణువులాగానే ఆమె కూడా అంతటా వ్యాపించియున్నది.

బ్రహ్మ పురాణము – **తత్ శక్తిః దుర్జయా భీమా విష్ణుశక్తిః ఇతి స్మృతా సర్వభూత హృదబ్జస్థా నానారూపధరా పరా ప్రాణాఖ్యా మంత్రమాతా చ విశ్వస్య జననీ ధ్రువా దేవీ భిన్నాంజన శ్యామా నిర్గుణా వ్యోమ ఏవ హి.** ఆ శక్తి జయింపరానిది. భీకరమైనది. ఆమెయే విష్ణువునకు శక్తిగా చెప్పబడినది. ఆ పరాశక్తియే అందరి హృదయకమలములందును స్థితమైయున్నది. నానారూపములు ధరించినది. ఆమె పేరే ప్రాణము. ఆమె అన్ని మంత్రములకును తల్లి. జగన్మాత.

వసంతోత్సవంలో శ్రీ దేవీ భూ దేవీ సమేతులైన శ్రీ మలయప్ప స్వామి. **వికీపీడియా చిత్రం.**

Photo by Vimalkalyan. https://en.wikipedia.org/wiki/File:Malayappa_in_Vasanthotsavam.jpg



**తథైవైక పరాశక్తిః శ్రీః తస్య కరుణాశ్రయా**
**జ్ఞానాది షడ్గుణ్య మయీ ప్రోక్తా ప్రకృతిః పరా**
**ఏకైవ శక్తిః శ్రీః తస్య ద్వితీయా పరివర్తతే .....**
**పరావరేణ రూపేన సర్వాకారా సనాతనీ**
**అనంత నామధేయా చ శక్తి చక్రస్య నాయికా**
**జగత్ చరాచరమ్ ఇదమ్ సర్వమ్ వ్యాప్య వ్యవస్థితా**

ఇంకా, లక్ష్మియే పరాశక్తి. కరుణామయి. ఆమెయే షడ్గుణ్యమయమైన పరాప్రకృతి అని పిలువబడినది. ఆ శక్తియే భగవతుని శాశ్వతమైన ఏకైక శక్తి. ఆ శ్రీశక్తియే భగవంతుని ద్వితీయరూపము మరియు అనేక రూపములు దాల్చునది. అనేకములైన పేర్లు కలిగినది. శక్తిచక్రమునకు నాయిక. సకల చరాచర జగత్తునందు వ్యాపించియున్నది.

శ్రీ లక్ష్మీసహస్ర నామము –

**మహావిభూతేః సంపూర్ణ షడ్గుణ్య వపుషః ప్రభోః**
**భగవద్వాసుదేవస్య నిత్యైవ ఏష అనపాయినీ**
**ఏకైవ వర్తతే భిన్నా జ్యోత్స్నేవ హిమదీధితేః**
**సర్వ శక్త్యాత్మికా చైవ విశ్వమ్ వ్యాప్య వ్యవస్థితా**
**సర్వైశ్వర్య గుణోపేతా నిత్యమ్ తద్ధర్మ ధర్మిణీ**
**ప్రాణశక్తిః పరాహ్యేషా సర్వేషామ్ ప్రాణినామ్ భువి**
**శక్తీనామ్ చైవ సర్వాసామ్ యోనిభూతా పరాకళా**

ఆమె సంపూర్ణ షడ్గుణ్య పరిపూర్ణుడైన వాసుదేవ భగవానునకు నిత్యానపాయిని. చల్లని వెన్నెలవలె ప్రకాశించునది. భగవంతునితో ఐక్యమైకూడా వేరుగా కనుపిస్తుంది. జగత్తంతా వ్యాపించినది. సకలశక్తి స్వరూపిణి. సర్వైశ్వర్య గుణోపేత. భగవద్ధర్మమే ఆమె ధర్మము. సకల జీవులకును ప్రాణశక్తి ఆమెయే. పరాకళ.



శ్రీ అలమేలుమంగా వెంకటేశ్వరస్వామి వార్ల విద్యుద్దీపాలంకరణ

Creative Commons Photo from Flickr – by Kiran Jagarlapudi

**యస్మాత్ లక్ష్మ్యంశ సంభూతాః శక్తయో విశ్వగః సదా**
**కారణ్యత్వేన తిష్ఠంతి జగత్యస్మిన్ తదాజ్ఞయా**
**తస్మాత్ ప్రీతా జగన్మాతా శ్రీః యస్య అచ్యుతవల్లభా**
**సుప్రీతాః శక్తయః తస్య సిద్ధిమ్ ఇష్టామ్ దిశంతి చ**

శ్రీలక్ష్మి అంశనుండి ఉద్భవించిన శక్తులు విశ్వమంతా వ్యాపించియున్నవి. ఆమె ఆజ్ఞానుసారం వర్తిస్తున్నాయి. అచ్యుతవల్లభయైన జగన్మాత శ్రీలక్ష్మి గనుక ప్రీతినొందితే ఆ శక్తులు కూడా ప్రీతినంది మనకు ఇష్టమైన సిద్ధులను ప్రాదించును.

ఇలా శ్రీలక్ష్మి గుణాలను గురించి వివరంగా వ్రాసిన తరువాత శ్రీ భట్టులు మరింత సమాచారం వైష్ణవస్మృతిలోనూ, ఇతర ధర్మశాస్త్రాలలోనూ ఉన్నదని వ్రాశారు.

రామాయణం. బాలకాండ 4.7 – **రామాయణమ్ కావ్యమ్ కృత్స్నమ్ సీతాయాః చరితమ్ మహత్.** రామాయణ కావ్యము సీతాదేవియొక్క మహత్తర చరితమును తెలుపుచున్నది.

ఇలా శ్రీ భట్టులు తమ 73వ నామము (8వ శ్లోకము) వ్యాఖ్యలో శ్రీమహాలక్ష్మి గుణాలను విపులంగా వర్ణించారు. తమ వ్యాఖ్య ముగింపులో 'మాధవ' నామము గురించి ఒక్క వాక్యం మాత్రం వ్రాశారు.

**శ్రద్ధయా దేవో దేవతమ్ ఆశ్నుతే.** లక్ష్మీదేవితో కూడియున్నందున భగవంతునికి జగత్పతిత్వము లభించినది. ఇదే 'శ్రీ' తత్వము యొక్క రహస్యము.

8వ శ్లోకంలోని 73వ నామమునకు ఇలా శ్రీ భట్టులు విస్తారమైన వ్యాఖ్యను వ్రాశారు. అయితే 169వ, 741వ నామములకు చాలా క్లుప్తంగా వ్యాఖ్యానించారు. 'మాధవ' నామంలో శ్రీమహాలక్ష్మి తత్వానికి శ్రీ భట్టులు అత్యధిక ప్రాధాన్యత ఇచ్చారు.

మా – హరిని గురించిన విద్య.

ధవ – ప్రభువు, ప్రసాదించేవాడు.

మాధవుడు – తనను గురించిన జ్ఞానాన్ని ప్రసాదించేవాడు.

18వ శ్లోకంలోని 169వ నామమునకు శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా 'హరిని గురించిన విద్యను అనుగ్రహించేవాడు మాధవుడు' అన్న అర్థం చెప్పారు. ఇద్దరూ హరివంశము (3.69.4)నుండి ఉదాహరించారు.

**మా విద్యా చ హరేః ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్ తస్మాత్ మాధవ నామాసి ధవః స్వామీతి శబ్దితః**

శ్రీ చిన్మయానంద – ముముక్షువులలో ఆత్మవివేచన, ధ్యానములను పెంపొందించేవాడు  మాధవుడు.

శ్రీ భట్టులు మహాభారతం (3.69.4)నుండి కూడా ఉదాహరించారు,

**మధువిద్యా అవబోధత్వాత్ ధావత్వాత్-వా శ్రియోఽనిశమ్**

**మౌనాత్ ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత మాధవమ్**

ఈ శ్లోకంలో 'మాధవ' నామమునకు మూడు అర్థాలు చెప్పబడ్డాయి. (1) మధువిద్యద్వారా తెలియవచ్చువాడు మాధవుడు. (2) శ్రీని ధరించినవాడు మాధవుడు. (3) ధ్యానము, మౌనము, యోగములద్వారా తెలియవచ్చువాడు మాధవుడు.

(1) మధువిద్యద్వారా తెలియవచ్చువాడు మాధవుడు. ఛాందోగ్యోపనిషత్తు (3.1), బృహదారణ్యకోపనిషత్తు (2.51)లలో మధువిద్యగురించి ఉన్నది.

(డా. క్రోవి పార్థసారథి రచించిన 'శ్రీకైవల్యసారథి' నుండి) ఆదిత్యునియందు మధువును ఆరోపించి, ఆవిధంగా ఆదిత్యుని ఉపాసించడమే మధువిద్య. ఈ విద్య హిరణ్యగర్భునినుండి ప్రజాపతికి, అతను మనువునకు, మనువు ఇక్ష్వాకునికి చెప్పారు. అరుణుని జ్యేష్ఠపుత్రుడైన ఉద్దాలకుడికి అతని తండ్రి ఈ బ్రహ్మ విజ్ఞానాన్ని చెప్పాడు.

సూర్యుడు దేవతలకు మధువువలె తృప్తిపరచేవాడు స్వర్గలోకం తేనెపట్టుకు కర్రలాంటిది. అంతరిక్షం తేనెపట్టులా వ్రేలాడుతుంది. ఋక్కులే తేనెటీగలు. ఆదిత్యుని మధ్య చలిస్తున్నట్లు కనిపించే భాగమే మధువు. వేదాదులే అమృతాలు. మొదటి అమృతాన్ని అగ్నిదేవునిద్వారా వసువులు అనుభవిస్తారు. రెండవ అమృతం ఇంద్రుడు ప్రధానంగాగల రుద్రగణం చేత అనుభవింపబడుతుంది.

మూడవ అమృతం వరుణుడు ప్రధానుడుగా ఆదిత్యగణంచేత అనుభవింపబడుతుంది. నాల్గవ అమృతం సోముడు ప్రధానంగా మరుద్గణం చేత అనభవింపబడుతుంది. ఐదవ అమృతం బ్రహ్మ ప్రధానుడుగా సాధ్యులచే అనుభవింపబడుతుంది.

సూర్యుడు ఉదయాస్తమయాలద్వారా జీవులకు వాటి కర్మఫలాలు అందిస్తూ, ఆ కర్మలు క్షయం అయిన తరువాత తనలో లీనం చేసుకుంటాడు. జ్ఞానులైనవారు పైన చెప్పిన వసు, రుద్ర, ఆదిత్య, మరుత్ గణాలులాగా అమృతాన్ని అనుభవించి సూర్యునితో అభేదాన్ని పొందుతారు.

(2) శ్రీని ధరించినవాడు మాధవుడు. ఈ అర్థానికి వివరణ ముందుగా చెప్పడమైనది.

(3) ధ్యానము, మౌనము, యోగము ద్వారా తెలియవచ్చువాడు మాధవుడు. ధర్మచక్రము రచయిత ఈ విషయాన్ని మరింత వివరించారు. మౌనమువలన ఇంద్రియాలు అదుపులో ఉంటాయి. ధ్యానమువలన ఆత్మతత్త్వముపై మనసు కేంద్రీకృతమౌతుంది. యోగమువలన ఈ నిగ్రహము స్థిరపడుతుంది.

ఈ 741వ నామమునకు శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడా 'మధువంశములో పుట్టినవాడు మాధవుడు' అని వ్యాఖ్యానించారు. **మధుకులోద్భవత్వాత్ మాధవః.** లేదా, **మధుకులే జాతత్వాత్ మాధవః.**

శ్రీ భట్టులు చెప్పిన మరొక వివరణ ప్రకారం లక్ష్మీనారాయణులు లోకములకు తల్లిదండ్రులు అనీ, లోకాలను రక్షించేవారు అనీ ఈ నామము సూచిస్తున్నది. వారికి ఈ లోకాలతో ఉన్న ప్రత్యేకమైన అనుబంధం ఈ అర్థం ద్వారా వ్యక్తమౌతున్నది. అమ్మవారు తోడుగా ఉండడంవల్లనే బద్ధచేతనులు ఒనరించే అనేకములైన అపచారములను శ్రీదేవుడు మన్నిస్తుంటాడు.

శ్రీ తిరుక్కళ్ళమ్ నృసింహరాఘవాచార్య గీతాభాష్యములో – **మా ధవః యస్య స మాధవః** – అని చెప్పారు. ఆయనకు ప్రభువు లేడు గనుక మాధవుడు. ఎందుకంటే అందరికీ ఆయనే ప్రభువు.

## 742. భక్తవత్సలః

- భక్తులపట్ల విశేషముగా ప్రేమ కలిగినవాడు.
- యజ్ఞములో భక్తులు సమర్పించినవాని కొఱకు తానై వారివద్దకు వెళ్ళేవాడు.
- భక్తులను తనవద్దకు కొనిపోయేవాడు. ఆవుకు దూడవలె భగవంతునికి భక్తులు ప్రియమైనవారు.

### ఓం భక్తవత్సలాయ నమః

భజ్ - సేవాయామ్ - సేవించుట, గౌరవించుట. **భజతి భజతే సేవతే ఇతి భక్తః** (కాశకృత్స్నధాతువ్యాఖ్యానము 1.695)
వత్స - లేగదూడ; వత్సల - **వత్స అంశాభ్యామ్ కామబలే** (పాణిని 5.2.98)
వత్సల - కామవత్, స్నేహవత్ - ప్రేమ, స్నేహ సూచకము; భక్తవత్సల - భక్తులయెడల ప్రేమకలవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతునికి భక్తులపట్ల ఉన్న వాత్సల్యము అనన్యము. ఈ నామముద్వారా భగవంతునికి భక్తులయెడ ఉన్న విశేష భావము తెలియవస్తున్నది. భక్తులు లభించినపుడు భగవానుడు ఎంతగా సంతోషిస్తాడంటే ఆయనకు వేరేమీ గుర్తు రావు **(తల్లాభ సంభ్రమ విస్మృత అన్య కామః)**. కనుక ఆయన భక్తవత్సలుడు.

శ్రీ వి.వి. రామానుజన్ ఈ భావాన్ని ఉదాహరణలతో మరింత వివరించారు – 'వత్సము' అనగా లేగదూడ. దూడపై ఉన్న మాలిన్యాన్ని ఆవు నాలుకతో నాకి శుభ్రం చేస్తుంది. అంటే ఆ మాలిన్యముకూడా భోగ్యముగా భావిస్తుంది. అలాగే భగవంతునికి భక్తులపై ఉన్న ప్రేమ ఎలాంటిదంటే భక్తుల అపరాధాలను నిరంతరం భగవంతుడు మన్నిస్తూనే ఉంటాడు. విదురుని ఆతిథ్యాన్ని శ్రీకృష్ణుడు

స్వీకరించినపుడు, భక్తపారవశ్యంలో విదురుడు చూచుకొనకుండా అరటిపండి తొక్కనే నైవేద్యంగా సమర్పించాడట. స్వామి కూడా వేరాలోచించకుండా ఆ తొక్కనే స్వీకరించాడు. ఎందుకంటే అది భక్తితో సమర్పించినది. తినదగినదా కాదా అని భగవంతునికి భేదం లేదు. భీష్ముడు అంపశయ్యపై ఉన్నప్పటి సంగతి. ఒకమారు శ్రీకృష్ణుడు పాండవులతో, పురుషసింహమైన భీష్ముడు నన్ను తలచుచున్నాడు – అని ఒక్కసారి మైమరచిపోయాడట.

భక్తులపట్ల వాత్సల్యం కలవాడు – అనే ఈ అర్థానికి తోడుగా శ్రీ సత్యసంధ యతిరాజ మరో రెండు అర్థాలను చెప్పారు –

(1) భక్త - ఉడికిన అన్నము, యజ్ఞములో సమర్పించినది; సలతి - వెళ్ళుట, అందుకొనుట; భక్తవత్-సలః - యజ్ఞములో సమర్పించినదాని కొరకు వెళ్ళేవాడు. **భక్తమ్ అన్నమ్ యేషామ్ అస్తి ఇతి భక్తవంతో యజ్ఞకర్తారో బ్రాహ్మణాన్, తన్ ప్రతి సలతి గచ్ఛతి ఇతి భక్తవత్సలః.** యజ్ఞముద్వారా భక్తులు తనకు అర్పించినదానిని అందుకోవడానికి భగవంతుడు స్వయంగా భక్తులవద్దకు వెళతాడు గనుక భక్తవత్సలుడు.

(2) **భక్త ఏవ వత్సః, తాన్ లాతి ఇతి భక్తవత్స-లః**; లా - ఆదానే దానేచ - తీసికొనుట, లాగుట. ఆవునకు దూడవలె భగవంతునకు భక్తులు ప్రియమైనవారు. వారిని భగవంతుడు తనవద్దకు తీసికొనును. కనుక ఆయన భక్తవత్సలుడు.



సింగపూర్ శ్రీ మరియమ్మ ఆలయం గోపురంపై శ్రీ సీతా రామ లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమంతుల శిల్పాలు.
Photo by Shesmax.
https://commons.wikimedia.org/wiki/File:Singapore._Sri_Mariamman._Gopuram._South_East-5.JPG



## సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చందనాంగదీ |
## వీరహా విషమః శూన్యో ఘృతాశీరచలశ్చలః || (79)

### 743. సువర్ణవర్ణః

- బంగారు రంగు కలవాడు.

ఓం సువర్ణవర్ణాయ నమః

**గుణవత్స్వర్ణ నికష నిర్దోషోజ్వల వర్ణతః సువర్ణవర్ణ ఇత్యుక్తః నవార్ణో భక్తకామదః.** గుణాలకు తగినట్లుగానే బంగారములాగా మెరిసే దేహము కలవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము. అభీష్టప్రదము. ఓం సువర్ణవర్ణాయ నమః.

**శోభన వర్ణ సువర్ణ, సువర్ణమివ వర్ణమ్ యస్య స సువర్ణవర్ణః.** స్వచ్ఛత, కాంతి, ఇతరులచే కోరబడుట – ఇవన్నీ బంగారపు లక్షణాలు. ఈ నామము ద్వారా భగవంతుని శుద్ధ సాత్వికత, ఆయన కాంతిమత్వము, భక్తులచే కోరబడుట వంటి గుణాలు తెలుపబడినవి.

తమ పారవశ్యంలో భగవంతుని వర్ణించడానికి ఆళ్వారులు ఈ నామమువంటి వర్ణనలు ఎన్నో వాడారు –

శ్రీ తిరుమంగైయాళ్వారు. తిరుక్కుమ్ దండకము (6) – మధురమైన గీతం, క్రొత్త తేనె, మెరిసే బంగారము, నిత్యసూరులు తమ తలపై ధరించే పూవు .....

శ్రీ నమ్మాళ్వారు. తిరువిరుత్తమ్ (85) – మూడులోకాలను కొలిచిన మాణిక్యము! నా ప్రియమైన మరకతము. సాటిలేని స్వచ్ఛమైన పసిడి!.

శ్రీ తిరుమంగైయాళ్వారు. పెరియతిరుమొళి (4.9.8) – (త్రేతాయుగంలో) నీది బంగారురంగు! (ద్వాపర యుగంలో) నీలం!.

శ్రీ భట్టులు శ్రుతులు, స్మృతులనుండి ఆధారాలు చెప్పారు –

**యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణమ్ కర్తారమ్ ఈశమ్ పురుషమ్ బ్రహ్మయోనిమ్** – ముండకోపనిషత్తు 3.3

ద్రష్టయగు ఏ జీవుడు తనయందున్న బంగారువర్ణముగల నిజరూపమును దర్శించుచున్నాడో అప్పుడాతడు పుణ్యపాపవర్జితుడై అద్వైతసిద్ధిని పొందుచున్నాడు.

**ప్రశసితారమ్ సర్వేషామ్ అణీయాంసమ్ అణోరపి**

**రుక్మాభమ్ స్వపన ధీగమ్యమ్ విద్యాత్తమ్ పురుషమ్ పరమ్** – మనుస్మృతి 12.122

అందరినీ శాసించే పరమపురుషుడు సూక్ష్మాతిసూక్ష్మరూపుడై బంగారురంగులో ప్రకాశించుచున్నాడు. ధ్యానమగ్నులైన విజ్ఞులు మాత్రమే ఆ పరమపురుషుని ధ్యానించగలరు.

**ఆదిత్యవర్ణమ్** – పురుషసూక్తము 20

**య ఏషోన్తరాదియే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యస్మశ్రుః హిరణ్యకేశ ఆ ప్రణకాత్ సర్వ ఏవ సువర్ణః** – ఛాందోగ్య. 1.6.6

సూర్యమండలము మధ్య దర్శనమిచ్చే సువర్ణపురుషుడు బంగారురంగు గడ్డము, బంగారు కేశములు, మొత్తం గోళ్లవరకూ కూడా బంగారురంగు కలిగియున్నాడు.

శ్రీ చిన్మయానంద – ఈ ప్రకాశవంతమైన పరమపురుషుని దర్శించిన ముని అన్ని విధములైన మాలిన్యములనుండి విముక్తుడై సమభావత్వమును పొందును.

శ్రీసూక్తంలో అమ్మవారినికూడా **'హిరణ్యవర్ణాం హరిణీం'** అని ప్రస్తుతించారు. సుందరకాండము (36.28)లో సీతమ్మవారు శ్రీరాముని ముఖాన్ని ఇలా వర్ణించారు – **కచ్చిన్న తద్-హేమ సమాన వర్ణమ్ తస్యాననమ్ పద్మసమానగంధి...** బంగారువన్నెతో పద్మపరిమళములతో ఆహ్లాదకరమైన ఆ శ్రీరాముని ఆననము...

## 744. హేమాంగః

- బంగారురంగు గల అవయవములతో శోభిల్లువాడు.

### ఓం హేమాంగాయ నమః

**వర్ణాశ్రయం తు యస్యాంగం దివ్యసత్త్వమయం యతః తతో హేమాంగ ఇత్యుక్తః సప్తార్ణో హేమవర్ణతః** బంగారు వర్ణానికి ఆధారమై, దివ్యమైన శుద్ధసత్త్వమయమై ప్రకాశించే శరీరము కలవాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. బంగారురంగు నిస్తుంది. ఓం హేమాంగాయ నమః.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ చెప్పిన నిర్వచనము – **హిన్వన్తి వర్ధయన్తి శోభామితి హేమాని తదృశాని అంగాని యస్య ఇతి హేమాంగః** బంగారు రంగుతో ఉండి తన అందాన్ని, తిరుమేణి శోభను వర్ధిల్లజేసే శరీరావయవములు కలవాడు హేమాంగుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం ఈ నామము భగవంతునియొక్క శాశ్వత, దివ్య, శుద్ధ సత్త్వదేహమును సూచిస్తుంది. **నిత్యమ్, దివ్యమ్, సత్త్వమయమ్ అంగమ్ అస్య ఇతి హేమాంగః.**

ఇంతకు ముందటి నామము **'సువర్ణవర్ణః'** మరియు ఈ నామము **'హేమాంగః'** అనుబంధ నామములు అనుకొనవచ్చును. కనుక ప్రమాణములు కూడా రెండింటికీ వర్తిస్తాయి. ఇంతకుముందు చెప్పినవే కాక మరొక ప్రమాణం సంధ్యావందనమంత్రంలో ఉంది – **ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణ ... హిరణ్మయవపుః ధృతశంఖచక్రః.**

**య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయవపుః** – ఛాందోగ్యోపనిషత్తు – సూర్యమండలం మధ్యవర్తియై భాసించుచున్న సువర్ణమయ దివ్యపురుషుడే పరమాత్మ.

## 745. వరాంగః

- దేవకీ వసుదేవుల కోరికను తీర్చడానికి తన దివ్యమంగళ విగ్రహముగా సాక్షాత్కరించినవాడు.
- శ్రేష్ఠమైన, సుందరమైన ఉత్తమ సాముద్రికములైన అంగములు కలవాడు.
- తనను ధ్యానించేవారికి ఆనందం కలిగించే రమణీయమైన రూపం కలిగినవాడు.

### ఓం వరాంగాయ నమః

వర = ఉత్తమమైన, శ్రేష్ఠమైన, అతి సుందరమైన

వర = వరము (ఇచ్చుట)

వర = కోరిక (కోరుట), ప్రార్థన

ఈ అర్థాలనుబట్టి వ్యాఖ్యలలోని వైవిధ్యాన్ని చూడవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'వర' అనగా 'ప్రార్థన' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **తదేతత్ ఔపనిషదమ్ దేవక్యా ప్రియమానమ్ అతినిహ్నుత దివ్యచిహ్నమ్ ఆవిష్కృతమ్ ఇతి వరాంగః.** దేవకీదేవి ప్రార్థనలను కరుణించి, సామాన్యచక్షువులకు కనిపించని దివ్యచిహ్నాలతో సాక్షాత్కరించినవాడు వరాంగుడు.

**దేవతా ప్రీతయే గుప్త దివ్య లాంఛన మంగళమ్**

**ఆవిష్కృతమ్ స్వతో యేన వరాంగ స్స తు కథ్యతే**

దేవతలయందలి ప్రీతిచేత వారి కోరికలు తీర్చడంకోసం, తన దివ్యలక్షణాలతో కూడిన దివ్యమంగళ విగ్రహముగా దేవకీవసుదేవులకు సాక్షాత్కరించినవాడు వరాంగుడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణము (5.3.8)నుండి ఉదాహరించారు –

**ఫుల్లేందీవర పత్రాభం చతుర్బాహుమ్ ఉదీక్ష్య తమ్**

**శ్రీవత్స వక్షసమ్ జాతమ్ తుష్టావ ఆనక దుందుభిః**

వికసించిన నల్లకలువవంటి వర్ణము కలవాడై, చతుర్బాహువులతోను, శ్రీవత్సముతోను అవతరించిన ఆ బిడ్డను చూచి దేవకీవసుదేవులు పరిపరివిధాల స్తోత్రం చేశారు (ఆనక దుందుభి = వసుదేవుడు?). నీలమేఘచ్ఛాయతో, చతుర్భుజాలతో, గదా శంఖ చక్ర పద్మాలు గల హస్తాలతో, కౌస్తుభమణితో, కమనీయమైన సూత్రంతో శ్రీవత్సలాంఛనంతో శ్రీహరి జన్మించాడు.

(పోతన భాగవతము)

**బాలు బూర్ణేందు రుచిజాలు భక్తలోక**
**పాలు సుగుణాలవాలు గృపావిశాలు**
**జూచి తిలకించి పులకించి చోద్యమంది**
**యుబ్బి చెలరేగి వసుదేవుడుత్సహించె**

అపుడు దేవకీదేవి స్వామిని ఇలా స్తుతించింది –

**ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గ నిరూఢులై**
**కంటిమందురు గాని నిక్కము గానరీ భవదాకృతిన్**
**గంటి భద్రముగంటి మాంసపు గన్నులు గనబోలదీ**
**తొంటిరూపు దొలంగబెట్టుము తోయజేక్షణ మ్రొక్కెదన్**

వసుదేవుని స్తుతి –

**సర్వము నీలోనిదిగా**
**సర్వాత్ముడవాది వస్తు సంపన్నుడవై**
**సర్వమయుడవగు నీకును**
**సర్వేశ్వర! లేవు లోను సంధులు వెలియున్**



శ్రీ కృష్ణ జననం. నారాయణ తిరుమలలో పటం. వికీ పీడియా నుండి . రాజశేఖర్ చిత్రం.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'వర' అనగా 'అందమైన, శ్రేష్ఠమైన' అనే అర్థాన్నిబట్టి వ్యాఖ్యానించారు. **వరాణి శోభనాని అంగాని అస్య ఇతి వరాంగః.** సుందరమైన అంగములు కలవాడు వరాంగుడు.

శ్రీ చిన్మయానంద – (వర = ఆనందము కలిగించే) తనను ధ్యానించేవారికి ఆనందము కలిగించే రూపు కలవాడు వరాంగుడు.

భగవానుని సౌందర్యాన్ని వర్ణించే మూడు నామములు ఇక్కడ వరుసగా వచ్చాయి – **సువర్ణవర్ణః, హేమాంగః, వరాంగః.** ఈ మూడు నామాలలోని సున్నితమైన భేదాలను శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇలా వివరించారు.

**సువర్ణవర్ణః** – సహజంగా నిర్మల దీప్తిమంతమైన రూపం కలిగినవాడు.

**హేమాంగః** – అందరినీ ఆకర్షించే సుందరమైన అవయవములు కలవాడు.

**వరాంగః** – శ్రేష్ఠమైన సాముద్రిక లక్షణాలు అన్ని ఒకేరూపంలో కలిగినవాడు.

ధర్మచక్రము రచయిత – సామాన్యమైన సౌందర్యమువలన కామం కలుగుతుంది. భగవానుని దివ్యసౌందర్యంవలన భక్తి కలుగుతుంది. శ్రీమహావిష్ణువు దివ్యసౌందర్యాన్ని వర్ణించే ఈ మూడు దివ్యనామములు స్మరించి భక్తితో ఆయనను ధ్యానింపనగును.

## **746.** చందనాంగదీ

- ఆహ్లాదకరమైన, సుందరమైన కేయూరమును ధరించినవాడు.
- ఆహ్లాదకరమైన చందనమును పూసికొనియున్నవాడు.
- మనందరికీ సంతోషమును కలిగించే మార్గాలు ప్రసాదించేవాడు.
- తనకు సంతోషం కలిగంచే 'అంగదుడు' అనే భక్తుని కలిగినవాడు.

### ఓం చందనాంగదినే నమః

చంద్ – ఆహ్లాదే, దీప్తౌచ – సంతోషం కలిగించు, ప్రకాశించు

చందన – చందత్యే అనేన, చందయతి వా యత్ తత్ చందనమితి – ఆనందం కలిగించేది

అంగద – అంగం దయతే, దాయతి, ద్యాతి వా – అంగమును రక్షించేది, శుద్ధి పరచేది, విభజించేది

పైచేయి (భుజము, మోచేయి మధ్యభాగము)ను రక్షించుకోవడానికి వాడే ఆభరణవిశేషమును 'అంగదము' లేదా 'కేయూరము' అంటారు.

చందన - అంగది – ఆనందం కలిగించే అంగదమును ధరించినవాడు.

**భూషణాన్యంగదాదీని సదాహ్లాదకరాణి చ సంతి యస్య చ నిత్యస్తు స స్మృత శ్చందనాంగదీ** ఆనందప్రదమైన అంగదాధి ఆభరణములు ధరించినవాడు చందనాంగది.

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము భగవంతుని శరీరమే అనంతసౌందర్యము కలిగిన ఆభరణము. భగవంతుని శరీరమును అలంకరించిన కారణముగా అంగదము (కేయూరము)వంటి ఆభరణాలు ఆహ్లాదకరమైన గుణాన్ని సంతరించుకుంటాయి. ఇక్కడ అంగదము (కేయూరము) ఒక ఉదాహరణ మాత్రమే. శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.5.6 – భగవంతుని శరీరంపైనున్న ఆభరణాలను లెక్కించలేము. ఇంకా శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురము 8.8.1లో భగవానుని ఆభరణాల అనంతసౌందర్యమును ఎంతో చక్కగా వర్ణించారు.

శ్రీ వైకుంఠగద్యములో శ్రీ భగవద్రామానుజులు భగవంతుని తిరుమేణిని ఇలా వర్ణించారు – **అతి మనోహర కిరీట చూడావతంసక మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామ ఉదరబంధన పీతాంబర కాంచీగుణ నూపురాదిభిః అత్యంత సుఖస్పర్శైః దివ్యగంధైః భూషితమ్.**

శ్రీ అనంతరామకృష్ణ శాస్త్రి – చందనము = గోపీచందనము, గంధము. భగవంతుడు తన శరీరముపై ఆహ్లాదకరమైన చందనమును ధరించియున్నాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – చందన - సంతోషము కలిగించే; అంగద - (అంగ్) వెళ్ళుట; **ఆహ్లాదకరీమ్ గతిమ్ యో దదాతి.** సంతోషంగా ఉండే అవకాశాలను కలిగించేవాడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – చందన = సంతోషము కలిగించే, భక్తి కలిగిన; అంగదుడు = వాలికొడుకు; సంతోషము కలిగించే అంగదుడు తన భక్తునిగా కలిగినవాడు చందనాంగది.

ధర్మచక్రము రచయిత – భగవంతుని ధ్యానించడంవల్ల మానసికశాంతి లభిస్తుంది.

## 747. వీరహా

- బలవంతులైన రాక్షసులను సంహరించినవాడు.
- వ్యర్థవాదాలు చేసి భక్తుల ధ్యానాన్ని కలతపరచేవారిని నశింపజేయువాడు.
- యమపాశములను నాశనము చేయువాడు.
- జీవులను మోక్షంవైపు నడిపించువాడు.
- రాక్షస సంహారంలో గరుడుడు, వాయువు తనకు తోడుగా కలిగినవాడు.
- పునర్జన్మను హరింపజేయువాడు.

### ఓం వీరఘ్నే నమః

ఈ నామము 168, 747, 927వ నామములుగా మూడుమార్లు వస్తుంది.
18వ శ్లోకము. 168వ నామము. వీరహా – **వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః**
79వ శ్లోకము. 747వ నామము. వీరహా – **వీరహా విషమః శూన్యో ఘృతాశీరచలశ్చలః**
99వ శ్లోకము. 927వ నామము. వీరహా – **వీరహా రక్షణస్సంతో జీవనః పర్యవస్థితః**

**వీరయతి ఇతి వా వీరః.** శత్రువులపై యుద్ధంలో బలాన్ని, పరాక్రమాన్ని ప్రదర్శించేవాడు వీరుడు. అమరకోశం ప్రకారం – **విరుద్ధాని రాతి హన్తి ఇతి వీరః.** శత్రువులను నాశనం చేసేవాడు వీరుడు. అయితే వీరులంతా ధర్మపరులు కారు. అధర్మాన్ని ఆచరించే వీరులను సంహరించే వీరఘ్నుడు భగవంతుడు. బలంకలిగి, అమాయకులను బాధించేవాడు అపరాధి. అటువంటి అపరాధి భగవంతునిచేత హతం అవుతాడు. వ్యాకరణపరంగా 'వీరహా'. 'కామహా' వంటి పదాలలో 'హా' భూతకాలాన్ని సూచిస్తుంది. నాశనం చేసినవాడు అని (పాణిని సూత్రం 3.2.87).

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సమూలం పూతనాదీన్వై యో జఘాన వీరహా.** పూతన, శకటాసురుడు వంటి రాక్షసులను సంహరించినవాడు. బాలకృష్ణుడు. వీరఘ్నుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 5.3.8 – పూతన, శకటాసురుడు, జంటవృక్షాలు, బకాసురుడు, కువలయాపీడము వంటివానిని సంహరించి, ఆపై బాలకృష్ణుడు తన ఎర్రని పెదాలమధ్య తెల్లని పలువరుస చూపుతూ చిద్విలాసంగా నవ్వాడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన నిర్వచనము – **విరుద్ధ గతీన్ హన్తి ఇతి వీరహా.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **విశేషేణ ఈరయన్తి క్షిపన్తి ధర్మమార్గమ్ ఇతి వీరాః కంస రావణ ప్రభృతయః; తాన్ వీరాన్ హన్తి ఇతి వీరహా.** ధర్మమార్గాన్ని విడచి చరించే కంస రావణాదులను సంహరించేవాడు 'వీరహా'.



బాలకృష్ణుని లీలలు - శకటాసుర వధ, పూతన వధ, తృణావర్త వధ, ధేనుకాసుర వధ – వికీపీడియా పురాతన చిత్రాల సంకలనం.

శ్రీ భట్టులు చెప్పిన మరొక వ్యాఖ్య – **స్వవేదన విహంత్యాన్ హైతుక - వీరాన్ హతవాన్ ఇతి వీరహా**. భాషలో ప్రావీణ్యం కలిగి ఉండి, తమ పాండిత్యాన్ని వ్యర్థవాదాలకు వినియోగిస్తూ, భక్తుల ధ్యానక్రియను భంగపరచేటటువంటి శుష్కపండితులను నాశనం చేసేవాడు 'వీరహా'.

శ్రీ భట్టులు చెప్పిన మరొక వ్యాఖ్య (927వ నామమునకు) – గజేంద్రునకు యమపాశములను తొలగించినవాడు 'వీరహా'. **మోక్షయామాస నాగేంద్రమ్ పాశేభ్యః శరణాగతమ్** (విష్ణుధర్మము 69).

నిరుక్తి – **వీరమ్ తద్బాధకమ్ మృత్యుమ్ హతవాన్ వీరహా మతః.**

శ్రీ శంకరులు చెప్పిన ఒక వ్యాఖ్య ప్రకారం భగవంతుడు అసురవీరులను సంహరించేవాడు గనుక 'వీరహా'. ఇది ఇంతకుముందు వ్రాసిన శ్రీ భట్టుల వ్యాఖ్యకు సరిపోతుంది.

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – **వివిధాః సంసారిణామ్ గతీః ముక్తిప్రదానేన హన్తి ఇతి వీరహా** (హన్-వెళ్ళుట). సంసారులు అధర్మమార్గము పట్టకుండా వారిని మోక్షగాములు చేసేవాడు 'వీరహా'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఈర్-గతౌ-వెళ్ళుట; హమ్-గతౌ-వెళ్ళుట. **వివిధమ్ ఈరతి ఇతి వీరః**. వివిధరకాలుగా చలించే జీవులు 'ఈర'. **తాన్ శ్చ హన్తి గమయతి వీరహా**. వాటికి చలించే సదుపాయం కల్గించినవాడు 'వీరహా'. **సర్వేషామ్ బహుధా ఈరాణామ్ జంతూనామ్ గమయితా విష్ణుః**. అన్ని జంతువులకు చలనం ఇచ్చేవాడు విష్ణువు.

శ్రీ చిన్మయానంద – వీ-వివిధమార్గములు; జనన మరణ మార్గమును అంతం చేసేవాడు 'వీరహా'.

ధర్మచక్రము రచయిత – ఈ నామమును ధ్యానించుటవలన కామక్రోధాది బలమైన అంతఃశత్రువులు నశించును.

## 748. విషమః

- భక్తులపట్ల ఒకవిధమైన, శత్రువులపట్ల మరొకవిధమై భావము (భేద భావము, వైషమ్యము) కలవాడు.
- -తనతో సములైనవారు వేరెవరూ లేరు. విలక్షణుడు.
- -క్షీరసాగరమథన సమయంలో రుద్రుడు సేవించిన విషంవలన రుద్రునికి హాని కలుగకుండా చేసినవాడు.

### ఓం విషమాయ నమః

వి-సమః, విషమః – **విగతో సమో యస్య ఇతి విషమః**.సమమైనవాడు లేనివాడు విషముడు.

పాణిని అష్టాధ్యాయి సూత్రము 8.3.88 ప్రకారం 'సు, వి, నిర్, దుర్' ప్రత్యయాలు చేరినపుడు 'స్వప్, సూతి, సమ' పదాలలోని 'స'కారం 'ష'కారం అవుతుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – మంచివారిపట్ల, చెడువారిపట్ల తన ప్రవర్తనలో వైషమ్యము (భేదభావము) కనబరచేవాడు విషముడు. **భీతి క్షేమ కరత్వాది కుటిలా కుటిలాత్మసు విషమస్సతు ఖ్యాతా.** దుష్టులకు భయము, శిష్టులకు ప్రేమ కలిగించేవాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తూ ఈ విధంగా భేదభావం కలిగి ఉండేవాడు. సమమైన భావము లేనివాడు 'వి-సమ' లేదా 'విషమః'. భక్తులపట్ల కారుణ్యవరదుడు. దుర్మార్గులపట్ల భీతావహుడు. భక్తపక్షపాతి.

భగవానుని విషమగుణాన్ని (విడమన్గళ్) శ్రీ నమ్మాళ్వారు తమ తిరువైమోళి పాశురములు 2.6.1 మరియు 78.3లలో వర్ణించారని శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించారు . భీష్మునితో అర్జునుడు యుద్ధం చేసేటపుడు అర్జునుని సారధిగా భగవానుడు తమ రధాన్ని కొంచెం కొంచెం పైకి లేపేవాడు లేదా క్రిందికి అణచేవాడట. ఈ విధంగా భీష్ముని బాణాలు గురి తప్పడానికీ, అర్జునుని బాణాలు గురి తప్పకుండా ఉండడానికి సాధ్యం చేశాడట. అలాగే అర్జునుడు జయద్రధునితో యుద్ధం చేసేటపుడు భగవానుడు తన చక్రాన్ని ప్రయోగించి, సూర్యాస్తమయం అని భ్రమ కలిగించి, జయద్రధుడు బయటకువచ్చి అర్జునుని బాణాలకు బలి అయ్యేలా చేశాడట.

ఇదే భావాన్ని, అనగా భగవానుడు భక్షపక్షపాతి గనుక విషముడు అని, శ్రీ బలదేవ విద్యాభూషణ వివరించారు. **భక్త పక్షపాతిత్వాత్ విషమః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సమో న అస్య విద్యతే సర్వ-విలక్షణాత్ ఇతి విషమః**. భగవంతునికి సమమైనవారెవరూ లేరు. అన్నివిధాలా ఆయన విలక్షణుడు. అధికుడు. శ్రీ శంకరులు గీత (11.43)నుండి ఉదాహరించారు.

**పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చగురుర్ గరీయాన్**

**న త్వత్ సమోఽస్తి అభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽపి అప్రతిమప్రభావ** – గీత 11.43

ఓ సర్వేశ్వరా! ఈ చరాచర జగత్తుకూ నీవే తండ్రివి. నీవు పూజ్యుడవు. నీవే గురుడవు. సర్వశ్రేష్ఠుడవు. ముల్లోకాలలోనూ నీతో సమానులెవరూ లేరు. ఇంకా నీకన్న అధికులు ఎలా ఉంటారు?

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుని సృష్టిలో ఈ విషమగుణము స్పష్టంగా కానవస్తుంది. ప్రతిజీవిలోనూ వైవిధ్యమున్నది. ప్రవర్తనలో విలక్షణత ఉన్నది.

శ్రీ వాసిష్ఠ ప్రతినామానికీ విపులమైన వ్యాకరణ విశ్లేషణ ఇవ్వడమే కాకుండా ఒక్కో నామమునకూ ఒక్కో శ్లోకం రచించారు. ఈ 'విషమః' నామమునకు ఆయన చెప్పిన శ్లోకము –

**స విష్ణురేకో విషమః పురాణః కరోతి విశ్వం విషమం స్వభావాత్**
**తమానుకుర్వన్ విషమం ప్రవృత్తా సంపత్ విపచ్చాపి జగత్ ప్రస్పష్టా**
పూర్ణపురుషుడైన విష్ణువు ఒక్కడే అందరికంటె విలక్షణుడు. మరియు తన స్వభావం ప్రకారం సృష్టిలో ప్రతిఒక్కదానినీ విలక్షణంగా చేస్తాడు. వివిధజాతుల మధ్యనే కాదు. ఒకేజాతికి చెందిన వివిధ జీవులు కూడా విలక్షణమైనవి.

శ్రీ సత్యసంధ యతిరాజ – **విషమ్ రుద్ర పీతమ్ మీనాతి హన్తి స్వ-నామ-స్మరణేన ఇతి విషమః.** (మీ - హింసాయామ్ - తొలగించుట, చంపుట). క్షీరసాగర మథన సమయంలో రుద్రుడు మ్రింగిన విషంయొక్క ప్రభావాన్ని హరించినవాడు విషముడు.

ధర్మచక్రము రచయిత భగవంతుని అసమానత్వము, విలక్షణతగురించి అనేక ఉదాహరణలు ఇచ్చారు –

(1) **హృషీకేశుడు** – ఇంద్రియాలను నిగ్రహించుటలో సాటిలేనివాడు. మరియు మన ఇంద్రియములు ఆయన అధీనంలోనే ఉంటాయి.

(2) **కేశవుడు, మధుసూదనుడు** – అసురులబారినుండి దేవతలను రక్షించుటలో సాటిలేనివాడు.

(3) **గోవిందుడు** – జీవుల స్వభావాన్ని ఎరగడంలో సాటిలేనివాడు.

(4) **జనార్దనుడు** – దుష్టులను శిక్షించడంలో సాటిలేనివాడు.

(5) **విష్ణువు** – అంతటా వ్యాపించినవాడు. ఆయన లేకుండా మరేదీ ఉండదు, పని చేయదు.

(6) **యోగీశుడు, యోగవిదాంనేత** – యోగులలోను, యోగము తెలిసినవారిలోను సాటిలేనివాడు.

(7) **భగవంతుడు** – షడ్గుణ్యపరిపూర్ణుడు గనుక ఆయనకు సాటి వేరెవరూ లేరు.

(8) **అచ్యుతుడు** – తన మాటను వృధా కానీయడు మరియు భక్తులను చేజారనీయనివాడు గనుక ఆయనకు వేరెవరూ సాటి లేరు

ఇవన్నీ శ్రీమన్నారాయణుని విషమత్వానికి ఉదాహరణలు. కనుక ఆయన విషముడు.

## 769. శూన్యః

- మానవుల మధ్య అవతరించినాగాని ఏ విధమైన దోషములు లేనివాడు.
- నిర్గుణుడు (అద్వైత వ్యాఖ్య).
- అన్ని చోట్లకూ వెళ్ళేవాడు. అంతటా ఉండేవాడు.
- ప్రళయకాలంలో అంతటినీ తుడిచివేసేవాడు.
- ఇంద్రియముల ద్వారా యత్నిస్తే అందనివాడు.

**ఓం శూన్యాయ నమః**

శూన్యము (సున్నా) అంటే ఏమీ లేకపోవడం (ఖాళీ). దోషములు లేనివాడనీ, గుణములు లేనివాడనీ, ప్రళయంలో అంతా ఖాళీ చేసేవాడని, శత్రువులను తుడిచివేస్తాడనీ – ఇలా ఈ నామానికి వివిధ వ్యాఖ్యలు మనకు లభిస్తున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు మనిషిగా అవతరించినాగానీ ఏ విధమైన దోషములు లేదా అవగుణములు ఆయన అవతారంలో ఉండవు. శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురం (3.10.6)ను ప్రస్తావించారు. భగవంతుడు సర్వ సద్గుణ పరిపూర్ణుడు, దోషరహితుడు అనేది అంతా అంగీకరించే విషయమే. అయితే కర్మదోషబద్ధులైన మానవులమధ్య మానవునిగా అవతరించినప్పటికీ ఆయన సంపూర్ణ పరత్వము ఆయనతోనే ఉంటుంది. ఏ విధమైన దోషగుణాలూ ఆయన దరిచేరవు. ప్రజలకు అందుబాటులో ఉండడానికే ఆయన అవతరిస్తాడు. తాను విధించే శిక్షలద్వారా శత్రువులను, తన స్వల్పవియోగంద్వారా భక్తులను పీడిస్తూనే ఉంటాడు. అయితే శ్రీ నమ్మాళ్వారుకు ఎలాంటి వియోగక్లేశమూ లేదు. ఎందుకంటే ఆయన మనసుకు నిరంతరాయంగా భగవదనుభవం లభిస్తూనే ఉంది.

శ్రీ స్వామిదేశికన్ శరణాగతి దీపిక 17వ శ్లోకంలో భగవదవతారాలకు సంబంధించి ఆరు రహస్యగుణాలను వర్ణించారు –

(1) **నానావిధైః** – భగవదవతారములు అనేక విధములు. ఉదాహరణకు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, రామ, రామ, కృష్ణ, కల్కి అవతారములు .

(2) **అకపటైః** – భగవదవతారములు భగవంతుని నిజమైన దర్శనములు. మాయ లేదా భ్రాంతివల్ల కన్పించేవి కాదు.

(3) **అజహత్ స్వభావైః** – సంపూర్ణ స్వభావము కలిగినవి. అవతార సమయంలో కూడా భగవంతుని పరత్వము సంపూర్ణంగా ఉండును.

(4) **అప్రాకృతైః** – ఇతరజీవుల శరీరములు పాంచభౌతికములు. కాని భగవంతుని అవతార తిరుమేణి శుద్ధసత్వమయము.

(5) **నిజ విహార వసేన సిద్ధైః** – ఇతర జీవుల జననం వాని పూర్వకర్మల మూలంగా జరుగుతుంది. కాని భగవంతుడు కర్మరహితుడు. ఆయన లీల, సంకల్పానుసారంగా అవతరిస్తాడు.

(6) **ఆత్మీయ రక్షక, విపక్ష వినాశనార్థైః** – భగవదవతారములు తన భక్తులను రక్షించడానికి, వారి శత్రువులను శిక్షించడానికి సంభవించును.

ఇలా భగవంతుడు మనుష్యరూపంలో అవతరించినాగాని, మానవులకుండే దోషాల విషయంలో ఆయన శూన్యుడని పైన చెప్పిన అవతార లక్షణాలవల్ల తెలుస్తుంది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ప్రకృత గుణ విరహితత్వాత్ శూన్యః**. ఈ వివరణ పైన చెప్పిన 4వ అంశానికి సరిపోతుంది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వ విశేష రహితత్వాత్ శూన్యవత్ శూన్యః.** భగవంతుడు గుణరహితుడు కనుక శూన్యుడు. ఈ వ్యాఖ్య అద్వైత సిద్ధాంతానికి సరిపోతుంది.

శ్రీ పెమ్మరాజు రాజారావు వివరణ – శారీరిక, మానసిక, బుద్ధి, అహంకారములు లేనివాడు, కర్తృత్వ భోక్తృత్వములు లేనివాడు, గుణములు కాని, ఆకారములుగాని లేనివాడు అగుటచే పరబ్రహ్మము 'శూన్యః' అను సుందర నామమున ప్రసిద్ధుడగుచున్నాడు. పరబ్రహ్మము నిర్మలము, నిష్కళంకము, స్వప్రకాశము అయియున్నందున 'శూన్యః' అని చెప్పబడెను. ఇది బౌద్ధులు వచించునట్టి సర్వశూన్యము కాదనియు, మనోబుద్ధుల కతీతమైన తేజోమయ స్వప్రకాశ పరిపూర్ణమయమనియు భావింపదగును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శూన్ - గతౌ - వెళ్ళుట; **శునతి ప్రాప్తో భవతి సర్వత్ర ఇతి శూన్యో విష్ణుః.** అన్ని చోట్లకు వెళ్ళేవాడు, అంతటా ఉండేవాడు శూన్యుడు. 'ఖాళీ' అనే అర్థాన్ని తెలిపే మరొక పదము 'ఖం' అనగా ఆకాశము, ఖాళీ, వార్తాహరుడు. ఖాళీ, కదలిక – ఈ రెండింటికీ అవినాభావ సంబంధము ఉన్నది. ఖాళీ ఉంటేనే కదలిక సాధ్యము. కదలికవల్లనే క్రొత్తఖాళీ ఏర్పడుతుంది.

శ్రీ సత్యసంధ యతిరాజ – **ప్రళయకాలే సర్వపదార్థ శూన్యత్వాత్ శూన్యః.** ప్రళయకాలంలో అన్నింటినీ ఖాళీచేసేవాడు (తనలో ఇముడ్చుకునేవాడు), అంతం చేసేవాడు 'శూన్యః'.

ధర్మచక్రము రచయిత – మనకు ఇంద్రియాలద్వారా గోచరమైనది మాత్రమే నిజమని మనం భావిస్తాము. ఇంద్రియాలకు అందనివాడు కనుక 'శూన్యః'.

## 750. ఘృతాశీ

- లోకాలలో ఐశ్వర్యాన్ని వెదజల్లేవాడు.
- వ్రేపల్లెలోని గోపికల ఇండ్లలోని నేతిని ఆశించినవాడు.
- అన్ని కోర్కెలను త్యజించినవాడు. ఆశారహితుడు.
- హోమంలో అర్పించిన నేతిని కోరువాడు.

### ఓం ఘృతాశిషే నమః

ఘృతమ్ – సేచనమ్, క్షరణమ్, దీపనమ్ వా ఘృతమ్ – చల్లుట, ప్రవహించుట, వెలుగుట.
ఘృతమ్ – నేయి, వెన్న.
ఆశీః – శాసు - ఇచ్ఛాయామ్, కోరుట, ఆశీర్వదించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఘృ - సేచనే - వెదజల్లుట; **ఘృతమ్ - సేచనమ్, స్వ-గుణైః జగత్ ఆప్యాయనమ్.** తన కరుణను లోకాలపై వెదజల్లి దీవించేవాడు ఘృతాశి.



బాలకృష్ణుడు వెన్న దొంగిలించుట. 1750 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Indischer_Maler_um_1750_(I)_001.jpg

శ్రీ భట్టుల మరొక వ్యాఖ్య – ఘృతమ్ - నేయి, ఆశీ - కోరినవాడు; **గోప గృహ గవ్యే ఆశాస్తిః అస్య ఘృతాశీ.** గోపికల ఇండ్లలో నేతిని ఆశించినవాడు ఘృతాశి.

**గోపానామ్ సద్మ గవ్యే వా జగదాప్యాయనేన వా ఘృతేత్వా శ్యాహి యస్యాస్తి ఘృతాశీః పరికీర్తితః** గొల్లభామల ఇండ్లలో దూరి పాలు, వెన్న, నెయ్యి ఆశించినవాడు ఘృతాశి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఘృతాః విగలితాః ఆసీషః ప్రార్థనాః అస్య ఇతి ఘృతాశీ.** ఏ విధమైన కోరికలు లేనివాడు. వెన్న కరిగి నేతిలా మారి కారిపోయినట్లే అన్ని కోరికలు భగవానునినుండి జారిపోయాయి. భగవంతుడు తృష్ణారహితుడు, పూర్ణకాముడు, పరిపూర్ణుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – హోమంలో అర్పించిన నేతిని ఆశించేవాడు ఘృతాశి. దీపంలో ఉంచిన నేతిని ఆశించేవాడు.

**751. అచలః**

- శత్రువుల యత్నాలకు చలించనివాడు.
- తన స్వరూప సామర్థ్యములనుండి చలనము పొందనివాడు.
- అంతటా ఉన్నందున ఇంక కదలనివాడు.

**ఓం అచలాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **దుర్యోధనాదిభిః దురాత్మభిః అభేద్యః అచలః.** దుర్యోధనాదులు ఎంత యత్నించినాగాని చలించనివాడు అచలుడు. (పాండవుల పక్షము వీడనివాడు).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **న స్వరూపాత్ న సామర్థ్యాత్ న చ జ్ఞానాదికాత్ గుణాత్ చలనం న విద్యతే అస్య ఇతి అచలః.** పరమేశ్వరుడు స్థిరమైనవాడు. ఆయన శక్తి, స్వరూపము, జ్ఞానమువంటివి ఎన్నడూ తరగవు. కనుక ఆయన అచలుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్యలో భగవంతుని సౌశీల్య సౌలభ్యత్వాలు, శ్రీ శంకరుల వ్యాఖ్యలో భగవంతుని పరత్వ అనంతత్వాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయనడానికి పై వ్యాఖ్యలు మరొక ఉదాహరణ.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు అంతటా ఉన్నాడు. ఆయన లేని చోటు లేదు. కనుక ఆయన ఒక చోటునుండి మరొక చోటుకు వెళ్ళడం అనేది జరగదు. ఇలా ఆయన అచలుడు. **స్థాణు రచలోऽయమ్** (గీత 2.24).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అచలుడైన భగవానుడు ఈ అచలత్వ గుణమును సృష్టిలో చాలా చోట్ల అమర్చాడు. ఉదాహరణకు ఒక జాతి విత్తనంలోనుండి అదే జాతి మొక్క వస్తుంది. నిప్పు పైకి ఎగుస్తుంది. ఇలా చాలా గుణాలు అచలాలు అని మనం గమనింపవచ్చును.

ధర్మచక్రము రచయిత – చిన్న గాలికి మొక్క కదులుతుంది కాని పెద్ద చెట్టు కదలదు. పెద్ద గాలికి చెట్టు కదులుతుంది కాని పర్వతం కదలదు. ఇలా శక్తినిబట్టి అచలత్వం వర్తిస్తుంది. అర్జునుడంతటివాడే కురుక్షేత్రంలో వ్యాకుల చిత్తుడయ్యాడు. కాని అనంత శక్తి సంపన్నుడైన భగవానుడు సదా అచలుడు.

ఇంద్రియాల అధీనంలో ఉన్న వ్యక్తులు తరచు చలిస్తూ ఉంటారు. భగవంతుని ధ్యానించి మనస్సును, ఇంద్రియాలను నిగ్రహిస్తే శాంతి, స్థిరత్వము లభిస్తాయి.

**752. చలః**

- చలించినవాడు. తన ప్రతినను భంగపరచుకొన్నవాడు.
- వాయురూపంలో చలించువాడు.
- గజేంద్రుని కాపాడడానికి పరుగులు తీసినవాడు.
- అనేక లీలలు కలిగినవాడు.

**ఓం చలాయ నమః**

ఇంతకుముందు నామము **'అచలః'** అనగా చలించనివాడు భగవంతుడు. అంతే కాకుండా చలించేవాడు కూడా భగవంతుడేనని ప్రస్తుతనామము **'చలః'** తెలుపుతుంది. శత్రువులపట్ల అచలత్వము, భక్తులపట్ల చలత్వము ప్రదర్శిస్తాడు భగవంతుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సత్యాద్యః పాండవార్థేహి చలతీతి చల స్మృతః.** మహాభారత యుద్ధంలో తాను ఆయుధం ధరించనని కృష్ణుడు చెప్పియున్నాడు. కాని మూడవనాటి యుద్ధంలో భీష్ముని రణధాటికి పాండవులు తాళలేకున్నారు. అప్పుడు కృష్ణుడు రోషంతో, పగ్గములను వదలి, సూర్యప్రభాభాసమానమైన చక్రమును త్రిప్పుచు ముందుకు దుమికెను. ఇందుకు రెండు కారణాలు చెబుతారు (1) పాండవులను రక్షించడానికి (2) కృష్ణునితో రేపు ఆయుధం పట్టిస్తానని అంతకుముందురోజు భీష్ముడు ప్రతిన పూనియుండడం. అంటే భక్తుని (భీష్ముని) మాట చెల్లించడంకోసం భగవానుడు తనమాటను స్వయంగా జవదాటాడన్నమాట. ఇలా ఆయన చలుడు.

భీష్మునిపై కృష్ణుడు విజృంభించిన విధానాన్ని శ్రీ పోతన ఇలా వర్ణించాడు (భాగవతము 1.222) –

కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగన భాగంబెల్ల గప్పి కొనగ
ఉఱికిన నోర్వక ఉదరంబులోనున్న
జగముల వ్రేగున జగతి కదల
చక్రంబు చేపట్టి చనుదెంచు రయమున
పైనున్న పచ్చని పుటము జార
నమ్మితి నా లావు నగుబాటు సేయక
మన్నింపుమని క్రీడి మఱల దిగువ

కరికి లంఘించు సింగంబు కరణి మెఱసి,
"నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జున"యంచు మద్విశిఖ వృష్టి
తెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు



భీష్మునిపై లంఘిస్తున్న శ్రీకృష్ణుడు. నారాయణ తిరుమల ఆలయంలో పటం. వికీపీడియా నుండి . రాజశేఖర్ చిత్రం.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వాయురూపేణ చలతి ఇతి చలః.** వాయురూపంలో చలించేవాడు చలుడు.

శ్రీ అనంతకృష్ణ శాస్త్రి – గజేంద్రుని కాచడానికి ఒక్క ఉదుటున పరుగులు తీసినవాడు చలుడు.

ఈ ఘట్టాన్ని శ్రీ పోతన ఇలా వర్ణించాడు (ఆంధ్రమహాభాగవతము. 8వ స్కంధము) –

సిరికిం జెప్పడు శంఖ చక్రయుగముం జేదోయి సంధింప డే
పరివారంబు జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణ కాం
తర ధమ్మిల్లము జక్కనొత్తడు వివాదప్రోత్థిత శ్రీ కుచో
పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – చల్ - విలాసనే - క్రీడించుట, ఆనందించుట. **చలతి విలసతి ఇతి చలః విలాసలీలా సంపన్నః.** లీలామానుషమూర్తి యైనందున భగవంతుడు చలుడు.



## అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృత్ |
## సుమేధా మేధజో ధన్యః సత్యమేధా ధరాధరః || (80)

### 753. అమానీ

- అహంకారము, గర్వము లేనివాడు.
- శరీరమును ఆత్మ అని భ్రమింపకుండువాడు.
- ఎలాగైనా కొలువజాలనివాడు. కొలతలకు అతీతుడు.

**ఓం అమానినే నమః**

మాన్ – పూజాయామ్ – గౌరవించుట, పూజించుట

మానము – గర్వము, అహంకారము (గర్వో అభిమానో అహంకారః – అమరకోశము 1.7.22)

**న మానో గర్వో యస్య ఇతి అమానః.** గర్వము, అహంకారము లేనివాడు అమాని.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భక్తుల విషయంలో ఏమాత్రమూ అహంకారము లేనివాడు అమాని. భగవంతుడు బ్రహ్మాదులచేత కూడా పూజలందుకుంటాడు. కాని పాండవులకు రాయబారిగా వెళ్ళి దుర్యోధనాదులచే మాటలు పడినవాడు. అర్జునునికి సారధియై పగ్గములు పట్టినవాడు. లోకరక్షణార్థమై పందిగాను, చేపగాను, సింహం ముఖంతోను అవతరించినవాడు. అమాని.

అండాళ్. నాచియార్ తిరుమోళి 11.8 – మురికితోనిండి, నీరుకారే వరాహావతారం ధరించి నీటి అడుగున బాధపడుతున్న భూదేవిని రక్షించినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అనాత్మ వస్తుషు ఆత్మాభిమానో న అస్తి ఇతి అమానీ.** ఆత్మ కానివానిని ఆత్మగా భ్రమింపనివాడు అమాని.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – (1) **ఆత్మ సమ్మాన భావరహితః.** అహంకారం లేనివాడు (2) మా-మానే-కొలుచుట. బలము, శక్తి అన్ని మంగళగుణాలలోను భగవంతుని కొలవడం సాధ్యం కాదు. ఎందుకంటే ఆయన అప్రమేయుడు. ఇంతింతని చెప్పరానివాడు.

### 754. మానదః

- తన భక్తులకు గౌరవమిచ్చేవాడు.
- భక్తులకు సన్మానము లభించేలాగును, అధర్మపరులకు సన్మానము లభింపకుండాను చేసేవాడు.
- తన మాయవలన నిజమైన ముముక్షువులకు ఆత్మజ్ఞానం కలిగేలాగును, కపటులకు ఆత్మేతర పదార్థములయందు ఆత్మభావం కలిగేలాగును చేసేవాడు.
- తన భక్తులకు ఆధ్యాత్మిక జ్ఞానం కలిగించేవాడు.

- జగత్తులో అన్నింటికీ ప్రమాణములు ఏర్పరచినవాడు.

## ఓం మానదాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అర్జున, ఉగ్రసేన, యుధిష్ఠిరాదిభ్యో రథిత్వ, అధిరాజ్య, బహుమానమ్ దత్తవాన్ మానదః.** భగవానుడు సారధిగా ఉంటే అర్జునుడు రధికుడయ్యాడు. భగవానుడు పౌరునిగా ఉంటే ఉగ్రసేనుడు రాజయ్యాడు. భగవంతుని దయవలన యుధిష్ఠిరుడు కూడా రాజ్యాన్నిపొంది సన్మానాలందుకొన్నాడు. ఇలా భగవంతుడు తన భక్తులకు గౌరవ మర్యాదలు కలిగించాడు గనుక మానదుడు (మాన=గౌరవము).

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు నాలుగు రకాల అర్థాలు చెప్పారు.

(1) మానము - ఆత్మాభిమానము, ఆత్మభావము; **స్వమాయయా సర్వేషామ్ అనాత్మసు మానమ్ ఆత్మాభిమానమ్ దదాతి ఇతి మానదః.** తన మాయవలన భగవంతుడు అందరిలోను ఆత్మ కానివానిపట్ల ఆత్మ అనే అభిమానము కలిగిస్తాడు గనుక మానదుడు.

(2) మానము - సత్కారము, ద - ఇచ్చుట; **భక్తానామ్ మానమ్ సత్కారమ్ దదాతి ఇతి వా.** భక్తులకు గౌరవ సత్కారములు కలిగించువాడు మానదుడు.

(3) మానము - సత్కారము, ద - నాశనము చేయుట (ద్యాతి); **అధర్మిష్ఠానామ్ మానమ్ సత్కారమ్ ద్యాతి ఇతి వా.** అధర్మపరులకు గౌరవము దక్కకుండా చేసేవాడు మానదుడు.

(4) మానము - (ఆత్మేతరముల పట్ల) ఆత్మ భావము, ద - ద్యాతి - నాశనము చేయుట; **తత్త్వవిదామ్ అనాత్మసు మానమ్ ఆత్మాభిమానమ్ ద్యాతి ఖండయతి ఇతి వా మానదః.** తత్త్వవిదులైనవారికి అనాత్మలపట్ల ఆత్మభావమును నాశనము చేసి ఆత్మజ్ఞానము కలిగించువాడు మానదుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – (అమరకోశము ప్రకారము) మానము - చిత్త సమున్నతి, బుద్ధి వృద్ధి చెందుట. **మానమ్ చిత్త సమన్నతమ్ దదాతి ఇతి మానదః.** తన భక్తుల బుద్ధిని పెంపొందించువాడు మానదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – మానము - పరిమాణము, దద్ - దానే - ఇచ్చుట, దౌ - అవఖండనే - ముక్కలు చేయుట. **మాన దదాతి ఆకర్షణేన, మాన ద్యాతి ఖండయతి వికర్షణేన.** ఆకర్షణ, వికర్షణల ద్వారా జగత్తులో ప్రతిదానికీ ఒక పరిమాణము ఏర్పరచేవాడు మానదుడు. ఇలా అన్నింటికీ రూపము, గుణము ఇత్యాదులు ఏర్పడినాయి. సంబంధాలు నెలకొన్నాయి. ఇందుకు శ్రీ వాసిష్ఠ అనేక ఉదాహరణలు చెప్పారు. భగవంతుడు ఏర్పరచిన ప్రమాణమువల్లనే గ్రహ నక్షత్రాదులు, వివిధ వస్తువులు తమ తమ ఆకారములను, పరిమాణములను, గుణములను కలిగి ఉన్నాయి. ప్రతివస్తువునకూ నిర్దిష్టమైన ఆకారం ఉంది. ఈ విధంగా పక్షుల రూపంనుండి ఎగిరే విమానాలకూ, చేపల రూపంనుండి నీటిలో పయనించే పడవలకూ రూపకల్పనచేసే అవకాశం మనకు లభించింది. అలాగే నీరు నిప్పును ఆర్పడంవంటి అనేక గుణాలు భగవంతుడు ఏర్పరచిన మానములు (ప్రమాణముల)వలన సంభవిస్తున్నది.

ధర్మచక్రము రచయిత – భగవంతుడు భక్తులకు గౌరవము కలిగిస్తాడు. మనం కూడా ఈ నామము ద్వారా భగవంతుని గౌరవించడం, భగవద్భక్తులను గౌరవించడం నేర్చుకోవాలి. జీవితాన్ని వ్యర్థం చేయకుండా, నీచ విషయాలజోలికి పోకుండా, ఆత్మ విషయంపై లగ్నం చేయాలి.

## 755. మాన్యః

- గౌరవింపదగినవాడు, పూజనీయుడు.

## ఓం మాన్యాయ నమః

మాన్-పూజాయామ్-గౌరవించుట, పూజించుట; **మానయితుమ్ యోగ్యో మాన్యః పూజనీయః ఇతి మాన్యః.** పూజించుటకు, గౌరవించుటకు అర్హుడైనవాడు మాన్యుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తదీయత్వేన సన్మానితవ్యో మాన్యః.** భక్తులకు, భగవంతునికి ఉన్న బంధం ఎలాంటిదంటే ఆ భక్తులు తనవారిగా ఉండడం తనకు గౌరవంగా భగవంతుడు భావిస్తాడు. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతంలోని – **న సారథేః సాత్వత కౌరవాణాం కృద్ధస్య ముచ్యతే రణేऽద్య కశ్చిత్** – అనే శ్లోకాన్ని ఉదాహరించారు. రథికుడైన అర్జునుడు కృద్ధుడై ఉన్నందున కౌరవులలోగాని, సాత్త్వతులలోగాని ఎవరూ మరణంనుండి తప్పించుకోలేరని కృష్ణుడన్నాడట.

శ్రీ నమ్మాళ్వారు. పెరియ తిరువంతాడి 53 – భక్తులకోసం ఏమి చేయాలన్నదే నిరంతరం నీ ఆలోచన.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వైః మాననీయః పూజనీయః సర్వేశ్వరత్వాత్ ఇతి మాన్యః.** భగవంతుడు సర్వేశ్వరుడైనందున అందరిచేత పూజింపదగినవాడు, గౌరవింపదగినవాడు గనుక మాన్యుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుని కారణంగా సకలం ఉంది, నడుస్తుంది. కనుక భగవంతుని పూజించాలి. ఈశావాస్యోపనిషత్తు 1 – **ఈశావాస్యమిదమ్ సర్వం యత్కించ జగత్యామ్ జగత్.** ఆ ఈశ్వరుడే సకల జగత్తునకు సృష్టికర్త, రక్షకుడు.

శ్రీ చిన్మయానంద శ్రీ శంకరాచార్యుల వివేకచూడామణినుండి ఉదాహరించారు – **ధన్యః స మాన్యో భువి.** ఇక్కడ పరమాత్మను తెలిసికొన్నవారే భూమిపై ధన్యులు, మాన్యులు అని చెప్పబడినది. ఇలా పరమాత్ముని గురించి తెలిసికొన్నవారు మాన్యులైతే ఇంక సాక్షాత్తు పరమాత్ముని గురించి ఏమి చెప్పాలి?

ఈ నామం వ్యాఖ్యానంలో శ్రీ భట్టుల మరియు శ్రీ శంకరుల వ్యాఖ్యానాలలో తేడాను ఇంకోమారు గ్రహింపవచ్చును. శ్రీ భట్టులు భగవంతుని భక్తవాత్సల్యాన్ని ప్రస్తుతించారు. శ్రీ శంకరులు భగవంతుని పరత్వమును, పరమేశ్వరత్వాన్ని కొనియాడారు.

శ్రీ శాస్త్రి – **అమానీ, మానదః, మాన్యః** - ఈ మూడు నామముల ద్వారా భగవంతుడు అందరికంటే గౌరవనీయుడు అని కాదు చెప్పబడింది. భగవంతుడు తన భక్తులకు గౌరవ సత్కారాలు లభించేలా చూస్తాడని (**మానదః**), మరియు భగవంతునికి భక్తుల గౌరవం ఎంతో ప్రియమైనదని (**మాన్యః**).

ధర్మచక్రము రచయిత – భగవంతుడు మాన్యుడు (పూజనీయుడు) అయినప్పటికీ ఆ సంగతి ఆయన నిజమైన భక్తులకే తెలుస్తుంది. వారే తమ ఐహికవాంఛలను అధిగమించి భగవంతుని అన్వేషించగలరు.

ఈ నామము వ్యాఖ్యానంలో మరొక విషయం కూడా గమనించవచ్చును. విష్ణు సహస్ర నామమునకు వివిధ వ్యాఖ్యానాలు ఉండడానికి రెండు కారణాలు గోచరిస్తున్నాయి (1) ఆయా వ్యాఖ్యానకర్తలు మహా భక్తులు, జ్ఞానులు. కనుక తమ తమ భగవదనుభవాలను తమ వ్యాఖ్యానాలద్వారా మనకు ప్రసాదించారు (2) వారు శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణాదులను తమదైన దృక్పథంలో వివరించి తమ తమ సిద్ధాంతాలకు ఆధారములు, విశ్వసనీయత సమకూర్చుకున్నారు.

ఈ నామమునకు ద్వైత వ్యాఖ్యానంలో ఈ విషయం అర్థమవుతుంది. ద్వైత సంప్రదాయం ప్రకారం శ్రీ అమ్మవారి గురించి ఇలా చెబుతారు. (1) ఆమె జీవుడు. కాని తక్కిన అందరు జీవులకంటె అధికురాలు (2) ఆమె విభువు, కాని విష్ణువుకంటె పరత్వములో తక్కువ. ద్వైతాచార్యులైన శ్రీ సత్యసంధ యతిరాజ ఈ **'మాన్యః'** నామమును 'మా+అన్య'గా పరిగణించి రెండు భావాలు చెప్పారు. **(1) మాయా రమాయా అన్యా చేష్టనీయా అస్య ఇతి మాన్యః (2) మాయా రమా ఉపలక్షిత జీవరాశేః అన్యో భిన్న ఇతి మాన్యః.** ఈ రెండు వివరణలూ ద్వైత సిద్ధాంతాలకు సరిపోతాయి.

శ్రీ శంకరులూ, శ్రీ భట్టులూ **'మాన్యః'** నామమును 'మాన్' అనే ధాతువు ఆధారంగా వివరించారు. అనగా గౌరవింపదగినవాడు అని. ద్వైతాచార్యులు మాత్రము ఈ నామమును 'మా-అన్య' అని గ్రహించారు.

## 756. లోకస్వామీ

- లోకములకు ప్రభువు. లోకమలే ఆయనవి.

### ఓం లోకస్వామినే నమః

స్వామ్ - ఐశ్వర్యము; **స్వామ్ ఐశ్వర్యమ్ అస్య అస్తి ఇతి స్వామీ** (అమరకోశము) – అనగా ఐశ్వర్యము కలిగినవాడు స్వామి; **స్వామిన్ ఐశ్వర్యే** (పాణిని సూత్రము 5.2.126) కూడా ఇదే అర్థం చెబుతున్నది. ఇలా లోకస్వామి అనగా లోకములకు ప్రభువు అని అర్థము

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు భక్తసులభుడైనందున లోకస్వామి. ఇక్కడ నాలుగు వరుస నామములకు శ్రీ భట్టుల వ్యాఖ్యానాలు ఇలా ఉన్నాయి.

753 – **అమానీ** – అహంకారము, గర్వము లేనివాడు.

754 – **మానదః** – తన భక్తులకు గౌరవమునిచ్చేవాడు.

755 – **మాన్యః** – భక్తులు తనవారిగా ఉండడం తనకు గౌరవంగా తలచేవాడు.

756 – **లోకస్వామీ** – ఆయన అమాని, మానదుడు, మాన్యుడు అయినందున, తన సౌలభ్యం కారణంగా, లోకస్వామి. **క ఏవం కర్మకరః? లోకస్వామీ.**

భగవంతునికి భక్తులపై ఉన్న ప్రేమ శ్రీ భట్టుల వ్యాఖ్యానంలో ప్రముఖంగా కనిపించే అంశము. అంటే భగవంతుని పరత్వం కారణంగా కాదు, ఆయ సౌలభ్యం కారణంగా లోకస్వామి. ఆయన మానుష రూపావతారాలలో కూడా ఆయన పరత్వము పూర్తిగా ఆయనతో ఉంటుంది. కాని ఆయన ఒక మానవునిగా కనుపించి ప్రవర్తిస్తాడు. ఎందుకంటే ఆయన భక్తులకు అందుబాటులో ఉడడానికి. **అహమ్ మానుషమ్ మన్యే.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **చతుర్దశానామ్ లోకానామ్ ఈశ్వరత్వాత్ లోకస్వామీ.** పదునాలుగు లోకములకు ప్రభువైనందున లోకస్వామి. కౌషీతకి ఉపనిషత్తు 3.9 – **ఏష లోకాధిపః.**

శ్రీ చిన్మయానంద – భగవంతుడే లోకాలకు అన్నింటికీ సృష్టికర్త, ప్రవర్తకుడు, నిర్దేశకుడు. జీవులలోని అన్ని విధాలైన అనుభవాలకు సదా అధిపతి. వస్తువులలో చైతన్యము. కనుక ఆయన లోకస్వామి.

శ్రీ వాసిష్ఠ – లోకములే తనకు ఐశ్వర్యముగా కలవాడు లోకస్వామి.

## 757. త్రిలోకధృత్

- మూడు లోకములను ధారణ చేసినవాడు.
- అవస్థాత్రయమునకు అధినేత.

### ఓం త్రిలోకధృతే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అశేషాణామపి ధారణ పోషకయోః భారకత్వాత్ త్రిలోకధృత్.** (ధృ - ధారణే - భరించుట, ఆధారము అగుట). మూడు లోకములకు ఆధారమైనవాడు త్రిలోకధృత్. మూడు లోకములను సృజించినవాడే వానిని పోషించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **త్రీన్ లోకాన్ ధారయతి ఇతి త్రిలోకధృత్.** మూడు లోకములను ధరించువాడు త్రిలోకధృత్.

శ్రీ చిన్మయానంద – త్రిలోకములనగా జాగ్రత్, స్వప్న, సుషుప్తి అను మూడు అవస్థలు. జీవులలో చైతన్యరూపుడైన భగవంతుడు ఈ మూడు అవస్థలకును అధిపతి. ఎందుకంటే మూలమైన ప్రాణము లేకుండా ఈ మూడు అవస్థలూ ఉండవు.

## త్రిలోకధృక్

### ఓం త్రిలోకధృజే నమః

కొందరు వ్యాఖ్యాతలు ఈ నామమునకు 'త్రిలోక ధృక్' అనే పాఠాన్ని గ్రహించారు. ఈ పాఠానికి కూడా ఇంచుమించుగా 'త్రిలోక ధృత్' నామానికి చెప్పిన అర్థమే చెప్పారు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **త్రిలోక ధృగ్ ఇతి ధారకతయా పాలకతయాశ్చ త్రిలోకీమ్ ధర్జతి గచ్ఛతి ఇతి తస్య స్వాభావికోऽయమ్ ధర్మః.** మూడు లోకములనూ నడపడం ఆయన స్వభావము (ధృజ్-గతౌ-వెళ్ళుట).

శ్రీ సత్యసంధ యతిరాజ – **త్రి లోకాన్ ద్యు పృథ్వీ అంతరిక్షాన్ ధరతి ఇతి త్రిలోక ధృత్.**

శ్రీ శంకరులు, శ్రీ భట్టులు 'త్రిలోక ధృత్' అనే పాఠాన్ని, శ్రీ సత్యసంధ యతిరాజ 'త్రిలోక ధృక్' అనే పాఠాన్ని తమ తమ వ్యాఖ్యానాలలో చెప్పారు.

## 758. సుమేధాః

- మంచి తలంపు, బుద్ధి, జ్ఞాపకశక్తి కలవాడు.

### ఓం సుమేధసే నమః

మేధ = జ్ఞాపకశక్తి, తెలివి; సు-మేధ = గొప్ప, మంచి జ్ఞాపకశక్తి, తెలివి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆరాధక సుసాధు బుద్ధిః సుమేధా.** భగవంతుడు సదా తన భక్తుల క్షేమము గురించి తలుస్తూ ఉంటాడు గనుక ఆయన 'సుమేధాః'

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శోభనా మేధా ధారణవతీ ధీః అస్య ఇతి సుమేధాః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శోభనా మేధా ప్రజ్ఞా అస్య ఇతి సుమేధాః.** గొప్ప బుద్ధి, తెలివి కలవాడు 'సుమేధాః'

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – 'గొప్ప తెలివి' అనగా జరుగబోయేవి అన్నీ తెలిసి ఉండడంచేత ఏ ఘటనవల్లా కూడా కలత చెందకుండుట.

శ్రీ చిన్మయానంద – మనుషుల విషయంలో 'సుమేధస్సు' అనగా ఆత్మను గురించిన జ్ఞానమును సాధించే ప్రజ్ఞ. ఇది క్రొత్త విషయం కాదుగాని ప్రస్తుతం మనకు అందుబాటులో లేనిది. కనుక 'సుమేధస్సు' అనగా దివ్యమైన జ్ఞాపకశక్తి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – మేధ - రక్షణ, ఆధారము కలిగించగలిగే తెలివి. భగవంతునికి మూడు కాలాలలోను జరిగే విషయాలు తెలుసు. కనుక ఆయనది సుమేధస్సు. ఈ విషయం తెలుసుకొన్న మానవుల మేధ ఉత్తమమైనది అవుతుంది.

ధర్మచక్రము రచయిత – జ్ఞానం సాధించే శక్తి మనలో ఉంది కాని శ్రద్ధాభక్తులు లేక అది మరుగున పడింది. భగవధ్యానంతో దానిని మేల్కొలిపి, మనస్సును, మాటను, చేతలను నియంత్రించడం సాధ్యమౌతుంది.

## 759. మేధజః

- యాగఫలముగా జన్మించినవాడు.
- యాగఫలముగా తెలియవచ్చువాడు.
- భక్తుల సత్సంగములో ఉండేవాడు.

### ఓం మేధజాయ నమః

**దేవకీ కృత పుత్రీయవ్రత యజ్ఞేచ యస్య వైః జనిత్సు మేధజ స్స స్యాత్ సప్తార్ణః పుత్రదాయకః -** ఈ నామమునందు 'మేధ' అనగా యజ్ఞము. గత జన్మలలో కుమారులకోసం దేవకి చేసిన వ్రతముల ఫలంగా జన్మించినవాడు. ఈ నామము సప్తాక్షరి. పుత్ర సంతానమునిచ్చును. ఓం మేధజాయ నమః.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అతో మేధే దేవకీ పుత్రీయవ్రతరూపే యజ్ఞే జాతః ఇతి మేధజః.** దేవకి ఒనరించిన పుత్రవ్రతముల ఫలితంగా జన్మించినవాడు మేధజుడు. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణము –

**స్తుతోऽహమ్ యత్ త్వయా పూర్వమ్ పుత్రార్థిన్యా తదద్యతే**
**సఫలమ్ దేవీ! సంజాతమ్ జాతోऽహమ్ యత్తవోదరాత్**

దేవీ! నన్ను కొడుకుగా కోరి పూర్వము నీవు నన్ను స్తుతించావు. అందుకు ఫలముగా నేను నీ గర్భమున జన్మించాను – అని భగవానుడు దేవకీదేవితో అన్నాడు.

విష్ణుధర్మము 33.9 – **సద్యాగార్థితేశోక్తమ్ యత్ ప్రసన్నేన తే శుభే! తత్కృతమ్ సఫలమ్ దేవీ......** మంగళప్రదమైన దేవీ! నీవు ఇదివరకు నన్ను అర్చించినపుడు నేనొసగిన వరము ఫలముగా జన్మించాను.

శ్రీ వి.వి. రామానుజన్ మరికొన్ని ఉదాహరణలు చెప్పారు. అదితి ఆచరించిన పయోవ్రతం ఫలితంగా ఆమె గర్భమున శ్రీనివాసుడు వామనావతారుడై జన్మించాడు. దశరధుడు పుత్రకామేష్టియాగం చేయగా శ్రీరాముడు జన్మించాడు. తాము చేసిన తపస్సుమూలంగా యశోదా నందగోపులకు శ్రీకృష్ణుని పెంచే భాగ్యం కలిగింది. శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉదాహరించిన విషయం – కంచిలో బ్రహ్మ చేసిన తపస్సు కారణంగా శ్రీ వరదరాజస్వామి వెలిశాడు.

శ్రీ చిన్మయానంద – ప్రతియజ్ఞంలోనూ భగవానుడు దర్శనమిస్తాడు గనుక ఆయన మేధజుడు. గీత ప్రకారం ఏదైనా సత్కార్యం కొరకు భగవంతుని పూజిస్తూ సమిష్టిగా నిర్వహించేది యజ్ఞము. భగవంతుడిచ్చే వరమే ఆ యజ్ఞఫలము. ఒక వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా భగవంతునికి సమర్పిస్తే ఆత్మజ్ఞానం లభిస్తుంది. వేదాంతాన్ని అభ్యసించేవారికి దీనిలో అనేక అంతరార్థాలు స్ఫురిస్తాయి.

ధర్మచక్రము రచయిత – భూత యజ్ఞము, పితృయజ్ఞము, నరయజ్ఞము, ఋషియజ్ఞము, దేవయజ్ఞము అనే పంచమహాయజ్ఞాలను ఆచరిస్తే భగవంతుని సాన్నిధ్యం, ఆత్మసాక్షాత్కారం లభిస్తాయి.

శ్రీ బలదేవ విద్యాభూషణ – మేధ్ - సంగమే - కలియుట; **మేధ - భక్త సంగమే జాయతే ప్రాదుర్భవతి ఇతి మేధజః.** భక్తుల సమావేశములలోనికి ఏతెంచువాడు మేధజుడు.

## 760. ధన్యః

- ధన్యుడు, అదృష్టము కలిసివచ్చినవాడు.

### ఓం ధన్యాయ నమః

ధనము - సంపద; **ధన ధర్మ సాధుః ధన్యః** (అమరకోశము); **ధన గణం లబ్ధా, యత్** - పొందినవాడు, **ధన్యః** - ధనము పొందినవాడు (పాణిని 4.4.84)

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ధన్యస్తు దేవకీ జన్మ ధన లాభాది స్మృతః.** దేవకీ గర్భాన జన్మించడమే తన అదృష్టంగా భావించినవాడు ధన్యుడు.

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుడు జన్మ లేనివాడు. అజుడు. కనుక ఒక తల్లి కడుపున పుట్టడం ఆయనకు ఆనందం కలిగించింది. (కంచి పూర్వమఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి తన పదవ యేటనే మఠాధిపతి అయ్యారు. కనుక తాను పెద్దల కాళ్ళకు సాష్టాంగప్రమాణం చేసే అదృష్టానికి దూరమయ్యానని ఒకమారు అన్నారట).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కృతార్థో ధన్యః.** భగవంతుడు పూర్ణకాముడు. కృతార్థుడు. పరిపూర్ణుడు. ఆయనకు ఇంక తీరవలసిన కోరికలు లేవు. కనుక ఆయన ధన్యుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సుకృతి పుణ్యవాన్ ధన్యః.** భగవంతుడు తన భక్తులు సమర్పించే పుష్పాదులను స్వీకరిస్తూ భక్తుల యోగక్షేమములను వహించును. ఇది ఆయన సుకృతి, పుణ్యకార్యము. కనుక ధన్యుడు.

ధర్మచక్రము రచయిత – ధన్యుడనగా క్రిందటి జన్మల పుణ్యఫలాన్ని అనుభవించేవాడు. అంతిమస్మృతి వలన తరువాతి జన్మ నిర్ణయమౌతుంది. జీవితమంతా సత్కార్యాలు ఆచరిస్తే ఉత్తమ అంతిమస్మృతి కలుగుతుంది. అపుడు వచ్చే జన్మలో మనం ధన్యులము అవుతాము. ఈ నామాన్ని ధ్యానించి ఆ విషయాన్ని గ్రహించాలి.

## 761. సత్యమేధాః

- సత్యమైన వర్తన (నటన కానిది, వాస్తవమైనది) కలిగినవాడు.
- సత్యమైన జ్ఞానము (అనంతము) కలిగినవాడు.
- వేదములకు నిజమైన అర్థము తెలిసినవాడు.

### ఓం సత్యమేధసే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **మేధా సత్య అస్య, న నటనామాత్రమ్ ఇతి సత్యమేధాః.** ఆయన చేష్టలు నటన కావు. అవన్నీ దాపరికంలేని నిజాలు. ఈ భగవద్గుణాన్ని 'ఆర్జవము' అని శ్రీ వి.వి. రామానుజన్ వర్ణించారు.

**పల్లవీ వసుదేవాది పాజాత్య స్వాభిమానినీ మేధా యస్యాపి సత్యా సః సత్యమేధాః ప్రకీర్తితః.** గోపికలతోను, వసుదేవుడు మొదలయినవారితోను నటన కాకుండా నిజంగానే స్వజాతీయుడై చరించే వాస్తవబుద్ధి కలవాడు. అవతారమునందలి చేష్టలు సత్యముగా ఉండేవాడు 'సత్యమేధాః'. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణలు –

విష్ణుపురాణము 5.13.11, 12 –

**యదివోఽస్తి మయి ప్రీతిః శ్లాఘ్యోఽహమ్ భవతామ్ యది తదాదమ్ బుద్ధిః సదృశీ బుద్ధిర్వః క్రియతామ మయి**

**నాఽహం దేవో న గంధర్వో న యక్షో న చ దానవః అహం వో బాంధవో జాతః నవశ్చింత్యమ్ అతోఽన్యథా**
నేనంటే మీకు నిజమైన ప్రేమ ఉంటే గనుక, నన్ను మీరు పొగడాలనుకుంటే గనుక, నన్ను మీలో ఒక గోపబాలునిగా భావించండి. నేను దేవుడిని కాను, యక్షుడను కాను, దానవుడిని కాను. మీ బంధువుగా జన్మించినవాడను. మరేమీ కాను.

రామాయణం. యుద్ధకాండ. రాముడు ఇలా అన్నాడు – **ఆత్మానమ్ మానుషమ్ మన్యే రామమ్ దశరథాత్మజమ్.** దశరధుని కుమారుడను, మానవుని అయిన రాముడిని అని నన్ను నేను భావిస్తాను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సత్యా అవితథా మేధా యస్య ఇతి సత్యమేధాః.** ఎన్నడూ విఫలముకాని నిజమైన మేధస్సు కలిగినవాడు. అకుంఠితము, అద్భుతము అయిన తెలివి కలవాడు. భగవానుని మేధాశక్తిని ఎవరు వర్ణింపగలరు?

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – వేదములు, వేదాంగముల గురించి నిజమైన జ్ఞానము భగవానునకు మాత్రమే ఉన్నది. కనుక ఆయన 'సత్యమేధాః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కల్పాదినుండి కల్పాంతమువరకు సకల చరాచరముల గురించిన జ్ఞానము, వానిని సృష్టించి, జీవము నిలిపే శక్తి ఉన్నందున భగానుడు 'సత్యమేధాః'.

ధర్మచక్రము రచయిత – భగవానుడు ధర్మము ఆచరించేవారికి నిజమైన జ్ఞానమును కలుగజేయును.

## 762. ధరాధరః

- కొండనెత్తినవాడు (గోవర్ధనగిరిధారి).
- భూమిని ధరించినవాడు.

### ఓం ధరాధరాయ నమః

ధర - కొండ; ధరా - భూమి; ధర+ఆధారః, ధరా+ధరః, ధరా+ఆధారః – అని ఈ నామమును మూడు విధములుగా భావింపవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'ధరమ్' అనగా కొండ అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **ధరమ్ ధృతవాన్ ధరాధరః** – అని నిరుక్తిలో ఉన్నది. గోపకులపై కోపంతో ఇంద్రుడు రాళ్ళ(వడగళ్ళ) వాన కురిపించాడు. అప్పుడు గోకులాన్ని రక్షించడానికి కృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తిపట్టాడు. అలా ఆయన ధరాధరుడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణంనుండి ఉదాహరించారు –



గోవర్ధనగిరి నెత్తిన శ్రీకృష్ణుడు. నారాయణ తిరుమలలో పటం. వికీపీడియా నుండి . రాజశేఖర్ చిత్రం.

**తదేతద్ అఖిలమ్ గోష్ఠం త్రాతవ్యమ్ అధునా మయా**
**ఇమమ్ అద్రిమ్ అహం ధైర్యాత్ ఉత్పాట్యాఽఽసు శిలామయమ్**
**ధారయిష్యామి గోష్ఠస్య పృథుచ్ఛత్రమివాపరమ్**
ఈ గోశాలను, గోవులను కాపాడవలసిన బాధ్యత నాపై యున్నది. పెద్ద శిలలతో కూడి ఈ కొండను గొడుగువలె ఎత్తిపట్టగలను – అని కృష్ణుడన్నాడు.

శ్రీ అన్నమయ్య – **కొండ గొడుగుగా గోవుల గాచిన కొండొక శిశువుకు గొబ్బిళ్ళో.**

శ్రీ వి.వి. రామానుజన్ ఆళ్వారుల రచనలనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'ధరా' అనగా 'భూమి' (ధరామ్ ధారయన్ ధరాధరః) అన్న అర్థంలో వ్యాఖ్యానించారు., **అంశైః అశేషైః శేషాద్యైః అశేషామ్ ధరామ్ ధారయన్ ధరాధరః.** తన విభూతులైన అష్టదిగ్గజములు, ఆదిశేషుడు మొదలగువానిద్వారా సమస్త ధారుణీమండలమును ధరించిన శ్రీహరియే ధరాధరుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి శృతినుండి ఉదాహరించారు – **యే నే మే విధృతే ఉభే, విష్ణునా విధృతే భూమి, దాధర్తమ్ పృథ్వీమభితో మయూఖైః.**

శ్రీ చిన్మయానంద 'భూమిని ధరించేవాడు ధరాధరుడు' అనే భావాన్నే మరొక కోణంలో వివరించారు. 'భూమి' అంటే పదార్థము అనుకోవచ్చును. ఈ పదార్థము తన సూక్ష్మ, మరియు స్థూల రూపాలలో కూడా భగవంతునిద్వారానే వ్యక్తమవుతుంది. భౌగోళికంగా చూచినట్లయితే భూమికి నీరు ఆధారము. నీటికి వాతావరణము, వాతావరణానికి అంతరిక్షము ఆధారములు. అంతరిక్షము అనే భావమును మన మనసుద్వారా అర్థం చేసుకోవాలి. మనసుకు అర్థమవ్వడం అంటే చేతనవల్ల కలుగుతుంది. ఇలా సకలజగత్తుకూ నారాయణుడే ఆధారము.

ధర్మచక్రము రచయిత – సూక్ష్మరూపంలో ఉన్న పంచభూతాలు స్థూలరూపంలో దృశ్యమైన జగత్తును ఏర్పరుస్తాయి. పంచభూతాలకు సృష్టికర్త, ఆధారము భగవంతుడే. ఆయన ధరాధరుడు. 'ఓం ధరాధరాయనమః' అనే మంత్రంలో అనేక అంతరార్థాలు నిబిడీకృతమై ఉన్నాయి.



**శ్రీ వేంకటేశ్వర వచనములు – శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్య**

శ్రీ పురుషోత్తమా! కరిరాజుం గాచితివి. కొలువు లోపల ద్రౌపది మానంబు నిల్పితివి. ప్రహ్లాదుని మాటలాలించితివి. శరణుసొచ్చిన విభీషణుని రక్షించితివి. రావణ కుంభకర్ణాదుల వధియించి లంక నేలించితివి. పాతాళంబు బలికి నొసగితివి. ధ్రువునికి ధ్రువంబుగాఁ బట్టంబు గృపచేసితివి. నిన్నెవ్వరెఱింగి నుతింతురు వారికి నీ పదవులిచ్చి రక్షింతువు. శ్రీ వేంకటేశ్వరా!



## తేజోవృషో ద్యుతిధరః సర్వశస్త్రభృతాంవరః |
## ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః || (81)

### 763. తేజోవృషః

- రక్షణ అనే తన వైభవాన్ని భక్తులపై వర్షించేవాడు.
- సూర్యునిరూపంలో వర్షమునకు మూలమైనవాడు.
- తన కాంతిని అన్నింటిపై వర్షించువాడు.
- తన భక్తుల రక్షణకై తన భీకరాయుధములను శత్రువులపై వర్షించువాడు.

**ఓం తేజోవృషాయ నమః**

తిజ్ - నిశానే - తడుపుట; తేజ్ - నిశానే, పాలనే చ - తడుపుట, రక్షించుట;

తేజస్ - కాంతి, ప్రకాశము, వైభవము

వృష్ - సేచనే - వర్షించుట, చల్లుట; వర్షతి ఇతి వృషః - వర్షించునది వృషః

ఈ ధాతువుల ఆధారముగా వివిధ వ్యాఖ్యలు ఉన్నాయి.



బృందావవనంలో రాసలీల. వికీపీడియా చిత్రం

https://commons.wikimedia.org/wiki/File:Ras_Leela_of_Lord_Krishna.jpg

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'తేజ్' అనగా 'రక్షణ' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. **ఏవమ్ సుహృత్ పాలన లక్షణమ్ తేజో వర్షతి ఇతి తేజోవృషః.** ఇలా ఆయన తన రక్షణ అనే వైభవాన్ని సజ్జనులపై వర్షిస్తాడు గనుక ఆయన తేజోవృషుడు. శ్రీ భట్టులు కృష్ణావతారపరంగా వ్యాఖ్యానించిన నామాలలో ఈ నామం వస్తుంది. కనుక గోపుల, గోపబాలుర రక్షణ ఈ వ్యాఖ్యలో సూచింపబడింది. **తేజోఽభి వర్షతి యతః సుహృత్పాలన లక్షణమ్ తేజోవృష స్సమాఖ్యాతః వస్వర్ణో మిత్రవృద్ధిదః -** తన మిత్రులను, సజ్జనులను కాపాడటము అనే తేజస్సును వర్షించువాడు తేజోవృషుడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. మిత్రులను పెంపొందించును. ఓం తేజోవృషాయ నమః.

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుడు తన భక్తులపై తన రక్షణ అనే తేజస్సు లేదా శక్తిని వెదజల్లును. గోకులంలోని అమాయకులు కన్నయ్యను మనసారా ప్రేమించారు. తల్లి ఆవు తన దూడకు పాదుగునిచ్చినట్లుగా శ్రీకృష్ణుడు గోకులవాసులపై తన కటాక్షాన్ని, రక్షణను వెదజల్లినాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'తేజస్సు' అనగా 'నీరు' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **తేజసామ్ అంభసామ్ ఆదిత్యరూపేణ వర్షణాత్ తేజోవృషః.** సూర్యునిద్వారా వర్షమును కురిపించేవాడు తేజోవృషుడు.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – **తేజాంసి ఆదాయ ఆదిత్యరూపేణ వర్షతివా.**

ధర్మచక్రము రచయిత – సముద్రంలో నీరు సూర్యునిద్వారా మంచినీరుగా మారి వర్షిస్తుంది. అలాగే భగవంతుని కారణంగా మనలోని మాలిన్యాలు నశించి మనసు పరిశుద్ధమవుతుంది. నీరు లేకుండానూ, దేవుడు లేకుండానూ జీవించడం అసాధ్యం.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – (తేజస్ - కాంతి). **శ్రీవిగ్రహాత్ తేజస్వినః ప్రభాకిరణాః సర్వతః ప్రసరన్తి.** ఆయన దివ్యమంగళ స్వరూపంనుండి అన్నింటిపైనా తేజస్సు ప్రసరిస్తుంది. అన్ని జీవులలోని చైతన్యము, కాంతి కూడా భగవంతుని కారణమువల్లనే కలుగుతుంది.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **స్వ-బంధు రక్షాయై చక్రాది దుఃసహాని తేజాంసి వర్షతి ఇతి తేజోవృషః.** తన బంధువులను (భక్తులను) కాపాడడంకోసం చక్రమువంటి తీవ్రమైన ఆయుధాలను (శత్రువులపై) వర్షించేవాడు తేజోవృషుడు.



గోపబాలకులతో దాగుడుమూతలు. 1750 కాలపు బషోలీ శైలి చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:The_Gopas_Play_Blindman%27s_Buff.jpg

**శ్రీ పోతన భాగవతము. శ్రీ కృష్ణుడు దావాగ్ని భక్షించి గోపకులను కాచుట.**

అడవిలో దావాగ్ని వ్యాపించి తమను చుట్టుముట్టగా గోపకులు భయంతో కలతపొంది శ్రీ బలరామసహితుడైన శ్రీకృష్ణునికి సాగిలపడి ఇలా మ్రొక్కారు.

అభ్రంకష ధూమాయిత
విభ్రాంత మహాస్ఫులింగ విసరోగ్ర శిఖా
విభ్రష్ట దగ్ధలోకా
దభ్రంబై వచ్చెఁజూడు దవశిఖి కృష్ణా!

**నీ చుట్టాలకు నాపదల్ గలుగునే! మేమెల్ల నీవార; మ**
**న్యాచారంబు లెఱుంగ, మీఁశుడవు మా; కాభీలదావాగ్ని నేఁ**
**డే చందంబున నింక దాఁటుదుము? మమ్మీక్షించి రక్షింప వ**
**న్నా! చంద్రాభ! విపన్నులస్ శిఖివితానచ్ఛన్నులస్ ఖిన్నులస్**

అపుడు శ్రీకృష్ణుడు

బంధుజనంబు చేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁ డో
బంధువులార! మీ నయన పంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధినడంతు నే ననినఁ జక్కన వాఱలు నట్ల చేయుడున్
బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్

## 764. ద్యుతిధరః

- దివ్యప్రకాశము కలవాడు.

### ఓం ద్యుతిధరాయ నమః

**'ద్యుతిధరః'** అనేపదము **'ఓజస్తేజోద్యుతిధరః'** అనే 276వ నామములో ఒక భాగంగా ఇంతకుముందు వచ్చింది. ద్యుతి - దీప్తౌ - ప్రకాశించుట. దేవతలకుండే దివ్యమైన కాంతిని వర్ణించడానికి ఈ పదాన్ని వాడుతారు. ధరః - ధరించుట, రక్షించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – చిన్నికృష్ణునిగా ఉన్నప్పుడే ఇంద్రునికూడా విస్మయపరచే కాంతి కలిగినవాడు ధ్యుతిధరుడు. **అమానుషీం యో ధృతవాన్ ద్యుతిమైంద్రాది భావుకామ్ ఖ్యాత స్స హి ద్యుతిధరః వస్వర్ణః కాంతిదో మనుః -** ఇంద్రాదిదేవతలనుకూడ మోహింపజేయగలది, మానవులకెవరికీ లేనిది అయిన కాంతిని ధరించిఉండేవాడు ధ్యుతిధరుడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. కాంతిప్రదము. ఓం ద్యుతిధరాయ నమః.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **అతిశయ కాంతి సంపన్నః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుని సర్వాంగములు కాంతితో ప్రకాశించుచున్నవి గనుక ఆయన ద్యుతిధరుడు. (79వ శ్లోకములో **'సువర్ణవర్ణః హేమాంగః వరాంగః చందనాంగదీ'** అని భగవంతుని సౌందర్యమును, కాంతిని వర్ణించారు.)

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సూర్యుడు, చంద్రుడు, దేవతలు, మెరుపు, రత్నాలు ఇలా అన్నింటిలోని కాంతి భగవంతునివల్లనే కలుగుచున్నది. మనందరిలోని కాంతియును భగవంతుని అంశయే.

శ్రీ చిన్మయానంద – భగవంతుని అంశవలన మనలో కలిగిన కాంతియే మనకు చైతన్యమును, తెలివిని, ఆలోచనలను, భావోద్వేగములను కలిగించుచున్నవి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ద్యుతి - ప్రకాశము కలవాడు; ధర - రక్షించువాడు. **స్వయం ప్రకాశమానః సర్వమ్ ధరతి ఇతి, వాస్తవిక అర్థః ప్రకాశమానః సర్వస్య ఆధారశ్చ ఇతి.** కాంతి కలిగినవాడు, అన్నింటినీ అందరినీ రక్షించేవాడు ద్యుతిధరుడు.

ధర్మచక్రము రచయిత – ఇక్కడ 'ద్యుతి' అంటే కేవలం శారీరిక కాంతి కాదు. ఆత్మప్రకాశము. బాహ్యసౌందర్యం కారణంగా కామాది లక్షణాలు పెరుగుతాయి. ఆత్మప్రకాశంవలన భక్తి పెరుగుతుంది. ఇది ద్యుతిధరుని లక్షణము. 'రాముడుండే చోట కామము ఉండదు. కామముండే చోట రాముడుండడు.'

భగవంతుని ప్రతి అవయవము ప్రకాశమానము. భక్తిని పెంపొందించును. శ్రీ స్వామిదేశికన్ శ్రీ భగవధ్యాన సోపానము, శ్రీ దేవనాయక పంచశతి వంటి స్తోత్రాలలో ఈ విషయం తెలియవస్తుంది.

## 765. సర్వశస్త్రభృతాంవరః

- అన్ని అస్త్రములు ధరించినవారిలో శ్రేష్ఠుడు.

### ఓం సర్వశస్త్రభృతాంవరాయ నమః

శస్ - హింసాయామ్ - ఖండించుట, బాధించుట; శస్త్రము - ఆయుధము.

భృ - ధారణ పోషణయోః - భరించుట, ధరించుట; భృత్ - ధరించినవాడు

వృ - వరణే - ఎన్నుకొనుట; వారితుమ్ అర్హః వరః - ఎన్నుకొనుటకు తగినవాడు, శ్రేష్ఠుడు వరుడు.

సర్వేషామ్ శస్త్ర భృతామ్ మధ్యే వరః శ్రేష్ఠః – ఆయుధములు ధరించినవారిలో శ్రేష్ఠుడు .

శ్రీహరి దుష్టరాక్షసుల సంహరణార్థము అనేక అవతారములలో వివిధ శస్త్రములను ధరించిన కారణమున ఆయన సర్వశస్త్రభృతాంవరుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – నరకుడు, జరాసంధుడు వంటి అసురులతో యుద్ధము చేసినపుడు గొప్పగా ఆయుధములు ప్రయోగించినవాడు సర్వశస్త్రభృతాంవరుడు. మానుషరూపంలో అవతరించినపుడు వివిధ ఆయుధాలు ప్రయోగించడం భగవంతునకొక లీల.



నరకాసుర వధ. 1520 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Narakasura.jpg

**మనుష్య ధర్మ లీలస్య లీలాసా జగత్పతేః అస్త్రాణ్యనేక రూపాణి యదరాతిషు ముంచతి** – విష్ణుపురాణము 5.22.14

మనుష్యని రూపంలో క్రీడిస్తున్న జగత్పతికి అనేక అస్త్రాలు ప్రయోగించడం కేవలం ఒక క్రీడ.

**పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్**

**ఝుషాణామ్ మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ** – గీత 10.31

పవిత్రమొనర్చువానిలో (లేదా వేగము కలవానిలో) నేను వాయువును. శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను నేను. మత్స్యములలో మొసలిని నేను. నదులలో గంగానదిని నేను.

శ్రీ చిన్మయానంద – ఆయుధధారులలో భగవంతుడు శ్రేష్ఠుడు అనడానికి కారణం ఆయన ధర్మరక్షణకు, లోకముల పునరుద్ధరణ (constructive destruction) కు ఆయుధములు వాడుతాడు. అందుకే ఆయన చక్రము పేరు 'సు-దర్శనము'. అంతే కాక సాధనలలో ప్రగతిని పొందినకొలదీ భక్తుల బంధనములను తెంచివేసేవాడు నారాయణుడు. ఇలా అన్ని విధాలా ఆయన సర్వశస్త్రభృతాంవరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు అన్ని జీవులకు స్వీయరక్షణార్థము కొన్ని ఆయుధములనిచ్చాడు (ఉదాహరణకు గోళ్ళు, కోరలు, కొమ్ములు). ఈ శస్త్రాలు మాత్రమే కాకుండా భగవంతుడు తన ఇచ్ఛానుసారము భూకంపమువంటి మహోత్పాతాలను కూడా వాడుతాడు.

ధర్మచక్రము రచయిత – రామకృష్ణాదులు శిష్టరక్షణ కొఱకు తమ ఆయుధములను వాడారు. ఇలా మంచి పనులకోసం శస్త్రాలను వాడినందున వారు శ్రేష్ఠులు. ప్రజాక్షయంకోసం శస్త్రాలు వాడకూడదు.

## 766. ప్రగ్రహః

- అర్జునుని స్వాధీనపరచుకొన్నవాడు.
- విశ్వాన్ని తన స్వాధీనంలో ఉంచుకొన్నవాడు.
- భక్తులు సమర్పించిన పత్రపుష్పాదులను ప్రీతితో స్వీకరించువాడు.
- భక్తుల మనస్సును, ఇంద్రియాలను తన అదుపులో ఉంచుకొనువాడు.
- భక్తుల శరణాగతిని స్వీకరించి, వారినెన్నడును వీడనివాడు.

### ఓం ప్రగ్రహాయ నమః

ప్ర (ప్రత్యయము) - బాగుగా, ప్రత్యేకముగా; గ్రహ్ - ఉపాదానే - పట్టుకొనుట, తీసికొనుట.

**ప్రకర్షణేన గృహ్ణాతి ఇతి ప్రగ్రహః**. విశిష్టమైన, ఉత్తమమైన, ప్రత్యేకమైన విధముగా గ్రహించువాడు ప్రగ్రహుడు. 'గ్రహించుట' అనగా 'అదుపులో ఉంచుకొనుట' అని శ్రీ భట్టులు, 'తీసికొనుట' అని శ్రీ శంకరులు అర్థం చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 697 నుండి 786వ నామమువరకు కృష్ణావతారపరముగా వ్యాఖ్యానించారు. వాటిలోనిదే అయిన ఈ నామమునకు శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్య – భగవానుడు అర్జునునికి సారథి అయినాగాని అర్జునుని తన అధీనంలో ఉంచుకొని తన మాట ప్రకారం నడిపించాడు. పగ్గములతో లాగినట్లుగా అర్జునుని తన ప్రేమతో స్వాధీనము చేసుకున్నవాడు ప్రగ్రహుడు. **పార్థసారథినానేన రశ్మిభిర్య ప్రగృహ్యతే స ప్రగ్రహస్సమాఖ్యాతః సప్తవర్ణ ఉదాహృతః -** పగ్గాలు వేసి గుర్రాలను స్వాధీనం చేసుకున్నట్లే, శ్రీ కృష్ణపరమాత్ముడు అర్జునుని స్వాధీనపరచుకొన్నందున 'ప్రగ్రహః' అని పిలువబడ్డాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. ఓం ప్రగ్రహాయ నమః.

ప్రగ్రహము అనగా 'కళ్ళెము' అనే అర్థం కూడా ఉంది. కఠోపనిషత్తులో చెప్పిన ఆధ్యాత్మికోదాహరణం ప్రకారం – మానవశరీరమే రథము. దానికి కట్టబడిన గుఱ్ఱములే ఇంద్రియములు. గుఱ్ఱములను నియంత్రించునట్టి కళ్ళెము మనస్సు (**మనః ప్రగ్రహమేవ చ**).

కళ్ళెమును బిగించువాడే బుద్ధియను సారథి. సారథిని శాసించు యజమానుడే ఆత్మ **(ఆత్మానామ్ రథమ్ విద్ధి, శరీరమ్ రథమేవ చ, బుద్ధిం తు సారథిమ్ విద్ధి, మనః ప్రగ్రహమేవ చ).**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **ప్రకర్షణేన గృహ్ణాతి విశ్వమ్ ఇతి.** విశ్వములో అన్నింటినీ తన అధీనంలో ఉంచుకొనేవాడు ప్రగ్రహుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – (గ్రహ - తీసికొనుట) **భక్తైః ఉపహృతమ్ పత్ర పుష్పాదికమ్ ప్రగృహ్ణాతి ఇతి ప్రగ్రహః.** భక్తితో సమర్పించిన పత్రపుష్పాదులను స్వీకరించేవాడు 'ప్రగ్రహః'.

శ్రీ చిన్మయానంద – అన్ని విధముల జాతులు, పశుపక్ష్యాదులు, వృక్షములు, అన్నింటి పూజలను చివరికి స్వీకరించేవాడు గనుక భగవంతుడు ప్రగ్రహుడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థం శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్యకు దగ్గరగా ఉన్నది.

**ధావతో విషయారణ్యే దుర్దాంత ఇంద్రియ వాజినః తత్ప్రసాదేన అశ్మినేవ బధ్నాతి ఇతి వా ప్రగ్రవత్ ప్రగ్రహః.** విషయారణ్యంలో పరుగులు తీసే ఇంద్రియాలనే గుర్రాలను అదుపులో ఉంచేవాడు ప్రగ్రహుడు. ఆయన అనుగ్రహంవలన భక్తులు ఇంద్రియలోలత్వాన్ని అధిగమించి ఆత్మజ్ఞానంవైపు పురోగమిస్తారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – ప్ర - ప్రకృష్ట - ప్రత్యేకమైన, ఉన్నత, దివ్య. **ప్రకృతో గ్రహః స్వీకారో యస్య ఇతి ప్రగ్రహః.** ఆయన స్వీకరణ చాలా ప్రత్యేకమైనది, విశిష్టమైనది.

**స్వజనమ్ సకృదపి శరణాగతమ్ స్వీకృత్య పునః కదాపి తమ్ న పరిత్యజతి ఇతి ప్రకృష్ట ఏవ గ్రహః ప్రభోః**
భగవంతుడు భక్తుల శరణాగతిని మొదటిసారే దయతో స్వీకరిస్తాడు. తరువాత ఎన్నడూ ఆయన వారిని విడువడు.

## **767.** నిగ్రహః

- శత్రువులను నాశనము చేయువాడు.
- సృష్టి అంతటినీ తన అధీనంలో పెట్టుకున్నవాడు.
- భక్తుల అహంకారమును అంతము చేయువాడు.

### ఓం నిగ్రహాయ నమః

'నిగ్రహము' అనగా అదుపు చేయుట, అణచివేయుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – అర్జునునితో సంబంధం లేకుండానే కురుక్షేత్ర సంగ్రామంలో తన సారథ్యంలో శత్రువులను నాశనం చేసినవాడు నిగ్రహుడు. **యేన సారథి వైచిత్ర్యాత్ నిగ్రహం తేऽత్ర శత్రవః స నిగ్రహ స్సమాఖ్యాతః సప్తార్ణ శ్శత్రునాశనః.** పార్థసారథియొక్క సారథ్యనైపుణ్యంచేత అర్జునుడు శత్రువులను జయించగలిగాడు. అందుచేత భగవానుడు 'నిగ్రహః' అనబడుతున్నాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. శత్రునాశకరము. ఓం నిగ్రహాయ నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వమ్ స్వవశేన నిగృహ్ణాతి ఇతి నిగ్రహః.** అంతటిని తన వశంలో ఉంచుకొని నిగ్రహించేవాడు నిగ్రహుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – **నిగృహ్ణాతి దైత్యాన్ ఇతి నిగ్రహః.** రాక్షసులను అణచివేసేవాడు నిగ్రహుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **నిగృహ్ణాతి విపథ గామినః ఇతి నిగ్రహః.** ధర్మమార్గము వదలి నడచేవారిని అదుపుచేయువాడు నిగ్రహుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **నిగృహ్ణాన్తే పార్థశాత్రవః కక దృష్టినా ఇతి నిగ్రహః.** పాండవుల శత్రువులపాలిటి యముడు నిగ్రహుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **నిశ్చయేన గృహ్యతే యేన ఇతి నిగ్రహః విష్ణుః.** విశ్వంలో అంతటినీ తన అధీనంలో ఉంచుకొని, సృష్టింపవలసినవానిని సృష్టిస్తూ, అంతం చేయవలసినవానిని అంతం చేసే విష్ణువే నిగ్రహుడు.

శ్రీ చిన్మయానంద – నిగ్రహ - చంపేవాడు, ఖండించేవాడు. భక్తులలోని అహంకారమును చంపేవాడు. వారి మనస్సులోని అహంకార మమకారాది దుర్గుణములను నాశనము చేసి ఆధ్యాత్మిక స్థితికి దోహదము చేయువాడు నిగ్రహుడు.

మరొక వివరణ – నిగ్రహః - తనలోనికి స్వీకరించువాడు. భగవంతుని ధ్యానించే భక్తులను తనలో లీనము చేసుకొనే దయాస్వరూపుడు నిగ్రహుడు.

## 768. వ్యగ్రః

### అవ్యగ్రః

- తొందరపడువాడు (మహాభారత యుద్ధంలో తన భక్తుని శత్రువులను అంతం చేయడానికి).
- ఆది, అంతము లేనివాడు.
- అనేక విధములుగా చలించువాడు.
- అ-వ్యగ్రః (ద్వైత పాఠము) – సంశయం లేనివాడు.
- గరుడుని తన వాహనంగా కలిగినవాడు.
- భక్తుల మనోరథాలు తీర్చడంలో సదా నిమగ్నుడైనవాడు.

ఓం వ్యగ్రాయ నమః

ఓం అవ్యగ్రాయ నమః



శ్రీకృష్ణుడు భీష్మునిపై లంఘించుట. వికీపీడియా చిత్రం.

Photo by : Richard Friedericks – at Arpana Ashram, Madhuban, Karnal, Haryana
https://commons.wikimedia.org/wiki/File:Arjuna_Krishna_Bhisma_Mahabharata.jpg

అగి - గతౌ - వెళ్ళుట, అగ్ర - ముందు ఉండుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – మహాభారతయుద్ధంలో అర్జునుని శత్రుసంహారంలో జాప్యాన్ని సహింపలేనివాడు వ్యగ్రుడు. **యుద్ధ క్రమా సహిష్ణుత్వాత్ పార్థ విద్విడ్వినిగ్రహే యోऽసౌ వ్యగ్ర స్సమాఖ్యాతః షడర్ణో వైరి నాశకః -** యుద్ధంలో శత్రుసంహారంకోసం అర్జునుడు పడే శ్రమను సహింపలేనివాడు వ్యగ్రుడు. ఈ నామము షడక్షరి. శత్రునాశకము. ఓం వ్యగ్రాయ నమః.

**యే యాన్తి యాన్త్యేవ శిని ప్రవీర! యేऽవస్థితాః సత్వర తేऽపి యాంతు**
**భీష్మం రథాత్ పశ్యతపాత్యమానమ్ ద్రోణం చ సంఖ్యే సగణం మయాऽద్య**
**......రథాత్ అవప్లుత్య విసృజ్య వాహన్** – మహాభారతము. భీష్మపర్వము 59.86

ఓ శినిప్రవీరా (సాత్యకీ)! పోయినవారు పోయారు. మిగిలిన వాళ్ళను, (లేదా ... పారిపోయేవాళ్ళను), అందరినీ ఒక్కపెట్టున తుదముట్టిస్తాను. రథంనుండి ఇప్పుడు భీష్ముడు నేలకొరగాలి. ద్రోణుడు సైన్యసమేతంగా నశించాలి. ... ఇలా అని కృష్ణుడు గుర్రాలను వదలి, రథం దిగి, భీష్మునివైపు సాగాడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 9.2.10 – దేవతలను రక్షించడానికి నీవేమైనా చేసి రాక్షసులను కడతేరుస్తావు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – అగ్రమ్ - కొన, అంతము, వినాశము. **విగతమ్ అగ్రమ్ అస్య ఇతి వ్యగ్రః.** అంతము లేనవాడు వ్యగ్రుడు. నాశనరహితుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **వివిధమ్ గమనమ్ యో విధత్తే స వ్యగ్ర ఉచ్యతే.** అనేక విధాలుగా కదిలేవాడు వ్యగ్రుడు. సృష్టిలో అన్నింటి చలనంలోనూ భగవంతుని వ్యగ్రత్వమును దర్శించవచ్చును.

శ్రీ సత్యసంధ యతిరాజ – ఈయన **'అవ్యగ్రః'** మరియు **'వ్యగ్రః'** అనే రెండు పాఠాలనూ పరిగణించారు.

**అవ్యగ్రః – వ్యగ్రో న భవతి ఇతి అవ్యగ్రః.** వ్యగ్రుడనగా ఏ మార్గం తీసుకోవాలో తెలియక సంశయాత్మకుడైనవాడు. అవ్యగ్రుడు అనగా సంశయం లేనివాడు.

**వ్యగ్రః – విః గరుడో అగ్రే అస్య స వ్యగ్రః.** గరుత్మంతుని (వి)పైనుండి విహరించేవాడు వ్యగ్రుడు.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – విసుగు, విరామము లేక తన భక్తుల మనోరథములను సదా ఇచ్చుచునుండువాడు వ్యగ్రుడు.

## 769. నైకశృంగః

- తన భక్తుల శత్రువులను అనేక విధాలుగా, అనేక ఉపాయాలతో హింసించేవాడు.
- నాలుగు వేదములు అనే కొమ్ములద్వారా పట్టుబడేవాడు (తెలియవచ్చువాడు).
- అకారము, ఉకారము, మకారము, నాదము అనే నాలుగు కొమ్ములు కలిగిన ప్రణవంద్వారా అందేవాడు.
- నాలుగు వేదములు అనే కొమ్ములద్వారా ధర్మమును ప్రవర్తింపజేసేవాడు.
- అనేక విధములుగా (జగత్)ప్రభుత్వమును నెరపువాడు.
- తన భక్తులకు కామితార్థములను అనేక విధములుగా ప్రసాదించువాడు.
- ఏకశృంగః – ఒక కొమ్ముగల శ్రీవరాహమూర్తిగా అవతరించినవాడు.
- అనేక కిరణములతో ప్రకాశించువాడు.
- ఆత్మరక్షణ కొఱకు, శత్రువులను బాధించడానికీ, వివిధ జీవులకు వివిధ అంగములు ఇచ్చినవాడు.

### ఓం నైకశృంగాయ నమః

### ఓం ఏకశృంగాయ నమః

శృ - హింసాయామ్ - చీల్చివేయుట, బాధించుట, చంపుట;

**శృంగమ్ ఇతి దీప్తేర్నామ, హింసా సాధనమ్ తథా పరకృత బాధానివారణ సాధనామపి శృంగమ్.** 'శృంగము' అనగా ప్రకాశము, శిక్షించే సాధనము, ఇతరులు కలుగజేసే బాధనుండి రక్షించే సాధనము. శృంగము అంటే 'కొమ్ము' అనేది సాధారణ అర్థము. శ్రీ శంకరులు ఈ అర్థం గ్రహించారు. న - ఏకశృంగః – **నైక శృంగః.** ఒకటికంటే ఎక్కువ కొమ్ములు కలిగినవాడు నైకశృంగుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'శృంగము' అనగా 'హింసా సాధనము' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. న -ఏక - శృంగః – **నైకశృంగః,** అని చెబుతూ శ్రీ భట్టులు మహాభారతయుద్ధంలో శ్రీకృష్ణుని పాత్రను ఇలా వ్యాఖ్యానించారు. **బుద్ధి యోగః సారధ్యమ్**

**అనాయుధ గ్రహణ వ్యాజః ప్రాప్తకాలే తద్గ్రహణమ్ ఇతి బహువైరి బాధకమ్ అస్య ఇతి నైకశృంగః.** శత్రువులను బాధించడానికి ఆయన ఉపయోగించిన ఆయుధాలు – సరైన సలహా ఇచ్చుట, రథం నడుపుట, ఆయుధం పట్టనని నియమం ఉన్నాగాని సమయం వచ్చినపుడు ఆయుధమును ధరించుట, పగటిని రాత్రిగా మార్చుట - ఇలా అనేక ఉపాయాలతో శత్రువుల పతనానికి కారణమైనవాడు నైకశృంగుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 6.4.10 – ప్రజల అహంకారంతో భారమైన భూమిని తేలికపరచడానికి భగవంతుడు మహాభారతయుద్ధం కలిగించాడు. అనేక అద్భుతాలు చూపాడు. అడుగడుగునా ఏదో మంత్రం వేసినట్లు నడిపాడు. చివరికి తన సంకల్పం నెరవేర్చుకొన్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – '**నైకశృంగః**' అనగా అనేక కొమ్ములు కలవాడు. ఇక్కడ అనేక కొమ్ములు అనగా నాలుగు వేదాలు నాలుగు కొమ్ములు. కొమ్ములను పట్టుకొంటే ఎద్దు అదుపులోనికి వచ్చినట్లుగా వేదాలద్వారా భగవంతుడు పట్టుచిక్కుతాడట – అని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు. శ్రీ శంకరులు ఋగ్వేదమునుండి ఉదాహరించారు.

**చత్వారిశృంగా త్రయోఽస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తాసోఽస్య**
**త్రిధా బద్ధో వృషభో రోరర్వీతి మహాదేవో మర్త్యాగ్ం అవివేశ** – ఋగ్వేదము 4.58.3
నాలుగు కొమ్ములు, మూడు పాదాలు, రెండు శిరస్సులు, ఏడు చేతులు కలవాడై మూడుచోట్ల బంధింపబడిన వృషభరూపుడైన భగవానుడు (జీవుడు) మనుష్యులలో ప్రవేశించి శబ్దం చేస్తున్నాడు – ఒక వివరణ ప్రకారం ఇక్కడ నాలుగు కొమ్ములు అంటే నాలుగు వేదాలు. మూడు పాదాలు అంటే దైనిక యజ్ఞాలు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – శాయనభాష్యం ప్రకారం, **అకార ఉకార మకార నాదరూప శృంగ చతుష్టయోపేతః** – నాలుగు కొమ్ములు అంటే ఓంకారంలో ఉండే అకారము, ఉకారము, మకారము, నాదము.

ఇంకోవ్యాఖ్య ప్రకారం భగవంతుడు నాలుగు వేదాలద్వారా ధర్మమును ప్రవర్తింపజేయుచు లోకములను నియంత్రించుచున్నాడు.

శ్రీ చిన్మయానంద – పై ఋగ్వేద శ్లోకంలో 'చత్వారిశృంగా' అంటే నాలుగు అవస్థలు - జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయము. (మూడు పాదములు అంటే స్థూల శరీరము, సూక్ష్మ శరీరము, కారణ శరీరము). మాండుక్యోపనిషత్తులో ఆత్మకు నాలుగు పాదాలు అని చెప్పారు. అవి ఈ నాలుగు అవస్థలు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – శృంగము - ఆధిక్యము, ప్రభుత్వము. **నైకమ్ వివిధమ్ శృంగమ్ ప్రభుత్వమ్ యస్య ఇతి నైకశృంగః.** అనేక విధాలుగా భగవంతుడు జగత్ప్రభువు. (**శృంగమ్ ప్రభుత్వే శిఖరే** - మేదిని).

శ్రీ సత్యసంధ యతిరాజ – **న ఏక శృంగో, న ఏకాని - అనేకాని శృంగాణి యస్య వృషరూపీ స నైకశృంగః** (వృష-ధర్మము). ధర్మమును ప్రవర్తింపజేయుటలో అనేకరూపములు ధరించువాడు నైకశృంగుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ మరొక వ్యాఖ్య – నా - ఏకశృంగః, నా - **పరమపురుషత్వాత్ నా** – 'నా' శబ్దము భగవంతుని పరమపురుషత్వమును సూచించును. ఏకశృంగః - ఒకే కొమ్ము కలవాడు - శ్రీవరాహమూర్తి.
**ఏకశృంగః తతో భూత్వా వరాహో నందివర్ధనః ఇమాంచ ఉధృత్వాత్ భూమిమ్ ఏకశృంగః** – మోక్షధర్మము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మూడు వివరణలిచ్చారు –
(1) శృంగ - దీప్తి. అనేక కిరణాలు ప్రకాశించువాడు ఏకశృంగుడు.
(2) అనేకవిధములుగా (దుష్టులను) హింసించువాడు ఏకశృంగుడు.

(3) హింసనుండి అనేకవిధములుగా రక్షించువాడు ఏకశృంగుడు. ఉదాహరణకు సింహం గోళ్ళు, గేదెకొమ్ములు, ఏనుగు దంతాలు – ఇవన్నీ శత్రువులను బాధించడానికీ, తమతమను శత్రువులనుండి కాపాడుకోవడానికీ ఉపయోగపడుతాయి.

## 770. గదాగ్రజః

- గదునికి అన్న (గద+అగ్రజః).
- మంత్రముగా పుట్టునవాడు (ని-గదాగ్రజః).
- నడచే, మాట్లాడే వారందరియందును వ్యాపించినవాడు (గద+అగ్ర+జ).
- శబ్దము చేయువారిలో అగ్రగణ్యుడు (వేదముల మూలము).
- బ్రాహ్మణులను ఆరోగ్యముగా నుంచువాడు (అగదాగ్రజః).

ఓం గదాగ్రజాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – 'గదుడు' అనేవాని అన్న అయినందున కృష్ణుడు గదాగ్రజుడు. వసుదేవునికి 'సునామ' అనే భార్యయందు 'గదుడు' అనే పుత్రుడు జన్మించాడు. (డా. క్రోవి పార్థసారథి రచన శ్రీ కైవల్యసారథి నుండి – వసుదేవుడు ఉగ్రసేనుని తమ్ముడైన దేవకునియొక్క ఏడుగురు కుమార్తెలను – దేవకి, శాంతి, దేవ, ధృతదేవ, ........ అనేవారిని వివాహం చేసుకొన్నాడు. అంతే కాకుండా ఇతనికి రోహిణి, కౌసల్య, పౌరవి అనే భార్యలున్నారు. వసుదేవునికి రోహిణియందు బలరాముడు, గదుడు, సారణుడు అనే కుమారులు కలిగారు. కృష్ణునికంటె గదుడు చిన్నవాడు).

శ్రీ శంకరుల వ్యాఖ్య – ని-గదాగ్రజః, నిగదము - మంత్రము. **నిగదేన మంత్రేణ అగ్రే జాయత ఇతి 'ని' శబ్దలోపం కృత్వా గదాగ్రజః.** నిగదము అనగా మంత్రము. ఇందులో 'ని' అక్షరం లోపించినందువలన **'గదాగ్రజః'** అయినది. అనగా మంత్రమునకు ముందుగా (మంత్రమువలన ముందుగా) జన్మించినవాడు గదాగ్రజుడు.

(శ్రీ కైవల్యసారథి నుండి – **గద్యతే ఇతి గదః.** ఈ గదుడు మంత్రములనుండి ఆవిర్భవించాడు. మంత్రముగా ముందే జన్మించినవాడు వాసుదేవుడు).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – రుక్మిణీదేవి తన లేఖలో శ్రీకృష్ణుని **'గదాగ్రజా!'** అని సంబోధించినది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – గద+అగ్ర+జః = గదాగ్రజః. గద - వ్యక్తాయామ్ వాచీ - మాట్లాడుట; అగ్ర - అగి, గతౌ - వెళ్ళుట, జః - జాత - అనుపవిష్ట - వ్యాపించుట, ప్రవేశించుట. **గదేషు గదనశీలేషు, అగ్రేషు గమన శీలేషు, అనుప్రవిష్టో జాత ఇవ ప్రతీయమానో గదాగ్రజ ఇతి విష్ణోర్నామ. శబ్దాయమానే గమనశీలేషు చ జీవిత శరీర ఏవ జీవాత్మానోఽవభాసః ఇతి ప్రకాశ ఇత్యర్థః.** నడచేవి, మాట్లాడేవి (అనగా అన్ని జీవుల)యుందు (ఆత్మరూపంలో) ప్రవేశించి ప్రకాశించేవాడు (అనగా చైతన్యస్వరూపుడు) అయన విష్ణువు గదాగ్రజుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ మరొక వ్యాఖ్య – **గదానామ్ వ్యక్తమ్ శబ్దమ్ కుర్వతామ్ ముష్యాణామ్ అగ్రజః జ్యేష్ఠః శ్రేష్ఠః.** శబ్దముచేయు వారందరిలోను శ్రేష్ఠుడు గదాగ్రజుడు. ఇక్కడ వేదములను తెలియజేయుట సూచింపబడినది. కనుకనే ఆయనను **'వాచస్పతి'** అని కూడ అందురు.

శ్రీ సత్యసంధ యతిరాజ – గదాగ్రజుడు అనగా గదునకు అన్న. ఈ భావమే కాకుండా శ్రీ యతిరాజులు **'అగదాగ్రజః'** అనే పాఠాన్ని కూడా పరిగణించారు. అగద - ఆరోగ్యవంతమైన, రోగము లేని; అగ్రజ - బ్రాహ్మణులు. **అగద నిరోగిణో అగ్రజా బ్రాహ్మణా ఇతి అగదాగ్రజః.** ఇక్కడ ఆరోగ్యంగా ఉండడమంటే వేదపఠనంద్వారా ఆధ్యాత్మికంగా పరిశుద్ధులై ఉండుట అని గ్రహింపవచ్చును.



## చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః |
## చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవిదేకపాత్ || (82)

### 771. చతుర్మూర్తిః

- నాలుగు రూపములు కలవాడు.
- వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు.
- విరాట్, సూత్రమాన, అవ్యాకృత, తురీయ రూపములు.
- కృతయుగంలో తెల్లగా, త్రేతాయుగంలో ఎర్రగా, ద్వాపరయుగంలో (పసుపు)పచ్చగా, కలియుగంలో నల్లగా ఉండేవాడు.
- విశ్వ, తైజస, ప్రజ్ఞా, తురీయ రూపములు.
- శ్రీవైకుంఠము, సత్యలోకము, శ్వేతదీపము, క్షీరాబ్ధిలలో ఉండేవాడు.

**ఓం చతుర్మూర్తయే నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – నాలుగు రూపములు అనగా భగవానుని నాలుగు వ్యూహములు – వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు. ఈ వ్యూహావతారములు విభవావతారములకంటె ముందునుండి ఉన్నవి (రామకృష్ణాదులు విభవావతారములు). శ్రీకృష్ణ విభవావతారములో కూడ భగవానుడు నాలుగు మూర్తులలలో అవతరించాడు – బలభద్రుడు (కృష్ణుని అన్న), వాసుదేవుడు (కృష్ణుడు), ప్రద్యుమ్నుడు (కృష్ణుని కొడుకు), అనిరుద్ధుడు (కృష్ణుని మనుమడు). శ్రీరామ విభవావతారంలోకూడ భగవంతుడు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులుగా పుత్రకామేష్ఠి యాగము పాయసమునుండి ఉద్భవించెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – చతుర్మూర్తులనగా విరాట్, సూత్రమాన, అవ్యాకృత, తురీయ మూర్తులు. ఈ మూర్తులను గురించి శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఇలా వివరించారు – సృష్టిలో అన్నింటికంటె ముందుగా ఉన్న మూలప్రకృతి (అవ్యాకృత) అవ్యక్త మూర్తితత్వము. ఈ మూలప్రకృతియొక్క స్థూలరూపము (అనగా భగవానుడు అంతర్యామిగా మూలప్రకృతిలో ప్రవేశించకముందు రూపము)ను 'విరాట్'మూర్తి అంటారు. మన బుద్ధిలోను, మనసులోను (సూక్ష్మరూపముగా) భగవానుడు అంతస్థితుడైయున్న ప్రాణశక్తియే 'సూత్ర'రూపము లేదా హిరణ్యగర్భుడు. పై మూడు రూపములకంటె భిన్నమైనది పరమపురుషుడు లేదా పురుషోత్తముడు. ఈ రూపములో అంతా భగవంతునియందే స్థితమైయున్నది. భగవంతుడొకడే యున్నాడు. ఇంకా జీవులు సంభవించలేదు.

శ్రీ చిన్మయానంద – నాలుగు యుగములలో నాలుగు రూపములు, వర్ణములు కలవాడు చతుర్మూర్తి. కృతయుగములో తెలుపు, త్రేతాయుగములో ఎరుపు, ద్వాపరయుగములో పీతవర్ణము (పసుపుపచ్చ), కలియుగములో నలుపురంగు ఉన్నవాడు. మరొక విధంగా – జాగ్రత్, స్వప్న, సుషుప్త, తురీయ అవస్థలు. సూక్ష్మరూపంలో విశ్వ, తైజస, ప్రజ్ఞా, తురీయ స్థితులు. స్థూలరూపంలో విరాట్, హిరణ్యగర్భ, ఈశ్వర, పరమాత్మ రూపములు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – చతుర్మూర్తులనగా విశ్వ, తైజస, ప్రజ్ఞా, తురీయ రూపములు. శరీరములు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు అని మూడు విధములు.

స్థూల శరీరము – బయటకు కనిపించే రూపము – విశ్వ రూపము.
సూక్ష్మ శరీరము – మనసు, ప్రాణము – తైజస రూపము.
కారణ శరీరము – పాత జన్మల జ్ఞాపకాలతో కూడినది – ప్రజ్ఞారూపము.

ఈ మూడు స్థితులలోను జీవుడు శరీరమును 'నేను' అనుకొంటాడు. వీటిని అధిగమించినది తురీయ స్థితి.

విశ్వమూర్తి – స్థూల శరీరము – జాగ్రత్ అవస్థ
తైజస మూర్తి – సూక్ష్మ శరీరము – స్వప్న అవస్థ
ప్రజ్ఞామూర్తి – కారణ శరీరము – సుషుప్త అవస్థ
తురీయమూర్తి – తురీయము – తురీయావస్థ.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ –

**వైకుంఠం ప్రథమ మూర్తిః సత్యలోకే తథాऽపరా శ్వేతద్వీపే తృతీయ చ చతుర్థీ క్షీరసాగరే.**
శ్రీవైకుంఠములోను, సత్యలోకములోను, శ్వేతద్వీపములోను, క్షీరసాగరములోను ఉన్న భగవానుని రూపములు చతుర్మూర్తులు.

## 772. చతుర్బాహుః

నాలుగు చేతులు కలవాడు.

- దేవకికి నాలుగు చేతుల రూపంలో దర్శనమిచ్చినవాడు.
- వాసుదేవుడు. శంఖ, చక్ర, గదా, పద్మములు ధరిచినవాడు.
- మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే నాలుగు చేతులతో జీవులను నియంత్రించువాడు.
- ధర్మార్థకామమోక్షములనే నాలుగు పురుషార్థములను ప్రసాదించువాడు.
- నాలుగు వేదములద్వారా తెలియవచ్చువాడు.

### ఓం చతుర్బాహవే నమః

15వ శ్లోకంలో 142వ నామముగా **'చతుర్భుజః'** అని చెప్పబడినది. **చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః.** ప్రస్తుతము 82వ శ్లోకములో 772వ నామముగా **'చతుర్బాహుః'** అని చెప్పబడినది. **చతుర్మూర్తిః చతుర్బాహుః చతుర్వ్యూహః చతుర్గతిః.** ఈ 'చతుర్బాహుః' మరియు 'చతుర్భుజః' నామములు ఇంచుమించుగా ఒకేవిధంగా అనిపిస్తాయి.

శ్రీ భట్టులు భగవంతుని వ్యూహావతారములను వర్ణించే సందర్భంలో 142వ నామము 'చతుర్భుజః' వచ్చింది. కనుక శ్రీ భట్టులు ఆ నామమును 'శంఖ చక్ర గదా పద్మ ధారియైన శ్రీవాసుదేవుడు' అని వ్యాఖ్యానించారు.

ఈ 772వ నామము 'చతుర్బాహుః' ను శ్రీ భట్టులు శ్రీకృష్ణావతారపరంగా వ్యాఖ్యానించారు. ఇది విభవావతారము. భగవంతుడు దేవకీదేవికి నాలుగు చేతులతో జన్మించాడు గనుక చతుర్బాహువు. **వ్యూహమూలా పరావస్థా నిరుపాధిక రూపతః చత్వారో బాహవో యస్య స చతుర్బాహురుచ్యతే.** పరా వాసుదేవునిగా దేవకి గర్భాన నాలుగు భుజములతో అవతరించినవాడు చతుర్బాహువు.

15వ శ్లోకము 142వ నామము 'చతుర్భుజః'కు శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణములు –

**చతుర్భుజమ్ ఉదారాంగమ్ చక్రాద్యాయుధ భూషణమ్** – విష్ణుపురాణము.
**తమసః పరమో ధాతా శంఖ చక్ర గదాధరః** – రామాయణము. యుద్ధకాండ 114.15
**భుజైర్చతుర్భిః సమేతమ్** – మహాభారతము. మోక్షపర్వము 5.34

ఈ 82వ శ్లోకము 772వ నామము 'చతుర్బాహుః' కు ప్రమాణములు –

**తమద్భుతమ్ బాలకమ్ అంబుజేక్షణమ్ చతుర్భుజమ్** – భాగవతము 10.3.9
**ఉపసంహార సర్వాత్మన్ రూపమేతచ్చతుర్భుజమ్**
**జానాతు మాఽవతారమ్ తే కంసోఽయమ్ దితి జన్మజః** – విష్ణుపురాణము 5.3.13
ఓ పరమాత్మా! నాలుగు భుజాలతో ఉన్న ఈ రూపాన్ని ఉపసంహరించుకో. దైత్యజాతికి చెందిన కంసుడు నీ అవతారాన్ని గురించి తెలిసికొనకూడదు.



చతుర్భుజుడై అవతరించిన శ్రీకృష్ణుని స్తుతిస్తున్న దేవకీ వసుదేవులు. 1560 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:The_Worship_of_Vishnu_at_the_Birth_of_Krishna_(6124513249).jpg

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 8.8.1 – ఆళ్వారును కౌగిలించుకోవడంకోసమే భగవంతునికి రెండు బదులు నాలుగు చేతులున్నాయి.

**అదృష్ట పూర్వమ్ హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే**
**తదేవ మే దర్శయ దేవరూపమ్ ప్రసీద దేవేశ జగన్నివాస** – గీత 11.45
**కిరీటినమ్ గదినమ్ చక్రహస్తమ్ ఇచ్ఛామి త్వా ద్రష్టుమహం తథైవ**
**తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే** – గీత 11.46

మునుపు ఎన్నడును చూడని ఆశ్చర్యకరమైన ఈ రూపమును కాంచి మిక్కిలి సంతసించితిని. కాని భయముచే నా మనసు కలవరపాటు పొందినది. కనుక, దేవేశ! చతుర్భుజయుక్తుడవై నాకు దర్శనమిమ్ము. ఓ దేవేశ! జగన్నివాస! ప్రసన్నుడవు కమ్ము. కిరీటమును, గదను, శంఖ చక్రములను ధరించిన నీ రూపమును చూడగోరుచున్నాను. ఓ సహస్రబాహో! విరాడ్రూపా! నీ చతుర్భుజ రూపమును నాకు చూపుము.

శ్రీ ఆండాళ్. తిరుప్పావై 30 – క్షీరసాగరమును మథించి దేవతలకు అమృతమొసంగిన మాధవుని, కేశవుని, సంపూర్ణ చంద్రునివంటి ముఖముగల గోపకన్యలు కీర్తించి వ్రేపల్లెలో వ్రతపరికరములు పొందిన విధమును, శ్రీవిల్లిపుత్తూరులో వసించుచు వికసించిన పద్మముల మాలను ధరించిన శ్రీ విష్ణుచిత్తుల కుమార్తెయుగు గోదాదేవి శబ్దార్థరసభరితములయిన ముప్పది పాశురములలో వివరించెను. దీనిని విడువక అనుసంధానమొనర్చువారు **గొప్ప పర్వతముల బోలిన నాలుగు భుజములును**, ఎఱ్ఱని కన్నులును, లక్ష్మీకరమగు ముఖమును, సర్వైశ్వర్యములును గలవాడైన శ్రియఃపతియగు నారాయణునివలన ఏచోటను సాటిలేని కృపను బడసినవారలై, బ్రహ్మానందానుభవమును కలవారైయుందురు (శ్రీ ఎన్. విజయరాఘవాచార్యులు, శ్రీ సంపన్నుడుంబై రంగకృష్ణమాచార్యులు అనువాదం, కూర్పు నుండి).

శ్రీ పెరుక్కారణై శ్రీచక్రవర్త్యాచార్యులు – భగవంతుని నాలుగు బాహువులు నాలుగు పురుషార్థములను అనుగ్రహించడానికి ఉన్నాయి. భక్తుల రక్ష అవుసరాలనుబట్టి చేతులు పెరుగుతాయి. గజేంద్రుని రక్షించడానికి ఎనిమిది చేతులతో వచ్చాడు. శ్రీ సుదర్శనాళ్వారులు ఎనిమిది చేతులతో ఎనిమిది ఆయుధాలతో విరాజిల్లుతున్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుని చతుర్బాహురూపము సంప్రదాయకంగా వాసుదేవుని సూచిస్తుంది. శ్రీమహావిష్ణువును నాలుగు భుజాలతో – శంఖము, చక్రము, గద మరియు పద్మము లేదా ధనుస్సులతో – భావిస్తారని శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరించారు.

**శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత గోవింద పుండరీకాక్ష రక్షమామ్ శరణాగతమ్** – నిత్య ప్రార్థన

శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతంనుండి ఉదాహరించారు.

**చతుర్భుజః శంఖ గదాబ్జ చక్రః పిశంగవాసా నలినాయతేక్షణః** – భాగవతము 8.18.1
**తమద్భుతమ్ బాలకమ్ అంబుజేక్షణమ్ చతుర్భుజమ్ శంఖ చక్ర గదాయుదార్యుధమ్** – భాగవతము 10.3.9

15వ శ్లోకంలో 'చతుర్భుజః' నామానికి శ్రీ చిన్మయానంద వివరణ – భగవానుని శంఖ చక్ర గదా పద్మములు లోకంలో ధర్మాన్ని నిలపడానికి, మోక్షమార్గం చూపడానికి ఉన్నాయి.

ప్రస్తుత 'చతుర్బాహుః' నామానికి శ్రీ చిన్మయానంద వివరణ – భగవంతుని నాలుగు చేతులు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములను సూచించును. వీనిద్వారా అన్ని కార్యములు భగవంతుని అధీనంలో ఉంటాయి. మరోవిధంగా పద్మము చిత్తమును, శంఖము బుద్ధిని, గద అహంకారమును, చక్రము మనస్సును సూచించును.

శ్రీ సత్యసంధ యతిరాజ –

(1) **భుంక్తే భునక్తి ఇతి భుజః, చతుర్ణామ్ ధర్మ అర్థ కామ మోక్షాణామ్ భుజః చతుర్భుజః**. అర్హులైనవారికి ధర్మార్థకామమోక్షములను ప్రసాదించును గనుక చతుర్భుజుడు.

(2) **చతుర్భ్యః వేదేభ్యః భవతి ఇతి చతుర్భుగ్ జ్ఞానమ్ తేన జాయతే అభిత్యాజ్యతే ఇతి చతుర్భుజః**. నాలుగు వేదాలద్వారా తెలియవచ్చువాడు విష్ణువు చతుర్భుజుడు.



శంఖ చక్ర గదా పద్మ ధారియైన శ్రీమహావిష్ణువు. ఢిల్లీ మ్యూజియంలోని విగ్రహం. గుప్తుల కాలం నాటిది. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Stone_sculpt_NMND_-29.JPG

## 773. చతుర్వ్యూహః

- నాలుగు వ్యూహములు కలవాడు – వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అను నాలుగు వ్యూహావతారములు.
- విభవావతారములో నాలుగు రూపములలోనున్నవాడు – శ్రీకృష్ణుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు.
- నలుగురు పురుషుల విభూతులు కలవాడు – శరీరరూపుడగు పురుషుడు, ఛందోరూపుడగు పురుషుడు, వేదరూపుడగు పురుషుడు, మహద్రూపుడగు పురుషుడు.
- నాలుగు వేదములద్వారా ఆయన ఆధిపత్యము తెలియును.
- మూడు వేదములు, వాక్కు అను నాల్గు శబ్దముల రూపములో ఉన్నవాడు.
- నాల్గు విధములైన మహిమలు (వ్యూహములు) చూపినవాడు.

### ఓం చతుర్వ్యూహాయ నమః

**సమస్త వ్యస్త షాడ్గుణ్య వ్యూహావస్థా చతుష్టయమ్ చతుర్వ్యూహ ఇతి ఖ్యాతః చతుర్వర్గప్రదోమనుః** - సకల షడ్గుణములతో వాసుదేవునిగను, రెండు రెండు గుణాతిశయములతో సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే రూపాలను, ఈ రకంగా చతుర్వ్యూహాలను ధరించినవాడు. ఈ నామము అష్టాక్షరీమహామంత్రము. చతుర్విధ పురుషార్థప్రదము. ఓం చతుర్వ్యూహాయ నమః.

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
15వ శ్లోకము. 140వ నామము. చతుర్వ్యూహః – **చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః**
82వ శ్లోకము. 773వ నామము. చతుర్వ్యూహః – **చతుర్మూర్తిః చతుర్బాహుః చతుర్వ్యూహః చతుర్గతిః**

ఊహ్ - వితర్కే - వివరించుట, తర్కించుట, అనుగ్రహించుట. **విశిష్టా ఊహా వ్యూహా.** ప్రత్యేకమైన పనుల కొరకు నాలుగు రూపములు ధరించినవాడు 'చతుర్వ్యూహః'.

ఆగమకోశము 4వ భాగము (శ్రీ ఎస్.కె. రామచంద్రరావు – కల్పతరు పరిశోధన అకాడమీ)నుండి – 'వ్యూహ' అనగా విభజించుట, పంచుట, అమర్చుట. పరవాసుదేవుడైన నారాయణుడు సృష్టి స్థితి లయాది కార్యములను నిర్వహించుటకై తనను తాను నాలుగు వ్యూహావతారములుగా సృజించుకొనెను. పాంచరాత్రాగమములో ఇది చాలా ముఖ్యమైన సిద్ధాంతము. వైకుంఠములోని పరవాసుదేవుడు నిశ్చలమైన, అలలు లేని, అంతు తెలియని, లోతు తెలియని, కాలస్థలాదులచే పరిచ్ఛిన్నముగాని, విభజింపరాని స్వరూపము. వైకుంఠములో ఈయన సమక్షములో అనంతజ్ఞానానందము విలసిల్లును. ఈయనచెంత నిత్యసూరులు (వారెన్నడును పునర్జన్మ పొందరు), ముక్తులును ఉందురు. ఈ పరవాసుదేవమూర్తి జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజములనే షడ్గుణములను పరిపూర్ణముగా కలిగియుండును. భగవంతుని వ్యూహావతారములు వివిధ కార్యముల నిర్వహణార్థము ఆయా గుణములు ప్రధానముగా కలిగి సంభవించును. ఇట్టివి నాలుగు వ్యూహములు – (వ్యూహ)వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు.

వాసుదేవుడు – జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజోమయము.
సంకర్షణుడు – జ్ఞాన, బల మయము.
ప్రద్యుమ్నుడు – ఐశ్వర్య, వీర్య మయము.

అనిరుద్ధుడు – శక్తి, తేజో మయము.

ప్రతి వ్యూహావతారమునందును షడ్గుణములు సంపూర్ణముగానుండును. కాని కొన్ని గుణములు ఆయా వ్యూహములకు ప్రధానమైనవి.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

15వ శ్లోకములో 'చతుర్వ్యూహః' – వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు.

82వ శ్లోకములో 'చతుర్వ్యూహః' – కృష్ణావతారము అనే విభవావతారములో నాలుగు రూపములు – కృష్ణుడు (వాసుదేవుడు), బలరాముడు (కృష్ణుని అన్న, సంకర్షణుడు), ప్రద్యుమ్నుడు (కృష్ణుని కుమారుడు, ప్రద్యుమ్నుడు), అనిరుద్ధుడు (కృష్ణుని మనుమడు, అనిరుద్ధుడు). భగవంతుని వివిధ వ్యూహావతారములకు వివిధ వాహనములు, రంగులు, అంగములు, ఆభరణములు, ఆయుధములు, ధ్వజములు చెందియున్నవి. ఇవన్నీ భక్తుల ధ్యానారాధనకు అనుకూలంగా భగవంతుడు ధరించాడు.

**నమస్తే వాసుదేవాయ నమః సంకర్షణాయ చ ప్రద్యుమ్నాయ అనిరుద్ధాయ సాత్వతాం పతయే నమః** – భాగవతము 10/40.21

శ్రీ శంకరుల వ్యాఖ్య –

15వ శ్లోకంలో 'చతుర్వ్యూహః' – వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు. ఇందుకు శ్రీ శంకరులు వేదవ్యాసుని రచనను ఉదాహరించారు –

**వ్యూహాత్మానమ్ చతుర్ధావై, వాసుదేవాది మూర్తిభిః సృష్ట్యాదీన్ ప్రకరోత్యేష, విశ్రుతాత్మా జనార్దనః**
విశృతాత్ముడు, జనార్దనుడు అనబడే ఆయనే సృష్ట్యాది కార్యక్రమాలు నిర్వహించుకొనడానికి తనను తాను వాసుదేవాది నాలుగు వ్యూహాలుగా విభజించుకొన్నాడు.

82వ శ్లోకంలో 'చతుర్వ్యూహః' – అనగా 'విభూతులు' అన్న అర్థంలో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. అనగా నాలుగు పురుషులు. **శరీరపురుషః ఛందఃపురుషో వేదపురుషో మహాపురుషః** (ఐతరేయారణ్యకము 3.2.9). ఈ దేహంలో నాలుగు విధాలైన పురుషులు (వ్యూహాలు) ఉండును.

శరీర పురుషుడు – చేతనుల శరీరంలోని ఆత్మ.
ఛందః పురుషుడు – సరిగ్గా ఉచ్ఛరించిన మంత్రాలు అనే ఆత్మ.
వేద పురుషుడు – వేదముల రూపంలోని ఆత్మ.
మహాపురుషుడు – కాలంరూపంలోని ఆత్మ.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **చతుర్భిః వేదైః వ్యూహ్యతే పరేశత్వేన వృధ్యతే యం ఇతి చతుర్వ్యూహః.** ఋగ్, యజుర్, సామ, అధర్వణములనే నాలుగు వేదముల రూపంలో ఆయన పరమేశ్వరత్వం నిరూపితమైనది గనుక ఆయన చతుర్వ్యూహుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **చత్వారి వాక్ పరిమితా పదాని** (ఋగ్వేదము 1.164.45). ఇవి వాక్కులో నాలుగు విభాగములను సూచించును. తరువాతి ఉక్తిలో 'గ్రహించే బ్రాహ్మణులు వానిని ఎరుగుదురు' అని ఉంది. ఈ నాలుగు విభాగములు అనగా మూడు వేదములు, సామాన్యమైన భాష (మాటలు) అని శ్రీ రాల్ఫ్ గ్రిఫిత్ వివరించారు.

ధర్మచక్రము రచయిత పూర్తిగా భిన్నమైన వివరణ ఇచ్చారు – నాలుగు వ్యూహములు అనగా నాలుగు గొప్పతనములు లేదా నాలుగు మహిమలు. అవి ఏవనగా

(1) లీలామాత్రంగా సృష్టిలయాది కార్యములు చేయుట.

(2) రాసక్రీడద్వారా పరాభక్తి మహాత్మ్యమును తెలియజేయుట.

(3) లెక్కలేనంతమంది గోపికలకు ఒకేమారు నాధునిగా ఉండి జీవాత్మ, పరమాత్మల మధ్య సంబంధము చూపుట.

(4) గాంధారి శాపాన్ని మౌనంగా స్వీకరించి వృష్ణివంశం నాశనాన్ని జరుగనిచ్చుట.

## 774. చతుర్గతిః

- ధర్మము, అధర్మము, కామము, మోక్షము అను నాలుగు పురుషార్థములను ప్రసాదించువాడు.
- ఇంద్రపదవి, బ్రహ్మపదము, కైవల్యము, మోక్షము అను నాలుగు పదములను భక్తులకు ప్రసాదించేవాడు.
- వృషభగతి, గజగతి, వ్యాఘ్రగతి, సింహగతి అనే నాలుగు విధాలయిన నడకలు కలవాడు.
- నాలుగు వర్ణములకు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు), నాలుగు ఆశ్రమములకు (బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములు) గమ్యము.
- ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు అను నాలుగు విధములైన భక్తులకు ఆశ్రయమైనవాడు.

### ఓం చతుర్గతయే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఉపాసక అభియోగ తారతమ్య కృత క్రమాత్ చతుస్రః ప్రాప్తయః అస్మిన్ ఇతి చతుర్గతిః.** ఉపాసకుల అర్హతనుబట్టి నాలుగు విధాలైన ఫలాలను (గతులను) ప్రసాదించేవాడు చతుర్గతి. ఈ నాలుగు గతులు ఏవో శ్రీ భట్టులు చెప్పలేదు. తరువాతి వ్యాఖ్యాతలు ఈ నాలుగు గతులు ఏవి అనే విషయంలో రెండు అభిప్రాయాలు చెప్పారు (1) ధర్మ, అర్థ, కామ, మోక్షములనే నాలుగు పురుషార్థాలు (2) (శ్రీ అణ్ణాంగారాచార్య స్వామి) ఇంద్రపదవి, బ్రహ్మ పదవి, కైవల్యము, మోక్షము అనే నాలుగు పదములు.

శ్రీ సుందరకాండము 35.19 – హనుమంతుడు సీతమ్మవారికి శ్రీరాముని వర్ణిస్తూ ఇలా అన్నాడు.

**చతుర్దశ సమద్వంద్వః చతుర్దంష్ట్రః చతుర్గతిః మహోష్ఠహనునాసశ్చ పంచస్నిగ్ధోఽష్టవంశవాన్.** శ్రీరాముడు పదునాలుగు జతలు అవయవములు సమప్రమాణములో కలవాడు. నాలుగు దంష్ట్రలు (సూదివలె మొనదేలిన దంతములు) కలవాడు. **నాలుగు మృగముల (సింహము, పెద్దపులి, ఏనుగు, వృషభము) నడకవంటి నడక కలవాడు.** అందమైన పెదవులు, చుబుకము, నాసిక కలవాడు. ఓ దేవీ! ఆ రాముడు నిగనిగలాడు ఐదు భాగములు (నేత్రములు, పలువరుస, చర్మము, పాదములు, కేశములు) కలవాడు. జానకీ! ఆయన శరీరము చేతివ్రేళ్ళు, కాలివ్రేళ్ళు, కరములు, నాసిక, నయనములు, కర్ణములు, ప్రజనము అను అష్టవంశములు తగిన ప్రమాణములో కలవాడు (గీతాప్రెస్ ప్రచురణలోని అనువాదము).

నాలుగు నడకలను సూచిస్తూ శ్రీమద్రామాయణంలో రాముని నడకనిలా వర్ణించారు – **గజ సింహ గతి వీరౌ శార్దూల వృషభోపమౌ.** శ్రీరంగం ఉత్సవంలో ఎంపెరుమాన్ ఊరేగింపులో నాలుగు విధాలైన నడకలుంటాయి – వృషభ గతి (గర్వము, విజయానందము సూచించు ఎద్దు నడక) , మత్తగజగతి (రాజసం ఉట్టిపడే ఏనుగు నడక), వ్యాఘ్రగతి (పులిలా బెదురులేని నడక), సింహగతి (అన్ని మృగములకు రాజైన, ఎదురు లేని సింహం నడక).

శ్రీ ఆండాళ్ తిరుప్పావై 23వ పాశురములో భగవానుని సింహగతిని ఇలా వర్ణించినది. (భావశ్రీ అనువాదము)

**వర్షర్తునందు పర్వత కుహరమందునన్ నిశ్చలస్థితిని నిదురించు శౌర్యపు సింహ**

మదియె మేల్కొని, తీవ్రమగు దృష్టి నీక్షించి వాసించు మేని రోమములు నిగుడగ జేసి
ద్రొర్లి ద్రొర్లియు మేని దులుపుకొని, మెయి సాచి గర్జించి, గుహనుండి గడగి వెల్వడ వచ్చు
పగిది గానుగ పూవువంటి మెయి చాయతో నీదు భవనమునుండి నేర్పునన్ విచ్చేసి
అపురూప సింహాసనమున కొలువున్నావు కరుణించి మా కార్యమెరుగ ప్రార్థించెదము




Creative Commons Photo from Flickr - Photo by : Richard Friedericks
at Arpana Ashram, Madhuban, Karnal, Haryana.
https://www.flickr.com/photos/shantaraj/10166194135/in/album-72157636346695635/

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'గతి' అనగా 'లక్ష్యము' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **ఆశ్రమానామ్ వర్ణానామ్ చతుర్ణామ్ యథోక్తకారిణామ్ గతిః చతుర్గతిః.** నాలుగు ఆశ్రమములకు, నాలుగు వర్ణములకు గతియైనవాడు చతుర్గతి. నాలుగు ఆశ్రమములనగా బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము. చతుర్వర్ణములనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. వర్ణాశ్రమ ధర్మాలు సక్రమంగా పాటించినట్లయితే భగవత్ప్రాప్తి కలుగుతుంది.

శ్రీ బలదేవ విద్యాభూషణ, శ్రీ సత్యసంధ యతిరాజ – నాలుగు విధాలైన భక్తులకు ఆశ్రయమైనవాడు చతుర్గతి.

**చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ** – గీత 7.16

ఓ భరతశ్రేష్ఠ! అర్జున! శుభకర్మలను ఆచరించుచు సుఖసంపదలను కోరుకొనువారు (అర్థార్థులు), శారీరిక మానసిక సంతాపములకు గురియైన ఆర్తులు, ఐహిక విషయములపై ఆసక్తిని వీడి పరమాత్మ తత్వజ్ఞానమును పొందుటకు ఇచ్ఛగలవారు (జిజ్ఞాసువులు), పరమాత్మ ప్రాప్తించిన జ్ఞానులు అను చతుర్విధ భక్తులు నన్ను భజింతురు.

**ఉదాహరణలు:** అర్థార్థులు – సుగ్రీవుడు, విభీషణుడు, ధ్రువుడు; ఆర్తులు – గజేంద్రుడు, జరాసంధునిచే బంధింపబడిన రాజులు, ద్రౌపది; జిజ్ఞాసులు – పరీక్షిత్తు, ఉద్ధవుడు; జ్ఞానులు – శుకుడు, సనకాదులు, నారదుడు, భీష్ముడు. (ఈ రచన అంతటా గీతాశ్లోకాల అనువాదం గీతాప్రెస్, గోరఖ్ పూర్ వారి ప్రచురణనుండి తీసుకొనడమైనది. శ్రీ మద్భగవద్గీత తత్వవివేచనీ హిందీ వ్యాఖ్య – రచన: శ్రీ జయదయాల్ గోయందకా – తెలుగు అనువాదము: డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య)

## 775. చతురాత్మా

- వ్యూహావతారములుగా నాలుగు రూపములు కలవాడు – వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు.
- రామ, కృష్ణ విభవావతారములలో నాలుగేసి రూపములు కలవాడు.
- సృష్టి, స్థితి, లయ కార్యములలో నాలుగేసి విభూతులు కలవాడు.
- చాతుర్య ఆత్మా చతురాత్మా – ఏ విధమైన బంధములు లేకుండా అతి పరిశుద్ధమైన ఆత్మ కలవాడు.
- మనసు, చిత్తము, బుద్ధి, అహంకారముల కార్యములకు కారణమైనవాడు.
- విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయములనే నాలుగు రూపములలో జీవునకు ఆధారమైనవాడు.
- ఆర్తుడు, అర్థార్ది, జిజ్ఞాసువు, జ్ఞాని అనే నాలుగు విధముల భక్తులకు అంతర్యామి.
- (చతుర = కుశల, తయారు) నాలుగు ముఖముల బ్రహ్మను సృష్టించినవాడు.
- జీవ, అంతరాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మ అనే నాల్గు విధములయిన ఆత్మలుగానున్నవాడు.

### ఓం చతురాత్మనే నమః

ఈ నామము రెండుమార్లు స్తుతింపబడినది.

15వ శ్లోకము. 139వ నాము. చతురాత్మా – **చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః**

82వ శ్లోకము. 775వ నామము. చతురాత్మా – **చతురాత్మా చతుర్భావః చతుర్వేదవిదేకపాత్**

'ఆత్మ' అనే పదం ఒక్కో జీవుని ఆత్మగురించి సాధారణంగా వాడుతారు. కాని ఒక్కోమారు పరమాత్మగురించి కూడ చెబుతారు. **చతుర్మూర్తిః** (82-771), **చతురాత్మా** (15-139, 82-775), **చతుర్వ్యూహః** (15-140, 82-773) –

అనే ఈ మూడు నామముల అర్థాలలోను కొంత సారూప్యం ఉంది. కనుక ఈ వ్యాఖ్యానాలగురించి కొంత పునరాలోకన ఇక్కడ ఇవ్వబడింది.

ఇంతకుముందు చెప్పినట్లుగా శ్రీ భట్టులు తమ వ్యాఖ్యలో 1000 నామములను 44 సమూహాలుగా విభజించారు. ఒక్కో సమూహంలోనూ భగవంతుని ఒక్కోగుణానుభవానికి ప్రాధాన్యతనిచ్చారు. వాటిలో 123 నుండి 146 వరకు నామములు భగవంతుని వ్యూహావతార వర్ణన పరంగా వ్యాఖ్యానించారు. కనుక 139 వ నామము 'చతురాత్మా', 140వ నామము 'చతుర్వ్యూహః' లు భగవంతుని నాలుగు వ్యూహముల గురించి వర్ణిస్తున్నాయి. ఇక 775వ నామము 'చతురాత్మా' మరియు 773వ నామము 'చతుర్వ్యూహః'లను శ్రీకృష్ణావతారపరంగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ఇలా ఒక్కో నామమునకు సందర్భానుసారంగా

ఒక్కో గుణాన్ని విశదీకరించారు. ఇలా భగవంతుని వివిధ గుణానుభవాలు మనకు లభిస్తున్నాయి. అంతేగాక ఈ స్తోత్రంలో పునరుక్తిదోషం లేదని నిరూపితమౌతున్నది.

శ్రీ శంకరుల వ్యాఖ్యానంలో అటువంటి సమూహాలు లేవు. కనుక ఒక నామానికి దాని ముందు వెనుక నామములతో ప్రత్యేకమైన సంబంధం కనిపించదు. అయితే శ్రీ శంకరులుకూడా పునరుక్తి దోషం లేకుండా వ్యాఖ్యానించారు. ఒకేనామం పలుమార్లు వచ్చినపుడు ఒకోమారు ఒకో క్రొత్త అర్థం చెప్పారు. ఉదాహరణకు – 'చతురాత్మా' నామము మొదటిసారి వచ్చినపుడు 'చతుర్' అంటే 'నాలుగు' అనే అర్థంలో, సృష్టి స్థితి లయ కార్యాలలో నాలుగేసి విభూతులు కలవాడు – అని వ్యాఖ్యానించారు. రెండవమారు ఇదే 'చతురాత్మా' నామమును 'చతుర-ఆత్మా' (చాతుర్యమ్ చతుర్) అనే అర్థంలో, ఆత్మను పరిశుద్ధంగా ఉంచుకొనేవాడు – అని వ్యాఖ్యానించారు శ్రీ శంకరులు. ఇక 'చతుర్మూర్తి' అనగా నాలుగు యుగాలలో నాలుగు రంగులు కలవాడు – అని వ్యాఖ్యానించారు.

ఇక ప్రస్తుత 'చతురాత్మా' నామమును గురించి –

శ్రీ భట్టుల వ్యాఖ్య –

15వ శ్లోకము. 139వ నామము. చతురాత్మా – **వాసుదేవాది రూపత్వాత్ చతురాత్మా ఇతి కథ్యతే.** ఇక్కడ 'ఆత్మ' అనగా రూపము. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములుగానున్నవాడు చతురాత్మ.

82వ శ్లోకము. 775వ నామము. చతురాత్మా – **స్థూల సూక్ష్మే జాగ్రదాదౌ చాతురాత్మ్య ప్రకాశనాత్ చతురాత్మా స విజ్ఞేయః వస్వర్ణో మనురుత్తమః.** జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయము అనే నాల్గు అవస్థలలోను భగవంతుడు స్థూల మరియు సూక్ష్మ రూపములలో భక్తులకొరకు ప్రకాశించుచుండును గనుక చతురాత్మ. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. మహత్తరమైనది. ఓం చతురాత్మనే నమః. అనగా భగవంతుడు అన్నివేళలా అన్నియెడలా భక్తులకు అందుబాటులో ఉండును.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

15వ శ్లోకము. చతురాత్మా – భగవంతుడు సృష్టి, స్థితి, లయము అనే మూడు కార్యములలోను నాలుగేసి విభూతులుగా ఒప్పుచుండును.

సృష్టియందు (హరి) – బ్రహ్మ, దక్షాదులు, కాలము, సకల జీవులు.
స్థితియందు (విష్ణువు) – విష్ణువు, మన్వాదులు, కాలము, సకల జీవులు.
లయయందు (జనార్దనుడు) – రుద్రుడు, యమాదులు, కాలము, సకల జీవులు.

**బ్రహ్మ దక్షాదయః కాలః తథైవ అఖిల జంతవః విభూతయా హరిరేతా జగతః సృష్టిహేతవః**
**విష్ణుర్మన్వాదయః కాలః సర్వభూతాని చ ద్విజ స్థితేర్నిమిత్త భూతస్య విష్ణోరేతా విభూతయః**
**రుద్రః కాలః అంతకాద్యశ్చ సమస్తాశ్చైవ జంతవః చతుర్ధా ప్రళయాయైతా జనార్దన విభూతయః** – విష్ణుపురాణము 1.22, 30.32

82వ శ్లోకము. చతురాత్మా – **రాగద్వేషాది రహితాత్ చతుర ఆత్మా మనో అస్య ఇతి చతురాత్మా.** ఇక్కడ చతురమైన ఆత్మ అనే అర్థంలో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. రాగద్వేషములు లేని పరిశుద్ధమైన ఆత్మ, ఆలా ఉంచుకొనే చాతుర్యం కలిగినవాడు చతురాత్మ.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – **మనో బుద్ధి అహంకార చిత్తాఖ్యాంతఃకరణ చతుష్టయ ఆత్మకత్వాత్ చతురాత్మా.** మనసు, బుద్ధి, అహంకారము, చిత్తము అనే నాలుగు అంతఃకరణలకు ఆధారమైనవాడు చతురాత్మ.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – **మనో బుద్ధిరహంకారః చిత్తమ్ కరణమ్ అంతరమ్ సంశయో నిశ్చయో గర్వస్మరణమ్ విషయానీ.**

మనసు – సంశయము – ఏదో చేయాలనుకొనేది.

బుద్ధి – నిశ్చయము – ముందు వెనుకలు ఆలోచించేది.

చిత్తము – స్మరణము – పాత జ్ఞాపకాల అనుభవాన్ని పరిగణించేది.

అహంకారము – గర్వము – చేసినందుకు గర్వించేది.

శ్రీ చిన్మయానంద 'చత్వారాత్మా' అనే పాఠాంతరాన్ని గ్రహించారు. అంతఃకరణ చతుష్టయము అనే నాలుగు రూపాలలో వ్యక్తమయ్యే అనంత ప్రకాశమే చత్వారాత్మ.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి 'నృసింహతాపిని' ఆధారంగా మరొక వివరణ ఇచ్చారు – **ఓత, అనుజ్ఞాత, అనుజ్ఞైకరస, అవికల్ప - అథ తురీయశ్చతురాత్మా తురీయావసిత్వాత్ ఏకైకస్య ఓతానుజ్ఞాత్రనుజ్ఞవైకల్పైః**.. పరమాత్ముడు నాలుగు రూపాలలో ప్రకాశిస్తున్నాడు.

(1) జీవుల స్థూల శరీరము (విశ్వ శరీరము)నకు ఆధారమైన 'విరాట్ రూపము'. విశ్వ శరీరమును, విరాట్ రూపమును కలిపి 'ఓత ప్రోత స్వరూపము' అంటారు.

(2) జీవుల సూక్ష్మ శరీరము (తైజస శరీరము)నకు ఆధారమైన 'సూత్ర రూపము'. తైజస శరీరము, సూత్ర రూపములు కలిపి 'అనుజ్ఞాత రూపము'.

(3) జీవుల మరో శరీరము పేరు కారణ శరీరము. ఇది పాత జన్మల జ్ఞాపకాలను కలిగి ఉంటుంది (ఉదాహరణ: పసిబిడ్డ పాలకోసం ఏడవాలని తెలుసుకోవడం). కారణ శరీరమునే 'ప్రాజ్ఞాశరీరము' అని కూడా అంటారు. ప్రాజ్ఞాశరీరమునకు ఆధారమైన పరమాత్మ రూపమును 'అనుజ్ఞైక రసము' అంటారు.

(4) ఈ మూడు రూపాలకంటే పరమైనది, బ్రహ్మజ్ఞానంవల్ల మాత్రమే తెలియవచ్చే పరమాత్మ రూపమును 'అవికల్పము' అంటారు.

ఇలా ఓత, అనుజ్ఞాత, అనుజ్ఞైకరస, అవికల్పములనే నాలుగు రూపములు కలిగిన పరమాత్మ చతురాత్మ.

శ్రీ టి.ఎస్. రాఘవన్ – మార్కండేయపురాణం ఆధారంగా, పరమాత్ముడు సకల జీవుల శరీరములందును విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయములనే నాలుగు రూపములలో ప్రవేశిస్తున్నాడు.

**పరమాత్మా చతుర్రూపః సర్వప్రాణి శరీరగః విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞా స్తురీయశ్చేతి కథ్యతే.**

జాగ్రదవస్థలో విశ్వరూపము, స్వప్నావస్థలో తైజసరూపము, సుషుప్నావస్థలో ప్రాజ్ఞారూపము, వీటన్నంటిని మించి తురీయావస్థలో తురీయరూపములోను పరమాత్ముడుంటాడు.

మాండూక్యోపనిషత్తులో ఈ అవస్థల గురించి చెప్పారు. ఆత్మకు నాలుగు పాదాలున్నాయి –

(1) జాగ్రదవస్థ మొదటి పాదం. దీనికి అధిపతి వైశ్వానరుడు. ఇతడికి ఏడు అంగములు, 19 నోళ్ళు ఉన్నాయి.

(2) స్వప్నావస్థ రెండవ పాదం. దీనికి అధిపతి తైజసుడు. వీనికి ఏడు అంగములు, 19 నోళ్ళు ఉన్నాయి.

(3) సుషుప్తి మూడవ దశ. అధిపతి ప్రాజ్ఞుడు.

(4) నాల్గవ దశ తురీయము. అధిపతి ఆత్మ. ఈ దశ అంతరము కాదు, బాహ్యము కాదు. అచేతన కాదు. ఇంకోదానితో సంబంధం పెట్టి చెప్పలేనిది. మనస్సు గ్రహించలేదు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **చతుర్ణామ్ ఆర్త అర్థార్థీ జిజ్ఞాసు ముముక్షుణామ్ ఆత్మా అంతర్యామీ ప్రియ ఇతి చతురాత్మా.** భగవంతుని అర్చించే నాలుగు విధాల భక్తులకు – దుఃఖమునుండి ఉపశమనము కోరువారు, సుఖము ధనము వంటివానిని కోరువారు, జ్ఞానము కోరువారు, మోక్షము కోరు జ్ఞానులు – ఈ నాలుగు విధాల భక్తులకు అంతర్యామి గనుక చతురాత్మ.

శ్రీ సత్యసంధ యతిరాజ – **చతుర్షు ధర్మ అర్థ కామ మోక్షేషు జనానామ్ యోగ్యతానుసారేణ ఆత్మా మనో యస్మాత్ స చతురాత్మా.** జనుల యోగ్యతనుబట్టి వారికి ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను ప్రసాదించువాడు చతురాత్మ.

శ్రీ సత్యసంధ యతిరాజ మరొక వివరణ – **చత్వార ఆత్మానః ఆత్మా, అంతరాత్మా, పరమాత్మా, జ్ఞానాత్మా లక్షణా యస్య ఇతి చతురాత్మా.** భగవంతునిలో నాలుగువిధాలైన ఆత్మల లక్షణాలున్నాయి. ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మల సంపూర్ణ గుణములు కలిగినవాడు చతురాత్మ.

పరమాత్ముడు ఆత్మరూపంలో మన హృదయాలలో వసించును. అంతరాత్మరూపంలో ఆత్మలో వసించును. తైత్తరీయోపనిషత్తులో **'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'** అని ఉంది. భగవంతుడు ప్రాణమయుడు, మనోమయుడు, అన్నమయుడు, విజ్ఞానమయుడు, ఆనందమయుడు. ఇందులో మనోమయ, ఆనందమయ విభూతులు జ్ఞానాత్మ స్వరూపములు. బృహత్ సంహితలో ఇలా ఉన్నది.

**ఆత్మా అంతరాత్మా హరిరేక ద్వి-విధా స్థితః**
**నివిష్టో హృదయే నిత్యమ్ రసం పిబతి కర్మజమ్.**

## 776. చతుర్భావః

- సృష్టి, స్థితి, రక్షణ, శాస్త్ర ప్రదానాది స్థూల సూక్ష్మ కార్యాలను తన నాలుగు వ్యూహముల ద్వారా ప్రకటింపజేయువాడు.
- నాలుగు వర్ణములు, నాలుగు ఆశ్రమములు, నాలుగు పురుషార్థములు, ఇలా నాలుగేసి సమూహములకు మూలము.
- నాలుగు విధములైన జీవులను సృష్టించినవాడు.

### ఓం చతుర్భావాయ నమః

భూ - సత్తాయామ్ - ఉండుట, నివసించుట, జన్మించుట;

భావ - ఉండువాడు - ఉండుటకు కారణమైనవాడు, స్వయముగా ఆవిర్భవించినవాడు, ఇతరుల ఆవిర్భావానికి కారణమైనవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భావ - భావన - వ్యక్తపరచుట. ఇంతకుముందు నామమువలెనే ఈ నామమునకు కూడా శ్రీ భట్టులు వ్యూహావతారములతో సంబంధము చూపారు. సృష్టి, స్థితి, రక్షణ, శాస్త్రముల ప్రాచుర్యము అనేవి నాలుగు కార్యములు. ఇవి వ్యూహావతారములలో ఇలా వ్యక్తమవుతున్నవి. (అభివ్యంజనము = వ్యక్తము). వాసుదేవ – సృష్టి; సంకర్షణ – స్థితి; ప్రద్యుమ్న – రక్షణ; అనిరుద్ధ – శాస్త్రప్రదానము.

**శాస్త్రదానాది పంచాభివ్యంజనాత్ స్థూలసూక్ష్మయోః చతుర్భావస్సమాఖ్యాత మున్యర్ణశ్చ గతిప్రదః.** సృష్టి, స్థితి, రక్షణ, శాస్త్ర ప్రదానాది కార్యాలను తన నాలుగు వ్యూహముల ద్వారా ప్రకటింపజేయువాడు చతుర్భావుడు. ఓం చతుర్భావాయ నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ధర్మార్థకామమోక్షాఖ్య పురుషార్థ చతుష్టయమ్ భవతి - ఉత్పాద్యతే అస్మాత్ ఇతి చతుర్భావః.** నాలుగు విధాలైన పురుషార్థములకు ఆధారమైనవాడు చతుర్భావుడు.

శ్రీ చిన్మయానంద 'నాల్గింటికి మూలము' అనే భావాన్ని మరింత విస్తరించారు – నాలుగు వర్ణములు, నాలుగు పురుషార్థములు, నాలుగు ఆశ్రమములు వంటివానికి మూలమైనవాడు చతుర్భావుడు.

**చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః**
**తస్య కర్తారమపి మాం విద్ధ్య కర్తారమవ్యయమ్** – గీత 4.13
బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారిని వారి గుణకర్మలననుసరించి నేను సృష్టించితిని. ఈ సృష్టి కార్యక్రమమునకు నేనే కర్తనైనను, శాశ్వతుడను, పరమేశ్వరుడను ఐన నన్ను వాస్తవముగ 'అకర్త'గా తెలిసికొనుము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **స్వకృత వ్యవస్థయా చతుర్విధమ్ సృష్టిమ్ ఉత్పాదయతి**. తన సంకల్పమాత్రమున నాలుగు విధములైన జీవులను సృష్టించినవాడు చతుర్భావుడు. ఆ నాల్గు విధాల జీవులు (1) గ్రుడ్డునుండి జనించేవి. ఉదా:పక్షులు, పాములు (2) ఝుంకారము చేసేవి. ఉదా: ఈగలు, దోమలు, తేనెటీగలు. (3) చెట్లు (4) మానవులు.

## 777. చతుర్వేదవిత్

- నాలుగు వేదములు తెలిసినవారు ఆయననెరుగుదురు.
- నాలుగు వేదములు పూర్తిగా తెలిసినవాడు భగవంతుడు మాత్రమే.
- నాలుగు వేదములు తెలియునట్లు అనుగ్రహించువాడు.

**ఓం చతుర్వేదవిదే నమః.**

'చతుర్-వేద-విత్' అనగా నాలుగు వేదములు పూర్తిగా తెలిసినవాడు. 14వ శ్లోకంలో ఇలాంటిదే 'వేదవిత్' అనే నామం వచ్చింది.

భగవంతుడొక్కడు మాత్రమే పూర్తిగా నాలుగు వేదములు తెలిసినవాడు. తక్కిన వేదజ్ఞానులంతా భగవానుని అనంత వ్యూహ, విభవములలో లేశమాత్రమే అనుభవిస్తారు.

**పరావర విభాగానాం కో విదా స్వయమేవయే చతుర్వేదవిదిత్యుక్తః వస్వర్ణో నిగమప్రదః -** నాలుగు వేదముల సారమూ స్వయంగా తెలిసినవాడు. ఈ నామము అష్టాక్షరీమంత్రము. వేదజ్ఞానప్రదము. ఓం చతుర్వేదవిదే నమః. (ఈ శ్లోకం, దాని భావంలో అచ్చుతప్పులున్నాయనిపించింది. కనుక కొంచెం మార్చాను – కా.సు.బాబు.)

**చతుర్వేదైః విద్యతే కణికామా తతయా జ్ఞాయతే ఇతి చతుర్వేదవిత్.** నాలుగు వేదాలు తెలిసినవారుకూడా ఆ పరమేశ్వరుని మహిమను కొద్దిగానే తెలుసుకోగలుగుతారు.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవవేద్యో వేదాన్తకృత్ <u>వేదవిదేవ</u> చాహమ్** – గీత 15.15
సమస్త ప్రాణుల హృదయములలో అంతర్యామిగానున్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహమును తొలగించుట) కలుగుచున్నవి. వేదములద్వారా తెలిసికొనదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదవిజ్ఞుడను కూడా నేనే.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (1.3.10)లో – **మఱైమాయ నాల్ వేదత్తుళ్ నిన్హ మలర్ చ్చుడారే** – అన్నారు. శ్రీ వేదాంతదేశికన్ ఈ పాశురంలో 'మఱై', 'వేదం' అనే రెండు పదాల వాడకాన్ని విశ్లేషించారు. 'మఱై' అనగా భక్తులుకానివారినుండి దాచిపెట్టబడిన గొప్ప రహస్యము. 'వేదము' అనగా గొప్ప భక్తులకు తెలియజేయబడిన ఆ రహస్యము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యథావత్ వేత్తి చతుర్ణామ్ వేదానామ్ అర్థమ్ ఇతి చతుర్వేదవిత్.** నాలుగు వేదముల అర్థము ఉన్నదున్నట్లుగా తెలిసినవాడు ఆయనొక్కడేగనుక ఆయన 'చతుర్వేదవిత్'. శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే అర్థం చెప్పారు. **చత్వారో వేదా ఋుగాదయః తాన్ అవశేషాన్ వేత్తి ఇతి చతుర్వేదవిత్.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు నాలుగు వేదములను పూర్తిగా తెలిసినవాడు మాత్రమే కాదు. స్వయముగా నాలుగు వేదములు ఆయనే. కనుక వేదములను, వాని అర్థములను బాగుగా అధ్యయనము చేసినవారికి మాత్రమే భగవంతుని తెలిసికొనుట సాధ్యము.

శ్రీ బలదేవ విద్యాభూషణ భిన్నమైన అనుభవాన్ని చెప్పారు – **చతురో వేదాన్ వేదయతి భక్తాన్ ఇతి చతుర్వేదవిత్**. తన భక్తులకు నాలుగు వేదములు తెలిసికొనుటను సాధ్యం చేసేవాడు 'చతుర్వేదవిత్'. అనగా భగవంతునిపట్ల గాఢమైన భక్తివలన మాత్రమే వేదములను అభ్యసించేవారికి వేదములు అవగతమగును.

## 778. ఏకపాత్

- మానవులలో ఒకనిగా అవతరించినపుడు తన మహిమలో ఒక భాగము (అంశ)ను మాత్రమే వ్యక్తపరచేవాడు.
- విశ్వరూపంలో ఆయన విభూతి ఆయనలో నాల్గవ భాగమే.
- (ఏకపా-అత్) ఏకైక రక్షకునిగా సదా కాపు కాచేవాడు.

ఓం ఏకపదే నమః

ఓం ఏకపాదే నమః (శ్రీ సత్యదేవో వాసిష్ఠ, శ్రీ కృష్ణదత్త భరద్వాజ)

పాదము అంటే మూడు అర్థాలున్నాయి (1) నాల్గవ భాగము (2) కాలి పాదము (3) భాగము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఏకాంశేనా వశీర్ణత్వాత్ ఏకపాదితి కథ్యతే.** ఒకే అంశతో అవతరించినవాడు ఏకపాత్ భగవంతుడు మనలో ఒకనిగా అవతరించినపుడు తన మహిమలో కొద్ది భాగమును మాత్రమే వ్యక్తపరచును (అంటే అర్థం అవతార సమయంలో భగవంతుని గొప్పతనంలో ఒక భాగం మాత్రమే ఉంటుందని కాదు. ఆయన తన సంపూర్ణమైన గుణాలు కలిగియుండును కాని వానిలో కొద్దిభాగమును మాత్రమే బయటకు వ్యక్తపరచును. శ్రీమద్రామాయణములో శ్రీరాముడు **'అహం మానుషం మన్యే'** – నేను మానవునిగా అనుకొంటున్నాను – అనడం ఇందుకొక ఉదాహరణ. శ్రీ స్వామిదేశికన్ తమ శరణాగతి దీపిక 17వ శ్లోకంలో విభవావతాముల పరిపూర్ణతను వివరించారు. శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణములు –

**అంశావతారో బ్రహ్మర్షే! యోఽయం యదుకులోద్భవ** – విష్ణుపురాణము 5.1.2 – ఓ బ్రహ్మర్షీ! యదుకులంలో శ్రీకృష్ణుని అవతారం ఆయనలోని ఒక అంశ మాత్రమే.

**అంశాంశేన అవతీర్య ఉర్వ్యామ్** – విష్ణుపురాణము 5.1.3 – తన అంశలో ఒక అంశగా ఈ జగత్తులో అవతరించాడు.

**విష్ణోరర్ధమ్ మహాభాగమ్ పుత్రమ్ ఇక్ష్వాకు నందనమ్** – బాలకాండ 18.12 – విష్ణువుయొక్క అర్ధమహాబాగము ఇక్ష్వాకువంశంలో పుత్రుడు రామునిగా అవతరించెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరుల వ్యాఖ్య పురుషసూక్తంలో ఉన్న విషయానికి సరిపోతుంది.

**ఏతావాన్ అస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః**

**పాదోఽస్య విశ్వభూతాని త్రిపాదస్యామృతమ్ దివి**

**త్రిపాదూర్ధ్వ ఉదయత్పురుషః పాదోఽస్యేహా భవాత్ పునః**

**తతో విశ్వంగ వ్యక్రామత్ సాశనానశనే అభి**

భగవంతుని మహిమలో నాల్గవభాగం మాత్రమే వ్యక్తమయ్యింది. తక్కిన మూడు వంతులు ఆయన పరమపదమునందలి నిత్యవిభూతి. ఇక్కడ నాల్గవ భాగము, మూడు భాగాలు అనగా అనంతంలో కొద్దిభాగము, అధికభాగము అని అర్థం చేసుకోవాలి.

శ్రీ శంకరులు గీతనుండి ఉదాహరించారు –

**అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున**
**విష్టభ్యామహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్** – గీత 10.42
అథవా, ఓ అర్జున! ఇంతకంటెను విపులముగా తెలిసికొని ప్రయోజనమేమి? ఈ సంపూర్ణ జగత్తును కేవలము నా యోగశక్తియొక్క ఒక్క అంశతోడనే ధరించుచున్నాను.

శ్రీ బలదేవ విద్యాభూషణ స్మృతులనుండి ఉదాహరించారు.

**అండానామ్ తు సహస్రానామ్ సహస్రాన్యయుతాని చ ఈ దృశానామ్ తథా తత్ర కోటి కోటి శతాని చ**
ఈ కనిపించే వేలాది బ్రహ్మాండములు ఆయనయందలి చాలా చాలా కొద్ది భాగం మాత్రమే.

శ్రీ సత్యసంధ యతిరాజ – 'ఏకపా-అత్ - ఏకపాత్' అని గ్రహించారు. అత్ - సాతాత్యగమనే - సదా వెళ్ళుచుండుట - అతతి. **ఏకపో ముఖ్యపాలకః సన్ అతతి.** ఆయన ఒక్కడే రక్షకుడు. కనుక మనలను సదా కనిపెట్టియుండును.

పా - రక్షణే, పాతి - రక్షించుట, అనే ధాతువునుండి కూడ 'ఏకపాత్' అనగా 'ఏకైక రక్షకుడు' అనే అర్థం వస్తుంది.

### శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్య – శ్రీ వేంకటేశ్వర వచనములు

వాసుదేవా! దేవకీ నందనా! గోపాలమూర్తీ! లక్ష్మీమనోహరా! భూకాంతాప్రియా! గోపికావల్లభా! రుక్మిణీ ప్రాణనాయకా! సత్యభామా మనోహరా! జాంబవతీ సుముఖా! కాళిందీ సరససల్లాపా! మిత్రవిందా భోగలోకైకరతా! భద్రా కుచకుంభవిహారా! నీ రాసగ్రహాది సరస సత్కథా ప్రసంగంబులు భాగవత పురాణంబులు. ఈ కథలు విన్నవారికిఁ బుణ్యంబు లనంతంబులై పరలోక సాధనంబులగునటే! యివి యెటువంటి విచిత్రంబులు! నీ కౌతుక క్రీడలు మోక్ష సాధనంబులట! శ్రీ వేంకటేశ్వరా!

### అన్నమయ్య కీర్తన

అలమేలుమంగ నీ వభినవ రూపము
జలజాక్షు కన్నులకు చవులిచ్చేవమ్మా

గరుడాచలాధీశు ఘనవక్షముననుండి
పరమానంద సంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించగ జేసితి గదమ్మా

శశికిరణములకు చలువల చూపులు
విశదముగా మీద వెదజల్లుచు
రసికత పెంపున కరగించి యెప్పుడు నీ
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా



వేలూరు శ్రీమహాలక్ష్మి చిత్రీకరణ by Smartmga
https://commons.wikimedia.org/wiki/ File:Mahalakshmi_vellur.jpg వికీపీడియా నుండి



## సమావర్తోనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః |
## దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా || (83)

### 779. సమావర్తః

- భక్తులకొరకు మరల మరల అవతరించువాడు.
- సంసార చక్రమును బాగుగా త్రిప్పువాడు. మరల మరల సృష్టికార్యము చేయువాడు.
- తన భక్తులకు సహాయం చేయడం గురించి సదా యోచించువాడు.

ఓం సమావర్తాయ నమః

ఇక్కడ 'సమ్' అనునది ఉపసర్గ. సమ్ - బాగుగా, అన్ని ప్రక్కలనుండి; వృత్ - వర్తనే - ఉండుట, ఆక్రమించుట, కొనసాగుట. **ఆవర్తతే చక్రవత్ భ్రామయతి ఇతి ఆవర్తః.** చక్రంలాగా తిరిగేది 'ఆవర్తః'.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు జన్మరహితుడైనాగాని భక్తులకోసం మరల మరల అవతరిస్తుంటాడు గనుక 'సమావర్తః'. **ఏతాదృశం హి సర్వత్ర సర్వదా సర్వథాపి చ వ్యూహస్య విభవస్యాపి యస్యాస్త్యావర్తనంత్వితి సమావర్త స్సమాఖ్యాతః వస్వర్ణో జన్మనాశకః** - ఈ రకంగా వ్యూహావతారాలు, విభవావతారాలు అన్ని చోట్ల, అన్నివిధాలా, ఎల్లప్పుడూ ధరిస్తూనే ఉండేవాడు 'సమావర్తః'. ఈ నామము అష్టాక్షరీమంత్రము. జన్మరాహిత్యమును ప్రసాదించును. ఓం సమావర్తాయ నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సంసారచక్రస్య సమ్యగ్ ఆవర్తకః ఇతి సమావర్తః.** సంసారచక్రమును బాగుగా త్రిప్పువాడు 'సమావర్తః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సమ్యగ్ ఆవర్తయతి సంసారచక్రమ్ ఇతి సమావర్తః.**

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సమ్యగ్ తాన్ ఆవర్తయతి పునః పునః సృజతి ఇతి సమావర్తః.**

**ఈశ్వరః సర్వభూతానామ్ హృద్దేశేఽర్జున తిష్ఠతి**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా** – గీత 18.61
అర్జునా! శరీరరూప యంత్రములను అధిరోహించి సర్వప్రాణుల హృదయములందును అంతర్యామిగానున్న పరమేశ్వరుడు తన మాయచేత వారివారి కర్మలననుసరించి వారిని భ్రమింపజేయుచున్నాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ మరొక వ్యాఖ్య – **సమీచీనః ఆవర్తనశ్చింతనమ్ స్వజన అవనమయమ్ యస్య ఇతి సమావర్తః.** భక్తుల మేలుకోసం ఏమి చేయాలన్న విషయంచుట్టూ భగవంతుని ఆలోచనలు తిరుగుతుంటాయి.

## 780. నివృత్తాత్మా

### అనివృత్తాత్మా

- భగవంతుని స్వభావము దివ్యము. అన్నింటికంటె ఉత్తమము. అది ప్రాకృతము కాదు.
- నరనారాయణావతారము. నివృత్తిధర్మమును నరునకు బోధించిన నారాయణుడు. సన్యాసమార్గము చేకొన్నవాడు.
- నివృత్తిధర్మము పాటించేవారి ఆత్మ. కర్మఫలములను ప్రసాదించువాడు.
- ('అనివృత్తాత్మా' - శ్రీ శంకరుల పాఠము) అంతటా ఉన్నవాడు గనుక దేనినుండి వెనుదిరుగడు.
- ప్రళయకాలంలో జీవులను తనయందు ఇముడ్చుకొనువాడు.
- అంతటా, అన్నింటా సంపూర్ణంగా వ్యాపించినవాడు.
- అర్హతలేనివారు చేయు యాగములపట్ల విముఖుడు.
- ప్రళయము, సృష్టివంటివాని ప్రభావము ఆయనపై యుండదు.
- తన యశస్సు, కీర్తనలపట్ల విముఖుడు.

**ఓం నివృత్తాత్మనే నమః**

**ఓం అనివృత్తాత్మనే నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్యానం ప్రకారం ఈ నామము నాలుగుసార్లు వస్తుంది. ఇలా నాల్గుసార్లు వచ్చే ఇంకొక్క నామము **'ప్రాణదః'** మాత్రమే.

| శ్లోకము | నామము | శ్రీ భట్టుల పాఠము | శ్రీ శంకరుల పాఠము |
|---|---|---|---|
| 25 | 231 | నివృత్తాత్మా | నివృత్తాత్మా |
| 48 | 453 | నివృత్తాత్మా | విముక్తాత్మా |
| 64 | 604 | నివృత్తాత్మా | నివృత్తాత్మా |
| 83 | 780 | నివృత్తాత్మా | అనివృత్తాత్మా / నివృత్తాత్మా |

25వ శ్లోకము. 231వ నామము. నివృత్తాత్మా – **ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః**

48వ శ్లోకము.453వ నామము.

శ్రీ భట్టుల పాఠము ప్రకారము: నివృత్తాత్మా – **సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్**

శ్రీ శంకరుల పాఠము ప్రకారము: విముక్తాత్మా – **సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్**

64వ శ్లోకము. 604వ నామము. నివృత్తాత్మా – **అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః**

83వ శ్లోకము. 780వ నామము.

శ్రీ భట్టుల పాఠము ప్రకారము: నివృత్తాత్మా – **సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః**

శ్రీ శంకరుల పాఠము ప్రకారము: అనివృత్తాత్మా – **సమావర్తోऽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః**

48వ శ్లోకము 453వ నామము, 64వ శ్లోకము 604వ నామము వివరణలో ఈ నామమునకు చెప్పబడిన వివిధ అర్థములు ఇవ్వడమైనది. మరికొన్ని విషయములు ఇక్కడ చర్చిస్తున్నాము.

శ్రీ భట్టుల వ్యాఖ్యలో రెండు విశేష లక్షణములున్నాయి. (1) శ్రీ భట్టులు ప్రధానంగా భగవంతుని సౌలభ్యాన్ని, సౌశీల్యాన్ని ప్రస్తుతించారు. భక్తుని దృక్పథంలో ఇవి ప్రధానలక్షణాలని శ్రీ భట్టుల భావన. శ్రీ శంకరులు ప్రధానంగా భగవంతుని పరత్వము (సర్వాధిక్యత)ను తమ వ్యాఖ్యలో తెలియజేశారు. (2) శ్రీ భట్టులు 1000 నామములను 44 సమూహాలుగా విభజించారు. ఒక్కో సమూహంలోను ఒక్కొక్క విభూతి లేదా అవతారము లేదా గుణము ప్రధాన విషయము. ఈ రెండవ లక్షణం పరంగా 'నివృత్తాత్మా' నామము చెప్పబడిన సందర్భాలు ఇవి.

25వ శ్లోకము 231వ నామము 'నివృత్తాత్మా' – శ్రీ భట్టులు 226నుండి 247వ నామము వరకు 'పురుషసూక్తంలో ప్రతిపాదించిన విరాట్ స్వరూపం' పరంగా వ్యాఖ్యానించారు. నివృత్తాత్మ = దివ్య, అప్రాకృత స్వరూపుడు.

48వ శ్లోకము 453వ నామము 'నివృత్తాత్మా' – శ్రీ భట్టులు 451 నుండి 463వ నామము వరకు భగవంతుని నరనారాయణావతార పరంగా వ్యాఖ్యానించారు. నివృత్తాత్మ = నివృత్తిధర్మమును పాటించువాడు.

64వ శ్లోకము 604వ నామము 'నివృత్తాత్మా' – శ్రీ భట్టులు 590 నుండి 606వ నామము వరకు భగవంతుని కర్మఫలప్రదానగుణం పరంగా వ్యాఖ్యానించారు. నివృత్తాత్మ = నివృత్తిధర్మం పాటించేవారి ఆత్మ.

83వ శ్లోకము 780వ నామము 'నివృత్తాత్మా' – శ్రీ భట్టులు 697నుండి 786వ నామము వరకు శ్రీకృష్ణావతారపరంగా వ్యాఖ్యానించారు. నివృత్తాత్మ = ప్రవృత్తి ధర్మము పాటించేవారి మధ్యలో ఉన్నప్పటికీ తానుమాత్రం నివృత్తిధర్మము పాటించును.

కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతునికి బ్రహ్మవిద్య బోధిస్తూ వేదంలోని రెండు మార్గాలను చెప్పాడు.

(1) ప్రవృత్తి మార్గము - లౌకికము. (2) నివృత్తి మార్గము - మోక్షదాయకము. ఈ రెండింటిలోనూ మానవుడు ఏదో ఒక మార్గాన్ని ఎన్నుకోవాలి. శ్రీకృష్ణుడు మానవుల మధ్యలో ఉన్నాగాని ఆయనకు కర్మబంధాలు వర్తించవు. విషయవాసనలు అంటవు. కనుక ఆయన నివృత్తాత్మ.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు –

25వ శ్లోకములో 'నివృత్తాత్మా' – **సంసార బంధన నివృత్త ఆత్మా స్వరూపమ్ అస్య ఇతి నివృత్తాత్మా**. ఇహలోక బంధములు ఆయనకు వర్తించవు గనుక నివృత్తాత్మ. శ్రీ భట్టుల వ్యాఖ్య కూడా ఇందుకు సరిపోతుంది.

48వ శ్లోకములో 'విముక్తాత్మా' – **స్వభావసిద్ధేన విముక్త ఆత్మా యస్య ఇతి విముక్తాత్మా**. స్వభావసిద్ధంగా, అనగా ఏ విధమైన కర్మఫలంగా కాకుండా, విముక్తుడైన ఆత్మ విముక్తాత్మ.

64వ శ్లోకములో 'నివృత్తాత్మా' – **స్వభావతో విషయేభ్యో నివృత్త ఆత్మా మనః అస్య ఇతి నివృత్తాత్మా**. తన స్వభావం ప్రకారం ప్రాపంచిక విషయాలనుండి విముఖుడైనవాడు నివృత్తాత్మ. శ్రీ భట్టులు కూడా ఇదే అర్థం చెప్పారుగాని నరనారాయణావతారానికి అన్వయించారు.

83వ శ్లోకములో 'అనివృత్తాత్మా' – **సర్వత్ర వర్తమానత్వాత్ స నివృత్తః కుతోऽపి అనివృత్తాత్మా**. భగవంతుడు అన్నిచోట్లా ఉంటాడు. కనుక దేనినుండైనా వెనుదిరగడం అనేది ఆయనకు వర్తించదు. అలా ఆయన అనివృత్తాత్మ.

శ్రీ సత్యసంధ యతిరాజ మూడు అర్థాలు చెప్పారు.

(1) **నివృత్తాత్మనో యేన ప్రలయ ఇతి.** ప్రళయకాలంలో జీవులను తనయందు ఇముడ్చుకొనేవాడు నివృత్తాత్మ.

(2) ని - నితారమ్ - పూర్తిగా, వృత్తః - సకలవిషయే ప్రవృత్తః. అన్నింటా ఉండేవాడు, అనగా అంతటా వ్యాపించినవాడు నివృత్తాత్మ.

(3) **అయోగ్య కృత యజ్ఞాదిభ్యో నివృత్తో వా ఆత్మా మనో యస్య స నివృత్తాత్మా.** అయోగ్యులు ఒనరించిన యజ్ఞములపట్ల విముఖుడైనవాడు నివృత్తాత్మ.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 64వ శ్లోకము 'నివృత్తాత్మా' – నివృత్త - అసంగ - సంబంధము లేనివాడు. **భగవాన్ విష్ణుః సృష్టికాలే ప్రళయకాలే చ సృష్టిమ్ ప్రళయౌ యథాక్రమమ్ విదధదపి, స్వస్వరూపవతో నివృత్తాత్మా భవతి అసంగః, ప్రళయకాలే వా సృష్టేర్ నివర్తత ఇతి నివృత్తాత్మా విష్ణురుక్తో భవతి.** భగవంతుడు విష్ణువుకు ప్రళయకాలంలో అంతం లేదు. సృష్టిలో జన్మ లేదు. అనగా ప్రళయము, సృష్టితో సంబంధము లేనివాడు గనుక నివృత్తాత్మ.

శ్రీ వి.వి. రామానుజన్ – అనేక బ్రహ్మాండములు, జీవులు, చరాచరములతో కూడిన సృష్టి చేసిన భగవానుడు అన్నింటికిని స్వామి. కాని ఆయనకు దీనిపట్ల మమకారము, గర్వమువంటివి లేవు. సృష్టిని కాపాడుటే ఆయన లక్ష్యము. కనుక భగవంతుడు నివృత్తాత్మ. ఈ నామముద్వారా మనము ఇంద్రియనిగ్రహము నేర్చుకొని భగవంతుని ధ్యానించాలని శ్రీ చిన్మయానంద వ్యాఖ్యానించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఒడ్డున ఉన్నవాడే ఊబిలోచిక్కుకున్నవానిని బయటకు లాగగలడు. అలాగే పూర్తిగా బంధవిముక్తుడైన భగవంతుడే మనలను భవబంధములనుండి తప్పించగలడు.

ధర్మచక్రము రచయిత – శ్రీమహావిష్ణువును 'నివృత్తాత్మ'యని ధ్యానము చేయుటద్వారా మనము విషయలోలత్వము, అహంకార మమకారాది బంధములనుండి విముక్తులము కాగలము. శ్రీరాముని జీవితం నివృత్తాత్ముని వర్తనమునకు స్పష్టమైన ఉదాహరణ.

శ్రీ శంకరుల పాఠం గురించి – ఇంతకుముందు చెప్పినట్లుగా శ్రీ భట్టులు 'నివృత్తాత్మా' అని చెప్పిన ఈ నాలుగు నామములకు శ్రీ శంకరుల పాఠం ఇలా ఉంది. 25, 64వ శ్లోకములు – నివృత్తాత్మా; 48వ శ్లోకము – విముక్తాత్మా; 83వ శ్లోకము – అనివృత్తాత్మా. ఇలా వ్యాఖ్యానకర్తలు పాఠాంతరాలు చెప్పడానికి మూడు కారణాలు ఉండవచ్చును.

(1) ఆయా వ్యాఖ్యానకర్తలకు కలిగిన ప్రత్యేక భగవదనుభవములు.

(2) తమ తమ సిద్ధాంతాలకు బలం చేకూర్చే వివరణలకు మరింత అవకాశం.

(3) పునరుక్తిదోష నివారణ.

శ్రీ శంకరులు చెప్పిన ఈ పాఠాలను పరిశీలిస్తే వానిలో ప్రత్యేకించి అద్వైతవాదం పెద్దగా కనుపించదు. కనుక 1వ మరియు 3వ కారణాలవల్ల ఈ పాఠాంతరాలు సంభవించి ఉండవచ్చును.

## విముక్తాత్మా

- స్వభావసిద్ధంగా బంధాలు లేని (ముక్తుడైన) ఆత్మ. ఎందుకంటే ఆయన జన్మరహితుడు. కర్మప్రభావ రహితుడు.
- ఆత్మలను (జీవులను) విముక్తులు చేసేవాడు.

### ఓం విముక్తాత్మనే నమః

శ్రీ శంకరులు 48వ శ్లోకంలో 'విముక్తాత్మా' అనే పాఠం చెప్పారు. ముచ్ - మోక్షణే - విడిపించుట, వదలుట, వి- (ఉపసర్గ). **స్వభావసిద్ధేన విముక్త ఆత్మా యస్య ఇతి విముక్తాత్మా.** స్వభావసిద్ధంగా, అనగా ఏ విధమైన కర్మఫలంగా కాకుండా, విముక్తుడైన ఆత్మ విముక్తాత్మ. భగవంతుడు జన్మరహితుడు. ఆయనకు కర్మఫలములంటవు. ఆయన త్రిగుణాతీతుడు. కనుక సదా విముక్తుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ ద్వైతసిద్ధాంతావలంబి. ఈయన కూడా 'విముక్తాత్మా' అనే పాఠం గ్రహించారు. కాని ఈయన చెప్పిన అర్థం భిన్నంగా ఉంది. **విముక్తా ఆత్మానో జీవా యేన ఇతి విముక్తాత్మా.** ఎవనివలనైతే జీవులు విముక్తులగునో అతడు (భగవంతుడు) విముక్తాత్మ.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'నివృత్తాత్మా', 'విముక్తాత్మా' అనే నామములకు భేదం లేదు. రెండింటి భావము ఒక్కటే.

ధర్మచక్రము రచయిత వివరణ – నాలుగు విధాలైన కర్మలున్నాయి: నిత్య, నైమిత్తిక, కామ్య, నిషిద్ధ కర్మలు.

(1) నిత్యకర్మలు: ఉదాహరణకు త్రికాల సంధ్యావందనం. ఇవి తప్పక చేయాలి. వీటిని ఆచరిస్తే పుణ్యం రాదు. కాని ఆచరించకపోవడం పాపం. (2) నైమిత్తిక కర్మలు: ఉదాహరణకు ఏకాదశి ఉపవాసము. వీనిని ఆచరించడంవలన నిర్దిష్టమైన ఫలాలు లభిస్తాయి. (3) కామ్యకర్మలు: ఉదాహరణకు వ్రతాలు, యజ్ఞాలు. ప్రత్యేకమైన ఫలాన్ని ఆశించి చేసేవి. (4) నిషిద్ధ కర్మలు: చేయగూడనివి. భగవంతునికి ఏ విధమైన కర్మఫలాలు అంటవు. ఎందుకంటే ఆయనకు కావలసిన ప్రయోజనాలు లేవు. ఆయన అన్నిపనులనూ జీవులకొరకే చేస్తాడు.

## అనివృత్తాత్మా

- దేనినుండీ మరలనివాడు.

### ఓం అనివృత్తాత్మనే నమః

శ్రీ శంకరులు 83వ శ్లోకంలో ఈ పాఠాన్ని గ్రహించారు. **సర్వత్ర వర్తమానత్వాత్ స నివృత్తః కుతోऽపి అనివృత్తాత్మా.** భగవంతుడు అన్నిచోట్లా ఉంటాడు. కనుక ఆయన దేనినుండైనా దూరం కావడం లేదా వెనుదిరగడం అనేది ఎలా జరుగుతుంది? కనుక ఆయన అనివృత్తాత్మ.

## 781. దుర్జయః

- భక్తివల్ల తప్ప మరి దేనిద్వారాను జయింపరానివాడు.
- జయింపరానివాడు.
- దుఃఖమును జయించడానికి మనకు సాధ్యం చేసేవాడు.
- సమాధివంటి కష్టమైన ఆచరణలద్వారా చిక్కేవాడు.

### ఓం దుర్జయాయ నమః

దుస్ (ఉపసర్గ); జీ - జయే - జయించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు భక్తివలన, భక్తిలో ఒక అంగమైన శరణాగతివలన మాత్రమే వశమగును. మరేవిధంగాను మనుషులకుగాని, దేవతలకుగాని లొంగడు. **శక్త్యా దేవ మనుష్యాద్యైః వశీకర్తుం న శక్యతే అన్వేష్టుం వాపి యస్యస్యాత్ దుర్జయ స్తప్తవర్ణకః.** దేవతలుగాని, మనుష్యులుగాని తమ శక్తిసామర్థ్యాలచేత ఆయనను వెతకడానికి, వశంచేసుకోవడానికి సాధ్యంకాదు గనుక ఆయన దుర్జయుడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. ఓం దుర్జయాయ నమః.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శాస్త్రానుసారము భగవంతుని ఆదేశానుసారము వర్తించేవారి హృదయములందు భగవంతుడు దుర్జయరూపంలో స్థితుడైయుండును. కనుక అలాంటి సదాచారపరులు తప్పక విజయం సాధిస్తారు.

ఈ నామానికి, మరికొన్ని నామాలకు ఉన్న సారూప్యాన్ని మనం గమనించదగును.

| | | |
|---|---|---|
| అపరాజితః | – | 721వ నామము, 76వ శ్లోకము |
| అపరాజితః | – | 866వ నామము, 92వ శ్లోకము |
| అజితః | – | 553వ నామము, 59వ శ్లోకము |
| దుర్జయః | – | ఈ 781వ నామము, 83వ శ్లోకము |

ఈ నామములకు శ్రీ భట్టులు సందర్భానుసారంగా ఇచ్చిన వ్యాఖ్యలను పరిశీలించుదాము.

(59-553) **అజితః** – ఈ నామము శ్రీ భట్టులు భగవంతుని శుద్ధసత్వస్వరూపునిగా వర్ణించే సందర్భంలో వచ్చింది. భగవంతుడు పరమపదంలో ఉంటాడు. పరమపదమునకు అజితా, అపరాజితా, అయోధ్యా వంటి పేర్లు కూడా ఉన్నాయి. అక్కడ సమస్తమూ శుద్ధసత్వమయమే. అక్కడ నశించే పదార్థము ఉండదు గనుక చావు పుట్టుకలు ఉండవు. కనుక భగవంతునికి అజితుడనే పేరు ఉంది.

(76-721) **అపరాజితః**, (83-781) **దుర్జయః** – ఈ రెండు నామములు శ్రీ భట్టులు భగవంతుని శ్రీకృష్ణ విభవావతారమును కీర్తించే సమూహంలో వస్తున్నాయి. కనుక శ్రీ భట్టులు 'అపరాజితః' అనగా 'పరాజయము రానీయనివాడు' అని అర్థం చెప్పి మహాభారత యుద్ధానికి సంబంధించిన ఉదాహరణలు చెప్పారు. ఇక ప్రస్తుత నామము 'దుర్జయః' అనగా, భగవంతుడు భక్తివల్ల మాత్రమే వశమౌతాడు. అదికూడా ఆయన దర్శనమివ్వాలనుకొన్నప్పుడే. అనగా మనంతట మనం ఆయనను వెదకాలంటే అది సాధ్యం కాదు. **యన్ న దర్శితవాన్ ఏష కస్తదన్వేష్టుమ్ అర్హతి**.

(92-866) **అపరాజితః** – ఈ నామము శ్రీ భట్టులు భగవంతుని 'దుష్టనిగ్రహ గుణము'ను కీర్తించే సమూహంలో వస్తుంది. అనగా భగవంతుడు దుష్టులను శిక్షించేగుణం గురించిన నామములు. ఇక్కడ 'అపరాజితః' నామమునకు శ్రీ భట్టులు చెప్పిన అర్థము – భగవంతుడు అందరికీ, అన్నింటికీ ప్రభువు. ఆయనను ఎలాగైనా, ఎపుడైనా నిగ్రహించడం సాధ్యం కాదు. కేవలం భగవంతుని ఆశీస్సు ఉంటే మనకు ఎదురుండదు.

**యస్య మంత్రీ చ గోప్తా చ సుహృచ్చైవ జనార్దనః హైః త్రైలోక్యనాథః సన్ కిమ్ ను తస్య నిర్జితమ్** – మహాభారతము. ఉద్యోగపర్వము. ఎవరికైతే శ్రీహరి రక్షకుడు, మిత్రుడు, శ్రేయోభిలాషిగా ఉంటాడో అలాంటివారికి జయించరానిది ఏముంటుంది?

ఇలా ఈ నాలుగు నామాలు భగవంతుని అపరాజితత్వాన్నే వివిధగుణానుభవాలతో నిరూపిస్తున్నాయి.

ఇక ఈ నామాలకు శ్రీ శంకరులు చెప్పిన అర్థాలు –

59వ శ్లోకము. **అజితః – కేనాప్యవతారేషు న జితః ఇతి అజితః**. ఏ అవతారములోను జయింపబడనివాడు అజితుడు.

76వ శ్లోకము. **అపరాజితః** – అంతఃశత్రువులైన కామాదులను, బాహ్యశత్రువులైన రాక్షసులను పూర్తిగా జయించినవాడు అపరాజితుడు.

ప్రస్తుత 83వ శ్లోకము. **దుర్జయః – జేతుమ్ న శక్యత ఇతి దుర్జయః**. ఎవరివల్లను ఆయనను జయించడం సాధ్యంకాదు కనుక ఆయన దుర్జయుడు.

92వ శ్లోకము. **అపరాజితః – శత్రుభిః న పరాజితః ఇతి అపరాజితః.** దేవతలుగాని, మానవులుగాని ఆయనను జయించలేరుగనుక ఆయన అపరాజితుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ ప్రస్తుత 'దుర్జయః' నామమునకు, **జేతుమ్ న శక్యః దుర్జయః –** అన్న భావమే కాకుండా మరొక వ్యాఖ్య కూడా ఇచ్చారు. **దుఃఖస్య జయో యస్మాత్ ఇతి దుర్జయః.** మనం దుఃఖాన్ని జయించడం సాధ్యం చేసేవాడు గనుక దేవుడు దుర్జయుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దుః సాధేన సమాధినా జీయతే హృది వశీ క్రియతే ఇతి దుర్జయః.** సమాధివంటి క్లిష్టమైన సాధనలద్వారా వశమగువాడు దుర్జయుడు.

## 782. దురతిక్రమః

- అతిక్రమింప వీలుకానివాడు.
- సంసారదుఃఖమునుండి బయటపడడానికి భగవంతుడు తప్ప వేరే ఉపాయం లేదు.
- ఆయన ఆజ్ఞను ఉల్లంఘిస్తే కలిగే ఫలితాలగురించిన భయంవల్ల ఎవరూ ఆయన ఆజ్ఞను ఉల్లంఘించరు.
- దుఃఖములు ఆయన జోలికి పోవు.
- ఆయన ఆజ్ఞను అతిక్రమిస్తే దుఃఖం కలుగుతుంది.

### ఓం దురతిక్రమాయ నమః

క్రమ - పదవిక్షేపే - అడుగువేయుట; అతిక్రమ - దాటుట, ఉల్లంఘించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – సంసారదుఃఖాన్ని దాటడానికి శ్రీమహావిష్ణువుతప్ప వేరే ఉపాయం లేదు. **అతిక్రమ్య స్వపన్మూలం సర్వేషాం ప్రాపకాంతరమ్ నాస్తీతి సర్వపాపఘ్నం స స్మృతో దురతిక్రమః.** దేవతలకు, మానవులకు కూడా సకలపాపాలను హరించే తన పాదాలుతప్ప వేరొక గత్యంతరం లేదు అని ఆయన గురించి చెప్పబడినందున ఆయన దురతిక్రముడు. ఓం దురతిక్రమాయ నమః.

శ్రీ భట్టులు పెక్కు ఉదాహరణలు చెప్పారు –

**యదా చర్మవదాకాశమ్ వేష్టయిష్యన్తి మానవః తదా దేవమ్ అవిజ్ఞాయ దుఃఖస్యాన్తమ్ నిగచ్ఛతి –** శ్వేతాశ్వరోపనిషత్తు 6.20
ఆకాశాన్ని చుట్టుముట్టి ఒక చిన్న తోలుసంచిలో ఉంచడం ఎంత అసంభవమో, దేవుడిని తెలుసుకోకుండా దుఃఖాన్ని దాటడం అంతే అసంభవం.
**వాసుదేవమ్ అనారాధ్య కో మోక్షమ్ సమవాప్నుయాత్ –** వాసుదేవుని ఆరాధించకుండా మోక్షము ఎవరికి లభిస్తుంది?
**ని హి విష్ణుమృతే కాచిత్ గతిరన్యావిధీయతే ఇత్యేవమ్ సతతమ్ వేదా గాయంతే నాత్ర సంశయః –** లింగపురాణము 24.43
మోక్షానికి విష్ణువుతప్ప వేరుగతి లేదు అని వేదములు ఘోషిస్తున్నాయి. ఇందులో సందేహం లేదు.

శ్రీ వి.వి. రామానుజన్ కాకాసురవృత్తాంతాన్ని ఉదాహరించారు. ముల్లోకాలూ తిరిగినా కాకాసురునికి రాముడే గతి అయ్యాడు. హనుమంతుడిలా చెప్పాడు – శ్రీరాముడు ఎవరినైనా చంపాలని తలిస్తే ఇక వానికి ఇంద్రుడు కాని, బ్రహ్మకాని, రుద్రుడుకాని ముల్లోకాలలోనూ ఎవరూ రక్షణనివ్వలేరు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుని శాసనానికి ఎదురులేదు. ఆయన ఆజ్ఞను అతిక్రమించే ధైర్యం ఎవరికీ లేదు. శ్రీ శంకరులు అందుకు చెప్పిన ఉదాహరణ –

**భయాత్ అస్య అగ్నిస్తపతి భయాత్ తపతీ సూర్యః భయైరింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః**
ఆయన అంటే ఉన్న భయంవలన అగ్ని జ్వలించును. సూర్యుడు మండును. ఇంద్రుడు, వాయువు, ఐదవవాడైన యముడు ఆయన అంటే భయంతోనే తమతమ కార్యక్రమాలను నిర్వహిస్తారు.

శ్రీ సత్యసంధ యతిరాజ – **దుఃఖస్య అతిక్రమో యస్య స దురతిక్రమః.** దుఃఖమును అతిక్రమించినవాడు దురతిక్రముడు. అనగా దుఃఖము ఆయనజోలికి పోదు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **యో భాగవతమ్ నియమమ్ ఉల్లంఘతే స శాశ్వత దుఃఖమేవ ఆప్నోతి ఇతి దురతిక్రమః.**

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దుఃఖాదః అతిక్రమః శాసన ఉల్లంఘనమ్ అస్య ఇతి దురతిక్రమః.**

పైరెండు వ్యాఖ్యల అర్థమూ ఇంచుమించు ఒక్కటే. భగవంతుని శాసనాన్ని ఉల్లంఘించినందుకు దుఃఖం ఫలితం.

**783.** దుర్లభః

**784.** దుర్గమః

**785.** దుర్గః

**786.** దురావాసః

ఈ నాలుగు నామముల భావం ఇంచుమించు ఒకేలా ఉంటుంది.

**దుర్లభః** – అందడానికి కష్టమైనవాడు.
**దుర్గమః** – అందరానివాడు, కనరానివాడు, తెలియరానివాడు.
**దుర్గః** – ప్రవేశింప వీలులేనివాడు.
**దురావాసః** – ఆయన నివాసం మన కందడం కష్టం.

కనుక ఈ నాలుగు నామముల వ్యాఖ్యానంలోను శ్రీ భట్టులు, శ్రీ శంకరులు పునరుక్తిలేకుండా చెప్పినవైనం ఆసక్తికరంగా ఉంటుంది.

ఓం దుర్లభాయ నమః
ఓం దుర్గమాయ నమః
ఓం దుర్గాయ నమః
ఓం దురావాసాయ నమః



శ్రీ ధన్వంతరి. గుజరాత్‌లోని ఒక ఆయుర్వేదనిలయంలో శిల్పం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Dhanwantari_Bhagwan.jpg

**783.** దుర్లభః

- జితేంద్రియులైన భక్తులకు, తీవ్రమైన సాధనవలన మాత్రమే లభించువాడు.

ఓం దుర్లభాయ నమః

**784.** దుర్గమః

- ఆయన తీవ్రమైన ప్రకాశం కారణంగా ఆయనను సమీపించలేరు, చూడలేరు.
- ఆయన నిజస్వరూపాన్ని ఎంతో కష్టంద్వారానే తెలియవచ్చును.
- ఉపనిషత్తులు తదితర శాస్త్రాలలో చెప్పిన కష్టమైన అన్వేషణవల్లనే తెలియవచ్చువాడు.

ఓం దుర్గమాయ నమః

**785.** దుర్గః

- అవిద్య అనే దృఢమైన కోటవల్ల మనకు దూరమైనవాడు.
- సాధనలో ఎదురైయ్యే అనుకోని అనేక అవరోధాల కారణంగా మనకు తెలియడం కష్టమైనవాడు.
- దుష్టులైన రాక్షసులకు దుఃఖము, బాధ కలిగించేవాడు.
- మనం నేర్చుకోవడానికి కష్టమైన సామగానం ఆయనను కీర్తిస్తుంది.

ఓం దుర్గాయ నమః

**786.** దురావాసః

- ఆయన నివాసమైన శ్రీవైకుంఠం మనకు అందరానిది.
- ధ్యానమగ్నులైన యోగులకు కూడా ఆయన స్వరూపం మనస్సులో ఎక్కువసేపు నిలవదు.
- ఆయన అన్నిచోట్లా, అన్నింటా ఉన్నాడు గనుక ఆయన ప్రత్యేకంగా ఇక్కడుంటాడని చెప్పలేము.
- కనీస జీవనావసరాలు కూడా అందుబాటులో లేవనిపించే జీవుల ప్రాణాలుకూడా నిలిపేవాడు.

ఓం దురావాసాయ నమః

శ్రీ కృష్ణదత్త భరద్వాజ ఈ నాలుగు నామములనుగురించి సంక్షిప్తంగా ఇలా చెప్పారు – భగవంతుని ఆరాధించి కాంక్షించే భక్తులకు ఆయన అవరోధాలు తొలగించి ఎలాగో తన అక్కున చేర్చుకొంటాడు. దుష్టులకు మాత్రం ఆయన అందరానివాడు.

ఇప్పుడు ఈ నామములకు వివిధ వ్యాఖ్యాతల అనుభవాలను పరిశీలించుదాము.

శ్రీ భట్టుల వ్యాఖ్యలు – భగవంతుడు అందడానికి కష్టమనేది ప్రధానమైన అర్థం. ఏదైనా వస్తువు లేదా స్థానాన్ని అందుకోవడానికి ఎలాంటి అవరోధాలు ఉండవచ్చును?

(1) ప్రయత్నించేవానిలో లోపాలు.

(2) దేనికోసం ప్రయత్నిస్తున్నామో ఆ వస్తువుయొక్క విశిష్ఠగుణాలు.

(3) యత్నించేవానికి, గమ్యానికి మధ్యనున్న అడ్డంకులు.

(4) గమ్యం అయిన స్థానంవల్ల కలిగిన పరిమితులు.

ఈ నాల్గువిధాలైన పరిమితులు ఆధారంగా శ్రీ భట్టులు ఈ నాల్గు నామాలను వ్యాఖ్యానించారు.

**783. దుర్లభః**

లభ్ – ప్రాప్తౌ - అందుకొనుట. **అజితేంద్రియ దుష్ప్రాప్తో దుర్లభః స చ కథ్యతే.** ఇంద్రియాలను జయించనివారికి అందనివాడు దుర్లభుడు. అనగా జితేంద్రియులకు మాత్రమే దేవుడు అందుతాడు. ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణలు:

**తస్యాప్యన్యమనస్కస్య సులభో న జనార్దనః** (విష్ణుధర్మము 73.6). భగవంతుడు కాక ఇతర విషయాలపై మనసు పెట్టినవారికి జనార్దనుడు సులభుడు కాడు.

**అప్రాప్యః కేశవో రాజన్! ఇంద్రియైః అజితై నృణామ్** (మహాభారతము. ఉద్యోగపర్వము 7.8.21). ఓ రాజా! ఇంద్రియములను అదుపులో పెట్టుకోలేని మానవులకు కేశవుడు లభించడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ చెప్పిన ఉదాహరణ – **జన్మాంతర సహస్రేషు తపోదాన సమాధిభిః నరాణామ్ క్షీణపాపానామ్ కృష్ణే భక్తిః ప్రజాయతే.** అనేక జన్మల అనంతరం, తపస్సు, దానము, సమాధివంటి సాధనలవలన, పాపములు క్షీణించుటవలన నరులకు కృష్ణునిపై భక్తి కలుగుతుంది.

**784. దుర్గమః**

**నేత్రదుర్బలానామ్ ఇవ మధ్యాహ్నభాస్కరః అప్రదృశ్య తేజః దండా పూపికయో దుర్గమః -** బలహీనమైన కన్నులున్నవాడు మధ్యాహ్నసూర్యబింబాన్ని చూడలేనట్లే, బలహీనమైన మనస్సున్నవారు వేలసూర్యుల తేజస్సుగల భగవంతుని తెలుసుకొనలేరు. ఇక్కడ శ్రీ భట్టులు 'దండపూపికా న్యాయము'ను ప్రస్తావించారు. ఒక గదిలో పుల్లకు మిఠాయి గ్రుచ్చిఉందనుకోండి. ఎలుకలు ఆ పుల్లను తినివేశాయంటే ఇక మిఠాయినికూడా ఎలుకలు తినివేసి ఉంటాయని వేరే చెప్పనక్కరలేదు.

**నేత్రదుర్బల వృత్తీనాం మధ్యాహ్న ద్యుమణేర్యథా ప్రాప్తిర్దుష్కర తేజస్త్వాత్ దుర్గమః పరికీర్తితః -** నేత్రదృష్టి బలంగా లేనివారు మధ్యాహ్నపు సూర్యుని చూడలేరు. అలాగే అత్యంత కాంతివంతుడైన సర్వేశ్వరుని ఎవరూ చూడలేరు. అలా ఆయన దుర్గముడు.

**785. దుర్గః**

**అవిద్యాః ఆవరణైః దుష్ప్రవేశ్చ దుర్గః.** కోటచుట్టూ అగడ్తలు ఉన్న కారణంగా మనకు కోటలో ప్రవేశించడం కష్టం అవుతుంది. అలాగే భగవంతునికీ, మనకూ మధ్య అడ్డంకిగా అవిద్య ఉంది. దాన్ని ఛేదించి భగవంతుని చెంత చేరడం చాల కష్టం.

**దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే** – గీత 7.14
నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నన్నే నిరంతరము భజించువారు ఈ మాయను అధిగమించి సంసార సముద్రమునుండి బయటపడగలరు.

సత్యమును ఇంద్రియములద్వారాను, మనస్సుద్వారాను, బుద్ధిద్వారాను తెలిసికొనలేమని ఉపనిషత్తులు చెబుతున్నాయి. **యతో వాచో నివర్తన్తే** (తైత్తరీయ 2.9.1)

**786. దురావాసః**

భగవంతుని పరమపదము మనకు అందరానిదని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **ఏవం చ దూరే దుష్కరః తత్పద ఆవాస ఇతి దురావాసః.**

**దుష్కరావాసభూమిత్వాత్ దురావాస ఇతీరితః దురారిణస్తు దుర్మార్గా మనస్తాన్నిహంతి యః.** పాపులకు దుర్లభమైన నివాసము కలవాడు దురావాసుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు –

**783. దుర్లభః**

**దుర్లభయా భక్త్యా లభ్యత ఇతి దుర్లభః.** ఎంతో అసాధారణమైన భక్తిద్వారా మాత్రమే లభించువాడు దుర్లభుడు. ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన ఉదాహరణలు –

**జన్మాంతర సహస్రేషు తపో జ్ఞాన సమాధిభిః నరాణామ్ క్షీణపాపానామ్ కృష్ణే భక్తిః ప్రజాయతే**

వేలాది జన్మలో సాగించిన తపస్సు, జ్ఞానము, సమాధివంటి వానివలన పాపము క్షీణించి నరులలో కృష్ణునిపట్ల భక్తి జనించును.

**పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా**

**యస్యాతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్** – గీత 8.22

ఓ పార్థ! సమస్త భూతములు (ప్రాణులు) ఆ పరమాత్మయందే అంతర్గతములైయున్నవి. ఆ సచ్చిదానంద ఘన పరమాత్మ చేతనే ఈ జగత్తంతయు వ్యాప్తమై (పూర్ణమై)యున్నది. అట్టి సనాతన, అవ్యక్త పురుషుడు అనన్య భక్తి ద్వారా మాత్రమే లభ్యుడగును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి కఠోపనిషత్తు (1.2.7)నుండి ఉదాహరించారు.

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వతోపి బహవో యమ్ న విద్యః**

**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలాఽనుశిష్టః**

దానిని గురించి వినడంకూడా ఎందరికో సాధ్యం కాదు. విన్నవాళ్ళలో కూడా కొద్దిమందే దానిని అర్థం చేసుకోగలరు. అది ఉపదేశించడానికి మంచి గురువు కానీ, ఉత్తముడైన శిష్యుడు కానీ దొరకడం చాలా కష్టం. తగిన గురువునుండి దానిని తెలిసికోవడం అద్భుతం.

**784. దుర్గమః**

**దుఃఖేన ఆయాసేన గమ్యతే, జ్ఞాయతే, జ్ఞాప్యతే వా దుర్గమః.** చాలా కష్టంమీద తెలియవచ్చేవాడు దుర్గముడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యలో గమనించదగిన విషయం – 'దుర్లభః' నామమునకు 'లభ్యత' (అనగా, లభించేవాడు) అనే పదాన్ని, 'దుర్గమః' నామానికి 'జ్ఞాయత' (అనగా, తెలియవచ్చేవాడు) అనే పదాన్ని వాడారు. భగవంతుడు భక్తిద్వారా లభిస్తాడు. శాస్త్రపఠనాదుల ద్వారా తెలియవస్తాడు. రెండూ కష్టమైనవే.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుని గురించి శ్రవణం, మననం, నిధిద్యాసనం అన్నీ కష్టమైనవే. **నాఽయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహుధ్నా శ్రుతేన** (కఠోపనిషత్తు 1.2.23).

**785. దుర్గః**

**అంతరాయ ప్రతిహతైః దుఃఖాత్ అవాపయత ఇతి దుర్గః.** భగవంతుని చేరుకోవడానికి అనేక అంతరాయములు ఉంటాయి. వాటిని అధిగమిస్తేనే ఆయనను చేరుకోవచ్చును.

**786. దురావాసః**

**దుఃఖేన ఆవాసయతే చిత్తే యోగిభిః సమాధౌ ఇతి దురావాసః.** యోగులకు కూడా ఆయనను ఎప్పుడూ చిత్తంలో నిలుపుకోవడం సాధ్యం కాదు. అలా ఆయన దురావాసుడు.

శ్రీ చిన్మయానంద గీత (6.33)నుండి ఉదాహరించారు –

**యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్.** ఓ మధుసూదనా! సమభావమునుగూర్చి నీవు చెప్పిన ఈ యోగముయొక్క స్థిరస్థితిని మనశ్చాంచల్య కారణమున తెలిసికొనలేకున్నాను.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దుస్సాధ్యా ప్రపత్యా వాస్యతే హృది ఇతి దురావాసః.** కష్టమార్గమైన ప్రపత్తి ద్వారానే మనసులో నిలిచేవాడు దురావాసుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – భగవంతుడు పొందడానికీ, తెలుసుకోవడానికీ, చేరుకోవడానికీ, నిలుపుకోవడానికీ కష్టమైనవాడు. కాని నిజమైన భక్తునికి సులభుడు. ఈ భావంలో శ్రీ కృష్ణదత్తభరద్వాజ ఈ నాలుగు నామాలనూ ఇలా వ్యాఖ్యానించారు.

783. <u>దుర్లభః</u> – **దుఃఖేన లభ్యో మృదువేగ ఆరాధకైః ఇతి దుర్లభః.** కొద్దిపాటి యత్నంతో ఆయనను ఆరాధించేవారికి లభించడం కష్టమైనవాడు దుర్లభుడు.

784. <u>దుర్గమః</u> – **దుఃఖేన ఆయాసేన గమ్యతే జ్ఞాయయతే మంతమతిమాద్భిః ఇతి దుర్గమః.** బుద్ధిమంతులు కాకుండా ఆయనను అన్వేషించేవారికి ఆయన తెలియరాడు గనుక దుర్గముడు.

785. <u>దుర్గః</u> – **దుఃఖేన గమ్యతే ప్రాపయతే అ-తీవ్ర సంవేగైః ఇతి దుర్గః.** తీవ్రమైన ఉద్వేగం లేకుండా ఆయనకోసం యత్నించేవారికి అందరానివాడు దుర్గుడు.

786. <u>దురావాసః</u> – **దుఃఖేన ఆవాసయతే హృద్యే అసమాహితైః ఇతి దురావాసః.** ధ్యానంలో నిమగ్నులు కానివారికి హృదయంలో నిలవడు గనుక ఆయన దురావాసుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ, ఇతరుల వ్యాఖ్యలు –

**<u>783. దుర్లభః</u>**

శ్రీ వాసిష్ఠ – భగవానుడు అన్నింటా, అంతటా ఉన్నాడు. మనందరిలో ఉన్నాడు. మన ప్రతిపని వెనుకా అసలు శక్తి ఆయనే. అయినాగాని ఆయన స్వరూపం తెలుసుకోవడం అసాధ్యం. జీవుడికి తన జనన మరణాల గురించే తెలియదు. ఇక భగవంతునిగురించి ఏమి తెలుస్తుంది? మార్కండేయునివంటి చిరంజీవులకే భగవంతునిగురించి సంపూర్ణంగా తెలియలేదు. కనుక భగవంతుడు దుర్లభుడు.

**<u>784. దుర్గమః</u>**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుని గుణాలు ఆయన సృష్టిలో ప్రతిబింబిస్తుంటాయి. భగవంతుడు మనందరిలోను మనతో ఉన్నాగాని అందనంత దూరంలో ఉన్నాడు. అలా ఆయన దుర్గముడు. ఈ శరీరంనుండి జీవుడు బయటకు పోయేటపుడు శరీరాన్ని వెంట తీసికొని వెళ్ళలేడు. దుర్గమత్వానికి ఇది ఒక ఉదాహరణ.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దుః సాధేన ఉపనిషద్ విచారేణ గమ్యతే బుధ్యతే ఇతి దుర్గమః.** ఉపనిషత్తుల అధ్యయనం, విచారణ అనే కష్టమైన మార్గంద్వారా తెలియవచ్చేవాడు దుర్గముడు.

**<u>785. దుర్గః</u>**

శ్రీ వాసిష్ఠ – భగవంతుడు అనంతుడు. ప్రయత్నించే శక్తినిబట్టి ఆయనగురించి మరికొంత తెలిసికోవచ్చును గాని సంపూర్ణంగా తెలుసుకోవడం సాధ్యం కాదు. మానవుల అంతఃకరణలే వారి పరిమితులు.

శ్రీ సత్యసంధ యతిరాజ – **దుర్గో దుఃఖమ్ గమయతి దైత్యాన్ ప్రతి ఇతి దుర్గః.** దుష్టులైన రాక్షసులకు దుఃఖం కలిగించేవాడు 'దుర్గః'.

శ్రీ బలదేవ విద్యాభూషణ – గై - శబ్దే - పాడుట. తెలుసుకోవడానికి కష్టమైన సామగానం ఆ దేవునిగురించి కీర్తిస్తుంది.

**786.** దురావాసః

శ్రీ వాసిష్ఠ – భగవంతుడు అన్నిచోట్లా, అన్నింటా ఉంటాడు. కనుక ఆయన నివాసం ఇది అని చెప్పడం సాధ్యం కాదు. **అంతరిక్షమ్ ఉతోదరమ్ దివమ్ యశ్చక్రే మూర్ధానమ్ తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః** (అధర్వ వేదము 10.7.32). బ్రహ్మమునకు భూమియే పీఠము. గాలి ఉదరము. ఆకాశమే శిరస్సు. అట్టి బ్రహ్మమునకు నమస్కారము.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – **దుర్గతమపి ప్రాణివర్గమ్ యథావ్యవస్థమ్ దుఃఖమ్ అనుభవంతమ్ ఆవాస్యతి ఇతి దురావాసః.** నీరు, గాలివంటి కనీస జీవనావసరాలుకూడా అందుబాటులో లేని ప్రాణుల జీవనానికి కూడా తగు వ్యవస్థను ఏర్పాటు చేసినవాడు దురావాసుడు.

## 787. దురారిహా

- దుష్టులైన శత్రువులను నశింజేయువాడు.
- భక్తులమనస్సులలో దురాలోచనలను నశింపజేయువాడు.

ఓం దురారిఘ్నే నమః

**787నుండి 810వరకు నామములను శ్రీ భట్టులు బుద్ధావతారపరంగా వ్యాఖ్యానించారు.**

దుర్ - ఆ - అరి - హా = చెడు - సంపూర్ణముగా - శత్రువులను - నాశనం చేయుట.

**దుఃఖమ్ సమంతాత్ అర్పయతి ప్రాపయతి ఇతి దురారి, దురారిః తాన్ హన్తి ఇతి దురారిహా.** దుఃఖము కలిగించేవారు చెడుశత్రువులు. అలాంటి చెడుశత్రువులను పూర్తిగా నాశనం చేసేవాడు 'దురారిహా'.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు దుష్టులైన అసురులను వేదవిముఖులను చేసి వారిని బలహీనులను చేస్తాడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణము (3.18.34)నుండి ఉదాహరించారు.

**మాయామోహేన తే దైత్యాః ప్రకారైః బహుభిః సదా వ్యుత్థాపితా యథా నైషాం త్రయీమ్ కశ్చిత్ అరోచయత్ హతాశ్చ తేऽసురా దేవైః సన్మార్గ పరిపంథినః.** అసురులను అనేక రకాలుగా మోహింపజేయగా వారందరూ వేదమార్గమును వదలి భ్రష్టులయ్యారు. సాధుమార్గ విరోధులయ్యారు. అప్పుడు వారు సులభంగా దేవతలచే చంపబడ్డారు.

ఇక్కడ అర్థం చేసుకోవలసిన విషయం – వేదానుష్ఠానంవలన రాక్షసులు కూడా సత్ఫలితాలను పొంది బలవంతులౌతారు. రావణాదులు తపస్సు, యాగమువంటి కార్యములద్వారా శక్తిమంతులై లోకాలను బాధించారు. అలాంటప్పుడు భగవంతుడు యుక్తితో వారిని పెడత్రోవ పట్టించి వేదాలనుండి విముఖులను చేశాడు.

**మాయామోహోయోऽయమ్ అఖిలాన్ దైత్యాన్స్తాన్ మోహయిష్యతి**
**తతోవధ్యా భవిష్యన్తి వేదమార్గ బహిష్కృతః స్థితౌ స్థితస్య మే వధ్యా యావంతః పరిపంథినః**
**బ్రహ్మణో యేऽధికారస్య దేవదైత్యాదికాః సురాః** – విష్ణుపురాణము 3.17.42,43

నా మాయామోహమయమ్మైన రూపము దైత్యులను మోహితులను చేస్తుంది. వారు వేదమార్గమునుండి వైదొలగుతారు. అప్పుడు వారిని తేలికగా హతం చేయవచ్చును. ఎందుకంటే రాక్షసులుగానీ, దేవతలుగానీ, ఇతరులుగానీ వేదములకు వ్యతిరేకమ్మైనవారు నా శక్తికారణంగా నశిస్తారు. లోకరక్షణార్థం నేనిలా చేస్తాను.

ఈ వ్యాఖ్య సందర్భంగా శ్రీ భట్టులు ప్రత్యేకంగా బుద్ధావతారాన్ని పేర్కొన్నారు. **ఇదమ్ దౌర్లత్యమ్ అప్రాపిసు పాపవిషయే ప్రయచ్ఛన్ బుద్ధావతారమ్ నియచ్ఛతి దురారి-హా.** (787నుండి 810వరకు నామములను శ్రీ భట్టులు బుద్ధావతారపరంగా వ్యాఖ్యానించారు.)



థాయిలాండ్ చియాంగ్ మాయ్ లో శ్రీ బుద్ధ విగ్రహం.

శ్రీ వి.వి. రామానుజన్ తిరువైమొళి (5.10.4)నుండి ఉదాహరించారు – నీవు బుద్ధాది అవతారాలలో అవైదిక ధర్మాన్ని బోధించడం, అమృతాన్ని పంచే విషయంలో మోహినిగా సురులను మోహింపజేయడం – ఇవన్నీ నా హృదయాన్ని కరిగిస్తాయి. స్వామీ! నీవీ పనులను ఎందుకు చేస్తున్నావు?

స్వామి దేశికన్ దయాశతకము 47 – **మాయాశాస్త్రాణ్యపి దమయితుమ్ త్వత్ప్రపన్న ప్రతీపాన్.** నీ భక్తుల శత్రువులను అదుపులో ఉంచడంకోసం నీవు మాయా శాస్త్రాన్ని కూడా పుట్టించావు.

కౌషీతకీ ఉపనిషత్ 3.9 – **ఏష ఉ ఏవైనమ్ అసాధుకర్మ కారయతి తమ్ యమధో నినీషతే.** ఆయన వారిని సత్కర్మలనుండి దూరంచేసి వారి నాశనానికి కారణమౌతాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – దురారి అనగా మన మనస్సులో ఉన్న దురాలోచనలు. **దుర్మతిః తామ్ హన్తి ఇతి దురారిహా.** భగవంతుని శరణుజొచ్చితే దురాలోచనలను నాశనం చేస్తాడు. **తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్.** అనే మంత్రం ద్వారా మనం మన దురాలోచనలను హరించేలా పూజ జరుపుతున్నామని శ్రీ వాసిష్ఠ సూచించారు.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు కరుణామయుడై మనలోని రాక్షస భావాలను నాశనం చేస్తాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **డోలయతే ఉత్క్షేపయతే ధర్మమార్గోయైః తే దులాః, దేలా ఏవ దురాః, తే ష అరయః ఇతి దురారయః, తాన్ హన్తి దురారిహా.** (దులా - ఉత్క్షేపే - చలించుట, ఊగుట). ధర్మమార్గమును భ్రష్టుపట్టించేవారు శత్రువులు. అలాంటి శత్రువులను నాశనం చేసేవాడు 'దురారిహా'.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దుష్టారిమ్ ప్రతిగచ్ఛన్తి ఇతి దురారిణః కామాదయః తాన్ హతవాన్ ఇతి తత్ర సాహాయ్యకారిత్వాత్ న అతికష్టమ్ ఇతి అర్థః.** భగవంతుని దయవలన కామాది శత్రువులను జయించడం కష్టంకాదు అని అర్థం.



శ్రీ లక్ష్మీనారాయణులు శేషపాన్పునధిరోహించి భక్తుల భజనలను స్వీకరిస్తున్నారు.

ఢిల్లీ మ్యూజియంలోని చిత్రం. వికీపీడియా నుండి. Photo by YANN

https://commons.wikimedia.org/wiki/
File:Sheshsayi_Vishnu_and_Lakshmi_ enjoying_festivity, National_Museum,_New_Delhi.jpg



## శుభాంగో లోకసారంగః సుతంతుస్తంతువర్ధనః |
## ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః || (84)

### 788. శుభాంగః

- అసురులను మోహించి, వంచించేంత సమ్మోహనకరమైన రూపం కలిగినవాడు.
- నిజమైన భక్తులు ఆయన దివ్యమంగళ విగ్రహాన్ని ధ్యానిస్తారు.
- భక్తితో సాధన చేసేవారికి అష్టాంగయోగమును సఫలం చేసేవాడు.
- అందమైన నడక కలవాడు.
- తన సుందర మంగళ రూపంతో అంతటా సదా వ్యాపించినవాడు.
- విశ్వంలో అన్నింటినీ అందంగా నడిపేవాడు.
- శాస్త్రములపట్ల, గురువచనములపట్ల విశ్వాసంలాంటి శుభగుణాలను తన భక్తులకు కలుగజేసేవాడు.

ఓం శుభాంగాయ నమః

ఈ నామం రెండుమార్లు వస్తుంది.

63వ శ్లోకము. 593వ నామము. శుభాంగః – **శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః**

84వ శ్లోకము. 788వ నామము. శుభాంగః – **శుభాంగో లోకసారంగః సుతంతుః తంతువర్ధనః**

'అంగము' అనగా ఏదైనా విషయంలో ఒక భాగం, శరీరంలోని ఒక అవయవము, ముఖ్యమైన విషయం – ఇలా అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్యలు –

63వ శ్లోకము. 593వ నామము. **శుభాంగః** – భక్తుల అర్హతలనుబట్టి వారికి భగవంతుడు ఫలములను ప్రసాదించు గుణమును కీర్తించే నామముల సందర్భంలో శ్రీ భట్టులు ఈ నామాన్ని వ్యాఖ్యానించారు. ఇక్కడ 'అంగము' అనగా 'భాగము' అన్న అర్థంలో, భక్తులకు భక్తిసాఫల్యం నిమిత్తం అష్టాంగయోగ మార్గమును ప్రసాదించినవాడు శుభాంగుడు.

84వ శ్లోకము. 788వ నామము. **శుభాంగః** – ఈ నామమును శ్రీ భట్టులు బుద్ధావతారపరంగా చెప్పారు. అసురులను సమ్మోహనపరచి, వారిని పెడమార్గంలో నడిపించడం ఎలా? **కథమ్ తాన్ అనుప్రవిష్టః? శుభాంగః.** అన్నివిధాల వారిని నమ్మించే రూపంతో. **మాయామోహన వేషేణ విప్రలభ్యాసురానపి అనుప్రవిష్టస్తాక్యోసౌ శుభాంగ ఇతి కథ్యతే** రాక్షసులతో నమ్మదగినవాడు అనిపించుకొని, మంచివేషంలో వారిని వంచించి, వారిలో ప్రవేశించివారిని మోసము చేసేవాడు. శుభాంగుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు –

63వ శ్లోకములో **శుభాంగః – సుందరీమ్ తనుమ్ ధారయన్ శుభాంగః.** సుందరమైన శరీరము ధరించినవాడు శుభాంగుడు.

84వ శ్లోకములో **శుభాంగః – శోభనైః అంగైః ధ్యేయత్వాత్ శుభాంగః.** శుభకరమైన అంగములు కలిగియున్న రూపముతో ధ్యానింపబడువాడు శుభాంగుడు.

ఇలా 84వ శ్లోకంలోని 'శుభాంగః' నామమును శ్రీ భట్టులు కపటవేషంగాను, శ్రీ శంకరులు భక్తులు ధ్యానించే రూపంగాను వ్యాఖ్యానించారు. భక్తుల శత్రువులను నాశనం చేయడానికొకటి, భక్తుల ధ్యానంకొరకు మరొకటి అనుకోవచ్చును.

రామాయణం బాలకాండలో వాల్మీకి నారదుడిని ఇలా అడిగాడు – ఈ ప్రపంచంలో గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవాక్యము కలవాడు, దృఢవ్రతుడు ఎవరు? అందుకు జవాబుగా నారదుడు చెప్పిన మూడు శ్లోకాలు. బాలకాండ 1-9, 10, 11:



**బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రుబర్హణః**
**విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః**
**మహోరస్కో మహేష్వాసో గూఢజత్రుః అరిదమనః**
**ఆజానుబాహుః సుశిరః సులలాటః సువిక్రమః**
**సమస్సమవిభక్తాంగః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్**
**పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః**

(శ్రీమాన్ ఎస్.టి.పి.వి. కోనప్పాచార్యులుగారి అనువాదము): అతడు ప్రశస్తమయిన బుద్ధి గలవాడు. నీతి గలవాడు. ఉత్తమమయిన మాటలు గలవాడు. అఖండమైన ఐశ్వర్యము గలవాడు. శత్రువులను వధించువాడు. ఉన్నతములగు మూపులు గలవాడు. గొప్ప చేతులు గలవాడు. శంఖమువంటి కంఠము గలవాడు. ఉన్నతమయిన చెక్కిళ్ళు గలవాడు. అతడు విశాలమగు రొమ్ము గలవాడు. గొప్ప ధనుస్సు గలవాడు. కండచే బలిసి కనబడనట్టి మూపుల సంధి ఎముకలు కలవాడు. శత్రువుల నణగద్రొక్కువాడు. మోకాలివరకు పొడవయిన చేతులు గలవాడు. మంచి లక్షణములతో కూడిన శిరస్సు కలవాడు. శుభలక్షణములు గల నుదురు గలవాడు. శోభనమగు నడక గలవాడు. అతడు మిక్కిలి పొడుగుగాని, పొట్టిగాని కాక సమమయిన శరీరము గలవాడు. హెచ్చుతగ్గులు లేక సమముగా విభజింపబడిన అవయవములు గలవాడు. మెరుగుతోకూడిన వన్నెగలవాడు. గొప్ప పరాక్రమము కలవాడు. బలిసిన రొమ్ముగలవాడు. విశాలమగు నేత్రములు గలవాడు. ప్రశస్తమయిన కాంతిగలవాడు. మంగళకరమగు లక్షణములు గలవాడు. గుజరాత్ పటాన్ లో శ్రీరాముని శిల్పం. చుట్టూ ఉన్న శిల్పాలు దశావతారాలను తెలుపుతున్నాయి. https://commons.wikimedia.org/wiki/File:Rani_ki_Vav_-_Vishnu.jpg

సుందరకాండము 35వ సర్గము 9నుండి 22వ శ్లోకము వరకు హనుమంతుడు శ్రీశుభాంగుడైన శ్రీరాముని అందమును సీతమ్మకు వర్ణించి చెప్పెను. ఇందుకు ఒక కారణము తాను నిజమైన రామదూతనని సీతకు నమ్మకము కలిగించుటకు. మరొక కారణము శ్రీరాముని వర్ణనము సీతమ్మకు ఆనందకరము.

శ్రీ బలదేవ విద్యాభూషణ –

**శుభాని దర్శకానామ్ మంగళోత్పాదకాని అంగాని చరణ వదన నయనాదీని యస్య ఇతి శుభాంగః.** భగవంతుని పాదములు, ముఖము, కన్నులు, సమస్త అంగములు ఆయనను ధ్యానించేవారికి శుభకరములు గనుక ఆయన శుభాంగుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'అగ' - గతౌ - వెళ్ళుట – అనే ధాతువు ఆధారంగా మూడు అర్థాలు చెప్పారు –

(1) **శోభమానో అంగతి - గచ్ఛతి యః స శుభాంగః.** సుందరమైన నడక గలవాడు శుభాంగుడు. (శ్రీరంగం పెరుమాళ్ళు ఉత్సవంలో సింహగతి, గజగతివంటి నడకల ప్రదర్శన ఉంటుంది.)

(2) **అంగనమ్ - సర్వకాలికమ్ సార్వదేశికమ్ చ వ్యాపనమ్; శుభమ్ అంగనమ్ యస్య స శుభాంగః.** తన శుభకరమైన రూపంతో అంతటా వ్యాపించి ఉండేవాడు శుభాంగుడు.

(3) **శోభాయన్ జగత్ గమయతి ఇతి శుభాంగః.** జగత్తును చక్కగా నడిపించువాడు శుభాంగుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – అంగయతి - కలిగించును, అనే అర్థంలో,
**శుభాని గురుశాస్త్రోక్త విశ్వాస స్వప్న ఆస్వాసన లక్షణాని అంగయతి ఉత్పలంభయతి ఇతి శుభాంగః.** శాస్త్రములపట్ల విశ్వాసము, గురువులపట్ల విశ్వాసమువంటి శుభలక్షణాలను తన భక్తులకు భగవంతుడు కలిగించును గనుక ఆయన శుభాంగుడు.

## 789. లోకసారంగః

- లోకంలో మనడానికి పైపై మార్గాలు (భోగ, మోక్ష మార్గాలు) ఉపదేశించినవాడు (లోకసారము చెప్పినవాడు).
- పూవులలోని మకరందాన్ని తుమ్మెద (సారంగము) గ్రహించినట్లుగా లోకసారము తెలిసినవాడు.
- వేదముల సారమైన ప్రణవముద్వారా పొందదగినవాడు.
- భక్తిచే ఆకర్షితుడైనవాడు.
- మోక్షమునిచ్చువాడు. జ్ఞానులు ఆయనను కోరుకుంటారు.
- భక్తులు ఆయన శుభగుణములను కీర్తించెదరు.

### ఓం లోకసారంగాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **లోకే యత్ సారమ్ తత్ గచ్ఛతి ఇతి లోకసారంగః.** వేదాలకు దూరమైనది, మరియు లోకజీవనానికి తగినది అయిన తాత్కాలికవిధానము (లోకసారము – భోగము, మోక్షము) బోధించినవాడు లోకసారంగుడు. రెండే విషయాలు ముఖ్యమని ఆయన (బుద్ధావతారంలో) బోధించాడు. (1) జీవితం ఆనందంగా గడపడం (2) చివరిలో మోక్షం పొందడం. **కురుష్వమ్ మమ వాక్యాని యది ముక్తిమ్ అభీష్ట థ** (విష్ణుపురాణము 3.18.5). ముక్తి కావాలంటే నా మాటల ప్రకారం నడవండి. బుద్ధావతారం గురించి పూర్తి అవగాహన కొరకు విష్ణుపురాణము 3.17, 318 అధ్యాయాలు చదవాలి (అని శ్రీ కృష్ణమాచారి వ్రాశారు)

**న్యాయానపేతం యత్సారం భోగ నిర్వాణ వర్త్మ చ లోకే తదచ్ఛతి సదా లోకసారంగ ఈరితః** రాక్షస సంహారానికి తగినటువంటి న్యాయమైన భోగ, మోక్ష సాధనాలు తెలిసినవాడు లోకసారంగుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువిరుత్తమ్ 96 – నిన్ను ఆరాధించుట కొరకు నీవే అనేక మార్గాలు ప్రసాదించావు. వాటిలో కొన్ని పరస్పర విరుద్ధమైనవి కూడాను. నీవే అనేక దేవతలను సృష్టించావు. కాని ఎవరూ నీకు సరిరారు.

శ్రీ వెంకటస్వామి రెడ్డియార్ – ఈ అనేక మార్గాలలో కొన్ని ప్రత్యేకించి రాజస తామస ప్రవృత్తి కలిగినవారికోసం ఉద్దేశింపబడ్డాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు – శ్రీ శంకరులు 'లోక-సార-అంగ' అనే పదవిభజన ఆధారంగా రెండు అర్థాలు చెప్పారు.

(1) **లోకానామ్ సారమ్ సారంగవత్ భృంగవత్ గృహ్ణాతి ఇతి లోకసారంగః.** లోకముల సారమును సారంగము అనగా తుమ్మెదవలె గ్రహించువాడు లోకసారంగుడు.

(2) **లోక సారః ప్రణవః, తేన ప్రతిపత్తవ్య ఇతి లోకసారంగః.** లోకముల సారము ప్రణవము (వేదముల సారము). అట్టి ప్రణవము ద్వారా అందువాడు లోకసారంగుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ రెండు అర్థాలు చెప్పారు – లోక్ - దర్శనే - చూచుట; శ్ర - గతౌ - వెళ్ళుట; అంగ - వెళ్ళుట. పాణిని సూత్రము 3.3.17 ప్రకారము 'సారః' అనగా ఒకేచోట ఉంటూ (కదలకుండా ఉంటూ) వెళ్ళేది (శ్ర-స్థిరౌ). ఉదాహరణకు చందన సారము. **స్థిరో భవతి ఇతి సారః.** కాలంతో కదలనిది సారము, అనగా భక్తి అని శ్రీ వాసిష్ఠ వివరించారు. **లోకే సారో భగవతి ప్రేమా.** ఇలాంటి నిశ్చలమైన భక్తి భగవంతునివైపే వెళుతుంది. **లోకసారంగః, లోక సారః తద్ గచ్ఛతి - ప్రాప్నోతి, తత్ ప్రతి ఆకృష్టో భవతి ఇతి లోకసారంగో విష్ణుః.**

(1) లోకసారమైన భక్తికి లక్ష్యమైన విష్ణుభగవానుడు లోకసారంగుడు.

(2) భక్తిపట్ల ఆకర్షింపబడే విష్ణుభగవానుడు లోకసారంగుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – లోక - సః - రంగః లోకసారంగః; సన్ - దానే - ఇచ్చుట; రంజ్ - రాగే ఇష్టపడుట. **లోకమ్ వైకుంఠాది లోకమ్ సనోతి దదాతి ఇతి లోక సాః, రంజయతే జ్ఞానినః అత్ర ఇతి రంగః, లోక సాః అసౌ రంగశ్చ ఇతి లోకసారంగః.** లోకము అనగా వైకుంఠమును ఇచ్చువాడు 'లోక సాః'. మరియు జ్ఞానులు అట్టి ఎవరిపట్ల భక్తి కలిగియుందురో అతడు లోకసారంగుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – 'సారంగము' అనగా శంఖము, ఒక సంగీత వాయిద్యము అనే అర్థాలు కూడా ఉన్నాయి. **లోకాః హరిభక్తజనాః సారంగా మోనోద్వతద్ గుణా గాయకా యస్య స లోకసారంగః.** హరిభక్తులు (లోకులు) ఎవరి మంగళగుణాలను కీర్తిస్తారో అతడు లోకసారంగుడు.

## 790. సుతన్తుః

- అసురులను పట్టి బంధించి ఉంచడానికోసం బలమైన త్రాళ్ళున్న వల కలిగియున్నవాడు.
- తననుండి విశ్వమును విస్తరింపజేసినవాడు.
- బ్రహ్మవంటి ఉత్తమ సంతానము కలిగినవాడు.
- యాదవవంశంలో పుట్టి ఆ వంశాన్ని వర్ధిల్లజేసినవాడు.

### ఓం సుతన్తవే నమః

'సు' అనేది ఉపసర్గ. 'తన్తు' పదము 'తను' అనే ధాతువునుండి వచ్చింది. తను - విస్తారే - వ్యాపించుట, వెళ్ళుట. 'తన్తు' అనగా దారము, తీగ వంటి అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'తన్తు' అనగా 'దారముల వల' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. దుష్టులను వశపరచుకోవడానికి, వారిని పట్టియుంచడానికి అందమైన మరియు బలమైన వల (భగవంతుని నిర్మలమైన ధ్యానరూపము) కలిగియున్నవాడు సుతన్తువు. శ్రీ భట్టులు 787నుండి 810వ నామము వరకు బుద్ధావతారపరంగా వ్యాఖ్యానించారని గమనించదగును.

**తంతుః కృత్రిమ శాంత్యాది రూపస్తద్రహణాయ వై సుతన్తుః శోభనస్యేతి సప్తార్ణో దోషనాశకః** రాక్షసులను వశపరచుకోవడానికి అనేక రూపములు ధరించినవాడు. ఈ నామము సప్తాక్షరీమంత్రము. దోషనాశకము. ఓం సుతన్తవే నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శోభనః తన్తుః విస్తీర్ణః ప్రపంచోऽస్య ఇతి సుతన్తుః.** దీనికి అనువాదకులు రెండు విధాల అర్థాలు చెప్పారు. (1) విశ్వమంతటా అందముగా విస్తరిల్లినవాడు (2) ఆయననుండి సమస్త జగత్తు విస్తరిల్లినది (ఉండనుండి దారపుప్రోగు విస్తరిల్లినట్లుగా).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – (తను - విస్తారే) **తన్యత ఇతి తన్తుః, శోభన తన్తుః యస్య స సుతన్తుః విష్ణుః, శోభనమ్ తన్యతే విశ్వమ్ యేన స సుతన్తు ఇతి అర్థః.** సృష్టినుండి ప్రళయందాకా సమస్తము ఆయననుండి విస్తరిస్తూనే ఉంటుంది. ఉదాహరణకు ముసలి జీవులు మరణించడానికి ముందు క్రొత్త జీవులు పుట్టడము. ఇలా ఆయననుండి విశ్వం విస్తరిల్లుతుంటుంది. అలా విశ్వమంతా చక్కగా వ్యాపింపజేసిన విష్ణువే సుతన్తువు.

శ్రీ సత్యసంధ యతిరాజ – **శోభనః తన్తుః చతుర్ముఖాది సంతానో యస్య స సుతన్తుః.** బ్రహ్మవంటివారు తన చక్కనైన సంతానముగా కలిగినవాడు 'సుతన్తుః'.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – వసుదేవుని సుతునిగా జన్మించి యదువంశమును వర్ధిల్లజేసినవాడు సుతన్తువు.

## 791. తన్తువర్ధనః

- సంసారబంధనాలను (తంతువులను) మరింత దృఢంగా చేసేవాడు.
- తననుండి విస్తరించిన జగత్తును కాపాడేవాడు.
- తాను సృజించిన జగత్తును తనయందే విలీనం చేసుకొనేవాడు.
- వసుదేవుని వంశమును ప్రద్యుమ్నాదులద్వారా వృద్ధిచేసినవాడు.

### ఓం తన్తువర్ధనాయ నమః

'వర్ధన' అనే పదం 'వృధ్' (వృద్ధౌ) అనగా 'పెరుగుట' అనే ధాతువునుండి వచ్చింది. కనుక ఈ నామమును ఇంతకుముందు నామము 'సుతన్తుః'కు పొడిగింపుగా భావింపవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఏవం పాపరూచిభిః అంసుభిరువ సంసార తన్తుమ్ సన్తనోతి ఇతి తన్తువర్ధనః.** ఈ విధంగా సంసారబంధనాలను (తంతువులను) వృద్ధిచేసేవాడు. అలా పాపకృత్యాలపట్ల మక్కువను పెంచి, దుష్టులను, అసుర స్వభావీకులను నాశనం చేసేవాడు తంతువర్ధనుడు.

**అంశుభిః పాపరుచిభిః తంతుః సంసార నామకమ్ యస్సంతనోతి సదా తంతువర్ధన ఈరితః** పాపకర్మలయందు మక్కువను పెంచుతూ, సంసారబంధనాలను మరింత దృఢం చేసేవాడు. వైదికకర్మలకన్నా అవైదికకర్మలను చేసినట్లయితే ఫలితము ఎక్కువగా ఉంటుందని నమ్మించి సంసారబంధనాలను బాగా పెంచేవాడు తంతువర్ధనుడు.

(ఈ రచనలో కొన్ని నామాలకు శ్రీ భట్టుల వ్యాఖ్యను వివరిస్తూ సుమారు ఒకే విధమైన రెండు శ్లోకాలు ఇవ్వబడ్డాయి. వానిలో ఒకటి డా. క్రోవి పార్థసారథి 'శ్రీకైవల్య సారథి'లో ఉదాహరించినది. మరొకటి శ్రీ కృష్ణమాచారి తమ ఆంగ్ల వ్యాఖ్యలో ఉదాహరించినది)

శ్రీ భట్టులు గీతనుండి, విష్ణుపురాణమునుండి ఉదాహరించారు. **తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు** – గీత 16.19. అట్లు ఇతరులను ద్వేషించు పాపాత్ములను, క్రూరులైన నరాధములను మాటిమాటికిని ఈ సంసారమునందు అసురీయోనులలోనే నేను పడవేయుచుందును.

**త్రయీమార్గ సముత్సర్గమ్ మాయామోహేన తేऽసురాః కారితాస్తన్మయా హ్యాసన్ తథాऽన్యే తత్ప్రచోదితాః**

**త్రైరప్యన్యేఽపరే త్రైశ్చ త్రైరప్యన్యే పరే చతే** – విష్ణుపురాణము 3.18.32
అలా మాయామోహితులైన అసురులు వేదవిముఖులై, వారే గురువులై, ఇతరులనుకూడా పెడత్రోవ పట్టిస్తారు. ఆ క్రమంలో అందరూ వేదాలకు దూరమౌతారు. ఇలా భగవంతుడు తంతువర్ధనుడై బంధాలు పెంచుతాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు రెండు అర్థాలు చెప్పారు.

(1) **తమేవ తంతుమ్ వర్ధయతి ఇతి** – తననుండి విస్తరించిన జగత్తును కాపాడేవాడు (వర్ధిల్లజేసేవాడు) తంతువర్ధనుడు.

(2) **వర్ధయతి - ఛేదయతి ఇతి వా తన్తువర్ధనః.** ప్రళయకాలంలో జగత్తును తనయందు విలీనం చేసుకొనేవాడు (ఛేదయతి) తంతువర్ధనుడు.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – 'సుతన్తుః' నామము వ్యాఖ్యను కొనసాగిస్తూ – ప్రద్యుమ్నాదులద్వారా వసుదేవుని వంశాన్ని వర్ధిల్లజేసినవాడు తంతువర్ధనుడు.

## 792. ఇంద్రకర్మా

- దేవతలు, ఇంద్రుని కొరకు ఈ పనులన్నీ చేసినవాడు.
- ఇంద్రుని శక్తికి కారణమైనవాడు.
- తన పరమేశ్వరత్వము ప్రతిఫలించే పనులు చేయువాడు.

### ఓం ఇంద్రకర్మణే నమః

ఇంద్ - పరమైశ్వర్యే - గొప్ప శక్తి కలిగియుండుట; ఇంద్ - ప్రథమ ('రాన్' ప్రత్యయము చేర్చుటవల్ల). 'ఇంద్రుడు' అనగా దేవతలలో ఇంద్ర పదవి కలిగినవాడు. శ్రీ భట్టులు 'ఇంద్రుడు' అనే అర్థంలోనూ, ఇతరులు 'ప్రథమ' అనే అర్థంలోనూ వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంద్రాది దేవతల మొరలను ఆలకించి భగవానుడు బుద్ధావతారం ధరించాడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణము (3.17.36)నుండి ఉదాహరించారు –

**తమ్ ఊచుః సకల దేవాః ప్రణిపాత పురస్సరమ్ ప్రసీద నాథ! దైత్యే భయః త్రాహి ఇతి శరణార్థినః.** దేవతలంతా ఆయనకు ప్రణమిల్లి ఇలా కోరారు – నాథా! మమ్ములను అసురులనుండి రక్షించుము. నీవే శరణు. ఈ భాగం విష్ణుపురాణంలో బుద్ధావతారానికి ఉపోద్ఘాతంగా వస్తుంది. **ప్రపన్నేంద్రాద్యర్థతయా దైత్యసంహార రూపకమ్ కర్మ యస్యాస్తీంద్రకర్మా హ్యష్టార్ణో మనురుత్తమః** ఇంద్రాది దేవతలు తనను శరణుజొచ్చినపుడు వారిని రక్షించడంకోసం దైత్యసంహారం చేసేవాడు ఇంద్రకర్మ. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. శ్రేష్ఠమైనది. ఓం ఇంద్రకర్మణే నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఇంద్రస్య కర్మేవ కర్మా అస్య ఇతి ఇంద్రకర్మా, ఐశ్వర్య కర్మేత్యర్థః.** ఇంద్రునివలె గొప్ప గొప్ప కార్యములు చేసేవాడు ఇంద్రకర్మ.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుడు ఇంద్రుని అంతర్యామి గనుక ఇంద్రుని కర్మలు భగవంతుని కర్మలే.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఇంద్ - పరమైశ్వర్యే; **ఇంద్రాణి కర్మాణి యస్య, పరమైశ్వర్యశాలిని కర్మాణి యస్య స ఇంద్రకర్మా.** భగవంతుని కార్యములు ఆయన పరమైశ్వర్యత్వమును సూచించును. గ్రహగతులను నిర్దిష్ట మార్గములోనుంచుట, సూర్యునికి శక్తినొసంగుట వంటివి. అలా ఆయన ఇంద్రకర్మ.

శ్రీ చిన్మయానంద – ఎల్లప్పుడూ గొప్ప మంగళకరమైన కార్యములొనరించువాడు ఇంద్రకర్మ.

## 793. మహాకర్మా

- గొప్ప పనులు చేసేవాడు.

**ఓం మహాకర్మణే నమః**

ఈ నామము రెండుమార్లు వస్తున్నది.

72వ శ్లోకము. 677వ నామము. మహాకర్మా – **మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః**
84వ శ్లోకము. 793వ నామము. మహాకర్మా – **ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః**

72వ శ్లోకములోని 'మహాకర్మా' –

శ్రీ భట్టుల వ్యాఖ్య – క్రిమికీటకాదులను కూడా క్రమముగా ఉద్ధరించి శ్రీహరి తన సన్నిధానమున చేర్చుకొనును. ఇది గొప్ప పని. కనుక ఆయన 'మహాకర్మా'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – మహాజగత్తువంటి సృష్టికార్యాలు చేసేవాడు 'మహాకర్మా'.

84వ శ్లోకములోని 'మహాకర్మా' – **మహన్తి కర్మాణి యస్య స మహాకర్మా.** గొప్పగొప్ప పనులు చేసేవాడు మహాకర్మ. అయితే ఈ గొప్ప పనులు ఏమిటి అనేది చెప్పడంలో వ్యాఖ్యాతల అనుభవం మనకు అందుతుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవానుడు కరుణామయుడు. అయితే ప్రపన్నులను కాపాడడంకోసము ఒకోమారు భగవంతుడు మోసపూరితము అనిపించే కార్యాలు చేస్తుంటాడు. కాని ఇవన్నీ భక్తుల సంరక్షణార్థము చేసే న్యాయమైన గొప్ప పనులే. **ఏవమ్ ప్రపన్న పరిపాలనార్థత్వాత్ దురాచార దండనార్థత్వాత్ పరమ కారుణికస్యైవ విప్రలంభ సంభవః, ఏవమ్ న్యాయ వృతత్త్వాత్ మహాకర్మా.**

**పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే** – గీత 4.8
సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపుమాపుటకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మహాన్తి వియదాదీని భూతాని కర్మాణి కార్యాణి అస్య ఇతి మహాకర్మా.** ఆకాశమువంటి (పంచ) భూతములను సృష్టించుట అనే గొప్ప కార్యమును చేసినందున ఆయన మహాకర్మ.

శ్రీ చిన్మయానంద – పంచభూతములతో ఈ మహాజగత్తును సృష్టించుట, దానిని నిర్దిష్ట విధానములో నడుపుట, సదా పునఃసృష్టి కొరకు ఉన్నవానిని అంతం చేయుట, ఇవన్నీ మహాద్భుతమైన కార్యాలు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **మహత్ మహనీయమ్ దివ్యమ్ కర్మ యస్య ఇతి మహాకర్మా.** ఆయన పనులన్నీ దివ్యమైనవి గనుక ఆయన మహాకర్మ.

**జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున** – గీత 4.9

ఓ అర్జున! నా జన్మ (అవతారము)లు, కర్మములు దివ్యములు. అనగా నిర్మలములు, అలౌకికములు. ఈ తత్త్వరహస్యమును తెలిసికొనినవాడు తనువును చాలించిన పిమ్మట మరల జన్మింపడు సరిగదా! నన్నే చేరును.



శ్రీ బలదేవ విద్యాభూషణ భాగవతంలో కృష్ణుడు ఇంద్రుని ఛత్రాన్ని, అదితి కుండలాలను వారికి అందజేయడంగురించి ప్రస్తావించారు. **మహాన్తి భౌమ వధ మణి పర్వ ఛత్ర అదితి కుండల ఆనయనాని కర్మాణి యస్య సా మహాకర్మా.** ఈ విషయం భాగవతం దశమస్కంధము 59వ అధ్యాయంలో వస్తుంది. (నరకాసురవధ వృత్తాంతము 10.59.2)

**ఇంద్రేణ హృతచ్ఛత్రేణ హృతకుండల బంధునా హృత అమర అద్రిస్థానేన**
**ఇంద్రేణ జ్ఞాపితో భౌమచేష్టితమ్ సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ.**

తననుండి నరకాసురుడు బలవంతంగా లాగుకొన్న తన రాజఛత్రాన్ని, తన తల్లి కుండలాలను, సుమేరు పర్వతాలలో తన ఆసనమైన మణిపర్వతాన్ని తిరిగి లభింపజేయమని ఇంద్రుడు కృష్ణుని ప్రార్థించాడు. అప్పుడు కృష్ణుడు సత్యభామాసమేతుడై గరుత్మంతుని అధిరోహించి నరకాసురుడుండే ప్రాగ్జ్యోతిషపురంవైపు వెళ్ళాడు. ఈ అధ్యాయంలో నరకాసురవధ వర్ణింపబడింది. తరువాత 43వ శ్లోకంలో కృష్ణుని 'అతర్క్యకృత్', అనగా తర్కానికి అందని గొప్పపనులు చేసేవాడు, అని వర్ణించారు. 'మహాకర్మా', 'అతర్క్యకృత్' నామములు ఒకే అర్థాన్ని ఇస్తాయి.

నరకాసు వధ – 1590 అక్బర్ కాలపు చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Cleaves_the_Demon_Narakasura_with_his_Discus.jpg

## 794. కృతకర్మా

- అసురులకు తాను బోధించిన విషయాన్ని తానుకూడా స్వయంగా ఆచరించినవాడు (వారిని నమ్మించడానికి).
- సాధింపవలసినదంతా సాధించినవాడు.
- సృష్ట్యాది కార్యక్రమాలను చక్కగా సాగించువాడు.
- వేరెవ్వరూ సాధింపలేని కార్యాలను చేసినవాడు.

### ఓం కృతకర్మణే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వయమ్ అనుష్ఠితా తదాచారః.** తాను అసురులకు ఏవైతే (అవైదిక కర్మలను) బోధించాడో, వాటిని తానుకూడా స్వయంగా ఆచరించినవాడు ఇలా ఆయన అసురులు వేదవిముఖులు అవ్వడానికి, అలా నాశనమవ్వడానికి కారణమయ్యాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **న కర్తవ్యమ్ కించిదపి కర్మ అస్య విద్యత్ ఇతి కృతకర్మా.** ఆయన అన్నీ సాధించినవాడు. ఇంక ఆయన చేయవలసిన పనులేవీ లేవు. ఇందుకు శ్రీ కృష్ణదత్త భరద్వాజ గీత (3.22)నుండి ఉదాహరించారు.

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి** – గీత 3.22. ఓ అర్జునా! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో నేను పొందనిదియు లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **కృతమేవ జత లక్షణమ్ పునః పునః కరోతి.** సృష్టి, రక్షణ, వినాశమువంటి కార్యాలను మళ్ళీ మళ్ళీ చేసేవాడు కృతకర్మ. **యథా పూర్వమ్ అకల్పయత్** (ఋగ్వేదము 10.190.3). పూర్వము ఎలా ఉండేదో అలానే సృష్టించాడు.

శ్రీ వాసిష్ఠ మరొక అర్థం కూడా చెప్పారు – **అన్యైః కర్తుమ్ అనర్హమ్ బహుభిరపి యత్కర్మ, తత్ కరోతి ఇతి కృతకర్మా.** ఇతరులు చేయలేని అనేక పనులను తాను చేసేవాడు కృతకర్మ. శ్రీ వాసిష్ఠ చెప్పిన ఉదాహరణలు: ప్రతిదినం క్రమం తప్పకుండా సూర్యోదయాస్తమయాలు, సృష్టిరచనా విధానము.

శ్రీ బలదేవ విద్యాభూషణ తమ చైతన్యసంప్రదాయానుసారంగా ఈ నామమును శ్రీకృష్ణలీలాపరంగా వ్యాఖ్యానించారు. ఇంకెవ్వరూ చేయలేని కర్మలను చేయువాడు కృతకర్మ. ఉదాహరణకు నరకాసుర సంహారము, పదహారువేలమంది రాజకన్యల విముక్తి, సత్యభామ కొరకు పారిజాత వృక్షాన్ని తెచ్చుట, బాణాసురునిపై యుద్ధంలో రుద్రుని జయించుట, ఉషా అనిరుద్ధులను విడిపించుట వంటివి.

## 795. కృతాగమః

- బౌద్ధము, జైనము వంటి ఆగమములను కూడా బోధించినవాడు.
- ఋగ్యజుస్సామఅథర్వణ వేదములకు మూలము.
- పాంచరాత్రాగమమును బోధించినవాడు.
- వివిధ అవతారాలద్వారా మరల మరల ప్రత్యక్షము అయ్యేవాడు.

### ఓం కృతాగమాయ నమః

గమ్ - గతౌ - వెళ్ళుట, వచ్చుట; ఆగమము - వచ్చినది; **ఆగమ్యతే అనేన ఇతి ఆగమో వేదః.** జ్ఞానమును తెలియజేయునది ఆగమము, వేదము. **కృత ఆగమో యస్య స కృతాగమః.** ఆగమమును చేసినవాడు కృతాగముడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు బుద్ధావతారపరంగా తమ వ్యాఖ్యను కొనసాగించారు. **బుద్ధ అర్హత సామయిక ఆగమః కృతాగమః.** తన బోధనలపట్ల విశ్వాసం కలిగించడానికి బౌద్ధ, జైన ఆగమములను బోధించినవాడు కృతాగముడు. (శ్రీ వి.వి. రామానుజన్ – ఈ ఆగమములు సామాన్యబుద్ధికి ఆకర్షణీయంగా ఉండి ప్రజలను తమవైపునకు తిప్పుకొన్నాయి.)

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కృతో వేదాత్మక ఆగమో యేన కృతాగమః.** వేదాది ఆగమములను నిర్మించినవాడు కృతాగముడు. బాదరాయణ ఉపనిషత్తునుండి శ్రీ శంకరులు ఉదాహరించారు. **అస్య మహతో భూతస్య నిశ్వసితమ్ ఏతత్ ఋగ్వేదో యజుర్వేదః సామవేదో అథర్వాంగీరస ఇతిహాసః పురాణమ్ విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాని..........** ఋక్ యజుర్ సామ అథర్వణ వేదములు పరమేశ్వరుని నిశ్వాసము.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **పాంచరాత్రస్య కృత్స్నస్య కర్తా నారాయణః స్వయమ్.** పాంచరాత్రాగమమునకు స్వయముగా నారాయణుడే కర్త. అలా ఆయన కృతాగముడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – ఆగమ - ప్రవేశము; **కృతస్తత్ చరితాని ప్రకాశ్య ద్వారకాయామ్ ఆగమో యేన స కృతాగమః.** శ్రీకృష్ణభగవానుడు అనేక లీలలు చూపిన అనంతరం ద్వారకలో ప్రవేశించాడు గనుక కృతాగముడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఆగమము - ప్రత్యక్షమగుట. భగవంతుడు సూర్యుని రూపంలోను, వివిధ అవతారాలుగాను మరల మరల ప్రత్యక్షమగును గనుక కృతాగముడు.

గోపికా వస్త్రాపహరణం. మూడు పురాతన చిత్రాల సంకలనం



పైన. ఎడమవైపు. 1800 నాటి కాంగ్రా శైలి - https://commons.wikimedia.org/wiki/File:Delhi-National_Museum-Gopies_demanding_theirs_clothes_from_Krishna-20131006.jpg

పైన కుడివైపు. 1800 నాటి గర్వాల్ శైలి - https://commons.wikimedia.org/wiki/File:Indian_-_Krishna_Taunting_the_Gopi_-_Walters_W863.jpg

క్రింద.1600 నాటి రాజస్థాన్ శైలి -

https://commons.wikimedia.org/wiki/File:The_Gopis_Plead_with_Krishna_to_Return_Their_Clothing_Folio_from_a_Bhagavata_Purana_(Ancient_Stories_of_Lord_Vishnu)_series._1610_Metmuseum.jpg



## ఉద్భవః సుందరః సుందో రత్ననాభస్సులోచనః |
## అర్కో వాజసనః (వాజసనిః) శృంగీ జయంతః సర్వవిజ్జయీ || (85)

### 796. ఉద్భవః

- మోక్షమార్గము ఉపదేశిస్తున్నట్లు నటిస్తూ సంసారబంధములనుండి బయటపడినవాడు.
- తన ఇష్టానుసారము, ఇచ్చవచ్చినపుడు, ఇచ్చమైనచోట జన్మించే ఉత్కృష్ట జన్మము కలవాడు.
- ఉన్నతమైన స్థానంలో ఉండేవాడు (సూర్యమండలము, శ్రీవైకుంఠము).
- అత్యున్నతులైన దేవతలను సృజించినవాడు.
- ధర్మరక్షణ కొరకు మరల మరల ఉద్భవించినవాడు.

**ఓం ఉద్భవాయ నమః**

ఈ నామము రెండుమార్లు స్మరింపబడినది.

41వ శ్లోకము. 375వ నామము. ఉద్భవః – **ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః**

85వ శ్లోకము. 796వ నామము. ఉద్భవః – **ఉద్భవః సుందరః సుందో రత్ననాభః సులోచనః**

శ్రీ భట్టులు పరవాసుదేవుడైన లక్ష్మీపతిపరంగా వ్యాఖ్యానించే సందర్భంలో 375వ నామము, మరియు బుద్ధావతారపరంగా వ్యాఖ్యానించే సందర్భంలో 796వ నామము వచ్చాయి.

'ఉత్' ఒక ఉపసర్గ. భూ - సత్తాయామ్ - ఉండుట, జీవించుట, జనించుట; ఉద్భవ - మూలము, ఆధారము, సృష్టి. 'ఉత్' అనే ఉపసర్గకు గ్రహించిన అర్థాన్నిబట్టి వివిధ వ్యాఖ్యాతల వ్యాఖ్యానాలలో వైవిధ్యం వస్తుంది. ఉత్ - ఉద్గత - పైకి లేచుట; ఉత్ - ఉత్కర్ష - గొప్ప; ఉత్ - ఉత్తమ - శ్రేష్ఠమైన; ఉత్ - ఉచ్చై - ఎత్తైన, అధికమైన, ఉన్నతమైన

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు రెండుమార్లూ 'ఉత్' అనగా 'ఉద్గత' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **ఉద్గతః భవాత్ ఇతి ఉద్భవః.** సంసారచక్రమునుండి రక్షించువాడు ఉద్భవుడు.

41వ శ్లోకములో 'ఉద్భవః' – భగవంతుడు తన నిజమైన భక్తులను సంసారమునుండి లేవనెత్తును గనుక ఉద్భవుడు. ఇక్కడి 'ఉద్భవః' నామం గురించి ఇంకా శ్రీ భట్టులు చెప్పిన విషయం – యశోదచే రోటికి కట్టబడిన చిన్నికృష్ణుని ధ్యానించడంవలన మనం సంసారబంధంనుండి విముక్తులము కావచ్చును. **దామోదరమ్ బంధహరమ్.**

85వ శ్లోకములో 'ఉద్భవః' – భగవంతుడు బుద్ధునిగా అసురులను సంసారతరణోపాయం విషయంలో పెడమార్గం పట్టించిన ఉద్భవుడు. **ముక్త్యుపదేశ నాటకేన భవాత్ ఉద్గత ఇతి ఉద్భవః.** ముక్తి గురించి ఆయన తప్పుమార్గం ఉపదేశించాడు మరియు తాను ఆ విధానంలో ముక్తుడయినట్లు నటించాడు. **మోక్షోపదేశ నటనాత్ భవాదుద్భవ స్థితః ఉద్భవ స్స చ విజ్ఞేయః సప్తార్ణః పాపనాశకః**

మోక్షమార్గము ఉపదేశిస్తున్నట్లుగా నటిస్తూ, సంసార బంధనాలనుండి బయటపడ్డట్లుగా కనిపించేవాడు ఉద్భవుడు. పునర్జన్మ లేనట్లుగా ఉండేవాడు. ఈ నామము సప్తాక్షరి. పాపాలను హరిస్తుంది. ఓం ఉద్భవాయ నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 41వ శ్లోకంలోని 'ఉద్భవః'కు శ్రీ శంకరులు రెండు వ్యాఖ్యలు ఇచ్చారు.

(1) **ప్రపంచ ఉత్పత్తి ఉపాదాన కారణత్వాత్ ఉద్భవః.** భగవంతుడు జగత్తునకు సృష్టికర్త. దానికి ముఖ్యకారణము. కనుక ఆయన ఉద్భవుడు.

(2) **ఉద్గతో భవాత్ ఇతి ఉద్భవః.** పుట్టుక, ఐహిక జీవనమువంటివి లేనివాడు ఉద్భవుడు. **ఉద్గతమ్ అపగతమ్ జన్మ అస్య, సర్వ కారణత్వాత్.** అన్నింటికీ ఆయనే కారణము. కనుక ఆయనకు జన్మముగాని, మూలముగాని లేవు. కనుక ఆయన ఉద్భవుడు.

85వ శ్లోకంలోని 'ఉద్భవః' – **ఉత్కృష్టమ్ భవమ్ జన్మ స్వేచ్ఛయా భజతి ఇతి ఉద్భవః.** ఆయన జన్మ ఉత్కృష్టమైనది. ఎందుకంటే ఆయన ఇచ్ఛానుసారము ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎలాగైనా జన్మించును. కనుక ఆయన ఉద్భవుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **ఉత్తమో భవో యస్య స ఉద్భవః.** ఆయన జన్మ ఉత్తమ (ఉత్కృష్ట)మైనది గనుక ఆయన ఉద్భవుడు. (భాగవతము 10.3) శ్రీ కృష్ణుని జన్మ సమయంలో అనేక అద్భుతాలు జరిగాయి. ఆయన పద్మాల్లాంటి కన్నులు తెరచుకొని ఉన్నాయి. బిడ్డకూ, తల్లికీ బొడ్డు కలిసి లేదు. అప్పుడే ప్రసవమైన బిడ్డలా కాకుండా ఆయన స్వచ్ఛంగా, శంఖచక్రాధులు ధరించియున్నాడు. ఆ సమయంలో సముద్రపు అలలు తీరాన్ని తాకుతూ భేరీధ్వనులు చేస్తున్నాయి. జన్మములేని ఆ పరమపురుషుడు దేవకికి జనించినపుడు అనేక శుభసూచకాలు పొడగట్టాయి.

శ్రీ సత్యసంధ యతిరాజ – **భవాత్ సంసారాత్ ఉత్పత్తేర్ వా ఉద్గత ఇతి ఉద్భవః.** సంసారము, జన్మము వంటివానికి అతీతుడు గనుక ఉద్భవుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ చెప్పిన మరొక అర్థము – **ఉత్కృష్టః పార్వత్యాదిభ్యో భవో యేన ఇతి ఉద్భవః.** పార్వతివంటి గొప్ప గొప్ప దేవతలకు సృష్టికర్త గనుక ఆయన ఉద్భవుడు.

శ్రీ చిన్మయానంద – ఉద్భవ - మూలము, కారణము. అన్నింటికీ మూలకారణమైనందున భగవంతుడు ఉద్భవుడు.

**సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః తా సాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా** – గీత 14.14
ఓ అర్జున! నానా యోనులందు జన్మించు ప్రాణులను తన గర్భమున ధరించు మూలప్రకృతియే ఆ ప్రాణులకు తల్లి. బీజ స్థాపనము చేయు నేను వాటికి తండ్రిని. అనగా సర్వప్రాణులకును ప్రకృతియే తల్లి. నేనే జనకుడను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఉత్ - ఉద్ ఉపసర్గ ఉచ్చై అర్థే - 'ఉత్' అనగా ఉన్నతమైన, బాగా పైన అని అర్థము. భూ - సత్తాయామ్ - ఉండుట; **ఉచ్చైః భవనమ్ యస్య స ఉద్భవః.** బాగా పైన తన స్థానమును కలిగియున్నవాడు ఉద్భవుడు. ఉదాహరణకు సూర్యమండలము, శ్రీ వైకుంఠము.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – ధర్మ సంరక్షణ కొరకు మరల మరల అవతరించు (జన్మించు)వాడు ఉద్భవుడు. **ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే** (గీత 4.8).

## 797. సుందరః

- అందమైనవాడు.

- ఉపసుందుని ద్వారా సుందుని చంపినవాడు (సుంద-రః).
- ఎంతగానో ఆరాధింపబడేవాడు.
- అందమైన శంఖము పాంచజన్యము కలిగినవాడు (సున్-దరః).
- వివిధ జీవులను, జీవుల భాగాలను చక్కగా విభజించినవాడు.

## ఓం సుందరాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తద్ దృష్టి మనోహరః సుందరః** (బుద్ధుడు). అసురుల దృష్టిలో అందంగా ఉండి వారిని ఆకర్షించినవాడు సుందరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **విశ్వాతిశాయి సౌభాగ్యశాలిత్వాత్ సుందరః.** లోకాలను మించిన అందం భగవంతుని సహజ లక్షణం కనుక ఆయన సుందరుడు.

శ్రీ తిరుమంగైయాళ్వారు పెరియతిరుమోళి (9.2)లో భగవంతుని – ఓహో! ఎంతటి మనోహరమైన అందము? దీనినెలా వర్ణించను? – అన్నారు. శ్రీ నారసింహుని అందం ఎక్కడా పట్టక పొంగి పొరలుతున్నదని శ్రీ తిరుమళిశయాళ్వారు నాన్ముగన్ తిరుమోళి (21)లో అన్నారు. అయ్యో! ఎలాంటి అందం? – అని శ్రీ తిరుప్పాన్ ఆళ్వారు అన్నారు (అమలనాడి పిరాన్ 9).

శ్రీ చిన్మయానంద – ఇక్కడ 'అందం' అంటే చిత్తమునకు లభించే శాంతి. ధ్యానంద్వారా సమాధి స్థితికి చేరుకున్నపుడు ఇలాంటి శాంతి లభిస్తుంది. అది శ్రీమన్నారాయణుని రూపమే. అందుకే ఆయనను ఉపనిషత్తులలో **'శాంతమ్ శివమ్ సుందరమ్'** అన్నారు.

శ్రీ సత్యసంధ యతిరాజ రెండు అర్థాలు చెప్పారు –

(1) **సుందరః సౌందరవాన్.** అందమైనవాడు సుందరుడు. దర-శంఖము; **శోభనం దరః శంఖో యస్య ఇతి సుందరః.** అందమైన పాంచజన్యము అనే శంఖాన్ని కలిగినవాడు సుందరుడు.

(2) **సుందమ్ ఉపసుందేన రేపయతి నాశయతి సుంద-రః.** ఉపసుందునిద్వారా సుందుని చంపించినవాడు సుందరుడు. సుందోపసుందులు నికుంభుని కొడుకులు. తమకు బయటివారితో చావులేకుండా వరం పొందారు. అప్పుడు వారు లోకాలను బాధింపసాగారు. ఇంద్రుడు పంపిన తిలోత్తమ కారణంగా వారిద్దరూ పరస్పరం పోరి మరణించారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సుతరామ్ ద్రియతే ప్రశస్యత ఇతి సుందరః.** సుతరామ్ - సదా; దృయతే - దృ - పూజించుట, ఆరాధించుట. సదా పూజింపబడువాడు సుందరుడు.

**ప్రసాదాభిముఖమ్ శాశ్వత ప్రసన్న వదనేక్షణమ్**
**సునాసమ్ సుభ్రువమ్ చారుకపోలమ్ సురసుందరమ్** – భాగవతము 4.8.45
సదా భక్తులను అనుగ్రహించుటకు ఇచ్ఛగించేవాడు, ప్రసన్నముఖం, కన్నులు కలవాడు, చక్కని ముక్కు, చెక్కిళ్ళు కలవాడు, దేవతలందరిలోను సుందరుడు అయిన భగవంతుని భక్తితో ధ్యానింపవలెను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – దృ - విదారణే - చింపుట, విడదీయుట; సు (ఉపసర్గ) - చక్కగా; **సు - సుష్టు నిర్దోషమ్ విదారణమ్ యః కురుతే స సు-దరః, సన్నేవ వర్ణాగమేన సుందర ఇత్యుక్తో భవతి.** భగవంతుడు వివిధ జీవుల శరీర భాగాలను చక్కగా విభజించాడు గనుక సుందరుడు. శ్రీ వాసిష్ఠ వ్రాసిన శ్లోకంలోని భాగం – **స సుందరో విష్ణు రనంతరూపో యోనిః సమగ్రమ్ వివిధమ్ దృణాతి.** అనంతమైన రూపములుగల విష్ణువు వివిధ జీవులను వివిధ రకాలుగా విభజించాడు.

**శ్రీ మేప్పత్తూర్ నారాయణ భట్టాత్రి రచించిన శ్రీమన్నారాయణీయము లోని శ్లోకాలు – (తెలుగు తాత్పర్యము రచన - ??)**

సూర్యస్పర్ధికిరీట మూర్ధ్వతిలక - ప్రోద్భాసి ఫాలాంతరం
కారుణ్యాఽఽకుల నేత్ర మార్ద్రహసితో - ల్లాసం సునాసాపుటమ్
గండోద్యన్మ కరాభకుండలయుగం - కంఠోజ్వలత్ కౌస్తుభం
త్వద్రూపం వనమాల్యహారపటల - శ్రీవత్సదీప్రం భజే

శ్రీకృష్ణపరమాత్ముడు సూర్యునికన్న దివ్యమైన తేజస్సుతో ప్రకాశించే కిరీటముతోను, కస్తూరితిలకము దిద్దిన ఫాలమధ్యముతోను, అందమైన కనులు, దయార్ద్రమైన చిరునగవు, చెక్కిళ్ళపై ప్రకాశించే కుండలములు, కంఠమందు ప్రేలాడే కౌస్తుభరత్నము, వనమాల, ఇతర ఆభరణములు కలిగి మిక్కిలి సౌందర్యవంతుడై యున్నాడు.

కేయూరాంగద కంకణోత్తమ మహా - రత్నాంగుళీయాంకిత
శ్రీమద్బాహుచతుష్క సంగత గదా - శంఖారి పంకేరుహామ్
కాంచిత్కాంచన కాంచి లాంఛిత లసత్ - పీతాంబరాలంబనీ
మాలంబే విమలాంబుజద్యుతిపదాం - మూర్తిం తవార్తిచ్ఛిదమ్

భుజములపైన ధరించిన కేయూరములు, భుజంమీద మోచేతిపైభాగాన ధరించే అంగదములు, రత్నపు ఉంగరాలతో అలంకరింపబడి శోభిల్లుతూ శంఖము, చక్రము, గద, పద్మము అనే ఆయుధాలను చేతులయందు ధరించి, బంగారు మొలనూలుతో అలంకరించబడిన పట్టుపీతాంబరమును ధరించి, దీనుల ఆర్తిని పోగొట్టే ఆ దేవదేవునకు ప్రణామాలు అర్పిస్తున్నాను.



గోపికావస్త్రాపహరణం. 1560 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:6_Master_of_the_Isarda_Bhagavata_Purana._The_Gopis_Plead_with_Krishna_to_Return_Their_Clothing._Folio_from_Isarda_Bhagavata_Purana._1560-65,_Metmuseum.jpg

## 798. సుందః

- చాలా మృదుహృదయునిగా కనుపించి అసురులని నమ్మించినవాడు.
- భక్తులపట్ల కరుణ కలవాడు.
- భక్తులకు సుఖసంతోషాలు ప్రసాదించేవాడు.
- జీవులన్నింటికీ అవుసరమైన ద్రవములను (జలములను) ప్రసాదించువాడు.

### ఓం సుందాయ నమః

సు (ఉపసర్గ); ఉన్ద్ - క్లేదనే - తడుపుట, మెత్తబరచుట; **సుష్ఠు ఉనత్తి ఇతి సుందః**. చక్కగా తడి చేయువాడు సుందుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు తన సుందర రూపముచేతను, నడవడికచేతను అసురుల హృదయములను కరిగించి, వారు తన మోసమును నమ్మేలా చేశాడు గనుక సుందుడు. ఈ భావము బుద్ధావతారానికి, మోహిని అవతారానికి కూడా వర్తిస్తుంది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఆయన కరుణామయుడు గనుక అందరిని కరిగించును. అందువలన ఆ దయార్ద్ర హృదయుని సుందుడు అంటారు.

ఒక్కమారు ఆయనవైపు తిరిగితే మనలోని దుర్వాసలను హరించి, పాపములను క్షమించి తన అక్కున చేర్చుకొనును అని శ్రీ చిన్మయానంద వివరించారు. **తన్నొక్కసారి ప్రేమతో పిలచిన తన్నైన నిచ్చున్ –** భాగవతము.

శ్రీ సత్యసంధ యతిరాజ **– సుమ్ సుఖమ్ దదాతి ఇతి సుం-దః.** తన భక్తులకు సుఖమును ఇచ్చువాడు సుందుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ **– యో వృష కర్మణా సమ్యగ్ ఉన్నతి, లోకేऽపి చ పశ్యామః, మనుష్యా జలేన క్వచిత్ బహుకృత్వః సించతి, క్వచిచ్చ అల్పశః, ఏషా యో నియమో స తస్యైవ వ్యాపకస్య విష్ణోః.** ప్రతి జీవికి తగినంత జలమును, ఇతర ద్రవములను ఇచ్చువాడు, మొక్కల కొరకు వర్షమును కురిపించువాడు అగు విష్ణువు సుందుడు.



జపాన్‌లో షింటో బుద్ధమందిరం. ఫొటో సౌజన్యం – భావరాజు కృష్ణమోహన్

## 799. రత్ననాభః

- రత్నమువంటి బొడ్డు గలవాడు.
- ఆయన బొడ్డునుండి జన్మించిన బ్రహ్మ మనుష్యులలో రత్నమువంటివాడు.
- 'అరత్ననాభః' – అసురులను నాశనము చేయువాడు.
- సాగరరూపంలో తన బొడ్డుయందు రత్నములు కలవాడు.

## ఓం రత్ననాభాయ నమః

ఇక్కడ 'రత్నము' అందమును సూచించును. రము - క్రీడాయామ్ - ఆడుట, ఆనందించుట - అనే ధాతువునుండి 'రత్న' శబ్దము వచ్చినది. 'నాః' - బంధనే - కట్టుట - అనే ధాతువునుండి 'నాభి' శబ్దము వచ్చినది. 'నాభి' అనగా బొడ్డు. నాభి కలిగినవాడు 'నాభః'.

శ్రీ భట్టుల వ్యాఖ్య **– పాండిత్య విడంబన మృష్టోదర వ్యక్త రమ్య నాభీ రత్ననాభః.** అసురులను నమ్మించడంకోసం తన పాండిత్యాన్ని వ్యక్తపరచడానికి తన చక్కని బొడ్డు (పొట్ట)ను చూపినవాడు రత్ననాభుడు. శ్రీ వి.వి. రామానుజన్, శ్రీ వేదాంతదేశికన్ ల అనువాదం ప్రకారం, బుద్ధావతారంలో భగవంతుడు వాదాలలో తన పాండిత్యాన్ని చూపే సందర్భాలలో పొట్ట నిమురుకొన్నాడు. అప్పుడు ఆయన నాభి అందమైన రత్నంవలె కనిపించింది. **సురత్ననాభ ఇత్యుక్తః యః పాండిత్య విడంబనాత్ మృష్టోదర రమ్య సత్ఫలదో మనుః.** సకల శాస్త్రాలు నిండియున్న ఆ బొజ్జయందు అలరారుచున్న రత్నమువంటి నాభి కలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. శాస్త్రపాండిత్యప్రదము. ఓం రత్ననాభాయ నమః. (శ్రీ కైవల్యసారథిలో ఇచ్చినది).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **రత్న శబ్దేన శోభా లక్ష్యతే, రత్నవత్ సుందరా నాభిః అస్య ఇతి రత్ననాభః**. సుందరము, మంగళప్రదము అయిన నాభి ప్రదేశము కలవాడు రత్ననాభుడు.

శ్రీ చిన్మయానంద వివరణ – ధ్యానము చేసే భక్తుల ఆలోచనలకు మూలస్థానము నాభి. ఆలోచనల గురించి కొందరు సిద్ధులు ఇలా చెప్పారు. అన్ని ఆలోచనలూ అనంతంనుండి ఉద్భవిస్తాయి. అలా బీజప్రాయంలో వాటిని 'పరా' అంటారు. అక్కడినుండి అవి ఆయా వ్యక్తులకు కొంచెం కొంచెం కనబడతాయి (అవగతమవుతాయి). వాటిని 'పశ్యన్తీ' అంటారు. తరువాతి దశలో అవి వ్యక్తమైనపుడు వానిని 'మధ్యమా' అంటారు. చివరిదశలో అవి కార్యరూపం దాల్చినపుడు 'వైఖరీ' అంటారు. ఇలా పరిణామక్రమంలో 'పశ్యన్తీ' దశలో ఆలోచనలు నాభి ఆధారంగా ఉంటాయి. అందరి ఆలోచనలకూ మూలం భగవంతుని 'రత్ననాభి'. కనుక భగవంతుడు రత్ననాభుడు. విష్ణువు నాభినుండి బ్రహ్మ జనించాడు అనడంలో అంతరార్థం ఇదే కావచ్చును.

శ్రీ సత్యసంధ యతిరాజ 'రత్ననాభః', 'అరత్ననాభః' అనే రెండు పాఠాలనూ గ్రహించి రెండు అర్థాలు చెప్పారు.

(1) రత్ననాభః – **రత్నం పుం రత్నమ్ చతుర్ముఖో నాభౌ యస్య**. పురుషులలో రత్నమైన బ్రహ్మ ఎవని నాభినుండి జన్మించాడో ఆ పరమపురుషుడు రత్ననాభుడు.

(2) అరత్ననాభః – నాభ - హింసాయామ్ అభావేపి - చంపుట, బాధించుట. **అరత్నాన్ అరత్ - దైత్యాన్ నభతి ఇతి అరత్ననాభః**. అసురులను నాశనం చేసేవాడు అరత్ననాభుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **రత్నమ్ నాభౌ యస్య ఇతి రత్ననాభః**. నాభియందు రత్నము కలవాడు రత్ననాభుడు. భగవంతుడు సాగరంలో రత్నాలు సృష్టించాడు. అవి ఆయనకు నాభివలె ఉన్నవి. **స రత్ననాభో భగవాన్ వరేణ్యో లోకే సముద్రే విదధాతి రత్నమ్.**

## 800. సులోచనః

- అందమైన కనులు గలవాడు.
- శ్రేష్ఠమైన జ్ఞానము కలవాడు.
- సంపూర్ణమైన జ్ఞానము, దృష్టి కలవాడు.
- సకల జీవులకు దృష్టినిచ్చేవాడు.

### ఓం సులోచనాయ నమః

'సు' (ఉపసర్గ); లోచ్ - దర్శనే - దృష్టిః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తథా హృదయాణు చోర లోచనః సు-లోచనః**. అందరి హృదయాలను దొంగిలించే (ఆకర్షించే) సమ్మోహనకరమైన కనులు కలవాడు సులోచనుడు. శ్రీ భట్టులు ఈ వ్యాఖ్యను కూడా బుద్ధావతారపరంగా చెబుతూ విష్ణుపురాణం (3.18.16)నుండి ఉదాహరించారు. **పునశ్చ రక్తాంబర ధృక్ మాయామోహః అజితేక్షణః**. ఆయన ఎఱ్ఱని దుస్తులు ధరించియున్నాడు. ఎన్నడూ ఓడిపోని కన్నులు గలవాడు. తన మాయచే అందరినీ మోహింపజేశాడు.

ఆయన కన్నుల అందం అసురులను మోహింపజేయడానికి మాత్రమే కాదు. భక్తులను తనయెడకు తీసికోవడానికీ ఉపయోగపడుతుంది. నాచియార్ తిరుమొళి (11.2)లో ఆండాళ్ తల్లి ఇలా అన్నది – శ్రీరంగంలో ఉన్న నా అమృతమూర్తీ! అందమైన శిరోజాలు, అందమైన నోరు, అందమైన కన్నులు కలవాడా! అందమైన నాభియందు అందమైన పద్మం కలవాడా! నీ

అందంతో నన్ను నీ వశం చేసుకున్నావుగదా!. – ఇలా భగవంతుని కన్నులు, తిరుమేని అందం గురించిన ప్రస్తావనలు నాలాయిరంలో అనేకంగా ఉన్నాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'లోచన' అనగా కన్నులు, జ్ఞానము అనే రెండు అర్థాలను గ్రహించారు. **శోభనమ్ లోచనమ్ నయనమ్ జ్ఞానమ్ వా అస్య ఇతి సులోచనః.** శోభనమైన కన్నులు, జ్ఞానము కలిగినవాడు సులోచనుడు.

శ్రీ చిన్మయానంద వివరణ – ఇక్కడ అందము అనగా శరీరసౌందర్యమనే గాదు. భగవంతుడు తన సృష్టి అంతటిని, దాని లక్ష్యమును స్పష్టముగా చూచును అని కూడా గ్రహించవలసియున్నది. భగవంతుడు సకల భువనాలలోనూ ఇప్పుడు జరుగుచున్నది, ఇదివరకు జరిగినది, ముందు జరుగబోవునది కూడా చూచును. అనగా ఆత్మజ్ఞానము కలిగినవాడు గనుక ఆయన సులోచనుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుడు (1) అందమైన కనులు గలవాడు (2) సకల జీవులకు దృష్టినిచ్చువాడు (సూర్యుడు) (3) ఆయనకు సూర్యచంద్రులే కన్నులు. కనుక ఆయన సులోచనుడు. **సమ్యగ్ లోచన్తే ప్రాణినో యస్మిన్ ఉదితే సతి ఇతి సులోచనః సూర్యః – చంద్ర సూర్యౌ చ నేత్రే**

## 801. అర్కః

- స్తుతింపబడినవాడు, ఆరాధింపబడినవాడు.
- సూర్యునిరూపంలో ఉన్నవాడు.

### ఓం అర్కాయ నమః

అర్క - తాపనే, స్తవనే చ - వేడిచేయుట, స్తుతించుట. **అర్చ్యత స్తూయత ఇతి అర్కః.** ఋచ్ - స్తుతౌ - స్తుతించుట; అర్చ్ - పూజాయామ్ - పూజించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అత్యంత ధార్మిక ఇతి స్తుతస్తైః అర్కః ఈరితః.** తన భక్తులచేత మిక్కిలి ధార్మికుడని స్తుతి చేయబడ్డవాడు 'అర్కః'. **అర్చ్యతే స్తూయత్ ఇతి అర్కః.** బుద్ధావతారంలో విరోధులచేత కూడా ఇంతవాడు అంతవాడు అని స్తుతింపబడినవాడు అర్కుడు.



థాయిలాండ్ బ్యాంగ్‌కాక్ ఆలయంలో శ్రీ బుద్ధ విగ్రహం

శ్రీ శంకరుల వ్యాఖ్య – **బ్రహ్మాదిభిః పూజ్యతమైరపి అర్చనీయత్వాత్ అర్కః.** బ్రహ్మాదులచేతకూడా పూజింపబడినవాడు అర్కుడు. శ్రీ కృష్ణదత్త భరద్వాజకూడా ఇదే భావాన్ని చెబుతూ భాగవతం (!2.13.1)నుండి ఉదాహరించారు. **యమ్ బ్రహ్మ వరుణేంద్ర మరుతః స్తువన్తి దివ్యైః స్తవైః.** బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు, వాయువువంటివారు ఆయనను దివ్యస్తుతులతో స్తుతిచేయుదురు.

శ్రీ చిన్మయానంద – 'అర్క' అనగా సూర్యుడు. శ్రీమన్నారాయణుడు సూర్యునిరూపంలో ప్రత్యక్షదైవమై యున్నాడు. లోకమునకు కాంతి, వేడిమి ప్రసాదిస్తున్నాడు. అన్ని జీవులందును అంతర్యామియై యున్నాడు. ఆయన లేకుంటే జీవం లేదు.

## 802. వాజసనః

### వాజసనిః

- అన్నమువంటివానిపై (ఐహిక విషయములందు) రుచిని (ఆసక్తిని) కలిగించినవాడు.
- అన్నము కోరినవారికి అన్నమును ప్రసాదించువాడు.
- సకల జీవులకు ఆహారము లభింపజేయువాడు.

**ఓం వాజసనాయ నమః**

**ఓం వాజసనియే నమః**

శ్రీ భట్టులు ఈ నామమును 'వాజసనిః' అనీ, శ్రీ శంకరులు 'వాజసనః' అనీ చెప్పారు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ రెండు పాఠములను ఇచ్చారు. మరియు 'వాజసనిః' అనేది 'వైదిక పాఠము' అన్నారు. బహుశా ఇందుకు కారణం వేదాలలో 'వాజసనిః' అని చెప్పబడి ఉండడం కావచ్చును. ఉదాహరణకు ఋగ్వేదము 9.110.11, 3.51.2, 10.91.15.

వాజ - అన్నము, ఆహారము; సన్ - సంభక్తౌ, దానే - ఇచ్చుట, విభజించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **నాస్తిక్య వాదేన ఐహికమ్ అన్నాదికమేవ సంభజతి ఇతి వాజసనిః.** తన నాస్తిక వాదముతో అన్నమువంటి ఐహిక భోగములపట్ల రుచిని కలిగించినవాడు (బుద్ధావతారంలో). **క్షపణకః వ్రతమ్ హేదమ్ యత్ ప్రాతః ప్రాతః దధ్యోదన కబళాన్ గృహ్ణతే ఇతి.** క్షపణకులు (బౌద్ధ భిక్షువులు) ప్రొద్దున్నే పెరుగన్నం తింటారు. **అన్నాదీన్యైహికాన్యేయ యస్మాన్మహ్యం భవంతి హి**

**స వాజసనిరిత్యుక్తః వస్వర్ణోఽన్నప్రదో మనుః** అన్నము మొదలగు ఐహిక ఫలములయందు రుచిని పుట్టించినవాడు 'వాజసని'. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అన్నమును ఇస్తుంది. ఓం వాజసనియే నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వాజమ్ - అన్నమ్ అర్థినామ్ సనోతి - దదాతి ఇతి వాజసనః.** కోరినవారికి అన్నమును ఇచ్చువాడు వాజసనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు జీవులకు జన్మమునకు ముందే అన్నమును సిద్ధము చేయును. ఉదాహరణకు బిడ్డ పుట్టేసరికి తల్లి రొమ్ములో పాలు సిద్ధంగా ఉంటాయి.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు సకలజీవుల శరీరమునకు, మనస్సుకు, బుద్ధికిని కూడా పౌష్టికత కలుగజేయును.

**గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా**
**పుష్ణామి చౌషధీః సర్వా సోమో భూత్వా రసాత్మకః** – గీత 15.13
పృథ్వియందు ప్రవేశించి, నేను నా శక్తిద్వారా సకల భూతములను ధరించి, పోషించుచున్నాను. రస స్వరూపుడనై, అనగా అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు, అనగా వనస్పతులన్నింటికి పుష్టిని చేకూర్చుచున్నాను.

## 803. శృంగీ

- కొమ్ములు కలవాడు.
- నెమలి పింఛము చేత ధరించి , కొమ్ము ఉన్నవానిలా కనుపించినవాడు.

- మత్స్య, వరాహ అవతారాలలో కొమ్ము కలిగినవాడు.
- చేత గోవర్ధనగిరి శిఖరము ధరించినవాడు.
- ప్రతి జీవికీ తన శృంగము (శక్తి) ప్రదర్శించుకొనే అవకాశం కలిగించినవాడు.
- తన భక్తులకు పునర్జన్మ భయాన్ని నాశనం చేసేవాడు.

## ఓం శృంగిణే నమః



గుజరాత్ పాటన్ లో శ్రీవరాహమూర్తి శిల్పం. వికీపీడియానుండి.

Photo by Nagarjuna Kandukuru

'శృంగము' అనగా కొమ్ము. కొండ శిఖరము (కొండ కొమ్ము), ఆధిపత్యము, గర్వము (శృంగభంగము) వంటి అర్థాలను కూడా సూచిస్తుంది. 'శృంగ' అనే పదము ఇంతకు ముందు కొన్ని నామాలలో వచ్చినది. **మహాశృంగః** (57వ శ్లోకము, 540వ నామము), **నైకశృంగః** (81వ శ్లోకము, 869వ నామము).

శ్రీ భట్టుల వ్యాఖ్య – బుద్ధావతారంలో భగవంతుడు అహింసాసూచకంగా చేత నెమలిపింఛము ధరించి, ఒక కొమ్ము కలవానిలా అగుపించాడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణము (18.2)నుండి ఉదాహరించారు.

**తతో దిగంబరో ముండో బర్హిపత్రధరో ద్విజ మాయామోహోఽసురాన్ శ్లక్ష్ణమ్ ఇద వచనమబ్రవీత్**

అతడు దిగంబరుడై, బోడిగుండుతో, చేత నెమలిపింఛము ధరించి, మృదువుగా ఇట్లు పలికెను. (చేత నెమలి పింఛము ధరించుట జైన భిక్షువుల ఆచారాలలో ఒకటి. 'పృథురాయ్ చరిత్ర' అనే హిందీ కవిత ప్రకారం అమరసింహుడనే బౌద్ధుడు నెమలిపింఛం ధరించాడు. – శ్రీ హెచ్. హెచ్. విల్సన్ తమ అనువాదంలో ఇచ్చిన పాదపీఠిక).

**కరేఽస్తి పింఛికా యస్య శృంగీ హంస విడంబనాత్ సర్వ ప్రపంచ మిధ్యాత్వ సంవిదాత్మత్వ వాదినః**

ప్రపంచం మిధ్య, జ్ఞానమే ఆత్మ అని వాదించే బుద్ధుడు తాను అహింసావాదినని తెలియజెయ్యడానికి నెమలిపింఛాన్ని చేత ధరించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ప్రళయ అంభసి శృంగవాన్ మత్స్యవిశేషరూపః శృంగీ.** ప్రళయాంభోనిధిలో శ్రీమత్స్యావతారుడై తన కొమ్మునకు తగిలించిన నావయందు సత్యవ్రతాదులను సాగరము దాటించినవాడు శృంగి.



మత్స్యావతార చిత్రం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File:Matsya_painting.jpg

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – ఈ నామమును శ్రీవరాహావతారమునకు కూడా అన్వయింపవచ్చును. పాతాళాంతర్గతయైన భూమిని శ్రీవరాహమూర్తి తన కొమ్ముతో లేవనెత్తెను. 58వ శ్లోకము, 542వ నామము '**మహావరాహః**'.

శ్రీ సత్యసంధ యతిరాజ – **శృంగాణి గోవర్ధన శృంగాని అస్య సన్తి ఇతి శృంగీ.** గోవర్ధనగిరి శిఖరాన్ని తన చేత ధరించినవాడు శృంగి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శృంగ - శక్తి, ప్రవాహము. భగవంతుడు సకల జీవులకు తమ శక్తిని ప్రదర్శించే విధానం ఇచ్చాడు. ఉదాహరణకు పాములు కోరలు, తేలుకు తోక శృంగములుగా నున్నవి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – శృ - హింసాయామ్ - బాధించుట, చంపుట. **శృణతి భవభయమ్ ఇతి శృంగమ్ అవిచింత్య సామర్థ్యమ్ తదస్య ఇతి శృంగీ.** తన భక్తులలో పునర్జన్మ అనే భయాన్ని నాశనం చేసేవాడు శృంగి.

## 804. జయంతః

- జయించువాడు.

### ఓం జయంతాయ నమః

జీ - జయే - గెలుచుట. **జితవాన్ ఇతి జయంతః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – మాయాశాస్త్రముల సృష్టికూడ భగవానుని లీలయే. మంచి చెడులు ఒక కారణంచేత ఆయనవల్ల ఏర్పడుతాయి. **ఆస్తిక్యవాదినః సంవిదాత్మత్వ ప్రపంచమిధ్యత్వవాదైః జితవాన్ ఇతి జయంతః.** ప్రపంచము మిధ్య అనే మాయావాదంతో ఆస్తికులను ఓడించినవాడు జయంతుడు. దీనికి కారణాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఎందుకంటే అసురులలో కొందరు ఆస్తికకర్మలద్వారా గొప్ప శక్తులు సాధించి లోకులకు కీడు చేస్తారు (ఉదాహరణకు – శుక్రాచార్యుడు, రావణుడు). అలాంటివారిని తన నాస్తికవాదనలతో పెడమార్గం పట్టించి నిజమైన భక్తులను ఉద్ధరించేవాడు గనుక భగవానుడు జయంతుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అరీన్ అతిశయేన జయతి, జయహేతుర్వా జయంతః.** తన శత్రువులపై జయం పొందేవాడు జయంతుడు. ఇలా భగవంతుడు దేవతల పక్షాన, పాండవుల పక్షాన ఉండి వారి శత్రువుల పరాజయానికి కారణమయ్యాడు.

శ్రీ చిన్మయానంద – భగవంతుని జయంతగుణమువలన మనం తుచ్ఛమైన కోరికలను జయింపవచ్చును.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **జయతి సఖాన్ బహుయుద్ధే వాగ్యుద్ధే వా ఇతి జయంతః.** మాటలలోను, ఆటలపోటీలలోను శ్రీకృష్ణుడు ఎల్లప్పుడూ తన మిత్రులలో జయం పొందేవాడు గనుక జయంతుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **యోహో సర్వదా జయతి, న కదాచిత్ పరాజయమ్ లభత ఇతి జయంతః.** ఎల్లప్పుడూ జయించేవాడు, ఎప్పుడూ పరాజయం పొందనివాడు జయంతుడు. భగవంతుని అధీనంలో సమస్త విశ్వమూ నడుస్తుంది. భగవంతుడు ఎవరి పక్షాన ఉంటాడో వారు తప్పక జయం పొందుతారు.

**ఏవమ్ హి యో వేత్తి జయంతమగ్ర్యయమ్ విష్ణుమ్ స సర్వమ్ జయతీతి బోధ్యమ్**
**యస్యాస్తి సవ్యే భగవాన్ జయంతః కిమ్ శాత్రవస్తస్య నరస్య కుర్యుః**
భగవంతుని అండ, ఆశీస్సులు ఉంటే ఎన్ని ఆయుధాలైనా, ఏమైనా గాని వారి విజయాన్ని ఆపలేవు.

శ్రీ వేదాంతదేశికుల కామాసికాష్టకము 6 – **త్వయి రక్షతి రక్షకైః కిం అన్యైః త్వయి చారక్షతి రక్షకైః కిం అన్యైః**
నీవు రక్షకుడవైతే ఇతర రక్షకులతో పని ఏమిటి? నీవు రక్షింపకుంటే ఇంక ఇతర రక్షకులేమి చేయగలరు?
స్వామిదేశికన్ అభీతిస్తవము 5 – **కదాచన కుతశ్చన క్వచ న తస్య నస్యాత్ భయమ్.** భగవంతుని భక్తులకు ఎప్పుడూ, ఎక్కడా, ఎలాగూ భయం లేదు.
ఋగ్వేదము 1.91 21 – **జయంతమ్ త్వమ్ అనుమదే సోమ.**
ఋగ్వేదము 10.103.8 – **దేవసేనానామ్ అభిభంజతీనామ్ జయంతీనామ్ మరుతో యంత్వగ్రమ్.**

## 805. సర్వవిజ్జయీ

- అన్నీ నేర్చుకున్నవారిని జయించినవాడు.
- అంతా తెలిసినవాడు మరియు సదా జయించువాడు.
- అంతా తెలిసిన మునులకు ప్రియమైనవాడు.

### ఓం సర్వవిజ్జయినే నమః

సర్వ - మొత్తము (సరతి ఇతి సర్వః); విద్ - జ్ఞానే - తెలిసికొనుట; విద్ - విచారణే - ఆలోచించుట, వాదించుట; జీ - జయే - గెలుచుట; సర్వ-విద్-జయీ – సర్వవిజ్జయీ.

శ్రీ భట్టుల వ్యాఖ్య – తన మధురమైన భాషణముతోను, ఒప్పించే వాదంతోనూ పండితులనందరినీ ఓడించినవాడు 'సర్వవిజ్జయీ'. ఇలా తన (నాస్తిక) వాదంతో అందరినీ ఓడించి, తద్వారా వేదవిదులైన దుష్టులను నాస్తికులుగా చేశాడు. అలా కాకుంటే అలాంటి అసురులు గొప్ప శక్తులు సంపాదించి ధార్మికులను బాధిస్తారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఈ నామమును 'సర్వవిత్' మరియు 'జయీ' అనే నామముల జంటగా పరిగణించారు. **సర్వవిషయమ్ జ్ఞానమ్ అస్య ఇతి సర్వవిత్.** అన్ని విషయాలు తెలిసినవాడు 'సర్వవిత్' **అభ్యంతరాన్ బాహ్యాన్ హిరణ్యాక్షాదిన్ శ్చ దుర్జయాన్ జేతుమ్ శీలమ్ అస్య ఇతి జయీ.** (కామాది) అంతఃశ్శత్రువులను, హిరణ్యాక్షునివంటి బాహ్యశత్రువులను జయించే గుణం కలిగినవాడు 'జయీ'. కనుక 'సర్వవిజ్జయీ'.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఈ రెండు నామములను ఇలా జోడించారు. భగవంతుడు 'సర్వవిత్' కనుక కామక్రోధాది అంతఃశత్రువులను జయింపగలడు. ముండకోపనిషత్తు 1.1.9, 2.2.7 – **యః సర్వజ్ఞః సర్వవిత్.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శత్రువు రహస్యాలు తెలిస్తే శత్రువును జయించడం సాధ్యం. భగవానుడు అన్నీ తెలిసినవాడు 'సర్వవిత్' గనుక అందరినీ జయించే 'జయీ'. అలా ఆయన 'సర్వవిజ్జయీ'.

శ్రీ చిన్మయానంద – తమ పాండిత్యంగురించి గొప్పగా చెప్పుకునేవారు కూడా సమాధిస్థితిలో శ్రీమన్నారాయణుని సన్నిధానంలో నిశ్శబ్దంగా ఉంటారు. కనుక ఆయన సర్వవిజ్జయి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'సర్వవిత్' అనగా అన్నీ తెలిసిన బ్రహ్మవంటివారిని సూచించును. వారందరికంటె గొప్పవాడు గనుక భగవంతుడు సర్వవిజ్జయి.

**సర్వమ్ విదన్తి ఇతి సర్వవిదో బ్రహ్మాదయః తానపి నిరతిశయ సర్వజ్ఞతాయ జయతి ఇతి సర్వవిజ్జయీ**

శ్రీ బలదేవ విద్యాభూషణ 'సర్వవిత్' అనగా 'అన్నీ తెలిసినవాడు' అని ఇతరులు చెప్పిన అర్థాన్నే చెప్పారు. కాని ఆయన 'జయీ' అనగా 'గౌరవింపబడువాడు' అని అర్థం చెప్పారు. సర్వవిత్సు వసిష్ఠ వామదేవాదిషు జయో మహోత్కర్షోऽస్య నిత్యమ్ అస్తి ఇతి సర్వవిజ్జయీ. అంతా తెలిసిన జ్ఞానులైన వసిష్ఠుడు, వామదేవుడు వంటివారిచే కూడా గొప్పగా గౌరవింపబడువాడు గనుక భగవంతుడు సర్వవిజ్జయి.

**శ్రీ వేంకటేశ్వర వచనములు – శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు.**



వైకుంఠనాథా! హిరణ్యగర్భాదులకుఁ దండ్రివైన నిన్ను, సనకాదులకును ఏలికవైన నిన్ను, దివిజులకు రక్షకుండవైన నిన్ను, మునులకు వరదుండవైన నిన్ను, జ్ఞానులకుఁ బరదైవతంబైన నిన్ను, జగంబులకు మూలకారణమవైన నిన్ను యశోదా నందగోపులు పుత్త్రుండవని పెంచిరి; గోపికా జనంబులు పతివని తలంచిరి; పాండవులు బావమఱఁదివని భావించిరి. వీరలటువంటి మమకారంబులనుభవించిరి. మఱికొందరు ముచికుంద దధిభాండ కమలాకర భీష్మాదులు పరతత్త్వమైన నారాయణుండవని భజియించి బ్రహ్మపదమునుం బొందిరి. ఇన్ని విధంబుల వారికి నీవొక్కండవే గుఱి. ఎటువలె భావించిన నటువలె నౌదువు. వివేకింప నేర్చినవారి పాలిటి నిధానమవుదువు; శ్రీ వేంకటేశ్వరా!

శ్రీ బలరామ కృష్ణులను ఆడిస్తున్న యశోదా నందులు.
1755 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Indischer_Maler_um_1755_002.jpg

హిరణ్యగర్భా! నీకుఁ బాన్పైన శేషుండు బ్రహ్మాండంబెత్తుకొనియె; నీకు వాహనంబయిన గరుత్మంతుం డమృతంబుఁ గొని చనియె; నీ కూఁతురైన గంగాభవాని హరు శిరస్సునెక్కె; ధ్రువుండు బ్రహ్మలోకం బతిక్రమించె; నారదుండు సురలకుఁ బోరువెట్టుచున్నాడు; రుక్మాంగదుండు యమలోకంబుం బాడుచేసె; శుకుండు వైరాగ్యంబు చూఱఁగొనియె; ఇందుచేతను నీ దాసులు నీకంటె నధికులౌట తేటపడియె; శ్రీ వేంకటేశ్వరా!



కేరళ తిరువళ్ళా శ్రీవల్లభాలయంలో శ్రీ గరుత్మంతుని చిత్రం.

Photo by : Dvellakat

https://commons.wikimedia.org/wiki/File:Garuda_picture_sreevallabha_temple.JPG



## సువర్ణబిందురక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః |
## మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః || (86)

### 806. సువర్ణబిందుః

- తన చతురమైన వాదనతో వైదికమతమును మరుగుపరచినవాడు (బుద్ధుడు).
- బంగారురంగు అవయవములు కలిగిన సుందరుడు.
- మంగళప్రదమైన ప్రణవమంత్రస్వరూపుడు.
- సుందరమైన స్వరూపము కలవాడు మరియు సృష్టిలో అన్నింటిని చక్కగా విభజించినవాడు.
- శుభకరమైన అక్షరములున్న వేదములనెరిగినవాడు.
- నుదుటిపైన, కపోలములపైన బంగారు రంగుగల చందన చిహ్నములు కలిగినవాడు.

**ఓం సువర్ణబిందవే నమః**

సు (ఉపసర్గ); వృ - వరణే - ఏరుకొనుట; వర్ణము అనగా రంగు, అక్షరము అనే అర్థాలున్నాయి. బింద్ - అవయవే - విడదీయుట; విద్ - జ్ఞానే - తెలిసికొనుట. **'బ', 'వ'యోరభేదః** – అనే వ్యాకరణసూత్రము ప్రకారము 'విందు' మరియు 'బిందు' అనే పదాలకు ఒకే అర్థం తీసికొనవచ్చును. శ్రీ భట్టులు 'బిది' - అపలాపే - దాచివేయుట - అనే అర్థంలో వ్యాఖ్యానించారు. 'బిందు' అంటే ఇంకా తిలకము (నుదుటిపై బొట్టు), అనుస్వరము (ॐ లో చుక్క), జింక వంటి పైని చుక్కలు – వంటి అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు బుద్ధావతారపరంగా తమ వ్యాఖ్యను కొనసాగించారు. **ఆస్తికత్వాపలాపేన పటుభిః పదకాక్షరైః సువర్ణబిందుర్కృథితః నవార్ణః పాపనాశనః.** తనయొక్క నేర్పుతో, వాదనాపటిమతో, అందమైన పదజాలం (సువర్ణములు)తో వైదకమతాన్ని అపలపించి (మరుగుపరచి), నాస్తికమతమునందు ఆసక్తిని పెంపొందించువాడు సువర్ణబిందువు. ఈ నామము నవాక్షరీ మంత్రము. పాపములను హరించును. ఓం సువర్ణబిందవే నమః. ఈ విధంగా వేదముల ధర్మాన్ని మరుగుపరచడంద్వారా దుష్టులకు ఆ మతంవల్ల కలిగే లాభాలను నివారించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'బిందు' అనగా 'అవయవములు' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **బిందవః అవయవాః సు-వర్ణ సదృశౌ అస్య ఇతి సువర్ణబిందుః.** బంగారురంగు అవయవాలు కలిగినవాడు సువర్ణబిందువు. 79వ శ్లోకంలో 743నుండి 746వరకు నామములు – **సువర్ణవర్ణః, హేమాంగః, వరాంగః, చందనాంగదీ** – కూడా భగవానుని శరీరసౌందర్యాన్ని కీర్తిస్తున్నాయి.

శ్రీ వాసిష్ఠ కూడా ఈ అర్థంలో ఒక వ్యాఖ్య చెప్పారు. **సు-శోభనమ్, వరణీయమ్ దృశ్యమ్ రూపమ్ యస్య స సువర్ణః, సువర్ణ బిందవః అవయవః యస్య స సు-వర్ణ-బిందుః.** శోభనకరమైన రంగు, అందమైన అవయవములు కలవాడు సువర్ణబిందువు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భక్తులు ఒనరించిన యజ్ఞాలలో అగ్నికుండంనుండి బంగారువర్ణంలో అవతరించువాడు సువర్ణబిందువు. బ్రహ్మదేవుడు కాంచీపురంలో యజ్ఞం చేసినపుడు భగవంతుడు కంచిపెరుమాళ్ళు అర్చామూర్తిగా ఉద్భవించాడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక వ్యాఖ్య – వర్ణము - అక్షరము; బిందువు - అనుస్వరము. **శోభనో వర్ణః అక్షరమ్ బిందుసా యస్మిన్ మంత్రే తన్-మంత్రాత్మా వా సువర్ణబిందుః.** ఏ మంత్రమునందు సుందరమగు అక్షరమును మరియు బిందువు (అనుస్వరము) కలదో అట్టి మంత్రము అనగా ఓంకారము గలవాడు, అనగా ప్రణవ స్వరూపుడు.

తైత్తరీయోపనిషత్తు 1.81 – **ఓం ఇతి బ్రహ్మ.**
కఠోపనిషత్తు 1.2.15 – **తత్ తే పదమ్ సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్.**

శ్రీ వాసిష్ఠగారి మరొక వివరణ – బింద్ - అవయవే - విడదీయుట; బిందతి - అవయవాన్ కరోతి - విభజించువాడు. చక్కని రూపము కలవాడు (సువర్ణ) మరియు సకల జీవులను చక్కగా విభజించువాడు, కాని అవి కలిసి జీవించునట్లు చేయువాడు. ఉదాహరణకు – చెట్లను కొమ్మలు, ఆకులు, పూలు – ఇలా విభజించును. సౌరమండలమును గ్రహములుగా విభజించును. **యథాయమ్ సూర్యస్తథాయమ్ సమస్త ప్రపంచః పరస్పరమ్ అవయవ-అవయవ విభావమ్ ఆపన్నః, పత్ర-ఫల-పుష్ప-శాఖాదీని వృక్షస్యేవ.**

శ్రీ సత్యసంధ యతిరాజ – బిందు - అక్షరము; విద్ - జ్ఞానే; సువర్ణ - వేదములు. **శోభనా వర్ణా యస్మిన్ స సువర్ణో వేదః, తస్య బిందుః జ్ఞాతా సువర్ణబిందుః.** వేదములు తెలిసినవాడు సువర్ణబిందువు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సు-వర్ణో లలాటస్థో బిందుః అస్య ఇతి.** నుదుటిపై బంగారురంగు బొట్టు కలవాడు. లేదా బంగారురంగు నుదుటిపై బొట్టు కలవాడు సువర్ణబిందువు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సువర్ణమివ పీతాభా బిందవః చందన బిందవో యస్య చిబుక, కపోల మస్తకే స సు-వర్ణ బిందుః.** బుగ్గలు, తల, చిబుకముపై చందనపు అలంకరణ కలవాడు సువర్ణబిందువు.



థాయిలాండ్ మందిరంలో శ్రీ బుద్ధుని విగ్రహాలు

## 807. అక్షోభ్యః

- గంభీరమ్మైన చిత్తము కలవాడు, కలతచెందనివాడు.
- రాగద్వేషములు లేనివాడు.
- మారీచుని భయపెట్టినవాడు.

### ఓం అక్షోభ్యాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది –
86వ శ్లోకము. 807వ నామము. అక్షోభ్యః – **సువర్ణబిందుః అక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః**
107వ శ్లోకము. 999వ నామము. అక్షోభ్యః – **రథాంగపాణిః అక్షోభ్యః సర్వప్రహరణాయుధః**

క్షుభ్ - సంచలనే - కలతనొందుట, క్షోభించుట, చలించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **గంభీరాశయత్వేన అవికార్యః.** బుద్ధునిగా భగవంతుడు వాదించినపుడు ఎవరూ ఆయనను ఎదుర్కొనలేరు. ఎందుకంటే ఆయన గాంభీర్యం అలాంటిది. **గంభీరాశయత్వేన వ్యాధికారతయా చ సః అక్షోభ్యః సప్తవర్ణస్యాత్ అక్షోభ్యత్వ ప్రదాయకః.** గంభీరమ్మైన హృదయం కలవాడు. అధికారము కలవాడు. పరులచే కలతనొందింప తగనివాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. కలతలు లేకుండా చేస్తుంది. ఓం అక్షోభ్యాయ నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **రాగాదిభిః శబ్దాది విషయ్మైశ్చ, త్రి-దశ-అరిభిశ్చ, న క్షోభత ఇతి అక్షోభ్యః.** రాగద్వేషములు, శబ్దాది విషయములు, మూడులోకములలోని శత్రువులు, ఎవరూ ఇతనిని కలతనొందింపలేరు గనుక ఆయన అక్షోభ్యుడు.

శ్రీ చిన్మయానంద గీతలోని స్థితప్రజ్ఞ లక్షణములను (2.54నుండి 2.61వరకు) ప్రస్తావించారు. ఈ స్థితప్రజ్ఞస్వభావమే అక్షోభ్యుడైన భగవానుని స్వభావము.

శ్రీ సత్యసంధ యతిరాజ మరొక క్రొత్త అనుభవాన్ని మన ముందుంచారు. ఆయన 'సువర్ణబిందుః' మరియు 'అక్షోభ్యః' అనేవి రెండూ కలిపి **'సువర్ణ-బిందు-రక్ష-భ్యః'** అనే ఒకే నామంగా పరిగణించారు.. **సువర్ణ బిందవో యస్మిన్ తత్ సువర్ణ బిందు - సువర్ణ బిందువత్ రక్షశ్చ సువర్ణబిందు - రక్షో మారీచః, తమ్ భ్యాసయతి భీషయతి ఇతి సువర్ణబిందు-రక్షో-భ్యః.** సువర్ణబిందువులు, అనగా వంటిపై బంగారుచుక్కలు కలిగిన లేడి. 'రక్ష' అనగా అలాంటి రాక్షసుడు మారీచుడు. భ్య - భయ - భయపెట్టినవాడు. ఇలా మారీచుని భీతావహుని చేసినవాడు సువర్ణబిందురక్షోభ్యుడు, అనగా శ్రీరాముడు.

## 808. సర్వవాగీశ్వరేశ్వరః

- వాక్పతులందరికి ప్రభువు.
- వాక్చాతుర్యము కలవారిలో అత్యున్నతుడు.

### ఓం సర్వవాగీశ్వరేశ్వరాయ నమః

వాక్కుపై ఆధిపత్యము కలవారందరికీ అధిపతియైనవాడు సర్వవాగీశ్వరేశ్వరుడు. సర్వ-వాక్-ఈశ్వర-ఈశ్వర. ఈ సర్వవాగీశ్వరులు ఎవరు అనే విషయంపై వివిధ వ్యాఖ్యానాలు ఆధారపడినాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు బుద్ధావతారపరంగా వ్యాఖ్యానించారు. వాదాలలో ఇతర పండితులందరిపైనా బుద్ధునిదే పైచేయి.

**వాద వాఙ్మయత్వోః పారం యో గచ్ఛతి స విశ్రుతః రవ్యర్థో వాక్ప్రద ఇతి సర్వవాగీశ్వరేశ్వరః.** ప్రతివాదులతో వాదించుటయందుగాని, ఇతరుల హృదయాలను ఆకర్షించేటట్లు మాట్లాడడంలోగాని తనకు మించినవాడు లేడు అని పేరుపొందినవాడు. ఈ నామము ద్వాదశాక్షరి. వాక్పటుత్వమునిస్తుంది. ఓం సర్వవాగీశ్వరేశ్వరాయ నమః. అయితే ఇక్కడ గమనించవలసిన విషయం ఏమంటే భగవంతుడు బుద్ధావతారంలో నాస్తికత్వాన్ని సమర్థిస్తూ, శాస్త్రవిరుద్ధంగా వాదించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – సర్వవాగీశ్వరుడనగా బ్రహ్మ. అట్టి బ్రహ్మకు ప్రభువు గనుక నారాయణుడు సర్వవాగీశ్వరేశ్వరుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – సర్వవాగీశ్వరుడనగా రుద్రుడు. అట్టి రుద్రునకు ప్రభువు సర్వవాగీశ్వరేశ్వరుడు. **సర్వేషామ్ వాచః సర్వవాచః తా సామ్ ఈశ్వరస్య రుద్రస్య చ ఈశ్వరత్వాత్ సర్వ-వాగ్-ఈశ్వర-ఈశ్వరః.**

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సర్వః శ్రుత్యాది లక్షణా వాచో యత్ర స సర్వవాక్, నిఖిలశాస్త్ర ప్రతిపాద్య ఇత్యర్థః, యత్ ఈశ్వర - ఈశ్వరవిధి - రుద్రాది నియామకః.** బ్రహ్మ, రుద్రుడు మరియు శాస్త్రపండితులు సర్వవాగీశ్వరులు. వారికి ఈశ్వరుడు సర్వవాగీశ్వరేశ్వరుడు.

శ్రీ చిన్మయానంద – కేనోపనిషత్తునుండి: **కేనేషితామ్ వాచమ్ ఇమమ్ వదన్తి?** ఎవరివలన మాటలు వెలువడును? **తదేవ బ్రహ్మమ్ తద్విద్ధి.** బ్రహ్మము కారణంగా. మాటలు అంటే కేవలం శబ్దాలు, ఇంద్రియాలు కాదు. వానికి కారణమైనవాడు నారాయణుడు.

శ్రీ వాసిష్ఠ – వాచస్పతి, అగ్ని, విద్యుత్ వంటివారు వాక్పతులు. వారందరికీ ప్రభువు సర్వవాగీశ్వరేశ్వరుడు. అనేకవిధాల జీవులున్నాయి. వాటికి శబ్దాలు చేసే శరీరభాగాలు వివిధంగా ఉన్నాయి. వీటన్నింటికీ కారణం నారాయణుడే.

## 809. మహాహ్రదః

- గొప్ప సరస్సు - పాపులను ముంచివేసేది. పుణ్యపురుషులు మరల మరల స్నానం చేసేది.
- లోతైన నీటితో సంబంధంకలవాడు - కాళీయమర్దనము, క్షీరసాగరశయనము సూచింపబడినవి.
- భూమి ఎండిపోకుండా ఉండేందుకుగాను మహాసాగరములను సృష్టించినవాడు.

### ఓం మహాహ్రదాయ నమః

హ్రాద - అవ్యక్తే శబ్దే - గర్జించు ధ్వని, అర్థం కాని శబ్దము చేసేది హ్రదము. **హృదతే ఇతి హ్రదః;** మహాహ్రదము-గొప్ప హ్రదము (సాగరము).

శ్రీ భట్టుల వ్యాఖ్య – బుద్ధావతారపరంగా, **యత్ర పాపకర్మణః అ-పునరుత్థానమ్ నిమజ్జన్తి పుణ్యకృతో గాహమ్ గాహమ్ తృప్యన్తి స మహాహ్రదః.** పాపులు మరల లేవకుండా మునిగిపోయే సరస్సు. పుణ్యాత్ములు మరల మరల స్నానం చేసి ఆనందించే సరస్సు మహాహ్రదము. అలా భగవంతుడు మహాహ్రదుడు.

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్**
**క్షిపామ్యజస్రమ్ శుభాన్ ఆసురీష్వేవ యోనిషు** – గీత 16.9
అట్లు ఇతరులను ద్వేషించు పాపాత్ములను, క్రూరులైన నరాధములను మాటిమాటికిని ఈ సంసారమునందు ఆసురీయోనులలోనే నేను పడవేయుచుందును.

శ్రీ వి.వి. రామానుజన్ – ప్రవాహం మధ్యలోసుడిగుండాలు ఎలాంటివో పాపాత్ములైన అసురులకు భగవానుడు అలాంటివాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అవగాహ్య తదానందమ్ విశ్రమ్య సుఖమ్ ఆస్తే యోగిన ఇతి మహాహ్రదః.** ఎవనియందు మునిగి యోగులు పరమానందమును అనుభవింతురో అట్టి చల్లని సరోవరము గనుక ఆ మహాత్ముడు మహాహ్రదుడు. శ్రీహరి శరణాగతి సర్వతాపహరణము.

శ్రీ సత్యసంధ యతిరాజ – **మహాన్ హ్రదో యస్య కాళీయమర్దన కాలే వా సముద్రశయన కాలే వా స మహాహ్రదః.** కాళీయ మర్దన కాలములోను, సాగరశయన కాలములోను లోతైన నీటితో సంబంధము కలవాడు మహాహ్రదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **మహాహ్రదో విష్ణురమోఘ కర్మా కరోతి విశ్వమ్ బహు సాధనాప్తమ్ మహాహ్రదమ్ స కురుతే సముద్రమ్ శుష్యేన భూః సూర్య ఖరాంశుపాతైః.** సూర్యుని తాపమువలన భూమి ఎండిపోకుండా గొప్ప సాగరములను సృష్టించినవాడు విష్ణువు. అలాంటి అమోఘమైన పనులను చేసినవాడు మహాహ్రదుడు.

## **810.** మహాగర్తః

- పాపులను సంసారమనే గొప్ప కందకములో (గోతిలో) పడద్రోయువాడు.
- మహాభారతంలో గొప్ప సారథి, రధికుడు.
- గరుడధ్వజముగల గొప్ప రథముపై పయనించువాడు.
- శేషాచలంవంటి గొప్ప పర్వతాలపై నివసించేవాడు.
- విశ్వమంతా దేనినుండి ఉద్భవించి, దేనియందు నివసించి, దేనిలో విలీనమౌతుందో ఆ పెద్ద కందకము.

### ఓం మహాగర్తాయ నమః

గృర్ - నిగరణే - మ్రింగివేయుట, బయటకు తెచ్చుట. 'గర్త' అంటే పెద్ద గోయి (కందకము, అగడ్త), రథము అనే అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'గర్త' అంటే అగడ్త (గోయి) అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **ఏవమ్ బాహ్య కుదృష్టి వినిష్విష్ట నష్టాత్మనామ్ రౌరవాది గర్తా అస్మాత్ ఇతి మహాగర్తా.** దుర్మార్గులైనవారిని భగవంతుడు రౌరవాది నరకాలలో పడవేస్తాడు. ఆ నరకాలే మహాగర్తలు. అలా వాటిలో పడద్రోసేవాడు మహాగర్త. **పాపాక్రాంత తయానష్ట ప్రజ్ఞానామ్ రౌరవాదయః గర్తా యస్మాన్మహాగర్తః స స్మృతో వసువర్ణకః.** ధర్మవిరుద్ధమైన మార్గమునవలంబించిన పాపకర్ములను, జ్ఞానము లేనివారిని రౌరవాది నరకాలలో పడవేసేవాడు మహాగర్త. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఓం మహాగర్తాయ నమః.

శ్రీ భట్టులు గీత (9.3)నుండి ఉదాహరించారు – **అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసార వర్త్మని.** ఓ పరంతప! ఈ ధర్మమార్గమునందు విశ్వాసములేని పురుషులు నన్ను పొందజాలరు. కనుక వారు మృత్యురూప సంసారచక్రమునందు పరిభ్రమించుచుందురు.

శ్రీ భగవద్రామానుజుల గీతాభాష్యంలో ఈ శ్లోకం వ్యాఖ్యానం ప్రకారం – ధర్మమార్గంలో చరించడానికి అర్హత పొంది, మరల అశ్రద్ధ, అవిశ్వాసాల కారణంగా ఆ మార్గాన్ని విడచినవారిని గురించి ఈ గీతాశ్లోకంలో చెప్పబడింది. **"అహో! మహదిదం ఆశ్చర్యం!"** ఇది చాలా ఆశ్చర్యం గదా! (ధర్మం తెలిసి ఉండీ నరకంలో పడడం) అని భగవద్రామానుజులు చివరిలో వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'గర్తా' అనగా కందకము, రథము అనే రెండు అర్థాలలోనూ వ్యాఖ్యానించారు. భగవంతుని మాయ దాటరాని కందకము (అగడ్త) గనుక ఆయన మహాగర్త. ఇందుకు శ్రీ శంకరులు గీత (7.14)నుండి ఉదాహరించారు –

**దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే**

నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమయినది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను అధిగమించి సంసార సముద్రమునుండి బయటపడగలరు.

శ్రీ శంకరులు 'గర్త' అనగా 'రథము' అనే అర్థంలో కూడా నిరుక్తము (3.5) ఆధారంగా వ్యాఖ్యానించారు.

**రథోఽపి గర్తా ఉచ్యతే, గృణాతేః స్తుతి కర్మణః స్తుత తమమ్ యానమ్, 'అరోహథో వరుణమిత్ర గర్తమ్'** – నిరుక్తము 3.5

శ్రీ శంకరుల వ్యాఖ్య – **గర్తా శబ్దో రథ పర్యాయో నైరుక్తైరుక్తః, తస్మాత్ మహారథః మహాగర్తః.** అర్జునుని రథసారథిగా మహాభారతయుద్ధంలో రాణించిన భగవంతుడు మహాగర్త.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా 'రథికుడు' అనే అర్థంలో వ్యాఖ్యానించారు **– మహాన్ గర్తో గరుడధ్వజ రథో యస్య ఇతి మహాగర్తా.** గరుడధ్వజంతో కూడిన గొప్ప రథం కలిగినవాడు మహాగర్త.

శ్రీ సత్యసంధ యతిరాజ – మహా-అగ-ర్ – మహాగర్త. అగ-కొండ; ర్-గతువా కర్తారి క్తః - వెళ్ళువాడు. **మహాన్తశ్చ తే అగాశ్చ శేషాచలాదయః తత్ర ఋచ్ఛతి ఇతి మహాగర్తః.** శేషాచలంవంటి గొప్ప పర్వతాలకు వెళ్ళువాడు (నివసించువాడు) మహాగర్త.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భగవంతుడు మహాగర్త, అనగా పెద్ద గొయ్యి. ఎందుకంటే అంతా ఆయనలోనే ఉంటుంది.

**ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య స చరాచరమ్ మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్రష్టుమిచ్ఛసి** – గీత 11.7
ఓ అర్జున! నా ఈ రూపమునందు ఒకేచోట స్థితమైయున్న సమస్త చరాచర జగత్తును చూడుము. అంతేగాక ఇంకను నీవు చూడదలచుకొనిన వాటినన్నింటినీ చూడుము.

భగవంతుడు బుద్ధావతారం ధరించి దుష్టులైన అసురులను పెడత్రోవన పట్టించాడన్న అర్థంలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించిన నామాలలో ఈ 'మహాగర్తా' నామము చివరిది. ధర్మం తప్పినవారిని భగవంతుడు శిక్షించే విధానం గురించి కంటెను భక్తులపట్ల భగవంతుని సౌశీల్యము, సౌలభ్యము అనే గుణాలను స్మరించి గానం చేయడం మరింత ఆనందదాయకము. కాని ఇక్కడ మనం గమనింపవలసిన విషయము ఏమంటే సృష్టిలోని సమస్త కార్యములు భగవంతుని ఇచ్ఛానుసారమే జరుగుతాయి. ఈ ప్రస్తావనలో బుద్ధావతారమును అర్థం చేసుకోవాలి. కర్మఫలాలను అందింపజేయడంలో ఇదొక ఘట్టము.

**ఇక్కడినుండి కొన్ని నామములు భగవానుని శిష్టపరిపాలనను కీర్తిస్తాయి.**

## 811. మహాభూతః

- మహాత్ములను తనవారిగా గ్రహించేవాడు.
- త్రికాలములచేత అవిచ్ఛిన్నముగాని స్వరూపము కలవాడు.
- పంచభూతములు తనయందు కలవాడు.

### ఓం మహాభూతాయ నమః

భూ - సత్తాయామ్ - ఉండుట, సంభవించుట. భూతము అనగా ఉండునది. నేల, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచభూతములనుకూడా భూతములు అంటారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **నిగ్రాహకత్వం కథితం స్వస్యైవాజ్ఞాతం ఘనాత్ స్వాజ్ఞానువర్తినాం పుంసా మనుగ్రాహస్తథోచ్యతే మహాభూతో మహాత్మానః స్వభూతా స యస్యచోచ్యతే.** ఇంతవరకు తన ఆజ్ఞను ఉల్లంఘించువారి విషయము, వారిని శిక్షించే విషయము

చెప్పారు. ఇప్పుడు తన ఆజ్ఞను పాలించేవారిని తాను (భగవంతుడు) ఎలా అనుగ్రహించేదీ చెప్పబడుచున్నది. మహాత్ములను అందరినీ తనవారిగా గ్రహించేవాడు 'మహాభూతః'. **మహాన్తః భూతాః యస్య స మహాభూతః.** లోకంలో గొప్పవారు, మహనీయులు అతని సొత్తు గనుక ఆయన మహాభూతము. ఇక్కడ మహాత్ములు అనగా భగవంతునియందే మనసు లగ్నము చేసిన భక్తులు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 2.3.6 – శ్రీహరి తన భక్తులనుండి ఎడబాటును భరించలేడు. భక్తులు కూడా ఆయననుండి వేరు కాలేరు. కనుక వారిని బాధ పెట్టకుండా ఉండడానికి భగవంతుడు సదా భక్తుల హృదయంలో దీపంలా వెలుగుతుంటాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కాలత్రయా నవచ్ఛిన్న స్వరూపత్వాత్ మహాభూతః.** భూత, భవిష్యత్, వర్తమాన కాలములచే పరిమితము కానివాడు మహాభూతము.

ఇక్కడ మళ్ళీ మనం గమనించవచ్చును – శ్రీ శంకరులు భగవంతుని పరతత్వమును, శ్రీ భట్టులు భగవంతుని సౌలభ్య సౌశీల్యతను ప్రముఖంగా కీర్తించారు. రెండూ శ్రీనివాసుని కళ్యాణగుణములే. కాని ఎన్నో పాపములు తెలిసీ తెలియక చేసే మనలాంటివారికి ఆ దేవుని సౌలభ్య సౌశీల్యతలు ఎంతో ఆశను, ఊరటను ఇస్తాయి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ, శ్రీ సత్యసంధ యతిరాజ – పంచభూతములు ఆయనయందే జనించినవి. ఆయనయందే ఉన్నవి. కనుక ఆయన మహాభూతము. **మహాన్తి భూతాని ఆకాశాదీని యస్మాత్ ఇతి మహాభూతః.**

## 812. మహానిధిః

- తన భక్తులను అధికప్రేమతో నిధివలె ఆదరించువాడు.
- తన భక్తులకు ఆయనే పెన్నిధి.
- విశ్వమునందు అన్నింటికీ ఆశ్రయమైనవాడు.
- భక్తులు అవుసరంకొద్దీ దోచుకొనే నిధి.

### ఓం మహానిధయే నమః

ని (ఉపసర్గ); ధా - ధారణ పోషణయో ర్దానే చ – ధరించుట, పోషించుట, ఇచ్చుట. **నితరామ్ ధీయతే పుష్యత ఇతి, నిధీయతే అత్ర ఇతి నిధిః.** నిలువ చేయునది నిధి. నితరామ్ - పూర్తిగా, ఎల్లపుడూ; నిధి - ఆశ్రయము, నివాసస్థలము.



ముంబై మందిరంలో శ్రీ రుక్మిణి విఠలుల విగ్రహాలు. వికీపీడియా చిత్రం. Photo by Shreeram Ghaiasas

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తే నిధివత్ అతి-ప్రియ అస్య ఇతి మహా-నిధిః.** భక్తులను ఎంతో ప్రేమతో, తన నిధివలె చూచుకొనువాడు మహానిధి.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 10.7.8 – భగవంతునికి పాలకడలి అంటే ఎంత ఇష్టమో, వైకుంఠం అంటే ఎంత ఇష్టమో, నా శరీరమన్నా అంతే ఇష్టము. ఆయనకూ, దివ్యదేశాలకూ ఉన్న సంబంధమే ఆయనకూ, నా దేహానికీ ఉంది. ఆయన నాపై ఆధారపడియున్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వభూతాని అస్మిన్ నిధీయన్త ఇతి మహానిధిః.** అన్ని భూతములు ఆయనయందు స్థితమైయున్నాయి. ప్రళయకాలమునందు అన్ని భూతములను తనయందు నిధివలె దాచుకొనును గనుక ఆయన మహానిధి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **మహాన్తః సూర్యాదయోఽపి గ్రహా యత్ర పక్షిణా ఇవ నిహితా ఇతి మహతామ్ నిధిత్వాత్ స మహా-నిధిః.** సూర్యుడు, గ్రహములు మొదలగునవన్నియు ఆయనయందు పక్షులవలె ఒదిగియుండును గనుక ఆయన మహానిధి.

శ్రీ చిన్మయానంద – భగవంతునినుండే అన్నీ వెలువడుతాయి. ఆయనయందే అన్నీ నిలుస్తాయి. మరియు భక్తులు తమ ఇష్టానుసారము దోచుకొనదగిన నిధి ఆయన.

శ్రీ తిరుమంగైయాళ్వారు తిరుక్కురమ్ తాండకమ్ 1 – మన అవసరానికి తప్పక లభించే నిధి. మనకు ఆధారంగా నిలిచే స్తంభము ఆయన.

శ్రీ తిరుమంగైయాళ్వారు పెరియతిరుమోళి 7.1.7 – నీ కరుణకంటె నాకు వేరుదిక్కు లేదు. నాకు అవుసరానికి దాచుకొన్న నిధి నీవు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమోళి 6.7.11 – ముందు అవుసరాలకు దాచుకొన్న నిధి మధుసూదనుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ ఈ నామును రెండు గుణాల మేలుకలయికగా వివరించారు – **శ్రీ భగవాన్ హి భక్తైః ప్రథమమ్ పూజ్యతే తతశ్చ తస్య మనోమయీ ప్రతిమా హృదయే నిధీయతే ధ్యాయతే చ.** భక్తులు ప్రథమంగా పూజించే మహాత్ముడు (మహా) శ్రీ భగవానుడు. మరియు భక్తులు ఆయను నిధివలె హృదయంలో దాచుకొందురు. ఓం మహానిధయే నమః.



శ్రీ బలరామ కృష్ణులు గోపబాలురతో కలిసి మందలను అడవికి తీసికొని వెళ్ళుట. 1500 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.

https://commons.wikimedia.org/wiki/File:5_Masters_of_the_Dispersed_Bhagavata_Purana._Krishna_and_Balarama_Taking_the_Cattle_to_Graze_Folio_from_a_Bhagavata_Purana_Manuscript_1520-40._Museum_Rietberg,_Zurich.jpg



## కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః
## అమృతాశోఽమృతవపుస్సర్వజ్ఞః సర్వతోముఖః || (87)

### 813. కుముదః

- ప్రకృతిమండలములో మహాత్ములతో (భక్తులతో) కలిసి ఆనందించేవాడు.
- దుష్టులను సంహరించి భూమికి ఆనందము కలిగించేవాడు.
- మంగళకరమైన పరమపదమును ప్రసాదించేవాడు.
- నీలికలువల దండను ధరించేవాడు.

**ఓం కుముదాయ నమః**

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

63వ శ్లోకము. 596వ నామము. కుముదః – **శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః**

87వ శ్లోకము. 813వ నామము. కుముదః – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః**

కు-ముదః – కుముదః. కై - శబ్దే - ధ్వనించుట. **కౌతు ధన్వతి ఇతి కుః**. ధ్వని చేసేది 'కుః'. **కుః పృథివీ పృథ్వీ** (అమరకోశము). ముద - హర్షే - సంతోషించుట. **మోదత ఇతి ముదః, మోదయతి ఇతి ముదః**. సంతోషించునది, సంతోషింపజేయువాడు;

కు-ము-దః – కుముదః. కు - భూమి, ము - ముక్తి, ద - ఇచ్చువాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – కౌ - ప్రకృతిమండలే- ప్రాకృతలోకం (భూమి)యందు కూడా, ముద - మోదతే - సంతోషించువాడు (భక్తుల సాంగత్యంలో). **ప్రాకృతే మండలే భూమౌ మోదనాచ్చ మహాత్మభిః ముక్తి భూమి ప్రదానాద్వా కుముదః పరికీర్తితః.** ప్రకృతి మండలమునందు మహాత్ములతో ఆనందించువాడు. భూమిమీద మోక్షమునిచ్చువాడు. పరలోకానికి సంబంధించిన మోక్షమునుకూడా ఇచ్చువాడు (ఇహపరములను ప్రసాదించువాడు) కుముదుడు.

శ్రీ వి.వి. రామానుజన్ వివరణ – భగవానుడు మానవజన్మమెత్తినందువలన ఎన్నో కష్టాలు అనుభవించాలి. అరణ్యకాండము (67.24)లో రాముడు ఇలా అన్నాడు – **రాజ్యాత్ భ్రంశః వనే వాసః సీతా నష్టః హతో ద్విజః.** నేను రాజ్యాన్ని కోల్పోయాను. అడవులలో ఉంటున్నాను. సీత దూరమైంది. ఇప్పుడు ఈ పక్షి (జటాయువు) కూడా చంపబడింది – ఇన్ని కష్టాలు ఉన్నా భగవంతుడు రామునిగా అత్రి, భరద్వాజుడు, అగస్త్యుడు వంటి మునుల సాంగత్యంలో సంతోషించాడు.

శ్రీ చిన్మయానంద – ఈ సృష్టిని చేయడం, దానిని నడపడం అనే బృహత్తర, అనితర కార్యాలు భగవంతునికి ఆనందాన్ని కలుగజేస్తాయి ఎందుకంటే ఇవి ఆయనకు మాత్రమే సాధ్యమయ్యే పనులు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కుమ్ ధరణీమ్ భార అవతరణమ్ కుర్వన్ మోదయతి ఇతి కు-ముదః.** భూమి భారాన్ని తగ్గించి (దుష్టులను నాశనం చేసి) సంతోషించేవాడు కుముదుడు. ఈ దుష్టనిగ్రహణ కొరకే ఆయన అవతరిస్తాడు. భక్తులను రక్షిస్తాడు.

ఇక్కడ కూడా శ్రీ శంకరులు మరియు శ్రీ భట్టుల వ్యాఖ్యానాలలో అనుభవ భేదాన్ని మనం గమనింపవచ్చును. ఇద్దరూ 'ముదము' అనగా 'ఆనందము' గురించే చెప్పారు. శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారం భగవంతుడు దుష్టులను శిక్షించి, భూభారం తగ్గించి సంతోషం పొందుతాడు. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం భగవంతుడు భూమిపై భక్తుల సాన్నిహిత్యంలో ఆనందం పొందుతాడు. శ్రీ శంకరులు భగవంతుని శక్తిని ప్రధానంగా చెప్పగా శ్రీ భట్టులు భగవంతుని భక్త సౌలభ్య సౌశీల్య గుణాలను వర్ణించారు.

శ్రీ ఎమ్. వి. రామానుజాచార్య – కు - భూమి, ము - ముక్తి, దః - ఇచ్చువాడు. ముక్తి లోకము, అనగా పరమపదమును ఇచ్చువాడు కుముదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కు - ఆకాశము (కై-శబ్దే). **శబ్దవత్ ఆకాశే మోదయతి ఇతి కుముదః, శబ్దాశ్రయే ఖే మోదత ఇతి కుముదః సూర్యః.** సూర్యునిగా ఆకాశంలో వెలుగుతూ సంతోషించేవాడు కుముదుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **ఉత్పలధరో కుముదః.** నీలికలువ పూలమాలను ధరించువాడు కుముదుడు.

## 814. కున్దరః

- (కుంద-రః) పరతత్వ జ్ఞానమును ప్రసాదించేవాడు.
- (కున్-దరః) అనేక జన్మలలో పేరుకుపోయిన పాపములను తొలగించువాడు.
- (కుంద-రః) కుంద పుష్పములువంటి స్వచ్ఛమైన, పరిశుద్ధమైన ఫలములను ప్రసాదించేవాడు.
- (కుమ్-దరః) హిరణ్యాక్షుని వెతుకుతూ వరాహరూపంలో భూమిని పెకలించినవాడు.
- కామితార్థములను ప్రసాదించువాడు.
- (కుమ్-దరః) భూమిని పెకలించి సముద్రములను సృష్టించినవాడు.
- (కుంద-రః) భక్తులు సమర్పించే కుంద పుష్పములను స్వీకరించి ఆనందించువాడు.

### ఓం కున్దరాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామము '**కుముదః**'లో 'కు' అనగా 'భూమి' అన్న అర్థం చెప్పడమైనది. ఇప్పుడు '**కుందరః**' నామంలో శ్రీ భట్టులు 'కు' అంటే 'భూమి'కి బదులు 'ముక్తిభూమి' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. 'కుందము' అనగా ముక్తిభూమి నిచ్చేది. అనగా పరతత్వ జ్ఞానము. అలాంటి పరతత్వ జ్ఞానమును ప్రసాధించువాడు కుందరుడు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమోళి 2.3.2 – నాకు నిజమైన జ్ఞానమును ప్రసాదించిన ఆచార్యుడవు నీవే.

**తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే** – గీత 10.10
అట్లు నిరంతర ధ్యానాదులద్వారా నాయందే లగ్నమనస్కులై భక్తిశ్రద్ధలతో నన్నే భజించువారికి నేను బుద్ధియోగమును ప్రసాధించెదను. దానిద్వారా నన్నే పొందుదురు.

నిరుక్తి రచయిత ఈ నామమునకు ఇచ్చిన వ్యాఖ్య – **కుమ్ అవ్యయమ్ పాప-వాచి, తస్య దారణాత్ కున్దరః.** 'కు' అనగా పాపమును సూచించును. దానిని ఛేదించువాడు కున్దరుడు. అనేక జన్మలలో ప్రోగుపడిన పాపములను పటాపంచలు చేయువాడు కున్దరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమునకు చెప్పిన మూడు అర్థాలలో ఇదికూడా ఒకటి. **త్యజేత్ కు-జన సంగమమ్** – అని అమరకోశ వ్యాఖ్యానం ఉంది. పాపుల తోడు కూడదని దాని అర్థము. శ్రీ వాసిష్ఠ వ్యాఖ్య – **కుమ్ - పాపమ్ దృణాతి స్వ-సేవానామ్ ఇతి కుమ్-దరః.** తన భక్తుల పాపములను చీల్చివేసేవాడు కుందరుడు. స **ఏవ బుద్ధిమ్ జరితుర్-విశోధ్య సు-మేధసమ్ తమ్ కురుతే స విష్ణుః.** అలా వారి పాపములను తొలగించి బుద్ధికి జ్ఞానమును కలుగజేయువాడు విష్ణువు. (మిగిలిన రెండు అర్థాలు తరువాత చెప్పబడినవి).

శ్రీ శంకరులు కూడా ఈ నామమునకు మూడు అర్థాలు చెప్పారు

(1) **కుంద పుష్పాని శుద్ధాని ఫలాని రాతి దదాతి ఇతి కుంద-రః.** కుందపుష్పములు (మల్లెలు? మొల్లలు?) వలె పరిశుద్ధమైన ఫలములను ప్రసాదించువాడు కుందరుడు.

(2) **కుందపుష్ప తుల్యాని శుద్ధాని ఫలాని లాతి ఆదత్తే ఇతి కుందరః.** (లా-ఆదానే దానేచ – గ్రహించుట). కుందపుష్పముల వంటి పరిశుద్ధమైన నివేదనలను స్వీకరించువాడు కుందరుడు. ఇక్కడ 'ల' మరియు 'ర' ధాతువులను ఒకదానిబదులు మరొకటి వాడవచ్చునన్న సూత్రమును గ్రహించాలి (ర-ల-యోః ఏకత్వాత్ స్మరణాత్).

(3) శ్రీవరాహావతారపరంగా ( కుమ్-భూమి, దార-చీల్చుట) **కుమ-ధరామ్ దారయామాస హిరణ్యాక్ష జిఘంశయా వారాహమ్ రూపమ్ ఆస్థాయ ఇతి వా కున్-దరః.** శ్రీవరాహమూర్తియై హిరణ్యాక్షుని వెదుకుతూ భూమిని పెకలించినందున కుందరుడు.

శ్రీ వాసిష్ఠ 'కము - కాంతౌ - కోరుకొనుట' అనే అర్థంలో కూడా వ్యాఖ్యానించారు. (ఉనాది సూత్రము 4.98 అబ్దాదయశ్చ) **కామయత ఇతి కుందః కమనీయః.** ప్రీతితో కోరుకొనబడునది కుందము. **కమనీయమ్ వాంఛితమ్ దదాతి ఇతి కుంద-రః.** ఇష్టంగా కోరుకున్నదానిని ప్రసాదించేవాడు కుందరుడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – **కుమ్-పృథ్వీమ్ దారయతి ఇతి కుందరః. స కుందరో నామ విదార్య భూమిమ్ స ఆత్మశక్త్యా కురుతే సముద్రమ్.** భూమిని చీల్చి సాగరములను సృష్టించినవాడు కుందరుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – **భక్త సమర్పిత కుందపుష్పేణ రమతి ఇతి కుంద-రః.** భక్తులు సమర్పించిన కుందపుష్పములు స్వీకరించి సంతోషించువాడు కుందరుడు.

## 815. కుందః

- పరతత్వ జ్ఞానమును అంచెలంచెలుగా ప్రసాదించువాడు.- భక్తుల పాపములను శుభ్రపరచి, అవి తిరిగిరాకుండా చేసేవాడు.
- కుంద (మల్లె) పుష్పములవలె స్వచ్ఛమైన, సుందరమైనవాడు.
- కుంద పుష్పములవంటి స్వచ్ఛతను భక్తులకు ఇచ్చేవాడు.
- 'కుంతః' – 'కుంత' అనే శూలమును ధరించినవాడు.
- కుంత శూలమువలె పదునుగా భక్తుల పాపములను తొలగించేవాడు.
- కశ్యప ఋషికి భూమిని దానమిచ్చినవాడు.
- భూమిపైనుండి దుష్టులైన క్షత్రియులను నాశనము చేసినవాడు.
- సూర్యకాంతి, వర్షమువంటివానిద్వారా భూమిని పరిశుద్ధము చేయువాడు.

ఓం కుందాయ నమః

ఇంతకుముందు నామము 'కుందరః' వివరణలో చెప్పినట్లుగా 'కు' అంటే భూమి, పాపము అనే రెండు అర్థాలున్నాయి. 'కుందము' అనగా మల్లెపూవు. '**కుందరః**', '**కుందః**'నామములమధ్య కొంత సారూప్యత ఉన్నది. 'ద' అనే శబ్దనికి 'దదాతి' (ఇచ్చును), 'దాయతి' (శుభ్రము చేయును), 'ద్యాతి' (తొలగించును) అనే అర్థాలు చెప్పుకొనవచ్చును. ఇలా వివిధ అర్థాలు వస్తాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'కుంద' అనగా 'పరతత్వ జ్ఞానము' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. 'కుందః' అనగా అలాంటి జ్ఞానాన్ని ప్రసాదించేవాడు. ఇంతకుముందరి నామము 'కుందరః'కు కూడా ఇదే అర్థాన్ని చెప్పారు. కాని తేడా ఏమిటంటే – ధ్యాన యోగాది సాధనలద్వారా జ్ఞానమును సంపాదించడం మొదలుపెట్టినవారికి పరాభక్తి, పరాజ్ఞానము, చివరిగా పరమభక్తి, ఇలా అంచెలంచెలుగా ప్రసాదించేవాడు 'కుందః'.

శ్రీ భట్టులు 'కు' అనగా 'పాపము' అనే అర్థంలో మరొక వ్యాఖ్యానంకూడా చెప్పారు. (దైప్ - శోధనే - శుద్ధి చేయుట). **పాపమ్ దాయతి శోధయతి ఇతి కుందః.** ఇక్కడ కూడా 'కుందరః' మరియు 'కుందః' నామములకు చెప్పిన స్వల్ప అంతరాన్ని గమనించాలి. **పాపమ్ దారయతి ఇతి కుందరః, అపి చ విదారితమ్ పాపమ్ శోధయతి ఇతి కుందః.** భక్తుల పాపములను తొలగించువాడు కుందరుడు. అలా తొలగించిన పాపములు తిరిగిరాకుండా వాటిని (పాపాలను) శుద్ధి చేసేవాడు కుందుడు. **కుమవ్యయం పాపవాచి కుందరస్తస్య దారణాత్ భక్తేభ్యః పరభక్త్యాది ప్రదానాత్కుంద ఉచ్యతే విదారితుం పాపజితం కుందశ్శోధయతీతివా**

శ్రీ వాసిష్ఠ చెప్పిన అర్థాలలో ఇదికూడా ఒకటి. **కుమ్ ఇతి పాపార్థకమ్ అవ్యయమ్, తద్ ఖండయతి ఇతి కుందః. యద్ వా కుమ=పాపమ్ దాయతి+శోధయతి ఇతి కుందః** (దో - అవఖండనే, దైప్ - శోధన).

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురము (2.6.1)లో 'కుంద' అనే నామమును వాడారు. శ్రీదేవుడు భక్తుల పాపములను తొలగించి, వాటిని దుర్మార్గులకు కర్మఫలంగా ఇస్తాడట. ఇక్కడ 'కుందము' అనగా మల్లెపూవు అనే అర్థాన్ని గ్రహింపవచ్చును. మల్లెపూవువలె స్వచ్ఛమైనవాడు లేదా మల్లెవంటి స్వచ్ఛతను ప్రసాదించేవాడు కుందుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు కూడా ఈ నామమునకు బహుళ వ్యాఖ్యలు చెప్పారు

**కుందోపమ సుందరాంగత్వాత్ స్వచ్ఛతయా స్ఫటికనిర్మలః కుందః.** కుందపుష్పమువలె అందమైనవాడు, స్వచ్ఛమైనవాడు కుందుడు.

కశ్యపునికి భూమి ('కు')ని దానముగా ఇచ్చినవాడు గనుక భగవంతుడు కుందుడు.

**సర్వపాప విశుధ్యార్థమ్ వాజిమేధేన చేష్టవాన్**
**తస్మిన్ యజ్ఞే మహాదానే దక్షిణామ్ భృగునందనః**
**మారీచాయ దదౌ ప్రీతః కశ్యపాయ వసుంధరామ్** – హరివంశము 31.106

తన పాపములను పోగొట్టుకోవడానికి భృగునందనుడు (పరశురాముడు) అశ్వమేధయాగం చేశాడు. ఆ యాగంలో మహాదానంలో భాగంగా ప్రీతితో భూమినంతటినీ కశ్యపునికి (మరీచుని కుమారుని) దానమిచ్చాడు.



కార్తవీర్యుని చేతులు ఖండిస్తున్న శ్రీ పరశురాముడు. 1870 కాలపు చిత్రం. వికీపీడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:Parasurama_killing_Sahasrarjuna.jpg

శ్రీ శంకరులు చెప్పిన మూడవ అర్థము – **కుమ్ పృథ్వీమ్ ద్యాతి ఖండయతి వా కుందః.** భూమిపై దుష్టక్షత్రియులను నాశనం చేసినవాడు కుందుడు.

**నిః క్షత్రియామ్ యశ్చ చకార మేదినీమ్ అనేకశో బాహువనమ్ తథాంచినత్**
**యః కార్తవీర్యస్య స భార్గవోత్తమో మమాస్తు మాంగల్య వివృద్ధయే హరిః** – విష్ణుధర్మము 43.37

భూమిపై దుష్ట క్షత్రియులను అనేకమార్లు సంహరించినవాడు, కార్తవీర్యుని బాహువులను ఖండించినవాడు అయిన భార్గవరాముడు నాకు శుభములు ప్రసాదించుగాక.

శ్రీ వి.వి. రామానుజన్ తిరుప్పావై పాశురము (**నిన్ కైయిల్ వేల్ పోట్రి**) ఆధారంగా ఈ నామమునకు –'కుంత' అనే శూలమును ధరించినవాడు – అని అర్థం చెప్పారు. అలాగే శ్రీ ఉత్తమూర్ వీరర్వాచార్యస్వామి శ్రీ నమ్మాళ్వారు పాశురంలో 'కుంత' అనే పదాన్ని ఉదాహరించారు. ఈ ప్రకారంగా ఈ నామమును '**కుందః**' బదులుగా '**కుంతః**' అని పరిగణింపవచ్చును. భక్తుల పాపాలను హరించడంలో శూలంవలె పదునైనవాడు అని అర్థము.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – కు - భూమి; ద - దాయతి - శోధయతి - శుద్ధి చేయువాడు. **పృథ్వీమ్ వర్షణేన శోధయతి ఇతి కుందః.** భూమిని వర్షమువంటివానితో పరిశుద్ధము చేయువాడు కుందుడు.

## **816.** పర్జన్యః

- మేఘమువలె తన అనుగ్రహాన్ని వర్షించి, భక్తుల తాపత్రయములను దూరముచేయువాడు.
- ఆయన కారణంగా ఉత్తమ జన్మలు సంప్రాప్తించును.
- రక్షించువాడు.

### ఓం పర్జన్యాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – అజ - అర్దనే - చెడగొట్టుట. **స్వ తత్త్వ జ్ఞాన దానేన నిత్యం తాపత్రయాపహ పర్జన్యస్స స్స్మమాఖ్యాతః.** భక్తులకు తనను గురించిన తత్వాన్ని ప్రసాదించి తాపత్రయములనుండి కాపాడువాడు పర్జన్యుడు.

తాపత్రయములనగా మూడు విధములైన తాపములు – (1) ఆధ్యాత్మిక తాపము : తన శరీరము, ఆత్మలవలన కలిగే తాపము. వ్యాధులు, మానసిక బాధలవంటివి. (2) ఆధిదైవిక తాపము : దేవతల కారణంగాను, కర్మలవలన, యక్ష రాక్షస పిశాచాదులవలనను కలిగే బాధలు. (3) ఆధిభౌతిక తాపము : ఇతర జంతువులు, వ్యక్తులు, ప్రకృతి కారణాలు వంటివానివలన కలిగే బాధలు. ఈ మూడు విధములైన తాపములను తన అనుగ్రహంతో వర్షించి చెదరగొట్టే కరుణామయుడు పర్జన్యుడు. భగవంతుని ఆళ్వారులు పలుమార్లు మేఘంతో పోల్చారు.

శ్రీ తిరుమంగైయాళ్వారు తిరునేడుమ్ దండకము 30 – నీవు కొందరికి వర్షమేఘం వంటివాడవు. మరికొందరికి అగ్నిలాంటివాడవు. అనేకులకు చల్లని వర్షంవంటివాడవు.

స్వామిదేశికన్ శరణాగతి దీపిక 23 – **తాపత్రయేణ విహితమ్ న భజన్తి సంతః సంసార ఘర్మ జనితేన సమాధిమన్తః.** నీ పట్ల భక్తియోగంలో మగ్నులైనవారు సంసారమనే అగ్నియందు జనించిన తాపత్రయములవలన బాధపడరు.

శ్రీ శంరుల వ్యాఖ్య – **పర్జన్యత్వాత్ ఆధ్యాత్మికాది తాపత్రయమ్ సమయతి ఇతి.** మేఘములు తమ వర్షముతో భూమిని చల్లబరచినట్లుగానే భగవంతుడు ఆధ్యాత్మికాది తాపత్రయములను శమింపజేయును గనుక ఆయన పర్జన్యుడు.

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – **సర్వాన్ కామాన్ అభివర్షతి ఇతి పర్జన్యః.** కోరుకున్నవాటిని వర్షించేవాడు పర్జన్యుడు. కొండలంత వరములు గుప్పెడువాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'పరిజన్యః' అని చెప్పారు. **పరిత ఆసీనా జనాః పరిజనాః, తేభ్యో హిత-తమః ఇతి పరిజన్యః, 'ఇ'కార లోపే పర్జన్యః.** ఆయనను ఆశ్రయించుకొని ఉన్నవారు (భక్తులు) పరిజనులు. వారికి, అనగా పరిజనులకు హితము చేయువాడు పరిజన్యుడు. 'ఇ'కార లోపము వలన పర్జన్యుడు.

శ్రీ వాసిష్ఠ – పృష్ - సేచనే - చల్లుట. **పర్షతి - సించతి ఇతి పర్జన్యః.** వర్షించువాడు పర్జన్యుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థం చెప్పారు. **తస్యామ్ చింతభూమౌ వర్షతి నిజరూప అమృతమ్ ఇతి పర్జన్యః.** తన భక్తుల మనస్సులలో తన స్వరూపామృతాన్ని వర్షించేవాడు పర్జన్యుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – **పరమ్ జన్యమ్ యస్మాత్ పర్జన్యః.** ఎవని కారణంగా ఉత్తమ జన్మలు లభిస్తాయో ఆయన పర్జన్యుడు.

శ్రీ వాసిష్ఠ ఈ నామమునకు ఆరు రకాల వ్యుత్పత్తులను సూచించారు. వాటిలో ఒకటి – 'పృ'-పాలన పోషణయోః - రక్షించుట, నింపుట. దీనికి 'అన్య' ప్రత్యయము కలిసినప్పుడు 'పర్జన్యః' అవుతుంది. అనగా 'రక్షించువాడు'.

## 817. పావనః

### పవనః

- వాయువురూపంలో ఉన్నవాడు.
- భక్తుల కష్టములు బాపుటకై స్వయముగ వారివద్దకు వచ్చువాడు.
- గాలి, అగ్ని, నీరువంటి రూపములలో పవిత్రము చేయువాడు.
- రక్షించేవారిని (అనగా రాజులను) రక్షించేవాడు (పా-అవనః)

ఓం పవనాయ నమః

ఓం పావనాయ నమః

32వశ్లోకము – **భూతభవ్య భవన్నాథః పవనః పావనోఽనలః**

87వ శ్లోకము – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః**

శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము 32వ శ్లోకంలోని 292వ నామము 'పవనః' మరియు 293వ నామము 'పావనః'. ఇక ఈ 87వ శ్లోకములోని ఈ 817వ నామమును 'పవనః'గాను, 'పావనః' గాను కూడా పరిగణించినట్లు కనిపిస్తున్నది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఈ నామమును 'పవి' - వెళ్ళుట - అనే ధాతువు ఆధారంగా వ్యాఖ్యానించారు. అమరకోశం వ్యాఖ్యానం ప్రకారం 'పూంగ్'-పవనే; **పవత ఇతి పవనః, పునీతే వా.** వెళ్ళునది, ప్రవహించునది, పునీతము చేయునది అనే అర్థాలున్నాయి.

292వ నామము 'పవనః'కు శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు తన శక్తిలో అదికొద్దిపాటి భాగంతోనే వాయువుగా సంచరిస్తుంటాడు.

ప్రస్తుత 817వ నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – (పవి-వెళ్ళుట) **పవతే ఇతి పవనః**. భగవంతుడు స్వయంగా తన భక్తులవద్దకు వెళ్ళి వారి కష్టాలు తొలగిస్తుంటాడు.

శ్రీ తిరుమంగైయాళ్వారు పెరియతిరుమొళి 1.10.9 – నీవు నీ ఇష్టానుసారం వచ్చి నా హృదయంలో నెలకొనియున్నావు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 5.7.7 – భగవంతుడా! దయతో నీవు నా హృదయంలో ప్రవేశించావు. కరుణించి ఇక్కడే ఉండు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 32వ శ్లోకంలోని 'పవనః' నామమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య: భగవంతుడు వాయువుగా పవిత్రము చేయును గనుక పవనుడు. ఇందుకు ప్రమాణంగా శ్రీ శంకరులు గీత (10.31)నుండి ఉదాహరించారు. **పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్**. చలించువానిలో (పవిత్రము చేయువానిలో) నేను వాయువును. ఆయుధధారులలో రాముడను.

ప్రస్తుత (87వ శ్లోకంలోని) నామమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్మృతిమాత్రేణ పునాతి ఇతి పవనః**. స్మరించినంతనే పవిత్రము చేయువాడు పవనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – శ్రీ విష్ణుసహస్రనామము పూర్వపీఠికలో **'పవిత్రాణామ్ పవిత్రమ్ యః'** అని ఉంది. భగవంతుని స్మరించుట, ఆయన దివ్యమంగళ విగ్రహాన్ని అర్చించుట, ఆయనను కీర్తించుట, పూజించుట, ధ్యానించుట, ప్రణామము చేయుట – ఇవన్నీ కూడా మన పాపములను తొలగించుకొనే మార్గాలు. పవిత్రజలాలలో స్నానం చేయుట, పుణ్యక్షేత్రాలు దర్శించుట కూడా ఇలాంటి కార్యాలే.

శ్రీ చిన్మయానంద 87వ శ్లోకంలోని నామాన్ని 'పావనః' అని పరిగణించారు. అహంకారము, కామము, ప్రలోభములు పాపములకు కారణాలు. అలాంటి మాలిన్యాలను తొలగించుకోవడానికి మనం సదా భగవంతుని మనసులో నిలుపుకోవాలి. సదా పవిత్రం చేసేవాడు పావనుడు.

శ్రీ వాసిష్ఠ కూడా 'పావనః' అనే నామాన్ని పరిగణించారు. కాని 'పవనః' అన్నా, 'పావనః' అన్నా ఒకే అర్థం వస్తుందని వ్యాఖ్యానించారు.

**స పావనో విష్ణు రమర్త్యకర్మా పునాతి విశ్వమ్ వివిధ ప్రభేదైః**
**స ఏవ సూర్య స హి వాస్తి వాయౌ జలే స్థలే వా సవితా స ఏవ**
భగవంతుడైన విష్ణువు గాలిగా వీచి, అగ్నిగా కాల్చి, నీటిగా కడిగి, భూమిగా లోగొని తన పవిత్రముచేసే తత్వమును అంతటా తెలియజేస్తున్నాడు.
ఋగ్వేదము 1.160.3 – **పునాతి ధీరో భువనాని మాయయా.**
నిరుక్తము 5.6 – **వాయుః పవిత్రమ్ స మా పునాతు అగ్నిః పవిత్రమ్ స మా పునాతు.**

శ్రీ సత్యసంధ యతిరాజ – పా-అవనః = పావనః; **పాన్తి ఇతి పా రాజానః, తేషామ్ అవనమ్ యస్మాత్ ఇతి పావనః**. రక్షించేవారు రాజులు. అలాంటి రాజులను రక్షించేవాడు పావనుడు.

## 818. అనిలః

- మరెవ్వరి ప్రేరణ (ప్రోత్సాహము) లేకుండానే భక్తులకు దీవెనలు ప్రసాదించువాడు (అన్-ఇలః).
- ఆయనకు ఆదేశము ఇచ్చేవారుండరు.
- తన భక్తులకు తేలికగా అందుబాటులో ఉండేవాడు (అ-నిలః).
- అన్నింటికీ ప్రాణమైన ఊపిరినిచ్చేవాడు.

- సదా జాగరూకుడై ఉండేవాడు.
- ఆధారము అవుసరం లేనివాడు.
- స్థిరమైన ఆవాసము లేనివాడు. వాయురూపమున సంచరించేవాడు.
- అంతము లేనివాడు.
- పాపపుణ్యములకు కట్టబడనివాడు.
- (**కం**సుని వధించి, ఉగ్రసేనునకు) రాజ్యమునిచ్చినవాడు.
- (రుక్మిణిని రక్షించుటకొరకు) నిదురలేని రాత్రులు గడిపినవాడు.

### ఓం అనిలాయ నమః

ఈ నామము రెండుమార్లు వచ్చినది.
25వ శ్లోకము. 236వ నామము. అనిలః – **అహః సంవర్తకో వహ్నిరనిలో ధరణీధరః**
87వ శ్లోకము. 818 నామము. అనిలః – **కుముదః కుందరః కుందః పర్జన్యః పావనః అనిలః**

ఈ నామములో 'ఇల' శబ్దమునకు 'ప్రేరేపించుట' అని అర్థము. ఆప్టే నిఘంటువులో నిదురించుట, వెళ్ళుట, కదలుట, విసురుట అనే అర్థాలుకూడా ఇవ్వబడ్డాయి. (ఇల - స్వప్న క్షపణయోః - నిదురించుట, వెళ్ళుట). శ్రీ భట్టులు ఈ నామము వివరణను 'అన - ప్రాణనే - బ్రతుకుట' అనే ధాతువు ఆధారంగా కూడా చెప్పారు. 'ఇల' అంటే భూమి అనే అర్థంకూడా ఉంది.

శ్రీ భట్టులు ప్రస్తుత (818వ) నామము 'అనిలః'ను 'ఇల - ప్రేరణే' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. ఒక పని కొరకు ఎవరైనా వ్యక్తిని ప్రేరేపించే వ్యక్తిని 'ఇల' అని ప్రస్తావిస్తారు. భగవంతుడు ఎవరిచేతను ప్రేరేపింపబడడు గనుక ఆయన అనిలుడు. అందుకు శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణ. విష్ణుధర్మము 74.42 – **తదస్య ప్రార్థితమ్ ధ్యాతో దదాతి మధుసూదనః** మధుసూదనుని ధ్యానించినట్లయితే తన భక్తులపై వరాలు వర్షిసాడు. **స్వస్య స్వస్మాత్ప్రేరకోఽస్య ప్రపన్నానుగ్రహే సదా నాస్తీతి సోఽనిలః ప్రోక్తో మున్వర్ణో మనురుత్తమః.** ప్రపన్నులను అనుగ్రహించడానికి తనకన్న మరియొక ప్రేరకుడు లేనివాడు. ఈ నామము సప్తాక్షరి. ఉత్తమమైనది. ఓం అనిలాయ నమః.

శ్రీ శంకరులు చెప్పిన అర్థాలలో ఒక్కటి – **ఇలతి ప్రేరణమ్ కరోతి ఇతి ఇలః, తద్ రహితత్వాత్ అనిలః**. ప్రేరణము చేయువాడు 'ఇలః'. అలాంటి ప్రేరకుడు లేనివాడు అనిలుడు. భగవంతునికి చెప్పేవారూ, ఆదేశించేవారూ ఎవరూ ఉండరు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థం భగవంతుని భక్త సౌలభ్యాన్ని సూచిస్తుంది. (అ-నిలః) నిల్ - గహనే - లోతైనది, మందమైనది, అర్థం కానిది 'నిలః'. **అ-గహనః అ-నిలః భక్తేభ్యః సులభః.** భక్తులకు అందుబాటులో ఉండేవాడు అనిలుడు.

25వ శ్లోకం 236వ నామమునకు శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్య – అన్ - ప్రాణనే - జీవించుట, శ్వాసించుట. **అననాత్ ఉజ్జీవనాత్ అనిలః**. ఆయన అందరియందు ఊపిరిగా ఉండి వారిని బ్రతికిస్తున్నాడు గనుక అనిలుడు.

తిరువైమొళి 5.6.2 – మనచుట్టూ ఉన్న వాయువంతా ఆయనయందు చిన్న భాగమే.
తైత్తరీయ నారాయణము 7 – **కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్?** ఆకాశం (పరమాత్మ) లేకుండా ఎవరు శ్వాసించగలరు? ఎవరు జీవింపగలరు?
పురుష సూక్తము 14 – **ప్రాణాత్ వాయుర్ అజాయత్**. ఆయన శ్వాసనుండి వాయువు జన్మించినది.

ఇక్కడ గమనించవలసిన విషయం – ఈ వ్యాఖ్యానంలో 'అనిలః' అంటే 'గాలి' అని అర్థం ఉన్నదనుకోరాదు. భగవంతుని శ్వాస (ప్రాణము)వల్ల గాలి మరియు సమస్త జీవులు ఆధారపడి ఉన్నాయి.

శ్రీ శంకరులు మరికొన్ని వ్యాఖ్యానాలు ఇచ్చారు. (అన్-ఇలః). ఇల - నిదుర. **ఇలతి స్వపితి ఇతి అజ్ఞః ఇలః, తద్ విపరీతో నిత్యప్రబుద్ధ స్వరూపత్వాత్ ఇతి వా అనిలః.** 'ఇలతి' అనగా 'నిదురించును' అనగా అజ్ఞాని. అలా కాకుండా సంపూర్ణజ్ఞాని అయినవాడు అనిలుడు.

25వ శ్లోకంలోని నామానికి శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – ఇల - భూమి - అనగా ఆధారము. అన-ఇలః - అనిలః - ఆధారము అవుసరంలేనివాడు. **అవిద్యమానా ఇలా ఆశ్రయతయా అన్-ఇలః**. భూమి, గాలి వంటి ఆధారములు లేనివాడు అనిలుడు.

అమరకోశము వ్యాఖ్యానము – **న విద్యతే నిలః నిలయమ్ స్థానమ్ యస్య ఇతి అనిలః.** స్థిరమైన స్థానము (నిలయము) లేనివాడు అనిలుడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక వ్యాఖ్య – **అనాదిత్వాత్ అనిలః**. ఆది, అంతము లేనివాడు అనిలుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ 'అనిలః' బదులు **'నిలః'** అనే పాఠం గ్రహించినట్లు అనిపిస్తున్నది. **నితరామ్ లాతి గృహ్ణాతి ఐకాంతినో భక్తాన్ ఇతి.** తదేక ధ్యానమగ్నులైన భక్తులను పూర్తిగా తనవైపు ఆకర్షించేవాడు.

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – **అనాదానాత్ అనిలః**. బంధింపబడనివాడు అనిలుడు. అనగా శ్రీరాధాకృష్ణశాస్త్రి ఇలా వివరించారు. **నిలాతి ఆదత్తే పుణ్యమ్ పాపమ్ వా.** పుణ్యము గాని, పాపముగాని ఆయనను అంటవు.

శ్రీ బలదేవ విద్యాభూషణ మరొక వ్యాఖ్య – **కంసవధ నిర్జితాయా ఇలాయా భూమేః ఉగ్రసేన దానాత్**. కంసుని వధించిన తరువాత భూమిని (రాజ్యాన్ని) ఉగ్రసేనునకిచ్చినవాడు అనిలుడు.

శ్రీ విద్యాభూషణ మరొక వ్యాఖ్య – ఇల - నిదుర; అనిలః - నిదుర లేనివాడు; **రుక్మిణీ స్పృహయా నిద్రా పరిత్యాగాత్ అనిలః.** రుక్మిణిని (రక్షించడం) గురించి ఆలోచిస్తూ నిదురలేని రాత్రులు గడిపినవాడు అనిలుడు. అందుకు ఆయన కృష్ణుడన్న ఈ మాటలను ఉదాహరించారు – **తథాహమపి తచ్చిత్తో నిద్రామ్ న లభే నిశితి**.

ధర్మచక్రము రచయిత – గాలి లేకుండా మనం జీవించలేము. భగవంతుని స్మరింపకుండానూ జీవించలేను. తాను నీరు, అన్నం లేకుండా అనేక దినాలు ఉండగలనని, కాని ప్రార్థన చేయకుండా ఒక్కరోజుకూడా గడపలేనని మహాత్మా గాంధీ అన్నారు. వాయురూపుడై మనచుట్టూ ఉండి మనలను బ్రతికించే భగవంతుని అనిలునిగా ధ్యానింపవలయును.

## 819. అమృతాశః

- తన భక్తులచే తన గుణములనే అమృతమును ఆస్వాదింపజేయువాడు.
- క్షీరసాగరమథనము అనంతరము అమృతమును సేవించినవాడు.
- ఫలములను ప్రసాదించుట కొరకు అమృతమైన (అంతులేని) వాంఛ గలవాడు.
- మొక్కవోని, సదా ఫలించెడి, సంకల్పము కలవాడు.
- ముక్తులకు అత్యంత ప్రియమైనవాడు.
- తాను సృష్టించిన సకల జీవులకు జీవనానికి అవుసరమైనవాటిని లభింపజేయువాడు.

**ఓం అమృతాశాయ నమః**

అ-మృత-ఆశః – అమృతాశః. అమృతము - మరణము లేనిది; అశ్ - భోజనే - తినుట; **అశ్నాతి ఆశయతి వా ఆశః –** భుజించువాడు. 'ఆశ' అనగా కోరిక అనే అర్థం కూడా ఉన్నది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తాన్ స్వగుణ అమృతమ్ ఆశయతి ఇతి అమృతాశః.** తన గుణములు అనే అమృతమును తన భక్తులకు తినిపించువాడు 'అమృతాశః'. **యశ్చాశయతి భక్తాన్యై స్వగుణామృత మాదరాత్ అమృతాశ స ఇత్యుక్తః శృత పీయూషదో మనుః**

తన భక్తులకు తన కళ్యాణగుణములను ఆదరముతో అమృతమువలె అనుభవింపజేయువాడు అమృతాశుడు. ఈ నామము చెవులకు అమృతము వంటిది. ఓం అమృతాశాయ నమః.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 8.8.4 – ఆయనను నేను నా శరీరంలోను, రక్తమాంసాలలోను, ఊపిరిలోను, ఆలోచనలలోను అనుభవిస్తున్నాను. ఆయన తేనెవలె, పాలవలె, చక్కెరవలె, మిఠాయివలె మధురమైనవాడు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 2.5.5 – భగవంతుడు స్వయంగా నాలో ప్రవేశించి అంతులేని అమృతంలాగా ఆనందాన్ని ఇచ్చాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **అమృతమ్ అయాచితమ్ మోక్షమ్ ఆశయతి భోజయతి భక్తాన్ ఇతి అమృతాశః.** అడుగకుండానే భక్తులకు మోక్షమనే అమృతమును భుజింపజేయవాడు అమృతాశుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు అనేక వ్యాఖ్యలు ఇచ్చారు. **స్వరూప అమృతమ్ అశ్నాతి ఇతి.** తన స్వరూపము అనే అమృతాన్ని ఆస్వాదింపజేయువాడు 'అమృతాశః'.

క్షీరసాగర మథనానంతరము అమృతమును దేవతలకు ఒసంగుటయేగాక తానును పానము చేసినవాడు అమృతాశుడు.

**అమృత అవినశ్వర ఫలత్వాత్ ఆశా వాంఛా అస్య ఇతి అమృతాశః.** ఫలములను ప్రసాదించుటకూ అమృతములైన (వినాశం లేని) ఆశ గలవాడు అమృతాశుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఆయన ఆశలు (సంకల్పము) అమృతములు (సదా నెరవేరును).

శ్రీ సత్యసంధ యతిరాజ – ఆశ - కోరిక, ఆసక్తి; అమృత - ముక్తులైనవారు. **అమృతానామ్ ముక్తానామ్ ఆశా ఇచ్ఛా యస్మిన్ విషయ ఇతి అమృతాశః.** ముక్తులైనవారికి ఆయనయందే ఆసక్తి ఉండును గనుక భగవంతుడు 'అమృతాశః'.

శ్రీ వాసిష్ఠ – **ప్రవాహతో నిత్య స్థాయీదమ్ చతుర్విధ భేద విభక్తమ్ యథా తదర్హః జీవన సాధనాని ఆశయతి - భోజయతి ఇతి అమృతాశో విష్ణుః.** తాను సృజించిన అన్ని విధములైన జీవులకు అవుసరమైన జీవన సాధనములను సమకూర్చువాడు 'అమృతాశః'.

## 820. అమృతవపుః

- అమృతమువంటి శరీరము కలవాడు.
- మృతము కాని (మరణము లేని) శరీరము కలవాడు.
- విశ్వములో జీవులను పుట్టించి, మరల సమయము వచ్చినపుడు మరణింపజేయువాడు.

### ఓం అమృతవపుషే నమః

'అమృతము' అనగా మృతము కానిది, అనగా మరణము లేనిది, క్షీణించనిది. అమృతము అనగా ఒక దివ్య పానీయము కూడ. 'వపుః' అనగా దేహము, స్వరూపము. (వప్ - బీజసంతానే ఛేదనే చ - విత్తుట, కోయుట, చల్లుట, నేయుట). శ్రీ భట్టులు అమృతము అనగా దివ్యపానీయము అనే అర్థంలో వ్యాఖ్యానించారు. శ్రీ శంకరులు 'మరణము లేని' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – అమృతమువంటి దేహము కలవాడు 'అమృతవపుః'. ఆయన తిరుమేణి – దివ్యమంగళ విగ్రహము – గురించి భక్తులు ఎంత ధ్యానించినా వారి తనివి తీరదు. ఆళ్వారులు భగవంతుని 'ఆరావముదన్' అని ఎన్నో సందర్భాలలో కీర్తించారు. ఉదా: ( తిరువైమొళి 5.8.1 నుండి 5.8.11 వరకు, 2.5.4, 2.5.5, 10.10.5, 10.10.6). ఎంబెరుమానార్ శ్రీ భగవద్రామానుజులు శ్రీవైకుంఠగద్యంలో – **అమృత సాగరాంతర్నిమగ్నః సర్వావయవః సుఖమాసిత్** – అని శ్రీ భగవంతుని వర్ణించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మృతమ్ మరణమ్ తద్ రహితమ్ వపుః అస్య ఇతి అమృతవపుః**. మరణము లేని శరీరము గలవాడు 'అమృతవపుః'. భగవంతుని శరీరము భౌతికము కాదు. శుద్ధ సత్వమయము, శాశ్వతము. ఆయనకు క్షీణాది స్వభావములు లేవు.

శ్రీ రాధాకృష్ణమూర్తి – వేల సంవత్సరాల క్రితం కృష్ణునిగా అవతరించిన భగవంతుడు నేటికీ అలా దర్శనమివ్వడంలో అర్థం ఇదే. (దేవాలయాలలో అర్చామూర్తిగా పెరుమాళ్ళు దర్శనమివ్వడంలో అంతరార్థం కూడా ఇదే).

తన వేణుగానంతో జగత్తును సమ్మోహపరుస్తున్న శ్రీకృష్ణుడు. ప్రాచీన పంజాబీ గ్రంథంలోని చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Krsna_enchants_the_natural_and_human_worlds_Wellcome_L0030642.jpg



శ్రీ సత్యదేవో వాసిష్ఠ – 'వపుః' వా - బీజ సంతానే ఛేదనే చ - విత్తుట, కోయుట. **భగవాన్ ప్రవాహ నిత్యమ్ ఇదమ్ విశ్వమ్ వపతి సంతనోతి తథా సర్వమ్ అంతకాలే ఛిన్నతి**. భగవంతుడు విశ్వములో జీవులను పుట్టించును. సమయం వచ్చినపుడు నాశనం చేయును. విస్తార ధర్మము, అనగా ఒక జాతిలో జీవులనుండి అదే ధర్మముగల ఇతర జీవుల పుట్టించుట – జరిపించును.

## 821. సర్వజ్ఞః

- అంతా తెలిసినవాడు.
- తన భక్తుల అవుసరాలను పూర్తిగా తెలిసినవాడు.

### ఓం సర్వజ్ఞాయ నమః

ఈ నామము రెండుమార్లు చ్చినది.

48వ శ్లోకము. 454వ నామము. సర్వజ్ఞః – **సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞోజ్ఞానముత్తమమ్**

87వ శ్లోకము. 821వ నామము. సర్వజ్ఞః – **అమృతాశోऽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

48వ శ్లోకములోని 454వ నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **తథా సర్వాత్మనా ఆత్మాన్ జానాతి ఇతిసర్వజ్ఞః**. అన్నింటా తానే అంతరాత్మయని తెలిసినవాడు గనుక సర్వజ్ఞుడు. ఇందుకు శ్రీ రాధాకృష్ణశాస్త్రి శ్రుతులనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు –

బృహదారణ్యక 6.5.7 – **ఇదమ్ సర్వమ్ యద్ అయమ్ ఆత్మా.**
ముండకోపనిషత్తు 1.1.9 – **యః సర్వజ్ఞః సర్వవిత్.**
ప్రశ్నోపనిషత్తు 4.10 – **స సర్వజ్ఞః సర్వో భవతి.**
మాండూక్యోపనిషత్తు 6 – **ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞః.**

శ్వేతాశ్వరోపనిషత్తు 2.6.2,16 – **స విశ్వకృత్ విశ్వవిద్ ఆత్మయోనిః సర్వజ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్యః.**

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – అంతా భగవంతుని సృష్టియే గనుక ఆయనకు తెలియనిది ఏమీ లేదు. ఇందుకు శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి పెక్కు ఉదాహరణలిచ్చారు –

అథర్వ 17.1.111 – **త్వమ్ ఇంద్ర అసి విశ్వజిత్ సర్వవిత్ పురుహూత స్త్వం ఇంద్రః.**

యజుర్ 3.2.10 – **స నో బంధుర్జనిత స విధాతా ధామాని వేద భువనాని విశ్వా.**

ఋగ్ 10.82.3 – **యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వ.**

**యస్తిష్ఠతి చరతి యశ్చవంచతి యోనిలాయమ్ చరతి యః ప్రతంకమ్**

**ద్వౌ సన్నిషద్య యన్మంత్రయేతే రజతద్ వేద వరుణ స్తృతీయః** – అథర్వ 4.26.2

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శ్రీ భగవాన్ హి సర్వమ్ సర్వత్ర సర్వదా సర్వథా చ జానాతి.** అంతా, అంతటా, ఎల్లవేళలా, అన్నివిధాలా తెలిసినవాడు శ్రీ భగవంతుడే. భూత భవిష్యద్వర్తమానాలుతెలిసినవాడు ఆయన మాత్రమే. అందరిలోనూ, అన్నింటిలోనూ ఉన్నవాడు ఆయన మాత్రమే. ఆయనకు అందనిది ఏదీ లేదు. తెలిసిందీ, తెలియాల్సిందీ అంతా ఆయనకు తెలుసు.

ప్రస్తుత (821వ) నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషామ్ శక్య, అశక్య సాధ్య, అసాధ్యాదికమ్ అనుసంధత్తే ఇతి సర్వజ్ఞః.** తన భక్తులకు అవసరమైనది ఏది? వారి చేతనైది ఏది? వారివల్ల కానిది ఏది? అన్నీ తెలిసినవాడై భగవంతుడు తన భక్తులకు అవుసరమైన పనులను చేసి వారిని కాపాడుచుండును గనుక ఆయన సర్వజ్ఞుడు. **శక్యాశక్యాదికం సర్వం సాధ్యాసాధ్యాదికం చ యః భక్తానా మనుసంధత్తే సర్వజ్ఞ ఇతీరితః.**

శ్రీ తిరుమంగైయాళ్వారు పెరియతిరుమోళి 4.9.6 – నీ ఎడబాటును భరించలేని భక్తులెవరో నీకు తెలుసు. నీ సాన్నిహిత్యం విలువ తెలియనివారెవరో నీకు తెలుసు. ఈ విశ్వంలో నీకు తెలియనిది ఏదీ లేదు. కాని నీకోసం తపిస్తున్న నా బాధ నీకు తెలిసినట్లు లేదు. అందుకే నీ దర్శనాన్ని నాకు ఇవ్వకున్నావు.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

48వ శ్లోకంలో 'సర్వజ్ఞః' – సర్వ-జ్ఞః – **సర్వశ్చ అసౌ జ్ఞశ్చ ఇతి సర్వజ్ఞః.** అంతా తానైనవాడు మరియు అంతా తెలిసినవాడు సర్వజ్ఞుడు.

87వ శ్లోకంలో 'సర్వజ్ఞః' – సర్వమ్-జ్ఞః – **సర్వమ్ జానాతి ఇతి సర్వజ్ఞః.** అంతా తెలిసినవాడు సర్వజ్ఞుడు. 'సర్వ' పదం మొదటి అర్థంలో నామవాచకము మరియు రెండవ అర్థంలో విశేషణము.

శ్రీ చిన్మయానంద – అన్ని ఆలోచనలను, భావాలను, ఉద్దేశ్యాలను, జ్ఞానాన్ని వెలిగించేవాడు సర్వజ్ఞుడు.

## **822.** సర్వతోముఖః

- అనేకవిధాలుగా పొందదగినవాడు.
- అన్ని దిక్కులా ముఖము కలిగినవాడు.

**ఓం సర్వతోముఖాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యేన కేనాపి వ్యాజేన సుప్రవేశత్వాత్ సర్వతోముఖః.** భగవంతుని అనేకవిధాలుగా పొందవచ్చును. ఇదే మార్గం అనే నియమం లేదు. కనుక ఆయన సర్వతోముఖుడు. **తత్తన్నియమ ముత్సృజ్య యో జ్ఞాతు శక్యతే బుద్ధైః వ్యాజేన యేన కేనాపి స స్మృత సర్వతోముఖః.** ఇంత గొప్పవాడు కాబట్టి ఈ ఉపాయాలతో మాత్రమే తెలుసుకోవాలి అని కాకుండా తన భక్తులైన జ్ఞానులకు ఏదో ఒక రకంగా తెలుసుకోదగినవాడు గనుక సర్వతోముఖుడు.

శరణాగతి గద్యము 17 – **యేన కేనాపి ప్రకారేణ ద్వయ వక్తా త్వమ్ కేవలమ్ మదీయయ్యైవ దయాయా –** ద్వయమంత్రంతో భగవంతునికి శరణాగతులైనవారిని భగవంతుడు ఏదో ఒక విధంగా కాపాడుతాడు. సహృదయులైనవారు, కపటులైనవారు, కష్టంలో ఉన్న ఆర్తులు, ముందు ముందు రక్షణ అవుసరమ్మైనవారు, మిత్రులు, శత్రువులు, ఎవరైనా సరే భగవంతుని శరణుజొచ్చి ఆయన రక్షణ పొందవచ్చును.

**ఆర్తోవా యది వా దృప్తః పరేషామ్ శరణాగతః**
**అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా** – యుద్ధకాండ 18.28

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవంతుడు సర్వవ్యాపి. అంతటను ముఖములు కలవాడు. కనుక సర్వతోముఖుడు.

**సర్వతః పాణిపాదమ్ తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్**
**సర్వతః శ్రుతి ముల్లోకే సర్వమావృత్య తిష్ఠతి** – గీత 13.13
ఆ పరమాత్మని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై యున్నవి. అతడు సర్వమును ఆవరించియున్నాడు.

తైత్తరీయారణ్యకము 10.1 – **విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖః.**
శ్వేతాశ్వరోపనిషత్తు 2.16 – **ప్రత్యంగ జనాస్తిష్ఠతి సర్వతోముఖః.**
తైత్తరీయారణ్యకము 10.1 – **ప్రత్యంగ ముఖాస్తిష్ఠతి విశ్వతోముఖః.**

శ్రీ చిన్మయానంద చెప్పిన ఉదాహరణ – సూర్యుని కాంతి అన్నివైపుల ప్రసరించును. అలాగే భగవంతుని ముఖం అన్నియెడలా ఉండును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సర్వాసు దిశాసు భజమాన్యైః భక్తైర్హి శ్రీమద్ భగవతో ముఖమ్ అవలోక్యతే.** భక్తులు అన్నియెడలనుండీ భగవంతుని భజించుచున్నారు. భగవంతుడు అందరినీ ఒకేమారు చూస్తున్నాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **అతః సర్వతోముఖః సర్వదిగ్దేశ వర్తిషు భక్తేషు ముఖమ్ అస్య ఇతి సర్వతోముఖః.**



శ్రీకూర్మం ఆలయంలో శ్రీ పరశురాముని విగ్రహం.
వికీపీడియా చిత్రం. రహ్మానుద్దీన్ తీసినది

https://commons.wikimedia.org/wiki/File:Parashurama_avataram,_Srikurmam.jpg



## సులభః సువ్రతః సిద్ధః శత్రుజిచ్ఛత్రుతాపనః |
## న్యగ్రోధోదుంబరోఽశ్వత్థశ్చాణూరాంధ్రనిషూదనః || (88)

### 823. సులభః

- తేలికగా లభించువాడు.
- -సుఖము కలిగించువాడు.

ఓం సులభాయ నమః

సు - సుఖము, సౌకర్యము; లభ్ - ప్రాప్తౌ - పొందుట. శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయములో భక్తులు అనుభవించి కీర్తించే రెండు ముఖ్య భగవద్గుణాలు (1) సౌలభ్యము (2) సౌశీల్యము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అనఽర్ఘోపి మూల్య-భాసేన స్వీకర్తుమ్ శక్యః సు-లభః.** భగవంతుడు వెలలేనివాడు అయినా తేలికగా లభిస్తాడు. ఇందుకు శ్రీ భట్టులు భాగవతంలోని కుబ్జ వృత్తాంతాన్ని ఉదాహరించారు. ఆమె కురూపి. అయినా ఆమె ఇచ్చిన చందనాన్ని స్వీకరించి భగవంతుడు ఆమెను అనుగ్రహించాడు. **వస్త్రే ప్రగృహ్య గోవిందమ్ మమ గేహమ్ వ్రజేతి వై** (విష్ణుపురాణము 5.20.11). ఆమె గోవిందుని వస్త్రాన్ని పట్టుకొని తన ఇంటికి రమ్మంది.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమోళి మూడవ దశకం మొదటి పాశురంలో భగవంతుని యశోద రోట బంధించిన వైనాన్ని వర్ణించారు. మహాయోగీశ్వరులకు అందరాని పురాణపురుషోత్తముడు ఆ తల్లి ప్రేమకు కట్టుబడెను. ఈ ఎంపెరుమాన్ భక్త సౌలభ్యాన్ని తలచినంతనే శ్రీ నమ్మాళ్వారు ఆనంద పరవశులై ఆరునెలల కాలంపాటు మైమరచి స్పృహలేకుండా ఉన్నారట. శ్రీ ఆండాళ్ నాచియార్ తిరువైమోళిలో కూడా ఇదే భావం తెలియవస్తుంది.

తిరువైమోళి 1.10.2 – మనం యదాలాపంగా అంకెలు లెక్కపెడుతూ 25 తరువాత 26 అనగానే భగవంతుడు తనను పిలుస్తున్నామనుకొని పరుగున వస్తాడు. (తత్వాలలో 25వది జీవము. 26వది పరమాత్మ.)

శ్రీరాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు (శ్రీ వేదాంత దేశికన్ ఉదాహరించిన విషయం): **త్వయి కంచిత్ సమాపన్నే కిమ్ కార్యమ్ సీతాయా మమ భరతేన మహాబాహో లక్ష్మణేన యవీయసా శత్రుఘ్నేన చ శత్రుఘ్న స్వశరీరేణ వా పునః** (రామాయణం. యుద్ధకాండ 41.5). ఓ వీరుడా! నీకు ఏమైనా ఆపద సంభవించినట్లయితే ఇక నాకు సీత, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, చివరికి స్వయంగా నేను కూడా ఉన్నాగాని ఎవరూ లేనట్లే.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పత్ర పుష్పాదిభిః భక్తిమాత్ర సమర్పితైః సుఖేన లభ్యత ఇతి సు-లభః.** భక్తితో సమర్పించిన పూలు, ఆకులు వంటివానితో తేలికగా లభించువాడు సులభుడు. ఇక్కడ 'భక్తితో' అనే మాట చాలా ముఖ్యమైనది. శ్రీ శంకరులు మహాభారతంనుండి ఉదాహరించారు.

**పత్రేషు పుష్పేషు ఫలేషు తోయేషు అక్రీత-లభ్యేషు సదైవ సత్సు**
**భక్త్యైక-లభ్యే పురుషే పురాణే ముక్త్యై కథమ్ న క్రియతే ప్రయత్నః**
పురాణ పురుషుడు భక్తిమాత్రంచేత సమర్పించిన ఆకులు, పూలు, పండ్లు, నీరు వంటివానిచేత సులభంగా లభిస్తాడు. అయినా ఆయనకోసం ప్రజలు యత్నించకపోవడం విచిత్రం కదా!

**అనన్య చేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః**
**తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః** – గీత 8.14
పార్థా! నిత్యము నిరంతరము అనన్య భావముతో చిత్తమును నాయందే నిలిపి, పురుషోత్తముడనైన నన్ను స్మరించుచు, సంతతము మత్పరాయణుడైన యోగికి నేను సులభుడను. అనగా అతనికి సహజముగానే నేను లభింతును.
శ్రీ సత్యసంధ యతిరాజ – **సుఖమ్ లభత ఇతి సులభః.** సుఖమును కలిగించేవాడు సులభుడు.

**శ్రీ మద్భాగవతంలో కుబ్జ వృత్తాంతము (శ్రీ ఏల్చూరి మురళీధరరావు రచననుండి) –**

రాజేంద్రా! భగవానుడంతట సుదాముని భక్తిభావాన్ని స్మరిస్తూ పురవీధిని సాగుతుండగా మార్గంలో ఒక గూని స్త్రీ సుగంధద్రవ్యపాత్రలను మోస్తూ ఎదురు వచ్చింది. కృష్ణుడామెను చూసి, 'సుందరీమణీ! నీవెవ్వతెవు? ఈ గంధాలు ఎవరికోసం? మాకు కొంచెం ఇస్తావా? నీకు మేలవుతుంది' అని పలకరించాడు. ఆ మాటలు విని కుబ్జ 'సుందరాకారా! చక్కదనం అందరికీ సమకూడే భాగ్యం కాదు. నేను దాసిని. నాకు గ్రీవోరఃకటాలు మూడూ వక్రంగా ఉన్నందున నన్ను 'త్రివక్ర' అంటారు. కంసరాజుకు అనులేపనాలు కూర్చడం నా పని. మా రాజుకు ఇవి ఎంతో ప్రియమైనవి. మీవంటివారు తప్ప తక్కినవారు వీటికి తగరు' అంటూ వారికి మైపూత ద్రవ్యం ఇచ్చింది.

రాజేంద్రా! రామకృష్ణులు సితాసిత శరీరులు. ఆ అనులేపాలను వారు పూసికొన్నంతనే సితాసితులు అసిత సితులవలె కాన్పించారు. కృష్ణుడప్పుడు ఆమెయెడ కరుణ వహించి ఆమె పాదాలమీద తన పాదాలు నిలిపి ఆమె గడ్డంక్రింద చేతినుంచి రెండువేళ్ళయెత్తుకు ఆమె శరీరాన్ని పైకెత్తాడు. ఆ దాసియొక్క కటి వక్షః కంఠ స్థలాలు మూడింటి కుంటు అప్పటికప్పుడే తొలగిపోయింది. ఆమె అమిత సౌందర్యవతియై కృష్ణుని ఉత్తరీయాన్ని ఒడిసిపట్టి 'పురుషాగ్రణీ! మా యింటికి దయసేయుము. నిన్ను చూసినంతనే నా మనసు నీయందు లగ్నమయింది. నీదాననయ్యాను; నన్ను అనుగ్రహించు. నిన్ను విడువలేను' అంటూ ప్రార్థించింది.



కుబ్జనుండి మైపూతలు స్వీకరిస్తున్న శ్రీ రామ కృష్ణులు.
1650 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Making_Kubja_Beautiful,_Folio_from_a_Bhagavata_Purana_(Ancient_Stories_of_the_Lord)_LACMA_M.72.1.27.jpg

## 824. సువ్రతః

- శరణాగతులను కాపాడుట అనే చక్కని, దృఢమైన వ్రతము కలవాడు.
- తన భక్తులు భక్తితో, అహంకారము లేకుండా సమర్పించిన స్వచ్ఛమైన నైవేద్యమును మాత్రమే స్వీకరించువాడు.
- తన నర-నారాయణ అవతారములో నియమముగా ఆహారమును గ్రహించినవాడు.
- సృష్టిలో అంతటినీ నియమము ప్రకారము తన అధీనములోనుంచుకొనువాడు.
- తాను పరమాత్ముడైనప్పటికీ శ్రీకృష్ణావతారములో అన్ని వ్రతములను నియమముగా ఆచరించినవాడు.

### ఓం సువ్రతాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

49వ శ్లోకము. 456వ నామము. సువ్రతః – **సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్**

88వ శ్లోకము. 824వ నామము. సువ్రతః – **సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'సు-వ్రతము' అంటే 'దృఢ వ్రతము' అని వ్యాఖ్యానించారు. **యథా కథంచిత్ ప్రవిష్టానామ్ సర్వథా పరిపాలన దృఢవ్రతః సు-వ్రతః.** ఏ విధంగానైనా తన చెంతకు వచ్చినవారిని ఎలాగైనా రక్షించడం అనే దృఢమైన నియమం పాటించేవాడు సు-వ్రతుడు. ఇందుకు శ్రీ భట్టులు రామాయణం యుద్ధకాండ (18.33)నుండి ఉదాహరించారు.

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి యాచతే**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ.**
'నేను నీవాడను. రక్షింపుము' అని ఒక్కమారైనను నన్ను వేడుకొన్నట్లయితే వానికి సర్వభూతములనుండి అభయమును ప్రసాదింతును. ఇది నా వ్రతము.

శరణాగతిగద్యంలో భగవానుడు భగవద్రామానుజులకు తన వ్రతాన్ని ఇలా చెప్పాడు – **అనృతమ్ నోక్త పూర్వమ్ మే న చ వక్ష్యామి కదాచన.** నేనేప్పుడూ అసత్యమాడలేదు. నా మాటలు ఎప్పుడూ అసత్యం కావు.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ** – గీత 18.66
సర్వ ధర్మములను, అనగా సమస్త కర్తవ్య కర్మలను నాకు సమర్పించి సర్వశక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని కావించెదను. నీవు శోకింపకుము.

**రామో ద్విర్ న అభిభాషతే.** రాముడు రెండు విధములుగా మాటలాడడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 9.10.5 – తనను శరణుజొచ్చినవారెవరికైనా వారి అంత్యకాలంలో శ్రీ భగవానుడు వారికి శ్రీవైకుంఠమును ప్రసాదించును.

శ్రీ వచనభూషణము 381 – అనాలోచితంగా, అదేంటో తెలియకుండాకూడా ఎవరైనాగాని ఒక దివ్యదేశం పేరు ఉచ్చరిస్తే, భగవంతుడు వారికి అందుకు సరిపడా పుణ్యం ప్రసాదిస్తాడు. అలా అనేక జన్మలలో ప్రోగుపడిన పుణ్యాన్నంతటినీ కలిపి, దానిని పదిరెట్లు చేసి, అందుకు తగిన ప్రతిఫలాన్ని అందిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'వ్రతము' అనగా ఆహారవిషయంలో నియమాన్ని ప్రస్తావించారు. **శోభనమ్ వ్రతయతి భుంక్తే.** ఈ వ్యాఖ్యకు వివిధాలైన వివరణలు ఉన్నాయి. శ్రీ అనంతకృష్ణశాస్త్రి ఇలా వివరించారు: కుచేలునివంటి మోహరహితులైన భక్తులు సమర్పించే స్వచ్ఛమైన నైవేద్యాన్ని పరిగ్రహించేవాడు గనుక భగవానుడు సువ్రతుడు.



శ్రీకృష్ణుని పరివారము సుదాముని ఆదరించుట. వికీపిడియా చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Fresco_Rooms_in_Bhau_Tambekar%27s_Wada_05_KRISHNA_SUDAMA.jpg

శ్రీ శంకరులు చెప్పిన మరొక వ్యాఖ్య – **భోజనాత్ నివర్తయతి ఇతి సువ్రతః.** తాను భుజించే ఆహారంపట్ల నియమం కలిగినవాడు సువ్రతుడు. ఉదాహరణకు నరనారాయణావతారంలో కఠినమైన నియమాలతో తపమునాచరించిన సువ్రతుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – వ్రతము అనగా నియమము. **సువ్రతయతి నియమయతి ఇతి సువ్రతః.** విశ్వంలో అన్నింటినీ నియమానుసారం నడిపేవాడు సువ్రతుడు. వాయువు, అగ్ని వంటివారు కూడ ఆయన ఆజ్ఞను జవదాటరు. **భీషాస్మాద్ వాతః పవతే.** ఇందుకు శ్రీ వాసిష్ఠ శ్రుతినుండి ఉదాహరించారు.

**యస్య వ్రతే పృథ్వీ నన్నమీతి యస్య వ్రతే శఫవజ్జర్భురీతి**
**యస్య వ్రతే ఓషధీర్విశ్వరూపః స నః పర్జన్యమహి శర్మ యచ్ఛ** – ఋగ్వేదము 5.83.5

శ్రీ బలదేవ విద్యాభూషణ – **శోభనాని పరమోత్సవ రూపాని జన్మాష్టమీ కార్తీక నియమాదీని వ్రతాని యస్య స సు-వ్రతః.** (శ్రీకృష్ణావతారంలో) తాను పరమేశ్వరుడైయుండి కూడా జన్మాష్టమి, కార్తీకమాసము వంటి వ్రతాలను నియమముగా ఆచరించినవాడు సువ్రతుడు.

## 825. సిద్ధః

- భక్తులు ఏ విధమైన ప్రత్యేక యత్నాలు చేయకుండానే వారిని రక్షిస్తూ వారికి అందివచ్చేవాడు.

- మోక్షము పొందడానికి సిద్ధముగా ఉన్న ఉపాయము.
- వేరెవరి సహాయమూ, దేని సహాయమూ లేకుండానే సకలసిద్ధులు పొందియున్న పరిపూర్ణుడు.
- భక్తులు ఆచరించే తపస్సు, ప్రయత్నాలలో ఫలాన్ని సిద్ధింపజేసేవాడు.
- మనకు శాస్త్రాలనూ, శుభాలనూ కలిగించేవాడు.
- అన్ని విధాలైన శోధనలకూ, తర్కాలకూ కూడా చిట్టచివరి ప్రమాణము.
- తాను చేసే అన్ని కార్యాలనూ పరిపూర్ణంగా, లోపాలు లేకుండా సాధించేవాడు.

## ఓం సిద్ధాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

11వ శ్లోకము. 98వ నామము. సిద్ధః – **అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిః అచ్యుతః**

88వ శ్లోకము. 825వ నామము. సిద్ధః – **సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః**

ఈ నామమునకు మూలశబ్ధము **సిధ్** - సమృద్ధౌ -లక్ష్యము చేరుకొనుట, విజయము పొందుట, సాధించుట. ఇంతకుముందు 27వ శ్లోకములోని 253 నుండి 256వరకు, **సిద్ధార్థః, సిద్ధసంకల్పః, సిద్ధిదః, సిద్ధిసాధనః** నామములు ఇదే ధాతువుపై ఆధారపడినవి. ప్రస్తుత సందర్భములో ఈ నామమునకు చెప్పిన వివరణలు – మనలను రక్షించడానికి వేంచేసియున్నవాడు, మన లక్ష్యాలను సాధిండానికి చేయూతనిచ్చేవాడు, దోషరహిత పరిపూర్ణుడు, మనలను దోషరహితులుగా చేసేవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అస్య గోప్తృత్వమ్ అనుపాధికమ్, సదా స్వత ఏవ సర్వగోప్తృత్వాత్, అయత్నసాధ్యః సిద్ధః.** పరమేశ్వరుడు అయత్నసాధ్యుడు. అంటే ప్రయత్నం లేకుండానే సాధింపబడేవాడు. ఇతరుల అధీనంలో లేనివాడు. తాను తనయొక్క అధీనంలోనే ఉన్నవాడు. భక్తులు ఆయనకోసం ఏమీ కష్టపడకుండానే ఆయన వారికి సిద్ధిస్తాడు గనుక సిద్ధుడు. ఇది ఆయన తత్వము.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 5.7.10 – నీ చరణాలే నా లక్ష్యము. వానిని సాధించడానికి నాకున్నమార్గం నీ పాదాలను అంటిపెట్టుకొని ఉండడమే. ఆ పాదాలు మనకు అందుబాటులో వేంచేసిఉన్నాయి. వాటిని చేరుకోవడానికి శ్రమించనక్కరలేదు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 10.6.3 – మేము ఆయన గుణగాణం చేసే నామాలను స్మరిస్తూ నారాయణుని చేరుకొన్నాము. ఆ దేవదేవుడు మనకు శ్రీవైకుంఠాన్ని అనుగ్రహించడంకోసం పరుగున వేంచేసి తిరువట్టాయంలో కొలువైయున్నాడు. భక్తులను కరుణించడంకోసం ఆయన తొందరపడుతున్నాగాని మనకోసం ఓపికతో వేచియున్నాడు. ఓ మనసా! నీ సహాయంతోనే ఇదంతా జరుగుతున్నది.

స్వామి దేశికన్ – **సిద్ధోపాయస్తు ముక్తౌ నిరవధిక దయః శ్రీసఖః సర్వశక్తిః.** శ్రీమన్నారాయణుడు ముముక్షువుల కొరకు సిద్ధోపాయము. అంతులేని దయగలవాడు. సర్వశక్తిమంతుడు (న్యాయవింశతి 17). అంటే ఆయనకోసం మనం క్రొత్త ఉపాయాలు (సాధనాలు, ప్రయత్నాలు) వెతుక్కోనక్కరలేదు. భక్తి లేదా ప్రపత్తి మార్గాలు అనే సాధ్యోపాయాలద్వారా మోక్షాన్నిచ్చే సిద్ధోపాయము శ్రీమన్నారాయణుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అనన్యాధీన సిద్ధిత్వాత్ సిద్ధః.** ఆయన ఇంకెవరిపైనా ఆధారపడనివాడు. తాను తనయొక్క అధీనంలోనే ఉన్నవాడు. అలా పరిపూర్ణసిద్ధిని కలిగియున్నవాడు సిద్ధుడు.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – భగవంతుని అర్చించే భక్తులు తమ యత్నాలకు సత్ఫలితాలు పొంది పరిపూర్ణతను పొందుతారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి నృసింహతాపిని (9.9)నుండి ఉదాహరించారు. **సదేవ పురస్తాత్ సిద్ధమ్ హి బ్రహ్మ.** భగవంతుడు సద్వ్రతములను ఆచరించేవారికి తగు సిద్ధులు ప్రసాదిస్తాడు. మరియు భగవంతుడు సకల సిద్ధులు కలిగియున్న పరిపూర్ణుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – షిధు - శాస్త్రే మాంగల్యేచ - బోధించుట, ఉపదేశించుట, శుభము కలిగించుట; ధా - ధారణ పోషణయో దానే చ - ఇచ్చుట, పుట్టించుట, పోషించుట. **సిధమ్ మంగళమ్ శాస్త్రమ్ వా ధత్త ఇతి సిద్ధః.** మనకు శాస్త్రములను ఇచ్చినవాడు, శుభములను కలిగించువాడు సిద్ధుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సిధ్యతి స్మ సిద్ధః, భగవాన్ హి సకలైః ప్రమాణైః సిద్ధః, తత్ర ప్రత్యక్ష ప్రమాణమ్ భక్తానామ్, అనుమాన ప్రమాణమ్ తార్కికానామ్, శబ్ద ప్రమాణమ్ చ శ్రుతి శాస్త్రానామ్, ఏవమ్ ప్రమాణ త్రయమపి శ్రీ భగవంతమ్ సాధయతి.** భక్తులకు ఆయన ప్రత్యక్ష ప్రమాణము. తార్కికులకు హేతుప్రమాణము. శ్రుతి శాస్త్రాలలో ఉన్న శబ్దప్రమాణము. ఇలా పరమసత్యాన్ని తెలుసుకోవడానికి అన్నివిధాలుగా చివరిప్రమాణము ఆయనే.



శ్రీ నరనారాయణుల మూర్తులు. స్వామినారాయణ మందిరం. కొలోనియా, న్యూ జెర్సీ, అమెరికా. వికీపీడియా చిత్రం
https://commons.wikimedia.org/wiki/File:NarNarayan_Dev.JPG

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **శ్రమ క్లంతంద్రాభిః వర్జితో యత్నాపేక్షా సిద్ధిశ్చ సిద్ధః.** సాధించవలసినదంతా ఆయన ఏమీ శ్రమ లేకుండానే సాధించేశాడు గనుక సిద్ధుడు. **సర్వతో భావినీ శాశ్వతీ సిద్ధిః అస్య ఇతి సిద్ధః.** ఆయన చేసేదంతా పరిపూర్ణంగా దోషరహితంగా చేస్తాడు గనుక సిద్ధుడు. ఇందుకు ఉదాహరణగా శ్రీ వాసిష్ఠ చెప్పినది – భగవంతుడు తగుపాళ్ళలో గాలి, నీరు, నిప్పు, వివిధ జీవులు వంటివానిని ఉంచి విశ్వాన్ని సృష్టించాడు.

**ఇంతవరకు శ్రీ భట్టుల వ్యాఖ్యానం భగవంతుని ప్రత్యక్ష (నేరు) అవతారాలపరంగా సాగింది. ఇంకముందు కొన్ని నామాల వ్యాఖ్యానంలో భగవంతుని పరోక్ష అవతారాలు, అనగా ఆయన ఇతరులలో ప్రవేశించే అవతారాలుగా, చెప్పబడినాయి.**

## 826. శత్రుజిత్

### శత్రుతాపనః

### శత్రుజిచ్ఛత్రుతాపనః

శ్రీ భట్టులు, ఆయన వ్యాఖ్యను అనుసరించేవారు **'శత్రుజిత్ శత్రుతాపనః'** అనే ఒకే నామముగా పరిగణించారు. శ్రీ శంకరులు, ఇతర వ్యాఖ్యాతలు **'శత్రుజిత్', 'శత్రుతాపనః'** అనే రెండు నామములను పరిగణించారు. అయితే రెండువిధాల వ్యాఖ్యానాలలోనూ భావం ఇంచుమించు ఒకటే అని గ్రహించాలి. శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారం భగవంతుడు స్వయంగా, అనగా రాముడు, కృష్ణుడువంటి అవతారాలలో శత్రువులను జయిస్తాడు. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం భగవంతుడు తన శక్తిని ఇతరులలో ప్రవేశపెట్టి **(స్వతేజసా అప్యాయితైః)** భగవంతుని శత్రువులను నశింపజేస్తాడు.

## శత్రుజిచ్ఛత్రుతాపనః

- శత్రుజిత్తులైనవారిలో తన అంశను ప్రవేశపెట్టి, వారిద్వారా తన భక్తుల శత్రువులను నాశనం చేయువాడు.

## ఓం శత్రుజిచ్ఛత్రుతాపనాయ నమః

భగవంతుడు తాను స్వయంగా తన భక్తుల శత్రువులను నాశనం చేయడమే కాకుండా, తన తేజస్సును ఇతరులలో ప్రవేశపెట్టి, వారిద్వారా (శత్రుజిత్తులద్వారా) తన భక్తుల శత్రువులను తపింపజేయును గనుక ఆయన శత్రుజిచ్ఛత్రుతాపనుడు. **పురుకుత్స కకుత్స్థాద్యైః శత్రుజిద్భి స్వతేజసా ఆధ్యే యత్నై రరిగణాన్ యస్తాపయతి నిత్యశః శత్రుజిచ్ఛత్రుతాపన ఇతి విద్యర్థణోదితః.** పురుకుత్సుడు, కకుత్స్థుడు మొదలైన రాజశ్రేష్ఠులయందు తన అంశను ప్రవేశపెట్టి శత్రునాశనము చేసినవాడు శత్రుజిచ్ఛత్రుతాపనుడు. పురుకుత్సుడు బిందుమతి, మాంధాతల కుమారుడు. ఇతడిని నాగకుమారులు తమ లోకానికి తీసుకొనిపోయి తమ చెల్లెలు నర్మదనిచ్చి వివాహం చేశారు. అంగీరసులనే గంధర్వులు నాగలోకానికి వెళ్ళి అక్కడి నాగులను బాధపెడుతున్నారు. ఈ సంగతి విన్న పురుకుత్సుడు వారితో యుద్ధంచేసి అంగీరసులను వధించాడు. శ్రీ భట్టులు విష్ణుపురాణంలోని ఈ ఉదంతాన్ని ఉదాహరించారు.

**పరంజయో హి నామ శశాదస్య చ రాజర్షేష్ఠనయః క్షత్రియవర్యః**
**తచ్ఛరీరే అహం అంశేన స్వయమేవ అవతీర్య తానశేషానసురాన్ నిహనిష్యామి** – విష్ణుపురాణము 4.2.8
**కకుత్స్థః భగవతః చరాచరగురోః అచ్యుతస్య తేజసా ఆప్యాయితో**
**దేవాసుర సంగ్రామే సమస్తానేవ అసురాన్ నిజఘాన** – విష్ణుపురాణము 4.2.11
నా అంశతో నేను పరంజయులనే రాజశ్రేష్ఠుల శరీరంలో ప్రవేశించి స్వయంగా అసురులను సంహరిస్తాను.... అప్పుడు కకుత్స్థుడు (పరంజయుడు), సమస్త చరాచరములకు ప్రభువైన అచ్యుతుని శక్తితో, యుద్ధంలో దేవతల శత్రువులను సంహరించాడు.

..... **అథ భగవాన్ ఆదిపురుషః పురుషోత్తమో యౌవనాశ్వస్య మాంధాతుః పురుకుత్సనామపుత్రస్తమ్ అనుప్రవిశ్య ఏతాన్ అశేష దుష్ట గంధర్వాన్ ఉపశమమ్ నయిష్యామి** – విష్ణుపురాణము 4.3.7
ఆదిపురుషుడైన పురుషోత్తముడు ఇలా అన్నాడు. నేను యువనాశ్వ, మాంధాతల పుత్రుడైన పురుకుత్సునిలో ప్రవేశించి గంధర్వులను అణచివేస్తాను.

**రసాతల గతశ్చ అసౌ భగవత్ తేజసా ఆప్యాయిత ఆత్మవీర్య సకల గంధర్వాన్ జఘాన** – 4.3.9
భగవంతుని తేజస్సుతో నిండిన పురుకుత్సుడు రసాతలం ప్రవేశించి సకల గంధర్వులను నాశనం చేశాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా **'శత్రుతాపనః'** నామానికి ఈ అర్థాన్ని చెప్పారు. **సర్వ సుహృదః సాధూన్ ద్విషన్తి త ఏవ శత్రవః తాన్ శ్చ యః స్వ-పరదత్త-శక్తిభిః మహాపురుషైః తాపయతి ఇతి శత్రుతాపనః.** భగవంతుడు తన శక్తిని మహాపురుషులకు ఇస్తాడు. ఆ మహాపురుషులు భగవద్భక్తులను పీడించే శత్రువులను నాశనం చేస్తారు. ఇందుకు శ్రీ వాసిష్ఠ అథర్వ వేదము (19.28.2)నుండి ఉదాహరించారు –

**ద్విషస్తాపయన్ హృదః శత్రూణామ్ తాపయన్ మనః**
**దుర్హార్దః సర్వాస్త్వమ్ దర్భ ధర్మ ఇవాభీన్త్సమ్ తాపయన్**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఈ నామమును **'శత్రుజిత్ శత్రుతాపనః'** అనే ఒకే నామంగా పరిగణించారు. కాని జంట అర్థాలు, శత్రుజిత్తు మరియు శత్రుతాపనుడు, కలిసినట్లుగా వ్యాఖ్యానించారు.

**శతయన్తి ఉత్పీడయన్తి ధార్మికాన్ ఇతి శత్రవః**

**తాన్ జయతి ఇతి శత్రుజిత్**

**శత్రూన్ తాపయతి ఇతి శత్రుతాపనః**

**శత్రుజిత్ చ అసౌ శత్రుతాపనన్ ఇతి శత్రుజిచ్ఛత్రుతాపనః**

ధార్మికులను పీడించేవారు శత్రువులు, అలాంటి శత్రువులను జయించేవాడు శత్రుజిత్తు. మరియు శత్రువులను బాధించేవాడు శత్రుతాపనుడు. వెరసి శత్రుజిచ్ఛత్రుతాపనుడు.

ఇక శ్రీ శంకరులు, ఇతరులు పరిగణించినట్లుగా రెండు వేరువేరు నామముల అర్థం క్రింద ఇవ్వడమైనది.

## శత్రుజిత్

- తన శత్రువులను జయించేవాడు.
- అన్నింటికంటే పెద్ద శత్రువైన 'శరీరమే ఆత్మ అనే భావము'ను జయించడానికి తోడ్పడేవాడు.
- సృష్టిలో జీవులకు తమ శత్రువులను ఎదుర్కొనే సదుపాయాన్ని కల్పించినవాడు.

### ఓం శత్రుజితే నమః

శత్రువులను జయించేవాడు శత్రుజిత్తు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సుర శత్రవ ఏవ అస్య శత్రవ, తాన్ జయతి ఇతి శత్రుజిత్**. దేవతల శత్రువులే ఆయన శత్రువులు. అలాంటి శత్రువులను జయించేవాడు శత్రుజిత్తు.

శ్రీ చిన్మయానంద – ప్రతి మనిషి హృదయంలోను అతని శరీరంపై వ్యామోహం ఉంటుంది. తద్వారా కలిగే కోర్కెలు ఎంత బలమైనవంటే వాటిని అణచడం మనిషికి కష్టం. ఇలాంటి శత్రువును జయించాలంటే నారాయణుని శరణు వేడుకొనడమే మార్గము. ఇలా నారాయణ ధ్యానం అన్నింటికంటే పెద్దశత్రువును జయించడానికి తోడ్పడుతుంది గనుక నారాయణుడు శత్రుజిత్తు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సృష్టిలో జీవులకు తమ శత్రువులను ఎదుర్కోవడానికి గోళ్ళు, కోరలు, కొమ్ములు వంటి ఆయుధాలను దేవుడు సమకూర్చాడు. ఈ అమరికలో భగవంతుని 'శత్రుజిత్' గుణం మనకు కనిపిస్తుంది.

## శత్రుతాపనః

- తన భక్తుల శత్రువులను హింసించేవాడు.
- భక్తుల హృదయాలలో దురాలోచనలను నాశనం చేసేవాడు.

### ఓం శత్రుతాపనాయ నమః

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సురశత్రూణామ్ తాపనాత్ శత్రుతాపనః**. దేవతల శత్రువులను తపింపజేయువాడు శత్రుతాపనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు దుష్టులకు అనేక కష్టములు కలిగించును.

శ్రీ చిన్మయానంద – భగవంతుని పాదములను శరణుజొొచ్చిన భక్తుల హృదయములలో అన్ని దురాలోచనలు దగ్ధమగును. కనుక భగవంతుడు శత్రుతాపనుడు.

## 827. న్యగ్రోధోదుంబరః

**న్యగ్రోధః**

**ఉదుంబరః**

శ్రీ పరాశరభట్టులు, ఆయన మార్గమును అనుసరించినవారు ఈ నామమును **'న్యగ్రోధోదుంబరః'** అనే ఒకే నామంగా పరిగణించారు. శ్రీ శంకరులు మరియు ఇతర వ్యాఖ్యాతలు **'న్యగ్రోధః', 'ఉదుంబరః'** అనే రెండు నామములుగా పరిగణించారు. ఈ నామవివరణను శ్రీ భట్టుల వ్యాఖ్యానంలోని ప్రత్యేకతకు ఒక ఉదాహరణగా గ్రహింపవచ్చును.

ముందుగా 'న్యగ్రోధః', 'ఉదుంబరః' అనే వేరు వేరు నామముల అర్థాలను పరిశీలించుదాము.

### న్యగ్రోధః

- ఆయనకంటే అతినీచులైె కూడా, ఆయనకు (భగవంతునికి) అంజలి ఘటించే వారివారి ఇష్టానుసారం నడచుకొనేవాడు.
- తన క్రిందివారిని నియంత్రించేవాడయ.
- అందరికంటె సనాతనుడు. అందరికంటె పైన ఉన్నవాడు.
- స్థిరముగా వేళ్ళూనుకొని అన్నిదిశల వ్యాపించిన విశ్వరూపుడు.
- భక్తులు తమ కామితార్థముల కొరకు పైనున్న ఆయనను వేడుకొందురు.
- తన భక్తుల శత్రువులను శిక్షించేవాడు.
- భగవంతుని పూజించే భక్తులు తమ హృదయాలలో ఆయననే కోరుకొంటారు.

### ఓం న్యగ్రోధాయ నమః

అంచ్ - గతి పూజనయో - వెళ్ళుట, పూజించుట; **నీచై అంచతి ఇతి న్యక్.** క్రిందికి వంగేవాడు న్యక్.
రుధ్ - కామే - అనుసరించుట; రుధ్ - ఆవరణే - ప్రతిఘటించుట.
న్యగ్రోధము అంటే 'వటవృక్షము' అనే అర్థం కూడా ఉన్నది.

కొందరు వ్యాఖ్యానకర్తలు ఈ నామమును **'న్యగ్రోహః'** అని కూడా గ్రహించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **న్యగ్భూతైః, అధ-కృతాంజలిభిః, రుధ్యతే స్వప్రసాదౌన్ముఖ్యేన వ్యస్థాప్యతే ఇత్ న్యగ్-రోధః.** తనకంటే ఎంతో క్రింద ఉన్నవారు కూడా అంజలి ఘటించి తనకు ప్రియం కలుగజేయగానే వారియందు అనుగ్రహం చూపేవాడు న్యగ్రోధుడు. ఇక్కడ శ్రీ భట్టులు భగవంతునికి 'అంజలి' ఘటించడంయొక్క ప్రభావాన్ని వక్కాణించారు. **అంజలిః పరమాముద్రా క్షిప్రమ్ దేవప్రసాదినీ.** అంజలిముద్రను చూడగానే భగవంతుడు ప్రసన్నుడౌతాడు (విష్ణుధర్మోత్తర 33.105).

**త్వదంఘ్రిమ్ ఉద్దిశ్య కదాపి కేనచిత్ యథా తథా వాపి సకృత్ కృతోऽంజలిః**
**తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః శుభాని పుష్ణాతి న జాతు హీయతే** – అళవందార్. స్తోత్రరత్నము 28

ఎవరైనా, ఎప్పుడైనా, ఏ కారణంచేతనైనాగాని ఒక్కమారు చేతులు జోడించి నీ పాదములను అర్చించినట్లయితే ఆ క్షణమే వారి పాపాలన్నీ నశిస్తాయి. వారికి ఎనలేని శుభములు కలుగుతాయి.

శ్రీ వి.వి. రామానుజన్ యశోద చేత పరమాత్ముడు రోట బంధింపబడిన వైనాన్ని ఉదాహరించారు. అంటే భగవానుడు భక్తికి, ప్రేమకు లొంగిపోతాడన్నమాట.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **న్యగ్ రుణద్ధి ఇతి న్యగ్-రోధః.** తన క్రింద ఉండేవారిని ఆదేశించువాడు న్యగ్రోధుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'న్యక్-రోహతి' అని విశ్లేషించారు. **పృషోదరాదిత్వాత్ హకారస్య ధకారాదేశః** – అనే వ్యాకరణసూత్రం ప్రకారం ఈ నామమును **'న్యగ్రోహః'** అని కూడా గ్రహింపవచ్చునని చెప్పారు. **న్యక్ అర్వాక్ రోహతి సర్వేషామ్ ఉపరివర్తత ఇతి న్యగ్రోధః.** క్రింది భాగమున పుట్టి (సర్వస్వమునకు మూలమై యుండి) అందరికంటె పైనున్నవాడు (సర్వేశ్వరుడు) గనుక న్యగ్రోధుడు. రుహ్ - బీజ జన్మాని ప్రాదుర్భావేచ - పుట్టుట, పెరుగుట, వర్ధిల్లుట – అనే మూలం ప్రకారం ఈ అర్థ వస్తుంది.

శ్రీ సత్యసంధ యతిరాజ కూడా **'న్యగ్రోహః'** అని పరిగణించారు కాని వేరే అర్థాన్ని చెప్పారు (రుహ్ - పెరుగుట). **సర్వాణి భూతాని న్యకృత్య రోహతి వర్ధతి ఇతి.** అన్ని భూతములను పుట్టించి, వాని వృద్ధికి కారణమగువాడు న్యగ్రోధుడు.

న్యక్ - క్రింద; రోధః - చిత్తగించుట (రుధ్ - కామే). 1948లో ముద్రింపబడిన శ్రీ కామకోటి కోశస్థానం (శ్రీ శంకరుల వ్యాఖ్యకు తమిళ అనువాదం)లో ఇచ్చిన అర్థం. తన క్రింద ఉన్న సమస్త భూతములను తన మాయచే అడ్డగించినవాడు, వారిని నియంత్రించువాడు న్యగ్రోధుడు.

'న్యగ్-రోహతి' అనగా క్రిందికి పెరుగునది, అనగా వటవృక్షము. ఎందుకంటే మర్రిచెట్టు భూమిపైన ఎంత విస్తరించి ఉంటుందో భూమిలోపల కూడా అలానే విస్తరించియుంటుంది (**నీచైర్గతౌ పరోహైర్వర్ధతే**). ఇలా స్థిరంగా ఉండి విశ్వమంతటా విస్తరించినవాడు న్యగ్రోధుడు. కొందరు వ్యాఖ్యాతలు మఱ్ఱిచెట్టు భగవద్విభూతి గనుక భగవంతుడు న్యగ్రోధుడు అని వ్యాఖ్యానించారు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక వ్యాఖ్య – **న్యగ్భిః అనురుధ్యతే - ప్రార్థయతే ఈప్సితాప్తయ ఇతి న్యగ్రోధః.** క్రిందనున్నవారు తమ కోర్కెలు తీర్చుకోవడానికి పైనున్న భగవంతుని ప్రార్థిస్తారు గనుక భగవంతుడు న్యగ్రోధుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – రుధ్ - ఆవరణే - ఎదిరించుట, అణచివేయుట. న్యక్ - కృత్య - అణచివేయుట. **న్యక్-కృత్య రుణద్ధి నిరయే నిక్షిపతి స్వ-భక్త-ద్రోహిణా ఇతి న్యగ్-రోధః.** తన భక్తుల శత్రువులను శిక్షించి అణచివేయువాడు న్యగ్రోధుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – రుధ్ - కామే - కోరుట. న్యగ్భిః **ప్రణతైః రుధ్యతే హృదయ ప్రదేశే ఇతి న్యగ్-రోధః.** భగవంతుని అర్చించే భక్తులు తమ హృదయంలో ఆ భగవంతునే కోరుకుంటారు గనుక భగవంతుడు న్యగ్రోధుడు.

## ఉదుంబరః

- సర్వోత్తమ పరంధామము శ్రీ వైకుంఠము తన స్థానముగా గలవాడు.
- ఆకాశముకంటె పై స్థాయిలో, అనగా అందరికంటె గొప్పవాడైయున్నవాడు.
- అన్నాదులచే విశ్వమంతయును పోషించువాడు.
- సర్వోత్తమ శబ్దాలైన వేదములే తన స్వరూపముగా గలవాడు.
- భజన, నామ, సంకీర్తనాది శ్రేష్ఠమైన శబ్దములద్వారా కీర్తింపబడువాడు.
- ఉత్కృష్టమైన అంబరము, అనగా పీతాంబరమును ధరించువాడు

## ఓం ఉదుంబరాయ నమః

ఉత్-అంబరః - ఉదుంబరః; అమ్ - గతిశబ్ద సంభక్తిషు - వెళ్ళుట, తినుట, ధ్వనించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వగుణైః ఉద్గతమ్ అంబరమ్ - పరమ్ ధామ అస్య ఇతి ఉదుంబరః.** శ్రీలక్ష్మీనిలయమై, అన్నింటికంటె గొప్ప వైభవము (ఉత్) కలిగిన పరంధామము (శ్రీ వైకుంఠము) తన నివాసముగా కలిగినవాడు ఉదుంబరుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అంబరాత్ ఉద్గత ఉదుంబరః.** ఆకాశముకంటె మిక్కిలి పై స్థాయిలో ఉండువాడు, అనగా అందరికంటె అధికుడు ఉదుంబరుడు.

శ్రీ చిన్మయానంద – ఫలితముకంటె కారణము గొప్పది మరియు సూక్ష్మమైనది. అన్నింటికి మూలమైన నారాయణుడు ఆకాశమునకు కూడ అందనివాడు. ఉదుంబరుడు.

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – ఉర్క్ అనగా అన్నము అనే భావమునుండి; **ఉర్క్-అన్నమ్, తదాత్మనా విశ్వమ్ పోషయన్ ఉదుంబరః.** అన్నము మొదలైనవానిద్వారా విశ్వమును పోషించువాడు ఉదుంబరుడు. ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన ఉదాహరణ. **ఊర్గవా అన్నద్ యద్ ఉదుంబరమ్** (తైత్తరీయ బ్రాహ్మణము 1.2.7, 1.3.8).

శ్రీ వాసిష్ఠ – అమ్ - శబ్దే - ధ్వనించుట; **ఉచ్చైః సర్వతః ఉత్తమో వేదరూపః శబ్దో యస్య స ఉదుంబరః సర్వేశ్వరో విష్ణుః.** సర్వోత్తమ శబ్దములైన వేదములే తన స్వరూపముగా కలిగినవాడు సర్వేశ్వరుడైన విష్ణువు ఉదుంబరుడు.

శ్రీ వాసిష్ఠగారి మరొక వ్యాఖ్య – **ఉత్ సర్వత ఉత్కృష్టత్వేన అంబ్యతే - శబ్ద్యతే సంకీర్త్యత ఇతి ఉదుంబరః.** ఉత్కృష్ట శబ్దములైన సంకీర్తనలచే కీర్తింపబడువాడు ఉదుంబరుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ఉత్ - ఉత్కృష్టమ్ అంబరమ్ - పీతాంబరమ్ యస్య సః ఉదుంబరః.** సర్వోత్తమమైన పీతాంబరమును ధరించువాడు ఉదుంబరుడు.

## న్యగ్రోధోదుంబరః

- భగవానుడు శ్రీలక్ష్మీసమేతుడై అత్యంతవైభవముగా పరమపదమున ఉండి, సకల దేవతలచేత పూజలు అందుకొంటూఉండి కూడా, అతి నీచులతో కూడా సేవింపబడేవాడు. అత్యల్పజీవులకు కూడా అందుబాటులో ఉన్నవాడు.

## ఓం న్యగ్రోధోదుంబరాయ నమః

ఇంతకు ముందు 'న్యగ్రోధః', 'ఉదుంబరః' అనే నామములకు వేరువేరుగా అర్థాలు చూశాము. ఇప్పుడు ఆ రెండింటినీ ఒకేనామంగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించిన విధం చూద్దాము.

'న్యగ్రోధః'కు శ్రీ భట్టులు చెప్పిన అర్థం – భగవంతుడు తనముందు చేతులు జోడించి ఉండే భక్తులకు అందుబాటులో ఉంటాడు (చెప్పుచేతలలో).

'ఉదుంబరః'కు శ్రీ భట్టులు చెప్పిన అర్థం – సకలవైభవయుతము, శ్రీ లక్ష్మీనిలయము అయిన పరమపదము తన నివాసంగా గలవాడు.

ఈ రెండింటినీ కలిపితే వచ్చే అర్థం – భగవంతుడు సర్వోత్తమమైనవి అన్నీ కలిగియున్నాగాని, తన భక్తులు చేతులు జోడించి ఎదుట నిలిస్తే వారి ఆనతి పాటిస్తాడు. **అత్యుచ్ఛ్రిత సేవ్యోఽపి అత్యంత నీచానామపి అనువర్తన సాధ్యః.** ఎందుకంటే భగవంతుడు భక్తసులభుడు. ఎంపెరుమాన్ యొక్క ఈ సౌలభ్యాన్ని భాషతో వర్ణించ సాధ్యం కాదు. శ్రీ భట్టుల వ్యాఖ్యలోని వైశిష్ట్యాన్ని చెప్పడానికి ఈ నామము వ్యాఖ్య ఒక చక్కని ఉదాహరణ. అందుకే శ్రీ భట్టుల వ్యాఖ్యానానికి 'భగవద్గుణ దర్పణము' అని పేరు పెట్టారు. ఎందుకంటే ఆ వ్యాఖ్యానంలో భగవంతుని సౌశీల్యము, సౌలభ్యము అనే గుణాలు మరల మరల ప్రస్తావింపబడ్డాయి.

**న్యగ్భూతైః ప్రణతైః స్వానుగ్రహౌన్ముఖ్యేన రుధ్యతే యో వ్యవస్థాప్యతే నిత్యం న్యగ్రోధ స్స ఉదాహృతః**
**గుణ త్రయాదుద్గతం యత్ పరంధామ చాంబరం లక్ష్మీపరిజనాధిశ్చ యస్యాస్తి స ఉదుంబరః**
**న్యగ్రోధోదుంబర ఇతి హ్యేక నామ ప్రకీర్తితమ్**
**అత్యుచ్ఛ్రితానామ్ సేవ్యో యోఽప్యత నీచానువర్తనాత్**
**న్యగ్రోధోదుంబర స్సస్యాత్ దశార్ణ సర్వసిద్ధిద**

ఉదంబరుడు అనగా గుణత్రయముతో కలియక వాటిని దాటియుండు పరమపదము తనకు నివాసస్థానముగా గలవాడు. పరమపదములో లక్ష్మీదేవితో కూడియున్నవాడు. మహాత్ములచేతనేగాక అతి నీచులతో కూడా సేవింపబడువాడు. న్యగ్రోధోదుంబరుడు అను ఇది ఒకేనామము. దశాక్షరి. సర్వసిద్ధిప్రదము. ఓం న్యగ్రోధోదుంబరాయ నమః.



శ్రీ వల్లభాచార్యులు 1506 సంవత్సరంలో సాధుపాండే వద్ద గోవర్ధనగిరి ప్రాంతములో శ్రీనాధుని విగ్రహమునకు వందనమొనర్చుట. పుష్టిమార్గ సంప్రదాయానికి ఇది ఆద్యము.

https://commons.wikimedia.org/wiki/File:Shrinathji_discovered.jpg

## 828. అశ్వత్థః

- అనిత్యములైన ఇంద్రాది దేవతలను ఏర్పరచి, వారిద్వారా సకల కార్యములను నిర్వర్తించువాడు.
- సంసారమనే అవ్యయమైన అశ్వత్థవృక్షము (రావిచెట్టు) తన స్వరూపముగా కలవాడు.
- సదా మారుతూ ఉండే జగత్తును శాశ్వతంగా ఏలేవాడు.
- పంచభూతములుగా విశ్వమంతా వ్యాపించినవాడు.

### ఓం అశ్వత్థాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – అ+శ్వ+స్థః – అశ్వస్థః – అశ్వత్థః. పృషోదరాది వ్యాకరణసూత్రం ప్రకారం 'స'బదులు 'త' వస్తుంది. శ్వ-రేపు; అశ్వ-రేపు లేనిది, అనగా శాశ్వతమైనది; స్థః-నియమించువాడు; **న శ్వః, అనిత్యమ్, ఇంద్రాదిత్యాది పదమ్ ఏషామ్, తేషు నియామకతయా తిష్ఠతి ఇతి అశ్వస్థః.** అనిత్యములైన ఇంద్రుడు, బ్రహ్మ, ఆదిత్యుడు వంటి పదవులను నియమించువాడు అశ్వత్థుడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణమునుండి ఉదాహరించారు.

**మూర్తిమ్ రజోమయీం బ్రాహ్మీమ్ ఆశ్రిత్య సృజతి ప్రజాః**
**ఆశ్రిత్య పౌరుషీమ్ మూర్తిమ్ సాత్వికీమ్ యః స పాలయన్**
**కాలాఖ్యామ్ తామసీమ్ మూర్తిమ్ ఆశ్రిత్య గ్రసతే జగత్**
రజోగుణాత్మకుడైన బ్రహ్మయందుండి భగవానుడు జగత్తును సృష్టిస్తాడు. సత్వగుణాత్మకుడైన విష్ణువుగా లోకములను పాలిస్తాడు. తమోగుణమూర్తియైన కాలునిగా (శివునిగా) విశ్వమును కబళిస్తాడు.

**అనిత్యమింద్రాది పదం యేషాం తేష్వపి నిత్యశః**
**నియామకత్వేనాశ్వత్థః తిష్ఠతీతి స కీర్తితః**
ఇంద్రాది దేవతల స్థానములు నిత్యమైనవి కావు. అటువంటి పదవులందున్నవారిని తాను నిత్యుడైయుండి శాశించేవాడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 5.2.8 – అనేక ఐహిక భాగ్యాలకై మీరు పూజించే దేవతలు పన్ను వసూలు చేసే అధికారులవంటివారు. దేవదేవుడైన నా దేవుడువారిని నియమించువాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా ఒక వ్యాఖ్యలో 'శ్వస్-రేపు' అనగా 'కాలము' అనే అర్థాన్ని వాడారు. **శ్వః - కాలే, తిష్ఠతి ఇతి శ్వత్థః, న శ్వత్థః అశ్వత్థః, కాల బాహిర్భూతో భగవాన్ విష్ణుః.** కాలముకు అతీతుడైన భగవానుడు విష్ణువు అశ్వత్థుడు. శాశ్వతుడు. ఇందుకు శ్రీ వాసిష్ఠ కఠోపనిషత్తు (2.3.1)నుండి ఉదాహరించారు –

**ఊర్ధ్వమూలోఽవాక్ శాఖ ఏషోఽశ్వత్థ సనాతనః**
**తదేవ శుక్రమ తద్ బ్రహ్మ తదేవామృతముచ్యతే**
శాశ్వతమైన రావిచెట్టుకు వ్రేళ్ళు పైకి, కొమ్మలు క్రిందికి ఉంటాయి. అది ప్రకాశవంతమైనది. బ్రహ్మము. అంతము లేనిది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అశ్వత్థ ఇవ తిష్ఠతి ఇతి అశ్వత్థః.** రావిచెట్టురూపంలో ఉన్నవాడు అశ్వత్థుడు. ఇలా తల్లక్రిందులుగా ఉన్న అశ్వత్థవృక్షం గురించి గీతలోను, ఉపనిషత్తులలోను ప్రస్తావించారు.

**ఊర్ధ్వమూల మధశ్శాఖమ్ అశ్వత్థమ్ ప్రాహురవ్యయమ్**
**ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్** – గీత 15.1

ఆదిపురుషుడైన పరమేశ్వరుడే (పైనుండు) మూలముగా, బ్రహ్మయే ముఖ్యశాఖ (కాండము)గా, వేదములే ఆకులుగా గల ఈ సంసారరూప అశ్వత్థ వృక్షము నాశరహితమైనది (శాశ్వతమైనది). ఈ సంసారవృక్ష తత్వమును మూలసహితముగా తెలిసినవాడు నిజముగా వేదార్థములను ఎఱిగినవాడు. ఈ సంసారమనెడు అశ్వత్థవృక్షము వివిధ జీవుల రూపములో అన్నియెడల విస్తరించియున్నది. దానియందు ఆకుల రూపములో జ్ఞానము ప్రవర్తిల్లుచున్నది. ఈ జ్ఞానము (వేదము) రెండు విధములు (1) సంసారమును పొడిగించే కామ్యకర్మలు, పూజాదికములు (2) కామాదులవలన విస్తరించే ఈ వృక్షమును ఛేదించే జ్ఞానము. శ్రుతులలో కూడ సంసారమును అశ్వత్థవృక్షముతో పోల్చారు.

**ఊర్ధ్వమూలోఽవాక్ శాఖ ఏషోఽశ్వత్థ సనాతనః** – కఠోపనిషత్తు 2.3.1
**ఊర్ధ్వమూల మవాక్ శాఖమ్ వృక్షమ్ యో వేద సంప్రతి** – (?)అరణ్యకము 1.11.5

శ్రీ బలదేవ విద్యాభూషణ – అశ్వత్థము - ప్రపంచము. **శ్వస్తాద్ రూపేణ న స్థాతేతి అశ్వత్థః ప్రపంచః; స అస్య అస్తి నిత్యమ్ నియమ్యత ఇతి అర్థః.** స్థిరముగానుండక, ఎప్పుడూ మారుతూనే ఉండే ప్రపంచమును పాలించేవాడు అశ్వత్థుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – అశ్ - వ్యాప్తౌ సంఘాతే చ - వ్యాపించుట, పోగుపడుట. **అశ్నువతే - వ్యాప్నువంతి విశ్వమ్ ఇతి అశ్వాని - పంచమహాభూతాని, తేషు వ్యాపకత్వేన అస్థితః అశ్వత్థః.** పంచమహాభూతముల రూపంలో విశ్వమంతటా వ్యాపించినవాడు అశ్వత్థుడు.

## 829. చాణూరాంధ్ర నిషూదనః

- చాణూరుడు అనే మల్లయోధుని సంహరించినవాడు.
- సాత్వికులను పీడించేవారిని కఠినంగా శిక్షించేవాడు.
- చాణూరుడు, దుర్యోధనుడు మొదలగువారిని పరిమార్చినవాడు.

ఓం చాణూరాంధ్ర నిషూదనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తద్విరోధినమ్ చాణూర నామానామ్ మల్లమ్ నిషూదితవాన్ ఇతి చాణూరాంధ్ర నిషూదనః.** ఆంధ్రజాతి (తక్కువ జాతికి)కి చెందిన, ఇంద్రాదులకు శత్రువైన, చాణూరుడు అనే మల్లుని హతమార్చినవాడు చాణూరాంధ్ర నిషూదనుడు. (ఈ చాణూరుడు, కంసుడు కృష్ణుని చంపడానికి పంపిన చాణూరుడు వేరు వేరు అని, ఇద్దరూ మల్లులేనని, శ్రీ వి.ఎన్. వేదాంతదేశికన్ వ్యాఖ్యానించారు.)

**చాణూరాఖ్యాసురం యోఽరిం మల్లం సూదితవాంశ్చవః**
**ప్రోచ్యతే మునిభిర్నిత్యం చాణూరాంధ్ర నిషూదనః**

ఈ నామంలో 'ఆంధ్ర' అనే పదానికి వివిధ వ్యాఖ్యాతలు వివిధ అర్థాలు చెప్పారు. ఆంధ్రజాతి, ఆంధ్రదేశము, తక్కువజాతి – ఇలా.

శ్రీశంకరుల వ్యాఖ్యకు కొందరు చెప్పిన వివరణ ప్రకారం ఆంధ్రదేశానికి చెందిన చాణూరుని కంసుడు పంపాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – చణ్ - దానే గతౌ చ - ఇచ్చుట. **చణతి - దదాతి దానశీల సాత్విక వృత్తయః చాణూరః.** దానమువంటి కార్యములు చేయు సాత్వికులు చాణూరులు.

చై - పూజా నిశామనయోః - పూజించుట, పరిశీలించుట. **చాయ్యంతే పూజయన్తే ఇతి చాణూరః, ప్రశస్త హృదయ సాధవః.** పూజాదులు చేసే సాధువులు చాణూరులు.

అంధ - దృష్ట్యుపఘాతే దృశ్యుపసంహారే - కళ్ళు మూసుకొనుట, గ్రుడ్డివారగుట. **అంధయతి ఇతి అంధ్ర.** గ్రుడ్డివారు, అంధ్రులు, అనగా మోసము చేయువారు.

చాణూరాంధ్రులు – సాధువులను మోసము చేయువారు.

సూద్ - క్షరణే - నాశనము చేయుట.

నిషూదన - అనేకవిధాలుగా నొప్పిని కలిగించువాడు.

చాణూరాంధ్రనిషూదనః – సాత్వికులను హింసించేవారిని కఠినంగా శిక్షించేవాడు చాణూరాంధ్రనిషూదనుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ **'చాణూరాంధ నిషూదనః'** అనే పాఠాన్ని గ్రహించారు. **చాణూరశ్చ అంధాశ్చ దుర్యోధనాదయః, తాన్ నిషూదయతి ఇతి.** సత్యాన్ని, ధర్మాన్ని చూడలేని గ్రుడ్డివారు దుర్యోధనాదులు (ధృతరాష్ట్రుని కొడుకులు అని కూడ). అట్టి అంధులను, చాణూరుని నాశనం చేసినవాడు చాణూరాంధనిషూదనుడు.





శ్రీ బలరామ కృష్ణులు కంసుని మల్లులతో పోరాడి మట్టుపెట్టుట. 1550, 1600 కాలాల రెండు చిత్రాల సంకలనం.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_and_Balarama_Fight_the_Evil_King_Kamsa%E2%80%99s_Wrestlers.jpg
https://commons.wikimedia.org/wiki/
File:Krishna_Killing_King_Kamsa_and_Balarama_Slaying_a_Wrestler_LACMA_AC1995.163.1.jpg

**శ్రీ వేంకటేశ్వర వచనములు – శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు.**

గోపికా వల్లభా! నేఁదలపోయంగా ఫలియించిన మేలు, మఱియు నే వెదకంగా దొరకెడు పదార్థంబులు, నేఁగోరంగా వచ్చు లాభంబు, నేఁజదువంగా దెలిసిన యర్థంబు, నే గడియించుకొనంగా సిద్ధించిన ధనంబు, నా నేర్పువలనఁ దెచ్చుకొనియెడి సుఖంబు, నా చేతులఁ జేసిన పుణ్యంబు, నా తపోబలిమిం గైకొను లోకంబు, నా పురాకృతఫలంబు, నా మనోరథంబు, నీవే. నా నుదుట బ్రహ్మదేవుండు వ్రాసిన వ్రాలు, నే జన్మించిన జన్మకారణము, నా యంతరంగంబులో నున్న మూర్తి నీవే సుమీ! నా కలిమి విన్నవించితి శ్రీ వేంకటేశ్వరా!.



## సహస్రార్చిః సప్తజిహ్వః సప్తైధాః సప్తవాహనః |
## అమూర్తిరనఘోऽచింత్యో భయకృద్భయనాశనః || (89)

### 830. సహస్రార్చిః

- వేలాది (అనంతమైన) కిరణములు కలిగి విశ్వమునంతనూ ప్రకాశింపజేసేవాడు.
- ఆయన దివ్యమంగళవిగ్రహము (తిరుమేణి) ఎంతగా వెలిగిపోతున్నదంటే, వేలాది కాంతికిరణాలు ఆయననుండి వెలువడుతున్నట్లున్నాయి.

ఓం సహస్రార్చిషే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతునినుండి (అంతులేని) కాంతికిరణాలు వెలువడుతున్నాయి. సూర్యచంద్రాదులనుండి వచ్చే కాంతికూడా భగవంతుని కాంతియే. భగవంతుడు ఇచ్చిన కాంతి కారణంగా సూర్యుడు నాలుగు కార్యములు – పచనము (వండుట, పండించుట), శోషణము (ఎండించుట), ప్రతాపనము (వేడి చేయుట), ప్రకాశనము (వెలుగునిచ్చుట) – అనేవి చేయగలుగుతున్నాడు. **సూర్యే సహస్రమర్చీషి శోషణాదిషు హేతవః అనివిష్టాని యేనాసౌ సహస్రార్చిరితి స్మృతః**

ఇందుకు శ్రీ భట్టులు పౌష్కరసంహితమునుండియు, గీత (15.12)నుండియు ఉదాహరించారు.

**అగ్నీషోమాత్మ సంజ్ఞస్య దేవస్య పరమాత్మనః**
**సూర్యచంద్రాంసౌ విద్ధి స ఆకారౌ లోచనేశ్వరః** – శ్రీ పౌష్కరము
అగ్నిషోమాత్ముడనే పరమాత్మునికి సూర్యుడు, చంద్రుడు అనే దేవతలు రెండు కన్నుల స్వరూపములు అని తెలిసికొనుము.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేऽఖిలమ్**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్** – గీత 15.12
సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సును, అటులనే చంద్రుని తేజస్సును, అగ్ని తేజస్సును నా తేజస్సేయని యెఱుంగుము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సహస్రాణి అనంతాని అర్చీషి యస్య సః సహస్రార్చిః**. వేలకొలది, అనగా అనంతమైన కిరణములు కలిగినవాడు సహస్రార్చి. ఇందుకు శ్రీ శంకరులు గీతనుండి ఉదాహరించారు.

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా**
**యది భాః సదృశీ సా స్యాత్, భాసస్తస్య మహాత్మనః** – గీత 11.12
ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాంతిపుంజములును ఆ విరాట్-రూప తేజస్సులకు సరికావు.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (3.4.7)లో ఎంపెరుమాన్ ను **'ఒళి మణివణ్ణన్'** (రత్నమువలె ప్రకాశించుచున్నవాడు) అని వర్ణించారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సహస్రాణి అర్చీషి శ్రీవిగ్రహోద్గత కాంతికిరణ యస్య ఇతి సహస్రార్చిః**. ఎవని దివ్య తిరుమేని వేలాది కాంతిపుంజములతో వెలుగుచున్నదో అతడు సహస్రార్చి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఇదే అర్థంతో ఉన్న ఇతర నామములను గమనింపదగును – **దీప్తమూర్తిః** (77వ శ్లోకము, 724వ నామము), **సహస్రాంశుః** (51వ శ్లోకము, 484వ నామము).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భూమిపై ఇసుక రేణువులు, సూర్యుని కిరణాలు లెక్కించలేము. ఇంక అనంతమైన భగవద్వైభవమును ఎలా కొలువగలము? ఎలా వర్ణింపగలము? సూర్యునికాంతి భగవంతుని కాంతిలో కొద్ది భాగము అని మాత్రము గ్రహింపనగును. శ్రుతులలో భగవంతుని విభవమును 'సహస్ర' పదంతో అనేకమార్లు వర్ణించారు – **సహస్రయాజసః, సహస్రపర్ణః, సహస్రపాత్, సహస్రశీర్షః, సహస్రాక్షః, సహస్రసోషమ్, సహస్రపోషిణమ్, సహస్రభావః, సహస్రమృష్టిః, సహస్రభరః, సహస్రయామా, సహస్రవీరమ్, సహస్రశృంగః, సహస్రస్థూణమ్, సహస్రకేతుమ్, సహస్రచక్షసమ్,........**

(శ్రీ కైవల్యసారథినుండి) భైరవ యామళము – పరమేశ్వరినుండి అనేక కోట్ల కిరణాలు ప్రకాశిస్తున్నాయి. అందులో 11 కిరణములను సూర్యుడు, 108 కిరణములను అగ్ని, 136 కిరణములను చంద్రుడు తీసుకొన్నారు. వీరివల్లనే జగద్వ్యాపారము జరుగుతున్నది.

## 831. సప్తజిహ్వః

- ఏడు నాల్కలు గలవాడు. అగ్నిస్వరూపుడు.

### ఓం సప్తజిహ్వాయ నమః

జిహ్వ అంటే నాలుక. అగ్నికి ఏడు నాల్కలు ఉంటాయని పురాణకథనం. ఈ 'సప్తజిహ్వః' నామమును వ్యాఖ్యాతలు అగ్నిపరంగా వివరించారు. **యస్మాత్కాళ్యాది జిహ్వాశ్చ అగ్నేర్భవతి సప్త చ స సప్తజిహ్వాఖ్యాతః లోకసంతర్పణేంతః.** లోకాలను అనందింపజేయడంకోసం పరమేశ్వరుడు అగ్నిదేవుడికి ఏడు నాలుకలనిచ్చాడు (అగ్నిరూపంలో పరమేశ్వరుడు ఏడు నాల్కలు కలిగియున్నాడు). అగ్నిహోత్రుని ఏడు నాల్కల పేర్లు –

1. కాళి – నల్లనిది.
2. కరాళి – భయంకరమైనది.
3. మనోజవ – మనసువంటి వేగము గలది.
4. సులోహిత – ఎరుపురంగు గలది.
5. సుధూమ్రవర్ణ – దట్టమైన పొగరంగు గలది.
6. విస్ఫులింగిని – రవ్వలు ఎగజిమ్మునది.
7. విశ్వరుచి – (దేవీ వేలాయమానా) అనేకరూపములు కలిగిన దేవత.

శ్రీ భట్టులు పౌష్కరసంహితనుండి కూడా ఉదాహరించారు.

**తద్వక్త్ర దేవతానాంచ హుతభుక్ పరమేశ్వరః**
**మంత్రపూతం యదాదాయ హుతమాజ్య పురస్సరమ్**
**బ్రహ్మాండభువనం సర్వం సంతర్పయత స్సర్వదా**

అగ్నిని ముఖంగా గల దేవతల రూపంలో హవిస్సును తీసుకునేవాడు పరమేశ్వరుడు. మంత్రసహితముగా నేయి, హోమద్రవ్యాలు అగ్నిముఖంగా ఆరగిస్తాడు. విశ్వమునకు సంతోషం కలిగిస్తాడు.

శ్రీ శంకరులు ముండకోపనిషత్తు (1.2.4)నుండి ఉదాహరించారు –

**కాళీ కరాళీచ మనోజవాచ సులోహితాయాచ సుధూమ్రవర్ణా**
**స్ఫులింగినీ విశ్వరుచీచ దేవీ వేలాయమానా ఇతి సప్తజిహ్వాః**

ఇతర శ్రుతివాక్యాలలో కూడా ఏడు నాల్కల గురించి ఉన్నది

ఋగ్వేదము 3.6.2 – **దివశ్చదగ్నే మహినా పృథివ్యా వచయన్తామ్ తే వహనాయః సప్తజిహ్వాః**
తైత్తరీయ సంహితము 1.5.3 – **సప్తతే అగ్నే సామిధః సప్తజిహ్వాః**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సాత్విక, రాజసిక, తామసిక కర్మలనుబట్టి ఈ సప్తజిహ్వాలు మారుతుంటాయి.

సాత్విక కర్మలో – హిరణ్యా, కనక, రక్తా, సుప్రభా, అతిర్కృతా, బహురూపా.
రాజసిక కర్మలో – పద్మరాగా, సువర్ణా, భద్రలోహితా, శ్వేతా, ధూమినీ, కాళికా.
తామసిక కర్మలో – కాళీ, కరాళీ .. మొదలగునవి.
ఈ ఏడు జిహ్వాలకు సంబంధించిన దేవతలు – దేవతలు, పితరులు, గంధర్వులు, యక్షులు, నాగులు, పిశాచములు, రాక్షసులు.

శ్రీ వాసిష్ఠ 'సప్తజిహ్వ' అంటే 'ఏడు నాల్కలు' అనే అర్థంలో మాత్రమే కాకుండా, 'సప్త' అంటే 'అనేక' అనే అర్థంలో మరొక వ్యాఖ్య చెప్పారు. **సప్త ఇతి అనేక ఉపలక్షణమ్ అనేక ప్రకార జిహ్వామ్ విధత్త ఇతి**. జీవులకు అనేక విధములైన నాలుకలను భగవంతుడు ప్రసాదిచాడు. మనం తిన్న అన్నం నాలుకద్వారా ప్రాణవాయువును కలుపుకొని జఠరాగ్నిలోనికి ప్రవేశిస్తుంది. అంటే ఇక్కడకూడా మనం అగ్నికి అహారాన్ని సమర్పిస్తున్నామన్నమాట. అంటే వేదాలలో చెప్పింది, నిజరీతిలో జరిగేదీ ఒకటే. **భవతి లోకేన సమో వేదో వేదేన చ సమోలోకః.**

శ్రీ చిన్మయానంద – మన ముఖంలో ఏడు జ్ఞానద్వారాలున్నాయ – రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు నాసికారంధ్రాల, ఒక నోరు. బాహ్యప్రపంచాన్ని గురించిన జ్ఞానభావన వీనిద్వారా కలుగను. అంటే ఒకవిధంగా ఏడు అగ్ని నాలుకలు ఏడు జ్ఞానద్వారాలద్వారా బయటకు వెడలుచున్నాయి. మన హృదయంలో ఉన్న శ్రీమన్నారాయణుని సప్తజిహ్వాలుగా వీటిని అలంకారికముగా చెప్పవచ్చును.

## 832. సప్తైధాః

- ఏడు విధములైన సమిధలచే ప్రజ్వలింపబడువాడు.
- ఏడు విధములైన వైదిక క్రియలచే ఆరాధింపబడువాడు.
- ఏడు దీప్తులచే ప్రకాశించువాడు.
- సప్తర్షులకు ఆధారమైనవాడు.

**ఓం సప్తైధసే నమః**

ఇంతకుముందు నామము 'సప్తజిహ్వః'ను ఏడు విధాలైన మంటలు (అగ్నికీలలు లేదా నాలుకలు) పరంగా వ్యాఖ్యానించారు. వాటి రంగులు లేదా గుణాలు, మరియు వానిద్వారా హవిస్సును స్వీకరించే దేవతల గురించి కూడా చెప్పారు. ప్రస్తుతనామము 'సప్తైధాః'ను ఆ మంటలను వివిధ యజ్ఞాలలో ప్రజ్వలింపజేసే సమిధల పరంగా వ్యాఖ్యానించారు.

ఎధ్ - వృద్ధౌ - పెరుగుట, వర్ధిల్లుట; ఏధాస్ - మంటలను పెంచే పదార్థము, సమిధ. సప్త ఏధాః యస్య సన్తి సః సప్తైధాః (నిరుక్తి).

ఏధాస్ - సమిధ (అష్టే నిఘంటువు). **యథైధాంసి సమిధోగ్నిర్భస్మాత్ కురుతేऽర్జున** (గీత 4.37).

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఏడు విధాల సమిధలద్వారా ప్రజ్వలింపబడిన అగ్నివలె ప్రకాశించువాడు 'సప్తైధాః'. వివిధ యజ్ఞాలలో అగ్ని వివిధ సమిధలద్వారా ప్రజ్వలింపబడుతుంది. యజ్ఞాలలో రకాలను శ్రీ శ్రీనివాస రాఘవన్ మరింత వివరించారు.

- పాకయజ్ఞములు (వంటలతో కూడినవి): 1. ఔపాసనము 2. వైశ్వదేవము 3. స్థాలీపాకము 4. అష్టకశ్రాద్ధము 5. మాసికము 6. ఈశానబలి 7. సర్పబలి.
- హవిర్యజ్ఞములు (మంటలో హవిస్సు వేయునవి): 1. అగ్నిహోత్రము 2. దర్శపూర్ణమాసము 3. పిండపితృయజ్ఞము 4. పశుబంధము 5. అగ్రాయణము 6. చాతుర్మాస్యము 7. సౌత్రామణి.
- సోమసంస్థలు (యాగములు): 1. అగ్నిష్టోమము 2. అత్యగ్నిష్టోమము 3. ఉక్థ్యము 4. షోడశము 5. వాజపేయము 6. అతిరాత్రము 7. అప్తోర్యామము.

వివిధ యజ్ఞాలలో వాడబడే సమిధలు వివిధ వృక్షాలనుండి తీసికొనబడుతాయి. ఈ వృక్షాలలో పూలు కనిపించవుగాని పండ్లు కనబడుతాయి (1) పలాశవృక్షము (2) మఱ్ఱిచెట్టు (3) Fig Tree (మేడి?) (4) పనసచెట్టు (5) శమీవృక్షము (6) అశనిహతము (7) పుష్కరపర్ణము.

శ్రీ కైవల్యసారథినుండి –

**వనస్పత్యోశ్చ సమిధః సప్త సంస్థాని వా తథా ఇష్టాపూర్తాది కర్మాణి సప్తైధా స్సంతి యస్య సః**
(1) అశ్వత్థః (2) ఉదుంబర (3) పర్ణ (4) శమీ (5) వైకంతక (6) అశనిహత (7) పుష్కరపర్ణ – అనే ఏడురకాలయిన వృక్షములకు సంబంధించిన సమిధలు గలవాడు. ఇష్టా, పూర్తి కర్మలు కలవాడు.
ఇష్టాకర్మలు – అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదానుపాలన, ఆతిథ్యము, వైశ్వదేవము.
పూర్తములు – వాపీకూపతటాకాలు, దేవాలయాల ప్రతిష్ట, సత్రవులు కట్టించడము, అన్నదానము మొదలైనవి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సప్త ఏధాంసి దీప్తయోऽస్య ఇతి సప్తైధాః**. ఏడు మంటలతో ప్రకాశించు అగ్ని సప్తైధ. ఇందుకు శ్రీ శంకరులు శ్రుతినుండి ఉదాహరించారు. **సప్త తే అగ్నే సమిధః సప్తజిహ్వః** (తైత్తరీయ సంహితము 1.5.3). ఓ అగ్నిదేవా! నీకు ఏడుమంటలు, ఏడు నాల్కలు ఉన్నాయి.

శ్రీ సత్యసంధ యతిరాజ – **సప్తర్షీన్ ఏధయతి వర్ధయతి ఇతి సప్తైధాః**. సప్తర్షులకు ఆధారముగానుండి, వారికి ఆనందము కలిగించువాడు సప్తైధ. సప్తర్షులు అనగా మరీచి, అత్రి, అంగిరసుడు, పౌలస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు.

## **533.** సప్తవాహనః

- ఏడు వేదమంత్రములకు రూపములైన ఏడు గుర్రములుగల వాహనము గలవాడు.
- ఏడు సూర్యుల రూపములో జగత్తునకు ఆధారమైనవాడు.

- ఏడు వాయుమండలములద్వారా ముల్లోకములకు ఆధారమైనవాడు.
- 'సప్త' అనే పేరుగల గుఱ్ఱము పూన్చిన రథము గలవాడు.
- జీవుల శరీరంలో ఏడు ద్రవములు, ముఖంలో ఏడు జ్ఞానద్వారములు – ఇలా ఏడు సంఖ్యలో జీవుల రక్షణకు కారణమైనవాడు.
- ఏడు లోకములకు సమృద్ధి కూర్చువాడు.

## ఓం సప్తవాహనాయ నమః

వాహ్ - ప్రాపనే - లాగుట, మోయుట, ప్రవహించుట. వాహనము అంటే బండి లేదా దానిని లాగే జంతువు. ఏడు వాహనములు గలవాడు సప్తవాహనుడు.

**సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్**
**శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఏడు గుఱ్ఱములు పూన్చిన రథముగల సూర్యుడు తన వాహనముగా గలవాడు సప్తవాహనుడు. ఈ ఏడు గుఱ్ఱములు ఏడు వేదమంత్రములకు అధిష్ఠానదేవతలుగా భావింపబడుతున్నవి.

ఆ ఏడు మంత్రములు – 1. భూః 2. భువః 3. సువః 4. మహః 5. జనః 6. తపః 7. సత్యమ్. ఈ ఏడు మంత్రములకు సంబంధించిన ఛందస్సులు – 1. గాయత్రి 2. ఉష్ణిక్ 3. అనుష్టుప్ 4. బృహతి 5. పంక్తి 6. త్రిష్టుప్ 7. జగతి. ఈ ఏడు మంత్రములకు అధిష్ఠాన దేవతలు – 1. అగ్ని 2. వాయువు 3. అర్క (సూర్యుడు) 4. వాగీశ (బృహస్పతి) 5. వరుణ 6. ఇంద్ర 7. విశ్వేదేవ. ఈ ఏడుగురు దేవతలు సూర్యుని మార్గములో ముందుగా నడచుదురు. ఈ ఏడుగురు దేవతలు, సంబంధిత ఏడు మంత్రములు, ఏడు ఛందస్సులద్వారా సూర్యునికి ఆధారమైనవాడు గనుక భగవంతుడు సప్తవాహనుడు. సూర్యమండల మధ్యస్థుడైన ఆయనను మనము ఈ ఏడు ఛందస్సులలో నిక్షిప్తమైన ఏడు మంత్రములద్వారా ఆరాధిస్తున్నాము.




**యోవహత్య విలస్కందాన్ సప్తాసౌ సప్తవాహనః**
**వాహనానిచ సన్న్యస్య సప్తవా సప్తవాహనః**

**హయశ్చ సప్త ఛ్చందాంసి తేషామ్ నానాని మే శ్రుణు**
**గాయత్రి బృహత్ ఉష్ణిగ్ జగతీ త్రిష్టుపేవచ**
**అనుష్టుప్ పంక్తిరిత్యుక్తాశ్ఛందాంసి హరయో రవేః** – విష్ణుపురాణము 2.8.5

https://commons.wikimedia.org/wiki/File:Shri_Surya_Bhagvan_bazaar_art,_c.1940%27s.jpg

శ్రీ సత్యసంధ యతిరాజ – **సప్తవాహా అశ్వా యస్య స సప్తవాహః, సూర్యస్తం నయతి ఇతి సప్తవాహనః.** ఏడు గుఱ్ఱములు కలిగిన సూర్యుని నడిపించువాడు సప్తవాహనుడు.

శ్రీ శంకరులు – **సప్త అశ్వా వాహనాని అస్య ఇతి సప్తవాహనః.** ఏడు గుఱ్ఱములు కలిగిన సూర్యుని రూపంలో ఉన్న భగవానుడు సప్తవాహనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **ఆరోగో భ్రాజః పటరః పతంగః స్వర్ణరో జ్యోతిషీమాన్ విభాసః** (అరుణ ప్రశ్నమ్ 20)
ఆరోగః, భ్రాజః, పటరః, పతంగః, స్వర్ణరః, జ్యోతిషీమాన్, విభాసః అనే ఏడుగురు సూర్యులున్నారు. వీరిలో ముగ్గురు మేరుపర్వతం పైభాగాన, ముగ్గురు మేరుపర్వతం క్రిందిభాగాన ప్రకాశిస్తున్నందున మనకు కనుపించరు. ఆరోగుడు అనే సూర్యుడు మాత్రం మనకు కనుపిస్తున్నాడు. ఇలా ఏడుగురు సూర్యులద్వారా జగత్తునకు ఆధారమైన భగవంతుడు సప్తవాహనుడు.
శ్రీ శంకరులు మరొక అర్థం కూడా చెప్పారు – **ఏకోఽశ్వో వహతి సప్త నామా** (తైత్తరీయారణ్యకము 3.11.9, ఋగ్వేద సంహితము (1.164.2) సూర్యుని రథానికి ఒకే చక్రం, ఒకే గుఱ్ఱం ఉంటాయి. ఆ గుఱ్ఱం పేరు 'సప్త'. కనుక సూర్యరూపుడైన భగవంతుడు సప్తవానుడు.

శ్రీ భట్టులు కూడా మరొక వ్యాఖ్య చెప్పారు – ఏడు వాయుమండలముల ద్వారా జగత్తులోని ప్రాణశక్తిని కాపాడువాడు గనుక భగవంతుడు సప్తవాహనుడు. ఈ ఏడు వాయుమండలములు (1) ఆవాహ (2) ప్రవాహ (3) సంవాహ (4) ఉద్వహ (5) పరివహ (6) వివహ (7) పరావహ.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – మన శరీరంలో అనేక విషయాలలో 'ఏడు' సంఖ్య కనిపిస్తుంది. ఏడు ధాతువులు (రస, శృంగ, మాంస, మేధ, అస్తి, మజ్జా, శుక్లములు), ముఖంలో ఏడు ద్వారాలు (రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రాలు, ఒక నోరు.). వీని ద్వారా జీవుల మనుగడ సాగుతుంది.

**సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్ సప్తార్చిష సమిధః సప్తహోమః (జిహ్వాః)**
**సప్తే మే లోకా ఏషు చరన్తి ప్రాణా గుహాశయా నిహితాః సప్త సప్త** – ముండకోపనిషత్తు 2.1.8
(ఈ శ్లోకానికి వివిధ వివరణలున్నాయి). అక్షర పురుషునినుండి ఏడు జ్ఞానేంద్రియాలు, ఏడు నాల్కలు, ఏడు విధాల సమిధలు, ఏడు హోమములు వెలువడ్డాయి. భగవంతుడు ఏడు ఏడు జ్ఞానేంద్రియాలను ప్రాణమనే గుహాశయంలో భద్రపరచాడు. అవి ఏడేడు లోకాలలో తిరుగుతుంటాయి. ఇలా ఏడేడు విధాలుగా జీవాన్ని పరిరక్షిస్తున్నందున భగవంతుడు సప్తవాహనుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సప్తభువనాని వాహయతి ప్రాపయతి అభ్యుదయమ్ ఇతి సప్తవాహనః**. ఏడు లోకాలకు సమృద్ధిని కూర్చువాడు సప్తవాహనుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – శ్రీమద్భాగవతం ప్రకారం భగవంతునికి ఏడు వాహనాలున్నాయి. నాలుగు గుఱ్ఱములు, ఒక రథము, గరుత్మంతుడు, ఆంజనేయుడు. కనుక ఆయన సప్తవాహనుడు.

**తత్ర అశ్వాః శైబ్య సుగ్రీవ మేఘ పుష్ప బలాహకాః స్యందనమ్ చైవ పంచమమ్** – భాగవతము 10.89.49
**ఛందోమయేన గరుడేన సమూహ్యమానః చక్రాయుధో అయగమదాశు యతో గజేంద్రః** – భాగవతము 8.3.31
**భిక్షురూపమ్ పరిత్యజ్య వానర రూపమాస్థితః**
**పృష్టమారోప్య తౌ వీరౌ జగామ కపికుంజరః** – రామాయణము 4.4.34

శ్రీ చిన్మయానంద – సూర్యుని రథానికి ఏడు గుఱ్ఱములు. ఇవి వారములో ఏడు రోజులను సూచించును.

36వ శ్లోకము 333వ నామము, 90వ శ్లోకము 860వ నామము అయిన **'వాయువాహనః'** నామానికి, ప్రస్తుత నామము **'సప్తవాహనః'**కు కొన్ని పోలికలు గమనించవచ్చును.

## 834. అమూర్తిః

- అప్రాకృత దివ్యమంగళ విగ్రహము. కర్మఫలమైన దేహము లేనివాడు.
- ప్రణవంలో అకారంచే సూచింపబడువాడు.

### ఓం అమూర్తయే నమః

**భగవంతుడు కర్మబద్ధులైన జీవులకంటే ఎలా భిన్నమైనవాడో తరువాతి కొద్ది నామాలలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్థూల భౌతిక మూర్తి వ్యావృత్తః అమూర్తిః.** జీవుల దేహము పాంచభౌతికమైనది. కాని భగవంతుని మూర్తి లేదా దేహము పూర్తిగా విలక్షణమైనది. దివ్యమైనది. అలా ఆయన అమూర్తి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ ఉదాహరించినది – ఈశావాస్య ఉపనిషత్తు 8 – **స పర్యగాత్ శుక్రమ్ అకాయమ్ అవ్రణమ్.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మూర్తిః ఘనరూపమ్ ధారణ సమర్థమ్ చరాచర లక్షణమ్, తద్ రహిత ఇతి అమూర్తిః.** 'మూర్తి' అనగా ఘనమైన రూపము కలిగినది. కదులుతుంది లేదా కదలదు. వ్రేలితో తాకడానికి వీలైనది. ఇలాంటి స్థూలరూపము పరమేశ్వరునకు లేదు. కనుక శ్రీమన్నారాయణుడు అమూర్తి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – 'మూర్తి' లేదా 'రూపము' లేదా 'దేహము' మనకు కర్మఫలాలను అనుభవించడంకోసం సంక్రమించింది. భగవంతునికి అలాంటి రూపం లేనందున ఆయన అమూర్తి.

శ్రీ వాసిష్ఠ – బ్రహ్మమనేది స్థిరమైన రూపం లేని అగ్ని వంటిది. ఋగ్వేదము 3.19.1 – **అగ్నిమ్ హోతారమ్ ప్రవృణే మియేధే గృత్సమ్ కవిమ్ విశమ్ ఇదమ్ అమూరమ్** (అమూరమ్ = అమూర్తమ్)

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **అకారో మూర్తిః యస్య ఇతి అమూర్తిః.** అకారముద్వారా సూచింపబడిన రూపము గలవాడు అమూర్తి.

స్వామి దేశికన్ – రహస్యత్రయ సారమ్ – అష్టశ్లోకి – **అకారార్థో విష్ణుః జగదుదయ రక్షా ప్రళయ కృత్.** అకారమునకు అర్థము విష్ణువు. ఆయనే జగత్తునకు సృష్టి, రక్ష, ప్రళయము కలిగించుచున్నాడు.

శ్రీ వాసిష్ఠ – **ఆత్మాహి అమూర్తిర్వహతే చ మూర్తమ్ గాత్రమ్ యథా నామ తథా భుపైతి విష్ణూర్హి అమూర్తిః సకలమ్ చ విశ్వమ్ వహన్ తథా నామభిరుచ్యతే సః.** రూపములేని ఆత్మవలనే ఈ దేహము నిలచియున్నది. అలాగే రూపరహితుడైన విష్ణువు నామరూపాత్మకమైన సకల విశ్వమునకు ఆధారమైయున్నందున ఆయనను 'అమూర్తి' అన్నారు.

## 835. అనఘః

- పాపము లేనివాడు.
- పాపమునకు వ్యతిరేకి.
- దోషము, మాలిన్యము లేనివాడు.
- దుఃఖమునకు అతీతుడు.

### ఓం అనఘాయ నమః

'అఘము' అనగా పాపము. అఘ్ - పాపకరణే - చెడు జరుగుట, పాపము చేయుట. **అఘో నాస్తి యస్మిన్ సోऽనఘః.** పాపము లేనివాడు అనఘుడు. పాపమునకు విరోధి అనఘుడు. 'అఘము' అంటే దుఃఖము అనే అర్థంకూడా ఉంది. దుఃఖము చెందనివాడు అనఘుడు.

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

16వ శ్లోకము. 148వ నామము. అనఘః – **అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః**

89వ శ్లోకము. 835వ నామము. అనఘః – **అమూర్తిః అనఘోఽచింత్యో భయకృత్ భయనాశనః**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

148వ నామము. అనఘః – **సంసార మధ్యే జనిత్వాఽపి అనఘః**. భగవంతుడు సంసారంలో జన్మించినా గాని ఆయన జన్మ కర్మలకు అతీతమైనది కనుక ఆయనకు పాపములంటవు. ఆయన కార్యములు ఆయన లీలలే. కనుక ఆయన అనఘుడు. అంతే కాకుండా ఆయన ఇతరుల పాపములను హరించేవాడు.

835వ నామము. అనఘః – **అకర్మ వశత్వేన తన్ మగ్న జీవ విలక్షణః అనఘః**. భవంతుడు కర్మలకు అతీతుడు. జీవులు కర్మలకు లోబడి ఉంటారు. ఇలా భగవంతుడు జీవులకంటే విలక్షణమైనవాడు. పాపములు ఆయనను అంటవు. కనుక ఆయన అనఘుడు.

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుని శరీరము శుద్ధసత్వమయము. ఆయనకు వయసు, క్షీణత, అనారోగ్యము వంటివి వర్తించవు. అలాగే పాపములు అంటవు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 3.3.5 – భగవంతుడు దోషరహితుడు. ఎన్నో పాపాలు చేసిన భక్తులను కూడా అపారమైన కరుణతో ఆశీర్వదిస్తాడు.

శ్రీ వి.ఎన్. వేదాంతదేశికన్ – తనను శరణు వేడినవారిని దరిచేర్చడంకోసం భగవంతుడు తిరువైకుంఠంలో ఓపికగా వేచియున్నాడు. వారి లోపాలతో నిమిత్తం లేకుండా అందరినీ కాపాడేవాడు. కరుణామయుడు. భక్తసులభుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'అఘము' అనగా 'పాపము', 'దుఃఖము' అనే రెండు అర్థాలనూ పరిగణించి రెండు నామములకు వ్యాఖ్యలనిచ్చారు.

16వ శ్లోకములో 'అనఘః' – **అఘమ్ న విద్యతే అస్య ఇతి అనఘః**. పాపము లేనివాడు అనఘుడు. ఇందుకు శ్రీ శంకరులు ఛాందోగ్యోపనిషత్తు (8.1)నుండి **'అపహత పాప్మా'** అన్న పదాన్ని ఉదాహరించారు.

89వ శ్లోకంలో 'అనఘః' – **అఘమ్ దుఃఖమ్ పాపమ్ చ ద్వయమ్ అస్య న విద్యత ఇతి అనఘః**. పాపము, దుఃఖము లేనివాడు అనఘుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా శ్రీ శంకరులలాగానే వ్యాఖ్యానించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతునికి దుష్కర్మలు, తద్వారా సంక్రమించు పాపము, తద్వారా సంభవించు దుఃఖము, ఇవేవీ వర్తింపవు. అన్నింటికీ మూలము పాపపు ఆలోచన. భగవంతునికి అలాంటి భావం ఉండజాలదు. కనుక ఆయనకు దుష్కర్మలు, పాపము, దుఃఖము వర్తింపవు. అలా ఆయన అనఘుడు.

ఈశావాస్యోపనిషత్తు 8 – **శుద్ధమ్ అపాప విద్ధమ్**......

బృహత్.ఉపనిషత్తు 4.3.21 – **అపహత పాప్మా అభయమ్ రూపమ్ .... తదాప్త కామమ్ ఆత్మ కామమ్ అకామమ్ రూపమ్ శోకాంతరమ్....**

ఛాందోగ్యోపనిషత్తు 8.7.1 – **ఆత్మా అపహత పాప్మా విజరజ్**....

ఛాందోగ్యోపనిషత్తు 8.4.1 – **న జరా న మృత్యుర్నశోకో న సుకృతమ్ న దుష్కృతమ్ సర్వే పాప్మానోఽతో నివర్తన్తే అపహత పాప్మా**....

శ్రీ చిన్మయానంద – ఛాందోగ్యోపనిషత్తు 8.1.5నుండి – **ఏష ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామ సత్యసంకల్పః.** ఈ ఆత్మకు పాపము, ముసలితనము, మరణము, దుఃఖము, ఆకలి, దప్పిక అంటవు. ఈ ఆత్మకు నిజమైన కోరిక, నిజమైన సంకల్పము ఉన్నాయి. మన శాంతి, అశాంతి ఆత్మకు అంటవు. కనుక భగవంతుడు అనఘుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భీష్ముడు భగవంతుని **'పవిత్రాణామ్ పవిత్రమ్ యః'** అని వర్ణించాడు.

## 836. అచింత్యః

- ఉపమానము లేనివాడు. మరిదేనితోనూ భగవంతుని పోల్చలేము.
- ఆయన శక్తిని ఊహించలేము.
- విశ్వమునకు విలక్షణముగానున్నవాడు గనుక మనస్సుచేత ఆయనను చింతింపజాలము.

### ఓం అచింత్యాయ నమః

చిత్ - సంజ్ఞానే - గుర్తించుట, అర్థం చేసుకొనుట. అచింత్యుడు అనగా ఆయనను తెలిసికొనలేము. ఆయన లీలలు అర్థం కావు. ఆయన శక్తికి, అందానికి, సౌశీల్య సౌలభ్యాలకు ఉపమానం లేదు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవానుని మరిదేనితోనూ, మరెవరితోనూ పోల్చలేము. **అచింత్యో దుర్నిరూపస్స్యాత్ ముక్తాద్యుపమయాపి సః.** ముక్తులను, నిత్యులను చూసైనా ఇతడు అసామాన్యుడు అని చెప్పవచ్చును.

ఛాందోగ్యోపనిషత్తులో భగవంతుని వర్ణన – **య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః దృశ్యతే, హిరణ్మయః స్మశ్రుః, హిరణ్యకేశ అప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథా కప్యాసమ్ పుణ్డరీకమేవమ్ అక్షిణీ.** ఆయన సూర్యమండలం మధ్య బంగారువర్ణంతో, బంగారు మీసాలు, కేశాలు కలిగి, అప్పుడే విరిసిన తామరపూవువంటి కన్నులు కలిగి సువర్ణమయుడై యున్నాడు. కాని అదే శ్రుతి (తైత్తరీయోపనిషత్తు)లో ఆయనను వర్ణించడం సాధ్యం కాదని ఉంది. **యతో వాచే నివర్తన్తే, అప్రాప్య మనసా సః.**

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 1.3.2 – ఓ పరంజ్యోతీ! నిన్ను అనుభవించాలేకాని మాటలలో వర్ణించడం అసాధ్యం. నీ కళ్ళనూ, కాళ్ళనూ, చేతులనూ పద్మాలతో పోల్చడం, నీ కాంతిని బంగారంతో పోల్చడం ఎందుకంటే ఇంకే మాటలూ అందక, నిన్ను మాటలలో వర్ణించడమూ, ప్రాపంచిక వస్తువులతో పోల్చడమూ అందరాని విషయాలు – ఆ తరువాతి పాశురాలలో శ్రీ నమ్మాళ్వారు భగవంతుని దివ్యమంగళరూపము, అనితర సౌశీల్యము, సౌలభ్యములను తలచి తలచి పరవశించారు. ఇంక నిన్ను వర్ణించే పని మానుకుంటానన్నారు. ఎందుకంటే భగవానుడు అచింత్యుడు. ఆవులతో కలసి ఆడే పాడే గోవిందుడు. 'వెన్నదొంగ' అని పేరుపడ్డ సర్వలోకేశ్వరేశ్వరుడు.



బాలకృష్ణుడు వెన్న దొంగిలించుట. 1950 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Baby_thief_Krishna_(bazaar_art,_c.1950%27s).jpg

తిరువైమొళి 1.9.6 – భగవంతుడు మన శరీరము, శరీరంలోని ఆత్మ, పంచమహాభూతాలకు ఆత్మ. (అణియన్) భక్తులకు తేలికగా అందివచ్చేవాడు. (శేయన్) శరణాగతులు కానివారికి అందరానివాడు. (యావరుక్కుమ్ శిందైక్కుమ్ గోచరన్ అల్లన్) అచింత్యుడు, మహాజ్ఞానులకు కూడా గోచరింపనివాడు. (తూయన్) అయినాగాని నా హృదయంలో నెలకొని నన్ను ఆశీర్వదించేవాడు. (తూయన్) నాతో ఉండడమే ఆయనకు కావాలి. (తూయక్కన్) తన గుణముల ప్రభావంతో నన్ను ఆకర్షించేవాడు. (మాయక్కన్) ఆయన గురించి ఆలోచించే ఆనందమే మనలను ఆయన దగ్గరకు చేరుస్తుంది. (ఎన్నుడైత్ తోళ్ ఇణైయాన్) అలాంటి మహానుభావుడు (నన్ను గరుడునిగా భావించి) నా భుజాలపై కూర్చుండి నన్ను తనవానిగా చేసుకొన్నాడు. ఆయన ఆశ్చర్యాలకే ఆశ్చర్యము. మాయామయుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ప్రమాత్రాది సాక్షిత్వేన సర్వప్రమాణ అగోచరత్వాత్ అచింత్యః**. దేనిని గురించి అయినా తెలిసికోవడానికి భగవానుడే కారణము. మనం కంటితో దేనినయినా చూస్తాము. కాని కంటిని చూడలేము. అలాగే భగవానుని గురించి జ్ఞానేంద్రియాలతో తెలిసికొనలేము.

శ్రీ శంకరులు మరొక వ్యాఖ్య కూడా చెప్పారు – **అయమ్ ఈదృశ ఇతి విశ్వప్రపంచ విలక్షణత్వేన చిన్తయితుమ్ అశక్యాద్ వా అచిన్త్యః.** భగవానుడు ప్రాపంచిక విశ్వముకంటె పూర్తిగా విలక్షణుడు. ఈ ప్రపంచంలో మనం తెలుసుకొనేది అంతా ఆయన విభూతిలో కొద్దిభాగమే. కనుక ఆయన అనంత విభూతులు బుద్ధికి అందరానివి.

**నాంతోऽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప**
**ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా** – గీత 10.40
**యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జితమేవ వా**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోऽంశ సంభవమ్** – గీత 10.41
**అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున**
**విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్** – గీత 10.42

ఓ పరంతప! నా దివ్య విభూతులకు అంతమే లేదు నా విభూతుల విస్తృతిని గురించి నీకు చాలా సంక్షిప్తముగా వివరించితిని. విభూతియుక్తమైన, అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుతము, శక్తియుక్తము ఐన వస్తువేదైనను నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము. అథవా ఓ అర్జున! ఇంతకంటెను విపులముగా తెలిసికొని ప్రయోజనమేమి? ఈ సంపూర్ణ జగత్తును కేవలము నా యోగశక్తియొక్క ఒక్క అంశతోనే ధరించుచున్నాను.

ఇలా భగవంతుడు తన ఒక్క అంశతోనే చరాచర సమస్త జగత్తునూ ధరించుచున్నాడు. కనుక ఆయన సంపూర్ణ శక్తి గురించి ఊహించడం సాధ్యం కాదు. అనగా ఆయన అచింత్యుడు.

శ్రీ చిన్మయానంద గీత (8.9)నుండి ఉదాహరించారు –

**కవిం పురాణ మనుశాసితారమ్ అణోరణీయాంస మనుస్మరేద్యః**
**సర్వస్య ధాతార మచింత్యరూపమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్** – గీత 8.9

సర్వజ్ఞుడును, సనాతనుడును, అందరిని శాసించువాడును, అణువుకంటెను సూక్ష్మమైనవాడును, అందరిని ధరించి పోషించువాడును, అచింత్యరూపుడును, సూర్యునివలె నిత్యచేతనప్రకాశరూపుడును, అజ్ఞానాంధకారమును పారద్రోలువాడును ఐన సచ్చిదానంద ఘన పరమేశ్వరుని స్మరించువాడగు (పరమభక్తుడు) ....

శ్రీ బలదేవ విద్యాభూషణ – **తర్కః అగోచరః శ్రుత్యేక గమ్యః.** తర్కమునకు అందరానివాడు. శ్రుతివాక్యముల ద్వారా మాత్రమే తెలియవచ్చువాడు గనుక భగవానుడు అచింత్యుడు.

## 837. భయకృత్

## 838. భయనాశనః

- తన ఆజ్ఞను ఉల్లంఘించేవారికి భయం కలుగజేస్తాడు. తన ఆజ్ఞలను పాలించే భక్తుల భయాన్ని పోగొడతాడు.

### ఓం భయకృతే నమః

### ఓం భయనాశనాయ నమః

భీ - భయే - భయపడుట, కలత చెందుట. అనే ధాతువునుండి ఈ రెండు నామములను వివరింపవచ్చును. శ్రీ భట్టులు ఈ రెండు నామములకు కలిపి వ్యాఖ్యానం చెప్పారు. శ్రీ శంకరులు విడివిడిగా వ్యాఖ్యానించారు.
శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు తన ఆజ్ఞలను ఉల్లంఘించేవారికి భయం కలిగిస్తాడు.తన ఆజ్ఞలను పాటించేవారి భయాన్ని తొలగిస్తాడు.

**ఆజ్ఞాతిలఙ్ఘినాం పుంసాం నరకాది భయంకరః భయకృత సమాఖ్యాతః సప్తార్ణోకభవవర్ధనః.** పరమేశ్వరుని ఆజ్ఞలే శ్రుతులు, స్మృతులు. వాటిని ధిక్కరించి స్వేచ్ఛగా విహరించేవారిని నరకలోకాలకు పంపి కఠినంగా శిక్షించి భయపెడతాడు గనుక భయకృత్. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సంసార బంధనాలను త్రెంచివేస్తుంది. ఓం భయకృతే నమః.

**ఆజ్ఞానువర్తినాం స్వస్య భయం నాశయతీతి యః భయనాశన ఇత్యుక్తో నవార్ణః కర్మకారకః.** తన ఆజ్ఞలను పాలించే భక్తులయొక్క భయాన్ని ఫోగొట్టేవాడు భయనాశనుడు. ఈ నామము నవాక్షరి. పుణ్యకర్మలను చేయిస్తుంది. ఓం భయనాశనాయ నమః.

మహాభారతం – **భయ అభయం కరః కృష్ణః సర్వలోకేశ్వరః ప్రభుః.**

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ** – రామాయణం. యుద్ధకాండ 18.34

తిరువైమొళి 6.3.8 – ఒప్పిలప్పన్ కోవెల లోని కణ్ణన్ తన భక్తులకు, దేవతలకు నిశ్చయమైన రక్షకుడు. అసురులకు మృత్యువు. శరణాగతులకు తన పాదాలవద్ద ఆశ్రయమిస్తాడు. శరణు వేడనివారు ఆయన దరిదాపులకు కూడా చేరలేరు.

శ్రీ శంకరుల వ్యాఖ్యలు –

### భయకృత్

'కృత్ - కరణే - చేయుట' అనే అర్థంలో – **అసన్మార్గ వర్తినామ్ భయం కరోతి ఇతి భయకృత్.** చెడుమార్గంలో చరించేవారికి భయం కలుగజేసేవాడు భయకృత్.

శ్రీ శంకరులే 'కృత్ - ఛేదనే - ఛేదించుట' అనే అర్థంలో మరొక వ్యాఖ్య చెప్పారు. **భక్తానామ్ భయం కృన్తతి వా భయకృత్.** భక్తుల భయాన్ని తొలగించేవాడు భయకృత్.

శ్రీ వాసిష్ఠ కూడా ఈ రెండు అర్థాలనూ చెప్పారు. మొదటి అర్థానికి ఋగ్వేదం (2.12.13)నుండి ఉదాహరించారు.

**ద్యావా చిదస్మై పృథ్వీ నమన్తే, సుష్మాచిదస్య పర్వతా భయన్తే**
**యః సోమసా నిచితో వజ్రబాహుర్యో వజ్రహస్తః సజనాస ఇంద్రః**
భూమి, ఆకాశం కూడా ఆయనకు ప్రణమిల్లుతాయి. ఆయన ఊపిరికి పర్వతాలు వణుకుతాయి. వజ్రహస్తుడైన ఆ సోమపానం చేసేవాడే ఇంద్రుడు. ఇంద్రుడు కూడా భగవానునిముందు భయపడతాడు గనుక భగవానుడు భయకృత్.

**భీష్మాస్మాద్ వాతః పవతే, భీషోదేతి సూర్యః**
**భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచయ ఇతి** – తైత్తరీయోపనిషత్తు
ఆయనపట్ల భయంతో గాలి వీస్తుంది. సూర్యుడు ఉదయిస్తాడు. అగ్ని, ఇంద్రుడు తమ పనులు చేస్తారు. ఆయనంటే భయంతో మృత్యువు పరుగెడతాడు.

### భయనాశనః

ఈ నామం వ్యాఖ్యలో శ్రీ శంకరులు వర్ణాశ్రమధర్మాలను పాటించవలసిన అవుసరాన్ని పేర్కొన్నారు.

**వర్ణ ఆశ్రమ ఆచారవతామ్ భయం నాశయతి ఇతి భయనాశనః.** వర్ణాశ్రమ ధర్మాలను ఆచరించేవారి భయాన్ని నాశనం చేసేవాడు భయనాశనుడు. ఇందుకు శ్రీ శంకరులు విష్ణుపురాణము (3.8.9)నుండి ఉదాహరించారు.

**వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్**
**విష్ణురారాధ్యతే పంథానాऽన్యస్తత్ తోష కారకః**
వర్ణాశ్రమధర్మాలను సరిగ్గా ఆచరించేవారే విష్ణువును ఆరాధిస్తున్నట్లు. ఆయనను సంతోషపరచడానికి వేరుమార్గం లేదు.



ద్వారకా తిరుమల శ్రీ సంతాన జగన్నాధ వెంకటేశ్వరస్వామి ఆలయం గోపురంపై గీతోపదేశము మరియు ఇతర శిల్పాలు.



## అణుర్బృహత్కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్ |
## అధృతస్స్వధృతస్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః || (90)

**తరువాతి కొన్ని నామములను శ్రీ భట్టులు అష్టసిద్ధులు (లేదా అష్టైశ్వర్యములు) పరంగా వ్యాఖ్యానించారు.** పరమేశ్వరునివద్ద ఈ సిద్ధులన్నీ సహజంగా ఉన్నాయి. మరియు ఆయన తన భక్తులకు ఈ సిద్ధులను ప్రసాదిస్తాడు. అష్టసిద్ధులు ఏవనగా –

1. అణిమ – శరీరాన్ని అతిచిన్నదిగా చేయడం.
2. మహిమ – శరీరాన్ని అతిపెద్దదిగా చేయడం.
3. గరిమ – శరీరం బరువును విపరీతంగా పెంచడం.
4. లఘిమ – శరీరాన్ని అతి తేలికగా చేయడం.
5. ప్రాప్తి – కావలసిన వస్తువును పొందడం.
6. ప్రాకామ్యము – ఆకాశ గమనము.
7. ఈశిత్వము – అధికారమును పొందడం.
8. వశిత్వము – లోబరచుకోవడం.

### 839. అణుః

- అతి సూక్ష్మమైనవాడు. సూక్ష్మాతిసూక్ష్మమైన మహదాకాశమందు, అంతకన్న సూక్ష్మమైన జీవునియందు ప్రవేశించువాడు.
- (అణు-శబ్దే) అంతటా, అన్నింటా వ్యాపించే శబ్దమునకు కారణమైనవాడు.
- (అణు-శబ్దే) వేద స్వరూపుడు. వేదములను, శాస్త్రములను మనకు ప్రసాదించినవాడు.

### ఓం అణవే నమః

అష్టసిద్ధులలో మొదటిదైన ‘అణిమ’గురించి ఈ నామంలో భగవంతుని శక్తిగా సూచింపబడినది. అణు - శబ్దము చేయుట; అణువు - అతి సూక్ష్మమైన పదార్ధము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు అతి సూక్ష్మమైన హృదయాకాశమందును, అంతకన్నా సూక్ష్మమైన జీవునియందును ప్రవేశించు శక్తి గలవాడు. **అతి సూక్ష్మ హృదాకాశాదవ్యక్తజీవ ప్రవేశనే శక్తిమానణురిత్యుక్తః షడర్ణ స్సర్వశక్తిదః.** ఈ నామము షడక్షరి. సర్వశక్తులను ఇస్తుంది. ఓం అణవే నమః. శ్రీ భట్టులు తైత్తరీయోపనిషత్తునుండి **‘అణోరణీయాన్’** అనే వర్ణనను ఉదాహరించారు.

శ్రీ వి.వి. రామానుజన్ – ఈ శక్తులు భగవంతునికి సహజములైనవి. భగవంతుని అనుగ్రహంవల్ల కొన్ని శక్తులు ఇతరులకు లభించును. ఉదాహరణకు సుందరకాండలో హనుమంతుడు అంగుష్ఠమాత్రుడై సురస నోటిలో ప్రవేశించెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ముండకోపనిషత్తునుండి ఉదాహరించారు. **ఏష అణురాత్మా చేతసా వేదితవ్యా.** ఈ ఆత్మ (పరమాత్మ) సూక్ష్మమైనది. బుద్ధిద్వారా మాత్రమే తెలిసికొనదగినది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – మన కంటి చూపుకు కొన్ని పరిమితులు (పెద్దవి, చిన్నవి కూడ) ఉన్నాయి. భగవంతుడు ఈ పరిమితులకు ఆవల ఉన్నాడు గనుక ఆయన ఇంద్రియములకు తెలియరాడు. శ్రీ శాస్త్రి శ్రుతులనుండి పెక్కు ఉదాహరణలు ఇచ్చారు.

కఠోపనిషత్తు 2.20, తైత్తరీయారణ్యకము 10.1 – **అణోరణీయాన్.**
కఠోపనిషత్తు 1.21 – **న హి సుజ్ఞేయమ్ అణురేషా ధర్మః.** సత్యము అణువువలె సూక్ష్మమైనది. తెలియడం కష్టము.
ముండకోపనిషత్తు 2.2.2 - **యదణుభ్యాऽణుచ.** అణువుకంటె చిన్నది.
కఠోపనిషత్తు 2.8 – **అణీయాన్ హ్యతర్క్యయమ్ అణు పరమాణాత్.** అణువుకంటె సూక్ష్మమైనది. తర్కమునకు అందనిది.
ఛాందోగ్యోపనిషత్తు 3.14.3 – **ఏష స ఆత్మా అంతర్హృదయే అణీయాన్ వ్రీహేర్వా యవ వాద్వా సర్షపాదా శ్యామాకాద్వా శ్యామాక తండూలాద్వా.** నా హృదయంలో ఉన్న ఈ పరమాత్మ బియ్యపుగింజకంటెను, ఆవగింజకంటెను చిన్నది.
ఛాందోగ్యోపనిషత్తు 6.8.7 – **స య ఏషో అణిమా.** ఈ (సత్) సూక్ష్మమైనది.

శ్రీ చిన్మయానంద గీతనుండి ఉదాహరించారు. **సర్వస్య చాహమ్ హృదిసన్నివిష్టః.** నేను అందరి హృదయాలలోను స్థితుడనైయున్నాను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భగవంతుని అణుత్వము కారణంగా ఆయన అన్నింటా, అంతటా, మరియు సూక్ష్మాతిసూక్ష్మమైన జీవునియందును వ్యాపించియున్నాడు. అంతేగాక 'అణ్' అనే ధాతువునకు 'శబ్దము' అనే అర్థం ఉంది. అంతటా వ్యాపించే శబ్దము రూపంలో కూడా భగవంతుడున్నాడు. మరియు జీవులనుండి వెలువడే శబ్దాలకుకూడా కారణం భగవంతుడే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – అణతి - శబ్దయతి - ప్రకటించును, తెలియజేయును. **అణతి శబ్దయతి వేదాది శాస్త్రమ్ ఇతి అణుః.** వేదాది శాస్త్రములను ప్రసాదించిన (ప్రకటించిన)వాడు అణువు. శ్రీ భరద్వాజ ఈ నామాలకు అష్టసిద్ధులపరంగా కాక, స్వతంత్రంగా వ్యాఖ్యలు ఇచ్చారని గ్రహించాలి.

## 840. బృహత్

- చాలా పెద్దవాడు. విశ్వమునకంటే మూడురెట్లు పెద్దదైన పరమపదమును తన అరచేతనుంచుకొన్నవాడు.
- చాలా పెద్దవాడు. ఇచ్ఛానుసారము పెరుగగలవాడు.
- ప్రతిచోటా సౌందర్యాన్ని పెంపొందించువాడు.
- వృద్ధిచెందిన మంగళగుణములు కలవాడు.

### ఓం బృహతే నమః

ఈ నామంలో భగవానుని 'మహిమ' అనే సిద్ధి (ఐశ్వర్యం) సూచింపబడింది. 'అణిమ' అనగా సూక్ష్మత్వము. 'మహిమ' అనగా గురుత్వము. బృహ్ - వృద్ధౌ - పెరుగుట, వృద్ధి చెందుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు అంతటా వ్యాపించియున్నాడు. భౌతికమైన జగత్తుకు మూడురెట్లు పెద్దదైన పరమపదము (త్రిపాద్విభూతి) కూడా ఆయన చేతిలో గోళీకాయ అంత ఉంది. **విపులం పరమం వ్యోమ మహిమ్నా చుళుకీకృతమ్ యేన నామ్నా**

**బృహత్ స స్యాత్ షడర్ణశ్చ బృహత్వదః.** అవధులు లేని పరమాకాశమును అరచేత ధరించినవాడు. ఈ నామము షడక్షరీమంత్రము. గొప్ప దశనిచ్చును. ఓం బృహతే నమః.

శ్రీ భట్టులు శ్రుతులనుండి చెప్పన ఉదాహరణలు –

పురుషసూక్తము – **స భూమిమ్ విశ్వతో వృత్వా అత్య తిష్టాత్ దశాంగుళమ్.** ఆయన భూమి మొత్తాన్ని ఆవరించి పదిరెట్లు పెద్దగా ఉన్నాడు.

తైత్తరీయోపనిషత్తు 6.10 – **మహతో మహీయాన్.** పెద్దవానికంటే పెద్దది. **వర్షీయాంశ్చ పృథివ్యా.** భూమికంటె పెద్దవాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి చెప్పిన శ్రుతి ఉదాహరణలు –

కఠోపనిషత్తు 2.2.2 – **అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతుమ్ బృహత్.** నీటినుండి పుట్టినవాడు, భూమినుండి పుట్టినవాడు, యాగంనుండి పుట్టినవాడు, కొండనుండి పుట్టినవాడు, నిజమైనవాడు, పెద్దయైనవాడు.

శ్వేతాశ్వరోపనిషత్తు 3.7 –**తతః పరమ్ బ్రహ్మ పరమ్ బృహన్తమ్.** అలా పెద్దవాడైన పరబ్రహ్మను ప్రార్థించి, ధ్యానించి తెలుసుకోవాలి.

మహిమ ఐశ్వర్యము, అణిమ ఐశ్వర్యము పరస్పరం వ్యతిరేకాలుగా కనిపిస్తాయి. తరువాత వచ్చే మరికొన్ని నామాలలో కూడా ఇలాంటి వ్యతిరేకమనిపించే శబ్దాలను గమనింపవచ్చును. అంటే భగవంతునికి అన్నీ సాధ్యమే అని, ఎలాంటి పరిమితులూ ఆయనకు వర్తింపవనీ గమనించాలి.

శ్రీ చిన్మయానంద – ఇవి రెండూ పరస్పర విరుద్ధాలుగా అనిపించవచ్చును. కాని తరచి చూస్తే మనకు ఇలాంటి నామాలలో భగవంతుని పరమైశ్వర్యముయొక్క వెలుగు సోకుతుంది. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా – **అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మాకస్య జన్తోర్నిహితమ్ గుహాయామ్.** చిన్నదానికంటే చిన్నది, పెద్దదానికంటె పెద్దది అయిన ఆత్మ హృదయం అనే గుహలో ఉన్నది.



గోవర్ధనగిరినెత్తిన శ్రీకృష్ణుడు.
1800 కాలపు చిత్రం. వికీపీడియానుండి
https://commons.wikimedia.org/wiki/File:Krishna_Holding_Mount_Govardhan.jpg

శ్రీ శంకరుల వ్యాఖ్య – **బృహత్వాత్ బృంహణత్వాత్ చ బ్రహ్మ బృహత్.** బ్రహ్మము చాలా పెద్దది. మరియు అనంతముగా పెరుగగలది గనుక బృహత్.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ సిద్ధులతో అన్వయం లేకుండా తమ వ్యాఖ్యను కొనసాగించారు. **బర్హతి వర్ధతే ప్రతిపదమ్ శోభాయామ్ ఇతి బృహత్.** ప్రతిచోటా సౌందర్యాన్ని వర్ధిల్లజేసేవాడు బృహత్.

శ్రీ సత్యసంధ యతిరాజ – **గుణైః వృద్ధః.** దివ్యమంగళ గుణములు సమృద్ధిగా కలిగినవాడ బృహత్.

## 841. కృశః

- తేలికైనవానికంటే తేలికైనవాడు.
- సన్నమైనవానికంటే సన్నమైనవాడు.
- తన భక్తుల కష్టాలను క్షీణింపజేసి తొలగించేవాడు.
- జీవులు సౌకర్యంగా ఉండడంకోసం వారిని తగు పరిమాణంలో రూపొందించువాడు.
- అసురులను తేలికజేయువాడు (నాశనం చేయువాడు).

### ఓం కృశాయ నమః

ఈ నామము 'లఘిమ' అనగా చాలా తేలిక అగుట అనే ఐశ్వర్యాన్ని (సిద్ధిని) సూచిస్తుంది. కృష్ - తనూకరణే - సన్నగా అగుట (కృశించుట). శ్రీ భట్టులు 'తేలికగా ఉండుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. శ్రీ శంకరులు 'సన్నగా ఉండుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వత్ర అవ్యాహత గతిః లఘిమ్నా కృశ ఈరిత.** లఘిమ కారణంగా భగవంతుడు ఎంత తేలికగా (దూదికంటె, గాలికంటె తేలికగా) ఉన్నాడంటే అయన ఎక్కడికైనా వెళ్ళవచ్చును. (అన్నిచోట్లా ఉన్నాడు). ఇందుకు శ్రీ భట్టులు మహాభారతంనుండి ఉదాహరించారు. **యత్ర కామ గతో వశీ.**

శ్రీ బలదేవ విద్యాభూషణ – భగవంతుడు ఎంత సన్నగా (కృశించి) ఉన్నాడంటే ఆయన ఒక రాయి లోపల కూడా ఉండవచ్చును. **శిలాస్వపి అప్రతిహత ప్రవేశత్వాత్ కృశః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అస్థూలమ్ ఇత్యాదినా దృశ్యత్వాత్ ప్రతిషేధాత్ కృశః.** భగవంతుడు ఎంత సన్నగా (అస్థూలంగా) ఉన్నాడంటే ఆయన అసలు కనిపించడు. ఒకరు ఈ వ్యాఖ్యను **'ద్రవ్యత్వ ప్రతిషేధాత్'** అని కూడా వ్రాశారు. అంటే భగవంతునికి అసలు ఆకారమే లేదు (ద్రవ్యత్వము). శ్రీ శంకరులు బృహదారణ్యకోపనిషత్తు (3.8.8)నుండి 'అస్థూలమ్' అనే పదాన్ని ఉదాహరించారు. అనగా 'స్థూలము కాని శరీరము'. తరువాతి నామము 'స్థూలః' గనుక బహుశా శ్రీ శంకరులు ఈ 'కృశః' నామమునకు 'అస్థూలమ్' అనే వివరణను ఎన్నుకొని ఉండవచ్చును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు చిన్నా, పెద్దా వంటి విషయాలు ఆయనను చూసినవారే చెప్పగలరు. కాని భగవంతుడు ఎంత పెద్దవాడంటే ఆయనను చూడడానికి మన కన్నులు చాలవు. ఎంత చిన్నవాడంటే ఆయన మన కన్నులకు ఆనడు. కనుక ఆయన చిన్నా, పెద్దా – కృశః, స్థూలః – అనే ప్రశ్నకు జవాబు లేదు. ఇది భగవంతుని లక్షణము. శ్రీ శంకరులు బృహదారణ్యకోపనిషత్తునుండి 'అస్థూలమ్' అని ఉదాహరించారు. ఆ పదం తరువాతే 'అనణు' అని ఉంది. (**అస్థూలమ్ అనణు**). అనగా భగవంతుడు తన సంకల్పానుసారము ఎలాగైనా ఉండవచ్చును. అలా ఎప్పుడైనా ఉండవచ్చును. ఈ నామంలో మాత్రం భగవంతుని కృశత్వము (తేలికగా ఉండుట లేదా సన్నగా ఉండుట) చెప్పబడింది.

ఇదే శ్లోకంలో ఇంతకుముందు ఒక నామంలో భగవంతుని '**అణుః**' అని వర్ణించారు. తరువాతి నామంలో అందుకు తేడాగా '**బృహత్**' అని చెప్పారు. అలాగే ప్రస్తుత నామం '**కృశః**'. దీని తరువాతి నామం ఇందుకు భిన్నంగా '**స్థూలః**' అని వస్తుంది. ఇలా వైరుధ్యమనిపించే భావన గురించి శ్రీ చిన్మయానంద – 'ధ్యానాన్ని అభ్యసించేవారి అవగాహనకు భగవంతుని గురించి ఋషులు ఇలా పరస్పర వ్యతిరేక భావాలను సూచించే పదాలు వాడారు' అని అన్నారు. ఇంతకుముందు ఉదాహరించిన ఉపనిషద్వాక్యాలు ఇలాంటివే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **కృశ్యతి తనూకరోతి స్వజన విపదమ్ ఇతి కృశః.** తన భక్తుల కష్టాలను సన్నబరచేవాడు (తగ్గించేవాడు, తొలగించేవాడు) కృశః.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా అష్టైశ్వర్యములు (అష్టసిద్ధులు)తో అన్వయం లేకుండా ఇలా వ్యాఖ్యానించారు. కృశ్ - సన్నముగా చేయుట. భగవంతుడు సకల జీవులను తగువిధంగా, తగు పరిమాణంలో రూపొందిస్తాడు. అది ఆయా జీవుల మనుగడకు, సౌకర్యానికి అవుసరం. ఈ విషయంలో శ్రీ వాసిష్ఠ వ్యాఖ్య '**త్వష్టా**' (6వ శ్లోకము, 52వ నామము) అనే నామం అర్థానికి పోలి ఉంది.

శ్రీ సత్యసంధ యతిరాజ – **దైత్యాన్ కర్శయతి ఇతి కృశః.** దైత్యులను కృశింపజేయువాడు, అనగా వారిని నాశనము చేయువాడు కృశః.

## 842. స్థూలః

- చాలా పెద్దవాడు. కావలసిన వస్తువును స్పృశింప (పొంద)గలవాడు. ప్రాప్తి గలవాడు.
- తన భక్తుల సంపదను ఎన్నోరెట్లు పెంచేవాడు.
- అందరికీ ఆత్మ అయినవాడు.

### ఓం స్థూలాయ నమః

స్థూల్ - పరిభ్రమణే - లావుగా, పెద్దగా అగుట. అనే శబ్దంనుండి ఈ నామమును వివరింపవచ్చును. ఇంతకు ముందు నామము 'కృశః' అనగా కావలసినంత సన్నగా లేదా తేలికగా అగుట అని వివరింపబడినది. ప్రస్తుత నామము 'స్థూలః' అనగా కావలసినంత పెద్దదిగా అగుట అనే భగవదైశ్వర్యం పరముగా వివరింపబడినది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు కదలకుండానే బ్రహ్మాండంలో ఏ వస్తువునైనా స్పృశింపగలడు (పొందగలడు) గనుక 'స్థూలః' ఈ నామంలో సూచించిన 'ప్రాప్తి' ఐశ్వర్యానికి శ్రీత్రివిక్రమావతారము చక్కని ఉదాహరణ. **స్థిత్వైకత్రాఖిలం స్పృష్టుం శక్తిర్యామహతీ సదా తయా ప్రకృష్టయా శక్త్యా విశిష్ట స్థూల ఉచ్యతే.**

ఆండాళ్. తిరుప్పావై 3 (శ్రీ వి.వి. రామానుజన్ ఉదాహరించినది) – **ఓంగియుల గళన్ద వుత్తమున్ పేర్ పాడి**. పెరిగి లోకాలు కొలిచిన పురుషోత్తముని కీర్తించి.

శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి ఉదాహరించారు.

**అనేజదేకమ్ మనసోజవీయో నైనద్దేవ ఆప్నువన్ పూర్వమర్షత్**
**తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతి** – ఈశావాస్యోపనిషత్తు 4.

పరమాత్మ కదలడు. ఆయనకు సమమైనది లేదు. ఆయన వేగం మనసుకంటే ఎక్కువ. (ఆయన దేవతలవద్దకు చేరుకున్నాగాని దేవతలకు ఆయన అందడు.) కదలకుండానే ఆయన పరుగెత్తేవారిని అధిగమిస్తాడు. ఆయన కారణంగా వాయువు జలాన్ని మోసుకెళతాడు.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**
**స భూమిమ్ విశ్వతో వృత్వా అత్య తిష్ఠత్ దశాంగులమ్** – పురుషసూక్తము.

ఆయన అంతులేని తలలు, కన్నులు, పాదములు కలిగినవాడు. విశ్వమంతా ఆవరించియున్నవాడు. మనకున్న జ్ఞానంతో ఆయనను కొలవడం సాధ్యం కాదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వః ఆత్మకత్వాత్ స్థూలః ఇతి ఉపచర్యతే**. అందరికీ ఆత్మ అయినందున ఆయనను 'స్థూలః' అన్నారు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **కోటి బ్రహ్మాండ విగ్రహత్వాత్ స్థూలః.** అనంతమైన బ్రహ్మాండములు ఆయన స్వరూపమే గనుక భగవానుడు స్థూలః.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుడు **అణుః, బృహత్, కృశః, స్థూలః** వంటి ఐశ్వర్యములు కలిగియున్నందున ఆయన ఏ క్షణంలో ఎలా ఉంటాడో ఎవరూ తెలిసికొనలేరు.

6వ శ్లోకం 53వ నామము '**స్థవిష్ఠః**'. 47వ శ్లోకం 437వ నామము '**స్థవిష్ఠః**' ఈ '**స్థవిష్ఠః**' నామము '**స్థూలః**', '**ఇష్ట**' అనే పదాలు కలిసి ఏర్పడినట్లుగా చెప్పుకోవచ్చును. అనగా సంకల్పానుసారము చాలా పెద్దగా ఉన్నవాడు అని. ఇంకా '**స్థవిష్ఠః**' అనగా భగవంతుడు బ్రహ్మాండము రూపంలోను, నక్షత్రమండలాల రూపంలోను ఉన్నాడు అని కూడా అర్థాలు చెప్పారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **స్థూలయతి బృంహయతి స్వజన సంపదమ్ ఇతి స్థూలః.** తన భక్తుల సంపదను ఎన్నోరెట్లు పెంచేవాడు 'స్థూలః' ఇక్కడ సంపద అంటే భౌతికమైన ధనాదులు మాత్రమే కాదు. భగవంతునికి, భాగవతులకు కైంకర్యము చేయడంలో ఉన్న ఆనందమే ఆ సంపద.

**తిరుప్పావై. 3వ పాశురము. చిత్రకవి ఆత్రేయ తెలుగు సేత మరియు వివరణ**

పెరిగి లోకాలు కొలిచిన పురుషోత్తముని కీర్తించి
నోము పేరునకలసి మేము నీరాడితే, దేశమంతా
నెల మూడు వానలు కురిసీ ఈతి బాధలు తొలుగు
పెరిగిన ఎఱ్ఱని వరిచేల పైకెగురు చేపలు
నీరజముల మెరసి నిదురించు తుమ్మెదలు
స్థిరమున కూర్చుండి సిరములను లాగ
కలశములను నింపు కామధేనువులు
నిత్య సంపదలతో నిండుగానుండు
జగతికే మంగళము కూర్చు మన శ్రీవ్రతము

ఇది ఆశీర్వచన పాశురం. ఎక్కడ ఏ శుభకార్యం జరిగినా ఈ విశేష పాశురమును పెద్దలు చదువుతారు. త్రివిధ తాపములు (తాపత్రయము) తొలగి, అన్నీ సమృద్ధిగా ఉండాలని పెద్దలు మంగళాశాసనం చేస్తారు. శుభప్రదమైన వామనావతారకథ ఈ గేయంలో వస్తుంది.



శ్రీ వామనావతార శిల్పం. Creative Commons photo from Flickr by Andrea Kirkby

## 843. గుణభృత్

- ఈశిత్వము గలవాడు. అనగా అన్నింటిమీద అధికారము గలవాడు. మరియు అన్నింటికి ఆధారమైనవాడు.
- రజోగుణముతో సృష్టిని, సత్త్వగుణముతో వృద్ధిని (పాలనను), తమోగుణముతో లయమును నిర్వహించువాడు.
- జ్ఞానానంద మాధుర్య వాత్సల్యాది అనంత కళ్యాణ గుణములు కలవాడు.

## ఓం గుణభృతే నమః

గుణములు అనగా దయాదాక్షిణ్యాది లక్షణములు మరియు సత్వరజస్తమోగుణములు కూడ. భృ - ధారణ పోషణయోః - కలిగియుండుట, నిర్వహించుట. **గుణ దయాదాక్షిణ్యాదయః సత్వరజస్తమ ఆదయశ్చ, తేషామ్ భృత్-ధారక ఇత్యర్థః** (శ్రీ వాసిష్ఠ).

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు తన సంకల్పమాత్రమున అన్ని జీవులను, అన్ని స్థితుల (గుణముల) యందును, తన అధీనములో ఉంచుకొని వానికి ఆధారమై యున్నాడు. ఈ నామము ఆయన ఈశిత్వము అనే ఐశ్వర్యమును సూచించును. **సంకల్పాత్వ గుణీభూత సర్వావస్థమిదం జగత్ కుర్వన్ బిభర్తి నిత్యం యః గుణభృత్ స స్మృతో బుధైః.** ఇందుకు శ్రీ భట్టులు తైత్తరీయోపనిషత్తు (6.1)నుండి ఉదాహరించారు. **సర్వస్య వశీ సర్వస్య ఈశానః.** ఆయన అన్నింటినీ తన అధీనంలో ఉంచుకొని వానికి ప్రభువైయున్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సత్వరజస్తమసామ్ సృష్టి స్థితి లయ కర్మసు అధిష్ఠానతృత్వాత్ గుణభృత్.** భగవంతుడు సత్వరజస్తమో గుణముల ద్వారా సృష్టిస్థితిలయాది కార్యములకు అధికారియై ఆయా గుణములకు ఆధారమై యున్నాడు గనుక గుణభృత్.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా మించు ఇదే అర్థం చెప్పారు. **గుణాన్ సత్వాదీన్ బిభర్తి ఇతి గుణభృత్.**

శ్రీ కృష్ణత్త భరద్వాజ – **గుణాన్ జ్ఞాన ఆనంద మాధుర్య వాత్సల్యాదీన్ బిభర్తి ఇతి గుణభృత్.** భూతభవిష్యద్వర్తమానములను గురించి సదా సంపూర్ణజ్ఞానము, సచ్చిదానంద పరిపూర్ణత్వము, శత్రువులపట్ల కూడామాధుర్యము, భక్తులయెడ దూడపట్ల ఆవుకుండే వాత్సల్యము ఇలాంటి అనంత కళ్యాణగుణములు కలిగినవాడు గుణభృత్.

శ్రీ సత్యసంధయతిరాజ కూడా ఇలాంటి అర్థమే చెప్పారు. **గుణాన్ ఆనందాదీన్ బిభర్తి ఇతి గుణభృత్.**



శ్రీ బలరామ కృష్ణులు అరణ్యంలో ప్రవేశించుట. 1800 కాలపు చిత్రం

https://commons.wikimedia.org/wiki/File:Krishna_and_Balarama_Arrive_in_the_Forest,_Folio_from_a_Bhagavata_Purana_(Ancient_Stories_of_the_Lord)_LACMA_M.79.51.jpg

## 844. నిర్గుణః

- అన్ని జీవులతోను సదా స్పర్శతో ఉన్నప్పటికీ వాని గుణములు ఆయనకు అంటవు. ఆయన గుణరహితుడు. వశిత్వము కలిగి అన్నింటినీ లోబరచుకొన్నవాడు.
- ఎట్టి గుణములు లేనివాడు.

### ఓం నిర్గుణాయ నమః

'గుణము' అనగా ప్రకృతి లక్షణములైన సత్వరజస్తమో గుణములు. ఈ గుణములు గాని, వాని ప్రభావములు గాని భగవంతుని అంటవు. కనుక ఆయన నిర్గుణుడు. '**గుణభృత్**' నామంలో చెప్పిన ప్రకారము అన్ని గుణములకూ ఆయనే ఆధారము అయినా గాని ఆయన మాత్రం నిర్గుణుడు. ఈ రెండు నామములు – **గుణభృత్, నిర్గుణః** – పరస్పరం విరుద్ధములు అనిపిస్తాయిగాని ఇవి రెండూ భగవదైశ్వర్యములను సూచిస్తాయి. '**గుణభృత్**' నామము ఈశిత్వమును, '**నిర్గుణః**' నామము వశిత్వమును తెలియజేస్తున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అతత్వశ్యతయా తత్ సంస్పర్శేఽపి అస్పృష్ట తద్గుణః నిర్గుణః**. భగవంతుడు అన్ని జీవులతోను కలసిఉన్నాగాని ఆయా జీవుల గుణములు, లక్షణములు, ప్రభావములు భగవంతుని అంటవు. ఎందుకంటే ఆయన నిర్గుణుడు. వానికి వేటికీ ఆయన లోబడడు. అన్నీ ఆయనకు వశమైయుంటాయి. భగవంతుని 'వశిత్వము' అనే ఐశ్వర్యము ఈ నామంలో చెప్పబడింది.

**స్థితోఽపి నీ క్షీరవత్ జగతోఽస్పర్శనాద్గుణైః ఉక్త స నిర్గుణః ఇతి సప్తార్ణ పావనత్వదః**. చేతాచేతనములన్నింటిలోనూ పాలలో కలిసిన నీటివలె కలిసి ఉంటాడు. ఈ రకంగా అన్ని భూతాలను లోబరచుకొని ఉంటాడు. అన్ని గుణాలతో ఉన్నప్పటికీ అన్నింటినీ లోబరచుకొని ఉంటాడు. కాని ఆయనకు గుణాలు అంటవు. కనుక ఆయన నిర్గుణుడు. ఇది సప్తాక్షరి. పావనకరము. ఓం నిర్గుణాయ నమః. (శ్రీకైవల్య సారథి).

ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ప్రమాణములు –
తైత్తరీయోపనిషత్తు 3.6.1 – **విశ్వస్య మిషతో వశీ.** తన చక్కని చూపుతో ఆయన లోకాలను వశం చేసుకొంటాడు.
విష్ణుపురాణము 1.9.44 – **సత్వాదయో న సన్తీశే యత్ర చ ప్రాకృతగుణాః**. ప్రకృతిలో ఉండే సత్వమువంటి గుణములు ఈశునియందు ఉండవు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ప్రకృత గుణత్రయ విరహితత్వాత్ నిర్గుణః.**

శ్రీ సత్యసంధ యతిరాజ – **సత్వాది గుణరహితత్వాత్ నిర్గుణః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వస్తుతో గుణ అభావాత్ నిర్గుణః**. ఏ విధమైన గుణములు లేనివాడు నిర్గుణుడు. ఇందుకు శ్రీ శంకరులు శ్వేతాశ్వరోపనిషత్తు (6.11)నుండి ఉదాహరించారు. **సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ**. అందరిలోనూ సాక్షిగా ఉండేవాడు. కాని వారిలోని త్రిగుణములు అంటనివాడు. నిర్గుణుడు.

## 845. మహాన్

- అన్ని విషయాలలోను అధికుడు. ఇచ్ఛానుసారము ఎక్కడికైనా వెళ్ళగలవాడు. ప్రాకామ్యము గలవాడు.
- ఊహకు, తర్కానికి అందనంతవాడు.

- పూజ్యనీయుడు. ఇంద్రాదులచే పూజలందుకొనేవాడు.

**ఓం మహతే నమః.**

మహ - పూజాయామ్ - గౌరవించుట, ఆనందించుట, పెంచుట; మహాన్ - పూజింపదగినవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **పరమ ప్రకర్షాత్ మహాన్.** అన్ని విషయాలలోను అత్యున్నతుడు మహాన్. ఆయనకు సాధ్యంకానిది లేది. ఆయన వెళ్ళలేని చోటు లేదు. మనం నీళ్ళలో మునిగి తేలినట్లుగానే భగవంతుడు భూమిలోకూడా మునిగి తేలగలడు. అష్టైశ్వర్యములపరంగా 'మహాన్' అనే నామము భగవంతుని ప్రాకామ్యమును (ఎదిరించరాని ఇచ్ఛను) సూచిస్తుందని శ్రీ భట్టులు వివరించారు. శ్రీ భట్టులు ఉదాహరించిన శ్లోకము –

**సంప్రయోజ్య వియోజ్యాయమ్ కామకారకరః ప్రభుః యద్ యద్ ఇచ్ఛేత్ అయం శౌరిః తత్ తత్ కుర్యాత్ అయత్నతః**
శౌరి తన ఇచ్ఛానుసారం ఏమైనా చేస్తాడు. అందుకోసం ఆయన కష్టపడనక్కరలేదు. ఆయన వేనినైనా కలపగలడు లేదా విడదీయగలడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఇక్కడ ప్రాకామ్యము అనగా ఇచ్ఛానుసారము ఎవరి మనసులోనైనా ప్రవేశించుట, వారేదైనా గుర్తుంచుకొనేలాగా లేదా దానిని మరచిపోయేలాగా చేయడంవంటివి. **భూమ్యాసహ మహావీరే హ్యున్మజ్జన నిమజ్జనాత్ మహానితి చ విఖ్యాతః షడర్ణస్తు మహత్వదః.** ప్రళయకాలంలో భూమితోబాటుగా తనుకూడా మహాసముద్రంలో మునుగుతూ తేలుతూ ఉంటాడు. అన్నింటికీ ఉత్కృష్టమైన ఆకాశగమనం కలవాడు. ఈ నామము షడక్షరీమంత్రము. మహత్వమును ప్రసాదిస్తుంది. ఓం మహతే నమః. (శ్రీ కైవల్యసారథినుండి)

శ్రీ శంకరుల వ్యాఖ్య – **తర్కతోऽపి యతో వక్తుమ్ న శక్యమ్.** తర్కం కోసం కూడా ఆయనను ఇలా అని వర్ణించడం సాధ్యం కాదు. ఆయనకు శబ్దాది విషయాలు వర్తించవు. ఆయన కొలవరానంత సూక్ష్మమైనవాడు. శుద్ధసత్వమూర్తి. అంతటా వ్యాపించినవాడు. ఆయనకు అవరోధం అనేది ఏదీ వర్తించదు. ఆయన మహాన్.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుని గురించి మాటలలోను, ఊహలలోను, మరేవిధంగాను అర్థం చేసుకొనలేము. ఇంతకుముందు ఆరు నామాలను పరిశీలించినట్లయితే పరిశీలించినట్లయితే భగవంతుడు **అణుః** (సూక్ష్మమైనవాడు), **బృహత్** (చాలా పెద్దవాడు), **కృశః** (చాలా సన్నినివాడు), **స్థూలః** (చాలా లావైనవాడు), **గుణభృత్** (గుణములతో నిండినవాడు), **నిర్గుణః** (గుణములు లేనివాడు). ఇలా ఆయన పరస్పర వ్యతిరేక పదాలతో వర్ణింపబడుచున్నాడు. ఎందుకంటే ఆయన కాలానికి, స్థలానికి, రూపానికి అతీతుడు. పంచభూతముల పరిమితులు ఆయనకు లేవు. శ్రీ చిన్మయానంద కూడా ఇదే వివరణ ఇచ్చారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – మహ్యతే - పూజ్యతే; శ్రీ భరద్వాజ ఈ శ్లోకంలో ఇతర నామాలకు, ఈ నామానికి కూడా అష్టైశ్వర్యాలకు లంకె పెట్టకుండా వివరణ ఇచ్చారు. **మహ్యతే పూజ్యతే బ్రహ్మాదిభిః ఇతి మహాన్.** బ్రహ్మాదులు కూడా ఈ భగవంతుని పూజిస్తారు. కనుక భగవంతుడు మహాన్. పూజింపదగినవాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సర్వైః అభ్యర్చ్యయత్వాత్ మహాన్.** అందరిచేత అర్చింపబడువాడు మహాన్.

## 846.అధృతః

- పరిమితులు లేనివాడు, కట్టుపడనివాడు
- ఆధారము లేనివాడు

## ఓం అధృతాయ నమః

ధృ - ధారణే - పట్టుకొనుట, ఆధారముగానుండుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామము **'మహాన్'** అనగా భగవంతుడు ఏదైనా చేయగలడు అని. ప్రస్తుత నామము **'అధృతః'** అనగా ఏదైనా చేయడానికి భగవంతునికి ఎలాంటి నియమాలుగాని, పరిమితులుగాని లేవని. రెండు నామాలు కలిపితే – భగవంతుడు తన ఇచ్ఛానుసారము ఎలాంటి పరిమితులు లేకుండా ఏమైనా చేయగలవాడు. **యశ్చా నియమ్యః కేనాపి హ్యధృతః స్సతు కీర్తితః.** అతడు ఎవరిచేతా నియమింపబడడు కాబట్టి 'అధృతః' అనబడుతాడు.

ఇందుకు శ్రీ భట్టులు చెప్పిన ఉదాహరణ – భగవంతుడు వైదిక బ్రాహ్మణుని కుమారునికి పరమపదం ప్రసాదించాడు. తరువాత ఆ పిల్లవానికి పునర్జన్మ ఇవ్వడంకోసం ఇహలోకానికి తెచ్చాడు. సాధారణంగా పరమపదాన్ని చేరుకొన్నవారికి పునర్జన్మ ప్రాప్తించదు. కాని భగవానుడు తన ఇచ్ఛానుసారం ఏమైనా చేయగలడు. ఈ నామంలో భగవంతుని 'ప్రాప్తి' (ఏదైనా చేయగలడు) అనే ఐశ్వర్యం సూచింపబడిందని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పృథివ్యాదీనామ్ ధారకాణామపి ధారకత్వాత్ న కేనచిత్ ధ్రియత ఇతి అధృతం.** భూమివంటి అన్నింటికీ ఆధారమైనవాడు భగవంతుడు. ఆయనకు మాత్రం వేరు ఆధారం లేదు కనుక ఆయన అధృతుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **యో హి సర్వస్య ధాతా స కేన ధృతః స్యాత్?** అన్నింటికీ ఆయన ఆధారం అయినప్పుడు ఆయనకు ఆధారం ఏముంటుంది?

శ్రీ చిన్మయానంద – వస్త్రానికి దూది, ఆభరణానికి బంగారం, కుండకు మట్టి ఆధారాలు. అలాగే సమస్త విశ్వానికి భగవంతుడు ఆధారం. మనకు ఆయనే ఆధారం అని గ్రహించి అధృతుడైన శ్రీమన్నారాయణుని ధ్యానింపవలెను.

శ్రీ కైవల్యసారథి నుండి –

1. ఇతరులయందు ప్రవేశించి వారిని వశం చేసుకోవడము.
2. తనను ధ్యానించేవారి హృదయాలలో ఉండడము.
3. జీవునితో కూడినది, కూడనిది అయిన దేహమందు ప్రవేశించడము.
4. ఇష్టాపూర్తి కర్మలయందు ఉండడము

ఈ కర్మలు వేటిలోనూ కట్టుపడకుండా యథేచ్ఛగా ఉండేవాడు అధృతుడు.

## 847. స్వధృతః

## 848. స్వాస్యః

## 849. ప్రాగ్వంశః

## 850. వంశవర్ధనః

**847, 848, 849**వ నామములు భగవంతుని ఐశ్వర్యోన్నతిని సూచించునవిగా **శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**



**స్వధృతః** – బద్ధులకంటె భగవానుడు ఉన్నతుడు. బద్ధులకు కూడా తపోధ్యానాదుల ద్వారా కొన్ని ఐశ్వర్యములు సంప్రాప్తించవచ్చును.

**స్వాస్యః** – ముక్తులకంటె భగవానుడు ఉన్నతుడు. ముక్తులు కూడా భగవంతునివంటి లక్షణములు అనేకములు కలిగి ఉండవచ్చును. కాని ముక్తులు ఒకప్పుడు అజ్ఞానంచే ఆవరింపబడ్డారు.

**ప్రాగ్వంశః** – నిత్యులకంటె భగవానుడు ఉన్నతుడు. నిత్యులనగా శ్రీవైకుంఠములో ఉండే శాశ్వత జీవాత్మలు. కాని నిత్యులకు మూలము, ఆధారము శ్రీమన్నారాయణుడే.

శ్రీ భట్టులు ఈ మూడు నామముల వివరణను తరువాతి నామమైన 'వంశవర్ధనః' నామం వివరణలో సంక్షిప్తపరచారు. మూడు విధములైన జీవులు – బద్ధులు, ముక్తులు, నిత్యులు – వర్ధిల్లుటకు కారణమైనవాడు వంశవర్ధనుడు.



యుద్ధానంతరం సకల వానరులనూ, భల్లూకాలనూ పునరుజ్జీవులను చేయించిన శ్రీ రామ లక్ష్మణులకు ప్రణామం చేస్తున్న వానరులు. 1800 కాలంనాటి చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Rama_with_Laksman_and_monkeys.jpg

## 847. స్వధృతః

- స్వభావసిద్ధంగా మహదైశ్వర్యము గలవాడు. తపోధ్యానాదులచే ఐశ్వర్యము (సిద్ధులు) పొందే బద్ధజీవులకంటే భిన్నమైనవాడు.
- తనకు తానే ఆధారమైనవాడు (స్వ - స్వయంగా)
- భక్తులు భగవంతుని తమ మనస్సులో నిలుపుకొందురు (స్వ - స్వజనులు - భక్తులు).
- తన భక్తుల ఐశ్వర్యమును నిలుపువాడు (స్వమ్ - ధనమ్).

**ఓం స్వధృతాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామము **'అధృతః'** అనగా మరెవరిచేత నియమములు లేనివాడు. ప్రస్తుత నామము **'స్వధృతః'** అనగా తనకు తానే నిలుపుకొనువాడు. స్వయంగా మహదైశ్వర్యం గలవాడు. **స్వభావతో ధృతైశ్వర్యః స్వధృతః పరికీర్తితః.** అనగా ఆయన అధికారము, ఐశ్వర్యము మరెవరిపైనో, దేనిపైనో ఆధరపడియుండవు. అది ఆయన సహజత్వము. బద్ధజీవులు తపోధ్యానాదులద్వారా పొందే సిద్ధులకూ, పరమాత్ముని ఐశ్వర్య సిద్ధులకూ భేదం ఇది.

మిగిలిన దేవుళ్ళందరూ ఆయా కార్యముల నిర్వహణకై ఆయనచే నియమింపబడ్డారు. కనుక వారికి ఆయన నియామకుడు, ఆధారము. అలా నియమింపబడని, పోలికలేని పరమాత్ముడు శ్రీమన్నారాయణుడు ఒక్కడే (తిరువైమొళి 5.10.8).

**ఏకోహి వై నారాయణ ఆసీత్.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఛాందోగ్యోపనిషత్తునుండి ఉదాహరించారు. **స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని.** ఆ పరబ్రహ్మ దేనిచే ప్రతిష్ఠితమైయున్నది? అది తన మహిమ చేతనే నిలిచియున్నది. ఒక వస్తువునకు ఆధారమైనదానికి మరియొక ఆధారం ఉంటుంది. కాని మరే ఆధారం లేకుండా తనకుతానే నిలచియున్నది పరబ్రహ్మము.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – స్వ - స్వజనః - తన భక్తులు; **స్వైః స్వజనైః ధృతః చిత్తే ఇతి స్వధృతః.** తనవారైన భక్తులు తమ మనసులలో నిలుపుకొని ఉండేవాడు స్వధృతుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ – స్వమ్ - ధనమ్ - సంపద; **స్వమ్ ధనమ్ ధృతమ్ యేన ఇతి స్వధృతః.** అన్నింటియందూ ఐశ్వర్యమును నిలుపువాడు, పెంచువాడు స్వధృతుడు.

## 848. స్వాస్యః

- శోభనకరమైన స్థానం సహజంగా గలవాడు. స్థిరమైన ఐశ్వర్యం కలవాడు.
- తామరపూవు మధ్యభాగంవలె ఎర్రని అందమైన ముఖం కలవాడు.
- చతుర్వేదాలు ఉపదేశించిన అందమైన ముఖం కలవాడు.

### ఓం స్వాస్యాయ నమః

ఆస్ - ఉపవేశనే - కూర్చొనుట (ఉదా. ఆసనము). 'ఆస్యము' అంటే 'పదవి' లేదా 'స్థానము' అనే అర్థాన్ని శ్రీ భట్టులు గ్రహించారు. 'ఆస్యము' అంటే 'ముఖము' అనే అర్థాన్ని శ్రీ శంకరులు గ్రహించారు. (అమరకోశము వ్యాఖ్యానము అసు - క్షేపణే – విసురుట; **అస్యతే క్షిప్యతే నవనీతాది అస్మిన్ ఇతి ఆస్యమ్.**)

శ్రీ భట్టుల వ్యాఖ్య – (సు-ఆస్యః) స్థిరమైన, శోభనమైన స్థానము (పదవి) గలవాడు 'స్వాస్యః'. **సు-శోభనా, శోభనా ఆస్య యస్య స స్వాస్యః.** గొప్ప స్థానము కలవాడు 'స్వాస్యః.' సహజంగా గొప్ప స్థానం కలవాడు. **ఆసనం శోభనం యస్య స స్వాస్యః ఇతి చోచ్యతే.** శ్రీ భట్టుల వివరణ – ముక్తులు కూడా శ్రీవైకుంఠంలో భగవంతునితో సామ్యము కలిగిఉంటారు. కాని తేడా ఏమంటే ముక్తులు ఒకప్పుడు అజ్ఞానంలో ఉండి తరువాత ముక్తులయ్యారు. భగవంతుడు మాత్రం ఎప్పుడూ అజ్ఞానానికి లోబడడు. ఇలా ఈయన ముక్తజీవులకంటే భిన్నుడు 'స్వాస్యః'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సు-శోభనమ్ పద్మోదరం తలవత్ తామ్రమ్ అభిరూపతమమ్ అస్య అస్యమ్ ఇతి స్వాస్యః.** తామరపూవు మధ్యభాగంవలె అందమైన ముఖము కలవాడు స్వాస్యః.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శోభనమ్ అస్యమ్ వదనమ్ యస్య ఇతి స్వాస్యః.**

శ్రీ శంకరులు మరొక అర్థం కూడా చెప్పారు – **వేదాత్మకో మహాన్ శబ్దరాశిః తస్య ముఖాత్ నిర్గతః పురుషార్థ ఉపదేశార్థమ్ ఇతి స్వాస్యః.** చతుర్విధ పురుషార్థములను సాధించడానికి ఉపదేశించిన అందమైన నోరు గలవాడు స్వాస్యః. ఇందుకు శ్రీ శంకరులు బృహదారణ్యకోపనిషత్తు (2.4.10)నుండి ఉదాహరించారు –

**అస్య మహతో భూతస్య నిశ్వాసితమ్ ఏతత్ ఋగ్వేదో యజుర్వేదః సామవేదః అథర్వాంగిరస ఇతిహాసః పురాణమ్ విద్యా ఉపనిషదః శ్లోకః అనువ్యాఖ్యాని వ్యాఖ్యాని అస్యైవ ఏతాని సర్వాణి నిశ్వాసితాని**
వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, సూత్రములు వంటివి అన్నీ ఆయన ఊపిరినుండి ఉద్భవించాయి.

## 849. ప్రాగ్వంశః

- అనాదిగా ముక్తులైన నిత్యసూరులయొక్క ఉత్పత్తి, స్థితి అన్నీ ఇతని అధీనంలోనే ఉంటాయి.
- సనాతన వంశము గలవాడు, అనగా విశ్వమునకు ఆది అయినవాడు.
- అందరికంటె ముందుగా ఆయననుండి బ్రహ్మ ఉద్భవించాడు.
- ప్రకర్షణతో (రాజసంతో) సంచరించేవాడు మరియు ఆయన గొప్పతనం స్పష్టంగా, గట్టిగా చెప్పబడింది.

### ఓం ప్రాగ్వంశాయ నమః

'ప్రాక్' అనగా మొదటి, ముందటి. వంశము అనగా జాతి. 'ప్రాక్' అనగా నిత్యసూరులు అని శ్రీ భట్టులు, విశ్వము అని శ్రీ శంకరులు, బ్రహ్మ అని శ్రీ కృష్ణదత్త భరద్వాజ అర్థాలను తీసుకొన్నారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ప్రాక్ - అనాదిగా ముక్తులై శ్రీవైకుంఠంలో ఉండే నిత్యసూరులు. వంశ - ఆధారము. ప్రాక్ వంశ - అనగా అట్టి నిత్యసూరుల స్థితి, అష్టైశ్వర్యములు, శక్తులు అన్నీ కూడా భగవానుని దయ, సంకల్పము వల్లనే సంభవిస్తున్నాయి. **అనాది ముక్తాః ప్రాంచో యే తేషాం ఉద్భవ భూమిదః ప్రాగ్వంశ ఇతి విఖ్యాతః సప్తార్ణో మనురుత్తమః.** అనాదిగా ముక్తులైన నిత్యసూరులయొక్క ఉత్పత్తి, స్థితి అన్నీ ఇతని అధీనంలోనే ఉంటాయి. ఈ నామము సప్తాక్షరీమహామంత్రము. ఉత్తమ ఫలప్రదము. ఓం ప్రాగ్వంశాయ నమః. (శ్రీ కైవల్య సారథి).

**ప్రాచాం వంశః ప్రాగ్వంశః.** ఇందుకు శ్రీ భట్టులు పురుషసూక్తంనుండి ఉదాహరించారు. **యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః.** విష్ణువు నివాస స్థలమైన పరమపదంలో అనాదిగా సాధ్యదేవతలు (సదా ముక్తులైన దేవతలు) ఉంటారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సూర్యవంశము, చంద్రవంశము, రఘువంశము, ఇలా ఏదైనా వంశంలో ప్రముఖుని పేరుమీద ఆయా వంశాల పేర్లు వస్తుంటాయి. అలాగే ప్రాగ్వంశానికి, అనగా నిత్యుల వంశానికి మూలమైనవాడు భగవానుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'ప్రాక్' అనగా అన్నింటికంటె ముందు ఉన్నది. **అస్య వంశః ప్రాగేవ, న పాశ్చాత్య ఇతి ప్రాగ్-వంశః.** అన్నింటికంటె ముందు ఆయన వంశము, అనగా జగత్తు ఉద్భవించింది. తరువాతే అన్నీ వచ్చాయి. సనాతనమైన వంశము గలవాడు అనగా విశ్వమునకు ఆదియైనవాడు (అనాది) గనుక భగవానుడు 'ప్రాగ్వంశః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'ప్రాగ్' అనగా అన్నింటికంటె ముందు సృష్టింపబడిన చతుర్ముఖబ్రహ్మ. **ప్రాంచతి ఇతి ప్రాగ్ బ్రహ్మా, స వంశః సనాతనో యస్య ఇతి ప్రాగ్-వంశః.** చతుర్ముఖ బ్రహ్మను తన వంశంలో కలిగిన సనాతనుడు 'ప్రాగ్వంశః'.

శ్రీ వాసిష్ఠ – అంచ్ - గతి పూజనయోః - వెళ్ళుట, పూజించుట. ప్ర - అంచు - క్విన్ = ప్రాంచ్ (పాణిని 3.2.59). అనగా ముందున్నవాడు. వన్ - శబ్దే సంభక్తౌ చ - ధ్వనించుట, గౌరవించుట. **ప్రకర్షేణ అంచతి-గచ్ఛతి, వనతి-శబ్దయతే సంబహుజతే చ ప్రాగ్**

**వంశః.** రాజసంతో పయనిస్తూ చలిస్తూ ఉండేవాడు. ఎవనియొక్క ఔన్నత్యం గొప్పగా ధ్వనించిందో (చెప్పబడిందో) ఆయన 'ప్రాగ్వంశః'.

## **850.** వంశవర్ధనః

- బద్ధులు, ముక్తులు, నిత్యసూరులు, దేవతలు, తన భక్తులు, ఇలా అందరి సంతానాన్నీ వృద్ధిచేసేవాడు.
- జగత్తును వృద్ధిపొందించువాడు (వర్ధ్ - పెంచుట).
- సమయం వచ్చినపుడు జగత్తును పరిసమాప్తం చేసేవాడు (వర్ధ్ - ఖండించుట).

### ఓం వంశవర్ధనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఇంతకు ముందు చెప్పిన మూడు నామములను ఈ నామ వివరణలో సంక్షిప్తపరచారు.

847. **స్వధృతః** – బద్ధ జీవులకంటే భిన్నంగా, స్వభావసిద్ధంగా, మహదైశ్వర్యం గలవాడు.

848. **స్వాస్యః** – ముక్తులకంటే భిన్నంగా, ఎప్పుడూ సహజంగా, శోభనస్థానం కలవాడు.

849. **ప్రాగ్వంశః** – నిత్యసూరులకు కూడా ఆధారమైనవాడు.

850. **వంశవర్ధనః** – పైన చెప్పిన బద్ధజీవులు, ముక్తులు, నిత్యులు – ఈ ముగ్గురు జీవుల వంశాలనూ వృద్ధిపరచేవాడు. ఈ మూడు విధాలైన జీవులు అనుభవించే కైంకర్యరసము (భగవత్సేవానందము) మరింతగా వర్ధిల్లడమే శ్రీ భట్టులు ప్రస్తావించిన వృద్ధి. కనుక భగవంతుడు వంశవర్ధనుడు.

**నిత్య సిద్ధస్య వర్గో యః వంశం సంతాన లక్షణమ్ తం వర్ధయతి యశ్చాసౌ వంశవర్ధన ఉచ్యతే.** తన భక్తులను, జ్ఞానులను తన సంతానముగా భావించి వృద్ధిపొందించువాడు వంశవర్ధనుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 9.3.4 – దేవతలు, నిత్యసూరులు మొదలైనవారు తడబడే మాటలలో భగవంతుని స్తుతిస్తున్నారు. ఎందుకంటే వారు భగవంతుని తలచుకొన్నపుడల్లా వారి హృదయం ఆనందపరవశం అవుతుంది. వారికి భోగాన్నిచ్చే ఔషధమూ, ఆనందాన్నిచ్చే పానీయమూ, జీవితాధారమూ, ఆనందహేతువూ ఆయనే అని వారంటున్నారు.

ఇలా భగవంతునికి కైంకర్యం చేయడంలో నానాటికి ప్రవృద్ధమయ్యే ఆనందాన్ని మనం కోరుకోవాలి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **వంశం భక్తానామ్ వర్ధయతే ఇతి వంశవర్ధనః.** తన భక్తులకు వృద్ధిని చేకూర్చేవాడు వంశవర్ధనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – వృధ్ - పెంపొందించుట. **వంశమ్ ప్రపంచమ్ వర్ధయన్ వంశవర్ధనః.** వంశము, అనగా ప్రపంచమును వృద్ధిచేయువాడు వంశవర్ధనుడు. **'ప్రాగ్వంశః'** నామము వ్యాఖ్యలో కూడా శ్రీ శంకరులు 'వంశము' అనగా 'ప్రపంచము' అనే అర్థాన్ని తీసుకొన్నారని గమనింపవచ్చును.

శ్రీ సత్యసంధ తీర్థ – **పరీక్షిత సంరక్షణేన పాండుకులమ్ వర్ధయతి ఇతి వంశవర్ధనః.** పరీక్షిత్తును కాపాడడంద్వారా పాండవుల వంశాన్ని వర్ధిల్లజేసినవాడు వంశవర్ధనుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **వంశం యదోః వర్ధయతి ఇతి వంశవర్ధనః యత్ర షట్ పంచాశత్ కోటయః ప్రధాన భూతా బభూవుః.** యదువంశం వృద్ధికి కారణమైనవాడు వంశవర్ధనుడు.

శ్రీ శంకరులు మరొక అర్థంకూడా చెప్పారు. వర్ధ్ - ఛేదనే - నరుకుట. **ప్రపంచమ్ ఛేదయన్ వా వంశవర్ధనః.** సమయం వచ్చినపుడు జగత్తును తనలో లీనం చేసుకొనేవాడు వంశవర్ధనుడు.

తన అవతార పరిసమాప్తి సమయంలో శ్రీకృష్ణుడు యాదవవంశమునుకూడా నాశనం చేయడాన్ని శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉదాహరించారు.

**శ్రీ అళవందార్ (యమునాచార్యులు) వారి స్తోత్ర రత్నము నుండి 36వ శ్లోకము**

స్ఫురత్కిరీటాంగద హార కంఠికా
మణీంద్ర కాంచీగుణ నూపురాదిభిః
రథాంగ శంఖాసి గదా ధనుర్వరైః
లసత్తులస్యా వనమాల యోజ్వలమ్

శ్రీమహావిష్ణువు ప్రకాశమానమగు కిరీటమును, ముత్యాల హారమును, కౌస్తుభమణిని, దివ్యాభరణములను ధరించియున్నాడు. శంఖ, చక్ర, ఖడ్గ, గదా ధనుష్పాణి. తులసీ వనమాలతో వెలుగొందుచున్నాడు.



శ్రీ పరశురాముడు శ్రీరామలక్ష్మణులకు ఎదురుపడుట. 1649 కాలపు. అజ్ఞాత చిత్రకారుని చిత్రం . వికీపీడియా నుండి.

Chhatrapati Shivaji Maharaj Vastu Sangrahalaya, Mumbai
https://commons.wikimedia.org/wiki/File:Parshurama_rama.jpg



## భారభృత్కథితో యోగీ యోగీశః సర్వకామదః |
## ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః || (91)

### 851. భారభృత్

- భారమును మోసేవాడు. జీవులకు ముక్తినొసగే భారమును మోసేవాడు.
- భక్తుల యోగక్షేమములు వహించేవాడు.
- అనంతాది రూపములలో జగత్తును మోసేవాడు.

ఓం భారభృతే నమః

'భార', 'భృత్' అనే రెండు పదములు ఒకే ధాతువునుండి వచ్చాయి. భృ - ధారణ పోషణయో - పట్టుకొనుట, నిలుపుట. **భారం బిభర్తి ఇతి భారభృత్**. భారమును మోసేవాడు భారభృత్తు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు జీవులకు సంబంధించిన అర్థంలో తమ వ్యాఖ్యను కొనసాగించారు. **స్వధృతః, స్వాస్యః, ప్రాగ్వంశః** అనే ఇంతకు ముందటి నామాలను కూడా శ్రీ భట్టులు జీవులపరంగా వ్యాఖ్యానించారు. శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయం ప్రకారం జీవులు మూడు విధాలు.

(1) బద్ధ జీవులు – సంసారబంధంలో చిక్కుకొన్నవారు.

(2) ముక్త జీవులు – బద్ధజీవులు మోక్షాన్ని పొంది ముక్తులవుతారు. వారు అప్పుడు శ్రీవైకుంఠంలో ఉండి భగవంతునికి నిత్యకైంకర్యం చేస్తారు.

(3) నిత్య జీవులు – వీరెప్పుడూ బద్ధులు కాలేదు. అనాదిగా పరమపదంలోనే ఉన్నారు.

బద్ధజీవులు ఆత్మజ్ఞానం ద్వారా భగవంతుని పొంది ముక్తులుగా అయ్యే భారాన్ని భగవంతుడే వహిస్తాడు గనుక భగవంతుడు 'భారభృత్' అని శ్రీ భట్టుల వ్యాఖ్య. **ముక్తానాం బంధ మోక్షాది భారస్య భరణాద్ధి సః భారభృత్ సప్తవర్ణస్యాత్ కార్యనిర్వాహ శక్తిదః.** ముక్తిమార్గంలో ప్రయాణించేవారిని సంసారబంధనాలనుండి వేరు చేస్తాడు. వారికి స్వస్వరూప జ్ఞానము కలుగజేస్తాడు. ఇటువంటి భారం వహిస్తాడు కాబట్టి 'భారభృత్' అనబడుతున్నాడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. కార్యనిర్వాహక శక్తినిస్తుంది. ఓం భారభృతే నమః. (శ్రీ కైవల్య సారధి).

శ్రీ వి.వి. రామానుజన్ గీత (9.22)నుండి ఉదాహరించారు.

**అనన్యాశ్చింతో మాం యే జనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్**
పరమేశ్వరుడనైన నన్ను నిరంతరము అనన్య భక్తితో చింతన చేయుచు, నిష్కామభావముతో సేవించువారి యోగక్షేమములను నేనే వహించుదును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **భారమ్ భక్తరక్షాయా బిభర్తి ఇతి భారభృత్.** భక్తుల రక్షణాభారమును వహించువాడు భారభృత్.

శ్రీ వి.వి. రామానుజన్ – ఒక్కసారి మనం 'నమః' అంటే చాలు. ఇంక భగవంతుడు మన పనిని పెద్దభారంగా పరిగణించి దానిని ఎలాగోలా సఫలం చేస్తాడు. ఇందుకు శ్రీ రామానుజన్ ఉదాహరించినది: శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 3.3.6 – తిరువేంకటత్తాన్ కు 'నమః' అని చెప్పడమే మన బాధ్యత. మిగిలి బాధ్యత అంతా ఆయన భుజాలపైనుంది.

ద్రౌపది వస్త్రాపహరణ సమయంలో తనను కాపాడమని ఆమె శ్రీకృష్ణుని వేడుకుంది. అప్పటికి ఆయన ఆమెను కాపాడాడు గాని ద్రౌపది ఆక్రందన జీవితాంతం శ్రీకృష్ణుని వెంటాడుతూనే ఉంది. తన భక్తురాలికి తగినంత సహాయం చేయలేకపోయానని, ఆమె ఋణం తీర్చుకోలేకపోయాని ఆయన భావిస్తూనే ఉన్నాడు. తనకు శరణాగతులైనవారిపట్ల భగవంతుడు ఇంతటి బాధ్యత నెత్తిన పెట్టుకుంటాడన్నమాట.



గీతా ప్రెస్ వారి ప్రచురణలోని చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Drauapadi_Disrobing.jpg

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అనంతాది రూపేణ భువో భారమ్ బిభర్తి ఇతి భారభృత్.** అనంతుడు, (ఆదిశేషుడు)వంటి రూపాలలో భువనముల భారాన్ని భరించేవాడు భారభృత్.

శ్రీ సత్యసంధ తీర్థ – **భారమ్ భారభూతమ్ బ్రహ్మాండమ్ కూర్మరూపేణ బిభర్తి ఇతి భారభృత్.** ఆదికూర్మం రూపంలో బ్రహ్మాండాన్ని మోసేవాడు భారభృత్.

శ్రీ చిన్మయానంద – ఇక్కడ 'భరించడం' అంటే ఒక మనిషి తన తలపై బరువును మోయడం అనుకోరాదు. సకల జగత్తుకు కారణము, దానిని నడిపేవాడు భగవంతుడు. ఈ విధంగా ఆయన భారభృత్.

## 852. కథితః

- వేదములు, పురాణములు సకల శాస్త్రములు, నారదాదులు ఎవనిగురించి చెప్పారో మరియు కీర్తించారో ఆయన.

### ఓం కథితాయ నమః

కథ్ - వాక్య ప్రబంధే - చెప్పుట, వినిపించుట. కథితుడు - చెప్పబడినవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **కథితః ఉక్తః వక్ష్యమాణ గుణవత్తయా సర్వశాస్త్రేషు.** ఇప్పటివరకూ చెప్పినవి, ఇంక చెప్పబోయేవి అయిన అన్ని గుణమలందును ఆయన పరిపూర్ణత్వము గురించి సకల శాస్త్రములందును చెప్పబడినది గాన ఆయన కథితుడు. ఇందుకు శ్రీ భట్టులు 'జితంతే స్తుతి' (1.7)నుండి ఉదాహరించారు. **వచసమ్ వాచ్యమ్ ఉత్తమన్.** సకల పదాలు (శ్రుతులు, స్మృతులు) ఆ ఉత్తముని గురించే కీర్తిస్తున్నాయి.

శ్రీ తిరుమళిశయాళ్వారు. తిరుచ్చంద. 11 – వేదముల పరమ గమ్యము నీవే. పరబ్రహ్మమని వేదములు చెప్పింది నీ గురించే. మాటలలో చెప్పరాని దివ్యప్రకాశము నీవే. నీవు సృష్టించిన బ్రహ్మయే వేదముల సాయంతో సృష్టికార్యాన్ని నిర్వహిస్తున్నాడు. ఆ బ్రహ్మ కూడా నిన్ను మాటలలో ఏమాత్రం వర్ణించలేడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 3.1.10 – నాస్తికులకు అగుపించనివి, నీ భక్తులకు తెరచియున్నవి అయిన నాలుగు వేదముల సారము నీవే.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వేదాదిభిః అయమేక ఏవ పరత్వేన కథిత ఇతి కథితః; సర్వైర్వేదైః కథిత ఇతి వా కథితః.** ఆయనే పరబ్రహ్మమని వేదాదులు చెబుతున్నాయి. మరియు వేదములు ఆయననే కీర్తిస్తున్నాయి. కనుక ఆయన కథితుడు. ఇందుకు శ్రీ శంకరులు అనేక ప్రమాణములు ఉదాహరించారు.

శ్రీ కృష్ణుని గానం చేస్తున్న శ్రీ మీరాబాయి. ఉదయపూర్ సౌధంలోని చిత్రం. వికీపీడియా నుండి.

Photo by ArishG https://commons.wikimedia.org/wiki/File:Mirabai_and_Krishna.jpg



కఠోపనిషత్తు 2.15 – **సర్వే వేదా యత్పదమ్ ఆమనన్తి.** సకల వేదములు ఆయన పదమును (పరమపదమని) చెబుతున్నాయి.

గీత 15.15 – **వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః వేదాన్తకృత్ వేదవిదేవచాహమ్.** వేదముల ద్వారా తెలిసికోదగినవాడను, వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

భవిష్యత్ పురాణము 132.95 – **వేదే రామాయణే పుణ్యే భారతే భరతర్షభ అదౌ మధ్యే తథాచాఽంతే విష్ణుః సర్వత్ర గీయతే.** ఓ భరతవంశ శ్రేష్ఠుడా! వేదములు, పవిత్ర రామాయణము, భారతము, వీటన్నింటిలో అన్నింటా అంతటా శ్రీమహావిష్ణువే కీర్తింపబడ్డాడు.

కఠోపనిషత్తు 3.9 – **సోధ్వనః పరమాప్నోతి తద్ విష్ణోః పరమం పదమ్.** (సూక్ష్మమైన బుద్ధియే సారధిగా కలిగి, కళ్ళెమువలె మనస్సును అదుపులో ఉంచుకొన్న) అతను మార్గం చివరివరకూ చేరుకుంటాడు. అదే విష్ణువుయొక్క పరమపదము.

ఇతర వ్యాఖ్యాతలు 'కథితః' అనగా 'ఫలానివారిచే కీర్తింపబడినవాడు' అనే అర్థంలో వ్యాఖ్యానించారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **నారద వాల్మీకి ప్రభృతిభిః సంకీర్తత యశో విస్తారత్వాత్ కథితః.** నారదుడు, వాల్మీకి వంటివారిచే కీర్తింపబడిన విస్తారమైన యశస్సు కలవాడు కథితుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – **కథితః సద్-ఆగమ్యైః ప్రతిపాదితః.** ఆగమములచే చెప్పబడినవాడు కథితుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ –

**విష్ణుర్హి లోకే కథితః పురాణః తస్యాన్తమ్ ఆప్నోతి న వాగ్ వచోభిః**

**తస్మాత్ సనాదేన చ వర్తమానా వాగస్తి వక్తుమ్ ప్రతిజన్తు నిష్ఠా**

భగవంతుని మాటలలో చెప్పలేము. వేదాదులు కూడా ఆయనను పూర్తిగా వర్ణించలేకపోతున్నాయి. ఆయనను స్తుతించడానికే మనకు మాట్లడే శక్తి ఉన్నది. ఆయనే కథితుడు (చెప్పదగినవాడు), దర్శతుడు (అంతా చూసేవాడు. అంతటా అయనను చూసేందుకే మనకు చూపు ఉన్నది), శ్రవణుడు, స్పర్శనుడు, రూపుడు, ఘ్రాణుడు....

## 853. యోగీ

- అసాధారణ, అతిమానుష శక్తులు, అష్టైశ్వర్యములు సమృద్ధిగా, పరిపూర్ణముగా గలవాడు.
- యోగసాధనద్వారా ఎరుగదగినవాడు.
- ఘటనాఘటన సమర్థుడు. పరస్పర వ్యతిరేకమైనవానిని కూడా జోడించే యోగీశ్వరుడు.
- తన చిత్తంపై సంపూర్ణమైన నియంత్రణ గలవాడు.
- భక్తుల కోరికలను తీర్చి వారిని ఏకం చేసేవాడు.

### ఓం యోగినే నమః

3వ శ్లోకములో **'యోగః'** నామము, ఈ శ్లోకంలో **'యోగీ'** నామము వచ్చాయి.

3వ శ్లోకము. 18వ నామము. యోగః – **యోగో యోగవిదాంనేతా ప్రధానపురుషేశ్వరః**
91వ శ్లోకము. 853వ నామము. యోగీ – **భారభృత్ కథితో యోగీ యోగీశః సర్వకామదః**

ఈ నామముల పదములకు మూలధాతువు 'యుజ్' అనగా కలయిక, ఏకమగుట. అమరకోశములో 'యోగః' అన్న పదమునకు (3.3.22) **'యోగః సన్నాహః ఉపాయ ధ్యాన సంగతి ముక్తిషి'** అని అనేక అర్థాలు చెప్పారు. 18వ నామము వివరణలో చెప్పిన అర్థాల సారాంశము ఇక్కడ మళ్ళీ ఇవ్వబడింది.

యోగః - ఉపాయము (శ్రీ భట్టులు) – ముక్తి ప్రాప్తికి ఏకైక స్వతంత్ర సాధనము భగవంతుడు.
యోగః - ఉపాయము (శ్రీ సత్యసంధ తీర్థ) – భవతరణోపాయము భగవంతుడే.
యోగః - ఉపాయము (శ్రీ కృష్ణదత్త భర్వాజ) – కోర్కెలు తీరుటకు తిరుగులేని ఉపాయము భగవంతుడే.
యోగః - ఏకమగుట (శ్రీ శంకరులు) – యోగసాధనవలన పొందబడువాడు భగవంతుడు.
యోగః - ధ్యానము, సమైక్యత (శ్రీ బలదేవ విద్యాభూషణ) – యోగధ్యానమువలన భక్తులు భగవంతునిలో లీనమవుతారు.
యోగః - ధ్యానము (శ్రీ సత్యసంధ తీర్థ) – యోగులచే ధ్యానింపబడువాడు భగవంతుడు.
యోగః - ధ్యానము (శ్రీ చిన్మయానంద) – ధ్యానమువలన, సమత్వభావమువలన తెలియబడువాడు భగవంతుడు.

ఇక ప్రస్తుత నామము 'యోగీ' గురించి –

శ్రీ భట్టుల వ్యాఖ్య –
**యుజ్యతే అనేనేన ఇతి యోగః, అఘటితార్థ ఘటనమ్ మహాప్రభావః స అస్య అతిశయేన నిత్యయోగేన, సర్వమ్ ఏతత్ సంభావయతి ఇతి యోగీ.** 'యోగము' అంటే కలుపుట. జరుగనివానిని జరిపించేవాడు యోగి. కూడనివానిని కూర్చడము, లేనివానిని పొందడము – ఇలాంటివానిని అతిశయంగా సంభవింపజేసే గుణము కలవాడు యోగి.

ఇంతకుముందు నామములు పరిశీలిస్తే భగవానుని ఘటనాఘటన సామర్థ్యం అవగతమవుతుంది. కూడనివానిని కూర్చగల సంపూర్ణశక్తిమంతుడు ఆయన. ఆయనలో అష్టైశ్వర్యములు సంపూర్ణంగా ఉన్నాయి. కనుకనే ఆయన **అణువు** (చిన్నవాడు), **బృహత్** (పెద్దవాడు), **కృశః** (సన్ననివాడు), **స్థూలుడు** (లావైనవాడు), **గుణభృత్, నిర్గుణుడు, మహాత్ముడు**. ఇలా కనుక భగవానుని 'యోగి' అని కీర్తించవచ్చును. **యోగోహ్యఘటితార్థస్య ఘటనం తేన సర్వా యస్యాస్తి నిత్యసంబంధః స యోగీ పరికీర్తితః.**

'యోగము' అంటే కూడనివానిని కూర్చడము, లేనివానిని పొందడము. అటువంటి గుణముతో ఎడతెగని (నిత్యమైన) సంబంధము కలవాడు యోగి. (శ్రీ కైవల్యసారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యోగః జ్ఞానమ్, తేనైవ గమ్యత్వాత్ యోగీ**. యోగము అనగా జ్ఞానము. జ్ఞానము ద్వారా మాత్రమే పొందబడువాడు యోగి. ఈ వ్యాఖ్య అద్వైత సిద్ధాంతానికి అనుగుణంగా ఉన్నదని గ్రహింపవచ్చును. విశిష్టాద్వైతంలో మాత్రం భగంతుని భక్తియోగము లేదా ప్రపత్తి ద్వారా పొందవచ్చును. ఇందుకు జ్ఞానము, కర్మలు సాధనములు మాత్రమే.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – వివిధ విషయాలపై తగులుకొనే చిత్తాన్ని అంతర్ముఖం చేసే ప్రక్రియయే యోగము. అలా చిత్తవృత్తి నిరోధం ద్వారా భగవంతుని పొందవచ్చును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **యుజ్యతే సంబంధ్యతే ఇతి యోగీ.** కలిపి ఉంచేవాడు యోగి. **యోగైర్యుక్తమ్ చ ఇదమ్ శరీరమ్ యోగీ. సకలమ్ చ విశ్వమ్ పరస్పరమ్ బద్ధమ్ యోగీ. ఏష చ యోగరూపో గుణో భగవతో విష్ణురేవ సర్వత్ర వ్యాప్తః.** విశ్వములో అన్నింటిని ఒకటిగా కలిపియుంచగలవాడు విష్ణువొక్కడే గనుక ఆయన యోగి.

శ్రీ శంకరులు చెప్పిన మరొక వ్యాఖ్య – **యోగః సమాధిః, స హి స్వాత్మని సర్వదా సమాధత్తే స్వాత్మానమ్ తేన వా యోగీ.** యోగమనగా సమాధి. తన ఆత్మను పూర్తిగా తన అధీనంలో ఉంచుకొన్నవాడు యోగి.

శ్రీ చిన్మయానంద – యోగమనగా చిత్తవృత్తి నిరోధము. భగవంతుడు తన మనసును పూర్తిగా తన అధీనంలో ఉంచుకొన్న యోగి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **యోజయతి స్వజనాన్ తదభీష్టేన ఇతి యోగీ**. భక్తులు కోరినవాటిని ప్రసాదించి వారిని ఏకం చేసేవాడు యోగి.

## 854. యోగీశః

- యోగులందరికి ప్రభువు.
- యోగమును నెరవేర్చువాడు.
- అంతటినీ కలిపి ఉంచేవాడు.

### ఓం యోగీశాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **శ్రీ భట్టులు 'స్వధృతః' (847వ) నామమునుండి మూడు రకాల జీవులుపరంగా వ్యాఖ్యానించారు.** ఈ నామము **'యోగీశః'** వ్యాఖ్య కూడా అలాగే కొనసాగించారు. భగవానుడు యోగులందరికీ ప్రభువు. బద్ధజీవులమధ్య నున్నవారిలోను, సనకాది మహాత్ములలోను కూడా యోగసాధనను సఫలం చేసి వారికి శ్రీవైకుంఠము ప్రాప్తించేలా చేస్తాడు. **యోగీశః సనకాదీనాం యోగినాం ధుర్య ఉచ్యతే.** ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణంనుండి ఉదాహరించారు. **సనందాదీన్ అప-కల్మషాన్ మునీన్ చకార భూయః అతి పవిత్రమ్ పదమ్.** కల్మషరహితులైన సనకసనందనాది మునులకు అతిపవిత్ర పరమపదమును (శ్రీ వైకుంఠమును) ప్రాప్తింపజేసినవాడు యోగీశుడు.

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురము (8.3.10)ను ఉదాహరించారు. నిజమైన తపస్సు, భక్తి కారణంచేత జ్ఞానదృష్టిని సాధించిన సనక సనందనాది మునులు, భగవంతుని అపరిమిత దివ్యమంగళ గుణాలను తనివితీరా అనుభవించి ఆనందించిన ముక్తులు, సంసారభయం ఇసుమంతైనా లేని నిత్యులు – వీరందరూ ఆయనను ఆనందపరవశులై సేవిస్తారు. ఇక్కడ ముముక్షువులు, ముక్తులు, నిత్యులు అనే మూడు విధాల జీవులగురించి చెప్పబడింది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – యోగులలో శ్రేష్ఠుడు యోగీశుడు. సామాన్యయోగులు కొందరు విఘ్నముల కారణంగా తమ యోగసాధననుండి ఎడబాటు చెందుతుంటారు (యోగభ్రష్టులవుతుంటారు). కాని ఆత్మతత్త్వమును పరిపూర్ణముగా నెరిగిన శ్రీహరి తన స్వరూపానందమునందే నిమగ్నుడైయుండును. కనుక ఆయన యోగీశుడు.

హంపిలో శ్రీ యోగనారసింహుడు. Creative Commons Photo from Flickr by Venkataramesh Kommoju




శ్రీ కృష్ణదత్త భరద్వాజ – కర్మయోగులు, జ్ఞానయోగులు, భక్తియోగులు – అందరూ ఆయననే ధ్యానింతురు, పూజింతురు. కనుక భగవంతుడు యోగీశుడు. గీత (6.47)నుండి శ్రీ భరద్వాజ ఉదాహరించారు.

**యోగినామపి సర్వేషామ్ మద్గతేనాంతరాత్మనా**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః**

యోగులందరిలోను శ్రద్ధాళువై, అంతరాత్మను నాయందే లగ్నమొనర్చి, అనగా భక్తి విశ్వాసములతో నిశ్చలమైన, దృఢమైన అనన్యభావముతో నాయందే స్థిరమైయున్న మనోబుద్ధిరూప అంతఃకరణమును గలిగి నిరంతరము నన్నే భజించువాడు నాకు పరమశ్రేష్ఠుడు. (యోగులలో ఉత్తమమైనవారు ఆయననే ధ్యానిస్తారు అని ఇక్కడ గ్రహించాలి).

శ్రీ చిన్మయానంద – యోగి అనగా సంసారమధ్యంలో ఉండి కూడా ఐహికములైన బంధాలకు అతీతంగా ఉండేవాడు. ఈ విధంగా చూస్తే భగవానుడే యోగీశ్వరుడౌతాడు.

శ్రీ సత్యసంధతీర్థ చెప్పిన అర్థం కొంత భిన్నంగా ఉంది. **యోగినామ్ సమ్ (సుఖమ్) యస్మాత్ ఇతి యోగీశః**. ఎవని వలన (ఎవరిని ధ్యానించడం వలన) యోగులు పరమసుఖం అనుభవిస్తారో అతడే యోగీశుడు.

శ్రీ వాసిష్ఠ 'యోగము' అంటే 'కలయిక' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. అంతటినీ కలిపి ఉంచేవాడు యోగీశుడు. ఉదాహరణకు అనేక భాగాలను కలిపి శరీరంగా పనిచేయించువాడు. గ్రహనక్షత్రాది బ్రహ్మాండములను కలిపి జగత్తును నిలిపియుంచేవాడు యోగీశుడు.

## 855. సర్వకామదః

- అన్ని కోరికలను తీర్చేవాడు.

### ఓం సర్వకామదాయ నమః

**సర్వాన్ కామాన్ దదాతి ఇతి సర్వకామదః.** కోరినవానినన్నింటినీ ప్రసాదించేవాడు సర్వకామదుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – అణిమాది సిద్ధులు మోక్షప్రాప్తికి అవరోధాలు అగుగాక. అయినా సరే అలాంటివానిని కూడా యోగులకు ప్రసాదించేవాడు సర్వకామదుడు. అనగా భక్తులు ముక్తిమార్గంనుండి చలించి, సామాన్యమైన సుఖాలు, సిద్ధులు కోరుకుంటే గనుక వానినికూడా భగవంతుడు ప్రసాదిస్తాడు. **అణిమాదీన్ సర్వకామాన్ యోగస్ఖలిత యోగినామ్ అన్తరాయతయా ముక్తేః దదత్ స్యాత్ సర్వకామదః.** ఏ కారణంచేతనయినా యోగభ్రష్టులయినప్పటికీ వారికికూడా యోగఫలంగా అణిమవంటి సిద్ధులను ప్రసాదించేవాడు గనుక భగవానుడు సర్వకామదుడు. ఇందుకు శ్రీ భట్టులు గీత (6.41)నుండి ఉదాహరించారు.

**ప్రాప్యపుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే**
యోగభ్రష్టుడు పుణ్యాత్ములు పొందు లోకములను, అనగా స్వర్గాది ఉత్తమ లోకములను పొంది, ఆయా లోకములలో పెక్కు సంవత్సరములు గడిపి, పిదప పవిత్రులైన సంపన్నుల గృహమున జన్మించును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – బ్రహ్మసూత్రము (3.2.38)లో **'ఫలమత ఉపపత్తేః'** అని ఉంది. ఏ విధమైన యోగమునకు కానీ, ప్రయత్నానికి కానీ తగు ఫలములు ఇచ్చేవాడు భగవంతుడు మాత్రమే. కనుక ఆయన సర్వకామదుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతము (2.3.10)నుండి ఉదాహరించారు.
**అకామః సర్వకామో వా మోక్షకామ ఉదారధీః తీవ్రేణ భక్తియోగేన యజేతా పురుషమ్ పరమ్**
ఏ విధమైన కోర్కెలు లేనివాడు, అనేక కోర్కెలున్నవాడు కూడ, మరియు తగు జ్ఞానము సాధించి మోక్షముపై ఇష్టమున్నవాడు కూడ, తీవ్రమైన భక్తితో పరమపురుషుని పూజింపవలెను. అనగా, ధర్మార్థకామమోక్షాలలో వేనిని ఆశించినాగాని మనం సర్వకామదుడైన ఆ దేవదేవునే పూజింపవలెను. సామాన్య ఫలాలకోసం అన్యదేవతలను పూజించడం గురించి శుకమహర్షి పరీక్షిత్తునకు వివరించిన పిదప చివరలో ఇలా చెప్పాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఛాందోగ్యోపనిషత్తు (4.5.3)నుండి ఉదాహరించారు.
**ఏష ఉ ఏవ వామనీరేష సర్వాణి వామాని నయతి సర్వాణి వామాని నయతి య ఏవం వేద**
తననాశ్రయించినారికి సకల శుభాలను ప్రసాదించే ఆయనే వామని. ఇక్కడ 'వామని' అనే పదము వామనీత్వము (**స్వ ఆశ్రితేషు శోభన ప్రాపకత్వమ్** - ఆశ్రితులకు శుభములనిచ్చే గుణము)ను సూచించునని శ్రీ ఎన్.ఎస్. అనంతరంగాచార్య వివరించారు. 'సర్వాణీ వామాని నయతి' అని రెండుమార్లు వచ్చింది. ఒక విషయాన్ని మరింత దృఢంగా చెప్పడానికి వేదపరిభాషలో ఇలా రెండుమార్లు చెబుతారు.

32వ శ్లోకం 299వ నామము **'కామప్రదః'** కూడా **'సర్వకామదః'**లాంటి భావాన్నే కలిగి ఉంది – **కామహా కామకృత్ కాన్తః కామః కామప్రదః ప్రభుః.**

## 856. ఆశ్రమః

- విశ్రాంతినొసగువాడు. ఆశ్రయమిచ్చువాడు.

### ఓం ఆశ్రమాయ నమః

శ్రము - తపసి ఖేదేచ - కష్టపడుట, అలసిపోవుట; ఆశ్రమ - విశ్రాంతి పొందుట, విరామము పొందుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు **'సర్వకామదః'** వివరణలో శ్రీ భట్టులు యోగభ్రష్టులైనవారిని కూడా భగవానుడెలా అనుగ్రహిస్తాడో చెప్పారు. ఈ నామం **'ఆశ్రమః'** వివరణకూడా అదే భావంలో సాగింది. **తతో వివృత్య సుభిక్ష పరవిద్యేషు వైష్ణవ గృహేషు తేషామ్ విశ్రాంతి హేతుః ఆశ్రమః.**

**తేషాంతు యోగభ్రష్టానాం హేతుర్వైష్ణవ సద్మను సుభిక్ష పరవిద్యేషు విశ్రాంతేరాశ్రమ స్మృతః.** యోగభ్రష్టులైనవారు ఆ విధంగా సుఖాలు అనుభవించి, అనంతరం ఆధ్యాత్మికవిద్యావేత్తలైన వైష్ణవుల గృహాలలో మళ్ళీ జన్మిస్తారు. అంటే ఇక్కడ ఉత్తమజన్మవలన వారికి భోగలాలసతనుండి విరామం లభించి, తిరిగి యోగసాధనను కొనసాగించే అవకాశం లభిస్తుంది. ఇదే వారికి ఆశ్రయము. భగవంతుని పావన దివ్య చరణాలను ధ్యానించుటే ఆశ్రమము.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురం (10.1.2)లో ఇదే భావం చెప్పబడింది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఆశ్రమత్వాత్ సర్వేషామ్ సంసార అరణ్యే భ్రమతామ్ విశ్రమ స్థానత్వాత్ ఆశ్రమః.** సంసారమనే అరణ్యంలో దారితప్పి తిరుగుతూ దుఃఖానికి లోబడిన జీవులకు విశ్రాంతినొసగువాడు గనుక భగవానుడు 'ఆశ్రమః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే అర్థం చెప్పారు. **భవాటవ్యామ్ భ్రమతామ్ సర్వేషామ్ భక్తానామ్ విశ్రమ దాయిత్వాత్ ఆశ్రమః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సంసారమనే అడవిలో పీడితులైనవారికి వివిధదశలలో వానప్రస్థము, సన్యాసము, నిద్ర, సమాధి, చివరకు మోక్షము వంటి విశ్రామములను ప్రసాదించువాడు 'ఆశ్రమః'.

శ్రీ సత్యసంధ తీర్థ – **న విద్యతే శ్రమో ఏషామ్ తే అ-శ్రమా ముక్తాః, తేషామ్ అయమ్ స్వామి ఇతి ఆశ్రమః.** శ్రమ లేనివారికి ప్రభువు 'ఆశ్రమః'. అనగా భగవంతుని దాసులకు శ్రమయుండదు.

శ్రీ రఘునాథ తీర్థ – తత్వసారము (బృహత్ సహస్ర ఆధారంగా) **అ-సంయక్, శ్రమ్యతే-తప్యతే, గూహ్యతే ఇతి ఆ-శ్రమః.** తనను తాను చక్కగా మరుగుపరచుకొనియుండువాడు (అనగా తెలియరానివాడు) 'ఆశ్రమః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **ఆశ్రమ్యన్తే కర్మానురూపమ్ యోనిమ్ ప్రాపయ ఏన ఇతి ఆశ్రమః.** ఎవని కారణంగా జీవులు తమ కర్మానుసారము జన్మాది కష్టములు అనుభవిస్తారో, ఎవని కారణంగా తాపసులు అనేక శ్రమలకోర్చి ధ్యానాదులు కొనసాగిస్తారో అతడు 'ఆశ్రమః'. మిగిలిన వ్యాఖ్యాతలు 'ఆ' అనే ప్రత్యయాన్ని 'శ్రమ'కు వ్యతిరేకమైన భావాన్ని ఇచ్చేలా వ్యాఖ్యానించారు. కాని శ్రీ వాసిష్ఠ మాత్రం 'ఆ' అనే ప్రత్యయాన్ని 'శ్రమ'కు మరింత బలాన్ని చేకూర్చే అనే అర్థంలో వ్యాఖ్యానించారు.

## 857. శ్రమణః

- అంతరాయం వలన ఆగిపోయిన యోగాన్ని మరుజన్మలో కొనసాగించేలా చేసేవాడు.
- వివేకహీనులకు (సంసార) తాపము కలిగించేవాడు.
- నరనారాయణావతారంలో లోకహితంకోసం తపస్సును ఆచరించినవాడు.
- సన్యాసులకు ఆధారమైనవాడు.
- స్తుతుల మూలంగా తెలియవచ్చేవాడు.

### ఓం శ్రమణాయ నమః

**శ్రమ్యతే ఇతి శ్రమణః.** శ్రమించేవాడు లేదా శ్రమింపజేసేవాడు శ్రమణుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – యోగసాధకులకు భగవంతుడు చేసే సహాయం పరంగా **853**వ నామం **'యోగీ'**నుండి శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **యోగీ, యోగీశః. సర్వకామదః, ఆశ్రమః.** ప్రస్తుత నామము **'శ్రమణః'** వ్యాఖ్యను కూడా శ్రీ భట్టులు అదే రీతిలో కొనసాగించారు. **అనాయాసేన శ్రమ్యతే ఇతి శ్రమణః.** ఒక జన్మలో ఆగిపోయిన యోగసాధనను మరొక జన్మలో కొనసాగించడానికి అవకాశం కలిగించేవాడు శ్రమణుడు.

**అక్షీణ పూర్వ సంస్కారైః జన్మానుభవేన చ శ్రమ్యతేఽభ్యస్యతేఽత్రేతి శ్రమణః పరికీర్తితః.** ఈ రకంగా (యోగమునకు అంతరాయం కలిగి) మరొక జన్మనెత్తిన భక్తులకు పూర్వజన్మ సంస్కారం ఉంటుంది. గతజన్మలో వదిలివేసిన యోగమును ఈ జన్మలో అభ్యసిస్తారు (శ్రీకైవల్య సారథి). ఇలా సాధ్యమయ్యేలా చేసేవాడు గనుక భగవంతుని శ్రమణుడని కీర్తిస్తారు. ఇందుకు శ్రీ భట్టులు గీత (6.43)నుండి ఉదాహరించారు.

**తత్ర సంబుద్ధి సంయోగం లభతే పౌర్వదేహికమ్ యు తతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన**
అచట (యోగి కుటుంబమున పుట్టిన పిదప) పూర్వదేహమున సాధించిన బుద్ధిసంయోగమును అనగా సమబుద్ధిరూప యోగసంస్కారములను అతడు సులభముగనే పొందును. ఓ కురునందన! ఆ బుద్ధి సంయోగ ప్రభావమున అతడు మరల పరమాత్మ ప్రాప్తి సిద్ధించుటకై మునుపటికంటెను అధిక సాధన చేయును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అవివేకినః సర్వాన్ సంతాపయతి ఇతి శ్రమణః.** వివేకము లేనివారిని (సంసార) తాపము అనుభవించేలా చేయువాడు శ్రమణుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి వివరణ – ముక్తికొరకు సరైన మార్గము కనిపిస్తున్నాగాని చాలామంది ఆ మార్గాన్ని అనుసరించకుండా విషయలోలులు అవుతారు. అలాంటివారికి జన్మ, కర్మ, కర్మఫలమువంటి సంసారతాపాలు తప్పవు. ఇలా వారిని (అవివేకులను) తపింపజేసేవాడు శ్రమణుడు.

శ్రీ చిన్మయానంద వివరణ – ఆశ, మోహము, విషయలోలత వంటి వానికి లోబడే జనులకు చివరికి భంగపాటు, అశాంతి, దుఃఖము కలుగుతాయి. ఇలాంటి న్యాయాన్ని అమలుపరచే శ్రీమన్నారాయణుడు శ్రమణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'శ్రమ' అనే గుణాన్ని భగవానునికే వర్తించేలా వ్యాఖ్యానించారు. **శ్రామయతి తపస్ చరతి నరనారాయణ రూపేణ లోకసంగ్రహాయ ఇతి శ్రమణః.** లోకరక్షణార్థమై నరనారాయణావతారంలో తీవ్రమన తపస్సును (శ్రమను) ఆచరించినవాడు శ్రమణుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – **శ్రమణాః సన్యాసినః అస్య దాసత్వేన సన్తి ఇతి శ్రమణః.** శ్రమణులనగా సన్యాసులు. వారు భగవంతుని దాసులై ఉందురు. అలా కాకుంటే సన్యాసులకు ఉనికి లేదు. కనుక భగవంతుడు శ్రమణుడు.

శ్రీ రఘునాధతీర్థ (తత్వసారము) – **శ్రమన్తి జానన్తి అనేన ఇతి శ్రమణమ్ స్తుతిః స్తుతిమాన్ స్తుతి విషయః శ్రమణః.**
స్తుతులు అయన గురించే చెబుతున్నవి. ఆయన స్తుతులద్వారా తెలియవచ్చుచున్నాడు. కనుక ఆయన అనగా భగవంతుడు శ్రమణుడు.

## 858. క్షామః

- క్షయమైన రూపం గలవాడు. భూమ్యాదులు అంతమయ్యే సమయంలో ఒంటరిగా, దూరంగా ప్రకాశిస్తున్న ధ్రువనక్షత్రము.
- మళ్ళీ యోగాభిముఖులైన యోగభ్రష్టులను క్షమించి, వారికి సాఫల్యతను కలుగజేసేవాడు.
- ప్రళయకాలంలో క్షయించి (ఒంటరిగా మిగిలి) ఉన్నవాడు.
- ప్రళయకాలంలో జగత్తును క్షీణం చేసి మూలస్థితికి తీసికొని వెళ్ళేవాడు.
- భగవంతుడు విశ్వంలోను, విశ్వం భగవంతునిలోను అంతర్లీనంగా దాగియుండెను.
- అంత్య (ప్రళయ) కాలంలో సకలమునకు నివాసస్థానము (క్షాయతి - నివసించును).
- విశ్వమును అన్ని హంగులతోను సృజించినవాడు (క్షా+మానే = భూమి+శబ్దము).
- రాక్షస స్వభావము కలవారిని అదుపులో పెట్టువాడు (క్షా+మువతే).
- శ్రీవరాహావతారములో భూమిని (క్షమను) ధరించినవాడు.
- గోవుల దారిలో అవరోధములను తొలగించువాడు (క్షమ్+ఆమ).

- ఎంతో ఓపికతో సహించువాడు (క్షమ - సహనము).

## ఓం క్షామాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

47వ శ్లోకము. 444వ నామము. క్షామః – **నక్షత్రనేమిః నక్షత్రీ క్షమః క్షామః సమీహనః**

91వ శ్లోకము. 858వ నామము. క్షామః – **ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

ఈ నామమును అనేక మూలశబ్దాలపరంగా వ్యాఖ్యాతలు వివరించారు.

క్షి –క్షయే – క్షీణించుట, తగ్గుట.

క్షి – హింసాయామ్ – బాధించుట, నాశనం చేయుట.

క్షి – నివాస గతయోః – నివసించుట, వెళ్ళుట.

క్షమ్ – సహనే – అనుమతించుట, ఓర్పు వహించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'క్షి - క్షియే - క్షీణించుట' అనే అర్థంలో 444వ నామాన్ని, 'క్షమ్ - సహనే - ఓర్పు' అనే అర్థంలో 858వ నామాన్ని వ్యాఖ్యానించి, పునరుక్తి లేకుండా చూపారు.

444వ నామము 'క్షామః'ను ధ్రువనక్షత్రపరంగా వ్యాఖ్యానించారు. **అవాంతర లయే కైశ్చిత్ క్షీణ స్తారాగణై స్మృతః క్షామో ధ్రువ సమీపస్థః చతుర్నక్షత్ర సంయుతః.** అవాంతర ప్రళయంలో శింశుమార చక్రమునకు సంబంధించిన నాలుగు నక్షత్రములు మాత్రమే మిగిలియుండును. భూమి, పంచభూతములు మొదలైనవన్నీ లయించును. మిగిలిన నక్షత్రాలన్నీ కొరవడగా ఆ నాలుగు నక్షత్రాలతో కలిసి ధ్రువమండలమునకు సమీపంలో ఉంటాడు కనుక భగవంతుడు 'క్షామః'.

**యావన్మాత్రే ప్రదేశే తు మైత్రేయావస్థితో ధ్రువః**
**క్షయమాయాతి తావత్ తు భూమేరాభూత సంప్లవే** – విష్ణుపురాణము 2.8.92

ప్రస్తుత 858వ నామము 'క్షామః'ను శ్రీ భట్టులు 'సహనము' అన్న అర్థంలో వివరించారు. (క్షమ్ - సహనే - ఒప్పుకొనుట, ఓర్పు). 855వ నామంనుండి 861వ నామంవరకు యోగసాధనపరంగా, ప్రత్యేకించి అంతరాయం కలిగిన యోగులకు తగు సహకారం భగవంతునినుండి లభిస్తుందని, శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **స్వ యోగాభిముఖ్య మాత్రేణ తే యోగభ్రష్టా అపి దుర్గమ్ తరితుమ్ క్షమన్తే అస్మాత్ ఇతి క్షామః.** గతంలో యోగభ్రష్టులయినప్పటికీ ఇప్పుడు మళ్ళీ యోగాభిముఖులు అయినారు కాబట్టి అలాంటివారిని క్షమించి, వారు సంసార సాగరాన్ని తరింపగలిగే శక్తినిస్తాడు గనుక భగవానుడు 'క్షామః' (శ్రీకైవల్యసారధి). ఇందుకు శ్రీ భట్టులు గీత (6.40)నుండి ఉదాహరించారు.

**పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే న హి కళ్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి**

ఓ పార్థా! అట్టి (యోగభ్రష్టుడైన) పురుషుడు ఈ లోకమున గాని, పరలోకమునగాని అధోగతి పాలుగాడు. ఏలనన, నాయనా! ఆత్మోద్ధరణమునకు, అనగా భగవత్ప్రాప్తికై కర్తవ్యకర్మలను ఆచరించువాడెవ్వడును దుర్గతి పాలుగాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 47వ శ్లోకములోని 'క్షామః' నామమును శ్రీ శంకరులు 'క్షయ' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **సర్వ వికారేషు క్షపితేషు స్వాత్మనా అవస్థిత ఇతి క్షామః.** ప్రళయకాలంలో అంతా అంతరించిపోగా (క్షయింపగా) తాను మాత్రం మిగిలి ఉండేవాడు 'క్షామః'.

ప్రస్తుత 'క్షామః' నామమునుకూడా శ్రీ శంకరులు ప్రళయంపరంగానే వ్యాఖ్యానించారు కాని ఇందులో భగవానుని మరొక గుణం తెలియవస్తున్నది. **క్షామాః క్షీణాః సర్వాః ప్రజాః కరోతి ఇతి క్షామః.** సకల జీవులను వాని మూలస్థితికి క్షీణింపజేసేవాడు 'క్షామః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **క్షామాన్-క్షీణాన్ కరోతి దుర్జనాన్ ఇతి క్షామః.** దుర్జనులను నాశనం చేసేవాడు 'క్షామః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – క్షయ - దాగియుండుట. **య ఏతస్మిన్ విశ్వే అంతర్లీనః తిష్ఠతి సర్వమ్ వ్యాప్య, యస్మిన్ వా ఇదమ్ విశ్వమ్ ప్రలీయతే.** ఎవనియందు అంతర్లీనంగా ఈ విశ్వము దాగియుంటుందో, ఎవడు ఈ విశ్వంలో నెలకొనికూడా కనుపించడో అతడు 'క్షామః'. మన మధ్యలో ఉన్నాగాని కనుపించడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – క్షి - నివాస గతయోః - నివసించుట, ఉండుట. **క్షాయతి-నివాసయతి, గమయతి ఇతి క్షామః.** అంతిమ సమయంలో (ప్రళయకాలంలో) భగవానుడే అన్నింటికీ నివాసస్థానము గనుక ఆయన 'క్షామః'.

శ్రీ వాసిష్ఠ మరొక అనుభవము – క్షా - పృథీ - భూమి లేదా విశ్వము. మాంగ్ - మానే శబ్దే - కొలుచుట, ధ్వనించుట. **క్షా ఇతి విశ్వ ఉపలక్షణమ్, ఏవమ్ చ విశ్వమ్ ఇదమ్ య ఇయత్తయా నిబధ్నాతి, గతి దానేన శబ్దవచ్చ కరోతి ఇతి క్షామః.** భగవంతుడు జగత్తును ఇలా ఇలా సృష్టించాడు. దానికి ఇలా వర్తించే స్వభావాన్ని, శబ్దాది లక్షణాలను ఏర్పరచాడు. కనుక ఆయన 'క్షామః'.

శ్రీ సత్యసంధ తీర్థ – క్షా - నరకాః - రాక్షసులు. మా - మవతే - బంధనే హింసాయాంచ - కట్టివేయుట, బాధించుట. **క్షా-నరకాః, తాన్ మతతే-బధ్నాతి ఇతి క్షామః.** రాక్షసులను అదుపులో ఉంచేవాడు 'క్షామః'.

శ్రీ సత్యసంధ తీర్థ మరొక వివరణ – క్షమ - భూమి. **క్షమాయా అయం ధారకో వరాహాది రూపేణ ఇతి క్షామః.** శ్రీవరాహమూర్తిగా భూమిని ధరించినవాడు 'క్షామః'.

శ్రీ రఘునాథ తీర్థ –

47వ శ్లోకంలోని 'క్షామః' – (క్షమ్-ఆమ) **క్షమ్ గవామ్ సంరోధ విశేషమ్ ఆమినోతి కృన్తతి ఇతి క్షామః.** క్షమ అనగా ఆవులు. ఆవుల మార్గంలో అవరోధాలను తొలగించేవాడు 'క్షామః'.
ఈ 91వ శ్లోకంలో 'క్షామః' – **క్షమతే సహతే ఇతి క్షామః.** ఓర్పుతో సహించువాడు 'క్షామః'.

తూర్పు చాళుక్యులనాటి శ్రీ గరుత్మంతుని శిల్పం. పెదవేగి గ్రామం లోనిది.



## 859. సుపర్ణః

- చక్కనైన రెక్కలు గలవాడు. హంస, గరుత్మంతుడు.
- యోగులు సంసారము దాటడానికి సహకరించేవాడు.
- ఏదైనా కదలడానికి శక్తినిచ్చేవాడు.
- వేద స్వరూపుడు (సంసారమనే అశ్వత్థ వృక్షానికి వేదములే ఆకులు – గీత).
- పచ్చని తులసి ఆకులచే అలంకృతుడైనవాడు.
- శ్రీలక్ష్మీదేవి సాన్నిహిత్యం కారణంగా పచ్చని రంగు గలవాడు.
- శుద్ధమైన భక్తిచే సంతోషించువాడు.
- పరమానంద నిలయుడు (సు-పర్-ణః).
- ప్రళయకాలంలో చక్కని మఱ్ఱియాకుపై శయనించినవాడు.

- విశ్వమంతా పూర్తిగా వ్యాపించియున్నవాడు.
- సుపర్ణుడైన గరుడుని వాహనంగా కల్గినవాడు.

## ఓం సుపర్ణాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

21వ శ్లోకము. 194వ నామము. సుపర్ణః – **మరీచిః దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః**

91వ శ్లోకము. 859వ నాము. సుపర్ణః – **ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

శ్రీ భట్టులు ఈ (194వ) నామమును రెండు విధాలుగా వ్యాఖ్యానించారు (1) చక్కని రెక్కలు గలవాడు (హంసావతారము కావచ్చును) (2) సంసార సాగరమును దాటుటకు యోగులకు సాయం చేసేవాడు. **శోభన పర్ణత్వాత్, సంసార నయనాత్ వా సుపర్ణః.** శ్రీ భట్టులు ప్రత్యేకంగా హంసావతారమును పేర్కొనలేదు. గరుత్మంతుని కూడా పేర్కొనలేదు. అయితే శ్రీ భట్టుల వ్యాఖ్యానాన్ని వివరించిన ఇతరులు 'సుపర్ణః' అనగా శోభనమైన పర్ణములు గలవాడు, అనగా చక్కని రెక్కలు గలవాడు, అనగా హంస లేదా గరుత్మంతుడు అని చెప్పారు.

శ్రీమద్భాగవతము (1.16.15) – **సిద్ధేశ్వరాణామ్ కపిలః సుపర్ణోఽహమ్ పతత్రిణామ్** – సిద్ధులలో నేను కపిల మహర్షిని. పక్షులలో నేను గరుత్మంతుడను.

భగవద్గీత (10.29) – **మృగాణామ్ మృగేంద్రోఽహమ్ వైనతేయశ్చ పక్షిణామ్** – మృగములలో రాజైన సింహమును నేను. పక్షులలో వినతాసుతుడగు గరుత్మంతుడను.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సుపర్ణునిగా మూర్తీభవించిన భగవానుని రెండు రెక్కలు ఇవి (1) వేదములు ఒక రెక్క. ఇది సన్మార్గమును చూపించును (2) వేదానుష్ఠానము చేసే ఆచార్యుల సదాచారము రెండవ రెక్క.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమును ముండకోపనిషత్తు (3.1) శ్లోకం పరంగా వ్యాఖ్యానించారు –

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానమ్ వృక్షమ్ పరిష్వజాతే**
**తయోరన్యః పిప్పలమ్ స్వాదన్తి, అనశ్నమ్ అన్యో అభిచాకశీతి**

ఒకే చెట్టుపై ఎంతో స్నేహం కలిగిన రెండు చక్కనైన పక్షులు (సుపర్ణములు) ఉన్నవి. అందు ఒక పక్షి (రావి)పండును భుజించుచున్నది. రెండవ పక్షి కేవలము చూచుచున్నది. ఇక్కడ శరీరమే వృక్షము. దానిపైన మొదటి పక్షి 'జీవుడు' (భోగి). రెండవ పక్షి 'ఈశ్వరుడు' (యోగి). సంసారమునందలి కర్మఫలమే పండు. జీవాత్మ కర్మఫలముననుభవించును. పరమాత్మ (సుపర్ణుడు) సంగరహితుడు, సాక్షిమాత్రుడు.

ప్రస్తుత (859వ) నామమునకు శ్రీ భట్టులు చెప్పిన అర్థము – **ఏవమ్ ప్రత్యాపన్న సమాధీన్ సమాధి - విపాక - ద్వారా తమసః పారమ్ నయతి ఇతి సుపర్ణః.** యోగమార్గంనుండి విచలితులైన యోగులను కూడా మరల యోగమార్గంవైపు మళ్ళించి, వారు మరల సమాధి సాఫల్యము పొందేలా చేసి, వారిని అజ్ఞానాంధకారము (సంసారసాగరము)ను దాటేలా చేసేవాడు సుపర్ణుడు. ఇందుకు శ్రీ భట్టులు మౌలసంహితనుండి, గీతనుండి ఉదాహరించారు.

మౌల సంహిత – **స్వ-పారమ్ భగవాన్ నయతి.** భగవంతుడు వారిని ఒడ్డుకు చేరుస్తాడు.

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః**
**అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాంగతిమ్** – గీత 6.45

కాని, ప్రయత్నపూర్వకముగ యోగసాధన చేయు యోగి అనేక జన్మల సంస్కారప్రభావమున ఈ జన్మయందే సిద్ధినిపొంది, సంపూర్ణముగా పాపరహితుడై, తత్క్షణమే పరమపదమును పొందును.

శ్రీ వాసిష్ఠ ఇచ్చిన మరొక అనుభవము – సృష్టిలో సూర్యచంద్రాదులతో సహా సమస్తమూ కదలడానికి తగు శక్తినిచ్చేవాడు సుపర్ణుడు. ఆయనయొక్క చక్కని రెక్కలవల్లనే అవి కదులుతున్నాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'పర్ణ' అంటే 'ఆకు' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. సంసారమనే వృక్షానికి వేదములు (ఛందములు) ఆకులు. భగవంతుడు వేదస్వరూపుడు గనుక సుపర్ణుడు.

**ఊర్ధ్వమూలమధశ్శాఖమ్ అశ్వత్థమ్ ప్రాహురవ్యయమ్**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్** – గీత 5.1
ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగా, బ్రహ్మయే ముఖ్యశాఖ (కాండము)గా, వేదములే పర్ణములు (ఆకులు)గా గల ఈ సంసారరూప అశ్వత్థవృక్షము నాశరహితమైనది (శాశ్వతమైనది). ఈ సంసారవృక్షతత్వమును మూలసహితముగా తెలిసినవాడు నిజముగా వేదార్థములను ఎఱిగినవాడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – జీవులు తమ కర్మశేషమును అనుభవించుటకై సంసారక్లేశమును అనుభవించక తప్పదు. అలాంటప్పుడు భగవంతుడు జీవులకు ఈ అఖండమైన రావిచెట్టుయొక్క చల్లని నీడ కల్పిస్తాడు గనుక ఆయన సుపర్ణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శోభనాని పర్ణాని తులసీదళాని యన్మూర్తౌ స సుపర్ణః.** చక్కని పచ్చని తులసీదళాలతో అలంకృతమైన మూర్తి గలవాడు సుపర్ణుడు.

శ్రీ విద్యాభూషణ – విలువైన ఆభరణాలకంటే కూడా భగవంతునికి పచ్చని తులసి ఆకులపైనే ప్రీతి. **శోభనాని పర్ణాని తులసీపత్రాణ్యేవ న తు కనక రత్నాని యస్మిన్ స సుపర్ణః.** కనుక ఆయన సుపర్ణుడు.

శ్రీ భరద్వాజ మరొక వివరణ – **శోభనః పర్ణో హరిత భావో యస్య శ్రీలక్ష్మీదేవీ సాన్నిధ్యాత్ ఇతి సుపర్ణః.** తన వక్షస్థలంపైన వేంచేసియున్న శ్రీలక్ష్మీదేవి సాన్నిధ్యం కారణంగా ఆయనకు పచ్చరంగు అబ్బింది గనుక భగవంతుడు సుపర్ణుడు.

శ్రీ భరద్వాజ మరొక వివరణ – **శోభనమ్ పర్ణమ్ ప్రీణనమ్ యస్య ఇతి సుపర్ణః.** భక్తితో సమర్పించిన ఆకువల్లనైనా ప్రీతిచెందేవాడు సుపర్ణుడు.

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః** – గీత 9.26
నిర్మల బుద్ధితో, నిష్కామ భావముతో పరమభక్తునిచే సమర్పింపబడిన పత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, జలమునుగాని నేను ప్రత్యక్షముగా (స్వయముగా) ప్రీతితో ఆరగింతును.

**దళమైనను బుష్పమైనను**
**ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్**
**గొలిచిన జనులర్పించిన**
**నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్** – పోతన. భాగవతము 10.10

శ్రీ టి.ఎస్. రాఘవేంద్రన్. శ్రీ విష్ణుసహస్రనామ సంగ్రహార్థః – **సు-శోభన, పర-ఉత్తమ, ణః-ఆనందః, తాని సన్తి ఇతి సుపర్ణః.** పరమానందమునకు నిలయమైనవాడు సుపర్ణుడు. శ్రీ రఘునాథతీర్థ తత్వసాగరంలో కూడా ఇంచుమించు ఇదే అర్థం చెప్పారు.

శ్రీ సత్యసంధ తీర్థ – **శోభనమ్ పర్ణమ్ వటపత్రమ్ శయ్యాత్వేన యస్య స సుపర్ణః.** ప్రళయకాలంలో చక్కని మఱ్ఱియాకుపై శయనించినవాడు సుపర్ణుడు.

శ్రీ రఘునాధ తీర్థ – **సు-సమ్యక్ భూమిన్ పూరయతి-వ్యాప్నోతి ఇతి సుపర్ణః.** భూమి అంతటా చక్కగా వ్యాపించియున్నవాడు సుపర్ణుడు.

**ఆదికవి శ్రీ నన్నయ ఆంధ్రమహాభారతము. ఆదిపర్వము. గరుడోపాఖ్యానము.** గరుత్మంతునికి సుపర్ణుడను పేరు వచ్చుట.

ఇంద్రుడు గరుత్మంతునిపై వజ్రాయుధం ప్రయోగించగా,

**అదియును నంబరంబున నగ్నికణంబులు చెదరం బఱతెంచి పక్షిరాజు పక్షంబుల దాఁక వచ్చినం జూచి గరుడుండు నగి, 'నీ చేయు వేదన నన్నుం దాఁకనోపదు; నీవు మహాముని సంభవంబవగుటను, దేవేంద్రునాయుధంబవగుటను, నిన్ను నవమానింపంగాదు, గావున మదీయైకపర్ణ శకలచ్ఛేదంబు సేయుము; నాయందు నీ శక్తి యింతియ' యనిన సకల భూతసంఘంబెల్ల నాతని పర్ణంబుల సుస్థిరత్వంబునకు మెచ్చి సుపర్ణుండని పొగడిరి. సురేంద్రుడును నవ్విహగేంద్రు మాహాత్మ్యంబునకు మెచ్చి యచ్చెరువంది యట్లనియె.**

గరుత్మంతుడు వజ్రాయుధంపై గౌరవంతో ఒక్క ఈకను మాత్రము రాల్చాడు. అప్పుడు ఇంద్రుడిలా అన్నాడు.

**నిరుపమాన శౌర్య! నీతోడఁ జెలిమి సే**
**యంగ నా కభీష్టమైన యదియు;**
**నిట్టి విక్రమంబు, నిట్టి సామర్థ్యంబుఁ**
**గలదెయొరుల కిజ్జగంబు నందు**



శ్రీవిల్లిపుత్తూరు ఆలయంలో శ్రీ గరుత్మంతుని మూర్తి.
https://commons.wikimedia.org/wiki/File:Srivilliputtur15,_a_part.JPG
Photo by: Prinzy555

## 860. వాయువాహనః

- జగత్తులో జీవనము నిలుపుటకై వాయువును సంచరింపజేసేవాడు.
- పతనమైనవారిని గరుత్మంతునిద్వారా వాయువేగంతో ఉద్ధరింపజేసేవాడు.
- వాయుసుతుడైన హనుమంతుని వాహనంగా కలవాడు.
- సప్తమారుతములను అన్ని మండలాంతరములందు చలింపజేయువాడు.

### ఓం వాయువాహనాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

36వ శ్లోకము. 333వ నామము. వాయువాహనః – **స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయువాహనః**

91వ శ్లోకము. 860వ నామము. వాయువాహనః – **ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

వాహ్ - గతి గంధనయోః - వెళ్ళుట, వీచుట; వాహ్ - ప్రాపనే - తీసుకెళ్ళుట, ప్రవహించుట. **వాయుః వాహ్యతే - ప్రవర్త్యతే అనేన ఇతి వాయువాహనః.** ఎవరిద్వారా గాలి ప్రవహిస్తుందో అతడు వాయువాహనుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

36వ శ్లోకంలో **'వాయువాహనః'** – సమస్త ప్రాణుల జీవనమునకు ఆధారము వాయువు. ఆ వాయువును ప్రవహింపజేయువాడు వాయువాహనుడు.

**యో వాయౌ తిష్ఠాన్ వాయోరంతరో యమ్ వాయుర్నవేద యస్య వాయుః శరీరమ్ యో వాయురంతరో యమయతి ఏష త ఆత్మాఅంతర్యామి అమృతః** – బృహదారణ్యకోపనిషత్తు 3.7.11
ఆయన వాయువు లోపల ఉంటాడు. కాని వాయువు ఆయనను ఎరుగదు. ఆయన శరీరము వాయువు. ఆయన లోనుండి వాయువును నియంత్రిస్తాడు. ఆయనే నాశరహితుడైన అంతరాత్మ.

శ్రీ తిరుమంగయాళ్వారు – జీవుని నిలిపే పంచభూతముల వెనుకనున్న శక్తివి నీవే.

91వ శ్లోకంలో **'వాయువాహనః'** – ఈ నామం వివరణలో శ్రీ భట్టులు 'వాయువు' అనగా 'గరుత్మంతుడు' అన్న అర్థం తీసుకొన్నారు.
**తాన్ శ్చ ప్రబల హేతుభిః పతితానపి, వాయునా - అనుపమ గత్వరేణ పతగపతినా, వాహయతి ఉత్తారయతి ఇతి వాయువాహనః.**

**వాయునా గత్వరేణైవ కర్మణా పతితాన్ సతః గరుత్మతా వాహయతి యస్సాద్వాయువాహనః**
తన భక్తులు ఒకవేళ పాపకర్మలు చేసి పతితులైనట్లయితే, వాయుగతితో సంచరించే గరుత్మంతుని పంపి వారిని ఉద్ధరించేవాడు వాయువాహనుడు (శ్రీకైవల్యసారథి).

ఇందుకు శ్రీ భట్టులు విష్ణుతత్వమునుండి ఉపరిచర వసువు వృత్తాంతమును ఉదాహరించారు. ఆ రాజు ఒక ముని శాపంవలన అధోగతి పాలయ్యాడు. అప్పుడు భగవంతుడు గరుత్మంతుని పంపి అతనిని ఉత్తమ లోకాలకు లేవనెత్తించాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – గజేంద్రుని ఉద్ధరించే తొందరలో భగవంతునికి గరుత్మంతుని వేగం కూడా చాలలేదేమో. వాయువే వాహనంగా పరుగులిడి గజేంద్రుని కాపాడాడు ఆ వాయువాహనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

36వ శ్లోకంలో **'వాయువాహనః' – వహతః సప్త అవహాదీన్ వాహయతి ఇతి వాయువాహనః.** సప్తమారుతములను చలింపజేయువాడు వాయువాహనుడు. కశ్యప, దితిల సంతానమైన సప్తమరుత్తులను వివిధ మండలములందు వ్యాపించిన వాయువులకు అధిపతిగా భగవంతుడు నియమించెను. ఈ వాయువుల ప్రభావము (ఒత్తిడి) వలన గ్రహ నక్షత్రాదులు తమ నిర్ణీత మార్గములందు సంచరించును. ఏడు విధములైన వాయువులు

(1) ఆవహ వయువు – మేఘమండలమునకు, భూమండలమునకు మధ్య ప్రసరించునది.
(2) ప్రవహ వాయువు – సూర్యమండలమునకు, మేఘమండలమునకు మధ్య ప్రసరించునది.
(3) అనువహ వాయువు – చంద్రమండలమునకు, సూర్యమండలమునకు మధ్య ప్రసరించునది.
(4) సంవహ వాయువు – నక్షత్ర మండలమునకు, చంద్రమండలమునకు మధ్య ప్రసరించునది.
(5) వివహ వాయువు – గ్రహమండలమునకు, నక్షత్రమండలమునకు మధ్య ప్రసరించునది.
(6) పరావహ వాయువు – సప్తర్షి మండలమునకు, గ్రహమండలమునకు మధ్య ప్రసరించునది.
(7) పరివహ వాయువు – ధ్రువ మండలమునకు, సప్తర్షి మండలమునకు మధ్య ప్రసరించునది.

శ్రీ చిన్మయానంద – వాయువులకున్న అసాధారణమైన శక్తి, జీవమును నిలిపే లక్షణము భగవంతునివలన లభించినవి.

91వ శ్లోకంలోని **'వాయువాహనః'** – వాయువును చలింపజేసి జీవమును నిలిపేవాడు గనుక భగవంతుడు వాయువాహనుడు. **భీషాస్మాద్ వాతః పవతే** (తైత్తరీయోపనిషత్తు 2.8) – పరమేశ్వరుడున్నాడన్న భయంతోనే వాయువు సరిగా వీచుచున్నది. దిక్పాలకులు వారి విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – వాయువువలె వేగంగా భగవంతుడు తన భక్తులను ఉద్ధరిస్తాడు గనుక ఆయన వాయువాహనుడు.

శ్రీ వాసిష్ఠ – భగవంతుడు ముందుగా వాయువును సృష్టించి, తరువాత జీవులను సృష్టించాడు. ఇలా ఆ జీవులు పీల్చడానికి గాలి సిద్ధంగా ఉంది. భగవానుని శక్తిని మనం ఊహించలేము. శ్రీ వాసిష్ఠ వేదములనుండి అనేక ఉదాహరణలిచ్చారు.

ఈశావాస్యోపనిషత్తు 4 – **తద్ ధావతోఽన్యాన్ అత్యేతి తిష్ఠాత్ తస్మిన్ అపో మాతరిశ్వా దధాతి.** అది కదలదు. కాని వెంటాడేవాళ్ళకు అందదు. దాని శక్తివల్ల సకల జీవులు నిలుస్తున్నాయి.

అధర్వణ వేదము 10.7.2 – **కస్మాదంగాత్ దీప్యతే అగ్నిరస్య కస్మాదంగాత్ పవతే మాతరిశ్వా.** ఆయన (శక్తి)వలన అగ్ని దీప్తిస్తింది. వాయువు చలిస్తుంది.

అధర్వణ వేదము 10.7.12 – **యత్రాగ్నిశ్చంద్రమాః సూర్యో వాతస్తిష్ఠన్త్యార్పితః. స్కంభమ్ తమ్ బ్రూహి కతమః స్విదేవ సః.** ఎవని ఆధారంగా భూమి, ఆకాశం తమ స్థానాలలో ఉన్నాయో, ఎవనిపై అగ్ని, చంద్రుడు, సూర్యుడు, గాలి ఆధారపడి ఉన్నాయో.

అధర్వణ వేదము 13.3.2 – **యస్మాద్ వాతా ఋతుధా పవన్తే యస్మాద్ సముద్రా అధి విక్షరన్తి.** ఎవనివలన గాలి ఋతువులకు అనుగుణంగా వీస్తుందో, ఎవనివలన సముద్రాలు అదుపులో ఉంటాయో..

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – వాయువనగా వాయుపుత్రుడైన హనుమంతుడు. శ్రీరామావతారంలో భగవంతుడు హనుమంతుని భుజాలపై ఆసీనుడై రావణునితో యుద్ధం చేశాడు గనుక వాయువాహనుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **వాతి - గంధయతే సూచయతి శ్రీ మద్భగవద్ ఆగమమ్ ఇతి వాయుః, తద్వాహనమ్ గరుత్మదాఖ్యమ్ యస్య ఇతి వాయువాహనః, గరుత్మతః సంచాలనే సామగీతిరుద్భవతి, సా చ శ్రీమన్నారాయణస్య ఆగమనమ్ సూచయతి.** భగవంతుని వాహనము గరుత్మంతుడు. గరుడుడు చలించేటపుడు సామగానం ధ్వనిస్తుంది. ఇది భగవంతుని ఆగమనాన్ని సూచిస్తుంది. కనుక భగవంతుడు వాయువాహనుడు.



కంచి బ్రహ్మోత్సవంలో శ్రీ వరదరాజ పెరుమాళ్ గరుడ సేవ. వికీపీడియా చిత్రం.

Photo by BalakrishnanVaradarajan. https://commons.wikimedia.org/wiki/File:Garuda_Sevai.jpg

శ్రీ సత్యసంధ తీర్థ – (వాయువాహ-నః) **వాయుమ్ శ్వాసవాయుమ్ వహన్తి ఇతి వాయువాహ్ జీవః, తాన్ నయతి ఇతి వాయువాహ-నః.** ప్రాణవాయువును శ్వాసించు జీవులు 'వాయువాహ్'. వానిని నడిపించువాడు 'వాయువాహ-నుడు'.

శ్రీ సత్యసంధతీర్థ మరొక వివరణ – వాయువాహ్+వృతు - వర్తన - ఉండుట, జరుగుట, జీవించుట. అహ-వ్యాప్తౌ - వ్యాపించుట. వాయువును ఉండేలాగు, వ్యాపించేలాగు చేసేవాడు వాయువాహనుడు (వాయువః + అహనః). **వాయువశ్చ అసౌ అహనశ్చ ఇతి వాయువాహనః.**



**ధనుర్ధరో ధనుర్వేదో దండో దమయితా దమః |**

**అపరాజితస్సర్వసహో నియంతా నియమో యమః || (92)**

పాఠాంతరము

**ధనుర్ధరో ధనుర్వేదో దండో దమయితా దమః |**

**అపరాజితస్సర్వసహో నియంతాऽనియమోऽయమః || (92)**

### 861. ధనుర్ధరః

- ధనుస్సును ధరించినవాడు.

ఓం ధనుర్ధరాయ నమః

ధన్ - శబ్దము చేయుట; ధన్ - ధాన్యే - ఫలమునొసగుట; ఈ నామమును శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడ 'ధనుస్సును ధరించినవాడు' అని వ్యాఖ్యానించారు.

రామ రావణ యుద్ధం. 1820 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Rama_and_Hanuman_fighting_Ravana,_an_album_painting_on_paper,_c1820.jpg



శ్రీ భట్టుల వ్యాఖ్య – యోగసాధన పరంగా శ్రీ భట్టుల వ్యాఖ్య కొనసాగింది. భగవత్ప్రాప్తి కొరకు యోగసాధన సాగించే భక్తులకు అవరోధములు తొలగించేందుకు శార్ఙ్గము అనే గొప్ప ధనుస్సును చేబట్టినవాడు ధనుర్ధరుడు. **ఉపాసకానాం భక్తేభ్యః ప్రత్యూహ వినివృత్తయే ధనుషో ధారకో నిత్యం స్వయం స స్స్యాద్ధనుర్ధరః.** భక్తులయొక్క ప్రతిబంధకాలను పారద్రోలడానికి ఎప్పుడూ ధనుస్సును ధరించియుండేవాడు ధనుర్ధరుడు. **ఏతదహమ్ హి లోకేऽస్మిన్ క్షత్రియైర్ధార్యతే ధనుః.** తన వనవాస కాలంలో ఋషులు తమ తపస్సులకు ఎదుర్కొంటున్న విఘ్నాలను తొలగించడంకోసం శ్రీరాముడు ధనుస్సును చేతబట్టాడు. **ధార్యతే క్షత్రియైః చాప న ఆర్త శబ్దో భవేదతి.** ఎక్కడా ఆర్తశబ్దం వినబడకుండా ఉండడానికి ధనుస్సును చేబట్టడం క్షత్రియధర్మము.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమోళి (9.2.6)లో భగవంతుని ఆయుధాలను వ్యక్తులుగా వర్ణించారు. శత్రువులను చూడగానే ఆ ఆయుధాలు కోపం పూనుతాయట. తిరువైమోళి (8.8.1) – భగవంతుని ధనుస్సు శార్ఙ్గము మర్యాదతో వంగియున్నది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శ్రీమాన్ రామనామా మహద్ధనుర్ధారయామాస ఇతి ధనుర్ధరః.** (శిష్టరక్షణ కొరకు) శ్రీరామావతారంలో గొప్ప ధనుస్సును చేబట్టినవాడు ధనుర్ధరుడు.

ఇతరులు కూడా ధనుస్సును ధరించారుగాని వారెవరూ శ్రీరామునికి సాటిరారు. **రామః శస్త్రభృతామహమ్** – అని గీత (10.31)లో భగవంతుడు చెప్పాడు. శ్రీరాముడు ఒక గడ్డిపోచను కూడా బాణంగా చేసెనని కాకాసుర వృత్తాంతము ద్వారా తెలుస్తున్నది.

శ్రీ చిన్మయానంద ముండకోపనిషత్తు (2.2.3)శ్లోకాన్ని ఉదాహరించారు. ఇక్కడ 'ప్రణవము' అనే అర్థంలో 'ధనుస్సు' శబ్దాన్ని వాడారు.

**ధనుర్గృహీత్వౌపనిషదమ్ మహాస్త్రమ్ శరమ్ హ్యుపాసానిశితమ్ సంధయీత్**
**ఆయమ్య తద్భావ గతేన చేతసా లక్ష్యమ్ తదేవాక్షరమ్ సోమ్యవిద్ధిః**
ఉపనిషత్తులలో చెప్పిన (ప్రణవము అనే) ధనుస్సును చేతబట్టి, అందు ధ్యానముచే పదునెక్కిన (ఆత్మ అనే) బాణమును సంధించి, బ్రహ్మముపై గురిపెట్టి బాణమును విడువవలెను. దాని లక్ష్యము అక్షరపరబ్రహ్మమే. (తరువాతి మంత్రములో **'ప్రణవో ధనుః, శరోహ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే'** అని స్పష్టంగా చెప్పారు).

శ్రీ బలదేవ విద్యాభూషణ గౌడీయ వైష్ణవ సంప్రదాయ పండితులు. వీరు 'ధనుర్ధరః' నామమును శ్రీకృష్ణపరంగా వ్యాఖ్యానించారు. **లక్షణా స్వయంవరే మత్స్యవేధాయ ధనుషో ధరణాత్ ధనుర్ధరః.** లక్షణాదేవి స్వయంవరంలో మత్స్యమును ఛేదించడానికి ధనుస్సును ధరించినవాడు ధనుర్ధరుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఋగ్వేద మంత్రాన్ని ఉదాహరించారు.
**అహమ్ రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మద్విషే హన్తవావు**
**అహమ్ జనాయ సమదమ్ కృణోమ్యహమ్ ద్యావయవా పృథ్వీ ఆవివేశ**
నేను రుద్రుని కొరకు విల్లును వంచుతాను. అందువల్ల బాణము భగవద్వేషులను కొట్టి చంపుతుంది. నేను ప్రజలకొరకు యుద్ధాన్ని సిద్ధం చేస్తాను. నేను భూమి, ఆకాశం అంతా విస్తరించాను.

## **862.** ధనుర్వేదః

- ధనుర్విద్యను తెలియజెప్పువాడు.
- ధనుర్విద్య సంపూర్ణముగా తెలిసినవాడు (శ్రీరాముడు).
- తన సృష్టిలోని జీవులన్నింటికీ ఆత్మరక్షణోపాయములు సమకూర్చినవాడు.
- ఆత్మసాక్షాత్కారము కోసము ప్రణవధ్యానమును ప్రసాదించినవాడు.

### ఓం ధనుర్వేదాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సురేంద్రాద్యాః ధనుశ్శాస్త్రం యస్మాద్విందంతి స శ్రుతః ధనుర్వేదో హ్యష్టవర్ణో ధనుర్వేదప్రదాయకః.** మహావీరులైన దేవేంద్రాదులు కూడా తన దగ్గర నేర్చుకొనవలసినంత ధనుర్విద్యా విశారదుడు గనుక ఆయన 'ధనుర్వేదః'. ఈ నామము అష్టాక్షరీమంత్రము. ధనుర్వేదాన్నిస్తుంది. ఓం ధనుర్వేదాయ నమః. (శ్రీకైవల్యసారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స ఏవ దాశరథిః ధనుర్వేదమ్ వేత్తి ఇతి ధనుర్వేదః.** దశరథతనయుడైన ఆ రాముడే ధనుర్విద్యను సంపూర్ణముగా ఎఱిగినవాడు గనుక 'ధనుర్వేదః'. ఇంతకుముందు 'ధనుర్ధరః' నామవివరణలో 'మహత్' అనే పదానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఇవ్వాలి (మహత్ ధనుర్ధారః). అలాగే ఈ 'ధనుర్వేదః' నామ వివరణలో 'ఏవ' అనే పదాన్ని ప్రముఖంగా గమనించాలి. ధనుర్విద్య తెలిసినవారు చాలామంది ఉన్నాగాని రామునివంటివారు వేరెవరూ లేరు. రాముడు తన ఇష్టం వచ్చినట్లు బాణాన్ని ప్రయోగించగలడు. ఉపసంహరించగలడు. తన బాణాలతో ప్రకృతిని శాసించగలడు. అందుకే సముద్రంపై తన బాణాన్ని ఎక్కుపెట్టాడు.

శ్రీ వాసిష్ఠ రెండు అర్థాలు చెప్పారు.

(1) **ధనుర్విందతి లభత ఇతి.** ధనుస్సు కలిగినవాడు.

(2) **ధనుర్వేదయతి స్వరక్షణార్థమ్ సర్వేభ్య ఇతి ధనుర్వేదః.** ఇక్కడ ధనుస్సు అంటే 'ఆత్మరక్షణా సాధనము' అని శ్రీ వాసిష్ఠ గ్రహించారు. భగవంతుడు జీవులకు ఆత్మరక్షణాసాధనాలను ప్రసాదించాడు. ఉదాహరణకు ఆవులకు కొమ్ములు (**గవాధికానామ్ ధనురస్తి శృంగమ్**), పులులకు, సింహాలకు గోళ్ళు (**సింహాది హింస్రస్య నఖాది రూపమ్**),మనుషులకు బుద్ధి (**ధనుశ్చ మర్త్యస్య సు-బుద్ధిః**).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ యజుర్వేదంనుండి ఉదాహరించారు.
**అవతత్య ధనుష్ట్వగ్ం సహస్రాక్ష శతేషుధే నిశీర్య శల్యానామ్ శివో నః సుమనాభవః**

శ్రీ చిన్మయానంద ఇంతకు ముందు నామము 'ధనుర్ధరః' వివరణలోలాగానే 'ధనుస్' అంటే 'ప్రణవం' అనే అర్థాన్ని గ్రహించారు. ఆత్మసాక్షాత్కారం కోసం ఓంకారాన్ని ధ్యానం చేసే విధానాన్ని ప్రసాదించినవాడు 'ధనుర్వేదః'.

శ్రీ రఘునాధ తీర్థ – **ధనూషి విదన్తి ఇతి ధనుర్వేదః అస్త్రజ్ఞః భృత్యాః తే అస్య భక్తానామ్ దాసాః సన్తి ఇతి ధనుర్వేదః**
భగవంతుని భక్తులకు అస్త్రవిద్యా విశారదులు సేవకులగుదురు.

## 863. దండః

- దుష్టులను శిక్షింపజేసేవాడు.
- యమదండము వెనుకనున్న నిజమైన శక్తి.
- **అదండః** – ఎవరిచేతను నియమింప (శిక్షింప)బడనివాడు.
- జీవులను ధర్మం అనుసరింపజేసే నియమకర్త.

### ఓం దండాయ నమః

దమ్ - ఉపశమే - అదుపులో ఉంచుట. **దుష్టాన్ దండయతి ఇతి దండః.** దుష్టులను శిక్షించేది దండము. దండము అంటే 'కర్ర' అని కూడా అర్థం ఉంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **వేదధర్మారిష్ఠతాతి నృపాది ముఖతః ఖలాన్ దండనీత్యా దామ్యతీతి దండస్యాద్ృతువర్ణకః.** వైదికధర్మాన్ని రక్షించడానికి దక్షులైన రాజులద్వారా దుష్టులను శిక్షించేవాడు 'దండః'. ఈ నామము షడక్షరీమంత్రము. దుష్టులను శిక్షిస్తుంది. ఓం దండాయ నమః. (శ్రీ కైవల్యసారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు గీత (10.38)నుండి ఉదాహరించారు. **దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్.** (దుష్టులను) శిక్షించువారిలో దండము అనగా దమనశక్తిని నేనే. జయేచ్ఛ కలవారి నీతిని నేనే.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 6.10.4 – దుష్టులైన అసురులు జనులను బాధిస్తారు. అలాంటివారిపై కరుణ లేకుండా భగవంతుడు అగ్నిలాంటి బాణాలను వర్షిస్తాడు. ఖరదూషణాదులపై రాముడు ఇలానే బాణవర్షం కురిపించాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – తిరుగులేని యమదండము వెనుక నిజమైన శక్తి భగవానుడే.

శ్రీ సత్యసంధ తీర్థ – దైత్యాన్ దండయతి ఇతి దండః. రాక్షసులను శిక్షించేవాడు 'దండః'.

శ్రీ సత్యసంధ తీర్థ **'అదండః'** అనే పాఠ్యాంతరాన్ని కూడా పరిగణించారు. **అన్య కర్తృక శిక్షణ రహితః అదండః.** ఎవరిచేతను శిక్షింపబడనివాడు 'అదండః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – దండ - దమన - నియమన - అదుపు. అందరినీ అదుపులో ఉంచి ఆయన నియమాల ప్రకారం వర్తించేలా చేసేవాడు 'దండః'.

## 864. దమయితా

- (తన భక్తుల శత్రువులను) దండించువాడు. దుష్టులను శిక్షించే స్వభావం కలవాడు.
- (తన భక్తుల కష్టాలను) తొలగించేవాడు.
- యమధర్మరాజు మున్నగువారి రూపంలో దుర్మార్గులను దండించేవాడు.

### ఓం దమయిత్రే నమః

దమ - ఉపశమే - అదుపులో పెట్టుట. తృన్ - తాచ్ఛీల్య - అలాంటి గుణము కలిగియుండుట (పాణిని సూత్రము 3.2.125 ప్రకారము). **దమయతి - ఉపశమయతి తచ్ఛీలో దమయితా.** శిక్షించే స్వభావం కలవాడు దమయిత. ఇంతకు ముందునామము 'దండః' కూడా ఇదే మూలశబ్దంనుండి వివరింపబడింది. అయితే 'దండః' నామము శిక్షించే ఒక సాధనంగాను, 'దమయితా' నామము శిక్షించేవానిగాను భగవానుని సూచిస్తున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వయంచ రావణాదీన్ తాచ్ఛీల్యేన దమయితా.** రావణునివంటివారిని శిక్షించే స్వభావం కలవాడు దమయిత. (నిరుక్తి) **తాచ్ఛీల్యాత్ రావణాదీనామ్ హర్తా - దమయితా స్వయమ్.** ఇలాంటి స్వభావం ఉన్నందునే భగవంతుడు రాముడు, కృష్ణుడువంటి అవతారాలలో సంభవించి, భూమిలో దుష్టులను నాశనం చేసి, ధర్మాన్ని సంస్థాపిస్తుంటాడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 7.5.2 – భగవంతుడు మన మధ్య జన్మనెత్తి, (రామావతారంలో సీతాసమేతంగా లాగా) అనేక కష్టాలు అనుభవించి, దుష్టులను వెదకిపట్టుకొని, వారిని నాశనం చేస్తుంటాడు. ఎందుకోసం? భగవంతుని పాదాలను ఇసుమంతయినా తలచుకొనని ఈ మానవులకోసం.

ఈ విధమయిన భగవంతుని లక్షణమే 'దమయితా' నామంలో తెలుపబడింది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – యమధర్మరాజు, మున్నగువారి రూపంలో భగవంతుడు దుర్మార్గులను వారి అకృత్యముల కారణంగా దండించును గనుక ఆయన దమయిత. ఇందుకు శ్రీ శంకరులు గీత (10.29)నుండి ఉదాహరించారు. **పితౄణామార్యమాచాస్మి యమం సంయమతామహమ్.** పితరులలో ఆర్యముడను (పితృగణ ప్రభువును). శాసకులలో యమధర్మరాజును నేను.

శ్రీ సత్యసంధ తీర్థ కూడా ఇదే అర్థం చెప్పారు. **దైత్యాన్ దమయతి ఇతి దమయితా**. దుష్టులైన రాక్షసులను శిక్షించేవాడు దమయిత.

శ్రీ వాసిష్ఠ – **జగతి జగదీశ కృతాయ జగద్వ్యవస్థాయా భంజకమ్ ఉపశమ్య స్వవశే స్థాపయతి**. ధర్మమును అతిక్రమించేవారిని శిక్షించేవాడు దమయిత.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **దమయతి ఉపశమయతి దైన్యమ్ స్వజనానామ్ ఇతి దమయితా.** తన భక్తుల కష్టాలను హరించేవాడు దమయిత.

21వ శ్లోకం 192వ నామము **'దమనః'**కు శ్రీ భట్టులు చెప్పిన వ్యాఖ్య ఇందుకు దగ్గరగా ఉన్నది. **కాంతి మందాకినీభిః భవతాపమ్ దమయతి ఇతి దమనః.** మందాకినివంటి తన కాంతితో సంసారతాపమును హరించేవాడు దమనుడు.

తన భక్తుల శత్రువులను శిక్షించేవాడు దమయిత.

శ్రీ చిన్మయానంద – దుష్టులను శిక్షించి, పాపులను నాశనం చేసి, జగత్తు అనే వనంలో ఆధ్యాత్మిక పుష్పాలను పూయించేవాడు దమయిత.

శ్రీ బలదేవ విద్యాభూషణ గౌడీయవైష్ణవ సంప్రదాయానికి చెందిన పండితులు. ఈయన దాదాపు అన్ని నామాలను శ్రీకృష్ణావతారపరంగా వ్యాఖ్యానించారు. ప్రస్తుత 'దమయతా' నామనకు ఆయన వ్యాఖ్య – **నాగ్నజితీ స్వయంవరే సప్తానాముక్షణామ్ దమనాత్ దమయితా.** నాగ్నజితి స్వయంవరంలో ఏడు ఎద్దులను అదుపుచేసినవాడు దమయిత.

## 865. అదమః

- ఎవరిచేతను దండింపబడనివాడు. ఎందుకంటే ఆయనకంటే ఎక్కువవారెవ్వరూ లేరు.
- (అద+మః) అందరికీ సంపదలు ప్రసాదించేవాడు.

### దమః

- దుర్మార్గులను దండించు దండనక్రియాఫలము తానే అయినవాడు (దండనవలన కలిగే సత్ఫలితాలు).
- అన్నింటినీ (గ్రహాదులనూ, జీవులనూ వగైరా) నియమంలో పెట్టువాడు.
- (ద+మః) కల్పతరువువలె భక్తులకు సకలాభీష్టములు ప్రసాదించువాడు.

### ఓం అదమాయ నమః

### ఓం దమాయ నమః

శ్రీ పరాశరభట్టులు ఈ నామమును **'అదమః'** అని చెప్పగా, శ్రీ శంకరులు **'దమః'** అనే పాఠాన్ని చెప్పారు. ఇంతకుముందు రెండు నామములు **'దండః', 'దమయితా'** లాగానే ఈ 'దమః' నామము కూడా 'దమ్ - ఉపశమే - అదుపు చేయుట' అనే శబ్దంనుండి వివరింపబడింది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అదమః** – నిరుక్తిలో శ్రీ భట్టుల వ్యాఖ్యను ఇలా చెప్పారు. **కశ్చిత్ దమయితా నాస్తి యస్యాసౌ అదమః స్మృతః.** ఆయనను అణచువారెవ్వరూ లేరు గనుక ఆయనను 'అదముడు' అని ధ్యానిస్తారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరణ – **దామయతి ఇతి దమో దమనః పరాభవతా, న దమో యస్య కశ్చిత్ సః అదమః.**

శ్రీ భట్టులు మహాభారతం ఉద్యోగపర్వము (67.8)నుండి ఉదాహరించారు – **భస్మకుర్యాత్ జగత్సర్వమ్ మనసైవ జనార్దనః న తు కృత్స్నమ్ జగచ్చక్తమ్ కించిత్ కర్తుమ్ జనార్దనే.** సంకల్పమాత్రాన జనార్దనుడు సకల జగత్తును భస్మము చేయగలడు. కాని జగత్తు అంతా కలసినా ఆయనను ఏమీ చేయలేదు.

శ్రీ సత్యసంధ యతిరాజ కూడా 'అదమః' అనే నామాన్ని పరిగణించారు (ఆద-మః). **సమ్యక్ దదాతి ఇతి ఆదః, తేషామ్ మా-సంపత్ యస్మాత్ ఇతి అదమః.** అందరికీ చక్కగా సంపదలు ఇచ్చేవాడు అదముడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **దమః – దమ్యేషు దండ కార్యమ్ ఫలమ్, తచ్చ స ఏవ ఇతి దమః.** భగవంతుడొనర్చే దండన కార్యమునకు ఫలం కూడా తానే అయినందున 'దమః' అనబడుచున్నాడు. అంటే శిక్షణ కారణంగా జరిగే మార్పు (సద్బుద్ధి కలుగుట, మోక్షము లభించుట వంటివి) కూడా భగవత్స్వరూపమే.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు కలిగించే శిక్షణవల్ల సత్ఫలితమే జరుగుతుంది. ఆత్మ పరిశుద్ధమవుతుంది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – దమనమునకు వాడే సాధనాలు, అనగా ఇంద్రియ నిగ్రహము వంటివి, కూడా దమములే.

శ్రీ వాసిష్ఠ –

**దమోహి సర్వత్ర విరాజమానః, క్రియాసు సర్వమ్ స నియమ్య యంగ్తే**
**గ్రహాస్తమేవ దమమాత్ర విష్ణుమ్ నమన్తి సర్వే పరిధౌ భ్రమన్తః**

భగవంతుని అదుపు (దమము)వలన అన్నీ తమతమ పనులు చేస్తున్నాయి. గ్రహములు తమ పరిధిలో చరిస్తున్నాయి. ఇంతకుముందు నామము 'దమయితా'ను దుష్టశిక్షణాపరంగాను, ఈ నామము 'దమః'ను కర్మపాలనాపరంగాను శ్రీ వాసిష్ఠ వివరించారు.

శ్రీ రఘునాథ తీర్థ – (ద-మః) **కల్పతరు శాఖా ఇవ భక్తానామ్ సర్వాభీష్టమ్ దదాతి ఇతి ద-మః.** కల్పతరువు కొమ్మలాగా భగవంతుడు భక్తులు అడిగినవన్నీ ఇస్తాడు. (శ్రీ సత్యసంధ తీర్థ 'అదమః' నామమునకు చెప్పిన అర్థం కూడా ఇలానే ఉంది.)

## 866. అపరాజితః

- ఎదురు లేనివాడు. అపజయమెరుగనివాడు.
- భగవంతుని రక్షణలోనున్నవారికి అపజయము లేదు.
- భగవంతుని శక్తి ఎన్నటికీ తరుగదు.

### ఓం అపరాజితాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

76వ శ్లోకము. 721వ నామము. అపరాజితః – **దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాపరాజితః**

92వ శ్లోకము. 866వ నామము. అపరాజితః – **అపరాజితస్సర్వసహో నియన్తాఽనియమోఽయమః**

జీ - జయే అభిభావే చ - జయించుట. **పరై ర్న పరాజీయతే, పరాభిభూయతే వా స అపరాజితో విష్ణుః.** భగవంతుడైన విష్ణువును ఎవరూ జయించలేరు. మరియు అవమానపరచలేరు. భగవంతుడు 'అపరాజితుడు' అన్న విషయాన్ని రెండు విధాలుగా అర్థం చేసుకోవచ్చును. (1) ఎవరూ, ఎప్పుడూ, ఎక్కడా భగవంతుని జయించలేరు. (2) భగవంతుని రక్షణలో ఉన్నవారికి అపజయం లేదు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 721వ నామము 'అపరాజితః'ను మొదటి అర్థంలోను, 866వ నామము 'అపరాజితః'ను రెండవ అర్థంలోను వ్యాఖ్యానించి, పునరుక్తిదోషం లేకుండా చెప్పారు.

721వ నామము. అపరాజితః – **క్వచిత్, కదాచిత్, కుతశ్చిత్ అప్రతిహతః అపరాజితః.** లోకంలో ఎవరూ, ఎప్పుడూ, ఎక్కడా భగవంతుని నిరోధించలేదు (ఓడించలేదు). కనుక భగవంతుడు అపరాజితుడు.

శ్రీ భట్టులు ఆయుర్వేద చరకసంహితమునుండి ఉదాహరించారు –

**యథాऽహమ్ నాభిజానామి వాసుదేవే పరాజయమ్**
**మాతుశ్చ పాణిగ్రహణమ్ సముద్రస్య చ శోషణమ్**
**ఏతేన సత్యవాక్యేన సిచ్యతామ్ అగదోహ్యయమ్**

వాసుదేవుని పరాజయము జరుగదు. నా తల్లి వివాహము నేను చూడలేదు, సముద్రము ఎండిపోవుట నేనెరుగను. ఈ వాక్యములు ఎంత నిజమో ఈ ఆయుర్వేద శాస్త్రము కూడ అంతే నిజమగుగాక.



మహాబలిపురంలో శ్రీ భూవరాహస్వామి శిల్పం. వికీపీడియా చిత్రం.
By Michael Clark
https://commons.wikimedia.org/wiki/File:Shore_Temple,_Relief_carvings_02_(2281609094).jpg

శ్రీ భట్టులు ఇంకా రామాయణ మహాభారతాలనుండి ఉదాహరించారు –

యుద్ధకాండ 114.15 – **అజయ్యః శాశ్వతో ధ్రువః.** అజేయుడు, శాశ్వతుడు, నిశ్చలుడు.
యుద్ధకాండ 120.14 – **అజితః ఖడ్గధృక్.** అజితుడు, ఖడ్గధారి
భారత. ఉద్యోగ. 6.79 – **యతో కృష్ణ స్తతో జయః.** (కృష్ణుడున్నచోట జయము ఉండును).
భారతము – **దాశార్హమ్ అపరాజితమ్.** కృష్ణుడు అపరాజితుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

76వ శ్లోకములో 'అపరాజితః' – **న అంతరై రాగాదిభిః పరాజిత ఇతి అపరాజితః.** అంతశ్శత్రువులైన రాగద్వేషాదులు భగవంతుని ఎన్నడూ జయించలేవు గనుక భగవంతుడు అపరాజితుడు.

92వ శ్లోకములో 'అపరాజితః' – **శత్రుభిః న పరాజిత ఇతి అపరాజితః.** (బాహ్య) శత్రువులు భగవంతుని ఎన్నడూ జయించలేరు గనుక భగవంతుడు అపరాజితుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ చెప్పిన మరొక అర్థము – అ-పః-రాజితః – **న విద్యతే పః - పాలకో యస్య స అపః, స చాసౌ రాజితశ్చ ఇతి అపరాజితః.** భగవంతునికి పాలకుడు ఉండడు. మరియు భగవంతుడు ప్రకాశమానుడు. కనుక అపరాజితుడు. అంతే కాకుండా భక్తుడు కానివాడు ఆయనను చేరలేడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'పర' అనగా 'అత్యంత' అనే అర్థంలో కూడా వ్యాఖ్యానించారు. ఒక వ్యాఖ్య ఇంచుమించు శ్రీ భట్టుల వ్యాఖ్యతో సరిపోతుంది. మరొక వ్యాఖ్య అద్వైత సిద్ధాంతానికి దగ్గరగా ఉంది. భగవంతునికంటే వేరే ఏదీ లేదు. కనుక భగవంతుడు పరాజితుడు కావడం అనేది అసంభవం. పర ఏవ **కశ్చిన్నాస్తి, న ద్వితీయో న తృతీయః. ఇతి అథర్వ వచనాత్, తస్మాత్ పరాజిత్వస్య అసంభవాత్ భగవతః అపరాజితః ఇతి నామ్నా సంకీర్తనమ్ ఉపపద్యతే.**

శ్రీ చిన్మయానంద మరొక అనుభవము – తక్కినదంతా అంతరించినపుడు పరమాత్ముడు మాత్రమే ఉండును గనుక ఆయన అపరాజితుడు.

శ్రీ రఘునాధ తీర్థ – **పరాజీయతే కాలతః నశ్వరః విభూతయః, న విద్యన్తే నశ్వరాహ విభూతయః యస్య సః అపరాజితః.** అన్ని విభూతులూ (శక్తులూ) కాలంతో క్షీణిస్తాయి. కాని భగవద్విభూతి నాశనరహితమైనది. కనుక భగవంతుడు అపరాజితుడు.

## 867. సర్వసహః

- ఇతర దేవతలు కూడా తానే ఆధారమైనవాడు.
- తన శత్రువులను జయించువాడు.
- సర్వ సమర్ధుడు, సకలశక్తి భాండారము.
- అందరి అపరాధములను మన్నించువాడు.

### ఓం సర్వసహాయ నమః

'సహ' అనగా భరించుట, సహించుట, సమర్ధత కలిగియుండుట. శ్రీ భట్టులు, శ్రీ వాసిష్ఠ 'భరించుట, ఆధారమగుట' అనే అర్ధంలో వ్యాఖ్యానించారు. శ్రీ శంకరులు 'సమర్ధత కలిగియుండుట, శక్తి కలిగియుండుట, జయించుట, నిలుపుట' అనే అర్ధాలు వాడారు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'సహించుట, ఓర్చుకొనుట' అనే అర్ధంలో వ్యాఖ్యానించారు. శ్రీ శంకరులు 'సహస్' అనగా 'బలము' అనే అర్ధం కూడా వాడారు. **సహతే అనేన శత్రుమ్ ఇతి సహః.** (అమరకోశము).

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వ-శాసనేన సర్వమ్ దేవతాంతరమపి మదాంధికారిణామ్ ఆరాధ్యతయా సహతే - బిభర్తి ఇతి సర్వసహః.** నారాయణుడే పరమదైవము అని తెలియని మందమతులు ఇతర దేవతలను పూజిస్తారు. అయినా అలాంటి అన్యదేవతలకు కూడా తానే ఆధారమైనవాడు 'సర్వసహః'.

**మదాంధకారిణాం సర్వం ఆరాధ్యత్వేన దైవతమ్ బిభర్తి సహతే యస్తు స సర్వసహ ఈరితః.**
మదాంధికారులచే ఆరాధింపబడే దేవతలను కూడా తనే భరించువాడు (భక్తులలో ఉత్తములు, మధ్యములు, మదాంధికారులు అని మూడు రకాలున్నారు. ఇందులో మూడవరకంవారు యక్షిణీ దేవతలను పూజిస్తారు..) (శ్రీ కైవల్యసారధి).

శ్రీ వాసిష్ఠ కూడా 'ఆధారమగుట, భరించుట' అనే అర్థాన్ని మరొకరకంగా చెప్పారు. భూమి, ఆకాశము, సకల చరాచరములకు ఆధారము, రక్షణ అయినందున భగవంతుడు 'సర్వసహః'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు మూడు అర్థాలను చెప్పారు.

(1) **సర్వాన్ శత్రూన్ సహత ఇతి సర్వసహః.** సకల శత్రువులను జయించువాడు సర్వసహుడు.

(2) **సర్వ కర్మసు సమర్థ ఇతి సర్వసహః.** అన్ని కార్యములందు సమర్ధుడు సర్వసహుడు.

(3) **పృథివ్యాది రూపేణ వా సర్వసహః.** భూమివంటి రూపములలో అన్నింటికి ఆధారమైనవాడు సర్వసహుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సర్వేషామ్ స్వజన అపరాధానామ్ సహః ఇతి సర్వసహః.** తన భక్తులందరి అపరాధములను సహించువాడు సర్వసహుడు. శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఈ అర్థాన్ని మరింత పొడిగించారు. శత్రువుల అపరాధములను కూడ మన్నించువాడు సర్వసహుడు.

శ్రీ వాసిష్ఠ 'సహించుట' అనే అర్థంలో మరొక వ్యాఖ్య చెప్పారు. ఎన్ని నీర్లు కలిసినా సముద్రం తన తత్వాన్ని కోల్పోదు. శరీరంలో ఉన్న జీవుడు అనేక కర్మలను ఎదుర్కొన్నా చివరకు ఆ శరీరాన్ని వదలి మరొక శరీరానికి వెళతాడు. ఇది భగవంతుని సర్వసహత్వమునకు సూచిక.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సర్వాణి రుక్మ్యవజ్ఞా వదాంసి సహత ఇతి సర్వసహః.** రుక్మిణియొక్క సోదరుడు రుక్మి. రుక్మి, దుర్యోధనుడు, శిశుపాలుడు వంటివారి అనేక దుర్భాషలను సహించినవాడు సర్వసహుడు.

అమ్మలగన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాల బె
ద్దమ్మ, సురారులమ్మ కడుపారడి బుచ్చినయమ్మ, దన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ, మా
యమ్మ, కృపాబ్ధి ఇచ్చుట మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్

నమ్మితి నా మనంబున సనాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ! మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిఁ జేయు మమ్మ! ని
న్నమ్మినవారి కెన్నటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!



శ్రీ అమ్మవారి ఆలయంనుండి శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని కొనిపోవుట. 1790 నాటి బషోలి శైలి చిత్రం. వికీపీడియానుండి.
https://commons.wikimedia.org/wiki/File:Krsna_Takes_Rukmini_Away_from_Devi_Shrine.jpg

## 868. నియన్తా

- నియమించువాడు. అన్యదేవతలను ఆరాధించేవారికి ఆయా దేవతలపట్ల భక్తి శ్రద్ధలు కలుగజేసేవాడు.
- అందరిని (దేవతలను) ఆయా కార్యములందు నియమించువాడు.
- అనియంత – ఆయనకు పైన అధికారి (నియంత) లేడు.

### ఓం నియన్త్రే నమః

యము - ఉపరమే - లేవనెత్తుట, చూపుట, ప్రతిపాదించుట. ని (ఉపసర్గ) - ఆజ్ఞను సూచించును. తృచ్ - ఉప పదవిని సూచించును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకు ముందలి నామము 'సర్వసహః'ను శ్రీ భట్టులు అన్యదేవతారాధనాపరంగా వ్యాఖ్యానించారు. ఈ 'నియన్తా' నామ వ్యాఖ్యను కూడా అదే భావంలో చెప్పారు. **తత్ర తత్ తత్ రుచీన్ ప్రరోచయన్ నియచ్ఛతి ఇతి నియన్తా.** అన్య దేవతలను ఆరాధించే భక్తులకు ఆయా దేవతలయందు భక్తి శ్రద్ధలు కలుగజేసి తద్వారా వారికి కామితార్థములను ప్రసాదించువాడు 'నియన్త'.

**దైవతేషు చ సర్వేషు తత్తదిచ్ఛాం ప్రరోచయన్ మదాంధికారిణీ యో஽సౌ నియన్తాస్యాన్నియచ్ఛతి.** భక్తులు ఆరాధించే దేవతలయందు వారికి ఆసక్తి, నమ్మకములను పెంచి, మదాంధికారులను కూడా నియంత్రించేవాడు నియంత. (శ్రీకైవల్యసారధి).

ఇందుకు శ్రీ భట్టులు గీత (7.21)నుండి ఉదాహరించారు.

**యో యో యాంయాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్**
సకామభక్తుడు ఏయే దేవతా స్వరూపమును భక్తి శ్రద్ధలతో పూజింప నిశ్చయించుకొనునో ఆయా దేవతయందే భక్తిశ్రద్ధలను స్థిరముగా కుదురుకొనునట్లు చేయుదును.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 1.1.5 – ప్రతివ్యక్తీ తన గుణము, స్థాయి, బుద్ధికి లోబడి ఒకో దేవతను ఆరాధించి కోరుకొన్న ఫలాలను పొందాలని యత్నించును. (మోక్షము కాకుండా) తగు ఫలములను వారి అర్హతను అనుసరించి ఆయా భక్తులు తాము ఆరాధించే దేవతలనుండి పొందుతారు. ఎందుకంటే ఆ దేవతలను నియమించినవాడు, వారి శక్తి, వారికి ఆదేశములిచ్చేవాడు భగవంతుడే (అనగా భగవంతుడు అన్యదేవతలకు నియంత.)

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వాన్ స్వేషు స్వేషు కృత్యేషు వ్యవస్థాపయతి ఇతి నియన్తా.** (ఉదాహరణకు దిక్పాలకులను) ఆయా కార్యములందు నియమించు భగవంతుడు నియన్త.

శ్రీ వాసిష్ఠ – **నియచ్ఛతి - నిబధ్నన్తి సర్వమ్ వ్యవస్థిత వర్త్మనా గమనాయ ఇతి నియన్తా విష్ణుః.** సూర్యుడు, గ్రహములు, ఇలా అన్నీ విష్ణువు ఏర్పరచిన వ్యవస్థకు లోబడి వర్తిస్తున్నాయి. కనుక భగవంతుడు నియన్త.

శ్రీ చిన్మయ **'అనియన్తా'** అని గ్రహించారు. సూర్యాది గ్రహములను, పంచభూతములను, ఇలా అందరినీ నియమించిన భగవంతునికి పై అధికారి లేడు గనుక భగవంతుడు అనియన్త.

## 869. నియమః

### అనియమః

- (మహాబలి వంటి) మహాబలురను కూడ అదుపులో పెట్టేవాడు. శాసించేవాడు.
- (అన్యదేవతారాధకులకు కూడ) తగు ఫలములు అందేలా నియమము చేసినవాడు.
- నియమము, యమము వంటి యోగసాధనలద్వారా లభించువాడు.
- అనియమః – ఆయనకంటె పైన శాసకులు (నియామకులు) ఎవ్వరూ లేరు.
- తనను గురించిన పవిత్రజ్ఞానమును భక్తులకు అందజేసేవాడు.
- అంతా వ్యాపించి, అంతనూ చుట్టి ఉండేవాడు.

**ఓం నియమాయ నమః**

**ఓం అనియమాయ నమః**

ఈ నామము రెండు శ్లోకములలో వస్తుంది.

17వ శ్లోకము. 163వ నామము. 'నియమః' – **అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః**
92వ శ్లోకము. 869వ నామము. 'నియమః' లేదా 'అనియమః' – **'అపరాజితః సర్వసహో నియంతా నియమో యమః'** లేదా **'అపరాజితః సర్వసహో నియంతాऽనియమోऽయమః'**

'నియమము' అనగా అదుపులో పెట్టుట, ఏర్పాటు చేయుట, శాసించుట. ఈ నామమును శ్రీ భట్టులు **'నియమః'** అని చెప్పగా శ్రీ శంకరులు **'నియమః'** మరియు **'అనియమః'** అనే రెండు పాఠాలనూ పరిగణించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

17వ శ్లోకము. 163వ నామము. **నియమః – బలి ప్రభృతయః అపి నియమ్యన్తే అనేన ఇతి నియమః.** బలివంటి బలవంతులను కూడా అపుచేయువాడు 'నియమః'. అంతే కాదు. సమస్త జగత్తు ఆయన శాసనానికి లోబడి ఉంటుంది. **నియమ్యతే జగత్ యేన నియమః స ఉదీరితః.** అని నిరుక్తి రచయిత చెప్పారు. శ్రీ వి.వి. రామానుజన్ భగవానుని ఆశ్రిత రక్షణాగుణాన్ని ప్రత్యేకంగా చెప్పారు.

92వ శ్లోకము. 869వ నామము. **నియమః** – ఇంతకుముందు వచ్చిన 'సర్వసహః', 'నియన్తా' నామములను శ్రీ భట్టులు అన్యదేవతారాధనా సంబంధంగా వ్యాఖ్యానించారు. ఈ 'నియమః' నామవ్యాఖ్య కూడా అదే విషయంలో చెప్పారు. **తత్ఫలమ్ చ జాతి, ఆయుః, భోగాదికమ్ నియమ్యతే అస్మిన్ ఇతి నియమః.** అన్యదేవతారాధన చేయువారికి తగు ఫలములు (జాతి, ఆయుపు, భోగము వంటివి) లభించేలా నియమము చేసినవాడు 'నియమః'. శ్రీ భట్టులు 'నియన్తా' నామమునకు గీత 7.21 శ్లోకమును ఉదాహరించారు. 'నియమః' నామమునకు గీత 7.22 శ్లోకమును ఉదాహరించారు.

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే**
**లభతే చ తతః కామాన్ మయ్యైవ విహితాన్ హితాన్**
అట్టి సకామ భక్తుడు తగిన భక్తి శ్రద్ధలతో ఆ దేవతనే ఆరాధించును. తత్ఫలితముగ నా అనుగ్రహమువలననే ఆ దేవత ద్వారా తాను కోరుకొనిన భోగములను అతడు తప్పక పొందగలడు.

ఇక్కడ గమనింపవలసిన విషయం ఏమంటే – (1) వారి వారి స్థాయిని బట్టి భక్తులు ఏదో ఒక దేవతను పూజకొరకు ఎంచుకొనేలా భగవంతుడు అనుమతిస్తాడు. (2) అలా ఎంచుకొన్న తరువాత, ఆ ఆరాధనలో భక్తునికి భగవంతుడు సహకరిస్తాడు. భక్తిశ్రద్ధలు కలుగజేస్తాడు. (3) భక్తుని అర్హతకు తగినట్లుగా ఫలములను ఆ దేవతద్వారా భక్తునికి లభించేటట్లు భగవానుడు ఏర్పరచాడు. ఈ మూడు విషయాలు 'సర్వసహః', 'నియన్తా', 'నియమః' అనే నామములద్వారా తెలియబరచబడినవి. జీవునికి ఇలా ఎంచుకొనే స్వాతంత్ర్యము శ్రీ రామానుజులవారి శ్రీభాష్యమునందు కూడా చెప్పబడింది. 2.3.41 సూత్రమునకు వ్యాఖ్యానము – **కృత ప్రయత్నాపేక్షతు విహిత ప్రతిషిద్ధా అవై యర్థాదిభ్యః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య –

17వ శ్లోకము – **నియమః – స్వేషు స్వేషు అధికారేషు ప్రజా నియమతి ఇతి నియమః.** ఆయా అధికారముల (కార్యముల) యందు తగువారిని నియమించువాడు 'నియమః'. ఉదాహరణకు భగవంతుడు సూర్య చంద్ర నక్షత్ర గ్రహాదులను, దిక్పాలకులను నియమించి వారికి నియమిత కర్మలను శాసించి, పరిపాలనము చేయును.

92వ శ్లోకము – **నియమః** – నియమము, యమము అనే యోగసాధనలద్వారా లభించువాడు 'నియమః'.

పతంజలి యోగసూత్రము 2.32 – **శుచ సంతోష తపః స్వాధ్యాయ ఈశ్వర ప్రణి ప్రధానాని నియమః.**

నియమములు అనగా – 1. సంతోషము (సుఖ దుఃఖాది ద్వంద్వములయందు సమత్వము). 2. శౌచము (శరీరము, మనస్సుల శుద్ధి). 3. తపస్సు (శారీరిక, వాచిక, మానసిక నియమము). 4. స్వాధ్యాయము (పుణ్యగ్రంథ పఠనము). 5. ఈశ్వర ప్రణిధానము (భగవంతుని యెడ అచంచలమైన భక్తి).

యమములు అనగా – 1. అహింస (ఏ ప్రాణికిని హింస చేయకుండుట). 2. సత్యము (నిజము పలుకుట). 3. అస్తేయము (దొంగతనము చేయకుండుట). 4. బ్రహ్మచర్యము (ఇంద్రియ నిగ్రహము). 5. అసంగ్రహము (ఇతరులనుండి స్వీకరింపకుండుట).

92వ శ్లోకము – **అనియమః – నియమః నియతి తస్య న విద్యత ఇతి అనియమః, సర్వ నియన్తుః నియన్తన్తర అభావాత్.** భగవంతుని నియమించేవారు, శాసించేవారు ఎవరూ లేరు. ఆయన సర్వనియన్త. కనుక ఆయన 'నియమః'.

శ్రీ రఘునాథతీర్థ – తత్వసారము – **స్వవిషయ జ్ఞానాని భక్తేభ్యో నియమయతి ప్రయచ్ఛతి ఇతి నియమః.** తనను గురించిన జ్ఞానమును భక్తులకు చక్కగా తెలియబరచువాడు 'నియమః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ రెండు అర్థాలను చెప్పారు –

(1) యమ - పరివేష్టనే - చుట్టుముట్టుట. **నియమాన్ శక్త్యా సకలమ్ విశ్వమ్ వ్యాప్నోతి తస్మాత్ స నియమః.** సకల విశ్వమునందు వ్యాపించి, చుట్టుముట్టి యుండేవాడు గనుక 'నియమః'.

(2) యమ్ - ఉపరమే - సరిచూచుట. సకల చరాచరాలు భగవంతునియందు, ఆయన అదుపులో ఉంటాయి. ఆయన కారణంగానే చలిస్తాయి.

## 870. యమః

### అయమః

- అందరు దేవతలను శాసించువాడు. యమాదులను నియమించువాడు.
- యమము, నియమము అనే యోగసాధనలద్వారా పొందవచ్చువాడు.
- అయమః – మృత్యువు లేనివాడు.
- అయమః – అయనకు పై శాసకులు లేరు.
- ప్రళయకాలమున సకల జీవరాశులను అంతము చేయువాడు.
- తన భక్తులకు భగవదనుభవం అనే రుచికరమైన భోజనము తినిపించువాడు.
- అయ-మః – సద్గుణములను, సదాచారములను తెలిసినవాడు, నేర్పువాడు.

**ఓం యమాయ నమ**

**ఓం అయమాయ నమః**

17వ శ్లోకంలోని 163, 164 నామములు. 'నియమః, యమః' – **అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః**
92వ శ్లోకంలోని 869, 870 నామములు. 'నియమః, యమః' లేదా 'అనియమః, అయమః' – **'అపరాజితః సర్వసహో నియంతా నియమో యమః'** లేదా **'అపరాజితః సర్వసహో నియంతాऽనియమోऽయమః'**

ఈ 92వ శ్లోకంలోని నామములను శ్రీ భట్టులు 'నియమః, యమః' అని చెప్పారు. శ్రీ శంకరులు 'అనియమః, అయమః' అనే పాఠంతోపాటు 'నియమః, యమః' అనే పాఠాంతరాన్ని కూడా చెప్పారు. అన్ని నామములూ 'యమ్' లేదా 'యమ' అనే ధాతువులనుండి వివరింపబడినవి. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం ఈ నాలుగు నామముల అర్థాన్ని ఇలా క్లుప్తంగా చెప్పవచ్చును.

(163) నియమః – మహాబలివంటివారిని కూడా అదుపు చేయువాడు.

(164) యమః – అందరికీ అంతర్యామియై అందరినీ అదుపు చేయువాడు.

(869) నియమః – అన్యదేవతలను ఆరాధించే భక్తులకు తగు ఫలములు ప్రసాదింపజేయువాడు.

(870) యమః – అందరు దేవతలను నియమించి, శాసించువాడు.

ఈ నామములన్నీ అనంతగుణసంపన్నుడైన భగవంతుని కొన్ని గుణములను కీర్తించేవిగా శ్రీ భట్టులు వివరించారు. ఇక్కడ వరుసగా వచ్చిన **'నియన్తా, నియమః, యమః, అనియమః, అయమః'** నామములన్నింటినీ కలిపి శ్రీ వాసిష్ఠ ఒక చక్కని శ్లోకాన్ని కూర్చారు.

**విష్ణుర్నియన్తా నియమో యమోఽసౌ విష్ణుర్నియన్తా అనియమో అయమో సః**
**ప్రకాశతే విశ్వమిదమ్ సమస్తమ్ యన్మైర్నియామైశ్చ కృత వ్యవస్థమ్**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

17వ శ్లోకము. 164వ నామము. **యమః – యచ్ఛతీతి యమః. యమతీతి యమః.** అందరికీ అంతర్యామియై అందరినీ అదుపులో ఉంచువాడు యముడు.

92వ శ్లోకము. 870వ నామము. **యమః – తత్తత్ ఫల నియామకాన్ యమాదీన్ అపి యచ్ఛతి ఇతి యమః.** ఆయా ఫలములు ఇచ్చే యమాదులను అన్యదేవతలను శాసించువాడు యముడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణమునుండి (3.7.13) యముని మాటలనే ఉదాహరించారు. **ప్రభవతి సంయమనే మమాపి విష్ణుః.** నన్ను కూడా శాసించువాడు విష్ణువే.

**వాయుర్యమోగ్నిర్వరుణః శశాంకః ప్రజాపతిస్త్వమ్ ప్రపితామహశ్చ**
**నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే** – గీత 11.39
నీవే వాయుదేవుడవు. యముడవు. అగ్నివి. వరుణుడవు. చంద్రుడవు. ప్రజాపతియైన బ్రహ్మవు. బ్రహ్మకును జనకుడవు. నీకు వేలకొలది నమస్కారములు. మరల మరల నమస్కారములు. ఇంకను నమస్కారములు.



శ్రీ బ్రహ్మ మరియు ఇతర లోకపాలకులు. శ్రీలంక అనూరాధపురాకు చెందిన 9వ శతాబ్దపు చిత్రాలు.
ఎడమవైపునుండి – అశ్వంపై శ్రీ వరుణుడు, సింహంపై గదాయుధం ధరించిన శ్రీ కుబేరుడు, మధ్యలో కూర్మంపై శ్రీ బ్రహ్మ, మహిషంపై శ్రీ యముడు, కుడివైపున గజంతో వజ్రాయుధుడైన శ్రీ ఇంద్రుడు.
https://commons.wikimedia.org/wiki/File:Brahma_and_the_Lokapalas.jpg

ఈశావాస్యోపనిషత్తు 16 – **పూషన్! ఏకర్షే! యమ! సూర్య! ప్రజాపత్య!**

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 4.10.8 – తనకు శరణుజొచ్చిన మార్కండేయునికి పరమశివుడు శాశ్వతజీవనం ఇచ్చాడు. అది శ్రీమన్నారాయణుని సంకల్పంవల్లనే జరిగింది.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

17వ శ్లోకము – **నియమః, యమః**

నియమః – సకల జీవులను (మరియు దేవతలను) ఆయా కార్యములలో నియమించువాడు.

యమః – అందరికీ అంతర్యామియై వారిని శాసించువాడు.

ఇక ఈ 92వ శ్లోకములోని నామములకు శ్రీ శంకరులు **'నియమః యమః'** మరియు **'అనియమః అయమః'** అనే రెండు పాఠాలనూ చెప్పారు. 'నియమః యమః' అనే పాఠం ప్రకారం భగవంతుడు **'అథవా యమ నియమౌ యోగాంగే, తద్గమ్యత్వాత్ స ఏవ నియమో యమః'**. నియమము, యమము అనే యోగాంగ సాధనలవలన లభించువాడు 'నియమః యమః'.

పతంజలి యోగసూత్రము 2.30 – **అహింసా సత్య అస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాయ యమః.** అహింస, సత్యము, దొంగతనము చేయకుండుట, బ్రహ్మచర్యము, మోహము లేకుండుట (అపరిగ్రహము) అనునవి యమములు.

**అయమః – స అస్య విద్యతే యమః మృత్యు ఇతి అయమః.** భగవంతుడు ఆదిమధ్యాంతరహితుడు. యముని సృజించినవాడు భగవంతుడే. యముని శాసించువాడు భగవంతుడే. భగవంతునికి యముడు (మృత్యువు) లేడు గనుక భగవంతుడు అయముడు.

శ్రీ సత్యసంధ యతిరాజ –

(1) యమ్ - ఉపరమే - పాలించుట, సరిచూచుట. **న విద్యతే యమః - నియామకః, సదృశో వా యస్య సః అయమః.** భగవంతునికి శాసకులు (నియామకులు) లేరు గనుక ఆయన అయముడు.

(2) మా - మానే - కొలుచుట. అయమ్ - శుభావహావిధిమ్ మాతి - జానాతి ఇతి అయమః. శుభగుణములను తెలిసినవాడు, ప్రసాదించువాడు అయముడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – సకల జీవులను, వారి జీవనకాలమును నిర్ణయించువాడు అయముడు.

శ్రీ వాసిష్ఠ – **యచ్ఛతి - ఉపసంహరతి సర్వమ్ సర్గాన్తే ఇతి యమః.** ప్రళయకాలంలో సకలమును తనయందు లీనము చేసికొనువాడు యముడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – యమ - తినిపించుట (యమయతి బ్రాహ్మణాన్ - బ్రాహ్మణులకు తినిపించుట). యమ - పరివేషనే, పరివేషణమ్ - భోజనమ్. **యమయతి భోజయతి స్వాదుభిః అన్నైః భక్తాన్ ఇతి యమః.** భక్తులకు స్వాదిష్టమైన భోజనము (అనగా భగవదనుభవము) తినిపించువాడు యముడు.

ఈ భాగం ముగింపులో శ్రీ భట్టులు చెప్పిన మాట – ఇంతకుముందు **(851 నుండి 870 వరకు?)** నామములు భగవంతుని రజస్తమోగుణములను సూచించునవి. **871 నుండి 880**వ నామము వరకు భగవంతుని సత్వగుణమును సూచించునవి.



## సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాయణః |
## అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ ప్రీతివర్ధనః || (93)

### 871. సత్త్వవాన్

- మోక్షమునకు మార్గమును సుగమము చేసే సత్వగుణమునకు అధిష్ఠాన దేవత.
- శౌర్య, వీర్యాది దివ్యగుణములు సమృద్ధిగా గలవాడు.
- భక్తులను అనుగ్రహించే లక్షణము నిశ్చయముగా గలవాడు.

**ఓం సత్త్వవతే నమః**

'సత్త్వ' అనే పదమును సత్వగుణాన్ని గురించి వాడుతారు. అయితే ఈ పదానికి ఇతర అర్థాలు కూడా ఉన్నాయి. అమరకోశంలో ఇలా ఉంది. **ద్రవ్యే ప్రాణే బలే జంతౌ వ్యవసాయ స్వభావయోః గుణే విత్తే సతోభావో సత్త్వమ్ గుణిని తు త్రిషు** మంచితనము, ద్రవ్యము, బలము, కృషి, పట్టుదల వంటి అర్థాలున్నాయి. ఈ 'సత్త్వవాన్' నామమునకు కొందరు వ్యాఖ్యాతలు ఈ అర్థాలలో కొన్నింటిని పరిగణించారు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమునకు వ్యాకరణపరంగా వివరమైన అర్థం చెప్పారు.

'అస్ - భువి - ఉండుట' నుండి 'సత్' అనే శబ్దం వస్తుంది. పాణిని సూత్రము 5.1.119 **'తస్య భావస్-త్వ-తలౌ'** ప్రకారం 'సత్'కు 'త్వ' కలిపితే 'ఆ గుణం కలిగిన' అనే అర్థం వస్తుంది. అలా 'సత్త్వ' శబ్దం వస్తుంది.

తరువాత పాణిని సూత్రము 5.2.94 **'తత్-అస్య-అస్మిన్-అస్తి ఇతి మతుప్'** ప్రకారం 'మతుప్' ప్రత్యయం కలిపితే 'ఎవరియందు ఉండునో' అనే అర్థం వస్తుంది. అలా 'సత్-త్వ-మత్' అయ్యింది. తరువాతి సూత్రం 8.2.9 **'మ ఆత్ ఉపధాయాః చ మతో ధః అయవాదిభ్యః'** ప్రకారం 'మ' బదులు 'వ' వస్తుంది. అప్పుడు 'సత్త్వమత్' అల్లా 'సత్త్వవత్' అయ్యింది. ఈ పదంనుండి 'సత్త్వవాన్' వచ్చింది. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. శ్రీ వాసిష్ఠ ప్రతి నామమునకూ ఇలాగే వ్యాకరణ వివరణ ఇచ్చారు. అంతేగాక ఆయన వ్యాకరణసూత్రాలనూ, శ్రుతులనూ విస్తారంగా ఉదాహరించారు సంస్కృత వ్యాకరణం తెలిసినవారికి శ్రీ వాసిష్ఠ వ్యాఖ్యానము ఒక అద్భుతమైన గ్రంథము.

**శ్రీ భట్టుల వ్యాఖ్య – ఈ 871వ నామమునుండి 880వ నామమువరకు భగవానుని సత్వగుణ అధిష్ఠానమును సూచించేవిగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

సత్వ, రజస్, తమో గుణాలలో సత్వగుణము ప్రకాశమానమైనది. సుఖమును, ఆనందమును, చివరికి మోక్షమును కలిగించేది. **పరమ ప్రకాశ లాఘవ, సుఖ సంపదా మోక్షమూలమ్, సత్త్వమ్ సాక్షాత్ అధిష్ఠేయమ్ అస్య ఇతి సత్త్వవాన్.** అలాంటి సత్త్వగుణ సంపన్నుడు, దాని అధిష్ఠానదైవము అయినందున భగవంతుడు 'సత్త్వవాన్'. ఇందుకు శ్రీ భట్టులు శ్వేతాశ్వరోపనిషత్తు

(3.12)నుండి ఉదాహరించారు. **మహాన్ ప్రభుర్వై పురుషః సత్త్వస్య ఏష ప్రవర్తకః సు నిర్మలామ్ ఇమమ్ శాంతిమ్ ఈశానో జ్యోతిరవ్యయః.** ఈ మహాపురుషుడే మోక్షమునిచ్చువాడు. సత్త్వగుణ ప్రవర్తకుడు. మోక్షరూపమైన అవ్యయజ్యోతి.

శ్రీ భట్టులు వరాహపురాణం (3.7.13)నుండి కూడా ఉదాహరించారు. **సత్త్వేన ముచ్యతే జంతుః సత్త్వమ్ నారాయణాత్మకమ్.** సత్త్వము నారాయణాత్మకము. దానివల్లనే జీవులు బంధములనుండి విముక్తులగుదురు.

లింగపురాణము. 14వ అధ్యాయము –

**హిరణ్యగర్భో రజసా తమసా శంకరః స్వయమ్**
**సత్త్వేన సర్వగో విష్ణుః సర్వాత్మా సదసన్మయః**

24వ అధ్యాయము –

**త్వత్-కోప సంభవో రుద్రః తమసా సమావృతః**
**త్వత్-ప్రసాదాత్ జగద్ధాతా రజసా చ పితామహః**
**త్వత్-స్వరూపాత్ స్వయమ్ విష్ణుః సత్త్వేన పురుషోత్తమః**

తరువాతి అధ్యాయంలో నందికేశ్వరుడిలా అన్నాడు –

**పరమాత్మానమ్ ఈశానమ్ తమసా రుద్రరూపిణమ్**
**రజసా సర్వలోకానామ్ సర్గలీలా ప్రవర్తకమ్**
**సత్త్వేన సర్వభూతానామ్ స్థాపకమ్ పరమేశ్వరమ్**
**సర్వాత్మానమ్ మహాత్మానామ్ పరమాత్మానామ్ ఈశ్వరమ్**
**తే దృష్ట్వా ప్రాహవై బ్రహ్మా భగవంతమ్ జనార్దనమ్**

పాంచరాత్రము-భగవచ్ఛాస్త్రము

**సాత్త్వికైః సేవ్యతే విష్ణుః తామసైరేవ శంకరః**
**రాజసైః సేవ్యతే బ్రహ్మా సంకీర్ణైస్తు సరస్వతీ**



గోవర్ధనోద్ధరణము - బేలూరు శిల్పం. వికీపీడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:12th-century_Vishnu_avatar_Krishna_holding_Goverdhan_mountain_to_shield_everyone_from_rains_at_Shaivism_Hindu_temple_Hoysaleswara_arts_Halebidu_Karnataka_India.jpg

శ్రీ రఘునాధ తీర్థ – బృహతి సహస్రము ఆధారంగా – **సతః సమీచీనస్య భావః సత్త్వమ్ విశిష్ట ప్రకృష్ట ఆనందాది గుణజాతమ్, తత్ అస్య అస్తి ఇతి సత్త్వవాన్.** ఆనందమువంటి విశిష్ట ఉత్తమ గుణములు కలిగినందున భగవంతుడు 'సత్త్వవాన్'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'సత్త్వము' అనగా ధైర్యము, బలము అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. **శౌర్య వీర్యాదికమ్ సత్త్వమ్ అస్య అస్తి ఇతి సత్త్వవాన్.** వీర్యము, బలము, తేజస్సు, సౌశీల్యము వంటి దివ్యగుణములు విశేషము కలవాడు సత్త్వవాన్.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఈ సత్త్వగుణములు సమృద్ధిగా కలిగినందున భగవానుడు చలించడు. యుద్ధములో భయమనునది ఆయనకు వర్తించదు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'సత్త్వము' అనగా 'వ్యవసాయః నిశ్చయః', అనగా 'స్థిరమైన గుణము' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. **సత్త్వమ్ వ్యవసాయః - నిశ్చయః భక్తానుగ్రహ సూచకో వర్తతే యస్మిన్ సః సత్త్వవాన్.** భక్తులను అనుగ్రహించే నిశ్చయమైన స్వభావము కలవాడు 'సత్త్వవాన్'.

## 872. సాత్త్వికః

- సత్వగుణమునకు తగు ఫలమునిచ్చేవాడు.
- ప్రధానముగా సత్వగుణమునందు స్థితుడైనవాడు.

### ఓం సాత్త్వికాయ నమ



బ్యాంగ్‌కాక్ నగరం ఆలయంలో బుద్ధ విగ్రహం

ఇంతకు ముందు నామము 'సత్త్వవాన్' వలెనే ఈ 'సాత్త్వికః' నామము కూడా 'సత్' అనే శబ్దంనుండి వివరింపబడింది. పాణిని సూత్రము 5.1.63 ప్రకారము తథిత ప్రత్యయము 'ఇక' చేరిస్తే 'తద్-అర్హతి' అనగా 'ఆ అర్హత కలిగియుండును' అనే అర్థం వస్తుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ధర్మ జ్ఞాన వైరాగ్య ఐశ్వర్య రూప ఫల నియమనేన చ సత్త్వమ్ అర్హత ఇతి సాత్త్వికః.**

**విజ్ఞానైశ్వర్య వైరాగ్య ధర్మరూప ఫలం స్వయం నియమ్యార్హతి సత్త్వం యః సాత్త్వికః పరికీర్తితః.** సత్వగుణ ఫలములైన ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము వంటివానిని తన భక్తులకిచ్చేవాడు సాత్వికుడు. (శ్రీకైవల్య సారధి).

శ్రీ వాసిష్ఠ వివరణ – **తథా చ సర్వ మనుష్యాది వనస్పత్యాది వర్గశ్చ సత్త్వయుక్తః సత్త్వార్హః సత్త్వసంబంధీవా.** మనుష్యులు, మొక్కలు వంటివానికి సత్వగుణమును కలిగించేవాడు సాత్వికుడు.

శ్రీ రఘునాధ తీర్థ – తత్త్వటీక – **సత్వగుణ జన్యత్వాత్ సాత్త్వమ్ జ్ఞానమ్, తద్వాన్ సాత్త్వీ స్వభక్తమ్ సాత్త్వినమ్ కరోతి ఇతి సాత్త్వికః.** తన భక్తులకు సత్వగుణమునుండి జన్మించిన జ్ఞానమును ప్రసాదించినవాడు సాత్వికుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సత్త్వే గుణే ప్రాధాన్యేన స్థిత ఇతి సాత్త్వికః.** ప్రధానముగా సత్వగుణమునందు స్థితుడైయుండువాడు సాత్త్వికుడు.

## 873. సత్యః

- పవిత్రాత్ముల (సాధుపురుషుల) పట్ల ప్రియము కలిగినవాడు.
- ఉన్నతమైన విధంగా సత్పురుషుడు (మంచివాడు).
- సత్యమును స్థిరపరచినవాడు.
- తాను మాత్రమే నిజమైన ఉనికి గలవాడు (శ్రీ శంకరుల వ్యాఖ్య).
- ప్రాణము, అన్నము, సూర్యుడు అనే రూపంలో ఉండువాడు (సత్-తి-యమ్).

### ఓం సత్యాయ నమః

ఈ నామము మూడు మార్లు స్తుతింపబడింది.

12వ శ్లోకము. 107వ నామము. సత్యః – **వసుః వసుమనా సత్యః సమాత్మా సమ్మితః సమః**

23వ శ్లోకము. 218వ నామము. సత్యః – **గురుర్గురుతరో ధామః సత్యః సత్యపరాక్రమః**

93వ శ్లోకము. 873వ నామము. సత్యః – **సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాక్రమః**

'సత్' శబ్దమునకు తథిత ప్రత్యయము 'యత్' చేరిస్తే 'సత్య' అవుతుంది. పాణిని సూత్రము 4.4.98 'తత్ర సాధుః' ప్రకారం 'యత్' జత అయితే 'ఆ విషయంలో అత్యుత్తమం' అనే అర్థం వస్తుంది.

'గీత' 17.26, 17.27లో 'సత్' శబ్దం గురించి ఉంది –

**సద్భావే సాధు భావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే**
**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే**

ఓ పార్థ! 'సత్' అను పరమాత్మ నామము సత్య ప్రభావమునందును, శ్రేష్ఠ భావమునందును, అనగా పరమాత్మ నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావమునందును ప్రయోగింపబడుచుండును. ఉత్తమ కర్మాచరణము నందును 'సత్' అను శబ్దము ప్రయుక్తమగుచుండును. యజ్ఞ దాన తపః క్రియలయందలి నిష్ఠ, ఆస్తిక భావమును 'సత్' అని యందురు. పరమాత్మనుద్దేశించి చేయబడు నిశ్చయాత్మక కర్మలను కూడడ 'సత్' అనియందురు. (**శ్రీ జయదయాల్ గోయందకా** – శ్రీ మద్భగవద్గీత – తత్త్వవివేచనీ హిందీ వ్యాఖ్యకు తెలుగు అనువాదము – అనువాదకులు: డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య – గీతాప్రెస్, గోరఖ్ పూర్ ప్రచురణ – భగవద్గీత నుండి ఉదాహరించిన శ్లోకాలకు అన్నిచోట్లా తెలుగు అనువాదం ఈ పుస్తకంనుండి యథాతథంగా వ్రాశాను.)

సత్యమనగా ఉనికి, మంచితనము, సద్వర్తన, సదాచారము, భక్తి, నిష్ఠ, బహుమతి, మరియు వీనికి సంబంధించిన కార్యములు. వీనిలో శ్రేష్ఠమైనది, వీనికి తోడ్పడునది సత్యము.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

12వ శ్లోకము. 107వ నామము. సత్యః – 'సత్' శబ్దము సాధుపురుషులను సూచించును. **తేషు సత్సు సాధుః**. ఆ విధంగా సాధువులయందు ఆదరము గలవాడు 'సత్యః'.

23వ శ్లోకము. 213వ నామము. సత్యః – ఇక్కడ 'సత్' అనగా మంచితనము. మేలు చేయువాడు 'సత్యః'. **మన్వాదిషు తత్కాల సమాశ్రితేషు సత్సు సాధుః**. (మత్స్యావతార పరంగా) మనువు వంటివారి ప్రార్థనలను మన్నించి వారికి హితమొనర్చువాడు 'సత్యః'.

తిరువైమొళి 9.10.6, 9.10.7 – తన భక్తులనెన్నడూ వీడని సత్యము ఆయన. నిజమైన భక్తితో కాంక్షారహితంగా భగవంతునికి కైకర్యం చేసే భక్తులకు ఆయన ఎల్లప్పుడూ తగు భక్తిని ప్రసాదిస్తాడు (కోరికలతో భగవంతుని ఆరాధించేవారికి కూడా ఆయన కామితార్థాలు ప్రసాదిస్తాడు. కాని వారిని అంటిపెట్టుకొని ఉండడు.)

93వ శ్లోకము. 873వ నామము. సత్యః – **సాత్త్విక శాస్త్ర ప్రతిపాద్యతయా యథార్థవైభవః సత్యః.** సాత్త్విక శాస్త్రములు ప్రతిపాదించిన నిజమైన వైభవము ఆయనే. ఆయనే అసలు సత్యము. శ్రీ భట్టులు మహాభారతం ఉద్యోగపర్వము (69.12)నుండి ఉదాహరించారు (సంజయుని పలుకులు) –

**సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమ్ అస్మిన్ ప్రతిష్ఠితమ్**
**సత్తా సత్తే చ గోవిందః తస్మాత్ సత్యః సతామ్ మతః**

శ్రీకృష్ణుడు సత్యమునందు ప్రతిష్ఠితుడై యున్నాడు. సత్యము ఆయనయందున్నది. సత్తు, అసత్తు (ఉనికి, భ్రమ) రెండూ కూడా గోవిందునియందున్నవి. కనుక ఆయనను 'సత్యః' అంటారు.

శ్రీ వి.వి. రామానుజన్ – 'తిరుమెయ్యమ్' దివ్యక్షేత్రంలో భగవంతుని తిరునామము 'సత్యమూర్తి'.

శ్రీ తిరుమంగయాళ్వారు. పెరియతిరుమొళి 5.6.9 – ఐహికమైన క్షణిక భోగభాగ్యాలను వదిలివేసి, ఇంద్రియ లోలత్వమును త్యజించి భగవంతునే ధ్యానించువారికి ఆయన తన నిజతత్వమును తప్పక తెలియజేస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఈ నామమునకు పలువిధాలుగా భావం చెప్పారు. వానిలో కొన్ని వివరణలు విశేషంగా అద్వైతసిద్ధాంతాన్ని వ్యక్తపరుస్తాయి.

భగవానుడు నిజము. కనుక సత్యము. ఆయన ఎన్నడూ అబద్ధం కాదు. **అవితథ రూపత్వాత్.** ఇందుకు శ్రీ శంకరులు తైత్తరీయ ఉపనిషత్తు (2.1) నుండి ఉదాహరించారు. **సత్యం జ్ఞానమ్ అనంతమ్ బ్రహ్మ.**

సత్-తి-యమ్ – 'సత్' అనగా ప్రాణము. 'తి' అనగా అన్నము. 'యమ్' అనగా సూర్యుడు. ప్రాణ, అన్న, సూర్య రూపములలో నున్నవాడగుటచే భగవానుడు 'సత్యము'. అని చెప్పబడెను. తైత్తరీయారణ్యకము 13 – **సదితి ప్రాణాస్తీత్యన్నమ్ యమిత్య సా వాదిత్యః.**

శ్రీ వాసిష్ఠ అథర్వ వేదము (14.1.1)నుండి ఉదాహరించారు. సత్యముపై భూమి ఆధారపడి (కూర్చుని) ఉన్నది. సూర్యునివలన ఆకాశము నిలిచియున్నది. నియమముల కారణంగా సూర్యుడు, చంద్రుడు దివియందు స్థిరముగానున్నారు.

**సత్యేనోత్తభితా భూమిః సూర్యేణోత్తభితా చ ద్యౌః ఋతేన ఆదిత్యాస్తిష్ఠన్తి దివి సోమో అధిశ్రితః**

**సత్సు సాధుత్వాత్.** సాధుపురుషులలో సత్ స్వభావము భగవంతుడే.

**సత్య వచన ధర్మరూపత్వాత్ సత్యః.** భగవంతుని మాటలు ఎప్పుడూ సత్యమే.

మహానారాయణోపనిషత్తు (221) **తస్మాత్ సత్యమ్ ఇతి ప్రాణావై సత్యమ్ తేషామ్ ఏష సత్యమ్.** ప్రాణములు సత్యము. వానిలోని భగవంతుడు సత్యమే.

శ్రీ సత్యసంధ యతిరాజ – **సద్భావమ్ యాపయతి ఇతి సత్యః.** తన భక్తులను సద్భావమువైపు మళ్ళించేవాడు 'సత్యః'.

ఈ 93వ శ్లోకములోని 'సత్యః' నామమునకు శ్రీ వాసిష్ఠ వివరణ – **సత్సు సాధు స్వభావేషు పరమహితకారిత్వేన మహాపురుష పూజ్య నిత్య పరమ హితకారీచ ఇత్యర్థః.** ఆయన మహాపురుషులచే పూజింపబడుతాడు. ఆయన ఇతరులకు సహాయం చేసే స్వభావం కలవవాడు. కనుక సాత్విక స్వభావం కలిగినవారిలో అత్యుత్తముడు. సత్యః.

శ్రీ టి.ఎస్. రాఘవన్ ఈ నామమునకు 34 వివిధ వివరణలు లేదా ప్రమాణాలను సమీకరించారు. వాటిలో కొన్ని –

తైత్తరీయోపనిషత్తు – **తత్ సత్యమ్ ఇత్యాచక్షసే.** కనుక బ్రహ్మము సత్యము (సత్కార్యములు చేయునది) అనబడును.

**సత్యేశమ్ సత్య సంకల్పమ్ సత్యమ్ సత్యవ్రతమ్ హరిమ్**
**సత్యచర్యమ్ సత్యయోనిమ్ సత్యశీర్షమహం భజే** – ఆదిత్య పురాణము 3.5

శ్రీ మధ్వాచార్యులు. భాగవత తాత్పర్యము 1.1.1 – **సత్యమ్ నిర్దుఃఖ నిత్య నిరతిశయ ఆనంద అనుభవ స్వరూపమ్** (భగవంతుని వర్ణన). భగవంతుని రూపము సత్యము. దుఃఖము లేనిది. శాశ్వతమైనది. పరమానంద అనుభవమునిచ్చునది.

శ్రీ మధ్వాచార్యులు – **సత్యోహి భగవాన్ విష్ణుః సద్గుణత్వాత్ ప్రకీర్తితః.** అనంత సద్గుణ సంపన్నత వలన విష్ణుభగవానుని 'సత్యము' అని కీర్తిస్తారు.

శ్రీ జయతీర్థ. కర్మనిర్ణయ టీక – **సత్యః స్వతంత్రః.**

**సత్యమేవ జయతి నాऽనృతమ్, సత్యేన కథాః వితతో దేవయానః**
**యనాక్రమన్తి ఋషయో హ్యాప్తకామాః యత్ర తత్సత్యస్య నిధానమ్ –** అధర్వణ ఉపనిషత్తు మంత్రము 2.6

**ఏషమ్ అతివదతి యః సత్యేనతివదతి సోऽహమ్ భగవః సత్యేనావదాన్తి**
**సత్యమ్ త్వేవ విజిజ్ఞాసితవ్యమ్ ఇతి సత్యమ్ భగవో విజిజ్ఞాస ఇతి –** ఛాందోగ్యోపనిషత్తు మంత్రము 7.16.1

**తత్ సత్యమ్ సత్ ఇతి ప్రాణః తి ఇతి అన్నమ్ యమ్ ఇతి అసౌ ఆదిత్యమ్ తద్ ఏతత్ త్రివృత్.....**
**య ఏవమ్ ఏతత్ సత్యస్య సత్యత్వమ్ వేద –** ఐతరేయోపనిషత్తు మంత్రము 2.1.7

## 874. సత్యధర్మపరాయణః

- తన భక్తులు నిష్కామంగా ఆచరించే నిజమైన ధర్మమువల్ల మిక్కిలి ప్రసన్నమగువాడు.
- సత్యమునందు, శాస్త్రములలో చెప్పిన ధర్మమునందు ఆసక్తి కలిగినవానియందే స్థితమైనవాడు.
- ఉత్తమమైన ధర్మము నాచరించువారికి తోడై దారి చూపువాడు.
- సత్యమును, ధర్మమును ఆచరించే యదువు, తుర్వశుడు (?) వంటివారికి ఆశ్రయమైనవాడు.

### ఓం సత్యధర్మపరాయణాయ నమః

**సత్యశ్చ అసౌ ధర్మః సత్యధర్మః సచ్చిదానంద లక్షణః స ఏవ పరః అయనమ్ - ఆశ్రయః స్వరూపమ్ వా సత్యధర్పరాయణః.** సత్యము, ధర్మము ప్రకారము నడచుకొనేవాడు మరియు మరియు సత్యమునకు, ధర్మమునకు నిలయమైనవాడు సత్యధర్మపరాయణుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – సత్యధర్మము - శాస్త్రములలో చెప్పిన సరియైన (నివృత్తి) ధర్మము. పరాయణమ్ - పరమ ప్రీణనమ్ - మిక్కిలి ప్రసన్నమగుట. సాత్విక శాస్త్రములలో చెప్పినట్లు నివృత్తిధర్మము పాటించువారి చర్యలకు భగవంతుడు మిక్కిలి సంతోషించును. అనగా ఇతర ప్రయోజనములను ఆశించక, సర్వమును **"శ్రీ భగవదాజ్ఞాయ శ్రీమన్నారాయణ ప్రీత్యర్థమ్"** ఆచరించవలెను.

**ఉపాధిరహితస్సత్యముఖో ధర్మపరాయణమ్ పరమప్రీణనమ్ యస్య సత్యధర్మపరాయణః..** ఇతరమైన ఫలితాలు అపేక్షించని సత్వగుణ ప్రధానమైన ధర్మాచరణముతో మిక్కిలి ప్రసన్నమయ్యేవాడు సత్యధర్మపరాయణుడు. (శ్రీకైవల్య సారధి).

శ్రీ చిన్మయానంద – **కర్తవ్య అకర్తవ్య విధిరేవ ధర్మః.** శాస్త్రానుసారము చేయదగినవి, చేయకూడనివి అయిన కర్మల గురించిన నియమములే ధర్మము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సత్యే యథాభూతార్థ కథనే ధర్మ చ, చోదనా లక్షణే నియత ఇతి సత్యధర్మపరాయణః.** సత్యమునందు, శాస్త్రవిధానమునననుసరించు ధర్మమునందును నియతుడైనవాడు (అందు శ్రద్ధ కలిగి ఆచరించువాడు) సత్యధర్మపరాయణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **సత్యః సమీచీనో ధర్మాచారో ఏషామ్ తే సత్యధర్మాణః, తేషామ్** పరమ **పరమమ్ అయనమ్ గతిః ఆధారో వా యః సత్య ధర్మ పరాయణః.** సత్యమును, ధర్మమును ఆచరించువారికి తోడుండి వారికి తగు దారి చూపువాడు సత్యధర్మ పరాయణుడు.

శ్రీ రఘునాధ తీర్థ – సత్య-ధర్మ-పర-అయనః.
**సత్సు భవః సత్యః, స చ అసౌ ధర్మశ్చ సత్యధర్మః**
**సత్య-ధర్మేషు సాత్త్విక ధర్మేషు పరమ్ తాత్పర్యమ్**
**యేషామ్ తే సత్యధర్మపరాః, యదు, తుర్వశ ఆది భక్తజనాః**

**తేషామ్ అయనమ్ ఆశ్రయః ఇతి సత్యధర్మపరాయణః.**

సాత్విక ధర్మమునాచరించేవారు సత్యధర్మపరులు. యదువు, తుర్వసుడు వంటి సత్యధర్మపరులకు అయనము (ఆశ్రయము) అయినవాడు సత్యధర్మపరాయణుడు.

ఇలాంటివే మరి రెండు నామములు:

31వ శ్లోకము. 290వ నామము. **సత్యధర్మపరాక్రమః** 56వ శ్లోకము. 532వ నామము. **సత్యధర్మః**

## 875. అభిప్రాయః

- సత్యధర్మనిష్ఠ గల సాత్వికులచే కోరబడువాడు.
- ప్రళయకాలంలో సకలజీవులు ఆయనకు అభిముఖంగా వెళ్ళి ఆయనలో కలిసిపోతాయి.
- పురుషార్థములు వాంఛించువారిచేత కోరబడువాడు.
- అందరి కార్యములకు ప్రేరణ అయినవాడు.

### ఓం అభిప్రాయాయ నమః

'అభిప్రాయము' అంటే సాధారణమైన అర్థము – ఉద్దేశ్యము, లక్ష్యము, కోరిక. **అభిప్రీయతే కామయతే స్వజనహితో యేన ఇతి అభిప్రాయః.** తన భక్తుల హితము కోరేవాడు 'అభిప్రాయః'.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సత్యధర్మనిష్ఠేన స్వచ్ఛేన నిరుపాధిక ఉద్దేశ్యతయా అభిప్రేతః ఇతి అభిప్రాయః.** సత్యధర్మనిష్ఠాపరులు, సాత్విక పరాయణులు అయినవారు ఎవరిని ఉద్దేశించి కోరుకుంటారో ఆయన 'అభిప్రాయః'.

**స్వచ్ఛేన ధర్మనిష్ఠేన సత్యేన చ విశేషతః నిరుపాధికోద్దేశ్యత్వాదభితః ప్రేయతే చ యః అభిప్రాయ స్స విజ్ఞేయః వస్వర్ణో మనురుత్తమః.** ధర్మముతోను, సత్యనిష్ఠలతోను, సర్వకాల సర్వావస్థలయందును, అందరిచేత సేవింపబడువాడు, అందరిచేతను పరమప్రయోజనము కొరకు కోరబడువాడు 'అభిప్రాయః'. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. ఉత్తమ సాధనము. ఓం అభిప్రాయాయ నమః. (శ్రీకైవల్యసారధి).

పెరియతిరుమొళి 2.3.2 –ఉత్తమ సాధువులు ఆస్వాదించే తీయని, పిప్పిలేని పండు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అభిప్రేయతే పురుషార్థ కాంక్షిభిః.** ధర్మార్థకామమోక్షములనే పురుషార్థములను కోరేవారు ఇతనిని కోరుకుంటారు.

శ్రీ శంకరుల మరొక వ్యాఖ్య – **అభిముఖ్యేన ప్రళయే అస్మిన్ ప్రైతి ఇతి వా అభిప్రాయః.** ప్రళయకాలంలో ఈయనకు అభిముఖంగా వెళ్ళి (ప్రైతి) జీవులు ఈయనలో లీనమవుతాయి గనుక ఆయన 'అభిప్రాయః'

శ్రీ రఘునాథ తీర్థ – తత్వసారము – **అభి అభితః ప్రకర్షేణ ప్రాయః ప్రేరణక్రియా యస్య ఇతి అభిప్రాయః.** నేరుగా అందరి కార్యములను ప్రేరేపించువాడు 'అభిప్రాయః'.

## 876. ప్రియార్హః

- తన భక్తుల ప్రేమ పొందడానికి యోగ్యుడు. వారి ప్రేమను పొంది వారిపట్ల కృతజ్ఞత చూపువాడు.
- మనకిష్టమైనవానిని సమర్పించడానికి అర్హుడైనవాడు. వానిని స్వీకరించువాడు.

## ఓం ప్రియార్హాయ నమః

ప్రీ - తర్పణే, కాంతౌచ - సంతోషపెట్టుట, సంతోషించుట. అర్హ - పూజాయామ్, యోగ్యత్వే చ - పూజించుట, తగియుండుట (యోగ్యత కలిగియుండుట). **ప్రియమ్ అర్హతి ఇతి ప్రియార్హః**. ప్రేమను పొందడానికి యోగ్యమైనవాడు. **ప్రియేషు అర్హ-యోగ్యః ప్రియార్హః**. ప్రేమించడానికి అందరికంటే యోగ్యుడు ప్రియార్హుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు భక్తులను ఎంతో గాఢంగా ప్రేమిస్తాడు. భక్తులు తమ భక్తిని భగవంతునికి సమర్పించి, తమ అవుసరాలకోసం ఆయనపై ఆధారపడతాడు. ఇలాంటి భక్తుల ప్రవర్తన ఎంతో ఉదారమైనదని భగవంతుని ఉద్దేశ్యము. ఎందుకంటే అలాంటి భక్తులు తమ సర్వస్వాన్నీ భగవంతునికి అర్పించుతారు. ఆ భక్తులపట్ల భగవానుడు ఎంతో కృతజ్ఞుడైయుంటాడు. ఈ విధంగా భక్తుల ప్రేమను పొందానికి అర్హుడు గనుక భగంతుడు ప్రియార్హుడు.

**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవా నుత్తమాం గతిమ్** – గీత 7.18
ఈ చతుర్విధ భక్తులందరును ఉదారులే (అనగా భగవంతునియందు విశ్వాసమునుంచి ఎల్లప్పుడు అతనినే సేవించుచు ఉండువారు). కాని జ్ఞానియైనవాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగానుంచి, నన్నే పరమప్రాప్యునిగా భావించును. విధముగా అతడు నాయందే స్థితుడు. ఇలా భక్తులు తమ సర్వస్వమును తనకు అర్పించినందున వారు 'ఉదారులు' (అనగా దాతృత్వము కలవారు) అని భగవంతుడు భావించును. అంతగా ఆయన తన భక్తులను గౌరవించును. కనుక ఆయన భక్తుల ప్రేమకు అర్హుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 7.5.11 – అనన్యభక్తితో తనను శరణుజొచ్చిన భక్తులకు కృష్ణభగవానుడు తన దివ్యపాదపద్మములపట్ల నిత్యశ్రద్ధను ప్రసాదిస్తాడు. అయినాగాని తన భక్తులకు ఇంకా తగు ప్రతిఫలం ఇవ్వలేదని ఆయన భావిస్తాడు. (అందుకే ద్రౌపది ఆర్తనాదానికి తగినంతగా స్పందింపలేకపోయానని శ్రీకృష్ణుడు తన వైకుంఠగమనకాలంలో కూడా అన్నాడు).

భక్తులపట్ల ఇంత ప్రేమ ఉన్న భగవానుడు భక్తులకు ప్రియార్హుడు.



ద్రౌపదీ మాన సంరక్షణం – 1920 కాలపు చిత్రం. వికీపీడియా నుండి. by Narottam – Nathdwara
https://commons.wikimedia.org/wiki/File:Draupadi_Chirapaharan.jpg

శ్రీ శంకరుల వ్యాఖ్య – ప్రియమైనవి అనగా మనకు అత్యంత ఇష్టమైనవి. అలా మనకు అత్యంత ప్రియమైనవానిని ఎవరికైనా సమర్పించాలంటే అందుకు అర్హుడు భగవంతుడే. కనుక ఆయన ప్రియార్హుడు.

లోకమునందు తనకు మిక్కిలి ఇష్టమైన వస్తువును, దానియొక్క అక్షయఫలము కొరకు అర్హుడగువానికి ఆ వస్తువులను దానము చేయవలెనని శాస్త్రము చెబుతున్నది. అలాంటి వస్తువును స్వీకరించే అర్హత కలవాడు పరమేశ్వరుడే గనుక ఆయన ప్రియార్హుడు. ఇందుకు శ్రీ శంకరులు విష్ణుధర్మోత్తరమునుండి ఉదాహరించారు.

**యద్యత్ ఇష్టతమమ్ లోకే యచ్చాస్య దయితుమ్ గృహే**
**తత్తత్ గుణవతే దేయమ్ తదేవ అక్షయమ్ ఇచ్ఛతా** – మహాభారతము 13.58.7, విష్ణుధర్మోత్తరము 55.3
అక్షయ ఫలమును (బ్రహ్మమును) కోరేవారు తమకిష్టమైన వస్తువులను, మరియు ఇంటిలోని మంచి వస్తువులను తగు యోగ్యత కలవారికి సమర్పించాలి (ఇది భగవంతునికి సమర్పించినట్లగును.)

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – బృహదారణ్యక మంత్రము. **ఆత్మనస్తు కామాయ సర్వమ్ ప్రియమ్ భవతి.** ఎవరికైనా ఇష్టమైన వస్తువులలో అన్నింటికంటె ప్రధానమైనది ఆత్మయే.

శ్రీ వైష్ణవసంప్రదాయంలో ఎంతో ప్రాముఖ్యత కలిగిన ప్రపత్తి అనగా ఆత్మసమర్పణమునకు ఈ నామవివరణతో సంబంధము చెప్పవచ్చును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ప్రియాణి స్రక్-చందనాని అర్హతి ఇతి ప్రియార్హః.** చక్కని పూలదండలతోను, చందనాదులోను పూజలందుకొనుటకు అర్హుడైనవాడు ప్రియార్హుడు.

యజుర్వేద మంత్రము 23.19 – **ప్రియాణామ్ ప్రియపతిమ్ హవామహే.**

## 877. అర్హః

- పూజింపదగినవాడు.

### ఓం అర్హాయ నమః

**అర్హతే - ప్రాప్తుమ్ యుజ్యత ఇతి అర్హః.** పొందడానికి యోగ్యుడైనవాడు అర్హుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అనన్య స్పృహాణామ్ తేషామపి అయమేవ యోగ ఇతి అర్హః.** (మోక్షము తప్ప) ఇతర కాంక్షలు లేనివారిచే కోరబడుటకు అర్హుడు. ఇందుకు శ్రీ భట్టులు గీత (7.18)నుండి ఉదాహరించారు. **ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్.** (జ్ఞానియైన) భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగానుంచి, నన్నే పరమప్రాప్యునిగా భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థితుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **స్వాగత, ఆసన, ప్రశంసా, అర్ఘ్య, పాద్య, స్తుతి, నమస్కార ఆదిభిః పూజా సాధనైః పూజనీయ ఇతి అర్హః.** స్వాగతము, ఆసనము, ప్రశంస, అర్ఘ్యము, పాదప్రక్షాళనము, స్తుతి, నమస్కారము మున్నగు షోడశోపచారములతో పూజిందగినవాడు గనుక శ్రీహరి అర్హుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామములోని భావమును ఇలా చక్కగా చెప్పారు – **సర్వాంతర్గతాన్ సర్వాన్ భోగాన్ విహాయ శ్రేయోర్థినామ్ విదుషామ్ సర్వప్రకారైః సాధనైః సోపకరణైః పూజావిధానైః సర్వకర్మార్పణేన నిష్కామకర్మభిశ్చ స ఏవ ప్రాప్తుమ్ యోగ్య ఇతి అర్హః.** విద్వత్తు కలిగినవారు అన్ని భోగములను పరిత్యజించి, పరమానందమును మాత్రమే ఆశించి, తమ సమస్త సాధనలను, పూజాది

క్రియలను, ఆయా పనులవలన కలగే ఫలాలను, ఇలా అన్నింటినీ ఆ భగవానునికే సమర్పిస్తారు. కనుక భగవానుడే పూజార్హుడు. ఇక్కడ గమనించవలసిన విషయం ఏమంటే ఇతర కోరికలు లేనివారు విష్ణువును పూజించుదురు. వారికి విష్ణువు పూజార్హుడు.



తిరుమల తెప్పోత్సవం. Photo by Rameshbabu N

https://commons.wikimedia.org/wiki/File:Teppotsavam_(day_5_float).jpg

ఋగ్వేద మంత్రము 1.94.1

**ఇమామ్ స్తోమమ్ అర్హతే జాతవేదసే రథమ్మివ సమ్ మహేమా మనీషయా**

**భద్రాహి నః ప్రమతిరస్య సంసద్యగ్నే సఖ్యే మా రిషామా వయమ్ తవ**

ఇంకా శ్రీ వాసిష్ఠ ఇలా చెప్పారు – భగవానుని అర్హత్వము మనందరిలోనూ ఎంతోకొంత ప్రతిబింబిస్తుంది. కనుక ఎంతో కొంత అర్హులమే.

**అన్నమయ్య కీర్తన**

షోడశకళానిధికి షోడశోపచారములు - జాడతోడ నిచ్చలును సమర్పయామి

అలరు విశ్వాత్మకున కావాహన మిదె సర్వ - నిలయున కాసనము నెమ్మి నిదే
అలగంగా జనకున కర్ఘ్యపాద్యాచమనాలు - జలధి శాయికిని మజ్జనమిదే

వరపీతాంబరునకు వస్త్రాలంకారమిదె - సరి శ్రీమంతునకు భూషణము లివే
ధరణీధరునకు గంధపుష్ప ధూపములు - తిర మిదె కోటిసూర్యతేజునకు దీపము

అమృతమథనునకు నదివో నైవేద్యము - గమి(రవి)జంద్రునేత్రునకు కప్పురవిడెము
అమరిన శ్రీవేంకటాద్రి మీద దేవునికి - తమితో ప్రదక్షిణాలు దండములు నివిగో

శ్రీ రఘునాథ తీర్థ **'అర్హః'**, **'ప్రియకృత్'** అనే రెండు నామాలనూ కలిపి **'అర్హప్రియకృత్'** అనే పాఠ్యాంతరాన్ని చెప్పారు.

ఓం అర్హప్రియకృతే నమః

**అర్హేభ్యః - యోగేభ్యః భక్తేభ్యః ప్రియమ్ కరోతి ఇతి అర్హప్రియకృత్.** యోగ్యులైన తన భక్తులపట్ల రక్షణాది ప్రియమైన కార్యములను నిర్వర్తించేవాడు **'అర్హప్రియకృత్'.**

## 878. ప్రియకృత్

- భక్తులకు ప్రియమును కూర్చువాడు. మోక్షమును మాత్రమే కాక అన్య కామితార్థములను కూడ ప్రసాదించువాడు.

ఓం ప్రియకృతే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అన్య పరానపి భజతః తచ్ఛందానువర్తనేన ప్రియాన్ కరోతి ఇతి ప్రియకృత్.** (మోక్షమే కాకుండా) ఇతర కోరికలు కోరే భక్తుల కోరికలు కూడా తీర్చువాడయ ప్రియకృత్.

**భజతోऽప్యన్య భక్తాన్యః స్వప్రియాన్ కురుతే సదా చందానువర్తనేనేతి ప్రియకృత్ స చ కథ్యతే.** ఇతర ప్రయోజనాలనాశ్రయించి తననాశ్రయించినవారిని కూడా, చివరకు తననే కోరునట్లు చేసేవాడు. అనగా ఒకవేళ భక్తుడు సిరిసంపదలు, భోగభాగ్యాలకోసం భగవంతుని ఆశ్రయించినప్పటికీ, ముందుగా వాటిని ఇచ్చి, చివరకు ఆ భక్తుని మోక్షంవైపు ఆకర్షించేవాడు ప్రియకృత్. (శ్రీకైవల్య సారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **న కేవలమ్ ప్రియార్హ ఏవ, కిన్తు స్తుత్యాదిభిః భజతామ్ ప్రియమ్ కరోతి ఇతి ప్రియకృత్.** భగవంతుడు కేవలం 'ప్రియార్హుడు' ( 876వ నామము) మాత్రమే కాదు. స్తుతివంటి కార్యాలద్వారా తనను ఆరాధించే భక్తుల కోరికలు తీర్చి వారికి ప్రియము చేకూర్చేవాడు.

శ్రీ వాసిష్ఠ భగవంతునికి ప్రీతి కలిగించేవిగా కొన్ని వైదిక మంత్రాలను ఉదాహరించారు. వానివల్ల సంతుష్టుడై భగవానుడు భక్తుల కోరికలను తీరుస్తాడు.

**వషట్ తే విష్ణవాస అకృనోమి తన్ మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్**
**వర్ధన్తు త్వా సుష్టుతయో గిరోమే యూయమ్ పాతవస్తిభిః సదా నః** – ఋగ్వేదము 7.99.7
ఈ స్తుతి వాక్యములు నిన్ను సంతుష్టుని చేయుగాక. మాకు మరిన్ని దీవెనలనిమ్ము.

ఋగ్వేదము 1.189.1 – సన్మార్గంలో మమ్ములను సంపన్నులను చేయుము. మమ్మల్ని పెడత్రోవ పట్టించే పాపాలను తొలగించుము.



ఋగ్వేదము 3.62.10 – అంతనూ సృష్టించే భగవానుని దివ్యతేజస్సును మేము ధ్యానిస్తున్నాము. అది మమ్మల్ని చైతన్యులను చేయుగాక.

శ్రీ రఘునాథ తీర్థ **'అర్థప్రియకృత్'** అనే ఒకే నామమును పరిగణించారు. భక్తులకు రక్షణను, ప్రేమను ప్రసాదించేవాడు అర్థప్రియకృత్.

## 879. ప్రీతివర్ధనః

- తన భక్తులలో సంతోషమును, భక్తిని వృద్ధి చేసేవాడు.
- తన భక్తుల ప్రేమను పూరించేవాడు.

### ఓం ప్రీతివర్ధనాయ నమః

వృద్ - వృద్ధౌ - పెంచుట. వర్ధ్ - పూరణ - నింపుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు తన గుణముల అతిశయంతో తన భక్తులలోని ఆనందమును పెంపొందించును. కనుక ఆయన ప్రీతివర్ధనుడు.

**గుణావిష్కరణాన్నిత్యం ఉత్తరోత్తరతోఽధికమ్ యస్తు ప్రీతమ్ వర్ధయతి ప్రీతివర్ధన ఈరితః..** ఈ రకంగా ఇతరదేవతల నారాధించే భక్తులకు తన మహిమలు చూపిస్తూ, వారికి తనయందు భక్తిని పెంపొందింపజేయువాడు ప్రీతివర్ధనుడు (శ్రీకైవల్యసారథి). శ్రీ భట్టులు గీత (10.10)నుండి ఉదాహరించారు.

**తేషామ్ సతతయుక్తానామ్ భజతాం ప్రీతిపూర్వకమ్**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే**

అట్లు నిరంతరము ధ్యానాదులద్వారా నాయందే లగ్నమనస్కులై నన్నే భజించువారికి నేను బుద్ధియోగమును, అనగా తత్త్వజ్ఞానరూపయోగమును ప్రసాదించెదను. దానిద్వారా వారు నన్నే పొందుదురు.

శ్రీ భగవద్రామానుజులు తమ గీతాభాష్యం ప్రవేశికలో శ్రీకృష్ణభగవానుని గురించి ఇలా చెప్పారు – శ్రీకృష్ణభగవానుడు తన నిరతిశయ (అంతులేని) సౌందర్య శీలాది గుణములచే అక్రూరుడు, మాలాకారుడు వంటివారిని కూడా పరమభాగవతులుగా చేశాడు. ఇలా భగవంతుడు భక్తుల ప్రీతి (భక్తి, ఆనందము)ను వర్ధిల్లజేయును గనుక ఆయన ప్రీతివర్ధనుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి (1.10.10) – భగవంతుడు తన సుందర నయన పద్మాల సహాయంతో నమ్మాళ్వారు హృదయంలో తిష్ఠ వేశాడు. కనుక ఆళ్వారు భగవంతుని మరచిపోలేదు.

శ్రీ చిన్మయానంద – భగవంతుని గరించి అలోచించినకొద్దీ ఆయనపట్ల మన ప్రీతి వర్ధమానమవుతోంది. కనుక భగవంతుడు ప్రీతివర్ధనుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – **ప్రీతిమ్ భక్తేషు వర్ధయతి ప్రీత్వా భక్తాన్ వర్ధయతి ఇతి వా ప్రీతివర్ధనః.** భగవంతుడు భక్తులలో ప్రేమను పెంపొందించును. మరియు ప్రేమతో భక్తులను వృద్ధి చేయును. కనుక ఆయన ప్రీతివర్ధనుడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – వర్ధ్ - ఛేదన పూరణయోః - ఖండించుట, నిలుపుట. **ప్రీతిమ్ వర్ధయతి పూరయతి ఇతి ప్రీతివర్ధనః.** తన భక్తుల ప్రేమను సఫలము చేయువాడు ప్రీతివర్ధనుడు.



## విహాయసగతిర్జ్యోతిః సురుచిర్హుతభుగ్విభుః |
## రవిర్విరోచనః సూర్యః సవితా రవిలోచనః || (94)

**శ్రీ భట్టులు ఈ శ్లోకములో 'జ్యోతి' మొదలుకొని నామములను, మరియు తరువాతి శ్లోకములోని మొదటి నామమును అర్చిరాది మార్గములోని వివిధ దశలను సూచించునవిగా వ్యాఖ్యానించారు.** అర్చిరాది మార్గములు అనగా ముక్తజీవుడు పరబ్రహ్మమును చేరుకొనే ప్రయాణంలో తారసపడే వివిధ సోపానములు (లోకములు). ఈ మార్గదశల పేర్లు వివిధ ఉపనిషత్తులలో కొంచెం తేడాగా ఉన్నాయి.

ఛాందోగ్యోపనిషత్తు (4.15.5, 4.15.6, 5.10.1, 5.10.2) ప్రకారం

అర్చిస్ (అగ్ని), అహః (పగలు), శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, ఆదిత్య, చంద్ర, విద్యుత్.

కౌషీతకి ఉపనిషత్తు (1.2.1) ప్రకారం

అగ్నిలోకము, వాయులోకము, వరుణలోకము, ఆదిత్యలోకము, ఇంద్రలోకము, ప్రజాపతి లోకము.

బృహదారణ్యకోపనిషత్తు (8.2.15, 7.10.1) ప్రకారం

అర్చిస్, అహః, శుక్లపక్షము, ఉత్తరాయణము, దేవలోకము, ఆదిత్య, వైద్యుత.

ఛాందోగ్యోపనిషత్తులోని మంత్రము (5.10.1)

**తద్య ఇత్థమ్ విదుః యే చేమేऽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే - తేऽర్చిషమ్**
**అభిసంభవన్తి, అర్చిషోऽహః అహ్న ఆపూర్యమాణ పక్షమ్**
**ఆపూర్యమాణ పక్షాత్ యాన్ షడుదఙ్ఞేతిమాసాన్స్తాన్**

పంచాగ్నులగురించి తెలిసినవారు, అరణ్యాలలో బ్రహ్మమును గురించి శ్రద్ధతో తపస్సు చేసేవారు అగ్నిలో ఏకమౌతారు. అగ్నినుండి పగలుదేవత వద్దకు, అక్కడినుండి శుక్లపక్షదేవత వద్దకు, అక్కడినుండి ఉత్తరాయణదేవత వద్దకు వెళతారు.

ఛాందోగ్యోపనిషత్తు (5.10.2)

**మాసేభ్యః సంవత్సరమ్, సంవత్సరాత్ ఆదిత్యమ్,**
**ఆదిత్యాత్ చంద్రమాసమ్, చంద్రమాసో విద్యుతమ్,**
**తత్ పురుషో అమానవః, స ఏవాన్ బ్రహ్మగమయతి**
**ఏష దేవపథో బ్రహ్మపథః**
**ఏతేన ప్రతిపద్యమానా ఇమామ్ ఆవర్తమ్ నావర్తన్తే నావర్తన్తే**

ఉత్తరాయణమునుండి ఆ జీవుడు సంవత్సరమునకు, అక్కడినుండి ఆదిత్య లోకమునకు, అక్కడినుండి చంద్రమాస లోకమునకు, అక్కడినుండి విద్యుత్ లోకమునకు వెళ్ళును. అక్కడినుండి అమానవుడు ఆ జీవిని బ్రహ్మమార్గమునకు కొనిపోవును. ఇలా ఈ మార్గంలో వెళ్ళిన జీవుడు మరల సంసారమునకు తిరిగిరాడు.

శ్రీ భగవద్రామానుజులు శ్రీభాష్యము (4.3.1 సూత్రము)లో ఈ మార్గము గురించి విపులంగా చర్చించారు. ఆయన చెప్పిన ప్రకారం ఈ మూడు ఉపనిషత్తులలోను చెప్పిన దశలు ఆయా వర్ణనల ప్రకారం సరిగా అర్థం చేసుకొంటే ఒకే క్రమంలో చెప్పవచ్చును. ఆ 12 దశలు ఇలా ఉన్నాయి.

1. అర్చిస్ (అగ్ని)
2. అహః (పగలు)
3. శుక్లపక్షము (పూర్వపక్షము)
4. ఉత్తరాయణము
5. సంవత్సరము
6. వాయువు
7. ఆదిత్య
8. చంద్ర
9. వైద్యుత్
10. వరుణ
11. ఇంద్ర
12. ప్రజాపతి

ఈ 12 దశలు, వాని పేర్లు ఏదో ఒకటి అన్న పద్ధతిలో చెప్పబడినవి కావు. వివిధ ఉపనిషత్తులను క్షుణ్ణంగా విశ్లేషించి శ్రీ భగవద్రామానుజులు ఈ 12 పేర్లను ఈ క్రమంలో చెప్పారు. శ్రీభాష్యము 4.3.2లో ఈ విషయం గురించి మరిన్ని వివరాలున్నాయి. ముక్తులు ఈ భౌతికజీవనంనుండి పరమపదము చేరుకొనే మార్గంలో ఈ పన్నెండుగురు అధిష్ఠానదేవతలు దారిని సుగమం చేస్తారు. వారిని 'అతివాహికలు' అని కూడా అంటారు.

శ్రీ భట్టులు చెప్పిన వివిధ నామములు, వానికి అర్చిరాది మార్గము దశలతో ఉన్న సంబంధము క్రింది జాబితాలో ఇవ్వడమైనది.

880. **విహాయసగతిః –** ముక్తజీవుని భగవంతుడు స్వయంగా తోడ్కొనిపోవునని సారాంశము.

881. **జ్యోతిః –** అగ్ని.

882. **హుత-భుగ్-విభుః –** శుక్లపక్షమునకు అధిష్ఠాన దేవత.

883. **రవిః –** ఉత్తరాయణకాలపు అధిష్ఠాన దేవత.

884. **విరోచనః –** సంవత్సరమునకు అధిష్ఠాన దేవత.

885. **సూర్యః –** వాయువు.

886. **సవితా –** సూర్యుడు.

887. **రవిలోచనః –** చంద్రుడు, మెరుపు మరియు వరుణుని సూచించును.

888. **అనంత హుతభుగ్ భోక్తా –** ఇంద్రలోకము, ప్రజాపతి లోకము.

ముక్తజీవుడు ఈ లోకంనుండి శ్రీవైకుంఠమును చేరుకునే విధాన్ని, ఆ మార్గంలో అతివాహికలు ఇచ్చే చేయూతను శ్రీ నమ్మాళ్వారు అతిమధురంగా, సుందరంగా వర్ణించారు –

ముందుగా వైద్యుత దేవుడు (దేవత) ముక్తజీవుని ఆగమనం గురించి ఉరుము ద్వారా తక్కిన అతివాహికలకు ప్రకటిస్తాడు. వరుణుడు ఆకాశాన్నంతటినీ బంగారుకుండలలోని నీటితో నింపిన మేఘాలు పరుస్తాడు. సముద్రాలు సంతోషించి తరంగాలతో ఎగసి ఎగసి పడుతున్నాయి. ఈ 12 అతివాహికలు మాత్రమే కాక, అన్ని లోకాలలోని అతివాహికలు మరియు తపోధ్యానులైన మునులు కూడా వరుసలో నిలబడి ముక్తజీవుని స్వాగతించి గౌరవిస్తారు.

తులసిమాలాలంకృతుడైన శ్రీ భగవానుడు శ్రీ అమ్మవారితో కలసి, చిరకాలంగా తమనుండి దూరమైన భక్తునికోసం ఎదురు చూస్తున్నారు. తన మార్గంలో ముక్తజీవుడు విశ్రమించడంకోసం సకల లోకాలలోని దేవతలు అందమైన పర్ణశాలలను నిర్మిస్తున్నారు. వరుణుడు, ఇంద్రుడు, ప్రజాపతి తమ తమ లోకాల ప్రవేశద్వారాలవద్ద నిలుచుండి ముక్తజీవుని స్వాగతిస్తూ, అతనినుండి ఆశీస్సులు

పొందాలని కోరుకొంటున్నారు. సనక నారదాదులు వేదాలను గానం చేస్తూ ముక్తజీవుని ఆహ్వానిస్తున్నారు. దారి అంతటా పండుగ వాతావరణం నెలకొన్నది. మంగళవాయిద్యాల ఘోషలు అంతటా వినబడుతున్నాయి. శ్వేతోన్నతమూర్తులైన నిత్యసూరులు పరమపదము ద్వారంవద్ద నిలబడి ముక్తజీవుని స్వాగతిస్తున్నారు. ఈ శుభసందర్భంలో భగవంతుడుకూడా విశేషంగా ప్రకాశిస్తున్నాడు.

ఆ జీవుడు ఎట్టకేలకు తన శాశ్వత నిలయాన్ని చేరుకొన్నాడని నిత్యసూరులు సంతోషంతో పులకించిపోతున్నారు. ముక్తజీవుని వారు ఇంటింటా పాద్యోపచారాలతో సేవిస్తున్నారు. ముక్తుని వైకుంఠంలోనికి స్వాగతించడంకోసం భగవానుడు, అమ్మవారు ఎదురుచూస్తున్నారు.

## 880. విహాయస గతిః

- పరమపదమును పొందుటకు సాధనమైనవాడు.
- సూర్యుడై ఆకాశమున (అంతరిక్షంలో) సంచరించేవాడు.
- గరుడుని వాహనంగా చేసుకొని ఆకాశంలో సంచరించేవాడు.
- తాపసులు తమ తపస్సుద్వారా ఆయనను పొందుతారు.

### ఓం విహాయస గతయే నమః

వి ( ఉపసర్గ). హా - గతౌ - వెళ్ళుట, పొందుట, సాధించుట. హా - త్యాగే - వదలివేయుట. అసున్ (ప్రత్యయము)

విహాయస – దేనిద్వారా ప్రయాణిస్తామో అది, అనగా ఆకాశము, అంతరిక్షము.

విహాయస – త్యాగము, తపస్సు ఆచరించే సాత్వికులు.

అమరకోశము ప్రకారము – **విహాయస - వియద్ విష్ణుపదమ్ విహాయసీ,** అనగా ఆకాశము, పక్షి, విష్ణువు నివాసస్థానము అనే అర్థాలున్నాయి.

గతి - పొందునది, లక్ష్యము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'విహాయసము' అంటే 'విష్ణుపదము' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **తథా నిరూఢ భక్తి పరకోటిభిః విహాయసమ్ - పరమవ్యోమ పదమేవ గమ్యతే అస్మాత్ ఇతి విహాయస గతిః.** ఆయన ద్వారానే పరమభక్తులు పరమపదమును చేరుకుంటారు కనుక భగవంతుడు 'విహాయస గతి'.

**నిరూఢ భక్తియుక్తైర్హి నిత్యం యస్మాత్తు గమ్యతే విహాయసం పరంవ్యోమ విహాయసగతిస్తు సః.** భక్తిలో పరాకాష్టను చేరినవారికి పునరావృతి లేని పరమాకాశమనే పరమపదాన్ని ఇచ్చేవాడు విహాయసగతి. (శ్రీకైవల్య సారథి).

శ్రీ భట్టులు విష్ణుపురాణము (5.19.26)నుండి ఉదాహరించారు.

**భుక్త్వాంచ విపులాన్ భోగాన్ తమంతే మత్ప్రసాదాదజమ్**
**మమానుస్మరణమ్ ప్రాప్య దివ్యమ్ లోకమవాప్స్యసి**

నా దయవల్ల అనేక భోగములు అనుభవించి, అనంతరం అవసానసమయంలో నన్ను స్మరిస్తావు. అలా దివ్యమైన పరమపదమును పొందుతావు.

మరియు బ్రహ్మసూత్రములు (4.2.16)కూడా ఉదాహరించారు.

**తదోకః అగ్రజ్వలనమ్ తత్ప్రకాశితద్వారో విద్యా సామర్థ్యాత్ తచ్**

**ఛేషగత్యనుస్మృతి యోగాచ్చహార్దానుగృహీతః శతాధీకయా**

తాను నిష్టతో ఆచరించిన భక్తియోగమువలనను, భగవంతుని పరంధామమును గురించి తదేకదృష్టితో సాగించిన ధ్యానమువలనను భక్తుడు తన అవసాన సమయములో తాను శరీరమును విడచి వెళ్ళవలసిన ద్వారమును చూడగలడు. మరియు మూర్ధాయనాడి లేదా సుషుమ్నానాడి ద్వారా జీవుడు శరీరమును వదలినచో ఆ మార్గము భగవంతుని పరంధామమునకు తీసికొని వెళ్ళును.

పెరియతిరుమొళి 5.8.5 – భగవంతుడు ముందుగా భక్తుడు ఇహలోక సౌఖ్యములు అనుభవించేలా చేస్తాడు. అనంతరం తన లోకానికి తీసికొని వెళతాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'గతి' అనగా 'నివాసము' లేదా 'నిలయము' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **విహాయసః - విహాయసమ్ గతిః - ఆశ్రయః అస్య ఇతి విహాయసగతిః, విష్ణుపదమ్ ఆదిత్యో వా.** విహాయసము (ఆకాశము లేదా అంతరిక్షము) తన ఆశ్రయము (నిలయము)గా గలవాడు. ఈ అర్థము శ్రీమహావిష్ణువునకు లేదా సూర్యదేవుని రూపంలో ఉన్న శ్రీమహావిష్ణువునకు కూడ వర్తించును.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **విహాయసే అంతరిక్షే గతిః గమనమ్ యస్య స విహాయస గతిః - సూర్యః.** సూర్యునిరూపంలో అంతరిక్షంలో సంచరించేవాడు విహాయసగతి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి కూడా 'విహాయసము' అనగా 'ఆకాశము' అన్న భావాన్ని మరింత విపులీకరించారు. అడ్డంకులు లేని, ఆధారం అవసరంలేని, అంతులేని ఆకాశమే తన దారిగా కలిగినవాడు శ్రీసూర్యనారాయణమూర్తియైన భగవానుడు. తన సృష్టిపైనున్న మక్కువతో భగవంతుడు సూర్యరూపుడై దానిని సంరక్షించును. కనుక ఆయన ప్రియకృత్, ప్రీతివర్ధనుడు. తరువాతి 10 నామములను కూడా శ్రీసూర్యనారాయణ పరంగా శ్రీ రాధాకృష్ణశాస్త్రి వ్యాఖ్యానించారు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'విహాయసము' అంటే 'ఆకాశము', 'పక్షి' అనే రెండు అర్థాలను గ్రహించారు. **విహాయసే - వ్యోమ్ని విహాయః పతినా గతిః యస్య ఇతి విహాయసగతిః.** విహాయసము (అంతరిక్షము)నందు విహాయపతి (గరుడుని)పై సంచరించేవాడు విహాయసగతి. శ్రీ సత్యసంధ తీర్థ కూడా ఇంచుమించు ఇదే అర్థం చెప్పారు. **విహాయసో - గరుడః, తేన తేన గతిః యస్య స విహాయసగతిః.**

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – విహాయస - తపస్వి (హ్యా-త్యాగే). **విహాయసైః తపస్విభిః, అభిగమ్యతే ప్రాప్యత ఇతి విహాయసగతిః విష్ణుః.** తాపసులు తమ తపస్సుద్వారా ఎవరిని పొందుతారో ఆ శ్రీమహావిష్ణువే విహాయసగతి.

## 881. జ్యోతిః

- శ్రీవైకుంఠమునకు దారి చూపే కాంతి.
- స్వయంప్రకాశమానుడైన పరమాత్మ.
- సూర్యచంద్రాదులను కూడా వెలిగించే కాంతి.

### ఓం జ్యోతిషే నమః

**ఈ నామము మొదలు తరువాతి కొద్ది నామములను అర్చిరాది మార్గములో దశలను సూచించేవిగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. పరమపదమును చేరుటకు ముక్తులు ప్రయాణించే మార్గమే అర్చిరాది మార్గము.**

ద్యుత్ - దీప్తౌ - వెలుగుట. **ద్యుతేరిసిన్ ఆదేశ్చ జః**, అనే ఉనాదిసూత్రం (2.110) ప్రకారం మొదట్లో జకారం వస్తుంది. అలా ఈ 'ద్యుత్' ధాతువునుండి 'జ్యోతి' అనే పదం వస్తుంది. **ద్యోతతే అస్మాత్ ఇతి జ్యోతిః.** ఆయన కారణంగా అన్నీ వెలుగుతాయి గనుక ఆయన జ్యోతి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – జీవుడు పరమపదమునకు వెళ్ళే మార్గంలో మొదటిదశను ఈ నామం సూచిస్తుంది. ఈ అర్చిరాది మార్గంలో మొదటి దేవత 'అర్చిః'. అనగా మొదటి అతివాహిక. ఈ దేవత జీవుని 'పగలు అధిష్ఠాన దేవత' వరకు తోడ్కొని పోవును.

**స్వప్రాప్తే స్సాధనత్వాధ్యః స్వయం నిత్యం విశేషతః అర్చిరాదిగతేర్జ్యోతిః ప్రథమం సర్వకథ్యతే.** తన భక్తులు సాయుజ్యం పొందడానికి సాధనమైన అర్చిరాది మార్గానికి ప్రథమ సోపానమైన 'అర్చిస్సు' అనగా అగ్నిని నియమించువాడు 'జ్యోతి'. ఆ మార్గాన్ని పరమేశ్వరునివల్లనే భక్తులు చూడగలుగుతారు. (శ్రీకైవల్య సారధి).

శ్రీ భట్టులు ఛాందోగ్యోపనిషత్తు మరియు బ్రహ్మసూత్రములనుండి ఉదాహరించారు..

ఛాందోగ్యోపనిషత్తు 5.10.10 – **తే అర్చిషామ్ అభిసంభవన్తి.** అక్కడ వారు అర్చిస్సు (అగ్ని)తో ఏకమౌతారు. అగ్నినుండి పగటి దేవతవద్దకు, అక్కడినుండి శుక్లపక్షమునకు వెళతారు.

బ్రహ్మసూత్రములు 4.3.1 – **అర్చిరాదినా తత్ ప్రథితే.** కాంతి (అర్చిస్సు)తో ప్రారంభమయ్యే ఈ మార్గము సుపరిచితము. అనగా ముక్తజీవులు ప్రయాణించే ఈ అర్చిరాది మార్గము ఉపనిషత్తులలో విపులముగా చెప్పబడినది.

బ్రహ్మసూత్రములు 4.3.4 –**అతివాహికాః తల్లింగాత్.** అతివాహికలు అనగా దారి చూపే దేవతలు. వారు ధ్యానయోగులను బ్రహ్మమువద్దకు తీసికొని పోవుదురు, అనే సూచనలు లభిస్తున్నాయి. వారే ముక్తజీవులను పరంధామమునకు తీసికొని వెళతారు.

శ్రీ వి.వి. రామానుజన్ గీత శ్లోకములు 8.24 నుండి 8.27 వరకు ఉదాహరించారు. బ్రహ్మజ్ఞానమును పొందినవారు బ్రహ్మము వద్దకు పోయే మార్గము ఈ శ్లోకాలలో వర్ణింపబడినది.

**అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః** (8.24)

బ్రహ్మవేత్తలైన యోగులు జ్యోతిర్మయ మార్గము ద్వారా బ్రహ్మపదప్రాప్తి నందుదురు. ఈ జ్యోతిర్మయ మార్గమునకు అధిదేవత అగ్ని. దేహత్యాగము చేసిన ఈ యోగులను క్రమముగా దిన (పగలు), శుక్లపక్ష, ఉత్తరాయణ అభిమాన దేవతలు కొనిపోయి పరమపదమునకు చేర్చుదురు (ఇది అర్చిరాది మార్గము).

**ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్**
**తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే** (8.25)

అట్లే సకామకర్మయోగులు ధూమ్రమార్గముద్వారా స్వర్గాదిలోకములను చేరుదురు. దేహత్యాగము చేసిన ఈ సకామకర్మయోగులను క్రమముగా రాత్రి, కృష్ణపక్ష, దక్షిణాయన అభిమాన దేవతలు కొనిపోయి, స్వర్గాది లోకములను చేర్చుదురు. వారు అచట చాంద్రమస జ్యోతిని పొంది, అనగా తమ శుభకర్మ ఫలములను అనుభవించి, తిరిగి భూలోకమును చేరుదురు.

**శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే**
**ఏకయా యాత్యనావృత్తిమన్యయావర్తతే పునః** (8.26)

ఈ రెండు మార్గములకును శుక్ల, కృష్ణ మార్గములనియు, లేక దేవయాన, పితృయాన మార్గములనియు వ్యవహారప్రసిద్ధి గలదు. ఇవి సనాతనములు. దేవయాన మార్గమున వెళ్ళువారు పరమగతిని పొంది తిరిగిరారు. పితృయాన మార్గములో వెళ్ళువారు తిరిగివచ్చి జననమరణ చక్రములో పడుదురు.

ఇవి రెండూ (అర్చిరాది మార్గము, ధూమయాన మార్గము) కాక నరకమునకు పోవువారు యామయ మార్గంలో వెళతారని శాస్త్రాలలో చెప్పారు.

(ఈ రచన మొత్తంలో భగవద్గీత నుండి ఉదాహరించిన శ్లోకాలకు తెలుగు అనువాదం ఈ పుస్తకంనుండి యథాతథంగా వ్రాశాను. **శ్రీ జయదయాల్ గోయందకా** – శ్రీ మద్భగవద్గీత – తత్వవివేచనీ హిందీ వ్యాఖ్యకు తెలుగు అనువాదము – అనువాదకులు: డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య గీతాప్రెస్, గోరఖ్ పూర్ ప్రచురణ.)

భగవద్గీతలో చెప్పిన ఈ అర్చిరాది మార్గమును ఆళ్వారులు తమ దివ్యప్రబంధాలలో సుందరంగా వర్ణించారు. శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (10.9)లోని పది పాశురాలలో ముక్తజీవుని వైకుంఠయాత్ర, అతనికి మార్గంలో లభించే స్వాగత ఆదరణలు వర్ణింపబడినాయి.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా శ్రీ భట్టులలాగానే వ్యాఖ్యానించారు. **ద్యోతతే సుషుమ్నయా నిర్గతః తద్భక్తః అర్చిః ప్రాప్య యస్మాత్ స జ్యోతిః.** సుషుమ్నానాడిద్వారా దేహాన్ని వదలిన భక్తునికి దారి చూపే కాంతియే జ్యోతి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – నారాయణుడు స్వయముగా (ఇతరులతో నిమిత్తము లేకుండా) ప్రకాశించువాడు గనుక 'జ్యోతి'. ఇందుకు శ్రీ శంకరులు మహానారాయణోపనిషత్తునుండి ఉదాహరించారు. **నారాయణ పరో జ్యోతిరాత్మా నారాయణః పరః.**

ఇతర శ్రుతి వాక్యాలు –

బృహదారణ్యకోపనిషత్తు 4.3.9 – **అత్ర అయం పురుషః స్వయం జ్యోతిః.**
గీత 13.18 – **జ్యోతిషామపి తద్ జ్యోతిః.**
ముండకోపనిషత్తు 2.2.10 – **తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్ తస్య భాసా సర్వమిదమ్ విభాతి.** తాను మాత్రము స్వయముగా ప్రకాశించును. మరియు అన్నింటిని ప్రకాశింపజేయును. ఆయన కాంతివల్లనే తక్కినవన్నీ ప్రకాశించును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ద్యోతతే దీప్యతి కాన్త్యా ఇతి జ్యోతిః.** తన కాంతి ద్వారా అన్నింటినీ వెలిగించేది 'జ్యోతి'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – సూర్యుని, అగ్నిని వెలిగించేవాడు భగవంతుడే. వేదాలలో సూర్యుని, అగ్నిని కూడా 'జ్యోతి' అని ప్రస్తావించారు. కనుక భగవంతుడు జ్యోతులకు జ్యోతి.

యజుర్వేదము 3.9 – **అగ్నిర్జ్యోతిః జ్యోతిరగ్నిః స్వాహా. సూర్యో జ్యోతిః జ్యోతిః సూర్యః స్వాహా.**

## **882.** సురుచిః

- సుందరమైన కాంతి గలవాడు. అర్చిరాది మార్గములో దినాభిమాన దేవతగా ఉండువాడు.
- జగత్తును రక్షించుటయందు కాంక్ష గలవాడు.
- అన్నింటిలోని కాంతికిని కారణమైనవాడు.
- తన భక్తులయెడ ఎంతో అనురాగము కలవాడు.

### ఓం సురుచయే నమః.

రుచ్ - దీప్తావభి ప్రీతౌ - వెలుగుట, అందముగానుండుట, సంతోషించుట. **సుష్ఠు రోచత ఇతి సురుచిః.** చక్కగా ప్రకాశించువాడు సురుచి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు అర్చిరాదిమార్గం పరంగా వ్యాఖ్యను కొనసాగించారు. కాంతి (జ్యోతి) తరువాత పగలు (దినాభిమాన దేవత) ముక్తజీవునికి శ్రీవైకుంఠమువైపు దారి చూపును. ఆ పగలు దేవతయే సురుచి. **సూర్యోదయాత్ రోచతే ఇతి రుచిః. సా అస్య శోభనా ఇతి సురుచిః.** సూర్యోదయమునుండి ప్రకాశించునది రుచి. మరియు సుందరమైనది సురుచి (పగలు). ఇందుకు శ్రీ భట్టులు ఛాందోగ్యోపనిషత్తు (5.10.1)నుండి **'అర్చిషో అహః'** అని ఉదాహరించారు. అగ్ని తరువాత పగలు దేవత బ్రహ్మమునకు పోవు దారి చూపును.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **శోభనో రుచిః దివసః యస్మాత్ స సురుచిః.** ఎవనివల్లనైతే చక్కని పగలు సంభవిస్తుందో ఆయన సురుచి.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

(1) ఆయన కాంతి అందమైనది. మంగళప్రదమైనది. ఆకర్షణీయమైనది.

(2) ఆయన ఇష్టము (సంకల్పము) అందమైనది, మంగళప్రదమైనది, ఆకర్షణీయమైనది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి 'రుచి' అంటే 'ఇష్టము' (కోరిక) అనే అర్థంలో వ్యాఖ్యానించారు. జగత్తును రక్షించే చక్కని సంకల్పము కలవాడు సురుచి.

శ్రీ వాసిష్ఠ – అన్ని కాంతులకూ కారణమైన భగవానుడు సురుచి.

శ్రీ చిన్మయానంద – మంగళప్రదమైన వైభవము, సంకల్పము కలవాడు సురుచి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – అమరకోశము (3.3.29). **అభిష్వంగే స్పృహాయామ్ చ గభస్తౌ చ రుచిః త్రియమ్.** 'రుచి' అనగా అభిష్వంగము (దృఢమైన అనుబంధము) అనే అర్థం ఉన్నది. **శోభనా రుచిః అభిష్వంగః అనురాగః యస్మిన్ భక్తానామ్ ఇతి సురుచిః.** భక్తులయెడ గాఢమైన అనురాగము కలవాడు సురుచి.

## 883. హుతభుగ్విభుః

### హుతభుక్

### విభుః

శ్రీ భట్టులు **'హుతభుగ్విభుః'** అనే ఒకే నామమును పరిగణించారు. శ్రీ శంకరులు, శ్రీ సత్యసంధ తీర్థవంటివారు **'హుతభుక్', 'విభుః'** అనే రెండు నామములను పరిగణించారు.

### హుతభుగ్విభుః

- శుక్లపక్షముగా ఉండేవాడు.

### ఓం హుతభుగ్విభవే నమః

హు - దానాదనయోః - ఇచ్చుట, యజ్ఞము చేయుట, తినుట. భుజ్ - పాలన - అభ్యవహారయోః - రక్షించుట, భుజించుట. 'హు'నుండి 'హుతమ్' అనే పదము, 'భుజ్'నుండి 'భుక్' అనే పదము వచ్చాయి.

**హుతమ్ భుంక్తే హుతభుక్.** నివేదించినదానిని భుజించువాడు హుతభుక్. **వివిధో భవతి ఇతి విభుః.** అనేక విధాలుగా (రూపాలుగా) వ్యక్తమగువాడు విభువు. (భూః - సత్తాయామ్ - ఉండుట).

శ్రీ భట్టుల వ్యాఖ్య – **హుతమ్ భుంజనః సోమః.** హుత - యజ్ఞములో సమర్పించినదానిని, భుక్ - భుజించును, మరియు, విభుః - పూర్ణో భవతి - నిండుగా అగును (శుక్లపక్ష చంద్రుడు).

**హుతమ్ సుధా పరిణతమ్ భుంజానశ్చంద్రమాస్తథా విభుః పూర్ణో భవేత్ యస్మిన్ స వై స్యాత్ హుతభుగ్విభుః.** హోమంలో వేసిన ద్రవ్యాలన్నీ అమృతంగా మారతాయి. ఆ అమృతాన్ని ఆరగించేవాడు చంద్రుడు. అతడు పూర్ణుడుగా ఉండే శుక్లపక్షమునకు అభిమానిగా ఉండేవాడు 'హుతభుగ్విభుః' (శ్రీకైవల్య సారధి). అర్చిరాది మార్గంలో మూడవ దశను ఈ నామము సూచించును. ఇందుకు కూడ శ్రీ భట్టులు ఛాందోగ్యోపనిషత్తు (5.10.1)నుండి ఉదాహరించారు. **అర్చిషః అహః అహ్న అపూర్యమాణ పక్షమ్...** అగ్నినుండి పగలు, పగటినుండి శుక్లపక్షము.....

శ్రీ బలదేవ విద్యాభూషణ వ్యాఖ్య శ్రీ భట్టుల వ్యాఖ్యకు సమాంతరంగా, చంద్రునిపరంగా సాగింది. **హుతభుక్ - చంద్రః, విభుః - పూర్ణః, యత్ర స హుతభుగ్విభుః శుక్లపక్షః.** భగవంతుడు శుక్లపక్ష చంద్రునివలె సదా తన భక్తుల జీవితంనుండి అంధకారమును దూరము చేయును.

**హుతభుక్** (శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము)

- యజ్ఞములందు హోమము చేయబడు ద్రవ్యములను స్వీకరించువాడు.
- యజ్ఞములను రక్షించువాడు.

**ఓం హుతభుజే నమః**

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

94వ శ్లోము. 883వ నామము. హుతభుక్ – **విహాయసగతిః జ్యోతిః సురుచిః హుతభుక్ విభుః**

95వ శ్లోకము. 889వ నామము. హుతభుక్ – **అనంతో హుతభుక్ భోక్తా సుఖదో నైకదోగ్రజః**

ఈ రెండు శ్లోకాలలోను శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము 'హుతభుక్' నామము వచ్చుచున్నది. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారము ఆయా నామములు 'హుతభుగ్విభుః' మరియు 'అనంతో హుతభుక్ భోక్తా' నామములలో కలిసియున్నవి.

శ్రీ శంకరుల వ్యాఖ్య. 94వ శ్లోకములో. హుతభుక్ – **సమస్త దేవతోద్దేశేన ప్రవృత్తేష్వపి కర్మసు హుతమ్ భుంక్తే భునక్తి ఇతి వా హుతభుక్.** యజ్ఞాలలో వివిధ దేవతలనుద్దేశించి నివేదనలు చేసినప్పటికీ, ఆయా దేవతల రూపంలో చివరకు భగవంతుడే ఆ హోమద్రవ్యములను స్వీకరించును కనుక ఆయన 'హుతభుక్'.

శ్రీ శంకరుల వ్యాఖ్య. 95వ శ్లోకములో. హుతభుక్ – **హుతమ్ యజ్ఞమ్ భునక్తి ఇతి హుతభుక్.** యజ్ఞమును రక్షించువాడు 'హుతభుక్'.

శ్రీ వాసిష్ఠ వివరణ – **హుతమితి అగ్నౌ ప్రక్షిప్తమ్ స-మంత్రమ్.** మంత్రసహితముగా అగ్నియందు సమర్పించేది హుతము. యజుర్వేదము 17.79 – **సప్త తే అగ్నే సమిధః సప్తజిహ్వాః.** అగ్నికి ఏడు నాల్కలున్నవి (ఏడు విధములైన అగ్నులున్నవి). ఇవి 'సప్తజిహ్వాః' నామ వివరణలో వర్ణింపబడినవి.

ప్రాణస్వరూపుడైన భగవానుడే మనము ఆరగించిన అన్నమును కూడ భుజించుచున్నాడు. ఇది కూడ భగవంతుని 'హుతభుక్' లక్షణమును సూచించును.

విభుః

- అంతటా వ్యాపించియున్నవాడు. అన్ని జగములకు ప్రభువు.
- ఆయన కారణంగా సకల వస్తువులు విడివిడిగా (విభజించి) వ్యక్తమవుతాయి.
- అనేక రూపములలో వ్యక్తమయ్యేవాడు.

ఓం విభవే నమః

26వ శ్లోకము. 241వ నామము. విశ్వభుగ్-విభుః – **సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వదృగ్ విశ్వభుగ్ విభుః**
(శ్రీ భట్టులు 'విశ్వభుగ్విభుః' అనీ, శ్రీ శంకరులు 'విశ్వభుక్' మరియు 'విభుః' అనీ చెప్పారు).
94వ శ్లోము. 883వ నామము. హుతభుక్-విభుః – **విహాయసగతిః జ్యోతిః సురుచిః హుతభుక్ విభుః**
(శ్రీ భట్టులు 'హుతభుగ్విభుః' అనీ, శ్రీ శంకరులు 'హుతభుక్' మరియు 'విభుః' అనీ చెప్పారు.)

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వత్ర వర్తమానత్వాత్ త్రయాణమ్ లోకానామ్ విభుత్వాత్ విభుః.** అంతటా ఉన్నవాడు, మరియు ముల్లోకములకు ప్రభువు అయినవాడు విభుడు.

శ్రీ చిన్మయానంద – సర్వవ్యాపియైన నారాయణుడే విభుడు. కాలము చేతను, స్థలము చేతను పరిమితము కానివాడు. ఎలాంటి హద్దులు లేనివాడు.

శ్రీ సత్యసంధ యతిరాజ తీర్థ – **విశిష్టా భవన్తి అస్మాత్ విభుః.** ఆయన కారణంగా సకల చరాచరములు విశిష్టములు (వేరు వేరు) అగును గనుక ఆయన విభుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **వివిధో భవతి ఇతి విభుః.** అనేక రూపములలో వ్యక్తమగువాడు విభుడు.

884. రవిః

- ఉత్తరాయణ పుణ్యకాలంలోని సూర్యుడు. ఉత్తరాయణ దేవతద్వారా స్తుతింపబడే సూర్యుడు.
- రసములను గ్రహించే సూర్యుని రూపం దాల్చినవాడు.
- సకల చేతన, అచేతనములకు శబ్దము కలిగించే శక్తినిచ్చువాడు.
- తన భక్తులచే స్తుతింపబడువాడు.

ఓం రవయే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – రూ - శబ్దే, ధ్వని చేయుట. రూయతే - ప్రశస్యత ఇతి రవిః - ప్రశంసింపబడువాడు. ఉత్తరాయణ పుణ్యకాలంలో స్తుతింపబడు సూర్యుడు. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పటి (జనవరి 14) నుండి కర్కాటక రాశిలో ప్రవేశించే (జూలై 7) వరకు ఉత్తరాయణ పుణ్యకాలము. ఈ కాలంలో దేవతలు మేల్కొంటారు. అర్చిరాది మార్గంలో 4వ దశ అయిన ఉత్తరాయణంతో ఈ నామమును శ్రీ భట్టులు అనుసంధించారు.




తూర్పు చాళుక్యులనాటి శ్రీ సూర్యభగవానుని శిల్పం. పెదవేగి గ్రామం లోనిది

**యశ్చోత్తరాయణ ద్వారా రూయతేఽత్ర ప్రకాశ్యతే స వై రవిస్సమాఖ్యాతః ప్రాశస్త్య ఫలదో మనుః.** ఉత్తరాయణ దేవత ద్వారా స్తుతింపబడే సూర్యుడు. ప్రకాశించేవాడు. ఈ నామమంత్రము ప్రశస్తమైన గొప్ప ఫలితాన్నిస్తుంది. ఓం రవయే నమః (శ్రీకైవల్యసారథి).

శ్రీ బలదేవ విద్యాభూషణ చెప్పిన అర్థం కూడా షుమారుగా శ్రీ భట్టులు చెప్పిన అర్థంతో సరిపోతుంది. రు - గతి రేషణయోః - వెళ్ళుట, బాధించుట.

**రవతే గచ్ఛతి ఉత్తరాయణేన యస్మాత్ రవిః యదనుకంపయా ఉత్తరాయేణ యాతి ఇతి అర్థః.** ఎవని కృపవల్ల సూర్యుడు ఉత్తరాయణ మార్గంలో పయనిస్తాడో అతడు రవి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'రవి' అనగా ఆదిత్యునకు (సూర్యునకు) అధిష్ఠాన దేవత (ఆదిత్య ఆత్మా) అని వ్యాఖ్యానించారు. **రసాన్ ఆదిత్త ఇతి రవిః.** అన్ని రసములను గ్రహించేవాడు రవి. ఇందుకు శ్రీ శంకరులు విష్ణుధర్మోత్తరము (1.30.16)నుండి ఉదాహరించారు. **రసానామ్ చ తథా ఆదానాత్ రవిః ఇత్యభిధీయత.**

భగవద్గీత (10.21)లో ఇలా ఉంది. **ఆదిత్యానామ్ అహమ్ విష్ణుః జ్యోతిషామ్ రవిరంశుమాన్.** అదితియొక్క ద్వాదశపుత్రులైన ఆదిత్యులలో విష్ణువును నేను. జ్యోతిర్మయ స్వరూపులలో నేను రవిని (సూర్యుడను).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – రు - శబ్దే - ధ్వని చేయుట, అరచుట, ఝుమ్మనుట. ఉనాదిసూత్రము (4.139) 'అచా ఇహ్' ప్రకారము 'ఇ' ప్రత్యయం చేరిస్తే 'రవి' అవుతుంది. 'ఇ' ప్రత్యయం వల్ల 'అలా చేసేవాడు, చేయుంచేవాడు' అనే అర్థం వస్తుంది (కర్తరి కరణే వా). కనుక 'రవి' అనగా శబ్దమునకు కారణమైనవాడు. ఆయన కారణంగానే సమస్తజీవరాసులు శబ్దమును చేయగలుగుచున్నాయి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **రూయతే స్తూయతే భక్తజనైః ఇతి రవిః.** భక్తజనులచేత స్తుతింపబడువాడు రవి.

## 885. విరోచనః

- ప్రకాశమానమైనవాడు. ఉత్తరాయణ దక్షిణాయణ కాలములలో సూర్యుని ప్రకాశింపజేయువాడు.
- అనేక విధములుగా ప్రకాశించు వైభవము కలవాడు. సూర్యుడు, చంద్రుడు, పగలు, రాత్రి వంటివి.
- తన భక్తుల మనస్సులలో విశేషముగా ప్రకాశించుచున్నవాడు.
- 'విలోచనః' – అర్జునుడు, సంజయుడు వంటివారికి దివ్యనేత్రములను ఇచ్చినవాడు.

### ఓం విరోచనాయ నమః

### ఓం విలోచనాయ నమః

రుచ్ - దీప్తావభి ప్రీతౌ - ప్రకాశించుట, ఇష్టపడుట, సుందరముగ నుండుట. వి - ఉపసర్గ. వి-రుచ్-యుచ్ - విలోచనః. 'యుచ్' ప్రత్యయము చేర్చుటవలన పాణిని సూత్రము (3.2.149) **'అనుదాత్తేత్తః చ హలాదేః'**

ప్రకారము 'ఆ విధమైన లక్షణము కలవాడు' అనే అర్థం వస్తుంది. కనుక ప్రకాశించే, ప్రకాశింపజేసే సహజమైన స్వభావం కలవాడు విరోచనుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ద్వాభ్యామ్ అయన-గతిభ్యామ్ సంవత్సరో రథేన విరోచయతి ఇతి విరోచనః.** రెండు అయనములమధ్య రథంపై ప్రయాణించే సూర్యుని ప్రకాశింపజేసేవాడు విరోచనుడు. ఈ నామము సంవత్సర అధిష్ఠాన దేవతను తెలియజేయును. అర్చిరాది మార్గంలో ఇది ఐదవ దశ.

**అయన ద్వయ గత్యాఽర్కం యో విరోచయతి స్వయం విరోచన ఇతి ఖ్యాతః ప్రకాశ ఫలదో మనుః.** ఉత్తరాయణ, దక్షిణాయన మార్గాలలో రథాన్ని నడిపి ఇతనిని (సూర్యుని) ప్రకాశింపజేయువాడు, సంవత్సరాభిమాని అయినవాడు విరోచనుడు. ఈ నామజపము అమిత ప్రకాశమును ఇస్తుంది. ఓం విరోచనాయ నమః (శ్రీకైవల్య సారధి).

శ్రీ బలదేవ విద్యాభూషణ వ్యాఖ్య కూడా శ్రీ భట్టుల వ్యాఖ్యకు సమాంతరంగా సాగింది. **విరోచయతి సంవత్సరేణ గచ్ఛన్తమ్ స్వోపాసనమ్ అభిప్రాతమ్ దీప్రంచ కరోతి ఇతి విరోచనః.** సంవత్సరమంతా సూర్యుని ప్రకాశింపజేసేవాడు విరోచనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వివిధమ్ రోచత ఇతి వి-రోచనః.** అనేక విధములుగా ప్రకాశములు (వైభవములు) కలవాడు విరోచనుడు. సూర్యచంద్రాదుల రూపంలో ప్రకాశించేవాడు విరోచనుడు. వృక్షాదుల వృద్ధికి కిరణములు అందించేవాడు విరోచనుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **విశేషేణ రోచతే భక్తేభ్యః ఇతి విరోచనః.** భక్తుల మనస్సులలో విశేషముగా ప్రకాశించువాడు విరోచనుడు. **నమో రుచాయ బ్రహ్మయే** (యజుర్వేద మంత్రము 31.20).

శ్రీ చిన్మయానంద – భక్తులు ఏ రూపంలో భగవంతుని ధ్యానిస్తే ఆ రూపంలో వారికి అందివచ్చి వారికి సంతోషం కలుగజేసేవాడు విరోచనుడు. గీత 4.11 – **యే యథా మాం ప్రతిపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్.**

శ్రీ సూర్య భగవానుని శిల్పం. వికీపిడియా చిత్రం By https://commons.wikimedia.org/wiki/User:Nomu420



శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి చెప్పిన ఉదాహరణలు –

అథర్వ వేదము 9.10.2 – **తస్యా విరోచనః ప్రాహ్లోదిర్వత్స ఆసీదయస్పాత్రమ్.**

ఋగ్వేదము 5.44.2 – **శ్రియే సుదృశీ రూపరస్య యాః స్వర్విరోచమానః కకుభామచోదతే.**

ఋగ్వేదము 9.86.21 – **అయమ్ పునాత్ ఉషసో విరోచయత్.**

శ్రీ సత్యసంధ యతిరాజ **'విలోచనః'** అనే పాఠాన్ని గ్రహించారు. **దివ్యమ్ లోచనమ్ పార్థస్య యస్మాత్ స విలోచనః.** అర్జునుడు, సంజయుడు వంటివారికి దివ్యదృష్టిని ఇచ్చినవాడు విలోచనుడు. ఇందుకు ఆయన గీత (11.8)నుండి ఉదాహరించారు. **దివ్యమ్ దదామి తే చక్షుః.**

## 886. సూర్యః

- వాయురూపములో చలనమునకు కారణమైనవాడు.
- ఏ దివ్యశక్తినుండి సమస్తము జనించుచున్నదో అట్టి శక్తినిధి.
- సూర్యునియందు, అగ్నియందు శ్రీ (తేజస్సు)నకు కారణమైనవాడు.
- జ్ఞానమునకు కారణమైనవాడు.

## ఓం సూర్యాయ నమః

శ్రీ వాసిష్ఠ వివరణ – సృ - గతౌ - వెళ్ళుట; సూ - ప్రేరణే - ప్రేరేపించుట. పాణిని సూత్రము 3.1.114 **రాజ సూర్య సూర్య.... సరతి గచ్ఛతి ఇతి సూర్యః.** చలించువాడు సూర్యుడు. **సువతి కర్మాణి ప్రేరయతి లోకాన్ ఇతి సూర్యః.** సకల కర్మలను ప్రేరేపించువాడు సూర్యుడు.

శ్రీ చిన్మయానంద – వ్యాకరణపరంగా మూలకారణమైన శక్తియే సూర్యుడు. సాధారణంగా ఈ పదము ఆకాశంలోని సూర్యుని (రవి, ఆదిత్యుడు) సూచించును. ఎందుకంటే అందరికీ శక్తిని ప్రసాదించేవాడు సూర్యుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – సృ - చలించుట. 'కృత్' లేదా 'క్విప్' ప్రత్యయమువల్ల అనేక అర్థాలు వస్తాయి. ఇక్కడ సందర్భానుసారం 'వాయువు' అనే అర్థం తీసికొనవచ్చును. ఎందుకంటే వాయువు సదా భగవంతుని కారణంగా చలించును. **వాయుః సదా సరతి యస్మాత్ ఇతి సూర్యః.** ఇలా ఈ నామమును శ్రీ భట్టులు అర్చిరాది మార్గంలో ఆరవ దశయైన వాయుదేవుని సూచిస్తూ వ్యాఖ్యానించారు.

**వాయుస్సరతి యస్మాద్ధి తస్మాత్సూర్య షడక్షరి.** సూర్యుడు అంటే అంతా సంచరించే వాయువు అంతర్యామి. ఈ నామము షడక్షరి. ఓం సూర్యాయ నమః (శ్రీకైవల్యసారధి).

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇంచుమించు ఇదే అర్థం చెప్పారు. **వాయుమ్ సరతి స్వోపాసకమ్ నీత్వా ఇతి సూర్యః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఆకాశములో సర్పమువలె చరించేది (సరతి) సూర్యుడు. ఈ వివరణ కూడా వాయువును సూచించవచ్చును.

కౌషీతకీ ఉపనిషత్తు (1.3)లో వాయువును సంవత్సరం తరువాతి దశగా (అర్చిరాది మార్గాన్ని) చెప్పారు. **స వాయు లోకమ్.** అక్కడినుండి జీవుడు వాయులోకానికి వెళతాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సూతే సర్వమ్ ఇతి సూర్యః. సూతే శ్రియమ్ ఇతి సూర్యః.** అన్నింటికీ కారణమైనవాడు సూర్యుడు. ఏ దివ్యశక్తినుండి సమస్తము జనించుచున్నదో అట్టి శక్తినిధి సూర్య శబ్దముతో సూచింపబడుచున్నది. సర్వ చైతన్యమూర్తి, సర్వపోషణకర్తయునైన భగవానుడు 'సూర్య' నామమున భజనీయుడగును (శ్రీ పెమ్మరాజు రాజారావు). సూర్యునియందును, అగ్నియందును శ్రీ (ప్రకాశము) ఎవని కారణముగా కలుగుచున్నదో అతడే సూర్యుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – **సూరి గమ్యత్వాత్ సూర్యః.** ఎవనివలన జ్ఞానము లభించునో అతడు సూర్యుడు.

శ్రీ రఘునాథ తీర్థ – **సూరిభిః జ్ఞానిభిః ప్రాప్యతే ఇతి సూర్యః.** జ్ఞానులైన మునులు ఎవరిని పొందుదురో అతడు సూర్యుడు.

## 887. సవితా

- సూర్యుని రూపములో వర్షమును, పంటలను కలుగజేయువాడు.
- సర్వజగత్తు సృష్టికి కారణమైనవాడు

## ఓం సవిత్రే నమః

సూ - ప్రాణి గర్భవిమోచనే - జన్మనిచ్చుట, ఉత్పాదన చేయుట. **సూతే ఇతి సవితా.**

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

94వ శ్లోకము. 887వ నామము. సవితా – **రవిర్విరోచనః సూర్యః సవితా రవిలోచనః**
104వ శ్లోకము. 969వ నామము. సవితా – **భూర్భువస్స్వస్తరుస్తారః సవితా ప్రపితామహః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సూర్య ద్వారా వృష్టి సస్యాదికమ్ సూతే ఇతి సవితా.** సూర్యునిద్వారా వర్షమును, పంటలు మున్నగువానిని కలుగజేయువాడు సవిత లేదా ఆదిత్యుడు. అర్చిరాది మార్గములో ఇది ఏడవ దశ.

104వ శ్లోకంలో 'సవితా' నామమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వేషామ్ సాక్షాత్ జనయితా సవితా.** అంతటిని (సూర్యుని కూడ) సృష్టించువాడు సవిత.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వస్య జగతః ప్రసవితా సవితా.** సకల జగత్తునకు జన్మనిచ్చినవాడు సవిత. ఇందుకు శ్రీ శంకరులు విష్ణుధర్మోత్తరము (1.30.15)నుండి ఉదాహరించారు.
**రసానామ్ చ తథాదానాత్ రవిః ఇతి అభిధియతే**
**ప్రజానామ్ తు ప్రసవనాత్ సవితా ఇతి నిగద్యతే**
ఛాందోగ్యోపనిషత్తు (1.12.5) – **దేవో వరుణః ప్రజాపతిః సవితా.**
మైత్రాయణి (5.7) – అతడు తేజస్సుతో వెలుగును. వర్షములు కురిపించును. ప్రజలను రక్షించును. అతడే సవిత.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి ఇదే అర్థం ఇచ్చే 'సపితా' అనే పాఠాంతరాన్ని గ్రహించారు. అందరికీ తండ్రియైనవాడు 'స-పితా'.

శ్రీ వాసిష్ఠ – **సూర్య ద్వారా వృష్టి సస్యాదికమ్ ఉత్పాదయ జగత్ జనయతి ఇతి సవితా.** సూర్యునిద్వారా వర్షములను, పంటలను కలిగించి, జగత్తులోని జీవనమునకు ఆధారమైనవాడు సవిత.

## **888.** రవిలోచనః

- తన (సూర్య)కాంతి ద్వారా (చంద్ర, విద్యుత్, వరుణులను) ప్రకాశింపజేయువాడు.
- సూర్యుడే తన కన్నుగా కలవాడు.
- అయన కన్నులనుండి సూర్యుడు ఉద్భవించెను.
- స్తుతివల్ల ప్రీతి చెందువాడు.

ఓం రవిలోచనాయ నమః

**రవినా - తత్ ప్రకాశేన. లోచయతి - దర్శయతి ఇతి రవిలోచనః.** తన ప్రకాశంవల్ల తెలియవచ్చేవాడు రవిలోచనుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **రవి రశ్మి సంక్రాంత్యాది ముఖేన చంద్ర - విద్యుత్ - వరుణాన్ లోచయతి ఇతి రవిలోచనః.** సూర్యకాంతి ద్వారా చంద్రుని, విద్యుత్ (ఇంద్రుడు)ను, వరుణుని ప్రకాశింపజేయువాడు రవిలోచనుడు. ఈ నామము అర్చిరాది మార్గములో ఎనిమిదవ, తొమ్మిదవ, మరియు పదవ దశలైన చంద్ర, ఇంద్ర, వరుణ లోకములను తెలియజేయును.

**సూర్యరశ్మి సంబంధాత్ విద్యుద్వరుణ చంద్రకాన్ నిరంతరం లోచయతి రవిలోచన ఈరితః.** సూర్య కిరణముల ద్వారా ప్రకాశించునట్టి విద్యుత్తు, వరుణ, చంద్రులకు అంతర్యామియైన అభిమాన దేవత. (శ్రీకైవల్య సారధి).

ఛాందోగ్యోపనిషత్తు – **అదిత్యాత్ చంద్రమసమ్, చంద్రమసో విద్యుతమ్.**
కౌషితకీ పనిషత్తు (1.3) – **స వరుణమ్ లోకమ్.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **రవిః లోచనమ్ - చక్షుః అస్య ఇతి రవిలోచనః.** సూర్యుడే తన కన్నుగా కలవాడు రవిలోచనుడు. ఇందుకు శ్రీ శంకరులు ముండకోపనిషత్తు (2.1.4)నుండి ఉదాహరించారు. **అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్ర సూర్యౌ.** అగ్నియే ఆయన కిరీటము. సూర్యచంద్రులేకన్నులు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **రవిః భాస్కరః లోచనాద్ యస్య ఇతి రవిలోచనః.** ఎవని కన్నులనుండి సూర్యుడు ఉద్భవించాడో ఆయన రవిలోచనుడు.

పురుష సూక్తము – **చక్షో సూర్యో అజాయత** (ఋగ్వేదము 10.90.13)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **రవినా లోచయతి సర్వస్వమ్ ఇతి రవిలోచనః.** సూర్యునిద్వారా సర్వమును వెలిగించేవాడు రవిలోచనుడు.

**లోచయతే అనేన ఇతి లోచనః, రవిః లోచనమ్-చక్షుః యస్య స రవిలోచనః.** ఆయన కన్నులే సూర్యుడు. వానిద్వారానే మనం చూస్తాము.

శ్రీ రఘునాధ తీర్థ – రు - శబ్దే - ధ్వని చేయుట, రవి - స్తుతించుట, లోచ్ - వెలుగుట, లోచనః - సంతోషించువాడు. **రవిః స్తుతిః, లోచనీయత్వాత్ లోచనమ్ ప్రియమ్. రవిః స్తుతిః, లోచనమ్ ప్రియమ్ యస్య సః రవిలోచనః.** స్తుతివల్ల సంతోషించువాడు రవిలోచనుడు.



ఢిల్లీ మ్యూజియంలో శ్రీ సూర్యుని విగ్రహం

https://commons.wikimedia.org/wiki/File:Surya_statue,_New_Delhi,_India_-_20051204.jpg



## అనంతో హుతభుగ్భోక్తా సుఖదో నైకదోఽగ్రజః (నైకజోఽగ్రజః)|
## అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతః || (95)

### 889. అనంత హుతభుగ్భోక్తా

అనంతః

హుతభుక్

భోక్తా

శ్రీ భట్టులు **'అనంత హుతభుగ్భోక్తా'** అనే ఒకే నామముగా పరిగణించగా, శ్రీ శంకరులు **'అనంతః', 'హుతభుక్', 'భోక్తా'** అనే మూడు నామములుగా పరిగణించారు.

### అనంత హుతభుగ్భోక్తా

- ఇంద్రుడు, బ్రహ్మలకు అంతర్యామియైనవాడు.
- అంతము లేనివాడు, మరియు అగ్నియందు సమర్పించిన హవ్యములను స్వీకరించువాడు.

### ఓం అనంత హుతభుగ్భోక్త్రే నమః

శ్రీ భట్టులు ఈ నామమును అర్చిరాది మార్గములో చివరి రెండు దశలను (పదకొండవ, పన్నెండవ దశలను) సూచించునవిగా వ్యాఖ్యానించారు. అర్చిరాది మార్గం చివరి దశలలో ఇంద్రుడు, బ్రహ్మ ముక్తజీవుని పరమపదమునకు చేర్చుదురు. (**స ఇంద్రలోకమ్, స ప్రజాపతి లోకమ్** – కౌషీతకీ).

హుతభుక్ – ఇంద్రుడు; భోక్తా – బ్రహ్మ. **సప్త తంతుషు హుతమ్ భుంక్తే ఇతి ఇంద్రో హుతభుక్.** ఏడు విధాలైన యజ్ఞాలలో సమర్పించిన హవ్యమును స్వీకరించువాడు ఇంద్రుడు హుతభుక్. **ప్రజాః భునక్తి పాలయతి ఇతి ప్రజాపతి భోక్తా.** ప్రజను (జన్మించువానిని, విస్తరించువానిని) రక్షించువాడు, పాలించువాడు ప్రజాపతి బ్రహ్మ భోక్తా. భగవానుని అధీనంలో వీరిద్దరూ అమితమైన మహత్తు కలిగినవారు గనుక 'అనంత హుతభుగ్భోక్తా'.

**మరుత్వాన్ హుతభుక్ భోక్తా భునక్తీతి ప్రజానిధిః సోఽనంత హుతభుక్ భోక్తా మహాంతౌ యస్య తౌ సదా.** హోమము చేసిన హవిస్సును భుజించేవాడు ఇంద్రుడు. ప్రజలను కాపాడేవాడు బ్రహ్మ. వీరి లోకాలను –అనగా ఇంద్రలోకాన్ని, ప్రజాపతి లోకాన్ని పొందజేసేవాడు 'అనంతోహుతభుగ్భోక్తా' (శ్రీకైవల్య సారథి).

శ్రీ బలదేవ విద్యాభూషణ ఈ (అర్చిరాదిమార్గం) సందర్భంలోని నామాలకు ఇంచుమించు శ్రీ భట్టులవలెనే వ్యాఖ్యానం చెప్పారు. ఈ నామాన్ని శ్రీ బలదేవ **'అనంతః', 'హుతభుగ్భోక్తా'** అనే రెండు నామములుగా పరిగణించారు. 'హుతభుగ్భోక్తా'కు ఇద్దరి వ్యాఖ్య ఒకేవిధంగా ఉంది.

**హుతభుగ్భిః అమృత పరిణామరూపమ్ హుతమ్ భుంజానైః**

**విద్యుత పర్యంత ఆగతేన అమానవేన పురుషేణ సహితైః**

**వరుణ ఇంద్ర ప్రజాపతిః స్వపదగామినమ్ భక్తమ్ భునక్తి పాలయతి ఇతి హుతభుగ్ భోక్తా.**

అమానవ పురుషులచేత ఇంద్రలోకాదులద్వారా ముందుకు నడిపింపబడే భక్తులను రక్షించేవాడు. ఇక్కడ వరుణుడు, ఇంద్రుడు వంటివారు వెంటరాగా ముక్తజీవుడు పరమపదం చేరుకునే మార్గం చివరి దశలో ఉంటాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'అనంతహుతభుగ్భోక్తా'ను ఒకే నామంగా పరిగణించి, రెండు భాగాలుగా వ్యాఖ్యానించారు. **న అంతః యస్య ఇతి అనంతః.** అంతము లేనివాడు అనంతుడు. **హుత-భుజా పావకేన భుంక్తే ఇతి హుతభుగ్భోక్తా.** అగ్నియందు సమర్పించినదానిని భుజించువాడు 'హుతభుగ్భోక్తా'.

ఇప్పుడు **'అనంతః', 'హుతభుక్', 'భోక్తా'** అనే మూడు వేరువేరు నామములుగా వ్యాఖ్యలను పరిశీలించుదాము.

## అనంతః

- అంతము లేనివాడు.
- దేశకాలాదుల చేత, మరి దేనిచేతను పరిచ్ఛిన్నుడు కానివాడు.
- ఎవరికీ అంతు తెలియని గుణసంపన్నుడు.
- పరిశుద్ధమైన మనసు లేనివారికి అందరానివాడు.
- ఆదిశేషుడు.

## ఓం అనంతాయ నమః

70వ శ్లోకము. 665వ నామము. అనంతః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరః అనంతో ధనంజయః**

95వ శ్లోకము. 889వ నామము. అనంతః (శ్రీ శంకరుల వ్యాఖ్య ప్రకారము) – **అనంతః హుతభుక్ భోక్తా సుఖదో నైకదోऽగ్రజః**

**న అంతమ్ యస్య స అనంతః.** అంతము లేనివాడు అనంతుడు.

**శేషరూపో వా.** ఆదిశేషుని రూపంలో ఉన్నవాడు అనంతుడు.

దేశము, కాలము, వస్తువు వంటి అవధులు లేనివాడు అనంతుడు. ఆయన విభూతులకు అంతము లేదు. ఎవరైనా ఆయన గుణగణముల అంతమునుచూడలేదు. కనుక అవ్యయుడైన భగవంతుడు అనంతుడు. అన్నింటికంటే ఆద్యుడు. నిత్యుడు. సర్వవ్యాపి.

**శ్రీమద్భాగవతము. దశమ స్కంధము. అక్రూరునికి భగవద్దర్శనం. మరియు అతడు చేసిన స్తుతి**

శ్రీ ఏల్చూరి మురళీధరరావు రచన మరియు శ్రీ పోతన భాగవతం నుండి సంకలనం..

రాజేంద్రా! కృష్ణుని రథం వాయువేగాన ప్రయాణించి యమునాతీరం చేరుకొన్నది. భగవానుడు రథం ఆపి రామునితోపాటు దిగి కాళిందీ నిర్మల మధుతోయాలను ఆచమించి, జలాలను గ్రోలి చేరువనున్న వృక్షమూలాన కొంతసేపు కూర్చుండి రామునితో మళ్ళీ రథం ఎక్కాడు. అక్రూరుడు వారు రథంలో కూర్చున్న తర్వాత వారి అనుమతి గొని స్నానార్థం నదివద్దకు వెళ్ళాడు.

రాజేంద్రా! అక్రూరుడా విధంగా నదీజలాలను సమీపించి వేదమంత్రాలు జపిస్తూ నీటిలో మునిగాడు. అక్కడతనికి రామకృష్ణులు కానవచ్చారు. అక్రూరుడది చూసి, 'ఏమిటిది? రామకృష్ణులను రథంలో కూర్చుండబెట్టి కదా ఇక్కడికి వచ్చాను. ఇంతలో వారిక్కడికి ఎప్పుడు వచ్చారు?' అని ఆశ్చర్యపడుతూ నీటినుంచి లేచి రథంవంకకు చూశాడు. వారు రథంలో సుఖోపవిష్టులై ఉన్నారు. అతని ఆశ్చర్యం ఇనుమడించింది. అదంతా భ్రాంతి కాబోలునని అతను భావించి మళ్ళీ నీట మునిగాడు.

అక్రూరునికి శ్రీ రామ కృష్ణుల దివ్యదర్శనానుభూతి కలుగుట. 1760 కాలపు కాష్మీర్ చిత్రం. వికీపీడియానుండి.



అక్రూరుడు నీట మునిగినంతనే, వేయి తలల వేయి పడగలు కలిగి, బిసశ్వేతశృంగాలతో కైలాసగిరిని తలపించుతున్న అనంతుడు, అతని ఉత్సంగాన కూర్చున్న మేఘశ్యామమూర్తి అతనికి కనిపించారు. ఆ దివ్యమూర్తి పీతాంబరం ధరించి, చారుప్రసన్నవదనంతో, పద్మదీర్ఘనేత్రాలతో, చతుర్భుజాలతో, శోభాయమానభ్రూయుగంతో, సమున్నత నాసికతో, చారుకర్ణ సుకపోలారుణాధరంతో వెలుగొందుతూ దరహాసనిరీక్షణాలను ప్రసరింపజేస్తున్నాడు. అతని ఉదరం రావి ఆకును మరపిస్తూ వళిత్రయంతో సొంపారుతున్నది.

మఱియుఁ జారు లక్షణలక్షిత నఖ పాద గుల్ఫ జాను జంఘోరు కటి నాభి మధ్యోదరుండును; సాదరుండును; శ్రీవత్స కౌస్తుభ వనమాలికా విరాజిత విశాలవక్షుండును; బుండరీకాక్షుండును; శంఖ చక్ర గదా పద్మ హస్తుండును; సత్వగుణ ప్రశస్తుండును; బ్రహ్మసూత్ర కటిసూత్ర హార కేయూర కటక కంకణ మకరకుండల కిరీటాది విభూషణుండును; భక్తజనపోషణుండును; సుందర కపోల ఫాల నాసాధర వదన కర్ణుండును; నీలనీరద వర్ణుండును గంబుకంధరుండును; గరుణాగుణ బంధురుండును; ప్రహ్లాద నారద సునంద నంద ప్రముఖ సంభావితుండును; శ్రీ పుష్టి తుష్టి కీర్తి కాంతీలోర్జా విద్యాశక్తి మాయాశక్త్యాది సేవితుండునునై యొప్పు నప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తిసంభ్రమంబు లగ్గంబులుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె.

(శ్రీ మానినీ మానస చోర దండకము) శ్రీమానినీమానసచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా! సమస్తంబు నస్తంగతంబై మహాలోలకల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలఁగా బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతిఁ శోభిల్లు నీ నాభికంజంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణి యై మన్న యా బమ్మ యుత్పన్నుఁ డయ్యెం గదా పావ కాకాశ వాతావనీ వార్యహంకార మాయామహామానసాదుల్ హృషీకాదులున్ లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీ మహాదేహమం దుల్లసించున్; వసించున్; నశించున్; జడత్వంబు లేకాత్మ యై యొప్పు నీ యొప్పిదం బెల్ల నోచెల్ల; చెల్లన్ విచారింపఁ దారెంత; వారెంత వారైన మాయాదులా మాయతోఁ గూడి క్రీడించు లోకానుసంధాత యా ధాత నిర్ణేతయే? నీ కళారాశికిం గొంద ఱంభోజగర్భాదు లధ్యాత్మ లందున్న శేషాధిభూతంబు లందు న్ననేకాధిదైవంబు లందున్ సదా సాక్షివై యుండువంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం ద్రయీపద్ధతిం గొంద ఱింద్రాదిదేవాభిదానంబులన్, నిక్క మొక్కండ వంచున్ మఱిం గొంద ఱారూఢకర్మంబులం ద్రెంచి సంసారముం ద్రుంచి సన్యస్తులై మించి విజ్ఞానచక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబునం దన్మయత్వంబుతోఁ గొందఱీ వాత్మ వంచున్, మఱిం గొంద ఱా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వుబాటింతు వంచున్; మఱిన్ నీవు నారాయణాఖ్యుండ వంచున్; శివాఖ్యుండ వంచున్; మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు; రెగ్గేమి? యేఱుల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్లన్ విశేషంబులై డింది నీ యం దనూనంబు లీనంబులౌ; నేక రాకేందుబింబంబు కుంభాంతరంభంబులం బింబితంబైన వేఱున్నదే? యెన్ననేలా ఘటాంతర్గతాకాశముల్ దద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీక నే పోకలం బోక; యేకాకివై యుండు; దీశా!

కృశానుండు నెమ్మోము, సోముండు భానుండు కన్నుల్ దిశల్ కర్ణముల్ భూమి పాదంబు లంభోనిధుల్ గుక్షి, శల్యంబు లద్రుల్, లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ కచంబుల్, నభోవీధి నాభిప్రదేశంబు, రేలుంబగళ్ళున్ నిమేషంబు, లంభోజగర్భుండు గుహ్యంబు, వర్షంబు వీర్యంబు, నాకంబు మూర్ధంబుగా నేకమై యున్న నీమేని దండం బయోజాత గర్భాండముల్ మండితోదుంబరానేకహానేక శాఖా ఫలాపూరి తానంత జంతు ప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిష్ట జంతుప్రకారంబుగా నిండి యుండున్; మహారూప! నీ రూపముల్ పెగ్గలం బుగ్గడింపన్; లయాంభోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరోధించి సాధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే; ద్రుంపవే కైటభశ్రీమధుం జక్రిపై మొత్తవే; యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలా పరిష్పందివై పందివై మేదినిన్ మీదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్ నిమ్ములం జిమ్ముచుం గ్రువ్వవే త్రెవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై దండివై, దండి వైరోచనిం జూచి యాచింపవే, పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ, బాఋుండవై రాజకోటిన్ విపాటింపవే, రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే నొంపవే క్రూరులన్ వాసుదేవాది రూపంబులన్, శుద్ధ బుద్ధుండవై వైరిదా రాంతరంగంబుల న్నంతరంగంబులుంగాఁ గరంగింపవే పెంపు దీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించు నిన్నెన్న నేనెవ్వఁడన్; నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః. (http://telugubhagavatam.org నుండి కాపీ చేసినది)

కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ చేయు చందంబునం
దలఁతున్ సత్యములంచు; మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్నాకు నీ
విలసత్పాదయుగంబుఁ జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!"

రాజేంద్రా! అక్రూరుడా విధంగా జలాంతరమందు తనకు సాక్షాత్కరించిన భగవత్స్వరూపాన్ని ప్రస్తుతిస్తుండగా ఆ రూపం తటాలున మాయమయింది. అతను విస్మయచకితుడై నీటిబయటికి వచ్చి మధ్యాహ్నిక క్రియలు ముగించుకొని వడివడిగా వచ్చి రథం ఎక్కి సారథ్యం వహించాడు. భగవానుడతనిని చూసి, 'అయ్యా! నీ ముఖలక్షణాలలో మార్పు కనిపిస్తున్నది. కారణమేమిటి? ఏదైనా వింత నీ బుద్ధిని ఆకర్షించి నిన్నింతసేపు నిలిపగందా?' అని అడిగాడు. అక్రూరుడా మాటలు విని, 'పరమేశ్వరా! సర్వాద్భుతాలకు స్థానమైన నిన్ను కన్నారా చూస్తుండగా భూనభోంతరాళాలలో కనుపించే చిత్రాలూ చిత్రాలేనా?' అని రథాన్ని కదిలించాడు.

## హుతభుక్

- యజ్ఞములను రక్షించువాడు.
- యజ్ఞములోని హవ్యమును భుజించువాడు.

### ఓం హుతభుజే నమః

94వ శ్లోకంలో శ్రీ భట్టులు **'హుతభుగ్విభుః'** అనే ఒకే నామమును పరిగణించగా, శ్రీ శంకరులు **'హుతభుక్', 'విభుః'** అనే రెండు నామాలను పరిగణించారు. 95వ శ్లోకంలో శ్రీ భట్టులు **'అనంతో హుతభుగ్భోక్తా'** అనే ఒకే నామముగా పరిగణించగా, శ్రీ శంకరులు **'అనంతః', 'హుతభుక్', 'భోక్తా'** అనే మూడు నామములుగా పరిగణించారు. ఇలా శ్రీ శంకరుల పాఠము ప్రకారము ఈ నామము రెండుమార్లు వస్తుంది.

హు – దానాదానయోః – అర్పించుట, యజ్ఞము చేయుట, భుజించుట.
భుజ్ – పాలనాభ్యవహారయోః – రక్షించుట.
భుజ్ – అనవనే – భుజించుట, వాడుట.

95వ శ్లోకంలోని 'హుతభుక్' – **హుతమ్ భునక్తి ఇతి హుతభుక్.** యజ్ఞములను రక్షించువాడు హుతభుక్.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – యజ్ఞనిర్వహణలో అనివార్యంగా ఏవైనా లోపాలు జరిగినా గాని విజయవంతంగా యజ్ఞం ముగింపు కావడం కూడా యజ్ఞరక్షణలో భాగమే.

**యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో యాగ క్రియాదిషు న్యూనమ్ సంపూర్ణతామ్ యాతి సత్యో వందే తమచ్యుతమ్.**

94వ శ్లోకంలోను 'హుతభుక్' – **హుతమ్ భుంక్తే ఇతి హుతభుక్.** యజ్ఞములో సమర్పించినదానిని భుజించువాడు హుతభుక్.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – యజ్ఞములో వివిధ దేవతలకు సమర్పణలు చేసినపుడు వానిని ముందుగా అగ్ని చేకొని సూర్యునకిచ్చును. సూర్యుడు ఆయా దేవతలకందజేయును. అందరు దేవతలు కడకు వానిని భగవానునికే సమర్పింతురు. ఇలా ఆయన 'హుతభుక్'.

## భోక్తా

- భక్తులు ప్రేమతో సమర్పించినవానిని గైకొని ఆదరించేవాడు.
- అన్ని యజ్ఞములందును అర్పించిన హవ్యములను స్వీకరించేవాడు.
- పితృదేవతలకు సమర్పించినవానిని స్వీకరించేవాడు.
- అగ్ని, సూర్యుడు, కాలము వంటి రూపములలో చివరకు అన్నింటినీ అంతము చేసేవాడు.
- అంతటినీ రక్షించే, పాలించేవాడు.

### ఓం భోక్త్రే నమః

16వ శ్లోకము. 145వ నామము. భోక్తా – **భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః**
53వ శ్లోకము. 502వ నామము. భోక్తా – **శరీరభూతభృత్ భోక్తా కపీంద్రో భూరిదక్షిణః**
95వ శ్లోకము. 888వ నామము. భోక్తా (శ్రీ శంకరుల పాఠము)– **అనన్తో హుతభుక్ భోక్తా సుఖదః నైకదోగ్రజః**

'భుక్', 'భోక్తా' అనే పదాలకు ధాతువు 'భుజ్' అనగా రక్షించుట, భుజించుట అనే అర్థాలున్నాయి.

**భునక్తి ఇతి భోక్తా.** రక్షించేవాడు భోక్త. **భుంక్తే ఇతి భోక్తా.** అనుభవించేవాడు భోక్త. (ఆస్వాదించేవాడు).

**రక్షణో భక్షణశ్చ.** భగవంతుడు జగత్తును సృజిస్తాడు, రక్షిస్తాడు మరియు ప్రళయకాలంలో దానిని లయం చేసుకొంటాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

145వ నామము 'భోక్తా' – భక్తులు ప్రేమతో నివేదించినవానిని అమృతమువలె ఆస్వాదించి సంతోషించువాడు భోక్త.
**పత్రమ్ పుష్పమ్ ఫలమ్ తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః** – గీత 9.26
నిర్మల బుద్ధితో, నిష్కామభావముతో పరమభక్తునిచే సమర్పింపబడిన పత్రమునుగాని, పుష్పమును గాని, ఫలమును గాని, జలమును గాని నేను ప్రత్యక్షముగా (స్వయముగా) ప్రీతితో ఆరగింతును.

శ్రీ భట్టులు చెప్పిన మరొక వివరణ – ఏ దేవతకు నివేదించినాగాని, అవన్నీ చివరికి ఆయనకే చెందుతాయి గనుక ఆయన భోక్త.

**భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరమ్ సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి** – గీత 5.29
భగవంతుడు యజ్ఞములకును, తపస్సులకును భోక్త. సమస్త లోకములకును, లోకేశ్వరులకును అధిపతి. సమస్త ప్రాణులకును ఆత్మీయుడు. అనగా అవ్యాజ దయాళువు. పరమప్రేమస్వరూపుడు. ఈ భగవత్తత్వమును ఎఱిగిన భక్తునకు శాంతి లభించును.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవచ న తు మామభిజానంతి తత్త్వేనా తశ్చ్యవంతి తే** – గీత 9.24
ఏలనన, సకల యజ్ఞములకును భోక్తను, స్వామిని కూడా నేనే. వారు నా పరమేశ్వరతత్వమును ఎఱుంగరు. కావున పతనమగుదురు. అనగా పునర్జన్మను పొందుదురు.

502వ నామము 'భోక్తా' –

ఈ నామము వివరణలో శ్రీ భట్టులు భగవంతుని భోక్తృత్వ గుణమును మరింత విస్తరించి చెప్పారు. భగవంతుడు సమస్త హవ్యములకు (దేవతలకు అర్పించినవానికి) మాత్రమే కాక, సమస్త కవ్యములకు (పితరులకు అర్పించినవానికి) కూడా భోక్త.
మహాభారతము. శాంతిపర్వము 348.3 – **హవ్య కవ్య భుజో విష్ణుః ఉదకపూర్వే మహోదధౌ**. భగవంతుడు ఈశాన్యసాగరంలో స్థితుడై, నిష్ఠతో సమర్పించిన సమస్త హవ్య కవ్యములను భుజించును.
**అహమన్నమ్ అహమన్నమ్ అహమన్నమ్ అహమన్నాదోఽహమన్నాదోఽహమన్నాదః** – తైత్తరీయోపనిషత్తు
నా భక్తులు ఆస్వాదించే భోజనము నేను. నా భక్తులు సమర్పించేదానిని ఆస్వాదించేది కూడా నేనే.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 9.6.10 – ఆళ్వారు, భగవంతుడు ఒకరి సన్నిధానంలో ఉండి మరొకరు ఆనందించడంలో పరస్పరం పోటీ పడుతున్నారు. ఈ పోటీలో చివరకు భగవంతుడే గెలిచాడు.

తిరువైమొళి 10.10.11 – భగవంతుడు తనివితీరా తన భక్తులతో కలిసి ఆనందిస్తున్నాడు.

భోక్తయైన పరమేశ్వరుడు కుచేలుడిచ్చిన పిడికెడు అటుకులు తిని సంతృప్తుడయ్యాడు. దుర్యోధనుని మర్యాదలు వదలుకొని విదురుని ఇంటచేరి విందు ఆరగించాడు.

శ్రీ శంకరుల గీతావ్యాఖ్యానము (13.22 శ్లోకమునకు) ఆధారంగా ధర్మచక్రము రచయిత ఈ నామాన్ని మన నిత్యజీవనానికి ఆపాదించారు. భగవానుడు అందరిలోనూ అంతర్యామిగా ఉండి అన్నింటికీ సాక్షిగాను, మార్గదర్శకంగాను, అనుభవించేవానిగాను ఉంటాడు.

**ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః** – గీత 13.22
ఈ దేహమునందున్న ఆత్మ వాస్తవముగ పరమాత్మయే. అతడు సాక్షీభూతుడగుటవలన 'ఉపద్రష్ట' యనియు, యథార్థ సమ్మతినిచ్చువాడు అగుటవలన 'అనుమంత' అనియు, అన్నింటిని ధరించి, పోషించువాడగుటవలన 'భర్త'యనియు, జీవరూపములో 'భోక్త' అనియు, బ్రహ్మాదులకు స్వామి యగుట వలన 'మహేశ్వరుడు' అనియు, శుద్ధసచ్చిదానంద ఘనస్వరూపుడగుట వలన 'పరమాత్మ' అనియు పిలువబడుచున్నాడు.
*(భగవద్గీత నుండి ఉదాహరించిన శ్లోకాలకు అన్నిచోట్లా తెలుగు అనువాదం ఈ పుస్తకంనుండి యథాతథంగా వ్రాశాను: **శ్రీ జయదయాల్ గోయందకా** – శ్రీ మద్భగవద్గీత – తత్త్వవివేచనీ హిందీ వ్యాఖ్యకు తెలుగు అనువాదము. అనువాదకులు: డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య .గీతాప్రెస్, గోరఖ్ పూర్ ప్రచురణ.)*

తాము అర్జించిన సంపదలను భగవంతునికి అర్పించేవారికి భగవంతుడు భోక్త. అలా ఏదైనా భగవంతునికి అర్పిస్తే మనకు అహంకార మమకారాదులు నశించి, నిజమైన ఆస్వాదనానందము కలుగుతుంది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – భుజ్ - తినుట. **కాలరూపో హి భగవాన్ కాలక్రమేణ సర్వమ్ భుంక్తే.** కాలరూపుడైన భగవానుడు కాలక్రమంలో సర్వమునూ భుజించును కనుక భోక్త. అగ్ని, సూర్యుడు, కాలుడు (యముడు), ఇలా వేర్వేరు రూపాలలో భగవంతుడు సర్వమునూ అంతమొందించును.

కఠోపనిషత్తు 2.25 – **యస్య బ్రహ్మశ్చ క్షత్రమ్ చ ఉభే భవత ఓదనః.** ఎవనికైతే బ్రహ్మ మరియు క్షత్రములు (చరాచరములు) అన్నము అవుతాయో....

సముద్రంనుండి పుట్టిన వర్షాలు నదులై తిరిగి సముద్రంలో కలిసినట్లే భగవంతుని సృష్టి తిరిగి భగవంతునిలో లీనమవుతుంది. **ఉత్పాదయతా, రక్షితా, భక్షితా చ భవతి.** కనుక భగవంతుడు భోక్త.

శ్రీ బలదేవ విద్యాభూషణ – భుజ్ - రక్షించుట. **భునక్తి పాలయతి ఇతి భోక్తా.** సదాచారపరులను రక్షించేవాడు భోక్త.

## 890. సుఖదః

- తన భక్తులకు సమస్త సుఖములను ప్రసాదించువాడు.
- దుర్మార్గుల ఆనందమును తొలగించువాడు.
- తన భక్తులకు అల్పసుఖములను తొలగించి (ద్యాతి-ఖండించుట), వారికి పరమానంద మార్గమును చూపువాడు.
- తన భక్తుల దుఃఖములను హరించువాడు (అ-సుఖ-దః, ద్యాతి - ఖండించుట).
- సకల జీవులకు నీటిని ప్రసాదించువాడు (సుఖమ్ - ఉదకమ్ - నీరు).
- జీవులకు చక్కని శరీరమును ఇచ్చినవాడు.

### ఓం సుఖదాయ నమః

49వ శ్లోకము. 460వ నామము. సుఖదః – **సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్**
95వ శ్లోకము. 890వ నామము. సుఖదః – **అనంతో హుతభుగ్భోక్తా సుఖదో నైకదోऽగ్రజః**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

460వ నామము 'సుఖదః' – సదాచారపరులైనవారికి శాశ్వతమైన సుఖమునిచ్చువాడు సుఖదుడు. సామాన్యమైన ఆనందములే కాక మోక్షమును కూడ ప్రసాదించును.

890వ నామము 'సుఖదః' – ఇంతకుముందు నామములవలెనే ఈ నామమును కూడ శ్రీ భట్టులు జీవుని పరమపదానికి తీసుకొనివెళ్ళే అర్చిరాదిమార్గం పరంగా వ్యాఖ్యానించారు. **అమానవ ముఖేన స్పృష్ట్వా స-వాసనమ్ సంసారముత్సాయామ్ స్వాప్తి సుఖమ్ దదాతి ఇతి సుఖదః.** అర్చిరాదిమార్గం చివరిదశలో అమానవ పురుషుని స్పర్శ కారణంగా చిట్టచివరి విషయవాసనలు కూడా తొలగిపోతాయి. జీవుడు పరమానందమును పొందుతాడు. కనుక భగవంతుడు సుఖదుడు.

**అమానవ కర స్పర్శాత్ భవముత్సార్య సత్వరమ్ స్వప్రాప్తి లక్షణ సఖం దదాతి సుఖదశ్చ సః.** అతని (అమానవ) కరస్పర్శతో సంసారకరమయిన సూక్ష్మప్రకృతి బంధాన్ని కూడా విడిపించి తన సాయుజ్యము అనే అపారమైన, అవిచ్ఛిన్నమైన సుఖాన్ని ఒసంగుచున్నాడు గనుక భగవానుడు సుఖదుడు. అమానవుడు అంటే విరజానదీ తీరాన ఉండే పరమపావనుడు. ముక్తజీవులను తన చేతితో స్పృశిస్తాడు. దానివల్ల వారు సూక్ష్మశరీరం ధరించి దివ్యరూపం పొందుతారు. (శ్రీకైవల్యసారథి).

ఇందుకు శ్రీ భట్టులు ఛాందోగ్యోపనిషత్తు (5.10.2)నుండి ఉదాహరించారు. **తత్ పురుషః అమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి ఏష దేవయానః పంథా ఇతి.** అక్కడినుండి (చంద్ర, వైద్యుతాదులనుండి) అమానవ పురుషుడు జీవుని పరబ్రహ్మము కడకు తీసికొని పోవును. ఇది దేవయాన మార్గము.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇంచుమించు ఇదే అర్థం చెప్పారు.

**తతో మానవేన స్వ-పార్షదేన ఆనీతాయ విధ్వస్త లింగదేహాయ**

**స్వ-భక్తాయ స్వ-పార్షద తను లాభరూపమ్ సుఖం దదాతి ఇతి సుఖదః**

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'సుఖదః' నామమునకు రెండు అర్థాలు చెప్పారు.

- **సుఖమ్ దదాతి.** మంచివారికి ఆనందాన్ని ఇచ్చేవాడు.
- **సుఖమ్ ద్యాతి.** చెడువారి ఆనందాన్ని హరించేవాడు.

ఇవి రెండే గాక శ్రీ శంకరులు **'అసుఖదః'** అనే పాఠాంతరాన్ని కూడా గ్రహించారు. **అసుఖమ్ ద్యాతి.** భక్తుల కష్టాలను హరించేవాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **సుఖమ్ ద్యాతి సుఖదః.** భక్తులయొక్క అల్పమైన (సంసారిక) సుఖాలను హరించి, తద్వారా వారిలోని వైరాగ్యమును పెంచి, వారిని శాశ్వతమైన సంతోషంవైపు నడిపించేవాడు సుఖదుడు.

శ్రీ వాసిష్ఠ 'సుఖమ్' అంటే 'ఉదకమ్' అనే అర్థాన్ని తీసుకొన్నారు (నిఘంటు 1.12). ఇందుకు మూలమైన ధాతువు 'ఖను' - అవధారణే - త్రవ్వుట – కావచ్చును. సకల జీవుల మనుగడ కొరకు బావులు, నదులు, చెఱువులు వంటివానిలో నీటిని ప్రసాదించువాడు సుఖదుడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – **సువ్యవస్థిత ఖాతమ్ చ ఇదమ్ శరీరమ్ జీవేభ్యో దదాతి ఇతి సుఖదః.** 'సుఖము' అనగా శరీరము. అనగా చక్కగా ఏర్పాటు చేయబడిన అఖాతము. ఇలా అస్థికలు, మాంసము, రక్తము వంటివానితో చక్కని శరీరమును సృష్టించి జీవునికి ఇచ్చినవాడు సుఖదుడు.

## 891. నైకదః

### నైకజః

- అనేకమైనవానిని ఇచ్చువాడు. ముక్తజీవునికి అనేకవిధములుగా స్వాగతము చెప్పించువాడు.
- అనేకమార్లు అవతరించినవాడు (నైకజః).
- తులసి, పద్మ వనములలో ఉండేవాడు. శ్రీమహాలక్ష్మికి పతి.

**ఓం నైకదాయ నమః**

**ఓం నైకజాయ నమః**



నాదియా జిల్లా అనూలియాలో శ్రీ మహావిష్ణువు విగ్రహం.

Photo by: SuvadipSanyal
https://commons.wikimedia.org/wiki/File:Vishnu_2.jpg

శ్రీ భట్టుల వ్యాఖ్య – న-ఏక-దః – నైకదః. **ఏకమ్ దదాతి ఇతి ఏకదః, తద్విరుద్ధః నైకదః.** ఒకటే ఇచ్చువాడు ఏకదుడు. అలా కాకుండా అనేకములు ఇచ్చువాడు నైకదుడు. అర్చిరాది మార్గంలో ప్రయాణించి పరమపదమును చేరుకొంటున్న ముక్తజీవునికి లభించే వైభవమైన స్వాగత సత్కారాల పరంగా ఈ నామమును శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

**బ్రహ్మాలంకారదాయిన్యో ముక్తేభ్యశ్చ పదే పదే దివ్యాశ్చాప్సరసో యస్య నైకద స్స చ కథ్యతే.** ముక్తి పొందినవారికి పరమపదమునందు దివ్యాలంకారములు చేయడానికి అనేకమంది అప్సరసాంగనలు కలవాడు నైకదుడు (శ్రీకైవల్య సారధి). ఇందుకు శ్రీ భట్టులు కౌషీతకీ ఉపనిషత్తు (1.4)నుండి ఉదాహరించారు.

**తమ్ పంచశతాని అప్సరసః ఉపధావన్తి శతమ్ మాలా హస్తః**

**శతమ్ అంజనహస్తాః తమ్ బ్రహ్మాలంకారేన అలంకుర్వతి**

ఐదువందలు అప్సరసలు ముక్తజీవునికి స్వాగతం చెబుతారు. వారిలో వందమంది చేత పూలమాలలు, మరొక వందమంది చేత సుగంధ ద్రవ్యాలు సిద్ధంగా ఉంటాయి. వారు స్వయంగా ఆ జీవుని బ్రహ్మాలంకారములతో అలంకరిస్తారు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **న ఏకమ్ వస్తు దదాతి, అపి తు స్వ-పర్యన్తాని సర్వాణి వస్తూని దదాతి.** కేవలం ఒక్క వస్తువు మాత్రమే ఇచ్చేవాడు కాడు. అనేక వస్తువులను, చివరకు తనను తాను స్వయంగా ఇచ్చేవాడు నైకదుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **భక్తేభ్యో న ఏకాన్ అర్థాన్ బహూన్ ఏవ కామాన్ చతుర్వర్గ అంతర్వర్తినో దదాతి ఇతి నైకదః.** తన భక్తులకు నాలుగు విధాలైన పురుషార్థములను (ధర్మార్థకామమోక్షములను) ప్రసాదించువాడు నైకదుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు **'నైకజః'** పాఠాన్ని గ్రహించారు. **ధర్మగుప్తయే అసకృత్ జాయమానత్వాత్ నైక-జః.** ధర్మమును రక్షించడంకోసం అనేకమార్లు జన్మించినవాడు, అనగా అవతరించినవాడు నైకజుడు. ఇక్కడ 'జన్మ' అనగా తక్కిన జీవులవలె కర్మఫలమైన జన్మ కాదు. భగవానుడు తన ఇచ్ఛానుసారం అవతరిస్తాడు.

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్** – గీత 4.7

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే** – గీత 4.8

ఓ భారత! (అర్జున!) ధర్మమునకు హాని కలిగినప్పుడును, అధర్మము పెచ్చుపెరిగి పోవుచున్నప్పుడును నన్ను నేను సృజించుకొందును. అనగా సాకార రూపముతో లోకమున అవతరింతును. సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపు మాపుటకును నేను ప్రతి యుగమునందును అవతరించుచుందును.

శ్రీ సత్యసంధ తీర్థ – ఈయన **'నైకజః'** అనే పాఠాన్ని గ్రహించారు. కాని ఆయన చెప్పిన అర్థం పూర్తిగా భిన్నంగా ఉంది. ని (ఉపసర్గ), క-జ – **కే జాయన్తి ఇతి కమలాని** – నీటిలో జన్మించునవి (పద్మములు) కమలములు. ని-కజా – శ్రీమహాలక్ష్మి. నైకజః – శ్రీమహాలక్ష్మికి పతి.

శ్రీ సత్యసంధ తీర్థ చెప్పిన మరొక అర్థము – 'నికజము' అనగా తులసి, పద్మ వనములు. **నితరామ్ కజాని యస్మిన్ తద్వనమ్ నికజమ్ తత్ర భవో నైకజ ఇతి.** తులసి వనములయందు, పద్మ వనములయందు ఉండేవాడు నైకజుడు. ఇందుకు ఆయన చెప్పిన ప్రమాణము – **తులసీ కాననమ్ యత్ర యత్ర పద్మవనాని చ వసన్తి వైష్ణవా యత్ర తత్ర సన్నిహితో హరిః.** తులసి వనములు, పద్మ వనములు, శ్రీ వైష్ణవులు ఉండేచోట హరి నివసించును.

అనేక అవతారములు ధరించినవాడు 'నైకజుడు' అని కూడా శ్రీ సత్యసంధతీర్థ ఒక అర్థం చెప్పారు.

శ్రీ రఘునాథ తీర్థ మరొక ద్వైత సంప్రదాయ ఆచార్యులు. ఆయన **'అనేకదః'** అనే పాఠాన్ని గ్రహించారు. కాని అందుకు ఆయన చెప్పిన అర్థం **'నైకదః'** అర్థానికి సరిపోతుంది. **అనేకాని బహూని దదాతి ఇతి అనేక-దః.** అనేకములైన వానిని ప్రసాదించువాడు అనేకదుడు.

## 892. అగ్రజః

- తనముందు నిలచిన ముక్తజీవునిపట్ల ప్రసన్నుడై, శ్రీమహాలక్ష్మీ సమేతుడై, భోగ్యభూతుడై ప్రకాశించేవాడు.
- హిరణ్యగర్భుని రూపమున అందరికంటె ముందుగా జన్మించినవాడు.

### ఓం అగ్రజాయ నమః

'అగ్ర' అనగా 'ముందు'. **అగ్రే జాయత ఇతి అగ్రజః.** అందరికంటె ముందుగా ఉన్నవాడు అగ్రజుడు. **పూర్వో యో దేవేభ్యో జాతః, నమో రుచాయ బ్రహ్మయే** (పురుష సూక్తము. యజుర్వేదము 31.20).

శ్రీ భట్టుల వ్యాఖ్య – అగ్రజుడు అనగా ముందుకు వచ్చినవాడు. **ఏవమ్ ప్రాప్తానామ్ ముక్తానామ్ అగ్రే సహ సర్వేశ్వర్యా శ్రియా యథా, పర్యంక విద్యమ్ పరమభోగ్యో జాయతే ఇతి అగ్రజః.** అర్చిరాది మార్గంలో ప్రయాణించి తనవద్దకు వచ్చిన ముక్తజీవుని ఎదురుగా శ్రీమహాలక్ష్మీసమతుడై కరుణతో స్వాగతించేవాడు అగ్రజుడు.

**స్వస్యాగ్రే ప్రాప్త ముక్తానాం సర్వైశ్వర్య శ్రియా సహ యథా పర్యంకవిద్యంచ కరుణానిష్ట చేతసా తద్భోగ్యో జాయతే యశ్చసోఽగ్రజః పరికీర్తితః.** సకల భోగ సంపదలతోను తన ముందు నిలిచిన ముక్తులకోసం కరుణాంతరంగుడై, 'పర్యంకవిద్య'యందు చెప్పినట్లు భోగ్యభూతుడై ప్రకాశించువాడు అగ్రజుడు (శ్రీకైవల్య సారథి).

కౌషీతకీ ఉపనిషత్తు 1.5, 1.6 –

**స ఆగచ్ఛతి అమితౌజసమ్ పర్యంకమ్ ఇతి ప్రభృతి**
**ఉపశ్రీరుపబృంహణమ్ తస్మిన్ బ్రహ్మాస్తే**
**తమిత్థమ్ విత్ పాదేనైవ అగ్రే ఆరోహతి**
**తమ్ బ్రహ్మ ఆహ 'కోఽసీతి' ఇతి ప్రభృతి చ**
**సాయా బ్రహ్మణి చితిః వ్యష్టిః తామ్ చితిమ్ జాయతి**
**తామ్ వ్యష్టి వ్యాశ్నుతే ఇతి ఇత్యేవమంతా హి పర్యంకవిద్యా**

అమితమైన తేజస్సుతో వెలిగే పర్యంకము (మంచము)వద్దకు ముక్తజీవుడు వెళతాడు. శ్రీమహాలక్ష్మి తన ప్రక్కనుండగా, దివ్య సేవకులు సేవించుచుండగా, దానిపై పరబ్రహ్మము ఆసీనుడై యుంటాడు. ఇలా పరబ్రహ్మమును ధ్యానించిన ముక్తజీవుడు పర్యంకముపైకి ఎక్కుతాడు. నీవెవరవు అని పరబ్రహ్మము ముక్తజీవుని అడుగుతాడు. బ్రహ్మమునందుగల చైతన్యమును అని జీవుడు చెబుతాడు. అప్పుడు ముక్తజీవునికి పర్యంకవిద్య జ్ఞానం లభిస్తుంది. ఇలా అతను బ్రహ్మానందమును అనుభవిస్తాడు.



పశ్చిమ గోదావరి జిల్లా చక్రాయగూడెంలో శ్రీరామాలయం

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అగ్రే జాయత ఇతి అగ్రజః.** హిరణ్యగర్భుని రూపమున మున్ముందుగా జన్మించినవాడు అగ్రజుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతం (2.9.9)నుండి ఉదాహరించారు.

**తస్మై స్వలోకమ్ భగవాన్ స భాజితః సందర్శయామాస పరం న యత్పరమ్**
**వ్యాపేతన సంక్లేశ విమోహ సాధ్వసమ్ స్వ దృష్టవద్భిః అభిష్టుతమ్**

బ్రహ్మదేవుడు తన సృష్టికి ముందు దేవమానం ప్రకారం వేయి సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. భగవానుడు ఆ విధంగా సంపూజితుడై, బ్రహ్మ తపోదీక్షకు సంతోషించి, ఏది పరమశ్రేష్ఠమో, దేనికన్న పరమోత్కృష్టమైనది వేరొకటి లేదో, దేనిని గురించి ఆత్మజ్ఞానులు ధ్యానిస్తారో, ఆ తన లోకాన్ని పరమపదాన్ని వైకుంఠాన్ని సందర్శించే మహాభాగ్యాన్ని అతనికి కలుగజేశాడు.

శ్రీ చిన్మయానంద – అందరికంటె ముందు జన్మించినవాడు అగ్రజుడు. సహజంగా మిగిలినవన్నీ ఆయననుండే జన్మించాయి. ఎవనినుండి సమస్తమూ ఉద్భవిస్తుందో, ఎవనియందు సమస్తమూ నిలిచియుంటుందో, ఎవనిలో సమస్తం లయిస్తుందో అతడే అగ్రజుడు.

## 893. అనిర్విణ్ణః

- జీవులు సంసారబంధమునుండి బయటపడడానికి తనను ఆశ్రయించకపోయినాగాని విసుగు చెందకుండా సృష్టికార్యం సాగించేవాడు.
- జీవుడు తనను చేరి ముక్తుడైనపుడు భారము తీరినట్లుగా సంతోషించేవాడు.
- పూర్ణకాముడు గనుక నిరాశ పొందనివాడు.
- భక్తుల కోరికలు తీర్చడంలో విసుగు లేనివాడు.

### ఓం అనిర్విణ్ణాయ నమః

47వ శ్లోకము. 436వ నామము. అనిర్విణ్ణః – **అనిర్విణ్ణః స్థవిష్ఠోభూః ధర్మయూపో మహామఖః**
95వ శ్లోకము. 893వ నామము. అనిర్విణ్ణః – **అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతః**

ని (ఉపసర్గ); విద్ - సత్తాయామ్ - జరుగుట, ఉండుట; విద్ - విచారణే - ఆలోచించుట, భావించుట
అనిర్విణ్ణః - ఏ విధమైన చింతలు, క్లేశములు లేకుండుట.

**నిర్వేదమ్ క్షోభమ్ క్లేశమ్ ఆలస్యమ్ వా న ప్రాప్నోతి స అనిర్విణ్ణో విష్ణుః.** నిర్వేదము (చింత), క్షోభ, క్లేశము (చిత్త వ్యాకులత), ఆలస్యము (విసుగు, సోమరితనము) వంటివి పొందనివాడు అనిర్విణ్ణుడు. **యో న కదాచిదపి నిర్వేదమ్ (ఖిన్నతమ్) ప్రాప్నోతి స అనిర్విణ్ణః.** ఏ విధమైన ఖిన్నతను (నిర్వేదమును) పొందనివాడు అనిర్విణ్ణుడు. భగవానుడు ఎందుకు నిర్విణ్ణుడు (నిర్వేదము పొందువాడు) కాడో అనే విషయంలో వివిధ వ్యాఖ్యాతల వివరణలలో భేదాలను గమనించవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

436వ నామము 'అనిర్విణ్ణః' – జనులు సంసారబద్ధులై, లౌకిక వాంఛా ప్రీతిపరులై, పరమేశ్వరుని అలక్ష్యం చేసినాగాని విసుగు చెందక (అనిర్విణ్ణః - అనలసః - అలసత్వము లేనివాడు) మరల మరల సృష్టికార్యమును కొనసాగించువాడు అనిర్విణ్ణుడు. పంట పండినా పండకపోయినాగాని రైతు మరల మరల విత్తినట్లుగా, తననుండి విముఖులైన జీవులయందుకూడా భక్తి జనించేలా అవకాశం ఇచ్చేవాడు భగవంతుడు అనిర్విణ్ణుడు.

893వ నామము 'అనిర్విణ్ణః' – చింత లేనివాడు అనిర్విణ్ణుడు. 880వ నామము 'విహాయసగతి'నుండి చెప్పిన క్రమంలో ముక్తజీవుడు శ్రీవైకుంఠమునకు వచ్చి తనను చేరినందున భగవంతుడు ఒక భారము తీరినట్లుగా సంతోషించును. ఆ విధంగా ఆయన అనిర్విణ్ణుడు. (అంతవరకూ ఆ జీవునిపట్ల కరుణ కలిగిన భగవంతుడు అతని ముక్తికై చింత పొందియుండును.)

**మహతా ప్రనిధానేనహృత్యార్య భవగర్తతః ప్రాపయ్య చ తమాత్మానం కృతకృత్యశ్చ విజ్వరః.** ఈ రకంగా నిరంతరము కృషిచేసి, సంసారసాగరంలో పడి ఉన్నవారిని ఉద్ధరించి, వారిని మోక్షసామ్రాజ్యానికి అభిషిక్తులను కావించి, నిశ్చింతగా ఉండేవాడు అనిర్విణ్ణుడు (శ్రీకైవల్య సారధి).

శ్రీ భట్టులు రామాయణంనుండి ఉదాహరించారు – విభీషణుడిని లంకకు అధిపతిగా పట్టంకట్టి, తన మాట చెల్లించుకొన్నందుకు, బాధ్యత తీరినందుకు శ్రీరాముడు ముదము పొందాడు. **కృతకృత్యస్తదా రామో విజ్వరః ప్రముమోద** (బాలకాండము 1.85).

శ్రీ శంకరుల వ్యాఖ్య –

**అవాప్త సర్వకామత్వాత్, అప్రాప్తహేత్యభావాత్ నిర్వేదః అస్య న విద్యత ఇతి అనిర్విణ్ణః.** భగవానుడు నిస్పృహ, నిర్వేదము, దుఃఖము మున్నగునవి లేనివాడు. ఆయన అవాప్తకాముడు. పూర్ణుడు. పరిపూర్ణుడు. నిత్యతృప్తుడు. కనుక అనిర్విణ్ణుడు.

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి** – గీత 3.22



ఓ అర్జున! ఈ ముల్లోకములందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియును లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – భక్తుల కోరికలు తీర్చడంలో భగవంతుడు ఎన్నడూ విసుగు, విముఖత్వము, అలసత్వము పొందడు. కనుక ఆయన అనిర్విణ్ణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే అర్థం చెప్పారు. **న నిర్విందతి కదాపి స్వజన కామనాపరంపరా పూర్తిషు ఇతి అనిర్విణ్ణః.**

శ్రీ వాసిష్ఠ, శ్రీ రాధాకృష్ణశాస్త్రి – నిర్విణ్ణత (విరక్తి, వింత, విసుగు) అనేది కావలసినది పొందలేనివారికి, పొందినది చాలనివారికి వర్తిస్తుది. ఇవన్నీ పూర్వజన్మ కర్మఫలితాలు. కాని భగవానుడు పూర్ణకాముడు. మార్పు లేనివాడు. జన్మ కర్మ రహితుడు. కనుక ఆయన అనిర్విణ్ణుడు.

1840 కాలానికి చెందిన రాజస్థాన్ కోట శైలి చిత్రం. అన్నకూటోత్సవంలో అర్చకులు శ్రీనాధుని అర్చిస్తున్నారు.

https://commons.wikimedia.org/wiki/File:Kota_school,_Rajasthan,_India_-_Priests_worshipping_Krishna_as_Shrinathji_for_Mountain_of_Food_festival_(Annakuta_utsava);_shrine_ha..._-_Google_Art_Project.jpg

## 894. సదామర్షీ

- ఎంతో సహనము కలవాడు (సదా-మర్షీ). అన్ని విధముల కైంకర్యములను స్వీకరించేవాడు.
- (సత్-ఆ-మర్షీ) సజ్జనులొనరించే అపరాధములపట్ల క్షమాగుణము కలవాడు.
- (సదా-ఆమర్షీ) దుర్మార్గుల కార్యముల పట్ల ఏమాత్రం సహనం లేనివాడు.

### ఓం సదామర్షిణే నమః

మృష - తితీక్షాయామ్ - ఓర్పు వహించుట, క్షమించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ముక్తజీవుడు శ్రీవైకుంఠాన్ని చేరిన విషయాన్ని ఈ నామము వ్యాఖ్యలో కూడా శ్రీ భట్టులు కొనసాగించారు. భగవంతుడు ఎంతో ఓపికతో ముక్తజీవులు తనకొనరించే సకల కైంకర్యములను స్వీకరిస్తాడు (భగవంతునికి ఆ కైంకర్యము అవుసరం లేకున్నాగానీ సంతోషంతో స్వీకరిస్తాడు.)

**సర్వకాలం తత్ప్రభృతి కృత ప్రతికృతం చ సః మర్షితుమ్ శీలమస్యేతి సదామర్షీతి కీర్తితః.** ఆ విధంగా పరమపదము పొందిన తరువాత, పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు తమకు చేసిన మహోపకారానికి ప్రతిక్రియగా భక్తులు సమర్పించే వివిధరకాలైన నిత్యకైంకర్యములను (నివేదనలను) స్వీకరించేవాడు సదామర్షి (శ్రీకైవల్యసారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – సత్-ఆ-మర్షీ – సదామర్షీ. **సతః సాధూన్ అభిముఖ్యేన మృష్యతే క్షమత ఇతి సదామర్షీ.** సాధుజనులు (తెలియక) చేసిన అపరాధములను సదా క్షమించువాడు సదామర్షి. 'సత్' అనగా సాధువులు. 'ఆ' ప్రత్యయము ద్వారా 'అన్ని ప్రక్కల నుండి' అనే అర్థం వస్తుంది (శ్రీమాన్ ఆప్టే నిఘంటువు). 'మర్షీ' అనగా క్షమించువాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే అర్థం చెప్పారు. **సతః సాధూనా సమంతాత్ మర్షితుమ్ శీలమ్ యస్య ఇతి సదామర్షీ.**

**కథంచిత్ ఉపకారేణ కృతేన ఏకేన తుష్యతి**
**న స్మరతి అపకారాణామ్ శతమపి ఆత్మవత్తయా** – రామాయణం. అయోధ్యకాండ 1.11
శ్రీరాముడు తనకు ఇతరులొనర్చిన చిన్న ఉపకారంవల్ల కూడా ఎంతో సంతోషిస్తాడు. తనపట్ల చేసిన అపకారాలను కూడా పట్టించుకొనడు. ఇది ఆయన నైజము.

**నాऽక్షస్తప్యతే భూరిభారః** – ఋగ్వేదము 1.164.13 – జగములను నడిపే ఇరుసు ఎంత భారమైనాగాని వేడెక్కదు, విరిగిపోదు.

శ్రీ సత్యసంధతీర్థ ఇందుకు విరుద్ధంగా అర్థం చెప్పారు. 'సదా-ఆమర్షః' అని. **సదా ఆమర్షః కోపో దైత్యేషు అస్య అస్తి ఇతి సదామర్షీ.** దైత్యులపట్ల సదా క్రోధము (అసహనము) కలిగినవాడు సదామర్షి. 'ఆ' ప్రత్యమువల్ల విరుద్ధమైన అర్థం వస్తుంది. (గమ్ - వెళ్ళుట, ఆగమ - వచ్చుట, మర్షీ - సహనము కలిగియుండుట, ఆమర్షీ - కోపముగా, సహనము లేకుండా ఉండుట.)

## 895. లోకాధిష్ఠానమ్

- సకల లోకములకు ఆధారమైనవాడు.

### ఓం లోకాధిష్ఠానాయ నమః

స్థా - గతి నివృత్తౌ - నిలుచుండుట, ఉండుట. అధి - ముఖ్యమైన, ప్రముఖ, ప్రధాన. లోకములు - జగత్తు. **లోకస్య అధిష్ఠానమ్ లోకాధిష్ఠానమ్.** లోకములకు ఆధారము లోకాధిష్ఠానము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ముక్తజీవులు శ్రీవైకుంఠము చేరి భగవత్సాన్నిధ్యాన్ని అనుభవించే విషయం పరంగా ఈ నామాన్ని కూడా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. భగవంతుని నిత్యవిభూతి కారణంగా ముక్తజీవులు పరమపదంలో శ్రీమన్నారాయణుని సేవించగలుగుచున్నారు. ఆ ఉత్తమ లోకాలకు ఆధారం ఆయనే.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **లోకానామ్ స్వాంతికమ్ ఆగతానామ్ స్వజనానామ్ నిత్యమ్ ఆశ్రయత్వాత్ లోకాధిష్ఠానమ్.** భక్తులు తమ ప్రయాణం చివరిలో చేరుకునే శాశ్వత శాంతిస్థానము శ్రీభగవానుడే.

తిరువైమోళి 3.9.9 – ముందుగా ఆయన మనకు అనేక సంపదలు ఇచ్చాడు. తరువాత మనను శ్రీవైకుంఠమునకు కొనిపోయి 'ఇదే నీ ఇల్లు, తీసుకో' అంటాడు. ఇక వైకుంఠం మనదే.

ఋగ్వేదము 1.164.13 – **తస్మిన్నాథ స్థుర్ భువనాని విశ్వా.**

ఋగ్వేదము 1.164.39 – **ఋచో అక్షరే పరమే వ్యోమాన్ యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః.**

తైత్తరీయారణ్యకము 10.1.1 – **యస్మిన్నిదమ్ సమ్ చ విచైతి సర్వమ్.**

యజుర్వేదము 17.30 – **యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **తమ్ అనాధారమ్ అధిష్ఠాయ త్రయో లోకాః తిష్ఠన్తి లోకాధిష్ఠానమ్.** ఆయనకు ఆధారము అవుసరం లేదు. లోకములన్నీ ఆయనపై ఆధారపడి ఉన్నాయి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుడు కూర్మ, వరాహ, ఆదిశేషాది అవతారములలో లోకమునకు ఆధారమై యున్నాడు.

## 896. అద్భుతః

- ఎంతో అద్భుతమైన, ఆశ్చర్యకరమైనవాడు.
- అప్పుడప్పుడూ మనమధ్య అవతరించేవాడు.
- (ఆద్యమ్ - ధాన్యములు) ఆయన కారణంగా ధాన్యములు, ఆహారము లభిస్తున్నాయి.

### ఓం అద్భుతాయ నమః

భూ - ఉండుట. ఉనాది సూత్రము (5.1). **అది భువో దుతాచ్** – ప్రకారం 'అద్' అనగా తెలియరానిది, ఎప్పుడైనా హఠాత్తుగా జరిగేది. అద్భుతం అంటే ఆశ్చర్యం కూడాను.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వదా సర్వైః సర్వథా అనుభవేऽపి అపూర్వత్వాత్ అతి విస్మయనీయః.**

మనం (భక్తులు, నిత్య ముక్తులు) ఆయనను ఎల్లప్పుడూ, అందరూ, అన్ని విధాల అనుభవించినాగాని ఆయన తనివి తీరని అద్భుతము. ఉత్తమ లోకాలలోని భక్తులు పరమేశ్వరుని సదా అనుభవిస్తున్నప్పటికీ ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా కనుపించేవాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **విచిత్రైః ప్రతిక్షణమ్ నీతనైః గుణరూప చరిత్రైః తైః తేషామ్ విస్మయ కరణాత్ అద్భుతః.** ముక్తులు ఆయన గుణరూప చరితములను సదా విస్మయంతో వర్ణిస్తుంటారు. ఇలా విచిత్రంగా ప్రతిక్షణం వారిని విస్మయపరచేవాడు అద్భుతము.

పెరియతిరుమొళి 8.1.9 – ఆయనను నేను ఇంతకుముందు ఎక్కడ చూచాను? ఏ దివ్యక్షేత్రంలో చూచాను? లేక ఎక్కడా చూడలేదా?

పెరియ తిరుమొళి 10.10.9 – తల్లీ! చేత దివ్యచక్రాన్ని, బంగారు సారంగ ధనుస్సును ధరించిన అతడెవరో నాకు తెలియరావడంలేదు.

తిరువైమొళి 8.6.10 – శ్రీమన్నారాయణుడు అద్భుతమైన చేష్టలు చేసి ఆనందిస్తాడు. అద్భుత చేష్టలంటే ఏమిటి? ఆయన తన భక్తులకే గాక, శత్రువులకు కూడా సాయం చేస్తాడు. పంది, తాబేలు ఇలా ఎన్నో రూపాలలో అవతరించి భక్తుల నుద్ధరిస్తాడు. ఆయన

అనుభవాలతో మనకు తనివి తీరదు. ఆయన వామనుడై వచ్చి, త్రివిక్రముడై మూడు లోకాను అతిక్రమించాడు. కాని నాహృదయంలో నెలకొని ఉన్నాడు. ఇవన్నీ ఆయన అద్భుత చేష్టలు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు భగవానుని అద్భుత లక్షణాన్ని గురించి చెబుతూ ఉపనిషత్తునుండి, గీతనుండి ఉదాహరించారు.

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వంతోపి భవోऽయం న విద్యుః**

**ఆశ్చర్యోవక్తా కుశలోऽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః** – కఠోపనిషత్తు 2.7

పరమాత్మము ఎలాంటిదంటే దానిని గురించి వినడంవలన అది లభించదు. వినడంవలన అర్థం కాదు. దానిని గురించి తెలిసినవారు, పొందినవారు, జ్ఞానియైన గురువుద్వారా తెలుసుకొన్నవారు అరుదు.

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః**

**ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్** – గీత 2.29

ఎవరో ఒక మహాపురుషుడు మాత్రమే దీనిని (ఈ ఆత్మను) ఆశ్చర్యకరమైనదానిగా చూచును. మరియొక మహాత్ముడు దీని తత్వమును ఆశ్చర్యకరముగా వర్ణించును. వేరొక పురుషుడు దీనిని ఆశ్చర్యకరమైనదానిగా వినును. ఆ విన్నవారిలో కూడా కొందరు దీనిగురించి ఏమియు ఎఱుగరు.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు, ఆయనను గూర్చి తెలిపే గురువు, ఆయనను అర్థం చేసుకొనే శిష్యుడు – అన్నీ అద్భుతాలే.

శ్రీ వాసిష్ఠ – **అద్ - కదాచిత్ భవతి ఇతి అద్భుతమ్.** అప్పుడప్పుడూ ఆయన మనయందు అవతరించుట అద్భుతము. **సన్నాపి అభూతమ్ ఇవ ఇతి అర్థః.** ఆయన మనలో ఉండి కూడ మనలో లేరు అని అర్థము. భగవంతుడు మనందరిలో ఉన్నాగాని ఆ సంగతి తెలియక మనం భగవంతుడు లేనట్లుగా ప్రవర్తిస్తాము. ఇది అద్భుతము.

శ్రీ రఘునాథ తీర్థ – **ఆద్యమ్ - భోగ్యమ్ అన్నాదికమ్ భవతి అస్మాత్ ఇతి అద్భుతః.** ఆద్యము అనగా తినేది (అన్నము, ధాన్యము). భగవంతుని కారణంగా ధాన్యము, ఆహారము లభించుచు జీవుల మనుగడ సాగుచున్నది. ఇలా జరిగేలా చేసేవాడు అద్భుతము.



సింహవాహనంపై ఊరేగుతున్న శ్రీ మలయప్ప స్వామి.

https://commons.wikimedia.org/wiki/File:Malayappa_in_simha_vahanam.jpg



## సనాత్సనాతనతమః కపిలః కపిరవ్యయః (కపిరప్యయః) |
## స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః || (96)

### 897. సనాత్

- ముక్తులు ఆయనను భజించి, దర్శించి, అనుభవింతురు.
- కాలస్వరూపుడు.
- శాశ్వతము, ఆద్యంతరహితము ఐ, సదా అదే సుందరరూపములో ఉండేవాడు.
- భక్తులు సమర్పించినదానిని ఇష్టంగా స్వీకరించేవాడు.

ఓం సనాతే నమః

ఈ నామ వివరణకు రెండు విధాల అర్థాలు చెప్పబడినవి.

(1) సన్ - దానే - ఇచ్చుట, పూజించుట. **సనోతి - దదాతి స్వదర్శనమ్ భక్తేభ్యః ఇతి సనాత్.** భక్తులకు ఆయన తన దర్శనమును అనుగ్రహించును.

(2) అమరకోశములో 'సనా' అనగా 'నిత్య' అనే అర్థం ఉంది. అనగా సనాతనమైన, కాలంతో పతనం కాని, శాశ్వతమైన.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషామ్ సంభజనాత్ సనాత్.** ఆయనను భజించి, దర్శించి ముక్తులందరూ పరిపూర్ణ ఆనందమును పొందుదురు గనుక ఆయన సనాత్.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సనాత్ ఇతి నిపాతః చిరార్థ వచనః.** సనాత్ అనగా పురాతన, చిరకాలమైనది. కాలంతో క్షీణించనిది. ఇది భగవంతుని కాలస్వరూపమును సూచించును. ఇందుకు శ్రీ శంకరులు ఉదాహరించినది –

**పరస్య బ్రహ్మణో రూపమ్ పురుషః ప్రథమం ద్విజ**
**వ్యక్తావ్యక్తే తథైవాన్యే రూపే కాలస్తథాపరమ్** – విష్ణుపురాణము 1.2.15

పరబ్రహ్మముయొక్క మొదటిరూపము పురుషుడు. వ్యక్తావ్యక్తములు తరువాతవి. తరువాతిది సమయము. భగవంతునివలెనే కాలము ఆద్యంతరహితము.

శ్రీ వాసిష్ఠ – **సనాత్ నిత్యః అవికారః ఏకరసః ఇత్యర్థః.** సనాత్ అనగా నిత్యమైన (శాశ్వతమైన)వాడు, మార్పు లేని (స్థిరమైన)వాడు, సదా ఒకే సుందరమైన రూపు కలిగినవాడు. ఋగ్వేదమునుండి ఉదాహరణలు –

2.16.1 – **సనాత్ యువానమసే హవామహే.**

4.20.6 – **సనాదేవ సహసే జాత ఉగ్రః.**

10.55.6 – **ఆ యో మహః శురః సనాత్ అనీడః.**

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సనమ్ తద్-దత్తమ్ రస గంధాది అత్తి ఇతి సనాత్.** తన భక్తులు సమర్పించిన ఉపచారములను ప్రేమతో సంతోషముగా స్వీకరించువాడు సనాత్. ఆప్టే నిఘంటువులో 'సన్' పదమునకు ఇచ్చిన ఒక అర్థము – కరుణతో స్వీకరించుట.

### **898.** సనాతనతమః

- ప్రాచీనులందరిలోకి ప్రాచీనుడు.
- నిత్యమూ అనుభవిస్తున్నప్పటికీ నిత్యనూతనమైనవాడు.

### ఓం సనాతనతమాయ నమః

'సనా' - నిత్యమైన, ప్రాచీనమైన. పాణిని సూత్రము (4.3.23) ప్రకారము 'తన' ప్రత్యయము కలిపితే 'ప్రాచీన కాలానికి చెందిన' అనే అర్థం వస్తుంది. దానికి 'తమప్' ప్రత్యయము కలిపితే 'అన్నింటికంటె' అనే భావం కలుస్తుంది. భగవానుడు అన్నింటికంటె ముందునుండి యున్నాడు. మరియు ప్రళయంలో అన్నీ లయమైనాగాని ఆయన మాత్రం అలాగే ఉంటాడు. కనుక ఆయన సనాతనతముడు.



శ్రీ నమ్మాళ్వార్ - నాథముని మరియు మధురకవి ఆళ్వారులతో. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Swami_Nammaazhvar.jpg

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు అత్యంత ప్రాచీనుడైనప్పటికీ ఆయనను గురించిన అనుభవం ఎప్పుడూ క్రొత్తగానే ఉంటుంది. **పురా అపి నవః పురాణః.** సనా - పురాణ. తన - రూపము, మూర్తి (తను - శరీరము). తమ - అనుభవంలో ఎంతో ఆనందం కూర్చేది. **సదా తనత్వేఽపి తదా తనత్వాత్ నిత్యనూతన భోగ్యః.** ప్రాచీనమూర్తి యైనప్పటికీ అత్యంత నూతనమూర్తివలె మనకు అనుభవం కలుగజేసేవాడు. నిత్యనూతన భోగ్యుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థం చెప్పారు. **సనాతనానామ్ ముక్తానామ్ అయమ్ అతిశయేన సనాతనతమః. సనాతనత్వేఽపి తేషామ్ తదా-తనత్వాత్ ప్రతీయ ఇత్యర్థః.**

తిరువైమొళి 2.5.4 – నేను ఇంతకుముందు చెప్పినదే మళ్ళీ చెబుతున్నందుకు మన్నించండి. కాని ఎన్ని దినాలు, సంవత్సరాలు, యుగాలు అనుభవించినాగాని నాకు తనివి తీరని నిత్యనూతన అనుభవమది. అందులోని అనంతవైవిధ్యం కారణంగా ప్రతిక్షణం నేను ఆనందంతో పరవశిస్తుంటాను. సదా అది నాకు నూతనానుభవమే. అయితే నా బుద్ధి అభివృద్ధి చెందడంవల్ల నాకేదో క్రొత్త అనుభవం కలుగుతున్నదని అనుకొనవద్దండి. మొదటినుండీ నా బుద్ధి కుశలంగానే ఉన్నది భగవంతుని దయవల్ల. కాని భగవత్సాన్నిధ్యము అనేది పూర్తిగా వేరే తలానికి చెందినది. అందరికీ అంతర్యామి, ప్రభువు అయిన భగవంతుడు చల్లని పచ్చని అందపు కొండలాగా ఉంటాడు. ఆయన కనులు, పాదములు, చేతులు అప్పుడే విరిసిన పద్మాలలా ఉంటాయి. క్షణక్షణానికీ మాధుర్యం పెరుగుతున్నందువలన, ఎంత త్రాగినా తనివితీరని అమృతమే ఆయన.

తిరువైమొళి 2.6.1 – ప్రభూ! నీవు దేవాధిదేవుడవు. జీవితంలో ప్రతిదినం సేవించినాగాని తనివి తీరని అమృతానివి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వ కారణత్వాత్, విరించ్యాదీనామపి సనాతనానామ్ అతిశయేన సనాతనత్వాత్ సనాతనతమః.** అన్నివిధాలుగా, బ్రహ్మవంటివారికంటే కూడా సనాతనుడు గనుక సనాతనతముడు.

**సనాతనమ్ ఏనమ్ ఆహురుతాద్యః స్యాత్ పునార్ణవః**

**అహోరాత్రే ప్రజాయేతే అన్యో అన్యస్య రూపయోః** – అధర్వవేదము 10.8.23

పగలు, రాత్రి ఒకదానిరూపం ఒకటి దాల్చి, మరల మరల వచ్చినట్లు ఆయన ప్రాచీనుడైనా ఎప్పుడూ క్రొత్తగా ఉంటాడు.

## 899. కపిలః

- కపిలమహాముని అవతారము.
- అందమైన (కపిల) వర్ణము కలవాడు.
- జీవుల జీవనం కొరకు సూర్యుని తెచ్చేవాడు.
- సుగ్రీవ హనుమదాదులచే సేవింపబడినవాడు.

### ఓం కపిలాయ నమః

57వ శ్లోకము. 535వ నామము. కపిలాచార్యః – **మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః**

96వ శ్లోకము. 899వ నామము. కపిలః – **సనాత్ సనాతనతమః కపిలః కపిరవ్యయః**

57వ శ్లోకంలోని 'కపిలాచార్యః' నామమును శ్రీ భట్టులు మరియు శ్రీ శంకరులు కూడా కపిలమహాముని అవతారపరంగా వ్యాఖ్యానించారు (శ్రీ భట్టులు 529 నుండి 538వ నామం వరకు కపిలముని పరంగా వ్యాఖ్యానించారు). సాంఖ్యయోగమును బోధించిన శ్రీ కపిలుడు శ్రీమహావిష్ణువుయొక్క అంశావతారము. 96వ శ్లోకంలోని 'కపిలః' నామమును శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడా 'సుందరమైన రంగు కలవాడు' అన్న అర్థంలో వ్యాఖ్యానించి, పునరుక్తి లేదని నిరూపించారు.

కమ్ - కాంతౌ - కాంతిరిచ్ఛా - కోరుకొనుట. కబ్ర్ - వర్ణే - రంగు కలిగియుండుట. ఉణాదిసూత్రము (1.,55) **'కామేః పశ్చ'** ప్రకారము 'కమ్'లోని 'మ' లేదా 'కబ్ర్' లోని 'బ్ర'లు 'ప'గా మారుతాయి. 'ఇలాచ్' ప్రత్యయము చేరిస్తే 'కపిలః' అనగా ఎరుపురంగు కలవాడు – అన్న అర్థం వస్తుంది (పొగ లేని మంట రంగు).

శ్రీ భట్టుల వ్యాఖ్య –

57వ శ్లోకము. **కపిలాచార్యః** – వేదవిదుడైన శ్రీ కపిలుడు.

96వ శ్లోకము. **కపిలః** – సుందరమైన వర్ణము కలవాడు కపిలుడు. **మధ్యస్థ నీల తోయద విద్యుల్లేఖోజ్వల వర్ణః కపిలః.**

**విద్యున్మండల మధ్యస్థ నీలమేఘవదుజ్వలః కపిల స్స స్సమాఖ్యాతః సప్తవర్ణో మహామనుః.** మెరుపులతో అలరారే నీలమేఘములాగా మంచి తేజస్సుతో వెలుగొందేవాడు. ఇక్కడ మెరుపులు శ్రీమహాలక్ష్మికి సంకేతము. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. గొప్ప విశేషమైనది. ఓం కపిలాయ నమః (శ్రీ కైవల్య సారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య –

57వ శ్లోకము. **మహర్షిః కపిలాచార్యః** – వేదములకు ద్రష్టలైన మునులు మహర్షులు. మహర్షులలో తాను స్వయముగా కపిలాచార్యుడనని శ్రీకృష్ణ భగవానుడు గీత (10.26)లో తెలిపెను. **సిద్ధానాం కపిలో మునిః.** శ్వేతాశ్వరోపనిషత్తు 5.2 – **ఋషిమ్ ప్రసూతమ్ కపిలమ్ మహాన్తమ్.**

96వ శ్లోకము. **కపిలః – బడబానలస్య కపిలో వర్ణ ఇతి తద్రూపీ కపిలః.** సముద్రములోని బడబానల స్వరూపుడైనందున భగవంతుడు కపిలుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – కొద్దిపాటి నల్లని ఛాయ కలిగిన బంగారురంగును కపిలవర్ణము అంటారు.

శ్రీ వాసిష్ఠ – 'కపి' అనగా పింగళవర్ణము. **కపిమ్ - సూర్యమ్, లాతి - ఆదత్తే, సర్వస్య జగతః ప్రవర్తనాయ ఇతి కపిలః.** సకల జగత్తును ప్రవర్తింపజేయుటకై సూర్యుని తెచ్చేవాడు కపిలుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – 'కపి' అనగా కోతి. **కపీన్ సుగ్రీవ హనుమదాదీన్ లాతి సేవాయామ్ ఇతి కపిలః.** సుగ్రీవ, హనుమదాదులను తన సేవ నిమిత్తము కలిగినవాడు కపిలుడు.

## 900. కపిరవ్యయః

కపిః

అవ్యయః

అప్యయః

శ్రీ భట్టులు ఈ నామమును 'కపిరవ్యయః' అనే ఒకే నామముగా పరిగణించారు. శ్రీ శంకరులు 'కపిః', 'అప్యయః' అనే రెండు నామములుగా పరిగణించారు. కొందరు 'కపిః', 'అవ్యయః' అనే రెండు నామములుగా పరిగణించారు.

### కపిరవ్యయః

- తరగని శాశ్వతమైన ఆనందము పొందేవాడు. ముక్తులతో కలిసి ఆనందించేవాడు.

### ఓం కపయే అవ్యయాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – 'అవ్యయము' అనగా తరగనిది. శాశ్వతమైనది. కమ్ - సుఖము. **కమ్ పిబతి, పాతి వా కపిః.** ఆనందమును అనుభవించేవాడు, తన ఆనంద అనుభవమును ఇతరుల కొరకు కాపాడేవాడు 'కపి'. **స్వయమపి తద్-అనుభవ సుఖ నివృత్తిమ్ పాతి పిబతి వా కపిః అవ్యయః.** ముక్తులకొరకు తన తరుగులేని ఆనందానుభవమును జాగ్రత్త చేసేవాడు 'కపిరవ్యయః'. ముక్తబృందముతో కలిసి శాశ్వతమైన నిత్యానందమును అనుభవించేవాడు. అనగా ముక్తులు నిత్యమైన భగవత్సాన్నిధ్యమును పొంది ఆనందిస్తే, అందుకు ఎంతో సంతోషించేవాడు 'కపిరవ్యయః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా 'కపిరవ్యయః' అనే ఒకే నామంగా పరిగణించారు కాని, 'కపిః', 'అవ్యయః' అనే రెండు గుణముల మిశ్రమంగా ఈ నామమును వివరించారు. **కామ్ - జలమపి పిబతి స్వజనైః స ప్రేమ ఉపహృతమ్ ఇతి కపిః. సదైవ అవ్యయో-నిర్వికార ఇతి అవ్యయః.** ప్రేమతో భక్తులు అర్పించిన జలమునైనా సేవించేవాడు 'కపి'. తరుగు, మార్పు లేనివాడు 'అవ్యయః'. కనుక ఆయన 'కపిరవ్యయః'.

### కపిః

- సూర్యునిగా జలములను త్రాగు (ఎండించు)వాడు.
- శ్రీవరాహమూర్తియై భూమిని జలములనుండి ఉద్ధరించినవాడు.
- భక్తితో సమర్పించిన జలమునైనా స్వీకరించువాడు.

## ఓం కపయే నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కమ్ - జలమ్ రశ్మిభిః పిబన్ కపిః, సూర్యః.** సూర్యుని రూపంలో జలములను తన కిరణములచే త్రాగు (ఎండజేయు)వాడు కపి.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – **కాత్ - తోయాత్ భూమిమ్ అపాత్ ఇతి కపిః వరాహః.** జలములనుండి భూమిని కాపాడిన శ్రీవరాహమూర్తియే కపి. 'క' అనగా నీరు. 'పా' అనగా రక్షించుట. శ్రీ భట్టులు, శ్రీ శంకరులు కూడా 1వ శ్లోకము 102వ నామము 'వృషాకపి' వివరణలో 'కపి' అనగా వరాహావతారమును సూచించునని చెప్పారు. ఇందుకు వారు మహాభారతం శాంతిపర్వము (330.24)నుండి ఉదాహరించారు.

**కపిర్వరాహః శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే**
**తస్మాద్ వృషాకపిమ్ ప్రాహ కాశ్యపో మామ్ ప్రజాపతిః**

శ్రీ వాసిష్ఠ 'కపిః' అన్న పదానికి మూడు విధాలుగా వ్యుత్పత్తులను చూపారు.

(1) కై - శబ్దే - ధ్వనించుట. (2) కృర్ - విక్షేపే - పారబోయుట, వెదజల్లుట. (3) కన్ - దీప్తి కాంతి గతిషు - వెలుగుట. శ్రీ వాసిష్ఠ 'కపిః' నామమునకు చెప్పిన అర్థములు – **కపిః స్తవః శబ్దరూపః తమ్ పిబతి ఇతి కపిః.** శబ్దరూపములో ఉన్న స్తుతిని భగవంతుడు త్రాగుతాడు (ఆనందంతో స్వీకరిస్తాడు) గనుక ఆయన కపి. **కమ్ - జలమ్, పాతి - పిబతి.** సూర్యునికి అంతర్యామి అయిన భగవానుడు నీటిని హరిస్తాడు గనుక కపి.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **తద్ సేవారూపమ్ కమ్ పిబతి ఇతి కపిః.** భక్తితో సమర్పించిన జలాన్నయినా స్వీకరిస్తాడు గనుక ఆయన కపి.

**పత్రమ్ పుష్పమ్ ఫలమ్ తోయమ్ యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః** – గీత 9.26
నిర్మల బుద్ధితో, నిష్కామ భావముతో, పరమ భక్తునిచే సమర్పింపబడిన పత్రమును గాని, పుష్పమును గాని, ఫలమును గాని, జలమును గాని నేను ప్రత్యక్షముగా (స్వయముగా) ప్రీతితో ఆరగింతును.

## అవ్యయః

- తనను చేరినవారిని మరల జనన మరణ చక్రములో పడనీయనివాడు.
- తరుగుదల (క్షీణత), నాశనము లేనివాడు. షడ్వికారములు లేనివాడు.
- తన భక్తులనుండి ఎన్నడును ఎడము కానివాడు.

## ఓం అవ్యయాయ నమః

ఇంతకుముందు ఈ నామము 2వ శ్లోకంలో 13వ నామంగా ఉంది.

**అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞో అక్షర ఏవ చ**

13వ నామమునకు శ్రీ భట్టులు, శ్రీ శంకరులు చెప్పినవి మొదటి రెండు అర్థములు.

శ్రీ భట్టులు: తనను చేరినవారిని మరల జనన మరణ చక్రములో పడనీయనివాడు.

శ్రీ శంకరులు: తరుగుదల (క్షీణత), నాశనము లేనివాడు. షడ్వికారములు లేనివాడు.

ఇక ఈ 900వ నామమునకు శ్రీ బలదేవ విద్యాభూషణ చెప్పిన అర్థము – **న వ్యేతి తేషామ్ సమాజాత్ ఇతి అవ్యయః.** తన భక్తులనుండి ఎన్నడూ దూరం కానివాడు అవ్యయుడు.

## అప్యయః

- ప్రళయకాలమునందు సర్వమును తనయందే ఇముడ్చుకొనువాడు.

### ఓం అప్యయాయ నమః

అపి - ఉపసర్గ (ఇంకా). అయ్ - వెళ్ళుట. అప+అయ్ - దగ్గరకు వెళ్ళుట, చేర్చుకొనుట, దగ్గర.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ప్రళయే అస్మిన్ అపియన్తి జగన్తి ఇతి అప్యయః.** ప్రళయకాలమునందు సమస్తమును తనయందే ఇముడ్చుకొనువాడు అప్యయుడు.

శ్రీ వాసిష్ఠ – **అపియన్తి ఇతి అప్యయః, లీయన్తే అస్మిన్ భూతాని ప్రళయకాలే, అతః అప్యయః ఇతి ఉచ్యతే.** మహాప్రళయం జరిగినపుడు జీవజాలమంతా తమ కర్మను తమతో మూటగట్టుకొని ఇతనిలో ప్రవేశిస్తుంది. ఇతడు మాత్రం అలాగే ఉంటాడు. త్రికాలములయందు ఉంటాడు. అందుకే అప్యయుడు.

**ఇక్కడికి 900 నామములకు వ్యాఖ్య పూర్తి అయ్యింది. హరేకృష్ణ.**

**ఇక్కడ గమనింపవలసిన ఒక చిన్న విషయం. 69వ నామమునుండి శ్రీ శంకరుల పాఠానికి, శ్రీ భట్టుల పాఠానికి మధ్య నామముల సంఖ్యలో వ్యత్యాసం ప్రారంభమవుతుంది. ఆ వ్యత్యాసం మళ్ళీ ఈ 900వ నామంతో ముగుస్తుంది. అనగా 901వ నామంనుండి శ్రీ శంకరుల పాఠము, శ్రీ భట్టుల పాఠములలో నామముల సంఖ్యలు ఒకే విధంగా ఉంటాయి.**

**హరే రామ హరే రామ రామ రామ హరే హరే హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే.**

## 901. స్వస్తిదః

- గొప్ప శుభములను ఇచ్చువాడు.
- దివ్యజ్ఞానమును ఇచ్చువాడు.

### ఓం స్వస్తిదాయ నమః

సు (ఉపసర్గ) - దీవెనను సూచించును (ఉనాది సూత్రము 4.180 – 'సావసేః'). అస్ - భువి - ఉండుట. సు - అస్తి - స్వస్తి. **స్వస్తిమ్ దదాతి ఇతి స్వస్తిదః కళ్యాణదః.** మంగళములను ప్రసాదించువాడు 'స్వస్తిదః' (శ్రీ వాసిష్ఠ).

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – అస - గతి దీప్త్యా దానేషు - వెళ్ళుట, ప్రకాశించుట, అంగీకరించుట. **శోభనః అస్తిః గతిః అర్థాత్ జ్ఞానమ్ గమనమ్ ప్రాప్తిః స్వస్తిః, తమ్ దదాతి భక్తేభ్యః ఇతి స్వస్తిదః.** భక్తులకు జ్ఞానమును ప్రసాదించువాడు 'స్వస్తిదః'

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఏవమ్ మహామంగళమ్ దదాతి ఇతి స్వస్తిదః.** ఈ విధముగా ఎల్లరకు మహాశుభములను ప్రసాదించువాడు స్వస్తిదుడు. ఇక్కడ 'మహాశుభము' అనగా శ్రీవైకుంఠమునకు మార్గము చూపే దివ్యజ్ఞానము అని శ్రీ రామానుజన్ వివరించారు. ఇది శ్రీ కృష్ణదత్త భరద్వాజ వివరణకు కూడా సరిపోతుంది.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 1.7.4 – మోక్షానందమునకు దారి చూపే పరమజ్ఞానమును ప్రసాదించే కాంతిపుంజము.

శ్రీ పెరియాళ్వారు. తిరు 5.2.8 – భగవానుడు గురువుగా వచ్చి నాకు బ్రహ్మోపదేశము చేశాడు. నా మనసులో జ్ఞానపీఠాన్ని అధిరోహించాడు. ఒక్కసారి ఆయన పాదములు నా మనసులో చేరగానే నా సకల కల్మషాలు, లోటుపాట్లు, అజ్ఞానము నశించాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **భక్తానామ్ స్వస్తి మంగళమ్ దదాతి ఇతి స్వస్తిదః**. భక్తులకు శుభములు కలుగజేయువాడు స్వస్తిదుడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – **ఆత్మ ధారణాయ, అర్థాత్ జీవనాయ జీవన ఉపయోగిని సాధనాని దదాతి స స్వస్తిదః**. జీవుల మనుగడకు అవుసరమైన సాధనాలు ఇచ్చేవాడు స్వస్తిదుడు.

## 902. స్వస్తికృత్

- సమస్త శుభములను, మంగళములను కలిగించేవాడు.

### ఓం స్వస్తికృతే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవానుడు 'స్వస్తిదః'గా సకల శుభాలను ఇస్తాడు, మరియు 'స్వస్తికృత్'గా ఆ శుభాలను మనం నిరాటంకంగా అనుభవించే అవకాశం కలిగిస్తాడు. **స్వస్తి భోగాశిషం యః కరోతి స్వస్తికృచ్ఛ సః.** కళ్యాణగుణాలచేత తన భోగానికి విపత్తు రాకుండా చేసేవాడు స్వస్తికృత్. బ్రహ్మజ్ఞానమును ప్రసాదించేవాడు స్వస్తిదుడు, ముక్తులు తన కళ్యాణ గుణాలను అనుభవించేలా తానే స్వయంగా వారికి అందుబాటులోకి వచ్చేవాడు స్వస్తికృత్.

శ్రీ శంకరుల వ్యాఖ్య – భగవానుడు 'స్వస్తిదః'గా భక్తులకు శుభములు ఇవ్వడం మాత్రమే గాక, భక్తులకు మంచివైనవానిని చేసేవాడు గనుక స్వస్తికృత్.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – భక్తులచే మంచిపనులు చేయించేవాడు స్వస్తికృత్.

శ్రీ చిన్మయానంద – 'కృత్ - ఛేదనే - ఖండించుట' అనే అర్థాన్ని శ్రీ శంకరులు 'కృత్'తో ముగిసే అనేక నామములకు వాడారు. ధర్మము తప్పినవారికి ఆనందములను హరించేవాడు స్వస్తికృత్.

## 903. స్వస్తి

- మంగళ స్వరూపుడు, సుఖనిధానము, పరమానందము.

### ఓం స్వస్తినే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వయమేవ మహన్ - మంగళమ్ స్వస్తి.** తానే స్వయముగా మహామంగళ స్వరూపుడైనవాడు స్వస్తి.

శ్రీ విష్ణుసహస్రనామ సత్సంగము (ఢిల్లీ) వారిచ్చిన అదనపు వివరణ – సమస్త జీవులూ ఐహిక విషయానురక్తులై, భోగలాలసులై జీవించడానికి ఆసక్తి చూపుతాయి. కాని ఇది నిజమైన ఆనందము కాదు. కనుక భక్తులు తనను (భగవంతుని) కోరి, పొంది, నిజమైన ఆనందము అనుభవించేలా చేసేవాడు గనుక స్వస్తి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **మంగళ స్వరూపమ్ ఆత్మీయమ్ పరమానంద లక్షణమ్ స్వస్తి.** పరమాత్ముడు మంగళ స్వరూపుడు. ఆత్మీయుడు. పరమానందము ఆయన గుణము. కనుక ఆయన స్వస్తి.

శ్రీ తిరుప్పాణాళ్వారు – నా కన్నులు ఆ అమృతమూర్తిని చూచాయి. ఇంక అవి చూపును త్రిప్పుకొనలేవు. మరల దేనినీ చూడనిచ్చగించవు.

సనత్కుమారీయము – **యత్ర న అన్యత్ పశ్యతి, న అన్యత్ విజానాతి, న అన్యత్ శృణోతి, తద్ భూమా.** దేనినుండి కన్నులు మరలవో, మనసు చెదరదో, చెవులు వినకుండా ఉండలేవో అదే పరమానందము. శుభము. దానిని మించినదేదీ లేదు.

భగవంతుని పరమానంద శుభలక్షణములను గురించి ఆళ్వారులు లెక్కలేనన్నిసార్లు వర్ణించారు. భగవానుడు **'పవిత్రాణామ్ పవిత్రమ్', 'మంగళానామ్ చ మంగళమ్', 'మంగళమ్ పరమ్'**.

శ్రీ చిన్మయానంద – సచ్చిదానందము భగవంతుని తత్వము. అశుభములు ఆయన చెంత ఉండజాలవు.

శ్రీ సత్యసంధ తీర్థ – **సు అత్యన్తమ్ అస్తి ఇతి సకల దేశ కాలేషు వర్తత ఇతి స్వస్తి.** సదా, భూత, భవిష్యత్, వర్తమాన కాలములందు ఉండేవాడు స్వస్తి.

## 904. స్వస్తిభుక్

- మంగళములను కాపాడువాడు.
- మంగళములను, ఆనందమును అనుభవించేవాడు.
- భక్తులచే మంగళములను, ఆనందమును అనుభవింపజేయువాడు.
- భక్తులకు సుఖములనిచ్చేవాడు.

**ఓం స్వస్తిభుజే నమః**

భుజ్ - పాలనాభ్యవహారయోః - పాలించుట, రక్షించుట, భుజించుట, అనుభవించుట – ఇలా అనేక అర్థాలున్నాయి.



వికీపీడియా చిత్రం. తిరుచిరాపల్లి అమ్మ మంటపం

https://commons.wikimedia.org/wiki/File:Amma_Mandapam_Place_(Tiruchirapalli,_Inde)_(14104401583).jpg
by Jean-Pierre Dalbéra from Paris, France

శ్రీ భట్టుల వ్యాఖ్య – భుజ్ - రక్షించుట, పాలించుట. **సర్వమ్ ఏతత్ స్వస్తి భునక్తి - పాలయతి ఇతి స్వస్తిభుక్.** భగవానుడు సకల శుభములను, భక్తులను రక్షించును. భక్తులు మనసులో భగవానుని అనుభవించుట, అందువల్ల పరమానందము పొందుట, తద్వారా అనేక సేవలు చేయుట – ఇవన్నీ కూడా భగవంతుడు రక్షించును.

నిరుక్తి – **పాలనాత్ మంగళస్య ఇవ స్వస్తిభుక్ చ ఇతి గమ్యతే.** మంగళములన్నింటిని కాపాడును గనుక ఆయనను స్వస్తిభుక్ అని కీర్తింతురు.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థం చెప్పారు. **స్వస్తి - కళ్యాణమ్ భునక్తి - పాలయతి సమ్రత్యాణామ్ ఇతి స్వస్తిభుక్.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – భుజ్ - అనుభవించుట. **తదేవ భునక్త ఇతి స్వస్తిభుక్, భక్తానామ్ మంగళమ్ స్వస్తి భునక్తి ఇతి వా స్వస్తిభుక్.** స్వయముగా మంగళములను అనుభవించువాడు మరియు భక్తులచే మంగళములను అనుభవింపజేయువాడు స్వస్తిభుక్.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **స్వయమ్ స్వస్తి భునక్తే అనుభవతి ఇతి స్వస్తిభుక్.**

శ్రీ సత్యసంధ తీర్థ – **స్వస్తి సుఖమ్ భోజయతి ఇతి స్వస్తిభుక్.** భక్తులచే సుఖములను భుజింప (అనుభవింప) జేయువాడు స్వస్తిభుక్.

## 905. స్వస్తిదక్షిణః

- తన భక్తులకు మంగళములను దక్షిణగా ఇచ్చువాడు. తనకు కైంకర్యము చేయడానికి దివ్యశరీరము, శక్తి మొదలైనవానిని ఆత్మార్పణ అనే యజ్ఞంలో నిత్యముక్తులైన భక్తులకు దక్షిణగా ఇచ్చేవాడు.
- మంగళ స్వరూపమున వృద్ధిపొందువాడు. శుభదాతయై వర్ధిల్లువాడు.

### ఓం స్వస్తిదక్షిణాయ నమః

దక్ష్ - వృద్ధౌ - పెరుగుట. దక్షిణ అనగా బహుమతి, శక్తి, సామర్థ్యము, వృద్ధి పొందుట అనే అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – దక్షిణ అనగా యజ్ఞయాగాదులలో పురోహితులకు ఇచ్చే బహుమతి. 'స్వస్తి' అనగా 'మంగళము'ను దక్షిణగా ఇచ్చేవాడు స్వస్తిదక్షిణుడు. **అన్యాదపి స్వ-పరిచర అనుగుణమ్ దివ్య శరీర శక్త్యాది స్వస్తి స్వాత్మ దాన దీర్ఘసత్రే ఋత్విగ్భ్యో దేయా దక్షిణా అస్య ఇతి స్వస్తిదక్షిణః.** భగవానుడు 'దీర్ఘసత్రము' అనే నిత్యయాగాన్ని నిర్వహిస్తున్నాడట. అందులో నిత్యులు, ముక్తులే ఋత్విక్కులు. భగవంతుడు తనను తాను భక్తుల ఆనందానికై సమర్పించుకోవడమే ఈ యాగంయొక్క ప్రయోజనం. ఇందులో భగవానుడు తనను తాను నిత్యులు, ముక్తుల కొరకు అర్పించుకొంటాడు. అంతే గాకుండా ఆయన నిత్యులు, ముక్తులకు శుద్ధసత్వమయమైన (శాశ్వతమైన, క్షీణత లేని) దివ్యశరీరమును, మరియు శక్తి జ్ఞానాదులను (స్వస్తి) ప్రసాదిస్తాడు. ఈ యాగంలో భగవానుడే యజమాని. ఆయన తన ఋత్విక్కులకు (నిత్యులకు, ముక్తులకు) ఇచ్చేదే దక్షిణ. కనుక ఆయన స్వస్తిదక్షిణుడు.

**శక్త్యాద్యాః ప్రకృతిః స్వస్తి స్వాత్మదానం చ దక్షిణా ఆత్మార్పణాఖ్యయాగే తు యస్యాస్తి స్వస్తిదక్షిణః.** తన కైంకర్యము చేయడానికి తగినటువంటి దివ్యశరీరము, శక్తి మొదలైనవి 'స్వస్తి' అనబడుతాయి. వాటిని 'ఆత్మార్పణ' అనే యజ్ఞంలో నిత్య ముక్తులయిన భక్తులకు దక్షిణగా ఇచ్చేవాడు స్వస్తిదక్షిణుడు. (శ్రీకైవల్య సారధి).

శ్రీ బలదేవ విద్యాభూషణ ఇలాంటి అర్థమే చెప్పారు.

**స్వ-నిత్యమ్ ధామాదికమ్ కళ్యాణ రూపత్వాత్ స్వస్తి ఇత్యుచ్యతే**
**సా దక్షిణా స్వ-భక్తి-సత్ర ఋత్విగ్భ్యో దేయమ్ అస్య ఇతి స్వస్తిదక్షిణః**
ఈ వ్యాఖ్య ప్రకారము శ్రీవైకుంఠము, మరియు ఆ పరంధామమునకు నిత్యమంగళగుణములు 'స్వస్తి' అనబడుతాయి. వాటిని యజ్ఞంలో దక్షిణగా ఋత్విక్కులకు ఇచ్చేవాడు స్వస్తిదక్షిణుడు.

శ్రీ విష్ణుసహస్రనామ సత్సంగము, ఢిల్లీ – యజ్ఞములు చేసేవారికి భగవంతుడు తనవంతు దక్షిణగా మంగళములు కూర్చును గనుక స్వస్తిదక్షిణుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇలాంటి అర్థం చెప్పారు. **స్వస్తిభిః ఆశీర్భిః దక్షయతి వర్ధయతి స్వజనానాన్ ఇతి స్వస్తిదక్షిణః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఈ నామమునకు మూడు అర్థాలు చెప్పారు.

(1) **స్వస్తిరూపేణ దక్షతే వర్ధతే.** దక్ష - వర్ధిల్లుట. మంగళస్వరూపుడై వర్ధిల్లువాడు. తన భక్తులకు మంగళములిచ్చి గొప్పగా భావించువాడు స్వస్తిదక్షిణుడు.

(2) **స్వస్తి దాతుమ్ సమర్థ ఇతి వా స్వస్తిదక్షిణః.** దక్షిణ - శక్తి, నైపుణ్యము. మంగళములను ప్రసాదించే శక్తి సామర్థ్యములు కలవాడు స్వస్తిదక్షిణుడు.

(3) **దక్షిణ శబ్ద ఆశుకారిణీ వర్తతే, శీఘ్రమ్ స్వస్తి దాతుమ్ అయమేవ సమర్థ ఇతి స్వస్తిదక్షిణః.** దక్షిణ - వేగంగా, వెంటనే. భక్తులకు వేగంగా, వెంటనే మంగళములను ఈయగలిగినవాడు స్వస్తిదక్షిణుడు.

వీనికి శ్రీ శంకరులు చెప్పిన ప్రమాణములు – **స్మరాదేవ దేవస్య సిద్ధయన్తి సర్వసిద్ధయాః.**
**స్మృతే సకలకళ్యాణ భాజనమ్ యత్ర జాయతే పురుషః తమ్ అజమ్ నిత్యమ్ వ్రజామి స్మరణమ్ హరిమ్.** ఎవనిని స్మరించినంతమాత్రంచేత సకలశుభాలు లభిస్తాయో, అటువంటి నిత్యుడు, శాశ్వతుడు అయిన హరిని శరణు పొందుతున్నాను.
**స్మరణాదేవ కృష్ణస్య పాపసంఘాత పంజరమ్ శతధా భేదమ్ ఆయాతి గిరిర్వజ్రహతో యథా.** శ్రీకృష్ణపరమాత్ముని స్మరించినంతమాత్రాన పాపరాశి అంతా కూడా (ఇంద్రుని) వజ్రంతో కొట్టబడిన పర్వతంలా ముక్కలై పోతుంది.

శ్రీ చిన్మయానంద – మంగళము అనేది శ్రీమన్నారాయణుని స్వరూపము. ఆయన తన భక్తులను చేరి తన మంగళగుణములను వారికి ప్రసాదించును.

శ్రీ వాసిష్ఠ – **స్వస్తిమ్ దక్షతే వర్ధయతి ఇతి స్వస్తిదక్షిణః వరదహస్తో మంగళహస్త ఇతి.** ఆయన వరదహస్తమే మంగళహస్తము. ఆయన తన భక్తులకు మంగళములను, వరములను ప్రసాదించి మంగళమూర్తిగా వర్ధిల్లును. కనుక స్వస్తిదక్షిణుడు.




రథంలో శ్రీ రామ కృష్ణులను మధురకు తీసికొని వెళుతున్న అక్రూరుడు. 1900 కాలపు చిత్రం. వికీపిడియానుండి.
https://commons.wikimedia.org/wiki/File:Krishna_and_Balarama_are_seated_in_a_chariot_driven_by_Akrura.jpg



## అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః |
## శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః || (97)

### 906. అరౌద్రః

- రౌద్రము లేనివాడు. సౌమ్యుడు.

**ఓం అరౌద్రే నమః**

రుధిర్ - అశ్రువిమోచనే - ఏడ్చుట, అరచుట. రుద్ర - రోదయతి ఇతి రుద్ర - ఇతరులను ఏడ్పించే (బాధించే) లక్షణము. రౌద్రము - రుద్రగుణము, కోపలక్షణము. భగవానుడు రౌద్రుడు కాడు గనుక అరౌద్రుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **పరమైశ్వర్యేఽపి గుణ శీతలిమ్నా అరౌద్రః.** భగవానుడు సర్వేశ్వరుడు. అయినా చల్లనివాడు. కళ్యాణ గుణాఢ్యుడు.

**శాంతాకారం భుజగశయనమ్ పద్మనాభం సురేశం**
**విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం .....**
అనే ధ్యానశ్లోకము భగవానుని శాంతగుణస్తుతితో మొదలవుతుంది. భగవంతుని శాంతగుణంనుండి కరుణ, ప్రేమ ప్రకాశిస్తాయి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **పరమశాంత సౌమ్య సుందరాకారః.**

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుడు అనన్య తేజస్సుతో ప్రకాశిస్తున్నాగాని ఆ తేజస్సు భక్తులకు ఏమాత్రం కష్టం కలిగించదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అవాప్త సర్వకామత్వేన ద్వేషాదేః అభావాత్ ఇతి అరౌద్రః.** భగవానుడు అవాప్త సర్వకాముడు. అనగా ఆయన కోరుకొనవలసినది ఏమీ లేదు. కామము లేనియెడల ద్వేషము, క్రోధము ఉండవు. కనుక ఆయన అరౌద్రుడు.

రౌద్రము మూడు విధములుగానుండును (1) కర్మరౌద్రము (2) రాగరౌద్రము (3) కోపరౌద్రము. ఈ మూడు రౌద్రములు లేనివాడు శ్రీహరి.

శ్రీ రఘునాధ తీర్థ – **రుదతి అనేన ఇతి రుద్రమ్ - దుఃఖమ్, తజ్జనకత్వేన తత్సంబంధిత్వాత్ రౌద్రమ్ కామక్రోధాది దుఃఖ సాధనమ్, తదస్య నాస్తి ఇతి అరౌద్రః.** కామక్రోధాదులచే దుఃఖము (రుద్రము) జనించును. అలాంటి దుఃఖముతో ఏమాత్రము సంబంధము లేనివాడు గనుక భగవంతుడు అరౌద్రుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **ఆనందపూర్ణత్వాత్ అరుద్రః ప్రసన్నమూర్తిః.** భగవానుడు పరమానంద ప్రశాంతమూర్తి. అరౌద్రుడు.

## 907. కుండలీ

- నిత్య దివ్యాభరణములైన కుండలములు ధరించినవాడు.
- సాంఖ్యము (జ్ఞానయోగము), యోగము (కర్మయోగము) అను రెండు కుండలములుగా ధరించినవాడు.
- సూర్యమండల సదృశములైన కుండలములు ధరించినవాడు.

### ఓం కుండలినే నమః

కుండలములు అనగా చెవులకు ధరించే ఆభరణములు. కర్ణికా **తాలపత్రమ్ స్యాత్ కుండలమ్ కర్మవేష్టనమ్** (అమరకోశము 2.10.3)

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యథోచిత నిత్య దివ్య భూషణః కుండలీ.** నిత్యదివ్యభూషణములను తనకు తగినట్లుగా ధరించినవాడు కుండలి. ఇక్కడ కుండలములు అనేక ఆభరణములకు సంకేతముగా చెప్పబడినవి. ప్రత్యేకంగా చెప్పాలంటే మకరకుండలములు ధరించినవాడు కుండలి.

శ్రీ భగవద్రామానుజులు శరణాగతి గద్యములో భగవంతుని ఇలా వర్ణించారు. **నిరతిశయ ఔజ్వల్య కిరీట మకుట చూడావతంస మకర కుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్త దామోదర పీతాంబర కాంచీగుణ నూపురాది అపరిమిత దివ్యభూషణ!.**

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి 7.3.10, 8.8.1లో భగవంతుని మకరకుండలముల వర్ణన ఉన్నది. అవి ఎంతో సుందరంగా ప్రకాశిస్తూ కదులుతున్నవి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 'కుండలి' అంటే 'సర్పము' అనే అర్థం కూడా ఉన్నది. **కుండలాకార వపుః అస్య ఇతి కుండలీ.** చుట్టుకొని ఉన్న దేహము కలిగినది కుండలి (అమరకోశము వ్యాఖ్యానము). శ్రీ శంకరులు ఈ అర్థం వాడుతూ, **శేష రూప భాక్ కుండలీ –** అని చెప్పారు. ఆదిశేషునిరూపంలో ఉన్నవాడు కుండలి.

కుండలి అంటే కర్ణాభరణం అనే అర్థంలో కూడా శ్రీ శంకరులు మరొక వ్యాఖ్య (రెండు అర్థాలు) చెప్పారు.

(1) సూర్యమండల సదృశములైన కుండలములు ధరించినవాడు కుండలి. ఆయన కుండలములు సూర్యునివలె ప్రకాశిస్తున్నాయి.

(2) సాంఖ్యము (జ్ఞానయోగము), యోగము (కర్మయోగము) అనేవానిని కుండలములుగా చెవులకు ధరించినవాడు కుండలి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి భాగవతం (12.11.12)నుండి ఉదాహరించారు.

**బిభర్తి సాంఖ్యమ్ యోగమ్ చ దేవో మకరకుండలే**
**మౌళిమ్ పదమ్ పరమేష్ఠ్యమ్ సర్వలోకాఽభయంకరమ్**

పరమాత్ముడు సాంఖ్యమును, యోగమును తన మకరకుండలములుగా ధరించాడు. బ్రహ్మలోకమే ఆయన కిరీటము.

(శ్రీ పెమ్మరాజు రాజారావు) రాజయోగమున కుండలినీశక్తిని మేల్కొల్పుటవలన పొందబడువాడు పరమాత్మ యగుటచేత 'కుండలీ'యనబడెను.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – కుడి - దాహే - దహించుట నుండి 'కుండ్' వచ్చును. కుడి - రక్షణే - రక్షించుట నుండి 'కుండ్' వచ్చును. ఉనాదిసూత్రము (1.104) **'కలస్తృపశ్చ'** ప్రకారము కుండ్ + అల - కుండల. **కుండలమ్ దాహో రక్షణమ్ వా, స అస్య అస్తి ఇతి కుండలీ.** దహించెడి, రక్షించెడి గుణము కలిగినది కుండలము. అలాంటి కుండలములు ధరించినవాడు 'కుండలీ'. భగవంతుడు

సృష్టించిన సూర్యుడు, అగ్ని – వీనికి దహన గుణము (కాల్చుట), రక్షణ గుణము (జీవ పోషణ) ఉన్నవి. అలాగే భగవంతుడు రక్షణ (సృష్టిపాలన), దహన (లయ) గుణములు కలిగియున్నాడు. కనుక ఆయన కుండలి.

శ్రీ సత్యసంధ తీర్థ – **మకరకుండలవాన్ కుండలీ.**

శ్రీ రఘునాధ తీర్థ – **కుండలమ్ దహనమ్ శత్రూణామ్ అస్మాత్ భవతి ఇతి కుండలీ.** శత్రువులను దహించే (నాశనం చేసే) వాడు కుండలి.

## 908. చక్రీ

- చక్రాయుధమును ధరించినవాడు.

**ఓం చక్రిణే నమః**

97వ శ్లోకము. 908వ నామము. చక్రీ – **అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః**
107వ శ్లోకము. 995వ నామము. చక్రీ – **శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః**
ఇలాంటిదే మరొక నామము:
45వ శ్లోకము. 417వ నామము. సుదర్శనః – **ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః**



శ్రీ చక్రత్తాళ్వారు. 1825 కాలపు చిత్రం. వికీపిడియానుండి

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తాదృశః దివ్యాయుధః చక్రీ.** చక్రమువంటి దివ్యాయుధములను ధరించినవాడు చక్రి. ఇంతకుముందు 'కుండలీ' నామములో అనేక దివ్యాభరణములకు సంకేతముగా కుండలములను చెప్పినట్లే ఇప్పుడు అనేక దివ్యాయుధములకు సంకేతముగా చక్రమును చెప్పారు. ఇంకా భగవానుని సౌందర్యము అనేక దివ్యాభరణ దివ్యాయుధములతో ఎలా ప్రకాశిస్తున్నదో శ్రీ భట్టులు వివరించారు. 107వ శ్లోకము 995వ నామము 'చక్రీ' వివరణలో శ్రీ భట్టులు భగవంతుని భక్తరక్షకత్వమును విశేషంగా వివరించారు. ఇలా పునరుక్తి లేకుండా వ్యాఖ్యానించారు.

**నిత్య సుదర్శనః స్వభృత్య ప్రతిభట రక్షః అసుర శోణిత కల్మాషిత జ్వాలాంచితమ్ చక్రమపి తథైవ ఇతి చక్రీ** (995వ నామము వ్యాఖ్య). భగవానుడు సదా సుదర్శన చక్రమును ధరించియున్నాడు. భగవద్భక్తుల విరోధులైన రాక్షసుల రక్తంతో ఆ చక్రం తడిసియున్నది. మరియు అగ్ని జ్వాలలు వెదజల్లుతూ ఉన్నది.

శరణాగతి గద్యంలో శ్రీ భగవద్రామానుజులు భగవంతుని దివ్యాయుధాలను ఇలా వర్ణించారు. **స్వానురూప అచింత్య శక్తి శంఖ చక్ర గదాऽసి శార్ఙ్గాది అసంఖ్యేయ నిత్య నిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధ!** అని. భగవంతుని దివ్యాయుధముల గురించి దివ్యప్రబంధములలో అనేక ప్రస్తావనలున్నాయి. ఆ చక్రం భగవంతుని ఆభరణము. మరియు సదా భక్తులను కాపాడడానికి సిద్ధంగా ఉన్నది.

శ్రీ వేలుక్కుడ కృష్ణన్. విష్ణు సహస్రనామ ఉపన్యాసము – చక్రము ఎంపెరుమాన్ యొక్క విశేషమైన చిహ్నము.

భాగవతము 8.20.30 – **సుదర్శనమ్ చక్రమ్ అసహ్య తేజ.**

రామాయణము 1.45.22 – **శంఖ చక్ర ధరో హరిః.**

విష్ణుపురాణము 5.30.22 – **నమస్తే చక్రహస్తాయ.**

భగవంతుడు గజేంద్రుని రక్షించడానికి చక్రాన్ని వాడాడు. కృష్ణావతారంలో చక్రాన్ని పలుమార్లు వాడాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సమస్త లోక రక్షణార్థమ్ మనస్తత్త్వాత్మకమ్ సుదర్శనాఖ్యమ్ చక్రమ్ ధత్తా ఇతి చక్రీ.** సమస్త లోకములను రక్షించుటకై మనస్సు అనే తత్త్వము కలిగిన, సుదర్శనము అనే పేరు కలిగిన చక్రమును ధరించినవాడు చక్రి. శ్రీ శంకరులు విష్ణుపురాణమునుండి ఉదాహరించారు.

**చల స్వరూపమ్ అత్యంత జవేనాంతరితానిలమ్**

**చక్రరూపమ్ చ మనోధత్తే విష్ణుః కరే స్థితమ్**

చలించే స్వభావము కలిగినది, వాయువుకంటె వేగము కలిగినది, మనస్సు తత్త్వము కలిగినది (అనగా నిలకడ లేనిది, అనగా ఎప్పుడూ తిరుగుతూ సిద్ధంగా ఉన్నది) అయిన చక్రమును విష్ణువు తన చేత ధరించియున్నాడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక వ్యాఖ్య . 107వ శ్లోకములోని 'చక్రీ' నామమునకు – **సంసార చక్రమ్ అస్య ఆజ్ఞయా పరివర్తత ఇతి వా.** సంసారమనే చక్రము ఇతని ఆజ్ఞవల్ల పరిభ్రమించుచున్నది. కనుక ఆయన చక్రి.

శ్రీ బలదేవ విద్యాభూషణ – చక్రము అంటే 'సైన్యము' అనే అర్థం కూడా ఉన్నది. అమరకోశము 2.8.78 – **వరూధినీ బలం సైన్యం చక్రం.** వ్యాఖ్య – **చకతే హన్తి పరబలమ్ ఇతి చక్రమ్.** ఈ అర్థంలో – **చక్రమ్ అపరిమిత సైన్యమ్ అస్య అస్తి ఇతి చక్రీ.** ఆయనకు అపరిమితమైన సైన్యము ఉన్నది గనుక ఆయన చక్రి.

## 909. విక్రమీ

- గొప్ప పరాక్రమము కలిగినవాడు
- ప్రత్యేకమై, పెద్ద అడుగు (పద విక్షేపము) కలవాడు (త్రివిక్రమావతారములో).
- తన వివిధ అవతారములలో ఎట్టి భేదములును లేనివాడు.
- రక్షించుట అనే విశేషమైన లక్షణము కలవాడు.

### ఓం విక్రమిణే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

9వ శ్లోకము – 76వ నామము – విక్రమీ – **ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః**

97వ శ్లోకము – 909వ నామము – విక్రమీ **– అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః**

'విక్రమ' అంటే 'పరాక్రమము', 'పెద్ద అడుగు' అనే అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – 76వ నామము 'విక్రమీ' – **ఇచ్ఛా ప్రతిహంతృ ప్రసక్తి పరిపంథి స్వభావమ్ అస్య ఇతి విక్రమీ.** ఆయన ఇచ్ఛకు వ్యతిరేకంగా ఏదీ జరుగనీయని స్వభావం కల పరాక్రమశాలి 'విక్రమీ'.

శ్రీ మద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – ఎలాంటి అవరోధాలనైనా తేలికగా తొలగించే 'విశేష క్రమము' కలవాడు 'విక్రమీ'.

శ్రీరాముడు సుగ్రీవునితో ఇలా అన్నాడు –

**పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్**

**అంగుళ్యమాత్రేణ తాన్ హన్యామ్ ఇచ్ఛన్ హరిగణేశ్వర**

ఓ వానరరాజా! నేను తలచుకొంటే పిశాచ దానవ యక్ష రాక్షస గణాలను వేనినైనా వ్రేలికొనతో నాశనం చేయగలను.

తిరువైమొళి 5.10.1 – నీవు జన్మించిన విధము, నీవు పడిన కష్టాలు, నీవు చూపిన మహిమలు, నీ లీలలు, నీవు చేసిన శత్రుసంహార లీల, నీవు పాండవుల ప్రక్కనుండి యుద్ధం చేయించిన తీరు – ఇవేవీ ఎవరికీ అర్థం కావు.

5.10.2 – నప్పిన్ని (నాగ్నజితి)ని పెండ్లాడడంకోసం నీవు ఏడు ఎద్దులను అదుపు చేశావు. పిల్లవానిగా ఉన్నప్పుడే నీవు బకాసురుని నోరు పగలదీసి వధించావు.

5.10.3 – తల్లిగా నటించి విషపు పాలీయబోయిన పూతన ప్రాణములు పీల్చివేశావు. నీ ఎఱ్ఱని చిన్ని పాదంతో శకటాసురుని తన్ని చంపావు.

909వ నామము 'విక్రమీ' – **గాంభీర్యానుకూల విలాసః విక్రమీ.** తన గాంభీర్యము (పరాక్రమము)నకు తగిన దివ్యచేష్టలు కలవాడు విక్రమీ.

శ్రీ పెరియాళ్వారు. తిరు 5.4.6 – నా భగవంతుడా! నీ దివ్య పరాక్రమ లీలలనన్నింటినీ నా మనోఫలకంపై ముద్రించుకొన్నాను. అవి గోడమీద బొమ్మలులా స్పష్టంగా కనుపిస్తున్నాయి.

శ్రీ మద్ శ్రీముష్ణమ్ ఆండవన్, శ్రీ రంగరామానుజ మహాదేశికన్ – తన పరాక్రమమునకు, శౌర్యమునకు తగిన 'విక్రమగతి' కలిగినవాడు 'విక్రమీ'. మహాబలిపురంలో శ్రీ త్రివిక్రమావతార శిల్పం. వికీపీడియా చిత్రం.



తిరుప్పావై 23 – పర్వత గుహలో వర్షాకాలములో చలనములేక పరుండి నిద్రించుచున్న సింహము మేలుకొని తీక్షణముగ చూచి, వాసన వేయు జూలును విదల్చి, అన్నివేపుల దొర్లి, దులుపుకొని, శరీరమును అటునిటు జాపి, గర్జించి, గుహ వెలుపలికి వచ్చునట్లుగా, ఓ అతసీపుష్ప సంకాశా! నీవు నీ అంతఃపురమునుండి అట్లే వెలుపలికి వేంచేసి, మనోహరము, శ్రేష్ఠము అగు సింహాసనమును అధిష్ఠించి, మేము వచ్చిన కార్యమును పరిశీలించి, కృపచేయ వేడుచున్నాము (చిత్రకవి ఆత్రేయ తెలుగు అనువాదం).

**అల ఇల కొలిచిన చరణాలకు మంగళం**
**ఆ లంకను గూల్చిన అతిబలునకు మంగళం**
**శకటాసురు కాల్ రాచిన యశస్వికి మంగళం**
**అసురద్వయమును అణచిన అడుగులకు మంగళం** – తిరుప్పావై 24 (చిత్రకవి ఆత్రేయ తెలుగుసేత).

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – క్రమ్ - పాద విక్షేపే - నడచుట, అడుగు వేయుట. **విశిష్టః క్రమ ఇతి విక్రమః స అస్య అస్తి ఇతి విక్రమీ.** లేదా, **విశిష్టమ్ క్రమణమ్ అస్య అస్తి ఇతి విక్రమీ.** విశిష్టమైన అడుగులు కలవాడు 'విక్రమీ'.

ఋగ్వేదము 1.22.17 – **ఇదమ్ విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ స-మూఢామస్య పాగ్ం సురే.**

ఋగ్వేదము 1.154.2 – **యస్యోరుషు త్రిషు విక్రమణేషు అధిక్షియన్తి భువనాని విశ్వా.** ఆయన మూడు పెద్ద అడుగులలో సకల భువనాలు ఇమిడియున్నాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'విక్రమ' అనగా 'పదవిక్షేపము' (అడుగు) మరియు 'పరాక్రమము' అనే రెండు అర్థాలనూ కలిపి వ్యాఖ్యానించారు. **విక్రమః పదవిక్షేపః శౌర్యమ్ వా, ద్వయమ్ చ అశేష పురుషేభ్యో విలక్షణమ్ అస్య అస్తి ఇతి విక్రమీ.** విలక్షణములైన (వేరెవరికీ లేని) పదవిక్షేపము మరియు శౌర్యము కలిగినవాడు 'విక్రమీ'.

శ్రీ భగవద్రామానుజులు శరణాగతి గద్యంలో భగవానుని కళ్యాణ గుణాల వర్ణనలో శౌర్య విక్రమాలను కూడా చెప్పారు. **స్వాభావిక అనవతికాతిశయ జ్ఞాన బల ఐశ్వర్య వీర్య శక్తి తేజస్ సౌశీల్య వాత్సల్య మార్దవ ఆర్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్య గాంభీర్య ఔదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతాది అసంఖ్యేయ కళ్యాణగుణ గణౌఘ మహార్ణవ!.**

శ్రీ వేలుక్కుడి కృష్ణన్ – భగవంతుడు తన భక్తులకు వారు అడుగకుండానే, అంతులేకుండా, ప్రశ్నించకుండా, ఆలోచించకుండా అనేక వరములు కురిపిస్తాడు. ఈ విషయంలో ఆయన అవధులు లేని, లోతు తెలియని, అనంత మణిసంపన్నమైన సాగరమువంటివాడు. ఇలా అవధులు లేకుండా భక్తులకు వరాలిచ్చేవాడు గనుక ఆయన 'విక్రమీ'.

శ్రీ సత్యసంధ తీర్థ – 'క్రమము' అనగా తారతమ్యము. 'వి' వ్యతిరేకార్థము నిచ్చును. విక్రమ - తారతమ్యము లేకుండుట. **క్రమః తారతమ్యమ్ అస్య అస్తి ఇతి క్రమీ, న క్రమీ విక్రమీ, స్వ అవతారేషు తారతమ్య రహిత ఇతి విక్రమీ.** తన అవతారములందు తారతమ్యము లేనివాడు 'విక్రమీ'. ఆయన మానవరూపంలో అవతరించినా, వరాహరూపంలో అవతరించినా గాని ఆయన పరిపూర్ణ పరమాత్ముడే. ఆయన గుణములలో కొరవడునదేమీ లేదు. కనుక ఆయన 'విక్రమీ'.

శ్రీ స్వామిదేశికన్. శరణాగతి దీపిక (17వ శ్లోకంలో) దీని ఎంపెరుమాన్ అవతార రహస్యముగా వర్ణించారు.

శ్రీ రఘునాథ తీర్థ – క్రమ - పని, వృత్తి, కార్యము. **విశిష్టః క్రమః వ్యాపారః ఇతి విక్రమీ.** విశిష్టమైన వ్యాపారము (పని) కలిగినవాడు 'విక్రమీ'. జగన్నాథుడైన భగవానుడు నిరంతరం తన సృష్టిపోషణ గురించి నిమగ్నుడైయుండును. ఇది ఆయనకు మాత్రమే వర్తిస్తుంది.

## 910. ఊర్జితశాసనః

- ఎవరూ ఉల్లంఘింపజాలని ఆజ్ఞలనిచ్చువాడు.
- శ్రుతి, స్మృతులే తన ఆజ్ఞలుగా కలవాడు.

### ఓం ఊర్జితశాసనాయ నమః

ఉర్జ్ - బల ప్రాణనయోః - బలపరచుట, జీవించుట. ఊర్జిత - బలమైన, తిరుగు లేని. శాస్ - అనుశిష్టౌ - బోధించుట, పాలించుట, సరిచేయుట. **అనుశాసనమ్ - ఆజ్ఞానువర్తనమ్ యస్య స ఊర్జిత శాసనః విష్ణుః అనతిక్రమణీయ నియమః.** ఉల్లంఘింపరాని శాసనము చేయువాడు అయిన విష్ణువు ఊర్జితశాసనుడు. ఆయన నియమములు అతిక్రమింపరానివి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **విరించి పురందరాది అలంఘ్యాజ్ఞః ఊర్జిత శాసనః.** బ్రహ్మేంద్రాదులు కూడా భగవంతుని ఆజ్ఞను ఉల్లంఘింపజాలరు గనుక భగవంతుడు ఊర్జిత శాసనుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **విధి రుద్రాది అలంఘ్య ఆజ్ఞత్వాత్ ఊర్జిత శాసనః.**

శ్రీ తిరుమళిశయాళ్వారు. నాన్ముగన్ తిరువంతాడి 38 – భగవానుని అభీష్టానికి విరుద్ధంగా దేవతలెవరూ కూడా కనీసం వ్రేలు కూడా ఎత్తలేరు.

**భీష్మాద్ వాతః పవతే, భీషోదేతి సూర్యః భీషాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధ్వాతి పంచమేతి –** తైత్తరీయోపనిషత్తు
ఆయనంటే ఉన్న భయంవల్లనే వాయువు వీస్తుంది. సూర్యుడు ఉదయిస్తాడు. అగ్ని, ఇంద్రులు తమ పనులు చేస్తారు. ఐదవవాడైన యముడు పరుగులు తీస్తారు.

**ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః**
**ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి గార్గి ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః –** బృహదారణ్యకోపనిషత్తు
యాజ్ఞవల్క్యుడు ఇలా అన్నాడు. ఓ గార్గీ, ఆయనయొక్క తిరుగులేని శాశనంవల్లనే బ్రహ్మ, సూర్య, చంద్రాదులు తమ తమ స్థానాలలో ఉన్నారు. భూమి, ఆకాశము తమ తమ స్థానాలలో నిలిచియున్నాయి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శ్రుతి స్మృతి లక్షణమ్ ఊర్జితమ్ శాసనమ్ అస్య ఇతి ఊర్జిత శాసనః.** శ్రుతులును, స్మృతులును భగవానునియొక్క బలమైన శాసనములు. కనుక ఆయన ఊర్జిత శాసనుడు. ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన ప్రమాణము –
**శ్రుతి స్మృతి మమైవాఽజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే ఆజ్ఞాచ్ఛేధి మమ ద్వేషీ మద్భక్తోఽపి న వైష్ణవః**
శ్రుతులు, స్మృతులు నా ఆజ్ఞలు. వానిని ఉల్లంఘించినవాడు నాకు శత్రువు. అటువంటివాడు నా భక్తుడైనా గాని నిజమైన వైష్ణవుడు కాదు.

శ్రీ చిన్మయానంద – భగవంతుని శాసనమునకు మినహాయింపులు లేవు. నిబంధనలు లేవు.

## 911. శబ్దాతిగః

- మాటలకు అందనివాడు. వాక్కుచేత గాని, మనసుచేత గాని చెప్పరానివాడు.

### ఓం శబ్దాతిగాయ నమః

**శబ్దమ్ అతిగచ్ఛతి - వాచమ్ అతిక్రమ్య వర్తతే ఇతి శబ్దాతిగః.** మాటలకు అతీమైనవాడు 'శబ్దాతిగః'.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అనంత జిహ్వేన అనంతేన, అనంతశాఖైః ఆమ్నాయైః సాక్షాత్ సరస్వత్యా చ దురుదారహ మహిమా శబ్దాతిగః.**

అనంతమైన నాల్కలున్న అనంతుని (వేయి నాల్కలున్న ఆదిశేషుని) చేత గాని, అనంత శాఖలున్న వేదములవలన గాని, సాక్షాత్తు సరస్వతిచేత గాని వర్ణింప వీలుగానివాడు. అనంత కళ్యాణగుణ సంపన్నుడు. వానిలో కొద్ది భాగాన్ని మాత్రమే భీష్ముడు శ్రీవిష్ణుసహస్రనామంలో కీర్తించాడు.



పుష్పగిరి శ్రీ భీమేశ్వరాలయంలో శ్రీ లక్ష్మీనారాయణులు, గరుత్మంతుడు. వికీపిడియా చిత్రం.
Photo by S.v.madhav. https://commons.wikimedia.org/wiki/File:Sri_lakshmi_narayana_swami_pushpagiri.JPG

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.5.8 – ఆయన శక్తి, సౌందర్యము, గుణములు, వైభవములు, లీలలు అనంతములు. ఆయన మెడలో తులసిమాలయే ఆయన పరమేశ్వరత్వానికి ఋజువు. నేను అనుభవించిన విషయాన్ని మాటలలో ఎలా చెప్పను? ఆయన మహత్వాన్ని మాటలలో చెప్పగలవారెవరైనా ఉంటే ప్రయత్నించండి.

తిరువైమొళి 8.5.4 – నీ కరుణార్ద్రమైన, తేనెలూరే, సమ్మోహనపరచే కన్నులు నా మనస్సును నింపివేశాయి. పాలకడలి మధ్యలో నీవు పవళించిన సుందరదృశ్యాన్ని తలచుకొన్నపుడెల్లా నేను ఆనందపరవశుడనౌతాను. ఈ అనుభవాలను నేను మాటలలో చెప్పలేను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శబ్దప్రవృత్తి హేతునామ్ జాత్యాదీనామ్ అసంభవాత్ శబ్దేన వక్తుమ్ శబ్దాతిగః.** ఆయనను మాటలలో వర్ణించడానికి అసాధ్యము. కనుక భగవంతుడు 'శబ్దాతిగః'. ఇందుకు శ్రీ శంకరులు తైత్తరీయోపనిషత్తునుండి, విష్ణుపురాణమునుండి ఉదాహరించారు.

తైత్తరీయోపనిషత్తు 2.3 – **యతో వాచే నివర్తన్తే, అప్రాప్య మనసా సహ.** ఆయనను వర్ణింపజాలక మాటలు వెనుదిరుగుతాయి. ఆయన మనసుకు అందరాడు.

విష్ణుపురాణము 1.17.22 – **న శబ్ద గోచరో యస్య యోగి ధ్యేయమ్ పరంపదమ్.** మాటలకందని ఆయన పరమపదమును యోగులు ధ్యానింతురు.

శ్రీ చిన్మయానంద – వేదములు సత్యమును నిర్వచింపలేవు. వివరింపలేవు. కేవలం సత్యంవైపు చూపెడతాయి. శాశ్వతమైన పరమసత్యము వేదములకు అతీతమైనది. మనసు, బుద్ధిలకు అందజాలనిది.

**912నుండి 945వరకు నామములను శ్రీ భట్టులు గజేంద్రమోక్షము పరంగా వ్యాఖ్యానించారు.**

## 912. శబ్దసహః

- ఆర్తనాదమును ఆలకించువాడు. అస్పష్టమైన పిలుపు (గజేంద్రుని మొర)ను కూడా సహించువాడు.
- (శబ్దములు) వేదముల అర్థాన్ని అంగీకరించువాడు. వేదములయొక్క తాత్పర్యము, వేదసారము తానే అయినవాడు.

### ఓం శబ్దసహాయ నమః

శప్ - ఆక్రోశే - బాధతో అరచుట, తిట్టుట. ఉణాది సూత్రము (4.97) **'శాసపిభ్యామ్ దదానౌ'** ప్రకారము 'శప్'కు 'దన్' ప్రత్యయము చేరిస్తే 'శబ్ద' అవుతుంది. అనగా ఆక్రోశించుట. సహ్ - మర్షణే - సహించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఈ నామమును గజేంద్రుని ఆర్తనాదము పరంగా వ్యాఖ్యానించారు. పశుపక్ష్యాదులు స్పష్టంగా మాట్లాడలేవు గనుక వాని పిలుపు అస్పష్టమైనది. **అస్పష్ట శబ్దానామ్ తిరశ్చామపి ఆర్తశబ్దమ్ అతి భారమివ సహతే ఇతి శబ్దసహః.** అస్పష్టంగా ఉన్న(గజేంద్రుని) ఆర్తనాదమును విని ఆ పిలుపును పెద్ద భారంగా (ఎంతో ముఖ్యమైన బాధ్యతగా) స్వీకరించినవాడు శబ్దసహుడు. అందుకే ఆయన సిరికిం జెప్పక, శంఖచక్రయుగముం జేదోయి సంధింపక, గజేంద్రుని కుయ్యాలించి, సంరంభంతో, గజప్రాణావనోత్సాహియై వేంచేసెను. ఆ గజేంద్రుని నోటనున్న ఒక పూవు చాలును అతని భక్తి తెలపడానికి.

**అతిధారమివాऽస్పష్టం తిరశ్చాం శబ్దమానూర్తిజం సహతే యః శబ్దసహః వస్వర్ణో మనురుత్తమ**

పశుపక్ష్యాదుల భాష స్పష్టంగా ఉండదు. అందుచేత సామాన్య మానవుడికి అది తెలియదు. అటువంటి భాషను కూడా ఆలకించువాడు శబ్దసహుడు. ఈ నామము అష్టాక్షరి. ఉత్తమమైనది. ఓం శబ్దసహాయ నమః. (శ్రీ కైవల్యసారధి).

**శ్రీ పోతన భాగవతము. గజేంద్రుని ఆర్తనాదము.**

లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చె, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్,
నీవే తప్ప నితఃపరం బెఱుగ, మన్నింపందగున్ దీనునిన్,
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

వినుదట జీవుల మాటలు
చనుదట చనరానిచోట్ల శరణార్థుల కో
యనుదట పిలిచిన సర్వము
గనుదట సందేహమయ్యె గరుణావార్ధీ!

ఓ కమలాప్త! యోవరద! యో ప్రతిపక్ష విపక్షదూర! కు
య్యో కవి యోగివంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విపులప్రభావ! రా
వే కరుణింపవే తలపవే శరణార్థిని నన్ను గావవే.



1790 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Indian_School,_late_18th_century_-_Vishnu_saves_the_elephant_Gajendra_from_the_clutches_of_the_crocodile_Makara._-_RCIN_1005113.o_-_Royal_Collection.jpg

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శబ్దము అంటే మంచి మాట కావచ్చును, చెడు మాట కావచ్చును. శ్రీ వాసిష్ఠ ఈ నామంలో 'శబ్ద' అంటే 'తిట్లు' అనే అర్థం తీసుకొన్నారు. **క్షమా విభూష సకలస్య లోకే, సర్వమ్ క్షమావాన్ సహతే క్షమాయామ్.** భగవానుని క్షమాగుణం కారణంగానే శత్రువుల తిట్లు కూడా భరిస్తాడు గనుక ఆయన 'శబ్దసహః'. శ్రీరాముని **'క్షమయా పృథ్వీ సమః'** అని వర్ణించారు. భగవంతుని ఈ క్షమాగుణమే విష్ణుభక్తులలో సాత్త్వికగుణంగా ప్రస్ఫుటమౌతుంది.

శ్రీ సత్యసంధ యతిరాజ – **భృగ్వాది భక్తకృత తర్జనరూప శబ్దమ్ సహత ఇతి శబ్దసహః.** భృగువు వంటి భక్తులు చేసి అవమానములను (దూషణములను) సహించినవాడు శబ్దసహుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వే వేదాః తాత్పర్యేణ తమేవ వదన్తి ఇతి శబ్దసహః.** సకల వేదములు సారముగా ఆయననే చెప్పును గనుక ఆయన శబ్దసహుడు.

**సర్వస్య చాహం హృదిసన్నివిష్టో మత్తః స్మృతి జ్ఞాన మపోహనం చ**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్** – గీత 15.15
సమస్త ప్రాణుల హృదయములలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహమును తొలగించుట) కలుగుచున్నవి. వేదముల ద్వారా తెలిసికొనదగినవాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను కూడా నేనే.

శ్రీ చిన్మయానంద – వేదములద్వారా తనను ప్రకటించే అవకాశం కల్పించినవాడు 'శబ్దసహః'

## 913. శిశిరః

- (గజేంద్రుని కాపాడడానికి) అతి వేగంగా వచ్చినవాడు.

- తన భక్తుల తాపత్రయములను చల్లార్చేవాడు.

## ఓం శిశిరాయ నమః

శశ - ప్లుత గతౌ - దూకుట, గెంతుట. ఉణాది సూత్రము (1.5.3) ప్రకారము 'శశ'కు 'కిరచ్' ప్రత్యయం చేరిస్తే 'శిశిరః' పదం వస్తుంది. **శశతి, శీఘ్రమ్ ఉత్ప్లుల్య గచ్ఛతి ఇత శిశిరః.** వేగంగా దూకుతూ వెళ్లేవాడు శిశిరుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆర్త శబ్ద శ్రవణానంతరమ్ అతి త్వరయా గతః శిశిరః.** గజేంద్రుని ఆర్తనాదము విని అతి త్వరగా అతనిని రక్షించడానికి పరుగులు తీసినవాడు శిశరుడు. ఇందుకు శ్రీ భట్టులు ఉదాహరించినది – **శ్రుత్వా చక్రగదాధరః, సాన్నిధ్యమ్ కల్పయామాస తస్మిన్ సరసి.** గజేంద్రుని ఆర్తనాదం వినగానే శ్రీమన్నారాయణుడు శంఖచక్రగదాధారియై అతివేగంతో ఆ సరసువద్దకు వచ్చాడు.

ఈ ఘట్టాన్ని అనేకులు వ్యాఖ్యాతలు, కవులు వివిధాలుగా, రమణీయంగా వర్ణించారు. భగవంతుడు శ్రీమహాలక్ష్మి అమ్మవారికి కూడా చెప్పలేదట. గరుడుని వేగం చాలదని తానే గరుడుని చేత ధరించి సరస్సువద్దకు వెళ్ళాడట.

తిరుమొళి 2.3.9 – గరుడునిపై వేంచేసి, చక్రాయుధంతో మొసలిని పరిమార్చి, గజేంద్రుని రక్షించినవాడు.

శిఱియ తిరుమడల్ – నారాయణా! మణివణ్ణా! అనంత శయనా! నా ఇక్కట్లను తొలగించు. అని గజేంద్రుడు మొరపెట్టుకొనగానే భగవానుడు మొసలిపై కోపించి, సరస్సువద్దకు పరుగులు తీసి, చక్రంతో మొసలిని రెండుగా ఖండించి, గజేంద్రుని కాపాడాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శశతి, ద్రుతమ్ గచ్ఛతి స్వజనానామ్ అవనాయ ఇతి శిశిరః.** తన భక్తులను రక్షించడానికి అతివేగంగా వెళ్లేవాడు శిశిరుడు.



గజేంద్రుని రక్షణ . 1910 కాలపు చిత్రం. వికీపీడియానుండి. https://commons.wikimedia.org/wiki/File:Gajendra_Moksha_print.jpg

**శ్రీ పోతన భాగవతము – భగవానుని తొందరపాటు.**

అల వైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యన గుయ్యాలించి సంరంభియై

సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగముంజేదోయి సంధింపడే
పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము జక్క నొత్తడు వివాదప్రోత్థిత శ్రీ కుచో
పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **శిశిరము అంటే చల్లని ఋతువు. శ్రీ శంకరులు ఈ అర్థం తీసుకొన్నారు. తాపత్రయాభి తప్తానామ్ విశ్రమ స్థానత్వాత్ శిశిరః.** తాపత్రయములను చల్లార్చేవాడు శిశిరుడు. తాపములు మూడు విధములు.

(1) ఆధ్యాత్మిక తాపములు – దైవముచే కలుగజేయబడేవి.

(2) అధిభౌతిక తాపములు – అగ్ని, వరద, భూకంపం వంటివి.

(3) అధిదైవిక తాపములు – అలసత్వము, కపటము, అశ్రద్ధ వంటివి.
ఈ మూడు రకాల తాపములను చల్లబరచేవాడు శిశిరుడు.

శ్రీ చిన్మయానంద – సంసారం అనే అగ్నిలో కాలుతున్నవారికి చల్లని విశ్రాంతి స్థలము శిశిరుడు.

శ్రీ వాసిష్ఠ 'వేగంగా వెళ్ళుట', 'చల్లని ఋతువు' అనే రెండు అర్థాలనూ కలిపారు. సకాలంలో ఋతువులు మారుస్తూ జీవుల మనుగడకు ఆధారమైనవాడు శిశిరుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దృష్టామాత్రః తేషామ్ సంతాపమ్ నివర్తయతి ఇతి శిశిరః.** భగవంతుని దర్శనమాత్రముననే భక్తుల సంతాపములు, కష్టములు దూరమగును గనుక ఆయన శిశిరుడు.

## 914. శర్వరీకరః

- ఆర్తులను రక్షించడానికి, దుష్టులను శిక్షించడానికి చేత పంచాయుధములను ధరించినవాడు.
- సంసారులకు మాయను (చీకటిని) కలిగించేవాడు. జ్ఞానులకు మాయ ఆవరించకుండా చేస్తాడు.
- అందరకు విశ్రాంతి సమయముగా రాత్రిని కలిగించేవాడు.
- రాత్రి సమయంలో చల్లని చంద్రకిరణాల రూపంలో ప్రకాశించేవాడు.
- తన శత్రువులకు వినాశనం కలిగించేవాడు.

### ఓం శర్వరీకరాయ నమః

శృ - హింసాయామ్ - బాధించుట, ఖండించుట, చంపుట. శ + ష్వరచ్ (ప్రత్యయము) - శర్వరి (ఉణాది సూత్రము 2.122). కరః - చేత ఆయుధములు ధరించినవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు గజేంద్రమోక్షము పరంగా వ్యాఖ్యను కొనసాగించారు. **హింసాపర విదారిణీ పంచాయుధీ కరే అస్య ఇతి శర్వరీకరః.** భగవానుడు గజేంద్రుని కాపాడడానికి వచ్చినపుడు ఆయన శర్వరీకరుడు. పంచాయుధములనగా పాంచజన్యము (శంఖము), సుదర్శనము (చక్రము), కౌమోదకి (గద), శార్ఙ్గము (ధనుస్సు), నందకము (ఖడ్గము).

**శ్రీ పోతన భాగవతము – శ్రీమహావిష్ణువు వేంచేసిన విధము**

ఇట్లు భక్తజనపాలన పరాయణుండును, నిఖిల జంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు, కరికులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి, లక్ష్మీకాంతా వినోదంబులం దనివి సాలించి, సంభ్రమించి, దిశలు నిరీక్షించి, గజేంద్ర రక్షాపరత్వంబు నంగీకరించి, నిజ పరికరంబును మరల నవధరించి, గగనంబున కుద్గమించి, వేంచేయు నప్పుడు

తనవెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుడు, వాని పొంతను ధను: కౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు దా వచ్చిరో
య్యన వైకుంఠపురంబునం గలుగువారాబాలగోపాలమున్.



శ్రావణ బెళగొళలో శ్రీ గజలక్ష్మి శిల్పం. వికీపీడియా చిత్రం.

Photo by Vibhorjain. https://commons.wikimedia.org/wiki/File:Sravanbelagola_Temple.jpg

తదనంతరంబ ముఖారవింద మకరంద బిందుసందోహ పరిష్యందమానానంద దిందిందిర యగు నయ్యిందిరాదేవి, గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవాద చేలాంచలయై పోవుచు.

తన వేంచేయు పదంబు పేర్కొన డనాథ స్త్రీ జనాలాపముల్
వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో ఖలుల్ వేద ప్రపంచంబులన్,
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుడు డేడి చూపుడని దిక్కారించిరో దుర్జనుల్.

వినువీధిం జనుదేర గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ
వనసంపత్తి నిరాకరిష్ణు గరుణావర్ధిష్ణు యోగీంద్ర హృ
ద్వన వర్తిష్ణు సహిష్ణు భక్తజనబృంద ప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లస దిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణున్.

ఇట్లు వొడగని
చనుదెంచెన్ ఘనుడల్లవాడె, హరిపజ్జం గంటిరే లక్ష్మి? శం
ఖ నినాదం బదే, చక్ర మల్లదె, భుజంగధ్వంసియున్ వాడె క్ర
న్నన నేతెంచె నటంచు వేల్పులు **నమోనారాయణా**యేతి ని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్.



17వ శతాబ్దపు నేపాల్ కు చెందిన విగ్రహం. వికీపీడియానుండి. Photo by: Wonderlane
https://commons.wikimedia.org/wiki/File:%22God_Vishnu_Riding_on_His_Mount,_Garuda,_Nepal,_16th_-_17th_century,_Schist%22_-_Tibetan_Buddhist_art_at_Art_Institute_of_Chicago_-_DSC_8260.jpg

శ్రీ శంకరుల వ్యాఖ్య – (అమరకోశ వ్యాఖ్యానము. **శృణాయామ్ చక్షూంసి ఇతి శర్వరీ.** జీవుల చూపును మూసివేసేది శర్వరి.) శ్రీ శంకరులు 'శర్వరి' అనగా 'రాత్రి' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. రాత్రిని కలుగజేసేవాడు శర్వరీకరుడు. అంధకారము అజ్ఞానమును సూచించును. సాంసారిక జీవులకు ఆత్మజ్ఞానము అంధకారమయము (అందరానిది, కానరానిది) అయిన శర్వరి. మరియు జ్ఞానులకు సంసారమే ఒక చీకటి (వెళ్ళరానిది, కోరరానిది). ఈ రకంగా శ్రీమన్నారాయణుడు శర్వరీకరుడు. సంసారులకు అవిద్యను కమ్ముకునేలా చేసి తన తత్వాన్ని వారికి తెలియనీయడు. ఆయనే జ్ఞానులకు మాయ ఆవరించకుండా చేస్తాడు. ఇందుకు శ్రీ శంకరులు గీత (2.69)నుండి ఉదాహరించారు.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః**

నిత్యజ్ఞానస్వరూప పరమానందప్రాప్తియందు స్థితప్రజ్ఞుడైన యోగి మేల్కొనియుండును. అది ఇతర ప్రాణులు అన్నింటికి రాత్రితో సమానము. నశ్వరమైన ప్రాపంచిక సుఖప్రాప్తికై ప్రాకులాడుచు ప్రాణులన్నియును మేల్కొనియుండును. అది పరమాత్మ తత్వమునెఱిగిన మునికి (మనన శీలునకు) రాత్రితో సమానము.

కాబట్టి సంసారులు అజ్ఞానంతో నిద్రపోయే కాలము, యోగి జ్ఞానసముపార్జనకు మేల్కొని ఉండే కాలము ఒకటే. అందుచేతనే పరమేశ్వరుడు సంసారులకు అజ్ఞానము, యోగులకు జ్ఞానము ఇస్తాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పగలు రజోగుణమును (క్రియాతత్పరతను), రాత్రి సమయం తమోగుణమును (కార్యహీనతను) సూచించును. ఈ పగలు రాత్రి మార్పులు మన జీవితమునకు గొప్ప సదుపాయములు. అన్ని సమస్యలు విస్మరించి మనం రాత్రివేళ విశ్రాంతి

పొందవచ్చును. జ్ఞానికి పగటిసమయంలో కూడా (రాత్రివంటి) ప్రశాంతత లభిస్తుంది. కాని అజ్ఞానికి రాత్రి మాత్రమే ఆ ప్రశాంతత లభిస్తుంది. ఇలా విశ్రాంతికి అవకాశం కల్పించేవాడు శర్వరీకరుడు (శర్వరి-రాత్రి).

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శర్వరీ నిశా లోకవిశ్రామదాయిన్, తస్య కరః సంపాదకః ఇతి శర్వరీకరః.** అందరికీ విశ్రాంతి సమయంగా రాత్రిని కలిగించేవాడు శర్వరీకరుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – శర్వరి - రాత్రి. కరః - కిరణములు. **శర్వాయామ్ - రాత్రౌ, కరః - కిరణా యస్య చంద్రార్గత రూపేణ ఇతి శర్వరీకరః.** రాత్రివేళల వెన్నెల అనే చల్లని చంద్రకిరణాల రూపంలో ప్రకాశించేవాడు శర్వరీకరుడు.

శ్రీ రఘునాథ తీర్థ – శర్వరి - హింస, నాశనము. కరః - చేయువాడు. **శర్వరీ - హింసా, తమ్ కరోతి ఇతి శర్వరీకరః.** తన శత్రువులకు నాశనం కలిగించేవాడు శర్వరీకరుడు.

**శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు – శ్రీ వేంకటేశ్వర వచనములు**

గరుడధ్వజా! యేమని చెప్పెడిది నీ ప్రభావంబు? నీ నాభి కమలమునం బుట్టెనట విరించి మీ మహిమం దెలియ శక్తుండు గాడట! నానా వేదంబుల నీ మహిమలు చెప్పునట; నీ మూర్తి కడ గుఱుతుం గానవట! రవిచంద్రులు నీ నయనంబులట; నీయపార తేజో మహిమంబు లెఱుంగలేరట! ఇంద్రాది దేవతలు నీ యాజ్ఞాధారులట; యొక్కొక్కమాఱును నీతో గినిసి నిన్నెదిరించలేక నీ శరణంబు వేడుకొందురట! పంచమహాభూతంబులు నీ ప్రకృతిగుణంబులట; నీ స్వభావంబు అట్టివి యని తెలుపజాలవట! సముద్రంబు నీ పాన్పట; నీ గుణంబుల లోతెఱుంగవట! మునులు భవదీయ స్వరూప సూచక వాదులట; నీ మాయ దాటనోపరట! చరాచర జగత్తు నీ సృష్టియట; నిన్నుం జూపి చెప్పనోపదట! నా శక్తియెంత? నేనెంత? నే నీ శ్రీపాదంబులు గతియని యుండగా నీవే దయదలంచెదవు గాక! శ్రీ వేంకటేశ్వరా!



అరగొండ శ్రీ ఆంజనేయస్వామి మందిరం




హనుమాన్ జంక్షన్ ఆలయం



## అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః |
## విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః || (98)

### 915. అక్రూరః

- క్రూరుడు కానివాడు (గజేంద్రుని రక్షించుటలో).
- అవాప్తకాముడగుట చేత క్రోధము లేనివాడు. కనుక క్రౌర్యము లేనివాడు.

**ఓం అక్రూరాయ నమః**

కృత్ - ఛేదనే - ఖండించుట. ఉణాది సూత్రము (2.21) '**కృతేచ్ఛః క్రూ చ**' ప్రకారము కృత్ + రక్ (ప్రత్యయము) నుండి 'క్రూరః' వచ్చును. క్రూరుడు కానివాడు అక్రూరుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతునిలో క్రూరత లేదు. తనపట్ల ఎంతో అపరాధం చేసిన రావణుడు యుద్ధంలో అలసిపోయినపుడు రాఘవుడు రావణుని సంహరించలేదు. విశ్రాంతి తీసికొని మరునాడు రమ్మని యుద్ధరంగంనుండి పంపివేశాడు.

ఇక గజేంద్ర సంరక్షణ విషయంలో – **గజ పరిజిగీర్షయా కరస్థైరపి ఆయుధైః గ్రాహమపి ఝుటితి అకృత్తవాన్ అక్రూరః.** భగవంతుడు ఆయుధాలు కలిగి ఉన్నప్పటికీ, వెంటనే మొసలిని చంపలేదు. ముందుగా గజరాజును, మొసలిని కూడా ఒడ్డుకు లాగాడు. అప్పటికీ మొసలి తన పట్టును వీడనందున భగవంతుడు తన చక్రాన్ని మొసలిపై ప్రయోగించాడు. అది కూడా క్రౌర్యం లేకుండా దానిని ఒక్కసారి ఖండించాడు. శ్రీ భట్టులు ఉదాహరించిన శ్లోకము –

**గ్రాహగ్రస్తమ్ గజేంద్రమ్ చ తం గ్రాహమ్ చ జలాశయాత్ ఉజ్జహార అప్రమేయాత్మా తరసా మధుసూదనః**

అప్రమేయాత్ముడైన మధుసూదనుడు మొసలి నోట చిక్కిన గజేంద్రుని, మరియు మొసలిని జలాశయంనుండి పైకెత్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అవాప్త సమస్త కామత్వాత్ కామ అభావాదేవ, తస్మాత్ క్రౌర్యమ్ అస్య న అస్తి ఇతి అక్రూరః.** భగవానుడు అవాప్త కాముడు. అన్ని కోరికలూ తీరినవాడు గనుక ఆయనకు ఇంక కోరికలు ఉండవు. కోరికలు లేనిచోట క్రోధము, క్రౌర్యము ఉండవు. కనుక ఆయన అక్రూరుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – హిరణ్యకశిపుని వధ సమయంలో భగవంతుడు కోపాన్ని తెచ్చిపెట్టుకున్నాడు. ప్రహ్లాదుని చూడగానే కరుణాప్రేమమూర్తి అయ్యాడు. శుద్ధసత్వమూర్తి అయిన శ్రీనారసింహుడు క్రూరుడు కానేరడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **పాండవ క్లేశ కారకమ్ దుర్వాసమ్ న కృతవాన్ ఇతి అక్రూరః**. పాండవులకు వనవాస సమయంలో దుర్వాసుడు క్లేశం కలిగించాడు (ద్రౌపది అక్షయపాత్రను తొలిచివేసిన తరువాత దుర్వాసుడు తన శిష్యగణంతో భోజనానికై వెళ్ళాడు). అయినాగాని దూర్వాసుని శిక్షించనివాడు అక్రూరుడు.

**శ్రీ పోతన భాగవతము – శ్రీమహావిష్ణువు మకరిని సంహరించిన విధము.**

అయ్యవసరంబున గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక, మనస్సమాన సంచారుండై, పోయి పోయి, కొంతదూరంబున శింశుమార చక్రంబునుంబోలె గురు మకర కుళీర మీన మిథునంబై, కిన్న రేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ వర కచ్ఛపంబై, భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె సరాగ జీవనంబై, వైకుంఠపురంబునుంబోలె శంఖ చక్ర కమలాలంకృతంబై, సంసారచక్రంబునుంబోలె ద్వంద్వ సంకుల పంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని.



గజేంద్ర మోక్షము.
శ్రీకాకుళం నారాయణ తిరుమల ఆలయంలో చిత్రం.
వికీపీడియా నుండి. Rajasekhar1961

కరుణాసింధుడు శౌరి వారిచరమున్ ఖండింపగా బంపె స
త్వరితాకంపిత భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగ చ్ఛటా
పరిభూతాంబుర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండభాండ చ్ఛటాం
తర నిర్వక్రము బాలితాఖిల సుధాంధ శ్చక్రముం జక్రమున్.

ఇట్లు పంచిన.
అంభోజాకర మధ్య నూతన నళిన్యాలింగన క్రీడనా
రంభుండైన వెలుంగుఱేని చెలు వారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభ ధ్వానముతో గొలంకువు గలంకం బొందగా జొచ్చి దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై.

భీమంబై తల ద్రుంచి ప్రాణముల బాపెం జక్ర మాశు క్రియన్
హేమక్ష్మాధర దేహముం జకితవన్యేభేంద్ర సందోహముం
గామ క్రోధన గేహమున్ గరటి రక్త స్రావ గాహంబు ని
స్సీమోత్సాహము వీత దాహము జయశ్రీ మోహమున్ గ్రాహమున్.

ఇట్లు నిమిష స్పర్శనంబున సుదర్శనంబు మకరి తల ద్రుంచు నవసరంబున.

మకర మొకటి రవి జొచ్చెను
మకరము మఱియొకటి ధనదు మాటున డాగెన్;
మకరాలయమున దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్.

తమముం బాసిన రోహిణీ విభుక్రియన్ దర్పించి సంసారదు:
ఖము వీడ్కొన్న విరక్త చిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి, పా
దము లల్లార్చి, కరేణుకావిభుడు సౌందర్యంబుతో నొప్పె, సం
భ్రమదాశాకరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుడై.

పూరించెన్ హరి పాంచజన్యము గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదారసిత ప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును, నిర్ధూతద్విషత్సైన్యమున్.

మెరసెన్ నిర్జరదుందుభుల్, జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెన్ బువ్వుల వాన జల్లు గురిసెన్, దేవాంగనా లాస్యముల్
పరగెన్, దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగె దరంగ చుంబిత నభోగంగా ముఖాంభోజమై.

## 916. పేశలః

- మనోహరమైన రూపము గలవాడు.
- మృదుమధుర స్వభావముగల కారుణ్యమూర్తి.
- సృష్టిని అనేక విధాలుగా విభజించినవాడు.
- రుద్రుడు ఆయనపట్ల భక్తుడు.

### ఓం పేశలాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సంభ్రమాత్ ఆయుధాయుధ స్రగ్ భూషాంబర రమణీయః పేశలః**

**త్వరాతిశయతః ప్రస్త స్రగ్భూషాంబర సుందరః గజేంద్ర రక్షా సమయే యోఽసౌ పేశల స్మృతః.** గజేంద్రుని రక్షించే సంరంభంలో త్వరిత గతిన వెళుతున్న శ్రీమహావిష్ణువు ధరించిన ఆభరణాలు, పూలమాలలు, వస్త్రాలు అన్నీ చెదిరిపోయి ఉన్నాయి. అలాంటి స్థితిలో అతిసుందరంగా, మనోహరంగా ఉన్నందున ఆయన పేశలుడు. (శ్రీకైవల్యసారధి)

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 3.5.1 – కొలనులో తామరపూవు తెంచుతున్న గజేంద్రుడు మొసలి పట్టులో చిక్కాడు. అలాంటి గజేంద్రుని వద్దకు నల్లని మేఘంలా ఉన్న శ్రీకృష్ణుడు భక్తవరదుడై వడివడిగా వచ్చాడు.

గజేంద్రుని రక్షణకు త్వరపడుతున్న భగవంతునికీ, 'పేశలః' నామమునకూ సంబంధం ఏమిటి? ఇందుకు శ్రీ కృష్ణన్ చెప్పిన వివరణ – ఆపన్నుడైన తన భక్తుని రక్షించడానికి శ్రీదేవుడు వడివడిగా వస్తున్నాడు. తన భక్తుని కాపాడడంలో ఆయనకు ఎంతో సంతోషం ఉన్నది. మరియు ఆ వేగంలో ఆయన వస్త్రాభరణాలు చెదిరి ఉన్నాయి. భగవంతుని సాన్నిధ్యంవలన ఆ వస్త్రాభరణాలకు అందం వస్తున్నది (వస్త్రాభరణాల వలన ఆయనకు అందం రాదు).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కర్మణా, మనసా, వాచా, వపుషా చ శోభనత్వాత్ పేశలః.** భగవానుని చేతలు, మనస్సు, మాటలు, రూపము అన్నీ రమణీయమైనవి గనుక ఆయన పేశలుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పూవువలె సుతిమెత్తని, కరుణాపూరితమైన హృదయము, మాటలు, చేతలు కలవాడు పేశలుడు.

శ్రీ చిన్మయానంద – భగవానుడు అనంత దయార్ద్రమూర్తి. ఆయన హృదయం భక్తులయెడ ప్రేమ, సౌకుమార్యంతో పొంగి పొరలుతున్నది. భక్తులు ఆయన రక్షణ కొరకు మ్రొక్కగానే ఆయన వారిని ఐహిక బంధాలనుండి విముక్తులను చేస్తాడు.

శ్రీ వాసిష్ఠ – పిశ్ - అవయవే - ఏర్పడుట. **పింశతి, అవయమ్ కరోతి, ఇతి పేశలః.** భగవంతుడు సృష్టిని అనేక భాగాలుగా విభజించాడు. ఉదాహరణకు శరీరాన్ని అవయవాలుగా విభజించాడు. నక్షత్ర మండలమును అనేక గ్రహ నక్షత్రాదులుగా విభజించాడు. కాలమును క్షణాలు, నిముషాలు, ఘంటలు, దినాలు, సంవత్సరాలుగా విభజించాడు. కనుక ఆయన పేశలుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – ప-ఈశ-ల - పేశల. **ఈశమ్ - రుద్రమ్, లాతి - భక్తత్వేన గృహ్ణాతి, ఇతి ఈశలః, పాతి ఇతి పః, పశ్చ అసౌ ఈశలశ్చ ఇతి పేశలః.** రుద్రుని తనకు భక్తునిగా కలిగినవాడు మరియు ఆయనను రక్షించువాడు పేశలుడు.

## 917. దక్షః

- దుష్ట శక్తులను వేగంగా రూపుమాపువాడు.
- గజేంద్రుని రక్షణ కొఱకు త్వరితగతిని వచ్చినవాడు (దక్ష్ - శీఘ్రార్థే).

- గజేంద్రుని రక్షణ కొఱకు త్వరితగతిని వచ్చే శక్తి కలిగినవాడు (దక్ష్ - శక్తిశాలీ).
- విశ్వరూపంలో ప్రవృద్ధుడైనవాడు (దక్ష్ - పెరుగుట).
- సృష్టి, పాలన, లయము కార్యములలో నిపుణుడు అయినవాడు (దక్ష్ - నైపుణ్యము).
- శత్రువులను నాశనం చేసేవాడు (దక్ష్ - హింసనయోః)

## ఓం దక్షాయ నమః

45వ శ్లోకము. 424వ నామము. దక్షః – **ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః**

98వ శ్లోకము. 917వ నామము. దక్షః – **అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః**

'దక్ష' అంటే పెరుగుట, వేగముగా పని చేయుట, వృద్ధి చెందుట, శక్తి కలిగియుండుట, బాధించుట వంటి అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

45వ శ్లోకం. 424వ నామము. **దక్షః** – ఈ నామమును శ్రీ భట్టులు శ్రీ కల్క్యావతారము పరంగా వ్యాఖ్యానించారు. **దస్యు వధే దక్షతే - శీఘ్రకారీ ఇతి దక్షః.** అతి వేగంగా దుష్టులను సంహరించేవాడు దక్షుడు. కల్కి.

ఈ నామమునకు శ్రీ శంకరులు చెప్పిన ఒక అర్థం – **సర్వ కర్మాణి క్షిప్రమ్ కరోతి వా దక్షః.** అన్ని పనులూ అతి వేగంగా చేసేవాడు దక్షుడు. అందుకే భగవంతుని గుణగణాల వర్ణనలో 'సంకల్పమాత్రేణ' అనే విశేషం తరచు కన్పిస్తుంది.

98వ శ్లోకం. 917వ నామము. **దక్షః – క్షిప్రమ్ ఆగంతా దక్షః.** గజేంద్రుని పిలుపు విని అతి వేగంగా వచ్చినవాడు దక్షుడు. 'దక్ష' అనగా 'శీఘ్రకారీ' అన్న భావాన్ని పెక్కు అనువాదకులు గ్రహించారు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **స్మృతిమాత్రః త్వరయా గతవాన్ ఇతి దక్షః**. భక్తులు స్మరించినంతనే వెంటనే వచ్చేవాడు దక్షుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే అర్థం చెప్పారు. **దక్షతే - శీఘ్రతామ్ కురుతే స్వజన అవనే ఇతి దక్షః.**

913వ నామము 'శిశిరః'కు, మరియు 917వ నామము 'దక్షః'కు కూడా శ్రీ భట్టులు 'గజేంద్రుని ఆర్తనాదం విని వేగంగా వచ్చినవాడు'అనే అర్థమే చెప్పారు. అయితే (1) రెండు అర్థాలు ఒకటి అయినా, నామములు వేరు గనుక పునరుక్తి దోషం లేదు. (2) శ్రీ శంకరులు కూడా 917, 918 నామములు 'దక్షః' మరియు 'దక్షిణః' కు ఒకే విధమైన అర్థం చెప్పారు. ఇక్కడ కూడా నామములు వేరు గనుక పునరుక్తి దోషం లేదు. (3) శ్రీ భట్టుల వ్యాఖ్యలో ఉన్న స్వల్ప అంతరాన్ని శ్రీ మద్ శ్రీముష్ణమ్ ఆండవన్ ఇలా వివరించారు. దక్షః – వేగంగా రావడానికి తగిన శక్తి సామర్థ్యములు కలవాడు. శిశిరః – వేగంగా వచ్చినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య

45వ శ్లోకములో **'దక్షః'** – దక్ష - వృద్ధి చెందుట. **జగద్రూపేణ వర్ధమానత్వాత్ దక్షః.** సకల జగత్తు రూపంలో వర్ధిల్లువాడు దక్షుడు.

98వ శ్లోకములో **'దక్షః' – ప్రవృద్ధః శక్తః శీఘ్రకారీ చ దక్షః.** వృద్ధి, శక్తి, వేగము అనే లక్షణములున్నవాడు దక్షుడు. సమర్థత, ప్రతిభ, కార్యనిర్వహణ చాతుర్యము, శక్తి సంపద, శీఘ్రకారిత్వము, పట్టుదల, అప్రమత్తత మున్నగు దివ్య లక్షణములు కలవాడు దక్షుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – **శీఘ్రకారీ చ దక్షః, త్రయమ్ చైతాత్ పరస్మిన్ నియతియమ్ ఇతి దక్షః.** తన సృష్టియందు నైపుణ్యము కలవాడు దక్షుడు.

శ్రీ చిన్మయానంద – సృష్టి, పాలన, లయము అనే కార్యములను నియమంగా, నైపుణ్యంగా, సమయబద్ధంగా చేసేవాడు దక్షుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – దక్ష్ - హింసాయామ్ - బాధించుట. **శత్రూణామ్ హన్తా దక్షః.** శత్రువులను నాశనం చేసేవాడు దక్షుడు.

సంస్కృత వ్యాఖ్యానాలను ఇతర భాషలలోనికి అనువదించడంలోను, మరింత వివరించడంలోను వచ్చే సమస్యలు, తద్వారా ఉత్పన్నమయ్యే భావభేదాలు ఇక్కడ 'శిశిరః', 'దక్షః' నామములలో (913, 917 నామములలో) గమనించవచ్చును.

సంస్కృతంలో శ్రీ భట్టుల వ్యాఖ్యానం ఇలా ఉంది.

(913) శిశిరః – **ఆర్త శబ్ద శ్రవణానంతరమ్ అతిత్వరయా** గతః **శిశిరః** (శాశ - ప్లుతగతౌ, సాన్నిధ్యమ్ కల్పయామాస తస్మిన్ సారసి).
(917) దక్షః – **క్షిప్రమ్ ఆగన్తా దక్షః.**

913వ నామంలోను, 917వ నామంలోను కూడా శ్రీ భట్టులు భగవానుని 'త్వరితగతి'ని స్తుతిస్తున్నారని అనుకోవచ్చును. అయితే ఈ రెండు నామముల అర్థాలలో ఉన్న స్వల్ప భేదాన్ని శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ ఇలా చెప్పారు (శ్రీ భట్టుల వ్యాఖ్యకు ఆయన వివరణ).

(913) శిశిరః – మొసలి నోట చిక్కిన గజేంద్రుని వద్దకు అతివేగంగా వచ్చినవాడు (శీఘ్రకారీ).
(917) దక్షః – అతివేగంగా గజేంద్రుని వద్దకు రావడానికి సామర్థ్యము కలవాడు (శక్తిశాలీ).
ఇలా చూస్తే శ్రీ భట్టుల వ్యాఖ్యానంలో పునరుక్తి లేదు. 425వ నామమును కూడా శ్రీ భట్టులు 'వేగంగా' అనే అర్థంలో చెప్పారు కాని అది శ్రీ కల్క్యవతార పరంగా.

శ్రీ శంకరులు ఈ 'శిశిరః', 'దక్షః' నామములకు పూర్తిగా భిన్నమైన వ్యాఖ్యలు చెప్పారు గనుక పునరుక్తి సమస్య అసలు లేదు.

శిశిరః – (చల్లని ఋతువు) **తాపత్రయ అభితప్తానామ్ విశ్రమ స్థానత్వాత్ శిశిరః.** తాపత్రయము వలన తప్తులనవారికి చల్లని ఆశ్రయము.

దక్షః – **ప్రవృద్ధః, శక్తః, శీఘ్రకారీ చ.** వృద్ధి,శక్తి, వేగము అనే లక్షణములు కలవాడు.

## 918. దక్షిణః

- ప్రసన్నత, ప్రేమ, శరణాగత వాత్సల్యము అనే గుణములున్నవాడు.
- అంతటా వ్యాపించినవాడు.
- ప్రళయకాలంలో సర్వమునూ నాశనం చేయువాడు.
- ఎంతో దాతృగుణము, దాక్షిణ్యము, దయ గలవాడు.
- వేగం కలవాడు. నిపుణుడు.

### ఓం దక్షిణాయ నమః

ఇంతకు ముందు నామము 'దక్షః' మరియు ఈ నామము 'దక్షిణః' ఒకే శబ్దంనుండి వచ్చాయి.

దక్ష్ - వృద్ధౌ, శీఘ్రార్థే - పెరుగుట, త్వరపడుట. ఉణాది సూత్రము (2.50) **'ద్రు దక్షిభ్యామ్ ఇనన్'** ప్రకారము 'దక్ష్' శబ్దానికి 'ఇనన్' ప్రత్యయం చేరిస్తే 'దక్షిణ' పదం వస్తుంది. సిద్ధాంత కౌముదిలో 'దక్షిణః' పదానికి ఇచ్చిన అర్థం. **దక్షతే వర్ధతే శీఘ్రకారీ భవతి వా స దక్షిణః, సరళో వామభాగః పరతంత్రోऽనువర్తనమ్.** (సరళ స్వభావము. నిజాయితీ, మర్యాద, వినయము). 'దక్ష' మరియు 'దక్షిణ' పదాల అర్థం - నైపుణ్యత, త్వరగా రావడం, వేగంగా కార్యాచరణ చేయడం. ఇవే కాకుండా (శ్రీ ఆప్టే నిఘంటువు ప్రకారం) ప్రసన్న,

ఆహ్లాద స్వభావం, మృదువర్తన అనే అర్థాలు కూడా ఉన్నాయి. కనుక 'దక్షిణ' అంటే త్వరగా వచ్చేవాడు, నాశనం చేసేవాడు, సరళ స్వభావం కలవాడు, భక్తులను వర్ధిల్లజేసేవాడు అనే అర్థాలను చెప్పవచ్చును.

శ్రీ భట్టులు 'మృదు స్వభావం కలిగిన, కరుణాపూరితమైన' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **తథా ఆగత్య, ధిఙ్మామ్, దూరగతోఽహమ్ త్వామ్, ఇతి సాంత్వనైః, గజేంద్రస్య అనుకూలః దక్షిణః.** భగవానుడు పరుగు పరుగున గజేంద్రుని వద్దకు రావడమే కాదు. వచ్చి, అయ్యో, నేను సమీపంలో లేకపోయానే – అని సాంత్వనవచనాలు పలికి గజేంద్రుని ఓదార్చాడు. ఇందుకు శ్రీభట్టులు విష్ణుధర్మము (69.83 నుండి ఉదాహరించారు.

**ప్రీతిమాన్ పుండరీకాక్షః శరణాగత వత్సలః భజన్తమ్ గజరాజానమ్ మధురమ్ మధుసూదనః** – విష్ణుధర్మము 69.83
శరణాగత వత్సలుడు, పుండరీకాక్షుడు అయిన మధుసూదనుడు తనను భజించిన గజేంద్రునిపట్ల ప్రసన్నుడయ్యాడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ ఈ నామము భగవానుని దాక్షిణ్యమును, సౌశీల్యమును, వినయమును, సౌహార్ధతను సూచించేదిగా వర్ణించారు. అఖిలాండకోటి బ్రహ్మాండకోటికి సర్వేశ్వరుడైన శ్రీమహావిష్ణువు ఒక జంతువుపట్ల ప్రసన్నుడై తన ఆలస్యానికి చింతిస్తూ సాంత్వన వచనాలు పలికాడు.

శ్రీ కృష్ణన్ ఈ ఘట్టాన్ని ఇంకా మధురంగా వర్ణించారు. భగవానుడు గజరాజు చెంత మోకరిల్లి అతని గాయాలను పరీక్షించాడు. తన దివ్య తిరుమేని పైని ఉత్తరీయాన్ని తీసి, ఊది, గజరాజు కాలికి కట్టి, ఉపశమనం కలిగించాడు. అంతే కాక తన ఆలస్యానికి చింతిస్తూ సాంత్వన వచనాలు పలికాడు. శరణాగత వాత్సల్యతకు ఇంతకంటే మరేమి ఉదాహరణ కావాలి?

రామాయణం యుద్ధకాండ (19.7)లో విభీషణుడు శరణుజొచ్చినపుడు శ్రీరాముడు **'వచసా సాంత్వయిత్వైనమ్ లోచనాభ్యామ్ పిబన్నివ'** – తన సాంత్వన వచనాలతోను, మరియు కన్నులతోను విభీషణుని త్రాగుతున్నట్లు (కటాక్ష వీక్షణాలతో తడిపినట్లు) ఉన్నాడట.

**శ్రీ పోతన భాగవతము**

'సంసార దుఃఖమును వీడ్కొన్న విరక్త చిత్తుని గతి' కరేణుకా విభుడు సౌందర్యముతో నొప్పెను. హరి 'దూరీభూత విపన్న దైన్యమగు' పాంచజన్యమును పూరించెను.

నిడుద యగు కేల గజమును
మడువున వెడలంగ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుణుకుచు
నుడిపెన్ విష్ణుండు దు:ఖ ముర్వీనాథా!

**కరమున మెల్లన నివురుచు**
**గర మనురాగమున మెఱసి కలయం బడుచుం**
**గరి హరికతమున బ్రతుకుచు**
**గర పీడన మాచరించె గరిణుల మరలన్.**



కెనడా మాంట్రియల్ ఆలయంలో శ్రీ లక్ష్మీనారాయణుల ప్రతిమలు.

Photo by : Ndoduc
https://commons.wikimedia.org/wiki/File:Temple_Sri_Sanatan_-_Montr%C3%A9al_-_QC_-_CA_-_Shiva_%26_Parvati.jpg

శ్రీ శంకరుల వ్యాఖ్య –

శ్రీ శంకరులు ఇంతకు ముందు నామము 'దక్షః' కు చెప్పిన అర్థము – **ప్రవృద్ధః శక్తః శీఘ్రకారీ చ దక్షః.** వృద్ధి, శక్తి, వేగము అనే లక్షణములున్నవాడు దక్షుడు. సమర్ధత, ప్రతిభ, కార్యనిర్వహణ చాతుర్యము, శక్తి సంపద, శీఘ్రకారిత్వము, పట్టుదల, అప్రమత్తత మున్నగు దివ్య లక్షణములు కలవాడు దక్షుడు.

ఇంతకుముందు నామము 'దక్షః' మరియు ఈ 'దక్షిణః' నామములకు ఒకే అర్థమున్నాగాని పునరుక్తి లేదని శ్రీ శంకరులు స్పష్టంగా చెప్పారు. ఎందుకంటే అర్థం ఒకటే అయినా నామములు వేరు. శ్రీ వేదవ్యాసుడు భగవానుని దక్షత గుణమును రెండు నామములలో ప్రస్తుతించాడు. **దక్షిణః శబ్దస్యాపి దక్ష ఏవ అర్థః, శబ్ద భేదాత్ న పునరుక్త్యమ్.**

అయితే శ్రీ శంకరులు ఈ 'దక్షిణః' నామమునకు మరొక అర్థాన్ని కూడా చెప్పారు. దక్ష - గతి హింసనయోః - వెళ్ళుట, (చంపుట) బాధించుట అనే అర్థాల ప్రకారం, **అథవా గచ్ఛతి హింసతి ఇతి వా దక్షః (దక్షిణః).** అంతటా వ్యాపించియుండేవాడు, ప్రళయకాలంలో అంతనూ అంతం చేసేవాడు దక్షుడు (దక్షిణుడు) అని కొందరు అనువాదకులు ఈ వ్యాఖ్యను వివరించారు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **దంశతి దుర్యోధన ఉద్యమమ్ ఇతి దక్షిణః.** దుర్యోధనుని పురోగతిని నాశనం చేసినవాడు దక్షిణుడు.

శ్రీ పెమ్మరాజు రాజారావు – దక్షిణలనగా యజ్ఞ యాగ వ్రతానుష్ఠాదులు పూర్తియైన యజమానుడు వానిని నిర్వర్తించిన ఋత్విక్కులకు, పురోహితులకు ఇచ్చునట్టి కానుకలు, ధన కనక వస్త్రాదులు, వివిధ సత్కారాలు. ఇవి అన్నియును భగవానుని తృప్తి కొరకు చేయు ఆరాధనమే అగుటవలన భగవానుడు 'దక్షిణః' అను నామమున ఆరాధ్యుడగుచున్నాడని భావన. మరియు భగవానుడు తననాశ్రయించిన భక్తులకు వారి వారి యర్హతలనుబట్టి దక్షిణలను (భూ, ధన, గృహ, పుత్ర, సుఖ భోగాదులను) ఇచ్చుచుండువాడు గాన దక్షిణ శబ్దముతో కీర్తింపబడుచున్నాడని భావము. 96వ శ్లోకము 905వ నామము 'స్వస్తిదక్షిణః' ఈ భావంలో వ్యాఖ్యానింపబడినది. ఇది భగవానుని దాక్షిణ్యగుణమును సూచించును.

పై భావమే శ్రీ చిన్మయానంద వివరణలో ఉన్నది.

శ్రీ వాసిష్ఠ – **క్షిప్రమ్ ఆగచ్ఛతి ఆహూత, ఆగత్య చ సంతుష్టో ముక్త హస్తమ్ దదాతి ఇతి ఉదారః స దక్షిణ ఉచ్యతే.** ఆర్తనాదము విన్నపుడు భగవానుడు త్వరత్వరగా వస్తాడు. వచ్చి వరములనిచ్చే ఉదారుడు. అలా ఆయన మనోహరంగా ఉంటాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ –

(1) **దక్షయతి వర్ధయతి ఇతి దక్షిణః.** తన భక్తులను వర్ధిల్లజేసేవాడు దక్షిణుడు (దక్షిణ - అభివృద్ధి).

(2) **విశ్వరంగే ఉదారతమో నాయకః.** సమస్త జగత్తులోను అత్యంత ఔదార్యం కలిగిన భగవానుడు దక్షిణుడు. (అమరకోశము 3.1.8. దక్షిణ - సరళ, ఉదారౌ చ)

## 919. క్షమిణాంవరః

- తన భక్తులను రక్షించడంలో అందరికంటె ముందుండేవాడు. భక్తరక్షణకై ఎంతో ఆతురత కలిగినవాడు.
- భూమి, తదితర బ్రహ్మాండముల భారమును మోసేవారిలో శ్రేష్ఠుడు.
- అత్యధిక శక్తిశాలి.
- భక్తుల అపరాధములను మన్నించేవాడు. శ్రేష్ఠమైన క్షమాగుణం కలిగినవాడు.

**ఓం క్షమిణాంవరాయ నమః**

క్షమ్ - సహనే - సహించుట, ఓర్చుకొనుట. వృణ్ - వరణే - ఏరుకొనుట, శ్రేష్ఠమైన. క్షమిణాంవరః - ఓర్పుగలవారిలో ఉత్తముడు. **సహనశీలాయామ్, క్షమావతామ్ మధ్యే వరః - శ్రేష్ఠః ఇత్యర్థః.** క్షమ అంటే శక్తిగల, సమర్థమైన అనే అర్థాలు కూడా ఉన్నాయి. మరియు క్షమ అంటే సహనము, క్షమాగుణము అనేవి సాధారణంగా తెలిసిన అర్థాలు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తద్ దర్శనేన ధృతాత్మా, అభవత్ తత్ర దేవేశః.** భగవానుడు గజేంద్రుని మొర విని పరుగు పరుగున వచ్చాడు. ఆయన మనసు కల్లోలంగా ఉంది. గజేంద్రుని రక్షించడంలోని జాప్యాన్ని ఆయన తాళలేకపోయాడు. వచ్చి, గజేంద్రుని చూచిన తరువాత ఆయన మనసు కుదుటపడింది. భక్తుల రక్షణకై భగవంతుడెంత ఆతురుడో ఇక్కడ తెలుస్తుంది. ఇలా భక్తరక్షణలో ఆయన శ్రేష్ఠుడు. క్షమిణాంవరుడు.

ఇలాగే సుగ్రీవుడు తొందరపాటులో రావణునిపై లంఘించి మల్లయుద్ధం చేసినపుడు, సుగ్రీవుడు తిరిగివచ్చేదాకా రాముడు ఎంతో ఆతురపడ్డాడు. తనవారి రక్షణకై భగవంతుడు ఇంత శ్రద్ధ చూపిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు మూడు అర్థాలను చెప్పారు.

**క్షమవతామ్ యోగినామ్ ఇతి క్షమిణాంవరః.** క్షమాగుణము కలిగిన యోగులందరిలో శ్రేష్ఠుడు క్షమిణాంవరుడు.

**పృథివ్యాదీనామ్ భారధారకాణామ్ శ్రేష్ఠ ఇతి క్షమిణాంవరః.** భారమును ధరించే భూమివంటివానిలో శ్రేష్ఠుడు క్షమిణాంవరుడు.

**క్షమిణాః శక్తిః, అయం తు సర్వ శక్తిమత్వాత్ సకలాః క్రియాః కర్తుమ్ క్షమత ఇతి వా క్షమిణాంవరః.** 'క్షమిణా' అనగా శక్తి కలిగినవారు. పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు గనుక క్షమిణాంవరుడు.

శ్రీ శంకరులు రామాయణము (1.1.8)నుండి ఉదాహరించారు. శ్రీరాముడు **'క్షమయా పృథ్వీ సమః'**.

శ్రీ చిన్మయానంద – జీవుల అనేకానేక పాపములను క్షమించుటలో భగవానుడు ఎంతో సహనము కలవాడు. హిరణ్యాక్ష, హిరణ్యకశిపు, రావణాదులకు కూడా సన్మార్గంలో నడవడానికి ఆయన ఎంతో అవకాశం ఇచ్చాడు. చివరకు స్వయంగా దర్శనమిచ్చి, వారిని అంతం చేసి, వారికి పరమపదాన్ని చేరే అవకాశమిచ్చాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇలాంటి అర్థమే చెప్పారు. **క్షమితుమ్ సోఢుమ్ భక్త అపరాధాన్ శీలమ్ యేషామ్ తే క్షమిణః, తేషామ్ వరః ఇతి క్షమిణామ్ వరః.**

భగవానుని సహన (క్షమా) గుణానికి మరొక ఉదాహరణ – ఆయన శ్రీరామావతారంలో సీతమ్మతో కలిసి పెక్కు కష్టాలను సహించాడు. ఇంకా భృగుమహర్షి తన వక్షస్థలంపై తన్నినా కోపగించుకొనలేదు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – వనవాస సమయంలో పాండవులను కష్టపెట్టిన దూర్వాసుని శ్రీకృష్ణుడు క్షమించాడు. కాకాసుర వృత్తాంతంలో శ్రీరాముడు కాకాసురుని కొద్దిశిక్షతో వదిలివేశాడు. సీతమ్మతల్లి రాక్షసుని తలను శ్రీరాముని పాదములవైపు ఉండేలా చేసి అతని క్షమకు అవకాశం కల్పించింది. భగవానుని క్షమాగుణం అసమానమైనది. మాటలలో చెప్పరానిది.

## 920. విద్వత్తమః

- ఆర్తుల, భక్తుల దుఃఖాన్ని నివారించడం బాగా తెలిసినవాడు.
- సర్వవిద్యా పారంగతుడు. ఆయనకు తెలియనిది ఏదీ లేదు.

**ఓం విద్వత్తమాయ నమః**

**విదన్తి ఇతి విద్వాంసో జ్ఞానినః, తేషు అతిశయేన శ్రేష్ఠః సర్వజ్ఞాత్ ఇతి విద్వత్తమ విష్ణుః.** తెలిసినవారు విద్వాంసులు. అలాంటి జ్ఞానులలో శ్రేష్ఠుడు, సర్వజ్ఞుడు గనుక విష్ణువు విద్వత్తముడు. సకల జ్ఞానము, వేదాదులు ఆయన నుండియే ఉద్భవించినవి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు గజేంద్రమోక్షము పరంగా తమ వ్యాఖ్యను కొనసాగించారు. **తచ్చికిత్సా యామ్ విద్వత్తమః.** భగవానుడు గజేంద్రుని వద్దకు వచ్చి మొసలిని చంపాడు. తరువాత గజేంద్రుని ఆర్తిని నివారించడానికి ఏమి చేయాలో ఆయనకు తెలుసును. ఆయన గజేంద్రుని సాంత్వన వచనాలతో ఓదార్చాడు. చేతులతో నిమిరాడు. భగవానుని దర్శనమే గజేంద్రునికి అతిపెద్ద చికిత్స. భగవానుని భక్త వాత్సల్యము, భక్తుల క్షేమం పట్ల ఆయనకున్న ఆతురత శ్రీ భట్టుల వ్యాఖ్యలో మరల మరల కనుపిస్తాయి. భగవంతుని ఈ గుణమాధుర్యమును శ్రీ భట్టులు చెప్పిన తీరు మాటలలో వివరింపలేనిది. దానిని అనుభవింపవలయును.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – భగవానుడు వైద్యులందరియందు శ్రేష్ఠుడు. వేయి సంవత్సరములు మకరి నోట బాధపడిన గజరాజుకేమి చికిత్స చేయాలో భగవంతునికి తెలియును. కనుక ఆయన విద్వత్తముడు.

శ్రీ భట్టులు విష్ణుధర్మము (69.89)నుండి ఉదాహరించారు. **ఏవముక్త్వా కురుశ్రేష్ఠ! గజేంద్రమ్ మధుసూదనః స్పర్శయామాస హస్తేన.....**భగవానుని దివ్యకరస్పర్శయే గజేంద్రునికి అత్యుత్తమ ఔషధము. అది సకలాపన్నహరము. పాపహరము. భగవానుని ఎర్రని పెదవులనుండి వచ్చిన మాటలు, గాలి గజేంద్రునికి సర్వవిధములు సాంత్వన కూర్చెను.

శ్రీ వేలుక్కుడి కృష్ణన్ మరొక ఉదాహరణ ఇచ్చారు. జనస్థానంలో శ్రీరాముడు ఖరదూషణాదులను, పదునాల్గువేలమంది రాక్షసులను నాశనం చేసి గాయాలతో తిరిగి వచ్చినపుడు సీతమ్మ తల్లి చేసిన దివ్యవైద్యము – ఆయనను ఆమె ప్రేమతో కౌగిలించుకున్నది. సకల వైద్యములకును నిలయమైన శ్రీమహాలక్ష్మియే ఆమె.

**తమ్ దృష్ట్వా శత్రుహన్తారమ్ మహర్షిణామ్ సుఖావహమ్ బభూవ హృష్టా వైదేహీ భర్తారమ్ పరిషస్వజే**
మహర్షులను పీడించే రాక్షసులను వధించి రాముడు మహర్షులకు సుఖం కలుగజేశాడు. తన భర్తయైన ఆ రాముని చూచి వైదేహి ఎంతో సంతోషించి అతనిని ఆలింగనం చేసుకొన్నది.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **అథ గజేంద్ర ఉద్ధారకతామ్ సూచయన్ ఆహస్వైక శరణ్యాస్య గజేంద్రస్య విపద్ వినాశే అతి నిపుణత్వాత్ విద్వత్తమః.** గజేంద్రుని శరణాగతిని స్వీకరించి, ఎంతో నిపుణతతో అతని విపత్తును తొలగించినవాడు విద్వత్తముడు.

శ్రీ భట్టుల వ్యాఖ్యను శ్రీ రాధాకృష్ణ శాస్త్రి మరింత విస్తారంగా చెప్పారు. భక్తుల సకల సమస్యలను పరిష్కరించడం తెలిసినవాడు విద్వత్తముడు.

**శ్రీ పోతన భాగవతము**

శ్రీ హరి కర సంస్పర్శను
దేహము దాహంబు మాని ధృతి గరిణీ సం
దోహంబును దాను గజపతి
మోహన ఘీంకార శబ్దములతో నొప్పెన్.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **నిరస్తాతిశయమ్ జ్ఞానమ్ సర్వదా సర్వ గోచారమ్ అస్య ఇతి అస్తి, న ఇతరేషామ్ ఇతి విద్వత్తమః.** భగవంతుడు మాత్రమే సర్వవిద్యా పారంగతుడు. సర్వ శాస్త్రనిధి. సకల శ్రుతి సాగరుడు. సకల విద్యలును, యోగములును, కళలును ఆయననుండియే జనించినవి కనుక ఆయన విద్వత్తముడు.

శ్రీ వాసిష్ఠ – సృష్టికి ముందు, తరువాత, మరియు భవిష్యత్తులోను సమస్తమూ తెలిసినవాడు భగవంతుడే. వేరెవరూ కాదు.

## 921. వీతభయః

- ఆయన కారణంగా భక్తుల భయం దూరమౌతుంది. గజేంద్రుని భయాన్ని పారద్రోలినవాడు ఆయన.
- సర్వభయరహితుడు.

### ఓం వీతభయాయ నమః

**వి - విశేషేణ, ఇతమ్ - గతమ్, భయమ్ - భీతిః, యస్య ఇతి వీతభయః.** ఆయననుండి భయం దూరమౌతుంది. ఆయన ఎలాంటి భయమూ లేనివాడు. శ్రీ శంకరులు, మరియు ఆయన వ్యాఖ్యను అనుసరించినవారు ఈ అర్థం ఇచ్చారు.

**వీతమ్ భయమ్ యస్మాత్ స వీతభయః.** ఆయన కారణంగా భక్తుల భయాలు తొలగుతాయి. ఈ విధమైన భక్తవాత్సల్యతను శ్రీ భట్టులు తమ వ్యాఖ్యలో పొందుపరచారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తత్ సమాగతమ్ తుముల ఉపలంభాత్ వీతమ్ భయమ్ గజేంద్రస్య ఇతి వీతభయః.** భగవానుడు సంరంభంతో రావడం చూసి గజేంద్రుని భయం మాయమయ్యింది.

శ్రీ వేలుక్కుడి కృష్ణన్ – తాను తెంపిన తామరపూవు సకాలంలో భగవంతునికి సమర్పింపలేకపోతానేమోనని గజేంద్రుని భయం. కనుక భగవానుని రాక చూచి అతని భయం తొలగింది.

శ్రీ వి.వి. రామానుజన్ – గజేంద్రుడు మొరపెట్టుకొన్నాడు. కనుక సకాలంలో భగవంతుడు రాకపోతే భగవంతుని ఆశ్రితరక్షా గుణమునకు వంక వస్తుంది. ఇదే గజేంద్రుని భయం. భగవానుని రాకతో తొలగినది ఆ భయం.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **వీతమ్ - వినష్టమ్ గజేంద్రస్య గ్రాహాత్ భయమ్ యేన స వీతభయః.** ఎవని కారణంగా గజేంద్రునికి మొసలివల్ల కలిగిన భయం తొలగిందో అతడు 'వీతభయః'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వీతమ్ - విగతమ్, భయమ్ సాంసారికమ్ సంసార లక్షణమ్ వా అస్య ఇతి వీతభయః, సర్వేశ్వరత్వాత్ నిత్యముక్తత్వాత్ చ.** భగవంతునికి సంసారభయం లేదు. ఆయన సర్వేశ్వరుడు. నిత్యముక్తుడు. కనుక ఆయనకు ఏ విధములైన భయములు వర్తించవు. ఆయన సర్వభయరహితుడు. వీతభయుడు.

శ్రీ సత్యసంధ తీర్థ (ద్వైతాచార్యులు) – **భయః శూన్యః వీతభయః.** భయము లేనివాడు వీతభయుడు.

శ్రీ రఘునాథ తీర్థ (ద్వైతాచార్యులు) – **భక్తేభ్యో వీతమ్ - విగతమ్ భయమ్ యస్మాత్ సః వీతభయః.** భక్తులకు భయం లేకుండా చేసేవాడు వీతభయుడు.

**శ్రీ పోతన భాగవతము** – గజరాజును కాచిన గోవిందుని శ్రీమహాలక్ష్మి ఇట్లు స్తుతించెను.

అరవింద మందిర యగు నయ్యిందిరాదేవి మందస్మిత చంద్రికా వదనారవింద యగుచు ముకుందున కిట్లనియె.

దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును
దీనపరాధీన! దేవదేవ! మహేశా!

## 922. పుణ్య శ్రవణ కీర్తనః

- శ్రీహరిని గురించిన స్మరణ, చింతన, కీర్తన, అర్చన, ధ్యాన, శ్రవణాదులు సమస్త పాపములను నశింపజేసి మహాపుణ్యమను ప్రసాదించును.

### ఓం పుణ్య శ్రవణ కీర్తనాయనమః

**పుణ్య - పావతే, పూయతే వా అనేన ఇతి పుణ్యమ్.** పవిత్రము చేయునది పుణ్యము. **పుణ్యమ్ - పవిత్రీకరణమ్, నామ్నామ్ శ్రవణమ్ కీర్తనమ్ చ యస్య స పుణ్య శ్రవణ కీర్తనః.** ఎవని నామములు విన్నా, అన్నా గాని, పుణ్యము లభించునో ఆయన పుణ్యశ్రవణకీర్తనుడు. **యస్య విష్ణోర్నామ్నామ్ అన్యతః శ్రవణమ్, తథా స్వముఖతః ఉచ్చార్య కీర్తనమ్, ఇత్యుభయతా పవిత్రీకరణమ్ భవతి, స ఏతన్నామ్నామ్ అభిధీయతే.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు గజేంద్రమోక్షము పరంగా వ్యాఖ్యను కొనసాగించారు. గజేంద్రుని మోక్షము కథను విన్నా, చెప్పినా గాని పాపములు హరించును గనుక ఆయన పుణ్యశ్రవణకీర్తనుడు.

**గజేంద్ర మోక్షణం శ్రుత్వా సద్య పాపాత్రుముచ్యతే యస్మాత్తత్కీర్తనం పుణ్యం శ్రవణం చేతి స స్మృతః ద్వాదశార్ణో మనుశ్రేష్టః పుణ్యశ్రవణకీర్తనః.** గజేంద్రమోక్షణము కథను విన్నట్లైతే పాపాలన్నీ పటాపంచలయిపోతాయి. కాబట్టి దీనిని విన్నా చదివినా పుణ్యముగానే పరిగణిస్తాడు శ్రీమన్నారాయణుడు. ఈ నామము ద్వాదశాక్షరీ మహామంత్రము. ఉత్తమోత్తమమైనది. ఓం పుణ్యశ్రవణకీర్తనాయ నమః. (శ్రీకైవల్య సారథి).

శ్రీ భట్టులు విష్ణుధర్మము (69.79)నుండి ఉదాహరించారు. **శ్రుతేన హి కురుశ్రేష్ఠ! స్మృతేన కథితేన వా గజేంద్ర మోక్షణైవ సద్యః పాపాత్ విముచ్యతే.** అర్జునా! ఈ గజేంద్ర మోక్షము వృత్తాంతమును విన్నా, స్మరించినా, చెప్పినా గాని ఆ వ్యక్తికి సమస్త పాపములు నశించును.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – భగవంతుని నామములు, గాథలు వినదగినవి. కీర్తింపదగినవి. వానివలన పాపములు నశించును. అందువలననే గజేంద్ర మోక్షమును చెప్పే ఈ శ్లోకమును ప్రతినిత్యం ఉదయం మనం అనుసంధానం (అర్థంతో సహా మననం) చేస్తాము.

కంబోడియా అంగకార్ వాట్ కు చెందిన గజేంద్ర మోక్ష శిల్పం. పారిస్ మ్యూజియం లోనిది. Photo by Jean-Pierre Dalbéra https://commons.wikimedia.org/wiki/FileL'exposition "Angkor - la naissance d'un mythe" (musée Guimet) (11804396084).jpg



**గ్రాహమ్ గ్రస్తే గజంద్రే సరభసమ్ తార్క్ష్యమ్**
**ఆరుహ్య ధావన్ వ్యాఘూర్ణన్ మాల్య భూషా**
**వసన్ పరికరో మేఘ గంభీర ఘోషః**
**విభ్రాణో రథాంగమ్ శరమసిమ్ అభయం శంఖ చాపౌ చ**
**ఖేటౌ హస్తైః కౌమోదకీమ్ అపి**
**అవతు హరిరసావంహసామ్ సంహతేర్ణః**

(ఈ శ్లోకము శ్రీమద్ అళగియ సింగర్ ఆహ్నిక గ్రంథంలో లభించింది.)
మొసలి నోట చిక్కిన గజేంద్రుని మొర విని భగవానుడు సంరంభంతో

గరుడునిపైనెక్కి, వేగిరంగా వచ్చాడు. ఆయన వస్త్ర భూషణాదులు చెల్లాచెదురై ఉన్నాయి. ఆయన వస్తుంటే గంభీర మేఘ ధ్వని వినిపిస్తున్నది. ఆయన చేత శంఖ, ఖడ్గ, చాప, గదాది ఆయుధాలు సిద్ధంగా ఉన్నాయి. ఈ వృత్తాంతాన్ని అనుసంధానం చేస్తే గాని, విన్నా గాని, చెప్పినా గాని వారికి భగవంతుని రక్షణ తప్పక లభిస్తుంది.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థం చెప్పారు. **పాపహారి గజేంద్ర సంబంధి శ్రవణాదిత్వాత్ పుణ్యశ్రవణకీర్తనః.**

**శ్రీ పోతన భాగవతము**

**అని మఱియు, నప్పరమేశ్వరుండిట్లని యానతిచ్చె. ఎవ్వరేనియు నపరరాత్రంబున మేల్కాంచి, సమాహిత మనస్కులై, శ్వేతద్వీపంబును, నాకుం బ్రియంబైన సుధాసాగరంబును, హేమనగరంబును, నిగ్గిరికందర కాననంబులను, వేత్ర కీచక వేణులతా గుల్మ సురపాదపంబులను, ఏనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించి యుండు నక్కొండశిఖరంబులను, కౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను, శ్రీదేవిని, శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదాది ఋషులను, మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను, దదవతార కృత కార్యంబులను, సూర్య సోమ పావకులనుఁ, బ్రణవంబును, ధర్మ తప స్సత్యంబులను, వేదంబును, వేదాంగంబులను, శాస్త్రంబులను, గో భూసుర సాధు పతివ్రతాజనంబులను, జంద్రకాశ్యపజాయా సముదయంబును, గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును, నమరులను, నమరతరువులను, నైరావతంబును, నమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షి నివహంబును, బుణ్యశ్లోకులైన మానవులను, సమాహిత చిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తు. అని హృషీకేశుండు నిర్దేశించి, శంఖంబు పూరించి, విహగపరివృఢ వాహనుండై వేంచేసె. విబుధానీకంబు సంతోషించె.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పుణ్యమ్ పుణ్యకరమ్ శ్రవణమ్ కీర్తనమ్ చ అస్య ఇతి పుణ్యశ్రవణకీర్తనః.** ఎవని నామము విన్నా, కీర్తించినా పుణ్యం లభిస్తుందో అతడు పుణ్యశ్రవణకీర్తనుడు.

శ్రీ శంకరులు, శ్రీ వాసిష్ఠ ఈ ఫలశ్రుతి శ్లోకమును ఉదాహరించారు.

**యు ఇదం శ్రుణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్**
**నాఽశుభం ప్రాప్నుయాత్ కించిత్ సోఽముత్రేహ, చ మానవః**

పరమ మంగళకరములగు ఈ సహస్ర నామములను శ్రద్ధగా శ్రవణము చేయునట్టి గాని, కీర్తనము చేయునట్టి గాని మానవులకు ఇహలోకమునందును, పరలోకమునందును ఎట్టి అశుభములును కలుగవు (శ్రీ పెమ్మరాజు రాజారావు).

శ్రీ చిన్మయానంద – కీర్తనము అంటే యాంత్రికంగా వల్లెవేయడం కాదు. భగవానుని వైభవాన్ని మననం చేయాలి. భగవంతునికిష్టమైన పనులయెడ నిమగ్నమవ్వాలి. మనసా వాచా కర్మణా ప్రతిక్షణం భగవత్సాన్నిధ్యాన్ని అనుభవించాలి. అటువంటి భక్తుని జీవితమే పూజ, అఖండ కీర్తన, ఆనంద ప్రేమమయము.

శ్రీ వాసిష్ఠ ఈ నామము సారాంశముగా చెప్పిన శ్లోకము –

**యస్యాతి నామ్నామ్ శ్రవణమ్ పవిత్రమ్ సంకీర్తనమ్ చాప్యమలం హి తస్య**
**సోఽనంత నామా భగవాన్ హి విష్ణుః, స్వనామభిర్విశ్వమిదమ్ పునాతి.**

విష్ణుభగవానుని నామములు విన్నా, కీర్తించినా గాని దోషములు హరించి పవిత్రత చేకూరును. ఆయన (అనంత కళ్యాణ గుణములను తెలిపే) అనంత నామములు జగత్తును పావనం చేస్తున్నాయి.

రోటికి కట్టబడిన బాలకృష్ణుడు మద్దిచెట్లను కూలదోసి గంధర్వులను శాపముక్తులను చేయుట. 1720 కాలపు చిత్రం.

https://commons.wikimedia.org/wiki/File:Krishna_Splits_the_Double_Arjuna_Tree.jpg





## ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుఃస్వప్ననాశనః |
## వీరహా రక్షణస్సంతో జీవనః పర్యవస్థితః || (99)

### 923. ఉత్తారణః

- ఉద్ధరించువాడు. దరిజేర్చువాడు.

**ఓం ఉత్తారణాయ నమః**

ఉ (ఉపసర్గ) - తీవ్రంగా, తృ - ప్లవన సంతరణయోః - దాటుట, ఈదుట. **ఉత్తారయతి ఇతి ఉత్తారణః.** చక్కగా దాటించువాడు ఉత్తారణుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య **–** శ్రీ భట్టులు గజేంద్రమోక్షము పరంగా వ్యాఖ్యను కొనసాగించారు. **తౌ సరసా ఉత్తారితవాన్.** వానినిద్దరిని (గజేంద్రుని, మొసలిని) నీటినుండి లేవనెత్తినవాడు. ఇక్కడ శ్రీ భట్టులు **'తౌ'** పదమును ప్రయోగంచుట గమనించదగిన విషయము. భగవానుడు ఇద్దరినీ రక్షించాడు. మొసలిబారినుండి ఏనుగును, శాపంనుండి మొసలిని రక్షించాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థం చెప్పారు. **సరోవరాత్ గజేంద్రమ్ ఉత్తారయామాస ఇతి ఉత్తారణః.**

ఇతర వ్యాఖ్యాతలు భగవంతుడు భక్తులను సంసారసాగరంనుండి లేవనెత్తడం పరంగా అర్థం చెప్పారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– సంసార సాగరాత్ ఉత్తారయతి ఇతి ఉత్తారణః.** తన్నాశ్రయించిన భక్తులను మాధవుడు భయంకరమైన మృత్యుసంసార సాగరమునుండి ఉద్ధరించును గనుక ఉత్తారణుడు అయ్యాడు.

శ్రీ చిన్మయానంద **–** మనం శరీరం, మనస్సు, బుద్ధిల ద్వారా మనచుట్టూ జరిగే భౌతికమైన మార్పులను మనకు ఆపాదించుకుంటాము. సకల జీవులను ప్రకాశింపజేసే మనలోని చైతన్యమును భగవన్ముఖం చేస్తే మనం ఈ మార్పులకు అతీతంగా నిశ్చల నిర్మల పరమానంద జరామరణరహిత స్థితిని సాధింపవచ్చును. కనుక శ్రీమన్నారాయణుడు ఉత్తారణుడు.

శ్రీ వాసిష్ఠ **– భవార్తి సంతప్తానామ్ భవచ్చరణ ఆగంతానామ్ ఉత్తితీర్షూణామ్ ఉత్తారణో నావికో నావేవ ఇత్యర్థః.** సంసార తాపంనుండి రక్షణ కావాలని అనుకుంటే భగవంతుని ఆశ్రయించాలి. అప్పుడు ప్రయాణికులను పడవలో నది దాటించే నావికునిలా భగవంతుడు తన భక్తులను సంసారసాగరం దాటిస్తాడు.

శ్రీ సత్యసంధ తీర్థ ఈ నామమును సన్యాసులకు సుఖాన్నిచ్చే ప్రణవమంత్రము పరంగా వ్యాఖ్యానించారు. **ఉత్కృష్టః తారః ప్రణవో యేషామ్ త ఉత్తారాః సన్న్యాసినః తేషామ్ సుఖమ్ యస్మాత్ స ఉత్తారణః.**

## 924. దుష్కృతిహా

- దుష్కార్యములు చేయువారిని నాశనము చేయువాడు. భాగవతులను బాధించేవారిని నాశనం చేయువాడు.
- శరణాగతులైనవారి పాపములను నశింపజేయువాడు.

### ఓం దుష్కృతిఘ్నే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఈ నామమును గజేంద్రమోక్షము పరంగా వ్యాఖ్యానించారు. భగవత్కైంకర్య కార్యక్రమంలో ఉన్న గజేంద్రునికి అపకారం తలపెట్టిన మొసలిని సంహరించినవాడు 'దుష్కృతిహా'. **గ్రాహం విదారయామాస యస్మాత్ దుష్కృతిహా చ సః.** ఈ వ్యాఖ్యకు కూడా శ్రీ భట్టులు విష్ణుధర్మము (69)నుండి ఉదాహరించారు. **స్థలస్థం దారయామాస గ్రాహం చక్రేణ మాధవః.** తీరము చేరిన మొసలిని మాధవుడు తన చక్రాయుధముతో చీల్చివేశాడు.

**శ్రీ పోతన భాగవతము**

భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశుక్రియన్
హేమక్ష్మాధర దేహముం జకిత వన్యేభేంద్ర సందోహమున్
గామ క్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్

భగవంతుని ఈ గుణమే గీత (4.8)లో స్తుతింపబడింది.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపుమాపుటకును, ధర్మమును సుస్థిరమొనర్చుటకును నేను ప్రతియగమునందును అవతరించుచుందును.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇలానే అర్థం చెప్పారు. భాగవతునిపట్ల అపచారమొనర్చినవానిని హతము చేసినవాడు 'దుష్కృతిహా'. **దుష్కృతిమ్ గ్రాహమ్ హతవాన్ ఇతిదుష్కృతిహా.**

ఆండాళ్. తిరుప్పావై 13 – బకాసురుని నోటిని చీల్చిన శ్రీకృష్ణుని, దుష్టరావణుని పది తలలను గిల్లిపారవేసిన శ్రీరాముని నామమును గానము చేయుచు పోయి మన తోడిపిల్లలందరును వ్రతక్షేత్రమును చేరినారు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – భాగవతులపట్ల చేసే అపచారములు భగవంతునికి అత్యంతకోపం తెప్పిస్తాయి. శ్రీరామావతారంలోను, శ్రీనృసింహావతారంలోను ఈ గుణాన్ని స్పష్టంగా చూడవచ్చును. పూజారులు శ్రీ తిరుప్పాణాళ్వారు పట్ల అపచారం చేసినపుడు శ్రీరంగనాథుడు తన కోపాన్ని ప్రదర్శించాడు. భాగవతాపచారము అన్నింటికంటె పెద్ద పాపము. అది ఎప్పుడూ చేయరానిది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **దుష్కృతిః పాపసంజ్ఞితః హన్తి ఇతి దుష్కృతిహా. యే పాపకారిణః తాన్ హన్తి ఇతి వా.** పాపములను నాశనము చేయువాడు లేదా పాపులను నాశనము చేయువాడు 'దుష్కృతిహా'.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవానుడే కాదు. భగవంతుని నామము కూడా పాపములనుండి మనలను కాపాడును. కురుసభలో దుర్యోధనాదులచేత ద్రౌపది పరాభవింపబడినపుడు ఆమె శ్రీకృష్ణుని ప్రార్థించినది. అప్పుడు కృష్ణుడక్కడికి రావడానికి ముందే కృష్ణనామము ద్రౌపదిని రక్షించినది. అని శ్రీకృష్ణుడు రుక్మిణితో చెప్పాడు. తీవ్రమైన పాపులను నాశనం చేయడమే కాక, తెలియక చేసిన పాపములు పరిహారమయ్యేలాగ భగవంతుడు అవకాశమిస్తాడు.

శ్రీ చిన్మయానంద – ఎవరైనా విషయలోలురై దష్కార్యములు చేసినపుడు, ఆ పనుల వాసనలు వారితో ఉండి మళ్ళీ మళ్ళీ అలాంటి పనులకు ప్రేరేపిస్తాయి. మనసును శ్రీమన్నారాయణునిపట్ల లగ్నం చేసినట్లయితే అలాంటి వాసనలు నశిస్తాయి. కనుక నారాయణుడు 'దుష్కృతిహా'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **దుష్కృతీః హన్తి ప్రపన్నానామ్ ఇతి దుష్కృతిహా**. ప్రపన్నుల పాపములను నాశనం చేసేవాడు 'దుష్కృతిహా'.

## 925. పుణ్యః

- పవిత్రము చేయువాడు.
- పుణ్యకార్యములు ఆచరించుటయందు శ్రేష్ఠుడు.

### ఓం పుణ్యాయ నమః

73వ శ్లోకము. 692వ నామము. పుణ్యః – **పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిః అనామయః**
99వ శ్లోకము. 925వ నామము. పుణ్యః – **ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః**

పు - పావనే - పవిత్రము చేయుట. పుణ్ - శుభకర్మాణి - మంగళ కార్యములయందు.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

692వ నామము. **పుణ్యః –** పావనము చేయువాడు 'పుణ్యః'. అతి నీచులైన పాపులు కూడా భగవన్నామస్మరణం చేసి పవిత్రులయ్యే అవకాశం కలిగించినవాడు 'పుణ్యః'.

925వ నామము. **పుణ్యః –** భగవంతుడు తన భక్తులను ఉద్ధరించిన గజేంద్రమోక్షాది ఉదంతాలను మననం చేసుకొన్నంతమాత్రాన మనం పరిశుద్ధులమౌతాము.

**కీర్త్యాస్మదాదీనపియో గజేంద్ర త్రాణ రూపయా పుణ్యస్సస్యాత్పునాతీతి షడర్ణః పావనత్వతః.** గజేంద్రమోక్షము అనబడే ఈ కీర్తిచేత మనలను కూడా పాపరహితులుగా చేయువాడు 'పుణ్యః'. ఈ నామము షడక్షరీమంత్రము. పాపనాశకరి. ఓం పుణ్యాయ నమః. (శ్రీకైవల్య సారథి).

శ్రీ శంకరుల వ్యాఖ్య –

692వ నామము. **పుణ్యః –** భగవంతుని స్మరించినంత మాత్రమున కల్మషములు నశించును గనుక భగవంతుడు 'పుణ్యః'.

925వ నామము. **పుణ్యః –** శ్రుతి, స్మృతుల బోధనల ద్వారా పుణ్యమార్గములను ఉపదేశించినవాడు 'పుణ్యః'.

శ్రీ బలదేవ విద్యాభూషణ – కంసునివంటి దుర్మార్గులను నాశనం చేసినవాడు 'పుణ్యః'.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – ఏ విధమైన లోపములు, అధర్మములు లేనివాడు మరియు పవిత్రము చేయవాడు 'పుణ్యః'. భగవంతుడు సూర్యుని రూపంలో తాను స్వయంగా పవిత్రుడు అగుటయే గాక, అన్నింటిని పవిత్రము చేయుచున్నాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ, శ్రీ కృష్ణదత్త భరద్వాజ – స్వయముగా శుభకర్మలు ఆచరించేవాడు 'పుణ్యః'.

శ్రీ పోతన భాగవతము

అని చెప్పి శుక యోగీంద్రుండిట్లనియె.

నరనాథ! నీకును నాచేత వివరింపఁ బడిన యీ కృష్ణానుభావమైన గజరాజ మోక్షణ కథ వినువారికి యశము లిచ్చును గల్మషాపహంబు దుస్స్వప్ననాశంబు దుఃఖసంహారంబుఁ బ్రొద్దుల మేల్కాంచి పూతవృత్తి నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు. సంపదలు గల్గుఁ బీడలు శాంతిఁ బొందు సుఖము సిద్ధించు వర్ధిల్లు శోభనములు మోక్ష మఱచేతిదై యుండు ముదము చేరు ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె.

గజరాజ మోక్షణంబును
నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజవరదుఁ డిచ్చును
గజతురగ స్యందనములుఁ గైవల్యంబున్.

(పై భాగములోని శ్రీ పోతన భాగవతము పద్యములను ఆంధ్ర భారతి **(**http://www.andhrabharati.com**)** మరియు తెలుగు వికిసోర్సు నుండి కాపీ చేశాను. – కా.సు. బాబు).

## **926.** దుస్స్వప్ననాశనః

- చెడు కలలను నాశనం చేసేవాడు.

### ఓం దుస్స్వప్ననాశనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకుముందు నామములనువలనే ఈ నామమును కూడా శ్రీ భట్టులు గజేంద్రమోక్షం పరంగా వ్యాఖ్యానించి, అందుకు విష్ణుధర్మమునుండి ఉదాహరించారు.

**గజేంద్రమోక్షణాధ్యాయ జాపాద్దుస్స్వప్నజం ఫలం నాశయత్యం చ యోऽసౌ ఇతి దుస్స్వప్ననాశనః.** గజేంద్రమోక్షము అనే అధ్యాయమును భక్తితో పఠించినట్లయితే దుస్వప్నాలు ఒక్కక్షణంలో పటాపంచలౌతాయి గనుక శ్రీహరి దుస్వప్ననాశనుడు. (శ్రీకైవల్యసారధి)

విష్ణుధర్మములో అధ్యాయము ఫలశ్రుతి –
**యే మామ్ త్వామ్ చ సరశ్చైవ గ్రాహస్య చ విమోక్షణమ్**
**యే స్మరిష్యన్తి మనుజాః ప్రయతాః స్థిరబుద్ధయః**
**దుఃస్వప్నో నశ్యతే తేషామ్ సు-స్వప్నశ్చ భవిష్యతి**

సంస్కృతభాగవతములో ఫలశ్రుతి (8.4.14) –
**ఏతన్ మహారాజ తవేరితో మయా కృష్ణానుభవో గజరాజ మోక్షణమ్**
**స్వర్గ్యమ్ యశస్యమ్ కలికల్మషాపహమ్ దుస్స్వప్ననాశనమ్ కురువర్య శృణ్వతామ్**

శ్రీ పోతన భాగవతము నుండి సంగ్రహపరచినది – ఓ రాజా! ఈ కృష్ణానుభవమైన గజరాజమోక్షణ కథ వినువారికి యశములిచ్చును. కలికల్మషములపహరించును. దుస్వప్ననాశనమొనర్చును. దుఃఖము సంహరించును. విభవమమరును. సంపదలు కలుగును. పీడలు శాంతించును. సుఖము సిద్ధించును. శోభనములు వర్ధిల్లును. మోక్షము అందివచ్చును. ముదము చేరును. అని విష్ణుడు ప్రీతుడై యానతిచ్చెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీహరియొక్క స్మరణ కీర్తనాదులచేత (భవిష్యత్తులో అనర్థములను సూచించు) దుస్స్వప్నములన్నియునునశించును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుని భక్తులకు ఆపదలు సంభవింపవు. కనుక ఆపదలను సూచించు దుస్వప్నములు కలగవు. భగవంతుని నామమును శ్రద్ధగా ధ్యానించినచో ఏవిధమైన చెడు కలలు రావు.

శ్రీ చిన్మయానంద – పునర్జన్మే అన్నింటికంటె చెడు స్వప్నము. నారాయణ నామస్మరణాదీక్ష పూనినవారికి మనసులో చెడు ఆలోచనలు, భయములు, భ్రమలు దరిజేరవు కనుక వారికి దుస్వప్నములు కలుగవు.

శ్రీ వాసిష్ఠ – ప్రార్థనవల్ల చెడు స్వప్నములు తొలగునని వేదములోనున్నది.

అథర్వవేదము 16.6.9 – **జాగ్రద్ దుష్ స్వప్న్యమ్ స్వనే దుష్-స్వప్న్యమ్.**

ఋగ్వేదము 10.86.21 – **పునరేహి వృషాకపే సువితా కల్పయావహై య ఏష స్వప్ననంశనోఽస్తమేషి పథా పునర్-విశ్వమాద్-ఇంద్ర ఉత్తరః.**

శ్రీ పెమ్మరాజు రాజారావు – స్వప్నములనగా మనస్సులోని అంతరాంతరములలో దాగియున్న తృప్తితీరని వాంఛలయొక్కయు, వాసనలయొక్కయు బహిర్గతములగు ఛాయలు మాత్రమే. హరి కీర్తనము సకలవాంఛా వాసనా రాహిత్యము కలిగించి, చిత్తశుద్ధిని ప్రసాదించును. వాస్తవముగా ఆలోచించినచో, జననమరణ జరావ్యాధి దుఃఖభూయిష్టమైన ఈ జన్మమే దుస్వప్నమని బుద్ధిమతులు తలచెదరు. జన్మరాహిత్యమును ప్రసాదించువాడు శ్రీహరియే గాన దుస్వప్ననాశనుడని అర్చనీయుడగుచున్నాడు.

## **927.** వీరహా

- గజేంద్రునకు యమపాశములు తొలగించినవాడు.
- బలవంతులైన రాక్షసులను సంహరించినవాడు.
- వ్యర్థవాదాలు చేసి భక్తుల ధ్యానాన్ని కలతపరచేవారిని (శుష్కపండితులను) నాశనం చేసేవాడు.
- సంసారులు అధర్మమార్గం పట్టకుండా, వారిని మోక్షంవైపు నడిపించేవాడు.
- జీవులకు వివిధ చలనములు కలిగించేవాడు.
- రాక్షస సంహారంలో గరుడుడు, వాయువులు తనకు తోడుగా కలిగినవాడు.
- పునర్జన్మను హరింపజేయువాడు.

### ఓం వీరఘ్నే నమః

ఈ నామము 168, 747, 927వ నామములుగా మూడుమార్లు వస్తుంది.

18వ శ్లోకము. 168వ నామము. వీరహా – **వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః**

79వ శ్లోకము. 747వ నామము. వీరహా – **వీరహా విషమః శూన్యో ఘృతాశీరచలశ్చలః**

99వ శ్లోకము. 927వ నామము. వీరహా – **వీరహా రక్షణస్సంతో జీవనః పర్యవస్థితః**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

- పూతన, శకటాసురుడు వంటి రాక్షసులను సంహరించిన బాలకృష్ణుడు వీరఘ్నుడు.

- భాషలో ప్రావీణ్యం కలిగియుండి, తమ పాండిత్యాన్ని వ్యర్థవాదాలకు వినియోగిస్తూ, భక్తుల ధ్యానక్రియను భంగపరచే శుష్కపండితులను నాశనం చేసేవాడు వీరఘ్నుడు.
- గజేంద్రునకు యమపాశములను తొలగించినవాడు (మృత్యువునుండి రక్షించినవాడు) 'వీరహా'. **మోక్షయామాస నాగేంద్రమ్ పాశేభ్యః శరణాగతమ్** (విష్ణుధర్మము 69). **వీరం తద్బాధకం మృత్యుం హతవాన్ సః వీరహా.**

శ్రీ శంకరుల వ్యాఖ్య **–** బలవంతులు మరియు దుష్టులు అయిన రాక్షసులను సంహరించినవాడు **'**వీరహా**'**.

సంసారులు అధర్మమార్గం పట్టకుండా వారిని మోక్షమువైపు నడిపించేవాడు **'**వీరహా**'**.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ **–** అన్ని జంతువులకు చలనం ఇచ్చేవాడు **'**వీరహా**'**.

శ్రీ చిన్మయానంద **–** జనన మరణ చక్రమును ఛేదించేవాడు **'**వీరహా**'**.

## **928.** రక్షణః

- గజేంద్రుని రక్షించినవాడు.
- ముల్లోకములను రక్షించువాడు.

### ఓం రక్షణాయ నమః

రక్ష - పాలనే - కాపాడుట. **రక్షతి - పాలతి సకలమ్ విశ్వమ్ ఇతి రక్షణః.** విశ్వమును రక్షించువాడు రక్షణుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య **– తమ్ స్పర్శన పరిరంభణ సాంత్వనాదిభిః రక్షితవాన్.** భగవానుడు గజేంద్రుని స్పర్శించి (నిమిరి), కౌగిలించుకొని, సాంత్వన వచనములు పలికి రక్షించాడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుధర్మమునుండి ఉదాహరించారు.

**ఏవముక్త్వా మహారాజ గజేంద్రమ్ మధుసూదనః స్పర్శయామాస హస్తేన గజమ్ గంధర్వమేవ చ**

నిడుదయగు కేల గజమును
మడువున వెడలంగ దిగిచి మదజలరేఖల్
దుడుచుచు మెల్లన పుణుకుచు
నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా! **–** శ్రీ పోతన భాగవతము

శ్రీ శంకరుల వ్యాఖ్య **– సత్వమ్ గుణమ్ అధిష్ఠాయ జగత్రయమ్ రక్షన్ ఇతి రక్షణః.** సత్వగుణమును ధరించి ముల్లోకములను రక్షించువాడు రక్షణుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.2.9 **–** రక్షించుటయే శ్రీ విష్ణుని గుణము. ఆయన రుద్రునకు, బ్రహ్మకును అంతర్యామియై లయము, సృష్టి కార్యములు చేయుట కూడ రక్షణకే. లయ ద్వారా జీవులకు (కృశించిన దేహములు వదిలించి) ఆయన క్రొత్త శరీరమును ఇస్తాడు. మరియు సృష్టి ద్వారా ఇంద్రియాదులనిచ్చి పరమాత్మని కొరకు సాధన చేసే అవకాశం కలిగిస్తాడు. ఇలా ఆయన సృష్టి, లయ కార్యములు కూడా రక్షణలో భాగమే.

శ్రీ చిన్మయానంద గీత (4.8)నుండి ఉదాహరించారు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

ఇక్కడ కూడా 'పరిత్రాణాయ' అనగా 'రక్షించుట కొరకు' అనే పదాన్ని ముందుగా వాడారు. రక్షణయే ఆయనకు ప్రధాన అవతార లక్ష్యము. దుష్టశిక్షణ కూడా అందులో భాగమే.

శ్రీ వాసిష్ఠ భగవానుని రక్షణార్ధం పఠించే వేదమంత్రాన్ని ఉదాహరించారు. ఋగ్వేదము 4.3.14 –
**రక్షా నో అగ్నే తవ రక్షణేభీ రారక్షాణః సుముఖః ప్రీణానః ప్రతిష్ఫుట విరుజ వీడ్వహో జహి రక్షో మహిచిద్ వావృధానమ్**

## 929. సంతః

- తన ఆశ్రితులను అనేక విధములుగా వృద్ధిచేయువాడు.
- తన భక్తుల కొరకే ఉన్నవాడు.
- విద్యా వినయ సంపన్నులైన సజ్జనులయందు ఉండేవాడు.
- అంతటా వ్యాపించియున్నవాడు.
- పూజింపబడువాడు.
- జగత్తును చక్కగా విస్తరింపజేయువాడు.

**ఓం సంతాయ నమః**

**ఓం సద్భ్యో నమః**

సమ్ (ఉపసర్గ). తను - విస్తారే - వ్యాపించుట, పొడిగించుట, ఇచ్చుట (ఆష్టే నిఘంటువు ప్రకారం).

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆశ్రితాన్ సన్తనోతి (సమ్యక్ తనోతి) ఇతి సన్తః.** తనను ఆశ్రయించినవారు చక్కగా వర్ధిల్లేలాగాను, తన పట్ల ధ్యాసవల్ల సంతోషించేలాగానూ చేయువాడు 'సన్తః'.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **ఏవమ్ గజేంద్రమ్ శరణాగతమ్ సన్తనోతి ఇతి సన్తః.** శరణాగతుడైన గజేంద్రుని వర్ధిల్లజేసినవాడు 'సన్తః'.



గజేంద్ర మోక్షము. 1820 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Gajendra_moksha.jpg

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – భగవానుడు మనను తప్పక రక్షించుననే నమ్మకమే మనలను వర్ధిల్లజేయును. ఊరేగింపులో దేవుని ఉత్సవమూర్తి దర్శనము ఉద్దేశ్యం ఇదే.

శ్రీ భట్టులు ఇచ్చిన మరి రెండు వ్యాఖ్యలు –

**తేషామ్ అస్తి ఇతి సన్తః.** తన భక్తుల కొరకు అండగా ఉండేవాడు 'సన్తః'.

**తేభ్య ఇష్టం దత్తవాన్ ఇతి సన్తః.** తన భక్తులు కోరుకున్నవి ఇచ్చేవాడు 'సన్తః'

**న తే రూపమ్ న చక్రో నాయుధాని న చాస్పదమ్ తథాऽపి పురుషాకారో భక్తానామ్ ప్రకాశసే –** జితన్తే స్తోత్రము

నీ దివ్యాత్మ స్వరూపము, నీ దివ్యమంగళ విగ్రహము, నీ ఆయుధాలు, నీ వైకుంఠధామము – అన్నీ నీ కొరకు కాదు. నీ భక్తుల కొరకే (నీవు స్వతంత్రుడవు కావు). అయినా నీవు పరమాత్ముడవై భక్తుల కొరకు ప్రకాశిస్తున్నావు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సన్మార్గవర్తినః సన్తః, తద్రూపేణ విద్యా వినయ వృద్ధయే స ఏవ వర్తత ఇతి సన్తః.** సన్మార్గంలో చరించేవారు సన్తులు అనగా సజ్జనులు. విద్యా వినయాది గుణ సంపదల నభివృద్ధి పరచు సజ్జనులయందున్నవాడుటచేత 'సన్తః' అను శబ్దముచే ఆరాధ్యుడగుచున్నాడు. ఈ నామము బహువచనాంతముగా నిర్దేశింపబడినది. సజ్జన సమాజము కూడ భగవంతుడే (శ్రీ పెమ్మరాజు రాజారావు).

శ్రీ సత్యసంధ తీర్థ – తను - విస్తారే. **సంపూర్ణత్వాత్ తనోతేః వ్యాప్తః.** అంతటా ఉండి, అన్నింటా వ్యాపించినవాడు 'సన్తః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – సన్ - సంభక్తౌ - పూజించుట. **సన్యతే ఆరాధ్యతే స్మ ఇతి సన్తః.** ఎవరినైతే ఆరాధిస్తారో, పూజిస్తారో అతడు 'సన్తః'.

శ్రీ వాసిష్ఠ – **సమ్యక్ తనోతి విస్తారయతి జగత్ ఇతి సన్తః.** జగత్తును చక్కగా (క్రమ విధానంలో) విస్తరింపజేయువాడు 'సన్తః'.

## 930. జీవనః

- మొసలి శాపమును తొలగించి తిరిగి గంధర్వునిగా జీవింపజేసినవాడు.
- ప్రాణరూపంలో ఉండి సకల జీవులను బ్రతికిస్తున్నవాడు.

### ఓం జీవనాయ నమః

జీవన్ - ప్రాణ ధారణే - బ్రతుకుట. **జీవయతి - ప్రాణయతి జీవన ఉపయోగ సాధనైః ఇతి జీవనః.** జీవించడానికి అవుసరమైన సాధనములను సమకూర్చి జీవుల జీవనమును నిలిపేవాడు జీవనుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.2.9 – రక్షించుట అనేది భగవంతుని లక్షణము. ప్రళయకాలంలో సమస్తమునూ కబళించడం ఎందుకంటే వారికి పునఃసృష్టిలో క్రొత్త శరీరములు ఇచ్చి రక్షించడం కోసము. శిథిలమైన శరీరములు బదులు క్రొత్త శరీరం ఇవ్వడం కోసమే ఆయన మృత్యువును కలిగిస్తున్నాడు. భగవానుని సృష్టి, స్థితి, లయ కార్యములన్నీ రక్షణ కొరకే.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వహస్తేన హననాత్ గ్రాహమపి గంధర్వత్వేన జీవయన్ - జీవనః.** భగవంతునిచేత మరణించిన మొసలికి శాపవిమోచనం కలిగి గంధర్వరూపం తిరిగివచ్చింది. ఇలా పునర్జీవనమును ప్రసాదించినవాడు '**జీవనః**'. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుపురాణము (69)నుండి ఉదాహరించారు.

**స హి దేవల శాపేన హూహూః గంధర్వసత్తమః గ్రాహత్వమ్ అగమత్ కృష్ణాత్ వధమ్ ప్రాప్య దివంగతః**

దేవలుడు అనే ఋషి శాపంవలన హూహూ అనే గంధర్వుడు మొసలిగా అయినాడు. శ్రీకృష్ణుని చేత మరణించిన ఆ మొసలి తిరిగి గంధర్వునిగా మారినది.

**శ్రీ పోతన భాగవతము**

జననాథ! దేవలశాప విముక్తుఁడై పటుతర గ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూనామ గంధర్వుఁ డప్పుడు తన తొంటి నిర్మలతనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములు వాడి
యా దేవు కృప నొంది యందంద మఱియును వినతశిరస్కుఁడై పేడ్కతోడ

దళితపాపుఁ డగుచుఁ దనలోకమున కేఁగె నపుడు శౌరి కేల నంటఁ దడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థం చెప్పారు. **గ్రాహమపి గంధర్వత్వేన జీవతి ఇతి జీవనః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వాః ప్రజాః ప్రాణరూపేణ జీవయతి ఇతి జీవనః.** ప్రాణముల రూపంలో ఉండి శ్రీమన్నారాయణుడే సకల జీవులను జీవింపజేస్తున్నాడు గనుక జీవనుడు.

శ్రీ చిన్మయానంద 'సకల జీవులలోనూ ప్రధాన చైతన్య రూపము' అని చెబుతూ గీత (15.13)నుండి ఉదాహరించారు.

**గామావిశ్య చ భూతాని ధారయామ్యహమ్ ఓజసా పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః**

పృథ్వియందు ప్రవేశించి, నేను నా శక్తిద్వారా సకల భూతములను ధరించి, పోషించుచున్నాను. రసస్వరూపుడనై, అనగా అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు, అనగా వనస్పతులకు అన్నింటికిని పుష్టి చేకూర్చుచున్నాను.

## 931. పర్యవస్థితః

- ప్రక్కన నిలిచియున్నవాడు. గజేంద్రునిచుట్టూ తిరిగి లాలించినవాడు.
- విశ్వమంతా వ్యాపించియున్నవాడు.

### ఓం పర్యవస్థితాయ నమః

పరి (ప్రత్యయము) - చుట్టూరా, సమీపంలో. స్థ - గతి నివృత్తౌ - నిలుచుండుట, వేచియుండుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **వాత్సల్యాత్ గజేంద్రమ్ పరి - పరితః అవస్థితః ఇతి పర్యవస్థితః.** భగవానుడు వాత్సల్యంతో గజేంద్రుని దగ్గర ఉండి, అతనిని చుట్టుముట్టి యున్నాడు. భగవానుని భక్తవాత్సల్యత విష్ణుధర్మంలో **'ప్రీతిమాన్ పుండరీకాక్షః శరణాగతవత్సలః'** అని చెప్పబడిందని శ్రీ ట్టులు ఉదాహరించారు.

**వాత్సల్యాద్యో గజేంద్రంతు పరితో వసనాచ్చ సః పర్యవస్థితః అఖ్యాతో వస్వర్ణో హ్యమితప్రదః.** గజేంద్రునిపట్ల ప్రేమాతిశయములతో ఉండబట్టలేక అతనికి అన్నివైపుల నిలిచి లాలించినవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అమిత ఫలాన్నిస్తుంది. ఓం పర్యవస్థితాయ నమః. (శ్రీకైవల్య సారధి).

కరమున మెల్లన నివురుచు
గర మనురాగమున మెఱసి కలయం బడుచుం
గరి హరికతమున బ్రతుకుచు
గర పీడన మాచరించె గరిణుల మరలన్.

భక్తులంటే భగవానునకెంత ప్రేమయో ఆళ్వారులు అనేక సందర్భాలలో వర్ణించారు. (తిరువైమొళి 10.10.1, 8.3.6, 1.9 వంటివి) నారాయణుడు ఎంతో ప్రేమతోను, ఇష్టంతోను తన భక్తులలో కలిసిపోతాడు. ఆయన చల్లని నీలమణి దేహంతో భక్తుల మనస్సులను ఆక్రమించి అక్కడే తిష్ట వేస్తాడు. క్రమంగా భక్తుల సర్వేంద్రియాలనూ తన స్వాధీనంలోకి తెచ్చుకుంటాడు.

శ్రీ కృష్ణన్ – గజేంద్రునికి ఎక్కడెక్కడ గాయాలున్నాయో తెలుసుకోవడానికి భగవంతుడు గజేంద్రుని చుట్టూ తిరిగాడు. కనుక ఆయన పర్యవస్థితుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **వాత్సల్య భరేణ గజేంద్రస్య పరితః స్థితవాత్ పర్యవస్థితః.**

పై వ్యాఖ్యలు ప్రధానంగా భగవానుని భక్తవత్సలతను చెబుతున్నాయి. శ్రీ కృష్ణదత్త భరద్వాజ భక్తుల క్షేమంపట్ల భగవానునకున్న ఆతురతను ప్రధానంగా వ్యాఖ్యానించారు. **పరితో భక్తమ్ అవస్థితః తస్య రక్షాయై ఇతి పర్యవస్థితః.** భక్తులను రక్షించడంకోసం సదా వారిని చుట్టియుండేవాడు పర్యవస్థితుడు. ఇందుకు శ్రీ భరద్వాజ భాగవతం (1.12.9,10) నుండి ఉదాహరించారు. తల్లిగర్భంలో ఉండగానే పరీక్షిత్తును బ్రహ్మాస్త్రంనుండి భగవంతుడు కాపాడాడు.

**క్షతజాక్షమ్ గదాపాణిమ్ ఆత్మనః సర్వతో దిశమ్**
**పరిభ్రమన్తమ్ ఉల్కాభామ్ భ్రామయన్తమ్ గదాముహుః**
**అస్త్రతేజః స్వగదయా నీహారమివ గోపతి**
**విధమన్తమ్ సన్నికర్షే పర్యైక్షత క ఇత్యాసౌ**

భగవానుడు క్రోధారుణ నేత్రుడై గదను చేతబట్టి, ఉత్తర గర్భంలోని శిశువు చుట్టూ సుడిగాలిలా తిరుగుతున్నాడు. ఆయన చేత గదాయుధము ప్రజ్వలిస్తూ, మంచును సూర్యకిరణాలు హరించినట్లుగా, బ్రహ్మాస్త్రముయొక్క తేజస్సును హరిస్తున్నది. ఈ పురుషుడెవరు? ఒక్కమారు తన ప్రక్కకు ఎక్కడినుండి వచ్చాడని ఆ శిశువు ఆశ్చర్యముతో పరీక్షించెను.



ఉత్తర గర్భాన్ని కాపాడిన శ్రీకృష్ణుడు.
గీతా ప్రెస్ ప్రచురణ నుండి. వికీపీడియా చిత్రం.
by Ramanarayanadatta Sastry
https://commons.wikimedia.org/wiki/File:Krishna_give_life_to_dead_child_of_Uttara.jpg

**శ్రీ పోతన భాగవతము –** ఉత్తర గర్భాన్ని రక్షించిన శ్రీకృష్ణుని కుంతి ఇలా స్తుతించింది.

శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశ దహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పరితః సర్వతో విశ్వమ్ వ్యాప్య ఇతి పర్యవస్థితః.** విశ్వమంతా వ్యాపించియుండేవాడు పర్యవస్థితుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి నారాయణసూక్తమునుండి ఉదాహరించారు. నారాయణుడు అంతటా లోపల, బయట కూడ వ్యాపించియున్నాడు. **అంతర్బహిశ్చ తత్సర్వమ్ వ్యాప్య నారాయణః స్థితః.**

శ్రీ వాసిష్ఠ కూడా ఇదే అర్థం చెప్పారు. **పరితః - సర్వత ఊర్ధ్వ, అధః, తిర్యక్ చ అవస్థితః ఇతి పర్యవస్థితః.**



## అనన్తరూపోऽనంతశ్రీర్జితమన్యుర్భయాపహః |
## చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః || (100)

### 932. అనన్తరూపః

- అనంతములైన (లెక్క లేనన్ని) రూపములు ధరించువాడు.
- అంతము లేని (క్షయించని, నాశనము లేని) రూపము గలవాడు.
- వర్ణింపనలవిగాని, అన్ని దిశలా అంతు లేకుండా వ్యాపించిన రూపము గలవాడు.

**ఓం అనన్తరూపాయ నమః**

ఈ నామమును మూడు విధములుగా వివరింపవచ్చును.

(1) తన అనేక అవతారములు మరియు వ్యూహములు మరియు విభవములు ద్వారా లెక్కలేనన్ని రూపములు గలవాడు.

(2) వర్ణింప వీలుగాని, సమస్త దిశలందు అంతులేకుండా వ్యాపించిన రూపము గలవాడు. ఇది భగవానుని విశ్వరూపమును సూచించును.

(3) అంతము లేని, అనగా ఎన్నడూ క్షీణించని, నశించని, ఏ విధమైన మార్పులు లేని శాశ్వతమైన రూపము గలవాడు.

**అనంతాని రూపాని యస్య సః అనంతరూపః.** అనంతమైన రూపములు గలవాడు అనంతరూపుడు. భగవానుని అనేక అవతారములగురించి ఆయనయే గీత (4.8)లో చెప్పాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

సత్పురుషులను పరిరక్షించుటకును, దుష్టులను రూపు మాపుటకును, ధర్మమును సుస్థిరమొనర్చుటకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

ఇక్కడ భగవదవతారములకు మూడు కారణములు చెప్పినాగాని, వానిలో 'భక్తులను రక్షించుట' ముఖ్య కారణము. మిగిలిన రెండు కారణాలు తద్వారా సంభవించేవి. గజేంద్ర రక్షణార్థం ఆయన దర్శనమిచ్చిన రూపం ఆయన అనంతరూపాలలో ఒక్కటి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఈదృశీ సద్యః సంపాద్యాని అనంతాని రూపాణి అస్య ఇతి అనంతరూపః.** సంకల్పానుసారం, అవసరాన్నిబట్టి, నేరుగా ఈ విధంగా అనంతములైన రూపములు ధరించినవాడు అనంతరూపుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 1.3.2 – అవసరాన్నిబట్టి భగవానుడు సరళమైన అనేక రూపములలో అవతరించాడు. ఈ అవతారాలలో ఆయన సమస్త కళ్యాణగుణ సంపన్నుడు. భక్తులకు మోక్షానుభవాన్ని ఇచ్చువాడు. ఆయా రూపాలలో భక్తులకు

అందివచ్చినవాడు మరియు తన భక్తుల శత్రువులకు అందరానివాడు. అవతార ప్రయోజనం కొరకు ఆయన చేప, పంది, అర్ధమృగము (నరసింహము) – ఇలా ఏ రూపాన్నైనా ధరిస్తాడు.

తిరువైమొళి 2.5.6 – క్షీరసాగరంలో ఆదిశేషునిపై శయనించిన స్వామి అన్నివిధాలా అనంతసంపన్నుడు. ఆయనను అలంకరించిన దివ్యాభరణాలకు అంతులేదు. ఆయన నామములు అనంతములు. కొన్ని ఆయన శౌర్యమును, కొన్ని ఇతర కళ్యాణగుణములను సూచించును. ఆయన దివ్యప్రకాశ రూపములు పర, వ్యూహాది రూపములకంటె భిన్నమైనవి మరియు అనంతమైనవి. గాన, ధ్యాన, దర్శన, శ్రవణాది అనేక మాధ్యముల ద్వారా ఆయనను అనుభవించవచ్చును. అనంతునిపై శయనించిన ఆయన రూపాది సకల కళ్యాణగుణములలోను అనంతుడే.

శ్రీ కృష్ణన్ – భగవానుడు పర, వ్యూహ, విభవ, అర్చావతారములలో అనంతరూపములు కలిగియున్నాడు. రామ, కృష్ణాది విభవావతారములు, అనేకములైన అర్చావతారములు, అనేకములైన అంతర్యామి రూపములు, ఇలా అన్నీ భక్తుల రక్షణకు ఉద్దేశించినవే.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అనంతాని రూపాణి అస్య విశ్వప్రపంచ రూపేణ స్థితస్య ఇతి అనంతరూపః.** ఈ నామరూపాత్మకమైన అనంత విశ్వమంతా ఆ అనంతుని రూపములే గనుక ఆయన అనంతరూపుడు అను శబ్దమున వాచ్యుడగుచున్నాడు (శ్రీ పెమ్మరాజు రాజారావు).

శ్రీ కృష్ణదత్త రద్వాజ – **అనంతమ్ శాశ్వతమ్ రూపమ్ అస్య ఇతి అనంతరూపః.** ఆయన రూపములు అంతులేనివి మాత్రమే కాదు. శాశ్వతములైనవి కూడాను. అనగా వానికి క్షయము లేదు. కాలముతో అంతరించవు. మరియు ప్రత్యేక లక్ష్యము కొరకు సంభవించిన (రామ, కృష్ణాది) విభవావతారములు కూడా మనకు శాశ్వతముగా అనుభవింప వీలు కలిగినవి.

శ్రీ సత్యసంధ తీర్థ కూడా 'అనంత' అనగా 'శాశ్వత' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **అ-నాశాని రూపాణి యస్య స అనంతరూపః.** నాశనము లేని రూపములు కలిగినవాడు అనంతరూపుడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – భగవానుని రూపము అన్నిదిశలా, అన్నియెడలా అంతము లేనిది. ఇది ఆయన విశ్వరూపమును సూచించును.

కైవల్యోపనిషత్తు – **అచింత్యమ్ అవ్యక్తమ్ అనంతరూపమ్.** మనసుకు అందనిది, మాటలకు అందనిది, అన్నియెడలా అంతము లేనిది.

ఋగ్వేదము 10.81.3, యజుర్వేదము 17.19 –

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహురుత విశ్వతస్పాత్**

**సం-బాహుభ్యాంధమతి సంపతత్రైర్ద్యావా భూమీ జనయన్ దేవేకః**

అన్నియెడలా కన్నులు కలిగినవాడు, అన్నియెడలా ముఖములు (నోళ్ళు), కాళ్ళు, చేతులు కలిగినవాడు ఒక్కడే దేవుడు. ఆయనే తన చేతులతో భూమ్యాకాశములను సృష్టించి నిలిపియుంచుచున్నాడు.

**అనేక బాహూదరవక్త్రనేత్రమ్ పశ్యామి త్వాం సర్వతోऽనంతరూపమ్**

**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ విశ్వరూప** – గీత 11.16

ఓ విశ్వేశ్వర! విశ్వరూప! నీ బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు అసంఖ్యాకములు. నీ అనంతరూపము సర్వతోముఖముగ విలసిల్లుచున్నది. నీవు ఆదిమధ్యాంతరహితుడవు. మహత్వపూర్ణమైన నీ దివ్యరూపమునకు ఆదిమధ్యాంతములను తెలిసికొనలేకున్నాను.

## 933. అనన్తశ్రీః

- అనంతమైన (లెక్కలేనన్ని) ఐశ్వర్య విభూతులు (సంపద, యశస్సు, శక్తి వంటివి) కలవాడు.
- ఎన్నడూ తరుగని ఐశ్వర్య విభూతులు కలవాడు.

### ఓం అనన్తశ్రియే నమః.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – **అనంతాః శ్రియః యస్య సః అనంతశ్రీః.** అంతులేని, లెక్క లేని ఐశ్వర్యము కలవాడు 'అనంతశ్రీ'. ఈ సంపదలతో ఆయన ఏమి చేస్తాడు? భక్తులు కోరినవన్నీ ఇస్తాడు, ఆఖరుకు తనను తానే భక్తులకు ప్రసాదిస్తాడు. గజేంద్రుని ఉదంతంలో ఆయన మొసలికి శాపవిమోచనం కలిగించి గంధర్వునిగా స్వర్గాన్నిచ్చాడు. గజేంద్రునికి శ్రీవైకుంఠప్రాప్తిని కలుగజేశాడు. ఇలా అందరికీ ఇవ్వడానికున్న అంతులేని సంపద 'అనంతశ్రీ' నామములో చెప్పబడింది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేభ్యో దేయాః స్వ-ప్రాప్తి-పర్యంతః అనంతాః శ్రియోऽపి అస్య ఇతి అనంతశ్రీః.** భక్తులకు ఇవ్వడానికి, చివరకు తనను తానే ఇచ్చేయడానికి అంతులేని 'శ్రీ'లు కలవాడు అనంతశ్రీ. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుధర్మము (69)నుండి ఉదాహరించారు. **తతో దివ్య వపోర్భూత్వా హస్తిరాత్ పరమం పదమ్ జగామ.** అప్పుడు దివ్య శరీరము ధరించి గజేంద్రుడు పరమపదమునకేగెను.

**దేయాః స్వప్రాప్తి పర్యంతాః శ్రియోऽనంతాశ్చ నిత్యశః ప్రసన్నేభ్యో యస్య సంతి సోऽనంతశ్రీరితిస్మృతః..** తన భక్తులకు ఇవ్వడం కోసం అనంతమైన సంపదలు కలవాడు. భక్తులకు తనను తాను సమర్పించుకోవడానికి కూడాసిద్ధపడేవాడు (శ్రీకైవల్య సారధి).

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుని విభూతులు రెండు విధములు. ప్రాపంచికములైనవి లీలా విభూతులు. శ్రీవైకుంఠములోనివి నిత్యవిభూతులు. ఇవి రెండూ కూడా కేవలం భక్తుల కొరకే. భగవంతుడు సుసంపన్నుడైన మహాపురుషుడు (సెల్వార్ పెరియార్), అని శ్రీ ఆండాళ్ నాచియార్ తిరుమొళి (10.10)లో వర్ణించింది. సంపదలో పెరిగిన పిల్లవాడని శ్రీకృష్ణుని శ్రీ పెరియాళ్వారు వర్ణించారు (2.8.8).

శ్రీ తిరుమంగయాళ్వారు. పెరియతిరుమొళి 7.7.1 – సిరిసంపదలకు దేవతయైన లక్ష్మికి ఐశ్వర్యమెవరు? సకల దేవతలకు దేవుడైనవాడే.

**కః శ్రీః శ్రియః పరమసత్త్వ సమాశ్రయః**
**కః పుండరీక నయనః పురుషోత్తమః కః**
**కస్యాయౌతాయుట శత ఏక కలాంశక అంశే విశ్వమ్**
**విచిత్ర చితచిత్ ప్రవిభాగవృత్తమ్** – శ్రీ ఆళవందార్. స్తోత్తరరత్నము 12
లక్ష్మీదేవికే 'శ్రీ' అయిన దేవుడెవ్వరు? పరమ సత్వగుణమునకు మూర్తీభవించిన స్వరూపమెవ్వడు? సకల పురుషులకు పరమపురుషుడైన దేవుడెవ్వడు? ఆ పద్మములవంటి కనులు కలిగిన దేవుని శక్తిలో కించిన్మాత్రము చేతనే చేతనాచేతనామయమైన ఈ సకల విశ్వముయొక్క సృష్టి, పాలన, లయము జరుగుచున్నవి (ఆ దేవుడు శ్రీమన్నారాయణుడే).

శ్రీ శకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'శ్రీ' అనగా 'శక్తి' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. **అనంత - అపరిమిత, శ్రీః - పరాశక్తిః అస్య ఇతి అనంతశ్రీః.** పరిమితులు లేని పరాశక్తులకు నిలయమైనవాడు అనంతశ్రీ. ఇందుకు శ్రీ శంకరులు శ్రుతినుండి ఉదాహరించారు. **పరా అస్య శక్తి వివిధైశ్చ శ్రూయతే** (శ్వేతాశ్వరోపనిషత్తు 6.8). ఆయన పరాశక్తి వివిధములుగా చెప్పబడును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'అనంత' అనగా 'నాశనము లేని' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **అనంతా - అవినాశినీ శ్రీః - శోభా సంపత్ యస్య ఇతి అనంతశ్రీః.** శాశ్వతమైన సంపద, సౌందర్యము కలవాడు అనంతశ్రీ.

శ్రీ సత్యసంధ తీర్థ కూడా ఇదే అర్థం చెప్పారు. **అనంతా - నాశరహితా, శ్రీః అపరూపశ్రీః యస్య స అనంతశ్రీః.**

శ్రీ చిన్మయానంద **–** శక్తి మూడు విధములు. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి. ఈ శక్తులన్నీ భగవానునినుండి ఉద్భవించును.

## 934. జితమన్యుః

- కోపమును జయించినవాడు.

### ఓం జితమన్యవే నమః

జీ - జయే, అభిభవేచ - జయించుట. మన్ - జ్ఞానే - తెలిసికొనుట, ఆలోచించుట. ఉణాది సూత్రము (3.20) ప్రకారము 'మన్'కు 'యుచ్' ప్రత్యయము చేరిస్తే 'మన్యుః' వస్తుంది. దాని అర్థం కోపము, కష్టము, త్యాగము. 'జితామన్యుః' అనగా కోపమును జయించినవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య **–** శ్రీ భట్టులు గజేంద్రమోక్షము వృత్తాంతము పరంగా వ్యాఖ్యను కొనసాగించారు. తనపట్ల శరణాగతుడైన గజేంద్రుని పట్టి బాధిస్తున్న మొసలివంటి జలకీటకం పట్ల ఆయనకు కోపం లేదు. కనుకనే మొసలిని ఇంకా శపించకుండా శాపవిమోచనం కలిగించాడు. **గజేంద్ర ద్వేషిణో యే చ కీటకాద్యాః జలవాసినః యస్తేషు మన్యం జితవాన్ జితమన్యుః స కథ్యతే**

ఆ మడుగులో ఉన్న గజేంద్రునియందు ద్వేషంతో ఉన్న మొసలి మొదలైన కీటకములపై కోపమును జయించినవాడు జితమన్యుడు (శ్రీకైవల్య సారధి).

భగవంతుని జితమన్యతకు మరొక దృష్టాంతము భృగుమహర్షి వృత్తాంతము. భృగువు తన వక్షస్థలంపై తన్నినా గాని భగవానుడు కోపం ధరించకుండా భృగువు పట్ల వినయంతో ప్రవర్తించి, పాదసేవ చేసి, అలా భృగువుయొక్క అహంకారాన్ని అణచివేశాడు.

కోపమును అదుపులో పెట్టులొనకపోతే ఏమవుతుందో భగవానుడు గీత (2.62, 63)లో చెప్పాడు **–**

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే**
**సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోऽభిజాయతే.**

విషయచింతన చేయు పురుషునకు ఆ విషయములందు ఆసక్తి ఏర్పడును. ఆసక్తివలన ఆ విషయములను పొందుటకై కోరికలు కలుగును. ఆ కోరికలు తీరనప్పుడు క్రోధము కలుగును.

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః**
**స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణస్యతి**

అట్టి క్రోధము వలన వ్యామోహము కలుగును. దాని ప్రభావమున స్మృతి ఛిన్నాభిన్నమగును. స్మృతి భ్రష్టము అయినందున బుద్ధి అనగా జ్ఞానశక్తి నశించును. బుద్ధినాశము వలన మనుష్యుడు తన స్థితినుండి పతనమగును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి **–** కొన్నిమార్లు భగవానుడు కోపమును ధరించును. ఇది కేవలం అపరాధులను శిక్షించడానికి ఒక ఆయుధం మాత్రమే. ఆ కోపము భగవంతుని బుద్ధిని ఏమాత్రం ప్రభావితం చేయదు.

సాగరాన్ని దాటే ఉపాయం తెలుపమని శ్రీరాముడు సముద్రం ఒడ్డున దీక్షలో కూర్చున్నాడు. సాగరునినుండి ఎలాంటి స్పందన రాకపోవడంతో రాముడు కోపగించి సాగరంపై బాణాన్ని ఎక్కుపెట్టాడు. మరొక వృత్తాంతము . యుద్ధంలో రాముడు హనుమంతుని

భుజాలపై కూర్చుని యుద్ధం చేస్తున్నాడు. రావణుని బాణాలు హనుమంతుని తీవ్రంగా గాయపరచాయి. రక్తసిక్తమైన హనుమ దేహాన్ని చూసి రాముడు 'కోపమా, నన్నావహించు' అని కోపము పూనాడు. నిజానికి కోపం ఎప్పుడూ భగవంతుని అధీనంలో ఉంటుంది. దుష్టులను శిక్షించడానికి, భక్తులను రక్షించడానికి భగవంతుడు కోపాన్ని ధరిస్తాడు.

**వినమ్య ధనుర్భీమమ్ తూణ్యోశ్చోద్ధృత్యసాయకాన్**
**క్రోధమాహారయత్ తీవ్రమ్ వధార్థమ్ సర్వరక్షసామ్ –** రామాయణం 3.24.33
రాక్షసులనందరినీ వధించడం కోసం రాముడు తన గొప్ప ధనుస్సు వంచి, బాణాన్ని ఎక్కుపెట్టి, క్రోధాన్ని ధరించాడు.




తిరుమల వసంతోత్సవంలో శ్రీ సీతారామ లక్ష్మణులు మరియు హనుమంతుడు. వికీపీడియా చిత్రాలు.

Photo by : Vimalkalyan https://commons.wikimedia.org/wiki/File:Rama_in_Tirumala.jpg

49వ శ్లోకములోని 463వ నామము '**జితక్రోధః**' కూడా ఇంచుమించు ఇదే అర్థాన్ని కలిగిఉంది. మన్యు, కోపము, క్రోధము అనే ఈ మూడు పదాలమధ్య ఉన్న స్వల్ప వ్యత్యాసాన్ని శ్రీ శాస్త్రి వివరించారు. 'మన్యు' అనగా బయటకు కనిపించని కోపం మనస్సులోనే ఇమిడి ఉంటుంది. 'కోపం' అనగా కనులు ఎర్రబడడం వంటి ముఖలక్షణాలు కనిపిస్తాయి. 'క్రోధం' అనగా కోపాన్ని తెలిపే మాటలు, చేతలు వెలివడుతాయి. భగవానుడు అవుసరార్థం ఈ మూడు దశలలోని ఏదో ఒక కోపాన్ని పూనుతాడు కాని అది ఎప్పుడూ ఆయన అధీనంలోనే ఉంటుంది. కనుక ఆయన 'జితామన్యుః'.

463వ నామము 'జితాక్రోధః' ను శ్రీ భట్టులు 'ఇతరులలోని క్రోధాన్ని జయించినవాడు' అని వ్యాఖ్యానించారు. ('తన క్రోధాన్ని జయించినవాడు' అని కాదు). మోహిని రూపంలో అసురులకు అమృతం అందకుండా చేసినపుడు ఆ రాక్షసులు కోపగించడం బదులుగా ఆమె అందాన్ని చూసి సమ్మోహితులయ్యారు.

రావణ వధ అనంతరము రాముడు విభీషణుని పిలిచి రావణుని దహనసంస్కారాలు చేయమని చెప్పాడు. రావణుని మరణంతో అతనితో వైరం అంతరించిందట.

**మరణాంతాని వైర్యాణి నివృత్తమ్ నః ప్రయోజనమ్ క్రియతామ్ అస్య సంస్కారో మమాప్యేప యథా తవ.** యుద్ధకాండ 59.147 – **కోపస్య వాసామ్ ఏ ఇవాన్.** రాముడు తీవ్రమైన కోపాన్ని ధరించి రావణునిపై భీకరంగా యుద్ధం చేశాడు. అలసిపోయిన రావణుని చూసి, సేదదీరి మరునాడు రమ్మని పంపేశాడు.

**తస్మాత్ పరిశ్రాంత ఇవ వ్యవస్య న త్వామ్ శరైర్మృత్యువశమ్ నయామీ –** 59.153
**గచ్ఛానుజానామి రణార్ది తస్త్వం ప్రవిశ్య రాత్రించర రాజా లంకామ్**
**అస్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః –** 59.154

శ్రీ వాసిష్ఠ **–** మనకంటె బలవంతులు శక్తివంతులు అయినవారితో వైరం ఉంటే కోపం వస్తుంది. భగవంతునికంటే బలవంతులెవరూ లేరు. కనుక ఆయనకు కోపం వచ్చే పరిస్థితి లేదు.

## **935.** భయాపహః

- (సంసార) భయమును తొలగించేవాడు.

### ఓం భయాపహాయ నమః

భయ - భయము. అపహన్ - చంపుట, నాశనము చేయుట (**"**హ**"**). భయ అపహః - భయమును నాశనము చేయువాడు. పాణిని సూత్రము (3.2.49) **'**ఆశిషి హనః**'** ప్రకారము **'**డ**'** ప్రత్యయము చేరినపుడు **'**ఆశీర్వపూరకముగా నాశనము చేయుట**'** అనే అర్థం వస్తుంది (అతడు మన భయమును హరించుగాక).

హ - చంపుట, నాశనము చేయుట (**'**హన్**'** నుండి). పాణిని సూత్రము (3.2.50) **'**అపె క్లేశ తమసో**'** ప్రకారము **'**హన్**'** తరువాత **'**డ**'** ప్రత్యయము వస్తే, మరియు ముందుగా **'**అప్**'** వస్తే, **'**క్లేశాపహః**'** అనే అర్థం వస్తుంది. **'**భయాపహః**'** అంటే భయమును, బాధను, చీకటిని తొలగించేవాడు అని అర్థము.

89వ శ్లోకము, 838వ నామము '**భయనాశనః**' కూడా ఇలాంటి అర్థాన్నే కలిగివుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య **– అస్మాదాదీనామపి స్వ-వాత్సల్యేన తాదృశ అనాధత్వ భయమ్ వధ్యాత్ ఇతి ఆశంసనర్థః.** ఆయన వాత్సల్యము కారణంగా దిక్కు లేదనుకొనే అనాథలు కూడా భగవంతుడు తమను కాపాడునని విశ్వసింపవచ్చును. శ్రీ భట్టులు ఉదాహరించినది **– భయేమహతి మగ్నాన్శ్చ త్రాతి నిత్యమ్ జనార్దనః.** గొప్ప (సంసార) భయంలో మునిగి ఉన్నవారిని జనార్దనుడు రక్షించును.

**అనాధత్వ భయం హన్తి వాత్సల్యేన మాదృశామ్ భయాపహ స్సమాఖ్యాతః వస్వర్ణో మనురుత్తమః.** అనాథలకు కూడా అమితమైన వాత్సల్యంతో తానే దిక్కై నిలిచి, భయాన్ని పోగొట్టేవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. శ్రేష్టమైనది. ఓం భయాపహాయ నమః (శ్రీకైవల్య సారధి). భగవంతుని రక్షణయందు మహావిశ్వాసము కలిగి ఉండవలెనని ఈ నామము బోధించుచున్నది.

శ్రీ పెరియాళ్వారు. తిరుమొళి 4.4.9 **–** శ్రీ నరసింహదేవుని మనం (రక్షణ కొరకు) నమ్ముకొనవచ్చును.
శ్రీ పెరియాళ్వారు. 5.1.9 **–** భక్తులను రక్షించడానికి ఆయనను నమ్ముకుంటే చాలును. ఆయన చక్రం చేతబట్టి వచ్చి గజేంద్రుని రక్షించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– భయమ్ సంసారజమ్ పుంసామ్ అపఘ్నమ్ భయాపహః.** తన భక్తులకు సంసార భయమును నాశనము చేయువాడు **'**భయాపహః**'**.

89వ శ్లోకంలోని **'**భయనాశనః**'** నామమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య **–** ధర్మమార్గంలో చరించేవారికి భయం లేకుండా చేసేవాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఏదైనా సమస్య ఎదురైనపుడు భయం కలుగుతుంది. చాలామార్లు ఆ సమస్యకంటే భయంయొక్క తీవ్రత, ప్రభావం ఎక్కువగా ఉంటాయి. భగవానుని నమ్ముకున్నవారికి భయం ఉండదు. నిజమైన భక్తుడు సుఖదుఃఖాలను ఒకేవిధంగా చూస్తాడు.

గీత 2.38 – **సుఖ దుఃఖ సమే కృత్వా.**

గీత 2.56 – **దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః.**

శ్రీ కృష్ణన్ – భగవంతుడు గజేంద్రుని భయాన్ని మాత్రమే పోగొట్టలేదు. మొసలికి శాపభయాన్ని పోగొట్టాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ 'భయావహః' అనే పాఠాన్ని గ్రహించారు. కాని ఆయన చెప్పిన అర్థం మాత్రం 'భయాపహః' అన్న నామము అర్థానికి సరిపోతుంది. (అవహన్ - పోగొట్టుట, పడగొట్టుట.)

## 936. చతురశ్రః

- అన్ని విషయములలోను నైపుణ్యము (చాతుర్యము) కలవాడు.
- అందరిపట్ల సమన్యాయము కలవాడు. వారి వారి కర్మానుసారము ఫలములు ప్రసాదించువాడు.
- ఎవరినైతే కోర్కెలు కోరుతామో అతడు.
- నాలుగు దిశలందు వ్యాపించినవాడు.
- జ్ఞానులైనవారిచే అర్చింపబడువాడు.

**ఓం చతురశ్రాయ నమః**

చతుర - నాలుగు సంఖ్య. అశ్ర, అశ్రి - మూల, కోణము. చతురశ్రము అనగా రేఖాగణితములో చతురస్రము. ఇందులో అన్ని భుజములు, కోణములు సమానముగా నుండును. కనుక 'చతురశ్రుడు' అనగా అందరి పట్ల సమన్యాయము కలవాడు అని కొందరి వ్యాఖ్య. 'చతుర' అనగా నిపుణత (చాతుర్యము) కల్గిన అనే అర్థం కూడా ఉంది. 'చతురశ్రః' అనగా అన్నింటి యందును నైపుణ్యము కలిగిన అని కొందరు వివరించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – 'చతురశ్రః' అనగా అన్ని విధముల చాతుర్యము కలవాడు అన్న అర్థంలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. యుక్తములైన పనులు చేసినవాడు చతురుడు.

శ్రీమద్ ఆండవన్ వివరణ – భగవానుడు అన్ని సందర్భములలోను భక్తులను ఉద్ధరించడానికి యుక్తమైన అన్ని పనులు చేస్తాడు. గజేంద్ర మోక్షము సందర్భములో ఆయన మొసలిని శాపం బారినుంచి విముక్తుని చేశాడు. గజేంద్రుడు త్రుంచిన పూవును భగవత్కైంకర్యము చేసే అవకాశం కలిగించి సత్ఫలము ప్రసాదించాడు. భక్తులు మొరపెట్టుకుంటే తాను రయమున వచ్చి వారిని కాపాడుతానని నిరూపించాడు. తాను వైకుంఠమునుండే మొసలిని శిక్షించగలడు కాని ఆయన అలా చేయలేదు. ఉన్నపళంగా వైకుంఠంనుండి ఒక్కమారు గజరాజు, మొసలి ఉన్న సరస్సువద్దకు వచ్చాడు. ఆభరణాలన్నీ అస్తవ్యస్తంగా ఉన్నాయి. **గర్జతే గజాయ జగామ.** మరియు ఆయన క్షుద్రజలకీటకమైన మొసలిపై క్రోధాన్ని తెచ్చిపెట్టుకున్నాడు. ఇవన్నీ ఆయన భక్తవాత్సల్యతకు, భక్తులను రక్షించే గుణానికి యుక్తమైనవి.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ భగవానుని **'చాతుర్యం'** గురించి చెబుతూ రామాయణంలోని వాలి వధ సంఘటనను ఉదాహరించారు. ముందుగా వాలి రాముని అధర్మపరుడని తూలనాడాడు. కాని రాముని వివరణ విన్న తరువాత శ్రీరాముని ధర్మగుణాన్ని కీర్తించాడు. భగవానుని చాతుర్యమునకు ఇది మరొక ఉదాహరణ.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– న్యాయ సమవేతః చతురశ్రః.** అందరియందును సమానముగా వర్తించువాడు. జీవులకు వారవారి కర్మానుసారముగా ఫలములను ప్రసాదించువాడు. కనుక అలంకారికముగా **'చతురశ్ర'** అని కీర్తింపబడును.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి **'చతుర'** అనగా **'నాలుగు'** అన్న అర్థంలో భగవానుని నాలుగు విధాల రక్షణను చెప్పారు.

- ధర్మార్థకామమోక్షములనే పురుషార్థములను జీవులకు వారి కర్మానుసారము ప్రసాదించువాడు.
- ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణము మరియు (నాల్గవది?) అనే నాలుగు విధాలైన యాగాగ్నుల రూపంలో ఉన్నవాడు.
- గర్భమునుండి, అండమునుండి, స్వేదమునుండి, భూమినుండి – ఇలా నాలుగు విధములుగా జన్మించే జీవుల మనుగడకు ఆధారమైనవాడు.
- ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు అనే నాలుగు విధములైన భక్తులను రక్షించేవాడు.
- నాలుగు వేదముల శిరస్సులు (ఉపనిషత్తులు) ద్వారా తెలియవచ్చేవాడు.
- ఆయన ఆజ్ఞ జగత్తులో నాలుగు దిశలందు పాలింపబడుతుంది.

శ్రీ వాసిష్ఠ **–** చద్ - యాచనే - అడుగుట. **'**చద్**'**కు **'**ఉరన్**'** అనే ప్రత్యయం చేరిస్తే ఉణాదిసూత్రము (5.58) **'**చతేరురన్**'** ప్రకారం **'**చతుర్**'** అనే పదం వస్తుంది. **చతతి చత్యతే వా ఇతి చతుర్.** ఏదైనా అడిగేవాడు లేదా ఆయనను మనం ఏమైనా కోరుతాము.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరో రెండు అర్థాలు **–**

అశ్ - వ్యాప్తౌ సంఘాతే చ - వ్యాపించుట, ప్రోగుపడుట. అశ్ - భోజనే - తినుట.

**చతస్రో దిశో అశ్నుతే చతురశ్రః.** నాలుగు దిశలందు వ్యాపించినవాడు చతురశ్రుడు.

**చతసృషు దిక్షు స్థితానామ్ ప్రాణినామ్ భోజనస్య దాతా ఇతి విష్ణుః.** నాలుగు దిశలలో ఉన్న జీవులకు ఆహారమును ప్రసాదించు విష్ణువే చతురశ్రుడు.

శ్రీకృష్ణదత్త భరద్వాజ **– చతురైః శ్రీయతే - సేవ్యతే ఇతి చతురశ్రః.** ఆయన గొప్పతనము నెరిగినవారు ఆయనను పూజింతురు గనుక ఆయన చతురశ్రుడు.

## 937. గభీరాత్మా

- గంభీరమైన స్వభావము కలవాడు.
- అన్నింటి ప్రాప్తికి, చలనమునకు కారణమైనవాడు.

### ఓం గభీరాత్మనే నమః

ఉణాది సూత్రము 4.35 గభీర గంభీరౌ. గమ్ - గతౌ - వెళ్ళుట. 'గమ్'కు 'ఇరన్' ప్రతయయము చేర్చినపుడు 'మ్' శబ్దము 'భ్' శబ్దముగా మారుతుంది. అలా 'గభీర' పదం వస్తుంది. 'గభీర', 'గంభీర' పదాల అర్థం ఒకటే. అమరకోశంలో 'నిమ్నమ్ గంభీరమ్' అని ఉంది. 'గభీరాత్మా' లో 'ఆత్మ' అంటే స్వరూపము లేదా స్వభావము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అన్యేషామ్ చతుర్ముఖ ముఖానామప్రధృష్య గాంభీర్యః గభీరాత్మా.** బ్రహ్మాదులకు కూడా తెలియరాని గంభీరమైన (లోతైన) స్వభావము కలవాడు గభీరాత్మ.

**ధాత్రాదీనా మప్రదృష్యం గాంభీర్యం యస్య విద్యతే గభీరాత్మా స విజ్ఞేయః పస్తార్ణో మనురుత్తమః.** బ్రహ్మాదులకు కూడా నిర్ణయించలేని గాంభీర్యము కలవాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. శ్రేష్ఠమైనది. ఓం గభీరాత్మనే నమః. (శ్రీ కైవల్యసారథి).

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – ఆయన స్వభావము ఎంత లోతైనదంటే దానిని ఎవరూ కల్లోలపరచలేరు.

శ్రీ కృష్ణన్ – శ్రీపాద తీర్థము (గంగ)ను శిరస్సుపై ధరించిన శివుడు, జ్ఞానులలో ఉత్తముడైన బ్రహ్మ కూడా చిరకాలం తపస్సు చేసినా ఆయన నిజస్వరూపమును, స్వభావమును తెలిసికొనలేరు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 1.1.8 – బ్రహ్మకు తను సృష్టించినవాని గురించి తెలుసు కాని తనకంటె ముందువాని గురించి తెలియదు.

తిరువైమోలి 7.71 – బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు వంటివారిని మనం సామాన్యమైన నేత్రాలతో చూడలేము. అలాగే వారు కూడా నా కృష్ణభగవానుని చూడలేరు.

నాన్ముగమ్ తిరువన్ 73 – ప్రళయసమయంలో జగత్తును మ్రింగివేసి, సృష్టిసమయంలో వానిని వెలిగ్రక్కిన ఎంపెరుమాన్ గంభీరతను మనం అర్థంచేసుకొనలేము. ఎనిమిది కళ్ళ (నాల్గు ముఖాల) బ్రహ్మకు, నీలకంఠుడైన శివునికి కూడా కూడా ఆయనను అందుకొనే సులభమార్గం (చరమశ్లోకం) తెలియదు.

**సముద్ర ఇవ గాంభీర్యే** – అని శ్రీరాముని వాల్మీకి మహర్షి వర్ణించాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఆత్మా స్వరూపమ్ చిత్తమ్ వా గభీరమ్ పరిచ్ఛేత్తుమశక్యమ్ అస్య ఇతి గభీరాత్మా.** ఎవని నిజస్వరూపము, చిత్తము అందరానంత గంభీరమో అతడు గభీరాత్మ. ఆయన సాగరమువలె మహా గంభీరుడు. ఆయన నెవ్వరూ కల్లోలపరచలేరు. విశ్వమంతా వ్యాపించియున్న ఆయన వైశిష్ట్యము, వైభవము, గంభీరతలను ఎవరూ మనసుతో ఊహింపలేరు. మాటలలో చెప్పలేరు.

శ్రీ వాసిష్ఠ – గమ్ - గతౌ - వెళ్ళుట. **గచ్ఛతి గమ్యతే - ప్రాప్యతే అనేన.** ఆయన కారణంగా సమస్తము ప్రాప్తించును. **గచ్ఛతి - ప్రాప్నువన్తి, ధ్యాయన్తి, ప్రార్థయన్తే వా స గభీరః.** అందరూ ఎవరిని పొందడానికి ధ్యానము, ప్రార్థన చేస్తారో ఆయన గభీరుడు.

**గచ్ఛతి గమనశీలః.** అన్నింటిలోను చలనము కలిగించేవాడు గభీరాత్మ. ఆయన స్థావరములైన వృక్షాదులయందు కూడ మరణము, క్షీణత వంటి ప్రక్రియలద్వారా చలనము కలిగించేవాడు.

### 938. విదిశః

- అనంతములైన ఆయన తత్త్వము, రూపములు, గుణములు అన్ని దిశలందును వ్యాపించియున్నవి.
- అన్ని దిశలనుండి ఆయన అందివచ్చును.
- విశేష దాతృత్వము కలవాడు. యోగ్యతలనుబట్టి ఫలములను ప్రసాదించువాడు.
- (విద్ - తెలియుట) జ్ఞానులకు ఆనంద కారణము.
- శాస్త్రములను వివరముగా తెలియజేసినవాడు.
- అంతటా, అన్నింటా, అన్నిదిశలా వ్యాపించియున్నవాడు.

ఓం విదిశాయ నమః

ఈ నామము 'విదిశః', మరియు తరువాతి రెండు నామములు 'వ్యాదిశః', 'దిశః'లు 'దిశ్' అనే ధాతువును కలిగియున్నవి. 'దిశ్' అంటే దిక్కు, ఆజ్ఞ, దానము, సమర్పణ వంటి అర్థాలున్నాయి. 'వి' అనే ఉపసర్గకు 'వివిధ' అని అర్థం వస్తుంది. దిశ్ - అతిసర్జనే - దానమిచ్చుట, అంగీకరించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషమ్ వినయ గద్గద స్తుతి గిరామ్ అస్య దూరే వివిధా దిశాః దేసాః ఇతి విదిశః.** ఆయన మాటలకు, దేనికీ అందనివాడు. ఆయన తత్వము, స్వరూపము, గుణములు అన్నీ అనంతములై అన్నియెడల వ్యాపించియున్నవి. ఆయన కళ్యాణగుణములన్నీ ఆయనను స్తుతించే దేవతలకు కూడా తెలియవు.

**వినయాద్గద్గద స్తోత్ర ధాత్రీనామ్ విశేషః దూరేశ్య వివిధా దేశాః విదిశః పరికీర్తితః.** వినయంతో, తత్పరతతో, గద్గద స్తోత్రంతో ఆయనను స్తుతించే బ్రహ్మాదులకు కూడా అగోచరుడు 'విదిశః'. (శ్రీకైవల్య సారథి).

పెరియ తిరుమొళి 1.7.8 – చతుర్ముఖుడైన బ్రహ్మ మరియు శివుడు తమ నాలుకలు అరిగిపోయేలా ఆయనను స్తుతిస్తారు. (అయినా ఆయన వారికి తన దర్శనమివ్వడు. కాని ప్రహ్లాదునివంటి భక్తుల ఎదుట ప్రత్యక్షమవుతాడు).

తిరువైమొళి 2.7.12 – అనేక యుగాలలో సృష్టింపబడిన బ్రహ్మ శివాదులు దామోదరుని శరీరములే. వారికి కూడా ఆయన సంపూర్ణ మహత్యము తెలియదు. కాని అవుసరమైనపుడు అలాంటి దేవదేవుడు వారిని రక్షిస్తాడు. గజేంద్రుని ఆర్తనాదం విని పరుగున వచ్చి కాపాడాడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – **వివిధాః దిశాదేశః యస్య స విదిశః.** ఎక్కడెక్కడినుండైనా, ఏ దిక్కునుండైనా భగవానుని పిలిచి ఆయనను పొందవచ్చును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వివిధాని ఫలాని అధికారిభ్యో విశేషేణ దిశతి ఇతి విదిశః.** (దిశ్ - అతిసర్జనే - ప్రసాదించుట). విశేష దాతృత్వము కలవాడు. వివిధ ఫలములకు అధికారము (యోగ్యత) కలవారికి వారి వారి కర్మానుసారము ఫలములనిచ్చేవాడు 'విదిశః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇదే అర్థం చెప్పారు. **విశేషేణ దిశతి - దదాతి భక్తేభ్యః అభీష్టమ్ ఇతి విదిశః.** భక్తుల అభీష్టములను విశేషంగా సిద్ధింపజేసేవాడు 'విదిశః'. శ్రీ చిన్మయానంద కూడా ఇదే అర్థం చెప్పారు.

శ్రీ వాసిష్ఠ – భగవానుడు అంతటా అన్నిదిశలా అన్నింటా వ్యాపించియున్నాడని, ఆయన లేని చోటు లేదని ఈ నామము సూచించును.

శ్రీ సత్యసంధ తీర్థ – (విది-శః) విద్ - తెలియుట. శమ్ - సుఖమ్. విదిశీ – జ్ఞానిని, **శమ్ - సుఖమ్ యస్మాత్ స విదిశః.** (బ్రహ్మ) జ్ఞానము తెలిసినవారి ఆనందమునకు కారణము 'విదిశః'.

శ్రీ రఘునాధ తీర్థ – **వి - అతిశయేన దిశతి - ఉపదిశతి ఇతి విదిశః. అతిశయేన యజ్ఞక్రియా ప్రకారాన్ ఉపదిశతి ఇతి విదిశః.** చక్కగా యజ్ఞ యాగాది కార్యములను తెలియజేయు (ఉపదేశించు)వాడు 'విదిశః'. ఈ అర్థమును శాస్త్రముల జ్ఞానమునకు కూడ అన్వయించవచ్చును. శాస్త్రములను, విధులను చక్కగా తెలియజేసినవాడు 'విదిశః'.

## 939. వ్యాదిశః

- వివిధ దేవతలను ఆయా పదవులలో నియమించినవాడు.

- భక్తులకు వారి కర్మానుసారము తగు ఫలములనిచ్చువాడు.
- ఇంద్రాది దేవతలకును తగు ఆదేశములిచ్చువాడు.

## ఓం వ్యాదిశాయ నమః

వ్యాదిశ్ - పంచుట, నియమించుట, ఆజ్ఞాపించుట. ఆదేశ - ఆదేశము. ఈ రెండు శబ్దములపైనను ఈ నామమును వివరించారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషామ్ అభిమతమ్ తత్తత్ పదమ్ అతిసృజతి ఇతి వ్యాదిశః.** వారిని (అనగా బ్రహ్మ, రుద్రాదులను, ఇంతకుముందు నామములో చెప్పినట్లు) ఆయా పదములయందు తగు స్థాయిని కల్పించువాడు '**వ్యాదిశః**'.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 5.2.8 – జనులు వారి వారి అభిరుచుల ప్రకారం పూజించుకునేందుకు వీలుగా భగవంతుడు తన శరీరంనుండి అన్యదేవతలను సృజించాడు. వారికి యథోచిత పదవులు కల్పించాడు. భక్తులు ఆయా దేవతలకు సమర్పించినవి కూడా కడకు ఆయనకే చేరతాయి.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – **విశేషేణ ఆదిశతి ఇతి వ్యాదిశః.** వివిధ దేవతలకు తగు ఆదేశములు, ఫలములు కూర్చువాడు '**వ్యాదిశః**'.

శ్రీ కృష్ణన్ – భగవానుడు ఒకే కార్యంలో అందరికీ తగు ఫలములు ఎలా ప్రసాదిస్తాడో చెబుతూ శ్రీ కృష్ణన్ గజేంద్రమోక్షమునుండి, వామనావతారమునుండి ఉదాహరించారు. (శ్రీ భట్టుల వ్యాఖ్యను శ్రీ కృష్ణన్ కొంత భిన్నంగా వివరించారు.) **తత్తత్ అభిమత దేశమ్ సృజతి ఇతి వ్యాదిశః.** తన భక్తులు కోరిన కోర్కెలు వారి అభిమతముల ప్రకారము తీర్చేవాడు '**వ్యాదిశః**'.

గజేంద్రమోక్షంలో గజేంద్రునికి భగవత్కైంకర్య భాగ్యం లభించింది. తాను తెంచిన పూవును శ్రీమహావిష్ణువు పాదములవద్ద సమర్పించగలిగాడు. మొసలికి శాపంనుండి విముక్తి లభించింది. భగవానుడు భక్తజన సంరక్షకుడనే విషయం స్పష్టంగా ప్రకటితమైనది. మరియు వృత్తాంతమును విన్నా గాని, స్మరించినా గాని మనకు పాపములు తొలగి, కష్టములు తొలగి, శుభములు చేకూరుతాయి. అలా అందరికీ వారి వారి అభిమతములు సిద్ధించాయి.

ఇక వామనావతారంలో భగవానుడు అదితి కోర్కెను, ఇంద్రుని కోర్కెను తీర్చి సంతోషించాడు. ఇంద్రునికి రాజ్యం లభించింది. శ్రీమహావిష్ణువుకు దానమిచ్చిన భాగ్యం బలికి దక్కింది. సమస్త లోకములకు శ్రీనివాసుని పదములను పూజించే అవకాశం ఒనగూడింది (బ్రహ్మ కడిగిన పాదము, బ్రహ్మము తానైన పాదము). ఈ వృత్తాంతమును తనివితీరా గానం చేసే భాగ్యం ఆళ్వారులకు లభించింది. ఆయన సకల జగత్పతి అని శాస్త్రములో చెప్పిన విషయం నిరూపణమయ్యింది.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – దిశ్ - అతిసర్జనే - ఇచ్చుట, దానము చేయుట. **వివిధమ్ ఆసమంతాథ్ దిశతి - దదాతి ఇతి వ్యాదిశః.** అన్ని దిశల భక్తులకు అనేక ఫలములు కూర్చిఆడు '**వ్యాదిశః**'.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **వివిధామ్ ఆజ్ఞామ్ శక్రాదీనామ్ కుర్వన్ వ్యాదిశః.** ఇంద్రాది సమస్త దేవతలను ఘనముగా శాసించి వారి వారి కర్తవ్యములను సక్రమముగా నిర్వర్తింపజేయువాడు వ్యాదిశః.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **విశేషేణ ఆదిశతి - ఆజ్ఞాపయతి ఇతి వ్యాదిశః.** విశేషముగా ఆజ్ఞాపించువాడు '**వ్యాదిశః**'. ఇక్కడ '**విశేషముగా**' అనగా ఆయన జగత్ప్రభువు గనుక ఆయన ఆజ్ఞకు తిరుగు లేదు. అది అందరి ఆజ్ఞలవంటిది కాదు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **వివిధాన్ అధికారాన్ తస్య ఆదిశతి - ఆజ్ఞాపయతి అధికారిణి తస్మిన్ ఏవమ్ ఏవ ఉచితమితి భవః.** తగు విధముగా వివిధ దేవతలను ఆజ్ఞాపించువాడు '**వ్యాదిశః**'.

శ్రీ చిన్మయానంద – భగవంతుని ఆజ్ఞలు అందరి ఆజ్ఞలవంటివి కావు. ప్రాకృతిక శక్తులు, దేవతలు, దేవుళ్ళు అందరూ ఆయన ఆజ్ఞానుసారము వర్తిస్తారు.

## 940. దిశః

- (బ్రహ్మాది దేవతలను తమ తమ కార్యములయందు) ఆజ్ఞాపించువాడు.
- వేదముల రూపములో సమస్త వైదిక కర్మల ఫలములను ఇచ్చువాడు. యుక్తాయుక్తములను తెలియజేయువాడు.

ఓం దిశాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – బ్రహ్మాది దేవతలను తమ తమ స్థానములు, విధుల గురించి ఆజ్ఞాపించువాడు దిశ. ఇక్కడ శ్రీ భట్టులు 'దిశ్' అనగా 'ఆజ్ఞ' అనే అర్థాన్ని వాడారు. న **తాన్ గజేంద్రత్వాత్ అంతరంగీ కరోతి, కిన్తు ఆజ్ఞాపయతీతి దిశః.** భగవంతుడు గజేంద్రునివంటి ప్రపన్నులను వాత్సల్యంతో తన అంతరంగికులుగా చేసుకుంటాడు. కాని బ్రహ్మాది దేవతలకు తగు స్థానములనిచ్చి వారిని ఆజ్ఞాపిస్తాడు కనుక ఆయన దిశ.

**ధాత్రాదీన్ సర్వకృత్యేషు స్వాజ్ఞాపయతి యస్సదా దిశస్సతు సమాఖ్యాతః సప్తార్ణో మనురుత్తమః.** బ్రహ్మాదులకు అర్హమైన స్థానాలిచ్చి, వారిని తన ఆజ్ఞానువర్తులుగా చేయువాడు దిశ. ఈ నామము సప్తాక్షరి. ఉత్తమమైనది. ఓం దిశాయ నమః. గజేంద్రుని మోక్షము చూసి ఇంద్రాది దేవతలంతా బ్రహ్మను ముందు నిలబెట్టి శ్రీమన్నారాయణునికి నమస్కరించారు. తమకు కూడా మోక్షాన్ని ప్రసాదిస్తాడేమో? అని వారి ఆశ. కాని వారికి మోక్షమివ్వలేదు. (శ్రీ కైవల్య సారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సమస్తానామ్ కర్మణామ్ ఫలాని వేదాత్మనా దిశః.** ఈ వ్యాఖ్యను అనువాదకులు రెండు రకాలుగా వివరించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – (దిశ్ - చూపుట) భగవానుడు వేదముల రూపములో ఏది మంచి, ఏది చెడువంటి విషయాలను తెలియజేయును గనుక దిశ.

శ్రీ టి.ఎస్. కృష్ణమూర్తి – (దిశ్ - అతిసర్జనే - ఇచ్చుట, దానము చేయుట) వేదముల రూపములో భగవంతుడు వివిధ కర్మల ఫలములను ప్రసాదించును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **దిశతి - దదాతి కర్మఫలమ్ ఇతి దిశః.** కర్మఫలములను ఇచ్చువాడు దిశ.

శ్రీ చిన్మయానంద – నారాయణుడు శ్రుతుల రూపంలో ఆత్మజ్ఞానమును ప్రసాదించును. జ్ఞానము నిచ్చువాడు దిశ.

శ్రీ రఘునాధ తీర్థ – **దిశ్యతే - భక్తైః పృచ్ఛయతేతి దిశః.** భక్తులు ఆయనను గురించి తెలుసుకోవాలని అడుగుతుంటారు గనుక ఆయన దిశ.

938, 939, 940 నామములు **విదిశః, వ్యాదిశః, దిశః** – ఈ మూడు నామములు ఒకే ధాతువు ఆధారంగా వివరింపబడినాయి. అయితే వాటిలో పునరుక్తి లేకుండా వ్యాఖ్యాతలు ఎలా వ్యాఖ్యానించారో పరిశీలిస్తే ఆసక్తికరంగా ఉంటుంది.

<u>శ్రీ భట్టుల వ్యాఖ్యలు</u>

**విదిశః** – భగవంతుని తత్త్వము, స్వరూపములు, గుణములు అన్ని దిక్కులందు వ్యాపించియున్నవి (దిశ - దిక్కు).

**వ్యాదిశః** – భగవంతుడు వివిధ దేవతలను వివిధ పదములయందు నియమించెను (వ్యాదిశ్ - నియమించుట).

**దిశః –** భగవంతుడు సమస్త దేవతలను ఆజ్ఞాపించును (దిశ్ - ఆజ్ఞాపించుట).

<u>శ్రీ శంకరుల వ్యాఖ్యలు</u>

**విదిశః –** కర్మానుసారము జీవులకు తగు ఫలములు ఇచ్చువాడు (దిశతి - దదాతి. దిశ్ - దానము).

**వ్యాదిశః –** ఇంద్రాదులకు వారి విధుల ప్రకారము ఆదేశములు ఇచ్చువాడు.

**దిశః –** వైదిక కర్మలకు తగు ఫలములిచ్చు వేదస్వరూపుడు.

<u>శ్రీ సత్యసంధ తీర్థ వ్యాఖ్యలు</u>

**విదిశః –** బ్రహ్మ జ్ఞానులకు పరమానందమును ఇచ్చువాడు (విద్ - తెలియుట, జ్ఞానుల గురించి).

**వ్యాదిశః –** విశేషమైన ఆదేశములు ఇచ్చువాడు (అంతా ఆయన ఆజ్ఞానువర్తులే).

**దిశః –** ధర్మమును గురించిన జ్ఞాన

మును దృష్టాంతముల ద్వారా తెలియజేయువాడు (**ధర్మజ్ఞాన అతిదేశనాత్ దిశః**).

<u>శ్రీ సత్యదేవో వాసిష్ఠ వ్యాఖ్యలు</u>

**విదిశః –** అంతటా, అన్నిటా, అన్ని దిక్కులా వ్యాపించినవాడు.

**వ్యాదిశః –** అన్నియెడలా వివిధ ఫలములను ఇచ్చువాడు.

**దిశః –** వేదోక్తులద్వారా మంచి చెడులను ఉపదేశించినవాడు.



భగవంతుడు భక్తులనుండి ఏమైనా గ్రహించి అనుగ్రహిస్తాడు. పత్రం, పుష్పం, ఫలం, తోయమ్.

గీతాప్రెస్ వారి ప్రచురణలోని చిత్రం. వికీపీడియా నుండి.

Author Ramanarayanadatta Sastri
https://commons.wikimedia.org/wiki/File:God_take_anything_from_his_followers.jpg



టోక్యో మ్యూజియంలో శ్రీ సూర్యుని విగ్రహం

https://commons.wikimedia.org/wiki/File:Surya,_East_India,_19th_century_AD,_chlorite,_view_2_-_Matsuoka_Museum_of_Art_-_Tokyo,_Japan_-_DSC07163.JPG. Photo by Daderot



## అనాదిర్భూర్భువో లక్ష్మీస్సువీరో రుచిరాంగదః |
## జననో జనజన్మాదిర్భీమో భీమపరాక్రమః || (101)

### 941. అనాదిః

- అనేకులు (బ్రహ్మ రుద్రాదులు కూడ) తమ పరిమిత జ్ఞానమువలన ఆయననెరుగరు, పొందలేరు.
- మొదలు లేనివాడు.

### ఓం అనాదయే నమః

దా - దానే - ఇచ్చుట. **న ఆదీయతే ఇతి అనాదిః.** అందరానివాడు అనాది. 'ఆది' అంటే 'మొదలు' అనే అర్థం కూడా ఉన్నది. మొదలు లేనివాడు అనాది.

శ్రీ భట్టుల వ్యాఖ్య **– తైః అన్యపరైః న స్వామిత్వేన ఆదీయతే ఇతి అనాదిః.** వారిచే (బ్రహ్మరుద్రాదులచే) కూడా తెలియబడనివాడు, స్వీకరింపబడనివాడు అనాది. **ఏవమ్ తిర్యక్ష్వపి భక్తేషు వివశః, బ్రహ్మాదిషు ఫల్గు ఫలమేవ ప్రయచ్ఛతి.** మరియు ఆయన గజేంద్రునివంటి భక్తులపట్ల పూర్తిగా వివశుడై తనను తానే ఇచ్చివేసుకొనును. కాని బ్రహ్మరుద్రాదులకు అంత స్వాతంత్ర్యము ఇవ్వడు. భక్తులకు ఇచ్చినంత (మోక్షాది) ఫలములను దేవతలకు ఇవ్వడు గనుక అనాది.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ **–** బ్రహ్మరుద్రాదులు ప్రీతితో కాక భీతితో ఆయన ఆజ్ఞను పాలింతురు. ఆయన పరమేశ్వరత్వమును వారెరుగరు.

శ్రీ వాసిష్ఠ **– న ఆదీయతే ఇతి అనాదిః. న ఆదీయతే - గృహ్యతే స మనస్కైః జ్ఞానేంద్రియైః కర్మేంద్రియైశ్చ ఇతి అనాదిః.** మనస్సు ద్వారాను, ఇంద్రియముల ద్వారాను అందరానివాడు అనాది.

**దేవతాంతర భక్తైర్యః కుత్సితైశ్చాపి సర్వదా నాదీయతే స్వాభిమతం అనాదిః పరికీర్తితః.** దేవతాంతర భక్తులచేత, అనగా ఇతర దేవతలను ఆరాధించువారిచేత తమకు ప్రభువుగా స్వీకరింపబడనివాడు **'అనాదిః'** (శ్రీకైవల్య సారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య **–** శ్రీ శంకరులు **'ఆది'** అనగా **'మొదలు, కారణము'** అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **ఆదిః - కారణమ్ అస్య న విద్యత ఇతి అనాదిః, సర్వకారణత్వాత్.** అన్నింటికీ ఆయనే కారణము (మొదలు). ఆయనకు కారణము లేదు గనుక ఆయన అనాది.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము **– న ఆదీయతే - స్వీకృత్యతే స్వోద్భవాయ కించిత్ అపరమ్ నిమిత్త కారణమ్ అనేన సో అనాదిః.** భగవంతుని ఉనికికి కారణము ఉండదు. ఆయన అనాది. అనగా అన్నింటికంటె ముందు ఉన్నవాడు.

### 942. భూర్భువః

- భగవంతునకు తాము దాసులము అని నిజ జ్ఞానమును తెలుసుకొన్న నిజమైన జీవనము కలవారికి ప్రాప్తిస్థానము.

- సకల భూతములకు ఆశ్రయమైన భూమికి ఆధారము.
- తనయందే తానున్నవాడు (వేరు ఆధారము లేకుండా).
- సమస్త జ్ఞానమునకు మూలమైనవాడు.

## ఓం భువోభువే నమః

భూ - సత్తాయామ్ - ఉండుట, నివసించుట, ఆధారము. ఈ నామములో రెండు 'భూ' పదములున్నవి.

మొదటి **'భూ' –** నామవాచకము **–** ఆధారము.

రెండవ **'భూ' –** భువః **–** షష్టీవిభక్తి **–** ఆధారమునకు, భూమి.

**ప్రథమో భూ శబ్ద ఆధార వాచకః ప్రథమాంతో, ద్వితీయశ్చ షష్ట్యంతః పృథ్వీ వాచకః.** కనుక ఈ నామమును 'భువః భూః' అనగా 'ఆధారమునకు ఆధారము' లేదా 'భూమికి ఆధారము' అని వివరింపవచ్చును.

101వ శ్లోకము. 942వ నామము. భూర్భువః **– అనాదిః భూర్భువో లక్ష్మీ సువీరో రుచిరాంగదః**

104వ శ్లోకము. 967వ నామము. భూర్భువస్స్వస్తరుస్తరు **– భూర్భువస్స్వస్తరుస్తరుః తారః సవితా ప్రపితామహః**

శ్రీ భట్టుల వ్యాఖ్య **– భవతి ఇతి భూః స్వదాస్య జ్ఞానేన ఆత్మలాభవాన్, తస్య భువః స్వయమేవ భూః పదమ్ ఇతి భూర్భువః.** 'స్వదాస్యజ్ఞానము' అనగా తాను భగవంతునికి దాసుడనని, భగవంతుడు తన ప్రభువని తెలియుట. ఇలాంటి ఆత్మజ్ఞానము కలిగినవాడు **'భూః'** అనగా నిజమైన జీవనము కలిగినవాడు (ఉనికి ఉన్నవాడు). అటువంటివానికి నిలయము (భువః, ఆధారము, నివాస స్థానము) భగవంతుడు. కనుక ఆయన 'భూర్భువః'.

**తస్య స్వదాస్యజ్ఞానేన ఆత్మలాభవతః పదమ్ భవతి స్వయమ్ వేతి భూర్భువ స్స చ కథ్యతే.** భగవంతునికి తాము దాసులము అని తెలుసుకొన్నటువంటివారై ఆత్మసాక్షాత్కారము కోరే భక్తులకు తానే ప్రాప్తిస్థానమైనవాడు (శ్రీకైవల్యసారథి).

**మయ్యేవ మన అధత్స్వ మయి బుద్ధిం నివేశయ**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః –** గీత 12.8
నాయందే మనస్సును నిలుపుము. నాయందే బుద్ధిని లగ్నము చేయుము. పిమ్మట నాయందే స్థిరముగానుందువు. ఇందు ఏమాత్రమూ సందేహమునకు తావు లేదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– భువోऽపి భూః.** భూమికి ఆధారమైనవాడు. సకల భూతములకు ఆశ్రయమైన భూమికి కూడ ఆధారమైనవాడు. భువికి భూ అనగా 'భూర్భువః'.

శ్రీ వాసిష్ఠ **– భవన్తి అస్యామ్ ఇతి భూః - పృథ్వీ, తస్య భూః ఆధారః.** ఉండునది భూమి. ఆ భూమికి ఆధారము 'భూర్భువః'. మరియు ఆయన అన్నింటికీ సృష్టికర్త, పాలనకర్త. **భువయోర్భావయితా - ఉత్పాదకో మూలాధారః స భూర్భువః ఉచ్యతే.**

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము **– స్వయమ్ స్వస్మిన్ భవతి ఇతి భూర్భువః.** స్వయముగా తనయందు తానే ఉండువాడు 'భూర్భువః'. అనగా ఆయన సృష్టికి, ఉనికి వేరు కారణము, ఆధారము లేవు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ **– భువః - ప్రపంచస్య, భూః - ఉద్గమః (సృష్టి, పోషణ), భువోః భూః.** ప్రపంచమునకు సృష్టి, పాలన చేయువాడు 'భూర్భువః'.

శ్రీ భరద్వాజ చెప్పిన మరొక అర్థము – **భువ ఇతి జ్ఞానమ్, తస్య భూః - ఉద్భవః ఇతి భువో భూః.** సకల జ్ఞానమునకు మూలమైనవాడు 'భూర్భువః'.

**సర్వస్య చాహం హృదిసన్నివిష్టో మత్తః స్మృతిః జ్ఞానమపోహనంచ –** గీత 15.15. సమస్త ప్రాణుల హృదయములలో అంతర్యామిగా ఉన్నవాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహమును తొలగించుట) కలుగుచున్నవి.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – శ్రీ శంకరుల వ్యాఖ్య – భూర్భువోలక్ష్మీ – 'భువః' అను పదమునకు 'లక్ష్మి'యను అర్థము కూడ కలదు. పరమాత్మ భూమికి ఆధారము మాత్రమే కాక గొప్ప అలంకారముగా నున్నవాడనియును భావము.

## 943. లక్ష్మీః
### భువోలక్ష్మీ
### భూర్భువో లక్ష్మీ

- భక్తులందరికీ తానే సకల సంపదలు అయినవాడు.
- భువోలక్ష్మీ. భూమికి ఆధారము మాత్రమే కాక శోభ కూడా అయినవాడు.
- భూర్భువో లక్ష్మీ. భూమికి సౌందర్యము మరియు నిలయము (Firmament, భువః) అయినవాడు.
- భూర్భువో లక్ష్మీ. భూమి, భువము మరియు ఆత్మవిద్య.
- సదా శ్రీలక్ష్మీ సమేతుడై యుండువాడు. సకల సంపదలు, సకల కళ్యాణగుణములు పరిపూర్ణముగా కలవాడు.
- భక్తులయెడ ఎనలేని వాత్సల్యము చూపువాడు. వారికి కష్టముల నధిగమించు మార్గము చూపువాడు.
- సదాచారపరులను తన నిధిగా భావించువాడు.

ఓం లక్ష్మై నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషాం లక్ష్మీ - సర్వ సంపత్ చ. ఆత్మ లాభవతాం సర్వ సంపత్ లక్ష్మీ స్స యతస్మృతః.** ఆత్మజ్ఞానము కలిగిన భక్తులందరికీ సకల సంపదలు తానే అయినవాడు. ఇందుకు శ్రీ భట్టులు రామాయణమునుండి, మహాభారతమునుండి ఉదాహరించారు.

రామాయణము. యుద్ధకాండ 19.6 – **భవద్గతమ్ చ మే రాజ్యమ్ జీవితమ్ సుఖాని చ.** విభీషణుడు శ్రీరామునితో ఇలా అన్నాడు. నా రాజ్యము, జీవితము, సుఖములు అన్నీ నీయందే ఉన్నవి.

**కృష్ణాశ్రయః కృష్ణబలాః కృష్ణనాథాశ్చ పాండవాః**
**కృష్ణపరాయణమ్ తేషామ్ జ్యోతిషామివ చంద్రమా –** మహాభారతము. ద్రోణపర్వము 183.24
చుక్కలకు చంద్రునివలె పాండవులకు శ్రీకృష్ణుడే సర్వము. వారికి అతడే ఆశ్రయము, బలము, రక్షణ, ప్రభువు.

తిరువైమోళి 5.1.8 – నాకు భగవంతుడే సర్వస్వము. ఇంకముందు ఆయనే నాకు సుందరకాంతలు, ధనము, వైభవము, బిడ్డలు, తల్లిదండ్రులు.

శ్రీ కృష్ణన్ – భగవానుని వక్షస్థలంపై శ్రీమహాలక్ష్మి నెలకొనియున్నది. ఆయన సంపదలకు తరుగు లేదు. భక్తులకివ్వడానికి అంతులేదు. అంతే కాక భక్తులకు నిజమైన సంపద ఆయనే.

**న దేవ లోకాక్రమణమ్ న అమరత్వమ్ అహం వృణే ఐశ్వర్యమ్ వా విలోకానామ్ రామయే న త్వయా వినా –** రామాయణం.

లక్ష్మణుడు శ్రీరామునితో ఇలా అన్నాడు **–** రామా, నీవు తప్ప నాకింకేమీ అక్కరలేదు. స్వర్గాధిపత్యము, అమరత్వము, ఐశ్వర్యము, ఇవన్నీ అవుసరం లేదు.

**స్నేహో మే పరమో రాజన్ త్వయీ నిత్యం ప్రతిష్ఠితః భక్తిశ్చ నిత్యతా వీరా భావో నాన్యత్ర గచ్ఛతి**

హనుమంతుడు శ్రీరామునితో ఇలా అన్నాడు **–** నీపట్ల నిశ్చలమైన, శాశ్వతమైన భక్తిని తప్ప వేరేమీ నా మనస్సు కోరడంలేదు. నీపట్ల సేవాభక్తియే నాకు నిరంతరం కావాలి.

శ్రీ తిరుప్పాణాళ్వారు **–** శ్రీరంగనాధుని అమృతరూపమును చూచిన నా కనులు మరి దేనినీ చూడకుండును గాక.

శ్రీ తొండరాడిప్పొడియాళ్వారు **–** శ్రీరంగనాథా! నిన్ను నేను ఇక్కడే, ఇప్పుడే దర్శించుకొనగా ఇంకా నాకు శ్రీవైకుంఠం ఎందుకు?

శ్రీ శంకరుల వ్యాఖ్య **–** శ్రీ శంకరులు '**భూః**', '**భువః**', '**లక్ష్మీ**' అనే మూడు పదముల కలయికతో నామములను వ్యాఖ్యానించారు.

942వ నామము **– భూర్భువః –** సకలభూతములకు ఆధారమైన భూమికి ఆధారమైనవాడు.

**భువోలక్ష్మీః –**

లక్ష్మీ - శోభ, సౌందర్యము. భువ - భూమి. **న కేవలమ్ అసౌ భూః భువః, లక్ష్మీః శోభా చ ఇతి భువో లక్ష్మీ.** భూమికి ఆధారము, అనగా **'**భూర్భువః**'** మాత్రమే కాకుండా, భూమికి శోభ కూడా అయినవాడు భువోలక్ష్మీః**'**.

**భూర్భువోలక్ష్మీః –**

(1) భూః - భూలోకము, భువః - భువర్లోకము, లక్ష్మీ - ఆత్మవిద్య. భూమికి, భువర్లోకమునకు శోభ అయినవాడు భూర్భువోలక్ష్మీ.
(2) భూః - భూమి, భువః - భువర్లోకము, లక్ష్మీ - శోభ. భూమి, భువర్లోకము, ఆత్మవిద్య తానే అయినవాడు భూర్భువోలక్ష్మీ.
విష్ణుపురాణము (1.9.11.8)లో లక్ష్మీదేవిని **'**ఆత్మవిద్య**'** అని స్తుతించారు. **ఆత్మవిద్యా చ దేవి త్వమ్.** శ్రీమహాలక్ష్మి, శ్రీమహావిష్ణువుల కారణంగానే ఆత్మవిద్య సిద్ధిస్తుందని ఇక్కడ అర్థము.

శ్రీరాధాకృష్ణశాస్త్రి ఈ నామమును స్త్రీవాచకంగా పరిగణించారు. శ్రీలక్ష్మీదేవి నిత్యానపాయినియై సదా ఆయన వక్షస్థలాన నెలకొని ఉంది. ఆయన రామునిగా అవతరిస్తే ఆమె సీతగాను, ఆయన కృష్ణునిగా అవతరిస్తే ఆమె రుక్మిణిగాను అవతరించింది. వారిద్దరూ ఒకరినుండి మరొకరు వేరుగాదు.

తిరువైమొళి 6.6.10 **–** ఓ తిరువేంకటనాథా! నీవు నా ప్రభువువు. ముల్లోకాలకూ నీవే ప్రభువువు. నీ కీర్తి తులలేనిది. మాయమ్మ అలమేలుమంగ (మహాలక్ష్మి) నీ దివ్యవక్షస్థలమున ఆసీనయై ఎన్నడూ నిన్నెడబాయకయున్నది.

శ్రీలక్ష్మీదేవి నామముచే సూచించబడే సౌందర్యము, యశస్సు, వైభవము, సంపత్తువంటి సకల సంపూర్ణ కళ్యాణగుణములు ఈ నామముచే తెలుపబడుచున్నవి.

**శ్రీ సీతారామ స్తోత్రము**

అయోధ్యాపుర-నేతారం మిథిలాపుర-నాయికాం .
రాఘవాణామలంకారం వైదేహానామలంక్రియాం .. 1..
రఘూణాం కులదీపం చ నిమీనాం కులదీపికాం .
సూర్యవంశ-సముద్భూతం సోమవంశ-సముద్భవాం .. 2..
పుత్రం దశరథస్యాద్యం పుత్రీం జనకభూపతేః .
వశిష్ఠానుమతాచారం శతానందమతానుగాం .. 3..
కౌసల్యాగర్భ-సంభూతం వేదిగర్భోదితాం స్వయం .

పుండరీక-విశాలాక్షం స్ఫురదిందీవరేక్షణాం .. 4..
చంద్రకాంతాననాంభోజం చంద్రబింబోపమాననాం .
మత్త-మాతంగ-గమనం మత్త-హంస-వధూ-గతాం .. 5..
చందనార్ద్ర-భుజామధ్యం కుంకుమార్ద్ర-కుచస్థలీం .
చాపాలంకృత-హస్తాబ్జం పద్మాలంకృత-పాణికాం .. 6..
శరణాగత-గోప్తారం ప్రణిపాద-ప్రసాదికాం .
కాలమేఘనిభం రామం కార్తస్వర-సమ-ప్రభాం .. 7..
దివ్య-సింహాసనాసీనం దివ్య-స్రగ్వస్త్ర-భూషణాం .
అనుక్షణం కటాక్షాభ్యాం అన్యోన్యేక్షణ-కాంక్షిణౌ .. 8..
అన్యోన్య-సదృశాకారౌ త్రైలోక్యగృహదంపతీ.
ఇమౌ యువాం ప్రణమ్యాహం భజామ్యద్య కృతార్థతాం .. 9..
అనేన స్తౌతి యః స్తుత్యం రామం సీతాం చ భక్తితః .
తస్య తౌ తనుతాం పుణ్యాస్సంపదః సకలార్థదాః .. 10..
ఏవం శ్రీరామచంద్రస్య జానక్యాశ్చ విశేషతః .
కృతం హనూమతా పుణ్యం స్తోత్రం సద్యో విముక్తిదం .
యః పఠేత్ప్రాతరుత్థాయ సర్వాన్ కామానవాప్నుయాత్ .. 11..
.. ఇతి శ్రీమత్ హనూమత్కృత-శ్రీ సీతారామ స్తోత్రం సంపూర్ణం ..



https://commons.wikimedia.org/wiki/File:Devotional_offering_of_food_to_Hindu_Deity_Shri_Sita-Rama.jpg

Photo by Bizmadhav1

శ్రీ చిన్మయానంద – సృష్టిలో సుందరము, శుభకరము అయినవన్నీ భగవానునివల్లనే కలుగుచున్నవి. ఆ పరమాత్ముని ప్రమేయం లేకుంటే సకలం అచేతనమై, శిథిలమై, జీవరహితమైయుండేది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – లక్ష - దర్శనాంకనయోః - గమనించుట, లక్ష్యపెట్టుట. లక్ష - ఆలోచనే - భావించుట.

(1) **లక్షయతి - దర్శయతి నిరతిశయ వాత్సల్యమ్ ఇతి లక్ష్మీః.** తన భక్తులపట్ల అంతులేని ప్రేమ చూపేవాడు లక్ష్మి.

(2) **లక్షయతి అంకమ్ ఆరోప్యతి భక్తపుత్రాన్ ఇతి లక్ష్మీః జగన్మాతా.** భక్తులు భగవానుని అంకంపై క్షేమంగా ఉండేలా జగన్మాత లక్ష్మి అనుగ్రహిస్తుంది.

(3) **లక్షయతి - ఆలోచయతి స్వజనానామ్ విపత్ సరిత ఉద్ధారస్య ఉపాయాన్ ఇతి లక్ష్మీః.** సంసారంలో ఎదురయ్యే కష్టాలను అధిగమించి భగవంతుని చేరే మార్గమును తన భక్తులకు తెలియజేసేవాడు లక్ష్మి.

శ్రీ సత్యసంధ తీర్థ – 'లక్ష్' అనగా 'దర్శనాంకయోః' అనే అర్థాన్ని వాడారు. **లక్షయతి పుణ్యకృతో, లక్ష్యతే పుణ్యకృత్భిః ఇతి వా లక్ష్మీః.** సదాచారపరులు భగవంతుని తమ ప్రభువుగా భావిస్తారు. మరియు ఆయన సదాచారపరులను తన నిధిగా భావించును. అలా ఆయన '**లక్ష్మి**'.

శ్రీ వాసిష్ఠ – **లక్ష్యతి - దర్శయతి ఇతి లక్ష్మీః.** అందము, ఐశ్వర్యము వంటి లక్ష్మీసంపన్నులైనవారిని ప్రకాశింపజేయువాడు. నిజానికి భగవానుడే లక్ష్మీస్వరూపుడై అంతటా వ్యాపించి, ఆయా వస్తువులను లేదా జీవులను కనిపించేలా చేస్తున్నాడు. ఉదాహరణకు సూర్యుని శోభాయమానముగా వెలిగిస్తున్నాడు.

## **944.** సువీరః

- గొప్ప వీరుడు.
- అనేక ప్రశస్తములగు, మంగళకరములగు నడకలు (ప్రవర్తనములు) కలవాడు.

- అనేక మార్గములద్వారా మనకు లభించువాడు.
- -తన కృష్ణావతారములో గొప్ప, అనేక మంగళకరమైన వీరులతో కలసియున్నవాడు.

## ఓం సువీరాయ నమః

ఈ '**సువీరః**' నామమును రెండు శబ్దముల ఆధారముగా వివరించారు. (1) వీర - ప్రతాము కలవాడు. (2) ఈర - గతౌ - వెళ్ళుట. ఇక '**సు**' అనే ఉపసర్గకు '**మంచి**' అనే అర్థమున్నది. '**వి**' అనే ప్రత్యయానికి '**వివిధ**' అనే అర్థముంది. ఈ నామమునకు సంబంధించిన మరొక నామము '**వీరః**' రెండు లేదామూడు మార్లు వచ్చింది.

43వ శ్లోకము. 402వ నామము. వీరః – **వీరః శక్తిమతాంశ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః**
67వ శ్లోకము. 649వ నామము. వీరః – **కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః** (శ్రీ శంకరుల పాఠము ప్రకారము)
70వ శ్లోకము. 64వ నామము. వీరః – **అనిర్దేశ్యవపుః విష్ణుః వీరః అనంతో ధనంజయః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'సువీరుడు' అనగా 'మంచి శక్తిమంతుడు' అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. భక్తుల పతనాన్ని నివారించే వీరుడు మరియు పతనమైనవారిని ఉద్ధరించే సువీరుడు. **తేషాం వినిపాత ప్రతీకారః.**

**తేషాం యో వినిపాతస్య ప్రతీకారం కరోతి సః సువీర ఇతి విఖ్యాతః సప్తార్ణో మనురుత్తమః.** అటువంటివారికి (భక్తులకు) ఎదురయ్యే ఆపదలను అడ్డుకునేవాడు సువీరుడు. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. ఉత్తమము. ఓం సువీరాయ నమః. (శ్రీకైవల్య సారధి).

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – **శోభనః వీరః యః సః సువీరః.** శోభనమైన (చక్కని, కోరదగిన, సంతోషము కలిగించే) వీరుడు సువీరుడు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 3.2.3 – రథాశ్వాలను త్రోలే చర్నాకోలును చేతబట్టి భగవానుడు అర్జుననిద్వారా తన కార్యాన్ని చేయించి, భూబారాన్ని తగ్గించాడు.

శ్రీ వాసిష్ఠ – **శోభనా - సరళా, వివిధా చ ఈరః గతిః యస్య స సువీరః.** వివిధములైన చక్కని గతులు (వర్తనములు) కలవాడు సువీరుడు. ఇందుకు శ్రీవాసిష్ఠ (సూర్య) భగవానుని ఉత్తరాయణ, దక్షిణాయన గతులను ఉదాహరించారు. శ్రీవాసిష్ఠ ఉదాహరించనప్పటికీ మనము ఈ అర్థంలో శ్రీరంగం ఊరేగింపులో ఎంపెరుమాన్ యొక్క గజగతి, సింహగతి, వ్యాఘ్రగతి, సర్పగతులను స్మరించుకోవచ్చును.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – వీరులు మూడు రకాలు. వీరుడు, శూరుడు, పరాక్రమవంతుడు. వీరుడనగా ఎంత శక్తి ఎదురు నిలిచినా చలించడు. శూరుడనగా శత్రుసేన మధ్యలోకి చొచ్చుకొనిపోయి వారినందరినీ మట్టుపెట్టేవాడు. పరాక్రమశాలియనగా యుద్ధంలో ఏమాత్రం గాయం కాకుండా యుద్ధం చేసే నిపుణుడు. ఈ మూడు లక్షణాలూ ఈ 'సువీరః' నామంలో సూచింపబడినాయి. మరి మొసలివంటి అల్పజీవిని చంపే ఉదంతం సందర్భంలో 'సువీరః' అనే పెద్ద నామమును ఎందుకు చెప్పారు? ఎందుకంటే తన భక్తులకు కష్టం కలిగించేవారెవరైనా భగవానునికి ముఖ్యశత్రువులే! భక్తరక్షణలో భగవానుని సువీరత కానవస్తుంది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **శోభనో వీరః పరాక్రమీ ఇతి సువీరః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'ఈర్' అనగా 'వెళ్ళుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **శోభనః వివిధా ఈరాః - గతయోః యస్య స సువీరః.** అనేక ప్రశస్తమైన, మంగళకరమైన గతులు (వర్తనములు) కలవాడు సువీరుడు.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – భగవానుడు యోగుల హృదయములందు ఆసీనుడైయుండుట, సూర్యమండల మధ్యవర్తియై యుండుట, క్షీరసాగరమున శయనించియుండుట వంటి అనేక స్థితులను ఈ నామము సూచించును.

శ్రీ చిన్మయానంద – అనేక విధములైన దివ్యవైభవములతోను, విభూతులతోను విలసిల్లువాడు సువీరుడు. తన అనేక అవతారములలో అద్భుత కార్యములద్వారా వీరత్వమును చాటినవాడు సువీరుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భక్తి, ప్రపత్తి వంటి అనేక సాధనములద్వారా అందువాడు సువీరుడు, (ఈర్ - గతి).

శ్రీ బలదేవ విద్యాభూషణ – **తతః సమాగతేషు సఖిషు సువీరః శోభనాః శ్రీదామ సుభద్రాదయః స్వతుల్యా వీరా యస్య సువీరః.** శ్రీకృష్ణావతారమున అనేకమంది వీరులతో సాన్నిహిత్యము కలిగినవాడు సువీరుడు.

శ్రీ భగవానుని వీర్యగుణమును భీష్ముడు ఇంతకుముందే (43, 70 శ్లోకాలలోని) 'వీరః' నామముద్వారా స్తుతించాడు. మరి మళ్ళీ 'సువీరః' నామమును ఎందుకు స్తుతించాడు? వీరులు అనేక విధములు. అందులో మంచివారు, చెడువారు ఉంటారు. చెడు వీరులను భగవానుడు ఎలానిర్మూలిస్తాడో 'వీరహా' నామము (168, 747, 927 నామములు) ద్వారా చెప్పడమైనది. ఇక ప్రస్తుత సందర్భములో 'సువీరః' నామము భగవానుని భక్తవాత్సల్య గుణాన్ని ప్రతిబింబిస్తుంది. తన భక్తుల కష్టాలను పారద్రోలే వీరుడు 'సువీరుడు'.

## **945.** రుచిరాంగదః

- తన భక్తులు అనుభవించడం కోసం తన దివ్యమంగళ సుందర రూపమును వారికి ప్రసాదించే (దర్శనమిచ్చే)వాడు.
- భక్తులైనవారికి చక్కని శరీరము (రూపము)ను ప్రసాదించేవాడు. (ఉదాహరణకు, కుబ్జకు).
- మనోహరములు, శుభకరములు అయిన అంగదములు (భుజకీర్తులు) ధరించినవాడు.
- అన్ని జంతువులు చలించుటకు చక్కని సాధనములను ఇచ్చినవాడు.

### ఓం రుచిరాంగదాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – రుచిర-అంగ-దః - రుచిరాంగదః. **రుచిరమ్ - అతిమనోహరమ్, అనుభవ భోగ్యమ్ అంగమ్ దదాతి ఇతి రుచిరాంగదః.** తన భక్తులు అనుభవించడానికి తన అతిసుందర రూపమును (దర్శనమును) ప్రసాదించేవాడు రుచిరాంగదుడు. భగవానుని రూపము, ఆయుధములు, ఆభరణములు, నివాసము అన్నీ భక్తుల కొరకే,

**ప్రపన్నేభ్యః స్వానుభవయోగ్యమంగం మనోహరమ్ అప్రాకృతమ్ సదాదత్తే యోऽసౌ రుచిరాంగదః.** తన భక్తులు, తత్పరులు, ప్రపన్నులు అన్నివేళలయందు అనుభవించదగిన సుందరమయిన దివ్యమంగళ విగ్రహాన్ని వారికి ప్రసాదించేవాడు రుచిరాంగదుడు (శ్రీకైవల్య సారధి).

శ్రీ భట్టులు జితంతే స్తోత్రమునుండి ఉదాహరించారు.**న తే రూపమ్ నచాకారో నాయుధాని నచాస్పదమ్ తథాऽపి పురుషాకారో భక్తానామ్ ప్రకాశసే.** నీ దివ్యాత్మ స్వరూపము, నీ దివ్యమంగళ విగ్రహము, నీ ఆయుధాలు, నీ నివాసమైన శ్రీవైకుంఠము, ఇవేవీ నీకోసం కాదు. (ఆవన్నీ నీ భక్తుల కోసమే. నీవు అసలు స్వతంత్రుడవు కావు. నీ భక్తుల అధీనంలో ఉన్నావు). అయినాగాని భక్తుల కొరకు పరమపురుషుడవై ప్రకాశిస్తున్నావు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 8.7.7 – ఆ ఎర్రని పెదాలు, సుందరమైన నాభి, మెరిసే కర్ణాభరణాలు, ఇవన్నీ ఒకదానితో ఒకటి పోటీపడి నన్ను చుట్టుముట్టి తమ వశం చేసుకొంటున్నాయి. కాని ఇవేవీ ఆ పెదాలపై విరిసిన చిరునవ్వుకు సాటిరావు. ఆ నవ్వుద్వారా భగవంతుడు నా హృదయంనుండి మాట్లాడుతాడు.

శ్రీ తిరువైమోళి 8.8.1 – ఒకే ఒక్కడైన ప్రభువు నా ఆత్మలో ఆత్మయై ప్రకాశిస్తున్నాడు. ఆయనను నాలోనే చూచుకొంటున్నాను. ఎరుపెక్కిన అందమైన పెద్ద కన్నులు, ఎర్రని పండ్లవంటి పెదాలు, మధ్య కొంచెంగా మెరుస్తున్న తెల్లని పలువరుస, చేపల ఆకారంలో ఉన్న కర్ణాభరణాలు, నీలిమేఘ దేహము, ప్రకాశిస్తున్న కిరీటము, నాలుగు పొడవైన చేతులు, సుందరంగా ప్రకాశించే ఐదు శక్తివంతమైన ఆయుధాలు, ఇవన్నీ నాలోనే ఉన్నాయి.

ఈ పాశురంలో భగవానుని సౌందర్యవర్ణనంతోపాటు, అవన్నీ ఆళ్వారు అనుభవంకొరకే ఉన్నాయని గమనింపవచ్చును. ఇంకా, అనేక సందర్భాలలో ఆళ్వారులు, సద్గురువులు భగవంతుని తిరుమేనిని అనుభవించి పరవశించారు. శ్రీ తిరుప్పాణాళ్వారు అమలనాదిపిరాన్, శ్రీ భగవద్రామానుజుల గద్యత్రయము, శ్రీ స్వామిదేశికన్ భగవధ్యాన సోపానము, శ్రీ దేవనాయక పంచశతి ఇలాంటి రచనలే.

శ్రీ కృష్ణన్ గజేంద్రమోక్షము వృత్తాంతాన్ని ఉదాహరించారు. గజేంద్రునివంటి భక్తుని ఆలింగనం చేసుకొని భగవంతుడు తన తిరుమేనిని అనుభవించే అవకాశం కల్పించాడు. తిరువైమోళి 1.9లోని పది పాశురాలలోను భగవంతుడు తనను గురించిన ఆనందానుభవాన్ని దశలు దశలుగా ఎలా ఇస్తాడో వర్ణింపబడింది. ఎందుకంటే ఒక్కమారుగా ఆ దివ్యానుభూతిని అందజేస్తే ఆళ్వారుగారు తట్టుకొనలేడని.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా శ్రీ భట్టుల వ్యాఖ్యలాగానే వ్యాఖ్యానించారు. **రుచిరమ్ అంగమ్ తేభ్యో దదాతి తద్విధేయస్తాన్ ఆలింగత్వాత్ ఇతి అర్థః.** అర్హులైన భక్తులకు తన దివ్యాలింగనము అనే భాగ్యాన్ని ప్రసాదించేవాడు రుచిరాంగదుడు. సీత గురించిన సమాచారాన్ని తెచ్చిన హనుమంతుని శ్రీరాముడు కౌగిలించుకొనిన వృత్తాంతమును ఇక్కడ స్మరించుకొనవచ్చును. తాను అంతకంటె బహుమతిని ఈయలేనని శ్రీరాముడు వచించెను.

(క్రింది శ్లోకములలోని తెలుగు తాత్పర్యములు గీతాప్రెస్ వారి 'సుందరకాండము' నుండి.)

వాల్మీకి రామాయణము. యుద్ధకాండము - 12, 13, 14

**ఇదంతు మమ దీనస్య మనోభూయః ప్రకర్షతి యదిహాస్యప్రియాఖ్యాతుః న కుర్మి సదృశమ్ ప్రియమ్**
**ఏష సర్వస్య భూతస్తు పరిష్వంగో హనూమతః మయా కాలమిమం ప్రాప్య దత్తస్తస్య మహాత్మనః**
**ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాంగో రామస్తం పరిషస్వజే హనూమంతం మహాత్మానం కృతకార్యముపాగతమ్**

సీతాదేవి కుశలవార్తలను తెలిపి, మహోపకారమొనర్చిన ఈ మారుతికి తగిన ప్రత్యుపకారము చేయలేక దీనుడనైయుంటిని. అందువలన నా మనస్సు మిక్కిలి పరితపించుచున్నది. ఈ సందర్భమున మహాత్ముడైన ఈ హనుమంతునకు గాఢాలింగన సౌఖ్యమును మాత్రమే ఇయ్యగలను. ఇదియే అతనికి పరమసుఖానుభవమును కలిగింపగలదు. ప్రస్తుతము నేను ఈయగలిగిన నా సర్వస్వమిదియే. ఇట్లు పలికి శ్రీరాముడు పులకితగాత్రుడై, తాను అప్పగించిన కార్యమును సఫలమొనర్చి పవిత్రాత్ముడై వచ్చిన హనుమంతుని తన హృదయమునకు హత్తుకొనెను.

శ్రీ రామచరిత మానసము –3, 4

**సును కపి తొహి సమాన ఉపకారీ**
**నహిఁ కొఉ సుర నర ముని తనుధారీ**

ప్రతి ఉపకార కరౌం కా తోరా
సనముఖ హోఇ న సకత మన మోరా
సును సుత తోహి ఉరిన మైం నాహీ
దేఖెఉం కరి బిచార మన మాహీం
పుని పుని కపిహి చితవ సురత్రాతా
లోచన నీర పులక అతి గాతా



1730 కాలపు చిత్రం. వికీపీడియానుండి.

https://commons.wikimedia.org/wiki/File:Anonymous - Hanuman before Rama and Lakshmana, Folio from the dispersed "Mankot" Ramayana series - 1976.16 - Metropolitan Museum of Art.jpg

శ్రీరామచంద్రుడు వచించెను – హనుమా! వినుము. దేవతలలో గాని, మునీశ్వరులలో గాని, మానవులలో గాని నాకు నీవంటి ఉపకారి లేనేలేడు. నేను నీకేమి ప్రత్యుపకారము చేయగలను? నా మనస్సుగూడ నీ ముందుకు వచ్చుటకు జంకుచున్నది. నీ ఋణమునుండి విముక్తుడను కాలేనని తోచుచున్నది – దేవతల రక్షకుడైన శ్రీరామచంద్రుడు మాటిమాటికిని హనుమంతునివైపు చూచుచుండెను. అతని నేత్రములు సజలములై, శరీరము పులకితమగుచుండెను.

ఆధ్యాత్మ రామాయణము. సుందరకాండము 5-64

**యత్పాదపద్మయుగళం తులసీదళాద్యైః సంపూజ్య విష్ణుపదవీమ్ అతులామ్ ప్రయాతి**
**తేనైవ కిం పునరసౌ పరిరబ్ధమూర్తీ రామేణ వాయుతనయః కృతపుణ్యపుంజః**

శ్రీరాముని పాదపద్మములను తులసీదళాదులతో పూజించినవారు సాటిలేని పరమపదమును పొందుదురు. అట్టి శ్రీరామచంద్రుడే పుణ్యముల రాశియైన హనుమంతుని అనుగ్రహించి స్వయముగా ఆయనకు తన ఆలింగన సుఖమును ప్రసాదించెను. ఆ మారుతి భాగ్యమును ఎంతని కొనియాడగలము?

శ్రీ అనంతకృష్ణశాస్త్రి చెప్పిన అర్థం కొంచెం భిన్నంగా ఉంది. ఆయన ఈ నామంలోని పదాలకు ఇతరులు వాడిన అర్థమే వాడారు కాని ఇలా వివరించారు. భగవంతుడు తన భక్తులకు సుందరమైన దేహమును ప్రసాదించును గనుక రుచిరాంగదుడు. ఇందుకు శ్రీ శాస్త్రి భాగవతంలోని కుబ్జ వృత్తాంతమును ఉదాహరించారు.

**శ్రీ పోతన భాగవతము. కుబ్జ వృత్తాంతము.**

ఎవ్వరిదానవు? లేపము
లెవ్వరికిం గోరికొనుచు నేగెదు? నీ పే
రెవ్వరు మా కిమ్మిన్నియు
నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రా!

చక్కనివాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్లవారికిం
జక్కఁదనంబు లెక్కడివి; చారుశరీర! త్రివక్ర యండ్రు; నే
నిక్కము కంసుదాసిని; వినిర్మల లేపన విద్యదాన; నన్
మిక్కిలి రాజుమెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే!

అని పలికి యా కుమారుల
తనువులు నగవులును వీక్షితమ్ములు మాటల్
తన చిత్తముఁ గరఁగించిన
ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్.

1610 కాలపు చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Krishna_meets_Kubja.jpg

ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు - లన్నియుఁ దాను దేహమున నలఁది
కొని ప్రసన్నత నొంది కుబ్జ ముఁవ్వంకల - యొడలు చక్కఁగ నొత్తి యునుపఁ దలఁచి
తత్పదంబుల మీఁదఁ దన పదంబులు ద్రొక్కి - హస్తాంగుళద్వయ మబల గవుద
క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి - నెత్తఁగ వక్రత లెల్ల మాని
చక్కనైన చిత్తజన్ముబాణము క్రియఁ
గొమరుమిగిలి పిఱుఁదుఁ గుచయుగంబు
నొంపుఁ జేయఁ దరుణి సుందరమూర్తి యై
కమలనయనుఁ జూచి కాంక్షతోడ.



వేంచేయుము నా యింటికిఁ
బంచశరాకార"! యనుచుఁ బైకొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని
పంచాశుగబాణజాల భగ్నహృదయయై.
(http://telugubhagavatam.org నుండి కాపీ చేసినది)

శ్రీ శంకరుల వ్యాఖ్య – రుచిరే - కళ్యాణే అంగదే యస్య ఇతి రుచిరాంగదః. మనోహరములు, శుభకరములు అయిన అంగదములు, అనగా భుజకీర్తులు ధరించినవాడు రుచిరాంగదుడు.

ఇక్కడ గమనింపదగును. 545వ నామము 'కనకాంగదీ' – దివ్యమైన బంగారు భుజకీర్తులు, అనగా ఆభరణములు ధరించినవాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇలాంటి అర్థమే చెప్పారు. **రుచిరాణి దర్శనీయతమాని బాహుభూషణాని చత్వారి అంగదాని యస్య ఇతి రుచిరాంగదః.** చూపులకు ఆనందమునిచ్చే అందమైన బాహుభూషణములను (అంగదములను) కలిగినవాడు రుచిరాంగదుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ ఈ నామమును 'అంగ్' అనగా 'గతౌ' అనగా 'వెళ్ళుట' అన్న భావంలో వ్యాఖ్యానించారు. **సుందరగతియుక్తమ్ శరీరమ్, సుందరమ్ గమనమ్ వా యో దదాతి స రుచిరాంగదః.** అన్ని జీవులు చక్కగా చలించడానికి కావలసిన సాధనములను వాని వాని శరీరములలో కూర్చినవాడు రుచిరాంగదుడు.

## 946. జననః

- జనింపజేయువాడు. సృష్టికర్త

### ఓం జననాయ నమః

జన్ - ప్రాదుర్భావే - పుట్టుట. **జనయతి ఇతి జననః, సర్వస్య జగతో జననః, స్వయమ్ అజోఽపి.** తాను స్వయముగా పుట్టుక లేనివాడు అయినప్పటికీ అన్నింటినీ సృష్టించువాడు జననుడు. పాణిని సూత్రము 3.3.113 ప్రకారం **'జన్'** ధాతువుకు **'ల్యుట్**

(అన)' ప్రత్యయము చేర్చితే 'జననః' అనే పదం వస్తుంది. దీనివల్ల ఆ కార్యము, లేదా సాధనము, లేదా స్థలము సూచింపబడుతాయి. 'జననః' అనే పురుషవాచకము 'కర్తారి' అనగా 'చేయువాడు' అనే అర్థంలో చెప్పబడింది.

**ఈ 946వ నామమునుండి 992వ నామము వరకు (అనగా దాదాపు స్తోత్రం చివరివరకు) శ్రీమన్నారాయణుని వ్యాపారములకు (కార్యములకు) ప్రయోజనములు (ఫలితములు) పరంగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.**

**అథ సర్వ భగవద్ వ్యాపారాణామ్ ప్రయోజనమ్.** భగవంతుని సకల వ్యాపారములు జీవుల కొరకే అని మనం గ్రహించవచ్చును. ఈ భగవద్వ్యాపారాలలో ముందుగా సృష్టికార్యం గురించి చెప్పబడింది. ఇందుకు శ్రీ భట్టుల అనుభవము – **తదనుభవ క్షమ కరణి యుక్తాన్ అన్యానపి జనయతి ఇతి జననః.** భగవంతుని అనుభవించడానికి కావలసిన దేహము, ఇంద్రియాలతో సకల జీవులను సృజించినవాడు.

**విచిత్ర దేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్ పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాది సంయుతః**
భగవంతుని సేవలో తరించడంకోసం బ్రహ్మ మనకు కాళ్ళు, చేతులు వంటి ఇంద్రియాలు ఇచ్చాడు.

**పోతన భాగవతము 7-169**

కమలాక్షు నర్చించు కరములు కరములు - శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు - శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు - మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు - పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి;
దేవదేవుని చింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి.

భగవంతుడు కృపతో జీవులకు వారి కర్మానుసారము శరీరమును, ఇంద్రియములను, రూపమును ఇచ్చెను. వానిద్వారా జీవులు సత్కార్యములు చేసి భగవంతునికి దగ్గర కావచ్చును. అలా సత్కార్యములు చేయకుంటే మరో జన్మలో ఆ అవకాశం లభిస్తుంది.

(బ్రహ్మయే సృష్టికర్త అని సాధారణంగా అంటుంటాము. అసలైన సృష్టికర్త శ్రీమన్నారాయణుడు అని శ్రీ నమ్మాళ్వారు అనేకమార్లు స్తుతించారు. భగవానుడు మహత్ ను, పంచమహాభూతములను, బ్రహ్మాండమును సృజించి, అప్పుడు బ్రహ్మను సృజించి తక్కిన సృష్టికార్యానికి కావలసిన శక్తిని బ్రహ్మకు ఇచ్చాడు. బ్రహ్మకు కూడా అంతర్యామియైన శ్రీమహావిష్ణువే అసలు సృష్టికర్త.)

శ్రీ చిన్మయానంద – సకల విశ్వము నారాయణునినుండియే వచ్చింది. సకల జీవులకును జనకుడు నారాయణుడే. సృష్టికి ముందున్నది ఆయనే. అంతా ఆయననుండి వచ్చి ఆయనయందే ఉంటుంది. కనుక జగదీశ్వరుడైన శ్రీమన్నారాయణుడే 'జననః'.

**అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే**
**ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః** – గీత 10.8
ఈ సమస్త జగత్తుయొక్క ఉత్పత్తికి వాసుదేవుడనైన నేనే మూలకారణము. నావలననే ఈ జగత్తంతయు నడుచుచున్నది. ఈ విషయము బాగుగా ఎఱింగిన జ్ఞానులైన భక్తులు భక్తిశ్రద్ధలతో నిరంతరము నన్నే సేవింతురు.
**పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్**

**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ** – గీత 11.43
ఓ అనుపమ ప్రభావా! ఈ సమస్త చరాచ జగత్తునకు నీవే తండ్రివి. నీవే పూజ్యుడవు. గురుడవు. సర్వ శ్రేష్ఠుడవు. ఈ ముల్లోకములయందు నీతో సమానుడెవ్వడను లేడు. ఇంక నీకంటె అధికుడెట్లుండును?

శ్రీ సత్యసంధతీర్థ – **జనమ్ నయతి ఇతి జననః.** సకల జనులకు దారి చూపువాడు జననుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **జనయతి ముదమ్ స్వజనానామ్ హృదయేషు ఇతి జననః.** తన భక్తుల హృదయములలో ఆనందము జనింపజేయువాడు జననుడు.

## 947. జనజన్మాది

- సకల జీవులకును తానే మూలకారణము అయినవాడు.
- సకల జీవుల జన్మలకు తానే పరమ ప్రయోజనము (లక్ష్యము) అయినవాడు.

### ఓం జనజన్మాదయే నమః

జన-జన్మ-ఆదిః – జనజన్మాదిః. జాయంతే ఇతి జనాః; జన్మ - జననమ్; ఆదిః - దదాతేః, ఇచ్చువాడు, మూలకారణము. అన్ని జీవులకు (జన్మలకు) మూలకారణము జనజన్మాది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'మూలకారణము', మరియు 'ప్రయోజనము' అనే రెండు అర్థాలను కలిపి చెప్పారు. **తేషామ్ జనానామ్ జన్మనః ఆదిః - నిమిత్తమ్, ప్రయోజనమ్ ఇతి జనజన్మాదిః.** సకల జీవుల జన్మలకు నిమిత్త కారణము, మరియు పరమ గమ్యము అయినవాడు జనజన్మాది.

మన జన్మకు పరమోత్తమ గమ్యము నారాయణుడే అన్న అర్థానికి శ్రీ భట్టులు పెక్కు ఉదాహరణలు చెప్పారు.

**అద్య మే సఫలమ్ జన్మ** – విష్ణుధర్మము 5.7.3 – ఈ రోజు నా జన్మ సఫలమౌతున్నది. ఈ రాత్రి శుభకరమైన ఉదయంగా మారనున్నది. ఈ నాడు నేను శ్రీకృష్ణభగవానుని దర్శింపనున్నాను. అని అక్రూరుడు అనుకొన్నాడు.

**జన్మస్య విఫలాన్యైకాయ గోవిందాశ్రయా క్రియా.** గోవిందునితో సంబంధము లేని పనులన్నీ ఈ జన్మలో వ్యర్థమైన పనులే.

**సుజన్మ దేహమత్యంతం తదేవాऽశేష జంతుషు యదేవ పులకోద్భాసి విష్ణునామని కీర్తతే.**
ఈ జన్మ ఎత్తినందుకు ఫలము ఏమంటే గోవిందుని గురించి చెప్పడమే. విష్ణునామము చెప్పినంతనే గగుర్పాటు చెందేదే అన్ని జన్మలలోకి శ్రేష్ఠమైనది (శ్రీకైవల్య సారధి). **జననో జనజన్మాదిః నవార్ణో జన్మనాశకః.** ఈ నామము నవాక్షరీ మంత్రము. జన్మరాహిత్యమును ఇస్తుంది. ఓం జనజన్మాదయే నమః.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **జనస్య జని మతః జన్మ ఉద్భవః, తస్య ఆదిః మూలకారణమ్ ఇతి జనజన్మాదిః.** సకల జీవుల జన్మలకు మూలకారణమైనవాడు జనజన్మాది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **జనానామ్ - ప్రాణినామ్ జన్మనః ఆదిః ఇతి జనజన్మాదిః.**

**శ్రీమద్భాగవతము. అక్రూరుని తలపులు. శ్రీ ఏల్చూరు మురళీధరరావు రచన.**

దేవా! ఏమి పుణ్యం చేసుకున్నానో, ఎట్టి తపస్సుకు నోచుకున్నానో, ఏ సత్పాత్రునికి ఎటువంటి దానం ఇచ్చానో నేడు నాకు నిన్ను సందర్శించే మహాభాగ్యం కలిగింది. శూద్రునికి వేదోచ్చారణవలె విషయాత్మునికి భగవద్దర్శనం దుర్లభం....... విషయాతురులు కూడా

కాలగతి మూలాన యాదృచ్ఛికంగా భగవద్దర్శన భాగ్యాన్ని పొందగలుగుతారు. నేటితో నా అమంగళాలన్నీ నశించాయి. యోగిజనధ్యేయమైన నీ పాదపద్మాలకు ఇదే నమస్కారం.

...... ఏ నీ చరణారవిందనఖ కిరణాలు సోకినందువలన అంబరీషాదులు సంసృతి సాగరాన్ని తరింపగలిగారో, ఏ నీ పాదారవిందాలు బ్రహ్మాదులకు పూజనీయాలు, సిరికి ఆశ్రయాలు, మునీంద్రులకు భక్తినిధానాలు అయి పరమైశ్వర్య సౌభాగ్య పరమపురుషార్థప్రదములన్న మాటను ప్రకటిస్తున్నవో, ఏ నీ చరణారవిందాలు గోపాలన నిమిత్తం వనసంచార రూపాన భూదేవికి సంతాపాన్ని తీరుస్తున్నవో, ఆ నీ పవిత్ర పాదారవిందాలను కన్నులార చూసుకొని చేతులారా పూజించుకొంటాను. సుకపోల నాసికము, స్మితావలోకారుణకంజలోచన దీప్తిమంతము, నీలకుటిల కుంతలావృతము, సకలకళాపరిపూర్ణము అయిన నీ ముఖచంద్రమండలాన్ని తిలకించి ధన్యధన్యుడనవుతాను.



1730 కాలపు చిత్రం. శ్రీ బలరామ కృష్ణులు అక్రూరుని రథంలో వెళుతున్నారు.

https://commons.wikimedia.org/wiki/ File:Krishna_and_Balarama_Being_Driven_by_Akrura_to_Mathura,_Folio_from_a_Bhagavata_Purana_(Ancient_Stories_of_the_Lord)_LACMA_M.**71.49.1**.jpg

## 948. భీమః

- ధర్మమార్గమును అతిక్రమించినవారికి భయంకరుడు. వారికి పునర్జన్మమనే శిక్షను కలిగించువాడు.

### ఓం భీమాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

39వ శ్లోకము. 359వ నామము. భీమః – **అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః**

101వ శ్లోకము. 948వ నామము. భీమః – **జననో జనజన్మాదిః భీమో భీమపరాక్రమః**

భీ - భయే - భయపడుట. అనే ధాతువునుండి ఈ నామమును వివరించారు.

జగత్తు అంతా భగవంతుని అధీనంలో నడుస్తుంది గనుక సకల జగత్తుకు ఆయన భీముడు. ఇక భక్తుల విషయానికి వస్తే, నిజమైన భక్తులను ఆయన ఎంతగా ప్రేమిస్తాడంటే భక్తులు చెప్పినట్లుగా ఆయన నడచుకుంటాడు. భక్తులు కానివారు కూడా భయంవల్ల భగవంతుని ఆదేశానుసారం వర్తిస్తారు. కనుక భగవంతుడు భీముడు. ఈ విషయం 359వ నామ వివరణలో చెప్పబడింది. భగవంతుని ఆజ్ఞను అతిక్రమించడానికి అందరూ భయపడుతారు. **వాయ్వంబరాగ్న్యప్ క్షితయ స్త్రిలోకా బ్రహ్మాదయో యే వయముద్విజంతః.** మహాభాగవతం 6.9.21. **హరామ యస్మై బలిమ్ అంతకోసా బిభేతి యస్మాదరణమ్ తతోనః.** పంచమహాభూతములు, వానిద్వారా ఏర్పడిన ముల్లోకాలు, అన్నీ మహాంతకునికి భయపడును. అతడు పరబ్రహ్మకు భయపడును. అట్టి పరబ్రహ్మము మనలను రక్షించుగాక.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇక ఈ 948వ నామము వ్యాఖ్యలో మరొక కోణంలో చూశారు. ధర్మమార్గాన్ని విడచి చరించే జీవులకు నరకము, పునర్జన్మ వంటి శిక్షలు విధించేవాడు భీముడు. భగవంతుని కరుణను సదుపయోగం చేసుకోలేనివారికి తిరిగి అలాంటి అవకాశం ఇవ్వడంకోసం ఈ శిక్షను విధిస్తాడు. **మహా అనుగ్రహ విముఖానామ్ భీమః.**

**ఏవం విధానుగ్రహస్య విముఖానామ్ నిరంతరమ్ గర్భ జన్మాది హేతుత్వాత్ భీమ ఇత్యుచ్యతే బుధైః.** భగవంతుని అనుగ్రహమునకు నోచుకోనివారికి నిరంతర గర్భవాసమునకు కారణమైనవాడు భీముడు. (శ్రీకైవల్య సారధి).

శ్రీ భట్టులు గీత (16.19)నుండి ఉదాహరించారు. **తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ క్షిపామ్యజస్రమ శుభాన్ ఆసురీష్వేవ యోనిషు.** అట్లు ఇతరులను ద్వేషించు పాపాత్ములను, క్రూరులైన నరాధములను మాటిమాటికిని ఈ సంసారమునందు ఆసురీయోనులలోనే నేను పడవేయుదును.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 9.9.7 – నిజమైన భక్తి కలిగి భగవంతునికే అంకితమైనవారికిని, భగవత్ప్రాప్తి తప్ప వేరు కోరిక లేకుండా ఆయనను అర్చించేవారికి, మరేమీ వాంఛించనివారికి భగవంతుని తెలుసుకొనుట సులభము. ఇతర కోరికలతో ఆయనను అర్చించేవారికి ఆయన ఆ కామితార్థములను ప్రసాదిస్తాడు. కాని వారినుండి దూరమౌతాడు. వారికి అందరాడు.

శ్రీ భట్టులు ఈ భాగంలో భగవానుని వ్యాపారముల ప్రయోజనం పరంగా వ్యాఖ్యానిస్తున్నారని గుర్తుంచుకోవాలి. భగవానుడు భీముడై భక్తులు కానివారికి భయం కలిగించడానికి, అధర్మపరులను శిక్షించడానికి ప్రయోజనం ఏమిటి? జగత్తును ఒక పద్ధతిలో ఉంచడము, భక్తులను రక్షించడము, పెడమార్గం పట్టినవారిని తిరిగి సన్మార్గములోనికి తీసుకొని రావడము భీమ వ్యాపార ప్రయోజనములు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– భయ హేతుత్వాత్ భీమః**. భయమును కలిగించువాడు భీముడు. అధర్మపరుల హృదయాలలో భీతిని కలిగించేవాడు. ఇందుకు శ్రీ శంకరులు కఠోపనిషత్తు మంత్రము (2.3.2)ను ఉదాహరించారు. **మహద్ భయమ్ వజ్రముద్యతమ్.** ఎత్తబడిన వజ్రాయుధమువంటి భయము.

39వ శ్లోకంలోని 'భీమః' నామమునకు శ్రీ శంకరులు **'అభీమః'** అనే పాఠాంతరాన్ని కూడా పరిగణించారు. ధర్మమార్గమున చరించేవారికి భయం లేకుండా చేసేవాడు అభీముడు.

నృసింహోత్తర పురాణం (6.1)లో **'భీషణమ్ అభీషణమ్'** అని ఉన్నది. శ్రీ నృసింహస్వామి హిరణ్యకశిపునకు భీకరంగా భయంకలిగించేలాగానూ, ప్రహ్లాదునకు సౌమ్యమూర్తిగానూ కనిపించాడట.

శ్రీ సత్యసంధ తీర్థ **– భృత మాః ప్రమాణాని తేన వ్యాసాది రూపేణ ఇతి భీమః.** వేదవ్యాసుని అవతారంలో భగవంతుడు వేదముల ద్వారా ప్రమాణములను ప్రకటించాడు గనుక భీముడు.

**భియమ్ భక్త భయమ్ మినాతి హినస్తి ఇతి భీమః**. తన భక్తుల భయములను రూపుమాపి వారిని కాపాడువాడు భీముడు.

## 949. భీమపరాక్రమః

- భీకరమైన పరాక్రము కలవాడు.

### ఓం భీమపరాక్రమాయ నమః

భగవంతుని పరాక్రమము తులలేనిది. అసురులను భీతావహులుగా చేసేది. అలా ఆయన పరాక్రమము భక్తులను రక్షిస్తుంది. దుష్టులను రూపుమాపి వారిని కూడా ఇంకా దుష్కార్యాలు చేయకుండా రక్షిస్తుంది.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 9.2.10 **–** దేవతలను బాధించే అసురులకు భగవంతుడు విరుగులేని కాలకూటవిషం లాంటివాడు.

శ్రీ కృష్ణన్ విశ్లేషణ **–**

948వ నామము. **భీమః –** ధర్మమార్గమును వదలినవారికి భయం కలిగించేవాడు.

949వనామము. **భీమపరాక్రమః –** ఇంకా దుష్టులై సత్పురుషులను, లోకములను బాధించేవారిపట్ల భీకరమైన పరాక్రమం కలిగి, వారిని భీతావహులుగా చేయువాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అన్యేష్వపి జగదహిత నిరత్రేషు హిరణ్యాదిషు భీమపరాక్రమః.** జగత్తునకు హానికలిగించే హిరణ్య(కశిపు)ని వంటి వారియందు భయంకరమైన పరాక్రమం కలవాడు. **లోకాకహితేషు నితరాం హిరణ్యాదిషు సర్వదా భీమః పరాక్రమో యస్య సస్యాద్భీమపరాక్రమః**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **భయహేతుః పరాక్రమః అస్య ఇతి భీమపరాక్రమః.** భగవంతుడు తన వివిధ అవతారాలలో శత్రువులకు భయం కలిగించే పరాక్రమాన్ని ప్రదర్శించినందువలన ఆయన భీమపరాక్రముడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతునిగురించి సదా భయంతో ఆయనను తలచుకోవడంకూడా అసురులకు మంచినే చేస్తుంది. భాగవతం (7.1.30)లో ఈ విషయం నారద, ధర్మజుల మధ్య జరిగిన సంభాషణల ద్వారా తెలుస్తుంది. కామోత్కంఠతచే గోపికలు, వైరంచే శిశుపాలాదులు, భయంచే కంసుడు, బంధుత్వంచే యాదవులు, భక్తిచే సదా గోవిందుని తలచి ఆయనను పొందారు.

**గోప్యః కామాత్ భయాత్ కంసః ద్వేషాత్ చైద్యాదయో నృపః**
**సంబంధాత్ వృష్ణయః స్నేహాత్ యూయమ్ భక్త్యా వయం విభో** – భాగవతము 7.1.30

పోతన భాగవతము

అలుకనైన జెలిమినైన గామంబున
నైన బాంధవములనైన భీతి
నైన దగిలి తలప నఖిలాత్ముడగు
హరి జేరవచ్చు వేఱుసేయడతడు.

కామోత్కంఠత గోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తినేము నిదే చక్రిం గంటిమెట్లైన ను
ద్ధామ ధ్యాన గరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా

శ్రీ సత్యసంధ తీర్థ – **భీమస్య ద్రౌపదీపతే, రుద్రస్య వా పరాక్రమో యస్మాద్ స భీమపరాక్రమః.** (ద్రౌపది పతియైన) భీముడు, రుద్రుడు వంటివారి పరాక్రమమునకు కారణమైనవాడు భీమపరాక్రముడు.



శ్రీ విల్లిపుత్తూరు శ్రీ ఆండాళ్ ఆలయం. వికీపీడియా చిత్రం. Photo by Ssriram mt

https://commons.wikimedia.org/wiki/File:Srivilliputhur_Andal_temple_(17).jpg



**ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః |**

**ఊర్ధ్వగస్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః || (102)**

**950. ఆధారనిలయః**

- ఈ జగత్తునకు ఆధారమైన మహాభక్తులు, ధార్మికులకు ఆధారమైనవాడు..
- ఈ జగత్తునకు ఆధారమైన పృథివ్యాది పంచమహాభూతములకు ఆధారమైనవాడు.

**ఓం ఆధారనిలయాయ నమః**

ఆ (ప్రత్యయము) - అన్ని విధాలుగా, అన్ని ప్రక్కలనుండి. దృ - ధారణే - నిలబెట్టుట, భరించుట – నుండి 'ధారా' వచ్చును. లీ - శ్లేషణే - అతుకుకొనుట, పైన పరుండుట. దీనికి ముందు 'ని' ప్రత్యయము చేరిస్తే 'నిలయ' పదము వస్తుంది. **జగద్ధారణమ్ అపి ధారక ఇతి ఆధారనిలయః.** జగత్తుకు ఆధారమని వేనిని భావిస్తామో వానికి ఆధారమైనవాడు ఆధారనిలయుడు. అనగా బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, సూర్యుడు, సకల గ్రహములు, ఉపగ్రహములు, పంచమహాభుతములు – వీటన్నింటికీ ఆధారమైనవాడు. అంతే కాకుండా ఆయన సకల ప్రాణులలోను అంతర్యామియై వానికన్నింటికీ కూడా ఆధారమైనవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ధార్మికతయా జగదాధారః ప్రహ్లాద విభీషణ పాండవ ఆదయః, తేషామ్ నిలయః ఆధారనిలయః.** ప్రహ్లాదుడు, విభీషణుడు, పాండవులు వంటి భక్తులు జగత్తునకు ఆధారమైన ధార్మికులు. అనగా వారి ధర్మమువలన జగత్తు నిలబడియున్నది. అలాంటివారికి ఆధారమైనవాడు ఆధారనిలయుడు. ఇందుకు శ్రీ భట్టులు విష్ణుస్మృతినుండి ఉదాహరించారు.

**వర్ణాశ్రమ ఆచారపరాః సంతః శాస్త్రైక తత్పరాః త్వామ్ ధరే! ధారయిష్యన్తి తేషు త్వద్భారమాహితమ్**

ఓ భూమాతా! వర్ణాశ్రమ ధర్మాలు, ఆచారములు, శాస్త్ర విధానాలు ఖచ్చితంగా అనుసరించేవారు నీకు ఆధారమై యున్నారు. వారిపై నీ భారమున్నది. (ఇక్కడ ధర్మాచరణకిచ్చిన ప్రాధాన్యతను గమనించనగును). ఇలాంటి సత్పురుషులకు ఆధారము భగవంతుడు కనుక ఆయన ఆధార నిలయుడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ ఈ నామమును రెండు విధాలుగా వివరించారు (1) **ఆధారభూతాః సాత్వికాః తేషామ్ నిలయః** (2) **ఆధారభూతః నిలయః యస్య స ఆధారనిలయః**. ఇందులో మొదటి అర్థం శ్రీ భట్టులు చెప్పినదానికి సరిపోతుంది. రెండవ అర్థం ప్రకారం ధార్మికతత్పరులే భగవంతునికి నిలయము. అనగా భగవంతుడు ధర్మపరులైన భక్తులయందుండును. ఇది విశిష్టాద్వైత సంప్రదాయాన్ని చక్కగా ప్రతిబింబించే వివరణ.

శ్రీ నమ్మాళ్వారు. పెరియ తిరువంతాడి 75 – నీవు జగత్తును, భూమ్యాకాశాదులను ధరిస్తున్నావన్నది నిజమే. కాని నీవు నా చెవులనుండి నాలో ప్రవేశించి నా హృదయంలో స్థితుడవైయున్నావు. కనుక నాకు ఆధారం నీవా? లేక నీకు ఆధారం నేనా? నీవు పెద్దవాడివా? నేను పెద్ద వాడినా? శత్రువులరక్తాన్ని త్రాగివేసే చక్రాన్ని ధరించిన పరమాత్ముడా? ఈ సంగతి చెప్పు.

**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్** – గీత 7.18

ఈ చతుర్విధ భక్తులందరును ఉదారులే (అనగా భగవంతునియందు విశ్వాసముంచి, ఎల్లప్పుడు అతనినే సేవించుచు ఉండువారు). కాని జ్ఞానియైనవాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగా ఉంచి, నన్నే పరమప్రాప్యునిగా భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థితుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పృథివ్యాదీనామ్ పంచభూతానామ్ ఆధారత్వాత్ ఆధారనిలయః.** భూమివంటి పంచమహాభూతములకు ఆధారమైనవాడు ఆధారనిలయుడు.

శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి పెక్కు ఉదాహరణలు చెప్పారు.

యజుర్వేదము 32.7 – **యత్రాధి సూర ఉదితో విభాతి కస్మై దేవాయ హవిషా విధేమ.**

ఋగ్వేదము 1.154.2 – **యస్యోరుషు త్రిషు విక్రమణేషు అధిక్షియన్తి భువనాని విశ్వా.** ఆయనయొక్క మూడు విశాలమైన అడుగులలో సకలభువనములు నిలిచియున్నవి.

అధర్వవేదము 10.8.16 – **యతః సూర్య ఉదేత్యస్తమ్ యత్ర చ గచ్ఛతి తదేవ మన్యేऽహమ్ జ్యేష్ఠమ్ తదునాత్యేతి కించన**
ఏ పరబ్రహ్మము కారణంగా సూర్యుడు ఉదయిస్తాడు, అస్తమిస్తాడు, విశ్రమిస్తాడో, ఎవని సంకల్పం లేకుండా ఏదీ జరుగదో అట్టి పరబ్రహ్మమునకు వందనము.

ఋగ్వేదము 7.99.2 –
**న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమన్తమాప**
**ఉదస్తభ్నా నాకమృష్యమ్ బృహన్తమ్ దాధర్థ ప్రాచీమ్ కకుభమ్ పృథివ్యాః**
ఓ మహావిష్ణూ! పుట్టినవాడు, పుట్టేవాడు ఎవరూ కూడా నీ మహిమను పూర్తిగా తెలిసికొనలేడు. భూమి తూర్పు చివరను నీవు భద్రంగా బంధించావు. మరియు బృహదాకాశమును నీవు నిలబెడుతున్నావు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – పంచభూతములయందు నివసించియుండువాడు ఆధారనిలయుడు. ఇలా వానియందు ఉండడంవలన అవి భగవద్వ్యాపారములను సక్రమంగా నిర్వహిస్తున్నాయి.
**గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః** – గీత 15.13
**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్** – గీత 15.14
పృథ్వియందు ప్రవేశించి, నేను నా శక్తిద్వారా సకల భూతములను ధరించి, పోషించుచున్నాను. రసస్వరూపుడనై, అనగా అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు, అనగా వనస్పతులన్నింటికి పుష్టిని చేకూర్చుచున్నాను. నేనే ప్రాణాపాన సంయుక్తమైన వైశ్వానరాగ్ని రూపములో సర్వప్రాణులయందుండి నాలుగు విధములైన ఆహారములను జీర్ణము చేయుచుందును.

బృహదారణ్యకోపనిషత్తు 3.7.19 –
**యః సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యోऽన్తరో యం సర్వాణి, భూతాని న విదుర్యస్య సర్వాణి భూతాని**
**శరీరం యః సర్వాణి, భూతాన్యన్తరో యమయత్యేష త అంతర్యామ్యమృతః ఇత్యాధిభూతమ్ అతాధ్యాత్మమ్**
ఎవరైతే సర్వభూతాలయందును స్థితుడైయుండునో, సకల భూతముల లోపల ఉన్నా ఆయనగురించి భూతములు ఎఱుగవో, ఎవని శరీరము సకలభూతములై యున్నదో, అన్ని భూతములు ఎవని అధీనంలో వర్తించునో, ఆ శాశ్వత అమృత అంతర్యామియే నీ అంతరాత్మ.

శ్రీ సత్యసంధ తీర్థ – ధార - గోకులంలో ఇంద్రుడు కురిపించిన కుంభవృష్టి. **అ-సమంతాత్ ధారా - దేవేంద్రకృత వృష్టిధారా యేషామ్ త ఆధారా గోపాలాః, తేషామ్ గోవర్ధన ధారణేన నిలయాశ్రయ ఇతి ఆధారనిలయః.** 'ధార' అనగా ఇంద్రుడు కురిపించిన కుండపోత. అలాంటి వర్షాన్నుంచి గోపకులను, గోవులను కాపాడడంకోసం గోవర్ధనగిరినెత్తి, వారికి ఆశ్రయము (నిలయము)ను ఇచ్చినవాడు ఆధారనిలయుడు.

## 951. ధాతా

### అధాతా

- జగత్తును సృష్టించినవాడు (ధా - జన్మనిచ్చుట).
- ఆధారమై పోషించువాడు (ధా - ధారణ పోషణయోశ్చ).
- తాను స్వయంగా ధర్మానికి ఆచార్యస్థానమును అలంకరించేవాడు.
- అధాతా – తనకు తాను తప్ప వేరు ఆధారము లేనివాడు.
- ప్రళయకాలమున సమస్తమును పానము చేయువాడు (ధేట్ - పానే - త్రాగుట).
- చతుర్ముఖ బ్రహ్మకు అంతర్యామియైనవాడు.

### ఓం ధాత్రే నమః

### ఓం అధాత్రే నమః

5వ శ్లోకము. 43వ నామము. ధాతా – **అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః**

102వ శ్లోకము. 951వ నామము. ధాతా / అధాతా – '**ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః**' లేదా '**ఆధారనిలయోఽధాతా పుష్పహాసః ప్రజాగరః**'

శ్రీ భట్టుల వ్యాఖ్య –

5వ శ్లోకములో **'ధాతా'** – ధా - ఉంచుట, పైన కూర్చుండుట (ఆప్టే నిఘంటువు). **'ధాతా'** అనగా సృష్టికర్త. క్షేత్రము (ప్రకృతి)యందు అండము (జీవము)ను ఉంచి సృష్టి కార్యమునకు మూలమైనవాడు ధాత.

102వ శ్లోకములో **'ధాతా' – స్వయమ్ చ ధర్మాచార్యకేణ ధాతా.** తాను స్వయముగా ధర్మమును ఆచరించుచూ, ధర్మమునకు ఆచార్యస్థానమును అలంకరించేవాడు ధాత.

శ్రీ ఎమ్.వి. రామానుజాచార్య వివరణ – **'ధా'** అన్న ధాతువునకు **'ధారణ పోషణయోః'** అన్న అర్థాన్ని పరిగణిస్తే, భగవంతుడు స్వయముగా ధర్మాచరణ చేస్తూ భూమికి ఆధారమైయున్నాడు. భగవంతుని చూచి ఇతరులు కూడా ధర్మాన్ని ఆచరిస్తారు.

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి** – గీత 3.22

ఓ అర్జున! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియు లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను.

శ్రీ అణ్ణాంగారాచార్య వివరణ – వేదములు, గీత వంటి ప్రవచనములద్వారా, మరియు వివిధ అవతారములలో తన కార్యములద్వారా జగత్తునకు ఆధారమై పోషించువాడు ధాత.

శ్రీ కృష్ణన్ వివరణ – భగవానుడు శ్రీరామావతారములో సకల ధర్మమును చక్కగా ఆచరించి చూపెను.

శ్రీ శంకరుల వ్యాఖ్య –

5వ శ్లోకములో **'ధాతా' – అనంతాది రూపేణ విశ్వమ్ బిభర్తి ఇతి ధాతా.** అనంతునివంటి రూపములలో విశ్వమును భరించువాడు ధాత. శ్రీ వాసిష్ఠ కూడా ఇదే అర్థం చెప్పారు.

102వ శ్లోకంలో **'అధాతా' –** శ్రీ శంకరులు ఈ శ్లోకంలోని ఈ నామమును ముఖ్యంగా **'అధాతా'** అని పరిగణించారు. **స్వాత్మనా ధృతస్య అస్య అస్యో ధాతా న అస్తి ఇతి అధాతా.** తనను తానే ధరించును. ఆయనను ధరించేవారు వేరెవరూ లేరు గనుక ఆయన **'అధాత'**. శ్రీ వాసిష్ఠ కూడా **'అధాత'** అనే పాఠాన్ని పరిగణించారు.

శ్రీ శంకరులు **'ధాతా'** అనే పాఠాంతరాన్ని కూడా పరిగణించారు. ధేట్ - పానే - త్రాగుట. **సంహారసమయే సర్వాః ప్రజా ధయతి - పిబతి ఇతి ధాతా.** ప్రళయకాలంలో సకలమును పానం చేసేవాడు ధాత. శ్రీ వాసిష్ఠ ఈ అర్థాన్ని కూడా చెప్పారు. **ధయతి - పిబతి విశ్వమ్ ఇతి ధాతా.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ **– దధాతి పోషయతి స్వజనాన్ ఇతి ధాతా.** తన భక్తులను రక్షించి పోషించువాడు ధాత.

శ్రీ బలదేవ విద్యాభూషణ – 5వ శ్లోకంలో **'ధాతా' – ఉత్పత్తి వినాశ విరహాదనాది నిధనః కారణత్వే విరించాదిభ్యో విశేషమ్ ఆహ ధాతా ఇతి.** బ్రహ్మ విష్ణు రుద్ర రూపములలో సృష్టి స్థితి లయాది కార్యములు నిర్వహించువాడు ధాత.

శ్రీ అణ్ణంగారాచార్య – భగవానుని శరీరంలో ఒక భాగమై భగవత్కార్యాన్ని నిర్వహించే చతుర్ముఖబ్రహ్మ ధాత.

## 952. పుష్పహాసః

- వికసించిన పూవువలె మృదువైనాడు. తన భక్తులకు భోగ్యమైన శక్తి కలిగినవాడు.
- పుష్పము వికసించినట్లే పరమాత్ముడు విశ్వమంతటా విస్తరించాడు.

ఓం పుష్పహాసాయ నమః

పుష్ప - వికాసనే - విస్తరించుట, తెరచుకొనుట. హస్ - హసనే - నవ్వుట, వికసించుట. ఈ నామము భగవంతుని లాలిత్యమును సూచించును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఏవమ్ **నిష్పాదిత స్వానుభవ శక్తీనామ్ సాయమివ పుష్పస్య హాసో భోగ్యత ఉల్లాసః అస్య ఇతి పుష్పహాసః.** ఆయన తన శక్తిని భక్తులు అనుభవించడం కోసం మృదువుగా, సాయంకాలం వికసించిన పుష్పంలాగా వెలయిస్తాడు గనుక పుష్పహాసుడు.

**స్వానుభవ శక్తినామ్ సాయం పుష్పవదనస్య వై హాసోఽస్తి భోగ్యతోల్లాసః పుష్పహాస ఇతి స్మృతః.** భక్తులు తనను అనుభవించడానికి తగిన శక్తిసామర్థ్యములను పుట్టించి, అటువంటివారికి తన భోగ్యాతిశయములను సాయంకాలము వికసించు పుష్పములాగా ప్రకాశింపజేయువాడు పుష్పహాసుడు. (శ్రీకైవల్య సారధి).

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – భక్తుల రక్షణకోసం భగవంతుని శక్తులు పూవు వికసించినట్లుగా ప్రకాశిస్తాయి. ఆయన శక్తులు భక్తులకు అనుభవభోగ్యములు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ **–** భగవంతుని తిరుమేని అంతా కూడా మృదువైన పూవులాంటిది. కనుక భక్తులు దానిని అనుభవించి పరవశిస్తారు. ఇది ఆయన అవతార ప్రయోజనము. శ్రీ భట్టులు ఈ నామములను భగవంతుని అవతార ప్రయోజనాలపరంగా వ్యాఖ్యానిస్తున్నారు.

శ్రీ తిరుమంగయాళ్వారు. పెరియ తిరుమొళి 8.1.5 **–** భగవంతుని పాదములు మృదువైన పూవులవంటివి. ఆ పాదాలవద్ద మనం శరణాగతులమైనపుడు ఆయన తన మెత్తని పద్మాలవంటి చేతులతో మనలను లేవనెత్తుతాడు. ఆయన మనను ప్రేమతో ఆలింగనం చేసుకొన్నపుడు ఆయన దివ్య సుందర తిరుమేని మరియు దివ్యాభరణాల స్పర్శానుభూతి మనలను ఎన్నటికీ వదలదు. ఆయన వక్షస్థలమున నెలకొన్న విశాలాక్షి లక్ష్మీదేవి అనుగ్రహం కోసం ప్రార్థించి మనం వారితో ఐక్యమయ్యే భాగ్యాన్ని కోరుతాము. మధురమైన మకరందం జాలువారే పరిమళపుష్పాలతో శోభిల్లుచున్న తిరుక్కణ్ణపురం దివ్యక్షేత్రంలో ఈ పరమాత్ముడు మనకోసం వేచియున్నాడు.



వికీపిడియా చిత్రం. Photo by Siva301in

https://commons.wikimedia.org/wiki/File:Lord_Krishna_with_his_head_on_the_lap_of_the_Alvar_saint,_Andal.JPG

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమోళి 3.1.2 – భగవానుని కన్నులు, పాదములు, కరములు అన్నింటినీ మృదువైన, పరిమళభరితమైన, సుందరమైన పద్మాలతో పోలుస్తాము. కాని అది పేలవమైన పోలిక. ఎందుకంటే పరమాత్ముని అందాన్ని దేనితోనూ పోల్చలేము.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ కూడా ఇలాంటి వ్యాఖ్యనే చెప్పారు. **పుష్పమివ మృదుః స్వజన మనోహారీ హాసో యస్య స పుష్పహాసః.** పుష్పమువలె మనోహరమైన నవ్వుతో తన భక్తుల మనస్సులను పరవశింపజేయువాడు పుష్పహాసుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– ముకులాత్మనా స్థితానామ్ పుష్పాణామ్ హాసవత్ ప్రపంచ రూపేణ వికాసః అస్య ఇతి పుష్పహాసః.** మొగ్గలు వికసించి పూలైనట్లుగా భగవంతుడు విశ్వముగా విస్తరిల్లెను గనుక పుష్పహాసుడు.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – అవ్యక్తమగు పరబ్రహ్మము మొగ్గగా సూచింపబడెను. వికసించిన పుష్పము నామరూపాత్మకమగు సుందర విశ్వముగా తెలుపబడినది. ఇది అలంకారభాషలో గానము చేయబడిన మధురమగు భగవన్నామము.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుని తలపుతో భక్తుల మనసులు ఆనందంతో వికసిస్తాయి. మరియు భక్తుల హృదయాలలో ఆయన వికసించి వారిని పరిమళింపజేస్తాడు. కనుక ఆయన పుష్పహాసుడు.

శ్రీ వాసిష్ఠ – **యో సదా ప్రసన్నముఖః శోకరహితశ్చ భవతి, తస్మిన్ నిష్పాపే శోకమోహరహితే స్వయమ్ భగవాన్ విరాజతే స విష్ణుః పుష్పహాసః.** శ్రీమహావిష్ణువుసదా ప్రసన్నమూర్తి. శోకము, మోహము వంటి కల్మషములు ఆయున చెంతకు రావు. అలా పరిమళించే భగవంతుడు పుష్పహాసుడు.

## 953. ప్రజాగరః

- ఆశ్రితులను, భక్తులను రక్షించడంకోసం సదా మేల్కొని (జాగరూకుడై) ఉండువాడు.
- తమోగుణము లేనివాడు గనుక నిద్రకు వశం కానివాడు.
- శ్రీవేంకటాచలంలో ఉండి భక్తుల సాంగత్యాన్ని ఆనందించేవాడు.

ఓం ప్రజాగరాయ నమః



తిరుమల వసంతోత్సవం ఊరేగింపు. ఎడమవైపు పల్లకీలో శ్రీ సీతారామలక్ష్మణులున్నారు. మధ్య పల్లకీలో శ్రీ దేవీ భూదేవీ సమేతులైన శ్రీ మలయప్పస్వామి, కుడివైపున శ్రీ రుక్మిణీ కృష్ణులు ఊరేగుతున్నారు.

Photo by: Vimalkalyan https://commons.wikimedia.org/wiki/File:Vasanthotsavam_Procession.jpg

ప్ర (ఉపసర్గ). జాగృ - నిద్రాక్షయే - నిద్రించకుండా (మెలకువగా) ఉండుట. **ప్రకర్షేణ జాగర్తి ఇతి ప్రజాగరః.** విశేషముగా మేల్కొని ఉండువాడు ప్రజాగరుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య **– రాత్రిం దివం ప్ర-జాగర్తి ఇతి ప్రజాగరః.**

**రాత్రిం దినం ప్రజాగర్తి సస్యేష్వివ కృషీవలః భక్తేషు నితరాం యోఽసౌ ప్రజాగర ఇహోచ్యతే.** రైతు తన పంటలను కాపాడుకోవడానికి రేయింబవళ్ళు ఎలా జాగ్రత్తగా (మెలకువగా) ఉంటాడో, అదే విధంగా పరమాత్మ కూడా తన భక్తులను రక్షించడానికి సర్వదా మేలుకొని ఉంటాడు (శ్రీకైవల్య సారథి). శ్రీ భట్టులు ఇందుకు కఠోపనిషత్తు మంత్రాన్ని (5.8) ఉదాహరించారు. **య ఏషు సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః.** జీవులు నిదురించే సమయంలో ఈ పరమపురుషుడు మేల్కొని యుండి తన ఇచ్ఛాశక్తిద్వారా సృష్టిని చేస్తున్నాడు.

శ్రీ కృష్ణన్ – మన అంతులేని కోర్కెలు తీర్చడానికి భగవంతుడు మనం నిదురించే సమయంలో తాను మెలకువగా ఉంటున్నాడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – మనం ఆదమరచి నిదురపోతాము. మనం క్షేమంగా నిదుర లేవడానికి భగవంతుని జాగరూకతయే కారణము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **నిత్య ప్రబుద్ధ స్వరూపత్వాత్ జాగర్తి ఇతి ప్రజాగరః.** భగవానుడు నిత్యప్రబుద్ధ స్వరూపుడు. అనగా స్వభావసిద్ధంగానే జ్ఞానాన్ని పొందిఉన్నవాడు. మాయకు అతీతుడు. తమోగుణము ఆయన దరిచేరదు. కనుక ఆయన సదా జాగృతియందే ఉండును. అలా ప్రజాగరుడు.

శ్రీ రఘునాథ తీర్థ – **ప్రకాశేణ భక్తాన్ జాగ్రయతి-నిద్రరహితాన్ ముక్తా కరోతి ఇతి ప్రజాగరః.** భగవంతుడు భక్తులను మేల్కొలిపి ముక్తులను చేయును గనుక ఆయన ప్రజాగరుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – ప్రజ-అగ-ర – ప్రజాగర. ప్రజ - సృష్టించువాడు. అగ - వేంకటాచలం కొండలలో నివసించువాడు. ర - రమతి - ఆనందించువాడు. **ప్రకర్షేణ జనయతి లోకాన్ ఇతి ప్రజా. అగేషు వెంకటాద్రి పర్వతేషు రమత ఇతి అగ-రః. ప్రజశ్చ అసౌ అగరశ్చ ఇతి ప్రజాగరః.** శ్రీ వేంకటాచలంవంటి పర్వతాలలో నివసిస్తూ తన భక్తుల సాన్నిహిత్యాన్ని అనుభవించి ఆనందించేవాడు ప్రజాగరుడు.

భూమి, వాయువు, అగ్ని, నీరు, ఆకాశము అనే పంచభూతములు ఎన్నడూ నిదురించవు. అలాగే ఆత్మ, సూర్యుడు, ప్రాణము వంటివి నిదురించవు. వీటన్నింటికీ అంతర్యామియై భగవంతుడు జీవుల మనుగడకోసం సదా జాగరూకుడై యున్నాడు.

## 954. ఊర్ధ్వగః

- అన్ని విధములుగా ఉన్నత ప్రమాణములు కలవాడు.
- జీవుల పరమగమ్యమైన శ్రీవైకుంఠమునకు దారి చూపువాడు.
- అందరికంటె ఉన్నతోన్నతుడు.

### ఓం ఊర్ధ్వగాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యోసౌ స్వభావస్తుంగః ఊర్ధ్వగః పరికీర్తితః.** స్వభావసిద్ధంగానే ఉన్నతమైనవాడు 'ఊర్ధ్వగః'. ఈ నామము ఇంతకు ముందు నామము 'ప్రజాగరః' లోని గుణమునకు పొడిగింపుగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. తన సృష్టిని రక్షిచడం కోసం భగవానుడు నిద్రకూడా పోడు. కనుక 'ఊర్ధ్వగః'.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 10.8.8 – తన లక్ష్యాన్ని సాధించడంలో పెట్టే శ్రద్ధ విషయంలో ఆయనకెవరూ సాటి రారు. రక్షణే ఆయన లక్ష్యము.

తిరువైమొళి 1.1.1 – దివ్యమంగళ కళ్యాణ గుణములలో ఆయనకు సాటి లేరు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వేషామ్ ఉపరి తిష్ఠన్ ఊర్ధ్వగః.** అందరికంటె మహోన్నత స్థానమునందున్నవాడు 'ఊర్ధ్వగః'.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి – మనలను శ్రీవైకుంఠమునకు తీసుకొని పోయేవాడు విష్ణువేనని ఈ నామము తెలుపుతున్నది.

శ్రీ వాసిష్ఠ – **సర్వేషామ్ ఊర్ధ్వ స్థితిశాలిత్వాత్, సర్వతః శ్రేష్ఠత్వాత్ వా ఊర్ధ్వగః.** అన్ని విధములుగా అందరికంటె ఉన్నతమైనవాడు '**ఊర్ధ్వగః**'. శరీరంలో జ్ఞానస్థానమైన మెదడు అన్ని అవయవాలకంటే పైన ఉండడాన్ని ఈ సందర్భంలో గమనించాలి.

## 955. సత్పథాచారః

- భక్తులు తనకు కైంకర్యము చేయుట అనే సన్మార్గములో ప్రవర్తింపజేసేవాడు.
- తన అవతారములయందు నిరంతరము సదాచారములను, ధర్మమును ఆచరించేవాడు.

### ఓం సత్పథాచారాయ నమః

సత్ - మంచి. పథ - దారి. చర్ - గతౌ - వెళ్ళుట. ఆచార - ప్రవర్తన, నడవడిక.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సత్పథే - స్వాభావిక దాస్యమార్గే, ఆచరణమ్ - తేషామ్ ప్రవర్తనమ్, అస్య ఇతి సత్పథాచారః.** భగవంతునికి దాస్యము చేయుట అనేది భక్తునకు స్వభావసిద్ధమైన సదాచారము. అలా భగవంతునకు కైంకర్యము చేయుట అనే మార్గంలో భక్తులను ప్రవర్తింపజేయువాడు సత్పథాచారుడు. ఇది ఆయన అవతార ప్రయోజనములలో ఒకటి. ఇందుకు శ్రీ భట్టులు గీత (9.33)నుండి ఉదాహరించారు. **అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్.** ఈ మానవ శరీరము క్షణభంగురము. సుఖరహితము. ఐనను దుర్లభము. కనుక దీనిని పొంది నిరంతరము నన్నే భజింపుము.

శ్రీ సత్యసంధ తీర్థ కూడా శ్రీ భట్టులవలెనే వ్యాఖ్యానించారు. **సత్పథే - సన్మార్గే, ఆచరయతి యోగ్యానితి సత్పథాచారః.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సతామ్ పంథానః కర్మాణి సత్పథాః, తాన్ ఆచరతి ఇతి సత్పథాచారః.** తన అవతారములయందు భగవంతుడు సదాచారములను ఆచరించును గనుక సత్పథాచారుడు.

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి** – గీత 3.22
ఓ అర్జున! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే నేను పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియు లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను.

శ్రీ వాసిష్ఠ – **సత్పథే ఆచారో యః సః సత్పథాచారః.** సన్మార్గములో చరించువాడు సత్పథాచారుడు.

## 956. ప్రాణదః

- ప్రాణములను ఇచ్చువాడు. శక్తిని ఇచ్చువాడు. ఆత్మను ఉద్దీపింపజేయువాడు. చైతన్యమునకు కారకుడు.
- మృతుడైన పరీక్షిత్తును బ్రతికించినవాడు.
- అన్నింటికీ పరిపూర్ణతను ఇచ్చువాడు.
- దేవతలకు బలమునిచ్చువాడు. సంసారికి భోగాసక్తులై చెడిపోయిన జ్ఞానులకు ఆత్మోజ్జీవనము ఇచ్చువాడు.
- చివరకు ప్రాణములను హరించి వానిని పరిశుద్ధము చేయువాడు.
- అందరికీ ఇంద్రియములను ఇచ్చువాడు.
- దుఃఖమును హరించువాడు.

### ఓం ప్రాణదాయ నమః

ఈ నామము నాలుగుమార్లు వచ్చింది. శ్రీ భట్టుల పాఠం ప్రకారం ఇలా నాలుగు మార్లు వచ్చిన మరొక నామము 'నివృత్తాత్మా'.
8వ శ్లోకము . 66వ నామము – ప్రాణదః – **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**

35వ శ్లోకము . 323వ నామము – ప్రాణదః – **అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**
44వ శ్లోకము . 409వ నామము – ప్రాణదః – **వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః**
102వ శ్లోకము . 965వ నామము – ప్రాణదః – **ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః**

అణ్ - ప్రాణనే - శ్వాసించుట, జీవించుట, కదలుట. ప్ర (ఉపసర్గ) - విశేషముగా. '**ప్రాణ**' అనగా '**గాలి**' అనే అర్థం ఉంది. ప్రాణ్యతే - జీవయతే అనేన ఇతి ప్రాణః - వాయుః. '**ప్రాణదః**' నామంలో చివరి భాగమైన '**ద**'కు అనేక అర్థాలున్నాయి. ద - దదాతి - ఇచ్చునది. దో - అవఖండయతి - ఖండించునది (**ద్యాతి - కాలాత్మనా అవఖండయతి - ప్రాణో మృత్యుః**). దై - శోధనే - పరిశుద్ధము చేయునది (**ప్రాణానాన్ దాపయతి శోధయతి శుధ్యన్నివ**). దా - లవనే - నరుకుట (**ప్రాణాన్ దాతి లునాతి ఇతి ప్రాణదః.**)

క్లుప్తంగా చెప్పాలంటే భగవంతుని కారణంగానే జీవులు శ్వాసిస్తాయి మరియు శ్వాస ఆపివేస్తాయి. '**ప్రాణదః**' నామము సారాంశంగా శ్రీ వాసిష్ఠ చెప్పిన శ్లోకము –
**ప్రాణాన్ దదాతి, కిము వా ద్యాతి, దాతి కిం వా**
**ప్రాణాన్ విశోధయతి, దాపయతి ఇతి కిం వా**
**సర్వత్ర సర్వవిధినా స హి విష్ణురేకో**
**యః ప్రాణదోఽస్తి కథితః శ్రుతిభిః పురాణః**
ప్రాణములను ఇచ్చువాడు ఆయనే. ప్రాణములను తీసికొనిపోవువాడు ఆయనే. ప్రాణములను పరిశుద్ధము చేయునది ఆయనే. ప్రాణములను ఉద్దీపింపజేయునది ఆయనే. ఆ శ్రీమహావిష్ణువే ప్రాణముల రూపంలో అన్నింటిలోనూ, అంతటా ఉన్నాడు. అట్టి పరమాత్ముని శ్రుతులు '**ప్రాణదః**' అని కీర్తించుచున్నవి.

శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి మరికొన్ని ఉదాహరణలు చెప్పారు –

యజుర్వేదము 17.15 – **ప్రాణదా అపానదా వ్యానదా వర్చోదా వరి వో దాః అన్యాన్స్తే అస్మాత్తపన్తు హేతయః పావకో అస్మభ్యమ్ శివోభవ.**
అథర్వణ వేదము 4.35.5 – **యః ప్రాణదః ప్రాణదవాన్ బభూవ యస్మై లోకాః ఘృతవంతః క్షరన్తి.**
అథర్వణ వేదము 11.4.11 – **ప్రాణో మృత్యుః తక్మా ప్రాణమ్ దేవా ఉపాసతే ప్రాణో హ సత్యవాదినమ్ ఉత్తమో లోక ఆదధత్.**

శ్రీ వాసిష్ఠ మరొక స్వతంత్ర వ్యాఖ్య కూడా చెప్పారు. ప్రా - పూరణే - నింపుట. **ప్రాణః - పూర్ణః, పూర్ణస్య దాతా ప్రాణదః.** అన్నింటికీ పూర్ణత్వమునిచ్చేవాడు ప్రాణదుడు. ఉదాహరణకు మన శరీరంలో అనేక ధాతువులు అంతటా వ్యాపించి ఉన్నాయి. కొన్ని మొక్కలకు ఏ భాగం కత్తిరించినా పాలు కారతాయి. భగవంతుడు జీవుల మనుగడకొరకు అనేక సదుపాయాలిస్తాడు.

'**ప్రాణము**' అనగా '**ప్రాణవాయువు**' అనే అర్థంలో – **ప్రాణమ్ - జీవనమ్ దదాతి ఇతి ప్రాణదః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య –

8వ శ్లోకము. 66వ నామము. ప్రాణదః – **అస్య ఐశ్వర్యస్య ప్రథమమ్ విషయమ్ ప్రాణమ్ దదాతి.** ఇక్కడ '**ప్రాణము**' అనే శబ్దము '**బలము, శక్తి**' అనే అర్థంలో వాడబడింది. తనయొక్క భక్తులకు తనను సేవించుకొనడానికి తగిన బలము, శక్తి ఇచ్చేవాడు ప్రాణదుడు. శ్రీ భట్టులు ప్రత్యేకంగా నిత్యసూరులు నిరంతరాయంగా భగవంతునికి కైంకర్యము చేసికోవడాన్ని ఉదాహరించారు. **సూరిభ్యః సదా దర్శన రూప స్వానుభవ పరిచరణానుకూల బలదః.** నిత్యసూరులు భగవంతుని సేవించే శక్తి కలిగియుండడమే కాకుండా ఆయనను దర్శించుకొంటూ ఆయన రూపమును అనుభవించే భాగ్యము కలిగియున్నారు.
తైత్తరీయ యజుర్వేదము 4.1.8 – **య ఆత్మా-దాః బల-దాః.** అతడు ఆత్మను, బలమును ఇచ్చును.

బృహదారణ్యకోపనిషత్తు 4.1.8 – **సదైవ ప్రాణ ఆవిశతి.** సృష్టింపబడిన శరీరంలోకి ప్రాణవాయువులు పరమాత్మునితో కలిసి ప్రవేశిస్తాయి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – మరొక అర్థంలో కూడా భగవంతుడు ప్రాణదుడు. తన నిజమైన భక్తులకు ఆయన తనను తానే వారికి ప్రసాధించి, వారి ఆనందమునకు కారణము అగును. తన భక్తులకు ఆయనే ప్రాణము. **ప్రాణాన్ - జీవనమ్ దదాతి భక్తేభ్యః ఆత్మాన్ దర్శయిత్వా ఇతి ప్రాణదః.**

35వ శ్లోకము. 323వ నామము. ప్రాణదః – శ్రీ భట్టులు కూర్మావతారపరంగా వ్యాఖ్యానించిన నామములమధ్య ఈ 'ప్రాణదః' నామము ఉన్నది. ఇక్కడ కూడా 'ప్రాణ' అనగా 'బలము' అనే అర్థంలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

**మరుతాం బలదానాద్ధి సముద్రమథనే భృశమ్ ప్రాణదశ్చ సముద్దిష్ట కూర్మరూపతయా హి సః**

క్షీరసాగర మథనం చేసేటప్పుడు తాను కూర్మరూపం ధరించి దేవతలకు ఎక్కువ బలాన్ని ఇచ్చినవాడు ప్రాణదుడు. అయితే భగవానుడు వారికి శక్తిని ఇచ్చి ఊరుకోలేదు. స్వయంగా శ్రీకూర్మరూపియై మందరగిరిని తన వీపుపై మోసి ఆ కార్యాన్ని విజయవంతం చేశాడు. అందయకే ఆయనను 'అనంత బల శక్తి'గా ధ్యానిస్తారు. ఓం అనంతబలశక్తయే నమః.

పోతన. భాగవతము

సవరసైలక్షయోజనముల వెడలుపై కడుఁ గఠోరంబైన కర్పరమున
నదనైన బ్రహ్మాండమైన నాహారించు ఘనతరంబగు ముఖగహ్వరంబు
సకల చరాచర జంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ నాఁగినఁ గదలనియట్టి కాళ్ళు

వెలికి లోనికిఁ జనుదెంచు విపులతుండ
మంబుజంబులఁ బోలెడి యక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి కూర్మి
చెలువొంద నొక మహాకూర్మమయ్యె

కమఠంబై జలరాశిఁజొచ్చి లఘుముక్తాశుక్తి చందంబునన్
నమదద్రీంద్రమునెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళి కంపములతో నౌ నౌఁగదే బాపురే
కమలాక్షా! శరణంచు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగాన్.



**1780 కాలపు చిత్రం.**

https://commons.wikimedia.org/wiki/File:MET_DP152318.jpg

44వ శ్లోకము. 409వ నామము. ప్రాణదః – **ప్రసిద్ధానపి ప్రాణాన్ దదాతి ఇతి ప్రాణదః.** అందరికీ ప్రాణములను, చైతన్యమును ఇచ్చువాడు ప్రాణదుడు. శ్రీ భట్టులు రామాయణము అయోధ్యకాండ (59.4, 59.5)నుండి ఉదాహరించారు. శ్రీరాముని ఎడబాటువల్ల పూవులు, మొగ్గలు, చివుళ్ళు ఎండిపోయాయి. అడవిలో చెట్లన్నీ ఎండుటాకులతో మిగిలాయి. అలాగే శ్రీరాముడు సీతాసమేతుడై వనవాసంనుండి అయోధ్యకు తిరిగి వచ్చినపుడు ఋతువు కాకున్నా పూవులు, పళ్ళు పుష్కలంగా పూచాయి, కాచాయి.

102వ శ్లోకము. 956వ నామము. ప్రాణదః – **కాంతాది విషయ వ్యాప్తా నష్టాత్మభ్యః కృపావశాత్ సదాత్మోజ్జీవనం యోऽసౌ దదాతీ ప్రాణదస్మృతః.** పరమేశ్వరుడు కడు కరుణామయుడు. కనుక క్షుద్రమైన సాంసారిక భోగాసక్తులై పతనమైనవారికి ఆత్మోజ్జీవన మార్గమును ప్రసాదించేవాడు ప్రాణదుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – 8వ శ్లోకములో. ప్రాణదః

(1) **ప్రాణాన్ దదాతిశ్చేష్టయతి ఇతి ప్రాణదః.** ప్రాణులకు ప్రాణశక్తిని ఇచ్చువాడు ప్రాణదుడు. **కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్.** (ఇది లేకుండా) ఎవరు బ్రతుకగలరు? ఎవరు శ్వాసించగలరు? (తైత్తరీయ 2.7)

(2) **ప్రాణాన్ కాలాత్మనా ద్యాతి - ఖండయతి, ప్రాణాన్ దాయతి (దాపయతి) - శోధయతి వా, ప్రాణాన్ దాతి లునాతి ఇతి వా ప్రాణదః.** కాలుని (మృత్యువు) రూపంలో ప్రాణములు హరించువాడు, ప్రాణములను శోధించు (పరిశుద్ధపరచు) వాడు, దుష్ట (అసుర) ప్రాణులను నాశనము చేయువాడు ప్రాణదుడు.

44వ శ్లోకములో. ప్రాణదః – **సృష్ట్యాదౌ సర్వప్రాణినామ్ అంతర్యామితయా ప్రాణాన్ దదాతి ఇతి ప్రాణదః, ద్యాతి - ఖండయతి ప్రాణినామ్ ప్రాణాన్ ప్రళయకాల ఇతి వా ప్రాణదః.** సృష్టి సమయంలో సర్వభూతములకు ప్రాణములను ఇచ్చువాడును, మరియు ప్రళయకాలమున భూతముల ప్రాణశక్తులను ఖండించు (హరించు) వాడు ప్రాణదుడు.

35వ శ్లోకములో. ప్రాణదః – **సురాణామ్ అసురాణామ్ యథాసంఖ్యమ్ ప్రాణమ్ దదాతి ద్యాతి వా ఇతి ప్రాణదః.** సురులకు (దేవతలకు) ప్రాణములను ఇచ్చువాడు, అసురులకు (రాక్షసులకు) ప్రాణములను అంతము చేయువాడు ప్రాణదుడు.

102వ శ్లోకములో. ప్రాణదః – **మృతాన్ పరీక్షిత్ ప్రభృతీన్ జీవయన్ ప్రాణదః.** పరీక్షిత్తువంటివారిని బ్రతికించినవాడు ప్రాణదుడు. (శ్రీకృష్ణుడు గురుదక్షిణగా సాందీపని కుమారుని యమలోకంనుండి తెచ్చిన విషయాన్ని కూడా స్మరించుకొనవచ్చును).

నాలుగు మార్లు వచ్చిన ఈ నామమును శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా పునరుక్తి లేకుండా వ్యాఖ్యానించిన విధానాన్ని మనం గమనింపవచ్చును.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి –

**అప్యహమ్ జీవితమ్ జహ్యామ్ త్వామ్ వాసితే సలక్ష్మణామ్**
**న తు ప్రతిజ్ఞామ్ సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః** – రామాయణం. అరణ్యకాండ 10.19
శ్రీరాముడు సీతమ్మతో ఇలా అన్నాడు. నేను విశేషంగా బ్రాహ్మణులకు ఇచ్చిన వచనాన్ని పాలించడంకోసం నా ప్రాణాలనూ, చివరికి నీవి మరియు లక్ష్మణుని ప్రాణాలనూ కూడా లెక్కచేయను.

మరికొన్ని వ్యాఖ్యలు – శ్రీ టి. రాఘవేంద్రన్ రచించిన పుస్తకంనుండి –

**ప్రాణాన్ ఇంద్రియాణి దదాతి ఇతి ప్రాణదః.** అందరికీ ఇంద్రియాలను ఇచ్చి వానిని పనిచేయించేవాడు ప్రాణదుడు.

**ప్రాణాన్ ఇంద్రియాణి ద్యాతి ఖండయతి ఇతి ప్రాణదః.** సాత్వికులైనవారికి ఇంద్రియభోగములపైని అనురక్తిని హరించేవాడు ప్రాణదుడు.

**ప్రకర్షేణ అణమ్ సుఖవిరుద్ధ దుఃఖమ్ ద్యాతి ఖండయతి ఇతి ప్రాణదః. (ణః - సుఖమ్. తద్విరుద్ధాత్ అణః - శోకః, ప్రకర్షేణ తమ్ ద్యాతి - ఖండయతి ఇతి ప్రాణదః.).** సుఖమునకు భంగము కలిగించే దుఃఖమును నాశనము చేయువాడు ప్రాణదుడు.

## 957. ప్రణవః

- భక్తులు తనకు ప్రేమతో ప్రణమిల్లునట్లు (వశమగునట్లు) చేయువాడు.
- ఓంకార స్వరూపుడు.
- భక్తులు ఆయనను స్తుతించెదరు (ప్రణుతింతురు).
- జగత్తును క్రమవిధానంలో ఉంచేవాడు.
- వేదములు ఆయనకు ప్రణమిల్లును.
- అందరిచే ప్రణామములు అందుకొనువాడు.

### ఓం ప్రణవాయ నమః

44వ శ్లోకంలో 410వ నామమునకు **'**ప్రణవః**'** అనీ, **'**ప్రణమః**'** అనీ రెండు పాఠాలున్నాయి.

44వ శ్లోకము. 410వ నామము. ప్రణవః / ప్రణమః **–** '**వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః'** లేదా **'వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణమః పృథుః'**

102వ శ్లోకము. 957వ నామము. ప్రణవః **– ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః**

శ్రీ వాసిష్ఠ పదవివరణ **–** ప్ర (ప్రత్యయము) - విశేషమైన. ణు - స్తుతౌ - మెచ్చుకొనుట, స్తుతించుట. **ప్రణౌతి ఇతి ప్రణవః, ప్రణమయతి ఇతి వా.** స్తుతింపబడువాడు, పూజింపబడువాడు **'**ప్రణవః**'**. **'**భూ**'** శబ్దం **'**భవ్**'** అయినట్లే, **'**ణు**'** శబ్దం **'**ణవ్**'** అవుతుంది (పాణిని సూత్రం 3.3.57 **–** ఋదోరప్). ప్ర+ణవ్ **–** ప్రణవ. **'**న**'** అనే ధాతువు ఆధారంగా కొన్ని వివరణలున్నాయి. వాటిలో పాణిని సూత్రము 8.4.14 **– ఉపసర్గాత్ అసమాసేఽపి ణోపదేశస్య –** ప్రకారం **'**న**'** శబ్దం **'**ణ**'**గా మారుతుంది.

శ్రీ భట్టుల వ్యాఖ్య **– ప్రణవేన ఈదృశ సంబంధమ్ ఉద్బోధ్య,** 'మామ్ నమస్కురు' **ఇతి స్వ-చరణారవిందయోః తాన్ ప్రణమయతి.** పవిత్రమైన ప్రణవమంత్రము ద్వారా భగవంతుడు **'**మామ్ నమస్కురు**'** అని బోధించి, తన భక్తులను తన పాదారవిందములకు ప్రణమిల్లేలా చేసేవాడు. ఇది భక్తులకు, భగవంతునికి ఉన్న నిజమైన సంబంధము.

**ఆత్మోజ్జీవన సంబంధ ఉద్బోధ ప్రణవేనవై పాదారవిందమోస్తాస్యః ప్రణామయతి నిత్యశః ప్రణదన్న సమాఖ్యాతః సప్తార్ణో మోక్షదోమనుః** ప్రణవోపదేశంనుండి ఆత్మోజ్జీవనం వరకు కావలసిన నవవిధ సంబంధం జ్ఞానమును పుట్టించి, వారిని ఎల్లపుడు తన పాదాక్రాంతులుగ చేసికొన్నవాడు **'**ప్రణవః**'** ఈ నామము సప్తాక్షరీ మంత్రము. ముక్తిప్రదము. ఓం ప్రణవాయ నమః. (శ్రీకైవల్య సారథి).

యోగసూత్రము 1.27 **– తస్య వాచకః ప్రణవః.** మాటలలో భగవంతుని స్వరూపము ప్రణవము. ఈ మంత్రమును తెలిసికొన్నట్లయితే భగవంతుని తెలిసికొనవచ్చును. ప్రణవ మంత్రము **'**అ**'**, **'**ఉ**'**, 'మ' అనే మూడు శబ్దముల కలయిక అయిన **'**ఓం**'**. ఈ మంత్రముయొక్క అర్థమును గురుముఖముగా తెలిసికొనవలెను. జీవాత్మకు, పరమాత్మకు ఉన్న అనుబంధమును ఈ మంత్రము తెలుపును.

ఈ **'**ప్రణవః**'** నామమునకు శ్రీ ఎమ్.వి. రామానుజాచార్య వివరణ **–** భగవంతునికి, జీవాత్మలకు అనాదిగా ఉన్న సంబంధాన్ని భగవంతుడు జీవులకు తెలియజేస్తాడు. అయితే జీవులు అది కోరుకొని, అందుకొని, అర్థం చేసుకోవాలి. జీవాత్మ, పరమాత్మల సంబంధము ప్రణవ మంత్రంలో నిక్షిప్తమై యున్నది.

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే –** గీత 18.65

ఓ అర్జున! నీవు నాందే మనస్సును నిలుపుము. నా భక్తుడవు కమ్ము. నన్నే సేవించుము. నాకు ప్రణమిల్లుము. ఇట్లు చేయుటవలన నన్నే పొందగలవు. ఇది ప్రతిజ్ఞాపూర్వకముగా నేను చెప్పుచున్న మాట. ఏలనన నీవు నాకు అత్యంత ప్రియుడు.

**'మామ్ నమస్కురు'** – నాకే ప్రణమిల్లుము – అని భగవంతుడు చేసిన ఉపదేశమును మరింతగా అర్థం చేసుకోవడానికి భగవద్రామానుజులు ఈ శ్లోకానికి వ్రాసిన భాష్యాన్ని పరిశీలించుదాము.

**'మద్-భక్తః భవ' – అత్యర్థమ్ మమ ప్రియః అత్యర్థమత్ ప్రియత్వేన చ నిరతిశయమ్ ప్రియామ్ స్మృతి సంతతిమ్ కురుష్వ ఇత్యర్థః.** నీ మనసును నాపై నిలుపుము. నా భక్తుడవు కమ్ము. నేను నీకు అత్యంత ప్రియుడను అయ్యేలా ప్రవర్తించుము. ప్రియాతి ప్రియుడనైన న్ను ధ్యానించుము. అనగా సాటిలేని ప్రేమను నాపై చూపుము. అని అర్థము. శ్రీ రామానుజులు తమ వ్యాఖ్యలో **'ప్రియమ్'** అనే పదాన్ని మూడుమారులు ఉపయోగించిన వైనాన్ని ప్రత్యేకంగా గమనించాలి. భగవంతునికి, మనకు ఉన్న సంబంధంయొక్క తత్వము **'ప్రియము'**. భగవంతునికి మనపైనున్న అవ్యాజమైన ప్రేమ మరియు కరుణ కారణంగా మనము ఆయనకు ప్రణమిల్లి, ఆయనకు శరణాగతులం కావాలి. అప్పుడు మనలను తప్పక ఉద్ధరిస్తాడని ఆయన చెబుతున్నాడు.

**'మద్-యాజీ భవ' – తత్రాపి మద్భక్త ఇతి అనుషజ్యతే, యజనమ్ పూజనమ్ అత్యర్థ ప్రియమద్ ఆరాధన భవ, ఆరాధనమ్ హి పరిపూర్ణ శేషవృత్తిః.** నన్ను పూజించువాడవు (యాజీ) కమ్ము. ఇక్కడ కూడా **'నా భక్తుడవు కమ్ము'** అన్నఅర్థం తీసుకోవచ్చును. యజ్ఞము కూడా పూజయే. అనగా నీకు అత్యంత ప్రియమైనవానిగా నన్ను పూజింపుము. ఆరాధనము (పూజ) భగవంతునికి పరిపూర్ణ దాస్యము. మళ్ళీ ఇక్కడ **'అత్యర్థ ప్రియమ్'** అనే మాటలను గమనించాలి. **'ప్రేమతో'** (భయంతో కాదు) భగవంతుని ఆరాధించాలని భగవంతుడే చెబుతున్నాడు.

**'మామ్ నమస్కురు' – నమో నమనమ్ మయి అతిమాత్ర ప్రహ్వీ. భావమ్ అత్యర్థ ప్రియమ్ కురు ఇత్యర్థః.** నాకు ప్రమాణము చేయుము. అనగా ప్రేమతో నా ముందు మోకరిల్లుము. అని అర్థము. ఇక్కడ మళ్ళీ **'అత్యర్థ ప్రియమ్ కురు'** అని వ్రాశారు. అనగా ప్రేమతో నమస్కరించాలి.

అలా తనకు ప్రేమతో శరణాగతులైనవారికి భగవానుడిలా చెప్పాడు. **మామ్ ఏవ ఏష్యసి, సత్యమ్ తే ప్రతిజానే.** నేను ప్రతిజ్ఞ చేసి నిజం చెబుతున్నాను. నీవు నన్నే పొందుతావు. ఇక్కడితో భగవానుడు ఆగలేదు. **'ప్రియోఽసి మే'** నీవు నాకు ప్రియమైనవాడవు. అని అన్నాడు. అనగా భగవంతుడు తనను ప్రేమతో అర్చించాలని చెప్పడమే కాదు. ఆయనకు మనకు మధ్య ప్రేమ అనే దృఢమైన బంధం ఉంది. ఇంకోచోట (గీత 7.17లో) భగవానుడిలా చెప్పాడు – జ్ఞాని నాకు అత్యంత ప్రియమైనవాడు. అతడు నన్నే పొందుతాడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – ఈ గీతా శ్లోకాన్ని **'మన్మనా ఏవ భవ'** (నన్నే ధ్యానించుము), **'మద్భక్త ఏవ భవ'** (నాకే భక్తుడవు కమ్ము), **'మద్యాజీ ఏవ భవ', 'మామ్ ఏవ నమస్కురు', 'మామ్ ఏవ ఏష్యసి'** – నన్నే పూజించుము, నాకే నమస్కరించుము, నన్నే నిస్సందేహంగా పొందెదవు – అని అర్థం చేసుకోవాలి.

శ్రీ భట్టులు **'అథర్వ శీర్ష'** నుండి కూడా ఉదాహరించారు. **ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణమయతి, ఏతస్మాత్ ప్రణవః.** అన్ని జీవులు పరమాత్మునికి ప్రణామం చేసేలా చేయునది ప్రణవ మంత్రము. (అందుకే ప్రణవ మంత్రం తెలిసినవారు భగవంతునికి ప్రణామం చేయుటయే మహద్భాగ్యంగా భావిస్తారు.)

శ్రీ శంకరుల వ్యాఖ్య –

44వ శ్లోకములో **'ప్రణవః' – ప్రణౌతి ఇతి ప్రణవః.** స్తుతింపబడేవాడు 'ప్రణవః'. ఇందుకు శ్రీ శంకరులు సనత్కుమారీయమునుండి ఉదాహరించారు. **ప్రణమంతీహ యమ్ వేదాః తస్మాత్ ప్రణవ ఉచ్యతే.** వేదములు ఆయనకు ప్రణమిల్లును. కనుక ఆయనను **'ప్రణవః'** అన్నారు.

102వ శ్లోకములో 'ప్రణవః' – **ప్రణవో నామ పరమాత్మనో వాచక ఓంకారః తత్ అభేదోపచారేణ అయమ్ ప్రణవః.** ప్రణవము అనగా పరమాత్మవాచకమగు ఓంకారము. పరమాత్మకును, ఓంకారమునకును భేదము లేదు. కనుక ఆయన 'ప్రణవః'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ప్రకర్షేణ నూయతే స్తూయతే సద్భిః ఇతి ప్రణవః.** సజ్జనులైన భక్తులు ఆయనను విశేషంగా స్తుతింతురు, పూజింతురు. కనుక ఆయన 'ప్రణవః'.

శ్రీ సత్యసంధ తీర్థ – **ప్రకర్షేణ నయతి ఇతి ప్రణవః.** విష్ణువు సకల జగత్తును చక్కగా క్రమబద్ధంగా ఉంచును. కనుక ఆయన 'ప్రణవః'.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **నిత్యనూతనత్వాత్ ప్రణవః.** (ప్ర-నవ-ప్రణవ. **ప్రకర్షేణ నూతనత్వాత్ ప్రణవః**). నిత్యనూతనుడు గనుక 'ప్రణవః'.

శ్రీ రాఘవేంద్రన్ మరికొన్ని అర్థాలు చెప్పారు – **ప్రణమన్తి ఇహ యమ్ వేదాః తస్మాత్ ప్రణవః ఉచ్యతే** – సనత్కుమారీయము. సకల వేదములు ఆయనకు ప్రణమిల్లును గనుక ఆయనను 'ప్రణవః' అంటారు.

**రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః**
**ప్రణవః సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషమ్ నృషు** – గీత 7.8
ఓ అర్జునా! జలములలో రసతన్మాత్రను నేనే. సూర్య చంద్రులలో కాంతిని నేనే. వేదములన్నింటిలోను ఓంకారమును, ఆకాశమునందు శబ్దమును, పురుషులందు పౌరుషమును ననే.

శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి చెప్పిన కొన్ని ఉదాహరణలు –

కఠోపనిషత్తు 2.15, 2.16, 2.17
**సర్వే వేదా యత్పదమ్ ఆమనన్నతి తపాంసి సర్వాణి చ యద్వదన్తి**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యమ్ చరన్తి తత్తే పదమ్ సంగ్రహేణ బ్రవీమి యోమిత్యేతత్**
**ఏతత్ ధ్యేవాక్షరమ్ బ్రహ్మ స్తద్ధ్యేవాక్షరమ్ పరమ్**
**ఏతద్ ధ్యేవాక్షరమ్ జ్ఞాత్వా యో యదిచ్ఛన్తి తస్య తత్**
**ఏతద్ ఆలంబనమ్ శ్రేష్ఠమ్ ఏతద్ ఆలంబనమ్ పరమ్**
**ఏతద్ ఆలంబనమ్ జ్ఞాత్వాద్లోకే మహీయతే**
సకల వేదములు, అరణ్యకములు, ఉపనిషత్తులు చెప్పేది, బ్రహ్మచర్య వ్రతమునకు లక్ష్యమైనది అయిన పరమపదము గురించి చెబుతాను. అదే 'ఓం'. అదే పరబ్రహ్మము. దానిని ధ్యానిస్తే అన్ని కోరికలు ఈడేరుతాయి. అదే అన్నింటికంటె గొప్ప ఆలంబనము (ఆధారము). దానిని గురించి తెలిసినవాడు బ్రహ్మలోకంలో గౌరవం పొందుతాడు.

యజుర్వేదము 3.13 – **విశ్వేదేవాస ఇహ మాదయన్త ఓమ్ ప్రతిష్ఠ.**
యజుర్వేదము 40.15 – **ఓమ్ క్రతో స్మర క్లివే స్మర కృతమ్ స్మర.**
యజుర్వేదము 40.17 – **ఓమ్ ఖమ్ బ్రహ్మ.**
ఋగ్వేదము 1.164.9 – **ఋచో అక్షరే పరమే వ్యోమాన్ అస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః.**

ప్రణవమంత్రముయొక్క అర్థాన్ని తెలుసుకొని, ఆ మంత్రాన్ని ధ్యానించి, సిద్ధిని పొందితే, మనకు, శ్రీమహావిష్ణు పరమాత్మకు ఉన్న నిత్య సంబంధం మనకు అవగతమవుతుంది. ఇది ప్రణవమంత్రముయొక్క ప్రాముఖ్యత.

## 958. పణః

- శేష శేషీ బంధము (భగవంతుడు ప్రభువు, ఆయనకు భక్తులు దాసులు)ను తారుమారు చేసి తాను తన భక్తులకు దాసునిగా వ్యవహరించేవాడు.
- వివిధ దేవతలకు అంతర్యామియై, వారికి అర్పించినవానిని స్వీకరించి, అందుకు ఫలములుగా భక్తులకు కామితార్థములను ప్రసాదించేవాడు.
- ప్రపంచములో సదా రూపములను (వస్తువులు, జీవులను) మరియు వానికి తగు పేర్లను సూచిస్తూ సదా కార్యశీలియై ఉండేవాడు.
- మానవులాచరించు కర్మలను పణము (మూల్యము)గా స్వీకరించి, వానికి తగిన రీతిలో ఫలములను ప్రసాదించువాడు.
- జగత్తులోని సకల వ్యవస్థలను, క్రియలను సక్రమముగా నడుపువాడు.
- వివిధ దేవతలకు తగు విధులను ఏర్పరచి వారి కార్యములను నియంత్రించువాడు.

### ఓం పణాయ నమః

'పణ' శబ్దమునకు రెండు అర్థములున్నాయి. (1) పణ - వ్యవహారే - క్రయ విక్రయ కార్యములు, తగు మూల్యము చెల్లించుట. (2) పణ - స్తుతౌ - కీర్తించుట. ఎక్కువమంది **'పణము'** అనగా **'మూల్యము'** అనే అర్థంలో వ్యాఖ్యానించారు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ, శ్రీ సత్యసంధతీర్థ గార్లు 'స్తుతించుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **వ్యవహరతి, వ్యవహారయతి వా విశ్వమ్ సః పణః.** జగత్తులోని సకల కార్యములను ఆచరించువాడు లేదా ఆచరింపజేసేవాడు 'పణః'. (**'అపణ'** అనగా క్రయ విక్రయ వ్యవహారములు జరిగే వ్యాపారస్థలము. ఇక్కడ జరిగే వ్యాపారము ఏమిటి అనే విషయంలో వివిధ వ్యాఖ్యాతల అనుభవాలను మనం గమనింపవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య **–** శేషశేషీ భావము (ప్రభువు - దాసుల మధ్య సంబంధము) భగవంతునికి, భక్తులకు మధ్యనుండే సహజ తత్త్వము. అయితే ఒకోమారు భగవంతుడు ఈ సంబంధమును తారుమారు చేసి, అనగా ఇచ్చి పుచ్చుకొని, తానే తన భక్తునికి దాసునిగా వ్యవహరించును. అనగా ప్రభుత్వమును పణముగానొసగి, అందుకు ప్రతిఫలముగా దాస్యత్వమును స్వీకరించును. **ఏవమ్ తేషామ్ స్వామ్య - దాస్య వ్యతిహారేణ వ్యవహరతి ఇతి పణః.** 'వ్యతిహారేణ' అనగా **'తారుమారు చేయడం ద్వారా'**. ఇలా భగవంతునికి, భక్తునికి మధ్యనుండే సంబంధము తారుమారు కావడమే ఇక్కడ జరిగే వాణిజ్య వ్యాపారము.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ **–** శ్రీ తిరుమళిశయాళ్వారు వృత్తాంతములో ఈ గుణమే గోచరిస్తుంది. అందువలననే శ్రీ తిరుమళిశయాళ్వారును 'తిరుమశయిప్పిరాన్' అనీ, తిరుక్కుడంతై ప్రభువు ఆరావముధన్ ను 'శ్రీ ఆరావముధాళ్వారు' అనీ అన్నారు.

గీత 7.18లో ఈ వ్యవహారం సూచన ఉంది. **ఉదారాః** సర్వ **ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్.**ఈ చతుర్విధ భక్తులందరును ఉదారులే (అనగా భగవంతునియందు విశ్వాసమునుంచి, ఎల్లప్పుడును అతనినే సేవించుచు ఉండువారు). కాని జ్ఞానియైనవాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగానుండి, నన్నే పరమప్రాప్యునిగా భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థితుడు.

ఈ శ్లోకమునకు భగవద్రామానుజుల వ్యాఖ్యానము **– అయమ్ మయా వినా ఆత్మధారణ అసంభావనయా మామేవ అనుత్తమమ్ ప్రాప్యమ్ ఆస్థితః, అతః తేన వినా మమ అపి ఆత్మధారణమ్ న సంభవతి, తతో మమ అప ఆత్మా హి సః.** ఈ జ్ఞాని నా ఆధారము లేకుండా తాను ఉండలేడు, మరియు అతని ఆధారము లేకుండా నేను ఉండలేను. కనుక అతనే నేను.

శ్రీ వాసిష్ఠ – మరొక విధమైన వ్యాపార వ్యవహారము. మనము వివిధ దేవతలకు యజ్ఞములలో హవిస్సులను అర్పిస్తాము. ఆయా దేవతలు ఆ పణమును గ్రహించి మనకు కామితార్థములిస్తారు. ఆయా దేవతల అంతర్యామి శ్రీమన్నారాయణుడే.

**యో అగ్నీ షోమా హవిషా సపర్యాత్ దైవద్రీచా మనసా యో ఘృతేణ**
**తస్య వ్రతమ్ రక్షతమ్ పాతమమ్ హసో విశేజనాయ మహి శర్మయచ్ఛతమ్** – ఋగ్వేదము 1.93.8
నేను, మరియు హవిస్సులతో ఎవరు అగ్నిని, సోముని సేవిస్తారో, వారికి ఆ అగ్ని, సోముడు, యాగరక్షణను, కష్టముల నివారణను, గొప్ప వైభవమును ప్రసాదిస్తారు.
ఋగ్వేదము 1.1.2 **– అగ్నిః పూర్వేభిః ఋషిభిః ఈడ్యో నూతనైరుత సదేవామ్ ఏహ వక్షతి.** పూర్వ ఋషుల వలెనే ప్రస్తుత జనులు అగ్నిని స్తుతించాలి. ఆ అగ్ని దేవతలను భూమికి కొనివచ్చును.
ఋగ్వేదము 1.189.1 – **అగ్నేనయ సుపథా రాయే.** సమస్త సదాచారములను ఎఱిగిన అగ్నిదేవుడు మనకు సంపదలను ఇచ్చుగాక.

**దవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః పరస్పరం భాయవంతః శ్రేయః పరమవాప్స్యథ** – గీత 3.11
**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తేస్తేన ఏవ సః** – గీత 3.12
ఈ యజ్ఞములద్వారా మీరు దేవతలను తృప్తి పఱచుడు. మఱియు ఆ దేవతలు మిమ్ములను అనుగ్రహింతురు. నిస్వార్థ భావముతో మీరు పరస్పరము సంతృప్తి పఱచుకొనుచు పరమశ్రేయస్సును పొందగలరు. యజ్ఞములద్వారా సంతృప్తి పొందిన దేవతలు మీకు (మానవులకు) అయాచితముగనే ఇష్టములైన భోగములను ప్రసాదించెదరు. ఈ విధముగ దేవతలచే అనుగ్రహింపబడిన ఈ భోగములను ఆ దేవతలకు నివేదన చేయక తానే అనుభవించువాడు నిజముగా దొంగయే.

శ్రీ శంకరుల వ్యాఖ్య **–** భగవంతుడు జగత్తులో అనేక రూపాలను, వాని పేర్లను (వాని కర్మానుసారము?) సృజిస్తున్నాడు. ఇదే భగవంతుడు చేసే వాణిజ్యము. ఇందుకు శ్రీ శంకరులు తైత్తరీయోపనిషత్తు (3.12)నుండి ఉదాహరించారు. **సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాఽభివదన్ యదాస్తే.** సర్వజ్ఞుడైన ఆ పరమేశ్వరుడు అనేక రూపములను సృష్టించి వానికి తగు పేర్లు పెడుతూంటాడు.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము **– పుణ్యాణి సర్వాణి కర్మాణి పణమ్ సంగ్రహ్య అధికారిభ్యః, తత్ఫలమ్ ప్రయచ్ఛతి ఇతి లక్ష్యణా పణః.** భగవంతుడు జీవులు చేసిన పుణ్యకర్మలను ప్రోగుచేసి, వానిని పణము (మూల్యము)గా గ్రహించి, వారికి తగినరీతి ఫలములు ప్రసాదించును. ఈ గుణమువల్ల ఆయనకు **'**పణః**'** అనే పేరు వచ్చింది.

శ్రీ రాధాకృష్ణమూర్తి – మనం చెల్లించిన మూల్యం (పణం) ప్రకారం భగవంతుడు ఫలాన్ని ఇస్తాడు. ఇలా ధర్మమార్గమునకు సుఖము, అధర్మమార్గమునకు దుఃఖము లభిస్తాయి.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు జగత్తుకు సర్వాధికారి అని ఈ 'పణః' నామము సూచించుచున్నది. ప్రతికార్యమునకు ఆయన తగు ఫలితమునిచ్చును. ఇలా సృష్టిలో సకల కార్యములు క్రమవిధానంలో జరుగుతున్నాయి.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – పణ్ - స్తుతౌ - కీర్తించుట. **పణ్యతే స్తూయతే సత్త్వగుణవద్భిః ఇతి పణః.** సత్వగుణము మెండుగా కలిగినవారు భగవంతుని స్తుతించెదరు. కనుక ఆయన 'పణః'. శ్రీ సత్యసంధ తీర్థ కూడా ఇలాంటి అర్థమే చెప్పారు. **పణ్యతే జనైః స్తూయతే ఇతి పణః.**

శ్రీ రఘునాధ తీర్థ – **పణ్యతి దేవాన్ వ్యవహారేషు ప్రవర్తయతి ఇతి పణః.** దేవతలకు తగు విధులనేర్పరచి, వారిచే తగువిధంగా వ్యవహరింపజేయువాడు 'పణః'. ఇక్కడ భగవంతుని వాణిజ్యము మరొక కోణంలో చెప్పబడింది.



## ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః |
## తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః || (103)

### 959. ప్రమాణమ్

- సకల ధర్మములకు, జ్ఞానమునకు, శాస్త్రములకును మౌలికమయిన ఋజువు, ఆధారము.
- కృతయుగంలోని జీవులకు మంచిచెడులు తెలియజేసి, స్థిరమైన ఏర్పాట్లు (ప్రమాణములు) సిద్ధము చేసినవాడు.
- వేదముల అర్థాన్ని నిస్సంశయంగా, యథాతథంగా ఉపదేశించి, వానియందు విశ్వాసము కలుగజేయువాడు.
- జ్ఞానస్వరూపుడు.
- సృష్టికి ముందే సమస్త విశ్వముయొక్క రూపగుణాదులను నిర్ణయము చేసినవాడు.
- పరబ్రహ్మమును గురించి తెలియజేయువాడు.
- బ్రహ్మాదులచే పూజింపబడువాడు.
- త్రివిక్రమావతారమునందు బ్రహ్మాండమైన ఆకారము (పరిమాణము) కలవాడు.
- సదా సత్యమునే చెప్పువాడు.

ఓం ప్రమాణాయ నమః

46వ శ్లోకము. 429వ నామము. ప్రమాణమ్ – **విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయం**
103వ శ్లోకము. 959వ నామము. ప్రమాణమ్ – **ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః**
మాంగ్ - మానే - కొలుచుట, పోల్చుట, చూపుట. ప్ర (ఉపసర్గ). **ప్రకృష్టమ్ మానమ్ ప్రమాణమ్.** ఉన్నతమైన కొలమానము, ఋజువు ప్రమాణము.

46వ శ్లోకంలోని 429వ నామము 'ప్రమాణమ్'ను శ్రీ భట్టులు (422నుండి 436 వరకు నామములను) కల్క్యావతారపరంగా వ్యాఖ్యానించారు. ఇక్కడ ప్రమాణము అనగా 'వ్యవస్థాపన' అన్న అర్థంలో శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **అథ కార్త యుగానామ్ హితాహితయోః ప్రమాణమ్.** కలియుగం అంతమై కృతయుగం వచ్చినాక, కృతయుగంలో జీవులకు మంచి చెడులు తెలియజేసే స్థిరమైన ఏర్పాట్లు చేసినవాడు. భగవంతుని శక్తివల్లనే మనకు అవగాహన, జ్ఞానము కలుగుతున్నాయి. కనుక ఆయన తెలియజేసినట్లు నడచుకొనుటయే ఉత్తమవిధానము.

959వ నామము. ప్రమాణమ్ – **ఏవమ్ నిస్సంశయ విపర్యయ వేదరహస్య పరమార్థ ప్రత్యాయకత్వాత్ ప్రమాణమ్.** భగవానుడు వేదముల పరమార్థమును ఏమాత్రం సంశయం లేకుండానూ, వక్రీకరించకుండానూ, తెలియజేయును గనుక ఆయన 'ప్రమాణము'. అంతే గాదు. ఆయనే ప్రమేయము కూడాను (సాధించవలసిన లక్ష్యము).

**పరమార్థ త్రయీసార ప్రత్యాయకతయా స్వయం ప్రమాణమితి విఖ్యాతః సప్తార్ణో మనురుత్తమః.** తన భక్తులకు వేదంలోని అర్థాన్ని ఉపదేశించి, వానియందు విశ్వాసము కలుగజేయువాడు. ఈ నామము సప్తాక్షరీ మహామంత్రము. ఉత్తమమైనది. ఓం ప్రమాణాయ నమః (శ్రీకైవల్య సారథి).

శ్రీ సత్యసంధ తీర్థ – **ప్రకృష్టమ్ మానమ్ వేదాది ప్రమాణమ్ యస్మిన్ ఇతి ప్రమాణమ్.** వేదములవంటి అత్యున్నత ప్రమాణములను ప్రతిపాదించినవాడు 'ప్రమాణము'.

శ్రీ వాసిష్ఠ – 'మానము'అనగా కొలుచునది. **యావత్ ప్రమాణకమ్, యద్గుణమ్, యదృగ్ ఆకృతిమ్ చ జగన్ నిర్మిత్సతి, తత్ప్రమాణమ్ తాన్ గుణాన్ తాన్ చ ఆకృతిమ్ జగదారంభాత్ పూర్వమేవ తన్నిర్మాతి పరిమితయత ఏవ తత్ప్రమాణమ్ అభిధీయతే.** సృష్టికి పూర్వమే భగవంతుడు సమస్త జగత్తు ఎలా ఎంత ఉండాలో, అందులో ఎలాంటి గుణాలు ఉండాలో, ఏ విధమైన జీవులు ఉండాలో వంటి విషయాలను నిర్ధారణ చేసినవాడు గనుక 'ప్రమాణము'. శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి అనేక ఉదాహరణలిచ్చారు.

అథర్వ వేదము 4.11.2 – **అనడ్వాన్ ఇంద్రః స పశుభ్యో విచష్టే త్రాన్ చకో వినిమీతే అధ్వనః.**

అథర్వ వేదము 5.28.1 – **నవ ప్రాణాన్ నవభిః సం మిమీతే దీర్ఘాయుత్వాయ శత శరదాయ.**

యజుర్వేదము 10.90.1 – **స భూమిమ్ సర్వతో వృత్వా అత్యతిష్టద్ దశాంగులమ్.**

యజుర్వేదము 31.3 – **ఏతావన్ అస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ప్రకర్షేణ మిమీతే శబ్దయతి, ఆవిష్కరోతి జ్ఞానమ్ బ్రహ్మాదిభ్య ఇతి ప్రమాణమ్.** బ్రహ్మము గురించిన నిజమైన తత్వమును తెలియజేయును గనుక భగవంతుడు 'ప్రమాణము' (మాంగ్ - మానె, శబ్దే చ).

**ప్రకర్షేణ మాన్యతే బ్రహ్మాదిభిః ఇతి ప్రమాణమ్.** బ్రహ్మాదులచేత కూడ గొప్పగా పూజింపబడువాడు గనుక 'ప్రమాణము'. (మాన - పూజాయామ్).

శ్రీ సత్యసంధ తీర్థ చెప్పిన మరొక అర్థము – **ప్రకృష్టమ్ మానమ్ శరీరాది పరిమాణమ్ త్రివిక్రమాది రూపేణ యస్య ఇతి వా ప్రమాణమ్.** (మానే - కొలుచుట). త్రివిక్రమాది రూపములలో అత్యద్భుతమైన ఆకారము (పరిమాణము) కలిగినవాడు గనుక ఆయన 'ప్రమాణము'.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **సత్య భాషిత్వాత్ ప్రమాణమ్.** సదా సత్యమునే చెప్పువాడు గనుక 'ప్రమాణము'. **ప్రమాణమ్ నిత్య మర్యాద సత్యవాది ప్రమాతృషు.**

శ్రీ ఎ.వి. రామనాథన్ అమరకోశ వ్యాఖ్యానము – **ఇయత్తా హేతుశాస్త్రేషు ప్రమాణమ్ సత్యవాదినీ.** ప్రమాణము, సత్యవాదిని అనే పదాలకు ఒకే అర్థం ఉన్నది.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – 'ప్రమితః' అనగా 'జ్ఞానము' అని అర్థము. స్వయముగా ఇట్టి జ్ఞాన (ప్రమా) స్వరూపుడు అగుటచేత పరమాత్మ 'ప్రమాణమ్' అని గానము చేయబడెను. '**ప్రజ్ఞానం బ్రహ్మ**'యని శ్రుతి గానము చేయును. సకలేంద్రియములను ప్రకాశింపజేయు జ్ఞానశక్తియే ప్రజ్ఞానమని చెప్పబడుటచేత పరబ్రహ్మము 'ప్రమాణమ్' అని గానము చేయబడెను. పరమాత్మ యథార్థముగా పరమనిర్మలుడయి యుండియును భ్రాంతిదృష్టికి పదార్థరూపమున ఉండెనని విష్ణుపురాణ వర్ణనము.

## 960. ప్రాణనిలయః

- సకల ప్రాణులకు నిలయమైనవాడు, ఆధారమైనవాడు.

- ఇంద్రియములు జీవునియందు లీనమైయుండును. జీవరూపమగు పరమాత్మయే ప్రాణనిలయుడు.
- ప్రాణాపానాది పంచవాయువులు ఆయనయందు లయమగును.
- సకల జీవులు ఆయనయందు లీనమగును.

**ఓం ప్రాణనిలయాయ నమః**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ప్రాణన్తి ఇతి ప్రాణః, అన్యేఽపి జీవః.** ప్రాణము కలిగినవి జీవులు. అట్టి జీవులన్నింటికి నిలయమైనవాడు ప్రాణనిలయుడు. సాయంకాలము పక్షులన్నీ తమ గూటికి చేరినట్లుగా, సకల జీవులు తుదకు భగవంతుని చేరును.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదేవిధమైన ఉదాహరణ చెప్పారు. **ప్రాణన్తి తత్ స్నేహామృతేన సంబంధవతేతి ప్రాణాః తత్ ప్రేయసీ జనాః తే నిలీయన్తే అస్మిన్ శకున్త ఇవనీడే ఇతి ప్రాణనిలయః.** శకుంత పక్షులు తమ గూటిలో విశ్రమించే విధంగా గోపీజనులు భక్తి ప్రేమాతిశయముల కారణంగా ఆయనయందు విశ్రమించారు గనుక ఆయన ప్రాణనిలయుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'ప్రాణములు' అనగా ఐదు విధములైన వాయువులు అన్న అర్థంలో వ్యాఖ్యానించారు. ప్రాణవాయువు మనం లోపలికి పీల్చే గాలి రూపంలో జీవులకు ఆధారమవుతుంది. అపానవాయువు మనం బయటకు వదిలే నిశ్వాసము. శరీరంలో చలనములకు ఆధారమైనది వ్యానవాయువు. కర్మేంద్రియముల చలనములకు ధారమైనది ఉదాన వాయువు. మలం రూపంలో మాలిన్యమును విసర్జింపజేసేది సమానవాయువు. ఇలా అన్ని జీవ, ఇంద్రియ వ్యాపారములకు ఆధారమైనవాడు గనుక భగవంతుడు ప్రాణనిలయుడు.

'నిలీన' అనగా 'లీనమగుట', అనే అర్థంలో శ్రీ శంకరులు, శ్రీ వాసిష్ఠ కూడా వ్యాఖ్యానించారు.

శ్రీ శంకరులు – **ప్రాణీతి ఇతి ప్రాణో జీవః పరే పుంసి నిలీయత ఇతి ప్రాణనిలయః.** సకల జీవులు ఆ పరమాత్మయందే లీనమగును గనుక ఆయన ప్రాణనిలయుడు.

శ్రీ వాసిష్ఠ – **ప్రాణా నిలీయన్తే యస్మిన్ స ప్రాణనిలయః.** సకల జీవులు ఆయనయందే లీనమగును గనుక ఆయన ప్రాణనిలయుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **స సర్వేషామ్ స్థావర జంగమానామ్ చ యథా యోగ్యే సాధన ప్రదానేన వాసయిత అతః స ప్రాణనిలయః ఉచ్యతే.** కదిలేవి గాని, కదలనివి గాని అన్ని విధములైన జీవులకు వాని మనుగడకు అవసరమైన సాధనములను ఇచ్చి వానిని పోషించువాడు ప్రాణనిలయుడు.

శ్రీ చిన్మయానంద – సకల జీవులలోను జరిగే అన్ని వ్యాపారములకు ఆధారమైనవాడు ప్రాణనిలయుడు. శ్రీ శంకరుల వ్యాఖ్య కూడా ఇదే అర్థమును చెబుతున్నది.

## 961. ప్రాణధృత్
## ప్రాణభృత్

- ప్రాణులను పోషించేవాడు, ప్రాణులకు ఆధారము.

**ఓం ప్రాణధృతే నమః**

**ఓం ప్రాణభృతే నమః**

ఈ నామమును శ్రీ భట్టులు **'ప్రాణధృత్'** అనీ, శ్రీ శంకరులు **'ప్రాణభృత్'** అనీ చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ప్రాణధృత్ – ధృ - ధారణే - నిలుపుట, ధరించుట. **తాన్ మాతృవత్ ధారయతి చ ఇతి ప్రాణధృత్.** వానిని (తనయందు లీనమైన జీవులను) తల్లివలె పోషించువాడు 'ప్రాణధృత్'. ఇంతకు ముందు నామము 'ప్రాణనిలయః'లో ప్రాణులు ఆయనయందు లీనమగుట తెలుపబడినదని గమనింపనగును.

శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (2.6.10)లో భగవంతుని 'మన తల్లి, మన తండ్రి, మన ఆత్మ' అని సంబోధించారు. ఈ ముగ్గురు త్రికాలాలలోనూ మనలను రక్షిస్తారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ప్రాణభృత్ – **పోషయన్ అన్న రూపేణ ప్రాణాన్ ప్రాణభృత్.** అన్నము రూపమున భగవంతుడు సకల ప్రాణులను పోషించును గనుక ఆయన 'ప్రాణభృత్'.

శ్రీ వాసిష్ఠ – **సర్వత్ర వ్యాప్తః సర్వేషామ్ ప్రాణినామ్ ప్రాణాన్ బిభర్తి - పోషయతి, ధారయతి వా సః ప్రాణభృత్.** అంతటా వ్యాపించియున్నవాడు మరియు సమస్త ప్రాణులను పోషిస్తూ వానికి ఆధారమైనవాడు ప్రాణభృత్.

శ్రీ చిన్మయానంద – సకల ప్రాణులకును ప్రభువు శ్రీహరి. ఆయన కారణంగానే ప్రాణులు తినుట, జీర్ణించుకొనుట, శక్తి కలిగియుండుట, కర్మలు చేయుట, వాని ఫలితములు అనుభవించుట, వయసు పెరుగుట, మరణించుట వంటి వ్యాపారములు నిర్వర్తించుచున్నవి. ఈ అన్ని పనులయందును అధిపతి శ్రీమన్నారాయణుడే ఎట్టి బంధములు లేకుండా ఆయా పనులు చేయించుచున్నాడు. ఆయన కారణంగానే అన్ని జీవులు మనగలుగుచున్నవి.

శ్రీ సత్యసంధ తీర్థ – **ప్రాణాన్ ఇంద్రియాణి బిభర్తి ఇతి ప్రాణభృత్.** ప్రాణములను, ఇంద్రియములను పోషించువాడు ప్రాణభృత్.

## 962. ప్రాణజీవనః

- ప్రాణులను జీవింపజేయువాడు.

### ఓం ప్రాణజీవనాయ నమః

జీవ్ - ప్రాణ ధారణే - ప్రాణములకు ఆధారమగుట. **జీవయతి ఇతి జీవనః, ప్రాణానామ్ జీవనః ప్రాణజీవనః.** ప్రాణములను నిలుపువాడు ప్రాణజీవనుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తాన్ అన్నపానీయాదివత్ జీవయతి ఇతి ప్రాణజీవనః.** అన్నపానాదులవలె ప్రాణులను జీవింపజేయువాడు. తానే వారికి పోషక, ధారక, భోగవస్తువైనవాడు ప్రాణజీవనుడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – అన్నపానాదులకు ప్రాణములను నిలిపే శక్తి భగవంతునివల్లనే లభించుచున్నది.

తిరువైమొళి 6.7.1 – పరమాత్ముడైన కృష్ణుడే మనం భుజించే ఆహారము, త్రాగే నీరు, భోజనానంతరం సేవించే తమలపాకులు. ఆయనే ధారకము, పోషకము, భాగ్యము.

శ్రీ కృష్ణన్ – నిజమైన భక్తులకు భగవానుడే ఆహారమగును. భగవంతుని ఎడబాసి భక్తులు ఉండలేరు. కనుక ఆయన ప్రాణజీవనము. ఈ తత్వమే **'వాసుదేవః సర్వమ్'** అని గీతలో చెప్పబడినది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **ప్రాణాన్ జీవాన్ భజన పరాయణాన్ జీవయతి స్వ-దర్శన దానేన ఇతి ప్రాణజీవనః.** తనను భజించే భక్తులకు తన దర్శనమును ప్రసాదించి వారిని జీవింపజేయువాడు ప్రాణజీవనము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ప్రాణినో జీవయన్ ప్రాణాఖ్యైః పవనైః ప్రాణజీవనః.** ప్రాణవాయువులద్వారా ప్రాణులను జీవింపజేసేవాడు ప్రాణజీవనము. ఇందుకు శ్రీ శంకరులు శ్రుతినుండి ఉదాహరించారు.

**న ప్రాణేన న అపానేన మర్త్యో జీవతి కశ్చన ఇతరేన తు జీవన్తి యస్మిన్ ఏతావుపాశ్రితౌ** – కఠోపనిషత్తు 5.5 మానవుడు ప్రాణ అపానములచేత మాత్రమే జీవించుటలేదు. ఈ రెండూ ఏ తత్వమునందు ఆశ్రయము పొంది ఉన్నాయో అటువంటి పరమాత్మచేతనే జీవిస్తున్నాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – జీవనము అంటే ప్రాణవాయువు గాని, శరీరం గాని, మనస్సు గాని మాత్రమే కాదు. వీటన్నింటియొక్క అవ్యక్తమైన సంయోగమువలన జీవము ఉద్భవించును. అందుకు కారణము భగవంతుడు మాత్రమే. కనుక భగవంతుడే నిజమైన ప్రాణజీవనము.

శ్రీ సత్యసంధ తీర్థ – **ప్రాణేన ముఖ్యప్రాణేన జీవయతి జనాన్ ఇతి ప్రాణజీవనః.** ప్రధానమైన ప్రాణవాయువుల చేత జీవమును నిలిపేవాడు (ఆధారము) ప్రాణజీవనము.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **ప్రాణాః తే జీవనమ్ అస్య ఇతి ప్రాణజీవనః.** తన భక్తులకు ప్రాణమైనవాడు ప్రాణజీవనము. జ్ఞానియైన భక్తుడు సాక్షాత్తు భగవంతుని స్వరూపమే అని గీత (7.18)నందు చెప్పబడినది. 950వ నామము 'ఆధారనిలయః' వివరణలో ఈ శ్లోకమును ఉదాహరించడమైనది.

శ్రీ వాసిష్ఠ శ్రుతులనుండి పెక్కు ఉదాహరణలిచ్చారు.

**యో అస్య సర్వజన్మన ఈశే సర్వస్య చేష్టతః అతంద్రో బ్రహ్మణా ధీరః ప్రాణో మా ను తిష్టతు** – అధర్వ వేదము 11.4.24
జగత్ప్రభువైన ఆయన ఈ సృష్టిలో సకల చరాచరముల వ్యాపారములకు కారణము. ధీరుడైన అట్టి ప్రాణమునకు నా ప్రార్థనలు.
**ప్రాణాయ నమో యస్య సర్వ ఇదమ్ వశీ.** ఆధర్వవేదము 11.4.1 – ఈ సృష్టిలో సకలమును తన అధీనములో ఉంచుకొన్న అట్టి ప్రాణమునకు ప్రణామములు.

**ప్రాణమ్ ఆహుర్మాతరిశ్వానమ్ వాతోహ ప్రాణ ఉచ్యతే**
**ప్రాణేహ భూతమ్ భవ్యమ్ చ ప్రాణే సర్వమ్ ప్రతిష్ఠితమ్** – అధర్వవేదము 11.4.15
వాయువు అని కూడా అనబడే మాతరిశ్వమును ప్రాణము అనే పేరుతో పిలుస్తారు. ఈ ప్రాణముపైనే సమస్త భూత భవిష్యత్ వర్తమానములు ఆధారపడియున్నవి.

ప్రాణమునకు ఆధారమగుటలో అనేక ప్రక్రియలను, దశలను మనము ఊహించుకోవచ్చును. ఒక జీవికి శరీరమునొసగుట, వానికి ప్రాణవాయువులిచ్చుట, మనుగడకొరకు అన్నపానాదులిచ్చుట, ఆలోచించుటకు మనసును ఇచ్చుట, కార్యనిర్వహణకు ఇంద్రియాలనిచ్చుట, ఇవన్నీ నియంత్రణలో పరస్పరము సహకరించుకొనుచు పనిచేయుట, చివరకు మరణముద్వారా శరీరమునుండి ఆత్మ వేరగుట – ఇవన్నీ వేరువేరు నామములలో ప్రతిఫలిస్తున్నాయి. **ప్రాణదః, ప్రాణధృత్ / ప్రాణభృత్, ప్రాణజీవనః** – వంటి నామములద్వారా భగవంతుడు సకల ప్రాణులకు సృష్టికర్త, పోషకుడు, అంతం చేయువాడు అని గ్రహించవచ్చును.

## 963. తత్త్వమ్

- అన్నింటియొక్క సారము, పరబ్రహ్మము.

**ఓం తత్త్వాయ నమః**

'తత్త్వము' అన్న పదం అర్థాన్ని శ్రీ వాసిష్ఠ ఇలా వివరించారు. తను - విస్తారే - వ్యాపించుట, వెళ్ళుట. ఉణాది సూత్రము (1.132) ప్రకారము తన్ + ఆది = తత్. పాణిని సూత్రము (5.1.119 – **తస్య భావః త్వతలౌ**) ప్రకారము షష్ఠీ విభక్తిలో 'దానియొక్క గుణము, దానికి సంబంధించినది' అన్న అర్థానికి 'త్వ, తత్' వస్తాయి. అందువలన 'తత్త్వమ్' అవుతుంది. (ఉదా. అశ్వస్య భావః అశ్వత్త్వమ్, గోత్త్వమ్). **తన్యత ఇతి తత్, స్థావర జంగమాత్మకమ్ జగత్, తస్య సార భూతమ్ వస్తు తత్త్వమ్ ఇత్యర్థః.** 'తత్' ద్వారా స్థావర జంగము సహితమైన సకల జగత్తు సూచితము. వాని గుణము, సారాంశమును 'తత్త్వము' అందురు.

**యో విద్యాత్ సూత్రమ్ యస్మిన్నోతాః ప్రజా ఇమాః సూత్రమ్ సూత్రస్య యో విద్యాత్ స విద్యాత్ బ్రాహ్మణమ్ మహత్** – అథర్వ వేదము 10.8.37. సకల జీవులు ఏ దారము (సూత్రము)పై అల్లబడినవో, ఆ సూత్రమును తెలిసినవాడే బ్రహ్మమునెరిగినవాడు.

ఏదైనా వస్తువు లేదా పదార్థము లేదా జీవికి అతిముఖ్యమైన ఆధారము, కారణము, గుణము ఏదో, ఏది లేకుండా ఆ వస్తువు ఉనికి ఉండదో, అదే ఆ వస్తువుయొక్క తత్వము. సృష్టిలో ఏదీ భగవంతుడు లేకుండా ఉండదు. కనుక అన్నింటికీ తత్వము భగవంతుడే.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'తత్వము' అనగా 'సారాంశము' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **దధి దుగ్ధయోరివ దధి సారః చిత్ అచితోః వ్యాప్తి ప్రయోజనాభ్యామ్ సారాంశః తత్త్వమ్** పాలు, మరియు పెరుగుయొక్క సారాంశము వెన్న. వెన్నవల్లనే పాలు, పెరుగులకు రుచి, గుణమువంటివి లభిస్తున్నాయి. అలాగే చిత్తు, అచిత్తు – వీటన్నింటికీ సారమైనవాడు 'తత్త్వము'. చేతనాచేతనమైన సంసారానికి సారభూతమై ప్రకాశించేవాడు. ఇందుకు శ్రీ భట్టులు ఉదాహరించిన శ్లోకములు –

**పరమార్థమ్ అశేషస్య జగతః ప్రభవాప్యయమ్ శరణ్యమ్ శరణమ్ గచ్ఛన్ గోవిందమ్ నావసీదతి.** సర్వరక్షకుడైన గోవిందుని శరణుజొచ్చినవాడు ఎన్నడును దుఃఖమునకు లోనుగాడు. ఎందుకంటే సకల జగత్తుకు ఉత్పత్తి స్థానమైనవాడు, రక్షకుడు, లయస్థానము కూడ ఆ గోవిందుడే.

**ఏకతోవా జగత్ కృత్స్నమ్ ఏకతో వా జనార్దనః సారతో జగతః కృత్స్నాత్ అతిరిక్తో జనార్దనః.** త్రాసునకు ఒకవైపు సమస్త జగత్తును, మరొకవైపు భగవానుడైన జనార్దనుని ఉంచినట్లయితే, జనార్దనునివైపే మొగ్గు చూపుతుంది. ఎందుకంటే సమస్త జగత్తుయొక్క సారము జనార్దనుడే.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 8.1.7 – నా ప్రభువా! పచ్చిపాలలోని వెన్న నీవే. వెన్నలోని రుచి నీవే. సముద్రంలోని అమృతం నీవే. అమృతముయొక్క రుచి నీవే. కాదు, కాదు. అమృతాన్ని ఆస్వాదించినపుడు కలిగే ఆనందము నీవే.

నాచియార్ తిరుమొళి (5.6)లో అండాళ్ తల్లి భగవంతుని 'తత్తువన్' అని ప్రస్తావించినది. తన పరిస్థితిని తత్తువన్ కు వివరించి, ఆయనను తక్షణమే రమ్మని ఆమె ఒక పక్షిద్వారా సందేశాన్ని పంపినది. అలా చేస్తే తాను ఆ పక్షికి సదా ఋణపడి ఉంటానని ఆమె అంటున్నది. ఇక్కడ తత్తువన్ అనగా ఆమె జీవనానికి ఆధారమైనవాడు. ఆమెయొక్క జీవిత సారాంశము.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 6.9.7 – నీవే సకల కర్మలునూ, మరియు ఆ కర్మలను ఆచరించే జగత్తు నీవే, సకల జీవుల ఆత్మయును నీవే.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ గీత (10.41)నుండి ఉదాహరించారు. **యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా తత్త దేవావ గచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్.** విభూతియుక్తమైన, అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువు ఏదైనను నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదిగా తెలిసికొనుము.

శ్రీ రాధాకృష్ణమూర్తి మరొకవిధంగా వ్యాఖ్యానించారు. 'తత్త్వము' అనగా ఉనికికి కారణమైనది, మరియు ఆ వస్తువు నశించినాగాని తానుమాత్రం మిగిలియుండేది. 'తత్' అనగా బ్రహ్మము. అట్టి బ్రహ్మముయొక్క గుణము 'తత్త్వము'.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – నారాయణోపనిషత్తు. **తత్త్వమ్ నారాయణః పరః.** నారాయణుడే పరతత్త్వము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **తత్త్వమ్, అమృతమ్** పరమార్థః స **తత్త్వమ్ ఇతి** ఏతే ఏకార్థ వాచినః, పరమార్థ సతో బ్రహ్మణో వాచకః శబ్దః **తత్త్వమ్.** తత్త్వము, అమృతము, పరమార్థము, సతత్వము –ఇవన్నియూ ఒకే అర్థము గల పదములు. కనుక పరబ్రహ్మము 'తత్త్వమ్' అను దివ్యనామమున స్తుతింపబడును.



అహమ్మదాబాదు శ్రీ స్వామినారాయణ మందిరంలోని శ్రీనరనారాయణుల మూర్తుల చిత్రీకరణ. వికీపీడియా చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:NarNarayanDevTraditional.jpg

**శ్రీ అన్నమయ్య కీర్తన**

అంతయు నీవే హరి పుండరీకాక్ష | చెంత నాకు నీవే శ్రీరఘురామ ||

కులమును నీవే గోవిందుడా నా | కలిమియు నీవే కరుణానిధి
తలపును నీవే ధరణీధర నా | నెలవును నీవే నీరజనాభ ||

తనువును నీవే దామోదర నా | మనికియు నీవే మధుసూదన
వినికియు నీవే విట్ఠలుడా నా | వెనకముందు నీవే విష్ణు దేవుడా ||

పుట్టుగు నీవే పురుషోత్తమ | కొన నట్టనడుము నీవే నారాయణ
ఇట్టే శ్రీ వెంకటేశ్వరుడా నాకు | నెట్టన గతి ఇంక నీవే నీవే ||

## 964. తత్త్వవిత్

- తత్త్వమునెరిగినవాడు. స్వస్వరూపమును యథార్థముగా నెరింగినవాడు.

**ఓం తత్త్వవిదే నమః**

963వ నామము 'తత్త్వము' అనగా సకల జగత్తునకు సారాంశము, పరబ్రహ్మ స్వరూపము. 'విద్' అనగా తెలియుట. **తత్త్వమ్ తత్ స్వరూపమ్ వేత్తి ఇతి తత్త్వవిత్.** ఆ తత్త్వమును, అనగా తనను పూర్తిగా తెలిసినవాడు తత్త్వవిత్.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఆత్మనః తత్త్వమ్ వేత్తి ఇతి తత్త్వవిత్.** తన తత్త్వమును తాను ఎరిగినవాడు తత్త్వవిత్. బ్రహ్మరుద్రేంద్రాదులకు కూడా శ్రీమన్నారాయణుని తత్వము పూర్తిగా తెలియదు. అది పూర్తిగా తెలిసినవాడు శ్రీమన్నారాయణుడే. ఇందుకు శ్రీ భట్టులు గీత (10.15)నుండి ఉదాహరించారు.

**స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే.**
ఓ జగదుత్పత్తి కారక! ఓ సర్వ భూతేశ! ఓ దేవాదిదేవా! ఓ జగన్నాధా! ఓ పురుషోత్తమా! నీ తత్త్వమును నీవే స్వయముగా ఎఱుంగుదువు.

శ్రుతివాక్యము **'త్వమేవ త్వాం వేత్థ'**ను కూడా శ్రీ భట్టులు ఉదాహరించారు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – శ్రీమద్రామాయణంలో తార భగవంతుని అప్రమేయునిగా వర్ణించింది. 'ప్రమా' అనగా బుద్ధి. బుద్ధికి అందనివాడు అప్రమేయుడు. మనలాంటి సామాన్యమానవులకు మాత్రమే ఆయన అందరానివాడు కాడు. గొప్పగొప్ప శాస్త్రములు కూడ ఆయనను సరిగా చెప్పలేవు. తైత్తరీయోపనిషత్తు ఆనందవల్లిలో **'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'** అని ఉంది. అంటే నిరవధిక పరబ్రహ్మమును గురించి తెలియజాలక మాటలు, మనస్సు వెనుదిరుగుతాయట.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 1.1.8, 1.3.6 – దేవాదులు కూడా ఆయన తత్త్వమును తెలియజాలరు. ఎంత తపస్సు చేసినా పరబ్రహ్మము తత్త్వమును తెలియజాలరు.

శ్రీ అళవందార్. స్తోత్రరత్నము. **యస్యాస్తే మహిమానమ్ ఆత్మన ఇవ తత్ వల్లభోऽపి ప్రభుః.** భగవంతుని గొప్పతనము, శ్రీ అమ్మవారి గొప్పతనము ఎంత అవధులు లేనివంటే అవి వారికే పూర్తిగా తెలియదు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – తత్త్వమ్ **స్వరూపమ్ యథావత్ వేత్తి ఇతి తత్త్వవిత్.** సత్యమును ఉన్నది ఉన్నట్లుగా తెలిసినవాడు తత్త్వవిత్. భగవంతునికి మాత్రమే యథార్థముగా సృష్టి, స్థితి, లయము, కర్మబంధనములు, జీవులు వంటివాని గురించిన రహస్యములు తెలియును.

## **965.** ఏకాత్మా

- ఒకే ఒక ఆత్మ. చేతనాచేతనములన్నింటికీ తనొక్కడే శేషి అయినవాడు.

### ఓం ఏకాత్మనే నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – అన్ని ఆత్మలకు అధిపతియైన, అన్ని ఆత్మలనూ నియంత్రించే ఒకే ఒక పరమాత్మ గనుక ఏకాత్మ.
**సర్వస్య చిత్ అచిత్ వర్గస్య అయమేకేన శేషీ భోక్తా అభిమానౌ చ ఇతి ఏకాత్మా**
**శేషీ భోక్తాభిమానీ చ ఏకశ్చిద చితోశ్చయః ఏకాత్మేతి స సప్తార్ణః సర్వప్రాణప్రదో మనుః**
చేతనాచేతనములన్నింటికీ తానొక్కడే శేషి (ప్రభువు), భోక్త (అనుభవించేవాడు), మరియు అభిమాని (మేలు కోరేవాడు) అయినందున ఆయన ఏకాత్మ. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. దీర్ఘాయువునిస్తుంది. ఓం ఏకాత్మనే నమః (శ్రీకైవల్య సారథి).

శ్రీ వి.వి. రామానుజన్ శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి పాశురము (8.1.5)ను ఉదాహరించారు. ఇందులో ఆళ్వారులు భగవంతుని **'ఒరు ఉయిరేయో'** అని సంబోధించారు. అనగా ఏకాత్ముడని చెప్పవచ్చును.

ఈ సకల జగత్తును ఒకప్పుడు నీవే ప్రళయజలాలనుండి వెలికి తీశావు (శ్రీవరాహావతారము). మరియు నీవే కబళించావు (ప్రళయము). వెలికి ఉమిశావు (సృష్టి). నీ అడుగులతో కొలిచావు (శ్రీ త్రివిక్రమావతారము). ఇవన్నీ నీ కృపవల్లనే జరిగాయి. సముద్రాలను నీవే సృజించావు. నీవే మంథించావు (శ్రీ కూర్మావతారము). నీవే అడ్డుకట్టలు వేశావు (శ్రీరామావతారము). మళ్ళీ నీవే ఆ కట్టలను ఛేదించావు. నీవు నాప్రాణాలకు అత్యంత ప్రియమైవానివి. సకలదేవతలకు ప్రభువువు. మానవులకు దేవతలు ఎలా అందనివారో అలా నీవు దేవతలకు అందనివాడివి. నీవు అన్ని ఆత్మలకూ పరమాత్మవు. జగత్తునకు సృష్టికర్తవు, రక్షకునివి, లయకారునివి. నిన్ను నేను ఎలా చేరుకోవాలో చెప్పవయ్యా.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ శ్రుతులనుండి ఉదాహరించారు. **నిత్యో నిత్యానామ్ చేతనశ్చేతనానామ్ ఏకో బహూనామ్ యో విదదాతి కామాన్.** నిత్యులందరికంటె శాశ్వతమైనవాడు, చేతనులందరికంటె అత్యధికుడు, తానొక్కడే అనేకముగా వ్యక్తమైనవాడు, అందరి కోర్కెలు తీర్చేవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య **– ఏకశ్చ అసౌ ఆత్మా చ ఇతి ఏకాత్మా.** ఒక్కటే అయిన ఆత్మ 'ఏకాత్మా'. సృష్టికి ముందు ఈ జగత్తు అంతా ఒకే ఆత్మగా ఉన్నది. ఆ పరమేశ్వరుడే ఏకాత్మ. ఇందుకు శ్రీ శంకరులు ఐతరేయోపనిషత్తు నుండి, లింగపురాణమునుండి ఉదాహరించారు.

**ఆత్మా వా ఇదమేక అగ్ర ఆసీత్ నాऽన్యత్ కించన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజ ఇతి** – ఐతరేయోపనిషత్తు. సృష్టి ప్రాంభమందు ఈ జగత్తులో ఒకే ఆత్మ (పరమేశ్వర తత్త్వము) ఉండేది. మరేదీ లేదు. అది లోకాలను సృష్టించాలని అనుకొన్నది.

**యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ యచ్చాస్య సంతతో భావస్తస్మాద్ ఆత్మేతి గీయతే** – లింగపురాణము 70.96. అంతటా వ్యాపించియున్నది, గ్రహించేది, అనుభవించేది, శాశ్వతంగా ఉండేది ఆత్మ.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **ఏవన్ చ స విష్ణురేవ సర్వస్య స్థావర జంగమ రూపస్య విశ్వస్య ఏకాత్మా సర్వత్ర వ్యాప్తత్వాత్ ఏకాత్మా.** స్థావర జంగములైన సమస్తములందూ విశ్వమంతటా వ్యాపించియున్న విష్ణువే ఏకాత్మ.

శ్రీ సత్యసంధ తీర్థ – **ఏక ఆత్మా ముఖ్య స్వామీ.** ముఖ్యమైన దేవుడు ఏకాత్మ.



శ్రీకాకుళం నారాయణ తిరుమల ఆలయంలో దశావతార శిల్పాల సంకలనం. రాజశేఖర్ తీసిన చిత్రాలు. వికీపీడియా నుండి.

## 966. జన్మమృత్యుజరాతిగః

- జననము, మరణము, వృద్ధత్వము మున్నగునవి లేనివాడు. షడ్భావ వికారములు లేనివాడు.

### ఓం జన్మమృత్యుజరాతిగాయ నమః

ఈ నామములో పదముల మూల శబ్దములు. జని - ప్రాదుర్భావే - పుట్టుట. మృంగ్ - ప్రాణత్యాగే - మరణ సంబంధము. జృష్ - వయో హానౌ - వయసు పెరుగుట, హాని కలుగుట. గమ్ - గచ్ఛతి - వెళ్ళుట. అతి (ప్రత్యయము) - దాటుకొని. **అతిగచ్ఛతి ఇతి**

**అతిగః.** దాటుకొని వెళ్లునది. **జన్మ మృత్యు జరా అతిగచ్ఛతి ఇతి జన్మమృత్యుజరాతిగః.** పుట్టుక, చావు, ముసలితనములకు లోబడనిది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తథాపి తద్ ఉభయ విధర్మాత్మా.** భగవానుడు సకల చేనాచేతనములకు అంతర్యామి అయినా గాని, వాని ధర్మాలు (రజస్సు, తమస్సు, పుణ్యము, పాపము వంటివి) ఏమాత్రము అంటనివాడు. సామాన్య ఆత్మలు తమ పుణ్యపాపముల ఫలితములకు లోబడి శరీరములో బద్ధులగును. కనుక వానికి పుట్టువు, ముసలితనము, మరణము వంటివి సంభవించును. కాని పరమేశ్వరునకు అవి వర్తించవు. ఆయన తన సంకల్పానుసారము అవతరించును. కర్మఫలితముగా కాదు.

ఇక్కడ శరీరమునకు, ఆత్మకు ఉన్న భేదాన్ని గ్రహించాలి. ఆత్మకు పుట్టువు, మరణము వంటివి లేవు కాని వాని కర్మఫలంగా ధరించే దేహాలకు జన్మ, మృత్యువు, ముసలితనము వంటి దశలు వర్తించును. వాని కర్మఫలములు పూర్తిగా నశించిన తరువాత (అనగా అనేక జనన మరణ చక్రముల తరువాత) అవి పరమాత్మ సాన్నిధ్యమును పొందును. కాని కర్మరహితుడైన భగవంతునికి సంసారచక్రములో పడే పరిస్థితి ఎన్నడును రాదు.

**న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే** – గీత 4.14
నాకు కర్మఫలాసక్తి లేదు. కావున కర్మలు నన్నంటవు. ఇలా నా తత్వము తెలిసినవారు కర్మబద్ధులు కారు.

శ్రీ శంకరుల వ్యాఖ్యానము – **జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నాశ్యతి, ఇతి షడ్భావ వికారాన్ అతీయ గచ్ఛతి ఇతి జన్మమృత్యుజరాతిగః.** పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట, మార్పుచెందుట, క్షీణించుట, నశించుట అను ఆరు గుణములు (షడ్భావ వికారములు) లేనివాడు 'జన్మమృత్యుజరాతిగః'.

శ్రీ వాసిష్ఠ ఉదాహరించిన ఋగ్వేద మంత్రము (10.8.44). **అకామో ధీరో అమృతః స్వయంభూ రసేన తృప్తో న కుతశ్చనోనః తమేవ విద్వాన్ న విభాయ మృత్యోరాత్మానామ్ ధీర్మ్ అజరమ్ యువానమ్**
కోరికలు లేనివాడు, ధీరుడు, మరణము లేనివాడు, స్వయముగా పొందినదానితో తృప్తి చెందినవాడు, లోటు లేనివాడు, మరణభయము లేనివాడు – ఇవి అజరామర ధీరమైన పరమాత్మను ఎరిగినవాని లక్షణములు.

బృహదారణ్యకోపనిషత్తు 4.4.25 – **స వా ఏష మహాన్ అజ ఆత్మాజరః అమరః అమృతః అభయః బ్రహ్మ అభయం వై బ్రహ్మ అభయం హి వై బ్రహ్మ భవతి య ఏవం వేద.** అనంతమైనది, జన్మించనిది, నశించనిది, క్షీణించనిది, భయం లేనిది అయిన పరమాత్మమే పరబ్రహ్మము. అలాంటి నిర్భయమైన పరబ్రహ్మమును ఎరిగినవాడు పరబ్రహ్మమేయగును.

అండజ వాహన విను బ్ర
హ్మాండముల బంతులట్లు యాడెడు నీవా
కొండల నెత్తితి వందురు
కొండిక పని గాక దొడ్డ కొండా కృష్ణా
సకల బ్రహ్మాండములు భగవంతుని శక్తివలన బంతులవలె ఆడుచున్నవి. ఇక మంధర గిరిని, గోవర్ధన గిరిని ఎత్తుట ఎంతపని? ఇది ఆయనకు కేవలము ఆటకాయ తనమే.



1640 కాలపు రాజస్థాన్ ప్రాంత భాగవతపురాణ చిత్రం.
https://commons.wikimedia.org/wiki/File:Krishna_raising_Mount_Govardhan,_Bhagavata_Purana,ca_1640.jpg



## భూర్భువఃస్వస్తరుస్తారః సవితా ప్రపితామహః |
## యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః || (104)

### 967. భూర్భువస్స్వస్తరుః

- ముల్లోకములలోని (భూలోకము, భువర్లోకము, సువర్లోకములలోని)వారందరికీ. ఆశ్రయమైనవాడు. పక్షులకు వృక్షము ఆశ్రయమైనట్లుగా.
- మూడులోకములయందు వృక్షమువలె వ్యాపించియున్నవాడు.
- భూః, భువః, సువః అనే మూడు పవిత్ర వేదమంత్ర వ్యాహృతులద్వారా హోమము చేయుటవలన ముల్లోకములలోనివారు తరించుచున్నారు.

**ఓం భూర్భువస్స్వస్తరవే నమః**

శ్రీ ఆప్టే నిఘంటువు ప్రకారం,

భూలోకము – మనం నివసించే ఈ లోకము. మొదటి వ్యాహృతి.

భువర్లోకము – రెండవ వ్యాహృతి. భూమిపైనున్న ఆకాశము.

సువర్లోకము – సూర్యుని అవతల, ధృవనక్షత్రమువరకు వ్యాపించిన స్వర్గలోకము. మూడవ వ్యాహృతి. ఇంద్రాది దేవతలకు నిలయమైనది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **భూర్-భువస్-స్వర్-ఉపలక్షితైః పక్షి పథికైరివ ప్రాణిభిః ఉపజీవ్యమానచ్ఛాయ పత్రలపారిజాతః భూర్భువస్స్వస్తరుస్తరుః.** పక్షులకు, బాటసారులకు చెట్లు తమ పచ్చని ఆకులతోను, చల్లని నీడతోను ఆశ్రయాన్ని ఇస్తాయి. అలాగే మూడు లోకములలోని జీవులకు ఆశ్రయమైన తరువు (వృక్షము) భూర్భువస్స్వస్తరువు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – ఇక్కడ మూడు లోకములనే చెప్పినప్పటికీ, పదునాల్గు లోకములకు ఆశ్రయము శ్రీమహావిష్ణువే అని గ్రహింపవలెను. మరియు ఆశ్రయము అనగా నైమిత్తిక ప్రళయకాలమున ఇచ్చు ఆశ్రయము అని తెలియనగును.

శ్రీ భట్టులు విష్ణుపురాణము (1.17.91)నుండి ఉదాహరించారు. **సమాశ్రితాత్ బ్రహ్మతరోః అనంతాత్ నిస్సంశయః పక్వ ఫలప్రపాతః.** బ్రహ్మమనే శాశ్వత వృక్షాన్ని ఆశ్రయించినట్లయితే పండిన పండు (సంసారబంధమునుండి విముక్తి, మోక్షసాధన) తప్పక మన చేతిలో పడుతుంది.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.8.5 – తానొక్కడై భగవంతుడు ముల్లోకములలోనివారిని (బాధితులందరిని) కాచును. అందరికి సృష్టికర్తయైన ఆయన వారి రక్షణబాధ్యతను కూడ చేకొనును. అందులో ఎన్నడూ వెనుకాడడు.

ఇక్కడ 'తరు' (వృక్షము) అనే శబ్దము ముఖ్యంగా భగవంతుని రక్షణాగుణమును సూచించును. భగవానుడు సృష్టిస్థితిలయకారుడైనా గాని రక్షణ అనేది ఆయన ప్రధాన ధర్మము (తిరువైమోళి 2.2.9). శ్రీ మద్రామయణం కిష్కింధకాండ (15.19)లో తార శ్రీరాముని ఆశ్రయతత్వాన్ని వృక్షంతో పోల్చినది.

**నివాస వృక్షః సాధూనామ్ ఆపన్నానామ్ పరాగతిః ఆర్తానామ్ సంశ్రయశ్చైవ యశశ్చ ఏక భాజనమ్**

(శ్రీరాముడు) సాధువులకు నివాసవృక్షము. ఆపన్నులకు సురక్షిత స్థానము. వేరు రక్షణ లేనివారికి ఆయనే రక్షకుడు. స్తుతికి పాత్రుడైన ఏకైక వ్యక్తి.

శ్రీ భట్టుల వ్యాఖ్యను నిరుక్తిలో ఇలా క్లుప్తంగా చెప్పారు.

**భూరాదిభిర్రక్షితానాం జీవానాం యస్సమాశ్రయః భూర్భువస్స్వస్తరు స్సస్యాత్ దశార్ణ స్సర్వదోమనుః** భూలోకము, భువర్లోకము, సువర్లోకములలోనివారందరికీ, పక్షులకు వృక్షము ఆశ్రయమైనట్లుగా, ఆశ్రయమైనవాడు భూర్భువస్స్వస్తరువు. ఈ నామము దశాక్షరీమంత్రము. అధిక ఫలప్రదము. ఓం భూర్భువస్స్వస్తరవే నమః. (శ్రీకైవల్య సారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు (1) తౄ - తరణయోః - దాటుట (2) తరు - వృక్షము అనే రెండు అర్థాలలోను వ్యాఖ్యానించారు.

తౄ - ప్లవన తరణయోః - ఈదుట, దాటుట. **భూర్-భువః-స్వః సమాఖ్యాని త్రీణి వ్యాహృతి రూపాణి శుక్రాణి త్రయీ శరాణి బహ్వృచ ఆహుః, తైర్ హోమాదినా జగత్త్రయమ్ తరతి ప్లవతే ఇతి భూర్-భువస్-స్వస్-తరుః.** భూలోకము, భువర్లోకము, సువర్లోకము అను మూడు వ్యాహృతులును వేదములందు గల పవిత్ర మంత్రములై యున్నవి. ఈ పవిత్ర మంత్రములచేత విధివిధానముగా హోమము చేయబడుటచేత ముల్లోకములవారును తరింపబడుచున్నారు. కనుక శ్రీహరి 'భూర్భువస్స్వస్తరుః' అని గానము చేయబడెను.

శ్రీ శంకరుల వ్యాఖ్యకు ఆధారమైన ఋగ్వేదమంత్రము (తైత్తరీయోపనిషత్తులో కూడా ఈ మంత్రం ఉంది).

**భూర్-భువః-సువరితి ఏతాస్-తిస్రో వ్యాహృతయః .....**

**భూరితివా అయం లోకః,**

**భువరిత్యంతరిక్షమ్,**

**సువరిత్యాసౌ లోకః, .........**

**భూరితివా అగ్నిః, భువ ఇతి వాయుః, సువరిత్యాదిత్యః, ......**

**భూరితి వా ఋచః, భువ ఇతి సామాని, సువరితి యజూగ్ంషి, ........**

**భూరితి వై ప్రాణః, భువ ఇత్యపానః, సువరితి వ్యానః.......**

భగవంతుడు ముల్లోకాలనూ సృష్టించాడు. తరువాత భూమిపై అగ్నిని, ఆకాశంలో వాయువును, మరియు స్వర్గంలో సూర్యుడిని సృష్టించాడు. వీనిలో అగ్నినుండి ఋగ్వేదము, వాయువునుండి యజుర్వేదము, సూర్యునినుండి సామవేదము ఉద్భవించాయి. మరల వీనినుండి మూడు వ్యాహృతులు (శబ్దములు) ఉద్భవించాయి. అగ్నినుండి 'భూః', వాయువునుండి 'భువః', సూర్యునినుండి 'స్వః'. ఈ మూడు వ్యాహృతులతోను హోమము చేయుటద్వారా ఈ మూడు లోకములను దాటవచ్చును.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము – తరుః - వృక్షము. **భూర్-భువః-స్వ రాఖ్యమ్ లోకత్రయమ్ వృక్షవత్ వ్యాప్య తిష్ఠతి ఇతి భూర్-భువః-స్వః-తరుః.** భూలోకము, భువర్లోకము, సువర్లోకము అను మూడు లోకముల యందును వృక్షరూపమున వ్యాపించియున్న పరమాత్మ గనుక శ్రీమహావిష్ణువు 'భూర్భువస్స్వస్తరుః'.

శ్రీ వాసిష్ఠ – **భూః ఇతి భూలోకః, భువః ఇతి అంతరిక్షమ్, స్వః ఇతి ద్యులోకః, ఏతే త్రయో లోకాః త్రయః స్కంధా ఇవ యమాశ్రిత్య తిష్ఠన్తి, స ఏతేషామ్ ఆధారో మూలభూతః పరమేశ్వరః తరు-ఇవ-స్థితో భూర్-భువ-స్వస్-తరుః.** మూడు లోకములు ఆయన ఆశ్రయం పొందుతాయి. అలా భూమి, అంతరిక్షము, స్వర్గము అనే మూడు లోకాలకు ఆశ్రయం ఇచ్చేవాడు భూర్భువస్స్వస్తరువు.

## 968 తారః

- రక్షించువాడు.
- సంసారసాగరమును దాటించువాడు, తరింపజేయువాడు.
- ప్రణవము.

**ఓం తారాయ నమః**

ఈ నామము రెండుమార్లు వచ్చినది.

37వ శ్లోకము. 340వ నామము. తారః – **అశోకః తారణః తారః శూరః శౌరిర్జనేశ్వరః**

404వ శ్లోకము. 968వ నామము. తారః – **భూర్భువస్స్వస్తరుస్తరుః తారః సవితా ప్రపితామహః**

తౄర్ - ప్లవన సంతరణయోః - దాటుట, ఈదుట. సంసారసాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్న జీవులను ఆ సాగరం దాటించేవాడు 'తారః'.

గరుడ వాహనంపై ఊరేగుతున్న శ్రీ మలయప్పస్వామి. Creative Commons Photo from Flickr by Nagraj Salian



శ్రీ భట్టుల వ్యాఖ్య –

340వ నామము 'తారః'ను శ్రీ భట్టులు 'భయంనుండి కాపాడేవాడు' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **సర్వసంసార భయాత్ తారయతే ఇతి తారః.** ఇందుకు శ్రీ భట్టులు అథర్వశీర్షము నుండి ఉదాహరించారు. **గర్భ జన్మ జరా మరణ సంసార సాగర మహాభయాత్ త్రాయతీతి తస్మాత్ తారః.** గర్భావాసము, జననము, ముసలితనము, మరణము అనే మహాభయాలతో కూడిన కూడిన సంసారసాగరమును దాటించువాడు 'తారః'. భగవంతుడు అజాయమానుడు (పుట్టుక లేనివాడు), అజరుడు, అమరుడు అయినందున ఆయనకు ఈ భయాలు వర్తించవు. జీవులకే ఈ భయములు వర్తించును.

శ్రీ తిరుమంగైయాళ్వారు. పెరియతిరుమొళి 11.8.10 – సంసారమనే నరకంలో మునిగిపోకుండా నీ భక్తులను నీవు కాపాడుతావు.

సంసారమును సాగరముతో పోల్చినందున అనేకమార్లు భగవంతుని నావతో పోల్చారు. ఈ భావాన్ని మరింత వివరిస్తూ శ్రీ కృష్ణన్ ఇలా చెప్పారు – ఒక చిన్న పురుగు ఒక కొండపైనుండి మరొక కొండపైకి వెళ్ళలేదు. కాని అది ఒక సింహం పైకెక్కితే ఆ పనిని సింహం చేసి పెడుతుంది. అలాగే జీవులు శ్రీనారసింహుని శరణు వేడితే చాలును. ఆయన వారిని సులభంగా సంసారసాగరం దాటించేస్తాడు. ఈ సాగరాన్ని దాటడానికి మనం భగవద్భక్తి అనే నావను ఎక్కితే చాలును. ఆ నావను నడిపే పని ఆయన చూచుకుంటాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య కూడా ఇలానే ఉంది. **సంసార సాగరమ్ తారయన్ తారః.** సంసార సాగరమును దాటించేవాడు 'తారః'.

శ్రీ శంకరులు చెప్పిన మరొక అర్థము. **తారః ప్రణవోవా.** అనగా ప్రణవమంత్రము. ఎందుకంటే ప్రణవమంత్ర ధ్యానము మనలను సంసారసాగరంనుండి ఉద్ధరిస్తుంది.

శ్రీ చిన్మయానంద – భక్తుడు అచంచలమైన విశ్వాసంతో మరియు నిజమైన భక్తితో నావికుని శరణుజొచ్చితే ఆ భగవంతుడే సంసారసాగరమును దాటిస్తాడు. కనుక ఆయన 'తారః'. జ్ఞానముతో జాగృతమైన మనస్సుతో సాధించే ధ్యానము మనలను ఉన్నత ఆధ్యాత్మిక స్థాయికి కొనిపోవును. అలా శాశ్వత పరబ్రహ్మమైన శ్రీహరి అనుభవము కలుగును.

ధర్మచక్రము రచయిత – మనము మన గుణములకు దాసులము కాకుండా భగవంతుని ఆలంబనగా చేసికొనవలెను. మనం చేసే అన్ని పనులను భగవత్సేవ నిమిత్తం చేయాలి. అప్పుడు భగవంతుడు మనలను కాపాడుతాడు. అందుకే రామనామమును 'తారక మంత్రము' అంటారు. ఆ నామమును స్మరిస్తూ హనుమంతుడు సముద్రాన్ని లంఘించాడు. ఆ నామమును స్మరిస్తూ మనం కూడా సంసార సాగరాన్ని తరింపవచ్చును. రాముడున్నచోట కామము ఉండదు. కనుక రామనామము మనలను పతనం కాపాకుండా కాపాడును. రామనామమును స్మరిస్తే మనం సంసారసాగరంలో మునగము.

## 969. సవితా

- సూర్యుని రూపములో వర్షమును, పంటలను కలుగజేయువాడు.
- సర్వజగత్తునకు సృష్టి నిచ్చుతండ్రి.

### ఓం సవిత్రే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.

94వ శ్లోకము. 887వ నామము. సవితా – **రవిర్విరోచనః సూర్యః సవితా రవిలోచనః**

104వ శ్లోకము. 969వ నామము. సవితా – **భూర్భువస్స్వస్తరుః తారః సవితా ప్రపితామహః**

సూ - ప్రాణి గర్భవిమోచనే - జన్మను కలుగజేయుట. **సూతే సర్వ జగత్ ఇతి సవితా, సర్వస్య ఉత్పాదక ఇతి అర్థః.** సృష్టిలో సర్వమును సృష్టించువాడు సవిత.

94వ శ్లోకములో 887వ నామమునకు కూడా ఇదే అర్థం. కాని శ్రీ భట్టులు అర్చిరాదిమార్గం పరంగా వ్యాఖ్యానిస్తున్న సందర్భంలో ఆ నామం వచ్చింది. అర్చిరాది మార్గంలో ఏడవ దశ సూర్యుడు.

ప్రస్తుత నామమును శ్రీ భట్టులు 'సృష్టికర్త' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **సర్వేషామ్ సాక్షాత్ జనయితా సవితా.** సృష్టిలో సకలమును జనింపజేసినవాడు సవిత.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ తైత్తిరీయ ఉపనిషత్తు ఆనందవల్లి (6)నుండి ఉదాహరించారు. **సోఽకామ్యత, బహుస్యాం ప్రజాయేయేతి.** అతడు సంకల్పించాడు – నేను అనేకములుగా అగుదునుగాక. నేను జన్మింతును గాక.

శ్రీ కృష్ణన్ వివరణ – శ్రీ భట్టుల వ్యాఖ్యలో 'సాక్షాత్' అనే పదాన్ని మనం ప్రత్యేకంగా గమనించాలి. సాధారణంగా చతుర్ముఖ బ్రహ్మను సృష్టికర్త అంటుంటాము. కాని ఆ చతుర్ముఖ బ్రహ్మను సృష్టించినవాడు శ్రీహరియే.

సృష్టిలో 'అద్వారక సృష్టి', 'సద్వారక సృష్టి' అని రెండు దశలున్నాయి. అద్వారకసృష్టిలో భగవంతుడు ముందుగా 24 తత్వములను సృష్టించాడు. అవి – ప్రకృతి, మహత్, అహంకారము, పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు), పంచభూతములు (ఆకాశం, వాయువు, తేజస్సు, నీరు, భూమి), ఐదు కర్మేంద్రియములు (చేతులు, కాళ్ళు, నాలుక, గుదము, జననాంగము), ఐదు

జ్ఞానేంద్రియములు (చెవులు, కన్నులు, ముక్కు, నోరు, చర్మము) మరియు మనస్సు. అనంతరం ఆయన చతుర్ముఖ బ్రహ్మను సృష్టించాడు. ఆయనే బ్రహ్మకు అంతర్యామియై సృష్టికార్యమును అప్పగించాడు. అనంతరం చతుర్ముఖ బ్రహ్మ ద్వారా సద్వారకసృష్టి సాగింది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **సర్వస్య జగతః ప్రసవితా సవితా**. సకల జగత్తునకు జన్మనిచ్చినవాడు సవిత.

శ్రీ బలదేవ విద్యాభూషణ **'స-పితా'** అనే పాఠాన్ని గ్రహించారు. మరియు **'స', 'పితా'** అనేవానిని రెండు నామములుగా పరిగణించారు. ఆయన 'పితా' అనే నామమునకు చెప్పిన వ్యాఖ్య ఇంచుమించుగా శ్రీ భట్టులు 'సవితా' నామమునకు చెప్పిన వ్యాఖ్య (తండ్రి)తో సరిపోతుంది. తరువాతి నామము 'ప్రపితామహః' (అనగా తాత) గనుక ఈ నామమును 'సపితా'గా తీసుకుంటే అన్వయం బాగుంటుంది కావచ్చును. **తేషామ్ జనకత్వాత్ పితా.** అందరికీ తండ్రి గనుక పిత.

శ్రీ అనంతకృష్ణశాస్త్రి 94వ శ్లోకములోని నామమును 'సపితా' గా గ్రహించారు.

## 970. ప్రపితామహః

- బ్రహ్మదేవునికి తండ్రి.

### ఓం ప్రపితామహాయ నమః

పా - రక్షణే. పితృ - తండ్రి. పితామహ - తాత.
ప్ర-పితామహ – తాతకు పూర్వీకుడు. **పితామహీనామపి పితా ప్రపితామహః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – బ్రహ్మదేవుడు ప్రజాపతులను సృష్టించెను. ఆ ప్రజాపతులు ప్రజల ఉత్పత్తికి కారణమయ్యారు. కనుక బ్రహ్మదేవుని పితామహుడు (తాత) అంటారు. ఆ చతుర్ముఖ బ్రహ్మదేవునికి తండ్రియైనవాడు ప్రపితామహుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – **లోక పితౄణామ్ మరీచ్యాదీనామ్ పితా పితామహః చతుర్ముఖః, తస్య పితృత్వాత్ ప్రపితామహః.**

శ్రీ నమ్మాళ్వారు అనేక సందర్భాలలో భగవంతుడు బ్రహ్మను సృష్టించి, అతనిద్వారా తక్కిన సృష్టిని కావించినట్లు పేర్కొన్నారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పితామహస్య బ్రహ్మణోऽపి పితా ఇతి ప్రపితామహః.** పితామహుడైన బ్రహ్మకు పితయైనందున భగవంతుడు ప్రపితామహుడు.

ఇక వివిధ వ్యాఖ్యానకర్తల వైవిధ్యాన్ని గమనించడానికి ఇక్కడ శ్రీ రఘునాథ తీర్థ వ్యాఖ్యను చూడవచ్చును. **ప్రపీన్ తామయతి హన్తి చ ఇతి ప్రపితామహః. ప్రపీన్ మిథ్యాజ్ఞానాది రూప పాపవతః అసురాన్ తామయతి హన్తి చ ఇతి ప్రపి-తామ-హః.** మిథ్యాజ్ఞానులు, పాపులు అయిన అసురులను వధించి వారిని అంధకారంలో పడవేసేవాడు ప్రపితామహుడు.

## 971. యజ్ఞః

- యజ్ఞస్వరూపుడు, జపయజ్ఞమైనవాడు.

### ఓం యజ్ఞాయ నమః

48వ శ్లోకము. 446వ నామము. యజ్ఞః – **యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాం గతిః**
104వ శ్లోకము. 971వ నామము. యజ్ఞః – **యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః**

యజ్ - దేవపూజ సంగతి కారణ యజన దానేషు. **యజనమ్ యజ్ఞః. య ఇజ్యే స యజ్ఞః. యజన్తి యత్ర ఇతి యజ్ఞః. ఇజ్యతే అనేన ఇతి యజ్ఞః సాధనమ్.** సమర్పించునది, పూజింపబడువాడు, సమర్పించు వస్తువు లేదా సాధనము, ఇవన్నీ యజ్ఞములే.

**బ్రహ్మార్పణమ్ బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్**
**బ్రహ్మైవతేన గంతవ్యమ్ బ్రహ్మకర్మ సమాధినా** – గీత 4.24
యజ్ఞకార్యములందు ఉపయుక్తమగు స్రువాది సాధనములు బ్రహ్మము. హోమము చేయబడు ద్రవ్యము బ్రహ్మము. అగ్నియు బ్రహ్మము. యజ్ఞమునాచరించు కర్తయు బ్రహ్మము. హవన క్రియయు బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడైయుండు యోగిద్వారా పొందదగిన యజ్ఞఫలము కూడ బ్రహ్మమే.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

48వ శ్లోకము. 446వ నామము. యజ్ఞః – **యజ్ఞః తత్ సాధనః, తత్ ఫలావధిత్వేన ప్రతిపాదితః, అతో యజ్ఞః.** యజ్ఞము, యజ్ఞసాధనము, యజ్ఞఫలము కూడ అయినందున భగవానుడు యజ్ఞము.

**యజ్ఞో వై విష్ణుః** – తైత్తరీయ సంహిత
**తతశ్చ ఇజ్య ఆహుతిర్ద్వారా పోషితాస్తే హవిర్భుజః**
**వృష్టేః కారణతామ్ యాన్తి భూతానామ్ స్థితయే పునః** – విష్ణుపురాణము 2.8.101
యజ్ఞములలో సమర్పించిన హవిస్సులను స్వీకరించిన దేవతలు ప్రజల పోషణ కొరకు వర్షములు కురిపించుచున్నారు.
**అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహమౌషధమ్**
**మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్** – గీత 9.16
నేనే క్రతువును. నేనే యజ్ఞమును. స్వధయును నేనే. ఓషధులు నేనే. నేనే మంత్రమును. నేనే ఘృతమును. నేనే అగ్నిని. హోమరూపక్రియయును నేనే.
**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ**
**న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే** – గీత 9.24
ఏలనన సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడ నేనే. వారు నా పరమేశ్వర తత్త్వమును ఎఱుంగరు. కావున పతనమగుదురు. అనగా పునర్జన్మను పొందుదురు.

ప్రస్తుత (971వ) నామము. యజ్ఞః – **స్వారాధన ధర్మ సమృద్ధి రిక్తానామ్ తదర్థినామ్ స్వయమేవ యజ్ఞః.** భగవంతుని కోరుకొని ఆయనను ఆరాధించడానికి తగిన అవకాశము (సంభారములు, ధనము వంటివి) లేనివారికి, వారు కేవలం భగవన్నామ జపము చేస్తే చాలు, వారికి తానే యజ్ఞమయ్యేవాడు. అనగా నామజపమే యజ్ఞమగును.

**మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్**
**యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః** – గీత 10.25
మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఏకాక్షరమును అనగా ఓంకారమును నేను. యజ్ఞములందు జపయజ్ఞమును నేను. స్థావరములలో హిమాలయమును నేను.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – ఇంతకుముందు చెప్పిన **'సప్తజిహ్వః', 'సప్తైధాః'** వంటి మరికొన్ని నామములు కూడా యజ్ఞమునకు సంబంధించినవే కాని అవి యజ్ఞములు చేసే శక్తి సామర్థ్యములు కలవారికి భగవంతుడు ఎలా తోడుంటాడో వివరిస్తాయి. కాని ఈ

సందర్భంలో వచ్చే యజ్ఞ సంబంధిత నామములు సామాన్యులకు, అనగా విధియుక్తంగా యజ్ఞాలు చేయలేనివారికి, భగవంతుడే తోడు అని వివరిస్తాయి.

శ్రీ వాసిష్ఠ – **ఏవం చ యుజ్యతే సంగమ్యతే దీయతే చ యస్మా ఇతి నానార్థో యజ్ఞ శబ్దః.** ఎవరినైతే మనం ఆరాధిస్తామో, ఎవరికైతే సమస్త కర్మలు అర్పింపబడతాయో, ఆయన యజ్ఞము. మనం ఆత్మప్రీతికోసం కర్మలు చేస్తాము. అన్ని ఆత్మలకూ అంతర్యామియైన భగవంతుడు అన్నింటినీ గ్రహిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరుల వ్యాఖ్యలకు అనేక పాఠాలున్నాయి.

<u>48వ శ్లోకంలోని 'యజ్ఞః'</u> –

**సర్వ యజ్ఞ స్వరూపత్వాత్ యజ్ఞః.** అన్ని యజ్ఞములు భగవంతుని స్వరూపములే.
**సర్వేషామ్ దేవానామ్ తుష్టి కారకో యజ్ఞ ఆకారేణ ప్రవర్త ఇతి వా.** దేవతలను తృప్తిపరచడానికి భగవంతుడే యజ్ఞస్వరూపుడయ్యాడు.

<u>104వ శ్లోకంలోని 'యజ్ఞః'</u> –

**యజ్ఞ స్వరూపత్వాత్ యజ్ఞః.** యజ్ఞ స్వరూపుడు.
**యజ్ఞాత్మనా యజ్ఞః.** యజ్ఞమే ఆత్మగా గలవాడు.
**సంగంతా యజ్ఞః.**

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – 'యజ్' - సంగతి - సంబంధించిన. జీవులయొక్క కర్మలకు, వానికి తగు ఫలములకు తగు సంబంధము కలిగించువాడు యజ్ఞము.

శ్రీ బలదేవ విద్యాభూషణ – 48వ శ్లోకములోని 'యజ్ఞః' – **రుచి పత్న్యామ్ ఆకూత్యామ్ యజ్ఞనామ ఆవిర్భూతత్వాత్ యజ్ఞః.** రుచి, ఆకూతులకు 'యజ్ఞః' అనే పేరుతో జన్మించిన భగవానుడు 'యజ్ఞః'.

శ్రీ రఘునాథ తీర్థ 48వ శ్లోకములో **'యజ్ఞఇజ్యః'** అనే ఒక నామముగా పరిగణించారు. **యజ్ఞే ఇజ్యః స్తుత్యః పూజ్యః ఇతి యజ్ఞఇజ్యః.** యజ్ఞములలో పూజింపబడువాడు 'యజ్ఞఇజ్యః'.

శ్రీ చిన్మయానంద – లోకం క్షేమాన్ని ఆశించి, నిర్మలమైన మనస్సుతో, అంకితభావంతో, సర్వుల సహకారంతో ఆచరించేదే యజ్ఞము. అలాంటి కార్యం జరిగేచోట శ్రీమన్నారాయణుడు స్థితుడైయుంటాడు. కనుక ఆయన యజ్ఞము.

## 972. యజ్ఞపతిః

- యజ్ఞమునకు ప్రభువు. ఫలప్రదాత. యజ్ఞమును రక్షించేవాడు.

### ఓం యజ్ఞపతయే నమః

పా - రక్షణే - రక్షించుట, పాలించుట. పతి - ప్రభువు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వయజ్ఞ ఫలప్రదః యజ్ఞపతిః.** సకల యజ్ఞములకు తగు ఫలములనిచ్చేవాడు.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ** (గీత 9.24). సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడ నేనే.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యజ్ఞానామ్ పాతా స్వామీ వా యజ్ఞపతిః.** సకల యజ్ఞములకు ప్రభువు మరియు రక్షకుడు యజ్ఞపతి. శ్రీ శంకరులు పైనచెప్పిన గీతాశ్లోకము (9.24)ను ఉదాహరించారు.

శ్రీ వాసిష్ఠ – **స్వయం యజ్ఞరూపో యజనీయో యజ్ఞసాధనమ్ చ భగవాన్ యజ్ఞం పాతీత్యతో యజ్ఞపతిః.** భగవంతుడు స్వయముగా యజ్ఞస్వరూపుడు. యజ్ఞములద్వారా ఆరాధింపబడువాడు. మరియు ఆయనే యజ్ఞములు చేయు సాధనము, యజ్ఞములకు రక్షకుడు. కనుక ఆయన యజ్ఞపతి.

గీతా శ్లోకము (9.16)లో ఇదే విషయమున్నది.

**అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహమౌషధమ్**

**మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్** – గీత 9.16

నేనే క్రతువును. నేనే యజ్ఞమును. స్వధయును నేనే. ఓషధులు నేనే. నేనే మంత్రమును. నేనే ఘృతమును. నేనే అగ్నిని. హోమరూపక్రియయును నేనే.

శ్రీ చిన్మయానంద 'యజ్ఞము'ను ఇంతకుమందులాగానే విస్తృతంగా అన్వయించారు. అంకితభావంతో, పరస్పర సహకారంతో, లోకక్షేమం కొఱకు చేసే అన్ని కార్యాలకు భగవంతుడే భోక్త. గీత 3వ అధ్యాయంలో ఈ భావం సూచింపబడింది.

**యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః**

**తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర** – గీత 3.9

ఓ అర్జున! యజ్ఞము కొరకు చేయబడు కర్మలలో గాక ఇతర కర్మలయందు నిమగ్నులగుటవలన మనుష్యులు కర్మబంధములలో చిక్కుపడుదురు. కనుక నీవు ఆసక్తిరహితుడవై యజ్ఞార్థమే కర్తవ్యకర్మలను చక్కగా ఆచరింపుము.

యజ్ఞమనగా సేవాభావంతో, అంకితత్వంతో చేసే ఏదైనా సాంఘిక, సామాజిక, జాతీయ, వ్యక్తిగత కార్యము.

## 973. యజ్వా

- యజ్ఞమును చేయువాడు.

### ఓం యజ్వనే నమః

పాణిని సూత్రము (3.2.103) ప్రకారము 'యజ్వా' అనే పదము భూతకాలమునకు (అనగా యజ్ఞము పూర్తి చేసినవానికి) వర్తించును. కాని భగవానునకు భూత, భవిష్యత్, వర్తమాన కాలపరిమితులు లేవు.

**విశ్వనిర్మాణ రూపేణ తదర్థ సాధన సంపాదన రూపేణ చ యజ్ఞేనేష్టవాన్ యజతే, యక్షయతి ఇతి వా స యజ్వా విష్ణుః.** విశ్వమును సృజించుట, దానిని పోషించుట అనే పనుల రూపంలో యజ్ఞమును చేసినవాడు, యజ్ఞము చేయుచున్నవాడు మరియు ఇంకముందు యజ్ఞము చేయువాడు అయిన విష్ణువే యజ్వ.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అశక్తం తు స్వయం యష్టా తం యజ్వేతి ప్రచక్షతే.** తన ఆరాధనారూపమైన యజ్ఞమును చేయజాలని అశక్తులకోసం తానే స్వయంగా యజ్ఞము చేయువాడు, యజ్ఞము చేయు యజమాని. ఇందుకు శ్రీ భట్టులు మహాభారతంలోని కృష్ణుని మాటలను ఉదాహరించారు.

**తేషాం తు పవనాయ అహం నిత్యమేవ యుధిష్ఠిర ఉభే సంధ్యే అనుతిష్ఠామి హి అస్కన్నమ్ తద్వ్రతం మమ**

ఓ యుధిష్ఠిరా! అనుదినం దైనిక కార్యాలు ఆచరింపలేనివారి పాపములను తొలగించడం కోసం నేను ఉభయ సంధ్యలయందును యజ్ఞము చేయుచున్నాను. ఇది నా వ్రతము.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – ఈ శ్లోకము పరమైకాంతులకు, అనగా ఏవో వైకల్యాలకారణంగా నిత్యకర్మలు ఆచరింపజాలని వారికోసం వర్తిస్తుంది. కనుక శక్తి కలిగినవారు నిత్యకర్మలను అశ్రద్ధ చేయరాదు.

శ్రీ బలదేవ విద్యాభూషణ చెప్పిన వ్యాఖ్య కూడా శ్రీ భట్టుల వ్యాఖ్యతో సరిపోతుంది. **అశక్తమ్ అకించనమ్ ఆవిశ్య తత్ తదారాధనమ్ నివర్తయన్ స్వయమేవ యజ్వా.**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యజమానాత్మనా తిష్ఠన్ యజ్వా.** యజ్ఞములన్నింటికీ తానే యజమాని అయినవాడు యజ్వ. ఇక్కడ యజమాని అనగా యజ్ఞమునకు ప్రభువు. యజ్ఞమును ఆచరించువాడు. ఇందుకు శ్రీ శంకరులు గీత (9.24)నుండి ఉదాహరించారు. **అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ.** సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడ నేనే.

శ్రీ చిన్మయానంద – భగవంతుడు సకల కార్యములను లోకశ్రేయస్సు కొఱకు ఆచరించును. అదియే నిజమైన యజ్ఞము. ఇలా వేదోక్తవిధుల ప్రకారం యజ్ఞము చేయువాడు యజ్వ.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'యజ' అనగా 'దానము చేయుట, ఇచ్చుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. యజ - దేవపూజా సంగతి కరణ యజన దానేషు. **యజతే దత్తే వరాన్ భక్తేభ్య ఇతి యజ్వా.** భక్తులకు వరములను ఇచ్చువాడు యజ్వ.

## 974. యజ్ఞాంగః

- సమర్థులైన భక్తులు ఆచరించే యజ్ఞాలన్నీ ఆయన చేసే యజ్ఞంలోని భాగములు, మరియును ఆయనను అందుకునే సాధనములు.
- పూజ్యనీయములైన దివ్య అవయవములు కలిగినవాడు.
- శ్రీవరాహావతారములో ఆయన శరీరభాగములన్నీ యజ్ఞోపకరణములను సూచించును. అనగా ఆయన యజ్ఞస్వరూపుడు.
- యజ్ఞమునకు అవుసరమైనవన్నీ సమకూరేలా చేసేవాడు. మరియు యజ్ఞహవ్యములను స్వీకరించువాడు. మరియు యజ్ఞముద్వారా లభించువాడు.

### ఓం యజ్ఞాంగాయ నమః

'యజ్ఞ' పదమునకు వివరణ ఇంతకుముందు చెప్పబడింది. యజ్ - దేవపూజ సంగతి కారణ యజన దానేషు. సమర్పించునది, పూజింపబడువాడు, సమర్పించు వస్తువు లేదా సాధనము, ఇవన్నీ యజ్ఞములే.

'అంగ్' అనగా వెళ్ళుట - అనే ధాతువునుండి 'అంగ' పదము వచ్చును. దీనికి అవయవము, భాగము, ఉపకరణము అనే అర్థాలున్నాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సమర్థాన్ అనుష్ఠితమపి యజ్ఞాంతరమ్ అస్య శేషభూతమ్ ఇతి యజ్ఞాంగః.** శక్తిమంతులు ఆచరించే యజ్ఞాలన్నీ తాను చేసే కార్యానికి (యజ్ఞానికి) భాగములుగా ఉండేలా చేసేవాడు. అనగా మనం చేసే సమస్త యజ్ఞములూ భగవంతుని యజ్ఞమునకు లోబడి ఉంటాయి. మరియు అవన్నీ భగవంతుని పొందడానికి సాధనములు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – **యజ్ఞమ్ అంగమ్ అస్య ఇతి యజ్ఞాంగః.** మనం చేసే భగవదారాధన వంటి సమస్త యజ్ఞాలు ఆయనకు సమర్పించడానికి, తద్వారా ఆయనను పొందడానికి సాధనములు. అన్నింటికీ అంతిమ లక్ష్యము శ్రీమన్నారాయణుడే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **యజ్ఞాని పూజనీయాని అంగాని చరణాది మస్తకాంతాని యస్య ఇతి యజ్ఞాంగః.** భగవంతుని పాదపద్మములనుండి దివ్యశిరస్సువరకు సమస్త అంగములు పూజనీయములైన దివ్యాంగములు గనుక ఆయన యజ్ఞాంగుడు.

శ్రీశంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు ఈ నామమును శ్రీవరాహావతారము పరంగా వ్యాఖ్యానించారు. **యజ్ఞ అంగాని యస్య ఇతి వరాహమూర్తిః యజ్ఞాంగః.** శ్రీవరాహమూర్తి శరీరభాగములన్నీ యజ్ఞభాగములుగా వర్ణింపబడినవి. శ్రీ శంకరులు ఇందుకు హరివంశము (3.34 - 3.41)నుండి ఉదాహరించారు. శ్రీ మద్భాగవతము (3.13.34-39)లో కూడా ఈ వర్ణన ఉన్నది. విష్ణుపురాణంలో ఈ వర్ణన ఉన్నది.

శ్రీయజ్ఞవరాహమూర్తికి వేదములే పాదములుగా, యూపములు దంష్ట్రలుగా, క్రతువే హస్తముగను, చయనము ముఖముగను, అగ్ని జిహ్వగను, దర్భలు రోమములుగను, బ్రహ్మ శిరస్సుగను, అహోరాత్రములు నక్షత్రములుగాను, వేదాంగములు కర్ణాభరణములుగను, నాసిక స్రుక్కుగను, ముట్టెయే శ్రవణముగను, సామగానమే అరుపుగను హరివంశమునందు మనోహరముగ వర్ణింపబడియున్నందున శ్రీహరి 'యజ్ఞాంగః' అని భజింపబడుచున్నాడు (శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి).

శ్రీ వాసిష్ఠ – **ఇజ్యతే యః, ఇజ్యతే యేన, ఇజ్యతే యస్మై, ఇజ్యతే యత్ర వా ఇతి యజనీయః, యజన సాధనమ్ హవిరాది, యజన సంప్రదాయమ్ ఉద్దేశో, యజన స్థలాధికమ్ చ సర్వమ్ యజ్ఞ శబ్దేన గృహీతమ్ భవతి.** ఒక యజ్ఞమునకు సంబంధించినవన్నీ 'యజ్ఞము' అనవచ్చును. ఎవరికోసం యజ్ఞము చేస్తున్నామో ఆయన, ఎవరు యజ్ఞం చేస్తున్నాడో అతను, యజ్ఞముయొక్క ఉద్దేశ్యము, యజ్ఞము చేసే స్థలము, యజ్ఞమునందు వాడే సాధనములు (నెయ్యి వంటివి) – వీటన్నింటినీ 'యజ్ఞ' శబ్దము ద్వారా సూచింపవచ్చును. కనుక 'యజ్ఞాంగుడు' అనగా ఇవన్నీ సమకూరేలా చేసేవాడు. యజ్ఞములో అర్పించినవానిని స్వీకరించేవాడు (**స్వయం యజనయో యజ్ఞరూపః సన్ యజ్ఞ రూపాణి హవిరాదీని యజ్ఞస్థలం గత్వా ప్రాప్నోతి ఇతి యజ్ఞాంగః**), మరియు యజ్ఞముద్వారా లభించేవాడు (**యజ్ఞే అంగనమ్ - గతిః యస్య, స యజ్ఞాంగః, యజ్ఞైః - యజన కర్మభిః అంగః - ప్రాప్తిః యస్య స యజ్ఞాంగః**).

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము – 'అంగము' అనగా భాగము. యజ్ఞములో వాడే అన్నింటికీ (అనగా బ్రహ్మ, హోత, అధ్వర్యు, హవిస్సు వంటివానికి) అంతర్యామి అయినందున భగవంతుడు యజ్ఞాంగుడు.

**శ్రీమద్భాగవతము. తృతీయ స్కంధము** శ్రీ ఏల్చూరి నారాయణరావు, డా. ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరావుల రచనలనుండి సంగ్రహించినది. **శ్రీవరాహావతార వర్ణన**

భగవానుని ధ్యానం చేస్తున్న బ్రహ్మ ముక్కు రంధ్రాలనుండి అంగుష్ఠమాత్రం ప్రమాణంకల వరాహం ఒకటి వెలువడి క్షణంలో మహాగజమంతయ్యింది. బ్రహ్మ, మరీచ్యాదులు అచ్చెరువందగా ఆ వరాహం కొండంత పెరిగి బృహద్రూపాన్ని ధరించింది. ఆ సూకరం దిక్కులు మార్మ్రోగేటట్లు ఘుర్ఘురించింది. ఆ ధ్వని విని జనలోక తపోలోక సత్యలోక వాసులు ఋగ్యజుస్సామ మంత్రాలతో ఆ మాయావరాహమూర్తియైన భగవంతుని ప్రస్తుతించారు. ఆ స్తుతులకు తన సంతోషాన్ని తెలియజేస్తున్నట్లుగా ఆ వేదమూర్తి తల పంకించి, ఘుర్ఘురించి, తోక యెత్తి, సటలు విదిల్చి, రోమాలు నిగుడించి, నింగిపైకెగసి, కాలిగిట్టలతో జలదమండలాన్ని తన్ని, తెల్లని కోరలని త్రిప్పుతూ, మూతి ముట్టెతో వాసనలానుతూ జలగర్భంలోనికి ప్రవేశించింది. ఆ మహోత్పాతానికి సాగరజలం పాయలుగా విడబారింది. ఆ మహావరాహం సాగరాంతంలో ఉన్న భూమిని నిజ దష్ట్రాగ్రంతో పైకెత్తి, రసాతలంనుండి వెలికి రాసాగింది. అప్పుడు

అడ్డం వచ్చిన హిరణ్యాక్షుడనే దైత్యుని ఆ వరాహమూర్తి చక్రంతో తెగటార్చాడు. ఆ శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు భక్తిశ్రద్ధలతో ఇలా సన్నుతించారు.



1800 కాలానికి చెందిన చిత్రం. ఇతర చిత్రాలు, శిల్పాలకు భిన్నంగా ఇందులో శ్రీ భూవరాహమూర్తి గరుడారూఢుడై యున్నాడు.

https://commons.wikimedia.org/wiki/File:Anonymous_-_Vishnu_as_Varaha,_the_Boar_Avatar,_Slays_Banasur,_A_Demon_General,_Page_from_an_Unknown_Manuscript_-_1974.221_-_Metropolitan_Museum_of_Art.jpg

దేవ! జిత, జితం తే పరమేశ్వర! జిత యజ్ఞభావన! శ్రుతిశరీర!
యనుచు గారణ సూకరాకారుడగు నీకు నతిభక్తి మ్రొక్కెదమయ్య, వరద!
భవదీయ రోమకూపములందు లీనంబు లైయుండు నంబుధు, లట్టి యధ్వ
రాత్మకమై తనరారు నీ రూపంబు గానంగరాదు దుష్కర్మపరుల
కట్టి నీకు బ్రణామంబు నాచరింతు
మఖిల జగదేకకీర్తి! దయానువర్తి
భవ్య చారిత్ర! పంకజపత్రనేత్ర!
చిర శుభాకార! యిందిరా చిత్తచోర!

దేవా! చర్మంలో సకల వేదాలు, రోమాలయందు బర్హిస్సులు, నీ కన్నులయందు నేయి, నీ నాల్గు పాదాలలోను బ్రహ్మ, హోత, ఉద్గాత, అధర్వులనబడేవారు చేసే యజ్ఞకర్మలు, ముట్టెయందు స్రుక్కు, నాసికయందు స్రువము, ఉదరంలో పాత్ర, చెవులు నోరు అనే రంధ్రములయందు చమస ప్రాశితములు, కంఠమందు ఇష్టిత్రికము, నాలుకయందు ప్రవర్గ్యము, నీ నమలుటయందు అగ్నిహోత్రములు, చయనములు కదా! అవసరమైనప్పుడెల్ల నీవు ఆవిర్భవించుట తీక్షణీయ ఇష్టియగును.

నీ కోరలు ప్రాయణీయం అనే దీక్షానంతర ఇష్ఠి, దయనీయం అనే సమాప్త ఇష్ఠి అవుతాయి. నీ రేతమే సోమం. నీ అవస్థానం ప్రాతస్సవనం మొదలైనవి. నీ చర్మం, మాంసం మొదలైన సప్తధాతువులు అగ్నిష్టోమ, ఉక్థ్య, షోడశి, వాజపేయ, అతిరాత్ర, అప్తోర్యాయములనే సప్తసంస్థా భేదములు. ద్వాదశ రూపమైన అనేక యజ్ఞసమూహాలు అయిన సర్వసత్రాలు నీ శరీరసంధులవుతాయి. సోమసహిత సోమరహితములైన యజ్ఞక్రతువులు అన్నీ నీవే. నీవు యజ్ఞబంధనాదులచేత ప్రకాశిస్తూ ఉంటావు.

సజ్జనుల హృదయం అనే నీటిపడియలో దిగిఉన్న ఓ సూకరసాదృశ్యము కలిగినవాడా! ఓ భూరమణా! ఓ లక్ష్మీపతీ! దేవోత్తమా! నీవు నాల్గువేదాలు మూర్తీభవించినవాడివి. నీ తెల్లని కోరపైన ఉన్న భూమి కులపర్వతంయొక్క ప్రకాశించే శిఖరంపై తగులుకొనియున్న మేఘంవలె ప్రకాశిస్తోంది. అధికమైన స్థావరజంగమైన ఈ భూచక్రాన్ని ఉద్ధరించు. ఈ తెల్లని కోరచివర తగిలిఉన్న ఈ పర్వతాలు, నదీనదాలు, అరణ్యాలతో కూడియున్న ఈ భూతలం, సరస్సులో మునిగి లేచిన గజరాజు దంతం చివర తగులుకొన్న నల్లకలువవలె శోభిల్లుతూంది.

దేవా! విశ్వానికే జనకుడవైన నీవు మాకు తండ్రిలాంటివాడవు. నీ పత్ని భూదేవి మాకు తల్లితో సమానం. మీ ఇరువురకూ చేతులు జోడించి మీ దయాభిక్షను అర్థిస్తున్నాము. నీ తేజాన్ని ధరించిన భూదేవి పవిత్రయై అలరారుచున్నది. నీవిప్పుడు ధర్మోద్ధరణ కావించి మాకు నివాసస్థానాన్ని కల్పింపగలవని అర్థార్థులమై వచ్చి చేరాము.

దేవా! నీవు రసాతలంనుండి భూమిని ఉద్ధరించి కొనితెచ్చే వేళ నీ మేని విదుర్పులకు నీ సటోచ్చలితమైన జలకణాలు సోకి జనలోక తపోలోక సత్యలోక వాసులమైన మేమందరమూ పవిత్రీకృతులమయ్యాము.

దేవా! నీ శక్తి అనంతమహిమోపేతం. లోకమంగళాన్ని కలిగించు. నీ యోగమాయలో మునిగి స్వరూపజ్ఞానాన్ని కోల్పోయిన మాకు అచింత్యమన నీ శక్తిని గ్రహించి, నిన్ను భజించడానికి తగినంత జ్ఞానాన్ని అనుగ్రహించు – అని బ్రహ్మాదులు స్తుతింపగా పరమేశ్వరుడు సంప్రీతస్వాంతుడై తన గోటిలో ఉన్న మున్నీటియందు భూమిని నిలిపి అంతర్హితుడైనాడు.

విదురా! ఈ వరాహచరిత్రను భక్తితో ఆకర్ణించినవారి హృదయాంతరంలో ప్రపన్నార్తిహరుడైన పరమేశ్వరుడు ప్రసన్నుడౌతాడు.

## 975. యజ్ఞవాహనః

- యజ్ఞమును సంపూర్ణం చేసే అవకాశం కలిగించేవాడు.
- యజ్ఞములకు తగిన ఫలములను అందజేసేవాడు.
- పూజనీయుడైన గరుడుని వాహనంగా గలవాడు.

### ఓం యజ్ఞవాహనాయ నమః

వహ - ప్రాపనే - మోయుట, తీసికొని వెళ్ళుట, ప్రవహించుట. 'వహ' ధాతువునుండి 'వాహన' అనే పదం వచ్చింది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తేషామ్ భక్తి శ్రద్ధా అధికార దానేన యజ్ఞమ్ వాహయతి ఇతి యజ్ఞవాహనః.** యజ్ఞములను ఆచరించే కర్తలకు తగిన భక్తి, శ్రద్ధ, అధికారములను ఇచ్చి వారు యజ్ఞములు పూర్తిచేసేలా అనుగ్రహించేవాడు యజ్ఞవాహనుడు.

ఇలా ఇంతకుముందు నామములను – **యజ్ఞపతిః, యజ్వా, యజ్ఞాంగః, యజ్ఞవాహనః** – చూచినట్లయితే భగవానుడు స్వయంగా యజ్ఞములు చేయగలిగినవారికి తత్ఫలములనిచ్చే యజ్ఞపతి. అలా స్వయంగా యజ్ఞములనాచరింపలేని అశక్తుల పక్షాన తానే

యజ్ఞములు చేయు యజ్వ. యజ్ఞములద్వారా పొందబడు యజ్ఞాంగుడు. యజ్ఞములు చేసేవారికి అవుసరమైన శ్రద్ధ, శక్తి, అధికారము ఇచ్చే యజ్ఞవాహనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఫలహేతు భూతాన్ యజ్ఞాన్ వాహయతి ఇతి యజ్ఞవాహనః.** సత్ఫలితాలను (లోకశ్రేయస్సును) ఆశించి చేసే యజ్ఞములను విజయవంతంగా సంపూర్ణము చేయించేవాడు యజ్ఞవాహనుడు.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – ఫలదాయకంబులగు యజ్ఞములే వాహనముగా కలిగియున్నందున పరమాత్మ 'యజ్ఞవాహనః' యని కీర్తింపబడెను.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'వాహన' అనగా వాహనము (బండి, రథము) అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **యజ్ఞమ్ - పూజనీయమ్, వాహనమ్ - వైనతేయో యస్య ఇతి యజ్ఞవాహనః.** పూజనీయుడైన వైనతేయుడు (గరుత్మంతుడు) వాహనముగా కలిగినవాడు యజ్ఞవాహనుడు.



11వ శతాబ్దానికి చెందిన బంగ్లాదేశ్ ప్రాంతపు శిల్పం.

https://commons.wikimedia.org/wiki/File:Bangladeshi_-_Vishnu_Riding_Garuda_-_Walters_25242.jpg



## యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః |
## యజ్ఞాంతకృద్యజ్ఞగుహ్యమన్నమన్నాద ఏవ చ || (105)

### 976. యజ్ఞభృత్

- యజ్ఞమును విజయవంతంగా సంపూర్ణం చేసే భారము వహించువాడు (నిర్వహణలో ఏవైనా లోపములు ఉన్నప్పటికీ)

ఓం యజ్ఞభృతే నమః

భృ - పోషణ ధారణయోః - పోషించుట, ఆధారమగుట. యజ్ఞమ్ **బిభర్తి - పుష్ణాతి, ధారయతి ఇతి యజ్ఞభృత్.** యజ్ఞమునకు ఆధారమైనవాడు. యజ్ఞమును చక్కగా పూర్తి చేయించేవాడు యజ్ఞభృత్.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **వికల్పమపి యజ్ఞమ్ స్వ-స్మరణ పూర్ణాహుతిభ్యామ్ పుష్ణాతి ఇతి యజ్ఞభృత్.**

**పూర్ణాహుతి స్వస్మృతిభ్యాం విఫలం యజ్ఞమప్యుత పుష్ణాతి యజ్ఞభృత్సస్యాత్ సప్తార్ణో మనురుత్తమః.** యజ్ఞము చేసేటపుడు ఏదైనా లోపం జరిగినప్పటికీ, తనను తలచి పూర్ణాహుతి చెయ్యటంచేత, ఆ యజ్ఞంయొక్క ఫలితం పూర్తిగా ఇచ్చేవాడు యజ్ఞభృత్. ఈ నామము సప్తాక్షరీమహామంత్రము. ఉత్తమమైనది. ఓం యజ్ఞభృతే నమః (శ్రీకైవల్యసారధి).

శ్రీ భట్టులు శ్రుతినుండి ఉదాహరించారు. **ప్రమాదాత్ కుర్వతామ్ కర్మ ప్రచ్యవత్యధ్వరేషు యత్ స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణమ్ స్యాదితి శ్రుతిః.** యజ్ఞనిర్వహణలో ప్రమాదవశాత్తు ఏవైనా దోషాలు సంభవించినప్పటికీ, అవి విష్ణుసంస్మరణవలన తొలగిపోయి యాగము సంపూర్ణం అవుతుందని శ్రుతి చెబుతున్నది.

శ్రీ వేలుక్కుడి కృష్ణన్ – యజ్ఞము చేయు వ్యక్తి ఏ కారణంచేతనైనాగాని అశక్తుడైనట్లయితే, ఆ యజ్ఞాన్ని చక్కగా పూర్తి చేయించే 'భారాన్ని' భగవంతుడే భరిస్తాడని 'భృత్' పదంవల్ల గ్రహించాలి. యజమాని చేయవలసిందల్లా, యజ్ఞం చివర పూర్ణాహుతి సమయంలో, శ్రీకృష్ణభగవానుని పాదపద్మాలను స్మరించి, మంత్ర, తంత్ర, విధి, విపర్యాసాదులలోని దోషములను మన్నించమని వేడుకోవాలి.

పూర్ణాహుతి సమయంలో పఠించే కొన్ని మంత్రాలు –

**ప్రాయశ్చిత్తా న్యశేషాని తపః కర్మాన్యాత్మకాని వై యాని తేషామ్ అశేషాణామ్ శ్రీకృష్ణానుస్మరణమ్ పరమ్**
**ఉపచారాపదేశేన కృతాన్ అహరర్మయా అపచారాన్ ఇమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ**
**పూర్ణాహుతిమ్ ఉత్తమమ్ జుహోతి, కర్మమ్ వై పూర్ణాహుతిః ఆవిర్గీర్భిః యతతోన ఉనమ్ తేన ఉక్తిమ్ విధేమ**

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యజ్ఞమ్ బిభర్తి పాతి ఇతి యజ్ఞభృత్.** యజ్ఞభర్తయును, యజ్ఞపాలకుడును పరమాత్మయే యగుటచేత 'యజ్ఞభృత్' అను మంగళవాచ్యుడగుచున్నాడు. పుణ్యప్రదములగు యజ్ఞములను జయప్రదముగా కొనసాగించువాడు పరమాత్మయే (శ్రీ పెమ్మరాజు రాజారావు).

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – యజ్ఞమును జయప్రదముగా సాగించుటకు ఏ యజ్ఞంలోనైనా హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నలుగురు పురోహితులుంటారు. బాగా పెద్ద యజ్ఞాలలో 16మంది పురోహితులుంటారు.

శ్రీ చిన్మయానంద 'యజ్ఞము' అనగా లోకక్షేమం కొరకు చేసే అన్ని పనులూ అనే అర్థాన్ని కొనసాగించారు. స్వార్థం లేకుండా, అంకితభావంతో, సేవాదృక్పథంతో చేసే అన్ని కార్యాలనూ చక్కగా చేయించేవాడు 'యజ్ఞభృత్'.

## 977. యజ్ఞకృత్

- యజ్ఞమును సృష్టించినవాడు.

### ఓం యజ్ఞకృతే నమః

శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా ఈ నామమునకు 'లోక కళ్యాణార్థము యజ్ఞమును సృష్టించినవాడు' అనే అర్థాన్ని చెప్పారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **జగద్ హితాయ యజ్ఞమాది సృజతి ఇతి యజ్ఞకృత్.** లోకక్షేమం కొఱకు యజ్ఞమును సృష్టించినవాడు యజ్ఞకృత్.

**సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః**
**అనేన ప్రసవిష్యధ్వమేవ వోస్త్విష్ట కామధుక్** – గీత 3.10
**దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః**
**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ** – గీత 3.11
**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః** – గీత 3.12

కల్పాదియందు బ్రహ్మదేవుడు యజ్ఞసహితముగ ప్రజలను సృష్టించి, 'మీరు ఈ యజ్ఞములద్వారా వృద్ధి చెందుడు. ఈ యజ్ఞములు మీకు కామధేనువువలె కోర్కెలనెల్ల తీర్చును' అని పల్కెను. 'ఈ యజ్ఞముల ద్వారా మీరు దేవతలను తృప్తిపరచుడు. మరియు ఆ దేవతలు మిమ్ములను అనుగ్రహింతురు. నిస్వార్థ భావముతో మీరు పరస్పరము సంతృప్తి పరచుకొనుచు పరమశ్రేయస్సును పొందగలరు' అని పల్కెను. యజ్ఞములద్వారా సంతృప్తి పొందిన దేవతలు మీకు (మానవులకు) అయాచితముగనే ఇష్టమైన భోగములను ప్రసాదించెదరు.

**'వషట్కారః'** నామ వివరణలో శ్రీ రాధాకృష్ణశాస్త్రి దేవతలకు, మనుష్యులకు యజ్ఞముద్వారా లభించిన పరస్పర సంబంధమును వివరించారు – మానవులొనరించిన యజ్ఞములద్వారా తమకు లభించు హవిర్భాగములపై దేవతలు ఆధారపడుదురు. దేవతలద్వారా లభించే వర్షాదులతో మానవుల మనుగడ కొనసాగును. ఇలా దేవతలకు, మనుష్యులకు మధ్య వారధిగా ఉండేలా భగవంతుడు యజ్ఞమును సృష్టించాడు. కనుక ఆయన 'యజ్ఞకృత్'.

'యజ్ఞకృత్' అనగా యజ్ఞములు చేయువాడు అనే అర్థం కూడా చెప్పవచ్చును. శ్రీ చిన్మయానంద ఇలా వ్యాఖ్యానించారు. యజ్ఞమును చేయును గనుక భగవంతుడు యజ్ఞకృత్. జీవుల కళ్యాణార్థము భగవంతుడు సృష్టి అనే యజ్ఞమును ఆచరించాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **యజ్ఞాన్ మఖాన్ స్వయమపి కరోతి అవతార విగ్రహే ఇతి యజ్ఞకృత్.** తన అవతారములలో భగవంతుడు స్వయంగా యజ్ఞములు ఆచరించాడు గనుక యజ్ఞకృత్.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఇంతకుముందు ('కృత్'తో వచ్చిన నామములకు వలె) కొన్ని నామాలకు చెప్పినట్లుగానే శ్రీ శంకరులు రెండు అర్థాలు చెప్పారు (1) యజ్ఞములు సృష్టి చేయువాడు (2) యజ్ఞములను అంతం చేయువాడు (కృన్తతి - నాశనం చేయును).

**జగదాదౌ యజ్ఞమ్ కరోతి, తదన్తే యజ్ఞమ్ కృన్తతి ఇతి వా యజ్ఞకృత్.** సృష్టి ఆరంభ సమయంలో యజ్ఞమును సృష్టించినవాడు, ప్రళయకాలంలో యజ్ఞములను అంతం చేయువాడు 'యజ్ఞకృత్'.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – విశ్వకళ్యాణార్థము చేయబడు యజ్ఞములను జయప్రదం చేయువాడును, దుర్బుద్ధితో చేయు యజ్ఞములను ధ్వంసము చేయువాడును శ్రీహరియే యగుటచే 'యజ్ఞకృత్' నామవాచ్యుడగును.

డా. క్రోవి పార్థసారధి. శ్రీకైవల్యసారధి రచననుండి – జగత్తుయొక్క ఆదియందు, అంతమందు కూడా యజ్ఞమును ఆచరించేవాడు. ప్రళయకాలములో యజ్ఞమును ప్రవర్తిల్లకుండా చేసేవాడు 'యజ్ఞకృత్'.

## 978. యజ్ఞీ

- ఎవని కొఱకు సకలయజ్ఞములు ఆచరింపబడతాయో ఆయన. యజ్ఞములు ఇతని సొత్తు. సకల యజ్ఞములకు తానే ప్రభువైనవాడు.

### ఓం యజ్ఞినే నమః

'యజ్ఞ' పదమునకు 'ఇని' ప్రత్యయము చేర్చుటద్వారా 'యజ్ఞీ' పదము వచ్చును. 'ఇనీ', 'మతుప్' ప్రత్యయములకు 'కలిగియుండుట, స్వంతదారు అగుట' అనే అర్థాలు వస్తాయి. **యజ్ఞః అస్య అస్తి ఇతి యజ్ఞీ.** యజ్ఞములద్వారా ఆరాధింపబడువాడు యజ్ఞి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **సర్వయజ్ఞానామ్ శేషీ యజ్ఞీ.** సకల యజ్ఞములకు అధిపతి (శేషి) అయినవాడు యజ్ఞి. ఆయన సంతృప్తి కొఱకే అన్ని యజ్ఞములు చేయబడును.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవచ**
**న తు మామభిజానంతి తత్వేనాతశ్చ్యవంతి తే** – గీత 9.24
ఏలనన సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడ నేనే. వారు నా పరమేశ్వరతత్వమును ఎఱుంగరు. కావున పతనమగుదురు. అనగా పునర్జన్మను పొందుదురు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 5.6.4 – సకల జనులు ఆచరించే కార్యముల ఫలములు నావే.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – భగవంతుని కొరకు భక్తులు ఆచరించే కైంకర్యాది కార్యాలలో ఏమైనా లోపములున్నా గాని చివరకు భక్తునికి భగవత్ప్రాప్తి కలుగుతుంది. ఇందుకొరకు శ్రీ తొండరాడిపొడియాళ్వారు తిరుమాలై 25వ పాశురంనుండి 30వ పాశురం వరకు ఉదాహరింపవచ్చును. ఆళ్వారు భగవంతునితో ఇలా మొఱపెట్టుకొన్నాడు – నేను నా వర్ణమునకు నిర్దేశింపబడిన కర్మలను చేయలేదు. జ్ఞానయోగాన్ని గాని, భక్తియోగాన్ని గాని సాధన చేయలేదు. భగవంతుని భజిస్తూ కాలం గడుపలేదు. కనీసం గజేంద్రునిలా ఒక పువ్వును కూడా సమర్పించలేదు. ఉడుతలా నాలుగు ఇసుకరేణువులను స్వామి కైంకర్యంకోసం మోయలేదు. నేను చేసిందల్లా ప్రభువు అనుగ్రహం కోసం ఆక్రోశించడమే. దీనినే ఆ దేవదేవుడు యజ్ఞంలా భావంచి నన్ను తన పాదపద్మముల దరిని చేర్చుకున్నాడు. (భగవంతునిపట్ల తనకున్న నైచ్యానుబంధం ఆళ్వారుతో ఇలా పాడించింది.)

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యజ్ఞానామ్ తత్ సమారాధనాత్మనమ్ శేషీ ఇతి యజ్ఞీ.** అన్ని యజ్ఞములకు శేషి అయినవాడు యజ్ఞి. అనగా యజ్ఞములు ఆయనను ఆరాధించడానికే నిర్విపంబడుతున్నాయి.

## 979. యజ్ఞభుక్

- యజ్ఞమునకు భోక్తయై అందు సమర్పింపబడిన పదార్థములను ప్రీతితో భుజించువాడు.
- యజ్ఞమును రక్షించువాడు.

### ఓం యజ్ఞభుజే నమః

భుజ్ - పాలన అభ్యవహారయోః - రక్షించుట, తినుట, అనుభవించుట. **యజ్ఞమ్ భుంక్తే, భునక్తి ఇతి వా యజ్ఞభుక్.** యజ్ఞమును అనుభవించువాడు, యజ్ఞమును రక్షించువాడు యజ్ఞభుక్.

శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా రెండు అర్థాలనూ చెప్పారు. శ్రీ కృష్ణదత్త భరద్వాజ 'భుక్తే - అశ్నాతి - భుజించుట' అనే అర్థాన్ని ప్రధానంగా చెప్పారు. **ఇజ్యన్తే దీయన్తే సమర్పయన్తే స్వజనైః ఇతి యజ్ఞః, అర్థాత్ నానావిధ రుచిరాః పదార్థాః తాన్ భుంక్తే అశ్నాతి ఇతి యజ్ఞభుక్.** యజ్ఞములో అర్పింపబడు వివిధ పదార్థములను ప్రీతితో స్వీకరించి భుజించి ఆనందించువాడు యజ్ఞభుక్. ఇందుకు శ్రీ భరద్వాజ గీతనుండి ఉదాహరించారు.

**పత్రమ్ పుష్పమ్ ఫలమ్ తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహమ్ భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః** – గీత 9.26
నిర్మల బుద్ధితో, నిష్కామ భావముతో పరమభక్తునిచే సమర్పింపబడిన పత్రమును గాని, పుష్పమును గాని, ఫలమును గాని, జలమునుగాని నేను ప్రత్యక్షముగా (స్వయముగా) ప్రీతితో ఆరగింతును.

ఈ గీతాశ్లోకమునుండి, మరియు ఇంతకుముందు నామములో ఉదాహరించిన శ్రీ తొండరాడిప్పొడియాళ్వారు పాశురమునుండి మనము గ్రహింపవలసినది ఏమనగా – దీక్షతో, అంకిత భావముతో చేసినదేదైనా యజ్ఞము అవుతుంది. ప్రేమతో, భక్తితో ఎంత స్వల్పమైనదానిని సమర్పించినాగాని భగవంతుడు ప్రీతితో స్వీకరిస్తాడు.

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ గీత (9.24) శ్లోకమును ఉదాహరించారు. **అహం హి సర్వ యజ్ఞానామ్ భోక్తా చ ప్రభురేవ చ.** సకల యజ్ఞములకు భోక్తను, స్వామిని కూడా నేనే.

శ్రీ కృష్ణన్ – భగవంతుని యాగరక్షకత్వము శ్రీరామావతారంలో స్పష్టంగా కనుపిస్తుంది. రాక్షసులను వధించి ఆయన విశ్వామిత్రుని యాగాన్ని రక్షించాడు. అన్ని యజ్ఞములకూ భగవానుడే, లక్ష్యము, సాధనము, భోక్త, రక్షకుడు.

శ్రీ చిన్మయానంద – యజ్ఞంలో అనేక దేవతలను ఉద్దేశించి హవిస్సులను సమర్పించినా, అవన్నీ భగవంతునికే చెందుతాయి.

శ్రీకైవల్య సారథి – యజ్ఞముయొక్క భోక్త తానైయుండి, యజ్ఞకర్తకు ఆ ఫలమునిచ్చి అనుభవింపజేసేవాడు యజ్ఞభుక్.

## 980. యజ్ఞసాధనః

- యజ్ఞములకు భగవంతుడే సాధనము (ఉపకరణము).
- యజ్ఞము అనే సాధనము ద్వారా భగవంతుని పొందవచ్చును.
- శుభకరమైన ఫలితములనిచ్చువాడు.

### ఓం యజ్ఞసాధనాయ నమః

సాధ్ - సంసిద్ధౌ - పూర్తి చేయుట, సాధించుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తే అస్య జ్ఞాన సిద్ధ్యుపాయా ఇతి యజ్ఞసాధనః.** భగవంతుని గురించిన జ్ఞానము కారణంగానే యజ్ఞము కామ్యార్థసిద్ధికి సాధనం అవుతుంది. కనుక ఆయన సిద్ధిసాధనుడు. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసింది ఏమంటే భగవంతుని గురించిన జ్ఞానము. మనకు భగవంతునికి మధ్యనున్న సంబంధము శేషశేషీభావము (సేవకునికి, ప్రభువునకు మధ్యనుండే సంబంధము). అన్నింటికంటే ముఖ్యంగా భగవంతునికి ఏదైనా సమర్పించేటపుడు దానిని ప్రేమతో సమర్పించుట. ఇవన్నీ సత్ఫలితాలు పొందడానికి అత్యవుసరం. ఏమి అర్పించామన్నది అంత ప్రధానం కాదు. ఆ సమర్పణలో ఉండే అంకితభావం అతిముఖ్యం.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా కొంచెం ఇలానే వ్యాఖ్యానించారు. **జ్ఞాన దానేన యజ్ఞ ఉపకారిత్వాత్ యజ్ఞసాధనః.** యజ్ఞమును గురించి, దాని విధివిధానముల గురించి, అవుసరమైన జ్ఞానమును భగవంతుడే ప్రసాదిస్తాడు. ఆ విధంగా ఆయన యజ్ఞనిర్వహణకు సహాయపడ్డాడు. కనుక ఆయన యజ్ఞసాధనుడు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – **ప్రాప్తి ఉపాయాః యజ్ఞమ్.** భగవంతుని పొందే ఉపాయము (సాధనము) యజ్ఞము. కనుక యజ్ఞమంటే కేవలం హోమకుండంలో చేసే ప్రక్రియ మాత్రమే కాదు. భగవంతునికి చేసే నిత్య ఆరాధనాది ఉపచారములన్నీ యజ్ఞములే. వీటిని శ్రద్ధాభక్తులతో ఆచరిస్తే వానినే భగవంతుడు తనను పొందే యజ్ఞములు అనే ఉపాయములు (సాధనములు)గా స్వీకరించును. కనుక ఆయన యజ్ఞసాధనుడు.

శ్రీ వాసిష్ఠ – **యజ్ఞః సాధ్యతే అనేన, యజ్ఞమ్ సాధయతి వా యజ్ఞసాధనః.** ఆయన ద్వారా యజ్ఞములు సాధ్యమగును. యజ్ఞముల ఫలములు ఆయనద్వారా సిద్ధించుచున్నవి. కనుక ఆయన యజ్ఞసాధనుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యజ్ఞః సాధనమ్ తత్ ప్రాప్తౌ ఇతి యజ్ఞసాధనః.** భగవంతుని పొందుటకు (సాధించుటకు) యజ్ఞములే సాధనములు (ఉపాయములు) గనుక ఆయన యజ్ఞసాధనుడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **యజ్ఞః పూజా ఆరాధనమ్ వా తమ్ భక్తానామ్ సాధయతి ఇతి యజ్ఞసాధనః, తథా యజ్ఞః పూజా సాధనమ్ ప్రాప్తయే యస్య ఇతి యజ్ఞసాధనః.** యజ్ఞమనగా భగవంతుని పొందు పూజ, ఆరాధనము. అలాంటి యజ్ఞములు చేసే శక్తిని, అవకాశమును భక్తులకు కలిగిస్తాడు గనుక ఆయన యజ్ఞసాధనుడు.

శ్రీ చిన్మయానంద – యజ్ఞమనగా స్వార్థము లేకుండా లోకకళ్యాణం కొరకు ఆచరించే కార్యము. అలాంటి యజ్ఞాలు నిర్విఘ్నంగా విజయవంతమయ్యేలా చేసేవాడు యజ్ఞసాధనుడు.

శ్రీ సత్యసంధ తీర్థ – సాధనము అనగా ఉపకరణము (ఉపయోగించే వస్తువు). **యజ్ఞస్య సాధనమ్ స్రుక్ స్రువాదికమ్ మంత్రాదికమ్ వా యస్మాత్ ఇతి యజ్ఞసాధనః.** యజ్ఞములో ఉపయోగించే సాధనములైన స్రుక్ (నేయిని హోమంలో వడ్డించే పెద్ద గరిటె), స్రువము (స్రుక్కులో నేతిని వడ్డించే చిన్న గరిటె), మంత్రములు వంటివన్నియు భగవంతునివల్లనే సమకూరుతున్నాయి. కనుక ఆయన యజ్ఞసాధనుడు.

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా** – గీత 4.24
యజ్ఞకార్యములందు ఉపయుక్తమగు స్రువాది సాధనములు బ్రహ్మము. హోమము చేయబడు ద్రవ్యము బ్రహ్మము. అగ్నియు బ్రహ్మము. యజ్ఞమునాచరించు కర్తయు బ్రహ్మము. హవన క్రియయు బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడైయుండు యోగిద్వారా పొందదగిన యజ్ఞఫలము కూడ బ్రహ్మమే.

'బ్రహ్మార్పణము'నకు శ్రీ భగవద్రామానుజుల వ్యాఖ్య – **అర్ప్యతే అనేన ఇతి అర్పణమ్ స్రుగాది. తద్ బ్రహ్మ కార్యత్వాత్ బ్రహ్మ, బ్రహ్మ యస్య హవిషః అర్పణమ్ తద్ బ్రహ్మార్పణమ్.** దేనిద్వారా అర్పణము చేస్తామో (స్రుక్, స్రువాదులు) అది అర్పణము. సమస్త సృష్టికి కార్యకారణమైన బ్రహ్మమే ఆ అర్పణము కూడాను. బ్రహ్మముతో చేయు అర్పణము అనే కార్యము బ్రహ్మార్పణము. శ్రీ సత్యసంధ తీర్థ వ్యాఖ్య ఈ శ్రీరామానుజుల వ్యాఖ్యతో సరిపోలుతుంది.

భగవదనుభవమును భక్తులు అనేకవిధాలుగా పొందుతారు. శ్రీ రఘునాథ తీర్థ వ్యాఖ్యను ఇందుకు ఉదాహరణగా చూడవచ్చును. **యజ్ఞ శబ్దః శుభవాచీ, తమ్ సాధయతి ఇతి యజ్ఞసాధనః**. 'యజ్ఞము' శుభసూచక పదము. అలాంటి శుభాలను ఇచ్చేవాడు గనుక భగవంతుడు యజ్ఞసాధనుడు.

## 981. యజ్ఞాన్తకృత్

- యజ్ఞమును చక్కగా పూర్తి చేయించువాడు.
- శ్రీమన్నారాయణుని గురించిన జ్ఞానమే యజ్ఞమునకు ఫలితము అనే సిద్ధాంతమును చేసినవాడు.
- మారీచ సుబాహువుల వంటివారిని నాశనం చేసినవాడు.

### ఓం యజ్ఞాన్తకృతే నమః

**యజ్ఞస్య అంతమ్ - సమాప్తిమ్ ఫలమ్ వా కరోతి ఇతి యజ్ఞాన్తకృత్.** (1) యజ్ఞమును విజయవంతముగా సమాప్తము చేయించువాడు (2) యజ్ఞమునకు తగు ఫలము ఇచ్చువాడు – అనే రెండు అర్థాలనూ ఈ నామమునకు చెప్పుకొనవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **యజ్ఞపర్యవసానమ్ స్వతత్వజ్ఞానమ్ కరోతి ఇతి యజ్ఞాంతకృత్.** అన్ని యజ్ఞములకు అంతిమ ఫలము తన (భగవంతుని) గురించిన జ్ఞానమే. అట్టి జ్ఞానమును అందించువాడు యజ్ఞాంతకృత్. (ఇక్కడ గుర్తుంచుకొనవలసిన విషయము – వేదముల పరిభాషలో దేనిని గురించయినా 'నిజమైన జ్ఞానము' అంటే కేవలం తెలిసికొని ఉండడం కాదు. ఆ జ్ఞానమును అనుసరించి సన్మార్గంలో జీవితాన్ని గడపడం). శ్రీ భట్టులు గీత (4.33)నుండి ఉదాహరించారు.

**శ్రేయాన్ ద్రవ్య మయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప**
**సర్వ కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే** – గీత 4.33
హే పరంతప! అర్జున! ద్రవ్యమయ యజ్ఞము కంటెను జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. కర్మలన్నియును జ్ఞానమునందే పరిసమాప్తమగును.

శ్రీ కైవల్యసారధినుండి – **సమాప్తించైవ యజ్ఞానాం స్వతత్త్వజ్ఞానతః క్షణాత్ నిరపేక్షణ యః కరోతి స యజ్ఞాంతకృదుచ్యతే** యజ్ఞం చేసినదాని ఫలితము – వెంటనే 'సాక్షాత్తు శ్రీమన్నారాయణుని తెలుసుకోవటమే' అని సిద్ధాంతమును నెలకొల్పినవాడు గనుక భగవానుని 'యజ్ఞాంతకృత్' అంటారు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ ఉదాహరించిన శ్రుతివాక్యము – **తమేవమ్ విద్వాన్ అమృత ఇహ భవతి నా అన్యః పంథా అయనాయ విద్యతే.** పరబ్రహ్మమును గురించి తెలుసుకొన్నవారికి మోక్షానందము లభిస్తుంది. వేరుమార్గం లేదు. అనగా భగవంతుని గురించిన జ్ఞానమువలన మోక్షము లభిస్తుంది. యజ్ఞఫలముగా భగవానుడు అట్టి జ్ఞానమును ఇస్తాడు. కనుక ఆయన యజ్ఞాంతకృత్.

శ్రీ శంకరులు రెండు అర్థాలను పేర్కొన్నారు –

(1) **యజ్ఞస్య అంతమ్ ఫలప్రాప్తిమ్ కుర్వన్ యజ్ఞాంతకృత్.** యజ్ఞము చేసిన పిదప దానికి తగు ఫలమును ప్రసాదించువాడు యజ్ఞాంతకృత్.

(2) **వైష్ణవీ ఋక్ శంసనేన పూర్ణాహుత్యా వా యజ్ఞసమాప్తిమ్ కరోతి ఇతి యజ్ఞాంతకృత్.** యజ్ఞం చివరిలో వైష్ణవీఋక్ **(విష్ణవే స్వాహా)** మంత్రం ద్వారా పూర్ణాహుతి చేస్తారు. ఆవిధంగా యజ్ఞమును పరిసమాప్తి చేయించువాడు యజ్ఞాంతకృత్. 976వ నామము 'యజ్ఞభృత్' ప్రకారం యజ్ఞం నిర్వహణలో ఏవైనా లోపాలున్నాగాని నిర్మలమైన మనస్సుతో విష్ణువును ధ్యానించి పూర్ణాహుతి చేస్తే ఆయన సంపూర్ణ యజ్ఞఫలమునిస్తాడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి ఉదాహరించిన శ్లోకము –

**యస్య స్మృత్యా చ నామోక్త్యా తపోయాఙ్క్రియాదిషు**

**న్యూనమ్ సంపూర్ణతామ్ యాతి సత్యో వందే తమచ్యుతమ్**

అచ్యుతుని స్మరించి, ఆయన నామమును ఉచ్చరించినట్లయితే ఏదైనా సత్కార్యము సంపూర్ణమవుతుంది. అట్టి అచ్యుతునకు వందనములు.

శ్రీ చిన్మయానంద – అన్ని యజ్ఞములలోను చివరి కార్యము చేసి, యజ్ఞమును పూర్తిచేయువాడు యజ్ఞాంతకృత్. పూర్ణాహుతిద్వారా సమస్తమును భగవంతునికి అర్పించినట్లయితే అక్కడ సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే తన దివ్యవైభవంతో అవతరిస్తాడు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **యజ్ఞానామ్ అంతో రమణీయో భగవద్ ఆవిర్భావవేలా, తమపి కృపయా కరోతి ఇతి యజ్ఞాంతకృత్.** యజ్ఞం చివరిలో భగవానుడు తన దివ్యమంగళ దర్శనాన్ని ఇచ్చి ఆశీర్వదిస్తాడు. కనుక ఆయన యజ్ఞాంతకృత్. ఇందుకు శ్రీ భరద్వాజ శ్రీమద్భాగవతము (4.19.3)నుండి ఉదాహరించారు.

**యత్ర యజ్ఞపతిః సాక్షాత్ భగవాన్ హరిరీశ్వరః**

**అన్వభూయత్ సర్వాత్మా సర్వలోక గురుః ప్రభుః**

సమస్త జగత్తును, జీవులను తన శరీరంలో ధరించిన పరమేశ్వరుడు శ్రీమహావిష్ణువును ఆరాధించారు. (తరువాతి శ్లోకములలో భగవంతుడు ప్రత్యక్షమగుట, ఆయనను సిద్ధులు, కపిలుడు, నారదుడు, దత్తుడు మొదలగువారు స్తుతించుట వర్ణింపబడినది.)

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **విఘ్నాన్ నిహృత్య యో యజ్ఞమ్ సమాపయతి, సంపాదితస్య తస్య యజ్ఞస్య యో అంతమ్ - ఫలమ్ చ దదాతి స యజ్ఞాంతకృత్ అభిధీయతే.** విఘ్నములు తొలగించి యజ్ఞములను విజయవంతంగా సమాప్తము చేయించువాడు, మరియు ఆ యజ్ఞములకు తగు ఫలములు ఇచ్చువాడు యజ్ఞాంతకృత్.

శ్రీ సత్యసంధ తీర్థ భిన్నంగా వ్యాఖ్యానించారు. కృ - హింసాయాం - బాధించుట, చంపుట. **యజ్ఞస్య అంతో నాశో యేభ్యః తే యజ్ఞాంతః సుబాహు మారీచాదయః, తాన్ కృణోతి ఇతి వా యజ్ఞాంతకృత్.** శ్రీరామావతారంలో విశ్వామిత్రుని యాగానికి రామలక్ష్మణులు రక్షకులుగా ఉన్నారు. ఆ యజ్ఞాన్ని అంతం చేయాలనుకొన్న సుబాహు మారీచాదులను నాశనం చేసినవాడు యజ్ఞాంతకృత్.

## **982.** యజ్ఞగుహ్యమ్

- యజ్ఞమునందలి రహస్యము.

ఓం యజ్ఞగుహ్యాయ నమః

గుహ్ - సంవరణే - కప్పియుంచుట, దాచియుంచుట. గుహ్యము అనగా రహస్యము. యజ్ఞములలో రహస్యము భగవానుడే. ఆ రహస్యము ఏమిటనే విషయంలో వివిధ వ్యాఖ్యాతల అనుభవాన్ని మనం తెలిసికొనవచ్చును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – రెండు విధాలుగా భగవానుడు యజ్ఞములోని రహస్యము (1) భగవానుడే సకల యజ్ఞములకు పరమలక్ష్యమని చాలామందికి తెలియదు (2) భగవానునుకు ఏమీ అవుసరం లేకపోయినా గాని, మనం యజ్ఞంలో సమర్పించే కొద్దిపాటి ద్రవ్యములను ఆర్తిగొన్నవానివలె స్వీకరించి, అందుకు ప్రతిఫలంగా గొప్ప కామ్యార్థాలను ప్రసాదిస్తాడు. యజ్ఞమునకు సంబంధించిన విధివిధానములు, సిద్ధాంతములు గురించి మంచి జ్ఞానం ఉన్న కొద్దిమందికే ఈ విషయాలు తెలియును. కనుక ఆయన 'యజ్ఞగుహ్యుడు'. శ్రీ భట్టులు ఉదాహరించిన మహాభారత శ్లోకములు.

**సర్వే వేదాః సర్వవేద్యాః స-శాస్త్రాః సర్వే యజ్ఞాః సర్వ ఇజ్యశ్చ కృష్ణః**
**విదుః కృష్ణమ్ బ్రాహ్మణాస్తత్త్వతో యే తేషామ్ రాజన్ సర్వయజ్ఞాః సమాప్తః**
నేర్చుకోవలసిన సకల వేదములు, సకల శాస్త్రములు, సకల యజ్ఞములు, సకల పూజావిధానములు అన్నీ శ్రీకృష్ణుడే. ఈ విధంగా శ్రీకృష్ణుని గురించిన సత్యమునెరిగినవారు అన్ని యజ్ఞములను సక్రమంగా పూర్తిచేశారనుకోవచ్చును.
**జ్యోతీగ్ంషి శుక్రాణి చ యాని లోకే త్రయోలోకాః లోకపాలస్త్రయీ చ**
**త్రయోఽగ్నశ్చ ఆహుతయశ్చ పంచసర్వేదేవా దేవకీపుత్ర ఏవ**
సృష్టిలో వెలిగే సమస్త మండలాలు, ముల్లోకాలు, మూడు లోకముల పాలకులు, మూడు అగ్నులు, ఆ అగ్నులలో వేల్చే ఐదు హోమద్రవ్యాలు, సకల దేవతలు – అందరూకూడ దేవకీనందనుడైన శ్రీకృష్ణుడే.

డా. క్రోవి పార్థసారథి రచన శ్రీకైవల్యసారథి నుండి – **యస్తర్పయతి యజ్ఞేషు నిత్యతృప్తోస్య తృప్తవత్ పురోడాశాధికం భుక్త్వా తృప్యత్యనాన్విశేషతః తద్యజ్ఞవిధిగత్యాది విద ఏవ విదంతి హి స స్థూల బుద్ధయస్తస్మాత్ యజ్ఞగుహ్యమితి స్మృతః** తాను తృప్తుడై, హవిస్సును, యజ్ఞద్రవ్యాలను అతి ఆదరంతో తీసుకొని, వాటివల్ల పరితృప్తుడై యజ్ఞము చేసినవారిని కూడా తృప్తిపొందిస్తాడు. ఈ విషయము జ్ఞానులకు గాని, అజ్ఞానులకు గాని ఎవరికీ తెలియకుండా రహస్యంగా ఉంచుతాడు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – యజ్ఞంలో సమర్పించిన స్వల్పమునే భగవంతుడు ఎంతో ఆనందంతో గ్రహించి, ఆ యజ్ఞం చేసినవారికి మోక్షంతో సహా గొప్ప ఫలితాలనిస్తాడు భగవంతుడు. ఇలా యజ్ఞవిధులను, ఫలితాలను తెలిసినవారు చాలా కొద్దిమంది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – ఏ యజ్ఞానికి సంబంధించినవైనా రెండు అంశాలున్నాయి. (1) ప్రాపంచిక, భౌతిక అంశాలు, సంభారాలు, విధానాలు (2) యజ్ఞకర్మను చేయడంలో ఉన్న అంతర్గత భావాలు. 981వ నామము **'యజ్ఞాంతకృత్'** వివరణలోను, మరియు గీతాశ్లోకము (4.33) వివరణ ద్వారాను కర్మలకంటె ఆ కర్మల వెనుకనున్న ఆలోచనలు చాలా ముఖ్యమని చెప్పడమైనది. యజ్ఞమును ఆచరించేటపుడు మన ఆలోచనలను కామ్యార్థములనుండి మళ్ళించి భగవంతునిపై నుంచుట ఉత్తమము. అలాంటి యజ్ఞమే శ్రేష్ఠము. ఇదే రహస్యము. అలాంటి భావాలతో చేసిన యజ్ఞమే బ్రహ్మస్వరూపము. ఇదే యజ్ఞగుహ్యము.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **యజ్ఞానామ్ గుహ్యమ్ జ్ఞానయుక్తః ఫలాభిసంధిరహితో వా యజ్ఞః, తద్ అభేద ఉపచారాత్ బ్రహ్మ యజ్ఞగుహ్యమ్.** యజ్ఞములలో జ్ఞానయజ్ఞము రహస్యమైనది. ఫలాపేక్ష లేకుండా చేసిన కార్యమైనా యజ్ఞమే. దానికి, బ్రహ్మమునకు తేడా లేదు. అదే యజ్ఞగుహ్యము.

శ్రీ చిన్మయానంద – శరీరమనే హోమకుండమునందు ప్రాపంచిక విషయాలనే ద్రవ్యాలను చైతన్యమనే అగ్నిలో దహింపజేయాలి. ఇదే జ్ఞానయజ్ఞము. దీనినే వేదములు బ్రహ్మయజ్ఞము అనికూడా అన్నాయి. ఇదే యజ్ఞములకు సంబంధించిన రహస్యము.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **తేన యజ్ఞేన తస్యైవ ముఖ్య ఉద్దేశ్యత్వాత్ యజ్ఞగుహ్యమ్.** అన్ని యజ్ఞములకు ముఖ్య ఉద్దేశ్యము భగవంతుడే. భగవంతునికొరకే యజ్ఞములను ఆచరించాలి కాని ప్రాపంచికమైన ప్రయోజనములను ఆశించికాదు. ఇందువలన అన్ని యజ్ఞములయందు దాగియున్న రహస్యమైన భగవంతుడు యజ్ఞగుహ్యము.

## 983. అన్నమ్

- భక్తులచే అనుభవింపబడువాడు.
- సకల ప్రాణులు భుజించు అన్నము పరబ్రహ్మస్వరూపము. తద్వారా జీవనము నిలుచును.
- ప్రళయకాలమున సమస్తమును భుజించువాడు.
- తన దర్శనమును ప్రసాదించి భక్తుల ప్రాణములు నిలుపువాడు.
- యజ్ఞము చేసిన భక్తులకు శ్రీవైకుంఠములో తనను తానే ప్రసాదించి వారికి పరమానందము కలిగించువాడు.

### ఓం అన్నాయ నమః

అద్ - భక్షణే - తినుట. అత్తి - భక్షతి ఇతి అన్నమ్ - భుజించువాడు మరియు ఆనందించువాడు అన్నమ్.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక ర్థము. అన్న-ప్రాణనే-శ్వాసించుట, జీవించుట. అనీతి **ఇతి అన్నమ్, యద్వా అన్యతే - ప్రాణ్యతే యేన తద్ అన్నమ్.** ఎవని కారణముగా జీవులు జీవించునో అతడు అన్నము.

శ్రుతిలో 'అన్నమ్' అనే పదమును యజ్ఞములో అర్పించు సమస్త హవిస్సులకు (నేతితో సహా) వాడారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **భోక్తృ శక్తిభిః భుజ్యతే ఇతి అన్నమ్.** భగవంతుని అనుగ్రహం పొందినవారు భగవంతుని అనుభవించి ఆనందిస్తారు. నిజమైన భక్తునికి భగవంతునియందు తప్ప మరి దేనియందు ఆనందము లభింపదు.

**ఏవం నిష్టారితానంత భోక్తృశక్తి సమన్వితైః భుజ్యతే య సదాకాలం సోఽన్నమిత్యుచ్యతే బుధైః** ఈ రకంగా భగవంతుని అనుగ్రహంతో అవిచ్ఛిన్నమైన భోక్తృశక్తిని పొందిన భక్తులచేత నిరంతరము అనుభవింపబడువాడు. (శ్రీకైవల్య సారథి).

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 6.7.1 – తన భక్తులకు కృష్ణుడే సర్వస్వము. వారు ఆకలిగొని భుజించే ఆహారము, దాహం గొని స్వీకరించే నీరు, భోజనానంతరం తీసుకొనే తాంబూలము – అన్నీ వారికి కృష్ణుడే. కేవలం భగవంతుని నామం పలకడం ద్వారాను, ఆయన గుణములను కీర్తించడం ద్వారాను, ఆయనను తలచడం ద్వారాను, ఆ భక్తుల ఆకలి, దప్పికలు సమసిపోతాయి. కృష్ణచైతన్యము కలిగినవారికి వేరు ఆహారం రుచించదు. దారి పొడవునా భగవంతుని నామం స్మరించడంవల్లను. 'తిరుక్కోళూరు దారి ఇదేనా? ఇంకెంత దూరం ఉంది?' అని అడుగుతూ వెళ్ళడం వల్లను వారికి ఇంకే సహాయం అక్కరలేదు. భగవంతుని స్మరణమే భక్తులకు ఆహారము.

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే**
**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః** – గీత 7.19
అనేక జన్మల పిదప జ్ఞానియైనవాడు (భగవత్తత్వమును ఎఱిగినవాడు) సర్వమూ వాసుదేవమయమే యని భావించి నన్ను శరణు పొందును. అట్టి మహాత్ముడు లభించుట అరుదు. ఇక్కడ 'సర్వమూ వాసుదేవమయము' అనగా 'అన్నము' అనగా 'అనుభవింపబడునది' అని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు.

తైత్తరీయోపనిషత్తులోని ప్రసిద్ధ వాక్యము.

**అహమన్నమ్ అహమన్నమ్ అహమన్నమ్**

**అహమన్నాదోఽహమ్ అన్నాదోఽహమ్ అన్నాదః**

భగవంతుని గురించి తెలుసుకొనే అర్హత కలిగినవారు కలిగినవారు భగవంతుని అనుభవించి ఆనందింతురు గనుక భగవంతుడు అన్నము. మరియు అలాంటివారిని ఆయన అనుభవించి ఆనందించును గనుక ఆయన (భగవంతుడు) అన్నాదుడు, అనగా అనుభవించువాడు.

తరువాతి నామము **'అన్నాదః'**.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ దివ్య ప్రబంధములలో ఆళ్వారుల దివ్య భగవదనుభవానందమును తెలిపే పెక్కు పాశురములను ఉదాహరించారు. తిరువైమోళి (5.10)లో పది పాశురములు ఇలాంటివే (తరువాతి నామ వివరణలో చర్చింపబడును). మరియు,

శ్రీ నమ్మాళ్వారు. పెరియ తిరువంతాడి 34 – ఓ ప్రభువా! నీ మేని ఛాయ సాగరమువలె నల్లగా ప్రకాశించునది. సకల బ్రహ్మాండములకు ఆదికారణము నీవే. నావంటి వారిలో దోషములను హరించుటే నీ గుణము. పాలకడలిలో పవళించియున్న నీ సౌందర్యమును గురించి తలంచినంతనే నా ఒడలు పులకాంకితమగును, కాళ్ళు సత్వహీనమగును. నా మనసు, కనులు నీ సౌందర్యభావముతో ఆనంద పరవశమగును.

శ్రీ కులశేఖరాళ్వారు. పెరుమాళ్ తిరుమొళి 2.3 – భగవంతుడా! ఏడు మదించిన ఎద్దుల నణచుట, శ్రీవరాహమూర్తివై భూమిని ఉద్ధరించుట, శ్రీరామునివై రావణుని అంతమొందించుట – ఇలా నీ లీలలను స్మరించినంతనే నా కనులవెంట ఆనంద బాష్పములు ధారగా కారుచున్నవి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అద్యతే ఇతి అన్నమ్.** సకల జీవులు భుజించునది అన్నము. సకల ఆహారములందును ప్రాణమును నిలుపు శక్తి భగవంతుడే గనుక ఆయన అన్నము.

శ్రీ చిన్మయానంద – అన్ని ఇంద్రియములు అనుభవించు భోగ్యములు ఆహారమువంటివే. అవన్నియును అన్నమే.

**అత్తి - భక్షతి ఇతి అన్నమ్.** భుజించేవాడు అన్నము. ఈ అర్థంలో శ్రీ శంకరులు, శ్రీ చిన్మయానంద చెప్పిన వ్యాఖ్య – **అత్తి భూతాని ఇతి అన్నమ్.** ప్రళయకాలంలో సకల భూతములను భక్షించువాడు అన్నము.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – అన - ప్రాణనే - శ్వాసించుట, జీవించుట. **అన్యన్తే ఉపజీవ్యన్తే భక్తాః యేన స్వ-దర్శన-దాన ద్వారా ఇతి అన్నమ్.** తన దివ్యదర్శన భాగ్యమును ప్రసాదించి భక్తుల ప్రాణములను నిలుపువాడు అన్నము. (ఉణాది సూత్రము 3.10 ప్రకారము 'అన్' ధాతువునకు 'న' ప్రత్యయము చేరిస్తే అన్నము - ఆహారము - అగును.)

శ్రీ బలదేవ విద్యాభూషణ – ఇంతకుముందు నామములు యజ్ఞసంబంధమైనవి. ఆ భావమునే ఈ 'అన్నమ్' నామమునకు అన్వయించవచ్చును. **యజ్ఞలభ్యే పరమవ్యోమ్ని యద్ దివ్య రస గంధాదిక మదనీయమ్ భోగ్యమ్.** యజ్ఞానంతరము ఫలముగా శ్రీవైకుంఠములో భక్తులకు తనను తానే భోగ్యముగా ప్రసాదించువాడు అన్నము.

## 984. అన్నాదః

ఏవ చ

- తనను అనుభవించేవారిని తాను అనుభవించువాడు. భోగ్యమైన భక్తులను అన్నములాగా ప్రేమతో పరిగ్రహించి ఆనందించువాడు.

- అన్నమును భక్షించువాడు. సకల జగత్తును అన్నములాగా భక్షించువాడు.
- భక్తులు సమర్పించినదానిని ఆనందముగా స్వీకరించువాడు.

## ఓం అన్నాదాయ నమః

ఇంతకు ముందు నామము 'అన్నమ్' వివరణలో చెప్పినట్లుగా 'అన్నమ్' అనే పదమును రెండు మూల శబ్దములనుండి విశ్లేషించవచ్చును. (1) అద్ - భక్షణే - తినుట, అనుభవించుట. (2) అన - ప్రాణనే - జీవించుట, శ్వాసించుట. 'అన్న' శబ్దమునకు 'అద్' ప్రత్యయము చేరిస్తే 'అన్నాద' పదం వస్తుంది. 'అద్' అంటే కూడా (భక్షణే) తినుట అనే అర్థం. కనుక 'అన్నాదః' అంటే 'ఆహారమును తినువాడు' అని అర్థం.

ఇంతకుముందు నామము 'అన్నమ్' అనగా 'భక్తులచేత అనుభవింపబడువాడు' అని అర్థము. 'అన్నాదః' అంటే 'అలా తనను అనుభవించే భక్తులను అనుభవించేవాడు' అని అర్థము. **అన్నమ్ అత్తి ఇతి అన్నాదః.**

శ్రీ భట్టుల వ్యాఖ్య – **తాన్ శ్చ తథా భుంక్తే ఇతి అన్నాదః.** వారు (భక్తులు) ఆయనను (భగవంతుని) అనుభవించినట్లే (అన్నముగా), ఆయన కూడా భోగ్యమైన భక్తులను ప్రేమతో అన్నములాగా పరిగ్రహించి అనుభవించువాడు గనుక అన్నాదుడు.

**యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ.** తరువాత శ్రీ భట్టులు ఈ శ్లోకములోని **'ఏవ', 'చ'** అనే పదాలను వివరించారు. ఈ రెండు పదములూ నేరుగా భగవన్నామములు కావు.

ఏవ – **కో అన్య ఈదృశః ఇతి ఏవ కారః.** ఈయనలాంటివాడు వేరెవరుంటారు? ఈయన మాత్రమే అలాంటివాడు, అని అర్థము.

చ – **'చ' శబ్దః సర్వముక్తమ్ ఏకత్ర అస్మిన్ సముచ్చినోతి.** ఇప్పటివరకూ చెప్పినవన్నీ (గుణాలు) సంపూర్ణంగా శ్రీకృష్ణభగవానునిలో ఉన్నాయని అర్థము.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా **'ఏవ', 'చ'** పదాలకు ఇవే అర్థాలు చెప్పారు. **నహ్యేతాదృక్ అన్యోఽస్తి ఇతి బోధయితుమ్ ఏవ-కారః, నిఖిల భోగ్య సముచ్చాయ చ-కారః.** భక్తునకు భగవంతుడు భోగ్యవస్తువు గనుక అన్నము. భగవంతునకు భక్తునకు భోగ్యవస్తువు గనుక భగవంతుడు అన్నాదుడు. వీరిద్దరిమధ్యా ఉన్న ప్రేమబంధము ఒకరినొకరు అనుభవించడానికి పోటీ పడినట్లుంది. దానిని శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (9.7.9)లో ఇలా చక్కగా వర్ణించారు (శ్రీ వి.వి. రామానుజన్, శ్రీ వేళుక్కుడి కృష్ణన్ ఉదాహరించారు).

భగవంతుని దర్శనం కోసం ఆళ్వారు వేచియున్నాడట. ఒకమారు ఆయనను చూడగానే ఇంకెవరికీ మిగల్చకుండా సమస్తం తానే మ్రింగివేయాలని ఆళ్వారు కోరిక. కాని భగవంతుని ప్రణాళిక వేరుగా ఉంది. తన దర్శనంతోపాటు ఆయన తన సంపూర్ణ సౌశీల్యాన్ని ఆళ్వారుకు వెలిబుచ్చాడు. ఆ దర్శనపు ఆనందపరవశంతో ఆళ్వారు కరిగిపోయాడట. వెంటనే ఆ ద్రవ్యాన్ని భగవంతుడు త్రాగివేశాడు. ఈ తిరుక్కాట్కరయ్యప్పన్ మరీ కొరకరాని కొయ్యగదా? ఈ ఆటలోగాని, మరెందులోగాని ఆయనను ఓడించడం సాధ్యం కాదు. భగవంతుని అన్నముగా చేయాలని ఆళ్వారు ఆలోచన. కాని తెలివిగా భగవంతుడు అన్నాదుడయ్యాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అన్నమ్ అత్తి ఇతి అన్నాదః.** అన్నమును భుజించువాడు అన్నాదుడు. శ్రీహరికి జగత్తు అంతయు అన్నరూపమున భోక్తృ భోగ్య రూపమై యున్నది గనుక ఆయన అన్నాదుడు.

శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి – అన్నము పరబ్రహ్మ స్వరూపము. దానిని భక్షించువాడును పరబ్రహ్మమేయని భావము.

శ్రీకైవల్య సారథినుండి – భక్తులయొక్క భక్తి, ప్రేమను భక్షించువాడు అన్నాదుడు.

తరువాత శ్రీ శంకరులు **'ఏవ', 'చ'** పదాలను వివరించారు.

**ఏవ – సర్వమ్ జగత్ అన్నాది రూపేణ భోక్తృ భోగ్యాత్మకమ్ ఏవ ఇతి దర్శయితుమ్ 'ఏవ'కారః.** శ్రీహరికి సకల జగత్తు భోగ్యము (అనుభవింబడునది), భోక్తము (అనుభవించునది) అని తెలియజేయడానికి 'ఏవ' శబ్దము చెప్పబడినది.

**చ – 'చ' శబ్దః సర్వనామ్నామ్ ఏకస్మిన్ పరస్మిన్ పుంసి సముచ్చిత్యా వృత్తిమ్ దర్శయితుమ్.** సమస్త నామములయొక్క ప్రవృత్తిని సమన్వయించి ఒక్క పరమాత్మయందే వర్తించుచున్నది. అనగా అన్ని నామములు ఆ పరమాత్మకే వర్తించును. అని తెలియజేయుటకు 'చ' శబ్దము చెప్పబడినది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – జగత్తులో సమస్తాన్ని రెండు విధాలుగా విభజించవచ్చును. (1) ఆహారము (అన్నము) (2) ఆహారమును తినేవాడు (అన్నాదుడు). దాదాపు ఈ స్తోత్రం చివరిభాగంలో భగవంతుని **'అన్నః', 'అన్నాదః'** నామాలతో భీష్ముడు ప్రస్తుతించాడు. ఆవిధంగా తమ ఎదురుగానున్న వాసుదేవుడే **'విశ్వము'**నుండి **'అన్నాదుడు'** వరకూ చెప్పిన నామములతో వర్ణింపబడినవాడని భీష్ముడు ధర్మపుత్రునికి తెలియబరచాడు. అలా ఈ శ్లోకాలలోను, వానిలోని నామాలలోను కీర్తింపబడిన దేవుడు సాక్షాత్తు దేవకీనందనుడైన కృష్ణుడేనని తరువాతి శ్లోకంలో భీష్ముడు చెబుతాడు.

తైత్తరీయోపనిషత్తు భృగువల్లి చివరిలో భగవంతుడు అన్నము, అన్నాదుడు కూడానని చెప్పబడింది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **అన్నమ్ స్వజనోపహృతమ్ మోదకాని అత్తి ఇతి అన్నాదః.** తన భక్తులు తనకు నివేదించినదానిని సంతోషంతో స్వీకరించును గనుక భగవంతుడు అన్నాదుడు.

బేలూరు శ్రీ చెన్న కేశవాలయంలో శ్రీ భూవరాహస్వామి శిల్పం. వికీపీడియా నుండి By Michael Gunther
https://commons.wikimedia.org/wiki/File:Belur_si1034.jpg



ఈ శిల్పంలో శ్రీస్వామివారి ముఖంలో క్రోధం కనిపించడంలేదు. ప్రసన్నత, ఆహ్లాదం కనిపిస్తున్నాయని ఛాయాగ్రాహకుడు వ్యాఖ్యానించారు.

**భాగవతము. దశమ స్కంధము. భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట.**

నమస్తే దేవదేవేశ! శంఖచక్రగదాధర!
భక్తేచ్ఛోపాత్తరూపాయ పరమాత్మన్నమోస్తుతే
నమః పంకజనాభాయ నమః పంకజమాలినే
నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే
నమో భగవతే తుభ్యం వాసుదేవాయ విష్ణవే
పురుషాయాదిబీజాయ పూర్ణబోధాయ తే నమః
అజాయ జనయిత్రేస్య బ్రహ్మణేఽనంతశక్తయే
పరాపరాత్మన్ భూతాత్మన్ పరమాత్మన్నమోస్తుతే.






## శ్రీ మేప్పత్తూర్ నారాయణ భట్టాత్రి ప్రణీత

## శ్రీమన్నారాయణీయమ్

### 21వ సర్గ – జంబూద్వీపాదులలో భగవదారాధన

**మూల వ్యాఖ్యాత: శ్రీ స్వామి తపస్యానంద**

**అనుసృజన: శ్రీ తాడేపల్లి పతంజలి**

(శ్రీరామకృష్ణమఠం, మైలాపూర్, చెన్నై ప్రచురణ)

మధ్యోద్భవే భువ ఇలావృతనామ్ని వర్షే
గౌరీప్రధాన-వనితాజన-మాత్రభాజి
శర్వేణ మంత్రనుతిభిః సముపాస్యమానం
సంకర్షణాత్మక-మధీశ్వర సంశ్రయే త్వామ్ (1)

భూమండలానికి మధ్యన ఇలావృతమనే ప్రాంతం ఉంది. ఆ ప్రాంతంలో గౌరీదేవి నాయకురాలిగా స్త్రీలు మాత్రమే నివసిస్తూ ఉంటారు. అక్కడ వెలసిన శివుడు (అర్ధ నారీశ్వరుడు) నిన్ను వేదమంత్రాల, స్తోత్రాలతో సేవిస్తున్నాడు. అట్టి నీ సంకర్షణ రూపాన్ని నేను ఆశ్రయిస్తాను.

భద్రాశ్వనామక ఇలావృతపూర్వవర్షే
భద్రశ్రవోభిః ఋషిభిః పరిణూయమానమ్
కల్పాన్తగూఢ-నిగమోద్ధరణ-ప్రవీణం
ధ్యాయామి దేవ హయశీర్షతనుం భవన్తమ్ (2)

ఇలావృతానికి తూర్పున భద్రాశ్వమనే వర్షం (భూఖండం) ఉంది. అక్కడ భద్రశ్రవసులు అనే ఋషులు జలప్రళయంలో (కల్పాంతంలో) మునిగిన వేదరాశిని ఉద్ధరించిన హయగ్రీవరూపంలోని నిన్ను విశేషంగా స్తుతిస్తూ ఉంటారు. అట్టి హయగ్రీవరూపాన్ని నేను ధ్యానిస్తున్నాను.

ధ్యాయామి దక్షిణగతే హరివర్షవర్షే
ప్రహ్లాదముఖ్య పురుషైః పరిషేవ్యమాణమ్
ఉత్తుంగశాన్త-ధవలాకృతి-మేకశుద్ధ-
జ్ఞానప్రదం నరహరిం భగవన్ భవన్తమ్ (3)

ఓ భగవాన్! ఇలావృతానికి దక్షిణాన హరివర్షమనే ప్రాంతం ఉంది. ప్రహ్లాదుడు మొదలైన మహాపురుషులు సేవించే శాంతప్రవృత్తితో, తెల్లని రంగులో, శుద్ధజ్ఞానాన్ని ప్రసాదించే నీ నరసింహాకృతి అక్కడ వెలసి ఉంది. అట్టి నీ రూపాన్ని నేను ధ్యానిస్తున్నాను.

వర్షే ప్రతీచి లలితాత్మని కేతుమాలే
లీలావిశేష-లలితాస్మిత శోభనాంగమ్

లక్ష్మ్యా ప్రజాపతిసుతైశ్చ నిషేవ్యమాణం
తస్యాః ప్రియాయ ధృతకామతనుం భజే త్వామ్ (4)

ఇలావృతానికి పశ్చిమాన కేతుమాల అనే ప్రాంతం ఉంది. ఆ ప్రాంతంలో లీలావిలాస లలిత మందహాస రూపుడవైన నిన్ను లక్ష్మి, ప్రజాపతి పుత్రులు (బ్రహ్మ మానస పుత్రులైన సనక సనందనాదులు) సదా సేవిస్తూ ఉంటారు. మహాలక్ష్మి ప్రత్యర్థం మన్మథ స్వరూపం దాల్చిన నిన్ను, ఓ దేవా! నేను కూడా సేవిస్తాను.

రమ్యేఽప్యుదీచి ఖలు రమ్యకనామ్ని వర్షే
తద్వర్షనాథ-మనువర్య-సపర్యమాణమ్
భక్తైకవత్సల-మమత్సరహృత్సు భాన్తం
మత్స్యాకృతిం భువననాథ భజే భవన్తమ్ (5)

ఇలావృతానికి ఉత్తరప్రాంతానగల రమ్యకమనే ప్రదేశానికి అధిపతి వైవస్వతమనువు. అక్కడ నువ్వు మత్స్యరూపంలో కొలువై ఆ మనువు సేవలు అందుకొంటూ ఉంటావు. పరిశుద్ధుల హృదయాలలో ప్రకాశిస్తూ, భక్తులను అనుగ్రహిస్తున్న ఓ భువననాథా! నేను నిన్ను సదా సేవిస్తూంటాను.

వర్షం హిరణ్మయసమాహ్వయ-మౌత్తరాహ-
మాసీన-మద్రిధృతి-కర్మఠ-కామఠాంగమ్
సంసేవతే పితృగణప్రవరోఽర్యమా యం
తం త్వాం భజామి భగవన్ పరచిన్మయాత్మన్ (6)

ఆ రమ్యకానికి ఉత్తరభాగంలో హిరణ్మయమనే ప్రదేశంలో నువ్వు మందరపర్వతాన్ని అలవోకగా మోసిన కూర్మరూపం దాల్చి కొలువై ఉన్నావు. పితృగణాలలో ఉత్కృష్టుడైన ఆర్యముడు సదా సర్వవేళలా నిన్ను అక్కడ కొలుచుచున్నాడు. విశుద్ధజ్ఞానస్వరూపుడవైన నిన్ను, ఓ భగవాన్, నేను కూడా ఆ రూపంలోని నిన్ను సేవిస్తాను.

కించోత్తరేషు కురుషు ప్రియయా ధరణ్యా
సంసేవితో మహితమన్త్ర-నుతిప్రభేదైః
దంష్ట్రాగ్రఘృష్ట-ఘనపృష్ఠగరిష్ఠవర్ష్మా
త్వం పాహి విజ్ఞనుత-యజ్ఞవరాహమూర్తే (7)

ఉత్తర కురుభూములలో నీ దేవియైన భూదేవి సేవిస్తూండగా, మహిమతో కూడుకొన్న మంత్రాలతో, వివిధ స్తుతులతో కొనియాడబడుతున్న నీ యజ్ఞవరాహ రూపపు దంష్ట్రాగ్రం మేఘాలను సైతం చూర్ణం చేయగల ఉన్నతమైనది. అటువంటి నీ రూపాన్ని సేవించే నన్ను పరిరక్షించు.

యామ్యాం దిశం భజతి కింపురుషాఖ్యవర్షే
సంసేవితో హనుమతా దృఢభక్తిభాజా
సీతాభిరామ-పరమాద్భుత-రూపశాలీ
రామాత్మకః-పరిలసన్ పరిపాహి విష్ణో (8)

ఓ విష్ణుమూర్తీ! దక్షిణ దిశలోనున్న కింపురుష సీమలో అద్భుతమైనదీ, సీతాదేవికి ప్రమోదం కలిగించేదీ అయిన శ్రీరాముని రూపంలో విరాజిల్లుతున్నావు. అక్కడ దృఢభక్తితో హనుమంతుడు నిన్ను సేవిస్తున్నాడు. అట్టి శ్రీరామ రూపు దాల్చిన నువ్వు నన్ను రక్షించు.

శ్రీనారదేన సహ భారతఖణ్డముఖ్యై-
స్త్వం సాంఖ్యయోగనుతిభిః సముపాస్యమానః
ఆకల్పకాలమిహ సాధుజనాభిరక్షీ
నారాయణో నరసఖః పరిపాహి భూమన్ (9)

ఓ ప్రభూ! భరతఖండంలో నువ్వు నరునకు సఖుడైన నారాయణునిగా అవతరించావు. అక్క సాధుజనాన్ని రక్షించడానికి కల్పాంతందాకా ఉంటావు. సాంఖ్యయోగతత్వ ప్రతిపాదకాలైన స్తోత్రాలతో నారదాది మహామునులు స్తుతిస్తూ నిన్ను సేవిస్తుంటారు. అట్టి నువ్వు నన్ను కాపాడు.

ప్లాక్షేऽర్కరూపమయి శాల్మల ఇందురూపం
ద్వీపే భజన్తి కుశనామని వహ్నిరూపమ్
క్రౌంచేऽమ్బురూపమథ వాయుమయం చ శాకే
త్వాం బ్రహ్మరూపమయి పుష్కరనామ్ని లోకా (10)

ఓ దేవా! ప్లక్షద్వీపంలో సూర్యుని రూపంలో, శాల్మలద్వీపంలో చంద్రుని రూపంలో, కుశద్వీపంలో అగ్నిరూపంలో, క్రౌంచద్వీపంలో జలరూపంలో, శాకద్వీపంలో వాయురూపంలో, పుష్కరద్వీపంలో బ్రహ్మరూపునిగా జనులు నిన్ను సేవిస్తూన్నారు.

సర్వైర్ధ్రువాదిభి-రుడుప్రకరై-ర్గ్రహైశ్చ
పుచ్ఛాదికేష్వవయవే-ష్వభికల్ప్యమానైః
త్వం శింశుమారవపుషా మహతాముపాస్యః
సన్ధ్యాసు రున్ధి నరకం మమ సిన్ధుశాయిన్ (11)

పాలసముద్రంలో పవళించిన దేవా! మహనీయులునిన్ను శింశుమారమనే గొప్ప చేపగా భావించి, ఆ శరీరంలోని అవయవాలందు అశ్వనీ మొలైన నక్షత్రాలను, మీనం మేషం ఇత్యాదులైన రాశులను, ధ్రువ మొదలైన మండలాలను, సూర్యాది గ్రహాలను కల్పించుకొని సదా త్రిసంధ్యలలో సేవిస్తూ, తరిస్తున్నారు. అట్టి నువ్వు నా నరకబాధలను తొలగించు,

పాతాలమూలభువి శేషతనుం భవన్తం
లోలైకకుణ్డలవిరాజి-సహస్రశీర్షమ్
నీలామ్బరం ధృతహలం భుజగాంగనాభి-
ర్జుష్టం భజే హర గదాన్ గురుగేహనాథ (12)

ఓ దేవా! గురువాయూరు పురాధీశా! పాతాళంలో నువ్వే అయిన ఆదిశేషుడు ప్రకాశిస్తున్నాడు. వేయి పడగలతో, ఒక కుండలంతో, నీలాంబరంతో, చేత నాగలి రూపంలోని ఆయుధంతో నాగకాంతలు సేవిస్తూండగా నువ్వు విరాజిల్లుతున్నావు. అట్టి నీ ఆదిశేషమూర్తిని నేనుకూడా సేవిస్తాను. నా రోగాలను బాపు!

శ్రీ మేప్పత్తూర్ నారాయణ భట్టాత్రి ప్రణీత శ్రీమన్నారాయణీయమ్
21వ సర్గ – జంబూద్వీపాదులలో భగవదారాధన
మూల వ్యాఖ్యాత: శ్రీ స్వామి తపస్యానంద. అనుసృజన: శ్రీ తాడేపల్లి పతంజలి
శ్రీరామకృష్ణమఠం, మైలాపూర్, చెన్నై ప్రచురణ. కాపీహక్కులు: శ్రీరామకృష్ణమఠం, చెన్నై



## ఆత్మయోనిః స్వయంజాతో వైఖానః సామగాయనః |
## దేవకీనందనః స్రష్టా క్షితీశః పాపనాశనః || (106)

### 985. ఆత్మయోనిః

- తన భక్తులలో తేలికగా కలిసిపోయేవాడు. పాలలో పంచదార కలసినట్లుగా తనను అనుభవించేవారిని తనతో చేర్చుకొనువాడు.
- ఈ అనంత విశ్వమునకు తానే ఉపాదాన కారణము అయినవాడు.
- స్వయంభువు.
- జీవాత్మ యందున్నవాడు.

**ఓం ఆత్మయోనయే నమః**

యు - మిశ్రణే అమిశ్రణే చ - కలుపుట, వేరుచేయుట. ఉణాదిసూత్రము (4.5.1) ప్రకారము 'ని' ప్రత్యయము చేర్చుటవల్ల 'యోని' అనగా 'గర్భము' అన్న అర్థం వస్తుంది. 'ఆత్మయోని' నామమునకు ఒక అర్థం – **ఆత్మా - స్వయమేవ, స్వస్య యోనిః - కారణమ్.** తనకు తానే కారణమైనవాడు ఆత్మయోని.

శ్రీ భట్టుల వ్యాఖ్య – యు - కలుపుట, చేర్చుట. **దుగ్ధేనేవ సితావలయమ్ ఆత్మనా భోక్తారమ్ మిశ్రయతి ఇతి ఆత్మయోనిః.** పాలు, పంచదారలాగా తనను అనుభవించేవారిని తనలో కలుపుకొనేవాడు ఆత్మయోని. ఈ నామం ద్వారా శ్రీ భట్టులు భగవంతుని సౌశీల్యమును విశేషంగా వివరించారు.

**భోక్తారమాత్మానం నిత్యం యో యజయతి సర్వదా ఆత్మయోని స్వచైవోత్తో వస్స్వర్ణ స్సుఖభోగదః.** జ్ఞానులను అన్నములాగా అనుభవించడానికి అన్నమువలె తనలో చేర్చుకొనువాడు. ఈ నామము అష్టాక్షరీ మంత్రము. అవిచ్ఛిన్నమైన సంసార సుఖభోగాలను ఇస్తుంది. ఓం ఆత్మయోనయే నమః. (శ్రీకైవల్య సారధి).

ఇంతకు ముందు అనేక నామముల వివరణలో చెప్పినట్లుగా శ్రీ భట్టులు భగవానుని సౌలభ్యము, సౌశీల్యము అనే రెండు గుణాలను విశేషంగా తమ వ్యాఖ్యానంలో ప్రస్తుతించారు. ఈ 'ఆత్మయోనిః' నామము వ్యాఖ్యలో భగవానుని సౌశీల్యగుణవర్ణనయందు శ్రీ భట్టుల నైపుణ్యాన్ని గమనింపవచ్చును. భగవంతుడు ఎంతో యదాలాపంగా, ఇతరులకు శ్రమ లేకుండా, తేలికగా భక్తులలో కలిసిపోయి, వారు తనను సంపూర్ణంగా అనుభవించే భాగ్యాన్ని ప్రసాదిస్తాడు. ఇందుకు భక్తులకు కావలసిన అర్హత అచంచలమైన భక్తియే.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే భావాన్ని వ్యక్తీకరించారు. **ఆత్మానమ్ స్వమ్ యౌతి భక్తః సహవాస భోగే ఇతి ఆత్మయోనిః.** భక్తులను సంపూర్ణంగా, భేదం లేకుండా తనలో కలిపివేసుకొని, వారికి తనను అనుభవించేలా చేసేవాడు ఆత్మయోని. ఇందుకు శ్రీ విద్యాభూషణ తైత్తరీయోపనిషత్తు ఆనందవల్లిలోని ఆనందమయవిద్య గురించిన శ్లోకాన్ని ఉదాహరించారు.

**యో వేదనిహితమ్ గుహాయామ్ పరమే వ్యోమన్**

**సోऽశ్నుతే సర్వాన్ కామ్నాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి.**

హృదయమనే గుహలో దాగియున్న బ్రహ్మమును ఎరిగినవారు పరమపదములో ఆ బ్రహ్మముతో కూడి బ్రహ్మముయొక్క సకల మంగళగుణములను అనుభవింతురు.

శ్రీ నమ్మాళ్వారు. తిరువైమొళి 2.3.1 – ఓ నా మనసా! రక్తమాంసమయమైన ఈ భౌతిక శరీరంలో ఉన్నాగాని నీవు నా బంధాలనుండి విముక్తుని చేయడానికి సహకరించావు. శ్రీవైకుంఠంలో నిత్యసూరులు అనుభవించే ఆనందం నాకు గోచరమయ్యింది. నేను ఆయనను వదిలి పారిపోవాలని అనుకున్నాగాని భగవానుడు నన్ను జయించి తన దాసునిగా చేసుకున్నాడు. అంతేగాక నన్ను తనలో లీనం చేసుకొన్నాడు. ఈ అనుభవం తేనెలో తేనె, చక్కెరలో చక్కెర, అమృతంలో అమృతం కలిసినట్లుగా ఉన్నది. (శ్రీ భట్టులు పాలు, చక్కెర కలిపిన ఉపమానం చెప్పిన విషయాన్ని గమనింపదగును).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఆత్మైవ యోనిః ఉపాదాన కారణమ్ న అన్య ఇతి ఆత్మయోనిః**. సమస్తజగత్తుకు తానే ఉపాదాన కారణము. మరెవరును కాదు. కనుక భగవంతుడు ఆత్మయోని.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – **స్వయంభూత్వాత్ ఆత్మయోనిః.** భగవంతుడు తనంతట తానే జన్మించినవాడు గనుక ఆత్మయోని. ఇందుకు శ్రీ భరద్వాజ శ్వేతాశ్వరోపనిషత్తు (6.16)నుండి ఉదాహరించారు. **స విశ్వకృద్ విశ్వవిద్ ఆత్మయోనిః.** ఇక్కడ 'ఆత్మయోని' అనగా 'స్వయంభువు'.

శ్రీ అణ్ణాంగారాచార్య ఇదే ఉపనిషద్వాక్యమును తీసుకొని. అందులో 'ఆత్మయోనిః' పదమునకు 'జీవాత్మలో ఉండువాడు' అని అర్థం చెప్పారు. (శ్రీ రంగరాజముని వ్యాఖ్యను అనుసరించి).

## 986. స్వయంజాతః

- తనంత తానే జన్మించినవాడు. ఎవరూ ప్రార్థింపవలసిన అవుసరం లేకుండా జీవుల ఉద్ధరణ కొఱకు తానే స్వయంగా ధర్మరక్షణ కొఱకు అవతరించినవాడు.
- సకల జగత్తుకు తానే నిమిత్త కారణము అయినవాడు.

### ఓం స్వయంజాతాయ నమః

**స్వయం జాయతే అజనిష్ఠ ఇతి వా స్వయంజాతః.** తాను స్వయముగా జన్మించినవాడు. వేరెవరూ ఆయనకు జన్మనీయలేదు (సృష్టించలేదు).

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ప్రార్థనా నిరపేక్షతయా జాతః స్వయంజాతః.** భగవంతుడు తన సంకల్పానుసారం ధర్మరక్షణ కొఱకు స్వయంగా అవతరిస్తాడు (**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**). అంటే కష్టాలలో ఉన్నవారు వచ్చి తనను ప్రార్థించేదాకా ఆయన ఆగడు. తన బిడ్డలైన జీవులను కాపాడడం ఆయన లక్షణము. కనుక ఆయన స్వయంజాతుడు.

భగవానుడు ఏది చేసినా అది తన భక్తుల శ్రేయస్సు కొఱకే అనే అర్థంలో శ్రీ భట్టులు ఈ స్తోత్రంలోని నామములను వ్యాఖ్యానించారని ఇంతకుముందు అనేకమార్లు చెప్పడమైనది. 'స్వయంజాతః' నామమునకు నేరు అర్థము – తనంత తానే జనించినవాడు (అనగా ఆయనను పుట్టించినవాడు లేడు). కాని శ్రీ భట్టులు ఈ నామమునకు వ్యాఖ్యలో– తన భక్తుల కష్టములను నివారించడానికి అవుసరమైనపుడల్లా భగవంతుడు స్వయంగా అవతరిస్తాడు – అని వివరించారు. ఇలా అనేక నామములను భగవంతుని భక్తవత్సలత పరంగా శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు.

తిరువిరుత్తమ్ 1 – మమ్ములను సంసారభారంనుండి విముక్తులను చేయడానికి నీవు స్వయంగా జన్మించావు.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – మనలను సంసారబంధంనుండి ముక్తులను చేయడంకొఱకు భగవంతుడు స్వయంగా సంసారంలో చిక్కుకుంటాడు. ఇందుకు ఉదాహరణగా గీత (3.22) శ్లోకమును చూడవచ్చును.

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన**

**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి**

ఓ అర్జున! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే నేను పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియును లేదు. ఐనను నేను కర్మలయందే ప్రవర్తిల్లుచున్నాను.

ఎందరో స్త్రీలను చెరనుండి విముక్తులను చేయుటకై సీతమ్మతల్లి పది నెలలు రావణుని బందీగా లంకలో గడిపినది. మనలను బంధవిముక్తులను చేయడానికి శ్రీకృష్ణుడు కంసుని చెరసాలలో జన్మించాడు. మనలను కష్టాలనుండి గట్టెంకించడంకోసం ఆ దివ్యదంపతులు కష్టాలపాలవుతున్నారు.

పై గీతా శ్లోకమునకు భగవద్రామానుజుల వ్యాఖ్య – **కర్మణా అవాప్తవ్యమ్ న కించిద్ అపి అస్తి, అథాపి లోక రక్షాయై కర్మణి ఏవ వర్తే.** తనకు ఏమీ అవసరం లేకున్నాగాని భగవంతుడు కర్మలయందు ప్రవర్తిల్లుచున్నాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **నిమిత్త కారణమపి స ఏవ ఇతి దర్శయితుమ్ స్వయంజాత ఇతి.** సకల జగత్తుకు నిమిత్త కారణము కూడ శ్రీహరియే అగుటచేత ఆయన స్వయంజాతుడు. ఉదాహరణకు – కుండలు చేయుటకు మట్టి, కుమ్మరి, నీరు, చక్రము, ఇలా అనేకములు అవుసరమవుతాయి. వీనిలో మట్టి ఉపాదాన కారణము (Material cause). మరియు కుమ్మరి నిమిత్త కారణము (Instrumental cause). ఇంకా నీరు, చక్రము వంటివి సహకార కారణములు. ఇంతకు ముందు నామము 'ఆత్మయోనిః' నామమునకు భగవంతుడు ఉపాదాన కారణమనియు, ప్రస్తుత 'స్వయంజాతః' నామమునకు భగవంతుడు నిమిత్త కారణమనియు శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు. ఇందుకు ఆయన బ్రహ్మసూత్రము (1.4.23)నుండి ఉదాహరించారు. **ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంత అనుపరోధాత్.** భగవంతుడు ఉపాదాన కారణమును, నిమిత్త కారణమును ఐయున్నాడు. అంటే ఆయన మరే ఇతర సాధనములు, మూల పదార్థములు లేకుండా సకల సృష్టిని స్వయంగా తానే చేస్తాడు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – తనంత తానే వ్యక్తమైనవాడు స్వయంజాతుడు. తైత్తరీయోపనిషత్తు ఆనందవల్లి – **తదాత్మానమ్ స్వయమ్ అకురుత.** బ్రహ్మము తనను తానే సృజించుకొన్నది.

దేవకీమాత శ్రీకృష్ణునికి జన్మనిచ్చినదని అంటారు. కాని శుకమహర్షి చెప్పిన ప్రకారం చంద్రుడు ఆకాశంలో ఉదయించినట్లుగా కృష్ణుడు దేవకి గర్భంనుండి ప్రత్యక్షమయ్యాడు.

**దేవక్యామ్ దేవరూపిణ్యామ్ విష్ణుః సర్వగుహాశయః**

**ఆవిరాసీత్ యథా ప్రాచ్యామ్ దిశీ ఇందురివ పుష్కలః** – శ్రీ మద్భాగవతము 10.3.8

శ్రీకృష్ణుడు సంకల్పానుసారం దేవకి గర్భంలో ప్రవేశించి, మరల సంకల్పార్థం వెలికి వచ్చాడు. ఇక్కడ దేవకికి, కష్ణునికి ఉన్న బంధము తూర్పుదిక్కుకు, చంద్రునికి ఉన్నటువంటి సంబంధమే.

**శ్రీకృష్ణావతరణము.**

శ్రీమద్భాగవతము. దశమ స్కంధము. శ్రీ ఏల్చూరు మురళీధరరావు రచననుండి –

పరీక్షిన్నరేంద్రా! ఒకానొకనాడు ప్రకృతి సర్వగుణోల్లసితమై శోభాపూర్ణంగా అలరారింది. ఆనాటి రాత్రి రోహిణీ నక్షత్రయుక్తమై ప్రశాంత గ్రహ నక్షత్ర తారకంగా ప్రకాశించింది. దిక్కులన్నీ ప్రసన్నములై విభాసిల్లాయి..... మారుతాలు సుమవాసనా పూరితాలై మంద మంద గతుల చల్లగా వీచాయి. అగ్నిహోత్రాలు ప్రజ్వరిల్లాయి. సాధుజన హృదయాలు ప్రసన్నములయ్యాయి. దేవదుందుభి ధ్వనులతో కిన్నెర గంధర్వ సంగీతనాదాలతో, సిద్ధ చారణ ప్రస్తుతులతో, విద్యాధరాప్సరసల నాట్యాలతో నింగి మార్మోగసాగింది. పుష్పవర్షం కురిసింది. కారుమబ్బులు క్రమ్మి కటిక చీకట్లు ఆవరించాయి.

నాటి నిశీథ సమయంలో దేవకీగర్భంనుంచి నిఖిలాంతర్యామి అయిన భగవానుడు ఉదయించాడు. భగవదుదయం ప్రాకృత శిశూదయంవలె మాతృగర్భమలిన నిమజ్జనం కాక ప్రాచీదిశ పూర్ణచంద్రోదయాన్ని తలపింపజేస్తూండడమూ, పుట్టిన పాపడు నీలనీరద గాత్రంతో, పుండరీకనేత్రాలతో, శంఖ చక్ర గదాది సమంచిత చతుర్భుజాలతో, శ్రీవత్సవక్షంతో ఒప్పారుతూ, పీతాంబరం ధరించి, కిరీట కుండల కాంచీ కంకణ కేయూర నవరత్నకాంతికాంతుడై, మందిరాంతరమంతా ఉద్దీపించడం వసుదేవుడు చూసి ఆశ్చర్య సంభ్రమానందాలు ముప్పిరిగొనగా, కొంతసేపటికి తేరుకొని, స్నానం చేసి, బ్రాహ్మణులకు పదివేల గోవులను మనోదత్తం కావించి, పురిటింటిలోనికి ప్రవేశించి, నిజప్రభాసముద్భాసితుడై, అందున్న ఆ శిశురూప భగవానునికి కైమోడ్చి నిర్భయుడై ప్రస్తుతించాడు.

## 987. వైఖానః

- సంసార దుఃఖాలను, బంధాలను పెకలించివేయువాడు.
- శ్రీవరాహమూర్తియై భూమిని త్రవ్వి హిరణ్యాక్షుని సంహరించినవాడు.
- ప్రశాంతులైన ముక్తజీవులకు ప్రభువు.
- శత్రువులను ఖండించి నాశనము చేయువాడు.
- సాగరములను (త్రవ్వి) సృష్టించినవాడు.

### ఓం వైఖానాయ నమః

వి (ఉపసర్గ) - విశేషంగా. ఖన - అవధారణే - త్రవ్వుట. ఈ 'త్రవ్వుట' అనే పనిని ఒకో వ్యాఖ్యాత ఒకోవిధంగా చూశారు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు 'ఖన' అనగా పెళ్ళగించుట, పెకలించుట (పీకివేయుట) అనే అర్థంలో వ్యాఖ్యానించారు. **జనిత్వా, భవదుఃఖ విఖననాత్ వైఖానః.** ఈవిధంగా సంకల్పానుసారుడై అవతరించిన స్వయంజాతుడు తన భక్తుల సంసార దుఃఖాలను, ముఖ్యంగా జనన మరణ క్లేశాలను పెకలించిపారవేయువాడు గనుక వైఖానుడు.

**జనిత్వా భవదుఃఖయో వివిధం ఖనతి స్వతః వైఖాన స్స చ నిర్దిష్టః సప్తార్ణోऽఖిల దుఃఖహా.** ఈరకంగా అవతరించి, సంసారంలో కలిగే దుఃఖాలను పెళ్ళగించి పారవేయువాడు గనుక వైఖానుడు అని చెప్పడమైనది. ఈ నామము సప్తాక్షరీ మంత్రము. సమస్త దుఃఖనాశనము. ఓం వైఖానాయ నమః (శ్రీకైవల్య సారధి).

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇదే అర్థాన్ని చెప్పారు. **జనిత్వాశ్చ స్వభక్త దుఃఖ విఖననాత్ వైఖానః.**

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ శ్రీ నమ్మాళ్వారు తిరువిరుత్తమ్ నుండి ఉదాహరించారు – ఓ దేవదేవా! మేమిక్కడ సంసారసాగరంలో మునిగి అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతూ, దురాచారాల మధ్య తనువు, మనము మాలిన్యపూరితమై యున్నాము. మమ్ములను రక్షించగలిగినవాడవు నీవొక్కడవే. నీ ఇచ్ఛానుసారం అవతరించి మమ్ములను ఈ భవబంధాలనుండి రక్షించగలవు. కాపాడుము దేవదేవా!

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు 'ఖన' అనగా 'త్రవ్వుట' అనే అర్థంలో శ్రీవరాహావతార పరంగా వ్యాఖ్యానించారు. **ధరణీమ్ విశేషేణ ఖనిత్వా పాతాళ వాసినమ్ హిరణ్యాక్షమ్ వారాహరూపమ్ ఆస్థాయ జఘాన ఇతి పురాణే ప్రసిద్ధమ్.** శ్రీ ఆదివరాహావతారమున భూమిని చీల్చుకొని లోన ప్రవేశించి హిరణ్యాక్షుని సంహరించిన పురాణగాథను పురస్కరించుకొని శ్రీహరి 'వైఖానుడు' అనే నామమున ప్రసిద్ధుడాయెను.

శ్రీ చిన్మయానంద ఈ ఘటనకు ఆసక్తికరమైన అర్థం చెప్పారు. హిరణ్యమనగా బంగారము. 'అక్ష' అనగా కన్ను. 'హిరణ్యాక్ష' అనగా ఐహికమైన సంసార సౌఖ్యములపట్ల వ్యామోహము. భగవానుడు మనలోని అహంకారమును చీల్చివైచి, ఐహిక భోగములను నశింపజేయును గనుక ఆయన వైఖానుడు.

శ్రీ రఘునాథ తీర్థ – ఖన - త్రవ్వుట, ముక్కలు చేయుట. **విశేషేణ శత్రుమ్ అవదారయతి ఇతి విఖానః, విఖాన ఏవ వైఖానః.** శత్రువులను ముక్కలుగా చేసి నాశనము చేయువాడు వైఖానుడు.

శ్రీ వాసిష్ఠ చెప్పిన మరొక అర్థము. ఖన-త్రవ్వుట.
**తస్య చ విశిష్టః ఖానో సముద్రస్య నహీదృక్ ఖననం కేనచిత్ తదన్యేన కర్తుమ్ శక్యమ్**
భూమిమీద సముద్రములను త్రవ్వినవాడు వైఖానుడు. ఈ పని ఆయనవల్ల తప్ప మరెవరివల్లా సాధ్యం కాదు.

## 988. సామగాయనః

- ఆయన ఎదురుగా ముక్తులు సామమును గానము చేయుచు ఆయనను స్తుతింతురు.
- తానే స్వయముగా సామమును గానము చేయువాడు.
- సామగానము చేయువారి అంతిమ లక్ష్యము.

### ఓం సామగాయనాయ నమః

సో - అంతః కర్మాణి - నాశనము చేయుట, ముగించుట. ఉణాది సూత్రము (4.152) **'సాతిభ్యామ్ మనిన్ మనిణౌ'** ప్రకారము ఇందునుండి 'సామ' పదము వస్తుంది. దీని అర్థము 'ఆనందము కలిగించునది, ఇష్టమైనది'. ఇది సామ వేదమును కూడా సూచించును. 'గై - శబ్దే - పాడుట' నుండి 'గాయన' అనగా 'పాడువాడు' అనే పదం వచ్చింది. (పాణిని సూత్రము 3.1.153 **ణ్యుట్ చ**). సామగాయనుడు అనగా సామమును పాడువాడు. లేదా, సామగానము చేయువారిని కలిగినవాడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **స్వప్రాప్తి మధుపానేన 'హావు హావు హావు' ఇతి సామాని గాయమానో ముక్తః అస్య ఇతి సామగాయనః.**

**స్వప్రాప్తి మధుపానేన నిరత స్సామగీతిషు నిత్యముక్తా స్యంతి యస్య స ఉక్త సామగాయనః.** నిరంతరం సామగానము చేయుచున్న భగవత్ప్రాప్తినందిన నిత్యముక్తులు కలిగినవాడు సామగాయనుడు. ఇందుకు శ్రీ భట్టులు తైత్తరీయోపనిషత్తునుండి ఉదాహరించారు. **ఏతత్ సామ గయన్నాస్తే.**

శ్రీ కృష్ణదత్త భరద్వాజ శ్రీమద్భాగవతం (12.13.1)నుండి ఉదాహరించారు.

**యమ్ బ్రహ్మ రుద్రేంద్ర స్తువన్తి దివ్యైః స్తవైః వేదైః**
**సాంగ పద క్రమోపనిషద్భిః గాయన్తి సామగాః**
**ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తి యమ్ యోగినః**
**యస్యాన్తమ్ న విదుః సురాసురగణ దేవాయ తస్మై నమః**

బ్రహ్మ రుద్రేంద్ర వరుణ మరుత్తులవంటివారి స్తుతి వాక్యములచే పూజింపబడువాడును, అంగ క్రమ విధానాలలో వేదములచే స్తుతింపబడువాడును, సామగానముచే కీర్తింపబడువాడును, యోగుల నిశ్చలమైన ధ్యానముద్వారా తెలియవచ్చువాడును, దేవాసురులకును తన అనంత తత్వము తెలియనివాడును, సదా ప్రకాశించువాడును అగు పరబ్రహ్మమునకు నమస్సులు.

భగవద్గీత (10.22)లో శ్రీకృష్ణుడు సామవేదమును ప్రత్యేకముగా పేర్కొన్నాడు.

**వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా**

వేదములలో నేను సామవేదమును. దేవతలలో ఇంద్రుడను నేను. ఇంద్రియములలో నేను మనస్సును. ప్రాణులలో చైతన్యమును (ప్రాణశక్తిని) నేను.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు సామగానమును శ్రీకృష్ణునికే ఆపాదించారు. **సామాని గాయన్తి ఇతి సామగాయనః.** సామగానము చేయువాడు సామగాయనుడు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – జ్ఞానమును పొందిన బ్రహ్మజ్ఞానులు పరవశంతో సామగానమును చేయుదురు. శ్రీకృష్ణుడు గోపాలుడై వేణుగాన రూపంలో సామగానం చేశాడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ - సామ-గ-అయనః - సామగాయనః. సామవేదమును గానము చేయువారు 'సామగాః'. అలాంటివారి గమ్యము (అయనము) సామగాయనుడు. **సామగానమ్ అయనమ్ - ఆశ్రయః పరమోలక్ష్యః సామగాయనః.**

శ్రీ రఘునాధ తీర్థ – **యజ్ఞవినాశకాన్ రాక్షసాన్ స్యతి హినస్తి ఇతి సామగీయన్తే అస్మిన్ ఇతి సామగాయనః. సామాని స్తోత్రవిశేషాః గీయన్తే అస్మిన్ ఇతి సామగాయనః.** యజ్ఞమునకు భంగము కలిగించే రాక్షసులను నాశనం చేసేవాడు – అని ఆయనను వేదస్తోత్రములు కీర్తించుచున్నవి. కనుక ఆయన సామగాయనుడు.

## 989. దేవకీనందనః

- దేవకికి ఆనందము కలిగించినవాడు.
- సోమరసమును స్వీకరించి ఆనందించువాడు.
- సూర్యుడు.

### ఓం దేవకీనందనాయ నమః

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీకృష్ణుని సమక్షంలో ఈ శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమును భీష్ముడు యుధిష్ఠిరునికి ఉపదేశించాడు. ఇప్పటివరకూ చెప్పిన నామములన్నీ ఎక్కడో ఉన్న దేవునిగురించి కాదనీ, అవి సాక్షాత్తు తమ ఎదురుగా ఉన్న దేవకీనందనుడైన శ్రీకృష్ణుని స్తుతించేవనీ భీష్ముడు ఈ నామము 'దేవకీనందనః' ద్వారా తెలియజేస్తున్నాడు. శ్రీ భట్టులు ఈ నామమును ఈ అర్థంలో వివరించారు. ఆ దేవకీనందనుడే యుధిష్ఠిరుని బంధువైన కృష్ణుడు.

**దేవక్యాస్తనయత్వేన పరావస్థ ప్రజజ్ఞివాన్ వాత్సల్యాద్ధనరో యోऽసౌ దేవకీనందన స్మృతః.** తాను పరాత్పరుడైయుండి కూడా వాత్సల్యము మొదలైన గుణాలతో అత్యంత పరతంత్రుడై దేవకి అష్టమ గర్భాన అవతరించినవాడు దేవకీనందనుడు. శ్రీ భట్టులు ఉదాహరించిన మహాభారత శ్లోకము –

**స ఏష పృథు దీర్ఘాక్షః సంబంధీ తే జనార్దనః**
**ఏష భూతమ్ భవిష్యచ్చ భవచ్చ భరతర్షభ**
ఓ భరతవంశ శ్రేష్ఠుడా! విశాలమైన నేత్రములు కలిగిన, నీ బంధువైన జనార్దనుడే భూత భవిష్య వర్తమాన కాలములన్నీ అయినవాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – శ్రీ శంకరులు కూడా ఇదే అర్థాన్ని చెప్పారు. దేవకీగర్భమున జన్మించిన శ్రీకృష్ణుడు సాక్షాత్తుగ భగవంతుడే గనుక ఆయన దేవకీనందనుడు. ఇందుకు శ్రీ శంకరులు మహాభారతమునుండి మరొక శ్లోకాన్ని (13.156.7) ఉదాహరించారు.

**జ్యోతీంషి శుక్రాణి చ యాని లోకే త్రయో లోకా లోకపాలైస్త్రయీ చ**
**త్రయో అగ్న్యశ్చ ఆహుతయశ్చ పంచ సర్వే దేవా దేవకీపుత్ర ఏవ**
లోకములోని జ్యోతులు (సూర్యచంద్రాదులు), మూడు లోకములు, లోకపాలకులు, వేదత్రయము, అగ్నిత్రయము, పంచాహుతులు – ఇవన్నీ దేవకీనందనుడే.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ భాగవతంలో శ్రీకృష్ణుడు అవతరించిన శ్లోకాన్ని (10.,3.8) ఉదాహరించారు.

శ్రీకృష్ణ జననం. మరియు వసుదేవుడు బిడ్డను తీసికొని వెళ్ళుట. అక్బర్ కాలంనాటి చిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Birth_%26_escape_of_krishna_vmpa_musueum.jpg



**దేవక్యామ్ దేవరూపిణ్యామ్ దేవకీనందనః శ్రీకృష్ణః**
**ఆవిరాసీత్ యథా ప్రాచ్యామ్ దిశీ రిందురివ పుష్కలః**
పూర్ణిమనాడు తూర్పుదిక్కున పూర్ణచంద్రుడు ఉదయించినట్లుగా దేవరూపిణియైన దేవకియందు దేవకీనందనుడైన శ్రీకృష్ణుడు జనించాడు.

శ్రీ పోతన భాగవతము నుండి

(ఆచార్య డా. జోస్యుల సూర్యప్రకాశరావు రచననుండి గ్రహించిన తాత్పర్యములు)

సుతుగనె దేవకి నడురే
యతి శుభగతి దారలును గ్రహంబులు నుండన్
దితి సుత నిరాకరిష్ణున్
శ్రిత వదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.

వెన్నుని నతిప్రసన్నునిఁ
గ్రన్నన గని మెఱుఁగుఁ బోఁడి గడు నొప్పారెం
బున్నమనాడు కళానిధి
గన్న మహేంద్రాశ చెలువు గలిగి నరేంద్రా!

ఈవిధంగా పూర్ణిమనాడు తూర్పుదిక్కు షోడశకళలతో నిండిన పూర్ణచంద్రుని కన్నట్లుగా ఆ దేవకీదేవి లోకరక్షకుడైన ఆ విష్ణుస్వరూపుని ప్రసవించింది. నీలమేఘచ్ఛాయతో చతుర్భుజాలతో శంఖచక్రపద్మాలు గల హస్తాలతో కౌస్తుభమణితో కమనీయమైన సూత్రంతో శ్రీవత్సలాంఛనంతో శ్రీహరి జన్మించాడు. అలా నిజరూపంతో వెలసిన బాలుని చూచి వసుదేవుడు 'నేటితో యాదవుల కడగండ్లు తీరాయి' అని సంతసించె.

**బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక**
**పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ**
**జూచి తిలకించి పులకించి చోద్య మంది**
**యుబ్బి చెలరేఁగి వసుదేవు డుత్సహించె.**

అప్పుడు దేవకీదేవి స్వామిని ఇలా స్తుతించింది.

మధుర లోని శ్రీ కేశవదేవ మందిరంలో మూల మూర్తి. వికీపీడియా చిత్రం. Photo by Raghvendra Sharma

**ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై**
**'కంటి'మందురు గాని, నిక్కము గానరీ భవదాకృతిం**
**గంటి భద్రముఁ గంటి మాంసపుఁ గన్నులం గనబోలదీ**
**తొంటిరూపుఁ దొలంగఁ బెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్**

దేవకీవసుదేవుల ప్రణతులు స్వీకరించి భగవంతుడు వారి పూర్వజన్మ వృత్తాంతమును, తన జన్మ కారణమును తెలియజేశాడు.

**నందనుడనియుం బరమా**
**నందంబగు బ్రహ్మమనియు నను దలంచుచు నా**
**పెందెరవు నొందెదరు నా**
**యందుల ప్రేమమున భవమునందరు మీరున్**

కుమారుడననీ, పరమేశ్వరుడననీ నన్ను మీరు ప్రేమించి ధ్యానిస్తూ ఉంటే మీకు కూడా మరల జన్మ కలుగకుండా చేసి మీరు మోక్షం పొందేలా అనుగ్రహిస్తాను అన్నాడు స్వామి. ఇలా వారికి ఆనతిచ్చి, అపుడు వసుదేవుడు చేయవలసిన పనిని తెలియజేసి, ఆ శ్రీహరి చతుర్భుజాలుగల దివ్యరూపం ఉపసంహరించి, తన మాయ ప్రసరింపజేసి, నవజాత శిశువు రూపం ధరించి కొంతసేపు దేవకీవసుదేవులకు వేడుక జరిపాడు.

'దేవకీ నందనః' అనగా దేవకికి జన్మించిన కృష్ణుడు అని నేరుగా అర్థం గ్రహించవచ్చును. అయితే కొద్దిమంది వ్యాఖ్యాతలు ఈ వృత్తాంతానికి సంబంధం లేకుండా వేరే అర్థాలు చెప్పారు. ఉదాహరణకు –

శ్రీ రఘునాథ తీర్థ –

**దేవానామ్ కమ్ సుఖమ్ అస్య ఇతి దేవకీ సోమః తేన దేవకినా సోమేన నందతే ఇతి దేవకీనందనః**

దేవతలకు ఆనందమునిచ్చే సోమరసము దేవకి. అలాంటి సోమమును గ్రహించి ఆనందించేవాడు దేవకీనందనుడు.

మరొకవిధంగా,

**దేవేన పాషాణేన క్రియతే సూయతే ఇతి దేవకీ దేవక్యా సోమేన నందతే ఇతి దేవకీనందనః**

దేవము (రాతి)నుపయోగించి (రోలులాగా) తయారుచేసేది దేవకి అనగా సోమము. అలాంటి సోమమును గ్రహించి ఆనందించేవాడు దేవకీనందనుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ కూడా కృష్ణుని ప్రస్తావించకుండా, దేవకీనందనుడంటే సూర్యుడని అర్థం చెప్పారు.

ఇలా కొందరు వ్యాఖ్యాతలు 'దేవకియొక్క కుమారుడు' అనే అర్థం తీసుకొనకుండా వేరే అర్థాలు చెప్పడానికి కారణాలు పరిశీలించవలసియున్నది. (భగవద్రామానుజులు శ్రీభాష్యంలో **'తత్ త్వమ్ అసి'** అనే మహావాక్యం వివరణలో చెప్పిన విషయం – ఏదైనా వాక్యానికి లేదా పదానికి నేరుగా అర్థం తెలుస్తున్నపుడు దానికి పరోక్షమైన అర్థాన్ని వెదకడం ఆక్షేపణీయం.)

## 990. స్రష్టా

- సృజించువాడు.

### ఓం స్రష్ట్రే నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది.
63వ శ్లోకము. 595వ నామము. స్రష్టా – **శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః**
106వ శ్లోకము. 90వ నామము. స్రష్టా – **దేవకీనందనః స్రష్టా క్షితీశః పాపనాశనః**

**సృజతి ఇతి స్రష్టా.** సృజించువాడు స్రష్ట. భగవంతుడు బ్రహ్మాండమును, అందులో బ్రహ్మను సృష్టించి, తక్కిన సృష్టిచేయుటకు అవుసరమైన శక్తిని, జ్ఞానమును, బాధ్యతను బ్రహ్మకు అప్పగించును. బ్రహ్మకు కూడా అంతర్యామి భగవంతుడే గనుక భగవంతుడు అసలు సృష్టికర్త.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **పరావస్థాం ప్రపన్నోఽసౌ స్రష్టేతి ప్రజనాత్ స్మృతః.** పరావస్థలో ఉండి సకల లోకాలు సృష్టించువాడు స్రష్ట. ఈ నామము వివరణలో కూడా శ్రీ భట్టులు భగవానుని సౌలభ్యమును, సౌశీల్యమును విశేషంగా పేర్కొన్నారు. ఈ నామం ద్వారా భీష్ముడు యుధిష్ఠిరునకు చెప్పింది ఏమంటే, సమస్త సృష్టికర్తయైన పరవాసుదేవుడే తమకెదురుగానున్న దేవకీనందనుడైన కృష్ణుడు. అలాంటి పరవాసుదేవుడు భక్తులకు అందుబాటులో ఉన్నాడు. భగవంతుని కళ్యాణగుణాలను ఉపదేశిస్తున్న భీష్ముని అనుగ్రహించాడు.

శ్రీ శంకరుల భాష్యము – **స్రష్టా సర్వలోకస్య.** సకల లోకాలను సృష్టించినవాడు స్రష్ట.

శ్రీ చిన్మయానంద – చతుర్ముఖ బ్రహ్మకు కూడా సృజనశక్తి తన అంతర్యామియైన శ్రీమన్నారాయణుని నుండియే లభించినది.

## 991. క్షితీశః

- తాను సకల లోకములకు అధినాయకుడైనప్పటికీ భూమిపైనున్న జీవులను ఉద్ధరించడానికి తరచు అవతరించేవాడు.
- భూమినేలిన దశరథరాముడు.
- భూమాతకు పతి.

### ఓం క్షితీశాయ నమః

క్షి - నివాస గతయోః - నివసించుట. పాణిని సూత్రము (3.3.94) 'స్త్రియామ్ క్తిన్' ప్రకారము 'క్షితిః' అనగా భూమి. **తస్య ఈశః క్షితీశః**. భూమికి ప్రభువు క్షితీశుడు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవానుడు కేవలం భూమికే కాదు, సకల బ్రహ్మాండములకు ప్రభువు. **యో అనంతరూపో అఖిల విశ్వరూపో గర్భేఽపి లోకాన్ వపుషాభిః.** ఆయన అనంతరూపుడు, అఖిల విశ్వస్వరూపుడు. సమస్త లోకములను తన గర్భమున ధరించును. అయినాగాని దేవలోకాదులకంటె భూలోకంలో జీవులు ఎక్కు కష్టాలు అనుభవిస్తున్నారు గనుక వారిని ఉద్ధరించడానికి భగవంతుడు తరచు భూలోకంలో అవతరిస్తున్నాడు. అందువలన ఆయనను క్షితీశుడు అన్నారు. **సర్వ ఈశత్వేఽపి ఆర్తిభూయిష్ఠత్వాత్ భూయిష్ఠమ్ భూమే ఈశః ఇతి క్షితీశః.**

తిరువైమొళి 3.3.4 - తిరువేంకటత్తన్ దేవతలకు, ముక్తసూరులకు ప్రభువే. కాని ఆయన వైభవం అందువల్ల పెరగదు. నావంటి అల్పులతో కలుస్తూ నీచులకు కూడా అందుబాటులో ఉండడమే ఆయన నిజమైన వైభవం. ఇలా నాయెడల ఆయన చూపే వాత్సల్యము ఆయన వైభవాన్ని ఇనుమడింపజేస్తూ ఆయన సౌలభ్యాన్ని ప్రకాశింపజేస్తున్నది.

భగవంతుడు సకల లోకేశుడు అయినాగాని ఆయన భూమియెడ ప్రేమపాశాలతో బంధుడయ్యాడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **క్షితేర్ భారమ్ అపనీయతామ్ పాలయన్ క్షితీశః.** భూమిపైనున్న జీవుల బాధలు తొలగించి వారిని రక్షించువాడు క్షితీశుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **క్షితేః భూమేః ఈశః దశరథాత్మజః.** ఆ పరబ్రహ్మమే దశరథరాజనందనుడై శ్రీరామచంద్రుడై అవతరించి అనంత భూమండలముకెల్లను మహాసార్వభౌముడయ్యెను గనుక క్షితీశుడు (శ్రీ పెమ్మరాజు రాజారావు).

శ్రీ చిన్మయానంద – క్షితి అనగా భూమాత. భూమికి పతియైనందున ఆయన క్షితీశుడు.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – **క్షియన్తి - నివసన్తి, గచ్ఛన్తి వా నాశమ్ భూతాని యస్యామ్ సా క్షితిః - భూః, తస్య ఈశః క్షితీశః.** సమస్త జీవులు చివరిలో భూమియందే కలుస్తాయి. అలాంటి భూమికి ప్రభువు క్షితీశుడు.

## **992.** పాపనాశనః

- పాపములను నశింపజేయువాడు. భగవంతుని దివ్యనామముయొక్క స్మరణ, చింతన, జప, కీర్తనల మాత్రము చేతనే సమస్త పాతకములు, సకల బంధనములు, సకల తాపములు, సకల వ్యాధులు, సంచిత ప్రారబ్దాది కర్మలు పూర్తిగా నశించును (శ్రీ పెమ్మరాజు రాజారావు రచననుండి).
- అసురులను నాశనము చేయువాడు. వారి పాపములను కూడా తొలగించువాడు.
- దేవకీనందనుడుగా జన్మించినప్పటికీ, తన భక్తులయొక్క బాహ్యశత్రువులైన కంసాది రాక్షసులను, అంతశ్శత్రువులైన అరిషడ్వర్గాలను నాశనము చేసినవాడు.

### ఓం పాపనాశనాయ నమః

**పాపమ్ నాశయతి ఇతి పాపనాశనః.** 'పాప' పదమునకు మూల ధాతువు 'పా', అనగా 'రక్షణే' (రక్షించుట). 'పః' ప్రత్యయము చేర్చుటవల్ల 'పాపః' అగును. అనగా దీనినుండి మనము మనలను రక్షించుకొనవలెను. **పాతి అస్మాత్ ఆత్మానమ్ ఇతి పాపః.** దేనినుండి మనము రక్షణ పొందవలెనో అది 'పాపము'.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **అథ దధి నవనీతస్తైన్య రాసక్రీడాది కథామృతేన పరేషామ్ పాపనాశనః. అవతారేఽపి వైష్ణవానామ్ బాహ్యాభ్యంతర శత్రునాశనః.** భగవంతుని లీలలను స్మరించుట సకల పాపనాశకము. ఆయన పెరుగు, వెన్నలను దొంగిలించిన విధము, గోపికలతో రాసక్రీడలు సలిపిన లీలలు స్మరిస్తే మన మనసులోని పాపములు తొలగుతాయి. తన అవతారములలో ఆయన శ్రీవైష్ణవుల అంతశ్శత్రువులను, బాహ్యశత్రువులను నాశనం చేయును. ఆయన కళ్యాణగుణ ధ్యానమువలన అంతశ్శత్రువులు, ఆయన ఆయుధములవలన బాహ్యశత్రువులు నాశనం పొందును. (తరువాతి శ్లోకములో ఆయన ఆయుధములు చెప్పబడును).

**దేవకీతనయత్వేఽపి ప్రపన్నానాం విశేషతః బాహ్యాంతశ్శత్రుసంహారీ యస్సస్యాత్ పాపనాశనః**

దేవకీనందనుడుగా జన్మించినప్పటికీ తన భక్తులయొక్క బాహ్యశత్రువులైన కంసాది రాక్షసులను, అంతశ్శత్రువులైన అరిషడ్వర్గాలను నాశనము చేసినవాడు గనుక పాపనాశనుడు. (శ్రీకైవల్య సారధి).

శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ – సామాన్యమైన దొంగలు వస్తువులను హరిస్తారు. కాని శ్రీహరి మన మనస్సులోని చోరభావములను హరిస్తాడు. ఆ వెన్నదొంగను, గోపీమానసచోరుని లీలలను ధ్యానిస్తే భక్తుల మనస్సులోని పాపములు తొలగుతాయి.

శ్రీ నమ్మాళ్వారు తమ తిరువైమొళి (3.6.2)లో భగవంతుని 'పాపనాశన్' అని ప్రస్తావించారు. త్రిమూర్తులలో ముఖ్యుడు, రుద్రునికి, బ్రహ్మకును కూడా అంతర్యామి మరియు సృష్టికర్త అయినవాడును, పద్మాక్షుడును అయిన ప్రభువును ధ్యానించండి. బ్రహ్మకును, రుద్రునికిని, దేవతలకును కూడా కష్టాలను తొలగించేది ఆయనే. రావణుని హతమార్చి, లంకను ధ్వంసంచేసి, సీతమ్మతల్లిని విడిపించింది ఆయనే. కేవలం స్మరించినంతనే మనందరి పాపాలనూ హరించే కమలనేత్రుడు ఆయనే.

శ్రీ పెరియాళ్వారు. తిరు 5.4.3 – నా దేవుడా! నీ కృపవలన కలిగిన మహాభాగ్యమును నేనెలా వర్ణించగలను? నిర్దాక్షిణ్యంగా పిశాచాలలా నన్ను అణగద్రొక్కే పాపాలన్నీ ఇప్పుడు కారాగారంనుండి పారిపోయి దాగుకునే దొంగల్లా నిశ్శబ్దంగా వెడలిపోయాయి.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ గీత (4.9)నుండి ఉదాహరించారు –

**జన్మ కర్మ చ మే దివ్య యేవం యో వేత్తి తత్త్వతః త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున**

ఓ అర్జున! నా జన్మ (అవతారము)లు, కర్మములు దివ్యములు. అనగా నిర్మలములు, అలౌకికములు. ఈ తత్త్వరహస్యమును తెలిసికొనినవాడు తనువును చాలించిన పిమ్మట మఱల జన్మింపడు సరికదా! నన్నే చేరును.

ఇంకా శ్రీ కృష్ణన్ ఇలా చెప్పారు – భగవంతుని జన్మగురించి ధ్యానిస్తే మనకు పునర్జన్మయుండదు. ఆయన తల్లిపాలు త్రావిన విషయాన్ని స్మరిస్తే మళ్ళీ మనం తల్లిపాలకోసం జన్మించము. ఆయన పెరుగును, వెన్నను దొంగిలించిన లీలను స్మరిస్తే ఆయన మన పాపాలను అన్నింటినీ దొంగిలించివేస్తాడు. ఆయనను యశోదాదేవి రోట బంధించిన వైనాన్ని స్మరిస్తే మనం మళ్ళీ సంసారబంధాల్లో చిక్కుకొనము. భగవంతుని లీలాస్మరణ మహాత్మ్యం ఇంతటిది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **కీర్తితః పూజితో ధ్యాయతః స్మృతః పాపరాశిమ్ నాశయన్ పాపనాశనః.** భగవంతుని కీర్తించుటవలన, పూజించుటవన, ధ్యానించుటవలన, స్మరించుటవలన పాపములు నాశనమగును. కనుక భగవంతుడు పాపనాశనుడు. ఇందుకు శ్రీ శంకరులు 'వృద్ధశాత తపము'నుండి ఉదాహరించారు.

**పక్షోపవాసాద్ యత్ పాపమ్ పూరుషస్య ప్రణశ్యతి**
**ప్రాణాయామ శతేనైవ తత్పాపమ్ నశ్యతే నృణమ్**
**ప్రాణాయామ సహస్రేణ యత్పాపమ్ నశ్యతే నృణమ్**
**క్షణమాత్రేణ తత్పాపమ్ హరేర్ధ్యానాత్ ప్రణశ్యతి**

పక్షం రోజులు ఉపవాసం చేయడంవల్ల నశించే పాపాలు ఒక్క వంద ప్రాణాయామాలవల్ల నశించుతాయి. అలాంటి వెయ్యి ప్రాణాయామాల ద్వారా నశించే పాపాలు ఒక్క క్షణం హరిని ధ్యానించడంవల్ల నశించుతాయి.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – భగవంతుని ధ్యానించడంవలన సదా భగవానుడు మన మనస్సులో నివాసముంటాడు. అందువలన మనస్సు నిర్మలంగా ఉంటుంది. ఈ శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రం ఆరంభంలో భీష్ముడు యుధిష్ఠిరునికి ఇలా చెప్పాడు.

**తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే విష్ణోర్నామసహస్రం మే శ్రుణు పాపభయాపహం**

ఓ ధర్మరాజా! అట్టి సర్వలోక మహేశ్వరేశ్వరుండును, సర్వాంతర్యామియు, దేవదేవుడును అగు శ్రీవిష్ణుభగవానునియొక్క వేయి పుణ్యనామములను వినుము. ఇవి పాపములను, భయములను తొలగించును. తరువాతి శ్లోకం – **యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః** – లో ఈ నామములు భగవంతుని కళ్యాణగుణములను కీర్తించునవని చెప్పాడు భీష్ముడు. కనుక విష్ణువుయొక్క గుణములనుగాని ధ్యానిస్తే మనస్సులోని పాపములు తొలగును.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ శ్రీమద్భాగవతము (12.13.23)నుండి ఉదాహరించారు.

నామసంకీర్తనమ్ యస్య సర్వపాపప్రణాశనమ్ ప్రణామో దుఃఖశమనః తం నమామి హరిం పరం

ఎవని నామమును స్మరిస్తే సర్వపాపములు నశించునో, ఎవనిని పూజిస్తే సకల దుఃఖములు శమించునో అట్టి హరికి నమస్కరించుచున్నాను. ఇది శ్రీమద్భాగవతములోని చివరి శ్లోకము. కనుక శ్రీ సూతముని ఈ శ్లోకం ద్వారా శ్రీమద్భాగవతం సారాంశాన్ని చెప్పినట్లు భావింపవచ్చును.

శ్రీ చిన్మయానంద – భగవంతుని గురించిన ధ్యానంవల్ల అన్ని వాసనలు నశించును. భగవంతునికి పూర్తిగా శరణాగతుడై తన కార్యములను ధర్మానుసారం నిర్వహిస్తే ఉన్న వాసనలు నశిస్తాయి. క్రొత్త వాసనలు ఉత్పన్నం కావు. వేదములలోని కర్మయోగమునకిదే మూలము.

శ్రీ సత్యసంధ భిన్నంగా చెప్పిన అర్థాలలో ఒకటి – **పాపనాః అశ్నాతి పాపం నయతి ఇతి పాపనాః దైత్యాః, తాన్ అశ్నాతి ఇతి పాపనాశనః.** పాపములు చేసేవారు 'పాపనాః' అనగా దైత్యులు. వారిని భక్షించే (నాశనం చేసే)వాడు గనుక భగవానుడు పాపనాశనుడు.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇలాంటి ఒక అర్థం చెప్పారు. **పవిత్రైః చరితైః శ్రోతౄణామ్ నిఖిల కర్మ్యరూపం పాపం వివర్తయన్, అసురానామపి నిహితాన్ ఆత్మవిద్యామ్ నివర్త్య ముక్తిమ్ తేభ్యో యచ్ఛత్ పాపనాశనః.** భగవంతుని లీలలను వినేవారి పాపములను నాశనం చేసేవాడు పాపనాశనుడు. మరియు రాక్షసులను హతం చేసేవారిలో ఆత్మవిద్యను నెలకొలిపి వారికి ముక్తిని సుగమం చేసేవాడు గనుక కూడా ఆయన పాపనాశనుడు.

**శ్రీమద్భాగవతము – దశమస్కంధము. రాసక్రీడలు.** శ్రీ ఏల్చూరు మురళీధరరావు రచననుండి

రాజేంద్రా! గోపవిలాసినులా విధంగా పాడుతూ పలుకుతూ శ్రీకృష్ణసందర్శన లాలసచిత్తలై పలవరింపగా భగవంతుడు కరుణించి వారియెదుట నిలిచాడు..... గోపకామినులు ఒక్కుమ్మడిని లేచి కృష్ణుని చుట్టుముట్టారు. ఒకతె కేల్దోయిని కూర్చుని అతనికి కయిదండనిచ్చింది. ఒకతె అతని భుజం పట్టుకొని తన ఒడిలోకి లాగికొన్నది. ఒకతె అతని విడియానికై దోయిలించింది. ఒకతె అతని అంఘ్రికమలాన్ని తన కుచంపైని ఉంచుకొన్నది...... రాజేంద్రా! ఆ కాంతామణులా విధంగా శ్రీకృష్ణదర్శన పరమోత్సవ నిర్వృతలై పరమేశ్వరుని పొందిన ముముక్షువులవలె విరహతాపవిముక్తిని పొందారు. .... యమునాతీరాన గోపాంగనలు కృష్ణదర్శనాభావం వలన ఆప్తసమస్త కామలై తమ పయ్యెద చెరగులను కోమలాసనంగా పరిచారు. ఆ భగవానుడు యోగీశ్వర హృదయాంతరమందువలె ఆ ఆసనాన్ని అధివసించాడు.

పరీక్షిన్నరేంద్రా! ఆ గోపకామినులప్పుడు సంతోషిత స్వాంతులై రాసక్రీడకు ఉపక్రమించారు. పెక్కుమంది సుందరీమణులు కూడ వలయాకారంగా కావించే నృత్తవిశేషాన్ని రాసక్రీడ అంటారు.

వ్రజకలకంఠులు క్రీడార్థం మండలాకారంలో నిలిచారు. భగవానుడిద్దరిద్దరు మందగమనల మధ్య తాను నిలిచి ఆ యిరువురి కంఠాలపైని ఒక్కొక్క చేతిని ఆనించాడు. అందుమూలాన ప్రతి గోపాంగన తన ప్రక్కనే శ్రీకృష్ణుడున్నాడని భావించడం జరిగింది. భగవానుడు ఆ లలితాంగనల మధ్య నిలిచి ఉండటాన్ని చూడగా సువర్ణాల నడుమ మరకతాలను పొదిగిన్లు శోభిల్లింది. శ్రీకృష్ణుడొక్కడే అలా అందరితో ఉండడం ఎలా సాధ్యమనిపించవచ్చును. అచింత్య శక్తిసంపన్నుడైన భగవానుడొక్కడే పెక్కు భక్తులకు వారివారి విశ్వాసాలనుబట్టి వేర్వేరు రూపాలలో కనిపించడంలేదా?.....

గోపభామినులు క్రీడామగ్నలై తాళలయాలకు తగినట్లుగా అడుగులు వేస్తూ కరముద్రలు పట్టుతూ లేనవ్వు తేటలను గ్రుమ్మరిస్తూ బొమలు కదిలిస్తూ అభినయింపసాగారు. వారి నెన్నడుములు కుచభారానికి కంపించాయి. కట్టు కోకలు చెదిరాయి. నెమ్మోములు చెమర్చాయి. కొప్పుముడులు వీడాయి. ఒడ్డాణాలు జారిపడ్డాయి. ఆ విధంగా వారు ఆడుతూ పాడుతూ లీలాకృష్ణరూపాలమధ్య నిలిచి మేఘమండలాంతరాన తళతళలాడే మెరుపుతీగెలవలె ప్రకాశించారు. ఆ హంసయానలకు శ్రీకృష్ణస్పర్శ మైమరపును కలిగించింది. వారు పరమానంద వివశలై ఎలుగెత్తి వివిధరాగాలను ఆలపించారు. గగనాంగణం దివ్య సంగీత నాదాలతో మారుమ్రోగింది......



తంజావూరు పటచిత్రం. వికీపీడియానుండి

https://commons.wikimedia.org/wiki/File:Tanjore_mural_painting_on_cloth1.JPG

రాజేంద్రా! ఈ క్రీడలు స్థూలకాయికమైనవి కావు. గోపికల స్థూలదేహాలు ఆ క్రీడాసమయాల్లో వారి భర్తలచెంతనే ఉండేవి. అవి ఇంద్రియ కామోద్దీపితాలు కావు. కేవల పరాభక్తి రసోద్దీపితాలు. ఆ ఆత్మపరమాత్మలు ఒకదానితోనొకటి ఆనందించడమే ఇందులోని రహస్యం. భగవానుడు రాసక్రీడా వ్యాజాన గోపికలకు కామజయాన్ని అనుగ్రహించాడు. వారికి ఏకాంత భక్తి సుస్థిరమయ్యింది. ఆత్మానందానికి ఏకాంతభక్తి ఉత్తమోత్తమ సాధనం.



## శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః |
## రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః || (107)

శ్రీమహావిష్ణువుయొక్క వేయి నామాలను చెప్పే దివ్యశ్లోకాలలో ఇది చివరి శ్లోకము. తరువాత ఫలశ్రుతి ఆరంభమవుతుంది. ఈ శ్లోకంలో భగవానుని దివ్య పంచాయుధములు వర్ణింపబడినవి. ఈ దివ్యాయుధాలను ధరించిన మంగళమూర్తిగా భగవానుని భక్తులు అనేక విధాలుగా ప్రస్తుతించారు.

(1) భక్తులు వీనిని దివ్యాయుధాలుగా కీర్తిస్తారు.

(2) ఈ ఆయుధాలు భగవంతుని శత్రువులకు భయానకాలు. భగవానుని ఆయుధాలు అనేకములు (**దివ్యానేకోద్యతాయుధమ్** – గీత) అని చెప్పారు. స్వామిదేశికన్ షోడశాయుధస్తోత్రంలో సుదర్శనభగవానుని 16 ఆయుధములను స్తుతించారు. ఈ 'శంఖభృన్నందకీ....' శ్లోకంలో ఐదు ఆయిధాలు ధరించినవానిగా భగవానుని ప్రస్తుతించారు. ఈ ఐదు ఆయుధాల స్తుతియే పంచాయుధస్తోత్రంలో ఉన్నది.

(3) ఇలా భక్తులు ఈ ఆయుధాలను భగవంతుని అలంకారములుగాను, తమను రక్షించేవిగాను భావించారు. శ్రీ నమ్మాళ్వారు అనుభవం మరోలా ఉంది. (తిరువైమొళి 8.3.3) భక్తులకోసం భగవంతుడు ఈ ఆయుధాలన్నీ సదా మోస్తూ ఉండాలి. ఇందులో ఆయనకు సాయపడేవారెవరూ లేరని శ్రీ నమ్మాళ్వారు ఆందోళన చెందారు. కేవలం మన కోరికలను భగవంతునికి చెప్పుకోవడమే మన పనిగా భావిస్తాము. మనం కోరవలసినది ఆయననే అని మనకు తెలియదు కదా? అలాగే శ్రీ పెరియాళ్వారు భగవంతుని చల్లగా ఉండమని 'పళ్ళాండు' మంగళాశాసనం పలికారు.

(4) శ్రీ విష్ణుభగవానుడు తన తిరుమేనిపై ధరించే ఆయుధముల మరొక విశిష్ట లక్షణము – ప్రతి ఆయుధము సృష్టికి మూలమైన ఒక తత్వమును సూచించును. విష్ణుపురాణంలో చెప్పిన ప్రకారము

**చక్రము** – చంచలమైన మనస్సును సూచించును. వాయువేగము, మనోవేగము కలది.
**శంఖము** – తామస అహంకారమును సూచించును. ఇందుండి పంచభూతములు ఉద్భవించెను. ఉదాహరణకు ఆకాశమందున్న శబ్దతన్మాత్ర శంఖధ్వనియే.
**గద** – స్థిరమైన బుద్ధిని సూచించును.
**శార్ఙ్గము** – సాత్వికను సూచించును. ఐదు కర్మేంద్రియములకు, ఐదు జ్ఞానేంద్రియములకు ఇది నియంత్రణ కారకము.
**నందకి** – ఇది బ్రహ్మవిద్యను సూచించును. కత్తియొక్క ఒర అవిద్యను సూచించును.

విష్ణుపురాణము (1.22)లో ఇవి వర్ణింపబడినవి.

**ప్రధానమ్ బుద్ధిరప్యాస్తే గదారూపేణ మాధవే** (68)
**భూతాదిమ్ ఇంద్రియాదిశ్చ ద్విధాహంకార ఈశ్వరః**

**బిభర్తి శంఖరూపేణ శార్ఙ్గరూపేణ చ స్థితమ్** (69)
**బలస్వరూపమ్ అత్యంత జవేనాంతరివానలమ్**
**చక్రస్వరూపశ్చ మనోధత్తే విష్ణుః కరే స్థితమ్** (70)
**బిభర్తి యచ్చాసి రత్నమ్ అచ్యుతోऽత్యంత నిర్మలమ్**
**విద్యామయన్తు తద్ జ్ఞానమ్ అవిద్యాకోశ సంస్థితమ్** (73)
మాధవునియందు గదారూపంలో బుద్ధి స్థితమైనది. పంచభూతములకు, ఇంద్రియములకు నిలయమైన అహంకారము రెండువిధములుగా ఆయన శంఖమునందును, ధనుస్సు రూపమునను ఉన్నది. గాలికంటే వేగం కలిగిన మనస్సును చక్రరూపంలో ఆయన ధరించియున్నాడు. ప్రకాశించే ఆయన ఖడ్గము విద్యామయము. అవిద్య అనే ఒరలో దాగియున్నది.
ఇలా నిరాకారమైన తత్వములు ఆయుధాలుగా విష్ణుభగవానుడు తన చేత ధరిచియున్నాడు.

(5) పంచాయుధముల మరొక విశిష్ట లక్షణము – అవి భగవంతుని అసాధారణ లక్షణములుగా చెప్పబడినవి. అనగా ఈ ఆయుధములు ఇలా ఈయనకే ఉన్నవి. రావణుని భార్య మండోదరి శ్రీరాముని **'తమసః పరమో ధాతా శంఖ చక్ర గదాధరః'** అని ప్రస్తావించినది.


ద్వారకా తిరుమల గోపురం పైని శిల్పం

పరమాత్ముని విశ్వరూపమును చూచి కలత చెందిన అర్జునుడు భగవానుని చతుర్భుజ రూపమును చూపమని ప్రార్థించాడు (గీత 11.46)
**కిరీటినం గదినం చక్రహస్తమ్ ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ**
**తేనైవ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే!**
కిరీటమును, గదను, శంఖచక్రములను ధరించిన నీ రూపమును చూడగోరుచున్నాను. ఓ సహస్రబాహో! విరాడ్రూపా! నీ చతుర్భుజ రూపమును నాకు చూపుము.

శ్రీమద్భాగవతంలో పంచాయుధముల వర్ణన –

**సర్వాత్మనీదమ్ భువనమ్ నిరీక్ష్య సర్వేऽసురాః కశ్మలమాపురాంగః**

**సుదర్శనమ్ చక్రమ్ అసహాయతేజో ధనుశ్చ శార్ఙ్గమ్ స్తనయిత్ను ఘోషమ్**
**పర్జన్యఘోషో జలజః పాంచజన్యః కౌమోదకీ విష్ణుగదా తరస్వినీ**
**విద్యాధరోఽసి శతచంద్రయుక్తః తూరోత్తమా అక్షయసాయకౌచ**

ఓ రాజా! విశ్వమంతా వ్యాపించియున్న శ్రీహరి శరీరాన్ని దర్శించి అసురులు భయభ్రాంతులయ్యారు. అసామాన్య తేజోపూరితమైన సుదర్శన చక్రము, ఉరుమువలే ధ్వనించే శార్ఙ్గము అనే ధనుస్సు, వర్షించే మేఘంలా గర్జించే పాంచజన్య శంఖము, సాటిలేని బలం కల కౌమోదకి గద, నూరు వాడి అంచులతో ప్రజ్వలిస్తూ విద్యను తెలిపే నందక ఖడ్గము ఆయనకు ప్రణమిల్లుతున్నాయి.

## శ్రీ పంచాయుధ స్తోత్రము



Picture by Alwargiridhar
https://commons.wikimedia.org/wiki/
File:Vekata_viran_moorthy_-_Dasavatharas.jpg

సశంఖ చక్ర సగదాపి శార్ఙ్గం
పీతాంబరం కౌస్తుభవత్సచిహ్నం
శ్రియాసమేతోజ్వల శోభితాంగం
విష్ణుం సదాఽహం శరణం ప్రపద్యే

స్ఫురత్సహస్రార శిఖాతి తీవ్రం
సుదర్శనం భాస్కరకోటితుల్యం
సురద్విషాం ప్రాణవినాశి విష్ణో
శ్చక్రం సదాఽహం శరణం ప్రపద్యే

విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య
యస్య ధ్వని ర్దానవ దర్పహంతా
తం పాంచజన్యం శశికోటి శుభ్రం
శంఖం సదాఽహం శరణం ప్రపద్యే

యజ్జ్యానినాద శ్రవణాత్సురాణాం
భీతాంశు నిర్ముక్త భయాని సద్యః
పతంతి దైత్యాశని బాణవర్షైః
శార్ఙ్గం సదాఽహం శరణం ప్రపద్యే

హిరణ్మయీం మేరుసమాన సారాం
కౌమోదకీం దైత్యకులైక హంత్రీం
వైకుంఠ వామాగ్ర కరాభిమృష్టాం
గదాం సదాఽహం శరణం ప్రపద్యే

రక్షోఽసురాణాం కఠినోగ్రకంఠ
చ్ఛేద క్షరత్ క్షోణిత దిగ్ధధారాం
తం నందకం నామ హరేః ప్రదీప్తం
ఖడ్గం సదాఽహం శరణం ప్రపద్యే

ఇదం హరేః పంచమహాయుధానాం
స్తవం పఠేద్యోఽనుదినం ప్రభాతే
సమస్త దుఃఖాని భయాని సద్యః
పాపాని నశ్యంతి సుఖాని సంతి

## 993. శంఖభృత్

- పరమైశ్వర్య లక్షణము గల పాంచజన్యము అనే శంఖమును ధరించువాడు.
- పాంచజన్యమును తన అధరామృతముతో పోషించువాడు.
- అహంకార తత్త్వము గల పాంచజన్యమును ధరించువాడు.

### ఓం శంఖభృతే నమః

శమ - ఉపశమే - శాంతించుట, ముగించుట ('శాంతి' శబ్దము కూడా ఇదే మూలమునుండి వచ్చింది). ఉణాది సూత్రము (1.102) **'శమేః ఖః'** ప్రకారము 'శమ' శబ్దమునకు 'ఖ' ప్రత్యయము చేర్చుట ద్వారా 'శంఖ' పదము వస్తుంది. భృ - ధారణ పోణయోః - ధరించుట, పోషించుట. **శంఖం బిభర్తి ఇతి, శంఖం పుష్ణాతి ఇతివా శంఖభృత్.** శంఖమును ధరించువాడు లేదా శంఖమును పోషించువాడు 'శంఖభృత్'. శ్రీ భట్టులు 'పోషించుట' అనే అర్థంలో వ్యాఖ్యానించారు. శ్రీ ఆండాళ్ తల్లి కూడా ఈ భావాన్ని ఒక పాశురంలో ప్రస్తుతించింది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు ఇంతకు ముందలి 991 నామములను భగవంతుని సౌలభ్య సౌశీల్య గుణములను విశేషంగా సూచించేవిగా వ్యాఖ్యానించారు. చివరి 8 నామములు **'పరమైశ్వర్య చిహ్న దివ్య ఆయుధత్వాత్',** భగవంతుడు పరమైశ్వర్య సూచకములైన దివ్యాయుధములను ధరించినందున, ఆయనే సకల లోకములకును పరమేశ్వరుడు – అనే అర్థంలో వ్యాఖ్యానించారు. అదే సమయంలో భగవంతుని దివ్యాయుధ ధారణ స్మరణం ద్వారా భక్తులయందు భక్తిరసం పెంపొందించే దిశలో శ్రీ భట్టుల వ్యాఖ్యానం సాగింది. భగవంతుడు తన అధరామృతం ద్వారా శంఖమును పోషించుచున్నాడని శ్రీ భట్టులు 'శంఖభృత్' నామమునకు వ్యాఖ్యానం చెప్పారు.

ఇదే భావాన్ని అండాళ్ తల్లి నాచియార్ తిరుమొళి పాశురం (7.7)లో చక్కగా చెప్పింది. చక్రం (చక్రత్తాళ్వార్) అప్పుడప్పుడూ శ్రీనివాసుని స్పర్శను వదలి భక్తుల రక్షణ కొఱకు దూరంగా వెళ్ళవలసివస్తుందట. కాని శంఖం సదా ఆయనను అంటిపెట్టుకొని ఉండి, అప్పుడప్పుడూ ఆయన అధరామృతమును పొందే అదృష్టం కలిగియుంది. దానిదెంతటి భాగ్యమో కదా!

శ్రీ శంకరుల వ్యాఖ్య – **పాంచజన్యాఖ్యమ్ భూతాన్ అహంకారాత్మకమ్ శంఖం బిభర్తి శంఖభృత్.** తామస అహంకార తత్త్వము గల పాంచజన్యము అనే శంఖమును ధరించినవాడు 'శంఖభృత్'. ఈ తామస అహంకారమునుండే పంచభూతములు జనించినవి. ఈ చిహ్నముయొక్క విశేషము విష్ణుపురాణంలో వివరంగా చెప్పబడినది.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – 'పాంచజన్యము' అనే పేరే పంచభూతములకు మూలమైన అహంకార తత్త్వమును సూచించుచున్నది. మరొక ప్రసిద్ధ వృత్తాంతము – భగవంతుడు పంచజనుడు అనే రాక్షసుని వధించి, అతని రూపంనుండి గ్రహించిన శంఖమే పాంచజన్యము. పాంచజన్యమునుండి వెలువడే ధ్వని భక్తుల మనస్సులలోని అంతశ్శత్రువైన అజ్ఞానాన్ని, బాహ్యశత్రువులైన దుష్టులను నాశనం చేస్తుంది. ఇలా రెండు విధాలుగా అది భక్తులను రక్షిస్తుంది.

శ్రీ వాసిష్ఠ ఋగ్వేదం (4.10)లోని పది మంత్రాలను ఉదాహరించారు. ఇవి శంఖముయొక్క మహిమను చెప్పేవి. శంఖమును తాయెత్తుగా ధరిస్తే ఇవి వర్తిస్తాయని రాల్ఫ్ గ్రిఫిత్ అనువాదంలో ఉన్నది.

## 994. నందకీ

- విజయానందమును కలిగించే నందకము అను ఖడ్గమును ధరించినవాడు.

- సంతోషముతోనుండుమని భక్తులను దీవించువాడు.
- విద్యామయమై అనందవర్ధకమైన నందకము అనే ఖడ్గమును ధరించినవాడు.

## ఓం నందకినే నమః

నంద్ - సమృద్ధౌ - ఆనందించుట, వర్ధిల్లుట. పాణిని సూత్రము (3.1.150) 'ఆనిషి చ' ప్రకారం క్రియకు 'వున్' ప్రత్యయము చేర్చుటద్వారా దీవెనాపరమైన అర్థం వస్తుంది. అలా 'నందకః' అనగా 'ఆనందముగా ఉండుము' అని యనుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – 'నన్ను క్షేమంగా, సంతోషంగా ఉంచుము'. అని దేనిని ప్రార్థిస్తామో ఆ 'నందకము' అనే ఖడ్గమును తనదిగా కలిగినవాడు 'నందకి'. **నందక అస్యాస్తీతి నందకీ.** శ్రీమన్నారాయణుడు కూడా 'ఇది నన్ను సంతసింపజేయగలదు' అని ప్రార్థింపదగి ఉండడంచేత 'నందకము' అనే పేరుపొందిన ఖడ్గాన్ని ధరించినవాడు నందకి.

**నంద్యాన్మయ మిత్యేవం ప్రార్థ్యో భగవతాపి యః స నందకో నిత్యయోగీ యస్యాసౌ నందక స్మృతః** పరమేశ్వరుని సన్నిధిని ప్రాప్తింపజేసే నందకము అనే దివ్యఖడ్గాన్ని ధరించినవాడు నందకి (శ్రీకైవల్య సారధి).

శ్రీ వాసిష్ఠ – **ఆశంసనార్థమ్ ప్రియమ్ వస్తు నిత్యమ్ అస్య అస్తి ఇతి నందకీ.** సంతోషంగా ఉండమని దీవించడానికి ప్రియమైనవారిని సదా కలిగినవాడు నందకి. అనగా భగవంతుడు తన భక్తులను సదా సంతోషంగా ఉండమని దీవిస్తాడు. దివ్యాయుధమైన ఖడ్గంతో నిమిత్తం లేకుండా శ్రీ వాసిష్ఠ తమ వ్యాఖ్యను చెప్పడం గమనించదగినది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **విద్యామయో నదంకాఖ్యః అసిః అస్య ఇతి నందకీ.** విద్యామయమైన నందకము అనే ఖడ్గమును కలిగినవాడు నందకి. నందకము ఆనందవర్ధకమగు జ్ఞానతత్వమును తెలుపును. శ్రీవిష్ణుపురాణంలో ఒకో దివ్యాయుధానికీ ఒకో తత్వమును ఆపాదించిన విధానికి ఈ వ్యాఖ్య సరిపోతుంది.

శ్రీ బలదేవ విద్యాభుషణ కూడా ఇదే అర్థాన్ని చెప్పారు. **విజ్ఞానాత్మకో నందకో అసిః అస్య ఇతి నందకీ.**

శ్రీ చిన్మయానంద – భగవానుని ఖడ్గము పేరు నందకము. దానిని ధరించువాడు నందకి. 'నంద-కమ్' అనగా ఆనందమును కలిగించునది. శాస్త్రములలో కీర్తించిన ప్రకారము శ్రీహరి పావన దివ్యహస్తమునందలి దివ్యఖడ్గము విద్యాతత్వమును సూచించును. దీనిద్వారా సాధకుడు తనలోని అజ్ఞానమును ఖండింపవచ్చును.

## 995. చక్రీ

- తన భక్తులకు శత్రువులైన రాక్షసుల రక్తంతో తడిసిన సుదర్శనము అనే చక్రమును ధరించినవాడు.
- వర్తులాకారంలో భ్రమించేవానితో (గ్రహ నక్షత్రాదులు, సంసారము వంటివానితో) కూడిన విశ్వమును సృష్టించినవాడు.
- శుభదృష్టిని ప్రసాదించే సుదర్శనము అనే చక్రమును ధరించినవాడు.
- తేజోతత్త్వమయమైన సుదర్శనము అనే చక్రమును ధరించినవాడు.
- తన ఆజ్ఞచే గిరగిరా తిరిగే సంసారచక్రమును తన అధీనమందు గలవాడు.

## ఓం చక్రిణే నమః

97వ శ్లోకము. 908వ నామము. చక్రీ – **అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః**
107వ శ్లోకము. 995వ నామము. చక్రీ – **శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః**
ఇలాంటిదే మరొక నామము:

45వ శ్లోకము. 417వ నామము. సుదర్శనః – **ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః**

భగవానుడు ధరించే చక్రము పేరు సుదర్శనము. ఇది ఆయనకు అలంకారముగాను, ఆయన భక్తులకు రక్షణగాను భాసిల్లే దివ్యాయుధము.

శ్రీ భట్టుల వ్యాఖ్య –

908వ నామము. చక్రీ – **తాదృశ దివ్యాయుధః చక్రీ.** చక్రమువంటి దివ్యాయధములను ధరించినవాడు చక్రి. భగవానుని సౌందర్యము అనేక దివ్యాయుధములతో ప్రకాశిస్తున్నది.

995వ నామము. చక్రీ – **నిత్య సుదర్శనః స్వభృత్య ప్రతిభట రక్షః అసుర శోణిత కల్మాషిత జ్వాలాంచితమ్ చక్రమపి తథైవ ఇతి చక్రీ.** తన భక్తులైన దేవతల శత్రువులగు రాక్షసుల రక్తముచే తడిసిన తేజోవంతమైన సుదర్శన చక్రమును చేతియందు ధరించినవాడు చక్రి. ఇక్కడ భగవంతుని రక్షకత్వమును విశేషముగా వివరించారు.

**సర్వరక్షోऽసురచ్ఛేత్తా నిత్యం చక్రేణ యోగతః చక్రీతి కథ్యతే సమ్యక్ ఋత్విర్జః శత్రునాశకః** రాక్షస సంహారం చేసి లోకాలను రక్షించడంకోసం సుదర్శనమనే చక్రాయుధాన్ని ధరించినవాడు చక్రి. ఈ నామము షడక్షరీమహామంత్రము. శత్రుసంహారి. ఓం చక్రిణే నమః. (శ్రీకైవల్య సారధి).

శ్రీ శంకరుల వ్యాఖ్య –

908వ నామము. చక్రీ - **సమస్త లోక రక్షణార్థమ్ మనస్తత్వాత్మకమ్ సుదర్శనాఖ్యమ్ చక్రమ్ ధత్తా ఇతి చక్రీ.** సమస్త లోకములను రక్షించుటకై మనస్సు అనే తత్వము కలిగిన, సుదర్శనము అనే పేరు కలిగిన చక్రమును ధరించినవాడు చక్రి.

995వ నామము. చక్రీ – **సంసార చక్రమ్ అస్య ఆజ్ఞయా పరివర్తత ఇతి వా.** సంసారము అనే చక్రము ఇతని ఆజ్ఞవలన పరిభ్రమించుచున్నది. కనుక ఆయన చక్రి.

శ్రీ సత్యదేవో వాసిష్ఠ – శ్రీ వాసిష్ఠ 'చక్రము' అనగా 'గుండ్రముగా తిరుగునది' అనే సామాన్య అర్థంలో (ఆయుధాన్ని ప్రత్యేకంగా పేర్కొనకుండా) వ్యాఖ్యానించారు. మరల మరల పునరావృతమయ్యే విశేషాలు కలిగిన లోకాన్ని సృష్టించాడు గనుక భగవంతుడు చక్రి. ఉదాహరణకు సూర్య చంద్రోదయాలు.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ శ్రీమద్భాగవతము (8.20.30), శ్రీ విష్ణుపురాణము (5.30.22) నుండి ఉదాహరించారు **సుదర్శనమ్ చక్రమ్ అసహ్య తేజః. నమస్తే చక్రహస్తాయ.**

శ్రీ చిన్మయానంద – 'సు-దర్శనము' అనగా శుభకరమైన దృష్టి. అలాంటి చక్రమును ధరించినవాడు చక్రి. దివ్య చక్రాయుధము మనస్సును సూచించునని శాస్త్రములు చెబుతున్నవి.



శ్రీ విష్ణువునకు సుదర్శన చక్రాన్ని ప్రసాదిస్తున్న శ్రీ పరమేశ్వరుడు. 1820 కాలపు చిత్రం. వికీపీడియా నుండి.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **తేజస్-తత్త్వమ్ సుదర్శన చక్రమ్ అస్య అస్తి ఇతి చక్రీ.** తేజో తత్వమును సూచించే సుదర్శన చక్రమును ధరించినవాడు చక్రి.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ – శంఖ చక్రములు ధరించి వెలుగొందుతున్న భగవానునికి భక్తులు కానివారినుండి దృష్టిదోషం తగులకుండా ఉండడంకోసం భీష్ముడు శంఖము, చక్రము అనేవానికి సంబంధించిన నామములను చెప్పాడు. 993. శంఖభృత్. 994. నందకీ. 995. చక్రీ.

చక్రమునకు ఉన్న ఇతర నామములు **హేతిరాజన్, రథాంగః, సుదర్శన.** 417వ నామము **'సుదర్శనః'**. మరియు 998వ నామము **'రథాంగపాణిః'**.

## 996. శార్ఙ్గధన్వా

- తన ధనుష్టంకారము చేత, శరపరంపరల చేత, శత్రువులను నాశనం చేసే శార్ఙ్గము అనే పేరుగల ధనుస్సును ధరించినవాడు.
- ఇంద్రియాది అహంకార తత్వము రూపమైన శార్ఙ్గము అనే పేరు గల ధనుస్సును ధరించినవాడు.
- క్రియాతత్వరూపమైన శార్ఙ్గము అనే పేరు గల ధనుస్సును ధరించినవాడు.

### ఓం శార్ఙ్గధన్వనే నమః

**శార్ఙ్గమ్ ధనుః అస్య ఇతి శార్ఙ్గధన్వా.** శార్ఙ్గము అనే పేరుగల ధనుస్సును కలిగినవాడు 'శార్ఙ్గధన్వా'.

శౄ - హింసాయామ్ - చీల్చివేయుట, బాధించుట, చంపుట. ధన్ - శబ్దే - శబ్దము చేయుట.

శ్రీ భట్టుల వ్యాఖ్య – కేవలం తన అల్లెత్రాడు ధ్వని ద్వారా శత్రువులను, వారి నామములను, వారి పదవులను ధ్వంసం చేయగల ధనుస్సు శార్ఙ్గము. దీనికి తోడు ఆ ధనుస్సునుండి వచ్చే శరపరంపర కూడా శత్రువులను నాశనం చేస్తుంది. **జ్యా ఘోష శరవర్ష నాశిత.** ఇలా రెండు విధాలుగా శత్రువులను నాశనము చేసే శార్ఙ్గము అనే ధనుస్సును ధరించినవాడు 'శార్ఙ్గధన్వా'. ఇలా ఆ శార్ఙ్గధారి శత్రువుల సంకల్పాలను వమ్ము చేసి, ఆశ్రితులను పునరుజ్జీవింపజేయును.

**ఆండాళ్. తిరుప్పావై 4.**

భావశ్రీ తెలుగు సేత.

వర్ష నిర్వాహకా! గంభీర భావుకా!
నీ త్యాగమందు సంకోచింపవలదయ్యా
జలధి మధ్యను జొచ్చి, జలమంతటిని బీల్చి
గర్జించి గర్జించి గగనమధిరోహించి
కాలాది సకల కారణభూతుడైనట్టి
నారాయణుని దివ్య శ్యామలాకృతితోడ
అరుదైన అతని సుందర బాహుయుగ్మమున
చక్రమ్ము వలె మెరిసి, శంఖమ్ము వలె ఉరిమి
శార్ఙమ్ము గురియించు శరవర్షమన్నట్లు
లోకమెల్ల సుఖింప మేము సంతోషాన
మార్గశీర్ష స్నానమాచరించెడునట్లు
ఆలసింపక వర్షమందింప గోరెదము.



శ్రీ వేంకటేశ్వర స్వామి శిల్పం- వికీపీడియా చిత్రం.
Photo by Palagiri Ramakrishna Reddy



<u>ఆదర్శాచార్య చిత్రకవి ఆత్రేయ తెలుగు సేత</u>

పర్జన్య దేవ! పాలింప రావా!

సంద్రమ్ముపై వ్రాలి సలిలములు త్రావి

ఆదిదేవునివోలె ఆతసీదేవుడవై

ఆకసము పైకెక్కి గర్జించుమా!

సుందరబాహు అరవిందనాభు హస్తాన

చక్రమ్ము వలె మెరిసి, శంఖమ్ము వలె ఉరిమి

శార్ఙ్గ నిర్ముక్త శరపరంపరగా

లోకమ్ము హర్షింప వర్షమ్ము కురియుమా!

మార్గశిర స్నానమ్ము చేసి తరించెదము

జగతికే మంగళము కూర్చు మన శ్రీవతము

ఇక్కడ ఆండాళ్ళు తల్లి వానదేవుని 'ఆ పద్మనాభుని సుందర విశాల బాహుయుగళిలో, దక్షిణ భుజమునందలి సుదర్శనచక్రమువలె మెరియుము! ఆయన వామహస్తములోని పాంచజన్య శంఖమువలె ఉరుముము. శ్రీమహావిష్ణువు విల్లు శార్ఙ్గమునుండి వెలువడిన బాణవర్షము వలె ఆలసింపక వర్షించుము' అని కోరినది. ఆండాళ్ళు శ్రీమహావిష్ణువు శార్ఙ్గ ధనుశరపరంపరను తెలిసిన విషయము (ఉపమానము)గాను, అలా పడవలసిన వర్షమును ఉపమేయముగాను వాడడం మనము గమనింపదగిన విషయము.

శ్రీ త్రివిక్రమమూర్తి – వికీపీడియా చిత్రం. Photo by Nomu420. https://commons.wikimedia.org/wiki/File:Trivikrama.JPG

శ్రీ కృష్ణదత్త భరద్వాజ – భాగవతం (8.20.30)నుండి. **ధనుశ్చ శార్ఙ్గమ్ స్తనయిత్ను ఘోషమ్.** ఉరుమువలె ధ్వనించే శార్ఙ్గ ధనుస్సు – అని ఉదాహరించారు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఇంద్రియాది అహంకారాత్మకమ్ శార్ఙ్గమ్ నామ ధనుః అస్య ఇతి శార్ఙ్గధన్వా** . ఇంద్రియముల అహంకారతత్వరూపమైన శార్ఙ్గము అనే పేరు గల ధనుస్సును కలిగినవాడు 'శార్ఙ్గధన్వా'.

శ్రీ చిన్మయానంద – ఎన్నడూ గురితప్పని శార్ఙ్గము అనే ధనుస్సును ధరించినాడు గనుక భగవానుడు 'శార్ఙ్గధన్వా'. నారాయణుని ధనుస్సు అహంకార తత్వరూపమని శాస్త్రములు చెబుతున్నవి. ఈ చివరి శ్లోకంలో శ్రీమన్నారాయణుని చేతనుండి మనను ఆశీర్వదించే దివ్యాయుధములను భక్తితో స్మరింపనగును.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **క్రియా తత్త్వమ్ శార్ఙ్గమ్ ధనుః అస్య ఇతి శార్ఙ్గధన్వా.** క్రియాతత్వమును సూచించే శార్ఙ్గము అనే ధనుస్సును ధరించినాడు గనుక భగవానుడు 'శార్ఙ్గధన్వా'.

## 997. గదాధరః

- ప్రళయాగ్నిలా నిప్పులు చిమ్ముతూ ఆయనకు ఆనందము కలిగించే కౌమోదకి అనే గదను ధరించినవాడు.
- బుద్ధితత్వరూపమగు కౌమోదకి అనే గదను ధరించినవాడు.

ఓం గదాధరాయ నమః

గద - వ్యక్తాయామ్ వాచీ - మాట్లాడుట. గదతి - శబ్దమ్ కరోతి ఇతి గదా - ధ్వని చేయునది. ధృంజ్ - ధారణే - ధరించుట, పట్టుకొనుట, ఆధారమగుట. **గదాయాః ధరః గదాధరః.** గదను ధరించినవాడు గదాధరుడు. శ్రీమహావిష్ణువు గద పేరు కౌమోదకి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – కౌమోదకి గద ఎదురు లేని శక్తి గలది. ఇది ప్రళయాగ్నివలె నిప్పులు చిమ్ముచు భగవంతునికి ఆనందము కలిగించును. అట్టి గదను ధరించినవాడు గదాధరుడు.

శ్రీ వాసిష్ఠ కౌమోదకి ప్రయోగంలో వచ్చే ధ్వని మెరుపుతో కూడిన ఉరుమువంటిదని వర్ణించారు.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – మహాభారతంలో ఖాండవదహన సమయంలో వరుణుడు కృష్ణునికి ఈ గదనిచ్చాడు.

కౌమోదకికి మరొక అర్థం – కుముదః - భూదేవి సన్నిధిలో ఆనందించువాడు. కుమోదకః - భూమిని ఆనందపరచేవాడు. ఆయనకు చెందినది**, కుమోదకస్య ఇదమ్**, కౌమోదకి.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **బుద్ధి తత్త్వాత్మికమ్ కౌమోదకి నామ గదామ్ వహన్ గదారః**. బుద్ధితత్త్వరూపమగు కౌమోదకి అనే గదను ధరించినవాడు గదాధరుడు. విష్ణుపురాణంలో చెప్పిన వర్ణనకు ఈ అర్థం సరిపోతుంది.

శ్రీ కృష్ణదత్త భరద్వాజ శ్రీమద్భాగవతము (8.20.31)నుండి ఉదాహరించారు – **కౌమోదకీ విష్ణుగదా తరస్వినీ.** విష్ణువుయొక్క గదయైన కౌమోదకి సాటిలేనిది.

## 998. రథాంగపాణిః

- చక్రమును చేతబట్టి దుష్టశిక్షణకు సిద్ధముగానున్నవాడు.
- రథచక్రమును చేతబట్టి భీష్మునిపై లంఘించినవాడు.

### ఓం రథాంగపాణయే నమః

**రథాంగమ్ చక్రమ్ పాణౌ యస్య ఇతి రథాంగపాణిః**. చక్రమును చేతబట్టినవాడు రథాంగపాణి.

రము - క్రీడాయామ్ - ఆడుట, వినోదించుట. ఉణాది సూత్రము (2.2) ప్రకారము 'క్థన్' ప్రత్యయము జోడిస్తే 'రథ' శబ్దము వస్తుంది. **రమతే - క్రీడతి యస్మిన్ యేన వా రథః.** 'అగి'-వెళ్ళుట నుండి 'అంగ' శబ్దము వస్తుంది. **రథః అంగతి యేన తద్ రథాంగమ్.** రథమును సాగేలా చేసేది రథాంగము, అనగా రథచక్రము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఇంతకు ముందలి 995వ నామము 'చక్రీ' అంటేకూడా 'చక్రము ధరించినవాడు' అని అర్థము. మరియు ఈ 'రథాంగపాణిః' అంటే కూడా అదే అర్థము. కనుక ఇక్కడ పునరుక్తి వచ్చిందని కొందరు భావింపవచ్చును. అయితే 'చక్రీ' నామములో భగవంతుడు చక్రాయధమును కలిగియుండుట తెలుపబడినది. ప్రస్తుత 'రథాంగపాణిః' నామము ద్వారా ఆయన చక్రమును ప్రయోగించుటకు సంసిద్ధునిగా ఉండుట తెలుపబడినది. భక్తరక్షణకు ఆయన సదా సంసిద్ధుడు. కనుక పునరుక్తి లేదు.

**యథోచిత రథాంగం చ పాణౌ యస్యాస్తి నిత్యశః రథాంగపాణిరాఖ్యాత్ నవార్ణో భయాశకః** తనకు తగినట్లు ప్రకాశించే చక్రమును నిత్యము చేతబట్టినవాడు. ఈ నామము నవాక్షరీ మంత్రము. భయనాశకము. ఓం రథాంగపాణయే నమః. (శ్రీకైవల్య సారధి).

మరొక వివరణ (శ్రీ శంకరులు?) – మహాభారతయుద్ధంలో భీష్ముని ప్రతిన చెల్లించడంకోసం శ్రీకృష్ణుడు చక్రాన్ని (రథచక్రాన్ని) చేతబట్టి భీష్మునిపైకి ఉరికాడు. దీనివల్ల భగవానుడు స్వయంగా తన స్వంత ప్రతిజ్ఞను (ఆయుధము చేత ధరింపను అనే మాటను) ఉల్లంఘించాడు.

**స్వనిగమమ్ అపహాయ మత్ ప్రతిజ్ఞామ్ ఋతమ్ అధికర్తుమ్ అవప్లుతో రథస్థః**
**ధృత రథ చరణః అభ్యయాత్ చలత్ గుః హరిరివ హన్తుమ్ ఇభమ్ గతోత్తరీయః** – భాగవతం 1.9.37
ఆయుధము పట్టనన్న తన మాటను స్వయంగా తప్పుతూ, భగవానునితో ఆయుధం పట్టిస్తానన్న నా ప్రతిజ్ఞను నిలపడంకోసం, భగవానుడు రథంనుండి దూకి నావైపు పరుగెత్తాడు. ఏనుగును చంపడానికి గుహనుండి లంఘించిన సింహంలా ఆయన వస్తుంటే భూమండలం చలించింది.

శ్రీ బలదేవ విద్యాభూషణ – **భక్తప్రతిజ్ఞా ప్రతిపాలకతామ్ అతిశ్లాఘ్యత్వాత్ పునరాహ రథాంగపాణిరితి భీష్మమ్ ప్రతి ప్రదర్శితమ్ ఏతత్** భక్తుని ప్రతిజ్ఞ నిలపడంకోసం భీష్మునిపైకి వేగంగా దూకినవాడు రథాంగపాణి.

**<u>శ్రీ జయదల్ గోయందకా రచన. శ్రీమద్భగవద్గీత-తత్త్వ వివేచనీ వ్యాఖ్య నుండి.</u>**

అనువాదం – డా. ఎమ్. కృష్ణమాచార్యులు, డా. గోలి వెంకటరామయ్య.

శ్రీకృష్ణుడు మహాభారతయుద్ధమున ఆయుధము చేతబట్టనని ప్రతిజ్ఞ చేసియుండెను. భగవానునిచే శస్త్రగ్రహణము చేయించెదనని భీష్ముడు ప్రతిన పూనినట్లు భక్తకవి సూరదాసు వర్ణించెను – నేడు శ్రీకృష్ణభగవానునిచే ఆయుధము పట్టింపకున్నచో నా తల్లియైన గంగాదేవికిని, తండ్రి శంతనునకును అప్రతిష్ఠ తెచ్చినవాడనగుదును. ఈ దివ్యమైన మహారథమును కపిధ్వజముతో కూడ భగ్నమొనర్చెదను. ఇట్లు చేయనిచో నేను క్షత్రియగతిని పొందను. ఇది భగవంతునిపైన ఆన. (సూరదాసు చేసిన ఈ వర్ణన సంస్కృత మహాభారతమున లేదు).

మహాభారతమున ఈ ఘట్టము ఈ విధముగా చెప్పబడినది – యుద్ధము మూడవ దినమున భీష్మపితామహుడు రణమున మిక్కిలి విజృంభించి పోరాడసాగెను. అప్పుడు కృష్ణభగవానుడు రోషమును పూని, పగ్గములు వదలి, చక్రమును చేత ధరించి త్రిప్పుచు భూమిపైకి దుమికెను. అచటనున్నవారందరును ఆ దృశ్యమునకు భయకంపితులై, ఉచ్చస్వరముతో హాహాకారములు గావించిరి. భగవానుడు ప్రళయకాలాగ్నివలె భీష్మునిపైకి లంఘించెను..... అర్జునుడు భగవంతునివెంట పరుగిడి, ప్రణమిల్లి ఎట్టకేలకు ఆయనను మఱలించెను.

9వ దినమున – భీష్ముడు పాండవసేనను అల్లకల్లోలము ఒనర్చెను. శ్రీకృష్ణుడు చేతి పగ్గమును వీడి, కొఱడా చేతబట్టి భీష్మునిపైకి పరుగెత్తెను. భగవానుని పాదముల తాకిడికి భూమి కంపించెను..... అర్జునుడు పరుగెత్తికొనిపోయి కృష్ణుని చేతులు పట్టుకొనెను. శ్రీకృష్ణునకు ఆయనయొక్క పూర్వప్రతిజ్ఞను జ్ఞప్తికి తెచ్చి, భీష్ముని తాను (అర్జునుడు) చంపెదనని ప్రతిజ్ఞ చేసిన పిమ్మట భగవానుడు వెనుకకు మరలెను. ఈ ఘట్టమును శ్రీ పోతనామాత్యుడు ఆంధ్రమహాభాగవతమునందు (10.222) అతి రమణీయముగ వర్ణించెను.

కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి - గగన భాగంబెల్ల గప్పి కొనగ
ఉఱికిన నోర్వక ఉదరంబులోనున్న - జగముల వ్రేగున జగతి కదల
చక్రంబు చేపట్టి చనుదెంచు రయమున - పైనున్న పచ్చని పుటము జాఱ
నమ్మితి నా లావు నగుబాటు సేయక - మన్నింపుమని క్రీడి మఱల దిగువ

కరికి లంఘించు సింగంబు కరణి మెఱసి,
'నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జునా' యని మద్విశిఖ వృష్టి
తెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు



శ్రీ కృష్ణుడు భీష్మునిపై లంఘించుట. వికీపీడియా నుండి. By T Sujatha

https://commons.wikimedia.org/wiki/File:Krishnudu_bhishminipai_agrahincuta.jpg

## 999. అక్షోభ్యః

- దేనిచేతను సంక్షోభము పొందనివాడు. పరమశాంతమూర్తి. ప్రసన్న పరమానంద గంభీరమూర్తి.
- తనను ఆశ్రయించినవారిని రక్షించడం అనే దీక్షపూని, ఎన్ని ఆటంకములు వచ్చినాగాని చలించనివాడు.
- ఈ విధంగా దివ్యాయుధములు పూని ఎవరికైనా అశక్యుడైనవాడు.

### ఓం అక్షోభ్యాయ నమః

ఈ నామము రెండుమార్లు వస్తుంది –

86వ శ్లోకము. 807వ నామము. అక్షోభ్యః – **సువర్ణబిందుః అక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః**

107వ శ్లోకము. 999వ నామము. అక్షోభ్యః – **రథాంగపాణిః అక్షోభ్యః సర్వప్రహరణాయుధః**

86వ శ్లోకములోని 807వ నామము. అక్షోభ్యః

ఈ నామమును శ్రీభట్టులు బుద్ధావతారపరంగా వ్యాఖ్యానించారు. బుద్ధునిగా భగవంతుడు వాదించినపుడు ఎవరూ ఆయను ఎదుర్కొనలేరు. ఎందుకంటే ఆయన గాంభీర్యం అలాంటది కనుక ఆయన అక్షోభ్యుడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – రాగద్వేషములు, శబ్దాది విషయములు, మూడు లోకములలోని శత్రువులు – ఎవరూ ఇతనిని కలతనొందింపలేరు. కనుక ఆయన అక్షోభ్యుడు.

శ్రీ సత్యసంధ యతిరాజ 'సువర్ణబిందురక్షోభ్యః' అనే ఒకే నామమును పరిగణించారు. వంటిపై బంగారు చుక్కలు కలిగిన లేడిరూపంలో ఉన్న మారీచుని భీతావహుని చేసినవాడు సువర్ణబిందురక్షోభ్యుడు.

107వ శ్లోకంలోని 999వ నామము. అక్షోభ్యః

శ్రీ భట్టుల వ్యాఖ్య – శ్రీ భట్టులు భగవంతుని శరణాగతవత్సలత పరంగా వ్యాఖ్యానించారు. **ప్రసన్న అభయదాన దార్ఢ్యాత్ స్వమహిమ్నాऽపి అక్షోభ్యః.**

**అభయప్రదాన నియమ దార్ఢ్యారపి చ నిత్యశః అచాల్య స్వమహిమ్నాऽపిః అక్షోభ్యః ఇతి కీర్తితః** తనను ఆశ్రయించినవారిని రక్షించడం అనే దీక్షబూని, ఎన్ని ఆటంకములు వచ్చినా చలించనివాడు. మహామహిమోపేతుడు కాబట్టి శ్రీమన్నారాయణుడు అక్షోభ్యుడు అనబడుచున్నాడు (శ్రీకైవల్య సారధి).

భగవద్రామానుజుల శరణాగతి గద్యము – **అనృతమ్ నోక్త పూర్వమ్ న చ వక్ష్యే కదాచన.** నేనింతకు పూర్వమెప్పుడును అసత్యము వచింపలేదు. ఎప్పుడును వచింపను.

రామాయణము. యుద్ధకాండ 18.33 – **రామో ద్విర్నభిభాషతే.** రాముడు రెండు విధాలుగా మాటలాడడు.



శ్రీరాముని శరణు జొచ్చిన విభీషణుడు. 1916 కాలపు చిత్రం. వికీపీడియా నుండి. By Ramachandra Madhwa Mahishi https://commons.wikimedia.org/wiki/File:Vibhishana_Meets_Rama.jpg

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి యాచతే**

**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ** – రామాయణము. యుద్ధకాండ.

ఎవరైనను 'నేను నీవాడను' అని ఒక్కమారు శరణు వేడితే, వానికి సకల భూతములనుండి అభయమును ప్రసాదింతును. ఇది నా వ్రతము.

**సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**

**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ** – గీత 18.6

సర్వధర్మములను, అనగా సమస్త కర్తవ్యకర్మలను నాకు సమర్పించి, శక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని కావించెదను. నీవు శోకింపకుము.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ రామాయణం అరణ్యకాండ (10.19)నుండి ఉదాహరించారు. వనవాస తపోధర్మంలో నున్నందున రామలక్ష్మణులు ఆయుధాలను ధరించడం ఉత్తమం కాదని సీత భావించింది. అప్పుడు రాముడు తాను రాక్షసులనుండి మునులను రక్షించే దీక్ష పూనానని, కనుక ఆ విషయంలో ఎట్టి పరిస్థితిలోను వెనుకాడనని అన్నాడు.

**అప్యహమ్ జీవితమ్ జహ్యామ్ త్వామ్ వా సీతే స-లక్ష్మణమ్**

**న తు ప్రతిజ్ఞామ్ సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః**

సీతా! నేను ఇచ్చిన మాట, ప్రత్యేకించి బ్రాహ్మణులకు ఇచ్చిన మాట తప్పుటకంటె, నా జీవితమును, చివరకు నిన్ను, లక్ష్మణుని కూడా పోగొట్టుకొనుటకు సిద్ధముగా నున్నాను.

యుద్ధకాండము 18.3 – విభీషణ శరణాగతి సమయం.

**మిత్రభావేన సంప్రాప్తమ్ న త్యాజేయం కథంచన**

**దోషో యద్యపి తస్యస్యాత్ స తామ్ ఏతత్ అగర్హితమ్**

నన్ను నిజమైన ప్రేమతో చేరినవానిని ఎన్నడూ వదిలిపెట్టను. అతనిలో ఏవైనా దోషాలున్నా సరే. ఈ విధానం ఉత్తమమైనదని పెద్దలు చెబుతారు.

**'సత్యసంధః', 'అచ్యుతః'** వంటి నామములు వివరణలో కూడా భగవంతుని అక్షోభ్యత్వమునకు పెక్కు ఉదాహరణలు చెప్పడమైనది.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **అత ఏవ అశక్య క్షోభణ ఇతి అక్షోభ్యః.** ఈ విధంగా, అనేక దివ్యాయుధములు ధరించినవాడై, క్షోభింపరానివాడు (ఎవరును ఆయనను కలతనొందింపలేరు) గనుక ఆయన అక్షోభ్యుడు. ఇంతకుముందు నామములలో చెప్పిన దివ్యాయుధ ధారణను ఈ నామముతో శ్రీ శంకరులు అనుసంధించారు.

శ్రీ రాధాకృష్ణశాస్త్రి – తాను గడచిన పది రోజుల యుద్ధంలో చూసిన భగవదనుభవాన్ని భీష్ముడు ఈ చివరి నామములలో చెబుతున్నాడు. **'రథాంగపాణిః', 'అక్షోభ్యః'** ఇటువంటి నామములు.

శ్రీ బలదేవ విద్యాభూషణ కూడా ఇలాంటి భావాన్నే చెప్పారు. **త్యక్త శస్త్రోऽపి క్షోభయితుమ్ ఘర్షితుమ్ అశక్యత్వాత్ అక్షోభ్యః.** భగవంతుడు ఆయుధాలను వదిలివేసినాగాని ఆయనను ఓడించుటకు, క్షోభించుటకు ఎవరి శక్యం కాదు. కనుక ఆయన అక్షోభ్యుడు.

శ్రీ చిన్మయానంద – అంతులేని సహనము, ప్రేమ, కరుణ కలవాడు. మానవుల అనేక దోషములను, అపచారములను సహించువాడు. ఎంత ఉత్పాతం జరిగినా చలించనివాడు అక్షోభ్యుడు.

**విభీషణ శరణాగతి – రంగనాథ రామాయణము**

రంగనాథ రామాయణములో విభీషణ శరణాగతి భాగము. ఇక్కడ విభీషణుడు శ్రీరామచంద్రుని నుతించిన విధములో అనేక విష్ణుసహస్రనామములు ధ్వనిస్తున్నాయి. (ఈ స్తుతి వాల్మీకి రామాయణంలో లేదు)

**శ్రీరాముడిలా అన్నాడు.**

ఈ విభీషణుఁడేల యేచినయట్టి – రావణుండైన గర్వము దక్కివచ్చి
శరణన్నఁ గాతు నే చందమునైన – మరియాదలిట్టివి మా కులంబునకు
నభయమిచ్చితి వేగ నర్కజ! పోయి – సభయుని నవజవిభీషణుఁ దోడి తెమ్ము



శ్రీరాముని శరణుజొచ్చిన విభీషణుడు – 1790 కాలపు కాంగ్రా / గులెర్ శైలి చిత్రం. వికీపీడియానుండి.
https://commons.wikimedia.org/wiki/File:Vibhishana_bows_before_Rama.jpg

**విభీషణుడు శ్రీరామునిలా నుతించాడు**

నిత్య సత్య త్రాణ! నిత్య కళ్యాణ! – నిత్య జగత్త్రాణ! నిత్య గీర్వాణ!
జగదన్వయాకార! జగదేక వీర! – జగదుదయాకార! జగదబ్ధిపూర!
సర్వసంగాతీత! సర్వానుభూత! – సర్వజగత్పూత! సర్వసమేత!
గురులఘుక్రమరూప! గురుబోధదీప! – గురుమధురాలాప! గురుచారచాప!
పద్మసన్నిభనేత్ర! బహుజీవసూత్ర! – పద్మాకలితగాత్ర! పరమపవిత్ర!
కవిమనస్సంవేద్య! కరుణానవద్య! – వివిధశాస్త్రాపాద్య! వేదాంతవేద్య!
పరమాత్ముడఁవు నీవ, పరమంబు నీవ – పరమ విద్యయు నీవ, పరికింపనెందు
భువనకర్తవు నీవ భువనంబు నీవ – భువనహరత్వు నీవ, భువనైక వీర!
యాగభోక్తవు నీవ, యాగంబు నీవ – యాగఫలప్రదుఁడరయంగ నీవ,
చంద్రార్కులును నీవ, జలధులు నీవ- యింద్రాదులును నీవ, యిలయును నీవ,
శబ్దార్థములు నీవ, శబ్దముల్ నీవ – శబ్దముల్ భేదించు శ్రవణముల్ నీవ,

మూఁడు మూర్తులు నీవ, మూఁడు మూర్తులకుఁ – బోడిమి నవ్వలి పొడవును నీవ,
క్షరమును నీవ, యక్షరమును నీవ – క్షరసాక్షి వీవ, యక్షరసాక్షివీవఁ
ద్రిభువనవందిత! దేవాది దేవ! – యభయమీ దేవ! నా కఖిలాధినాథ!
జయజయ శతకోటి జలజాప్త తేజ! – జయజయ సంసారసర్ప సుపర్ణ!
లలితాగమ స్తోత్ర! లక్ష్మీకళత్ర! – విలసద్దయాపాత్ర! విబుధారి జైత్ర!
దినకర శశినేత్ర! దివ్యచారిత్ర! – యనుపమ శుభగాత్ర! యఖిలైక సూత్ర!
వేయినోరుల భోగివిభుఁడైన నుతులు – సేయంగ నోపునే శ్రీరామ నిన్ను?
నప్పద్మ సంభవుండైన నీ మహిమ – యొప్పెల్ల నుతియింప నోపునే తెలియ?
నే నిన్ను నుతియింప నెంతటివాఁడ – దానవుండను వృథా తరళచిత్తుఁడను!
భూనాథ! నీ వాదిపురుషోత్తముఁడవు – కాన నిన్నితరులు గానఁగలేరు
నరనాథ! యార్తుని నన్ను రక్షింపు – పరమ దుర్జన దైత్యపతి ద్రుంచిపైవు
మఖిల శరణ్యండవైన నీ మఱుఁగు – సుఖమని యే వచ్చి చొచ్చితిఁబ్రీతి

**శ్రీరామచంద్రుడు విభీషణుననుగ్రహించుట**

ననవుఁడు నతని కృపాంబుధిలోన – మనుజేశ్వరుండు క్రమ్మఱ నోలలార్చి
నమ్ము విబీషణ! నా కేశవైరి – తమ్ముఁడవా? నాకుఁదమ్ముఁడ వింతె
మఱువకుమింక; లక్ష్మణుకంటె నిన్ను నఱలేనివానిఁగా నాత్మ గైకొంటి
నని భయంబుడిపి దయార్ద్ర వాక్యముల – జననాయకుఁడు విభీషణు నాదరించి
నెయ్యంబుతోడ నా నృపుఁడప్పుఁడతని – చెయ్యాదుకొని వార్ధిఁ జేరంగ బోయి...



ఇదే ఘట్టము – థాయిలాండ్ రాజప్రాసాదంలోని చిత్రీకరణ – వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Wat_Phra_Kaeo_mural_2008-09-06_(007).jpg

శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః |
రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః || (107)

## 1000. సర్వప్రహరణాయుధః

- ప్రహరణమునకు (యుద్ధము చేయుటకు, శిక్షించుటకు) తగిన సమస్తాయుధములతో విరాజిల్లినవాడు.
- తన శరణార్థుల కష్టములను తీర్చువాడు.
- లెక్కకు మించిన దివ్యాభరణములు, దివ్యాయుధములు ధరించినవాడు.
- ఆశ్రితరక్షణ అనే దీక్ష కలిగినవాడు.
- సకలైశ్వర్య సంపన్నుడు. సర్వేశ్వరుడు.

ఓం సర్వప్రహరణాయుధాయ నమః

ప్రహరణము - కొట్టుట, దాడి చేయుట, గాయపరచుట. **సర్వాణి ప్రహరణాని ఆయుధాని యస్య ఇతి సర్వప్రహరణాయుధః.** అన్ని విధములుగా దాడి చేసే ఆయుధములు కలిగనవాడు సర్వప్రహరణాయుధుడు.

ఈ పుణ్య స్తోత్రంలోని చివరి (107వ) శ్లోకంలో 993 నుండి 999వ నామము వరకు భీష్ముడు భగవంతుని ఆయుధములను కీర్తించాడు. ఆ ఆయుధములు

1. శంఖభృత్ – పాంచజన్యము అనే శంఖము.
2. నందకీ – నందకము అనే ఖడ్గము.
3. చక్రీ – సుదర్శన చక్రము.
4. శార్ఙ్గధన్వా – శార్ఙ్గము అనే ధనుస్సు
5. గదాధరః – కౌమోదకి అనే గద.

ఈ ఐదు ఆయుధములు పంచాయుధ స్తోత్రంలో స్తుతింపబడినాయి. ఇంకా సుదర్శన స్తోత్రంలో (చక్రత్తాళ్వార్ యొక్క) షోడశాయుధముల స్తోత్రం ఉన్నది. ఇంతమాత్రం చేత ఆయన ఆయుధాలు ఐదుకో, పదహారుకో పరిమితం కాదు. శత్రువును శిక్షించడానికి ఆయనవద్ద అనంతమైన ఆయుధములున్నవని ఈ 'సర్వప్రహరణాయుధః' నామం ద్వారా చెప్పడమైనది. ఆయన ఎందుకు ఈ ఆయుధాలను ధరిస్తున్నాడనే విషయంలో వివిధ వ్యాఖ్యాతల అనుభవాలు మనకు గోచరిస్తాయి.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవంతుడు ధరించిన అనంత దివ్యాయుధములు ఎంతో శక్తి కలిగినవి. ప్రపన్నుల కష్టాలను హరించేవి. భగవద్భక్తుల శత్రువులను నాశనం చేసేవి. భగవానునికి ఆయుధాలుగాను, ఆభరణాలుగాను ఉన్నాయి. అవి కేవలం భౌతిక ఆయుధాలు కావు. ఒక్కొక్క దివ్యాయుధమునకు అనంతశక్తి కలదు. ఆ ఆయుధములు భాగవతుల రక్షణ కొరకు అన్ని వేళలా, అన్నిచోట్లా అన్నివిధాలా సిద్ధంగా ఉన్నాయి. **స్వవిష్ఠానామ్ సర్వ అనిష్ట ఉన్మూలయిత్రూణి....... సదా, సర్వత్రా, సర్వథా, సర్వప్రకార, సమాశ్రిత.......** ఈ ఆయుధముల ద్వారా శ్రీభగవానుడు సృష్టిపాలన, భక్తరక్షణ అనే సుదీర్ఘ సత్రయాగములను నిర్వర్తించుచున్నాడు. ఇలా భగవంతుని సకల గుణములు, ఆయన ఆయుధాలతో సహా – తన భక్తుల రక్షణ కొఱకేనని శ్రీ భట్టులు వివరించారు.

**పాదమూలం ప్రపన్నానాం భక్తానాం చాపి నిత్యశః**
**అసంఖ్యేయాన్యమర్యాద సామర్థ్యా న్యాత్మనస్సదా**
**సర్వత్ర సర్వదా సర్వప్రకారాశ్రిత రక్షణే**
**దీక్షితాన్యుచితాన్యన్యా న్యనంతాన్యాయుధాని హి**
**యస్య సంతి వై నిత్యం సర్వప్రహరణాయుధః**
**ద్వాదశార్ణో మహామంత్రః సర్వదుఃఖవినాశకః**

తన శరణార్థుల కష్టములను తీర్చువాడు. లెక్కుమించిన ఆభరణములు, శక్తివంతములైన ఆయుధములు ధరించినవాడు. ఆశ్రితరక్షణ అనే దీక్షగలవాడు. సకలైశ్వర్యసంపన్నుడైన శ్రీమన్నారాయణుడు అన్నిరకాల ఆయుధములను ధరించి ఆశ్రితులను రక్షిస్తున్నాడు గనుక ఆయన సర్వప్రహరణాయుధుడు. ఈ నామము ద్వాదశాక్షరీ మహామంత్రము. సకల దుఃఖములను హరిస్తుంది. ఓం సర్వప్రహరణాయుధాయ నమః. (శ్రీకైవల్యసారధి).

'సర్వ', 'ప్రహరణ' అనే విశేషణ పదములవలన ఇంతకుముందు చెప్పిన ఐదు ఆయుధములే కాక భగవానునివద్ద సమస్తములైన దివ్యాయుధములు ఉన్నవని, ఆయన దివ్యవైభవంలో ఇవి ఒక భాగమనీ గ్రహింపవలెను.

శ్రీ వి.వి. రామానుజన్ – భగవంతుడు కేవలం సంకల్పమాత్రమున తన శత్రువులను నాశనం చేయగలడు. ఐతే దుష్టుల గుండెల్లో భయాన్ని నెలకొల్పడంకోసం ఆయన ఆయుధాలు ధరిస్తాడు.

శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఏతాన్యేవ ఆయుధాని అస్య ఇతి న నియమ్యతే, అపి తు సర్వాణ్యేవ ప్రహరణాని ఆయుధాని అస్య ఇతి సర్వప్రహరణాయుధః.** ఇవి మాత్రమే అయనవద్ద ఉన్న ఆయుధాలని పరిమితి లేదు. ప్రహరణమునకు తగిన సమస్త ఆయుధములతో విరాజిల్లినవాడు గనుక శ్రీహరి సర్వప్రహరణాయుధుడు. ఉదాహరణకు వేలి గోళ్ళను సాధారణంగా ఆయుధంగా పరిగణింపము. కాని ఆయన హిరణ్యకశిపుని వధించడానికి వేలి గోళ్ళను ఆయుధముగా వాడినాడు. **ఆయుధత్వేన అప్రసిద్ధాన్యపి కరజాదీని అస్య అస్య ఆయుధాని భవన్తి ఇతి.** ఇలా ఏదైనా ఆయుధం కావచ్చుననీ, ఆయన సమస్త దివ్యాయుధాలను ధరించియున్నాడనీ ఈ చివరి నామంలో చెప్పడంవలన భగవంతుని సర్వేశ్వరత్వము మరియు సత్యసంకల్పము విశేషంగా చెప్పడమైనది. ఇందుకు శ్రీ శంకరులు బృహదారణ్యకోపనిషత్తు (4.4.22)నుండి **'ఏష సర్వేశ్వరః'** అని ఉదాహరించారు.

ఓం నృసింహాయ విద్మహే వజ్రనఖాయ ధీమహి తన్నృసింహః ప్రచోదయాత్

**ఓం నమో శ్రీ నారసింహాయ**

**శ్రీ పోతన భాగవతము.** శ్రీ భండారు పర్వతరావు సంకలనంనుండి **హిరణ్యకశిపు వధ**

విహగేంద్రుం డహి వ్రచ్చు కైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుడై యూరువులందు జేర్చి నఖ సంఘాతములన్ వ్రచ్చె దు
స్సహదంభోళి కఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్రహుతాశాంతక భీకరున్ ఘనకరున్ దైత్యాన్వయశ్రీకరున్

సహింపని వజ్రాయుధంవంటి శరీరం కలవాడు, చలించని పట్టుదల కలవాడు, గొప్ప భుజాలు కలవాడు, ఇంద్రాగ్నియమాదులకు భీకరుడు, బలిష్ఠమైన రాక్షసరాజు అయిన హిరణ్యకశిపుని తన తొడలమీద వేసుకొన్నాడు హరి. గరుత్మంతుడు సర్పాన్ని పట్టినట్లుగా పట్టుకొని.



చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిన్
ద్రెంచున్ గర్కశ నాడికావళులు భేదించున్ మహావక్షముం
ద్రుంచున్ మాంసము సూక్ష్మ ఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించున్ ప్రేవులు కంఠమాలికలుగ గల్పించున్ నఖోద్భాసియై

హిరణ్యకశిపుని గుండె నరహరి చీలుస్తాడు. నేలనిండా నెత్తురు చల్లుతాడు. కఠినములైన నరాలను తెంపుతాడు, రొమ్మును పగులగొడుతాడు, మాంసాన్ని చిన్నచిన్న ముక్కలుగా చేస్తాడు. ప్రేగులు హారాలుగా మెడలో వేసుకొంటాడు. ఒక్క ఆయుధాన్ని కూడా ప్రయోగించకుండా తొడలపై వేసికొని హరి రాక్షసుని చీలుస్తుంటే, నరహరి గోళ్ళు గొడ్డళ్ళవలె ఉన్నాయి. లోతైన గుండెను బద్దలు కొట్టేటపుడు గుద్దళ్ళవలె నున్నాయి. నరాలను త్రెంచేటప్పుడు గట్టి కొడవళ్ళవలెనున్నాయి. కడుపులోని ప్రేవులను తెంచేటప్పుడు రంపాలలా ఉన్నాయి.

నరసింహుని గోళ్ళను చూసి దేవతాముఖాలు వికసిస్తున్నాయి. రాక్షసరాజు శరీరాన్ని చీలుస్తున్నాయవి. అగ్నిజ్వాలలకన్న ప్రకాశమానంగా ఉండి, నరహరికి మ్రొక్కేవారికి అభయదానం చేస్తున్నాయి.

*ఉగ్రం, వీరం, మహావిష్ణుం, జ్వలంతం, సర్వతోముఖం*
*నృసింహం, భీషణం, భద్రం, మృత్యుమృత్యుం నమామ్యహం*

ఇంతకుముందు అనేక నామముల వ్యాఖ్యలో వివరించినట్లుగా, శ్రీ శంకరులు తమ వ్యాఖ్యయందు శ్రీమహావిష్ణువుయొక్క పరత్వమును (పరమేశ్వరత్వమును, అనంతశక్తిని) విశేషంగా ప్రస్తావించారు. శ్రీ భట్టులు తమ వ్యాఖ్యయందు ఆ జగన్నాధుని సౌలభ్యమును, సౌశీల్యమును, ముఖ్యంగా తన భక్తుల క్షేమం పట్ల భగవంతునికున్న ఆతురతను కీర్తించారు. ఈ వెయ్యవ నామము 'సర్వప్రహరణాయుధః'కు వారి వ్యాఖ్యలు కూడా ఈ విషయంలోని భిన్నత్వాన్ని తెలియజేస్తున్నాయి. శ్రీ శంకరులు భగవంతుని సర్వేశ్వరత్వమును - అనంత దివ్యాయుధ సంపన్నుడు, అనంత శక్తిమంతుడు, సర్వేశ్వరుడు - అని ప్రస్తావించారు. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం భక్తరక్షణార్థం శ్రీ భగవానుడు సకలాయుధాలతో సిద్ధంగా ఉన్నాడు.

భగవానుని నఖములనే ఆయుధములుగా ఉపయోగించిన వైనాన్ని శ్రీ శంకరులు ఉదాహరించారు. శ్రీ రాధాకృష్ణశాస్త్రి మరి కొంచెం ముందుకు వెళ్ళి వివరించారు. కాకాసురునిపై శ్రీరాముడు దర్భను ఆయుధంగా ప్రయోగించాడు. పూతన పాలు త్రాగడమే శ్రీకృష్ణుని ఆయుధము. శుక్రాచార్యుని కంటిని దర్భతో పొడిచి శ్రీవామనుడు బలిచక్రవర్తినుండి మూడడుగుల నేల పొందాడు. ఇలా ఆయన సత్యసంకల్పుడు. భక్తసంరక్షణకు ఏదైనా ఆయన ఆయుధమే. సంకల్పమాత్రాన ఆయన ఏదైనా చేయగలడు.

మరి సంకల్పమాత్రాన ఏదైనా చేయగలిగితే ఆయనకు ఆయుధములు ఎందుకు? శ్రీరాముడు యుద్ధకాండ (6.8.122)లో ఇలా అన్నాడు –

**పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యామ్ చైవ రాక్షసామ్**
**అంగుళ్యగ్రేణ తాన్ హన్యామ్ ఇచ్ఛవ హరిగణేశ్వర!**

ఓ వానరరాజా (సుగ్రీవా)! పిశాచములను గాని, దానవులను గాని, యక్షులను గాని, ఈ రాక్షసులను గాని నేను తలచుకొంటే వ్రేలికొనతో నాశనము చేయగలను.

మరయితే ఆయుధములు ఎందుకు? కనీసం కొన్నిచోట్ల అవి దుష్టులలో భయాన్ని రేకెత్తించి, భాగవతులకు హానిచేయకుండా ఆపుతాయని కొందరు వివరించారు.

శ్రీ ఆండాళ్. తిరుప్పావై 25. చిత్రకవి ఆత్రేయ తెలుగు సేత.

**నిన్నేమార్చి పరిమార్చ పన్ని పన్నాగముల**
**తలక్రిందులుగ జేసి, కలకలము రేపావు**
**కుమతి కంసుని గుండె బడబాగ్నివయినావు! ఓ ఆశ్రిత వ్యామోహశీలీ!....**

మరొక అనుభవము – భగవంతుడు తన శత్రువులను తన సంకల్పశక్తితో పరిమార్చును. కాని తన భక్తులకు కీడు తలపెట్టినవారిపై ఆయన తన ఆయుధములను ప్రయోగించి వారిని నాశనము చేయును.

భగవానుని దివ్యాయుధములకు సంబంధించిన మరొక విషయము – వారు నిత్యసూరులు. సదా భగవంతుని క్షేమం కాంక్షించేవారు, నిజానికి ఆయనకు రక్షణ అవుసరం లేకపోయినాగాని, ఆ దివ్యాయుధములు భగవంతునిపట్ల కలిగిన సేవాప్రేమభావంవల్ల ఆయనను రక్షించే ఉద్దేశంతో సదా ఆయన తిరుమేనిని అంటిపెట్టుకొని ఉన్నారు. ఈ విధమైన రక్షణ సేవాభావంతోనే శ్రీ పెరియాళ్వారు భగవంతుని క్షేమంగా వర్ధిల్లమని **'పల్లాండు'** పాశురం మంగళాశాసనం చేశారు.

**ఓం నమో శ్రీ సర్వప్రహరణాయుధాయ.**

ఈ పుణ్యదివ్యనామముతో వేయి దివ్యనామముల వివరణ పూర్తయ్యింది. **ఓం నమో వేంకటేశాయ.** ఇంకా ఫలశ్రుతి గురించి వివరణ వ్రాయాలి.

ఇంతేగాక ఈ (శ్రీ కృష్ణమాచారిగారి) ప్రయత్నాన్ని ఎంతో ప్రోత్సహించిన భాగవతులొకరు అడిగిన ప్రశ్న – ఋషులచే ప్రస్తుతింపబడిన **(ఋషిభిః పరిగీతాని)** శ్రీమహావిష్ణువుయొక్క ముఖ్యమైన వేయి నామముల **(యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః)** చివరిలో భగవానుని దివ్యాయుధముల ధారణను తెలిపే నామములతో ముగించడానికి విశేషమైన కారణమేమైనా ఉన్నదా? దీనిని గురించి తరువాత చర్చించుదాము.

**ఓం సర్వప్రహరణాయుధాయ నమః**



దూర్వాసుని ఆగ్రహాన్నుండి అంబరీషుని రక్షిస్తున్న శ్రీ సుదర్శన చక్రము . 19వ శతాబ్దపు చిత్రం. వికీపీడియా నుండి
https://commons.wikimedia.org/wiki/File:Ambarisha_and_Durvasa.jpg

**శ్రీమతే శ్రీరంగరామానుజ మహాదేశికాయ నమః**

**శ్రీ సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి**

మరొక్కమారు 107వ శ్లోకమును మననం చేసుంకొందాము.

**శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః |**
**రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః || (107)**

ఈ శ్లోకమునకు పాఠాంతరాలున్నాయి. కొన్ని పాఠాలలో ఈ శ్లోకం చివర **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అని ఉంది. మరికొన్ని పాఠాలలో **'సర్వప్రహరణాయుధః'** అనే నామం మరొకమారు వచ్చి, తరువాతి పంక్తిలో **'ఓం నమ ఇతి'** అని వస్తుంది. తరువాత ఫలశ్రుతి వస్తుంది. కొందరు వ్యాఖ్యాతలు **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'**కి కూడా వ్యాఖ్య వ్రాశారు. మరి కొందరు ఆ తరువాత ఫలశ్రుతికి కూడా వ్యాఖ్యలు వ్రాశారు. శ్రీ సత్యదేవో వాసిష్ఠ, శ్రీ కృష్ణదత్త భరద్వాజ, శ్రీ ఎమ్.వి. రామానుజాచార్య, శ్రీ చిన్మయానంద వంటివారు తమ వ్యాఖ్యలను 107వ శ్లోకంతో ఆపివేశారు. శ్రీ భట్టులు, శ్రీ శంకరాచార్యులు, శ్రీ వి.వి. రామానుజన్ వంటివారు ఫలశ్రుతికి కూడా (కొంత క్లుప్తంగా) వ్యాఖ్యను వ్రాశారు.

**సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి**

కొంతకాలం భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి సంస్థ ద్వారా మహాభారతం సంశోధిత పరిష్కరణ ముద్రణ అనే బృహత్కార్యక్రమం నడిచింది. ఇది అనేక దశబ్దాలపాటు సాగింది. అనేక వేల సంవత్సరాలలో జరిగిన మార్పులను తొలగించి, వేదవ్యాసుడు రచించిన మహాభారతం సంశోధిత ప్రతిని తయారు చేయడం కోసం వారు అనేక వ్రాత ప్రతులను పరిశోధించారు. 1925లో ప్రారంభమై 60వ దశకం వరకూ సాగిన ఈ సంశోధిత ప్రతిలో **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అనే పాఠం లేదు. బహుశా కొందరు వ్యాఖ్యాతలు ఈ **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** గురించి వ్యాఖ్యానించకపోవడానికి ఇది ఒక కారణం కావచ్చును. ఐతే శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము మొదటి వ్యాఖ్యాత ఐన శ్రీ శంకరాచార్యులు **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అనే వాక్యాన్ని తమ పాఠంలో ఉంచి, దానిపై వ్యాఖ్యానించారు.

**శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః**
**రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః**
**సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి**

నావద్ద (శ్రీ కృష్ణమాచార్యులవద్ద) ఉన్న శ్రీ భట్టుల వ్యాఖ్యానం మూడు పుస్తకాలలో ఈ వాక్యం లేదు. నా (శ్రీ కృష్ణమాచార్యుల) గురువు శ్రీమద్ శ్రీముష్ణమ్ ఆండవన్ గారు తమ ఉపన్యాసాలలో ఈ వాక్యాన్ని ప్రస్తావించకుండా నేరుగా ఫలశ్రుతి గురించి చెప్పారు. కాని, శ్రీ భట్టుల వ్యాఖ్యానాన్ని అనువదించిన ప్రొఫెసర్ శ్రీనివాస రాఘవన్, మరియు ఢిల్లీ శ్రీ విష్ణుసహస్రనామ సత్సంగంవారు మాత్రం **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** గురించిన వ్యాఖ్యను చేర్చారు. ఐతే వారు చేర్చిన విషయం శ్రీ శంకరుల వ్యాఖ్యతో సరిపోతుంది.

శ్రీ శంకరుల వ్యాఖ్య –
**ద్విర్-వచనమ్ సమాప్తిమ్ ద్యోతయతి ఓంకారశ్చ మంగళార్థః.**

**'సర్వప్రహరణాయుధః'** అనే నామమును రెండుమార్లు చెప్పడం ఈ స్తోత్రం సమాప్తమైనదని సూచిస్తుంది. ఓంకారము మంగళ సూచకము. ఇందుకు శ్రీ శంకరులు బృహన్నారదీయ పురాణము (51.10)నుండి ఉదాహరించారు.

**ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతా బ్రహ్మణః పురా**
**కంఠం భిత్వా వినిర్యాత్ తస్మాన్ మాంగళికావు భౌ**
ఆదిలో బ్రహ్మ గొంతునుండి 'ఓం'కారము, మరియు 'అథ' అనే శబ్దము వెలువడినాయి. ఇవి మంగళప్రదములు.

మరియు 'నమః' అనే పదం ద్వారా ప్రణామము చేయబడుతున్నది. ఇందుకు శ్రీ శంకరులు చెప్పిన శ్రుతివాక్యము – **భూయిష్ఠామ్ తే నమ ఉక్తిమ్ విధేమ** (ఈశావాస్యోపనిషత్తు 18). 'నమ' అని చెబుతూ నీకు మా ప్రణామములను అర్పించుచున్నాము.

**అంతేऽపి నమస్కారస్య శిష్టైః ఆచరణాత్.** చివరిలో నమస్కారము చేయుట సదాచారము. అని కూడా శ్రీ శంకరులు చెప్పారు. తమ పదనూరవనామం వ్యాఖ్యను ముగిస్తూ శ్రీ శంకరులు శ్రీకృష్ణునికి ప్రణామం చేశారు.

**ఏకోऽపి కృష్ణే సుకృతః ప్రణామో దశాశ్వమేధావభృతేన తుల్యః**
**దశాశ్వమేధీ పునరేతి జన్మ కృష్ణప్రణామి న పునర్భవాయ**
కృష్ణునకు భక్తితో చేసిన ఒక్క ప్రణామము పది అశ్వమేధయాగములకు సమానము. అశ్వమేధయాగం చేసినవానికైనా పునర్జన్మ ఉండవచ్చునుగాని కృష్ణునికి ప్రణామం చేసినవానికి మరుజన్మ ఉండదు.

**అతసీపుష్ప సంకాశమ్ పీతవాసమ్ అచ్యుతమ్**
**యే నమస్యన్తి గోవిందమ్ న తేషామ్ విద్యతే భయమ్**
అతసీపుష్పమువలె ప్రకాశించువాడు, పీతాంబరములను ధరించినవాడు, ఎన్నడూ తన భక్తులను పతనం కానీయని అచ్యుతుడు అయిన గోవిందునికి నమస్కరించేవానికి భయం లేదు.

**లోకత్రయాధిపమ్ అప్రతిమ ప్రభావమ్ ఈషత్ ప్రణమ్య శిరసా ప్రభవిష్ణుమ్**
**జన్మాంతర ప్రళయ కల్ప సహస్రజాతమ్ ఆసుప్రణాశమ్ ఉపయాతి నరస్య పాపమ్**
ముల్లోకములకు అధిపతి, అప్రతిమంగా ప్రకాశించేవాడును అయిన శ్రీమహావిష్ణువునకు ఒక్కమారు తలవంచి నమస్కరిస్తే వేయి కల్పముల ప్రళయముల కాలం చేసిన పాపములు నశిస్తాయి.

గీత (8.13)లో **'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'** అని ఉన్నదని శ్రీ వి.వి. రామానుజన్ వివరించారు. ఇంకా,
**తస్మాత్ ఓం ఇతి ఉదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్** – గీత 17.24
కనుక వేదమంత్రములను పఠించువారు శాస్త్రవిహితములైన యజ్ఞ దాన తపశ్చర్యలను సర్వదా 'ఓం' అను పరమాత్మ నామమును ఉచ్చరించుచునే ప్రారంభించెదరు.

సత్కార్యముల ముగింపులో కూడ ఓంకారమును ఉచ్చరించుట సంప్రదాయము.

శ్రీ సత్యసంధతీర్థ గ్రహించిన పాఠము ప్రకారము **'సర్వప్రహరణాయుధః'** అనే నామం రెండుమార్లు వచ్చి, తరువాతి పంక్తిలో **'ఓం నమ ఇతి'** అని వస్తుంది.

శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః సర్వప్రహరణాయుధః
ఓం నమ ఇతి

ఇలా చివరి మాటను రెండుమార్లు చెప్పడంద్వారా ఈ కార్యం (స్తోత్రం) ముగింపును సూచిస్తున్నదని శ్రీ సత్యసంధ యతిరాజ వ్యాఖ్యానించారు. **అధ్యాయాంతే ద్విరుక్తిః స్యాత్ వేదే వా వైదికేऽపి వా.**

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ పాఠం ప్రకారం చివరి శ్లోకం తరువాత **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అని వస్తుంది.

శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః
సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి

ఇందుకు శ్రీ కృష్ణన్ చెప్పిన వ్యాఖ్య శ్రీ శంకరుల వ్యాఖ్యతో సరిపోలుతుంది. మరియు శ్రీ కృష్ణన్ బ్రహ్మసూత్రముల అధ్యాయాంతములలో పదాలను రెండుమార్లు చెప్పడం ఉదాహరించారు.

1వ అధ్యాయం చివర – **ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః**
2వ అధ్యాయం చివర – **వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః**
3వ ధ్యాయం చివర – **ఏవమ్ ముక్తిఫలా నియమ తదవస్థావధృతేః తదవస్థావధృతేః**
4వ అధ్యాయం చివర – **అనావృత్తి శబ్దాత్ అనావృత్తి శబ్దాత్**

శ్రీ శంకర భగవత్పాదులు, శ్రీ భగవద్రామానుజాచార్యులు కూడా తమ తమ భాష్యాలలో బ్రహ్మసూత్రములకు ఈ పాఠాన్ని గ్రహించారు. కనుక ఇలా రచన అంతంలో చివరి పదాలను రెండుమార్లు చెప్పడం బాదరాయణుని రచనలో ఉన్నదని మనం భావించవచ్చును.

సంక్షిప్తంగా చెప్పాలంటే, **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అనే పదాలు మహాభారతం సంశోధిత పరిష్కృత ముద్రణలో లేవు. కాని శ్రీ శంకరాచార్యులు, శ్రీ భట్టులు తమ తమ వ్యాఖ్యలలో స్తోత్రాంతంలో **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అనే ముగింపును గ్రహించి, వ్యాఖ్యానించారు. వారి సంప్రదాయాన్ని అనుసరించిన ఇతర వ్యాఖ్యాతలు కూడా స్తోత్రాంతంలో **'సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి'** అనే పదాలను కలిపి వ్యాఖ్యానించారు. చివరి పదాన్ని రెండు మార్లు చెప్పడము, **'ఓం నమః'** అనే పదాలతో ముగించడము అనే వైదిక సంప్రదాయానికి అనుగుణంగా ఈ విధానం ఉన్నది.

శ్రీ సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి.

**ధన్యం తదేవ లగ్నం తన్నక్షత్రం తదేవ**
**పుణ్యమహః కరణస్య చ సా సిద్ధిః యత్ర హరిః ప్రాక్ నమస్క్రియతే**
శ్రీహరికి నమస్కరించిన సమయమే ప్రశస్తమగు లగ్నము. అదియే పవిత్ర నక్షత్రము. పుణ్యదినమదియే. అదియే శుభకరణము.



1770 కాలానికి చెందిన దశావతార చిత్రం. వికీపీడియా నుండి.

.

**శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము. 107వ శ్లోకము. మరికొన్ని విశేషములు.**

107వ శ్లోకమును మరొక్కమారు మననం చేసుకొందాము.

శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణిరక్షోభ్యః సర్వప్రహరణాయుధః
సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి

ఒక భక్తుడు (శ్రీ కృష్ణమాచారి గారిని) అడిగిన ప్రశ్న – ఒక క్రమబద్ధంగా అమర్చిన (అనగా కలగాపులగం కాని) రచనలలో చివరి భాగాన్ని సాధారణంగా ఆ రచనయొక్క సారాంశంగా లేదా ముగింపుగా చెబుతారు. శ్రీ విష్ణు సహస్రనామం యొక్క చివరి శ్లోకంలోని నామములు శ్రీమహావిష్ణువుయొక్క ఆయుధాలను తెలుపుతున్నాయి. దీనికి వ్యాఖ్యాతలు ఏమైనా కారణం చెప్పారా? లేకుంటే ఈ నామములు వేయీ కూడా ప్రత్యేక క్రమం లేకుండా అమర్చినవా? అలాగయితే ఈ చివరి నామములకు (శ్లోకానికి) ప్రత్యేకమైన విశేషం లేదని, మిగిలిన శ్లోకాలలాగానే ఇది కూడా మరొక పుణ్యశ్లోకమనీ అని మనం అనుకోవచ్చును. అందుకు సమాధానంగా ఈ రచనకు పీఠికలో వ్రాసిన విషయాన్ని మరొకమారు గుర్తు చేసుకుందాము.

శ్రీ పరాశరభట్టులు తమ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము వ్యాఖ్యానంలో వేయి నామాలనూ ఒకదానితో ఒకదానిని అనుసంధించారు. పాంచరాత్రాగమంలో భగవంతుని ఐదు విధాలైన అవతారాలను వర్ణించారు. అవి పర, వ్యూహ, విభవ, అర్చ, అంతర్యామి అవతారములు. ఈ ఐదు విధాలైన అవతారములకూ అనుగుణంగా ఈ స్తోత్రంలోని భగవన్నామములు ఒక క్రమంలో చెప్పబడినాయనీ, ఒక్కోనామసమూహం ఒక్కో అవతారం లేదా గుణాన్ని సూచిస్తుందనీ శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ఉదాహరణకు మొదటి 122 నామములు భగవంతుని పరవాసుదేవ స్వరూపమును సూచించునవి. తరువాతివి వ్యూహములను సూచించునవి. ఈ విధంగా శ్రీ భట్టులు మొత్తం 44 స్వరూపములను సూచించే సమూహాలుగా ఈ నామములను వర్గీకరించారు. ఈ 44 నామవర్గములు 44 పొరలుగా ఉన్న గులాబీ రేకులవంటివనీ, భగవత్సాన్నిధ్యానికి 44 మెట్లతో ఉన్న నిచ్చెనవంటివనీ శ్రీ శ్రీనివాసాచారియర్ వ్యాఖ్యానించారు (LIFCO ప్రచురణ. 1967. శ్రీ విష్ణు సహస్రనామములు. పీఠిక). ఇలా ఈ నామములను భీష్ముడు ఒక క్రమంలో చెప్పాడనీ (కలగా పులగంగా కాదనీ), ప్రతి వర్గానికీ ఒక విశేషం ఉన్నదనీ శ్రీ భట్టుల వ్యాఖ్య ద్వారా మనం గ్రహించవచ్చును (ఇతర వ్యాఖ్యాతలు నామములను ఈ విధంగా వర్గీకరించలేదు).

ఇక 107వ శ్లోకం విషయం. ఈ శ్లోకంలోని నామాలు భగవంతుని ఆయుధధారణను సూచించేవిగా ఉన్నాయి. ఈ స్తోత్రాన్ని అనేక విధాలుగా ముగించే అవకాశం ఉండగా శ్రీ భీష్ములు ఈ విధంగానే ఎందుకు ముగించారు?

ఈ చివరి శ్లోకంలో భగవంతుని ఆయుధధారణ గురించిన నామములు ఉండడానికి కారణం అర్థం చేసుకోవాలి. అంటే ముందుగా ఆయన ఆయుధాలు ఎందుకు ధరిస్తున్నాడో తెలుసుకోవాలి. విశిష్టాద్వైత సంప్రదాయంలో భగవంతుని ఆయుధధారణ గురించి రెండు అనుభవాలను చెప్పారు. ఒకటి – ఆ దివ్యాయుధాలు ఆయన ఆభరణాలలో భాగములు. రెండవది – తన భక్తులను అసురులనుండి రక్షించడానికి భగవంతుడు ఆయుధాలను ధరిస్తాడు. భగవంతుని సౌశీల్య, సౌలభ్య గుణములను 992 నామములలో కీర్తించిన తరువాత శ్రీ భీష్మాచార్యులు ఈ భగవద్గుణాలన్నీ భక్తుల రక్షణకోసమేనని చెప్పినట్లు అనుకోవచ్చును. అందుకే చివరి 8 నామములు భగవంతుని ఆయుధధారణను సూచిస్తున్నాయి. భక్తజన రక్షణే ఆ ఆశ్రితవత్సలుని ముఖ్యలక్షణము. అందుకే ఆయన భీకర దివ్యాయుధములు ధరించి సిద్ధంగా ఉన్నాడు. జీవులను ఉద్ధరించడానికే ఆయన సృష్ట్యాది కార్యక్రమములు చేస్తున్నాడు. ఈ ఆయుధములను భగవంతుని దివ్య తిరుమేనికి అలంకరణములుగా ఆయన భక్తులు అనుభవిస్తారు. ఆ ఆయుధములే భక్తుల భయంకర శత్రువులను (హిరణ్యకశిపు, రావణ, శిశుపాలాదులను) భీతావహులను చేయుచున్నాయి.

**'అక్షోభ్యః'** నామము వ్యాఖ్యలో శ్రీ భట్టులు భగవంతుని భక్తపాలనా వ్రతమును ప్రస్తావించారు. భక్తరక్షణా కర్తవ్యంలో తన కత్యంత ప్రియమైన లక్ష్మణుని, సీతను కూడా వదులుకోవడానికి తాను సిద్ధంగా  ఉన్నానని శ్రీరాముడు చెప్పాడు. **ప్రపన్న అభయదాన దార్ఢ్యాత్ స్వమహిమ్నాఽపి అక్షోభ్యః.** తనకు ప్రపన్నులైనవారికి అభయం ఇచ్చే వ్రతంనుండి ఏమాత్రమూ చలించనివాడు అక్షోభ్యుడు. భగవద్రామానుజులు శరణాగతి గద్యములో ఇలా చెప్పారు. **అనృతమ్ నోక్త పూర్వమ్ మే న చ వక్ష్యసే కదాచన.** నేనెప్పుడూ అసత్యము పలుకలేదు. ఎప్పుడూ పలుకను.

**రామో ద్విర్నాభిభాషతే.** రాముడు రెండు నాల్కలతో మాట్లాడడు – యుద్ధకాండ.

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీ చ యాచతే**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ** – యుద్ధకాండ18.33
నేను నీవాడను అని ఎవరైనా ప్రపన్నులయితే వానికి సర్వభూతములనుండి అభయము ప్రసాదించెదను. ఇది నా వ్రతము.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః** – గీత 18.66
సర్వ ధర్మములను, అనగా సమస్త కర్తవ్యకర్మలను నాకు సమర్పించి, సర్వశక్తిమంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని గావించెదను. నీవు శోకింపకుము.

శ్రీ వేళుక్కుడి కృష్ణన్ ఉదాహరించిన విషయము – వనవాస సమయంలో ఆయుధధారణను వదలి తపోజీవనమును ఆరంభింపమని ఒకమారు సీత రామునకు నచ్చజెప్పడానికి యత్నించింది. అప్పుడు రాముడు మునిగణ సంరక్షణ తన కర్తవ్యమనీ, ఆ ధర్మాన్ని త్యజింపలేననీ అన్నాడు.

**అప్యహమ్ జీవితమ్ జహ్యామ్ త్వామ్ వా సీతే స-లక్ష్మణమ్**
**న తు ప్రతిజ్ఞామ్ సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః**
ఓ సీతా! నేను నా ప్రాణాన్ని, చివరకు నిన్ను, లక్ష్మణుని కూడా వదులుకోగలను. కాని ఇచ్చిన మాటను, విశేషంగా బ్రాహ్మణులకిచ్చిన మాటను జవదాటలేను.

విభీషణశరణాగతి సమయంలో కూడా రాముడు ఇదే విషయాన్ని చెప్పాడు.
**మిత్రభావేన సంప్రాప్తమ్ న త్యజేయమ్ కథంచన**
**దోషో యద్యపి తస్య స్యాత్ ఏతత్ అగర్హితమ్** – యుద్ధకాండ 18.3
మిత్రభావంతోను, నిజమైన ప్రేమతోను నన్ను చేరినవానిలో ఏవైనా దోషాలున్నాగాని వానిని వదలుకొనను. ఇదే సత్పువర్తన అని పెద్దలు చెబుతారు.

ఈ ఉదాహరణలన్నీ భక్తుల రక్షణపట్ల భగవంతునికున్న దీక్షను తెలియజేస్తున్నాయి.

శ్రీ నమ్మాళ్వారు, ఇతర పూర్వాచార్యులు భగవంతుని భక్తరక్షణాగుణాన్ని అనేకవిధాలుగా కీర్తించారు. భగవంతుడే సృష్టి, రక్షణ, లయ కర్త. కాని రక్షణ అనేది ఆయన ప్రధానలక్షణము. అందుకొఱకే ఆయన సృష్టి, సంహార కార్యములు కూడా నిర్వహిస్తాడు. శ్రీ నమ్మాళ్వారు తిరువైమొళి (2.2.9)లో భగవంతుని '**కాక్కుమ్ ఇయల్విననే కణ్ణపిరాన్'** అని అన్నారు. రక్షణ అనేది భగవంతుని ప్రధాన గుణము. అందువల్లనే ప్రళయకాలంలో ఆయన సమస్త జీవులనూ తన ఉదరంలో నిలుపుకుంటాడు. ప్రళయం కూడా సృష్టికొఱకు అవుసరమైన కార్యము. పునఃసృష్టి ద్వారా భగవంతుడు జీవులకు మరల దేహములను, సౌఖ్యసాధనములను ఇచ్చి, వారు తిరిగి తనను చేరుకునే అవకాశం ఇస్తాడు. భగవానుడు తన నాభినుండి ఉద్భవించిన బ్రహ్మాండంలో బ్రహ్మను సృష్టించి,

ఆయనకు (చతుర్ముఖ బ్రహ్మకు) సృష్టికార్యాన్ని, అందుకు కావలసిన శక్తిని ఇస్తాడు. ఆ బ్రహ్మ రుద్రుని సృజిస్తాడు. రుద్రుడు లయకర్త. ఇలా బ్రహ్మకూ, రుద్రునికీ కూడా అంతర్యామి విష్ణువే. భగవంతుని ప్రధాన గుణము జీవుల రక్షణమే. సృష్టి, లయ కార్యములు కూడా రక్షణార్థమే జరుగుచున్నాయి. తద్వారా జీవులు క్రమంగా మోక్షం పొంది శ్రీవైకుంఠంలో భగవంతుని సాన్నిధ్యాన్ని చేరే అవకాశం లభిస్తుంది. జీవుల రక్షణ కోసమే పెరుమాళ్లు అవతరిస్తాడు. **పరిత్రాణాయ సాధూనామ్, వినాశాయ చ దుష్కృతామ్** – అన్నపుడు కూడా శ్రీకృష్ణుడు ముందుగా సాధుసంరక్షణనే పేర్కొన్నాడు. దుష్టశిక్షణ కూడా సాధుసంరక్షణలో భాగమే. పొలంలో కలుపుమొక్కలు పీకివేసే విధంగా.

రక్షణ తరువాత  భగవంతుడొనర్చే కార్యక్రమం లయము. ప్రళయకాలంలో జీవులు భద్రంగా ఉండేందుకు భగవంతుడు జీవులను తన ఉదరంలో దాచుకుంటాడు. మూడవ కార్యక్రమం సృష్టి. ఇది కూడా ప్రళయానంతరం జీవుల రక్షణ కోసం భగవంతుడొనర్చే కార్యక్రమము.

ఈ పాశురంలోని విషయాన్ని శ్రీ స్వామిదేశికన్ క్లుప్తంగా **'రక్షణాయ అవతీర్ణమ్'** అని చెప్పారు. ఈ విషయంలో భగవంతుడు భక్తులను కాపాడడమే కాకుండా రావణ హిరణ్యకశిపునివంటివారికి కూడా మోక్షాన్ని ఇచ్చాడు. ఇలా కూడా ఇది రక్షణా కార్యక్రమమే.

**న తే రూపమ్ నచాకారో నాయుధాని నచాస్పదమ్**

**తథాऽపి పురుషాకారో భక్తానామ్ ప్రకాశసే** – జితంతే స్తోత్రము 1.5

నీ దివ్యాత్మ స్వరూపము, నీ దివ్యమంగళ విగ్రహము, నీ దివ్యాయుధాలు, చివరికి నీవుండే శ్రీవైకుంఠము – ఇవేవీ నీ కొఱకు కాదు. అవన్నీ నీ భక్తుల కొఱకు మాత్రమే. ఈ విధంగా స్వతంత్రుడవు కావు. నీవు భక్తపరాధీనుడవు.  అయినాగాని నీవు సర్వేశ్వరునివలె ప్రకాశిస్తున్నావు.

ఇలా ఈ పుణ్యస్తోత్రం చివరి శ్లోకంలోని నామములు వివిధ దివ్యాయుధములు ధరించిన ఆయన దివ్యస్వరూపమును వర్ణించడంద్వారా ఆయనయొక్క భక్తజన పరిరక్షణాతురతను తెలియజేస్తున్నాయని మనం గ్రహించవచ్చును.

తరువాతి ప్రశ్న – భగవంతుడు కేవలం తన సంకల్పమాత్రముననే తన భక్తుల శత్రువులను నాశనం చేయగలడు గదా? మరి ఆయన ఆయుధాలను ఎందుకు ధరిస్తున్నాడు? ఈ ప్రశ్నకు సమాధానంగా మనం శ్రీ నమ్మాళ్వారు పాశురం తిరువైమొళి 4.8.1 ను పరిశీలించవచ్చును. ఈ పాశురంలో అనేక భగవద్గుణాలను ఆయన స్తుతించారు. ప్రస్తుత సందర్భంలో గమనింపదగినవి –

భగవంతుడు తన భక్తుల శత్రువులైన అసంఖ్యాక దుష్ట అసురులు నాశనం కావాలని సంకల్పించాడు. ఆపై తన ఆయుధాలతో వారిని నాశనం చేశాడు. ఇక్కడ 'సంకల్పించి' (నిరుమిత్తు) మరియు 'అప్పుడు తన ఆయుధాలతో వారిని నాశనం చేశాడు' (పడాయి తొట్ట) అనేవి ముఖ్యపదాలు. అంటే భగవానుడు అసురుల నాశనాన్ని సంకల్పించి, ఆపై ఆయుధాల వినియోగంతో (సంకల్పంతో కాక) దానిని సాధించాడు. ఈ విషయాన్ని  పుర్వాచార్యులు ఇలా వివరించారు – భగవంతుడు కేవలం తన సంకల్పంతోనే అసురులను నాశనం చేయగలడు. కాని ఆయన అందుకొఱకు తన ఆయుధాలను వినియోగించాడు. స్వయంగా తన శత్రువులైనవారిని భగవంతుడు కేవలం తన సంకల్పంతోనే నాశనం చేస్తాడు. కాని తన భక్తుల శత్రువులైనవారిని నాశనం చేయడానికి ఆయన తన ఆయుధాలను ప్రయోగిస్తాడు. భాగవతులపట్ల అపచారాన్ని భగవంతుడు ఏమాత్రం క్షమించడు. మరియు ఇదే పాశురంలో భగవంతుని పరిపూర్ణ షడ్గుణాలలో ఒకటైన వీర్యమును కూడా ఆళ్వారు ప్రస్తుతించారు.

భగవంతుడు తన భక్తుల శత్రువులను స్వయంగా తన శత్రువులుగా పరిగణిస్తాడు. ఈ కారణం చేతనే శ్రీకృష్ణుడు దుర్యోధనుని ఆతిథ్యమును తిరస్కరించాడు. ఎందుకంటే పాండవుల శత్రువు శ్రీకృష్ణుని శత్రువేనట.

**ద్విషద్ అన్నమ్ నో భోక్తవ్యమ్ ద్విషన్తమ్ నైవ భోజయేత్**
**పాండవాన్ ద్విషసే రాజన్ మమ ప్రాణాహి పాండవాః**
ఇలా భగవంతుని దివ్యాయుధములు భక్తుల రక్షణపట్ల ఆయనకున్న నియతికి సంకేతములు – అని భీష్ముడు ఈ చివరి శ్లోకంలో తెలియజేశాడు.

శ్రీ భట్టులు తమ వ్యాఖ్యానంలో వాడిన పదాలద్వారా భక్తరక్షణకై భగవంతుడెంత సంసిద్ధుడో నొక్కి వక్కాణించారు. **'అన్ని సమయాలలోనూ, అన్ని చోట్లా, అన్ని విధాలా'** భగవంతుడు భక్తరక్షణకు కృతనిశ్చయుడని శ్రీ భట్టులు చెప్పారు. అంతే కాదు. ఈ రక్షణాగుణమును శ్రీ భట్టులు భగవంతునికే కాక, భగవంతుని దివ్యాయుధాలకు కూడా ఆపాదించారు. వీరంతా ఆయుధరూపం ధరించిన నిత్యసూరులు. భాగవతరక్షణా దీక్షాపరులు.

శ్రియై నమః
ఓం నమో వేంకటేశాయ

చివరి నామమైన **'సర్వప్రహరణాయుధః'** వ్యాఖ్యలో – దుష్టులను పరిమార్చడానికి కావలసిన సకలాయుధములు భగవంతునివద్ద నున్నవి. అని శ్రీ భట్టులు చెప్పారు. ఇంకా శ్రీ భట్టుల వ్యాఖ్య ఇలా సాగింది – మరియు భగవంతుడు అసంఖ్యాకములైన అనేక దివ్యాయుధములు ధరించాడు. ఈ దివ్యాయుధములు భాగవతుల కష్టములను పూర్తిగా హరింపగలరు. భగవంతుని శరణుజొచ్చినవారిని అన్ని వేళలా, అన్ని చోట్లా, అన్ని విధాలుగా రక్షించడానికి ఈ దివ్యాయుధములు వ్రతము పూనియున్నారు. ఈ దివ్యాయుధముల శక్తి అనంతము. వారు భగవంతునికి ఆభరణాలై భాసిస్తూ భగవంతుని పరమేశ్వరత్వ నిర్వహణకు తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తూ ఉంటారు.



భగవంతుని లీలలో ముఖ్యగుణము జీవుల రక్షణ. ఆయన సకల కళ్యాణ గుణములు, సకలైశ్వర్యములు భక్తుల రక్షణ కొఱకే. భగవంతుని కళ్యాణగుణములకు అంతు లేనట్లే ఆయా గుణములను అనుభవించే విధములకు అంతులేదు. మరియు భక్తుల రక్షణ కొరకు ఆయన ఎంతకైనా వెళతాడు. భగవంతుని దివ్యాయుధధారణను స్తుతించడం ద్వారా ఆయన అన్ని వేళలా, అన్ని చోట్లా, అన్ని విధాలుగా, అన్ని సందర్భాలలో, ఎంతకైనాగాని తన భక్తులను కాపాడుకొంటాడని శ్రీ భీష్ములు చెప్పారని శ్రీ భట్టుల వ్యాఖ్యానం ద్వారా మనం గ్రహించవచ్చును. (అంపశయ్యపై భీష్ముడు. వికీపీడియా నుండి . by Mahavir Prasad Mishra)

అని శ్రీ కృష్ణమాచారి వ్రాశారు.

హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.



## వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నందకీ
## శ్రీమాన్ నారాయణో విష్ణుర్వాసుదేవోఽభిరక్షతు
## శ్రీ వాసుదేవోఽభిరక్షతు ఓం నమః ఇతి

వనమాల అనే దండను ధరించి, గదను, శార్ఙ్గము అనే ధనుస్సును, శంఖమును, చక్రమును, నందకము అనే ఖడ్గమును ధరించినవాడును, శ్రీమహావిష్ణువును (అంతటను వ్యాపించినవాడును), శ్రీ వాసుదేవుడును (అందరికిని అంతర్యామియైనవాడును) అయిన శ్రీమన్నారాయణుడు మనలను సదా రక్షించుగాక. అట్టి వాసుదేవుడు మనలను సదా రక్షించుగాక.

ఈ శ్లోకము మహాభారతము సంశోధితముద్రణలో లేదు. కాని సంప్రదాయంగా అనేకులు స్తోత్రపారాయణంలో ఈ శ్లోకమును కూడా కలిపి స్తుతిస్తారు. శ్రీ భట్టులు, శ్రీ శంకరులు ఈ శ్లోకమును తమ వ్యాఖ్యలలో కలపలేదు. ప్రొఫెసర్ శ్రీనివాస రాఘవన్ ఆంగ్లవ్యాఖ్యలోను, శ్రీ రాధాకృష్ణశాస్త్రి తమిళవ్యాఖ్యలోను ఈ శ్లోకం ఉంది. కాని శ్రీ భట్టులు దీనిపై వ్యాఖ్యానించలేదన్న విషయాన్ని వారు వ్రాశారు.

శ్రీ నల్లాన్ చక్రవర్తి రఘునాథాచార్యుల రచన (ముద్ర ఆఫ్ సెట్ ప్రింటర్స్, విజయవాడ) శ్రీ భట్టుల వ్యాఖ్యకు తెలుగు అనువాదము. అందులో ఈ శ్లోకము విష్ణుగాయత్రియొక్క సారాంశమని రచయిత వ్యాఖ్యానించారు. చాలా దేవతల స్తోత్రాలు ఆయా దేవ గాయత్రితో ముగించే సంప్రదాయం ఉన్నందున ఈ శ్లోకము శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు సముచితమైన ముగింపు అని రచయిత అభిప్రాయపడ్డారు.

కనుక ఈ శ్లోకం మహాభారతంలోని విష్ణుసహస్రనామస్తోత్రంలోని భాగం కాదనీ, శ్రీ శంకరులు, శ్రీ భట్టులు, శ్రీ రఘునాధ తీర్థులు వంటి వ్యాఖ్యానకర్తలు ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానించలేదనీ గమనించాలి. అయితే శ్రీమన్నారాయణుని స్తుతించే ఏ శ్లోకాన్నయినా భక్తితో పారాయణం చేయవచ్చు. తద్వారా ఫలశ్రుతిలో చెప్పిన అనేక సత్ఫలితాలు తప్పక లభిస్తాయి.

అని శ్రీ కృష్ణమాచారి వ్రాశారు.





# ఫలశ్రుతి

(ఫలశ్రుతి భాగములో శ్లోకముల తాత్పర్యములు అధికంగా శ్రీ పెమ్మరాజు రాజారావు, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ పెరుంబూదూరు కిడాంబి రామానుజాచార్యులు రచనలనుండి తీసుకొన్నాను. వ్యాఖ్యానము శ్రీ కృష్ణమాచారి రచననుండి అనువదించాను – కా.సు. బాబు)

**ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః |**
**నామ్నాం సహస్రం దివ్యానామశేషేణ ప్రకీర్తితం || (1)**

ఈ విధముగా కీర్తింపదగినవాడును, కేశవుడును, మహాత్ముడును ఐన శ్రీమహావిష్ణువుయొక్క వేయి దివ్యనామములు సంపూర్ణముగా సంకీర్తనము చేయబడినవి.

వేయి దివ్య భగవన్నామములు కూర్చిన 107 పుణ్యశ్లోకముల తరువాత భీష్ముడు యుధిష్ఠిరునికి ఇలా చెప్పాడు. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం **'కీర్తనీయస్య'** అనే పదం ద్వారా భగవానుని నిరంతరం కీర్తించాలనీ, కనుక యుధిష్ఠిరుడు భగవన్నామ సంకీర్తనను వెంటనే ఆరంభించాలనీ భీష్ముడు చెబుతున్నాడు. **'కేశవః'** (బ్రహ్మకును, శివునకును ఆద్యుడు), మరియు **'మహాత్మనః'** అనే నామములద్వారా కూడా భీష్ముడు ఇందుకు కారణం తెలియజేశాడు. **'దివ్యానామ్'** అనే పదం వలన ఈ నామములు భూమిపైన మరియు శ్రీవైకుంఠములోను కూడ గానము చేయదగినవని తెలియుచున్నది. **'అశేషేణ'** అనే పదం ద్వారా భీష్ముడు ముఖ్యమైన నామములేవీ వదలకుండా సంపూర్ణంగా యుధిష్ఠిరునికి ఉపదేశించాడని గ్రహింపవలెను.

శ్రీ శంకరులు **'అశేషేణ'** అనగా 'అన్యూన, అనతిరిక్త' అనగా తక్కువ గాని, ఎక్కువ గాని కాకుండా సరిగ్గా వేయి నామములు అని అర్థం చెప్పారు. దాని భావం ఏమంటే ఏవో కొన్ని నామములు కాకుండా భీష్ముడు అతిముఖ్యమైన వేయి నామములు బోధించాడని. శ్రీ శంకరులు ఆదిలో ధర్మరాజు అడిగిన ఆరు ప్రశ్నలలో ఒక ప్రశ్నను (**'కిమ్ జపన్ ముచ్యతే జంతుః'**) కూడా ప్రస్తావించారు. ఆ ప్రశ్నకు సమాధానముగా ఈ వేయి నామములను జపించాలని అర్థము. మరియు శ్రీ శంకరులు మూడు విధాలైన జపములను – **త్రివిధ జపో లక్ష్యతే – ఉచ్చా, ఉపాంశు, మానస లక్షణ త్రివిధో జపః** – గట్టిగా పలుకుట, మెల్లగా అనుకొనుట, మనసులో స్మరించుట – ఈ మూడు విధములుగానూ కీర్తన చేయవచ్చునని **'ప్రకీర్తితమ్'** ద్వారాగ్రహింపవచ్చును.

ఈ శ్లోకము ద్వారా ఈ నామములు దివ్యములనీ, శ్రీవైకుంఠములో నిత్యసూరులు స్వయంగా దీనిని గానం చేస్తారనీ తెలుసుకోవాలి. ఋషులు ఈ దివ్యనామములను ఏరి కూర్చి గానం చేశారు (ఋషిభిః పరిగీతాని). మనకు తెలిసిన ఇతర స్తోత్రాలకంటే ఈ స్తోత్రము భిన్నమైనది. ఇది శ్రీకృష్ణభగవానుని సమక్షంలో ఉపదేశించబడినది.

**య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ |**
**నాऽశుభం ప్రాప్నుయాత్ కించిత్ సోऽముత్రేహ చ మానవః || (2)**

ఈ సహస్రనామములను శ్రద్ధగా వినువారికి గాని, కీర్తనము చేయునట్టిగాని మానవులకు ఇహలోకమునందును, పరలోకమునందును ఎట్టి అశుభములు కలుగవు.

ఈ శ్లోకంలో ఈ స్తోత్రాన్ని చదవడంవల్ల కలిగే ఫలములను క్లుప్తంగా, సాధారణంగా చెప్పారు. శ్రీ భట్టుల వ్యాఖ్య ప్రకారం ఈ శ్లోకాన్ని విన్నా గాని, పఠించినా గాని ఇహ పర లోకాలలో ఎలాంటి అశుభాలు కలుగవు. ఇక్కడ 'విన్నా గాని, చదివినా గాని' ఫలితాలు లభిస్తాయన్న విషయాన్ని గమనించాలి.

ఇక్కడ **'అముత్రే చ'** (పరలోకంలో) అనగా శ్రీవైకుంఠముకంటే దిగువన ఉండే స్వర్గలోకము, బ్రహ్మలోకము వంటివి అని గ్రహింపవచ్చును. శ్రీ శంకరులు ఈ శ్లోకం వ్యాఖ్యానంలో చెప్పిన విషయం. యయాతి మరియు నహుషుడు బ్రాహ్మణులపట్ల అపరాధములు చేసి ఇడుముల పాలయ్యారు. ఈ దివ్యస్తోత్రమును విన్నాగాని, చదివినాగాని అలాంటి అశుభములు కలుగనేరవు. **యయాతి నహుషాదివత్ అశుభప్రాప్తి అభావమ్.**

**వేదాంతగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ |**
**వైశ్యో ధనసమృద్ధః స్యాత్ శూద్రస్సుఖమవాప్నుయాత్ || (3)**

(ఫలము కోరకనే)ఈ సహస్రనామ పారాయణము చేత బ్రాహ్మణునికి వేదాంత పరిజ్ఞానము లభిస్తుంది. క్షత్రియునికి విజయ పరంపరలు లభిస్తాయి. వైశ్యుడు ధనసంపన్నుడు అవుతాడు. శూద్రునకు సకల సుఖములు లభిస్తాయి.

(శ్రీ పెమ్మరాజు రాజారావు – అనగా బ్రహ్మ జ్ఞానాభిలాషతో, అద్వైత సిద్ధిని కోరి పారాయణము చేసినచో బ్రహ్మస్వరూపుడే యగును. లౌకికకార్య విజయకాంక్ష గలవానికి అదియే సిద్ధించును. ధన సంపన్నతను అభిలషించువానికి ధనరాశులు సిద్ధించును. లౌకిక భోగసుఖములు కాంక్షించువానికి అవియే లభించునని భావము)

ఈ శ్లోకము, తరువాతి శ్లోకములు ఈ స్తోత్రమును పారాయణము చేయుటవలన మరియు శ్రవణము చేయుటవలన ఒకో వర్గమువారికి కలిగే ఆయా ఫలితములను తెలుపుతున్నాయి. వీనిని శ్రీ భట్టులు ఈ విధంగా వర్గీకరించారు.

ప్రస్తుత (3వ) శ్లోకము – ప్రత్యేకమైన ఫలితాలను ఆశించకుండా, మరియు ప్రత్యేకమైన నియమాలు పాటించకుండా ఈ స్తోత్రమును పఠించినా, విన్నాగాని నాలుగు వర్ణములవారికి ఏయే ఫలితాలు లభిస్తాయో తెలుపుతుంది. తరువాతి (4వ) శ్లోకము – ప్రత్యేకమైన ఫలితాలు ఆశించి ఈ స్తోత్రమును చదివే, వినే వారికి లభించే ఫలితాలను తెలుపుతుంది. 5, 6, 7, 8వ శ్లోకములు – నియమాలు పాటిస్తూ (ఉదయాన్నే లేవడం, స్నానం చేయడం వంటివి ఆచరిస్తూ) ఈ స్తోత్రాన్ని చదివే, వినే వారికి లభించే ఫలితాలను తెలుపుతున్నాయి.

ఇలా నియమాలు పాటిస్తూ గాని, పాటించకుండా గాని, ప్రత్యేకమైన కోరికలు ఉండిగాని, లేకున్నాగాని, ఎవరికైనాగాని, కొన్ని సత్ఫలితాలు తప్పక లభిస్తాయి. (మరియు 2వ శ్లోకం ప్రకారం, పఠిస్తే లభించే ఫలితాలు విన్నాగాని లభిస్తాయి). ప్రస్తుత (3వ) శ్లోకము ఏయే వర్ణాలవారికి ఎలాంటి ఫలితాలు లభిస్తాయో తెలుపుతున్నది.

శ్రీ శంకరులు **'వేదాంత-గో బ్రాహ్మణస్య'** అనే పదాలను విపులంగా వివరించారు. ఆయన చెప్పిన వివరణ – **జపకర్మణా సాక్షాత్ ముక్తి శంకాయామ్, కర్మణామ్ సాక్షాత్ ముక్తిహేతుత్వమ్ నాస్తి, అపి తు జ్ఞానేనైవ మోక్ష ఇతి దర్శయితుమ్ 'వేదాంతగో బ్రాహ్మణస్యాత్' ఇత్యుక్తమ్.** బ్రాహ్మణులకు వేదాంత జ్ఞానము లభిస్తుందని చెప్పడం ద్వారా వేదవ్యాసుడు కేవలం స్తోత్రజపంతో మోక్షం రాదని, జ్ఞానమువలనే మోక్షం సిద్ధిస్తుందని చెప్పాడు. దీనిని గురించి ఇక్కడ చర్చించడంలేదు. కాని వ్యాఖ్యానకర్తలు తమ తమ సిద్ధాంతాలకు అనుగుణంగా తమ వ్యాఖ్యానాలను ఎలా మలుస్తారో ఇక్కడ గమనించవచ్చును.

శ్రీ వి.వి. రామానుజన్ – ఈ స్తోత్ర పారాయణం ద్వారా ఆత్మను గురించి, పరమాత్మను గురించి, ఆ రెండింటి మధ్యనున్న సేవక-ప్రభు సంబంధము గురించిన జ్ఞానం లభిస్తుంది. (బ్రహ్మము తప్ప మిగిలినదంతా మిథ్య అనే శ్రీ శంకరులు బోధించిన జ్ఞానం కాదు).

నాలుగు వర్ణములవారికి లభించే ఫలితాలను ఈ శ్లోకంలో చెప్పడంద్వారా ఈ స్తోత్రాన్ని అందరూ (అన్ని వర్ణాలవారూ) పారాయణం చేయవచ్చునని తెలుస్తున్నదని కొందరు వివరించారు. కొందరు ఆచార్యులు తమ శిష్యులలో మహిళలకు ఈ స్తోత్రపారాయణానికి సంబంధించి కొన్ని నిబంధనలను సూచించారు. కొంత భాగాన్ని చదువవద్దని కొందరూ, అసలు చదువవద్దని కొందరూ చెప్పినట్లు అనిపిస్తున్నది. నామముల భాగము మాత్రమే – '**విశ్వం విష్ణుః.......**'తో ప్రారంభమయ్యే మొదటి శ్లోకంనుండి '**శంఖభృన్నందకీ....**' అనే 107వ శ్లోకం వరకు మాత్రమే – చదువమని కొందరన్నారు. నాకు (శ్రీ కృష్ణమాచార్యులకు) తెలిసినంతవరకూ ఈ స్తోత్రం వినడం విషయంలో ఇలాంటి పరిమితులు లేవు. మరియు చదివితే లభించే ఫలితాలన్నీ వింటే కూడా లభిస్తాయి. ఏమైనా ఇలాంటి విషయాలలో ఎవరైనాగాని తమ తమ ఆచార్యులు చెప్పినట్లుగా ఖచ్చితంగా పాటించాలి.

ఇక ఫలితమునాశించి పారాయణం చేసేవారికి లభించే ఫలితాలగురించి చెబుతున్నారు.

**ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మం అర్థార్థీ చార్థమాప్నుయాత్ |**
**కామానవాప్నుయాత్ కామీ ప్రజార్థీ చాప్నుయాత్ ప్రజామ్ || (4)**

ఈ దివ్యస్తోత్ర పారాయణము చేత ధర్మమును కోరువారికి ధర్మపరంపరలు లభించును. అర్థము (ధనము) కోరువానికి సకల సంపదలు లభించును. వివిధ వాంఛలు (భోగాభిలాష) కలవానికి ఆయా మనోవాంఛలును, భోగములును సిద్ధించును. సంతానమును కోరుకొనేవారికి సత్సంతానము కలుగును. (ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములును సిద్ధించునని భావము).

**భక్తిమాన్ యః సదోత్థాయ శుచిస్తద్గతమానసః |**
**సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ ప్రకీర్తయేత్ || (5)**

భక్తుడు నిరంతరము ప్రాతఃకాలమునందు మేల్కొని, శుచియై, వేరు ఆలోచన లేకుండా, సర్వమంగళకరుడైన వాసుదేవుని ఈ సహస్రనామములను పారాయణ చేయవలెను.

శ్రీ భట్టులు 5, 6, 7, 8 శ్లోకములను ఒక సమితిగా పరిగణించారు. సదాచారములను పాటిస్తూ నియమబద్ధంగా ఈ పుణ్యనామములను జపిస్తే కలిగే ఫలితములు ఈ (5 నుండి 8 వరకు) శ్లోకములలో చెప్పడమైనది. శ్రీ భట్టులు చెప్పిన వివరణ – **అథ నియమ విశేషత్వాత్ జప రూప సంకీర్తనే భక్తస్య సమృద్ధిమ్ ఆహ.** ఇంతకు ముందు (3,4) శ్లోకముల ద్వారా ఈ పావన నామములను మనసులో స్మరించినా, మెల్లగా ఉచ్చరించినా, గట్టిగా కీర్తించినా, కేవలం విన్నాగాని సత్ఫలితాలు లభిస్తాయని తెలుసుకున్నాము. ఇప్పుడు వ్యాసుడు చెప్పేదేమంటే, నిరంతరం ఉదయమే మేల్కొని శుచియై ఏకాగ్ర భక్తితో వాసుదేవుని వేయి నామములు జపిస్తే మోక్షం లభిస్తుంది. **అనుత్తమమ్ శ్రేయః ప్రాప్నోతి** (6వ శ్లోకము).

శ్రీ శంకరుల వ్యాఖ్య – **భక్తిమాన్ ఇత్యాదినా భక్తిమతః శుచేః సతతమ్ ఉద్యుక్తస్య ఏకాగ్ర చిత్తస్య శ్రద్ధాళోర్విశిష్టాధికారిణః ఫల విశేషమ్ దర్శయతి.** భక్తి కలిగి, శుచియై, ఎల్లప్పుడూ ఏకాగ్రచిత్తంతో, శ్రద్ధతో చేసే పారాయణ ఫలితాలు ఇప్పుడు చెప్పబడుతున్నాయి.

శ్రీ రాధాకృష్ణ శాస్త్రి – ఇప్పుడు చెప్పబోయే ఫలితములు నిశ్చలమైన భక్తితో, నిర్మలమైన మనస్సు, మాటలు, చేతలతో, నిరంతర ధ్యానంతో శ్రీవాసుదేవుని సహస్రనామములను జపించేవానికి లభిస్తాయి.

ఈ శ్లోకంలో కొన్ని పదాల అర్థాలను విశేషంగా చెప్పుకొనవచ్చును.

**భక్తిమాన్** – భక్తుడు, విశేషంగా శ్రీవాసుదేవుని భక్తుడు (**వాసుదేవస్య నామ్నాన్**). ఏకాగ్రమైన భక్తి అవసరం. అన్యదేవతారాధనను విడువవలెను.

**సదా ఉత్థాయ** – ప్రతిదినము ప్రాతః కాలమున మేల్కొనాలి.

**శుచిః** – స్నానాదికముల ద్వారా శరీరము శుభ్రమగును. శాస్త్రాలలో చెప్పిన విధంగా వర్ణాశ్రమ ధర్మాలను నియమంతో ఆచరించడం కూడా శుచిలో భాగమే. నిత్యకర్మలు చక్కగా ఆచరించని దీక్ష వ్యర్థమౌతుందని ఆచార్యులు పెక్కుమార్లు చెప్పారు.

**తద్-గత-మానసః** – భక్తుని మనసు వాసుదేవుని పైననే ఉండాలి. ఇదే విషయం 'భక్తిమాన్' పదంలో కూడా చెప్పబడినది.

**పరికీర్తయేత్** – చక్కగా కీర్తించవలెను. అనగా ఇక్కడ జపము, పారాయణము సూచింపబడినవి.

**యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్యమేవ చ |**
**అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమం || (6)**

ఈ విధముగా శ్రీ విష్ణు సహస్రనామమును సంకీర్తన చేయుటవలన గొప్ప కీర్తి, జ్ఞాతులందు ప్రాధాన్యత, తరగని సంపద, మరియు సాటిలేని శ్రేయస్సు లభించును.

**న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విందతి |**
**భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః || (7)**

ఈ పుణ్యస్తోత్రమును పఠించు పుణ్యాత్మునకు ఎట్టి భయమును కలుగదు. అతడు ప్రతిభా సంపన్నుడును, గొప్ప తేజశ్శాలియు నగును. రోగములు కలుగవు. గొప్ప దీప్తి కలవాడును, చక్కని ఆరోగ్యము, బలము, రూపము, సద్గుణములును కలవాడగును.

**రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బంధనాత్ |**
**భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః || (8)**

రోగములతో బాధపడేవానికి రోగములనుండి విముక్తి లభించును. బంధములలో చిక్కుకున్నవారు బంధవిముక్తులగుదురు. భయముతో కలతచెందువారికి సమస్త భయములను హరించును. ఆపదలలోనున్నవారి ఆపదలు దూరమగును.

శ్రీ భట్టులు ఈ మూడు శ్లోకములకు క్లుప్తంగా రెండు వాక్యాలలో వ్యాఖ్యానించారు. **అనుత్తమమ్ శ్రేయః ముక్తిః, అన్యే అభ్యుదయ విశేషాః.** (6వ శ్లోకంలో చెప్పిన) 'అనుత్తమమైన శ్రేయము' అనగా ముక్తి. మరియు ఇతర ఫలములు ఈ లోకములో లభించు జయ సంపదలు. శ్రీ శంకరులు కూడా ఈ శ్లోకములను వ్యాఖ్యానించలేదు. వీని అర్థం స్పష్టంగా తెలుస్తుందని శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా భావించినట్లున్నారు.

శ్రీ భట్టులు చెప్పిన 'అనుత్తమ శ్రేయము' అనగా ముక్తినే నిజమైన భక్తుడు కోరుకుంటాడు. ఇతర ఫలములు కూడా ఈ ముక్తికి మార్గమును సుగమం చేసేవే. ఉదాహరణకు 'భయమునుండి విముక్తి' అనగా భగవంతుడు మనలను సంసార సాగరమునుండి తప్పక రక్షిస్తాడనే మహావిశ్వాసము.

**అచలాం శ్రియమ్** – తరగని సంపద – శ్రీనివాసునికి సదా కైంకర్యము చేసే మహాభాగ్యము. కైంకర్యశ్రీ.

**రోగార్తో ముచ్యతే రోగాత్** – ఈ శరీరముపైన, ఇహలోక భోగములపైన ఉన్న వ్యామోహమే అతిపెద్ద రోగము. దానినుండి విముక్తి లభించును.

**భయాన్ముచ్యేత భీతః** – మరల మరల జన్మించాలనే భయమే పెద్ద భయము. అట్టి పునర్జన్మ భయమునుండి రక్షణ లభించును.

**యశః ప్రాప్నోతి** – శ్రీవాసుదేవుని భక్తునిగా గొప్ప కీర్తి లభించును.

**ద్యుతిమాన్, తేజశ్చ విందతి** – అట్టి భక్తుని తేజస్సు గొప్పగా ప్రకాశించును. ఆచార్యునివద్ద ఇటువంటి తేజస్సు శిష్యునికి అవగతమగును.

**దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమం |**
**స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః || (9)**

భక్తితో నిరంతరమును పురుషోత్తముని మంగళకరమైన సహస్రనామములను స్తుతించినచో అట్టివానికి సమస్తములగు భయంకర క్లేశములు, కష్టములు, మహాదుఃఖములును హరించును.

ఎవరైనా శ్రీకృష్ణునిపట్ల నిశ్చలమైన భక్తి కలిగియుండి, శ్రీకృష్ణుని పొందటయే లక్ష్యముగా స్తుతించినట్లయితే ఆ భక్తుని కష్టాలన్నీ తప్పక తొలగిపోతాయి. ఆ భక్తుడు ప్రత్యేకంగా కష్టనివారణ కొఱకు ప్రార్థన చేయనక్కరలేదు.

**వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః |**
**సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనం || (10)**

శ్రీవాసుదేవుని ఆశ్రయించి, వాసుదేవుడే పరమగతియని భావించిన మనుష్యుడు సకల పాపముల నుండియు విముక్తమైన అంతఃకరణము కలవాడై సనాతన పరబ్రహ్మమునే **(మోక్షమునే)** పొందును.

**న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ |**
**జన్మమృత్యుజరావ్యాధిభయం నైవోపజాయతే || (11)**

వాసుదేవుని భక్తులకు ఎన్నడును అశుభములు కలుగనే కలుగవు. వారికి జననము (పునర్జన్మ), మరణము, ముసలితనము, వ్యాధులు వంటివాని గురించిన భయములెంతమాత్రమును కలుగవు.

ఈ రెండు (10, 11) శ్లోకములలో శ్రీ భట్టులు భక్తునికి పరమాత్మప్రాప్తి ఎలా లభిస్తుందో చెప్పారు.

**ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః |**
**యుజ్యేతాత్మాసుఖక్షాంతిశ్రీధృతిస్మృతికీర్తిభిః || (12)**

శ్రద్ధ, భక్తులతోటి ఈ పవిత్ర స్తవమును పారాయణము చేయు భక్తులకు అంతఃకరణశుద్ధి కలుగును. వారికి గొప్ప సౌఖ్యము (ఆత్మసుఖము), సహనము, మహైశ్వర్యము, చిత్తస్థైర్యము, మేధాసంపద, సత్కీర్తి లభించును. ఏకాగ్రచిత్తము, సదాచార సంపద, శుచిత్వము, భగవానునియందు పూర్ణవిశ్వాసము, అనురాగమును కలిగి పారాయణము చేసినవారికి పైన వివరించిన మహాఫలములన్నియును కలుగునని భావము.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **నియమవతో భక్తస్య అనుషంగిణీమ్ అభ్యుదయ సిద్ధిమ్ ఆహ.** నియమములతో శాస్త్రానుసారంగా పారాయణం చేసే భక్తులకు సకలైశ్వర్యములు తేలికగా (అయాచితంగా) నేరుగా లభిస్తాయి. 'శ్రద్ధా' అనగా 'సగౌరవ త్వరా' అనగా గౌరవంతో (వినయంతో) కూడుకున్న ఉత్సాహము – అని శ్రీ భట్టులు వివరించారు. **భగవతి భక్తః మహతః సుకృతస్య ఫలమ్.** భగవంతునిపట్ల భక్తి అనేక సత్కార్యములు చేసినందువలన ఫలితముగా లభించును. కనుక నిజమైన భక్తుడు శ్రద్ధాభక్తులతో ఈ స్తోత్రమును పారాయణ చేయాలి. మరియు సదా సత్కార్యములను ఆచరిస్తూ ఉండాలి. **గోవింద భక్త్యభ్యధికమ్ శ్రేయశ్చ అన్యత్ న విద్యతే.** గోవిందునిపట్ల భక్తికంటె అధికమైన శ్రేయస్సు వేరేమీ ఉండదని కూడా శ్రీ భట్టులు చెప్పారు.

5 నుండి 8వ శ్లోకములకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **అథ నియమ విశేషత్వాత్ జప రూప సంకీర్తనే భక్తస్య సర్వసమృద్ధిమ్ ఆహ.** ప్రస్తుత (12వ) శ్లోకమునకు శ్రీ భట్టుల వ్యాఖ్య – **నియమవతః భక్తస్య అనుషంగిణీమ్ అభ్యుదయ సిద్ధిమ్ ఆహ.** ఇలా రెండు సందర్భాలలోనూ 'నియమము' ప్రకారం పారాయణం చేసే భక్తులకు కలిగే ఫలితాలను వివరించారు. 5వ శ్లోకంలో నియమము ప్రకారం 'ప్రకీర్తన' (విశేషంగా చక్కగా స్తుతించుట, కీర్తించుట, శ్లాఘించుట) చేసే భక్తులకు కలిగే ఫలితాలను గురించి చెప్పారు. 12వ

శ్లోకంలో నియమం ప్రకారం 'అధీయానులు' అయి (శిష్యునిగా గాని, గురువుగా గాని) స్తోత్రం చేసేవారికి కలిగే ఫలితాలను గురించి చెప్పారు. శ్రీ వి.వి. రామానుజన్ 'అనుసంధానము' అనే పదాన్ని వాడారు. '

కనుక మనం తరచి చూడాలనుకుంటే, ఫలశ్రుతిలోని 5, 6, 7, 8వ శ్లోకములు – భక్తితో నియమానుసారం ఈ స్తోత్రమును పారాయణం చేసేవారికి కలిగే ఫలితములను గురించి. ఫలశ్రుతిలోని 12వ శ్లోకము – శ్రద్ధాభక్తులతో నియమానుసారం ఈ స్తోత్రమును, దాని అర్థములను విశేషంగా పఠించి, అర్థం చేసుకొని, ప్రచారం చేస్తూ భక్తితో పారాయణం చేసేవారికి కలిగే ఫలితములను గురించి.

శ్రీ శంకరుల వ్యాఖ్యకు అనువాదం వ్రాసినవారొకరు 5వ శ్లోకము (భక్తిమాన్.....) నుండి 12వ శ్లోకము (ఇమమ్ స్తవమ్.......) వరకు ఒక సమితిగా వర్గీకరించారు. ఈ శ్లోకములకు శ్రీ శంకరులు చెప్పిన వ్యాఖ్య – **భక్తిమాన్ ఇత్యాదినా భక్తిమతః శుచేః సతతముద్యుక్తస్యైకాగ్రచిత్తస్య శ్రద్ధాళోర్విశిష్ట అధికారిణః ఫలవిశేషమ్ దర్శయతి.** 'భక్తిమాన్'తో ప్రారంభమయ్యే ఈ శ్లోకాలలో భక్తితో, శుచితో, శ్రద్ధతో, ఏకాగ్రతతో, విశ్వాసంతో స్తోత్రం చేయువారికి లభించే ఫలములు చెప్పబడినవి.

ఇంకా శ్రీ శంకరులు ఇలా చెప్పారు – **శ్రద్ధా ఆస్తిక్య బుద్ధిః, భక్తిః భజనమ్ తాత్పర్యమ్, ఆత్మనః సుఖమ్ ఆత్మసుఖమ్, తేన చ క్షాన్యతిభిశ్చ ఉచ్యతే.** శ్రద్ధ అనగా భగవంతునిపట్ల నమ్మకము. భక్తి పూజను సూచించును. ఆత్మసుఖము అనగా ఆత్మానందము. వీని (ఈ గుణముల) ద్వారా సహనము, కరుణ వంటి ఉత్తమ గుణములు కూడా సూచింపబడినవి.

**న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభామతిః |**
**భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే || (13)**

పురుషోత్తముడైన శ్రీహరియందు భక్తి కలిగిన పుణ్యాత్ములకు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది దుర్గుణములుండవు (వారు అరిషడ్వర్గములను జయించినవారగుదురు). అట్టి పవిత్రులకు అశుభ భావములే యుండవు.

శ్రీ భట్టుల వ్యాఖ్య – భగవద్భక్తులనుండి దుర్గుణములు సహజముగానే దూరముగానుండును.

శ్రీ శంకరుల వ్యాఖ్య – ఈ శ్లోకములో 'న క్రోధ, న లోభ, న అశుభామతి' అనే పదములు నకారముతో వచ్చినవి. కనుక పురుషోత్తమ భక్తులకు క్రోధముండదు, లోభ బుద్ధియుండదు, అశుభము కలుగదు, అని నొక్కి చెప్పారు. 'మాత్సర్యము' పదమునకు మాత్రము 'చ' ఉన్నది. దీని భావము – భక్తులలో క్రోధ, లోభ, దురాలోచనలు మాత్రమే కాక మాత్సర్యము (అసూయ, ద్వేషము) కూడా నశించును.

**ద్యౌః సచంద్రార్క నక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః |**
**వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః || (14)**

సూర్య చంద్ర నక్షత్రములతో కూడిన స్వర్గలోకమును, ఆకాశము, దిక్కులు, భూమి, మహాసాగరములు మున్నగునవన్నియును మహాత్ముడగు వాసుదేవుని బలవీర్యములచేత ధరింపబడియున్నవి.

ఇంతకుముందు శ్లోకాలలో ఈ పుణ్యస్తవ పారాయణం వలన లభించే అనేక సత్ఫలితాలు చెప్పబడ్డాయి. వాటితోపాటు మోక్షం కూడా లభిస్తుందని చెప్పడమైనది. ఎవరైనా దురదృష్టవంతులు ఇదంతా నిజం కాదని తమ స్వంతతర్కం ద్వారా భావించవచ్చును. అలాంటి అభిప్రాయం తప్పనీ, భగవంతుని శక్తి, మహాత్మ్యము ముందు ఇవన్నీ (పైన చెప్పిన ఫలితాలన్నీ) చాలా అల్పవిషయాలనీ ప్రస్తుత శ్లోకంద్వారా తెలియవస్తున్నదని శ్రీ భట్టులు వివరించారు. న **అయమ్ ఫల అర్థవాదః శంక్యః నిర్భాగ్యైః కుతార్కికైః భగవత్ప్రభావస్య అసంభవస్య అభావేన అతివాద అపవాదయోః అసంభవాత్ ఇతి అభిప్రాయాన్, తస్య తమ్ ప్రభావన్ ఆహ.**

ఈ శ్లోకాన్ని గురించి శ్రీ శంకరుల వ్యాఖ్య – **ద్యౌః స చంద్రార్క నక్షత్రా ఇత్యాదినా స్తుతస్య వాసుదేవస్య మహాత్మ్య కథనేన ఉక్తానామ్ ఫలానామ్ ప్రాప్తి వచనమ్ యథార్థ కథనమ్ న అర్థవాద దర్శయతి.** స్వర్గము, చంద్రసూర్యులు, నక్షత్రములు వంటివానిగురించి చెప్పడంద్వారా పైన చెప్పిన ఫలితములు యథార్థమైనవనీ, అతిశయోక్తులు కానీ, వట్టిమాటలు కానీ కావనీ తెలియవచ్చుచున్నది.

శ్రీ శంకరులు, శ్రీ భట్టులు కూడా ఒకేవిధమైన వ్యాఖ్యలు చేయడం గమనించదగిన విషయం. ఈ స్తోత్ర మాహాత్మ్యమును సంశయించేవారికి ఈ ఫలశ్రుతిలో చెప్పినవన్నీ నిజాలనీ, భగవంతునికి అసంభవం లేదనీ తమ వ్యాఖ్యలద్వారా వారు చెబుతున్నారు.

శ్రీ భట్టులు చెప్పిన ఒక వ్యాకరణ విశేషము – **విధృతాని నానాలింగానామ్ 'నపుంసకమ్ - అనపుంసకేన ఏకత్వాత్' చ అస్య అన్యతరస్యామ్** (అష్టాధ్యాయి 1.2.69). ఈ శ్లోకంలో ద్యులోకము, చంద్రుడు, సూర్యుడు వంటివి వివిధ లింగములకు చెందిన పదములు. ఇలా పుంసక, నపుంసక లింగములను కలిపి చెప్పినపుడు క్రియాపదము నపుంసకలింగంలో ఉండాలి. 'విధృతాణి' అనే పదం నపుంసక లింగము.

ఇలా సమస్తము భగవంతుని కారణంగా నిలిచి ఉన్నాయని పై శ్లోకంలో చెప్పారు. మరియు అన్నీ, అందరూ కూడా భగవంతునికి లోబడి వర్తిస్తారని తరువాతి శ్లోకంలో చెప్పబడును.

ససురాసురగంధర్వం సయక్షోరగరాక్షసం |
జగద్వశే వర్తతేదం కృష్ణస్య స చరాచరం || (15)

దేవ దానవ గంధర్వులు, యక్షులు, నాగులు, రాక్షసులతో కూడిన సమస్త చరాచర జగత్తును భగవానుడగు శ్రీకృష్ణునికి వశవర్తియై యున్నది.

ఇక్కడ 'వర్తత', 'ఇదమ్' అనే పదములు కలిపి 'వర్తతేదమ్' అని చెప్పబడినది. ఇది 'అర్థప్రయోగము' అనగా పాతకాలపు పద్ధతి అని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ఖచ్చితమైన వ్యాకరణసూత్రాల ప్రకారము 'వర్తత ఇదమ్' అని లేదా 'అవర్తత ఇదమ్' (ఉండియున్నది) అని చెప్పాలి.

ఈ శ్లోకమునకు శ్రీ శంకరులు వేరుగా వ్యాఖ్యను చెప్పలేదు.

ఇంద్రియాణి మనో బుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః |
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ || (16)

సర్వేంద్రియములు, మనస్సు, బుద్ధి, సత్త్వగుణము, తేజస్సు, బలము, ధారణ ప్రతిభా సంపత్తి, క్షేత్రము (శరీరము), క్షేత్రజ్ఞుడు (దేహి) మున్నగు సమస్తమును వాసుదేవుని స్వరూపములేయని (శాస్త్రములలో) తెలుపబడినది.

**వాసుదేవస్య ఆత్మకాని** – సమస్తము ఆయన శరీరములే. శరీరమునకు ఆత్మకు ఉండే సంబంధమే సకల వస్తువులకు, భగవానునికి మధ్య ఉంటుందని, అలా సమస్తము భగవానుని అధీనంలో ఉంటుందని ఈ శ్లోకం చెబుతున్నదని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ఆత్మకు, పరమాత్మకు ఉన్నసంబంధము శరీరానికి, ఆత్మకు ఉన్న సంబంధం వంటిదేనన్న సారూప్యము విశిష్టాద్వైత సిద్ధాంతంలో చాలా ముఖ్యమైన అంశము.

అన్ని తత్వములు భగవానుని అధీనంలో ఉన్నాయని శాస్త్రాలు చెబుతున్నాయని ఈ శ్లోకం తెలియబరచునని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. ఆ శాస్త్రాలు కూడా భగవానుని అధీనంలోనే ఉన్నాయి. వివిధ ఆచారములను తెలియజేప్పే శాస్త్రములు కూడా భగవానుని అధీనంలో ఉన్నాయని తరువాతి (17వ) శ్లోకంలో ఉంది. కనుక 16, 17 శ్లోకాలు కలిపి చూస్తే, తత్వశాస్త్రములు మరియు అనుష్ఠాన శాస్త్రములు కూడా భగవంతుని అధీనంలో ఉన్నాయి.

**సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే |**
**ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః || (17)**
సర్వశాస్త్రములందును సదాచారమే ప్రధానముగా చెప్పబడియున్నది. సదాచారమునుండియే ధర్మము ప్రభవించును. అట్టి ధర్మమునకు అచ్యుతుడే ప్రభువు.

**ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః |**
**జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవం || (18)**
ఋషులు, పితరులు, సమస్త దేవతలు, మహాభూతములు, (సువర్ణాది) ధాతువులు – ఒకటేమిటి? జంగమ స్థావరములగు ఈ అనంతవిశ్వమంతయును నారాయణునినుండియే ఉద్భవించినది.

సృష్టిలో ఇదివరకు ఉన్నది, ఇప్పుడు ఉంటున్నది, ఇకముందు ఉండబోవునది ఏదైనా గాని శ్రీమన్నారాయణునినుండియే ఉద్భవించునని ఈ (18వ)శ్లోకము, తరువాతి (19వ)శ్లోకము చెప్పుచున్నవి. ధర్మమునకు లోబడి ఉండునవన్నీ భగవంతునినుండియే జనించినవని శ్రీ భట్టులు వ్యాఖ్యానించారు. **ధర్మానుబంధినామపి తద్ ఉద్భవమ్ ఆహ.**

ఇంకా శ్రీ భట్టులు ప్రతిపదార్థం కూడా చెప్పారు.

**ఋషయః** – మన్వాదయః, తస్య స్మర్తారః, అనుష్ఠారశ్చ – స్మృతులను వ్రాసిన మనువువంటివారు, స్మృతులను అనుసరించేవారు.
**పితరః, దేవః** – అవాంతర, ఆరాధ్యాః – పూజింపదగిన ఇతర (తక్కువ) దేవతలు.
**మహాభూతాని** – వియదాదీని – పంచభూతములు.
**ధాతవః** – తత్కార్యాణి, త్వక్ చర్మాదీని ఏతాని కర్మఫలభోగోపకరణాని – కర్మఫలములు అనుభవించడానికి ఉపయోగపడే చర్మమువంటి ధాతువులు.
**జంగమ్, అజంగమ్ చ ఇదమ్ జగత్** – కదిలే, మరియు కదలనివానితో కూడిన ఈ జగత్తు.
**నారాయణ ఉద్భవమ్** – నారాయణునినుండి జనించినవి.

**యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాదికర్మ చ |**
**వేదాశ్శాస్త్రాణి విజ్ఞానమేతత్సర్వం జనార్దనాత్ || (19)**
యోగము, జ్ఞానము, సాంఖ్యము, సకల విద్యలు, శిల్పములు (కళలు), కర్మలు, వేదములు, శాస్త్రములు – ఇటువంటి విజ్ఞానమంతయును జనార్దన భగవానునినుండియే కలుగుతున్నాయి.

మహాభారత సంశోధితముద్రణలో 'శిల్పాని' అని ఉన్నది. శ్రీ భట్టులు 'శిల్పాది' అనే పాఠమును గ్రహించారు. అలాగే శ్రీ భట్టులు 'యోగో జ్ఞానమ్' (యోగము మరియు జ్ఞానము) అనే పాఠం బదులు 'యోగ జ్ఞానమ్' (యోగమును గురించిన జ్ఞానము) అనే పాఠాన్ని గ్రహించారు. ఇంతకుముందు (18వ)శ్లోకంలో సమస్త చేతనాచేతనములకు (జంగమ్ అజంగమ్ చ ఇదమ్) మూలము భగవంతుడే అని చెప్పడమైనది. ప్రస్తుత (19వ)శ్లోకంలో సమస్త విజ్ఞానమునకు (విజ్ఞానమ్ ఏతత్ సర్వమ్) కూడా మూలము భగవంతుడేనని తెలుపుతున్నారు. ఈ శ్లోకానికి కూడా శ్రీ భట్టులు ప్రతిపదార్థము చెప్పారు.

**యోగజ్ఞానమ్** – యోగస్య జ్ఞానమ్, జ్ఞానమ్, శాస్త్రమ్ – యోగో ద్వివిధః సమాధియోగ కర్మయోగశ్చ – యోగము రెండు విధాలు. భక్తియోగము, కర్మయోగము. ఈ రెండింటి గురించిన శాస్త్రజ్ఞానము యోగజ్ఞానము.
**సాంఖ్యమ్** – సంఖ్యయా తత్త్వానామ్ అవధారణమ్ సాంఖ్యమ్ – సంఖ్యా (బుద్ధి ద్వారా) తత్వమును గురించి నిజము తెలుపు శాస్త్రము సాంఖ్యము.

**విద్యాః** – వ్యాకరణాది అంగవిద్యాః, ధనుర్, ఆయుర్, గాంధర్వ ప్రభృతీని దృష్టార్థాని ఉపవిద్యాః – (వేదములు ప్రధాన విద్యలు). ఉపవిద్యమైన వ్యాకరణాదులు, ధనుర్విద్య, ఆయుర్వేదము, సంగీత నృత్యాదులు వంటివి.

**శిల్ప ఆది** – శిల్పము, వాస్తు వంటివి.

**కర్మ** – సర్వత్ర అనుష్ఠేయమ్ కర్మ – అన్ని చోటుల ఆచరింపదగినది కర్మ.

**వేదాః** – ప్రధానవిద్యా – అన్నింటికంటెను ముఖ్యమైన విద్య.

**శాస్త్రాణి** – స్మృతి, ఇతిహాస, పురాణాని – స్మృతులు, ఇతిహాసములు, పురాణములు.

**సర్వమ్ ఏతత్ విజ్ఞానమ్** – ఈ శాస్త్రముల విజ్ఞానమంతా.

**జనార్దనాత్** (ఉద్భవతి) – జనార్దనునిండియే ఉద్భవించినవి.

నిత్యవిభూతి (శ్రీవైకుంఠము)నందును, లీలావిభూతి (తక్కిన సకల జగత్తుల)యందును సమస్తము భగవంతునిదేనను తరువాతి శ్లోకములో శ్రీమహావిష్ణువు మాహాత్మ్యము తెలియవచ్చుచున్నది.

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః |
త్రీన్‌లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః || (20)

ఈ జగత్తులో విష్ణువొక్కడే మాటలకును మనస్సునకును అందరానివాడును, అద్వితీయుండును అయిన పరమేశ్వరుడు. అతడే ముల్లోకములలోను వ్యాపించి సమస్త నానావిధ భూతజాలమునకు అంతర్యామియై సమస్తమును రక్షించుచు అనుభవించుచున్నను అవ్యయుడై (వాని సాంగత్యము లేనివాడై) యున్నాడు.

ఈ శ్లోకమునకు కూడా శ్రీ భట్టులు ప్రతిపదార్థము చెప్పారు.

**ఏకః** – స్వయమ్ ఏకమ్ సన్ – అందరికంటెను అధికుడైన దేవుడు (దేవదేవుడు) అయినందున.

**వ్యాప్య** – తేషామ్ నియమ శేషిత్వాదిభిః ఆత్మభవన్ – వాని అన్నింటియందును వ్యాపించి వాని అంతర్యామియై, వానికన్నింటికిని ప్రభువును, చాలకుడును అయినందున.

**అనేకశః పృథక్ భూతాన్** – అసంఖ్యేయతయా రూపప్రకార పరిణామ ప్రయోజన భేదేన పృథక్ చ స్థితాని మహాన్తి భూతాని – నానావిధములైన రూపములు, తత్వములు, విధానములు, ప్రయోజనములు ఉండి, ఒకదానికంటె మరొకటి భిన్నముగానున్న అనేకవిధములైన గొప్ప భూతములు.

**త్రీన్ లోకాన్** – బద్ధ ముక్త నిత్యాన్ చేతనాన్ – బద్ధులు, ముక్తులు, నిత్యులు అనే మూడువిధములైన జీవులు (ఆత్మలు) ఉండే లోకములు.

**విశ్వభుక్** – సర్వథా పరిపాలకః – జగత్తులో అన్నింటికి తానొక్కడే రక్షకుడైయుండి.

**తథాఽపి** – అయినా గాని.

**అవ్యయః** – తద్ దోషైః అపరామృష్టః, పునశ్చ పర విభూత్యా – వాని అన్నింటికి అంతరాత్మయైయుండి కూడా వాని (ఆ జీవుల) దోషములు అంటనివాడు.

**మహద్ భూతమ్** – అవాఙ్మానస గోచరశ్చ భవన్ – మాటలకును, మనసునకును అందనంత మహాత్మ్యము కలిగినవాడు.

**భుంక్తే** – లీలాభోగరసమ్ అనుభవతి – దివ్య లీలను, దివ్యానందమును అనుభవించువాడు.

శ్రీ శంకరులు ఈ శ్లోకమునకు వ్యాఖ్యానము చెప్పలేదు. శ్రీ శంకరుల అద్వైతమును ప్రతిబింబించేలా శ్రీ రాధాకృష్ణశాస్త్రి వ్రాసిన తాత్పర్యము – అంతటా వ్యాపించియున్న విష్ణుభగవానుడు మూడులోకములకును మూలమైన 'మహత్' అయ్యాడు. అనంతరము ఆయన అనేక రూపములు ధరించి సకల లోకములను నిండిపోయాడు. అలా ఉద్భవించిన సకలములకును ఆయనే

అంతరాత్మ. ఈ సకల లోకములకంటెను భిన్నుడు కాకుండ ఆయన ఈ లోకములను అనుభవించుచున్నాడు. తుదకు అంతటినీ ఆయన తనలో కలుపుకుంటాడు. (శ్రీమహావిష్ణువే సృష్టి స్థితి లయ కారకుడు, కర్త).

(శ్రీ విష్ణుసహస్రనామ ఫలస్తుతి చివరిభాగానికి ముందుగా శ్రీ కృష్ణమాచార్యులు వ్రాసిన సమర్పణను యథాతథంగా ఇక్కడ వ్రాస్తున్నాను – కా.సు. బాబు)

**1997 మే 7వ తేదీన అడియేన్ (కృష్ణమాచార్యులు) ఆరంభించిన శ్రీ విష్ణు సహస్రనామము ప్రాజెక్టు ఈనాటి రచనతో పూర్తి అవుతున్నది. ఈ ప్రాజెక్టు దాదాపు 10 సంవత్సరములు పడుతుందని అప్పట్లో అడియేన్ ఊహించలేదు. మన సంప్రదాయం గురించి ఏ కొంచెమైనా అడియేన్ తెలుసుకొని ఉంటే అది కేవలం ఈ పది సంవత్సరాల కృషి కారణంగానే. జీవితపు పరమలక్ష్యానికి మరింత దగ్గఱగా ఈ కృషి నన్ను (కృష్ణమాచార్యులను) తీసుకొని వెళ్లింది. మన సంప్రదాయం ప్రకారం మన నిత్యజీవితంలో ప్రభువు మన ఆచార్యుడే.**

**ఈనాడు (తేదీ?) మన పరమాచార్యులు శ్రీమద్ తిరుకుడంతై ఆండవన్ గారి శతమానోత్సవము. నా (కృష్ణమాచార్యుల) జీవితంలో ఆయన కటాక్షానికి సంబంధించిన మధురస్మృతులను జ్ఞాపకం చేసుకొంటూ ఈ శ్రీ విష్ణు సహస్రనామము ప్రాజెక్టు చివరి రచనను సమర్పించడం అడియేన్ కు ఎంతో ఆనందకరము. అస్మదాచార్యులు శ్రీ రంగరామానుజ మహాదేశికన్ గారి పాదపద్మాలవద్ద ఈ రచనను అడియేన్ సవినయంగా సమర్పిస్తున్నాడు.**

**ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితం |**
**పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ || (21)**

పరమ శ్రేయస్సు (మోక్షము)ను, (ఇహలోకమందలి) సుఖములను పొందాలని కోరుకొనేవారు వ్యాసమహర్షిచే ప్రణీతమైన ఈ శ్రీ విష్ణుభగవానుని స్తోత్రమును పఠింపవలయును.

శ్రీ భట్టుల వ్యాఖ్య – ఈ స్తోత్రము అనంతగుణ సంపన్నుడైన శ్రీవిష్ణుభగవానుని మహాత్మ్యమును కీర్తించుచున్నది. ఈ స్తోత్రముద్వారా భగవానుని స్తుతించిన వేదవ్యాసమహర్షి భగవంతుని మహాత్మ్యము పూర్తిగా తెలిసినవాడు. మరియు ఆయనను కీర్తింపగలిగినంత భాషాజ్ఞానము పూర్తిగా కలిగినవాడు. ఇలా ఈ స్తవరాజము ద్వారా కీర్తింపబడినవాడు, కీర్తన చేయుచున్నవాడు – ఇరువురూ మహాత్ములే. వారిరువురి గొప్పతనము ఈ స్తవములో పొందుపరుపబడినది. దుఃఖముచే నిండియున్న ఈ లోకములో ఈ స్తవరాజ పారాయణమే అత్యుత్తమ దుఃఖవిమోచన మార్గము. కనుక మోక్షార్థులు, సుఖార్థులూ కూడా ఈ స్తవమును పారాయణం చేసి సత్ఫలితాలను పొందవచ్చును.

శ్రీ భట్టులు తమ వ్యాఖ్యలో వాడిన కొన్ని పదములు –

**స్తవరత్నమ్** – విష్ణుసహస్రనామ స్తోత్రము.
**మహాదారిద్ర్యమ్ ఇదమ్ జగత్** – ఈ జగత్తు ధర్మమునకు దూరమై దుఃఖభూయిష్టమై యున్నది.
**నిర్విశంకః సేవతామ్** – ఈ స్తోత్రముద్వారా భగవంతుని సేవించినవారికి ఫలములు తప్పక, నిస్సందేహంగా కలుగుతాయి. మరియు ఈ శ్లోకంలో చెప్పిన ప్రకారం ఈ స్తోత్రాన్ని జపించేవారికి శ్రేయస్సు (మోక్షము) మరియు సుఖములు (ఇహలోక సౌఖ్యములు) కూడా లభిస్తాయి.

ఈ శ్లోకమునకు శ్రీ శంకరుల వ్యాఖ్య – **ఇమమ్ స్తవమ్ ఇత్యాదినా సహస్రశాఖాజ్ఞేన భగవతా కృష్ణద్వైపాయనేన సాక్షాత్ నారాయణేన కృతమ్ ఇతి సర్వైరేవ అర్థిభిః సాదరమ్ పఠితవ్యమ్ సర్వఫలసిద్ధయః ఇతి దర్శయతి.** 'ఇమమ్ స్తవమ్'తో ఆరంభమయ్యే ఈ శ్లోకం

ద్వారా భీష్ముడు చెప్పిన విషయము – సర్వజ్ఞుడును, సాక్షాత్తు నారాయణస్వరూపుడును అయిన శ్రీ కృష్ణద్వైపాయనుడు ఈ స్తోత్రమును రచించాడు. కనుక ఈ స్తోత్రమును శ్రద్ధతో, భక్తితో పఠించేవారికి అందరికీ సర్వఫలములును సిద్ధించును.

**విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభుమవ్యయం |**
**భజంతి యే పుష్కరాక్షం న తే యాంతి పరాభవం || (22)**

శ్రీమహావిష్ణువు జగదీశ్వరుడు, జన్మరహితుడు, సృష్టి స్థితి లయ కారకుడు. పద్మనేత్రుడైన ఆ దేవదేవుని భజించువారికి ఎట్టి అపజయములు గాని, దుఃఖములుగాని కలుగవు.

ముందుగా ఈ శ్లోకానికి శ్రీ శంకరుల వ్యాఖ్యను పరిశీలించుదాము – శ్రీ శంకరులు తమ వ్యాఖ్యానంలో సకల కామితార్థములను పొందడానికీ, ఫలితాన్ని ఆశించి నిర్వహించే సకల కర్మలలోని దోషాలను పరిహరించడానికీ, మరియు సంసారబంధమునుండి విముక్తిని పొంది మోక్షమును పొందడానికీ హరిని అర్చించడం అత్యంతముఖ్యమని వివరించారు. తరువాత శ్రీ శంకరులు తమ భాష్యమును శ్రీహరి పాదపద్మములకు అంకితం చేశారు.

తమ వ్యాఖ్యానానికి శ్రీశంకరులు ఉదాహరించిన శ్లోకము.

**ప్రమాదాత్ కుర్వతామ్ కర్మ ప్రచ్యవేతాధ్వరేషు చ**
**స్మరణాదేవ తద్ విష్ణోః సంపూర్ణమ్ స్యాత్ ఇతి శ్రుతిః** – గరుడపురాణము 230.50

అజ్ఞానంవల్ల గాని, మరేకారణంవల్ల కాని, యజ్ఞాది కర్మలయందు, ఇతర కార్యములందుగాని, అసంపూర్ణముగా గాని, అక్రమంగా గాని చేసిన పనులేవైనా గాని విష్ణునామమును ధ్యానించగనే సంపూర్ణమగునని శ్రుతులు చెప్పుచున్నవి.

(సంప్రదాయానుసారంగా ఈ స్తోత్రం చివరిలో **'కాయేన మనసా ...... నారాయణేతి సమర్పయామి'** అనే శ్లోకాన్ని చదవడం గమనింపదగును.)

శ్రీ శంకరులు శ్రీ వ్యాసభగవానుని మరొక శ్లోకాన్ని ఉదాహరించారు.

**ఆదరణేన యథా స్తౌతి ధనవన్తమ్ ధనేచ్ఛయా**
**తథా చేద్ విశ్వకర్తారమ్ కో న ముచ్యేత్ బంధనాత్**

డబ్బున్నవానిని ధనంకోసం స్తుతించేటటువంటి దీక్షతో విశ్వసృష్టిచేసిన భగవంతుని స్తుతిస్తే ఎవరు సంసారబంధంనుండి విముక్తులు కారు?

శ్రీ శంకరులు తమ విష్ణుసహస్రనామ భాష్యమును ముగిస్తూ ఈ శ్లోకాన్ని చెప్పారు.

**సహస్రనామ సంబంధి వ్యాఖ్యా సర్వసుఖావహా**
**శ్రుతి స్మృతి న్యాయ మూల రచితా హరిపాదయోః**

శ్రుతి, స్మృతి, న్యాయములకు అనుగుణంగా చెప్పబడిన ఈ సహస్రనామవ్యాఖ్య అందరికీ సుఖమును కలిగించునది. ఇది శ్రీహరి పాదములయెడ అంకితము చేయబడినది.

శ్రీ భట్టుల వ్యాఖ్య – **ఏవం స్వభావత ఏవ సమస్త ద్వంద్వ ప్రతిద్వంద్వి సకల కళ్యాణగుణాకరమ్, ప్రపన్న పారిజాతమ్, పుండరీకాక్షమ్, లక్ష్మీపతిమ్, భగవంతమ్ భజమానామ్ స ఏవ సర్వస్వమ్ ఇతి, తద్ సంపదో వాచామ్ అగోచరాః కుతః సాంసారిక పరిభవ ప్రసంగః ఇతి పర్యాప్తయతి విశ్వేశ్వరమ్ ఇతి.** లక్ష్మీపతియును, పుండరీకాక్షుడును అయిన భగవన్నారాయణుడు సమస్త ద్వంద్వములకును (సంతోషము, దుఃఖము – మంచి, చెడు వంటి ద్వంద్వములకు), అశుభములకును వ్యతిరేకి మరియు సమస్త

కళ్యాణగుణములకును నిలయము. ఆయన ప్రపన్నులకు పారిజాతము. ఆశ్రితులు ఆయననే తమ సమస్తముగా నెంచుదురు. కనుక అటువంటి ప్రపన్నుల సంపద, సౌఖ్యము మాటలకు అందనంతటివి. అటువంటివారికి పరాభవం అనేది ఎప్పుడైనా ఎలా జరుగుతుంది?

**శ్రీమహావిష్ణువును ధ్యానించినవారు ఎన్నడూ పరాభవము పొందరు.**

శ్రీ వేదవ్యాస మహర్షి స్తోత్రాంతములో ఈ విషయాన్ని రెండుమార్లు చెప్పి భక్తులకు అభయం ఇచ్చారు.

**న తే యాంతి పరాభవమ్**

**న తే యాంతి పరాభవమ్**

**వారికెన్నడూ పరాభవము జరుగదు.**

**వారికెన్నడూ పరాభవము జరుగదు.**

శ్రీ భట్టులు తమ 'భగవద్గుణ దర్పణము' రచనను ఇలా ముగించారు.

**అస్మాకమ్ అత్ర చ పరత్రం చ సర్వదుఃఖమ్ ఉన్మీల్య సంపదమ్ అశేషవిధామ్ విధాయ**
**శ్రీరంగరాజమహిషీ స చ వైష్ణవానామ్ సంగాత్ సుఖమ్ సహజ యేన సదా క్రియాస్తామ్**
తన దేవేరియైన శ్రీరంగనాయకీ సమేతుడైన శ్రీరంగరాయుడు ఇప్పుడు, తరువాత (ఈ లోకంలోను, పరలోకమందును) సర్వదుఃఖములను తొలగించుగాక. మనకు అశేష సమస్త సంపదలను ప్రసాదించుగాక. మనకు సదా శ్రీవైష్ణవభక్తుల సాంగత్యమును, సంతోషమును, జయమును ప్రసాదించుగాక.

**|| న తే యాంతి పరాభవం ఓం నమ ఇతి ||**

**వారికెన్నడూ పరాభవము జరుగదు అని నమస్కరిస్తున్నాను.**

**శ్రీకృష్ణార్పణమస్తు**

(ఇక్కడితో శ్రీ నరసింహన్ కృష్ణమాచారి గారి రచన పూర్తి అయినది – కా.సు. బాబు)



శ్రీకృష్ణుని పాదములు, పాదరక్షలు.
భువనేశ్వర్ మ్యూజియం శిల్పం.
వికీపీడియా చిత్రం.
Photo by
Steve Browne & John Verkleir




శ్రీ కృష్ణమాచారి ఆంగ్లరచనలు. www.sadagopan.org లో లభిస్తున్నాయి.

SlOkam 1

विश्वं विष्णुर्वषट्कारो भूतभव्यभवत्प्रभुः ।

भूतकृद्भूतभृद्भावो भूतात्मा भूतभावनः ॥

visvam vishNurvashaTkArO bhUtabhavya bhavatprabhuh |

bhUtakrudbhUtabhrudbhAvO bhUtAtmA bhUuta bhAvanah ||

[ PLEASE ADD PRANAVAM BEFORE EACH NAAMA ]

nAma 1. विश्वं - visvam

a) Universe or Cause of Universe

b) One who is full in all respects.

**viSvAya namah.**

The nAma is derived from the root viS - to enter. ViSvam means "Universe". SrI BhaTTar gives the reference to the following verse from moksha dharma:

veSanAt viSvamityAhu: lokAnAm kASisattama |

lokAnSca viSvameva iti pravadanti narAdhipa ||

They say BhagavAn is viSvam because He enters all the worlds. (The worlds themselves are called viSvam because of this). SrI BhaTTar interprets the term "Worlds" or "Universe" here to denote entirety. He points out that it is quite fitting that the first name of vishNu in SrI vishNu sahasranAmam suggests His immense glory, the fullness to the brim of His essential nature, form, qualities, etc., which are all natural, unexcelled, auspicious and superior. SrI v.v. rAmAnujan adds that this completeness is in respect of His rUpam, svarUpam, guNam, and everything else. He quotes nammAzhvAr - uvaryaRa uyar nalam uDaiyavan (tiruvAimozhi 1.1.1). It is to explain this aspect of the fullness of bhagavAn in every aspect that the remaining 999 nAma-s follow the

31

sadagopan.org

sadagopan.org

three worlds; and being the undecaying Self and enjoyer of all, He experiences everything (and also protects)". He has essentially echoed the translation provided by SrI R. Anantakrishna Sastry.

An interpretation that is more reflective of the advaitic philosophy is given by SrI rAdhAkRshNa SAstri, a rough translation of which follows:

"Lord vishNu who permeates everywhere, became mahat, the basis for all the three worlds. Then He became many, took different forms, and filled all the worlds with these forms; He is the soul of all things that appeared thus. He is enjoying these worlds without being distinct from them in the slightest way. He ultimately contains everything within Himself. (He is the One who performs creation, protection, and destruction)".

Conclusion

This posting formally concludes this project on SrI vishNu sahasra nAma that adiyEn started on May 7, 1997. Little did aDiyEn expect at that time that it would take close to 10 years to complete. Whatever little adiyEn knows about our sampradAyam, is completely owed to this effort over a period of 10 years. It was of immense benefit to me in taking me a tiny bit closer to the life's ultimate goal. In our sampradAyam, our AcAryan is our Lord in real life.

Today is the SatamAna utsavam (centenary celebration) of our great AcAryan SrImad tirukuDanthai ANDavan, and aDiyEn is delighted to present this concluding write-up with the sweet memories of the few moments in my life when aDiyEn was blessed with his kaTAksham, and place this work at the Lotus feet of asmad AcAryan SrI ra'nga rAmAnuja mahA deSikan.

इमं स्तवं भगवतो विष्णोर्व्यासेन कीर्तितम् ।

पठेद्य इच्छेत् पुरुषः श्रेयः प्राप्तुं सुखानि च ॥ २१

imam stavam bhagavato vishNor-vyAsena kIrtitam |

paThed-ya-icchet purushah Sreyah prAptum sukhAni ca || (21)

"That person, who desires to obtain supreme bliss and the pleasures of the world, should read this stotra of bhagavAn vishNu sung by the great sage

272



# ఉత్తర పీఠిక

(సంప్రదాయానుసారంగా శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము చివర పారాయణం చేసే క్రింది భాగము తాత్పర్యమును డా. క్రోవి పార్థసారథి రచించిన 'శ్రీకైవల్య సారథి', మరియు శ్రీ పెరుంబూదూరు కిడాంబి రామానుజాచార్యుల పరాశరభట్టభాష్యము అనువాదము ఆధారంగా వ్రాస్తున్నాను – కా.సు. బాబు)

అర్జున ఉవాచ

పద్మపత్ర విశాలాక్ష పద్మనాభ సురోత్తమ |

భక్తానామనురక్తానాం త్రాతా భవ జనార్దన ||

అర్జునుడు ఇలా అన్నాడు. పద్మపత్రములవలె విశాలమైన కనులు గలిగిన ఓ పద్మనాభా! దేవతలందరిలోకి శ్రేష్ఠుడవైన ఓ జనార్దనా! దయతో నీ భక్తులను కాపాడవలసింది.

శ్రీ భగవానువాచ

యో మాం నామసహస్రేణ స్తోతుమిచ్ఛతి పాండవ |

సోఽహమేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ||

|| స్తుత ఏవ న సంశయ ఓం నమ ఇతి ||

శ్రీకృష్ణభగవానుడు ఇలా అన్నాడు. నన్ను సహస్రనామములతో స్తుతించాలని కోరుకునేవారికి, నేను ఒక్క శ్లోకంతోనే వారి ప్రార్థనలను ఆలకించి కరుణిస్తాను. ఇందులో సంశయము లేదు. ఇందులో సంశయము లేదు.

వ్యాస ఉవాచ

వాసనాద్వాసుదేవస్య వాసితం భువనత్రయం |

సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోస్తు తే ||

|| శ్రీవాసుదేవ నమోస్తుత ఓం నమ ఇతి ||

వేదవ్యాసుడిలా అన్నాడు. ఓ వాసుదేవా! నీవు మూడు లోకాలకు నివాస స్థానమగుటచే వాసుదేవుడవు. సర్వ భూతములకు నీవు నివాసము (అంతర్యామి)గా నున్నావు. వాసుదేవా (వసుదేవ సుతా)! నీకు నా నమస్కారములు. వాసుదేవా! నీకు నా నమస్కారములు.

పార్వత్యువాచ

కేనోపాయేన లఘునా విష్ణోర్నామసహస్రకం |

పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో ||

పార్వతీదేవి ఇలా అన్నది. మహేశ్వరా! ప్రభూ! పండితులు అనునిత్యము ఏ ఉపాయంచేత క్లుప్తంగా శ్రీ విష్ణు సహస్రనామమును పారాయణ చేస్తారో తెలిసికొనగోరుతున్నాను.

(ఇక్కడ శ్రీ కిడాంబి రామానుజాచార్యులు ఉదాహరించిన ఐతిహ్యాము – శ్రీ అమ్మవారు ప్రతిదినము శ్రీవిష్ణుసహస్రనామమును పారాయణము చేయుచుండెడిది. ఒకనాడు పతి శుశ్రూషకై ఆమె శీఘ్రముగా పారాయణము ముగించవలసి వచ్చెను. అప్పుడు ఆమె శ్రీ విష్ణు సహస్రనామమును లఘువుగా ఎలా పారాయణం చేయాలని శ్రీ పరమేశ్వరుని అడిగినది. శ్రీ పరమేశ్వరుడు 'శ్రీ రామ రామ రామ' అని స్తుతించినచో ఒక్కొక్క రామనామము వేయి విష్ణునామముల పారాయణకు సమమగునని చెప్పెను)

ద్వారకా తిరుమల శివాలయం



ఈశ్వర ఉవాచ

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే |
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే ||

|| శ్రీ రామనామ వరానన ఓం నమ ఇతి ||

శ్రీ ఈశ్వరుడు ఇలా అన్నాడు. దేవీ! అందమైన ముఖము కలిగినదానా (వరాననా)! మనోరముడైన శ్రీరామచంద్రుని నేను మనసులోనే 'రామ రామ' అని ప్రార్థిస్తూ ఆనందిస్తున్నాను (రమే). రామనామము వేయి విష్ణునామములకు సమానము. రామనామము వేయి (విష్ణు)నామములకు సమానము.

బ్రహ్మోవాచ

నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షిశిరోరుబాహవే |
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటియుగధారిణే నమః ||

|| సహస్రకోటియుగధారిణే నమ ఓం నమ ఇతి ||

శ్రీ బ్రహ్మ ఇలా అన్నాడు. అంతము లేనివానికి నమస్కారము. (వేయి = అనంతమైన) వేల రూపములు, వేల పాదములు, వేల కన్నులు, వేల శిరస్సులు, వేల చేతులు గలవానికి నమస్కారములు. వేల నామములు కలిగిన శాశ్వత పురుషునికి నమస్కారములు. వేయికోటి యుగములు ధరించిన వానికి నమస్కారములు. వేయికోటి యుగములు ధరించిన వానికి నమస్కారములు.



శ్రీ గోపాలకృష్ణుని స్తుతిస్తున్న శ్రీ బ్రహ్మ.

https://commons.wikimedia.org/wiki/File:Brahma_extols_the_Lord_(6124583617).jpg

సంజయ ఉవాచ

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః |
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ||

సంజయుడు ఇలా అన్నాడు. ఎక్కడైతే యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడును, ధనుర్ధారియైన అర్జునుడును ఉంటారో అక్కడ సంపదలు (శ్రీ), విజయము, మంగళము మరియు ఐశ్వర్యము (భూతి), ధర్మము (నీతి) ఉంటాయని నా నిశ్చయము.

శ్రీభగవానువాచ

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే |
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ||

శ్రీకృష్ణభగవానుడిలా అన్నాడు. ఇతర చింతనలు లేక త్రికరణశుద్ధిగా నన్నే నమ్మి ఉపాసన చేసేవారి యోగక్షేమముల బాధ్యత నేనే వహిస్తాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం |
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ||

సాధుసజ్జనులను పరిరక్షించడానికి, దుష్టులను నాశనం చేయడానికి, ధర్మమును నిలబెట్టడానికి ప్రతియుగంలోనూ నేను అవతరిస్తుంటాను. (అని భగవానుడన్నాడు)

ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః |
సంకీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖాః సుఖినో భవంతి ||

ఆర్తులైనవారు, విషణ్ణులైనవారు, దెబ్బతిన్నవారు (ఇష్టసిద్ధినుండి దూరమైనవారు), భయము చెందినవారు, భయంకరమైన కష్టాలు, వ్యాధులతో బాధపడేవారు కేవలము 'నారాయణ' అన్నంత మాత్రముననే దుఃఖములనుండి విముక్తులై సకల సుఖాలు పొందుతారు.

శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము. 1690 కాలపు ప్రచురణ ముఖచిత్రం. వికీపీడియా నుండి.
https://commons.wikimedia.org/wiki/File:Vishnu_sahasranama_manuscript,_c1690.jpg



యదక్షర పదభ్రష్టం మాత్రా హీనం చ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తుతే

నారాయణా, నా స్తోత్రములో జరిగిన అక్షర దోషాలను, శబ్ద లోపాలను మన్నించ వలయును దేవా, నారాయణా, నీకు నమస్సులు.

కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ |
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ||

శరీరముచేత గాని, వాక్కుచేతగాని, ఇంద్రియాలచేత గాని, బుద్ధిచేతగాని, స్వభావంచేతగాని, చేసే కర్మలన్నింటినీ శ్రీమన్నారాయణునికి సమర్పిస్తున్నాననే భావం ఉన్నట్లైతే అతడు సర్వసుఖాలు అనుభవిస్తాడు.

|| ఓం శాంతిః శాంతిః శాంతిః ||

ఓం తత్ సత్

శ్రీ కృష్ణార్పణమస్తు



హరికిం బట్టపు దేవి, పున్నెముల ప్రో వర్థంబుఁబెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీ గిరిసుతల్ దోనాడు పూఁబోఁడి, తా
మరలందుండెడు ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి , సిరియిచ్చున్ నిత్యకళ్యాణముల్.

పరుఁడై, యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థాన సం
హరణ క్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై యంతర్గత జ్యోతియై,
పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్ - శ్రీ బమ్మెర పోతన

కడు దివ్యరూపమా గరుడవాహనమా
శ్రీహరి సేవాదీక్ష జ్ఞానవైరాగ్య పక్ష

పుట్టీ పుట్టగనె అపూర్వయుక్తియుక్తుడవై
అమర లోకములనుండి అమృతము తెచ్చితివి
వినత దాస్యము బాపి విష్ణుదాసుడైనావు
అన్ని కల్పాలలో వైకుంఠు సేవలో

శ్రీ తులసీ మాలికలు వరలక్ష్మీ హారాలు
వనమాలి ఎదదాల్చి శ్రీనివాసుడయ్యాడు
నీ తనువుపై నిలిచి నిఖిల లోకాలు బ్రోచు
పెరియ తిరువడి నీది పెరుమాళ్ళు కొలువులో

నానా మహిమాన్వితుడా నాగాలంకృత దేహ
పూని ఉపరిచర వసువును బ్రోచిన మహానుభావ
పన్నగ కాళేంద్రుని పారద్రోలినావు, ఆ
మిన్నేరును ఈ వసుధన మిన్నగా నిలిపావు

శ్రీ ఆకెళ్ళ విభీషణశర్మ.

Picture source: https://commons.wikimedia.org/wiki/File:Lakshmi_Vishnu.jpg

మ్రొక్కెద వసు రుద్రులకును, మ్రొక్కెద నాదిత్యులకును మొగి మరుతులకున్
మ్రొక్కి, చని యశ్వులకు నేఁగ్రక్కించెద సోఁకు కండగరువంబెల్లన్

మ్రొక్కెద రామచంద్రునకు మోడ్చెదఁగేలు సుమిత్ర పట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహప తనూజకు శ్రీ రఘురాము దేవికిన్
మ్రొక్కెద ధర్మ వాసవ మరుద్గణ మారుత రుద్రపాళికిన్
మ్రొక్కెద సూర్యచంద్రులకు మ్రొక్కెదఁదామరసాప్తు సూతికిన్

మునులును వేల్పులున్ దివిజ ముఖ్యుఁడు వజ్రి స్వభుండు బ్రహ్మ వా
య్వనల శశి ప్రభాకర జలాధిప శర్వ మరుత్తు లశ్వులున్
గనులకుఁ దోఁచువారు మఱి కాననివారును సర్వభూతముల్
ఘనతర భూతనాయకుఁడుఁ గార్యము సిద్ధియొనర్తురియ్యెడన్.

శ్రీ రఘురామపాద సరసీరుహయుగ్మము నాత్మ నిల్ప, కూ
పారము దాఁటి, విఘ్నములఁ బాఱఁగ దోలుచు, లంకఁజొచ్చి, సీ
తా రమణీమణిం గని, ముదంబును గూర్చి, రఘూత్తమాంఘ్రి సే
వారతి మీఱు పావని శివంకరుఁడై వెలయించు మత్కృతిన్.

శ్రీ వాసుదాస స్వామి (మందరము)



## ముగింపు

5/2/2005న ప్రారంభించిన ఈ శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రం వ్యాఖ్యానం అనువాదం వ్రాసే కార్యక్రమం 17/9/2011న ముగిసింది. తరువాత 6/10/2011న కంప్యూటరులో టైపు చేయడం మొదలుపెట్టగా 17/9/2014 నాటికి ఆ పని పూర్తయ్యింది. తల్లిదండ్రుల ఆశీర్వచనము వలన, భగవంతుని దయవలన నాకు ఈ సంకల్పము, శక్తి కలిగినవి.

శ్రీ భీష్మునకు, శ్రీ వేదవ్యాసునకు నమస్కారములు. శ్రీ శంకర భగవత్పాదులకు, శ్రీ పరాశరభట్టులకు, ఇతర వ్యాఖ్యాతలకు నమస్కారములు. ఆంగ్లంలో ఈ రచన చేసిన శ్రీ నరసింహన్ కృష్ణమాచారి గారికి నమస్కారములు. నా ఈ ప్రయత్నంలోని దోషములను మన్నింపమని వేడుకొంటూ ఈ అనువాదాన్ని నా తల్లిదండ్రులైన కాజ సరోజినీదేవి, రామానుజరావు గార్లకు అంకితం చేస్తున్నాను.



కాజ సుధాకరబాబు.
మస్కట్, ఒమన్ 17/9/2014

మరల 2020లో ఈ రచనను కొంచెం కుదించి, కొన్ని చిత్రాలను మార్చి, కూర్చి, ఒకే భాగంగా ముద్రించేలా రూపొందిస్తున్నాను. ఈ సందర్భంలో ప్రత్యేకంగా ప్రస్తావించవలసిన రెండు విషయాలు.

(1) నేను అంకితం ఇచ్చిన ఈ రచనను నా తండ్రిగారు ఎంతో ప్రేమగా, భక్తితో చదివారు. ఆయన గత సంవత్సరం 2019 డిసెంబరులో నిర్యాణం చెందారు.

(2) గడచిన 28 సంవత్సరాలు నేను సకుటుంబంగా మస్కట్ నగరంలో ఉంటున్నాను. ఈ సంవత్సరం చివరకు మస్కట్ నగరానికి వీడ్కోలు పలికి భారతదేశం వెళ్ళాల్సి ఉన్నది. నా లౌకిక జీవనానికీ, వృత్తి నిర్వహణకు, ఆధ్యాత్మిక సాధనకు ఈ నగరం ఎంతో ఆలంబన ఇచ్చింది. ఈ దేశానికి, నగరానికి, ప్రజలకు నా కృతజ్ఞతలు.

కాజ సుధాకర బాబు
మస్కట్, ఒమన్ 31/10/2020

**శ్రీ కృష్ణార్పణమస్తు**
**శ్రియై నమః. శ్రీ ఆండాళ్ తల్లికి నమస్కారము. ఓం నమో వేంకటేశాయ.**
**శ్రీ పంచాయుధములకు నమస్కారము. శ్రీ ఆదిశేషునికి నమస్కారము.**
**శ్రీ గరుత్మంతునికి నమస్కారము. శ్రీ హనుమంతునికి నమస్కారము.**

అనుబంధం



# సహస్రనామ స్తోత్రములు

ఈ భాగం కేవలం ఆన్‌లైన్ పుస్తకంకోసం జత చేశాను.

ముద్రించిన పుస్తకంలో ఈ భాగం లేదు.

https://sanskritdocuments.org/ నుండి తీసికొన్న స్తోత్రాలు

# స్తోత్రముల పట్టిక

# శ్రీలక్ష్మీ సహస్రనామ స్తోత్రం 1

అస్య శ్రీమహాలక్ష్మీసహస్రనామస్తోత్రమహామంత్రస్య
శ్రీమహావిష్ణుర్భగవాన్ ఋషిః, అనుష్టుప్ఛందః,
శ్రీమహాలక్ష్మీః దేవతా . శ్రీం బీజం హ్రీం శక్తిః, హ్రైం కీలకం .
శ్రీమహాలక్ష్మీప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ..

పద్మాననే పద్మకరే సర్వలోకైకపూజితే .
సాన్నిధ్యం కురు మే చిత్తే విష్ణువక్షఃస్థలస్థితే .. 1..

భగవద్దక్షిణే పార్శ్వే శ్రియం దేవీమవస్థితాం .
ఈశ్వరీం సర్వభూతానాం జననీం సర్వదేహినాం .. 2..

చారుస్మితాం చారుదతీం చారునేత్రాననభ్రువం .
సుకపోలాం సుకర్ణాగ్రన్యస్తమౌక్తికకుండలాం .. 3..

సుకేశాం చారుబింబోష్ఠీం రత్నతుంగఘనస్తనీం .
అలకాగ్రైరలినిభైరలంకృతముఖాంబుజం .. 4..

లసత్కనకసంకాశాం పీనసుందరకంధరాం .
నిష్కకంఠీం స్తనాలంబిముక్తాహారవిరాజితాం .. 5..

నీలకుంతలమధ్యస్థమాణిక్యమకుటోజ్జ్వలాం .
శుక్లమాల్యాంబరధరాం తప్తహాటకవర్ణినీం .. 6..

అనన్యసులభైస్తైస్తైర్గుణైః సౌమ్యముఖైర్నిజైః .
అనురూపానవద్యాంగీం హరేర్నిత్యానపాయినీం .. 7..

శ్రీర్వాసుదేవమహిషీ పుంప్రధానేశ్వరేశ్వరీ .
అచింత్యానంతవిభవా భావాభావవిభావినీ .. 1..

అహంభావాత్మికా పద్మా శాంతానంతచిదాత్మికా .
బ్రహ్మభావం గతా త్యక్తభేదా సర్వజగన్మయీ .. 2..

షాడ్గుణ్యపూర్ణా త్రయ్యంతరూపాత్మానపగామినీ .
ఏకయోగ్యాఽశూన్యభావాకృతిస్తేజః ప్రభావినీ .. 3..

భావ్యభావకభావాత్మభావ్యా కామధుగాఽఽత్మభూః .
భావాభావమయీ దివ్యా భేద్యభేదకభావనీ .. 4..

జగత్కుటుంబిన్యఖిలాధారా కామవిజృంభిణీ .
పంచకృత్యకరీ పంచశక్తిమయ్యాత్మవల్లభా .. 5..

భావాభావానుగా సర్వసమ్మతాఽఽత్మోపగూహినీ .
అపృథక్చారిణీ సౌమ్యా సౌమ్యరూపవ్యవస్థితా .. 6..

ఆద్యంతరహితా దేవీ భవభావ్యస్వరూపిణీ .
మహావిభూతిః సమతాం గతా జ్యోతిర్గణేశ్వరీ .. 7..

స్వాతంత్ర్యరూపా దేవోరఃస్థితా తద్ధర్మధర్మిణీ .
సర్వభూతేశ్వరీ సర్వభూతమాతాఽఽత్మమోహినీ .. 9..

సర్వాంగసుందరీ సర్వవ్యాపినీ ప్రాప్తయోగినీ .
విముక్తిదాయినీ భక్తిగమ్యా సంసారతారిణీ .. 10..

ధర్మార్థసాధినీ వ్యోమనిలయా వ్యోమవిగ్రహా .
పంచవ్యోమపదీ రక్షవ్యావృతిః ప్రాప్యపూరిణీ .. 11..

ఆనందరూపా సర్వాప్తిశాలినీ శక్తినాయికా .
హిరణ్యవర్ణా హైరణ్యప్రాకారా హేమమాలినీ .. 12..

ప్రత్నరత్నా భద్రపీఠా వేశినీ రజతస్రజా .
స్వాజ్ఞాకార్యమరా నిత్యా సురభిర్వ్యోమచారిణీ .. 13..

యోగక్షేమవహా సర్వసులభేచ్ఛాక్రియాత్మికా .
కరుణాగ్రానతముఖీ కమలాక్షీ శశిప్రభా .. 14..

కల్యాణదాయినీ కల్యా కలికల్మషనాశినీ .
ప్రజ్ఞాపరిమితాఽఽత్మానురూపా సత్యోపయాచితా .. 15..

మనోజ్ఞేయా జ్ఞానగమ్యా నిత్యముక్తాత్మసేవినీ .
కర్తృశక్తిః సుగహనా భోక్తృశక్తిర్గుణప్రియా .. 16..

జ్ఞానశక్తిరనౌపమ్యా నిర్వికల్పా నిరామయా .
అకలంకాఽమృతాధారా మహాశక్తిర్వికాసినీ .. 17..

మహామాయా మహానందా నిఃసంకల్పా నిరామయా .
ఏకస్వరూపా త్రివిధా సంఖ్యాతీతా నిరంజనా .. 18..

ఆత్మసత్తా నిత్యశుచిః పరశక్తిః సుఖోచితా .
నిత్యశాంతా నిస్తరంగా నిర్భిన్నా సర్వభేదినీ .. 19..

అసంకీర్ణాఽవిధేయాత్మా నిషేవ్యా సర్వపాలినీ .
నిష్కామనా సర్వరసాఽభేద్యా సర్వార్థ సాధినీ .. 20..

అనిర్దేశ్యాఽపరిమితా నిర్వికారా త్రిలక్షణా .
భయంకరీ సిద్ధిరూపాఽవ్యక్తా సదసదాకృతిః .. 21..

అప్రతర్క్యాఽప్రతిహతా నియంత్రీ యంత్రవాహినీ .
హార్దమూర్తిర్మహామూర్తిః అవ్యక్తా విశ్వగోపినీ .. 22..

వర్ధమానాఽనవద్యాంగీ నిరవద్యా త్రివర్గదా .
అప్రమేయాఽక్రియా సూక్ష్మా పరనిర్వాణదాయినీ .. 23..

అవిగీతా తంత్రసిద్ధా యోగసిద్ధాఽమరేశ్వరీ .
విశ్వసూతిస్తర్పయంతీ నిత్యతృప్తా మహౌషధిః .. 24..

శబ్దాహ్వయా శబ్దసహా కృతజ్ఞా కృతలక్షణా .
త్రివర్తినీ త్రిలోకస్థా భూర్భువఃస్వరయోనిజా .. 25..

అగ్రాహ్యాఽగ్రాహికాఽనంతాహ్వయా సర్వాతిశాయినీ .
వ్యోమపద్మా కృతధురా పూర్ణకామా మహేశ్వరీ .. 26..

సువాచ్యా వాచికా సత్యకథనా సర్వపాలినీ .
లక్ష్యమాణా లక్షయంతీ జగజ్జ్యేష్ఠా శుభావహా .. 27..

జగత్ప్రతిష్ఠా భువనభర్త్రీ గూఢప్రభావతీ .
క్రియాయోగాత్మికా మూర్తిః హృదబ్జస్థా మహాక్రమా .. 28..

పరమద్యౌః ప్రథమజా పరమాప్తా జగన్నిధిః .
ఆత్మానపాయినీ తుల్యస్వరూపా సమలక్షణా .. 29..

తుల్యవృత్తా సమవయా మోదమానా ఖగధ్వజా .
ప్రియచేష్టా తుల్యశీలా వరదా కామరూపిణీ .. 30..

సమగ్రలక్షణాఽనంతా తుల్యభూతిః సనాతనీ .
మహర్ద్ధిః సత్యసంకల్పా బహ్వృచా పరమేశ్వరీ .. 31..

జగన్మాతా సూత్రవతీ భూతధాత్రీ యశస్వినీ .
మహాభిలాషా సావిత్రీ ప్రధానా సర్వభాసినీ .. 32..

నానావపుర్బహుభిదా సర్వజ్ఞా పుణ్యకీర్తనా .
భూతాశ్రయా హృషీకేశ్వర్యశోకా వాజివాహికా .. 33..

బ్రహ్మాత్మికా పుణ్యజనిః సత్యకామా సమాధిభూః .
హిరణ్యగర్భా గంభీరా గోధూలిః కమలాసనా .. 34..

జితక్రోధా కుముదినీ వైజయంతీ మనోజవా .
ధనలక్ష్మీః స్వస్తికరీ రాజ్యలక్ష్మీర్మహాసతీ .. 35..

జయలక్ష్మీర్మహాగోష్ఠీ మఘోనీ మాధవప్రియా .
పద్మగర్భా వేదవతీ వివిక్తా పరమేష్ఠినీ .. 36..

సువర్ణబిందుర్మహతీ మహాయోగిప్రియాఽనఘా .
పద్మే స్థితా వేదమయీ కుముదా జయవాహినీ .. 37..

సంహతిర్నిర్మితా జ్యోతిః నియతిర్వివిధోత్సవా .
రుద్రవంద్యా సింధుమతీ వేదమాతా మధువ్రతా .. 38..

విశ్వంభరా హైమవతీ సముద్రేచ్ఛావిహారిణీ .
అనుకూలా యజ్ఞవతీ శతకోటిః సుపేశలా .. 39..

ధర్మోదయా ధర్మసేవ్యా సుకుమారీ సభావతీ .
భీమా బ్రహ్మస్తుతా మధ్యప్రభా దేవర్షివందితా .. 40..

దేవభోగ్యా మహాభాగా ప్రతిజ్ఞాపూర్ణశేవధిః .
సువర్ణరుచిరప్రఖ్యా భోగినీ భోగదాయినీ .. 41..

వసుప్రదోత్తమవధూః గాయత్రీ కమలోద్భవా .
విద్వత్ప్రియా పద్మచిహ్నా వరిష్ఠా కమలేక్షణా .. 42..

పద్మప్రియా సుప్రసన్నా ప్రమోదా ప్రియపార్శ్వగా .
విశ్వభూషా కాంతిమతీ కృష్ణా వీణారవోత్సుకా .. 43..

రోచిష్కరీ స్వప్రకాశా శోభమానవిహంగమా .
దేవాంకస్థా పరిణతిః కామవత్సా మహామతిః .. 44..

ఇల్వలోత్పలనాభాఽ ధిశమనీ వరవర్ణినీ .
స్వనిష్ఠా పద్మనిలయా సద్గతిః పద్మగంధినీ .. 45..

పద్మవర్ణా కామయోనిః చండికా చారుకోపనా .
రతిస్నుషా పద్మధరా పూజ్యా త్రైలోక్యమోహినీ .. 46..

నిత్యకన్యా బిందుమాలిన్యక్షయా సర్వమాతృకా .
గంధాత్మికా సురసికా దీప్తమూర్తిః సుమధ్యమా .. 47..

పృథుశ్రోణీ సౌమ్యముఖీ సుభగా విష్టరశ్రుతిః .
స్మితాననా చారుదతీ నిమ్ననాభిర్మహాస్తనీ .. 48..

స్నిగ్ధవేణీ భగవతీ సుకాంతా వామలోచనా .
పల్లవాంఘ్రిః పద్మమనాః పద్మబోధా మహాప్సరాః .. 49..

విద్వత్ప్రియా చారుహాసా శుభదృష్టిః కకుద్మినీ .
కంబుగ్రీవా సుజఘనా రక్తపాణిర్మనోరమా .. 50..

పద్మినీ మందగమనా చతుర్దంష్ట్రా చతుర్భుజా .
శుభరేఖా విలాసభ్రూః శుకవాణీ కలావతీ .. 51..

ఋజునాసా కలరవా వరారోహా తలోదరీ .
సంధ్యా బింబాధరా పూర్వభాషిణీ స్త్రీసమాహ్వయా .. 52..

ఇక్షుచాపా సుమశరా దివ్యభూషా మనోహరా .
వాసవీ పాండరచ్ఛత్రా కరభోరుస్తిలోత్తమా .. 53..

సీమంతినీ ప్రాణశక్తిః విభీషణ్యసుధారిణీ .
భద్రా జయావహా చంద్రవదనా కుటిలాలకా .. 54..

చిత్రాంబరా చిత్రగంధా రత్నమౌలిసముజ్జ్వలా .
దివ్యాయుధా దివ్యమాల్యా విశాఖా చిత్రవాహనా .. 55..

అంబికా సింధుతనయా సుశ్రేణిః సుమహాసనా .
సామప్రియా నమ్రితాంగీ సర్వసేవ్యా వరాంగనా .. 56..

గంధద్వారా దురాధర్షా నిత్యపుష్టా కరీషిణీ .
దేవజుష్టాఽ ఽ దిత్యవర్ణా దివ్యగంధా సుహృత్తమా .. 57..

అనంతరూపాఽ నంతస్థా సర్వదానంతసంగమా .
యజ్ఞాశినీ మహావృష్టిః సర్వపూజ్యా వషట్క్రియా .. 58..

యోగప్రియా వియన్నాభిః అనంతశ్రీరతీంద్రియా .
యోగిసేవ్యా సత్యరతా యోగమాయా పురాతనీ .. 59..

సర్వేశ్వరీ సుతరణిః శరణ్యా ధర్మదేవతా .
సుతరా సంవృతజ్యోతిః యోగినీ యోగసిద్ధిదా .. 60..

సృష్టిశక్తిర్ద్యోతమానా భూతా మంగలదేవతా .
సంహారశక్తిః ప్రబలా నిరుపాధిః పరావరా .. 61..

ఉత్తారిణీ తారయంతీ శాశ్వతీ సమితింజయా .
మహాశ్రీరజహత్కీర్తిః యోగశ్రీః సిద్ధిసాధనీ .. 62..

పుణ్యశ్రీః పుణ్యనిలయా బ్రహ్మశ్రీర్బ్రాహ్మణప్రియా .
రాజశ్రీ రాజకలితా ఫలశ్రీః స్వర్గదాయినీ .. 63..

దేవశ్రీరద్భుతకథా వేదశ్రీః శ్రుతిమార్గిణీ .
తమోఽ పహాఽ వ్యయనిధిః లక్షణా హృదయంగమా .. 94..

మృతసంజీవినీ శుభ్రా చంద్రికా సర్వతోముఖీ .
సర్వోత్తమా మిత్రవిందా మైథిలీ ప్రియదర్శనా .. 65..

సత్యభామా వేదవేద్యా సీతా ప్రణతపోషిణీ .
మూలప్రకృతిరీశానా శివదా దీప్రదీపినీ .. 66..

అభిప్రియా స్వైరవృత్తిః రుక్మిణీ సర్వసాక్షిణీ .
గాంధారిణీ పరగతిః తత్వగర్భా భవాభవా .. 67..

అంతర్వృత్తిర్మహారుద్రా విష్ణుదుర్గా మహాబలా .
మదయంతీ లోకధారిణ్యదృశ్యా సర్వనిష్కృతిః .. 68..

దేవసేనాఽ ఽత్మబలదా వసుధా ముఖ్యమాతృకా .
క్షీరధారా ఘృతమయీ జుహ్వతీ యజ్ఞదక్షిణా .. 69..

యోగనిద్రా యోగరతా బ్రహ్మచర్యా దురత్యయా .
సింహపింఛా మహాదుర్గా జయంతీ ఖంగధారిణీ .. 70..

సర్వార్తినాశినీ హృష్టా సర్వేచ్ఛాపరిపూరికా .
ఆర్యా యశోదా వసుదా ధర్మకామార్థమోక్షదా .. 71..

త్రిశూలినీ పద్మచిహ్నా మహాకాలీందుమాలినీ .
ఏకవీరా భద్రకాలీ స్వానందిన్యుల్లసద్గదా .. 72..

నారాయణీ జగత్పూరిణ్యుర్వరా ద్రుహిణప్రసూః .
యజ్ఞకామా లేలిహానా తీర్థకర్యుగ్రవిక్రమా .. 73..

గరుత్మదుదయాఽ త్యుగ్రా వారాహీ మాతృభాషిణీ .
అశ్వక్రాంతా రథక్రాంతా విష్ణుక్రాంతోరుచారిణీ .. 74..

వైరోచనీ నారసింహీ జీమూతా శుభదేక్షణా .
దీక్షావిదా విశ్వశక్తిః బీజశక్తిః సుదర్శనీ .. 75..

ప్రతీతా జగతీ వన్యధారిణీ కలినాశినీ .
అయోధ్యాఽ చ్ఛిన్నసంతానా మహారత్నా సుఖావహా .. 76..

రాజవత్యప్రతిభయా వినయిత్రీ మహాశనా .
అమృతస్యందినీ సీమా యజ్ఞగర్భా సమేక్షణా .. 77..

ఆకూతిఋుగ్యజుస్సామఘోషాఽ ఽ రామవనోత్సుకా .
సోమపా మాధవీ నిత్యకల్యాణీ కమలార్చితా .. 78..

యోగారూఢా స్వార్థజుష్టా వహ్నివర్ణా జితాసురా .
యజ్ఞవిద్యా గుహ్యవిద్యాఽ ధ్యాత్మవిద్యా కృతాగమా .. 79..

ఆప్యాయనీ కలాతీతా సుమిత్రా పరభక్తిదా .
కాంక్షమాణా మహామాయా కోలకామాఽ మరావతీ .. 80..

సువీర్యా దుఃస్వప్నహరా దేవకీ వసుదేవతా .
సౌదామినీ మేఘరథా దైత్యదానవమర్దినీ .. 81..

శ్రేయస్కరీ చిత్రలీలైకాకినీ రత్నపాదుకా .
మనస్యమానా తులసీ రోగనాశిన్యురుప్రదా .. 82..

తేజస్వినీ సుఖజ్వాలా మందరేఖాఽ మృతాశినీ .
బ్రహ్మిష్ఠా వహ్నిశమనీ జుషమాణా గుణాత్యయా .. 83..

కాదంబరీ బ్రహ్మరతా విధాత్ర్యుజ్జ్వలహస్తికా .
అక్షోభ్యా సర్వతోభద్రా వయస్యా స్వస్తిదక్షిణా .. 84..

సహస్రాస్యా జ్ఞానమాతా వైశ్వానర్యక్షవర్తినీ .
ప్రత్యగ్వరా వారణవత్యనసూయా దురాసదా .. 85..

అరుంధతీ కుండలినీ భవ్యా దుర్గతినాశినీ .
మృత్యుంజయా త్రాసహరీ నిర్భయా శత్రుసూదినీ .. 86..

ఏకాక్షరా సత్పురంధ్రీ సురపక్షా సురాతులా .
సకృద్విభాతా సర్వార్తిసముద్రపరిశోషిణీ .. 87..

బిల్వప్రియాఽ వనీ చక్రహృదయా కంబుతీర్థగా .
సర్వమంత్రాత్మికా విద్యుత్సువర్ణా సర్వరంజినీ .. 88..

ధ్వజఛత్రాశ్రయా భూతిర్వైష్ణవీ సద్గుణోజ్జ్వలా .
సుషేణా లోకవిదితా కామసూర్జగదాదిభూః .. 89..

వేదాంతయోనిర్జిజ్ఞాసా మనీషా సమదర్శినీ .
సహస్రశక్తిరావృత్తిః సుస్థిరా శ్రేయసాం నిధిః .. 90..

రోహిణీ రేవతీ చంద్రసోదరీ భద్రమోహినీ .
సూర్యా కన్యాప్రియా విశ్వభావనీ సువిభావినీ .. 91..

సుప్రదృశ్యా కామచారిణ్యప్రమత్తా లలంతికా .
మోక్షలక్ష్మీర్జగద్యోనిః వ్యోమలక్ష్మీః సుదుర్లభా .. 92..

భాస్కరీ పుణ్యగేహస్థా మనోజ్ఞా విభవప్రదా .
లోకస్వామిన్యచ్యుతార్థా పుష్కలా జగదాకృతిః .. 93..

విచిత్రహారిణీ కాంతా వాహినీ భూతవాసినీ .
ప్రాణినీ ప్రాణదా విశ్వా విశ్వబ్రహ్మాండవాసినీ .. 94..

సంపూర్ణా పరమోత్సాహా శ్రీమతీ శ్రీపతిః శ్రుతిః .
శ్రయంతీ శ్రీయమాణా క్ష్మా విశ్వరూపా ప్రసాదినీ .. 95..

హర్షిణీ ప్రథమా శర్వా విశాలా కామవర్షిణీ .
సుప్రతీకా పృశ్నిమతీ నివృత్తిర్వివిధా పరా .. 96..

సుయజ్ఞా మధురా శ్రీదా దేవరాతిర్మహామనాః .
స్థూలా సర్వాకృతిః స్థేమా నిమ్నగర్భా తమోనుదా .. 97..

తుష్టిర్వాగీశ్వరీ పుష్టిః సర్వాదిః సర్వశోషిణీ .
శక్త్యాత్మికా శబ్దశక్తిః విశిష్టా వాయుమత్యుమా .. 98..

ఆన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతిర్నయాత్మికా .
వ్యాలీ సంకర్షిణీ ద్యోతా మహాదేవ్యపరాజితా .. 99..

కపిలా పింగలా స్వస్థా బలాకీ ఘోషనందినీ .
అజితా కర్షిణీ నీతిర్గరుడా గరుడాసనా .. 100..

హ్లాదిన్యనుగ్రహా నిత్యా బ్రహ్మవిద్యా హిరణ్మయీ .
మహీ శుద్ధవిధా పృథ్వీ సంతానిన్యంశుమాలినీ .. 101..

యజ్ఞాశ్రయా ఖ్యాతిపరా స్తవ్యా వృష్టిస్త్రికాలగా .
సంబోధిణి శబ్దపూర్ణా విజయాంఽశుమతీ కలా .. 102..

శివా స్తుతిప్రియా ఖ్యాతిః జీవయంతీ పునర్వసుః .
దీక్షా భక్తార్తిహా రక్షా పరీక్షా యజ్ఞసంభవా .. 103..

ఆర్ద్రా పుష్కరిణీ పుణ్యా గణ్యా దారిద్ర్యభంజినీ .
ధన్యా మాన్యా పద్మనేమిః భార్గవీ వంశవర్ధనీ .. 104..

తీక్ష్ణప్రవృత్తిః సత్కీర్తిః నిషేవ్యాఽఘవినాశినీ .
సంజ్ఞా నిఃసంశయా పూర్వా వనమాలా వసుంధరా .. 105..

పృథుర్మహోత్కటాఽహల్యా మండలాఽఽశ్రితమానదా .
సర్వా నిత్యోదితోదారా జృంభమాణా మహోదయా .. 106..

చంద్రకాంతోదితా చంద్రా చతురశ్రా మనోజవా .
బాలా కుమారీ యువతిః కరుణా భక్తవత్సలా .. 107..

మేదిన్యుపనిషన్మిశ్రా సుమవీరుద్ధనేశ్వరీ .
దుర్మర్షణీ సుచరితా బోధా శోభా సువర్చలా .. 108..

యమునాఽక్షౌహిణీ గంగా మందాకిన్యమరాలయా .
గోదా గోదావరీ చంద్రభాగా కావేర్యుదన్వతీ .. 109..

సినీవాలీ కుహూ రాకా వారణా సింధుమత్యమా .
వృద్ధిః స్థితిర్ధ్రువా బుద్ధిః త్రిగుణా గుణగహ్వరా .. 110..

పూర్తిర్మాయాత్మికా స్ఫూర్తిర్వ్యాఖ్యా సూత్రా ప్రజావతీ .
విభూతిర్నిష్కలా రంభా రక్షా సువిమలా క్షమా .. 111..

ప్రాప్తిర్వాసంతికాలేఖా భూరిబీజా మహాగదా .
అమోఘా శాంతిదా స్తుత్యా జ్ఞానదోత్కర్షిణీ శిఖా .. 112..

ప్రకృతిర్గోమతీ లీలా కమలా కామధుగ్విధిః .
ప్రజ్ఞా రామా పరా సంధ్యా సుభద్రా సర్వమంగలా .. 113..

నందా భద్రా జయా రిక్తా తిథిపూర్ణాఽమృతంభరా .
కాష్ఠా కామేశ్వరీ నిష్ఠా కామ్యా రమ్యా వరా స్మృతిః .. 114..

శంఖినీ చక్రిణీ శ్యామా సమా గోత్రా రమా దితిః .
శాంతిర్దాంతిః స్తుతిః సిద్ధిః విరజాఽత్యుజ్జ్వలాఽవ్యయా .. 115..

వాణీ గౌరీందిరా లక్ష్మీః మేధా శ్రద్ధా సరస్వతీ .
స్వధా స్వాహా రతిరుషా వసువిద్యా ధృతిః సహా .. 116..

శిష్టేష్టా చ శుచిర్ధాత్రీ సుధా రక్షోఘ్న్యజాఽమృతా .
రత్నావలీ భారతీడా ధీరధీః కేవలాఽఽత్మదా .. 117..

యా సా శుద్ధిః సస్మితా కా నీలా రాధాఽమృతోద్భవా .
పరధుర్యాస్పదా హ్రీర్భూః కామినీ శోకనాశినీ .. 118..

మాయాకృతీ రసఘనా నర్మదా గోకులాశ్రయా .
అర్కప్రభా రథేభాశ్వనిలయేందుప్రభాఽద్భుతా .. 119..

శ్రీః కృశానుప్రభా వజ్రలంభనా సర్వభూమిదా .
భోగప్రియా భోగవతీ భోగీంద్రశయనాసనా .. 120..

అశ్వపూర్వా రథమధ్యా హస్తినాదప్రబోధినీ .
సర్వలక్షణలక్షణ్యా సర్వలోకప్రియంకరీ .. 121..

సర్వోత్కృష్టా సర్వమయీ భవభంగాపహారిణీ .
వేదాంతస్థా బ్రహ్మనీతిః జ్యోతిష్మత్యమృతావహా .. 122..

భూతాశ్రయా నిరాధారా సంహితా సుగుణోత్తరా .
సర్వాతిశాయినీ ప్రీతిః సర్వభూతస్థితా ద్విజా .
సర్వమంగలమాంగల్యా దృష్టాదృష్టఫలప్రదా .. 123..

ఇతి శ్రీలక్ష్మీసహస్రనామస్తోత్రం సంపూర్ణం .

```
Proofread by PSA Easwaran psaeaswaran at gmail.com
% Text title            : lakShmIsahasranAmastotram 1
% File name             : lakShmIsahasranAmastotram.itx
% itxtitle              : lakShmIsahasranAmastotram 1
% engtitle              : lakShmIsahasranAmastotram 1
% Category              : sahasranAma, devii, lakShmI, devI
% Location              : doc_devii
% Sublocation           : devii
% SubDeity              : lakShmI
% Language              : Sanskrit
% Subject               : philosophy/hinduism/religion
% Proofread by          : PSA Easwaran psaeaswaran at gmail.com
% Description-comments  : Edited by S. V. Radhakrishna Shastriji
% Indexextra            : (Scanned book)
% Acknowledge-Permission: Mahaperiaval Trust
% Latest update         : October 6, 2017
% Send corrections to   : Sanskrit@cheerful.com
% Site access           : https://sanskritdocuments.org
```

